వాస్తవంగా
ఈ ఖుర్ఆన్
మహోన్నతమయింది.
సురక్షితమయిన
ఫలకంలో ఉంది.
(అల్ బురూజ్ : 22)

Meaning of the
**HOLY QUR'AN**
(Telugu)

# దివ్య ఖుర్ఆన్

## అనువాదం, సంక్షిప్త వ్యాఖ్యానం


మూలానువాదం :

**మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది (రహ్మ)**

అనువాదం

**షేక్ హమీదుల్లా షరీఫ్,** B.A.,

# విషయ సూచిక

# మనవి

మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది పేరు నేడు ప్రపంచమంతటా ఇస్లామ్, ఇస్లామీయ సాహిత్యం, ఇస్లామీయ సంస్కరణోద్యమంతో ప్రగాఢంగా పెనవేసుకుపోయింది. ఆయన చేసిన దివ్య ఖుర్‌ఆన్ ఉర్దూ అనువాదం, సవివరమయిన వ్యాఖ్యానం "తఫ్‌హీముల్ ఖుర్‌ఆన్", ఇస్లామీయ ప్రపంచ ప్రజలందరిచేత మన్ననలందుకుంది. ఆ అనువాదం సరళ మయినది, సులభగ్రాహ్యమయింది, ఆధునిక వైజ్ఞానిక యుగపు మనిషికి సుబోధకమయింది. ఆయన శైలి మనోహర, మనోజ్ఞమయినది, పాఠకుణ్ణి ఇట్టే ఆకట్టుకుని తనతోటే సరికొత్త ప్రపంచాలలో విహరింపజేసేది. మొత్తం తఫ్‌హీముల్ ఖుర్‌ఆన్‌ని ఇప్పట్లో తెలుగు ప్రజలకు అందజెయ్యడం వీలుపడదన్నది వాస్తవం. అది ఎంతో వ్యయప్రయాసలతో కూడుకున్న, మరెంతో సమయంకోరే బృహత్తర కార్యం. అందువల్ల కనీసం, మౌలానా గారు స్వయంగా తన ఉర్దూ అనువాదంతో పాటు అవసరమనుకున్న చోట క్లుప్తమయిన వివరణలు జతచేసి వెలువరించిన "తర్జుమయే ఖుర్‌ఆన్"ని తెలుగు ప్రజలకు అందజెయ్యాలన్నది తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ బహుకాల వాంఛ. తదనుగుణంగా ఆ కార్యభారాన్ని ఇస్లామీయ సాహిత్యంతో దగ్గరి సంబంధ మున్న వారు, ధర్మప్రచార కార్యంలో అనవరతం కృషి సలుపుతున్నవారు, శ్రీ షేఖ్ హమీదుల్లా షరీఫ్ గారికి అప్పజెప్పడం జరిగింది.

మొత్తం అనువాదాన్ని ఒకేసారి వెలువరించాలని అనుకున్నాము. అన్నీ అనుకున్నట్లే జరగవుగా. అయితే 1981లో వాదియె హుదాలో జరిగిన హిజ్రీ శకం 15వ శతాబ్ది ప్రారంభోత్స వాలలో మొదటి 15 భాగాలు, ఫాతిహా సూరా మొదలుకుని బనీ ఇస్రాయీల్ సూరా వరకు, మొదటి సంపుటంగా వెలువరించాము. ఆ తరువాత వీలయినంత త్వరగా రెండవ సంపుటం ప్రచురించి దివ్య ఖుర్‌ఆన్ పూర్తి అనువాదాన్ని అందజెయ్యాలని అనుకున్నాము. అనివార్య కారణాల వల్ల రెండవ సంపుటం అనువాదం, పరిశీలన ఇత్యాది దశల్లో అనుకోని విధంగా జాప్యం జరగనారంభించింది. ఆ మధ్యన మొదటి సంపుటం మరో ముద్రణ ప్రచురించవలసి వచ్చింది. రెండవ సంపుటం అనువాదాన్ని పునఃపరిశీలిస్తున్నప్పుడు మొదటి సంపుటం అను వాదాన్ని కూడా అనేక కోణాలలో సంస్కరించవలసి ఉంటుందన్న వాస్తవం వెల్లడయింది.

యొక్క పొందిక చెడకుండా వ్రాయబడుతుంది. కాని ప్రసంగంలో కేవలం కంఠ స్వరాన్నీ ఉపన్యాస ధోరణినీ మార్చి వక్త పెద్ద పెద్ద అవాంతర వాక్యాలు చెపుతూ పోతాడు; అయినా పొందిక లేదు అని అనిపించదు. రచనలో విషయాన్ని పరిసరాలతో అన్వయించటానికి పదాల సాయం తీసుకోవలసి ఉంటుంది. కాని ప్రసంగంలో స్వయంగా పరిసరాలే విషయంతో తమ సంబంధాన్ని అన్వయించుకుంటాయి. పరిసరాలను సూచించకుండా చెప్పబడే మాటల మధ్య, లోటు ఉన్నట్లు తోచదు. ప్రసంగంలో సంబోధించేవాడూ సంబోధింపబడేవాడూ మాటిమాటికీ మారుతూ ఉంటారు. వక్త తన ఉపన్యాసంలో సమయ సందర్భాలనుబట్టి ఒకప్పుడు ఒకే వర్గాన్ని ప్రథమ పురుషలో ప్రస్తావిస్తాడు. మరొకప్పుడు అదే వర్గాన్ని ఎదుట ఉన్నట్లు భావించి మధ్యమ పురుషలో సంబోధిస్తాడు. ఒకప్పుడు ఏకవచనం ప్రయోగిస్తాడు. మరొకప్పుడు బహువచనం ప్రయోగిస్తాడు. ఒకప్పుడు తానే స్వయంగా ఉత్తమ పురుష అవుతాడు. మరొకప్పుడు ఒక వర్గం తరఫున మాట్లాడుతాడు. ఒకప్పుడు ఒక అతీతశక్తికి ప్రాతినిధ్యం వహిస్తాడు. మరొకప్పుడు ఆ అతీతశక్తి స్వయంగా అతని నోట పలకటం ప్రారంభిస్తుంది. ప్రసంగానికి ఈ విషయం వల్ల ఒక సొగసు వస్తుంది. కాని రచనలో ఈ విషయమే పొంతనను కోల్పోతుంది. ఒక ప్రసంగాన్ని రచనా రూపంలోకి తీసుకువస్తే దానిని చదివేటప్పుడు పఠిత తప్పనిసరిగా అందులో ఒక విధమైన పొందికలేమిని గ్రహిస్తాడు. పఠిత అసలు ప్రసంగం యొక్క పరిస్థితులకూ పరిసరాలకూ ఎంతగా దూరమవుతాడో అంతగా ఈ అనుభూతి కూడా అధికం అవుతూ పోతుంది. అరబ్బీ ఖురానులో కూడా పొందికలేమి ఉన్నది అని అజ్ఞులు అనటానికి అసలు కారణం ఇదే. దానిని దూరం చేయటానికి వ్యాఖ్యాన వివరణల ద్వారా మూలంలోని పొందికను విస్పష్టం చెయ్యటం తప్ప మరొక మార్గం లేదు. ఎందుకంటే, ఖురాను యొక్క మూల రచనలో హెచ్చుతగ్గులు చేయటం నిషిద్ధం. కాని మరొక భాషలోకి ఖురానును భావానువాదం చేస్తున్నప్పుడు ప్రసంగభాషను జాగ్రత్తగా రచనా భాషలోకి మార్చుకుంటే ఈ పొందికలేమి చాలా తేలికగా తొలగిపోతుంది.

అంతేకాదు, నేను ఇంతకు ముందే సూచనప్రాయంగా తెలిపినట్లు ఖురాను యొక్క ప్రతి సూరా ఒక ప్రసంగం. అది ఇస్లామ్ సందేశ ప్రచారం జరిగేటప్పుడు ఒక దశలో, ఒక ప్రత్యేక సమయంలో అవతరించింది. దానికి ప్రత్యేకమైన ఒక పూర్వ రంగం ఉండేది. కొన్ని ప్రత్యేక పరిస్థితులు దానిని కోరుతూ ఉండేవి. కొన్ని అవసరాలను తీర్చటానికి అది అవతరించేది. తమ పూర్వరంగంతో, తమ అవతరణ కాలంతో ఖురాను సూరాల సంబంధం ఎంత సన్నిహితంగా, ఎంత లోతుగా ఉండేదంటే ఒకవేళ దాని నుండి వేరుచేసి కేవలం ప్రతిపదానువాదాన్ని పఠిత

ముందు పెడితే ఎన్నో విషయాలను అతడు అర్థం చేసుకోలేడు. కొన్ని విషయాలను వ్యతిరేకార్థంలో కూడా తీసుకుంటాడు. అందుచేత ఖురాను యొక్క పూర్తి ఉద్దేశ్యం బహుశా అతని అవగాహన పరిధిలోకి రానేరాదు. అరబ్బీ ఖురానులో ఈ చిక్కును పరిష్కరించటానికి వ్యాఖ్యానం యొక్క సహాయం తప్పనిసరి అవుతుంది. ఎందుకంటే ఖురాను మూలంలో ఏ విషయాన్నీ పెంచటానికి వీల్లేదు. ఖురానుకు భావానువాదం చేసేటప్పుడు పాఠకునికి పూర్తిగా అర్థం కావటానికి విషయాన్ని కొంతవరకైనా పూర్వరంగంతో, అవతరణ పరిస్థితులతో అన్వయించే స్వేచ్ఛ ఇతర భాషలో లభిస్తుంది.

మరొక విషయం ఏమిటంటే, ఖురాను స్పష్టమైన అరబ్బీ భాషలో అవతరించింది. కాని అది ప్రత్యేకమైన ఒక ప్రాంత పరిభాషను కలిగివుంది. అది ఎన్నో పదాలను నిఘంటువు అర్థంలో కాకుండా ఒక ప్రత్యేకార్థంలో ఉపయోగించింది. ఇంకా ఎన్నో పదాలను అది విభిన్న సమయాలలో విభిన్న అర్థాలలో ఉపయోగించింది. పదానికి పదంగా చేయబడే అనువాదాలలో ఈ పారిభాషిక పదాలను దృష్టిలో ఉంచుకోవటం చాలా కష్టం. వాటిని దృష్టిలో ఉంచుకోలేకపోవటం వల్ల అప్పుడప్పుడూ పాఠకులు రకరకాల చిక్కులకు గురిఅవుతారు, అపార్థం చేసుకుంటారు. ఉదాహరణకు కుఫ్ర్ అనే పదాన్ని తీసుకోండి. అది ఖురాను పరిభాషలో అరబ్బీ నిఘంటువు చెప్పే అర్థానికి మన ధర్మశాస్త్రజ్ఞులు, ఇస్లాం తత్వవేత్తలు చెప్పే అర్థానికి భిన్నమైన అర్థం కలిగివుంది. అంతేకాదు, ఖురానులో కూడా అన్నిచోట్లా అది ఒకే అర్థంలో ప్రయోగించబడలేదు. ఒకచోట పూర్తి అవిశ్వాసం అనీ, మరొకచోట విశ్వాసం కోరే ఒక అవసరాన్ని నెరవేర్చకపోవటానికి కుఫ్ర్ వర్తిస్తుంది. ఒకచోట వాచా విశ్వాసం ప్రకటించి, కర్మణా తిరస్కరించటానికి లేక అవిధేయత చూపటానికీ ఈ పదం వాడబడింది. మరొకచోట పై పై విధేయతను కనబరుస్తూ లోలోపల అవిశ్వాసం కలిగివుండటాన్ని కుఫ్ర్‌గా చెప్పటం జరిగింది. ఈ వివిధ సందర్భాలలో మనం గనక కుఫ్ర్‌ను కుఫ్ర్‌గానే అనువదిస్తూపోతే లేదా మరొక పదాన్ని తప్పనిసరిగా వాడితే, అనువాదం మాత్రం సరిఅయినదే అవుతుంది. కాని చదువరులు ఒకచోట భావాన్ని సరిగ్గా గ్రహించలేరు, మరొకచోట అపార్థం చేసుకుంటారు, ఇంకొకచోట సందిగ్ధతలో పడిపోతాడు.

శబ్దానువాద పద్ధతిలో ఉన్న ఇటువంటి లోపాలను సవరించటానికి నేను భావానువాద పద్ధతిని అవలంబించాను. నేను ఖురాను పదాలకు ఉర్దూ రూపాన్ని తొడగటానికి బదులుగా ఖురానులో ఒక భాగాన్ని చదివినప్పుడు నాకు అర్థమైన భావాన్నీ, నా హృదయంపై పడిన ప్రభావాన్నీ సాధ్యమైనంతవరకు సరిఅయినవిధంగా నా మాటలలోకి మార్చటానికి ప్రయత్నం

చేశాను. ప్రకటన శైలిలో 'తర్జుమాతనం' ఉండకూడదు. స్వచ్ఛమైన అరబ్బీ భాషకు అనువాదం స్వచ్ఛమైన ఉర్దూ భాషలోనే ఉండాలి. ప్రసంగంలోని పొందిక సహజమైన రీతిలో రచనా భాషలో సువ్యక్తం కావాలి. దైవవాణి యొక్క భావమూ, ఉద్దేశమూ విశదం కావటంతో పాటు దాని వైభవమూ, వాగ్ధాటీ సాధ్యమైనమేరకు అనువాదంలో ప్రతిబింబించాలి. ఇటువంటి స్వేచ్ఛానువాదం కొరకు పదానువాద శృంఖలాలను త్రెంచుకుని, భావాలను ప్రకటించే ధైర్యం చేయటం అత్యం తావశ్యకం. కాని వ్యవహారం దైవవాణికి సంబంధించినది కనుక, నేను భయం భయంగానే ఈ స్వేచ్ఛను వాడుకున్నాను. ఖురాను యొక్క అసలు వాక్యాలు స్వేచ్ఛా ప్రకటనకు కల్పించే అవకాశాన్ని ఏమాత్రమూ అతిక్రమించకుండా ఉండేందుకు నేను సాధ్యమైనంతవరకూ జాగ్రత్తపడ్డాను.

ఈ అనువాదంతో పాటు విషయం పూర్తిగా అర్థంకాని చోట మాత్రమే క్లుప్తమయిన వివరణలను ఇచ్చాను. కేవలం అనువాదాన్ని పఠించగోరే వారికే ఈ అనువాదం. ఇక విపులంగా ఖురానును అర్థం చేసుకోదలచిన వారికి నా వ్యాఖ్యాన గ్రంథమైన 'తఫ్‌హీముల్ ఖురాన్' అధ్యయనం ప్రయోజనకారి కాగలదు.

అనువాదం ద్వారా ప్రయోజనం పొందటానికి నా దృష్టిలో అత్యంత సముచితమైన పద్ధతి ఏమిటంటే, మీరు ప్రతిరోజు పారాయణం చేయదలచినంత మేరకు ఖురాను మూలాన్ని పఠించండి. తరువాత ఒక్కొక్క ఆయతు అనువాదాన్ని చదవండి. చివరకు ఖురానులోని ఆ మొత్తం భాగం యొక్క అనువాదాన్ని అవిచ్ఛిన్నంగా చదవండి. అప్పుడు ఆ రోజు మీరు పఠించిన దానిలోని భావం అంతా మీకు చక్కగా అర్థం అవుతుంది. దానితోపాటు ఖురాను శబ్దానువాదాన్ని కూడా ముందు ఉంచుకుంటే బాగుంటుంది, ప్రతి పదం యొక్క భావం తెలుస్తుంది.

లాహోరు, హిజ్రీ శకము, 1391, సఫర్, 7 — **– అబుల్ ఆలా**

క్రీస్తు శకము 1971, ఏప్రిల్, 4

بسم الله الرحمن الرحيم

అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

(١)

# سُوۡرَةُ الۡفَاتِحَةِ

مَكِّيَّة

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ

اَلۡحَمۡدُ لِلّٰهِ رَبِّ الۡعٰلَمِيۡنَ ۙ‏ ﴿١﴾ الرَّحۡمٰنِ

الرَّحِيۡمِ ۙ‏ ﴿٢﴾ مٰلِكِ يَوۡمِ الدِّيۡنِ ؕ‏ ﴿٣﴾

اِيَّاكَ نَعۡبُدُ وَاِيَّاكَ نَسۡتَعِيۡنُ ؕ‏ ﴿٤﴾

اِهۡدِنَا الصِّرَاطَ الۡمُسۡتَقِيۡمَ ۙ‏ ﴿٥﴾ صِرَاطَ

الَّذِيۡنَ اَنۡعَمۡتَ عَلَيۡهِمۡ ۙ‏ غَيۡرِ

الۡمَغۡضُوۡبِ عَلَيۡهِمۡ وَلَا الضَّآلِّيۡنَ ﴿٧﴾

وهي

سَبۡعُ اٰيَاتٍ

# 1. అల్ ఫాతిహా

ఆయతులు : 7 అవతరణ : మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 – 3 అల్లాహ్ మాత్రమే స్తుతింపదగినవాడు.[1] ఆయన సకల లోకాలకు ప్రభువు,[2] అనంత కరుణామయుడు, అపార కృపా శీలుడు, ప్రతిఫలదినానికి స్వామి.**

**4 – 7 మేము నిన్నే ఆరాధిస్తాము,[3] సహాయం కొరకు నిన్నే అర్థిస్తాము. మాకు రుజుమార్గం చూపించు– నీవు అనుగ్రహించిన వారూ, నీ ఆగ్రహానికి గురికానివారూ, మార్గభ్రష్టులు కానివారూ అనుసరించిన మార్గము.[4]**

---

1. అల్లాహ్ ఈ 'ఫాతిహ' సూరాను తన దాసులకు నేర్పాడు. వారు దానిని ఒక విన్నపం రూపంలో తమ ప్రభువు సాన్నిధ్యంలో సమర్పించు కునేందుకు.
2. 'రబ్' (ప్రభువు) అనే పదం అరబ్బీ భాషలో మూడు అర్థాలలో వాడబడు తుంది. (1) స్వామి, యజమాని (2) పెంచేవాడు, పోషించేవాడూను. కాపాడేవాడు, కనిపెట్టివుండేవాడూను. (3) చక్రవర్తి, పరిపాలకుడు, యుక్తిపరుడు, నిర్వాహకుడు. అల్లాహ్ ఈ అన్ని అర్థాలలోనూ సృష్టికి ప్రభువు.
3. "ఇబాదత్" అనే పదం కూడా అరబ్బీ భాషలో మూడు అర్థాలలో ఉప యోగించబడుతుంది. (1) ఆరాధన, ఉపాసన (2) విధేయత, ఆజ్ఞా పాలన, (3) దాస్యం, బానిసత్వం.
4. దాసుని ఈ ప్రార్థనకు ఖురాను యావత్తూ జవాబు. దాసుడు తన ప్రభువును మార్గదర్శకత్వం కోసం ప్రార్థిస్తాడు. ప్రభువు దానికి సమా ధానంగా ఈ ఖురానును అతనికి ప్రసాదిస్తాడు.

| ఆయతులు 286 | **2. అల్ బఖర** | అవతరణ మదీనాలో |
|---|---|---|

٢ سُورَةُ الْبَقَرَةِ مَدَنِيَّةٌ ٨٧

اٰیاتها ٢٨٦ | رکوعاتها ٤٠

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ۝

الٓمّٓ ۝١ ذٰلِكَ الْكِتٰبُ لَا رَيْبَ ۛ فِيْهِ ۛ هُدًى لِّلْمُتَّقِيْنَ ۝٢ الَّذِيْنَ يُؤْمِنُوْنَ بِالْغَيْبِ وَ يُقِيْمُوْنَ الصَّلٰوةَ وَ مِمَّا رَزَقْنٰهُمْ يُنْفِقُوْنَ ۝٣ وَ الَّذِيْنَ يُؤْمِنُوْنَ بِمَآ اُنْزِلَ اِلَيْكَ وَ مَآ اُنْزِلَ مِنْ قَبْلِكَ ۚ وَ بِالْاٰخِرَةِ هُمْ يُوْقِنُوْنَ ۝٤ اُولٰٓئِكَ عَلٰى هُدًى مِّنْ رَّبِّهِمْ ۗ وَ اُولٰٓئِكَ هُمُ الْمُفْلِحُوْنَ ۝٥ اِنَّ الَّذِيْنَ كَفَرُوْا سَوَآءٌ عَلَيْهِمْ ءَاَنْذَرْتَهُمْ اَمْ لَمْ تُنْذِرْهُمْ لَا يُؤْمِنُوْنَ ۝٦ خَتَمَ اللّٰهُ عَلٰى قُلُوْبِهِمْ وَ عَلٰى سَمْعِهِمْ ؕ وَ عَلٰٓى اَبْصَارِهِمْ غِشَاوَةٌ ۫ وَّلَهُمْ عَذَابٌ عَظِيْمٌ ۝٧

**1 - 5** అలిఫ్ లామ్ మీమ్.[1] ఇది అల్లాహ్ గ్రంథము. ఇందులో ఏమాత్రం సందేహంలేదు. అల్లాహ్ భీతి కల వారికి ఈ గ్రంథం మార్గదర్శకం- వారు అగోచర విషయాలను[2] విశ్వసిస్తారు. నమాజును స్థాపిస్తారు.[3] మేము ప్రసాదించిన దానినుండి (మా మార్గంలో) ఖర్చుచేస్తారు. మేము నీపై అవతరింపచేసిన గ్రంథాన్నీ (ఖురాను), నీకు పూర్వం అవతరింపచేసిన గ్రంథాలనూ విశ్వసిస్తారు. పరలోకాన్ని దృఢంగా నమ్ముతారు. ఇలాంటి వారు తమ ప్రభువు తరఫు నుండి రుజుమార్గంలో ఉన్నారు. సాఫల్యం పొందేవారువారే.

**6 - 7** (ఈ విషయాలను) తిరస్కరించిన వారిని నీవు హెచ్చరించినా, హెచ్చరించకపోయినా ఒకటే. వారు విశ్వసించేవారు కారు. అల్లాహ్ వారి హృదయాలకూ, వారి చెవులకూ ముద్రవేశాడు.[4] వారి కన్నులపై తెర పడింది. వారు కఠిన శిక్షకు అర్హులు.

---

1. "ముఖత్తఆత్" అనే ఈ పొడి అక్షరాలు ఖురానులో కొన్ని సూరాల ప్రారంభంలో కనిపిస్తాయి. వ్యాఖ్యాతలు వాటికి విభిన్నార్థాలను వ్రాశారు. కాని వారికి ఏ ఒక్క అర్థం విషయంలోనూ ఏకాభిప్రాయం లేదు. వాటి అర్థాన్ని తెలుసుకునే ఆవశ్యకత ఎందుకు లేదంటే, మనిషి వాటిని గురించి తెలుసుకొనకపోయినా, ఖురాను ద్వారా మార్గదర్శకత్వం పొందగలుగుతాడు. అందులో ఏ లోటూ ఉండదు.
2. అగోచరాలు అంటే భావం, మానవ ఇంద్రియాలకు గోప్యంగా ఉన్న సత్యాలు. ప్రత్యక్షంగా సామాన్య మానవుల అనుభవంలోకి, దృష్టిలోకి రాని సత్యాలు. ఉదాహరణకు దేవుని అస్తిత్వం, ఆయన గుణ విశేషాలు, దైవదూతలు, వహీ, స్వర్గం, నరకం మొదలైనవి.
3. "ఇఖామతుస్సలాత్" (నమాజును స్థాపించటం) అంటే మనిషి కేవలం నియమం ప్రకారం నమాజు చెయ్యట మనే భావం మాత్రమే కాదు. దాని అర్థం ఏమిటంటే, సామూహికంగా నమాజు వ్యవస్థను నియమబద్ధంగా స్థాపించటం. ఒకవేళ ఏ పట్టణంలోనైనా ఒక్కొక్క మనిషి వ్యక్తిగతంగా నమాజును చేస్తూ ఉన్నప్పటికీ, జమాఅతుతో ఈ విధిని నిర్వహించే ఏర్పాటు లేకపోతే, అక్కడ నమాజు స్థాపించబడుతోంది అని అనలేము.
4. దీని భావం, అల్లాహ్ ముద్ర వేశాడు, అందువల్ల వారు స్వీకరించటానికి తిరస్కరించారు అని కాదు. భావం ఏమిటంటే, వారు పైన చెప్పబడిన మౌలిక విషయాలను నిరాకరించారు. తమ కొరకు ఖురాను ప్రతిపాదించిన మార్గానికి భిన్నంగా మరొక మార్గాన్ని ఎన్నుకున్నారు. అప్పుడు అల్లాహ్ వారి హృదయాలకూ, చెవులకూ ముద్ర వేశాడు.

**8 - 20** "అల్లాహ్‌ను, అంతిమదినాన్ని మేము విశ్వసించాము" అని అనేవారు కూడా కొందరు ఉన్నారు. కాని వాస్తవంగా వారు విశ్వాసులు కారు. అల్లాహ్‌నూ, విశ్వాసులనూ వారు మోసం చేస్తున్నారు. కాని యథార్థంగా వారు తమను తాము తప్ప మరెవరినీ మోసం చెయ్యటం లేదు. అయితే ఈ విషయాన్ని వారు గ్రహించటం లేదు. వారి హృదయాలకు ఒక రోగం పట్టుకుంది. అల్లాహ్ ఆ రోగాన్ని మరింత అధికం చేశాడు.[5] వారు చెప్పే ఈ అబద్ధానికిగాను, వారికి వ్యధాభరిత మయిన శిక్ష పడుతుంది. "అవనిలో కల్లోలాన్ని రేకెత్తించకండి" అని వారితో అన్నప్పుడల్లా వారు "మేము సంస్కర్తలము మాత్రమే" అని అంటారు - జాగ్రత్త! వాస్తవంగా వారే అసలు కల్లోలాన్ని సృష్టించేవారు. కాని వారు గ్రహించటం లేదు. "ఇతరులు విశ్వసించిన విధంగానే మీరూ విశ్వసించండి" అని వారితో అన్నప్పుడు వారు "మూర్ఖులు విశ్వసించిన విధంగా మేము విశ్వసించాలా?" అని జవాబిస్తారు-జాగ్రత్త! వాస్తవంగా వారే మూర్ఖులు, కాని అది వారికి తెలియదు. విశ్వాసులను కలసినప్పుడు వారు "మేము విశ్వసించాము" అని అంటారు. కాని తమ షైతానులను ఏకాంతంగా కలసి నప్పుడు వారు "అసలు మేము మీతోనే ఉన్నాము. వారిని కేవలం ఎగతాళి చేస్తున్నాము" అని అంటారు- అల్లాహ్ వారిని ఎగతాళి చేస్తున్నాడు. ఆయన వారికి వ్యవధి నిస్తూపోతున్నాడు. వారు తలబిరుసుతనం వల్ల అంధులై గమ్యరహితంగా తిరు గుతూ పోతున్నారు. సన్మార్గానికి బదులుగా అపమార్గాన్ని కొనుక్కున్న ప్రజలు వారే. కాని వారి ఈ బేరం వారికి లాభదాయ కమయింది కాదు. వారు ఏమాత్రం సత్యమార్గంలో లేరు.

وَ مِنَ النَّاسِ مَنۡ يَّقُوۡلُ اٰمَنَّا بِاللّٰهِ وَ بِالۡيَوۡمِ
الۡاٰخِرِ وَ مَا هُمۡ بِمُؤۡمِنِيۡنَ ٨ يُخٰدِعُوۡنَ اللّٰهَ وَ
الَّذِيۡنَ اٰمَنُوۡا ۚ وَ مَا يَخۡدَعُوۡنَ اِلَّاۤ اَنۡفُسَهُمۡ وَ وقف لازم
مَا يَشۡعُرُوۡنَ ٩ فِىۡ قُلُوۡبِهِمۡ مَّرَضٌ ۙ فَزَادَهُمُ
اللّٰهُ مَرَضًا ۚ وَ لَهُمۡ عَذَابٌ اَلِيۡمٌ ۙۢ بِمَا كَانُوۡا
يَكۡذِبُوۡنَ ١٠ وَ اِذَا قِيۡلَ لَهُمۡ لَا تُفۡسِدُوۡا فِى
الۡاَرۡضِ ۙ قَالُوۡۤا اِنَّمَا نَحۡنُ مُصۡلِحُوۡنَ ١١ اَلَاۤ
اِنَّهُمۡ هُمُ الۡمُفۡسِدُوۡنَ وَ لٰـكِنۡ لَّا يَشۡعُرُوۡنَ ١٢
وَ اِذَا قِيۡلَ لَهُمۡ اٰمِنُوۡا كَمَاۤ اٰمَنَ النَّاسُ قَالُوۡۤا
اَنُؤۡمِنُ كَمَاۤ اٰمَنَ السُّفَهَآءُ ؕ اَلَاۤ اِنَّهُمۡ هُمُ
السُّفَهَآءُ وَ لٰـكِنۡ لَّا يَعۡلَمُوۡنَ ١٣ وَاِذَا لَقُوا
الَّذِيۡنَ اٰمَنُوۡا قَالُوۡۤا اٰمَنَّا ۖۚ وَ اِذَا خَلَوۡا اِلٰى
شَيٰطِيۡنِهِمۡ ۙ قَالُوۡۤا اِنَّا مَعَكُمۡ ۙ اِنَّمَا نَحۡنُ
مُسۡتَهۡزِءُوۡنَ ١٤ اَللّٰهُ يَسۡتَهۡزِئُ بِهِمۡ وَ
يَمُدُّهُمۡ فِىۡ طُغۡيَانِهِمۡ يَعۡمَهُوۡنَ ١٥ اُولٰٓـئِكَ
الَّذِيۡنَ اشۡتَرَوُا الضَّلٰلَةَ بِالۡهُدٰى ۖ فَمَا
رَبِحَتۡ تِّجَارَتُهُمۡ وَ مَا كَانُوۡا مُهۡتَدِيۡنَ ١٦

5. రోగం అంటే, కపటం అనే రోగం. అల్లాహ్ ఈ రోగాన్ని ఉధృతం చేశాడనే దాని అర్థం ఏమిటంటే, కపటిని అల్లాహ్ వెంటనే శిక్షించడు. అతడికి విడుపును ఇస్తూ పోతాడు. కపటి మరింత కపటి అవుతూ పోతాడు.

مَثَلُهُمْ كَمَثَلِ الَّذِي اسْتَوْقَدَ نَارًا ۚ فَلَمَّا
أَضَاءَتْ مَا حَوْلَهُ ذَهَبَ اللَّهُ بِنُورِهِمْ وَ
تَرَكَهُمْ فِي ظُلُمَاتٍ لَا يُبْصِرُونَ ﴿١٧﴾ صُمٌّ بُكْمٌ
عُمْيٌ فَهُمْ لَا يَرْجِعُونَ ﴿١٨﴾ أَوْ كَصَيِّبٍ مِنَ
السَّمَاءِ فِيهِ ظُلُمَاتٌ وَرَعْدٌ وَبَرْقٌ ۚ يَجْعَلُونَ
أَصَابِعَهُمْ فِي آذَانِهِمْ مِنَ الصَّوَاعِقِ حَذَرَ
الْمَوْتِ ۚ وَاللَّهُ مُحِيطٌ بِالْكَافِرِينَ ﴿١٩﴾ يَكَادُ
الْبَرْقُ يَخْطَفُ أَبْصَارَهُمْ ۖ كُلَّمَا أَضَاءَ لَهُمْ
مَشَوْا فِيهِ وَإِذَا أَظْلَمَ عَلَيْهِمْ قَامُوا ۚ وَلَوْ
شَاءَ اللَّهُ لَذَهَبَ بِسَمْعِهِمْ وَأَبْصَارِهِمْ ۚ إِنَّ
اللَّهَ عَلَىٰ كُلِّ شَيْءٍ قَدِيرٌ ﴿٢٠﴾ يَا أَيُّهَا النَّاسُ ع ٢
اعْبُدُوا رَبَّكُمُ الَّذِي خَلَقَكُمْ وَالَّذِينَ مِنْ
قَبْلِكُمْ لَعَلَّكُمْ تَتَّقُونَ ﴿٢١﴾ الَّذِي جَعَلَ لَكُمُ
الْأَرْضَ فِرَاشًا وَالسَّمَاءَ بِنَاءً وَأَنْزَلَ مِنَ
السَّمَاءِ مَاءً فَأَخْرَجَ بِهِ مِنَ الثَّمَرَاتِ رِزْقًا
لَكُمْ ۖ فَلَا تَجْعَلُوا لِلَّهِ أَنْدَادًا وَأَنْتُمْ تَعْلَمُونَ ﴿٢٢﴾

వారి ఉపమానం ఇలా వుంది: ఒక వ్యక్తి నిప్పు రాజేసినంతనే పరిసరాలన్నీ ప్రకాశించాయి. అప్పుడు అల్లాహ్ వారి కంటి వెలుగును హరింపజేసి, అంధకారంలో ఏమీ కానరాని స్థితిలో వారిని వదిలాడు.[6] వారు చెవిటివారు, మూగవారు, గ్రుడ్డివారు. ఇక వారు (రుజుమార్గానికి) మరలిరారు. లేదా మరొక ఉపమానం: ఆకాశం నుండి భారీగా వర్షం కురుస్తోంది. దానికి తోడు చిమ్మచీకట్లు, ఉరుములు, మెరుపులు! ఉరుముల భీకర ధ్వని విని, మృత్యు భయంచేత వారు తమ వ్రేళ్ళను చెవులలో దూర్చుకుంటారు. అల్లాహ్ ఈ సత్యతిరస్కారులను అన్ని వైపుల నుండి పరివేష్టించి ఉన్నాడు. వారి పరిస్థితి, మెరుపులు వారి దృష్టిని ఎగర వేసుకపోతాయా అనే విధంగా ఉంది. వెలుగును చూసినప్పుడల్లా వారు కొంత దూరం నడుస్తారు. చీకటి క్రమ్ముకోగానే ఆగిపోతారు[7]- అల్లాహ్ కోరితే వారి వినికిడినీ, వారి చూపునూ సంపూర్ణంగా నశింపచేసేవాడే. నిశ్చయంగా ఆయన ప్రతిదీ చేయగల సమర్థుడు.

**21 - 22** మానవులారా! మిమ్మల్నీ, మీకు పూర్వం వారినీ సృష్టించిన మీ ప్రభువును ఆరాధించండి. దీని ద్వారానే మిమ్మల్ని మీరు రక్షించుకునే అవకాశం[8] ఉంది. మీ కొరకు భూమిని పాన్పుగాను, ఆకాశాన్ని కప్పుగాను సృష్టించిన వాడూ, పైనుండి వర్షాన్ని కురిపించి, తద్వారా అన్ని రకాల పంటలు పండే ఏర్పాటుచేసి మీకు ఉపాధి కల్పించిన వాడూ ఆయనే! ఇది మీకు తెలిసినప్పుడు ఇతరులను అల్లాహ్‌కు సమానులుగా నిలబెట్టకండి.[9]

---

6. అర్థం ఏమిటంటే, అల్లాహ్ దాసుడు ఒకడు కాంతిని విరజిమ్మి, సత్యాన్ని అసత్యం నుండి వేరుచేసి పూర్తిగా ప్రస్ఫుటం చేసినప్పుడు, పరిశీలనా దృష్టి కలవారికి యథార్థాలన్నీ కనిపించాయి. కాని స్వార్థపూజలో అంధులౌతున్న ఈ కపటులకు ఈ కాంతిలో ఏమీ కనిపించలేదు.

7. మొదటి దృష్టాంతం మనస్సులో పూర్తిగా తిరస్కారులే అయినా ఏదో స్వార్థం వల్ల కాని ఏదో కారణం వల్ల కానీ ముస్లిములైన కపటులకు సంబంధించింది. ఇక రెండో దృష్టాంతం సంశయమూ, ఊగిసలాటా, విశ్వాస బలహీనతలకూ లోనైనవారికి సంబంధించినది. వారు సత్యం అంటే కొంచెం ఇష్టం కలవారే. అయినా దానికోసం బాధలనూ, ఆపదలనూ సహించేటంతటి సత్యప్రియత్వం లేనివారు.

8. అంటే, ప్రపంచంలో తప్పుడు దృష్టినుండీ, తప్పుడు నడత నుండీ, పరలోకంలో దైవశిక్ష నుండి తప్పించుకునే అవకాశం.

**23 - 24** మేము మా దాసునిపై అవతరింపజేసిన గ్రంథం గురించి, అది మా గ్రంథం అవునో కాదో అని మీకు సందేహం ఉన్నట్లయితే దానివంటి ఒక్క సూరానైనా మీరు రచించి తీసుకు రండి. మీ సహచరులందరినీ పిలుచుకోండి. ఒక్క అల్లాహ్ తప్ప మరెవరి సహాయాన్నయినా పొందండి. మీరు సత్య వంతులే అయితే ఈ పని చేసి చూపించండి. కాని మీరు అలా చెయ్యకపోతే- నిశ్చయంగా ఎన్నటికీ చెయ్యలేరు-భయ పడండి, మానవులు, రాళ్ళు[10] ఇంధనం కాగల ఆ అగ్నికి. అది సత్య తిరస్కారుల కొరకు తయారు చెయ్యబడింది.

**25** ప్రవక్తా! ఈ గ్రంథాన్ని విశ్వసించి, (దాని బోధనలకు అనుగుణంగా) తమ నడవడికను తీర్చిదిద్దుకునే వారికి సంతోషవార్త వినిపించు: కాలువలు ప్రవహించే ఉద్యాన వనాలు వారి కొరకు సిద్ధంగా ఉన్నాయి అని. ఆ వనాలలోని పండ్లు ఆకారంలో భూలోకంలోని పండ్లను పోలి ఉంటాయి. తినటానికి ఏమైనా పండ్లు ఇవ్వబడినప్పుడల్లా, వారు "ఇలాంటి పండ్లే పూర్వం భూలోకంలో మాకు ఇవ్వబడేవి" అని అంటారు. అక్కడ వారికొరకు పవిత్రలైన భార్యలు ఉంటారు. వారు అక్కడే శాశ్వతంగా ఉంటారు.

**26 - 27** అవును. దోమ లేక దానికంటే మరీ అల్పమైన వస్తువును దృష్టాంతంగా చెప్పటానికి అల్లాహ్ ఎంత మాత్రం సిగ్గుపడడు.[11] ఈ దృష్టాంతాన్నే సత్యస్వీకారులు చూసి, ఇది తమ ప్రభువు తరఫునుండి వచ్చిన సత్యమే అని గ్రహిస్తారు. కాని సత్యతిరస్కారులు వాటిని విని "ఈ ఉపమానాల ద్వారా అల్లాహ్ చెప్పదలచుకున్న దేమిటి?" అని ప్రశ్నిస్తారు. ఈ విధంగా అల్లాహ్ ఒకే విషయంతో ఎంతో మందిని అపమార్గం వైపునకు తీసుకుపోతాడు. ఎంతోమందికి రుజుమార్గం చూపు తాడు. అల్లాహ్ దీనిద్వారా అపమార్గం పట్టించేది వీరినే- అల్లాహ్ ఆజ్ఞలను ఉల్లంఘించేవారు,[12] అల్లాహ్ తీసుకున్న ప్రమాణాన్ని దృఢపరచిన తరువాత భంగపరచేవారు,[13] కలిపి వుంచండి అని అల్లాహ్ ఆదేశించిన దాన్ని తెంచేవారు,[14] ఇంకా భువిలో కల్లోలాన్ని రేకెత్తించేవారు - వాస్తవంగా నష్ట పడేవారు వీరే.

وَ اِنۡ كُنۡتُمۡ فِىۡ رَيۡبٍ مِّمَّا نَزَّلۡنَا عَلٰى عَبۡدِنَا
فَاۡتُوۡا بِسُوۡرَةٍ مِّنۡ مِّثۡلِهٖ ۖ وَادۡعُوۡا شُهَدَآءَكُمۡ
مِّنۡ دُوۡنِ اللّٰهِ اِنۡ كُنۡتُمۡ صٰدِقِيۡنَ ۝٢٣ فَاِنۡ لَّمۡ
تَفۡعَلُوۡا وَلَنۡ تَفۡعَلُوۡا فَاتَّقُوا النَّارَ الَّتِىۡ
وَقُوۡدُهَا النَّاسُ وَالۡحِجَارَةُ ۚۖ اُعِدَّتۡ
لِلۡكٰفِرِيۡنَ ۝٢٤ وَ بَشِّرِ الَّذِيۡنَ اٰمَنُوۡا وَعَمِلُوا
الصّٰلِحٰتِ اَنَّ لَهُمۡ جَنّٰتٍ تَجۡرِىۡ مِنۡ تَحۡتِهَا
الۡاَنۡهٰرُ ؕ كُلَّمَا رُزِقُوۡا مِنۡهَا مِنۡ ثَمَرَةٍ رِّزۡقًا ۙ
قَالُوۡا هٰذَا الَّذِىۡ رُزِقۡنَا مِنۡ قَبۡلُ ۙ وَاُتُوۡا بِهٖ
مُتَشَابِهًا ؕ وَلَهُمۡ فِيۡهَآ اَزۡوَاجٌ مُّطَهَّرَةٌ ۙ وَّهُمۡ
فِيۡهَا خٰلِدُوۡنَ ۝٢٥ اِنَّ اللّٰهَ لَا يَسۡتَحۡىٖۤ اَنۡ
يَّضۡرِبَ مَثَلًا مَّا بَعُوۡضَةً فَمَا فَوۡقَهَا ؕ فَاَمَّا
الَّذِيۡنَ اٰمَنُوۡا فَيَعۡلَمُوۡنَ اَنَّهُ الۡحَـقُّ مِنۡ رَّبِّهِمۡ ۚ
وَ اَمَّا الَّذِيۡنَ كَفَرُوۡا فَيَقُوۡلُوۡنَ مَاذَآ اَرَادَ
اللّٰهُ بِهٰذَا مَثَلًا ۘ يُضِلُّ بِهٖ كَثِيۡرًا ۙ وَّ يَهۡدِىۡ وقف لازم
بِهٖ كَثِيۡرًا ؕ وَمَا يُضِلُّ بِهٖۤ اِلَّا الۡفٰسِقِيۡنَ ۝٢٦ ۙ
الَّذِيۡنَ يَنۡقُضُوۡنَ عَهۡدَ اللّٰهِ مِنۡۢ بَعۡدِ مِيۡثَاقِهٖ ۖ
وَ يَقۡطَعُوۡنَ مَآ اَمَرَ اللّٰهُ بِهٖۤ اَنۡ يُّوۡصَلَ
وَيُفۡسِدُوۡنَ فِى الۡاَرۡضِ ؕ اُولٰٓـئِكَ هُمُ الۡخٰسِرُوۡنَ ۝٢٧

كَيْفَ تَكْفُرُوْنَ بِاللّٰهِ وَكُنْتُمْ اَمْوَاتًا فَاَحْيَاكُمْ
ثُمَّ يُمِيْتُكُمْ ثُمَّ يُحْيِيْكُمْ ثُمَّ اِلَيْهِ تُرْجَعُوْنَ ﴿٢٨﴾
هُوَ الَّذِیْ خَلَقَ لَكُمْ مَّا فِی الْاَرْضِ جَمِيْعًا
ثُمَّ اسْتَوٰۤی اِلَی السَّمَآءِ فَسَوّٰىهُنَّ سَبْعَ
سَمٰوٰتٍ وَهُوَ بِكُلِّ شَیْءٍ عَلِيْمٌ ﴿٢٩﴾ وَاِذْ قَالَ ع ٣ ٩ ٣
رَبُّكَ لِلْمَلٰٓئِكَةِ اِنِّیْ جَاعِلٌ فِی الْاَرْضِ
خَلِيْفَةً قَالُوْۤا اَتَجْعَلُ فِيْهَا مَنْ يُّفْسِدُ
فِيْهَا وَيَسْفِكُ الدِّمَآءَ وَنَحْنُ نُسَبِّحُ
بِحَمْدِكَ وَنُقَدِّسُ لَكَ قَالَ اِنِّیْۤ اَعْلَمُ مَا لَا
تَعْلَمُوْنَ ﴿٣٠﴾ وَعَلَّمَ اٰدَمَ الْاَسْمَآءَ كُلَّهَا ثُمَّ
عَرَضَهُمْ عَلَی الْمَلٰٓئِكَةِ فَقَالَ اَنْۢبِـُٔوْنِیْ
بِاَسْمَآءِ هٰۤؤُلَآءِ اِنْ كُنْتُمْ صٰدِقِيْنَ ﴿٣١﴾ قَالُوْا
سُبْحٰنَكَ لَا عِلْمَ لَنَاۤ اِلَّا مَا عَلَّمْتَنَا اِنَّكَ
اَنْتَ الْعَلِيْمُ الْحَكِيْمُ ﴿٣٢﴾ قَالَ يٰۤاٰدَمُ اَنْۢبِئْهُمْ
بِاَسْمَآئِهِمْ فَلَمَّاۤ اَنْۢبَاَهُمْ بِاَسْمَآئِهِمْ قَالَ
اَلَمْ اَقُلْ لَّكُمْ اِنِّیْۤ اَعْلَمُ غَيْبَ السَّمٰوٰتِ
وَالْاَرْضِ وَاَعْلَمُ مَا تُبْدُوْنَ وَمَا كُنْتُمْ
تَكْتُمُوْنَ ﴿٣٣﴾

**28 - 29** మీరు అల్లాహ్ పట్ల తిరస్కార వైఖరిని ఎలా అవలంబించగలుగు తారు? వాస్తవానికి ప్రాణంలేని మీకు ఆయన ప్రాణం పోశాడు. మళ్ళీ మీ ప్రాణాన్ని తీసేదీ ఆయనే. తిరిగి మిమ్మల్ని బ్రతికించేదీ ఆయనే. చివరకు మీరంతా ఆయన వద్దకే మరలిపోతారు. ఇంకా ఆయనే ధరణిలో ఉన్న సమస్తాన్నీ మీ కొరకు సృష్టించినవాడు. తరువాత తన ధ్యానాన్ని పైకి మరల్చి సప్తాకాశాలను[15] సృజించినవాడూ ఆయనే. ప్రతి విషయమూ క్షుణ్ణంగా తెలిసిన వాడూ ఆయనే.

**30 - 33** ఈ సంఘటనను జ్ఞాపకం తెచ్చుకో: "నేను భువిలో ఒక ప్రతినిధిని[16] సృష్టించబోతున్నాను" అని నీ ప్రభువు తన దూతలతో అన్నప్పుడు వారు, "భూ వ్యవస్థను అస్తవ్యస్తం చేసి రక్తం చిందించేవాణ్ణి నియమించబోతున్నావా ప్రభూ? మేము నీ స్తోత్రం చేస్తూ నీ గొప్పతనాన్ని కొనియాడుతూ నీ పవిత్రనామం స్మరిస్తూనే ఉన్నాము కదా!" అని విన్నవించు కున్నారు. దానికి అల్లాహ్, "మీకు తెలియనివన్నీ నాకు తెలుసు"అని సమాధానం పలికాడు. తరువాత అల్లాహ్ ఆదమ్‌కు అన్ని వస్తువుల పేర్లూ నేర్పాడు. వాటిని దూతలకు చూపించి, "(ప్రతినిధి నియామకం సంక్షోభానికి దారితీస్తుంది అనే) మీ అభిప్రాయమే నిజమయితే, వీటి పేర్లు కాస్త నాకు చెప్పండి?" అని అల్లాహ్ వారిని అడిగాడు. వారు కడు వినమ్రులై ఇలా అన్నారు: "(ప్రభూ!) దోష రహితుడవు నీవే! నీవు తెలిపినది తప్ప మాకు మరేమీ తెలియదు. వాస్తవంగా సర్వం తెలిసినవాడవూ సర్వాన్ని అర్థం చేసుకోగలవాడవూ నీవే!" అప్పుడు అల్లాహ్ ఆదమ్‌తో, "ఈ వస్తువుల పేర్లను నీవు వారికి తెలుపు" అని అన్నాడు. ఆదమ్ వారికి వాటి పేర్లన్నీ తెలుపగానే, అల్లాహ్ ఇలా ప్రకటించాడు: "భూమ్యా కాశాలలో మీకు గోప్యంగావున్న సత్యాలన్నీ నాకు తెలుసనీ, మీరు ప్రకటించేవీ, మీరు దాచేవీ అన్నీ నాకు తెలుసనీ నేను మీకు చెప్పలేదా?"

9. ఇతరులను అల్లాహ్‌కు సమానులుగా నిలబెట్టటం అంటే దాస్యం, ఆరాధనల విభిన్న రూపాలలో దేనినైనా అల్లాహ్ పట్ల కాక ఇతరుల పట్ల ప్రదర్శించటం.

10. అంటే, అక్కడ కేవలం మీరు మాత్రమే నరకాగ్నికి ఇంధనం కారు. మీతోపాటు మీరు మీ దైవాలుగా, ఆరాధ్యులుగా చేసుకున్న విగ్రహాలు కూడా అక్కడ ఉంటాయి.

وَاِذۡ قُلۡنَا لِلۡمَلٰٓـئِكَةِ اسۡجُدُوۡا لِاٰدَمَ فَسَجَدُوۡٓا اِلَّاۤ اِبۡلِيۡسَ ؕ اَبٰى وَاسۡتَكۡبَرَ ۖ وَكَانَ مِنَ الۡكٰفِرِيۡنَ ﴿۳۴﴾ وَقُلۡنَا يٰٓـاٰدَمُ اسۡكُنۡ اَنۡتَ وَزَوۡجُكَ الۡجَـنَّةَ وَكُلَا مِنۡهَا رَغَدًا حَيۡثُ شِئۡتُمَا ۖ وَلَا تَقۡرَبَا هٰذِهِ الشَّجَرَةَ فَتَكُوۡنَا مِنَ الظّٰلِمِيۡنَ ﴿۳۵﴾ فَاَزَلَّهُمَا الشَّيۡطٰنُ عَنۡهَا فَاَخۡرَجَهُمَا مِمَّا كَانَا فِيۡهِ ۖ وَقُلۡنَا اهۡبِطُوۡا بَعۡضُكُمۡ لِبَعۡضٍ عَدُوٌّ ۚ وَلَـكُمۡ فِى الۡاَرۡضِ مُسۡتَقَرٌّ وَّمَتَاعٌ اِلٰى حِيۡنٍ ﴿۳۶﴾ فَتَلَقّٰٓى اٰدَمُ مِنۡ رَّبِّهٖ كَلِمٰتٍ فَتَابَ عَلَيۡهِ ؕ اِنَّهٗ هُوَ التَّوَّابُ الرَّحِيۡمُ ﴿۳۷﴾

**34** మేము దూతలకు "మీరు అందరూ ఆదమ్‌కు తలవంచండి" అని ఆదేశించినప్పుడు, వారందరూ తలవంచారు. కాని ఇబ్లీసు ధిక్కరించాడు. దురహంకారానికి గురి అయ్యాడు. అవిధేయులలో కలసిపోయాడు.

**35 - 37** మళ్ళీ మేము ఆదమ్‌తో ఇలా అన్నాము: "నీవూ, నీ భార్య ఇద్దరూ కలసి స్వర్గంలో నివసించండి. ఇక్కడ మీరు మీకు ఇష్టమైన దానిని యధేచ్ఛగా తినండి. కాని ఈ చెట్టు దరిదాపులకు పోవద్దు. ఒకవేళ పోతే, మీరు అతిక్రమణదారులలో కలసిపోతారు." చివరకు షైతాను వారిద్దరిని ఆ చెట్టు వైపునకు ఆకర్షించి, మా ఆజ్ఞాపాలనం నుండి దూరం చేశాడు. వారిని తమ పూర్వపు స్థితి నుండి తొలగించి వదలివేశాడు. అప్పుడు మేము ఇలా ఆజ్ఞాపించాము: "ఇక మీరంతా ఇక్కడ నుండి దిగిపొండి. మీరు ఒకరికొకరు శత్రువులు. ఒక పరిమిత కాలం వరకు మీరు భూలోకంలో ఉండి అక్కడే జీవితం గడపవలసి ఉంది." అప్పుడు ఆదమ్ తన ప్రభువు నుండి కొన్ని మాటలు నేర్చుకుని, పశ్చాత్తాపపడుతూ క్షమాభిక్ష అర్థించాడు. అతని ప్రభువు అతని వేడుకోలును మన్నించాడు. ఎందుకంటే, ఆయన అమితంగా క్షమించేవాడు, కనికరించేవాడూను.

11. ఇక్కడ అభ్యంతరమేమిటో తెలుపకుండానే దానికి సమాధానం ఇవ్వబడింది. ఖురానులో పలుచోట్ల భావ వివరణ కోసం సాలెపురుగు, ఈగ, దోమ మొదలైన వాటి ఉపమానాలు ఇవ్వబడ్డాయి. క్షుద్ర వస్తువులు ఉపమానాలుగా ఉన్న దైవ గ్రంథం ఎలాంటి దైవ గ్రంథం అని విరోధులు వాటిపట్ల అభ్యంతరం తెలిపారు.

12. ఇది "ఫాసిఖ్" అనే అరబ్బీ పదానికి అర్థం. అంటే, అవిధేయుడు, దైవ విధేయతా హద్దులను అతిక్రమించినవాడు.

13. రాజు తన ఉద్యోగులకు, ప్రజలకు జారీచేసే ఫర్మానాలను, మార్గదర్శక సూత్రాలను అరబ్బీ భాషలో 'అహద్' అంటారు. అల్లాహ్ తీసుకున్న ప్రమాణం అంటే భావం ఆయన జారీచేసిన శాశ్వత ఫర్మానా. దాని ప్రకారం సమస్త మానవులు ఆయన దాస్యాన్నే, ఆయన విధేయతనే, ఆయన పూజనే చెయ్యటానికి బద్ధులై ఉన్నారు. "ధృఢపరచిన తరువాత" అనేది సూచించేదేమిటంటే, ఆదమ్‌ను సృష్టించే సమయంలో సమస్త మానవ జాతిచే ఈ ఫర్మానాను పాటిస్తామనే ప్రమాణం తీసుకోబడింది. ఆరాఫ్ సూరాలో 172వ ఆయత్‌లో ప్రవచింపబడిన విధంగా.

14. అంటే, ఏ సంబంధాల స్థాపన సుస్థిరతలపై మానవుని సామూహిక, వ్యక్తిగత సంక్షేమం ఆధారపడివుందో, ఇంకా వేటిని సక్రమంగా ఉంచండి అని అల్లాహ్ ఆదేశించాడో, వాటిని వీరు ధ్వంసం చేస్తారు.

15. సప్తాకాశాల యధార్థం ఏమిటో నిర్ణయించటం కష్టం. మానవుడు ప్రతి యుగంలోనూ ఆకాశాలను గురించీ లేక విశ్వంను గురించీ తన పరిశీలనలకు తన ఊహలకు అనుగుణంగా విభిన్న భావనలను రూపొందించుకుంటూ వచ్చాడు. అవి నిరంతరం మారుతూ వచ్చాయి. కనుక క్లుప్తంగా ఇలా అర్థం చేసుకోవాలి. భూమికి అవతల సృష్టి ఎంతవరకు ఉందో, దాన్ని అల్లాహ్ పటిష్టమైన ఏడు అంతస్తులుగా విభజించి ఉంచాడు లేదా విశ్వంలోని ఏ

قُلْنَا اهْبِطُوْا مِنْهَا جَمِيْعًا ۚ فَاِمَّا يَاْتِيَنَّكُمْ مِّنِّىْ
هُدًى فَمَنْ تَبِعَ هُدَاىَ فَلَا خَوْفٌ عَلَيْهِمْ وَلَا
هُمْ يَحْزَنُوْنَ ﴿۳۸﴾ وَالَّذِيْنَ كَفَرُوْا وَكَذَّبُوْا
بِاٰيٰتِنَآ اُولٰٓئِكَ اَصْحٰبُ النَّارِ ۚ هُمْ فِيْهَا
خٰلِدُوْنَ ﴿۳۹﴾ يٰبَنِىْٓ اِسْرَآءِيْلَ اذْكُرُوْا نِعْمَتِىَ
الَّتِىْٓ اَنْعَمْتُ عَلَيْكُمْ وَاَوْفُوْا بِعَهْدِىْٓ اُوْفِ
بِعَهْدِكُمْ ۚ وَاِيَّاىَ فَارْهَبُوْنِ ﴿۴۰﴾ وَ اٰمِنُوْا بِمَآ
اَنْزَلْتُ مُصَدِّقًا لِّمَا مَعَكُمْ وَلَا تَكُوْنُوْٓا اَوَّلَ
كَافِرٍۢ بِهٖ ۠ وَلَا تَشْتَرُوْا بِاٰيٰتِىْ ثَمَنًا قَلِيْلًا ۫
وَّاِيَّاىَ فَاتَّقُوْنِ ﴿۴۱﴾ وَلَا تَلْبِسُوا الْحَقَّ بِالْبَاطِلِ
وَتَكْتُمُوا الْحَقَّ وَ اَنْتُمْ تَعْلَمُوْنَ ﴿۴۲﴾ وَ اَقِيْمُوا
الصَّلٰوةَ وَاٰتُوا الزَّكٰوةَ وَارْكَعُوْا مَعَ الرّٰكِعِيْنَ ﴿۴۳﴾
اَتَاْمُرُوْنَ النَّاسَ بِالْبِرِّ وَتَنْسَوْنَ اَنْفُسَكُمْ وَ
اَنْتُمْ تَتْلُوْنَ الْكِتٰبَ ؕ اَفَلَا تَعْقِلُوْنَ ﴿۴۴﴾
وَاسْتَعِيْنُوْا بِالصَّبْرِ وَالصَّلٰوةِ ؕ وَ اِنَّهَا لَكَبِيْرَةٌ
اِلَّا عَلَى الْخٰشِعِيْنَ ﴿۴۵﴾ الَّذِيْنَ يَظُنُّوْنَ اَنَّهُمْ
مُّلٰقُوْا رَبِّهِمْ وَاَنَّهُمْ اِلَيْهِ رٰجِعُوْنَ ﴿۴۶﴾

**38-39** మేము ఇలా తెలిపాము: "మీరంతా ఇక్కడి నుండి దిగిపొండి. ఇకపై నా తరఫు నుండి ఏదైనా ఉపదేశం మీ వద్దకు వచ్చినప్పుడు, నా ఈ ఉపదేశాన్ని అనుసరించేవారికి ఏ విధమైన భయంకానీ, విచారంకానీ కలిగే అవకాశం ఉండదు. దానిని స్వీకరించటానికి నిరాకరించేవారూ, మా "ఆయతులు" అసత్యాలని తృణీకరించేవారూ, నరకాగ్నిలోకి పోతారు. అక్కడ వారు శాశ్వతంగా ఉంటారు.

**40 - 46** ఇస్రాయీలు వంశీయులారా![17] నేను మీకు ప్రసాదించిన కానుకను గురించి ఆలోచించండి. మీరు నాతో చేసిన వాగ్దానం నెరవేర్చండి. నేను మీతో చేసిన వాగ్దానం నెరవేరుస్తాను. నాకు మాత్రమే మీరు భయపడండి. నేను ఇప్పుడు పంపిన గ్రంథాన్ని విశ్వసించండి. ఇది వరకే మీ వద్ద ఉన్న దివ్య గ్రంథాన్ని అది ధ్రువీకరిస్తుంది. కనుక మీరే అందరికంటే ముందు దానిని తిరస్కరించేవారు అవకండి. అల్ప ధరకు నా ఆయతులను అమ్మకండి.[18] నా ఆగ్రహానికి భయపడండి. సత్యాన్ని అసత్యంతో కలిపి దానిని కలగాపులగం చెయ్యకండి. బుద్ధిపూర్వకంగా సత్యాన్ని కప్పిపుచ్చే ప్రయత్నం చెయ్యకండి. నమాజును స్థాపించండి. జకాత్ ఇవ్వండి. నా సాన్నిధ్యంలో వినమ్రులై తలవంచే వారితోపాటు మీరూ వినమ్రులై తలవంచండి. సన్మార్గాన్ని అవలంబించండి అని మీరు ఇతరులకయితే ఉపదేశిస్తారు - కాని మిమ్మల్ని మీరు మరచిపోతారేమిటి? వాస్తవానికి మీరు ధర్మగ్రంథం పారాయణం చేస్తారు. అయినా మీరు బుద్ధిని బొత్తిగా ఉపయోగించరేమిటి? సహనం ద్వారా, నమాజు ద్వారా సహాయం పొందండి. నిస్సందేహంగా నమాజు కష్టతరమైన కార్యం. కాని అల్లాహ్‌కు విధేయులైన దాసులకు అది ఎంతమాత్రం కష్టం కాదు-వారు తాము ఎట్టకేలకు తమ ప్రభువును కలుసుకోవలసి ఉందనీ, ఆయన వైపునకే మరలిపోవలసి ఉందనీ నమ్ముతారు.

మండలంలో భూమి ఉందో ఆ మండలంలో ఏడు అంతస్తులు ఉన్నాయి.

16. ప్రతినిధి (ఖలీఫా) అంటే ఒకరి ఆస్తిలో వారు ఇచ్చిన అధికారాలను వారి ప్రతినిధి హోదాలో ఉపయోగించేవాడు.

يٰبَنِيْٓ اِسْرَآءِيْلَ اذْكُرُوْا نِعْمَتِيَ الَّتِيْٓ اَنْعَمْتُ
عَلَيْكُمْ وَاَنِّيْ فَضَّلْتُكُمْ عَلَى الْعٰلَمِيْنَ ﴿٤٧﴾ وَاتَّقُوْا
يَوْمًا لَّا تَجْزِيْ نَفْسٌ عَنْ نَّفْسٍ شَيْــًٔا وَّ لَا
يُقْبَلُ مِنْهَا شَفَاعَةٌ وَّلَا يُؤْخَذُ مِنْهَا عَدْلٌ وَّ
لَا هُمْ يُنْصَرُوْنَ ﴿٤٨﴾ وَاِذْ نَجَّيْنٰكُمْ مِّنْ اٰلِ
فِرْعَوْنَ يَسُوْمُوْنَكُمْ سُوْٓءَ الْعَذَابِ يُذَبِّحُوْنَ
اَبْنَآءَكُمْ وَيَسْتَحْيُوْنَ نِسَآءَكُمْ ؕ وَفِيْ ذٰلِكُمْ
بَلَآءٌ مِّنْ رَّبِّكُمْ عَظِيْمٌ ﴿٤٩﴾ وَاِذْ فَرَقْنَا بِكُمُ
الْبَحْرَ فَاَنْجَيْنٰكُمْ وَاَغْرَقْنَآ اٰلَ فِرْعَوْنَ وَاَنْتُمْ
تَنْظُرُوْنَ ﴿٥٠﴾ وَاِذْ وٰعَدْنَا مُوْسٰٓى اَرْبَعِيْنَ
لَيْلَةً ثُمَّ اتَّخَذْتُمُ الْعِجْلَ مِنْۢ بَعْدِهٖ وَاَنْتُمْ
ظٰلِمُوْنَ ﴿٥١﴾ ثُمَّ عَفَوْنَا عَنْكُمْ مِّنْۢ بَعْدِ ذٰلِكَ
لَعَلَّكُمْ تَشْكُرُوْنَ ﴿٥٢﴾

**47 - 48** ఇస్రాయీలు వంశీయులారా! నేను మీకు చేసిన మహోపకారాన్నీ, మిమ్మల్ని ప్రపంచంలోని జాతులలోకెల్లా ఘనతగల ఒక జాతిగా ఆదరించిన విషయాన్నీ[19] గుర్తుకు తెచ్చుకోండి. ఎవరూ ఎవరికీ ఏమాత్రం తోడ్పడలేని, ఎవరి సిఫారసూ అంగీకరించబడని, పరిహారం తీసుకుని ఎవరినీ విడుదల చెయ్యని, అపరాధులకు సహాయం ఎక్కడ నుండీ లభించని ఆ దినానికి మీరు భయపడండి.

**49** ఫిరౌను ప్రజల[20] బానిసత్వం నుండి మేము మీకు విముక్తి కలిగించిన సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకోండి– వారు మిమ్మల్ని ఘోర హింసకు గురిచేసే వారు. మీ కుమారులను వధించి, మీ కుమార్తెలను సజీవంగా విడిచి పెట్టేవారు. ఇందులో మీ ప్రభువు తరఫు నుండి మీకు కఠిన పరీక్ష ఉండినది.

**50** సముద్రాన్ని చీల్చి మేము మీకు మార్గం ఏర్పాటు చేసిన సంఘటనను గుర్తుకు తెచ్చుకోండి. ఆ తరువాత దానినుండి మిమ్మల్ని సురక్షితంగా ఆవలి ఒడ్డుకు చేరవేశాము. మీ కళ్ళముందే ఫిరౌను ప్రజలను మేము అందులో ముంచి వేశాము.

**51 - 52** మేము మూసాను నలువది రేయింబవళ్ళ నిర్ణీత కాలం వరకు పిలిచినప్పుడు,[21] మీరు అతను లేకపోవటం చూసి ఆవుదూడను ఆరాధ్య దైవంగా చేసుకున్నారు. ఆ విధంగా మీరు ఘోర దురాచారానికి పాల్పడ్డారు. అయినప్పటికీ మీరు కృతజ్ఞులౌతారేమో అని మేము మిమ్మల్ని క్షమించాము.

---

17. పవిత్ర మదీనా పట్టణంలోనూ, దానికి దగ్గరగా ఉన్న ప్రాంతంలోనూ యూదులు అధిక సంఖ్యలో నివసిస్తూ ఉండేవారు. కనుక ఇక్కణ్ణుండి 121వ ఆయత్తు వరకు వారిని సంబోధించి హితవు గరపటం జరిగింది.

18. "అల్ప ధర" అంటే ప్రాపంచిక ప్రయోజనాలు. వాటికోసం ఈ ప్రజలు అల్లాహ్ ఆజ్ఞలను, ఆయన ఉపదేశాలను రద్దుచేస్తూ ఉండేవారు. సత్య విక్రయానికి ప్రతిమూల్యంగా మానవుడు ప్రపంచంలో ఉన్న ధనం మొత్తాన్ని తీసుకున్న ప్పటికీ అది స్వల్పమైన ధరే అవుతుంది. ఎందుకంటే సత్యం దీనికంటే నిశ్చయంగా ఖరీదైనది.

19. శాశ్వతంగా మిమ్మల్ని సమస్త ప్రపంచ జాతులకంటే శ్రేష్ఠులుగా నిర్ణయించామని దీని భావం కాదు. అర్థం ఏమిటంటే, ఒకప్పుడు ప్రపంచ జాతులలో అల్లాహ్ ప్రసాదించిన సత్యజ్ఞానం కలిగివున్న జాతివారు మీరే. ఇంకా మీరు ప్రపంచ జాతులకు నాయకులుగానూ, మార్గదర్శకులుగానూ చెయ్యబడ్డారు – ప్రభువు దాస్యమార్గం వైపునకు అన్ని జాతులను ఆహ్వానించేందుకూ, నడిపేందుకూను.

**53** గుర్తుకు తెచ్చుకోండి: (ఈ ఘోర పాతకంలో మీరు మునిగి వున్నప్పుడు) మీరు రుజుమార్గం పొందగలందుకు మేము మూసాకు గ్రంథాన్నీ, గీటురాయినీ[22] ప్రసాదించాము.

**54** జ్ఞాపకం తెచ్చుకోండి: (అల్లాహ్ ప్రసాదించిన ఈ కానుకతో తిరిగి వచ్చిన) మూసా తన జాతి ప్రజలతో ఇలా అన్నాడు: "జనులారా! ఆవు దూడను ఆరాధ్య దైవంగా ఎన్నుకుని మీకు మీరే అన్యాయం చేసుకున్నారు. కనుక పశ్చాత్తాపంతో క్షమాభిక్ష కొరకు మీరు మీ సృష్టికర్తను వేడుకోండి, మీలోని ఘోర పాతకులను సంహరించండి.[23] మీ సృష్టికర్త దృష్టిలో ఇదే మీకు అత్యంత శ్రేయస్కరమైనది." అప్పుడు మీ సృష్టికర్త మీ పశ్చాత్తాపాన్ని ఆమోదించాడు. ఆయన ఎక్కువగా క్షమించే వాడూ, అమితంగా కరుణించేవాడూను.

**55 - 56** మూసాతో మీరు అన్న మాటలను జ్ఞప్తికి తెచ్చు కోండి: "మూసా! మేము అల్లాహ్‌ను (నీతో మాట్లాడుతూ ఉండగా) కళ్ళారా చూడనంతవరకు, నీ మాటలను ఎంత మాత్రం విశ్వసించము." అదే సమయంలో మీరు చూస్తూ ఉండగానే, ఒక భయంకరమైన పిడుగు మీపై పడింది. మీరంతా నిర్జీవులై నేలకొరిగారు. మళ్ళీ మేము ప్రాణం పోసి మిమ్మల్ని లేపాము, కనీసం ఈ ఉపకారం తరువాతైనా మీరు కృతజ్ఞత చూపు తారేమో అని.

**57** మేము మీపై మేఘాల ఛాయను కల్పించాము. మన్న్, సల్వాలను మీ కొరకు ఆహారంగా దించి, "మేము మీకు ప్రసాదించిన వాటిలో పరిశుభ్రమూ, పరిశుద్ధమూ అయిన వస్తువులను తినండి" అని చెప్పాము. (అయినప్పటికీ మీ పూర్వీకులు మా ఆజ్ఞలను ఉల్లంఘించారు) అయితే వారు మాకు ఏమాత్రం అన్యాయం చేయలేదు. తమకు తామే అన్యాయం చేసుకున్నారు.

وَ اِذْ اٰتَيْنَا مُوْسَى الْكِتٰبَ وَالْفُرْقَانَ لَعَلَّكُمْ
تَهْتَدُوْنَ ﴿٥٣﴾ وَ اِذْ قَالَ مُوْسٰى لِقَوْمِهٖ يٰقَوْمِ
اِنَّكُمْ ظَلَمْتُمْ اَنْفُسَكُمْ بِاتِّخَاذِكُمُ الْعِجْلَ
فَتُوْبُوْٓا اِلٰى بَارِىِٕكُمْ فَاقْتُلُوْٓا اَنْفُسَكُمْ ؕ ذٰلِكُمْ
خَيْرٌ لَّكُمْ عِنْدَ بَارِىِٕكُمْ ؕ فَتَابَ عَلَيْكُمْ ؕ اِنَّهٗ
هُوَ التَّوَّابُ الرَّحِيْمُ ﴿٥٤﴾ وَاِذْ قُلْتُمْ يٰمُوْسٰى لَنْ
نُّؤْمِنَ لَكَ حَتّٰى نَرَى اللّٰهَ جَهْرَةً فَاَخَذَتْكُمُ
الصّٰعِقَةُ وَاَنْتُمْ تَنْظُرُوْنَ ﴿٥٥﴾ ثُمَّ بَعَثْنٰكُمْ مِّنْ
بَعْدِ مَوْتِكُمْ لَعَلَّكُمْ تَشْكُرُوْنَ ﴿٥٦﴾ وَ ظَلَّلْنَا
عَلَيْكُمُ الْغَمَامَ وَاَنْزَلْنَا عَلَيْكُمُ الْمَنَّ
وَالسَّلْوٰى ؕ كُلُوْا مِنْ طَيِّبٰتِ مَا رَزَقْنٰكُمْ ؕ وَ
مَا ظَلَمُوْنَا وَلٰكِنْ كَانُوْٓا اَنْفُسَهُمْ يَظْلِمُوْنَ ﴿٥٧﴾

20. "ఆలి ఫిరౌను"ను మేము ఫిరౌను ప్రజలుగా అనువాదం చేశాము. ఇందులో ఫిరౌను వంశం వారు మరియు ఈజిప్ట్ పాలకవర్గంవారు ఉభయులూ చేరి ఉన్నారు.

21. అంటే, ఈజిప్టు నుండి విముక్తి పొందిన తరువాత, ఇస్రాయీలు సంతతివారు సినాయ్ ద్వీపకల్పానికి చేరు కున్నారు. అప్పుడు, అల్లాహ్ హజ్రత్ మూసా(అస్సలామ్)ను నలభై రేయింబవళ్ళు ఉండటానికి తూర్ పర్వతంపైకి పిలిచాడు.

وَ اِذْ قُلْنَا ادْخُلُوْا هٰذِهِ الْقَرْيَةَ فَكُلُوْا مِنْهَا
حَيْثُ شِئْتُمْ رَغَدًا وَّادْخُلُوا الْبَابَ سُجَّدًا وَّ
قُوْلُوْا حِطَّةٌ نَّغْفِرْ لَكُمْ خَطٰيٰكُمْ ؕ وَ سَنَزِيْدُ
الْمُحْسِنِيْنَ ﴿۵۸﴾ فَبَدَّلَ الَّذِيْنَ ظَلَمُوْا قَوْلًا
غَيْرَ الَّذِيْ قِيْلَ لَهُمْ فَاَنْزَلْنَا عَلَى الَّذِيْنَ
ظَلَمُوْا رِجْزًا مِّنَ السَّمَآءِ بِمَا كَانُوْا يَفْسُقُوْنَ ﴿۵۹﴾ ع
وَ اِذِ اسْتَسْقٰى مُوْسٰى لِقَوْمِهٖ فَقُلْنَا اضْرِبْ
بِّعَصَاكَ الْحَجَرَ ؕ فَانْفَجَرَتْ مِنْهُ اثْنَتَا
عَشْرَةَ عَيْنًا ؕ قَدْ عَلِمَ كُلُّ اُنَاسٍ
مَّشْرَبَهُمْ ؕ كُلُوْا وَاشْرَبُوْا مِنْ رِّزْقِ اللّٰهِ وَ لَا
تَعْثَوْا فِى الْاَرْضِ مُفْسِدِيْنَ ﴿۶۰﴾ وَ اِذْ قُلْتُمْ
يٰمُوْسٰى لَنْ نَّصْبِرَ عَلٰى طَعَامٍ وَّاحِدٍ فَادْعُ لَنَا
رَبَّكَ يُخْرِجْ لَنَا مِمَّا تُنْۢبِتُ الْاَرْضُ مِنْۢ
بَقْلِهَا وَ قِثَّآئِهَا وَ فُوْمِهَا وَ عَدَسِهَا وَ بَصَلِهَا ؕ
قَالَ اَتَسْتَبْدِلُوْنَ الَّذِيْ هُوَ اَدْنٰى بِالَّذِيْ هُوَ
خَيْرٌ ؕ اِهْبِطُوْا مِصْرًا فَاِنَّ لَكُمْ مَّا سَاَلْتُمْ ؕ وَ
ضُرِبَتْ عَلَيْهِمُ الذِّلَّةُ وَالْمَسْكَنَةُ ۗ وَ بَآءُوْ
بِغَضَبٍ مِّنَ اللّٰهِ ؕ ذٰلِكَ بِاَنَّهُمْ كَانُوْا يَكْفُرُوْنَ
بِاٰيٰتِ اللّٰهِ وَ يَقْتُلُوْنَ النَّبِيّٖنَ بِغَيْرِ الْحَقِّ ؕ
ذٰلِكَ بِمَا عَصَوْا وَّكَانُوْا يَعْتَدُوْنَ ﴿۶۱﴾ ع

**58 - 59** గుర్తుకు తెచ్చుకోండి, మేము మీతో ఇలా అన్నాము: "(మీ ముందు ఉన్న) ఈ నగరంలో ప్రవేశించండి. అక్కడ పండే పంటలను మీ ఇష్టానుసారం తృప్తిగా తినండి. కాని వినమ్రులై తలవంచుతూ నగర ద్వారంలో ప్రవేశించాలి. 'హిత్తతున్, హిత్తతున్'[24] అంటూ ముందుకు సాగిపోవాలి. అప్పుడు మేము మీరు చేసిన తప్పులను మన్నిస్తాము. సజ్జనులను అత్యధికంగా అనుగ్రహిస్తాము." కాని దుర్మార్గులు మేము వారితో అన్న మాటలను సమూలంగా మార్చివేశారు. కనుక దుర్మార్గం చేసినవారిపై మేము ఆకాశం నుండి ఆపదను దింపాము. ఇది వారు చూపుతూ వచ్చిన అవిధేయతలకు శిక్ష.

**60** జ్ఞాపకం తెచ్చుకోండి, మూసా తన ప్రజల కొరకు నీటికోసం ప్రార్థించినప్పుడు, మేము "నీవు ఆ కొండ రాతిని నీ చేతి కర్రతో కొట్టు" అని ఆదేశించాము. తదనుగుణంగా కొండరాయి నుండి పన్నెండు ఊటలు పెల్లుబికాయి. ప్రతి తెగవారు తమ నీరు త్రాగే స్థలాన్ని[25] కనుగొన్నారు. (అప్పుడు వారికి ఈ విధంగా ఆదేశించబడింది) "అల్లాహ్ మీకు ప్రసాదించిన దానిని తినండి, త్రాగండి. కాని ధరణిపై కల్లోలం రేకెత్తిస్తూ తిరగకండి."

**61** మీరు మూసాకు చేసిన ఫిర్యాదును జ్ఞాపకం తెచ్చుకోండి. "ఒకే రకమైన భోజనాన్ని మేము భరించలేకుండా ఉన్నాము. భూమిలో ఉత్పత్తి అయ్యే ఆకుకూరలు, కూరగాయలు, గోధుమలు, వెల్లుల్లి, ఉల్లిపాయలు, పప్పు దినుసులు మొదలైనవి మా కొరకు పండించు అని నీవు నీ ప్రభువును ప్రార్థించు." అప్పుడు మూసా ఇలా అడిగాడు: "శ్రేష్ఠమైన దానికి బదులుగా నీచమైనదానిని కోరుకుంటున్నారా? సరే, మంచిది. ఏదో ఒక పట్టణానికి మీరంతా తరలిపొండి. అక్కడ మీరు కోరేదంతా దొరుకుతుంది." చివరకు వారు తీవ్ర అవమానానికీ, పరాభవానికీ, దురవస్థకూ, దుర్భర దారిద్ర్యానికీ గురి అయ్యారు. ఇంకా వారు అల్లాహ్ ఆగ్రహానికి అర్హులయ్యారు. అదంతా వారు అల్లాహ్ ఆయతులను తిరస్కరించినదాని ఫలితం; ప్రవక్తలను అన్యాయంగా చంపినదాని ఫలం; అల్లాహ్ పట్ల అవిధేయత చూపినదాని పరిణామం; షరీయత్తు హద్దులను మాటిమాటికీ అతిక్రమించినదాని పర్యవసానం.

62 అరేబియా ప్రవక్త (ముహమ్మద్)ను విశ్వసించేవారుకానీ, యూదులుకానీ, క్రైస్తవులుకానీ, సాబియీలుకానీ-ఎవరైనా సరే- అల్లాహ్‌ను, అంతిమదినాన్ని విశ్వసించి మంచి పనులు చేసినవారికి నిస్సందేహంగా వారి ప్రభువు వద్ద మంచి ప్రతిఫలం ఉంది. వారికి ఏ విధమైన భయం కానీ, విచారం కానీ కలిగే అవకాశం లేదు.[26]

63 - 64 మేము తూర్ పర్వతాన్ని ఎత్తి మీపై నిలిపి మీ చేత చేయించిన ప్రమాణాన్ని గుర్తుకు తెచ్చుకోండి. అప్పుడు "మేము మీకు ప్రసాదిస్తున్న గ్రంథాన్ని దృఢంగా పట్టుకోండి, అందులో ఉన్న ఆజ్ఞలను, ఉపదేశాలను జ్ఞాపకం ఉంచుకోండి. దీని ద్వారానే మీరు భయభక్తుల బాటలో నడువగలరు" అని బోధించాము. కాని తరువాత మీరు ఆ ఒడంబడికను త్రోసిరాజన్నారు. అయినప్పటికీ అల్లాహ్ మిమ్మల్ని తన అనుగ్రహానికీ, కారుణ్యానికీ దూరం చెయ్యలేదు. లేకపోతే మీరు ఎప్పుడో వినాశానికి గురిఅయి ఉండేవారు.

اِنَّ الَّذِيْنَ اٰمَنُوْا وَالَّذِيْنَ هَادُوْا وَالنَّصٰرٰى
وَ الصّٰبِـِٕيْنَ مَنْ اٰمَنَ بِاللّٰهِ وَالْيَوْمِ الْاٰخِرِ
وَعَمِلَ صَالِحًا فَلَهُمْ اَجْرُهُمْ عِنْدَ رَبِّهِمْ ۚ وَلَا
خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ يَحْزَنُوْنَ ۝٦٢ وَاِذْ
اَخَذْنَا مِيْثَاقَكُمْ وَرَفَعْنَا فَوْقَكُمُ الطُّوْرَ ۗ
خُذُوْا مَآ اٰتَيْنٰكُمْ بِقُوَّةٍ وَّ اذْكُرُوْا مَا فِيْهِ
لَعَلَّكُمْ تَتَّقُوْنَ ۝٦٣ ثُمَّ تَوَلَّيْتُمْ مِّنْۢ بَعْدِ
ذٰلِكَ ۚ فَلَوْلَا فَضْلُ اللّٰهِ عَلَيْكُمْ وَرَحْمَتُهٗ
لَكُنْتُمْ مِّنَ الْخٰسِرِيْنَ ۝٦٤

ఇప్పుడు స్వతంత్రమైన జాతికి షరీయత్ సూత్రాలను, నిత్య జీవితానికి సంబంధించిన ఉపదేశాలను ఇవ్వటానికి.

22. గీటురాయి (ఫుర్ఖాన్) అంటే సత్యాసత్యాల భేదాన్ని ప్రస్ఫుటం చేసి చూపే వస్తువు అని భావం. అంటే, ధార్మిక జ్ఞానం, దాని అవగాహన. దానిద్వారా మనిషి సత్యాసత్యాల భేదాన్ని గుర్తిస్తాడు.

23. అంటే, మీలో ఆవుదూడను ఆరాధ్యదైవంగా చేసుకుని పూజించిన వారిని చంపండి అని అర్థం.

24. "హిత్తతున్"కు రెండు అర్థాలు చెప్పవచ్చు. ఒకటి : తమ తప్పులకు క్షమాభిక్ష పెట్టమని దేవుణ్ణి వేడుకుంటూ ప్రవేశించటం. రెండు : దోపిడీలు, హత్యాకాండ చేయటానికి బదులుగా నగర పౌరులందరినీ మన్నిస్తూ, సాధారణ క్షమ ప్రకటిస్తూ ప్రవేశించటం.

25. ఇస్రాయీలు సంతతిలో పన్నెండు తెగలుండేవి. అల్లాహ్ ప్రతి ఒక్క తెగకు ఒక ప్రత్యేక జలధారను ఏర్పాటుచేశాడు, వారి మధ్య పోట్లాట జరక్కుండా ఉండేందుకు.

26. సందర్భాన్నిబట్టి చూస్తే విశదమయ్యే విషయం ఏమిటంటే, ఇక్కడ విశ్వాసం సత్కార్మాలకు సంబంధించిన వివరాలు అంటే ఏ విషయాలను మనిషి విశ్వసించి ఏ పనులు చేస్తే అల్లాహ్ దృష్టిలో బహుమానానికి అర్హు డౌతాడో అనే వివరాలను ప్రవచించటం ఉద్దేశ్యం కాదు. యూదులే స్వర్గ ప్రవేశానికి అర్హులు అనే యూదుల నిరాధారమైన దృఢ విశ్వాసాన్ని ఖండించటం ఆయత్ ఉద్దేశ్యం. వారి వర్గంతో సంబంధం కలిగి వున్నవాడు ఆచరణ, విశ్వాసాల విషయంలో ఎలా ఉన్నాసరే అతని కొరకు ముక్తి వ్రాయబడిందనీ, వారి వర్గానికి బయటవున్న మిగతా మానవులందరూ నరకాగ్నికి ఇంధనం అవటానికే పుట్టారు అనే వారి అభిప్రాయాన్ని కూడా ఈ ఆయత్ ఖండిస్తుంది. వారి ఈ అపోహను దూరం చెయ్యటానికే ఇలా అనబడుతోంది: "అల్లాహ్ వద్ద పనికొచ్చేది మీరు సృష్టించుకొన్న వర్గాలూ, తెగలూ ఎంతమాత్రం కాదు. అక్కడ పనికొచ్చేదీ, చలామణీ అయ్యేదీ, విశ్వాసం, సత్కార్యాలు మాత్రమే." ఏ మనిషైనా సరే వీటిని తనతో తీసుకుని హాజరైతే అతడు తన ప్రభువు వద్ద తన బహుమానం పొందితీరుతాడు. అల్లాహ్ వద్ద తీర్పు జరిగేది మనిషి గుణగణాలనుబట్టేగాని మీ జనాభా లెక్కల జాబితాలు ఆధారంగా కాదు.

**65 - 66** సబ్బత్[27] శాసనం ఉల్లంఘించిన మీ వారి గాథ మీకు బాగా తెలుసు. మేము వారిని "అందరూ అసహ్యంగా, నీచంగా చూసే కోతులుగా మారిపోండి" అని శపించాము. ఈ విధంగా మేము వారి ముగింపును ఆ కాలం వారికీ, భావితరాల వారికీ ఒక గుణపాఠంగానూ, భయభక్తులు కలవారికి ఒక హితోపదేశంగానూ చేశాము.

**67 - 71** ఈ సంఘటనను కూడ గుర్తుకు తెచ్చుకోండి: మూసా తన జాతి వారితో, "అల్లాహ్ మిమ్మల్ని ఒక గోవును బలిగా ఇవ్వండి అని ఆజ్ఞాపిస్తున్నాడు" అని అన్నపుడు వారు "మాతో నీవు పరిహాసమాడుతున్నావా?" అని బదులు పలికారు. "అవివేకుల మాదిరిగా నేనూ మాట్లాడకుండా నన్ను రక్షించు అని అల్లాహ్‌ను శరణు వేడుకుంటున్నాను" అని మూసా అన్నాడు. అప్పుడు వారు, "సరే, ఆ ఆవును గురించి వివరంగా మాకు చెప్పు అని నీవు నీ ప్రభువును అడుగు" అని మూసాను కోరారు. అతను ఇలా సమాధానం చెప్పాడు: "అది ముసలిదీ కాదు, లేగదూడా కాదు. మధ్య వయస్సులో ఉన్న ఆవు అయివుండాలి అని అల్లాహ్ అంటు న్నాడు. కనుక ఆజ్ఞాపించిన విధంగా చెయ్యండి." వారు ఇంకా అడిగారు: "దాని రంగు ఏదయి ఉండాలో నీ ప్రభువును అడిగి మాకు చెప్పు." మూసా, "అది మెరిసే పసుపువన్నె కలిగి చూసేవారికి మనోహరంగా కన్పించాలి అని అల్లాహ్ ఆజ్ఞ" అని వారికి తెలిపాడు. మళ్ళీ వారు ఇలా అన్నారు: "అసలు ఏ విధమైన ఆవు కావాలో నీ ప్రభువును అడిగి మాకు స్పష్టంగా తెలుపు. దానిని నిర్ణయించటంలో మాకు సందేహం కలిగింది. అల్లాహ్ కోరితే మేము దానిని కనుగొంటాము." మూసా, "అది ఏ కృషీ చెయ్యనిదై భూమి దున్ననిదై మోట లాగనిదై ఏ లోపమూ లేనిదై పరిపూర్ణా రోగ్యము కలిగినదై ఉండాలి అని అల్లాహ్ అంటున్నాడు" అని వారికి జవాబు చెప్పాడు. "ఆ! అర్థమయింది. నీవు ఇప్పుడు సరియైన గుర్తులు చెప్పావు" అని వారు పలికారు. అప్పుడు వారు ఆవును బలి ఇచ్చారు. లేకపోతే వారు అలా చేసేవారు కాదు.[28]

وَلَقَدْ عَلِمْتُمُ الَّذِيْنَ اعْتَدَوْا مِنْكُمْ فِي السَّبْتِ
فَقُلْنَا لَهُمْ كُوْنُوْا قِرَدَةً خٰسِئِيْنَ ﴿٦٥﴾ فَجَعَلْنٰهَا
نَكَالًا لِّمَا بَيْنَ يَدَيْهَا وَمَا خَلْفَهَا وَمَوْعِظَةً
لِّلْمُتَّقِيْنَ ﴿٦٦﴾ وَإِذْ قَالَ مُوْسٰى لِقَوْمِهٖٓ إِنَّ
اللّٰهَ يَأْمُرُكُمْ أَنْ تَذْبَحُوْا بَقَرَةً ۭ قَالُوْٓا
أَتَتَّخِذُنَا هُزُوًا ۭ قَالَ أَعُوْذُ بِاللّٰهِ أَنْ أَكُوْنَ
مِنَ الْجٰهِلِيْنَ ﴿٦٧﴾ قَالُوا ادْعُ لَنَا رَبَّكَ يُبَيِّنْ
لَّنَا مَا هِيَ ۭ قَالَ إِنَّهٗ يَقُوْلُ إِنَّهَا بَقَرَةٌ لَّا
فَارِضٌ وَّلَا بِكْرٌ ۭ عَوَانٌۢ بَيْنَ ذٰلِكَ ۭ فَافْعَلُوْا
مَا تُؤْمَرُوْنَ ﴿٦٨﴾ قَالُوا ادْعُ لَنَا رَبَّكَ يُبَيِّنْ لَّنَا
مَا لَوْنُهَا ۭ قَالَ إِنَّهٗ يَقُوْلُ إِنَّهَا بَقَرَةٌ
صَفْرَاۗءُ ۙ فَاقِعٌ لَّوْنُهَا تَسُرُّ النّٰظِرِيْنَ ﴿٦٩﴾ قَالُوا
ادْعُ لَنَا رَبَّكَ يُبَيِّنْ لَّنَا مَا هِيَ ۙ إِنَّ الْبَقَرَ
تَشٰبَهَ عَلَيْنَا ۭ وَإِنَّآ إِنْ شَاۗءَ اللّٰهُ
لَمُهْتَدُوْنَ ﴿٧٠﴾ قَالَ إِنَّهٗ يَقُوْلُ إِنَّهَا بَقَرَةٌ لَّا
ذَلُوْلٌ تُثِيْرُ الْأَرْضَ وَلَا تَسْقِي الْحَرْثَ ۚ
مُسَلَّمَةٌ لَّا شِيَةَ فِيْهَا ۭ قَالُوا الْـٰٔنَ جِئْتَ
بِالْحَقِّ ۭ فَذَبَحُوْهَا وَمَا كَادُوْا يَفْعَلُوْنَ ﴿٧١﴾ ع ٨

27. "సబ్బత్" అంటే శనివారం. ఇస్రాయీలు సంతతి కొరకు నిర్ణయింపబడిన శాసనం ఏమిటంటే వారు శనివారాన్ని విశ్రాంతి కొరకు, ఆరాధన కొరకు ప్రత్యేకం చేసుకోవాలి. ఆ రోజున ప్రపంచానికి సంబంధించిన ఏ పనినైనా సరే, చివరకు అన్నం వండేపని కూడా స్వయంగానూ చెయ్యకూడదు, సేవకులతోనూ చేయించరాదు.

وَاِذْ قَتَلْتُمْ نَفْسًا فَادّٰرَءْتُمْ فِيْهَا ؕ وَ اللّٰهُ
مُخْرِجٌ مَّا كُنْتُمْ تَكْتُمُوْنَ ۚ﴿٧٢﴾ فَقُلْنَا اضْرِبُوْهُ
بِبَعْضِهَا ؕ كَذٰلِكَ يُحْيِ اللّٰهُ الْمَوْتٰى ۙ وَيُرِيْكُمْ
اٰيٰتِهٖ لَعَلَّكُمْ تَعْقِلُوْنَ ﴿٧٣﴾ ثُمَّ قَسَتْ قُلُوْبُكُمْ
مِّنْۢ بَعْدِ ذٰلِكَ فَهِيَ كَالْحِجَارَةِ اَوْ اَشَدُّ
قَسْوَةً ؕ وَاِنَّ مِنَ الْحِجَارَةِ لَمَا يَتَفَجَّرُ مِنْهُ
الْاَنْهٰرُ ؕ وَاِنَّ مِنْهَا لَمَا يَشَّقَّقُ فَيَخْرُجُ مِنْهُ
الْمَآءُ ؕ وَ اِنَّ مِنْهَا لَمَا يَهْبِطُ مِنْ خَشْيَةِ
اللّٰهِ ؕ وَ مَا اللّٰهُ بِغَافِلٍ عَمَّا تَعْمَلُوْنَ ﴿٧٤﴾
اَفَتَطْمَعُوْنَ اَنْ يُّؤْمِنُوْا لَكُمْ وَ قَدْ كَانَ فَرِيْقٌ
مِّنْهُمْ يَسْمَعُوْنَ كَلٰمَ اللّٰهِ ثُمَّ يُحَرِّفُوْنَهٗ مِنْۢ
بَعْدِ مَا عَقَلُوْهُ وَهُمْ يَعْلَمُوْنَ ﴿٧٥﴾ وَ اِذَا لَقُوا
الَّذِيْنَ اٰمَنُوْا قَالُوْٓا اٰمَنَّا ۖۚ وَاِذَا خَلَا بَعْضُهُمْ
اِلٰى بَعْضٍ قَالُوْٓا اَتُحَدِّثُوْنَهُمْ بِمَا فَتَحَ اللّٰهُ
عَلَيْكُمْ لِيُحَآجُّوْكُمْ بِهٖ عِنْدَ رَبِّكُمْ ؕ اَفَلَا
تَعْقِلُوْنَ ﴿٧٦﴾ اَوَ لَا يَعْلَمُوْنَ اَنَّ اللّٰهَ يَعْلَمُ مَا
يُسِرُّوْنَ وَمَا يُعْلِنُوْنَ ﴿٧٧﴾

**72 - 74** మరొక సంఘటనను కూడా మీరు గుర్తుకు తెచ్చుకోండి: మీరు ఒక వ్యక్తిని హత్యచేశారు. దానిని గురించి మీలో మీరు వాదులాడుకుంటూ, హత్యానేరాన్ని ఒకళ్ళపై నొకళ్ళు మోపుకోవటం ప్రారంభించారు. కాని మీరు గుప్తంగా ఉంచుతున్న దానిని బట్టబయలు చెయ్యటానికే అల్లాహ్ నిర్ణయం చేశాడు. కనుక మేము "హతుని శవాన్ని దాని ఒక భాగంతో కొట్టండి" అని వారిని ఆజ్ఞాపించాము. చూడండి! మృతులను అల్లాహ్ ఎలా బ్రతికిస్తాడో; మీరు అర్థం చేసుకోవాలని తన సూచనలను మీకు ఎలా చూపుతాడో. కాని, ఈ సూచనలను చూసిన తరువాత కూడా మీ హృదయాలు కఠినమై పోయాయి- పాషాణాల మాదిరిగా, కాదు వాటికంటే కూడా కఠినమైపోయాయి. ఎందుకంటే రాళ్ళల్లో కొన్నింటి నుండి సెలయేళ్ళు ప్రవహిస్తాయి. కొన్ని పగలగా వాటి నుండి నీరు చిమ్ముతుంది. మరికొన్ని అల్లాహ్‌కు భయపడి కంపించి నేలకొరుగుతాయి- జాగ్రత్త! మీరు చేస్తున్నదంతా అల్లాహ్‌కు తెలియకుండా లేదు.

**75 - 82** ముస్లిములారా! వారు మీ సందేశాన్ని విశ్వసిస్తారనే ఇంకా మీరు ఆశిస్తున్నారా?[29] వాస్తవానికి వారిలోని ఒక వర్గానికి, అల్లాహ్ ప్రవచనం విని బాగా అర్థం చేసుకుంటూనే, బుద్ధిపూర్వకంగా దానిని తారుమారు చేసే అలవాటు ఉంది. (ప్రవక్త ముహమ్మద్‌ను) విశ్వసించిన వారిని వారు కలసినప్పుడు, "మేమూ ఆయనను విశ్వసించాము" అని అంటారు. కాని వారు ఏకాంతంగా ఒకరినొకరు కలసినప్పుడు, "మీకేమన్నా బుద్ధి ఉందా? అల్లాహ్ మీకు స్పష్టం చేసిన విషయాలను వారిముందు ఎందుకు వెల్లడిచేస్తారు? మీ ప్రభువు సమక్షంలో మీకు వ్యతిరేకంగా వాటిని నిదర్శనాలుగా వారు వినియోగించటానికా?" అని అంటారు. వారు దాచేదంతా, వెల్లడి చేసేదంతా, అల్లాహ్‌కు తెలుసని వారికి నిజంగానే తెలియదా?

---

28. ఆవు ఉన్నతమైనదనీ, పవిత్రమైనదనీ, ఆరాధనకు అర్హమైనదనీ అనే వ్యాధి ఇస్రాయీలు సంతతి వారికి ఈజిప్టు ప్రజల ద్వారా, తమ పొరుగున వున్న జాతుల ద్వారా సంక్రమించింది. ఈ కారణంగానే వారు ఈజిప్టు నుండి బయలుదేరగానే ఆవు దూడను ఆరాధ్య దైవంగా చేసుకున్నారు. ఇందువల్ల ఆవును జిబహ్ చెయ్యండి అని ఆజ్ఞాపించటం జరిగింది. వారు దానిని దాటవెయ్యటానికి ప్రయత్నించారు. ఎక్కువగా వివరాలను

وَمِنْهُمْ اُمِّيُّوْنَ لَا يَعْلَمُوْنَ الْكِتٰبَ اِلَّآ اَمَانِيَّ
وَ اِنْ هُمْ اِلَّا يَظُنُّوْنَ ﴿۷۸﴾ فَوَيْلٌ لِّلَّذِيْنَ النصف
يَكْتُبُوْنَ الْكِتٰبَ بِاَيْدِيْهِمْ ۗ ثُمَّ يَقُوْلُوْنَ هٰذَا
مِنْ عِنْدِ اللّٰهِ لِيَشْتَرُوْا بِهٖ ثَمَنًا قَلِيْلًا ؕ
فَوَيْلٌ لَّهُمْ مِّمَّا كَتَبَتْ اَيْدِيْهِمْ وَ وَيْلٌ لَّهُمْ
مِّمَّا يَكْسِبُوْنَ ﴿۷۹﴾ وَ قَالُوْا لَنْ تَمَسَّنَا النَّارُ اِلَّآ
اَيَّامًا مَّعْدُوْدَةً ؕ قُلْ اَتَّخَذْتُمْ عِنْدَ اللّٰهِ
عَهْدًا فَلَنْ يُّخْلِفَ اللّٰهُ عَهْدَهٗۤ اَمْ تَقُوْلُوْنَ
عَلَى اللّٰهِ مَا لَا تَعْلَمُوْنَ ﴿۸۰﴾ بَلٰى مَنْ كَسَبَ
سَيِّئَةً وَّ اَحَاطَتْ بِهٖ خَطِيْٓئَتُهٗ فَاُولٰٓئِكَ اَصْحٰبُ
النَّارِ ۚ هُمْ فِيْهَا خٰلِدُوْنَ ﴿۸۱﴾ وَ الَّذِيْنَ اٰمَنُوْا
وَعَمِلُوا الصّٰلِحٰتِ اُولٰٓئِكَ اَصْحٰبُ الْجَنَّةِ ۚ هُمْ
فِيْهَا خٰلِدُوْنَ ﴿۸۲﴾ وَ اِذْ اَخَذْنَا مِيْثَاقَ بَنِيْٓ ع
اِسْرَآءِيْلَ لَا تَعْبُدُوْنَ اِلَّا اللّٰهَ
وَبِالْوَالِدَيْنِ اِحْسَانًا وَّ ذِى الْقُرْبٰى وَالْيَتٰمٰى
وَالْمَسٰكِيْنِ وَقُوْلُوْا لِلنَّاسِ حُسْنًا وَّاَقِيْمُوا
الصَّلٰوةَ وَاٰتُوا الزَّكٰوةَ ؕ ثُمَّ تَوَلَّيْتُمْ اِلَّا قَلِيْلًا
مِّنْكُمْ وَ اَنْتُمْ مُّعْرِضُوْنَ ﴿۸۳﴾

వారిలో నిరక్షరాస్యుల వర్గం మరొకటి ఉంది. వారికి గ్రంథ జ్ఞానం ఎంతమాత్రం లేదు. లేనిపోని ఆశలను, కోరికలను పెంచుకుని కేవలం వట్టి ఊహలతో జీవిస్తూ పోతున్నారు. షరీయత్తు గ్రంథాన్ని స్వహస్తాలతో రచించి, తద్వారా తుచ్ఛ ప్రయోజనం పొందే నిమిత్తం, "ఇది అల్లాహ్ వద్దనుండి వచ్చింది" అని ప్రజలకు చెప్పేవారికి వినాశం తప్పదు. వారి ఈ స్వహస్త లిఖిత రచన కూడ వారి వినాశానికి దారితీస్తుంది; వారి ఈ సంపాదన కూడ వారి సర్వనాశనానికి కారణభూతం అవుతుంది. ఇంకా వారు "నరక జ్వాలలు మమ్మల్ని ఏమాత్రం ముట్టుకోవు. ఒకవేళ మాకు శిక్ష పడినప్పటికీ అది కేవలం కొన్ని రోజులు మాత్రమే" అని అంటారు. వారిని అడగండి, "అల్లాహ్ నుండి మీరేమన్నా వాగ్దానం పొందారా ఆయన దాన్ని భంగం చెయ్యలేక పోవటానికి? లేక అల్లాహ్ బాధ్యత వహించినట్లు మీకు తెలియని విషయాలను మీరు అల్లాహ్‌కు ఆపాదించి చెబుతున్నారా? అసలు నరకాగ్ని మిమ్మల్ని ఎందుకు ముట్టుకోదు?" పాపం సంపాదించి, పాపజాలంలోనే ఇరుక్కుపోయేవారు నరకవాసులు. వారు నరకంలోనే శాశ్వతంగా ఉంటారు. విశ్వసించి, మంచి పనులు చేసేవారే స్వర్గ వాసులు. వారు స్వర్గంలోనే శాశ్వతంగా ఉంటారు.

**83 - 86** మేము ఇస్రాయీలు సంతానం నుండి మరొక వాగ్దానం తీసుకున్నాము. దానిని కూడా జ్ఞాపకం తెచ్చుకోండి: "అల్లాహ్‌ను తప్ప మరెవరినీ ఆరాధించ కూడదు. తల్లిదండ్రులను, బంధువులను, అనాథులను, నిరుపేదలను ఆదరించాలి. ప్రజలను సహృదయంతో పలుకరించాలి. నమాజును స్థాపించాలి. జకాత్ ఇవ్వాలి." కాని కొందరు తప్ప మీరంతా వాగ్దానభంగం చేశారు. ఇప్పటికీ మీరు దానిని లక్ష్యపెట్టటంలేదు.

---

అడుగసాగారు. అయితే ఎంత ఎక్కువగా వివరాలను వారు అడుగుతూ పోయారో, అంతే ఎక్కువగా చిక్కుల్లో పడిపోయారు. చివరకు ఆ కాలంలో పూజకొరకు ప్రత్యేకం చేసుకునే ప్రత్యేకమైన బంగారు వన్నెకల ఆవునే వేలుపెట్టి చూపి జిబహ్ చెయ్యండి అనటం జరిగింది.

29. ఈ ఉపన్యాసం సమీప కాలంలోనే ప్రవక్త ముహమ్మద్ (సఅసమ్)ను విశ్వసించిన క్రొత్త ముస్లిములను సంబోధిస్తూ చెయ్యబడింది. వారి చెవులలో మొదటి నుండే పడిన ప్రవక్త, గ్రంథం, దైవదూతలు, పరలోకం, షరీయత్తు వంటి పదాలను వారు తమ పొరుగునవున్న యూదుల నుండే విన్నారు. ఈ కారణం వల్ల వారు ఎవరు మొదటి నుండే ప్రవక్తలనూ దైవ గ్రంథాలనూ అనుసరిస్తున్నారో, ఎవరు తెలిపిన వార్తల కారణంగా మాకు విశ్వాస భాగ్యం కలిగిందో, వారు తప్పకుండా మాకు తోడుగా ఉంటారు, ఈ మార్గంలో అగ్రగాములుగా ఉంటారు అని ఆశించారు.

మేము మీ నుండి తీసుకున్న మరొక వాగ్దానాన్ని గుర్తుకు తెచ్చుకోండి: "మీరు ఒకరినొకరు చంపుకోరాదు. గృహాల నుండి బహిష్కరించుకోరాదు." దానిని మీరు అంగీకరించారు. దానికి మీరే స్వయంగా సాక్షులు. కాని మీరే నేడు మీ సోదరులను సంహరిస్తున్నారు. మీలోని ఒక వర్గం వారిని మీరు వారి ఇండ్లనుండి బహిష్కరిస్తున్నారు. దౌర్జన్యంగా, అన్యాయంగా, మీరు వారికి వ్యతిరేకంగా ముఠాలను కడుతున్నారు. వారు మీ వద్దకు యుద్ధఖైదీలుగా వచ్చినప్పుడు వారి విమోచన ధనం విషయంలో మీరు బేరం చేస్తున్నారు. అసలు మీరు వారిని ఇళ్ళనుండి బహిష్కరించటమే అధర్మం. మీరు దైవ గ్రంథంలోని ఒక భాగాన్ని విశ్వసించి, మరొక భాగాన్ని తిరస్కరిస్తారా? మీలో ఇలా చేసేవారిని ఇహలోక జీవితంలో ఘోర అవమానానికీ, పరలోకంలో తీవ్రమైన బాధకూ గురి చెయ్యటం తప్ప మరొక శిక్ష ఏముంటుంది? మీ చేష్టలు అల్లాహ్‌కు తెలియకుండా లేవు, జాగ్రత్త! పరలోకాన్ని విక్రయించి దానికి బదులుగా ప్రాపంచిక జీవితాన్ని కొనుక్కున్న వారు వీరే! కనుక వారికి పడే శిక్షా తగ్గదు; వారికి ఏ సహాయమూ లభించదు.

**87 - 90** మేము మూసాకు దివ్య గ్రంథం ప్రసాదించాము. అతని తరువాత వరుసగా ప్రవక్తలను పంపాము. చివరకు మర్యమ్ కుమారుడైన ఈసాకు స్పష్టమైన సూచనలు ఇచ్చి పంపాము. పరిశుద్ధాత్మ[30] ద్వారా అతనికి సహాయం చేశాము. మీ మనోవాంఛలకు ప్రతికూలంగా ఉన్న దానిని తీసుకుని ఏ ప్రవక్త అయినా మీ వద్దకు వచ్చినప్పుడు, మీరు ఆయన పట్ల తలబిరుసు తనంతో ప్రవర్తించారు. కొందరిని తిరస్కరించారు. మరికొందరిని చంపారు. ఇదేమి వైఖరి?- వారు, "మా హృదయాలు సురక్షితంగా ఉన్నాయి" అని అంటారు. కాదు, అది నిజంకాదు. అసలు విషయం ఏమిటంటే, వారి అవిశ్వాస వైఖరి కారణంగా అల్లాహ్ వారిని శపించాడు. కనుక వారు విశ్వసించటం అనేది కాని పని. అల్లాహ్ నుండి వారి వద్దకు ఇప్పుడు వచ్చిన గ్రంథం పట్ల వారి ప్రవర్తన ఎలా ఉంది? వారి వద్ద పూర్వం నుండే ఉన్న దైవ గ్రంథాన్ని ఈ గ్రంథం ధ్రువీకరిస్తున్నప్పటికీ, దీని రాకకు ముందు అవిశ్వాసులపై విజయం ప్రసాదించు అని వారు ప్రార్థిస్తూ వచ్చినప్పటికీ,[31]

وَ اِذْ اَخَذْنَا مِيْثَاقَكُمْ لَا تَسْفِكُوْنَ دِمَآءَكُمْ
وَ لَا تُخْرِجُوْنَ اَنْفُسَكُمْ مِّنْ دِيَارِكُمْ ثُمَّ
اَقْرَرْتُمْ وَاَنْتُمْ تَشْهَدُوْنَ ۝٨۴ ثُمَّ اَنْتُمْ
هٰٓؤُلَآءِ تَقْتُلُوْنَ اَنْفُسَكُمْ وَتُخْرِجُوْنَ فَرِيْقًا
مِّنْكُمْ مِّنْ دِيَارِهِمْ ز تَظٰهَرُوْنَ عَلَيْهِمْ
بِالْاِثْمِ وَالْعُدْوَانِ ط وَاِنْ يَّاْتُوْكُمْ اُسٰرٰى
تُفٰدُوْهُمْ وَهُوَ مُحَرَّمٌ عَلَيْكُمْ اِخْرَاجُهُمْ ط
اَفَتُؤْمِنُوْنَ بِبَعْضِ الْكِتٰبِ وَتَكْفُرُوْنَ
بِبَعْضٍ ج فَمَا جَزَآءُ مَنْ يَّفْعَلُ ذٰلِكَ مِنْكُمْ
اِلَّا خِزْىٌ فِى الْحَيٰوةِ الدُّنْيَا ج وَ يَوْمَ الْقِيٰمَةِ
يُرَدُّوْنَ اِلٰٓى اَشَدِّ الْعَذَابِ ط وَ مَا اللّٰهُ
بِغَافِلٍ عَمَّا تَعْمَلُوْنَ ۝٨٥ اُولٰٓئِكَ الَّذِيْنَ
اشْتَرَوُا الْحَيٰوةَ الدُّنْيَا بِالْاٰخِرَةِ ز فَلَا يُخَفَّفُ
عَنْهُمُ الْعَذَابُ وَ لَا هُمْ يُنْصَرُوْنَ ۝٨٦ وَ لَقَدْ ع ١٠
اٰتَيْنَا مُوْسَى الْكِتٰبَ وَقَفَّيْنَا مِنْۢ بَعْدِهٖ
بِالرُّسُلِ ز وَ اٰتَيْنَا عِيْسَى ابْنَ مَرْيَمَ الْبَيِّنٰتِ
وَاَيَّدْنٰهُ بِرُوْحِ الْقُدُسِ ط اَفَكُلَّمَا جَآءَكُمْ
رَسُوْلٌۢ بِمَا لَا تَهْوٰٓى اَنْفُسُكُمُ اسْتَكْبَرْتُمْ ج
فَفَرِيْقًا كَذَّبْتُمْ ز وَفَرِيْقًا تَقْتُلُوْنَ ۝٨٧ وَ قَالُوْا
قُلُوْبُنَا غُلْفٌ ط بَلْ لَّعَنَهُمُ اللّٰهُ بِكُفْرِهِمْ
فَقَلِيْلًا مَّا يُؤْمِنُوْنَ ۝٨٨ وَ لَمَّا جَآءَهُمْ كِتٰبٌ
مِّنْ عِنْدِ اللّٰهِ مُصَدِّقٌ لِّمَا مَعَهُمْ لا وَكَانُوْا مِنْ
قَبْلُ يَسْتَفْتِحُوْنَ عَلَى الَّذِيْنَ كَفَرُوْا ج

فَلَمَّا جَآءَهُمۡ مَّا عَرَفُوۡا كَفَرُوۡا بِهٖ‌ فَلَعۡنَةُ
اللّٰهِ عَلَى الۡكٰفِرِيۡنَ ﴿٨٩﴾ بِئۡسَمَا اشۡتَرَوۡا بِهٖۤ
اَنۡفُسَهُمۡ اَنۡ يَّكۡفُرُوۡا بِمَاۤ اَنۡزَلَ اللّٰهُ بَغۡيًا اَنۡ
يُّنَزِّلَ اللّٰهُ مِنۡ فَضۡلِهٖ عَلٰى مَنۡ يَّشَآءُ مِنۡ
عِبَادِهٖ‌ۚ فَبَآءُوۡ بِغَضَبٍ عَلٰى غَضَبٍ‌ؕ
وَلِلۡكٰفِرِيۡنَ عَذَابٌ مُّهِيۡنٌ ﴿٩٠﴾ وَاِذَا قِيۡلَ لَهُمۡ
اٰمِنُوۡا بِمَاۤ اَنۡزَلَ اللّٰهُ قَالُوۡا نُؤۡمِنُ بِمَاۤ اُنۡزِلَ
عَلَيۡنَا وَيَكۡفُرُوۡنَ بِمَا وَرَآءَهٗ‌ وَهُوَ الۡحَـقُّ
مُصَدِّقًا لِّمَا مَعَهُمۡ‌ؕ قُلۡ فَلِمَ تَقۡتُلُوۡنَ اَنۡۢبِيَآءَ
اللّٰهِ مِنۡ قَبۡلُ اِنۡ كُنۡتُمۡ مُّؤۡمِنِيۡنَ ﴿٩١﴾ وَلَقَدۡ
جَآءَكُمۡ مُّوۡسٰى بِالۡبَيِّنٰتِ ثُمَّ اتَّخَذۡتُمُ الۡعِجۡلَ
مِنۡۢ بَعۡدِهٖ وَاَنۡتُمۡ ظٰلِمُوۡنَ ﴿٩٢﴾ وَاِذۡ اَخَذۡنَا
مِيۡثَاقَكُمۡ وَرَفَعۡنَا فَوۡقَكُمُ الطُّوۡرَ‌ؕ خُذُوۡا مَآ
اٰتَيۡنٰكُمۡ بِقُوَّةٍ وَّاسۡمَعُوۡا‌ؕ قَالُوۡا سَمِعۡنَا
وَعَصَيۡنَا وَاُشۡرِبُوۡا فِىۡ قُلُوۡبِهِمُ الۡعِجۡلَ
بِكُفۡرِهِمۡ‌ؕ قُلۡ بِئۡسَمَا يَاۡمُرُكُمۡ بِهٖۤ اِيۡمَانُكُمۡ اِنۡ
كُنۡتُمۡ مُّؤۡمِنِيۡنَ ﴿٩٣﴾

తీరా అది వచ్చిన తరువాత వారు దానిని గుర్తించి కూడా తిరస్కరించారు. అటువంటి తిరస్కారులపై అల్లాహ్ శాపం అవతరించుగాక! తమ హృదయాలను తృప్తిపరచటానికి వారు అనుసరించే మార్గం ఎంత నీచమైనది?[32] అల్లాహ్ తన ఇష్టానుసారం తన దాసులలోని ఒకరిపై తన అనుగ్రహం అవతరింపచేశాడనే ద్వేషం వల్ల వారు అల్లాహ్ పంపిన ఆ ఉపదేశాలను తిరస్కరిస్తున్నారు.[33] కనుక వారు ఆగ్రహంపై ఆగ్రహానికి గురి అయ్యారు. ఇటువంటి అవిశ్వాసులకు తీవ్ర పరాభవంతో కూడుకున్న శిక్ష పడుతుంది.

**91 - 93** వారితో, "అల్లాహ్ అవతరింపచేసిన దానిని విశ్వసించండి" అని అన్నప్పుడు "మా (ఇస్రాయీలు వంశంలోని వారి) వద్దకు వచ్చిన దానిని మాత్రమే మేము విశ్వసిస్తాము" అని అంటారు. తమ గ్రంథం కానటువంటి ప్రతి దానినీ, అది సత్యమైనప్పటికీ, వారివద్ద పూర్వం నుండే ఉన్న దానిని అది ధ్రువీకరిస్తున్నప్పటికీ, వారు దానిని తిరస్కరిస్తారు. సరే, వారిని ఇలా అడుగు: "మీ వద్దకు వచ్చిన దానినే మీరు మనఃపూర్వకంగా విశ్వసించేవారే అయితే, ఇంతకు పూర్వం (ఇస్రాయీలు వంశంలో పుట్టిన) అల్లాహ్ ప్రవక్తలను ఎందుకు హత్య చేస్తూ వచ్చారు? ఎంత స్పష్టంగా ఉన్న సూచనలను మూసా మీ వద్దకు తీసుకు వచ్చాడు! అతను కొంచెం అటు పోగానే, మీరు ఆవు దూడను ఆరాధ్య దైవంగా చేసుకున్నారు. ఎంత దుర్మార్గులు మీరు! మేము తూర్ పర్వతాన్ని ఎత్తి మీపై నిలిపి మీతో చేయించిన ప్రమాణాన్ని కూడా గుర్తుకు తెచ్చుకోండి: "మేము మీకు చేస్తున్న ఉపదేశాలను స్థిరంగా పాటించండి, జాగ్రత్తగా వినండి" అని మేము నొక్కి చెప్పాము. మీ పూర్వీకులు, "మేము విన్నాము, కాని శిరసావహించేది లేదు" అని చెప్పారు. అసత్యారాధన వల్ల వారి హృదయాలు ఆవుదూడ మీది ప్రేమతో నిండిపోయాయి. (ముహమ్మద్!) వారితో ఇలా చెప్పు, "మీరు విశ్వాసులే అయితే, ఈ చెడు చేష్టలను చెయ్యండి అని ఆదేశించే మీ ఈ విశ్వాసం చాలా విచిత్రమైనది."

30. "పరిశుద్ధాత్మ" అంటే అర్థం వహీ జ్ఞానం లేక వహీ జ్ఞానాన్ని తెచ్చే జిబ్రీల్ దూత లేక పరిశుద్ధమైనదిగా, పవిత్రమైనదిగా అల్లాహ్ సృష్టించిన హజ్రత్ ఈసా (అస్సలామ్) యొక్క పరిశుద్ధాత్మ.

قُلْ إِنْ كَانَتْ لَكُمُ الدَّارُ الْاٰخِرَةُ عِنْدَ اللّٰهِ
خَالِصَةً مِّنْ دُوْنِ النَّاسِ فَتَمَنَّوُا الْمَوْتَ إِنْ
كُنْتُمْ صٰدِقِيْنَ ﴿٩٤﴾ وَلَنْ يَّتَمَنَّوْهُ اَبَدًا بِمَا
قَدَّمَتْ اَيْدِيْهِمْ ۗ وَاللّٰهُ عَلِيْمٌ بِالظّٰلِمِيْنَ ﴿٩٥﴾
وَلَتَجِدَنَّهُمْ اَحْرَصَ النَّاسِ عَلٰى حَيٰوةٍ ۚ وَمِنَ
الَّذِيْنَ اَشْرَكُوْا ۚ يَوَدُّ اَحَدُهُمْ لَوْ يُعَمَّرُ اَلْفَ
سَنَةٍ ۚ وَمَا هُوَ بِمُزَحْزِحِهٖ مِنَ الْعَذَابِ اَنْ
يُّعَمَّرَ ۗ وَاللّٰهُ بَصِيْرٌ بِمَا يَعْمَلُوْنَ ﴿٩٦﴾ قُلْ مَنْ
كَانَ عَدُوًّا لِّجِبْرِيْلَ فَاِنَّهٗ نَزَّلَهٗ عَلٰى قَلْبِكَ
بِاِذْنِ اللّٰهِ مُصَدِّقًا لِّمَا بَيْنَ يَدَيْهِ وَهُدًى
وَّبُشْرٰى لِلْمُؤْمِنِيْنَ ﴿٩٧﴾ مَنْ كَانَ عَدُوًّا لِّلّٰهِ
وَمَلٰٓئِكَتِهٖ وَرُسُلِهٖ وَجِبْرِيْلَ وَمِيْكٰىلَ فَاِنَّ
اللّٰهَ عَدُوٌّ لِّلْكٰفِرِيْنَ ﴿٩٨﴾

معانقة ٣
ع

**94 - 96** ఇంకా వారిని ఇలా అడుగు: "ఒకవేళ అల్లాహ్ వద్ద, పరలోక నివాసం మానవులందరికీ కాక కేవలం మీకు మాత్రమే ప్రత్యేకించబడితే, మీరు మీ ఈ అభిప్రాయంలో సత్యవంతులే అయితే మీరు మరణాన్ని తప్పక కోరాలి."– వారు ఎప్పటికీ మరణాన్ని కోరరు అనే విషయాన్ని నమ్ము. ఎందుకంటే, వారు స్వహస్తాలతో సంపాదించి అక్కడకు పంపినదాని కారణంగా (వారు అక్కడికి వెళ్లడానికి ఇష్టపడరు). ఈ దుర్మార్గుల మనస్తత్వం అల్లాహ్‌కు బాగా తెలుసు. జీవితం పట్ల అందరికంటే ఎక్కువ వ్యామోహం వీరిలోనే ఉందనే విషయం నీవు గ్రహిస్తావు. ఈ విషయంలో వారు ముష్రిక్కు లనే మించిపోయారు. వారిలోని ఒక్కొక్క వ్యక్తి ఏదో ఒక విధంగా వేయి సంవత్సరాలు బ్రతకాలని కోరుకుంటాడు. కాని దీర్ఘాయుర్దాయం వారిని శిక్ష నుండి ఎంతమాత్రం తప్పించలేదు. వారు ఏయే పనులు చేస్తున్నారో వాటిని అల్లాహ్ చూస్తూనే ఉన్నాడు.

**97 - 98** ప్రవక్తా! వారితో ఇంకా ఇలా చెప్పు: "జిబ్రీల్ పట్ల విరోధం ఉన్న ప్రతివాడూ[34] ఈ యథార్థాన్ని గ్రహించాలి. అల్లాహ్ ఆజ్ఞతోనే అతను ఈ ఖురానును నీ హృదయ ఫలకంపై అవతరింపజేశాడు. పూర్వం వచ్చిన అన్ని గ్రంథాలనూ అది ధ్రువీకరిస్తుంది. అవి నిజమని బలపరుస్తుంది. విశ్వసించే వారికి అది హితోపదేశం సాఫల్యం సిద్ధిస్తుందని తెలిపే శుభ వార్త. (జిబ్రీలు పట్ల వారికున్న విరోధానికి కారణం ఇదే అయితే, వారికి ఇలా తెలుపు) : అల్లాహ్‌కు, ఆయన దూతలకు, ఆయన ప్రవక్తలకు, జిబ్రీలుకు, మికాయీలుకు ఎవరు శత్రువులో, అటువంటి అవిశ్వాసులకు అల్లాహ్ శత్రువు."

31. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) ఆగమనానికి పూర్వం యూదులు, ఒక ప్రవక్త కొరకు ఆత్రుతతో నిరీక్షించేవారు. ఆయన ఆవిర్భావం గురించి వారి ప్రవక్తలు జోస్యం చెప్పారు. ఇంకా ఆయన త్వరగా రావాలని, ఆయన వస్తే అవిశ్వాసుల ప్రాబల్యం నశించి మళ్ళీ తమ ఔన్నత్యపు యుగం ప్రారంభమవుతుందని ప్రార్థించేవారు.
32. దీన్ని ఈ విధంగా కూడా అనువాదం చెయ్యవచ్చు : "ఎంత నీచమైన వస్తువు అది! దానికోసం వారు తమ ప్రాణాలను సైతం అమ్మివేశారు." అంటే, తమ సాఫల్యాన్నీ, తమ సౌభాగ్యాన్నీ, తమ మోక్షాన్నీ బలిచేశారు.
33. రాబోయే ప్రవక్త తమ జాతి నుండే ఉద్భవించాలని వారు కోరుకునేవారు. కాని వారు తాము హీనంగా చూసే మరొక జాతిలో ఆయన పుట్టటం వలన వారు ఆయనను తిరస్కరించారు. వారి భావం ఏమిటంటే, అల్లాహ్ వారిని అడిగి మరీ ప్రవక్తను పంపి ఉండవలసింది.

وَ لَقَدْ اَنْزَلْنَاۤ اِلَيْكَ اٰيٰتٍۭ بَيِّنٰتٍ ۚ وَ مَا
يَكْفُرُ بِهَاۤ اِلَّا الْفٰسِقُوْنَ ﴿٩٩﴾ اَوَ كُلَّمَا عٰهَدُوْا
عَهْدًا نَّبَذَهٗ فَرِيْقٌ مِّنْهُمْ ؕ بَلْ اَكْثَرُهُمْ لَا
يُؤْمِنُوْنَ ﴿١٠٠﴾ وَ لَمَّا جَآءَهُمْ رَسُوْلٌ مِّنْ عِنْدِ
اللّٰهِ مُصَدِّقٌ لِّمَا مَعَهُمْ نَبَذَ فَرِيْقٌ مِّنَ الَّذِيْنَ
اُوْتُوا الْكِتٰبَ ۙ كِتٰبَ اللّٰهِ وَرَآءَ ظُهُوْرِهِمْ
كَاَنَّهُمْ لَا يَعْلَمُوْنَ ﴿١٠١﴾ وَ اتَّبَعُوْا مَا تَتْلُوا
الشَّيٰطِيْنُ عَلٰى مُلْكِ سُلَيْمٰنَ ۚ وَ مَا كَفَرَ سُلَيْمٰنُ
وَلٰكِنَّ الشَّيٰطِيْنَ كَفَرُوْا يُعَلِّمُوْنَ النَّاسَ السِّحْرَ ۗ
وَمَاۤ اُنْزِلَ عَلَى الْمَلَكَيْنِ بِبَابِلَ هَارُوْتَ
وَمَارُوْتَ ؕ وَ مَا يُعَلِّمٰنِ مِنْ اَحَدٍ حَتّٰى
يَقُوْلَاۤ اِنَّمَا نَحْنُ فِتْنَةٌ فَلَا تَكْفُرْ ؕ
فَيَتَعَلَّمُوْنَ مِنْهُمَا مَا يُفَرِّقُوْنَ بِهٖ بَيْنَ الْمَرْءِ
وَزَوْجِهٖ ؕ وَ مَا هُمْ بِضَآرِّيْنَ بِهٖ مِنْ اَحَدٍ
اِلَّا بِاِذْنِ اللّٰهِ ؕ وَيَتَعَلَّمُوْنَ مَا يَضُرُّهُمْ وَلَا
يَنْفَعُهُمْ ؕ وَ لَقَدْ عَلِمُوْا لَمَنِ اشْتَرٰىهُ مَا لَهٗ فِى
الْاٰخِرَةِ مِنْ خَلَاقٍ ۛ وَلَبِئْسَ مَا شَرَوْا بِهٖۤ
اَنْفُسَهُمْ ؕ لَوْ كَانُوْا يَعْلَمُوْنَ ﴿١٠٢﴾ وَلَوْ اَنَّهُمْ
اٰمَنُوْا وَاتَّقَوْا لَمَثُوْبَةٌ مِّنْ عِنْدِ اللّٰهِ خَيْرٌ ؕ لَوْ
كَانُوْا يَعْلَمُوْنَ ﴿١٠٣﴾ ع ١٢ ١٢

**99 - 103** సత్యాన్ని స్పష్టంగా ప్రకటించే వాక్యాలను మేము నీపై అవతరింపజేశాము. అవిధేయులు తప్ప మరెవ్వరూ వాటిని తిరస్కరించరు. వారు ఏదైనా వాగ్దానం చేసినప్పుడల్లా, వారిలోని ఏదో ఒక వర్గం దానిని త్రోసిపుచ్చటం ఎల్లప్పుడూ జరుగుతూ రాలేదా? అంతేకాదు, మనఃపూర్వకంగా విశ్వసించని వారు చాలామంది వారిలో ఉన్నారు. వారివద్ద పూర్వం నుంచే ఉన్న దైవ గ్రంథాన్ని ధ్రువపరుస్తూ ఏ ప్రవక్త అయినా అల్లాహ్ తరఫు నుండి వచ్చినప్పుడు, గ్రంథ ప్రజలలోని ఒక వర్గం వారు అల్లాహ్ గ్రంథాన్ని, దానిని గురించి ఏమీ తెలియనివారుగా త్రోసిపుచ్చారు. సులైమాను రాజ్యం పేరు చెప్పి షైతానులు ప్రచారం చేసే విషయాలను వారు అనుసరించసాగారు. కాని వాస్తవంగా సులైమాను ఎన్నడూ అవిశ్వాసానికి ఒడిగట్టలేదు. అసలు అవిశ్వాసానికి పాల్పడింది ప్రజలకు చేతబడిని బోధించే షైతానులే. వారు హారూత్, మారూత్ అనే ఇద్దరు దైవదూతలపై బాబిలోనియాలో అవతరింపచేసిన దానివెంటపడ్డారు. ఎవడికైనా ఆ విద్యను నేర్పినప్పుడు ఆ దైవదూతలు స్పష్టంగా ఇలా హెచ్చరిక చేసేవారు: "జాగ్రత్త! మేము కేవలం ఒక పరీక్ష మాత్రమే! అవిశ్వాసానికి గురికాకు."[35] అయినప్పటికీ వారు భార్యాభర్తలను వేరుచేసే విద్యను ఆ దూతల వద్ద నేర్చుకునేవారు. అల్లాహ్ అనుమతి లేకుండా వారు ఈ విద్య ద్వారా ఎవరికీ ఏమాత్రం హాని కలిగించలేరనే విషయం సుస్పష్టం. కాని వారు నేర్చుకున్నది వారికి నష్టం కలిగించేదే కాని లాభం కలిగించేది ఎంతమాత్రం కాదు. ఈ విద్యను కొనేవారికి పరలోక సౌఖ్యాలలో ఏమాత్రం భాగం లేదనే విషయం వారికి బాగా తెలుసు. ఎంత తుచ్ఛమైన సొమ్ముకు బదులుగా వారు తమ ఆత్మలను అమ్ముకున్నారో వారికి తెలిస్తే ఎంత బాగుండేది! వారు విశ్వసించి, భయభక్తుల మార్గం అవలంబించి ఉన్నట్లయితే దానికి అల్లాహ్ వద్ద వారికి లభించి ఉండే ప్రతిఫలం ఎంతో శ్రేష్ఠమయినది. దీనిని వారు గ్రహిస్తే ఎంత బాగుండేది!

34. యూదులు మహాప్రవక్త (సఅసమ్)ను ఆయనను విశ్వసించిన వారిని మాత్రమే కాదు దుర్భాషలాడేది, పవిత్రుడైన దైవదూత జిబ్రీల్ (అస్సలామ్)ను కూడా తిట్టేవారు. ఇలా అనేవారు: అతడు మా శత్రువు. అతడు కారుణ్యాన్ని కాదు, శిక్షను తెచ్చే దైవదూత.'

**104 - 105** విశ్వసించిన ప్రజలారా! 'రాయినా' అనకూడదు, 'ఉన్‌జుర్నా' అనండి. ప్రతి మాటను శ్రద్ధతో వినండి.[36] ఈ అవిశ్వాసులు అత్యంత ఘోరమైన శిక్షకు అర్హులు. సత్య సందేశాన్ని తిరస్కరించినవారు గ్రంథ ప్రజలయినా లేక ముష్రిక్కులయినా వారికి మీపై మీ ప్రభువు తరఫు నుండి ఏ మేలూ అవతరించటం సుతరామూ ఇష్టంలేదు. కాని అల్లాహ్ తాను కోరిన వారిని తన కరుణ కొరకు ఎన్నుకుంటాడు. అల్లాహ్ అమితంగా అనుగ్రహించేవాడు.

**106 - 107** మేము మా ప్రవచనం ఒక దానిని రద్దు చేసినా లేక మరపింపచేసినా దాని స్థానంలో దానికంటే శ్రేష్ఠమైన దానిని లేక కనీసం దానితో సమానమైన దానిని తీసుకు వస్తాము.[37] అన్నింటిమీద అల్లాహ్‌కు సర్వాధికారాలున్న విషయం మీకు తెలియదా? భూమ్యాకాశాల సామ్రాజ్యాధి పత్యం కేవలం అల్లాహ్‌కే చెందుతుందని, ఆయన తప్ప మిమ్మల్ని సంరక్షించే వారు, మీకు సహాయం చేసేవారు మరెవ్వరూ లేరనే సంగతి మీకు తెలియదా?

يٰۤاَيُّهَا الَّذِيۡنَ اٰمَنُوۡا لَا تَقُوۡلُوۡا رَاعِنَا وَقُوۡلُوا
انۡظُرۡنَا وَاسۡمَعُوۡا ؕ وَلِلۡكٰفِرِيۡنَ عَذَابٌ اَلِيۡمٌ ﴿۱۰۴﴾
مَا يَوَدُّ الَّذِيۡنَ كَفَرُوۡا مِنۡ اَهۡلِ الۡكِتٰبِ وَلَا
الۡمُشۡرِكِيۡنَ اَنۡ يُّنَزَّلَ عَلَيۡكُمۡ مِّنۡ خَيۡرٍ مِّنۡ
رَّبِّكُمۡ ؕ وَاللّٰهُ يَخۡتَصُّ بِرَحۡمَتِهٖ مَنۡ يَّشَآءُ ؕ وَ
اللّٰهُ ذُو الۡفَضۡلِ الۡعَظِيۡمِ ﴿۱۰۵﴾ مَا نَنۡسَخۡ مِنۡ اٰيَةٍ
اَوۡ نُنۡسِهَا نَاۡتِ بِخَيۡرٍ مِّنۡهَاۤ اَوۡ مِثۡلِهَا ؕ اَلَمۡ
تَعۡلَمۡ اَنَّ اللّٰهَ عَلٰى كُلِّ شَىۡءٍ قَدِيۡرٌ ﴿۱۰۶﴾ اَلَمۡ
تَعۡلَمۡ اَنَّ اللّٰهَ لَهٗ مُلۡكُ السَّمٰوٰتِ
وَالۡاَرۡضِ ؕ وَمَا لَـكُمۡ مِّنۡ دُوۡنِ اللّٰهِ مِنۡ وَّلِىٍّ
وَّلَا نَصِيۡرٍ ﴿۱۰۷﴾

---

35. ఈ ఆయత్ వ్యాఖ్యానం గురించి విభిన్నాభిప్రాయాలున్నవి. నేను అర్థం చేసుకున్నది ఇది : ఇస్రాయీలు సంతతి వారందరూ బాబిలోనియాలో ఖైదీలుగా, బానిసలుగా ఉన్న కాలంలో అల్లాహ్ ఇద్దరు దైవదూతలను మానవరూపంలో వారిని పరీక్షించే నిమిత్తం పంపివుండవచ్చు, "లూత్" జాతి ప్రజల వద్దకు దైవదూతలను అందమైన నవ యువకుల రూపంలో పంపినట్లు. అదేవిధంగా, ఇస్రాయీలు సంతతి వద్దకు దైవదూతలు మత గురువుల వేషంలో, ఫకీర్ల వేషంలో వెళ్ళి ఉండవచ్చు. అక్కడ ఒకవైపు వారు మంత్రాల బజారులో తమ దుకాణాన్ని తెరచి ఉండవచ్చు. మరొక వైపు తమ వద్దకు వచ్చే ప్రతివాణ్ణీ ముందే, "చూడండి! మేము మీకు పరీక్ష వంటి వాళ్ళము. మీరు మీ పరలోకాన్ని చెడగొట్టుకోకండి" అని హెచ్చరిక కూడ చేసి ఉంటారు. అయినప్పటికీ ప్రజలు వారు ప్రదర్శించే క్షుద్రవిద్యల కొరకు, తావీజుల కొరకు విరుచుకుపడి ఉంటారు.

36. యూదులు మహాప్రవక్త (సఅసమ్) ప్రసంగించే సమావేశంలో పాల్గొన్నప్పుడు, వారు తమ సలాములో, తమ సంభాషణలో, సాధ్యమైన ప్రతి పద్ధతి ద్వారా, తమ హృదయాలలో ఉన్న విద్వేషాన్ని వెళ్ళగ్రక్కటానికి ప్రయత్నం చేసేవారు. మహాప్రవక్త (సఅసమ్) మాట్లాడేటప్పుడు యూదులకు ఎప్పుడైనా, "ఆగండి, కొంచెం మమ్మల్ని ఈ విషయం అర్థం చేసుకోనివ్వండి" అని చెప్పే అవసరం కలిగినపుడు, వారు "రాయినా" అని పలికేవారు. ఈ మాటకు అర్థం పైకిఅయితే "కొంచెం మా పట్ల శ్రద్ధ వహించండి లేక మా మాట వినండి" అనేదే. కాని ఇందులో ఇంకా ఎన్నో చెడు అర్థాలకూడా అవకాశం ఉంది. కనుక, "మీరు ఈ పదాన్ని ఉపయోగించకండి, దానికి బదులుగా 'ఉన్‌జుర్నా' అని అనండి" అని ముస్లిమ్‌లు ఆజ్ఞాపించబడ్డారు. దాని అర్థం ఏమిటంటే, "దయచేసి వినండి లేక కొంచెం మమ్మల్ని అర్థం చేసుకోనివ్వండి."

اَمۡ تُرِیۡدُوۡنَ اَنۡ تَسۡـَٔلُوۡا رَسُوۡلَکُمۡ کَمَا سُئِلَ
مُوۡسٰی مِنۡ قَبۡلُ ؕ وَ مَنۡ یَّتَبَدَّلِ الۡکُفۡرَ
بِالۡاِیۡمَانِ فَقَدۡ ضَلَّ سَوَآءَ السَّبِیۡلِ ﴿۱۰۸﴾ وَدَّ
کَثِیۡرٌ مِّنۡ اَہۡلِ الۡکِتٰبِ لَوۡ یَرُدُّوۡنَکُمۡ مِّنۡۢ بَعۡدِ
اِیۡمَانِکُمۡ کُفَّارًا ۚۖ حَسَدًا مِّنۡ عِنۡدِ اَنۡفُسِہِمۡ
مِّنۡۢ بَعۡدِ مَا تَبَیَّنَ لَہُمُ الۡحَقُّ ۚ فَاعۡفُوۡا
وَاصۡفَحُوۡا حَتّٰی یَاۡتِیَ اللّٰہُ بِاَمۡرِہٖ ؕ اِنَّ اللّٰہَ
عَلٰی کُلِّ شَیۡءٍ قَدِیۡرٌ ﴿۱۰۹﴾ وَ اَقِیۡمُوا الصَّلٰوۃَ وَ الثلثة
اٰتُوا الزَّکٰوۃَ ؕ وَمَا تُقَدِّمُوۡا لِاَنۡفُسِکُمۡ مِّنۡ خَیۡرٍ
تَجِدُوۡہُ عِنۡدَ اللّٰہِ ؕ اِنَّ اللّٰہَ بِمَا تَعۡمَلُوۡنَ
بَصِیۡرٌ ﴿۱۱۰﴾ وَ قَالُوۡا لَنۡ یَّدۡخُلَ الۡجَنَّۃَ اِلَّا مَنۡ
کَانَ ہُوۡدًا اَوۡ نَصٰرٰی ؕ تِلۡکَ اَمَانِیُّہُمۡ ؕ قُلۡ
ہَاتُوۡا بُرۡہَانَکُمۡ اِنۡ کُنۡتُمۡ صٰدِقِیۡنَ ﴿۱۱۱﴾ بَلٰی ٭ مَنۡ
اَسۡلَمَ وَجۡہَہٗ لِلّٰہِ وَ ہُوَ مُحۡسِنٌ فَلَہٗۤ اَجۡرُہٗ
عِنۡدَ رَبِّہٖ ۪ وَ لَا خَوۡفٌ عَلَیۡہِمۡ وَ لَا ہُمۡ
یَحۡزَنُوۡنَ ﴿۱۱۲﴾ ع ۱۳/۱۴

**108 - 110** పూర్వం మూసాను అడిగిన ప్రశ్నలవంటి వాటినే మీరు మీ ప్రవక్తను అడుగుదామనుకుంటున్నారా?[38] వాస్తవానికి విశ్వాస వైఖరిని అవిశ్వాస వైఖరిగా మార్చుకున్న వాడు సన్మార్గం తప్పుతాడు. గ్రంథ ప్రజలలోని పలువురు మిమ్మల్ని ఏదో ఒక విధంగా విశ్వాస మార్గం నుండి మరల్చి మళ్ళీ అవిశ్వాస మార్గం వైపునకు తీసుకుపోదామని కోరుతున్నారు. సత్యం వారికి సుస్పష్టం అయినప్పటికీ వారి ఈ కోరికకు కారణం వారి మనస్సులలో ఉన్న అసూయ. అయితే అల్లాహ్ తన తీర్పును అమలుపరిచే వరకు మీరు సహించి వారిని క్షమించండి. మీరు నిశ్చింతగా ఉండండి. అల్లాహ్‌కు అన్నింటి మీద సర్వాధికారాలు ఉన్నాయి. నమాజును స్థాపించండి. జకాత్ ఇవ్వండి. మీ భవిష్యత్తుకోసం మీరు చేసి ముందుగా పంపించే సత్కార్యాలను మీరు అల్లాహ్ వద్ద చూస్తారు. మీరు చేసేదంతా అల్లాహ్ దృష్టిలో ఉంది.

**111 - 112** "యూదులు కాని వారెవ్వరూ లేక క్రైస్తవుల ప్రకారం) క్రైస్తవులు కానివారెవ్వరూ స్వర్గంలో ప్రవేశించలేరు" అని వారు ప్రకటిస్తారు. ఇవి వారి కాంక్షలు మాత్రమే. వారిని ఇలా అడుగు:"మీరు అనేది సత్యమే అయితే, దానికి నిదర్శనాలేమిటో చూపండి." (అసలు మీలోగాని, మరెవ్వరిలోగానీ ఏ విధమైన ప్రత్యేకత లేదు). వాస్తవమేమిటంటే, ఎవరు తమను తాము అల్లాహ్ పట్ల విధేయతకు అంకితం చేసుకుని, ఆచరణలో సన్మార్గం అవలంబిస్తారో, దానికి వారు తమ ప్రభువు వద్ద మంచి ప్రతిఫలం పొందుతారు. అటువంటి వారికి భయంకాని, దుఃఖం కాని కలిగే అవకాశం ఎంత మాత్రం లేదు.

37. యూదులు ముస్లిమ్‌ల మనస్సులలో సృష్టించటానికి ప్రయత్నించిన ఒక ప్రత్యేక సందేహానికి ఇది జవాబు. వారి అభ్యంతరమేమిటంటే, "ఒకవేళ పూర్వపు గ్రంథాలు కూడా దేవుని తరఫు నుండే వచ్చివున్నట్లయితే, ఈ ఖురాను కూడా దేవుని తరఫు నుండే అయితే, వాటిలోని కొన్ని ఆజ్ఞల స్థానే ఇందులో వేరే ఆజ్ఞలు ఎందుకు ఇవ్వబడ్డాయి?"

38. యూదులు రంధ్రాన్వేషణలు చేస్తూ ముస్లిమ్‌లను రకరకాల ప్రశ్నలు అడిగేవారు: "మీ ప్రవక్తను ఇది అడగండి, అది అడగండి" అని పురికొల్పే వారు. కనుక అల్లాహ్, ఈ వ్యవహారంలో యూదుల వైఖరిని అవలంబించవలదని హెచ్చరిక చేస్తున్నాడు.

113 క్రైస్తవుల వద్ద (సత్యమనేది) ఏమీ లేదు అని యూదులు అంటారు. యూదుల వద్ద (సత్యమనేది) ఏమీలేదు అని క్రైస్తవులు అంటారు - కాని వారు ఉభయులూ చదివేది దైవ గ్రంథమే! గ్రంథ జ్ఞానం లేనివాళ్ళు కూడ ఇదేవిధంగా ప్రగల్భాలు పలుకుతారు. వీరందరిలో ఉన్న అభిప్రాయభేదాలను గురించి నిశ్చయంగా అల్లాహ్ ప్రళయదినం నాడు తీర్పు చెపుతాడు.

114 అల్లాహ్ ఆరాధనాలయాలలో ఆయన నామ సంస్మరణను నిషేధించి, వాటి వినాశానికి ఒడికట్టే వానికంటె పరమ దుర్మార్గుడెవడు? అటువంటి వారు ఆ ఆరాధనాలయాలలో అడుగు పెట్టటానికి అర్హులు కారు. ఒకవేళ వారు వాటిలో ప్రవేశించినా, భయపడుతూ ప్రవేశించాలి. కాని వారికి ప్రపంచంలో తీవ్రపరాభవమూ, పరలోకంలో ఘోరశిక్షా తప్పవు.

115 ప్రాక్పశ్చిమాలన్నీ అల్లాహ్వే. మీరు మీ ముఖాన్ని ఏ దిక్కుకు త్రిప్పినా, అక్కడ మీకు అల్లాహ్ సమ్ముఖం లభిస్తుంది. అల్లాహ్ అంతటా వ్యాపించి ఉన్నాడు. ఆయన అంతా తెలిసిన వాడు.

116 - 117 అల్లాహ్ ఒకరిని తన కుమారుడుగా చేసుకున్నాడు అని వారు అంటారు. కాని అల్లాహ్ ఆ విషయాలకు అతీతుడు. ఆయన అత్యంత పవిత్రుడు. అసలు యథార్థం ఏమిటంటే, భూమ్యాకాశాలలో ఉన్నవన్నీ ఆయన సొంతమే! అవన్నీ ఆయన యెడల విధేయతకు అంకితమైనవే! ఆయన ఆకాశాలకూ, భూమండలానికీ సృష్టికర్త. తాను ఒక నిర్ణయం తీసుకున్నప్పుడు, ఆయన దానిని కేవలం "అయిపో" అని ఆజ్ఞాపిస్తాడు. అది వెంటనే అయిపోతుంది.

118 - 119 "అల్లాహ్ స్వయంగా మాతో ఎందుకు మాట్లాడడు? లేక ఏదన్నా సూచన మా వద్దకు ఎందుకు రాదు?" అని అజ్ఞానులు అడుగుతారు. వారికి పూర్వం వారు కూడా ఇవే ప్రశ్నలను అడిగేవారు. (సన్మార్గం తప్పిన) వారందరి మనస్తత్వాలూ ఒక్కటే. నమ్మేవారికి మేము మా సూచనలను స్పష్టం చేశాము. (దీనికంటే స్పష్టమైన సూచన మరొకటి ఏముంటుంది?) సత్యజ్ఞానం ప్రసాదించి నిన్ను మేము శుభవార్త తెలిపేవానిగా, హెచ్చరిక చేసేవానిగా పంపాము.[39] నరకవాసం ఎన్నుకున్న వారిని గురించి నీవు ఎంతమాత్రం బాధ్యుడవు, జవాబుదారుడవు కావు.

وَقَالَتِ الْيَهُوْدُ لَيْسَتِ النَّصٰرٰى عَلٰى شَيْءٍ ۠ وَّ
قَالَتِ النَّصٰرٰى لَيْسَتِ الْيَهُوْدُ عَلٰى شَيْءٍ ۙ وَّهُمْ
يَتْلُوْنَ الْكِتٰبَ ؕ كَذٰلِكَ قَالَ الَّذِيْنَ لَا
يَعْلَمُوْنَ مِثْلَ قَوْلِهِمْ ۚ فَاللّٰهُ يَحْكُمُ بَيْنَهُمْ يَوْمَ
الْقِيٰمَةِ فِيْمَا كَانُوْا فِيْهِ يَخْتَلِفُوْنَ ﴿١١٣﴾ وَمَنْ
اَظْلَمُ مِمَّنْ مَّنَعَ مَسٰجِدَ اللّٰهِ اَنْ يُّذْكَرَ فِيْهَا
اسْمُهٗ وَسَعٰى فِيْ خَرَابِهَا ؕ اُولٰٓئِكَ مَا كَانَ لَهُمْ
اَنْ يَّدْخُلُوْهَآ اِلَّا خَآئِفِيْنَ ؕ لَهُمْ فِى الدُّنْيَا
خِزْيٌ وَّلَهُمْ فِى الْاٰخِرَةِ عَذَابٌ عَظِيْمٌ ﴿١١٤﴾ وَلِلّٰهِ
الْمَشْرِقُ وَالْمَغْرِبُ ۚ فَاَيْنَمَا تُوَلُّوْا فَثَمَّ وَجْهُ
اللّٰهِ ؕ اِنَّ اللّٰهَ وَاسِعٌ عَلِيْمٌ ﴿١١٥﴾ وَقَالُوا اتَّخَذَ
اللّٰهُ وَلَدًا ۙ سُبْحٰنَهٗ ؕ بَلْ لَّهٗ مَا فِى السَّمٰوٰتِ
وَالْاَرْضِ ؕ كُلٌّ لَّهٗ قٰنِتُوْنَ ﴿١١٦﴾ بَدِيْعُ
السَّمٰوٰتِ وَالْاَرْضِ ؕ وَاِذَا قَضٰٓى اَمْرًا
فَاِنَّمَا يَقُوْلُ لَهٗ كُنْ فَيَكُوْنُ ﴿١١٧﴾ وَقَالَ الَّذِيْنَ
لَا يَعْلَمُوْنَ لَوْلَا يُكَلِّمُنَا اللّٰهُ اَوْ تَاْتِيْنَآ اٰيَةٌ ؕ
كَذٰلِكَ قَالَ الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ مِّثْلَ قَوْلِهِمْ ؕ
تَشَابَهَتْ قُلُوْبُهُمْ ؕ قَدْ بَيَّنَّا الْاٰيٰتِ لِقَوْمٍ
يُّوْقِنُوْنَ ﴿١١٨﴾ اِنَّآ اَرْسَلْنٰكَ بِالْحَقِّ بَشِيْرًا
وَّنَذِيْرًا ۙ وَّلَا تُسْئَلُ عَنْ اَصْحٰبِ الْجَحِيْمِ ﴿١١٩﴾

وَ لَنۡ تَرۡضٰی عَنۡكَ الۡيَهُوۡدُ وَ لَا النَّصٰرٰی حَتّٰی
تَتَّبِعَ مِلَّتَهُمۡ ؕ قُلۡ اِنَّ هُدَی اللّٰهِ هُوَ
الۡهُدٰی ؕ وَلَئِنِ اتَّبَعۡتَ اَهۡوَآءَهُمۡ بَعۡدَ
الَّذِیۡ جَآءَكَ مِنَ الۡعِلۡمِ ۙ مَا لَكَ مِنَ اللّٰهِ مِنۡ
وَّلِیٍّ وَّلَا نَصِيۡرٍ ﴿۱۲۰﴾ اَلَّذِيۡنَ اٰتَيۡنٰهُمُ الۡكِتٰبَ
يَتۡلُوۡنَهٗ حَقَّ تِلَاوَتِهٖ ؕ اُولٰٓئِكَ يُؤۡمِنُوۡنَ بِهٖ ؕ
وَمَنۡ يَّكۡفُرۡ بِهٖ فَاُولٰٓئِكَ هُمُ الۡخٰسِرُوۡنَ ﴿۱۲۱﴾ يٰبَنِیۡۤ
اِسۡرَآءِيۡلَ اذۡكُرُوۡا نِعۡمَتِیَ الَّتِیۡۤ اَنۡعَمۡتُ عَلَيۡكُمۡ
وَ اَنِّیۡ فَضَّلۡتُكُمۡ عَلَی الۡعٰلَمِيۡنَ ﴿۱۲۲﴾ وَاتَّقُوۡا يَوۡمًا
لَّا تَجۡزِیۡ نَفۡسٌ عَنۡ نَّفۡسٍ شَيۡـًٔا وَّ لَا يُقۡبَلُ
مِنۡهَا عَدۡلٌ وَّ لَا تَنۡفَعُهَا شَفَاعَةٌ وَّ لَا هُمۡ
يُنۡصَرُوۡنَ ﴿۱۲۳﴾ وَاِذِ ابۡتَلٰٓی اِبۡرٰهٖمَ رَبُّهٗ بِكَلِمٰتٍ
فَاَتَمَّهُنَّ ؕ قَالَ اِنِّیۡ جَاعِلُكَ لِلنَّاسِ اِمَامًا ؕ
قَالَ وَ مِنۡ ذُرِّيَّتِیۡ ؕ قَالَ لَا يَنَالُ عَهۡدِی
الظّٰلِمِيۡنَ ﴿۱۲۴﴾

ربع منزل ١ ركوع ١٤

**120 - 121** నీవు (ముహమ్మద్!) వారి విధానాన్ని అవలంబించనంతవరకు, యూదులు, క్రైస్తవులు నీవంటే సంతోషం వ్యక్తం చెయ్యరు. అల్లాహ్ చూపిన మార్గమే సరిఅయిన మార్గం అని నీవు వారికి స్పష్టం చెయ్యి. దివ్య జ్ఞానం నీ వద్దకు వచ్చిన పిదప కూడ, ఒకవేళ నీవు వారి కోరికలకు లొంగిపోతే, నిన్ను అల్లాహ్ పట్టునుండి రక్షించే మిత్రుడూ, సహాయుడూ ఎవడూ లేడు. మేము గ్రంథాన్ని ప్రసాదించిన వారు దానిని పఠించవలసిన విధంగా పఠిస్తారు. దానిని (ఖుర్‌ఆన్‌ను) వారు హృదయపూర్వకంగా విశ్వసిస్తారు.[40] దాని యెడల తిరస్కార భావం చూపేవారే అసలు నష్టపడేవారు.

**122 - 123** ఇస్రాయీలు వంశీయులారా! నేను మీకు ప్రసాదించిన అనుగ్రహాన్ని జ్ఞాపకం చెయ్యండి. ప్రపంచంలోని అన్ని జాతులకంటే, మిమ్మల్ని నేను ఒక అత్యుత్తమమైన జాతిగా ఆదరించాను. భయపడండి ఆ దినానికి- ఆనాడు ఎవరూ ఎవరికీ ఏమాత్రమూ ఉపయోగపడరు. ఎవరినుండీ పరిహారం స్వీకరించబడదు. ఏ సిఫారసూ ఎవరికీ లాభకరం కాదు. ఇంకా, ఈ అపరాధులకు ఎక్కడ నుండీ ఏ సహాయమూ లభించదు.

**124** మరొక సందర్భాన్ని కూడ గుర్తుకు తెచ్చుకోండి. ఇబ్రాహీమ్‌ను అతని ప్రభువు కొన్ని విషయాలలో పరీక్షించాడు. వాటన్నిటిలో అతను పూర్తిగా నెగ్గాడు. అప్పుడు అతని ప్రభువు ఇలా అన్నాడు : "నేను నిన్ను మానవులందరికీ నాయకునిగా చెయ్యబోతున్నాను." ఇబ్రాహీమ్ తన ప్రభువును ఇలా అడిగాడు: "ఈ నీ వాగ్దానం నా సంతానానికూడా వర్తిస్తుందా?" అప్పుడు అల్లాహ్, "నా వాగ్దానం దుర్మార్గులైన వారికి వర్తించదు"[41] అని సమాధానం చెప్పాడు.

39. అంటే, వేరే సూచనల ప్రస్తావన దేనికి, స్వయంగా మహాప్రవక్త (సఅసమ్) వ్యక్తిత్వమే స్పష్టమైన సూచనగా ఉన్నపుడు? ఆయన ప్రవక్త పదవికి పూర్వపు పరిస్థితులు, ఆయన జన్మించిన జాతి, దేశ, కాల పరిస్థితులు, ఆయన పోషింపబడిన తీరు, నలభై సంవత్సరాల ఆయన జీవితం, ప్రవక్త అయిన తరువాత ఆయన నిర్వహించిన మహత్తరకార్యం - ఇదంతా ఒక మహోజ్వలమైన సూచనయే. దీని తరువాత మరొక సూచన అవసరం ఎంతమాత్రం లేదు.

40. ఇది గ్రంథ ప్రజలలోని సజ్జనులను సూచిస్తుంది. వీరు చిత్తశుద్ధితో, న్యాయబుద్ధితో పూర్వం నుండే తమ వద్ద ఉన్న దైవగ్రంథాన్ని చదువుతారు కనుక ఈ ఖురానును విని లేక చదివి విశ్వసిస్తారు.

وَ اِذْ جَعَلْنَا الْبَيْتَ مَثَابَةً لِّلنَّاسِ وَ اَمْنًا ؕ وَ
اتَّخِذُوْا مِنْ مَّقَامِ اِبْرٰهٖمَ مُصَلًّى ؕ وَعَهِدْنَاۤ
اِلٰۤى اِبْرٰهٖمَ وَ اِسْمٰعِيْلَ اَنْ طَهِّرَا بَيْتِىَ
لِلطَّآئِفِيْنَ وَ الْعٰكِفِيْنَ وَ الرُّكَّعِ السُّجُوْدِ ﴿۱۲۵﴾ وَ
اِذْ قَالَ اِبْرٰهٖمُ رَبِّ اجْعَلْ هٰذَا بَلَدًا اٰمِنًا وَّ
ارْزُقْ اَهْلَهٗ مِنَ الثَّمَرٰتِ مَنْ اٰمَنَ مِنْهُمْ
بِاللّٰهِ وَ الْيَوْمِ الْاٰخِرِ ؕ قَالَ وَمَنْ كَفَرَ
فَاُمَتِّعُهٗ قَلِيْلًا ثُمَّ اَضْطَرُّهٗۤ اِلٰى عَذَابِ النَّارِ ؕ
وَبِئْسَ الْمَصِيْرُ ﴿۱۲۶﴾ وَ اِذْ يَرْفَعُ اِبْرٰهٖمُ
الْقَوَاعِدَ مِنَ الْبَيْتِ وَ اِسْمٰعِيْلُ ؕ رَبَّنَا تَقَبَّلْ
مِنَّا ؕ اِنَّكَ اَنْتَ السَّمِيْعُ الْعَلِيْمُ ﴿۱۲۷﴾ رَبَّنَا وَ
اجْعَلْنَا مُسْلِمَيْنِ لَكَ وَمِنْ ذُرِّيَّتِنَاۤ اُمَّةً
مُّسْلِمَةً لَّكَ ۪ وَ اَرِنَا مَنَاسِكَنَا وَ تُبْ عَلَيْنَا ۚ
اِنَّكَ اَنْتَ التَّوَّابُ الرَّحِيْمُ ﴿۱۲۸﴾ رَبَّنَا وَابْعَثْ
فِيْهِمْ رَسُوْلًا مِّنْهُمْ يَتْلُوْا عَلَيْهِمْ اٰيٰتِكَ وَ
يُعَلِّمُهُمُ الْكِتٰبَ وَالْحِكْمَةَ وَيُزَكِّيْهِمْ ؕ اِنَّكَ
اَنْتَ الْعَزِيْزُ الْحَكِيْمُ ﴿۱۲۹﴾ ع ۸ ۱۵

**125** ఈ గృహాన్ని (కాబా) మేము మానవులందరికీ కేంద్రం గాను, శాంతి నిలయంగానూ చేశాము. ఇబ్రాహీము ఆరాధన కొరకు నిలబడిన ప్రదేశాన్ని శాశ్వతమైన నమాజు స్థలంగా చేసుకోవలసిందని ప్రజలను మేము ఆదేశించాము. ఇంకా నా ఈ గృహాన్ని, దానికి ప్రదక్షిణం చేసేవారి కొరకు, దానిలో ఏతెకాఫ్ పాటించేవారి కొరకు, రుకూ, సజ్దాలు చేసేవారి కొరకు పరిశుద్ధంగా ఉంచవలసిందని ఇబ్రాహీమును, ఇస్మాయీలును నిర్దేశించాము.

**126** ఆ తరువాత ఇబ్రాహీము అల్లాహ్‌ను ఇలా అర్థించాడు: "ప్రభూ! ఈ నగరాన్ని సుఖశాంతుల నగరం చెయ్యి. ఈ నగర వాసులలో అల్లాహ్‌నూ, పరలోకాన్నీ విశ్వసించేవారికి అన్ని రకాల పండ్లు, ఫలాలు ఆహారంగా ప్రసాదించు." అప్పుడు అతని ప్రభువు ఇలా జవాబు పలికాడు: "విశ్వసించని వారికి కూడ ఇహలోకపు తాత్కాలిక జీవితావసరాలను ప్రసాదిస్తాను. కాని చివరకు వారిని నరకయాతన వైపునకు ఈడుస్తాను. అది అత్యంత దుర్భరమైన నివాస స్థలం."

**127 - 129** ఇబ్రాహీము, ఇస్మాయీలు ఈ ఇంటి గోడలను ఎత్తేటప్పుడు ఈ విధంగా ప్రార్థించేవారు: "ఓ మా ప్రభూ! మా ఈ సేవను నీవు దయతో స్వీకరించు. నీవు అందరి మొరలు ఆలకించేవాడవు. అన్నీ తెలిసినవాడవు. ప్రభూ! మా ఇద్దరినీ నీకు విధేయులుగా చేసుకో. పూర్తిగా నీ విధేయతకే అంకితమయ్యే ఒక జాతిని మా సంతతినుండి ఆవిర్భవింప చెయ్యి. నీ ఆరాధనా రీతులను మాకు తెలుపు. మా తప్పులను మన్నించు. నీవు అమితంగా క్షమించేవాడవు; మరియు అనంతంగా కరుణించేవాడవు. ప్రభూ! నీ వాక్యాలు వారికి వినిపించి, నీ గ్రంథాన్నీ, దివ్య జ్ఞానాన్నీ వారికి బోధించి, వారి జీవితాలను తీర్చిదిద్దే ఒక ప్రవక్తను స్వయంగా వారి జాతి నుండే వారిలో పుట్టించు. నీవు సాటిలేని సర్వాధికారివి. అనుపమ ప్రజ్ఞాశాలివి."

41. అంటే, ఈ వాగ్దానం కేవలం సజ్జనులైన నీ సంతానానికే వర్తిస్తుంది. దుర్మార్గులైన నీ సంతానానికి ఇది వర్తించదు. ఇక్కడ దుర్మార్గుడంటే భావం, కేవలం మానవులకే దుర్మార్గం చేసేవాడని కాదు, సత్యం, వాస్తవాలకు దుర్మార్గం చేసేవాడని కూడా.

وَ مَنۡ یَّرۡغَبُ عَنۡ مِّلَّۃِ اِبۡرٰهٖمَ اِلَّا مَنۡ سَفِهَ
نَفۡسَهٗ ؕ وَلَقَدِ اصۡطَفَیۡنٰهُ فِی الدُّنۡیَا ۚ وَ اِنَّهٗ فِی
الۡاٰخِرَۃِ لَمِنَ الصّٰلِحِیۡنَ ﴿١٣٠﴾ اِذۡ قَالَ لَهٗ رَبُّهٗۤ
اَسۡلِمۡ ۙ قَالَ اَسۡلَمۡتُ لِرَبِّ الۡعٰلَمِیۡنَ ﴿١٣١﴾
وَوَصّٰی بِهَاۤ اِبۡرٰهٖمُ بَنِیۡهِ وَیَعۡقُوۡبُ ؕ یٰبَنِیَّ اِنَّ
اللّٰهَ اصۡطَفٰی لَکُمُ الدِّیۡنَ فَلَا تَمُوۡتُنَّ اِلَّا
وَاَنۡتُمۡ مُّسۡلِمُوۡنَ ﴿١٣٢﴾ؕ اَمۡ کُنۡتُمۡ شُهَدَآءَ اِذۡ
حَضَرَ یَعۡقُوۡبَ الۡمَوۡتُ ۙ اِذۡ قَالَ لِبَنِیۡهِ مَا
تَعۡبُدُوۡنَ مِنۡۢ بَعۡدِیۡ ؕ قَالُوۡا نَعۡبُدُ اِلٰهَکَ وَ
اِلٰهَ اٰبَآئِکَ اِبۡرٰهٖمَ وَاِسۡمٰعِیۡلَ وَاِسۡحٰقَ اِلٰهًا
وَّاحِدًا ۚۖ وَّ نَحۡنُ لَهٗ مُسۡلِمُوۡنَ ﴿١٣٣﴾ تِلۡکَ اُمَّۃٌ
قَدۡ خَلَتۡ ۚ لَهَا مَا کَسَبَتۡ وَلَکُمۡ مَّا کَسَبۡتُمۡ ۚ
وَ لَا تُسۡـَٔلُوۡنَ عَمَّا کَانُوۡا یَعۡمَلُوۡنَ ﴿١٣٤﴾ وَ قَالُوۡا
کُوۡنُوۡا هُوۡدًا اَوۡ نَصٰرٰی تَهۡتَدُوۡا ؕ قُلۡ بَلۡ مِلَّۃَ
اِبۡرٰهٖمَ حَنِیۡفًا ؕ وَ مَا کَانَ مِنَ الۡمُشۡرِکِیۡنَ ﴿١٣٥﴾
قُوۡلُوۡۤا اٰمَنَّا بِاللّٰهِ وَ مَاۤ اُنۡزِلَ اِلَیۡنَا وَمَاۤ اُنۡزِلَ
اِلٰۤی اِبۡرٰهٖمَ وَ اِسۡمٰعِیۡلَ وَاِسۡحٰقَ وَیَعۡقُوۡبَ
وَالۡاَسۡبَاطِ وَ مَاۤ اُوۡتِیَ مُوۡسٰی وَعِیۡسٰی وَ مَاۤ
اُوۡتِیَ النَّبِیُّوۡنَ مِنۡ رَّبِّهِمۡ ۚ لَا نُفَرِّقُ بَیۡنَ
اَحَدٍ مِّنۡهُمۡ ۫ۖ وَنَحۡنُ لَهٗ مُسۡلِمُوۡنَ ﴿١٣٦﴾

**130 - 133** ఇబ్రాహీము విధానాన్ని ఇక ద్వేషించేవాడెవడు-తనను తాను అజ్ఞానానికీ, అహంభావానికీ గురిచేసుకునేవాడు తప్ప. ప్రపంచంలో మా సేవ కొరకు మేము ఎన్నుకున్న వ్యక్తి ఇబ్రాహీము. పరలోకంలో అతను సజ్జనులతో పాటుఉంటాడు. అతను ఎలాంటివాడంటే, “ముస్లిమ్‌వు[42] అయిపో” అని అతని ప్రభువు అతనితో అన్నప్పుడు అతను వెంటనే, “నేను విశ్వ ప్రభువు యొక్క ‘ముస్లిమ్‌ను’ అయిపోయాను” అని జవాబు పలికాడు. ఇదే మార్గంలో నడవండి అని ఇబ్రాహీము తన సంతానానికి హితోపదేశం చేశాడు. ఈ ఉపదేశాన్నే యాఖూబ్ కూడా తన సంతానానికి చేశాడు: “నా బిడ్డలారా! ఈ ధర్మాన్నే అల్లాహ్ మీ కొరకు ఎన్నిక చేశాడు. కనుక మీరు మరణించే వరకూ ముస్లిములుగానే ఉండండి.” యాఖూబు మృత్యుదశలో ఉన్నప్పుడు మీరు అక్కడ ఉన్నారా? మరణించే ముందు అతను తన కుమారులను ఇలా అడిగాడు:“బిడ్డలారా! నా తరువాత మీరు ఎవరిని ఆరాధిస్తారు?” వారంతా ఇలా సమాధానం చెప్పారు: “మీరూ, మీ పెద్దలైన ఇబ్రాహీము, ఇస్మాయీలు, ఇస్‌హాఖ్ దేవుడుగా భావించిన ఆ ఏకైక దేవుణ్ణే మేమూ ఆరాధిస్తాము. మేము ఆయనకే ముస్లిములమై ఉంటాము.”

**134** వారంతా గతించిన ఒక సంఘం, వారు సంపాదించింది వారిది. మీరు సంపాదించేది మీది. వారు చేసినదాన్ని గురించి మిమ్మల్ని అడగటం జరగదు.

**135-136** “యూదులుగా మారితేనే రుజుమార్గం లభిస్తుంది” అని యూదులు అంటారు. “క్రైస్తవులుగా మారితేనే ధర్మమార్గం పొందగలుగుతారు” అని క్రైస్తవులు అంటారు. మీరు వారితో ఇలా అనండి: “కాదు, మేము అన్ని మార్గాలను విసర్జించి, ఒక్క ఇబ్రాహీము మార్గాన్నే అనుసరిస్తాము. ఇబ్రాహీము ముష్రిక్కులలోని వాడు కాదు.” ముస్లిములారా! ఇలా ప్రకటించండి: “మేమంతా అల్లాహ్‌నూ, ఆయన మా వైపునకు పంపిన హితోపదేశాన్నీ విశ్వసించాము. ఇంకా ఇబ్రాహీము, ఇస్మాయీలు, ఇస్‌హాఖు, యాఖూబు, యాఖూబు సంతానంపై అవతరించినదానినీ మూసాకూ, ఈసాకూ ఇతర ప్రవక్తలందరికీ వారి ప్రభువు ప్రసాదించిన దానినీ మేము విశ్వసించాము. వారిలో ఏ ఒక్కరి పట్లా మేము భేదభావం చూపము. మమ్మల్ని మేము ముస్లిములుగా అల్లాహ్‌కు సమర్పించుకున్నాము.”

فَاِنْ اٰمَنُوْا بِمِثْلِ مَآ اٰمَنْتُمْ بِهٖ فَقَدِ اهْتَدَوْا ۚ
وَاِنْ تَوَلَّوْا فَاِنَّمَا هُمْ فِيْ شِقَاقٍ ۚ فَسَيَكْفِيْكَهُمُ
اللّٰهُ ۚ وَهُوَ السَّمِيْعُ الْعَلِيْمُ ﴿١٣٧﴾ صِبْغَةَ اللّٰهِ ۚ
وَمَنْ اَحْسَنُ مِنَ اللّٰهِ صِبْغَةً ۫ وَّنَحْنُ لَهٗ
عٰبِدُوْنَ ﴿١٣٨﴾ قُلْ اَتُحَآجُّوْنَنَا فِي اللّٰهِ وَهُوَ رَبُّنَا
وَرَبُّكُمْ ۚ وَلَنَآ اَعْمَالُنَا وَلَكُمْ اَعْمَالُكُمْ ۚ
وَنَحْنُ لَهٗ مُخْلِصُوْنَ ﴿١٣٩﴾ اَمْ تَقُوْلُوْنَ اِنَّ
اِبْرٰهٖمَ وَاِسْمٰعِيْلَ وَاِسْحٰقَ وَيَعْقُوْبَ
وَالْاَسْبَاطَ كَانُوْا هُوْدًا اَوْ نَصٰرٰى ۗ قُلْ ءَاَنْتُمْ
اَعْلَمُ اَمِ اللّٰهُ ۗ وَمَنْ اَظْلَمُ مِمَّنْ كَتَمَ
شَهَادَةً عِنْدَهٗ مِنَ اللّٰهِ ۗ وَمَا اللّٰهُ بِغَافِلٍ
عَمَّا تَعْمَلُوْنَ ﴿١٤٠﴾ تِلْكَ اُمَّةٌ قَدْ خَلَتْ ۚ لَهَا
مَا كَسَبَتْ وَلَكُمْ مَّا كَسَبْتُمْ ۚ وَلَا تُسْـَٔلُوْنَ
عَمَّا كَانُوْا يَعْمَلُوْنَ ﴿١٤١﴾ ع ١٦/١٦

**137** మీరు విశ్వసించినట్లే వారూ విశ్వసిస్తే, అప్పుడు వారు ధర్మమార్గంలో ఉన్నట్లు. కాని, వారు ఒకవేళ దీనికి వైముఖ్యం చూపితే, కేవలం వైషమ్యంతో మంకుపట్టు పడుతున్నారన్నది విశదము. కనుక వారి బారినుండి మిమ్మల్ని ఆదుకునేందుకు అల్లాహ్ చాలు. మీరు నిశ్చింతగా ఉండండి. ఆయన అన్నీ వింటాడు, ఆయనకు అన్నీ తెలుసు.

**138** వారితో ఇలా చెప్పండి: "అల్లాహ్ రంగును స్వీకరించండి. అల్లాహ్ రంగు కంటె మరెవరి రంగు శ్రేష్ఠతరమైనది? మేము కేవలం ఆయననే ఆరాధిస్తాము."

**139 - 141** ప్రవక్తా! వారితో ఇలా అను: "అల్లాహ్ విషయంలో మీరు మాతో వాదులాడుతారా? వాస్తవానికి ఆయనే మాకూ ప్రభువు, మీకూ ప్రభువు. మా కర్మలు మాకు, మీ కర్మలు మీకు. మేమయితే మా దాస్యాన్ని కేవలం అల్లాహ్‌కే ప్రత్యేకం చేసుకున్నాము. లేకపోతే ఇబ్రాహీము, ఇస్మాయీలు, ఇస్హాఖు, యాఖూబు, యాఖూబ్ సంతానము - వీరంతా యూదులని లేక క్రైస్తవులని మీరు అంటారా?" ఇలా అడుగు: "మీకు బాగా తెలుసా లేక అల్లాహ్‌కా?" అల్లాహ్ అప్పగించిన సాక్ష్యాన్ని దాచే వ్యక్తికంటే పరమ దుర్మార్గుడు ఎవడు? మీ చేష్టలను అల్లాహ్ గమనించకుండా ఉండటం లేదు. వారంతా గతించిన ఒక సంఘం. వారి సంపాదన వారిది. మీ సంపాదన మీది. వారి కర్మలను గురించి మిమ్మల్ని ప్రశ్నించటం సంభవించదు.

42. ముస్లిమ్ : అల్లాహ్ ముందు విధేయుడై పూర్తిగా లొంగిపోయేవాడు. అల్లాహ్‌నే తన స్వామిగా, యజమానిగా, పాలకుడుగా, ఆరాధ్య దైవంగా అంగీకరించేవాడు. తనను తాను పరిపూర్ణంగా నిర్నిబంధంగా అల్లాహ్‌కు సమర్పించుకునేవాడు. అల్లాహ్ తరఫు నుండి వచ్చిన మార్గదర్శకత్వానికి అనుగుణంగా ప్రపంచంలో జీవితం గడిపేవాడు. ఈ విశ్వాసం పేరే, ఈ నడవడిక పేరే ఇస్లామ్. ప్రపంచంలో విభిన్న దేశాలకు, విభిన్న జాతులకు ఆది నుండి వచ్చిన ప్రవక్తల ధర్మం కూడా ఇదే.

سَيَقُوْلُ السُّفَهَآءُ مِنَ النَّاسِ مَا وَلّٰىهُمْ عَنْ
قِبْلَتِهِمُ الَّتِیْ كَانُوْا عَلَيْهَا ؕ قُلْ لِّلّٰهِ الْمَشْرِقُ وَ
الْمَغْرِبُ ؕ يَهْدِیْ مَنْ يَّشَآءُ اِلٰى صِرَاطٍ
مُّسْتَقِيْمٍ ﴿۱۴۲﴾ وَ كَذٰلِكَ جَعَلْنٰكُمْ اُمَّةً وَّسَطًا
لِّتَكُوْنُوْا شُهَدَآءَ عَلَى النَّاسِ وَ يَكُوْنَ
الرَّسُوْلُ عَلَيْكُمْ شَهِيْدًا ؕ وَ مَا جَعَلْنَا الْقِبْلَةَ
الَّتِیْ كُنْتَ عَلَيْهَاۤ اِلَّا لِنَعْلَمَ مَنْ يَّتَّبِعُ الرَّسُوْلَ
مِمَّنْ يَّنْقَلِبُ عَلٰى عَقِبَيْهِ ؕ وَ اِنْ كَانَتْ
لَكَبِيْرَةً اِلَّا عَلَى الَّذِيْنَ هَدَى اللّٰهُ ؕ وَ مَا
كَانَ اللّٰهُ لِيُضِيْعَ اِيْمَانَكُمْ ؕ اِنَّ اللّٰهَ بِالنَّاسِ
لَرَءُوْفٌ رَّحِيْمٌ ﴿۱۴۳﴾

**142 - 143** మూర్ఖజనులు ఇలా అంటారు: "పూర్వం ఏ ఖిబ్లా వైపునకు తిరిగి వారు నమాజు చేసేవారో, దాని నుండి ఇంత అకస్మాత్తుగా మరలటానికి కారణం?"[43] ప్రవక్తా! వారితో ఇలా అను: "ప్రాక్పశ్చిమాలు అన్నీ అల్లాహ్‌వే. అల్లాహ్ తాను కోరిన వారికి రుజుమార్గం చూపుతాడు." ఈ విధంగా మేము మిమ్మల్ని ఒక "మధ్యస్థ సమాజం"గా చేశాము.[44] ఇకపై మీరు సమస్త మానవ జాతికి సాక్షులుగా ఉంటారు. ప్రవక్త మీకు సాక్షిగా ఉంటాడు[45]...

**143** ...ఎవరు ప్రవక్తను అనుసరిస్తారో, ఎవరు వెనుతిరిగి పోతారో పరీక్షించాలనే మేము పూర్వం మీరు మీ ముఖాన్ని ఏ దిక్కు వైపునకు తిప్పేవారో ఆ దిక్కునే మీ ఖిబ్లాగా నిర్ణయించాము. ఇది నిజంగా ఎంతో కఠినమైన విషయం! కాని అల్లాహ్ సన్మార్గ భాగ్యం కలుగజేసిన వారికి ఇది ఏ మాత్రం కష్టతరం కాలేదు. ఈ మీ విశ్వాసాన్ని అల్లాహ్ ఏ మాత్రం వృధాకానివ్వడు. మానవుల పట్ల అల్లాహ్‌కు ఎంతో కరుణ, వాత్సల్యం ఉన్నాయనే విషయాన్ని నిశ్చయంగా నమ్మండి.

43. మహాప్రవక్త వలస (హిజ్రత్) పోయిన తరువాత పవిత్ర మదీనా నగరంలో పదహారు లేక పదిహేడు నెలల వరకు బైతుల్ మఖ్దిస్ (జెరూసలేం) ఉన్న దిక్కుకు తిరిగి నమాజు చేస్తూ ఉండేవారు. తరువాత "కాబా వైపు ముఖం పెట్టి నమాజు చెయ్యి" అనే ఆజ్ఞ వచ్చింది.

44. మధ్యస్థ సమాజం (ఉమ్మతె వసత్) అంటే భావం: ఉన్నతమైన ఒక సభ్య సమాజం; న్యాయమైన, మధ్యస్థ వైఖరిపై స్థిరంగా ఉండే సమాజం; ప్రపంచ జాతుల మధ్య అధ్యక్షస్థానం కలిగివున్న సమాజం; అసత్యం, అన్యాయం పునాదులుగా ఎవరితోనూ ఏ సంబంధాలూ లేని సమాజం; సత్యం, న్యాయం ఆధారంగా అందరితోనూ సంబంధాలు కలిగివుండే సమాజం.

45. దీని భావం ఏమిటంటే, పరలోకంలో సమస్త మానవాళి యొక్క సామూహికమైన లెక్క తీసుకొనబడేటప్పుడు, అల్లాహ్ యొక్క బాధ్యతాయుత ప్రతినిధిగా ప్రవక్త మిమ్మల్ని గురించి సరియైన ఆలోచన, సరియైన ఆచరణ, న్యాయం పునాదిగాగల జీవన వ్యవస్థకు సంబంధించిన ఏయే ఉపదేశాలనయితే మేము ఆయనకు తెలిపామో, వాటిని ఆయన మీకు ఏ విధమైన హెచ్చు తగ్గులు లేకుండా పూర్తిగా అందజేశానని మరియు వాటిని ఆచరించి ఒక ఆదర్శాన్ని మీ ముందు పెట్టానని సాక్ష్యమిస్తాడు. దీని తరువాత ప్రవక్త ప్రతినిధులుగా ఆయన స్థానే మీరూ ప్రజా బాహుళ్యాన్ని గురించి సాక్షులుగా నిలబడవలసి ఉంటుంది; ప్రవక్త మీకు అందజేసిన దానిని మీరు వారికి అందించటంలోనూ, ప్రవక్త స్వయంగా ఆచరించి మీకు చూపిన దానిని మీరు స్వయంగా ఆచరించి వారికి చూపటంలోనూ మీ మట్టుకు మీరు ఏ లోటూ చెయ్యలేదని, మీరు సాక్ష్యమీయవలసి ఉంటుంది.

قَدْ نَرٰى تَقَلُّبَ وَجْهِكَ فِي السَّمَآءِ ۚ
فَلَنُوَلِّيَنَّكَ قِبْلَةً تَرْضٰىهَا ۖ فَوَلِّ وَجْهَكَ
شَطْرَ الْمَسْجِدِ الْحَرَامِ ۭ وَحَيْثُ مَا كُنْتُمْ
فَوَلُّوْا وُجُوْهَكُمْ شَطْرَهٗ ۭ وَاِنَّ الَّذِيْنَ اُوْتُوا
الْكِتٰبَ لَيَعْلَمُوْنَ اَنَّهُ الْحَقُّ مِنْ رَّبِّهِمْ ۭ وَمَا
اللّٰهُ بِغَافِلٍ عَمَّا يَعْمَلُوْنَ ۝١٤٤ وَلَئِنْ اَتَيْتَ
الَّذِيْنَ اُوْتُوا الْكِتٰبَ بِكُلِّ اٰيَةٍ مَّا تَبِعُوْا
قِبْلَتَكَ ۚ وَمَآ اَنْتَ بِتَابِعٍ قِبْلَتَهُمْ ۚ وَمَا
بَعْضُهُمْ بِتَابِعٍ قِبْلَةَ بَعْضٍ ۭ وَلَئِنِ اتَّبَعْتَ
اَهْوَآءَهُمْ مِّنْۢ بَعْدِ مَا جَآءَكَ مِنَ الْعِلْمِ ۙ
اِنَّكَ اِذًا لَّمِنَ الظّٰلِمِيْنَ ۝١٤٥ اَلَّذِيْنَ اٰتَيْنٰهُمُ
الْكِتٰبَ يَعْرِفُوْنَهٗ كَمَا يَعْرِفُوْنَ اَبْنَآءَهُمْ ۭ
وَاِنَّ فَرِيْقًا مِّنْهُمْ لَيَكْتُمُوْنَ الْحَقَّ وَهُمْ
يَعْلَمُوْنَ ۝١٤٦ اَلْحَقُّ مِنْ رَّبِّكَ فَلَا تَكُوْنَنَّ مِنَ
الْمُمْتَرِيْنَ ۝١٤٧

وقف لازم

وقف منزل

**144** ప్రవక్తా! నీవు మాటిమాటికీ నీ ముఖాన్ని ఆకాశం వైపునకు ఎత్తటం మేము గమనిస్తూనే ఉన్నాము. ఇదిగో, నీకు అత్యంత ప్రీతికరమైన ఖిబ్లా వైపునకే ఇప్పుడు మేము నిన్ను త్రిప్పుతున్నాము. కాబట్టి నీవు ముఖాన్ని 'మస్‌జిదె హరామ్' వైపునకు త్రిప్పు. ఇకపై మీరెక్కడున్నాసరే, ముఖాన్ని ఆ వైపునకు పెట్టి నమాజు చెయ్యండి.[46] ....

**144 - 147**... (ఖిబ్లా మార్పునకు సంబంధించిన) ఈ ఆదేశాన్ని వారి ప్రభువే ఇచ్చాడనీ, అది సత్యం అనీ గ్రంథ ప్రజలకు బాగా తెలుసు. కాని ఇది తెలిసిన తరువాత కూడ, వారు ఏమి చేస్తున్నారో, దానిని అల్లాహ్ గమనించకుండా ఉండటం లేదు. గ్రంథ ప్రజలకు నీవు ఏ నిదర్శనం చూపినా, వారు నీ ఖిబ్లాను అనుసరించటం సంభవించదు. వారి ఖిబ్లాను అనుసరించటం నీకూ సాధ్యపడదు. వారిలోని ఏ వర్గంవారు కూడా మరొకరి ఖిబ్లాను అనుసరించటానికి తయారుగా లేరు. నీవు ఈ జ్ఞానం పొందిన తరువాత కూడ, ఒకవేళ నీవు వారి కోరికలను అనుసరిస్తే, నిశ్చయంగా దుర్మార్గులలో చేరి పోతావు. మేము ఎవరికి గ్రంథం ప్రసాదించామో, వారు తమ సంతానాన్ని ఏవిధంగా గుర్తిస్తారో[47] అదేవిధంగా (ఖిబ్లాగా నిర్ణయింపబడిన) ఈ స్థలాన్ని గుర్తిస్తారు. కాని వారిలోని ఒక వర్గం బుద్ధిపూర్వకంగా సత్యాన్ని కప్పిపుచ్చుతోంది. నిస్సందేహంగా ఇది మీ ప్రభువు నుండి వచ్చిన సత్యం. కనుక దీని విషయంలో మీరు ఏమాత్రం సంశయంలో పడకండి.

46. ఖిబ్లా మార్పును గురించి జారీఅయిన అసలు ఆజ్ఞ ఇది. ఈ ఆజ్ఞ హిజ్రీ శకం రెండో సంవత్సరం, రజబ్ లేక షాబాన్ నెలలో అవతరించింది. మహాప్రవక్త (సఅసమ్) తమ ఒక అనుచరుని ఇంటికి ఆహ్వానంపై భోజనానికి వెళ్ళారు. అక్కడ జుహర్ నమాజు సమయం అయింది. నమాజు చేయించటానికి ఆయన నిలబడ్డారు. రెండు రకాతులు అయిపోయాయి. మూడో రకాతులో అకస్మాత్తుగా వహీ ద్వారా ఈ ఆయత్ అవతరించింది. వెంటనే ఆయన, ఆయన వెనుక జమాఅత్‌లో నిలుచున్న వారంతా బైతుల్ మఖ్దిస్ వైపు నుండి కాబా వైపునకు తమ ముఖాలను త్రిప్పుకున్నారు. తరువాత మదీనా పట్టణంలో, మదీనా పట్టణ పరిసర ప్రాంతాలలో ఈ విషయం బహిరంగంగా ప్రకటించబడింది. ఇంకా, "నీవు మాటి మాటికీ నీ ముఖాన్ని ఆకాశం వైపునకు ఎత్తటాన్ని మేము గమనిస్తూనే ఉన్నాము" మరియు "ఇదిగో, నీకు అత్యంత ప్రీతికరమైన ఖిబ్లా వైపునకే ఇప్పుడు మేము నిన్ను త్రిప్పుతున్నాము" అనే మాటల ద్వారా స్పష్టంగా తెలిసేదేమిటంటే ఖిబ్లా మార్పునకు సంబంధించిన ఆజ్ఞ అవతరించక ముందునుండే మహాప్రవక్త (సఅసమ్) దాని కొరకు నిరీక్షిస్తూ ఉండేవారు.

وَلِكُلٍّ وِّجْهَةٌ هُوَ مُوَلِّيْهَا فَاسْتَبِقُوا الْخَيْرٰتِ ؕ
اَيْنَ مَا تَكُوْنُوْا يَاْتِ بِكُمُ اللّٰهُ جَمِيْعًا ؕ اِنَّ
اللّٰهَ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ ﴿۱۴۸﴾ وَمِنْ حَيْثُ
خَرَجْتَ فَوَلِّ وَجْهَكَ شَطْرَ الْمَسْجِدِ
الْحَرَامِ ؕ وَاِنَّهٗ لَلْحَقُّ مِنْ رَّبِّكَ ؕ وَمَا اللّٰهُ
بِغَافِلٍ عَمَّا تَعْمَلُوْنَ ﴿۱۴۹﴾ وَمِنْ حَيْثُ خَرَجْتَ
فَوَلِّ وَجْهَكَ شَطْرَ الْمَسْجِدِ الْحَرَامِ ؕ وَحَيْثُ
مَا كُنْتُمْ فَوَلُّوْا وُجُوْهَكُمْ شَطْرَهٗ ۙ لِئَلَّا يَكُوْنَ
لِلنَّاسِ عَلَيْكُمْ حُجَّةٌ ۙ اِلَّا الَّذِيْنَ ظَلَمُوْا
مِنْهُمْ ۙ فَلَا تَخْشَوْهُمْ وَاخْشَوْنِيْ ۙ وَلِاُتِمَّ
نِعْمَتِيْ عَلَيْكُمْ وَلَعَلَّكُمْ تَهْتَدُوْنَ ﴿۱۵۰﴾ كَمَآ
اَرْسَلْنَا فِيْكُمْ رَسُوْلًا مِّنْكُمْ يَتْلُوْا عَلَيْكُمْ
اٰيٰتِنَا وَيُزَكِّيْكُمْ وَيُعَلِّمُكُمُ الْكِتٰبَ وَ
الْحِكْمَةَ وَيُعَلِّمُكُمْ مَّا لَمْ تَكُوْنُوْا تَعْلَمُوْنَ ﴿۱۵۱﴾
فَاذْكُرُوْنِيْٓ اَذْكُرْكُمْ وَاشْكُرُوْا لِيْ وَلَا تَكْفُرُوْنِ ﴿۱۵۲﴾

وقف النبي صلى الله عليه وسلم

معانقة ٣

ع ١٨

**148** ప్రతి ఒక్కడికి ఒక దిక్కు ఉన్నది. దాని వైపునకు అతడు తిరుగుతాడు. కనుక మీరు మంచి పనులలో మిన్నగా ఉండటానికి ప్రయత్నించండి. మీరంతా ఎక్కడున్నాసరే అల్లాహ్ మిమ్మల్ని కనుగొంటాడు. ఆయన శక్తికి అతీతమైనది ఏదీ లేదు.

**149 - 152** మీరు ఏ ప్రాంతంలో ప్రయాణం చేసినా, మీ ముఖాన్ని (నమాజు సమయంలో) 'మస్‌జిదె హరామ్' వైపునకు త్రిప్పండి. ఎందుకంటే ఇది మీ ప్రభువు చేసిన న్యాయమైన నిర్ణయం. మీ కర్మలను అల్లాహ్ గమనించకుండా ఉండటం లేదు. మీరు ఏ ప్రదేశంలో ప్రయాణం చేసినా, మీ ముఖాన్ని 'మస్‌జిదె హరామ్' వైపునకే త్రిప్పండి. మీరు ఎక్కడున్నాసరే, దాని వైపునకే తిరిగి నమాజు చెయ్యండి. దీనివల్ల మీకు వ్యతిరేకంగా వాదించటానికి ప్రజలకు అవకాశం లభించదు[48]– కాని వారిలో దుర్మార్గులైన వారి నోరు ఎట్టి పరిస్థితులలోనూ ఊరుకోదు. అందుకని వారికి భయపడకండి, నాకు భయపడండి. ఇంకా[49] నేను మీపై నా అనుగ్రహాన్ని పూర్తి చేస్తాను. మీరు నా ఈ ఆజ్ఞాపాలన ద్వారా సాఫల్య మార్గం పొందే అవకాశం ఉంది. ఆ ప్రకారంగానే (ఈ విషయాల వల్ల మీకు సాఫల్య భాగ్యం కలిగింది.) మేము మీలో నుండే ఒకరిని ప్రవక్తగా మీ మధ్యకు పంపాము. అతను మీకు మా వాక్యాలను వినిపిస్తాడు. మీ జీవితాలను తీర్చిదిద్దుతాడు. మీకు గ్రంథాన్నీ, దివ్య జ్ఞానాన్నీ బోధిస్తాడు. మీకు తెలియని ఎన్నో విషయాలు నేర్పుతాడు. కనుక మీరు నన్ను జ్ఞాపకం పెట్టుకోండి. నేను మిమ్మల్ని జ్ఞాపకం పెట్టుకుంటాను. నాకు కృతజ్ఞతలు తెలుపండి. చేసిన మేలును మరువకండి.

47. ఇదొక అరబ్బీ నానుడి. ఏ విషయాన్నయితే మనిషి నిశ్చయంగా ఎరుగునో, ఆ విషయాన్ని అతడు తన సంతానాన్ని గుర్తించిన విధంగా గుర్తిస్తాడు అని ఈ నానుడి అర్థం. కాబాను హజ్రత్ ఇబ్రాహీము (అస్సలామ్) నిర్మించారు. దీని తర్వాత 1300 సంవత్సరాలకు బైతుల్ మఖ్దిస్‌ను హజ్రత్ సులైమాను (అస్సలామ్) నిర్మించారు. వాస్తవానికి ఈ విషయం యూదుల విద్వాంసులకూ, క్రైస్తవుల విద్వాంసులకూ బాగాతెలుసు. ఈ విషయం ఎవరికీ గోప్యంగా లేదు.

48. అంటే ఎవరికీ ఇలా అనే అవకాశం లభించకూడదు : "ఎంత మంచి ముస్లిములు వీళ్ళు, తమ దేవునియొక్క స్పష్టమైన ఆజ్ఞను ఉల్లంఘిస్తున్నారు."

49. ఈ వాక్యం సంబంధం "దాని వైపునకే తిరిగి నమాజు చెయ్యండి. దీనివల్ల మీకు వ్యతిరేకంగా వాదించటానికి ప్రజలకు అవకాశం లభించదు" అనే వాక్యంతో ఉంది.

يَاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا اسْتَعِيْنُوْا بِالصَّبْرِ
وَالصَّلٰوةِ ؕ اِنَّ اللّٰهَ مَعَ الصّٰبِرِيْنَ ﴿۱۵۳﴾ وَ لَا
تَقُوْلُوْا لِمَنْ يُّقْتَلُ فِیْ سَبِيْلِ اللّٰهِ اَمْوَاتٌ ؕ
بَلْ اَحْيَآءٌ وَّ لٰكِنْ لَّا تَشْعُرُوْنَ ﴿۱۵۴﴾ وَلَنَبْلُوَنَّكُمْ
بِشَیْءٍ مِّنَ الْخَوْفِ وَالْجُوْعِ وَ نَقْصٍ مِّنَ
الْاَمْوَالِ وَالْاَنْفُسِ وَالثَّمَرٰتِ ؕ وَ بَشِّرِ
الصّٰبِرِيْنَ ﴿۱۵۵﴾ الَّذِيْنَ اِذَآ اَصَابَتْهُمْ مُّصِيْبَةٌ ۙ
قَالُوْٓا اِنَّا لِلّٰهِ وَ اِنَّآ اِلَيْهِ رٰجِعُوْنَ ﴿۱۵۶﴾ اُولٰٓئِكَ
عَلَيْهِمْ صَلَوٰتٌ مِّنْ رَّبِّهِمْ وَرَحْمَةٌ ۟ وَ اُولٰٓئِكَ
هُمُ الْمُهْتَدُوْنَ ﴿۱۵۷﴾ اِنَّ الصَّفَا وَالْمَرْوَةَ مِنْ
شَعَآئِرِ اللّٰهِ ۚ فَمَنْ حَجَّ الْبَيْتَ اَوِ اعْتَمَرَ فَلَا
جُنَاحَ عَلَيْهِ اَنْ يَّطَّوَّفَ بِهِمَا ؕ وَمَنْ تَطَوَّعَ
خَيْرًا ۙ فَاِنَّ اللّٰهَ شَاكِرٌ عَلِيْمٌ ﴿۱۵۸﴾ اِنَّ الَّذِيْنَ
يَكْتُمُوْنَ مَآ اَنْزَلْنَا مِنَ الْبَيِّنٰتِ وَالْهُدٰى مِنْ
بَعْدِ مَا بَيَّنّٰهُ لِلنَّاسِ فِی الْكِتٰبِ ۙ اُولٰٓئِكَ
يَلْعَنُهُمُ اللّٰهُ وَيَلْعَنُهُمُ اللّٰعِنُوْنَ ﴿۱۵۹﴾ اِلَّا الَّذِيْنَ
تَابُوْا وَاَصْلَحُوْا وَ بَيَّنُوْا فَاُولٰٓئِكَ اَتُوْبُ
عَلَيْهِمْ ۚ وَ اَنَا التَّوَّابُ الرَّحِيْمُ ﴿۱۶۰﴾

**153 - 157** విశ్వాసులారా! సహనం ద్వారా, నమాజు ద్వారా సహాయం అర్థించండి. సహనం కలవారికి అల్లాహ్ తోడుగా ఉంటాడు. అల్లాహ్ మార్గంలో చంపబడిన వారిని 'మృతులు' అనకండి. వాస్తవానికి వారు సజీవులు. కాని మీరు వారి జీవితాన్ని గ్రహించలేరు. భయప్రమాదాలకు, ఆకలి బాధకు, ధన, ప్రాణ, ఆదాయాల నష్టానికి గురిచేసి మేము మిమ్మల్ని తప్పకుండా పరీక్షిస్తాము. ఈ పరిస్థితులలో మనఃస్థయిర్యంతో ఉండేవారు కష్టకాలం దాపురించినప్పుడు, "మేమంతా అల్లాహ్‌కే చెందినవారము. అల్లాహ్ వైపునకే మరలిపోవలసిన వారము" అని అనేవారికి శుభవార్తలు తెలుపు. వారిపై వారి ప్రభువు తన అపూర్వ అనుగ్రహాలను కురిపిస్తాడు. ఆయన కారుణ్యచ్ఛాయలు వారికి ఆశ్రయమిస్తాయి. వారే సన్మార్గ గాములు.

**158** సఫా మర్వాలు నిశ్చయంగా అల్లాహ్ యొక్క చిహ్నాలు. కనుక కాబా గృహానికి హజ్ కొరకు లేక 'ఉమ్‌రహ్'[50] కొరకు పోయేవారు, ఈ రెండు కొండల మధ్య 'సయీ' చేస్తే, అది దోషం ఎంతమాత్రం కాదు. స్వచ్ఛందంగా, హృదయపూర్వకంగా ఎవరైనా ఏదైనా సత్కార్యం చేస్తే అది అల్లాహ్‌కు తెలుస్తుంది. ఆయన దానిని ఆదరిస్తాడు.

**159 - 160** మేము అవతరింపచేసిన స్పష్టమైన జ్ఞానబోధలు, ధర్మోపదేశాలు వాస్తవానికి మానవులందరి మార్గదర్శకత్వం కోసం అని మేము మా గ్రంథంలో విశదం చేసిన తరువాత కూడా వాటిని దాచేవారిని అల్లాహ్ తప్పకుండా శపిస్తాడు, ఇంకా శపించే వారంతా వారిని శపిస్తారు. కాని ఎవరు పశ్చాత్తాపంతో తమ ఈ వైఖరిని మార్చుకుంటారో, తమ నడవడికను సంస్కరించుకుంటారో, తాము గోప్యంగా ఉంచుతూ వచ్చిన దానిని ప్రకటిస్తారో, వారిని నేను క్షమిస్తాను. నేను అమితంగా మన్నించేవాణ్ణి, అధికంగా కరుణించేవాణ్ణి.

50. 'జుల్ హిజ్జహ్' నెలలోని నిర్ణీత తేదీలలో కాబాను సందర్శించటాన్ని హజ్ అంటారు. ఆ తేదీలలో కాక వేరే కాలంలో కాబాను సందర్శించటాన్ని 'ఉమ్‌రహ్' అంటారు.

إِنَّ الَّذِينَ كَفَرُوا وَمَاتُوا وَهُمْ كُفَّارٌ أُولَٰئِكَ
عَلَيْهِمْ لَعْنَةُ اللَّهِ وَالْمَلَائِكَةِ وَالنَّاسِ
أَجْمَعِينَ ﴿١٦١﴾ خَالِدِينَ فِيهَا ۖ لَا يُخَفَّفُ عَنْهُمُ
الْعَذَابُ وَلَا هُمْ يُنْظَرُونَ ﴿١٦٢﴾ وَإِلَٰهُكُمْ إِلَٰهٌ
وَاحِدٌ ۖ لَا إِلَٰهَ إِلَّا هُوَ الرَّحْمَٰنُ الرَّحِيمُ ﴿١٦٣﴾
إِنَّ فِي خَلْقِ السَّمَاوَاتِ وَالْأَرْضِ وَاخْتِلَافِ
اللَّيْلِ وَالنَّهَارِ وَالْفُلْكِ الَّتِي تَجْرِي فِي الْبَحْرِ
بِمَا يَنْفَعُ النَّاسَ وَمَا أَنْزَلَ اللَّهُ مِنَ
السَّمَاءِ مِنْ مَاءٍ فَأَحْيَا بِهِ الْأَرْضَ بَعْدَ
مَوْتِهَا وَبَثَّ فِيهَا مِنْ كُلِّ دَابَّةٍ وَ
تَصْرِيفِ الرِّيَاحِ وَالسَّحَابِ الْمُسَخَّرِ بَيْنَ
السَّمَاءِ وَالْأَرْضِ لَآيَاتٍ لِقَوْمٍ يَعْقِلُونَ ﴿١٦٤﴾
وَمِنَ النَّاسِ مَنْ يَتَّخِذُ مِنْ دُونِ اللَّهِ أَنْدَادًا
يُحِبُّونَهُمْ كَحُبِّ اللَّهِ ۖ وَالَّذِينَ آمَنُوا أَشَدُّ
حُبًّا لِلَّهِ ۗ وَلَوْ يَرَى الَّذِينَ ظَلَمُوا إِذْ يَرَوْنَ
الْعَذَابَ أَنَّ الْقُوَّةَ لِلَّهِ جَمِيعًا وَأَنَّ اللَّهَ
شَدِيدُ الْعَذَابِ ﴿١٦٥﴾

**161 - 162** అవిశ్వాస వైఖరిని[51] అవలంబించి, అవిశ్వాసులుగానే అసువులు బాసిన వారిని అల్లాహ్, ఆయన దూతలు, ఇంకా మానవులందరూ శపిస్తారు. ఆ శాపగ్రస్త స్థితిలోనే వారు సదా ఉంటారు. వారి శిక్షను తగ్గించటం కానీ, వారికి మళ్ళీ ఏ వ్యవధీ ఇవ్వటం కానీ సంభవించదు.

**163 - 167** మీ దేవుడు ఒక్కడే. ఆ కరుణామయుడు, ఆ కృపాకరుడు తప్ప మరొక దేవుడులేడు. (ఈ సత్యం గ్రహించటానికి ఏవైనా గుర్తులు, తార్కాణాలు అవసరం అయితే) వివేకం ఉన్నవారికి భూమ్యాకాశాల నిర్మాణంలో, రేయింబవళ్ళు ఒకదాని వెంట ఒకటి చేసే నిరంతరమైన పయనంలో, ప్రజా బాహుళ్యానికి ఉపయోగపడే వస్తువులు మోసుకుంటూ నదులలో, సముద్రాలలో సంచరించే ఓడలలో, పైనుండి అల్లాహ్ కురిపించే వర్షపు నీటిలో–తద్వారా ఆయన మృత భూమికి ప్రాణం పోస్తాడు. (ఈ ఏర్పాటు ద్వారా) భువిలో వివిధ ప్రాణులను వర్థిల్లజేస్తాడు– వాయువుల సంచారంలో, భూమ్యాకాశాల మధ్య అల్లాహ్ ఆదేశాలకు కట్టుబడివున్న మేఘ మాలికలలో అసంఖ్యాకమైన సూచనలు కానవస్తాయి. కాని (అల్లాహ్ ఏకత్వాన్ని స్పష్టంగా, బహిరంగంగా చాటే ఇన్ని సూచనలు ఉన్నప్పటికీ) కొందరు అల్లాహ్‌ను కాదని ఇతరులను ఆయనకు సమానులుగా, ప్రత్యర్థులుగా భావిస్తారు. వారు అల్లాహ్‌పట్ల కలిగి వుండవలసిన ప్రేమతో వారిని ప్రేమిస్తారు - కాని విశ్వాసులు అన్నిటికంటె అధికంగా అల్లాహ్‌నే ప్రేమిస్తారు - సర్వశక్తులూ, సర్వాధికారాలూ అల్లాహ్ గుప్పెట్లో ఉన్నాయని, ఇంకా శిక్షించటంలో కూడా ఆయన చాలా కఠినుడు అనీ ఈ దుర్మార్గులకు, ముున్ముందు ఘోరశిక్షను ప్రత్యక్షంగా చూసిన తరువాత బోధపడేబదులు, ఇప్పుడే బోధపడితే ఎంత బాగుంటుంది!

51. 'కుఫ్ర్' అనే పదం ఈమాన్ (విశ్వాసం)కు వ్యతిరేకంగా చెప్పబడుతుంది. 'ఈమాన్' అంటే విశ్వసించటం, అంగీకరించటం, స్వీకరించటం అని భావం. దీనికి భిన్నంగా 'కుఫ్ర్' అంటే అర్థం, విశ్వసించకపోవటం, త్రోసిపుచ్చుటం, తిరస్కరించటం. ఖురాను ప్రకారం కుఫ్ర్ వైఖరి యొక్క వివిధ రూపాలు ఇలా ఉన్నాయి: ఒకటి, మానవుడు అసలు అల్లాహ్ ఉనికినే అంగీకరించకపోవటం, లేక ఆయన సర్వాధికారాన్ని స్వీకరించకపోవటం, లేక ఆయన్ని తన యొక్క, సమస్త సృష్టి యొక్క ప్రభువుగా, ఆరాధ్య దైవంగా ఒప్పుకోక పోవటం లేక ఆయన్ని ఏకైక ప్రభువుగా, ఆరాధ్య దైవంగా అంగీకరించకపోవటం. రెండు, అల్లాహ్ ఉనికిని మాత్రమే

إِذۡ تَبَرَّاَ الَّذِيۡنَ اتُّبِعُوۡا مِنَ الَّذِيۡنَ اتَّبَعُوۡا
وَرَاَوُا الۡعَذَابَ وَتَقَطَّعَتۡ بِهِمُ الۡاَسۡبَابُ ﴿١٦٦﴾
وَقَالَ الَّذِيۡنَ اتَّبَعُوۡا لَوۡ اَنَّ لَنَا كَرَّةً فَنَتَبَرَّاَ
مِنۡهُمۡ كَمَا تَبَرَّءُوۡا مِنَّا ؕ كَذٰلِكَ يُرِيۡهِمُ اللّٰهُ
اَعۡمَالَهُمۡ حَسَرٰتٍ عَلَيۡهِمۡ ؕ وَمَا هُمۡ
بِخٰرِجِيۡنَ مِنَ النَّارِ ﴿١٦٧﴾ يٰۤاَيُّهَا النَّاسُ كُلُوۡا ع ٢٠
مِمَّا فِى الۡاَرۡضِ حَلٰلًا طَيِّبًا ۖ وَّلَا تَتَّبِعُوۡا
خُطُوٰتِ الشَّيۡطٰنِ ؕ اِنَّهٗ لَكُمۡ عَدُوٌّ مُّبِيۡنٌ ﴿١٦٨﴾
اِنَّمَا يَاۡمُرُكُمۡ بِالسُّوۡٓءِ وَالۡفَحۡشَآءِ وَاَنۡ تَقُوۡلُوۡا
عَلَى اللّٰهِ مَا لَا تَعۡلَمُوۡنَ ﴿١٦٩﴾ وَاِذَا قِيۡلَ لَهُمُ
اتَّبِعُوۡا مَآ اَنۡزَلَ اللّٰهُ قَالُوۡا بَلۡ نَـتَّبِعُ مَآ
اَلۡفَيۡنَا عَلَيۡهِ اٰبَآءَنَا ؕ اَوَلَوۡ كَانَ اٰبَآؤُهُمۡ لَا
يَعۡقِلُوۡنَ شَيۡـًٔا وَّلَا يَهۡتَدُوۡنَ ﴿١٧٠﴾ وَمَثَلُ
الَّذِيۡنَ كَفَرُوۡا كَمَثَلِ الَّذِىۡ يَنۡعِقُ بِمَا لَا
يَسۡمَعُ اِلَّا دُعَآءً وَّنِدَآءً ؕ صُمٌّۢ بُكۡمٌ عُمۡىٌ
فَهُمۡ لَا يَعۡقِلُوۡنَ ﴿١٧١﴾

అల్లాహ్ వారిని శిక్షించే సమయాన వారు ప్రపంచంలో ఏ నాయకుల, ఏ మార్గదర్శకుల అడుగు జాడలలో నడిచేవారో, ఆ నాయకులు, ఆ మార్గదర్శకులు తమ అనుచరులతో, ఏ మాత్రం సంబంధం లేని విధంగా ప్రవర్తిస్తారు. కాని వారికి శిక్షమాత్రం తప్పదు. ఇంకా వారి సకల సాధనా సంపత్తుల పరంపర తెగిపోతుంది. అప్పుడు అనుచరులు ఇలా అంటారు: "మాకు (ప్రపంచానికి మళ్ళీ తిరిగి పోయే) మరొక అవకాశం లభిస్తే, వారు ఈ రోజు మమ్మల్ని త్యజిస్తున్న విధంగానే మేమూ వారిని అప్పుడు త్యజిస్తాము." ఈవిధంగా ప్రపంచంలో వారు చేసిన కర్మలను అల్లాహ్ వారిముందు ఉంచుతాడు. వారు అప్పుడు నిస్పృహతో, తీవ్ర అవమాన భారంతో క్రుంగిపోతారు. అయినప్పటికీ నరకాగ్ని నుండి బయటపడటం వారికి సాధ్య పడదు.

**168 - 169** ప్రజలారా! భూమిలోని ధర్మసమ్మతమైన, పరిశుభ్రమైన వాటినన్నింటినీ మీరు తినండి. షైతాను చూపే మార్గాలను తొక్కకండి. వాడు మీకు బహిరంగ శత్రువు. దుర్మార్గాన్నీ, అశ్లీలాన్నీ చెయ్యండి అని వాడు మిమ్మల్ని ఆజ్ఞాపిస్తాడు. ఏ విషయాలను గురించి అయితే (అల్లాహ్ చెప్పినట్లు) మీకు తెలియదో ఆ విషయాలను అల్లాహ్ పేరుతో చెప్పండి అని మిమ్మల్ని ప్రేరేపిస్తాడు.

**170 - 171** "అల్లాహ్ అవతరింపచేసిన ఆదేశాలను అనుసరించండి" అని వారితో అన్నప్పుడు, వారు "మా పూర్వీకులు అవలంబిస్తూ ఉండగా చూచిన పద్ధతినే మేము అనుసరిస్తాము" అని సమాధానం చెబుతారు. వారి పూర్వీకులు జ్ఞానం లేని వారైనప్పటికీ, సన్మార్గం పొందనివారైనప్పటికీ, వారు వారినే అనుసరిస్తూ పోతారా? అల్లాహ్ చూపిన మార్గాన్ని తిరస్కరించేవారి పోలిక ఇలా ఉంది: పశువుల కాపరి పశువులను కేకవేస్తాడు. కాని అవి ఆ కేకల, అరుపుల ధ్వనిని తప్ప దేనినీ వినలేవు. వారు చెవిటి వారు, మూగవారు, గ్రుడ్డి వారు. అందుకని ఏ విషయమూ వారి బుర్రకెక్కదు.

అంగీకరించి, ఆయన ఆజ్ఞలు ఆయన మార్గదర్శకత్వం జ్ఞానానికి, శాసనానికి ఏకైక ఆధారమని ఒప్పుకోవటానికి తిరస్కరించటం. మూడు, తాను అల్లాహ్ మార్గదర్శకత్వంపై నడవవలసి ఉన్నదని సూత్రప్రాయంగా అంగీకరించినా, అల్లాహ్ తన మార్గదర్శకత్వాన్ని, తన ఆజ్ఞలను ఏ ప్రవక్తల ద్వారా అందజేశాడో ఆ ప్రవక్తలను

يٰۤاَيُّهَا الَّذِيۡنَ اٰمَنُوۡا كُلُوۡا مِنۡ طَيِّبٰتِ مَا
رَزَقۡنٰكُمۡ وَ اشۡكُرُوۡا لِلّٰهِ اِنۡ كُنۡتُمۡ اِيَّاهُ
تَعۡبُدُوۡنَ ﴿۱۷۲﴾ اِنَّمَا حَرَّمَ عَلَيۡكُمُ الۡمَيۡتَةَ وَالدَّمَ
وَ لَحۡمَ الۡخِنۡزِيۡرِ وَ مَاۤ اُهِلَّ بِهٖ لِغَيۡرِ اللّٰهِ ۚ فَمَنِ
اضۡطُرَّ غَيۡرَ بَاغٍ وَّ لَا عَادٍ فَلَاۤ اِثۡمَ عَلَيۡهِ ؕ اِنَّ
اللّٰهَ غَفُوۡرٌ رَّحِيۡمٌ ﴿۱۷۳﴾ اِنَّ الَّذِيۡنَ يَكۡتُمُوۡنَ مَاۤ
اَنۡزَلَ اللّٰهُ مِنَ الۡكِتٰبِ وَ يَشۡتَرُوۡنَ بِهٖ ثَمَنًا
قَلِيۡلًا ۙ اُولٰٓـئِكَ مَا يَاۡكُلُوۡنَ فِىۡ بُطُوۡنِهِمۡ اِلَّا النَّارَ
وَ لَا يُكَلِّمُهُمُ اللّٰهُ يَوۡمَ الۡقِيٰمَةِ وَ لَا يُزَكِّيۡهِمۡ ۖۚ وَ
لَهُمۡ عَذَابٌ اَلِيۡمٌ ﴿۱۷۴﴾ اُولٰٓـئِكَ الَّذِيۡنَ اشۡتَرَوُا
الضَّلٰلَةَ بِالۡهُدٰى وَالۡعَذَابَ بِالۡمَغۡفِرَةِ ۚ فَمَاۤ
اَصۡبَرَهُمۡ عَلَى النَّارِ ﴿۱۷۵﴾ ذٰلِكَ بِاَنَّ اللّٰهَ نَزَّلَ
الۡكِتٰبَ بِالۡحَقِّ ؕ وَ اِنَّ الَّذِيۡنَ اخۡتَلَفُوۡا فِى
الۡكِتٰبِ لَفِىۡ شِقَاقٍۭ بَعِيۡدٍ ﴿۱۷۶﴾ لَيۡسَ الۡبِرَّ اَنۡ
تُوَلُّوۡا وُجُوۡهَكُمۡ قِبَلَ الۡمَشۡرِقِ وَالۡمَغۡرِبِ وَلٰكِنَّ
الۡبِرَّ مَنۡ اٰمَنَ بِاللّٰهِ وَالۡيَوۡمِ الۡاٰخِرِ وَالۡمَلٰٓـئِكَةِ
وَالۡكِتٰبِ وَالنَّبِيّٖنَ ۚ وَ اٰتَى الۡمَالَ عَلٰى حُبِّهٖ ذَوِى
الۡقُرۡبٰى وَ الۡيَتٰمٰى وَ الۡمَسٰكِيۡنَ وَ ابۡنَ السَّبِيۡلِ ۙ
وَالسَّآئِلِيۡنَ وَ فِى الرِّقَابِ ۚ وَ اَقَامَ الصَّلٰوةَ وَاٰتَى
الزَّكٰوةَ ۚ وَ الۡمُوۡفُوۡنَ بِعَهۡدِهِمۡ اِذَا عٰهَدُوۡا ۚ
وَالصّٰبِرِيۡنَ فِى الۡبَاۡسَآءِ وَالضَّرَّآءِ وَحِيۡنَ الۡبَاۡسِ ؕ
اُولٰٓـئِكَ الَّذِيۡنَ صَدَقُوۡا ؕ وَاُولٰٓـئِكَ هُمُ الۡمُتَّقُوۡنَ ﴿۱۷۷﴾

**172 - 173** విశ్వసించిన ప్రజలారా! నిజంగానే మీరు అల్లాహ్ ఆరాధకులు అయితే, మేము మీకు ప్రసాదించిన పరిశుభ్రమైన వస్తువులను నిస్సంకోచంగా తినండి. అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపండి. అల్లాహ్ నిషేధించినవి ఏమన్నా ఉంటే అవి ఇవి మాత్రమే: మరణించిన వాటిని తినకండి. రక్తాన్ని, పంది మాంసాన్ని ముట్టకండి. ఇంకా అల్లాహ్‌కు కాక ఇతరులకు సమర్పించబడిన దానిని తినకండి. కాని ఎవరైనా గత్యంతరం లేక వాటిలోని ఏ పదార్థాన్నయినా తింటే అది పాపం కాదు. అయితే నిషేధాజ్ఞను ఉల్లంఘించే ఉద్దేశ్యం ఉండకూడదు. ఇంకా అవసరానికి మించి తినకూడదు. అల్లాహ్ క్షమించేవాడూ, కరుణించేవాడూను.[52]

**174 - 176** వాస్తవమేమిటంటే, అల్లాహ్ తన గ్రంథంలో ప్రవచించిన ఆజ్ఞలను దాచేవారూ, వాటిని స్వల్ప ప్రాపంచిక ప్రయోజనాల కొరకు విక్రయించేవారూ, నిశ్చయంగా తమ ఉదరాలను అగ్నితో నింపుకుంటున్నారు. ప్రళయ దినంనాడు అల్లాహ్ వారిని ఏమాత్రం పలుకరించడు. పవిత్రులుగా పరిగణించడు. వారికి వ్యధాభరితమైన శిక్ష కలదు. సన్మార్గానికి బదులు వక్రమార్గాన్నీ, క్షమాభిక్షకు బదులు ఘోరశిక్షనూ కొనుక్కున్న వారు వీరు. ఎంత ధైర్యం వీరికి, నరక శిక్షను సైతం భరించటానికి సిద్ధంగా ఉన్నారు! ఇదంతా ఎందుకు సంభవించిందంటే అల్లాహ్ సత్యంతో కూడుకున్న గ్రంథాన్ని అవతరింపచేశాడు, కాని ఈ గ్రంథంలో విభేదాలు కల్పించినవారు తమ తగాదాలలో పడి అసలు సత్యం నుండే చాలా దూరం వెళ్ళిపోయారు.

**177** సత్కార్యం అంటే మీరు మీ ముఖాలను తూర్పుకో పడమరకో త్రిప్పటంకాదు. సత్కార్యం అంటే మనిషి అల్లాహ్‌నూ, అంతిమ దినాన్నీ, దూతలనూ, అల్లాహ్ అవతరింపజేసిన గ్రంథాన్నీ, ఆయన ప్రవక్తలనూ హృదయపూర్వకంగా విశ్వసించటం. ఇంకా అల్లాహ్ పట్ల ప్రేమతో తాము ఎక్కువగా ఇష్టపడే ధనాన్ని బంధువుల కొరకూ, అనాధుల కొరకూ, నిరుపేదల కొరకూ, బాటసారుల కొరకూ, సహాయం చెయ్యండి అని అర్థించేవారి కొరకూ, ఖైదీలను విడుదల చెయ్యటానికీ వ్యయ పరచటం. ఇంకా నమాజును స్థాపించటం, జకాత్ ఇవ్వటం, వాగ్దానం చేస్తే దానిని పాలించేవారూ, కష్టకాలంలో, లేమిలో, సత్యానికీ అసత్యానికీ మధ్య జరిగే పోరాటంలో స్థయిర్యం చూపేవారూ సత్పురుషులు. వాస్తవంగా సత్యసంధులు; అల్లాహ్ ఎడల భయభక్తులు కలవారు వీరే.

يٰۤاَيُّهَا الَّذِيۡنَ اٰمَنُوۡا كُتِبَ عَلَيۡکُمُ الۡقِصَاصُ
فِى الۡقَتۡلٰى ؕ اَلۡحُـرُّ بِالۡحُـرِّ وَالۡعَبۡدُ بِالۡعَبۡدِ
وَالۡاُنۡثٰى بِالۡاُنۡثٰى ؕ فَمَنۡ عُفِىَ لَهٗ مِنۡ اَخِيۡهِ
شَىۡءٌ فَاتِّبَاعٌ ۢ بِالۡمَعۡرُوۡفِ وَاَدَآءٌ اِلَيۡهِ
بِاِحۡسَانٍ ؕ ذٰلِكَ تَخۡفِيۡفٌ مِّنۡ رَّبِّکُمۡ
وَرَحۡمَةٌ ؕ فَمَنِ اعۡتَدٰى بَعۡدَ ذٰلِكَ فَلَهٗ
عَذَابٌ اَلِيۡمٌ ﴿۱۷۸﴾ وَلَـكُمۡ فِى الۡقِصَاصِ حَيٰوةٌ
يّٰۤاُولِى الۡاَلۡبَابِ لَعَلَّكُمۡ تَتَّقُوۡنَ ﴿۱۷۹﴾ كُتِبَ
عَلَيۡكُمۡ اِذَا حَضَرَ اَحَدَكُمُ الۡمَوۡتُ اِنۡ تَرَكَ
خَيۡرَا ۖۚ اۨلۡوَصِيَّةُ لِلۡوَالِدَيۡنِ وَالۡاَقۡرَبِيۡنَ
بِالۡمَعۡرُوۡفِ ۚ حَقًّا عَلَى الۡمُتَّقِيۡنَ ﴿۱۸۰﴾ فَمَنۡۢ
بَدَّلَهٗ بَعۡدَ مَا سَمِعَهٗ فَاِنَّمَاۤ اِثۡمُهٗ عَلَى الَّذِيۡنَ
يُبَدِّلُوۡنَهٗ ؕ اِنَّ اللّٰهَ سَمِيۡعٌ عَلِيۡمٌ ﴿۱۸۱﴾ فَمَنۡ
خَافَ مِنۡ مُّوۡصٍ جَنَفًا اَوۡ اِثۡمًا فَاَصۡلَحَ بَيۡنَهُمۡ
فَلَاۤ اِثۡمَ عَلَيۡهِ ؕ اِنَّ اللّٰهَ غَفُوۡرٌ رَّحِيۡمٌ ﴿۱۸۲﴾ ع

**178 - 179** విశ్వసించిన ప్రజలారా! హత్యావ్యవహారాలలో మీ కొరకు ప్రతీకార న్యాయం నిర్ణయించబడింది. హత్యచేసిన వ్యక్తి స్వతంత్రుడయితే, ఆ స్వతంత్రుణ్ణే శిక్షించాలి. బానిస అయితే ఆ బానిసనే వధించాలి. స్త్రీ అయితే ఆ స్త్రీనే చంపాలి. ఒకవేళ హతుని సోదరుడు హంతకుణ్ణి కనికరించదలిస్తే, న్యాయ సమ్మతంగా రక్తశుల్క నిర్ణయం జరగాలి. హంతకుడు రక్త ధనాన్ని ఉత్తమరీతిలో అతనికి చెల్లించాలి.[53] ఇది మీ ప్రభువు నుండి మీకు లభించే సౌకర్యం, కారుణ్యం. దీని తరువాత కూడ ఈ హద్దులను అతిక్రమించేవారు[54] ఘోరశిక్షకు గురిఅవుతారు. బుద్ధిజ్ఞానం కల ఓ మానవులారా! ఈ ప్రతీకార న్యాయం మీ సమాజానికి ఊపిరి. ఈ శాసనోల్లంఘనానికి మీరు దూరంగా ఉంటారని ఆశించబడుతోంది.

**180 - 182** మీలో ఎవరికైనా మరణకాలం సమీపించినప్పుడు, వారు ఆస్తిపాస్తులు కలవారైతే, తమ తల్లిదండ్రులకు, బంధువులకు న్యాయ సమ్మతంగా పంచిపెడుతూ మరణ శాసనం విధిగా వ్రాయాలి.[55] ఇది అల్లాహ్ పట్ల భయ భక్తులు కలవారి విధ్యుక్త ధర్మం. ఇంకా, మరణ శాసనం విన్నవారు, తరువాత ఒకవేళ దాన్ని మార్చితే, దాని పాపమంతా ఆ మార్చిన వారిదే. అల్లాహ్ అంతా వింటాడు. ఆయనకు అన్నీ తెలుసు. కాని మరణ శాసనం చేసిన వ్యక్తి, తెలియకపోవటం వల్లనో లేక బుద్ధిపూర్వకంగానో అన్యాయం చేశాడనే అనుమానం ఎవరికైనా కలిగితే, వారు ఈ వ్యవహారంతో సంబంధం ఉన్న వారందరి మధ్య రాజీ కుదిరిస్తే, అందులో ఏమాత్రం దోషం లేదు. అల్లాహ్ క్షమించేవాడూ, కరుణించేవాడూను.

---

విశ్వసించక పోవటం. నాలుగు, ప్రవక్తల మధ్య భేదభావం చూపటం. ఇంకా తన అభీష్టం, తన దురభిమానాలు ఆధారంగా ఒక ప్రవక్తను విశ్వసించటం, మరొక ప్రవక్తను విశ్వసించకపోవటం. ఐదు, విశ్వాసాలు, నైతిక విషయాలు, జీవన సూత్రాలను గురించి ప్రవక్తలు దేవుని తరఫున ఏ బోధనలైతే చేశారో వాటినీ, లేక వాటిలో దేన్నయినా విశ్వసించటానికి తిరస్కరించటం. ఆరు, సిద్ధాంతపరంగానయితే ఈ విషయాలనన్నింటినీ అంగీకరించి ఆచరణలో దైవాజ్ఞలను బుద్ధిపూర్వకంగా ఉల్లంఘించటం, ఈ చర్యను సమర్థించుకోవటం, ప్రాపంచిక జీవితంలో తన వైఖరికి విధేయతను కాక అవిధేయతను పునాదిగా చేసుకోవటం.

52. ఈ ఆయత్‌లో హరామ్ వస్తువును ఉపయోగించే అనుమతి మూడు షరతులతో ఇవ్వబడింది. మొదటిది : పరిస్థితి నిజంగానే అనివార్యమైనదిగా ఉండాలి – ఉదాహరణకు, ఆకలిదప్పుల కారణంగా మనిషి ప్రాణం పోతున్నప్పుడు లేక వ్యాధి కారణంగా ప్రాణానికి సంకటం ఏర్పడినప్పుడు, ఈ పరిస్థితిలో హరామ్ వస్తువు తప్ప మరొకటి లభ్యం కానప్పుడు. రెండో షరతు: అల్లాహ్ శాసనాన్ని ధిక్కరించే ఉద్దేశ్యం మనస్సులో లేకుండా

يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا كُتِبَ عَلَيْكُمُ الصِّيَامُ كَمَا
كُتِبَ عَلَى الَّذِيْنَ مِنْ قَبْلِكُمْ لَعَلَّكُمْ
تَتَّقُوْنَ ﴿١٨٣﴾ اَيَّامًا مَّعْدُوْدٰتٍ ؕ فَمَنْ كَانَ
مِنْكُمْ مَّرِيْضًا اَوْ عَلٰى سَفَرٍ فَعِدَّةٌ مِّنْ اَيَّامٍ
اُخَرَ ؕ وَعَلَى الَّذِيْنَ يُطِيْقُوْنَهٗ فِدْيَةٌ طَعَامُ
مِسْكِيْنٍ ؕ فَمَنْ تَطَوَّعَ خَيْرًا فَهُوَ خَيْرٌ لَّهٗ ؕ
وَاَنْ تَصُوْمُوْا خَيْرٌ لَّكُمْ اِنْ كُنْتُمْ تَعْلَمُوْنَ ﴿١٨٤﴾
شَهْرُ رَمَضَانَ الَّذِيْۤ اُنْزِلَ فِيْهِ الْقُرْاٰنُ
هُدًى لِّلنَّاسِ وَ بَيِّنٰتٍ مِّنَ الْهُدٰى
وَالْفُرْقَانِ ۚ فَمَنْ شَهِدَ مِنْكُمُ الشَّهْرَ
فَلْيَصُمْهُ ؕ وَ مَنْ كَانَ مَرِيْضًا اَوْ عَلٰى سَفَرٍ
فَعِدَّةٌ مِّنْ اَيَّامٍ اُخَرَ ؕ يُرِيْدُ اللّٰهُ بِكُمُ الْيُسْرَ
وَ لَا يُرِيْدُ بِكُمُ الْعُسْرَ ۫ وَ لِتُكْمِلُوا الْعِدَّةَ
وَلِتُكَبِّرُوا اللّٰهَ عَلٰى مَا هَدٰىكُمْ وَ لَعَلَّكُمْ
تَشْكُرُوْنَ ﴿١٨٥﴾

**183 - 184** విశ్వసించిన ప్రజలారా! ఉపవాసం మీకు విధిగా నిర్ణయించబడింది – ఏ విధంగా మీకు పూర్వం ప్రవక్తలను అనుసరించేవారికి కూడ విధించబడిందో. దీనివల్ల మీలో భయభక్తులు జనించే అవకాశం ఉంది. ఈ ఉపవాసం కొన్ని దినాల వరకే. కాని మీలో ఎవరైనా వ్యాధిగ్రస్తులయితే లేక ప్రయాణంలో ఉంటే, వేరే దినాలలో ఆ ఉపవాస దినాలను పూర్తి చెయ్యాలి. ఉపవాసం ఉండే శక్తి కలవారు (ఒకవేళ దానిని పాటించకపోతే) పరిహారం చెల్లించాలి. ఒక ఉపవాస దినానికి పరిహారం ఒక పేదవానికి భోజనం పెట్టడం. కాని ఎవరైనా సహృదయంతో ఇంకా ఎక్కువ పుణ్యం చేస్తే, అది వారికే మేలు. అయితే మీరు విషయాన్ని గ్రహించగలిగితే, ఉపవాసం ఉండటమే మీకు ఉత్తమం.[56]

**185** పవిత్ర ఖురాను అవతరించిన నెల రమజాను నెల. మానవులందరికీ (ఆ గ్రంథం) మార్గదర్శకం. రుజుమార్గం చూపే, సత్యాసత్యాలను వేరుపరచే స్పష్టమైన ఉపదేశాలు అందులో ఉన్నాయి. కనుక ఇక నుండి రమజాను నెలను పొందే వ్యక్తి ఆ నెల అంతా విధిగా ఉపవాసం ఉండాలి. కాని వ్యాధిగ్రస్తులైనవారు లేదా ప్రయాణంలో ఉన్నవారు, ఆ ఉపవాస దినాలను వేరే దినాలలో పూర్తిచెయ్యాలి. అల్లాహ్ మీకు సౌలభ్యం కలుగజెయ్యాలనే అభిలషిస్తాడు. మిమ్మల్ని కష్టపెట్టాలనే తలంపు ఆయనకు లేదు. కనుక మీరు ఉపవాస దినాల సంఖ్యను పూర్తిచెయ్యగలగటానికీ, అల్లాహ్ మీకు ప్రసాదించిన మహోపదేశానికి మీరు అల్లాహ్ ఔన్నత్యాన్ని కొనియాడటానికీ, ఆయనకు మీరు కృతజ్ఞతలు తెలుపుకోవటానికీ ఈ పద్ధతి తెలుపబడుతోంది.

ఉండాలి. మూడోది : అవసరమైన దానికంటే లవలేశమైనా ఎక్కువ తీసుకోరాదు. ఉదాహరణకు: హరామ్ వస్తువు యొక్క కొన్ని మెతుకులు లేదా కొన్ని బొట్లు లేదా కొన్ని గ్రుక్కలు ప్రాణ రక్షణకు సరిపోతే వాటికంటే ఎక్కువ మోతాదులో ఆ వస్తువును వినియోగించకూడదు.

53. ఈ ఆయత్ ద్వారా తెలిసే విషయమేమిటంటే, ఇస్లామీ శిక్షాస్మృతి ప్రకారం హత్య వంటి వ్యవహారంలో కూడా రాజీ సాధ్యమే. ఖిసాస్ (హత్యకు ప్రతీకారం) నుండి హంతకుణ్ణి క్షమించే హక్కు హతుని వారసులకు సంక్రమిస్తుంది. ఆ సందర్భంలో హంతకుణ్ణి తప్పనిసరిగా చంపాలని న్యాయస్థానం పట్టుపట్టడం ధర్మసమ్మతం కాదు. అయితే క్షమించటమే జరిగితే హంతకుడు విధిగా పరిహార ధనం చెల్లించాలి.

54. ఉదాహరణకు హతుని వారసులు పరిహార ధనం తీసుకున్న తరువాత కూడా మళ్ళీ ప్రతీకారం చేసే ప్రయత్నం చెయ్యటం లేక హంతకుడు పరిహార ధనాన్ని చెల్లించకుండా ఎప్పటికప్పుడు దాటేస్తూ ఉండటం ఇంకా హతుని వారసులు అతనికి చేసిన ఉపకారానికి ప్రతిగా అతడు వారికి కృతఘ్నత చూపటం.

**186** నా దాసులు నన్ను గురించి నిన్ను అడిగితే, నేను వారికి అత్యంత సమీపంలోనే ఉన్నాననీ, పిలిచేవాడు నన్ను పిలిచినప్పుడు నేను అతని పిలుపును వింటాను, సమాధానం పలుకుతాను అనీ, ఓ ప్రవక్తా నీవు వారికి తెలుపు. కనుక వారు నా సందేశం విని దానిని స్వీకరించాలి. నన్ను విశ్వసించాలి. (ఈ విషయం నీవు వారికి వినిపించు) వారు రుజుమార్గం పొందే అవకాశం ఉంది.

**187** ఉపవాసకాలంలో రాత్రి సమయాలలో మీరు మీ భార్యల వద్దకు పోవడం మీ కొరకు ధర్మ సమ్మతం చెయ్యబడింది. వారు మీకు దుస్తులు, మీరు వారికి దుస్తులు, మీరు రహస్యంగా ఆత్మద్రోహానికి పాల్పడుతున్నారనే విషయం అల్లాహ్‌కు తెలిసిపోయింది. అయినప్పటికీ ఆయన మీ అపరాధాన్ని క్షమించాడు, మిమ్మల్ని మన్నించాడు. ఇకనుండి మీరు మీ భార్యలతో సంభోగం చేయవచ్చు. అల్లాహ్ మీ కొరకు ధర్మ సమ్మతం చేసిన సుఖానుభవాన్ని పొందండి. ఇంకా రాత్రి నలుపు రేఖల నుండి ఉషోదయపు ధవళ రేఖలు ప్రస్ఫుటమయ్యే వరకు, మీరు తినండి, త్రాగండి. ఆ తరువాత వీటన్నింటినీ త్యజించి చీకటి పడేవరకు మీ ఉపవాసం పూర్తి చెయ్యండి. కాని మసీదులలో 'ఏతెకాఫ్' పాటించేటప్పుడు మీరు మీ భార్యలతో సంభోగించకండి. ఇవి అల్లాహ్ ఏర్పరచిన హద్దులు. వీటి దరిదాపులకు కూడ పోకండి. ఈ విధంగా అల్లాహ్ తన ఆజ్ఞలను ప్రజలకు స్పష్టం చేస్తాడు. తప్పుడు మార్గాల నుండి వారు తమను తాము రక్షించుకుంటారని ఆశించబడుతోంది.

**188** మీలో మీరు ఒకరి ఆస్తిని మరొకరు అన్యాయంగా కబళించకండి. బుద్ధిపూర్వకంగా, అక్రమమైనరీతిలో ఇతరుల ఆస్తిలో కొంత భాగం కాజేసే అవకాశం లభిస్తుందేమో[57] అనే దురుద్దేశ్యంతో దానిని న్యాయనిర్ణేతల వద్దకు తీసుకునిపోకండి.

وَ اِذَا سَاَلَكَ عِبَادِىْ عَنِّىْ فَاِنِّىْ قَرِيْبٌ ؕ
اُجِيْبُ دَعْوَةَ الدَّاعِ اِذَا دَعَانِ ۙ فَلْيَسْتَجِيْبُوْا
لِىْ وَلْيُؤْمِنُوْا بِىْ لَعَلَّهُمْ يَرْشُدُوْنَ ﴿١٨٦﴾ اُحِلَّ
لَكُمْ لَيْلَةَ الصِّيَامِ الرَّفَثُ اِلٰى نِسَآئِكُمْ ؕ هُنَّ
لِبَاسٌ لَّكُمْ وَاَنْتُمْ لِبَاسٌ لَّهُنَّ ؕ عَلِمَ اللّٰهُ
اَنَّكُمْ كُنْتُمْ تَخْتَانُوْنَ اَنْفُسَكُمْ فَتَابَ عَلَيْكُمْ
وَعَفَا عَنْكُمْ ۚ فَالْـٰٔنَ بَاشِرُوْهُنَّ وَابْتَغُوْا مَا
كَتَبَ اللّٰهُ لَكُمْ ۠ وَكُلُوْا وَ اشْرَبُوْا حَتّٰى يَتَبَيَّنَ
لَكُمُ الْخَيْطُ الْاَبْيَضُ مِنَ الْخَيْطِ الْاَسْوَدِ مِنَ
الْفَجْرِ ۠ ثُمَّ اَتِمُّوا الصِّيَامَ اِلَى الَّيْلِ ۚ وَ لَا
تُبَاشِرُوْهُنَّ وَ اَنْتُمْ عٰكِفُوْنَ ۙ فِى الْمَسٰجِدِ ؕ
تِلْكَ حُدُوْدُ اللّٰهِ فَلَا تَقْرَبُوْهَا ؕ كَذٰلِكَ
يُبَيِّنُ اللّٰهُ اٰيٰتِهٖ لِلنَّاسِ لَعَلَّهُمْ يَتَّقُوْنَ ﴿١٨٧﴾ وَ
لَا تَاْكُلُوْٓا اَمْوَالَكُمْ بَيْنَكُمْ بِالْبَاطِلِ
وَتُدْلُوْا بِهَآ اِلَى الْحُكَّامِ لِتَاْكُلُوْا فَرِيْقًا مِّنْ
اَمْوَالِ النَّاسِ بِالْاِثْمِ وَ اَنْتُمْ تَعْلَمُوْنَ ﴿١٨٨﴾ ع ٢٣

55. వారసత్వపు ఆస్తి పంపిణీ కొరకు ఇంకా ఏ చట్టమూ నిర్ణయించబడని కాలంలో ఈ ఉత్తరువు జారీ చెయ్యబడింది. ఆ కాలంలో ప్రతి మనిషీ తన వారసుల భాగాలను తప్పనిసరిగా ఒక వీలునామా ద్వారా నిర్ణయించవలసి ఉండేది, అతని మరణం తరువాత కుటుంబ కలహాలు తలెత్తకుండా ఉండేటందుకు, నిజమైన హక్కుదారులకు అన్యాయం జరక్కుండా ఉండేటందుకు. ఆ తరువాత వారసత్వపు ఆస్తి పంపకానికి అల్లాహ్ స్వయంగా ఒక నియమావళిని రూపొందించాడు (అది తరువాత 'నిసా' సూరాలో వస్తుంది). అప్పుడు మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) ఈ నియమాన్ని నిర్ణయించారు. వారసులకు అల్లాహ్ నిర్ణయించిన భాగాలలో వీలునామా ద్వారా హెచ్చుతగ్గులు చెయ్యటానికి వీలు లేదు. ఇంకా వారసులుకాని వారికొరకు మొత్తం ఆస్తిలో మూడో భాగం కంటే ఎక్కువగా వీలునామా వ్రాయకూడదు. ఒక విశ్వాసి ఒక అవిశ్వాసి ఉభయులూ ఒకరికొకరు వారసులు కాలేరు.

يَسۡـَٔلُوۡنَكَ عَنِ الۡاَهِلَّةِ ؕ قُلۡ هِىَ مَوَاقِيۡتُ
لِلنَّاسِ وَالۡحَجِّ ؕ وَ لَيۡسَ الۡبِرُّ بِاَنۡ تَاۡتُوا
الۡبُيُوۡتَ مِنۡ ظُهُوۡرِهَا وَ لٰكِنَّ الۡبِرَّ مَنِ اتَّقٰى ۚ
وَاۡتُوا الۡبُيُوۡتَ مِنۡ اَبۡوَابِهَا ۖ وَاتَّقُوا اللّٰهَ
لَعَلَّكُمۡ تُفۡلِحُوۡنَ ﴿۱۸۹﴾ وَ قَاتِلُوۡا فِىۡ سَبِيۡلِ اللّٰهِ
الَّذِيۡنَ يُقَاتِلُوۡنَكُمۡ وَ لَا تَعۡتَدُوۡا ؕ اِنَّ اللّٰهَ لَا
يُحِبُّ الۡمُعۡتَدِيۡنَ ﴿۱۹۰﴾ وَاقۡتُلُوۡهُمۡ حَيۡثُ
ثَقِفۡتُمُوۡهُمۡ وَاَخۡرِجُوۡهُمۡ مِّنۡ حَيۡثُ اَخۡرَجُوۡكُمۡ
وَالۡفِتۡنَةُ اَشَدُّ مِنَ الۡقَتۡلِ ۚ وَ لَا تُقٰتِلُوۡهُمۡ
عِنۡدَ الۡمَسۡجِدِ الۡحَرَامِ حَتّٰى يُقٰتِلُوۡكُمۡ فِيۡهِ ۚ
فَاِنۡ قٰتَلُوۡكُمۡ فَاقۡتُلُوۡهُمۡ ؕ كَذٰلِكَ جَزَآءُ
الۡكٰفِرِيۡنَ ﴿۱۹۱﴾ فَاِنِ انۡتَهَوۡا فَاِنَّ اللّٰهَ غَفُوۡرٌ
رَّحِيۡمٌ ﴿۱۹۲﴾

**189** ప్రవక్తా! తరిగే పెరిగే చంద్రుని రూపాలను గురించి ప్రజలు నిన్ను అడుగుతుంటారు. నీవు వారికి ఇలా తెలుపు: "తేదీల లెక్కకూ, హజ్ కాల నిర్ణయానికీ అవి గుర్తులు." ఇంకా వారికి ఇలా చెప్పు: "మీరు మీ ఇళ్ళల్లోకి వాటి వెనుక భాగం నుండి ప్రవేశించటం సత్కార్యం ఎంతమాత్రం కాదు. దైవాగ్రహానికి దూరంగా ఉండటమే అసలు నిజమైన సత్కార్యం. కనుక మీరు వాకిళ్ళ నుండే ఇళ్ళల్లోకి ప్రవేశించండి. అయితే అల్లాహ్‌కు భయపడుతూ ఉండండి. బహుశా మీకు వాస్తవమైన సాఫల్యభాగ్యం కలుగవచ్చు."[58]

**190 – 192** మీతో పోరాడేవారితో మీరూ అల్లాహ్ మార్గంలో పోరాడండి. కాని హద్దులు అతిక్రమించకండి. హద్దులు అతిక్రమించే వారిని అల్లాహ్ ప్రేమించడు. మీకు వారు ఎక్కడ ఎదురైనా, మీరు వారితో పోరాడండి. మిమ్మల్ని వారు ఎక్కడనుండి పారద్రోలారో, అక్కడి నుండి మీరూ వారిని పారద్రోలండి. చంపటం చెడ్డదే. కాని, 'ఫిత్నా' (పీడన) అంతకంటే చెడ్డది.[59] 'మస్జిదె హరామ్' వద్ద వారు మీతో యుద్ధం చెయ్యనంత వరకు, మీరూ వారితో యుద్ధం చెయ్యకండి. కాని వారే అక్కడ కయ్యానికి కాలుదువ్వితే, మీరు వారిని చంపటానికి వెనుదీయకండి. అవిశ్వాసులకు ఇదే తగిన శిక్ష. వారు యుద్ధం చెయ్యటం మానుకుంటే (మీరూ మానండి) అల్లాహ్ క్షమించేవాడూ, కరుణించేవాడూ అనే విషయం తెలుసుకోండి.

---

56. పలు ఇస్లామీ విధులు మాదిరిగానే రోజా (ఉపవాస వ్రతం) కూడా క్రమక్రమంగానే ఒక విధిగా రూపొందింది. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) ప్రారంభంలో ప్రతి మాసంలో కేవలం మూడు రోజులు ఉపవాసం ఉండండి అని ముస్లిములకు బోధించారు. కాని ఈ ఉపవాసాలు విధిగా ఉండవలసినవి కావు. తరువాత రమజాను ఉపవాసాలకు సంబంధించిన ఈ ఆజ్ఞ హిజ్రీ శకం రెండో సంవత్సరంలో అవతరించింది. కాని ఇందులో ఉపవాసం ఉండగల శక్తి కలిగి ఉండి ఉపవాసం ఉండదలచని వారికి సౌలభ్యం ఇవ్వబడింది. వారు ప్రతి ఒక్క ఉపవాసానికి బదులుగా ఒక నిరుపేదకు భోజనం పెట్టాలి. తరువాత రెండో ఆజ్ఞ అవతరించింది. అది ముందు రాబోతోంది.

57. ఈ ఆయత్ యొక్క ఒక భావం ఏమిటంటే, ప్రభుత్వాధికారులకు లంచమిచ్చి ధర్మసమ్మతం కాని ప్రయోజనాలను పొందే ప్రయత్నం చెయ్యకండి. రెండో భావం ఏమిటంటే, సొమ్ము ఇతరులది అని మీకు తెలిసికూడా, కేవలం వారివద్ద వారి యాజమాన్యాన్ని రుజువుపరచుకునే సాక్ష్యాధారం ఏదీ లేని కారణంగా లేక యథార్థాన్ని తారుమారుచేసి దాన్ని పొందగలమనే దురుద్దేశ్యంతో, మీరు న్యాయస్థానానికి పోకండి. ఎందుకంటే న్యాయమూర్తి దావా వివరాలనుబట్టి ఆ సొమ్మును మీకే ఇప్పించే అవకాశం ఉంది. కాని అది మీకు ధర్మసమ్మతం కాబోదు.

58. అరబ్బులలో రివాజులో ఉన్న మరొక మూఢాచారం ఏమిటంటే, హజ్ కొరకు 'ఇహ్‌రామ్' (హజ్ కొరకు ధరించే వస్త్రం)ను ధరించినప్పుడు, వారు తమ ఇళ్ళల్లోకి ముఖద్వారం గుండా ప్రవేశించేవారు కాదు. ఇంటి వెనుక నుండి గోడ దూకిగానీ

وَ قٰتِلُوْهُمْ حَتّٰى لَا تَكُوْنَ فِتْنَةٌ وَّيَكُوْنَ
الدِّيْنُ لِلّٰهِ ؕ فَاِنِ انْتَهَوْا فَلَا عُدْوَانَ اِلَّا عَلَى
الظّٰلِمِيْنَ ﴿١٩٣﴾ اَلشَّهْرُ الْحَرَامُ بِالشَّهْرِ الْحَرَامِ
وَالْحُرُمٰتُ قِصَاصٌ ؕ فَمَنِ اعْتَدٰى عَلَيْكُمْ
فَاعْتَدُوْا عَلَيْهِ بِمِثْلِ مَا اعْتَدٰى عَلَيْكُمْ ۪
وَاتَّقُوا اللّٰهَ وَ اعْلَمُوْٓا اَنَّ اللّٰهَ مَعَ الْمُتَّقِيْنَ ﴿١٩٤﴾
وَ اَنْفِقُوْا فِيْ سَبِيْلِ اللّٰهِ وَ لَا تُلْقُوْا بِاَيْدِيْكُمْ
اِلَى التَّهْلُكَةِ ۛ وَاَحْسِنُوْا ۛ اِنَّ اللّٰهَ يُحِبُّ
الْمُحْسِنِيْنَ ﴿١٩٥﴾ وَاَتِمُّوا الْحَجَّ وَ الْعُمْرَةَ لِلّٰهِ ؕ مع
فَاِنْ اُحْصِرْتُمْ فَمَا اسْتَيْسَرَ مِنَ الْهَدْيِ ۚ وَ لَا
تَحْلِقُوْا رُءُوْسَكُمْ حَتّٰى يَبْلُغَ الْهَدْيُ مَحِلَّهٗ ؕ
فَمَنْ كَانَ مِنْكُمْ مَّرِيْضًا اَوْ بِهٖٓ اَذًى مِّنْ
رَّاْسِهٖ فَفِدْيَةٌ مِّنْ صِيَامٍ اَوْ صَدَقَةٍ اَوْ
نُسُكٍ ۚ فَاِذَآ اَمِنْتُمْ ۥ فَمَنْ تَمَتَّعَ بِالْعُمْرَةِ
اِلَى الْحَجِّ فَمَا اسْتَيْسَرَ مِنَ الْهَدْيِ ۚ فَمَنْ لَّمْ
يَجِدْ فَصِيَامُ ثَلٰثَةِ اَيَّامٍ فِي الْحَجِّ وَ سَبْعَةٍ
اِذَا رَجَعْتُمْ ؕ تِلْكَ عَشَرَةٌ كَامِلَةٌ ؕ ذٰلِكَ
لِمَنْ لَّمْ يَكُنْ اَهْلُهٗ حَاضِرِي الْمَسْجِدِ
الْحَرَامِ ؕ وَ اتَّقُوا اللّٰهَ وَ اعْلَمُوْٓا اَنَّ اللّٰهَ
شَدِيْدُ الْعِقَابِ ﴿١٩٦﴾ ع ٢٤ ٨

**193** పీడన (ఫిత్నా) అంతమయ్యేవరకు, దైవధర్మం స్థాపించబడేవరకు మీరు వారితో యుద్ధం చేస్తూనే ఉండండి. తరువాత వారు దానిని మానుకుంటే, దౌర్జన్యపరులను తప్ప మరెవ్వరినీ శిక్షించకూడదు.

**194** నిషిద్ధ మాసానికి బదులు నిషిద్ధమాసమే. నిషేధాలన్నింటినీ అందరూ సమానంగా గౌరవించవలసినదే.[60] కనుక మీపై ఎవరన్నా దాడిచేస్తే, మీరూ వారిపై అదే విధంగా దాడి చెయ్యండి. అయితే అల్లాహ్‌కు భయపడుతూ ఉండండి. అల్లాహ్ ఏర్పరచిన హద్దులను అతిక్రమించకుండా ఉండే వారితోనే అల్లాహ్ ఉంటాడు అనే విషయం తెలుసుకోండి.

**195** అల్లాహ్ మార్గంలో ఖర్చుపెట్టండి. చేతులారా మిమ్మల్ని మీరు వినాశంపాలు చేసుకోకండి. మేలు చెయ్యండి. మేలు చేసేవారిని అల్లాహ్ ప్రేమిస్తాడు.

**196** 'హజ్'ను, 'ఉమ్రహ్'ను అల్లాహ్ సంతోషం కోసం చెయ్యాలని సంకల్పించుకుంటే, దానిని నెరవేర్చండి. మార్గమధ్యంలో చిక్కుకుంటే మీరు ఇవ్వగలిగిన ఖుర్బానీని అల్లాహ్‌కు సమర్పించండి.[61] ఖుర్బానీ తన స్థానం చేరనంతవరకు మీరు శిరోముండనం చేయించుకోకండి. కాని మీలో ఎవరైనా వ్యాధిగ్రస్తులై లేదా తల బాధకులోనై (ఖుర్బానీ తన స్థానానికి చేరక మునుపే) శిరోముండనం చేయించుకుంటే దానికి పరిహారంగా ఉపవాసం ఉండాలి లేక దానధర్మాలు చెయ్యాలి లేక ఖుర్బానీ ఇవ్వాలి.[62] తరువాత మీకు శాంతిభద్రతలు నెలకొన్నట్లయితే[63] (మీరు హజ్‌కు ముందే మక్కా చేరుకున్నట్లయితే) ఈ అవకాశం వినియోగించుకుంటూ హజ్ కాలం వచ్చేవరకు మీలో ఎవరైనా 'ఉమ్రహ్' చేసినట్లయితే, వారు తమ శక్తికి తగిన విధంగా 'ఖుర్బానీ' ఇవ్వాలి. ఖుర్బానీ ఇవ్వలేకపోతే, హజ్ కాలంలో మూడు ఉపవాసాలు, ఇంటికి తిరిగి వచ్చిన పిదప ఏడు ఉపవాసాలు, ఈ విధంగా మొత్తం పది ఉప వాసాలు ఉండాలి. 'మస్జిదె హరామ్'కు సమీపంలో ఇల్లూ వాకిలీ లేని వారికే ఈ సౌకర్యం వర్తిస్తుంది. అల్లాహ్ ఇచ్చే ఈ ఆజ్ఞలను మీరు ఉల్లంఘించకండి. అల్లాహ్ కఠినంగా శిక్షించేవాడని మీరు స్పష్టంగా తెలుసుకోండి.

اَلْحَجُّ اَشْهُرٌ مَّعْلُوْمٰتٌ ۚ فَمَنْ فَرَضَ فِيْهِنَّ
الْحَجَّ فَلَا رَفَثَ وَ لَا فُسُوْقَ ۙ وَ لَا جِدَالَ فِي
الْحَجِّ ؕ وَ مَا تَفْعَلُوْا مِنْ خَيْرٍ يَّعْلَمْهُ اللّٰهُ ؕ وقف النبي صلى الله عليه وسلم
وَتَزَوَّدُوْا فَاِنَّ خَيْرَ الزَّادِ التَّقْوٰى ۫ وَ اتَّقُوْنِ
يٰۤاُولِي الْاَلْبَابِ ﴿١٩٧﴾ لَيْسَ عَلَيْكُمْ جُنَاحٌ اَنْ
تَبْتَغُوْا فَضْلًا مِّنْ رَّبِّكُمْ ؕ فَاِذَاۤ اَفَضْتُمْ مِّنْ
عَرَفٰتٍ فَاذْكُرُوا اللّٰهَ عِنْدَ الْمَشْعَرِ الْحَرَامِ ۖ
وَ اذْكُرُوْهُ كَمَا هَدٰىكُمْ ۚ وَاِنْ كُنْتُمْ مِّنْ قَبْلِهٖ
لَمِنَ الضَّآلِّيْنَ ﴿١٩٨﴾ ثُمَّ اَفِيْضُوْا مِنْ حَيْثُ
اَفَاضَ النَّاسُ وَ اسْتَغْفِرُوا اللّٰهَ ؕ اِنَّ اللّٰهَ
غَفُوْرٌ رَّحِيْمٌ ﴿١٩٩﴾

**197 - 203** హజ్ మాసాలు అందరికీ తెలిసినవే. ఈ నిర్ణీత మాసాలలో హజ్ చేసే సంకల్పం ఉన్న వ్యక్తి అప్రమత్తుడై మెలగాలి. హజ్ సమయంలో అతడు కామచేష్టలకూ దుష్కార్యాలకూ, ఘర్షణలకూ దూరంగా ఉండాలి. మీరు చేసే ఏ పుణ్య కార్యమైనా అది అల్లాహ్‌కు తెలుస్తుంది. హజ్ యాత్రకు ప్రయాణ సామగ్రిని తీసుకువెళ్ళండి. భయభక్తులు అన్నిటికంటే ఉత్తమమైన సామగ్రి. కనుక వివేకవంతులారా! నాకు అవిధేయత చూపకండి. హజ్ యాత్రతో పాటు మీరు అల్లాహ్ అనుగ్రహం అన్వేషిస్తే అందులో దోషం లేదు.[64] 'అరఫాత్' నుండి బయలుదేరి, 'మష్అరె హరామ్' (ముజ్‌దల్‌ఫ) వద్ద ఆగి అల్లాహ్‌ను స్మరించండి. అల్లాహ్ మీకు బోధించిన విధంగా ఆయనను స్మరించండి. వాస్తవానికి మీరు పూర్వం మార్గం తప్పి నడిచేవారు. తరువాత ప్రజలంతా ఏ స్థలం నుండి వెనుకకు మరలుతారో, అదే స్థలం నుండి మీరూ మరలండి. క్షమించు అని అల్లాహ్‌ను వేడుకోండి.[65] నిశ్చయంగా అల్లాహ్ క్షమించేవాడూ, కరుణించేవాడూను.

లేదా గోడకు చేయబడిన కిటికీ వంటి ద్వారం గుండాగానీ లోనికి ప్రవేశించేవారు. ఇంకా ప్రయాణం చేసి తిరిగి వచ్చినప్పుడు కూడా వెనుక భాగం నుండే ఇళ్ళల్లోకి ప్రవేశించేవారు. ఈ ఆయత్‌లో ఖండించబడింది కేవలం ఒక్క ఈ ఆచారం మాత్రమే కాదు; అసలు సత్కార్యం అంటే అల్లాహ్‌కు భయపడటం అనీ, అల్లాహ్ ఆజ్ఞోల్లంఘనానికి దూరంగా ఉండటం అనీ, ఈ ఆచారాలకూ సత్కార్యానికీ ఏ విధమైన సంబంధం లేదు అనీ హెచ్చరికజేసి సమస్త మూఢాచారాలను ఖండించడం జరిగింది.

59. ఇక్కడ 'ఫిత్నా' (పీడన) అంటే ఒక వర్గాన్ని గానీ లేక ఒక వ్యక్తిని గానీ కేవలం అసత్యాన్ని వదలి సత్యాన్ని స్వీకరించిన కారణంగా హింసా దౌర్జన్యాలకు గురిచెయ్యటం.

60. అరేబియా ప్రజలలో హజ్రత్ ఇబ్రాహీము (అస్సలామ్) కాలం నుండే ఒక కట్టుబాటు చెలామణిలోకి వచ్చింది. 'జుల్ ఖాఇదహ్', 'జుల్ హజ్జహ్', 'ముహర్రమ్' అనే మూడు మాసాలు హజ్ కొరకు ప్రత్యేకించబడ్డాయి. రజబ్ మాసం 'ఉమ్రా' కొరకు ప్రత్యేకించబడింది. ఈ నాలుగు మాసాలలో యుద్ధం, హత్య, విధ్వంసకాండ నిషేధించబడ్డాయి. ప్రజలు శాంతి భద్రతలతో కూడిన సురక్షిత వాతావరణంలో కాబాను సందర్శించి, తిరిగి ఇళ్ళకు ప్రయాణం చెయ్యగలగాలని. ఈ కారణంగా ఈ మాసాలను హరామ్ మాసాలు అంటే పవిత్ర మాసాలు అని అంటారు.

61. అంటే, మార్గమధ్యంలో ఏదైనా కారణం వల్ల ముందుకు సాగటం అసంభవమై తప్పనిసరిగా ఆగిపోవలసివస్తే, ఒంటె, ఆవు, మేకలలో ఏది లభించినా దానిని అల్లాహ్ కొరకు 'ఖుర్బానీ' (బలి)గా సమర్పించండి.

62. హదీస్ ద్వారా తెలిసేదేమిటంటే, ఈ పరిస్థితిలో మూడు రోజులు ఉపవాసం ఉండండి అనీ లేదా ఆరుగురు నిరుపేదలకు భోజనం పెట్టండి అనీ లేదా కనీసం ఒక మేకనైనా ఖుర్బానీ చెయ్యండి అనీ మహాప్రవక్త (సఅసమ్) ఆదేశించారు.

63. అంటే, ఏ కారణంగానయితే మీరు తప్పనిసరిగా మార్గమధ్యంలో ఆగిపోవలసి వచ్చిందో ఆ కారణం తొలగిపోతే అని అర్థం.

64. అల్లాహ్ అనుగ్రహాన్ని అన్వేషించటం అంటే భావం, హజ్ యాత్రా కాలంలో జీవనోపాధి కొరకు ఏదైనా పని చెయ్యటం.

65. హజ్రత్ ఇబ్రాహీము (అస్సలామ్) ఇస్మాయీలు (అస్సలామ్)ల కాలం నుండే అరబ్బులలో సర్వత్రా వాడుకలో ఉన్న హజ్ పద్ధతి ఇది. జిల్ హజ్జహ్ మాసం తొమ్మిదో తేదీన యాత్రికులు 'మినా' నుండి 'అరఫాత్'కు పోయేవారు. రాత్రికి అక్కడ

فَاِذَا قَضَيْتُمْ مَّنَاسِكَكُمْ فَاذْكُرُوا اللّٰهَ كَذِكْرِكُمْ
اٰبَآءَكُمْ اَوْ اَشَدَّ ذِكْرًا ؕ فَمِنَ النَّاسِ مَنْ
يَّقُوْلُ رَبَّنَآ اٰتِنَا فِى الدُّنْيَا وَمَا لَهٗ فِى الْاٰخِرَةِ
مِنْ خَلَاقٍ ۝٢٠٠ وَمِنْهُمْ مَّنْ يَّقُوْلُ رَبَّنَآ اٰتِنَا
فِى الدُّنْيَا حَسَنَةً وَّفِى الْاٰخِرَةِ حَسَنَةً وَّقِنَا
عَذَابَ النَّارِ ۝٢٠١ اُولٰٓئِكَ لَهُمْ نَصِيْبٌ مِّمَّا
كَسَبُوْا ؕ وَاللّٰهُ سَرِيْعُ الْحِسَابِ ۝٢٠٢ وَاذْكُرُوا
اللّٰهَ فِىْٓ اَيَّامٍ مَّعْدُوْدٰتٍ ؕ فَمَنْ تَعَجَّلَ فِىْ
يَوْمَيْنِ فَلَآ اِثْمَ عَلَيْهِ ۚ وَمَنْ تَاَخَّرَ فَلَآ اِثْمَ
عَلَيْهِ ۙ لِمَنِ اتَّقٰى ؕ وَاتَّقُوا اللّٰهَ وَاعْلَمُوْٓا
اَنَّكُمْ اِلَيْهِ تُحْشَرُوْنَ ۝٢٠٣ وَمِنَ النَّاسِ مَنْ
يُّعْجِبُكَ قَوْلُهٗ فِى الْحَيٰوةِ الدُّنْيَا وَيُشْهِدُ اللّٰهَ
عَلٰى مَا فِىْ قَلْبِهٖ ۙ وَهُوَ اَلَدُّ الْخِصَامِ ۝٢٠٤ وَاِذَا
تَوَلّٰى سَعٰى فِى الْاَرْضِ لِيُفْسِدَ فِيْهَا وَيُهْلِكَ
الْحَرْثَ وَالنَّسْلَ ؕ وَاللّٰهُ لَا يُحِبُّ الْفَسَادَ ۝٢٠٥
وَاِذَا قِيْلَ لَهُ اتَّقِ اللّٰهَ اَخَذَتْهُ الْعِزَّةُ بِالْاِثْمِ
فَحَسْبُهٗ جَهَنَّمُ ؕ وَلَبِئْسَ الْمِهَادُ ۝٢٠٦ وَمِنَ
النَّاسِ مَنْ يَّشْرِىْ نَفْسَهُ ابْتِغَآءَ مَرْضَاتِ
اللّٰهِ ؕ وَاللّٰهُ رَءُوْفٌ بِالْعِبَادِ ۝٢٠٧ يٰٓاَيُّهَا الَّذِيْنَ
اٰمَنُوا ادْخُلُوْا فِى السِّلْمِ كَآفَّةً ۠ وَلَا تَتَّبِعُوْا
خُطُوٰتِ الشَّيْطٰنِ ؕ اِنَّهٗ لَكُمْ عَدُوٌّ مُّبِيْنٌ ۝٢٠٨

النصف

మీ హజ్ విధులను ముగించిన తరువాత, మీరు మీ తాత ముత్తాతలను పూర్వం స్మరించే విధంగానే ఇంకా దానికంటే అధికంగానే అల్లాహ్‌ను స్మరించండి. (కాని అల్లాహ్‌ను స్మరించే వారిలో కూడా ఎంతో వ్యత్యాసం ఉంది). వారిలో కొందరు, "మా ప్రభూ! మాకు ఈ లోకంలోనే అన్నీ ప్రసాదించు" అని ప్రార్థిస్తారు. అలాంటివారికి పరలోకంలో ఏ భాగమూ లేదు. ఇంకా కొందరు ఈవిధంగా ప్రార్థిస్తారు: "మా ప్రభూ! ఇహలోకంలోనూ, పరలోకంలోనూ మాకు మంచిని ప్రసాదించు. మమ్మల్ని నరకబాధ నుండి కాపాడు." ఇలాంటి వారు తమ సంపాదనకు అనుగుణంగా ఉభయ లోకాలలో తమ వాటాను పొందుతారు. లెక్క తేల్చటం అల్లాహ్‌కు ఎంతోసేపు పట్టదు. మీరు అల్లాహ్ నామ సంస్మరణలో గడుపవలసిన రోజులు లెక్కకు కొన్ని మాత్రమే. త్వరగా రెండు రోజులలోనే ఇక్కడ నుండి తిరిగి వెళ్ళితే, అది ఏమాత్రం దోషంకాదు. ఎవరైనా ఇంకా కొంతకాలం ఉండి తిరిగి వెళ్ళినా తప్పులేదు.[66] అయితే ఆ దినాలను అతడు భయభక్తులతో గడపాలి. అల్లాహ్ పట్ల అవిధేయతకు దూరంగా ఉండండి. ఒకరోజు మీరంతా ఆయన సన్నిధిలో హాజరు కావలసి ఉంది అని బాగా తెలుసుకోండి.

**204 - 210** మానవుల్లోని ఒకడు చెప్పేమాటలు ఇహలోక జీవితంలో నిన్ను ఎంతో రంజింపచేస్తాయి. తన సంకల్పశుద్ధిని గురించి తెలుపడానికి అతడు అల్లాహ్‌ను మాటిమాటికి సాక్షిగా నిలబెడతాడు. కాని వాస్తవంగా అతడు సత్యానికి బద్ధవిరోధి. అతడికి అధికారం లభించినప్పుడు[67] అతడు లోకంలో కల్లోల వ్యాప్తికీ, పంట పొలాల విధ్వంసానికీ, మానవ సంతతి వినాశానికీ నిత్యం కృషి చేస్తాడు- (అతడు సాక్షిగా నిలబెట్టే) అల్లాహ్ కల్లోలాన్ని ఏమాత్రం సహించడు. "అల్లాహ్‌కు భయపడు" అని అతడితో అన్నప్పుడు, అహం భావం అతడిని పాపానికే అంటుకుపోయేలా చేస్తుంది. అలాంటి వాడికి తగిన స్థలం నరకమే. అది అతి చెడ్డ నివాసం. మరోవైపు మానవుల్లోనే మరొకడు అల్లాహ్ సంతోషం పొందటానికే తన పూర్తి జీవితాన్ని అంకితం చేస్తాడు. అల్లాహ్ అటువంటి తన దాసుణ్ణి అమితంగా ప్రేమిస్తాడు. విశ్వసించిన ప్రజలారా! మీరు పూర్తిగా ఇస్లామ్‌లో ప్రవేశించండి.[68] షైతాను అడుగుజాడలు త్రొక్కకండి. అతడు మీకు బహిరంగ శత్రువు.

فَاِنْ زَلَلْتُمْ مِّنْۢ بَعْدِ مَا جَآءَتْكُمُ الْبَيِّنٰتُ
فَاعْلَمُوْٓا اَنَّ اللّٰهَ عَزِيْزٌ حَكِيْمٌ ﴿٢٠٩﴾ هَلْ
يَنْظُرُوْنَ اِلَّآ اَنْ يَّاْتِيَهُمُ اللّٰهُ فِيْ ظُلَلٍ مِّنَ
الْغَمَامِ وَ الْمَلٰٓئِكَةُ وَ قُضِيَ الْاَمْرُ ؕ وَ اِلَى اللّٰهِ
تُرْجَعُ الْاُمُوْرُ ﴿٢١٠﴾ؒ سَلْ بَنِيْٓ اِسْرَآءِيْلَ كَمْ ع ٢٥/١٤
اٰتَيْنٰهُمْ مِّنْ اٰيَةٍۭ بَيِّنَةٍ ؕ وَ مَنْ يُّبَدِّلْ نِعْمَةَ
اللّٰهِ مِنْۢ بَعْدِ مَا جَآءَتْهُ فَاِنَّ اللّٰهَ شَدِيْدُ
الْعِقَابِ ﴿٢١١﴾ زُيِّنَ لِلَّذِيْنَ كَفَرُوا الْحَيٰوةُ الدُّنْيَا
وَ يَسْخَرُوْنَ مِنَ الَّذِيْنَ اٰمَنُوْا ۘ وَ الَّذِيْنَ وقف لازم
اتَّقَوْا فَوْقَهُمْ يَوْمَ الْقِيٰمَةِ ؕ وَ اللّٰهُ يَرْزُقُ مَنْ
يَّشَآءُ بِغَيْرِ حِسَابٍ ﴿٢١٢﴾ كَانَ النَّاسُ اُمَّةً
وَّاحِدَةً ۫ فَبَعَثَ اللّٰهُ النَّبِيّٖنَ مُبَشِّرِيْنَ وَ
مُنْذِرِيْنَ ۪ وَ اَنْزَلَ مَعَهُمُ الْكِتٰبَ بِالْحَقِّ
لِيَحْكُمَ بَيْنَ النَّاسِ فِيْمَا اخْتَلَفُوْا فِيْهِ ؕ وَمَا
اخْتَلَفَ فِيْهِ اِلَّا الَّذِيْنَ اُوْتُوْهُ مِنْۢ بَعْدِ مَا
جَآءَتْهُمُ الْبَيِّنٰتُ بَغْيًاۢ بَيْنَهُمْ ۚ فَهَدَى اللّٰهُ
الَّذِيْنَ اٰمَنُوْا لِمَا اخْتَلَفُوْا فِيْهِ مِنَ الْحَقِّ
بِاِذْنِهٖ ؕ وَ اللّٰهُ يَهْدِيْ مَنْ يَّشَآءُ اِلٰى صِرَاطٍ
مُّسْتَقِيْمٍ ﴿٢١٣﴾

మీ వద్దకు వచ్చిన స్పష్టమైన హితోపదేశాలను మీరు స్వీకరించిన తరువాత మళ్ళీ తప్పటడుగువేస్తే, అల్లాహ్ సర్వ శక్తిమంతుడూ సర్వజ్ఞుడూ అనే విషయం బాగా తెలుసుకోండి. (ఇన్ని హితోపదేశాల తరువాత కూడా ప్రజలు తమనుతాము సరిదిద్దుకోకపోతే) మేఘాల షామియానాలలో దూతలు వెంటరాగా, అల్లాహ్ వారి ముందు స్వయంగా ప్రత్యక్షమై వారిని గురించి తీర్పు చెప్పే సమయం కోసం వారు నిరీక్షిస్తున్నారని దాని అర్థమా? చివరకు అన్ని వ్యవహారాలూ అల్లాహ్ ముందే పెట్టబడతాయి.

**211** మేము ఎన్ని స్పష్టమైన గుర్తులు వారికి చూపించామో ఇస్రాయీలు వంశీయులను అడగండి. ఇంకా, అల్లాహ్ అనుగ్రహ భాగ్యం కలిగిన తరువాత దాన్ని దౌర్భాగ్యంగా మార్చుకునే జాతిని అల్లాహ్ ఎంత కఠినంగా శిక్షిస్తాడో (కూడా వారిని అడగండి).

**212** అవిశ్వాస వైఖరిని అవలంబించిన వారికి ఇహలోక జీవితం ప్రియమైనదిగానూ మనోహరమైనదిగానూ కనిపించేలా చేయబడింది. వారు విశ్వాస వైఖరి అవలంబించిన వారిని పరిహసిస్తారు. కాని ప్రళయదినం నాడు భయభక్తులు కలవారే వారి కంటె ఉన్నత స్థానంలో ఉంటారు. ఇక ఐహిక సంపదనైతే, తాను కోరిన వారికి లెక్కలేకుండా ఇచ్చే అధికారం అల్లాహ్‌కే ఉంది.

**213** ప్రారంభంలో మానవులంతా ఒకే మార్గం అనుసరించారు. (కాని తరువాత పరిస్థితులు మారాయి. అభిప్రాయ భేదాలు ఉత్పన్నమయ్యాయి). అప్పుడు అల్లాహ్ ప్రవక్తలను పంపాడు. వారు సత్యమార్గంలో నడిచేవారికి శుభవార్తలు తెలిపేవారు. వక్రమార్గం అనుసరిస్తే దుష్ఫలితాలు కలుగుతాయని హెచ్చరిక చేసేవారు. సత్యం గురించి ప్రజలలో పొడచూపిన విభేదాలు పరిష్కరించటానికి వారితోపాటు పరమ సత్యం వున్న గ్రంథాన్ని కూడ పంపాడు- (ఈ అభిప్రాయ భేదాలు తల ఎత్తటానికి కారణం ప్రారంభంలో ప్రజలకు సత్యం తెలుపబడకపోవటం ఎంతమాత్రం కాదు) ఈ విభేదాలను సృష్టించినవారు సత్యజ్ఞానం ప్రసాదించబడ్డవారే. స్పష్టమైన హితోపదేశాలు పొందిన తరువాత కూడ వారు కేవలం ఒకరికొకరు అన్యాయం చేసుకునే ఉద్దేశ్యంతో అసలు సత్యాన్ని వదలి విభిన్న పద్ధతులను సృష్టించుకున్నారు- అయితే ప్రవక్తలను విశ్వసించిన వారికి అల్లాహ్ తన అనుమతితో ప్రజలు వివాదపడిన సత్యాన్ని పొందేమార్గం చూపాడు. అల్లాహ్ తాను కోరిన వారికి రుజుమార్గం చూపుతాడు.

**214** స్వర్గ ప్రవేశం ఊరకే లభిస్తుందని మీరు అపోహపడు తున్నారా? మీకు పూర్వం విశ్వాసులకు సంభవించినవన్నీ ఇంకా మీకు సంభవించనేలేదే![69] వారిపై ఆపదలు, ఎనలేని వ్యధలు విరుచుకుపడ్డాయి, వారు కుదిపివేయ బడ్డారు. చివరకు అప్పటి ప్రవక్త, విశ్వాసులైన అతని అనుచరులు "అల్లాహ్ సహాయం ఇంకా ఎప్పుడొస్తుంది" అని ఆక్రోశించారు. అప్పుడు, "అదిగో, అల్లాహ్ సహాయం సమీపంలోనే ఉంది" (అని వారిని ఓదార్చటం జరిగింది).

**215** "మేము ఏమి ఖర్చు చెయ్యాలి" అని ప్రజలు అడుగు తారు. "మీరు ఏమి ఖర్చుచేసినా దానిని మీ తల్లిదండ్రుల కొరకూ, బంధువుల కొరకూ, అనాథులు, నిరుపేదలు, బాటసారుల కొరకూ ఖర్చు చెయ్యండి. మీరు ఏ మేలుచేసినా, దాన్ని అల్లాహ్ తెలుసుకుంటాడు" అని వారికి చెప్పండి.

**216** యుద్ధం చెయ్యండి అని మీకు ఆజ్ఞాపించబడింది. కాని అది మీకు ఇష్టంగా లేదు. మీకు నచ్చని విషయమే మీకు లాభకరం కావచ్చు; మీకు నచ్చే విషయమే మీకు నష్టకరం కావచ్చు. ఈ విషయం అల్లాహ్‌కు తెలుసు, మీకు తెలియదు.

اَمۡ حَسِبۡتُمۡ اَنۡ تَدۡخُلُوا الۡجَنَّةَ وَ لَمَّا يَاۡتِكُمۡ
مَّثَلُ الَّذِيۡنَ خَلَوۡا مِنۡ قَبۡلِكُمۡ ؕ مَسَّتۡهُمُ
الۡبَاۡسَآءُ وَالضَّرَّآءُ وَ زُلۡزِلُوۡا حَتّٰى يَقُوۡلَ
الرَّسُوۡلُ وَالَّذِيۡنَ اٰمَنُوۡا مَعَهٗ مَتٰى نَصۡرُ اللّٰهِ ؕ
اَلَاۤ اِنَّ نَصۡرَ اللّٰهِ قَرِيۡبٌ ﴿۲۱۴﴾ يَسۡـَٔلُوۡنَكَ مَاذَا
يُنۡفِقُوۡنَ ؕ قُلۡ مَاۤ اَنۡفَقۡتُمۡ مِّنۡ خَيۡرٍ
فَلِلۡوَالِدَيۡنِ وَالۡاَقۡرَبِيۡنَ وَالۡيَتٰمٰى وَ الۡمَسٰكِيۡنِ
وَابۡنِ السَّبِيۡلِ ؕ وَ مَا تَفۡعَلُوۡا مِنۡ خَيۡرٍ فَاِنَّ
اللّٰهَ بِهٖ عَلِيۡمٌ ﴿۲۱۵﴾ كُتِبَ عَلَيۡكُمُ الۡقِتَالُ وَ هُوَ
كُرۡهٌ لَّكُمۡ ۚ وَعَسٰۤى اَنۡ تَكۡرَهُوۡا شَيۡـًٔا وَّ هُوَ
خَيۡرٌ لَّكُمۡ ۚ وَعَسٰۤى اَنۡ تُحِبُّوۡا شَيۡـًٔا وَّ هُوَ شَرٌّ
لَّكُمۡ ؕ وَ اللّٰهُ يَعۡلَمُ وَ اَنۡتُمۡ لَا تَعۡلَمُوۡنَ ﴿۲۱۶﴾ ع ٢٦

నుండి తిరిగి 'ముజ్దలిఫాహ్'కు వచ్చి అక్కడ ఆగిపోయేవారు. కాని తరువాతి కాలంలో క్రమేణా ఖురైష్ తెగవారి పౌరోహిత్యం ఖాయం అయిన తరువాత వారు "మేము 'హరమ్' (కాబా) వారసులం. మేము సాధారణ అరబ్బులతో పాటు అరఫాతు వరకు వెళ్ళడం మా స్థాయికి తగని విషయం" అని చెబుతూ తమ ప్రత్యేకతనూ, దర్పాన్నీ చాటుకొనటానికి 'ముజ్దలిఫాహ్' వరకు మాత్రమే పోయి తిరిగి వచ్చేవారు. ఇతరులను మటుకు అరఫాత్‌దాకా వెళ్ళమనేవారు. ఈ అహంకార విగ్రహాన్నే ఈ ఆయతులో పగలగొట్టడం జరిగింది.

66. అంటే, 'తష్రీఖ్' దినాలలో 'మినా' నుండి మక్కాకు తిరిగిపోవటం అనేది 'జిల్ హజ్జహ్' నెల పన్నెండో తేదీన జరిగినా లేక పదమూడో తేదీన జరిగినా ఫర్వాలేదు.

67. "అతడు మరలినప్పుడు" అని కూడా అనువాదం చెయ్యవచ్చు. భావం ఏమిటంటే, ఈ మాటలు చెప్పి, అతడు మరలినప్పుడు, ఆచరణలో ఇదంతా చేస్తాడు.

68. అంటే, ఏ విధమైన మినహాయింపులూ, షరతులూ లేకుండా మీ పూర్తి జీవితాన్ని ఇస్లామ్ పరిధిలోకి తీసుకురండి. మీరు మీ జీవితాన్ని విభిన్న రంగాలుగా విభజించి, కొన్ని రంగాలలో ఇస్లామ్‌ను అవలంబించటం, మరికొన్ని రంగాలను దాని నుండి మినహాయించటం జరక్కూడదు.

69. అర్థం ఏమిటంటే, ప్రపంచంలో ప్రవక్తలు ఆవిర్భవించినప్పుడల్లా, వారికీ, వారి పట్ల విశ్వాసం ప్రకటించిన వారికీ, దేవునిపై తిరుగుబాటు ప్రకటించినవారి తరఫు నుండి తీవ్ర ప్రతిఘటన ఎదురయ్యేది. వారు తమ ప్రాణాలను సైతం ఒడ్డి, అసత్యపు విధానాలకు బదులుగా, సత్యధర్మ సంస్థాపనం కొరకు తీవ్రకృషి చేశారు. అప్పుడే వారు స్వర్గానికి అర్హులయ్యారు. మీరు

يَسْـَٔلُوْنَكَ عَنِ الشَّهْرِ الْحَرَامِ قِتَالٍ فِيْهِ ۗ قُلْ
قِتَالٌ فِيْهِ كَبِيْرٌ ۗ وَ صَدٌّ عَنْ سَبِيْلِ اللّٰهِ وَ
كُفْرٌۢ بِهٖ وَالْمَسْجِدِ الْحَرَامِ ۚ وَ اِخْرَاجُ اَهْلِهٖ
مِنْهُ اَكْبَرُ عِنْدَ اللّٰهِ ۚ وَ الْفِتْنَةُ اَكْبَرُ مِنَ
الْقَتْلِ ۗ وَ لَا يَزَالُوْنَ يُقَاتِلُوْنَكُمْ حَتّٰى
يَرُدُّوْكُمْ عَنْ دِيْنِكُمْ اِنِ اسْتَطَاعُوْا ۗ وَ مَنْ
يَّرْتَدِدْ مِنْكُمْ عَنْ دِيْنِهٖ فَيَمُتْ وَ هُوَ كَافِرٌ
فَاُولٰٓئِكَ حَبِطَتْ اَعْمَالُهُمْ فِي الدُّنْيَا وَ الْاٰخِرَةِ ۚ
وَاُولٰٓئِكَ اَصْحٰبُ النَّارِ ۚ هُمْ فِيْهَا خٰلِدُوْنَ ﴿٢١٧﴾
اِنَّ الَّذِيْنَ اٰمَنُوْا وَ الَّذِيْنَ هَاجَرُوْا وَ جٰهَدُوْا
فِيْ سَبِيْلِ اللّٰهِ ۙ اُولٰٓئِكَ يَرْجُوْنَ رَحْمَتَ اللّٰهِ ؕ
وَ اللّٰهُ غَفُوْرٌ رَّحِيْمٌ ﴿٢١٨﴾

**217 - 218** నిషిద్ధ మాసంలో యుద్ధం చెయ్యటాన్ని గురించి ప్రజలు నిన్ను అడుగుతారు. వారికి ఇలా సమాధానం చెప్పు: “ఆ మాసంలో యుద్ధం చెయ్యటం మహా నేరమే. కాని అల్లాహ్ మార్గంలో అవరోధాలు కల్పించటం, అల్లాహ్‌ను తిరస్కరించటం, అల్లాహ్ ఆరాధకులను 'మస్జిదె హరామ్'ను దర్శించకుండా ఆటంకపరచటం, అందులో ఉండే వారిని బయటికి గెంటివెయ్యటం అల్లాహ్ దృష్టిలో అంతకంటే గొప్ప నేరం. ఇంకా, హింస ద్వారా పరధర్మాన్ని అణచటం రక్తపాతం కంటే అత్యంత తీవ్రమైనది.”[70] మిమ్మల్ని మీ ధర్మాన్నుండి మళ్ళించగలగటం వారికి సాధ్యపడితే, వారు అంతవరకు మీతో యుద్ధం చేస్తూనే పోతారు (ఈ విషయం బాగా అర్థం చేసుకోండి). మీలో ఎవరైనా తన ధర్మాన్ని పరిత్యజించి, అవిశ్వాస పరిస్థితిలో మరణిస్తే, అతడు చేసిన మంచి పనులన్నీ ఇహపరలోకాలు రెండింటిలోనూ వృథా అవుతాయి. అటువంటి వారంతా నరకవాసులు. నరకంలోనే వారు శాశ్వతంగా ఉంటారు. కాని దీనికి భిన్నంగా విశ్వసించి, అల్లాహ్ మార్గంలో తమ ఇల్లూ వాకిలీ సహితం విడిచి జిహాద్[71] చేసేవారు దైవకారుణ్యం ఆశించటానికి అన్నివిధాలా అర్హులు. అల్లాహ్ వారి తప్పులను క్షమించి వారిని కరుణిస్తాడు.

దైవం కోసం, ఆయన ధర్మం కోసం ఏ కష్టాన్నీ భరించకుండానే, అల్లాహ్ స్వర్గం మీకు దొరకటానికి, అంత తేరగా లేదు.

70. ఈ విషయానికి ఒక సంఘటనతో సంబంధం ఉంది. హిజ్రీ రెండో సంవత్సరం రజబ్ మాసంలో మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) ఎనిమిది మందితో కూడిన ఒక బృందాన్ని 'నఖ్‌లా' వైపునకు పంపారు (అది మక్కా మరియు తాయిఫ్‌ల మధ్య ఉన్న ఒక ప్రాంతం). ఆయన (సఅసమ్) వారిని ఖురైష్‌ల కదలికలను గమనించండి అనీ, వారి భవిష్యత్ వ్యూహాలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించండి అనీ ఆదేశించారు. యుద్ధం చేసే ఏ అనుమతినీ ఆయన (సఅసమ్) వారికి ఇవ్వలేదు. కాని మార్గమధ్యంలో వారికి ఖురైష్ వ్యాపారస్తుల ఒక చిన్న బృందం కనిపించింది. వారు ఆ బృందంపై దాడిచేసి ఒక మనిషిని కూడా హత్య చేశారు. మిగిలిన వారిని నిర్బంధించి సామానులతో సహా మదీనా పురానికి తీసుకువచ్చారు. ఈ సంఘటన రజబ్ నెల ఆఖరులోనో లేక షాబాన్ నెల ప్రారంభంలోనో జరిగింది. కనుక ఈ దాడి రజబ్ మాసం (అంటే హరామ్ మాసం)లో జరిగిందా లేదా అనే విషయాన్ని గురించి ఇదమిత్థంగా చెప్పటం కష్టం. కాని ఖురైష్‌లూ, వారి రహస్య మిత్రులు అయిన యూదులూ, మదీనాపురంలోని కపటులూ అంతా కలసి ముస్లింలకు వ్యతిరేకంగా దుష్ప్రచారం చెయ్యసాగారు. తీవ్ర అభ్యంతరాలను లేవదీయ సాగారు. “వీరు గొప్ప అల్లాహ్ భక్తులమని బయలుదేరారు. హరామ్ మాసంలో కూడా రక్తపాతం చెయ్యటానికి వెనుకాడటం లేదు.” ఈ అభ్యంతరాలకు ఈ ఆయత్‌లో సమాధానం ఇవ్వటం జరిగింది.

71. “జిహాద్” అంటే, ఏదైనా లక్ష్యాన్ని సాధించే నిమిత్తం తీవ్ర ప్రయత్నం చెయ్యటం. ఇది కేవలం యుద్ధానికే పర్యాయ పదం కాదు. అరబ్బీ భాషలో యుద్ధం కొరకు 'ఖితాల్' అనే పదం వాడబడుతుంది. 'జిహాద్' దీనికంటే కూడ విస్తృతమైన అర్థం కల పదం. ఈ పదంలో యుద్ధం అనే భావం ప్రతి ప్రయత్నం అనే అర్థం కూడా చేరి ఉంది.

يَسْـَٔلُوْنَكَ عَنِ الْخَمْرِ وَ الْمَيْسِرِ ؕ قُلْ فِيْهِمَاۤ
اِثْمٌ كَبِيْرٌ وَّ مَنَافِعُ لِلنَّاسِ ؗ وَ اِثْمُهُمَاۤ اَكْبَرُ
مِنْ نَّفْعِهِمَا ؕ وَيَسْـَٔلُوْنَكَ مَاذَا يُنْفِقُوْنَ ؕ۬ قُلِ
الْعَفْوَ ؕ كَذٰلِكَ يُبَيِّنُ اللّٰهُ لَكُمُ الْاٰيٰتِ لَعَلَّكُمْ
تَتَفَكَّرُوْنَ ۙ﴿۲۱۹﴾ فِى الدُّنْيَا وَ الْاٰخِرَةِ ؕ وَيَسْـَٔلُوْنَكَ
عَنِ الْيَتٰمٰى ؕ قُلْ اِصْلَاحٌ لَّهُمْ خَيْرٌ ؕ وَ اِنْ
تُخَالِطُوْهُمْ فَاِخْوَانُكُمْ ؕ وَاللّٰهُ يَعْلَمُ الْمُفْسِدَ
مِنَ الْمُصْلِحِ ؕ وَلَوْ شَآءَ اللّٰهُ لَاَعْنَتَكُمْ ؕ اِنَّ
اللّٰهَ عَزِيْزٌ حَكِيْمٌ ﴿۲۲۰﴾ وَ لَا تَنْكِحُوا الْمُشْرِكٰتِ
حَتّٰى يُؤْمِنَّ ؕ وَلَاَمَةٌ مُّؤْمِنَةٌ خَيْرٌ مِّنْ
مُّشْرِكَةٍ وَّ لَوْ اَعْجَبَتْكُمْ ۚ وَ لَا تُنْكِحُوا
الْمُشْرِكِيْنَ حَتّٰى يُؤْمِنُوْا ؕ وَ لَعَبْدٌ مُّؤْمِنٌ خَيْرٌ
مِّنْ مُّشْرِكٍ وَّ لَوْ اَعْجَبَكُمْ ؕ اُولٰٓئِكَ يَدْعُوْنَ
اِلَى النَّارِ ۖۚ وَ اللّٰهُ يَدْعُوْۤا اِلَى الْجَنَّةِ وَالْمَغْفِرَةِ
بِاِذْنِهٖ ۚ وَيُبَيِّنُ اٰيٰتِهٖ لِلنَّاسِ لَعَلَّهُمْ
يَتَذَكَّرُوْنَ ﴿۲۲۱﴾

**219** మద్యపానము గురించీ, జూదము గురించీ ప్రజలు నిన్ను ప్రశ్నిస్తారు. నీవు వారికి ఇలా ఉపదేశించు:“ఈ రెంటిలోనూ కీడు ఉన్నది వాటిలో ప్రజలకు కొన్ని లాభాలు ఉన్నా, ఈ లాభాలకంటే కలిగే కీడే ఎక్కువ.”[72] “మేము అల్లాహ్ మార్గంలో ఏమి ఖర్చుపెట్టాలి?” అని వారు అడుగుతారు. “మీ నిత్యావసరాలకు పోగా మిగిలినది”[73] అని నీవు వారికి చెప్పు. ఇహపరాల చింతన మీలో కలిగేందుకుగాను అల్లాహ్ ఈవిధంగా తన ఆజ్ఞలను విశదీకరిస్తాడు.

**220** అనాధులతో వ్యవహరించే తీరును గురించి వారు నిన్ను అడుగుతారు. నీవు వారికి ఇలా బోధించు: “ఏ విధంగా వ్యవహరిస్తే వారికి ఎక్కువ మేలు కలుగుతుందో, ఆ విధంగా వ్యవహరించటం ఉత్తమం. ఒకవేళ మీరూ వారూ కలసివుంటూ, ఉభయుల ఖర్చులను ఉమ్మడిగా భరిస్తే, అందులో అభ్యంతరం లేదు. ఎటొచ్చీ వారు మీకు సోదరతుల్యులే కదా! కీడు చేసే వారెవరో, మేలు చేసేవారెవరో అల్లాహ్‌కు బాగా తెలుసు. అల్లాహ్ కోరితే, ఈ విషయంలో మీతో కఠినంగా వ్యవహరించి ఉండేవాడే. కాని ఆయన సర్వాధికారియేకాదు, వివేకవంతుడు కూడా.”

**221** ముష్రిక్కు మహిళలు విశ్వసించనంతవరకు మీరు వారిని ఎట్టి పరిస్థితులలోనూ వివాహమాడరాదు. ముష్రిక్కు కులీన స్త్రీ మీకు ఎంత నచ్చినా, ఆమె కంటే విశ్వాసురాలైన ఒక బానిస స్త్రీ ఎంతో మేలు. (అదే విధంగా) ముష్రిక్కు పురుషులు విశ్వాసులు కానంతవరకు మీరు మీ మహిళలను వారికిచ్చి ఎన్నటికీ వివాహం చెయ్యకూడదు. ముష్రిక్కు కులీనుడు మీకు ఎంత నచ్చినా, అతడికంటె విశ్వాసి అయిన ఒక బానిస ఎంతో మేలు. ఈ ముష్రిక్కులు మిమ్మల్ని అగ్ని వైపునకు ఆహ్వానిస్తారు. కాని అల్లాహ్ తన అనుజ్ఞతో మిమ్మల్ని స్వర్గం వైపునకూ క్షమాభిక్ష వైపునకూ రమ్మని పిలుస్తాడు. గుణపాఠం గ్రహించి హితబోధను స్వీకరిస్తారని ప్రజలకు అల్లాహ్ తన ఆజ్ఞలను స్పష్టంగా తెలుపుతాడు.

72. ఇది సారాయికీ, జూదానికీ సంబంధించిన మొదటి ఉత్తరువు. ఇందులో కేవలం అనిష్టతను వ్యక్తం చేసి వదలిపెట్టడం జరిగింది. మున్ముందు ‘నిసా’ సూరాలోని 43వ ఆయతులో, ‘మాయిదా’ సూరాలోని 90వ ఆయత్‌లో తరువాతి ఉత్తరువులు రాబోతున్నాయి.

**222 - 223** రుతుస్రావానికి సంబంధించిన ఉత్తరువు ఏమిటి అని వారు నిన్ను అడుగుతారు. నీవు వారికి ఇలా తెలుపు: "అదొక అపరిశుద్ధావస్థ. కనుక రుతు కాలంలో భార్యలకు దూరంగా ఉండండి. వారు పరిశుద్ధలు కానంతవరకు వారి వద్దకు పోకండి.[74] వారు పరిశుద్ధలు అయిన తరువాత, అల్లాహ్ ఆదేశించిన విధంగా మీరు వారి వద్దకు పోవచ్చు. చెడుగుకు దూరంగా ఉండేవారిని, పరిశుద్ధతను పాటించేవారిని అల్లాహ్ ప్రేమిస్తాడు. మీ స్త్రీలు మీ యొక్క సేద్యపు భూములు. మీ పొలాలకు మీరు కోరిన విధంగా పోవటానికి మీకు అధికారం ఉంది. కాని మీరు మీ భవిష్యత్తును గురించి తగు జాగ్రత్త వహించండి. అల్లాహ్ ఆగ్రహానికి దూరంగా ఉండండి.[75] ఒకరోజున ఆయనను కలుసుకోవలసి వుందని బాగా తెలుసు కోండి. ప్రవక్తా! నీ ఉపదేశాలను స్వీకరించిన వారికి (సాఫల్యము, సౌభాగ్యము ఉన్నాయనే) శుభవార్త వినిపించు.

**224 - 225** సత్కార్యాలూ, భయభక్తులూ, మానవ సంక్షేమమూ - వీటికి దూరంగా ఉండే ఉద్దేశ్యంతో మీరు చేసే ప్రమాణాలకు అల్లాహ్ పవిత్ర నామాన్ని ఉపయోగించకండి. అల్లాహ్ మీ మాటలన్నింటినీ వింటున్నాడు. ఆయనకు అంతా తెలుసు. అనాలోచితంగా మీరు చేసే అర్థరహిత ప్రమాణాలను గురించి అల్లాహ్ మిమ్మల్ని పట్టుకోడు. కాని హృదయపూర్వ కంగా మీరు చేసే ప్రమాణాలను గురించి ఆయన తప్పకుండా అడుగుతాడు. అల్లాహ్ మన్నించేవాడు, సహనశీలుడూను.

وَ يَسْـَٔلُوْنَكَ عَنِ الْمَحِيْضِ ؕ قُلْ هُوَ اَذًى ۙ
فَاعْتَزِلُوا النِّسَآءَ فِی الْمَحِيْضِ ۙ وَلَا تَقْرَبُوْهُنَّ
حَتّٰی يَطْهُرْنَ ۚ فَاِذَا تَطَهَّرْنَ فَاْتُوْهُنَّ مِنْ
حَيْثُ اَمَرَكُمُ اللّٰهُ ؕ اِنَّ اللّٰهَ يُحِبُّ التَّوَّابِيْنَ
وَ يُحِبُّ الْمُتَطَهِّرِيْنَ ۝٢٢٢ نِسَآؤُكُمْ حَرْثٌ لَّكُمْ ۪
فَاْتُوْا حَرْثَكُمْ اَنّٰی شِئْتُمْ ۫ وَ قَدِّمُوْا
لِاَنْفُسِكُمْ ؕ وَ اتَّقُوا اللّٰهَ وَ اعْلَمُوْٓا اَنَّكُمْ
مُّلٰقُوْهُ ؕ وَبَشِّرِ الْمُؤْمِنِيْنَ ۝٢٢٣ وَلَا تَجْعَلُوا
اللّٰهَ عُرْضَةً لِّاَيْمَانِكُمْ اَنْ تَبَرُّوْا وَ تَتَّقُوْا
وَتُصْلِحُوْا بَيْنَ النَّاسِ ؕ وَ اللّٰهُ سَمِيْعٌ عَلِيْمٌ ۝٢٢٤
لَا يُؤَاخِذُكُمُ اللّٰهُ بِاللَّغْوِ فِیْٓ اَيْمَانِكُمْ وَ لٰكِنْ
يُّؤَاخِذُكُمْ بِمَا كَسَبَتْ قُلُوْبُكُمْ ؕ وَ اللّٰهُ
غَفُوْرٌ حَلِيْمٌ ۝٢٢٥

73. ఈ ఆయత్ నుండి ఈ రోజులలో విచిత్రమైన అర్థాలను తీస్తున్నారు. వాస్తవానికి ఆయత్‌లోని పదాల ద్వారా స్పష్టంగా తెలిసేది ఏమిటంటే, ప్రజలు తమ సొమ్ముకు తాము యజమానులు. వారు మేము దైవ సంతోషం కోసం ఏమి ఖర్చు పెట్టాలి అని ప్రశ్నిస్తున్నారు. ఇలా సెలవీయబడింది : మొదట మీ సొమ్ముతో మీ అవసరాలను తీర్చుకోండి. తరువాత మిగిలిపోయిన దానిని అల్లాహ్ మార్గంలో వ్యయపరచండి. ఇది స్వచ్ఛంద వ్యయం. దానిని దాసుడు తన ప్రభువు మార్గంలో సంతోషంతో చేస్తాడు.

74. అర్థం ఏమిటంటే, ఈ స్థితిలో వారితో సంభోగించకండి.

75. ఇవి కడు సమగ్రమైన పదాలు, వాటికి రెండు అర్థాలున్నాయి. రెంటికీ సమానమైన ప్రాముఖ్యం ఉంది. ఒకటేమిటంటే, మీ వంశ అవిచ్ఛిన్నతకోసం ప్రయత్నం చెయ్యండి, మీరు ఈ ప్రపంచాన్ని విడిచిపెట్టేముందు మీ స్థానంలో పనిచేసేవారు పుట్టేందుకు. రెండోదేమిటంటే, మీరు మీ స్థానంలో వదలిపెట్టనున్న సంతతిని ధర్మం, శీలం, మానవత్వం వంటి ఆణిముత్యాలతో అలంకరించే ప్రయత్నం చెయ్యండి.

**226 - 227** తమ భార్యలను కలవకూడదని ప్రమాణం చేసుకునే వారికి నాలుగు మాసాల వ్యవధి కలదు.[76] కాని వారు తమ దాంపత్య జీవితాన్ని మళ్ళీ ప్రారంభిస్తే అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడూను. కాని వారు చివరకు విడాకుల కొరకే నిర్ణయం తీసుకుంటే, అల్లాహ్ అంతా వింటాడు, ఆయనకు అన్నీ తెలుసు[77] అనే విషయం వారు తెలుసుకోవాలి.

**228** విడాకులివ్వబడిన స్త్రీలు మూడు రుతువుల కాలం పూర్తి అయ్యేవరకు విధిగా వేచివుండాలి. వారి గర్భాశయాలలో అల్లాహ్ సృష్టించిన దానిని దాచటం వారికి ధర్మం కాదు. అల్లాహ్‌నూ, అంతిమదినాన్నీ వారు నిజంగానే విశ్వసించేవారే అయితే, ఆ విధంగా చెయ్యటం ఎంతమాత్రం భావ్యం కాదు. వారి భర్తలు దాంపత్య సంబంధాలను సరిదిద్దుకొనుటకు సిద్ధంగా ఉంటే, ఈ నిరీక్షణా కాలంలో వారిని తమ భార్యలుగా తిరిగి స్వీకరించే హక్కు వారికి ఉంది.[78] మగవారికి మహిళలపై ఉన్నటువంటి హక్కులే ధర్మం ప్రకారం మహిళలకు కూడా మగవారిపై ఉన్నాయి. కాని పురుషులకు స్త్రీలపై కొంచెం ఆధిక్యం ఉన్నది. అందరిపై అల్లాహ్‌కు ఆధిక్యం ఉన్నది. ఆయన సర్వాధికారి, సర్వజ్ఞాని, వివేచనాపరుడు.

لِلَّذِيْنَ يُؤْلُوْنَ مِنْ نِّسَآئِهِمْ تَرَبُّصُ اَرْبَعَةِ
اَشْهُرٍ ۚ فَاِنْ فَآءُوْ فَاِنَّ اللّٰهَ غَفُوْرٌ
رَّحِيْمٌ ﴿٢٢٦﴾ وَاِنْ عَزَمُوا الطَّلَاقَ فَاِنَّ اللّٰهَ
سَمِيْعٌ عَلِيْمٌ ﴿٢٢٧﴾ وَالْمُطَلَّقٰتُ يَتَرَبَّصْنَ
بِاَنْفُسِهِنَّ ثَلٰثَةَ قُرُوْٓءٍ ؕ وَلَا يَحِلُّ لَهُنَّ اَنْ
يَّكْتُمْنَ مَا خَلَقَ اللّٰهُ فِيْٓ اَرْحَامِهِنَّ اِنْ كُنَّ
يُؤْمِنَّ بِاللّٰهِ وَالْيَوْمِ الْاٰخِرِ ؕ وَبُعُوْلَتُهُنَّ
اَحَقُّ بِرَدِّهِنَّ فِيْ ذٰلِكَ اِنْ اَرَادُوْٓا
اِصْلَاحًا ؕ وَلَهُنَّ مِثْلُ الَّذِيْ عَلَيْهِنَّ
بِالْمَعْرُوْفِ ۪ وَلِلرِّجَالِ عَلَيْهِنَّ دَرَجَةٌ ؕ وَ
اللّٰهُ عَزِيْزٌ حَكِيْمٌ ﴿٢٢٨﴾ ع ٢٨ ١٢

76. షరీయత్తు భాషలో దీనిని 'ఈలా' అంటారు. భార్యాభర్తల మధ్య సంబంధాలు ఎల్లప్పుడూ సరిగా ఉండకపోవచ్చు. అప్పుడప్పుడూ విచ్ఛిన్నతకు కారణాలు ఉత్పన్నమవుతూనే ఉంటాయి. కాని స్త్రీ పురుషులు ఉభయులూ చట్టసమ్మతంగా దాంపత్య బంధంలోనే ఉంటూ, క్రియాత్మకంగా దంపతులు కాని విధంగా వేర్వేరుగా ఉండే కలహాన్ని అల్లాహ్ షరీయత్తు అనుమతించదు. కనుక అల్లాహ్ ఇటువంటి కలతకు నాలుగు మాసాలు గడువుగా నిర్ణయం చేశాడు. ఈ నాలుగు మాసాల కాలంలో భార్యాభర్తలు తమ సంబంధాలను చక్కదిద్దుకోవాలి లేదా తమ దాంపత్య బంధాన్ని త్రెంచుకోవాలి. ఇది వారిరువురు స్వతంత్రులై తమకు ఇష్టమైన వారిని వివాహం చేసుకోవటానికి దోహదం చేస్తుంది.

77. అంటే, ఒకవేళ మీరు స్వల్పమైన, అసమంజసమైన కారణాలు ఆధారంగా మీ భార్యకు విడాకులిస్తే, అల్లాహ్ పట్ల నిర్భయంగా ఉండకండి. మితిమీరిన మీ ప్రవర్తన ఆయనకు తెలియదనుకోకండి.

78. భర్త భార్యకు ఒకసారిగాని లేక రెండుసార్లుగాని విడాకులు ఇచ్చి ఉన్న సందర్భానికే ఈ ఆజ్ఞ వర్తిస్తుంది. అంటే ఇది 'తలాఖె రజయీ' అవుతుంది. 'ఇద్దత్' గడువు మధ్యలో భర్త భార్యను తిరిగి స్వీకరించవచ్చు.

اَلطَّلَاقُ مَرَّتٰنِ ۪ فَاِمۡسَاكٌۢ بِمَعۡرُوۡفٍ اَوۡ تَسۡرِيۡحٌۢ بِاِحۡسَانٍ ؕ وَلَا يَحِلُّ لَـكُمۡ اَنۡ تَاۡخُذُوۡا مِمَّاۤ اٰتَيۡتُمُوۡهُنَّ شَيۡـًٔا اِلَّاۤ اَنۡ يَّخَافَاۤ اَلَّا يُقِيۡمَا حُدُوۡدَ اللّٰهِ ؕ فَاِنۡ خِفۡتُمۡ اَلَّا يُقِيۡمَا حُدُوۡدَ اللّٰهِ ۙ فَلَا جُنَاحَ عَلَيۡهِمَا فِيۡمَا افۡتَدَتۡ بِهٖ ؕ تِلۡكَ حُدُوۡدُ اللّٰهِ فَلَا تَعۡتَدُوۡهَا ۚ وَمَنۡ يَّتَعَدَّ حُدُوۡدَ اللّٰهِ فَاُولٰٓـئِكَ هُمُ الظّٰلِمُوۡنَ ﴿۲۲۹﴾

فَاِنۡ طَلَّقَهَا فَلَا تَحِلُّ لَهٗ مِنۡۢ بَعۡدُ حَتّٰى تَنۡكِحَ زَوۡجًا غَيۡرَهٗ ؕ فَاِنۡ طَلَّقَهَا فَلَا جُنَاحَ عَلَيۡهِمَاۤ اَنۡ يَّتَرَاجَعَاۤ اِنۡ ظَنَّاۤ اَنۡ يُّقِيۡمَا حُدُوۡدَ اللّٰهِ ؕ وَتِلۡكَ حُدُوۡدُ اللّٰهِ يُبَيِّنُهَا لِقَوۡمٍ يَّعۡلَمُوۡنَ ﴿۲۳۰﴾

**229** విడాకులు రెండుసార్లు ఇవ్వాలి. తరువాత భార్యను సక్రమంగా తమ వద్ద ఉండనివ్వాలి లేదా ఆమెను సహృదయంతో సాగనంపాలి.[79] సాగనంపేటప్పుడు, మీరు వారికి పూర్వం ఇచ్చిన వాటినుండి దేన్నయినా తిరిగి తీసుకోవటం ధర్మసమ్మతం కాదు - అల్లాహ్ విధించిన హద్దులకు కట్టుబడి ఉండలేమనే భయం దంపతులకు కలిగిన పక్షంలో ఒక మినహాయింపు ఉంది. ఇలాంటి సందర్భంలో దంపతు లిద్దరూ అల్లాహ్ విధించిన హద్దులకు కట్టుబడి ఉండలేరనే భయం మీకు కలిగితే, స్త్రీ తన భర్తకు ఏదైనా పరిహారం ఇచ్చి వేరు కావటానికి[80] వారిద్దరూ అంగీకరిస్తే, అందులో ఏమాత్రం దోషంలేదు. ఇవి అల్లాహ్ విధించిన హద్దులు. వీటిని అతిక్రమించకండి. అల్లాహ్ విధించిన హద్దులను అతిక్రమించేవారే దుర్మార్గులు.

**230** ఆ తరువాత (రెండుసార్లు విడాకులిచ్చిన పిదప భర్త భార్యకు మూడవసారి) విడాకులిస్తే, ఇక ఆ స్త్రీ అతనికి హలాల్ (ధర్మసమ్మతం)కాదు. ఆమె వివాహం వేరే పురుషునితో జరిగి, అతడు ఆమెకు విడాకులిస్తే తప్ప.[81] అప్పుడు మొదటి భర్త, ఈ స్త్రీ ఉభయులూ తాము అల్లాహ్ హద్దులకు లోబడి ఉండగలమని భావిస్తే, వారు పునర్వివాహం చేసుకోవటంలో దోషం లేదు. ఇవి అల్లాహ్ ఏర్పరచిన హద్దులు.(అల్లాహ్ హద్దులు అతిక్రమిస్తే కలిగే పర్యవసానం) ఎరిగిన వారికి మార్గదర్శకంగా ఉండటానికి వాటిని ఆయన విశదపరుస్తున్నాడు.

79. ఈ ఆయత్ ప్రకారం, ఒక పురుషుడు ఒక పెళ్ళి సంబంధంలో తన భార్యకు విడాకులిచ్చి తిరిగి స్వీకరించే (తలాఖె రజయీ) హక్కును కేవలం రెండుసార్లు మాత్రమే వినియోగించుకో గలుగుతాడు. తన భార్యకు రెండుసార్లు విడాకులిచ్చి మళ్ళీ ఆమెను స్వీకరించిన వ్యక్తి, ఇక తన జీవిత కాలంలో ఎప్పుడైనా ఆమెకు మూడోసారి విడాకులిస్తే, ఆ స్త్రీ అతడికి శాశ్వతంగా వేరవుతుంది.

80. షరీయత్తు పరిభాషలో దీనిని 'ఖులా' అంటారు. అంటే, ఒక స్త్రీ తన భర్తకు ఏదో కొంత ఇచ్చి అతన్నుండి విడాకులు పొందటం అన్నమాట. ఈ పరిస్థితిలో, తాను ఇచ్చిన సొమ్ము అంతాకాని లేదా అందులో కొంతగాని పరస్పరాంగీకారంతో తిరిగి తీసుకోవటం పురుషుడికి ధర్మసమ్మతమే. కాని ఒకవేళ స్వయంగా పురుషుడే స్త్రీకి విడాకులిస్తే, అతడు ఆమె నుండి తానిచ్చిన ఏ సొమ్మునూ తిరిగి తీసుకోలేడు.

81. అంటే, ఎప్పుడైనా అతడు తన ఇష్టానుసారం విడాకులివ్వటం అని భావం. కేవలం మొదటి భర్త కొరకు ఆ స్త్రీని హలాల్ (ధర్మసమ్మతం) చెయ్యటానికి జరిగే కుట్రతో కూడుకున్న వివాహానికీ, విడాకులకూ దీని ప్రకారం ఏ విధమైన అనుమతి లభించదు.

وَ اِذَا طَلَّقْتُمُ النِّسَآءَ فَبَلَغْنَ اَجَلَهُنَّ
فَاَمْسِكُوْهُنَّ بِمَعْرُوْفٍ اَوْ سَرِّحُوْهُنَّ
بِمَعْرُوْفٍ وَ لَا تُمْسِكُوْهُنَّ ضِرَارًا
لِّتَعْتَدُوْا ۚ وَ مَنْ يَّفْعَلْ ذٰلِكَ فَقَدْ ظَلَمَ
نَفْسَهٗ ؕ وَ لَا تَتَّخِذُوْٓا اٰيٰتِ اللّٰهِ هُزُوًا ۫ وَ
اذْكُرُوْا نِعْمَتَ اللّٰهِ عَلَيْكُمْ وَ مَآ اَنْزَلَ عَلَيْكُمْ
مِّنَ الْكِتٰبِ وَالْحِكْمَةِ يَعِظُكُمْ بِهٖ ؕ وَ اتَّقُوا
اللّٰهَ وَ اعْلَمُوْٓا اَنَّ اللّٰهَ بِكُلِّ شَيْءٍ عَلِيْمٌ ﴿۲۳۱﴾ وَ ع ٢٩ ١٣ الثلثة
اِذَا طَلَّقْتُمُ النِّسَآءَ فَبَلَغْنَ اَجَلَهُنَّ فَلَا
تَعْضُلُوْهُنَّ اَنْ يَّنْكِحْنَ اَزْوَاجَهُنَّ اِذَا تَرَاضَوْا
بَيْنَهُمْ بِالْمَعْرُوْفِ ؕ ذٰلِكَ يُوْعَظُ بِهٖ مَنْ كَانَ
مِنْكُمْ يُؤْمِنُ بِاللّٰهِ وَالْيَوْمِ الْاٰخِرِ ؕ ذٰلِكُمْ
اَزْكٰى لَكُمْ وَ اَطْهَرُ ؕ وَاللّٰهُ يَعْلَمُ وَ اَنْتُمْ لَا
تَعْلَمُوْنَ ﴿۲۳۲﴾ وَ الْوَالِدٰتُ يُرْضِعْنَ اَوْلَادَهُنَّ
حَوْلَيْنِ كَامِلَيْنِ لِمَنْ اَرَادَ اَنْ يُّتِمَّ
الرَّضَاعَةَ ؕ وَ عَلَى الْمَوْلُوْدِ لَهٗ رِزْقُهُنَّ وَ
كِسْوَتُهُنَّ بِالْمَعْرُوْفِ ؕ لَا تُكَلَّفُ نَفْسٌ اِلَّا
وُسْعَهَا ۚ لَا تُضَآرَّ وَالِدَةٌۢ بِوَلَدِهَا وَلَا مَوْلُوْدٌ
لَّهٗ بِوَلَدِهٖ ۚ وَعَلَى الْوَارِثِ مِثْلُ ذٰلِكَ ۚ

**231** మీరు మీ స్త్రీలకు విడాకులిచ్చినప్పుడు, వారికొరకు నిర్ణయింపబడిన గడువు (ఇద్దత్) దగ్గరపడగానే, వారిని సహృదయంతో మీ వద్ద ఉంచుకోవాలి లేదా మంచితనంతో సాగనంపాలి. కేవలం పీడించే ఉద్దేశ్యంతో వారిని మీతో ఉంచు కోవటం అన్యాయం. ఆ విధంగా చేసేవాడు వాస్తవానికి తనకు తానే అన్యాయం చేసుకుంటున్నాడు. అల్లాహ్ వాక్యాలతో చెలగాటం ఆడకండి. అల్లాహ్ మీకు గొప్ప కానుకను ప్రసాదించిన విషయాన్ని మరువకండి. తాను మీపై అవతరింప జేసిన గ్రంథాన్నీ, దివ్య జ్ఞానాన్నీ తగువిధంగా గౌరవించండి అని అల్లాహ్ మీకు బోధిస్తున్నాడు. అల్లాహ్‌కు భయపడండి. అంతా ఆయనకు తెలుసు అనే విషయం మీరు బాగా తెలుసు కోండి.

**232** మీరు మీ స్త్రీలకు విడాకులిచ్చివేసిన తరువాత వారు తమ నిరీక్షణా వ్యవధి (ఇద్దత్)ని పూర్తిచేసి, తమ నిశ్చిత భర్తలను ధర్మసమ్మతంగా పరస్పరం ఇష్టపడి వివాహం చేసుకోదలిస్తే, మీరు వారిని ఆటంకపరచకూడదు. మీరు నిజంగా అల్లాహ్‌ను అంతిమదినాన్ని విశ్వసించినవారే అయితే, అలా ఎంత మాత్రం చెయ్యకూడదని మీకు బోధించబడుతోంది. మీకొరకు సంస్కార వంతమూ పవిత్రమూ అయిన పద్ధతి ఏమిటంటే మీరు దానికి దూరంగా ఉండటమే. అల్లాహ్‌కు అన్నీ తెలుసు, మీకు తెలియదు.

**233** తమ సంతానం యొక్క పాలుపట్టే గడువు పూర్తికావాలని తండ్రులు కోరిన పక్షంలో తల్లులు తమ బిడ్డలకు పూర్తిగా రెండు సంవత్సరాలు పాలు పట్టాలి.[82] అప్పుడు ఆమెకు పిల్లల తండ్రి తగురీతిగా భోజన వస్త్రాలను ఇచ్చి పోషిం చవలసి ఉంటుంది. కాని శక్తికి మించిన భారం ఎవరి మీదా మోప కూడదు. (అంటే) బిడ్డనుకన్న కారణంగా తల్లిమీద ఎక్కువ భారం మోపటం భావ్యం కాదు. బిడ్డకు తండ్రి కనుక తండ్రిని ఇరకాటంలో పెట్టటం కూడ సమంజసం కాదు- పాలిచ్చే తల్లిని పోషించే బాధ్యత తండ్రిపై ఉన్న విధంగానే తండ్రి వారసులపై కూడా ఉంటుంది -

82. ఈ ఆజ్ఞ దంపతులిద్దరూ వేరై స్త్రీ ఒడిలో పాలు త్రాగే పిల్లవాడు ఉన్నప్పటి స్థితికి వర్తిస్తుంది. ఆ వేర్పాటు విడాకుల ద్వారానైనా లేదా 'ఖులా' ద్వారానైనా లేదా వివాహభంగం ద్వారానైనా లేదా కోర్టుద్వారానైనా కావచ్చు.

فَاِنْ اَرَادَا فِصَالًا عَنْ تَرَاضٍ مِّنْهُمَا
وَتَشَاوُرٍ فَلَا جُنَاحَ عَلَيْهِمَا ؕ وَ اِنْ اَرَدْتُّمْ
اَنْ تَسْتَرْضِعُوْٓا اَوْلَادَكُمْ فَلَا جُنَاحَ عَلَيْكُمْ
اِذَا سَلَّمْتُمْ مَّآ اٰتَيْتُمْ بِالْمَعْرُوْفِ ؕ وَ اتَّقُوا
اللّٰهَ وَ اعْلَمُوْٓا اَنَّ اللّٰهَ بِمَا تَعْمَلُوْنَ بَصِيْرٌ ﴿٢٣٣﴾
وَ الَّذِيْنَ يُتَوَفَّوْنَ مِنْكُمْ وَيَذَرُوْنَ اَزْوَاجًا
يَّتَرَبَّصْنَ بِاَنْفُسِهِنَّ اَرْبَعَةَ اَشْهُرٍ وَّعَشْرًا ۚ
فَاِذَا بَلَغْنَ اَجَلَهُنَّ فَلَا جُنَاحَ عَلَيْكُمْ فِيْمَا
فَعَلْنَ فِيْٓ اَنْفُسِهِنَّ بِالْمَعْرُوْفِ ؕ وَ اللّٰهُ بِمَا
تَعْمَلُوْنَ خَبِيْرٌ ﴿٢٣٤﴾ وَلَا جُنَاحَ عَلَيْكُمْ فِيْمَا
عَرَّضْتُمْ بِهٖ مِنْ خِطْبَةِ النِّسَآءِ اَوْ اَكْنَنْتُمْ فِيْٓ
اَنْفُسِكُمْ ؕ عَلِمَ اللّٰهُ اَنَّكُمْ سَتَذْكُرُوْنَهُنَّ وَ
لٰكِنْ لَّا تُوَاعِدُوْهُنَّ سِرًّا اِلَّآ اَنْ تَقُوْلُوْا
قَوْلًا مَّعْرُوْفًا ۬ؕ وَ لَا تَعْزِمُوْا عُقْدَةَ النِّكَاحِ
حَتّٰى يَبْلُغَ الْكِتٰبُ اَجَلَهٗ ؕ وَ اعْلَمُوْٓا اَنَّ اللّٰهَ
يَعْلَمُ مَا فِيْٓ اَنْفُسِكُمْ فَاحْذَرُوْهُ ۚ وَ اعْلَمُوْٓا
اَنَّ اللّٰهَ غَفُوْرٌ حَلِيْمٌ ﴿٢٣٥﴾ ع

కాని ఇరుపక్షాలవారు సంప్రదించుకుని పరస్పరాంగీకారంతో బిడ్డచే పాలు విడిపిస్తే అందులో దోషం లేదు. ఇంకా మీరు మీ సంతానానికి వేరే స్త్రీ ద్వారా పాలు ఇప్పించే ఏర్పాటు చెయ్య దలిస్తే, అదీ ఆక్షేపణీయం కాదు. కాని మీరు ఆమెకు ఇవ్వ వలసిన దానిని న్యాయ సమ్మతంగా చెల్లించాలి. అల్లాహ్‌కు భయపడండి. మీరు చేస్తున్నదంతా అల్లాహ్ దృష్టిలో ఉంది అనే విషయం తెలుసుకోండి.

**234 - 235** మీలో ఎవరైనా మరణించి, వారి భార్యలు సజీవంగా ఉంటే, వారు నాలుగు నెలల పదిరోజుల వరకు తమను తాము నిగ్రహించుకోవాలి.[83] ఈ గడువు (ఇద్దత్) పూర్తి అయిన పిదప, వారు తమ కొరకు ఏది ఉచితమో దానిని యుక్తమైన రీతిలో చేసుకోవటానికి స్వేచ్ఛ కలిగి ఉన్నారు. దానికి మీరు బాధ్యులుకారు. మీరు చేసే పనులన్నీ అల్లాహ్‌కు తెలుసు. ఈ వితంతువులను వివాహం చేసుకోవాలనే మీ సంకల్పాన్ని మీరు వారి నిరీక్షణాకాలం (ఇద్దత్)లో పరోక్షంగా తెలిపినా లేక దానిని మీ మనస్సులలో గోప్యంగా ఉంచినా అది దోషం కాదు. వారిని గురించిన ఆలోచన సహజంగానే మీకు కలుగుతుందని అల్లాహ్‌కు తెలుసు. కాని రహస్యంగా ఎలాంటి ఒప్పందం చేసుకోరాదు. అయితే మీరేమన్నా మాట్లాడదలిస్తే గౌరవమైన రీతిలో మాట్లాడండి. నిరీక్షణా వ్యవధి (ఇద్దత్) పూర్తి కానంత వరకు వివాహ నిర్ణయం తీసుకోకూడదు. మీ మనస్సులలో ఉన్న విషయం సహితం అల్లాహ్‌కు తెలుసు అని తెలుసుకోండి. కనుక ఆయనకు భయపడండి. ఇంకా ఆయన అత్యంత సహన శీలుడని (చిన్న చిన్న తప్పులను) మన్నిస్తాడని కూడా తెలుసుకోండి.

83. భర్త మరణం తరువాత పాటించవలసిన ఈ గడువు తమ భర్తలతో రతిసుఖం ఎరుగని స్త్రీలకు కూడ వర్తిస్తుంది. అయితే, గర్భిణీ స్త్రీకి ఇది వర్తించదు. ఆమెకు భర్త మరణం తరువాతి గడువు, ఆమె ప్రసవించే వరకే ఉంటుంది. ఆమె తన భర్త మరణం తరువాత వెంటనే ప్రసవించినా సరే లేదా కొన్ని నెలల తరువాత ప్రసవించినా సరే. "తమను తాము నిగ్రహించుకోవాలి" అనే దాని అర్థం, కేవలం ఆమె ఈ గడువు కాలంలో వివాహం చేసుకోకూడదు అని మాత్రమే కాదు. ఆభరణాలు మొదలైనవాటితో సింగారించుకోవటానికి దూరంగా ఉండాలని కూడా అర్థం.

**236 - 237** మీరు మీ స్త్రీలను ముట్టుకోకముందే లేక వారి మహర్ (స్త్రీ ధనం) నిర్ణయం కాకపూర్వమే మీరు వారికి విడాకులిస్తే, అది పాపం కాదు. అప్పుడు మీరు వారికి ఏదో కొంత తప్పకుండా ఇవ్వాలి. ధనవంతుడైన వ్యక్తి తన శక్తికొలదీ, పేదవాడైన మనిషి తన స్థితినిబట్టి ధర్మసమ్మతమైన విధంగా చెల్లించాలి. ఇది సజ్జనులైన వారి విధి. మీరు తాకకపూర్వమే మీ స్త్రీలకు విడాకులిస్తే, ఒకవేళ అప్పటికే వారి మహర్ నిర్ణయింపబడి ఉన్నట్లయితే అప్పుడు సగం మహర్‌ను చెల్లించ వలసి ఉంటుంది. కాని స్త్రీ గనక ఉదార బుద్ధితో వ్యవహరించి (మహర్‌ను క్షమించి విడిచిపెట్టి)నట్లయితే లేక నికాహ్ బంధం తన చేతిలో ఉన్న పురుషుడు ఔదార్యంతో (పూర్తి మహర్) చెల్లించినట్లయితే అది అభ్యంతరకరం కాదు. మీరు (పురుషులు) ఉదార స్వభావంతో వ్యవహరిస్తే, అది భయభక్తులకు సన్నిహిత మైనది. పరస్పర వ్యవహారాలలో ఔదార్యం చూపటం మరువకండి. మీరు చేసే పనులను అల్లాహ్ చూస్తున్నాడు.

**238 - 239** మీరు మీ నమాజులను సంరక్షించుకోండి – ముఖ్యంగా అత్యుత్తమమైన నమాజును.[84] అల్లాహ్ సన్నిధానంలో విధేయులైన దాసులుగా నిలబడండి. పరిస్థితులు ప్రమాదకరంగా ఉంటే, నడుస్తూవున్నా లేక స్వారీ చేస్తూవున్నా, ఎలా సాధ్య మయితే అలా నమాజు చెయ్యండి. శాంతి భద్రతలు నెలకొన్న తరువాత, అల్లాహ్ మీకు నేర్పిన పద్ధతి ప్రకారం ఆయనను స్మరించండి. ఈ పద్ధతి పూర్వం మీకు తెలియదు.

**240 - 241** మీలోని వారెవరైనా మరణించి, వారి భార్యలు సజీవంగా వుంటే, వారు తమ భార్యలకు ఒక సంవత్సరం వరకు భరణపు ఖర్చులు ఇవ్వాలనీ వారిని ఇంటి నుండి బహిష్కరించరాదనీ ఒక వీలునామా వ్రాయాలి. కాని వారు తమంతట తామే వెళ్ళిపోయి, తమ విషయంలో ధర్మసమ్మతంగా ఏమి చేసినా దానికి మీరు బాధ్యులు కారు. అల్లాహ్ సర్వాధికారి, సర్వమూ తెలిసినవాడు. ఇదేవిధంగా విడాకులివ్వబడిన స్త్రీలకు కూడా సముచితరీతిని ఎంతో కొంత ఇచ్చి సాగనంపాలి. భయ భక్తులు కలవారు దీనిని విధిగా పాటించాలి.

لَا جُنَاحَ عَلَيْكُمْ اِنْ طَلَّقْتُمُ النِّسَآءَ مَا لَمْ
تَمَسُّوْهُنَّ اَوْ تَفْرِضُوْا لَهُنَّ فَرِيْضَةً ۖۚ وَّ
مَتِّعُوْهُنَّ ۚ عَلَى الْمُوْسِعِ قَدَرُهٗ وَعَلَى الْمُقْتِرِ
قَدَرُهٗ ۚ مَتَاعًا بِالْمَعْرُوْفِ ۚ حَقًّا عَلَى
الْمُحْسِنِيْنَ ﴿٢٣٦﴾ وَاِنْ طَلَّقْتُمُوْهُنَّ مِنْ قَبْلِ اَنْ
تَمَسُّوْهُنَّ وَ قَدْ فَرَضْتُمْ لَهُنَّ فَرِيْضَةً
فَنِصْفُ مَا فَرَضْتُمْ اِلَّآ اَنْ يَّعْفُوْنَ اَوْ يَعْفُوَا
الَّذِيْ بِيَدِهٖ عُقْدَةُ النِّكَاحِ ؕ وَ اَنْ تَعْفُوْٓا
اَقْرَبُ لِلتَّقْوٰى ؕ وَ لَا تَنْسَوُا الْفَضْلَ بَيْنَكُمْ ؕ
اِنَّ اللّٰهَ بِمَا تَعْمَلُوْنَ بَصِيْرٌ ﴿٢٣٧﴾ حٰفِظُوْا عَلَى
الصَّلَوٰتِ وَ الصَّلٰوةِ الْوُسْطٰى ۗ وَ قُوْمُوْا لِلّٰهِ
قٰنِتِيْنَ ﴿٢٣٨﴾ فَاِنْ خِفْتُمْ فَرِجَالًا اَوْ رُكْبَانًا ۚ
فَاِذَآ اَمِنْتُمْ فَاذْكُرُوا اللّٰهَ كَمَا عَلَّمَكُمْ مَّا لَمْ
تَكُوْنُوْا تَعْلَمُوْنَ ﴿٢٣٩﴾ وَالَّذِيْنَ يُتَوَفَّوْنَ مِنْكُمْ
وَيَذَرُوْنَ اَزْوَاجًا ۖۚ وَّصِيَّةً لِّاَزْوَاجِهِمْ مَّتَاعًا
اِلَى الْحَوْلِ غَيْرَ اِخْرَاجٍ ۚ فَاِنْ خَرَجْنَ فَلَا
جُنَاحَ عَلَيْكُمْ فِيْ مَا فَعَلْنَ فِيْٓ اَنْفُسِهِنَّ مِنْ
مَّعْرُوْفٍ ؕ وَ اللّٰهُ عَزِيْزٌ حَكِيْمٌ ﴿٢٤٠﴾ وَلِلْمُطَلَّقٰتِ
مَتَاعٌۢ بِالْمَعْرُوْفِ ؕ حَقًّا عَلَى الْمُتَّقِيْنَ ﴿٢٤١﴾

كَذٰلِكَ يُبَيِّنُ اللّٰهُ لَكُمْ اٰيٰتِهٖ لَعَلَّكُمْ
تَعْقِلُوْنَ ﴿٢٤٢﴾ اَلَمْ تَرَ اِلَى الَّذِيْنَ خَرَجُوْا مِنْ ع٣٢
دِيَارِهِمْ وَ هُمْ اُلُوْفٌ حَذَرَ الْمَوْتِ ۠ فَقَالَ
لَهُمُ اللّٰهُ مُوْتُوْا ۣ ثُمَّ اَحْيَاهُمْ ۭ اِنَّ اللّٰهَ لَذُوْ
فَضْلٍ عَلَى النَّاسِ وَلٰكِنَّ اَكْثَرَ النَّاسِ لَا
يَشْكُرُوْنَ ﴿٢٤٣﴾ وَ قَاتِلُوْا فِيْ سَبِيْلِ اللّٰهِ وَاعْلَمُوْٓا
اَنَّ اللّٰهَ سَمِيْعٌ عَلِيْمٌ ﴿٢٤٤﴾ مَنْ ذَا الَّذِيْ يُقْرِضُ
اللّٰهَ قَرْضًا حَسَنًا فَيُضٰعِفَهٗ لَهٗٓ اَضْعَافًا
كَثِيْرَةً ۭ وَ اللّٰهُ يَقْبِضُ وَيَبْصُۜطُ ۠ وَ اِلَيْهِ
تُرْجَعُوْنَ ﴿٢٤٥﴾ اَلَمْ تَرَ اِلَى الْمَلَاِ مِنْۢ بَنِيْٓ
اِسْرَاۗءِيْلَ مِنْۢ بَعْدِ مُوْسٰى ۘ اِذْ قَالُوْا لِنَبِيٍّ وقف لازم
لَّهُمُ ابْعَثْ لَنَا مَلِكًا نُّقَاتِلْ فِيْ سَبِيْلِ اللّٰهِ ۭ
قَالَ هَلْ عَسَيْتُمْ اِنْ كُتِبَ عَلَيْكُمُ الْقِتَالُ
اَلَّا تُقَاتِلُوْا ۭ قَالُوْا وَ مَا لَنَآ اَلَّا نُقَاتِلَ فِيْ
سَبِيْلِ اللّٰهِ وَقَدْ اُخْرِجْنَا مِنْ دِيَارِنَا وَ
اَبْنَاۗىِٕنَا ۭ فَلَمَّا كُتِبَ عَلَيْهِمُ الْقِتَالُ تَوَلَّوْا
اِلَّا قَلِيْلًا مِّنْهُمْ ۭ وَ اللّٰهُ عَلِيْمٌۢ بِالظّٰلِمِيْنَ ﴿٢٤٦﴾

**242** ఈ విధంగా అల్లాహ్ తన ఆజ్ఞలను మీకు స్పష్టంగా తెలుపుతాడు. మీరు అర్థం చేసుకుని ప్రవర్తిస్తారని ఆశించబడు తోంది.

**243 - 245** మరణభీతితో తమ ఇళ్ళూవాకిళ్ళను విడిచివెళ్ళిన వారి ఉదంతాన్ని గురించి నీవు తలపోశావా? వారు వేల సంఖ్యలో ఉండేవారు. అల్లాహ్ వారితో "చావండి" అని అన్నాడు. మళ్ళీ ఆయన వారిని బ్రతికించాడు.[85] వాస్తవం ఏమిటంటే, అల్లాహ్ మానవులపట్ల అత్యంత అనుగ్రహం కలవాడు. కాని చాలామంది కృతజ్ఞతలు చూపరు. ముస్లిము లారా! అల్లాహ్ మార్గంలో యుద్ధం చెయ్యండి. అల్లాహ్ అన్నీ వింటాడు, ఆయనకు అంతా తెలుసు అని మీరు బాగా తెలుసు కోండి. అల్లాహ్‌కు మంచి రుణం ఇచ్చేవారు మీలో ఎవరైనా ఉన్నారా? దానిని ఆయన ఎన్నో రెట్లు అధికంచేసి తిరిగి ఇస్తాడు.[86] (ఐశ్వర్యాన్ని) తగ్గించటం, అధికం చెయ్యటం - అంతా అల్లాహ్ చేతులలోనే ఉంది. ఆయన వైపునకే మీరంతా తిరిగి పోవలసివుంది.

**246** మూసా (నిర్యాణం) తరువాత ఇస్రాయీలు నాయకులకు ఎదురైన పరిస్థితులను గురించి నీవు ఆలోచించావా? వారు తమ ప్రవక్తను ఇలా అడిగారు: "మేము అల్లాహ్ మార్గంలో యుద్ధం చెయ్యటానికి నీవు మాకొరకు ఒక రాజును నియ మించు." అప్పుడు ప్రవక్త వారిని ఇలా అడిగాడు : "తీరా మిమ్మల్ని యుద్ధం చెయ్యండి అని ఆదేశిస్తే, అప్పుడు మీరు నిరాకరించరు కదా?" వారు ఇలా అన్నారు: "మేము మా ఇళ్ళనుండి గెంటివేయబడ్డాము. మా పిల్లలు మాకు దూరం చెయ్యబడ్డారు. అలాంటప్పుడు మేము అల్లాహ్ మార్గంలో యుద్ధం చెయ్యకుండా ఉండటమనేది ఎలా సాధ్యం?" కాని, యుద్ధం చెయ్యండి అని ఆజ్ఞాపించగానే వారిలో కొందరు తప్ప అందరూ వెన్నుచూపారు. ఈ దుర్మార్గులలో ప్రతి ఒక్కడూ అల్లాహ్‌కు తెలుసు.

84. అసలు 'సలాతుల్ వుస్తా' అనే పదాలు మూలంలో వాడబడ్డాయి. ఉస్తా అంటే మధ్య వస్తువు అనీ, ఉన్నతమూ, శ్రేష్ఠమూ అయిన వస్తువు అనీ అర్థం. 'సలాతుల్ వుస్తా' అర్థం, మధ్య నమాజు అనీ మరియు సరియైన సమయంలో ప్రశాంత చిత్తంతో అల్లాహ్ పట్ల శ్రద్ధాభక్తులతో చేసే సర్వ లక్షణ లక్షితమైన నమాజు అనీ అర్థం. ఈ పదాన్ని 'మధ్య నమాజు' అనే అర్థంలో తీసుకున్న వ్యాఖ్యాతలు సాధారణంగా దాన్ని 'అసర్ నమాజు' అనే భావంలో తీసుకున్నారు.

85. ఇది ఇస్రాయీలు సంతతి వారి సామూహికమైన వలస (Exodus)ను సూచిస్తున్నది. 'మాయిదా' సూరా నాలుగో రుకూలో అల్లాహ్ దీనికి సంబంధించిన వివరాలను పేర్కొన్నాడు.

وَ قَالَ لَهُمْ نَبِيُّهُمْ اِنَّ اللّٰهَ قَدْ بَعَثَ لَكُمْ
طَالُوْتَ مَلِكًا ؕ قَالُوْۤا اَنّٰى يَكُوْنُ لَهُ الْمُلْكُ
عَلَيْنَا وَ نَحْنُ اَحَقُّ بِالْمُلْكِ مِنْهُ وَ لَمْ
يُؤْتَ سَعَةً مِّنَ الْمَالِ ؕ قَالَ اِنَّ اللّٰهَ
اصْطَفٰىهُ عَلَيْكُمْ وَ زَادَهٗ بَسْطَةً فِى الْعِلْمِ
وَالْجِسْمِ ؕ وَاللّٰهُ يُؤْتِىْ مُلْكَهٗ مَنْ يَّشَآءُ ؕ وَ
اللّٰهُ وَاسِعٌ عَلِيْمٌ ﴿۲۴۷﴾ وَقَالَ لَهُمْ نَبِيُّهُمْ اِنَّ اٰيَةَ
مُلْكِهٖۤ اَنْ يَّاْتِيَكُمُ التَّابُوْتُ فِيْهِ سَكِيْنَةٌ مِّنْ
رَّبِّكُمْ وَ بَقِيَّةٌ مِّمَّا تَرَكَ اٰلُ مُوْسٰى وَاٰلُ
هٰرُوْنَ تَحْمِلُهُ الْمَلٰٓئِكَةُ ؕ اِنَّ فِىْ ذٰلِكَ لَاٰيَةً
لَّكُمْ اِنْ كُنْتُمْ مُّؤْمِنِيْنَ ﴿۲۴۸﴾ فَلَمَّا فَصَلَ طَالُوْتُ ع ٣٢
بِالْجُنُوْدِ ۙ قَالَ اِنَّ اللّٰهَ مُبْتَلِيْكُمْ بِنَهَرٍ ۚ
فَمَنْ شَرِبَ مِنْهُ فَلَيْسَ مِنِّىْ ۚ وَ مَنْ لَّمْ
يَطْعَمْهُ فَاِنَّهٗ مِنِّىْۤ اِلَّا مَنِ اغْتَرَفَ غُرْفَةًۢ
بِيَدِهٖ ۚ فَشَرِبُوْا مِنْهُ اِلَّا قَلِيْلًا مِّنْهُمْ ؕ فَلَمَّا
جَاوَزَهٗ هُوَ وَ الَّذِيْنَ اٰمَنُوْا مَعَهٗ ۙ قَالُوْا لَا
طَاقَةَ لَنَا الْيَوْمَ بِجَالُوْتَ وَ جُنُوْدِهٖ ؕ قَالَ
الَّذِيْنَ يَظُنُّوْنَ اَنَّهُمْ مُّلٰقُوا اللّٰهِ ۙ كَمْ مِّنْ
فِئَةٍ قَلِيْلَةٍ غَلَبَتْ فِئَةً كَثِيْرَةًۢ بِاِذْنِ اللّٰهِ ؕ
وَ اللّٰهُ مَعَ الصّٰبِرِيْنَ ﴿۲۴۹﴾

**247 - 248** వారి ప్రవక్త వారితో ఇలా అన్నాడు: "మీకు ఏలికగా అల్లాహ్ తాలూత్‌ను నియమించాడు." ఇది విని వారు ఇలా అన్నారు: "మాపై రాజ్యం చేసే హక్కు అతనికెలా సంక్రమిస్తుంది? రాజ్యం చేసే హక్కూ అర్హతలూ అతనికంటే మాకే ఎక్కువగా ఉన్నాయి. ఎందుకంటే, అతడు శ్రీమంతుడు కాదు." దానికి సమాధానంగా ప్రవక్త వారితో ఇలా అన్నాడు: "మీకు బదులుగా అల్లాహ్ అతనినే ఎన్నిక చేశాడు. అల్లాహ్ అతనికి బుద్ధి బలాన్నీ, కండబలాన్నీ సమృద్ధిగా ప్రసాదించాడు. తాను కోరిన వారికి తన రాజ్యం ప్రసాదించే అధికారం అల్లాహ్‌కు ఉంది. అల్లాహ్ అంతా వ్యాపించి ఉన్నాడు, సర్వమూ తెలిసినవాడు." వారి ప్రవక్త వారికి ఇంకా ఈవిధంగా తెలియ జేశాడు: "అల్లాహ్ అతనిని మీపై రాజుగా నియమించాడు అనటానికి తార్కాణమేమిటంటే, అతని ప్రభుత్వ కాలంలో మీ పెట్టె (ఆర్క్) మీకు తిరిగి లభిస్తుంది. మీ ప్రభువు నుండి మీ కొరకు మనశ్శాంతి సామగ్రి అందులో ఉంది. ఇంకా అందులో మూసా కుటుంబం, హారూను కుటుంబం వదలి వెళ్ళిన పవిత్ర అవశేషాలు ఉన్నాయి. దానిని ప్రస్తుతం దూతలు కాపాడు తున్నారు. మీరు విశ్వసించినవారే అయితే, ఇది నిశ్చయంగా మీకొక మహత్తరమైన చిహ్నం."

**249** తరువాత యుద్ధానికి సైన్యంతో బయలుదేరుతూ తాలూత్ ఇలా ప్రకటించాడు: "ఒక నదీ తీరాన అల్లాహ్ మిమ్మల్ని పరీక్షింపబోతున్నాడు. దానిలో నీళ్ళు త్రాగేవాడు నా సహచరుడు కాడు. దాని నీళ్ళతో తన దాహం తీర్చుకోనివాడే నా సహ చరుడు. కాని చేతితో ఒక గుక్కెడు త్రాగితే ఫర్వాలేదు." అయితే కొందరు తప్ప అందరూ ఆ నదీజలాన్ని కడుపునిండా త్రాగారు...

**249 - 251** ...తాలూత్, అతని ముస్లిము సహచరులు ఆ నదిని దాటి ముందుకుపోయినప్పుడు వారు తాలూత్‌తో ఇలా అన్నారు : "జాలూత్‌ను, అతని సైన్యాలను ఎదుర్కొనే శక్తి ఈరోజు మాలో లేదు."[87] కాని ఒక రోజున అల్లాహ్‌ను కలవటం తప్పదు అని విశ్వసించినవారు ఈ విధంగా ప్రకటించారు: "ఒక చిన్న వర్గం ఒక పెద్ద వర్గాన్ని అల్లాహ్ అనుమతితో జయించటం ఎన్నోసార్లు జరిగింది. అల్లాహ్ సహచర్యం, స్థయిర్యం కలవారికి లభిస్తుంది."

وَلَمَّا بَرَزُوْا لِجَالُوْتَ وَجُنُوْدِهٖ قَالُوْا رَبَّنَآ
اَفْرِغْ عَلَيْنَا صَبْرًا وَّثَبِّتْ اَقْدَامَنَا
وَانْصُرْنَا عَلَى الْقَوْمِ الْكٰفِرِيْنَ ﴿٢٥٠﴾ فَهَزَمُوْهُمْ
بِاِذْنِ اللّٰهِ ۙ وَقَتَلَ دَاوٗدُ جَالُوْتَ وَ اٰتٰىهُ اللّٰهُ
الْمُلْكَ وَالْحِكْمَةَ وَ عَلَّمَهٗ مِمَّا يَشَآءُ ؕ وَ لَوْ
لَا دَفْعُ اللّٰهِ النَّاسَ بَعْضَهُمْ بِبَعْضٍ ۙ
لَّفَسَدَتِ الْاَرْضُ وَلٰكِنَّ اللّٰهَ ذُوْ فَضْلٍ
عَلَى الْعٰلَمِيْنَ ﴿٢٥١﴾ تِلْكَ اٰيٰتُ اللّٰهِ نَتْلُوْهَا
عَلَيْكَ بِالْحَقِّ ؕ وَ اِنَّكَ لَمِنَ الْمُرْسَلِيْنَ ﴿٢٥٢﴾
تِلْكَ الرُّسُلُ فَضَّلْنَا بَعْضَهُمْ عَلٰى بَعْضٍ ۘ الجزء ٣ وقف لازم
مِنْهُمْ مَّنْ كَلَّمَ اللّٰهُ وَرَفَعَ بَعْضَهُمْ دَرَجٰتٍ ؕ
وَاٰتَيْنَا عِيْسَى ابْنَ مَرْيَمَ الْبَيِّنٰتِ وَاَيَّدْنٰهُ
بِرُوْحِ الْقُدُسِ ؕ وَلَوْ شَآءَ اللّٰهُ مَا اقْتَتَلَ
الَّذِيْنَ مِنْۢ بَعْدِهِمْ مِّنْۢ بَعْدِ مَا جَآءَتْهُمُ
الْبَيِّنٰتُ وَلٰكِنِ اخْتَلَفُوْا فَمِنْهُمْ مَّنْ اٰمَنَ
وَمِنْهُمْ مَّنْ كَفَرَ ؕ وَلَوْ شَآءَ اللّٰهُ مَا اقْتَتَلُوْا ۟
وَلٰكِنَّ اللّٰهَ يَفْعَلُ مَا يُرِيْدُ ﴿٢٥٣﴾ ع ٣٣

జాలూత్‌తో, అతని సైన్యంతో పోరాడటానికి బయలు దేరుతూ వారు ఇలా ప్రార్థించారు: "మా ప్రభూ! మాకు ధైర్యస్థయిర్యాలు ప్రసాదించు. మా కాళ్ళకు నిలకడను చేకూర్చు. అవిశ్వాస వర్గంపై మాకు విజయం అనుగ్రహించు." చివరకు అల్లాహ్ అనుజ్ఞతో వారు అవిశ్వాసులను ఓడించి పారద్రోలారు. దావూద్ జాలూత్‌ను సంహరించాడు. అల్లాహ్ అతనికి రాజ్యాధికారాన్నీ, బుద్ధికౌశల్యాన్నీ ప్రసాదించాడు. ఇంకా తాను కోరిన విషయాల జ్ఞానాన్ని ఆయన అతనికి ప్రదానం చేశాడు. ఈ విధంగా అల్లాహ్ మానవుల ఒక వర్గాన్ని మరొక వర్గం ద్వారా తొలగించకపోతే, భూలోక వ్యవస్థ ఛిన్నాభిన్నమై ఉండేది. కాని ప్రపంచ మానవులపై అల్లాహ్‌కు ఎనలేని అనుగ్రహం. (కనుకనే ఈ విధంగా ఆయన అరాచకాన్ని, సంక్షోభాన్నీ రూపుమాపే ఏర్పాట్లు చేస్తూ ఉంటాడు).

**252 - 253** ఇవన్నీ అల్లాహ్ వాక్యాలు. వాటిని మేము యథాతథంగా నీకు వినిపిస్తున్నాము. ముహమ్మద్! నిశ్చయంగా నీవు సందేశహరులుగా పంపబడిన వారిలోనివాడవు. (మానవులకు సత్యమార్గం చూపటానికి పంపబడిన) ఈ ప్రవక్తలకు ఒకరిపై మరొకరికి ఉన్నత స్థానాలు ప్రసాదించాము. వారిలోని ఒకరితో అల్లాహ్ స్వయంగా మాట్లాడాడు. మరొకరికి వేరే విధంగా ఘనతను ఇచ్చి ఆదరించాడు. చివరన మర్యమ్ కుమారుడైన ఈసాకు మేము స్పష్టమైన సూచనలు ప్రసాదించాము, పరిశుద్ధాత్మతో అతనిని ఆదుకున్నాము. అల్లాహ్ సంకల్పించి ఉన్నట్లయితే, ప్రవక్తల తరువాత స్పష్టమైన గుర్తులు చూసిన ప్రజలు పరస్పరం కలహించుకునేవారు కాదు. కాని (ప్రజలను విభేదాలకు లోనుకాకుండా బలవంతంగా ఆపటం అల్లాహ్ ఉద్దేశం కాదు, అందుకని) వారు పరస్పరం విభేదాలకు లోనయ్యారు. కొందరు విశ్వసించారు, మరి కొందరు అవిశ్వాసమార్గాన్ని అవలంబించారు. కాని అల్లాహ్ కోరితే, వారు పరస్పరం కలహించుకునే వారే కాదు. కాని అల్లాహ్ తాను కోరింది చేస్తాడు.

86. ఖర్జె హసన్ (మంచి రుణం) అంటే, కేవలం సత్కార్యాభిలాషతో నిస్వార్థంగా అల్లాహ్ మార్గంలో ధనం వినియోగించటం. దానిని అల్లాహ్ తాను తీసుకున్న రుణంగా పరిగణిస్తున్నాడు. "నేను కేవలం అసలు రుణాన్నే కాదు. దానికి ఎన్నోరెట్లు ఎక్కువ ఇస్తాను" అని వాగ్దానం చేస్తున్నాడు.

يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْۤا اَنْفِقُوْا مِمَّا رَزَقْنٰكُمْ
مِّنْ قَبْلِ اَنْ يَّاْتِىَ يَوْمٌ لَّا بَيْعٌ فِيْهِ وَلَا خُلَّةٌ
وَّ لَا شَفَاعَةٌ ؕ وَالْكٰفِرُوْنَ هُمُ الظّٰلِمُوْنَ ۝٢٥٤
اَللّٰهُ لَاۤ اِلٰهَ اِلَّا هُوَ ۚ اَلْحَىُّ الْقَيُّوْمُ ۚ لَا
تَاْخُذُهٗ سِنَةٌ وَّ لَا نَوْمٌ ؕ لَهٗ مَا فِى السَّمٰوٰتِ
وَمَا فِى الْاَرْضِ ؕ مَنْ ذَا الَّذِىْ يَشْفَعُ عِنْدَهٗۤ
اِلَّا بِاِذْنِهٖ ؕ يَعْلَمُ مَا بَيْنَ اَيْدِيْهِمْ وَمَا
خَلْفَهُمْ ۚ وَلَا يُحِيْطُوْنَ بِشَىْءٍ مِّنْ عِلْمِهٖۤ اِلَّا بِمَا
شَآءَ ۚ وَسِعَ كُرْسِيُّهُ السَّمٰوٰتِ وَالْاَرْضَ ۚ
وَلَا يَـُٔوْدُهٗ حِفْظُهُمَا ۚ وَهُوَ الْعَلِىُّ الْعَظِيْمُ ۝٢٥٥
لَاۤ اِكْرَاهَ فِى الدِّيْنِ ۙ قَدْ تَّبَيَّنَ الرُّشْدُ مِنَ
الْغَىِّ ۚ فَمَنْ يَّكْفُرْ بِالطَّاغُوْتِ وَيُؤْمِنْۢ بِاللّٰهِ
فَقَدِ اسْتَمْسَكَ بِالْعُرْوَةِ الْوُثْقٰى ۗ لَا انْفِصَامَ
لَهَا ؕ وَاللّٰهُ سَمِيْعٌ عَلِيْمٌ ۝٢٥٦ اَللّٰهُ وَلِىُّ الَّذِيْنَ
اٰمَنُوْا ۙ يُخْرِجُهُمْ مِّنَ الظُّلُمٰتِ اِلَى النُّوْرِ ؕ
وَالَّذِيْنَ كَفَرُوْۤا اَوْلِيٰٓـئُهُمُ الطَّاغُوْتُ ۙ
يُخْرِجُوْنَهُمْ مِّنَ النُّوْرِ اِلَى الظُّلُمٰتِ ؕ اُولٰٓـئِكَ
اَصْحٰبُ النَّارِ ۚ هُمْ فِيْهَا خٰلِدُوْنَ ۝٢٥٧ ع

**254** విశ్వసించిన ప్రజలారా! క్రయవిక్రయాలు కూడా జరగని, మైత్రీ ఉపయోగపడని, సిఫారసు కూడా చెల్లని, ఆ (చివరి) దినము రాకపూర్వమే, మేము మీకు ప్రసాదించిన సిరిసంపదల నుండి (మా మార్గంలో) ఖర్చు పెట్టండి. వాస్తవంగా అవిశ్వాస మార్గం అవలంబించేవారే దుర్మార్గులు.

**255** అల్లాహ్- ఆయన తప్ప ఆరాధ్య దైవం ఎవ్వడూ లేడు. సకల చరాచర సృష్టికి మూలాధారం అయిన ఆయన సజీవుడు, నిత్యుడు, అనంతుడు. ఆయన నిదురపోడు, ఆయనకు కునుకూ రాదు. భూమ్యాకాశాలలో ఉన్న సమస్తమూ ఆయనదే. ఆయన సమ్ముఖంలో ఆయన అనుజ్ఞ లేకుండా సిఫారసు చెయ్యగల వాడెవ్వడు? ప్రజల ముందు ఉన్న దానినీ ఆయన ఎరుగును. వారికి గుప్తంగా ఉన్నదీ ఆయనకు తెలుసు. ఆయన స్వయంగా తెలియజెయ్యాలని అభిలషిస్తే తప్ప ఆయనకున్న జ్ఞాన విశేషాల లోని ఏ విషయమూ వారి గ్రహణ పరిధిలోకి రాదు. ఆయన రాజ్యాధికారం[88] ఆకాశాలనూ భూమినీ పరివేష్టించి ఉన్నది. వాటి సంరక్షణ ఆయనకు ఎంతమాత్రం అలసట కలిగించదు. ఆయన మాత్రమే సర్వాధికుడు, సర్వోత్తముడూను.

**256 - 257** ధర్మం విషయంలో నిర్బంధంకానీ, బలాత్కారం కానీ లేవు.[89] సత్యవాక్కు అసత్యవాక్కుల నుండి ప్రస్ఫుటం చెయ్యబడింది. ఇకనుండి 'తాగూత్'[90]ను తిరస్కరించి, అల్లాహ్‌ను విశ్వసించినవాడు సుస్థిరమైన, ఎన్నటికీ విడిపోని ఆశ్రయం పొందినట్లే. (అతడు ఆశ్రయించిన) అల్లాహ్ సర్వమూ వింటాడు, సమస్తమూ తెలిసినవాడు. అల్లాహ్ విశ్వాసులకు సంరక్షకుడు, సహాయకుడూను. ఆయన వారిని కటిక చీకట్ల నుండి వెలికితీసి వెలుగు చూపిస్తాడు. తాగూత్[91] అవిశ్వాస మార్గం అవలంబించే వారికి సంరక్షకులు, సహాయకులూను. వీరు వారిని వెలుగునుండి చీకటి వైపునకు లాక్కుపోతారు. వారు అగ్ని జ్వాలలకు గురి అయ్యేవారు. అక్కడ వారు శాశ్వ తంగా ఉంటారు.

---

87. బహుశా ఇలా అనేవారు ఇదివరకు ఒకసారి నది ఒడ్డున తమ ఓర్పు లేమిని ప్రదర్శించినవారే అయివుంటారు.

88. అసలు మూలంలో 'కుర్సీ' (కుర్చీ) అనే పదం వాడబడింది. అది సర్వసాధార ణంగా ప్రభుత్వానికీ, అధికారానికీ చిహ్నంగా చెప్పబడుతుంది. తెలుగు భాషలో కూడా తరచు కుర్చీ అనే పదం చెప్పి ప్రభుత్వాధికారాలు అని దాని అర్థంగా తీసుకుంటారు. ఈ పదం కారణంగానే ఈ ఆయత్ "ఆయతుల్ కుర్సీ"గా ప్రసిద్ధిచెందింది. ఇది

**258** ఇబ్రాహీము ప్రభువు ఎవరు అనే విషయంపై అతనితో వివాదపడిన[92] వ్యక్తి విషయాన్ని గురించి నీవు ఆలోచించలేదా? అల్లాహ్ ఆ వ్యక్తికి రాజ్యాధికారం ఇవ్వటం వల్ల ఈ వివాదం తలెత్తింది. "జీవన్మరణాలు ఎవరి అధీనంలో ఉన్నాయో, ఆయనే నా ప్రభువు" అని ఇబ్రాహీము అన్నప్పుడు, అతడు ఇలా జవాబు పలికాడు: "చావు బ్రతుకులు రెండూ నా అధీనంలోనే ఉన్నాయి." ఇబ్రాహీము ఇలా అన్నాడు: "సరే, అల్లాహ్ సూర్యుణ్ణి తూర్పు నుండి ఉదయింపచేస్తాడు. నీవు కాస్త దానిని పడమర నుండి ఉదయింపజెయ్యి." ఇది విన్న ఆ సత్యధిక్కారి బిత్తర పోయాడు. అయితే అల్లాహ్ దుష్టులకు రుజుమార్గం చూపడు.

**259** లేక ఉదాహరణకు– ఇళ్ళ కప్పులపై తలక్రిందులుగా పడివున్న పట్టణం మీదుగా ప్రయాణం చేసిన ఆ వ్యక్తిని చూడు. అతడు ఆశ్చర్యంతో ఇలా పలికాడు: "శిథిలమైపోయిన ఈ పట్టణానికి అల్లాహ్ మళ్ళీ ఏవిధంగా జీవం పోస్తాడు." అప్పుడు అల్లాహ్ అతని ప్రాణాన్ని తీసేశాడు. ఆ స్థితిలో అతడు నూరేళ్ళ వరకు ఉన్నాడు. తరువాత అల్లాహ్ అతనిని మళ్ళీ బ్రతికించి ఇలా అడిగాడు: "నీవు ఇక్కడ ఎంతకాలం ఉన్నావో చెప్పు." అతడు "ఒకరోజో లేక కొన్ని గంటలో" అని చెప్పాడు. అల్లాహ్ ఇలా తెలిపాడు: "ఇక్కడ ఈ స్థితిలో నీవు నూరు సంవత్సరాలు పడివున్నావు. నీవు కొంచెం నీ అన్నపానీయాల వైపు చూడు. వాటిలో ఏమాత్రం మార్పు లేదు. ఇంకా నీవు నీ గాడిదను కూడ చూడు. (దాని ఎముకలు సహితం కృశించి పోతున్నాయి). ప్రజలకు నిన్ను ఒక దృష్టాంతంగా చూపే ఉద్దేశ్యంతో మేము ఈ విధంగా చేశాము. ఇంకా చూడు! ఆ (గాడిద) అస్థిపంజరాన్ని మేము ఏ విధంగా లేపి, దానిని మాంసంతో నింపుతామో." ఈ విధంగా సత్యం అతనికి తేటతెల్లం కాగానే, అతడు ఇలా అన్నాడు: "అల్లాహ్ సర్వశక్తి మంతుడని నాకు తెలుసు."

اَلَمْ تَرَ اِلَى الَّذِىْ حَآجَّ اِبْرٰهٖمَ فِىْ رَبِّهٖۤ اَنْ
اٰتٰىهُ اللّٰهُ الْمُلْكَ ۘ اِذْ قَالَ اِبْرٰهٖمُ رَبِّىَ الَّذِىْ وقف لازم
يُحْىٖ وَيُمِيْتُ ۙ قَالَ اَنَا اُحْىٖ وَاُمِيْتُ ؕ قَالَ
اِبْرٰهٖمُ فَاِنَّ اللّٰهَ يَاْتِىْ بِالشَّمْسِ مِنَ الْمَشْرِقِ
فَاْتِ بِهَا مِنَ الْمَغْرِبِ فَبُهِتَ الَّذِىْ كَفَرَ ؕ
وَاللّٰهُ لَا يَهْدِى الْقَوْمَ الظّٰلِمِيْنَ ۚ﴿۲۵۸﴾ اَوْ
كَالَّذِىْ مَرَّ عَلٰى قَرْيَةٍ وَّهِىَ خَاوِيَةٌ عَلٰى
عُرُوْشِهَا ۚ قَالَ اَنّٰى يُحْىٖ هٰذِهِ اللّٰهُ بَعْدَ
مَوْتِهَا ۚ فَاَمَاتَهُ اللّٰهُ مِائَةَ عَامٍ ثُمَّ بَعَثَهٗ ؕ
قَالَ كَمْ لَبِثْتَ ؕ قَالَ لَبِثْتُ يَوْمًا اَوْ بَعْضَ
يَوْمٍ ؕ قَالَ بَلْ لَّبِثْتَ مِائَةَ عَامٍ فَانْظُرْ اِلٰى
طَعَامِكَ وَشَرَابِكَ لَمْ يَتَسَنَّهْ ۚ وَانْظُرْ اِلٰى
حِمَارِكَ وَلِنَجْعَلَكَ اٰيَةً لِّلنَّاسِ وَانْظُرْ اِلَى
الْعِظَامِ كَيْفَ نُنْشِزُهَا ثُمَّ نَكْسُوْهَا لَحْمًا ؕ
فَلَمَّا تَبَيَّنَ لَهٗ ۙ قَالَ اَعْلَمُ اَنَّ اللّٰهَ عَلٰى كُلِّ
شَىْءٍ قَدِيْرٌ ﴿۲۵۹﴾

అల్లాహ్‌ను గురించిన పరిపూర్ణ జ్ఞానంతో నిండి ఉంది. దీనితో సరితూగే వర్ణన మరెక్కడా లేదు. ఇందువల్లనే హదీసులో దీనిని ఖురాను యొక్క అత్యుత్తమమైన ఆయత్‌గా అభివర్ణించడం జరిగింది.

89. అంటే, ఎవరినీ విశ్వసించండి అని బలవంతం చెయ్యటానికి వీల్లేదు.

90. నిఘంటువు ప్రకారం, ధర్మసమ్మతమైన హద్దులను అతిక్రమించి ప్రవర్తించే ప్రతి మనిషినీ 'తాగూత్' అంటారు. ఖురాను పరిభాషలో 'తాగూత్' అంటే, దాస్యపు హద్దులను అతిక్రమించి, స్వయంగా తానే స్వామియై, దైవమై, దైవదాసులచే తనకు దాస్యం చేయించుకునే దైవదాసుడు అని అర్థం.

وَاِذْ قَالَ اِبْرٰهٖمُ رَبِّ اَرِنِىْ كَيْفَ تُحْىِ
الْمَوْتٰى ؕ قَالَ اَوَلَمْ تُؤْمِنْ ؕ قَالَ بَلٰى وَلٰكِنْ
لِّيَطْمَئِنَّ قَلْبِىْ ؕ قَالَ فَخُذْ اَرْبَعَةً مِّنَ
الطَّيْرِ فَصُرْهُنَّ اِلَيْكَ ثُمَّ اجْعَلْ عَلٰى كُلِّ جَبَلٍ
مِّنْهُنَّ جُزْءًا ثُمَّ ادْعُهُنَّ يَاْتِيْنَكَ سَعْيًا ؕ
وَاعْلَمْ اَنَّ اللّٰهَ عَزِيْزٌ حَكِيْمٌ ﴿٢٦٠﴾ مَثَلُ الَّذِيْنَ ربع
يُنْفِقُوْنَ اَمْوَالَهُمْ فِىْ سَبِيْلِ اللّٰهِ كَمَثَلِ حَبَّةٍ
اَنْۢبَتَتْ سَبْعَ سَنَابِلَ فِىْ كُلِّ سُنْۢبُلَةٍ مِّائَةُ
حَبَّةٍ ؕ وَاللّٰهُ يُضٰعِفُ لِمَنْ يَّشَآءُ ؕ وَاللّٰهُ
وَاسِعٌ عَلِيْمٌ ﴿٢٦١﴾ اَلَّذِيْنَ يُنْفِقُوْنَ اَمْوَالَهُمْ فِىْ
سَبِيْلِ اللّٰهِ ثُمَّ لَا يُتْبِعُوْنَ مَآ اَنْفَقُوْا مَنًّا وَّ
لَآ اَذًى ۙ لَّهُمْ اَجْرُهُمْ عِنْدَ رَبِّهِمْ ۚ وَلَا
خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ يَحْزَنُوْنَ ﴿٢٦٢﴾ قَوْلٌ
مَّعْرُوْفٌ وَّمَغْفِرَةٌ خَيْرٌ مِّنْ صَدَقَةٍ يَّتْبَعُهَآ
اَذًى ؕ وَاللّٰهُ غَنِىٌّ حَلِيْمٌ ﴿٢٦٣﴾ يٰۤاَيُّهَا الَّذِيْنَ
اٰمَنُوْا لَا تُبْطِلُوْا صَدَقٰتِكُمْ بِالْمَنِّ وَالْاَذٰى ۙ
كَالَّذِىْ يُنْفِقُ مَالَهٗ رِئَآءَ النَّاسِ وَلَا يُؤْمِنُ
بِاللّٰهِ وَالْيَوْمِ الْاٰخِرِ ؕ فَمَثَلُهٗ كَمَثَلِ
صَفْوَانٍ عَلَيْهِ تُرَابٌ فَاَصَابَهٗ وَابِلٌ فَتَرَكَهٗ
صَلْدًا ؕ لَا يَقْدِرُوْنَ عَلٰى شَىْءٍ مِّمَّا
كَسَبُوْا ؕ وَاللّٰهُ لَا يَهْدِى الْقَوْمَ الْكٰفِرِيْنَ ﴿٢٦٤﴾

**260** మరొక సంఘటనను కూడ దృష్టిలో ఉంచుకో. ఇబ్రాహీము ఇలా అడిగాడు: "ఓ నా ప్రభూ! నీవు మృతులను ఏ విధంగా బ్రతికిస్తావో నాకు చూపించు." అల్లాహ్ "నీకు విశ్వాసం లేదా?" అని అడిగాడు. ఇబ్రాహీము వినయంగా ఇలా అన్నాడు: "నాకు విశ్వాసం అయితే ఉంది. కాని మనస్సును తృప్తిపరచటం కోసం అడుగుతున్నాను."[93] అప్పుడు అల్లాహ్ చెప్పాడు: "సరే, మంచిది, నాలుగు పక్షులను తీసుకో. వాటిని బాగా మచ్చిక చేసుకో; తరువాత ఒక్కొక్కదాని భాగాన్ని ఒక్కొక్క కొండపై పెట్టి రా. మళ్ళీ వాటిని రమ్మని పిలువు. అవి నీ వద్దకు పరుగెత్తుకుంటూ వస్తాయి. అల్లాహ్ సర్వ శక్తిమంతుడూ సర్వజ్ఞుడూ అని బాగా జ్ఞాపకం ఉంచుకో."

**261 - 265** తమ సంపదను అల్లాహ్ మార్గంలో ఖర్చుచేసే వారి ఖర్చు ఉపమానం ఇలా ఉంటుంది: ఒక్క విత్తనాన్ని నాటితే, అది మొలిచి ఏడు వెన్నులను ఈనుతుంది. ప్రతి వెన్నుకూ నూరేసి గింజలు ఉంటాయి. ఇదే విధంగా అల్లాహ్ తాను కోరిన వారి సత్కార్యాన్ని వికసింపచేస్తాడు. అల్లాహ్ అమితంగా ఇచ్చేవాడూ అన్నీ తెలిసినవాడూను. అల్లాహ్ మార్గంలో తమ ధనాన్ని వ్యయంచేసి, ఆ తరువాత తమ దాతృత్వాన్ని మాటి మాటికీ చాటుతూ, గ్రహీతల మనస్సును గాయపరచని వారి ప్రతిఫలం వారి ప్రభువు వద్ద ఉంది. వారికి ఏ విధమైన భయం కాని, ఖేదం కాని ఉండవు. మనస్సును గాయపరచే దానం కంటే, మృదుభాషణం, క్షమాగుణం ఎంతో మేలైనవి. అల్లాహ్ అన్నింటికీ అతీతుడు, అత్యంత సహనశీలుడూను. విశ్వసించిన ఓ ప్రజలారా! కేవలం పరుల మెప్పును పొందటానికే తన ధనం ఖర్చుచేసే వాని మాదిరిగా అల్లాహ్‌నూ అంతిమదినాన్నీ విశ్వసించని వాని మాదిరిగా, మీరు దెప్పిపొడిచి, గ్రహీత మనస్సును గాయపరచి మీ దాన ధర్మాలను మట్టిలో కలపకండి. అతడు చేసిన ధన వ్యయాన్ని ఈ విధంగా పోల్చవచ్చు: ఒక కొండరాతిపై ఒక మట్టిపొర ఏర్పడి ఉంది. భారీవర్షం దానిపై కురవగా ఆ మట్టి కాస్తా కొట్టుకు పోయింది. చివరకు మిగిలింది ఉత్త కొండరాయి మాత్రమే. ఇలాంటి వారు తాము దానం చేస్తున్నామని భావించి చేసే పుణ్యకార్యం వల్ల వారికి ఏ ప్రయోజనమూ కలుగదు. అవిశ్వాసులకు సత్యమార్గం చూపటం అల్లాహ్ సంప్రదాయం కాదు.[94]

దీనికి భిన్నంగా తమ సంపదను చిత్తశుద్ధితో కేవలం అల్లాహ్ సంతోషం పొందే ఉద్దేశ్యంతో వ్యయపరచేవారి వ్యయాన్ని మెట్టప్రదేశంలో ఉన్న తోటతో పోల్చవచ్చు. భారీ వర్షం కురిస్తే అది రెట్టింపు పంటను ఇస్తుంది. ఒకవేళ భారీవర్షం కురవక, సన్నని జల్లు పడినా అదే దానికి చాలు. మీరు చేసేదంతా అల్లాహ్ దృష్టిలో ఉంది.

**266** సతతం నీరు పారే పిల్లకాలువలతో, ఖర్జూరం, ద్రాక్ష మొదలైన సకల ఫలాలతో నిండి పచ్చగా అలరారే తోట మీలో ఎవరికైనా ఉండి, అతడు వయోభారంతో క్రుంగి, యోగ్యులు కానటువంటి చిన్నపిల్లలు ఉన్న సంకట సమయంలో ఆ తోట సుడిగాలికి గురిఅయి నశించిపోవటం మీలో ఎవరికైనా సమ్మతమేనా?[95] మీరు యోచించగలందులకు ఈ విధంగా అల్లాహ్ తన హితవులను విశదపరుస్తాడు.

**267 - 269** విశ్వసించిన ప్రజలారా! మీరు సంపాదించిన ధనంలోని, మేము మీ కొరకు నేల నుండి ఉత్పత్తి చేసిన దానిలోని మేలైన భాగాన్ని దైవమార్గంలో ఖర్చుపెట్టండి. ఆయన మార్గంలో ఇవ్వటానికి పనికిరాని వస్తువులను ఏరితీసే ప్రయత్నం చెయ్యకండి. ఒకవేళ ఆ వస్తువులనే ఎవరన్నా మీకు ఇస్తే, వాటిని మీరు తృణీకార భావంతో తప్ప, మనసారా స్వీకరించరు కదా! అల్లాహ్‌కు ఏదీ ఏమాత్రం అవసరం లేదనీ ఆయన మహోత్తమమైన గుణములు కలవాడనీ మీరు తెలుసుకోండి. దారిద్ర్య ప్రమాదం చూపి షైతాను మిమ్మల్ని భయపెడతాడు. నీతిబాహ్యమైన, నీచమైన మార్గం అవలంబించండి అని ప్రేరేపిస్తాడు. కాని మిమ్మల్ని క్షమిస్తానని, అనుగ్రహిస్తానని అల్లాహ్ వాగ్దానం చేస్తున్నాడు. అల్లాహ్ అత్యంత ఉదార స్వభావుడు, అన్నీ తెలిసినవాడు. తాను కోరిన వారికి దివ్యజ్ఞానం ప్రసాదిస్తాడు. ఎవరికి దివ్యజ్ఞానం లభించిందో, వాస్తవంగా వారికి మహాభాగ్యం లభించినట్లే. విజ్ఞత ఉన్నవారే ఈ విషయాల నుండి పాఠం నేర్చుకుంటారు.

وَمَثَلُ الَّذِيْنَ يُنْفِقُوْنَ اَمْوَالَهُمُ ابْتِغَآءَ
مَرْضَاتِ اللّٰهِ وَتَثْبِيْتًا مِّنْ اَنْفُسِهِمْ كَمَثَلِ
جَنَّةٍۭ بِرَبْوَةٍ اَصَابَهَا وَابِلٌ فَاٰتَتْ اُكُلَهَا
ضِعْفَيْنِ ۚ فَاِنْ لَّمْ يُصِبْهَا وَابِلٌ فَطَلٌّ ؕ وَاللّٰهُ
بِمَا تَعْمَلُوْنَ بَصِيْرٌ ﴿٢٦٥﴾ اَيَوَدُّ اَحَدُكُمْ اَنْ
تَكُوْنَ لَهٗ جَنَّةٌ مِّنْ نَّخِيْلٍ وَّ اَعْنَابٍ تَجْرِيْ
مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ ۙ لَهٗ فِيْهَا مِنْ كُلِّ الثَّمَرٰتِ ۙ
وَاَصَابَهُ الْكِبَرُ وَلَهٗ ذُرِّيَّةٌ ضُعَفَآءُ ۖ
فَاَصَابَهَآ اِعْصَارٌ فِيْهِ نَارٌ فَاحْتَرَقَتْ ؕ
كَذٰلِكَ يُبَيِّنُ اللّٰهُ لَكُمُ الْاٰيٰتِ لَعَلَّكُمْ
تَتَفَكَّرُوْنَ ﴿٢٦٦﴾ يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْۤا اَنْفِقُوْا مِنْ ع
طَيِّبٰتِ مَا كَسَبْتُمْ وَمِمَّاۤ اَخْرَجْنَا لَكُمْ مِّنَ
الْاَرْضِ ۠ وَلَا تَيَمَّمُوا الْخَبِيْثَ مِنْهُ تُنْفِقُوْنَ
وَلَسْتُمْ بِاٰخِذِيْهِ اِلَّاۤ اَنْ تُغْمِضُوْا فِيْهِ ؕ
وَاعْلَمُوْۤا اَنَّ اللّٰهَ غَنِيٌّ حَمِيْدٌ ﴿٢٦٧﴾ اَلشَّيْطٰنُ
يَعِدُكُمُ الْفَقْرَ وَيَاْمُرُكُمْ بِالْفَحْشَآءِ ۚ وَاللّٰهُ
يَعِدُكُمْ مَّغْفِرَةً مِّنْهُ وَفَضْلًا ؕ وَاللّٰهُ وَاسِعٌ
عَلِيْمٌ ﴿٢٦٨﴾ يُّؤْتِى الْحِكْمَةَ مَنْ يَّشَآءُ ۚ وَمَنْ
يُّؤْتَ الْحِكْمَةَ فَقَدْ اُوْتِىَ خَيْرًا كَثِيْرًا ؕ وَمَا
يَذَّكَّرُ اِلَّاۤ اُولُوا الْاَلْبَابِ ﴿٢٦٩﴾

91. తాగూత్ పదం అసలు ఏకవచనమే అయినా, ఇక్కడ మాత్రం బహువచనంగా వాడబడింది. ఎందుకంటే దైవానికి విముఖుడైన మానవుడు ఒకే ఒక్క 'తాగూత్' వలలోనే చిక్కుకోడు. ఎంతోమంది తాగూత్‌లు అతణ్ణి స్వాధీనం చేసుకుంటారు.

92. 'ఆ వ్యక్తి' అంటే నమ్రూద్ అని భావం. హజ్రత్ ఇబ్రాహీము (అస్సలామ్) స్వదేశం అయిన ఇరాఖ్ దేశానికి అతడు రాజు.

93. అంటే, ప్రత్యక్షంగా చూచిన తరువాత కలిగే తృప్తి.

وَمَآ اَنْفَقْتُمْ مِّنْ نَّفَقَةٍ اَوْ نَذَرْتُمْ مِّنْ نَّذْرٍ
فَاِنَّ اللّٰهَ يَعْلَمُهٗ ؕ وَمَا لِلظّٰلِمِيْنَ مِنْ اَنْصَارٍ ﴿٢٧٠﴾
اِنْ تُبْدُوا الصَّدَقٰتِ فَنِعِمَّا هِيَ ۚ وَاِنْ تُخْفُوْهَا
وَتُؤْتُوْهَا الْفُقَرَآءَ فَهُوَ خَيْرٌ لَّكُمْ ؕ وَيُكَفِّرُ
عَنْكُمْ مِّنْ سَيِّاٰتِكُمْ ؕ وَاللّٰهُ بِمَا تَعْمَلُوْنَ
خَبِيْرٌ ﴿٢٧١﴾ لَيْسَ عَلَيْكَ هُدٰىهُمْ وَلٰكِنَّ اللّٰهَ
يَهْدِيْ مَنْ يَّشَآءُ ؕ وَمَا تُنْفِقُوْا مِنْ خَيْرٍ
فَلِاَنْفُسِكُمْ ؕ وَمَا تُنْفِقُوْنَ اِلَّا ابْتِغَآءَ وَجْهِ
اللّٰهِ ؕ وَمَا تُنْفِقُوْا مِنْ خَيْرٍ يُّوَفَّ اِلَيْكُمْ
وَاَنْتُمْ لَا تُظْلَمُوْنَ ﴿٢٧٢﴾

**270 - 271** మీరేమి ఖర్చుపెట్టినదీ, మీరు మొక్కుబడి[96] చేసుకున్నదీ, అంతా అల్లాహ్‌కు తెలుసు. దుర్మార్గులకు సహాయం చేసేవారు ఎవ్వరూ లేరు. మీరు మీ దానధర్మాలను బహిరంగంగా చేసినా మంచిదే. కాని రహస్యంగా నిరుపేదలకు దానమివ్వటం మీకు ఎక్కువ మేలు చేకూరుస్తుంది. మీ దుష్కార్యాలు ఎన్నో దీనివల్ల సమసిపోతాయి. మీరు ఏమి చేసినా అది అల్లాహ్‌కు తెలుస్తుంది.

**272** ప్రవక్తా! ప్రజలను సత్యమార్గంలో నడిపించే బాధ్యత నీపై లేదు. తాను కోరిన వారిని అల్లాహ్‌యే సత్యమార్గంలో నడుపుతాడు. మంచి మార్గంలో మీరు ఖర్చుచేసే ధనం మీకే మేలు చేకూరుస్తుంది. అసలు మీరు ఖర్చుచేసేది అల్లాహ్ సంతోషం పొందటానికేగా! కనుక మంచి మార్గంలో మీరు ఏమి ఖర్చుచేసినా, దాని ప్రతిఫలం మీకు పూర్తిగా లభిస్తుంది. మీకు అన్యాయం ఎంతమాత్రం జరగదు.

---

94. ఇక్కడ మూలంలో కాఫిర్ (అవిశ్వాసి) అనే పదం 'కృతఘ్నుడు', 'అనుగ్రహాన్ని తిరస్కరించేవాడు' అనే అర్థంలో వాడబడింది.

95. మీరు జీవితమంతా సంపాదించింది యావత్తూ, మీకు దాని అవసరం ఎక్కువగా ఉన్నటువంటి, సరికొత్తగా సంపాదించటానికి ఏమాత్రం అవకాశం కూడా లేనటువంటి ముప్పుకాలంలో సర్వనాశనం కావటం మీకు ఇష్టముండదు కదా! అలాగే ప్రపంచంలో జీవితాంతం కష్టపడి పనిచేసిన తరువాత, పరలోక జీవిత ప్రాంగణంలో పాదం మోపగానే, మీరు మీ జీవిత కాలంలో సంపాదించిన దానికి అక్కడ ఏమాత్రం విలువ లేదు అనీ, మళ్ళీ సంపాదించుకునే అవకాశం కూడా లేదు అనీ అకస్మాత్తుగా మీకు తెలిసే పరిస్థితి ఉత్పన్నం కావటాన్ని మీరు ఎలా ఇష్టపడగలుగుతారు? మీరు ప్రపంచం కొరకు సంపాదించింది, ప్రపంచంలోనే ఉండిపోయింది. పరలోకం కొరకు సంపాదించి తీసుకువచ్చింది ఏమీ లేదు కదా, ఇక్కడ దాని ఫలితాన్ని అనుభవించటానికి.

96. 'నజ్ర్' (మొక్కుబడి) అంటే మనిషి తన కోరిక ఏదైనా తీరితే, ఏదైనా సత్కార్యం చేస్తానని ప్రమాణం చెయ్యటం. ఈ సత్కార్యం ఒక ముస్లిముకు నిత్య విధులలోనిది అయి ఉండకూడదు. ఈ కోరిక యుక్తమైనదీ, ధర్మసమ్మతమైనదీ అయితే అనుగ్రహించు అని వేడుకున్నది అల్లాహ్‌నే అయితే, అది తీరిన తరువాత, మనిషి సత్కార్యం చేస్తానని ప్రమాణం చేసింది కేవలం అల్లాహ్ కొరకే అయినట్లయితే, అటువంటి 'మొక్కుబడి' అల్లాహ్ యెడల విధేయతతో చేయబడినట్లే. దానిని నెరవేర్చటం వల్ల ప్రతిఫలమూ, పుణ్యమూ లభిస్తాయి. పరిస్థితి దీనికి భిన్నమయితే, అటువంటి మొక్కుబడి చేసుకొనటం పాపం. దానిని తీర్చటం శిక్షకు, నరకబాధకు గురికావటమే.

لِلۡفُقَرَآءِ الَّذِيۡنَ اُحۡصِرُوۡا فِىۡ سَبِيۡلِ اللّٰهِ لَا
يَسۡتَطِيۡعُوۡنَ ضَرۡبًا فِى الۡاَرۡضِ يَحۡسَبُهُمُ
الۡجَاهِلُ اَغۡنِيَآءَ مِنَ التَّعَفُّفِ‌ۚ تَعۡرِفُهُمۡ
بِسِيۡمٰهُمۡ‌ۚ لَا يَسۡـَٔلُوۡنَ النَّاسَ اِلۡحَافًا‌ ؕ وَمَا
تُنۡفِقُوۡا مِنۡ خَيۡرٍ فَاِنَّ اللّٰهَ بِهٖ عَلِيۡمٌ ٢٧٣ اَلَّذِيۡنَ
يُنۡفِقُوۡنَ اَمۡوَالَهُمۡ بِالَّيۡلِ وَالنَّهَارِ سِرًّا
وَّعَلَانِيَةً فَلَهُمۡ اَجۡرُهُمۡ عِنۡدَ رَبِّهِمۡ‌ۚ وَلَا
خَوۡفٌ عَلَيۡهِمۡ وَلَا هُمۡ يَحۡزَنُوۡنَ ٢٧٤ اَلَّذِيۡنَ
يَاۡكُلُوۡنَ الرِّبٰوا لَا يَقُوۡمُوۡنَ اِلَّا كَمَا يَقُوۡمُ
الَّذِىۡ يَتَخَبَّطُهُ الشَّيۡطٰنُ مِنَ الۡمَسِّ‌ؕ ذٰلِكَ
بِاَنَّهُمۡ قَالُوۡۤا اِنَّمَا الۡبَيۡعُ مِثۡلُ الرِّبٰوا‌ ۘ وَاَحَلَّ
اللّٰهُ الۡبَيۡعَ وَحَرَّمَ الرِّبٰوا‌ ؕ فَمَنۡ جَآءَهٗ
مَوۡعِظَةٌ مِّنۡ رَّبِّهٖ فَانۡتَهٰى فَلَهٗ مَا سَلَفَؕ
وَاَمۡرُهٗۤ اِلَى اللّٰهِ‌ؕ وَمَنۡ عَادَ فَاُولٰٓـئِكَ اَصۡحٰبُ
النَّارِ‌ۚ هُمۡ فِيۡهَا خٰلِدُوۡنَ ٢٧٥ يَمۡحَقُ اللّٰهُ الرِّبٰوا
وَيُرۡبِى الصَّدَقٰتِ‌ؕ وَاللّٰهُ لَا يُحِبُّ كُلَّ كَفَّارٍ
اَثِيۡمٍ ٢٧٦ اِنَّ الَّذِيۡنَ اٰمَنُوۡا وَعَمِلُوا الصّٰلِحٰتِ
وَاَقَامُوا الصَّلٰوةَ وَاٰتَوُا الزَّكٰوةَ لَهُمۡ اَجۡرُهُمۡ
عِنۡدَ رَبِّهِمۡ‌ۚ وَلَا خَوۡفٌ عَلَيۡهِمۡ وَلَا هُمۡ
يَحۡزَنُوۡنَ ٢٧٧

**273** అల్లాహ్ కార్యంలో నిమగ్నులైన కారణంగా, తమ జీవనోపాధి కోసం భూమిపై తిరిగే అవకాశం లేనందువల్ల లేమికి గురిఅయినవారు ప్రత్యేకంగా ధన సహాయానికి అర్హులు. వారిని ఎరుగని మనిషి వారి ఆత్మాభిమానం చూసి వారు భాగ్యవంతులని భావిస్తాడు. వారి ముఖాలను చూసి మీరు వారి నిజస్థితిని గ్రహించగలరు. లోకుల వెంటపడి సహాయం చెయ్యండి అని బ్రతిమాలే మనుషులు కారు వారు. మీరు వారి సహాయార్థం ఏమి ఖర్చుచేసినా, అది అల్లాహ్‌కు తెలియకుండా ఉండదు.

**274 - 277** తమ సంపదను రేయింబవళ్ళు బహిరంగంగానూ, రహస్యంగానూ ఖర్చు చేసే వారు తమ ప్రతిఫలాన్ని తమ ప్రభువువద్ద పొందుతారు. వారికి ఏ విధమైన భయంగాని, దుఃఖంగాని కలిగే అవకాశం లేదు. కాని వడ్డీ తినేవారి స్థితి షైతాను పట్టటం వల్ల ఉన్మాది అయిన వ్యక్తి స్థితి లాంటిది.[97] ఈ స్థితికి వారు గురికావటానికి కారణం వారు "వ్యాపారం కూడ వడ్డీ లాంటిదేగా"[98] అని అనటమే. వాస్తవానికి అల్లాహ్ వ్యాపారాన్ని ధర్మసమ్మతం (హలాల్) చేశాడు. వడ్డీని నిషిద్ధం (హరామ్) చేశాడు. కనుక తన ప్రభువు చేసిన ఈ హితబోధ అందే వ్యక్తి మున్ముందు వడ్డీ తినటం త్యజిస్తే, అతను పూర్వం తిన్నదేదో తిన్నాడు. అతని వ్యవహారం చివరకు అల్లాహ్ వద్దకే పోతుంది.[99] ఈ ఆదేశం తరువాత మళ్ళీ ఈ దుశ్చేష్టకు పాల్పడే వాడు నిశ్చయంగా నరకవాసి. అక్కడ అతడు శాశ్వతంగా ఉంటాడు. అల్లాహ్ వడ్డీని నశింపజేస్తాడు. దానధర్మాలను పెంచి అధికం చేస్తాడు. కృతఘ్నుడూ, దుష్టుడూ అయిన వ్యక్తిని అల్లాహ్ ప్రేమించడు. కాని విశ్వసించి మంచిపనులు చేసే వారికి, నమాజును స్థాపించే వారికి జకాత్‌ను ఇచ్చేవారికి వారి ప్రభువువద్ద తగిన ప్రతిఫలం లభిస్తుంది. వారికి భయం కానీ, శోకంకానీ కలిగే అవకాశం లేదు.

97. అరబ్బులు పిచ్చి మనిషిని 'మజ్నూన్' (జిన్నాతు పట్టినవాడు) అనేవారు. ఎవరి విషయంలోనైనా, అతడు పిచ్చివాడయ్యాడు అని అనవలసివస్తే, అప్పుడు అతణ్ణి జిన్నాతు పట్టుకుంది అని అంటారు. ఇదే లోకోక్తి ఉపయోగిస్తూ ఖురాను వడ్డీ తినేవాణ్ణి ఉన్మత్తుడైన వ్యక్తితో పోల్చింది.

98. వారి దృక్పథంలోని లోపం ఏమిటంటే, వ్యాపారంలోని పెట్టుబడిపై వచ్చే లాభానికీ, వడ్డీకి మధ్య ఉన్న వ్యత్యాసాన్ని వారు అర్థం చేసుకోరు. ఈ రెంటినీ ఒకే త్రాటకట్టి, వ్యాపారంలో పెట్టిన డబ్బుపై వచ్చే లాభం ధర్మసమ్మతం అయినప్పుడు, అప్పుగా ఇచ్చిన డబ్బుపై వచ్చే లాభం ధర్మసమ్మతం ఎందుకు కాదు అని తర్కం చేస్తారు.

يَآيُّهَا الَّذِيْنَ اٰمَنُوا اتَّقُوا اللّٰهَ وَذَرُوْا مَا
بَقِيَ مِنَ الرِّبٰوٓا اِنْ كُنْتُمْ مُّؤْمِنِيْنَ ﴿٢٧٨﴾ فَاِنْ لَّمْ
تَفْعَلُوْا فَاْذَنُوْا بِحَرْبٍ مِّنَ اللّٰهِ وَرَسُوْلِهٖ ۚ
وَاِنْ تُبْتُمْ فَلَكُمْ رُءُوْسُ اَمْوَالِكُمْ ۚ لَا
تَظْلِمُوْنَ وَلَا تُظْلَمُوْنَ ﴿٢٧٩﴾ وَاِنْ كَانَ ذُوْ
عُسْرَةٍ فَنَظِرَةٌ اِلٰى مَيْسَرَةٍ ۗ وَاَنْ تَصَدَّقُوْا
خَيْرٌ لَّكُمْ اِنْ كُنْتُمْ تَعْلَمُوْنَ ﴿٢٨٠﴾ وَاتَّقُوْا يَوْمًا
تُرْجَعُوْنَ فِيْهِ اِلَى اللّٰهِ ۗ ثُمَّ تُوَفّٰى كُلُّ نَفْسٍ
مَّا كَسَبَتْ وَهُمْ لَا يُظْلَمُوْنَ ﴿٢٨١﴾ ع

**278 - 281** విశ్వసించిన ప్రజలారా! మీరు నిజంగా విశ్వాసులే అయితే, అల్లాహ్‌కు భయపడండి, ఇంకా మీకు ప్రజల నుండి రావలసిన వడ్డీని విడిచిపెట్టండి. కాని ఒకవేళ మీరు అలా చెయ్యకపోతే, మీపై అల్లాహ్ తరఫునుండి ఆయన ప్రవక్త తరఫు నుండి యుద్ధ ప్రకటన ఉంది అనే విషయం తెలుసుకోండి.[100] ఇప్పుడైనా మీరు పశ్చాత్తాపపడితే (వడ్డీని వదులుకుంటే) అసలు సొమ్ము తీసుకోవటానికి హక్కు దారులవుతారు. మీరూ అన్యాయం చెయ్యకూడదు, మీకూ అన్యాయం జరగకూడదు. మీ బాకీదారుడు ఆర్థిక ఇబ్బందులలో ఉంటే, అతని పరిస్థితి మెరుగుపడే వరకు గడువు ఇవ్వండి. లేక మీరు తెలిసినవారే అయితే, ఆ బాకీని అతనికి దానం చెయ్యండి. అది మీకు ఎక్కువ శ్రేయస్కరం.[101] అల్లాహ్ వద్దకు మీరు మరలి వెళ్ళేరోజున జరిగే పరాభవం నుండి, కలిగే ఆపద నుండి రక్షించుకోండి. అక్కడ ప్రతి ఒక్కడికీ అతడు చేసిన మంచి చెడ్డలకు పరిపూర్ణ ప్రతిఫలం లభిస్తుంది. ఎవరికీ ఏ మాత్రం అన్యాయం జరగదు.

99. అతడు తిన్నదాన్ని అల్లాహ్ క్షమించి వదిలేస్తాడు అని సెలవీయబడలేదు. అతని వ్యవహారం అల్లాహ్‌కు సమర్పించబడుతుంది అని మాత్రమే అనబడింది. ఈ వాక్యం ద్వారా తెలిసేదేమిటంటే, అతను “పూర్వం తిన్నదేదో తిన్నాడు” అనే దాని భావం, ఇదివరకు తినబడిన వడ్డీని క్షమించటం జరిగిందని కాదు. అతనికి కేవలం చట్ట సంబంధమైన రాయితీ ఇవ్వబడిందని భావం. అంటే ఇదివరకు తినబడిన వడ్డీని తిరిగి ఇచ్చివెయ్యి అని చట్టరీత్యా అడగటం జరగదు.

100. ఈ ఆయత్ మక్కా విజయం తరువాత అవతరించింది. అప్పుడు అరేబియా ఇస్లామీ ప్రభుత్వం క్రింద ఉంది. ఇంతకు పూర్వం వడ్డీని అసహ్యించుకున్నప్పటికీ, చట్టరీత్యా దానిని నిషేధించటం జరగలేదు. ఈ ఆయత్ అవతరణ తరువాత ఇస్లామీ ప్రభుత్వం పరిధిలో వడ్డీ వ్యాపారం శిక్షార్హమైన నేరంగా పరిగణించబడింది. ఆయత్ చివరి పదాలు ఆధారంగా ఇబ్నె అబ్బాస్ (రజిఅన్), హసన్ బస్రీ (రహ్మాలై), ఇబ్నె సీరీన్ (రహ్మాలై), రబీ బిన్ అనస్ (రహ్మాలై)ల అభిప్రాయమేమిటంటే, దారుల్ ఇస్లామ్‌లో (ఇస్లామీ రాజ్యపరిధిలో) వడ్డీ తినేవాణ్ణి “తౌబా” (పశ్చాత్తాపం) చేసుకో అని బలవంతం చెయ్యాలి. ఒకవేళ వడ్డీ తినటం మానుకోకుంటే అతణ్ణి వధించాలి. ఇతర షరీయత్తువేత్తల అభిప్రాయం ప్రకారం, అటువంటి మనిషిని చెరసాలలో పెట్టటం సరిపోతుంది. వడ్డీ తినటాన్ని వదలిపెట్టే ప్రమాణం చెయ్యనంత వరకు అతణ్ణి వదలిపెట్టకూడదు.

101. ఈ ఆయత్ నుండి ఒక షరీయత్తు ఆజ్ఞను గ్రహించటం జరిగింది. రుణగ్రస్తుడు రుణాన్ని చెల్లించలేకపోతే ఇస్లామీ న్యాయస్థానం రుణదాతను వ్యవధి ఇవ్వవలసిందేనని ఆదేశిస్తుంది. కొన్ని పరిస్థితులలో మొత్తం రుణాన్ని లేక రుణంలోని ఒక భాగాన్ని మాఫీ చేయించే అధికారం కూడా దానికి ఉంది. షరీయత్తువేత్తలు, మనిషి నివాసగృహాన్ని, భోజన పాత్రలనూ, కట్టుబట్టలనూ, ఉపాధి పనిముట్లనూ ఎట్టి పరిస్థితులలోనూ జప్తు చెయ్యటానికి వీలులేదని వివరించారు.

يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْۤا اِذَا تَدَايَنْتُمْ بِدَيْنٍ اِلٰۤى
اَجَلٍ مُّسَمًّى فَاكْتُبُوْهُ ؕ وَلْيَكْتُبْ بَّيْنَكُمْ كَاتِبٌ
بِالْعَدْلِ ۪ وَلَا يَاْبَ كَاتِبٌ اَنْ يَّكْتُبَ كَمَا
عَلَّمَهُ اللّٰهُ فَلْيَكْتُبْ ۚ وَلْيُمْلِلِ الَّذِىْ عَلَيْهِ
الْحَقُّ وَلْيَتَّقِ اللّٰهَ رَبَّهٗ وَلَا يَبْخَسْ مِنْهُ
شَيْـــًٔا ؕ فَاِنْ كَانَ الَّذِىْ عَلَيْهِ الْحَقُّ سَفِيْهًا اَوْ
ضَعِيْفًا اَوْ لَا يَسْتَطِيْعُ اَنْ يُّمِلَّ هُوَ فَلْيُمْلِلْ
وَلِيُّهٗ بِالْعَدْلِ ؕ وَاسْتَشْهِدُوْا شَهِيْدَيْنِ مِنْ
رِّجَالِكُمْ ۚ فَاِنْ لَّمْ يَكُوْنَا رَجُلَيْنِ فَرَجُلٌ
وَّامْرَاَتٰنِ مِمَّنْ تَرْضَوْنَ مِنَ الشُّهَدَآءِ اَنْ
تَضِلَّ اِحْدٰٮهُمَا فَتُذَكِّرَ اِحْدٰٮهُمَا الْاُخْرٰى ؕ
وَلَا يَاْبَ الشُّهَدَآءُ اِذَا مَا دُعُوْا ؕ وَلَا
تَسْـَٔمُوْۤا اَنْ تَكْتُبُوْهُ صَغِيْرًا اَوْ كَبِيْرًا اِلٰۤى
اَجَلِهٖ ؕ ذٰلِكُمْ اَقْسَطُ عِنْدَ اللّٰهِ وَاَقْوَمُ
لِلشَّهَادَةِ وَاَدْنٰۤى اَلَّا تَرْتَابُوْۤا اِلَّاۤ اَنْ تَكُوْنَ
تِجَارَةً حَاضِرَةً تُدِيْرُوْنَهَا بَيْنَكُمْ فَلَيْسَ
عَلَيْكُمْ جُنَاحٌ اَلَّا تَكْتُبُوْهَا ؕ وَاَشْهِدُوْۤا اِذَا
تَبَايَعْتُمْ ۪ وَلَا يُضَآرَّ كَاتِبٌ وَّلَا شَهِيْدٌ ؕ۬
وَاِنْ تَفْعَلُوْا فَاِنَّهٗ فُسُوْقٌ بِكُمْ ؕ وَاتَّقُوا اللّٰهَ ؕ
وَيُعَلِّمُكُمُ اللّٰهُ ؕ وَاللّٰهُ بِكُلِّ شَىْءٍ عَلِيْمٌ ۲۸۲

**282** విశ్వసించిన ప్రజలారా! మీరు పరస్పరం ఒక నిర్ణీత కాలం కొరకు అప్పు తీసుకున్నప్పుడు,[102] ఆ వ్యవహారాన్ని వ్రాసి పదిలపరచండి. ఇరుపక్షాల మధ్య న్యాయంగా దస్తావేజును ఒక వ్యక్తి వ్రాయాలి. అల్లాహ్ ఎవడికైతే అక్షరజ్ఞానం ప్రసాదించాడో, అతడు వ్రాయటానికి నిరాకరించకూడదు. అతడు వ్రాయాలి. బాధ్యత మోపబడిన వ్యక్తి (అప్పు తీసుకునేవాడు) చెప్పి వ్రాయించాలి. అతడు తన ప్రభువైన అల్లాహ్‌కు భయపడాలి. నిర్ణయమైన షరతులలో హెచ్చుతగ్గులు చెయ్యరాదు. కాని రుణం తీసుకునే వ్యక్తి అమాయకుడు లేక బలహీనుడు లేక చెప్పి వ్రాయించలేని అసమర్థుడు అయితే, అతని సంరక్షకుడు న్యాయంగా చెప్పి వ్రాయించాలి. ఇంకా మీరు మీలోని ఇద్దరు పురుషులను దానికి సాక్షులుగా పెట్టుకోవాలి. ఇద్దరు పురుషులు లభించని పక్షంలో, ఒక పురుషుడు, ఇద్దరు స్త్రీలు సాక్షులుగా ఉండాలి. ఎందుకంటే వారిలో ఒకామె మరచిపోతే, రెండవ స్త్రీ ఆమెకు జ్ఞాపకం చేస్తుంది. ఎవరి సాక్ష్యం మీ అందరికీ ఆమోదయోగ్యమో వారి నుండే ఈ సాక్షులు ఎన్నుకోబడాలి. సాక్ష్యం ఇవ్వండి అని ఆహ్వానించినప్పుడు, సాక్షులు నిరాకరించకూడదు. వ్యవహారం చిన్నదైనా, పెద్దదైనా, దానిని గడువు నిర్ణయంతో దస్తావేజు రూపంలో వ్రాయించటానికి అశ్రద్ధ చెయ్యకూడదు. అల్లాహ్ దృష్టిలో ఈ పద్ధతి మీ కొరకు అత్యంత న్యాయ సమ్మతమైనది. సులభంగా సాక్ష్య నిర్ణయం చెయ్యటానికి ఇది తోడ్పడుతుంది. ఇంకా, మీరు అనుమానాలకు, అపోహలకు గురిఅయ్యే అవకాశం తక్కువగా ఉంటుంది. కాని మీరు అప్పటికప్పుడు పరస్పరం చేసుకునే (సాధారణ) వ్యాపార సంబంధమైన లావాదేవీలను వ్రాయకుండావుంటే, అందులో అభ్యంతరం లేదు. కాని వ్యాపార వ్యవహారాలు నిశ్చయించేటప్పుడు, తప్పకుండా సాక్షులను పెట్టుకోండి. దస్తావేజు వ్రాసేవానినీ, సాక్షులనూ పీడించరాదు. ఆ విధంగా చేస్తే అది పాపం అవుతుంది. అల్లాహ్ ఆగ్రహాన్నుండి రక్షించుకోండి. ఆయన మీకు సరియైన పద్ధతిని బోధిస్తున్నాడు. ఆయనకు ప్రతిదీ తెలుసు.

102. అప్పు వ్యవహారంలో గడువు నిర్ణయం తప్పనిసరిగా జరగాలి అనే ఆజ్ఞ దీని నుండే ఉద్భవించింది.

وَاِنْ كُنْتُمْ عَلٰى سَفَرٍ وَّلَمْ تَجِدُوْا كَاتِبًا فَرِهٰنٌ
مَّقْبُوْضَةٌ ؕ فَاِنْ اَمِنَ بَعْضُكُمْ بَعْضًا فَلْيُؤَدِّ
الَّذِى اؤْتُمِنَ اَمَانَتَهٗ وَلْيَتَّقِ اللّٰهَ رَبَّهٗ ؕ وَلَا
تَكْتُمُوا الشَّهَادَةَ ؕ وَمَنْ يَّكْتُمْهَا فَاِنَّهٗۤ اٰثِمٌ
قَلْبُهٗ ؕ وَاللّٰهُ بِمَا تَعْمَلُوْنَ عَلِيْمٌ ﴿٢٨٣﴾ لِلّٰهِ مَا فِى
السَّمٰوٰتِ وَمَا فِى الْاَرْضِ ؕ وَاِنْ تُبْدُوْا مَا
فِىْۤ اَنْفُسِكُمْ اَوْ تُخْفُوْهُ يُحَاسِبْكُمْ بِهِ اللّٰهُ ؕ
فَيَغْفِرُ لِمَنْ يَّشَآءُ وَيُعَذِّبُ مَنْ يَّشَآءُ ؕ
وَاللّٰهُ عَلٰى كُلِّ شَىْءٍ قَدِيْرٌ ﴿٢٨٤﴾ اٰمَنَ الرَّسُوْلُ بِمَآ
اُنْزِلَ اِلَيْهِ مِنْ رَّبِّهٖ وَالْمُؤْمِنُوْنَ ؕ كُلٌّ اٰمَنَ
بِاللّٰهِ وَمَلٰٓئِكَتِهٖ وَكُتُبِهٖ وَرُسُلِهٖ ۟ لَا نُفَرِّقُ
بَيْنَ اَحَدٍ مِّنْ رُّسُلِهٖ ۟ وَقَالُوْا سَمِعْنَا وَ
اَطَعْنَا ۫ غُفْرَانَكَ رَبَّنَا وَاِلَيْكَ الْمَصِيْرُ ﴿٢٨٥﴾

**283** మీరు ప్రయాణంలో ఉన్నప్పుడు, దస్తావేజు వ్రాసేవాడు దొరకని పక్షంలో, మీవద్ద ఉన్న వస్తువును తాకట్టుపెట్టండి.[103] మీలో ఎవరైనా మరొకర్ని నమ్మి అతనితో ఒక వ్యవహారం చేసినట్లయితే, ఆ వ్యక్తి తనవద్ద ఉన్న అమానతును తిరిగి ఇవ్వాలి. అతడు తన ప్రభువైన అల్లాహ్‌కు భయపడాలి. ఎట్టి పరిస్థితులలోనూ సాక్ష్యాన్ని దాచకండి. సాక్ష్యాన్ని దాచేవాడి హృదయం పాపభూయిష్టమైనది. మీరు చేసేవన్నీ అల్లాహ్‌కు తెలుసు.

**284** ఆకాశాలలో, భూమిపై ఉన్న సమస్తమూ అల్లాహ్‌దే. మీరు మీ మనస్సులలో ఉన్న విషయాలను ప్రకటించినా లేక దాచినా, వాటిని గురించి ఎట్టకేలకు అల్లాహ్ లెక్క తీసుకుంటాడు. ఇంకా, తాను కోరిన వారిని క్షమించటానికీ, తాను కోరిన వారిని శిక్షించటానికీ ఆయనకు అధికారం ఉంది. ఆయన అన్నిటిపైన అధికారం కలవాడు.

**285** ప్రవక్త తనపై తన ప్రభువు నుండి అవతరించిన దాన్ని విశ్వసించాడు. ఈ ప్రవక్తను విశ్వసించేవారు కూడా దానిని హృదయపూర్వకంగా స్వీకరించారు. వారంతా అల్లాహ్‌నూ, ఆయన దూతలనూ, ఆయన గ్రంథాలనూ, ఆయన ప్రవక్తలనూ విశ్వసిస్తారు. వారు ఇలా అంటారు: "మేము అల్లాహ్ పంపిన ప్రవక్తలలోని ఏ ఒక్కరినీ భేదభావంతో చూడము. మేము ఆదేశం విన్నాము, శిరసావహించాము. స్వామీ! క్షమాభిక్ష పెట్టు అని మేము నిన్ను అర్థిస్తున్నాము. చివరకు మేమంతా నీదెసకే మరలి వస్తాము."

103. తాకట్టు ఉద్దేశ్యం, కేవలం అప్పు ఇచ్చేవాడికి తన అప్పు క్షేమంగా తిరిగి వస్తుందనే ధైర్యం కలిగించటమే. కాని అతనికి తన అప్పుకు బదులుగా తాకట్టు పెట్టబడిన వస్తువును వినియోగించుకునే హక్కు లేదు. ఎందుకంటే అది వడ్డీ అవుతుంది. అయితే పశువును తాకట్టు పెట్టుకుంటే దాని పాలు త్రాగవచ్చు, దానిపై స్వారీ చెయ్యవచ్చు. దానిచే బరువు లాగించవచ్చు – ఎందుకంటే ఇది, అసలు అతడు ఆ పశువుకు పెట్టిన మేతకు ప్రతిఫలం.

لَا يُكَلِّفُ اللّٰهُ نَفْسًا اِلَّا وُسْعَهَا ؕ لَهَا مَا
كَسَبَتْ وَعَلَيْهَا مَا اكْتَسَبَتْ ؕ رَبَّنَا لَا
تُؤَاخِذْنَآ اِنْ نَّسِيْنَآ اَوْ اَخْطَاْنَا ۚ رَبَّنَا وَلَا
تَحْمِلْ عَلَيْنَآ اِصْرًا كَمَا حَمَلْتَهٗ عَلَى الَّذِيْنَ
مِنْ قَبْلِنَا ۚ رَبَّنَا وَلَا تُحَمِّلْنَا مَا لَا طَاقَةَ لَنَا
بِهٖ ۚ وَاعْفُ عَنَّا ۥ وقفة وَاغْفِرْ لَنَا ۥ وقفة وَارْحَمْنَا ۥ وقفة
اَنْتَ مَوْلٰنَا فَانْصُرْنَا عَلَى الْقَوْمِ الْكٰفِرِيْنَ ﴿٢٨٦﴾ ع ۴۰ ۳ ۸

**286** ఏ ప్రాణిపైనా అల్లాహ్ దాని శక్తి సామర్థ్యాలకు మించిన బరువు బాధ్యతలను మోపడు. తాను సంపాదించిన పుణ్యానికి సత్ఫలితాన్నీ, తాను కూడబెట్టిన పాపానికి దుష్ఫలితాన్నీ ప్రతి వ్యక్తీ అనుభవిస్తాడు.

(విశ్వసించిన ప్రజలారా! మీరు ఈ విధంగా ప్రార్థిస్తూ ఉండండి): "మా ప్రభూ! పొరపాటువల్ల జరిగే మా తప్పులను పట్టబోకు. స్వామీ! మాకు పూర్వం వారిపై మోపిన భారాన్ని మాపై మోపకు. ప్రభూ! ఏ బరువును మోసే శక్తి మాలో లేదో, దానిని మాపై పెట్టకు. మమ్మల్ని మన్నించు. మమ్మల్ని క్షమించు. మమ్మల్ని కరుణించు. నీవు మాకు రక్షకుడవు. అవిశ్వాసులకు వ్యతిరేకంగా మాకు సహాయపడు."

ఆయతులు 200 | **3. ఆలి ఇమ్రాన్** | అవతరణ మదీనాలో

٣ سُورَةُ اٰلِ عِمْرٰنَ مَدَنِيَّةٌ ٨٩

رکوعاتها ٢٠ | اٰیاتها ٢٠٠

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○

الٓمّٓ ۚ ① اللّٰهُ لَآ اِلٰهَ اِلَّا هُوَ ۙ الۡحَـىُّ الۡقَيُّوۡمُ ؕ ②
نَزَّلَ عَلَيۡكَ الۡكِتٰبَ بِالۡحَـقِّ مُصَدِّقًا لِّمَا بَيۡنَ
يَدَيۡهِ وَاَنۡزَلَ التَّوۡرٰٮةَ وَالۡاِنۡجِيۡلَ ۙ ③ مِنۡ
قَبۡلُ هُدًى لِّلنَّاسِ وَاَنۡزَلَ الۡفُرۡقَانَ ؕ اِنَّ
الَّذِيۡنَ كَفَرُوۡا بِاٰيٰتِ اللّٰهِ لَهُمۡ عَذَابٌ
شَدِيۡدٌ ؕ وَاللّٰهُ عَزِيۡزٌ ذُوۡانۡتِقَامٍ ④ اِنَّ اللّٰهَ
لَا يَخۡفٰى عَلَيۡهِ شَىۡءٌ فِى الۡاَرۡضِ وَلَا فِى
السَّمَآءِ ؕ ⑤ هُوَ الَّذِىۡ يُصَوِّرُكُمۡ فِى الۡاَرۡحَامِ
كَيۡفَ يَشَآءُ ؕ لَآ اِلٰهَ اِلَّا هُوَ الۡعَزِيۡزُ
الۡحَكِيۡمُ ⑥ هُوَ الَّذِىۡٓ اَنۡزَلَ عَلَيۡكَ الۡكِتٰبَ
مِنۡهُ اٰيٰتٌ مُّحۡكَمٰتٌ هُنَّ اُمُّ الۡكِتٰبِ وَاُخَرُ
مُتَشٰبِهٰتٌ ؕ فَاَمَّا الَّذِيۡنَ فِىۡ قُلُوۡبِهِمۡ زَيۡغٌ
فَيَتَّبِعُوۡنَ مَا تَشَابَهَ مِنۡهُ ابۡتِغَآءَ الۡفِتۡنَةِ
وَابۡتِغَآءَ تَاۡوِيۡلِهٖ ؕ وَمَا يَعۡلَمُ تَاۡوِيۡلَهٗۤ اِلَّا
اللّٰهُ ؔ وَالرّٰسِخُوۡنَ فِى الۡعِلۡمِ يَقُوۡلُوۡنَ اٰمَنَّا بِهٖ ۙ كُلٌّ
مِّنۡ عِنۡدِ رَبِّنَا ۚ وَمَا يَذَّكَّرُ اِلَّاۤ اُولُوا الۡاَلۡبَابِ ⑦

وقف النبي صلى الله عليه وسلم وقف لازم وقف منزل

**1 – 2** అలిఫ్ లామ్ మీమ్. అల్లాహ్ – సజీవుడు, నిత్యుడు, విశ్వ వ్యవస్థకు ఆధారభూతుడు. వాస్తవానికి ఆయన తప్ప మరొక దేవుడు లేడు.

**3 – 4** ప్రవక్తా! ఆయన ఈ గ్రంథాన్ని నీపై అవతరింపజేశాడు. అది సత్యాన్ని తీసుకువచ్చింది. మునుపు అవతరించిన గ్రంథాలను ధ్రువపరుస్తుంది. దీనికి పూర్వం ఆయన మానవులకు రుజుమార్గం చూపటానికి తౌరాతు, ఇన్‌జీలు గ్రంథాలను అవతరింపజేశాడు. ఇంకా (సత్యాసత్యాలను వేరుచేసి చూపే) గీటురాయిని అవతరింపజేశాడు. ఇక నుండి అల్లాహ్ ఆజ్ఞలను ధిక్కరించే వారికి కఠిన శిక్షపడటం నిశ్చయం. అల్లాహ్ మహత్తర శక్తి సంపన్నుడు, దుష్టత్వానికి తగిన ప్రతిఫలం ఇచ్చేవాడూను.

**5 – 9** భూమ్యాకాశాలలోని ఏ వస్తువూ అల్లాహ్‌కు గోప్యంగా లేదు. మాతృ గర్భాలలో మీ రూపాలను తన ఇష్టానుసారం తీర్చిదిద్దేది ఆయనే కదా! మహాశక్తిశాలీ, మహా వివేకీ అయిన ఆయన తప్ప మరొక దేవుడు లేడు. ప్రవక్తా! నీపై ఈ గ్రంథాన్ని అవతరింపజేసినవాడు ఆ దేవుడే! ఈ గ్రంథంలో రెండు రకాల ఆయతులు ఉన్నాయి. మొదటివి, ముహ్కమాత్[1] (స్పష్టమైనవి). అవి గ్రంథానికి పునాదుల వంటివి. రెండోవి, ముతషాబిహాత్ (అస్పష్టమైనవి). వక్రమనస్కులు కలతలను రేపేందుకు ఎల్లప్పుడూ 'ముతషాబిహాత్'[2] వెంటపడి వాటికి అర్థాలు తొడిగే ప్రయత్నం చేస్తారు. కాని వాటి అసలు అర్థాన్ని అల్లాహ్ తప్ప మరెవ్వరూ ఎరుగరు. దీనికి భిన్నంగా, పరిపక్వ జ్ఞానం కలవారు ఇలా అంటారు: "వాటిని మేము విశ్వసించాము. ఇవన్నీ మా ప్రభువు నుండి వచ్చినవే."[3] యథార్థం ఏమిటంటే, ఏ విషయాన్నుండైనా విజ్ఞతగలవారే గుణపాఠం నేర్చుకుంటారు.

1. ఏ ఆయతుల భాష సుస్పష్టంగా ఉంటుందో, వేటి భావాన్ని నిర్ణయించటంలో ఏ విధమైన సంశయానికి తావు ఉండదో, ఆ ఆయతులను 'ముహ్కమాత్' అంటారు. 'అవి గ్రంథానికి పునాదుల వంటివి' అంటే, ఖురాను ఏ లక్ష్యం కొరకు అవతరించిందో, ఆ లక్ష్యాన్ని ఈ ఆయతులే నెరవేరుస్తాయి. వాటిలోనే ఇస్లాం వైపునకు ప్రపంచాన్ని ఆహ్వానించటమూ, గుణపాఠానికీ, హితోపదేశానికీ సంబంధించిన విషయాలను ప్రబోధించటమూ, అపమార్గాల

رَبَّنَا لَا تُزِغْ قُلُوْبَنَا بَعْدَ اِذْ هَدَيْتَنَا وَهَبْ
لَنَا مِنْ لَّدُنْكَ رَحْمَةً ۚ اِنَّكَ اَنْتَ الْوَهَّابُ ﴿٨﴾
رَبَّنَآ اِنَّكَ جَامِعُ النَّاسِ لِيَوْمٍ لَّا رَيْبَ
فِيْهِ ۭ اِنَّ اللّٰهَ لَا يُخْلِفُ الْمِيْعَادَ ﴿٩﴾ اِنَّ ع
الَّذِيْنَ كَفَرُوْا لَنْ تُغْنِيَ عَنْهُمْ اَمْوَالُهُمْ وَلَآ
اَوْلَادُهُمْ مِّنَ اللّٰهِ شَيْـــًٔا ۭ وَاُولٰۗىِٕكَ هُمْ وَقُوْدُ
النَّارِ ﴿١٠﴾ كَدَاْبِ اٰلِ فِرْعَوْنَ ۙ وَالَّذِيْنَ مِنْ
قَبْلِهِمْ ۭ كَذَّبُوْا بِاٰيٰتِنَا ۚ فَاَخَذَهُمُ اللّٰهُ
بِذُنُوْبِهِمْ ۭ وَاللّٰهُ شَدِيْدُ الْعِقَابِ ﴿١١﴾ قُلْ
لِّلَّذِيْنَ كَفَرُوْا سَتُغْلَبُوْنَ وَتُحْشَرُوْنَ اِلٰى
جَهَنَّمَ ۭ وَبِئْسَ الْمِهَادُ ﴿١٢﴾ قَدْ كَانَ لَكُمْ اٰيَةٌ فِيْ
فِئَتَيْنِ الْتَقَتَا ۭ فِئَةٌ تُقَاتِلُ فِيْ سَبِيْلِ اللّٰهِ
وَاُخْرٰى كَافِرَةٌ يَّرَوْنَهُمْ مِّثْلَيْهِمْ رَاْيَ
الْعَيْنِ ۭ وَاللّٰهُ يُؤَيِّدُ بِنَصْرِهٖ مَنْ يَّشَاۗءُ ۭ
اِنَّ فِيْ ذٰلِكَ لَعِبْرَةً لِّاُولِي الْاَبْصَارِ ﴿١٣﴾

వారు అల్లాహ్‌ను ఇలా ప్రార్థిస్తారు: "ప్రభూ! నీవు మాకు సరియైన మార్గాన్ని చూపావు. ఇక మా మనస్సులను వక్రమార్గం వైపునకు మళ్ళించకు. నీ కారుణ్య నిధినుండి మాకు కారుణ్యాన్ని ప్రసాదించు. నిజమైనదాతవు నీవే. ప్రభూ! నీవు నిశ్చయంగా మానవులందరినీ ఒక రోజున సమావేశపరుస్తావు. ఆ రోజు రావటంలో ఏమాత్రం సందేహం లేదు. నీవు ఎన్నటికీ ఆడిన మాట తప్పేవాడవు కావు."

**10 - 13** అవిశ్వాస వైఖరిని అవలంబించిన వారికి, వారి ఐశ్వర్యబలం కాని, సంతానబలంకాని అల్లాహ్‌కు ప్రతికూలంగా ఉపయోగపడవు. వారు నరకానికి ఇంధనం అయి తీరుతారు. చివరకు వారి ముగింపు ఫిరౌను అనుచరులు, అంతకు పూర్వపు అవిధేయుల ముగింపు వంటిది అవుతుంది- వారు అల్లాహ్ ఆయతులను అసత్యాలుగా తిరస్కరించారు. పర్యవసానంగా వారి పాపాలకుగాను అల్లాహ్ వారిని పట్టుకున్నాడు. వాస్తవం ఏమిటంటే, నిశ్చయంగా అల్లాహ్ కఠినంగా శిక్షిస్తాడు. కనుక ప్రవక్తా! నీ సందేశాన్ని స్వీకరించటానికి నిరాకరించిన వారికి ఇలా చెప్పు: "అనతికాలంలోనే మీరు లోబరుచుకో బడతారు, నరకానికి తరుమబడతారు. నరకం చాలా చెడ్డ నివాసం." (బద్ర్ యుద్ధరంగంలో) మార్కొన్న ఆ రెండు వర్గాలలో మీకు గుణపాఠ సూచన ఉండినది. ఒక వర్గం అల్లాహ్ మార్గంలో పోరాడింది. రెండోది అవిశ్వాసుల వర్గం. అవిశ్వాసులు విశ్వాసులకు రెట్టింపుగా[4] ఉన్న విషయాన్ని చూసేవాళ్ళు స్వయంగా తమ కళ్ళతోనే చూశారు. కాని అల్లాహ్ తాను ఇష్టపడ్డ వారిని తన సహాయంతో బలపరుస్తాడు (అనే విషయాన్ని యుద్ధపరిణామం నిరూపించింది). కళ్ళున్న వారికి ఇందులో ఒక మహత్తరమైన బోధ ఇమిడి ఉంది.

---

ఖండనమూ, సత్యమార్గ వివరణమూ, ధర్మం యొక్క మౌలిక విశ్వాసాలను బోధించటమూ, నమ్మకాలు, ఆరాధనలు, నీతులు, విధులు, ఆజ్ఞలు, నిషేధాలకు సంబంధించిన ఆదేశాలు ఉపదేశించటమూ జరిగింది.

2. ఏ ఆయతుల అర్థంలోనైతే సంశయానికి తావు ఉంటుందో, ఆ ఆయతులను 'ముతషాబిహాత్' అంటారు. అతీంద్రియ సత్యాలకు సంబంధించిన అవసరమైన కనీస సమాచారాన్ని మనిషికి ఇవ్వకుండా అతని కొరకు జీవితానికి సంబంధించిన ఏ మార్గాన్నీ ప్రతిపాదించటం సాధ్యం కాదు అనే విషయం స్పష్టం. ఏ విషయాలైతే

زُيِّنَ لِلنَّاسِ حُبُّ الشَّهَوٰتِ مِنَ النِّسَآءِ
وَالْبَنِيْنَ وَالْقَنَاطِيْرِ الْمُقَنْطَرَةِ مِنَ الذَّهَبِ
وَالْفِضَّةِ وَالْخَيْلِ الْمُسَوَّمَةِ وَالْاَنْعَامِ
وَالْحَرْثِ ؕ ذٰلِكَ مَتَاعُ الْحَيٰوةِ الدُّنْيَا ۚ وَاللّٰهُ
عِنْدَهٗ حُسْنُ الْمَاٰبِ ﴿١٤﴾ قُلْ اَؤُنَبِّئُكُمْ بِخَيْرٍ
مِّنْ ذٰلِكُمْ ؕ لِلَّذِيْنَ اتَّقَوْا عِنْدَ رَبِّهِمْ جَنّٰتٌ
تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ خٰلِدِيْنَ فِيْهَا وَ
اَزْوَاجٌ مُّطَهَّرَةٌ وَّرِضْوَانٌ مِّنَ اللّٰهِ ؕ وَاللّٰهُ
بَصِيْرٌۢ بِالْعِبَادِ ﴿١٥﴾ اَلَّذِيْنَ يَقُوْلُوْنَ رَبَّنَآ اِنَّنَآ
اٰمَنَّا فَاغْفِرْ لَنَا ذُنُوْبَنَا وَقِنَا عَذَابَ النَّارِ ﴿١٦﴾
اَلصّٰبِرِيْنَ وَالصّٰدِقِيْنَ وَالْقٰنِتِيْنَ وَالْمُنْفِقِيْنَ
وَالْمُسْتَغْفِرِيْنَ بِالْاَسْحَارِ ﴿١٧﴾

**14 - 17** స్త్రీలూ, సంతానమూ, వెండి బంగారు రాసులూ, మేలుజాతి గుర్రాలూ, పశువులూ, సేద్యపు భూములూ వంటి వ్యామోహాలపై ప్రేమ ఆకర్షకంగా చెయ్యబడింది. కాని ఇవన్నీ అనిత్యమైన ఐహిక జీవన సంపదలు మాత్రమే. అసలైన ఉత్తమ నివాసం అల్లాహ్ వద్ద ఉన్నదే. ఇలా చెప్పు: వాటికంటే ప్రశస్తమైనదేదో నేను మీకు తెలిపేదా? భయభక్తులు కలవారి కొరకు వారి ప్రభువు వద్ద ఉద్యానవనాలు ఉన్నాయి. వాటి క్రిందుగా కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి. అక్కడ వారికి శాశ్వతమైన జీవితం లభిస్తుంది. పరిశుద్ధ చరితలైన భార్యల సాంగత్యం లభిస్తుంది. అల్లాహ్ సమ్మతి లభిస్తుంది. అల్లాహ్ తన దాసుల నడవడికను శ్రద్ధతో గమనిస్తాడు. వారు అల్లాహ్‌ను ఇలా వేడుకుంటారు: "ప్రభూ! మేము విశ్వసిం చాము. మా తప్పులను మన్నించు. మమ్మల్ని నరక జ్వాలల నుండి కాపాడు." వారు సహనశీలురు, సత్యసంధులు, విధేయులు, దానపరులు, క్షమించు అని రాత్రి చివరి గడియలలో అల్లాహ్‌ను వేడుకుంటారు.

---

మానవ ఇంద్రియాలకు అతీతంగా ఉన్నాయో, వేటినైతే అతడు ఎన్నడూ చూడటంగానీ, ముట్టుకోవటంగానీ, రుచిచూడటం కానీ జరగలేదో, వాటి కొరకు మానవ భాషలో ప్రత్యేకంగా కల్పించబడిన పదాలు లేవు. వాటి యథార్థ స్వరూపాన్ని ప్రతి శ్రోత మనస్సులో చిత్రించటానికి ఉపకరించే భావ ప్రకటన విధానాలూ వాడుకలో లేవు. ఈ కారణం వల్ల, ఇటువంటి విషయాలను వివరించటానికి, అసలు సత్యంతో దగ్గరి పోలిక కలిగివున్న గోచర విషయాలకు మానవ భాషలో లభించే పదాలను, భావ ప్రకటన విధానాలను ఉపయోగించటం అనివార్యం అవుతుంది. కనుక ఈ సత్యాలను వివరించటానికి ఖురానులో ఇటువంటి భాషే వాడబడింది. 'ముతషాబిహాత్' అంటే, ఈ భాష ఉపయోగించబడిన ఆయతులు అని భావం.

3. వారికి ముతషాబిహాత్ యొక్క నిజమైన అర్థమే తెలియనప్పుడు, వారు వాటిని ఎలా విశ్వసించారు అనే సందేహం ఎవరికీ కలగకూడదు. యధార్థం ఏమిటంటే, విజ్ఞత కలిగిన మనిషికి ఖురాను అల్లాహ్ గ్రంథం అనే నమ్మకం 'ముహ్కమాత్' ఆయతుల అధ్యయనం వల్ల కలుగుతుంది కానీ "ముతషాబిహాత్" ఆయతుల అర్థ వివరణల ద్వారా కాదు. 'ముహ్కమాత్' ఆయతులను గురించి సావధానంగా ఆలోచించటం వల్ల, ఈ గ్రంథం నిజంగానే అల్లాహ్ గ్రంథం అనే సంతృప్తి కలిగినప్పుడు, "ముతషాబిహాత్" ఆయతులు అతని హృదయంలో ఏ విధమైన కలతను రేపలేవు.

4. అసలు భేదం మూడింతలు అయినప్పటికీ, స్థూలంగా చూసేవాడు కూడా అవిశ్వాసుల సైన్యం ముస్లిములకు రెట్టింపుగా ఉందని గ్రహించకుండా ఉండలేదు.

**18 - 20** తాను తప్ప మరొక దైవంలేడు అనే సత్యానికి స్వయంగా అల్లాహ్‌యే సాక్ష్యమిచ్చాడు. దైవదూతలు, సమస్త జ్ఞానులు కూడ ఆ మహాశక్తిమంతుడూ, ఆ మహాజ్ఞానీ తప్ప వాస్తవానికి మరొక దైవం లేడు అని నిజాయితీగానూ, న్యాయంగానూ సాక్ష్యమిస్తారు. అల్లాహ్ దృష్టిలో అసలు ధర్మం కేవలం ఇస్లామ్ మాత్రమే. గ్రంథం ఇవ్వబడిన వారు ఈ ధర్మాన్ని త్రోసిరాజని విభిన్న విధానాలను అవలంబించారు. వారి ఈ వైఖరికి కారణం, వారు జ్ఞానం వచ్చిన తరువాత కూడా ఒకరిపై ఒకరు అత్యాచారం చెయ్యటానికి సంకల్పించటమే. అల్లాహ్ ఆజ్ఞలను, ఆయన బోధలను శిరసావహించటానికి తిరస్కరించేవారి లెక్కలను పరిష్కరించటం అల్లాహ్‌కు ఎంతోసేపు పట్టదు. ప్రవక్తా! ఇక వీరు నీతో ఘర్షణకు తలపడితే, ఇలా చెప్పు: "నేనూ నా అనుచరులూ అల్లాహ్‌కు సంపూర్ణంగా విధేయులమయ్యాము." గ్రంథం కలవారినీ, గ్రంథం లేనివారినీ ఉభయులనూ ఇలా అడుగు: "మీరు కూడ ఆయనపట్ల విధేయతకూ, దాస్యానికీ అంగీకరించారా?" అలా చేస్తే వారు సరియైన మార్గాన్ని పొందినట్లే. కాని ఒకవేళ వారు దానికి విముఖులైతే, నీ బాధ్యత కేవలం సందేశాన్ని అందజెయ్యటమే. తరువాత అల్లాహ్ తన దాసుల విషయాలను తానే స్వయంగా చూసుకుంటాడు.

**21 - 22** అల్లాహ్ ఆదేశాలనూ, బోధలనూ శిరసావహించటానికి తిరస్కరించే వారికీ, ఆయన ప్రవక్తలను అన్యాయంగా చంపేవారికీ, సత్యాన్నీ న్యాయాన్నీ శాసించటానికి ప్రజలలో నుండి లేచే వారి ప్రాణాల వెంట పడేవారికీ బాధాకరమైన శిక్షను గురించిన శుభవార్తను వినిపించు. వారి కర్మలు ఇహ పరాలు రెండింటిలోనూ వృథా అవుతాయి. వారికి సహాయపడేవాడెవడూ ఉండడు.

**23 - 25** గ్రంథజ్ఞానంలోని కొంత భాగం పొందిన వారి పరిస్థితి ఎలా ఉందో నీవు గమనించలేదా? దైవగ్రంథం వారి మధ్య తీర్పు చెప్పగలందులకుగాను వారిని దాని వైపునకు ఆహ్వానించినప్పుడు, వారిలోని ఒక వర్గం వారు జారుకుంటారు. ఆ తీర్పు పట్ల వైముఖ్యం చూపుతారు. వారి ఈ నడతకు కారణం, వారు, "మమ్మల్ని నరకాగ్ని అసలు ముట్టుకోదు. ఒకవేళ మాకు నరకశిక్ష పడినా, అది కొన్ని రోజులు మాత్రమే" అని చెప్పుకోవటం. స్వయం కల్పితాలైన వారి నమ్మకాలే వారిని తమ ధర్మం విషయంలో అనేక అపోహలకు లోను చేశాయి. ఏ దినమైతే రావటం తథ్యమో, ఆ దినాన మేము వారిని సమావేశపరచినప్పుడు వారి గతి ఏమవుతుందో? ఆ రోజున ప్రతి మనిషికీ తాను సంపాదించుకున్నదానికి పూర్తి ప్రతిఫలం ఇవ్వబడుతుంది. ఎవరికీ అన్యాయం జరగదు.

شَهِدَ اللّٰهُ اَنَّهٗ لَاۤ اِلٰهَ اِلَّا هُوَ ۙ وَالْمَلٰٓئِكَةُ
وَاُولُوا الْعِلْمِ قَآئِمًا بِالْقِسْطِ ؕ لَاۤ اِلٰهَ اِلَّا هُوَ
الْعَزِيْزُ الْحَكِيْمُ ١٨ اِنَّ الدِّيْنَ عِنْدَ اللّٰهِ الْاِسْلَامُ ۗ النصف
وَمَا اخْتَلَفَ الَّذِيْنَ اُوْتُوا الْكِتٰبَ اِلَّا مِنْۢ بَعْدِ
مَا جَآءَهُمُ الْعِلْمُ بَغْيًاۢ بَيْنَهُمْ ؕ وَمَنْ يَّكْفُرْ
بِاٰيٰتِ اللّٰهِ فَاِنَّ اللّٰهَ سَرِيْعُ الْحِسَابِ ١٩ فَاِنْ
حَآجُّوْكَ فَقُلْ اَسْلَمْتُ وَجْهِىَ لِلّٰهِ وَمَنِ
اتَّبَعَنِ ؕ وَقُلْ لِّلَّذِيْنَ اُوْتُوا الْكِتٰبَ وَالْاُمِّيّٖنَ
ءَاَسْلَمْتُمْ ؕ فَاِنْ اَسْلَمُوْا فَقَدِ اهْتَدَوْا ۚ وَاِنْ
تَوَلَّوْا فَاِنَّمَا عَلَيْكَ الْبَلٰغُ ؕ وَاللّٰهُ بَصِيْرٌۢ
بِالْعِبَادِ ٢٠ اِنَّ الَّذِيْنَ يَكْفُرُوْنَ بِاٰيٰتِ اللّٰهِ ع
وَيَقْتُلُوْنَ النَّبِيّٖنَ بِغَيْرِ حَقٍّ ۙ وَّيَقْتُلُوْنَ
الَّذِيْنَ يَاْمُرُوْنَ بِالْقِسْطِ مِنَ النَّاسِ ۙ فَبَشِّرْهُمْ
بِعَذَابٍ اَلِيْمٍ ٢١ اُولٰٓئِكَ الَّذِيْنَ حَبِطَتْ اَعْمَالُهُمْ
فِى الدُّنْيَا وَالْاٰخِرَةِ ۫ وَمَا لَهُمْ مِّنْ نّٰصِرِيْنَ ٢٢
اَلَمْ تَرَ اِلَى الَّذِيْنَ اُوْتُوْا نَصِيْبًا مِّنَ الْكِتٰبِ
يُدْعَوْنَ اِلٰى كِتٰبِ اللّٰهِ لِيَحْكُمَ بَيْنَهُمْ ثُمَّ
يَتَوَلّٰى فَرِيْقٌ مِّنْهُمْ وَهُمْ مُّعْرِضُوْنَ ٢٣ ذٰلِكَ
بِاَنَّهُمْ قَالُوْا لَنْ تَمَسَّنَا النَّارُ اِلَّاۤ اَيَّامًا
مَّعْدُوْدٰتٍ ۠ وَّغَرَّهُمْ فِىْ دِيْنِهِمْ مَّا كَانُوْا
يَفْتَرُوْنَ ٢٤ فَكَيْفَ اِذَا جَمَعْنٰهُمْ لِيَوْمٍ لَّا رَيْبَ
فِيْهِ ۗ وَوُفِّيَتْ كُلُّ نَفْسٍ مَّا كَسَبَتْ وَهُمْ لَا يُظْلَمُوْنَ ٢٥

قُلِ اللّٰهُمَّ مٰلِكَ الْمُلْكِ تُؤْتِي الْمُلْكَ مَنْ
تَشَآءُ وَتَنْزِعُ الْمُلْكَ مِمَّنْ تَشَآءُ ز وَتُعِزُّ مَنْ
تَشَآءُ وَتُذِلُّ مَنْ تَشَآءُ ط بِيَدِكَ الْخَيْرُ ط
اِنَّكَ عَلٰى كُلِّ شَیْءٍ قَدِيْرٌ ﴿٢٦﴾ تُوْلِجُ الَّيْلَ فِي
النَّهَارِ وَتُوْلِجُ النَّهَارَ فِي الَّيْلِ ز وَتُخْرِجُ
الْحَیَّ مِنَ الْمَيِّتِ وَتُخْرِجُ الْمَيِّتَ مِنَ الْحَیِّ ز
وَتَرْزُقُ مَنْ تَشَآءُ بِغَيْرِ حِسَابٍ ﴿٢٧﴾ لَا يَتَّخِذِ
الْمُؤْمِنُوْنَ الْكٰفِرِيْنَ اَوْلِيَآءَ مِنْ دُوْنِ
الْمُؤْمِنِيْنَ ج وَمَنْ يَّفْعَلْ ذٰلِكَ فَلَيْسَ مِنَ
اللّٰهِ فِيْ شَیْءٍ اِلَّآ اَنْ تَتَّقُوْا مِنْهُمْ تُقٰىةً ط
وَيُحَذِّرُكُمُ اللّٰهُ نَفْسَهٗ ط وَاِلَى اللّٰهِ الْمَصِيْرُ ﴿٢٨﴾
قُلْ اِنْ تُخْفُوْا مَا فِيْ صُدُوْرِكُمْ اَوْ تُبْدُوْهُ
يَعْلَمْهُ اللّٰهُ ط وَيَعْلَمُ مَا فِي السَّمٰوٰتِ وَمَا فِي
الْاَرْضِ ط وَاللّٰهُ عَلٰى كُلِّ شَیْءٍ قَدِيْرٌ ﴿٢٩﴾ يَوْمَ
تَجِدُ كُلُّ نَفْسٍ مَّا عَمِلَتْ مِنْ خَيْرٍ مُّحْضَرًا ۚ
وَّمَا عَمِلَتْ مِنْ سُوْٓءٍ ۚ تَوَدُّ لَوْ اَنَّ بَيْنَهَا
وَبَيْنَهٗٓ اَمَدًۢا بَعِيْدًا ط وَيُحَذِّرُكُمُ اللّٰهُ
نَفْسَهٗ ط وَاللّٰهُ رَءُوْفٌۢ بِالْعِبَادِ ﴿٣٠﴾ ع

معانقة ٣

ع ١٠

**26 - 27** ఇలా అను: “ఓ అల్లాహ్! విశ్వసామ్రాజ్యాధిపత్యానికి ప్రభూ! నీవు కోరినవారికి ప్రభుత్వాధికారాన్ని ప్రసాదిస్తావు. నీవు కోరిన వారి నుండి దాన్ని లాక్కుంటావు. నీవు కోరిన వారికి గౌరవాన్ని ప్రసాదిస్తావు. నీవు కోరిన వారిని పరాభవం పాలు చేస్తావు. శుభాలు నీ అధీనంలో ఉన్నాయి. నిస్సందేహంగా నీకు అన్నింటిపైనా అధికారం ఉంది. నీవు రాత్రిని పగటిలోకి ప్రవేశింపచేస్తావు. పగలును రాత్రిలోకి ప్రవేశింపచేస్తావు. ప్రాణం లేని దాని నుండి ప్రాణమున్న దానిని తీస్తావు. ప్రాణమున్న దాని నుండి ప్రాణం లేనిదానిని తీస్తావు. నీవు కోరిన వారికి లెక్కలేనంత ఉపాధిని ప్రసాదిస్తావు.”

**28 - 30** విశ్వాసులు తోటి విశ్వాసులను కాదని అవిశ్వాసులను తమ మిత్రులుగా, తమ సహచరులుగా, తమ సహాయకులుగా ఎంతమాత్రం ఎన్నుకోరాదు. అలా చేసేవారికి అల్లాహ్‌తో ఏ విధమైన సంబంధమూ లేదు. అయితే వారి దౌర్జన్యం నుండి రక్షణ పొందటానికి, మీరు ఆ వైఖరిని అభినయిస్తే అది క్షమార్హమే.[5] కాని అల్లాహ్ తనకే భయపడండి అని హెచ్చరిస్తున్నాడు. మీరంతా ఆయన వద్దకే మరలిపోవలసి ఉంది.[6] ప్రవక్తా! ప్రజలను ఇలా హెచ్చరించు: “మీ మనస్సులలో ఉన్నదంతా– మీరు దానిని దాచినా లేక బహిర్గతం చేసినా – అల్లాహ్‌కు తెలుసు. భూమ్యాకాశాలలో ఉన్నది ఏదీ ఆయనకు తెలియకుండా లేదు. ఆయన అధికారం అన్నింటిపైనా ఉంది. ప్రతి మనిషీ తాను చేసిన– మంచి చేసినా లేక చెడ్డ చేసినా– దాని ఫలితాన్ని ప్రత్యక్షంగా చూసే రోజు రాబోతోంది. తనకు ఈ రోజు ఇంకా ఎంతో దూరంగా ఉంటే ఎంత బాగుండేది అని మనిషి ఆ రోజున కోరుకుంటాడు. అల్లాహ్ తనకు భయపడండి అని మిమ్మల్ని హెచ్చరిస్తున్నాడు. ఆయనకు తన దాసులంటే ఎంతో ప్రేమ.”

5. అంటే, ఒకవేళ ఎవరైనా ఒక ముస్లిము, ఇస్లామ్ పట్ల విరోధం కలిగి ఉన్న పక్షం మధ్య చిక్కుకుపోయి, వారు తనను హింసిస్తారనే భయం అతనికి కలిగితే, తన విశ్వాసాన్ని రహస్యంగా ఉంచటానికీ, పైకి వారిలోని ఒకడుగా ప్రవర్తించటానికీ అతనికి అనుమతి ఇవ్వబడింది. లేదా, ఒకవేళ అతడు ముస్లిము అని తెలిసిపోతే, తన ప్రాణాన్ని రక్షించుకోవటానికి అతడు అవిశ్వాసులతో స్నేహ వైఖరిని ప్రకటించవచ్చు. చివరకు వారి వ్యతిరేకతను భరించలేని భయానక పరిస్థితి ఏర్పడినప్పుడు అతనికి అవిశ్వాస వచనాన్ని పలికే అనుమతి కూడ ఇవ్వబడింది. (ఈ విధానాన్ని షరీయత్తు పరిభాషలో ‘తఖియ్యా’ అని అంటారు).

6. అంటే, మీ ప్రాణ రక్షణ నిమిత్తం ఇస్లామీ ఉద్యమానికీ ఇస్లామీ పక్షాల ప్రయోజనాలకూ, ఇంకా ముస్లిములలో

وَلِيُمَحِّصَ اللّٰهُ الَّذِيْنَ اٰمَنُوْا وَيَمْحَقَ
الْكٰفِرِيْنَ ﴿۱۴۱﴾ اَمْ حَسِبْتُمْ اَنْ تَدْخُلُوا الْجَنَّةَ
وَلَمَّا يَعْلَمِ اللّٰهُ الَّذِيْنَ جٰهَدُوْا مِنْكُمْ وَ
يَعْلَمَ الصّٰبِرِيْنَ ﴿۱۴۲﴾ وَلَقَدْ كُنْتُمْ تَمَنَّوْنَ
الْمَوْتَ مِنْ قَبْلِ اَنْ تَلْقَوْهُ فَقَدْ رَاَيْتُمُوْهُ
وَاَنْتُمْ تَنْظُرُوْنَ ﴿۱۴۳﴾ وَمَا مُحَمَّدٌ اِلَّا رَسُوْلٌ ع ۱۴ ۵
قَدْ خَلَتْ مِنْ قَبْلِهِ الرُّسُلُ اَفَاۡئِنْ مَّاتَ
اَوْ قُتِلَ انْقَلَبْتُمْ عَلٰۤى اَعْقَابِكُمْ وَمَنْ
يَّنْقَلِبْ عَلٰى عَقِبَيْهِ فَلَنْ يَّضُرَّ اللّٰهَ شَيْـًٔا وَ
سَيَجْزِى اللّٰهُ الشّٰكِرِيْنَ ﴿۱۴۴﴾ وَمَا كَانَ لِنَفْسٍ
اَنْ تَمُوْتَ اِلَّا بِاِذْنِ اللّٰهِ كِتٰبًا مُّؤَجَّلًا وَ
مَنْ يُّرِدْ ثَوَابَ الدُّنْيَا نُؤْتِهٖ مِنْهَا وَمَنْ يُّرِدْ
ثَوَابَ الْاٰخِرَةِ نُؤْتِهٖ مِنْهَا وَسَنَجْزِى
الشّٰكِرِيْنَ ﴿۱۴۵﴾ وَكَاَيِّنْ مِّنْ نَّبِىٍّ قٰتَلَ مَعَهٗ
رِبِّيُّوْنَ كَثِيْرٌ فَمَا وَهَنُوْا لِمَآ اَصَابَهُمْ فِىْ
سَبِيْلِ اللّٰهِ وَمَا ضَعُفُوْا وَمَا اسْتَكَانُوْا وَ
اللّٰهُ يُحِبُّ الصّٰبِرِيْنَ ﴿۱۴۶﴾ وَمَا كَانَ قَوْلَهُمْ اِلَّاۤ
اَنْ قَالُوْا رَبَّنَا اغْفِرْ لَنَا ذُنُوْبَنَا وَاِسْرَافَنَا فِىْۤ
اَمْرِنَا وَثَبِّتْ اَقْدَامَنَا وَانْصُرْنَا عَلَى الْقَوْمِ
الْكٰفِرِيْنَ ﴿۱۴۷﴾ فَاٰتٰىهُمُ اللّٰهُ ثَوَابَ الدُّنْيَا وَ
حُسْنَ ثَوَابِ الْاٰخِرَةِ وَاللّٰهُ يُحِبُّ
الْمُحْسِنِيْنَ ﴿۱۴۸﴾ ع ۱۵ ۶

ఇంకా ఆయన ఈ పరీక్ష ద్వారా విశ్వాసులను వేరుచేసి అవిశ్వాసులను తుదముట్టించదలిచాడు. మీరు ఇట్టే స్వర్గంలో ప్రవేశించాలని అనుకుంటున్నారా? వాస్తవానికి ఆయన మార్గంలో ప్రాణాలు తెగించి కృషి చేసేవారు, ఆయన కొరకు సహనం చూపేవారు మీలో ఎవరో అల్లాహ్ ఇంకా చూడనే లేదు కదా! మీరు ఇదివరకు మరణాన్ని కోరుతూ ఉండేవారు! కాని ఇది, మరణం మీ ముందుకు రానప్పటి విషయం. ఇదిగో, అది ఇప్పుడు మీ ముందుకే వచ్చింది. దాన్ని స్వయంగా మీరే మీ కళ్ళతో చూశారు.

**144** ముహమ్మద్ ఒక ప్రవక్త తప్ప మరేమీ కారు. అతనికి పూర్వం ఇంకా ఎందరో ప్రవక్తలు గతించారు. అలాంటప్పుడు ఒకవేళ అతను మరణిస్తే లేక హత్య చెయ్యబడితే మీరు వెనుకంజవేసి మరలిపోతారా? జ్ఞాపకం ఉంచుకోండి, మరలి పోయేవాడు అల్లాహ్‌కు ఏమాత్రం నష్టం కలిగించలేడు. కాని అల్లాహ్‌కు కృతజ్ఞత చూపే దాసులుగా జీవించే వారిని ఆయన తగు విధంగా బహూకరిస్తాడు.

**145 - 148** అల్లాహ్ అనుమతి లేనిదే ఏ ప్రాణి కూడా చావజాలదు. మరణకాలం వ్రాయబడే ఉంది. ప్రాపంచిక ప్రతిఫలం పొందే ఉద్దేశ్యంతో పని చేసే వాడికి మేము ప్రపంచాన్నుండే ఇస్తాము. పరలోక ప్రతిఫలాపేక్షతో పని చేసేవాడు పరలోక ప్రతిఫలాన్ని పొందుతాడు. కృతజ్ఞతలు తెలిపే వారికి మేము వారి ప్రతిఫలాన్ని తప్పకుండా ప్రసాదిస్తాము. ఇంతకు పూర్వం ఎంతోమంది ప్రవక్తలు గతించారు. వారితో కలిసి దైవభక్తులు యుద్ధం చేశారు. అల్లాహ్ మార్గంలో ఎదురయిన కష్టాలకు వారు క్రుంగిపోలేదు. బలహీనత కనబరచలేదు. (అసత్యం ముందు) తలవంచలేదు. అలాంటి సహనశీలురనే అల్లాహ్ ప్రేమిస్తాడు. వారి ప్రార్థన కేవలం ఇదే: "మా ప్రభూ! మా తప్పులను, మా పొరపాట్లను మన్నించు. మా పనులలో జరిగిన నీ హద్దుల అతిక్రమణను క్షమించు. మా పాదాలకు స్థయిర్యాన్ని ప్రసాదించు. అవిశ్వాసులకు ప్రతికూలంగా మాకు సహాయం చెయ్యి." చివరకు అల్లాహ్ వారికి ఇహలోక ప్రతిఫలాన్నీ ఇచ్చాడు, దానికంటే మేలైన పరలోక ప్రతిఫలాన్నీ ప్రసాదించాడు. అల్లాహ్‌కు మంచిపనులు చేసే ఇలాంటి ప్రజలే ఇష్టం.

يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْۤا اِنْ تُطِيْعُوا الَّذِيْنَ
كَفَرُوْا يَرُدُّوْكُمْ عَلٰۤى اَعْقَابِكُمْ فَتَنْقَلِبُوْا
خٰسِرِيْنَ ﴿١٤٩﴾ بَلِ اللّٰهُ مَوْلٰٮكُمْ ۚ وَهُوَ خَيْرُ
النّٰصِرِيْنَ ﴿١٥٠﴾ سَنُلْقِيْ فِيْ قُلُوْبِ الَّذِيْنَ كَفَرُوا
الرُّعْبَ بِمَاۤ اَشْرَكُوْا بِاللّٰهِ مَا لَمْ يُنَزِّلْ بِهٖ
سُلْطٰنًا ۚ وَمَاْوٰٮهُمُ النَّارُ ؕ وَبِئْسَ مَثْوَى
الظّٰلِمِيْنَ ﴿١٥١﴾ وَلَقَدْ صَدَقَكُمُ اللّٰهُ وَعْدَهٗۤ اِذْ
تَحُسُّوْنَهُمْ بِاِذْنِهٖ ۚ حَتّٰۤى اِذَا فَشِلْتُمْ
وَتَنَازَعْتُمْ فِى الْاَمْرِ وَعَصَيْتُمْ مِّنْۢ بَعْدِ مَاۤ
اَرٰٮكُمْ مَّا تُحِبُّوْنَ ؕ مِنْكُمْ مَّنْ يُّرِيْدُ الدُّنْيَا
وَمِنْكُمْ مَّنْ يُّرِيْدُ الْاٰخِرَةَ ۚ ثُمَّ صَرَفَكُمْ
عَنْهُمْ لِيَبْتَلِيَكُمْ ۚ وَلَقَدْ عَفَا عَنْكُمْ ؕ وَاللّٰهُ
ذُوْ فَضْلٍ عَلَى الْمُؤْمِنِيْنَ ﴿١٥٢﴾ اِذْ تُصْعِدُوْنَ وَ
لَا تَلْوٗنَ عَلٰۤى اَحَدٍ وَّ الرَّسُوْلُ يَدْعُوْكُمْ فِيْۤ
اُخْرٰٮكُمْ فَاَثَابَكُمْ غَمًّاۢ بِغَمٍّ لِّكَيْلَا تَحْزَنُوْا عَلٰى
مَا فَاتَكُمْ وَلَا مَاۤ اَصَابَكُمْ ؕ وَاللّٰهُ خَبِيْرٌۢ بِمَا
تَعْمَلُوْنَ ﴿١٥٣﴾

**149 - 151** విశ్వాసులారా! మీరు గనక అవిశ్వాస మార్గం అవలంబించినవారి సలహాలను పాటిస్తే వారు మిమ్మల్ని అవిశ్వాసం వైపునకు మరలిస్తారు. అప్పుడు మీరు నష్టపోతారు. (వారు చెప్పేదంతా అసత్యం) వాస్తవం ఏమిటంటే అల్లాహ్‌యే మీకు అండ, ఆయనే మీకు తోడు. ఆయనే అందరి కంటే ఉత్తమ సహాయకుడు. సత్య తిరస్కారుల హృదయాలను మేము భయంతో నింపే సమయం త్వరలోనే రాబోతోంది. ఎందుకంటే ఎవరిని గురించి అల్లాహ్ ఏ ప్రమాణాన్నీ అవతరింపజెయ్యలేదో, వారిని, వారు అల్లాహ్‌తో పాటు దైవత్వంలో భాగస్వాములుగా నిలబెట్టారు. వారి తుది నివాసం నరకం. ఆ దుర్మార్గులకు లభించే ఈ నివాసం ఎంతో చెడ్డది.

**152** అల్లాహ్ మీకు చేసిన (సహాయం చేస్తాననే) తన వాగ్దానాన్ని నెరవేర్చాడు. ప్రారంభంలో ఆయన ఆజ్ఞ ప్రకారం మీరే వారిని చంపుతూ ఉన్నారు. కాని మీరు బలహీనతను ప్రదర్శించినప్పుడు మీ కర్తవ్యం విషయంలో పరస్పరం విభేదాలకు గురిఅయినప్పుడు మీరు వ్యామోహపడిన వస్తువును (అంటే విజయ ధనం) అల్లాహ్ మీకు చూపగానే మీరు మీ నాయకుని ఆజ్ఞను ఉల్లంఘించారు– ఎందుకంటే, మీలో కొందరు ఇహాన్ని కోరారు, మరికొందరు పరాన్ని కోరారు– అప్పుడు అల్లాహ్ మిమ్మల్ని పరీక్షించటానికి అవిశ్వాసులకు బదులుగా మిమ్మల్ని ఓటమిపాలుజేశాడు. అయినప్పటికీ వాస్తవానికి అల్లాహ్ మిమ్మల్ని క్షమించాడు. ఎందుకంటే, విశ్వాసుల పట్ల అల్లాహ్‌కు ఎనలేని అనుగ్రహం.

**153** జ్ఞాపకం తెచ్చుకోండి, అప్పుడు మీరు పారిపోతున్నారు. వెనక్కి తిరిగి ఎవరినీ చూసే అంత స్పృహకూడా మీకు లేదు. వెనుక నుండి ప్రవక్త మిమ్మల్ని కేకవేస్తూ[31] ఉన్నాడు. అప్పుడు మీ ఈ వైఖరికి ప్రతిఫలంగా అల్లాహ్ మీకు దుఃఖం తరువాత దుఃఖం కలుగజేశాడు, మీరు ఏదైనా పోగొట్టుకున్నా లేదా మీకు ఏదైనా ఆపద కలిగినా మీరు చింతించకుండా ఉండేటందుకు ఇది భవిష్యత్తులో మీ కొరకు గుణపాఠంగా ఉండాలని. అల్లాహ్‌కు మీరు చేసే పనులన్నీ తెలుసు.

---

29. ఇక్కడ బద్ర్ సంగ్రామం సూచించబడింది. భావం ఏమిటంటే అప్పుడు దెబ్బతిన్న అవిశ్వాసులు ధైర్యాన్ని కోల్పోలేదుకదా! ఇప్పుడు ఈ ఉహుద్ సంగ్రామంలో దెబ్బతిన్న మీరు ఎందుకు భగ్నహృదయులవుతారు?

ثُمَّ اَنْزَلَ عَلَيْكُمْ مِّنْۢ بَعْدِ الْغَمِّ اَمَنَةً نُّعَاسًا
يَّغْشٰى طَآئِفَةً مِّنْكُمْ ۙ وَ طَآئِفَةٌ قَدْ
اَهَمَّتْهُمْ اَنْفُسُهُمْ يَظُنُّوْنَ بِاللّٰهِ غَيْرَ الْحَقِّ ظَنَّ
الْجَاهِلِيَّةِ ؕ يَقُوْلُوْنَ هَلْ لَّنَا مِنَ الْاَمْرِ مِنْ
شَيْءٍ ؕ قُلْ اِنَّ الْاَمْرَ كُلَّهٗ لِلّٰهِ ؕ يُخْفُوْنَ فِيْۤ
اَنْفُسِهِمْ مَّا لَا يُبْدُوْنَ لَكَ ؕ يَقُوْلُوْنَ لَوْ كَانَ
لَنَا مِنَ الْاَمْرِ شَيْءٌ مَّا قُتِلْنَا هٰهُنَا ؕ قُلْ لَّوْ
كُنْتُمْ فِيْ بُيُوْتِكُمْ لَبَرَزَ الَّذِيْنَ كُتِبَ عَلَيْهِمُ
الْقَتْلُ اِلٰى مَضَاجِعِهِمْ ۚ وَلِيَبْتَلِيَ اللّٰهُ مَا فِيْ
صُدُوْرِكُمْ وَلِيُمَحِّصَ مَا فِيْ قُلُوْبِكُمْ ؕ وَ اللّٰهُ
عَلِيْمٌۢ بِذَاتِ الصُّدُوْرِ ﴿۱۵۴﴾ اِنَّ الَّذِيْنَ تَوَلَّوْا
مِنْكُمْ يَوْمَ الْتَقَى الْجَمْعٰنِ ۙ اِنَّمَا اسْتَزَلَّهُمُ
الشَّيْطٰنُ بِبَعْضِ مَا كَسَبُوْا ۚ وَ لَقَدْ عَفَا اللّٰهُ
عَنْهُمْ ؕ اِنَّ اللّٰهَ غَفُوْرٌ حَلِيْمٌ ﴿۱۵۵﴾ ع

**154** ఈ దుఃఖం తరువాత అల్లాహ్ మీలో కొందరిపై నిశ్చింత స్థితిని ఆవహింపజేశాడు. దానివల్ల వారు కునికిపాట్లు పడ సాగారు.[32] కాని కేవలం స్వప్రయోజనానికే పూర్తిగా ప్రాముఖ్యం ఇచ్చే రెండోవర్గం వారు, అల్లాహ్‌ను గురించి అజ్ఞానభూయిష్టమైన, సత్యదూరమైన అనుమానాలు వ్యక్తం చెయ్యసాగారు. వారు ఇప్పుడు ఏమంటారంటే: "ఈ వ్యవహారాన్ని నడపటంలో మాకూ ఏదైనా భాగం ఉందా?" వారికి ఇలా చెప్పు: "(ఎవరికీ ఏ భాగమూ లేదు) ఈ వ్యవహారానికి సంబంధించిన సమస్త అధికారాలూ అల్లాహ్ చేతుల్లో ఉన్నాయి." వాస్తవానికి వారు తమ హృదయాలలో దాచుకున్న దానిని మీకు వ్యక్తం చెయ్యటం లేదు. వారి అసలు ఉద్దేశ్యమేమిటంటే: "(నాయకత్వపు) అధికారాలలో మాకూ భాగం ఉండివున్నట్లయితే ఇక్కడ మేము చంపబడి ఉండేవారము కాము." వారితో ఇలా అను: "మీరు మీ ఇళ్ళల్లోనే ఉండివున్నప్పటికీ, మరణం వ్రాయబడి ఉన్నవారు స్వయంగా తమ వధ్యస్థానాలకు తరలివచ్చి ఉండేవారు. ఈ వ్యవహారమంతా ఎందుకు జరిగిందంటే, మీ గుండెలలో దాగివున్న దానిని అల్లాహ్ పరీక్షించేందుకు, మీ మనస్సులలో ఉన్న మాలిన్యాన్ని వేరుచెయ్యటానికి. అంతరంగాల స్థితి అల్లాహ్‌కు బాగా తెలుసు.

**155** మీలో కొందరు శత్రువును మార్కొనే రోజున వెన్ను చూపారు. వారి ఈ పొరపాటుకు కారణమేమిటంటే, వారిలోని కొన్ని బలహీనతలవల్ల షైతాను వారి పాదాలను చలింపజేశాడు. అయినా అల్లాహ్ వారిని క్షమించాడు. అల్లాహ్ అధికంగా క్షమించేవాడు, సహించేవాడూను.

30. అసలు, మూలంలో "వ యత్తఖిజ మిన్‌కుమ్ షుహదాఅ" అనే పదాలు ఉపయోగించబడ్డాయి. దీనికి ఒక అర్థమేమిటంటే, మీలో కొందర్ని షహీదులు (అమరగతులుగా) తీసుకోదలిచాడు. అంటే కొందరికి 'షహాదత్' (అమరగతి) భాగ్యాన్ని ప్రసాదించదలచాడు. రెండో అర్థం ఏమిటంటే విశ్వాసులతో కపటులతో మిశ్రితమైపోయిన మీ వర్గం నుండి యథార్థంగా షుహదాఅ అలన్నాస్ (మానవుల ముందు సత్యానికి సాక్షులు)గా ఉన్నవారిని వేరుచేయదలిచాడు. అంటే వారు మేము ముస్లిమ్ సమాజానికి ఏ మహోన్నత పదవిని ఇచ్చి గౌరవించామో, ఆ మహోన్నత పదవికి అర్హులైనవారు.

31. ఉహుద్ సంగ్రామంలో ముస్లిములపై అకస్మాత్తుగా ఇరువైపుల నుండి ఒకేసారి దాడి జరిగి వారి సైనిక పంక్తులలో గందరగోళం వ్యాపించినపుడు, కొందరు మదీనా పట్టణం వైపు పారిపోయారు. మరికొందరు ఉహుద్ కొండపైకి ఎక్కారు. కాని మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) తమ స్థానం నుండి ఒక్క అంగుళం కూడా

يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لَا تَكُوْنُوْا كَالَّذِيْنَ
كَفَرُوْا وَ قَالُوْا لِاِخْوَانِهِمْ اِذَا ضَرَبُوْا فِي
الْاَرْضِ اَوْ كَانُوْا غُزًّى لَّوْ كَانُوْا عِنْدَنَا مَا
مَاتُوْا وَ مَا قُتِلُوْا ۚ لِيَجْعَلَ اللّٰهُ ذٰلِكَ حَسْرَةً
فِيْ قُلُوْبِهِمْ ؕ وَ اللّٰهُ يُحْيٖ وَ يُمِيْتُ ؕ وَاللّٰهُ
بِمَا تَعْمَلُوْنَ بَصِيْرٌ ﴿۱۵۶﴾ وَ لَئِنْ قُتِلْتُمْ فِيْ
سَبِيْلِ اللّٰهِ اَوْ مُتُّمْ لَمَغْفِرَةٌ مِّنَ اللّٰهِ وَ
رَحْمَةٌ خَيْرٌ مِّمَّا يَجْمَعُوْنَ ﴿۱۵۷﴾ وَ لَئِنْ مُّتُّمْ اَوْ
قُتِلْتُمْ لَاِلَى اللّٰهِ تُحْشَرُوْنَ ﴿۱۵۸﴾ فَبِمَا رَحْمَةٍ
مِّنَ اللّٰهِ لِنْتَ لَهُمْ ۚ وَلَوْ كُنْتَ فَظًّا غَلِيْظَ
الْقَلْبِ لَانْفَضُّوْا مِنْ حَوْلِكَ ۪ فَاعْفُ عَنْهُمْ
وَاسْتَغْفِرْ لَهُمْ وَشَاوِرْهُمْ فِي الْاَمْرِ ۚ فَاِذَا
عَزَمْتَ فَتَوَكَّلْ عَلَى اللّٰهِ ؕ اِنَّ اللّٰهَ يُحِبُّ
الْمُتَوَكِّلِيْنَ ﴿۱۵۹﴾ اِنْ يَّنْصُرْكُمُ اللّٰهُ فَلَا غَالِبَ
لَكُمْ ۚ وَاِنْ يَّخْذُلْكُمْ فَمَنْ ذَا الَّذِيْ يَنْصُرُكُمْ
مِّنْ بَعْدِهٖ ؕ وَعَلَى اللّٰهِ فَلْيَتَوَكَّلِ الْمُؤْمِنُوْنَ ﴿۱۶۰﴾

**156 - 158** విశ్వాసులారా! అవిశ్వాసులు మాదిరిగా ప్రవర్తించకండి. తమ బంధుమిత్రులు ఎప్పుడైనా ప్రయాణంలో ఉంటే లేదా యుద్ధంలో ఉంటే, (అక్కడ వారు ఏదైనా ప్రమాదానికి గురిఅయితే) వారు ఇలా అంటారు: "వారు మాతోపాటు ఉండివున్నట్లయితే చనిపోయేవారూ కాదు, చంపబడేవారూ కాదు." ఈ విధమైన వారి మాటలను అల్లాహ్ వారి హృదయ శోకానికీ, ఆవేదనకూ కారణాలుగా చేస్తాడు. వాస్తవానికి చంపేవాడూ, బ్రతికించేవాడూ అల్లాహ్ మాత్రమే. మీరు చేసే అన్ని పనులనూ ఆయన కనిపెట్టే ఉన్నాడు. మీరు అల్లాహ్ మార్గంలో చంపబడినా లేక చనిపోయినా మీ వంతుగా మీకు లభించే అల్లాహ్ కారుణ్యం, ఆయన క్షమాభిక్ష, వారు కూడబెట్టే సమస్త వస్తువులకంటే ఎంతో ఉత్తమమైనవి. మీరు చనిపోయినా లేక చంపబడినా, ఏ స్థితిలో అయినాసరే మీరంతా అల్లాహ్ సమక్షంలో సమీకరింపబడతారు.

**159 - 160** (ప్రవక్తా!) అల్లాహ్ యొక్క అనంత కరుణ వల్లనే నీవు వారిపట్ల మృదుస్వభావుడవు అయ్యావు. నీవేగనక కర్కశుడవు, కఠిన హృదయుడవు అయినట్లయితే వారందరూ నీ చుట్టుపక్కల నుండి దూరంగా పోయేవారు. వారి తప్పులను మన్నించు, వారిని క్షమించు అని అల్లాహ్‌ను ప్రార్థించు. ధర్మానికి సంబంధించిన పనిలో వారిని కూడా సంప్రదించు. అయితే ఒక నిర్ణయాన్ని తీసుకుని దాన్ని అమలుపరచటానికి సంకల్పించినపుడు అల్లాహ్‌పై భారం వెయ్యి. తననే నమ్ముకుని పనిచేసే వారంటే అల్లాహ్‌కు ఎంతో ఇష్టం. అల్లాహ్ మీకు సహాయం చేస్తూ ఉన్నట్లయితే, ఏ శక్తీ మీపై ఆధిక్యాన్ని సాధించ లేదు. ఆయన మిమ్మల్ని విడిచిపెట్టినట్లయితే, ఆ తరువాత మీకు సహాయం చేయగలవాడెవడు? కనుక నిజమైన విశ్వాసులు అల్లాహ్‌నే నమ్ముకోవాలి.

---

కదలలేదు. నలువైపులా శత్రుసైన్యాలు గుమిగూడి ఉన్నవి. పదీ పన్నెండుమంది ముస్లిము సైనికుల ఒక చిన్న సమూహం మాత్రమే దగ్గర ఉండిపోయింది. కాని అల్లాహ్ ప్రవక్త ఈ అతి సంక్లిష్ట సమయంలో కూడా పర్వతం మాదిరిగా తమ స్థానంలో స్థిరంగా ఉండిపోయారు. పారిపోయే వారిని ఇలా కేకవేస్తున్నారు: "ఇలయ్య ఇబాదల్లాహ్ ఇలయ్య ఇబాదల్లాహ్" "అల్లాహ్ దాసులారా, నా వైపునకు రండి, అల్లాహ్ దాసులారా, నా వైపునకు రండి" అని.

32. ఇస్లామీ సైన్యంలో కొందరికి అప్పుడు కలిగిన ఒక వింత అనుభవం ఇది. ఈ యుద్ధంలో పాల్గొన్న అబూ తల్హా (రజిఅన్) స్వయంగా ఇలా అన్నారు: "ఈ పరిస్థితిలో మమ్మల్ని ఆవహించిన నిద్రమత్తువల్ల కరవాలాలు చెయ్యిజారి పడసాగాయి."

**161 - 164** ఏ ప్రవక్త అయినా నమ్మక ద్రోహాని (ఖియానత్)కి పాల్పడడు. నమ్మకద్రోహం చేసినవాడు ప్రళయంనాడు తన నమ్మక ద్రోహంతో పాటు హాజరవుతాడు. అప్పుడు ప్రతి ప్రాణికి తన సంపాదనకు పూర్తి ప్రతిఫలం లభిస్తుంది. ఎవరికీ ఏమాత్రం అన్యాయం జరగదు-ఎల్లప్పుడూ అల్లాహ్ అభీష్టం ప్రకారం నడిచే వ్యక్తి, అల్లాహ్ ఆగ్రహానికి గురిఅయి, తన చివరి నివాసము, అతి చెడ్డ నివాసము అయిన నరకానికి పోయే వ్యక్తి మాదిరిగా వ్యవహరించడం ఎలా సంభవం? అల్లాహ్ దృష్టిలో ఈ రెండు రకాల వ్యక్తుల మధ్య, స్థానాల విషయంలో ఎంతో తారతమ్య ముంది. అల్లాహ్ అందరి పనులను పరిశీలిస్తున్నాడు. వాస్తవానికి అల్లాహ్ విశ్వాసులకు మహోపకారం చేశాడు: స్వయంగా వారినుండే వారిమధ్య ఒక ప్రవక్తను లేపాడు. అతడు ఆయన ఆయతులను వారికి వినిపిస్తాడు. వారి జీవితాలను తీర్చిదిద్దుతాడు. వారికి గ్రంథాన్నీ, వివేకాన్నీ నేర్పుతాడు. వాస్తవానికి వారు ఇంతకు పూర్వం స్పష్టమయిన అపమార్గాలలో పడివున్నారు.

**165 - 168** మీపై ఆపద వచ్చిపడగానే, “ఇదెక్కణ్ణుంచి దాపురించింది” అని అంటారేమిటి? (బద్ర్ సంగ్రామంలో) దీనికి రెండింతల ఆపద స్వయంగా మీ చేతుల ద్వారానే (మీ శత్రువులపై) పడిందికదా! ప్రవక్తా! వారితో ఇలా చెప్పు:“ఈ ఆపద స్వయంగా మీరు తెచ్చుకున్నదే.” నిశ్చయంగా అల్లాహ్‌కు ప్రతి వస్తువుపై అధికారం ఉంది. పోరాటం నాడు మీకు కలిగిన నష్టం అల్లాహ్ అనుమతితోనే కలిగింది. ఎందుకంటే తద్వారా మీలో విశ్వాసులెవరో కపటులెవరో అల్లాహ్ చూడదలచాడు - ఆ కపటులతో: “రండి, అల్లాహ్ మార్గంలో యుద్ధం చెయ్యండి. లేదా కనీసం (మీ నగరాన్నయినా) రక్షించుకోండి” అని అన్నప్పుడు వారు ఇలా అన్నారు: “ఈ రోజు యుద్ధం జరుగుతుందని మాకు తెలిసివున్నట్లయితే మేము తప్పకుండ మీతోపాటు వచ్చివుండే వారము.” ఈ మాటలు అంటున్నప్పుడు వారు విశ్వాసానికంటే అవిశ్వాసానికే చేరువగా ఉన్నారు. వారు తమ హృదయాలలో లేని మాటలను తమ నోటితో అంటారు. వారు తమ హృదయాలలో దాస్తున్న దానిని గురించి అల్లాహ్‌కు బాగా తెలుసు. తాము మాత్రం కూర్చుండిపోయి, యుద్ధం చెయ్యటానికి పోయి చంపబడినటువంటి తమ సోదరులను గురించి: “వారు గనక మా మాటలు ఆలకించివున్నట్లయితే చంపబడి ఉండేవారు కారు” అని అన్నవారు వీరే. వారితో ఇలా చెప్పు:“మీరు చెప్పే విషయంలో మీరు గనక నిజాయితీపరులే అయితే, మీకు చావు దాపురించినప్పుడు మీరు దానిని నివారించి చూపాలి.”

وَمَا كَانَ لِنَبِيٍّ اَنْ يَّغُلَّ ؕ وَمَنْ يَّغْلُلْ يَاْتِ
بِمَا غَلَّ يَوْمَ الْقِيٰمَةِ ۚ ثُمَّ تُوَفّٰى كُلُّ نَفْسٍ مَّا
كَسَبَتْ وَهُمْ لَا يُظْلَمُوْنَ ﴿١٦١﴾ اَفَمَنِ اتَّبَعَ
رِضْوَانَ اللّٰهِ كَمَنْۢ بَآءَ بِسَخَطٍ مِّنَ اللّٰهِ وَمَاْوٰىهُ
جَهَنَّمُ ؕ وَبِئْسَ الْمَصِيْرُ ﴿١٦٢﴾ هُمْ دَرَجٰتٌ عِنْدَ
اللّٰهِ ؕ وَاللّٰهُ بَصِيْرٌۢ بِمَا يَعْمَلُوْنَ ﴿١٦٣﴾ لَقَدْ مَنَّ اللّٰهُ
عَلَى الْمُؤْمِنِيْنَ اِذْ بَعَثَ فِيْهِمْ رَسُوْلًا مِّنْ
اَنْفُسِهِمْ يَتْلُوْا عَلَيْهِمْ اٰيٰتِهٖ وَيُزَكِّيْهِمْ
وَيُعَلِّمُهُمُ الْكِتٰبَ وَالْحِكْمَةَ ۚ وَاِنْ كَانُوْا مِنْ
قَبْلُ لَفِيْ ضَلٰلٍ مُّبِيْنٍ ﴿١٦٤﴾ اَوَلَمَّاۤ اَصَابَتْكُمْ النصف
مُّصِيْبَةٌ قَدْ اَصَبْتُمْ مِّثْلَيْهَا ۙ قُلْتُمْ اَنّٰى هٰذَا ؕ
قُلْ هُوَ مِنْ عِنْدِ اَنْفُسِكُمْ ؕ اِنَّ اللّٰهَ عَلٰى كُلِّ
شَيْءٍ قَدِيْرٌ ﴿١٦٥﴾ وَمَاۤ اَصَابَكُمْ يَوْمَ الْتَقَى
الْجَمْعٰنِ فَبِاِذْنِ اللّٰهِ وَلِيَعْلَمَ الْمُؤْمِنِيْنَ ۙ ﴿١٦٦﴾
وَلِيَعْلَمَ الَّذِيْنَ نَافَقُوْا ۚۖ وَقِيْلَ لَهُمْ تَعَالَوْا
قَاتِلُوْا فِيْ سَبِيْلِ اللّٰهِ اَوِ ادْفَعُوْا ؕ قَالُوْا لَوْ
نَعْلَمُ قِتَالًا لَّا اتَّبَعْنٰكُمْ ؕ هُمْ لِلْكُفْرِ يَوْمَئِذٍ
اَقْرَبُ مِنْهُمْ لِلْاِيْمَانِ ۚ يَقُوْلُوْنَ بِاَفْوَاهِهِمْ
مَّا لَيْسَ فِيْ قُلُوْبِهِمْ ؕ وَاللّٰهُ اَعْلَمُ بِمَا
يَكْتُمُوْنَ ﴿١٦٧﴾ اَلَّذِيْنَ قَالُوْا لِاِخْوَانِهِمْ وَقَعَدُوْا
لَوْ اَطَاعُوْنَا مَا قُتِلُوْا ؕ قُلْ فَادْرَءُوْا عَنْ
اَنْفُسِكُمُ الْمَوْتَ اِنْ كُنْتُمْ صٰدِقِيْنَ ﴿١٦٨﴾

وَ لَا تَحۡسَبَنَّ الَّذِيۡنَ قُتِلُوۡا فِىۡ سَبِيۡلِ اللّٰهِ
اَمۡوَاتًا ؕ بَلۡ اَحۡيَآءٌ عِنۡدَ رَبِّهِمۡ يُرۡزَقُوۡنَ ۙ﴿۱۶۹﴾
فَرِحِيۡنَ بِمَاۤ اٰتٰٮهُمُ اللّٰهُ مِنۡ فَضۡلِهٖ ۙ وَ
يَسۡتَبۡشِرُوۡنَ بِالَّذِيۡنَ لَمۡ يَلۡحَقُوۡا بِهِمۡ مِّنۡ
خَلۡفِهِمۡ ۙ اَلَّا خَوۡفٌ عَلَيۡهِمۡ وَ لَا هُمۡ يَحۡزَنُوۡنَ ۘ﴿۱۷۰﴾ وقف لازم
يَسۡتَبۡشِرُوۡنَ بِنِعۡمَةٍ مِّنَ اللّٰهِ وَ فَضۡلٍ ۙ وَّاَنَّ
اللّٰهَ لَا يُضِيۡعُ اَجۡرَ الۡمُؤۡمِنِيۡنَ ۚۛ﴿۱۷۱﴾ اَلَّذِيۡنَ
اسۡتَجَابُوۡا لِلّٰهِ وَ الرَّسُوۡلِ مِنۡۢ بَعۡدِ مَاۤ اَصَابَهُمُ
الۡقَرۡحُ ؕۛ لِلَّذِيۡنَ اَحۡسَنُوۡا مِنۡهُمۡ وَ اتَّقَوۡا اَجۡرٌ
عَظِيۡمٌ ۚ﴿۱۷۲﴾ اَلَّذِيۡنَ قَالَ لَهُمُ النَّاسُ اِنَّ النَّاسَ
قَدۡ جَمَعُوۡا لَـكُمۡ فَاخۡشَوۡهُمۡ فَزَادَهُمۡ اِيۡمَانًا ۖ وَّ
قَالُوۡا حَسۡبُنَا اللّٰهُ وَنِعۡمَ الۡوَكِيۡلُ ﴿۱۷۳﴾ فَانۡقَلَبُوۡا
بِنِعۡمَةٍ مِّنَ اللّٰهِ وَ فَضۡلٍ لَّمۡ يَمۡسَسۡهُمۡ سُوۡٓءٌ ۙ
وَّاتَّبَعُوۡا رِضۡوَانَ اللّٰهِ ؕ وَ اللّٰهُ ذُوۡ فَضۡلٍ
عَظِيۡمٍ ﴿۱۷۴﴾ اِنَّمَا ذٰلِكُمُ الشَّيۡطٰنُ يُخَوِّفُ
اَوۡلِيَآءَهٗ ۖ فَلَا تَخَافُوۡهُمۡ وَخَافُوۡنِ اِنۡ كُنۡتُمۡ
مُّؤۡمِنِيۡنَ ﴿۱۷۵﴾

**169 - 175** అల్లాహ్ మార్గంలో చంపబడ్డ వారిని మృతులుగా భావించకండి. వాస్తవానికి వారు సజీవులే. తమ ప్రభువువద్ద జీవికను పొందుతున్నారు. అల్లాహ్ తన కృపతో ప్రసాదించిన దానితో వారు ఎంతో సుఖంగా, సంతోషంగా ఉన్నారు. తమ వెనుక ప్రపంచంలో ఉండిపోయి ఇంకా తమతో చేరని విశ్వాసులకు కూడా ఏ విధమైన భయంకానీ, దుఃఖంకానీ కలిగే అవకాశంలేదని వారు నిశ్చింతగా ఉన్నారు. అల్లాహ్ బహుమానాలకు, ఆయన అనుగ్రహాలకు వారు పొంగిపోతున్నారు. విశ్వాసుల ప్రతిఫలాన్ని అల్లాహ్ వృథాకానివ్వడని వారికి తెలిసిపోయింది; క్షతగాత్రులయిన తరువాత కూడా అల్లాహ్ పిలుపునకు, ప్రవక్త పిలుపునకు సమాధానమిచ్చినటువంటి[33] విశ్వాసుల ప్రతిఫలం – వారిలో సజ్జనులు, భయభక్తులు కలవారు అయిన వ్యక్తుల కొరకు గొప్ప ప్రతిఫలం ఉంది– వారితో ప్రజలు, "మీకు వ్యతిరేకంగా పెద్ద సైన్యాలు మోహరించి ఉన్నాయి, వాటికి భయపడండి" అని అన్నప్పుడు దానిని విని వారి విశ్వాసం ద్విగుణీకృతమయింది. వారు ఇలా సమాధానం చెప్పారు: "మాకు అల్లాహ్ చాలు. ఆయనే శ్రేష్ఠుడైన కార్య సాధకుడు." చివరకు వారు అల్లాహ్ ప్రసాదించిన వరాలతో, అనుగ్రహంతో తిరిగి వచ్చారు. వారికి ఏ విధమైన హాని కలగలేదు. ఇంకా వారికి అల్లాహ్ అభీష్టం ప్రకారం నడిచే మహాభాగ్యం కూడా లభించింది. అల్లాహ్ అపరిమితంగా అనుగ్రహించేవాడు.[34] వాస్తవానికి తన మిత్రులను గురించి ఊరకే ప్రజలను భయపెట్టింది షైతానేనని ఇప్పుడు మీరు గ్రహించే ఉంటారు. కనుక మీరు నిజమైన విశ్వాసులే అయితే ఇక ముందు మానవులకు భయపడకండి. నాకు భయపడండి.

33. 'ఉహుద్' సంగ్రామం నుండి మరలి చాలాదూరం వెళ్ళిపోయిన తరువాత ముష్రిక్కులు తమ తప్పును గ్రహించి తమలో తాము ఇలా అనుకున్నారు : మనం ఎంత పని చేశాము, ముహమ్మద్ (సఅసమ్) శక్తిని అణచటానికి దొరికిన అమూల్యమైన అవకాశాన్ని పోగొట్టుకుని వచ్చేశాము. ఒకచోట ఆగి, వారు మదీనాపై వెంటనే రెండోసారి దండెత్తాలి అని పరస్పరం తీర్మానించుకున్నారు. కాని వారికి ధైర్యం చాలలేదు. కనుక తిరిగి మక్కా వెళ్ళిపోయారు. ఇటు మహాప్రవక్త (సఅసమ్) కూడా వారు మళ్ళీ తిరిగి వస్తారేమో అని ఆందోళన పడ్డారు. కనుక ఉహుద్ సంగ్రామం ముగిసిన మరునాడే ఆయన ముస్లిములను సమావేశపరచి, మనం అవిశ్వాసులను వెంటాడాలి అని సెలవిచ్చారు. ఇది అతి క్లిష్టమైన సమయం. అయినప్పటికీ, నిజమైన ముస్లిములు తమ ప్రాణాలనైనా త్యాగం చెయ్యటానికి సిద్ధపడ్డారు. మహాప్రవక్త (సఅసమ్)తో పాటు మదీనాకు ఎనిమిది మైళ్ళ దూరంలో ఉన్న "హమ్‌రా ఉల్ అసద్" వరకు వెళ్ళారు. ఈ ఆయత్‌లో ఈ త్యాగమూర్తులనే సూచించటం జరిగింది.

وَ لَا يَحۡزُنۡكَ الَّذِيۡنَ يُسَارِعُوۡنَ فِى الۡكُفۡرِ‌ۚ
اِنَّهُمۡ لَنۡ يَّضُرُّوا اللّٰهَ شَيۡـًٔا‌ ؕ يُرِيۡدُ اللّٰهُ اَلَّا
يَجۡعَلَ لَهُمۡ حَظًّا فِى الۡاٰخِرَةِ‌ ۚ وَلَهُمۡ عَذَابٌ
عَظِيۡمٌ‏ ﴿۱۷۶﴾ اِنَّ الَّذِيۡنَ اشۡتَرَوُا الۡكُفۡرَ بِالۡاِيۡمَانِ
لَنۡ يَّضُرُّوا اللّٰهَ شَيۡـًٔا‌ ۚ وَلَهُمۡ عَذَابٌ اَلِيۡمٌ‏ ﴿۱۷۷﴾
وَلَا يَحۡسَبَنَّ الَّذِيۡنَ كَفَرُوۡۤا اَنَّمَا نُمۡلِىۡ لَهُمۡ
خَيۡرٌ لِّاَنۡفُسِهِمۡ‌ ؕ اِنَّمَا نُمۡلِىۡ لَهُمۡ لِيَزۡدَادُوۡۤا
اِثۡمًا ‌ۚ وَلَهُمۡ عَذَابٌ مُّهِيۡنٌ‏ ﴿۱۷۸﴾ مَا كَانَ اللّٰهُ
لِيَذَرَ الۡمُؤۡمِنِيۡنَ عَلٰى مَاۤ اَنۡتُمۡ عَلَيۡهِ حَتّٰى
يَمِيۡزَ الۡخَبِيۡثَ مِنَ الطَّيِّبِ‌ؕ وَمَا كَانَ اللّٰهُ
لِيُطۡلِعَكُمۡ عَلَى الۡغَيۡبِ وَلٰكِنَّ اللّٰهَ يَجۡتَبِىۡ مِنۡ
رُّسُلِهٖ مَنۡ يَّشَآءُ‌ ۖ فَاٰمِنُوۡا بِاللّٰهِ وَرُسُلِهٖ‌ ۚ
وَاِنۡ تُؤۡمِنُوۡا وَتَتَّقُوۡا فَلَـكُمۡ اَجۡرٌ عَظِيۡمٌ‏ ﴿۱۷۹﴾

**176 - 178** ప్రవక్తా! నేడు అవిశ్వాస మార్గంలో గట్టిగా ప్రయత్నం చేస్తున్న వారి కార్యకలాపాలు నిన్ను ఖేదపరచరాదు. వారు అల్లాహ్‌కు ఏ మాత్రం హాని కలిగించలేరు. పరలోకంలో వారికి ఏ భాగమూ ఇవ్వరాదనేదే అల్లాహ్ అభిమతం. చివరకు వారికి కఠిన శిక్షపడుతుంది. విశ్వాసాన్ని విడిచిపెట్టి అవిశ్వాసాన్ని కొనుక్కునేవారు నిశ్చయంగా అల్లాహ్‌కు ఏ నష్టమూ కలిగించటం లేదు. వారి కొరకు వ్యధాభరితమైన శిక్ష సిద్ధంగా ఉంది. మేము ఇస్తూ ఉన్నటువంటి అవకాశాన్ని ఈ అవిశ్వాసులు తమకు మేలుగా భావించరాదు. వారు ఇంకా ఎక్కువ పాపాలు కూడబెట్టుకోవాలనే మేము వారికి ఈ అవకాశాన్ని ఇస్తున్నాము. వారికి తీవ్ర అవమానంతో కూడుకున్న శిక్ష పడుతుంది.

**179** మీరు ప్రస్తుతం ఉన్నటువంటి స్థితిలో అల్లాహ్ విశ్వాసులను ఏమాత్రం ఉండనివ్వడు. ఆయన పవిత్రులను అపవిత్రుల నుండి తప్పకుండా వేరు చేస్తాడు. అయితే అగోచర విషయాల రహస్యాలను మీకు తెలుపడం[35] అల్లాహ్ విధానం కాదు. (అగోచర విషయాలు తెలుపడానికి) అల్లాహ్ తన ప్రవక్తలలో నుండి తాను కోరినవారిని ఎన్నుకుంటాడు. కనుక (అగోచర విషయాలను గురించి) అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తలను నమ్మండి. మీరు గనక విశ్వాస భయభక్తుల మార్గాన్ని అవలంబిస్తే మీకు పెద్ద బహుమానం లభిస్తుంది.

34. ఉహుద్ నుండి తిరిగి పోతూ అబూ సుఫ్యాను వచ్చే సంవత్సరం బద్ర్‌లో మీకూ మాకూ మళ్ళీ సంగ్రామం జరుగుతుంది అని ముస్లిములకు సవాలు విసిరాడు. కాని ఆ సమయం దగ్గర పడ్డప్పుడు అతడికి ధైర్యం చాలలేదు. కనుక తన పరువు కాపాడుకోవటానికి అతడు రహస్యంగా ఒక వ్యక్తిని పంపాడు. ఆ వ్యక్తి మదీనా పట్టణానికి పోయి ఈ సంవత్సరం ఖురైషులు గొప్ప సన్నాహాలు చేశారు. పెద్ద సైన్యాన్ని సమాయత్తం చేశారు. మొత్తం అరేబియాలోనే దానిని ఎదుర్కొనే శక్తి ఎవరికీ లేదు అని ముస్లిములలో ప్రచారం చెయ్యసాగాడు. ఈ ప్రచారం వల్ల ముస్లిములు కొంచెం కలతచెందారు. కాని మహాప్రవక్త (సఅసమ్) ఒక పెద్ద సమావేశంలో, "ఎవరూ వెళ్ళకపోతే నేనొక్కణ్ణే వెళతాను" అని ప్రకటించినప్పుడు పదిహేను వందల మంది యోధులు ఆయనతో వెళ్ళటానికి లేచి నిలబడ్డారు. ఆయన ఆ కొందరినే తీసుకుని బద్ర్‌కు వెళ్ళారు. అబూ సుఫ్యాను యుద్ధానికి రాలేదు. ముస్లిములు ఎనిమిది రోజులదాకా బద్ర్‌లో ఉండి వ్యాపారం చేసి మంచి లాభాలు గడించారు.

وَ لَا يَحْسَبَنَّ الَّذِيْنَ يَبْخَلُوْنَ بِمَآ اٰتٰهُمُ
اللّٰهُ مِنْ فَضْلِهٖ هُوَ خَيْرًا لَّهُمْ ؕ بَلْ هُوَ شَرٌّ
لَّهُمْ ؕ سَيُطَوَّقُوْنَ مَا بَخِلُوْا بِهٖ يَوْمَ الْقِيٰمَةِ ؕ
وَ لِلّٰهِ مِيْرَاثُ السَّمٰوٰتِ وَ الْاَرْضِ ؕ وَ اللّٰهُ
بِمَا تَعْمَلُوْنَ خَبِيْرٌ ﴿۱۸۰﴾ لَقَدْ سَمِعَ اللّٰهُ قَوْلَ
الَّذِيْنَ قَالُوْۤا اِنَّ اللّٰهَ فَقِيْرٌ وَّ نَحْنُ اَغْنِيَآءُ ۘ
سَنَكْتُبُ مَا قَالُوْا وَقَتْلَهُمُ الْاَنْۢبِيَآءَ بِغَيْرِ
حَقٍّ ۙ وَّ نَقُوْلُ ذُوْقُوْا عَذَابَ الْحَرِيْقِ ﴿۱۸۱﴾ ذٰلِكَ
بِمَا قَدَّمَتْ اَيْدِيْكُمْ وَ اَنَّ اللّٰهَ لَيْسَ
بِظَلَّامٍ لِّلْعَبِيْدِ ۚ﴿۱۸۲﴾ اَلَّذِيْنَ قَالُوْۤا اِنَّ اللّٰهَ
عَهِدَ اِلَيْنَاۤ اَلَّا نُؤْمِنَ لِرَسُوْلٍ حَتّٰى يَاْتِيَنَا
بِقُرْبَانٍ تَاْكُلُهُ النَّارُ ؕ قُلْ قَدْ جَآءَكُمْ
رُسُلٌ مِّنْ قَبْلِيْ بِالْبَيِّنٰتِ وَ بِالَّذِيْ قُلْتُمْ
فَلِمَ قَتَلْتُمُوْهُمْ اِنْ كُنْتُمْ صٰدِقِيْنَ ﴿۱۸۳﴾ فَاِنْ
كَذَّبُوْكَ فَقَدْ كُذِّبَ رُسُلٌ مِّنْ قَبْلِكَ
جَآءُوْ بِالْبَيِّنٰتِ وَالزُّبُرِ وَالْكِتٰبِ الْمُنِيْرِ ﴿۱۸۴﴾
كُلُّ نَفْسٍ ذَآئِقَةُ الْمَوْتِ ؕ وَ اِنَّمَا تُوَفَّوْنَ
اُجُوْرَكُمْ يَوْمَ الْقِيٰمَةِ ؕ فَمَنْ زُحْزِحَ عَنِ النَّارِ
وَاُدْخِلَ الْجَنَّةَ فَقَدْ فَازَ ؕ وَمَا الْحَيٰوةُ الدُّنْيَاۤ
اِلَّا مَتَاعُ الْغُرُوْرِ ﴿۱۸۵﴾

ع ۱۸ - وقف لازم

**180** అల్లాహ్ తన అనుగ్రహాన్ని విరివిగా ప్రసాదించినప్పటికీ పిసినారితనం చూపేవారు, ఈ పిసినారితనం తమకు మేలైనదని భావించరాదు. కాదు, ఇది వారికొరకు ఎంతో హానికరమయినది. వారు తమ లోభత్వంతో కూడబెడుతూ ఉన్నదే ప్రళయం నాడు వారి పాలిట కంఠపాశం అవుతుంది. భూమ్యాకాశాల వారసత్వం అల్లాహ్‌కే చెందుతుంది. మీరు ఏదైతే చేస్తారో అది అల్లాహ్‌కు తెలుసు.

**181 - 182** "అల్లాహ్ దరిద్రుడు. మేము ధనికులం"[36] అని అన్నవారి ప్రేలాపన అల్లాహ్ విన్నాడు. వారి ఈ మాటలను కూడా మేము వ్రాసుకుంటాము. ఇంకా ఇదివరకు వారు అన్యాయంగా ప్రవక్తలను చంపిన విషయం కూడా వారి కర్మపత్రంలో వ్రాశాము. (తీర్పు సమయం వచ్చినప్పుడు) మేము వారితో ఇలా అంటాము: "ఇదిగో నరకబాధను చవి చూడండి. ఇది స్వయంగా మీచేతి సంపాదనే. అల్లాహ్ తన దాసులకు అన్యాయం చేసేవాడు కాదు."

**183 - 185** "(ఆకాశం నుండి) అగ్ని (దిగివచ్చి) తినేటటువంటి బలిని మా సమక్షంలో ఇయ్యనంతవరకూ మేము ఎవరినీ ప్రవక్తగా స్వీకరించకూడదని అల్లాహ్ మాకు ఉపదేశించాడు" అని అనేవారితో ఇలా అను: "నాకు పూర్వం మీ వద్దకు చాలామంది ప్రవక్తలు వచ్చారు. స్పష్టమైన ఎన్నో నిదర్శనాలు తీసుకువచ్చారు. మీరు ప్రస్తావించిన ఈ నిదర్శనాన్ని సైతం తీసుకువచ్చారు. (ప్రవక్తలను విశ్వసించటానికి ఈ షరతును పెట్టటంలో) మీరు గనక సత్యవంతులే అయితే, ఆ ప్రవక్తలను మీరు ఎందుకు హత్య చేశారు?" ప్రవక్తా! ఇక వారు గనక నిన్ను తిరస్కరిస్తే నీకు ముందు ప్రత్యక్ష నిదర్శనాలను, సహీఫాలను (PSALMS), వెలుగును ప్రసాదించే గ్రంథాలను తీసుకువచ్చిన చాలామంది ప్రవక్తలు కూడా తిరస్కరించబడ్డారు. చివరకు ప్రతి మనిషీ మరణిస్తాడు. మీరంతా మీ పూర్తి ప్రతిఫలాన్ని ప్రళయంనాడు పొందుతారు. అక్కడ నరకాగ్ని నుండి కాపాడబడి, స్వర్గంలో ప్రవేశపెట్టబడేవాడు మాత్రమే యథార్థానికి సఫలీకృతుడు. ఇక ఈ ప్రపంచం, అది కేవలం మాయావస్తువు మాత్రమే.

لَتُبْلَوُنَّ فِيْٓ اَمْوَالِكُمْ وَ اَنْفُسِكُمْ ۟ وَلَتَسْمَعُنَّ مِنَ
الَّذِيْنَ اُوْتُوا الْكِتٰبَ مِنْ قَبْلِكُمْ وَ مِنَ الَّذِيْنَ
اَشْرَكُوْٓا اَذًى كَثِيْرًا ؕ وَ اِنْ تَصْبِرُوْا وَ تَتَّقُوْا
فَاِنَّ ذٰلِكَ مِنْ عَزْمِ الْاُمُوْرِ ﴿١٨٦﴾ وَ اِذْ اَخَذَ اللّٰهُ
مِيْثَاقَ الَّذِيْنَ اُوْتُوا الْكِتٰبَ لَتُبَيِّنُنَّهٗ لِلنَّاسِ وَ
لَا تَكْتُمُوْنَهٗ ؗ فَنَبَذُوْهُ وَرَآءَ ظُهُوْرِهِمْ وَ
اشْتَرَوْا بِهٖ ثَمَنًا قَلِيْلًا ؕ فَبِئْسَ مَا يَشْتَرُوْنَ ﴿١٨٧﴾
لَا تَحْسَبَنَّ الَّذِيْنَ يَفْرَحُوْنَ بِمَآ اَتَوْا وَّ يُحِبُّوْنَ
اَنْ يُّحْمَدُوْا بِمَا لَمْ يَفْعَلُوْا فَلَا تَحْسَبَنَّهُمْ
بِمَفَازَةٍ مِّنَ الْعَذَابِ ۚ وَ لَهُمْ عَذَابٌ اَلِيْمٌ ﴿١٨٨﴾ وَ
لِلّٰهِ مُلْكُ السَّمٰوٰتِ وَ الْاَرْضِ ؕ وَ اللّٰهُ عَلٰى كُلِّ
شَيْءٍ قَدِيْرٌ ﴿١٨٩﴾ اِنَّ فِيْ خَلْقِ السَّمٰوٰتِ وَ الْاَرْضِ ع ١٩ ١٠
وَاخْتِلَافِ الَّيْلِ وَ النَّهَارِ لَاٰيٰتٍ لِّاُولِي الْاَلْبَابِ ﴿١٩٠﴾
الَّذِيْنَ يَذْكُرُوْنَ اللّٰهَ قِيٰمًا وَّقُعُوْدًا وَّ عَلٰى
جُنُوْبِهِمْ وَيَتَفَكَّرُوْنَ فِيْ خَلْقِ السَّمٰوٰتِ
وَالْاَرْضِ ۚ رَبَّنَا مَا خَلَقْتَ هٰذَا بَاطِلًا ۚ
سُبْحٰنَكَ فَقِنَا عَذَابَ النَّارِ ﴿١٩١﴾ رَبَّنَآ اِنَّكَ مَنْ
تُدْخِلِ النَّارَ فَقَدْ اَخْزَيْتَهٗ ؕ وَ مَا لِلظّٰلِمِيْنَ
مِنْ اَنْصَارٍ ﴿١٩٢﴾ رَبَّنَآ اِنَّنَا سَمِعْنَا مُنَادِيًا يُّنَادِيْ
لِلْاِيْمَانِ اَنْ اٰمِنُوْا بِرَبِّكُمْ فَاٰمَنَّا ۖ رَبَّنَا فَاغْفِرْ لَنَا
ذُنُوْبَنَا وَ كَفِّرْ عَنَّا سَيِّاٰتِنَا وَ تَوَفَّنَا مَعَ
الْاَبْرَارِ ﴿١٩٣﴾ رَبَّنَا وَاٰتِنَا مَا وَعَدْتَّنَا عَلٰى رُسُلِكَ
وَ لَا تُخْزِنَا يَوْمَ الْقِيٰمَةِ ؕ اِنَّكَ لَا تُخْلِفُ الْمِيْعَادَ ﴿١٩٤﴾

**186 - 189** ముస్లిములారా! మీరు ధన ప్రాణాలకు సంబంధించిన పరీక్షను తప్పకుండా ఎదుర్కొంటారు. గ్రంథ ప్రజల నుండీ, ముష్రిక్కుల నుండీ మీరు కష్టం కలిగించే మాటలు అనేకం వింటారు. ఈ పరిస్థితులలో మీరు గనక సహనంతో, భయభక్తులతో నిలకడగా ఉంటే, ఇది ఎంతో సాహసంతో కూడుకున్న కార్యం. గ్రంథోపదేశాలను ప్రజలలో వ్యాపింపజేయాలని, వాటిని మరుగుపరచరాదని, అల్లాహ్ వారితో చేయించిన ప్రమాణాన్ని కూడా గ్రంథ ప్రజలకు జ్ఞాపకం చెయ్యండి. కాని వారు గ్రంథాన్ని తమ వీపుల వెనుక పడవేశారు. స్వల్ప మూల్యానికి దానిని అమ్మివేశారు. వారు చేసే ఈ వ్యాపారం ఎంత చెడ్డది! తాము చేసిన పనులకు సంతోషపడేవారు, యథార్థంగా తాము చేయని పనులకు తమకు ప్రశంసలు లభించాలని కోరేవారు శిక్షను తప్పించుకుంటారని భావించకండి. వాస్తవానికి వారికొరకు బాధాకరమైన శిక్ష సిద్ధంగా ఉంది. భూమికీ, ఆకాశాలకూ యజమాని అల్లాహ్, ఆయన శక్తి సమస్తాన్నీ ఆవరించివుంది.

**190 - 194** భూమీ, ఆకాశాల సృష్టిలో రేయింబవళ్ళు ఒకదాని తరువాత ఒకటి రావడంలో, నిలుచున్నా, కూర్చున్నా, పరుండినా అన్నివేళలా అల్లాహ్‌ను స్మరించేవారున్నూ, భూమీ, ఆకాశాల నిర్మాణం గురించి చింతన చేసేవారున్నూ అయిన వివేకవంతులకు ఎన్నో సూచనలు ఉన్నాయి. (వారు అప్రయత్నంగా ఇలా అంటారు) ప్రభూ! ఇదంతా నీవు వ్యర్థంగా, లక్ష్యరహితంగా సృష్టించలేదు. నీవు పరిశుద్ధుడవు కాబట్టి నిష్ఫల కార్యాలు చెయ్యవు. కనుక ప్రభూ! మమ్మల్ని నరక బాధనుండి కాపాడు. నీవు ఎవడినైతే నరకంలో పడవేస్తావో వాణ్ణి వాస్తవానికి అధోగతికీ, అవమానానికీ గురి చేసినట్లే. ఇక ఇటువంటి దుర్మార్గులకు సహాయం చేసేవాడెవడూ ఉండడు. ప్రభూ! మేము విశ్వాసం వైపునకు పిలిచేవాని పిలుపును విన్నాము. మీ ప్రభువును విశ్వసించండి అని అతను అనేవాడు. మేము అతని సందేశాన్ని స్వీకరించాము. కనుక మా స్వామీ! మేము చేసిన తప్పులను మన్నించు. మాలో ఉన్న చెడులను దూరం చెయ్యి. సజ్జనులతో పాటు మా జీవితానికి ముగింపు ప్రసాదించు. దేవా! నీవు నీ ప్రవక్తల ద్వారా చేసినటువంటి బాసలను మా విషయంలో నెరవేర్చు. ప్రళయంనాడు మమ్మల్ని పరాభవానికి గురి చెయ్యకు. నిస్సందేహంగా నీవు నీ వాగ్దానాలకు భిన్నంగా వ్యవహరించవు.

**195** సమాధానంగా వారి ప్రభువు ఇలా అన్నాడు: "మీలోని ఎవరి శ్రమనూ నేను వృధాగా పోనివ్వను. పురుషుడైనా స్త్రీ అయినా మీరంతా ఒకే రాశికి చెందినవారు. కనుక నా కొరకు తమ దేశాన్ని విడిచిపెట్టినవారు, నా మార్గంలో తమ గృహాల నుండి గెంటివేయబడినవారు, హింసించబడిన వారు, నా కొరకు పోరాడి చంపబడిన వారు – అటువంటివారి తప్పులన్నింటినీ నేను క్షమిస్తాను. క్రింద సెలయేళ్ళు ప్రవహించే ఉద్యానవనాలలోకి వారిని ప్రవేశింపజేస్తాను." ఇది అల్లాహ్ వద్ద వారికి లభించే ప్రతిఫలం– ఉత్తమమైన ప్రతిఫలం అల్లాహ్ వద్దనే ఉంది.

**196 - 199** ప్రవక్తా! ప్రపంచ దేశాలలో ఉన్నటువంటి అవిశ్వాసులు దర్జాగా తిరుగాడటం నిన్ను మోసంలో పడవేయరాదు. అది కేవలం కొన్ని రోజుల జీవితపు కొద్దిపాటి సుఖం మాత్రమే. తరువాత వారంతా నరకానికి పోతారు. అది అధ్వాన్నమైన నివాసస్థలం. దీనికి భిన్నంగా తమ ప్రభువుకు భయపడుతూ జీవితం గడిపేవారి కొరకు, క్రింద కాలువలు ప్రవహించే తోటలు ఉన్నాయి. ఆ తోటలలో వారు కలకాలం ఉంటారు. ఇది అల్లాహ్ తరఫు నుండి వారికి లభించే ఆతిథ్యం. అల్లాహ్ వద్ద ఉన్నదే సజ్జనుల కొరకు అన్నింటికంటే శ్రేష్ఠమైనది. గ్రంథ ప్రజలలో కూడా కొందరు అల్లాహ్‌ను విశ్వసిస్తారు. నీ వైపునకు పంపబడిన ఈ గ్రంథాన్ని విశ్వసిస్తారు. స్వయంగా వారి వైపునకు ఇదివరకు పంపబడిన గ్రంథాన్ని కూడ విశ్వసిస్తారు. అల్లాహ్ సమక్షంలో వినమ్రులౌతారు. అల్లాహ్ ఆయతులను స్వల్పమయిన మూల్యానికి అమ్మరు. వారి ప్రతిఫలం వారి ప్రభువువద్ద ఉంది. అల్లాహ్ లెక్క తీసుకోవడంలో ఆలస్యం చెయ్యడు.

**200** విశ్వాసులారా! సహనంతో వ్యవహరించండి. అసత్యవాదుల ముందు పరాక్రమం చూపండి. సత్య సేవ కొరకు సిద్ధంగా ఉండండి. అల్లాహ్‌కు భయపడుతూ ఉండండి. తద్వారా మీరు సాఫల్యం పొందే అవకాశం ఉంది.

فَاسْتَجَابَ لَهُمْ رَبُّهُمْ اَنِّيْ لَاۤ اُضِيْعُ عَمَلَ
عَامِلٍ مِّنْكُمْ مِّنْ ذَكَرٍ اَوْ اُنْثٰى ۚ بَعْضُكُمْ
مِّنْۢ بَعْضٍ ۚ فَالَّذِيْنَ هَاجَرُوْا وَاُخْرِجُوْا مِنْ
دِيَارِهِمْ وَاُوْذُوْا فِيْ سَبِيْلِيْ وَ قٰتَلُوْا وَقُتِلُوْا
لَاُكَفِّرَنَّ عَنْهُمْ سَيِّاٰتِهِمْ وَ لَاُدْخِلَنَّهُمْ جَنّٰتٍ
تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ ۚ ثَوَابًا مِّنْ عِنْدِ
اللّٰهِ ؕ وَ اللّٰهُ عِنْدَهٗ حُسْنُ الثَّوَابِ ﴿١٩٥﴾ لَا
يَغُرَّنَّكَ تَقَلُّبُ الَّذِيْنَ كَفَرُوْا فِي الْبِلَادِ ﴿١٩٦﴾
مَتَاعٌ قَلِيْلٌ ۗ ثُمَّ مَاْوٰىهُمْ جَهَنَّمُ ؕ وَ بِئْسَ
الْمِهَادُ ﴿١٩٧﴾ لٰكِنِ الَّذِيْنَ اتَّقَوْا رَبَّهُمْ لَهُمْ جَنّٰتٌ
تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ خٰلِدِيْنَ فِيْهَا نُزُلًا
مِّنْ عِنْدِ اللّٰهِ ؕ وَمَا عِنْدَ اللّٰهِ خَيْرٌ لِّلْاَبْرَارِ ﴿١٩٨﴾
وَاِنَّ مِنْ اَهْلِ الْكِتٰبِ لَمَنْ يُّؤْمِنُ بِاللّٰهِ وَ
مَاۤ اُنْزِلَ اِلَيْكُمْ وَ مَاۤ اُنْزِلَ اِلَيْهِمْ خٰشِعِيْنَ
لِلّٰهِ ۙ لَا يَشْتَرُوْنَ بِاٰيٰتِ اللّٰهِ ثَمَنًا قَلِيْلًا ؕ
اُولٰٓئِكَ لَهُمْ اَجْرُهُمْ عِنْدَ رَبِّهِمْ ؕ اِنَّ اللّٰهَ
سَرِيْعُ الْحِسَابِ ﴿١٩٩﴾ يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا
اصْبِرُوْا وَصَابِرُوْا وَرَابِطُوْا ۗ وَاتَّقُوا اللّٰهَ
لَعَلَّكُمْ تُفْلِحُوْنَ ﴿٢٠٠﴾

الثلثة
ع ٢٠ ١١

35. అంటే, మీలో ఎవరు విశ్వాసులో, ఎవరు కపటులో మీకు తెలియజెయ్యాలని.

36. ఇది యూదుల మాట. ఖురానులో, "అల్లాహ్‌కు మంచి రుణం ఇచ్చేవారెవరు?" అనే ఆయత్ వచ్చినప్పుడు, దానిని ఎగతాళిచేస్తూ యూదులు, "అవును, పాపం అల్లాహ్ నిరుపేద అయ్యాడు. అందుకని ఇప్పుడు ఆయన తన దాసులను అప్పు అడుగుతున్నాడు" అని అనటం ప్రారంభించారు.

ఆయతులు 176

# 4. అన్ నిసా

అవతరణ మదీనాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1** మానవులారా! మీ ప్రభువుకు భయపడండి. ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణి నుండి పుట్టించాడు. అదే ప్రాణి నుండి దాని జతను సృష్టించాడు. ఇంకా ఆ జంట ద్వారా ఎంతో మంది పురుషులను, స్త్రీలను అవనిలో వ్యాపింపజేశాడు. ఏ దేవుని పేరు చెప్పుకుని మీరు పరస్పరం మీ మీ హక్కులను కోరుకుంటారో, ఆ దేవునికి భయపడండి. బంధుత్వ సంబంధాలను తెంచటం మానుకోండి. అల్లాహ్ మిమ్మల్ని పరికిస్తున్నాడనే విషయాన్ని తెలుసుకోండి.

**2** అనాథుల ఆస్తిని వారికి తిరిగి ఇవ్వండి. వారి మంచి వస్తువులను మీ చెడ్డ వస్తువులతో మార్చకండి. వారి ఆస్తిని మీ ఆస్తితో కలిపి కబళించకండి. ఇది మహాపాపం.

**3** అనాథులకు న్యాయం చెయ్యలేమనే భయం మీకు కలిగితే, మీకు నచ్చిన స్త్రీలను ఇద్దరేసిగాని, ముగ్గురేసిగాని, నలుగురేసిగాని వివాహం చేసుకోండి.[1] అయితే వారితో న్యాయంగా వ్యవహరించలేమనే భయం మీకుంటే, అప్పుడు ఒకామెనే చేసుకోండి[2] లేదా మీ స్వాధీనంలోకి వచ్చిన స్త్రీలను[3] దాంపత్యంలోకి తీసుకోండి. అన్యాయానికి దూరంగా ఉండేందుకు ఇది ఉత్తమ మార్గం.

۴ سُوۡرَةُ النِّسَآءِ مَدَنِيَّةٌ ۹۲

رکوعاتها ۲۴ اٰیاتها ۱۷۶

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○

يٰۤاَيُّهَا النَّاسُ اتَّقُوۡا رَبَّكُمُ الَّذِىۡ خَلَقَكُمۡ مِّنۡ
نَّفۡسٍ وَّاحِدَةٍ وَّ خَلَقَ مِنۡهَا زَوۡجَهَا وَ بَثَّ
مِنۡهُمَا رِجَالًا كَثِيۡرًا وَّنِسَآءً‌ ۚ وَ اتَّقُوا اللّٰهَ
الَّذِىۡ تَسَآءَلُوۡنَ بِهٖ وَ الۡاَرۡحَامَ‌ ؕ اِنَّ اللّٰهَ
كَانَ عَلَيۡكُمۡ رَقِيۡبًا ﴿۱﴾ وَ اٰتُوا الۡيَتٰمٰٓى اَمۡوَالَهُمۡ
وَ لَا تَتَبَدَّلُوا الۡخَبِيۡثَ بِالطَّيِّبِ‌ ۖ وَ لَا تَاۡكُلُوۡۤا
اَمۡوَالَهُمۡ اِلٰٓى اَمۡوَالِكُمۡ‌ ؕ اِنَّهٗ كَانَ حُوۡبًا
كَبِيۡرًا ﴿۲﴾ وَ اِنۡ خِفۡتُمۡ اَلَّا تُقۡسِطُوۡا فِى الۡيَتٰمٰى
فَانۡكِحُوۡا مَا طَابَ لَـكُمۡ مِّنَ النِّسَآءِ مَثۡنٰى وَ
ثُلٰثَ وَ رُبٰعَ‌ ۚ فَاِنۡ خِفۡتُمۡ اَلَّا تَعۡدِلُوۡا
فَوَاحِدَةً اَوۡ مَا مَلَـكَتۡ اَيۡمَانُكُمۡ‌ ؕ ذٰلِكَ اَدۡنٰٓى
اَلَّا تَعُوۡلُوۡا ؕ ﴿۳﴾

1. ఈ ఆయత్ ఒకరికంటే ఎక్కువమంది భార్యలను చేసుకునే అనుమతి ఇచ్చే నిమిత్తం అవతరించలేదు అనే విషయం దృష్టిలో ఉండాలి. ఎందుకంటే, దీని అవతరణకు పూర్వమే ఈ పద్ధతి ధర్మసమ్మతమై ఉండేది. స్వయంగా మహాప్రవక్త (సఅసమ్)కు అప్పుడు ఒకరికంటే ఎక్కువమంది భార్యలు ఉండేవారు. అసలు ఈ ఆయత్ యుద్ధాలలో షహీదులైన వారి అనాథులైన పిల్లల సమస్యను పరిష్కరించేందుకు అవతరించింది. "ఒకవేళ మీరు ఈ అనాథులైన పిల్లల హక్కులను నెరవేర్చలేకపోతే, అప్పుడు అనాథులైన పిల్లలు కల స్త్రీలను వివాహం చేసుకోండి" అని సెలవీయబడింది.

2. ఈ విషయంలో షరీయత్తువేత్తల మధ్య ఏకాభిప్రాయం (ఇజ్‌మా) ఉంది. ఈ ఆయత్ ప్రకారం భార్యల సంఖ్య పరిమితం చెయ్యబడింది. ఒకే సమయంలో నలుగురుకంటే ఎక్కువమంది భార్యలను కలిగివుండటం నిషేధించబడింది. ఇంకా ఈ ఆయత్ బహుభార్యాత్వపు అనుమతిని భార్యలందరికీ న్యాయం చెయ్యాలి అనే షరతుమీద ఇస్తుంది. అయితే న్యాయం అనే షరతును నెరవేర్చకుండా ఒకరికంటే ఎక్కువమంది భార్యలను చేసుకునే అనుమతిని వినియోగించుకునేవాడు అల్లాహ్‌ను మోసం చేస్తున్నాడు అన్నమాట. అతడు న్యాయం చేయని భార్యగాని, భార్యలుగానీ ఫిర్యాదుచేస్తే వారికి న్యాయం చేకూర్చే హక్కు ఇస్లామీ ప్రభుత్వ న్యాయస్థానానికి ఉన్నది. పాశ్చాత్యుల దృక్పథాల ప్రాబల్యానికి, బానిసత్వానికి లోనయినటువంటి కొందరు, బహుభార్యాత్వ

وَاٰتُوا النِّسَآءَ صَدُقٰتِهِنَّ نِحْلَةً ؕ فَاِنْ طِبْنَ
لَكُمْ عَنْ شَیْءٍ مِّنْهُ نَفْسًا فَكُلُوْهُ هَنِیْٓـًٔا
مَّرِیْٓـًٔا ۝۴ وَ لَا تُؤْتُوا السُّفَهَآءَ اَمْوَالَكُمُ الَّتِیْ
جَعَلَ اللّٰهُ لَكُمْ قِیٰمًا وَّ ارْزُقُوْهُمْ فِیْهَا وَ
اكْسُوْهُمْ وَ قُوْلُوْا لَهُمْ قَوْلًا مَّعْرُوْفًا ۝۵ وَ ابْتَلُوا
الْیَتٰمٰی حَتّٰۤی اِذَا بَلَغُوا النِّكَاحَ ۚ فَاِنْ اٰنَسْتُمْ
مِّنْهُمْ رُشْدًا فَادْفَعُوْۤا اِلَیْهِمْ اَمْوَالَهُمْ ۚ وَ لَا
تَاْكُلُوْهَاۤ اِسْرَافًا وَّ بِدَارًا اَنْ یَّكْبَرُوْا ؕ وَ مَنْ
كَانَ غَنِیًّا فَلْیَسْتَعْفِفْ ۚ وَ مَنْ كَانَ فَقِیْرًا
فَلْیَاْكُلْ بِالْمَعْرُوْفِ ؕ فَاِذَا دَفَعْتُمْ اِلَیْهِمْ
اَمْوَالَهُمْ فَاَشْهِدُوْا عَلَیْهِمْ ؕ وَ كَفٰی بِاللّٰهِ حَسِیْبًا ۝۶

**4** స్త్రీలకు వారి మహర్‌ను సంతోషంగా(విధిగా భావిస్తూ) చెల్లించండి. అయితే వారు తమంత తాము మహర్‌లో కొంత భాగాన్ని తమ ఇష్టపూర్వకంగా విడిచిపెడితే, దానిని మీరు సంతోషంగా అనుభవించండి.

**5** అల్లాహ్ మీకు జీవనాధారంగా చేసిన సంపదను అవివేకులకు అప్పగించకండి. అయితే దానినుండి వారికి అన్న వస్త్రాలు కల్పించండి. వారికి హితబోధ చెయ్యండి.

**6** అనాథులకు పెళ్ళి ఈడు వచ్చేవరకు వారిని అజమాయిషీ చేస్తూ ఉండండి.[4] వారిలో మీకు యోగ్యత కనిపించినపుడు వారి ఆస్తిని వారికి అప్పగించండి. వారు పెద్దవారై తమ హక్కును కోరుతారేమో అని భయపడి వారి ఆస్తిని న్యాయ సీమలను అతిక్రమించి తొందర తొందరగా ఎన్నడూ తినకండి. అనాథుల సంరక్షకుడు సంపన్నుడైతే, అతడు వారి సొమ్ముకు దూరంగా ఉండాలి. ఒకవేళ అతడు పేదవాడైతే దాన్ని ధర్మ సమ్మతంగా అనుభవించాలి.[5] తరువాత వారి ఆస్తిని వారికి అప్పగించేటప్పుడు దానికి ఇతరులను సాక్షులుగా పెట్టండి. లెక్క తీసుకోవటానికి అల్లాహ్ చాలు.

---

పద్ధతిని (ఇది పాశ్చాత్యుల దృష్టికోణంలో మౌలికంగా తప్పుడు పద్ధతి) రూపుమాపటమే అసలు ఖురాను ఉద్దేశ్యం అని నిరూపించటానికి ప్రయత్నం చేస్తారు. అసలు ఇటువంటి ఆలోచనలు మానసిక దాస్యం వల్ల ఉత్పన్నమౌతాయి. స్వతహాః బహుభార్యాత్వం ఒక చెడు అని అనటమే అసలు ఒప్పుకోదగ్గ విషయం కాదు. ఎందుకంటే కొన్ని పరిస్థితులలో ఇది ఒక సాంఘిక, నైతిక ఆవశ్యకత అవుతుంది. అందుకనే దివ్య ఖురాను స్పష్టమైన మాటలలో దీనిని ధర్మసమ్మతం చేసింది. దీనిని నిజంగానే నిర్మూలిస్తుందని తెలుసుకోవటానికి సూచన ప్రాయంగానైనా సరే నిరసిస్తూ ఏ పదాన్ని ఉపయోగించలేదు.

3. బానిస స్త్రీలు అని భావం. అంటే, యుద్ధంలో నిర్బంధింపబడిన స్త్రీలు. యుద్ధఖైదీల మార్పిడి జరగని పక్షంలో, ప్రభుత్వం తరఫు నుండి ప్రజలకు పంచి ఇవ్వబడినవారు.

4. అంటే, వారు యుక్త వయస్సుకు చేరువవుతున్నప్పుడు, వారి బుద్ధివికాసం ఎలా ఉందో, వారిలో తమ వ్యవహారాలను స్వయంగా తమ బాధ్యతపై నడుపుకునే సామర్థ్యం ఎంత వరకు పెరిగిందో చూస్తూ ఉండండి.

5. అంటే, అతడు తన సేవలకు తీసుకునే పారితోషికం న్యాయమైనదని నిష్పాక్షికుడైన, న్యాయబుద్ధిగల ప్రతి మనిషీ ఒప్పుకోవాలి. ఇంకా అతడు పారితోషికం ఎంత తీసుకున్నా, దానిని రహస్యంగా తీసుకోరాదు. బహిరంగంగా నిర్ణయించి మరీ తీసుకోవాలి. ఇంకా దాని లెక్కను వ్రాసి ఉంచాలి.

**7** తల్లిదండ్రులు, దగ్గరి బంధువులు విడిచివెళ్ళిన ఆస్తిలో పురుషులకు భాగం ఉంది. అదేవిధంగా తల్లిదండ్రులు, దగ్గరి బంధువులు విడిచివెళ్ళిన ఆస్తిలో స్త్రీలకు కూడా భాగం ఉంది - అది తక్కువైనా సరే లేక ఎక్కువైనా సరే.[6] ఈ భాగం (అల్లాహ్‌చే) నిర్ణయించబడింది.

**8** ఆస్తి పంపకం జరిగేటప్పుడు ఇతర బంధువులు, అనాథులు, నిరుపేదలు వస్తే, ఆ ఆస్తినుండి వారికి కూడ కొంత ఇవ్వండి. వారిని మంచిమాటలతో పలుకరించండి.

**9 - 10** ప్రజలు ఈ విషయాన్ని గురించి ఆలోచించి భయపడాలి : ఒకవేళ వారే తమ పిల్లలను నిస్సహాయులుగా విడిచిపెట్టి వెళ్ళవలసివస్తే మరణ సమయంలో వారు ఆ పిల్లలను గురించి ఎంతగా ఆందోళన చెందేవారో! కనుక వారు అల్లాహ్‌కు భయపడాలి. న్యాయం పలకాలి. అనాథుల ఆస్తిని అన్యాయంగా తినేవారు వాస్తవానికి తమ పొట్టలను అగ్నితో నింపుకుంటారు. వారు తప్పకుండా మండే నరకాగ్నిలో త్రోయ బడతారు.

لِلرِّجَالِ نَصِيبٌ مِّمَّا تَرَكَ الْوَالِدٰنِ وَ
الْاَقْرَبُوْنَ ۖ وَ لِلنِّسَآءِ نَصِيبٌ مِّمَّا تَرَكَ
الْوَالِدٰنِ وَ الْاَقْرَبُوْنَ مِمَّا قَلَّ مِنْهُ اَوْ كَثُرَ ۭ
نَصِيبًا مَّفْرُوْضًا ۝٧ وَ اِذَا حَضَرَ الْقِسْمَةَ اُولُوا
الْقُرْبٰى وَالْيَتٰمٰى وَالْمَسٰكِيْنُ فَارْزُقُوْهُمْ مِّنْهُ وَ
قُوْلُوْا لَهُمْ قَوْلًا مَّعْرُوْفًا ۝٨ وَ لْيَخْشَ الَّذِيْنَ
لَوْ تَرَكُوْا مِنْ خَلْفِهِمْ ذُرِّيَّةً ضِعٰفًا خَافُوْا
عَلَيْهِمْ ۖ فَلْيَتَّقُوا اللّٰهَ وَلْيَقُوْلُوْا قَوْلًا
سَدِيْدًا ۝٩ اِنَّ الَّذِيْنَ يَاْكُلُوْنَ اَمْوَالَ
الْيَتٰمٰى ظُلْمًا اِنَّمَا يَاْكُلُوْنَ فِيْ بُطُوْنِهِمْ نَارًا ۭ
وَسَيَصْلَوْنَ سَعِيْرًا ۝١٠ ع ١٠/١٢

6. ఈ ఆయత్‌లో స్పష్టంగా చట్టసంబంధమైన ఐదు ఉత్తరువులు ఇవ్వబడ్డాయి. ఒకటి, వారసత్వపు ఆస్తి కేవలం పురుషుల హక్కు మాత్రమే కాదు, స్త్రీలు కూడా దానికి హక్కుదారులే. రెండు, వారసత్వపు ఆస్తి విభజింపబడాలి, అది ఎంత తక్కువ అయినాసరే. మూడు, ఈ ఆయత్‌లో మృతుడు వదలివెళ్ళిన మొత్తం ఆస్తి విభజింపతగినదిగా ఖరారు చెయ్యబడింది. ఇందులో స్థిరాస్తి, చరాస్తి అనీ, సేద్యపు భూమి, బంజరు భూమి అనీ, పిత్రార్జితం, స్వార్జితం అనీ ఏ విచక్షణా చూపటం జరగలేదు. నాలుగు, దీనిద్వారా తెలిసేదేమిటంటే, ఆస్తిపరుని జీవితకాలంలో వారసత్వపు హక్కును గురించి ఏ విధమైన ప్రశ్న ఉత్పన్నం కాదు. కాని ఆస్తిపరుడు ఏదైనా ఆస్తిని వదలిపెట్టి మరణిస్తే అప్పుడు వారసత్వపు హక్కు అనేది ఉద్భవిస్తుంది. ఐదు, ఈ ఆయత్ ద్వారా ఈ నిబంధన కూడా రూపొందుతుంది : దగ్గరి బంధువు ఉన్నప్పుడు, దూరపు బంధువు వారసత్వపు ఆస్తిని పొందలేడు. ఈ నిబంధనను రాబోయే 11వ ఆయత్ చివర్లోనూ, 33వ ఆయత్‌లోనూ వివరించటం జరిగింది.

يُوصِيكُمُ اللّٰهُ فِيٓ اَوْلَادِكُمْ ۚ لِلذَّكَرِ مِثْلُ حَظِّ
الْاُنْثَيَيْنِ ۚ فَاِنْ كُنَّ نِسَآءً فَوْقَ اثْنَتَيْنِ
فَلَهُنَّ ثُلُثَا مَا تَرَكَ ۚ وَ اِنْ كَانَتْ وَاحِدَةً
فَلَهَا النِّصْفُ ۗ وَ لِاَبَوَيْهِ لِكُلِّ وَاحِدٍ مِّنْهُمَا
السُّدُسُ مِمَّا تَرَكَ اِنْ كَانَ لَهٗ وَلَدٌ ۚ فَاِنْ
لَّمْ يَكُنْ لَّهٗ وَلَدٌ وَّ وَرِثَهٗٓ اَبَوٰهُ فَلِاُمِّهِ
الثُّلُثُ ۚ فَاِنْ كَانَ لَهٗٓ اِخْوَةٌ فَلِاُمِّهِ السُّدُسُ
مِنْ بَعْدِ وَصِيَّةٍ يُّوْصِيْ بِهَآ اَوْ دَيْنٍ ۗ اٰبَآؤُكُمْ
وَ اَبْنَآؤُكُمْ لَا تَدْرُوْنَ اَيُّهُمْ اَقْرَبُ لَكُمْ
نَفْعًا ۗ فَرِيْضَةً مِّنَ اللّٰهِ ۗ اِنَّ اللّٰهَ كَانَ
عَلِيْمًا حَكِيْمًا ﴿١١﴾

**11** మీ సంతానం విషయంలో అల్లాహ్ మీకు ఇలా ఆదేశిస్తున్నాడు: ఒక పురుషుని భాగం ఇద్దరు స్త్రీల భాగాలకు సమానం.[7] ఒకవేళ (మృతునికి వారసులుగా) ఇద్దరికంటే ఎక్కువమంది ఆడ పిల్లలు ఉంటే, వారికి మొత్తం ఆస్తిలో మూడింట రెండు భాగాలు ఇవ్వాలి.[8] ఒకే ఆడపిల్ల వారసు రాలైతే, ఆస్తిలో అర్ధ భాగం ఆమెకు చెందుతుంది. మృతుడు సంతానం కలవాడైతే, అతని తల్లిదండ్రులలో ఒక్కొక్కరికి మొత్తం ఆస్తిలో ఆరోభాగం లభించాలి.[9] ఒకవేళ అతడు సంతానం లేనివాడై అతని తల్లిదండ్రులు మాత్రమే అతనికి వారసులైతే, అప్పుడు తల్లికి మూడో భాగం ఇవ్వాలి.[10] మృతు డికి సోదరీ సోదరులు కూడా ఉంటే, అప్పుడు తల్లికి ఆరోభాగం లభిస్తుంది.[11] మృతుడు రాసిన వీలునామా అమలుజరిపి అతనిపై ఉన్న అప్పులు తీర్చిన తరువాతనే[12] (ఈ భాగాల పంపకం జరగాలి). మీ తల్లిదండ్రులలో, మీ సంతానంలో ప్రయోజనం రీత్యా మీకు ఎవరు ఎక్కువ సన్నిహితులో మీకు తెలియదు. ఈ భాగాలను అల్లాహ్ నిర్ణయించాడు. నిశ్చ యంగా అల్లాహ్ యథార్థాలన్నీ తెలిసినవాడు, మర్మాలన్నీ ఎరిగినవాడు.

7. కుటుంబ జీవితంలో ఆర్థిక బాధ్యతల భారాన్ని షరీయతు పురుషునిపై ఎక్కువగా మోపింది. స్త్రీని ఎన్నో ఆర్థిక బాధ్యతల బరువు నుండి తప్పించింది. కనుక వారసత్వపు ఆస్తిలో స్త్రీ భాగాన్ని పురుషుని భాగం కంటే తక్కువగా ఉంచటం న్యాయమే.

8. ఇదే ఆజ్ఞ ఇద్దరు కూతుళ్ళ విషయంలో కూడా వర్తిస్తుంది. భావం ఏమిటంటే, ఏ వ్యక్తికైనా వారసుడుగా కొడుకే లేకపోతే, కేవలం కూతుళ్ళే ఉంటే, ఇద్దరు కూతుళ్ళున్నా లేక ఇద్దరి కంటే ఎక్కువమంది ఉన్నా, అప్పుడు, అతడు వదలి వెళ్ళిన మొత్తం ఆస్తిలో మూడింట రెండు వంతులు ఆ కూతుళ్ళకు పంచబడుతుంది. మిగిలిన మూడో వంతు ఇతర వారసులకు. కాని మృతునికి కేవలం ఒక్కడే కొడుకు ఉంటే, అప్పుడు దీని విషయంలో పండితుల మధ్య ఏకాభిప్రాయం (ఇజ్‌మా) ఇలా ఉంది : ఇతర వారసులెవరూ లేని పక్షంలో, అతడు మొత్తం సంపదకు వారసుడవుతాడు. ఇతర వారసులుంటే, వారి భాగం ఇచ్చిన తరువాత మిగిలిన మొత్తం ఆస్తి అతనికి లభిస్తుంది.

9. అంటే, మృతుడు సంతానం కలవాడైన పక్షంలో, మృతుని తల్లిదండ్రులలో ఒక్కొక్కరు ఆరింట ఒక వంతుకు హక్కుదారులౌతారు. మృతునికి వారసులు కేవలం కూతుళ్ళే ఉన్నా లేక కేవలం కొడుకులే ఉన్నా లేక కొడుకులూ కూతుళ్ళూ ఉన్నా లేక ఒకే కొడుకైనా లేక ఒకే కూతురైనా, ఎట్టి పరిస్థితిలలోనైనా సరే మిగిలిన మూడింట రెండు వంతుల ఆస్తిని ఇతర వారసులు పంచుకుంటారు.

10. తల్లిదండ్రులు తప్ప మరొక వారసుడెవడూ లేనిపక్షంలో, మిగిలిన మూడింట రెండు వంతుల ఆస్తి తండ్రికి లభిస్తుంది. అలా కానిపక్షంలో మూడింట రెండు వంతులలో తండ్రి, ఇతర వారసులు భాగస్వాములౌతారు.

11. సోదరులు సోదరీమణులు ఉన్న పక్షంలో, తల్లి భాగం మూడింట ఒక వంతుకు బదులు ఆరింట ఒక వంతు చెయ్యబడింది. ఈ విధంగా తల్లి భాగం తగ్గించగా మిగిలిన ఆరింట ఒక వంతు తండ్రి భాగానికి చేర్చబడుతుంది. ఎందుకంటే, ఈ పరిస్థితిలో తండ్రి బాధ్యతలు అధికమౌతాయి. మృతుని తల్లిదండ్రులు ఒకవేళ బ్రతికి ఉంటే, అతని సోదరీ సోదరులకు భాగం లేదు.

وَ لَكُمْ نِصْفُ مَا تَرَكَ اَزْوَاجُكُمْ اِنْ لَّمْ
يَكُنْ لَّهُنَّ وَلَدٌ ۚ فَاِنْ كَانَ لَهُنَّ وَلَدٌ فَلَكُمُ
الرُّبُعُ مِمَّا تَرَكْنَ مِنْۢ بَعْدِ وَصِيَّةٍ يُّوْصِيْنَ
بِهَآ اَوْ دَيْنٍ ؕ وَ لَهُنَّ الرُّبُعُ مِمَّا تَرَكْتُمْ اِنْ
لَّمْ يَكُنْ لَّكُمْ وَلَدٌ ۚ فَاِنْ كَانَ لَكُمْ وَلَدٌ
فَلَهُنَّ الثُّمُنُ مِمَّا تَرَكْتُمْ مِّنْۢ بَعْدِ وَصِيَّةٍ
تُوْصُوْنَ بِهَآ اَوْ دَيْنٍ ؕ وَ اِنْ كَانَ رَجُلٌ
يُّوْرَثُ كَلٰلَةً اَوِ امْرَاَةٌ وَّ لَهٗۤ اَخٌ اَوْ اُخْتٌ
فَلِكُلِّ وَاحِدٍ مِّنْهُمَا السُّدُسُ ۚ فَاِنْ كَانُوْۤا
اَكْثَرَ مِنْ ذٰلِكَ فَهُمْ شُرَكَآءُ فِى الثُّلُثِ مِنْۢ
بَعْدِ وَصِيَّةٍ يُّوْصٰى بِهَآ اَوْ دَيْنٍ ۙ غَيْرَ مُضَآرٍّ ۚ
وَصِيَّةً مِّنَ اللّٰهِ ؕ وَاللّٰهُ عَلِيْمٌ حَلِيْمٌ ؕ﴿۱۲﴾

**12** మీ భార్యలకు సంతానం లేనిపక్షంలో, వారు విడిచి పోయిన ఆస్తిలో మీకు అర్ధభాగం లభిస్తుంది. కాని వారికి సంతానం ఉంటే అప్పుడు వారు విడిచివెళ్ళిన ఆస్తిలో మీకు నాలుగోభాగం లభిస్తుంది. ఇది వారు వ్రాసిపోయిన వీలునామా అమలు జరిపిన తరువాత, వారు చేసిపోయిన అప్పులు తీర్చిన తరువాత జరగాలి. మీకు సంతానం లేనిపక్షంలో మీరు విడిచి పోయే ఆస్తిలోని నాలుగో భాగానికి వారు (మీ భార్యలు) హక్కుదారులౌతారు. కాని మీరు సంతానవంతులైతే అప్పుడు వారికి ఎనిమిదో భాగం లభిస్తుంది.[13] ఇది మీరు వ్రాసిన వీలునామాను అమలు జరిపిన తరువాత, మీరు చేసిన అప్పులు తీర్చిన తరువాత జరగాలి.

(మరణించిన) పురుషుడు లేక స్త్రీ సంతానహీనులై వారి తల్లి దండ్రులు కూడా జీవించి ఉండకపోతే, కాని వారికి ఒక సోదరుడు లేక ఒక సోదరి ఉంటే అప్పుడు వారిద్దరిలో ఒక్కొక్కరికి ఆరోభాగం లభిస్తుంది. కాని సోదరీ సోదరులు ఒకరి కంటే ఎక్కువమంది ఉంటే అప్పుడు మొత్తం ఆస్తిలోని మూడో భాగానికి వారంతా భాగస్వాములౌతారు.[14] మృతుడు వ్రాసిన వీలునామా అమలు జరిపిన తరువాత, అతడు చేసిన అప్పులు తీర్చిన తరువాత ఈ పంపిణీ జరగాలి. కాని ఇది (వారసులకు) నష్టం కలిగించేది కాకూడదు.[15] ఇది అల్లాహ్ వైపు నుండి వచ్చిన ఆదేశం. అల్లాహ్ అన్నీ తెలిసినవాడు, అత్యంత మృదు స్వభావుడు.

12. వీలునామా ప్రస్తావన అప్పునకు పూర్వమే వచ్చింది. కాని 'ఉమ్మత్' యొక్క ఏకాభిప్రాయం ఏమిటంటే, వీలునామా కంటే ముందు అప్పునకు ప్రాముఖ్యం ఇవ్వాలి. అంటే, మృతుడు ఒకవేళ రుణగ్రస్తుడు అయివుంటే, అన్నిటికంటే ముందు మృతుడు వదలిపోయిన ఆస్తినుండి ఆ అప్పు తీర్చబడాలి. తరువాత వీలునామా అమలుపరచబడాలి. దీని తరువాతనే వారసత్వపు ఆస్తి పంచబడుతుంది.

13. అంటే, భార్య ఒకతె ఉన్నా లేక ఒకరికంటే ఎక్కువమంది భార్యలు ఉన్నా, సంతానం ఉన్న పక్షంలో వారు ఎనిమిదింట ఒక వంతుకు, సంతానం లేని పక్షంలో నాలుగింట ఒక వంతుకు భాగస్వాములు అవుతారు. ఈ నాలుగింట ఒక వంతు లేక ఎనిమిదింట ఒక వంతు భార్యలందరికీ సమానంగా పంచబడాలి.

14. ఈ ఆయత్‌ను గురించి వ్యాఖ్యాతల ఇజ్మా (ఏకాభిప్రాయం) ఎలా ఉందంటే, ఇందులో సోదరులు సోదరీమణులు అంటే భావం, అర్ధ సోదరులు, అర్ధ సోదరీమణులు అని. అంటే, కేవలం తల్లి తరపు నుండి మృతునికి బంధువులైనవారు. కాని వారి తండ్రి మరొకరు. ఇక సొంత సోదరసోదరీమణులు, తండ్రి తరపు నుండి మృతునితో బంధుత్వం కలిగి వున్న సవతి సోదర సోదరీమణులు, వారికి వర్తించే ఆజ్ఞ ఇదే సూరాలో చివరి ఆయత్‌లో వచ్చింది.

15. వీలునామాలో నష్టం కలిగించటం అంటే అర్హులైన బంధువుల యొక్క హక్కులు భంగపడేలా వీలునామా వ్రాయటం. అప్పులో నష్టం కలిగించటం అంటే, కేవలం హక్కుదారులకు వారి హక్కు దొరక్కుండా చెయ్యటానికి, మనిషి నిజంగా

**13 - 14** ఇవి అల్లాహ్ విధించిన హద్దులు. అల్లాహ్‌కూ ఆయన ప్రవక్తకూ విధేయత చూపేవాణ్ణి అల్లాహ్, క్రింద సెలయేళ్ళు ప్రవహించే ఉద్యానవనాలలో ప్రవేశింపజేస్తాడు. ఆ వనాలలో అతడు కలకాలం ఉంటాడు. అసలు ఇదే గొప్ప సాఫల్యం. అల్లాహ్‌కూ ఆయన ప్రవక్తకూ అవిధేయత చూపుతూ అల్లాహ్ విధించిన హద్దులను అతిక్రమించేవాణ్ణి అల్లాహ్ అగ్నిలో పడవేస్తాడు. అందులో అతడు సదా ఉంటాడు. అతనికి మిక్కిలి అవమానకరమైన శిక్ష పడుతుంది.

**15 - 16** మీ స్త్రీలలో ఎవరైనా సిగ్గుమాలిన పనికి ఒడిగట్టితే, వారికి వ్యతిరేకంగా మీలో నలుగురు మనుషుల సాక్ష్యం తీసుకోండి. నలుగురు మనుషులు గనక సాక్ష్యం ఇస్తే, వారు మరణించే వరకైనా లేదా వారికొరకు అల్లాహ్ ఏదైనా మార్గం చూపించేవరకైనా వారిని ఇళ్ళల్లో నిర్బంధించండి. మీలో ఈ అకృత్యానికి పాల్పడిన వారినిద్దరినీ బాధించండి. తరువాత వారు పశ్చాత్తాప పడి, తమ నడతను సరిదిద్దుకుంటే వారిని విడిచిపెట్టండి. అల్లాహ్ పశ్చాత్తాపాన్ని అధికంగా అంగీకరిస్తాడు, ఎక్కువగా కనికరిస్తాడు.[16]

**17 - 18** అజ్ఞానం వల్ల ఏదైనా చెడ్డపని చేసి వెనువెంటనే పశ్చాత్తాపపడే వారి పశ్చాత్తాపాన్ని మాత్రమే స్వీకరించే బాధ్యత అల్లాహ్‌పై ఉంది అని తెలుసుకోండి. అలాంటివారి పట్ల అల్లాహ్ కరుణాదృష్టితో తిరిగి సుముఖుడవుతాడు. అల్లాహ్ అన్ని విషయాలు తెలిసినవాడూ, వివేకసంపన్నుడూను. చావు గడియ సమీపించేవరకు ఎడతెగకుండా అకృత్యాలు చేస్తూ వుండి, "ఇప్పుడు నేను పశ్చాత్తాపపడుతున్నాను" అని అనేవారి పశ్చాత్తాపం ఎంత మాత్రం స్వీకరించబడదు. ఇదేవిధంగా, మరణించే వరకు అవిశ్వాసులుగానే ఉండేవారి పశ్చాత్తాపం కూడా స్వీకరించబడదు. అటువంటి వారి కొరకు మేము అత్యంత బాధాకరమైన శిక్షను సిద్ధంచేసి ఉంచాము.

تِلْكَ حُدُوْدُ اللّٰهِ ؕ وَ مَنْ يُّطِعِ اللّٰهَ وَ رَسُوْلَهٗ
يُدْخِلْهُ جَنّٰتٍ تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ
خٰلِدِيْنَ فِيْهَا ؕ وَ ذٰلِكَ الْفَوْزُ الْعَظِيْمُ ﴿١٣﴾ وَ مَنْ
يَّعْصِ اللّٰهَ وَ رَسُوْلَهٗ وَ يَتَعَدَّ حُدُوْدَهٗ
يُدْخِلْهُ نَارًا خَالِدًا فِيْهَا ۪ وَلَهٗ عَذَابٌ
مُّهِيْنٌ ﴿١٤﴾ وَ الّٰتِيْ يَاْتِيْنَ الْفَاحِشَةَ مِنْ ع ١٤
نِّسَآئِكُمْ فَاسْتَشْهِدُوْا عَلَيْهِنَّ اَرْبَعَةً
مِّنْكُمْ ۚ فَاِنْ شَهِدُوْا فَاَمْسِكُوْهُنَّ فِي الْبُيُوْتِ
حَتّٰى يَتَوَفّٰهُنَّ الْمَوْتُ اَوْ يَجْعَلَ اللّٰهُ لَهُنَّ
سَبِيْلًا ﴿١٥﴾ وَالَّذٰنِ يَاْتِيٰنِهَا مِنْكُمْ فَاٰذُوْهُمَا ۚ
فَاِنْ تَابَا وَ اَصْلَحَا فَاَعْرِضُوْا عَنْهُمَا ؕ اِنَّ
اللّٰهَ كَانَ تَوَّابًا رَّحِيْمًا ﴿١٦﴾ اِنَّمَا التَّوْبَةُ عَلَى
اللّٰهِ لِلَّذِيْنَ يَعْمَلُوْنَ السُّوْٓءَ بِجَهَالَةٍ ثُمَّ
يَتُوْبُوْنَ مِنْ قَرِيْبٍ فَاُولٰٓئِكَ يَتُوْبُ اللّٰهُ
عَلَيْهِمْ ؕ وَ كَانَ اللّٰهُ عَلِيْمًا حَكِيْمًا ﴿١٧﴾ وَ
لَيْسَتِ التَّوْبَةُ لِلَّذِيْنَ يَعْمَلُوْنَ السَّيِّاٰتِ ۚ
حَتّٰٓى اِذَا حَضَرَ اَحَدَهُمُ الْمَوْتُ قَالَ اِنِّيْ
تُبْتُ الْـٰٔنَ وَ لَا الَّذِيْنَ يَمُوْتُوْنَ وَهُمْ كُفَّارٌ ؕ
اُولٰٓئِكَ اَعْتَدْنَا لَهُمْ عَذَابًا اَلِيْمًا ﴿١٨﴾

---

తాను చెయ్యని అప్పులు కూడా చేశానని అంగీకరించటం లేదా హక్కుదారులకు ఆస్తి దొరక్కుండా చేసే దురుద్దేశ్యంతో ఏదైనా పన్నాగం పన్నటం.

16. ఇది వ్యభిచార నేరానికి సంబంధించిన తొలి ఆదేశం. తరువాత 'నూర్' సూరాలో పురుషుణ్ణీ స్త్రీనీ ఇరువురినీ చెరొక వంద కొరడా దెబ్బలు కొట్టాలి అనే ఆజ్ఞ కల ఆయత్ అవతరించింది.

يَآاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لَا يَحِلُّ لَكُمْ اَنْ تَرِثُوا
النِّسَآءَ كَرْهًا ؕ وَلَا تَعْضُلُوْهُنَّ لِتَذْهَبُوْا
بِبَعْضِ مَآ اٰتَيْتُمُوْهُنَّ اِلَّآ اَنْ يَّاْتِيْنَ بِفَاحِشَةٍ
مُّبَيِّنَةٍ ۚ وَعَاشِرُوْهُنَّ بِالْمَعْرُوْفِ ۚ فَاِنْ
كَرِهْتُمُوْهُنَّ فَعَسٰٓى اَنْ تَكْرَهُوْا شَيْـًٔا وَّ
يَجْعَلَ اللّٰهُ فِيْهِ خَيْرًا كَثِيْرًا ﴿۱۹﴾ وَاِنْ اَرَدْتُّمُ
اسْتِبْدَالَ زَوْجٍ مَّكَانَ زَوْجٍ ۙ وَّاٰتَيْتُمْ
اِحْدٰىهُنَّ قِنْطَارًا فَلَا تَاْخُذُوْا مِنْهُ شَيْـًٔا ؕ
اَتَاْخُذُوْنَهٗ بُهْتَانًا وَّاِثْمًا مُّبِيْنًا ﴿۲۰﴾ وَكَيْفَ
تَاْخُذُوْنَهٗ وَقَدْ اَفْضٰى بَعْضُكُمْ اِلٰى بَعْضٍ وَّ
اَخَذْنَ مِنْكُمْ مِّيْثَاقًا غَلِيْظًا ﴿۲۱﴾ وَلَا تَنْكِحُوْا
مَا نَكَحَ اٰبَآؤُكُمْ مِّنَ النِّسَآءِ اِلَّا مَا قَدْ
سَلَفَ ؕ اِنَّهٗ كَانَ فَاحِشَةً وَّمَقْتًا ؕ وَسَآءَ
سَبِيْلًا ﴿۲۲﴾ ع ۱۴

**19 - 21** విశ్వసించిన ప్రజలారా! బలవంతంగా స్త్రీలకు వారసులు కావటం మీకు ధర్మసమ్మతం కాదు.[17] ఇంకా, వారిని వేధించి సాధించి మీరు వారికి ఇచ్చిన 'మహర్'లో కొంత భాగాన్ని కాజేసే ప్రయత్నం చెయ్యటం కూడా ధర్మసమ్మతం కాదు. అయితే వారు గనక బాహాటంగా చెడు నడతకు పాల్పడి నట్లయితే, (అప్పుడు వారిపట్ల కఠినంగా ప్రవర్తించే అధికారం మీకు ఉంది).[18] వారితో సద్భావంతో జీవితం గడపండి. ఒకవేళ మీకు వారు నచ్చకపోతే, బహుశా మీకు ఒక వస్తువు నచ్చకపోవచ్చు. కాని అందులోనే అల్లాహ్ ఎంతో మేలును పెట్టివుండవచ్చు. ఒకవేళ మీరు ఒక భార్య స్థానంలో మరొక భార్యను తీసుకొచ్చే సంకల్పమే చేసుకుంటే, మీరు ఆమెకు ఒక పెద్ద ధనరాశిని ఇచ్చి ఉన్నాసరే దానినుండి ఏ కొంచెం కూడా తిరిగి తీసుకోవద్దు. ఆమెపై అపనిందమోపి, ఘోరమైన అన్యాయానికి పాల్పడి దాన్ని తిరిగి తీసుకుంటారా? మీరు పరస్పరం దాంపత్య సుఖం అనుభవించిన తరువాత, వారు మీ నుండి గట్టి వాగ్దానం తీసుకున్న తరువాత, మీరు దానిని ఎలా తిరిగి తీసుకుంటారు?

**22** మీ తండ్రులు వివాహం చేసుకున్న స్త్రీలను మీరు ఎంత మాత్రమూ వివాహమాడకండి. పూర్వం జరిగిందేదో జరిగి పోయింది.[19] వాస్తవానికి ఇది ఒక సిగ్గుమాలిన పని, జుగుప్సా కరమైనది, ఒక దుర్నడత.[20]

17. దీని అర్థం ఏమిటంటే, భర్త మరణించిన తరువాత ఆ కుటుంబీకులు అతని వితంతువును అతని ఆస్తిగా భావించి ఆమెకు సంరక్షకులై, వారసులై కూర్చోరాదు. భర్త మరణించిన తరువాత స్త్రీ స్వతంత్రురాలవుతుంది. 'ఇద్దత్' కాలాన్ని గడిపిన తరువాత తాను కోరిన చోటికి ఆమె పోవచ్చు. ఇంకా తాను కోరిన వాడిని వివాహం చేసుకోవచ్చు.
18. సొమ్మును కాజెయ్యటానికి కాదు, అక్రమ ప్రవర్తనకు శిక్షించటానికి.
19. అజ్ఞానకాలంలో సవతి తల్లిని వివాహం చేసుకున్నవాడు ఈ ఆజ్ఞ వచ్చిన తరువాత కూడా ఆమెను తన భార్యగా ఉంచుకోవచ్చు అని దీని అర్థం కాదు. భావం ఏమిటంటే, పూర్వం ఇలా జరిగిన వివాహాల ద్వారా కలిగిన సంతానం, ఇపుడు ఈ ఆజ్ఞ వచ్చిన తరువాత అక్రమ సంతానంగా పరిగణించబడటం జరగదు. ఇంకా వారి తండ్రుల ఆస్తిలో వారికున్న వారసత్వపు హక్కు కూడా రద్దు కాదు.
20. ఇస్లామీ న్యాయశాస్త్రం ప్రకారం ఈ చేష్ట శిక్షార్హమైన నేరం. చట్టరీత్యా పోలీసు జోక్యానికి అర్హమైనది.

حُرِّمَتْ عَلَيْكُمْ اُمَّهٰتُكُمْ وَ بَنٰتُكُمْ وَ اَخَوٰتُكُمْ
وَعَمّٰتُكُمْ وَ خٰلٰتُكُمْ وَبَنٰتُ الْاَخِ وَبَنٰتُ
الْاُخْتِ وَاُمَّهٰتُكُمُ الّٰتِیْٓ اَرْضَعْنَكُمْ وَاَخَوٰتُكُمْ
مِّنَ الرَّضَاعَةِ وَاُمَّهٰتُ نِسَآىِٕكُمْ وَرَبَآىِٕبُكُمُ
الّٰتِیْ فِیْ حُجُوْرِكُمْ مِّنْ نِّسَآىِٕكُمُ الّٰتِیْ دَخَلْتُمْ
بِهِنَّ فَاِنْ لَّمْ تَكُوْنُوْا دَخَلْتُمْ بِهِنَّ فَلَا جُنَاحَ
عَلَیْكُمْ وَحَلَآىِٕلُ اَبْنَآىِٕكُمُ الَّذِیْنَ مِنْ
اَصْلَابِكُمْ وَ اَنْ تَجْمَعُوْا بَیْنَ الْاُخْتَیْنِ اِلَّا
مَا قَدْ سَلَفَ اِنَّ اللّٰهَ كَانَ غَفُوْرًا رَّحِیْمًا ﴿۲۳﴾

**23** మీకు ఈ స్త్రీలు (హరామ్) నిషేధించబడ్డారు: మీ తల్లులు,[21] కుమార్తెలు,[22] సోదరీమణులు,[23] మీ మేనత్తలు, మీ తల్లి సోదరీ మణులు (పినతల్లులు), మీ సోదరుల కుమార్తెలు, మేన కోడళ్ళు,[24] మీకు పాలిచ్చిన తల్లులు, మీతోపాటు పాలు త్రాగిన సోదరీమణులు,[25] మీ భార్యల తల్లులు, మీ సంరక్షణలో పెరిగిన మీ భార్యల కుమార్తెలు,[26]– అంటే మీరు రమించిన భార్యల కుమార్తెలు; అయితే ఒకవేళ (వివాహం మాత్రమే అయి) రమించటం జరిగి వుండకపోతే (వారికి విడాకులిచ్చి, వారి కుమార్తెలను వివాహమాడటం) మీకు దోషం కాదు- మీ వెన్ను నుండి పుట్టిన మీ కుమారుల భార్యలు.[27] ఇంకా ఏకకాలంలో అక్కాచెల్లెళ్ళు ఇద్దరినీ చేర్చి భార్యలుగా చేసు కోవటం కూడా నిషిద్ధమే.[28] పూర్వం జరిగిందేదో జరిగి పోయింది. అల్లాహ్ క్షమించేవాడూ కరుణించే వాడూను.[29]

21. 'తల్లి' అనే పదం ఇక్కడ సొంత తల్లి, సవతి తల్లి ఉభయులకూ వర్తిస్తుంది. అందువల్ల ఇద్దరూ హరామ్ (నిషిద్ధలే). ఇంకా ఇదే ఆజ్ఞాపరిధిలో నాయనమ్మలు, అమ్మమ్మలు కూడా చేరివున్నారు.
22. "కుమార్తె"కు సంబంధించిన ఆజ్ఞలో, కొడుకు కూతురు (మనుమరాలు), కూతురు కూతురు (మనుమరాలు) కూడా చేరి ఉన్నారు.
23. సొంత సోదరి, తల్లికి వేరే భర్తవల్ల కలిగిన సోదరి, తండ్రికి వేరే భార్య ద్వారా కలిగిన సోదరి – ఈ ముగ్గురికీ ఈ ఆజ్ఞ సమానంగా వర్తిస్తుంది.
24. ఈ అన్ని బంధుత్వాలలో కూడా సొంత, సవతి అనే భేదం లేదు.
25. ఈ విషయం గురించి ముస్లిము సమాజంలో ఏకాభిప్రాయం ఉంది. ఒక బాలుడు లేక ఒక బాలిక ఏ స్త్రీ పాలనైతే త్రాగారో, ఆ స్త్రీ వారికి తల్లికి సంబంధించిన ఆజ్ఞాపరిధిలోనూ, ఆ స్త్రీ భర్త తండ్రికి సంబంధించిన ఆజ్ఞాపరిధిలోనూ ఉంటారు. సొంత తల్లి సొంత తండ్రి విషయంలో నిషిద్ధాలైన బంధుత్వాలన్నీ పాలిచ్చిన తల్లి ఆమె భర్త విషయంలో కూడా నిషిద్ధాలే. తనకు పాలిచ్చిన తల్లి పాలు తనతో పాటు త్రాగిన ఆమె శిశువు మాత్రమే ఈ శిశువుకు నిషిద్ధం కాదు. ఆమె సంతానం మొత్తం నిషిద్ధమే. అంటే, ఈ శిశువుకు వారు సొంత సోదరులు, సొంత సోదరీమణులు వంటివారే అవుతారు. ఇంకా వారి సంతానం కూడా ఈ శిశువుకు సొంత సోదరీమణుల, సొంత సోదరుల సంతానం వంటివారే అవుతారు.
26. ఇటువంటి అమ్మాయి నిషిద్ధం కావటం ఆమె మారుతండ్రి ఇంట్లో పెంచబడింది అనే షరతుపై ఆధారపడి లేదు. మారు కూతురు ఎట్టి పరిస్థితుల్లోనూ పురుషునికి నిషిద్ధమే, ఆమె మారు తండ్రి ఇంట్లో పెంచబడినా లేక పెంచబడకపోయినా షరీయతువేత్తలు ఈ విషయంలో దాదాపు ఏకీభవించారు.
27. కొడుకుల భార్యల మాదిరిగానే మనుమళ్ళ భార్యలు కూడా తాతలకు నిషిద్ధం.
28. మహాప్రవక్త (సఅసమ్) ఇలా బోధించారు : తల్లి సోదరి, ఆమె సోదరి కూతురు, ఈ ఇరువురినీ, మేనత్తనూ, ఆమె మేనకోడల్నీ, ఈ ఇద్దరినీ ఏకకాలంలో చేర్చి తన వివాహబంధంలోకి తీసుకోవటం నిషిద్ధం. ఈ వ్యవహారంలో ఈ సూత్రాన్ని ఇలా అర్థం చేసుకోవాలి : ఇద్దరు స్త్రీలలో ఏ ఒక్కరైనా పురుషుడై ఉంటే, అప్పుడు అతడు ఆ రెండో స్త్రీని వివాహం చేసుకోవటం నిషిద్ధం అయినపక్షంలో, అటువంటి ఇద్దరు స్త్రీలను ఏకకాలంలో ఒకే పురుషుడు వివాహంలోకి తీసుకోవటం ఎట్టి పరిస్థితులలోనైనా నిషిద్ధమే.

**24 - 25** ఇంకా ఇతరుల వివాహబంధంలో ఉండే స్త్రీలు కూడా మీకు హరామ్, మీ చేతికి (యుద్ధంలో) చిక్కిన స్త్రీలు తప్ప.[30] ఇది అల్లాహ్ అనుశాసనం. దీనిని మీరు విధిగా పాటించాలి. వీరు తప్ప మిగతా స్త్రీలందరినీ మీరు మీ ధనం ద్వారా పొందటం మీకు హలాల్ (ధర్మసమ్మతం) చెయ్య బడింది. అయితే వారికి వివాహబంధంతో రక్షణ కల్పించాలి. కాని విశృంఖలమైన కామక్రీడలకు ఒడిగట్టరాదు. తరువాత వారిద్వారా మీరు అనుభవించిన దాంపత్య సుఖానికి బదులుగా వారి 'మహర్'ను ఒక విధిగా భావించి చెల్లించండి. కాని 'మహర్' ఒప్పందం జరిగిన తరువాత పరస్పరమైన అంగీకారంతో మీ మధ్య ఏదైనా రాజీ కుదిరితే, అందులో దోషంలేదు. అల్లాహ్ అన్నీ తెలిసినవాడు, అత్యంత వివేక సంపన్నుడు. మీలో ఎవరైనా ఒకరు ముస్లిము కుటుంబానికి చెందిన వనితలను వివాహం చేసుకునే స్తోమత లేకపోతే, మీ స్వాధీనంలో ఉన్నటువంటి ముస్లిములైనటువంటి బానిస స్త్రీలలో ఎవరినైనా అతడు వివాహం చేసుకోవాలి. మీ విశ్వాసం యొక్క స్థితిగతులు అల్లాహ్‌కు బాగా తెలుసు. మీరంతా ఒకే వర్గానికి చెందినవారు. అందువల్ల వారి సంరక్షకుల అనుమతితో వారిని వివాహం చేసుకోండి. న్యాయమైన పద్ధతిలో వారికి మహర్ ఇవ్వండి - వారు వివాహ బంధంలో సురక్షితంగా ఉండేందుకు, స్వేచ్ఛా కామక్రీడలకు దిగ కుండా ఉండేందుకు, దొంగచాటు సంబంధాలను ఏర్పరచుకోకుండా ఉండేందుకు. వివాహబంధంలో వారు రక్షణ పొందిన తరువాత ఏదైనా చెడునడతకు పాల్పడితే, కుటుంబ స్త్రీల (ముహ్సనాత్[31])కు నిర్ణయించబడిన శిక్షలోని సగం శిక్ష వారికి విధించబడుతుంది. వివాహం చేసుకోకపోవటం వల్ల భయభక్తుల బంధాలు తెగిపోతాయని మీలో భయపడే వారి కొరకే ఈ సౌలభ్యం అనుమతించబడింది. మీరు నిగ్రహశక్తి కలిగివుంటే, అది మీకే శ్రేయస్కరం. అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడూను.

الجزء ٥

وَّ الْمُحْصَنٰتُ مِنَ النِّسَآءِ اِلَّا مَا مَلَكَتْ
اَيْمَانُكُمْ ۚ كِتٰبَ اللّٰهِ عَلَيْكُمْ ۚ وَ اُحِلَّ لَكُمْ مَّا
وَرَآءَ ذٰلِكُمْ اَنْ تَبْتَغُوْا بِاَمْوَالِكُمْ مُّحْصِنِيْنَ
غَيْرَ مُسٰفِحِيْنَ ؕ فَمَا اسْتَمْتَعْتُمْ بِهٖ مِنْهُنَّ
فَاٰتُوْهُنَّ اُجُوْرَهُنَّ فَرِيْضَةً ؕ وَ لَا جُنَاحَ
عَلَيْكُمْ فِيْمَا تَرٰضَيْتُمْ بِهٖ مِنْۢ بَعْدِ
الْفَرِيْضَةِ ؕ اِنَّ اللّٰهَ كَانَ عَلِيْمًا حَكِيْمًا ﴿٢٤﴾
وَ مَنْ لَّمْ يَسْتَطِعْ مِنْكُمْ طَوْلًا اَنْ يَّنْكِحَ
الْمُحْصَنٰتِ الْمُؤْمِنٰتِ فَمِنْ مَّا مَلَكَتْ
اَيْمَانُكُمْ مِّنْ فَتَيٰتِكُمُ الْمُؤْمِنٰتِ ؕ وَ اللّٰهُ
اَعْلَمُ بِاِيْمَانِكُمْ ؕ بَعْضُكُمْ مِّنْۢ بَعْضٍ ۚ
فَانْكِحُوْهُنَّ بِاِذْنِ اَهْلِهِنَّ وَاٰتُوْهُنَّ
اُجُوْرَهُنَّ بِالْمَعْرُوْفِ مُحْصَنٰتٍ غَيْرَ
مُسٰفِحٰتٍ وَّ لَا مُتَّخِذٰتِ اَخْدَانٍ ۚ فَاِذَآ
اُحْصِنَّ فَاِنْ اَتَيْنَ بِفَاحِشَةٍ فَعَلَيْهِنَّ نِصْفُ
مَا عَلَى الْمُحْصَنٰتِ مِنَ الْعَذَابِ ؕ ذٰلِكَ لِمَنْ
خَشِيَ الْعَنَتَ مِنْكُمْ ؕ وَ اَنْ تَصْبِرُوْا خَيْرٌ
لَّكُمْ ؕ وَ اللّٰهُ غَفُوْرٌ رَّحِيْمٌ ﴿٢٥﴾ ع ١

29. అంటే, దీని విషయంలో ప్రశ్నించటం జరగదు. కాని అవిశ్వాస స్థితిలో సోదరీమణులు ఇద్దరినీ ఏకకాలంలో వివాహం చేసుకున్నవాడు ఇస్లామ్ స్వీకరించిన తరువాత ఒకామెను నిలుపుకుని మరొకామెకు విడాకులు ఇవ్వాలి.

30. అంటే, యుద్ధంలో పట్టుబడిన స్త్రీల యొక్క అవిశ్వాసులైన భర్తలు 'దారుల్ హరబ్' (ఇస్లామీ ప్రభుత్వంతో పోరాడుతున్న రాజ్యం)లో ఉన్నప్పటికీ ఆ స్త్రీలు నిషిద్ధలు కారు. ఎందుకంటే, 'దారుల్ హరబ్' నుండి 'దారుల్ ఇస్లామ్' (ఇస్లామీ రాజ్యం) లోకి ప్రవేశించిన తరువాత-వారి వివాహబంధాలు రద్దయిపోతాయి.

يُرِيْدُ اللّٰهُ لِيُبَيِّنَ لَكُمْ وَ يَهْدِيَكُمْ سُنَنَ
الَّذِيْنَ مِنْ قَبْلِكُمْ وَ يَتُوْبَ عَلَيْكُمْ ؕ وَ اللّٰهُ
عَلِيْمٌ حَكِيْمٌ ﴿٢٦﴾ وَ اللّٰهُ يُرِيْدُ اَنْ يَّتُوْبَ
عَلَيْكُمْ ۫ وَ يُرِيْدُ الَّذِيْنَ يَتَّبِعُوْنَ الشَّهَوٰتِ
اَنْ تَمِيْلُوْا مَيْلًا عَظِيْمًا ﴿٢٧﴾ يُرِيْدُ اللّٰهُ اَنْ
يُّخَفِّفَ عَنْكُمْ ۚ وَ خُلِقَ الْاِنْسَانُ ضَعِيْفًا ﴿٢٨﴾
يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لَا تَاْكُلُوْۤا اَمْوَالَكُمْ
بَيْنَكُمْ بِالْبَاطِلِ اِلَّاۤ اَنْ تَكُوْنَ تِجَارَةً عَنْ
تَرَاضٍ مِّنْكُمْ ۟ وَ لَا تَقْتُلُوْۤا اَنْفُسَكُمْ ؕ اِنَّ
اللّٰهَ كَانَ بِكُمْ رَحِيْمًا ﴿٢٩﴾ وَ مَنْ يَّفْعَلْ ذٰلِكَ
عُدْوَانًا وَّظُلْمًا فَسَوْفَ نُصْلِيْهِ نَارًا ؕ وَ كَانَ
ذٰلِكَ عَلَى اللّٰهِ يَسِيْرًا ﴿٣٠﴾ اِنْ تَجْتَنِبُوْا كَبَآئِرَ
مَا تُنْهَوْنَ عَنْهُ نُكَفِّرْ عَنْكُمْ سَيِّاٰتِكُمْ
وَنُدْخِلْكُمْ مُّدْخَلًا كَرِيْمًا ﴿٣١﴾

**26 - 28** మీకు పూర్వం గతించిన సజ్జనులు అవలంబించిన మార్గాలను మీకు విశదపరచి ఆ మార్గాలలోనే మిమ్మల్ని కూడా నడపాలని అల్లాహ్ కోరుతున్నాడు. ఆయన తన కారుణ్యంతో మీ వైపునకు మరలాలని అభిలషిస్తున్నాడు. ఆయన సర్వమూ తెలిసినవాడు, మహావివేకి కూడా. అల్లాహ్ అయితే మీ వైపునకు కారుణ్యంతో మరలాలనే కోరుతున్నాడు. కాని తమ మనోవాంఛలను అనుసరిస్తున్నవారు మీరు సన్మార్గం తొలగి దూరంగా పోవాలని కోరుతారు. మీపై ఉన్న ఆంక్షలను అల్లాహ్ తేలిక చెయ్యాలని కోరుతున్నాడు. ఎందుకంటే మానవుడు బలహీనుడుగా సృష్టించబడ్డాడు.

**29 - 31** విశ్వసించిన ప్రజలారా! ఒకరి సొమ్మును మరొకరు అధర్మంగా తినకండి. ఇచ్చిపుచ్చుకోవటం జరగవలసిందే, అయితే పరస్పర అంగీకారంతో.[32] మిమ్మల్ని మీరు చంపుకోకండి.[33] అల్లాహ్‌కు మీరంటే ఎంతో దయ అని నమ్మండి. హింసా దౌర్జన్యాల ద్వారా అలా చేసేవాణ్ణి మేము తప్పకుండా అగ్నిలో పడవేస్తాము. ఇది అల్లాహ్‌కు అంత కష్టమైన పని కాదు. మీకు నిషేధించబడినటువంటి మహాపాపాలకు గనక మీరు దూరంగా ఉంటే, మీ చిన్న చిన్న దోషాలను మేము మీ లెక్కనుండి తీసివేస్తాము. మిమ్మల్ని గౌరవస్థానాల్లో ప్రవేశం పజేస్తాము.

31. ఈ రుకూలో 'ముహ్సనాత్' అనే పదం రెండు అర్థాల్లో వాడబడింది. ఒకటి, "వివాహిత స్త్రీలు." వారికి తమ భర్తల రక్షణ ఉంటుంది. రెండు, "కుటుంబ స్త్రీలు." వారు వివాహితులు కాకపోయినా వారికి తమ కుటుంబరక్షణ ఉంటుంది. ఇరవైనాలుగో ఆయత్‌లో ఆయత్ అర్థం స్పష్టం చేస్తున్న విధంగా 'ముహ్సనాత్' పదం, బానిస స్త్రీలకు వ్యతిరేకంగా అవివాహిత కుటుంబ స్త్రీల కొరకు వాడబడింది. దీనికి భిన్నంగా బానిస స్త్రీల కొరకు 'ముహ్సనాత్' పదం మొదటి అర్థంలో వాడబడింది. స్పష్టమైన పదాల్లో ఇలా సెలవీయబడింది: వారికి వివాహ రక్షణ లభించిన తరువాత (ఫ ఇజా ఉహ్సిన్న) వారు గనక వ్యభిచారానికి పాల్పడితే, 'ముహ్సినాత్' (అవివాహిత కుటుంబ స్త్రీల)కు విధించబడే శిక్షలో సగం శిక్ష వారికి విధించడం జరుగుతుంది.

32. 'అధర్మంగా' అంటే న్యాయానికి వ్యతిరేకంగా షరీయతుకు, నైతికతకు సమ్మతం కాని విధంగా అని భావం. "పరస్పర అంగీకారంతో" అంటే స్వతంత్రమైన, స్వచ్ఛందమైన అంగీకారం అని అర్థం. ఒత్తిడి, మోసం, వంచనలతో కూడిన అంగీకారం కాదు.

33. ఈ వాక్యం పూర్వపు వాక్యానికి ముగింపు కూడా కావచ్చు, స్వయంగా ఒక స్వతంత్ర వాక్యం కూడా కావచ్చు. ఒకవేళ పూర్వపు వాక్యానికి ముగింపుగా భావిస్తే, దాని అర్థం ఇది : ఇతరుల సొమ్మును అధర్మంగా తినటం స్వయంగా తమను తాము వినాశానికి గురి చేసుకోవటమే. ఒకవేళ దానిని స్వతంత్ర వాక్యంగా భావిస్తే, దానికి రెండు అర్థాలున్నాయి. ఒకటి, ఒకరినొకరు హత్య చేసుకోకండి. రెండు, ఆత్మహత్య చేసుకోకండి.

**32** అల్లాహ్ మీలో ఎవరికైనా ఇతరులకు ఇచ్చినదానికంటే ఎక్కువగా ప్రసాదించివుంటే మీరు దానికి ఆశపడకండి. పురుషులు సంపాదించిన దానికి తగినట్లుగా వారి భాగం ఉంటుంది. స్త్రీలు సంపాదించిన దానికి తగినట్లుగా వారి భాగం ఉంటుంది. అయితే అల్లాహ్‌ను ఆయన అనుగ్రహం కొరకు ప్రార్థిస్తూ ఉండండి. నిశ్చయంగా అల్లాహ్ సకల విషయ పరిజ్ఞానం కలవాడు.

**33** తల్లిదండ్రులు, దగ్గరి బంధువులు విడిచివెళ్ళే ప్రతి ఆస్తికి మేము హక్కు దారులను నిర్ణయించాము. ఇక మీరు వాగ్దానం చేసిన వారు - వారికి ఇవ్వవలసిన భాగం వారికి ఇవ్వండి. నిశ్చయంగా అల్లాహ్ అన్నింటినీ కనిపెట్టి ఉన్నాడు.[34]

**34 - 35** పురుషులు స్త్రీలకు అధికారులు (ఖవ్వామ్),[35] ఎందుకంటే అల్లాహ్ వారిలో ఒకరికి మరొకరిపై ఆధిక్యతను ప్రసాదించటంవల్ల, ఇంకా పురుషులు తమ సంపదను వారికొరకు ఖర్చు చేస్తున్నందువల్ల. కనుక సుగుణవతులైన స్త్రీలు విధేయత కలిగివుంటారు. పురుషులు లేనప్పుడు అల్లాహ్ రక్షణలో ఉంటూ వారి హక్కులను కాపాడుతారు. ధిక్కరిస్తారనే భయం మీకు ఏ స్త్రీల విషయంలో కలుగుతుందో వారికి నచ్చజెప్పండి. పడకగదులలో వారికి దూరంగా ఉండండి, మరియు కొట్టండి.[36] తరువాత వారు మీకు విధేయలైతే, అకారణంగా వారిని వేధించటానికి సాకులు వెతక్కండి. గొప్పవాడూ, అధికుడూ అయిన అల్లాహ్ పైన ఉన్నాడనే విషయాన్ని తెలుసుకోండి. భార్య భర్తల మధ్య సంబంధాలు చెడిపోతాయనే భయం మీకు కలిగితే, భర్త బంధువుల నుండి ఒక మధ్యవర్తిని, భార్య బంధువుల నుండి ఒక మధ్యవర్తిని నియమించండి. వారిద్దరు[37] సంస్కరణను కోరితే అల్లాహ్ వారిమధ్య సమాధానం కుదరటానికి మార్గం చూపుతాడు. అల్లాహ్ సర్వజ్ఞాని, సకలమూ ఎరిగినవాడు.

وَ لَا تَتَمَنَّوْا مَا فَضَّلَ اللّٰهُ بِهٖ بَعْضَكُمْ عَلٰى
بَعْضٍ ؕ لِلرِّجَالِ نَصِيْبٌ مِّمَّا اكْتَسَبُوْا ؕ وَ
لِلنِّسَآءِ نَصِيْبٌ مِّمَّا اكْتَسَبْنَ ؕ وَسْـَٔلُوا اللّٰهَ
مِنْ فَضْلِهٖ ؕ اِنَّ اللّٰهَ كَانَ بِكُلِّ شَیْءٍ
عَلِيْمًا ﴿۳۲﴾ وَ لِكُلٍّ جَعَلْنَا مَوَالِیَ مِمَّا تَرَكَ
الْوَالِدٰنِ وَالْاَقْرَبُوْنَ ؕ وَ الَّذِيْنَ عَقَدَتْ
اَيْمَانُكُمْ فَاٰتُوْهُمْ نَصِيْبَهُمْ ؕ اِنَّ اللّٰهَ كَانَ عَلٰى
كُلِّ شَیْءٍ شَهِيْدًا ﴿۳۳﴾ اَلرِّجَالُ قَوّٰمُوْنَ عَلَى ع ٨ ٢
النِّسَآءِ بِمَا فَضَّلَ اللّٰهُ بَعْضَهُمْ عَلٰى بَعْضٍ وَّ
بِمَاۤ اَنْفَقُوْا مِنْ اَمْوَالِهِمْ ؕ فَالصّٰلِحٰتُ قٰنِتٰتٌ
حٰفِظٰتٌ لِّلْغَيْبِ بِمَا حَفِظَ اللّٰهُ ؕ وَ الّٰتِیْ
تَخَافُوْنَ نُشُوْزَهُنَّ فَعِظُوْهُنَّ وَاهْجُرُوْهُنَّ فِی
الْمَضَاجِعِ وَاضْرِبُوْهُنَّ ۚ فَاِنْ اَطَعْنَكُمْ فَلَا
تَبْغُوْا عَلَيْهِنَّ سَبِيْلًا ؕ اِنَّ اللّٰهَ كَانَ عَلِيًّا
كَبِيْرًا ﴿۳۴﴾ وَاِنْ خِفْتُمْ شِقَاقَ بَيْنِهِمَا فَابْعَثُوْا
حَكَمًا مِّنْ اَهْلِهٖ وَ حَكَمًا مِّنْ اَهْلِهَا ۚ اِنْ
يُّرِيْدَاۤ اِصْلَاحًا يُّوَفِّقِ اللّٰهُ بَيْنَهُمَا ؕ اِنَّ اللّٰهَ
كَانَ عَلِيْمًا خَبِيْرًا ﴿۳۵﴾

---

34. అరబ్బులలో ఇలాంటి నియమం ఒకటి ఉండేది : ఏ ప్రజల మధ్యనైతే స్నేహ, సౌభ్రాత్రాల ఒడంబడిక జరుగుతుందో, వారు ఒకరి వారసత్వపు ఆస్తికి మరొకరు హక్కుదారులవుతూ ఉండేవారు. ఇదేవిధంగా ఎవరినైతే పెంపుడు కొడుకుగా చేసుకోవటం జరిగేదో, అతడు కూడా పెంపుడు తండ్రికి వారసుడుగా పరిగణింపబడేవాడు. ఈ ఆయత్‌లో అజ్ఞాన కాలం యొక్క ఈ విధానాన్ని రద్దుచేస్తూ ఇలా సెలవీయబడింది : వారసత్వపు ఆస్తి

وَ اعْبُدُوا اللّٰهَ وَ لَا تُشْرِكُوْا بِهٖ شَيْـًٔا وَّ
بِالْوَالِدَيْنِ اِحْسَانًا وَّ بِذِي الْقُرْبٰى وَ الْيَتٰمٰى
وَالْمَسٰكِيْنِ وَ الْجَارِ ذِي الْقُرْبٰى وَالْجَارِ
الْجُنُبِ وَالصَّاحِبِ بِالْجَنْۢبِ وَ ابْنِ السَّبِيْلِ ۙ
وَمَا مَلَكَتْ اَيْمَانُكُمْ ؕ اِنَّ اللّٰهَ لَا يُحِبُّ مَنْ
كَانَ مُخْتَالًا فَخُوْرَا ۙ ﴿٣٦﴾ الَّذِيْنَ يَبْخَلُوْنَ وَ
يَاْمُرُوْنَ النَّاسَ بِالْبُخْلِ وَيَكْتُمُوْنَ مَاۤ اٰتٰىهُمُ
اللّٰهُ مِنْ فَضْلِهٖ ؕ وَ اَعْتَدْنَا لِلْكٰفِرِيْنَ عَذَابًا
مُّهِيْنًا ﴿٣٧﴾ وَ الَّذِيْنَ يُنْفِقُوْنَ اَمْوَالَهُمْ رِئَآءَ
النَّاسِ وَلَا يُؤْمِنُوْنَ بِاللّٰهِ وَ لَا بِالْيَوْمِ
الْاٰخِرِ ؕ وَ مَنْ يَّكُنِ الشَّيْطٰنُ لَهٗ قَرِيْنًا فَسَآءَ
قَرِيْنًا ﴿٣٨﴾ وَمَاذَا عَلَيْهِمْ لَوْ اٰمَنُوْا بِاللّٰهِ وَ
الْيَوْمِ الْاٰخِرِ وَاَنْفَقُوْا مِمَّا رَزَقَهُمُ اللّٰهُ ؕ وَ
كَانَ اللّٰهُ بِهِمْ عَلِيْمًا ﴿٣٩﴾ اِنَّ اللّٰهَ لَا يَظْلِمُ
مِثْقَالَ ذَرَّةٍ ۚ وَ اِنْ تَكُ حَسَنَةً يُّضٰعِفْهَا
وَيُؤْتِ مِنْ لَّدُنْهُ اَجْرًا عَظِيْمًا ﴿٤٠﴾ فَكَيْفَ اِذَا
جِئْنَا مِنْ كُلِّ اُمَّةٍۢ بِشَهِيْدٍ وَّ جِئْنَا بِكَ عَلٰى
هٰۤؤُلَآءِ شَهِيْدًا ﴿٤١﴾ يَوْمَئِذٍ يَّوَدُّ الَّذِيْنَ كَفَرُوْا وقف النبي عليه السلام
وَ عَصَوُا الرَّسُوْلَ لَوْ تُسَوّٰى بِهِمُ الْاَرْضُ ؕ
وَلَا يَكْتُمُوْنَ اللّٰهَ حَدِيْثًا ﴿٤٢﴾ ع

**36 - 42** మీరంతా అల్లాహ్‌కు దాస్యం చెయ్యండి. ఎవరినీ ఆయనకు భాగస్వాములుగా చేయవద్దు. తల్లిదండ్రుల ఎడల సద్భావంతో మెలగండి. బంధువులూ, అనాథులూ, నిరుపేదల పట్ల మంచిగా వ్యవహరించండి. పొరుగున ఉన్న బంధువులు, అపరిచితులయిన పొరుగువారు, ప్రక్కనున్న మిత్రులు,[38] బాటసారులు, మీ అధీనంలో ఉన్న దాసదాసీ జనం పట్ల ఉదార బుద్ధితో వ్యవహరించండి. గర్వాతిశయంతో కన్నూ మిన్నూ కాననివారు, తమ గొప్పతనం గురించి విర్రవీగేవారు అంటే అల్లాహ్ ఇష్టపడడు అని గట్టిగా నమ్మండి. ఇంకా, పిసినారితనంతో ప్రవర్తిస్తూ ఇతరులక్కూడా పిసినారితనాన్ని గరపేవారిని, అల్లాహ్ తన అనుగ్రహంతో ఇచ్చిన దాన్ని దాచి పెట్టేవారిని కూడా అల్లాహ్ ప్రేమించడు. మా అనుగ్రహాలను తిరస్కరించే ఇటువంటి వారికొరకు మేము అవమానకరమైన శిక్షను సిద్ధపరచి ఉంచాము. కేవలం ప్రజలకు చూపటానికి తమ సంపదను ఖర్చు పెట్టేవారు, అల్లాహ్‌ను, అంతిమ దినాన్ని హృదయపూర్వకంగా విశ్వసించనివారు అంటే కూడా అల్లాహ్‌కు అనిష్టమే. యథార్థమేమిటంటే షైతాన్ ఎవడి స్నేహితుడయ్యాడో వాడికి దుస్సాంగత్యం లభించినట్లే. వారు గనక అల్లాహ్‌ను, అంతిమ దినాన్ని విశ్వసిస్తే, అల్లాహ్ ఇచ్చిన దాని నుండి ఖర్చు పెడితే వారిపైకి ఏ విపత్తు వచ్చిపడుతుంది? వారు ఆవిధంగా చేసి వున్నట్లయితే వారి సత్కార్యాలు అల్లాహ్‌కు తెలియకుండా ఉండేవి కావు కదా! అల్లాహ్ ఎవరికీ రవ్వంత అన్యాయం కూడా చెయ్యడు. ఎవరైనా ఒక మంచి పని చేస్తే, దాన్ని అల్లాహ్ రెండింతలు చేస్తాడు. ఇంకా తన తరఫు నుండి పెద్ద ప్రతిఫలం కూడా ప్రసాదిస్తాడు. మేము ప్రతి సమాజంనుండి ఒక సాక్షిని తెచ్చి నిన్ను (ముహమ్మద్-సఅసమ్‌ను) వారికి సాక్షిగా నిలబెట్టినప్పుడు వారు ఏం చేస్తారో ఆలోచించు. ప్రవక్త మాటను తిరస్కరించి, ఆయనకు అవిధేయత చూపిన ప్రజలంతా అప్పుడు భూమి బ్రద్దలై తాము భూమిలో స్థాపితమైపోతే ఎంత బాగుండును అని తలపోస్తారు. అక్కడ వారు అల్లాహ్ ముందు ఏ విషయాన్నీ దాచలేరు.

మేము నిర్ణయించిన నియమం ప్రకారం బంధువుల మధ్య పంచబడాలి. అయితే మీరు ఎవరికైతే వాగ్దానాలు చేశారో, వారికి మీ జీవితకాలంలో మీరు ఏది కోరితే అది ఇవ్వగలరు.

43 విశ్వాసులారా! మీరు నిషాస్థితిలో ఉన్నప్పుడు నమాజ్ దరిదాపులకు వెళ్ళకండి.[39] మీరు పలికేదేమిటో మీకు తెలిసినప్పుడే నమాజ్ చెయ్యాలి.[40] ఇదేవిధంగా అపరిశుద్ధ స్థితిలో[41] కూడా, స్నానం చెయ్యనంతవరకు నమాజ్ దగ్గరకు వెళ్ళకండి, దారినిపోతూ ఉన్నప్పుడు తప్ప.[42] మీరు ఎప్పుడైనా అస్వస్థులైతే లేక ప్రయాణంలో ఉంటే లేక మీలో ఎవరైనా మలమూత్ర విసర్జనం చేసివుంటే లేక మీరు మీ స్త్రీలను తాకివుంటే,[43] మీకు నీరు లభ్యంకాని పక్షంలో, పరిశుభ్రమైన మట్టిని ఉపయోగించండి, దానితో మీ ముఖాలను, చేతులను రుద్దుకొనండి.[44] నిస్సందేహంగా అల్లాహ్ ఉదార స్వభావుడు, క్షమా గుణం కలవాడు.

يَاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لَا تَقْرَبُوا الصَّلٰوةَ وَ اَنْتُمْ سُكٰرٰى حَتّٰى تَعْلَمُوْا مَا تَقُوْلُوْنَ وَ لَا جُنُبًا اِلَّا عَابِرِىْ سَبِيْلٍ حَتّٰى تَغْتَسِلُوْا ؕ وَ اِنْ كُنْتُمْ مَّرْضٰۤى اَوْ عَلٰى سَفَرٍ اَوْ جَآءَ اَحَدٌ مِّنْكُمْ مِّنَ الْغَآئِطِ اَوْ لٰمَسْتُمُ النِّسَآءَ فَلَمْ تَجِدُوْا مَآءً فَتَيَمَّمُوْا صَعِيْدًا طَيِّبًا فَامْسَحُوْا بِوُجُوْهِكُمْ وَ اَيْدِيْكُمْ ؕ اِنَّ اللّٰهَ كَانَ عَفُوًّا غَفُوْرًا ﴿۴۳﴾

35. 'ఖవ్వామ్' (అధికారి) అంటే ఒక వ్యక్తి లేక ఒక సంస్థ లేక ఒక వ్యవస్థ యొక్క వ్యవహారాలను సక్రమంగా నడపటం, దాన్ని రక్షించటం, కనిపెట్టి ఉండడం, ఇంకా దాని అవసరాలను సమకూర్చటం వంటి బాధ్యతలు కలవాడు అని అర్థం.

36. ఈ మూడు పనులూ ఏకకాలంలో జరగాలని భావం కాదు. అసలు భావం ఏమిటంటే, అవిధేయతకు పాల్పడుతున్న పరిస్థితిలో, ఈ మూడు చర్యలూ అనుమతించబడ్డాయి. ఇక వాటిని అమలుపర్చటంలో నేరం, శిక్ష, ఈ రెండింటి మధ్య సమతూకం ఉండాలి. తేలికైన చర్య ద్వారా సంస్కరణ సాధ్యమయ్యేచోట తీవ్రమైన చర్య తీసుకోకూడదు. భార్యలను కొట్టే అనుమతిని మహాప్రవక్త (సఅసమ్) ఎప్పుడైనా ఇచ్చివుంటే దానిని ఎంతో అనిష్టంగానే ఇచ్చారు, అయినా దానిని నిరసించారు.

37. వారిద్దరు అంటే, రాజీ ప్రయత్నం చేసేవారూ, భార్యాభర్తలు కూడా అని భావం. ప్రతి తగాదాలలో రాజీపడటం అనేది సాధ్యమే. అయితే ప్రత్యర్థులు కూడా రాజీపడేవారే అయివుండాలి, మధ్యవర్తులు కూడా ప్రత్యర్థుల మధ్య ఏ విధంగానైనా రాజీకుదర్చాలి అని కోరేవారే అయివుండాలి.

38. దీని భావం, సహచర మిత్రుడు అని కూడా, ఎప్పుడైనా ఎక్కడైనా తటస్థపడే వ్యక్తి అని కూడా. ఉదాహరణకు మీరు బజారులో పోతూ ఉంటే, ఒక వ్యక్తి మీతో పాటు నడుస్తూ ఉంటాడు. లేదా దుకాణంలో మీరు సామాను కొంటూ ఉంటే, మరొక వ్యక్తి కూడా మీతో పాటు కొంటూ ఉంటాడు. మీరు ప్రయాణంలో ఉన్నప్పుడు ఒక వ్యక్తి మీతో పాటు ప్రయాణం చేస్తూ ఉంటాడు. ఈ తాత్కాలికపు పొరుగుతనం కూడా సభ్యత కలవాడు, మంచివాడు అయిన ప్రతి మానవునిపై ఒక బాధ్యతను మోపుతుంది. అది ఏమిటంటే అతడు సాధ్యమైనంత వరకు తన పొరుగువానిపట్ల సత్ప్రవర్తనతో వ్యవహరించాలి. అతనికి కష్టం కలిగించకుండా ఉండాలి.

39. ఇది మద్యపానానికి సంబంధించిన రెండో ఆజ్ఞ. మొదటి ఆజ్ఞ బఖరా సూరా (219వ ఆయత్)లో వచ్చింది.

40. అంటే, నమాజ్‌లో మనిషి తన నోటితో ఏమంటున్నాడో తెలుసుకునే అంత తెలివి కలిగి ఉండాలి. నిలుచున్నది నమాజ్ కోసం, చేస్తున్నది పద్యగానం మాదిరిగా ఉండకూడదు.

41. అపరిశుద్ధ స్థితి (జనాబత్) అంటే రతివల్ల గాని, లేక స్వప్నంలో ఇంద్రియ స్ఖలనంవల్ల కాని ఏర్పడే అపరిశుద్ధత అని భావం.

42. షరీయతువేత్తలలో, వ్యాఖ్యాతలలో ఒక వర్గంవారు ఈ ఆయతు భావాన్ని ఇలా అర్థం చేసుకున్నారు : అపరిశుద్ధ స్థితి (జనాబత్)లో మసీదులోకి వెళ్ళకూడదు, ఏదైనా పని కొరకు మసీదులో నుండి వెళ్ళే అవసరం

اَلَمۡ تَرَ اِلَى الَّذِيۡنَ اُوۡتُوۡا نَصِيۡبًا مِّنَ الۡكِتٰبِ
يَشۡتَرُوۡنَ الضَّلٰلَةَ وَيُرِيۡدُوۡنَ اَنۡ تَضِلُّوا
السَّبِيۡلَ ﴿۴۴﴾ وَاللّٰهُ اَعۡلَمُ بِاَعۡدَآئِكُمۡ ؕ وَكَفٰى
بِاللّٰهِ وَلِيًّا ۙ وَّكَفٰى بِاللّٰهِ نَصِيۡرًا ﴿۴۵﴾ مِنَ الَّذِيۡنَ
هَادُوۡا يُحَرِّفُوۡنَ الۡـكَلِمَ عَنۡ مَّوَاضِعِهٖ وَ
يَقُوۡلُوۡنَ سَمِعۡنَا وَعَصَيۡنَا وَاسۡمَعۡ غَيۡرَ مُسۡمَعٍ
وَّرَاعِنَا لَيًّۢا بِاَلۡسِنَتِهِمۡ وَطَعۡنًا فِى الدِّيۡنِ ؕ وَ
لَوۡ اَنَّهُمۡ قَالُوۡا سَمِعۡنَا وَاَطَعۡنَا وَاسۡمَعۡ وَانۡظُرۡنَا
لَـكَانَ خَيۡرًا لَّهُمۡ وَاَقۡوَمَ ۙ وَلٰـكِنۡ لَّعَنَهُمُ اللّٰهُ
بِكُفۡرِهِمۡ فَلَا يُؤۡمِنُوۡنَ اِلَّا قَلِيۡلًا ﴿۴۶﴾

**44 - 46** గ్రంథ జ్ఞానంలో కొంతభాగం ఇవ్వబడినవారిని కూడా మీరు చూశారా? వారే స్వయంగా అపమార్గాన్ని కొని తెచ్చుకున్నారు. మీరు కూడా మార్గం తప్పాలని కోరుతున్నారు. మీ శత్రువులను అల్లాహ్ బాగా ఎరుగును. మీకు సహాయం చేయటానికి, మిమ్మల్ని కాపాడటానికి అల్లాహ్‌యే చాలు. యూదుల పద్ధతిని అవలంబించిన వారిలో కొందరు పదాలను వాటి సందర్భాల నుండి తారుమారు చేస్తారు.[45] సత్యధర్మానికి వ్యతిరేకంగా ప్రచారం చెయ్యటానికి, వారు తమ నాలుకలను మెలిత్రిప్పి "సమినా వ అసయ్‌నా"[46] అని, "ఇస్మగైరముస్ మఇన్"[47] అనీ,"రాఇనా"[48] అనీ పలుకుతారు. అలా కాకుండా, "సమినా వ అతానా" అని, "ఇస్మ", "ఉన్‌జుర్‌నా" అనీ, అని ఉంటే వారికే మేలు కలిగివుండేది. అది ఉత్తమమైన పద్ధతిగా ఉండేది. కాని వారి అసత్యానుసరణం కారణంగా, వారిపై అల్లాహ్ శాపం పడే ఉంది. కనుక వారు విశ్వసించటం అనేది చాలా తక్కువ.

పడితే తప్పు. రెండో వర్గం దీన్ని ప్రయాణం అనే భావం తీసుకుంది. అంటే, ఒకవేళ మనిషి ప్రయాణావస్థలో ఉండి, అపరిశుద్ధ స్థితి ఏర్పడితే అప్పుడు అతను 'తయమ్ముమ్' చేసుకోవచ్చు.

43. 'లమ్స్' (తాకటం) అంటే ఏమిటి అనే విషయంలో భేదాభిప్రాయం ఉంది. దీని భావం రతి అని అనేకమంది విద్వాంసులు అభిప్రాయపడ్డారు. ఇమామ్ అబూ హనీఫా (రహ్మఅలై) ఆయన సహచరులు ఈ అభిప్రాయాన్నే స్వీకరించారు. దీనికి భిన్నంగా, కొందరు ఇతర షరీయతువేత్తల వద్ద దీనిభావం తాకటం లేక మీద చెయ్యి వెయ్యటం. ఇదే అభిప్రాయాన్ని ఇమామ్ షాఫయీ (రహ్మఅలై) స్వీకరించారు. ఇమామ్ మాలిక్ (రహ్మఅలై) అభిప్రాయమేమిటంటే, ఒకవేళ స్త్రీగాని పురుషుడుగాని ఒకరినొకరు కామోద్రేకంతో చేత్తో తాకితే, అప్పుడు వారి వుజూ భంగం అవుతుంది. కానీ కామోద్రేకం లేకుండా ఒకరి శరీరం మరొకరిని తాకితే అందులో ఏ దోషమూ లేదు.

44. ఆజ్ఞ యొక్క వివరాలు ఇవి: ఒకవేళ మనిషికి వుజూ లేకపోతే లేదా అతనికి గుసుల్ (స్నానం) అవసరం ఏర్పడితే, నీళ్ళు దొరకని పక్షంలో, తయమ్ముమ్ చేసుకుని నమాజ్ చెయ్యవచ్చు. ఒకవేళ రోగి అయితే, గుసుల్ లేక వుజూ చేసుకోవటం వల్ల అతనికి నష్టం కలుగుతుందనే భయం ఉంటే, అప్పుడు నీళ్ళు ఉన్నప్పటికీ, తయమ్ముమ్ చేసుకునే అనుమతిని వినియోగించుకోవచ్చు.

45. దీనికి మూడు అర్థాలున్నాయి : ఒకటి, అల్లాహ్ గ్రంథంలోని పదాలలో మార్పులు చేర్పులు చేస్తారు. రెండు, తమ వ్యాఖ్యలతో గ్రంథంలో ఆయతుల అర్థాన్నే తలక్రిందులుగా చేస్తారు. మూడు, మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్), ఆయన అనుచరులతో సహవాసం చేసి వారి మధ్య కూర్చుండి వారి మాటలు వింటారు. తిరిగి ప్రజల వద్దకు వెళ్ళిన తరువాత వాటిని తప్పుడువిధంగా ఉల్లేఖిస్తారు. చెప్పిన విషయం ఒకటైతే, వారు దాన్ని దుర్బుద్ధితో తారుమారుచేసి ప్రజలలో ప్రచారం చేస్తారు.

يٰٓاَيُّهَا الَّذِيْنَ اُوْتُوا الْكِتٰبَ اٰمِنُوْا بِمَا نَزَّلْنَا
مُصَدِّقًا لِّمَا مَعَكُمْ مِّنْ قَبْلِ اَنْ نَّطْمِسَ
وُجُوْهًا فَنَرُدَّهَا عَلٰٓى اَدْبَارِهَآ اَوْ نَلْعَنَهُمْ كَمَا
لَعَنَّآ اَصْحٰبَ السَّبْتِ ؕ وَ كَانَ اَمْرُ اللّٰهِ
مَفْعُوْلًا ﴿۴۷﴾ اِنَّ اللّٰهَ لَا يَغْفِرُ اَنْ يُّشْرَكَ بِهٖ وَ
يَغْفِرُ مَا دُوْنَ ذٰلِكَ لِمَنْ يَّشَآءُ ۚ وَمَنْ
يُّشْرِكْ بِاللّٰهِ فَقَدِ افْتَرٰٓى اِثْمًا عَظِيْمًا ﴿۴۸﴾ اَلَمْ
تَرَ اِلَى الَّذِيْنَ يُزَكُّوْنَ اَنْفُسَهُمْ ؕ بَلِ اللّٰهُ
يُزَكِّيْ مَنْ يَّشَآءُ وَلَا يُظْلَمُوْنَ فَتِيْلًا ﴿۴۹﴾ اُنْظُرْ
كَيْفَ يَفْتَرُوْنَ عَلَى اللّٰهِ الْكَذِبَ ؕ وَ كَفٰى بِهٖٓ
اِثْمًا مُّبِيْنًا ﴿۵۰﴾ ع

**47 - 48** గ్రంథ ప్రజలారా! మేము ఇప్పుడు అవతరింపజేసిన గ్రంథాన్ని విశ్వసించండి. అది, మీ వద్ద పూర్వం నుండే ఉన్న గ్రంథాన్ని ధ్రువపరుస్తుంది, సమర్థిస్తుంది. మేము ముఖాలను వికృతంచేసి వెనక్కి తిప్పకముందే, లేక మేము సబ్బత్ వారిని శపించినట్లుగా వారినీ శపించక ముందే, దీనిని విశ్వసించండి. అల్లాహ్ ఆజ్ఞ తప్పకుండా అమలు పరచబడుతుందని గుర్తు పెట్టుకోండి. అల్లాహ్ క్షమించనిది కేవలం షిర్క్ మాత్రమే. అది తప్ప ఏ పాపాన్ని అయినా ఆయన తాను ఇష్టపడిన వారికొరకు క్షమిస్తాడు. ఇతరులను అల్లాహ్‌కు భాగస్వాములుగా చేసేవాడు, ఎంతో ఘోరమైన అబద్ధాన్ని కల్పించాడు అన్నమాట, ఎంతో తీవ్రమైన పాపపుమాట అన్నాడు అన్నమాట.

**49 - 50** తమ ఆత్మ పరిశుద్ధతను గురించి గొప్పలు చెప్పుకునే వారిని కూడా మీరు గమనించారా? నిజానికి పరిశుద్ధతను అల్లాహ్‌యే తాను కోరిన వారికి ప్రసాదిస్తాడు. (వారికి పరిశుద్ధత లభించకపోతే) వారికి రవ్వంత అన్యాయం కూడా జరిగినట్లు కాదు. చూశారా! వారు అల్లాహ్‌పై లేనిపోని అభాండాలు వెయ్యటానికెక్కూడా జంకడం లేదు. వారు స్పష్టంగా పాపాత్ములని చెప్పటానికి ఈ ఒక్క పాపం చాలు.

---

46. అంటే, వారికి దైవాజ్ఞలను వినిపించినప్పుడు వారు బిగ్గరగా, 'సమిఅనా' (మేము విన్నాము) అని అంటారు. కాని మెల్లగా 'అసయ్‌నా' (మేము అంగీకరించలేదు) అని అంటారు. లేదా 'అతానా' (మేము అంగీకరించాము) అనే పదాన్ని నాలుకను మెలిపెట్టి ఎలా ఉచ్చరిస్తారంటే, అది కాస్తా 'అసయ్‌నా' అయిపోతుంది.
47. అంటే, సంభాషణ మధ్యలో వారు ఏదైనా విషయాన్ని ముహమ్మద్ (సఅసమ్)కు చెప్పదలచుకున్నప్పుడు "ఇస్‌మ" (వినండి) అని అంటారు. తరువాత వెంటనే "గయ్‌ర ముస్ మఇన్" అని కూడా అంటారు. ఇది వ్యతిరేకార్థంగల పదం. దీనికి ఒక అర్థం ఏమిటంటే, మీరు ఎంత గౌరవనీయులంటే, మీకు ఇష్టంకాని విషయాన్ని ఎవడూ మీ ముందు వినిపించలేడు. రెండో అర్థం ఏమిటంటే, మీకు ఏ విషయాన్నయినా వినిపించటానికీ మీరు తగినవారు కారు. మరొక అర్థం, మిమ్మల్ని దేవుడు చెవిటివాడుగా చేయుగాక అని.
48. దీని వివరణ బఖర సూరాలో 36వ వ్యాఖ్యానంలో వచ్చింది.

اَلَمْ تَرَ اِلَى الَّذِيْنَ اُوْتُوْا نَصِيْبًا مِّنَ الْكِتٰبِ
يُؤْمِنُوْنَ بِالْجِبْتِ وَالطَّاغُوْتِ وَيَقُوْلُوْنَ
لِلَّذِيْنَ كَفَرُوْا هٰٓؤُلَاۤءِ اَهْدٰى مِنَ الَّذِيْنَ
اٰمَنُوْا سَبِيْلًا ﴿٥١﴾ اُولٰٓئِكَ الَّذِيْنَ لَعَنَهُمُ اللّٰهُ ؕ وَ
مَنْ يَّلْعَنِ اللّٰهُ فَلَنْ تَجِدَ لَهٗ نَصِيْرًا ﴿٥٢﴾ اَمْ
لَهُمْ نَصِيْبٌ مِّنَ الْمُلْكِ فَاِذًا لَّا يُؤْتُوْنَ النَّاسَ
نَقِيْرًا ﴿٥٣﴾ اَمْ يَحْسُدُوْنَ النَّاسَ عَلٰى مَاۤ اٰتٰىهُمُ
اللّٰهُ مِنْ فَضْلِهٖ ۚ فَقَدْ اٰتَيْنَاۤ اٰلَ اِبْرٰهِيْمَ
الْكِتٰبَ وَالْحِكْمَةَ وَاٰتَيْنٰهُمْ مُّلْكًا عَظِيْمًا ﴿٥٤﴾
فَمِنْهُمْ مَّنْ اٰمَنَ بِهٖ وَمِنْهُمْ مَّنْ صَدَّ عَنْهُ ؕ
وَكَفٰى بِجَهَنَّمَ سَعِيْرًا ﴿٥٥﴾ اِنَّ الَّذِيْنَ كَفَرُوْا
بِاٰيٰتِنَا سَوْفَ نُصْلِيْهِمْ نَارًا ؕ كُلَّمَا نَضِجَتْ
جُلُوْدُهُمْ بَدَّلْنٰهُمْ جُلُوْدًا غَيْرَهَا لِيَذُوْقُوا
الْعَذَابَ ؕ اِنَّ اللّٰهَ كَانَ عَزِيْزًا حَكِيْمًا ﴿٥٦﴾ وَ
الَّذِيْنَ اٰمَنُوْا وَعَمِلُوا الصّٰلِحٰتِ سَنُدْخِلُهُمْ
جَنّٰتٍ تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ خٰلِدِيْنَ فِيْهَاۤ
اَبَدًا ؕ لَهُمْ فِيْهَاۤ اَزْوَاجٌ مُّطَهَّرَةٌ ۫ وَّ نُدْخِلُهُمْ
ظِلًّا ظَلِيْلًا ﴿٥٧﴾

**51 - 57** గ్రంథ జ్ఞానంలో కొంత భాగం ఇవ్వబడిన వారిని నీవు చూడలేదా? వారి పరిస్థితి ఎలా వుందంటే, వారు 'జిబ్త్'[49]ను, "తాగూత్"[50]ను నమ్ముతారు. ఇంకా వారు అవిశ్వాసులను గురించి, "విశ్వాసులకంటే వీరే చాలావరకు సరైన మార్గంలో ఉన్నారు"[51] అని అంటారు. ఇటువంటి వారినే అల్లాహ్ శపించింది. అల్లాహ్ శపించినవాడికి సహాయం చేసే వాడెవ్వడూ నీకు దొరకడు. పరిపాలనలో వారికేమైనా భాగం ఉందా? ఉంటే వారు ఇతరులకు చిల్లిగవ్వకూడా ఇవ్వరు. లేక ఇతరులను చూచి వారు అసూయపడటానికి కారణం అల్లాహ్ వారికి తన అనుగ్రహాన్ని ప్రసాదించాడనా? ఇదే నిజమయితే వారు ఈ విషయం తెలుసుకోవాలి: మేము ఇబ్రాహీము సంతతికి గ్రంథాన్ని, వివేకాన్ని ప్రసాదించాము. వారికి మహత్తరమైన సామ్రాజ్యాన్ని ప్రదానం చేశాము. కాని, వారిలో కొంతమంది ఆ గ్రంథాన్ని విశ్వసించారు, మరికొంత మంది దానికి విముఖులయ్యారు. వైముఖ్యం చూపేవారికి మండే నరకాగ్నియే చాలు.[52] మా ఆయత్‌లను నిరాకరించిన వారిని మేము నిశ్చయంగా అగ్నిలో పడవేస్తాము. ఇంకా వారి శరీర చర్మం కాలి కరిగి పోయినప్పుడల్లా, దాని స్థానంలో మేము మరొక చర్మాన్ని సృష్టిస్తాము, వారు శిక్షను బాగా రుచిచూడాలని. అల్లాహ్ సర్వశక్తిమంతుడు. తన నిర్ణయాలను అమలుపరచే విజ్ఞత ఆయనకు నిండుగా ఉంది. మా ఆయత్‌లను విశ్వసించి మంచి పనులు చేసేవారిని మేము, క్రింద కాలువలు ప్రవహించే ఉద్యానవనాలలో ప్రవేశపెడతాము. అక్కడ వారు కలకాలం ఉంటారు. ఇంకా, వారికి పరిశుద్ధ లయిన భార్యలు లభిస్తారు. మేము వారిని దట్టమైన నీడలలో ఉంచుతాము.

---

49. 'జిబ్త్' అంటే, అసలు భావం అసత్యమైనది. ఆధారము లేనిది, నిరుపయోగమైనది. ఇస్లామ్ పరిభాషలో మంత్రతంత్రాలు, జ్యోతిష్యం, భూతవైద్యం, శకునాలు, ముహూర్తాలు, ఇంకా ఇతర ఊహా అపోహలకు సంబంధించిన అన్ని విషయాలను 'జిబ్త్'తో పోలుస్తారు.
50. వివరణ కొరకు బఖర సూరాలో 89, 90 సంఖ్యలుగల వ్యాఖ్యానాలు చూడండి.
51. ఇక్కడ అవిశ్వాసులు అంటే అరబ్ ముష్రిక్కులు అని భావం.
52. ఇక్కడ, ఇస్రాయీల్ సంతతి వారి అసూయాభరితమైన మాటలకు జవాబు ఇవ్వబడుతోందని జ్ఞాపకముంచుకోవాలి. ఈ జవాబు అర్థం ఏమిటంటే, "మీకు అసలు ఏ విషయమంటే కడుపుమంట? మీరు కూడా ఇబ్రాహీమ్ (అస్సలామ్) సంతానమే కదా, ఈ ఇస్మాయీల్ సంతతివారు కూడా ఇబ్రాహీమ్ (అస్సలామ్)

58 ముస్లిములారా! “అమానతులను యోగ్యులైన వారికి అప్పగించండి. ప్రజల మధ్య తీర్పు చెప్పేటప్పుడు న్యాయంగా చేయండి”[53] అని అల్లాహ్ మిమ్మల్ని ఆజ్ఞాపిస్తున్నాడు. అల్లాహ్ మీకు ఎంతో చక్కని హితబోధ చేస్తున్నాడు. నిశ్చయంగా ఆయన అన్నీ వింటాడు, అన్నీ చూస్తాడు.

59 విశ్వసించిన ప్రజలారా! విధేయత చూపండి అల్లాహ్‌కు, విధేయత చూపండి ప్రవక్తకు, మీలో అధికారం అప్పగించబడిన పెద్దలకు. మీమధ్య ఏ విషయంలోనైనా వివాదం తల ఎత్తితే దాన్ని అల్లాహ్‌కు, ప్రవక్తకు నివేదించండి.[54] మీరు నిజంగానే అల్లాహ్‌మీద అంతిమ దినం మీదా విశ్వాసం కలవారే అయితే. ఇదే సరియైన పద్ధతి. ఫలితాన్ని బట్టి కూడా ఇదే ఉత్తమమైనది.

إِنَّ اللّٰهَ يَأْمُرُكُمْ أَنْ تُؤَدُّوا الْأَمٰنٰتِ إِلَىٰ
أَهْلِهَا ۙ وَ إِذَا حَكَمْتُمْ بَيْنَ النَّاسِ أَنْ
تَحْكُمُوا بِالْعَدْلِ ۚ إِنَّ اللّٰهَ نِعِمَّا يَعِظُكُمْ بِهِ ۗ
إِنَّ اللّٰهَ كَانَ سَمِيعًا بَصِيرًا ﴿٥٨﴾ يٰأَيُّهَا الَّذِينَ
اٰمَنُوا أَطِيعُوا اللّٰهَ وَ أَطِيعُوا الرَّسُولَ وَ أُولِي
الْأَمْرِ مِنْكُمْ ۖ فَإِنْ تَنٰزَعْتُمْ فِي شَيْءٍ فَرُدُّوهُ
إِلَى اللّٰهِ وَالرَّسُولِ إِنْ كُنْتُمْ تُؤْمِنُونَ بِاللّٰهِ وَ
الْيَوْمِ الْاٰخِرِ ۚ ذٰلِكَ خَيْرٌ وَّ أَحْسَنُ تَأْوِيلًا ﴿٥٩﴾ ع ٨/٥

సంతానమే కదా! ప్రపంచ నాయకత్వానికి సంబంధించి మేము ఇబ్రాహీమ్ (అస్సలామ్) కు చేసిన వాగ్దానం ఆయన వంశీయులలో మేము పంపిన గ్రంథాన్నీ, వివేకాన్నీ అనుసరించినవారికి మాత్రమే వర్తిస్తుంది. ఈ గ్రంథాన్నీ, వివేకాన్నీ, పూర్వం మేము మీ వద్దకే పంపాము. మీరు మీ అయోగ్యతవల్ల దానిపట్ల విముఖులయ్యారు. ఇప్పుడు మేము దాన్నే ఇస్మాయీల్ సంతతి వారికి ఇచ్చాము. వారు తమ అదృష్టంవల్ల దానిని విశ్వసించారు.”

53. అంటే, మీరు ఇస్రాయీల్ సంతతివారు గురిఅయిన చెడులకు దూరంగా ఉండాలి. ఇస్రాయీల్ సంతతివారు చేసిన పెద్ద తప్పులలో ఒకటి ఇది: వారు తమ క్షీణదశలో అమానతులను, అంటే బాధ్యతాయుతమైన పదవులను, మత నాయకత్వాన్ని, జాతి నాయకత్వాన్ని, అనర్హులు, అల్పబుద్ధులు, అవినీతిపరులు, నమ్మకద్రోహులు, దుర్వర్తనులు అయిన వ్యక్తులకు ఇవ్వసాగారు. తత్ఫలితంగా దుష్టుల నాయకత్వంలో సమస్త జాతి చెడిపోసాగింది. ముస్లిములకు, ‘మీరు అలా చెయ్యకూడదు’ అని బోధ చెయ్యబడుతోంది. ఇస్రాయీల్ సంతతివారి మరొక పెద్ద బలహీనత ఏమిటంటే, వారిలో న్యాయదృష్టి నశించిపోయింది. వారు వ్యక్తిగత, జాతీయ ప్రయోజనాల కొరకు నిస్సంకోచంగా దైవవిశ్వాసాన్ని నిర్లక్ష్యం చేసేవారు. మొండి వైఖరిని అవలంబించేవారు. న్యాయం గొంతు కొయ్యటానికి వారు ఏమాత్రం సంకోచించేవారు కాదు. కనుక “మీరు అన్యాయపరులు కాకండి. ఎవరితోనైనా సరే, మైత్రి వున్నా లేక విరోధం ఉన్నా, ఎట్టి పరిస్థితులలోనూ, మాట్లాడితే న్యాయం మాట్లాడండి, తీర్పు చేస్తే న్యాయంగా చేయండి” అని అల్లాహ్ ముస్లిములకు బోధిస్తున్నాడు.

54. ఈ ఆయత్ ఇస్లాముకు సంబంధించిన యావత్తు ధార్మిక, సాంస్కృతిక, రాజకీయ వ్యవస్థలకు పునాది. ఇస్లామీ ప్రభుత్వం యొక్క సంవిధానంలోని ప్రప్రథమ అధికరణం. ఇందులో నాలుగు సూత్రాలు శాశ్వత ప్రాతిపదికపై పొందుపరచబడ్డాయి : (1) ఇస్లామీ వ్యవస్థలో విధేయత చూపటానికి అర్హుడు అల్లాహ్ మాత్రమే. ఒక ముస్లిము అన్నిటికంటే ముందు దైవానికి దాసుడు. మిగిలినవన్నీ ఏవైనా ఉంటే, దీని తరువాతనే (2) ఇస్లామీ వ్యవస్థకు రెండో పునాది, ప్రవక్త పట్ల విధేయత చూపటం (3) పై రెండు విధేయతల తరువాత వాటికి లోబడి ఉండే మూడో విధేయత ఏమిటంటే అధికారం అప్పగించబడిన పెద్దల పట్ల చూపే విధేయత. వారు స్వయంగా ముస్లిములలోనివారై ఉండాలి. “ఉలిల్ అమ్ర్” యొక్క భావంలో, ముస్లిముల సామూహిక వ్యవహారాలను చూసే నాయకులు అందరూ చేరివున్నారు. వారు విద్వాంసులైనా లేక రాజకీయ మార్గదర్శకత్వం వహించే నాయకులైనా, లేక దేశపాలనా వ్యవహారాలను నిర్వహించే అధికారులైనా లేక న్యాయస్థానాలలో తీర్పుచెప్పే న్యాయాధిపతులైనా లేక సాంస్కృతిక, సామాజిక విషయాలలో తెగలకు, పల్లెలకు, వాడలకు పెద్దలుగా ఉండే నాయకులు, సర్దారులు అయినా సరే (4) దైవాజ్ఞ, ప్రవక్త పద్ధతి – ఈ రెండూ మౌలిక శాసనంగా, అంతిమ

اَلَمْ تَرَ اِلَى الَّذِيْنَ يَزْعُمُوْنَ اَنَّهُمْ اٰمَنُوْا بِمَآ
اُنْزِلَ اِلَيْكَ وَمَآ اُنْزِلَ مِنْ قَبْلِكَ يُرِيْدُوْنَ
اَنْ يَّتَحَاكَمُوْٓا اِلَى الطَّاغُوْتِ وَ قَدْ اُمِرُوْٓا
اَنْ يَّكْفُرُوْا بِهٖ ؕ وَيُرِيْدُ الشَّيْطٰنُ اَنْ يُّضِلَّهُمْ
ضَلٰلًا بَعِيْدًا ۝٦٠ وَاِذَا قِيْلَ لَهُمْ تَعَالَوْا اِلٰى مَآ
اَنْزَلَ اللّٰهُ وَ اِلَى الرَّسُوْلِ رَاَيْتَ الْمُنٰفِقِيْنَ
يَصُدُّوْنَ عَنْكَ صُدُوْدًا ۝٦١ فَكَيْفَ اِذَآ
اَصَابَتْهُمْ مُّصِيْبَةٌۢ بِمَا قَدَّمَتْ اَيْدِيْهِمْ ثُمَّ
جَآءُوْكَ يَحْلِفُوْنَ ۖ بِاللّٰهِ اِنْ اَرَدْنَآ اِلَّآ
اِحْسَانًا وَّتَوْفِيْقًا ۝٦٢ اُولٰٓئِكَ الَّذِيْنَ يَعْلَمُ اللّٰهُ
مَا فِيْ قُلُوْبِهِمْ ۗ فَاَعْرِضْ عَنْهُمْ وَعِظْهُمْ وَقُلْ
لَّهُمْ فِيْٓ اَنْفُسِهِمْ قَوْلًا بَلِيْغًا ۝٦٣ وَمَآ اَرْسَلْنَا
مِنْ رَّسُوْلٍ اِلَّا لِيُطَاعَ بِاِذْنِ اللّٰهِ ؕ وَلَوْ اَنَّهُمْ
اِذْ ظَّلَمُوْٓا اَنْفُسَهُمْ جَآءُوْكَ فَاسْتَغْفَرُوا اللّٰهَ
وَاسْتَغْفَرَ لَهُمُ الرَّسُوْلُ لَوَجَدُوا اللّٰهَ تَوَّابًا
رَّحِيْمًا ۝٦٤

**60 - 70** ప్రవక్తా! "నీవద్దకు పంపబడిన గ్రంథాన్ని, నీకు పూర్వం పంపబడిన గ్రంథాలను మేము విశ్వసించాము" అని ప్రకటన అయితే చేసి తమ వ్యవహారాల పరిష్కారం కొరకు 'తాగూత్' వద్దకు పోవాలని కోరేవారిని నీవు చూడలేదా? వాస్తవానికి 'తాగూత్'ను తిరస్కరించండి అని వారిని ఆదేశించటం జరిగింది[55]–షైతాన్ వారిని పెడత్రోవపట్టించి సన్మార్గానికి బహుదూరంగా తీసుకుపోవాలని చూస్తాడు. వారితో, "అల్లాహ్ పంపిన దాని వైపునకు రండి, ప్రవక్త వైపునకు రండి" అని చెప్పినప్పుడు, ఆ కపటులు నీ వైపునకు రాకుండా తప్పించుకోవడాన్ని నీవు చూస్తావు. అయితే వారు తమ చేజేతులా తెచ్చుకున్న ఆపద వారిపైకి వచ్చిపడినప్పుడు వారి ప్రవర్తన ఎలా ఉంటుంది? అప్పుడు వారు నీ వద్దకు ప్రమాణాలు చేస్తూ వస్తారు. వచ్చి, "దేవుని సాక్షిగా! మేము మంచినే కాంక్షించాము. ప్రత్యర్థుల మధ్య ఏదో ఒక విధంగా రాజీ కుదరాలనేదే మా ఉద్దేశ్యం" అని అంటారు – వారి మనస్సులలో ఏదైతే ఉందో అది అల్లాహ్‌కు తెలుసు. కనుక వారితో వివాదానికి దిగకు. వారికి నచ్చజెప్పు. వారి హృదయాలలో నాటుకునే విధంగా బోధచేయి. (వారికి ఇలా తెలుపు) మేము ఏ ప్రవక్తను పంపినా అల్లాహ్ అనుజ్ఞ ప్రకారం అతనికి విధేయత చూపాలనే పంపాము. వారు తమ ఆత్మలకు అన్యాయం చేసుకున్న తరువాత వారి కొరకు ఉత్తమమయిన పద్ధతి ఏమిటంటే, వారు నీ వద్దకు వచ్చి ఉండవలసింది, క్షమించు అని అల్లాహ్‌ను అర్థించి ఉండవలసింది, ఇంకా ప్రవక్త కూడ వారి కొరకు మన్నింపుకై విజ్ఞాపన చేసి ఉండేవాడు. అప్పుడు వారు నిశ్చయంగా అల్లాహ్‌ను క్షమించేవాడుగా, కరుణించేవాడుగా కనుగొని ఉండేవారు.

ప్రమాణంగా ఉంటాయి. ముస్లిముల మధ్య లేదా ప్రభుత్వానికి ప్రజలకు మధ్య ఏ సమస్యలోనైనాసరే, వివాదం తలెత్తితే దాని విషయంలో తీర్పునకు ఖురాను, సున్నత్‌లనూ సంప్రదించటం జరుగుతుంది. అక్కడ లభించే తీర్పును అందరూ శిరసావహించవలసి ఉంటుంది.

55. ఇక్కడ స్పష్టంగా 'తాగూత్' అంటే భావం, అల్లాహ్ శాసనం ప్రకారంకాక వేరే శాసనం ప్రకారం తీర్పులు చేసే పాలకుడు, ఇంకా అల్లాహ్ సామ్రాజ్యాధిపత్యం పట్ల విధేయత చూపని, అల్లాహ్ గ్రంథాన్ని అంతిమ ప్రమాణంగా స్వీకరించని న్యాయవ్యవస్థ.

فَلَا وَ رَبِّكَ لَا يُؤْمِنُوْنَ حَتّٰى يُحَكِّمُوْكَ فِيْمَا
شَجَرَ بَيْنَهُمْ ثُمَّ لَا يَجِدُوْا فِيْٓ اَنْفُسِهِمْ حَرَجًا
مِّمَّا قَضَيْتَ وَ يُسَلِّمُوْا تَسْلِيْمًا ﴿۶۵﴾ وَ لَوْ اَنَّا
كَتَبْنَا عَلَيْهِمْ اَنِ اقْتُلُوْٓا اَنْفُسَكُمْ اَوِ اخْرُجُوْا
مِنْ دِيَارِكُمْ مَّا فَعَلُوْهُ اِلَّا قَلِيْلٌ مِّنْهُمْ ؕ وَ لَوْ
اَنَّهُمْ فَعَلُوْا مَا يُوْعَظُوْنَ بِهٖ لَكَانَ خَيْرًا لَّهُمْ وَ
اَشَدَّ تَثْبِيْتًا ﴿۶۶﴾ وَّ اِذًا لَّاٰتَيْنٰهُمْ مِّنْ لَّدُنَّآ
اَجْرًا عَظِيْمًا ﴿۶۷﴾ وَّلَهَدَيْنٰهُمْ صِرَاطًا
مُّسْتَقِيْمًا ﴿۶۸﴾ وَ مَنْ يُّطِعِ اللّٰهَ وَالرَّسُوْلَ
فَاُولٰٓئِكَ مَعَ الَّذِيْنَ اَنْعَمَ اللّٰهُ عَلَيْهِمْ مِّنَ
النَّبِيّٖنَ وَالصِّدِّيْقِيْنَ وَ الشُّهَدَآءِ وَ
الصّٰلِحِيْنَ ۚ وَحَسُنَ اُولٰٓئِكَ رَفِيْقًا ﴿۶۹﴾ ذٰلِكَ
الْفَضْلُ مِنَ اللّٰهِ ؕ وَ كَفٰى بِاللّٰهِ عَلِيْمًا ﴿۷۰﴾ ع
يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا خُذُوْا حِذْرَكُمْ فَانْفِرُوْا
ثُبَاتٍ اَوِ انْفِرُوْا جَمِيْعًا ﴿۷۱﴾ وَ اِنَّ مِنْكُمْ لَمَنْ
لَّيُبَطِّئَنَّ ۚ فَاِنْ اَصَابَتْكُمْ مُّصِيْبَةٌ قَالَ قَدْ
اَنْعَمَ اللّٰهُ عَلَيَّ اِذْ لَمْ اَكُنْ مَّعَهُمْ شَهِيْدًا ﴿۷۲﴾

కాదు, ముహమ్మద్! నీ ప్రభువు సాక్షిగా! వారు తమ పరస్పర విభేదాల విషయంలో నిన్ను న్యాయనిర్ణేతగా స్వీకరించనంత వరకు, ఇంకా నీవు ఏ నిర్ణయం చేసినా దానిని గురించి వారి మనస్సులలో కూడా ఏ మాత్రం సంకోచం లేకుండా దానిని యథాతథంగా శిరసావహించనంతవరకు వారు నిజమైన విశ్వాసులు కాలేరు. మేము వారిని, "మిమ్మల్ని మీరు చంపుకోండి" లేక "మీ గృహాలను వదలండి" అని ఆజ్ఞాపించి వున్నట్లయితే, వారిలో కొద్దిమంది మాత్రమే దాన్ని పాటించే వారు. వారికి హితబోధ చేయబడిన విధంగా వారు గనక నడచుకొని ఉన్నట్లయితే, అది వారికి శ్రేయస్కరమైనదిగా, (విశ్వాసములో) దృఢత్వాన్ని కలిగించేదిగా ఉండేది. మేము మా తరఫు నుండి వారికి గొప్ప ప్రతిఫలం ఇచ్చివుండేవారము. ఇంకా వారికి ఋజుమార్గం చూపించి ఉండేవారము. అల్లాహ్‌కు, ప్రవక్తకు విధేయత చూపేవారు అల్లాహ్ అనుగ్రహా నికి పాత్రులైన వారితో ఉంటారు, అంటే ప్రవక్తలు, సత్య సంధులు, షహీదులు, సజ్జనులూను.[56] ఎవరికి దొరికినా ఈ స్నేహితులు ఎంత మంచి వారు! అల్లాహ్ నుండి లభించే అసలైన అనుగ్రహం ఇదే. యథార్థం తెలుసుకోవడానికి అల్లాహ్ పంపిన జ్ఞానమే చాలు.

**71 - 76** విశ్వాసులారా! యుద్ధానికి ఎల్లప్పుడూ సన్నద్ధులై ఉండండి. వీలునుబట్టి వేరు వేరు జట్లుగానో లేక అంతా కలసియో బయలుదేరండి.[57] యుద్ధమంటే తప్పించుకు తిరిగేవారు కూడా మీలో కొందరు ఉన్నారు. ఒకవేళ మీకు ఏదన్నా ఆపదవస్తే వారు, "అల్లాహ్ మాపై దయచూపాడు, కనుకనే మేము వారితో వెళ్ళలేదు" అని అంటారు.

56. దీని భావం ఏమిటంటే, వారు పరలోకంలో ఇటువంటివారితో ఉంటారు. వారిలో ఎవరైనా తమ ఈ కార్యం వల్ల ప్రవక్త కూడా అవుతారని అర్థం కాదు.

57. ఉహుద్ సంగ్రామంలో ముస్లిముల ఓటమి కారణంగా చుట్టుపక్కల ఉన్న తెగలు ధైర్యాన్ని పుంజుకున్నాయి. ముస్లిములు అన్ని వైపుల నుండి ప్రమాదాలలో చిక్కుకున్నారు. ఇటువంటి పరిస్థితులలో ఈ ఆజ్ఞ అవతరించిందనే విషయాన్ని స్పష్టంగా అర్థం చేసుకోవాలి.

وَ لَئِنْ اَصَابَكُمْ فَضْلٌ مِّنَ اللّٰهِ لَيَقُوْلَنَّ كَاَنْ لَّمْ
تَكُنْۢ بَيْنَكُمْ وَ بَيْنَهٗ مَوَدَّةٌ يّٰلَيْتَنِيْ كُنْتُ
مَعَهُمْ فَاَفُوْزَ فَوْزًا عَظِيْمًا ﴿۷۳﴾ فَلْيُقَاتِلْ فِيْ سَبِيْلِ
اللّٰهِ الَّذِيْنَ يَشْرُوْنَ الْحَيٰوةَ الدُّنْيَا بِالْاٰخِرَةِ ؕ
وَمَنْ يُّقَاتِلْ فِيْ سَبِيْلِ اللّٰهِ فَيُقْتَلْ اَوْ يَغْلِبْ
فَسَوْفَ نُؤْتِيْهِ اَجْرًا عَظِيْمًا ﴿۷۴﴾ وَ مَا لَكُمْ لَا
تُقَاتِلُوْنَ فِيْ سَبِيْلِ اللّٰهِ وَالْمُسْتَضْعَفِيْنَ مِنَ
الرِّجَالِ وَ النِّسَآءِ وَالْوِلْدَانِ الَّذِيْنَ يَقُوْلُوْنَ
رَبَّنَاۤ اَخْرِجْنَا مِنْ هٰذِهِ الْقَرْيَةِ الظَّالِمِ اَهْلُهَا ۚ
وَاجْعَلْ لَّنَا مِنْ لَّدُنْكَ وَلِيًّا ۙۚ وَّ اجْعَلْ لَّنَا مِنْ
لَّدُنْكَ نَصِيْرًا ؕ ﴿۷۵﴾ اَلَّذِيْنَ اٰمَنُوْا يُقَاتِلُوْنَ فِيْ
سَبِيْلِ اللّٰهِ ۚ وَالَّذِيْنَ كَفَرُوْا يُقَاتِلُوْنَ فِيْ
سَبِيْلِ الطَّاغُوْتِ فَقَاتِلُوْۤا اَوْلِيَآءَ الشَّيْطٰنِ ۚ اِنَّ
كَيْدَ الشَّيْطٰنِ كَانَ ضَعِيْفًا ﴿۷۶﴾ اَلَمْ تَرَ اِلَى الَّذِيْنَ ع
قِيْلَ لَهُمْ كُفُّوْۤا اَيْدِيَكُمْ وَ اَقِيْمُوا الصَّلٰوةَ وَاٰتُوا
الزَّكٰوةَ ۚ فَلَمَّا كُتِبَ عَلَيْهِمُ الْقِتَالُ اِذَا فَرِيْقٌ
مِّنْهُمْ يَخْشَوْنَ النَّاسَ كَخَشْيَةِ اللّٰهِ اَوْ اَشَدَّ
خَشْيَةً ۚ وَقَالُوْا رَبَّنَا لِمَ كَتَبْتَ عَلَيْنَا الْقِتَالَ ۚ
لَوْ لَاۤ اَخَّرْتَنَاۤ اِلٰۤى اَجَلٍ قَرِيْبٍ ؕ قُلْ مَتَاعُ
الدُّنْيَا قَلِيْلٌ ۚ وَالْاٰخِرَةُ خَيْرٌ لِّمَنِ اتَّقٰى ۫ وَ لَا
تُظْلَمُوْنَ فَتِيْلًا ﴿۷۷﴾

ఒకవేళ అల్లాహ్ మిమ్మల్ని అనుగ్రహిస్తే వారు ఇలా అంటారు– మీకూ వారికీ మధ్య ఏ విధమయిన అనురాగబంధమే లేనట్లుగా అంటారు– "మేమూ వారితోపాటు వెళ్ళి ఉన్నట్ల యితే మంచి ఫలితం దక్కివుండేది." (అటువంటి వారు తెలుసుకోవాలి) : పరలోకానికి బదులుగా ఇహలోక జీవితాన్ని అమ్మివేసినవారు అల్లాహ్ మార్గంలో పోరాడాలి. అల్లాహ్ మార్గంలో పోరాడి చంపబడేవానికి లేక విజయాన్ని పొందేవానికి మేము తప్ప కుండా గొప్ప ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాము. అసలు మీరు, నిస్సహాయులైన ఆ పురుషులు, స్త్రీలు, పిల్లలకొరకు అల్లాహ్ మార్గంలో పోరాడక పోవటానికి కారణం ఏమిటీ? బలహీను లవటంచేత అణచబడి, వారు, "మా ప్రభూ! దుర్మార్గులైన ఈ నగరవాసుల నుండి మాకు విమోచనం కలిగించు. మా కొరకు నీ తరఫు నుండి ఒక సహాయకుణ్ణి, ఒక రక్షకుణ్ణి పంపించు"[58] అని ఫిర్యాదు చేస్తున్నారే! విశ్వాస మార్గాన్ని ఎన్ను కున్న వారు అల్లాహ్ మార్గంలో పోరాడతారు. అవిశ్వాస మార్గాన్ని ఎన్నుకున్నవారు తాగూత్ మార్గంలో పోరాడతారు. కనుక షైతాన్ సహచరులతో పోరాడండి. వాస్తవంగా షైతాన్ జిత్తులు ఎంతో బలహీనమైనవని నమ్మండి.

**77 - 78** "మీ చేతులను (యుద్ధం చెయ్యకుండా) నిలిపి ఉంచండి. నమాజును స్థాపించండి. జకాత్ఇవ్వండి" అని చెప్ప బడినవారిని కూడా నీవు చూశావా? తీరా ఇప్పుడు యుద్ధం చెయ్యండి అని వారికి ఆజ్ఞ ఇస్తే వారిలో కొందరి స్థితి ఎలా ఉందంటే, వారు దైవానికి భయపడినట్లుగా మనుషులకు భయపడుతున్నారు. కాదు, అంతకంటే అధికంగానే. "ప్రభూ! యుద్ధం చెయ్యండి అనే ఈ ఆజ్ఞను మా కొరకు ఎందుకు వ్రాసి పెట్టావు? మాకు ఇంకా కొంత వ్యవధిని ఎందుకివ్వలేదు?" అని అంటారు. వారితో ఇలా అను: "ఐహిక జీవిత భోగాలు అల్పమైనవి, దైవభక్తి పరాయణుడైన మనిషికి పరలోకమే ఎక్కువ మేలైనది. మీకు రవ్వంత అన్యాయం కూడా జరగదు."[59]

58. మక్కాలోనూ, అరేబియాలోని ఇతర ప్రాంతాలలోనూ ఉన్న తెగలలో ఇస్లామును స్వీకరించి బాధలకు గురైన పిల్లలనూ, స్త్రీలనూ, పురుషులనూ ఇక్కడ సూచించటం జరిగింది. వారు వలసపోయేటందుకు గాని, తమను తాము హింస నుండి రక్షించుకునేటందుకుగాని శక్తి లేనివారు. పాపం వారు రకరకాలుగా బాధలకు గురిచెయ్యబడేవారు. ఈ పీడన నుండి తమను ఎవరైనా కాపాడాలని ప్రార్థిస్తూ ఉండేవారు.

اَيۡنَ مَا تَكُوۡنُوۡا يُدۡرِكْكُّمُ الۡمَوۡتُ وَلَوۡ كُنۡتُمۡ
فِىۡ بُرُوۡجٍ مُّشَيَّدَةٍ ؕ وَاِنۡ تُصِبۡهُمۡ حَسَنَةٌ
يَّقُوۡلُوۡا هٰذِهٖ مِنۡ عِنۡدِ اللّٰهِ ۚ وَاِنۡ تُصِبۡهُمۡ
سَيِّئَةٌ يَّقُوۡلُوۡا هٰذِهٖ مِنۡ عِنۡدِكَ ؕ قُلۡ كُلٌّ
مِّنۡ عِنۡدِ اللّٰهِ ؕ فَمَالِ هٰٓؤُلَۤاءِ الۡقَوۡمِ لَا
يَكَادُوۡنَ يَفۡقَهُوۡنَ حَدِيۡثًا ﴿٧٨﴾ مَاۤ اَصَابَكَ مِنۡ
حَسَنَةٍ فَمِنَ اللّٰهِ وَمَاۤ اَصَابَكَ مِنۡ سَيِّئَةٍ
فَمِنۡ نَّـفۡسِكَ ؕ وَاَرۡسَلۡنٰكَ لِلنَّاسِ رَسُوۡلًا ؕ وَ
كَفٰى بِاللّٰهِ شَهِيۡدًا ﴿٧٩﴾ مَنۡ يُّطِعِ الرَّسُوۡلَ فَقَدۡ
اَطَاعَ اللّٰهَ ۚ وَمَنۡ تَوَلّٰى فَمَاۤ اَرۡسَلۡنٰكَ عَلَيۡهِمۡ
حَفِيۡظًا ﴿٨٠﴾ وَيَقُوۡلُوۡنَ طَاعَةٌ فَاِذَا بَرَزُوۡا مِنۡ
عِنۡدِكَ بَيَّتَ طَآئِفَةٌ مِّنۡهُمۡ غَيۡرَ الَّذِىۡ
تَقُوۡلُ ؕ وَاللّٰهُ يَكۡتُبُ مَا يُبَيِّتُوۡنَ ۚ فَاَعۡرِضۡ
عَنۡهُمۡ وَتَوَكَّلۡ عَلَى اللّٰهِ ؕ وَكَفٰى بِاللّٰهِ
وَكِيۡلًا ﴿٨١﴾ اَفَلَا يَتَدَبَّرُوۡنَ الۡقُرۡاٰنَ ؕ وَلَوۡ كَانَ
مِنۡ عِنۡدِ غَيۡرِ اللّٰهِ لَوَجَدُوۡا فِيۡهِ اخۡتِلَافًا
كَثِيۡرًا ﴿٨٢﴾

ఇక మృత్యువు, మీరు ఎక్కడున్నాసరే అది మీకు వచ్చి తీరుతుంది, మీరు ఎంతటి ధృఢమైన భవనాలలో ఉన్నాసరే...

**78 - 79**... వారికి ఏదైనా లాభం కలిగితే, "ఇది అల్లాహ్ తరఫునుండి వచ్చింది" అని అంటారు. ఒకవేళ ఏదైనా నష్టం కలిగితే, "ప్రవక్తా! ఇది నీ వల్ల జరిగింది" అని అంటారు. "అంతా అల్లాహ్ తరఫునుండే జరిగింది" అని వారికి చెప్పు. అసలు వారికి ఏమయింది, వారు ఏ విషయాన్నీ అర్థం చేసుకోరు? మనిషీ! నీకు ఏ మేలు కలిగినా అల్లాహ్ కరుణ వల్లనే కలుగుతుంది. నీకు ఏ కీడు కలిగినా అది నీవు స్వయంగా సంపాదించుకున్న దాని ఫలితమే...

**79 - 80** ... ముహమ్మద్! మేము నిన్ను మానవజాతికి సందేశహరుడుగా చేసి పంపాము. దీనికి అల్లాహ్ సాక్ష్యం చాలు. ప్రవక్తకు విధేయత చూపినవాడు వాస్తవంగా అల్లాహ్‌కు విధేయత చూపినట్లే. కాని ఎవడైతే విముఖుడయ్యాడో అటువంటివారిపై మేము నిన్ను కావలివానిగా చేసి పంపలేదు.

**81 - 82** వారు నీ సమక్షంలోనయితే "మేము విధేయులం" అని అంటారు. కాని నీ వద్ద నుండి వెళ్ళిన తరువాత వారిలోని ఒక వర్గంవారు రాత్రివేళ సమావేశమై నీ మాటలకు వ్యతిరేకంగా సంప్రదింపులు జరుపుతారు. వారి ఈ రహస్యాలోచనలన్నింటినీ అల్లాహ్ వ్రాస్తున్నాడు. నీవు వారిని లెక్కచేయకు. అల్లాహ్‌పై భారం మోపు. భారం మోపటానికి ఆయనే చాలు. ఈ ప్రజలు ఖురానును గురించి ఆలోచన చెయ్యరా? ఇది అల్లాహ్ తరఫు నుండి కాక వేరొకరి తరఫు నుండి వచ్చి ఉన్నట్లయితే ఇందులో ఎన్నో పరస్పర విరుద్ధాలైన విషయాలు ఉండేవి.[60]

59. అంటే, మీరుగనక దైవధర్మం కోసం పాటుపడితే, దైవమార్గంలో ప్రాణాలొడ్డి పోరాడితే దేవుని వద్ద మీ ప్రతిఫలం వ్యర్థం కావటం అనేది జరగదు.

60. ఇది దేవుని వాణి తప్ప మరొకరిది కాజాలదని ఈ వాణియే స్వయంగా సాక్ష్యమిస్తోంది. ఏ మానవుడికీ ఇవి సాధ్యం కావు : ఎన్నో సంవత్సరాల వరకు అతడు విభిన్న పరిస్థితులలో, విభిన్న సందర్భాలలో, విభిన్న విషయాలపై ప్రసంగిస్తూ ఉండటం, ఆది నుండి అంతం వరకు అతని ఉపన్యాసాలన్నీ సమానంగా, ఒకే వర్ణంలో, సమతూకం గల సంపుటి కావటం, అందులోని ఏ భాగమూ మరొక భాగాన్ని ఖండించకుండా ఉండటం, అందులో ఎక్కడా అభిప్రాయం మార్పు యొక్క ఛాయలైనా లేకుండా ఉండటం, అందులో బోధకుని విభిన్న మనోభావాలు తమ విభిన్న వర్ణాలలో వ్యక్తం కాకుండా ఉండటం, ఇంకా అందులో పునఃపరిశీలన అవసరం రాకుండా ఉండటం.

وَ اِذَا جَآءَهُمْ اَمْرٌ مِّنَ الْاَمْنِ اَوِ الْخَوْفِ
اَذَاعُوْا بِهٖ ؕ وَ لَوْ رَدُّوْهُ اِلَى الرَّسُوْلِ وَ اِلٰۤى
اُولِي الْاَمْرِ مِنْهُمْ لَعَلِمَهُ الَّذِيْنَ يَسْتَنْۢبِطُوْنَهٗ
مِنْهُمْ ؕ وَلَوْ لَا فَضْلُ اللّٰهِ عَلَيْكُمْ وَرَحْمَتُهٗ
لَاتَّبَعْتُمُ الشَّيْطٰنَ اِلَّا قَلِيْلًا ۝٨٣ فَقَاتِلْ فِيْ
سَبِيْلِ اللّٰهِ ۚ لَا تُكَلَّفُ اِلَّا نَفْسَكَ وَحَرِّضِ
الْمُؤْمِنِيْنَ ۚ عَسَى اللّٰهُ اَنْ يَّكُفَّ بَاْسَ
الَّذِيْنَ كَفَرُوْا ؕ وَ اللّٰهُ اَشَدُّ بَاْسًا وَّ اَشَدُّ
تَنْكِيْلًا ۝٨٤ مَنْ يَّشْفَعْ شَفَاعَةً حَسَنَةً يَّكُنْ
لَّهٗ نَصِيْبٌ مِّنْهَا ۚ وَ مَنْ يَّشْفَعْ شَفَاعَةً
سَيِّئَةً يَّكُنْ لَّهٗ كِفْلٌ مِّنْهَا ؕ وَ كَانَ اللّٰهُ عَلٰى
كُلِّ شَيْءٍ مُّقِيْتًا ۝٨٥ وَ اِذَا حُيِّيْتُمْ بِتَحِيَّةٍ
فَحَيُّوْا بِاَحْسَنَ مِنْهَاۤ اَوْ رُدُّوْهَا ؕ اِنَّ اللّٰهَ
كَانَ عَلٰى كُلِّ شَيْءٍ حَسِيْبًا ۝٨٦ اَللّٰهُ لَاۤ اِلٰهَ اِلَّا
هُوَ ؕ لَيَجْمَعَنَّكُمْ اِلٰى يَوْمِ الْقِيٰمَةِ لَا رَيْبَ
فِيْهِ ؕ وَمَنْ اَصْدَقُ مِنَ اللّٰهِ حَدِيْثًا ۝٨٧

النصف ع ١١

**83** వారు ఎక్కడన్నా ఏదైనా సంతృప్తికరమైన వార్తగాని లేదా భయంకరమైన వార్తగాని విన్నప్పుడు దాన్ని వ్యాపింపచేస్తారు. అలాకాక వారు దానిని ప్రవక్తకు, సంఘంలోని బాధ్యతాయుతులైన తమ పెద్దలకు తెలిపివుంటే వారిలో, దానిని ఆధారంగా చేసుకుని సరియైన నిర్ణయం తీసుకోగలిగే సామర్థ్యం కలవారి దృష్టికి అది వచ్చి ఉండేది.[61] మీపై గనక అల్లాహ్ అనుగ్రహం, కారుణ్యం లేకపోయినట్లయితే, (మీ బలహీనతలు ఎలాంటి వంటే) మీలో ఎవరో కొద్ది మంది తప్ప, మీరందరూ షైతానును అనుసరించి ఉండేవారు.

**84 - 85** కనుక ప్రవక్తా! నీవు అల్లాహ్ మార్గంలో యుద్ధం చెయ్యి. నీవు నీ విషయంలో తప్ప మరెవరి విషయంలోనూ బాధ్యుడవు కావు. అయితే విశ్వాసులను యుద్ధం చెయ్యండి అని ప్రేరేపించు. అల్లాహ్ అవిశ్వాసుల శక్తిని అణచవచ్చు. అల్లాహ్ శక్తి అందరి శక్తికంటే ఎంతో అధికమైనది. ఆయన శిక్ష అన్ని శిక్షలకంటే తీవ్రమైనది. మంచి విషయం నిమిత్తం సిఫారసు చేసేవానికి అందులో భాగం లభిస్తుంది. చెడు విషయం నిమిత్తం సిఫారసు చేసేవానికి అందులో భాగం లభిస్తుంది. అల్లాహ్ ప్రతి వస్తువుపై తన దృష్టిని ఉంచుతాడు.

**86 - 87** మీకు ఎవరైనా గౌరవభావంతో సలాము చేస్తే అతనికి మీరు అంతకంటే ఉత్తమమైన పద్ధతిలో ప్రతి సలాము చెయ్యండి. లేదా కనీసం అదే విధంగానైనా చెయ్యండి. అల్లాహ్ ప్రతి దానికి లెక్క తీసుకుంటాడు. అల్లాహ్- ఆయన తప్ప వేరే దైవం లేదు. ఆయన మీ అందరినీ ప్రళయదినం నాడు సమావేశపరుస్తాడు. అది రావటంలో ఏమాత్రం సందేహం లేదు. అల్లాహ్ మాటకంటే మరెవరి మాట నిజం కాగలదు?

61. అది సంక్షోభ సమయం కాబట్టి, ప్రతి వైపు నుండి వదంతులు వ్యాపిస్తూ ఉండేవి. ఒకసారి ఆధారంలేని, అతిశయోక్తితో కూడిన ప్రమాద వార్తలు వస్తాయి. వాటి కారణంగా ఒక్కసారిగా మదీనా పట్టణంలోనూ, దాని చుట్టుపక్కలా ఆందోళన వ్యాపిస్తుంది. మరొకసారి జిత్తులమారి శత్రువు నిజమైన ప్రమాదాన్ని కప్పిపుచ్చటానికి శాంతివార్తలు పంపుతాడు. ప్రజలు వాటిని విని అజాగ్రత్తలో పడిపోతారు. ఇలాంటి బాధ్యతారహితమైన వదంతులను వ్యాపింపజెయ్యటం వల్ల ఉత్పన్నమయ్యే పరిణామాలు ఎంత దూరం పోతాయో సామాన్య ప్రజలకు తెలియదు. వారి చెవులలో ఏదైనా పుకారు వచ్చిపడితే, దాన్ని ప్రతి చోటా వినిపిస్తూ తిరుగుతూ ఉంటారు. వారినే ఈ ఆయత్‌లో గద్దించటం జరిగింది. ఇంకా వారిని వదంతులను వ్యాపింపచెయ్యటం మానుకోమని, వారికి అందిన ప్రతివార్తను బాధ్యతకలిగిన ప్రజల దాకా చేరవేసి ఊరుకోమని తీవ్రంగా హెచ్చరించటం జరిగింది.

فَمَا لَكُمْ فِي الْمُنٰفِقِيْنَ فِئَتَيْنِ وَاللّٰهُ اَرْكَسَهُمْ
بِمَا كَسَبُوْا ؕ اَتُرِيْدُوْنَ اَنْ تَهْدُوْا مَنْ اَضَلَّ
اللّٰهُ ؕ وَ مَنْ يُّضْلِلِ اللّٰهُ فَلَنْ تَجِدَ لَهٗ
سَبِيْلًا ﴿۸۸﴾ وَدُّوْا لَوْ تَكْفُرُوْنَ كَمَا كَفَرُوْا
فَتَكُوْنُوْنَ سَوَآءً فَلَا تَتَّخِذُوْا مِنْهُمْ اَوْلِيَآءَ
حَتّٰى يُهَاجِرُوْا فِيْ سَبِيْلِ اللّٰهِ ؕ فَاِنْ تَوَلَّوْا
فَخُذُوْهُمْ وَ اقْتُلُوْهُمْ حَيْثُ وَجَدْتُّمُوْهُمْ ۪ وَ
لَا تَتَّخِذُوْا مِنْهُمْ وَلِيًّا وَّ لَا نَصِيْرًا ﴿۸۹﴾ اِلَّا
الَّذِيْنَ يَصِلُوْنَ اِلٰى قَوْمٍۭ بَيْنَكُمْ وَبَيْنَهُمْ
مِّيْثَاقٌ اَوْ جَآءُوْكُمْ حَصِرَتْ صُدُوْرُهُمْ اَنْ
يُّقَاتِلُوْكُمْ اَوْ يُقَاتِلُوْا قَوْمَهُمْ ؕ وَ لَوْ شَآءَ
اللّٰهُ لَسَلَّطَهُمْ عَلَيْكُمْ فَلَقٰتَلُوْكُمْ ۚ فَاِنِ
اعْتَزَلُوْكُمْ فَلَمْ يُقَاتِلُوْكُمْ وَاَلْقَوْا اِلَيْكُمُ
السَّلَمَ ۙ فَمَا جَعَلَ اللّٰهُ لَكُمْ عَلَيْهِمْ سَبِيْلًا ﴿۹۰﴾
سَتَجِدُوْنَ اٰخَرِيْنَ يُرِيْدُوْنَ اَنْ يَّاْمَنُوْكُمْ
وَيَاْمَنُوْا قَوْمَهُمْ ؕ كُلَّمَا رُدُّوْۤا اِلَى الْفِتْنَةِ
اُرْكِسُوْا فِيْهَا ۚ فَاِنْ لَّمْ يَعْتَزِلُوْكُمْ وَ يُلْقُوْۤا
اِلَيْكُمُ السَّلَمَ وَيَكُفُّوْۤا اَيْدِيَهُمْ فَخُذُوْهُمْ وَ
اقْتُلُوْهُمْ حَيْثُ ثَقِفْتُمُوْهُمْ ؕ وَ اُولٰٓئِكُمْ جَعَلْنَا
لَكُمْ عَلَيْهِمْ سُلْطٰنًا مُّبِيْنًا ﴿۹۱﴾ ع ۱۲

**88 - 91** మీకు ఏమయింది, మీ మధ్య కపటులను గురించి రెండు అభిప్రాయాలు ఉన్నాయి? వాస్తవానికి వారు సంపాదించుకున్న దుష్టకర్మల ఫలితంగానే అల్లాహ్ వారిని వెనక్కు (పూర్వపు స్థితికి) మరల్చాడు. అల్లాహ్ మార్గం చూపనివానికి మీరు మార్గం చూపదలచారా? వాస్తవంగా అల్లాహ్ అపమార్గం పట్టించినవాని కొరకు మీరు ఏ మార్గాన్నీ కనుగొనలేరు. స్వయంగా వారు అవిశ్వాసులుగా ఉన్నట్లుగానే మీరు కూడా అవిశ్వాసులుగా మారి, మీరూ వారూ సమానులై పోవాలని వారు కోరుతున్నారు. కనుక అల్లాహ్ మార్గంలో వారు హిజ్రత్ (వలస) చెయ్యనంతవరకు, వారిలో ఎవ్వరినీ మీరు మీ మిత్రులుగా ఎన్నుకోకండి. ఒకవేళ వారు హిజ్రత్ చెయ్యకపోతే, ఎక్కడ దొరికినా వారిని పట్టుకోండి, చంపండి.[62] వారిలో ఎవ్వరినీ మీ మిత్రులుగా, సహాయకులుగా చేసుకోకండి. అయితే మీతో ఒప్పందం చేసుకున్న జాతితో కలిసిపోయిన కపటులకు ఈ ఉత్తరువు నుండి మినహాయింపు ఉంది.[63] అదే విధంగా మీ వద్దకు వచ్చి యుద్ధం పట్ల విముఖతను వ్యక్తం చేసి మీతోగాని, లేక స్వజాతి వారితోగాని యుద్ధం చెయ్యటానికి సమ్మతించని కపటులకు కూడా ఈ మినహాయింపు వర్తిస్తుంది. అల్లాహ్ గనక సంకల్పించి ఉంటే, వారికి మీపై ఆధిక్యాన్ని ఇచ్చి ఉండేవాడు. నిశ్చయంగా వారూ మీతో పోరాడి ఉండేవారే. కాబట్టి వారు మీ నుండి వైదొలగితే, యుద్ధం చెయ్యటం మానివేస్తే, సంధికొరకు, శాంతి కొరకు చేయిచాపితే, అప్పుడు వారిపై దాడి చెయ్యటానికి అల్లాహ్ మీ కొరకు ఏ కారణాన్నీ వదలలేదు. మరొక రకం కపటులను మీరు చూస్తారు. వారు మీతోనూ, తమ జాతి వారితోనూ శాంతియుతంగా ఉండాలని కోరుకుంటారు. కాని ఎప్పుడైనా అల్లకల్లోల పరిస్థితి ఏర్పడినపుడు, అదును చూసి, వారు అందులోకి దూకుతారు. అలాంటివారు మీతో పోరాడటం మానుకోక పోతే, సంధికొరకు శాంతి కొరకు చేయిచాపకపోతే, తమ చేతులను ఆపి వుంచకపోతే, అప్పుడు వారిని ఎక్కడ దొరికితే అక్కడ పట్టుకోండి, సంహరించండి. వారితో యుద్ధం చెయ్యటానికి మేము మీకు స్పష్టమైన అధికారం ఇచ్చాము.

**92 - 93** పొరపాటుగా తప్ప, ఒక విశ్వాసి మరొక విశ్వాసిని చంపటం తగనిపని. ఒక విశ్వాసిని పొరపాటుగా చంపిన వాడు, దానికి పరిహారంగా ఒక ముస్లిము బానిసకు విముక్తి కలిగించాలి.[64] ఇంకా హతుని వారసులకు రక్తపరిహారాన్ని అతడు చెల్లించాలి,[65] వారు దాన్ని క్షమించి రద్దుచేస్తే తప్ప. కాని ఆ ముస్లిము హతుడు మీ శత్రుజాతికి చెందినవాడైతే, దానికి పరిహారం ఒక ముస్లిము బానిసకు విముక్తి కలిగించటం. ఒకవేళ అతడు మీతో ఒడంబడిక చేసుకున్న ముస్లిమేతర జాతికి చెందినవాడైతే అతని వారసులకు రక్తపరిహారాన్ని చెల్లించాలి. ఇంకా ఒక ముస్లిము బానిసను విడుదల చెయ్యాలి.[66] బానిస దొరకనివారు వరుసగా రెండు మాసాలు ఉపవాసం ఉండాలి.[67] ఈ అపరాధానికిగాను అల్లాహ్ ముందు పశ్చాత్తాపపడే పద్ధతి ఇదే.[68] అల్లాహ్ అన్నీ తెలిసినవాడూ, అత్యంత వివేకవంతుడూను. ఇక బుద్ధిపూర్వకంగా ఒక విశ్వాసిని చంపేవానికి ప్రతిఫలం నరకం. అందులో అతడు సదా ఉంటాడు. అతనిపై అల్లాహ్ ఆగ్రహం, శాపం అవతరిస్తాయి. అల్లాహ్ అతడి కొరకు కఠినమైన శిక్షను సిద్ధపరచి ఉంచాడు.

وَ مَا كَانَ لِمُؤْمِنٍ اَنْ يَّقْتُلَ مُؤْمِنًا اِلَّا
خَطَـًٔا ۚ وَ مَنْ قَتَلَ مُؤْمِنًا خَطَـًٔا فَتَحْرِيْرُ
رَقَبَةٍ مُّؤْمِنَةٍ وَّ دِيَةٌ مُّسَلَّمَةٌ اِلٰۤى اَهْلِهٖۤ اِلَّاۤ
اَنْ يَّصَّدَّقُوْا ؕ فَاِنْ كَانَ مِنْ قَوْمٍ عَدُوٍّ لَّكُمْ وَ
هُوَ مُؤْمِنٌ فَتَحْرِيْرُ رَقَبَةٍ مُّؤْمِنَةٍ ؕ وَ اِنْ
كَانَ مِنْ قَوْمٍۭ بَيْنَكُمْ وَ بَيْنَهُمْ مِّيْثَاقٌ فَدِيَةٌ
مُّسَلَّمَةٌ اِلٰۤى اَهْلِهٖ وَ تَحْرِيْرُ رَقَبَةٍ مُّؤْمِنَةٍ ۚ
فَمَنْ لَّمْ يَجِدْ فَصِيَامُ شَهْرَيْنِ مُتَتَابِعَيْنِ ۫
تَوْبَةً مِّنَ اللّٰهِ ؕ وَ كَانَ اللّٰهُ عَلِيْمًا
حَكِيْمًا ﴿۹۲﴾ وَ مَنْ يَّقْتُلْ مُؤْمِنًا مُّتَعَمِّدًا
فَجَزَآؤُهٗ جَهَنَّمُ خٰلِدًا فِيْهَا وَ غَضِبَ اللّٰهُ
عَلَيْهِ وَ لَعَنَهٗ وَ اَعَدَّ لَهٗ عَذَابًا عَظِيْمًا ﴿۹۳﴾

62. ఈ ఆజ్ఞ యుద్ధరంగంలో అవిశ్వాసులతో సంబంధాలను కలిగివుండి ఇస్లామీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా విద్రోహకరమైన కార్యకలాపాలలో క్రియాత్మకంగా పాల్గొనే కపట ముస్లిములకు సంబంధించినది.

63. ఇటువంటి కపటులను మిత్రులుగా, సహాయకులుగా చేసుకోవచ్చు అని దీని భావం కాదు. దీని భావం ఏమిటంటే, వారిని పట్టుకోవటంగాని, చంపటంగాని జరగకూడదు. ఎందుకంటే వారు ఇస్లామీ ప్రభుత్వంతో ఒప్పందం కుదుర్చుకున్న జాతివారితో కలిసిపోయారు.

64. హతుడు ముస్లిము కావటంచేత అతని హత్యకు ఒక ముస్లిము బానిస విమోచనాన్ని పరిహారంగా నిర్ణయించటం జరిగింది.

65. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) రక్తపరిహారం యొక్క పరిమాణాన్ని నూరు ఒంటెలుగా లేక రెండువందల ఆవులుగా లేక రెండు వేల మేకలుగా నిర్ణయించారు. ఒకవేళ మరొక రూపంలో ఎవరైనా రక్తపరిహారాన్ని ఇవ్వదలచుకుంటే, దాని పరిమాణం ఈ జంతువుల బజారు ధర ప్రకారం నిర్ణయించబడుతుంది. ఉదాహరణకు, మహాప్రవక్త (సఅసమ్) కాలంలో నగదు రక్తపరిహారం ఇవ్వదలచుకున్న వారికొరకు ఎనిమిది వందల దీనారులు లేక ఎనిమిదివేల దిర్హములు నిర్ణయించబడ్డాయి. హజ్రత్ ఉమర్ (రజిఅన్) కాలం వచ్చినప్పుడు, ఆయన ఏమన్నారంటే, ఒంటెల ధర పెరిగింది. కనుక ఇప్పుడు ఒక వెయ్యి బంగారు దీనారులు లేక పన్నెండువేల వెండి దిర్హములు రక్తపరిహారంగా చెల్లించబడాలి. కాని ఒక విషయం మటుకు స్పష్టంగా ఉండాలి. నిర్ణయించబడిన రక్తపరిహారం యొక్క ఈ పరిమాణం బుద్ధిపూర్వకంగా చేసిన హత్యకు వర్తించదు. యాధృచ్ఛికంగానో లేక ఉద్దేశ్యరహితం గానో జరిగిన హత్యకు మాత్రమే వర్తిస్తుంది.

66. ఈ ఆయత్‌లోని ఆజ్ఞల సారాంశం ఇది : ఒకవేళ హతుడు దారుల్ ఇస్లామ్‌కు చెందిన పౌరుడైతే, అతని హంతకుడు రక్తపరిహారం కూడా ఇవ్వవలసి ఉంటుంది. తన పాపాన్ని క్షమించవలసినదని దేవుణ్ణి వేడుకునే నిమిత్తం అతడు

يٰۤاَيُّهَا الَّذِيۡنَ اٰمَنُوۡۤا اِذَا ضَرَبۡتُمۡ فِىۡ سَبِيۡلِ
اللّٰهِ فَتَبَيَّنُوۡا وَلَا تَقُوۡلُوۡا لِمَنۡ اَلۡقٰۤى اِلَيۡكُمُ
السَّلٰمَ لَسۡتَ مُؤۡمِنًا ۚ تَبۡتَغُوۡنَ عَرَضَ
الۡحَيٰوةِ الدُّنۡيَا ۖ فَعِنۡدَ اللّٰهِ مَغَانِمُ كَثِيۡرَةٌ ؕ
كَذٰلِكَ كُنۡتُمۡ مِّنۡ قَبۡلُ فَمَنَّ اللّٰهُ عَلَيۡكُمۡ
فَتَبَيَّنُوۡا ؕ اِنَّ اللّٰهَ كَانَ بِمَا تَعۡمَلُوۡنَ خَبِيۡرًا ﴿٩٤﴾

**94** విశ్వసించిన ప్రజలారా! మీరు అల్లాహ్ మార్గంలో "జిహాద్" కొరకు బయలుదేరినప్పుడు, మిత్రులు శత్రువుల మధ్య విచక్షణ చేయండి. మీ వైపునకు సలాము చేస్తూ ముందుకు వచ్చేవాణ్ణి, "నీవు ముస్లిమువు కావు" అని త్వరపడి అనకండి. మీరు గనక ప్రాపంచిక ప్రయోజనాలను పొందగోరితే, అల్లాహ్ వద్ద మీకొరకు విజయధనాలు సమృద్ధిగా ఉన్నాయి. దీనికి పూర్వం స్వయంగా మీరూ ఇదేస్థితిలో ఉన్నారుకదా! ఆ తరువాత అల్లాహ్ మిమ్మల్ని కనికరించాడు. కనుక వివేచనతో వ్యవహరించండి.[69] మీరు చేసేదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు.

ఒక బానిసను కూడా స్వతంత్రుడుగా చేయవలసి ఉంటుంది. ఒకవేళ హతుడు 'దారుల్ హరబ్'కు చెందిన పౌరుడైతే, హంతకుడు కేవలం బానిసను స్వతంత్రుడుగా చేస్తే సరిపోతుంది. ఈ సందర్భంలో రక్తపరిహారం ఇచ్చే అవసరం లేదు. ఒకవేళ హతుడు ఇస్లామీ ప్రభుత్వంతో ఒప్పందం చేసుకునివున్న 'దారుల్ కుఫ్ర్' (అవిశ్వాస దేశం)కు చెందిన పౌరుడైతే, హంతకుడు ఒక బానిసను స్వతంత్రునిగా చేయవలసి ఉంటుంది. అదికాక రక్తపరిహారాన్ని కూడా ఇవ్వవలసి ఉంటుంది. కాని రక్త పరిహారం యొక్క పరిమాణం, ఒప్పందం చేసుకున్న దేశానికి చెందిన ఒక ముస్లిమేతరుణ్ణి హత్యచేసిన పక్షంలో, ఒప్పందం ప్రకారం ఇవ్వవలసినంత పరిహారంతో సమానంగా ఉండాలి.

67. అంటే, ఉపవాసాలు ఎడతెగకుండా ఉండాలి. మధ్యలో నాగా పెట్టకూడదు. ఒకవేళ ఎవరైనా షరీయతుపరమైన కారణం లేకుండా మధ్యలో ఒక్క ఉపవాసాన్ని వదలిపెట్టినా, మళ్ళీ సరికొత్తగా ఉపవాసాలు ప్రారంభించవలసి ఉంటుంది.

68. అంటే, ఇది 'జుర్మానా' కాదు. ఇది 'పశ్చాత్తాపం' (తౌబా), 'పరిహారం' (కఫ్ఫారా). జుర్మానాలో పశ్చాత్తాపమూ, సిగ్గుపడటమూ, ఆత్మ సంస్కరణా భావాలు ఉండవు. సాధారణంగా అది తీవ్ర అనిష్టతతో గత్యంతరం లేని పరిస్థితుల్లో ఇవ్వబడుతుంది. ఇంకా విసుగును, వెగటును తన వెనుక విడిచిపోతుంది. దీనికి భిన్నంగా, అల్లాహ్ కోరేదేమిటంటే తప్పు చేసిన దాసుడు ఆరాధన, సత్కార్యం, ఇతరుల హక్కులను నెరవేర్చటం ద్వారా దాని దుష్ప్రభావాన్ని తన ఆత్మ నుండి కడిగివేయాలి. ఇంకా సిగ్గుపడుతూ, పశ్చాత్తాపంతో అల్లాహ్ వైపునకు మరలాలి– ఈ పాపం క్షమింపబడటానికేకాక ఇక ముందు అతని ఆత్మ అటువంటి తప్పులను తిరిగి చెయ్యకుండా ఉండేందుకు.

69. ఇస్లామ్ ప్రారంభంలో 'అస్సలాము అలైకుమ్' అనే పదం ముస్లిముల కొరకు చిహ్నంగానూ, సంకేతంగానూ ఉండేది. ఒక ముస్లిము మరొక ముస్లిమును చూసి ఈ పదాన్ని, "నేను మీ వర్గానికే చెందిన మనిషిని, మిత్రుణ్ణి, శ్రేయోభిలాషిని, శత్రువునుకాను" అనే భావంలో ప్రత్యేకంగా వాడేవాడు. ఆ కాలంలో ఈ చిహ్నం ప్రాముఖ్యం మరీ ఎక్కువగా ఉండటానికి కారణం ఏమిటంటే, అప్పుడు అరేబియాలోని కొత్త ముస్లిములు, అవిశ్వాసుల మధ్య వేషభాషలలో స్పష్టమైన భేదం ఏదీ ఉండేది కాదు. ఇందువల్ల ఒక ముస్లిము మరొక ముస్లిమును తేలికగా గుర్తించటం సాధ్యమయ్యేది కాదు. కాని యుద్ధ సందర్భాలలో ఒక చిక్కు ఎదురయ్యేది. ముస్లిములు ఏదైనా శత్రువర్గంపై దాడిచేసినప్పుడు, అక్కడ ముస్లిము ఎవరైనా ఈ వలయంలో చిక్కుకుంటే, అతడు దాడి చేసిన ముస్లిములకు, తానుకూడా వారి ధార్మిక సోదరుడే అని తెలియజేయటానికి, "అస్సలాము అలైకుమ్" లేదా "లా ఇలాహ ఇల్లల్లాహ్" అని ఎలుగెత్తి అరిచేవాడు. కాని ముస్లిములకు, ఇతడు ఎవరో అవిశ్వాసి అనీ, కేవలం ప్రాణ రక్షణార్థం దొంగవేషాలు వేస్తున్నాడని ఇతనిపై అనుమానం కలిగేది. ఈ కారణంగా పలు సందర్భాలలో వారు అతణ్ణి సంహరించేవారు. ఆయత్ ఉద్దేశ్యం ఏమిటంటే, తనను తాను ముస్లిముగా చెప్పుకునే వ్యక్తి గురించి, అతడు కేవలం ప్రాణ రక్షణ కోసం అబద్ధం చెబుతున్నాడు అని స్థూలంగా నిర్ణయం చేసిపారవేసే హక్కు మీకు లేదు. అతడు సత్యవంతుడూ కావచ్చు లేదా అబద్ధం చెప్పేవాడూ కావచ్చు. యథార్థమైతే విచారణ తర్వాతనే తెలుస్తుంది. విచారణ చెయ్యకుండా విడిచిపెట్టటంలో ఒక అవిశ్వాసి అబద్ధం చెప్పి ప్రాణాన్ని రక్షించుకునే అవకాశం ఉండవచ్చు. కాని సంహరించటం వల్ల ఒక ముస్లిము ఏ పాపము చెయ్యకుండా మీ చేతులలో చనిపోయే అవకాశం కూడా ఉంది.

**95 - 96** కారణమేదీ లేకుండానే ఇంటివద్ద కూర్చుండిపోయే ముస్లిములు, అల్లాహ్ మార్గంలో తమ ధనప్రాణాలతో "జిహాద్" చేసే ముస్లిములు ఉభయుల స్థానం సమానం కాదు. కూర్చుండి పోయేవారి స్థానం కంటే ధనప్రాణాలతో "జిహాద్" చేసేవారి స్థానాన్ని అల్లాహ్ సమున్నతం చేశాడు. ప్రతి ఒక్కరికి అల్లాహ్ మేలునే వాగ్దానం చేసినమాట వాస్తవమే అయినా ఆయన వద్ద ముజాహిద్‌ల సేవలకు లభించే ప్రతిఫలం, కూర్చుండిపోయే వారికి లభించే ప్రతిఫలంకంటే ఎంతో ఎక్కువ. వారి కొరకు అల్లాహ్ తరఫు నుండి ఉన్నత స్థానాలూ ఉన్నాయి. క్షమాభిక్ష, కారుణ్యం కూడా ఉన్నాయి. అల్లాహ్ ఎక్కువగా క్షమించేవాడూ అమితంగా కరుణించే వాడూను.

**97 - 100** తమ ఆత్మలకు అన్యాయం చేసుకుంటూ ఉండే వారి[70] ప్రాణాలను తీసి, దైవదూతలు వారిని, "ఇదేమిటి మీ స్థితి ఇలా ఉంది?" అని అడిగారు. అప్పుడు వారు ఇలా సమాధానం చెప్పారు: "మేము భూమిపై బలహీనులముగా, నిస్సహాయులముగా ఉండేవారము." దైవదూతలు "అల్లాహ్ భూమి విశాలంగా లేదా మీరు వలసపోవటానికి?" అని అడిగారు. వారి నివాసం నరకం. అది మహాచెడ్డ నివాసం. అయితే, నిజంగానే నిస్సహాయులై బయలుదేరటానికి ఏ మార్గమూ, ఏ సాధనసంపత్తీ లేని పురుషులనూ, స్త్రీలనూ, పిల్లలనూ అల్లాహ్ క్షమించవచ్చు. (ఎందుకంటే) అల్లాహ్ ఎక్కువగా క్షమించేవాడూ అధికంగా మన్నించేవాడూను. అల్లాహ్ మార్గంలో వలసపోయేవాడు ఆశ్రయం పొందటానికి పుడమిలో కావలసినంత స్థలాన్నీ, బ్రతుకుతెరువుకు ఎక్కువ అవకాశాలనూ పొందుతాడు. అల్లాహ్ వైపునకు, ఆయన ప్రవక్త వైపునకు వలసపోవటానికి తన గృహం నుండి బయలుదేరి మార్గమధ్యంలోనే మరణించినవానికి విధిగా ప్రతిఫలం ఇచ్చే బాధ్యత అల్లాహ్‌దే. అల్లాహ్ క్షమాభిక్ష పెట్టేవాడు, కరుణించే వాడూను.[71]

لَا يَسْتَوِى الْقٰعِدُوْنَ مِنَ الْمُؤْمِنِيْنَ غَيْرُ اُولِى
الضَّرَرِ وَ الْمُجٰهِدُوْنَ فِىْ سَبِيْلِ اللّٰهِ بِاَمْوَالِهِمْ
وَاَنْفُسِهِمْ ؕ فَضَّلَ اللّٰهُ الْمُجٰهِدِيْنَ بِاَمْوَالِهِمْ وَ
اَنْفُسِهِمْ عَلَى الْقٰعِدِيْنَ دَرَجَةً ؕ وَ كُلًّا وَّعَدَ
اللّٰهُ الْحُسْنٰى ؕ وَفَضَّلَ اللّٰهُ الْمُجٰهِدِيْنَ عَلَى
الْقٰعِدِيْنَ اَجْرًا عَظِيْمًا ۙ﴿۹۵﴾ دَرَجٰتٍ مِّنْهُ وَ
مَغْفِرَةً وَّ رَحْمَةً ؕ وَ كَانَ اللّٰهُ غَفُوْرًا
رَّحِيْمًا ۧ﴿۹۶﴾ اِنَّ الَّذِيْنَ تَوَفّٰىهُمُ الْمَلٰٓئِكَةُ ظَالِمِىْٓ
اَنْفُسِهِمْ قَالُوْا فِيْمَ كُنْتُمْ ؕ قَالُوْا كُنَّا
مُسْتَضْعَفِيْنَ فِى الْاَرْضِ ؕ قَالُوْٓا اَلَمْ تَكُنْ
اَرْضُ اللّٰهِ وَاسِعَةً فَتُهَاجِرُوْا فِيْهَا ؕ فَاُولٰٓئِكَ
مَاْوٰىهُمْ جَهَنَّمُ ؕ وَسَآءَتْ مَصِيْرًا ۙ﴿۹۷﴾ اِلَّا
الْمُسْتَضْعَفِيْنَ مِنَ الرِّجَالِ وَالنِّسَآءِ وَالْوِلْدَانِ
لَا يَسْتَطِيْعُوْنَ حِيْلَةً وَّ لَا يَهْتَدُوْنَ سَبِيْلًا ۙ﴿۹۸﴾
فَاُولٰٓئِكَ عَسَى اللّٰهُ اَنْ يَّعْفُوَ عَنْهُمْ ؕ وَكَانَ
اللّٰهُ عَفُوًّا غَفُوْرًا ﴿۹۹﴾ وَ مَنْ يُّهَاجِرْ فِىْ سَبِيْلِ
اللّٰهِ يَجِدْ فِى الْاَرْضِ مُرٰغَمًا كَثِيْرًا وَّسَعَةً ؕ
وَ مَنْ يَّخْرُجْ مِنْۢ بَيْتِهٖ مُهَاجِرًا اِلَى اللّٰهِ وَ
رَسُوْلِهٖ ثُمَّ يُدْرِكْهُ الْمَوْتُ فَقَدْ وَقَعَ اَجْرُهٗ
عَلَى اللّٰهِ ؕ وَ كَانَ اللّٰهُ غَفُوْرًا رَّحِيْمًا ۧ﴿۱۰۰﴾

70. అంటే, ఇస్లామును స్వీకరించిన తరువాత కూడా తగిన కారణం ఏదీ లేకుండానే, తప్పనిసరిగా ఉండిపోవలసిన అగత్యం ఏదీ లేకుండానే, అవిశ్వాసులైన ప్రజల మధ్య నివసిస్తున్నవారు. ఇంకా అర్థముస్లిము, అర్థ అవిశ్వాస జీవితం గడపటంతో సమాధానపడుతున్నవారు. వాస్తవానికి దారుల్ ఇస్లామ్ సిద్ధించింది, కాబట్టి అక్కడకు వలసపోయి తమ ధర్మం ప్రకారం, తమ విశ్వాసం ప్రకారం పూర్తి ఇస్లామీ జీవితం గడిపే సౌకర్యం కూడా ఉంది. ఇంకా తమ విశ్వాసాన్ని కాపాడుకోవటానికి వలస రావలసినదని దారుల్ ఇస్లామ్ తరఫు నుండి వారిని ఆహ్వానించటం కూడా జరిగింది.

وَ اِذَا ضَرَبۡتُمۡ فِی الۡاَرۡضِ فَلَیۡسَ عَلَیۡکُمۡ
جُنَاحٌ اَنۡ تَقۡصُرُوۡا مِنَ الصَّلٰوۃِ ٭ۖ اِنۡ خِفۡتُمۡ
اَنۡ یَّفۡتِنَکُمُ الَّذِیۡنَ کَفَرُوۡا ؕ اِنَّ الۡکٰفِرِیۡنَ
کَانُوۡا لَکُمۡ عَدُوًّا مُّبِیۡنًا ﴿۱۰۱﴾ وَ اِذَا کُنۡتَ فِیۡہِمۡ
فَاَقَمۡتَ لَہُمُ الصَّلٰوۃَ فَلۡتَقُمۡ طَآئِفَۃٌ مِّنۡہُمۡ
مَّعَکَ وَلۡیَاۡخُذُوۡۤا اَسۡلِحَتَہُمۡ ۟ فَاِذَا سَجَدُوۡا
فَلۡیَکُوۡنُوۡا مِنۡ وَّرَآئِکُمۡ ۪ وَلۡتَاۡتِ طَآئِفَۃٌ
اُخۡرٰی لَمۡ یُصَلُّوۡا فَلۡیُصَلُّوۡا مَعَکَ وَ لۡیَاۡخُذُوۡا
حِذۡرَہُمۡ وَاَسۡلِحَتَہُمۡ ۚ وَدَّ الَّذِیۡنَ کَفَرُوۡا لَوۡ
تَغۡفُلُوۡنَ عَنۡ اَسۡلِحَتِکُمۡ وَ اَمۡتِعَتِکُمۡ فَیَمِیۡلُوۡنَ
عَلَیۡکُمۡ مَّیۡلَۃً وَّاحِدَۃً ؕ وَ لَا جُنَاحَ عَلَیۡکُمۡ اِنۡ
کَانَ بِکُمۡ اَذًی مِّنۡ مَّطَرٍ اَوۡ کُنۡتُمۡ مَّرۡضٰۤی اَنۡ
تَضَعُوۡۤا اَسۡلِحَتَکُمۡ ۚ وَخُذُوۡا حِذۡرَکُمۡ ؕ اِنَّ
اللّٰہَ اَعَدَّ لِلۡکٰفِرِیۡنَ عَذَابًا مُّہِیۡنًا ﴿۱۰۲﴾ فَاِذَا قَضَیۡتُمُ
الصَّلٰوۃَ فَاذۡکُرُوا اللّٰہَ قِیٰمًا وَّقُعُوۡدًا وَّ عَلٰی
جُنُوۡبِکُمۡ ۚ فَاِذَا اطۡمَاۡنَنۡتُمۡ فَاَقِیۡمُوا الصَّلٰوۃَ ۚ اِنَّ
الصَّلٰوۃَ کَانَتۡ عَلَی الۡمُؤۡمِنِیۡنَ کِتٰبًا مَّوۡقُوۡتًا ﴿۱۰۳﴾

**101** మీరు ప్రయాణానికి బయలుదేరినప్పుడు నమాజును సంక్షిప్తం చేస్తే అది తప్పుకాదు,[72] (ముఖ్యంగా) అవిశ్వాసులు మిమ్మల్ని వేధిస్తారనే భయం మీకు కలిగినప్పుడు. ఎందుకంటే వారు మీతో బహిరంగవైరానికి పూనుకున్నారు.

**102 - 103** ప్రవక్తా! నీవు ముస్లిముల మధ్య ఉండి (పోరాటం జరుగుతూ ఉండగా) నమాజ్ చేయించటానికి వారితో నిలబడితే, వారిలోని ఒక వర్గం నీతోపాటు నిలబడాలి. వారు అస్త్రధారులై ఉండాలి. వారు తమ సజ్దాను పూర్తి చేసుకుంటే వెనక్కి వెళ్ళిపోవాలి. అప్పుడు ఇంకా నమాజ్ చెయ్యని రెండోవర్గం వచ్చి నీతోపాటు నమాజ్ చెయ్యాలి. వారు కూడా జాగరూకులై ఉండాలి. తమ ఆయుధాలను ధరించి ఉండాలి.[73] ఎందుకంటే మీరు మీ ఆయుధాల పట్ల, మీ సామానుల పట్ల ఏ కొద్దిపాటి అజాగ్రత్త చూపినా మీపై ఒక్కసారిగా విరుచుకు పడాలని అవిశ్వాసులు కాచుకుని ఉన్నారు. అయితే వర్షంవల్ల మీకు ఇబ్బందిగా ఉంటే లేక మీరు అస్వస్థులైతే ఆయుధాలను దించటం తప్పుకాదు. అయినప్పటికీ మీ జాగ్రత్తలో మీరు ఉండాలి. అవిశ్వాసుల కొరకు అల్లాహ్ నిశ్చయంగా అవమాన కరమైన శిక్షను సిద్ధంచేసి ఉంచాడు. నమాజ్‌ను పూర్తిచేసిన తరువాత, నిలుచున్నా, కూర్చున్నా, పరుండినా ఏ స్థితిలోవున్నా, అల్లాహ్‌ను మటుకు స్మరిస్తూ ఉండండి. శాంతి భద్రతలు నెలకొన్నప్పుడు పూర్తి నమాజ్ చెయ్యండి. వాస్తవానికి నమాజ్ విశ్వాసులు నిర్ణీత సమయాలలో విధిగా పాటించవలసిన ధర్మం.

---

71. ఇక్కడ అర్థం చేసుకోవలసిన విషయం ఏమిటంటే, అల్లాహ్ ధర్మాన్ని విశ్వసించని వ్యక్తి అవిశ్వాస వ్యవస్థలో జీవితం గడపటం కేవలం రెండు సందర్భాలలోనే ధర్మసమ్మతం కాగలుగుతుంది. ఒకటి, అతడు ఆ భూభాగంలో ఇస్లామ్ ప్రాబల్యం కొరకు కుఫ్ర్ వ్యవస్థను ఇస్లామ్ వ్యవస్థగా మార్చటానికి కృషిచేస్తూ ఉన్నప్పుడు; దైవప్రవక్తలూ వారి తొలి అనుచరులూ చేసినట్లు. రెండు, వాస్తవానికి అక్కడ నుండి బయటికి వెళ్ళేమార్గం ఏదీ అతనికి లభించనప్పుడు; తీవ్ర అనిష్టతతో, అసహనంతో గత్యంతరం లేక అక్కడ నివసిస్తూ ఉన్నప్పుడు.

72. శాంతి నెలకొని ఉన్న కాలంలో, ప్రయాణంలో గనక ఉంటే, 'ఖసర్' నమాజును (సంక్షిప్తం) చేసే పద్ధతి ఇది: నాలుగు రకాతులను విధి (ఫర్జ్)గా చెయ్యవలసిన నమాజులలో రెండు రకాతులను మాత్రమే చెయ్యాలి. యుద్ధస్థితిలో 'ఖసర్' కొరకు ఏ హద్దూ నిర్ణయింపబడిలేదు. యుద్ధకాలంలో ఎలా వీలుపడితే అలా నమాజు చేసుకోవచ్చు.

73. 'సలాతె ఖౌఫ్'కు సంబంధించిన ఈ ఆజ్ఞ శత్రువుల దాడి ప్రమాదం ఉండి, ఇంకా క్రియారూపంలో యుద్ధం ప్రజ్వరిల్లని సందర్భానికి వర్తిస్తుంది.

وَ لَا تَهِنُوْا فِي ابْتِغَآءِ الْقَوْمِ ؕ اِنْ تَكُوْنُوْا
تَاْلَمُوْنَ فَاِنَّهُمْ يَاْلَمُوْنَ كَمَا تَاْلَمُوْنَ ۚ وَ
تَرْجُوْنَ مِنَ اللّٰهِ مَا لَا يَرْجُوْنَ ؕ وَكَانَ اللّٰهُ
عَلِيْمًا حَكِيْمًا ﴿۱۰۴﴾ اِنَّاۤ اَنْزَلْنَاۤ اِلَيْكَ الْكِتٰبَ ع ۱۵ ۴ ۱۲
بِالْحَقِّ لِتَحْكُمَ بَيْنَ النَّاسِ بِمَاۤ اَرٰىكَ اللّٰهُ ؕ
وَ لَا تَكُنْ لِّلْخَآئِنِيْنَ خَصِيْمًا ﴿۱۰۵﴾ وَّاسْتَغْفِرِ
اللّٰهَ ؕ اِنَّ اللّٰهَ كَانَ غَفُوْرًا رَّحِيْمًا ﴿۱۰۶﴾ وَ لَا
تُجَادِلْ عَنِ الَّذِيْنَ يَخْتَانُوْنَ اَنْفُسَهُمْ ؕ
اِنَّ اللّٰهَ لَا يُحِبُّ مَنْ كَانَ خَوَّانًا اَثِيْمًا ﴿۱۰۷﴾
يَّسْتَخْفُوْنَ مِنَ النَّاسِ وَ لَا يَسْتَخْفُوْنَ مِنَ
اللّٰهِ وَ هُوَ مَعَهُمْ اِذْ يُبَيِّتُوْنَ مَا لَا يَرْضٰى
مِنَ الْقَوْلِ ؕ وَ كَانَ اللّٰهُ بِمَا يَعْمَلُوْنَ
مُحِيْطًا ﴿۱۰۸﴾ هٰۤاَنْتُمْ هٰۤؤُلَآءِ جٰدَلْتُمْ عَنْهُمْ فِي
الْحَيٰوةِ الدُّنْيَا ۫ فَمَنْ يُّجَادِلُ اللّٰهَ عَنْهُمْ يَوْمَ
الْقِيٰمَةِ اَمْ مَّنْ يَّكُوْنُ عَلَيْهِمْ وَكِيْلًا ﴿۱۰۹﴾ وَ مَنْ
يَّعْمَلْ سُوْٓءًا اَوْ يَظْلِمْ نَفْسَهٗ ثُمَّ يَسْتَغْفِرِ اللّٰهَ
يَجِدِ اللّٰهَ غَفُوْرًا رَّحِيْمًا ﴿۱۱۰﴾ وَ مَنْ يَّكْسِبْ
اِثْمًا فَاِنَّمَا يَكْسِبُهٗ عَلٰى نَفْسِهٖ ؕ وَ كَانَ اللّٰهُ
عَلِيْمًا حَكِيْمًا ﴿۱۱۱﴾ وَ مَنْ يَّكْسِبْ خَطِيْٓئَةً اَوْ
اِثْمًا ثُمَّ يَرْمِ بِهٖ بَرِيْٓـئًا فَقَدِ احْتَمَلَ بُهْتَانًا وَّ ع ۱۶ ۸ ۱۳
اِثْمًا مُّبِيْنًا ﴿۱۱۲﴾

**104** ఈ వర్గాన్ని వెన్నాడటంలో బలహీనతను ప్రదర్శించకండి. ఒకవేళ మీరు బాధపడుతూ ఉంటే మీ మాదిరిగానే వారు కూడా బాధపడుతున్నారు. పైగా అల్లాహ్ నుండి వారు ఆశించని దానిని మీరు ఆశిస్తున్నారు. అల్లాహ్‌కు అంతా తెలుసు. ఆయన అత్యంత వివేకసంపన్నుడు.

**105 - 112** ప్రవక్తా! అల్లాహ్ నీకు చూపిన రుజుమార్గానికి అనుగుణంగా నీవు ప్రజల మధ్య తీర్పు చెయ్యటానికి మేము ఈ గ్రంథాన్ని సత్యంతో నీ వద్దకు పంపాము. నీవు నీతిలేనివారి తరఫున వాదిగా నిలబడకు. క్షమాభిక్ష కొరకు అల్లాహ్‌ను ప్రార్థించు. ఆయన ఎక్కువగా క్షమించేవాడూ అధికంగా కరుణించేవాడూను. ఆత్మద్రోహం చేసుకునేవారిని[74] నీవు బలపరచకు. నమ్మక ద్రోహి, నిత్యపాపి అయిన మనిషిని అల్లాహ్ ప్రేమించడు. వారు తమ దుష్కర్మలను మానవులకు తెలియకుండా దాచగలరు. కాని అల్లాహ్‌కు తెలియకుండా దాచలేరు. రాత్రులందు వారు ఆయన అభీష్టానికి వ్యతిరేకంగా రహస్య సమాలోచనలు జరిపే సమయంలో కూడా ఆయన వారితో ఉంటాడు. వారి సకల చర్యలను అల్లాహ్ పరివేష్టించి ఉన్నాడు. మీరు ఈ అపరాధుల తరఫున ఇహలోక జీవితంలో నయితే వాదించారు. కాని ప్రళయం రోజున వారి తరఫున అల్లాహ్‌తో ఎవరు వాదిస్తారు? వారిని అక్కడ సమర్థించేవాడెవడు? చెడ్డపని చేసినవాడు లేదా తన ఆత్మకు అన్యాయం చేసుకున్నవాడు తరువాత క్షమాభిక్ష పెట్టు అని అల్లాహ్‌ను అర్థిస్తే, అతడు అల్లాహ్‌ను క్షమించేవాడుగా కరుణామయుడుగా తెలుసుకుంటాడు. కాని ఎవడైనా చెడును సంపాదించుకుంటే, (తరువాత పశ్చాత్తాప పడకపోతే) అతని ఈ సంపాదన అతనికే విపత్తుగా పరిణమిస్తుంది. అల్లాహ్‌కు అన్ని విషయాలూ తెలుసు. ఆయన వివేక సంపన్నుడు. ఎవడైనా ఏదైనా నేరంగాని లేక పాపంగాని చేసి, ఆ నిందను ఏ నిర్దోషి పైనైనా మోపితే అతడు తీవ్రమైన అపనిందను, ఘోరపాతకాన్ని మూటగట్టుకుంటాడు.

74. ఇతరులకు ద్రోహం చేసే వ్యక్తి నిజానికి అందరికంటే ముందు స్వయంగా తన ఆత్మకే ద్రోహం చేసుకుంటున్నాడు.

وَ لَوۡ لَا فَضۡلُ اللّٰهِ عَلَيۡكَ وَ رَحۡمَتُهٗ لَهَمَّتۡ طَّآئِفَةٌ مِّنۡهُمۡ اَنۡ يُّضِلُّوۡكَ ؕ وَمَا يُضِلُّوۡنَ اِلَّاۤ اَنۡفُسَهُمۡ وَ مَا يَضُرُّوۡنَكَ مِنۡ شَىۡءٍ ؕ وَاَنۡزَلَ اللّٰهُ عَلَيۡكَ الۡكِتٰبَ وَالۡحِكۡمَةَ وَعَلَّمَكَ مَا لَمۡ تَكُنۡ تَعۡلَمُ ؕ وَكَانَ فَضۡلُ اللّٰهِ عَلَيۡكَ عَظِيۡمًا ﴿۱۱۳﴾ لَا خَيۡرَ فِىۡ كَثِيۡرٍ مِّنۡ نَّجۡوٰٮهُمۡ اِلَّا مَنۡ اَمَرَ بِصَدَقَةٍ اَوۡ مَعۡرُوۡفٍ اَوۡ اِصۡلَاحٍۢ بَيۡنَ النَّاسِ ؕ وَمَنۡ يَّفۡعَلۡ ذٰلِكَ ابۡتِغَآءَ مَرۡضَاتِ اللّٰهِ فَسَوۡفَ نُـؤۡتِيۡهِ اَجۡرًا عَظِيۡمًا ﴿۱۱۴﴾ وَمَنۡ يُّشَاقِقِ الرَّسُوۡلَ مِنۡۢ بَعۡدِ مَا تَبَيَّنَ لَهُ الۡهُدٰى وَ يَتَّبِعۡ غَيۡرَ سَبِيۡلِ الۡمُؤۡمِنِيۡنَ نُوَلِّهٖ مَا تَوَلّٰى وَنُصۡلِهٖ جَهَنَّمَ ؕ وَ سَآءَتۡ مَصِيۡرًا ﴿۱۱۵﴾

الثلثة

ع ۱۷

**113** ప్రవక్తా! అల్లాహ్ అనుగ్రహం గనక నీపై ఉండివుండక పోతే, ఆయన కారుణ్యం నీకు తోడుగా ఉండివుండకపోతే, వారిలోని ఒక వర్గం నిన్ను అపార్థానికి గురిచెయ్యాలనే నిర్ణయం తీసుకుంది. వాస్తవానికి వారు తమను తాము తప్ప మరెవ్వరినీ అపార్థానికి గురిచేసుకోలేదు. నీకు ఏమాత్రం నష్టం కలిగించి వుండేవారు కాదు.[75] అల్లాహ్ నీపై గ్రంథాన్ని, వివేకాన్ని అవతరింపజేశాడు. పూర్వం నీకు తెలియనిదంతా నీకు నేర్పాడు. నిజంగానే ఆయనకు నీమీద ఎక్కువ అనుగ్రహం ఉంది.

**114 - 115** ప్రజలు జరిపే రహస్య సమాలోచనలలో సాధారణంగా ఏ మేలూ ఉండదు. కాని ఎవరైనా రహస్యంగా దానధర్మాలు చెయ్యండి అని బోధిస్తే లేక ఏదైనా సత్కార్యం కొరకు లేదా ప్రజల వ్యవహారాలను చక్కబరిచే ఉద్దేశ్యంతో ఎవరితోనైనా ఏదైనా రహస్యం చెబితే అది మంచి విషయమే. ఎవరైనా అల్లాహ్ సంతోషం కొరకు ఈ విధంగా చేస్తే వారికి మేము గొప్ప ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాము. కాని తనకు రుజుమార్గం విశదమైనప్పటికీ ఎవడైనా ప్రవక్తకు వ్యతిరేకంగా నడుంబిగిస్తే, విశ్వాసుల వైఖరి కాక మరొక వైఖరి అవలంబిస్తే, అతన్ని మేము అతడు మళ్ళిన దిక్కుకే నడిపిస్తాము. ఇంకా అతన్ని నరకంలో పడవేస్తాము. అది అతి నీచమైన నివాస స్థలం.

75. అంటే, ఒకవేళ వారు తప్పుడు వాజ్మూలాలూ, తప్పుడు సాక్ష్యాలూ తెచ్చి నిన్ను అపార్థానికి గురిచెయ్యటంలో సఫలురైనా, తమకు అనుకూలంగా న్యాయ విరుద్ధంగా తీర్పును పొందినా, నష్టం మటుకు వారిదే. నీకు ఏమాత్రం నష్టం కలగదు. ఎందుకంటే, దైవసన్నిధిలో నేరస్తులు వారు అవుతారు. నీవు కాదు. న్యాయాధిపతిని మోసంచేసి తనకు అనుకూలంగా తప్పుడు తీర్పు పొందిన వ్యక్తి ఈ మాయోపాయాల వల్ల హక్కు తనకే దక్కుతుందనే అపోహకు తననుతానే గురిచేసుకుంటున్నాడు. వాస్తవానికి అల్లాహ్ దృష్టిలో హక్కు ఎవరిదో వారిదే అవుతుంది. ఇంకా న్యాయాధిపతి అపోహ ఆధారంగా చేసిన తీర్పువల్ల యథార్థంపై ఏ ప్రభావమూ పడదు.

اِنَّ اللّٰهَ لَا يَغْفِرُ اَنْ يُّشْرَكَ بِهٖ وَ يَغْفِرُ مَا
دُوْنَ ذٰلِكَ لِمَنْ يَّشَآءُ ؕ وَمَنْ يُّشْرِكْ بِاللّٰهِ
فَقَدْ ضَلَّ ضَلٰلًا بَعِيْدًا ﴿١١٦﴾ اِنْ يَّدْعُوْنَ مِنْ
دُوْنِهٖۤ اِلَّاۤ اِنٰثًا ۚ وَ اِنْ يَّدْعُوْنَ اِلَّا شَيْطٰنًا
مَّرِيْدًا ﴿١١٧﴾ لَّعَنَهُ اللّٰهُ ۘ وَ قَالَ لَاَتَّخِذَنَّ مِنْ وقف لازم
عِبَادِكَ نَصِيْبًا مَّفْرُوْضًا ﴿١١٨﴾ وَّلَاُضِلَّنَّهُمْ وَ
لَاُمَنِّيَنَّهُمْ وَ لَاٰمُرَنَّهُمْ فَلَيُبَتِّكُنَّ اٰذَانَ الْاَنْعَامِ
وَ لَاٰمُرَنَّهُمْ فَلَيُغَيِّرُنَّ خَلْقَ اللّٰهِ ؕ وَ مَنْ يَّتَّخِذِ
الشَّيْطٰنَ وَ لِيًّا مِّنْ دُوْنِ اللّٰهِ فَقَدْ خَسِرَ
خُسْرَانًا مُّبِيْنًا ﴿١١٩﴾ يَعِدُهُمْ وَ يُمَنِّيْهِمْ ؕ وَ مَا
يَعِدُهُمُ الشَّيْطٰنُ اِلَّا غُرُوْرًا ﴿١٢٠﴾ اُولٰٓئِكَ
مَاْوٰىهُمْ جَهَنَّمُ ۫ وَ لَا يَجِدُوْنَ عَنْهَا مَحِيْصًا ﴿١٢١﴾
وَالَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا الصّٰلِحٰتِ سَنُدْخِلُهُمْ
جَنّٰتٍ تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ خٰلِدِيْنَ فِيْهَاۤ
اَبَدًا ؕ وَعْدَ اللّٰهِ حَقًّا ؕ وَمَنْ اَصْدَقُ مِنَ
اللّٰهِ قِيْلًا ﴿١٢٢﴾

**116 - 122** అల్లాహ్ దృష్టిలో కేవలం షిర్కు ఒక్కటే క్షమార్హం కానిది. అది తప్ప తాను కోరిన వారి అన్ని పాపాలను ఆయన క్షమిస్తాడు. ఇతరులను అల్లాహ్‌కు భాగస్వాములుగా చేసిన వాడు అపమార్గాన బహుదూరం వెళ్ళిపోయాడు. వారు అల్లాహ్‌ను వదలి స్త్రీ దేవతలను ఆరాధ్యులుగా చేసుకుంటారు. అల్లాహ్ శాపానికి గురిఅయిన ఆ తిరుగుబాటుదారు షైతాన్‌ను తమ ఆరాధ్యుడుగా చేసుకుంటారు.[76] (వారు విధేయత చూపే ఆ షైతాను) అల్లాహ్‌తో ఇలా అన్నాడు: “నేను నీ దాసుల నుండి ఒక నిర్ణీతమైన భాగ్యాన్ని నిశ్చయంగా తీసుకుంటాను.[77] నేను వారిని మార్గం తప్పిస్తాను. నేను వారిలో లేనిపోని ఆశలు కల్పిస్తాను. నేను వారిని ఆజ్ఞాపిస్తాను. వారు నా ఆజ్ఞానుసారం జంతువుల చెవులు చీలుస్తారు.[78] నేను వారిని ఆదేశిస్తాను. వారు నా ఆదేశం ప్రకారం అల్లాహ్ సృష్టిలో మార్పులు చేస్తారు.”[79] అల్లాహ్‌కు బదులుగా ఈ షైతానును తన సంరక్షకుడుగా, స్నేహితుడుగా చేసుకునేవాడు స్పష్టంగా నష్టానికి గురి అవుతాడు. అతడు వారితో వాగ్దానాలు చేస్తాడు. వారికి ఆశలు చూపుతాడు. కాని షైతాను వాగ్దానాలు కేవలం మోసాలు తప్ప మరేమీ కావు. ఇటువంటి ప్రజల నివాసం నరకం. దానినుండి తప్పించుకోవటానికి వారికి ఏ మార్గమూ లభించదు. ఇక విశ్వసించి మంచిపనులు చేసేవారిని మేము క్రింద కాలువలు ప్రవహించే ఉద్యానవనాలలో ప్రవేశపెడతాము. వారు అక్కడ శాశ్వతంగా ఉంటారు. అల్లాహ్ చేసిన ఈ వాగ్దానం నిజమైనది. అల్లాహ్ కంటే ఎక్కువ సత్యవంతుడెవడు?

76. పూజా పురస్కారాలు చెయ్యటం, దైవత్వపు స్థానం ఇవ్వటం అనే అర్థంలో ఎవడూ షైతానును ఆరాధ్యదైవంగా చేసుకోడు. అయితే అతణ్ణి ఆరాధ్యదైవంగా చేసుకునే విధానం ఏదంటే, మనిషి తన మనస్సు పగ్గాలను షైతానుకు స్వాధీనం చేస్తాడు. వాడు ఎటు నడిపితే అటు నడుస్తాడు - ఇతడు వాడి దాసుడు. వాడు ఇతడి దైవం అనేవిధంగా. దీనిద్వారా తెలిసిందేమిటంటే, ఎదురు చెప్పకుండా చూపే విధేయతా, గ్రుడ్డిగా అనుసరించటం కూడా “ఆరాధనే”. ఇంకా ఈ విధమైన విధేయత చూపేవాడు వాస్తవానికి అల్లాహ్‌ను వదలి తన విధేయతకు అర్హుడుగా చేసుకున్నవాడిని ఆరాధిస్తున్నాడు అన్నమాట.

77. అంటే, వారి సమయాలలో, వారి శ్రమలలో, వారి ప్రయత్నాలలో, వారి శక్తులలో, సామర్థ్యాలలో, వారి సంపదలో, సంతానంలో నేను కూడా భాగం పంచుకుంటాను. వారిని మోసం చేసి ఎలా సమ్మోహింపజేస్తానంటే, వారు ఈ అన్నింటిలో ఒక పెద్ద భాగాన్ని నా మార్గంలో వ్యయపరుస్తారు.

لَيْسَ بِاَمَانِيِّكُمْ وَلَآ اَمَانِيِّ اَهْلِ الْكِتٰبِ ؕ
مَنْ يَّعْمَلْ سُوْٓءًا يُّجْزَ بِهٖ ۙ وَلَا يَجِدْ لَهٗ مِنْ
دُوْنِ اللّٰهِ وَلِيًّا وَّلَا نَصِيْرًا ﴿۱۲۳﴾ وَمَنْ يَّعْمَلْ
مِنَ الصّٰلِحٰتِ مِنْ ذَكَرٍ اَوْ اُنْثٰى وَهُوَ مُؤْمِنٌ
فَاُولٰٓئِكَ يَدْخُلُوْنَ الْجَنَّةَ وَلَا يُظْلَمُوْنَ
نَقِيْرًا ﴿۱۲۴﴾ وَمَنْ اَحْسَنُ دِيْنًا مِّمَّنْ اَسْلَمَ
وَجْهَهٗ لِلّٰهِ وَهُوَ مُحْسِنٌ وَّاتَّبَعَ مِلَّةَ اِبْرٰهِيْمَ
حَنِيْفًا ؕ وَاتَّخَذَ اللّٰهُ اِبْرٰهِيْمَ خَلِيْلًا ﴿۱۲۵﴾ وَلِلّٰهِ
مَا فِي السَّمٰوٰتِ وَمَا فِي الْاَرْضِ ؕ وَكَانَ اللّٰهُ
بِكُلِّ شَيْءٍ مُّحِيْطًا ﴿۱۲۶﴾ وَيَسْتَفْتُوْنَكَ فِي النِّسَآءِ ؕ ع ۱۸ ۱۱ ۱۵
قُلِ اللّٰهُ يُفْتِيْكُمْ فِيْهِنَّ ۙ وَمَا يُتْلٰى عَلَيْكُمْ فِي
الْكِتٰبِ فِيْ يَتٰمَى النِّسَآءِ الّٰتِيْ لَا تُؤْتُوْنَهُنَّ مَا
كُتِبَ لَهُنَّ وَتَرْغَبُوْنَ اَنْ تَنْكِحُوْهُنَّ
وَالْمُسْتَضْعَفِيْنَ مِنَ الْوِلْدَانِ ۙ وَاَنْ تَقُوْمُوْا
لِلْيَتٰمٰى بِالْقِسْطِ ؕ وَمَا تَفْعَلُوْا مِنْ خَيْرٍ فَاِنَّ
اللّٰهَ كَانَ بِهٖ عَلِيْمًا ﴿۱۲۷﴾

**123 - 126** అంతిమ ఫలితం మీ కోరికలపైగాని లేక గ్రంథప్రజల కోరికలపై గాని ఆధారపడి లేదు. దుర్మార్గం చేసినవాడు దాని ఫలితం అనుభవిస్తాడు. అల్లాహ్‌కు వ్యతిరేకంగా తనను సమర్థించేవాణ్ణిగాని, తనకు సహాయం చేసేవాణ్ణిగాని అతడు పొందలేడు. మంచిపనులు చేసేవారు- పురుషులైనా స్త్రీలైనా- వారుగనక విశ్వాసులైతే స్వర్గంలో ప్రవేశి స్తారు. వారికి రవ్వంత అన్యాయం కూడా జరగదు. అల్లాహ్‌కు తనను తాను సమర్పించుకున్నవాడూ, సత్ప్రవర్తన కలవాడూ, అల్లాహ్ తన మిత్రునిగా ఎన్నుకున్న ఇబ్రాహీము విధానాన్ని ఏకాగ్ర మనస్సుతో అనుసరించేవాడూ అయిన వ్యక్తి జీవన విధానంకంటె మేలైనది మరెవరిది కాగలుగుతుంది? ఆకా శాలలో, భూమిలో ఉన్నదంతా అల్లాహ్‌దే. అల్లాహ్ ప్రతి వస్తువును పరివేష్టించి ఉన్నాడు.

**127** ప్రజలు నిన్ను స్త్రీల వ్యవహారంలో ధార్మిక తీర్పు (ఫత్వా) ఏమిటో అడుగుతున్నారు.[80] వారితో ఇలా చెప్పు- "వారి విషయంలో అల్లాహ్ మీకు ధార్మిక తీర్పు ఇస్తున్నాడు. దానితో పాటు పూర్వం నుండీ మీకు ఈ గ్రంథంలో వినిపించబడుతూ వచ్చిన ఉత్తరువులను కూడా జ్ఞాపకం చేస్తున్నాడు. అంటే మీరు హక్కులను నెరవేర్చని, మీరు వివాహం చేయని అనాథ బాలికలకు (దురాశతో స్వయంగా మీరే వారిని వివాహం చేసుకోదలిచారు.[81]) సంబంధించిన ఉత్తరువులు. ఇంకా బలహీనులు, నిస్సహాయులు అయిన పిల్లలకు సంబంధించిన ఉత్తరువులు. అనాథులతో న్యాయంగా వ్యవహరించండి అని అల్లాహ్ మీకు ఆజ్ఞాపిస్తున్నాడు. మీరు ఏ మంచిపని చేసినా అది అల్లాహ్‌కు తెలియకుండా ఉండదు.

78. అరేబియా ప్రజల మూఢ విశ్వాసాలలో ఒకదానిని ఇక్కడ సూచించటం జరిగింది. వారు ఈ నియమాన్ని పాటించేవారు : ఆడ ఒంటె ఐదు లేక పది ఈతలు ఈనినప్పుడు, దాని చెవులు చీల్చి తమ స్త్రీ దేవత పేరుతో దానిని వదలిపెట్టేవారు. ఇంకా దానిని పనికొరకు ఉపయోగించుకోవటం నిషిద్ధంగా భావించేవారు. ఇలాగే ఏ మగ ఒంటె రేతస్సువల్ల పదిపిల్ల ఒంటెలు కలుగుతాయో, దానిని కూడా దేవతల పేరుతో పుణ్యం కొరకు వదలటం జరిగేది. చెవులు చీల్చటం పుణ్యం కొరకు వదలిపెట్టిన జంతువుకు సంకేతం.

79. దైవసృష్టిలో మార్పులు చెయ్యటం అంటే వస్తువుల సహజ నిర్మాణాన్ని మార్చటం కాదు. అసలు షైతాను చేష్టగా ఇక్కడ నిర్ణయించటం జరిగిన ఆ మార్పు ఏమిటంటే, మానవుడు ఒక వస్తువును అల్లాహ్ ఉద్దేశించని పనికి వినియోగించటం. అలాగే అల్లాహ్ ఉద్దేశించిన పనికి ఆ వస్తువును ఉపయోగించకపోవటం. వేరే మాటలలో చెప్పాలంటే మానవుడు తన స్వభావానికి, వస్తువుల స్వభావానికి వ్యతిరేకంగా చేసే అన్ని పనులూ,

وَ اِنِ امۡرَاَةٌ خَافَتۡ مِنۡۢ بَعۡلِهَا نُشُوۡزًا اَوۡ
اِعۡرَاضًا فَلَا جُنَاحَ عَلَيۡهِمَاۤ اَنۡ يُّصۡلِحَا بَيۡنَهُمَا
صُلۡحًا ؕ وَالصُّلۡحُ خَيۡرٌ ؕ وَ اُحۡضِرَتِ الۡاَنۡفُسُ
الشُّحَّ ؕ وَ اِنۡ تُحۡسِنُوۡا وَ تَتَّقُوۡا فَاِنَّ اللّٰهَ
كَانَ بِمَا تَعۡمَلُوۡنَ خَبِيۡرًا ﴿۱۲۸﴾ وَلَنۡ تَسۡتَطِيۡعُوۡۤا
اَنۡ تَعۡدِلُوۡا بَيۡنَ النِّسَآءِ وَ لَوۡ حَرَصۡتُمۡ فَلَا
تَمِيۡلُوۡا كُلَّ الۡمَيۡلِ فَتَذَرُوۡهَا كَالۡمُعَلَّقَةِ ؕ وَ
اِنۡ تُصۡلِحُوۡا وَتَتَّقُوۡا فَاِنَّ اللّٰهَ كَانَ غَفُوۡرًا
رَّحِيۡمًا ﴿۱۲۹﴾ وَاِنۡ يَّتَفَرَّقَا يُغۡنِ اللّٰهُ كُلًّا مِّنۡ
سَعَتِهٖ ؕ وَكَانَ اللّٰهُ وَاسِعًا حَكِيۡمًا ﴿۱۳۰﴾ وَلِلّٰهِ مَا
فِى السَّمٰوٰتِ وَ مَا فِى الۡاَرۡضِ ؕ وَ لَقَدۡ
وَصَّيۡنَا الَّذِيۡنَ اُوۡتُوا الۡكِتٰبَ مِنۡ قَبۡلِكُمۡ وَ
اِيَّاكُمۡ اَنِ اتَّقُوا اللّٰهَ ؕ وَاِنۡ تَكۡفُرُوۡا فَاِنَّ لِلّٰهِ
مَا فِى السَّمٰوٰتِ وَ مَا فِى الۡاَرۡضِ ؕ وَكَانَ اللّٰهُ
غَنِيًّا حَمِيۡدًا ﴿۱۳۱﴾ وَلِلّٰهِ مَا فِى السَّمٰوٰتِ وَ مَا فِى
الۡاَرۡضِ ؕ وَكَفٰى بِاللّٰهِ وَكِيۡلًا ﴿۱۳۲﴾ اِنۡ
يَّشَاۡ يُذۡهِبۡكُمۡ اَيُّهَا النَّاسُ وَيَاۡتِ بِاٰخَرِيۡنَ ؕ
وَكَانَ اللّٰهُ عَلٰى ذٰلِكَ قَدِيۡرًا ﴿۱۳۳﴾ مَنۡ كَانَ يُرِيۡدُ
ثَوَابَ الدُّنۡيَا فَعِنۡدَ اللّٰهِ ثَوَابُ الدُّنۡيَا
وَالۡاٰخِرَةِ ؕ وَكَانَ اللّٰهُ سَمِيۡعًاۢ بَصِيۡرًا ﴿۱۳۴﴾ ع ۱۹/۸/۱۲

**128 - 134** ఒక స్త్రీ[82] తనను భర్త నిరాదరించి, వేధిస్తాడేమో అనీ లేదా విముఖుడై ఈసడించుకుంటాడేమో అనీ భయపడితే, భార్యాభర్తలిరువురూ పరస్పరం (ఇచ్చిపుచ్చుకునే ధోరణిలో) సర్దుబాటు చేసుకోవడంలో దోషంలేదు.[83] ఏమైనప్పటికీ సర్దుబాటే అన్ని విధాలా ఉత్తమమైనది. మనస్సులు సంకుచిత భావాల వైపునకు త్వరగా మొగ్గుతాయి. అయితే మీరు ఉదార బుద్ధితో వ్యవహరిస్తే, భయభక్తులతో మెలిగితే, అల్లాహ్‌కు మీ ఈ ప్రవర్తన తెలియకుండా ఉండదని నమ్మండి. భార్యల మధ్య పూర్తి న్యాయం చెయ్యటం మీ శక్తికి మించిన పని. మీరు ఎంత కోరినా దీనిని సాధించలేరు. కనుక ఒక భార్య వైపునకు ఎక్కువగా మొగ్గి మరొకామెను డోలాయమాన స్థితిలో పడవెయ్యకండి.[84] (అప్పుడు దైవశాసనం యొక్క ఉద్దేశ్యం పూర్తవుతుంది). మీరు మీ ప్రవర్తనను సరిజేసుకుని అల్లాహ్‌కు భయపడుతూ ఉంటే, అల్లాహ్ క్షమించేవాడు, కరుణించే వాడూను. కాని ఒకవేళ దంపతులు పరస్పరం విడిపోవటమే జరిగితే, అప్పుడు అల్లాహ్ తన అపారమైన శక్తి ద్వారా వారికి ఒకరి అవసరం మరొకరికి లేకుండా చేస్తాడు. అల్లాహ్ అనంతమైన వనరులు కలవాడు. ఆయన వివేకవంతుడు, అన్నీ తెలిసినవాడూను. ఆకాశాలలో, భూమిలో ఉన్నదంతా అల్లాహ్‌దే. అల్లాహ్‌కు భయపడుతూ ప్రవర్తించండి అని మీకు పూర్వం మేము గ్రంథం ఇచ్చిన వారికి ఉపదేశించాము, ఇప్పుడు మీకూ ఉపదేశిస్తున్నాము. ఒకవేళ మీరు నిరాకరిస్తే నిరాకరించండి. భూమ్యాకాశాలలో ఉన్న సమస్త వస్తువులకూ యజమాని అల్లాహ్‌యే. ఆయన అక్కరలేనివాడు, ప్రతి స్తోత్రానికి అర్హుడు. అవును, అల్లాహ్‌యే యజమాని, ఆకాశాలలో ఉన్న సమస్తానికీ, భూమిలో ఉన్న సర్వానికీ. కార్యసాఫల్యానికీ ఆయనేచాలు. ఆయన సంకల్పిస్తే మిమ్మల్ని తొలగించి, మీ స్థానంలోకి ఇతరులను తీసుకురాగలడు. ఆయన దీనిని చెయ్యగల సర్వశక్తిమంతుడు. కేవలం ఇహలోక ఫలాన్నే కోరేవ్యక్తి, అల్లాహ్ వద్ద ఇహలోక ఫలమూ ఉన్నదని, పరలోక ఫలమూ ఉన్నదని తెలుసుకోవాలి. అల్లాహ్ అన్నీ వింటాడు, అన్నీ చూస్తాడు.

يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا كُوْنُوْا قَوّٰمِيْنَ بِالْقِسْطِ شُهَدَآءَ لِلّٰهِ وَلَوْ عَلٰٓى اَنْفُسِكُمْ اَوِ الْوَالِدَيْنِ وَالْاَقْرَبِيْنَ ۚ اِنْ يَّكُنْ غَنِيًّا اَوْ فَقِيْرًا فَاللّٰهُ اَوْلٰى بِهِمَا ۖ فَلَا تَتَّبِعُوا الْهَوٰٓى اَنْ تَعْدِلُوْا ۚ وَاِنْ تَلْوٗٓا اَوْ تُعْرِضُوْا فَاِنَّ اللّٰهَ كَانَ بِمَا تَعْمَلُوْنَ خَبِيْرًا ﴿١٣٥﴾

**135** విశ్వసించిన ప్రజలారా! న్యాయధ్వజవాహకులుగా నిలబడండి. అల్లాహ్ కొరకు సాక్షులుగా ఉండండి. మీ న్యాయం, మీ సాక్ష్యం మీకూ, మీ తల్లిదండ్రులకూ, మీ బంధువులకూ ఎంత హాని కలిగించినా సరే. కక్షి దారులు భాగ్యవంతులయినా, నిరుపేదలయినా అల్లాహ్ వారి శ్రేయస్సును మీకంటే ఎక్కువగా కాంక్షిస్తాడు. కనుక మీ మనోవాంఛలను అనుసరిస్తూ న్యాయం నుండి వైదొలగకండి. మీరు గనక సాక్ష్యాన్ని వక్రీకరిస్తే, న్యాయాన్ని దాటవేస్తే, బాగా తెలుసుకోండి, మీరు చేసేదంతా అల్లాహ్‌కు తెలుసు అని.

---

ఇంకా అతడు సృష్టి ఉద్దేశ్యానికి దూరంగా ఉండటానికి అవలంబించే అన్ని విధానాలూ ఈ ఆయత్ ప్రకారం షైతాను యొక్క అపమార్గం పట్టించే ప్రేరణల ఫలితాలే. ఉదాహరణకు, లూత్ జాతి వారి నడత, కుటుంబ నియంత్రణ, సన్యాసత్వం, బ్రహ్మచర్యం, పురుషులనూ, స్త్రీలనూ గొడ్డుపోయిన వారుగా చేయటం, పురుషులను నపుంసకులుగా చేసి అంతఃపుర సేవకులుగా నియమించటం, స్త్రీలలో స్వభావసిద్ధమైన పరిచర్యలపట్ల వైముఖ్యం జనింపజేయటం, పురుషునికి మాత్రమే తగినటువంటి రంగాలలోకి స్త్రీని లాగటం.

80. వారు అడిగిన ధార్మిక తీర్పు గురించి ఇక్కడ వివరించటం జరగలేదు. కాని 128 నుండి 130 వరకు ఉన్న ఆయతులలో ఇవ్వబడిన ధార్మికతీర్పును బట్టి ప్రశ్న స్వభావం అర్థమవుతుంది.

81. "తర్‌గబూన అన్ తన్‌కిహు హున్న" యొక్క భావం ఇది కూడా అవుతుంది: "మీరు వారిని వివాహం చేసుకునే కాంక్ష కలిగివున్నవారు." ఇంకా ఇది కూడా కావచ్చు : "మీరు వారిని వివాహం చేసుకోవటానికి ఇష్టపడరు."

82. ఇక్కడి నుంచి ప్రజల ప్రశ్నకు సమాధానం ప్రారంభమవుతుంది. ప్రశ్న ఏమిటంటే, ఒకరికంటే ఎక్కువమంది భార్యలువున్న సందర్భంలో ఒక భార్య గనక దీర్ఘవ్యాధితో బాధపడుతున్నప్పుడు లేదా సంభోగానికి యోగ్యురాలు కానప్పుడు న్యాయం చెయ్యండి అని ఇవ్వబడిన ఆజ్ఞను ఏ విధంగా పాటించాలి? ఈ పరిస్థితిలో కూడా ఇద్దరిపట్లా సమానమైన సుముఖత కలిగివుండటం, సమానమైన ప్రేమను కలిగివుండటం, శారీరక సంబంధంలో కూడా సమానత్వాన్ని పాటించటం అతనికి తప్పనిసరి అవుతుందా? ఒకవేళ అతడు అలా చెయ్యకపోతే, అతడు మరొక వివాహం చేసుకోవటానికి మొదటి భార్యను వదలిపెట్టటం "న్యాయం" రీత్యా అవసరమా? ఇంకా, ఒకవేళ మొదటి భార్య స్వయంగా వేరుకావటానికి ఇష్టపడకపోతే, దంపతుల మధ్య ఈ విధమైన రాజీ సాధ్యమా? అనిష్టతకు గురిఅయిన భార్య తన హక్కులను కొన్నింటిని స్వయంగా వదులుకుని, భర్తను విడాకులివ్వకుండా ఆపగలదా? ఇలా చెయ్యటం "న్యాయం" షరతుకు వ్యతిరేకం కాదా? ఇటువంటి ప్రశ్నలకు ఇక్కడ సమాధానం ఇవ్వబడింది.

83. అంటే, విడాకులు వేర్పాటుకు మారుగా ఈ విధంగా పరస్పరం రాజీపడి, ఒక స్త్రీ వయసులోని ఒక పెద్ద భాగం గడిపిన తన భర్తతోనే ఉండటం ఉత్తమం.

84. ఈ ఆయత్ ఆధారంగా కొందరు ఇలా నిర్ణయించారు: ఖురాను ఒకవైపేమో న్యాయం అనే షరతు విధించి బహుభార్యాత్వాన్ని అనుమతిస్తుంది. కాని రెండో వైపు న్యాయం అసంభవమని నిర్ణయించి ఈ అనుమతిని ఆచరణ రూపంలో మాత్రం రద్దు చేస్తుంది. కాని వాస్తవానికి ఇటువంటి నిర్ణయం చేయటానికి ఈ ఆయత్‌లో అసలు ఆస్కారమే లేదు. ఒకవేళ కేవలం "మీరు స్త్రీల మధ్య న్యాయం చెయ్యలేరు" అని మాత్రమే అనబడి ఉన్నట్లయితే, ఈ నిర్ణయానికి అవకాశం ఉండేది. కాని దీని తరువాతనే ఇలా సెలవియ్యబడింది: "కనుక ఒక భార్య వైపునకు పూర్తిగా మొగ్గకండి". ఈ వాక్యం అటువంటి భావానికి అసలు అవకాశం ఇవ్వదు. ఐరోపా క్రైస్తవులను అనుకరించే మహానుభావులే ఇటువంటి అర్థాలు చెబుతారు.

يٰۤاَيُّهَا الَّذِيۡنَ اٰمَنُوۡۤا اٰمِنُوۡا بِاللّٰهِ وَرَسُوۡلِهٖ وَ
الۡكِتٰبِ الَّذِىۡ نَزَّلَ عَلٰى رَسُوۡلِهٖ وَ الۡكِتٰبِ
الَّذِىۡۤ اَنۡزَلَ مِنۡ قَبۡلُ ؕ وَمَنۡ يَّكۡفُرۡ بِاللّٰهِ وَ
مَلٰۤٮِٕكَتِهٖ وَكُتُبِهٖ وَرُسُلِهٖ وَ الۡيَوۡمِ الۡاٰخِرِ فَقَدۡ
ضَلَّ ضَلٰلًاۢ بَعِيۡدًا ﴿۱۳۶﴾ اِنَّ الَّذِيۡنَ اٰمَنُوۡا ثُمَّ
كَفَرُوۡا ثُمَّ اٰمَنُوۡا ثُمَّ كَفَرُوۡا ثُمَّ ازۡدَادُوۡا كُفۡرًا
لَّمۡ يَكُنِ اللّٰهُ لِيَـغۡفِرَ لَهُمۡ وَلَا لِيَـهۡدِيَهُمۡ
سَبِيۡلًا ؕ﴿۱۳۷﴾ بَشِّرِ الۡمُنٰفِقِيۡنَ بِاَنَّ لَهُمۡ عَذَابًا
اَلِيۡمَا ۙ﴿۱۳۸﴾ الَّذِيۡنَ يَتَّخِذُوۡنَ الۡكٰفِرِيۡنَ اَوۡلِيَآءَ
مِنۡ دُوۡنِ الۡمُؤۡمِنِيۡنَ ؕ اَيَبۡتَغُوۡنَ عِنۡدَهُمُ
الۡعِزَّةَ فَاِنَّ الۡعِزَّةَ لِلّٰهِ جَمِيۡعًا ؕ﴿۱۳۹﴾ وَقَدۡ نَزَّلَ
عَلَيۡكُمۡ فِى الۡكِتٰبِ اَنۡ اِذَا سَمِعۡتُمۡ اٰيٰتِ اللّٰهِ
يُكۡفَرُ بِهَا وَيُسۡتَهۡزَاُ بِهَا فَلَا تَقۡعُدُوۡا مَعَهُمۡ
حَتّٰى يَخُوۡضُوۡا فِىۡ حَدِيۡثٍ غَيۡرِهٖ ۖ اِنَّكُمۡ اِذًا
مِّثۡلُهُمۡ ؕ اِنَّ اللّٰهَ جَامِعُ الۡمُنٰفِقِيۡنَ وَالۡكٰفِرِيۡنَ
فِىۡ جَهَنَّمَ جَمِيۡعَا ۙ﴿۱۴۰﴾ الَّذِيۡنَ يَتَرَبَّصُوۡنَ بِكُمۡ ۚ
فَاِنۡ كَانَ لَـكُمۡ فَتۡحٌ مِّنَ اللّٰهِ قَالُوۡۤا اَلَمۡ نَكُنۡ
مَّعَكُمۡ ۖ وَاِنۡ كَانَ لِلۡكٰفِرِيۡنَ نَصِيۡبٌ ۙ قَالُوۡۤا
اَلَمۡ نَسۡتَحۡوِذۡ عَلَيۡكُمۡ وَنَمۡنَعۡكُمۡ مِّنَ
الۡمُؤۡمِنِيۡنَ ؕ فَاللّٰهُ يَحۡكُمُ بَيۡنَكُمۡ يَوۡمَ الۡقِيٰمَةِ ؕ
وَلَنۡ يَّجۡعَلَ اللّٰهُ لِلۡكٰفِرِيۡنَ عَلَى الۡمُؤۡمِنِيۡنَ
سَبِيۡلًا ﴿۱۴۱﴾ ع ۲۰/۱۷

**136 - 141** విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ, ఆయన తన ప్రవక్తపై అవతరింపజేసిన గ్రంథాన్నీ, ఇంకా ఆయన దీనికి పూర్వం అవతరింపజేసిన ప్రతి గ్రంథాన్నీ విశ్వసించండి.[85] అల్లాహ్‌ను, ఆయన దూతలను, ఆయన గ్రంథాలను, ఆయన ప్రవక్తలను, అంతిమదినాన్ని తిరస్క రించినవాడు[86] నిశ్చయంగా మార్గం తప్పి అపమార్గంలో పడి చాలాదూరం పోయాడు. ఇక విశ్వసించి, తరువాత తిరస్కరించి, మళ్ళీ విశ్వసించి, మళ్ళీ తిరస్కరించి ఆ తిరస్కా రంలోనే పురోగమించేవారిని అల్లాహ్ సుతరామూ క్షమించడు, వారికి ఎన్నటికీ రుజుమార్గం చూపడు. విశ్వాసులను త్రోసిరాజని, అవిశ్వాసులను తమ మిత్రులుగా చేసుకునే కపటులకు వ్యధా భరితమైన శిక్ష సిద్ధంగా ఉందనే శుభవార్తను వినిపించండి. వీరు గౌరవం పొందే ఆశతోనా వారివద్దకు పోయేది? వాస్తవానికి గౌరవం అంతా పూర్తిగా అల్లాహ్‌కు మాత్రమే చెందుతుంది. అల్లాహ్ ఈ గ్రంథంలో మీకు ఇదివరకే ఈ ఉత్తరువు ఇచ్చి వున్నాడు: అల్లాహ్ ఆయతులకు వ్యతి రేకంగా తిరస్కార వచనాలు వాగటాన్ని, వాటిని పరిహసించ టాన్ని మీరు విన్నట్లయితే ప్రజలు వేరే విషయాన్ని ప్రారంభించ నంతవరకు మీరు అక్కడ కూర్చోరాదు. ఇప్పుడు మీరుగనక అలా చేస్తే మీరూ వారిలాంటి వారే. అల్లాహ్ కపటులనూ, అవిశ్వాసులనూ నరకంలో ఒకచోట పోగుచెయ్యబోతున్నాడనే విషయం నిశ్చయమని తెలుసుకోండి. ఈ కపటులు మీ విషయంలో నిరీక్షిస్తున్నారు (గాలి ఎటు వీస్తుందో అని). అల్లాహ్ తరపు నుండి విజయం గనక మిమ్మల్ని వరిస్తే మీవద్దకు వచ్చి వారు “మేము మీతో ఉండలేదా?” అని అంటారు. ఒకవేళ అవిశ్వాసులదే పైచెయ్యి అయితే, వారితో “మీకు వ్యతిరేకంగా పోరాడేశక్తి మాకు లేదా? అయినప్పటికీ మేము మిమ్మల్ని ముస్లిముల బారి నుండి కాపాడాము” అని అంటారు. మీ ఉభయుల వ్యవహారాన్ని అల్లాహ్ ప్రళయంనాడు పరిష్కరిస్తాడు. (ఆ పరిష్కారంలో) ముస్లిములపై విజయం పొందే ఏ మార్గాన్నీ అవిశ్వాసులకు అల్లాహ్ వదలడు.

إِنَّ الْمُنٰفِقِيْنَ يُخٰدِعُوْنَ اللّٰهَ وَ هُوَ خَادِعُهُمْ ۚ
وَاِذَا قَامُوْٓا اِلَى الصَّلٰوةِ قَامُوْا كُسَالٰى ۙ
يُرَآءُوْنَ النَّاسَ وَلَا يَذْكُرُوْنَ اللّٰهَ اِلَّا
قَلِيْلًا ﴿۱۴۲﴾ مُّذَبْذَبِيْنَ بَيْنَ ذٰلِكَ ۖ لَآ اِلٰى
هٰٓؤُلَآءِ وَلَآ اِلٰى هٰٓؤُلَآءِ ۗ وَمَنْ يُّضْلِلِ اللّٰهُ
فَلَنْ تَجِدَ لَهٗ سَبِيْلًا ﴿۱۴۳﴾ يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا
لَا تَتَّخِذُوا الْكٰفِرِيْنَ اَوْلِيَآءَ مِنْ دُوْنِ
الْمُؤْمِنِيْنَ ۗ اَتُرِيْدُوْنَ اَنْ تَجْعَلُوْا لِلّٰهِ
عَلَيْكُمْ سُلْطٰنًا مُّبِيْنًا ﴿۱۴۴﴾ اِنَّ الْمُنٰفِقِيْنَ فِى
الدَّرْكِ الْاَسْفَلِ مِنَ النَّارِ ۚ وَلَنْ تَجِدَ لَهُمْ
نَصِيْرًا ﴿۱۴۵﴾ اِلَّا الَّذِيْنَ تَابُوْا وَاَصْلَحُوْا وَ
اعْتَصَمُوْا بِاللّٰهِ وَاَخْلَصُوْا دِيْنَهُمْ لِلّٰهِ فَاُولٰٓئِكَ
مَعَ الْمُؤْمِنِيْنَ ۗ وَسَوْفَ يُؤْتِ اللّٰهُ
الْمُؤْمِنِيْنَ اَجْرًا عَظِيْمًا ﴿۱۴۶﴾ مَا يَفْعَلُ اللّٰهُ
بِعَذَابِكُمْ اِنْ شَكَرْتُمْ وَاٰمَنْتُمْ ۗ وَكَانَ اللّٰهُ
شَاكِرًا عَلِيْمًا ﴿۱۴۷﴾

**142 - 143** ఈ కపటులు అల్లాహ్‌ను మోసం చేస్తున్నారు. వాస్తవానికి అల్లాహ్‌యే వారిని మోసంలో పడవేశాడు. వారు నమాజ్ కొరకు లేస్తే, బద్ధకంగా, కేవలం ప్రజలకు చూపేందుకే లేస్తారు. అల్లాహ్‌ను చాలా తక్కువగా స్మరిస్తారు. వారు విశ్వాస తిరస్కారాల మధ్య ఊగిసలాడుతున్నారు. పూర్తిగా ఇటూ కాదు, పూర్తిగా అటూ కాదు. అల్లాహ్ మార్గం తప్పించిన వానికి నీవు ఏ మార్గాన్నీ చూపలేవు.[87]

**144 - 147** విశ్వసించిన ప్రజలారా! విశ్వాసులను కాదని అవిశ్వాసులను మీ మిత్రులుగా చేసుకోకండి. మీరు, మీకే వ్యతిరేకంగా అల్లాహ్‌కు స్పష్టమైన సాక్ష్యం ఇవ్వదలచుకున్నారా? బాగా తెలుసుకోండి, కపటులు నరకంలో అట్టడుగు ప్రదేశానికి పోతారు. వారికి సహాయం చేసేవాడెవడూ మీకు దొరకడు. అయితే వారిలో పశ్చాత్తాపపడి, తమ ప్రవర్తనను సంస్కరించుకునే వారూ, ఇంకా అల్లాహ్‌ను గట్టిగా నమ్ముకుని తమ ధర్మాన్ని అల్లాహ్ కొరకే ప్రత్యేకించుకునేవారూ విశ్వాసులతో ఉంటారు. అల్లాహ్ విశ్వాసులకు తప్పకుండా గొప్ప ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాడు. మీరు కృతజ్ఞతలు చూపేదాసులుగా ఉన్నప్పుడు, విశ్వాస మార్గంలో నడుస్తూ ఉన్నప్పుడు మిమ్మల్ని అల్లాహ్ నిష్కారణంగా ఎందుకు శిక్షిస్తాడు? అల్లాహ్ యోగ్యతకు ఎంతో విలువ ఇస్తాడు.[88] ఆయన అందరిస్థితినీ ఎరిగిన వాడు.

---

85. విశ్వసించిన వారితో విశ్వసించండి అని అనటం పైకి విచిత్రంగా కన్పిస్తుంది. కాని అసలు ఇక్కడ విశ్వాసం అనే పదం రెండు వేరే అర్థాలలో వాడబడింది. విశ్వసించటం అనే దాని ఒక అర్థం ఏమిటంటే మనిషి తిరస్కారానికి బదులు స్వీకారమార్గాన్ని అవలంబించాలి. అంగీకరించని వారి నుండి వేరై, అంగీకరించేవారిలో కలిసిపోవాలి. దీని రెండో అర్థం ఏమంటే, మనిషి ఏ విషయాన్ని విశ్వసిస్తే, ఆ విషయాన్ని హృదయపూర్వకంగా విశ్వసించాలి. పూర్తి ఉదాత్తతతో, చిత్తశుద్ధితో విశ్వసించాలి. ఆయత్‌లో మొదటి అర్థం ప్రకారం అంగీకరించిన వారుగా పరిగణింపబడే ముస్లిములందరినీ సంబోధించటం జరిగింది. వారిని, రెండో అర్థం ప్రకారం నిజమైన ముస్లిములు అవమని కోరటం జరిగింది.

86. తిరస్కరించటం అంటే కూడా రెండు అర్థాలున్నాయి. ఒకటి, మనిషి స్పష్టంగా తిరస్కరించటం. రెండు, నోటితో అంగీకరించి, హృదయంతో అంగీకరించకపోవటం లేదా తన ప్రవర్తన ద్వారా తాను అంగీకరించానని అతడు ప్రకటిస్తున్న విషయాన్ని యథార్థానికి అంగీకరించలేదని నిరూపించటం.

87. అంటే, ఎవడు దైవగ్రంథం ద్వారా దైవప్రవక్త చరిత్ర ద్వారా మార్గదర్శకత్వాన్ని పొందలేదో, ఎవడిని సత్యానికి

لَا يُحِبُّ اللّٰهُ الْجَهْرَ بِالسُّوْٓءِ مِنَ الْقَوْلِ اِلَّا
مَنْ ظُلِمَ ؕ وَكَانَ اللّٰهُ سَمِيْعًا عَلِيْمًا ﴿١٤٨﴾ اِنْ
تُبْدُوْا خَيْرًا اَوْ تُخْفُوْهُ اَوْ تَعْفُوْا عَنْ سُوْٓءٍ فَاِنَّ
اللّٰهَ كَانَ عَفُوًّا قَدِيْرًا ﴿١٤٩﴾ اِنَّ الَّذِيْنَ
يَكْفُرُوْنَ بِاللّٰهِ وَرُسُلِهٖ وَيُرِيْدُوْنَ اَنْ
يُّفَرِّقُوْا بَيْنَ اللّٰهِ وَرُسُلِهٖ وَيَقُوْلُوْنَ نُؤْمِنُ
بِبَعْضٍ وَّنَكْفُرُ بِبَعْضٍ ۙ وَّيُرِيْدُوْنَ اَنْ
يَّتَّخِذُوْا بَيْنَ ذٰلِكَ سَبِيْلًا ﴿١٥٠﴾ اُولٰٓئِكَ هُمُ
الْكٰفِرُوْنَ حَقًّا ۚ وَاَعْتَدْنَا لِلْكٰفِرِيْنَ عَذَابًا
مُّهِيْنًا ﴿١٥١﴾ وَالَّذِيْنَ اٰمَنُوْا بِاللّٰهِ وَرُسُلِهٖ وَلَمْ
يُفَرِّقُوْا بَيْنَ اَحَدٍ مِّنْهُمْ اُولٰٓئِكَ سَوْفَ يُؤْتِيْهِمْ
اُجُوْرَهُمْ ؕ وَكَانَ اللّٰهُ غَفُوْرًا رَّحِيْمًا ﴿١٥٢﴾ ع ٢١

**148 - 149** అన్యాయం జరిగితే తప్ప,[89] మనిషి చెడు పలకటాన్ని అల్లాహ్ ఇష్టపడడు. అల్లాహ్ అన్నీ వినేవాడూ అన్నీ తెలిసినవాడూనూ. (అన్యాయం జరిగితే చెడు పలికే హక్కు మీకు ఉంది) అయినప్పటికీ మీరు బహిరంగంగానూ, చాటుగానూ మేలే చేస్తూపోతే లేదా కనీసం చెడును క్షమతో ఉపేక్షిస్తే అల్లాహ్ (గుణం కూడా ఇదే, ఆయన) క్షమించేవాడు. (వాస్తవానికి ఆయన శిక్షించే) శక్తి కలవాడు కూడ.

**150 - 152** అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తలను తిరస్కరించే వారూ, అల్లాహ్ ఆయన ప్రవక్తల మధ్య భేదభావం చూపే వారూ, "మేము కొందరిని విశ్వసిస్తాము, మరికొందరిని విశ్వసించము" అని అనే వారూ, అవిశ్వాస విశ్వాసాలకు మధ్య ఒక (కొత్త) మార్గాన్ని కనిపెట్టాలనే ఉద్దేశ్యం కలవారు- వారు అందరూ పరమ అవిశ్వాసులే. అటువంటి అవిశ్వాసుల కొరకు మేము అత్యంత అవమానకరమైన శిక్షను సిద్ధంచేసి ఉంచాము- దీనికి భిన్నంగా అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తలందరినీ విశ్వసించి, వారి మధ్య భేదభావం చూపని వారికి మేము వారి ప్రతిఫలాన్ని తప్పక ప్రసాదిస్తాము. అల్లాహ్ అధికంగా మన్నించేవాడూ, అనన్యంగా కరుణించేవాడూను.

దూరంగా పోతూ, అసత్యం వైపునకు మొగ్గుతూ ఉండటం చూసి దైవం కూడా అతడు స్వయంగా మరలగోరే వైపునకు మరలించాడో, ఎవడి అపమార్గ కాంక్షవల్ల దైవం అతని కొరకు జ్ఞానమార్గ ద్వారాలను మూసివేసి కేవలం అపమార్గద్వారాలనే తెరచి ఉంచాడో, అటువంటి వ్యక్తికి రుజుమార్గం చూపటం వాస్తవానికి మానవ మాత్రుడికి సాధ్యం కాదు.

88. "షుక్ర్" దాసుని తరఫు నుండి అయితే కృతజ్ఞత అని భావం. దైవం తరఫు నుండి అయితే యోగ్యతను గౌరవించటం అని భావం.

89. అంటే, దుర్మార్గుడికి వ్యతిరేకంగా నిరసన వ్యక్తం చేసే హక్కు పీడితులకు లభిస్తుంది.

يَسْـَٔلُكَ اَهْلُ الْكِتٰبِ اَنْ تُنَزِّلَ عَلَيْهِمْ كِتٰبًا
مِّنَ السَّمَآءِ فَقَدْ سَاَلُوْا مُوْسٰۤى اَكْبَرَ مِنْ ذٰلِكَ
فَقَالُوْۤا اَرِنَا اللّٰهَ جَهْرَةً فَاَخَذَتْهُمُ الصّٰعِقَةُ
بِظُلْمِهِمْ ۚ ثُمَّ اتَّخَذُوا الْعِجْلَ مِنْۢ بَعْدِ مَا
جَآءَتْهُمُ الْبَيِّنٰتُ فَعَفَوْنَا عَنْ ذٰلِكَ ۚ وَاٰتَيْنَا
مُوْسٰى سُلْطٰنًا مُّبِيْنًا ﴿١٥٣﴾ وَرَفَعْنَا فَوْقَهُمُ
الطُّوْرَ بِمِيْثَاقِهِمْ وَقُلْنَا لَهُمُ ادْخُلُوا الْبَابَ
سُجَّدًا وَّقُلْنَا لَهُمْ لَا تَعْدُوْا فِى السَّبْتِ وَ
اَخَذْنَا مِنْهُمْ مِّيْثَاقًا غَلِيْظًا ﴿١٥٤﴾ فَبِمَا نَقْضِهِمْ
مِّيْثَاقَهُمْ وَكُفْرِهِمْ بِاٰيٰتِ اللّٰهِ وَقَتْلِهِمُ
الْاَنْۢبِيَآءَ بِغَيْرِ حَقٍّ وَّقَوْلِهِمْ قُلُوْبُنَا غُلْفٌ ؕ
بَلْ طَبَعَ اللّٰهُ عَلَيْهَا بِكُفْرِهِمْ فَلَا يُؤْمِنُوْنَ اِلَّا
قَلِيْلًا ﴿١٥٥﴾ وَّبِكُفْرِهِمْ وَقَوْلِهِمْ عَلٰى مَرْيَمَ بُهْتَانًا
عَظِيْمًا ۙ ﴿١٥٦﴾ وَّقَوْلِهِمْ اِنَّا قَتَلْنَا الْمَسِيْحَ عِيْسَى
ابْنَ مَرْيَمَ رَسُوْلَ اللّٰهِ ۚ وَمَا قَتَلُوْهُ وَمَا
صَلَبُوْهُ وَلٰكِنْ شُبِّهَ لَهُمْ ؕ وَاِنَّ الَّذِيْنَ
اخْتَلَفُوْا فِيْهِ لَفِىْ شَكٍّ مِّنْهُ ؕ مَا لَهُمْ بِهٖ مِنْ
عِلْمٍ اِلَّا اتِّبَاعَ الظَّنِّ ۚ وَمَا قَتَلُوْهُ يَقِيْنًا ۙ ﴿١٥٧﴾

**153 - 162** ప్రవక్తా! ఈ గ్రంథ ప్రజలు ఒకవేళ ఈనాడు "ఆకాశం నుండి ఏదైనా గ్రంథాన్ని మాపై అవతరింపచెయ్యి" అని నిన్ను కోరుతున్నట్లయితే ఇంతకంటే పరమ ఘోరమైన కోరికలనే వారు పూర్వం మూసాను కోరి వున్నారు. ఆయనను వారు, "అల్లాహ్‌ను మాకు ప్రత్యక్షంగా చూపించు" అనే కోరారు. వారి ఈ తలబిరుసుతనం కారణంగానే వారిపై అకస్మాత్తుగా పిడుగు విరుచుకుపడింది. తరువాత వారు ఆవుదూడను తమ ఆరాధ్య దైవంగా చేసుకున్నారు. వాస్తవానికి వారు స్పష్టమైన సూచనలు చూసి వున్నారు. దానికిక్కూడా మేము వారిని మన్నించాము. మేము మూసాకు స్పష్టమైన ఆజ్ఞను ప్రసాదించాము. వారిపై తూర్ పర్వతమెత్తి (ఈ ఆజ్ఞకు మేము విధేయులమై ఉంటామనే) ప్రమాణాన్ని తీసుకున్నాము. సజ్దా చేస్తూ (నగర) ద్వారంలోకి ప్రవేశించండి అని మేము వారిని ఆజ్ఞాపించాము.[90] 'సబ్బత్' శాసనాన్ని ఉల్లంఘించకూడదని మేము వారికి చెప్పాము. దీనికిగాను వారి నుండి గట్టి ప్రమాణం తీసుకున్నాము. చివరకు, వారు ప్రమాణ భంగం చెయ్యటం వల్లా, అల్లాహ్ ఆయతులను నిరాకరించటం వల్లా, ఎంతోమంది ప్రవక్తలను అన్యాయంగా హత్య చేయటం వల్లా, ఇంకా "మా హృదయాలు గలేబులలో సురక్షితంగా ఉన్నాయి"[91]అని చెప్పటం వల్లా,- యథార్థం ఏమిటంటే వారు అసత్యాన్ని అనుసరించిన కారణంగా అల్లాహ్ వారి హృదయాలకు ముద్రవేశాడు. కనుకనే వారు తక్కువగా విశ్వసిస్తారు- వారు తమ అవిశ్వాసంలో ఎంత ముందుకు పోయారంటే, మర్యమ్‌పైనే తీవ్రమైన నిందమోపారు. స్వయంగా, "మేము మసీహ్, మర్యమ్ కుమారుడైన ఈసా అనే దైవప్రవక్తను చంపాము"[92] అని అన్నారు- వాస్తవానికి వారు ఆయనను చంపనూలేదు, శిలువపైకి ఎక్కించనూ లేదు. కాని ఆ విషయంలో వారు భ్రమకు గురిచెయ్యబడ్డారు.[93] ఈ విషయం గురించి అభిప్రాయభేదం వ్యక్తం చేసిన వారు కూడా సందేహానికి లోనయ్యారు. దీనిని గురించి వారికి అసలు ఏమీ తెలియదు. వారు కేవలం ఊహనే అనుసరిస్తున్నారు. వారు అతనిని నిశ్చయంగా చంపలేదు.

90. దీని ప్రస్తావన బఖర సూరా 58 - 59 ఆయతులలో ఉంది.
91. అంటే, మీరు ఏమి చెప్పినా సరే, దాని ప్రభావం మా హృదయాలపై ఎంతమాత్రం పడదు.

بَلْ رَّفَعَهُ اللّٰهُ اِلَيْهِ ؕ وَ كَانَ اللّٰهُ عَزِيْزًا
حَكِيْمًا ﴿١٥٨﴾ وَ اِنْ مِّنْ اَهْلِ الْكِتٰبِ اِلَّا
لَيُؤْمِنَنَّ بِهٖ قَبْلَ مَوْتِهٖ ۚ وَ يَوْمَ الْقِيٰمَةِ
يَكُوْنُ عَلَيْهِمْ شَهِيْدًا ﴿١٥٩﴾ فَبِظُلْمٍ مِّنَ الَّذِيْنَ
هَادُوْا حَرَّمْنَا عَلَيْهِمْ طَيِّبٰتٍ اُحِلَّتْ لَهُمْ وَ
بِصَدِّهِمْ عَنْ سَبِيْلِ اللّٰهِ كَثِيْرًا ﴿١٦٠﴾ وَّ اَخْذِهِمُ
الرِّبٰوا وَ قَدْ نُهُوْا عَنْهُ وَ اَكْلِهِمْ اَمْوَالَ
النَّاسِ بِالْبَاطِلِ ؕ وَ اَعْتَدْنَا لِلْكٰفِرِيْنَ مِنْهُمْ
عَذَابًا اَلِيْمًا ﴿١٦١﴾ لٰكِنِ الرّٰسِخُوْنَ فِي الْعِلْمِ
مِنْهُمْ وَالْمُؤْمِنُوْنَ يُؤْمِنُوْنَ بِمَاۤ اُنْزِلَ اِلَيْكَ
وَ مَاۤ اُنْزِلَ مِنْ قَبْلِكَ وَالْمُقِيْمِيْنَ الصَّلٰوةَ وَ
الْمُؤْتُوْنَ الزَّكٰوةَ وَالْمُؤْمِنُوْنَ بِاللّٰهِ وَ الْيَوْمِ
الْاٰخِرِ ؕ اُولٰٓئِكَ سَنُؤْتِيْهِمْ اَجْرًا عَظِيْمًا ﴿١٦٢﴾ ع ٢٢

కాని అల్లాహ్ ఆయనను తన వైపునకు లేపుకున్నాడు. అల్లాహ్ అద్భుత శక్తి సంపన్నుడు, అత్యంత వివేకవంతుడు. గ్రంథ ప్రజలలో ఎవ్వరూ అతనిని అతని మరణానికి పూర్వం విశ్వసించకుండా ఉండరు.[94] ప్రళయం నాడు ఆయన వారికి వ్యతిరేకంగా సాక్ష్యమిస్తాడు - యూదుల ఈ దుర్మార్గ వైఖరివల్లా, ఇంకా వారు ఎక్కువగా అల్లాహ్ మార్గంలో ఆటంకాలను సృష్టిస్తున్నందువల్లా, వారికి నిషేధించబడిన వడ్డీని తీసుకుంటున్నందువల్లా, అధర్మంగా ఇతరుల సొమ్మును కబళిస్తున్నందువల్లా, మేము వారి కొరకు పూర్వం ధర్మసమ్మతములైన ఎన్నో పరిశుద్ధమైన వస్తువులను నిషిద్ధాలుగా చేశాము.[95] వారిలో అవి శ్వాసులుగా ఉన్న వారికొరకు మేము వ్యధాభరితమైన శిక్షను సిద్ధం చేసి ఉంచాము. అయితే, వారిలోని గొప్ప జ్ఞానులు, నిజాయితీపరులు అందరూ, ప్రవక్తా! నీపై అవతరింపచెయ్యబడిన దానినీ నీకు పూర్వం అవతరింప చెయ్యబడిన దానినీ విశ్వసిస్తారు. ఈ విధంగా విశ్వసించే వారికి నమాజ్, జకాత్‌ల నియమాలను పాటించేవారికి, అల్లాహ్‌ను, అంతిమ దినాన్ని చిత్తశుద్ధితో నమ్మేవారికీ మేము గొప్ప ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాము.

92. అపరాధుల ధైర్యం ఎంత పెచ్చుపెరిగిపోయిందంటే, వారు ప్రవక్తను ప్రవక్తగా ఎరిగి ఉండి కూడా ఆయనపై హత్యా ప్రయత్నం చేశారు. ఇంకా సగర్వంగా మేము అల్లాహ్ ప్రవక్తను హత్య చేశాము అని చెప్పుకున్నారు. ఈ సందర్భంలో "మర్యమ్" సూరాలో రెండో రుకూను మా వ్యాఖ్యానంతో పాటు చదివితే ఇస్రాయీలు సంతతివారు హజ్రత్ ఈసా (అస్సలామ్)ను యథార్థంగానే దైవప్రవక్త అని ఎరుగుదురు. అయినప్పటికీ వారు ఆయనను శిలువపై ఎక్కించారు అని విశదమవుతుంది.

93. ఈ ఆయత్ వివరించేది ఏమిటంటే హజ్రత్ మసీహ్ (అస్సలామ్) శిలువపైకి ఎక్కించబడే ముందే లేపుకోబడ్డారు. ఇంకా మసీహ్ శిలువపై అసువులు బాసారు అనే క్రైస్తవుల, యూదుల అభిప్రాయం కేవలం అపోహ మాత్రమే. యూదులు ఆయనను శిలువపైకి ఎక్కించక మునుపే అల్లాహ్ ఎప్పుడో ఆయనను పైకి లేపుకున్నాడు. తరువాత యూదులు ఎవరిని శిలువ మీదికి ఎక్కించారో అతడు మరొక వ్యక్తి. ఆయన్ని వారు ఎందుకు, ఎలా మర్యము కుమారుడు ఈసాగా భావించారో తెలియదు.

94. ఈ వాక్యానికి రెండు అర్థాలు చెప్పబడ్డవి, దీని పదాలలో రెంటికీ సమానమైన అవకాశం ఉంది. ఒకటి, పైన మేము అనువాదం చేసింది. రెండు, తన మరణానికి ముందు మసీహ్ (అస్సలామ్)ను విశ్వసించని వాడెవడూ గ్రంథ ప్రజలలో ఉండడు అని.

95. బహుశా ఇది ముందు అల్ అన్ ఆమ్ సూరా 146వ ఆయత్‌లో రాబోయే భావాన్ని సూచిస్తుంది. అంటే, ఇస్రాయీలు సంతతివారి కొరకు గోళ్ళు ఉన్న జంతువులన్నీ నిషేధించబడ్డవి. ఇంకా ఆవు, మేకకొవ్వు కూడా నిషేధించబడింది. ఇదికాక యూదుల శాస్త్రంలోని ఇతర నియమాలనూ, నిర్బంధాలనూ కూడా ఇది

إِنَّآ أَوْحَيْنَآ إِلَيْكَ كَمَآ أَوْحَيْنَآ إِلَىٰ نُوحٍ وَّ
النَّبِيِّـۧنَ مِنۢ بَعْدِهِۦ ۚ وَأَوْحَيْنَآ إِلَىٰٓ إِبْرَٰهِيمَ
وَإِسْمَٰعِيلَ وَإِسْحَٰقَ وَيَعْقُوبَ وَالْأَسْبَاطِ وَ
عِيسَىٰ وَأَيُّوبَ وَيُونُسَ وَهَٰرُونَ وَسُلَيْمَٰنَ ۚ
وَءَاتَيْنَا دَاوُۥدَ زَبُورًا ﴿١٦٣﴾ وَرُسُلًا قَدْ قَصَصْنَٰهُمْ
عَلَيْكَ مِن قَبْلُ وَرُسُلًا لَّمْ نَقْصُصْهُمْ
عَلَيْكَ ۚ وَكَلَّمَ اللَّهُ مُوسَىٰ تَكْلِيمًا ﴿١٦٤﴾ رُّسُلًا
مُّبَشِّرِينَ وَمُنذِرِينَ لِئَلَّا يَكُونَ لِلنَّاسِ
عَلَى اللَّهِ حُجَّةٌۢ بَعْدَ الرُّسُلِ ۚ وَكَانَ اللَّهُ
عَزِيزًا حَكِيمًا ﴿١٦٥﴾ لَّٰكِنِ اللَّهُ يَشْهَدُ بِمَآ أَنزَلَ
إِلَيْكَ ۖ أَنزَلَهُۥ بِعِلْمِهِۦ ۖ وَالْمَلَٰٓئِكَةُ يَشْهَدُونَ ۚ
وَكَفَىٰ بِاللَّهِ شَهِيدًا ﴿١٦٦﴾ إِنَّ الَّذِينَ كَفَرُوا۟ وَ
صَدُّوا۟ عَن سَبِيلِ اللَّهِ قَدْ ضَلُّوا۟ ضَلَٰلًۢا
بَعِيدًا ﴿١٦٧﴾ إِنَّ الَّذِينَ كَفَرُوا۟ وَظَلَمُوا۟ لَمْ
يَكُنِ اللَّهُ لِيَغْفِرَ لَهُمْ وَلَا لِيَهْدِيَهُمْ
طَرِيقًا ﴿١٦٨﴾ إِلَّا طَرِيقَ جَهَنَّمَ خَٰلِدِينَ فِيهَآ
أَبَدًا ۚ وَكَانَ ذَٰلِكَ عَلَى اللَّهِ يَسِيرًا ﴿١٦٩﴾ يَٰٓأَيُّهَا
النَّاسُ قَدْ جَآءَكُمُ الرَّسُولُ بِالْحَقِّ مِن رَّبِّكُمْ
فَـَٔامِنُوا۟ خَيْرًا لَّكُمْ ۚ وَإِن تَكْفُرُوا۟ فَإِنَّ لِلَّهِ مَا
فِى السَّمَٰوَٰتِ وَالْأَرْضِ ۚ وَكَانَ اللَّهُ عَلِيمًا
حَكِيمًا ﴿١٧٠﴾

**163 - 169** ప్రవక్తా! మేము నీ వైపునకు వహీ (దైవవాణి)ని పంపాము, నూహ్ వైపునకు ఆయన తరువాతి ప్రవక్తల వైపునకు పంపినట్లు. మేము ఇబ్రాహీము, ఇస్మాయీల్, ఇస్హాఖ్, యాఖూబ్, యాఖూబ్ సంతతి, ఈసా, అయ్యూబ్, యూనుస్, హారూన్, సులైమాన్‌ల వైపునకు వహీని పంపాము. మేము దావూద్‌కు 'జబూర్'ను ప్రసాదించాము. మేము ఇంతకు ముందు నీతో ప్రస్తావించిన ప్రవక్తల వైపునకు కూడ వహీని పంపాము. నీతో ప్రస్తావించని ప్రవక్తల వైపునకు కూడా పంపి వున్నాము. సంభాషణలో మాదిరిగా మేము మూసాతో ప్రత్యక్షంగా మాట్లాడాము. ఈ ప్రవక్తలందరూ శుభవార్తను తెలిపే వారుగా, హెచ్చరిక చేసేవారుగా పంపబడ్డారు - వారి ఆవిర్భావం తరువాత, అల్లాహ్‌కు ప్రతికూలంగా వాదించటానికి ప్రజల వద్ద ఏ సాకూ మిగలకూడదని.[96] ఎట్టి పరిస్థితులలోనైనా అల్లాహ్‌యే ఆధిక్యం కలిగివుండేవాడు, మహా వివేకవంతుడు (ప్రజలు ఒప్పుకున్నా ఒప్పుకోక పోయినా). ప్రవక్తా! నీపై తాను అవతరింపజేసిన దానిని తన జ్ఞానంతో అవతరింపజేశానని అల్లాహ్ సాక్ష్యమిస్తున్నాడు. దీనికి దైవదూతలు కూడ సాక్షులుగా ఉన్నారు, అల్లాహ్ సాక్షిగా ఉండటమే సరిపోయినప్పటికీ. దీనిని విశ్వసించటానికి స్వయంగా తిరస్కరిస్తూ, ఇతరులను కూడ అల్లాహ్ మార్గం లోకి రాకుండా నిరోధించే వారు నిశ్చయంగా అపమార్గంలో పడి సత్యానికి చాలా దూరంగా వెళ్ళిపోయారు. ఈ విధంగా అవిశ్వాసవైఖరిని, తిరుగుబాటు వైఖరిని అవలంబించి అన్యాయానికి, అక్రమానికి పాల్పడేవారిని అల్లాహ్ ఎన్నటికీ క్షమించడు, వారికి నరక మార్గం తప్ప మరేమార్గమూ చూపడు. అక్కడ వారు కలకాలం ఉంటారు. ఇది అల్లాహ్‌కు ఏమంత కష్టమైన పనికాదు.

**170** మానవులారా! ఈ ప్రవక్త మీ వద్దకు మీ ప్రభువు తరఫు నుండి సత్యం తీసుకువచ్చాడు. అతన్ని విశ్వసించండి, మీకే మంచిది. కాని మీరు గనక తిరస్కరిస్తే, ఆకాశాలలో, భూమిలో ఉన్నదంతా అల్లాహ్‌దే అనే విషయం తెలుసుకోండి. అల్లాహ్ అన్నీ తెలిసినవాడూ, అత్యంత వివేకీనూ.[97]

يَاَهۡلَ الۡكِتٰبِ لَا تَغۡلُوۡا فِىۡ دِيۡنِكُمۡ وَلَا
تَقُوۡلُوۡا عَلَى اللّٰهِ اِلَّا الۡحَـقَّ ؕ اِنَّمَا الۡمَسِيۡحُ
عِيۡسَى ابۡنُ مَرۡيَمَ رَسُوۡلُ اللّٰهِ وَكَلِمَتُهٗ ۚ
اَلۡقٰٮهَاۤ اِلٰى مَرۡيَمَ وَرُوۡحٌ مِّنۡهُ فَاٰمِنُوۡا بِاللّٰهِ وَ
رُسُلِهٖ ۚ وَلَا تَقُوۡلُوۡا ثَلٰثَةٌ ؕ اِنْتَهُوۡا خَيۡرًا
لَّـكُمۡ ؕ اِنَّمَا اللّٰهُ اِلٰـهٌ وَّاحِدٌ ؕ سُبۡحٰنَهٗۤ اَنۡ
يَّكُوۡنَ لَهٗ وَلَدٌ ۘ لَهٗ مَا فِى السَّمٰوٰتِ وَمَا فِى
الۡاَرۡضِ ؕ وَكَفٰى بِاللّٰهِ وَكِيۡلًا ﴿۱۷۱﴾

**171** గ్రంథ ప్రజలారా! మీ ధర్మ విషయాలలో అతిగా ప్రవర్తించకండి.[98] అల్లాహ్‌కు సత్యం తప్ప వేరే విషయాన్ని ఆపాదించకండి. మసీహ్, మర్యమ్ కుమారుడైన ఈసా, అల్లాహ్ పంపిన ఒక ప్రవక్త, అల్లాహ్ మర్యమ్ వైపునకు పంపిన ఒక ఆజ్ఞ,[99] అల్లాహ్ తరఫు నుండి వచ్చిన (మర్యమ్ గర్భంలో బిడ్డ రూపం దాల్చిన) ఒక ఆత్మ[100] తప్ప మరేమీ కాదు. కనుక అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తలను విశ్వసించండి. 'ముగ్గురు'[101] అని అనకండి. ఇలా అనటం మానివెయ్యండి. ఇది మీకే శ్రేయస్కరం. అల్లాహ్ ఒక్కడే దేవుడు. ఆయన పరిశుద్ధుడు. ఆయనకు ఒక కొడుకు ఉన్నాడనే విషయానికి ఆయన అతీతుడు.[102] భూమ్యాకాశాలలో ఉన్న సమస్తమూ ఆయన ఆస్తియే. దాని పోషణకు, దాని రక్షణకు ఆయనే చాలు.

సూచిస్తుందేమో. ఏ వర్గం కొరకైనా దాని జీవన పరిధిని పరిమితం చెయ్యటం, వాస్తవానికి ఆ వర్గాన్ని ఒక విధంగా శిక్షించటమే.

96. అంటే, ఈ ప్రవక్తలందరినీ పంపే ఉద్దేశ్యం ఒక్కటే, అది ఏమిటంటే, అల్లాహ్ మానవజాతిపట్ల తన వాదాన్ని పూర్తిచెయ్యదలచాడు, తీర్పుదినం నాడు మార్గభ్రష్టులైన అపరాధులు ఆయన సమక్షంలో, "మాకు ఏమీ తెలియదు, నీవు మాకు యథార్థాన్ని తెలిపే ఏర్పాటూ ఏదీ చెయ్యలేదు" అనే సాకు చూపకుండా ఉండేటందుకు.

97. అంటే, మీ దేవుడు అజ్ఞానీ కాదు, ఆయన రాజ్యంలో ఉంటూ మీరు దుష్టకార్యాలు చేసినా ఆయనకు తెలియక పోవటానికి, ఆయన అమాయకుడూ కాదు, తన ఆజ్ఞలను ఉల్లంఘించే వారిపట్ల వ్యవహరించే పద్ధతి ఆయనకు తెలియకపోవటానికి.

98. ఇక్కడ గ్రంథ ప్రజలు అంటే క్రైస్తవులు అని భావం. అతిగా ప్రవర్తించటం అంటే, ఏ విషయాన్నైనా సమర్థించటంలోగాని, బలపరచటంలోగానీ హద్దులు మీరటం అని భావం. యూదుల నేరం ఇది : వారు మసీహ్‌ను తిరస్కరించటంలో, ఆయనను వ్యతిరేకించటంలో హద్దుమీరి ప్రవర్తించారు. క్రైస్తవుల నేరమేమిటంటే, వారు మసీహ్‌పట్ల విశ్వాసంలో, ప్రేమలో హద్దుమీరి ప్రవర్తించారు. ఆయనను దేవుని కుమారుడుగానే కాదు, దేవుడుగా కూడా నిర్ణయించారు.

99. అసలు 'కలిమ' అనే పదం ఉపయోగించబడింది. మర్యమ్ వైపునకు కలిమాను పంపటం అనే దాని అర్థం ఏమిటంటే, అల్లాహ్ హజ్రత్ మర్యమ్ (అస్సలామ్) గర్భకోశానికి పురుషుని రేతస్సు లేకుండానే గర్భాన్ని ధరించు అనే ఫర్మానా (ఆజ్ఞ)ను అవతరింపజేశాడు. క్రైస్తవులు మొదట 'కలిమ' అనే పదాన్ని 'వాక్కు' లేక 'వాక్శక్తి' అనే అర్థంలో తీసుకున్నారు. తరువాత ఈ వాక్కును, వాక్శక్తిని అల్లాహ్ వాక్కుగా భావించారు, తరువాత ఇలా ఊహించారు: అల్లాహ్ వాక్కు అంటే, అల్లాహ్ యొక్క ఈ గుణం మర్యమ్ (అస్సలామ్) గర్భంలో ప్రవేశించి దేహరూపం దాల్చింది, అదే మసీహ్ రూపంలో ప్రత్యక్షమయింది. ఈ విధంగా క్రైస్తవులలో మసీహ్ (అస్సలామ్) లో దైవత్వం ఉన్నది అనే తప్పుడు విశ్వాసం పుట్టింది. ఇంకా దేవుడే స్వయంగా తనను తాను మసీహ్ రూపంలో ప్రత్యక్షపరచుకున్నాడు, లేక తన శాశ్వతగుణాలలోని వాక్కు, వాక్శక్తి అనే గుణాన్ని మసీహ్ రూపంలో ప్రత్యక్షపరచాడు అనే తప్పుడు భావన వేళ్ళూనింది.

100. ఇక్కడ స్వయంగా మసీహ్‌నే "రూహుమ్మిన్‌హు" (దైవం తరఫు నుండి ఒక ఆత్మ) అని అభివర్ణించడం జరిగింది. ఇంకా బఖర సూరా 87వ ఆయత్‌లో ఈ భావాన్ని ఇలా చెప్పటం జరిగింది: "మేము పరిశుద్ధాత్మతో మసీహ్‌కు

**172 - 173** తాను అల్లాహ్‌కు దాసుడుగా ఉండటాన్ని మసీహ్ అగౌరవంగా భావించలేదు. అల్లాహ్‌కు అత్యంత సన్నిహితంగా ఉండే దూతలు కూడా దీనిని తమకు అగౌరవంగా భావించరు. అల్లాహ్ దాస్యాన్ని తనకు అగౌరవమైనదిగా భావించేవాడు, అలా భావిస్తూ విర్రవీగేవాడు, అల్లాహ్ అందరినీ పోగుచేసి తనముందు హాజరు పరచబోయే ఒక సమయం వస్తుంది (అని తెలుసుకోవాలి). అప్పుడు విశ్వసించి,సత్ప్రవర్తనా వైఖరిని అవలంబించిన వారు తమ ప్రతిఫలాన్ని పూర్తిగా పొందుతారు. అల్లాహ్ తన అనుగ్రహంతో వారికి మరింత ఎక్కువ బహుమానం ప్రసాదిస్తాడు. ఇక దాస్యాన్ని అగౌరవమైనదిగా భావించి విర్రవీగిన వారికి అల్లాహ్ అతి బాధాకరమైన శిక్షను విధిస్తాడు. అల్లాహ్‌ను కాదని వారు ఎవరెవరి సహకార సంరక్షణలను నమ్ముకున్నారో, వారిలో ఎవరినీ వారు అక్కడ పొందలేరు.

لَنۡ يَّسۡتَنۡكِفَ الۡمَسِيۡحُ اَنۡ يَّكُوۡنَ عَبۡدًا لِّلّٰهِ
وَ لَا الۡمَلٰٓـئِكَةُ الۡمُقَرَّبُوۡنَ‌ؕ وَمَنۡ يَّسۡتَنۡكِفۡ
عَنۡ عِبَادَتِهٖ وَيَسۡتَكۡبِرۡ فَسَيَحۡشُرُهُمۡ اِلَيۡهِ
جَمِيۡعًا ﴿۱۷۲﴾ فَاَمَّا الَّذِيۡنَ اٰمَنُوۡا وَعَمِلُوا
الصّٰلِحٰتِ فَيُوَفِّيۡهِمۡ اُجُوۡرَهُمۡ وَيَزِيۡدُهُمۡ مِّنۡ
فَضۡلِهٖ‌ۚ وَاَمَّا الَّذِيۡنَ اسۡتَنۡكَفُوۡا وَاسۡتَكۡبَرُوۡا
فَيُعَذِّبُهُمۡ عَذَابًا اَلِيۡمًا ۙ وَّلَا يَجِدُوۡنَ لَهُمۡ
مِّنۡ دُوۡنِ اللّٰهِ وَلِيًّا وَّلَا نَصِيۡرًا ﴿۱۷۳﴾

సహాయపడ్డాము." ఈ రెండు వాక్యాల భావం ఏమిటంటే, అల్లాహ్ మసీహ్ (అస్సలామ్) కి చెడు అంటే ఏమాత్రం ఎరుగని, పూర్తిగా సత్యంతో, నిజాయితీతో కూడిన, గొప్ప నైతిక విలువలు కలిగిన పరిశుద్ధాత్మను ప్రసాదించాడు. క్రైస్తవులు ఇందులో కూడా హద్దులు మీరారు. "రూహుమ్మినల్లాహి"ను స్వయంగా అల్లాహ్ ఆత్మగా నిర్ణయించారు. "రూహుల్ ఖుద్స్" భావాన్ని మసీహ్‌లో ప్రవేశించిన అల్లాహ్ పవిత్రాత్మగా తీసుకున్నారు. ఈ విధంగా అల్లాహ్‌తో పాటు, మసీహ్‌తోపాటు, "రూహుల్ ఖుద్స్"ను మూడో దేవుడుగా చేసిపారేశారు.

101. అంటే, ముగ్గురు దేవుళ్ళ విశ్వాసాన్ని విసర్జించండి – అది మీలో ఏ రూపంలో ఉన్నాసరే. యథార్థం ఏమిటంటే, క్రైస్తవులు ఒకేసారి తౌహీద్ (దేవుడు ఒక్కడే అనే సిద్ధాంతం)ను కూడా విశ్వసిస్తారు. ముగ్గురు దేవుళ్ళ సిద్ధాంతాన్ని (Trinity) కూడా విశ్వసిస్తారు. ఇన్జీలులో లభించే మసీహ్ (అస్సలామ్) యొక్క స్పష్టమైన సూక్తుల ప్రకారం క్రైస్తవుడెవడూ, దేవుడు కేవలం ఒకే దేవుడు, ఆయన తప్ప వేరే దేవుడు లేడు అనే విషయాన్ని తిరస్కరించలేడు. తౌహీద్, ధర్మానికి మూలం అని వారు అంగీకరించక తప్పదు. కాని దీని తరువాత, మసీహ్ పట్ల వారికి ఉన్న అతి గౌరవం కారణంగా వారు ముగ్గురు దేవుళ్ళ భావనను కూడా సమర్థిస్తారు, ఇంకా ఈ పరస్పర విరుద్ధ విశ్వాసాలను ఒకేసారి ఎలా సర్దుకుపోవాలి అనే విషయాన్ని ఈ రోజు వరకు వారు నిర్ణయించలేకపోయారు.

102. ఇక్కడ క్రైస్తవుల నాల్గో అతిని ఖండించటం జరిగింది. క్రైస్తవుల సంప్రదాయాలు ఒకవేళ నిజమే అయినా, వాటిద్వారా (ముఖ్యంగా మొదటి మూడు ఇన్జీలుల ద్వారా) మహాఅయితే కేవలం ఇది మాత్రమే నిరూపితమవుతుంది: మసీహ్ (అస్సలామ్) దేవునికీ ఆయన దాసులకూ మధ్య ఉన్న సంబంధాన్ని, తండ్రీ, పిల్లల మధ్య ఉన్న సంబంధంతో పోల్చారు. "తండ్రి" పదాన్ని దేవుని కొరకు ఆయన కేవలం ఉపమానంగా వాడుతూ ఉండేవారు. ఇది కేవలం ఒక్క మసీహ్ ప్రత్యేకత మాత్రమే కాదు, ప్రాచీన కాలం నుండి ఇస్రాయీలు సంతతివారు దేవుని కొరకు తండ్రి పదాన్ని వాడుతూ వచ్చారు, ఇంకా దీనికి సంబంధించిన ఉదాహరణలు ఎన్నో బైబిలు పాత నిబంధనలో ఉన్నాయి. మసీహ్ ఈ పదాన్ని తన జాతి సంప్రదాయం ప్రకారమే వాడారు. దేవుడు కేవలం తనకే కాదు సమస్త మానవులకు తండ్రి అని ఆయన అనేవారు. కాని క్రైస్తవులు ఇక్కడ మళ్ళీ అతిగా వ్యవహరించి మసీహ్‌ని దేవుని ఏకైక కుమారునిగా నిర్ణయించారు.

يَاَيُّهَا النَّاسُ قَدْ جَآءَكُمْ بُرْهَانٌ مِّنْ رَّبِّكُمْ
وَ اَنْزَلْنَآ اِلَيْكُمْ نُوْرًا مُّبِيْنًا ﴿١٧٤﴾ فَاَمَّا الَّذِيْنَ
اٰمَنُوْا بِاللّٰهِ وَ اعْتَصَمُوْا بِهٖ فَسَيُدْخِلُهُمْ فِيْ
رَحْمَةٍ مِّنْهُ وَفَضْلٍ ۙ وَّ يَهْدِيْهِمْ اِلَيْهِ
صِرَاطًا مُّسْتَقِيْمًا ﴿١٧٥﴾ يَسْتَفْتُوْنَكَ ؕ قُلِ اللّٰهُ
يُفْتِيْكُمْ فِي الْكَلٰلَةِ ؕ اِنِ امْرُؤٌا هَلَكَ لَيْسَ
لَهٗ وَلَدٌ وَّ لَهٗٓ اُخْتٌ فَلَهَا نِصْفُ مَا تَرَكَ ۚ
وَ هُوَ يَرِثُهَآ اِنْ لَّمْ يَكُنْ لَّهَا وَلَدٌ ؕ فَاِنْ
كَانَتَا اثْنَتَيْنِ فَلَهُمَا الثُّلُثٰنِ مِمَّا تَرَكَ ؕ وَ
اِنْ كَانُوْٓا اِخْوَةً رِّجَالًا وَّ نِسَآءً فَلِلذَّكَرِ
مِثْلُ حَظِّ الْاُنْثَيَيْنِ ؕ يُبَيِّنُ اللّٰهُ لَكُمْ اَنْ
تَضِلُّوْا ؕ وَ اللّٰهُ بِكُلِّ شَيْءٍ عَلِيْمٌ ﴿١٧٦﴾ ع ٢٤

**174 - 175** మానవులారా! మీ ప్రభువు తరఫు నుండి మీ వద్దకు స్పష్టమైన నిదర్శనం వచ్చింది. మేము మీవద్దకు మీకు స్పష్టంగా మార్గం చూపే జ్యోతిని పంపాము. ఇక అల్లాహ్ మాటను ఆలకించేవారిని, ఆయన శరణువేడుకునే వారిని అల్లాహ్ తన కరుణతో తన అనుగ్రహంతో కప్పి వేస్తాడు. వారికి తన వైపునకు వచ్చే రుజుమార్గం చూపుతాడు.

**176** ప్రవక్తా! ప్రజలు నిన్ను "కలాలా"[103] విషయంలో ధార్మిక తీర్పు అడుగుతున్నారు. అల్లాహ్ మీకు ఈ ధార్మిక తీర్పు ఇస్తున్నాడు అని చెప్పు. ఒక మనిషి గనక సంతానం లేకుండా మరణిస్తే, అతనికి ఒక సోదరి ఉంటే,[104] అప్పుడు ఆమె అతని ఆస్తిలో సగభాగం పొందుతుంది. సోదరి గనక సంతానం లేకుండా మరణిస్తే ఆమె సోదరుడు ఆమెకు వారసుడౌతాడు.[105] ఒకవేళ మృతునికి (వారసులు) ఇద్దరు సోదరీమణులైతే, వారు అతని ఆస్తిలోని మూడింట రెండు భాగాలకు హక్కుదారులు[106] అవుతారు. ఒకవేళ సోదరీ సోదరులు అనేకులు ఉన్నట్లయితే, అప్పుడు స్త్రీలకు ఒక వంతు పురుషులకు రెండు వంతులు లభిస్తాయి. అల్లాహ్ మీ కొరకు తన ఆజ్ఞలను విశదపరుస్తు న్నాడు - మీరు మార్గం తప్పి తిరగకుండా ఉండేందుకు. అల్లాహ్‌కు ప్రతి విషయమూ తెలుసు.

---

103. "కలాలా" అర్థంలో భేదాభిప్రాయం ఉంది. కొందరి అభిప్రాయం ప్రకారం "కలాలా" అంటే, సంతానం లేని, తండ్రీ తాతలూ జీవించిలేని వ్యక్తి. ఇంకా కొందరు కేవలం సంతానం లేకుండా మరణించే వ్యక్తినే "కలాలా" అంటారు. కాని చాలామంది షరీయత్తువేత్తలు మొదటి సందర్భానికే వర్తించే హజ్రత్ అబూబక్ర్ (రజిఅన్) అభిప్రాయాన్ని స్వీకరించారు. స్వయంగా ఖురాను నుండి కూడా దీనికి సమర్థన లభిస్తుంది. ఎందుకంటే, ఇక్కడ 'కలాలా' యొక్క సోదరిని సగం ఆస్తికి వారసులుగా నిర్ణయించటం జరిగింది. వాస్తవానికి ఒకవేళ "కలాలా" యొక్క తండ్రి జీవించివుంటే, సోదరికి అసలు ఏ భాగమూ లభించదు.

104. మృతునితో పాటు ఒకే తల్లిదండ్రులకు లేక కేవలం ఒకే తండ్రికి పుట్టిన సోదర సోదరీమణుల వారసత్వపు ఆస్తి ఇక్కడ ప్రస్తావించబడింది, హజ్రత్ అబూబక్ర్ (రజిఅన్) ఒకసారి ఒక ఉపన్యాసంలో ఈ అర్థాన్ని విశద పరిచారు. ప్రత్యక్ష సహచరులలో ఎవరూ దీనితో విభేదించలేదు. ఈ కారణం వల్ల ఇది అందరూ ఏకీభవించిన సమస్య.

105. అంటే, షరీయత్తు ప్రకారం వారసులైన వారు ఎవరూ లేనిపక్షంలో, సోదరుడు ఆమె పూర్తి ఆస్తికి వారసుడౌతాడు. ఒకవేళ షరీయత్తు ప్రకారం వారసులైన వారు ఉంటే, ఉదాహరణకు భర్త. అతని భాగం పంచిన తరువాత మిగిలిన మొత్తం ఆస్తి సోదరునికి లభిస్తుంది.

106. ఈ ఉత్తరువే ఇద్దరికంటే ఎక్కువమంది సోదరీమణులకు కూడా వర్తిస్తుంది.

ఆయతులు 120 | # 5. అల్ మాఇద | అవతరణ మదీనాలో

٥ سُوۡرَةُ الۡمَآئِدَةِ مَدَنِيَّةٌ ١١٢

اٰياتها ١٢٠ | ركوعاتها ١٦

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○

يٰۤاَيُّهَا الَّذِيۡنَ اٰمَنُوۡۤا اَوۡفُوۡا بِالۡعُقُوۡدِ ؕ اُحِلَّتۡ لَـكُمۡ بَهِيۡمَةُ الۡاَنۡعَامِ اِلَّا مَا يُتۡلٰى عَلَيۡكُمۡ غَيۡرَ مُحِلِّى الصَّيۡدِ وَاَنۡتُمۡ حُرُمٌ ؕ اِنَّ اللّٰهَ يَحۡكُمُ مَا يُرِيۡدُ ①

يٰۤاَيُّهَا الَّذِيۡنَ اٰمَنُوۡا لَا تُحِلُّوۡا شَعَآئِرَ اللّٰهِ وَلَا الشَّهۡرَ الۡحَـرَامَ وَلَا الۡهَدۡىَ وَلَا الۡقَلَۤائِدَ وَلَاۤ آٰمِّيۡنَ الۡبَيۡتَ الۡحَـرَامَ يَبۡتَغُوۡنَ فَضۡلًا مِّنۡ رَّبِّهِمۡ وَرِضۡوَانًا ؕ وَاِذَا حَلَلۡتُمۡ فَاصۡطَادُوۡا ؕ وَلَا يَجۡرِمَنَّكُمۡ شَنَاٰنُ قَوۡمٍ اَنۡ صَدُّوۡكُمۡ عَنِ الۡمَسۡجِدِ الۡحَـرَامِ اَنۡ تَعۡتَدُوۡا ‌ۘ وَتَعَاوَنُوۡا عَلَى الۡبِرِّ وَالتَّقۡوٰى ‌ۖ وَلَا تَعَاوَنُوۡا عَلَى الۡاِثۡمِ وَالۡعُدۡوَانِ ‌ۖ وَاتَّقُوا اللّٰهَ ؕ اِنَّ اللّٰهَ شَدِيۡدُ الۡعِقَابِ ②

المنزل ٢ — الربع

1 విశ్వాసులారా! కట్టుబాట్లను పూర్తిగా పాటించండి.[1] మీ కొరకు పశువులను పోలిన జంతువులన్నీ ధర్మసమ్మతం (హలాల్) చెయ్యబడ్డాయి[2]– ముందు మీకు తెలుపబడబోయేవి తప్ప. కాని "ఇహ్రామ్" స్థితిలో వేటను మీ కొరకు ధర్మసమ్మతం చేసుకోకండి. నిస్సందేహంగా అల్లాహ్ తాను కోరిన ఆజ్ఞను జారీ చేస్తాడు.

2 విశ్వసించిన ప్రజలారా! దైవభక్తి చిహ్నాలను అగౌరవపరచకండి[3]– నిషిద్ధ మాసాలలో ఏ మాసాన్నీ ధర్మ సమ్మతం చేసుకోకండి. ఖుర్బానీ పశువులపై చెయ్యి చేసుకోకండి. అల్లాహ్ మొక్కుబడికి సూచనగా మెడలలో పట్టెడలు కలిగివున్న జంతువులను ముట్టుకోకండి. తమ ప్రభువు అనుగ్రహాన్ని, ఆయన సంతోషాన్ని అన్వేషిస్తూ పవిత్ర మందిరం (కాబా) వైపునకు పోయేవారి జోలికి పోకండి. అయితే ఇహ్రామ్ స్థితి సమాప్తమయిన తరువాత మీరు వేటాడవచ్చు – చూడండి! మిమ్మల్ని మస్జిదె హరామ్‌కు పోనియ్యకుండా ఒక వర్గంవారు నిరోధించారని వారిపై ఆగ్రహించి, ఆవేశంలో మీరూ వారిపై అనుచితమైన దౌర్జన్యానికి పాల్పడకండి.[4] కాని మంచికి, దైవభక్తికి సంబంధించిన పనులలో అందరితోనూ సహకరించండి. పాపకార్యాలలో అత్యాచారాలలో ఎవరితోనూ సహకరించకండి. అల్లాహ్‌కు భయపడండి. ఆయన శిక్ష బహు కఠినమైనది.

1. అంటే, మీపై విధించబడిన హద్దులనూ, నిబంధనలనూ పాటించండి.
2. 'అన్ఆమ్' (పశువులు) అనే పదం అరబ్బీ భాషలో ఒంటె, ఆవు, గొఱ్ఱె, మేకల కొరకు వాడబడుతుంది. 'బహీమ' అనే పదం – మేసే ప్రతి చతుష్పాదికి వర్తిస్తుంది. "పశువుల వంటి మేసే చతుష్పాదులు మీకు హలాల్ చెయ్యబడ్డాయి." అంటే పశువులను పోలివుండీ మేసే జంతువులన్నీ ధర్మసమ్మతం చెయ్యబడ్డాయి అని భావం. అంటే, కోరపళ్ళు లేనివి, మాంసాహారానికి బదులుగా శాకాహారాన్ని తినేవి, ఇతర జంతుసంబంధమైన ప్రత్యేకతలలో పశువులను పోలి వున్నవి. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్), క్రూరమృగాలనూ, వేటాడే పక్షులనూ, మృతకళేబరాలను తినే జంతువులనూ నిషిద్ధాలుగా నిర్ణయించిన తమ ఆజ్ఞలలో దీనిని వివరించారు.

حُرِّمَتۡ عَلَيۡكُمُ الۡمَيۡتَةُ وَالدَّمُ وَ لَحۡمُ الۡخِنۡزِيۡرِ وَ مَاۤ اُهِلَّ لِغَيۡرِ اللّٰهِ بِهٖ وَالۡمُنۡخَنِقَةُ وَالۡمَوۡقُوۡذَةُ وَ الۡمُتَرَدِّيَةُ وَالنَّطِيۡحَةُ وَ مَاۤ اَكَلَ السَّبُعُ اِلَّا مَا ذَكَّيۡتُمۡ وَمَا ذُبِحَ عَلَى النُّصُبِ وَاَنۡ تَسۡتَقۡسِمُوۡا بِالۡاَزۡلَامِ‌ ذٰ لِكُمۡ فِسۡقٌ‌ اَلۡيَوۡمَ يَٮِٕسَ الَّذِيۡنَ كَفَرُوۡا مِنۡ دِيۡنِكُمۡ فَلَا تَخۡشَوۡهُمۡ وَاخۡشَوۡنِ‌ اَلۡيَوۡمَ اَكۡمَلۡتُ لَـكُمۡ دِيۡنَكُمۡ وَاَتۡمَمۡتُ عَلَيۡكُمۡ نِعۡمَتِىۡ وَرَضِيۡتُ لَـكُمُ الۡاِسۡلَامَ دِيۡنًا‌ فَمَنِ اضۡطُرَّ فِىۡ مَخۡمَصَةٍ غَيۡرَ مُتَجَانِفٍ لِّاِثۡمٍ‌ فَاِنَّ اللّٰهَ غَفُوۡرٌ رَّحِيۡمٌ ③

3 మీకు ఇవి నిషేధించబడినాయి– మృతపశువు, రక్తము, పంది మాంసము, అల్లాహ్ పేరుతో కాక మరెవరి పేరుతోనైనా 'జిబహ్' చెయ్యబడిన పశువు, ఊపిరాడక లేక దెబ్బతిని, ఎత్తు ప్రదేశం నుండి పడి లేక దేన్నయినా ఢీకొని లేక అడవి మృగం చీల్చగా మరణించిన జంతువు – సజీవంగా ఉండి మీరు 'జిబహ్' చేసినది తప్ప– బలిపీఠంపై వధింపబడినది.[5] ఇంకా పాచికల ద్వారా అదృష్టం తెలుసుకోవటం కూడ మీకు నిషేధించబడింది. ఇవన్నీ పాపకృత్యాలు. ఈనాడు అవిశ్వాసులు మీ ధర్మం గురించి పూర్తిగా ఆశలు వదులుకున్నారు. కనుక మీరు వారికి భయపడకండి.[6] నాకు భయపడండి. ఈనాడు నేను మీ ధర్మాన్ని మీకొరకు పరిపూర్ణం చేశాను. మీపై నా అనుగ్రహాన్ని పూర్తిచేశాను. మీ కొరకు ఇస్లామ్‌ను మీ ధర్మంగా అంగీకరించాను.[7] (కనుక మీకు విధించబడిన హరామ్, హలాల్ నియమాలను పాటించండి) అయితే, ఎవరైనా ఆకలివల్ల గత్యంతరం లేని పరిస్థితిలో, పాపం వైపునకు మొగ్గకుండా వీటిలోని ఏ వస్తువునైనా తిన్నట్లయితే, అల్లాహ్ క్షమించేవాడూ,[8] కరుణించేవాడూను.

3. ఒక విధానానికి లేక ఒక విశ్వాసానికి లేక ఒక ఆలోచన ఆచరణల పంథాకు లేక ఒక వ్యవస్థకు ప్రాతినిధ్యం వహించే ప్రతి వస్తువు దాని యొక్క 'చిహ్నం' (షిఆర్) అనబడుతుంది. ఎందుకంటే, అది దానికి సంకేతంగా లేక గుర్తుగా పనిచేస్తుంది. ప్రభుత్వ పతాకాలు, సైన్యం, పోలీసులు మొదలైన వారి యూనిఫారము, నాణేలు, కరెన్సీనోట్లు, స్టాంపులు ప్రభుత్వాల చిహ్నాలు. చర్చి, బలిపీఠం, శిలువ క్రైస్తవ మతానికి చిహ్నాలు. పిలకజుట్టు, జంధ్యం, దేవాలయం బ్రాహ్మణత్వం చిహ్నాలు. కేశబంధం, కంకణం, కృపాణం మొదలైనవి సిక్కు మతం చిహ్నాలు. సుత్తి, కొడవలి కమ్యూనిజం చిహ్నాలు. ఈ అన్ని విధానాలు తమ తమ అనుయాయులను తమ ఈ చిహ్నాలను గౌరవించండి అని కోర్తాయి. ఒకవేళ ఒక వ్యక్తి ఒక వ్యవస్థ చిహ్నాలలోని దేనినయినా అవమానపరిస్తే, అతడు అసలు ఆ వ్యవస్థపట్ల శత్రుత్వం కలిగివున్నాడని ఇది సూచిస్తుంది. ఇంకా ఒకవేళ ఆ అవమానపరిచేవాడు ఆ వ్యవస్థతో సంబంధం కలిగి ఉన్నవాడైతే, అతడు దానిని పరిత్యజించాడని, దానిపై తిరుగుబాటు చేస్తున్నాడని అతని ఈ చర్య సూచిస్తుంది. "అల్లాహ్ చిహ్నాలు" అంటే బహుదైవారాధన, అవిశ్వాసము, నాస్తికత్వాలకు ప్రతికూలంగా స్వచ్ఛమైన దైవభక్తి ప్రతిబింబాలైన సమస్త సంకేతాలూ, నిదర్శనాలూ అని భావం.

4. అవిశ్వాసులు ఆ సమయంలో ముస్లిములను కాబాను సందర్శించకుండా నిరోధించారు, ముస్లిములను హజ్‌కు కూడా పోకుండా చేశారు. ఇందుకని, ఇస్లామీ రాజ్య సరిహద్దులకు దగ్గరగావున్న అవిశ్వాస జాతుల మార్గాలను మనం కూడా మూసివెయ్యాలి, హజ్ కాలంలో వారి యాత్రికుల బృందాలపై మెరుపుదాడులు చెయ్యటం ప్రారంభించాలి అనే అభిప్రాయం ముస్లిములకు కలిగింది. కాని, అల్లాహ్ ఈ ఆయత్‌ను అవతరింపజేసి వారిని ఈ అభిప్రాయాన్ని ఉపసంహరించుకునేలా చేశాడు.

5. అసలు 'నుసుబ్' అనే పదం వాడబడింది. దైవేతరులకు మొక్కుబడిని సమర్పించుకోవటానికి ప్రజలు ప్రత్యేకించుకున్న స్థలాలు అని దీని భావం – అక్కడ రాతి విగ్రహం కాని, కొయ్య విగ్రహం కాని ఉన్నాసరే, లేకపోయినా సరే. ఉర్దూ భాషలో ఈ అర్థానికి సరిపోయే పదం 'ఆస్తాన'. ఇది ఒక మహనీయుడు లేక ఒక

4 ప్రజలు తమ కొరకు ఏది హలాల్ చెయ్యబడింది అని అడుగుతారు. ఇలా బోధించు: పరిశుభ్రమైన వస్తువులన్నీ మీ కొరకు హలాల్ చెయ్యబడ్డాయి.[9] మీరు తర్ఫీదు ఇచ్చిన వేట జంతువులు - దేవుడు మీకు ప్రసాదించిన జ్ఞానం ఆధారంగా మీరు వేటాడే తర్ఫీదును ఇచ్చినవి-అవి మీ కొరకు పట్టిన జంతువును కూడ మీరు తినవచ్చు.[10] కాని దానిపై అల్లాహ్ పేరును ఉచ్చరించండి.[11] అల్లాహ్ శాసనాన్ని ఉల్లంఘించేందుకు భయపడండి. లెక్క తీసుకోవాలంటే అల్లాహ్‌కు ఎంతోసేపు పట్టదు.

يَسْـَٔلُوْنَكَ مَاذَآ اُحِلَّ لَهُمْ ؕ قُلْ اُحِلَّ لَكُمُ الطَّيِّبٰتُ ۙ وَ مَا عَلَّمْتُمْ مِّنَ الْجَوَارِحِ مُكَلِّبِيْنَ تُعَلِّمُوْنَهُنَّ مِمَّا عَلَّمَكُمُ اللّٰهُ ۫ فَكُلُوْا مِمَّاۤ اَمْسَكْنَ عَلَيْكُمْ وَ اذْكُرُوا اسْمَ اللّٰهِ عَلَيْهِ ۪ وَ اتَّقُوا اللّٰهَ ؕ اِنَّ اللّٰهَ سَرِيْعُ الْحِسَابِ ۝۴

దేవతతో లేక ముష్రిక్కులకు చెందిన ఒక ప్రత్యేక విశ్వాసంతో సంబంధం కలిగివుంటుంది. అటువంటి స్థలాలలో జిబహ్ లేక బలిచెయ్యబడిన జంతువు కూడా నిషిద్ధం.

6. 'ఈనాడు' అంటే భావం, ఒక ప్రత్యేకమైన రోజుగాని, తేదీగాని కాదు. ఈ ఆయతులు అవతరించినప్పటి యుగం లేక కాలం అని భావం. మన భాషలో కూడా 'ఈనాడు' అనే పదం వర్తమాన కాలం కొరకు సాధారణంగా చెప్పబడుతుంది. "అవిశ్వాసులు మీ ధర్మం గురించి పూర్తిగా ఆశలు వదులుకున్నారు" అంటే, ఇప్పుడు మీ ధర్మం ఒక శాశ్వత వ్యవస్థగా రూపొందింది, స్వయంగా తన అధికార శక్తితో స్థాపితమైంది. అవిశ్వాసులు దానిని రూపుమాపే విషయంలో, మిమ్మల్ని మళ్ళీ పూర్వపు అజ్ఞానం వైపునకు మళ్ళించటంపట్ల ఆశలు వదులుకున్నారు అని భావం. "కనుక మీరు వారికి భయపడకండి, నాకు భయపడండి." అంటే, ఈ ధర్మానికి సంబంధించిన ఆజ్ఞలు, ఉపదేశాల ప్రకారం నడవటంలో, ఏ అవిశ్వాస శక్తి ప్రాబల్యం, జోక్యంల ప్రమాదంగాని, దురాక్రమణ, అవరోధాల ప్రమాదంగాని మీకు లేదు. ఇప్పుడు మీరు దైవానికి భయపడాలి - ఆయన ఆజ్ఞలను పాలించటంలో మీరు ఏదన్నా లోపం చేస్తే మీతో మృదువుగా వ్యవహరించటానికి మీ దగ్గర ఏ కారణమూ ఉండదు.

7. ధర్మాన్ని పరిపూర్ణం చెయ్యటం అంటే భావం దానిని ఒక శాశ్వతమైన ఆలోచన, ఆచరణల వ్యవస్థగా, ఒక పరిపూర్ణమైన నాగరిక, సాంస్కృతిక వ్యవస్థగా రూపొందించటం. అందులో జీవితం యొక్క మొత్తం సమస్యలకు సూత్రబద్ధమైన లేదా వివరణాత్మకమైన పరిష్కారం ఉండటం. సన్మార్గాన్ని, మార్గదర్శకత్వాన్ని పొందే విషయంలో ఎట్టి పరిస్థితులలోనూ దాని బయటకు పోయే అవసరం ఉత్పన్నం కాకుండా ఉండటం. అనుగ్రహాన్ని పూర్తి చెయ్యటం అంటే భావం, సన్మార్గవరాన్ని పూర్తిచెయ్యటం, ఇస్లామ్‌ను ధర్మంగా స్వీకరించటం అంటే భావం నా విధేయతను, నా దాస్యాన్ని అవలంబిస్తాము అని మీరు చేసిన ప్రమాణాన్ని మీ కృషి మీ ఆచరణలద్వారా నిజమైనదిగా, చిత్తశుద్ధితో కూడినదిగా నిరూపించారు. ఇందుకని నేను దానిని నా అంగీకారానికి యోగ్యమైనదిగా పరిగణించాను. ఇంకా మిమ్మల్ని ఆచరణలో ఏ స్థితికి తీసుకొని వెళ్ళానంటే, ఇక నా విధేయతా దాస్యాల కాడి తప్ప మరెవరి విధేయతా దాస్యాల కాడి మీ మెడలపై లేదు. ఇక విశ్వాసం రీత్యా మీరు నాకు విధేయులైనట్లు (ముస్లిము) నిత్యజీవితంలో కూడా నాకు తప్ప మరొకరికి విధేయులుగా ఉండవలసిన అవసరం మీకుఉండదు.

8. వ్యాఖ్యానం కొరకు బఖర సూరాలో 52వ వివరణ చూడండి.

9. అడిగేవారి ఉద్దేశ్యం ఏమిటంటే, సమస్త హలాల్ వస్తువుల వివరాలు వారికి తెలుపబడాలి. వారు వాటిని తప్ప ప్రతి వస్తువునూ హరాముగా భావించే నిమిత్తం సమాధానంగా ఖురాను హరాము వస్తువుల వివరాలను తెలిపింది. తరువాత పరిశుభ్రమైన వస్తువులన్నీ హలాలు అనే సాధారణ ఉపదేశం చేసి వదలిపెట్టివేసింది. ఈ విధంగా ప్రాచీన మత దృక్పథం పూర్తిగా తలక్రిందులై పోయింది. ప్రాచీన మత దృక్పథం ఏమిటంటే, సమస్తమూ హరామే, హలాలుగా నిర్ణయింపబడినవి తప్ప. దీనికి భిన్నంగా ఖురాను నిర్ణయించిన సూత్రం ఏమిటంటే సమస్తమూ హలాలే, హరాముగా నిర్ణయింపబడినవి తప్ప అపరిశుద్ధ వస్తువులను హలాలుగా

5 ఈనాడు మీ కొరకు పరిశుభ్రమైన వస్తువులన్నీ హలాల్ చెయ్యబడ్డాయి. గ్రంథ ప్రజల భోజనం మీకు హలాల్; మీ భోజనం వారికి హలాల్.[12] సుచరితలైన స్త్రీలు కూడ మీకు హలాల్, వారు విశ్వాసుల వర్గానికి చెందిన వారైనా సరే లేక మీకు పూర్వం గ్రంథం పొందిన జాతులకు చెందినవారైనా సరే.[13] కాని మీరు వారి మహరును చెల్లించి వివాహం చేసుకుని వారికి రక్షకులు కావాలి. అంతేగాని, వారితో స్వేచ్ఛా కామక్రీడలకు పాల్పడటం గాని లేక దొంగచాటు సంబంధాలను పెంచుకోవటంగాని చెయ్యరాదు. విశ్వాస వైఖరిని అవలంబించటానికి తిరస్కరించేవాడు తన జీవితంలో సాధించినదంతా వ్యర్థం అవుతుంది. ఇంకా అతడు పరలోకంలో దివాలా తీస్తాడు.

اَلۡيَوۡمَ اُحِلَّ لَـكُمُ الطَّيِّبٰتُ ؕ وَطَعَامُ الَّذِيۡنَ
اُوۡتُوا الۡكِتٰبَ حِلٌّ لَّـكُمۡ ۖ وَطَعَامُكُمۡ حِلٌّ لَّهُمۡ ۚ
وَالۡمُحۡصَنٰتُ مِنَ الۡمُؤۡمِنٰتِ وَالۡمُحۡصَنٰتُ مِنَ
الَّذِيۡنَ اُوۡتُوا الۡكِتٰبَ مِنۡ قَبۡلِكُمۡ اِذَاۤ
اٰتَيۡتُمُوۡهُنَّ اُجُوۡرَهُنَّ مُحۡصِنِيۡنَ غَيۡرَ
مُسٰفِحِيۡنَ وَلَا مُتَّخِذِىۡۤ اَخۡدَانٍ ؕ وَمَنۡ
يَّكۡفُرۡ بِالۡاِيۡمَانِ فَقَدۡ حَبِطَ عَمَلُهٗ ۚ وَهُوَ فِى
الۡاٰخِرَةِ مِنَ الۡخٰسِرِيۡنَ ۝٥ ع

చేసే ప్రయత్నం చెయ్యకుండా ఉండేందుకుగాను హలాలు అయ్యేందుకు పరిశుభ్రతా నియమాన్ని విధించింది. ఇక వస్తువుల 'పరిశుభ్రత' నిర్ణయం ఎలా జరగాలి అనే దానికి సమాధానం ఇది – షరీయత్తు నియమాలలో ఏ ఒక్క నియమం ప్రకారమైనా 'అపరిశుభ్రమైనవి'గా నిర్ణయింపబడినవి లేక మానవుని సాధారణ అభిరుచికి వెగటుగా ఉండే వస్తువులు లేక సంస్కారవంతుడైన మనిషి సాధారణంగా తన సహజ పరిశుభ్రతా భావానికి విరుద్ధంగా పరిగణించేవి. ఇవి తప్ప మిగతావన్నీ పరిశుభ్రమైనవే.

10. వేట జంతువులు అంటే అర్థం కుక్క, చిరుతపులి, డేగ, ఇంకా మానవుడు వేటకొరకు వినియోగించే అన్ని క్రూర జంతువులు, పక్షులు. శిక్షణ పొందిన జంతువు యొక్క ప్రత్యేకత ఏమిటంటే, అది తాను వేటాడిన దానిని మామూలు క్రూర జంతువుల మాదిరిగా చీల్చి తినివెయ్యదు. తన యజమాని కొరకు పట్టుకుని ఉంచు తుంది. ఈ కారణంగానే మామూలు క్రూర జంతువులు చీల్చిన జంతువు హరామ్. శిక్షణ గరిపిన క్రూర జంతువుల వేట హలాల్.

11. అంటే, వేట జంతువును వేటకొరకు వదిలే సమయంలో, బిస్మిల్లాహ్ (అల్లాహ్ పేరుతో) అని ఉచ్చరించండి. ఈ ఆయత్ ద్వారా తెలిసిన విషయం ఏమిటంటే, వేట జంతువును వేట కొరకు విడిచేటప్పుడు అల్లాహ్ పేరును స్మరించటం అవసరం. దీని తరువాత ఒకవేళ వేట సజీవంగా దొరికితే, అప్పుడు అల్లాహ్ పేరుతో దానిని జిబహ్ చెయ్యాలి. ఒకవేళ అది సజీవంగా లభించకపోతే జిబహ్ చేయకుండానే అది హలాలు అవుతుంది. ఎందుకంటే, ప్రారంభంలోనే వేట జంతువును వేట కొరకు విడిచిపెడుతూ అల్లాహ్ పేరును ఉచ్చరించటం జరిగింది. ఇదే ఆజ్ఞ బాణానికి కూడా వర్తిస్తుంది.

12. గ్రంథ ప్రజల భోజనంలో వారు జిబహ్ చేసింది కూడా చేరివుంది. మన భోజనం వారికొరకు, వారి భోజనం మన కొరకు హలాలు అవుతుంది అనే దాని భావం ఏమిటంటే, మన మధ్య వారి మధ్య తినటం త్రాగటం విషయంలో ఏ ఆటంకమూ లేదు. అంటరానితనం అంటూ ఏదీ లేదు. మనం వారితో కలసి తినవచ్చు. వారు మనతో కలసి తినవచ్చు. కాని ఈ సాధారణ అనుమతి ఇచ్చే ముందు "మీ కొరకు పరిశుభ్రమైన వస్తువులు హలాలు చెయ్యబడ్డాయి" అనే వాక్యాన్ని తిరిగి చెప్పటం జరిగింది. దీనిద్వారా తెలిసేదేమిటంటే, ఒకవేళ గ్రంథం కలవారు, షరీయత్తు దృష్టిలో అవసరమైన పరిశుద్ధత, పరిశుభ్రతలకు సంబంధించిన నియమాలను పాటించకపోతే లేక ఒకవేళ వారి భోజనంలో హరాము వస్తువులు కలిసివుంటే, దానికి దూరంగా ఉండాలి. ఉదాహరణకు, వారు గనక అల్లాహ్ పేరు ఉచ్చరించకుండా ఏదైనా పశువును జిబహ్ చేస్తే లేక దానిపై అల్లాహ్ పేరుగాక మరొకరి పేరును పలికితే, దానిని తినటం మన కొరకు ధర్మసమ్మతం కాదు.

13. దీని భావం, యూదులు, క్రైస్తవులు అని. వారి స్త్రీలను మాత్రమే వివాహం (నికాహ్) చేసుకునే అనుమతి ఇవ్వబడింది. దానితో పాటు వారు ముహ్సనాత్ (సురక్షితలు) అయి వుండాలి అనే షరతు కూడా విధించబడింది. అంటే విచ్చలవిడిగా

يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْۤا اِذَا قُمْتُمْ اِلَى الصَّلٰوةِ
فَاغْسِلُوْا وُجُوْهَكُمْ وَاَيْدِيَكُمْ اِلَى الْمَرَافِقِ وَ
امْسَحُوْا بِرُءُوْسِكُمْ وَ اَرْجُلَكُمْ اِلَى الْكَعْبَيْنِ ؕ وَ
اِنْ كُنْتُمْ جُنُبًا فَاطَّهَّرُوْا ؕ وَ اِنْ كُنْتُمْ مَّرْضٰۤى اَوْ
عَلٰى سَفَرٍ اَوْ جَآءَ اَحَدٌ مِّنْكُمْ مِّنَ الْغَآئِطِ
اَوْلٰمَسْتُمُ النِّسَآءَ فَلَمْ تَجِدُوْا مَآءً فَتَيَمَّمُوْا
صَعِيْدًا طَيِّبًا فَامْسَحُوْا بِوُجُوْهِكُمْ وَ اَيْدِيْكُمْ
مِّنْهُ ؕ مَا يُرِيْدُ اللّٰهُ لِيَجْعَلَ عَلَيْكُمْ مِّنْ حَرَجٍ وَّ
لٰكِنْ يُّرِيْدُ لِيُطَهِّرَكُمْ وَ لِيُتِمَّ نِعْمَتَهٗ عَلَيْكُمْ
لَعَلَّكُمْ تَشْكُرُوْنَ ۝٦ وَ اذْكُرُوْا نِعْمَةَ اللّٰهِ عَلَيْكُمْ
وَ مِيْثَاقَهُ الَّذِيْ وَاثَقَكُمْ بِهٖۤ ۙ اِذْ قُلْتُمْ سَمِعْنَا وَ
اَطَعْنَا ؗ وَ اتَّقُوا اللّٰهَ ؕ اِنَّ اللّٰهَ عَلِيْمٌۢ بِذَاتِ
الصُّدُوْرِ ۝٧ يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا كُوْنُوْا قَوّٰمِيْنَ
لِلّٰهِ شُهَدَآءَ بِالْقِسْطِ ؗ وَ لَا يَجْرِمَنَّكُمْ شَنَاٰنُ قَوْمٍ
عَلٰۤى اَلَّا تَعْدِلُوْا ؕ اِعْدِلُوْا ۫ هُوَ اَقْرَبُ لِلتَّقْوٰى ؗ
وَ اتَّقُوا اللّٰهَ ؕ اِنَّ اللّٰهَ خَبِيْرٌۢ بِمَا تَعْمَلُوْنَ ۝٨
وَعَدَ اللّٰهُ الَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا الصّٰلِحٰتِ ۙ لَهُمْ
مَّغْفِرَةٌ وَّ اَجْرٌ عَظِيْمٌ ۝٩ وَ الَّذِيْنَ كَفَرُوْا
وَكَذَّبُوْا بِاٰيٰتِنَاۤ اُولٰٓئِكَ اَصْحٰبُ الْجَحِيْمِ ۝١٠

**6** విశ్వసించిన ప్రజలారా! మీరు నమాజు కొరకు లేచినప్పుడు, మీ ముఖాలను, చేతులను మోచేతుల వరకు ప్రక్షాళనం చేసుకోండి; తలపై చేతులతో రాయండి, కాళ్ళను చీలమండ వరకు కడుక్కోండి.[14] మీరు అపరిశుద్ధంగా ఉంటే, స్నానం చేసి పరిశుద్ధులు అవ్వండి. మీరు గనక అస్వస్థులైతే లేక ప్రయాణస్థితిలో ఉంటే లేక మీలో ఎవరైనా కాలకృత్యాలు తీర్చుకుని వస్తే లేక మీరు స్త్రీలను ముట్టుకుంటే, అప్పుడు నీరు లభించని పక్షంలో పరిశుభ్రమైన మట్టితో విధిని నిర్వహించండి దానిపై చేతులతో కొట్టి మీ ముఖాలపై, చేతులపై రాయండి.[15] మీకు జీవితాన్ని కష్టతరం చేయటం అల్లాహ్ అభిమతం కాదు. కాని ఆయన మిమ్మల్ని పరిశుద్ధం చేయగోరుతున్నాడు, మీపై తన అనుగ్రహాన్ని పూర్తిచేయగోరుతున్నాడు మీరు కృతజ్ఞులవుతారేమో అని.

**7-10** అల్లాహ్ మీకు ప్రసాదించిన వరాన్ని జ్ఞాపకం ఉంచుకోండి. ఆయన మీనుండి తీసుకున్న దృఢమైన ప్రమాణాన్ని మరువకండి. అంటే, మీరు ఇలా అన్నారు: "మేము విన్నాము, విధేయత చూపటానికి అంగీకరించాము." అల్లాహ్‌కు భయపడండి. అల్లాహ్‌కు హృదయాలలో ఉన్న మర్మాలు కూడా తెలుసు. విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్ కొరకు సత్యంపై స్థిరంగా ఉండండి. న్యాయానికి సాక్షులుగా ఉండండి. (ఏదైనా) వర్గంతో ఉన్న వైరం కారణంగా మీరు ఆవేశానికి లోనయి న్యాయాన్ని త్యజించకండి. న్యాయం చెయ్యండి. ఇది దైవభక్తికి సరితూగినది. అల్లాహ్‌కు భయపడుతూ వ్యవహరించండి. మీరు చేసేదంతా అల్లాహ్‌కు పూర్తిగా తెలుసు. విశ్వసించి మంచిపనులు చేసేవారికి అల్లాహ్ వాగ్దానం చేశాడు, వారి పాపాలకు క్షమాభిక్ష, వారికి గొప్ప బహుమానం లభిస్తాయని. ఇక అవిశ్వాసానికి పాల్పడేవారు, అల్లాహ్ ఆయతులను నిరాకరించేవారు నరకానికి పోతారు.

---

తిరిగే స్త్రీలు కాకూడదు. ఇంకా తరువాతి వాక్యంలో యూదు లేక క్రైస్తవ భార్య కొరకు స్వధర్మాన్ని పోగొట్టుకోకూడదు అనే హెచ్చరిక కూడా చెయ్యబడింది.

14. మహాప్రవక్త (సఅసమ్) ఈ ఆజ్ఞకు చేసిన వివరణ ప్రకారం తెలిసేదేమిటంటే, ముఖం కడుక్కోవటంలో, పుక్కిలించి ఉయ్యటం, ముక్కును పరిశుభ్రం చెయ్యటం కూడా చేరివున్నాయని. ఇది లేకుండా నోటి పరిశుభ్రత పూర్తికాదు. చెవి, తలకు చెందిన ఒక భాగం కాబట్టి, తలపై చేతులతో రాయటం అంటే చెవుల లోపలి, బయటి భాగాలపై చేతులతో రాయటం కూడా చేరి ఉంది. ఇంకా వుజూ ప్రారంభానికి ముందు చేతులు కడుక్కోవాలి. ఎందుకంటే మనిషి వుజూచేసే చేతులను మొదట పరిశుభ్రం చేసుకోవాలి.

يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا اذْكُرُوْا نِعْمَتَ اللّٰهِ
عَلَيْكُمْ اِذْ هَمَّ قَوْمٌ اَنْ يَّبْسُطُوْۤا اِلَيْكُمْ
اَيْدِيَهُمْ فَكَفَّ اَيْدِيَهُمْ عَنْكُمْ ۚ وَاتَّقُوا اللّٰهَ ؕ
وَعَلَى اللّٰهِ فَلْيَتَوَكَّلِ الْمُؤْمِنُوْنَ ﴿۱۱﴾ وَلَقَدْ اَخَذَ
اللّٰهُ مِيْثَاقَ بَنِيْۤ اِسْرَآءِيْلَ ۚ وَبَعَثْنَا مِنْهُمُ
اثْنَيْ عَشَرَ نَقِيْبًا ؕ وَقَالَ اللّٰهُ اِنِّيْ مَعَكُمْ ؕ
لَئِنْ اَقَمْتُمُ الصَّلٰوةَ وَاٰتَيْتُمُ الزَّكٰوةَ وَاٰمَنْتُمْ
بِرُسُلِيْ وَعَزَّرْتُمُوْهُمْ وَاَقْرَضْتُمُ اللّٰهَ قَرْضًا
حَسَنًا لَّاُكَفِّرَنَّ عَنْكُمْ سَيِّاٰتِكُمْ وَلَاُدْخِلَنَّكُمْ
جَنّٰتٍ تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ ۚ فَمَنْ كَفَرَ
بَعْدَ ذٰلِكَ مِنْكُمْ فَقَدْ ضَلَّ سَوَآءَ السَّبِيْلِ ﴿۱۲﴾
فَبِمَا نَقْضِهِمْ مِّيْثَاقَهُمْ لَعَنّٰهُمْ وَجَعَلْنَا قُلُوْبَهُمْ
قٰسِيَةً ۚ يُحَرِّفُوْنَ الْكَلِمَ عَنْ مَّوَاضِعِهٖ ۙ وَ
نَسُوْا حَظًّا مِّمَّا ذُكِّرُوْا بِهٖ ۚ وَلَا تَزَالُ تَطَّلِعُ
عَلٰى خَآئِنَةٍ مِّنْهُمْ اِلَّا قَلِيْلًا مِّنْهُمْ فَاعْفُ
عَنْهُمْ وَاصْفَحْ ؕ اِنَّ اللّٰهَ يُحِبُّ الْمُحْسِنِيْنَ ﴿۱۳﴾

**11** విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్ మీకు (మొన్న మొన్ననే) చేసిన ఆ మహోపకారాన్ని జ్ఞాపకం తెచ్చుకోండి. అప్పుడు ఒక వర్గం వారు మీపై చెయ్యి చేసుకోవాలని సంకల్పించారు. కాని అల్లాహ్ వారి చేతులను, మీపైకి లేవకుండా ఆపాడు.[16] అల్లాహ్‌కు భయపడుతూ పనిచెయ్యండి. విశ్వాసులు అల్లాహ్‌నే నమ్ముకోవాలి.

**12 - 13** అల్లాహ్ ఇస్రాయీలు సంతతినుండి దృఢమైన ప్రమాణాన్ని తీసుకున్నాడు. వారిలో పన్నెండు మందిని నాయకులుగా[17] నియమించాడు. ఇంకా వారితో ఇలా అన్నాడు: "నేను మీతో ఉన్నాను. మీరు గనక నమాజును స్థాపిస్తే, జకాత్ ఇస్తే, నా ప్రవక్తలను విశ్వసించి వారికి తోడ్పడితే, అల్లాహ్‌కు మంచి రుణాన్ని ఇస్తూవుంటే, నమ్మండి! నేను మీలోని చెడుగులను మీనుండి తుడిచివేస్తాను. ఇంకా మిమ్మల్ని క్రింద కాలువలు ప్రవహించే ఉద్యాన వనాలలోకి ప్రవేశింపజేస్తాను. అయితే, దీని తరువాత మీలో తిరస్కార వైఖరిని అవలంబించేవాడు వాస్తవానికి రుజుమార్గం[18] (సవా ఉస్సబీల్) తప్పినవాడౌతాడు." వారు తమ వాగ్దానాన్ని భంగ పరచిన కారణంగా మేము వారిని మా కారుణ్యానికి దూరంగా విసరివేశాము. వారి హృదయాలను కర్కశం చేశాము. ఇప్పుడు వారి స్థితి ఎలా ఉందంటే, వారు పదాలను తారుమారు చేసి వాటి అర్థాన్ని, సందర్భాన్ని పూర్తిగా మార్చివేస్తారు. వారికి ఇవ్వబడిన బోధలలో ఎక్కువ భాగాన్ని వారు మరచి పోయారు. అనుదినం వారు చేసే ఏదో ఒక ద్రోహాన్ని గురించి నీకు తెలుస్తూనే ఉంటుంది. వారిలో ఈ లోపం లేకుండా ఉన్నవారు బహు తక్కువ. (వారు ఈ స్థితికి దిగజారిపోయినప్పుడు, వారు ఏ దుర్మార్గాలు చేసినా, అది పూర్తిగా అనుకున్నదే) కనుక వారిని క్షమించండి. వారి చేష్టలను ఉపేక్షించండి. ఉదార స్వభావులను అల్లాహ్ ప్రేమిస్తాడు.

15. వ్యాఖ్యానం కొరకు నిసా సూరాలోని 41, 43 వివరణలను చూడండి.

16. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజిఅన్) ఉల్లేఖించిన ఈ సంఘటన సూచించబడింది : యూదుల వర్గం ఒకటి మహాప్రవక్త (సఅసమ్) నూ, ఆయన ముఖ్య సహచరులనూ భోజనానికి ఆహ్వానించింది. ఎందుకంటే, అకస్మాత్తుగా వారిపై విరుచుకుపడి, వారిని చంపి ఇస్లామ్‌ను రూపుమాపాలని రహస్యంగా ఆ వర్గం వారు కుట్రపన్నారు. కాని ఆ సమయంలో అల్లాహ్ అనుగ్రహం వల్ల మహాప్రవక్త (సఅసమ్)కు ఈ కుట్రను గురించి తెలిసినది. దానితో ఆయన భోజనానికి వెళ్ళలేదు.

14 ఇదేవిధంగా, 'మేము క్రైస్తవులం' అని చెప్పుకున్న వారి నుండి కూడా మేము దృఢమైన ప్రమాణం తీసుకున్నాము. కాని వారు తమకు బోధించబడిన విషయంలో ఒక పెద్ద భాగాన్ని విస్మరించారు. చివరకు మేము వారిమధ్య పరస్పర విరోధ, విద్వేష బీజాలను ప్రళయం వరకు ఉండేవిధంగా నాటాము. వారు ప్రపంచంలో ఏమేమి చేస్తూ ఉండేవారో, దానిని అల్లాహ్ వారికి చూపే ఒక సమయం అవశ్యం వస్తుంది.

15 - 16 గ్రంథ ప్రజలారా! మా ప్రవక్త మీవద్దకు విచ్చేశాడు. మీరు కప్పి పుచ్చుతూ ఉండిన దైవగ్రంథంలోని ఎన్నో విషయాలను ఆయన మీ ముందు బహిర్గతం చేస్తున్నాడు. ఇంకా ఎన్నో విషయాలను వదిలివేస్తున్నాడు.[19] మీ వద్దకు అల్లాహ్ తరఫు నుండి కాంతి వచ్చేసింది. సత్యం వైపునకు మార్గం చూపే ఒక గ్రంథం కూడా. దానిద్వారా అల్లాహ్ తన సంతోషం పొందగోరే వారికి శాంతి పథాలను చూపుతాడు. తన ఇచ్ఛానుసారం వారిని చీకట్ల నుండి వెలికితీసి వెలుగు వైపునకు తీసుకు వస్తాడు. ఇంకా వారిని రుజు మార్గం వైపునకు నడుపుతాడు.

17 మర్యమ్ కుమారుడైన మసీహ్‌యే దేవుడు అని అన్నవారు నిశ్చయంగా అవిశ్వాసానికి పాల్పడ్డారు. ప్రవక్తా! వారితో ఇలా అను: "అల్లాహ్ గనక మర్యము కొడుకైన మసీహ్‌నీ, ఆయన తల్లినీ, సమస్త భూలోకవాసులనూ నాశనం చెయ్యగోరితే, ఆయన తన ఈ సంకల్పాన్ని విరమించుకునేలా చేసే శక్తి ఎవరికుంది? అల్లాహ్ భూమికీ, ఆకాశాలకూ, వాటిమధ్య ఉన్న సమస్తానికీ ప్రభువు. తాను కోరిన దానిని సృష్టిస్తాడు.[20] ఆయన అధికారం ప్రతి వస్తువును లోబరచుకుని ఉంది."

وَ مِنَ الَّذِيْنَ قَالُوْۤا اِنَّا نَصٰرٰۤى اَخَذْنَا
مِيْثَاقَهُمْ فَنَسُوْا حَظًّا مِّمَّا ذُكِّرُوْا بِهٖ ۪
فَاَغْرَيْنَا بَيْنَهُمُ الْعَدَاوَةَ وَالْبَغْضَآءَ اِلٰى يَوْمِ
الْقِيٰمَةِ ؕ وَ سَوْفَ يُنَبِّئُهُمُ اللّٰهُ بِمَا كَانُوْا
يَصْنَعُوْنَ ﴿۱۴﴾ يٰۤاَهْلَ الْكِتٰبِ قَدْ جَآءَكُمْ
رَسُوْلُنَا يُبَيِّنُ لَكُمْ كَثِيْرًا مِّمَّا كُنْتُمْ تُخْفُوْنَ
مِنَ الْكِتٰبِ وَيَعْفُوْا عَنْ كَثِيْرٍ ؕ قَدْ جَآءَكُمْ
مِّنَ اللّٰهِ نُوْرٌ وَّ كِتٰبٌ مُّبِيْنٌ ﴿۱۵﴾ يَّهْدِيْ بِهِ
اللّٰهُ مَنِ اتَّبَعَ رِضْوَانَهٗ سُبُلَ السَّلٰمِ
وَيُخْرِجُهُمْ مِّنَ الظُّلُمٰتِ اِلَى النُّوْرِ بِاِذْنِهٖ
وَيَهْدِيْهِمْ اِلٰى صِرَاطٍ مُّسْتَقِيْمٍ ﴿۱۶﴾ لَقَدْ كَفَرَ
الَّذِيْنَ قَالُوْۤا اِنَّ اللّٰهَ هُوَ الْمَسِيْحُ ابْنُ
مَرْيَمَ ؕ قُلْ فَمَنْ يَّمْلِكُ مِنَ اللّٰهِ شَيْـًٔا اِنْ
اَرَادَ اَنْ يُّهْلِكَ الْمَسِيْحَ ابْنَ مَرْيَمَ وَاُمَّهٗ
وَ مَنْ فِى الْاَرْضِ جَمِيْعًا ؕ وَ لِلّٰهِ مُلْكُ
السَّمٰوٰتِ وَ الْاَرْضِ وَ مَا بَيْنَهُمَا ؕ يَخْلُقُ مَا
يَشَآءُ ؕ وَ اللّٰهُ عَلٰى كُلِّ شَىْءٍ قَدِيْرٌ ﴿۱۷﴾

17. నాయకులు (నఖీబ్) అంటే అర్థం కనిపెట్టి ఉండేవారు, విచారణ జరిపేవారు. ఇస్రాయీలు సంతతిలో 12 తెగలు ఉండేవి. అల్లాహ్ వారిలోని ప్రతి తెగకు ఒక్కొక్క నాయకుణ్ణి స్వయంగా అదే తెగనుండి ఎన్నుకోండి అని ఆజ్ఞాపించాడు, వారిని కనిపెట్టి ఉండటానికి, వారిని ధర్మరాహిత్యం నుండి, నీతి హీనత నుండి కాపాడే కృషిచేస్తూ ఉండటానికి.

18. రుజుమార్గం (సవాఉస్సబీల్) అంటే గమ్యస్థానాన్ని చేరటానికి క్రమబద్ధంగా నిర్మించబడిన రహదారి. దాన్ని తప్పటం అంటే భావం మనిషి రహదారి నుండి తొలగి కాలిబాటలలో పడి దారి తప్పిపోవటం.

19. అంటే, మీరు చేసిన కొన్ని దొంగతనాలనూ, కొన్ని నమ్మకద్రోహాలనూ బహిరంగపరుస్తున్నాడు. సత్యధర్మ సంస్థాపన కొరకు వాటిని బహిరంగపరచటం అనివార్యం. మరికొన్నింటిని విస్మరిస్తున్నాడు. యథార్థానికి వాటిని బహిరంగపరచే అవసరం లేదు.

وَ قَالَتِ الْيَهُوْدُ وَ النَّصٰرٰى نَحْنُ اَبْنٰٓؤُا اللّٰهِ
وَاَحِبَّآؤُهٗ ؕ قُلْ فَلِمَ يُعَذِّبُكُمْ بِذُنُوْبِكُمْ ؕ
بَلْ اَنْتُمْ بَشَرٌ مِّمَّنْ خَلَقَ ؕ يَغْفِرُ لِمَنْ يَّشَآءُ
وَ يُعَذِّبُ مَنْ يَّشَآءُ ؕ وَ لِلّٰهِ مُلْكُ السَّمٰوٰتِ
وَالْاَرْضِ وَ مَا بَيْنَهُمَا ٞ وَ اِلَيْهِ الْمَصِيْرُ ﴿۱۸﴾
يٰۤاَهْلَ الْكِتٰبِ قَدْ جَآءَكُمْ رَسُوْلُنَا يُبَيِّنُ
لَكُمْ عَلٰى فَتْرَةٍ مِّنَ الرُّسُلِ اَنْ تَقُوْلُوْا مَا
جَآءَنَا مِنْۢ بَشِيْرٍ وَّ لَا نَذِيْرٍ ٞ فَقَدْ جَآءَكُمْ
بَشِيْرٌ وَّ نَذِيْرٌ ؕ وَ اللّٰهُ عَلٰى كُلِّ شَىْءٍ قَدِيْرٌ ﴿۱۹﴾ ع
وَ اِذْ قَالَ مُوْسٰى لِقَوْمِهٖ يٰقَوْمِ اذْكُرُوْا نِعْمَةَ
اللّٰهِ عَلَيْكُمْ اِذْ جَعَلَ فِيْكُمْ اَنْۢبِيَآءَ وَجَعَلَكُمْ
مُّلُوْكًا ۖۗ وَّ اٰتٰىكُمْ مَّا لَمْ يُؤْتِ اَحَدًا مِّنَ
الْعٰلَمِيْنَ ﴿۲۰﴾ يٰقَوْمِ ادْخُلُوا الْاَرْضَ الْمُقَدَّسَةَ
الَّتِىْ كَتَبَ اللّٰهُ لَكُمْ وَ لَا تَرْتَدُّوْا عَلٰٓى
اَدْبَارِكُمْ فَتَنْقَلِبُوْا خٰسِرِيْنَ ﴿۲۱﴾

**18** యూదులు, క్రైస్తవులు ఇలా అంటారు: "మేము అల్లాహ్ పుత్రులం, ఆయనకు ప్రీతిపాత్రులం." వారిని ఇలా అడుగు: "అయితే ఆయన మీ పాపాలకు మిమ్మల్ని ఎందుకు శిక్షిస్తున్నాడు? వాస్తవానికి మీరు కూడా అల్లాహ్ సృష్టించిన ఇతర మానవుల్లాంటి మానవులే! ఆయన తాను కోరిన వారిని క్షమిస్తాడు. తాను కోరిన వారిని శిక్షిస్తాడు. భూమీ, ఆకాశాలూ వాటిలో ఉన్న సమస్తమూ ఆయన ఆస్తియే. ఆయన వైపునకే అందరూ పోవలసిఉంది."

**19** గ్రంథ ప్రజలారా! ప్రవక్తల ఆగమన క్రమం ఎంతో కాలంగా ఆగిపోయి ఉన్నప్పుడు మా ఈ ప్రవక్త మీవద్దకు వచ్చాడు. మీకు స్పష్టమైన ధర్మోపదేశాలను అందజేస్తున్నాడు. మా వద్దకు శుభవార్త తెలిపేవాడు, హెచ్చరికలు చేసేవాడు ఎవడూ రాలేదు అని మీరు అనగలగకుండా ఉండాలని. కనుక చూడండి! ఆ శుభవార్త తెలిపేవాడు, హెచ్చరికలు చేసేవాడు ఇప్పుడు విచ్చేశాడు - అల్లాహ్ ప్రతి వస్తువుపై అధికారం కలవాడు.[21]

**20 - 26** మూసా తన జాతి వారితో ఇలా అన్న విషయాన్ని జ్ఞాపకం తెచ్చుకోండి: "నా జాతి ప్రజలారా! అల్లాహ్ మీకు ప్రసాదించిన ఈ వరాన్ని గురించి ఆలోచించండి - ఆయన మీలో ప్రవక్తలను ఆవిర్భవింపజేశాడు. మిమ్మల్ని పాలకులుగా చేశాడు. ప్రపంచంలో ఎవరికీ ఇవ్వనిదానిని మీకు ఇచ్చాడు- నా జాతి సోదరులారా! అల్లాహ్ మీ కొరకు వ్రాసి వుంచిన[22] పవిత్ర భూమిలో ప్రవేశించండి. వెన్ను చూపకండి. లేకపోతే విఫలులై ఘోర పరాజయంతో మరలివస్తారు."

20. అంటే, కేవలం మసీహ్ (అస్సలామ్) తండ్రి లేకుండా పుట్టిన కారణంగానే మీరు ఆయనను దేవుడుగా చేసేశారు. వాస్తవానికి అల్లాహ్ తాను కోరిన విధంగా పుట్టిస్తాడు. అల్లాహ్ ఏ మనిషినైనా అసాధారణమైన రీతిలో పుట్టిస్తే, అంతమాత్రం చేత అతడు దేవుడు కాలేడు.

21. అంటే, ఒకవేళ మీరు శుభవార్తాహరుడు, హెచ్చరిక చేసేవాడు అయిన ఈ ప్రవక్త మాటను అంగీకరించకపోతే, జ్ఞాపకం ఉంచుకోండి, అల్లాహ్ సమర్థుడు, శక్తిమంతుడూ అని. ఆయన మీకు విధించదలచుకున్న ప్రతి శిక్షనూ నిరాటంకంగా విధించగలడు.

22. అంటే, పాలస్తీనా భూభాగం. అక్కడ అప్పుడు పరమ ముష్రిక్కులు, దుర్నీతిపరులు అయిన ప్రజలు నివసిస్తూ ఉండేవారు. ఇస్రాయీలు సంతతివారు ఈజిప్టు నుండి బయటికి వచ్చినప్పుడు అల్లాహ్ వారి కొరకు ఈ భూభాగాన్నే ఎన్నిక చేశాడు. వెళ్ళి దాన్ని జయించండి అని ఆజ్ఞాపించాడు.

వారు ఇలా జవాబు పలికారు: "మూసా! అక్కడ మహా బలవంతులైన ప్రజలు ఉంటున్నారు. వారు అక్కడి నుంచి వెళ్ళిపోనంతవరకు మేము సుతరామూ అక్కడకు పోము. ఒకవేళ వారు వెళ్ళిపోతే, మేము ప్రవేశించడానికి సిద్ధంగా ఉన్నాము." ఆ భయపడే వారిలో అల్లాహ్ అనుగ్రహం పొందిన[23] ఇద్దరు వ్యక్తులు కూడా ఉన్నారు. వారు ఇలా అన్నారు: "ద్వారం గుండా లోపలకు జొరబడి ఆ బలవంతులను ఎదుర్కోండి. ఒకసారి మీరు లోనికి ప్రవేశించారా, మీదే పైచెయ్యి అవుతుంది. మీరు నిజంగానే ముస్లిమ్‌లైతే అల్లాహ్‌పై భారం వెయ్యండి." కాని వారు మళ్ళీ ఇలా అన్నారు: "మూసా! వారు అక్కడ ఉన్నంతవరకూ మేము అక్కడకు ఎన్నటికీ పోము. నీవూ, నీ ప్రభువూ ఉభయులూ పోయి పోరాడండి. మేము ఇక్కడే కూర్చుని ఉంటాము." దానిపై మూసా ఇలా అన్నాడు: "నా ప్రభూ! నా అధీనంలో ఎవ్వరూ లేరు- నేనూ నా సోదరుడూ తప్ప. కనుక నీవు మమ్మల్ని ఈ అవిధేయుల నుండి వేరు చెయ్యి." అల్లాహ్ ఇలా అన్నాడు: "సరే, అయితే, ఆ దేశం వారికి నలభై సంవత్సరాల వరకు నిషిద్ధం. వారు ధరణిలో నిలువ నీడలేకుండా సంచరిస్తారు. ఈ అవిధేయుల స్థితికి ఎంత మాత్రం జాలి పడకండి."[24]

**27 - 31** వారికి ఆదము యొక్క ఇద్దరు తనయుల వృత్తాంతాన్ని కూడా పొల్లుపోకుండా వినిపించు. వారిద్దరూ ఖుర్బానీ ఇచ్చినప్పుడు, ఒకరి ఖుర్బానీ స్వీకరించబడింది. మరొకరిది స్వీకరించబడలేదు. రెండోవాడు ఇలా అన్నాడు: "నేను నిన్ను చంపివేస్తాను." సమాధానంగా మొదటివాడు ఇలా అన్నాడు: "భయభక్తులు గలవారి మొక్కుబడులనే అల్లాహ్ స్వీకరిస్తాడు.

قَالُوْا يٰمُوْسٰٓى اِنَّ فِيْهَا قَوْمًا جَبَّارِيْنَ ۖ وَاِنَّا
لَنْ نَّدْخُلَهَا حَتّٰى يَخْرُجُوْا مِنْهَا ۚ فَاِنْ يَّخْرُجُوْا
مِنْهَا فَاِنَّا دٰخِلُوْنَ ﴿٢٢﴾ قَالَ رَجُلٰنِ مِنَ
الَّذِيْنَ يَخَافُوْنَ اَنْعَمَ اللّٰهُ عَلَيْهِمَا ادْخُلُوْا
عَلَيْهِمُ الْبَابَ ۚ فَاِذَا دَخَلْتُمُوْهُ فَاِنَّكُمْ
غٰلِبُوْنَ ۬ۚ وَعَلَى اللّٰهِ فَتَوَكَّلُوْٓا اِنْ كُنْتُمْ
مُّؤْمِنِيْنَ ﴿٢٣﴾ قَالُوْا يٰمُوْسٰٓى اِنَّا لَنْ نَّدْخُلَهَآ
اَبَدًا مَّا دَامُوْا فِيْهَا فَاذْهَبْ اَنْتَ وَرَبُّكَ
فَقَاتِلَآ اِنَّا هٰهُنَا قٰعِدُوْنَ ﴿٢٤﴾ قَالَ رَبِّ اِنِّيْ
لَآ اَمْلِكُ اِلَّا نَفْسِيْ وَاَخِيْ فَافْرُقْ بَيْنَنَا وَ
بَيْنَ الْقَوْمِ الْفٰسِقِيْنَ ﴿٢٥﴾ قَالَ فَاِنَّهَا مُحَرَّمَةٌ
عَلَيْهِمْ اَرْبَعِيْنَ سَنَةً ۚ يَتِيْهُوْنَ فِى
الْاَرْضِ ۗ فَلَا تَاْسَ عَلَى الْقَوْمِ الْفٰسِقِيْنَ ﴿٢٦﴾ ع ٧ وقف لازم
وَاتْلُ عَلَيْهِمْ نَبَاَ ابْنَيْ اٰدَمَ بِالْحَقِّ ۘ اِذْ قَرَّبَا
قُرْبَانًا فَتُقُبِّلَ مِنْ اَحَدِهِمَا وَلَمْ يُتَقَبَّلْ
مِنَ الْاٰخَرِ ۗ قَالَ لَاَقْتُلَنَّكَ ۗ قَالَ اِنَّمَا
يَتَقَبَّلُ اللّٰهُ مِنَ الْمُتَّقِيْنَ ﴿٢٧﴾ النصف

23. ఈ ఇద్దరు పెద్దలలో ఒకరు హజ్రత్ యూషా బిన్ నూన్‌గారు. ఆయన హజ్రత్ మూసా (అస్సలామ్) తరువాత ఆయన స్థానంలో ఖలీఫా అయ్యారు. హజ్రత్ కాలిబ్ రెండోవారు. ఆయన హజ్రత్ యూషాకు కుడిభుజం అయ్యారు. నలభై సంవత్సరాల వరకూ మార్గం తప్పి అటూ ఇటూ తిరుగాడిన తరువాత, ఇస్రాయీలు సంతతివారు పాలస్తీనాలో ప్రవేశించినప్పుడు హజ్రత్ మూసా (అస్సలామ్) సహచరులలో కేవలం ఈ ఇద్దరు పెద్దలే బ్రతికివున్నారు.

24. ఇక్కడ ఈ సంఘటనను ఉదాహరించటానికి కారణం ఏమిటంటే, మూసా (అస్సలామ్) కాలంలో అవిధేయతతో, వైముఖ్యంతో, అధైర్యంతో వ్యవహరించి మీరు ఏ శిక్షను అనుభవించారో, ఇప్పుడు అంతకంటే కూడా ఎక్కువ తీవ్రమైన శిక్షను, ముహమ్మద్ (సఅసమ్)కు వ్యతిరేకంగా తిరుగుబాటు వైఖరిని అవలంబించి అనుభవిస్తారు, అని ఇస్రాయీలు సంతతి వారికి తెలుపటం.

لَئِنْۢ بَسَطْتَّ اِلَیَّ یَدَكَ لِتَقْتُلَنِیْ مَاۤ اَنَا
بِبَاسِطٍ یَّدِیَ اِلَیْكَ لِاَقْتُلَكَ ۚ اِنِّیْۤ اَخَافُ
اللّٰهَ رَبَّ الْعٰلَمِیْنَ ﴿۲۸﴾ اِنِّیْۤ اُرِیْدُ اَنْ تَبُوْٓاَ
بِاِثْمِیْ وَ اِثْمِكَ فَتَكُوْنَ مِنْ اَصْحٰبِ النَّارِ ۚ وَ
ذٰلِكَ جَزٰٓؤُا الظّٰلِمِیْنَ ﴿۲۹﴾ فَطَوَّعَتْ لَهٗ نَفْسُهٗ
قَتْلَ اَخِیْهِ فَقَتَلَهٗ فَاَصْبَحَ مِنَ الْخٰسِرِیْنَ ﴿۳۰﴾
فَبَعَثَ اللّٰهُ غُرَابًا یَّبْحَثُ فِی الْاَرْضِ لِیُرِیَهٗ
كَیْفَ یُوَارِیْ سَوْءَةَ اَخِیْهِ ؕ قَالَ یٰوَیْلَتٰۤی
اَعَجَزْتُ اَنْ اَكُوْنَ مِثْلَ هٰذَا الْغُرَابِ
فَاُوَارِیَ سَوْءَةَ اَخِیْ ۚ فَاَصْبَحَ مِنَ النّٰدِمِیْنَ ﴿۳۱﴾ۛ
مِنْ اَجْلِ ذٰلِكَ ۛۚ كَتَبْنَا عَلٰی بَنِیْۤ اِسْرَآءِیْلَ اَنَّهٗ
مَنْ قَتَلَ نَفْسًۢا بِغَیْرِ نَفْسٍ اَوْ فَسَادٍ فِی
الْاَرْضِ فَكَاَنَّمَا قَتَلَ النَّاسَ جَمِیْعًا ؕ وَ مَنْ
اَحْیَاهَا فَكَاَنَّمَاۤ اَحْیَا النَّاسَ جَمِیْعًا ؕ وَ لَقَدْ
جَآءَتْهُمْ رُسُلُنَا بِالْبَیِّنٰتِ ؗ ثُمَّ اِنَّ كَثِیْرًا
مِّنْهُمْ بَعْدَ ذٰلِكَ فِی الْاَرْضِ لَمُسْرِفُوْنَ ﴿۳۲﴾

معانقة ٥ وقف النبي صلى الله عليه وسلم

నీవు నన్ను చంపటానికి చెయ్యి ఎత్తినా, నేను నిన్ను చంపటానికి చెయ్యి ఎత్తను.[25] సకల లోకాలకు ప్రభువైన అల్లాహ్‌కు నేను భయపడతాను. నీవే నా పాపాన్నీ, నీ పాపాన్నీ రెంటినీ మూట కట్టుకోవాలని, నరకవాసివి కావాలని నేను కోరుతున్నాను. దుర్మార్గుల దుర్మార్గానికి ఇదే తగిన ప్రతి ఫలం." చివరకు అతడి మనస్సు తన సోదరుని హత్యను అతడి కొరకు సులభ సాధ్యం చేసింది. అతడు అతన్ని చంపి నష్టపోయేవారిలో కలిసి పోయాడు. అప్పుడు అల్లాహ్ ఒక కాకిని పంపాడు. అది నేలను త్రవ్వ సాగింది, తన సోదరుని శవాన్ని ఏ విధంగా దాచాలో అతడికి తెలుపటానికి. ఇది చూసి అతడు రోదించాడు: "అయ్యో నేను పాడుగాను! నేను ఈ కాకిపాటివాణ్ణి కూడ కాలేకపోయానే, నా సోదరుని శవాన్ని దాచే ఉపాయం వెతకలేకపోయానే!" తరువాత అతడు తాను చేసిన దానికి ఎంతో పశ్చాత్తాపపడ్డాడు.[26]

**32** ఈ కారణం వల్లనే మేము ఇస్రాయీలు సంతతికి ఈ ఫర్మానాను వ్రాసి ఇచ్చాము: "హత్యకు బదులుగాగాని లేదా కల్లోలాన్ని వ్యాపింపజేసి నందుకుగాని కాక మరే కారణం వల్లనైనా ఒక మానవుణ్ణి చంపినవాడు సమస్త మానవులను చంపినట్లే. ఒక మానవుడి ప్రాణాన్ని కాపాడినవాడు మొత్తం మానవుల ప్రాణాలను కాపాడినట్లే." కాని వారి పరిస్థితి ఎలా ఉందంటే, మా ప్రవక్తలు ఒకరి తరువాత ఒకరు స్పష్టమైన ఉపదేశాలు తీసుకుని వారివద్దకు వచ్చినప్పటికీ, వారిలోని ఎక్కువమంది భూమిపై అత్యాచారాలు చేసేవారే.

25. దీని అర్థం, ఒకవేళ నీవు నన్ను చంపటానికి వస్తే చంపబడటానికి నేను చేతులు ముడుచుకుని నీ ముందు కూర్చుంటాను అని కాదు. దీని భావం ఏమిటంటే, నీవు గనక నన్ను హత్య చేయటానికే నిర్ణయించుకుంటే, అలాగే చెయ్యి. నేను మటుకు నిన్ను హత్య చెయ్యను అని.

26. ఇక్కడ ఈ సంఘటనను ప్రస్తావించే ఉద్దేశ్యం ఏమిటంటే, మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్)నూ ఆయన గారి ప్రముఖ సహచరులనూ హత్య చెయ్యటానికి యూదులు పన్నిన కుట్రకు వారిని మందలించటం. ఈ రెండు సంఘటనలలో పోలిక స్పష్టంగా ఉంది. వీరు కూడా అసూయతో మహాప్రవక్త (సఅసమ్)ను హత్యచెయ్యాలనుకున్నారు. ఆదమ్ (అస్సలామ్) యొక్క ఈ కుమారుడు కూడా అసూయతోనే తన సోదరుణ్ణి హత్య చేశాడు.

اِنَّمَا جَزٰٓؤُا الَّذِيْنَ يُحَارِبُوْنَ اللّٰهَ وَرَسُوْلَهٗ
وَ يَسْعَوْنَ فِي الْاَرْضِ فَسَادًا اَنْ يُّقَتَّلُوْٓا اَوْ
يُصَلَّبُوْٓا اَوْ تُقَطَّعَ اَيْدِيْهِمْ وَ اَرْجُلُهُمْ مِّنْ
خِلَافٍ اَوْ يُنْفَوْا مِنَ الْاَرْضِ ؕ ذٰلِكَ لَهُمْ
خِزْيٌ فِي الدُّنْيَا وَلَهُمْ فِي الْاٰخِرَةِ عَذَابٌ
عَظِيْمٌ ﴿۳۳﴾ اِلَّا الَّذِيْنَ تَابُوْا مِنْ قَبْلِ اَنْ
تَقْدِرُوْا عَلَيْهِمْ ۚ فَاعْلَمُوْٓا اَنَّ اللّٰهَ غَفُوْرٌ
رَّحِيْمٌ ﴿۳۴﴾ يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا اتَّقُوا اللّٰهَ
وَابْتَغُوْٓا اِلَيْهِ الْوَسِيْلَةَ وَجَاهِدُوْا فِيْ سَبِيْلِهٖ
لَعَلَّكُمْ تُفْلِحُوْنَ ﴿۳۵﴾ اِنَّ الَّذِيْنَ كَفَرُوْا لَوْ اَنَّ
لَهُمْ مَّا فِي الْاَرْضِ جَمِيْعًا وَّمِثْلَهٗ مَعَهٗ
لِيَفْتَدُوْا بِهٖ مِنْ عَذَابِ يَوْمِ الْقِيٰمَةِ مَا
تُقُبِّلَ مِنْهُمْ ۚ وَلَهُمْ عَذَابٌ اَلِيْمٌ ﴿۳۶﴾
يُرِيْدُوْنَ اَنْ يَّخْرُجُوْا مِنَ النَّارِ وَمَا هُمْ
بِخٰرِجِيْنَ مِنْهَا ۫ وَلَهُمْ عَذَابٌ مُّقِيْمٌ ﴿۳۷﴾

**33 - 34** అల్లాహ్‌తో, ఆయన ప్రవక్తతో పోరాడేవారికీ, ధరణిలో[27] కల్లోలాన్ని సృష్టిస్తూ తిరిగేవారికీ శిక్ష ఏమిటంటే: వారిని చంపటం లేదా శిలువపైకి ఎక్కించటం లేదా చేతులను, కాళ్ళను అభిముఖ దిశలలో ఖండించటం లేదా దేశం నుండి బహిష్కరించటం. ఇవి వారికి ఇహలోకంలో జరిగే అగౌరవం, అవమానం. పరలోకంలో వారికి అంతకంటె ఘోరమైన శిక్ష ఉంటుంది. మీరు వారిని స్వాధీనపరచుకోకముందు పశ్చాత్తాప పడే వారికి తప్ప- అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడు[28] అనే విషయం మీరు తెలుసుకోవాలి.

**35 - 37** విశ్వాసులారా! అల్లాహ్‌కు భయపడండి. ఆయన సాన్నిధ్యానికి చేరే మార్గాన్ని అన్వేషించండి.[29] ఆయన మార్గంలో నిరంతర కృషి చెయ్యండి. బహుశా మీకు సాఫల్య భాగ్యం లభించవచ్చు. స్పష్టంగా తెలుసుకోండి. తిరస్కార వైఖరిని అవలంబించిన వారి అధీనంలో సమస్త భూసంపద, ఇంకా అంతే సంపద దానితోపాటు ఉండి, వారు గనక ప్రళయ దిన శిక్ష నుండి తప్పించుకోవడానికి ఆ మొత్తం సంపదను విమోచన ధనంగా ఇవ్వగోరినా, అది స్వీకరించబడదు. వారికి వ్యధాభరితమైన శిక్ష పడితీరుతుంది. నరకాగ్ని నుండి వారు బయటకు పారిపోవాలని కోరుకుంటారు. కాని బయటికి రాలేరు. వారికి సదా ఉండే శిక్ష విధించబడుతుంది.

27. ధరణి అంటే, శాంతి భద్రతలను స్థాపించే నిమిత్తం ఇస్లామీ ప్రభుత్వం బాధ్యతను స్వీకరించిన దేశం లేక ప్రాంతం అని ఇక్కడ భావం. అల్లాహ్‌తో ఆయన ప్రవక్త (సఅసమ్)తో పోరాడటం అంటే, ఇస్లామీ ప్రభుత్వం దేశంలో స్థాపించిన సద్ వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాడటం అని భావం. ఇస్లామీ షరీయతువేత్తల దృష్టిలో సాయుధులై, ముఠాగా ఏర్పడి దోపిడీకి, విధ్వంసక చర్యలకూ పాల్పడే వారు అని దీని భావం.

28. అంటే, వారు గనక కల్లోలాన్ని సృష్టించే ప్రయత్నాలను మానుకునివుంటే, సువ్యవస్థను ఛిన్నాభిన్నం చేసే లేక సమూలంగా పడగొట్టే ప్రయత్నాలను విరమించుకుని ఉంటే, ఇంకా తరువాత వారు శాంతికాముకులు, శాసనబద్ధులు, సద్వర్తనులు అయ్యారని వారి ప్రవర్తన నిరూపిస్తూ ఉంటే, దీని తరువాత వారి పూర్వపు నేరాలు బయటపడినప్పటికీ పైన పేర్కొనబడిన శిక్షలలో ఏ శిక్షా వారికి విధించబడదు. అయితే ప్రజల హక్కులను వారు గనక భంగపరచి ఉన్నట్లయితే, దాని బాధ్యత వారిపై నుండి తొలగిపోదు. ఉదాహరణకు: ఒకవేళ వారు ఒక మనిషిని హత్యచేసి ఉంటే, లేక ఎవరి సొమ్మునైనా అధర్మంగా తీసుకునివుంటే, లేక మానవుల ప్రాణానికి, ధనానికి వ్యతిరేకంగా ఏదైనా నేరం చేసి ఉంటే, ఆ నేరం విషయంలో మాత్రం వారిపై క్రిమినల్ కేసు పెట్టబడుతుంది. కాని తిరుగుబాటుకూ, ద్రోహానికి ఇంకా దేవునికీ, దైవప్రవక్తకూ వ్యతిరేకంగా పోరాడినందుకు ఏ విధమైన కేసూ పెట్టబడదు.

**38 - 40** దొంగ- స్త్రీ అయినా పురుషుడైనా, ఉభయుల చేతులూ నరకండి.[30] ఇది వారి సంపాదనకు ప్రతిఫలం. అల్లాహ్ తరపు నుండి గుణపాఠం నేర్పే శిక్ష. అల్లాహ్ సర్వశక్తి మంతుడు, అత్యంత వివేక సంపన్నుడు. దుర్మార్గం చేసిన తరువాత పశ్చాత్తాపపడి తనను తాను సంస్కరించుకునే వాడి వైపునకు అల్లాహ్ కారుణ్య వీక్షణం మరలుతుంది.[31] అల్లాహ్ ఎక్కువగా క్షమించేవాడు, కరుణించేవాడూను. అల్లాహ్ భూమ్యాకాశాల సామ్రాజ్యానికి ప్రభువనే విషయం మీకు తెలియదా? ఆయన తాను కోరిన వారిని శిక్షిస్తాడు. తాను కోరినవారిని క్షమిస్తాడు. ఆయన సర్వాధికారాలు కలవాడు.

**41** ప్రవక్తా! అవిశ్వాస మార్గంలో పరుగులు తీసే ప్రజలను చూచి నీవు దుఃఖపడకు. వారు "మేము విశ్వసించాము" అని తమ నోటితో పలికే వారిలోని వారు కావచ్చు. కాని వారి హృదయాలు మాత్రం విశ్వసించలేదు. లేదా వారు యూదుల లోనివారైనా కావచ్చు. వారి (యూదుల) పరిస్థితి ఎలా ఉందంటే, వారు అబద్ధాలను కుతూహలంతో చెవియొగ్గి వింటారు. ఇంకా నీ వద్దకు ఎన్నడూ రాని ఇతర ప్రజల కొరకు గూఢచారులుగా వ్యవహరిస్తారు. అల్లాహ్ గ్రంథంలోని పదాల సందర్భం నిర్ణయమై ఉన్నప్పటికీ వాటి అసలు అర్థాన్ని తారుమారు చేస్తారు. ప్రజలతో ఇలా అంటారు: "మీకు ఈ విధమైన ఆజ్ఞ ఇస్తే స్వీకరించండి, లేకపోతే స్వీకరించకండి."[32] అల్లాహ్యే పరీక్షకు గురిచెయ్యాలని నిశ్చయించిన వారిని అల్లాహ్ పట్టునుండి తప్పించటానికి నీవు ఏమీ చెయ్యలేవు.[33] ఎవరి హృదయాలను అల్లాహ్ పరిశుద్ధ పరచదలచుకోలేదో, వారు వీరే. వీరు ఇహంలో పరాభవానికీ, పరంలో కఠిన శిక్షకూ గురి అవుతారు.

وَ السَّارِقُ وَ السَّارِقَةُ فَاقْطَعُوْٓا اَيْدِيَهُمَا
جَزَآءًۢ بِمَا كَسَبَا نَكَالًا مِّنَ اللّٰهِ ؕ وَ اللّٰهُ
عَزِيْزٌ حَكِيْمٌ ﴿۳۸﴾ فَمَنْ تَابَ مِنْۢ بَعْدِ ظُلْمِهٖ وَ
اَصْلَحَ فَاِنَّ اللّٰهَ يَتُوْبُ عَلَيْهِ ؕ اِنَّ اللّٰهَ
غَفُوْرٌ رَّحِيْمٌ ﴿۳۹﴾ اَلَمْ تَعْلَمْ اَنَّ اللّٰهَ لَهٗ
مُلْكُ السَّمٰوٰتِ وَ الْاَرْضِ ؕ يُعَذِّبُ مَنْ
يَّشَآءُ وَيَغْفِرُ لِمَنْ يَّشَآءُ ؕ وَ اللّٰهُ عَلٰى كُلِّ
شَيْءٍ قَدِيْرٌ ﴿۴۰﴾ يٰٓاَيُّهَا الرَّسُوْلُ لَا يَحْزُنْكَ
الَّذِيْنَ يُسَارِعُوْنَ فِي الْكُفْرِ مِنَ الَّذِيْنَ
قَالُوْٓا اٰمَنَّا بِاَفْوَاهِهِمْ وَ لَمْ تُؤْمِنْ قُلُوْبُهُمْ ۛ مع
وَمِنَ الَّذِيْنَ هَادُوْا ۛ سَمّٰعُوْنَ لِلْكَذِبِ سَمّٰعُوْنَ
لِقَوْمٍ اٰخَرِيْنَ ۙ لَمْ يَاْتُوْكَ ؕ يُحَرِّفُوْنَ الْكَلِمَ
مِنْۢ بَعْدِ مَوَاضِعِهٖ ۚ يَقُوْلُوْنَ اِنْ اُوْتِيْتُمْ هٰذَا
فَخُذُوْهُ وَاِنْ لَّمْ تُؤْتَوْهُ فَاحْذَرُوْا ؕ وَ مَنْ
يُّرِدِ اللّٰهُ فِتْنَتَهٗ فَلَنْ تَمْلِكَ لَهٗ مِنَ اللّٰهِ
شَيْـًٔا ؕ اُولٰٓئِكَ الَّذِيْنَ لَمْ يُرِدِ اللّٰهُ اَنْ يُّطَهِّرَ
قُلُوْبَهُمْ ؕ لَهُمْ فِي الدُّنْيَا خِزْيٌ ۚۖ وَّ لَهُمْ فِي
الْاٰخِرَةِ عَذَابٌ عَظِيْمٌ ﴿۴۱﴾

29. అంటే, అల్లాహ్ సాన్నిహిత్యాన్ని పొందగలిగే, ఆయన ప్రసన్నతను అందుకోగలిగే ప్రతి మార్గాన్నీ పొందటానికి, అన్వేషించటానికి సతతం ప్రయత్నిస్తూ ఉండండి.

30. రెండు చేతులూ కాదు, ఒకే చెయ్యి. మొదటిసారి దొంగతనానికి కుడిచెయ్యి నరకబడుతుంది. ఎవరైనా ఇతరుల అధీనంలో ఉన్న సొమ్మును లాగుకొని స్వాధీనపరచుకునే చర్యకు మాత్రమే దొంగతనం నేరం వర్తిస్తుంది. ఒక డాలు విలువ కంటే తక్కువ విలువగల వస్తువును దొంగిలిస్తే చేయి నరకబడదు. విశ్వసనీయమైన హదీసుల ప్రకారం మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) కాలంలో డాలు విలువ పది దిర్హములుండేది. ఇంకా ఆ కాలంలో ఒక దిర్హమ్‌లో 3 మాషాలు (15 గురిగింజలు) 1 1/5 రతీల (3 3/4 గురిగింజలు) వెండి ఉండేది. ఎన్నో రకాల వస్తువుల దొంగతనానికి చెయ్యి నరికే శిక్ష విధించబడదు. ఉదాహరణకు, పండ్లు

42 - 43 వీరు, అబద్ధం వినేవారు. నిషిద్ధమైన సొమ్ము తినేవారు. కనుక ఒకవేళ నీ వద్దకు (తమ వ్యాజ్యములను తీసుకుని) వస్తే, నీకు ఇష్టమైతే వారిమధ్య తీర్పు చెప్పే అధికారం నీకు ఇవ్వబడుతోంది లేదా తిరస్కరించు. నీవు తిరస్కరిస్తే, వారు నీకు ఏమాత్రం హాని కలిగించలేరు. నీవు గనక తీర్పు చెబితే, కచ్చితంగా న్యాయంగా చెప్పు. అల్లాహ్ న్యాయం చేసేవారిని ప్రేమిస్తాడు[34]- అల్లాహ్ ఆజ్ఞ వ్రాయబడి వున్న తౌరాతు గ్రంథం వారివద్ద ఉన్నప్పటికీ దానిపట్ల వైముఖ్యం ప్రదర్శిస్తూనే వారు నిన్ను ఎలా న్యాయ నిర్ణేతగా చేసుకుంటారు? అసలు విషయం ఏమిటంటే, వారిలో విశ్వాసమే లేదు.

سَمّٰعُوْنَ لِلْكَذِبِ اَكّٰلُوْنَ لِلسُّحْتِ ؕ فَاِنْ جَآءُوْكَ فَاحْكُمْ بَيْنَهُمْ اَوْ اَعْرِضْ عَنْهُمْ ۚ وَاِنْ تُعْرِضْ عَنْهُمْ فَلَنْ يَّضُرُّوْكَ شَيْـًٔا ؕ وَ اِنْ حَكَمْتَ فَاحْكُمْ بَيْنَهُمْ بِالْقِسْطِ ؕ اِنَّ اللّٰهَ يُحِبُّ الْمُقْسِطِيْنَ ۝٤٢ وَكَيْفَ يُحَكِّمُوْنَكَ وَ عِنْدَهُمُ التَّوْرٰىةُ فِيْهَا حُكْمُ اللّٰهِ ثُمَّ يَتَوَلَّوْنَ مِنْۢ بَعْدِ ذٰلِكَ ؕ وَ مَاۤ اُولٰٓئِكَ بِالْمُؤْمِنِيْنَ ۝٤٣

కూరగాయల దొంగతనం, అన్నం దొంగతనం, చిన్న చిన్న వస్తువుల దొంగతనం, పక్షుల దొంగతనం, బైతుల్ మాల్ దొంగతనం. అర్థం ఏమిటంటే, ఇటువంటి దొంగతనాలకు చెయ్యి నరికే శిక్ష విధించబడదు. కాని ఈ దొంగతనాలన్నీ క్షమించబడతాయి అని దీని అర్థం కాదు.

31. అటువంటి దొంగ చెయ్యిని నరకరాదు అని దీని భావం కాదు. భావం ఏమిటంటే, చెయ్యి నరకబడిన తరువాత, పశ్చాత్తాపపడేవాడు తన ఆత్మను దొంగతనం అనే దుర్బుద్ధినుండి పరిశుద్ధపరిచి అల్లాహ్‌కు మంచి దాసుడయ్యేవాడు అల్లాహ్ ఆగ్రహాన్ని తప్పించుకుంటాడు. అప్పుడు అల్లాహ్ అతనిలోని ఆ మచ్చను ప్రక్షాళనం చేస్తాడు. కాని ఒకవేళ ఏ మనిషైనా చెయ్యి నరకబడిన తరువాత కూడా తన నుండి ఆ దురుద్దేశ్యాన్ని దూరం చేసుకోకపోతే, ఏ తుచ్ఛభావాల కారణంగా అతడు దొంగతనం చేశాడో, అతని చెయ్యి నరకబడిందో, ఆ భావాలను తనలో పెంచుకుంటే, దాని అర్థం ఏమిటంటే, చెయ్యి అయితే అతని శరీరం నుండి వేరయింది. కాని దొంగతనం అతని ఆంతర్యంలోనే యథాతథంగా ఉండిపోయింది. ఈ కారణంగా అతడు చెయ్యి నరకబడటానికి ముందు ఉన్న విధంగానే దేవుని ఆగ్రహానికి అర్హుడుగానే ఉండిపోతాడు. ఇందుకనే దివ్య ఖురాను ఇలా ఉపదేశిస్తోంది: అతడు అల్లాహ్‌ను క్షమించు అని వేడుకోవాలి. తన ఆంతర్యాన్ని సంస్కరించు కోవాలి. ఎందుకంటే, ఆత్మపరిశుద్ధత కోర్టు శిక్ష ద్వారా కాదు. కేవలం పశ్చాత్తాపం ద్వారా, అల్లాహ్ వైపునకు మరలటం ద్వారా మాత్రమే ప్రాప్తమవుతుంది.

32. అంటే, పామర జనులతో ఇలా అంటారు : మేము మీకు తెలియజేస్తున్న ఆజ్ఞనే ముహమ్మద్ (సఅసమ్) కూడా తెలియజేసినట్లయితే దానిని స్వీకరించండి, లేకపోతే తిరస్కరించండి.

33. అల్లాహ్ తరఫు నుండి ఎవరైనా పరీక్షకు గురిచెయ్యబడటమనే దాని భావం ఏమిటంటే, ఒక వ్యక్తి చెడు వైపునకు మొగ్గుతూ ఉండటాన్ని అల్లాహ్ గనక గమనిస్తే అతనిని కఠిన పరీక్షకు గురిచేసే అనేక సందర్భాలను ఒకదాని తరువాత ఒకటి అతనికి కలుగచేస్తాడు. ఒకవేళ ఆ వ్యక్తి ఇంకా చెడు వైపునకు పూర్తిగా మొగ్గకుండా ఉంటే, ఆ పరీక్షల వల్ల మేల్కొంటాడు. చెడును ఎదుర్కోవటానికి అతనిలో ఉన్న మంచిని ప్రేరేపించే శక్తులు మేలుకుంటాయి. కాని ఒకవేళ అతడు చెడు వైపునకు పూర్తిగా మొగ్గిపోతే అతని మంచితనం అతనిలోని చెడు ముందు లోలోపలనే ఓడిపోతుంది. ఇలాంటి ప్రతి పరీక్షా సమయంలో అతడు ఇంకా ఎక్కువగా చెడు అనే వలలో చిక్కుకుంటూ పోతాడు. ఇదే అల్లాహ్ పరీక్ష. అంటే చెడిపోయే మానవుణ్ణి ఆ పరీక్ష నుండి రక్షించటం అతని శ్రేయోభిలాషులలో ఎవరి తరమూ కాదు.

اِنَّآ اَنْزَلْنَا التَّوْرٰىةَ فِيْهَا هُدًى وَّ نُوْرٌ ۚ
يَحْكُمُ بِهَا النَّبِيُّوْنَ الَّذِيْنَ اَسْلَمُوْا لِلَّذِيْنَ
هَادُوْا وَالرَّبّٰنِيُّوْنَ وَالْاَحْبَارُ بِمَا اسْتُحْفِظُوْا
مِنْ كِتٰبِ اللّٰهِ وَ كَانُوْا عَلَيْهِ شُهَدَآءَ ۚ فَلَا
تَخْشَوُا النَّاسَ وَ اخْشَوْنِ وَ لَا تَشْتَرُوْا بِاٰيٰتِيْ
ثَمَنًا قَلِيْلًا ؕ وَمَنْ لَّمْ يَحْكُمْ بِمَآ اَنْزَلَ اللّٰهُ
فَاُولٰٓئِكَ هُمُ الْكٰفِرُوْنَ ﴿٤٤﴾ وَكَتَبْنَا عَلَيْهِمْ فِيْهَآ
اَنَّ النَّفْسَ بِالنَّفْسِ ۙ وَ الْعَيْنَ بِالْعَيْنِ وَ
الْاَنْفَ بِالْاَنْفِ وَ الْاُذُنَ بِالْاُذُنِ وَالسِّنَّ
بِالسِّنِّ ۙ وَالْجُرُوْحَ قِصَاصٌ ؕ فَمَنْ تَصَدَّقَ بِهٖ
فَهُوَ كَفَّارَةٌ لَّهٗ ؕ وَ مَنْ لَّمْ يَحْكُمْ بِمَآ اَنْزَلَ
اللّٰهُ فَاُولٰٓئِكَ هُمُ الظّٰلِمُوْنَ ﴿٤٥﴾ وَقَفَّيْنَا عَلٰٓى
اٰثَارِهِمْ بِعِيْسَى ابْنِ مَرْيَمَ مُصَدِّقًا لِّمَا بَيْنَ
يَدَيْهِ مِنَ التَّوْرٰىةِ ۠ وَ اٰتَيْنٰهُ الْاِنْجِيْلَ فِيْهِ
هُدًى وَّنُوْرٌ ۙ وَّ مُصَدِّقًا لِّمَا بَيْنَ يَدَيْهِ مِنَ
التَّوْرٰىةِ وَهُدًى وَّمَوْعِظَةً لِّلْمُتَّقِيْنَ ﴿٤٦﴾
وَلْيَحْكُمْ اَهْلُ الْاِنْجِيْلِ بِمَآ اَنْزَلَ اللّٰهُ فِيْهِ ؕ وَ
مَنْ لَّمْ يَحْكُمْ بِمَآ اَنْزَلَ اللّٰهُ فَاُولٰٓئِكَ هُمُ
الْفٰسِقُوْنَ ﴿٤٧﴾

**44** మేము తౌరాతును అవతరింపజేశాము. అందులో మార్గదర్శకత్వమూ, జ్యోతీ ఉన్నాయి. ముస్లిములైన ప్రవక్తలంతా దాని ప్రకారమే ఈ యూదుల వ్యవహారాలను పరిష్కరించే వారు. ఇదేవిధంగా రబ్బీలు, షరీయత్తువేత్తలు[35] కూడా (దాని ఆధారంగానే తీర్పు చెప్పేవారు). ఎందుకంటే, అల్లాహ్ గ్రంథాన్ని రక్షించే బాధ్యత వారిపై మోపబడింది. వారు దీనికి సాక్షులుగా ఉండేవారు. కనుక (యూదులారా!) మానవులకు భయపడకండి. నాకు భయపడండి. నా ఆయతులను కొద్దిపాటి మూల్యం కొరకు అమ్మటం మానండి. అల్లాహ్ అవతరింపజేసిన చట్టం ప్రకారం తీర్పు చెయ్యనివారే అవిశ్వాసులు.

**45** తౌరాతు గ్రంథంలో మేము యూదుల కొరకు ఈ ఆజ్ఞను వ్రాశాము: ప్రాణానికి బదులు ప్రాణం, కన్నుకు బదులు కన్ను, ముక్కుకు బదులు ముక్కు, చెవికి బదులు చెవి, పన్నుకు బదులు పన్ను, ఇలా సమస్త గాయాల కొరకు సమానమైన ప్రతీకారం. కాని ఎవరైనా ప్రతీకారం చెయ్యకుండా క్షమిస్తే, అది అతనికి కప్ఫారా (పాపపరిహారం) అవుతుంది. అల్లాహ్ అవతరింపజేసిన శాసనం ప్రకారం తీర్పుచెయ్యని వారే దుర్మార్గులు.

**46 - 47** ఈ ప్రవక్తల తరువాత మేము మర్యమ్ కుమారుడైన ఈసాను పంపాము. ఆయన తన కాలంలో ఉన్నటువంటి తౌరాతు గ్రంథంలోని విషయాన్ని ధ్రువీకరించేవాడు. మేము ఆయనకు ఇంజీలును ప్రసాదించాము. అందులో మార్గదర్శకత్వమూ, జ్యోతీ ఉండేవి. అది కూడా ఆ కాలంలో ఉన్న తౌరాతులోని దానిని ధ్రువీకరించేది. అల్లాహ్ యందు భక్తి శ్రద్ధలు కలవారికి అది మార్గదర్శకం. అంతేకాదు, హితోపదేశం కూడా. మేము ఇంజీలు గ్రంథ ప్రజలను ఆ గ్రంథంలో అల్లాహ్ అవతరింపజేసిన శాసనం ప్రకారం తీర్పు చెయ్యాలని ఆజ్ఞాపించాము. అల్లాహ్ అవతరింపజేసిన శాసనం ప్రకారం తీర్పు చెయ్యని వారే హద్దులు మీరినవారు.[36]

34. యూదులు అప్పటి వరకు ఇంకా చట్టరీత్యా ఇస్లామీ ప్రభుత్వం యొక్క పౌరులు కాలేదు. ఇస్లామీ ప్రభుత్వంతో వారి సంబంధాలు దానితో వారు చేసుకున్న ఒప్పందాలపై ఆధారపడి ఉండేవి. ఈ కారణం వల్ల వారు మహాప్రవక్త (సఅసమ్) న్యాయస్థానంలోకి వచ్చే అవసరం లేదు. కాని వారు స్వయంగా తమ ధర్మశాస్త్రం ప్రకారం తీర్పు చెయ్యటానికి ఇష్టపడని వ్యవహారాలలో తీర్పు కొరకు మహాప్రవక్త (సఅసమ్) వద్దకు వచ్చేవారు.

وَ اَنۡزَلۡنَاۤ اِلَيۡكَ الۡكِتٰبَ بِالۡحَقِّ مُصَدِّقًا لِّمَا
بَيۡنَ يَدَيۡهِ مِنَ الۡكِتٰبِ وَ مُهَيۡمِنًا عَلَيۡهِ
فَاحۡكُمۡ بَيۡنَهُمۡ بِمَاۤ اَنۡزَلَ اللّٰهُ وَ لَا تَتَّبِعۡ
اَهۡوَآءَهُمۡ عَمَّا جَآءَكَ مِنَ الۡحَقِّ ؕ لِكُلٍّ
جَعَلۡنَا مِنۡكُمۡ شِرۡعَةً وَّ مِنۡهَاجًا ؕ وَ لَوۡ شَآءَ
اللّٰهُ لَجَعَلَكُمۡ اُمَّةً وَّاحِدَةً وَّ لٰكِنۡ لِّيَبۡلُوَكُمۡ فِىۡ
مَاۤ اٰتٰٮكُمۡ فَاسۡتَبِقُوا الۡخَيۡرٰتِ ؕ اِلَى اللّٰهِ
مَرۡجِعُكُمۡ جَمِيۡعًا فَيُنَبِّئُكُمۡ بِمَا كُنۡتُمۡ فِيۡهِ
تَخۡتَلِفُوۡنَ ۙ ﴿۴۸﴾ وَ اَنِ احۡكُمۡ بَيۡنَهُمۡ بِمَاۤ اَنۡزَلَ
اللّٰهُ وَ لَا تَتَّبِعۡ اَهۡوَآءَهُمۡ وَ احۡذَرۡهُمۡ اَنۡ
يَّفۡتِنُوۡكَ عَنۡۢ بَعۡضِ مَاۤ اَنۡزَلَ اللّٰهُ اِلَيۡكَ ؕ
فَاِنۡ تَوَلَّوۡا فَاعۡلَمۡ اَنَّمَا يُرِيۡدُ اللّٰهُ اَنۡ يُّصِيۡبَهُمۡ
بِبَعۡضِ ذُنُوۡبِهِمۡ ؕ وَ اِنَّ كَثِيۡرًا مِّنَ النَّاسِ
لَفٰسِقُوۡنَ ﴿۴۹﴾ اَفَحُكۡمَ الۡجَاهِلِيَّةِ يَبۡغُوۡنَ ؕ وَ مَنۡ
اَحۡسَنُ مِنَ اللّٰهِ حُكۡمًا لِّقَوۡمٍ يُّوۡقِنُوۡنَ ﴿۵۰﴾

**48 - 50** ప్రవక్తా! మేము నీ వద్దకు పంపిన ఈ గ్రంథం సత్యాన్ని తీసుకొని వచ్చింది. తన కాలంలో ఉన్నటువంటి "అల్ కితాబ్"లోని భాగాలను అది ధ్రువీకరిస్తుంది, పరిరక్షిస్తుంది.[37] కనుక నీవు అల్లాహ్ పంపిన చట్టం ప్రకారం ప్రజల వ్యవహారాలను పరిష్కరించు. నీ వద్దకు వచ్చిన సత్యానికి విముఖుడవై వారి వాంఛలను అనుసరించకు- మేము మీ (మానవుల) లోని ప్రతి ఒక్కరికీ ఒక షరీయత్తునూ, ఒక జీవిత విధానాన్నీ నిర్ణయించాము. మీ దేవుడు కోరుకున్నట్లయితే, మీ అందరినీ ఒకే ఒక సంఘంగా కూడా రూపొందించి ఉండే వాడు. కాని ఆయన మీకు ఇచ్చిన దాని విషయంలో మిమ్మల్ని పరీక్షించేందుకు ఈ విధంగా చేశాడు. కనుక మంచి పనులలో ఒకరినొకరు మించి పోవటానికి ప్రయత్నించండి. చివరకు మీరంతా అల్లాహ్ వద్దకే మరలిపోవలసి ఉంది. అప్పుడు ఆయన మీరు భేదాభిప్రాయం కలిగివున్న దాని అసలు యథార్థం ఏమిటో మీకు తెలుపుతాడు- కనుక ప్రవక్తా! నీవు అల్లాహ్ అవతరింపజేసిన శాసనం ప్రకారం ప్రజల వ్యవహారాలను పరిష్కరించు. వారి కోరికలను అనుసరించకు. మిమ్మల్ని వారు మోసంలో పడవేసి అల్లాహ్ మీ వద్దకు పంపిన ఉపదేశానికి రవ్వంత కూడా విముఖులను చెయ్యకుండా మీరు అప్రమత్తులై ఉండండి. వారు గనక దానికి విముఖులైతే, అల్లాహ్ వారు చేసిన కొన్ని పాపాలకు శాస్తిగా వారిని ఆపదకు గురిచెయ్యాలన్న నిర్ణయానికే వచ్చాడు అని తెలుసుకోండి. వారిలోని చాలామంది అవిధేయులు అనేది వాస్తవం. (వారు అల్లాహ్ శాసనానికి విముఖులై) అజ్ఞానపు[38] (జాహిలియ్యహ్) తీర్పు కావాలని కోరుకుంటున్నారా? కాని అల్లాహ్‌పై నమ్మకం కలవారి దృష్టిలో అల్లాహ్ కంటే మంచి తీర్పు చెయ్యగలవాడెవడు?

ఈ విధంగా బహుశా ఆయన తెచ్చిన షరీయత్తులో వారి కొరకేదైనా వేరే ఆజ్ఞ ఉండవచ్చునీ, ఇంకా తద్వారా తమ మత నియమాల అనుసరణ నుండి తప్పించుకోవచ్చునీ ఆశించేవారు.

35. ఖురానులో "రబ్బానియ్యూన్", "అహ్‌బార్" అనే పదాలు వాడబడ్డవి. రబ్బానియ్యూన్ (రబ్బానీలు) అంటే విద్వాంసులనీ, అహ్‌బార్ అంటే షరీయత్తువేత్తలనీ అర్థం.

36. ఇక్కడ అల్లాహ్ తాను అవతరింపజేసిన శాసనానికి అనుగుణంగా నిర్ణయాలు చెయ్యనివారిని గురించి మూడు తీర్పులను నిర్ధారించాడు. ఒకటి, వారు అవిశ్వాసులు. రెండు, వారు దుర్మార్గులు. మూడు, వారు హద్దులు మీరినవారు. అల్లాహ్ ఆజ్ఞ తప్పు అని, తన లేక ఇతర మానవుల ఆజ్ఞ ఒప్పు అని భావిస్తూ అల్లాహ్ ఆజ్ఞకు వ్యతిరేకంగా తీర్పు చేసేవాడు పూర్తిగా అవిశ్వాసి, దుర్మార్గుడు, హద్దులు మీరినవాడు. విశ్వాసరీత్యా అల్లాహ్

يَٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لَا تَتَّخِذُوا الْيَهُوْدَ
وَالنَّصٰرٰٓى اَوْلِيَآءَ ۘ بَعْضُهُمْ اَوْلِيَآءُ بَعْضٍ ۚ
وَمَنْ يَّتَوَلَّهُمْ مِّنْكُمْ فَاِنَّهٗ مِنْهُمْ ۚ اِنَّ اللّٰهَ لَا
يَهْدِى الْقَوْمَ الظّٰلِمِيْنَ ﴿٥١﴾ فَتَرَى الَّذِيْنَ
فِىْ قُلُوْبِهِمْ مَّرَضٌ يُّسَارِعُوْنَ فِيْهِمْ يَقُوْلُوْنَ
نَخْشٰٓى اَنْ تُصِيْبَنَا دَآئِرَةٌ ۚ فَعَسَى اللّٰهُ اَنْ
يَّاْتِىَ بِالْفَتْحِ اَوْ اَمْرٍ مِّنْ عِنْدِهٖ فَيُصْبِحُوْا عَلٰى
مَآ اَسَرُّوْا فِىْٓ اَنْفُسِهِمْ نٰدِمِيْنَ ﴿٥٢﴾ وَيَقُوْلُ
الَّذِيْنَ اٰمَنُوْٓا اَهٰٓؤُلَآءِ الَّذِيْنَ اَقْسَمُوْا بِاللّٰهِ
جَهْدَ اَيْمَانِهِمْ ۙ اِنَّهُمْ لَمَعَكُمْ ۚ حَبِطَتْ
اَعْمَالُهُمْ فَاَصْبَحُوْا خٰسِرِيْنَ ﴿٥٣﴾

وقف لازم
وقف غفران

الثلثة

**51** విశ్వాసులారా! యూదులనూ, క్రైస్తవులనూ మీ మిత్రులుగా చేసుకోకండి. వారు తమలో తామే ఒకరికొకరు మిత్రులు. మీలో ఎవడైనా వారిని తన మిత్రులుగా స్వీకరిస్తే అతడు కూడా వారిలో ఒకడుగా పరిగణింపబడతాడు. నిశ్చయంగా అల్లాహ్ దుర్మార్గులను తన మార్గదర్శకత్వానికి దూరం చేస్తాడు.

**52 – 53** హృదయాలలో కాపట్య రోగం ఉన్నవారు వారితోనే ఎక్కువగా కార్యకలాపాలు సాగిస్తూ తిరగటం నీవు చూస్తావు. వారు, "మేము ఏదన్నా ఆపదల వలయంలో చిక్కుకుంటా మేమో అనే భయం మాకు ఉంది" అని అంటారు. కాని అల్లాహ్ మీకు తిరుగులేని విజయాన్ని ప్రసాదించినప్పుడు లేక తన తరఫు నుండి మరేదైనా విషయాన్ని బహిర్గతం చేసినప్పుడు, వారు తమ మనస్సులలో గుప్తంగా ఉంచిన ఈ కాపట్యానికి సిగ్గుపడటం అనేది కూడా అసంభవం కాదు. అప్పుడు విశ్వాసులు ఇలా అంటారు: "మేము మీతోనే ఉన్నాము అని అల్లాహ్ పేరుపై కఠోర ప్రమాణాలు చేసి నమ్మకం కలిగిస్తూ ఉండేవారు వీరేనా?"– వారు చేసిన పనులన్నీ వృథా అయ్యాయి. చివరకు వారికి మిగిలింది అపజయం, ఆశా భంగమూను.

ఆజ్ఞను సత్యమైనదిగా నమ్ముతూ, ఆచరణలో దానికి వ్యతిరేకంగా తీర్పు చేసేవాడు ముస్లిము సమాజం నుండి బహిష్కృతుడు కాడు కాని, తన విశ్వాసాన్ని అవిశ్వాసంతో, దుర్మార్గంతో, హద్దుల అతిక్రమణతో మిశ్రమం చేస్తున్నాడు. ఇదేవిధంగా సమస్త వ్యవహారాలలో అల్లాహ్ ఆజ్ఞ పట్ల తిరస్కార వైఖరిని అవలంబించేవాడు సమస్త వ్యవహారాలలో అవిశ్వాసి, దుర్మార్గుడు, హద్దులు మీరిన వాడు అవుతాడు. ఇంకా కొన్ని వ్యవహారాలలో విధేయుడు, కొన్నింటిలో తిరస్కారి అయినవాడి జీవితంలో విశ్వాసం, ఇస్లామ్, అవిశ్వాసం, దుర్మార్గం, హద్దుల అతిక్రమణ మిశ్రమం ఖచ్చితంగా అతడు విధేయతను, తిరస్కారాన్ని కలిపి ఉంచిన నిష్పత్తిలో ఉంటుంది.

37. ఇక్కడ ఒక ముఖ్యమైన యథార్థాన్ని సూచించటం జరిగింది. ఈ విషయాన్ని ఇలా కూడా వ్యక్తం చెయ్యవచ్చు: "పూర్వపు గ్రంథాల"లో తన అసలైన నిజమైన రూపంలో మిగిలివున్న దాన్ని ఖురాను ధ్రువీకరిస్తుంది. కాని అల్లాహ్, "పూర్వపు గ్రంథాల"కు బదులుగా 'అల్‌కితాబ్' అనే పదాన్ని ఉపయోగించాడు. దానివల్ల బయటపడే రహస్యం ఏమిటంటే, ఖురానూ, వివిధ కాలాలలో, వివిధ భాషలలో అల్లాహ్ తరఫు నుండి అవతరించిన సమస్త గ్రంథాలూ వాస్తవానికి మౌలికంగా ఒకే గ్రంథం. వాటి రచయిత ఒకడే. వాటి లక్ష్యం ఒకటే. వాటి ఉద్దేశ్యం ఒకటే. వాటి ఉపదేశం ఒకటే. వాటి ద్వారా మానవజాతికి ప్రసాదించబడిన జ్ఞానమూ ఒకటే. ఒకవేళ భేదం ఏదైనా ఉంటే అది రచనా భేదమే. ఆ భేదం ఒకే లక్ష్యం కొరకు విభిన్న శ్రోతలనుబట్టి విభిన్న విధాలుగా అవలంబించబడింది. ఖురాను అల్ కితాబ్‌ను సంరక్షించేది అని అనే దాని భావం ఏమిటంటే, అది పూర్వపు ఆకాశ గ్రంథాలలో ఇవ్వబడిన సమస్త సత్యోపదేశాలను తనలోకి తీసుకుని పదిలపరచుకున్నది. ఇక ఈ సత్యోపదేశాలలోని ఏ భాగమూ చెరిగిపోదు.

يَاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا مَنْ يَّرْتَدَّ مِنْكُمْ عَنْ
دِيْنِهٖ فَسَوْفَ يَاْتِي اللّٰهُ بِقَوْمٍ يُّحِبُّهُمْ
وَيُحِبُّوْنَهٗۤ ۙ اَذِلَّةٍ عَلَى الْمُؤْمِنِيْنَ اَعِزَّةٍ عَلَى
الْكٰفِرِيْنَ ۫ يُجَاهِدُوْنَ فِيْ سَبِيْلِ اللّٰهِ وَلَا
يَخَافُوْنَ لَوْمَةَ لَآئِمٍ ؕ ذٰلِكَ فَضْلُ اللّٰهِ
يُؤْتِيْهِ مَنْ يَّشَآءُ ؕ وَاللّٰهُ وَاسِعٌ عَلِيْمٌ ﴿٥٤﴾
اِنَّمَا وَلِيُّكُمُ اللّٰهُ وَرَسُوْلُهٗ وَالَّذِيْنَ اٰمَنُوا
الَّذِيْنَ يُقِيْمُوْنَ الصَّلٰوةَ وَيُؤْتُوْنَ الزَّكٰوةَ وَ
هُمْ رٰكِعُوْنَ ﴿٥٥﴾ وَمَنْ يَّتَوَلَّ اللّٰهَ وَرَسُوْلَهٗ وَ
الَّذِيْنَ اٰمَنُوْا فَاِنَّ حِزْبَ اللّٰهِ هُمُ الْغٰلِبُوْنَ ﴿٥٦﴾ ع ٨ / ١٢

**54** విశ్వాసులారా! మీలో ఎవరైనా తమ ధర్మం నుండి వైదొలగి పోతే (పోవచ్చు). అల్లాహ్ ఇంకా ఎంతోమందిని సృష్టిస్తాడు. అల్లాహ్ వారిని ప్రేమిస్తాడు. వారు అల్లాహ్‌ను ప్రేమిస్తారు. వారు విశ్వాసులపట్ల మృదువుగానూ, అవిశ్వాసులపట్ల కఠినంగానూ[39] ప్రవర్తిస్తారు. అల్లాహ్ మార్గంలో అవిశ్రాంత కృషి చేస్తారు. నిందించేవారి నిందలకు వారు భయపడరు. ఇది అల్లాహ్ అనుగ్రహం. ఆయన దానిని తాను కోరినవారికి ప్రసాదిస్తాడు. ఆయన అపారమైన సాధనసంపత్తికి యజమాని, సర్వమూ తెలిసినవాడు.

**55 - 56** వాస్తవానికి మీ మిత్రులు కేవలం అల్లాహ్, అల్లాహ్ ప్రవక్త, నమాజును స్థాపించే జకాత్ ఇచ్చే, అల్లాహ్ ముందు రుకూ చేసే విశ్వాసులు మాత్రమే. అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ, విశ్వాసులనూ తమ మిత్రులుగా స్వీకరించేవారు, అల్లాహ్ పక్షమే ఆధిక్యం వహిస్తుందని తెలుసుకోవాలి.

---

38. అజ్ఞానం (జాహిలియ్యహ్) అనే పదం ఇస్లామ్ పదానికి వ్యతిరేకంగా వాడబడుతుంది. ఇస్లామ్ విధానానికి ఆధారం పూర్తిగా జ్ఞానమే. ఎందుకంటే దాని వైపునకు దేవుడే మార్గం చూపాడు. ఆయన సమస్త వాస్తవాల జ్ఞానం కలవాడు. అందుచేత ఇస్లామ్‌కు భిన్నంగావున్న ప్రతి విధానమూ అజ్ఞాన విధానమే. అరేబియాలో ఇస్లామ్‌కు పూర్వపు కాలాన్ని అజ్ఞాన యుగం అని ఇదే అర్థంలో అనడం ఎందుకు జరిగిందంటే ఆ కాలంలో జ్ఞానం లేకుండా కేవలం భ్రమ లేక ఊహ అనుమానం లేక కోరికలు ఆధారంగా మానవులు తమ జీవిత విధానాలను ఏర్పరచుకున్నారు. ఇలాంటి జీవిత విధానం ఎక్కడ, ఏ యుగంలో అవలంబించబడినా, దానిని ఎట్టి పరిస్థితులలోనూ అజ్ఞానపు జీవిత విధానం అనే అంటారు.

39. "విశ్వాసులపట్ల మృదువుగా" అంటే భావం ఒక విశ్వాసి విశ్వాసులకు వ్యతిరేకంగా తన శక్తిని ఎన్నటికీ ఉపయోగించకూడదు. అతని తెలివితేటలు, అతని సామర్థ్యం, అతని పలుకుబడి, అతని సంపద, అతని దేహబలం, ఏదైనా సరే ముస్లిములను అణచటానికి, వేధించటానికి వారికి నష్టం కలిగించటానికి ఉపయోగించకూడదు. ముస్లిములు తమ మధ్య అతనిని ఎల్లప్పుడూ ఒక మృదుస్వభావుడు, దయార్ద్ర హృదయుడు, సానుభూతి చూపేవాడు, సహనశీలుడు అయిన మానవుడుగా చూడాలి. "అవిశ్వాసుల పట్ల కఠినంగా" అంటే ఒక విశ్వాసి తన విశ్వాస పటిష్ఠత, ధార్మిక చిత్తశుద్ధి, సిద్ధాంత పటిష్ఠత, 3శీలబలం, విశ్వాసం వల్ల ప్రాప్తించిన దూరదృష్టి - వీటి కారణంగా ఇస్లామ్ విరోధులకు ప్రతికూలంగా ఎట్టి పరిస్థితులలోనూ కదలించశక్యం కాని పర్వతం మాదిరిగా నిలబడాలి. వారు అతనిని ఎన్నటికీ మెతక మనిషిగా, వెన్నముద్దగా భావించకూడదు. ఈ అల్లాహ్ దాసుడు చావగలడు కాని, ఎంత వెలకైనా అమ్ముడుపోడని, ఎంత ఒత్తిడి తెచ్చినా లొంగడని వారు అతనిని ఎప్పుడు కలిసినా వారికి స్పష్టం కావాలి.

يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لَا تَتَّخِذُوا الَّذِيْنَ
اتَّخَذُوْا دِيْنَكُمْ هُزُوًا وَّ لَعِبًا مِّنَ الَّذِيْنَ اُوْتُوا
الْكِتٰبَ مِنْ قَبْلِكُمْ وَ الْكُفَّارَ اَوْلِيَآءَ ۚ وَاتَّقُوا
اللّٰهَ اِنْ كُنْتُمْ مُّؤْمِنِيْنَ ﴿٥٧﴾ وَ اِذَا نَادَيْتُمْ اِلَى
الصَّلٰوةِ اتَّخَذُوْهَا هُزُوًا وَّ لَعِبًا ؕ ذٰلِكَ بِاَنَّهُمْ
قَوْمٌ لَّا يَعْقِلُوْنَ ﴿٥٨﴾ قُلْ يٰٓاَهْلَ الْكِتٰبِ هَلْ
تَنْقِمُوْنَ مِنَّآ اِلَّآ اَنْ اٰمَنَّا بِاللّٰهِ وَ مَآ اُنْزِلَ
اِلَيْنَا وَ مَآ اُنْزِلَ مِنْ قَبْلُ ۙ وَ اَنَّ اَكْثَرَكُمْ
فٰسِقُوْنَ ﴿٥٩﴾ قُلْ هَلْ اُنَبِّئُكُمْ بِشَرٍّ مِّنْ ذٰلِكَ
مَثُوْبَةً عِنْدَ اللّٰهِ ؕ مَنْ لَّعَنَهُ اللّٰهُ وَ غَضِبَ
عَلَيْهِ وَ جَعَلَ مِنْهُمُ الْقِرَدَةَ وَ الْخَنَازِيْرَ وَ
عَبَدَ الطَّاغُوْتَ ؕ اُولٰٓئِكَ شَرٌّ مَّكَانًا وَّ اَضَلُّ
عَنْ سَوَآءِ السَّبِيْلِ ﴿٦٠﴾ وَ اِذَا جَآءُوْكُمْ قَالُوْٓا
اٰمَنَّا وَ قَدْ دَّخَلُوْا بِالْكُفْرِ وَ هُمْ قَدْ خَرَجُوْا
بِهٖ ؕ وَ اللّٰهُ اَعْلَمُ بِمَا كَانُوْا يَكْتُمُوْنَ ﴿٦١﴾ وَ
تَرٰى كَثِيْرًا مِّنْهُمْ يُسَارِعُوْنَ فِى الْاِثْمِ وَ
الْعُدْوَانِ وَاَكْلِهِمُ السُّحْتَ ؕ لَبِئْسَ مَا كَانُوْا
يَعْمَلُوْنَ ﴿٦٢﴾ لَوْ لَا يَنْهٰىهُمُ الرَّبّٰنِيُّوْنَ وَ
الْاَحْبَارُ عَنْ قَوْلِهِمُ الْاِثْمَ وَاَكْلِهِمُ
السُّحْتَ ؕ لَبِئْسَ مَا كَانُوْا يَصْنَعُوْنَ ﴿٦٣﴾

**57 - 60** విశ్వాసులారా! మీకు పూర్వపు గ్రంథ ప్రజలలో మీ ధర్మాన్ని ఒక పరిహాసంగా, ఒక వినోద వస్తువుగా పరిగణించిన వారినీ, ఇతర అవిశ్వాసులనూ మీ మిత్రులుగా, సహచరులుగా చేసుకోకండి. మీరు గనక విశ్వాసులే అయితే అల్లాహ్‌కు భయపడండి. మీరు నమాజు కొరకు పిలుపు నిస్తే, వారు దానిని పరిహసించి వినోదిస్తారు.[40] దీనికి కారణం వారికి బుద్ధి లేకపోవటమే. వారితో ఇలా అను: "గ్రంథ ప్రజలారా! మీరు మాపై కినుక వహించటానికి కారణం మేము అల్లాహ్‌నూ మా వైపునకు అవతరించిన, మాకు పూర్వం కూడా అవతరించిన ధర్మోపదేశాన్ని విశ్వసించామనే విషయమూ ఇంకా మీలో చాలామంది అవిధేయులైనవారు ఉన్నారనే విషయమూ తప్ప మరొకటేముంది?" ఇంకా ఇలా చెప్పు:"అల్లాహ్ వద్ద ఎవరి ముగింపు అవిధేయుల ముగింపుకంటే కూడా హీనతరంగా ఉంటుందో వారిని గురించి తెలియజేయనా? వారు అల్లాహ్ శాపగ్రస్తులు. వారిపై ఆయన ఆగ్రహం విరుచుకుపడింది. వారు కోతులుగా, పందులుగా చెయ్యబడ్డారు. వారు తాగూత్ దాస్యం చేశారు. వారు ఎంతో అధ్వాన్నస్థితిలో ఉన్నారు. వారు రుజుమార్గం తప్పి బహుదూరం పోయారు."

**61 - 63** వారు మీ వద్దకు వచ్చినప్పుడు, "మేము విశ్వసించాము" అని అంటారు. కాని వాస్తవానికి వారు అవిశ్వాసాన్ని మోసుకువచ్చారు. అవిశ్వాసాన్నే మోసుకుని తిరిగిపోయారు. అల్లాహ్‌కు బాగా తెలుసు, వారు తమ హృదయాలలో ఏమేమి దాచివుంచారో. వారిలో చాలామంది పాప కార్యాలలో, హింసా దౌర్జన్యాలలో చురుకుగా పాల్గొంటూ తిరగటాన్నీ, హరాము సొమ్మును తినటాన్నీ నీవు చూస్తావు. వారు చేసే ఈ చేష్టలు బహుచెడ్డవి. వారి పండితులూ, మత గురువులూ పాపపు మాటలు పలక్కుండా, హరాము సంపాదన తినకుండా వారిని ఎందుకు నిరోధించరు? నిశ్చయంగా వారు సిద్ధం చేసుకుంటున్న తమ జీవిత కర్మపత్రం చాలా చెడ్డది.

40. అంటే,అజాన్ పిలుపు విని దానిని అనుకరిస్తూ ఎగతాళి చేస్తారు. దాని పదాలను మార్చి వికృతం చేస్తారు. దానికి వ్యతిరేకంగా రకరకాల కూతలు కూస్తారు.

64 యూదులు ఇలా అంటారు: "అల్లాహ్ చేతులు బంధింపబడివున్నాయి"[41]– వాస్తవంగా బంధాలు వారి చేతులకే పడివున్నాయి.[42] శాపం వారిపైనే పడింది. వారి వాగుడుకు ప్రతిఫలంగా– అల్లాహ్ చేతులు విశాలంగా ఉన్నాయి. తాను కోరిన ప్రకారం ఆయన ఖర్చు చేస్తాడు. వాస్తవం ఏమిటంటే, నీ ప్రభువు తరఫు నుండి నీపై అవతరించిన గ్రంథం వారిలో చాలామంది యొక్క తలబిరుసుతనమూ, అసత్యానుసరణమూ అతిశయించటానికి కారణ భూతమయింది. (ఈ కారణంగా) మేము వారి మధ్య విరోధ విద్వేషాలు ప్రళయం వరకూ ఉండే విధంగా చేశాము. వారు యుద్ధజ్వాలను ప్రజ్వలింపజేసినప్పుడల్లా, అల్లాహ్ దానిని చల్లారుస్తాడు. వారు భూమిలో సంక్షోభాన్ని వ్యాపింపచెయ్యడానికి ప్రయత్నం చేస్తున్నారు. కాని అల్లాహ్ సంక్షోభం సృష్టించేవారిని ఎంతమాత్రం ప్రేమించడు.

65 - 66 (ఈ తలబిరుసుతనానికి బదులుగా) ఈ గ్రంథ ప్రజలు విశ్వసించి ఉంటే, అల్లాహ్‌పట్ల భయభక్తుల వైఖరిని అవలంబించి ఉంటే, మేము వారి పాపాలను వారినుండి దూరం చేసి ఉండేవారము. వారిని భోగభాగ్యాలతో నిండివున్న స్వర్గవనాలలో ప్రవేశింపజేసి వుండేవారము. వారు తౌరాతునూ, ఇంజీలునూ, వారి ప్రభువు తరఫు నుండి వారి వద్దకు పంపబడిన ఇతర గ్రంథాలనూ అనుష్ఠించి ఉన్నట్లయితే ఎంత బాగుండేది! ఆ విధంగా చేసివుంటే, వారికొరకు ఆహారం పైనుండి వర్షించి ఉండేది, క్రిందినుండి పొంగివుండేది. వారిలో కొందరు రుజువర్తనులు కూడా ఉన్నారన్నమాట నిజమే. కాని వారిలో అధిక సంఖ్యాకులు బహు దుర్మార్గులు.

67 - 69 ప్రవక్తా! నీ ప్రభువు తరఫు నుండి నీపై అవతరించిన దానిని ప్రజలకు అందజెయ్యి. ఒకవేళ నీవు ఆ విధంగా చెయ్యకపోతే, ఆయన ప్రవక్తగా నీవు నీ ధర్మాన్ని నిర్వహించనట్లే. ప్రజల బారినుండి అల్లాహ్ నిన్ను రక్షిస్తాడు. ఆయన (నీకు ప్రతికూలంగా) అవిశ్వాసులకు విజయం పొందే మార్గాన్ని ఎన్నటికీ చూపడు అని నమ్ము.

وَقَالَتِ الْيَهُوْدُ يَدُ اللّٰهِ مَغْلُوْلَةٌ ؕ غُلَّتْ
اَيْدِيْهِمْ وَلُعِنُوْا بِمَا قَالُوْا ۘ بَلْ يَدٰهُ
مَبْسُوْطَتٰنِ ۙ يُنْفِقُ كَيْفَ يَشَآءُ ؕ وَلَيَزِيْدَنَّ
كَثِيْرًا مِّنْهُمْ مَّآ اُنْزِلَ اِلَيْكَ مِنْ رَّبِّكَ
طُغْيَانًا وَّكُفْرًا ؕ وَ اَلْقَيْنَا بَيْنَهُمُ الْعَدَاوَةَ
وَالْبَغْضَآءَ اِلٰى يَوْمِ الْقِيٰمَةِ ؕ كُلَّمَآ اَوْقَدُوْا
نَارًا لِّلْحَرْبِ اَطْفَاَهَا اللّٰهُ ۙ وَيَسْعَوْنَ فِى
الْاَرْضِ فَسَادًا ؕ وَ اللّٰهُ لَا يُحِبُّ
الْمُفْسِدِيْنَ ﴿٦٤﴾ وَ لَوْ اَنَّ اَهْلَ الْكِتٰبِ اٰمَنُوْا
وَاتَّقَوْا لَكَفَّرْنَا عَنْهُمْ سَيِّاٰتِهِمْ وَ لَاَدْخَلْنٰهُمْ
جَنّٰتِ النَّعِيْمِ ﴿٦٥﴾ وَ لَوْ اَنَّهُمْ اَقَامُوا التَّوْرٰىةَ وَ
الْاِنْجِيْلَ وَ مَآ اُنْزِلَ اِلَيْهِمْ مِّنْ رَّبِّهِمْ
لَاَكَلُوْا مِنْ فَوْقِهِمْ وَ مِنْ تَحْتِ اَرْجُلِهِمْ ؕ
مِنْهُمْ اُمَّةٌ مُّقْتَصِدَةٌ ؕ وَ كَثِيْرٌ مِّنْهُمْ سَآءَ
مَا يَعْمَلُوْنَ ﴿٦٦﴾ يٰۤاَيُّهَا الرَّسُوْلُ بَلِّغْ مَآ اُنْزِلَ
اِلَيْكَ مِنْ رَّبِّكَ ؕ وَ اِنْ لَّمْ تَفْعَلْ فَمَا بَلَّغْتَ
رِسَالَتَهٗ ؕ وَ اللّٰهُ يَعْصِمُكَ مِنَ النَّاسِ ؕ اِنَّ
اللّٰهَ لَا يَهْدِى الْقَوْمَ الْكٰفِرِيْنَ ﴿٦٧﴾

41. అరబ్బీ నానుడి ప్రకారం ఎవరి చేతులైనా బంధింపబడటం అంటే అతడు లోభి, అతని చేతులు దానధర్మాలకు దూరంగా ఉన్నాయి అని భావం.

స్పష్టంగా ఇలా చెప్పు: "గ్రంథ ప్రజలారా! మీరు తౌరాతునూ, ఇంజీలునూ మీ ప్రభువు తరఫు నుండి మీ వైపునకు అవతరింపచెయ్యబడిన ఇతర గ్రంథాలనూ ప్రతిష్ఠించనంతవరకు, అసలు మీరు ఏ పునాదిపైనా లేనట్లే." నీపై అవతరింపచెయ్యబడిన ఈ ఫర్మానా వారిలోని అధికుల తలబిరుసుతనాన్నీ, తిరస్కార భావాన్నీ తప్పకుండా మరింత అతిశయింపచేస్తుంది. కాని తిరస్కరించేవారి స్థితికి నీవు విచార పడవద్దు. (ఇక్కడ ప్రత్యేకమైన హక్కు ఏ ఒక్కరికీ లేదు) ముస్లిములైనా, యూదులైనా, సాబియీలైనా, క్రైస్తవులైనా, ఎవరైనాసరే, వారు గనక అల్లాహ్‌ను, చివరి రోజును విశ్వసించి, మంచి పనులు చేస్తే, నిస్సందేహంగా వారికి భయంకాని, శోకంగాని[43] కలిగే ఆస్కారం లేదు.

**70 - 71** మేము ఇస్రాయీలు సంతానం నుండి గట్టి ప్రమాణాన్ని తీసుకున్నాము. వారివద్దకు ఎంతోమంది ప్రవక్తలను పంపాము, కాని వారివద్దకు వారి మనోవాంఛలకు వ్యతిరేకమైన దానిని ఏ ప్రవక్త అయినా తెచ్చినప్పుడల్లా, వారు కొందరిని అసత్యవాదులని తిరస్కరించారు. మరికొందరిని హత్యచేశారు. ఆ విధంగా చెయ్యటం వల్ల ఏ ఉపద్రవమూ సంభవించదని వారు భావించారు. కనుక వారు గ్రుడ్డివారు, చెవిటివారు అయ్యారు. తరువాత అల్లాహ్ వారిని క్షమించాడు. అయినా వారిలో చాలామంది మరింత గ్రుడ్డివారుగా, మరింత చెవిటివారుగా అవుతూపోయారు. అల్లాహ్ వారి ఈ చేష్టలన్నింటినీ చూస్తూనే ఉన్నాడు.

**72** మర్యమ్ కుమారుడైన మసీహ్‌యే అల్లాహ్ అని అన్నవారు నిశ్చయంగా అవిశ్వాసానికి పాల్పడినట్లే. వాస్తవానికి మసీహ్ ఇలా అన్నాడు: ఇస్రాయీలు వంశీయులారా! అల్లాహ్‌కు దాస్యం చెయ్యండి. ఆయన నాకూ ప్రభువే మీకూ ప్రభువే. ఇతరులను అల్లాహ్‌కు భాగస్వాములుగా చేసేవారికి అల్లాహ్ స్వర్గాన్ని నిషిద్ధం చేశాడు. వారి నివాసం నరకం. అటువంటి దుర్మార్గులకు సహాయం అందించేవాడెవడూ లేడు.

قُلْ يٰۤاَهْلَ الْكِتٰبِ لَسْتُمْ عَلٰى شَیْءٍ حَتّٰى
تُقِيْمُوا التَّوْرٰىةَ وَ الْاِنْجِيْلَ وَ مَاۤ اُنْزِلَ
اِلَيْكُمْ مِّنْ رَّبِّكُمْ ؕ وَ لَيَزِيْدَنَّ كَثِيْرًا مِّنْهُمْ
مَّاۤ اُنْزِلَ اِلَيْكَ مِنْ رَّبِّكَ طُغْيَانًا وَّ كُفْرًا ۚ
فَلَا تَاْسَ عَلَى الْقَوْمِ الْكٰفِرِيْنَ ﴿۶۸﴾ اِنَّ الَّذِيْنَ
اٰمَنُوْا وَ الَّذِيْنَ هَادُوْا وَالصّٰبِـُٔوْنَ وَ النَّصٰرٰى
مَنْ اٰمَنَ بِاللّٰهِ وَ الْيَوْمِ الْاٰخِرِ وَعَمِلَ صَالِحًا
فَلَا خَوْفٌ عَلَيْهِمْ وَ لَا هُمْ يَحْزَنُوْنَ ﴿۶۹﴾ لَقَدْ
اَخَذْنَا مِيْثَاقَ بَنِیْۤ اِسْرَآءِيْلَ وَ اَرْسَلْنَاۤ
اِلَيْهِمْ رُسُلًا ؕ كُلَّمَا جَآءَهُمْ رَسُوْلٌۢ بِمَا لَا
تَهْوٰۤى اَنْفُسُهُمْ ۙ فَرِيْقًا كَذَّبُوْا وَ فَرِيْقًا
يَّقْتُلُوْنَ ﴿۷۰﴾ وَحَسِبُوْۤا اَلَّا تَكُوْنَ فِتْنَةٌ فَعَمُوْا
وَصَمُّوْا ثُمَّ تَابَ اللّٰهُ عَلَيْهِمْ ثُمَّ عَمُوْا وَ
صَمُّوْا كَثِيْرٌ مِّنْهُمْ ؕ وَ اللّٰهُ بَصِيْرٌۢ بِمَا
يَعْمَلُوْنَ ﴿۷۱﴾ لَقَدْ كَفَرَ الَّذِيْنَ قَالُوْۤا اِنَّ اللّٰهَ
هُوَ الْمَسِيْحُ ابْنُ مَرْيَمَ ؕ وَ قَالَ الْمَسِيْحُ
يٰبَنِیْۤ اِسْرَآءِيْلَ اعْبُدُوا اللّٰهَ رَبِّیْ وَ رَبَّكُمْ ؕ
اِنَّهٗ مَنْ يُّشْرِكْ بِاللّٰهِ فَقَدْ حَرَّمَ اللّٰهُ عَلَيْهِ
الْجَنَّةَ وَ مَاْوٰىهُ النَّارُ ؕ وَ مَا لِلظّٰلِمِيْنَ مِنْ
اَنْصَارٍ ﴿۷۲﴾

---

42. అంటే, లోభత్వంలో వారే స్వయంగా పడివున్నారు. ప్రపంచంలో తమ లోభత్వమూ, తమ సంకుచిత హృదయమూ కారణంగా వారు సామెతగా రూపొందారు అని భావం.

43. వ్యాఖ్యానం కొరకు బఖర సూరా 62వ ఆయతుకు ఇవ్వబడిన 26వ వివరణ చూడండి.

لَقَدْ كَفَرَ الَّذِيْنَ قَالُوْٓا اِنَّ اللّٰهَ ثَالِثُ ثَلٰثَةٍ
وَ مَا مِنْ اِلٰهٍ اِلَّآ اِلٰهٌ وَّاحِدٌ ؕ وَ اِنْ لَّمْ
يَنْتَهُوْا عَمَّا يَقُوْلُوْنَ لَيَمَسَّنَّ الَّذِيْنَ كَفَرُوْا
مِنْهُمْ عَذَابٌ اَلِيْمٌ ﴿۷۳﴾ اَفَلَا يَتُوْبُوْنَ اِلَى اللّٰهِ
وَيَسْتَغْفِرُوْنَهٗ ؕ وَاللّٰهُ غَفُوْرٌ رَّحِيْمٌ ﴿۷۴﴾ مَا
الْمَسِيْحُ ابْنُ مَرْيَمَ اِلَّا رَسُوْلٌ ۚ قَدْ خَلَتْ
مِنْ قَبْلِهِ الرُّسُلُ ؕ وَ اُمُّهٗ صِدِّيْقَةٌ ؕ كَانَا
يَاْكُلٰنِ الطَّعَامَ ؕ اُنْظُرْ كَيْفَ نُبَيِّنُ لَهُمُ الْاٰيٰتِ
ثُمَّ انْظُرْ اَنّٰى يُؤْفَكُوْنَ ﴿۷۵﴾ قُلْ اَتَعْبُدُوْنَ مِنْ
دُوْنِ اللّٰهِ مَا لَا يَمْلِكُ لَكُمْ ضَرًّا وَّ لَا نَفْعًا ؕ
وَاللّٰهُ هُوَ السَّمِيْعُ الْعَلِيْمُ ﴿۷۶﴾ قُلْ يٰٓاَهْلَ
الْكِتٰبِ لَا تَغْلُوْا فِيْ دِيْنِكُمْ غَيْرَ الْحَقِّ وَ لَا
تَتَّبِعُوْٓا اَهْوَآءَ قَوْمٍ قَدْ ضَلُّوْا مِنْ قَبْلُ
وَاَضَلُّوْا كَثِيْرًا وَّ ضَلُّوْا عَنْ سَوَآءِ السَّبِيْلِ ﴿۷۷﴾

**73 - 74** "అల్లాహ్ ముగ్గురిలో ఒకడు" అని అన్నవారు నిశ్చయంగా అవిశ్వాసానికి పాల్పడినవారు. వాస్తవమేమి టంటే, దేవుడు ఒక్కడే. మరొక దేవుడు లేడు. వారు గనక తమ ఈ మాటలను మానుకోకపోతే, వారిలో అవిశ్వాసానికి ఒడిగట్టిన వారికి వ్యధాభరితమైన శిక్షపడుతుంది. అయితే, వారు అల్లాహ్ వైపునకు మరలరా? క్షమించు అని ఆయనను వేడుకోరా? అల్లాహ్ అమితంగా మన్నించేవాడు, కరుణించే వాడూను.

**75** మర్యమ్ పుత్రుడైన మసీహ్ ఒక ప్రవక్త తప్ప మరేమీ కాడు. ఆయనకు పూర్వం కూడా ఎంతోమంది ప్రవక్తలు గతించారు. ఆయన తల్లి సద్గుణసంపన్నురాలు. వారు ఉభయులూ (ప్రతిరోజూ) భోజనం చేసేవారు - చూడండి! మేము వారిముందు యథార్థానికి సంబంధించిన సూచనలను ఎలా విశదీకరిస్తున్నామో. చూడండి! అయినా వారు సన్మార్గం తప్పి ఎటుపోతున్నారో![44]

**76 - 77** వారితో ఇలా అను: "ఇదేమిటి, మీరు అల్లాహ్‌ను వదలి, మీకు నష్టంగాని, లాభంగాని కలిగించే అధికారంలేని దానిని పూజిస్తున్నారు? అందరిదీ వినేవాడూ అంతా తెలిసిన వాడూ అల్లాహ్ మాత్రమే." ఇలా చెప్పు: గ్రంథప్రజలారా! మీ ధర్మం విషయంలో అన్యాయంగా హద్దులు మీరి ప్రవర్తిం చకండి. మీకు పూర్వం, స్వయంగా తామూ మార్గభ్రష్టులై, ఇంకా చాలా మందిని మార్గభ్రష్టులుగా చేసి, రుజుమార్గం తప్పినవారి ఊహాపోహలను అనుసరించకండి.

44. ఇక్కడ కొన్ని పదాలలో మసీహ్ దేవుడు అనే క్రైస్తవుల విశ్వాసాన్ని స్పష్టంగా ఖండించటం జరిగింది. ఇంతకంటే స్పష్టంగా చెప్పటం సాధ్యం కాదు. మసీహ్‌ని గురించి అసలు ఆయన ఎవరు అని తెలుసుకోగోరితే, ఈ క్రింది గుర్తుల ద్వారా ఏమాత్రం అనుమానం లేని విధంగా ఆయన కేవలం ఒక మానవుడే అని తెలుసుకోగలరు : ఆయన స్త్రీ గర్భం నుండి పుట్టాడు. ఆయన వంశవృక్షం కూడా స్పష్టంగా ఉంది. ఆయన మానవ శరీరం కలిగివుండేవాడు. మానవుడి కొరకు ప్రత్యేకమైన అన్ని హద్దులకు లోబడి ఉండేవాడు. అన్ని కట్టుబాట్లలో బంధింపబడి ఉండేవాడు. అన్ని గుణాలను కలిగి ఉండేవాడు. ఇంకా నిద్రించేవాడు, తినేవాడు, వేడిమి చల్లదనాల అనుభూతిని పొందేవాడు. చివరకు క్రైస్తవుల ప్రకారమే షైతాను ద్వారా పరీక్షకు కూడా గురిచెయ్యబడ్డాడు, ఆయనను గురించి ఇంగిత జ్ఞానం కల ఏ మానవుడైనా ఆయన స్వయంగా దేవుడనీ, దైవత్వంలో అల్లాహ్‌కు భాగస్వామి అనీ, సహచరుడు అనీ ఎలా భావించగలడు?

لُعِنَ الَّذِيْنَ كَفَرُوْا مِنْۢ بَنِيْٓ اِسْرَآءِيْلَ عَلٰى
لِسَانِ دَاوٗدَ وَعِيْسَى ابْنِ مَرْيَمَ ؕ ذٰلِكَ بِمَا
عَصَوْا وَّكَانُوْا يَعْتَدُوْنَ ﴿٧٨﴾ كَانُوْا لَا يَتَنَاهَوْنَ
عَنْ مُّنْكَرٍ فَعَلُوْهُ ؕ لَبِئْسَ مَا كَانُوْا
يَفْعَلُوْنَ ﴿٧٩﴾ تَرٰى كَثِيْرًا مِّنْهُمْ يَتَوَلَّوْنَ
الَّذِيْنَ كَفَرُوْا ؕ لَبِئْسَ مَا قَدَّمَتْ لَهُمْ
اَنْفُسُهُمْ اَنْ سَخِطَ اللّٰهُ عَلَيْهِمْ وَ فِى الْعَذَابِ
هُمْ خٰلِدُوْنَ ﴿٨٠﴾ وَ لَوْ كَانُوْا يُؤْمِنُوْنَ بِاللّٰهِ وَ
النَّبِىِّ وَ مَآ اُنْزِلَ اِلَيْهِ مَا اتَّخَذُوْهُمْ اَوْلِيَآءَ
وَ لٰكِنَّ كَثِيْرًا مِّنْهُمْ فٰسِقُوْنَ ﴿٨١﴾ لَتَجِدَنَّ
اَشَدَّ النَّاسِ عَدَاوَةً لِّلَّذِيْنَ اٰمَنُوا الْيَهُوْدَ
وَالَّذِيْنَ اَشْرَكُوْا ۚ وَ لَتَجِدَنَّ اَقْرَبَهُمْ مَّوَدَّةً
لِّلَّذِيْنَ اٰمَنُوا الَّذِيْنَ قَالُوْٓا اِنَّا نَصٰرٰى ؕ ذٰلِكَ
بِاَنَّ مِنْهُمْ قِسِّيْسِيْنَ وَرُهْبَانًا وَّاَنَّهُمْ لَا
يَسْتَكْبِرُوْنَ ﴿٨٢﴾ وَ اِذَا سَمِعُوْا مَآ اُنْزِلَ اِلَى
الرَّسُوْلِ تَرٰٓى اَعْيُنَهُمْ تَفِيْضُ مِنَ الدَّمْعِ مِمَّا
عَرَفُوْا مِنَ الْحَقِّ ۚ يَقُوْلُوْنَ رَبَّنَآ اٰمَنَّا
فَاكْتُبْنَا مَعَ الشّٰهِدِيْنَ ﴿٨٣﴾

**78 - 81** ఇస్రాయీలు సంతతివారిలో అవిశ్వాస మార్గం అవలంబించిన వారిని దావూద్ నోట, మర్యమ్ కుమారుడైన మసీహ్ నోట శపించటం జరిగింది. ఎందుకంటే వారు అవిధేయులయ్యారు. అత్యాచారాలు చేయసాగారు. చెడు పనులు చెయ్యకుండా వారు ఒకరినొకరు నిరోధించటం మానివేశారు.[45] వారు అవలంబించిన మార్గం చాలా చెడ్డది. ఈనాడు నీవు వారిలో చాలా ఎక్కువమందిని (విశ్వాసులకు ప్రతికూలంగా) అవిశ్వాసులను బలపరచేవారుగా, వారితో మైత్రిచేసేవారుగా చూస్తావు. నిశ్చయంగా వారి మనస్సులు వారి కొరకు తయారు చేసిపెట్టిన ముగింపు బహు చెడ్డది. ఈ కారణంగా అల్లాహ్ వారిపై ఆగ్రహోదగ్రుడయ్యాడు. వారు శాశ్వత శిక్షకు గురిఅవుతారు. వారు నిజంగానే అల్లాహ్‌నూ, ప్రవక్తనూ, ప్రవక్తపై అవతరించినదానినీ విశ్వసించేవారే అయితే (విశ్వాసులకు ప్రతికూలంగా) అవిశ్వాసులను ఎన్నటికీ మిత్రులుగా చేసుకొని ఉండేవారు కాదు. కాని వారిలో చాలా మంది అల్లాహ్ పట్ల విధేయతకు దూరమైపోయారు.

**82 - 86** విశ్వాసుల పట్ల విరోధం విషయంలో, నీవు యూదులనూ, ముష్రిక్కులనూ అందరికంటే ఎక్కువ ప్రచండులుగా కనుగొంటావు. విశ్వాసులపట్ల మైత్రి విషయంలో "మేము క్రైస్తవులం" అని అన్నవారిని అత్యంత సన్నిహితులుగా చూస్తావు. దీనికి కారణం ఏమిటంటే వారిలో దైవభక్తి గల విద్వాంసులూ, ప్రపంచాన్ని పరిత్యజించిన సన్యాసులూ ఉన్నారు. ఇంకా వారిలో అహంభావం లేదు. ప్రవక్తపై అవతరించిన ఈ గ్రంథాన్ని వారు విన్నప్పుడు, సత్యాన్ని గ్రహించిన కారణంగా వారి కళ్ళు అశ్రువులతో చెమ్మగిల్లటం నీవు చూస్తావు. వారు ఇలా అనేస్తారు: "ప్రభూ! మేము విశ్వసించాము. మా పేర్లను సాక్ష్యం ఇచ్చేవారిలో వ్రాయి."

45. ఒక జాతి చెడిపోవటం అనేది మొదట్లో కేవలం కొందరు వ్యక్తులతో ప్రారంభం అవుతుంది. ఒకవేళ జాతియొక్క సామూహిక అంతరాత్మ సజీవంగా ఉంటే, ప్రజాభిప్రాయం చెడిపోయిన ఆ వ్యక్తులను అణచిపెడుతూ ఉంటే మొత్తంమీద జాతి చెడిపోదు. కాని ఒకవేళ జాతి ఆ వ్యక్తుల విషయంలో అశ్రద్ధ వహించటం ప్రారంభిస్తే దుర్మార్గులను మందలించటానికి బదులుగా వారిని సంఘంలో తప్పుడు పనులను చేసేటందుకు స్వేచ్ఛగా వదలిపెడితే, క్రమక్రమంగా మొదట్లో కొందరు వ్యక్తుల వరకే పరిమితమైన చెడు మొత్తం జాతిలో వ్యాపిస్తుంది. ఇదే చివరకు ఇస్రాయీలు జాతి చెడిపోవటానికి కారణభూతం అయింది.

وَ مَا لَنَا لَا نُؤۡمِنُ بِاللّٰهِ وَمَا جَآءَنَا مِنَ
الۡحَقِّ ۙ وَ نَطۡمَعُ اَنۡ یُّدۡخِلَنَا رَبُّنَا مَعَ الۡقَوۡمِ
الصّٰلِحِیۡنَ ﴿۸۴﴾ فَاَثَابَهُمُ اللّٰهُ بِمَا قَالُوۡا جَنّٰتٍ
تَجۡرِیۡ مِنۡ تَحۡتِهَا الۡاَنۡهٰرُ خٰلِدِیۡنَ فِیۡهَا ؕ وَ
ذٰلِكَ جَزَآءُ الۡمُحۡسِنِیۡنَ ﴿۸۵﴾ وَ الَّذِیۡنَ كَفَرُوۡا
وَ كَذَّبُوۡا بِاٰیٰتِنَاۤ اُولٰٓئِكَ اَصۡحٰبُ الۡجَحِیۡمِ ﴿۸۶﴾ ع
یٰۤاَیُّهَا الَّذِیۡنَ اٰمَنُوۡا لَا تُحَرِّمُوۡا طَیِّبٰتِ مَاۤ
اَحَلَّ اللّٰهُ لَكُمۡ وَ لَا تَعۡتَدُوۡا ؕ اِنَّ اللّٰهَ لَا
یُحِبُّ الۡمُعۡتَدِیۡنَ ﴿۸۷﴾ وَ كُلُوۡا مِمَّا رَزَقَكُمُ اللّٰهُ
حَلٰلًا طَیِّبًا ۪ وَّاتَّقُوا اللّٰهَ الَّذِیۡۤ اَنۡتُمۡ بِهٖ
مُؤۡمِنُوۡنَ ﴿۸۸﴾ لَا یُؤَاخِذُكُمُ اللّٰهُ بِاللَّغۡوِ فِیۡۤ
اَیۡمَانِكُمۡ وَ لٰكِنۡ یُّؤَاخِذُكُمۡ بِمَا عَقَّدۡتُّمُ
الۡاَیۡمَانَ ۚ فَكَفَّارَتُهٗۤ اِطۡعَامُ عَشَرَةِ مَسٰكِیۡنَ
مِنۡ اَوۡسَطِ مَا تُطۡعِمُوۡنَ اَهۡلِیۡكُمۡ اَوۡ كِسۡوَتُهُمۡ
اَوۡ تَحۡرِیۡرُ رَقَبَةٍ ؕ فَمَنۡ لَّمۡ یَجِدۡ فَصِیَامُ ثَلٰثَةِ
اَیَّامٍ ؕ ذٰلِكَ كَفَّارَةُ اَیۡمَانِكُمۡ اِذَا حَلَفۡتُمۡ ؕ
وَ احۡفَظُوۡۤا اَیۡمَانَكُمۡ ؕ كَذٰلِكَ یُبَیِّنُ اللّٰهُ لَكُمۡ
اٰیٰتِهٖ لَعَلَّكُمۡ تَشۡكُرُوۡنَ ﴿۸۹﴾

ఇంకా వారు ఇలా అంటారు: "మా ప్రభువు మమ్మల్ని సజ్జనులలో చేర్చాలనే ఆకాంక్ష మాకు ఉన్నప్పుడు మేము అల్లాహ్‌ను ఎందుకు విశ్వసించకూడదు? మా వద్దకు వచ్చిన సత్యాన్ని ఎందుకు స్వీకరించకూడదు?" వారు ఇలా పలికిన కారణంగా అల్లాహ్ వారికి కింద కాలువలు ప్రవహించే ఉద్యానవనాలను ప్రసాదించాడు. వారు అక్కడ కలకాలం ఉంటారు. సద్వర్తనులకు లభించే ప్రతిఫలం ఇది. ఇక మా ఆయత్తులను స్వీకరించటానికి తిరస్కరించేవారూ, వాటిని అసత్యాలుగా చిత్రించి నిరాకరించేవారూ నరకానికి అర్హులు.

**87 - 88** విశ్వాసులారా! అల్లాహ్ మీ కొరకు ధర్మ సమ్మతం చేసిన పరిశుద్ధ వస్తువులను నిషిద్ధం చేసుకోకండి.[46] హద్దులను అతిక్రమించకండి. మితిమీరి ప్రవర్తించేవారంటే అల్లాహ్‌కు ఏమాత్రం ఇష్టం ఉండదు. అల్లాహ్ మీకు ప్రసాదించిన ధర్మ సమ్మతమూ, పరిశుద్ధమూ అయిన ఆహారాన్ని తినండి, త్రాగండి. మీరు విశ్వసించిన దైవం పట్ల అవిధేయతకు దూరంగా ఉండండి.

**89** మీరు చేసే అర్థంలేని ప్రమాణాలను గురించి అల్లాహ్ మిమ్మల్ని పట్టుకోడు. కాని మీరు బుద్ధిపూర్వకంగా చేసే ప్రమాణాలను గురించి ఆయన మిమ్మల్ని తప్పకుండా ప్రశ్నిస్తాడు. (అటువంటి ప్రమాణభంగానికి) పరిహారం ఏమిటంటే మీరు మీ ఆలుబిడ్డలకు తినిపించే మామూలు భోజనం పది మంది పేదలకు పెట్టటం లేదా వారికి కట్టుబట్టలు ఇవ్వటం లేదా ఒక బానిసను స్వతంత్రునిగా చెయ్యటం. ఈ స్తోమతలేనివారు మూడు రోజుల పాటు ఉపవాసం ఉండాలి. మీరు ప్రమాణం చేసి భంగపరిస్తే, మీ ప్రమాణాలకు పరిహారం ఇది. మీరు మీ ప్రమాణాలను కాపాడుకోండి. మీరు కృతజ్ఞతలు తెలుపుతారని అల్లాహ్ ఈ విధంగా తన ఆజ్ఞలను మీ కొరకు విశదం చేస్తున్నాడు.

46. ఈ ఆయత్‌లో రెండు విషయాలు చెప్పబడ్డాయి. ఒకటి : స్వయంగా మీరే నిషేధింపదగినవి ఏవో, ధరసమ్మతమైనవి ఏవో నిర్ణయించటానికి పూనుకోకండి. అల్లాహ్ దేనిని ధర్మసమ్మతం చేశాడో అదే ధర్మసమ్మతమైనది. అల్లాహ్ దేనిని నిషేధించాడో, అదే నిషిద్ధమైనది. మీ అధికారంతో ధర్మసమ్మతమైన దానిని నిషిద్ధం చేస్తే అప్పుడు మీరు దైవ శాసనానికి బదులుగా మనశ్శాసనాన్ని అనుసరించేవారుగా నిర్ణయింపబడతారు. రెండో విషయం: క్రైస్తవ సన్యాసులు, హిందూ యోగులు, బౌద్ధభిక్షువులు, సూఫీల మాదిరిగా వైరాగ్యాన్ని, సంసార పరిత్యాగ విధానాన్ని అవలంబించకండి.

يَاَيُّهَا الَّذِيۡنَ اٰمَنُوۡۤا اِنَّمَا الۡخَمۡرُ وَالۡمَيۡسِرُ وَ
الۡاَنۡصَابُ وَ الۡاَزۡلَامُ رِجۡسٌ مِّنۡ عَمَلِ
الشَّيۡطٰنِ فَاجۡتَنِبُوۡهُ لَعَلَّكُمۡ تُفۡلِحُوۡنَ ﴿۹۰﴾ اِنَّمَا
يُرِيۡدُ الشَّيۡطٰنُ اَنۡ يُّوۡقِعَ بَيۡنَكُمُ الۡعَدَاوَةَ
وَالۡبَغۡضَآءَ فِى الۡخَمۡرِ وَ الۡمَيۡسِرِ وَيَصُدَّكُمۡ عَنۡ
ذِكۡرِ اللّٰهِ وَ عَنِ الصَّلٰوةِۚ فَهَلۡ اَنۡتُمۡ
مُّنۡتَهُوۡنَ ﴿۹۱﴾ وَاَطِيۡعُوا اللّٰهَ وَاَطِيۡعُوا الرَّسُوۡلَ
وَاحۡذَرُوۡاۚ فَاِنۡ تَوَلَّيۡتُمۡ فَاعۡلَمُوۡۤا اَنَّمَا عَلٰى
رَسُوۡلِنَا الۡبَلٰغُ الۡمُبِيۡنُ ﴿۹۲﴾ لَيۡسَ عَلَى الَّذِيۡنَ
اٰمَنُوۡا وَ عَمِلُوا الصّٰلِحٰتِ جُنَاحٌ فِيۡمَا طَعِمُوۡۤا
اِذَا مَا اتَّقَوْا وَّ اٰمَنُوۡا وَ عَمِلُوا الصّٰلِحٰتِ ثُمَّ
اتَّقَوْا وَّ اٰمَنُوۡا ثُمَّ اتَّقَوْا وَّاَحۡسَنُوۡاؕ وَ اللّٰهُ
يُحِبُّ الۡمُحۡسِنِيۡنَ ﴿۹۳﴾ يٰۤاَيُّهَا الَّذِيۡنَ اٰمَنُوۡا ع ۱۲/۲
لَيَبۡلُوَنَّكُمُ اللّٰهُ بِشَىۡءٍ مِّنَ الصَّيۡدِ تَنَالُهٗۤ
اَيۡدِيۡكُمۡ وَ رِمَاحُكُمۡ لِيَعۡلَمَ اللّٰهُ مَنۡ يَّخَافُهٗ
بِالۡغَيۡبِۚ فَمَنِ اعۡتَدٰى بَعۡدَ ذٰلِكَ فَلَهٗ
عَذَابٌ اَلِيۡمٌ ﴿۹۴﴾

**90 - 92** విశ్వాసులారా! సారాయి, జూదం, దైవేతర మంది రాలు, పాచికల ద్వారా జోస్యం - ఇవన్నీ అసహ్యకరమైన షైతాను పనులు. వాటిని విసర్జించండి. మీకు సాఫల్య భాగ్యం కలిగే అవకాశం ఉంది.[47] షైతాను సారాయి, జూదాల ద్వారా మీ మధ్య విరోధ విద్వేషాలను సృష్టించాలనీ, మిమ్మల్ని అల్లాహ్ స్మరణ నుండీ, నమాజు నుండీ వారించాలని కోర్తాడు. కనుక మీరు వీటిని మానుకుంటారా లేదా? అల్లాహ్ మాటను ఆయన ప్రవక్త మాటను వినండి. వాటిని మానుకోండి. కాని మీరు గనక ఆజ్ఞలను పాలించకపోతే, బాగా తెలుసుకోండి, మా ప్రవక్తపై ఉన్న బాధ్యత కేవలం ఆజ్ఞలను స్పష్టంగా అంద చేయటమే.

**93** విశ్వసించి మంచి పనులు చేసేవారిని వారు పూర్వం తిన్నదానిని గురించి, త్రాగినదానిని గురించి ప్రశ్నించటం జరగదు. కాని వారు ఇక ముందు హరాము చెయ్యబడిన వస్తువులకు దూరంగా ఉండాలి. స్థిరమైన విశ్వాసం కలిగి ఉండాలి. మంచి పనులు చెయ్యాలి. ఇంకా మానుకోవాలని ఆజ్ఞాపించబడిన వస్తువులన్నింటినీ మానుకోవాలి. అల్లాహ్ ఆజ్ఞను అంగీకరించాలి. భయభక్తులతో పాటు సద్వర్తన కూడా కలిగి ఉండాలి. అల్లాహ్ సౌశీల్యవంతులను ప్రేమిస్తాడు.

**94 - 95** విశ్వాసులారా! మీ చేతులకూ మీ ఈటెల దెబ్బకూ పూర్తిగా అందుబాటులో వున్న వేట వస్తువు ద్వారా అల్లాహ్ మిమ్మల్ని కఠిన పరీక్షకు గురిచేస్తాడు, తనను చూడకుండానే మీలో, ఎవరు తనకు భయపడతారో చూద్దామని. ఈ హెచ్చరిక తరువాత అల్లాహ్ నిర్ణయించిన హద్దులను అతిక్రమించేవారికి వ్యధాభరితమైన శిక్ష పడుతుంది.

47. సారాయి నిషేధం గురించి ఇదివరకు రెండు ఆజ్ఞలు వచ్చాయి. ఇవి బఖర సూరా 219వ ఆయత్‌లో, నిసా సూరా 43వ ఆయత్‌లో వచ్చాయి. ఇక ఈ అంతిమ ఆజ్ఞ రావటానికి పూర్వం, మహాప్రవక్త (సఅసమ్) ఒక ఉపన్యాసంలో ప్రజలను ఇలా హెచ్చరించారు : "అల్లాహ్‌కు సారాయి అంటే చాలా అనిష్టం. దానిని గురించి పూర్తి నిషేధం రావటం అసంభవమేమీ కాదు. కనుక ఎవరెవరి వద్ద సారాయి ఉందో దానిని అమ్మివేసుకోండి." దీనికి కొంతకాలం తరువాత ఈ ఆయత్ అవతరించింది. అప్పుడు మహాప్రవక్త (సఅసమ్) ఇలా ప్రకటించారు : "ఇక ఎవరివద్ద సారాయి ఉందో వారు దానిని త్రాగటానికి వీలులేదు, అమ్మటానికీ వీలులేదు. దానిని వారు పారబోయాలి." వెంటనే మదీనా పుర వీధులలో సారాయి ప్రవహించింది.

يٰۤاَيُّهَا الَّذِيۡنَ اٰمَنُوۡا لَا تَقۡتُلُوا الصَّيۡدَ وَاَنۡتُمۡ
حُرُمٌ ؕ وَمَنۡ قَتَلَهٗ مِنۡكُمۡ مُّتَعَمِّدًا فَجَزَآءٌ
مِّثۡلُ مَا قَتَلَ مِنَ النَّعَمِ يَحۡكُمُ بِهٖ ذَوَا عَدۡلٍ
مِّنۡكُمۡ هَدۡيًاۢ بٰلِغَ الۡـكَعۡبَةِ اَوۡ كَفَّارَةٌ طَعَامُ
مَسٰكِيۡنَ اَوۡ عَدۡلُ ذٰلِكَ صِيَامًا لِّيَذُوۡقَ وَبَالَ
اَمۡرِهٖ ؕ عَفَا اللّٰهُ عَمَّا سَلَفَ ؕ وَمَنۡ عَادَ
فَيَنۡتَقِمُ اللّٰهُ مِنۡهُ ؕ وَاللّٰهُ عَزِيۡزٌ ذُو انۡتِقَامٍ ۝٩٥
اُحِلَّ لَـكُمۡ صَيۡدُ الۡبَحۡرِ وَطَعَامُهٗ مَتَاعًا لَّـكُمۡ وَ
لِلسَّيَّارَةِ‌ ۚ وَحُرِّمَ عَلَيۡكُمۡ صَيۡدُ الۡبَـرِّ مَا دُمۡتُمۡ
حُرُمًا ‌ؕ وَاتَّقُوا اللّٰهَ الَّذِىۡۤ اِلَيۡهِ تُحۡشَرُوۡنَ ۝٩٦
جَعَلَ اللّٰهُ الۡـكَعۡبَةَ الۡبَيۡتَ الۡحَـرَامَ قِيٰمًا لِّلنَّاسِ
وَالشَّهۡرَ الۡحَـرَامَ وَالۡهَدۡىَ وَالۡقَلَاۤئِدَ‌ ؕ ذٰ لِكَ
لِتَعۡلَمُوۡۤا اَنَّ اللّٰهَ يَعۡلَمُ مَا فِى السَّمٰوٰتِ وَمَا فِى
الۡاَرۡضِ وَاَنَّ اللّٰهَ بِكُلِّ شَىۡءٍ عَلِيۡمٌ ۝٩٧
اِعۡلَمُوۡۤا اَنَّ اللّٰهَ شَدِيۡدُ الۡعِقَابِ وَاَنَّ اللّٰهَ
غَفُوۡرٌ رَّحِيۡمٌ ۝٩٨ مَا عَلَى الرَّسُوۡلِ اِلَّا
الۡبَلٰغُ‌ ؕ وَاللّٰهُ يَعۡلَمُ مَا تُبۡدُوۡنَ وَمَا
تَكۡتُمُوۡنَ ۝٩٩ قُلْ لَّا يَسۡتَوِى الۡخَبِيۡثُ وَالطَّيِّبُ
وَلَوۡ اَعۡجَبَكَ كَثۡرَةُ الۡخَبِيۡثِ‌ ۚ فَاتَّقُوا اللّٰهَ
يٰۤاُولِى الۡاَلۡبَابِ لَعَلَّكُمۡ تُفۡلِحُوۡنَ ۝١٠٠ ع ١٣

విశ్వసించిన ప్రజలారా! 'ఇహ్రాము' స్థితిలో వేటాడకండి.[48] ఒకవేళ మీలో ఎవరైనా బుద్ధి పూర్వకంగా అలా చేస్తే, అతడు తాను చంపిన జంతువుతో సరితూగే ఒక పశువును నజరానా (మొక్కుబడి)గా సమర్పించుకోవాలి. దానిని మీలో న్యాయస్థులైన ఇద్దరు వ్యక్తులు నిర్ణయించాలి. ఈ నజరానాను కాబాకు చేర్చాలి. లేకపోతే, ఆ పాపానికి పరిహారంగా కొంతమంది పేదలకు భోజనం పెట్టాలి. లేదా దానికి సమానంగా ఉపవాసాలు ఉండాలి. ఎందుకంటే తాను చేసిన దాని యొక్క ఫలితాన్ని అతడు చవిచూడాలి. పూర్వం జరిగినదానిని అల్లాహ్ క్షమించాడు. కాని ఇకముందు ఎవరైనా మళ్ళీ అలా చేస్తే, అల్లాహ్ వారికి ప్రతీకారం చేస్తాడు. అల్లాహ్ అత్యంత శక్తి సంపన్నుడు. ప్రతీకారం చేసే శక్తి ఆయనకు ఉంది.

**96** సముద్ర జంతువులని వేటాడటం, వాటిని తినటం మీ కొరకు ధర్మ సమ్మతం చెయ్యబడ్డాయి. మీరు మజిలీ చేసేచోట కూడా వాటిని తినవచ్చు. ఇంకా వాటిని ప్రయాణీకుల బృందం కొరకు భోజన సామగ్రిగా కూడా చేసుకోవచ్చు. అయితే మీరు 'ఇహ్రాము' స్థితిలో ఉన్నంతవరకూ, నేలపై వేటాడటం మీకు నిషిద్ధం చెయ్యబడింది. కనుక అల్లాహ్ అవిధేయతకు దూరంగా ఉండండి. ఆయన సమక్షంలో మీరంతా ప్రోగుచెయ్యబడి హాజరుపరచబడతారు.

**97 - 100** పవిత్ర గృహమైన కాబాను అల్లాహ్ మానవజాతి (సమైక్యజీవన) సంస్థాపనకు సాధనంగా చేశాడు. ఇంకా పవిత్ర మాసాన్నీ, ఖుర్బానీ పశువులనూ వాటి కంఠపట్టికలను కూడా (ఈ కార్యసాధనలో సహాయపడేవిగా) చేశాడు, ఆకాశాలలో భూమిలో ఉన్న పరిస్థితులన్నీ అల్లాహ్‌కు తెలుసనీ, ఆయన సర్వజ్ఞాని అనీ మీకు తెలియటానికి. తెలుసుకోండి! అల్లాహ్ శిక్షించటంలో కూడా కఠినుడు. దానితో పాటు ఆయన అధికంగా మన్నించేవాడు, కరుణించేవాడూను. ప్రవక్తపై కేవలం సందేశాన్ని అందజేసే బాధ్యత మాత్రమే ఉంది. ఆ తరువాత మీ బాహ్యాంతర పరిస్థితులన్నింటినీ తెలుసు కునే వాడు అల్లాహ్‌యే. ప్రవక్తా! వారితో ఇలా అను: పరిశుద్ధము, అపరిశుద్ధము ఎట్టి పరిస్థితులలోనూ సమానం కావు, అపరిశుద్ధం యొక్క పుష్కలత నిన్ను ఎంతగా మరులు గొలిపినప్పటికీ.[49] వివేకంగల ప్రజలారా! అల్లాహ్ పట్ల అవిధేయతకు దూరంగా ఉండండి. మీకు సాఫల్య భాగ్యం కలిగే ఆశఉంది.

يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لَا تَسْـَٔلُوْا عَنْ اَشْيَآءَ
اِنْ تُبْدَ لَكُمْ تَسُؤْكُمْ ۚ وَ اِنْ تَسْـَٔلُوْا عَنْهَا حِيْنَ
يُنَزَّلُ الْقُرْاٰنُ تُبْدَ لَكُمْ ؕ عَفَا اللّٰهُ عَنْهَا ؕ وَ اللّٰهُ
غَفُوْرٌ حَلِيْمٌ ﴿۱۰۱﴾ قَدْ سَاَلَهَا قَوْمٌ مِّنْ قَبْلِكُمْ
ثُمَّ اَصْبَحُوْا بِهَا كٰفِرِيْنَ ﴿۱۰۲﴾ مَا جَعَلَ اللّٰهُ مِنْۢ
بَحِيْرَةٍ وَّ لَا سَآئِبَةٍ وَّ لَا وَصِيْلَةٍ وَّ لَا حَامٍ ۙ
وَّ لٰكِنَّ الَّذِيْنَ كَفَرُوْا يَفْتَرُوْنَ عَلَى اللّٰهِ
الْكَذِبَ ؕ وَ اَكْثَرُهُمْ لَا يَعْقِلُوْنَ ﴿۱۰۳﴾ وَ اِذَا
قِيْلَ لَهُمْ تَعَالَوْا اِلٰى مَاۤ اَنْزَلَ اللّٰهُ وَ اِلَى
الرَّسُوْلِ قَالُوْا حَسْبُنَا مَا وَجَدْنَا عَلَيْهِ
اٰبَآءَنَا ؕ اَوَ لَوْ كَانَ اٰبَآؤُهُمْ لَا يَعْلَمُوْنَ شَيْـًٔا
وَّ لَا يَهْتَدُوْنَ ﴿۱۰۴﴾

**101 - 102** విశ్వాసులారా! మీకు గనక వివరిస్తే మీకే బాధ[50] కలిగించే విషయాలను గురించి ప్రశ్నించకండి. కాని మీరు వాటిని ఖురాను అవతరించే సమయంలో అడిగితే, అవి మీకు విశదం చెయ్యబడతాయి. ఇంత వరకు మీరు చేసిన దానిని అల్లాహ్ క్షమించాడు. అల్లాహ్ క్షమించేవాడు, సహించే వాడూను. మీకు పూర్వం ఒక వర్గంవారు ఇటువంటి ప్రశ్నలనే అడిగారు. వారు ఆ ప్రశ్నల కారణంగానే అవిశ్వాసానికి గురిఅయ్యారు.

**103 - 104** అల్లాహ్ 'బహీరా'నుగాని, 'సాయిబా'ను గాని, 'వశీలా'ను గాని, 'హామ్'[51]ను గాని ఎంతమాత్రం నిర్ణయించ లేదు. అయినా ఈ అవిశ్వాసులు అల్లాహ్‌పై అపనిందను మోపుతున్నారు. వారిలో చాలామంది బుద్ధిలేని వాళ్ళు. (వారు ఇటువంటి భ్రమలను నమ్ముతున్నారు). "అల్లాహ్ అవతరింపజేసిన శాసనం వైపునకు రండి, ప్రవక్త వైపునకు రండి" అని వారితో చెప్పినప్పుడు, వారు "మా కొరకు మా తాతముత్తాతలు అవలంబిస్తూ ఉండగా మేము చూసిన విధానమే చాలు" అని జవాబు చెబుతారు. ఏమిటి! వారు తమ తాతముత్తాతలనే అనుసరిస్తూ పోతారా, వారికి ఏమీ తెలియనప్పటికీ, రుజుమార్గ జ్ఞానమే వారికి లేకపోయినప్పటికీ?

48. మనిషి స్వయంగా వేటాడటం లేక ఇతరులకు వేటలో ఏదో విధంగా సహాయపడటం – ఈ రెండు విషయాలూ ఇహ్రాము స్థితిలో నిషేధించబడ్డాయి. ఇంకా ఇహ్రాములో ఉన్నవారి కొరకు వేటాడటం జరిగితే, అప్పుడు కూడా ఇహ్రాములో ఉన్నవారికి దానిని తినటం ధర్మసమ్మతం కాదు. అయితే, ఒకవేళ ఎవరైనా తన కొరకు స్వయంగా వేటాడి అందులో నుండి ఇహ్రాములో ఉన్న వారికి అతడు కానుకగా కొంత ఇస్తే, దానిని తింటే దోషం లేదు. ఈ సాధారణ ఆజ్ఞ నుండి విష జంతువులు మినహాయించబడ్డాయి. పాము, తేలు, పిచ్చికుక్క వంటి ఇతర జంతువులను ఇహ్రాము స్థితిలో కూడా చంపవచ్చు. ఎందుకంటే, అవి మానవులకు నష్టం కలిగిస్తాయి.

49. ఈ ఆయత్ విలువలకు వేరే ప్రమాణాన్ని నిర్దేశిస్తోంది. బాహ్య రూపాన్ని మాత్రమే చూసే మానవుడు నిర్దేశించిన ప్రమాణానికి అది పూర్తి భిన్నంగా ఉంది. స్థూలదృష్టికి 100 రూపాయలు, 5 రూపాయల కంటే తప్పకుండా ఎక్కువ విలువైనవే. ఎందుకంటే అవి వందరూపాయలు, ఇవి ఐదు రూపాయలు. కాని ఆయత్ ఏమంటోందంటే, వందరూపాయలు గనక దైవం పట్ల అవిధేయతకు పాల్పడి సంపాదిస్తే అవి అపరిశుభ్రమైనవి. ఐదు రూపాయలను గనక దైవం పట్ల విధేయత పాటిస్తూ సంపాదిస్తే అవి పరిశుద్ధమైనవి. అపరిశుద్ధమైనవి పరిమాణంలో ఎంత ఎక్కువగా ఉన్నా ఎట్టి పరిస్థితులలోనూ అవి పరిశుద్ధమైన వాటితో ఏ విధంగానూ సమానం కాజాలవు.

50. మహాప్రవక్త (సఅసమ్)ను కొంతమంది వ్యర్థమైన వింత వింత ప్రశ్నలను అడిగేవారు. ధార్మిక విషయాలలోగాని, ప్రాపంచిక విషయాలలో గాని పనికిరాని ప్రశ్నలు అవి. కనుక ఈ విషయంలో ఈ హెచ్చరిక చెయ్యబడింది.

يَاَيُّهَا الَّذِيۡنَ اٰمَنُوۡا عَلَيۡكُمۡ اَنۡفُسَكُمۡ ۚ لَا
يَضُرُّكُمۡ مَّنۡ ضَلَّ اِذَا اهۡتَدَيۡتُمۡ ؕ اِلَى اللّٰهِ
مَرۡجِعُكُمۡ جَمِيۡعًا فَيُنَبِّئُكُمۡ بِمَا كُنۡتُمۡ
تَعۡمَلُوۡنَ ﴿۱۰۵﴾ يَاَيُّهَا الَّذِيۡنَ اٰمَنُوۡا شَهَادَةُ
بَيۡنِكُمۡ اِذَا حَضَرَ اَحَدَكُمُ الۡمَوۡتُ حِيۡنَ
الۡوَصِيَّةِ اثۡنٰنِ ذَوَا عَدۡلٍ مِّنۡكُمۡ اَوۡ اٰخَرٰنِ
مِنۡ غَيۡرِكُمۡ اِنۡ اَنۡتُمۡ ضَرَبۡتُمۡ فِى الۡاَرۡضِ
فَاَصَابَتۡكُمۡ مُّصِيۡبَةُ الۡمَوۡتِ ؕ تَحۡبِسُوۡنَهُمَا مِنۡۢ
بَعۡدِ الصَّلٰوةِ فَيُقۡسِمٰنِ بِاللّٰهِ اِنِ ارۡتَبۡتُمۡ لَا
نَشۡتَرِىۡ بِهٖ ثَمَنًا وَّلَوۡ كَانَ ذَا قُرۡبٰى ۙ وَلَا نَكۡتُمُ
شَهَادَةَ ۙ اللّٰهِ اِنَّاۤ اِذًا لَّمِنَ الۡاٰثِمِيۡنَ ﴿۱۰۶﴾ فَاِنۡ
عُثِرَ عَلٰٓى اَنَّهُمَا اسۡتَحَقَّاۤ اِثۡمًا فَاٰخَرٰنِ
يَقُوۡمٰنِ مَقَامَهُمَا مِنَ الَّذِيۡنَ اسۡتَحَقَّ عَلَيۡهِمُ
الۡاَوۡلَيٰنِ فَيُقۡسِمٰنِ بِاللّٰهِ لَشَهَادَتُنَاۤ اَحَقُّ مِنۡ
شَهَادَتِهِمَا وَمَا اعۡتَدَيۡنَاۤ ۖ اِنَّاۤ اِذًا لَّمِنَ
الظّٰلِمِيۡنَ ﴿۱۰۷﴾ ذٰلِكَ اَدۡنٰٓى اَنۡ يَّاۡتُوۡا بِالشَّهَادَةِ
عَلٰى وَجۡهِهَاۤ اَوۡ يَخَافُوۡۤا اَنۡ تُرَدَّ اَيۡمَانٌ ۢ بَعۡدَ
اَيۡمَانِهِمۡ ؕ وَاتَّقُوا اللّٰهَ وَاسۡمَعُوۡا ؕ وَاللّٰهُ لَا
يَهۡدِى الۡقَوۡمَ الۡفٰسِقِيۡنَ ﴿۱۰۸﴾ ع

**105** విశ్వాసులారా! మిమ్మల్ని గురించి మీరు ఆలోచించుకోండి. మీరు గనక స్వయంగా సన్మార్గంలో ఉంటే,[52] ఇతరులు మార్గభ్రష్టులైనప్పటికీ మీకు ఎంతమాత్రం హాని కలగదు. మీరందరూ అల్లాహ్ వైపునకే మరలి పోవలసి ఉంది. అప్పుడు ఆయన మీరు ఏమేమి చేస్తూ ఉండేవారో మీకు తెలుపుతాడు.

**106 - 108** విశ్వాసులారా! మీలో ఎవరికైనా మరణ సమయం ఆసన్నమై అతడు వీలునామా వ్రాయిస్తున్నప్పుడు, దాని సాక్ష్యానికి అనుసరించవలసిన పద్ధతి ఏమిటంటే, మీలో న్యాయవర్తనులైన ఇద్దరు వ్యక్తులు[53] సాక్షులుగా చెయ్యబడాలి లేక ఒకవేళ మీరు ప్రయాణ స్థితిలో ఉండి అక్కడ మీకు మృత్యు విపత్తు సంభవిస్తే అప్పుడు ముస్లిమేతరుల నుండే ఇద్దరు సాక్షులను తీసుకోవాలి. తరువాత ఏదైనా అనుమానం కలిగితే, నమాజు చేసిన పిదప ఆ ఇద్దరు సాక్షులనూ (మసీదులో) ఆపాలి. వారిద్దరూ అల్లాహ్‌పై ప్రమాణం చేసి ఇలా చెప్పాలి: "మేము స్వార్థం కొరకు సాక్ష్యాన్ని అమ్మేవాళ్ళం కాదు- అతడు మాకు దగ్గర బంధువైనాసరే (మేము అతని విషయంలో పక్షపాతం చూపం). మేము అల్లాహ్ కొరకు ఇచ్చే సాక్ష్యాన్ని దాచేవారం కాము. మేము ఆ విధంగా చేస్తే పాపాత్ములలో లెక్కింపబడతాము." కాని ఆ ఉభయులు తమను తాము పాపానికి గురిచేసుకున్నట్లు తెలిస్తే అప్పుడు వారి స్థానంలో సాక్ష్యమివ్వటానికి వారికంటే యోగ్యులైన మరో ఇద్దరు వ్యక్తులు - హక్కు విషయంలో అన్యాయం జరిగిన వారినుండి ముందుకు రావాలి. వారు అల్లాహ్‌పై ప్రమాణం చేసి ఇలా చెప్పాలి: "మా సాక్ష్యం వారి సాక్ష్యం కంటే ఎక్కువ సత్యమైనది. మేము మా సాక్ష్యం విషయంలో ఏ విధమైన అక్రమానికి పాల్పడలేదు. మేము ఆ విధంగా చేస్తే అన్యాయపరులలో చేరిపోతాము." ఈ పద్ధతివల్ల ప్రజలు నిజమైన సాక్ష్యం ఇస్తారనీ, లేదా వారి ప్రమాణాలను, తరువాత తీసుకోబడే ఇతరుల ప్రమాణాలు ఖండిస్తాయనే భయమైనా కనీసం వారికి కలుగుతుందనీ ఎక్కువగా ఆశించవచ్చు. అల్లాహ్‌కు భయపడండి, ఆలకించండి, అవిధేయత చూపే వారిని అల్లాహ్ తన మార్గదర్శకత్వానికి దూరం చేస్తాడు.

يَوْمَ يَجْمَعُ اللّٰهُ الرُّسُلَ فَيَقُوْلُ مَاذَآ
اُجِبْتُمْ ؕ قَالُوْا لَا عِلْمَ لَنَا ؕ اِنَّكَ اَنْتَ عَلَّامُ
الْغُيُوْبِ ﴿۱۰۹﴾ اِذْ قَالَ اللّٰهُ يٰعِيْسَى ابْنَ مَرْيَمَ
اذْكُرْ نِعْمَتِيْ عَلَيْكَ وَ عَلٰى وَالِدَتِكَ ۘ اِذْ
اَيَّدْتُّكَ بِرُوْحِ الْقُدُسِ ۟ تُكَلِّمُ النَّاسَ فِي
الْمَهْدِ وَ كَهْلًا ۚ وَ اِذْ عَلَّمْتُكَ الْكِتٰبَ وَ
الْحِكْمَةَ وَالتَّوْرٰىةَ وَالْاِنْجِيْلَ ۚ وَاِذْ تَخْلُقُ
مِنَ الطِّيْنِ كَهَيْـَٔةِ الطَّيْرِ بِاِذْنِيْ فَتَنْفُخُ فِيْهَا
فَتَكُوْنُ طَيْرًا بِاِذْنِيْ وَتُبْرِئُ الْاَكْمَهَ وَ
الْاَبْرَصَ بِاِذْنِيْ ۚ وَ اِذْ تُخْرِجُ الْمَوْتٰى بِاِذْنِيْ ۚ
وَ اِذْ كَفَفْتُ بَنِيْٓ اِسْرَآءِيْلَ عَنْكَ اِذْ جِئْتَهُمْ
بِالْبَيِّنٰتِ فَقَالَ الَّذِيْنَ كَفَرُوْا مِنْهُمْ اِنْ
هٰذَآ اِلَّا سِحْرٌ مُّبِيْنٌ ﴿۱۱۰﴾ وَ اِذْ اَوْحَيْتُ اِلَى
الْحَوَارِيّٖنَ اَنْ اٰمِنُوْا بِيْ وَ بِرَسُوْلِيْ ۚ قَالُوْٓا
اٰمَنَّا وَاشْهَدْ بِاَنَّنَا مُسْلِمُوْنَ ﴿۱۱۱﴾

وقف لازم

**109 - 119** అల్లాహ్, ప్రవక్తలందరినీ సమావేశపరచి, "మీకు ఏమని జవాబు ఇవ్వబడింది?"[54] అని అడిగే రోజున "మాకు ఏమీ తెలియదు. గుప్తంగా ఉన్న యథార్థాలన్నీ మీకే తెలుసు" అని వారు సమాధానం చెబుతారు. ఇంకా అల్లాహ్ ఈ విధంగా అడగబోయే ఆ సమయాన్ని గురించి ఊహించండి, "మర్యమ్ కుమారుడవైన ఈసా! జ్ఞాపకం తెచ్చుకో, నేను నీకూ, నీ తల్లికీ ప్రసాదించిన అనుగ్రహాన్ని నేను పరిశుద్ధాత్మ ద్వారా నీకు సహాయం చేశాను. నీవు ఊయలలో సైతం ప్రజలతో మాట్లాడే వాడివి, అదే విధంగా ఎదిగిన తరువాత కూడా. నేను నీకు గ్రంథాన్నీ, వివేకాన్నీ, తౌరాతునూ ఇంజీలునూ నేర్పాను. నీవు నా ఆదేశంతో పక్షి ఆకారంగల మట్టిబొమ్మను తయారు చేసి, దానిలో ఊదేవాడివి. అది నా ఆజ్ఞతో పక్షి అయ్యేది. నీవు పుట్టు గ్రుడ్డినీ, కుష్ఠురోగినీ నా ఆజ్ఞతో బాగు చేసే వాడివి. నీవు మృతులను నా ఆజ్ఞతో వెలికి తీసేవాడివి.[55] నీవు స్పష్టమైన సూచనలతో ఇస్రాయీలు సంతతి వారివద్దకు వచ్చినప్పుడు, వారిలోని సత్యతిరస్కారులు "ఈ సూచనలు మాయ తప్ప మరేమీ కాదు" అని అన్నారు. అప్పుడు నేనే నిన్ను వారి బారినుండి రక్షించాను. నేను హవారీలకు, "నన్నూ నా ప్రవక్తను విశ్వసించండి" అని సూచించినప్పుడు వారు "మేము విశ్వసించాము, మేము ముస్లిములము అయ్యామన్న దానికి నీవే సాక్షి"అని అన్నారు–

51. ఇది అరబ్‌వాసుల మూఢవిశ్వాసాల ప్రస్తావన. ఐదు ఈతలు ఈని చివరిసారిగా మగ ఒంటెను ఈనిన ఆడ ఒంటెను "బహీరా" అని అంటారు. అజ్ఞానయుగంలో అరబ్‌వాసులు అటువంటి దానిని చెవులు కోసి స్వేచ్ఛగా వదలిపెట్టేవారు. తరువాత దానిపై ఎవరూ స్వారీ చేసేవారు కారు. దాని పాలు త్రాగేవారు కారు. దాని రోమాలను కూడా ఉన్ని కోసం తీసేవారు కారు. తాను కోరిన పొలంలో, బీడులో మేత మెయ్యటానికి, తాను కోరిన రేవులో నీళ్ళు త్రాగటానికీ దానికి స్వేచ్ఛ ఉండేది. మొక్కుకున్న పని పూర్తి అయినప్పుడు లేక ఏదైనా వ్యాధి నయమయినప్పుడు లేక ఏదైనా ప్రమాదం నుండి తప్పించుకున్నప్పుడు కృతజ్ఞతాపూర్వకంగా దేవతల పేరుతో వదలిపెట్టే మగ ఒంటెను లేక ఆడ ఒంటెను "సాయిబా" అంటారు. ఇంకా పది ఈతలు ఈనిన, ప్రతిసారీ ఆడ ఒంటెనే ఈనిన ఒంటెను కూడా స్వేచ్ఛగా వదలిపెడతారు. మేక గనక మొదటి ఈతలో పోతును పెడితే, అది దేవతల పేరిట బలి ఇవ్వబడేది. మేక గనక ఆడమేకను ఈనితే దానిని ఉంచుకునేవారు. కాని ఆడ మేక, పోతు మేక రెండూ ఒకేసారి పుడితే, పోతును బలిచెయ్యటానికి బదులుగా దేవతల పేరిట వదలిపెట్టేవారు. దాని పేరే "వశీలా." మనుమడైన ఒంటె స్వారీకి యోగ్యమైనది అయినప్పుడు దాని తాత అయిన ముసలి ఒంటెను స్వేచ్ఛగా వదలిపెట్టేవారు. ఆ ముసలి ఒంటెనే "హామ్" అని అంటారు. ఇంకా ఒక ఒంటె రేతస్సువల్ల పది ఒంటె పిల్లలు పుడితే, దానికి కూడా స్వేచ్ఛ లభించేది.

اِذۡ قَالَ الۡحَوَارِيُّوۡنَ يٰعِيۡسَى ابۡنَ مَرۡيَمَ هَلۡ
يَسۡتَطِيۡعُ رَبُّكَ اَنۡ يُّنَزِّلَ عَلَيۡنَا مَآئِدَةً مِّنَ
السَّمَآءِ‌ؕ قَالَ اتَّقُوا اللّٰهَ اِنۡ كُنۡتُمۡ مُّؤۡمِنِيۡنَ ﴿١١٢﴾
قَالُوۡا نُرِيۡدُ اَنۡ نَّاۡكُلَ مِنۡهَا وَ تَطۡمَئِنَّ قُلُوۡبُنَا
وَ نَعۡلَمَ اَنۡ قَدۡ صَدَقۡتَنَا وَنَكُوۡنَ عَلَيۡهَا مِنَ
الشّٰهِدِيۡنَ ﴿١١٣﴾ قَالَ عِيۡسَى ابۡنُ مَرۡيَمَ اللّٰهُمَّ الربع
رَبَّنَاۤ اَنۡزِلۡ عَلَيۡنَا مَآئِدَةً مِّنَ السَّمَآءِ تَكُوۡنُ
لَنَا عِيۡدًا لِّاَوَّلِنَا وَاٰخِرِنَا وَ اٰيَةً مِّنۡكَ‌ۚ
وَارۡزُقۡنَا وَ اَنۡتَ خَيۡرُ الرّٰزِقِيۡنَ ﴿١١٤﴾ قَالَ اللّٰهُ
اِنِّىۡ مُنَزِّلُهَا عَلَيۡكُمۡ‌ۚ فَمَنۡ يَّكۡفُرۡ بَعۡدُ مِنۡكُمۡ
فَاِنِّىۡۤ اُعَذِّبُهٗ عَذَابًا لَّاۤ اُعَذِّبُهٗۤ اَحَدًا مِّنَ
الۡعٰلَمِيۡنَ ﴿١١٥﴾ وَ اِذۡ قَالَ اللّٰهُ يٰعِيۡسَى ابۡنَ مَرۡيَمَ ع ١٥ ٥
ءَاَنۡتَ قُلۡتَ لِلنَّاسِ اتَّخِذُوۡنِىۡ وَ اُمِّىَ اِلٰهَيۡنِ
مِنۡ دُوۡنِ اللّٰهِ‌ؕ قَالَ سُبۡحٰنَكَ مَا يَكُوۡنُ لِىۡۤ
اَنۡ اَقُوۡلَ مَا لَيۡسَ لِىۡ بِحَقٍّ‌ؕ اِنۡ كُنۡتُ وقف النبي
قُلۡتُهٗ فَقَدۡ عَلِمۡتَهٗ‌ؕ تَعۡلَمُ مَا فِىۡ نَفۡسِىۡ وَ لَاۤ
اَعۡلَمُ مَا فِىۡ نَفۡسِكَ‌ؕ اِنَّكَ اَنۡتَ عَلَّامُ الۡغُيُوۡبِ ﴿١١٦﴾

(హవారీల[56] విషయంలో) మరొక సంఘటనను కూడా జ్ఞాపకం తెచ్చుకో. వారు "మర్యమ్ కుమారుడవైన ఈసా! నీ ప్రభువు మా కొరకు ఆహార పదార్థాలతో నిండిన ఒక పళ్ళాన్ని ఆకాశం నుండి దింపగలడా?" అని అడిగినప్పుడు, ఈసా, "మీరు విశ్వాసులే అయితే అల్లాహ్‌కు భయపడండి" అని అన్నాడు. వారు ఇలా అన్నారు: "ఆ పళ్ళెంలో ఉన్న ఆహారాన్ని భుజించాలనీ, మా హృదయాలకు తృప్తి కలగాలనీ, నీవు మాకు చెప్పినదంతా నిజమనే విషయం మాకు తెలియాలనీ, ఇంకా మేము దానికి సాక్షులుగా ఉండాలనీ మాత్రమే మేము కోరుతున్నాము." దానిపై మర్యమ్ కుమారుడైన ఈసా ఇలా ప్రార్థించాడు: "అల్లాహ్! మా ప్రభూ! ఆకాశం నుండి మాపై ఆహారంతో నిండిన పళ్ళాన్ని ఒక దానిని అవతరింపజెయ్యి. అది మాకూ, మా పూర్వీకులకూ, మా తరువాతి వారికీ ఒక పండుగ సమయంగా నిర్ణయింపబడాలి. నీ తరపునుండి ఒక సూచన కాగలగాలి. మాకు ఆహారం ప్రసాదించు. నీవు ఉత్తమ ఆహారప్రదాతవు." అల్లాహ్ ఇలా జవాబు పలికాడు: "నేను దానిని మీపై అవతరింపజేస్తాను. కాని దాని తరువాత కూడా మీలో ఎవరైనా అవిశ్వాసానికి పాల్పడితే, వారికి నేను ఇంతవరకూ ఎవరికీ విధించని శిక్ష విధిస్తాను."– (ఈ అనుగ్రహాలను గుర్తు చేసి) అల్లాహ్, "మర్యమ్ కుమారుడవైన ఈసా! నీవు మనుజ జాతితో, అల్లాహ్‌ను కాదని నన్నూ, నా తల్లిని దేవుళ్ళుగా భావించండి అని బోధించావా?"[57] అని అడిగినపుడు అతను ఇలా మనవి చేసుకుంటాడు: "నీవు అత్యంత పవిత్రుడవు! ఏ మాటను అనే హక్కు నాకు లేదో ఆ మాటను అనటం నాకు యుక్తమైన పని కాదు. ఒకవేళ నేను ఆవిధంగా అని ఉంటే, అది నీకు తప్పకుండా తెలిసివుండేది. నా మనస్సులో ఏముందో నీకు తెలుసు. నీ మనస్సులో ఏముందో నాకు తెలియదు. నీవు గుప్తంగా ఉన్న యథార్థాలన్నీ తెలిసిన మహాజ్ఞానివి.

52. అంటే, మనిషి ఎల్లప్పుడూ, ఫలానా మనిషి ఏం చేస్తున్నాడు, ఫలానా మనిషి విశ్వాసంలో ఏం చెడు ఉంది, ఫలానా మనిషి కర్మలలో ఏం తప్పు ఉంది అని చూస్తూ ఉండేబదులు అతడు స్వయంగా తానేం చేస్తున్నాడు అని చూసుకోవాలి. కాని, మనిషి కేవలం తన మోక్షాన్ని గురించే ఆదుర్దాపడాలని, ఇతరులను సంస్కరించే విషయాన్ని గురించి ఆదుర్దా పడకూడదు అని ఈ ఆయత్ ఉద్దేశ్యం ఎంతమాత్రం కాదు. హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ (రజిఅన్) ఈ అపార్థాన్ని ఖండిస్తూ ఒక ప్రసంగంలో ఇలా అన్నారు: "ప్రజలారా! మీరు ఈ ఆయత్‌ను చదువుతారు. తప్పుడు వివరణలు చేస్తారు. నేను మహాప్రవక్త (సఅసమ్) ఇలా సెలవిస్తూ ఉండగా విన్నాను, 'ప్రజల చెడును చూసి దానిని మార్చే ప్రయత్నం గనక చెయ్యకపోతే, దుర్మార్గుణ్ణి దుర్మార్గం చేస్తూ చూసి అతడి చెయ్యి పట్టుకోకపోతే, అందర్నీ అల్లాహ్

مَا قُلْتُ لَهُمْ إِلَّا مَا أَمَرْتَنِي بِهِ أَنِ اعْبُدُوا اللَّهَ
رَبِّي وَرَبَّكُمْ ۚ وَكُنتُ عَلَيْهِمْ شَهِيدًا مَّا دُمْتُ
فِيهِمْ ۖ فَلَمَّا تَوَفَّيْتَنِي كُنتَ أَنتَ الرَّقِيبَ عَلَيْهِمْ ۚ
وَأَنتَ عَلَىٰ كُلِّ شَيْءٍ شَهِيدٌ ﴿١١٧﴾ إِن تُعَذِّبْهُمْ فَإِنَّهُمْ
عِبَادُكَ ۖ وَإِن تَغْفِرْ لَهُمْ فَإِنَّكَ أَنتَ الْعَزِيزُ
الْحَكِيمُ ﴿١١٨﴾ قَالَ اللَّهُ هَٰذَا يَوْمُ يَنفَعُ الصَّادِقِينَ
صِدْقُهُمْ ۚ لَهُمْ جَنَّاتٌ تَجْرِي مِن تَحْتِهَا الْأَنْهَارُ
خَالِدِينَ فِيهَا أَبَدًا ۚ رَّضِيَ اللَّهُ عَنْهُمْ وَرَضُوا
عَنْهُ ۚ ذَٰلِكَ الْفَوْزُ الْعَظِيمُ ﴿١١٩﴾ لِلَّهِ مُلْكُ السَّمَاوَاتِ
وَالْأَرْضِ وَمَا فِيهِنَّ ۚ وَهُوَ عَلَىٰ كُلِّ شَيْءٍ قَدِيرٌ ﴿١٢٠﴾

నీవు ఆదేశించిన దానిని తప్ప దేనినీ నేను వారికి చెప్పలేదు. అది ఏమిటంటే అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన నాకూ ప్రభువే, మీకూ ప్రభువే. నేను వారిమధ్య ఉన్నంత కాలంవరకే నేను వారిని కనిపెట్టి ఉన్నాను. నీవు నన్ను తిరిగి పిలుచుకున్న తరువాత నీవే వారిని కనిపెట్టి ఉంటున్నావు. నీవు సర్వ విషయాలను కనిపెట్టి ఉండేవాడవు. ఇప్పుడు ఒకవేళ నీవు వారిని శిక్షించినట్లయితే వారు నీ దాసులు, ఒకవేళ క్షమించి నట్లయితే నీవు శక్తిమంతుడవు, వివేకవంతుడవు." అప్పుడు అల్లాహ్ ఇలా సెలవిస్తాడు: "ఈ రోజు సత్యవంతులకు వారి సత్యం లాభాన్ని ఇస్తుంది. క్రింద కాలువలు ప్రవహించే ఉద్యాన వనాలు వారికి లభిస్తాయి. అక్కడ వారు ఎల్లప్పుడూ ఉంటారు. వారు అల్లాహ్ అంటే ఇష్టపడతారు. అల్లాహ్ వారంటే ఇష్టపడతాడు. ఇదే గొప్ప విజయం."

**120** భూమి, ఆకాశాలు వాటిలో ఉన్న సమస్తం యొక్క సామ్రాజ్యాధిపత్యం అల్లాహ్‌కే చెందుతుంది. ఆయనకు ప్రతి వస్తువుపైనా అధికారం ఉంది.

తన శిక్షకు గురిచెయ్యటం అసంభవం కాదు.' దైవం సాక్షి! ఇది మీ విధి. మంచిని ఆజ్ఞాపించండి. చెడు నుండి ఆపండి. లేకపోతే అల్లాహ్ మీపై ఎటువంటి వారిని రుద్దుతాడంటే, వారు మీలో అందరికంటే చెడ్డవారై ఉంటారు. వారు మిమ్మల్ని తీవ్రబాధలకు గురిచేస్తారు. తరువాత మీ సజ్జనులు అల్లాహ్‌ను ప్రార్థిస్తారు. కాని ఆ ప్రార్థనలు అంగీకరించబడవు."

53. అంటే, ధర్మపరాయణుడు, నిజాయితీపరుడు, నమ్మదగినవాడు అయిన ముస్లిము.

54. అంటే, ప్రళయం నాడు ప్రవక్తలను ఇలా అడగటం జరుగుతుంది: ఇస్లామ్ వైపునకు రమ్మని మీరు ప్రపంచానికి ఇచ్చిన పిలుపునకు, ప్రపంచం మీకు ఏమని జవాబిచ్చింది?

55. అంటే, మరణావస్థ నుండి తీసి జీవనావస్థలోకి తెచ్చేవాడు.

56. హవారీల ప్రస్తావన వచ్చింది కాబట్టి, ఉపన్యాస క్రమాన్ని త్రెంచి, అవాంతర వాక్యంగా ఇక్కడ హవారీలకు సంబంధించిన మరొక సంఘటనను కూడా సూచించటం జరిగింది. దానిద్వారా స్పష్టంగా తెలిసే విషయమేమిటంటే, మసీహ్ నుండి నేరుగా ఉపదేశం పొందిన శిష్యులు ఆయనను ఒక మానవుడు, కేవలం ఒక దాసుడు అని భావించేవారు. వారు అసలు తమ గురువును దేవుడుగా, లేక దేవుని భాగస్వామిగా లేక దేవుని కుమారుడుగా ఊహించనైనా ఊహించలేదు. ఇంకా స్వయంగా మసీహ్ కూడా తనను తాను వారి ముందు అధికారం లేని ఒక దైవదాసునిగా మాత్రమే చెప్పుకున్నాడు.

57. క్రైస్తవులు అల్లాహ్‌తో పాటు మసీహ్‌ని, రూహుల్ ఖుద్స్‌ను మాత్రమే దేవుళ్ళుగా చేసి తృప్తిపడలేదు. మసీహ్ తల్లి హజ్రత్ మర్యమ్‌ను కూడా ఒక శాశ్వత దేవతగా రూపొందించారు. మసీహ్ తరువాత మొదటి మూడు వందల సంవత్సరాల వరకు క్రైస్తవ ప్రపంచం ఈ నమ్మకాన్ని ఏమాత్రం ఎరుగదు. క్రీస్తు శకం మూడో శతాబ్దం చివరి కాలంలో అలెగ్జాండ్రియాలోని మత విద్వాంసులు మొదటిసారి హజ్రత్ మర్యమ్ కొరకు "ఉమ్ముల్లాహ్" లేక అల్లాహ్ తల్లి వంటి పదాలను ఉపయోగించారు. దీని తరువాత క్రమక్రమంగా చర్చీలలో మర్యమ్ పూజ వ్యాపిస్తూపోయింది.

ఆయతులు 165 | **6. అల్ అన్ఆమ్** | అవతరణ మక్కాలో

٦ سُوْرَةُ الْاَنْعَامِ مَكِّيَّةٌ ٥٥

اٰیاتها ١٦٥ | رکوعاتها ٢٠

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِیْ خَلَقَ السَّمٰوٰتِ وَ الْاَرْضَ
وَ جَعَلَ الظُّلُمٰتِ وَ النُّوْرَ ؕ ثُمَّ الَّذِیْنَ كَفَرُوْا
بِرَبِّهِمْ یَعْدِلُوْنَ ۝١ هُوَ الَّذِیْ خَلَقَكُمْ مِّنْ
طِیْنٍ ثُمَّ قَضٰۤی اَجَلًا ؕ وَ اَجَلٌ مُّسَمًّی عِنْدَهٗ
ثُمَّ اَنْتُمْ تَمْتَرُوْنَ ۝٢ وَهُوَ اللّٰهُ فِی السَّمٰوٰتِ وَ
فِی الْاَرْضِ ؕ یَعْلَمُ سِرَّكُمْ وَجَهْرَكُمْ وَ یَعْلَمُ
مَا تَكْسِبُوْنَ ۝٣ وَ مَا تَاْتِیْهِمْ مِّنْ اٰیَةٍ مِّنْ
اٰیٰتِ رَبِّهِمْ اِلَّا كَانُوْا عَنْهَا مُعْرِضِیْنَ ۝٤ فَقَدْ
كَذَّبُوْا بِالْحَقِّ لَمَّا جَآءَهُمْ ؕ فَسَوْفَ یَاْتِیْهِمْ
اَنْۢبٰٓؤُا مَا كَانُوْا بِهٖ یَسْتَهْزِءُوْنَ ۝٥ اَلَمْ یَرَوْا
كَمْ اَهْلَكْنَا مِنْ قَبْلِهِمْ مِّنْ قَرْنٍ مَّكَّنّٰهُمْ فِی
الْاَرْضِ مَا لَمْ نُمَكِّنْ لَّكُمْ وَ اَرْسَلْنَا
السَّمَآءَ عَلَیْهِمْ مِّدْرَارًا ۪ وَّ جَعَلْنَا الْاَنْهٰرَ
تَجْرِیْ مِنْ تَحْتِهِمْ فَاَهْلَكْنٰهُمْ بِذُنُوْبِهِمْ
وَاَنْشَاْنَا مِنْۢ بَعْدِهِمْ قَرْنًا اٰخَرِیْنَ ۝٦

**1 – 3** స్తోత్రం అల్లాహ్‌కు మాత్రమే శోభిస్తుంది. ఆయన భూమినీ, ఆకాశాలనూ నిర్మించాడు. వెలుగునూ చీకట్లనూ సృష్టించాడు. అయినా సత్యసందేశాన్ని స్వీకరించటానికి నిరాకరించినవారు ఇతరులను తమ ప్రభువుకు సమానులుగా పరిగణిస్తున్నారు. ఆయనే మిమ్మల్ని మట్టితో సృజించాడు. తరువాత మీ కొరకు ఒక జీవన వ్యవధిని నిర్ణయించాడు. ఆయన వద్ద నిర్ణయమై ఉన్న మరొక వ్యవధికూడా ఉంది.[1] కాని మీరు ఇంకా సంశయంలోనే పడివున్నారు. ఆ ఏకైక దైవమే ఆకాశాలలోనూ ఉన్నాడు, భూమిలోనూ ఉన్నాడు. మీరు బయటికి తెలియపరచేదీ, లోపల దాచిపెట్టేదీ అంతా ఆయనకు తెలుసు. మీరు సముపార్జించుకునే చెడునూ మంచినీ ఆయన బాగా ఎరుగును.

**4 – 6** ప్రజల స్థితి ఏమిటంటే, వారి ముందుకు వచ్చిన తమ ప్రభువు సూచనలలో వారు వైముఖ్యం చూపని సూచన ఏదీలేదు. ఇప్పుడు వారు తమ వద్దకు వచ్చిన సత్యాన్ని కూడా అసత్యమని తిరస్కరించారు. సరే, వారు ఇంతవరకూ ఎగతాళి చేస్తూ వచ్చిన విషయానికి సంబంధించిన కొన్ని వార్తలు త్వరలోనే వారికి అందుతాయి.[2] తమ తమ కాలాలలో అధిక ప్రాబల్యం కల ఎన్ని జాతులను మేము వారికి పూర్వం నాశనం చేశామో వారు చూడలేదా? మేము మీకు ప్రసాదించని అధికారాన్ని పుడమిపై వారికి ప్రసాదించాము. వారిపై మేము ఆకాశం నుండి మంచి వర్షాలను కురిపించాము. క్రింద నదులను ప్రవహింపచేశాము. (కాని వారు మా అనుగ్రహాల పట్ల కృతఘ్నుత చూపితే) చివరకు మేము వారు చేసిన పాపాల ఫలితంగా వారిని సర్వనాశనం చేశాము. వారి స్థానంలో మరొక తరం జాతులను లేపాము.

1. అంటే, ప్రళయ గడియ. అప్పుడు ఆదిమానవులు, అంత్య మానవులు సరికొత్తగా బ్రతికింపబడతారు. లెక్క చూపటానికి తమ ప్రభువు ముందు హాజరవుతారు.

وَلَوْ نَزَّلْنَا عَلَيْكَ كِتٰبًا فِيْ قِرْطَاسٍ فَلَمَسُوْهُ
بِاَيْدِيْهِمْ لَقَالَ الَّذِيْنَ كَفَرُوْٓا اِنْ هٰذَآ اِلَّا
سِحْرٌ مُّبِيْنٌ ۝٧ وَقَالُوْا لَوْلَآ اُنْزِلَ عَلَيْهِ
مَلَكٌ ؕ وَلَوْ اَنْزَلْنَا مَلَكًا لَّقُضِيَ الْاَمْرُ ثُمَّ لَا
يُنْظَرُوْنَ ۝٨ وَلَوْ جَعَلْنٰهُ مَلَكًا لَّجَعَلْنٰهُ رَجُلًا
وَّلَلَبَسْنَا عَلَيْهِمْ مَّا يَلْبِسُوْنَ ۝٩ وَلَقَدِ
اسْتُهْزِئَ بِرُسُلٍ مِّنْ قَبْلِكَ فَحَاقَ بِالَّذِيْنَ
سَخِرُوْا مِنْهُمْ مَّا كَانُوْا بِهٖ يَسْتَهْزِءُوْنَ ۝١٠ ع
قُلْ سِيْرُوْا فِي الْاَرْضِ ثُمَّ انْظُرُوْا كَيْفَ كَانَ
عَاقِبَةُ الْمُكَذِّبِيْنَ ۝١١ قُلْ لِّمَنْ مَّا فِي السَّمٰوٰتِ
وَالْاَرْضِ ؕ قُلْ لِّلّٰهِ ؕ كَتَبَ عَلٰى نَفْسِهِ
الرَّحْمَةَ ؕ لَيَجْمَعَنَّكُمْ اِلٰى يَوْمِ الْقِيٰمَةِ لَا
رَيْبَ فِيْهِ ؕ اَلَّذِيْنَ خَسِرُوْٓا اَنْفُسَهُمْ فَهُمْ لَا
يُؤْمِنُوْنَ ۝١٢ وَلَهٗ مَا سَكَنَ فِي الَّيْلِ وَ
النَّهَارِ ؕ وَهُوَ السَّمِيْعُ الْعَلِيْمُ ۝١٣

**7 - 9** ప్రవక్తా! మేము కాగితం మీద వ్రాయబడిన ఒక గ్రంథాన్ని నీపై అవతరింపజేసినా, ప్రజలు దానిని స్వహస్తాలతో తాకి చూసినా, సత్య తిరస్కారులు మటుకు "ఇది పచ్చి కనికట్టు తప్ప మరేమీకాదు" అని అంటారు. వారు, "ఈ ప్రవక్తపై ఒక దైవదూత ఎందుకు అవతరింపజేయబడలేదు?"[3] అని అడుగుతారు. మేము ఒకవేళ దైవదూతనే పంపి ఉన్నట్లయితే ఇప్పటికే తీర్పు జరిగి ఉండేది. వారికి వ్యవధి ఇవ్వబడి ఉండేది కాదు. ఒకవేళ మేము దైవదూతను అవతరింపజేసినా అతనిని మానవరూపంలోనే అవతరింపజేసి ఉండేవారము. ఈ విధంగా మేము వారిని, ప్రస్తుతం వారు ఏ సంశయంలో పడివున్నారో ఆ సంశయానికే గురిచేసి ఉండేవారము.

**10 - 11** ప్రవక్తా! నీకు పూర్వం కూడ చాలామంది ప్రవక్తలను ఎగతాళి చెయ్యటం జరిగింది. కాని చివరకు ఆ ఎగతాళి చేసేవారు ఏ యథార్థాన్ని ఎగతాళి చేస్తూ ఉండేవారో, ఆ యథార్థమే వారి నెత్తిపై పడింది. వారితో ఇలా అను: "కొంచెం భూసంచారం చేసి చూడండి, సత్యతిరస్కారుల ముగింపు ఎలా జరిగిందో తెలుస్తుంది."

**12** వారిని అడుగు: ఆకాశాలలో, భూమిలో ఉన్నదంతా ఎవరిదని?- అను, సమస్తమూ అల్లాహ్‌దే అని. దయాదాక్షిణ్యాలు చూపటాన్ని ఆయన తన మీద విధించుకున్నాడు. (కనుకనే ఆయన మీ అవిధేయతలకు, తలబిరుసు తనాలకు మిమ్మల్ని వెంటనే పట్టుకోడు). ప్రళయం నాడు ఆయన మీ అందరినీ తప్పకుండా సమావేశపరుస్తాడు. ఇది అనుమానానికి ఏమాత్రం ఆస్కారంలేని యథార్థం. కాని తమను తాము వినాశకరమైన ప్రమాదానికి గురిచేసుకున్నవారు మాత్రం దీనిని విశ్వసించరు.

**13 - 18** రాత్రి చీకటిలో పగటివెలుగులో నిలిచేది అంతా అల్లాహ్‌దే. ఆయన అన్నీ వింటాడు, అన్నీ తెలిసినవాడు.

2. హిజ్రత్ (వలస), హిజ్రత్ తరువాత ఇస్లాముకు ఒకదాని తరువాత ఒకటి లభించనున్న విజయాలు సూచించబడ్డాయి. ఈ సూచన వచ్చినపుడు, భావిలో ఎటువంటి వార్తలు వినవలసి ఉంటుందో అవిశ్వాసులు కూడా ఊహించలేక పోయారు. ముస్లిముల మనస్సులలో కూడా దీనికి సంబంధించిన ఏ భావనా రాలేదు.

قُلْ اَغَيْرَ اللّٰهِ اَتَّخِذُ وَلِيًّا فَاطِرِ السَّمٰوٰتِ وَ
الْاَرْضِ وَ هُوَ يُطْعِمُ وَ لَا يُطْعَمُ ؕ قُلْ اِنِّيْۤ
اُمِرْتُ اَنْ اَكُوْنَ اَوَّلَ مَنْ اَسْلَمَ وَ لَا
تَكُوْنَنَّ مِنَ الْمُشْرِكِيْنَ ﴿١٤﴾ قُلْ اِنِّيْۤ اَخَافُ
اِنْ عَصَيْتُ رَبِّيْ عَذَابَ يَوْمٍ عَظِيْمٍ ﴿١٥﴾ مَنْ
يُّصْرَفْ عَنْهُ يَوْمَىِٕذٍ فَقَدْ رَحِمَهٗ ؕ وَ ذٰلِكَ
الْفَوْزُ الْمُبِيْنُ ﴿١٦﴾ وَ اِنْ يَّمْسَسْكَ اللّٰهُ بِضُرٍّ
فَلَا كَاشِفَ لَهٗۤ اِلَّا هُوَ ؕ وَ اِنْ يَّمْسَسْكَ بِخَيْرٍ
فَهُوَ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ ﴿١٧﴾ وَ هُوَ الْقَاهِرُ
فَوْقَ عِبَادِهٖ ؕ وَ هُوَ الْحَكِيْمُ الْخَبِيْرُ ﴿١٨﴾ قُلْ
اَيُّ شَيْءٍ اَكْبَرُ شَهَادَةً ؕ قُلِ اللّٰهُ ۙ شَهِيْدٌۢ
بَيْنِيْ وَ بَيْنَكُمْ ۫ وَ اُوْحِيَ اِلَيَّ هٰذَا الْقُرْاٰنُ
لِاُنْذِرَكُمْ بِهٖ وَ مَنْۢ بَلَغَ ؕ اَىِٕنَّكُمْ لَتَشْهَدُوْنَ
اَنَّ مَعَ اللّٰهِ اٰلِهَةً اُخْرٰى ؕ قُلْ لَّاۤ اَشْهَدُ ۚ
قُلْ اِنَّمَا هُوَ اِلٰهٌ وَّاحِدٌ وَّ اِنَّنِيْ بَرِيْٓءٌ مِّمَّا
تُشْرِكُوْنَ ﴿١٩﴾ اَلَّذِيْنَ اٰتَيْنٰهُمُ الْكِتٰبَ يَعْرِفُوْنَهٗ
كَمَا يَعْرِفُوْنَ اَبْنَآءَهُمْ ۘ اَلَّذِيْنَ خَسِرُوْۤا
اَنْفُسَهُمْ فَهُمْ لَا يُؤْمِنُوْنَ ﴿٢٠﴾ وَ مَنْ اَظْلَمُ
مِمَّنِ افْتَرٰى عَلَى اللّٰهِ كَذِبًا اَوْ كَذَّبَ بِاٰيٰتِهٖ ؕ
اِنَّهٗ لَا يُفْلِحُ الظّٰلِمُوْنَ ﴿٢١﴾

ఇలా అను : "భూమ్యాకాశాల సృష్టికర్త, ఉపాధి ప్రదాతేగాని ఉపాధి గ్రహీత కానివాడు అయిన అల్లాహ్‌ను కాదని నేను మరెవరినయినా నా సంరక్షకుడుగా చేసుకోవాలా?" ఇలా చెప్పు: అందరికంటే ముందు నేను ఆయనకు విధేయుణ్ణి కావాలని నన్ను ఆదేశించటం జరిగింది. (ఇంకా ఇలా తాకీదు ఇవ్వబడింది. ఎవరైనా షిర్క్ చేస్తే చెయ్యనీ) "నీవు మాత్రం ముష్రిక్కులలో కలసిపోవద్దు." ఇంకా ఇలా అను:"నేను ఒకవేళ నా ప్రభువు ఆజ్ఞలను ఉల్లంఘిస్తే, ఒక మహా (భయంకరమైన) రోజున శిక్షను అనుభవించవలసి వస్తుందని నేను భయ పడుతున్నాను. ఆ రోజున శిక్షను తప్పించుకున్న వాడిని అల్లాహ్ నిజంగా కరుణించినట్లే. అదే ప్రస్ఫుటమైన సాఫల్యం. అల్లాహ్ గనక మీకు ఏదైనా నష్టం కలిగిస్తే, ఆయన తప్ప ఆ నష్టాన్నుండి మిమ్మల్ని రక్షించగలిగే వారెవరూలేరు. ఆయన మీకు ఏదైనా మేలు కలుగజేస్తే, ఆయనకు అన్నింటి పైనా అధికారం ఉంది. ఆయన తన దాసులపై సంపూర్ణమైన అధికా రాలు కలిగి వున్నాడు. ఇంకా అత్యంత వివేకవంతుడు, అన్నీ తెలిసినవాడు."

**19 - 21** వారిని అడుగు: ఎవరి సాక్ష్యం అందరి సాక్ష్యం కంటే గొప్పది? అని-ఇలా అను: నాకూ మీకూ మధ్య అల్లాహ్ సాక్షిగా ఉన్నాడు. ఈ ఖురాను నా వద్దకు వహీ ద్వారా పంప బడింది. మిమ్మల్నీ, ఇది ఎవరెవరి వద్దకు చేరుతుందో వారం దరినీ నేను హెచ్చరించాలని. అల్లాహ్‌తో పాటు ఇంకా ఇతర దేవుళ్ళు కూడా ఉన్నారని మీరు నిజంగానే సాక్ష్యం ఇవ్వ గలరా?[4] ఇలా అను: నేను అలాంటి సాక్ష్యం ఎంతమాత్రం ఇవ్వలేను. అను: దేవుడు ఆయన ఒక్కడే. మీరు చేసే షిర్కును నేను అసహ్యించు కుంటున్నాను. మేము ఎవరికైతే గ్రంథాన్ని ప్రసాదించామో, తమ కుమారులను ఏమాత్రం సందేహం లేకుండా గుర్తించే విధంగానే ఈ విషయాన్ని కూడా నిస్సం దేహంగా గుర్తిస్తారు. కాని తమను తామే నష్టానికి గురి చేసు కున్న వారు దీన్ని నమ్మరు. అల్లాహ్‌పై బూటకపు అభాండాలు వేసే వాడికంటే లేదా అల్లాహ్ సూచనలు అసత్యాలని తిరస్క రించే వాడికంటే పరమ దుర్మార్గుడు ఎవడుంటాడు? నిశ్చయంగా అటువంటి దుర్మార్గులు ఎన్నటికీ సాఫల్యం పొందలేరు.

وَ يَوْمَ نَحْشُرُهُمْ جَمِيْعًا ثُمَّ نَقُوْلُ لِلَّذِيْنَ
اَشْرَكُوْٓا اَيْنَ شُرَكَآؤُكُمُ الَّذِيْنَ كُنْتُمْ
تَزْعُمُوْنَ ۝٢٢ ثُمَّ لَمْ تَكُنْ فِتْنَتُهُمْ اِلَّآ اَنْ قَالُوْا
وَ اللّٰهِ رَبِّنَا مَا كُنَّا مُشْرِكِيْنَ ۝٢٣ اُنْظُرْ كَيْفَ
كَذَبُوْا عَلٰٓى اَنْفُسِهِمْ وَ ضَلَّ عَنْهُمْ مَّا كَانُوْا
يَفْتَرُوْنَ ۝٢٤ وَ مِنْهُمْ مَّنْ يَّسْتَمِعُ اِلَيْكَ ۚ
وَجَعَلْنَا عَلٰى قُلُوْبِهِمْ اَكِنَّةً اَنْ يَّفْقَهُوْهُ وَ فِيْٓ
اٰذَانِهِمْ وَقْرًا ؕ وَ اِنْ يَّرَوْا كُلَّ اٰيَةٍ لَّا يُؤْمِنُوْا
بِهَا ؕ حَتّٰٓى اِذَا جَآءُوْكَ يُجَادِلُوْنَكَ يَقُوْلُ
الَّذِيْنَ كَفَرُوْٓا اِنْ هٰذَآ اِلَّآ اَسَاطِيْرُ
الْاَوَّلِيْنَ ۝٢٥ وَهُمْ يَنْهَوْنَ عَنْهُ وَ يَنْـَٔوْنَ
عَنْهُ ۚ وَ اِنْ يُّهْلِكُوْنَ اِلَّآ اَنْفُسَهُمْ وَ مَا
يَشْعُرُوْنَ ۝٢٦ وَ لَوْ تَرٰٓى اِذْ وُقِفُوْا عَلَى النَّارِ
فَقَالُوْا يٰلَيْتَنَا نُرَدُّ وَ لَا نُكَذِّبَ بِاٰيٰتِ رَبِّنَا
وَنَكُوْنَ مِنَ الْمُؤْمِنِيْنَ ۝٢٧

**22 - 24** మేము వారందరినీ సమావేశపరిచే రోజున ముష్రిక్కులను ఇలా అడుగుతాము: "మీరు మీ దైవాలుగా భావించి నిలబెట్టిన ఆ భాగస్వాములంతా ఇప్పుడెక్కడున్నారు?" అప్పుడు వారు:"ఓ మా ప్రభూ! నీతోడు! మేము ముష్రిక్కులము కానేకాము" అని (అసత్యం) పలకటం తప్ప వేరే కుతంత్రాన్ని సృష్టించలేరు. చూడండి! అప్పుడు వారు తమను గురించి తామే ఏ విధంగా అబద్ధాలు కల్పిస్తారో! అక్కడ వారి బూటకపు దేవుళ్ళందరూ మటుమాయమై పోతారు.

**25 - 30** వారిలో నీ మాటను చెవియొగ్గి వినేవారు కొందరు ఉన్నారు. కాని విషయం ఏమిటంటే మేము వారి హృదయాలపై పరదాలు వేసి ఉంచాము. అందువల్ల వారు దానిని ఏ మాత్రం అర్థం చేసుకోరు. వారి చెవులను మొద్దుబారేటట్లు చేశాము. (కనుక అంతా విన్నప్పటికీ ఏమీ వినలేరు). వారు ఏ సూచనను చూసినా, దానిని విశ్వసించటం అనేది జరగదు. చివరకు వారు నీ వద్దకు వచ్చి నీతో వాదులాడేటప్పుడు, వారిలో తిరస్కరించాలనే నిర్ణయం చేసుకున్నవారు (అంతా విన్న తరువాత) "ఇదంతా పాతకాలపు గాథ తప్ప మరేదీ కాదు" అని అంటారు. వారు ప్రజలను ఈ సత్య విషయాన్ని విశ్వసించకుండా ఆపుతారు. స్వయంగా వారు కూడా దానికి దూరంగా పారి పోతారు. (ఇలా చేసి నీకు హాని కలుగజేస్తున్నామని వారు భావిస్తారు). వాస్తవానికి వారు అసలు తమ వినాశాన్ని తామే కొని తెచ్చుకుంటున్నారు. కాని వారికి దాని స్పృహలేదు. నరకం గట్టుపై వారిని నిలబెట్టే దృశ్యాన్ని నీవు గనక చూడగలిగితే ఎంత బాగుంటుంది. అప్పుడు వారు ఇలా అంటారు: "అయ్యో! మేము మళ్ళీ భూలోకానికి తిరిగి పంపబడే, మా ప్రభువు సూచనలు అసత్యాలని తిరస్కరించ కుండా ఉండే, విశ్వాసులలో మేము కలసిపోయే మార్గం ఏదైనా ఉంటే ఎంత బాగుండును."

---

3. అంటే, ఈ వ్యక్తి దేవుని తరపు నుండి ప్రవక్తగా పంపబడినప్పుడు, ఆకాశం నుండి ఒక దైవదూత అవతరించి ఉండవలసింది: "ఈయన దైవప్రవక్త. ఈయన మాటను నమ్మండి, లేకపోతే మీరు శిక్షించబడతారు" అని ప్రజలను హెచ్చరించి ఉండవలసింది.

4. ఏ విషయాన్ని గురించి అయినా సాక్ష్యం ఇవ్వటానికి కేవలం ఊహ లేక అనుమానం సరిపోదు. దానికొరకు జ్ఞానం అవసరం. దాని ఆధారంగా మనిషి విషయం ఇదీ అని నమ్మకంతో చెప్పగలుగుతాడు. కనుక ప్రశ్న యొక్క అర్థం ఏమిటంటే, ఈ అనంత విశ్వంలో అల్లాహ్ తప్ప దాస్యానికి, ఆరాధనకు అర్హుడైన సర్వాధికారాలుకల ప్రభువు మరొకడు ఎవడైనా ఉన్నట్లు నిజంగానే మీకు తెలుసా? అని.

بَلْ بَدَا لَهُمْ مَّا كَانُوْا يُخْفُوْنَ مِنْ قَبْلُ ؕ وَ
لَوْ رُدُّوْا لَعَادُوْا لِمَا نُهُوْا عَنْهُ وَاِنَّهُمْ
لَكٰذِبُوْنَ ﴿۲۸﴾ وَ قَالُوْۤا اِنْ هِيَ اِلَّا حَيَاتُنَا
الدُّنْيَا وَمَا نَحْنُ بِمَبْعُوْثِيْنَ ﴿۲۹﴾ وَ لَوْ تَرٰۤى اِذْ
وُقِفُوْا عَلٰى رَبِّهِمْ ؕ قَالَ اَلَيْسَ هٰذَا بِالْحَقِّ ؕ
قَالُوْا بَلٰى وَ رَبِّنَا ؕ قَالَ فَذُوْقُوا الْعَذَابَ بِمَا
كُنْتُمْ تَكْفُرُوْنَ ﴿۳۰﴾ قَدْ خَسِرَ الَّذِيْنَ كَذَّبُوْا ع ١٠
بِلِقَآءِ اللّٰهِ ؕ حَتّٰۤى اِذَا جَآءَتْهُمُ السَّاعَةُ
بَغْتَةً قَالُوْا يٰحَسْرَتَنَا عَلٰى مَا فَرَّطْنَا فِيْهَا ۙ
وَهُمْ يَحْمِلُوْنَ اَوْزَارَهُمْ عَلٰى ظُهُوْرِهِمْ ؕ اَلَا
سَآءَ مَا يَزِرُوْنَ ﴿۳۱﴾ وَمَا الْحَيٰوةُ الدُّنْيَاۤ اِلَّا
لَعِبٌ وَّلَهْوٌ ؕ وَلَلدَّارُ الْاٰخِرَةُ خَيْرٌ لِّلَّذِيْنَ
يَتَّقُوْنَ ؕ اَفَلَا تَعْقِلُوْنَ ﴿۳۲﴾

వాస్తవానికి వారు ఇలా అనటానికి కారణం, కేవలం వారు కప్పిపుచ్చిన సత్యం అప్పుడు వారి ముందు బహిర్గతం కావటమే! ఒకవేళ వారిని గత జీవితం వైపునకు తిరిగి పంపితే నిషేధించటం జరిగిన దాన్నంతా మళ్ళీ చేస్తారు. వారు అసలు ఎల్లప్పుడూ అబద్ధం చెప్పేవారే. (కనుక వారు తమ ఈ కోరికను వ్యక్తం చెయ్యటంలో కూడా అబద్ధాన్నే ప్రయోగిస్తారు). వారు ఈనాడు ఇలా అంటారు: “జీవితం అంటే కేవలం ఇహలోక జీవితమే. మరణం తరువాత మనం మళ్ళీ లేపబడటం అనేది జరగదు.” వారు తమ ప్రభువు ముందు నిలబెట్టబడే దృశ్యాన్ని నీవు చూడగలిగితే ఎంత బాగుండును! అప్పుడు వారి ప్రభువు వారిని “ఇదంతా యథార్థం కాదా?” అని అడుగుతాడు. వారు ఇలా అంటారు: “అవును మా ప్రభూ! ఇదంతా యథార్థమే!” అప్పుడు ఆయన ఇలా సెలవిస్తాడు: “సరే, అయితే మీరు యథార్థాన్ని తిరస్కరించిన దానికి ఫలితంగా ఇప్పుడు శిక్షను చవిచూడండి.”

**31 – 32** అల్లాహ్‌తో తమ సమావేశపు వర్తమానాన్ని అబద్ధంగా పరిగణించినవారు నష్టానికి గురి అయ్యారు. అకస్మాత్తుగా ఆ గడియ వచ్చిపడినప్పుడు వారే వాపోతారు: “అయ్యో! ఈ విషయంలో మేము ఎంత పొరపాటు చేశాము!” అని. వారి పరిస్థితి ఎలా ఉంటుందంటే, తమ పాపాల బరువును తమ వీపులపై మోస్తూ ఉంటారు. చూడండి! వారు మోస్తూవున్న ఈ బరువు ఎంత చెడ్డదో! ఇహలోక జీవితం ఒక ఆట, ఒక తమాషా మాత్రమే.[5] వాస్తవానికి నష్టంనుండి తప్పించుకొనగోరే వారికి పరలోకవాసమే అత్యంత శ్రేష్ఠమైనది. అయితే మీరు బుద్ధిని ఉపయోగించరా?

5. ప్రాపంచిక జీవితంలో ఏ ఉదాత్తతా లేదనీ, అది కేవలం ఆట కొరకు, తమాషా కొరకు మాత్రమే సృష్టించబడింది అనీ దీని భావం కాదు. అసలు దాని భావం యథార్థమైన, శాశ్వతమైన పరలోక జీవితం ముందు ఈ ఇహలోక జీవితం, ఒక వ్యక్తి ఆటలో, వాహ్యాళిలో కొంచెం సేపు కాలక్షేపం చేసి, తరువాత ఉదాత్తమైన అసలు వ్యాపకం వైపునకు తిరిగి వెళ్ళటం వంటిది అనీ, ఇంకా దానిని ఆటతో, తమాషాతో పోల్చటం ఎందుకు జరిగిందంటే, ఇక్కడ యథార్థమైన పరలోక విషయం గుప్తంగా ఉండటం వల్ల, దూరదృష్టిలేని పై మెరుగులకు భ్రమించే మానవులు, అపోహలకు గురికావటానికి ఎన్నో కారణాలు ఉన్నాయి. ఈ అపోహలలో చిక్కుకుని ప్రజలు అసలు యథార్థానికి వ్యతిరేకంగా ఉన్నటువంటి విచిత్రమైన నడవడులను అవలంబించటం వల్ల వారి జీవితం కేవలం ఒక ఆటగా, ఒక తమాషాగా అయిపోతుంది.

قَدْ نَعْلَمُ اِنَّهٗ لَيَحْزُنُكَ الَّذِيْ يَقُوْلُوْنَ
فَاِنَّهُمْ لَا يُكَذِّبُوْنَكَ وَ لٰكِنَّ الظّٰلِمِيْنَ بِاٰيٰتِ
اللّٰهِ يَجْحَدُوْنَ ﴿٣٣﴾ وَ لَقَدْ كُذِّبَتْ رُسُلٌ مِّنْ
قَبْلِكَ فَصَبَرُوْا عَلٰى مَا كُذِّبُوْا وَ اُوْذُوْا حَتّٰى
اَتٰهُمْ نَصْرُنَا ۚ وَ لَا مُبَدِّلَ لِكَلِمٰتِ اللّٰهِ ۚ وَ
لَقَدْ جَآءَكَ مِنْ نَّبَاِى الْمُرْسَلِيْنَ ﴿٣٤﴾ وَ اِنْ
كَانَ كَبُرَ عَلَيْكَ اِعْرَاضُهُمْ فَاِنِ اسْتَطَعْتَ اَنْ
تَبْتَغِيَ نَفَقًا فِي الْاَرْضِ اَوْ سُلَّمًا فِي السَّمَآءِ
فَتَاْتِيَهُمْ بِاٰيَةٍ ۚ وَ لَوْ شَآءَ اللّٰهُ لَجَمَعَهُمْ عَلَى
الْهُدٰى فَلَا تَكُوْنَنَّ مِنَ الْجٰهِلِيْنَ ﴿٣٥﴾ اِنَّمَا
يَسْتَجِيْبُ الَّذِيْنَ يَسْمَعُوْنَ ۘ وَ الْمَوْتٰى
يَبْعَثُهُمُ اللّٰهُ ثُمَّ اِلَيْهِ يُرْجَعُوْنَ ﴿٣٦﴾

النصف وقف غفران وقف منزل

**33 - 36** ప్రవక్తా! ఈ ప్రజలు కల్పించే మాటలవల్ల నీకు బాధ కలుగుతుందనే విషయం మాకు బాగా తెలుసు. కాని వారు తిరస్కరించేది నిన్ను కాదు. ఈ దుర్మార్గులు వాస్తవానికి తిరస్కరిస్తున్నది అల్లాహ్ ఆయతులనే.[6] నీకు పూర్వం కూడా చాలామంది ప్రవక్తలు తిరస్కరించబడ్డారు. కాని వారు ఆ తిరస్కారానికి, తాము గురిచెయ్యబడిన వ్యధలకు సహనం వహించారు. చివరకు మా సహాయం వారికి అందింది. అల్లాహ్ మాటలను మార్చేశక్తి ఎవరికీలేదు. పూర్వపు ప్రవక్తలకు జరిగినదాని సమాచారాలు నీకు ఇదివరకే అందాయి. అయినా ఒకవేళ నీకు వారి వైముఖ్యాన్ని భరించటం కష్టంగా ఉంటే, నీకు గనక శక్తివుంటే, భూమిలో ఒక సొరంగాన్ని వెదకి లేదా ఆకాశానికి నిచ్చెనవేసి, వారివద్దకు ఏదైనా సూచనను తీసుకొని వచ్చే ప్రయత్నం చెయ్యి. అల్లాహ్ గనక కోరివుంటే, వారందరినీ సన్మార్గంపై చేర్చి ఉండేవాడే. కనుక నీవు అవివేకివి కావద్దు.[7] వినేవారు మాత్రమే సత్య సందేశాన్ని స్వీకరిస్తారు. ఇక మృతుల విషయం,[8] అల్లాహ్ వారిని నేరుగా గోరీల నుండే లేపుతాడు. తరువాత వారు (ఆయన న్యాయస్థానంలో హాజరు అయ్యేందుకు) తిరిగి తీసుకొని రాబడతారు.

6. నిజం ఏమిటంటే, మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) అల్లాహ్ ఆయత్తులను వినిపించటం ప్రారంభించనంత వరకు, ఆయన జాతి ప్రజలందరూ ఆయనను అమీను (అమానతుదారు), సాదిఖు (సత్యసంధుడు) అని అనేవారు. ఆయన నిజాయితీని పూర్తిగా నమ్మేవారు. ఆయన అల్లాహ్ తరఫు నుండి సందేశం అందజెయ్యటం ప్రారంభించినప్పుడే, వారు ఆయనను అబద్ధం చెప్పేవాడు అని తిరస్కరించేవారు. ఈ రెండో దశలో కూడా వ్యక్తిగతంగా ఆయనను అబద్ధం చెప్పేవాడు అని చెప్పే సాహసం వారిలో ఎవరికీ లేకపోయింది. ఆయన బద్ధవిరోధి కూడా, ప్రపంచానికి సంబంధించిన ఏ వ్యవహారంలోనైనా ఎన్నడైనా ఆయన అబద్ధం చెప్పారని ఆయనపై ఎన్నడూ అభియోగం మోపలేదు. వారు ఆయనను అబద్ధాలు చెప్పేవాడుగా తిరస్కరించింది కేవలం ప్రవక్త హోదాలోనే. అబూజహల్ ఆయనకు ఆగర్భ శత్రువుగా ఉండేవాడు. హజ్రత్ అలీ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం ఒకసారి అతడు స్వయంగా మహాప్రవక్త (సఅసమ్)తో మాట్లాడుతూ ఇలా అన్నాడు: "మేము మిమ్మల్ని మాత్రం అబద్ధం చెప్పేవాడు అని అనటంలేదు. కాని మీరు చెప్పే దానిని మటుకు అబద్ధం అంటున్నాము."

7. అంటే, వారు విశ్వసించేటందుకు దోహదం చేసే సూచన ఏదైనా వారికి చూపబడాలి అనే చింతలో పడకు. అల్లాహ్ దృష్టిలో గనక సమస్త మానవులు సన్మార్గంలో నడుపబడాలి అనే విషయం ఉంటే అందరినీ విశ్వాసులుగానే పుట్టించేవాడు. తరువాత ప్రవక్తలను పంపే అవసరమూ, విశ్వాసులూ, అవిశ్వాసుల మధ్య సంవత్సరాల తరబడి సంఘర్షణను జరిపించే అవసరమూ ఏముంది?

8. వినేవారు అంటే అర్థం తమ అంతరాత్మలు సజీవంగా ఉన్నవారూ, తమ బుద్ధినీ, తమ ఆలోచనను స్తంభింపచెయ్యని వారూ, ఇంకా తమ హృదయద్వారాలకు ద్వేషము, స్తబ్దత అనే తాళాలను వెయ్యనివారూ అయిన ప్రజలు. వీరికి భిన్నంగా మృతులు అంటే గీసిన గీటు దాటకుండా అంధుల మాదిరిగా ప్రవర్తిస్తూ, ఇక ఆ గీటుకు బయటవున్న మరే కొత్త విషయాన్నీ అది పరమ సత్యం అయినాసరే, అంగీకరించటానికి సిద్ధంగా లేని ప్రజలు.

وَ قَالُوْا لَوْ لَا نُزِّلَ عَلَيْهِ اٰيَةٌ مِّنْ رَّبِّهٖ ؕ قُلْ
اِنَّ اللّٰهَ قَادِرٌ عَلٰٓى اَنْ يُّنَزِّلَ اٰيَةً وَّ لٰكِنَّ
اَكْثَرَهُمْ لَا يَعْلَمُوْنَ ۝٣٧ وَ مَا مِنْ دَآبَّةٍ فِي
الْاَرْضِ وَ لَا طٰٓئِرٍ يَّطِيْرُ بِجَنَاحَيْهِ اِلَّآ اُمَمٌ
اَمْثَالُكُمْ ؕ مَا فَرَّطْنَا فِي الْكِتٰبِ مِنْ شَيْءٍ ثُمَّ
اِلٰى رَبِّهِمْ يُحْشَرُوْنَ ۝٣٨ وَالَّذِيْنَ كَذَّبُوْا
بِاٰيٰتِنَا صُمٌّ وَّ بُكْمٌ فِي الظُّلُمٰتِ ؕ مَنْ يَّشَاِ اللّٰهُ
يُضْلِلْهُ ؕ وَ مَنْ يَّشَاْ يَجْعَلْهُ عَلٰى صِرَاطٍ
مُّسْتَقِيْمٍ ۝٣٩ قُلْ اَرَءَيْتَكُمْ اِنْ اَتٰىكُمْ عَذَابُ
اللّٰهِ اَوْ اَتَتْكُمُ السَّاعَةُ اَغَيْرَ اللّٰهِ تَدْعُوْنَ ۚ
اِنْ كُنْتُمْ صٰدِقِيْنَ ۝٤٠ بَلْ اِيَّاهُ تَدْعُوْنَ
فَيَكْشِفُ مَا تَدْعُوْنَ اِلَيْهِ اِنْ شَآءَ وَ تَنْسَوْنَ
مَا تُشْرِكُوْنَ ۝٤١ ع١٠

**37 - 41** "ఈ ప్రవక్తపై అతని ప్రభువు తరఫు నుండి ఏదైనా సూచన ఎందుకు అవతరింపజేయబడలేదు?" అని వారు అడుగుతారు. అను: "అల్లాహ్‌కు సూచనను అవతరింపజేసే శక్తి పూర్తిగా ఉంది"అని. అయితే వారిలో అనేకులు అజ్ఞానంలో పడివున్నారు.[9] భూమిపై సంచరించే ఏ జంతువునైనా, గాలిలో రెక్కలతో ఎగిరే ఏ పక్షినైనా చూడండి. ఇవన్నీ మీ వంటి జీవ రాసులే. వాటి విధివ్రాత ఉన్న గ్రంథంలో మేము ఏ కొరతా చెయ్యలేదు. తరువాత ఇవన్నీ తమ ప్రభువు వద్ద ప్రోగుచెయ్య బడేవే. అయితే మా సూచనలను తిరస్కరిస్తూ ఉన్నవారు చెవిటివారు, మూగవారు, చీకట్లలో పడివున్నవారు. అల్లాహ్ తాను కోరిన వారిని మార్గభ్రష్టులుగా చేస్తాడు. తాను కోరిన వారిని రుజుమార్గవర్తనులుగా చేస్తాడు.[10] వారితో ఇలా అను: "కొంచెం ఆలోచించి చెప్పండి: ఎప్పుడైనా అల్లాహ్ తరఫు నుండి ఏదైనా పెద్ద ఆపద మీపై వచ్చిపడినప్పుడు లేదా చివరి గడియయే దాపురించినప్పుడు, మీరు అల్లాహ్‌ను తప్ప మరెవర్నయినా పిలుస్తారా? చెప్పండి, మీరు సత్య వంతులే అయితే. అప్పుడు మీరు అల్లాహ్‌నే పిలుస్తారు. ఆయన గనక కోరితే ఆ ఆపదను మీపై నుండి తొలగిస్తాడు. అటువంటి సందర్భాలలో మీరు నిలబెట్టిన దైవత్వపు భాగస్వాములను మీరు మరచిపోతారు."[11]

---

9. సూచన అంటే, ఇంద్రియగ్రాహ్యమైన మహిమ. అల్లాహ్ వాక్కుకు అర్థం ఏమిటంటే, మహిమను చూపించకపోవటానికి కారణం మేము దానిని చూపలేమని కాదు. దానికి మరొక కారణం ఉంది. దానిని వారు కేవలం తమ మూర్ఖత్వం వల్ల అర్థం చేసుకోరు.

10. అల్లాహ్ మార్గభ్రష్టులుగా చెయ్యటం అంటే అర్థం అజ్ఞానం, అంటే ఇష్టపడే మానవుడికి అల్లాహ్ సూచనలను అధ్యయనం చేసే అదృష్టం ప్రసాదించబడక పోవటం. విద్వేషీ, వాస్తవికదృష్టి లేనివాడూ అయిన విద్యార్థి ఒకవేళ వాటిని చూసినప్పటికీ, వాస్తవికతతో కూడిన సూచనలు అతని కళ్ళకు కన్పించకపోవటం ఇంకా అపోహలలో చిక్కుకునేలా చేసే విషయాలు అతణ్ణి సత్యానికి బహుదూరంగా లాక్కుపోవటం. దీనికి భిన్నంగా, అల్లాహ్ మార్గదర్శకం అంటే సత్యాభిలాషికి జ్ఞాన మార్గాల ద్వారా ప్రయోజనం పొందే అదృష్టం ప్రసాదించబడటం. ఇంకా అల్లాహ్ సూచనలలో వాస్తవికతకు చేర్చే గుర్తులు అతనికి లభించటం.

11. అంటే, ఈ సూచన స్వయంగా మీలోనే ఉంది. మీకు పెద్ద ఆపద కలిగినప్పుడు లేక మరణం తన భయంకరమైన స్వరూపంతో మీ ముందుకు వచ్చి నిలుచున్నప్పుడు, ఒకే దేవుని ఆశ్రయం తప్ప మరొక ఆశ్రయం ఏదీ మీకు కనిపించదు. పెద్ద పెద్ద ముష్రిక్కులు సైతం అటువంటి సమయంలో తమ ఆరాధ్యులను మరచి ఒకే దేవుణ్ణి పిలుస్తారు. కరుడుగట్టిన నాస్తికుడు సైతం దేవుని ముందు ప్రార్థన కొరకు చేతులెత్తుతాడు. ఇది ఏ విషయాన్ని రుజువు చేస్తుందంటే, దైవభక్తికీ, దేవుడు ఒక్కడే అనే దానికి ఆయనను ఆరాధించాలనే ప్రేరణకూ సాక్ష్యం ప్రతి మానవునిలోనూ ఉంది. దానిపై ఉపేక్ష, అజ్ఞానం అనే తెరలు ఎన్ని వేసినప్పటికీ, అప్పుడప్పుడూ అది పైకెగసి ముందుకు వస్తూనే ఉంటుంది.

وَ لَقَدْ اَرْسَلْنَاۤ اِلٰۤى اُمَمٍ مِّنْ قَبْلِكَ فَاَخَذْنٰهُمْ بِالْبَاْسَآءِ وَ الضَّرَّآءِ لَعَلَّهُمْ يَتَضَرَّعُوْنَ ۝٤٢ فَلَوْ لَاۤ اِذْ جَآءَهُمْ بَاْسُنَا تَضَرَّعُوْا وَ لٰكِنْ قَسَتْ قُلُوْبُهُمْ وَ زَيَّنَ لَهُمُ الشَّيْطٰنُ مَا كَانُوْا يَعْمَلُوْنَ ۝٤٣ فَلَمَّا نَسُوْا مَا ذُكِّرُوْا بِهٖ فَتَحْنَا عَلَيْهِمْ اَبْوَابَ كُلِّ شَيْءٍ ؕ حَتّٰۤى اِذَا فَرِحُوْا بِمَاۤ اُوْتُوْۤا اَخَذْنٰهُمْ بَغْتَةً فَاِذَا هُمْ مُّبْلِسُوْنَ ۝٤٤ فَقُطِعَ دَابِرُ الْقَوْمِ الَّذِيْنَ ظَلَمُوْا ؕ وَ الْحَمْدُ لِلّٰهِ رَبِّ الْعٰلَمِيْنَ ۝٤٥ قُلْ اَرَءَيْتُمْ اِنْ اَخَذَ اللّٰهُ سَمْعَكُمْ وَ اَبْصَارَكُمْ وَ خَتَمَ عَلٰى قُلُوْبِكُمْ مَّنْ اِلٰهٌ غَيْرُ اللّٰهِ يَاْتِيْكُمْ بِهٖ ؕ اُنْظُرْ كَيْفَ نُصَرِّفُ الْاٰيٰتِ ثُمَّ هُمْ يَصْدِفُوْنَ ۝٤٦ قُلْ اَرَءَيْتَكُمْ اِنْ اَتٰىكُمْ عَذَابُ اللّٰهِ بَغْتَةً اَوْ جَهْرَةً هَلْ يُهْلَكُ اِلَّا الْقَوْمُ الظّٰلِمُوْنَ ۝٤٧ وَ مَا نُرْسِلُ الْمُرْسَلِيْنَ اِلَّا مُبَشِّرِيْنَ وَ مُنْذِرِيْنَ ۚ فَمَنْ اٰمَنَ وَ اَصْلَحَ فَلَا خَوْفٌ عَلَيْهِمْ وَ لَا هُمْ يَحْزَنُوْنَ ۝٤٨ وَ الَّذِيْنَ كَذَّبُوْا بِاٰيٰتِنَا يَمَسُّهُمُ الْعَذَابُ بِمَا كَانُوْا يَفْسُقُوْنَ ۝٤٩

**42 - 45** మీకు పూర్వం అనేక జాతుల వద్దకు మేము ప్రవక్తలను పంపాము. ఆ జాతులను మేము కష్టాలకు, కడగండ్లకు గురిచేశాము, వారు మా ముందు వినయంతో తలవంచాలని. మా తరఫునుండి వారిపైకి ఆపద వచ్చిపడినప్పుడు వారు ఎందువల్ల వినమ్రులు కాలేదు? కాని వారి హృదయాలు మరీ కఠినమయ్యాయి. షైతాను, "మీరు చేసేదంతా బాగానే ఉంది" అని వారిని నమ్మించాడు. తరువాత వారు తమకు చెయ్యబడిన హితోపదేశాన్ని విస్మరించినప్పుడు, మేము వారికొరకు సకల భోగభాగ్యాల ద్వారాలను తెరిచాము. చివరకు వారు తమకు ప్రసాదించ బడిన ఆనందాలలో నిమగ్నులై ఉండగా, అకస్మాత్తుగా మేము వారిని పట్టుకున్నాము. అప్పుడు పరిస్థితి ఎలా ఉందంటే, వారు ప్రతి మేలు విషయంలో హతాశులయ్యారు. ఈ విధంగా దుర్మార్గానికి పాల్పడినవారిని సమూలంగా నిర్మూలించటం జరిగింది. సకల లోక ప్రభువైన అల్లాహ్‌యే స్తుతికి పాత్రుడు. (ఆయన వారిని సమూలంగా నాశనం చేశాడు).

**46 - 49** ప్రవక్తా! వారితో ఇలా అను: "మీరెప్పుడైనా ఆలోచించారా, అల్లాహ్ మీ చూపును మీ వినికిడిని మీనుంచి లాక్కుంటే, మీ హృదయాలకు ముద్రవేస్తే,[12] మళ్ళీ మీకు ఈ శక్తులను అల్లాహ్ తప్ప తిరిగి ఇవ్వగల మరొక దేవుడెవడున్నాడు?" చూడు! ఏవిధంగా మేము మాటిమాటికీ మా సూచనలను వారికి తెలుపుతామో, మరేవిధంగా వారు వాటి నుండి తమ దృష్టిని మరల్చుకుంటారో! ఇలా అను: "మీరెప్పుడైనా యోచించారా, అల్లాహ్ తరఫు నుండి అకస్మాత్తుగానో, బహిరంగంగానో మీపై శిక్ష అవతరిస్తే, అప్పుడు దుర్మార్గులు తప్ప మరెవరైనా నాశనమవుతారా? మేము ప్రవక్తలను పంపేది, వారు సచ్చరిత్రులకు సంతోష వార్తను ఇచ్చేవారు, దుశ్చరిత్రులను భయపెట్టే వారు కావాలని. కనుక, వారి మాట విని, తమ నడవడికను సంస్కరించుకునే వారికి భయంకానీ విచారంకానీ కలిగే అవకాశం లేదు. కాని మా ఆయతులు అసత్యాలని తిరస్కరించేవారు తమ అవిధేయతలకు ఫలితంగా శిక్ష తప్పకుండా అనుభవిస్తారు.

12. ఇక్కడ హృదయాలకు ముద్రవేయటం అంటే భావం, ఆలోచించే శక్తినీ, అర్థం చేసుకునే శక్తినీ హరింపజేయటం.

قُلْ لَّآ اَقُوْلُ لَكُمْ عِنْدِیْ خَزَآىِٕنُ اللّٰهِ وَلَآ
اَعْلَمُ الْغَیْبَ وَلَآ اَقُوْلُ لَكُمْ اِنِّیْ مَلَكٌ ۚ اِنْ
اَتَّبِعُ اِلَّا مَا یُوْحٰۤى اِلَیَّ ؕ قُلْ هَلْ یَسْتَوِی
الْاَعْمٰى وَالْبَصِیْرُ ؕ اَفَلَا تَتَفَكَّرُوْنَ ﴿۵۰﴾ وَ ع ٦ ١١
اَنْذِرْ بِهِ الَّذِیْنَ یَخَافُوْنَ اَنْ یُّحْشَرُوْۤا اِلٰى
رَبِّهِمْ لَیْسَ لَهُمْ مِّنْ دُوْنِهٖ وَلِیٌّ وَّ لَا شَفِیْعٌ
لَّعَلَّهُمْ یَتَّقُوْنَ ﴿۵۱﴾ وَلَا تَطْرُدِ الَّذِیْنَ یَدْعُوْنَ
رَبَّهُمْ بِالْغَدٰوةِ وَالْعَشِیِّ یُرِیْدُوْنَ وَجْهَهٗ ؕ
مَا عَلَیْكَ مِنْ حِسَابِهِمْ مِّنْ شَیْءٍ وَّ مَا مِنْ
حِسَابِكَ عَلَیْهِمْ مِّنْ شَیْءٍ فَتَطْرُدَهُمْ فَتَكُوْنَ
مِنَ الظّٰلِمِیْنَ ﴿۵۲﴾ وَكَذٰلِكَ فَتَنَّا بَعْضَهُمْ
بِبَعْضٍ لِّیَقُوْلُوْۤا اَهٰۤؤُلَآءِ مَنَّ اللّٰهُ عَلَیْهِمْ مِّنْۢ
بَیْنِنَا ؕ اَلَیْسَ اللّٰهُ بِاَعْلَمَ بِالشّٰكِرِیْنَ ﴿۵۳﴾ وَ
اِذَا جَآءَكَ الَّذِیْنَ یُؤْمِنُوْنَ بِاٰیٰتِنَا فَقُلْ
سَلٰمٌ عَلَیْكُمْ كَتَبَ رَبُّكُمْ عَلٰى نَفْسِهِ
الرَّحْمَةَ ۙ اَنَّهٗ مَنْ عَمِلَ مِنْكُمْ سُوْٓءًۢا بِجَهَالَةٍ
ثُمَّ تَابَ مِنْۢ بَعْدِهٖ وَاَصْلَحَ فَاَنَّهٗ غَفُوْرٌ
رَّحِیْمٌ ﴿۵۴﴾ وَكَذٰلِكَ نُفَصِّلُ الْاٰیٰتِ وَلِتَسْتَبِیْنَ
سَبِیْلُ الْمُجْرِمِیْنَ ﴿۵۵﴾ ع ٥ ١٢

**50** ప్రవక్తా! వారితో ఇలా అను: "నావద్ద అల్లాహ్ నిధి నిక్షేపాలు ఉన్నాయని గానీ, నాకు అగోచర జ్ఞానం కలదనిగానీ, నేను మీతో చెప్పటం లేదు. ఇంకా నేను దైవదూతనని కూడా అనటం లేదు. నేను కేవలం నాపై అవతరింపచేయబడే 'వహీ'ని మాత్రమే అనుసరిస్తాను." వారిని అడుగు: "గ్రుడ్డి వాడూ కళ్ళు ఉన్నవాడూ ఇద్దరూ ఒకటి కాగలరా? మీరు అసలు ఆలోచించరా?" అని.

**51 - 55** ప్రవక్తా! తమ ప్రభువు ముందు ఆయన తప్ప తమకు అండగా నిలిచి, సహాయం చేసే(అధికారంకల) వాడు గానీ లేదా తమ కొరకు సిఫారసు చేసేవాడుగానీ ఎవడూ ఉండని స్థితిలో ఎప్పుడైనా హాజరు కావలసివస్తుందని భయ పడుతూ ఉండేవారికి నీవు దీని (వహీ జ్ఞానం) ద్వారా ఉప దేశించు. బహుశా వారు (ఈ ఉపదేశం వల్లనైనా జాగరూకులై) భయభక్తుల వైఖరి అవలంబిస్తారేమో! రేయింబవళ్ళూ తమ ప్రభువును వేడుకునేవారినీ ఆయన ప్రసన్నతను పొందగోరే ప్రయత్నంలో నిమగ్నులై ఉన్నవారినీ నీవు దూరంగా తొలగి పొమ్మనకు. వారికి సంబంధించిన లెక్కలోని ఏ విషయాన్ని గురించిన భారమూ నీపై లేదు. నీకు సంబంధించిన లెక్కలోని ఏ విషయాన్ని గురించిన భారమూ వారిపై లేదు. దీని తరువాత కూడ నీవు గనక వారిని దూరంగా త్రోసివేస్తే దుర్మార్గులలో చేరిపోతావు. అసలు మేము ఈ విధంగా వారి లోని కొందరిని కొందరి ద్వారా పరీక్షకు గురిచేశాము.[13] వారు వీరిని చూసి, "మా మధ్య అల్లాహ్ దయాదాక్షిణ్యాలను పొందిన వారు వీరేనా?" అని అనేందుకు- అవును! అల్లాహ్, కృతజ్ఞతలు చూపే తన భక్తులను వీరికంటే బాగా ఎరుగడా? మా ఆయతులను విశ్వసించేవారు నీ వద్దకు వచ్చినప్పుడు, వారితో ఇలా అను: "మీకు శాంతి సమకూరుగాక! మీ ప్రభువు తనపై దయాదాక్షిణ్యాలను విధించుకున్నాడు. (కేవలం ఆయన కృపవల్లనే), ఒకవేళ మీలో ఎవరైనా అజ్ఞానం వల్ల ఏదైనా చెడుచేసి, తరువాత పశ్చాత్తాపపడి సంస్కరించుకుంటే, ఆయన అతనిని క్షమిస్తాడు. అతని పట్ల ఉదారంగా వ్యవహరిస్తాడు."[14] ఈ విధంగా మేము మా సూచనలను స్పష్టంగా వివరిస్తాము. అపరాధుల మార్గం పూర్తిగా విస్పష్టం కావాలని.

قُلْ اِنِّیْ نُهِیْتُ اَنْ اَعْبُدَ الَّذِیْنَ تَدْعُوْنَ مِنْ
دُوْنِ اللّٰهِ ؕ قُلْ لَّاۤ اَتَّبِعُ اَهْوَآءَكُمْ ۙ قَدْ
ضَلَلْتُ اِذًا وَّ مَاۤ اَنَا مِنَ الْمُهْتَدِیْنَ ﴿۵۶﴾ قُلْ
اِنِّیْ عَلٰی بَیِّنَةٍ مِّنْ رَّبِّیْ وَ كَذَّبْتُمْ بِهٖ ؕ مَا
عِنْدِیْ مَا تَسْتَعْجِلُوْنَ بِهٖ ؕ اِنِ الْحُكْمُ اِلَّا
لِلّٰهِ ؕ یَقُصُّ الْحَقَّ وَ هُوَ خَیْرُ الْفٰصِلِیْنَ ﴿۵۷﴾
قُلْ لَّوْ اَنَّ عِنْدِیْ مَا تَسْتَعْجِلُوْنَ بِهٖ لَقُضِیَ
الْاَمْرُ بَیْنِیْ وَ بَیْنَكُمْ ؕ وَ اللّٰهُ اَعْلَمُ
بِالظّٰلِمِیْنَ ﴿۵۸﴾ وَ عِنْدَهٗ مَفَاتِحُ الْغَیْبِ لَا
یَعْلَمُهَاۤ اِلَّا هُوَ ؕ وَ یَعْلَمُ مَا فِی الْبَرِّ وَ الْبَحْرِ ؕ
وَ مَا تَسْقُطُ مِنْ وَّرَقَةٍ اِلَّا یَعْلَمُهَا وَ لَا حَبَّةٍ فِیْ
ظُلُمٰتِ الْاَرْضِ وَ لَا رَطْبٍ وَّ لَا یَابِسٍ اِلَّا
فِیْ كِتٰبٍ مُّبِیْنٍ ﴿۵۹﴾ وَ هُوَ الَّذِیْ یَتَوَفّٰىكُمْ
بِالَّیْلِ وَ یَعْلَمُ مَا جَرَحْتُمْ بِالنَّهَارِ ثُمَّ
یَبْعَثُكُمْ فِیْهِ لِیُقْضٰۤی اَجَلٌ مُّسَمًّی ۚ ثُمَّ اِلَیْهِ
مَرْجِعُكُمْ ثُمَّ یُنَبِّئُكُمْ بِمَا كُنْتُمْ تَعْمَلُوْنَ ﴿۶۰﴾ وَ ع ١٣
هُوَ الْقَاهِرُ فَوْقَ عِبَادِهٖ وَ یُرْسِلُ عَلَیْكُمْ
حَفَظَةً ؕ حَتّٰۤی اِذَا جَآءَ اَحَدَكُمُ الْمَوْتُ
تَوَفَّتْهُ رُسُلُنَا وَ هُمْ لَا یُفَرِّطُوْنَ ﴿۶۱﴾

**56 - 62** ప్రవక్తా! వారితో ఇలా అను: “అల్లాహ్‌ను కాక మీరు వేడుకునే ఇతరులకు దాస్యం చెయ్యటం నాకు నిషేధించ బడింది.” ఇలా అను : “నేను మీ కోరికలను అనుసరించను. అలా చేసినట్లయితే, నేను మార్గభ్రష్టుడనయిపోతాను. సన్మార్గం పొందిన వారిలో ఉండను.” అను: “నా ప్రభువు వద్ద నుండి వచ్చిన ఒక సుస్పష్టమైన ప్రమాణం విషయంలో నేను స్థిరంగా ఉన్నాను. మీరు దానిని అసత్యమని తిరస్కరించారు. ఇప్పుడు మీరు తొందర పెడుతున్న విషయం మాత్రం నా అధీనంలో లేదు. నిర్ణయాధికారం పూర్తిగా అల్లాహ్‌కే ఉంది. ఆయనే సత్య విషయాన్ని ప్రకటిస్తాడు. ఆయనే ఉత్తమ నిర్ణయం చేసేవాడు.” ఇలా అను: “మీరు తొందరపెట్టే విషయం నా అధీనంలోనే గనక ఉన్నట్లయితే, నాకూ మీకూ మధ్య ఎప్పుడో తీర్పు జరిగిపోయి ఉండేది. కాని దుర్మార్గుల పట్ల ఎలా వ్యవహ రించాలో అల్లాహ్‌కు బాగా తెలుసు. అగోచరాల తాళం చెవులు ఆయన వద్దనే ఉన్నాయి. వాటిని ఆయన తప్ప ఎవరూ ఎరు గరు. భూమిలోనూ, సముద్రంలోనూ ఉన్నదంతా ఆయనకు తెలుసు. చెట్టునుండి ఏ ఆకైనా ఆయనకు తెలియకుండా రాలదు. భూమిలోని చీకటి పొరలలో ఉన్న ఏ గింజైనా ఆయనకు తెలియకుండా లేదు. తడిగా ఉన్నదీ, పొడిగా ఉన్నదీ అంతా ఒక విపులమైన గ్రంథంలో వ్రాయబడి ఉంది. ఆయనే రాత్రివేళ మీ ఆత్మలను వశపరచుకుంటాడు. పగటివేళ మీరు చేసే దంతా ఆయన తెలుసుకుంటాడు. మళ్ళీ రెండో రోజు ఆయన మిమ్మల్ని ఈ వ్యవహార ప్రపంచంలోకి తిరిగి పంపు తాడు, మీ నిర్ణీత జీవిత కాలం పూర్తికావటానికి. చివరకు మీరు ఆయన వైపునకే మరలిపోవాలి. అప్పుడు ఆయన మీకు మీరు చేస్తూ ఉన్నదంతా చూపుతాడు. తన దాసులపై ఆయనకు పూర్తి అధికారం ఉంది. మిమ్మల్ని కనిపెట్టి ఉండేవారిని నియ మించి పంపుతాడు. చివరకు మీలో ఎవరికైనా మరణ సమయం ఆసన్నమైనప్పుడు, ఆయన పంపిన దూతలు అతని ప్రాణం తీసుకుంటారు. తమ కర్తవ్య నిర్వహణలో వారు ఏమాత్రం అజాగ్రత్త చూపరు.

13. అంటే, పేదలకు, నిరుపేదలకు సమాజంలోని అట్టడుగు వర్గాలవారికి, అందరికంటే ముందే విశ్వాస భాగ్యాన్ని కలిగించి ధనగర్వం, గౌరవ ప్రతిష్ఠల గర్వం కలవారిని మేము పరీక్షకు గురిచేశాము.

14. అప్పుడు మహాప్రవక్త (సఅసమ్)ను విశ్వసించిన వారిలో అజ్ఞాన కాలంలో పెద్ద పెద్ద పాపాలు చేసిన వారు కూడా అనేకమంది ఉన్నారు. ఇప్పుడు ఇస్లామ్‌ను స్వీకరించిన తరువాత వారి జీవితాలు పూర్తిగా మారిపోయాయి. కాని

ثُمَّ رُدُّوْٓا اِلَى اللّٰهِ مَوْلٰىهُمُ الْحَقِّ ؕ اَلَا لَهُ
الْحُكْمُ ۟ وَهُوَ اَسْرَعُ الْحٰسِبِيْنَ ﴿۶۲﴾ قُلْ مَنْ
يُّنَجِّيْكُمْ مِّنْ ظُلُمٰتِ الْبَرِّ وَالْبَحْرِ تَدْعُوْنَهٗ
تَضَرُّعًا وَّ خُفْيَةً ۚ لَئِنْ اَنْجٰىنَا مِنْ هٰذِهٖ
لَنَكُوْنَنَّ مِنَ الشّٰكِرِيْنَ ﴿۶۳﴾ قُلِ اللّٰهُ يُنَجِّيْكُمْ
مِّنْهَا وَ مِنْ كُلِّ كَرْبٍ ثُمَّ اَنْتُمْ تُشْرِكُوْنَ ﴿۶۴﴾
قُلْ هُوَ الْقَادِرُ عَلٰٓى اَنْ يَّبْعَثَ عَلَيْكُمْ عَذَابًا
مِّنْ فَوْقِكُمْ اَوْ مِنْ تَحْتِ اَرْجُلِكُمْ اَوْ يَلْبِسَكُمْ
شِيَعًا وَّيُذِيْقَ بَعْضَكُمْ بَاْسَ بَعْضٍ ؕ اُنْظُرْ
كَيْفَ نُصَرِّفُ الْاٰيٰتِ لَعَلَّهُمْ يَفْقَهُوْنَ ﴿۶۵﴾ وَ
كَذَّبَ بِهٖ قَوْمُكَ وَ هُوَ الْحَقُّ ؕ قُلْ لَّسْتُ
عَلَيْكُمْ بِوَكِيْلٍ ﴿۶۶﴾ لِكُلِّ نَبَاٍ مُّسْتَقَرٌّ ۫ وَّسَوْفَ
تَعْلَمُوْنَ ﴿۶۷﴾

మళ్ళీ వారంతా తమ నిజమైన ప్రభువు, అల్లాహ్ సన్నిధికి మరలింపబడతారు. తెలుసుకోండి, తీర్పు చేసే సర్వాధికారాలు ఆయనకే ఉన్నాయి. లెక్కను తీసుకోవటంలో ఆయన వడిగల వాడు."

**63 - 67** ప్రవక్తా! వారిని ఇలా అడుగు: "భూసముద్రాల చీకట్లలోని ప్రమాదాల నుండి మిమ్మల్ని కాపాడేది ఎవరు? మీరు (ఆపద సమయంలో) కడు దీనంగా విలపిస్తూ, అతి గోప్యంగా వేడుకొనేది ఎవరిని? ఈ ఉపద్రవం నుండి ఆయన గనక మమ్మల్ని రక్షిస్తే, మేము తప్పకుండా కృతజ్ఞులం అవు తాము అని మీరు అనేది ఎవరితో?" - ఇలా అను: "అల్లాహ్ మీకు దానినుండీ ప్రతి బాధనుండీ విముక్తి కలిగిస్తాడు. తరువాత మీరు ఇతరులను ఆయనకు భాగస్వాములుగా నిలబెడతారు."[15] ఇలా చెప్పు: "ఆయనకు ఈ శక్తి ఉంది- ఏదైనా శిక్షను పైనుండి మీపై అవతరింపచేయగలడు లేదా మీ పాదాల కింద నుండి తీసుకురాగలడు లేదా మిమ్మల్ని వర్గాలుగా విభజించి ఒక వర్గం బలాన్ని మరొక వర్గానికి రుచి చూపించగలడు." చూడండి! వారు బహుశా సత్యాన్ని గ్రహిస్తారని, మేము ఏవిధంగా మా సూచనలను మాటిమాటికీ రకరకాలుగా వారి ముందు పెడుతున్నామో! అది సత్యం అయినా, మీ జాతి దాన్ని తిరస్కరిస్తోంది. వారితో ఇలా చెప్పు: "నేను మీ ప్రవర్తనకు బాధ్యుడనుగా నియమింపబడలేదు.[16] ప్రతి వార్త నిజం కావడానికి ఒక గడువు అంటూ నిర్ణయమై ఉంది. త్వరలోనే స్వయంగా మీకే ఫలితమేమిటో తెలిసిపో తుంది."

---

ఇస్లామ్ విరోధులు వారిని పూర్వ జీవితంలో చేసిన తప్పులకూ, పొరపాట్లకూ ఎత్తి పొడిచేవారు. దీనిని గురించి ఇలా చెప్పబడుతోంది. విశ్వాసులను ఓదార్చు. పశ్చాత్తాపపడి తనను తాను సంస్కరించుకునేవాడి పూర్వపు తప్పులను పట్టుకునే విధానం అల్లాహ్ విధానం కాదని, వారికి తెలుపు.

15. అంటే, ఈ వాస్తవం ఒక్క అల్లాహ్‌యే సకల శక్తి సామర్థ్యాలు కలవాడు, ఆయనే సర్వాధికారాలకు ప్రభువు, మీ మంచీ చెడులపై సంపూర్ణ అధికారాలు కలవాడు, ఆయన చేతులలోనే మీ అదృష్టాల కళ్ళెం ఉంది. దీనికి సాక్ష్యం స్వయంగా మీలోనే ఉంది. ఏదైనా గడ్డు కాలం వచ్చినపుడు, సహాయ సంపత్తులతో సంబంధాలు తెగిపోతూ కన్పించినపుడు, మీరు అప్రయత్నంగా ఆయన వైపునకే మరలుతారు. కాని స్పష్టమైన ఈ నిదర్శనం ఉన్నప్పటికీ మీరు ఆధారం, ప్రమాణం లేకుండా, నిరూపణ లేకుండా దైవత్వంలో ఇతరులను ఆయనకు భాగస్వాములుగా

وَ اِذَا رَاَيۡتَ الَّذِيۡنَ يَخُوۡضُوۡنَ فِيۡۤ اٰيٰتِنَا
فَاَعۡرِضۡ عَنۡهُمۡ حَتّٰى يَخُوۡضُوۡا فِيۡ حَدِيۡثٍ
غَيۡرِهٖ ؕ وَ اِمَّا يُنۡسِيَنَّكَ الشَّيۡطٰنُ فَلَا تَقۡعُدۡ
بَعۡدَ الذِّكۡرٰى مَعَ الۡقَوۡمِ الظّٰلِمِيۡنَ ﴿٦٨﴾ وَ مَا
عَلَى الَّذِيۡنَ يَتَّقُوۡنَ مِنۡ حِسَابِهِمۡ مِّنۡ شَىۡءٍ وَّ
لٰـكِنۡ ذِكۡرٰى لَعَلَّهُمۡ يَتَّقُوۡنَ ﴿٦٩﴾ وَذَرِ الَّذِيۡنَ
اتَّخَذُوۡا دِيۡنَهُمۡ لَعِبًا وَّ لَهۡوًا وَّغَرَّتۡهُمُ الۡحَيٰوةُ
الدُّنۡيَا وَ ذَكِّرۡ بِهٖۤ اَنۡ تُبۡسَلَ نَفۡسٌۢ بِمَا كَسَبَتۡ ۖ
لَيۡسَ لَهَا مِنۡ دُوۡنِ اللّٰهِ وَلِىٌّ وَّ لَا شَفِيۡعٌ ۚ وَ
اِنۡ تَعۡدِلۡ كُلَّ عَدۡلٍ لَّا يُؤۡخَذۡ مِنۡهَا ؕ اُولٰٓـئِكَ
الَّذِيۡنَ اُبۡسِلُوۡا بِمَا كَسَبُوۡا ۚ لَهُمۡ شَرَابٌ مِّنۡ
حَمِيۡمٍ وَّعَذَابٌ اَلِيۡمٌۢ بِمَا كَانُوۡا يَكۡفُرُوۡنَ ﴿٧٠﴾ ع ٨ ١٤

**68 - 70** ప్రవక్తా! ప్రజలు గనక మా ఆయతులలో తప్పులెన్నటాన్ని నీవు గమనిస్తే వారిమధ్య నుండి తొలగిపో, వారు ఈ ప్రస్తావనను వదలిపెట్టి మరో విషయాన్ని గురించి మాట్లాడటం మొదలుపెట్టేవరకు. ఒకవేళ నిన్ను షైతాను ఎప్పుడైనా ఏమరుపాటుకు గురిచేస్తే,నీవు ఈ పొరపాటును గ్రహించిన తరువాత, మళ్ళీ అటువంటి దుర్మార్గుల వద్ద కూర్చోవద్దు. వారి లెక్కలోని ఏ విషయానికీ భయభక్తులు కలవారు బాధ్యులు కారు. అయితే హితవు గరపటం వారి విధి. బహుశా వారు చెడునడతను మానుకుంటారేమో! తమ ధర్మాన్ని ఒక క్రీడగా, ఒక తమాషాగా భావించినవారిని ఇహలోక జీవితం మాయకు గురిచేసిన వారిని నీవు వదలిపెట్టు. కాని ఈ ఖురానును వినిపించి హితబోధ చెయ్యి. హెచ్చరిక చేస్తూ ఉండు. ఎందుకంటే, ఏ వ్యక్తీ తాను చేసిన చేష్టల దుష్ఫలితంలో చిక్కుకోకూడదు. ఆ చిక్కుకోవటం కూడా అల్లాహ్ నుండి రక్షింపగల సహాయకుడూ, రక్షకుడూ, ఇంకా సిఫారసు జేసేవాడూ ఎవడూ లేని స్థితిలో, ఇంకా అతడు సాధ్యమైన ప్రతిదానినీ పరిహారంగా ఇచ్చి విడుదల కావాలని కోరినా, అది కూడా అతడి నుండి స్వీకరించబడని స్థితిలో. ఎందుకంటే అటువంటివారు స్వయంగా తాము సంపాదించిన దాని ఫలితంగా పట్టుకోబడతారు. వారికి తమ సత్య నిరాకరణకు ప్రతిఫలంగా కాగే నీరు త్రాగటానికీ, వ్యధాభరితమైన శిక్ష అనుభవించటానికీ దొరుకుతాయి.

చేశారు. ఆయన ఉపాధివల్ల జీవిస్తారు. ఇతరులను అన్నదాతగా చేస్తారు. ఆయన అనుగ్రహం, ఆయన దయవల్ల సహాయం పొందుతారు. ఇతరులను సహాయకులుగా, అండదండలు ఇచ్చేవారుగా నిలబెడతారు. మీరు ఆయన బానిసలు. కాని ఇతరులకు దాస్యం చేస్తారు. ఆపదలలో ఆయన ఆదుకుంటాడు. ఆయనను కష్టకాలంలో వేడుకుంటారు. ఆ కాలం గడచిపోయినప్పుడు ఇతరులు మీ ఆపద్బాంధవులు అవుతారు. ఇంకా మొక్కుబడులు, అర్చనలు ఇతరుల పేర్లపై జరుగుతాయి.

16. అంటే, దేనిని మీరు చూడటం లేదో, దానిని బలవంతంగా మీకు చూపటం, దేనిని మీరు అవగాహన చేసుకోవటం లేదో, దానిని బలవంతంగా మీ అవగాహనలోకి దింపటం నా పనికాదు. మీరు గనక చూడకపోతే, అవగాహన చేసుకోకపోతే, మీపై శిక్షను అవతరింపజెయ్యటం కూడా నా పని కాదు.

قُلْ اَنَدْعُوْا مِنْ دُوْنِ اللّٰهِ مَا لَا يَنْفَعُنَا وَ لَا
يَضُرُّنَا وَ نُرَدُّ عَلٰٓى اَعْقَابِنَا بَعْدَ اِذْ هَدٰىنَا
اللّٰهُ كَالَّذِى اسْتَهْوَتْهُ الشَّيٰطِيْنُ فِى الْاَرْضِ
حَيْرَانَ ۖ لَهٗٓ اَصْحٰبٌ يَّدْعُوْنَهٗٓ اِلَى الْهُدَى
ائْتِنَا ؕ قُلْ اِنَّ هُدَى اللّٰهِ هُوَ الْهُدٰى ؕ
وَاُمِرْنَا لِنُسْلِمَ لِرَبِّ الْعٰلَمِيْنَ ﴿٧١﴾ وَ اَنْ
اَقِيْمُوا الصَّلٰوةَ وَ اتَّقُوْهُ ؕ وَ هُوَ الَّذِىْٓ اِلَيْهِ
تُحْشَرُوْنَ ﴿٧٢﴾ وَ هُوَ الَّذِىْ خَلَقَ السَّمٰوٰتِ
وَالْاَرْضَ بِالْحَقِّ ؕ وَ يَوْمَ يَقُوْلُ كُنْ
فَيَكُوْنُ ؕ قَوْلُهُ الْحَقُّ ؕ وَ لَهُ الْمُلْكُ يَوْمَ
يُنْفَخُ فِى الصُّوْرِ ؕ عٰلِمُ الْغَيْبِ وَالشَّهَادَةِ ؕ وَ
هُوَ الْحَكِيْمُ الْخَبِيْرُ ﴿٧٣﴾

الثلثة

**71 - 73** ప్రవక్తా! వారిని ఇలా అడుగు: అల్లాహ్‌ను వదలి పెట్టి, మాకు లాభంకానీ, నష్టంకానీ కలిగించలేని వారిని మేము వేడుకోవాలా? అల్లాహ్ మాకు రుజుమార్గం చూపిన తరువాత మేము ముందుకువేసిన అడుగును వెనక్కి తిప్పు కోవాలా? షైతానులు ఎడారిలో దారి తప్పించగా సహచరులు 'ఇటురా, సరైన మార్గం ఇక్కడుంది', అని పిలుస్తూ ఉన్నప్పటికీ గాభరాపడి కలవరపాటుతో తిరుగాడే వాని స్థితి మాదిరిగానే మేము మా స్థితిని కూడా చేసుకోవాలా? వారితో ఇలా అను: "వాస్తవానికి, నిజమైన మార్గదర్శకత్వం కేవలం అల్లాహ్ మార్గ దర్శకత్వమే, ఆయన నుండి మాకు ఈ ఆజ్ఞ అందజేయ బడింది: "సృష్టి ప్రభువు ముందు విధేయతతో తలవంచండి. నమాజును స్థాపించండి. ఆయనపట్ల అవిధేయతకు దూరంగా ఉండండి. ఆయన వైపునకే మీరంతా తీసుకుపోబడతారు." ఆయనే ఆకాశాన్నీ భూమినీ సత్యం ఆధారంగా సృష్టించాడు.[17] ఆయన ప్రళయాన్ని "అయిపో" అని ఆజ్ఞాపించే రోజునే అది సంభవిస్తుంది. ఆయన వాక్కు పూర్తిగా సత్యమైనది. శంఖం ఊదబడే రోజున విశ్వాధిపత్యం ఆయనదే. ఆయన గోచర అగోచర[18] విషయాలు అన్నీ తెలిసిన జ్ఞాని, అత్యంత వివేకి, సర్వసంవేది.

17. అల్లాహ్, భూమినీ ఆకాశాలనూ సత్యం ఆధారంగా సృష్టించాడు లేక సత్యంతో సృష్టించాడు అనే విషయం ఖురానులో పలుచోట్ల చెప్పబడింది. దీనికి ఒక అర్థం ఏమిటంటే, భూమ్యాకాశాల సృష్టి కేవలం ఒక ఆటగా జరగలేదు. ఇది ఒక పిల్లవాడి చేతి ఆటబొమ్మ కాదు, కేవలం కాలక్షేపం కొరకు అతడు దీనితో ఆడుకోవటానికి, ఇట్టే దానిని పగలగొట్టి పారెయ్యటానికి. అసలు ఇది పూర్తిగా ఒక ఉదాత్తమైన కార్యం. వివేకం ఆధారంగా చెయ్యబడింది. దీని వెనుక ఒక మహోన్నత లక్ష్యం ఉంది. ఇంకా ఈ సృష్టియొక్క గడువు తీరిపోయిన తరువాత, సృష్టికర్త, ఆ కాలంలో జరిగిన మొత్తం పనిని గురించి లెక్క తీసుకోవటం, అదేకాలం ఫలితాలపై మరొక కాలానికి పునాదులు వెయ్యటం అత్యంతావశ్యకం. రెండో అర్థం ఏమిటంటే, అల్లాహ్ ఈ సమస్త విశ్వవ్యవస్థను సత్యం యొక్క గట్టి పునాదులపై స్థాపించాడు. న్యాయం, వివేకం, సత్యం యొక్క సూత్రాలపై దానిలోని ప్రతి వస్తువూ ఆధారపడి ఉంది. వాస్తవానికి ఈ వ్యవస్థలో అసత్యం వ్రేళ్ళూనటానికీ, ప్రాబల్యం వహించటానికీ ఏ అవకాశమూ ఎంతమాత్రమూ లేదు. అసత్యవాదులు ఒకవేళ తమ అబద్ధాన్ని, దుర్మార్గాన్ని, నీతిహీనతను వృద్ధిపరచదలచుకుంటే తమ ప్రయత్నాలు చేసి చూసుకోవటానికి అల్లాహ్ వారికి అవకాశం ఇచ్చాడన్నది వేరే విషయం. కాని చివరకు భూమి ప్రతి అసత్య బీజాన్ని వెళ్ళగక్కుతుంది. ఇంకా చివరి లెక్క పత్రంలో ప్రతి అసత్యవాది చూసుకుంటాడు. అతడు ఈ దుష్ట వృక్షాన్ని పెంచ టానికీ, నీళ్ళు పెట్టటానికి చేసిన ప్రయత్నం అంతా వృధా అయిపోయిందని. మూడో అర్థం ఏమిటంటే, దేవుడు ఈ మొత్తం సృష్టిని తన హక్కు ఆధారంగా సృష్టించాడు. తన వ్యక్తిగతమైన హక్కు ఆధారంగానే ఆయన దీన్ని పరిపాలి స్తున్నాడు. తాను సృష్టించిన విశ్వంలో పరిపాలించే హక్కును తానే కలిగివున్నాడు. కాబట్టి ఆయన ఆజ్ఞ ఇక్కడ చలామణి అవుతుంది. ఇక్కడ తన ఆజ్ఞను చలాయించటానికి మరొకడెవడికీ హక్కు లేదు.

وَاِذْ قَالَ اِبْرٰهِيْمُ لِاَبِيْهِ اٰزَرَ اَتَتَّخِذُ
اَصْنَامًا اٰلِهَةً ۚ اِنِّيْٓ اَرٰىكَ وَقَوْمَكَ فِيْ ضَلٰلٍ
مُّبِيْنٍ ۝٧٤ وَكَذٰلِكَ نُرِيْٓ اِبْرٰهِيْمَ مَلَكُوْتَ
السَّمٰوٰتِ وَالْاَرْضِ وَلِيَكُوْنَ مِنَ
الْمُوْقِنِيْنَ ۝٧٥ فَلَمَّا جَنَّ عَلَيْهِ الَّيْلُ رَاٰ كَوْكَبًا ۚ
قَالَ هٰذَا رَبِّيْ ۚ فَلَمَّآ اَفَلَ قَالَ لَآ اُحِبُّ
الْاٰفِلِيْنَ ۝٧٦ فَلَمَّا رَاَ الْقَمَرَ بَازِغًا قَالَ هٰذَا
رَبِّيْ ۚ فَلَمَّآ اَفَلَ قَالَ لَىِٕنْ لَّمْ يَهْدِنِيْ رَبِّيْ
لَاَكُوْنَنَّ مِنَ الْقَوْمِ الضَّاۤلِّيْنَ ۝٧٧ فَلَمَّا رَاَ
الشَّمْسَ بَازِغَةً قَالَ هٰذَا رَبِّيْ هٰذَآ اَكْبَرُ ۚ
فَلَمَّآ اَفَلَتْ قَالَ يٰقَوْمِ اِنِّيْ بَرِيْۤءٌ مِّمَّا
تُشْرِكُوْنَ ۝٧٨ اِنِّيْ وَجَّهْتُ وَجْهِيَ لِلَّذِيْ فَطَرَ
السَّمٰوٰتِ وَالْاَرْضَ حَنِيْفًا وَّمَآ اَنَا مِنَ
الْمُشْرِكِيْنَ ۝٧٩ وَحَاۤجَّهٗ قَوْمُهٗ ۗ قَالَ
اَتُحَاۤجُّوْۤنِّيْ فِى اللّٰهِ وَقَدْ هَدٰىنِ ۗ وَلَآ اَخَافُ
مَا تُشْرِكُوْنَ بِهٖٓ اِلَّآ اَنْ يَّشَاۤءَ رَبِّيْ شَيْـًٔا ۗ
وَسِعَ رَبِّيْ كُلَّ شَيْءٍ عِلْمًا ۗ اَفَلَا تَتَذَكَّرُوْنَ ۝٨٠ وَ
كَيْفَ اَخَافُ مَآ اَشْرَكْتُمْ وَلَا تَخَافُوْنَ اَنَّكُمْ
اَشْرَكْتُمْ بِاللّٰهِ مَا لَمْ يُنَزِّلْ بِهٖ عَلَيْكُمْ
سُلْطٰنًا ۗ فَاَيُّ الْفَرِيْقَيْنِ اَحَقُّ بِالْاَمْنِ ۚ اِنْ
كُنْتُمْ تَعْلَمُوْنَ ۝٨١ اَلَّذِيْنَ اٰمَنُوْا وَلَمْ يَلْبِسُوْٓا
اِيْمَانَهُمْ بِظُلْمٍ اُولٰۤىِٕكَ لَهُمُ الْاَمْنُ وَهُمْ
مُّهْتَدُوْنَ ۝٨٢ ع

وقف لازم
ع ۱۲ ۱۵

**74 -82** ఇబ్రాహీము గాథను జ్ఞాపకం తెచ్చుకో. అతను తన తండ్రి ఆజరుతో ఇలా అన్నాడు: "ఏమిటీ నీవు విగ్రహాలను దేవుళ్ళుగా చేస్తున్నావా? నేను నిన్నూ, నీ జాతివారినీ స్పష్టమైన అపమార్గంలో ఉన్నట్లుగా చూస్తున్నాను." ఇదే విధంగా మేము ఇబ్రాహీముకు భూమ్యాకాశాల పాలనా వ్యవస్థను చూపించే వారము. ఎందుకు చూపేవారమంటే, అతను దృఢంగా విశ్వసించే వారిలో ఒకడు కావాలని. రాత్రి అతనిపై ఆవరించగానే అతను ఒక నక్షత్రాన్ని చూశాడు. అన్నాడు: "ఇది నా ప్రభువు" అని. కాని అది అస్తమించగానే అతను "అస్తమించేవాటిని నేను ప్రేమించను" అని అన్నాడు. చంద్రుడు ప్రకాశిస్తూ కనిపించగానే అతను, "ఇదీ నా ప్రభువు" అని అన్నాడు. కాని అదీ అస్తమించగానే "నా ప్రభువు గనక నాకు మార్గమే చూపి ఉండకపోతే, నేనూ మార్గభ్రష్టులలో కలసిపోయి ఉండేవాణ్ణే" అని అన్నాడు. తరువాత అతను సూర్యుణ్ణి ప్రకాశిస్తూ ఉండగా చూసి, "అసలు ఇదీ నా ప్రభువు! ఇది అన్నిటికంటే పెద్దది" అని పలికాడు. కాని అది కూడా అస్తమించగానే ఇబ్రాహీము ఎలుగెత్తి ఇలా ప్రకటించాడు: "నా జాతి సోదరులారా! మీరు దైవానికి భాగస్వాములుగా నిలబెట్టే వాట న్నింటితోనూ నాకు ఏవిధమైన సంబంధం లేదు.[19] నేను ఏకాగ్రతతో నా ముఖాన్ని భూమ్యాకాశాలను సృష్టించిన శక్తివైపునకు త్రిప్పుకున్నాను. నేను 'షిర్కు'కు ఒడిగట్టే వారిలోని వాణ్ణి ఎంత మాత్రంకాను." అతని జాతివారు అతనితో వాదులాటకు దిగగా అతను వారితో ఇలా అన్నాడు: "మీరు అల్లాహ్ విషయంలో నాతో కలహిస్తున్నారా? వాస్తవానికి ఆయన నాకు రుజుమార్గం చూపించాడు. మీరు నిలబెట్టిన భాగస్వాములకు నేను భయపడను. అయితే నా ప్రభువు ఏదైనా కోరితే అది తప్పకుండా జరగవచ్చు. నా ప్రభువు జ్ఞానం ప్రతిదానినీ ఆవరించి ఉన్నది. మీరు స్పృహలోకి రారా?[20] నేను అసలు మీరు నిలబెట్టే భాగస్వాములకు ఎందుకు భయపడాలి? వాటి విషయంలో అల్లాహ్ మీపై ఏ ప్రమాణాన్నీ అవతరింపచేయనప్పటికీ వాటిని మీరు ఆయనతో పాటు దైవత్వంలో భాగస్వాములుగా చేస్తూ భయపడనప్పుడు? మన ఉభయ పక్షాలలో ఎవరు నిర్భయత్వానికీ, ప్రశాంతతకూ ఎక్కువ అర్హులో మీకేమైనా తెలిస్తే చెప్పండి? వాస్తవానికి విశ్వసించిన వారికే, తమ విశ్వాసాన్ని దుర్మార్గంతో కలుషితం చేయనివారికే శాంతి, వారు మాత్రమే రుజుమార్గంపై ఉన్నారు.

وَ تِلْكَ حُجَّتُنَآ اٰتَيْنٰهَآ اِبْرٰهِيْمَ عَلٰى قَوْمِهٖ ؕ
نَرْفَعُ دَرَجٰتٍ مَّنْ نَّشَآءُ ؕ اِنَّ رَبَّكَ حَكِيْمٌ
عَلِيْمٌ ﴿۸۳﴾ وَ وَهَبْنَا لَهٗۤ اِسْحٰقَ وَ يَعْقُوْبَ ؕ كُلًّا
هَدَيْنَا ۚ وَنُوْحًا هَدَيْنَا مِنْ قَبْلُ وَ مِنْ ذُرِّيَّتِهٖ
دَاوٗدَ وَ سُلَيْمٰنَ وَاَيُّوْبَ وَ يُوْسُفَ وَ مُوْسٰى وَ
هٰرُوْنَ ؕ وَ كَذٰلِكَ نَجْزِى الْمُحْسِنِيْنَ ۙ﴿۸۴﴾ وَ
زَكَرِيَّا وَ يَحْيٰى وَعِيْسٰى وَاِلْيَاسَ ؕ كُلٌّ مِّنَ
الصّٰلِحِيْنَ ۙ﴿۸۵﴾ وَ اِسْمٰعِيْلَ وَ الْيَسَعَ وَ يُوْنُسَ
وَلُوْطًا ؕ وَ كُلًّا فَضَّلْنَا عَلَى الْعٰلَمِيْنَ ۙ﴿۸۶﴾ وَمِنْ
اٰبَآئِهِمْ وَذُرِّيّٰتِهِمْ وَ اِخْوَانِهِمْ ۚ وَ اجْتَبَيْنٰهُمْ
وَهَدَيْنٰهُمْ اِلٰى صِرَاطٍ مُّسْتَقِيْمٍ ﴿۸۷﴾ ذٰلِكَ
هُدَى اللّٰهِ يَهْدِىْ بِهٖ مَنْ يَّشَآءُ مِنْ عِبَادِهٖ ؕ
وَ لَوْ اَشْرَكُوْا لَحَبِطَ عَنْهُمْ مَّا كَانُوْا يَعْمَلُوْنَ ﴿۸۸﴾
اُولٰٓئِكَ الَّذِيْنَ اٰتَيْنٰهُمُ الْكِتٰبَ وَ الْحُكْمَ وَ
النُّبُوَّةَ ۚ فَاِنْ يَّكْفُرْ بِهَا هٰٓؤُلَآءِ فَقَدْ وَكَّلْنَا بِهَا
قَوْمًا لَّيْسُوْا بِهَا بِكٰفِرِيْنَ ﴿۸۹﴾ اُولٰٓئِكَ الَّذِيْنَ
هَدَى اللّٰهُ فَبِهُدٰىهُمُ اقْتَدِهْ ؕ قُلْ لَّآ اَسْئَلُكُمْ
عَلَيْهِ اَجْرًا ؕ اِنْ هُوَ اِلَّا ذِكْرٰى لِلْعٰلَمِيْنَ ﴿۹۰﴾ ع ۱۲

**83** ఇదీ మా తర్కము. దానినే మేము ఇబ్రాహీముకు, తన జాతికి వ్యతిరేకంగా ప్రసాదించాము. మేము కోరినవారికి ఉన్నత స్థానాలను ప్రసాదిస్తాము. సత్యం ఏమిటంటే నీ ప్రభువు వివేకవంతుడు, అన్నీ తెలిసినవాడు.

**84 - 90** మేము తరువాత ఇబ్రాహీముకు, ఇస్‌హాఖ్, యాఖూబ్ వంటి సంతానాన్ని ప్రసాదించాము. ప్రతి ఒక్కరికి మేము రుజుమార్గం చూపించాము. (ఈ రుజుమార్గాన్నే) వారికి పూర్వం నూహ్‌కు చూపాము. ఇంకా అతని సంతతి లోనివారైన దావూదు, సులైమాన్, అయ్యూబ్, యూసుఫ్, మూసా, హారూన్ లకు మేము (సన్మార్గం చూపించాము). ఈ విధంగా మేము సజ్జనులకు వారు చేసిన సత్కార్యానికి ప్రతిఫలం ఇస్తాము. (అతని సంతతికి చెందిన) జకరియ్యా, యహ్యా, ఈసా ఇల్యాస్‌లకు (మార్గం చూపాము). వారిలో ప్రతి ఒక్కడూ సజ్జనుడే. (ఇంకా ఆయన కుటుంబానికే చెందిన) ఇస్మాయీలు, అల్‌యస్అ, యూనుస్, లూత్‌లకు (సన్మార్గం చూపాము). వారిలో ప్రతి ఒక్కరికీ మేము భూలోక వాసులందరిపై ఘనతను ప్రసాదించాము. ఇంకా వారి తాత ముత్తాతలనూ వారి సంతానాన్నీ వారి తోబుట్టువు లలో చాలా మందినీ మేము అనుగ్రహించాము. వారిని మా సేవకొరకు ఎన్నుకున్నాము. వారికి రుజుమార్గం వైపునకు దారి చూపాము. ఇది అల్లాహ్ మార్గదర్శకత్వం. దానిద్వారా ఆయన తన దాసులలో తాను కోరిన వారికి మార్గం చూపుతాడు. కాని వారు ఒకవేళ షిర్కు చేసి ఉండినట్లయితే, వారు చేసిన సమస్తం నాశనం అయివుండేదే. మేము గ్రంథాన్నీ, ఆజ్ఞనూ, ప్రవక్త పదవినీ ప్రసాదించిన[21] వారు వీరే. ఒకవేళ వారు దానిని విశ్వసించటానికి తిరస్కరిస్తే (ఫర్వాలేదు) మేము ఈ అనుగ్రహాన్ని వేరే ప్రజలకు అప్పగించాము. వారు దానిని తిరస్కరించేవారు కారు. ప్రవక్తా! వారే అల్లాహ్ తరఫునుండి మార్గదర్శకత్వం పొందినవారు. వారి మార్గాన్నే నీవు అనుసరించు. ప్రకటించు: "నేను ఈ (ధర్మం యొక్క ప్రచార, ప్రబోధ) కార్యానికిగాను మీ నుండి ఏ ప్రతిఫలాన్నీ ఆశించటం లేదు. ఇది ఒక హితబోధ, సమస్త భూప్రజ కొరకు" అని.

18. అగోచరం (గైబ్) అంటే సృష్టితాలకు (సృష్టింపబడినవాటికి) గోప్యంగా ఉన్న దంతా అని అర్థం. గోచరం (షహాద) అంటే సృష్టితాలకు కనిపించేదీ తెలిసేదీ అని అర్థం.

وَ مَا قَدَرُوا اللّٰهَ حَقَّ قَدْرِهٖۤ اِذْ قَالُوْا مَاۤ
اَنْزَلَ اللّٰهُ عَلٰى بَشَرٍ مِّنْ شَیْءٍ ؕ قُلْ مَنْ
اَنْزَلَ الْكِتٰبَ الَّذِیْ جَآءَ بِهٖ مُوْسٰى نُوْرًا وَّ
هُدًى لِّلنَّاسِ تَجْعَلُوْنَهٗ قَرَاطِیْسَ تُبْدُوْنَهَا
وَ تُخْفُوْنَ كَثِیْرًا ۚ وَ عُلِّمْتُمْ مَّا لَمْ تَعْلَمُوْۤا اَنْتُمْ
وَ لَاۤ اٰبَآؤُكُمْ ؕ قُلِ اللّٰهُ ۙ ثُمَّ ذَرْهُمْ فِیْ
خَوْضِهِمْ یَلْعَبُوْنَ ﴿۹۱﴾ وَ هٰذَا كِتٰبٌ اَنْزَلْنٰهُ
مُبٰرَكٌ مُّصَدِّقُ الَّذِیْ بَیْنَ یَدَیْهِ وَ لِتُنْذِرَ
اُمَّ الْقُرٰى وَ مَنْ حَوْلَهَا ؕ وَ الَّذِیْنَ یُؤْمِنُوْنَ
بِالْاٰخِرَةِ یُؤْمِنُوْنَ بِهٖ وَ هُمْ عَلٰى صَلَاتِهِمْ
یُحَافِظُوْنَ ﴿۹۲﴾

**91 - 94** "అల్లాహ్ ఏ మానవుడిపైనా దేనినీ అవతరింప చెయ్యలేదు" అని పలికి ఈ ప్రజలు అల్లాహ్‌ను గురించి చాలా తప్పుడుగా అంచనావేశారు. వారిని అడుగు: "అయితే మూసా తెచ్చిన గ్రంథం– అది సమస్త మానవ జాతికి జ్యోతి, మార్గదర్శకత్వం, దానిని మీరు ముక్కలు ముక్కలుగా చేసి ఉంచుతారు, కొంతభాగాన్ని చూపిస్తారు, ఎక్కువ భాగాన్ని దాస్తారు, దాని ద్వారా మీకూ, మీ తాత ముత్తాతలకూ లేని జ్ఞానసంపద మీకు ఇవ్వబడింది, అసలు దాన్ని అవతరింప జేసినవాడెవడు?[22] ఆయన "అల్లాహ్" అని మాత్రం చెప్పండి. ఆపై వారిని తమ కుతర్కాలతో ఆడుకోవటానికి వదిలెయ్యండి. (ఆ గ్రంథం మాదిరిగా) ఇది కూడా మేము అవతరింపజేసిన ఒక గ్రంథం. అది ఎనలేని శుభాలు, మేళ్ళు కలది. తనకు పూర్వం వచ్చిన దానిని ధ్రువీకరిస్తుంది. దాని ద్వారా నీవు ఈ పురముల కేంద్రం (అంటే మక్కా) లోనూ దాని చుట్టుపట్లా ఉండేవారినీ హెచ్చరిక చెయ్యటానికి అది అవతరింపచెయ్య బడింది. పరలోకాన్ని నమ్మేవారు ఈ గ్రంథాన్ని విశ్వసిస్తారు. వారు తమ నమాజులను నియమం తప్పకుండా చేస్తారు.

19. ఇక్కడ హజ్రత్ ఇబ్రాహీము (అస్సలామ్) యొక్క ప్రారంభపు ఆలోచనా విధానాన్ని గురించి చెప్పటం జరిగింది. అది అతను ప్రవక్త పదవిని అలంకరించక పూర్వం సత్యాన్ని చేరటానికి సాధనంగా వినియోగపడింది. ఇందులో, పూర్తిగా షిర్కుతో నిండివున్న పరిసరాలలో కళ్ళు తెరచిన ఒక మానవుడు సవ్యమైన ఆలోచనా, సరియైన దృష్టీ కలవాడు, అయితే అతడు సృష్టి సూచనలను చూసి వాటిని గురించి సరియైన రీతిలో ఆలోచించి, సత్య విషయాన్ని తెలుసుకోవటంలో ఏ విధంగా సఫలుడు కాగలడో చెప్పబడింది.

20. అసలు 'తజక్కుర్' అనే పదం వాడబడింది. దాని యొక్క సరియైన భావం ఏమిటంటే, అశ్రద్ధకూ, మరపునకూ లోనైన వ్యక్తి హఠాత్తుగా తాను అశ్రద్ధ చేస్తూ వచ్చిన విషయాన్ని జ్ఞాపకం చేసుకోవటం. ఇందుకని మేము "అఫలా తతజక్కరూన్"ను పైవిధంగా అనువాదం చేశాము.

21. ఇక్కడ ప్రవక్తలకు మూడు వస్తువులు ప్రసాదించబడే విషయం ప్రస్తావించబడింది. ఒకటి, గ్రంథం అంటే అల్లాహ్ యొక్క మార్గదర్శక పత్రం. రెండు, ఆజ్ఞ, అంటే ఈ మార్గదర్శక పత్రానికి సంబంధించిన సరియైన అవగాహన, దాని సూత్రాలను జీవిత వ్యవహారాలకు వర్తింపజేసే నేర్పు, జీవిత సమస్యల విషయంలో నిశ్చితమైన అభిప్రాయానికి వచ్చే దైవదత్తమైన సామర్థ్యం, మూడు, ప్రవక్త పదవి, అంటే, అతడు ఈ మార్గదర్శక పత్రానికి అనుగుణంగా మానవులకు మార్గం చూపటం.

22. ఈ జవాబు యూదులకు ఇవ్వబడుతోంది కాబట్టి, మూసా (అస్సలామ్)పై తౌరాతు గ్రంథ అవతరణను నిదర్శనంగా చూపటం జరిగింది. ఎందుకంటే, స్వయంగా వారే దానిని నమ్మేవారు. మూసా (అస్సలామ్)పై తౌరాతు గ్రంథం అవతరించిందని వారు నమ్మటం స్వయంగా వారు, దేవుడు ఏ మానవుడిపైనా ఏదీ అవతరింపజెయ్యలేదు అని ప్రకటించిన దానిని ఖండిస్తుంది. ఇంకా దీనిద్వారా, కనీసం మానవుడిమీద గ్రంథం అవతరించగలదు, అవతరించింది కూడా అనే విషయం నిరూపితం అయింది.

وَمَنْ اَظْلَمُ مِمَّنِ افْتَرٰی عَلَی اللّٰهِ كَذِبًا اَوْ
قَالَ اُوْحِیَ اِلَیَّ وَ لَمْ یُوْحَ اِلَیْهِ شَیْءٌ وَّ مَنْ
قَالَ سَاُنْزِلُ مِثْلَ مَاۤ اَنْزَلَ اللّٰهُ ؕ وَ لَوْ
تَرٰۤی اِذِ الظّٰلِمُوْنَ فِیْ غَمَرٰتِ الْمَوْتِ وَ الْمَلٰٓىِٕكَةُ
بَاسِطُوْۤا اَیْدِیْهِمْ ۚ اَخْرِجُوْۤا اَنْفُسَكُمْ ؕ اَلْیَوْمَ
تُجْزَوْنَ عَذَابَ الْهُوْنِ بِمَا كُنْتُمْ تَقُوْلُوْنَ عَلَی
اللّٰهِ غَیْرَ الْحَقِّ وَكُنْتُمْ عَنْ اٰیٰتِهٖ
تَسْتَكْبِرُوْنَ ﴿۹۳﴾ وَ لَقَدْ جِئْتُمُوْنَا فُرَادٰی كَمَا
خَلَقْنٰكُمْ اَوَّلَ مَرَّةٍ وَّ تَرَكْتُمْ مَّا خَوَّلْنٰكُمْ
وَرَآءَ ظُهُوْرِكُمْ ۚ وَمَا نَرٰی مَعَكُمْ شُفَعَآءَكُمُ
الَّذِیْنَ زَعَمْتُمْ اَنَّهُمْ فِیْكُمْ شُرَكٰٓؤُا ؕ لَقَدْ
تَّقَطَّعَ بَیْنَكُمْ وَ ضَلَّ عَنْكُمْ مَّا كُنْتُمْ
تَزْعُمُوْنَ ﴿۹۴﴾ اِنَّ اللّٰهَ فَالِقُ الْحَبِّ وَ النَّوٰی ؕ
یُخْرِجُ الْحَیَّ مِنَ الْمَیِّتِ وَ مُخْرِجُ الْمَیِّتِ مِنَ
الْحَیِّ ؕ ذٰلِكُمُ اللّٰهُ فَاَنّٰی تُؤْفَكُوْنَ ﴿۹۵﴾ فَالِقُ
الْاِصْبَاحِ ۚ وَ جَعَلَ الَّیْلَ سَكَنًا وَّالشَّمْسَ وَ
الْقَمَرَ حُسْبَانًا ؕ ذٰلِكَ تَقْدِیْرُ الْعَزِیْزِ الْعَلِیْمِ ﴿۹۶﴾

అబద్ధపు అపనిందను సృష్టించి అల్లాహ్‌పై మోపే వాడికంటే, తనపై ఏ వహీ అవతరించకపోయినప్పటికీ "నాపై వహీ అవతరించింది" అని చెప్పేవాడి కంటే లేదా అల్లాహ్ అవతరింపచేసినటువంటి విషయాలనే "నేను కూడా అవతరింపచేసి చూపిస్తాను" అని పలికేవాడికంటే మించిన దుర్మార్గుడు ఎవడు? ఈ దుర్మార్గులు మరణవేదనలో మునిగి తేలుతూ ఉండగా, దైవదూతలు తమ హస్తాలను చాచి "ఇటు తెండి! బయటకు తీయండి మీ ప్రాణాలను, అల్లాహ్‌పై అపనిందను మోపి అన్యాయంగా కూసిన కూతలకూ, ఆయన ఆయతుల పట్ల తలబిరుసుతనం ప్రదర్శించినందుకూ ఫలితంగా ఈ రోజు మీకు అవమానకరమైన శిక్ష విధించబడుతుంది" అని అంటూ ఉండగా ఆ దృశ్యాన్ని నీవు చూడగలిగితే ఎంత బాగుంటుంది! (అప్పుడు అల్లాహ్ ఇలా సెలవిస్తాడు): "మేము మొదటి సారి మిమ్మల్ని ఒంటరిగా సృష్టించినట్లే ఇప్పుడు ఇదిగో మీరు ఒంటరిగా మాముందు హాజరయ్యారు. మేము ప్రపంచంలో మీకు ఇచ్చినదంతా, మీరు అక్కడే వదలిపెట్టి వచ్చారు. ఇప్పుడు మీ వెంట మీ పనులు నెరవేరడంలో కొంత పాత్ర ఉందని మీరు భావించిన మీ సిఫారసుదారులను కూడా మేము చూడటం లేదు. ఇప్పుడు మీ మధ్య సంబంధాలు అన్నీ తెగి పోయాయి. ఎవరిని గురించి మీరు గర్వపడేవారో వారందరూ మీకు కనుమరుగై పోయారు."

**95 - 103** విత్తనాన్నీ, టెంకనూ చీల్చేవాడు అల్లాహ్.[23] ఆయనే సజీవమైన దానిని నిర్జీవమైన దానినుండి తీస్తాడు.[24] ఇంకా నిర్జీవమైన దానిని సజీవమైన దానినుండి విసర్జింపచేసే వాడూ ఆయనే. ఈ పనులన్నీ చేసేవాడు అల్లాహ్‌యే. అటువంటప్పుడు మీరు మార్గంతప్పి ఎటు కొట్టుకుపోతున్నారు? రాత్రి తెరను చీల్చి ఆయనే ప్రభాతాన్ని వెలికితీస్తాడు. ఆయనే రాత్రిని ప్రశాంతి సమయంగా చేశాడు. ఆయనే సూర్యచంద్రుల ఉదయాస్తమయాల కాలాలను నిర్ణయించాడు. ఇవన్నీ ఆ అపూర్వ శక్తిమంతుడు, జ్ఞాన సంపన్నుడు చేసిన నిర్ణయాలే.

23. అంటే, నేల పొరలలో విత్తనాన్ని చీల్చి దాని నుండి చెట్టు యొక్క అంకురాన్ని తీసేవాడు.

وَ هُوَ الَّذِیۡ جَعَلَ لَکُمُ النُّجُوۡمَ لِتَهۡتَدُوۡا بِهَا
فِیۡ ظُلُمٰتِ الۡبَرِّ وَ الۡبَحۡرِ ؕ قَدۡ فَصَّلۡنَا الۡاٰیٰتِ
لِقَوۡمٍ یَّعۡلَمُوۡنَ ﴿۹۷﴾ وَ هُوَ الَّذِیۡۤ اَنۡشَاَکُمۡ مِّنۡ
نَّفۡسٍ وَّاحِدَۃٍ فَمُسۡتَقَرٌّ وَّ مُسۡتَوۡدَعٌ ؕ قَدۡ
فَصَّلۡنَا الۡاٰیٰتِ لِقَوۡمٍ یَّفۡقَهُوۡنَ ﴿۹۸﴾ وَ هُوَ الَّذِیۡۤ
اَنۡزَلَ مِنَ السَّمَآءِ مَآءً ۚ فَاَخۡرَجۡنَا بِهٖ نَبَاتَ
کُلِّ شَیۡءٍ فَاَخۡرَجۡنَا مِنۡهُ خَضِرًا نُّخۡرِجُ مِنۡهُ
حَبًّا مُّتَرَاکِبًا ۚ وَ مِنَ النَّخۡلِ مِنۡ طَلۡعِهَا
قِنۡوَانٌ دَانِیَۃٌ وَّ جَنّٰتٍ مِّنۡ اَعۡنَابٍ وَّالزَّیۡتُوۡنَ
وَالرُّمَّانَ مُشۡتَبِهًا وَّ غَیۡرَ مُتَشَابِهٍ ؕ اُنۡظُرُوۡۤا
اِلٰی ثَمَرِهٖۤ اِذَاۤ اَثۡمَرَ وَ یَنۡعِهٖ ؕ اِنَّ فِیۡ ذٰلِکُمۡ
لَاٰیٰتٍ لِّقَوۡمٍ یُّؤۡمِنُوۡنَ ﴿۹۹﴾ وَ جَعَلُوۡا لِلّٰهِ شُرَکَآءَ
الۡجِنَّ وَ خَلَقَهُمۡ وَ خَرَقُوۡا لَهٗ بَنِیۡنَ وَ بَنٰتٍۭ
بِغَیۡرِ عِلۡمٍ ؕ سُبۡحٰنَهٗ وَ تَعٰلٰی عَمَّا یَصِفُوۡنَ ﴿۱۰۰﴾ ع ۱۲ ۱۸
بَدِیۡعُ السَّمٰوٰتِ وَ الۡاَرۡضِ ؕ اَنّٰی یَکُوۡنُ لَهٗ
وَلَدٌ وَّ لَمۡ تَکُنۡ لَّهٗ صَاحِبَۃٌ ؕ وَ خَلَقَ کُلَّ
شَیۡءٍ ۚ وَ هُوَ بِکُلِّ شَیۡءٍ عَلِیۡمٌ ﴿۱۰۱﴾ ذٰلِکُمُ اللّٰهُ
رَبُّکُمۡ ۚ لَاۤ اِلٰهَ اِلَّا هُوَ ۚ خَالِقُ کُلِّ شَیۡءٍ
فَاعۡبُدُوۡهُ ۚ وَ هُوَ عَلٰی کُلِّ شَیۡءٍ وَّکِیۡلٌ ﴿۱۰۲﴾ لَا
تُدۡرِکُهُ الۡاَبۡصَارُ ۫ وَ هُوَ یُدۡرِکُ الۡاَبۡصَارَ ۚ
وَ هُوَ اللَّطِیۡفُ الۡخَبِیۡرُ ﴿۱۰۳﴾ قَدۡ جَآءَکُمۡ بَصَآئِرُ
مِنۡ رَّبِّکُمۡ ۚ فَمَنۡ اَبۡصَرَ فَلِنَفۡسِهٖ ۚ وَ مَنۡ عَمِیَ
فَعَلَیۡهَا ؕ وَ مَاۤ اَنَا عَلَیۡکُمۡ بِحَفِیۡظٍ ﴿۱۰۴﴾

ఆయనే నక్షత్రాలను మీ కొరకు ఎడారి చీకటిలో, సముద్రపు చీకట్లలో మార్గాన్ని తెలుసుకునే సాధనంగా చేశాడు. చూడండి, మేము జ్ఞానవంతుల కొరకు సూచనలను[25] విశదీకరించాము. ఆయనే మిమ్మల్ని ఒకే ప్రాణినుండి పుట్టించాడు. ఇంకా ప్రతి ఒక్కరికీ ఒక నివాస స్థలం ఉంది. అప్పగించబడే ఒక స్థలం ఉంది. విజ్ఞత ఉన్నవారి కొరకు మేము ఈ సూచనలను స్పష్టపరిచాము. ఆయనే ఆకాశంనుండి వర్షాన్ని కురిపించాడు. దానిద్వారా సకల వృక్ష జాతులను ఉద్భవింపజేశాడు. ఇంకా పచ్చని పొలాలనూ పచ్చని చెట్లనూ సృష్టించాడు. ఒకదానిపై ఒకటి ఒత్తుగా పెరిగిన గింజలను పండించాడు. ఖర్జూరపు పువ్వుల నుండి బరువుతో వంగిన పండ్ల గుత్తులను సృజించాడు. ఇంకా ద్రాక్ష, జైతూను, దానిమ్మ తోటలను సృష్టించాడు. వాటి పండ్లు ఒకదానినొకటి పోలివుండినప్పటికీ ప్రతిదాని ప్రత్యేకతలు వేర్వేరుగా కూడా ఉంటాయి. ఈ వృక్షాలు పంటకు వచ్చినప్పుడు, వాటికి పండ్లు కాయటం, అవి పండటం- ఈ స్థితిని మీరు కొంచెం ఆలోచనా దృష్టితో గమనించండి. విశ్వసించే వారికి వీటిలో సూచనలు ఉన్నాయి. అయినా ప్రజలు జిన్నాతులను అల్లాహ్‌కు భాగస్వాములుగా నిలబెట్టారు.[26] వాస్తవానికి ఆయన వాటి సృష్టికర్త. తెలియక పోయినా వారు ఆయనకు కొడుకులను, కూతుళ్లను కల్పించారు. యథార్థానికి ఆయన అత్యంత పరిశుద్ధుడు, వారు చెప్పే ఈ మాటలకు అతీతుడు. ఆయన ఆకాశాలను, భూమినీ ప్రభవింపజేసినవాడు. ఆయనకు ఒక జీవిత సహచరి అంటూ లేనప్పుడు ఆయనకు కొడుకు ఎలా ఉంటాడు? ఆయన ప్రతి వస్తువును పుట్టించాడు. ఆయనకు ప్రతి వస్తువును గురించీ తెలుసు. ఆయనే అల్లాహ్. మీ ప్రభువు. ఆయన తప్ప మరొక దేవుడు లేడు. ఆయన సర్వానికీ సృష్టికర్త. కనుక మీరు ఆయననే ఆరాధించండి. ఆయన ప్రతిదానికీ సంరక్షకుడు. చూపులు ఆయనను అందుకోలేవు. ఆయన చూపులను అందుకుంటాడు. ఆయన సూక్ష్మద్రష్ట, సర్వజ్ఞాని.

**104** చూడండి! మీ వద్దకు మీ ప్రభువు తరఫు నుండి వివేచనా కాంతులు వచ్చేశాయి. కనుక ఇక దృష్టిని వినియోగించుకునే వ్యక్తి తనకు తానే మేలు చేసుకుంటాడు. మరి గ్రుడ్డిగా వ్యవహరించే వ్యక్తి తానే నష్టపోతాడు. నేను మాత్రం మీకు కావలివాణ్ణి కాను.[27]

وَكَذٰلِكَ نُصَرِّفُ الْاٰيٰتِ وَلِيَقُوْلُوْا دَرَسْتَ
وَلِنُبَيِّنَهٗ لِقَوْمٍ يَّعْلَمُوْنَ ﴿١٠٥﴾ اِتَّبِعْ مَاۤ اُوْحِيَ
اِلَيْكَ مِنْ رَّبِّكَ ۚ لَاۤ اِلٰهَ اِلَّا هُوَ ۚ وَاَعْرِضْ
عَنِ الْمُشْرِكِيْنَ ﴿١٠٦﴾ وَلَوْ شَآءَ اللّٰهُ مَاۤ
اَشْرَكُوْا ؕ وَمَا جَعَلْنٰكَ عَلَيْهِمْ حَفِيْظًا ۚ وَمَاۤ
اَنْتَ عَلَيْهِمْ بِوَكِيْلٍ ﴿١٠٧﴾ وَلَا تَسُبُّوا الَّذِيْنَ
يَدْعُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ فَيَسُبُّوا اللّٰهَ عَدْوًاۢ بِغَيْرِ
عِلْمٍ ؕ كَذٰلِكَ زَيَّنَّا لِكُلِّ اُمَّةٍ عَمَلَهُمْ ۠ ثُمَّ
اِلٰى رَبِّهِمْ مَّرْجِعُهُمْ فَيُنَبِّئُهُمْ بِمَا كَانُوْا
يَعْمَلُوْنَ ﴿١٠٨﴾ وَاَقْسَمُوْا بِاللّٰهِ جَهْدَ اَيْمَانِهِمْ
لَئِنْ جَآءَتْهُمْ اٰيَةٌ لَّيُؤْمِنُنَّ بِهَا ؕ قُلْ اِنَّمَا
الْاٰيٰتُ عِنْدَ اللّٰهِ وَمَا يُشْعِرُكُمْ ۙ اَنَّهَاۤ اِذَا
جَآءَتْ لَا يُؤْمِنُوْنَ ﴿١٠٩﴾ وَنُقَلِّبُ اَفْـِٕدَتَهُمْ
وَاَبْصَارَهُمْ كَمَا لَمْ يُؤْمِنُوْا بِهٖۤ اَوَّلَ مَرَّةٍ
وَّنَذَرُهُمْ فِيْ طُغْيَانِهِمْ يَعْمَهُوْنَ ﴿١١٠﴾ ع ١٣ ١٩ | الجزء ٨
وَلَوْ اَنَّنَا نَزَّلْنَاۤ اِلَيْهِمُ الْمَلٰٓئِكَةَ وَكَلَّمَهُمُ
الْمَوْتٰى وَحَشَرْنَا عَلَيْهِمْ كُلَّ شَيْءٍ قُبُلًا مَّا
كَانُوْا لِيُؤْمِنُوْۤا اِلَّاۤ اَنْ يَّشَآءَ اللّٰهُ وَلٰكِنَّ
اَكْثَرَهُمْ يَجْهَلُوْنَ ﴿١١١﴾

**105 - 108** ఈ విధంగా మేము మా ఆయతులను మాటి మాటికీ విభిన్న రీతులలో వివరిస్తూ ఉంటాము. ఎందుకిలా చేస్తామంటే, ఈ ప్రజలు, "నీవు ఎవరివద్దనో పాఠాలు నేర్చుకుని వచ్చావు" అని అనాలని, ఇంకా మేము విజ్ఞులైన వారికి యథార్థాన్ని విశదపరచాలని. ప్రవక్తా! నీపై నీ ప్రభువు తరఫు నుండి అవతరించిన 'వహీ'ని అనుసరిస్తూ ఉండు. ఎందుకంటే, ఆ ప్రభువు ఒక్కడు తప్ప మరొక దేవుడు లేనేలేడు. ఈ ముష్రిక్కులను పట్టించుకోకు. అల్లాహ్ సంకల్పించి ఉన్నట్లయితే, (స్వయంగా ఆయనే ఏ ఏర్పాటుచేసి ఉండే వాడంటే) వారు షిర్కు చేసేవారు కాదు. మేము నిన్ను వారికి కావలి వానిగా నియమించనూ లేదు, నీవు వారికి బాధ్యుడవూ కావు. (ముస్లిములారా!) వారు అల్లాహ్‌ను కాదని వేడుకునే ఇతరు లను దూషించకండి. ఎందుకంటే, వారు షిర్కుకంటే ఇంకా ముందుకు పోయి అజ్ఞానంచేత అల్లాహ్‌ను దూషిస్తారేమో. ఈ విధంగానే మేము ప్రతి వర్గం వారికి వారు చేసే పనులు ఆకర్షకంగా ఉండేలా చేశాము. వారు తరువాత తమ ప్రభువు వైపునకే మరలి రావలసి ఉంది. అప్పుడు ఆయన వారికి తెలుపుతాడు, వారు ఏమేమి చేస్తూ ఉండేవారో.

**109 - 115** ఈ ప్రజలు గట్టి ప్రమాణాలు చేస్తూ ఇలా అంటారు: "మా ముందుకు ఏదైనా సూచన (అంటే ఒక అద్భుతం) వస్తే, మేము దానిని తప్పక విశ్వసిస్తాము." ప్రవక్తా! వారికి చెప్పు: "సూచనలు అల్లాహ్ వశంలోనే ఉన్నాయి" అని. ఒకవేళ సూచనలు వచ్చినా, వారు విశ్వసించేవారు కారు అని నీకు ఎలా బోధపరచాలి?[28] మొట్టమొదట వారు దానిని (ఈ గ్రంథాన్ని) విశ్వసించని విధంగానే మేము వారి హృదయా లను, వారి చూపులను ఇప్పుడు మళ్ళిస్తున్నాము, మేము వారిని తమ తలబిరుసుతనంలోనే దారితప్పి తిరిగేలా వదలివేస్తాము. మేము వారిపై దైవదూతలను సైతం అవతరింపజేసినా, మరణించినవారు వారితో మాట్లాడినా, మేము వారి కళ్ళ ముందు ప్రపంచంలోని వస్తువులు ఎన్నింటిని ప్రోగుజేసి పెట్టినా, అప్పుడు కూడా వారు విశ్వసించేవారు కాదు, (వారు విశ్వసించాలని) అల్లాహ్ సంకల్పిస్తే తప్ప. కాని వారిలో చాలా మంది అజ్ఞానపు మాటలు పలుకుతారు.

وَ كَذٰلِكَ جَعَلْنَا لِكُلِّ نَبِيٍّ عَدُوًّا شَيٰطِيْنَ
الْاِنْسِ وَ الْجِنِّ يُوْحِيْ بَعْضُهُمْ اِلٰى بَعْضٍ
زُخْرُفَ الْقَوْلِ غُرُوْرًا ؕ وَ لَوْ شَآءَ رَبُّكَ مَا
فَعَلُوْهُ فَذَرْهُمْ وَ مَا يَفْتَرُوْنَ ﴿۱۱۲﴾ وَ لِتَصْغٰۤى
اِلَيْهِ اَفْـِٕدَةُ الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ وَ
لِيَرْضَوْهُ وَ لِيَقْتَرِفُوْا مَا هُمْ مُّقْتَرِفُوْنَ ﴿۱۱۳﴾
اَفَغَيْرَ اللّٰهِ اَبْتَغِيْ حَكَمًا وَّ هُوَ الَّذِيْۤ اَنْزَلَ
اِلَيْكُمُ الْكِتٰبَ مُفَصَّلًا ؕ وَ الَّذِيْنَ اٰتَيْنٰهُمُ
الْكِتٰبَ يَعْلَمُوْنَ اَنَّهٗ مُنَزَّلٌ مِّنْ رَّبِّكَ بِالْحَقِّ
فَلَا تَكُوْنَنَّ مِنَ الْمُمْتَرِيْنَ ﴿۱۱۴﴾ وَ تَمَّتْ كَلِمَتُ
رَبِّكَ صِدْقًا وَّ عَدْلًا ؕ لَا مُبَدِّلَ لِكَلِمٰتِهٖ ۚ وَ
هُوَ السَّمِيْعُ الْعَلِيْمُ ﴿۱۱۵﴾

మేము ఇదే విధంగా ఎల్లప్పుడూ మానవ షైతానులను జిన్నాతు షైతానులను ప్రతి ప్రవక్తకు శత్రువులుగా చేశాము. ప్రజలను వంచించే నిమిత్తం వారు సొంపైన మాటలను పరస్పరం ప్రేరేపించుకుంటారు. వారు ఈ విధంగా చెయ్యకూడదని నీ ప్రభువు సంకల్పమేఅయితే, వారు ఎన్నటికీ అలా చెయ్యరు. కనుక వారిని వారి మానాన వదలిపెట్టు, అబద్ధపు నిందా రోపణలు చేయటానికి. (మేము వారిని ఇదంతా ఎందుకు చెయ్యనిస్తున్నా మంటే) పరలోకాన్ని విశ్వసించని వారి హృదయాలు ఆ (అందమైన మోసం) వైపునకు మొగ్గాలని, వారు అదంటే ఇష్టపడాలని, వారు తాము ఆర్జించు కోదలచిన చెడులను ఆర్జించుకోవాలని[29] - పరిస్థితి ఇదైనప్పుడు నేను అల్లాహ్‌ను కాదని తీర్పు చెప్పే మరొకడికోసం అన్వేషించాలా, వాస్తవానికి ఆయన పూర్తి వివరాలతో మీ వద్దకు గ్రంథాన్ని పంపినప్పుడు?[30] మేము (నీకు పూర్వం) గ్రంథం ఇచ్చిన వారికి తెలుసు, ఈ గ్రంథం నీ ప్రభువు తరఫునుండే సత్యం ఆధారంగా అవతరించిందని. కనుక నీవు శంకించే వారిలో చేరిపోకు. సత్యం రీత్యా న్యాయం రీత్యా నీ ప్రభువు వాక్కు పరిపూర్ణ మైనది. ఆయన ఆదేశాలను మార్చేవాడు ఎవడూ లేదు. ఆయన అన్నీ వింటాడు. ఆయనకు అంతా తెలుసు.

24. సజీవమైన దానిని నిర్జీవమైన దానినుండి తియ్యటం అంటే భావం, ప్రాణం లేని పదార్థం నుండి ప్రాణం ఉన్న జీవులను పుట్టించటం. ఇంకా నిర్జీవమైనదానిని సజీవమైన దాని నుండి విసర్జింపజెయ్యటం అంటే భావం, ప్రాణం ఉన్న శరీరాల నుండి ప్రాణం లేని పదార్థాలను విసర్జింపజెయ్యటం.

25. అంటే, ఈ యథార్థం యొక్క సూచనలు : దేవుడు కేవలం ఒక్కడే. దైవత్వపు గుణవిశేషాలు కలవాడూ, దైవత్వపు అధికారాలలో భాగస్వామీ, దైవత్వపు హక్కులలో ఏదైనా హక్కుకు అర్హుడైన వాడూ మరొకడెవడూ లేడు.

26. అంటే, తమ భ్రమా, అనుమానాల ఆధారంగా సృష్టి నిర్వహణలో మానవుడి అదృష్ట దురదృష్టాల విషయంలో అల్లాహ్‌తో పాటు ఇతర అదృశ్య శక్తులకు కూడా పాత్ర ఉందని వారు తీర్మానించారు. వర్షాన్ని కురిపించే దేవుడొకడు, చెట్లూ చేమలను పుట్టించే దేవుడొకడు. ఒకామె ధనానికి దేవి. మరొకామె రోగానికి దేవత. ఈ రకమైన మూఢ విశ్వాసాలు ప్రపంచంలోని అన్ని ముష్రిక్కు జాతులలో ప్రేతాత్మలు, భూతాత్మలు, షైతానులు, రాక్షసులు, దేవతలు, దేవీలను గురించినవి ఉన్నాయి.

27. ఈ వాక్యం అల్లాహ్ చెప్పినదే, కాని ప్రవక్త ద్వారా చెప్పబడుతోంది. ఫాతిహా సూరా మాదిరిగా అది అల్లాహ్ మాటే, కాని అది దాసుని నోటిద్వారా పలుకబడుతోంది. "నేను మాత్రం మీకు కావలివాణ్ణి కాను" అంటే, నా పని కేవలం, ఈ కాంతిని మీ ముందు ఉంచటమే. దాని తరువాత కళ్ళు తెరచి చూడటం, చూడకపోవటం అనేది మీ పని. స్వయంగా కళ్ళు మూసుకున్న వారి కళ్ళను బలవంతంగా తెరవటం, వారు చూడనిదానిని వారికి చూపించి తీరటం అనే సేవలు నాకు అప్పగించబడలేదు.

28. ఈ ఉపన్యాసం ముస్లిములనుద్దేశించి చెయ్యబడింది. మార్గభ్రష్టులైపోయిన తమ సోదరులు రుజుమార్గంపైకి రావటానికి ఏదో ఒక సూచన కనిపించాలని వారు అసహనంతో కోరుతూ ఉండేవారు.

وَ اِنْ تُطِعْ اَكْثَرَ مَنْ فِي الْاَرْضِ يُضِلُّوْكَ
عَنْ سَبِيْلِ اللّٰهِ ؕ اِنْ يَّتَّبِعُوْنَ اِلَّا الظَّنَّ وَ
اِنْ هُمْ اِلَّا يَخْرُصُوْنَ ﴿۱۱۶﴾ اِنَّ رَبَّكَ هُوَ اَعْلَمُ
مَنْ يَّضِلُّ عَنْ سَبِيْلِهٖ ۚ وَ هُوَ اَعْلَمُ
بِالْمُهْتَدِيْنَ ﴿۱۱۷﴾ فَكُلُوْا مِمَّا ذُكِرَ اسْمُ اللّٰهِ عَلَيْهِ
اِنْ كُنْتُمْ بِاٰيٰتِهٖ مُؤْمِنِيْنَ ﴿۱۱۸﴾ وَ مَا لَكُمْ اَلَّا
تَاْكُلُوْا مِمَّا ذُكِرَ اسْمُ اللّٰهِ عَلَيْهِ وَ قَدْ فَصَّلَ
لَكُمْ مَّا حَرَّمَ عَلَيْكُمْ اِلَّا مَا اضْطُرِرْتُمْ
اِلَيْهِ ؕ وَ اِنَّ كَثِيْرًا لَّيُضِلُّوْنَ بِاَهْوَآئِهِمْ
بِغَيْرِ عِلْمٍ ؕ اِنَّ رَبَّكَ هُوَ اَعْلَمُ بِالْمُعْتَدِيْنَ ﴿۱۱۹﴾
وَ ذَرُوْا ظَاهِرَ الْاِثْمِ وَ بَاطِنَهٗ ؕ اِنَّ الَّذِيْنَ
يَكْسِبُوْنَ الْاِثْمَ سَيُجْزَوْنَ بِمَا كَانُوْا
يَقْتَرِفُوْنَ ﴿۱۲۰﴾ وَ لَا تَاْكُلُوْا مِمَّا لَمْ يُذْكَرِ اسْمُ
اللّٰهِ عَلَيْهِ وَ اِنَّهٗ لَفِسْقٌ ؕ وَ اِنَّ الشَّيٰطِيْنَ
لَيُوْحُوْنَ اِلٰٓى اَوْلِيٰٓئِهِمْ لِيُجَادِلُوْكُمْ ۚ وَ اِنْ
اَطَعْتُمُوْهُمْ اِنَّكُمْ لَمُشْرِكُوْنَ ﴿۱۲۱﴾ اَوَ مَنْ كَانَ ع ۱۴
مَيْتًا فَاَحْيَيْنٰهُ وَ جَعَلْنَا لَهٗ نُوْرًا يَّمْشِيْ بِهٖ
فِي النَّاسِ كَمَنْ مَّثَلُهٗ فِي الظُّلُمٰتِ لَيْسَ
بِخَارِجٍ مِّنْهَا ؕ كَذٰلِكَ زُيِّنَ لِلْكٰفِرِيْنَ مَا
كَانُوْا يَعْمَلُوْنَ ﴿۱۲۲﴾ وَ كَذٰلِكَ جَعَلْنَا فِيْ كُلِّ
قَرْيَةٍ اَكٰبِرَ مُجْرِمِيْهَا لِيَمْكُرُوْا فِيْهَا ؕ وَ مَا
يَمْكُرُوْنَ اِلَّا بِاَنْفُسِهِمْ وَ مَا يَشْعُرُوْنَ ﴿۱۲۳﴾

**116 - 117** ప్రవక్తా! ఒకవేళ పుడమిపై నివసించే ప్రజలలో అధిక సంఖ్యాకులు చెప్పినట్లుగా నీవు నడిస్తే, వారు నిన్ను అల్లాహ్ మార్గంనుండి తొలగిస్తారు. వారు కేవలం అంచనాలను అనుసరిస్తారు, ఊహా కల్పనలు చేస్తారు, వాస్తవానికి నీ ప్రభువుకే బాగా తెలుసు, ఎవరు ఆయన మార్గం నుండి వైదొలగి ఉన్నారో, ఎవరు రుజుమార్గంపై ఉన్నారో.

**118 - 121** ఇక మీకు అల్లాహ్ ఆయతులపై విశ్వాసమే ఉంటే, అల్లాహ్ నామం స్మరించబడిన పశువు మాంసం తినండి. అల్లాహ్ పేరు స్మరించబడిన వస్తువును మీరు తినక పోవటానికి అసలు కారణం ఏమిటి? వాస్తవానికి గత్యంతరం లేని సంకట పరిస్థితులలో తప్ప, మిగతా అన్ని పరిస్థితులలోనూ అల్లాహ్ ఏ వస్తువుల వినియోగాన్ని నిషేధించాడో, వాటి వివరాలను మీకు ఆయన ఇదివరకే తెలియజేశాడు. చాలా మంది ప్రజలు జ్ఞానం లేకపోయినా కేవలం తమ కోరికలకు లోనయి అపమార్గం పట్టించే విషయాలను మాట్లాడుతూ ఉంటారు. ఈ హద్దులు మీరే వారిని నీ ప్రభువు బాగా ఎరుగును. మీరు బహిరంగ పాపాలకూ దూరంగా ఉండండి. రహస్య పాపాలకూ దూరంగా ఉండండి. పాపాలను సంపాదించుకునే వారు తమ ఈ సంపాదనకు ప్రతిఫలం పొంది తీరుతారు. అల్లాహ్ పేరుతో 'జిబహ్' చెయ్యబడని జంతువు మాంసం తినకండి. అలా చెయ్యటం పాపం. మీతో కయ్యానికి దిగటానికిగాను షైతానులు తమ సహచరుల మనస్సులలో అనుమానాలను, అభ్యంతరాలను ప్రేరేపిస్తారు. కాని ఒకవేళ మీరు వారిపట్ల విధేయత చూపటానికి అంగీకరిస్తే నిశ్చయంగా మీరూ ముష్రిక్కులే.

**122 - 123** మొదట మృతుడై, మేము ప్రాణంపోసి జ్యోతిని ప్రసాదించగా, దాని వెలుగులో ప్రజల మధ్య జీవన యాత్ర కొనసాగించే వ్యక్తీ, చీకట్లలో కూరుకుపోయి వాటి నుండి ఏవిధంగానూ బయటకు రాలేని వ్యక్తీ ఒకటే అవుతారా?[31] ఇదేవిధంగా అవిశ్వాసులకు వారి పనులు మనోహరమైనవిగా చెయ్యబడ్డాయి. ఇంకా ఇదేవిధంగా మేము ప్రతి పట్టణం లోనూ దానిలో ఉన్న పెద్దపెద్ద నేరస్తులను అక్కడ తమ కుతంత్రాలు, వంచనలు అనే వలను పరచటానికి నియమించాము. వాస్తవానికి వారు తమ కుతంత్రాల వలలో తామే ఇరుక్కుంటారు. కాని వారికి దాని స్పృహలేదు.

وَ اِذَا جَآءَتۡهُمۡ اٰیَةٌ قَالُوۡا لَنۡ نُّؤۡمِنَ حَتّٰی نُؤۡتٰی
مِثۡلَ مَاۤ اُوۡتِیَ رُسُلُ اللّٰهِ ؕۘ اَللّٰهُ اَعۡلَمُ حَیۡثُ وقف لازم
یَجۡعَلُ رِسَالَتَهٗ ؕ سَیُصِیۡبُ الَّذِیۡنَ اَجۡرَمُوۡا
صَغَارٌ عِنۡدَ اللّٰهِ وَ عَذَابٌ شَدِیۡدٌۢ بِمَا كَانُوۡا
یَمۡكُرُوۡنَ ﴿۱۲۴﴾ فَمَنۡ یُّرِدِ اللّٰهُ اَنۡ یَّهۡدِیَهٗ یَشۡرَحۡ
صَدۡرَهٗ لِلۡاِسۡلَامِ ۚ وَ مَنۡ یُّرِدۡ اَنۡ یُّضِلَّهٗ
یَجۡعَلۡ صَدۡرَهٗ ضَیِّقًا حَرَجًا كَاَنَّمَا یَصَّعَّدُ
فِی السَّمَآءِ ؕ كَذٰلِكَ یَجۡعَلُ اللّٰهُ الرِّجۡسَ عَلَی
الَّذِیۡنَ لَا یُؤۡمِنُوۡنَ ﴿۱۲۵﴾ وَ هٰذَا صِرَاطُ رَبِّكَ
مُسۡتَقِیۡمًا ؕ قَدۡ فَصَّلۡنَا الۡاٰیٰتِ لِقَوۡمٍ
یَّذَّكَّرُوۡنَ ﴿۱۲۶﴾ لَهُمۡ دَارُ السَّلٰمِ عِنۡدَ رَبِّهِمۡ وَهُوَ
وَلِیُّهُمۡ بِمَا كَانُوۡا یَعۡمَلُوۡنَ ﴿۱۲۷﴾ وَ یَوۡمَ
یَحۡشُرُهُمۡ جَمِیۡعًا ۚ یٰمَعۡشَرَ الۡجِنِّ قَدِ
اسۡتَكۡثَرۡتُمۡ مِّنَ الۡاِنۡسِ ۚ وَ قَالَ اَوۡلِیٰٓؤُهُمۡ
مِّنَ الۡاِنۡسِ رَبَّنَا اسۡتَمۡتَعَ بَعۡضُنَا بِبَعۡضٍ
وَّبَلَغۡنَاۤ اَجَلَنَا الَّذِیۡۤ اَجَّلۡتَ لَنَا ؕ قَالَ النَّارُ
مَثۡوٰىكُمۡ خٰلِدِیۡنَ فِیۡهَاۤ اِلَّا مَا شَآءَ اللّٰهُ ؕ اِنَّ
رَبَّكَ حَكِیۡمٌ عَلِیۡمٌ ﴿۱۲۸﴾ وَكَذٰلِكَ نُوَلِّیۡ بَعۡضَ
الظّٰلِمِیۡنَ بَعۡضًۢا بِمَا كَانُوۡا یَكۡسِبُوۡنَ ﴿۱۲۹﴾ ع ۱۵ ۸ ۲

**124** వారి ముందుకు ఏదైనా ఆయత్ వచ్చినప్పుడు వారు, "అల్లాహ్ ప్రవక్తలకు ఇవ్వబడిందే, స్వయంగా మాకూ ఇవ్వబడనంతవరకు, మేము విశ్వసించము" అని అంటారు. తన సందేశాన్ని ఎవరిద్వారా ప్రచారం చేయించాలో ఎలా చేయించాలో అల్లాహ్‌కే బాగా తెలుసు. ఈ దోషులు తమ కుతంత్రాలకు పర్యవసానంగా అల్లాహ్ వద్ద తీవ్రపరాభవమూ, కఠిన శిక్షా అనుభవించే సమయం సమీపంలోనే ఉంది.

**125 - 127** కనుక (యథార్థం ఇది) అల్లాహ్ తాను సన్మార్గం చూపదలచిన వ్యక్తి హృదయాన్ని ఇస్లామ్ కొరకు తెరుస్తాడు. తాను అపమార్గం పాలు చెయ్యదలచిన వ్యక్తి హృదయాన్ని సంకుచితంచేసి ఇక దానిని ఎంతగా అదుముతాడంటే (ఇస్లామ్ భావన రాగానే) అతనికి తన ఆత్మ ఆకాశానికి ఎగిరిపోతూ ఉన్నట్లు అనిపిస్తుంది. ఈ విధంగా అల్లాహ్ (సత్యం నుండి పారిపోయే, సత్యాన్ని ద్వేషించే మనస్తత్వం అనే) మాలిన్యాన్ని అవిశ్వాసులపై రుద్దుతాడు.[32] వాస్తవానికి ఈ మార్గం నీ ప్రభువు యొక్క రుజుమార్గం. దాని చిహ్నాలు హితబోధను స్వీకరించే వారికొరకు స్పష్టం చెయ్యబడ్డాయి. వారు అవలంబించిన సరియైన ప్రవర్తన కారణంగా వారి ప్రభువు వద్ద వారికొరకు శాంతి నిలయం ఉంది. ఆయన వారికి సంరక్షకుడుగా ఉంటాడు.

**128 - 131** అల్లాహ్ వారందరినీ చుట్టుముట్టి సమావేశపరచే రోజున జిన్నాతులను (అంటే జిన్నాతులలోని షైతానులను) సంబోధిస్తూ ఇలా అంటాడు: "జిన్నాతు వర్గీయులారా! మీరు మానవ జాతిని పూర్తిగా వాడుకున్నారు." మానవులలోని వారి మిత్రులు ఇలా విన్నవించుకుంటారు: "ప్రభూ! మేమంతా ఒకరి నొకరము బాగా వాడుకున్నాము. నీవు మా కొరకు నిర్ణయించిన సమయానికి మేము ఇప్పుడు చేరుకున్నాము." అల్లాహ్ అంటాడు: "సరే! ఇక అగ్నియే మీ నివాసం. అందులో మీరు కలకాలం ఉంటారు." కేవలం అల్లాహ్ రక్షించదలచిన వారే దానినుండి సురక్షితంగా ఉంటారు. నిస్సందేహంగా నీ ప్రభువు వివేకవంతుడు, జ్ఞానవంతుడూను. చూడండి! ఈ విధంగా మేము (పరలోకంలో) దుర్మార్గులను ఒకరికొకరు సహచరులుగా చేస్తాము, వారు (ప్రపంచంలో ఒకరితో ఒకరు కలసి) సంపాదించిన సంపాదనకు కారణంగా.

يٰمَعْشَرَ الْجِنِّ وَ الْاِنْسِ اَلَمْ يَاْتِكُمْ رُسُلٌ
مِّنْكُمْ يَقُصُّوْنَ عَلَيْكُمْ اٰيٰتِيْ وَيُنْذِرُوْنَكُمْ
لِقَآءَ يَوْمِكُمْ هٰذَا ؕ قَالُوْا شَهِدْنَا عَلٰۤى اَنْفُسِنَا
وَ غَرَّتْهُمُ الْحَيٰوةُ الدُّنْيَا وَ شَهِدُوْا عَلٰۤى
اَنْفُسِهِمْ اَنَّهُمْ كَانُوْا كٰفِرِيْنَ ﴿١٣٠﴾ ذٰلِكَ اَنْ لَّمْ
يَكُنْ رَّبُّكَ مُهْلِكَ الْقُرٰى بِظُلْمٍ وَّ اَهْلُهَا
غٰفِلُوْنَ ﴿١٣١﴾ وَ لِكُلٍّ دَرَجٰتٌ مِّمَّا عَمِلُوْا ؕ وَ
مَا رَبُّكَ بِغَافِلٍ عَمَّا يَعْمَلُوْنَ ﴿١٣٢﴾ وَ رَبُّكَ
الْغَنِيُّ ذُو الرَّحْمَةِ ؕ اِنْ يَّشَاْ يُذْهِبْكُمْ وَ
يَسْتَخْلِفْ مِنْۢ بَعْدِكُمْ مَّا يَشَآءُ كَمَآ اَنْشَاَكُمْ
مِّنْ ذُرِّيَّةِ قَوْمٍ اٰخَرِيْنَ ﴿١٣٣﴾ اِنَّ مَا تُوْعَدُوْنَ
لَاٰتٍ ۙ وَّمَاۤ اَنْتُمْ بِمُعْجِزِيْنَ ﴿١٣٤﴾ قُلْ يٰقَوْمِ
اعْمَلُوْا عَلٰى مَكَانَتِكُمْ اِنِّيْ عَامِلٌ ۚ فَسَوْفَ
تَعْلَمُوْنَ ۙ مَنْ تَكُوْنُ لَهٗ عَاقِبَةُ الدَّارِ ؕ اِنَّهٗ
لَا يُفْلِحُ الظّٰلِمُوْنَ ﴿١٣٥﴾ وَ جَعَلُوْا لِلّٰهِ مِمَّا ذَرَاَ
مِنَ الْحَرْثِ وَ الْاَنْعَامِ نَصِيْبًا فَقَالُوْا هٰذَا
لِلّٰهِ بِزَعْمِهِمْ وَهٰذَا لِشُرَكَآئِنَا ۚ فَمَا كَانَ
لِشُرَكَآئِهِمْ فَلَا يَصِلُ اِلَى اللّٰهِ ۚ وَ مَا كَانَ لِلّٰهِ
فَهُوَ يَصِلُ اِلٰى شُرَكَآئِهِمْ ؕ سَآءَ مَا يَحْكُمُوْنَ ﴿١٣٦﴾

(ఈ తరుణంలో అల్లాహ్ వారిని ఇదీ అడుగుతాడు): "జిన్నాతులారా! మానవులారా! మా ఆయతులను మీకు వినిపించే ఈనాటి ఫలితాన్ని గురించి హెచ్చరించే ప్రవక్తలు మీ వద్దకు స్వయంగా మీనుండే రాలేదా?" వారు ఇలా అంటారు: "అవును వచ్చారు. మాకు వ్యతిరేకంగా స్వయంగా మేమే సాక్ష్యమిస్తున్నాము." ఈనాడు ప్రాపంచిక జీవితం వారిని మోసానికి గురిచేసింది. కాని ఆనాడు తాము అవిశ్వాసులమని స్వయంగా వారే తమకు వ్యతిరేకంగా సాక్ష్య మిస్తారు. ప్రజలు యథార్థమేమిటో తెలియని స్థితిలో ఉన్నప్పుడు నీ ప్రభువు వారి పట్టణాలను అన్యాయంగా నాశనం చెయ్యడు. (ఈ విషయాన్ని నిరూపించటానికే వారిచే ఈవిధంగా సాక్ష్యం చెప్పించటం జరుగుతుంది).

**132 - 135** ప్రతి వ్యక్తి స్థానం అతడు చేసే పనులకు అనుగుణంగా ఉంటుంది. నీ ప్రభువు ప్రజల పనులు ఎరుగనివాడు కాడు. నీ ప్రభువు ఏ అక్కరా లేనివాడు. కనికరించటం ఆయన స్వభావం. ఒకవేళ ఆయన అభిలషిస్తే, మిమ్మల్ని తొలగించి, మీ స్థానంలో తాను కోరిన వేరే ప్రజలను తీసుకువస్తాడు, ఆయన మిమ్మల్ని వేరే ప్రజల సంతతి నుండి ఉద్భవింపజేసిన విధంగా. మీకు వాగ్దానం చెయ్యబడుతూ ఉన్న విషయం తప్పకుండా వస్తుంది. దేవుణ్ణి అశక్తుడుగా చేసే శక్తి మీకు లేదు. ప్రవక్తా! ఇలా అను: "ప్రజలారా! మీరు చేసేపని మీరు చేస్తూ ఉండండి. నేను కూడా నా పని చేస్తూ ఉన్నాను. ఫలితం ఎవరి విషయంలో మేలైనదిగా ఉంటుందో త్వరలోనే మీకు తెలిసిపోతుంది." ఏమైనప్పటికీ దుర్మార్గులు సాఫల్యం పొందలేరు అనేది వాస్తవం.

**136** అల్లాహ్ కొరకు ఈ ప్రజలు స్వయంగా ఆయనే సృష్టించిన పొలాల నుండీ పశువుల నుండీ ఒక భాగాన్ని కేటాయించారు. ఇది అల్లాహ్ కొరకు, ఇది మేము నిలబెట్టిన భాగస్వాముల కొరకు అని స్వయంగా తామే తీర్మానించుకుని అంటారు. వారు నిలబెట్టిన భాగస్వాములకు చెందే భాగం అల్లాహ్‌కు ఎలాగూ చేరదు. కాని అల్లాహ్‌కు చెందేది మాత్రం వారు నిలబెట్టిన భాగస్వాములకు చేరిపోతుంది.[33] ఎలాంటి తప్పుడు నిర్ణయాలు చేస్తారు ఈ ప్రజలు!

وَكَذٰلِكَ زَيَّنَ لِكَثِيرٍ مِّنَ الْمُشْرِكِيْنَ قَتْلَ
أَوْلَادِهِمْ شُرَكَآؤُهُمْ لِيُرْدُوْهُمْ وَلِيَلْبِسُوْا
عَلَيْهِمْ دِيْنَهُمْ ۖ وَلَوْ شَآءَ اللّٰهُ مَا فَعَلُوْهُ
فَذَرْهُمْ وَمَا يَفْتَرُوْنَ ﴿١٣٧﴾ وَقَالُوْا هٰذِهٖٓ
أَنْعَامٌ وَّحَرْثٌ حِجْرٌ ۖ لَّا يَطْعَمُهَآ إِلَّا مَنْ
نَّشَآءُ بِزَعْمِهِمْ وَأَنْعَامٌ حُرِّمَتْ ظُهُوْرُهَا وَ
أَنْعَامٌ لَّا يَذْكُرُوْنَ اسْمَ اللّٰهِ عَلَيْهَا افْتِرَآءً
عَلَيْهِ ۚ سَيَجْزِيْهِمْ بِمَا كَانُوْا يَفْتَرُوْنَ ﴿١٣٨﴾
وَقَالُوْا مَا فِيْ بُطُوْنِ هٰذِهِ الْأَنْعَامِ خَالِصَةٌ
لِّذُكُوْرِنَا وَمُحَرَّمٌ عَلٰٓى أَزْوَاجِنَا ۚ وَإِنْ يَّكُنْ
مَّيْتَةً فَهُمْ فِيْهِ شُرَكَآءُ ۚ سَيَجْزِيْهِمْ
وَصْفَهُمْ ۚ إِنَّهٗ حَكِيْمٌ عَلِيْمٌ ﴿١٣٩﴾

**137** ఇదేవిధంగా చాలామంది ముష్రిక్కులకు తమ సంతాన హత్యను, వారు నిలబెట్టిన భాగస్వాములు సరైనదిగా కనిపించేలా చేశారు,[34] వారిని వినాశానికి గురిచెయ్యటానికి, వారికి వారి ధర్మం సంశయాస్పదమైనదిగా చెయ్యటానికి.[35] అల్లాహ్ సంకల్పించి ఉన్నట్లయితే, వారు ఆ విధంగా చేసి ఉండేవారు కాదు. కనుక వారిని తమ తప్పుడు నిందారోపణలు చేసుకోవటానికి వదిలిపెట్టండి.

**138** ఇలా అంటారు:"ఈ జంతువులు, ఈ పొలాలు ప్రత్యేకించబడ్డాయి. మేము తినిపించదలచిన వారే వీటిని తినగలుగుతారు." వాస్తవానికి ఈ కట్టుబాటు వారు స్వయంగా కల్పించుకున్నదే. ఇంకా వారు కొన్ని జంతువులపై స్వారీ చెయ్యటాన్ని, వాటిచే బరువు లాగించటాన్ని నిషేధించారు. మరికొన్ని జంతువులపై వారు అల్లాహ్ నామాన్ని ఉచ్చరించరు. ఇవన్నీ వారు అల్లాహ్‌కు అంటగట్టిన అబద్ధాలు. త్వరలోనే అల్లాహ్ ఈ తప్పుడు ఆరోపణలకు వారికి ప్రతిఫలం ఇస్తాడు.

**139** ఇంకా ఇలా అంటారు: "ఈ జంతువుల గర్భంలో ఉన్నది మా పురుషులకు ప్రత్యేకం, మా స్త్రీలకు నిషిద్ధం. కాని అది మరణించినదైతే ఉభయులూ కలసి దానిని తినవచ్చు." వారు కల్పించిన ఈ మాటలకు అల్లాహ్ వారికి ప్రతిఫలం ఇచ్చి తీరుతాడు. నిశ్చయంగా ఆయన వివేకవంతుడు. ఆయనకు అన్ని విషయాలూ తెలుసు.

---

29. 110వ ఆయత్తు నుండి 113వ ఆయత్తు వరకు చెప్పబడిన విషయం ఏమిటంటే, ప్రకృతి సిద్ధాంతం ప్రకారం చెట్టుకు పండ్లు కాసినట్లు స్వయంగా మానవుని తలమీద వెంట్రుకలు మొలచినట్లు మానవునికి మార్గదర్శకత్వం లభించటం అల్లాహ్ శాసన ఉద్దేశం కాదు. ఆయన మానవుణ్ణి ప్రపంచంలో పరీక్షించే నిమిత్తం పుట్టించాడు. పరీక్షించే ఉద్దేశ్యంతో, అతడు రుజుమార్గం వైపునకు పోదలచుకున్నాడా లేక అపమార్గం వైపునకా అనే విషయం స్వయంగా అతనికే వదలిపెట్టాడు. ఒకవేళ అతడు తనకు తానై అపమార్గాన్ని తొక్కదలిస్తే, బలవంతంగా అతనికి మార్గదర్శకత్వాన్ని ఇవ్వటం అల్లాహ్ విధానం కాదు.

30. ఈ వాక్యంలో మాట్లాడేవారు మహాప్రవక్త (సఅసమ్), మాట్లాడినది ముస్లిములతో.

31. అంటే, మీరు ఏవిధంగా ఇది ఆశించగలరు: మానవత్వపు చైతన్యభాగ్యం పొందినవాడూ, జ్ఞానకాంతులతో వక్రమార్గాల మధ్య సత్యం యొక్క రుజుమార్గాన్ని స్పష్టంగా చూస్తున్నవాడూ అయిన ఒక మానవుడు అవివేకపు, అజ్ఞానపు చీకట్లలో దారితప్పి కొట్టుమిట్టాడే చైతన్య రహితులైన ప్రజల మాదిరిగా ప్రపంచంలో ఎలా జీవించగలడు?

32. ఈ వాక్యం ద్వారా స్పష్టమైన విషయం ఏమిటంటే విశ్వసించనివారి హృదయాన్ని మాత్రమే అల్లాహ్ ఇస్లామ్ కొరకు సంకుచితం చేస్తాడు. వారికి మార్గదర్శకత్వాన్ని ప్రసాదించే తలంపు ఆయనకు ఉండదు.

قَدۡ خَسِرَ الَّذِیۡنَ قَتَلُوۡۤا اَوۡلَادَهُمۡ سَفَهًۢا بِغَیۡرِ
عِلۡمٍ وَّحَرَّمُوۡا مَا رَزَقَهُمُ اللّٰهُ افۡتِرَآءً عَلَی
اللّٰهِ ؕ قَدۡ ضَلُّوۡا وَمَا كَانُوۡا مُهۡتَدِیۡنَ ﴿۱۴۰﴾ وَ ع ١٦ ١١ ٣
هُوَ الَّذِیۡۤ اَنۡشَاَ جَنّٰتٍ مَّعۡرُوۡشٰتٍ وَّ غَیۡرَ
مَعۡرُوۡشٰتٍ وَّ النَّخۡلَ وَ الزَّرۡعَ مُخۡتَلِفًا اُكُلُهٗ وَ
الزَّیۡتُوۡنَ وَالرُّمَّانَ مُتَشَابِهًا وَّ غَیۡرَ
مُتَشَابِهٍ ؕ كُلُوۡا مِنۡ ثَمَرِهٖۤ اِذَاۤ اَثۡمَرَ وَ اٰتُوۡا
حَقَّهٗ یَوۡمَ حَصَادِهٖ ۫ۖ وَ لَا تُسۡرِفُوۡا ؕ اِنَّهٗ لَا
یُحِبُّ الۡمُسۡرِفِیۡنَ ﴿۱۴۱﴾ۙ وَمِنَ الۡاَنۡعَامِ حَمُوۡلَةً وَّ
فَرۡشًا ؕ كُلُوۡا مِمَّا رَزَقَكُمُ اللّٰهُ وَ لَا تَتَّبِعُوۡا
خُطُوٰتِ الشَّیۡطٰنِ ؕ اِنَّهٗ لَكُمۡ عَدُوٌّ مُّبِیۡنٌ ﴿۱۴۲﴾ۙ
ثَمٰنِیَةَ اَزۡوَاجٍ ۚ مِنَ الضَّاۡنِ اثۡنَیۡنِ وَ مِنَ
الۡمَعۡزِ اثۡنَیۡنِ ؕ قُلۡ ءٰٓالذَّكَرَیۡنِ حَرَّمَ اَمِ
الۡاُنۡثَیَیۡنِ اَمَّا اشۡتَمَلَتۡ عَلَیۡهِ اَرۡحَامُ
الۡاُنۡثَیَیۡنِ ؕ نَبِّـُٔوۡنِیۡ بِعِلۡمٍ اِنۡ كُنۡتُمۡ صٰدِقِیۡنَ ﴿۱۴۳﴾ۙ

**140** అజ్ఞానం వల్ల, మూర్ఖత్వం వల్ల తమ సంతానాన్ని హత్య చేసినవారూ, అల్లాహ్ ఇచ్చిన ఉపాధిని అల్లాహ్‌పై అబద్ధాలు మోపి నిషేధించుకున్నవారూ నిశ్చయంగా నష్టానికి గురి అయ్యారు. నిశ్చయంగా వారు మార్గం తప్పారు. ఎన్నటికీ రుజుమార్గం పొందేవారు కారు.

**141 - 144** అల్లాహ్‌యే నిటారు చెట్లుగల పలురకాల తోటలనూ, ద్రాక్ష తోటలనూ, ఖర్జూరపు తోటలనూ సృష్టించాడు. పొలాలను పండించాడు. వాటిద్వారా రకరకాల ఆహార పదార్థాలు లభిస్తాయి. జైతూను చెట్లనూ దానిమ్మ చెట్లనూ ఉద్భవింపజేశాడు. వాటి పండ్లు రూపంలో ఒకటే. కాని వాటి రుచి వేరు. అవి పండినప్పుడు వాటి పంటను తినండి. వాటి పంటను కోసేటప్పుడు మీపై ఉన్న అల్లాహ్ హక్కును చెల్లించండి. హద్దులు మీరకండి. హద్దులు మీరే వారిని అల్లాహ్ ప్రేమించడు. ఇంకా, ఆయనే పశువులలో స్వారీ చెయ్యటానికి, బరువు మొయ్యటానికి, తినటానికి, పరచుకోవటానికి[36] కూడా వినియోగపడే జంతువులను సృష్టించాడు. అల్లాహ్ మీకు ప్రసాదించిన వాటిని తినండి. షైతానును అనుసరించకండి. వాడు మీకు బహిరంగ శత్రువు. ఇవి, మగవీ ఆడవీ కలసి ఎనిమిది. రెండు గొఱ్ఱె జాతినుండి, మరొక రెండు మేక జాతి నుండి. ప్రవక్తా! వారిని ఇలా అడుగు: అల్లాహ్ నిషేధించింది మగ జంతువులనా లేక ఆడజంతువులనా లేక ఆ గొఱ్ఱెల గర్భాలలో, మేకల గర్భాలలో ఉన్న పిల్ల జంతువులనా? మీరు సత్యవంతులే అయితే నాకు సరియైన జ్ఞానంతో తెలుపండి.

---

33. వారు అల్లాహ్ పేరుతో తీసే భాగాన్ని కూడా రకరకాల మోసాలుచేసి తగ్గించే వారు. స్వయం కల్పితమైన భాగస్వాముల భాగాన్ని పెంచటానికి శతవిధాలుగా ప్రయత్నించేవారు. ఉదాహరణకు, దేవుని పేర తీయబడిన ధాన్యం, పండ్లు మొదలైన వాటిలో ఏదైనా క్రిందపడిపోతే, అది భాగస్వాముల భాగంలో కలపబడేది, ఒకవేళ భాగస్వాముల భాగం నుండి ఏదైనా క్రింద పడిపోతే లేక అల్లాహ్ భాగంలో కలిసిపోతే, దానిని తీసి మళ్ళీ వారి భాగానికే చేర్చటం జరిగేది. ఒకవేళ ఏదైనా కారణం వల్ల మొక్కుబడికోసం ప్రత్యేకించిన ధాన్యం అవసరం కలిగితే అల్లాహ్ భాగం తినేసేవారు. కాని భాగస్వాముల భాగాన్ని ముట్టుకోవటానిక్కూడా భయపడేవారు, ఏదైనా ఆపద వచ్చిపడుతుందేమో అని.

34. ఇక్కడ "భాగస్వాములు" అనే పదం మరొక అర్థంలో ఉపయోగించబడింది. ఈ అర్థం పై అర్థానికి భిన్నమైనది. 136వ ఆయత్తులో "భాగస్వాములు" అనే పదంతో పోల్చబడినవారు, వారి ఆరాధ్యులు. వారి శుభాశీస్సులు వారి సిఫారసు, వారి మధ్యవర్తిత్వం వరాలు పొందటంలో సహాయపడతాయని భావించేవారు. వరాలకు తెలిపే కృతజ్ఞతలకు వారు కూడా అర్హులని భావించి ఆ అర్హతలో వారిని అల్లాహ్‌తో పాటు భాగస్వాములుగా

وَ مِنَ الْاِبِلِ اثْنَيْنِ وَ مِنَ الْبَقَرِ اثْنَيْنِ ؕ
قُلْ ءٰٓالذَّكَرَيْنِ حَرَّمَ اَمِ الْاُنْثَيَيْنِ اَمَّا
اشْتَمَلَتْ عَلَيْهِ اَرْحَامُ الْاُنْثَيَيْنِ ؕ اَمْ كُنْتُمْ
شُهَدَآءَ اِذْ وَصّٰىكُمُ اللّٰهُ بِهٰذَا ۚ فَمَنْ اَظْلَمُ
مِمَّنِ افْتَرٰى عَلَى اللّٰهِ كَذِبًا لِّيُضِلَّ النَّاسَ
بِغَيْرِ عِلْمٍ ؕ اِنَّ اللّٰهَ لَا يَهْدِي الْقَوْمَ
الظّٰلِمِيْنَ ﴿١٤٤﴾ قُلْ لَّآ اَجِدُ فِيْ مَآ اُوْحِيَ اِلَيَّ ع
مُحَرَّمًا عَلٰى طَاعِمٍ يَّطْعَمُهٗۤ اِلَّآ اَنْ يَّكُوْنَ
مَيْتَةً اَوْ دَمًا مَّسْفُوْحًا اَوْ لَحْمَ خِنْزِيْرٍ فَاِنَّهٗ
رِجْسٌ اَوْ فِسْقًا اُهِلَّ لِغَيْرِ اللّٰهِ بِهٖ ۚ فَمَنِ
اضْطُرَّ غَيْرَ بَاغٍ وَّلَا عَادٍ فَاِنَّ رَبَّكَ غَفُوْرٌ
رَّحِيْمٌ ﴿١٤٥﴾ وَ عَلَى الَّذِيْنَ هَادُوْا حَرَّمْنَا كُلَّ
ذِيْ ظُفُرٍ ۚ وَمِنَ الْبَقَرِ وَ الْغَنَمِ حَرَّمْنَا عَلَيْهِمْ
شُحُوْمَهُمَآ اِلَّا مَا حَمَلَتْ ظُهُوْرُهُمَآ اَوِ الْحَوَايَآ
اَوْ مَا اخْتَلَطَ بِعَظْمٍ ؕ ذٰلِكَ جَزَيْنٰهُمْ بِبَغْيِهِمْ ۖ
وَ اِنَّا لَصٰدِقُوْنَ ﴿١٤٦﴾ فَاِنْ كَذَّبُوْكَ فَقُلْ
رَّبُّكُمْ ذُوْ رَحْمَةٍ وَّاسِعَةٍ ۚ وَ لَا يُرَدُّ بَاْسُهٗ
عَنِ الْقَوْمِ الْمُجْرِمِيْنَ ﴿١٤٧﴾

ఇదేవిధంగా రెండు ఒంటె జాతిలోనివి, మరొక రెండు ఆవు జాతిలోనివి. అడుగు వారిని: వీటిలో అల్లాహ్ నిషేధించినవి మగపశువులా లేక ఆడపశువులా లేక ఒంటెల, ఆవుల గర్భాలలో ఉన్న పిల్ల పశువులా? వీటిని నిషేధిస్తూ అల్లాహ్ ఆజ్ఞలు ఇచ్చే సమయంలో మీరు ఉన్నారా? జ్ఞానం లేకుండా ప్రజలను పెడమార్గం పట్టించే నిమిత్తం అబద్ధాన్ని కల్పించి దానిని అల్లాహ్‌కు ఆపాదించే వ్యక్తికంటే మించిన దుర్మార్గు డెవడు? నిశ్చయంగా అల్లాహ్ అటువంటి దుర్మార్గులకు రుజుమార్గం చూపడు.

**145 - 147** ప్రవక్తా! వారితో ఇలా అను: నా వద్దకు వచ్చిన వహీలో, తినేవాడికొరకు ఏ వస్తువూ నిషేధించబడినట్లు నాకు కనిపించదు, చచ్చిన జంతువు, కారిన రక్తము, పంది మాంసము, ఇది అపరిశుద్ధం గనక, లేక ఫిస్ఖ్ (అపచారం), అంటే, అల్లాహ్ పేరుతోకాక వేరేవారి పేరుతో జిబహ్ చెయ్యబడింది[37] (మొదలైనవి) తప్ప. కాని ఎవరైనా గత్యంతరం లేని పరిస్థితులలో (వీటిలో దేన్నయినా తింటే), అవిధేయతకు ఒడిగట్టే ఉద్దేశం లేకుండా, ఆవశ్యకత హద్దును మీరకుండా ఉంటే, నిశ్చయంగా నీ ప్రభువు మన్నిస్తాడు, కరుణిస్తాడు. యూదుమతం అవలంబించిన వారికి మేము గోళ్ళు ఉన్న అన్ని జంతువులనూ నిషేధించాము. ఆవు, మేకల కొవ్వును కూడా, వాటి వీపునకూ లేక ప్రేగులకూ లేక ఎముకలకూ అంటివున్నది తప్ప. ఇది మేము వారి తలబిరుసుతనానికిగాను వారికి విధించిన శిక్ష.[38] మేము చెప్పేదంతా పూర్తిగా నిజం. ఇక, ఒకవేళ వారు నిన్ను తిరస్కరిస్తే, నీవు వారితో ఇలా చెప్పెయ్యి: "మీ ప్రభువు కారుణ్య పరిధి సువిశాలమైనది. అపరాధులపై పడకుండా ఆయన శిక్షను ఆపటం అసాధ్యం."

చేసేవారు. దీనికి భిన్నంగా ఈ ఆయతుల్లో "భాగస్వాములు" అంటే అర్థం సంతాన హత్య అనే ఆచారాన్ని నెలకొల్పిన మానవులు. ఇంకా ఈ దుర్మార్గపు ఆచారాన్ని వారి దృష్టిలో ఒక ధర్మసమ్మతమైన, ఇష్టపడదగిన పనిగా చేసిన షైతానులు. సంతాన హత్య అనే ఆచారం మూడు విధాలుగా అరేబియా వాసులలో ప్రబలివుండేది. ఖురానులో ఈ మూడింటినీ సూచించటం జరిగింది. (1) బాలికల హత్య. ఎవడూ వారి అల్లుడు కారాదనే అభిప్రాయంతో, తెగలమధ్య జరిగే యుద్ధాలలో తమ కూతుళ్ళు శత్రువు చేతులలో చిక్కరాదనే అభిప్రాయంతో లేదా మరేదైనా కారణంవల్ల ఆ బాలికలు వారికి పరాభవ కారణంగా పరిణమించరాదనే అభిప్రాయంతో. (2) పిల్లల హత్య, వారి పోషణాభారం మొయ్యలేమనే ఉద్దేశంతో ఆర్థిక వనరులు తక్కువగా ఉన్నందువల్ల వారు దుర్భరమవుతారనే ఉద్దేశంతో. (3) పిల్లలను తమ ఆరాధ్యుల ప్రసన్నతకోసం బలిపీఠంపై ఎక్కించటం.

35. అజ్ఞానయుగంలోని అరబ్బులు తమను తాము హజ్రత్ ఇబ్రాహీమ్(అస్సలామ్), హజ్రత్ ఇస్మాయీల్ (అస్సలామ్)ల

سَيَقُولُ الَّذِينَ اَشْرَكُوا لَوْ شَآءَ اللهُ مَا
اَشْرَكْنَا وَ لَآ اٰبَآؤُنَا وَ لَا حَرَّمْنَا مِنْ شَيْءٍ ؕ
كَذٰلِكَ كَذَّبَ الَّذِينَ مِنْ قَبْلِهِمْ حَتّٰى ذَاقُوْا
بَاْسَنَا ؕ قُلْ هَلْ عِنْدَكُمْ مِّنْ عِلْمٍ فَتُخْرِجُوْهُ
لَنَا ؕ اِنْ تَتَّبِعُوْنَ اِلَّا الظَّنَّ وَ اِنْ اَنْتُمْ اِلَّا
تَخْرُصُوْنَ ﴿۱۴۸﴾ قُلْ فَلِلّٰهِ الْحُجَّةُ الْبَالِغَةُ ۚ فَلَوْ
شَآءَ لَهَدٰىكُمْ اَجْمَعِيْنَ ﴿۱۴۹﴾ قُلْ هَلُمَّ
شُهَدَآءَكُمُ الَّذِيْنَ يَشْهَدُوْنَ اَنَّ اللهَ حَرَّمَ
هٰذَا ۚ فَاِنْ شَهِدُوْا فَلَا تَشْهَدْ مَعَهُمْ ۚ وَ لَا
تَتَّبِعْ اَهْوَآءَ الَّذِيْنَ كَذَّبُوْا بِاٰيٰتِنَا وَ الَّذِيْنَ
لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ وَ هُمْ بِرَبِّهِمْ يَعْدِلُوْنَ ﴿۱۵۰﴾ ع

**148 - 149** ఈ ముష్రిక్కు జనులు (మీ ఈ మాటలకు బదులుగా) తప్పకుండా ఇలా అంటారు: "ఒకవేళ అల్లాహ్‌యే కోరి ఉండినట్లయితే, మేమూ మా పూర్వీకులూ షిర్కుచేసి ఉండేవారమే కాదు. మేము దేనినీ నిషేధించి ఉండే వారము కూడా కాదు.[39] ఇటువంటి మాటలనే మాటిమాటికీ కల్పించి వారికి పూర్వం వారు కూడా సత్యాన్ని తిరస్కరించారు. చివరకు వారు మా శిక్షను చవిచూచారు. వారితో ఇలా అను: "మీ వద్ద ఏదైనా జ్ఞానం ఉందా, మాముందు పెట్టటానికి? మీరు కేవలం అంచనాలను అనుసరిస్తున్నారు. మీరు చేసేవన్నీ వట్టి ఊహాగానాలే." ఇంకా ఇలా అను: "(మీ ఈ వాదానికి భిన్నంగా) సత్యానికి చేర్చేవాదన అల్లాహ్ వద్ద ఉంది. అల్లాహ్ గనక సంకల్పించి ఉన్నట్లయితే నిస్సందేహంగా మీ అందరికీ ఆయన మార్గం చూపి ఉండేవాడు."[40]

**150** వారితో ఇలా అడుగు: "అల్లాహ్‌యే ఈ వస్తువులను నిషేధించాడు అని సాక్ష్యమిచ్చే మీ సాక్షులను తీసుకురండి." ఒకవేళ వారు అలా సాక్ష్య మిస్తే, నీవు వారితో కలసి సాక్ష్యం ఇవ్వకు.[41] మా ఆయతులను అసత్యాలుగా చిత్రించి తిరస్కరించినవారూ, పరలోకాన్ని నిరాకరించినవారూ, ఇతరులను తమ ప్రభువుకు సమానులుగా నిలబెట్టినవారూ – అలాంటి వారి కోరికలను నీవు ఎంతమాత్రం అనుసరించకు.

అనుచరులమని చెప్పుకునేవారు, అనుకునేవారు కూడా. ఈ కారణంవల్ల వారు తాము అవలంబిస్తూ ఉన్న మతం దేవుడు ఇష్టపడే మతమే అని భావించేవారు. కాని ఈ ధర్మంలో తరువాతి యుగాలలో వారి మత గురువులూ, వారి తెగల సర్దారులూ, వారి వంశవృద్ధులూ ఇంకా ఇతరులూ రకరకాల విశ్వాసాలను, కర్మలను, ఆచారాలను చేరుస్తూపోయారు. తరువాతి తరాలవారు వాటిని మతం యొక్క అసలు భాగం అని అనుకున్నారు. ఈ విధంగా వారి మొత్తం ధర్మం సంశయగ్రస్తం అయిపోయింది.

36. అంటే, వాటి చర్మాలతో, వాటి రోమాలతో తివాచీలు తయారుచేసేవారు.

37. అవి తప్ప తినే వస్తువు ఏదీ షరీయత్తులో హరాము కాదు అని దీని అర్థం కాదు. దాని అర్థం ఏమిటంటే మీరు హరాము చేసుకున్న వస్తువులు హరాము కావు కాని హరాము వస్తువులు ఇవి, వివరణ కొరకు మాఇదా సూరాలో 2, 9 వివరణలు చూడండి.

38. ఆలి ఇమ్రాన్ సూరాలో 93వ ఆయత్‌నూ, నిసా సూరాలో 160వ ఆయత్‌నూ చూడండి.

39. అంటే, వారు తమ నేరానికీ, తమ తప్పుడు పనులకూ ఆ పాత సాకులనే చెపుతారు, వేటిని ఎల్లప్పుడూ నేరస్తులు, తప్పుడు పనులు చేసేవారు చెబుతూ వచ్చారో. వారు ఇలా అంటారు: మేము షిర్కు చెయ్యాలనేదే, మేము ఏ వస్తువులను హరాముగా నిర్ణయించామో, వాటిని హరాముగా నిర్ణయించాలనేదే, మా విషయంలో అల్లాహ్ సంకల్పం. మేము అలా చెయ్యాలని అల్లాహ్ సంకల్పం కాకపోతే మేము ఈ పనులన్నీ చెయ్యటం ఎలా సాధ్యపడేది. కనుక, మేము అల్లాహ్ సంకల్పానికి అనుగుణంగానే ఇదంతా చేస్తున్నాము, కనుక మేము

قُلۡ تَعَالَوۡا اَتۡلُ مَا حَرَّمَ رَبُّكُمۡ عَلَيۡكُمۡ اَلَّا تُشۡرِكُوۡا بِهٖ شَيۡـًٔـا وَّبِالۡوَالِدَيۡنِ اِحۡسَانًا ۚ وَلَا تَقۡتُلُوۡۤا اَوۡلَادَكُمۡ مِّنۡ اِمۡلَاقٍ ؕ نَحۡنُ نَرۡزُقُكُمۡ وَاِيَّاهُمۡ ۚ وَلَا تَقۡرَبُوا الۡفَوَاحِشَ مَا ظَهَرَ مِنۡهَا وَمَا بَطَنَ ۚ وَلَا تَقۡتُلُوا النَّفۡسَ الَّتِىۡ حَرَّمَ اللّٰهُ اِلَّا بِالۡحَـقِّ ؕ ذٰ لِكُمۡ وَصّٰٮكُمۡ بِهٖ لَعَلَّكُمۡ تَعۡقِلُوۡنَ ﴿۱۵۱﴾ وَلَا تَقۡرَبُوۡا مَالَ الۡيَتِيۡمِ اِلَّا بِالَّتِىۡ هِىَ اَحۡسَنُ حَتّٰى يَبۡلُغَ اَشُدَّهٗ ۚ وَاَوۡفُوا الۡكَيۡلَ وَالۡمِيۡزَانَ بِالۡقِسۡطِ ۚ لَا نُـكَلِّفُ نَفۡسًا اِلَّا وُسۡعَهَا ۚ وَاِذَا قُلۡتُمۡ فَاعۡدِلُوۡا وَلَوۡ كَانَ ذَا قُرۡبٰى ۚ وَبِعَهۡدِ اللّٰهِ اَوۡفُوۡا ؕ ذٰ لِكُمۡ وَصّٰٮكُمۡ بِهٖ لَعَلَّكُمۡ تَذَكَّرُوۡنَ ﴿۱۵۲﴾ وَاَنَّ هٰذَا صِرَاطِىۡ مُسۡتَقِيۡمًا فَاتَّبِعُوۡهُ ۚ وَلَا تَتَّبِعُوا السُّبُلَ فَتَفَرَّقَ بِكُمۡ عَنۡ سَبِيۡلِهٖ ؕ ذٰ لِكُمۡ وَصّٰٮكُمۡ بِهٖ لَعَلَّكُمۡ تَتَّقُوۡنَ ﴿۱۵۳﴾

**151 - 153** ప్రవక్తా! వారికి ఇలా చెప్పు: "రండి మీకు వినిపిస్తాను, మీ ప్రభువు మీపై విధించిన కట్టుబాట్లు ఏమిటో.[42] ఎవరినీ ఆయనకు భాగ స్వాములుగా చెయ్యరాదు. తల్లిదండ్రులతో మంచిగా ప్రవర్తించండి. పేదరికానికి భయపడి మీ సంతానాన్ని హత్య చేయకండి. మేము మీకూ ఉపాధిని స్తున్నాము. వారికీ ఇస్తాము. అశ్లీల విషయాల దరిదాపులకు కూడా పోకండి,[43] బహిరంగమైనవైనా సరే లేక గోప్యమైనవైనా సరే. సత్యంతో తప్ప అల్లాహ్ పవిత్రంగా నిర్ణయించిన ఏ ప్రాణాన్నీ హతమార్చకండి, ఈ విషయాలనే పాటించమని ఆయన మీకు ఉపదేశించాడు, బహుశా మీరు ఆలోచించి పని చేస్తారని. అనాథుల ఆస్తి దరిదాపులకు పోకండి,ఉత్తమమైన రీతిలో తప్ప – వారు యుక్త వయస్సుకు చేరేవరకు. కొలతలో, తూనికలో పూర్తి న్యాయం చెయ్యండి. మేము ప్రతి మనిషిపైనా అతని శక్తిమేరకే బాధ్యతా భారాన్ని మోపుతాము. పలికితే న్యాయమే పలకండి, వ్యవహారం మీ బంధువులకు సంబంధించినది అయినాసరే. అల్లాహ్‌తో చేసుకున్న ఒడంబడికను నెరవేర్చండి.[44] ఈ మాటలను అల్లాహ్ మీకు ఉపదేశిస్తున్నాడు, బహుశా మీరు హితబోధను స్వీకరిస్తారేమో అని. ఇంకా ఆయన ఇలా ఉద్బోధిస్తున్నాడు: నా రుజుమార్గం ఇదే. కనుక మీరు దీనిపైనే నడవండి. వేరే మార్గాలపై నడవకండి. ఎందుకంటే అవి మిమ్మల్ని ఆయన మార్గంనుండి తొలగించి విచ్ఛిన్న పరుస్తాయి. మీ ప్రభువు మీకు చేసిన హితోపదేశం ఇదే, బహుశా మీరు వక్రవైఖరికి దూరంగా ఉంటారని.

చేస్తున్నదంతా సక్రమమైనదే, దీనికి నేరారోపణ అనేది ఉంటే, మాపై కాదు, అల్లాహ్‌పైనే. మేము ఏది చేస్తున్నామో అలా చెయ్యటానికే బద్ధులమై ఉన్నాము, ఇది తప్ప ఇంకొకటి చెయ్యటం మా శక్తికి మించిన పని.

40. అంటే, అల్లాహ్ గనక కోరివున్నట్లయితే, మేము షిర్కును చేసి ఉండేవారము కాదు అనే వాదాన్ని సాకుగా చెప్పటం వల్ల విషయం పూర్తిగా స్పష్టం కాదు. విషయాన్ని పూర్తిగా చెప్పదలిస్తే ఇలా చెప్పండి : అల్లాహ్ గనక ఇష్టపడి ఉన్నట్లయితే మా అందరికీ మార్గదర్శకత్వాన్ని ఇచ్చి ఉండేవాడు. వేరేమాటలలో చెప్పాలంటే, మీరే స్వయంగా మీ ఎన్నుకునే స్వేచ్ఛను ఉపయోగించి రుజుమార్గాన్ని అవలంబించటానికి సిద్ధంగా లేరు. మీరు కోరేది ఏమిటంటే అల్లాహ్ ఏవిధంగా దైవదూతలను పుట్టుకతోనే రుజువర్తనులుగా చేశాడో అదేవిధంగా మిమ్మల్ని కూడా చేసివుండవలసింది అని. ఒకవేళ అల్లాహ్ సంకల్పం మానవుడి విషయంలో ఇదే అయివుంటే, ఆయన తప్పకుండా అలా చెయ్యగలిగేవాడు. కాని ఇది ఆయన సంకల్పం కాదు. కనుక ఏ అపమార్గాన్ని మీరు మీ కొరకు స్వయంగా ఇష్టపడ్డారో, అల్లాహ్ కూడా మిమ్మల్ని అందులోనే పడివుండనిస్తాడు.

41. అంటే, వారుగనక సాక్షిగా ఉండే గురుతరమైన బాధ్యతను అర్థం చేసుకుని ఉంటే, ఇంకా మనిషి తనకు

ثُمَّ اٰتَيۡنَا مُوۡسَى الۡكِتٰبَ تَمَامًا عَلَى الَّذِىۡۤ
اَحۡسَنَ وَ تَفۡصِيۡلًا لِّـكُلِّ شَىۡءٍ وَّ هُدًى وَّ
رَحۡمَةً لَّعَلَّهُمۡ بِلِقَآءِ رَبِّهِمۡ يُؤۡمِنُوۡنَ ۝١٥٤ وَهٰذَا
كِتٰبٌ اَنۡزَلۡنٰهُ مُبٰرَكٌ فَاتَّبِعُوۡهُ وَ اتَّقُوۡا لَعَلَّكُمۡ
تُرۡحَمُوۡنَ ۝١٥٥ اَنۡ تَقُوۡلُوۡۤا اِنَّمَاۤ اُنۡزِلَ الۡكِتٰبُ
عَلٰى طَآٮِٕفَتَيۡنِ مِنۡ قَبۡلِنَا وَ اِنۡ كُنَّا عَنۡ
دِرَاسَتِهِمۡ لَغٰفِلِيۡنَ ۝١٥٦ اَوۡ تَقُوۡلُوۡا لَوۡ اَنَّاۤ اُنۡزِلَ
عَلَيۡنَا الۡكِتٰبُ لَكُنَّاۤ اَهۡدٰى مِنۡهُمۡ فَقَدۡ
جَآءَكُمۡ بَيِّنَةٌ مِّنۡ رَّبِّكُمۡ وَهُدًى وَّ رَحۡمَةٌ
فَمَنۡ اَظۡلَمُ مِمَّنۡ كَذَّبَ بِاٰيٰتِ اللّٰهِ وَصَدَفَ
عَنۡهَا سَنَجۡزِى الَّذِيۡنَ يَصۡدِفُوۡنَ عَنۡ اٰيٰتِنَا
سُوۡٓءَ الۡعَذَابِ بِمَا كَانُوۡا يَصۡدِفُوۡنَ ۝١٥٧ هَلۡ
يَنۡظُرُوۡنَ اِلَّاۤ اَنۡ تَاۡتِيَهُمُ الۡمَلٰٓٮِٕكَةُ اَوۡ يَاۡتِىَ
رَبُّكَ اَوۡ يَاۡتِىَ بَعۡضُ اٰيٰتِ رَبِّكَ يَوۡمَ يَاۡتِىۡ
بَعۡضُ اٰيٰتِ رَبِّكَ لَا يَنۡفَعُ نَفۡسًا اِيۡمَانُهَا لَمۡ
تَكُنۡ اٰمَنَتۡ مِنۡ قَبۡلُ اَوۡ كَسَبَتۡ فِىۡۤ اِيۡمَانِهَا
خَيۡرًا قُلِ انْتَظِرُوۡۤا اِنَّا مُنۡتَظِرُوۡنَ ۝١٥٨

**154 - 158** మేము మూసాకు గ్రంథాన్ని ప్రసాదించాము. అది మంచి వైఖరిని అవలంబించే మానవుడిపై అనుగ్రహ పరిపూర్తి, ఆవశ్యకమైన సకల విషయాల వివరణ, పూర్తిగా మార్గదర్శకం, పూర్తిగా కారుణ్యం. (ఇది ఇస్రాయీలు వంశీయులకు ఎందుకు ఇవ్వబడిందంటే) బహుశా ప్రజలు తమ ప్రభువును కలుసుకోవటాన్ని విశ్వసిస్తారని.[45] ఇదే విధంగా మేము ఈ గ్రంథాన్ని అవతరింపజేశాము. ఇది శుభాలుకల గ్రంథం. కావున మీరు దీనిని అనుసరించండి. భయభక్తుల వైఖరిని అవలంబించండి. మీరు కరుణించబడటం సాధ్యం కావచ్చు. ఇక మీరు, "మాకు పూర్వం ఉన్న రెండు వర్గాలకు గ్రంథం ఇవ్వబడింది. వారు ఏమి చదివేవారో, ఏమి చదివించేవారో మాకు తెలియదు" అని అనలేరు. ఇంకా మీకు, "మాపై గనక గ్రంథాన్ని అవతరింపజేసి ఉండినట్లయితే, మేము వారిని మించిన రుజువర్తనులముగా నిరూపించుకునేవారము" అని సాకులుచెప్పే ఆస్కారం కూడా లేదు. మీవద్దకు మీ ప్రభువు తరపు నుండి ఒక స్పష్టమైన ప్రమాణం, మార్గదర్శకత్వం, కారుణ్యం వచ్చేసింది. ఇక అల్లాహ్ ఆయతులు అసత్యాలు అని పలికేవాడికంటే, వాటిపట్ల వైముఖ్యం ప్రదర్శించేవాడికంటే మించిన దుర్మార్గుడెవడు? మా ఆయతులపట్ల విముఖులయ్యే వారికి, వారి ఈ వైముఖ్యం ఫలితంగా మేము నీచాతినీచమైన శిక్షను విధించితీరుతాము. దైవదూతలు వచ్చి వారిముందు నిలబడాలనీ లేదా నీ ప్రభువే స్వయంగా రావాలనీ లేదా నీ ప్రభువు యొక్క కొన్ని బహిరంగ నిదర్శనాలు[46] ప్రత్యక్షం కావాలనీ, ప్రజలు నిరీక్షిస్తున్నారా? నీ ప్రభువు యొక్క ప్రత్యేకమైన సూచనలు కొన్ని ప్రత్యక్షమయ్యే రోజున పూర్వం విశ్వసించకుండా ఆ రోజున విశ్వసించిన వ్యక్తికీ, లేదా విశ్వసించి కూడా ఏ మంచినీ సంపాదించుకోని వ్యక్తికీ తమ విశ్వాసంవల్ల ఏ ప్రయోజనమూ చేకూరదు. ప్రవక్తా! వారితో ఇలా అను: "సరే, మంచిది. మీరూ నిరీక్షించండి. మేమూ నిరీక్షిస్తున్నాము."

తెలిసిన విషయానికే సాక్షిగా ఉండాలని గ్రహిస్తే వారు ఎన్నటికీ ఇటువంటి సాక్ష్యం ఇవ్వటానికి ధైర్యం చెయ్యరు. కాని ఒకవేళ వారు సాక్షిగా ఉండే బాధ్యతను గ్రహించకుండా సిగ్గుమాలి దేవుని పేరుతో దొంగసాక్ష్యం ఇవ్వటానిక్కూడా సంకోచించకపోతే, వారి ఈ అబద్ధంలో నీవు సహవాసివి కావద్దు.

اِنَّ الَّذِیۡنَ فَرَّقُوۡا دِیۡنَهُمۡ وَ كَانُوۡا شِیَعًا لَّسۡتَ
مِنۡهُمۡ فِیۡ شَیۡءٍ ؕ اِنَّمَاۤ اَمۡرُهُمۡ اِلَی اللّٰهِ ثُمَّ
یُنَبِّئُهُمۡ بِمَا كَانُوۡا یَفۡعَلُوۡنَ ﴿۱۵۹﴾ مَنۡ جَآءَ
بِالۡحَسَنَةِ فَلَهٗ عَشۡرُ اَمۡثَالِهَا ۚ وَ مَنۡ جَآءَ
بِالسَّیِّئَةِ فَلَا یُجۡزٰۤی اِلَّا مِثۡلَهَا وَ هُمۡ لَا
یُظۡلَمُوۡنَ ﴿۱۶۰﴾ قُلۡ اِنَّنِیۡ هَدٰىنِیۡ رَبِّیۡۤ اِلٰی
صِرَاطٍ مُّسۡتَقِیۡمٍ ۬ۚ دِیۡنًا قِیَمًا مِّلَّةَ اِبۡرٰهِیۡمَ
حَنِیۡفًا ۚ وَ مَا كَانَ مِنَ الۡمُشۡرِكِیۡنَ ﴿۱۶۱﴾ قُلۡ اِنَّ
صَلَاتِیۡ وَ نُسُكِیۡ وَ مَحۡیَایَ وَ مَمَاتِیۡ لِلّٰهِ رَبِّ
الۡعٰلَمِیۡنَ ﴿۱۶۲﴾ۙ

**159 - 160** తమ ధర్మాన్ని ముక్కలు ముక్కలుగా చేసి, ముఠాలుగా చీలి పోయిన వారితో నిశ్చయంగా నీకు ఏ సంబంధమూ లేదు. వారి వ్యవహారం అల్లాహ్ అధీనంలో ఉంది. ఆయనే వారికి తెలుపుతాడు, వారు ఏమేమి చేశారో. అల్లాహ్ వద్దకు సత్కార్యాన్ని తీసుకువచ్చే వానికొరకు పదింతలు ప్రతిఫలం ఉంది. దుష్కార్యాన్ని తీసుకువచ్చే వానికి, అతడు ఎంత తప్పు చేశాడో అంతే ప్రతిఫలం లభిస్తుంది. ఎవరికీ అన్యాయం మట్టుకు జరగదు.

**161 - 165** ప్రవక్తా! ఇలా ప్రకటించు: నిశ్చయంగా నా ప్రభువు నాకు రుజుమార్గాన్ని చూపించాడు. అది పూర్తిగా సరియైన ధర్మం. ఏ వక్రతా లేనిది, ఇబ్రాహీమ్ విధానం, దానిని అతను ఏకాగ్రతతో అవలంబించాడు. అతను ముష్రిక్కులలోని వాడు కాదు. ఇలా అను: "నా నమాజ్ నా సకల ఉపాసనారీతులు,[47] నా జీవనం, నా మరణం- సమస్తమూ సకల లోకాలకూ ప్రభువైన అల్లాహ్ కొరకే.

---

42. అంటే, మీ ప్రభువు విధించిన కట్టుబాట్లు. మీరు ఇప్పుడు చిక్కుకుపోయి ఉన్నవి కావు. అసలైన కట్టుబాట్లు ఇవి.

43. అసలు "ఫవాహిష్" (అశ్లీల విషయాలు) అనే పదం వాడబడింది. పూర్తిగా స్పష్టంగా కనిపించే చెడు లక్షణాలుగల పనులన్నింటికీ ఇది వర్తిస్తుంది. వ్యభిచారాన్ని, లూత్ జాతి దురాచారాన్ని, నగ్నత్వాన్ని, అబద్ధపు నిందారోపణను తండ్రి పెండ్లాడిన స్త్రీని వివాహం చేసుకోవటాన్ని దివ్య ఖురాను అశ్లీల కార్యాలుగా పరిగణిస్తుంది. హదీసులలో దొంగతనాన్ని, సారాయి త్రాగటాన్ని, భిక్షాటనను అశ్లీల కార్యాలలో చేర్చటం జరిగింది. ఇదేవిధంగా ఇతర సిగ్గుమాలిన పనులన్నీ అశ్లీల కార్యాలలో చేరిపోతాయి. ఇంకా అల్లాహ్ ప్రవచనం ప్రకారం ఈ రకపు చేష్టలను బహిరంగంగానూ చెయ్యకూడదు, రహస్యంగానూ చెయ్యకూడదు.

44. "అల్లాహ్‌తో చేసుకున్న ఒడంబడిక" అంటే భావం : ఒక వ్యక్తి దేవుని భూమిపై మానవ సమాజంలో పుట్టినంతనే మానవుడు దేవుడు మధ్య, మానవుడు మానవుడు మధ్య సహజమైన రీతిలో దానంతట అదే ఉనికిలోకి వచ్చే ఒడంబడిక.

45. భావం ఏమిటంటే, ప్రజలు తమను తాము బాధ్యతారహితులుగా భావించటం మానుకోవాలి. వారు తమ ప్రభువు ముందు హాజరై ఒకరోజున తమ కర్మలను గురించి సమాధానం చెప్పుకోవాలి అని నమ్మాలి.

46. అంటే, యథార్థంపై ఉన్న తెరను పూర్తిగా తొలగించే ప్రళయ నిదర్శనాలు లేక దైవశిక్ష లేక మరొకటేదైనా సూచన. ఇక అది ప్రత్యక్షమైన తరువాత పరీక్ష అనే ప్రశ్నే మిగిలివుండదు.

لَا شَرِيْكَ لَهٗ ۚ وَ بِذٰلِكَ اُمِرْتُ وَ اَنَا اَوَّلُ
الْمُسْلِمِيْنَ ﴿۱۶۳﴾ قُلْ اَغَيْرَ اللّٰهِ اَبْغِيْ رَبًّا وَّ هُوَ
رَبُّ كُلِّ شَيْءٍ ؕ وَ لَا تَكْسِبُ كُلُّ نَفْسٍ اِلَّا
عَلَيْهَا ۚ وَ لَا تَزِرُ وَازِرَةٌ وِّزْرَ اُخْرٰى ۚ ثُمَّ
اِلٰى رَبِّكُمْ مَّرْجِعُكُمْ فَيُنَبِّئُكُمْ بِمَا كُنْتُمْ فِيْهِ
تَخْتَلِفُوْنَ ﴿۱۶۴﴾ وَ هُوَ الَّذِيْ جَعَلَكُمْ خَلٰٓئِفَ
الْاَرْضِ وَ رَفَعَ بَعْضَكُمْ فَوْقَ بَعْضٍ دَرَجٰتٍ
لِّيَبْلُوَكُمْ فِيْ مَاۤ اٰتٰىكُمْ ؕ اِنَّ رَبَّكَ سَرِيْعُ
الْعِقَابِ ۖ وَ اِنَّهٗ لَغَفُوْرٌ رَّحِيْمٌ ﴿۱۶۵﴾ ع ۲۰/۱۱

ఆయనకు ఏ భాగస్వామీ లేదు. ఈ ఆజ్ఞయే నాకు ఇవ్వబడింది. అందరికంటే ముందు విధేయతతో తలవంచేవాణ్ణి నేనే." ఇలా అను: నేను అల్లాహ్‌ను కాదని వేరే ప్రభువును అన్వేషించాలా, ఆయనే ప్రతిదానికీ ప్రభువైనప్పుడు? ప్రతి వ్యక్తీ తాను సంపాదించే దానికి తానే బాధ్యుడు. బరువు మోసేవాడెవడూ ఇతరుని బరువును మోయడు.[48] చివరకు మీరంతా మీ ప్రభువు వైపునకే మరలిపోవలసి ఉంది. అప్పుడు ఆయన మీ విభేదాల యథార్థాన్ని మీకు విశదం చేస్తాడు. ఆయనే మిమ్మల్ని భూమండలానికి ఖలీఫాలుగా చేశాడు, మీలో కొందరికి కొందరిపై ఉన్నత స్థానాలను ప్రసాదించాడు, మీకు ఇచ్చిన దానితోనే మిమ్మల్ని పరీక్షించాలని. నిస్సందేహంగా మీ ప్రభువు శిక్షించటంలో కూడ వడిగలవాడు. ఎక్కువగా మన్నించేవాడు, కరుణించేవాడు కూడా.

47. అసలు ఇక్కడ "నుసుక్" అనే పదం ఉపయోగించబడింది. 'జంతుబలి' అని కూడా దానికి అర్థం. అది దాస్యం, ఆరాధన యొక్క ఇతర అన్ని రూపాలకు కూడా వర్తిస్తుంది.

48. అంటే, ప్రతి మనిషి తన కర్మలకు తానే బాధ్యుడు. ఒకరి కర్మల భారం మరొకరిపై ఉండదు.

ఆయతులు 206 | 7. అల్ ఆరాఫ్ | అవతరణ మక్కాలో

۷ سُوْرَةُ الْاَعْرَافِ مَكِّيَّةٌ ۳۹

اٰيَاتُهَا ۲۰۶ | رُكُوْعَاتُهَا ۲۴

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

الٓمّٓصٓ ۚ ۱ كِتٰبٌ اُنْزِلَ اِلَيْكَ فَلَا يَكُنْ فِيْ صَدْرِكَ حَرَجٌ مِّنْهُ لِتُنْذِرَ بِهٖ وَ ذِكْرٰى لِلْمُؤْمِنِيْنَ ۲ اِتَّبِعُوْا مَاۤ اُنْزِلَ اِلَيْكُمْ مِّنْ رَّبِّكُمْ وَ لَا تَتَّبِعُوْا مِنْ دُوْنِهٖۤ اَوْلِيَآءَ ؕ قَلِيْلًا مَّا تَذَكَّرُوْنَ ۳ وَ كَمْ مِّنْ قَرْيَةٍ اَهْلَكْنٰهَا فَجَآءَهَا بَاْسُنَا بَيَاتًا اَوْ هُمْ قَآئِلُوْنَ ۴ فَمَا كَانَ دَعْوٰىهُمْ اِذْ جَآءَهُمْ بَاْسُنَاۤ اِلَّاۤ اَنْ قَالُوْۤا اِنَّا كُنَّا ظٰلِمِيْنَ ۵ فَلَنَسْـَٔلَنَّ الَّذِيْنَ اُرْسِلَ اِلَيْهِمْ وَ لَنَسْـَٔلَنَّ الْمُرْسَلِيْنَ ۙ ۶ فَلَنَقُصَّنَّ عَلَيْهِمْ بِعِلْمٍ وَّ مَا كُنَّا غَآئِبِيْنَ ۷ وَ الْوَزْنُ يَوْمَئِذِ الْحَقُّ ۚ فَمَنْ ثَقُلَتْ مَوَازِيْنُهٗ فَاُولٰٓئِكَ هُمُ الْمُفْلِحُوْنَ ۸ وَ مَنْ خَفَّتْ مَوَازِيْنُهٗ فَاُولٰٓئِكَ الَّذِيْنَ خَسِرُوْۤا اَنْفُسَهُمْ بِمَا كَانُوْا بِاٰيٰتِنَا يَظْلِمُوْنَ ۹

**1 – 2** అలిఫ్ లామ్ మీమ్ సాద్. ఇది ఒక గ్రంథం, నీ వైపునకు అవతరింపచెయ్యబడింది. కనుక ప్రవక్తా! దీనిని గురించి నీ మనస్సులో ఏ సంకోచమూ[1] ఉండకూడదు. దీని అవతరణ ఉద్దేశ్యం – నీవు దీనిద్వారా (తిరస్కారులను) భయపెట్టాలనీ, ఇది విశ్వాసులకు హితోపదేశం కావాలనీ.

**3** ప్రజలారా! మీ ప్రభువు తరఫు నుండి మీపై అవతరింపచెయ్యబడిన దానిని అనుసరించండి. మీ ప్రభువును త్రోసిరాజని ఇతర సంరక్షకులను అనుసరించకండి – కాని మీరు హితబోధను స్వీకరించటం అరుదు.

**4 – 5** మేము నాశనం చేసిన నగరాలు ఎన్నో ఉన్నాయి. వాటిపై మా శిక్ష రాత్రి సమయంలో హఠాత్తుగా విరుచుకు పడింది లేక పట్టపగలు వారు విశ్రాంతి తీసుకుంటూ ఉండగా వచ్చిపడింది. వారిపై మా శిక్ష వచ్చిపడినప్పుడు, "మేము నిజంగానే దుర్మార్గులం" అనే రోదన తప్ప వారి నోటినుండి మరేమీ రాలేదు.

**6 – 9** కనుక ఇది తప్పకుండా జరుగవలసి ఉంది: మేము ఎవరి వద్దకు ప్రవక్తలను పంపామో, వారిని మేము లెక్క అడుగుతాము. ఇంకా ప్రవక్తలను కూడా అడుగుతాము (వారు సందేశాన్ని అందజేసే తమ విధిని ఎంతవరకు నిర్వహించారు అనీ, దానికి లభించిన సమాధానం ఏమిటీ అనీ). తరువాత స్వయంగా మేమే జరిగిన మొత్తం గాథను పూర్తి జ్ఞానంతో వారి ముందు పెడతాము. అసలు మేము ఎక్కడా లేకుండా ఉండలేదుగదా! బరువు ఆ రోజున సత్యమే అవుతుంది.[2] ఎవరి త్రాసు పళ్ళాలు బరువుగా ఉంటాయో వారే సాఫల్యం పొందేవారు. ఎవరి త్రాసు పళ్ళాలు తేలికగా ఉంటాయో వారే తమను తాము నష్టానికి గురిచేసుకునేవారు. ఎందుకంటే, వారు ఆయతుల పట్ల దుర్మార్గంగా ప్రవర్తిస్తూ ఉండేవారు.

وَ لَقَدْ مَكَّنّٰكُمْ فِي الْاَرْضِ وَ جَعَلْنَا لَكُمْ فِيْهَا
مَعَايِشَ ؕ قَلِيْلًا مَّا تَشْكُرُوْنَ ﴿۱۰﴾ وَلَقَدْ ع ۸
خَلَقْنٰكُمْ ثُمَّ صَوَّرْنٰكُمْ ثُمَّ قُلْنَا لِلْمَلٰٓئِكَةِ
اسْجُدُوْا لِاٰدَمَ ۖ فَسَجَدُوْٓا اِلَّآ اِبْلِيْسَ ؕ لَمْ
يَكُنْ مِّنَ السّٰجِدِيْنَ ﴿۱۱﴾ قَالَ مَا مَنَعَكَ اَلَّا
تَسْجُدَ اِذْ اَمَرْتُكَ ؕ قَالَ اَنَا خَيْرٌ مِّنْهُ ۚ
خَلَقْتَنِيْ مِنْ نَّارٍ وَّ خَلَقْتَهٗ مِنْ طِيْنٍ ﴿۱۲﴾
قَالَ فَاهْبِطْ مِنْهَا فَمَا يَكُوْنُ لَكَ اَنْ تَتَكَبَّرَ
فِيْهَا فَاخْرُجْ اِنَّكَ مِنَ الصّٰغِرِيْنَ ﴿۱۳﴾ قَالَ
اَنْظِرْنِيْٓ اِلٰى يَوْمِ يُبْعَثُوْنَ ﴿۱۴﴾ قَالَ اِنَّكَ مِنَ
الْمُنْظَرِيْنَ ﴿۱۵﴾ قَالَ فَبِمَآ اَغْوَيْتَنِيْ لَاَقْعُدَنَّ
لَهُمْ صِرَاطَكَ الْمُسْتَقِيْمَ ﴿۱۶﴾ ثُمَّ لَاٰتِيَنَّهُمْ مِّنْ
بَيْنِ اَيْدِيْهِمْ وَ مِنْ خَلْفِهِمْ وَ عَنْ اَيْمَانِهِمْ
وَ عَنْ شَمَآئِلِهِمْ ؕ وَ لَا تَجِدُ اَكْثَرَهُمْ
شٰكِرِيْنَ ﴿۱۷﴾ قَالَ اخْرُجْ مِنْهَا مَذْءُوْمًا
مَّدْحُوْرًا ؕ لَمَنْ تَبِعَكَ مِنْهُمْ لَاَمْلَئَنَّ
جَهَنَّمَ مِنْكُمْ اَجْمَعِيْنَ ﴿۱۸﴾ وَيٰٓاٰدَمُ اسْكُنْ اَنْتَ
وَ زَوْجُكَ الْجَنَّةَ فَكُلَا مِنْ حَيْثُ شِئْتُمَا وَ لَا
تَقْرَبَا هٰذِهِ الشَّجَرَةَ فَتَكُوْنَا مِنَ الظّٰلِمِيْنَ ﴿۱۹﴾

**10** మేము మిమ్మల్ని ధరణిపై అధికారాలతో వసింపజేశాము. ఇక్కడ మీ కొరకు ఉపాధి వసతులను ఏర్పాటుచేశాము. కాని మీరు కృతజ్ఞులు కావటం అనేది అరుదు.

**11** మేము మీ సృష్టిక్రియను ప్రారంభించాము. తరువాత మీ రూపాన్ని తీర్చిదిద్దాము. పిదప ఆదముకు సాష్టాంగపడండి అని దైవదూతలను ఆజ్ఞాపించాము. ఈ ఆదేశానుసారం అందరూ సాష్టాంగపడ్డారు. కాని ఇబ్లీసు సాష్టాంగపడేవారిలో చేరలేదు.[3]

**12 - 19** అల్లాహ్, "నిన్ను నేను ఆదేశించినప్పటికీ సాష్టాంగ పడకుండా నిన్ను ఏ విషయం నిరోధించింది?" అని అడిగాడు. ఇలా పలికాడు: "నేను అతడికంటే శ్రేష్ఠుణ్ణి. నీవు నన్ను అగ్నితో సృష్టించావు. అతణ్ణి మట్టితో." ఇలా సెలవిచ్చాడు: "సరే, అయితే ఇక్కణ్ణుంచి కిందకు దిగు. ఇక్కడ నీ గొప్పతనాన్ని గురించి గర్వపడే హక్కు నీకు లేదు. వెళ్ళిపో. వాస్తవానికి నీవు తమ పరాభవాన్ని తామే కోరుకునే వారిలోని వాడవు."[4] ఇలా అన్నాడు: "వారందరూ మళ్ళీ లేపబడే రోజు వరకు నాకు వ్యవధినివ్వు." ఇలా సెలవిచ్చాడు: "నీకు వ్యవధి ఉంటుంది." ఇలా అన్నాడు: "అలాగే, నీవు నన్ను మార్గభ్రష్టత్వానికి గురిచేసినట్లు నేను కూడా నీ రుజుమార్గంపై ఈ మానవుల కొరకు మాటువేసి కూర్చుంటాను. వెనుకా, ముందూ, కుడీ, ఎడమా అన్ని వైపుల నుండీ వారిని చుట్టుముట్టుతాను. వారిలో అధిక సంఖ్యాకులను కృతజ్ఞులుగా చూడవు." ఇలా సెలవిచ్చాడు: "వెళ్ళిపో ఇక్కణ్ణుంచి, నీచుడవై, తిరస్కృతుడవై. వారిలో నిన్ను అనుసరించే వారందరితో నిన్ను కలిపి నరకాన్ని నింపుతాను. దీనిని నమ్ము. ఆదమ్! నీవూ, నీ భార్యా, ఇద్దరూ ఈ స్వర్గంలో నివసించండి. ఎక్కడ ఏ వస్తువును మీ మనస్సు కోరినా దానిని తినండి. కాని ఈ వృక్షం దరిదాపులకు కూడా పోవద్దు. ఒకవేళ పోయినట్లయితే దుర్మార్గులలో కలసిపోతారు."

1. అంటే, ఏ విధమైన సంకోచమూ, భయమూ లేకుండా దానిని ప్రజలకు అందజెయ్యి. ఇంకా విరోధులు దానికి ఎలా ప్రతిస్పందిస్తారు అనే విషయాన్ని లెక్కచెయ్యకు.
2. అంటే, ఆ రోజున దేవుని న్యాయపు తరాజులో సత్యం తప్ప మరేవస్తువూ బరువైనదిగా ఉండదు. బరువుతప్ప మరే

فَوَسْوَسَ لَهُمَا الشَّيْطٰنُ لِيُبْدِيَ لَهُمَا مَاوٗرِيَ
عَنْهُمَا مِنْ سَوْاٰتِهِمَا وَقَالَ مَا نَهٰكُمَا رَبُّكُمَا
عَنْ هٰذِهِ الشَّجَرَةِ اِلَّآ اَنْ تَكُوْنَا مَلَكَيْنِ اَوْ
تَكُوْنَا مِنَ الْخٰلِدِيْنَ ۝٢٠ وَقَاسَمَهُمَآ اِنِّيْ لَكُمَا
لَمِنَ النّٰصِحِيْنَ ۝٢١ فَدَلّٰىهُمَا بِغُرُوْرٍ ۚ فَلَمَّا
ذَاقَا الشَّجَرَةَ بَدَتْ لَهُمَا سَوْاٰتُهُمَا وَطَفِقَا
يَخْصِفٰنِ عَلَيْهِمَا مِنْ وَّرَقِ الْجَنَّةِ ۖ وَنَادٰىهُمَا
رَبُّهُمَآ اَلَمْ اَنْهَكُمَا عَنْ تِلْكُمَا الشَّجَرَةِ وَ
اَقُلْ لَّكُمَآ اِنَّ الشَّيْطٰنَ لَكُمَا عَدُوٌّ مُّبِيْنٌ ۝٢٢
قَالَا رَبَّنَا ظَلَمْنَآ اَنْفُسَنَا ۫ وَاِنْ لَّمْ تَغْفِرْ لَنَا
وَتَرْحَمْنَا لَنَكُوْنَنَّ مِنَ الْخٰسِرِيْنَ ۝٢٣ قَالَ
اهْبِطُوْا بَعْضُكُمْ لِبَعْضٍ عَدُوٌّ ۚ وَلَكُمْ فِي
الْاَرْضِ مُسْتَقَرٌّ وَّمَتَاعٌ اِلٰى حِيْنٍ ۝٢٤ قَالَ
فِيْهَا تَحْيَوْنَ وَفِيْهَا تَمُوْتُوْنَ وَمِنْهَا
تُخْرَجُوْنَ ۝٢٥ ع

**20 - 25** తరువాత షైతాను వారిని మాయకు లోనుచేశాడు, ఒకరిని మరొకరికి గుప్తంగా ఉన్న వారి మర్మాంగాలను వారికి బహిర్గతం చేసేందుకు. వాడు వారితో ఇలా అన్నాడు: "మీ ప్రభువు మిమ్మల్ని ఈ వృక్షం వద్దకు పోవద్దని వారించటానికి కారణం, మీరు దైవదూతలు అయిపోతారేమో అనేదీ, లేక మీకు శాశ్వతమైన జీవితం లభిస్తుందేమో అనేదీ తప్ప మరొకటి కాదు." ఇంకా వాడు ప్రమాణం చేసి వారితో ఇలా అన్నాడు: "నేను మీ నిజమైన శ్రేయోభిలాషిని." ఈ విధంగా మోసంచేసి అతడు వారిద్దరినీ క్రమక్రమంగా తన పన్నుగడ వైపునకు త్రిప్పుకున్నాడు. చివరకు వారు ఆ వృక్షాన్ని రుచి చూడగానే, వారి ఆచ్ఛాదనలు వారిముందే తొలగిపోయాయి. అప్పుడు వారు తమ శరీరాలను స్వర్గంలోని ఆకులతో కప్పుకోసాగారు. తరువాత వారి ప్రభువు వారిని పిలిచి ఇలా అన్నాడు: "నేను ఆ చెట్టువద్దకు పోవద్దని మిమ్మల్ని వారించలేదా? షైతాను మీకు బహిరంగ శత్రువని చెప్పలేదా?" వారు ఉభయులూ ఇలా వేడుకున్నారు: "ప్రభూ! మాకు మేము అన్యాయం చేసుకున్నాము. నీవు గనక మమ్మల్ని మన్నించకపోతే, కనికరించకపోతే మేము నిశ్చయంగా సర్వనాశనం అయిపోతాము."[5] ఇలా అన్నాడు: "దిగిపోండి, మీరు ఒకరికొకరు శత్రువులు. ఒక నిర్ణీతకాలం వరకు మీకు భూమిలోనే నివాసమూ ఉపాధి సదుపాయాలూ ఉంటాయి." ఇంకా ఇలా అన్నాడు: "మీరు అక్కడే జీవిస్తారు. అక్కడే మరణిస్తారు. అక్కడినుంచే చివరకు తీయబడతారు."

వస్తువూ సత్యం కాదు. ఎవరిలో ఎంత సత్యం ఉంటుందో, అతడు అంతే బరువైనవాడుగా ఉంటాడు. తీర్పు ఏది జరిగినా బరువును బట్టే జరుగుతుంది. ఏ ఇతర వస్తువునూ ఎంతమాత్రం పట్టించుకోవడం జరగదు.

3. ఇబ్లీస్ దైవదూతలలోనివాడు అని దీని భావం కాదు. అసలు భూమండల వ్యవహారాలను నిర్వహించే దైవదూతలకు ఆదము (అస్సలామ్) ముందు సాష్టాంగపడండి అనే ఆజ్ఞ ఇవ్వటం అనే దాని అర్థం ఏమిటంటే, దైవదూతల నిర్వహణ క్రింద ఉన్న సృష్టితాలు యావత్తూ ఆదము (అస్సలామ్)కు విధేయులు కావాలని. ఈ సృష్టితాలలో కేవలం ఇబ్లీసు ముందుకు వచ్చి తాను ఆదము (అస్సలామ్)కు సజ్దా చెయ్యనని ప్రకటించాడు.

4. అసలు 'సాగిరీన్' అనే పదం ఉపయోగించబడింది. సాగిర్ అంటే అర్థం "అర్రాజీ బిజ్జుల్" అంటే నీచత్వాన్నీ, అల్పత్వాన్నీ, హీనస్థితినీ స్వయంగా స్వీకరించిన వ్యక్తి. కనుక అల్లాహ్ వాక్కు భావం ఏమిటంటే, దాసుడవూ సృష్టింపబడిన వాడవూ అయికూడా, నీవు నీ గొప్పతనాన్ని గురించి గర్వపడుతున్నావు అంటే అర్థం, నీవే స్వయంగా నీచుడవు కాగోరుతున్నావన్నమాట.

5. దీనిద్వారా తెలిసిందేమిటంటే, మానవునిలో సిగ్గూ బిడియం అనేది ఒక సహజసిద్ధమైన భావం. మానవుడు తన

**26 - 27** ఆదము సంతానమా! మేము మీపై దుస్తులను అవతరింప జేశాము. అవి మీరు సిగ్గుపడే మీ శరీర భాగాలను కప్పుతాయి. మీ శరీర రక్షణకు శోభకు సాధనంగా ఉంటాయి. భయభక్తులు అనే దుస్తులే మంచి దుస్తులు. ఇది అల్లాహ్ సూచనలలోని ఒక సూచన. బహుశా ప్రజలు దీనిద్వారా గుణపాఠం నేర్చుకుంటారేమో! ఆదము సంతానమా! షైతాను మీ మాతా పితరులను స్వర్గం నుంచి బహిష్కరింపజేశాడు. వారి మర్మాంగాలు ఒకరివి ఒకరికి బహిర్గతం కావటానికి వారి వస్త్రాలను, వారిపైనుండి తొలగింపచేశాడు. అదేవిధంగా మిమ్మల్ని మళ్ళీ వాడు ఆపదకు గురి చెయ్యటం అనేది జరగ కూడదు. అతడూ, అతడి సహచరులూ, మీరు వారిని చూడలేని ప్రదేశం నుండి మిమ్మల్ని చూస్తారు. మేము ఈ షైతాను లను విశ్వసించని వారికి సంరక్షకులుగా చేశాము.

**28 - 30** ఏదైనా సిగ్గుమాలిన పనిచేసినప్పుడు, ఈ ప్రజలు ఏమంటారంటే, "ఈ పద్ధతినే మా తాత ముత్తాతలు అవలం బిస్తూ ఉండగా మేము చూశాము. ఇలా చెయ్యండి అని అల్లాహ్యే మమ్మల్ని ఆదేశించాడు."[6] వారితో ఇలా అను: "సిగ్గుమాలిన పనిని అల్లాహ్ ఎన్నటికీ ఆదేశించడు. అల్లాహ్ తరఫు నుండి వచ్చాయని మీకు తెలియని ఆ విషయాలను మీరు అల్లాహ్ పేరుతో ప్రకటిస్తున్నారేమిటి?" ప్రవక్తా! వారితో ఇలా అను: "నా ప్రభువు సత్యాన్నీ, న్యాయాన్నీ ఆదేశించాడు. ఇంకా ఆయన ఆజ్ఞ ఏమిటంటే, మీరు ప్రతి ఆరాధనలో మీ దిక్కును సరిగ్గా అమర్చుకోండి, ఆయననే వేడుకోండి, మీ ధర్మాన్ని ఆయన కొరకే ప్రత్యేకం చేసుకుని. ఆయన మిమ్మల్ని ఇప్పుడు పుట్టించిన విధంగానే మీరు మళ్ళీ పుట్టించబడతారు. ఒక వర్గానికి ఆయన రుజుమార్గం చూపించాడు. కాని రెండో వర్గానికి మార్గభ్రష్టత్వం బాగా సరిపోయింది. ఎందుకంటే, వారు అల్లాహ్కు బదులుగా షైతానులను తమ సంరక్షకులుగా ఎన్నుకున్నారు. అయినా "మేము రుజుమార్గంలో ఉన్నాము" అని వారు భావిస్తున్నారు.

يٰبَنِيْٓ اٰدَمَ قَدْ اَنْزَلْنَا عَلَيْكُمْ لِبَاسًا يُّوَارِيْ
سَوْاٰتِكُمْ وَرِيْشًا ؕ وَ لِبَاسُ التَّقْوٰى ۙ ذٰلِكَ
خَيْرٌ ؕ ذٰلِكَ مِنْ اٰيٰتِ اللّٰهِ لَعَلَّهُمْ
يَذَّكَّرُوْنَ ﴿٢٦﴾ يٰبَنِيْٓ اٰدَمَ لَا يَفْتِنَنَّكُمُ الشَّيْطٰنُ
كَمَآ اَخْرَجَ اَبَوَيْكُمْ مِّنَ الْجَنَّةِ يَنْزِعُ عَنْهُمَا
لِبَاسَهُمَا لِيُرِيَهُمَا سَوْاٰتِهِمَا ؕ اِنَّهٗ يَرٰىكُمْ هُوَ
وَ قَبِيْلُهٗ مِنْ حَيْثُ لَا تَرَوْنَهُمْ ؕ اِنَّا جَعَلْنَا
الشَّيٰطِيْنَ اَوْلِيَآءَ لِلَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ ﴿٢٧﴾ وَ اِذَا
فَعَلُوْا فَاحِشَةً قَالُوْا وَجَدْنَا عَلَيْهَآ اٰبَآءَنَا وَ
اللّٰهُ اَمَرَنَا بِهَا ؕ قُلْ اِنَّ اللّٰهَ لَا يَاْمُرُ بِالْفَحْشَآءِ ؕ
اَتَقُوْلُوْنَ عَلَى اللّٰهِ مَا لَا تَعْلَمُوْنَ ﴿٢٨﴾ قُلْ اَمَرَ
رَبِّيْ بِالْقِسْطِ ۟ وَ اَقِيْمُوْا وُجُوْهَكُمْ عِنْدَ كُلِّ
مَسْجِدٍ وَّادْعُوْهُ مُخْلِصِيْنَ لَهُ الدِّيْنَ ؕ كَمَا
بَدَاَكُمْ تَعُوْدُوْنَ ﴿٢٩﴾ فَرِيْقًا هَدٰى وَ فَرِيْقًا حَقَّ
عَلَيْهِمُ الضَّلٰلَةُ ؕ اِنَّهُمُ اتَّخَذُوا الشَّيٰطِيْنَ
اَوْلِيَآءَ مِنْ دُوْنِ اللّٰهِ وَيَحْسَبُوْنَ اَنَّهُمْ
مُّهْتَدُوْنَ ﴿٣٠﴾

---

శరీరం యొక్క ప్రత్యేక భాగాలను ఇతరుల ముందు బహిర్గతం చెయ్యటానికి సహజంగా సిగ్గుపడటమే అతని ఈ భావానికి ప్రథమ రూపం. ఇందుకనే షైతాను అతణ్ణి మానవ నైజపు సరళ మార్గం నుండి తొలగించటానికి ప్రయోగించిన మొదటి అస్త్రం, అతని సిగ్గుపడే ఈ భావాన్ని దెబ్బతీయటం, ఇంకా నగ్నత మార్గంద్వారా అతని కొరకు అశ్లీలానికి ద్వారాలను తెరవటం, ఇంకా అతన్ని కామ వ్యవహారాలలో దుర్వర్తనుడుగా చెయ్యటం. దీనిద్వారా

يٰبَنِيْٓ اٰدَمَ خُذُوْا زِيْنَتَكُمْ عِنْدَ كُلِّ مَسْجِدٍ وَّ
كُلُوْا وَ اشْرَبُوْا وَ لَا تُسْرِفُوْا ۚ اِنَّهٗ لَا يُحِبُّ
الْمُسْرِفِيْنَ ۝٣١ قُلْ مَنْ حَرَّمَ زِيْنَةَ اللّٰهِ الَّتِيْٓ
اَخْرَجَ لِعِبَادِهٖ وَ الطَّيِّبٰتِ مِنَ الرِّزْقِ ؕ قُلْ
هِيَ لِلَّذِيْنَ اٰمَنُوْا فِي الْحَيٰوةِ الدُّنْيَا خَالِصَةً
يَّوْمَ الْقِيٰمَةِ ؕ كَذٰلِكَ نُفَصِّلُ الْاٰيٰتِ لِقَوْمٍ
يَّعْلَمُوْنَ ۝٣٢ قُلْ اِنَّمَا حَرَّمَ رَبِّيَ الْفَوَاحِشَ
مَا ظَهَرَ مِنْهَا وَ مَا بَطَنَ وَ الْاِثْمَ وَ الْبَغْيَ
بِغَيْرِ الْحَقِّ وَ اَنْ تُشْرِكُوْا بِاللّٰهِ مَا لَمْ يُنَزِّلْ
بِهٖ سُلْطٰنًا وَّاَنْ تَقُوْلُوْا عَلَى اللّٰهِ مَا لَا
تَعْلَمُوْنَ ۝٣٣

ع ١٠

**31** ఆదము సంతానమా! ప్రతి ఆరాధనా సమయంలో మీ వస్త్రాలంకరణ పట్ల శ్రద్ధ వహించండి.[7] తినండి, త్రాగండి, మితిమీరకండి. అల్లాహ్ మితిమీరేవారిని ప్రేమించడు.

**32** ప్రవక్తా! వారితో ఇలా అను: "అల్లాహ్ తన దాసుల కొరకు ఉద్భవింపజేసిన మంచి వస్త్రాలను ఎవరు నిషేధించారు? ఇంకా అల్లాహ్ ప్రసాదించిన పరిశుద్ధ వస్తువులను నిషేధించింది ఎవరు?" ఇలా అను: ఈ వస్తువులన్నీ ఇహలోక జీవితంలో కూడా విశ్వాసుల కొరకే, ప్రళయంనాడు ప్రత్యేకంగా వారికొరకు మాత్రమే. జ్ఞానం కలవారి కొరకు ఈ విధంగా మేము మా మాటలను స్పష్టంగా చెబుతున్నాము.

**33** ప్రవక్తా! వారితో ఇలా అను: "నా ప్రభువు నిషేధించినవి ఇవి : సిగ్గుమాలిన పనులు - బహిరంగమైనవి కాని, లేక గుప్తమైనవి కాని - పాపాలు[8] సత్యానికి వ్యతిరేకంగా మేరమీరటం,[9] అల్లాహ్ ఏ ప్రమాణాన్నీ అవతరింపజేయక పోయినా మీరు ఇతరులను అల్లాహ్‌కు భాగస్వాములుగా కల్పించటం (వాస్తవంగా అల్లాహ్‌యే అన్నాడని) మీకు తెలియని విషయాన్ని మీరు అల్లాహ్ పేరుతో చెప్పటం."

---

ఇంకా తెలిసిందేమిటంటే, మానవునిలో ఉన్నత స్థితికి చేరుకోవాలనే ఒక ప్రకృతి సహజమైన తృష్ణ కూడా ఉంది. ఇందుకనే అతని ముందుకు షైతాను శ్రేయోభిలాషి రూపంలో రావలసి వచ్చింది. "నిన్ను మరీ ఉన్నతమైన స్థితి వైపునకు తీసుకుపోవాలని ఉంది" అని అనవలసి వచ్చింది. ఇంకా దీనిద్వారా తెలిసిన మరొక విషయం ఏమిటంటే, షైతానుకు ప్రతికూలంగా మానవుణ్ణి ఉత్తముడుగా తీర్చిదిద్దే అతని అసలైన గుణం ఏమిటంటే, అతడు తప్పు చేసినప్పుడు పశ్చాత్తాపపడతాడు, క్షమించు అని అల్లాహ్‌ను ప్రార్థిస్తాడు. దీనికి భిన్నంగా, షైతానును నీచుడుగా, అవమానితుడుగా చేసిన విషయం ఏమిటంటే, వాడు తప్పుచేసి అల్లాహ్ సమక్షంలో ఎదురు పలికాడు. తిరుగుబాటు ధోరణిని అవలంబించాడు.

6. ఇది అరబ్బుల నగ్న ప్రదక్షిణను సూచిస్తుంది. వారిలో చాలామంది హజ్ సమయంలో దిగంబరులై కాబా ప్రదక్షిణం చేసేవారు. ఇంకా వారి స్త్రీలు ఈ వ్యవహారంలో తమ పురుషులకంటే కూడా ఎక్కువగా సిగ్గులేకుండా ప్రవర్తించేవారు. వారి దృష్టిలో ఇది ఒక ధర్మకార్యం. దీన్ని పుణ్యకార్యంగా భావించి చేసేవారు.

7. ఇక్కడ వస్త్రాలంకరణ అంటే పూర్తి దుస్తులు అని భావం. దైవారాధనలో నిలబడటానికి మనిషి కేవలం తన 'సత్ర్' (షరీయత్ ప్రకారం కప్పి ఉంచవలసిన శరీర భాగాలు)ను కప్పుకోవటమే చాలదు. దానితోపాటు శక్తిమేరకు అతడు తన దుస్తులను పూర్తిగా ధరించటం కూడా అవసరమే. వాటివల్ల సత్ర్ కూడా కప్పబడాలి, అలంకరణ కూడా కావాలి. మనిషి గౌరవపాత్రుడైన వ్యక్తిని ఎవరినైనా కలుసుకోవటానికి పోయేటప్పుడు మంచి దుస్తులను ధరించేవిధంగా, దైవారాధన కొరకు కూడా అతడు మంచి దుస్తులను ధరించాలి.

8. అసలు "ఇస్మున్" అనే పదం ఉపయోగించబడింది. దాని అసలు అర్థం, అలక్ష్యం. దీని భావం ఏమిటంటే, మనిషి తన ప్రభువుకు విధేయత చూపటంలోనూ, ఆయన ఆజ్ఞలను పాలించటంలోనూ అలక్ష్యం చెయ్యటం.

9. అంటే, తన హద్దులను అతిక్రమించి, తనకు ప్రవేశించే హక్కులేని హద్దులలో అడుగుపెట్టటం.

وَ لِكُلِّ اُمَّةٍ اَجَلٌ ۚ فَاِذَا جَآءَ اَجَلُهُمْ لَا يَسْتَاْخِرُوْنَ سَاعَةً وَّ لَا يَسْتَقْدِمُوْنَ ﴿٣٤﴾ يٰبَنِيْۤ اٰدَمَ اِمَّا يَاْتِيَنَّكُمْ رُسُلٌ مِّنْكُمْ يَقُصُّوْنَ عَلَيْكُمْ اٰيٰتِيْ ۙ فَمَنِ اتَّقٰى وَ اَصْلَحَ فَلَا خَوْفٌ عَلَيْهِمْ وَ لَا هُمْ يَحْزَنُوْنَ ﴿٣٥﴾ وَ الَّذِيْنَ كَذَّبُوْا بِاٰيٰتِنَا وَاسْتَكْبَرُوْا عَنْهَاۤ اُولٰٓئِكَ اَصْحٰبُ النَّارِ ۚ هُمْ فِيْهَا خٰلِدُوْنَ ﴿٣٦﴾ فَمَنْ اَظْلَمُ مِمَّنِ افْتَرٰى عَلَى اللّٰهِ كَذِبًا اَوْ كَذَّبَ بِاٰيٰتِهٖ ؕ اُولٰٓئِكَ يَنَالُهُمْ نَصِيْبُهُمْ مِّنَ الْكِتٰبِ ؕ حَتّٰۤى اِذَا جَآءَتْهُمْ رُسُلُنَا يَتَوَفَّوْنَهُمْ ۙ قَالُوْۤا اَيْنَ مَا كُنْتُمْ تَدْعُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ ؕ قَالُوْا ضَلُّوْا عَنَّا وَشَهِدُوْا عَلٰۤى اَنْفُسِهِمْ اَنَّهُمْ كَانُوْا كٰفِرِيْنَ ﴿٣٧﴾ قَالَ ادْخُلُوْا فِيْۤ اُمَمٍ قَدْ خَلَتْ مِنْ قَبْلِكُمْ مِّنَ الْجِنِّ وَ الْاِنْسِ فِي النَّارِ ؕ كُلَّمَا دَخَلَتْ اُمَّةٌ لَّعَنَتْ اُخْتَهَا ؕ حَتّٰۤى اِذَا ادَّارَكُوْا فِيْهَا جَمِيْعًا ۙ قَالَتْ اُخْرٰىهُمْ لِاُوْلٰىهُمْ رَبَّنَا هٰۤؤُلَآءِ اَضَلُّوْنَا فَاٰتِهِمْ عَذَابًا ضِعْفًا مِّنَ النَّارِ ؕ۬ قَالَ لِكُلٍّ ضِعْفٌ وَّ لٰكِنْ لَّا تَعْلَمُوْنَ ﴿٣٨﴾ وَ قَالَتْ اُوْلٰىهُمْ لِاُخْرٰىهُمْ فَمَا كَانَ لَكُمْ عَلَيْنَا مِنْ فَضْلٍ فَذُوْقُوا الْعَذَابَ بِمَا كُنْتُمْ تَكْسِبُوْنَ ﴿٣٩﴾ ع

**34 - 39** ప్రతి జాతికి ఒక గడువు నిర్ణయం అయివుంది. ఒక జాతి గడువు పూర్తి అయినప్పుడు, ఒక్క గడియకాలం కూడా అది వెనకా ముందూ అవటం సంభవించదు. (సృష్టి ప్రారంభంలోనే అల్లాహ్ ఈ విషయాన్ని స్పష్టం చేశాడు). ఆదము సంతానమా! జ్ఞాపకం ఉంచుకోండి, ఒకవేళ మీ వద్దకు స్వయంగా మీలోనుండే నా ఆయతులను వినిపించే ప్రవక్తలు వచ్చినప్పుడు, అవిధేయత నుండి తనను తాను కాపాడు కుంటూ తన వైఖరిని సంస్కరించుకునే వానికి భయంకానీ దుఃఖంకానీ కలిగే అవకాశం లేదు. ఇంకా మా ఆయతులు అసత్యాలని తిరస్కరించి వాటిపట్ల తలబిరుసు తనం ప్రదర్శించే వారే నరక నివాసులు అవుతారు. అక్కడే వారు శాశ్వతంగా ఉంటారు. పూర్తిగా అబద్ధాలైన విషయాలను సృష్టించి, అల్లాహ్‌కు ఆరోపించి లేక సత్యమైన అల్లాహ్ ఆయతులు అసత్యాలని తిరస్కరించే వాడిని మించిన దుర్మార్గుడెవడు? అటువంటి వారు తమ విధివ్రాత ప్రకారం తమ భాగాన్ని పొందుతూ ఉంటారు,[10] మేము పంపే దైవదూతలు వారి ఆత్మలను బంధించటానికి వచ్చే ఆ గడియ వరకు. అప్పుడు ఆ దూతలు వారిని ఇలా అడుగుతారు: "చెప్పండి, మీరు అల్లాహ్‌కు బదులుగా వేడుకునే ఆ ఆరాధ్యదైవాలు ఇప్పు డెక్కడున్నారు?" వారు ఇలా అంటారు: "వారంతా మా నుండి తప్పుకున్నారు." ఇంకా వారు "మేము నిజంగానే సత్య తిరస్కారులమే" అని తమకు వ్యతిరేకంగా తామే సాక్ష్యం ఇస్తారు. అల్లాహ్ ఇలా సెలవిస్తాడు: "పోండి, మీకు పూర్వం గతించిన జిన్నాతుల వర్గమూ మానవుల వర్గమూ పోయి చేరిన ఆ నరకానికే మీరూ పోండి." ప్రతి వర్గమూ, అది నరకంలో ప్రవేశించేటప్పుడు తన పూర్వపు వర్గాన్ని శపిస్తూ ప్రవేశిస్తుంది. చివరకు వారంతా అక్కడకు చేరినప్పుడు, తరువాత వచ్చిన ప్రతివర్గమూ తన పూర్వపు వర్గాన్ని గురించి ఇలా అంటుంది: "ప్రభూ! మమ్మల్ని మార్గభ్రష్టులుగా చేసినవారు వీరే. కనుక వీరికి రెట్టింపు అగ్ని శిక్ష విధించు." సమాధానంగా ఇలా అనబడుతుంది: "ప్రతివాడికీ రెట్టింపు శిక్షే పడుతుంది. కాని అది మీకు తెలియదు."[11] మొదటివర్గం రెండో వర్గంతో ఇలా అంటుంది: "(మేము గనక నిందార్హులమే అయితే) మీరు మాత్రం మా కంటే ఏ విషయంలో మెరుగు, ఇక మీరు మీ సంపాదనకు ఫలితంగా శిక్షను చవిచూడండి."

إِنَّ الَّذِينَ كَذَّبُوا بِآيَاتِنَا وَاسْتَكْبَرُوا عَنْهَا لَا
تُفَتَّحُ لَهُمْ أَبْوَابُ السَّمَاءِ وَلَا يَدْخُلُونَ
الْجَنَّةَ حَتَّىٰ يَلِجَ الْجَمَلُ فِي سَمِّ الْخِيَاطِ ۚ
وَكَذَٰلِكَ نَجْزِي الْمُجْرِمِينَ ﴿٤٠﴾ لَهُمْ مِنْ جَهَنَّمَ
مِهَادٌ وَمِنْ فَوْقِهِمْ غَوَاشٍ ۚ وَكَذَٰلِكَ نَجْزِي
الظَّالِمِينَ ﴿٤١﴾ وَالَّذِينَ آمَنُوا وَعَمِلُوا
الصَّالِحَاتِ لَا نُكَلِّفُ نَفْسًا إِلَّا وُسْعَهَا
أُولَٰئِكَ أَصْحَابُ الْجَنَّةِ ۖ هُمْ فِيهَا خَالِدُونَ ﴿٤٢﴾
وَنَزَعْنَا مَا فِي صُدُورِهِمْ مِنْ غِلٍّ تَجْرِي
مِنْ تَحْتِهِمُ الْأَنْهَارُ ۖ وَقَالُوا الْحَمْدُ لِلَّهِ الَّذِي
هَدَانَا لِهَٰذَا وَمَا كُنَّا لِنَهْتَدِيَ لَوْلَا أَنْ
هَدَانَا اللَّهُ ۖ لَقَدْ جَاءَتْ رُسُلُ رَبِّنَا
بِالْحَقِّ ۖ وَنُودُوا أَنْ تِلْكُمُ الْجَنَّةُ
أُورِثْتُمُوهَا بِمَا كُنْتُمْ تَعْمَلُونَ ﴿٤٣﴾ وَنَادَىٰ الثلثة
أَصْحَابُ الْجَنَّةِ أَصْحَابَ النَّارِ أَنْ قَدْ وَجَدْنَا
مَا وَعَدَنَا رَبُّنَا حَقًّا فَهَلْ وَجَدْتُمْ مَا وَعَدَ
رَبُّكُمْ حَقًّا ۖ قَالُوا نَعَمْ ۚ فَأَذَّنَ مُؤَذِّنٌ بَيْنَهُمْ
أَنْ لَعْنَةُ اللَّهِ عَلَى الظَّالِمِينَ ﴿٤٤﴾ الَّذِينَ
يَصُدُّونَ عَنْ سَبِيلِ اللَّهِ وَيَبْغُونَهَا عِوَجًا
وَهُمْ بِالْآخِرَةِ كَافِرُونَ ﴿٤٥﴾ وقف لازم

**40 - 43** నమ్మండి! మా ఆయతులను తిరస్కరించినవారి కొరకూ వాటిపట్ల తలబిరుసుతనం ప్రదర్శించిన వారికొరకూ ఆకాశద్వారాలు ఎంతమాత్రం తెరువబడవు. సూది రంధ్రం గుండా ఒంటె పోవటం ఎంత అసంభవమో, వారు స్వర్గంలోకి పోవటం కూడా అంతే అసంభవం. అపరాధులకు మావద్ద ఇటువంటి ప్రతిఫలమే లభిస్తుంది. వారికి నరకమే పాన్పు, నరకమే దుప్పటి. మేము దుర్మార్గులకు ఇచ్చే ప్రతిఫలం ఇదే. దీనికి భిన్నంగా మా ఆయతులను విశ్వసించి మంచిపనులు చేసినవారు– ఈ విషయంలో మేము ప్రతి వ్యక్తి పైనా అతని శక్తిసామర్థ్యాలకు అనుగుణంగానే బాధ్యతను మోపుతాము – వారు స్వర్గనివాసులు. అక్కడ వారు సదా ఉంటారు. వారి మనస్సులలో పరస్పరం ఏ కాస్త శత్రుభావం ఉన్నా దాన్ని మేము తొలగిస్తాము. వారి క్రింద కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి. వారు ఇలా అంటారు: “మాకు ఈ మార్గం చూపిన అల్లాహ్‌కే స్తోత్రాలు. ఆయనే గనక మాకు మార్గం చూపి ఉండకపోయినట్లయితే స్వయంగా మేము మార్గం పొంది ఉండే వారము కాదు. మా ప్రభువుచే పంపబడిన ప్రవక్తలు వాస్తవంగా సత్యాన్నే తీసుకువచ్చారు.” అప్పుడు వారికి ఈ వాణి వినబడుతుంది: “మీరు వారసులుగా చేయబడిన ఈ స్వర్గం మీరు చేస్తూ ఉండిన పనులకు ప్రతిఫలంగా మీకు లభించింది.”

**44 - 45** తరువాత స్వర్గవాసులు నరకవాసులను పిలిచి ఇలా అంటారు: “మా ప్రభువు మాకు చేసిన వాగ్దానాలను అన్నింటినీ మేము సత్యమైనవిగా కనుగొన్నాము. మరి మీరు కూడా మీ ప్రభువు చేసిన వాగ్దానాలను సత్యమైనవిగా కనుగొన్నారా?” వారు జవాబుగా, “అవును” అని పలుకుతారు. అప్పుడు ప్రకటించే వాడొకడు వారిమధ్య ఇలా ప్రకటిస్తాడు: “ప్రజలను అల్లాహ్ మార్గం నుండి నిరోధించేవారూ, దానిని వక్రీకరించగోరేవారూ, పరలోకాన్ని తిరస్కరించేవారూ అయిన దుర్మార్గులపై అల్లాహ్ శాపం అవతరించుగాక.”

10. అంటే, ప్రపంచంలో వారి కొరకు ఎన్ని గడువుదినాలు నిర్ణయించబడి ఉన్నాయో, అన్ని దినాలు ఇక్కడ ఉంటారు. ఇంకా ఏ రకం జీవితం వారి అదృష్టంలో వ్రాయబడి ఉందో, అది పైకి చెడ్డదైనా మంచిదైనా దానిని వారు గడుపుతారు.

11. అంటే, ఒక శిక్ష స్వయంగా అపమార్గాన్ని అవలంబించినందుకు, రెండో శిక్ష ఇతరులను అపమార్గం పట్టించినందుకు.

وَبَيْنَهُمَا حِجَابٌ ۚ وَعَلَى الْاَعْرَافِ رِجَالٌ
يَّعْرِفُوْنَ كُلًّا بِسِيْمٰهُمْ ۚ وَ نَادَوْا اَصْحٰبَ
الْجَنَّةِ اَنْ سَلٰمٌ عَلَيْكُمْ ۣ لَمْ يَدْخُلُوْهَا وَ هُمْ
يَطْمَعُوْنَ ﴿٤٦﴾ وَ اِذَا صُرِفَتْ اَبْصَارُهُمْ تِلْقَآءَ
اَصْحٰبِ النَّارِ ۙ قَالُوْا رَبَّنَا لَا تَجْعَلْنَا مَعَ
الْقَوْمِ الظّٰلِمِيْنَ ﴿٤٧﴾ وَ نَادٰۤى اَصْحٰبُ ع ٥/٨ ١٢
الْاَعْرَافِ رِجَالًا يَّعْرِفُوْنَهُمْ بِسِيْمٰهُمْ قَالُوْا
مَاۤ اَغْنٰى عَنْكُمْ جَمْعُكُمْ وَ مَا كُنْتُمْ
تَسْتَكْبِرُوْنَ ﴿٤٨﴾ اَهٰۤؤُلَآءِ الَّذِيْنَ اَقْسَمْتُمْ لَا
يَنَالُهُمُ اللّٰهُ بِرَحْمَةٍ ؕ اُدْخُلُوا الْجَنَّةَ لَا خَوْفٌ
عَلَيْكُمْ وَلَاۤ اَنْتُمْ تَحْزَنُوْنَ ﴿٤٩﴾ وَ نَادٰۤى
اَصْحٰبُ النَّارِ اَصْحٰبَ الْجَنَّةِ اَنْ اَفِيْضُوْا
عَلَيْنَا مِنَ الْمَآءِ اَوْ مِمَّا رَزَقَكُمُ اللّٰهُ ؕ قَالُوْۤا
اِنَّ اللّٰهَ حَرَّمَهُمَا عَلَى الْكٰفِرِيْنَ ﴿٥٠﴾ ۙ الَّذِيْنَ
اتَّخَذُوْا دِيْنَهُمْ لَهْوًا وَّ لَعِبًا وَّغَرَّتْهُمُ الْحَيٰوةُ
الدُّنْيَا ۚ فَالْيَوْمَ نَنْسٰىهُمْ كَمَا نَسُوْا لِقَآءَ يَوْمِهِمْ
هٰذَا ۙ وَ مَا كَانُوْا بِاٰيٰتِنَا يَجْحَدُوْنَ ﴿٥١﴾

**46 - 49** ఈ ఉభయ వర్గాల మధ్య ఒక తెర అడ్డుగా నిలుస్తుంది. దాని యొక్క ఎత్తయిన ప్రదేశాల (ఆరాఫ్)పై మరికొందరు ప్రజలు ఉంటారు. వారు ప్రతి ఒకణ్ణీ అతని ముఖాకృతిని బట్టి గుర్తుపడతారు. స్వర్గవాసులను పిలిచి, "మీకు శాంతి కలుగుగాక" అని అంటారు. వారు స్వర్గంలోకి ప్రవేశించనేలేదు. కాని దానిని ఆశిస్తున్నారు.[12] వారి దృష్టి నరకవాసుల వైపునకు మళ్ళినప్పుడు ఇలా అంటారు: "ప్రభూ! మమ్మల్ని మటుకు ఈ దుర్మార్గులలో చేర్చకు." తరువాత ఎత్తైన ప్రదేశాలపై ఉన్న ఈ ప్రజలు నరకంలో ఉన్న కొందరు పెద్ద మనుషులను వారి ఆనవాళ్ళ ద్వారా గుర్తుపట్టి ఇలా అంటారు: "చూశారా మీరూ, మీ అనుచరవర్గాలు గానీ, మీరు గొప్పగా భావించిన ఆస్తిపాస్తులుగానీ, ఈ రోజు మీకు ఏ విధంగానూ పనికిరాలేదు గదా! మీరు 'వీరికి అల్లాహ్ తన కారుణ్యాన్ని ఏమాత్రం ప్రసాదించడు' అని ప్రమాణాలు చేసి అంటూ ఉండినవారే కదా ఈ స్వర్గ నివాసులు. ఈ రోజు వారితోనే 'స్వర్గంలో ప్రవేశించండి. మీకు భయంగాని దుఃఖంగాని లేదు' అని అనటం జరిగింది."

**50 - 51** నరకవాసులు స్వర్గవాసులతో ఇలా మొరపెట్టుకుంటారు : "కాస్త దయచేసి మాపై కొద్దిగా నీళ్ళు పోయండి, లేదా అల్లాహ్ మీకు ప్రసాదించిన ఆహారంలో నుంచైనా కొంత ఇటు విసరండి." వారు ఇలా సమాధానం చెబుతారు: "ఈ రెంటినీ అల్లాహ్ సత్యతిరస్కారులకు నిషేధించాడు. వారు తమ ధర్మాన్ని ఒక క్రీడగా, ఒక కాలక్షేపంగా చేసుకున్నారు. ఇంకా వారిని ఇహలోక జీవితం మోసానికి గురిచేసింది." అల్లాహ్ ఇలా సెలవిస్తాడు:"వారు ఈనాటి సమావేశాన్ని మరచి ఉండినవిధంగానే మా ఆయతులను తిరస్కరిస్తూ ఉండిన విధంగానే మేమూ వారిని ఈనాడు మరచిపోతాము."

---

ఒక శిక్ష నేరాలకు సంబంధించింది అయితే రెండో శిక్ష నేరప్రవృత్తిని వారసత్వంగా ఇతరుల కొరకు వదలి వచ్చినదానికి సంబంధించినది.

12. ఎత్తైన ప్రదేశాల (ఆరాఫ్)పై ఉండే ప్రజలు అంటే స్వర్గంలో ప్రవేశించటానికి దోహదం చేసే అంత బలమైన అనుకూల విషయం ఏదీ తమ జీవితాలలో లేనటువంటి, నరకంలో పడవేయటానికి వీలు కలిగించే అంత బలమైన వ్యతిరేక విషయం ఏదీ తమ జీవితాలలో లేనటువంటి ప్రజలు అని భావం. ఇందువల్ల వారు స్వర్గ నరకాల మధ్య ఒక సరిహద్దుపై ఉంటారు. వారు తమకు స్వర్గభాగ్యం కలుగుతుందని అల్లాహ్ అనుగ్రహం పట్ల ఆశతో ఉంటారు.

وَلَقَدْ جِئْنٰهُمْ بِكِتٰبٍ فَصَّلْنٰهُ عَلٰى عِلْمٍ هُدًى وَّ
رَحْمَةً لِّقَوْمٍ يُّؤْمِنُوْنَ ﴿٥٢﴾ هَلْ يَنْظُرُوْنَ اِلَّا
تَاْوِيْلَهٗ ؕ يَوْمَ يَاْتِيْ تَاْوِيْلُهٗ يَقُوْلُ الَّذِيْنَ
نَسُوْهُ مِنْ قَبْلُ قَدْ جَآءَتْ رُسُلُ رَبِّنَا
بِالْحَقِّ ۚ فَهَلْ لَّنَا مِنْ شُفَعَآءَ فَيَشْفَعُوْا لَنَآ
اَوْ نُرَدُّ فَنَعْمَلَ غَيْرَ الَّذِيْ كُنَّا نَعْمَلُ ؕ قَدْ
خَسِرُوْٓا اَنْفُسَهُمْ وَ ضَلَّ عَنْهُمْ مَّا كَانُوْا
يَفْتَرُوْنَ ﴿٥٣﴾ اِنَّ رَبَّكُمُ اللّٰهُ الَّذِيْ خَلَقَ
السَّمٰوٰتِ وَ الْاَرْضَ فِيْ سِتَّةِ اَيَّامٍ ثُمَّ
اسْتَوٰى عَلَى الْعَرْشِ ۫ يُغْشِي الَّيْلَ النَّهَارَ
يَطْلُبُهٗ حَثِيْثًا ۙ وَّ الشَّمْسَ وَالْقَمَرَ وَالنُّجُوْمَ
مُسَخَّرٰتٍۭ بِاَمْرِهٖ ؕ اَلَا لَهُ الْخَلْقُ وَ الْاَمْرُ ؕ
تَبٰرَكَ اللّٰهُ رَبُّ الْعٰلَمِيْنَ ﴿٥٤﴾ اُدْعُوْا رَبَّكُمْ
تَضَرُّعًا وَّ خُفْيَةً ؕ اِنَّهٗ لَا يُحِبُّ
الْمُعْتَدِيْنَ ﴿٥٥﴾ وَ لَا تُفْسِدُوْا فِي الْاَرْضِ
بَعْدَ اِصْلَاحِهَا وَادْعُوْهُ خَوْفًا وَّطَمَعًا ؕ اِنَّ
رَحْمَتَ اللّٰهِ قَرِيْبٌ مِّنَ الْمُحْسِنِيْنَ ﴿٥٦﴾

**52 - 53** మేము ఈ ప్రజల వద్దకు ఒక గ్రంథాన్ని తీసుకు వచ్చాము. దానిని మేము జ్ఞానం ఆధారంగా సవివరమైనదిగా చేశాము. అది విశ్వాసులకు మార్గదర్శకత్వం, కారుణ్యం. ఇక వీరు ఈ గ్రంథం తెలియజేసే ముగింపు కోసం కాక మరేదైనా విషయం కొరకు నిరీక్షిస్తున్నారా? ఆ ముగింపు వచ్చే రోజున దానిని నిర్లక్ష్యం చేస్తూ వచ్చినవారే ఇలా అంటారు: "యథార్థం గానే మా ప్రభువు పంపిన ప్రవక్తలు సత్యం తీసుకుని వచ్చారు. అయితే, మా కొరకు సిఫారసు చెయ్యటానికి, సిఫారసు దారు లెవరైనా మాకు లభిస్తారా? లేదా మేము మళ్ళీ తిరిగి పంప బడగలమా? పూర్వం మేము చేస్తూ ఉండిన దానికి బదులుగా, ఇప్పుడు మరొక పద్ధతి ప్రకారం పనిచేసి చూపించటానికి?"– వారు తమను తాము నష్టంలో పడవేసుకున్నారు. వారు సృష్టించిన అసత్యాలు సమస్తమూ ఈ రోజు వారినుండి తప్పుకున్నాయి.

**54 - 56** వాస్తవంగా మీ ప్రభువు అల్లాహ్‌యే. ఆయన ఆకాశాలనూ, భూమినీ ఆరుదినాలలో సృష్టించాడు.[13] తరువాత తన రాజ్యపీఠాన్ని అలంకరించాడు.[14] రాత్రిని పగటిపై కప్పివేస్తాడు. ఆ తరువాత పగలు రాత్రివెంట పరుగుతీస్తూ ఉంటుంది. ఇంకా ఆయన సూర్యుణ్ణి, చంద్రుణ్ణి, నక్షత్రాలను పుట్టించాడు. అన్నీ ఆయన ఆజ్ఞకు కట్టుబడి ఉన్నాయి. తెలుసుకోండి, సృష్టి ఆయనదే. దానిపై ఆధిపత్యమూ ఆయనదే.[15] అల్లాహ్ అనంతమైన శుభాలు కలవాడు.[16] సకల లోకాలకు ప్రభువు, స్వామి. మీ ప్రభువును వేడుకోండి, విలపిస్తూనూ గోప్యంగానూ. నిశ్చయంగా ఆయన మితిమీరి మెలిగేవారిని ప్రేమించడు. ధరణి సంస్కరణ జరిగిన తరువాత,[17] దానిపై సంక్షోభాన్ని సృష్టించకండి. దేవుడినే వేడుకోండి భయంతోనూ, ఆశతోనూ. నిశ్చయంగా అల్లాహ్ కారుణ్యం రుజువర్తనులకు దాపులోనే ఉంది.

13. ఇక్కడ దినం అనే పదానికి అర్థం ప్రపంచంలో ప్రజలు దినం అని చెప్పుకునే 24 గంటల దినం కావచ్చు లేదా ఈ పదం యుగం అనే అర్థంలో వాడబడి ఉండవచ్చు.
14. అల్లాహ్ రాజ్యపీఠాన్ని అలంకరించే వివరమైన స్థితిని అర్థం చేసుకోవటం మనకు సాధ్యపడదు. ఇది ముతషాబిహాత్ (అస్పష్టమైన విషయాలు) లోనిది. వాటి అర్థాన్ని నిర్ణయించటం అసాధ్యం.
15. అంటే, దేవుడే ఈ విశ్వాన్ని పుట్టించాడు. ఆయనే దీనికి పరిపాలకుడు. తన సృష్టిని ఆయన ఇతరులకు స్వాధీనమూ చెయ్యలేదు, తన సృష్టిలోని వారికెవ్వరికీ స్వతంత్రులై తాము కోరిన దాన్ని చేసే హక్కునూ ఇవ్వలేదు.

وَ هُوَ الَّذِیْ یُرْسِلُ الرِّیٰحَ بُشْرًاۢ بَیْنَ یَدَیْ
رَحْمَتِهٖ ؕ حَتّٰۤی اِذَاۤ اَقَلَّتْ سَحَابًا ثِقَالًا
سُقْنٰهُ لِبَلَدٍ مَّیِّتٍ فَاَنْزَلْنَا بِهِ الْمَآءَ
فَاَخْرَجْنَا بِهٖ مِنْ كُلِّ الثَّمَرٰتِ ؕ كَذٰلِكَ نُخْرِجُ
الْمَوْتٰی لَعَلَّكُمْ تَذَكَّرُوْنَ ﴿۵۷﴾ وَ الْبَلَدُ الطَّیِّبُ
یَخْرُجُ نَبَاتُهٗ بِاِذْنِ رَبِّهٖ ۚ وَ الَّذِیْ خَبُثَ لَا
یَخْرُجُ اِلَّا نَكِدًا ؕ كَذٰلِكَ نُصَرِّفُ الْاٰیٰتِ
لِقَوْمٍ یَّشْكُرُوْنَ ﴿۵۸﴾ؑ لَقَدْ اَرْسَلْنَا نُوْحًا اِلٰی ع ۷ ۱۴
قَوْمِهٖ فَقَالَ یٰقَوْمِ اعْبُدُوا اللّٰهَ مَا لَكُمْ مِّنْ
اِلٰهٍ غَیْرُهٗ ؕ اِنِّیْۤ اَخَافُ عَلَیْكُمْ عَذَابَ یَوْمٍ
عَظِیْمٍ ﴿۵۹﴾ قَالَ الْمَلَاُ مِنْ قَوْمِهٖۤ اِنَّا لَنَرٰىكَ
فِیْ ضَلٰلٍ مُّبِیْنٍ ﴿۶۰﴾ قَالَ یٰقَوْمِ لَیْسَ بِیْ
ضَلٰلَةٌ وَّ لٰكِنِّیْ رَسُوْلٌ مِّنْ رَّبِّ الْعٰلَمِیْنَ ﴿۶۱﴾
اُبَلِّغُكُمْ رِسٰلٰتِ رَبِّیْ وَ اَنْصَحُ لَكُمْ وَ اَعْلَمُ مِنَ
اللّٰهِ مَا لَا تَعْلَمُوْنَ ﴿۶۲﴾ اَوَ عَجِبْتُمْ اَنْ جَآءَكُمْ
ذِكْرٌ مِّنْ رَّبِّكُمْ عَلٰی رَجُلٍ مِّنْكُمْ لِیُنْذِرَكُمْ
وَ لِتَتَّقُوْا وَ لَعَلَّكُمْ تُرْحَمُوْنَ ﴿۶۳﴾ فَكَذَّبُوْهُ
فَاَنْجَیْنٰهُ وَ الَّذِیْنَ مَعَهٗ فِی الْفُلْكِ وَ اَغْرَقْنَا
الَّذِیْنَ كَذَّبُوْا بِاٰیٰتِنَا ؕ اِنَّهُمْ كَانُوْا قَوْمًا
عَمِیْنَ ﴿۶۴﴾ؑ ع ۸ ۱۵

**57 - 58** తన కారుణ్యానికి ముందుగా శుభవార్తలను మోసుకు పోయే వాయువులను పంపేది అల్లాహ్‌యే. తరువాత అవి నీటితో నిండిన మేఘాలను ఎత్తుకునిపోయేటప్పుడు వాటిని నిర్జీవంగా పడివున్న ఏ ప్రదేశం వైపునకైనా కదిలిస్తాడు. అక్కడ వర్షం కురిపించి (ఆ మృత భూమినుండే) రకరకాల పండ్లను వెలికి తీసుకొస్తాడు. చూడండి! ఈవిధంగా మేము మృతులను నిర్జీవస్థితినుండి ఉధ్భవింపజేస్తాము, బహుశా మీరు దానిని చూసి అయినా గుణపాఠం నేర్చుకుంటారేమో అని. మంచి నేల తన ప్రభువు ఆదేశానుసారం పుష్కలంగా పంటనిస్తుంది. చెడ్డ నేలలో నాసిరకం పంట తప్ప మరేమీ పండదు. కృతజ్ఞతలు తెలిపేవారి కొరకుగాను మేము ఈ విధంగా సూచనలను మాటి మాటికీ వివరిస్తూ ఉంటాము.

**59 - 64** మేము నూహ్‌ను అతని జాతివద్దకు పంపాము.[18] అతను ఇలా అన్నాడు: “నా జాతి సోదరులారా! అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక దేవుడు లేడు. మీ విషయంలో ఒక భయంకర దినంనాటి శిక్షను గురించి నేను ఆందోళన పడుతున్నాను.” ఆయన జాతి సర్దారులు ఇలా పలికారు: “నీవు స్పష్టమైన అపమార్గానికి గురిఅయినట్లు మాకు కనిపిస్తున్నది.” నూహ్ ఇలా అన్నాడు: “నా జాతి సోదరులారా! నేను ఏ అపమార్గంలోనూ పడలేదు. యథార్థానికి నేను సకల లోక ప్రభువునకు ప్రవక్తను. నా ప్రభువు సందేశాలను మీకు అందజేస్తాను. మీ శ్రేయోభిలాషిని. మీకు తెలియని విషయాలు నాకు అల్లాహ్ తరఫునుండి తెలుసు. మీకు ఆశ్చర్యం కలిగిందా, మీ వద్దకు స్వయంగా మీ జాతికి చెందిన ఒక మనిషి ద్వారా మీ ప్రభువు జ్ఞాపిక వచ్చిందని – మిమ్మల్ని హెచ్చరించటానికి, మీరు చెడునడతకు దూరంగా ఉండడానికి, మీపై దయ చూపటానికి?” కాని వారు ఆయనను తిరస్కరించారు. చివరకు మేము ఆయననూ, ఆయన సహచరులనూ ఒక పడవద్వారా విముక్తి కలిగించాము. మా ఆయతులు అసత్యాలని తిరస్కరించిన వారందరినీ మేము ముంచివేశాము. నిశ్చయంగా వారు అంధజనులు.

16. ‘అనంతమైన శుభాలు కలవాడు అల్లాహ్’ అంటే అర్థం ఏమిటంటే, ఆయన మంచి విషయాలు, మేళ్ళు అంతం లేనటువంటివి. అనంతమైన, అసంఖ్యాకమైన మేళ్ళు ఆయన ద్వారా వ్యాపిస్తున్నాయి.

**65 - 72** ఇంకా ఆద్ జాతివద్దకు మేము వారి సోదరుడు హూద్‌ను పంపాము.[19] అతను ఇలా అన్నాడు: "నా జాతి సోదరులారా! అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక దేవుడు లేడు. అలాంటప్పుడు మీరు తప్పుడు నడతను వదులుకోరా?" అతని మాటలను నమ్మటానికి తిరస్కరించిన అతని జాతి సర్దారులు ఇలా సమాధానం చెప్పారు: "నీవు తెలివి తక్కువతనానికి గురిఅయినట్లు మేము భావిస్తున్నాము. నీవు అసత్యవాదివని మా అనుమానం." అతను ఇలా అన్నాడు: "నా జాతి సోదరులారా! నేను తెలివితక్కువతనానికేమీ గురి కాలేదు. నేను సకల లోకాల ప్రభువునకు ప్రవక్తను. మీకు నా ప్రభువు సందేశాలను అంద జేస్తాను. నేను మీయొక్క నమ్మదగిన శ్రేయోభిలాషిని. మీకు ఆశ్చర్యం కలిగిందా, మీ వద్దకు మిమ్మల్ని హెచ్చరించటానికి స్వయంగా మీ జాతికి చెందిన ఒక మనిషి ద్వారా మీ ప్రభువు జ్ఞాపిక వచ్చిందని? మరచిపోకండి! మీ ప్రభువు నూహ్ జాతికి తరువాత మిమ్మల్ని వారసులుగా చేశాడు. మీకు బలాధిక్యతను ప్రసాదించాడు. కనుక అల్లాహ్ శక్తి మహిమలను జ్ఞాపకం ఉంచుకోండి.[20] మీరు సాఫల్యం పొందగలరని ఆశించవచ్చు." వారు ఇలా జవాబు ఇచ్చారు: "నీవు మావద్దకు రావటానికి కారణం, మేము ఒక్క అల్లాహ్‌నే ఆరాధించాలనా, మా తాత ముత్తాతలు పూజిస్తూ వచ్చిన వాటిని విసర్జించాలనా? సరే, నీవు నిజం చెప్పేవాడివే అయితే నీవు మమ్మల్ని బెదిరిస్తూ ఉన్న ఆ శిక్షను తీసుకురా." అతను ఇలా అన్నాడు: "మీపై మీ ప్రభువు శాపం, ఆయన ఆగ్రహం ఇదివరకే విరుచుకుపడ్డాయి. అల్లాహ్ ఏ ప్రమాణాన్నీ పంపనీ, మీరూ మీ తాత ముత్తాతలూ పెట్టుకున్న పేర్ల విషయంలో మీరు నాతో ఘర్షణపడుతున్నారా?[21] సరే, అయితే మీరూ నిరీక్షించండి, మీతోపాటు నేనూ నిరీక్షిస్తాను." చివరకు మేము మా కృపతో హూద్‌నూ, అతని అనుయాయులనూ రక్షించుకున్నాము. మా ఆయతులు అసత్యాలని తిరస్కరించిన వారినీ విశ్వసించనివారినీ మేము సమూలంగా నాశనం చేశాము.

وَاِلٰی عَادٍ اَخَاهُمْ هُوْدًا ؕ قَالَ یٰقَوْمِ اعْبُدُوا
اللّٰهَ مَا لَکُمْ مِّنْ اِلٰهٍ غَیْرُهٗ ؕ اَفَلَا تَتَّقُوْنَ ﴿۶۵﴾
قَالَ الْمَلَاُ الَّذِیْنَ کَفَرُوْا مِنْ قَوْمِهٖۤ اِنَّا
لَنَرٰىكَ فِیْ سَفَاهَةٍ وَّ اِنَّا لَنَظُنُّكَ مِنَ
الْکٰذِبِیْنَ ﴿۶۶﴾ قَالَ یٰقَوْمِ لَیْسَ بِیْ سَفَاهَةٌ وَّ
لٰکِنِّیْ رَسُوْلٌ مِّنْ رَّبِّ الْعٰلَمِیْنَ ﴿۶۷﴾ اُبَلِّغُکُمْ
رِسٰلٰتِ رَبِّیْ وَ اَنَا لَکُمْ نَاصِحٌ اَمِیْنٌ ﴿۶۸﴾ اَوَ
عَجِبْتُمْ اَنْ جَآءَکُمْ ذِکْرٌ مِّنْ رَّبِّکُمْ عَلٰی
رَجُلٍ مِّنْکُمْ لِیُنْذِرَکُمْ ؕ وَ اذْکُرُوْۤا اِذْ
جَعَلَکُمْ خُلَفَآءَ مِنْۢ بَعْدِ قَوْمِ نُوْحٍ وَّ زَادَکُمْ
فِی الْخَلْقِ بَصْۜطَةً ۚ فَاذْکُرُوْۤا اٰلَآءَ اللّٰهِ لَعَلَّکُمْ
تُفْلِحُوْنَ ﴿۶۹﴾ قَالُوْۤا اَجِئْتَنَا لِنَعْبُدَ اللّٰهَ وَحْدَهٗ
وَ نَذَرَ مَا کَانَ یَعْبُدُ اٰبَآؤُنَا ۚ فَاْتِنَا بِمَا
تَعِدُنَاۤ اِنْ کُنْتَ مِنَ الصّٰدِقِیْنَ ﴿۷۰﴾ قَالَ قَدْ
وَقَعَ عَلَیْکُمْ مِّنْ رَّبِّکُمْ رِجْسٌ وَّ غَضَبٌ ؕ
اَتُجَادِلُوْنَنِیْ فِیْۤ اَسْمَآءٍ سَمَّیْتُمُوْهَاۤ اَنْتُمْ وَ
اٰبَآؤُکُمْ مَّا نَزَّلَ اللّٰهُ بِهَا مِنْ سُلْطٰنٍ ؕ
فَانْتَظِرُوْۤا اِنِّیْ مَعَکُمْ مِّنَ الْمُنْتَظِرِیْنَ ﴿۷۱﴾
فَاَنْجَیْنٰهُ وَ الَّذِیْنَ مَعَهٗ بِرَحْمَةٍ مِّنَّا وَ قَطَعْنَا
دَابِرَ الَّذِیْنَ کَذَّبُوْا بِاٰیٰتِنَا وَ مَا کَانُوْا مُؤْمِنِیْنَ ﴿۷۲﴾ ع ۸ ۱۶

17. అంటే వందల, వేల సంవత్సరాల తరబడి దైవప్రవక్తల, మానవ సంఘ సంస్కర్తల ప్రయత్నాల కారణంగా మానవ నీతులలో నాగరికతలో ఏ సంస్కరణలు జరిగాయో, వాటిలో మీ తప్పుడు పనుల వల్ల చెడును సృష్టించకండి.

18. హజ్రత్ నూహ్ (అస్సలామ్) జాతి ప్రజలు ఈనాడు మనం ఇరాఖ్ పేరుతో పిలుస్తున్న ప్రాంతంలో ఉండేవారు.

وَ اِلٰى ثَمُوْدَ اَخَاهُمْ صٰلِحًا ۘ قَالَ يٰقَوْمِ
اعْبُدُوا اللّٰهَ مَا لَكُمْ مِّنْ اِلٰهٍ غَيْرُهٗ ؕ قَدْ
جَآءَتْكُمْ بَيِّنَةٌ مِّنْ رَّبِّكُمْ ؕ هٰذِهٖ نَاقَةُ اللّٰهِ
لَكُمْ اٰيَةً فَذَرُوْهَا تَاْكُلْ فِيْٓ اَرْضِ اللّٰهِ وَ لَا
تَمَسُّوْهَا بِسُوْٓءٍ فَيَاْخُذَكُمْ عَذَابٌ اَلِيْمٌ ﴿٧٣﴾ وَ
اذْكُرُوْٓا اِذْ جَعَلَكُمْ خُلَفَآءَ مِنْۢ بَعْدِ عَادٍ وَّ
بَوَّاَكُمْ فِى الْاَرْضِ تَتَّخِذُوْنَ مِنْ سُهُوْلِهَا
قُصُوْرًا وَّ تَنْحِتُوْنَ الْجِبَالَ بُيُوْتًا ۚ فَاذْكُرُوْٓا
اٰلَآءَ اللّٰهِ وَ لَا تَعْثَوْا فِى الْاَرْضِ مُفْسِدِيْنَ ﴿٧٤﴾

**73 - 74** సమూదు జాతివద్దకు మేము వారి సోదరుడు సాలిహ్‌ను పంపాము.[22] అతను ఇలా అన్నాడు: "నా జాతి సోదరులారా! అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక దేవుడు లేడు. మీవద్దకు మీ ప్రభువు యొక్క స్పష్టమైన ప్రమాణం వచ్చింది. అల్లాహ్ యొక్క ఈ ఆడ ఒంటె, మీ కొరకు ఒక సూచన వంటిది.[23] కనుక దానిని విడిచిపెట్టండి, అల్లాహ్ భూమిపై అది స్వేచ్ఛగా మేస్తూ తిరగటానికి. దురుద్దేశ్యంతో దాన్ని ముట్టుకోకండి. అలాచేస్తే మిమ్మల్ని వ్యధా భరితమైన శిక్ష ఒకటి పట్టు కుంటుంది. జ్ఞాపకం తెచ్చుకోండి ఆ సమయాన్ని. అప్పుడు అల్లాహ్ ఆద్ జాతి తరువాత మిమ్మల్ని దానికి వారసులుగా చేశాడు. మీకు భూమిపై ఉన్నతమైన స్థానాన్ని ప్రసాదించగా, మీరు ఈ రోజు దాని చదునైన మైదానాలలో మహోన్నతమైన భవనాలను నిర్మిస్తు న్నారు. దాని కొండలను గృహాలుగా చెక్కుతున్నారు. కనుక ఆయన సృష్టి మహిమలను నిర్లక్ష్యం చెయ్యకండి. ధరణిపై సంక్షోభాన్ని సృష్టించకండి.

19. ఆద్ జాతివారి అసలు నివాసం అహ్‌ఖాఫ్ ప్రాంతంలో ఉంది. ఈ ప్రాంతం హిజాజ్, యమన్, యమామాలకు మధ్య ఉంది. ఇక్కడ నుండే వారు వ్యాపించి యమన్ యొక్క పశ్చిమతీరాలు, ఒమాన్, హజర్‌మౌత్ నుండి ఇరాఖ్ వరకు తమ అధికారాన్ని చలాయించారు.

20. అసలు "ఆలా" అనే పదం ఉపయోగించబడింది. దాని అర్థం అనుగ్రహాలు అని, సృష్టి మహిమలు అని, స్తోత్రాలకు అర్హమైన గుణాలు అని.

21. అంటే, మీరు ఒకరిని వానకు, ఒకరిని గాలికి, ఒకరిని సిరికి, ఒకరిని రోగానికి ప్రభువు అంటారు. వాస్తవానికి వారిలో ఎవరూ యథార్థంగా దేనికీ ప్రభువు కారు. ఇవన్నీ కేవలం మీరు పెట్టుకున్న పేర్లే. వీటి కొరకు తగాదా పడేవాడు అసలు కొన్ని పేర్లకోసమే తగాదా పడుతున్నాడు అన్నమాట. అంతేగాని ఏ యథార్థం కొరకూ కాదు.

22. సమూద్ జాతివారు వాయవ్య అరేబియా ప్రాంతంలో, ఈనాడు కూడా అల్ హిజ్ర్ అనే పేరుతో పిలువబడుతున్న ఒక ప్రదేశంలో నివసిస్తూ ఉండేవారు. ప్రస్తుత కాలంలో మదీనా, తబూక్‌ల మధ్య ఉన్న ఒక ప్రదేశాన్ని మదాయిన్ సాలిహ్ అంటారు. ఇదే సమూద్ జాతి వారి రాజధానిగా ఉండేది. పూర్వకాలంలో హిజ్ర్ అనబడుతూ ఉండేది. ఇప్పటికీ అక్కడ సమూద్ జాతి వారి కొన్ని కట్టడాలు ఉన్నాయి. వాటిని వారు కొండలను తొలిచి నిర్మించారు.

23. ఖురానులో పలుచోట్ల వచ్చిన ఈ సంఘటనకు చెందిన వివరాల ద్వారా తెలిసేదేమిటంటే, సమూద్ జాతివారు, స్వయంగా హజ్రత్ సాలిహ్‌ను అల్లాహ్ తరఫు నుండి నియమింపబడ్డారని స్పష్టంగా నిరూపించే ఒక సూచనను చూపవలసినదిగా కోరారు. దీనికి సమాధానంగానే హజ్రత్ సాలిహ్ ఆడ ఒంటెను చూపారు.

قَالَ الْمَلَاُ الَّذِيْنَ اسْتَكْبَرُوْا مِنْ قَوْمِهٖ
لِلَّذِيْنَ اسْتُضْعِفُوْا لِمَنْ اٰمَنَ مِنْهُمْ اَتَعْلَمُوْنَ
اَنَّ صٰلِحًا مُّرْسَلٌ مِّنْ رَّبِّهٖ ؕ قَالُوْۤا اِنَّا بِمَاۤ
اُرْسِلَ بِهٖ مُؤْمِنُوْنَ ﴿٧٥﴾ قَالَ الَّذِيْنَ
اسْتَكْبَرُوْۤا اِنَّا بِالَّذِيْۤ اٰمَنْتُمْ بِهٖ كٰفِرُوْنَ ﴿٧٦﴾
فَعَقَرُوا النَّاقَةَ وَ عَتَوْا عَنْ اَمْرِ رَبِّهِمْ وَقَالُوْا
يٰصٰلِحُ ائْتِنَا بِمَا تَعِدُنَاۤ اِنْ كُنْتَ مِنَ
الْمُرْسَلِيْنَ ﴿٧٧﴾ فَاَخَذَتْهُمُ الرَّجْفَةُ فَاَصْبَحُوْا فِيْ
دَارِهِمْ جٰثِمِيْنَ ﴿٧٨﴾ فَتَوَلّٰى عَنْهُمْ وَ قَالَ يٰقَوْمِ
لَقَدْ اَبْلَغْتُكُمْ رِسَالَةَ رَبِّيْ وَ نَصَحْتُ لَكُمْ وَ
لٰكِنْ لَّا تُحِبُّوْنَ النّٰصِحِيْنَ ﴿٧٩﴾ وَ لُوْطًا اِذْ قَالَ
لِقَوْمِهٖۤ اَتَاْتُوْنَ الْفَاحِشَةَ مَا سَبَقَكُمْ بِهَا مِنْ
اَحَدٍ مِّنَ الْعٰلَمِيْنَ ﴿٨٠﴾ اِنَّكُمْ لَتَاْتُوْنَ الرِّجَالَ
شَهْوَةً مِّنْ دُوْنِ النِّسَآءِ ؕ بَلْ اَنْتُمْ قَوْمٌ
مُّسْرِفُوْنَ ﴿٨١﴾ وَ مَا كَانَ جَوَابَ قَوْمِهٖۤ اِلَّاۤ اَنْ
قَالُوْۤا اَخْرِجُوْهُمْ مِّنْ قَرْيَتِكُمْ ۚ اِنَّهُمْ اُنَاسٌ
يَّتَطَهَّرُوْنَ ﴿٨٢﴾ فَاَنْجَيْنٰهُ وَ اَهْلَهٗۤ اِلَّا امْرَاَتَهٗ ۖ
كَانَتْ مِنَ الْغٰبِرِيْنَ ﴿٨٣﴾ وَاَمْطَرْنَا عَلَيْهِمْ
مَّطَرًا ؕ فَانْظُرْ كَيْفَ كَانَ عَاقِبَةُ الْمُجْرِمِيْنَ ﴿٨٤﴾ ع ١٠ ١٢ ١٧

**75 - 76** పెద్ద మనుషులుగా చెలామణిఅయ్యే అతని జాతి సర్దారులు బలహీన వర్గాలలోని విశ్వసించిన ప్రజలను ఇలా అడిగారు: "సాలిహ్ తన ప్రభువు పంపిన ప్రవక్త అని మీకు నిజంగానే తెలుసా?" వారు ఇలా సమాధానం ఇచ్చారు: "నిస్సందేహంగా అతనితో పంపబడిన సందేశాన్ని మేము విశ్వసిస్తున్నాము." తమ పెద్దరికాన్ని చాటుకునేవారు ఇలా అన్నారు: "మీరు విశ్వసించిన దాన్ని మేము తిరస్కరిస్తున్నాము."

**77 - 79** తరువాత వారు ఆ ఆడ ఒంటెను చంపివేశారు.[24] పచ్చి పొగరుబోతుతనంతో తమ ప్రభువు ఆజ్ఞను ఉల్లంఘించారు. సాలిహ్‌తో ఇలా అన్నారు: "నిజంగానే నీవు ప్రవక్తల లోనివాడవే అయితే నీవు మమ్మల్ని బెదిరిస్తూ వచ్చిన ఆ శిక్షను తీసుకురా." చివరకు ఊపివేసే ఒక భయంకరమైన ఆపద వారిని చుట్టుముట్టింది. వారు తమ ఇళ్ళల్లోనే బోర్లాపడి, పడినట్లే ఉండిపోయారు. సాలిహ్ ఈ విధంగా అంటూ వారి నగరాల నుండి నిష్క్రమించాడు: "నా జాతి ప్రజలారా! నేను నా ప్రభువు సందేశాన్ని మీకు అందజేశాను. నేను మీ శ్రేయస్సునే సదా అభిలషించాను. కాని నేనేం చేసేది, మీకు మీ శ్రేయోభిలాషులంటేనే ఇష్టం లేదు."

**80 - 84** లూత్‌ను మేము ప్రవక్తగా చేసి పంపాము. జ్ఞాపకం తెచ్చుకో అతను తన జాతితో ఇలా అన్నాడు:[25] "మీరు ఇంత సిగ్గులేనివారై పోయారేమిటి, మీకు పూర్వం ప్రపంచంలో ఎవ్వడూ చెయ్యని బూతుపని చేస్తున్నారు? మీరు స్త్రీలను వదలి పురుషులతో మీ కామాన్ని తీర్చుకుంటున్నారు? వాస్తవానికి మీరు పూర్తిగా హద్దుమీరి ప్రవర్తించేవారు." కాని అతని జాతి ఇచ్చిన జవాబు ఇదే: "గెంటెయ్యండి వీళ్ళను మీ బస్తీల నుండి, మహా పవిత్రులట వీళ్ళు." చివరకు మేము లూత్‌నూ అతని ఇంటి వాళ్ళనూ– వెనుక ఉండిపోయే వారిలో కలసి పోయిన అతని భార్యను తప్ప– రక్షించాము. ఇంకా ఆ జాతిపై కురిపించాము మేము ఒక వర్షాన్ని.[26] చూడండి, ఆ అపరాధుల ముగింపు ఎలా జరిగిందో.

24. ఖమర్, షమ్స్ సూరాలలో చెప్పబడినవిధంగా, చంపింది ఒక్కడే. కాని సమస్త జాతి ఈ నేరాన్ని సమర్థించింది కాబట్టి ఇంకా అతడు ఈ నేరాన్ని జాతి సమ్మతి ప్రకారంగానే చేశాడు కాబట్టి అభియోగం మొత్తం జాతిపై మోపబడింది.

25. హజ్రత్ లూత్ (అస్సలామ్), హజ్రత్ ఇబ్రాహీమ్ (అస్సలామ్) సోదరుని కుమారుడు. మార్గదర్శకత్వం నిమిత్తం అతను పంపబడిన జాతి అప్పుడు మృత సముద్రం (Dead Sea) ఉన్న ప్రాంతంలో ఉండేది.

وَ اِلٰى مَدْيَنَ اَخَاهُمْ شُعَيْبًا ؕ قَالَ يٰقَوْمِ
اعْبُدُوا اللّٰهَ مَا لَكُمْ مِّنْ اِلٰهٍ غَيْرُهٗ ؕ قَدْ
جَآءَتْكُمْ بَيِّنَةٌ مِّنْ رَّبِّكُمْ فَاَوْفُوا الْكَيْلَ وَ
الْمِيْزَانَ وَ لَا تَبْخَسُوا النَّاسَ اَشْيَآءَهُمْ وَ لَا
تُفْسِدُوْا فِى الْاَرْضِ بَعْدَ اِصْلَاحِهَا ؕ ذٰلِكُمْ
خَيْرٌ لَّكُمْ اِنْ كُنْتُمْ مُّؤْمِنِيْنَ ﴿۸۵﴾ وَ لَا
تَقْعُدُوْا بِكُلِّ صِرَاطٍ تُوْعِدُوْنَ وَ تَصُدُّوْنَ
عَنْ سَبِيْلِ اللّٰهِ مَنْ اٰمَنَ بِهٖ وَتَبْغُوْنَهَا
عِوَجًا ۚ وَ اذْكُرُوْٓا اِذْ كُنْتُمْ قَلِيْلًا فَكَثَّرَكُمْ ۪
وَانْظُرُوْا كَيْفَ كَانَ عَاقِبَةُ الْمُفْسِدِيْنَ ﴿۸۶﴾ وَ
اِنْ كَانَ طَآئِفَةٌ مِّنْكُمْ اٰمَنُوْا بِالَّذِيْٓ
اُرْسِلْتُ بِهٖ وَ طَآئِفَةٌ لَّمْ يُؤْمِنُوْا فَاصْبِرُوْا
حَتّٰى يَحْكُمَ اللّٰهُ بَيْنَنَا ۚ وَ هُوَ خَيْرُ الْحٰكِمِيْنَ ﴿۸۷﴾

**85 - 87** మేము మద్‌యన్[27] జాతి వారివద్దకు వారి సోదరుడు షుఐబ్‌ను పంపాము. అతను ఇలా అన్నాడు: "నా జాతి సోదరులారా! అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక దేవుడు లేడు. మీ వద్దకు మీ ప్రభువు యొక్క స్పష్టమైన మార్గదర్శకత్వం వచ్చింది. కనుక తూకాన్ని, కొలతను పూర్తిగా పాటించండి. ప్రజలకు వారి వస్తువుల విషయంలో నష్టం కలిగించకండి. భూమి సంస్కరింపబడిన తరువాత, దానిలో సంక్షోభాన్ని సృష్టించకండి. ఇందులోనే మీ శ్రేయస్సు ఉంది, మీరు (నిజంగానే) విశ్వాసులైతే.[28] ప్రజలను భయ పెట్టటానికీ, విశ్వసించేవారిని అల్లాహ్ మార్గం నుండి నిరోధిం చటానికీ, రుజుమార్గ వక్రీకరణకూ పాల్పడి (జీవితపు) ప్రతిమార్గంలో బందిపోటు దొంగల మాదిరిగా పొంచి కూర్చో కండి. జ్ఞాపకం తెచ్చుకోండి ఆ కాలాన్ని, అప్పుడు మీరు అల్పసంఖ్యలో ఉండేవారు. తరువాత అల్లాహ్ మీ సంఖ్యను అధికం చేశాడు. కళ్ళు తెరచి చూడండి. సంక్షోభం సృష్టించిన వారి పర్యవసానం ప్రపంచంలో ఏమయిందో! ఏ ఉపదేశాన్ని ఇచ్చి నన్ను పంపటం జరిగిందో దానిని మీలోని ఒక వర్గం విశ్వసించి, మరొక వర్గం విశ్వసించకపోతే అల్లాహ్ మన మధ్య తీర్పు చెప్పేవరకు సహనంతో నిరీక్షించండి. (ఆయనే) అందరికంటే ఉత్తమంగా తీర్పు చెప్పేవాడు.

26. ఖురానులో మరికొన్నిచోట్ల చెప్పబడినవిధంగా, ఇక్కడ వర్షం అంటే రాళ్ళవర్షం. నీళ్ళ వర్షం కాదు.
27. మద్‌యన్ వారి అసలు ప్రాంతం హిజాజుకు వాయవ్యదిశలో పాలస్తీనాకు దక్షిణ దిక్కున ఎర్రసముద్రం, అఖ్బా ఖాతం ఒడ్డుపై ఉంది. సీనాయ్ ద్వీపకల్పం తూర్పు ఒడ్డుపై కూడా దీని భాగం కొంత వ్యాపించి ఉంది. వ్యాపారం ఈ జాతి ప్రజల వృత్తిగా ఉండేది. పూర్వకాలం యమన్ నుండి మక్కా యంబోల గుండా సిరియాకు పోయే వాణిజ్య రహదారీ, ఇరాఖు నుండి ఈజిప్టునకు పోయే మరొక వాణిజ్య రహదారీ, ఈ రెండు కలిసేచోటే ఈ జాతి నివాస స్థలాలుండేవి.
28. ఈ ప్రజలు స్వయంగా తమ విశ్వాసాన్ని బాహాటంగా ప్రకటించారని ఈ వాక్యం ద్వారా విశదమవుతోంది.

قَالَ الْمَلَاُ الَّذِيْنَ اسْتَكْبَرُوْا مِنْ قَوْمِهٖ
لَنُخْرِجَنَّكَ يٰشُعَيْبُ وَ الَّذِيْنَ اٰمَنُوْا مَعَكَ مِنْ
قَرْيَتِنَآ اَوْ لَتَعُوْدُنَّ فِيْ مِلَّتِنَا ؕ قَالَ اَوَ لَوْ
كُنَّا كٰرِهِيْنَ ﴿۸۸﴾ قَدِ افْتَرَيْنَا عَلَى اللّٰهِ كَذِبًا
اِنْ عُدْنَا فِيْ مِلَّتِكُمْ بَعْدَ اِذْ نَجّٰنَا اللّٰهُ
مِنْهَا ؕ وَمَا يَكُوْنُ لَنَآ اَنْ نَّعُوْدَ فِيْهَآ اِلَّآ اَنْ
يَّشَآءَ اللّٰهُ رَبُّنَا ؕ وَسِعَ رَبُّنَا كُلَّ شَيْءٍ
عِلْمًا ؕ عَلَى اللّٰهِ تَوَكَّلْنَا ؕ رَبَّنَا افْتَحْ بَيْنَنَا
وَبَيْنَ قَوْمِنَا بِالْحَقِّ وَاَنْتَ خَيْرُ الْفٰتِحِيْنَ ﴿۸۹﴾
وَ قَالَ الْمَلَاُ الَّذِيْنَ كَفَرُوْا مِنْ قَوْمِهٖ لَئِنِ
اتَّبَعْتُمْ شُعَيْبًا اِنَّكُمْ اِذًا لَّخٰسِرُوْنَ ﴿۹۰﴾
فَاَخَذَتْهُمُ الرَّجْفَةُ فَاَصْبَحُوْا فِيْ دَارِهِمْ
جٰثِمِيْنَ ﴿۹۱﴾ الَّذِيْنَ كَذَّبُوْا شُعَيْبًا كَاَنْ لَّمْ
يَغْنَوْا فِيْهَا ۚ اَلَّذِيْنَ كَذَّبُوْا شُعَيْبًا كَانُوْا هُمُ
الْخٰسِرِيْنَ ﴿۹۲﴾ فَتَوَلّٰى عَنْهُمْ وَ قَالَ يٰقَوْمِ لَقَدْ
اَبْلَغْتُكُمْ رِسٰلٰتِ رَبِّيْ وَ نَصَحْتُ لَكُمْ ۚ فَكَيْفَ
اٰسٰى عَلٰى قَوْمٍ كٰفِرِيْنَ ﴿۹۳﴾

**88 - 89** దురహంకారులైన అతని జాతి సర్దారులు అతనితో ఇలా అన్నారు: "షుఐబ్, మేము నిన్నూ, నీతోపాటు విశ్వసించిన వారినీ మా నగరం నుండి బహిష్కరిస్తాము, లేదా మీరు మా సంఘంలో తిరిగి చేరవలసి ఉంటుంది." షుఐబ్ ఇలా సమాధానం పలికాడు: "ఏమిటీ, మాకు ఇష్టం లేకపోయినా మమ్మల్ని బలవంతంగా మళ్ళిస్తారా? అల్లాహ్ మాకు మీ సంఘం నుండి విముక్తి కలిగించిన తరువాత ఒకవేళ మళ్ళీ మేము దానిలో చేరితే మేము అల్లాహ్‌కు అబద్ధం ఆరోపించినవాళ్ళం అవుతాము. దాని వైపునకు మళ్ళటం అనేది మాత్రం మాకు ఏ విధంగానూ సాధ్యం కాదు, మా ప్రభువైన అల్లాహ్ సంకల్పిస్తే తప్ప. మా ప్రభువు జ్ఞానం ప్రతి వస్తువునూ ఆవరించి ఉంది. ఆయననే మేము నమ్ము కున్నాము. ప్రభూ! మాకూ మా జాతికీ మధ్య సరియైన తీర్పు చెయ్యి. నీవు ఉత్తమ న్యాయనిర్ణేతవు."

**90 - 93** అతని మాటలను తిరస్కరించిన అతని జాతి సర్దారులు పరస్పరం ఇలా అనుకున్నారు: "ఒకవేళ మీరు షుఐబ్‌ను అనుసరించటానికి అంగీకరిస్తే నాశనం అవు తారు."[29] కాని జరిగిందేమిటంటే, ఊపివేసే ఒక పెద్ద ఆపద వారిని పట్టుకుంది. వారు తమ గృహాలలో బోర్లాపడి, పడినట్లే ఉండి పోయారు. షుఐబ్‌ను తిరస్కరించిన వారు ఆ గృహాలలో ఎన్నడూ నివసించని విధంగా తుడుచుకు పోయారు. షుఐబ్‌ను తిరస్కరించినవారే చివరకు సర్వనాశనమయ్యారు. షుఐబ్ ఇలా అంటూ వారి నగరాల నుండి నిష్క్రమించాడు: "నా జాతి సోదరులారా! నేను నా ప్రభువు సందేశాలను మీకు అంద జేశాను. మీ శ్రేయోభిలాషిగా నేను నా బాధ్యతను పూర్తిగా నెరవేర్చాను. సత్యాన్ని స్వీకరించటానికి తిరస్కరించే జాతి కొరకు నేను ఇప్పుడు ఎలా బాధపడను?"

29. ఈ విషయం కేవలం షుఐబ్ జాతి సర్దారులవరకే పరిమితమై లేదు. ప్రతియుగంలోనూ దుర్మార్గులు సత్యం, న్యాయం, నిజాయితీల వైఖరివల్ల తమకు ఇటువంటి ప్రమాదాలే తలెత్తుతాయని అభిప్రాయపడ్డారు. ప్రతి కాలంలోనూ అవినీతిపరులు వ్యాపారం, రాజకీయాలు, ఇంకా ఇతర ప్రపంచ వ్యవహారాలు, అబద్ధం, అక్రమం, అన్యాయం, అవినీతి లేకుండా కొనసాగలేవు అనీ, న్యాయవైఖరిని అవలంబించటం అంటే తమ ప్రపంచాన్ని నాశనం చేసుకోవటమే అనీ తలంచారు.

وَمَآ اَرْسَلْنَا فِيْ قَرْيَةٍ مِّنْ نَّبِيٍّ اِلَّآ اَخَذْنَآ
اَهْلَهَا بِالْبَاْسَآءِ وَالضَّرَّآءِ لَعَلَّهُمْ يَضَّرَّعُوْنَ ﴿٩٤﴾
ثُمَّ بَدَّلْنَا مَكَانَ السَّيِّئَةِ الْحَسَنَةَ حَتّٰى عَفَوْا
وَّقَالُوْا قَدْ مَسَّ اٰبَآءَنَا الضَّرَّآءُ وَالسَّرَّآءُ
فَاَخَذْنٰهُمْ بَغْتَةً وَّهُمْ لَا يَشْعُرُوْنَ ﴿٩٥﴾ وَلَوْ اَنَّ
اَهْلَ الْقُرٰٓى اٰمَنُوْا وَاتَّقَوْا لَفَتَحْنَا عَلَيْهِمْ
بَرَكٰتٍ مِّنَ السَّمَآءِ وَالْاَرْضِ وَلٰكِنْ كَذَّبُوْا
فَاَخَذْنٰهُمْ بِمَا كَانُوْا يَكْسِبُوْنَ ﴿٩٦﴾ اَفَاَمِنَ اَهْلُ
الْقُرٰٓى اَنْ يَّاْتِيَهُمْ بَاْسُنَا بَيَاتًا وَّهُمْ
نَآئِمُوْنَ ﴿٩٧﴾ اَوَاَمِنَ اَهْلُ الْقُرٰٓى اَنْ يَّاْتِيَهُمْ
بَاْسُنَا ضُحًى وَّهُمْ يَلْعَبُوْنَ ﴿٩٨﴾ اَفَاَمِنُوْا مَكْرَ
اللّٰهِ ۚ فَلَا يَاْمَنُ مَكْرَ اللّٰهِ اِلَّا الْقَوْمُ
الْخٰسِرُوْنَ ﴿٩٩﴾ اَوَلَمْ يَهْدِ لِلَّذِيْنَ يَرِثُوْنَ ع ١٢
الْاَرْضَ مِنْۢ بَعْدِ اَهْلِهَآ اَنْ لَّوْ نَشَآءُ
اَصَبْنٰهُمْ بِذُنُوْبِهِمْ ۚ وَنَطْبَعُ عَلٰى قُلُوْبِهِمْ فَهُمْ
لَا يَسْمَعُوْنَ ﴿١٠٠﴾ تِلْكَ الْقُرٰى نَقُصُّ عَلَيْكَ
مِنْ اَنْۢبَآئِهَا ۚ وَلَقَدْ جَآءَتْهُمْ رُسُلُهُمْ
بِالْبَيِّنٰتِ ۚ فَمَا كَانُوْا لِيُؤْمِنُوْا بِمَا كَذَّبُوْا مِنْ
قَبْلُ ؕ كَذٰلِكَ يَطْبَعُ اللّٰهُ عَلٰى قُلُوْبِ
الْكٰفِرِيْنَ ﴿١٠١﴾ وَمَا وَجَدْنَا لِاَكْثَرِهِمْ مِّنْ
عَهْدٍ ۚ وَاِنْ وَّجَدْنَآ اَكْثَرَهُمْ لَفٰسِقِيْنَ ﴿١٠٢﴾

**94 - 99** మేము ఏ నగరానికి ప్రవక్తను పంపినా ఆ నగర ప్రజలను మొదట లేమికీ, కష్టానికీ గురిచెయ్యకుండా ఉండటం జరగలేదు, వారు వినమ్రులు కావాలనే ఉద్దేశ్యంతో. తరువాత మేము వారి దుస్థితిని సుస్థితిగా మార్చాము. చివరకు వారు బాగా అభివృద్ధిచెంది ఇలా అన్నారు: “మంచి రోజులు చెడ్డ రోజులు అనేవి మా పూర్వీకులకు కూడా కలుగుతూ వచ్చాయి.” తుదకు మేము వారిని అకస్మాత్తుగా పట్టుకున్నాము. వారికి దానిని గురించి ఏమాత్రం తెలియదు.[30] నగరాల ప్రజలు విశ్వసించి, భయభక్తుల వైఖరిని అవలంబించి ఉన్నట్లయితే మేము వారికొరకు ఆకాశంలోని, భూమిలోని శుభాల ద్వారాలను తెరచి ఉండేవారము. కాని వారు ధిక్కరించారు. కనుక మేము వారిని వారు పోగు చేస్తూ ఉన్న చెడు సంపాదన కారణంగా పట్టుకున్నాము. ఏమిటీ? అయితే ఇక మా శిక్ష రాత్రి సమయంలో వారు గాఢనిద్రలో ఉన్నప్పుడు వారిపై అకస్మాత్తుగా వచ్చి పడదని నగరాల ప్రజలు నిర్భయంగా ఉన్నారా? లేక శక్తిమంతమైన మా హస్తం, పగటివేళ వారు ఆడుకుంటున్నప్పుడు వారిపై హఠాత్తుగా ఎన్నడూ పడదనే తృప్తితో ఉన్నారా వారు? ఏమిటీ, ఈ ప్రజలు అల్లాహ్ ఎత్తుగడ అంటే నిర్భయంగా ఉన్నారా? వాస్తవానికి నాశనం కాబోయే జాతి మాత్రమే అల్లాహ్ ఎత్తుగడ[31] అంటే నిర్భయంగా ఉంటుంది.

**100 - 102** ఏమిటీ, పూర్వపు భూలోకవాసుల తరువాత భూమికి వారసులయ్యే ప్రజలకు ఈ యథార్థ విషయం ఏ గుణపాఠాన్నీ నేర్పలేదా, మేము కోరితే వారి నేరాలకు వారిని పట్టుకోగలమని? (కాని వారు గుణపాఠం నేర్పే యథార్థాలను లక్ష్యపెట్టరు). మేము వారి హృదయాలకు ముద్ర వేశాము. కనుక వారు ఏదీ వినరు. ఈ జాతుల ప్రజలు, ఎవరి గాథలను మేము మీకు వినిపిస్తున్నామో (మీ ముందు ఒక దృష్టాంతంగా ఉన్నారు). వారివద్దకు వారి ప్రవక్తలు స్పష్టమైన నిదర్శనాలను తీసుకు వచ్చారు. కాని వారు ఒకసారి తిరస్కరించినదానిని మళ్ళీ అంగీకరించేవారు కాదు. చూడండి! ఈ విధంగా మేము సత్యతిరస్కారుల హృదయాలకు ముద్రవేస్తాము. మేము వారిలో చాలా మందిని తమ వాగ్దానం పట్ల గౌరవం కలవారుగా చూడలేదు. చాలామందిని దుర్మార్గులుగానే చూశాము.

ثُمَّ بَعَثْنَا مِنْۢ بَعْدِهِمْ مُّوْسٰى بِاٰيٰتِنَآ اِلٰى
فِرْعَوْنَ وَ مَلَا۠ئِهٖ فَظَلَمُوْا بِهَا ۚ فَانْظُرْ كَيْفَ
كَانَ عَاقِبَةُ الْمُفْسِدِيْنَ ﴿۱۰۳﴾ وَ قَالَ مُوْسٰى
يٰفِرْعَوْنُ اِنِّيْ رَسُوْلٌ مِّنْ رَّبِّ الْعٰلَمِيْنَ ﴿۱۰۴﴾ لا
حَقِيْقٌ عَلٰۤى اَنْ لَّاۤ اَقُوْلَ عَلَى اللّٰهِ اِلَّا الْحَقَّ ؕ
قَدْ جِئْتُكُمْ بِبَيِّنَةٍ مِّنْ رَّبِّكُمْ فَاَرْسِلْ مَعِيَ
بَنِيْۤ اِسْرَآءِيْلَ ﴿۱۰۵﴾ قَالَ اِنْ كُنْتَ جِئْتَ بِاٰيَةٍ
فَاْتِ بِهَاۤ اِنْ كُنْتَ مِنَ الصّٰدِقِيْنَ ﴿۱۰۶﴾ فَاَلْقٰى
عَصَاهُ فَاِذَا هِيَ ثُعْبَانٌ مُّبِيْنٌ ﴿۱۰۷﴾ وَّ نَزَعَ يَدَهٗ
فَاِذَا هِيَ بَيْضَآءُ لِلنّٰظِرِيْنَ ﴿۱۰۸﴾ قَالَ الْمَلَاُ مِنْ ربع
قَوْمِ فِرْعَوْنَ اِنَّ هٰذَا لَسٰحِرٌ عَلِيْمٌ ﴿۱۰۹﴾ يُّرِيْدُ
اَنْ يُّخْرِجَكُمْ مِّنْ اَرْضِكُمْ ۚ فَمَاذَا تَاْمُرُوْنَ ﴿۱۱۰﴾
قَالُوْۤا اَرْجِهْ وَاَخَاهُ وَاَرْسِلْ فِي الْمَدَآئِنِ
حٰشِرِيْنَ ﴿۱۱۱﴾ يَاْتُوْكَ بِكُلِّ سٰحِرٍ عَلِيْمٍ ﴿۱۱۲﴾ وَ
جَآءَ السَّحَرَةُ فِرْعَوْنَ قَالُوْۤا اِنَّ لَنَا لَاَجْرًا
اِنْ كُنَّا نَحْنُ الْغٰلِبِيْنَ ﴿۱۱۳﴾ قَالَ نَعَمْ وَ اِنَّكُمْ
لَمِنَ الْمُقَرَّبِيْنَ ﴿۱۱۴﴾ قَالُوْا يٰمُوْسٰۤى اِمَّاۤ اَنْ
تُلْقِيَ وَ اِمَّاۤ اَنْ نَّكُوْنَ نَحْنُ الْمُلْقِيْنَ ﴿۱۱۵﴾
قَالَ اَلْقُوْا ۚ فَلَمَّاۤ اَلْقَوْا سَحَرُوْۤا اَعْيُنَ النَّاسِ
وَ اسْتَرْهَبُوْهُمْ وَجَآءُوْ بِسِحْرٍ عَظِيْمٍ ﴿۱۱۶﴾
وَاَوْحَيْنَاۤ اِلٰى مُوْسٰۤى اَنْ اَلْقِ عَصَاكَ ۚ فَاِذَا
هِيَ تَلْقَفُ مَا يَاْفِكُوْنَ ﴿۱۱۷﴾ ج

**103** (పైన పేర్కొనబడిన) ఈ జాతుల తరువాత మేము మూసాను మా సూచనలతో ఫిరౌను[32] వద్దకూ అతని జాతి సర్దారుల వద్దకూ పంపాము. కాని వారు కూడా మా సూచనల పట్ల అన్యాయంగా ప్రవర్తించారు. కనుక చూడండి, ఆ దుర్మార్గుల గతి ఏమయిందో!

**104 - 117** మూసా ఇలా అన్నాడు: "ఫిరౌన్! నేను విశ్వప్రభువు తన తరఫున పంపగా వచ్చినవాడను. నా పని ఏమిటంటే, అల్లాహ్ పేరుతో సత్యం తప్ప మరే మాటా పలక కుండా ఉండటం. నేను మీ వద్దకు మీ ప్రభువు తరఫు నుండి నా నియామకాన్ని గురించిన స్పష్టమైన నిదర్శనం తీసుకొని వచ్చాను. కనుక నీవు ఇస్రాయీలు సంతానాన్ని నాతో పంపు." ఫిరౌను ఇలా అన్నాడు: "ఒకవేళ నీవు ఏదైనా నిదర్శనాన్ని తెస్తే, నీ ప్రకటనలో సత్యవంతుడవే అయితే, దానిని తీసుకురా." మూసా తన చేతికర్రను విసిరాడు. అకస్మాత్తుగా అది ఒక సజీవ సర్పంగా మారిపోయింది. అతను తన జేబు నుండి చెయ్యిని పైకి తీశాడు. ప్రేక్షకులందరి ముందూ అది మెరయసాగింది. అప్పుడు ఫిరౌను జాతి సర్దారులు పరస్పరం ఇలా అనుకున్నారు: "నిశ్చయంగా ఈ వ్యక్తి మహా నైపుణ్యంగల మాంత్రికుడే. మిమ్మల్ని మీ భూమి నుండి వెళ్ళగొట్ట గోరు తున్నాడు.[33] ఇప్పుడేమంటారో చెప్పండి?" వీళ్ళంతా ఫిరౌనుకు ఇలా సలహా ఇచ్చారు: "అతన్నీ, అతని సోదరుణ్ణీ ఆపి ఉంచండి. అన్ని పట్టణాలకూ వేగులవాళ్ళను పంపండి, నిపుణుడైన ప్రతి మాంత్రికుణ్ణి మీ వద్దకు తీసుకురావటానికి." ఆ విధంగా మాంత్రికులు ఫిరౌను వద్దకు వచ్చారు. వారు ఇలా అన్నారు: "ఒకవేళ మేము గెలిస్తే మాకు దీని ప్రతిఫలం తప్పకుండా లభిస్తుంది కదా!" ఫిరౌను ఇలా సమాధానం చెప్పాడు: "అవును, మీరు మా సాన్నిధ్యానికి చేరువవుతారు." తరువాత వారు మూసాతో ఇలా అన్నారు: "నీవు విసురుతావా లేక మేము విసరాలా?" మూసా జవాబు పలికాడు: "మీరే విసరండి" అని. వారు తమ పాచికలను విసరి చూపులను మంత్ర ముగ్ధం, హృదయాలను భీతావహంచేశారు, అద్భుత మైన మాయాజాలాన్ని కల్పించారు. మేము మూసాకు, "నీ చేతి కర్రను విసరివెయ్యి" అని సంజ్ఞ చేశాము. అతను విసర గానే తృటిలో అది వారి బూటకపు మాయాజాలాన్ని మ్రింగే సింది.

فَوَقَعَ الْحَقُّ وَبَطَلَ مَا كَانُوْا يَعْمَلُوْنَ ﴿١١٨﴾
فَغُلِبُوْا هُنَالِكَ وَانْقَلَبُوْا صٰغِرِيْنَ ﴿١١٩﴾ وَ اُلْقِيَ
السَّحَرَةُ سٰجِدِيْنَ ﴿١٢٠﴾ قَالُوْٓا اٰمَنَّا بِرَبِّ
الْعٰلَمِيْنَ ﴿١٢١﴾ رَبِّ مُوْسٰى وَ هٰرُوْنَ ﴿١٢٢﴾

**118 - 122** ఈ విధంగా ఏది సత్యమో అది సత్యంగా నిరూపితమయింది. వారు దేనిని కల్పించారో అది అసత్యంగా మిగిలిపోయింది. ఫిరౌను, అతని సహచరులు పోటీరంగంలో పరాజితులయ్యారు. (విజయానికి బదులుగా) అంతా తారు మారై, అవమానం పాలయ్యారు. ఇక మాంత్రికుల పరిస్థితి, అంతరంగంలోని ఏదో విషయం వారిని సాష్టాంగపడేలా చేసింది. వారు ఇలా అన్నారు: "మేము విశ్వసించాము సకల లోకాల ప్రభువును, మూసా, హారూనులు విశ్వసిస్తున్న ప్రభువును."[34]

30. ఒక్కొక్క ప్రవక్త ఒక్కొక్క జాతియొక్క వ్యవహారాన్ని వేర్వేరుగా చెప్పిన తరువాత, ప్రతియుగంలోనూ ప్రవక్తల నియామకం జరిగినప్పుడు అల్లాహ్ అవలంబించిన సమగ్రమైన పద్ధతి గురించి ఇప్పుడు చెప్పటం జరుగుతోంది. అది ఏమిటంటే, ఏ జాతి వద్దకైనా ప్రవక్తను పంపినప్పుడు మొదట దానిని కష్టాలకూ ఆపదలకూ గురిచెయ్యటం జరిగింది, హితోపదేశం కొరకు దాని చెవులు తెరుచుకోవాలని, ఇంకా అది తన దైవం ముందు వినయవిధేయతలతో లొంగిపోవటానికి అంగీకరించాలని. తరువాత ఈ అనుకూల వాతావరణంలో కూడ దాని హృదయం సత్యస్వీకారం వైపునకు మొగ్గకపోతే, దానిని సిరిసంపదలు అనే పరీక్షకు గురిచెయ్యటం జరిగింది. ఇక్కడి నుంచి దాని సర్వనాశనం యొక్క పీఠిక ప్రారంభమయింది. దైవప్రవక్తల మాట వినకపోయినా దానిపై వరాల వర్షం కురిసినప్పుడు, అది తనను పట్టుకునే దేవుడెవడూ పైని లేడని భావించింది. ఇంకా మేమే సర్వాధికులం అనే అహంకారంతో దాని బుర్ర నిండిపోయింది. ఈ విషయం చివరకు దానిని దైవశిక్షకు గురిచేసింది.

31. అసలు 'మక్ర్' (ఎత్తుగడ) అనే పదం ఉపయోగించబడింది. అరబ్బీ భాషలో దాని అర్థం రహస్యోపాయం. అంటే, ఒక వ్యక్తికి వ్యతిరేకంగా, అతనిపై తిరుగులేని దెబ్బ పడేవరకు తనకు ఆపద ముంచుకొస్తున్నదని అతనికి తెలియకుండా ఎత్తుగడ వెయ్యటం. ఇంకా పై పరిస్థితులను చూసి అంతా సవ్యంగానే ఉంది అని అతడు భావించేలా యుక్తి పన్నటం.

32. ఫిరౌను అనే పదానికి "సూర్యదేవుని సంతానం" అని అర్థం. పూర్వపు ఈజిప్టు వాసులు తమ మహాదేవుడు లేక మహాప్రభువు అయిన సూర్యుణ్ణి 'రా' అనేవారు. ఫిరౌను అనే పేరు ఆ దేవుని పేరుతోనే వచ్చింది. ఇది ఒక వ్యక్తి పేరు కాదు. ఇది ఈజిప్టు రాజుల బిరుదు. రష్యా రాజులకు 'జార్' అని, ఈరాను పాదుషాలకు 'కిస్రా' అని బిరుదులున్నట్లు.

33. మూసా (అస్సలామ్), "నేను ప్రవక్తను" అని చేసిన ప్రకటనలో, అతను సమస్త జీవన వ్యవస్థను సమూలంగా మార్చాలని కోరుతున్నాడనే విషయం అంతర్లీనమై ఉంది. అందులో నిస్సందేహంగా దేశ రాజకీయ వ్యవస్థ కూడా ఉంది. ఎందుకంటే సకల లోకాల ప్రభువు ప్రతినిధి ఇతరులకు విధేయుడుగా, పాలితుడుగా ఉండేందుకు రాడు. ప్రజలను విధేయులుగా చెయ్యటానికి, వారిని పాలించటానికీ వస్తూ ఉంటాడు. ఒక అవిశ్వాసి యొక్క పరిపాలనా అధికారాన్ని అంగీకరించటం అతని ప్రవక్త హోదాకు పూర్తిగా వ్యతిరేకం. ఈ కారణంగానే హజ్రత్ మూసా "నేను ప్రవక్తను" అని చేసిన ప్రకటన వినగానే ఫిరౌనుకూ ఇతర రాజ్య ప్రముఖులకూ ఒక రాజకీయ, ఆర్థిక నాగరిక విప్లవం యొక్క ప్రమాదం పొడసూపింది. ఈ వ్యక్తి మాటగనక చెల్లితే అధికారం వారి చేతుల నుండి జారిపోతుందని వారు అర్థం చేసుకున్నారు.

34. ఈ విధంగా అల్లాహ్ ఫిరౌను ప్రజల ఎత్తుగడను వారిపైకే త్రిప్పికొట్టాడు. వారు దేశంలోని నిపుణులైన మాంత్రికులందరినీ పిలిచి బహిరంగ ప్రదర్శనను ఎందుకు ఏర్పాటుచేశారంటే, మూసా (అస్సలామ్) మాంత్రికుడనే నమ్మకాన్ని సామాన్య ప్రజానీకంలో కలుగజెయ్యటానికి లేదా కనీసం వారిలో ఈ అనుమానాన్నైనా పుట్టించటానికి. కాని ఈ పోటీలో ఓడిపోయిన తరువాత, వారు పిలిచిన మాంత్రిక నిపుణులు ఏకగ్రీవంగా నిర్ణయించారు – హజ్రత్ మూసా (అస్సలామ్) ప్రదర్శించిన వస్తువు మంత్రం కానేకాదని, అది నిశ్చయంగా సకల లోకాల ప్రభువు యొక్క శక్తి మహిమ అని, ఇంకా దాని ముందు ఏ మంత్రశక్తీ పనిచెయ్యదని.

قَالَ فِرْعَوْنُ اٰمَنْتُمْ بِهٖ قَبْلَ اَنْ اٰذَنَ لَكُمْ ۚ
اِنَّ هٰذَا لَمَكْرٌ مَّكَرْتُمُوْهُ فِى الْمَدِيْنَةِ
لِتُخْرِجُوْا مِنْهَآ اَهْلَهَا ۚ فَسَوْفَ تَعْلَمُوْنَ ﴿١٢٣﴾
لَاُقَطِّعَنَّ اَيْدِيَكُمْ وَاَرْجُلَكُمْ مِّنْ خِلَافٍ ثُمَّ
لَاُصَلِّبَنَّكُمْ اَجْمَعِيْنَ ﴿١٢٤﴾ قَالُوْٓا اِنَّآ اِلٰى رَبِّنَا
مُنْقَلِبُوْنَ ﴿١٢٥﴾ وَمَا تَنْقِمُ مِنَّآ اِلَّآ اَنْ اٰمَنَّا
بِاٰيٰتِ رَبِّنَا لَمَّا جَآءَتْنَا ؕ رَبَّنَآ اَفْرِغْ عَلَيْنَا
صَبْرًا وَّتَوَفَّنَا مُسْلِمِيْنَ ﴿١٢٦﴾ وَقَالَ الْمَلَاُ مِنْ ع ١٤/١٨
قَوْمِ فِرْعَوْنَ اَتَذَرُ مُوْسٰى وَقَوْمَهٗ لِيُفْسِدُوْا
فِى الْاَرْضِ وَيَذَرَكَ وَاٰلِهَتَكَ ؕ قَالَ
سَنُقَتِّلُ اَبْنَآءَهُمْ وَنَسْتَحْىٖ نِسَآءَهُمْ ۚ وَاِنَّا
فَوْقَهُمْ قٰهِرُوْنَ ﴿١٢٧﴾ قَالَ مُوْسٰى لِقَوْمِهِ
اسْتَعِيْنُوْا بِاللّٰهِ وَاصْبِرُوْا ۚ اِنَّ الْاَرْضَ
لِلّٰهِ ۙ يُوْرِثُهَا مَنْ يَّشَآءُ مِنْ عِبَادِهٖ ؕ وَ
الْعَاقِبَةُ لِلْمُتَّقِيْنَ ﴿١٢٨﴾ قَالُوْٓا اُوْذِيْنَا مِنْ قَبْلِ
اَنْ تَاْتِيَنَا وَمِنْ بَعْدِ مَا جِئْتَنَا ؕ قَالَ عَسٰى
رَبُّكُمْ اَنْ يُّهْلِكَ عَدُوَّكُمْ وَيَسْتَخْلِفَكُمْ فِى ع ١٥
الْاَرْضِ فَيَنْظُرَ كَيْفَ تَعْمَلُوْنَ ﴿١٢٩﴾

**123 - 124** ఫిరౌను ఇలా అన్నాడు: "నేను మీకు అనుమతి నివ్వక ముందే మీరు అతన్ని విశ్వసించారా? నిశ్చయంగా ఈ రాజధాని నగరంలో దాని పాలకులను అధికారం నుండి తొలగించటానికి మీరంతా కలసి రహస్యంగా పన్నిన కుట్ర ఇది. సరే, అయితే దాని ఫలితం మీకు ఇప్పుడే తెలుస్తుంది. నేను మీ చేతులనూ మీ కాళ్ళనూ వ్యతిరేకదిశలో నరికిస్తాను. ఇంకా దాని తరువాత మీ అందరినీ సిలువనెక్కిస్తాను."

**125 - 126** వారు ఇలా జవాబు పలికారు: "ఎట్టి పరిస్థితిలోనూ మేము మరలవలసింది మా ప్రభువు వైపునకే. నీవు ఏ విషయంలో మాపై పగతీర్చుకోదలచావో, అది మా ప్రభువు సూచనలు మా ముందుకు వచ్చినప్పుడు మేము వాటిని విశ్వసించామనేది తప్ప మరొకటికాదు. ప్రభూ, మాకు ఓరిమిని అమితంగా అనుగ్రహించు. మమ్మల్ని ప్రపంచం నుండి లేపినప్పుడు మేము నీకు విధేయులుగా ఉన్న స్థితిలోనే లేపు."[35]

**127** ఫిరౌనుతో అతని జాతి సర్దారులు ఇలా అన్నారు: "మూసానూ అతని జాతివారినీ రాజ్యంలో కల్లోలం వ్యాపింప చేయటానికీ, వారు నీ దాస్యాన్నీ నీ దేవుళ్ళ దాస్యాన్నీ కాదనటానికి, నీవు వారిని స్వేచ్ఛగా వదలిపెడతావా?" ఫిరౌను ఇలా జవాబు ఇచ్చాడు: "నేను వారి కొడుకులను చంపిస్తాను. వారి స్త్రీలను బ్రతకనిస్తాను.[36] వారిపై మా అధికారపు పట్టు పటిష్ఠంగా ఉంది."

**128 - 129** మూసా తన జాతివారితో ఇలా అన్నాడు: "అల్లాహ్‌ను సహాయం కొరకు అర్థించండి, ఓర్పు వహించండి. భూమి అల్లాహ్‌ది, తన దాసులలో తాను కోరిన వారిని దానికి వారసులుగా చేస్తాడు.[37] అంతిమ సాఫల్యం అల్లాహ్‌కు భయపడుతూ పనిచేసేవారి కొరకే." అతని జాతివారు ఇలా అన్నారు: "నీవు రాకపూర్వం కూడా మేము బాధింపబడే వారము. ఇప్పుడు నీవు వచ్చిన తరువాత కూడా బాధింపబడుతున్నాము." అతను ఇలా జవాబు పలికాడు: "మీ ప్రభువు మీ శత్రువులను నాశనం చేసి మిమ్మల్ని ధరణిలో ఖలీఫాలుగా చేసే సమయం సమీపంలోనే ఉంది. అప్పుడు మీరు ఎలా ప్రవర్తిస్తారో ఆయన చూస్తాడు."

وَ لَقَدْ اَخَذْنَآ اٰلَ فِرْعَوْنَ بِالسِّنِيْنَ وَ نَقْصٍ
مِّنَ الثَّمَرٰتِ لَعَلَّهُمْ يَذَّكَّرُوْنَ ﴿١٣٠﴾ فَاِذَا
جَآءَتْهُمُ الْحَسَنَةُ قَالُوْا لَنَا هٰذِهٖ ۚ وَاِنْ
تُصِبْهُمْ سَيِّئَةٌ يَّطَّيَّرُوْا بِمُوْسٰى وَ مَنْ مَّعَهٗ ؕ
اَلَآ اِنَّمَا طٰٓئِرُهُمْ عِنْدَ اللّٰهِ وَ لٰكِنَّ اَكْثَرَهُمْ
لَا يَعْلَمُوْنَ ﴿١٣١﴾ وَ قَالُوْا مَهْمَا تَاْتِنَا بِهٖ مِنْ اٰيَةٍ
لِّتَسْحَرَنَا بِهَا ۙ فَمَا نَحْنُ لَكَ بِمُؤْمِنِيْنَ ﴿١٣٢﴾
فَاَرْسَلْنَا عَلَيْهِمُ الطُّوْفَانَ وَالْجَرَادَ وَالْقُمَّلَ
وَالضَّفَادِعَ وَالدَّمَ اٰيٰتٍ مُّفَصَّلٰتٍ ۟
فَاسْتَكْبَرُوْا وَ كَانُوْا قَوْمًا مُّجْرِمِيْنَ ﴿١٣٣﴾ وَ لَمَّا
وَقَعَ عَلَيْهِمُ الرِّجْزُ قَالُوْا يٰمُوْسَى ادْعُ لَنَا
رَبَّكَ بِمَا عَهِدَ عِنْدَكَ ۚ لَئِنْ كَشَفْتَ عَنَّا
الرِّجْزَ لَنُؤْمِنَنَّ لَكَ وَلَنُرْسِلَنَّ مَعَكَ بَنِيْٓ
اِسْرَآءِيْلَ ﴿١٣٤﴾ ۚ فَلَمَّا كَشَفْنَا عَنْهُمُ الرِّجْزَ اِلٰٓى
اَجَلٍ هُمْ بٰلِغُوْهُ اِذَا هُمْ يَنْكُثُوْنَ ﴿١٣٥﴾ فَانْتَقَمْنَا
مِنْهُمْ فَاَغْرَقْنٰهُمْ فِى الْيَمِّ بِاَنَّهُمْ كَذَّبُوْا
بِاٰيٰتِنَا وَ كَانُوْا عَنْهَا غٰفِلِيْنَ ﴿١٣٦﴾ وَ اَوْرَثْنَا
الْقَوْمَ الَّذِيْنَ كَانُوْا يُسْتَضْعَفُوْنَ مَشَارِقَ
الْاَرْضِ وَمَغَارِبَهَا الَّتِيْ بٰرَكْنَا فِيْهَا ؕ وَ
تَمَّتْ كَلِمَتُ رَبِّكَ الْحُسْنٰى عَلٰى بَنِيْٓ اِسْرَآءِيْلَ ۙ
بِمَا صَبَرُوْا ؕ وَ دَمَّرْنَا مَا كَانَ يَصْنَعُ فِرْعَوْنُ
وَ قَوْمُهٗ وَ مَا كَانُوْا يَعْرِشُوْنَ ﴿١٣٧﴾ ع

**130 - 137** మేము ఫిరౌను ప్రజలను ఎన్నో సంవత్సరాల వరకు కరువుకూ, పంటల కొరతకూ గురిచేశాము, బహుశా వారికి తెలివి వస్తుందేమో అని. కాని వారి పరిస్థితి ఎలా ఉండేదంటే, మంచికాలం వచ్చినప్పుడు వారు, "మేము దీనికే అర్హులం" అని అనేవారు. గడ్డుకాలం వచ్చినప్పుడు వారు మూసానూ, అతని సహచరులనూ తమకు అపశకునంగా పేర్కొనే వారు. అసలు వాస్తవానికి వారి అపశకునం అల్లాహ్ చేతులలో ఉంది. కాని వారిలో చాలామంది జ్ఞానహీనులు. వారు మూసాతో ఇలా అన్నారు: "నీవు మంత్ర జాలంగా మాపై ప్రయోగించటానికి ఏ మంత్రసూచనను తెచ్చినా మేము నీ మాటను నమ్మేవాళ్ళము కాము." చివరకు మేము వారి పైకి తుఫానును పంపాము. మిడతల దండులను వదిలాము. పేలు వ్యాపింపజేశాము. కప్పలను పుట్టించాము. రక్తము కురిపించాము. ఈ సూచనలనన్నింటినీ వేర్వేరుగా చూపించాము. కాని వారు తలబిరుసుతనం ప్రదర్శిస్తూనే పోయారు. వారు మహాపరాధం చేసిన ప్రజలు. వారిపై ఆపద అవతరించినప్పుడల్లా ఇలా అనేవారు: "మూసా! నీకు నీ ప్రభువు తరఫు నుండి లభించిన పదవి ఆధారంగా మా కొరకు ప్రార్థించు. ఈసారి నీవు మానుండి ఈ ఆపదను తొలగింపజేస్తే మేము నీ మాటలను విశ్వసిస్తాము. ఇస్రాయీలు సంతానాన్ని నీవెంట పంపుతాము." కాని మేము మా శిక్షను వారినుండి ఒక నిర్ణీతమైన కాలం వరకు– ఆ కాలానికి వారు ఎలాగైనా చేరుకోవలసినవారే – తొలగించినప్పుడల్లా వారు తమ వాగ్దానం నుండి ఒక్కసారిగా మరలిపోయేవారు. అప్పుడు మేము వారికి ప్రతీకారం చేశాము. వారిని సముద్రంలో ముంచివేశాము. ఎందుకంటే, వారు మా సూచనలు అసత్యాలని తిరస్కరించారు. వాటిని లెక్క చేయలేదు. ఇంకా వారి స్థానంలో, బలహీనులుగా చెయ్యబడిన వారందరినీ మేము ఆ భూభాగపు తూర్పు పడమరలకు వారసులుగా చేశాము. ఆ భూభాగాన్ని మేము శుభాలతో నింపాము.[38] ఈ విధంగా నీ ప్రభువు ఇస్రాయీలు సంతతికి మేలు చేస్తాను అన్న వాగ్దానం నెరవేరింది. ఎందుకంటే వారు ఓర్పుతో వ్యవహరించారు. ఇంకా ఫిరౌనూ, అతని జాతివారూ చేసిన నిర్మాణాలూ, లేపిన భవనాలూ సమస్తమూ మేము నేలమట్టం చేశాము.

وَجٰوَزْنَا بِبَنِيٓ اِسْرَآءِيْلَ الْبَحْرَ فَاَتَوْا عَلٰى
قَوْمٍ يَّعْكُفُوْنَ عَلٰٓى اَصْنَامٍ لَّهُمْ ۚ قَالُوْا يٰمُوْسَى
اجْعَلْ لَّنَآ اِلٰهًا كَمَا لَهُمْ اٰلِهَةٌ ۗ قَالَ اِنَّكُمْ
قَوْمٌ تَجْهَلُوْنَ ١٣٨ اِنَّ هٰٓؤُلَآءِ مُتَبَّرٌ مَّا هُمْ
فِيْهِ وَبٰطِلٌ مَّا كَانُوْا يَعْمَلُوْنَ ١٣٩ قَالَ اَغَيْرَ
اللّٰهِ اَبْغِيْكُمْ اِلٰهًا وَّهُوَ فَضَّلَكُمْ عَلَى
الْعٰلَمِيْنَ ١٤٠ وَاِذْ اَنْجَيْنٰكُمْ مِّنْ اٰلِ فِرْعَوْنَ
يَسُوْمُوْنَكُمْ سُوْٓءَ الْعَذَابِ ۚ يُقَتِّلُوْنَ اَبْنَآءَكُمْ وَ
يَسْتَحْيُوْنَ نِسَآءَكُمْ ۗ وَفِيْ ذٰلِكُمْ بَلَآءٌ مِّنْ
رَّبِّكُمْ عَظِيْمٌ ١٤١ ع ١٦/١٢

**138 - 141** మేము ఇస్రాయీలు సంతతిని సముద్రం దాటించాము. తరువాత వారు పోసాగారు, మార్గమధ్యంలో ఒక జాతి ప్రజల వద్దకుపోవడం జరిగింది. ఆ జాతివారు తాము ఆరాధించే కొన్ని విగ్రహాల పట్ల ప్రేమకు పూర్తిగా అంకితమైనవారు. (ఇస్రాయీల్ సంతతి) వారు ఇలా అన్నారు: "మూసా! వాళ్ళ దేవుళ్ళవంటి ఒక దేవుణ్ణి మాకు కూడా చేసిపెట్టు."[39] మూసా ఇలా అన్నాడు: "మీరు చాలా అజ్ఞానపు మాటలు మాట్లాడుతున్నారు. ఈ ప్రజలు అవలంబిస్తున్న విధానం నాశనం అయ్యేదే. ఇంకా వారు చేస్తూ ఉన్న పని పూర్తిగా అసత్యమైనది." మళ్ళీ మూసా ఇలా అన్నాడు: "నేను అల్లాహ్‌ను కాదని మరొక దైవాన్ని మీకొరకు అన్వేషించాలా? వాస్తవానికి ప్రపంచంలోని సమస్త జాతుల కంటే మీకు ఔన్నత్యాన్ని ప్రసాదించింది అల్లాహ్‌యే." (అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు): మేము మీకు ఫిరౌన్ ప్రజల బారినుండి విముక్తి కలిగించిన సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకోండి. వారు మిమ్మల్ని ఘోర యాతనకు గురిచేసేవారు. మీ కుమారులను చంపేవారు, మీ స్త్రీలను మాత్రం బ్రతకనిచ్చేవారు. ఇందులో మీ ప్రభువు తరఫునుండి మీకు ఒక పెద్ద పరీక్ష ఉండినది.

35. పథకం తలక్రిందులు కావటం చూసిన ఫిరౌను చివరి ఎత్తు వేశాడు. ఈ మొత్తం వ్యవహారాన్ని మూసా (అస్సలామ్) ప్రవక్తా, మాంత్రికులూ కలసి పన్నిన కుట్రగా నిర్ణయించి, మాంత్రికులకు శారీరక హింస, మరణశిక్ష విధించటం జరుగుతుందని బెదిరించి, వారు తన ఈ అభియోగాన్ని ఒప్పుకునేలా చెయ్యాలనేదే ఈ ఎత్తు. కాని ఈ ఎత్తు కూడా బెడిసికొట్టింది. మాంత్రికులు తాము ఏ శిక్షకైనా సిద్ధమేనని చెబుతూ, తాము మూసా (అస్సలామ్) ప్రవక్త సత్యసంధతను నమ్మటం ఏ కుట్ర ఫలితమూ కాదని, సత్యాన్ని అంగీకరించిన ఫలితమే అని నిరూపించారు. ఇక్కడ, కొన్ని క్షణాలలోనే విశ్వాసం ఈ మాంత్రికుల ప్రవర్తనలో ఎంత పెద్ద విప్లవాన్ని తెచ్చింది అనే విషయం గమనించదగింది. కొంతసేపటికి పూర్వం ఈ మాంత్రికుల అల్పత్వం స్థితి ఎలా ఉందంటే, వారు తమ పూర్వీకుల ధర్మాన్ని సమర్థించటానికీ, దానికి సహాయపడటానికీ తమ గృహాల నుండి బయలుదేరి వచ్చారు, ఇంకా ఫిరౌనును "ఒకవేళ మేము మా మతాన్ని మూసా (అస్సలామ్) దాడి నుండి రక్షించుకుంటే, సర్కారువారి నుండి మాకు బహుమానం లభిస్తుంది గదా?" అని అడిగారు కూడా. అలాంటివారు ఇప్పుడు విశ్వాస భాగ్యం లభించిన తరువాత, వారి సత్యభక్తి, ఉన్నత సంకల్పం ఏ దశకు చేరాయంటే, కొంతసేపటికి పూర్వం ఏ రాజుముందు దురాశకు లోనై లొంగిపోయారో, ఇప్పుడు అతని సర్వాధికార్యాన్నీ, ప్రచండశక్తినీ ధిక్కరిస్తున్నారు. అతడు విధిస్తానని బెదిరించిన భయంకరమైన శిక్షలను సైతం అనుభవించటానికి సిద్ధపడుతున్నారు. కాని ఈ సత్యం సత్యమైన దిగా వారికి స్పష్టమైన తరువాత దానిని త్యజించటానికి సిద్ధంగా లేరు.

36. ఈ విషయం స్పష్టంగా అవగాహనలో ఉండాలి - ఒకటి హజ్రత్ మూసా (అస్సలామ్) జననానికి పూర్వం ప్రారంభమైన హింసాకాలం. రెండోది మూసా (అస్సలామ్) ప్రవక్త పదవికి నియమింపబడిన తరువాత ప్రారంభమైన హింసాకాలం. రెండు కాలాలలోనూ సమానమైన విషయం ఏమిటంటే, ఇస్రాయీలు సంతతివారి

وَ وٰعَدْنَا مُوْسٰى ثَلٰثِيْنَ لَيْلَةً وَّاَتْمَمْنٰهَا بِعَشْرٍ
فَتَمَّ مِيْقَاتُ رَبِّهٖٓ اَرْبَعِيْنَ لَيْلَةً ۚ وَقَالَ
مُوْسٰى لِاَخِيْهِ هٰرُوْنَ اخْلُفْنِيْ فِيْ قَوْمِيْ
وَاَصْلِحْ وَ لَا تَتَّبِعْ سَبِيْلَ الْمُفْسِدِيْنَ ﴿١٤٢﴾
وَلَمَّا جَآءَ مُوْسٰى لِمِيْقَاتِنَا وَ كَلَّمَهٗ رَبُّهٗ ۙ
قَالَ رَبِّ اَرِنِيْٓ اَنْظُرْ اِلَيْكَ ؕ قَالَ لَنْ
تَرٰىنِيْ وَ لٰكِنِ انْظُرْ اِلَى الْجَبَلِ فَاِنِ اسْتَقَرَّ
مَكَانَهٗ فَسَوْفَ تَرٰىنِيْ ۚ فَلَمَّا تَجَلّٰى رَبُّهٗ
لِلْجَبَلِ جَعَلَهٗ دَكًّا وَّ خَرَّ مُوْسٰى صَعِقًا ۚ
فَلَمَّآ اَفَاقَ قَالَ سُبْحٰنَكَ تُبْتُ اِلَيْكَ وَاَنَا
اَوَّلُ الْمُؤْمِنِيْنَ ﴿١٤٣﴾ قَالَ يٰمُوْسٰٓى اِنِّيْ
اصْطَفَيْتُكَ عَلَى النَّاسِ بِرِسٰلٰتِيْ وَبِكَلَامِيْ ۖ
فَخُذْ مَآ اٰتَيْتُكَ وَكُنْ مِّنَ الشّٰكِرِيْنَ ﴿١٤٤﴾

**142 - 144** మేము మూసాను (సినాయ్ కొండపైకి) ముప్పై రేయింబవళ్ళ కోసం పిలిపించాము. తరువాత ఇంకా పది రోజులు పొడిగించాము. ఈ విధంగా అతని ప్రభువు నిర్ణయించిన గడువు మొత్తం నలభై రోజులు అయింది. మూసా పోతూ పోతూ తన సోదరుడు హారూనుతో ఇలా అన్నాడు: "నా తరువాత నీవు నాజాతి ప్రజలలో నాకు ప్రాతినిధ్యం వహించు. సక్రమంగా వ్యవహరిస్తూ ఉండు. విచ్ఛిన్నకారుల మార్గంలో నడవకు." మేము నిర్ణయించిన సమయానికి సరిగ్గా అతను చేరినప్పుడు, అతని ప్రభువు అతనితో సంభాషించాడు. అప్పుడు అతను ఇలా మనవి చేశాడు: "ప్రభూ! నా చూపునకు బలాన్ని ప్రసాదించు. నిన్ను చూస్తాను." ఇలా సెలవిచ్చాడు: "నీవు నన్ను చూడలేవు. కొంచెం, ముందున్న ఆ కొండవైపు చూడు. అది తన స్థానంలో స్థిరంగా ఉంటే అప్పుడు నీవు నన్ను చూడగలవు." ఆ ప్రకారం అతని ప్రభువు ఆ కొండపై తన తేజస్సును ప్రసరింపజేసి దానిని భస్మం చేసేశాడు. మూసా స్పృహతప్పి పడిపోయాడు. తెలివి వచ్చిన తరువాత ఇలా అన్నాడు: "నీవు పరిశుద్ధుడవు. నేను నీ సన్నిధిలో పశ్చాత్తాప పడుతున్నాను. అందరికంటే మొదట నేనే విశ్వసిస్తున్నాను." ఇలా సెలవిచ్చాడు: "మూసా, నా సందేశాన్ని అందజెయ్యటానికి, నాతో సంభాషించటానికి, ప్రజలందరికంటే నీకు ప్రాధాన్యం ఇచ్చి నేను నిన్ను ఎన్నుకున్నాను. కనుక నేనిచ్చే దానిని తీసుకో. కృతజ్ఞతలు తెలుపు."

కొడుకులను చంపటం జరిగింది. వారి కూతుళ్ళను వదలిపెట్టటం జరిగింది. ఎందుకంటే వారి జాతిని క్రమక్రమంగా అంతం చెయ్యటానికి, ఆ జాతి ఇతర జాతులలో లీనమైపోవటానికి.

37. ఈ కాలంలో కొంతమంది ఈ ఆయత్ నుండి "భూమి అల్లాహ్‌ది" అనే భాగాన్ని తీసుకుంటారు. కాని "తాను కోరిన వారిని దానికి వారసులుగా చేస్తాడు" అనే తరువాతి భాగాన్ని పట్టించుకోరు.

38. అంటే, ఇస్రాయీలు సంతతిని పాలస్తీనా భూభాగానికి వారసులుగా చేశాము. ఖురానులో పలుచోట్ల, పాలస్తీనా, సిరియా భూభాగాలకే, "మేము ఈ భూభాగాన్ని శుభాలతో నింపాము" అనే పదాలు ఉపయోగించబడ్డాయి.

39. ఈ జాతివారు ముస్లిములే. కాని ఈజిప్టులో శతాబ్దాల తరబడి విగ్రహపూజ చేసే జాతి వారి మధ్య ఉన్న దాని ప్రభావం ఇది.

**145 - 147** తరువాత మేము జీవితానికి సంబంధించిన ప్రతి రంగానికి కావలసిన హితబోధనూ, ప్రతి వ్యవహారానికి సంబంధించిన స్పష్టమైన మార్గదర్శకత్వాన్నీ శిలాఫలకాలపై వ్రాసి మూసాకు ఇచ్చాము. అతనితో ఇలా అన్నాము: "ఈ ఉపదేశాలను నీ చేతులతో గట్టిగా పట్టుకో. వాటి ఉత్తమ భావాలను అనుసరించండి అని నీ జాతివారిని ఆజ్ఞాపించు. త్వరలోనే నేను నీకు దుర్మార్గుల గృహాలను చూపిస్తాను. ఏ హక్కూ లేకుండా భూమిపై పెద్దలుగా చలామణి అయ్యే వారి దృష్టిని నేను నా సూచనల నుండి మరలిస్తాను. వారు ఏ సూచనను చూచినా దానిని ఎన్నటికీ విశ్వసించరు. ఒకవేళ సరియైన మార్గం వారి ముందుకు వచ్చినా దానిని వారు అవలంబించరు. ఒకవేళ వక్రమార్గం కనిపిస్తే, వెంటనే ఆ మార్గం మీదకు దుముకుతారు. ఎందుకంటే, వారు మా సూచనలను తిరస్కరించారు. వాటిని నిర్లక్ష్యం చేస్తూ వచ్చారు. మా సూచనలను తిరస్కరించి పరలోకంలో హాజరు కావటాన్ని త్రోసిపుచ్చేవాడి కర్మలన్నీ వ్యర్థమైపోతాయి. ప్రజలు మరేదైనా ప్రతిఫలాన్ని పొందగలరా, వారు ఎంతచేస్తే అంత తప్ప?"

**148 - 153** మూసా (వెళ్ళిన) తరువాత, అతని జాతి ప్రజలు తమ ఆభరణాలతో ఒక ఆవుదూడ విగ్రహాన్ని తయారుచేశారు. అందులో నుండి ఆవు అరుపువంటి ధ్వని వచ్చేది. అది వారితో మాట్లాడలేదనీ, మరే వ్యవహారంలోనూ వారికి మార్గం చూపలేదనీ వారికి కనిపించేది కాదా? అయి నప్పటికీ వారు దానిని ఆరాధ్యదైవంగా చేసుకున్నారు. వారు పరమ దుర్మార్గులు.[40] వారి నుండి ఆత్మ వంచనపు తెరలు తొలగిపోయినప్పుడు, వారు తాము వాస్తవానికి మార్గం తప్పామని కనుగొన్నారు. అప్పుడు ఇలా అన్నారు: "మా ప్రభువు గనక మాపై దయ చూపకపోతే, మమ్మల్ని మన్నించకపోతే, మేము సర్వనాశనం అయిపోతాము."

وَ كَتَبْنَا لَهٗ فِي الْاَلْوَاحِ مِنْ كُلِّ شَيْءٍ مَّوْعِظَةً
وَّتَفْصِيْلًا لِّكُلِّ شَيْءٍ ۚ فَخُذْهَا بِقُوَّةٍ وَّاْمُرْ
قَوْمَكَ يَاْخُذُوْا بِاَحْسَنِهَا ؕ سَاُورِيْكُمْ دَارَ
الْفٰسِقِيْنَ ﴿١٤٥﴾ سَاَصْرِفُ عَنْ اٰيٰتِيَ الَّذِيْنَ
يَتَكَبَّرُوْنَ فِي الْاَرْضِ بِغَيْرِ الْحَقِّ ؕ وَ اِنْ
يَّرَوْا كُلَّ اٰيَةٍ لَّا يُؤْمِنُوْا بِهَا ۚ وَ اِنْ يَّرَوْا
سَبِيْلَ الرُّشْدِ لَا يَتَّخِذُوْهُ سَبِيْلًا ۚ وَ اِنْ يَّرَوْا
سَبِيْلَ الْغَيِّ يَتَّخِذُوْهُ سَبِيْلًا ؕ ذٰلِكَ بِاَنَّهُمْ
كَذَّبُوْا بِاٰيٰتِنَا وَ كَانُوْا عَنْهَا غٰفِلِيْنَ ﴿١٤٦﴾ وَ
الَّذِيْنَ كَذَّبُوْا بِاٰيٰتِنَا وَ لِقَآءِ الْاٰخِرَةِ حَبِطَتْ
اَعْمَالُهُمْ ؕ هَلْ يُجْزَوْنَ اِلَّا مَا كَانُوْا يَعْمَلُوْنَ ﴿١٤٧﴾ ع
وَ اتَّخَذَ قَوْمُ مُوْسٰى مِنْۢ بَعْدِهٖ مِنْ حُلِيِّهِمْ
عِجْلًا جَسَدًا لَّهٗ خُوَارٌ ؕ اَلَمْ يَرَوْا اَنَّهٗ لَا
يُكَلِّمُهُمْ وَ لَا يَهْدِيْهِمْ سَبِيْلًا ۘ اِتَّخَذُوْهُ
وَكَانُوْا ظٰلِمِيْنَ ﴿١٤٨﴾ وَ لَمَّا سُقِطَ فِيْۤ اَيْدِيْهِمْ
وَرَاَوْا اَنَّهُمْ قَدْ ضَلُّوْا ۙ قَالُوْا لَئِنْ لَّمْ
يَرْحَمْنَا رَبُّنَا وَيَغْفِرْلَنَا لَنَكُوْنَنَّ مِنَ الْخٰسِرِيْنَ ﴿١٤٩﴾

وقف لازم

40. ఇస్రాయీలు సంతతిపై పడిన ఈజిప్టు ప్రభావం యొక్క మరొకరూపం ఇది. వారు దానిని తీసుకుని ఈజిప్టు నుండి బయలుదేరారు. ఈజిప్టులో ఆవును పూజించేవారు. దానిని పవిత్రంగా భావించేవారు. ఈ ఆచార ప్రభావం వారిపై చాలా తీవ్రంగా పడింది. కనుకనే వారు ప్రవక్త కనుమరుగవగానే పూజ కొరకు ఒక కృత్రిమపు ఆవుదూడను తయారుచేసుకున్నారు.

وَ لَمَّا رَجَعَ مُوْسٰۤى اِلٰى قَوْمِهٖ غَضْبَانَ اَسِفًا ۙ
قَالَ بِئْسَمَا خَلَفْتُمُوْنِیْ مِنْۢ بَعْدِیْ ۚ اَعَجِلْتُمْ
اَمْرَ رَبِّكُمْ ۚ وَ اَلْقَى الْاَلْوَاحَ وَ اَخَذَ بِرَاْسِ
اَخِیْهِ یَجُرُّهٗۤ اِلَیْهِ ؕ قَالَ ابْنَ اُمَّ اِنَّ الْقَوْمَ
اسْتَضْعَفُوْنِیْ وَ كَادُوْا یَقْتُلُوْنَنِیْ ۖ فَلَا تُشْمِتْ
بِیَ الْاَعْدَآءَ وَ لَا تَجْعَلْنِیْ مَعَ الْقَوْمِ
الظّٰلِمِیْنَ ۝١٥٠ قَالَ رَبِّ اغْفِرْ لِیْ وَ لِاَخِیْ وَ
اَدْخِلْنَا فِیْ رَحْمَتِكَ ۖ وَ اَنْتَ اَرْحَمُ الرّٰحِمِیْنَ ۝١٥١ ع ١٨ ٨
اِنَّ الَّذِیْنَ اتَّخَذُوا الْعِجْلَ سَیَنَالُهُمْ غَضَبٌ
مِّنْ رَّبِّهِمْ وَ ذِلَّةٌ فِی الْحَیٰوةِ الدُّنْیَا ؕ وَ كَذٰلِكَ
نَجْزِی الْمُفْتَرِیْنَ ۝١٥٢ وَ الَّذِیْنَ عَمِلُوا السَّیِّاٰتِ
ثُمَّ تَابُوْا مِنْۢ بَعْدِهَا وَ اٰمَنُوْۤا ۟ اِنَّ رَبَّكَ مِنْۢ
بَعْدِهَا لَغَفُوْرٌ رَّحِیْمٌ ۝١٥٣ وَ لَمَّا سَكَتَ عَنْ
مُّوْسَى الْغَضَبُ اَخَذَ الْاَلْوَاحَ ۖ وَ فِیْ نُسْخَتِهَا
هُدًى وَّ رَحْمَةٌ لِّلَّذِیْنَ هُمْ لِرَبِّهِمْ یَرْهَبُوْنَ ۝١٥٤
وَ اخْتَارَ مُوْسٰى قَوْمَهٗ سَبْعِیْنَ رَجُلًا
لِّمِیْقَاتِنَا ۚ فَلَمَّاۤ اَخَذَتْهُمُ الرَّجْفَةُ قَالَ رَبِّ
لَوْ شِئْتَ اَهْلَكْتَهُمْ مِّنْ قَبْلُ وَ اِیَّایَ ؕ
اَتُهْلِكُنَا بِمَا فَعَلَ السُّفَهَآءُ مِنَّا ۚ اِنْ هِیَ اِلَّا
فِتْنَتُكَ ؕ تُضِلُّ بِهَا مَنْ تَشَآءُ وَ تَهْدِیْ مَنْ
تَشَآءُ ؕ اَنْتَ وَلِیُّنَا فَاغْفِرْ لَنَا وَ ارْحَمْنَا
وَ اَنْتَ خَیْرُ الْغٰفِرِیْنَ ۝١٥٥

అటునుండి మూసా ఆగ్రహంతో, విచారంతో తన జాతి ప్రజల వద్దకు మరలివచ్చాడు. వచ్చిన వెంటనే ఇలా అన్నాడు: "నేను లేనప్పుడు నా స్థానంలో మీరు చాలా చెడ్డగా ప్రవర్తించారు. మీ ప్రభువు ఆజ్ఞ కొరకు నిరీక్షించే ఓపిక కూడా మీలో లేకుండా పోయిందా?" అతను శిలాఫలకాలను విసిరివేశాడు. తన సోదరుడు (హారూను) తలవెంట్రుకలను పట్టుకొని అతన్ని లాగాడు. హారూను ఇలా అన్నాడు: "నా తల్లి కుమారుడా! ఈ ప్రజలు నన్ను లోబరచు కున్నారు. ఇంకా కాస్తయితే నన్ను చంపేసేవారే. కనుక నీవు శత్రువులకు, నన్ను చూసి నవ్వే అవకాశం ఇవ్వకు. ఈ దుర్మార్గపు ముఠాతో నన్ను కలపకు." అప్పుడు మూసా ఇలా అన్నాడు: "ప్రభూ! నన్నూ నా సోదరుణ్ణీ క్షమించు. మమ్మల్ని నీ కారుణ్యంలోకి ప్రవేశింపజెయ్యి. నీవు అందరికంటే అధికంగా కారుణ్యం చూపేవాడవు." (సమాధానంగా ఇలా సెలవియ్యబడింది): "ఆవుదూడను ఆరాధ్య దైవంగా చేసుకున్నవారు తప్పకుండా తమ ప్రభువు ఆగ్రహంలో చిక్కుకుని తీరుతారు. ఇహలోక జీవితంలో అవమానం పాలవుతారు. అబద్ధం సృష్టించే వారికి మేము ఇటువంటి శిక్షనే విధిస్తాము. చెడుకార్యం చేసి, పశ్చాత్తాపపడి, విశ్వసించేవారు నిశ్చయంగా ఈ పశ్చాత్తాప, విశ్వాసాల తరువాత వారు నీ ప్రభువును క్షమించే వాడుగా, కనికరించేవాడుగా చూస్తారు."

**154 - 156** కోపం చల్లారిన పిమ్మట, మూసా ఆ శిలాఫలకాలను తన చేతులలోకి తీసుకున్నాడు. వాటి వ్రాతలో తమ ప్రభువుకు భయపడే వారి కొరకు మార్గదర్శకత్వమూ కారుణ్యమూ ఉన్నాయి. మేము నిర్ణయించిన సమయానికి (అతనితో పాటు) హాజరుకావటానికి మూసా తన జాతి ప్రజల నుండి డెబ్భై మందిని ఎన్నుకున్నాడు.[41] వారిని ఒక తీవ్ర భూకంపం వచ్చి పట్టుకున్నప్పుడు మూసా ఇలా మనవి చేసుకున్నాడు: "నా స్వామీ! మీరు సంకల్పించి ఉన్నట్లయితే, మొదట్లోనే వీళ్ళనూ, నన్నూ నాశనం చేయగలిగి ఉండేవారు. మాలోని కొందరు అజ్ఞానులు చేసిన తప్పునకు మీరు మా అందరినీ నాశనం చేస్తారా? ఇది మీరు పెట్టిన ఒక పరీక్ష. దానిద్వారా మీరు కోరినవారిని అపమార్గానికి గురిచేస్తారు. ఇంకా మీరు కోరిన వారికి మార్గదర్శకత్వాన్ని ప్రసాదిస్తారు. మా సంరక్షకులు మీరే! కనుక మమ్మల్ని క్షమించండి. మాపై దయచూపండి. మీరు అందరికంటే అధికంగా క్షమించేవారు.

وَاكْتُبْ لَنَا فِيْ هٰذِهِ الدُّنْيَا حَسَنَةً وَّ فِي
الْاٰخِرَةِ اِنَّا هُدْنَاۤ اِلَيْكَ ؕ قَالَ عَذَابِيْۤ
اُصِيْبُ بِهٖ مَنْ اَشَآءُ ۚ وَرَحْمَتِيْ وَسِعَتْ كُلَّ
شَيْءٍ ؕ فَسَاَكْتُبُهَا لِلَّذِيْنَ يَتَّقُوْنَ وَ يُؤْتُوْنَ
الزَّكٰوةَ وَ الَّذِيْنَ هُمْ بِاٰيٰتِنَا يُؤْمِنُوْنَ ﴿۱۵۶﴾
اَلَّذِيْنَ يَتَّبِعُوْنَ الرَّسُوْلَ النَّبِيَّ الْاُمِّيَّ الَّذِيْ
يَجِدُوْنَهٗ مَكْتُوْبًا عِنْدَهُمْ فِي التَّوْرٰىةِ
وَالْاِنْجِيْلِ ۫ يَاْمُرُهُمْ بِالْمَعْرُوْفِ وَ يَنْهٰىهُمْ عَنِ
الْمُنْكَرِ وَ يُحِلُّ لَهُمُ الطَّيِّبٰتِ وَ يُحَرِّمُ عَلَيْهِمُ
الْخَبٰٓئِثَ وَيَضَعُ عَنْهُمْ اِصْرَهُمْ وَالْاَغْلٰلَ الَّتِيْ
كَانَتْ عَلَيْهِمْ ؕ فَالَّذِيْنَ اٰمَنُوْا بِهٖ وَ عَزَّرُوْهُ
وَنَصَرُوْهُ وَ اتَّبَعُوا النُّوْرَ الَّذِيْۤ اُنْزِلَ مَعَهٗۤ ۙ
اُولٰٓئِكَ هُمُ الْمُفْلِحُوْنَ ﴿۱۵۷﴾ قُلْ يٰۤاَيُّهَا النَّاسُ ع ١٩
اِنِّيْ رَسُوْلُ اللّٰهِ اِلَيْكُمْ جَمِيْعًا الَّذِيْ لَهٗ
مُلْكُ السَّمٰوٰتِ وَ الْاَرْضِ ۚ لَاۤ اِلٰهَ اِلَّا هُوَ
يُحْيٖ وَيُمِيْتُ ۪ فَاٰمِنُوْا بِاللّٰهِ وَ رَسُوْلِهِ
النَّبِيِّ الْاُمِّيِّ الَّذِيْ يُؤْمِنُ بِاللّٰهِ وَ كَلِمٰتِهٖ وَ
اتَّبِعُوْهُ لَعَلَّكُمْ تَهْتَدُوْنَ ﴿۱۵۸﴾

మా కొరకు ఇహలోకపు మేలునూ వ్రాయండి, పరలోకపు మేలును కూడా వ్రాయండి. మేము మీ వైపునకే మరలాము." సమాధానంగా ఇలా సెలవయింది: "శిక్షను నేను కోరినవారికి విధిస్తాను. కాని నా కారుణ్యం ప్రతి వస్తువునూ ఆవరించి ఉంది. నాపట్ల అవిధేయతకు దూరంగా ఉండే వారి కొరకూ, జకాత్ ఇచ్చేవారి కొరకూ, నా ఆయతులను విశ్వసించేవారి కొరకూ నేను దానిని వ్రాస్తాను."

**157 - 158** ఈ సందేశహరుణ్ణి, చదువనూ వ్రాయనూ రాని ఈ ప్రవక్త[42](సల్లల్లాహు అలైహి వ సల్లమ్)ను అనుసరించే వారు (ఈనాడు ఈ కారుణ్యా నికి అర్హులు). అతని ప్రస్తావన వారికి తమవద్ద ఉన్న తౌరాతు, ఇంజీలు గ్రంథాలలో వ్రాయబడి లభిస్తుంది. అతను వారికి మంచిని ఆజ్ఞాపిస్తాడు. చెడునుండి నిరోధిస్తాడు. వారికొరకు పరిశుద్ధమైన వస్తువులను ధర్మ సమ్మతం చేస్తాడు. అపరిశుద్ధమైన వాటిని నిషిద్ధం చేస్తాడు. వారిపై మోపబడివున్న బరువులను దించుతాడు. వారు బంధిం పబడివున్న శృంఖలాలను త్రెంచుతాడు.[43] కనుక అతనిని విశ్వ సించీ సమర్థించీ అతనికి సహకరించీ అతనితో అవతరింప జెయ్యబడిన జ్యోతిని అనుసరించేవారు మాత్రమే సాఫల్యం పొందేవారు. ముహమ్మద్! ఇలా ప్రకటించు: "మానవులారా! నేను మీ అందరి వైపునకు వచ్చిన అల్లాహ్ సందేశహరుణ్ణి. ఆయన భూమ్యాకాశాల సామ్రాజ్యానికి ప్రభువు. ఆయన తప్ప మరొక దేవుడులేడు. ఆయనే జీవితాన్ని ప్రసాదిస్తాడు. ఆయనే మృత్యువును ఇస్తాడు. కనుక విశ్వసించండి అల్లాహ్‌ను, ఆయన పంపిన నిరక్షరాస్యుడైన ప్రవక్తను – అతను అల్లాహ్‌ను, ఆయన సూక్తులను విశ్వసిస్తాడు – అతనిని అనుసరించండి, మీరు సరియైన మార్గం పొందుతారేమో.

41. డెబ్భైమంది జాతి ప్రతినిధులు సీనా పర్వతంపై దేవుని సమక్షంలో హాజరై జాతి తరపున ఆవు పూజ నేరానికి క్షమాభిక్ష కోరటానికి, ఇక విధేయులుగా ఉంటాము అని సరికొత్తగా వాగ్దానం చెయ్యటానికి పిలువనంపబడ్డారు.

42. ఇక్కడ మహాప్రవక్త (సఅసమ్) కొరకు "ఉమ్మీ" అనే పదం, యూదుల ప్రయోగం ప్రకారం ఉపయోగించబడింది. ఇస్రాయీలు సంతతి వారు తమను తప్ప ఇతర జాతుల వారందరినీ "ఉమ్మీ" (Gentile and Goyim) అని అంటారు. ఇంకా వారి జాత్యహంకారం ఒక ఉమ్మీ నాయకత్వాన్ని స్వీకరించటం అనేది సుదూర విషయం, ఉమ్మీలు తమతో సమానమైన మానవ హక్కులను పొందటానికి అంగీకరించటానికి కూడా వారు సిద్ధంగా లేరు. ఉదాహరణకు ఖురానులో వారి ఈ సూక్తిని ఉటంకించడం జరిగింది : "ఉమ్మీ (యూదులు కానివారు)ల సొమ్మును దోచుకుంటే, మమ్మల్ని పట్టడం జరగదు," (ఆలి ఇమ్రాన్ 75వ ఆయత్). కనుక అల్లాహ్ వారి

وَمِنْ قَوْمِ مُوْسٰى اُمَّةٌ يَّهْدُوْنَ بِالْحَقِّ وَ بِهٖ
يَعْدِلُوْنَ ﴿١٥٩﴾ وَ قَطَّعْنٰهُمُ اثْنَتَیْ عَشْرَةَ
اَسْبَاطًا اُمَمًا ؕ وَ اَوْحَیْنَاۤ اِلٰی مُوْسٰۤی اِذِ
اسْتَسْقٰىهُ قَوْمُهٗۤ اَنِ اضْرِبْ بِّعَصَاكَ الْحَجَرَ ۚ
فَانْۢبَجَسَتْ مِنْهُ اثْنَتَا عَشْرَةَ عَيْنًا ؕ قَدْ
عَلِمَ كُلُّ اُنَاسٍ مَّشْرَبَهُمْ ؕ وَ ظَلَّلْنَا عَلَيْهِمُ
الْغَمَامَ وَ اَنْزَلْنَا عَلَيْهِمُ الْمَنَّ وَ السَّلْوٰی ؕ
كُلُوْا مِنْ طَيِّبٰتِ مَا رَزَقْنٰكُمْ ؕ وَمَا ظَلَمُوْنَا وَ
لٰكِنْ كَانُوْۤا اَنْفُسَهُمْ يَظْلِمُوْنَ ﴿١٦٠﴾ وَ اِذْ قِيْلَ
لَهُمُ اسْكُنُوْا هٰذِهِ الْقَرْيَةَ وَ كُلُوْا مِنْهَا حَيْثُ
شِئْتُمْ وَقُوْلُوْا حِطَّةٌ وَّ ادْخُلُوا الْبَابَ سُجَّدًا
نَّغْفِرْ لَكُمْ خَطِيْٓـٰٔتِكُمْ ؕ سَنَزِيْدُ الْمُحْسِنِيْنَ ﴿١٦١﴾
فَبَدَّلَ الَّذِيْنَ ظَلَمُوْا مِنْهُمْ قَوْلًا غَيْرَ الَّذِیْ
قِيْلَ لَهُمْ فَاَرْسَلْنَا عَلَيْهِمْ رِجْزًا مِّنَ السَّمَآءِ
بِمَا كَانُوْا يَظْلِمُوْنَ ﴿١٦٢﴾ ع ٢٠

**159 - 160** మూసా జాతిలో సత్యం ప్రకారం హితబోధ చేసే, సత్యం ప్రకారమే న్యాయం చేసే ఒక వర్గం కూడా ఉండేది. మేము ఆ జాతిని పన్నెండు వంశాలుగా విభజించి, వాటిని శాశ్వత వర్గాలుగా తీర్చిదిద్దాము. మూసాను అతని జాతివారు నీళ్ళు అడిగినప్పుడు మేము అతనిని తన చేతికర్రతో ఫలానా కొండరాయిని కొట్టు అని సంజ్ఞ చేశాము. అప్పుడు ఆ రాయి నుండి పన్నెండు ఊటలు పెల్లుబికాయి. ప్రతి వర్గం వారు తాము నీళ్ళు పొందే స్థలాన్ని నిర్ణయించుకున్నారు. మేము వారిపై మేఘాల ఛాయను కల్పించాము. వారిపై మన్న్ సల్వాలను దింపాము– "తినండి మేము మీకు ప్రసాదించిన పరిశుద్ధమైన పదార్థాలను" అని అన్నాము. కాని తరువాత వారు ఏమి చేశారో అది మాకు అన్యాయం చేయటం కాదు, తమకు తామే అన్యాయం చేసుకున్నారు.

**161 - 162** వారికి ఇలా ఆజ్ఞాపించటం జరిగిన సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకో: "ఈ పట్టణంలోకి పోయి నివసించండి. దాని పంటద్వారా మీ ఇష్ట ప్రకారం ఆహారం పొందండి. ఇంకా "హిత్తతున్" "హిత్తతున్" అంటూ వెళ్ళండి. సాష్టాంగ పడుతూ పట్టణ ద్వారంలో ప్రవేశించండి, మేము మీ తప్పులను మన్నిస్తాము. సద్వైఖరి కలిగి ఉండేవారిని అధికానుగ్రహంతో సత్కరిస్తాము." కాని వారిలోని దుర్మార్గులు తమకు చెప్పిన మాటను మార్చివేశారు. పర్యవసానంగా మేము వారి దుర్మార్గానికి ఫలితంగా వారి పైకి ఆకాశం నుండి శిక్షను పంపాము.

ప్రయోగాన్నే ఉపయోగించి, "ఇక ఆ ఉమ్మీతోనే మీ అదృష్టం ముడిపడివుంది" అని సెలవిస్తున్నాడు. అతని అనుసరణను స్వీకరిస్తే, నా కారుణ్య భాగ్యం పొందుతారు. లేకపోతే, శతాబ్దాల తరబడి మీరు చిక్కుకుని ఉన్న ఆగ్రహం మీ అదృష్టంలో వ్రాయబడి ఉంటుంది.

43. అంటే, వారి షరీయతువేత్తలు తమ చట్టపరమైన రంధ్రాన్వేషణలతోనూ, వారి సన్యాసులు తమ తపస్సు అతిశయోక్తులతోనూ, ఇంకా వారి పామర ప్రజానీకం తమ మూఢనమ్మకాలతోనూ స్వయం కల్పితములైన కట్టుబాట్లతోనూ, నిబంధనలతోనూ, తమ జీవితాన్ని ఎన్నో భారాల క్రింద నొక్కి పెట్టారు, ఎన్నో శృంఖలాలలో బంధించి ఉంచారు. ఈ ప్రవక్త ఆ అన్ని భారాలను దించుతారు. ఆ అన్ని బంధాలను త్రెంచి జీవితాన్ని స్వతంత్రం చేస్తాడు.

وَسْـَٔلْهُمْ عَنِ الْقَرْيَةِ الَّتِىْ كَانَتْ حَاضِرَةَ
الْبَحْرِ ۘ اِذْ يَعْدُوْنَ فِى السَّبْتِ اِذْ تَاْتِيْهِمْ وقف لازم
حِيْتَانُهُمْ يَوْمَ سَبْتِهِمْ شُرَّعًا وَّ يَوْمَ لَا
يَسْبِتُوْنَ ۙ لَا تَاْتِيْهِمْ ۛ كَذٰلِكَ ۛ نَبْلُوْهُمْ بِمَا معانقة
كَانُوْا يَفْسُقُوْنَ ﴿۱۶۳﴾ وَاِذْ قَالَتْ اُمَّةٌ مِّنْهُمْ لِمَ النصف
تَعِظُوْنَ قَوْمَا ۙ اللّٰهُ مُهْلِكُهُمْ اَوْ مُعَذِّبُهُمْ
عَذَابًا شَدِيْدًا ۗ قَالُوْا مَعْذِرَةً اِلٰى رَبِّكُمْ
وَلَعَلَّهُمْ يَتَّقُوْنَ ﴿۱۶۴﴾ فَلَمَّا نَسُوْا مَا ذُكِّرُوْا بِهٖٓ
اَنْجَيْنَا الَّذِيْنَ يَنْهَوْنَ عَنِ السُّوْٓءِ وَ اَخَذْنَا
الَّذِيْنَ ظَلَمُوْا بِعَذَابٍۭ بَـِٔيْسٍۭ بِمَا كَانُوْا
يَفْسُقُوْنَ ﴿۱۶۵﴾ فَلَمَّا عَتَوْا عَنْ مَّا نُهُوْا عَنْهُ قُلْنَا
لَهُمْ كُوْنُوْا قِرَدَةً خٰسِـِٕيْنَ ﴿۱۶۶﴾

**163 - 166** సముద్రపు గట్టున ఉన్న ఆ పట్టణాన్ని గురించి కూడా వారిని కొంచెం అడుగు.[44] ఆ సంఘటనను వారికి గుర్తుచేయి. అక్కడి ప్రజలు సబ్బత్ (శనివారం) రోజున దేవుని ఆజ్ఞలను ఉల్లంఘించేవారు. ఇంకా చేపలు సబ్బత్ నాడే వారి ముందు ఎగిరెగిరి నీటిపైకి వస్తూ ఉండేవి. సబ్బత్ నాడు తప్ప మిగతా దినాలలో అవి వచ్చేవికావు. ఇలా ఎందుకు జరిగేదంటే, మేము వారి అవిధేయతల కారణంగా వారిని పరీక్షకు గురిచేస్తూ ఉండేవారము. ఇంకా వారికి ఈ విషయం కూడా గుర్తుచేయి. వారిలోని ఒక వర్గం వారు మరొక వర్గం వారితో ఇలా అన్నారు: "మీరు హితబోధ ఎందుకు చేస్తున్నారు అల్లాహ్ నాశనం చెయ్యనున్నవారికి లేక కఠినంగా శిక్షించనున్న వారికి?" వారు ఇలా సమాధానం చెప్పారు: "మేము మీ ప్రభువు ముందు క్షమింపబడటానికి ఒక కారణంగా చెప్పుకునే నిమిత్తం ఇదంతా చేస్తున్నాము. బహుశా ఈ ప్రజలు ఆయన పట్ల అవిధేయతకు దూరంగా ఉంటారనే ఆశతో చేస్తు న్నాము." చివరకు వారు తమకు జ్ఞాపకం చెయ్యబడిన హితబోధలను పూర్తిగా విస్మరించినప్పుడు, మేము చెడునుండి ప్రజలను వారించేవారిని రక్షించాము. దుర్మార్గులైన ఇతరులందరినీ వారి అవిధేయతల కారణంగా కఠినశిక్షకు గురిచేశాము. తరువాత వారు, తాము నిరోధించబడిన పనినే పూర్తి తలబిరుసు తనంతో చేస్తూపోయారు. అప్పుడు మేము ఇలా అన్నాము: "కోతులై పొండి,[45] హీనులుగా నీచులుగా!"

44. ఈ ప్రాంతం అయ్‌లా, అయ్‌లాత్ లేక అయ్‌లూత్ అని పరిశోధక విద్వాంసుల గట్టి అభిప్రాయం. అక్కడ ఇప్పుడు యూదు రాజ్యమైన ఇస్రాయీలు ఇదే పేరుతో ఒక ఓడరేవును నిర్మించింది. దాని దాపులోనే జోర్దాన్ దేశపు ప్రముఖ ఓడరేవు "అఖబా" కూడా ఉంది.

45. దీనిద్వారా తెలిసింది ఏమిటంటే, ఈ పట్టణంలో మూడు రకాల ప్రజలు ఉండే వారు. మొదటి రకం వారు, బహిరంగంగా అల్లాహ్ ఆజ్ఞలను ఉల్లంఘించేవారు. రెండోరకంవారు, స్వయంగా వారు ఆజ్ఞోల్లంఘనం చేసేవారు కాదు. కాని ఇతరులు ఆజ్ఞోల్లంఘనం చేస్తూ ఉంటే మౌనంగా చూస్తూ ఉండేవారు. ఇంకా సంస్కర్తలతో అనేవారు, ఈ మూర్ఖులకు హితబోధ చేయటం వల్ల ఒరిగేది ఏమిటి అని. మూడోరకం వారు, విశ్వాసం పట్ల వారికి ఉన్న అభిమానం అల్లాహ్ హద్దులను ఇలా బహిరంగంగా అతిక్రమించటాన్ని సహించేది కాదు. వారు మంచిని ఆజ్ఞాపించటంలో, చెడు నుండి ఆపటంలో చురుకుగా ఉండేవారు, బహుశా ఆ అపరాధులు తమ బోధవల్ల రుజుమార్గంపైకి వస్తారనే ఆశతో. ఒకవేళ వారు రుజుమార్గాన్ని అవలంబించకపోయినా, అప్పటికీ వారు తమ వరకు తమ కర్తవ్యాన్ని నిర్వహించి తమ బాధ్యత తీరినట్లు దేవుని సమక్షంలో నిరూపణ సమర్పించుకోగలందులకు. ఈ పరిస్థితులలో ఆ పట్టణం పైకి అల్లాహ్ శిక్ష వచ్చి పడినప్పుడు, ఖురాను ఇలా అంటోంది : ఆ మూడు వర్గాలలో కేవలం మూడో వర్గమే దాని నుండి రక్షించబడింది. ఎందుకంటే, అదే దేవుని సమక్షంలో తన బాధ్యతా నిర్వహణను గురించి సమాధానం చెప్పుకోవలసి ఉందని ఆందోళన పడింది. ఇంకా అదే తన బాధ్యత తీరినట్లు సాక్ష్యాన్ని సమకూర్చుకుంది. మిగిలిన రెండు వర్గాలవారు దుర్మార్గులుగా పరిగణింపబడ్డారు. వారు తమ అపరాధం మేరకు శిక్షకు గురిఅయ్యారు. అయితే, పూర్తి తలబిరుసుతనంతో ఆజ్ఞలను ఉల్లంఘిస్తూ పోయినవారే కోతులుగా చెయ్యబడ్డారు.

وَ اِذۡ تَاَذَّنَ رَبُّكَ لَيَبۡعَثَنَّ عَلَيۡهِمۡ اِلٰى يَوۡمِ
الۡقِيٰمَةِ مَنۡ يَّسُوۡمُهُمۡ سُوۡٓءَ الۡعَذَابِ ؕ اِنَّ رَبَّكَ
لَسَرِيۡعُ الۡعِقَابِ ۖۚ وَ اِنَّهٗ لَغَفُوۡرٌ رَّحِيۡمٌ ﴿۱۶۷﴾
وَقَطَّعۡنٰهُمۡ فِى الۡاَرۡضِ اُمَمًا ۚ مِنۡهُمُ الصّٰلِحُوۡنَ
وَمِنۡهُمۡ دُوۡنَ ذٰلِكَ وَ بَلَوۡنٰهُمۡ بِالۡحَسَنٰتِ وَ
السَّيِّاٰتِ لَعَلَّهُمۡ يَرۡجِعُوۡنَ ﴿۱۶۸﴾ فَخَلَفَ مِنۡ
بَعۡدِهِمۡ خَلۡفٌ وَّرِثُوا الۡكِتٰبَ يَاۡخُذُوۡنَ
عَرَضَ هٰذَا الۡاَدۡنٰى وَ يَقُوۡلُوۡنَ سَيُغۡفَرُ لَنَا ۚ وَ
اِنۡ يَّاۡتِهِمۡ عَرَضٌ مِّثۡلُهٗ يَاۡخُذُوۡهُ ؕ اَلَمۡ يُؤۡخَذۡ
عَلَيۡهِمۡ مِّيۡثَاقُ الۡكِتٰبِ اَنۡ لَّا يَقُوۡلُوۡا عَلَى اللّٰهِ
اِلَّا الۡحَقَّ وَدَرَسُوۡا مَا فِيۡهِ ؕ وَ الدَّارُ الۡاٰخِرَةُ
خَيۡرٌ لِّلَّذِيۡنَ يَتَّقُوۡنَ ؕ اَفَلَا تَعۡقِلُوۡنَ ﴿۱۶۹﴾
وَالَّذِيۡنَ يُمَسِّكُوۡنَ بِالۡكِتٰبِ وَ اَقَامُوا الصَّلٰوةَ ؕ
اِنَّا لَا نُضِيۡعُ اَجۡرَ الۡمُصۡلِحِيۡنَ ﴿۱۷۰﴾ وَ اِذۡ نَتَقۡنَا
الۡجَبَلَ فَوۡقَهُمۡ كَاَنَّهٗ ظُلَّةٌ وَّظَنُّوۡۤا اَنَّهٗ وَاقِعٌ ۢ
بِهِمۡ ۚ خُذُوۡا مَاۤ اٰتَيۡنٰكُمۡ بِقُوَّةٍ وَّاذۡكُرُوۡا مَا فِيۡهِ
لَعَلَّكُمۡ تَتَّقُوۡنَ ﴿۱۷۱﴾ وَ اِذۡ اَخَذَ رَبُّكَ مِنۡۢ بَنِىۡۤ ع ۲۱
اٰدَمَ مِنۡ ظُهُوۡرِهِمۡ ذُرِّيَّتَهُمۡ وَاَشۡهَدَهُمۡ عَلٰٓى
اَنۡفُسِهِمۡ ۚ اَلَسۡتُ بِرَبِّكُمۡ ؕ قَالُوۡا بَلٰى ۛۚ شَهِدۡنَا ۛۚ معانقة ۷
اَنۡ تَقُوۡلُوۡا يَوۡمَ الۡقِيٰمَةِ اِنَّا كُنَّا عَنۡ هٰذَا
غٰفِلِيۡنَ ﴿۱۷۲﴾

**167** జ్ఞాపకం తెచ్చుకో, నీ ప్రభువు ఇలా ప్రకటించిన సందర్భాన్ని: "ప్రళయ దినం వచ్చేవరకు నేను తప్పకుండా ఇస్రాయీలు సంతతివారిని తీవ్రయాతనకు గురిచేసే ప్రజల అదుపులో ఉండేలా చేస్తూ ఉంటాను." నిశ్చయంగా నీ ప్రభువు శిక్షించటంలో వడిగలవాడు. నిశ్చయంగా ఆయన మన్నింపుతో కరుణతో వ్యవహరించేవాడూను.

**168 - 171** మేము వారిని భువిలో ముక్కలుముక్కలుగా చేసి నానా జాతులుగా విభజించాము. వారిలో కొందరు సజ్జనులు. కొందరు దానికి భిన్నమైనవారు. మేము వారిని మంచీ చెడూ స్థితుల ద్వారా పరీక్షకు గురి చేస్తూ వచ్చాము, బహుశా వారు మరలివస్తారేమో అని. ఆపై పూర్వపు తరాల తరువాత అయోగ్యులైన వారు వారికి వారసులయ్యారు. వారు దైవగ్రంథానికి వారసులై కూడా తుచ్ఛమైన ఐహిక ప్రయోజనాలను సేకరిస్తున్నారు. పైగా ఇలా అంటారు: "మేము క్షమింపబడతామని ఆశిస్తున్నాము." ఆ ఐహిక సంపదే ముందుకు వస్తే, మళ్ళీ దానిని వారు తటాలున అందుకుంటారు. సత్యమైన దానినే అల్లాహ్ పేరుతో పలకాలని వారినుండి గ్రంథ ప్రమాణం తీసుకోవటం జరగలేదా? గ్రంథంలో వ్రాయబడివున్న దానిని స్వయంగా వారే చదివారు. పరలోక నివాసం దైవభక్తి పరాయణులకు మాత్రమే మేలైనది.[46] మీరు ఈ మాత్రపు విషయాన్ని అర్థం చేసుకోలేరా? గ్రంథాన్ని పాటించే, నమాజును స్థాపించే సద్వర్తనుల ప్రతిఫలాన్ని మేము నిశ్చయంగా వ్యర్థం చెయ్యము. ఆ సంఘటన కూడా వారికేమైనా జ్ఞాపకం ఉందా, అప్పుడు మేము పర్వతాన్ని కదలించి దానిని ఒక గొడుగు మాదిరిగా వారిపై కప్పాము. అది తమపై పడుతుందేమో అని వారు భ్రమపడ్డారు. ఆ సమయంలో మేము వారితో ఇలా అన్నాము: "మేము మీకు ఇస్తున్న గ్రంథాన్ని దృఢంగా పట్టుకోండి. అందులో వ్రాయబడి ఉన్నదానిని జ్ఞాపకం ఉంచుకోండి. అప్పుడు మీరు చెడు నడవడికి దూరంగా ఉంటారని ఆశించబడుతోంది."

**172 - 174** ప్రవక్తా! ప్రజలకు ఆ సమయాన్ని జ్ఞాపకం చెయ్యి. అప్పుడు నీ ప్రభువు ఆదము సంతతి యొక్క వీపుల నుండి వారి సంతానాన్ని తీసి ఇంకా స్వయంగా వారిని వారికే సాక్షులుగా నిలబెట్టి అడిగాడు: "నేను మీ ప్రభువును కాదా?" అని. వారు ఇలా అన్నారు: "నిశ్చయంగా మీరే మా ప్రభువు. మేము దీనికి సాక్ష్యమిస్తున్నాము."[47] మేము ఇలా ఎందుకు చేశామంటే, ప్రళయదినంనాడు మీరు, "మాకు ఈ విషయం తెలియదు" అని అనకుండా ఉండేటందుకు,

اَوْ تَقُوْلُوْٓا اِنَّمَآ اَشْرَكَ اٰبَآؤُنَا مِنْ قَبْلُ وَ
كُنَّا ذُرِّيَّةً مِّنْۢ بَعْدِهِمْ ۚ اَفَتُهْلِكُنَا بِمَا فَعَلَ
الْمُبْطِلُوْنَ ﴿١٧٣﴾ وَكَذٰلِكَ نُفَصِّلُ الْاٰيٰتِ وَ
لَعَلَّهُمْ يَرْجِعُوْنَ ﴿١٧٤﴾ وَاتْلُ عَلَيْهِمْ نَبَاَ الَّذِيْٓ
اٰتَيْنٰهُ اٰيٰتِنَا فَانْسَلَخَ مِنْهَا فَاَتْبَعَهُ الشَّيْطٰنُ
فَكَانَ مِنَ الْغٰوِيْنَ ﴿١٧٥﴾ وَلَوْ شِئْنَا لَرَفَعْنٰهُ بِهَا
وَلٰكِنَّهٗٓ اَخْلَدَ اِلَى الْاَرْضِ وَاتَّبَعَ هَوٰىهُ ۚ
فَمَثَلُهٗ كَمَثَلِ الْكَلْبِ ۚ اِنْ تَحْمِلْ عَلَيْهِ
يَلْهَثْ اَوْ تَتْرُكْهُ يَلْهَثْ ؕ ذٰلِكَ مَثَلُ
الْقَوْمِ الَّذِيْنَ كَذَّبُوْا بِاٰيٰتِنَا ۚ فَاقْصُصِ
الْقَصَصَ لَعَلَّهُمْ يَتَفَكَّرُوْنَ ﴿١٧٦﴾

లేదా "షిర్కును మా తాత ముత్తాతలు మా కంటే ముందే ప్రారంభించారు. తరువాత మేము వారి సంతతికి జన్మించాము. దుర్జనులు చేసిన నేరానికి మీరు మమ్మల్ని పట్టుకుంటారా?" అని అనకుండా ఉండేటందుకు. చూడండి, ఇలా మేము సూచనలను స్పష్టంగా వివరిస్తాము.[48] వారు మరలి రావాలని ఇలా చేస్తాము.

**175 - 176** ప్రవక్తా! వారికి ఆ వ్యక్తి గాధను వినిపించు. అతనికి మేము మా ఆయతుల జ్ఞానాన్ని ప్రసాదించాము. కాని అతడు వాటిని పాటించ కుండా విముఖుడై పోయాడు. చివరకు షైతాను అతణ్ణి వెంబడించాడు. పర్యవసానంగా అతడు మార్గభ్రష్టులలో కలసిపోయాడు. మేము గనక కోరి వున్నట్లయితే అతనికి ఆ ఆయతుల ద్వారా ఔన్నత్యాన్ని ప్రసాదించి ఉండేవారము. కాని అతడు భూమి వైపునకే మ్రొగ్గాడు. తన మనోవాంఛలనే అనుసరించాడు. కనుక అతడి పరిస్థితి కుక్క వంటిదైపోయింది. మీరు దానిపై దాడిచేస్తే అప్పుడు కూడా అది నాలుకను వెళ్ళబెట్టుతుంది. దానిని వదలిపెడితే అప్పుడు కూడా అది నాలుకను వెళ్ళబెట్టుతుంది.[49] మా ఆయతులను తిరస్కరించే వారి దృష్టాంతం కూడా ఇదే. నీవు వారికి ఈ గాథలను వినిపిస్తూ ఉండు, బహుశా వారు యోచిస్తారేమో.

46. ఈ ఆయతును రెండు రకాలుగా అనువాదం చెయ్యవచ్చు. ఒకటి, మేము పైన మూలంలో అనువదించినది. రెండు, దైవభక్తి పరాయణులకు పరలోక నివాసమే ఉత్తమమైనది.

47. అనేక హదీసుల ద్వారా తెలిసినట్లు, ఈ వ్యవహారం ఆదిమ మానవుడు అయిన ఆదము (అస్సలామ్) సృష్టి జరిగిన సందర్భంలో సంభవించింది. ఆ సమయంలో దైవదూతలను సమావేశపరచి వారిచే ఆదిమానవునికి సజ్దా చేయించబడింది. ఇంకా భూమిపై మానవుని ఖిలాఫత్ (ప్రాతినిధ్యం)ను గురించి ప్రకటన చేయబడింది. అదేవిధంగా ప్రళయం వరకు పుట్టబోయే మొత్తం ఆదము సంతానాన్ని అల్లాహ్ ఒకేసారి సృష్టించి వారికి చైతన్యాన్ని ప్రసాదించి తన ముందు హాజరుపరిచాడు. వారి నుండి తాను మాత్రమే ప్రభువు అనే విషయానికి సాక్ష్యం తీసుకున్నాడు.

48. అంటే, సత్యావగాహనకు సంబంధించిన సూచనలు, అవి స్వయంగా మానవునిలోనే ఉన్నాయి. అవి యథార్థం వైపునకు మార్గం చూపుతాయి.

49. వ్యాఖ్యాతలు, దైవప్రవక్త కాలానికి దానికి పూర్వపు చరిత్రకూ సంబంధించిన విభిన్న వ్యక్తులకూ ఈ ఉదాహరణను వర్తింపజేశారు. కాని యథార్థం ఏమిటంటే, ఉదాహరణలోని ఆ ప్రత్యేక వ్యక్తి ఎవరో తెలుపకుండా రహస్యంగా ఉంచటం జరిగింది. అయితే ఈ ఉదాహరణ, ఈ గుణం కలిగివున్న ప్రతి వ్యక్తికీ వర్తిస్తుంది. అల్లాహ్ ఇతని స్థితిని కుక్కతో పోల్చాడు. ఎల్లప్పుడూ వ్రేలాడుతూ ఉండే దాని నాలుక, ఆ నాలుక నుండి కారుతూ ఉండే చొంగ; ఆరిపోని అత్యాశ అనే అగ్నినీ, ఎన్నటికీ తృప్తిపడని మనస్సునూ తెలుపుతాయి. ఈ పోలిక మూలంగానే ఆ తరువాత ఉర్దూ భాషలో, ప్రపంచ వ్యామోహంలోపడి అంధుడయ్యే వ్యక్తిని, "ప్రపంచ శునకం" (దునియాకా కుత్తా) అంటూ వచ్చారు.

**177 - 179** మా ఆయతులను తిరస్కరించిన వారి దృష్టాంతం చాలా చెడ్డది. ఎందుకంటే వారు తమకు తామే అన్యాయం చేసుకుంటున్నారు. అల్లాహ్ ఎవడికి మార్గం చూపుతాడో వాడే సన్మార్గం పొందుతాడు. కాని అల్లాహ్ ఎవడిని తన మార్గదర్శకత్వానికి దూరం చేస్తాడో, వాడే నిష్ఫలుడౌతాడు, నష్టపోతాడు. చాలామంది జిన్నాతులనూ, మానవులనూ మేము నరకం కోసమే సృష్టించాము, ఇది యథార్థం. వారికి హృదయాలున్నాయి కాని వారు వాటితో ఆలోచించరు. వారికి కళ్ళు ఉన్నాయి కాని వారు వాటితో చూడరు. వారికి చెవులు ఉన్నాయి కాని వారు వాటితో వినరు. వారు జంతువుల వంటి వారు- కాదు వాటికంటే కూడా దిగజారిపోయారు. అలక్ష్యంలో మునిగివున్నవారు వీరే.[50]

**180 - 183** అల్లాహ్ మంచి పేర్లకు అర్హుడు. ఆయనను మంచి పేర్లతోనే వేడుకోండి. ఆయనను మంచిపేర్లతో పిలిచే విషయంలో సత్యం నుండి వైదొలగే వారిని వదలిపెట్టండి. వారు తాము చేస్తున్న దానికి ప్రతిఫలం పొంది తీరుతారు.[51] మేము సృష్టించినవారిలో ఖచ్చితంగా సత్యం ప్రకారం ఉపదేశించే, సత్యం ప్రకారం న్యాయం చేసే ఒక వర్గం కూడా ఉంది. ఇక మా ఆయతులు అసత్యాలని తిరస్కరించినవారు, మేము వారిని క్రమేణా వారికి ఏమాత్రం తెలియని పద్ధతి ప్రకారం వినాశం వైపునకు తీసుకుపోతాము. నేను వారికి సడలింపును ఇస్తున్నాను. నా వ్యూహానికి తిరుగులేదు.

**184 - 186** తమ మిత్రునిపై ఉన్మాదప్రభావం ఏదీ పడలేదు[52] అనే విషయం గురించి వారు ఎప్పుడూ ఆలోచించలేదా? అతను హెచ్చరిక చేసేవాడు మాత్రమే. (చెడు ఫలితం కలుగక ముందే) స్పష్టంగా హెచ్చరిక చేస్తున్నాడు. ఇంకా వారు భూమ్యాకాశాలు పనిచేసే తీరును గురించి ఎప్పుడూ యోచించలేదా? అల్లాహ్ సృష్టించిన ఏ వస్తువునూ వారు కళ్ళు తెరచి చూడలేదా? బహుశా వారి జీవితపు గడువు పూర్తి అయ్యే సమయం ఆసన్నమయిందనే విషయాన్ని గురించి కూడా వారు ఆలోచించలేదా? అయితే ప్రవక్త చేసిన ఈ హెచ్చరిక తరువాత అసలు వారు విశ్వసించే విషయం మరొకటి ఏది కాగలదు?- అల్లాహ్ తన మార్గదర్శకత్వం నుండి దూరం చేసే వ్యక్తికి మరొక మార్గదర్శకుడు ఎవడూ లేడు. అల్లాహ్ అటువంటి వారిని తమ తలబిరుసుతనంలో మార్గం తప్పి తిరగటానికి వదలిపెడతాడు.

سَآءَ مَثَلًا الْقَوْمُ الَّذِيْنَ كَذَّبُوْا بِاٰيٰتِنَا
وَاَنْفُسَهُمْ كَانُوْا يَظْلِمُوْنَ ﴿١٧٧﴾ مَنْ يَّهْدِ اللّٰهُ
فَهُوَ الْمُهْتَدِيْ ۚ وَ مَنْ يُّضْلِلْ فَاُولٰٓئِكَ هُمُ
الْخٰسِرُوْنَ ﴿١٧٨﴾ وَلَقَدْ ذَرَاْنَا لِجَهَنَّمَ كَثِيْرًا مِّنَ
الْجِنِّ وَ الْاِنْسِ ۖ لَهُمْ قُلُوْبٌ لَّا يَفْقَهُوْنَ بِهَا ۡ
وَ لَهُمْ اَعْيُنٌ لَّا يُبْصِرُوْنَ بِهَا ۡ وَ لَهُمْ اٰذَانٌ لَّا
يَسْمَعُوْنَ بِهَا ؕ اُولٰٓئِكَ كَالْاَنْعَامِ بَلْ هُمْ
اَضَلُّ ؕ اُولٰٓئِكَ هُمُ الْغٰفِلُوْنَ ﴿١٧٩﴾ وَ لِلّٰهِ
الْاَسْمَآءُ الْحُسْنٰى فَادْعُوْهُ بِهَا ۪ وَذَرُوا الَّذِيْنَ
يُلْحِدُوْنَ فِيْٓ اَسْمَآئِهٖ ؕ سَيُجْزَوْنَ مَا كَانُوْا
يَعْمَلُوْنَ ﴿١٨٠﴾ وَ مِمَّنْ خَلَقْنَآ اُمَّةٌ يَّهْدُوْنَ
بِالْحَقِّ وَ بِهٖ يَعْدِلُوْنَ ﴿١٨١﴾ وَ الَّذِيْنَ كَذَّبُوْا ع ٢٢ ١٢
بِاٰيٰتِنَا سَنَسْتَدْرِجُهُمْ مِّنْ حَيْثُ لَا
يَعْلَمُوْنَ ﴿١٨٢﴾ وَاُمْلِيْ لَهُمْ ؕ اِنَّ كَيْدِيْ
مَتِيْنٌ ﴿١٨٣﴾ اَوَ لَمْ يَتَفَكَّرُوْا ٚ مَا بِصَاحِبِهِمْ مِّنْ
جِنَّةٍ ؕ اِنْ هُوَ اِلَّا نَذِيْرٌ مُّبِيْنٌ ﴿١٨٤﴾ اَوَ لَمْ
يَنْظُرُوْا فِيْ مَلَكُوْتِ السَّمٰوٰتِ وَ الْاَرْضِ وَمَا
خَلَقَ اللّٰهُ مِنْ شَيْءٍ ۙ وَّ اَنْ عَسٰٓى اَنْ يَّكُوْنَ
قَدِ اقْتَرَبَ اَجَلُهُمْ ۚ فَبِاَيِّ حَدِيْثٍۭ بَعْدَهٗ
يُؤْمِنُوْنَ ﴿١٨٥﴾ مَنْ يُّضْلِلِ اللّٰهُ فَلَا هَادِيَ لَهٗ ؕ وَ
يَذَرُهُمْ فِيْ طُغْيَانِهِمْ يَعْمَهُوْنَ ﴿١٨٦﴾

**187 - 188** వారు నిన్ను "అసలు ఆ ప్రళయ గడియ ఎప్పుడు అవతరిస్తుంది?" అని అడుగుతున్నారు. ఇలా అను: "దానిని గురించి నా ప్రభువుకే తెలుసు. దానిని దాని సమయం వచ్చినప్పుడే ఆయన ప్రత్యక్షపరుస్తాడు. ఆకాశాలలో, అవనిలో అది అత్యంత కఠినసమయంగా ఉంటుంది. అది మీపై అకస్మాత్తుగా వచ్చిపడుతుంది." నీవు దాని అన్వేషణలో మునిగి వున్నట్లుగా భావించి వారు నిన్ను దానిని గురించి అడుగుతున్నారు. ఇలా అను: "దానిని గురించి కేవలం అల్లాహ్‌కు మాత్రమే తెలుసు. కాని చాలా మందికి ఈ యథార్థం తెలియదు." ప్రవక్తా! వారితో ఇలా అను: "నాకు సంబంధించిన లాభనష్టాలపై నాకు ఏ అధికారమూ లేదు. అల్లాహ్ కోరింది మాత్రమే అవుతుంది. నాకే గనక అగోచర విషయ జ్ఞానం ఉన్నట్లయితే, నేను ఎన్నో ప్రయోజనాలను నా కొరకు పొంది ఉండేవాణ్ణి. నాకు ఎన్నటికీ ఏ నష్టమూ వాటిల్లేది కాదు. నేను నా మాటను నమ్మేవారి కొరకు కేవలం హెచ్చరిక చేసేవాణ్ణి మాత్రమే, శుభవార్త వినిపించేవాణ్ణి మాత్రమే."

**189 - 198** అల్లాహ్‌యే మిమ్మల్ని ఏకైక ప్రాణి నుండి సృష్టించాడు. ఇంకా అదే జాతినుండి అతనికి సహచరిని సృజించాడు, అతను ఆమెతో ప్రశాంత జీవితం గడపటానికి. తరువాత పురుషుడు స్త్రీని కప్పివేసినప్పుడు ఆమె ఒక తేలికైన భారాన్ని ధరించింది. ఆమె దానిని మోసుకుంటూ తిరుగుతూ ఉండేది. తరువాత ఆమె గర్భభారం అధికమయినప్పుడు, వారు ఉభయులూ కలసి తమ ప్రభువైన అల్లాహ్‌ను ఇలా వేడుకున్నారు: "నీవు గనక మాకు మంచి పిల్లవాణ్ణి ఇచ్చినట్లయితే, మేము నీకు కృతజ్ఞులం అవుతాము." అప్పుడు అల్లాహ్ వారికి ఒక చక్కని, ఏ లోపమూ లేనటువంటి పిల్లవాణ్ణి ప్రసాదించాడు. కాని వారు ఆయన ప్రసాదించిన ఈ కానుక విషయంలో ఇతరులను ఆయనకు భాగస్వాములుగా చేయసాగారు.[53] వారు చేసే ఈ షిర్కు పనులకు అల్లాహ్ అతీతుడు, ఉన్నతుడూను. ఎంత మూఢులు వీళ్ళు! ఏ వస్తువునూ సృష్టించలేనివారిని, స్వయంగా తామే సృష్టించబడేవారిని, ఎవరికీ సహాయం చెయ్యలేనివారిని, స్వయంగా తమకు తామే సహాయం చేసుకోలేని వారిని వీరు అల్లాహ్‌కు భాగస్వాములుగా చేస్తున్నారు. ఒకవేళ మీరు వారిని రుజుమార్గం పైకి రమ్మని ఆహ్వానిస్తే వారు మీవెంట రారు. మీరు వారిని పిలిచినా లేక మౌనం వహించినా మీకు రెండూ ఒక్కటే.[54]

يَسْـَٔلُوْنَكَ عَنِ السَّاعَةِ اَيَّانَ مُرْسٰىهَا ؕ قُلْ
اِنَّمَا عِلْمُهَا عِنْدَ رَبِّیْ ۚ لَا يُجَلِّيْهَا لِوَقْتِهَاۤ اِلَّا
هُوَ ؔ ثَقُلَتْ فِی السَّمٰوٰتِ وَ الْاَرْضِ ؕ لَا
تَاْتِيْكُمْ اِلَّا بَغْتَةً ؕ يَسْـَٔلُوْنَكَ كَاَنَّكَ حَفِیٌّ
عَنْهَا ؕ قُلْ اِنَّمَا عِلْمُهَا عِنْدَ اللّٰهِ وَ لٰكِنَّ اَكْثَرَ
النَّاسِ لَا يَعْلَمُوْنَ ﴿۱۸۷﴾ قُلْ لَّاۤ اَمْلِكُ لِنَفْسِیْ
نَفْعًا وَّ لَا ضَرًّا اِلَّا مَا شَآءَ اللّٰهُ ؕ وَ لَوْ
كُنْتُ اَعْلَمُ الْغَيْبَ لَاسْتَكْثَرْتُ مِنَ الْخَيْرِ ۛۚ
وَ مَا مَسَّنِیَ السُّوْٓءُ ۛۚ اِنْ اَنَا اِلَّا نَذِيْرٌ وَّ
بَشِيْرٌ لِّقَوْمٍ يُّؤْمِنُوْنَ ﴿۱۸۸﴾ هُوَ الَّذِیْ خَلَقَكُمْ
مِّنْ نَّفْسٍ وَّاحِدَةٍ وَّجَعَلَ مِنْهَا زَوْجَهَا
لِيَسْكُنَ اِلَيْهَا ۚ فَلَمَّا تَغَشّٰىهَا حَمَلَتْ حَمْلًا
خَفِيْفًا فَمَرَّتْ بِهٖ ۚ فَلَمَّاۤ اَثْقَلَتْ دَّعَوَا اللّٰهَ
رَبَّهُمَا لَئِنْ اٰتَيْتَنَا صَالِحًا لَّنَكُوْنَنَّ مِنَ
الشّٰكِرِيْنَ ﴿۱۸۹﴾ فَلَمَّاۤ اٰتٰىهُمَا صَالِحًا جَعَلَا لَهٗ
شُرَكَآءَ فِيْمَاۤ اٰتٰىهُمَا ۚ فَتَعٰلَى اللّٰهُ عَمَّا
يُشْرِكُوْنَ ﴿۱۹۰﴾ اَيُشْرِكُوْنَ مَا لَا يَخْلُقُ شَيْـًٔا وَّ
هُمْ يُخْلَقُوْنَ ﴿۱۹۱﴾ وَ لَا يَسْتَطِيْعُوْنَ لَهُمْ نَصْرًا وَّ
لَاۤ اَنْفُسَهُمْ يَنْصُرُوْنَ ﴿۱۹۲﴾ وَ اِنْ تَدْعُوْهُمْ اِلَى
الْهُدٰى لَا يَتَّبِعُوْكُمْ ؕ سَوَآءٌ عَلَيْكُمْ
اَدَعَوْتُمُوْهُمْ اَمْ اَنْتُمْ صَامِتُوْنَ ﴿۱۹۳﴾

اِنَّ الَّذِيْنَ تَدْعُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ عِبَادٌ
اَمْثَالُكُمْ فَادْعُوْهُمْ فَلْيَسْتَجِيْبُوْا لَكُمْ اِنْ
كُنْتُمْ صٰدِقِيْنَ ﴿۱۹۴﴾ اَلَهُمْ اَرْجُلٌ يَّمْشُوْنَ بِهَآ
اَمْ لَهُمْ اَيْدٍ يَّبْطِشُوْنَ بِهَآ اَمْ لَهُمْ اَعْيُنٌ
يُّبْصِرُوْنَ بِهَآ اَمْ لَهُمْ اٰذَانٌ يَّسْمَعُوْنَ بِهَا
قُلِ ادْعُوْا شُرَكَآءَكُمْ ثُمَّ كِيْدُوْنِ فَلَا
تُنْظِرُوْنِ ﴿۱۹۵﴾ اِنَّ وَلِيِّ‌ىَ اللّٰهُ الَّذِيْ نَزَّلَ
الْكِتٰبَ وَهُوَ يَتَوَلَّى الصّٰلِحِيْنَ ﴿۱۹۶﴾ وَ الَّذِيْنَ
تَدْعُوْنَ مِنْ دُوْنِهٖ لَا يَسْتَطِيْعُوْنَ نَصْرَكُمْ وَ لَآ
اَنْفُسَهُمْ يَنْصُرُوْنَ ﴿۱۹۷﴾ وَ اِنْ تَدْعُوْهُمْ اِلَى
الْهُدٰى لَا يَسْمَعُوْا وَ تَرٰىهُمْ يَنْظُرُوْنَ
اِلَيْكَ وَ هُمْ لَا يُبْصِرُوْنَ ﴿۱۹۸﴾

అల్లాహ్‌ను త్రోసిరాజని మీరు వేడుకుంటున్న వారు మీ మాదిరి గానే కేవలం దాసులు. మీరు వారిని ప్రార్థించి చూడండి. మీకు వారిపట్ల ఉన్న భావాలు నిజమే అయితే మీ ప్రార్థనలకు వారు సమాధానం ఇవ్వాలి. వారికి కాళ్ళు ఉన్నాయా వాటితో నడవటానికి? వారికి చేతులు ఉన్నాయా వాటితో పట్టుకోవటా నికి? వారికి కళ్ళు ఉన్నాయా వాటితో చూడడానికి? వారికి చెవులు ఉన్నాయా వాటితో వినడానికి? ప్రవక్తా! వారితో ఇలా అను: "మీరు నిలబెట్టిన భాగస్వాములను పిలవండి. తరువాత మీరంతా కలసి నాకు వ్యతిరేకంగా వ్యూహాలు పన్నండి. నాకు ఎంతమాత్రం గడువు ఇవ్వకండి. ఈ గ్రంథాన్ని అవతరింప జేసిన దేవుడే నాకు రక్షకుడు, సహాయకుడు. ఆయన సజ్జను లకు సహాయపడతాడు. దీనికి భిన్నంగా మీరు అల్లాహ్‌ను వదలి వేడుకునేవారు మీకూ సహాయం చెయ్యలేరు, స్వయంగా తమకూ సహాయం చేసుకోలేరు. ఇంకా మీరు గనక వారిని రుజుమార్గం వైపునకు రమ్మని పిలిస్తే, వారు మీ మాటను విననైనా లేరు. పైకి వారు మీవైపు చూస్తూ ఉన్నట్లు కనిపిస్తుంది. కాని వాస్తవానికి వారు దేనినీ చూడలేరు."

50. అంటే, మేము వారిని హృదయమూ, బుద్ధీ, మెదడూ, కళ్ళూ, చెవులూ అన్నీ ఇచ్చి సృష్టించాము. కాని దుర్మార్గులు వాటిని సరిగ్గా ఉపయోగించుకోలేదు. ఇంకా తమ చెడుకార్యాల కారణంగా చివరకు నరకానికి అర్హులయ్యారు.

51. "మంచి పేర్లు" అంటే భావం, దేవుని ఔన్నత్యం, ఆధిక్యం, ఆయన పవిత్రత, పరిశుద్ధత, ఇంకా ఆయన గుణవిశేషాల పరిపూర్ణతలను వ్యక్తం చేసేపేర్లు. దేవునికి పేర్లు పెట్టటంలో న్యాయం నుండి వైదొలగటం అంటే, దేవుని స్థానానికి తగని పేర్లు పెట్టటం, ఆయన గౌరవానికి భంగకరంగా ఉన్న పేర్లను పెట్టటం, ఇంకా ఆయనకు లోపాలను, తప్పులను ఆరోపించే పేర్లు పెట్టటం, లేక ఆయన పవిత్రమైన, ఉన్నతమైన ఉనికిని గురించి ఏదైనా తప్పుడు విశ్వాసం వ్యక్తమయ్యే పేర్లు పెట్టటం.

52. మిత్రుడు అంటే అర్థం మహాప్రవక్త (సఅసమ్) అని. ఆయనను మక్కావాసుల మిత్రుడు అని ఎందుకు అనటం జరిగిందంటే, ఆయన వారికి కొత్తవారు కారు. వారిలోనే పుట్టారు. వారి మధ్యనే పెరిగారు. బాల్యం నుండి యౌవనానికి, యౌవనం నుండి వార్ధక్యానికి చేరారు. ప్రవక్త పదవికి పూర్వం సమస్త జాతి ఆయనను సద్గుణ సంపన్నుడుగా వివేచనాపరుడుగా చూసింది. ప్రవక్త పదవి తరువాత ఆయన దైవసందేశాన్ని అందజెయ్యటం ప్రారంభించినప్పుడు, అకస్మాత్తుగా ఆయనను పిచ్చివాడు అని అనసాగారు. ఈ ఉన్మాదం ఆరోపణ ఆయన ప్రవక్త కాకముందు చెప్పిన మాటలను గురించి చేసినది కాదు, ఆయన ప్రవక్త అయిన తరువాత ప్రచారం చెయ్యటం ప్రారంభించిన మాటలను గురించి చేసినది అనేది స్పష్టం. ఈ కారణం వల్ల, అసలు ఈ మాటలలోని ఏమాట పిచ్చిదో వారు ఎప్పుడైనా ఆలోచించారా? అని సెలవీయబడుతోంది.

53. భావం ఏమిటంటే, సంతానం ఇచ్చేవాడు అల్లాహ్‌యే. ఒకవేళ అల్లాహ్, తల్లి గర్భం నుండి కోతినిగాని పామునుగాని ఏదైనా వింత జంతువునుగాని పుట్టిస్తే లేదా శిశువును కడుపులోనే గ్రుడ్డిదిగా, చెవిటిదిగా, కుంటిదిగా చేస్తే లేదా దాని శారీరక, మానసిక, బుద్ధి సంబంధమైన శక్తులలో ఏదైనా లోపాన్ని పెడితే, అల్లాహ్ చేసిన ఈ రూపాన్ని మార్చే శక్తి ఎవడికీ లేదు. ఈ యథార్థాన్ని దేవుడు ఒక్కడే అనేవారు ఎరిగినవిధంగానే ముష్రిక్కులు కూడా ఎరుగుదురు. ఈ కారణం వల్లనే గర్భకాలంలో అల్లాహ్‌యే చక్కని శిశువును పుట్టిస్తాడు అని ఆశలన్నీ అల్లాహ్‌పైనే పెట్టుకుంటారు. కాని ఆశలు ఫలించినప్పుడు,

خُذِ الْعَفْوَ وَأْمُرْ بِالْعُرْفِ وَأَعْرِضْ عَنِ
الْجٰهِلِيْنَ ﴿١٩٩﴾ وَإِمَّا يَنْزَغَنَّكَ مِنَ الشَّيْطٰنِ
نَزْغٌ فَاسْتَعِذْ بِاللّٰهِ ۚ إِنَّهٗ سَمِيْعٌ عَلِيْمٌ ﴿٢٠٠﴾ إِنَّ
الَّذِيْنَ اتَّقَوْا إِذَا مَسَّهُمْ طٰٓئِفٌ مِّنَ الشَّيْطٰنِ
تَذَكَّرُوْا فَإِذَا هُمْ مُّبْصِرُوْنَ ﴿٢٠١﴾ وَإِخْوَانُهُمْ
يَمُدُّوْنَهُمْ فِي الْغَيِّ ثُمَّ لَا يُقْصِرُوْنَ ﴿٢٠٢﴾ وَإِذَا
لَمْ تَأْتِهِمْ بِاٰيَةٍ قَالُوْا لَوْلَا اجْتَبَيْتَهَا ۚ قُلْ
إِنَّمَآ أَتَّبِعُ مَا يُوْحٰٓى إِلَيَّ مِنْ رَّبِّيْ ۚ هٰذَا
بَصَآئِرُ مِنْ رَّبِّكُمْ وَهُدًى وَّرَحْمَةٌ لِّقَوْمٍ
يُّؤْمِنُوْنَ ﴿٢٠٣﴾ وَإِذَا قُرِئَ الْقُرْاٰنُ فَاسْتَمِعُوْا لَهٗ
وَأَنْصِتُوْا لَعَلَّكُمْ تُرْحَمُوْنَ ﴿٢٠٤﴾ وَاذْكُرْ رَّبَّكَ
فِيْ نَفْسِكَ تَضَرُّعًا وَّخِيْفَةً وَّدُوْنَ الْجَهْرِ
مِنَ الْقَوْلِ بِالْغُدُوِّ وَالْاٰصَالِ وَلَا تَكُنْ مِّنَ
الْغٰفِلِيْنَ ﴿٢٠٥﴾ إِنَّ الَّذِيْنَ عِنْدَ رَبِّكَ لَا
يَسْتَكْبِرُوْنَ عَنْ عِبَادَتِهٖ وَيُسَبِّحُوْنَهٗ وَلَهٗ
يَسْجُدُوْنَ ﴿٢٠٦﴾ ۩ السجدة الثلثة

**199 - 202** ప్రవక్తా! మృదుత్వం, మన్నింపుల వైఖరిని అవలంబించు. మంచిని ప్రబోధించు. మూర్ఖులతో వాదానికి దిగకు. ఒకవేళ ఎప్పుడైనా షైతాను నిన్ను ఉసిగొలిపితే అల్లాహ్ శరణు వేడు. ఆయన అన్నీ వినేవాడు. అన్నీ తెలిసినవాడు. వాస్తవానికి భయభక్తులు కలవారి స్థితి ఇలా ఉంటుంది. ఎప్పుడైనా షైతాను ప్రభావం వల్ల వారికి ఏదైనా చెడు ఆలోచన తట్టినప్ప టికీ, వారు తక్షణం అప్రమత్తులవుతారు. తరువాత వారు అవలంబించవలసిన సరియైన మార్గమేమిటో వారికి స్పష్టంగా కనిపిస్తుంది. ఇక వారి (అంటే షైతాను) సోదరులు, వారు వారిని తమ వక్రమార్గంలోనికే లాక్కుపోతారు. వారిని భ్రష్టులుగా చెయ్యటంలో ఏమాత్రం లోపం చేయరు.

**203 - 204** ప్రవక్తా! నీవు వారికి ఏదైనా ఒక సూచనను (మహత్యాన్ని) చూపకపోతే వారు ఇలా అంటారు: "నీవు నీకొరకు ఏదైనా సూచనను ఎందుకు ఎన్నుకోలేదు?" వారితో ఇలా అను: "నేను కేవలం నా ప్రభువు నా వద్దకు పంపిన వహీని మాత్రమే అనుసరిస్తాను. ఇందులో జ్ఞాన కాంతి పుంజాలు ఉన్నాయి. అవి మీ ప్రభువు తరఫు నుండి వచ్చాయి. ఇది మార్గదర్శకత్వం, కారుణ్యం, దానిని స్వీకరించేవారి కొరకు. దివ్య ఖురాను మీ ముందు పఠింపబడుతూ ఉన్న ప్పుడు, దానిని శ్రద్ధతో వినండి, మౌనంగా ఉండండి. బహుశా మీరు కూడా కరుణింపబడతారేమో.

**205 - 206** ప్రవక్తా! నీ ప్రభువును ఉదయమూ సాయం త్రమూ స్మరించు, లోలోపల వినయంతోనూ భయపడుతూనూ, మెల్లగా నోటితో కూడా. నిర్లక్ష్యం చేసేవారిలో నీవు చేరకు. నీ ప్రభువు సన్నిధిలో సన్నిహిత స్థానం కలిగివుండే దైవదూతలు ఎన్నడూ తమ గొప్పతనానికి గర్వపడి ఆయన ఆరాధనకు విముఖులు కారు. ఆయనను స్తుతిస్తూ ఉంటారు. ఆయన ముందు సజ్దాచేస్తూ వినమ్రులయి ఉంటారు.[55]

---

చందమామలాంటి బిడ్డ పుట్టినపుడు కృతజ్ఞతలు తెలుపుకోవటానికి, మొక్కుబడులూ అర్చనలూ దేవతలకు, అవతారాలకు, "వలీ"లకు, హజ్రత్‌లకు సమర్పించుకుంటారు. ఇంకా శిశువును దేవుడు కాక మరొకరెవరో ప్రసాదించారని సూచించే పేర్లు పెడతారు.

54. అంటే, ముష్రిక్కుల మిథ్యాదేవుళ్ళ పరిస్థితి ఎలా ఉందంటే, రుజుమార్గం చూపటం తమ భక్తులకు మార్గదర్శకత్వం వహించేమాట అలా ఉంచి పాపం వారు చివరకు ఏ మార్గదర్శకుడిని అనుసరించే శక్తినీ కలిగిలేరు. పిలిచేవాని పిలుపునకు జవాబూ పలుకలేరు.

55. ఈ ఆయత్‌ను పఠించేవారు లేక వినేవారు సజ్దా చెయ్యాలి అని ఆజ్ఞ. ఖురానులో సజ్దా ఆయత్‌లు 14 చోట్ల వచ్చాయి.

## 8 سُوۡرَةُ الۡاَنۡفَالِ مَدَنِيَّةٌ ٨٨

اٰيَاتُهَا ٧٥ | رُكُوۡعَاتُهَا ١٠

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ
يَسۡـَٔلُوۡنَكَ عَنِ الۡاَنۡفَالِ ؕ قُلِ الۡاَنۡفَالُ لِلّٰهِ وَ
الرَّسُوۡلِ ۚ فَاتَّقُوا اللّٰهَ وَ اَصۡلِحُوۡا ذَاتَ
بَيۡنِكُمۡ ۖ وَ اَطِيۡعُوا اللّٰهَ وَرَسُوۡلَهٗۤ اِنۡ كُنۡتُمۡ
مُّؤۡمِنِيۡنَ ١ اِنَّمَا الۡمُؤۡمِنُوۡنَ الَّذِيۡنَ اِذَا
ذُكِرَ اللّٰهُ وَجِلَتۡ قُلُوۡبُهُمۡ وَ اِذَا تُلِيَتۡ
عَلَيۡهِمۡ اٰيٰتُهٗ زَادَتۡهُمۡ اِيۡمَانًا وَّ عَلٰى رَبِّهِمۡ
يَتَوَكَّلُوۡنَ ۚ ٢ الَّذِيۡنَ يُقِيۡمُوۡنَ الصَّلٰوةَ وَ مِمَّا
رَزَقۡنٰهُمۡ يُنۡفِقُوۡنَ ٣ اُولٰۤـئِكَ هُمُ الۡمُؤۡمِنُوۡنَ
حَقًّا ؕ لَهُمۡ دَرَجٰتٌ عِنۡدَ رَبِّهِمۡ وَمَغۡفِرَةٌ
وَّرِزۡقٌ كَرِيۡمٌ ۚ ٤ كَمَاۤ اَخۡرَجَكَ رَبُّكَ مِنۡۢ
بَيۡتِكَ بِالۡحَقِّ ۖ وَ اِنَّ فَرِيۡقًا مِّنَ الۡمُؤۡمِنِيۡنَ
لَكٰرِهُوۡنَ ۙ ٥ يُجَادِلُوۡنَكَ فِى الۡحَقِّ بَعۡدَ مَا
تَبَيَّنَ كَاَنَّمَا يُسَاقُوۡنَ اِلَى الۡمَوۡتِ وَ هُمۡ
يَنۡظُرُوۡنَ ٦

## 8. అల్ అన్‌ఫాల్

ఆయతులు 75 | అవతరణ మదీనాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 – 6** వారు నిన్ను "అన్‌ఫాల్"ను గురించి అడుగుతున్నారు.[1] ఇలా అను: "ఈ అన్‌ఫాల్ అల్లాహ్‌కూ ఆయన ప్రవక్తకూ చెందుతాయి. కనుక మీరు అల్లాహ్‌కు భయపడండి. మీ పరస్పర సంబంధాలను సంస్కరించుకోండి. అల్లాహ్‌కూ, ఆయన ప్రవక్తకూ విధేయత చూపండి, మీరు గనక విశ్వాసులే అయితే."[2] నిజమైన విశ్వాసుల హృదయాలు అల్లాహ్ ప్రస్తావన విన్నంతనే భయంతో కంపిస్తాయి. వారి సమక్షంలో అల్లాహ్ ఆయతులు పారాయణం చెయ్యబడినప్పుడు వారి విశ్వాసం పెరుగుతుంది. వారు తమ ప్రభువు పట్ల నమ్మకం కలిగి వుంటారు. వారు నమాజును స్థాపిస్తారు. వారికి మేమిచ్చిన దానినుండి (మా మార్గంలో) ఖర్చుపెడతారు. అటువంటి వారే నిజమైన విశ్వాసులు. వారి కొరకు వారి ప్రభువు వద్ద ఉన్నత స్థానాలు ఉన్నాయి. తప్పులకు మన్నింపు ఉంది. శ్రేష్ఠమైన ఆహారం ఉంది. (ఈ అన్‌ఫాల్ వ్యవహారంలో కూడా ఇదివరకు ఉత్పన్నమైన పరిస్థితి వంటిదే ఇప్పుడూ ఉత్పన్న మౌతోంది. అప్పుడు) నీ ప్రభువు నిన్ను సత్యంతో నీ గృహం నుండి బయటకు తీసుకువచ్చాడు. విశ్వసించిన వారిలోని ఒకవర్గం వారికి ఇది ఇష్టంలేదు. వారు ఈ సత్యం విషయంలో నీతో ఘర్షణపడ్డారు, అది వాస్తవానికి సత్యమని పూర్తిగా రుజువైపోయింది. వారి పరిస్థితి తమ కళ్లముందే తాము మృత్యువు వైపునకు తరుమబడే వారి మాదిరిగా ఉంది.

1. అన్‌ఫాల్, నఫిల్ యొక్క బహువచనం. అరబ్బీ భాషలో నఫిల్ అంటే విధిగా చేయవలసిన దానికంటే ఎక్కువగా చేయటం లేదా హక్కుగా పొందవలసిన దానికంటే ఎక్కువగా పొందటం. దాసుని తరఫు నుండి అయితే, అది ఒక దాసుడు తన స్వామి కొరకు విధిగా చెయ్యవలసిన దానికంటే అధికంగా తన సంతోషంతో చేసే స్వచ్ఛంద దాస్యం అవుతుంది నఫిల్ నమాజు మాదిరిగా. అది గనక స్వామి తరఫు నుండి అయితే, స్వామి తన దాసునికి అతనికున్న హక్కుకంటే అధికంగా ఇచ్చే కానుక అవుతుంది. ఇక్కడ అన్‌ఫాల్ పదం బద్ర్ సంగ్రామంలో ముస్లిములకు లభ్యమైన విజయధనం కొరకు ఉపయోగించబడింది. వాటిని అన్‌ఫాల్‌గా నిర్ణయించే దాని భావం ఏమిటంటే, ఇవి మీరు సంపాదించినవి కావు. ఇవి అల్లాహ్ అనుగ్రహాలు, బహుమానాలు. ఆయన వాటిని మీకు ప్రసాదించాడు అని ముస్లిములకు బోధపరచటం.

وَ اِذۡ يَعِدُكُمُ اللّٰهُ اِحۡدَى الطَّآئِفَتَيۡنِ اَنَّهَا
لَكُمۡ وَ تَوَدُّوۡنَ اَنَّ غَيۡرَ ذَاتِ الشَّوۡكَةِ تَكُوۡنُ
لَكُمۡ وَ يُرِيۡدُ اللّٰهُ اَنۡ يُّحِقَّ الۡحَقَّ بِكَلِمٰتِهٖ وَ
يَقۡطَعَ دَابِرَ الۡكٰفِرِيۡنَ ۙ﴿٧﴾ لِيُحِقَّ الۡحَقَّ وَيُبۡطِلَ
الۡبَاطِلَ وَ لَوۡ كَرِهَ الۡمُجۡرِمُوۡنَ ۚ﴿٨﴾ اِذۡ تَسۡتَغِيۡثُوۡنَ
رَبَّكُمۡ فَاسۡتَجَابَ لَكُمۡ اَنِّىۡ مُمِدُّكُمۡ بِاَلۡفٍ مِّنَ
الۡمَلٰٓئِكَةِ مُرۡدِفِيۡنَ ﴿٩﴾ وَ مَا جَعَلَهُ اللّٰهُ اِلَّا
بُشۡرٰى وَ لِتَطۡمَئِنَّ بِهٖ قُلُوۡبُكُمۡ ۚ وَ مَا النَّصۡرُ
اِلَّا مِنۡ عِنۡدِ اللّٰهِ ؕ اِنَّ اللّٰهَ عَزِيۡزٌ حَكِيۡمٌ ﴿١٠﴾ ع ١٥
اِذۡ يُغَشِّيۡكُمُ النُّعَاسَ اَمَنَةً مِّنۡهُ وَيُنَزِّلُ
عَلَيۡكُمۡ مِّنَ السَّمَآءِ مَآءً لِّيُطَهِّرَكُمۡ بِهٖ وَيُذۡهِبَ
عَنۡكُمۡ رِجۡزَ الشَّيۡطٰنِ وَلِيَرۡبِطَ عَلٰى قُلُوۡبِكُمۡ وَ
يُثَبِّتَ بِهِ الۡاَقۡدَامَ ﴿١١﴾ؕ اِذۡ يُوۡحِىۡ رَبُّكَ اِلَى
الۡمَلٰٓئِكَةِ اَنِّىۡ مَعَكُمۡ فَثَبِّتُوا الَّذِيۡنَ اٰمَنُوۡا ؕ
سَاُلۡقِىۡ فِىۡ قُلُوۡبِ الَّذِيۡنَ كَفَرُوا الرُّعۡبَ
فَاضۡرِبُوۡا فَوۡقَ الۡاَعۡنَاقِ وَ اضۡرِبُوۡا مِنۡهُمۡ كُلَّ
بَنَانٍ ﴿١٢﴾ؕ ذٰلِكَ بِاَنَّهُمۡ شَآقُّوا اللّٰهَ وَ رَسُوۡلَهٗ ۚ
وَمَنۡ يُّشَاقِقِ اللّٰهَ وَرَسُوۡلَهٗ فَاِنَّ اللّٰهَ شَدِيۡدُ
الۡعِقَابِ ﴿١٣﴾ ذٰلِكُمۡ فَذُوۡقُوۡهُ وَ اَنَّ لِلۡكٰفِرِيۡنَ
عَذَابَ النَّارِ ﴿١٤﴾

**7 - 8** రెండు వర్గాలలో ఒక వర్గం మీకు దొరికిపోతుందని[3] అల్లాహ్ వాగ్దానం చేసిన సందర్భాన్ని జ్ఞాపకం చేసుకోండి. మీకు బలహీనవర్గం దొరకాలని మీరు కోరుకున్నారు. కాని తన మాటల ద్వారా సత్యం యొక్క సత్యతను నిరూపించాలనేది, అవిశ్వాసులను సమూలంగా నాశనం చెయ్యాలనేది అల్లాహ్ సంకల్పం. ఎందుకంటే, సత్యం సత్యంగా రూఢి కావాలని, అసత్యం అసత్యంగా రుజువు కావాలని, ఇది అపరాధులకు ఎంత అనిష్టమైనా సరే.

**9 - 10** ఇంకా మీరు మీ ప్రభువును సహాయం కొరకు ప్రార్థించిన సందర్భాన్ని కూడా జ్ఞాపకం తెచ్చుకోండి. సమాధానంగా అప్పుడు ఆయన ఇలా సెలవిచ్చాడు: "నేను మీ సహాయం కొరకు వెయ్యిమంది దైవదూతలను ఒకరి తరువాత ఒకరిని ఎడతెగకుండా పంపుతున్నాను." మీకు శుభవార్తగానూ మీ మనస్సులు దీనివల్ల నిశ్చింతగా ఉండే నిమిత్తమూ అల్లాహ్ ఈ విషయాన్ని మీకు తెలిపాడు. సహాయమనేది ఎప్పుడు లభించినా అల్లాహ్ తరఫు నుండే లభిస్తుంది. నిశ్చయంగా అల్లాహ్ అత్యంత శక్తిమంతుడు, అత్యంత వివేకవంతుడూను.

**11** ఇంకా ఆ సమయాన్ని అప్పుడు అల్లాహ్ తన తరఫు నుండి నిద్రమత్తు రూపంలో నిశ్చింతనూ, నిర్భయస్థితినీ మీపై ఆవహింపచేస్తూ ఉన్నాడు.[4] ఆయన ఆకాశం నుండి మీపై నీళ్ళను వర్షింపచేస్తూ ఉన్నాడు, మిమ్మల్ని పరిశుద్ధపరచాలని, మీకు షైతానువల్ల కలిగిన మాలిన్యాన్ని మీనుండి దూరం చెయ్యాలని, మీకు ధైర్యం కలిగించాలని, తద్వారా మీ పాదాలను సుస్థిరం చెయ్యాలని.

**12 - 14** ఇంకా ఆ సమయం, అప్పుడు మీ ప్రభువు దైవదూతలకు ఇలా సంజ్ఞ చేశాడు: "నేను మీకు తోడుగా ఉన్నాను. మీరు విశ్వాసులకు ధైర్య స్థయిర్యాలను కలిగించండి. నేను ఇప్పుడే ఈ అవిశ్వాసుల హృదయాలలో భయాన్ని సృష్టిస్తాను. కనుక మీరు వారి మెడలపై కొట్టండి. వారి కీలు కీలుపై కొట్టండి."[5] ఎందుకంటే వారు అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను ఎదిరించారు. అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ ఎదిరించే వారిపట్ల అల్లాహ్ అత్యంత కఠినంగా వ్యవహరిస్తాడు- ఇది[6] మీ శిక్ష. ఇక దానిని రుచి చూడండి. సత్యాన్ని తిరస్కరించేవారికి నరకశిక్ష ఉంటుందనే విషయం మీరు తెలుసుకోవాలి.

يَاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْٓا اِذَا لَقِيْتُمُ الَّذِيْنَ كَفَرُوْا زَحْفًا فَلَا تُوَلُّوْهُمُ الْاَدْبَارَ ﴿١٥﴾ وَ مَنْ يُّوَلِّهِمْ يَوْمَئِذٍ دُبُرَهٗٓ اِلَّا مُتَحَرِّفًا لِّقِتَالٍ اَوْ مُتَحَيِّزًا اِلٰى فِئَةٍ فَقَدْ بَآءَ بِغَضَبٍ مِّنَ اللّٰهِ وَمَاْوٰىهُ جَهَنَّمُ ؕ وَ بِئْسَ الْمَصِيْرُ ﴿١٦﴾ فَلَمْ تَقْتُلُوْهُمْ وَ لٰكِنَّ اللّٰهَ قَتَلَهُمْ ۪ وَ مَا رَمَيْتَ اِذْ رَمَيْتَ وَ لٰكِنَّ اللّٰهَ رَمٰى ۚ وَلِيُبْلِيَ الْمُؤْمِنِيْنَ مِنْهُ بَلَآءً حَسَنًا ؕ اِنَّ اللّٰهَ سَمِيْعٌ عَلِيْمٌ ﴿١٧﴾ ذٰلِكُمْ وَ اَنَّ اللّٰهَ مُوْهِنُ كَيْدِ الْكٰفِرِيْنَ ﴿١٨﴾ اِنْ تَسْتَفْتِحُوْا فَقَدْ جَآءَكُمُ الْفَتْحُ ۚ وَاِنْ تَنْتَهُوْا فَهُوَ خَيْرٌ لَّكُمْ ۚ وَ اِنْ تَعُوْدُوْا نَعُدْ ۚ وَ لَنْ تُغْنِيَ عَنْكُمْ فِئَتُكُمْ شَيْـًٔا وَّ لَوْ كَثُرَتْ ۙ وَ اَنَّ اللّٰهَ مَعَ الْمُؤْمِنِيْنَ ﴿١٩﴾ ع ٢ ١٦

**15 - 16** విశ్వాసులారా! మీరుగనక సైన్యం రూపంలో అవిశ్వాసులను ఎదుర్కొంటే, వారికి వెన్ను చూపకండి. ఎవడు అటువంటి సమయంలో వెన్నుచూపుతాడో – యుద్ధపుటెత్తుగడగా అలా చేస్తే తప్ప లేదా మరొక (విశ్వాసుల) సైన్యాన్ని కలిసేందుకు అలా చేస్తే తప్ప – అతడు అల్లాహ్ ఆగ్రహంలో చిక్కుకుపోతాడు. నరకం అతడి నివాస స్థలం అవుతుంది. అది అతిచెడ్డ పునరాగమన ప్రదేశం.

**17 - 19** కనుక యథార్థం ఏమిటంటే, వారిని మీరు చంపలేదు. వారిని అల్లాహ్ చంపాడు. ప్రవక్తా! నీవు విసరలేదు అల్లాహ్ విసిరాడు.[7] ఇది (ఈ పనికొరకు విశ్వాసుల చేతులు వినియోగించబడటం) ఎందుకంటే, అల్లాహ్ ముస్లిములను ఒక మంచి పరీక్షగుండా విజయవంతంగా దాటించదలచాడు. నిశ్చయంగా అల్లాహ్ అన్నీ వినేవాడూ, అన్నీ తెలిసినవాడూను. ఈ వ్యవహారం మీకు సంబంధించి నంతవరకే. అవిశ్వాసుల పట్ల వ్యవహారం ఎలా ఉంటుందంటే, అల్లాహ్ వారి వ్యూహాలను బలహీన పరుస్తాడు. ఈ అవిశ్వాసులతో ఇలా అను: "మీరు గనక తీర్పును కోరితే, ఇదో, తీర్పు మీ ముందుకు వచ్చేసింది.[8] కాబట్టి ఇక మానండి, అది మీకే మేలు. ఒకవేళ మీరు ఈ బుద్ధితక్కువ పనిని మళ్ళీ చేసినట్లయితే మేము కూడా మళ్ళీ అదే శిక్షను విధిస్తాము. మీ సైనిక దళం, అది ఎంత అధికంగా ఉన్నప్పటికీ, మీకు ఏమాత్రం పనికిరాదు. అల్లాహ్ విశ్వాసులతో ఉన్నాడు."

2. ఈ ధనం పంపకం విషయంలో ఏ ఆదేశమూ రాకముందే ముస్లిములలో వివిధ వర్గాలవారు తమ తమ భాగాలను గురించి దావాలు చెయ్యటం ప్రారంభించారు. కనుక ఈ విషయం సెలవీయబడింది.

3. అంటే, సిరియా నుండి వస్తున్న ఖురైషుల వ్యాపార బృందం, లేదా మక్కా నుండి వస్తున్న ఖురైషుల సైన్యం.

4. ఈ అనుభవమే ముస్లిములకు ఉహుద్ సంగ్రామంలో కలిగింది, ఆలి ఇమ్రాను సూరా 154వ ఆయత్‌లో పేర్కొనబడిన విధంగా.

5. ఇంతవరకు బద్ర్ సంగ్రామానికి చెందిన ఆయా సంఘటనలను విడివిడిగా చెప్పటం జరిగింది. అసలు వాటి ఉద్దేశ్యం 'అన్ఫాల్' పదం యొక్క అంతరార్థాన్ని విశదపరచటమే. ప్రారంభంలో ఇలా అనబడింది : ఈ విజయ ధనాన్ని మీరు మీ ప్రాణాలొడ్డి పోరాడినదానికి ఫలితంగా భావించి, దానికి యజమానులు ఎలా కాగలరు. ఇది అసలు అల్లాహ్ ప్రసాదం. ప్రసాదించే వాడే స్వయంగా తన సొమ్ముకు యజమాని. దీనిని నిరూపించటానికే ఈ సంఘటనలు పేర్కొనబడ్డాయి : ఈ విజయం విషయంలో స్వయంగా లెక్కవేసి చూసుకోండి. మీరు ప్రాణాలొడ్డి పోరాడిన మీ కృషికి, మీ ధైర్యసాహసాలకూ ఎంత భాగం ఉందో, అల్లాహ్ సహాయానికి ఎంత భాగం ఉందో. కనుక దీన్ని ఎలా పంచాలి అని నిర్ణయించే పని మీది కాదు, ఆ పని అల్లాహ్‌ది.

يَاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْٓا اَطِيْعُوا اللّٰهَ وَرَسُوْلَهٗ وَ
لَا تَوَلَّوْا عَنْهُ وَاَنْتُمْ تَسْمَعُوْنَ ۝٢٠ وَ لَا
تَكُوْنُوْا كَالَّذِيْنَ قَالُوْا سَمِعْنَا وَ هُمْ لَا
يَسْمَعُوْنَ ۝٢١ اِنَّ شَرَّ الدَّوَآبِّ عِنْدَ اللّٰهِ
الصُّمُّ الْبُكْمُ الَّذِيْنَ لَا يَعْقِلُوْنَ ۝٢٢ وَ لَوْ عَلِمَ
اللّٰهُ فِيْهِمْ خَيْرًا لَّاَسْمَعَهُمْ ؕ وَلَوْ اَسْمَعَهُمْ
لَتَوَلَّوْا وَّهُمْ مُّعْرِضُوْنَ ۝٢٣ يَاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا
اسْتَجِيْبُوْا لِلّٰهِ وَلِلرَّسُوْلِ اِذَا دَعَاكُمْ لِمَا
يُحْيِيْكُمْ ۚ وَ اعْلَمُوْٓا اَنَّ اللّٰهَ يَحُوْلُ بَيْنَ
الْمَرْءِ وَ قَلْبِهٖ وَاَنَّهٗٓ اِلَيْهِ تُحْشَرُوْنَ ۝٢٤
وَاتَّقُوْا فِتْنَةً لَّا تُصِيْبَنَّ الَّذِيْنَ ظَلَمُوْا مِنْكُمْ
خَآصَّةً ۚ وَاعْلَمُوْٓا اَنَّ اللّٰهَ شَدِيْدُ الْعِقَابِ ۝٢٥

**20 - 23** విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్‌కూ, ఆయన ప్రవక్తకూ విధేయత చూపండి. ఆజ్ఞ విన్న తరువాత దానినుండి మరలకండి. వాస్తవంగా వినకుండానే “మేము విన్నాము” అని అనే వారివలె మీరూ అయిపోకండి. తమ బుద్ధిని ఉపయోగించని చెవిటివారూ, మూగవారూ మాత్రమే నిశ్చయంగా అల్లాహ్ దృష్టిలో నీచాతినీచమైన కోవకు చెందిన జంతువులు. వారిలో ఏ కొద్దిపాటి మంచితనమైనా ఉందని అల్లాహ్‌కు అనిపించి ఉంటే, ఆయన వారికి తప్పకుండా వినే భాగ్యం కలుగజేసి ఉండేవాడు. (కాని ఆ మంచితనం లేకుండా) ఆయన గనక వారికి వినిపించి ఉండినట్లయితే, వారు నిర్లక్ష్యంగా తమ ముఖాలను త్రిప్పుకుని ఉండేవారే.

**24 - 29** విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్ పిలుపునకూ, ఆయన ప్రవక్త పిలుపునకూ జవాబు పలకండి, ప్రవక్త మీకు జీవితాన్ని ప్రసాదించే దానివైపునకు మిమ్మల్ని పిలిచినప్పుడు. తెలుసుకోండి, అల్లాహ్ మనిషికీ అతని హృదయానికీ మధ్య ఉన్నాడనీ, ఆయన వైపునకే మీరు పోగుచేయబడతారనీ. ఆ ఉపద్రవం నుండి మిమ్మల్ని మీరు కాపాడుకోండి. దానివల్ల కలిగే హాని ప్రత్యేకంగా మీలో పాపం చేసిన వారికే పరిమితమై ఉండదు.[9] అల్లాహ్ కఠినంగా శిక్షించేవాడనే విషయాన్ని తెలుసుకోండి.

6. ఈ వాక్యంలో సంబోధితులు, బద్ర్ సంగ్రామంలో ఓటమిపాలైన అవిశ్వాసులైన ఖురైషులు.
7. బద్ర్ యుద్ధమైదానంలో ముస్లిముల సైన్యాలు అవిశ్వాసుల సైన్యాలు పరస్పరం ఎదురైనప్పుడు, యుద్ధ ప్రారంభానికి ముందు మహాప్రవక్త (సఅసమ్) తన చేతితో గుప్పెడు ఇసుక తీసుకుని “షాహితల్ ఉజూహ్” అని అంటూ అవిశ్వాసుల వైపునకు విసిరారు. వెంటనే ఆయన సంజ్ఞతో ముస్లిములు మూకుమ్మడిగా అవిశ్వాసులపై విరుచుకుపడ్డారు. ఆ సంఘటనే ఇక్కడ సూచించబడింది. అర్థం ఏమిటంటే చెయ్యి ప్రవక్తదే, కాని దెబ్బ అల్లాహ్‌ది.
8. మక్కా నుండి బయలుదేరేటప్పుడు ముష్రిక్కులు కాబా తెరలు పట్టుకుని, ప్రభూ! ఇరువర్గాలలో ఉత్తముల వర్గానికి విజయాన్ని ప్రసాదించు అని ప్రార్థించారు.
9. దీని భావం ఏమిటంటే, ఇవి అంటువ్యాధి మాదిరిగా ఒక పెద్ద ఆపదను తెచ్చే ప్రత్యేకమైన సామూహిక ఉపద్రవాలు. ఆ ఆపదలో కేవలం పాపులే చిక్కుకోరు. పాపుల సమాజంలో ఉండటాన్ని సహించేవారు కూడా చిక్కుకుంటారు.

وَاذْكُرُوْٓا اِذْ اَنْتُمْ قَلِيْلٌ مُّسْتَضْعَفُوْنَ فِي
الْاَرْضِ تَخَافُوْنَ اَنْ يَّتَخَطَّفَكُمُ النَّاسُ
فَاٰوٰىكُمْ وَاَيَّدَكُمْ بِنَصْرِهٖ وَرَزَقَكُمْ مِّنَ
الطَّيِّبٰتِ لَعَلَّكُمْ تَشْكُرُوْنَ ﴿٢٦﴾ يٰٓاَيُّهَا الَّذِيْنَ
اٰمَنُوْا لَا تَخُوْنُوا اللّٰهَ وَالرَّسُوْلَ وَتَخُوْنُوْٓا
اَمٰنٰتِكُمْ وَاَنْتُمْ تَعْلَمُوْنَ ﴿٢٧﴾ وَاعْلَمُوْٓا اَنَّمَآ
اَمْوَالُكُمْ وَاَوْلَادُكُمْ فِتْنَةٌ ۙ وَّاَنَّ اللّٰهَ عِنْدَهٗٓ
اَجْرٌ عَظِيْمٌ ﴿٢٨﴾ يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْٓا اِنْ تَتَّقُوا
اللّٰهَ يَجْعَلْ لَّكُمْ فُرْقَانًا وَّيُكَفِّرْ عَنْكُمْ سَيِّاٰتِكُمْ
وَيَغْفِرْ لَكُمْ ۗ وَاللّٰهُ ذُو الْفَضْلِ الْعَظِيْمِ ﴿٢٩﴾ وَاِذْ
يَمْكُرُ بِكَ الَّذِيْنَ كَفَرُوْا لِيُثْبِتُوْكَ اَوْ
يَقْتُلُوْكَ اَوْ يُخْرِجُوْكَ ۗ وَيَمْكُرُوْنَ وَيَمْكُرُ
اللّٰهُ ۗ وَاللّٰهُ خَيْرُ الْمٰكِرِيْنَ ﴿٣٠﴾ وَاِذَا تُتْلٰى
عَلَيْهِمْ اٰيٰتُنَا قَالُوْا قَدْ سَمِعْنَا لَوْ نَشَآءُ لَقُلْنَا
مِثْلَ هٰذَآ ۙ اِنْ هٰذَآ اِلَّآ اَسَاطِيْرُ
الْاَوَّلِيْنَ ﴿٣١﴾

జ్ఞాపకం తెచ్చుకోండి ఆ సమయాన్ని, అప్పుడు మీరు అల్ప సంఖ్యలో ఉండేవారు, భూమిపై మీరు దుర్బలులుగా పరిగణింపబడేవారు, మిమ్మల్ని ప్రజలు రూపుమాపుతారేమో అని మీరు భయపడుతూ ఉండేవారు, తరువాత అల్లాహ్ మీకు ఆశ్రయ స్థలాన్ని సమకూర్చాడు. తన సహాయంతో మీ చేతులకు బలం చేకూర్చాడు. మీకు మంచి ఉపాధిని ఏర్పాటు చేశాడు, బహుశా మీరు కృతజ్ఞులు అవుతారేమో అని. విశ్వసించిన ప్రజలారా! బుద్ధిపూర్వకంగా అల్లాహ్‌కూ ఆయన ప్రవక్తకూ నమ్మకద్రోహం చెయ్యకండి. మీ అమానతుల[10] విషయంలో ద్రోహానికి పాల్పడకండి. మీ సంపద, మీ సంతానమూ వాస్తవంగా పరీక్షా సాధనాలని, అల్లాహ్ వద్ద ప్రతిఫలంగా ఇవ్వటానికి కావలసినంత ఉందనే విషయాన్ని తెలుసుకోండి. విశ్వసించిన ప్రజలారా! మీరు గనక భయభక్తులను అవలంబిస్తే, అల్లాహ్ మీకు గీటురాయిని[11] ప్రసాదిస్తాడు. మీనుండి మీ చెడులను దూరం చేస్తాడు. మీ తప్పులను మన్నిస్తాడు. అల్లాహ్ అత్యధికంగా అనుగ్రహించేవాడు.

**30 - 37** ఆ సమయం కూడా జ్ఞాపకం తెచ్చుకోదగ్గదే అప్పుడు సత్య తిరస్కారులు నీకు వ్యతిరేకంగా పన్నాగాలు పన్నుతూ ఉన్నారు, నిన్ను నిర్బంధించాలని లేదా నిన్ను హత్య చెయ్యాలని లేదా నిన్ను దేశం నుండి బహిష్కరించాలని.[12] వారు తమ ఎత్తులు తాము వేస్తూ ఉన్నారు. అల్లాహ్ తన ఎత్తు తాను వేస్తూ ఉన్నాడు. అల్లాహ్ అందరికంటే బాగా ఎత్తులు వేస్తాడు. మా ఆయతులు వారికి వినిపించబడినప్పుడు వారు ఇలా అనేవారు: “అవును, మేము విన్నాము. మేము గనక కోరితే, అటువంటి మాటలనే మేమూ సృష్టించగలం. ఇవి పూర్వం నుండీ ప్రజలు చెప్పుకుంటూ వస్తున్న పాత కథలే.”

10. మీ “అమానతులు” అంటే ఎవరినైనా నమ్మి వారికి అప్పగించే అన్ని బాధ్యతలు. అవి వ్యక్తిగతమైన బాధ్యతలైనా కావచ్చు లేక సామూహిక ఒడంబడికల బాధ్యతలైనా కావచ్చు లేక పార్టీ రహస్యాల బాధ్యతలైనా కావచ్చు లేక వ్యక్తిగత, పార్టీపరమైన ఆస్తుల బాధ్యతలైనా కావచ్చు లేక ఏదైనా పదవీ హోదాల యొక్క బాధ్యతలైనా కావచ్చు, వేటినైతే సంఘం ఒక వ్యక్తిని నమ్మి అతనికి అప్పజెబుతుందో.

11. మేలిమి కల్తీల భేదాన్ని ప్రస్ఫుటంచేసే వస్తువును గీటురాయి అంటారు. “ఫుర్‌ఖాన్” అన్నా అర్థం ఇదే. కనుకనే మేము “ఫుర్‌ఖాన్” అంటే “గీటురాయి” అని అనువాదం చేశాము. దైవవాక్కు ఉద్దేశ్యం ఏమిటంటే, మీరు గనక ప్రపంచంలో అల్లాహ్‌కు భయపడుతూ పనిచేస్తే, అల్లాహ్ మీకు విచక్షణా శక్తిని ప్రసాదిస్తాడు. దానిద్వారా అడుగడుగునా మీకు స్వయంగా తెలుస్తూ ఉంటుంది, ఏ వైఖరి సరియైనదో, ఏది తప్పుడు వైఖరియో. ఇంకా ఏ మార్గం సత్యమైనదో, అల్లాహ్ వైపునకు పోతుందో, ఏ మార్గం అసత్యమైనదో, షైతానుతో కలుపుతుందో.

وَ اِذْ قَالُوا اللّٰهُمَّ اِنْ كَانَ هٰذَا هُوَ الْحَقَّ مِنْ
عِنْدِكَ فَاَمْطِرْ عَلَيْنَا حِجَارَةً مِّنَ السَّمَآءِ
اَوِ ائْتِنَا بِعَذَابٍ اَلِيْمٍ ﴿٣٢﴾ وَ مَا كَانَ اللّٰهُ
لِيُعَذِّبَهُمْ وَ اَنْتَ فِيْهِمْ ؕ وَ مَا كَانَ اللّٰهُ
مُعَذِّبَهُمْ وَهُمْ يَسْتَغْفِرُوْنَ ﴿٣٣﴾ وَ مَا لَهُمْ اَلَّا
يُعَذِّبَهُمُ اللّٰهُ وَهُمْ يَصُدُّوْنَ عَنِ الْمَسْجِدِ
الْحَرَامِ وَمَا كَانُوْٓا اَوْلِيَآءَهٗ ؕ اِنْ اَوْلِيَآؤُهٗٓ
اِلَّا الْمُتَّقُوْنَ وَلٰكِنَّ اَكْثَرَهُمْ لَا يَعْلَمُوْنَ ﴿٣٤﴾
وَ مَا كَانَ صَلَاتُهُمْ عِنْدَ الْبَيْتِ اِلَّا مُكَآءً
وَّتَصْدِيَةً ؕ فَذُوْقُوا الْعَذَابَ بِمَا كُنْتُمْ
تَكْفُرُوْنَ ﴿٣٥﴾ اِنَّ الَّذِيْنَ كَفَرُوْا يُنْفِقُوْنَ
اَمْوَالَهُمْ لِيَصُدُّوْا عَنْ سَبِيْلِ اللّٰهِ ؕ
فَسَيُنْفِقُوْنَهَا ثُمَّ تَكُوْنُ عَلَيْهِمْ حَسْرَةً ثُمَّ
يُغْلَبُوْنَ ؕ وَ الَّذِيْنَ كَفَرُوْٓا اِلٰى جَهَنَّمَ
يُحْشَرُوْنَ ﴿٣٦﴾ لِيَمِيْزَ اللّٰهُ الْخَبِيْثَ مِنَ
الطَّيِّبِ وَيَجْعَلَ الْخَبِيْثَ بَعْضَهٗ عَلٰى بَعْضٍ
فَيَرْكُمَهٗ جَمِيْعًا فَيَجْعَلَهٗ فِىْ جَهَنَّمَ ؕ اُولٰٓئِكَ
هُمُ الْخٰسِرُوْنَ ﴿٣٧﴾ قُلْ لِّلَّذِيْنَ كَفَرُوْٓا اِنْ ع ٩ ١٨
يَّنْتَهُوْا يُغْفَرْ لَهُمْ مَّا قَدْ سَلَفَ ۚ وَاِنْ
يَّعُوْدُوْا فَقَدْ مَضَتْ سُنَّتُ الْاَوَّلِيْنَ ﴿٣٨﴾

వారు అన్న ఆ మాట కూడా జ్ఞాపకం ఉంది: "దైవమా! ఇది నిజంగా నీ తరఫు నుండి వచ్చిన సత్యమే అయితే, మాపై ఆకాశం నుండి రాళ్ళను కురిపించు లేదా ఏదైనా బాధాకరమైన శిక్షను మాపైకి తీసుకురా." నీవు వారిమధ్య ఉన్నప్పుడు, అల్లాహ్ వారిపై ఆపదను అవతరింపజెయ్యడు. ప్రజలు క్షమా భిక్ష కొరకు ప్రార్థిస్తూ ఉంటే, వారిని శిక్షించటం అనేది అల్లాహ్ సంప్రదాయం కాదు. కాని ఇప్పుడు ఆయన వారిపై శిక్షను ఎందుకు అవతరింపచెయ్యకూడదు, వారు "మస్జిదె హరామ్" యొక్క మార్గాన్ని ఆటంక పరుస్తూ ఉన్నప్పుడు? వాస్తవానికి వారు ఈ మసీదుకు ధర్మసమ్మతమైన ముతవల్లీలు (ధర్మకర్తలు) కారు. దీనికి ధర్మసమ్మతమైన ముతవల్లీలు కేవలం భయభక్తులు కలవారే కాగలరు. కాని చాలామంది ఈ విషయాన్ని ఎరుగరు. బైతుల్లాహ్ (అల్లాహ్ గృహం)వద్ద వారు చేసే నమాజేమిటీ? కేవలం ఈలలు వేయటం, చప్పట్లు కొట్టటం తప్ప. కనుక, ఇదో, ఈ శిక్షను చవి చూడండి, మీరు చేస్తూ ఉండిన సత్య తిరస్కారానికి ఫలితంగా. సత్యాన్ని ఒప్పుకోవడానికి నిరాకరించిన వారు, తమ సంపదను ప్రజలు అల్లాహ్ మార్గం వైపునకు రాకుండా ఆపటానికి వ్యయపరుస్తున్నారు. ఇంకా వ్యయపరుస్తూనే పోతారు. కాని చివరకు ఈ ప్రయత్నాలే వారి దుఃఖానికి కారణభూతమవుతాయి. అప్పుడు వారు పరాధీనులౌతారు. తరువాత ఈ అవిశ్వాసులు పోగుచేయబడి నరకం వైపునకు తరుమబడతారు. అల్లాహ్ మాలిన్యాన్ని పరిశుద్ధత నుండి వేరుచేయటానికి, అన్ని రకాల మాలిన్యాన్ని కలిపి ఒకచోట పోగుచెయ్యటానికి, తరువాత ఆ కుప్పను నరకంలో పడవేయటానికి. అసలు దివాలా తీసినవారు వీరే.

**38** ప్రవక్తా! ఈ అవిశ్వాసులకు ఇలా చెప్పు: "ఇప్పుడైనా మానుకుంటే, గతంలో జరిగినదానినంతా మన్నించటం జరుగుతుంది. కాని వారు పూర్వపు వైఖరినే మళ్ళీ అవలంబిస్తే, పూర్వపు జాతులకు ఏమి జరిగిందో, అది అందరికీ తెలుసు."

12. ఇక ముహమ్మద్ (సఅసమ్) కూడా మదీనాకు వెళ్ళిపోతారు అనే ఖురైషుల అనుమానం గట్టి నమ్మకంగా మారినప్పటి సందర్భం ఇక్కడ ప్రస్తావించబడింది. ఆ సమయంలో వారు పరస్పరం ఇలా అనుకోసాగారు : ఈ వ్యక్తి గనక మక్కా నుండి వెళ్ళిపోతే ప్రమాదం మన అదుపు నుండి తప్పిపోతుంది. కనుక వారు ఆయన వ్యవహారాన్ని గురించి అంతిమనిర్ణయం చెయ్యటానికి ఒక సమావేశాన్ని ఏర్పాటు చేశారు. ఇంకా, ఈ ప్రమాదాన్ని ఏ విధంగా నిరోధించాలి అనే విషయాన్ని గురించి పరస్పరం సంప్రదింపులు జరిపారు.

وَقَاتِلُوْهُمْ حَتّٰى لَا تَكُوْنَ فِتْنَةٌ وَّ يَكُوْنَ
الدِّيْنُ كُلُّهٗ لِلّٰهِ ۚ فَاِنِ انْتَهَوْا فَاِنَّ اللّٰهَ بِمَا
يَعْمَلُوْنَ بَصِيْرٌ ﴿٣٩﴾ وَاِنْ تَوَلَّوْا فَاعْلَمُوْٓا اَنَّ
اللّٰهَ مَوْلٰىكُمْ ؕ نِعْمَ الْمَوْلٰى وَ نِعْمَ النَّصِيْرُ ﴿٤٠﴾
وَ اعْلَمُوْٓا اَنَّمَا غَنِمْتُمْ مِّنْ شَيْءٍ فَاَنَّ لِلّٰهِ
خُمُسَهٗ وَلِلرَّسُوْلِ وَلِذِي الْقُرْبٰى وَ الْيَتٰمٰى وَ
الْمَسٰكِيْنِ وَ ابْنِ السَّبِيْلِ ۙ اِنْ كُنْتُمْ اٰمَنْتُمْ
بِاللّٰهِ وَ مَآ اَنْزَلْنَا عَلٰى عَبْدِنَا يَوْمَ الْفُرْقَانِ
يَوْمَ الْتَقَى الْجَمْعٰنِ ؕ وَ اللّٰهُ عَلٰى كُلِّ شَيْءٍ
قَدِيْرٌ ﴿٤١﴾ اِذْ اَنْتُمْ بِالْعُدْوَةِ الدُّنْيَا وَ هُمْ
بِالْعُدْوَةِ الْقُصْوٰى وَ الرَّكْبُ اَسْفَلَ مِنْكُمْ ؕ
وَ لَوْ تَوَاعَدْتُّمْ لَاخْتَلَفْتُمْ فِي الْمِيْعٰدِ ۙ وَ لٰكِنْ
لِّيَقْضِيَ اللّٰهُ اَمْرًا كَانَ مَفْعُوْلًا ۙ لِّيَهْلِكَ مَنْ
هَلَكَ عَنْۢ بَيِّنَةٍ وَّ يَحْيٰى مَنْ حَيَّ عَنْۢ بَيِّنَةٍ ؕ
وَ اِنَّ اللّٰهَ لَسَمِيْعٌ عَلِيْمٌ ﴿٤٢﴾ اِذْ يُرِيْكَهُمُ اللّٰهُ
فِيْ مَنَامِكَ قَلِيْلًا ؕ وَ لَوْ اَرٰىكَهُمْ كَثِيْرًا
لَّفَشِلْتُمْ وَلَتَنَازَعْتُمْ فِي الْاَمْرِ وَلٰكِنَّ اللّٰهَ
سَلَّمَ ؕ اِنَّهٗ عَلِيْمٌۢ بِذَاتِ الصُّدُوْرِ ﴿٤٣﴾

الجزء ١٠

**39 - 40** విశ్వసించిన ప్రజలారా! పీడన ఏమాత్రం మిగలకుండా పోయే వరకు, అల్లాహ్ నిర్ణయించిన ధర్మం పూర్తిగా నెలకొల్పబడేవరకు ఈ అవిశ్వాసులతో యుద్ధం చెయ్యండి. తరువాత వారు పీడనను మానుకుంటే, అల్లాహ్ వారి కర్మలను తప్పకుండా గమనిస్తాడు. ఒకవేళ వారు మానక పోతే, అల్లాహ్ మీకు సంరక్షకుడు అని తెలుసుకోండి. ఆయన ఉత్తమరక్షకుడూ, సహాయకుడూను.

**41** మీరు ఈ విషయాన్ని తెలుసుకోవాలి: మీరు యుద్ధ సంపదగా పొందిన[13] దానిలో ఐదవభాగం అల్లాహ్‌కూ, ఆయన ప్రవక్తకూ, బంధువులకూ, అనాథలకూ, బీదవారికీ, బాటసారులకూ చెందుతుంది. మీరు అల్లాహ్‌నూ, నిర్ణయ దినం నాడు అంటే ఉభయ సైన్యాలు ఢీకొన్ననాడు మేము మా దాసునిపై అవతరింపజేసిన విషయాన్నీ[14] విశ్వసించినట్లయితే (ఈ భాగాన్ని సంతోషంగా ఇవ్వండి) అల్లాహ్‌కు అన్ని విషయాలపై అధికారం ఉంది.

**42** ఆ సమయాన్ని గుర్తుకు తెచ్చుకోండి: అప్పుడు మీరు లోయకు ఈ ప్రక్కన ఉన్నారు. వారు ఆ ప్రక్కన మకాము చేశారు. మీకు క్రింది (ఒడ్డు) వైపున బిడారు ఉంది. ఒకవేళ మొదటే మీకూ వారికీ మధ్య యుద్ధం చెయ్యాలి అనే తీర్మానమే జరిగి ఉండినట్లయితే, మీరు తప్పకుండా ఈ సందర్భంలో ఆ తీర్మానాన్ని పాటించకుండా దాటవేసి ఉండేవారు. కాని జరిగింది ఏదో అది అల్లాహ్ తాను తీసుకున్న నిర్ణయాన్ని అమలుపరచటానికి జరిగింది, నశించవలసినవాడు స్పష్టమైన నిదర్శనంతో నశించాలని, జీవించవలసినవాడు స్పష్టమైన నిదర్శనంతో జీవించాలని జరిగింది. నిశ్చయంగా అల్లాహ్ వినేవాడూ తెలిసినవాడూను.

**43** ఆ సమయాన్ని కూడ గుర్తుకు తెచ్చుకోండి, అప్పుడు ఓ ప్రవక్తా! అల్లాహ్ వారిని నీ కలలో కొద్దిమందిగా చూపాడు.[15] ఒకవేళ ఆయన వారిని ఎక్కువ సంఖ్యలో చూపి ఉన్నట్లయితే, మీరు తప్పకుండా ధైర్యాన్ని కోల్పోయి ఉండే వారు. యుద్ధం విషయంలో వివాదపడి ఉండేవారు. కాని అల్లాహ్‌యే మిమ్మల్ని దీనినుండి రక్షించాడు. నిశ్చయంగా ఆయన హృదయాల స్థితిని సైతం ఎరుగును.

وَ اِذْ يُرِيْكُمُوْهُمْ اِذِ الْتَقَيْتُمْ فِيْٓ اَعْيُنِكُمْ
قَلِيْلًا وَّيُقَلِّلُكُمْ فِيْٓ اَعْيُنِهِمْ لِيَقْضِيَ اللّٰهُ
اَمْرًا كَانَ مَفْعُوْلًا ۗ وَ اِلَى اللّٰهِ تُرْجَعُ الْاُمُوْرُ ﴿۴۴﴾ ع
يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْٓا اِذَا لَقِيْتُمْ فِئَةً فَاثْبُتُوْا
وَاذْكُرُوا اللّٰهَ كَثِيْرًا لَّعَلَّكُمْ تُفْلِحُوْنَ ﴿۴۵﴾
وَاَطِيْعُوا اللّٰهَ وَرَسُوْلَهٗ وَلَا تَنَازَعُوْا فَتَفْشَلُوْا
وَتَذْهَبَ رِيْحُكُمْ وَاصْبِرُوْا ۗ اِنَّ اللّٰهَ مَعَ
الصّٰبِرِيْنَ ﴿۴۶﴾ وَلَا تَكُوْنُوْا كَالَّذِيْنَ خَرَجُوْا
مِنْ دِيَارِهِمْ بَطَرًا وَّ رِئَآءَ النَّاسِ وَيَصُدُّوْنَ
عَنْ سَبِيْلِ اللّٰهِ ۗ وَاللّٰهُ بِمَا يَعْمَلُوْنَ مُحِيْطٌ ﴿۴۷﴾

**44** జ్ఞాపకం తెచ్చుకోండి: యుద్ధ సమయంలో అల్లాహ్ మీ దృష్టికి శత్రువులను కొద్దిమందిగా చూపాడు. వారి దృష్టికి మిమ్మల్ని తగ్గించి చూపాడు, జరుగవలసి ఉన్నదానిని అల్లాహ్ అమలులోకి తీసుకురావడానికి. చివరకు అన్ని వ్యవహారాలూ అల్లాహ్ వద్దకే మరలిపోతాయి.

**45 - 47** విశ్వాసులారా! మీరు ఒక వర్గాన్ని ఎదుర్కొన్నప్పుడు స్థయిర్యంతో ఉండండి. అల్లాహ్‌ను అత్యధికంగా స్మరించండి, మీకు విజయభాగ్యం కలుగుతుందని ఆశించవచ్చు. అల్లాహ్‌కూ ఆయన ప్రవక్తకూ విధేయత చూపండి. పరస్పరం కలహించు కోకండి. అలా జరిగితే మీలో బలహీనత ప్రవేశిస్తుంది, మీ శక్తి సన్నగిల్లిపోతుంది. సహనంతో మెలగండి.[16] నిశ్చయంగా అల్లాహ్ సహనం చూపేవారితో ఉంటాడు. తమ గృహాల నుండి విర్రవీగుతూ ప్రజల ముందు తమ దర్పాన్ని ప్రదర్శిస్తూ బయలుదేరేవారి మాదిరిగా, అల్లాహ్ మార్గం నుండి ప్రజలను నిరోధించే వైఖరిని కలిగి వున్న వారి మాదిరిగా ప్రవర్తించకండి. వారు చేస్తున్నది ఏదీ అల్లాహ్ పట్టుకు అతీతంగా లేదు.

13. ఇక్కడ విజయ ధనం పంపిణీకి సంబంధించిన చట్టం తెలుపబడింది. దానిని గురించి ఉపన్యాసం ప్రారంభంలో ఇది అల్లాహ్ బహుమానం, దీని విషయంలో నిర్ణయం చేసే అధికారం అల్లాహ్‌కూ ఆయన ప్రవక్తకూ మాత్రమే ఉంది, అని అనటం జరిగింది. ఇప్పుడు ఆ నిర్ణయం ప్రకటించబడింది.

14. అంటే, మీకు విజయం లభించటానికి మీకు ఈ విజయధనం లభించటానికి దోహదం చేసిన సహాయ సహకారాలు.

15. మహాప్రవక్త (సఅసమ్) ముస్లిములను తీసుకుని మదీనా నగరం నుండి బయలుదేరినప్పటి లేదా మార్గమధ్యంలో ఏదైనా మజిలీవద్ద ఆగినప్పటి విషయం ఇది. అప్పటికి అవిశ్వాసుల సైన్యం యథార్థంగా ఎంత ఉందో ఇంకా రూఢీ కాలేదు. ఆ సమయంలో మహాప్రవక్త (సఅసమ్) ఆ సైన్యాన్ని కలలో చూశారు. ఇంకా ఆయనకు చూపబడిన దృశ్యం ద్వారా ఆయన శత్రువుల సంఖ్య అంత పెద్దదికాదు అని అంచనావేశారు.

16. అంటే, మీ భావోద్రేకాలనూ, మీ కోరికలనూ అదుపులో ఉంచుకోండి. తొందరపాటు, కలవరము, భయం, దురాశ, నిరాశ, అనుచితమైన ఆవేశమూ - వీటికి దూరంగా ఉండండి. స్థిమితమైన మనస్సుతో సరియైన నిర్ణయాలు తీసుకుంటూ పనిచెయ్యండి. ప్రమాదాలు, కష్టాలు ఎదురైనప్పుడు మీ పాదాలు తొట్రుపాటుకు లోనుకాకూడదు. ఉద్రేకాన్ని రెచ్చగొట్టే సమయాలు ఎదురైతే, కోపతాపాలలో పడి మీరు అసందర్భమైన చేష్టలు చెయ్యకూడదు. కష్టాలు వచ్చిపడ్డప్పుడు, పరిస్థితులు విషమిస్తూ కనిపించినప్పుడు, వ్యాకులపాటుతో మీరు ఇంద్రియ నిగ్రహశక్తిని కోల్పోకూడదు. లక్ష్యాన్ని సాధించాలనే అత్యుత్సాహంతో అసహనానికి లోనయి, లేదా అపరిపక్వమైన ఉపాయాన్ని స్థూలదృష్టిలో ఉపయోగకరమైనదిగా భ్రమపడి తొందరపాటు నిర్ణయాలు తీసుకోరాదు. ఒకవేళ ఎప్పుడైనా ప్రాపంచిక ప్రయోజనాలూ, తుచ్ఛమైన మనోవాంఛల ప్రేరణలూ మిమ్మల్ని తమ వైపునకు లాగుతూ ఉన్నప్పటికీ; మీ మనస్సు, మీరు వాటి వైపునకు అప్రయత్నంగా లాగబడే అంత బలహీనంగా ఉండకూడదు. ఈ సమస్త భావాలు కేవలం ఒకే పదం "స(బ్" (సహనం)లో దాగివున్నాయి. ఈ సమస్త విషయాలలో సహనశీలురు అయినవారికే నా సహాయం లభిస్తుంది అని అల్లాహ్ సెలవిస్తున్నాడు.

وَاِذْ زَيَّنَ لَهُمُ الشَّيْطٰنُ اَعْمَالَهُمْ وَقَالَ لَا
غَالِبَ لَكُمُ الْيَوْمَ مِنَ النَّاسِ وَاِنِّىْ جَارٌ لَّكُمْ ۚ
فَلَمَّا تَرَآءَتِ الْفِئَتٰنِ نَكَصَ عَلٰى عَقِبَيْهِ وَقَالَ
اِنِّىْ بَرِىْٓءٌ مِّنْكُمْ اِنِّىْٓ اَرٰى مَا لَا تَرَوْنَ اِنِّىْٓ
اَخَافُ اللّٰهَ ؕ وَاللّٰهُ شَدِيْدُ الْعِقَابِ ﴿٤٨﴾ اِذْ ع
يَقُوْلُ الْمُنٰفِقُوْنَ وَالَّذِيْنَ فِىْ قُلُوْبِهِمْ مَّرَضٌ
غَرَّ هٰٓؤُلَآءِ دِيْنُهُمْ ؕ وَمَنْ يَّتَوَكَّلْ عَلَى اللّٰهِ
فَاِنَّ اللّٰهَ عَزِيْزٌ حَكِيْمٌ ﴿٤٩﴾ وَلَوْ تَرٰٓى اِذْ يَتَوَفَّى
الَّذِيْنَ كَفَرُوا ۙ الْمَلٰٓئِكَةُ يَضْرِبُوْنَ وُجُوْهَهُمْ وَ
اَدْبَارَهُمْ ۚ وَ ذُوْقُوْا عَذَابَ الْحَرِيْقِ ﴿٥٠﴾ ذٰلِكَ
بِمَا قَدَّمَتْ اَيْدِيْكُمْ وَ اَنَّ اللّٰهَ لَيْسَ
بِظَلَّامٍ لِّلْعَبِيْدِ ﴿٥١﴾ كَدَاْبِ اٰلِ فِرْعَوْنَ ۙ وَ
الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ ؕ كَفَرُوْا بِاٰيٰتِ اللّٰهِ
فَاَخَذَهُمُ اللّٰهُ بِذُنُوْبِهِمْ ؕ اِنَّ اللّٰهَ قَوِىٌّ
شَدِيْدُ الْعِقَابِ ﴿٥٢﴾ ذٰلِكَ بِاَنَّ اللّٰهَ لَمْ يَكُ
مُغَيِّرًا نِّعْمَةً اَنْعَمَهَا عَلٰى قَوْمٍ حَتّٰى يُغَيِّرُوْا
مَا بِاَنْفُسِهِمْ ۙ وَ اَنَّ اللّٰهَ سَمِيْعٌ عَلِيْمٌ ۙ ﴿٥٣﴾
كَدَاْبِ اٰلِ فِرْعَوْنَ ۙ وَالَّذِيْنَ مِنْ قَبْلِهِمْ ؕ
كَذَّبُوْا بِاٰيٰتِ رَبِّهِمْ فَاَهْلَكْنٰهُمْ بِذُنُوْبِهِمْ
وَاَغْرَقْنَآ اٰلَ فِرْعَوْنَ ۚ وَ كُلٌّ كَانُوْا
ظٰلِمِيْنَ ﴿٥٤﴾

**48 - 54** ఆ సమయాన్ని గురించి కొంచెం ఆలోచించండి: అప్పుడు షైతాను వారి చేష్టలను వారి దృష్టికి ఆకర్షకములుగా చేసిచూపాడు. ఇంకా వారితో ఇలా అన్నాడు: "ఈనాడు మిమ్మల్ని ఎవడూ జయించలేడు, (ఎందుకంటే) నేను మీతో ఉన్నాను." కాని రెండు పక్షాలు ఒక దానికొకటి ఎదురుపడినప్పుడు, అతడు మడమతిప్పి ఇలా అన్నాడు: "మీకూ నాకూ ఏ సంబంధమూ లేదు. మీరు చూడనివి ఎన్నో నేను చూస్తున్నాను. నాకు అల్లాహ్ అంటే భయం కలుగుతోంది. అల్లాహ్ కఠినంగా శిక్షించేవాడు." అప్పుడు కపటులూ, హృదయాలకు రోగం తగిలినవారూ, అందరూ ఇలా అన్నారు: "వారిని వారి ధర్మం పిచ్చివారిని చేసింది."[17] వాస్తవానికి ఎవరైనా అల్లాహ్‌ను నమ్ముకుంటే, నిశ్చయంగా అల్లాహ్ మహాశక్తిమంతుడూ, మహా వివేకవంతుడూను. దైవదూతలు, హతులైన అవిశ్వాసుల ప్రాణాలను తీస్తున్నప్పటి స్థితిని నీవు గనక చూడగలిగితే ఎంత బాగుండేది! వారు వారి ముఖాలపైని, పిరుదులపైని కొట్టేవారు. ఇంకా ఇలా అనేవారు: "ఇదో, కాల్చే శిక్షను అనుభవించండి. ఇది స్వయంగా మీ చేతులే ముందుగా సేకరించి పెట్టిన దానికి ప్రతిఫలం. అంతేకాని అల్లాహ్ తన దాసులకు అన్యాయం చేసేవాడు మాత్రం కాదు." ఇది ఫిరౌను జాతివారికీ, వారి పూర్వపు ప్రజలకూ సంభవిస్తూ వచ్చిన విధంగానే వీరికీ సంభవించింది. అంటే, వారు అల్లాహ్ ఆయతులను విశ్వసించటానికి తిరస్కరించారు. అప్పుడు అల్లాహ్ వారిని వారి పాపాల కారణంగా పట్టుకున్నాడు. అల్లాహ్ శక్తిగలవాడు, కఠిన శిక్షను విధించేవాడు. ఇది అల్లాహ్ యొక్క ఈ సంప్రదాయం ప్రకారం జరిగింది: ఒక జాతి తన నడవడికను మార్చుకోనంత వరకు, అల్లాహ్ తాను దానికి ప్రసాదించిన ఏ అనుగ్రహాన్నీ ఉపసంహరించడు. అల్లాహ్ అన్నీ వింటాడు. ఆయనకు అంతా తెలుసు. ఫిరౌను జాతి వారికీ, వారికి పూర్వపు జాతుల వారికీ ఏమి సంభవించిందో, అది ఈ నియమం ప్రకారమే సంభవించింది. వారు తమ ప్రభువు ఆయతులను తిరస్కరించారు. అప్పుడు మేము వారిని వారి పాపాలకు ఫలితంగా నాశనం చేశాము. ఇంకా ఫిరౌను ప్రజలను (సముద్రంలో) ముంచివేశాము. వారందరూ దుర్మార్గులే.

إِنَّ شَرَّ الدَّوَآبِّ عِنْدَ اللّٰهِ الَّذِيْنَ كَفَرُوْا
فَهُمْ لَا يُؤْمِنُوْنَ ﴿٥٥﴾ اَلَّذِيْنَ عٰهَدْتَّ مِنْهُمْ
ثُمَّ يَنْقُضُوْنَ عَهْدَهُمْ فِيْ كُلِّ مَرَّةٍ وَّ هُمْ لَا
يَتَّقُوْنَ ﴿٥٦﴾ فَاِمَّا تَثْقَفَنَّهُمْ فِي الْحَرْبِ
فَشَرِّدْ بِهِمْ مَّنْ خَلْفَهُمْ لَعَلَّهُمْ يَذَّكَّرُوْنَ ﴿٥٧﴾ وَ
اِمَّا تَخَافَنَّ مِنْ قَوْمٍ خِيَانَةً فَانْبِذْ اِلَيْهِمْ
عَلٰى سَوَآءٍ ؕ اِنَّ اللّٰهَ لَا يُحِبُّ الْخَآئِنِيْنَ ﴿٥٨﴾
وَ لَا يَحْسَبَنَّ الَّذِيْنَ كَفَرُوْا سَبَقُوْا ؕ اِنَّهُمْ
لَا يُعْجِزُوْنَ ﴿٥٩﴾

**55 – 59** నిశ్చయంగా భూమిపై సంచరించే ప్రాణులన్నింటిలో కెల్లా అల్లాహ్ దృష్టిలో మిక్కిలి నీచమైనవారు సత్యాన్ని అంగీకరించటానికి తిరస్కరించి, ఇక ఎట్టి పరిస్థితులలోనూ దానిని విశ్వసించటానికి సిద్ధంగా లేనివారు; (ముఖ్యంగా) వారిలో నీవు ఒప్పందం కుదుర్చుకున్నవారు; అవకాశం దొరికినప్పుడల్లా వారు ఆ ఒప్పందాన్ని ఉల్లంఘిస్తారు. అల్లాహ్‌కు ఏమాత్రం భయపడరు.[18] కావున ఒకవేళ మీకు వారు రణరంగంలో ఎదురైతే, వారికి ఎలా బుద్ధిచెప్పాలంటే, వారి తరువాత అదే వైఖరిని అవలంబించనున్న ప్రజలు భయభ్రాంతులై పారిపోవాలి.[19] ఒప్పందాన్ని ఉల్లంఘించేవారి ఈ పర్యవసానాన్ని చూసి వారు గుణపాఠం నేర్చుకుంటారని ఆశించవచ్చు. ఒకవేళ మీకు ఎప్పుడైనా ఏ జాతివల్లనైనా నమ్మకద్రోహం కలుగుతుందనే భయం ఉంటే, బాహాటంగా వారి ఒప్పందాన్ని వారి ముందు విసిరి వెయ్యండి.[20] నిశ్చయంగా అల్లాహ్ నమ్మకద్రోహులను ప్రేమించడు. సత్య తిరస్కారులు తాము గెలిచామనే అపోహకు గురికారాదు. నిశ్చయంగా వారు మమ్మల్ని ఓడించలేరు.

17. అంటే, అత్యల్ప సంఖ్యలో ఉండి, వనరులు కూడా అంతగాలేని ముస్లిముల సంఘం, ఖురైషుల వంటి బలమైన శక్తితో ఢీకొనటానికి పోవటం చూసి మదీనాలోని కపటులూ, ప్రపంచ వ్యామోహం, దైవం పట్ల అశ్రద్ధ అనే వ్యాధికి గురిఅయినవారూ, పరస్పరం ఇలా అనుకున్నారు : "వీరు తమ ధర్మోద్రేకంలో పిచ్చివాళ్ళయ్యారు. ఈ పోరాటంలో వారు నాశనం కావటం తప్పదు. కాని ఈ ప్రవక్త వారిపై మంత్రాలు చదివి ఊదాడు కనుక వారి బుద్ధి స్తంభించిపోయింది, కళ్ళతో చూస్తూ వారు మృత్యు ముఖంలోకి పోతున్నారు."

18. ఇక్కడ ప్రత్యేకంగా యూదులు సూచించబడ్డారు; వారితో మహాప్రవక్త (సఅసమ్) ఒడంబడికను కుదుర్చుకున్నారు. అయినప్పటికీ వారు మహాప్రవక్త (సఅసమ్)కూ ముస్లిములకూ వ్యతిరేకంగా చురుకుగా పనిచేస్తూ ఉండేవారు. బద్ర్ సంగ్రామం ముగిసినవెంటనే వారు ప్రతీకారం చెయ్యండి అని ఖురైషులను రెచ్చగొట్టటం ప్రారంభించారు.

19. దీని భావం ఏమిటంటే, ఒకవేళ ఏదైనా జాతితో మనకు ఒడంబడిక జరిగివుంటే తరువాత ఆ జాతివారు తమ ఒడంబడిక బాధ్యతలను విస్మరించి మనకు వ్యతిరేకంగా ఏదైనా యుద్ధంలో పాల్గొంటే, మనం కూడా ఒడంబడిక యొక్క నైతిక బాధ్యతల నుండి విడుదల పొందుతాము. అప్పుడు ఆ జాతితో యుద్ధం చేసే హక్కు మనకు ఉంటుంది. ఇంకా ఒకవేళ ఏదైనా జాతితో మనం యుద్ధం చేస్తూ ఉంటే, మనతో ఒడంబడిక చేసుకున్న జాతి వ్యక్తులను మన శత్రువులతో పాటు యుద్ధంలో పాల్గొంటూ ఉండగా మనం చూస్తే, మనం వారిని చంపటానికి, వారితో శత్రువుతో వ్యవహరించే విధంగా వ్యవహరించటానికి ఏమాత్రం సంకోచించకూడదు.

وَ اَعِدُّوْا لَهُمْ مَّا اسْتَطَعْتُمْ مِّنْ قُوَّةٍ وَّ مِنْ
رِّبَاطِ الْخَيْلِ تُرْهِبُوْنَ بِهٖ عَدُوَّ اللّٰهِ وَعَدُوَّكُمْ
وَ اٰخَرِيْنَ مِنْ دُوْنِهِمْ ۚ لَا تَعْلَمُوْنَهُمْ ۚ اَللّٰهُ
يَعْلَمُهُمْ ۗ وَ مَا تُنْفِقُوْا مِنْ شَيْءٍ فِيْ سَبِيْلِ
اللّٰهِ يُوَفَّ اِلَيْكُمْ وَ اَنْتُمْ لَا تُظْلَمُوْنَ ﴿٦٠﴾ وَ
اِنْ جَنَحُوْا لِلسَّلْمِ فَاجْنَحْ لَهَا وَ تَوَكَّلْ عَلَى
اللّٰهِ ۗ اِنَّهٗ هُوَ السَّمِيْعُ الْعَلِيْمُ ﴿٦١﴾ وَاِنْ
يُّرِيْدُوْٓا اَنْ يَّخْدَعُوْكَ فَاِنَّ حَسْبَكَ اللّٰهُ ۗ هُوَ
الَّذِيْٓ اَيَّدَكَ بِنَصْرِهٖ وَ بِالْمُؤْمِنِيْنَ ﴿٦٢﴾ ۙ
وَاَلَّفَ بَيْنَ قُلُوْبِهِمْ ۗ لَوْ اَنْفَقْتَ مَا فِي
الْاَرْضِ جَمِيْعًا مَّآ اَلَّفْتَ بَيْنَ قُلُوْبِهِمْ وَ
لٰكِنَّ اللّٰهَ اَلَّفَ بَيْنَهُمْ ۗ اِنَّهٗ عَزِيْزٌ حَكِيْمٌ ﴿٦٣﴾
يٰٓاَيُّهَا النَّبِيُّ حَسْبُكَ اللّٰهُ وَ مَنِ اتَّبَعَكَ مِنَ
الْمُؤْمِنِيْنَ ﴿٦٤﴾ ع

**60** మీరు మీ శక్తిమేరకు అత్యధికబలాన్నీ, కట్టివేసి సిద్ధంగా ఉన్న గుర్రాలను వారిని ఎదుర్కోవటానికి సమాయత్తపరచుకోండి,[21] తద్వారా అల్లాహ్ శత్రువులనూ మీ శత్రువులనూ, ఇంకా మీరు ఎరుగని, కాని అల్లాహ్ ఎరిగిన ఇతర శత్రువులనూ భయకంపితులుగా చెయ్యండి. అల్లాహ్ మార్గంలో మీరు ఏది ఖర్చు చేసినా, దాని పూర్తి ప్రతిఫలం మీ వైపునకు మళ్ళించబడుతుంది. మీకు ఎంతమాత్రం అన్యాయం జరగదు.

**61 - 64** ప్రవక్తా! శత్రువు గనక సంధిశాంతుల వైపునకు మొగ్గు చూపితే, నీవు కూడా దానికి సిద్ధపడు. అల్లాహ్‌పై భారం వెయ్యి; ఆయనే అంతా వినేవాడూ అన్నీ తెలిసినవాడూను. ఒకవేళ నిన్ను మోసం చేసే ఉద్దేశ్యమే వారికి ఉంటే, నీకు అల్లాహ్ చాలు. తన సహాయంతోనూ, ముస్లిముల ద్వారానూ నిన్ను ఆదుకున్నవాడూ, ఇంకా ముస్లిముల మనస్సులను ఒక దానితో ఒకటి కలిపినవాడూ ఆయనేకదా! నీవు సమస్త భూసంపదను ఖర్చుపెట్టినా, వారి మనస్సులను కలపగలిగి ఉండేవాడవు కాదు. కానీ అల్లాహ్ వారి మనస్సులను కలిపాడు. నిశ్చయంగా ఆయన మహా శక్తి మంతుడు, మహా వివేకవంతుడు. ప్రవక్తా! నీకూ, నిన్ను అనుసరించే విశ్వాసులకూ అల్లాహ్‌యే చాలు.

20. అంటే, మా మధ్యా, మీ మధ్యా ఇక ఏ విధమైన ఒడంబడిక లేదు. ఎందుకంటే మీరు ఒప్పందానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నారు అని స్పష్టంగా ఆ జాతికి హెచ్చరిక చెయ్యండి.

21. అర్థం ఏమిటంటే, అవసరమైనప్పుడు వెంటనే యుద్ధ చర్యలు తీసుకోవటానికి, మీ వద్ద యుద్ధసామగ్రి ఒక ప్రత్యేక సైనికబలమూ ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండాలి. ప్రమాదం ముంచుకొనివచ్చిన తరువాత, కంగారులో త్వరత్వరగా స్వచ్ఛంద సేవకులను, ఆయుధాలను, ఆహార సామగ్రిని ప్రోగుచెయ్యటానికి ప్రయత్నం చేస్తే, ఈ సన్నాహాలు పూర్తిఅయ్యే లోపల శత్రువు తన పని కాస్తా పూర్తి చేసుకుంటాడు.

يٰۤاَيُّهَا النَّبِيُّ حَرِّضِ الْمُؤْمِنِيْنَ عَلَى الْقِتَالِ ؕ
اِنْ يَّكُنْ مِّنْكُمْ عِشْرُوْنَ صٰبِرُوْنَ يَغْلِبُوْا
مِائَتَيْنِ ۚ وَ اِنْ يَّكُنْ مِّنْكُمْ مِّائَةٌ يَّغْلِبُوْۤا
اَلْفًا مِّنَ الَّذِيْنَ كَفَرُوْا بِاَنَّهُمْ قَوْمٌ لَّا
يَفْقَهُوْنَ ﴿٦٥﴾ اَلْـٰٔنَ خَفَّفَ اللّٰهُ عَنْكُمْ وَ عَلِمَ اَنَّ
فِيْكُمْ ضَعْفًا ؕ فَاِنْ يَّكُنْ مِّنْكُمْ مِّائَةٌ صَابِرَةٌ
يَّغْلِبُوْا مِائَتَيْنِ ۚ وَ اِنْ يَّكُنْ مِّنْكُمْ اَلْفٌ
يَّغْلِبُوْۤا اَلْفَيْنِ بِاِذْنِ اللّٰهِ ؕ وَ اللّٰهُ مَعَ
الصّٰبِرِيْنَ ﴿٦٦﴾ مَا كَانَ لِنَبِيٍّ اَنْ يَّكُوْنَ لَهٗۤ
اَسْرٰى حَتّٰى يُثْخِنَ فِي الْاَرْضِ ؕ تُرِيْدُوْنَ
عَرَضَ الدُّنْيَا ۖۗ وَ اللّٰهُ يُرِيْدُ الْاٰخِرَةَ ؕ وَ اللّٰهُ
عَزِيْزٌ حَكِيْمٌ ﴿٦٧﴾ لَوْ لَا كِتٰبٌ مِّنَ اللّٰهِ سَبَقَ
لَمَسَّكُمْ فِيْمَاۤ اَخَذْتُمْ عَذَابٌ عَظِيْمٌ ﴿٦٨﴾ فَكُلُوْا
مِمَّا غَنِمْتُمْ حَلٰلًا طَيِّبًا ۖؗ وَّ اتَّقُوا اللّٰهَ ؕ اِنَّ
اللّٰهَ غَفُوْرٌ رَّحِيْمٌ ﴿٦٩﴾

**65 - 66** ప్రవక్తా! ముస్లిములను యుద్ధానికి పురికొలుపు. మీలోగనక ఇరవైమంది స్థయిర్యం కలవారు ఉంటే, వారు రెండువందల మందిని జయిస్తారు. ఇంకా అటువంటి వారు వందమంది గనక ఉంటే, వేయిమంది సత్యతిరస్కారులను జయిస్తారు. ఎందుకంటే, వారు బుద్ధిహీనులైన ప్రజలు.[22] సరే, ఇప్పుడు అల్లాహ్ మీ బరువును తేలిక చేశాడు, ఆయనకు తెలుసు, ఇంకా మీలో బలహీనత ఉందని. కనుక మీలోగనక వందమంది సహన స్థయిర్యాలు కలవారు ఉంటే, వారు రెండువందల మందినీ, ఇంకా అటు వంటి వారు గనక వేయి మంది ఉంటే, రెండువేల మందినీ, అల్లాహ్ ఆదేశానుసారం జయించగలరు.[23] సహనం కలవారితో అల్లాహ్ ఉంటాడు.

**67 - 69** ధరణిలో శత్రువులను పూర్తిగా అణచనంతవరకు, తనవద్ద యుద్ధ ఖైదీలను ఉంచుకోవటం అనేది ఏ ప్రవక్తకూ తగదు. మీరు ప్రాపంచిక ప్రయోజనాలను కాంక్షిస్తున్నారు. కాని అల్లాహ్ (మీకొరకు) పరలోకాన్ని కాంక్షిస్తున్నాడు. అల్లాహ్ శక్తిమంతుడూ, వివేకవంతుడూను. ముందేగనక అల్లాహ్ ఫర్మానా ఒకటి వ్రాయబడి ఉండకపోతే, మీరు తీసుకున్నదానికి పర్యవసానంగా మీకు పెద్ద శిక్షపడి ఉండేది. కనుక మీరు పొందిన సొమ్మును తినండి. అది ధర్మసమ్మత మైనదీ, పవిత్రమైనదీను. అల్లాహ్‌కు భయపడుతూ ఉండండి.[24] నిశ్చయంగా అల్లాహ్ మన్నించేవాడూ కరుణించేవాడూను.

22. ఈనాటి ప్రయోగంలో ఆత్మ విశ్వాసం (Morale) అని అనబడేదానినే అల్లాహ్ వివేచనతోనూ, అవగాహనతోనూ, బుద్ధితోనూ పోల్చాడు. తన లక్ష్యంపట్ల సరియైన స్పృహను కలిగివుండేవాడు సావధానంగా ఆలోచించి పోరాడు తున్నాడు. ఎందుకంటే అతడు ఏ విషయం కోసం తన ప్రాణాలొడ్డి పోరాడటానికొచ్చాడో, అది అతని వ్యక్తిగత జీవితం కంటే కూడా ఎంతో విలువైనది. అది నశించిన తరువాత జీవితానికి విలువ లేకుండా పోతుంది. అతడు లక్ష్యంపట్ల స్పృహ లేకుండా పోరాడే మనిషికంటే ఎన్నో రెట్లు శక్తి కలిగి ఉంటాడు. ఉభయుల మధ్య శారీరక శక్తిలో ఏ భేదమూ లేకపోయినప్పటికీ.

23. మొదట ఒకటి పది నిష్పత్తి ఉండేది, ఇప్పుడు మీలో బలహీనతలు పొడసూపాయి కాబట్టి, అది ఒకటి రెండు నిష్పత్తి అయిపోయింది అని భావం కాదు. దీనియొక్క సరియైన భావం ఏమిటంటే, సైద్ధాంతికంగానూ ప్రామాణికంగానూ చూస్తే విశ్వాసులు, అవిశ్వాసుల మధ్య ఒకటి పది నిష్పత్తే ఉంది. కాని ఇంకా మీ నైతిక శిక్షణ పూర్తికాలేదు కాబట్టి, ఇంకా మీ చైతన్యం, అవగాహనల దశ పరిపక్వతకు చేరలేదు కాబట్టి, ప్రస్తుతం మీ స్థాయిని తగ్గిస్తూ – మీ నుండి కోరబడేదేమిటంటే, మీకు రెట్టింపుగా ఉన్న శక్తితో తలపడటానికి మీకు ఏ విధమైన సంకోచం ఉండటానికి వీలులేదు. ఈ ఆదేశం హిజ్రీ రెండో సంవత్సరానికి సంబంధించింది అనే విషయం జ్ఞాపకముండాలి. అప్పుడు ముస్లిములలో చాలామంది కొత్త కొత్తగా ఇస్లామ్‌లోకి ప్రవేశించినవారు ఉన్నారు, వారి శిక్షణ ప్రారంభదశలోనే ఉంది.

يَاَيُّهَا النَّبِيُّ قُلْ لِّمَنْ فِيْۤ اَيْدِيْكُمْ مِّنَ
الْاَسْرٰۤى ۙ اِنْ يَّعْلَمِ اللّٰهُ فِيْ قُلُوْبِكُمْ خَيْرًا
يُّؤْتِكُمْ خَيْرًا مِّمَّاۤ اُخِذَ مِنْكُمْ وَيَغْفِرْ لَكُمْ ؕ وَ
اللّٰهُ غَفُوْرٌ رَّحِيْمٌ ۝٧٠ وَ اِنْ يُّرِيْدُوْا
خِيَانَتَكَ فَقَدْ خَانُوا اللّٰهَ مِنْ قَبْلُ فَاَمْكَنَ
مِنْهُمْ ؕ وَ اللّٰهُ عَلِيْمٌ حَكِيْمٌ ۝٧١ اِنَّ الَّذِيْنَ
اٰمَنُوْا وَهَاجَرُوْا وَ جٰهَدُوْا بِاَمْوَالِهِمْ وَاَنْفُسِهِمْ
فِيْ سَبِيْلِ اللّٰهِ وَ الَّذِيْنَ اٰوَوْا وَّنَصَرُوْۤا اُولٰٓئِكَ
بَعْضُهُمْ اَوْلِيَآءُ بَعْضٍ ؕ وَ الَّذِيْنَ اٰمَنُوْا وَلَمْ
يُهَاجِرُوْا مَا لَكُمْ مِّنْ وَّلَايَتِهِمْ مِّنْ شَيْءٍ حَتّٰى
يُهَاجِرُوْا ۚ وَاِنِ اسْتَنْصَرُوْكُمْ فِي الدِّيْنِ
فَعَلَيْكُمُ النَّصْرُ اِلَّا عَلٰى قَوْمٍ بَيْنَكُمْ وَ بَيْنَهُمْ
مِّيْثَاقٌ ؕ وَ اللّٰهُ بِمَا تَعْمَلُوْنَ بَصِيْرٌ ۝٧٢ وَ
الَّذِيْنَ كَفَرُوْا بَعْضُهُمْ اَوْلِيَآءُ بَعْضٍ ؕ اِلَّا
تَفْعَلُوْهُ تَكُنْ فِتْنَةٌ فِي الْاَرْضِ وَ فَسَادٌ كَبِيْرٌ ۝٧٣

**70 - 71** ప్రవక్తా! నీ అధీనంలో బందీలుగా ఉన్న వారితో ఇలా అను: "మీ హృదయాలలో ఏపాటి మంచితనమైనా ఉన్నదని అల్లాహ్‌కు తెలిస్తే, ఆయన మీ వద్ద నుండి తీసుకొన్న దానికంటె ఎంతో ఎక్కువగా మీకు ఇస్తాడు. మీ తప్పులను మన్నిస్తాడు. అల్లాహ్ మన్నించేవాడూ కరుణించే వాడూను." కాని వారు నీకు నమ్మకద్రోహం చెయ్యాలనే ఉద్దేశం కలిగి వున్నట్లయితే - ఇంతకు పూర్వం వారు అల్లాహ్‌కు నమ్మక ద్రోహం చేసే ఉన్నారు, అందుకుగాను శిక్షగా అల్లాహ్ వారిని నీ అదుపులోకి తెచ్చాడు - అల్లాహ్‌కు అంతా తెలుసు, ఆయన వివేచనాపరుడు.

**72 - 73** విశ్వాసాన్ని స్వీకరించి వలసపోయినవారూ, అల్లాహ్ మార్గంలో తమ ప్రాణాలనూ తమ సంపదలనూ ఒడ్డి పోరాడిన వారూ, వలసవచ్చిన వారికి ఆశ్రయమిచ్చి సహాయం చేసిన వారూ-వారే అసలు ఒకరికొకరు స్నేహితులు, సంరక్షకులూను. ఇక విశ్వసించినప్పటికీ (దారుల్ ఇస్లాంలోకి) వలసపోనివారు వలస రానంతవరకు వారి సంరక్షణతో మీకు సంబంధం లేదు.[25] ఒకవేళ వారు ధర్మ వ్యవహారాలలో మీ సహాయం కోరితే, వారికి సహాయం చెయ్యటం మీ విధ్యుక్త ధర్మం. కాని మీరు ఒప్పందం కుదుర్చుకున్న జాతికి వ్యతిరేకంగా మాత్రం కాదు.[26] మీరు చేసేదంతా అల్లాహ్ చూస్తున్నాడు. సత్య తిరస్కారులు పరస్పరం సహాయం చేసుకుంటారు. ఒకవేళ మీరు పరస్పరం సహాయం చేసుకొనకపోతే భూమిపై హింసా దౌర్జన్యాలూ, అల్లకల్లోలమూ చెలరేగుతాయి.[27]

24. బద్ర్ సంగ్రామానికి పూర్వం 'ముహమ్మద్' సూరాలో ఇవ్వబడిన యుద్ధానికి సంబంధించిన ప్రారంభ ఉపదేశాలలో యుద్ధఖైదీల నుండి ఫిదియా (పరిహారం) వసూలుచేసే అనుమతి ఇవ్వబడింది. కాని, దానితో పాటు, మొదట శత్రుశక్తిని పూర్తిగా అణచాలి, తరువాతనే ఖైదీలను పట్టుకునే ఆలోచన చెయ్యాలి అనే షరతు కూడా విధింపబడింది. ఈ ఫర్మానా ప్రకారం ముస్లిములు బద్ర్ సంగ్రామంలో ఖైదీలను నిర్బంధించడం అనేదీ, తరువాత వారి నుండి ఫిదియా వసూలు చెయ్యటం అనేదీ అనుమతి ప్రకారమే జరిగింది. కాని జరిగిన పొరపాటల్లా ఏమిటంటే, "శత్రుశక్తిని పూర్తిగా అణచటం" అనే ముఖ్యమైన షరతును పూర్తిచెయ్యకమునుపే, ముస్లిములు శత్రువులను ఖైదుచెయ్యటంలో, విజయధనాన్ని ప్రోగు చేసుకోవటంలో మునిగిపోయారు. ఈ విషయమే అల్లాహ్‌కు నచ్చలేదు. ఎందుకంటే, అలా చెయ్యకుండా ముస్లిములు అవిశ్వాసులను వెంటాడి ఉన్నట్లయితే, అప్పుడు ఖురైషుల శక్తి పూర్తిగా నశించి ఉండేది.

25. 'విలాయత్' అనే పదం అరబ్బీ భాషలో సమర్థన, సహాయం, సహకారం, ఆశ్రయం ఇచ్చుట, స్నేహం, సన్నిహితత్వం, సంరక్షణ, ఇంకా ఇటువంటి అర్థాలలో వాడబడుతుంది. ఈ ఆయత్ సందర్భాన్నిబట్టి ఈ పదం యొక్క

وَ الَّذِیۡنَ اٰمَنُوۡا وَ ہَاجَرُوۡا وَ جٰہَدُوۡا فِیۡ
سَبِیۡلِ اللّٰہِ وَ الَّذِیۡنَ اٰوَوۡا وَّ نَصَرُوۡۤا اُولٰٓئِکَ ہُمُ
الۡمُؤۡمِنُوۡنَ حَقًّا ؕ لَہُمۡ مَّغۡفِرَۃٌ وَّ رِزۡقٌ
کَرِیۡمٌ ﴿۷۴﴾ وَ الَّذِیۡنَ اٰمَنُوۡا مِنۡۢ بَعۡدُ وَ ہَاجَرُوۡا
وَ جٰہَدُوۡا مَعَکُمۡ فَاُولٰٓئِکَ مِنۡکُمۡ ؕ وَ اُولُوا
الۡاَرۡحَامِ بَعۡضُہُمۡ اَوۡلٰی بِبَعۡضٍ فِیۡ کِتٰبِ
اللّٰہِ ؕ اِنَّ اللّٰہَ بِکُلِّ شَیۡءٍ عَلِیۡمٌ ﴿۷۵﴾ ع۱۰

**74 - 75** విశ్వసించి అల్లాహ్ మార్గంలో ఇల్లూవాకిలీ వదలి పెట్టి కృషిచేసిన వారూ, వారికి ఆశ్రయమిచ్చి సహాయం చేసినవారూ, వారే నిజమైన విశ్వాసులు. వారి పాపాలకు మన్నింపూ, వారికి చక్కని ఉపాధీ లభిస్తాయి. ఆ తరువాత విశ్వసించి, వలస వచ్చినవారు మీతో కలిసి కృషిచేసిన వారు కూడా మీతోనే చేరిపోతారు. కాని అల్లాహ్ గ్రంథం ప్రకారం రక్తసంబంధం కలవారు పరస్పరం ఎక్కువ హక్కుదారులు.[28] నిశ్చయంగా అల్లాహ్‌కు ప్రతి విషయమూ తెలుసు.

స్పష్టమైన భావం ఏమిటంటే, ఒక దేశానికి దాని పౌరులతో ఉండే సంబంధం, పౌరులకు తమ దేశంతో ఉండే సంబంధం, ఇంకా పౌరుల మధ్య పరస్పరం ఉండే సంబంధం. కనుక ఈ ఆయత్ రాజ్యాంగపరమైన సంరక్షణనూ రాజకీయపరమైన సంరక్షణనూ ఇస్లామ్ రాజ్యం యొక్క సరిహద్దులకే పరిమితం చేస్తుంది, ఇంకా ఈ హద్దులకు బయటవుండే ముస్లిములను ఈ ప్రత్యేక సంబంధానికి దూరంగా ఉంచుతుంది. ఈ సంరక్షణ లేకపోవటం వల్ల ఉత్పన్నమయ్యే చట్టపరమైన పరిణామాలు చాలా విస్తృతంగా ఉంటాయి. వాటిని గురించి ఇక్కడ వివరంగా చెప్పే అవకాశం లేదు.

26. పై వాక్యంలో దారుల్ ఇస్లామ్ (ఇస్లామ్ రాజ్యం)కు బయట ఉండే ముస్లిములను "రాజకీయ రక్షణ" అనే సంబంధానికి దూరంగా ఉంచటం జరిగింది. ఇప్పుడు ఈ ఆయత్తు బయటి ముస్లిములు ఈ సంబంధానికి దూరంగా ఉన్నప్పటికీ, వారు ధార్మిక సౌభ్రాత్ర సంబంధానికి మాత్రం దూరంగా లేరు అనే విషయాన్ని వివరిస్తుంది. ఒకవేళ ఎక్కడైనా వారిపై అన్యాయం జరుగుతూ ఉంటే, వారు ఇస్లామ్ సౌభ్రాత్ర సంబంధం ఆధారంగా దారుల్ ఇస్లామ్ ప్రభుత్వాన్ని దాని పౌరులను సహాయం కోసం అర్థిస్తే తమ పీడిత సోదరులకు సహాయం చెయ్యటం వారి విధి. అయితే దీని తరువాత ఇంకా వివరిస్తూ చెప్పబడినదేమిటంటే, ఆ ధార్మిక సోదరులకు సహాయం చేసే విధిని గుడ్డిగా నిర్వహించటం జరగదు, కాని అంతర్జాతీయ బాధ్యతలను, నైతిక హద్దులను దృష్టిలో ఉంచుకుని మాత్రమే నిర్వహించబడుతుంది. ఒకవేళ ముస్లిములకు అన్యాయం చేసే జాతితో దారుల్ ఇస్లామ్‌కు ఒడంబడిక సంబంధాలు ఉంటే, ఆ పరిస్థితిలో ఒడంబడిక యొక్క నైతిక బాధ్యతలకు వ్యతిరేకంగా ఉన్నటువంటి ఏ సహాయాన్నీ పీడిత ముస్లిములకు చెయ్యటం జరగదు.

27. అంటే, ఒకవేళ దారుల్ ఇస్లామ్‌లోని ముస్లిములు ఒకరికొకరు సంరక్షకులు కాకపోతే; దారుల్ ఇస్లామ్‌కు వలసరాకుండా దారుల్ కుఫ్ర్ (అవిశ్వాసుల రాజ్యం)లో నివసించే ముస్లిములను, దారుల్ ఇస్లామ్‌లో ఉండే ముస్లిములు తమ రాజకీయ సంరక్షణ పరిధికి బయటవున్నట్లు భావించకపోతే; ఒకవేళ బయట ఉన్న పీడిత ముస్లిములు సహాయం కోరినప్పుడు, వారికి సహాయం అందజెయ్యకపోతే, ఒకవేళ ఇస్లామ్ ప్రభుత్వం ఒడంబడిక కుదుర్చుకున్న జాతికి వ్యతిరేకంగా ముస్లిములకు సహాయం చెయ్యటం జరగదు అనే నియమాన్ని కూడా పాటించకపోతే, ఒకవేళ ముస్లిములు అవిశ్వాసులతో మైత్రీ (మవాలాత్) సంబంధాలను తెంచుకోకపోతే – అప్పుడు భూమిపై ఉపద్రవమూ పెద్ద సంక్షోభమూ చెలరేగుతాయి.

28. అంటే, వారసత్వపు ఆస్తి ఇస్లామ్ సౌభ్రాత్రం ఆధారంగా కాకుండా బంధుత్వం ఆధారంగా పంచబడుతుంది. ఈ ఆజ్ఞకు మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) చేసిన వివరణ ఇలా ఉంది: కేవలం ముస్లిము బంధువులే ఒకరికొకరు వారసులౌతారు. ముస్లిము ఒక అవిశ్వాసికిగాని, అవిశ్వాసి ఒక ముస్లిముకుగాని వారసుడు కాడు.

ఆయతులు 129 | **9. అత్ తౌబా** | అవతరణ మదీనాలో

٩ سُوْرَةُ التَّوْبَةِ مَدَنِيَّةٌ ١١٣

اٰياتها ١٢٩ | ركوعاتها ١٦

بَرَآءَةٌ مِّنَ اللّٰهِ وَ رَسُوْلِهٖٓ اِلَى الَّذِيْنَ
عٰهَدْتُّمْ مِّنَ الْمُشْرِكِيْنَ ۝١ فَسِيْحُوْا فِي
الْاَرْضِ اَرْبَعَةَ اَشْهُرٍ وَّاعْلَمُوْٓا اَنَّكُمْ غَيْرُ
مُعْجِزِي اللّٰهِ ۙ وَ اَنَّ اللّٰهَ مُخْزِي الْكٰفِرِيْنَ ۝٢

**1 – 2** అల్లాహ్ తరఫునుండి, ఆయన ప్రవక్త తరఫు నుండి మీరు ఒడంబడికలు చేసుకున్న ముష్రిక్కులకు[1] విముక్తి ప్రకటించబడుతోంది.[2] కనుక మీరు దేశంలో స్వేచ్ఛగా ఇంకా నాలుగు నెలలు తిరగండి. మీరు అల్లాహ్‌ను అశక్తుడుగా చెయ్యలేరని తెలుసుకోండి. అల్లాహ్ సత్యతిరస్కారులను పరాభవంపాలు చేస్తాడు.

1. అన్‌ఫాల్ సూరా 58వ ఆయత్‌లో, మీకు ఏ జాతి నుండి అయినా ఒప్పందం విషయంలో విద్రోహం జరుగుతుందనే భయం కలిగితే, బహిరంగంగా ఆ జాతి ఒప్పందాన్ని దాని వైపునకు విసిరివేయండి. మీకూ మాకూ మధ్య ఎలాంటి ఒప్పందమూ మిగిలి లేదు అని దానిని హెచ్చరించండి, అనే విషయం వచ్చింది. ఈ నైతిక నిబంధనావళి ప్రకారమే ఒప్పందాలను రద్దుచేస్తూ – ఒప్పందాలూ, వాగ్దానాలూ ఉన్నప్పటికీ, ఎల్లప్పుడూ ఇస్లామ్‌కు వ్యతిరేకంగా కుట్రలు పన్నుతూ ఉండేటటువంటి అవకాశం లభించగానే ఒప్పందం పాటింపును ప్రక్కకునెట్టి విరోధానికి దిగేటటువంటి అన్ని తెగలకూ వ్యతిరేకంగా ఈ సాధారణ ప్రకటన చేయబడింది. ఈ ప్రకటన తరువాత అరేబియా ముష్రిక్కులకు ఇది తప్ప మరొక ప్రత్యామ్నాయం మిగలలేదు – యుద్ధానికి సిద్ధపడటం, ఇస్లామ్ శక్తిని ఎదుర్కొని నామరూపాలు లేకుండా పోవటం లేదా దేశాన్ని వదలిపెట్టి పారిపోవటం లేదా ఇస్లామును స్వీకరించి దేశంలోని అధికభాగాన్ని ఇదివరకే ఇస్లామీ ప్రభుత్వానికి లోబడినట్లు చేసిన వ్యవస్థకు నిబంధనావళికి (తమనూ తమ ప్రాంతాన్నీ తామే) స్వాధీనపరచటం.
2. ఈ ఆయతులు ఐదో రుకూ అంతం వరకు హిజ్రీ 9వ సంవత్సరంలో, మహాప్రవక్త (సఅసమ్) హజ్రత్ అబూ బకర్ (రజిఅన్)ను హజ్ కొరకు పంపిన తరువాత అవతరించాయి. ఆయన వెళ్ళిన తరువాత ఈ ఆయతులు అవతరించినప్పుడు మహాప్రవక్త (సఅసమ్) హజ్రత్ అలీ (రజిఅన్)ను పంపారు, హాజీల జన సమూహంలో వాటిని వినిపించటానికి ఈ క్రింది నాలుగు విషయాలను ప్రకటించటానికి : (1) ఇస్లామ్ ధర్మాన్ని స్వీకరించటానికి తిరస్కరించిన ఏ వ్యక్తీ స్వర్గంలో ప్రవేశించలేడు. (2) ఈ సంవత్సరం తరువాత ఏ ముష్రిక్కు అయినా హజ్ కొరకు రాకూడదు. (3) ప్రజలు బైతుల్లా (అల్లాహ్ గృహం – కాబా) చుట్టూ దిగంబరులై ప్రదక్షిణ చెయ్యటం నిషిద్ధం. (4) ఎవరితో దైవప్రవక్త చేసుకున్న ఒప్పందం గడువు మిగిలివుందో, అంటే ఎవరు ఒప్పందాన్ని ఉల్లంఘించలేదో, వారియెడల ఒప్పందం గడువు పూర్తి అయ్యేవరకు విశ్వాసపాత్రతతో వ్యవహరించటం జరుగుతుంది. మహాప్రవక్త (సఅసమ్) ఉపదేశానుసారం హజ్రత్ అలీ (రజిఅన్) ఈ ప్రకటనను జిల్ హజ్జహ్ నెల 10వ తేదీన చేశారు.

وَ اَذَانٌ مِّنَ اللّٰهِ وَ رَسُوْلِهٖۤ اِلَى النَّاسِ يَوْمَ
الْحَجِّ الْاَكْبَرِ اَنَّ اللّٰهَ بَرِیْٓءٌ مِّنَ
الْمُشْرِكِیْنَ ۙ۬ وَ رَسُوْلُهٗ ؕ فَاِنْ تُبْتُمْ فَهُوَ خَیْرٌ
لَّكُمْ ۚ وَ اِنْ تَوَلَّیْتُمْ فَاعْلَمُوْۤا اَنَّكُمْ غَیْرُ
مُعْجِزِی اللّٰهِ ؕ وَ بَشِّرِ الَّذِیْنَ كَفَرُوْا بِعَذَابٍ
اَلِیْمٍ ۟ۙ﴿٣﴾ اِلَّا الَّذِیْنَ عٰهَدْتُّمْ مِّنَ الْمُشْرِكِیْنَ
ثُمَّ لَمْ یَنْقُصُوْكُمْ شَیْـًٔا وَّ لَمْ یُظَاهِرُوْا عَلَیْكُمْ
اَحَدًا فَاَتِمُّوْۤا اِلَیْهِمْ عَهْدَهُمْ اِلٰی مُدَّتِهِمْ ؕ
اِنَّ اللّٰهَ یُحِبُّ الْمُتَّقِیْنَ ﴿٤﴾ فَاِذَا انْسَلَخَ
الْاَشْهُرُ الْحُرُمُ فَاقْتُلُوا الْمُشْرِكِیْنَ حَیْثُ
وَجَدْتُّمُوْهُمْ وَ خُذُوْهُمْ وَ احْصُرُوْهُمْ
وَ اقْعُدُوْا لَهُمْ كُلَّ مَرْصَدٍ ۚ فَاِنْ تَابُوْا وَ
اَقَامُوا الصَّلٰوةَ وَ اٰتَوُا الزَّكٰوةَ فَخَلُّوْا
سَبِیْلَهُمْ ؕ اِنَّ اللّٰهَ غَفُوْرٌ رَّحِیْمٌ ﴿٥﴾ وَ اِنْ
اَحَدٌ مِّنَ الْمُشْرِكِیْنَ اسْتَجَارَكَ فَاَجِرْهُ حَتّٰی
یَسْمَعَ كَلٰمَ اللّٰهِ ثُمَّ اَبْلِغْهُ مَاْمَنَهٗ ؕ ذٰلِكَ
بِاَنَّهُمْ قَوْمٌ لَّا یَعْلَمُوْنَ ۠﴿٦﴾ ع

**3 - 4** పెద్ద హజ్‌రోజున[3] సమస్త ప్రజలకు అల్లాహ్ తరఫు నుండీ ఆయన ప్రవక్త తరఫు నుండీ చెయ్యబడే బహిరంగ ప్రకటన ఏమిటంటే, అల్లాహ్ ముష్రిక్కులకు ఏ విధంగానూ బాధ్యుడు కాడు అలాగే ఆయన ప్రవక్త కూడా. ఇప్పుడు మీరు గనక పశ్చాత్తాపపడితే అది మీకే మేలు. ఒకవేళ విముఖులైతే మీరు అల్లాహ్‌ను అశక్తుడుగా చెయ్యలేరు అని బాగా అర్థం చేసుకోండి. ప్రవక్తా! తిరస్కరించేవారికి కఠినశిక్షను గురించిన శుభవార్తను వినిపించు, మీరు ఒడంబడికలు కుదుర్చుకున్న ముష్రిక్కులకు తప్ప. ఎందుకంటే వారు తమ ఒడంబడికలు నెరవేర్చటంలో మీపట్ల ఏ లోపమూ చేయలేదు, మీకు వ్యతిరేకంగా ఎవరికీ సహాయం చేయలేదు; అటువంటి వారితో పాటు మీరు కూడా ఒడంబడికను గడువు వరకు పాటించండి. ఎందుకంటే, అల్లాహ్ భయభక్తులు గలవారంటేనే ఇష్టపడ తాడు.

**5 - 6** కనుక, నిషిద్ధ మాసాలు[4] గడిచిపోయిన తర్వాత ముష్రిక్కులను చంపండి, ఎక్కడ కనిపిస్తే అక్కడ, ఇంకా వారిని పట్టుకోండి, చుట్టుముట్టండి, ప్రతి మాటువద్ద వారి కొరకు పొంచి కూర్చోండి. తరువాత ఒకవేళ వారు పశ్చాత్తాప పడితే, నమాజును స్థాపిస్తే, జకాత్ ఇస్తే, వారిని విడిచిపెట్టండి.[5] అల్లాహ్ మన్నించేవాడూ, కరుణించేవాడూను. ఒకవేళ ముష్రిక్కులలో ఏ వ్యక్తి అయినా శరణుగోరి మీ వద్దకు రాదలిస్తే (అల్లాహ్ గ్రంథాన్ని వినటానికీ), అతనికి శరణు ఇవ్వండి, అతడు అల్లాహ్ గ్రంథాన్ని వినే అంతవరకు. తరువాత అతనిని అతని భద్రతాస్థలం వరకు చేర్చండి. ఇలా ఎందుకు చెయ్యా లంటే, వారికి గ్రంథ జ్ఞానము లేదు కాబట్టి.

3. పెద్ద హజ్ అనే పదం చిన్న హజ్‌కు వ్యతిరేక పదం. అరేబియా వాసులు ఉమ్‌రాను చిన్న హజ్ అనేవారు. దీనికి భిన్నంగా జిల్ హజ్జహ్ మాసం నిర్ణీత తేదీలలో జరిగే హజ్‌ను పెద్ద హజ్ అనేవారు.

4. ఇక్కడ నిషిద్ధ మాసాలు అంటే, ముష్రిక్కులకు గడువుగా ఇవ్వబడిన నాలుగు మాసాలు అని భావం. ఈ గడువు కాలంలో ముష్రిక్కులపై దాడి చెయ్యటం ముస్లిములకు ధర్మసమ్మతం (జాయజ్) కాదు. అందుకని వాటిని నిషిద్ధ మాసాలుగా నిర్ణయించటం జరిగింది.

5. అంటే, కేవలం అవిశ్వాసం నుండి, షిర్కు నుండి మరలినంత మాత్రాన వ్యవహారం పూర్తి కాదు. వారు నమాజును స్థాపించవలసి ఉంటుంది. జకాత్‌ను ఇవ్వవలసి ఉంటుంది. లేకపోతే, వారు అవిశ్వాసాన్ని విసర్జించి ఇస్లామును స్వీకరించారు అనేది అంగీకరించటం జరగదు.

كَيْفَ يَكُوْنُ لِلْمُشْرِكِيْنَ عَهْدٌ عِنْدَ اللّٰهِ وَ
عِنْدَ رَسُوْلِهٖۤ اِلَّا الَّذِيْنَ عٰهَدْتُّمْ عِنْدَ
الْمَسْجِدِ الْحَرَامِ ۚ فَمَا اسْتَقَامُوْا لَكُمْ
فَاسْتَقِيْمُوْا لَهُمْ ؕ اِنَّ اللّٰهَ يُحِبُّ الْمُتَّقِيْنَ ۝٧
كَيْفَ وَ اِنْ يَّظْهَرُوْا عَلَيْكُمْ لَا يَرْقُبُوْا فِيْكُمْ
اِلًّا وَّ لَا ذِمَّةً ؕ يُرْضُوْنَكُمْ بِاَفْوَاهِهِمْ وَ تَاْبٰى
قُلُوْبُهُمْ ۚ وَ اَكْثَرُهُمْ فٰسِقُوْنَ ۝٨ اِشْتَرَوْا
بِاٰيٰتِ اللّٰهِ ثَمَنًا قَلِيْلًا فَصَدُّوْا عَنْ سَبِيْلِهٖ ؕ
اِنَّهُمْ سَآءَ مَا كَانُوْا يَعْمَلُوْنَ ۝٩ لَا يَرْقُبُوْنَ
فِيْ مُؤْمِنٍ اِلًّا وَّ لَا ذِمَّةً ؕ وَ اُولٰٓئِكَ هُمُ
الْمُعْتَدُوْنَ ۝١٠ فَاِنْ تَابُوْا وَ اَقَامُوا الصَّلٰوةَ وَ
اٰتَوُا الزَّكٰوةَ فَاِخْوَانُكُمْ فِي الدِّيْنِ ؕ وَ نُفَصِّلُ
الْاٰيٰتِ لِقَوْمٍ يَّعْلَمُوْنَ ۝١١ وَ اِنْ نَّكَثُوْۤا
اَيْمَانَهُمْ مِّنْۢ بَعْدِ عَهْدِهِمْ وَ طَعَنُوْا فِيْ دِيْنِكُمْ
فَقَاتِلُوْۤا اَئِمَّةَ الْكُفْرِ ۙ اِنَّهُمْ لَاۤ اَيْمَانَ لَهُمْ
لَعَلَّهُمْ يَنْتَهُوْنَ ۝١٢

**7 - 12** ఈ ముష్రిక్కులకు అల్లాహ్ వద్ద ఆయన సందేశహరునివద్ద ఒడంబడిక అనేది అసలు ఎలా సాధ్యం? - మీరు 'మస్జిదె హరామ్' వద్ద ఒడంబడిక చేసుకున్నవారితో తప్ప.[6] వారు మీతో సరిగ్గా ఉన్నంతవరకు మీరూ వారితో సరిగ్గా ఉండండి. ఎందుకంటే అల్లాహ్ భయభక్తులు కలవా రంటే ఇష్టపడతాడు- కానీ వారితో తప్ప, ఇతర ముష్రిక్కులతో ఏ ఒడంబడికైనా ఎలా సాధ్యం, వారి పరిస్థితి ఇలా ఉన్న ప్పుడు? అంటే మీపై ప్రాబల్యం వహిస్తే మీ విషయంలో ఏ బంధుత్వాన్నీ లెక్కచెయ్యరు, ఏ ఒడంబడిక బాధ్యతనూ ఖాతరు చెయ్యరు, వారు నోటిమాటలతో మిమ్మల్ని సమాధాన పరచ టానికి ప్రయత్నిస్తారు. కాని వారి మనస్సులు మాత్రం తిరస్కరి స్తాయి. వారిలో చాలా మంది దుర్మార్గులు. వారు అల్లాహ్ ఆయతులను అల్పధరకు విక్రయించారు. అంతేకాదు, అల్లాహ్ మార్గంలో అవరోధమై నిల్చున్నారు. వారు చేసినవి బహు చెడ్డచేష్టలు. ఏ విశ్వాసి విషయంలోనైనా వారు బంధు త్వాన్నిగానీ, ఒడంబడిక బాధ్యతనుగానీ లెక్కచెయ్యరు. అతిక్రమణ అనేది ఎల్లప్పుడూ వారి వైపునుండే జరిగింది. కనుక ఒకవేళ వారు పశ్చాత్తాపపడితే, నమాజును స్థాపిస్తే, జకాత్ ఇస్తే, వారు మీ ధార్మిక సోదరులే.[7] విజ్ఞుల కొరకు మేము మా ఆజ్ఞలను ఇలా స్పష్టం చేస్తాము. ఒకవేళ ఒడం బడిక కుదుర్చుకున్న తరువాత, వారు మళ్ళీ తమ ప్రమాణాలను భగ్నంచేస్తే, మీ ధర్మంపై దాడులు చెయ్యటం ప్రారంభిస్తే, అవిశ్వాస పతాక ధారులతో యుద్ధం చెయ్యండి ఎందుకంటే, వారి ప్రమాణాలు ఏ మాత్రం నమ్మదగ్గవి కావు. బహుశా (కరవాల శక్తివల్లనే) వారు మానుకోవచ్చు.[8]

6. అంటే, బనీ కినానహ్, బనీ ఖుజాఅహ్, బనీ జమ్‌రహ్ అనే తెగలు అని భావం.

7. అంటే, నమాజు, జకాత్‌లు లేకుండా కేవలం తౌబా (పశ్చాత్తాపపడటం, మరలటం) చేసుకున్నంత మాత్రాన వారు మీ ధార్మిక సోదరులు అయిపోరు. ఒకవేళ వారు ఈ షరతును పూర్తిచేస్తే, దాని ఫలితంగా వారిపై దాడిచేయటం, వారి ధన,మాన, ప్రాణాలకు నష్టం కలిగించటం మీకు నిషిద్ధం. అంతేకాదు, ఇస్లామీ సమాజంలో వారికి సమానమైన హక్కులు లభిస్తాయి. సామాజికంగా, నాగరికంగా, చట్టరీత్యా వారు ఇతర సమస్త ముస్లిము పౌరులు మాదిరిగా అయిపోతారు. ఏ భేదభావమూ, విచక్షణా వారి ప్రగతి మార్గంలో అడ్డుగా నిలువవు.

اَلَا تُقَاتِلُوْنَ قَوْمًا نَّكَثُوْٓا اَيْمَانَهُمْ وَهَمُّوْا
بِاِخْرَاجِ الرَّسُوْلِ وَ هُمْ بَدَءُوْكُمْ اَوَّلَ مَرَّةٍ ؕ
اَتَخْشَوْنَهُمْ ۚ فَاللّٰهُ اَحَقُّ اَنْ تَخْشَوْهُ اِنْ كُنْتُمْ
مُّؤْمِنِيْنَ ﴿۱۳﴾ قَاتِلُوْهُمْ يُعَذِّبْهُمُ اللّٰهُ بِاَيْدِيْكُمْ
وَيُخْزِهِمْ وَيَنْصُرْكُمْ عَلَيْهِمْ وَ يَشْفِ صُدُوْرَ
قَوْمٍ مُّؤْمِنِيْنَ ﴿۱۴﴾ وَيُذْهِبْ غَيْظَ قُلُوْبِهِمْ ؕ وَ
يَتُوْبُ اللّٰهُ عَلٰى مَنْ يَّشَآءُ ؕ وَاللّٰهُ عَلِيْمٌ
حَكِيْمٌ ﴿۱۵﴾ اَمْ حَسِبْتُمْ اَنْ تُتْرَكُوْا وَ لَمَّا يَعْلَمِ
اللّٰهُ الَّذِيْنَ جٰهَدُوْا مِنْكُمْ وَ لَمْ يَتَّخِذُوْا مِنْ
دُوْنِ اللّٰهِ وَ لَا رَسُوْلِهٖ وَ لَا الْمُؤْمِنِيْنَ
وَلِيْجَةً ؕ وَ اللّٰهُ خَبِيْرٌۢ بِمَا تَعْمَلُوْنَ ﴿۱۶﴾ مَا ع ٢ ٨
كَانَ لِلْمُشْرِكِيْنَ اَنْ يَّعْمُرُوْا مَسٰجِدَ اللّٰهِ
شٰهِدِيْنَ عَلٰٓى اَنْفُسِهِمْ بِالْكُفْرِ ؕ اُولٰٓئِكَ حَبِطَتْ
اَعْمَالُهُمْ ۚۖ وَفِى النَّارِ هُمْ خٰلِدُوْنَ ﴿۱۷﴾ اِنَّمَا يَعْمُرُ
مَسٰجِدَ اللّٰهِ مَنْ اٰمَنَ بِاللّٰهِ وَ الْيَوْمِ الْاٰخِرِ وَ
اَقَامَ الصَّلٰوةَ وَ اٰتَى الزَّكٰوةَ وَ لَمْ يَخْشَ اِلَّا
اللّٰهَ فَعَسٰٓى اُولٰٓئِكَ اَنْ يَّكُوْنُوْا مِنَ
الْمُهْتَدِيْنَ ﴿۱۸﴾ اَجَعَلْتُمْ سِقَايَةَ الْحَآجِّ وَ
عِمَارَةَ الْمَسْجِدِ الْحَرَامِ كَمَنْ اٰمَنَ بِاللّٰهِ وَ
الْيَوْمِ الْاٰخِرِ وَ جٰهَدَ فِىْ سَبِيْلِ اللّٰهِ ؕ لَا يَسْتَوٗنَ
عِنْدَ اللّٰهِ ؕ وَ اللّٰهُ لَا يَهْدِى الْقَوْمَ الظّٰلِمِيْنَ ﴿۱۹﴾ وقف لازم

**13 - 16** తమ వాగ్దానాలను భంగంచేస్తూ ఉన్నవారితో, సందేశహరుణ్ణి దేశం నుండి బహిష్కరించాలని నిర్ణయించు కున్నవారితో మీరు యుద్ధం చెయ్యరా? అతిక్రమణను ప్రారంభించింది వారే. మీరు వారికి భయపడు తున్నారా? మీరు గనక విశ్వాసులే అయితే మీరు భయపడటానికి అల్లాహ్‌యే ఎక్కువ అర్హుడు. కనుక వారితో యుద్ధం చెయ్యండి; అల్లాహ్ మీ చేతుల ద్వారా వారిని శిక్షిస్తాడు. వారిని హీనులుగా, నీచులుగా చేసి అవమానం పాలుచేస్తాడు. ఇంకా వారికి ప్రతికూలంగా మీకు సహాయం చేస్తాడు. చాలామంది విశ్వాసుల హృదయాలను చల్లబరుస్తాడు. వారి గుండెల మంటను దూరం చేస్తాడు. ఇంకా తాను కోరినవారికి పశ్చా త్తాప భాగ్యం కలుగజేస్తాడు.[9] అల్లాహ్ అంతా తెలిసినవాడూ వివేకవంతుడూను. మీరు ఊరికే వదలిపెట్టబడతారని అనుకుంటున్నారా? వాస్తవానికి మీలో (తన మార్గంలో) ప్రాణాలొడ్డి పోరాడిన వారు ఎవరో, ఇంకా, అల్లాహ్‌నూ సందేశహరుణ్ణీ విశ్వాసులనూ తప్ప మరెవరినీ ఆప్తమిత్రులుగా చేసుకోని వారు ఎవరో ఇంకా అల్లాహ్ చూడనేలేదు. మీరు ఏది చేస్తారో అది అల్లాహ్‌కు తెలుసు.

**17 - 22** ముష్రిక్కులు అల్లాహ్ మసీదులలో సంరక్షకులుగా, సేవకులుగా ఉండటానికి పనికిరారు. ఎందుకంటే వారే స్వయంగా అవిశ్వాసులమని తమకు వ్యతిరేకంగా సాక్ష్యమిస్తు న్నారు. వారి కర్మలైతే అన్నీ వ్యర్థమైపోయాయి. నరకంలో వారు కలకాలం ఉండాలి. అల్లాహ్‌నూ, అంతిమ దినాన్నీ విశ్వసించి, నమాజును స్థాపించేవారు, జకాత్ ఇచ్చేవారు అల్లాహ్‌కు తప్ప మరెవరికీ భయపడనివారు మాత్రమే అల్లాహ్ మసీదులకు సంరక్షకులూ, సేవకులూ కాగలగుతారు. వారే సరియైన మార్గంలో నడుస్తారని ఆశించవచ్చు. అల్లాహ్‌నూ, అంతిమదినాన్నీ విశ్వసించి అల్లాహ్ మార్గంలో ప్రాణాలొడ్డి కృషి చేసే మనిషి పనితో[10] హాజీలకు మంచినీళ్లు త్రాపటాన్ని, మస్జిదె హరామ్‌కు సేవలు చెయ్యటాన్ని మీరు సమానంగా భావించారా? అల్లాహ్ దగ్గర వారిద్దరూ సమానులు కారు. అల్లాహ్ దుర్మార్గులకు మార్గం చూపడు.

اَلَّذِيۡنَ اٰمَنُوۡا وَ هَاجَرُوۡا وَ جٰهَدُوۡا فِىۡ سَبِيۡلِ
اللّٰهِ بِاَمۡوَالِهِمۡ وَ اَنۡفُسِهِمۡ ۙ اَعۡظَمُ دَرَجَةً عِنۡدَ
اللّٰهِ ؕ وَ اُولٰٓـئِكَ هُمُ الۡفَآٮِٕزُوۡنَ ﴿٢٠﴾ يُبَشِّرُهُمۡ
رَبُّهُمۡ بِرَحۡمَةٍ مِّنۡهُ وَ رِضۡوَانٍ وَّ جَنّٰتٍ لَّهُمۡ
فِيۡهَا نَعِيۡمٌ مُّقِيۡمٌ ۙ﴿٢١﴾ خٰلِدِيۡنَ فِيۡهَاۤ اَبَدًا ؕ اِنَّ
اللّٰهَ عِنۡدَهٗۤ اَجۡرٌ عَظِيۡمٌ ﴿٢٢﴾ يٰۤاَيُّهَا الَّذِيۡنَ
اٰمَنُوۡا لَا تَتَّخِذُوۡۤا اٰبَآءَكُمۡ وَ اِخۡوَانَكُمۡ اَوۡلِيَآءَ
اِنِ اسۡتَحَبُّوا الۡكُفۡرَ عَلَى الۡاِيۡمَانِ ؕ وَ مَنۡ
يَّتَوَلَّهُمۡ مِّنۡكُمۡ فَاُولٰٓـئِكَ هُمُ الظّٰلِمُوۡنَ ﴿٢٣﴾ قُلۡ
اِنۡ كَانَ اٰبَآؤُكُمۡ وَ اَبۡنَآؤُكُمۡ وَ اِخۡوَانُكُمۡ وَ
اَزۡوَاجُكُمۡ وَ عَشِيۡرَتُكُمۡ وَ اَمۡوَالُ ۨاقۡتَرَفۡتُمُوۡهَا
وَ تِجَارَةٌ تَخۡشَوۡنَ كَسَادَهَا وَ مَسٰكِنُ
تَرۡضَوۡنَهَاۤ اَحَبَّ اِلَيۡكُمۡ مِّنَ اللّٰهِ وَ رَسُوۡلِهٖ وَ
جِهَادٍ فِىۡ سَبِيۡلِهٖ فَتَرَبَّصُوۡا حَتّٰى يَاۡتِىَ اللّٰهُ
بِاَمۡرِهٖ ؕ وَ اللّٰهُ لَا يَهۡدِى الۡقَوۡمَ الۡفٰسِقِيۡنَ ﴿٢٤﴾ ع

విశ్వసించి అల్లాహ్ మార్గంలో ఇల్లూ వాకిలీ వదిలిపెట్టి తమ ప్రాణాలతో, తమ సంపదలతో పోరాడిన వారి అంతస్తే ఆయన దృష్టిలో గొప్పది. అట్టివారే సఫలీకృతులు. వారి ప్రభువు వారికి తన కారుణ్యం, తన సంతోషాల శుభవార్తనూ, శాశ్వత భోగాల సామగ్రిగల స్వర్గవనాల శుభవార్తనూ ఇస్తున్నాడు. వాటిలో వారు సదా ఉంటారు. నిశ్చయంగా సేవలకు ప్రతిఫలం ఇవ్వటానికి అల్లాహ్ వద్ద ఎంతో ఉంది.

**23 - 24** విశ్వసించిన ప్రజలారా! మీ తండ్రులను, మీ సోదరులను కూడా మీ సహచరులుగా చేసుకోకండి, ఒకవేళ వారు విశ్వాసం కంటె అవిశ్వాసానికి ప్రాధాన్యం ఇస్తే. మీలో వారిని సహచరులుగా చేసుకునే వారే దుర్మార్గులు. ప్రవక్తా! ఇలా అను: "ఒకవేళ మీ తండ్రులు, మీ కుమారులు, మీ సోదరులు, మీ భార్యలు, మీ బంధువులు, మీ ఆప్తులు, మీరు సంపాదించిన ఆస్తిపాస్తులు, మందగిస్తాయేమో అని మీరు భయపడే మీ వ్యాపారాలు, మీరు ఇష్టపడే మీ గృహాలు అల్లాహ్ కంటే ఆయన ప్రవక్త కంటే ఆయన మార్గంలో శ్రమించటం కంటే మీకు గనక ఎక్కువ ప్రియతరమైతే, అల్లాహ్ తన తీర్పును మీ ముందుకు తీసుకువచ్చే వరకు నిరీక్షించండి. అల్లాహ్ దోషులకు మార్గం చూపడు."

8. ఇక్కడ ప్రమాణం చెయ్యటం, వాగ్దానం చెయ్యటం అంటే ముస్లిము అవటానికి ప్రమాణం చెయ్యటం, ఇస్లామ్ పట్ల విశ్వాస పాత్రతతో ఉండటానికి వాగ్దానం చెయ్యటం. భావం ఏమిటంటే, ఒకవేళ వారు ముస్లిములు అయిన తరువాత, మళ్ళీ అవిశ్వాసం వైపునకు మరలిపోతే, వారితో యుద్ధం చెయ్యబడుతుంది. ఈ ఆజ్ఞ ప్రకారమే హజ్రత్ అబూబకర్ (రజిఅన్) ధర్మపరిత్యాగం చేసినవారికి వ్యతిరేకంగా యుద్ధం చేశారు.

9. ఈ ప్రకటన చెయ్యబడగానే అరేబియాకు చుట్టుప్రక్కల అగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లుతాయని, ఇంకా తాము ఒక భయంకరమైన యుద్ధాన్ని ఎదుర్కొనవలసి ఉంటుందని ముస్లిములు భయపడ్డారు. అల్లాహ్ ఈ ఆయతులలో, మీ భయం నిజం కాదు, ఫలితం దీనికి భిన్నంగా ఉంటుంది అని ధైర్యం చెబుతున్నాడు.

10. బైతుల్లాహ్ (కాబా గృహం)కు ధర్మకర్తలుగా ఇక ముష్రిక్కులు ఉండలేరనీ, ముష్రిక్ ఖురైషులు కేవలం హాజీలకు సేవచేస్తూ వచ్చినంత మాత్రాన వారు దీనికి అర్హులు కాలేరు అనీ ఈ సూక్తి ద్వారా నిర్ణయం చెయ్యబడింది.

لَقَدْ نَصَرَكُمُ اللّٰهُ فِيْ مَوَاطِنَ كَثِيْرَةٍ ۙ وَّ يَوْمَ
حُنَيْنٍ ۙ اِذْ اَعْجَبَتْكُمْ كَثْرَتُكُمْ فَلَمْ تُغْنِ عَنْكُمْ
شَيْـًٔا وَّ ضَاقَتْ عَلَيْكُمُ الْاَرْضُ بِمَا رَحُبَتْ
ثُمَّ وَلَّيْتُمْ مُّدْبِرِيْنَ ۝٢٥ ثُمَّ اَنْزَلَ اللّٰهُ
سَكِيْنَتَهٗ عَلٰى رَسُوْلِهٖ وَ عَلَى الْمُؤْمِنِيْنَ
وَاَنْزَلَ جُنُوْدًا لَّمْ تَرَوْهَا وَ عَذَّبَ الَّذِيْنَ
كَفَرُوْا ؕ وَذٰلِكَ جَزَآءُ الْكٰفِرِيْنَ ۝٢٦ ثُمَّ
يَتُوْبُ اللّٰهُ مِنْۢ بَعْدِ ذٰلِكَ عَلٰى مَنْ يَّشَآءُ ؕ وَ
اللّٰهُ غَفُوْرٌ رَّحِيْمٌ ۝٢٧ يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْۤا
اِنَّمَا الْمُشْرِكُوْنَ نَجَسٌ فَلَا يَقْرَبُوا الْمَسْجِدَ
الْحَرَامَ بَعْدَ عَامِهِمْ هٰذَا ۚ وَ اِنْ خِفْتُمْ عَيْلَةً
فَسَوْفَ يُغْنِيْكُمُ اللّٰهُ مِنْ فَضْلِهٖۤ اِنْ شَآءَ ؕ اِنَّ
اللّٰهَ عَلِيْمٌ حَكِيْمٌ ۝٢٨

**25 - 27** అల్లాహ్ ఇదివరకు చాలా సందర్భాలలో మీకు సహాయం చేసి ఉన్నాడు, ఇటీవలనే హునైన్ సంగ్రామం రోజున ఆయన సహాయం యొక్క మహిమను మీరు చూసి ఉన్నారు.[11] ఆ రోజు మీరు మీ సంఖ్యాబలాన్ని చూసి గర్వపడ్డారు. కాని అది మీకు ఏవిధంగానూ పనికిరాలేదు. భూమి విశాలమైనది అయినప్పటికీ మీకు ఇరుకైపోయింది. మీరు వెన్నుచూపి పారిపోయారు. తరువాత అల్లాహ్ తన (తరఫు నుండి) ప్రశాంతస్థితిని తన ప్రవక్తపై విశ్వాసులపై అవతరింపజేశాడు; ఇంకా మీకు కనిపించని దళాలను దించాడు. సత్య తిరస్కారులను శిక్షించాడు. సత్యాన్ని తిరస్కరించే వారికి లభించే ప్రతిఫలం ఇదే. తరువాత (మీరు దీనిని కూడా చూశారు) ఇలా శిక్షించిన తరువాత, అల్లాహ్ తాను కోరినవారికి పశ్చాత్తాప భాగ్యాన్ని కూడా ప్రసాదిస్తాడు.[12] అల్లాహ్ మన్నించేవాడూ, కరుణించేవాడూను.

**28** విశ్వసించిన ప్రజలారా! ముష్రిక్కులు అపరిశుద్ధులు. కనుక ఈ సంవత్సరం తరువాత వారు మస్జిదె హరామ్ దరిదాపులకు కూడా రాకూడదు.[13] ఒకవేళ మీకు లేమి భయం కలిగితే, అల్లాహ్ కోరితే మిమ్మల్ని తన అనుగ్రహంతో సంపన్నులుగా చెయ్యటం అసంభవం కాదు. అల్లాహ్ అన్నీ తెలిసిన వాడూ వివేకవంతుడూను.

11. హునైన్ యుద్ధం హిజ్రీ 8వ సంవత్సరం షవ్వాల్ మాసంలో, ఈ ఆయతుల అవతరణకు కేవలం పన్నెండు లేక పదమూడు మాసాలకు పూర్వం, మక్కా తాయఫ్‌ల మధ్య హునైన్ లోయలో జరిగింది. ఈ యుద్ధంలో విశ్వాసుల తరఫున 12 వేల మంది సైనికులు పాల్గొన్నారు. అవిశ్వాసుల తరఫున చాలా తక్కువమంది సైనికులు పాల్గొన్నారు. అయినప్పటికీ హవాజిన్ తెగవారి బాణనిపుణులు విశ్వాసులను వెనక్కి మళ్ళేలా చేశారు. ఇస్లామీ సైన్యం ఛిన్నాభిన్నమై పరాజయం పాలయింది. ఆ సమయంలో కేవలం మహాప్రవక్త (సఅసమ్) కొందరు ప్రాణ స్నేహితులైన ఆయన అనుచరులు మాత్రమే తమ స్థానాల నుండి కదలకుండా స్థిరంగా ఉండిపోయారు. వారి ధైర్యస్థైర్యాల వల్లనే మళ్ళీ సైన్యంలో క్రమశిక్షణ సాధ్యపడింది. చివరకు విశ్వాసులకు గెలుపు చేకూరింది. లేకపోతే, మక్కా విజయం ద్వారా లభించిన దానికంటే ఎక్కువగానే హునైన్‌లో కోల్పోవలసి వచ్చేది.

12. హునైన్ సంగ్రామంలో ఓడిపోయిన అవిశ్వాసులందరూ తరువాత ముస్లిములు అయ్యారు అనే విషయాన్ని ఇక్కడ సూచించటం జరిగింది.

13. అంటే, ఇక ముందు వారి హజ్ యాత్ర వారి కాబా సందర్శనం మాత్రమేకాదు, మస్జిదె హరామ్ సరిహద్దులలోకి వారి ప్రవేశం కూడా నిషిద్ధమే.

**29 - 35** గ్రంథ ప్రజలలో అల్లాహ్‌నూ, అంతిమదినాన్నీ విశ్వసించని వారునూ, అల్లాహ్, ఆయన ప్రవక్త నిషిద్ధంగా నిర్ణయించినదానిని నిషిద్ధంగా భావించని వారునూ, ఇంకా సత్యధర్మాన్ని తమ ధర్మంగా చేసుకోనివారునూ అయిన వారికి వ్యతిరేకంగా యుద్ధం చెయ్యండి. వారు స్వయంగా తమ చేతులతో జిజియా ఇచ్చేవరకూ, లోబడి ఉండేవరకూ[14] (వారితో పోరాడండి). "ఉజైర్ అల్లాహ్ కుమారుడు" అని యూదులు అంటారు. "మసీహ్ అల్లాహ్ కుమారుడు" అని క్రైస్తవులు అంటారు. వారికి పూర్వం అవిశ్వాసంలో పడివున్న వారి మాటలను అనుకరిస్తూ వారు తమ నోటితో అనే ఈ మాటలు నిరాధారమైనవి. దేవుని దెబ్బ వారిపై పడుగాక! వారెలా మోస పోతున్నారు! వారు అల్లాహ్‌ను కాదని తమ పండితులను తమ సన్యాసులను తమ ప్రభువులుగా చేసుకున్నారు.[15] ఇంకా ఇదేవిధంగా మర్యమ్ కుమారుడైన మసీహ్‌ను కూడా. వాస్తవానికి, ఒకే దేవుని దాస్యం తప్ప మరెవరి దాస్యాన్నీ చేసే ఆజ్ఞ వారికి ఇవ్వబడలేదు. ఆయన తప్ప ఆరాధనకు అర్హుడైన వాడెవడూలేడు. ఆయన పరిశుద్ధుడు. వారు అనే షిర్కు మాటలకు అతీతుడు. వారు అల్లాహ్ జ్యోతిని తమ నోటితో ఊది ఆర్పివేయాలని అనుకుంటున్నారు. కాని అల్లాహ్ తన జ్యోతిని పరిపూర్ణం చెయ్యకుండా వదిలిపెట్టటానికి అంగీకరించడు, అవిశ్వాసులకు ఇది ఎంత అయిష్టమైనా సరే. తన ప్రవక్తకు మార్గదర్శకత్వాన్నీ, సత్యధర్మాన్నీ ఇచ్చి పంపినవాడు అల్లాహ్‌యే. దానిని ఇతర అన్ని జీవన వ్యవస్థలపై ప్రబలింప జెయ్యాలని,[16] ముష్రిక్కులకు ఇది ఎంత సహించరానిదైనా సరే. విశ్వసించిన ప్రజలారా! ఈ గ్రంథ ప్రజల యొక్క చాలా మంది పండితుల స్థితీ, సన్యాసుల స్థితీ ఎటువంటిదంటే, వారు ప్రజల సొమ్మును అక్రమపద్ధతుల ద్వారా తినేస్తారు. వారిని అల్లాహ్ మార్గం అనుసరించకుండా ఆపుతారు. వెండి బంగారాలను పోగుచేసి వాటిని దైవమార్గంలో ఖర్చుపెట్టని వారికి వ్యధాభరితమైన శిక్ష యొక్క శుభవార్తను అంద జెయ్యండి. ఈ వెండి బంగారాలు నరకాగ్నిలో కాల్చబడే ఒక రోజు వస్తుంది. వాటితోనే వారి నొసటిపై, వారి పార్శ్వాలపై, వీపులపై వాతలు వెయ్యబడతాయి– ఇది మీరు మీ కొరకు కూడబెట్టుకున్నది, ఇదిగో, ఇక మీరు కూడబెట్టిన సంపదను రుచిచూడండి.

قَاتِلُوا الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِاللّٰهِ وَ لَا بِالْيَوْمِ
الْاٰخِرِ وَ لَا يُحَرِّمُوْنَ مَا حَرَّمَ اللّٰهُ وَرَسُوْلُهٗ
وَ لَا يَدِيْنُوْنَ دِيْنَ الْحَقِّ مِنَ الَّذِيْنَ اُوْتُوا
الْكِتٰبَ حَتّٰى يُعْطُوا الْجِزْيَةَ عَنْ يَّدٍ وَّ هُمْ
صٰغِرُوْنَ ﴿٢٩﴾ وَ قَالَتِ الْيَهُوْدُ عُزَيْرُ ابْنُ اللّٰهِ وَ ع ٤ ٥ ١٠
قَالَتِ النَّصٰرَى الْمَسِيْحُ ابْنُ اللّٰهِ ؕ ذٰلِكَ قَوْلُهُمْ
بِاَفْوَاهِهِمْ ۚ يُضَاهِـُٔوْنَ قَوْلَ الَّذِيْنَ كَفَرُوْا
مِنْ قَبْلُ ؕ قٰتَلَهُمُ اللّٰهُ ۚ اَنّٰى يُؤْفَكُوْنَ ﴿٣٠﴾
اِتَّخَذُوْۤا اَحْبَارَهُمْ وَرُهْبَانَهُمْ اَرْبَابًا مِّنْ
دُوْنِ اللّٰهِ وَ الْمَسِيْحَ ابْنَ مَرْيَمَ ۚ وَ مَاۤ اُمِرُوْۤا
اِلَّا لِيَعْبُدُوْۤا اِلٰهًا وَّاحِدًا ۚ لَاۤ اِلٰهَ اِلَّا هُوَ ؕ
سُبْحٰنَهٗ عَمَّا يُشْرِكُوْنَ ﴿٣١﴾ يُرِيْدُوْنَ اَنْ يُّطْفِـُٔوْا
نُوْرَ اللّٰهِ بِاَفْوَاهِهِمْ وَ يَاْبَى اللّٰهُ اِلَّاۤ اَنْ يُّتِمَّ
نُوْرَهٗ وَ لَوْ كَرِهَ الْكٰفِرُوْنَ ﴿٣٢﴾ هُوَ الَّذِيْۤ اَرْسَلَ
رَسُوْلَهٗ بِالْهُدٰى وَ دِيْنِ الْحَقِّ لِيُظْهِرَهٗ عَلَى
الدِّيْنِ كُلِّهٖ ۙ وَ لَوْ كَرِهَ الْمُشْرِكُوْنَ ﴿٣٣﴾ يٰۤاَيُّهَا النصف
الَّذِيْنَ اٰمَنُوْۤا اِنَّ كَثِيْرًا مِّنَ الْاَحْبَارِ وَ
الرُّهْبَانِ لَيَاْكُلُوْنَ اَمْوَالَ النَّاسِ بِالْبَاطِلِ وَ
يَصُدُّوْنَ عَنْ سَبِيْلِ اللّٰهِ ؕ وَ الَّذِيْنَ يَكْنِزُوْنَ
الذَّهَبَ وَ الْفِضَّةَ وَ لَا يُنْفِقُوْنَهَا فِيْ سَبِيْلِ
اللّٰهِ ۙ فَبَشِّرْهُمْ بِعَذَابٍ اَلِيْمٍ ﴿٣٤﴾ يَّوْمَ يُحْمٰى
عَلَيْهَا فِيْ نَارِ جَهَنَّمَ فَتُكْوٰى بِهَا جِبَاهُهُمْ وَ
جُنُوْبُهُمْ وَظُهُوْرُهُمْ ؕ هٰذَا مَا كَنَزْتُمْ
لِاَنْفُسِكُمْ فَذُوْقُوْا مَا كُنْتُمْ تَكْنِزُوْنَ ﴿٣٥﴾

إِنَّ عِدَّةَ الشُّهُورِ عِندَ اللَّهِ اثْنَا عَشَرَ شَهْرًا فِي كِتَابِ اللَّهِ يَوْمَ خَلَقَ السَّمَاوَاتِ وَالْأَرْضَ مِنْهَا أَرْبَعَةٌ حُرُمٌ ۚ ذَٰلِكَ الدِّينُ الْقَيِّمُ ۚ فَلَا تَظْلِمُوا فِيهِنَّ أَنفُسَكُمْ ۚ وَقَاتِلُوا الْمُشْرِكِينَ كَافَّةً كَمَا يُقَاتِلُونَكُمْ كَافَّةً ۚ وَاعْلَمُوا أَنَّ اللَّهَ مَعَ الْمُتَّقِينَ ﴿٣٦﴾ إِنَّمَا النَّسِيءُ زِيَادَةٌ فِي الْكُفْرِ ۖ يُضَلُّ بِهِ الَّذِينَ كَفَرُوا يُحِلُّونَهُ عَامًا وَيُحَرِّمُونَهُ عَامًا لِّيُوَاطِئُوا عِدَّةَ مَا حَرَّمَ اللَّهُ فَيُحِلُّوا مَا حَرَّمَ اللَّهُ ۚ زُيِّنَ لَهُمْ سُوءُ أَعْمَالِهِمْ ۗ وَاللَّهُ لَا يَهْدِي الْقَوْمَ الْكَافِرِينَ ﴿٣٧﴾

**36 - 37** యథార్థం ఏమిటంటే, ఆకాశాన్నీ భూమినీ అల్లాహ్ సృష్టించినప్పటి నుండీ, మాసాల సంఖ్య అల్లాహ్ గ్రంథంలో పన్నెండు మాత్రమే. వాటిలో నాలుగు నిషిద్ధ మాసాలు.[17] ఇదే సరియైన గణనపద్ధతి. కనుక ఈ నాలుగు మాసాలలో మీకు మీరు అన్యాయం చేసుకోకండి. ముష్రిక్కులతో అందరూ కలసి పోరాడండి, వారందరూ కలసి మీతో పోరాడేవిధంగా. తెలుసుకోండి, అల్లాహ్ భయభక్తులు కలవారితోనే ఉంటాడని.[18] 'నసీ' అవిశ్వాసంలో ఒక అదనమైన అవిశ్వాసపు చేష్ట. దానిద్వారా ఈ అవిశ్వాసులు మార్గభ్రష్టతకు గురిచెయ్యబడతారు. ఒక సంవత్సరం ఒక మాసాన్ని ధర్మసమ్మతం చేసుకుంటారు, మరొక సంవత్సరం దానినే నిషిద్ధం చేసేస్తారు, అల్లాహ్ నిషిద్ధం చేసిన మాసాల సంఖ్యను పూర్తిచెయ్యాలనీ, అల్లాహ్ నిషిద్ధం చేసిన దానిని ధర్మసమ్మతం చేసుకోవాలని కూడా[19]– వారి దుష్కార్యాలు వారికి మనోహరమైనవిగా చెయ్యబడ్డాయి; అల్లాహ్ సత్యతిరస్కారులకు సన్మార్గం చూపడు.

14. అంటే, పోరాటం ఉద్దేశ్యం వారు విశ్వసించటం, సత్యధర్మాన్ని అనుసరించటం కాదు. దాని ఉద్దేశ్యం ఏమిటంటే, వారి పరిపాలన అంతం కావాలి. వారు భువిలో ఏలికలుగా, అధికారులుగా, నాయకులుగా ఉండకూడదు. ధరణిలో జీవన వ్యవస్థ యొక్క పగ్గాలు, పరిపాలన, నాయకత్వపు అధికారాలు సత్యధర్మాన్ని అనుసరించేవారి చేతులలోనే ఉండాలి. గ్రంథం కలవారు వారికి లొంగి వారికి విధేయులై ఉండాలి. ఆ తరువాత, ఎవరి మనస్సు కోరితే వారు స్వయంగా తమ సమ్మతితో ముస్లిములు కావచ్చు లేకపోతే జిజియా ఇస్తూ ఉండాలి. జిజియా అంటే ఇస్లామీ ప్రభుత్వంలో ముస్లిమేతరులకు లభించే శాంతి భద్రతలకు వారు ఇచ్చే ప్రతిఫలం. ఇంకా వారు ఆజ్ఞాబద్ధులై ఉండటానికి ఇష్టపడుతున్నారనే విషయానికి ఇది సంకేతం.

15. హదీసులో ఇలా ఉంది : పూర్వం క్రైస్తవుడుగా ఉన్న హజ్రత్ అదీ బిన్ హాతిమ్ మహాప్రవక్త (సఅసమ్) వద్దకు వచ్చి ఇస్లామ్‌ను స్వీకరించినప్పుడు ఆయన ప్రవక్త (సఅసమ్)ను ఇలా అడిగారు : "ఈ ఆయత్‌లో మేము మా విద్వాంసులను, మా సన్యాసులను దేవుడుగా చేసుకున్నాము అనే అభియోగం మాపై మోపబడింది. దాని అసలు విషయం ఏమిటి?" సమాధానంగా మహాప్రవక్త (సఅసమ్) ఇలా సెలవిచ్చారు : వారు హరాముగా నిర్ణయించిన దానిని మీరు హరాముగా ఒప్పుకుంటారు. వారు హలాలుగా నిర్ణయించిన దానిని హలాలుగా ఒప్పుకుంటారు. ఇది నిజం కాదా? ఆయన ఇలా అన్నారు : నిజంగానే మేము అలానే చేస్తాము. ప్రవక్త ఇలా సెలవిచ్చారు : "చాలు, వారిని ప్రభువులుగా నమ్మటం అంటే ఇదే." దీనిద్వారా తెలిసిందేమిటంటే, అల్లాహ్ గ్రంథంలో ప్రమాణం ఏదీ లేకుండానే మానవ జీవితం కొరకు జాయెజ్ (ధర్మసమ్మత మయినది) నాజాయజ్ (ధర్మసమ్మతం కానిది) హద్దులను నిర్ణయించే వారు అసలు దేవుని స్థానంలో స్వయంగా వచ్చి కూర్చుంటారు. వారి ఈ షరీయతు నిర్మాణపు హక్కును స్వీకరించే వారు వారిని దేవుడుగా చేస్తారు.

16. 'అద్దీన్'ను మేము అన్ని జీవన వ్యవస్థలు అని అనువాదం చేశాము. 'దీన్' అనే పదం అరబ్బీ భాషలో జీవన వ్యవస్థ, జీవన విధానం అనే అర్థాలలో ఉపయోగించబడుతుంది. దానిని స్థాపించే వానిని ప్రమాణంగా, విధేయతకు అర్హుడుగా స్వీకరించి, అనుసరించవలసి ఉంటుంది. కనుక దైవప్రవక్త నియామక ఉద్దేశ్యం ఈ

يَاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا مَا لَكُمْ اِذَا قِيْلَ لَكُمُ
انْفِرُوْا فِيْ سَبِيْلِ اللّٰهِ اثَّاقَلْتُمْ اِلَى
الْاَرْضِ ؕ اَرَضِيْتُمْ بِالْحَيٰوةِ الدُّنْيَا مِنَ
الْاٰخِرَةِ ۚ فَمَا مَتَاعُ الْحَيٰوةِ الدُّنْيَا فِي الْاٰخِرَةِ
اِلَّا قَلِيْلٌ ﴿۳۸﴾ اِلَّا تَنْفِرُوْا يُعَذِّبْكُمْ عَذَابًا
اَلِيْمًا ۙ وَّيَسْتَبْدِلْ قَوْمًا غَيْرَكُمْ وَلَا تَضُرُّوْهُ
شَيْـًٔا ؕ وَاللّٰهُ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ ﴿۳۹﴾ اِلَّا
تَنْصُرُوْهُ فَقَدْ نَصَرَهُ اللّٰهُ اِذْ اَخْرَجَهُ الَّذِيْنَ
كَفَرُوْا ثَانِيَ اثْنَيْنِ اِذْ هُمَا فِي الْغَارِ اِذْ
يَقُوْلُ لِصَاحِبِهٖ لَا تَحْزَنْ اِنَّ اللّٰهَ مَعَنَا ۚ
فَاَنْزَلَ اللّٰهُ سَكِيْنَتَهٗ عَلَيْهِ وَاَيَّدَهٗ بِجُنُوْدٍ لَّمْ
تَرَوْهَا وَ جَعَلَ كَلِمَةَ الَّذِيْنَ كَفَرُوا
السُّفْلٰى ؕ وَكَلِمَةُ اللّٰهِ هِيَ الْعُلْيَا ؕ وَاللّٰهُ
عَزِيْزٌ حَكِيْمٌ ﴿۴۰﴾

**38 - 40** విశ్వసించిన ప్రజలారా![20] మీకు ఏమైనది, మీతో అల్లాహ్ మార్గంలో బయలుదేరండి అని చెప్పినప్పుడు, మీరు నేలకు అతుక్కుపోయారు? మీరు పరలోకానికి మారుగా ప్రాపంచిక జీవితాన్ని కోరుకున్నారా? అలా అయితే మీరు తెలుసుకోవాలి, ప్రాపంచిక జీవితపు సకల సామగ్రి పరలోక సుఖాల ముందు స్వల్పాతి స్వల్పమైనదిగా తెలుతుందని. మీరు గనక లేవకపోతే, దేవుడు మీకు వ్యధాభరితమైన శిక్ష విధిస్తాడు. ఇంకా మీ స్థానంలో మరొక సంఘాన్ని దేనినయినా లేపుతాడు. మీరు దేవునికి ఏమాత్రం నష్టం కలిగించలేరు. ఆయన ప్రతి వస్తువుపై అధికారం కలిగివున్నాడు. మీరు ఒకవేళ ప్రవక్తకు సహాయం చెయ్యకపోతే, ఏమీ ఫర్వాలేదు. అవిశ్వాసులు అతనిని బహిష్కరించినపుడూ అతను కేవలం ఇద్దరిలో రెండో వాడుగా ఉన్నప్పుడూ, వారిద్దరూ గుహలో ఉన్నప్పుడూ అతడు తన స్నేహితునితో, "విచారపడకు, అల్లాహ్ మనకు తోడుగా ఉన్నాడు" అని అన్నప్పుడూ[21] అల్లాహ్ అతనికి సహాయం చేశాడు. ఆ సమయంలో అల్లాహ్ అతనిపై తన తరఫునుండి మనశ్శాంతిని అవతరింపజేశాడు. అతనికి మీకు కానరాని దళాలతో సహాయపడ్డాడు. అవిశ్వాసుల మాటను కించపరిచాడు. అల్లాహ్ మాట సర్వదా సర్వోత్కృష్టమైనదే! అల్లాహ్ మహాశక్తి సంపన్నుడూ, మహావివేక వంతుడూనూ.

ఆయత్తులో తెలుపబడింది - దేవుని వద్ద నుండి ఆయన తీసుకువచ్చిన మార్గదర్శకత్వాన్నీ, సత్యధర్మాన్నీ ధర్మం వంటి స్వభావం కలిగివుండే సమస్త విధానాలపై, వ్యవస్థలపై ప్రబలింపజెయ్యటం. ఆయన తీసుకువచ్చిన జీవన వ్యవస్థ మరొక జీవన వ్యవస్థకు లోబడి, దాని ప్రాబల్యానికి లొంగి, అది ఇచ్చే రాయితీలతో అవకాశాలతో సర్దుబాటు చేసుకోవటానికి కాదు ప్రవక్త నియామకం జరిగింది. ఆయన భూమి ఆకాశాల చక్రవర్తికి ప్రతినిధిగా వస్తాడు. తన చక్రవర్తి పంపిన సత్యవ్యవస్థ ప్రాబల్యాన్ని చూడగోర్తాడు. ఒకవేళ మరొక జీవన వ్యవస్థ ఏదైనా ప్రపంచంలో ఉన్నప్పటికీ, అది దేవుని వ్యవస్థ ప్రసాదించే సౌలభ్యాలకు పరిమితమై మెలగవలసి ఉంటుంది. ఉదాహరణకు జిజియా ఇచ్చిన సందర్భంలో, జిమ్మీల జీవన వ్యవస్థ ఉన్న రీతిలో, అంతేకాని అవిశ్వాసులు ప్రాబల్యం వహించి, సత్యధర్మాన్ని విశ్వసించేవారు జిమ్మీలై ఉండే విధంగా మాత్రం కాదు.

17. నాలుగు హరాము మాసాలు అంటే జీఖాదా, జిల్ హజ్జహ్, ముహర్రమ్ మాసాలు హజ్ యాత్ర కొరకు, రజబ్ మాసం ఉమ్రా కొరకు.

18. అంటే, ఒకవేళ ముష్రిక్కులు ఈ మాసాలలో కూడా పోరాడటం మానుకోకపోతే, వారు సమైక్యమై మీతో పోరాడేవిధంగా మీరు కూడా సమైక్యమై వారితో పోరాడండి. బఖరా సూరాలోని 194వ ఆయత్తు ఈ ఆయత్తుకు వ్యాఖ్యానం.

اِنْفِرُوْا خِفَافًا وَّ ثِقَالًا وَّ جَاهِدُوْا بِاَمْوَالِكُمْ
وَ اَنْفُسِكُمْ فِيْ سَبِيْلِ اللّٰهِ ۭ ذٰلِكُمْ خَيْرٌ لَّكُمْ
اِنْ كُنْتُمْ تَعْلَمُوْنَ ۝٤١ لَوْ كَانَ عَرَضًا قَرِيْبًا
وَّسَفَرًا قَاصِدًا لَّاتَّبَعُوْكَ وَ لٰكِنْۢ بَعُدَتْ
عَلَيْهِمُ الشُّقَّةُ ۭ وَ سَيَحْلِفُوْنَ بِاللّٰهِ لَوِ
اسْتَطَعْنَا لَخَرَجْنَا مَعَكُمْ ۚ يُهْلِكُوْنَ اَنْفُسَهُمْ ۚ
وَاللّٰهُ يَعْلَمُ اِنَّهُمْ لَكٰذِبُوْنَ ۝٤٢

**41** బయలుదేరండి, తేలికగానైనా సరే, బరువుగానైనా సరే. అల్లాహ్ మార్గంలో పోరాడండి మీ సంపదలనూ, మీ ప్రాణాలనూ ఒడ్డి. ఇది మీకు శ్రేయస్కరమైనది, మీరు గనక తెలుసుకుంటే.

**42** ప్రవక్తా! లాభాలు గనక తేలికగా లభిస్తే, ప్రయాణం సులభతరమైతే వారు తప్పకుండా మీ వెంట రావటానికి సిద్ధపడేవారు. కాని వారికి ఈ మార్గం ఎంతో శ్రమతో కూడినదిగా కనిపించింది.[22] ఇప్పుడు వారు దేవునిపై మాటిమాటికీ ప్రమాణం చేసి మరీ అంటారు: మేము గనక రాగల స్థితిలో ఉన్నట్లయితే, నిశ్చయంగా మీ వెంట వచ్చి ఉండేవారమని. వారు తమను తాము వినాశంలో పడవేసు కుంటున్నారు. వారు అబద్ధం చెప్పేవారని అల్లాహ్‌కు బాగా తెలుసు.

---

19. అరేబియాలో 'నసీ' రెండు రకాలుగా ఉండేది. ఒక రకం ఇది : యుద్ధంకోసం, విధ్వంసక చర్యలకోసం, హత్యా ప్రతీకారం కోసం ఒక హరాము మాసాన్ని హలాలు మాసంగా నిర్ణయించుకునేవారు. దీనికి బదులుగా ఒక హలాలు మాసాన్ని హరాము మాసంగా చేసుకుని మాసాల సంఖ్యను పూర్తిచేసుకునేవారు. రెండోరకం ఏమిటంటే, చాంద్రమాన సంవత్సరాన్ని సూర్యమాన సంవత్సరంతో సరిపెట్టటానికి అధికమాసాన్ని ఒకదాన్ని చేర్చేవారు, హజ్ యాత్ర ఎల్లప్పుడూ ఒకే రుతువులో వస్తూ ఉండటానికి చాంద్రమానం ప్రకారం విభిన్న రుతువులలో హజ్ తిరుగుతూ ఉండడం వల్ల కలిగే ఇబ్బందులు వారికి కలుగకుండా ఉండటానికి. ఈ విధంగా 33 సంవత్సరాల వరకు హజ్ యాత్ర తన అసలు సమయానికి భిన్నంగా వేరే తేదీల్లో జరిగింది. కేవలం 34వ సంవత్సరంలో మాత్రమే ఒకసారి జిల్ హజ్జహ్ మాసం 9 – 10 తేదీలలో జరిగింది. మహాప్రవక్త (సఅసమ్) ఈ సంవత్సరమే హజ్జతుల్ విదాను జరిపారు. ఆ సంవత్సరమే హజ్ యాత్ర తన అసలు తేదీలలో వచ్చింది. అప్పటి నుండే 'నసీ' పద్ధతి రద్దు చెయ్యబడింది.
20. ఈ ఆయతులు 9వ రుకూ చివరి వరకు తబూక్ సంగ్రామం కొరకు సన్నాహాలు జరుగుతున్న కాలంలో అవతరించాయి.
21. మక్కా అవిశ్వాసులు మహాప్రవక్త (సఅసమ్)ను హత్య చెయ్యటానికే నిర్ణయించారు. ఆయన సరిగ్గా హత్య కొరకు నిర్ణయించబడిన రాత్రే మక్కా నుండి బయలుదేరి, సౌర్ గుహలో మూడు రోజులు దాక్కున్నారు. తరువాత మదీనా వైపునకు వలసపోయారు. ఇక్కడ ఈ సందర్భాన్నే ప్రస్తావించటం జరిగింది. అప్పుడు గుహలో హజ్రత్ అబూబకర్ (రజిఅన్) మహాప్రవక్త (సఅసమ్)తో ఉన్నారు.
22. అంటే, రోమ్ వంటి శక్తితో యుద్ధం చెయ్యవలసి రావటంవల్ల, తీవ్రమైన ఎండాకాలం అవటంవల్ల, దేశంలో కరవు పరిస్థితులు నెలకొని ఉండటంవల్ల, ఆశలు పెట్టుకున్న కొత్తపైర్లు కోతకు రావటం వల్ల వారికి తబూక్ ప్రయాణం భారం అనిపించసాగింది.

**43 - 45** ప్రవక్తా! అల్లాహ్ నిన్ను క్షమించుగాక, నీవు వారికి అనుజ్ఞ ఎందుకు ఇచ్చావు? (వారికి నీవై అనుజ్ఞ ఇవ్వకుండా ఉండవలసింది) ఎవరు సత్యవంతులో నీకు స్పష్టమై ఉండేది. ఇంకా అబద్ధం చెప్పేవారిని కూడా నీవు తెలుసుకొని ఉండేవాడవు. అల్లాహ్‌పై, అంతిమదినంపై విశ్వాసం కలిగి ఉండేవారు, తమ ప్రాణాలనూ, తమ సంపదలనూ ఒడ్డి పోరాడే విషయంలో తమను మన్నించవలసినదని నిన్ను ఎన్నటికీ అభ్యర్థించరు. భయభక్తులు కలవారిని అల్లాహ్ బాగా ఎరుగును. అల్లాహ్‌నూ, అంతిమదినాన్ని విశ్వసించని వారు తమ మనస్సులో సంశయాలు ఉండి వాటిలోనే ఊగిసలాడేవారు మాత్రమే అటువంటి అభ్యర్థనలను చేస్తారు.

**46 - 48** ఒకవేళ నిజంగానే వారికి బయలుదేరాలనే ఉద్దేశం ఉంటే, దాని కొరకు వారు ఏవైనా సన్నాహాలు చేసి వుండేవారు. కాని అల్లాహ్‌కు వారు బయలుదేరటం అసలు ఇష్టం లేదు. కనుక ఆయన వారికి బద్ధకం కలుగజేశాడు. ఇంకా, "వెనుక ఉండిపోయేవారితోనే ఉండిపోండి" అని వారికి చెప్పబడింది. వారు గనక మీతో బయలుదేరి ఉండినట్లయితే, మీకు కీడు తప్ప మరి దేనినీ అధికం చేసివుండేవారు కాదు. వారు మీ మధ్య విభేదాల్ని సృష్టించే నిమిత్తం తీవ్రప్రయత్నాలు చేస్తూ ఉంటారు. మీ వర్గం వారిలో వారి మాటలను చెవియొగ్గి వినేవారు ఇప్పటికీ చాలామంది ఉన్నారు. అల్లాహ్ ఆ దుర్మార్గులను బాగా ఎరుగును. ఇంతకుముందు కూడా వారు విభేదాలను సృష్టించే ప్రయత్నాలు చేశారు. మిమ్మల్ని ఓడించటానికి, వారు అన్ని రకాల వ్యూహాలను మార్చి మార్చి ప్రయోగించారు. చివరకు వారి ఇష్టానికి వ్యతిరేకంగా సత్యం వచ్చేసింది. అల్లాహ్ కార్యం నెరవేరిపోయింది.

**49** వారిలో ఒకడు ఇలా అంటాడు: "నాకు అనుజ్ఞ ఇవ్వండి. నన్ను పరీక్షకు గురిచెయ్యకండి"- వినండి! వారు పరీక్షకే గురిఅయివున్నారు. నరకం ఈ అవిశ్వాసులను చుట్టుముట్టి ఉన్నది.

عَفَا اللّٰهُ عَنْكَ ۚ لِمَ اَذِنْتَ لَهُمْ حَتّٰى يَتَبَيَّنَ
لَكَ الَّذِيْنَ صَدَقُوْا وَ تَعْلَمَ الْكٰذِبِيْنَ ﴿٤٣﴾ لَا
يَسْتَاْذِنُكَ الَّذِيْنَ يُؤْمِنُوْنَ بِاللّٰهِ وَ الْيَوْمِ
الْاٰخِرِ اَنْ يُّجَاهِدُوْا بِاَمْوَالِهِمْ وَ اَنْفُسِهِمْ ؕ
وَاللّٰهُ عَلِيْمٌۢ بِالْمُتَّقِيْنَ ﴿٤٤﴾ اِنَّمَا يَسْتَاْذِنُكَ
الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِاللّٰهِ وَالْيَوْمِ الْاٰخِرِ وَ
ارْتَابَتْ قُلُوْبُهُمْ فَهُمْ فِيْ رَيْبِهِمْ
يَتَرَدَّدُوْنَ ﴿٤٥﴾ وَ لَوْ اَرَادُوا الْخُرُوْجَ لَاَعَدُّوْا
لَهٗ عُدَّةً وَّلٰكِنْ كَرِهَ اللّٰهُ انْۢبِعَاثَهُمْ فَثَبَّطَهُمْ وَ
قِيْلَ اقْعُدُوْا مَعَ الْقٰعِدِيْنَ ﴿٤٦﴾ لَوْ خَرَجُوْا فِيْكُمْ
مَّا زَادُوْكُمْ اِلَّا خَبَالًا وَّلَاۡاَوْضَعُوْا خِلٰلَكُمْ
يَبْغُوْنَكُمُ الْفِتْنَةَ ۚ وَ فِيْكُمْ سَمّٰعُوْنَ لَهُمْ ؕ وَ
اللّٰهُ عَلِيْمٌۢ بِالظّٰلِمِيْنَ ﴿٤٧﴾ لَقَدِ ابْتَغَوُا الْفِتْنَةَ
مِنْ قَبْلُ وَقَلَّبُوْا لَكَ الْاُمُوْرَ حَتّٰى جَآءَ الْحَقُّ
وَ ظَهَرَ اَمْرُ اللّٰهِ وَهُمْ كٰرِهُوْنَ ﴿٤٨﴾ وَ مِنْهُمْ
مَّنْ يَّقُوْلُ ائْذَنْ لِّيْ وَ لَا تَفْتِنِّيْ ؕ اَلَا فِي
الْفِتْنَةِ سَقَطُوْا ؕ وَ اِنَّ جَهَنَّمَ لَمُحِيْطَةٌۢ
بِالْكٰفِرِيْنَ ﴿٤٩﴾

**50 - 51** మీకు మేలు కలిగితే వారికి బాధ కలుగుతుంది. ఏదైనా ఆపద మీమీదకు వచ్చిపడినప్పుడు వారు ముఖాన్ని త్రిప్పుకొని సంతోషంతో పొంగిపోతూ మరలిపోతారు. ఇలా అంటూ పోతారు: "మేము ముందే మా వ్యవహారాన్ని సరిచేసుకోవటం మంచిదయింది". వారితో ఇలా అనండి : "అల్లాహ్ మా కొరకు వ్రాసి ఉంచింది తప్ప మాకు ఏదీ (చెడుగానీ మంచిగానీ) ఏమాత్రం కలగదు. అల్లాహ్‌యే మా సంరక్షకుడు. విశ్వసించేవారు ఆయననే నమ్ముకోవాలి."

**52** వారితో ఇలా అనండి: "మీరు మా విషయంలో దేనికొరకు నిరీక్షిస్తున్నారో అది, రెండు మేళ్లలో ఒకటితప్ప మరొకటేముంది?[23] ఇక మీ విషయంలో మేము నిరీక్షిస్తున్నది ఏమిటంటే, అల్లాహ్ స్వయంగా మీకు శిక్ష ఇస్తాడా లేక మా చేతుల ద్వారా ఇప్పిస్తాడా అనేది. మంచిది, అయితే ఇక మీరు కూడా నిరీక్షించండి. మేము కూడా మీతోపాటే నిరీక్షిస్తాము."

**53 - 55** వారికి ఇలా చెప్పండి: "మీరు మీ సంపదలను ఇష్టంతో ఖర్చు చేసినా లేదా ఇష్టం లేకుండా ఖర్చుచేసినా అవి ఎట్టి పరిస్థితులలోనూ స్వీకరించబడవు. ఎందుకంటే, మీరు దుర్మార్గులు. వారు ఇచ్చిన సంపద స్వీకరించబడకపోవటానికి దీనికంటే మరొక కారణమేదీలేదు. వారు అల్లాహ్‌నూ ఆయన ప్రవక్తనూ తిరస్కరించారు. నమాజుకు వస్తే బద్ధకంతో వస్తారు. దేవుని మార్గంలో ఖర్చు పెడితే అయిష్టంగానే ఖర్చుపెడతారు. వారి సిరిసంపదలనూ, వారి అధిక సంతానాన్ని చూసి మోసపోవద్దు. అల్లాహ్ మాత్రం ఈ వస్తువుల ద్వారానే వారిని ప్రాపంచిక జీవితంలో కూడా శిక్షకు గురిచెయ్యాలనీ, వారు ప్రాణ త్యాగం చేసినా సత్యతిరస్కార స్థితిలోనే చెయ్యాలనీ కోరుతున్నాడు.

**56 - 57** వారు దేవునిమీద మాటిమాటికీ ప్రమాణం చేసి, మేము మీవారమే అని అంటారు. వాస్తవానికి వారు ఎంతమాత్రం మీవారు కారు. అసలు వారు మీరంటే భయపడతారు. వారికి గనక ఏదైనా ఆశ్రయంగానీ, గుహగానీ, దూరి కూర్చుండేస్థలం గానీ దొరికితే గబగబా పరుగెత్తి అందులో దాక్కుంటారు.

إِن تُصِبْكَ حَسَنَةٌ تَسُؤْهُمْ ۖ وَإِن تُصِبْكَ
مُصِيبَةٌ يَقُولُوا قَدْ أَخَذْنَا أَمْرَنَا مِن قَبْلُ
وَيَتَوَلَّوا وَّهُمْ فَرِحُونَ ﴿٥٠﴾ قُل لَّن يُصِيبَنَا
إِلَّا مَا كَتَبَ اللَّهُ لَنَا هُوَ مَوْلَانَا ۚ وَعَلَى اللَّهِ
فَلْيَتَوَكَّلِ الْمُؤْمِنُونَ ﴿٥١﴾ قُلْ هَلْ تَرَبَّصُونَ
بِنَا إِلَّا إِحْدَى الْحُسْنَيَيْنِ ۖ وَنَحْنُ
نَتَرَبَّصُ بِكُمْ أَن يُصِيبَكُمُ اللَّهُ بِعَذَابٍ مِّنْ
عِندِهِ أَوْ بِأَيْدِينَا ۖ فَتَرَبَّصُوا إِنَّا مَعَكُم
مُّتَرَبِّصُونَ ﴿٥٢﴾ قُلْ أَنفِقُوا طَوْعًا أَوْ كَرْهًا
لَّن يُتَقَبَّلَ مِنكُمْ ۖ إِنَّكُمْ كُنتُمْ قَوْمًا
فَاسِقِينَ ﴿٥٣﴾ وَمَا مَنَعَهُمْ أَن تُقْبَلَ مِنْهُمْ
نَفَقَاتُهُمْ إِلَّا أَنَّهُمْ كَفَرُوا بِاللَّهِ وَبِرَسُولِهِ وَ
لَا يَأْتُونَ الصَّلَاةَ إِلَّا وَهُمْ كُسَالَىٰ وَلَا
يُنفِقُونَ إِلَّا وَهُمْ كَارِهُونَ ﴿٥٤﴾ فَلَا تُعْجِبْكَ
أَمْوَالُهُمْ وَلَا أَوْلَادُهُمْ ۚ إِنَّمَا يُرِيدُ اللَّهُ
لِيُعَذِّبَهُم بِهَا فِي الْحَيَاةِ الدُّنْيَا وَتَزْهَقَ
أَنفُسُهُمْ وَهُمْ كَافِرُونَ ﴿٥٥﴾ وَيَحْلِفُونَ بِاللَّهِ
إِنَّهُمْ لَمِنكُمْ وَمَا هُم مِّنكُمْ وَلَٰكِنَّهُمْ قَوْمٌ
يَفْرَقُونَ ﴿٥٦﴾ لَوْ يَجِدُونَ مَلْجَأً أَوْ مَغَارَاتٍ أَوْ
مُدَّخَلًا لَّوَلَّوْا إِلَيْهِ وَهُمْ يَجْمَحُونَ ﴿٥٧﴾

23. అంటే, అల్లాహ్ మార్గంలో షహాదత్ (అమరగతి) లేక ఇస్లామ్ విజయం.

وَ مِنۡهُمۡ مَّنۡ يَّلۡمِزُكَ فِى الصَّدَقٰتِ‌ ۚ فَاِنۡ
اُعۡطُوۡا مِنۡهَا رَضُوۡا وَاِنۡ لَّمۡ يُعۡطَوۡا مِنۡهَاۤ اِذَا
هُمۡ يَسۡخَطُوۡنَ ﴿۵۸﴾ وَلَوۡ اَنَّهُمۡ رَضُوۡا مَاۤ اٰتٰٮهُمُ
اللّٰهُ وَرَسُوۡلُهٗ ۙ وَقَالُوۡا حَسۡبُنَا اللّٰهُ سَيُؤۡتِيۡنَا
اللّٰهُ مِنۡ فَضۡلِهٖ وَرَسُوۡلُهٗۤ ۙ اِنَّاۤ اِلَى اللّٰهِ
رٰغِبُوۡنَ ﴿۵۹﴾ اِنَّمَا الصَّدَقٰتُ لِلۡفُقَرَآءِ وَ
الۡمَسٰكِيۡنِ وَالۡعٰمِلِيۡنَ عَلَيۡهَا وَالۡمُؤَلَّـفَةِ قُلُوۡبُهُمۡ
وَفِى الرِّقَابِ وَالۡغٰرِمِيۡنَ وَفِىۡ سَبِيۡلِ اللّٰهِ
وَابۡنِ السَّبِيۡلِ‌ ؕ فَرِيۡضَةً مِّنَ اللّٰهِ‌ ؕ وَاللّٰهُ
عَلِيۡمٌ حَكِيۡمٌ ﴿۶۰﴾

**58 - 60** ప్రవక్తా! వారిలో కొందరు సదఖాత్[24] పంపకం విషయంలో నీపట్ల ఆక్షేపణలు తెలుపుతారు. ఒకవేళ ఈ నిధుల నుండి ఏదైనా వారికిస్తే సంతోషిస్తారు. ఇవ్వకపోతే ఆగ్రహిస్తారు. అల్లాహ్, ఆయన ప్రవక్త వారికి ఇచ్చిన దానితో తృప్తిపడి ఇలా అనివుంటే ఎంత బాగుండేది: “అల్లాహ్ మాకు చాలు. ఆయన తన అనుగ్రహంతో మాకు ఇంకా చాలా ఇస్తాడు. ఆయన ప్రవక్త కూడా మాపై దయచూపుతాడు. మేము అల్లాహ్ వైపునకే దృష్టిని నిలిపి వున్నాము.” ఈ జకాత్ నిధులు అసలు కేవలం నిరుపేదలకు, అక్కరలు తీరని వారికీ,[25] జకాత్ వ్యవహారాలకై నియుక్తులైన వారికీ, ఇంకా ఎవరి హృదయా లను గెలుచుకోవటం అవసరమో వారికీ,[26] ఇంకా బానిసల విముక్తికీ,[27] రుణగ్రస్తుల సహాయానికీ, దేవుని మార్గంలోనూ[28] బాటసారుల ఆతిథ్యానికీ[29] వినియోగించటం కొరకు, ఇది అల్లాహ్ తరఫు నుండి నిర్ణయించబడిన ఒక విధి. అల్లాహ్ అన్నీ ఎరిగినవాడూ వివేకవంతుడూను.

24. అంటే, జకాత్ నిధులు.

25. మూలంలోని ఫకీరు పదం అంటే, తన ఆర్థిక అవసరాలకొరకు ఇతరుల సహాయంపై ఆధారపడేవాడు. మసాకీన్ అంటే, మామూలు పేదవాళ్ళకంటే ఎక్కువ లేమితో బాధపడేవారు.

26. హృదయాలను గెలుచుకోవటం అనే ఈ ఆజ్ఞ ఉద్దేశ్యం ఏమిటంటే, ఇస్లామ్ వ్యతిరేకతలో చురుకుగా ఉన్నవారికి డబ్బు ఇచ్చి వారి విరోధభావాన్ని చల్లబరచే అవకాశం ఉంటే లేదా అవిశ్వాసుల శిబిరంలోని వారెవరైనా డబ్బు తీసుకుని దాని నుండి చీలి ముస్లిములకు సహాయకులయ్యే అవకాశం ఉంటే, లేదా ఎవరైనా కొత్త కొత్తగా ఇస్లామ్‌లో ప్రవేశించినప్పుడు వారి బలహీనతలను చూసి, వారికి ధన సహాయం చెయ్యకపోయినట్లయితే మళ్ళీ అవిశ్వాసుల శిబిరం వైపునకు మరలిపోతారనే భయం కలిగితే, అటువంటి వారికి శాశ్వతమైన పించన్లూ, లేదా తాత్కాలికమైన కానుకలూ ఇచ్చి వారిని ఇస్లామ్‌కు సహాయసహకారాలు అందజేసేవారుగా, విధేయులుగా, ఆజ్ఞాపాలకులుగా లేక కనీసం నిరపాయకరులైన శత్రువులుగా చేసుకోవచ్చు.

27. అంటే, బానిసలను స్వతంత్రులుగా చెయ్యటానికి అని భావం.

28. ‘దేవుని మార్గం’ అనే పదం విస్తృతార్థం కలిగినది. అల్లాహ్ సంతోషం కోసం చెయ్యబడే సమస్త సత్కార్యాలూ దీని భావంలో ఇమిడివున్నాయి. విద్వాంసులలో ఒక వర్గం ఈ అభిప్రాయాన్ని వెలిబుచ్చింది. ఈ ఆజ్ఞ ప్రకారం జకాత్ సొమ్మును ప్రతి సత్కార్యం కొరకూ వినియోగించవచ్చు. కాని అధిక సంఖ్యాకులు ఇలా అభిప్రాయపడ్డారు: ఇక్కడ అల్లాహ్ మార్గంలో అంటే అల్లాహ్ మార్గంలో జిహాద్ అని భావం. అంటే, అవిశ్వాసపు వ్యవస్థను తొలగించి దాని స్థానంలో ఇస్లామీ వ్యవస్థను నెలకొల్పటానికి చేసే కృషి. ఈ కృషిలో పాల్గొనే వారి ప్రయాణపు ఖర్చులకొరకూ వాహనం కొరకూ ఆయుధాలు మొదలైన సకల సామగ్రిని సమకూర్చటానికి జకాత్ నిధుల నుండి సహాయం ఇవ్వవచ్చు. వారు తమ అవసరాలకు సహాయం అక్కరలేని సంపన్నులైన వారైనాసరే.

29. ప్రయాణీకుడు తన ఇంటిదగ్గర ధనవంతుడైనప్పటికీ ప్రయాణ సమయంలో ఒకవేళ అతనికి సహాయం అవసరం అయితే అతనికి జకాత్ నిధుల నుండి సహాయం చెయ్యవచ్చు.

وَمِنْهُمُ الَّذِيْنَ يُؤْذُوْنَ النَّبِيَّ وَيَقُوْلُوْنَ هُوَ
اُذُنٌ ؕ قُلْ اُذُنُ خَيْرٍ لَّكُمْ يُؤْمِنُ بِاللّٰهِ
وَيُؤْمِنُ لِلْمُؤْمِنِيْنَ وَرَحْمَةٌ لِّلَّذِيْنَ اٰمَنُوْا
مِنْكُمْ ؕ وَالَّذِيْنَ يُؤْذُوْنَ رَسُوْلَ اللّٰهِ لَهُمْ
عَذَابٌ اَلِيْمٌ ﴿٦١﴾ يَحْلِفُوْنَ بِاللّٰهِ لَكُمْ
لِيُرْضُوْكُمْ ۚ وَاللّٰهُ وَرَسُوْلُهٗۤ اَحَقُّ اَنْ يُّرْضُوْهُ
اِنْ كَانُوْا مُؤْمِنِيْنَ ﴿٦٢﴾ اَلَمْ يَعْلَمُوْۤا اَنَّهٗ مَنْ
يُّحَادِدِ اللّٰهَ وَرَسُوْلَهٗ فَاَنَّ لَهٗ نَارَ جَهَنَّمَ
خَالِدًا فِيْهَا ؕ ذٰلِكَ الْخِزْيُ الْعَظِيْمُ ﴿٦٣﴾ يَحْذَرُ
الْمُنٰفِقُوْنَ اَنْ تُنَزَّلَ عَلَيْهِمْ سُوْرَةٌ تُنَبِّئُهُمْ
بِمَا فِيْ قُلُوْبِهِمْ ؕ قُلِ اسْتَهْزِءُوْا ۚ اِنَّ اللّٰهَ
مُخْرِجٌ مَّا تَحْذَرُوْنَ ﴿٦٤﴾ وَلَئِنْ سَاَلْتَهُمْ
لَيَقُوْلُنَّ اِنَّمَا كُنَّا نَخُوْضُ وَنَلْعَبُ ؕ قُلْ
اَبِاللّٰهِ وَاٰيٰتِهٖ وَرَسُوْلِهٖ كُنْتُمْ تَسْتَهْزِءُوْنَ ﴿٦٥﴾
لَا تَعْتَذِرُوْا قَدْ كَفَرْتُمْ بَعْدَ اِيْمَانِكُمْ ؕ اِنْ
نَّعْفُ عَنْ طَآئِفَةٍ مِّنْكُمْ نُعَذِّبْ طَآئِفَةً
بِاَنَّهُمْ كَانُوْا مُجْرِمِيْنَ ﴿٦٦﴾

**61** వారిలో కొందరు ప్రవక్తను తమ మాటలతో నొప్పించేవారు ఉన్నారు. "ఈ మనిషి ఎప్పుడూ చెప్పుడు మాటలు వింటాడు" అని అంటారు. ఇలా చెప్పండి: "ఆయన మీ మేలుకొరకే అలా ఉన్నాడు. అల్లాహ్‌ను విశ్వసిస్తాడు. విశ్వసించినవారిని నమ్ముతాడు. మీలో విశ్వాసులైన వారికొరకు పూర్తిగా కారుణ్యా మూర్తి. అల్లాహ్ ప్రవక్తను నొప్పించే వారికి వ్యధాభరితమైన శిక్షపడుతుంది."

**62 – 63** వారు మీ ముందు ప్రమాణాలు చేస్తారు, మిమ్మల్ని సంతోషపెట్టటానికి. వాస్తవానికి వారు విశ్వాసులే అయితే అల్లాహ్‌నూ ఆయన ప్రవక్తనూ సంతోషపెట్టటానికి వారు చింతన చేయాలి. ఎందుకంటే వారు ఎక్కువ హక్కుదారులు. వారికి తెలియదా, అల్లాహ్‌నూ ఆయన ప్రవక్తనూ ఎదుర్కొనే వాడి కొరకు నరకాగ్ని ఉందనీ, అందులోనే కలకాలం ఉంటాడనీ? ఇది పెద్ద అవమానం.

**64 – 66** ఈ కపటులు భయపడుతున్నారు, వారి హృదయాలలో ఉన్న రహస్యాలను బయటపెట్టే సూరా ఏదైనా ముస్లిములపై అవతరిస్తుందేమో అని. ప్రవక్తా! వారితో ఇలా అను: "ఇంకా ఎగతాళి చెయ్యండి. బయటపడుతుందని మీరు భయపడుతూ ఉన్న ఆ విషయాన్నే అల్లాహ్ బయటపెట్టబోతున్నాడు." మీరు చెప్పుకుంటూ ఉన్న విషయం ఏమిటి? అని ఒకవేళ వారిని అడిగితే, మేము సరదాగా వేళాకోళంగా మాట్లాడుకుంటున్నాము[30] అని తక్షణం బదులు చెబుతారు. వారితో ఇలా అను : "మీ వేళాకోళం, అల్లాహ్‌తోనా ఆయన ఆయతులతోనా, ఆయన ప్రవక్తతోనా? ఇక సాకులు చెప్పకండి. మీరు విశ్వసించిన తరువాత అవిశ్వాసానికి పాల్పడ్డారు. ఒకవేళ మేము మీలో ఒక వర్గాన్ని క్షమించినా, రెండో వర్గానికి మాత్రం తప్పనిసరిగా శిక్ష విధిస్తాము. ఎందుకంటే వారు అపరాధులు."

30. తబూక్ యుద్ధకాలంలో కపటులు తరచుగా తమ సమావేశాలలో కూర్చుని మహాప్రవక్త (సఅసమ్)ను, ముస్లిములను గేలిచేసేవారు. సదుద్దేశ్యంతో జిహాద్ కొరకు సిద్ధంగా ఉన్నవారిని తమ పరిహాసాలతో అధైర్యపరిచే ప్రయత్నం చేసేవారు. హదీసులలో వారి మాటలు ఎన్నో నకలు చెయ్యబడ్డాయి. ఉదాహరణకు : ఒకచోట కొందరు కపటులు కూర్చుని బాతాఖానీ కొడుతున్నారు. ఒకడు ఇలా అన్నాడు :"ఏమండీ, రోమనులను కూడా మీరు అరబ్బుల మాదిరిగా భావించారా? రేపు చూడండి, పోరాడటానికి విచ్చేసిన ఈ యోధులందరూ త్రాళ్ళతో బంధింపబడి ఉంటారు." రెండోవాడు ఇలా అందుకున్నాడు : "భలే మజాగా ఉంటుందిలే, ఆపైన నూరేసి

وقف لازم

اَلْمُنٰفِقُوْنَ وَالْمُنٰفِقٰتُ بَعْضُهُمْ مِّنْۢ بَعْضٍۘ
يَاْمُرُوْنَ بِالْمُنْكَرِ وَيَنْهَوْنَ عَنِ الْمَعْرُوْفِ
وَيَقْبِضُوْنَ اَيْدِيَهُمْ ؕ نَسُوا اللّٰهَ فَنَسِيَهُمْ ؕ اِنَّ
الْمُنٰفِقِيْنَ هُمُ الْفٰسِقُوْنَ ﴿۶۷﴾ وَعَدَ اللّٰهُ الْمُنٰفِقِيْنَ
وَالْمُنٰفِقٰتِ وَالْكُفَّارَ نَارَ جَهَنَّمَ خٰلِدِيْنَ
فِيْهَا ؕ هِيَ حَسْبُهُمْ ۚ وَلَعَنَهُمُ اللّٰهُ ۚ وَلَهُمْ
عَذَابٌ مُّقِيْمٌ ﴿۶۸﴾ كَالَّذِيْنَ مِنْ قَبْلِكُمْ كَانُوْۤا
اَشَدَّ مِنْكُمْ قُوَّةً وَّاَكْثَرَ اَمْوَالًا وَّاَوْلَادًا ؕ
فَاسْتَمْتَعُوْا بِخَلَاقِهِمْ فَاسْتَمْتَعْتُمْ بِخَلَاقِكُمْ كَمَا
اسْتَمْتَعَ الَّذِيْنَ مِنْ قَبْلِكُمْ بِخَلَاقِهِمْ وَخُضْتُمْ
كَالَّذِيْ خَاضُوْا ؕ اُولٰٓئِكَ حَبِطَتْ اَعْمَالُهُمْ فِي
الدُّنْيَا وَالْاٰخِرَةِ ۚ وَاُولٰٓئِكَ هُمُ الْخٰسِرُوْنَ ﴿۶۹﴾
اَلَمْ يَاْتِهِمْ نَبَاُ الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ قَوْمِ نُوْحٍ وَّ
عَادٍ وَّثَمُوْدَ ۙ وَقَوْمِ اِبْرٰهِيْمَ وَاَصْحٰبِ مَدْيَنَ
وَالْمُؤْتَفِكٰتِ ؕ اَتَتْهُمْ رُسُلُهُمْ بِالْبَيِّنٰتِ ۚ
فَمَا كَانَ اللّٰهُ لِيَظْلِمَهُمْ وَلٰكِنْ كَانُوْۤا اَنْفُسَهُمْ
يَظْلِمُوْنَ ﴿۷۰﴾

**67 - 70** కపటులైన పురుషులూ, కపటులైన స్త్రీలూ అందరూ ఒకే కోవకు చెందినవారు; వారు చెడును చెయ్యండి అని ఆజ్ఞాపిస్తారు. మంచిని చెయ్యవద్దు అని వారిస్తారు. ఇంకా తమ చేతులను మేలుచేయకుండా ఆపుతారు. వారు అల్లాహ్‌ను మరచిపోయారు. కనుక అల్లాహ్ కూడా వారిని మరచి పోయాడు. నిశ్చయంగా ఈ కపటులే ద్రోహులు. కపటులైన ఈ పురుషులకూ, స్త్రీలకూ అవిశ్వాసులకూ అల్లాహ్ నరకాగ్నిని వాగ్దానం చేశాడు. అందులో వారు కలకాలం ఉంటారు. అదే వారికి యోగ్యమైనది. వారిపై అల్లాహ్ శాపం పడింది. వారికొరకు శాశ్వతమైన శిక్ష ఉంది - మీవి కూడ మీకు ముందువారి తీరుతెన్నులే. వారు మీకంటే ఎక్కువ బలాఢ్యులు. ఎక్కువ సంపద, ఎక్కువ సంతానం కలిగివుండేవారు. పైగా వారు ప్రపంచంలో తమ వంతు సుఖాలను జుర్రుకున్నారు. మీరు కూడా మీవంతు సుఖాలను వారు అనుభవించిన మాదిరి గానే అనుభవించారు. ఇంకా వారు పడినటువంటి వాదోప వాదాలలోనే మీరూ పడ్డారు. కనుక వారి ముగింపు ఎలా జరిగిందంటే, వారు చేసినదంతా ప్రపంచంలోనూ వ్యర్థమై పోయింది, పరలోకంలోనూ వ్యర్థమైపోయింది. వారే నష్టానికి గురి అయ్యారు - వారికి తమ పూర్వీకుల చరిత్ర అందలేదా? నూహ్ జాతి ప్రజలు ఆద్, సమూద్ జాతులు, ఇబ్రాహీమ్ జాతి ప్రజలు, మద్‌యన్ ప్రజలు, తల్లక్రిందులు చేయబడిన పట్టణాలు?[31] వారి ప్రవక్తలు వారివద్దకు స్పష్టమైన నిదర్శనా లను తీసుకువచ్చారు. అయితే వారికి అల్లాహ్ అన్యాయం చెయ్యలేదు. వారే తమకు తాము అన్యాయం చేసుకున్నారు.

కొరడా దెబ్బలు కొట్టే ఆజ్ఞ ఇవ్వబడితే." మరొక కపటుడు, మహాప్రవక్త (సఅసమ్) యుద్ధ సన్నాహాలు చురుగ్గా చేస్తూ ఉండగా చూసి తన ప్రియ మిత్రులతో అన్నాడు: "ఆయన్ని చూడండి! రోమ్, సిరియా కోటలను జయిం చటానికి బయలుదేరాడు."

31. అంటే, తల్లక్రిందులు చెయ్యబడిన లూత్ జాతి పట్టణాలు.

**71 - 72** విశ్వాసులైన పురుషులూ, విశ్వాసులైన స్త్రీలూ, వారందరూ ఒకరికొకరు సహచరులు, వారు మేలు చెయ్యండి అని ఆజ్ఞాపిస్తారు. చెడు చెయ్యవద్దు అని నిరోధిస్తారు. నమాజును స్థాపిస్తారు. జకాత్‌ను ఇస్తారు. అల్లాహ్ పట్ల ఆయన ప్రవక్త పట్ల విధేయత పాటిస్తారు. వారిమీదనే అల్లాహ్ తన కారుణ్యాన్ని తప్పకుండా అవతరింపజేస్తాడు. నిశ్చయంగా అల్లాహ్ అందరికంటే ప్రబలుడు. వివేకవంతుడూ, వివేచనా పరుడూను. విశ్వాసులైన ఈ పురుషులకూ, స్త్రీలకూ అల్లాహ్ వాగ్దానం చేశాడు, క్రింద కాలువలు ప్రవహించే తోటలను వారికి ఇస్తాను అని. వారు వాటిలో శాశ్వతంగా ఉంటారు. నిత్యమూ కళకళలాడే ఆ ఉద్యాన వనాలలో వారికొరకు పరిశుద్ధమైన నివాసాలు ఉంటాయి. ఇంకా అన్నింటికంటే మించిన అల్లాహ్ ప్రసన్నత వారికి లభిస్తుంది. అదే గొప్ప సాఫల్యం.

**73 - 74** ప్రవక్తా![32] అవిశ్వాసులూ, కపటులూ ఈ ఉభయులనూ పూర్తి శక్తితో ఎదుర్కో. వారితో కఠినంగా వ్యవహరించు. చివరకు వారి నివాస స్థలం నరకమే, అది అతి చెడ్డ నివాస స్థలం. మేము ఆ మాటను అనలేదు అని వారు మాటిమాటికీ దేవునిపై ప్రమాణంచేసి అంటారు. వాస్తవానికి వారు ఆ అవిశ్వాసపు మాటను అన్నారు.[33] వారు ఇస్లామ్‌ను స్వీకరించిన తరువాత అవిశ్వాసానికి ఒడిగట్టారు. వారు దేనిని చెయ్యాలని అనుకున్నారో దానిని చెయ్యలేకపోయారు.[34] అల్లాహ్, ఆయన ప్రవక్తా తమ అనుగ్రహంతో వారిని సంపన్నులుగా చేశారనే కదా వారు ఆగ్రహిస్తున్నారు. ఇక వారు తమ ఈ వైఖరిని మానుకుంటే, అది వారికే మేలు.వారు గనక మానుకోక పోతే, అల్లాహ్ వారికి అత్యంత బాధాకరమైన శిక్ష విధిస్తాడు. ప్రపంచంలోనూ పరలోకంలోనూ వారిని సమర్థించేవాడూ వారికి సహాయం చేసే వాడూ ఇలలో ఎవడూ లేడు.

وَالْمُؤْمِنُوْنَ وَالْمُؤْمِنٰتُ بَعْضُهُمْ اَوْلِيَآءُ
بَعْضٍ ۘ يَاْمُرُوْنَ بِالْمَعْرُوْفِ وَ يَنْهَوْنَ عَنِ وقف لازم
الْمُنْكَرِ وَ يُقِيْمُوْنَ الصَّلٰوةَ وَ يُؤْتُوْنَ الزَّكٰوةَ
وَيُطِيْعُوْنَ اللّٰهَ وَ رَسُوْلَهٗ ؕ اُولٰٓئِكَ
سَيَرْحَمُهُمُ اللّٰهُ ؕ اِنَّ اللّٰهَ عَزِيْزٌ حَكِيْمٌ ﴿٧١﴾
وَعَدَ اللّٰهُ الْمُؤْمِنِيْنَ وَ الْمُؤْمِنٰتِ جَنّٰتٍ
تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ خٰلِدِيْنَ فِيْهَا وَ
مَسٰكِنَ طَيِّبَةً فِيْ جَنّٰتِ عَدْنٍ ؕ وَ رِضْوَانٌ
مِّنَ اللّٰهِ اَكْبَرُ ؕ ذٰلِكَ هُوَ الْفَوْزُ الْعَظِيْمُ ﴿٧٢﴾ ع ٩ ٦ ١٥
يٰٓاَيُّهَا النَّبِيُّ جَاهِدِ الْكُفَّارَ وَالْمُنٰفِقِيْنَ وَاغْلُظْ
عَلَيْهِمْ ؕ وَ مَاْوٰىهُمْ جَهَنَّمُ ؕ وَبِئْسَ الْمَصِيْرُ ﴿٧٣﴾
يَحْلِفُوْنَ بِاللّٰهِ مَا قَالُوْا ؕ وَ لَقَدْ قَالُوْا كَلِمَةَ
الْكُفْرِ وَكَفَرُوْا بَعْدَ اِسْلَامِهِمْ وَ هَمُّوْا بِمَا لَمْ
يَنَالُوْا ۚ وَمَا نَقَمُوْٓا اِلَّآ اَنْ اَغْنٰىهُمُ اللّٰهُ وَ
رَسُوْلُهٗ مِنْ فَضْلِهٖ ۚ فَاِنْ يَّتُوْبُوْا يَكُ خَيْرًا
لَّهُمْ ۚ وَ اِنْ يَّتَوَلَّوْا يُعَذِّبْهُمُ اللّٰهُ عَذَابًا
اَلِيْمًا ۙ فِي الدُّنْيَا وَ الْاٰخِرَةِ ۚ وَ مَا لَهُمْ فِي
الْاَرْضِ مِنْ وَّلِيٍّ وَّ لَا نَصِيْرٍ ﴿٧٤﴾

32. తబూక్ సంగ్రామం తరువాత అవతరించిన ఆయతులు ఇక్కడి నుండి ప్రారంభమవుతాయి.

33. ఇక్కడ సూచించబడిన విషయం ఏమిటో దానికి సంబంధించిన నిశ్చితమైన సమాచారం మాకు అందలేదు. అయితే హదీసులలో ఆ కాలంలో కపటులు చెప్పిన విభిన్న అవిశ్వాసపు విషయాల ప్రస్తావన వచ్చింది. ఉదాహరణకు, ఒక కపటుడు ఒక ముస్లిము యువకునితో మాట్లాడుతూ ఇలా అన్నాడు : "ఒకవేళ ఈ వ్యక్తి అంటే ముహమ్మద్ (సఅసమ్) చెప్పేదంతా నిజంగానే సత్యమైతే, అప్పుడు మేమంతా గాడిదలకంటే కూడా నీచమయినవాళ్ళమయి పోతాము. మరొక హదీసులో ఇలా ఉంది : తబూక్ ప్రయాణంలో ఒకచోట మహాప్రవక్త (సఅసమ్) గారి ఒంటె తప్పిపోయింది. అప్పుడు కపటుల వర్గం వారు తమ సమావేశంలో ఆయనను బాగా

وَ مِنۡهُمۡ مَّنۡ عٰهَدَ اللّٰهَ لَئِنۡ اٰتٰٮنَا مِنۡ فَضۡلِهٖ
لَنَصَّدَّقَنَّ وَ لَنَكُوۡنَنَّ مِنَ الصّٰلِحِيۡنَ ﴿۷۵﴾ فَلَمَّاۤ
اٰتٰٮهُمۡ مِّنۡ فَضۡلِهٖ بَخِلُوۡا بِهٖ وَ تَوَلَّوۡا وَّهُمۡ
مُّعۡرِضُوۡنَ ﴿۷۶﴾ فَاَعۡقَبَهُمۡ نِفَاقًا فِىۡ قُلُوۡبِهِمۡ اِلٰى
يَوۡمِ يَلۡقَوۡنَهٗ بِمَاۤ اَخۡلَفُوا اللّٰهَ مَا وَعَدُوۡهُ وَ
بِمَا كَانُوۡا يَكۡذِبُوۡنَ ﴿۷۷﴾ اَلَمۡ يَعۡلَمُوۡۤا اَنَّ اللّٰهَ
يَعۡلَمُ سِرَّهُمۡ وَنَجۡوٰٮهُمۡ وَ اَنَّ اللّٰهَ عَلَّامُ
الۡغُيُوۡبِ ﴿۷۸﴾ اَلَّذِيۡنَ يَلۡمِزُوۡنَ الۡمُطَّوِّعِيۡنَ
مِنَ الۡمُؤۡمِنِيۡنَ فِى الصَّدَقٰتِ وَالَّذِيۡنَ لَا
يَجِدُوۡنَ اِلَّا جُهۡدَهُمۡ فَيَسۡخَرُوۡنَ مِنۡهُمۡ ؕ
سَخِرَ اللّٰهُ مِنۡهُمۡ وَلَهُمۡ عَذَابٌ اَلِيۡمٌ ﴿۷۹﴾
اِسۡتَغۡفِرۡ لَهُمۡ اَوۡ لَا تَسۡتَغۡفِرۡ لَهُمۡ ؕ اِنۡ
تَسۡتَغۡفِرۡ لَهُمۡ سَبۡعِيۡنَ مَرَّةً فَلَنۡ يَّغۡفِرَ اللّٰهُ
لَهُمۡ ؕ ذٰلِكَ بِاَنَّهُمۡ كَفَرُوۡا بِاللّٰهِ وَرَسُوۡلِهٖ ؕ
وَاللّٰهُ لَا يَهۡدِى الۡقَوۡمَ الۡفٰسِقِيۡنَ ﴿۸۰﴾ ع

**75 - 80** ఆయన గనక తన అనుగ్రహం నుండి మాకు ప్రసాదిస్తే మేము దానం చేస్తాము, సజ్జనులమై ఉంటాము అని అల్లాహ్‌కు ప్రమాణం చేసినవారు కూడా కొందరు వారిలో ఉన్నారు. కాని, అల్లాహ్ తన అనుగ్రహం వల్ల వారిని సంపన్నులుగా చేసినప్పుడు, వారు పిసినారితనానికి దిగారు. తమ ప్రమాణం నుండి మరలిపోయారు. దానిని ఏమాత్రం లెక్క చేయటం లేదు. ఫలితం ఏమయిందంటే, వారు అల్లాహ్ ఎడల చేసిన ఈ ప్రమాణ భంగం కారణంగా, వారు చెబుతూ వచ్చిన అబద్ధం కారణంగా, అల్లాహ్ వారి హృదయాలలో కాపట్యాన్ని నాటాడు. అది ఆయన సమక్షంలో వారు హాజరయ్యే రోజు వరకూ వారిని వెంటాడటం మానదు. వారికి తెలియదా, అల్లాహ్‌కు వారి గుప్తరహస్యాలూ, వారి రహస్య సమాలోచనలూ సయితం తెలుసని, ఆయనకు సమస్త అగోచర విషయాలు కూడా పూర్తిగా తెలుసని? (ఆ పిసినారి సంపన్నులను ఆయన బాగా ఎరుగును) సంతోషంతో, ఇష్టంతో విశ్వాసులు చేసే ధనత్యాగాలను కించపరుస్తూ వారు మాట్లాడుతారు. (దేవుని మార్గంలో ఇచ్చేందుకు) తాము శ్రమకోర్చి ఇచ్చేది తప్ప మరేదీ తమ వద్ద లేనివారిని వారు హేళన చేస్తారు. ఈ హేళన చేసేవారిని అల్లాహ్ హేళన చేస్తున్నాడు. వారికి బాధాకరమైన శిక్ష పడుతుంది. ప్రవక్తా! నీవు అటువంటి ప్రజలను క్షమించవలసినదిగా విజ్ఞాపన చేసినా, చేయక పోయినా (ఒకటే); ఒకవేళ నీవు వారిని క్షమించవలసినదిగా డెబ్బైసార్లు విజ్ఞాపన చేసినా, అల్లాహ్ వారిని ఎంతమాత్రం క్షమించడు. ఎందుకంటే, వారు అల్లాహ్‌నూ ఆయన ప్రవక్తనూ తిరస్కరించారు. అల్లాహ్ దుర్మార్గులైన ప్రజలకు మోక్షమార్గం చూపడు.

అవహేళన చేస్తూ పరస్పరం ఇలా అనుకున్నారు : "ఈ పెద్దమనిషి ఆకాశ సమాచారాలను వినిపిస్తాడు. కాని తన ఒంటె ఇప్పుడు ఎక్కడుందో అనే సమాచారాన్ని మటుకు చెప్పలేదు."

34. తబూక్ సంగ్రామ కాలంలో కపటులు పన్నిన కుట్రలు ఇక్కడ సూచించబడ్డాయి. ఒక సందర్భంలో వారు, రాత్రి సమయంలో మహాప్రవక్త (సఅసమ్) ప్రయాణంలో ఉన్నప్పుడు ఆయనను ఏదైనా గోతిలో తోసెయ్యాలనే ఒక పథకాన్ని సిద్ధం చేశారు. ఒకవేళ తబూకులో ముస్లిములు ఓడిపోతే, వెంటనే మదీనాలో అబ్దుల్లా బిన్ ఉబై శిరస్సుపై రాజకిరీటాన్ని పెడదామనే నిర్ణయం కూడా వారు తీసుకున్నారు.

فَرِحَ الْمُخَلَّفُوْنَ بِمَقْعَدِهِمْ خِلٰفَ رَسُوْلِ
اللّٰهِ وَكَرِهُوْٓا اَنْ يُّجَاهِدُوْا بِاَمْوَالِهِمْ وَ
اَنْفُسِهِمْ فِيْ سَبِيْلِ اللّٰهِ وَ قَالُوْا لَا تَنْفِرُوْا فِي
الْحَرِّ ؕ قُلْ نَارُ جَهَنَّمَ اَشَدُّ حَرًّا ؕ لَوْ كَانُوْا
يَفْقَهُوْنَ ﴿٨١﴾ فَلْيَضْحَكُوْا قَلِيْلًا وَّلْيَبْكُوْا كَثِيْرًا ۚ
جَزَآءًۢ بِمَا كَانُوْا يَكْسِبُوْنَ ﴿٨٢﴾ فَاِنْ رَّجَعَكَ
اللّٰهُ اِلٰى طَآئِفَةٍ مِّنْهُمْ فَاسْتَاْذَنُوْكَ
لِلْخُرُوْجِ فَقُلْ لَّنْ تَخْرُجُوْا مَعِيَ اَبَدًا وَّلَنْ
تُقَاتِلُوْا مَعِيَ عَدُوًّا ؕ اِنَّكُمْ رَضِيْتُمْ بِالْقُعُوْدِ
اَوَّلَ مَرَّةٍ فَاقْعُدُوْا مَعَ الْخٰلِفِيْنَ ﴿٨٣﴾ وَلَا
تُصَلِّ عَلٰٓى اَحَدٍ مِّنْهُمْ مَّاتَ اَبَدًا وَّلَا تَقُمْ عَلٰى
قَبْرِهٖ ؕ اِنَّهُمْ كَفَرُوْا بِاللّٰهِ وَرَسُوْلِهٖ وَمَاتُوْا
وَ هُمْ فٰسِقُوْنَ ﴿٨٤﴾ وَلَا تُعْجِبْكَ اَمْوَالُهُمْ وَاَوْلَا
دُهُمْ ؕ اِنَّمَا يُرِيْدُ اللّٰهُ اَنْ يُّعَذِّبَهُمْ بِهَا فِي
الدُّنْيَا وَ تَزْهَقَ اَنْفُسُهُمْ وَهُمْ كٰفِرُوْنَ ﴿٨٥﴾ وَ
اِذَآ اُنْزِلَتْ سُوْرَةٌ اَنْ اٰمِنُوْا بِاللّٰهِ وَجَاهِدُوْا
مَعَ رَسُوْلِهِ اسْتَاْذَنَكَ اُولُوا الطَّوْلِ مِنْهُمْ
وَقَالُوْا ذَرْنَا نَكُنْ مَّعَ الْقٰعِدِيْنَ ﴿٨٦﴾ رَضُوْا
بِاَنْ يَّكُوْنُوْا مَعَ الْخَوَالِفِ وَطُبِعَ عَلٰى قُلُوْبِهِمْ
فَهُمْ لَا يَفْقَهُوْنَ ﴿٨٧﴾

**81 - 83** వెనుక ఉండిపోవటానికి అనుమతి ఇవ్వబడినవారు అల్లాహ్ ప్రవక్తతో వెళ్ళకపోయినందుకూ, ఇంటివద్దనే కూర్చుండిపోయినందుకూ సంతోషపడ్డారు. అల్లాహ్ మార్గంలో తమ ప్రాణాలనూ, తమ సంపదలనూ ఒడ్డి పోరాడేందుకు వారు ఇష్టపడలేదు. వారు ప్రజలతో, "ఈ తీవ్రమైన వేడిలో బయలేదేరకండి" అని అన్నారు. వారితో ఇలా అను: "నరకాగ్ని దీనికంటే ఎక్కువ వేడిగా ఉంటుంది". వారికి దానిని గురించి తెలిస్తే ఎంత బాగుండును! ఇప్పుడు వారు నవ్వటం తగ్గించాలి. ఏడ్వటం హెచ్చించాలి. ఎందుకంటే వారు సంపాదిస్తూ ఉండిన చెడులకు లభించే ప్రతిఫలం అటువంటిది గనక (దానికి వారు ఏడ్వ వలసినదే). ఒకవేళ అల్లాహ్ వారి మధ్యకు నిన్ను తిరిగి తీసుకువెళితే, ఇకముందు వారిలో ఏ వర్గమైనా పోరాటం కొరకు బయలు దేరటానికి నిన్ను అనుమతి అడిగితే వారితో స్పష్టంగా ఇలా చెప్పు:"ఇక మీరు నాతో ఎంతమాత్రమూ రాలేరు. నా పక్షంలో ఉండి ఏ శత్రువుతోనూ పోరాడనూలేరు. మీరు మొదట కూర్చుండి పోవటానికే ఇష్టపడ్డారు. కనుక ఇప్పుడు ఇంటివద్ద కూర్చుండిపోయేవారితోనే కూర్చుండి పోండి."

**84 - 85** ఇక ముందు వారిలో ఎవడైనా మరణిస్తే, అతడి జనాజా నమాజును కూడా నీవు ఎంతమాత్రం చెయ్యకు. ఎన్నడూ అతడి గోరీ వద్ద నిలబడకు. ఎందుకంటే వారు అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ తిరస్క రించారు. ఇంకా వారు ద్రోహులుగానే మరణించారు. వారి సంపదా వారి అధిక సంతానమూ నిన్ను మోసానికి గురిచెయ్యకూడదు. ఈ సంపద ద్వారా ఈ సంతానం ద్వారా వారిని ఈ ప్రపంచంలోనే శిక్షించాలనీ వారి ప్రాణాలు వారు అవిశ్వాసులుగా ఉన్న స్థితిలోనే పోవాలనీ-అల్లాహ్ సంకల్పించాడు.

**86 - 89** అల్లాహ్‌ను విశ్వసించండి, ఆయన ప్రవక్తతో కలసి పోరాడండి అనే విషయం కల సూరా ఏదైనా అవతరించి నప్పుడల్లా, వారిలో సమర్థులైన వారే తమను పోరాటంలో పాల్గొనటం గురించి మన్నించాలని నీకు విజ్ఞప్తి చేయటాన్ని నీవు గమనించావు. మేము కూర్చుండిపోయేవారితో ఉండి పోతాము, మమ్మల్ని వదలిపెట్టండి అని వారు అన్నారు. వారు ఇంటిలో కూర్చుండి పోయే స్త్రీలలో చేరిపోవటానికి ఇష్టపడ్డారు. వారి హృదయాలపై ముద్రవేయబడింది. అందువల్ల వారికి ఇప్పుడు ఏమీ అర్థం కాదు.

لٰكِنِ الرَّسُوْلُ وَالَّذِيْنَ اٰمَنُوْا مَعَهٗ جٰهَدُوْا
بِاَمْوَالِهِمْ وَاَنْفُسِهِمْ ؕ وَاُولٰٓئِكَ لَهُمُ الْخَيْرٰتُ ؗ
وَاُولٰٓئِكَ هُمُ الْمُفْلِحُوْنَ ﴿٨٨﴾ اَعَدَّ اللّٰهُ لَهُمْ
جَنّٰتٍ تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ خٰلِدِيْنَ
فِيْهَا ؕ ذٰلِكَ الْفَوْزُ الْعَظِيْمُ ﴿٨٩﴾ وَ جَآءَ
الْمُعَذِّرُوْنَ مِنَ الْاَعْرَابِ لِيُؤْذَنَ لَهُمْ وَ
قَعَدَ الَّذِيْنَ كَذَبُوا اللّٰهَ وَرَسُوْلَهٗ ؕ سَيُصِيْبُ
الَّذِيْنَ كَفَرُوْا مِنْهُمْ عَذَابٌ اَلِيْمٌ ﴿٩٠﴾ لَيْسَ
عَلَى الضُّعَفَآءِ وَ لَا عَلَى الْمَرْضٰى وَلَا عَلَى
الَّذِيْنَ لَا يَجِدُوْنَ مَا يُنْفِقُوْنَ حَرَجٌ اِذَا
نَصَحُوْا لِلّٰهِ وَرَسُوْلِهٖ ؕ مَا عَلَى الْمُحْسِنِيْنَ
مِنْ سَبِيْلٍ ؕ وَاللّٰهُ غَفُوْرٌ رَّحِيْمٌ ﴿٩١﴾ وَّلَا عَلَى
الَّذِيْنَ اِذَا مَآ اَتَوْكَ لِتَحْمِلَهُمْ قُلْتَ لَآ
اَجِدُ مَآ اَحْمِلُكُمْ عَلَيْهِ ۪ تَوَلَّوْا وَّ اَعْيُنُهُمْ
تَفِيْضُ مِنَ الدَّمْعِ حَزَنًا اَلَّا يَجِدُوْا مَا
يُنْفِقُوْنَ ﴿٩٢﴾ اِنَّمَا السَّبِيْلُ عَلَى الَّذِيْنَ
يَسْتَاْذِنُوْنَكَ وَهُمْ اَغْنِيَآءُ ۚ رَضُوْا بِاَنْ
يَّكُوْنُوْا مَعَ الْخَوَالِفِ ۙ وَطَبَعَ اللّٰهُ عَلٰى قُلُوْبِهِمْ
فَهُمْ لَا يَعْلَمُوْنَ ﴿٩٣﴾

ع ١٠/١١

దీనికి భిన్నంగా ప్రవక్తా, ప్రవక్తతోపాటు విశ్వసించినవారూ తమ ప్రాణాలతో తమ సంపదలతో పోరాడారు. కనుక ఇప్పుడు అన్ని మేళ్ళూ వారికే. ఇంకా వారే సాఫల్యాన్ని పొందు తారు. అల్లాహ్ వారికొరకు క్రింద కాలువలు ప్రవహించే ఉద్యాన వనాలను సిద్ధంచేసి ఉంచాడు. వాటిలో వారు కలకాలం ఉంటారు. ఇదే గొప్ప సాఫల్యం.

**90** ఎడారి అరబ్బులు కూడా చాలామంది వచ్చారు. తాము కూడా వెనుక ఉండిపోవటానికి అనుమతికోసం సాకులు చెప్పారు. ఈవిధంగా అల్లాహ్‌కూ ఆయన ప్రవక్తకూ విశ్వాస విషయంలో అబద్ధపు వాగ్దానం చేసినవారు వెనుకనే కూర్చుండి పోయారు. ఎడారి అరబ్బులలో అవిశ్వాస వైఖరిని అవలం బించిన వారు త్వరలోనే బాధాకరమైన శిక్షకు గురి అవుతారు.

**91 - 93** వృద్ధులూ, వ్యాధిగ్రస్తులూ, పోరాటంలో పాల్గొన టానికి దారి భత్యాలు లేనివారూ, ఒకవేళ వెనుక ఉండిపోతే ఏ దోషమూ లేదు, వారు చిత్తశుద్ధితో అల్లాహ్‌కూ ఆయన ప్రవక్తకూ విశ్వాస పాత్రులుగా ఉన్నంత వరకు.[35] అటువంటి సజ్జనులపట్ల ఆక్షేపణకు ఏ ఆస్కారమూ లేదు. అల్లాహ్ మన్నించేవాడూ, కరుణించేవాడూను. స్వయంగా వచ్చి "మా కొరకు వాహనాలు సమకూర్చండి" అని నీకు విజ్ఞప్తి చేసిన వారిపట్ల కూడా ఇదేవిధంగా ఏ ఆక్షేపణకూ అవకాశం లేదు. నీవు "నేను మీ కొరకు వాహనాలను ఏర్పాటు చెయ్యలేను" అని అన్నప్పుడే, గత్యంతరంలేక వారు మరలి పోయారు. వారి కళ్ళనుండి అశ్రువులు ప్రవహించాయి. వారు తమ ఖర్చులతో పోరాటంలో పాల్గొనే శక్తి తమకు లేనందుకు చాలా బాధపడ్డారు. అయితే ధనవంతుల పట్ల ఆక్షేపణ ఉంది. ఎందుకంటే తమను పోరాటంలో పాల్గొనే విషయంలో మన్నించవలసిందిగా నీకు విజ్ఞప్తి చేశారు. వారు ఇంటివద్ద కూర్చుండిపోయే స్త్రీలలో చేరిపోవటానికి ఇష్టపడ్డారు. అల్లాహ్ వారి హృదయాలపై ముద్రవేశాడు. ఇందువల్ల వారికి ఏమీ తెలియదు. (అల్లాహ్ వద్ద వారి ఈ వైఖరికి ఏ ఫలితం కలుగ నున్నదో అనేది).

يَعْتَذِرُوْنَ اِلَيْكُمْ اِذَا رَجَعْتُمْ اِلَيْهِمْ ؕ قُلْ
لَّا تَعْتَذِرُوْا لَنْ نُّؤْمِنَ لَكُمْ قَدْ نَبَّاَنَا اللّٰهُ
مِنْ اَخْبَارِكُمْ ؕ وَسَيَرَى اللّٰهُ عَمَلَكُمْ وَ
رَسُوْلُهٗ ثُمَّ تُرَدُّوْنَ اِلٰى عٰلِمِ الْغَيْبِ وَ
الشَّهَادَةِ فَيُنَبِّئُكُمْ بِمَا كُنْتُمْ تَعْمَلُوْنَ ﴿٩٤﴾
سَيَحْلِفُوْنَ بِاللّٰهِ لَكُمْ اِذَا انْقَلَبْتُمْ اِلَيْهِمْ
لِتُعْرِضُوْا عَنْهُمْ ؕ فَاَعْرِضُوْا عَنْهُمْ ؕ اِنَّهُمْ
رِجْسٌ ز وَّمَاْوٰىهُمْ جَهَنَّمُ ۚ جَزَآءًۢ بِمَا كَانُوْا
يَكْسِبُوْنَ ﴿٩٥﴾ يَحْلِفُوْنَ لَكُمْ لِتَرْضَوْا عَنْهُمْ ۚ فَاِنْ
تَرْضَوْا عَنْهُمْ فَاِنَّ اللّٰهَ لَا يَرْضٰى عَنِ الْقَوْمِ
الْفٰسِقِيْنَ ﴿٩٦﴾ اَلْاَعْرَابُ اَشَدُّ كُفْرًا وَّنِفَاقًا وَّ
اَجْدَرُ اَلَّا يَعْلَمُوْا حُدُوْدَ مَآ اَنْزَلَ اللّٰهُ
عَلٰى رَسُوْلِهٖ ؕ وَاللّٰهُ عَلِيْمٌ حَكِيْمٌ ﴿٩٧﴾

**94 - 96** మీరు తిరిగి వారివద్దకు పోయినప్పుడు, వారు రకరకాల సాకులు చెబుతారు. కాని మీరు స్పష్టంగా ఇలా చెప్పండి: “సాకులు చెప్పకండి. మేము మీ ఏ మాటనూ నమ్మం. అల్లాహ్ మాకు మీ పరిస్థితులన్నీ తెలిపాడు. ఇక అల్లాహ్ ఆయన ప్రవక్తా మీ ప్రవర్తనను చూస్తారు. తరువాత మీరు ఆయన వైపునకు మరలింపబడతారు. ఆయన బహిరంగంగా ఉన్నదీ గుప్తంగా ఉన్నదీ, అంతా ఎరిగినవాడు. మీరు ఏమేమి చేస్తూ ఉండేవారో ఆయన మీకు తెలుపుతాడు.” నీవు మరలివచ్చిన తరువాత వారు నీ ముందు ప్రమాణాలు చేస్తారు, నీవు వారిని ఉపేక్షించాలని. కనుక నీవు వారిని తప్పకుండా ఉపేక్షించు. ఎందుకంటే, వారొక మాలిన్యం వంటివారు. వారి అసలు స్థానం నరకం. అది వారి సంపాదనకు ప్రతిఫలంగా వారికి లభిస్తుంది. వారు నీ సమక్షంలో ప్రమాణాలు చేస్తారు, వారికి నీవు ప్రసన్నుడవు కావాలని. వాస్తవానికి, ఒకవేళ నీవు వారిపట్ల ప్రసన్నత చూపినా అల్లాహ్ మటుకు అటువంటి విద్రోహులకు ఎన్నటికీ ప్రసన్నుడు కాడు.

**97 - 99** ఈ ఎడారి అరబ్బులు అవిశ్వాసం విషయంలో, కాపట్యం విషయంలో బహుమూర్ఖులు. కనుక అల్లాహ్ తన ప్రవక్తపై అవతరింపజేసిన ధర్మం యొక్క హద్దులు వారికి తెలియకుండా ఉండే అవకాశాలే ఎక్కువగా ఉన్నాయి.[36] అల్లాహ్‌కు అన్నీ తెలుసు. ఆయన జ్ఞానీ, వివేకవంతుడూను.

---

35. దీనిద్వారా తెలిసిందేమిటంటే, పైకి నిస్సహాయులుగా కనిపించేవారి విషయంలో కూడా కేవలం ఒక్క ముసలితనమూ, వ్యాధీ, లేదా కేవలం పేదరికమూ వారిని క్షమించటానికి చాలినంత కారణం కాదు. కాని వారి ఈ నిస్సహాయతలు, వారు అల్లాహ్‌కూ ఆయన ప్రవక్త (సఅసమ్)కూ నిజమైన విశ్వాసపాత్రులు అయిన పక్షంలోనే క్షమించబడటానికి కారణాలు కాగలవు. ఒకవేళ విశ్వాసపాత్రతే లేకపోతే, ఏ వ్యక్తి అయినా కేవలం, అతడు విధి నిర్వహణా సమయంలో పేదవాడుగా లేక వ్యాధిగ్రస్తుడుగా ఉన్నాడనే కారణం వల్ల అతడు క్షమింపబడటం జరగదు.

36. ఎడారి అరబ్బులు అంటే, మదీనా పట్టణానికి చుట్టుప్రక్కలలో తమ నివాసాలను ఏర్పరచుకున్న గ్రామీణ ఎడారి అరబ్బులు అని భావం. వారు మదీనాలో ఒక పటిష్ఠమైన, సుసంఘటితమైన శక్తి ఉద్భవిస్తూ ఉండటం చూసి మొదట భయపడి అణగి ఉన్నారు. తరువాత ఇస్లామ్ అవిశ్వాసముల మధ్య సంఘర్షణలు జరుగుతున్నప్పుడు కొంతకాలం వరకు ఏ ఎండకా గొడుగుపట్టే అవకాశవాద వైఖరిని అవలంబించారు. ఆ తరువాత ఇస్లామీ ప్రభుత్వ అధికారం హిజాజ్, నజద్‌ల యొక్క ఒక పెద్ద భాగంపై వ్యాపించి విరోధి తెగల శక్తి దాని ముందు పటాపంచలై పోయినప్పుడు, వారు సమయాన్నిబట్టి ఇస్లామ్ పరిధిలోకి ప్రవేశించటమే ఉత్తమమని భావించారు. కాని ఈ ధర్మాన్ని సత్యధర్మంగా భావించి హృదయపూర్వకంగా విశ్వసించినవారూ, చిత్తశుద్ధితో దాని బాధ్యతలను

وَ مِنَ الْاَعْرَابِ مَنْ يَّتَّخِذُ مَا يُنْفِقُ مَغْرَمًا
وَّ يَتَرَبَّصُ بِكُمُ الدَّوَآئِرَ ؕ عَلَيْهِمْ دَآئِرَةُ
السَّوْءِ ؕ وَ اللّٰهُ سَمِيْعٌ عَلِيْمٌ ﴿٩٨﴾ وَ مِنَ
الْاَعْرَابِ مَنْ يُّؤْمِنُ بِاللّٰهِ وَ الْيَوْمِ الْاٰخِرِ وَ
يَتَّخِذُ مَا يُنْفِقُ قُرُبٰتٍ عِنْدَ اللّٰهِ وَصَلَوٰتِ
الرَّسُوْلِ ؕ اَلَاۤ اِنَّهَا قُرْبَةٌ لَّهُمْ ؕ سَيُدْخِلُهُمُ
اللّٰهُ فِىْ رَحْمَتِهٖ ؕ اِنَّ اللّٰهَ غَفُوْرٌ رَّحِيْمٌ ﴿٩٩﴾ وَ ع ١٢ ١٠
السّٰبِقُوْنَ الْاَوَّلُوْنَ مِنَ الْمُهٰجِرِيْنَ
وَالْاَنْصَارِ وَ الَّذِيْنَ اتَّبَعُوْهُمْ بِاِحْسَانٍ ۙ
رَّضِيَ اللّٰهُ عَنْهُمْ وَ رَضُوْا عَنْهُ وَ اَعَدَّ لَهُمْ
جَنّٰتٍ تَجْرِىْ تَحْتَهَا الْاَنْهٰرُ خٰلِدِيْنَ فِيْهَاۤ
اَبَدًا ؕ ذٰلِكَ الْفَوْزُ الْعَظِيْمُ ﴿١٠٠﴾

దేవుని మార్గంలో ఖర్చుపెడుతున్నప్పుడు అది బలవంతంగా తమపై రుద్ద బడిందని భావించేవారు ఈ ఎడారి అరబ్బులలో కొందరు ఉన్నారు. మీ విషయంలో వారు కాలం మార్పుల కోసం నిరీక్షిస్తున్నారు, (మీరు ఏదైనా సంకటంలో చిక్కుకుంటే మీరు వారిని బంధించి ఉంచిన ఈ వ్యవస్థ యొక్క విధేయతా శృంఖలాలను త్రెంచిపారేయాలని) వాస్తవానికి సంకట వలయం స్వయంగా వారినే చుట్టుముట్టి ఉంది. అల్లాహ్ అంతా వింటాడు. ఆయనకు అన్నీ తెలుసు. ఈ ఎడారి అరబ్బులలోనే ఇంకా కొంతమంది ఉన్నారు. వారు అల్లాహ్‌నూ అంతిమదినాన్నీ విశ్వసిస్తారు. తాము ఖర్చుచేసే దానిని అల్లాహ్ సాన్నిహిత్యం పొందటానికీ ప్రవక్తనుండి దేవుని కారుణ్యానికై ప్రార్థనలు పొందటానికీ సాధనంగా చేసుకుంటారు. అవును! అది నిశ్చయంగా అల్లాహ్ సాన్నిహిత్యాన్ని పొందటానికి సాధనమే. అల్లాహ్ తప్పకుండా వారిని తన కారుణ్యంలో ప్రవేశింపజేస్తాడు. నిశ్చయంగా అల్లాహ్ క్షమించేవాడూ కరుణించేవాడూను.

**100** అందరికంటే ముందు విశ్వాస సందేశాన్ని స్వీకరించటానికి ముందంజ వేసిన ముహాజిరుల (వలస వచ్చినవారి) పట్లా, అన్సారుల (ఆశ్రయమిచ్చిన వారి) పట్లా తరువాత నిజాయితీతో వారి వెనుక వచ్చినవారిపట్లా అల్లాహ్ తృప్తి చెందాడు. వారు కూడా అల్లాహ్‌పట్ల తృప్తి చెందారు. అల్లాహ్ వారి కొరకు క్రింద సెలయేళ్ళు ప్రవహించే ఉద్యానవనాలను సిద్ధపరచి ఉంచాడు. వారు వాటిలో సదా ఉంటారు. ఇదే మహత్తరమైన సాఫల్యం.

నెరవేర్చటానికి సిద్ధపడినవారూ వారిలో కొద్దిమంది మాత్రమే. వారి ఈ పరిస్థితి ఇక్కడ ఇలా అభివర్ణించబడింది: పట్టణవాసులకంటే ఈ గ్రామీణ అరబ్బులూ, ఎడారి అరబ్బులూ ఎక్కువ కపట వైఖరిని కలిగివున్నారు. సత్యాన్ని తిరస్కరించే తత్వం వారిలో ఎక్కువగా ఉంది. తరువాత దానికి కారణం కూడా ఇలా తెలుపబడింది: పట్టణవాసులు, జ్ఞాన సంపన్నులు, సత్యధర్మ ప్రజల సహవాసాన్ని వినియోగించుకుంటూ కొన్ని ధర్మ విషయాలనూ, దాని హద్దులనూ తెలుసుకుంటారు కూడా. కాని ఈ గ్రామీణ అరబ్బులూ ఈ ఎడారి అరబ్బులూ జీవితాంతం పూర్తిగా "ఆర్థిక జంతువులు" మాదిరిగా రేయింబవళ్ళు ఉపాధి కొరకు తిరుగుతూ ఉంటారు. పశుప్రాయమైన జీవితావసరాలకు అతీతంగా ఉండే ఏ విషయం గురించి అయినా ఆలోచించే అవకాశమే వారికి లభించదు. అందుకని ధర్మంను గురించీ, దాని హద్దులను గురించీ వారికి తెలియకుండా ఉండే అవకాశాలే ఎక్కువగా ఉన్నాయి. ముందు 122వ ఆయత్‌లో వారి ఈ రోగానికి చికిత్స నిర్ణయించబడింది.

ع
وقف منزل

وَمِمَّنْ حَوْلَكُمْ مِّنَ الْاَعْرَابِ مُنٰفِقُوْنَ ۛ وَ
مِنْ اَهْلِ الْمَدِيْنَةِ ۛ مَرَدُوْا عَلَى النِّفَاقِ ۟ لَا
تَعْلَمُهُمْ ؕ نَحْنُ نَعْلَمُهُمْ ؕ سَنُعَذِّبُهُمْ
مَّرَّتَيْنِ ثُمَّ يُرَدُّوْنَ اِلٰى عَذَابٍ عَظِيْمٍ ۚ﴿١٠١﴾ وَ
اٰخَرُوْنَ اعْتَرَفُوْا بِذُنُوْبِهِمْ خَلَطُوْا عَمَلًا
صَالِحًا وَّ اٰخَرَ سَيِّئًا ؕ عَسَى اللّٰهُ اَنْ يَّتُوْبَ
عَلَيْهِمْ ؕ اِنَّ اللّٰهَ غَفُوْرٌ رَّحِيْمٌ ﴿١٠٢﴾ خُذْ مِنْ
اَمْوَالِهِمْ صَدَقَةً تُطَهِّرُهُمْ وَ تُزَكِّيْهِمْ بِهَا
وَصَلِّ عَلَيْهِمْ ؕ اِنَّ صَلٰوتَكَ سَكَنٌ لَّهُمْ ؕ وَ
اللّٰهُ سَمِيْعٌ عَلِيْمٌ ﴿١٠٣﴾ اَلَمْ يَعْلَمُوْۤا اَنَّ اللّٰهَ هُوَ
يَقْبَلُ التَّوْبَةَ عَنْ عِبَادِهٖ وَ يَاْخُذُ الصَّدَقٰتِ
وَ اَنَّ اللّٰهَ هُوَ التَّوَّابُ الرَّحِيْمُ ﴿١٠٤﴾ وَ قُلِ
اعْمَلُوْا فَسَيَرَى اللّٰهُ عَمَلَكُمْ وَ رَسُوْلُهٗ وَ
الْمُؤْمِنُوْنَ ؕ وَسَتُرَدُّوْنَ اِلٰى عٰلِمِ الْغَيْبِ وَ
الشَّهَادَةِ فَيُنَبِّئُكُمْ بِمَا كُنْتُمْ تَعْمَلُوْنَ ۚ﴿١٠٥﴾
وَاٰخَرُوْنَ مُرْجَوْنَ لِاَمْرِ اللّٰهِ اِمَّا يُعَذِّبُهُمْ
وَاِمَّا يَتُوْبُ عَلَيْهِمْ ؕ وَ اللّٰهُ عَلِيْمٌ حَكِيْمٌ ﴿١٠٦﴾

**101** మీ చుట్టుపక్కల ఉండే ఎడారి అరబ్బులలో కపటులు చాలామంది ఉన్నారు. అలాగే స్వయంగా మదీనా పౌరులలో కూడా కపటులు ఉన్నారు. వారు కాపట్యంలో రాటుదేలారు. మీరు వారిని ఎరుగరు. మేము వారిని ఎరుగుదుము. మేము వారికి రెట్టింపు శిక్షను విధించే సమయం సమీపంలోనే ఉంది. తరువాత వారు మరింత పెద్ద శిక్ష కొరకు తిరిగి తీసుకు రాబడతారు.

**102 - 105** తమ తప్పులను ఒప్పుకున్నవారు కొందరు ఉన్నారు. వారి ఆచరణ మిశ్రమమైనది. కొంత మంచీ, కొంత చెడూ. అల్లాహ్ వారిని మళ్ళీ కరుణించటం అనేది అసంభవ మేమీ కాదు. ఎందుకంటే, ఆయన మన్నించే వాడూ కరుణించే వాడూను. ప్రవక్తా! నీవు వారి సంపదల నుండి సదఖా తీసుకొని వారిని పరిశుద్ధపరచు. ఇంకా (సన్మార్గంలో) వారిని ముందుకు నడుపు. వారికొరకు దేవుని కారుణ్యానికై ప్రార్థించు. ఎందుకంటే నీ ప్రార్థనవల్ల వారికి ఉపశమనం కలుగుతుంది. అల్లాహ్ అంతా వింటాడు. ఆయనకు అంతా తెలుసు. వారికి తెలియదా, అల్లాహ్‌యే తన దాసుల పశ్చాత్తాపాన్ని అంగీకరిస్తా డని, వారి దానధర్మాలకు స్వీకారాన్ని ప్రసాది స్తాడని, అల్లాహ్ అమితంగా క్షమించేవాడూ కరుణించేవాడూ అని? ప్రవక్తా! ఇంకా వారితో ఇలా అను: “మీరు ఆచరించండి. అల్లాహ్, ఆయన ప్రవక్తా, విశ్వాసులూ అందరూ మీ ఆచరణ వైఖరి ఇప్పుడు ఎలా ఉంటుందో అని గమనిస్తారు. తరువాత మీరు ఆయన వైపునకు మరలింపబడతారు. ఆయనకు బహిరం గంగా ఉన్నదీ, గుప్తంగా ఉన్నదీ అంతా తెలుసు. మీరు ఏమేమి చేస్తూ ఉండేవారో ఆయన మీకు తెలుపుతాడు.”

**106** మరి కొందరున్నారు. ఇంకా వారి వ్యవహారం దేవుని ఆజ్ఞకోసం ఆగి వున్నది. ఆయన వారికి శిక్షనూ విధించవచ్చు. మళ్ళీ కొత్తగా వారిని కనికరించనూవచ్చు. అల్లాహ్‌కు అంతా తెలుసు, ఆయన జ్ఞానీ, వివేకవంతుడూను.

**107 - 110** ఇంకా కొందరువున్నారు. వారు ఒక మసీదును నిర్మించారు, (సత్యసందేశానికి) నష్టం కలిగించాలనే ఉద్దేశ్యంతో, ఇంకా (దేవుని ఆరాధన చెయ్యటానికి బదులుగా) అవిశ్వాసాన్ని అనుసరించాలని, విశ్వాసులలో చీలిక తీసుకు రావాలని, (ఈ బూటకపు ఆరాధనాలయాన్ని) ఇదివరకు అల్లాహ్‌కూ ఆయన ప్రవక్తకూ వ్యతిరేకంగా పోరాడిన వ్యక్తికి మాటుగా చెయ్యాలని. వారు మాటిమాటికీ ప్రమాణాలు చేసి, మా ఉద్దేశ్యం మేలు చెయ్యటం తప్ప మరొకటి కాదు అని తప్పకుండా అంటారు. కానీ అల్లాహ్ సాక్షిగా ఉన్నాడు, వారు పూర్తి అసత్యవాదులు. నీవు ఎన్నడూ ఆ కట్టడంలో నిలబడకు. మొదటి రోజునుండే భయభక్తులు ఆధారంగా స్థాపించబడిన మసీదే నీవు (ఆరాధన కొరకు) నిలబడటానికి తగినది. అందులో పరిశుద్ధంగా ఉండటానికి ఇష్టపడేవారు ఉన్నారు. అల్లాహ్‌కు పరిశుద్ధతను పాటించేవారు అంటేనే ఇష్టం.[37] అయితే నీ అభిప్రాయమేమిటి? మంచి మానవుడు ఎవడు? తన కట్టడపు పునాదులను దైవభీతిపై, దైవ సంతోషాన్ని పొందాలనే కాంక్షపై లేపినవాడా లేదా తన కట్టడాన్ని లోయయొక్క డొల్ల అంచుపై లేపినవాడా? అది అతనిని తీసుకుని నేరుగా నరకాగ్నిలో పడి పోయింది! అటువంటి దుర్మార్గులకు అల్లాహ్ ఎన్నటికీ రుజుమార్గం చూపడు. వారు నిర్మించిన ఈ కట్టడం ఎల్లప్పుడూ వారి హృదయాలలో అపనమ్మకానికి మూలంగా ఉంటుంది. (ఆ అపనమ్మకం బయటపడే మార్గమేదీ ఇక లేదు) వారి హృదయాలు ముక్కలు ముక్కలు అయితేనే తప్ప. అల్లాహ్ అన్నీ తెలిసినవాడు. వివేకవంతుడూ, మేధావంతుడూను.

وَالَّذِيْنَ اتَّخَذُوْا مَسْجِدًا ضِرَارًا وَّكُفْرًا وَّ
تَفْرِيْقًاۢ بَيْنَ الْمُؤْمِنِيْنَ وَاِرْصَادًا لِّمَنْ
حَارَبَ اللّٰهَ وَرَسُوْلَهٗ مِنْ قَبْلُ ؕ وَلَيَحْلِفُنَّ
اِنْ اَرَدْنَاۤ اِلَّا الْحُسْنٰى ؕ وَاللّٰهُ يَشْهَدُ اِنَّهُمْ
لَكٰذِبُوْنَ ﴿١٠٧﴾ لَا تَقُمْ فِيْهِ اَبَدًا ؕ لَمَسْجِدٌ
اُسِّسَ عَلَى التَّقْوٰى مِنْ اَوَّلِ يَوْمٍ اَحَقُّ اَنْ
تَقُوْمَ فِيْهِ ؕ فِيْهِ رِجَالٌ يُّحِبُّوْنَ اَنْ
يَّتَطَهَّرُوْا ؕ وَاللّٰهُ يُحِبُّ الْمُطَّهِّرِيْنَ ﴿١٠٨﴾ اَفَمَنْ
اَسَّسَ بُنْيَانَهٗ عَلٰى تَقْوٰى مِنَ اللّٰهِ وَ
رِضْوَانٍ خَيْرٌ اَمْ مَّنْ اَسَّسَ بُنْيَانَهٗ عَلٰى
شَفَا جُرُفٍ هَارٍ فَانْهَارَ بِهٖ فِيْ نَارِ جَهَنَّمَ ؕ وَ
اللّٰهُ لَا يَهْدِى الْقَوْمَ الظّٰلِمِيْنَ ﴿١٠٩﴾ لَا يَزَالُ
بُنْيَانُهُمُ الَّذِيْ بَنَوْا رِيْبَةً فِيْ قُلُوْبِهِمْ اِلَّاۤ اَنْ
تَقَطَّعَ قُلُوْبُهُمْ ؕ وَاللّٰهُ عَلِيْمٌ حَكِيْمٌ ﴿١١٠﴾ ع

37. మదీనా పట్టణంలో అప్పుడు రెండు మసీదులుండేవి. ఒకటి ఖుబా మసీదు. ఇది పట్టణ శివార్లలో ఉంది. రెండోది ప్రవక్త మసీదు. ఇది పట్టణం లోపల ఉంది. ఈ రెండు మసీదులు ఉండగా, మూడో మసీదును నిర్మించే అవసరం ఎంతమాత్రం లేదు. కాని కపటులు వర్షంలో, చలిరాత్రులలో, సామాన్య ప్రజలకు ముఖ్యంగా ఈ రెండు మసీదులకు దూరంగా ఉండే ముసలివారికీ, వికలాంగులకూ ఐదు పూటలు నమాజు కొరకు రావటం కష్టమవుతోంది అనే విషయాన్ని సాకుగా తీసుకుని "మేము కేవలం నమాజు చేసేవారి సౌలభ్యం కొరకు ఒక కొత్త మసీదును నిర్మించదలచుకున్నాము" అని అనేవారు. ఈ విధంగా వారు దాని నిర్మాణానికి అనుమతి పొందారు. దానిని వారు తమ కుట్రలకు కేంద్రంగా చేసుకున్నారు. వారు మహాప్రవక్త (సఅసమ్)ను మోసంచేసి ఆయనచే దానికి ప్రారంభోత్సవం చేయించదలిచారు. కాని అల్లాహ్ వారి ఉద్దేశ్యాలను గురించి మహాప్రవక్త (సఅసమ్)కు మొదటనే హెచ్చరిక చేశాడు. తబూక్ నుండి తిరిగి వచ్చిన తరువాత ఆయన ఈ జిరార్ మసీదును ధ్వంసం చేయించారు.

إِنَّ اللّٰهَ اشْتَرٰى مِنَ الْمُؤْمِنِيْنَ اَنْفُسَهُمْ وَ
اَمْوَالَهُمْ بِاَنَّ لَهُمُ الْجَنَّةَ ؕ يُقَاتِلُوْنَ فِيْ
سَبِيْلِ اللّٰهِ فَيَقْتُلُوْنَ وَ يُقْتَلُوْنَ ۫ وَعْدًا عَلَيْهِ
حَقًّا فِي التَّوْرٰىةِ وَ الْاِنْجِيْلِ وَ الْقُرْاٰنِ ؕ وَ مَنْ
اَوْفٰى بِعَهْدِهٖ مِنَ اللّٰهِ فَاسْتَبْشِرُوْا بِبَيْعِكُمُ
الَّذِيْ بَايَعْتُمْ بِهٖ ؕ وَ ذٰلِكَ هُوَ الْفَوْزُ
الْعَظِيْمُ ﴿١١١﴾ اَلتَّآئِبُوْنَ الْعٰبِدُوْنَ الْحٰمِدُوْنَ
السَّآئِحُوْنَ الرّٰكِعُوْنَ السّٰجِدُوْنَ الْاٰمِرُوْنَ
بِالْمَعْرُوْفِ وَ النَّاهُوْنَ عَنِ الْمُنْكَرِ وَ
الْحٰفِظُوْنَ لِحُدُوْدِ اللّٰهِ ؕ وَ بَشِّرِ الْمُؤْمِنِيْنَ ﴿١١٢﴾
مَا كَانَ لِلنَّبِيِّ وَ الَّذِيْنَ اٰمَنُوْۤا اَنْ يَّسْتَغْفِرُوْا
لِلْمُشْرِكِيْنَ وَ لَوْ كَانُوْۤا اُولِيْ قُرْبٰى مِنْۢ بَعْدِ مَا
تَبَيَّنَ لَهُمْ اَنَّهُمْ اَصْحٰبُ الْجَحِيْمِ ﴿١١٣﴾ وَ مَا كَانَ
اسْتِغْفَارُ اِبْرٰهِيْمَ لِاَبِيْهِ اِلَّا عَنْ مَّوْعِدَةٍ وَّ
عَدَهَاۤ اِيَّاهُ ۚ فَلَمَّا تَبَيَّنَ لَهٗۤ اَنَّهٗ عَدُوٌّ لِّلّٰهِ تَبَرَّاَ
مِنْهُ ؕ اِنَّ اِبْرٰهِيْمَ لَاَوَّاهٌ حَلِيْمٌ ﴿١١٤﴾

**111 - 112** యథార్థం ఏమిటంటే, విశ్వాసుల నుండి అల్లాహ్ వారి ప్రాణాలనూ, వారి సంపదలనూ స్వర్గానికి బదులుగా కొన్నాడు.[38] వారు అల్లాహ్ మార్గంలో పోరాడుతారు, చంపుతారు, చస్తారు. తౌరాతులో, ఇంజీలులో, ఖురానులో వారికి అల్లాహ్ చేసిన (స్వర్గం యొక్క) వాగ్దానం సత్యమైనది. తన వాగ్దానాన్ని నెరవేర్చటంలో అల్లాహ్‌ను మించినవాడెవడు? కనుక సంబరపడండి, మీరు దేవునితో చేసిన ఈ వర్తకానికి; ఇదే అన్నిటికంటే మహత్తరమైన సాఫల్యం. అల్లాహ్ వైపునకు మాటిమాటికీ మరలే వారూ,[39] ఆయనను ఆరాధించేవారూ, ఆయనను స్తుతించేవారూ, ఆయన కొరకు భూమి మీద సంచారం చేసేవారూ,[40] ఆయన సన్నిధిలో రుకూలూ, సజ్దాలూ చేసేవారూ, మంచిని చెయ్యండి అని ఆజ్ఞాపించేవారూ, చెడు చెయ్యవద్దు అని నిరోధించేవారూ, అల్లాహ్ విధించిన హద్దులను కాపాడే వారూ (ఇటువంటి గుణవిశేషాలు కల విశ్వాసులు అల్లాహ్‌తో ఇటువంటి వాణిజ్య ఒప్పందాన్ని కుదుర్చుకుంటారు). ప్రవక్తా! ఇటువంటి విశ్వాసులకు శుభవార్త అందజెయ్యి.

**113 - 114** ముష్రిక్కులను క్షమించవలసినదిగా ప్రార్థన చెయ్యటం ప్రవక్తకూ, విశ్వాసులకూ తగనిపని, వారు వారికి బంధువులైనప్పటికీ, ఇంకా వారు నరకానికి అర్హులని వారికి స్పష్టమైనప్పుడు. ఇబ్రాహీము తన తండ్రిని క్షమించవలసినదిగా చేసిన ప్రార్థన అతను తన తండ్రికి చేసిన వాగ్దానం కారణంగా చేసినటువంటిది. కాని అతని తండ్రి దేవునికి శత్రువని అతనికి స్పష్టమైనప్పుడు, అతను అతని పట్ల విసిగిపోయాడు. వాస్తవానికి, ఇబ్రాహీము మెత్తని మనస్సు కలవాడు. దైవభక్తుడూ, సంయమనము కలవాడూను.

38. ఇక్కడ దేవునికీ, దాసునికీ మధ్య ఉండే ఈ విశ్వాస వ్యవహారాన్ని వర్తకంతో పోల్చటం జరిగింది. దాని అర్థం ఏమిటంటే, విశ్వాసం అసలు ఒక ఒప్పందం. దాని ప్రకారం దాసుడు తన ప్రాణాన్నీ, తన ఆస్తిపాస్తులనూ అల్లాహ్‌కు అమ్మేస్తాడు. దానికి ప్రతిఫలంగా మరణానంతరం మరొక జీవితంలో అతనికి స్వర్గం ప్రసాదించబడుతుంది అనే వాగ్దానాన్ని అల్లాహ్ చేస్తాడు. దానిని దాసుడు స్వీకరిస్తాడు.

39. అసలు "అత్‌తాఇబూన్" అనే పదం వాడబడింది. దానికి పదానువాదం "తౌబా చేసుకునేవారు" అని. కాని ఈ పదం ఉపయోగించబడిన సందర్భాన్నిబట్టి స్పష్టమయ్యే విషయం ఏమిటంటే, తౌబా చేసుకోవటం అనేది విశ్వాసుల శాశ్వత గుణాలలో ఒక గుణం అని. కనుక దాని అసలు భావం ఇది. వారు ఒక్కసారి మాత్రమే తౌబా చేసుకోరు. ఎల్లప్పుడూ తౌబా చేసుకుంటూనే ఉంటారు. తౌబా అంటే అసలు అర్థం తిరిగి వచ్చుట లేక మరలుట. కనుక ఈ

وَمَا كَانَ اللّٰهُ لِيُضِلَّ قَوْمًا بَعْدَ اِذْ هَدٰىهُمْ
حَتّٰى يُبَيِّنَ لَهُمْ مَّا يَتَّقُوْنَ ؕ اِنَّ اللّٰهَ بِكُلِّ
شَیْءٍ عَلِيْمٌ ﴿١١٥﴾ اِنَّ اللّٰهَ لَهٗ مُلْكُ السَّمٰوٰتِ
وَالْاَرْضِ ؕ يُحْيٖ وَيُمِيْتُ ؕ وَمَا لَكُمْ مِّنْ
دُوْنِ اللّٰهِ مِنْ وَّلِيٍّ وَّلَا نَصِيْرٍ ﴿١١٦﴾ لَقَدْ تَّابَ
اللّٰهُ عَلَى النَّبِيِّ وَالْمُهٰجِرِيْنَ وَالْاَنْصَارِ
الَّذِيْنَ اتَّبَعُوْهُ فِيْ سَاعَةِ الْعُسْرَةِ مِنْۢ بَعْدِ مَا
كَادَ يَزِيْغُ قُلُوْبُ فَرِيْقٍ مِّنْهُمْ ثُمَّ تَابَ
عَلَيْهِمْ ؕ اِنَّهٗ بِهِمْ رَءُوْفٌ رَّحِيْمٌ ﴿١١٧﴾ وَّعَلَى
الثَّلٰثَةِ الَّذِيْنَ خُلِّفُوْا ؕ حَتّٰۤى اِذَا ضَاقَتْ
عَلَيْهِمُ الْاَرْضُ بِمَا رَحُبَتْ وَضَاقَتْ
عَلَيْهِمْ اَنْفُسُهُمْ وَظَنُّوْۤا اَنْ لَّا مَلْجَاَ مِنَ اللّٰهِ
اِلَّاۤ اِلَيْهِ ؕ ثُمَّ تَابَ عَلَيْهِمْ لِيَتُوْبُوْا ؕ اِنَّ
اللّٰهَ هُوَ التَّوَّابُ الرَّحِيْمُ ﴿١١٨﴾ ع

**115 - 116** ప్రజలకు సన్మార్గం చూపిన తరువాత మళ్ళీ వారిని మార్గభ్రష్టత్వానికి గురిచెయ్యటం అల్లాహ్ విధానం కాదు, వారు దూరంగా ఉండవలసిన విషయాలను గురించి వారికి స్పష్టంగా తెలుపనంతవరకు. వాస్తవానికి అల్లాహ్‌కు ప్రతి విషయం గురించీ తెలుసు. భూమ్యాకాశాల సామ్రాజ్యం అల్లాహ్ అధీనంలోనే ఉందనేదీ, ఆయన చేతిలోనే జీవన్మరణాలు ఉన్నాయి అనేదీ, మిమ్మల్ని ఆయన నుండి కాపాడగల సంరక్షకుడూ, సహాయకుడూ మరెవడూలేడు అనేదీ యథార్థమే.

**117 - 118** అల్లాహ్ క్షమించాడు ప్రవక్తనూ, బహుకష్ట కాలంలో ప్రవక్తకు తోడ్పడిన ముహాజిరులనూ, అన్సారులనూ. వారిలో కొందరి హృదయాలు వక్రత్వం వైపునకు మొగ్గినప్పటికీ[41] (కాని వారు ఆ వక్రత్వాన్ని అనుసరించ కుండా ప్రవక్తకు తోడ్పడినప్పుడు) అల్లాహ్ వారిని క్షమించాడు. నిస్సందేహంగా ఆయన వారి పట్ల వాత్సల్యంతో, కనికరంతో వ్యవహరించాడు. ఇంకా వ్యవహారం వాయిదా వెయ్యబడిన ఆ ముగ్గురిని కూడా ఆయన క్షమించాడు. ఇంత పెద్ద వైశాల్యం కలిగి ఉండికూడా, భూమి వారికి ఇరుకైపోయింది. వారి ప్రాణాలు కూడా వారికి భారమైపోయాయి. అల్లాహ్ నుండి తమను కాపాడుకోవటానికి స్వయంగా అల్లాహ్ కారుణ్యం తప్ప వేరే ఆశ్రయం ఏదీ లేదని వారు తెలుసుకున్నారు. అప్పుడు అల్లాహ్ కనికరంతో వారి వైపునకు మరలాడు, వారు ఆయన వైపునకు మరలి వచ్చేటందుకు. నిశ్చయంగా ఆయన చాలా క్షమించేవాడూ, కరుణించేవాడూను.[42]

---

పదం యొక్క యథార్థ భావాన్ని స్పష్టం చెయ్యటానికి మేము దాని వివరణాత్మకమైన అనువాదాన్ని ఇలా చేశాము: "వారు అల్లాహ్ వైపునకు మాటిమాటికీ మరలేవారు."

40. ఉపవాసం ఉండేవారు అని రెండోవిధంగా కూడా అనువాదం చెయ్యవచ్చు.

41. అంటే, చిత్తశుద్ధిగల కొందరు ప్రవక్త అనుచరులు సైతం ఆ సంకట సమయంలో యుద్ధానికి పోవటానికి కాస్త వెనుకంజవేశారు. కాని వారి హృదయాలలో విశ్వాసం ఉంది. వారు హృదయపూర్వకంగా సత్యధర్మాన్ని ప్రేమించారు. అందుకని చివరకు వారు తమ ఈ బలహీనతను జయించగలిగారు.

42. ఈ ముగ్గురు అనుచరులు వీరు : కఅబ్ బిన్ మాలిక్ (రజిఅన్), హిలాల్ బిన్ ఉమయ్యా (రజిఅన్), మురారా బిన్ రబీ (రజిఅన్). ఈ ముగ్గురూ నిజమైన విశ్వాసులే. ఇదివరకు తమ చిత్తశుద్ధిని ఎన్నోసార్లు నిరూపించుకున్నవారే. త్యాగాలు చేసినవారే. కాని ఇన్ని సేవలు చేసినప్పటికీ, తబూక్ సంగ్రామం వంటి సంక్లిష్ట సమయంలో సమర్థులైన విశ్వాసులందర్నీ యుద్ధం కొరకు బయలుదేరండి అని ఆజ్ఞాపించినప్పుడు వారు బద్ధకించారు. ఈ బద్ధకం విషయంలోనే వారిని తీవ్రంగా మందలించటం జరిగింది. మహాప్రవక్త (సఅసమ్) తబూక్ నుండి తిరిగి వచ్చిన

يٰۤاَيُّهَا الَّذِيۡنَ اٰمَنُوا اتَّقُوا اللّٰهَ وَ كُوۡنُوۡا مَعَ
الصّٰدِقِيۡنَ ۝١١٩ مَا كَانَ لِاَهۡلِ الۡمَدِيۡنَةِ وَ مَنۡ
حَوۡلَهُمۡ مِّنَ الۡاَعۡرَابِ اَنۡ يَّتَخَلَّفُوۡا عَنۡ
رَّسُوۡلِ اللّٰهِ وَ لَا يَرۡغَبُوۡا بِاَنۡفُسِهِمۡ عَنۡ نَّفۡسِهٖ ؕ
ذٰلِكَ بِاَنَّهُمۡ لَا يُصِيۡبُهُمۡ ظَمَاٌ وَّ لَا نَصَبٌ وَّ لَا
مَخۡمَصَةٌ فِىۡ سَبِيۡلِ اللّٰهِ وَ لَا يَطَئُوۡنَ مَوۡطِئًا
يَّغِيۡظُ الۡكُفَّارَ وَ لَا يَنَالُوۡنَ مِنۡ عَدُوٍّ نَّيۡلًا اِلَّا
كُتِبَ لَهُمۡ بِهٖ عَمَلٌ صَالِحٌ ؕ اِنَّ اللّٰهَ لَا
يُضِيۡعُ اَجۡرَ الۡمُحۡسِنِيۡنَ ۝١٢٠ۙ وَ لَا يُنۡفِقُوۡنَ
نَفَقَةً صَغِيۡرَةً وَّلَا كَبِيۡرَةً وَّلَا يَقۡطَعُوۡنَ
وَادِيًا اِلَّا كُتِبَ لَهُمۡ لِيَجۡزِيَهُمُ اللّٰهُ اَحۡسَنَ مَا
كَانُوۡا يَعۡمَلُوۡنَ ۝١٢١ وَ مَا كَانَ الۡمُؤۡمِنُوۡنَ
لِيَنۡفِرُوۡا كَآفَّةً ؕ فَلَوۡلَا نَفَرَ مِنۡ كُلِّ فِرۡقَةٍ
مِّنۡهُمۡ طَآئِفَةٌ لِّيَتَفَقَّهُوۡا فِى الدِّيۡنِ وَلِيُنۡذِرُوۡا
قَوۡمَهُمۡ اِذَا رَجَعُوۡۤا اِلَيۡهِمۡ لَعَلَّهُمۡ يَحۡذَرُوۡنَ ۝١٢٢ ع

**119 - 121** విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్‌కు భయపడండి. సత్యవంతులకు తోడ్పడండి. మదీనా పౌరులకూ, చుట్టుపక్కల ఉండే ఎడారి అరబ్బులకూ అల్లాహ్ ప్రవక్తను వదిలిపెట్టి ఇళ్ళల్లో కూర్చోవటం, ఆయనను పట్టించుకోకుండా తమను గురించి మాత్రమే ఆదుర్దాపడటం ఎంతమాత్రం శోభించదు. ఎందుకంటే, అల్లాహ్ మార్గంలో వారు ఆకలిదప్పులనూ, శరీర శ్రమకు సంబంధించిన ఏదైనా బాధను సహించి ఉంటే, సత్యతిరస్కారులు సహించలేని మార్గంపై వారు ఏదైనా అడుగువేస్తే ఏ శత్రువుకైనా (సత్య విరోధానికి) వారు ప్రతీకారం చేస్తే దానికి బదులుగా వారికొరకు ఒక సత్కార్యం వ్రాయబడ కుండా ఉండటం అనేది ఎన్నటికీ జరగదు. నిశ్చయంగా అల్లాహ్ వద్ద సజ్జనుల సేవాఫలం హక్కు హరించబడదు. ఇదేవిధంగా వారు (దైవ మార్గంలో) కొద్దో గొప్పో, ఏదైనా ఖర్చును భరిస్తే (జిహాద్ ప్రయత్నంలో) వారు ఏదైనా లోయనుదాటితే, వారికొరకు దానిని వ్రాయకపోవటం అనేది కూడా ఎన్నటికీ జరుగదు, అల్లాహ్ వారి ఈ మంచి కార్యానికి ప్రతిఫలాన్ని వారికి ప్రసాదించటానికి.

**122** విశ్వాసులు అందరికందరూ బయలుదేరవలసిన అవసరం లేదు. కాని వారి జనపదంలోని ప్రతి భాగం నుండి కొందరు బయలుదేరి వచ్చి, ధర్మ అవగాహనను పెంపొందిం చుకుని, తిరిగి వెళ్ళి తమ ప్రాంతంలోని ప్రజలకు వారు (ఇస్లామ్ వ్యతిరేక వైఖరిని)మానుకోవాలని హెచ్చరిక చెయ్యటం ఎందుకు జరుగలేదు?[43]

తరువాత ముస్లిములను, ఈ ముగ్గురికి సలాము చెయ్యవద్దనీ వారితో మాట్లాడవద్దనీ ఆజ్ఞాపించారు. 40 రోజుల తరువాత వారి భార్యలు కూడా వారికి దూరంగా ఉండాలని శాసించబడ్డారు. వాస్తవానికి మదీనా పట్టణంలో వారి పరిస్థితి ఈ ఆయతులో చిత్రించబడిన విధంగా అయిపోయింది. చివరకు 50 రోజుల వెలి తరువాత ఈ మన్నింపు ఆజ్ఞ అవతరించింది.

43. భావం ఏమిటంటే, పల్లెటూరి అరబ్బులందరూ మదీనాకు వచ్చే అవసరం లేదు. ప్రతి బస్తీకి, ప్రతి ప్రాంతానికి చెందిన ప్రజలలో కొందరు గనక మదీనాకు వచ్చి ధర్మజ్ఞానం పొంది, తిరిగివెళ్ళి తమ ప్రాంత ప్రజలకు ధర్మాన్ని నేర్పివుంటే, పల్లెటూరి అరబ్బులలో ఇంత అజ్ఞానం ఉండేది కాదు. ఈ అజ్ఞానం కారణంగానే వారు కాపట్యం రోగానికి గురి అయ్యారు. ఇస్లామ్‌ను స్వీకరించిన తరువాత కూడా ముస్లిములుగా తమ బాధ్యతలను నెరవేర్చటం లేదు.

يٰۤاَيُّهَا الَّذِيۡنَ اٰمَنُوۡا قَاتِلُوا الَّذِيۡنَ يَلُوۡنَكُمۡ مِّنَ
الۡكُفَّارِ وَلۡيَجِدُوۡا فِيۡكُمۡ غِلۡظَةً ؕ وَ اعۡلَمُوۡۤا اَنَّ
اللّٰهَ مَعَ الۡمُتَّقِيۡنَ ﴿١٢٣﴾ وَاِذَا مَاۤ اُنۡزِلَتۡ سُوۡرَةٌ
فَمِنۡهُمۡ مَّنۡ يَّقُوۡلُ اَيُّكُمۡ زَادَتۡهُ هٰذِهٖۤ اِيۡمَانًا ۚ
فَاَمَّا الَّذِيۡنَ اٰمَنُوۡا فَزَادَتۡهُمۡ اِيۡمَانًا وَّ هُمۡ
يَسۡتَبۡشِرُوۡنَ ﴿١٢٤﴾ وَ اَمَّا الَّذِيۡنَ فِىۡ قُلُوۡبِهِمۡ
مَّرَضٌ فَزَادَتۡهُمۡ رِجۡسًا اِلٰى رِجۡسِهِمۡ وَ مَاتُوۡا
وَ هُمۡ كٰفِرُوۡنَ ﴿١٢٥﴾ اَوَ لَا يَرَوۡنَ اَنَّهُمۡ يُفۡتَنُوۡنَ
فِىۡ كُلِّ عَامٍ مَّرَّةً اَوۡ مَرَّتَيۡنِ ثُمَّ لَا يَتُوۡبُوۡنَ
وَ لَا هُمۡ يَذَّكَّرُوۡنَ ﴿١٢٦﴾ وَاِذَا مَاۤ اُنۡزِلَتۡ سُوۡرَةٌ
نَّظَرَ بَعۡضُهُمۡ اِلٰى بَعۡضٍ ؕ هَلۡ يَرٰٮكُمۡ مِّنۡ
اَحَدٍ ثُمَّ انْصَرَفُوۡا ؕ صَرَفَ اللّٰهُ قُلُوۡبَهُمۡ بِاَنَّهُمۡ
قَوۡمٌ لَّا يَفۡقَهُوۡنَ ﴿١٢٧﴾ لَقَدۡ جَآءَكُمۡ رَسُوۡلٌ مِّنۡ
اَنۡفُسِكُمۡ عَزِيۡزٌ عَلَيۡهِ مَا عَنِتُّمۡ حَرِيۡصٌ عَلَيۡكُمۡ
بِالۡمُؤۡمِنِيۡنَ رَءُوۡفٌ رَّحِيۡمٌ ﴿١٢٨﴾ فَاِنۡ تَوَلَّوۡا
فَقُلۡ حَسۡبِىَ اللّٰهُ ۖ لَاۤ اِلٰهَ اِلَّا هُوَ ؕ عَلَيۡهِ
تَوَكَّلۡتُ وَهُوَ رَبُّ الۡعَرۡشِ الۡعَظِيۡمِ ﴿١٢٩﴾

**123 - 127** విశ్వసించిన ప్రజలారా! మీ చెంతనున్న సత్య తిరస్కారులతో పోరాడండి.[44] వారు మీలో కాఠిన్యాన్ని చూడాలి.[45] భయభక్తులు కలవారితో అల్లాహ్ ఉంటాడని తెలుసుకోండి. కొత్త సూరా ఏదైనా అవతరించినప్పుడల్లా వారిలోని కొందరు (హేళనగా ముస్లిములను) ఇలా అడుగుతారు: "మీలో ఎవరి విశ్వాసం దీనివల్ల పెరిగిందో చెప్పండి?" విశ్వసించిన వారి విశ్వాసాన్ని వాస్తవంగానే (అవతరించిన ప్రతి సూరా) పెంచింది. వారు దానికి సంతోష పడుతున్నారు. అయితే (కాపట్యం) రోగం తగిలిన హృదయాలు కల వారి పూర్వపు మాలిన్యానికి (ప్రతి కొత్తసూరా) మరింత మాలిన్యాన్ని చేర్చింది. వారు మరణించే వరకు అవిశ్వాసంలోనే పడివున్నారు. తాము ప్రతి సంవత్సరం ఒకటీ రెండుసార్లు పరీక్షకు గురిచెయ్యబడటాన్ని వారు చూడటం లేదా?[46] కాని దీని తరువాత కూడా వారు పశ్చాత్తాపము పడటంలేదు. ఏ గుణపాఠాన్నీ నేర్చు కోవటం లేదు. సూరా ఏదైనా అవతరించినప్పుడు వారు కళ్ళతోనే పరస్పరం మాట్లాడుకుంటారు, ఎవరైనా మిమ్మల్ని చూడటం లేదు కదా అని. తరువాత మెల్లగా అక్కడి నుండి జారుకుంటారు. అల్లాహ్ వారి హృదయాలను (ఖురాను నుండి) మళ్ళించాడు. ఎందుకంటే వారు బుద్ధిహీనులు.

**128 - 129** చూడండి! మీవద్దకు ఒక ప్రవక్త వచ్చాడు. ఆయన స్వయంగా మీలోనివాడే. మీరు నష్టానికి గురికావటం అనేది ఆయనకు కష్టం కలిగిస్తుంది. మీ సాఫల్యాన్ని ఆయన తీవ్రంగా కాంక్షిస్తాడు. విశ్వాసులపై ఆయన వాత్సల్యం కలవాడు, కారుణ్యం కలవాడు – ఇక వారు నీకు విముఖులైతే, ప్రవక్తా! వారితో ఇలా అను: "నాకు అల్లాహ్‌యే చాలు. ఆయన తప్ప ఆరాధ్యుడు ఎవ్వడూ లేదు. ఆయననే నేను నమ్ముకు న్నాను. ఆయన మహత్తరమైన అధికార పీఠానికి ప్రభువు."

44. ఉపన్యాస సందర్భాన్నిబట్టి ఆలోచిస్తే స్పష్టమయ్యే విషయం ఏమిటంటే, ఇక్కడ అవిశ్వాసులు అంటే భావం తమ సత్యతిరస్కారం పూర్తిగా బయటపడిపోయిన కపటులు అని. వారు ముస్లిము సమాజంలో కలసిపోవటం వల్ల తీవ్ర నష్టాలు కలుగుతూ ఉండేవి.

45. అంటే, ఇక వారితో ఇంతవరకు అవలంబిస్తూ వచ్చిన మృదువైఖరిని మానుకోవాలి.

46. అంటే, వారి విశ్వాసపు ప్రకటన పరీక్ష అనే గీటురాయికి గురికాకుండా ఉండని పరిస్థితులూ ఆ ప్రకటనలోని కల్తీ యొక్క రహస్యం బయటపడకుండా ఉండని పరిస్థితులూ రాకుండా ఏ సంవత్సరమూ గడవటం లేదు.

ఆయతులు 109 | ## 10. యూనుస్ | అవతరణ మక్కాలో

١٠ سُوْرَةُ يُوْنُسَ مَكِّيَّةٌ ٥١
اٰيَاتُهَا ١٠٩ | رُكُوْعَاتُهَا ١١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

الٓرٰ ۚ تِلْكَ اٰيٰتُ الْكِتٰبِ الْحَكِيْمِ ① اَكَانَ
لِلنَّاسِ عَجَبًا اَنْ اَوْحَيْنَآ اِلٰى رَجُلٍ مِّنْهُمْ
اَنْ اَنْذِرِ النَّاسَ وَبَشِّرِ الَّذِيْنَ اٰمَنُوْٓا اَنَّ
لَهُمْ قَدَمَ صِدْقٍ عِنْدَ رَبِّهِمْ ؕ قَالَ
الْكٰفِرُوْنَ اِنَّ هٰذَا لَسٰحِرٌ مُّبِيْنٌ ② اِنَّ رَبَّكُمُ
اللّٰهُ الَّذِيْ خَلَقَ السَّمٰوٰتِ وَالْاَرْضَ فِيْ سِتَّةِ
اَيَّامٍ ثُمَّ اسْتَوٰى عَلَى الْعَرْشِ يُدَبِّرُ الْاَمْرَ ؕ
مَا مِنْ شَفِيْعٍ اِلَّا مِنْ بَعْدِ اِذْنِهٖ ؕ ذٰلِكُمُ
اللّٰهُ رَبُّكُمْ فَاعْبُدُوْهُ ؕ اَفَلَا تَذَكَّرُوْنَ ③
اِلَيْهِ مَرْجِعُكُمْ جَمِيْعًا ؕ وَعْدَ اللّٰهِ حَقًّا ؕ اِنَّهٗ
يَبْدَؤُا الْخَلْقَ ثُمَّ يُعِيْدُهٗ لِيَجْزِيَ الَّذِيْنَ
اٰمَنُوْا وَعَمِلُوا الصّٰلِحٰتِ بِالْقِسْطِ ؕ وَالَّذِيْنَ
كَفَرُوْا لَهُمْ شَرَابٌ مِّنْ حَمِيْمٍ وَّعَذَابٌ اَلِيْمٌۢ
بِمَا كَانُوْا يَكْفُرُوْنَ ④

المنزل ٣ | وقف النبي صلى الله عليه وسلم

**1 - 2** అలిఫ్ లామ్ రా. ఈ ఆయతులు వివేకంతోనూ విజ్ఞానంతోనూ నిండి వున్న గ్రంథంలోనివి. (ఏమరుపాటులో పడివున్న) ప్రజలను హెచ్చరించు అనీ, విశ్వసించిన వారికి తమ ప్రభువువద్ద నిజమైన గౌరవమూ సాఫల్యమూ ఉన్నాయనే శుభవార్త తెలుపు అనీ మేము స్వయంగా వారిలోని ఒక మనిషిపైకి వహీని పంపించటం ప్రజలకు చోద్యమైన విషయంగా కన్పిస్తోందా?(దానికి) తిరస్కారులు "ఈ మనిషి పచ్చి మాంత్రికుడు"[1] అని అన్నారు.

**3** యథార్థం ఏమిటంటే ఆకాశాలనూ, భూమినీ ఆరు రోజులలో సృష్టించి, తరువాత రాజ్యపీఠాన్ని అలంకరించి సృష్టి వ్యవహారాలను నడుపుతూవున్న దేవుడే మీ ప్రభువు. ఆయన అనుమతి ఇస్తే తప్ప ఎవడూ సిఫారసు చేయలేడు. ఈ అల్లాహ్‌యే మీ ప్రభువు. కనుక మీరు ఆయననే ఆరాధించండి. మీరు ఇక స్పృహలోకి రారా?

**4** ఆయన వైపునకే మీరంతా మరలిపోవలసి ఉన్నది. ఇది అల్లాహ్ యొక్క తిరుగులేని వాగ్దానం. నిస్సందేహంగా సృష్టిని ఆయనే ప్రారంభిస్తాడు. తరువాత రెండోసారి మళ్ళీ ఆయనే సృష్టిస్తాడు. విశ్వసించి మంచిపనులు చేసిన వారికి ప్రతిఫలం న్యాయంగా ఇవ్వటానికి – అవిశ్వాసవైఖరిని అవలంబించిన వారు సలసల కాగే నీరు త్రాగటానికి, వ్యథాభరితమైన శిక్షను అనుభవించటానికి, వారు ఒడిగట్టిన సత్యతిరస్కారానికి ఫలితంగా.

1. మహాప్రవక్త (సఅసమ్)ను వారు మాంత్రికుడని ఏ అర్థంలో అనేవారంటే, ఎవడైనా ఒక వ్యక్తి, ఆయన ఖురానును పారాయణం చేస్తూవుండగా, దానిని బోధిస్తూ ఉండగా విని ప్రభావితుడై ఇస్లామ్ ధర్మాన్ని స్వీకరిస్తే అతడు తన ప్రాణాలను ధారపొయ్యటానికీ, ప్రపంచంతో పూర్తిగా తెగతెంపులు చేసుకోవటానికీ, అన్ని రకాల క్లేశాలను భరించటానికి సిద్ధపడేవాడు.

هُوَ الَّذِيْ جَعَلَ الشَّمْسَ ضِيَآءً وَّ الْقَمَرَ
نُوْرًا وَّ قَدَّرَهٗ مَنَازِلَ لِتَعْلَمُوْا عَدَدَ السِّنِيْنَ
وَ الْحِسَابَ ؕ مَا خَلَقَ اللّٰهُ ذٰلِكَ اِلَّا بِالْحَقِّ ۚ
يُفَصِّلُ الْاٰيٰتِ لِقَوْمٍ يَّعْلَمُوْنَ ۵ اِنَّ فِي
اخْتِلَافِ الَّيْلِ وَ النَّهَارِ وَ مَا خَلَقَ اللّٰهُ فِي
السَّمٰوٰتِ وَالْاَرْضِ لَاٰيٰتٍ لِّقَوْمٍ يَّتَّقُوْنَ ۶
اِنَّ الَّذِيْنَ لَا يَرْجُوْنَ لِقَآءَنَا وَ رَضُوْا
بِالْحَيٰوةِ الدُّنْيَا وَ اطْمَاَنُّوْا بِهَا وَ الَّذِيْنَ هُمْ
عَنْ اٰيٰتِنَا غٰفِلُوْنَ ۷ اُولٰٓئِكَ مَاْوٰىهُمُ النَّارُ
بِمَا كَانُوْا يَكْسِبُوْنَ ۸ اِنَّ الَّذِيْنَ اٰمَنُوْا وَ
عَمِلُوا الصّٰلِحٰتِ يَهْدِيْهِمْ رَبُّهُمْ بِاِيْمَانِهِمْ ۚ
تَجْرِيْ مِنْ تَحْتِهِمُ الْاَنْهٰرُ فِيْ جَنّٰتِ النَّعِيْمِ ۹
دَعْوٰىهُمْ فِيْهَا سُبْحٰنَكَ اللّٰهُمَّ وَ تَحِيَّتُهُمْ فِيْهَا
سَلٰمٌ ۚ وَ اٰخِرُ دَعْوٰىهُمْ اَنِ الْحَمْدُ لِلّٰهِ رَبِّ
الْعٰلَمِيْنَ ۱۰ ع

**5 - 6** సూర్యుణ్ణి కాంతిమంతునిగా చేసినవాడు ఆయనే. చంద్రుడికి వెలుగును ఇచ్చినవాడూ ఆయనే. చంద్రుని తరిగే పెరిగే దశలను కచ్చితంగా నిర్ణయించిన వాడూ ఆయనే. తద్వారా మీరు సంవత్సరాల, తేదీల లెక్కను తెలుసుకోవాలని. అల్లాహ్ ఇదంతా సత్యబద్ధంగానే పుట్టించాడు. జ్ఞానం కల ప్రజలకు ఆయన తన సూచనలను తేటతెల్లంగా తెలియజేస్తు న్నాడు. నిశ్చయంగా రేయింబవళ్ళ నిరంతర పరిభ్రమణంలో భూమ్యాకాశాలలో అల్లాహ్ సృష్టించిన ప్రతి వస్తువులో (తప్పుడు దృష్టికోణం నుండి తప్పుడు ప్రవర్తన నుండి) తప్పించుకోగోరే వారికొరకు సూచనలు ఉన్నాయి.[2]

**7 - 8** యథార్థం ఏమిటంటే మమ్మల్ని కలుసుకోవాలని ఆశించనివారూ ప్రాపంచిక జీవితమునే వరించి దానితోనే తృప్తి చెందినవారూ మా సూచనల పట్ల నిర్లక్ష్య భావం కలిగి వున్నవారూ- అటువంటి వారి అంతిమ నివాస స్థలం నరకమే అవుతుంది. వారు (తమ ఈ తప్పుడు విశ్వాసం, తప్పుడు ప్రవర్తనలు కారణంగా) చేస్తూ వచ్చిన చెడులకు ఫలితంగా.

**9 - 10** ఇదీ యథార్థమే. విశ్వసించి (అంటే ఈ గ్రంథంలో తెలుపబడిన సత్యాలను స్వీకరించి), మంచి పనులు చేస్తూ ఉండినవారిని వారి ప్రభువు వారి విశ్వాసం కారణంగా సరియైన మార్గంపై నడుపుతాడు. భోగభాగ్యాలతో నిండివున్న స్వర్గవనాలలో వారి క్రింద కాలువలు ప్రవహిస్తాయి. అక్కడ వారు దైవమా! నీవు పవిత్రుడవు అని స్తుతిస్తారు, శాంతి కలుగుగాక అని ప్రార్థిస్తారు. వారి ప్రతి మాటకు ముగింపు ఇలా ఉంటుంది: స్తోత్రమంతా సకల లోకాల ప్రభువైన అల్లాహ్‌కు మాత్రమే.

2. అంటే, ఈ సూచనల ద్వారా ఇటువంటి గుణాలు కలవారే వాస్తవికతను అవగాహన చేసుకోగలుగుతారు. ఒకటి : వారు అజ్ఞాన జనితమైన విద్వేషాలను విడనాడి, అల్లాహ్ ప్రసాదించిన సాధనాలను జ్ఞానం పొందటానికి వినియోగించుకోవాలి. రెండు : స్వయంగా వారిలోనే అపమార్గానికి దూరంగా ఉండాలనే కోరిక, సన్మార్గాన్ని స్వీకరించాలనే కోరిక జనించాలి.

وَ لَوْ يُعَجِّلُ اللّٰهُ لِلنَّاسِ الشَّرَّ اسْتِعْجَالَهُمْ
بِالْخَيْرِ لَقُضِيَ اِلَيْهِمْ اَجَلُهُمْ ؕ فَنَذَرُ
الَّذِيْنَ لَا يَرْجُوْنَ لِقَآءَنَا فِيْ طُغْيَانِهِمْ
يَعْمَهُوْنَ ﴿١١﴾ وَ اِذَا مَسَّ الْاِنْسَانَ الضُّرُّ دَعَانَا
لِجَنْۢبِهٖۤ اَوْ قَاعِدًا اَوْ قَآئِمًا ۚ فَلَمَّا كَشَفْنَا
عَنْهُ ضُرَّهٗ مَرَّ كَاَنْ لَّمْ يَدْعُنَاۤ اِلٰى ضُرٍّ مَّسَّهٗ ؕ
كَذٰلِكَ زُيِّنَ لِلْمُسْرِفِيْنَ مَا كَانُوْا يَعْمَلُوْنَ ﴿١٢﴾
وَ لَقَدْ اَهْلَكْنَا الْقُرُوْنَ مِنْ قَبْلِكُمْ لَمَّا ظَلَمُوْا ۙ
وَ جَآءَتْهُمْ رُسُلُهُمْ بِالْبَيِّنٰتِ وَ مَا كَانُوْا
لِيُؤْمِنُوْا ؕ كَذٰلِكَ نَجْزِي الْقَوْمَ الْمُجْرِمِيْنَ ﴿١٣﴾
ثُمَّ جَعَلْنٰكُمْ خَلٰٓئِفَ فِي الْاَرْضِ مِنْۢ بَعْدِهِمْ
لِنَنْظُرَ كَيْفَ تَعْمَلُوْنَ ﴿١٤﴾ وَ اِذَا تُتْلٰى عَلَيْهِمْ
اٰيَاتُنَا بَيِّنٰتٍ ۙ قَالَ الَّذِيْنَ لَا يَرْجُوْنَ لِقَآءَنَا
ائْتِ بِقُرْاٰنٍ غَيْرِ هٰذَاۤ اَوْ بَدِّلْهُ ؕ قُلْ مَا
يَكُوْنُ لِيْۤ اَنْ اُبَدِّلَهٗ مِنْ تِلْقَآئِ نَفْسِيْ ۚ
اِنْ اَتَّبِعُ اِلَّا مَا يُوْحٰۤى اِلَيَّ ۚ اِنِّيْۤ اَخَافُ اِنْ
عَصَيْتُ رَبِّيْ عَذَابَ يَوْمٍ عَظِيْمٍ ﴿١٥﴾ قُلْ لَّوْ
شَآءَ اللّٰهُ مَا تَلَوْتُهٗ عَلَيْكُمْ وَ لَاۤ اَدْرٰىكُمْ
بِهٖ ۖ فَقَدْ لَبِثْتُ فِيْكُمْ عُمُرًا مِّنْ قَبْلِهٖ ؕ اَفَلَا
تَعْقِلُوْنَ ﴿١٦﴾ فَمَنْ اَظْلَمُ مِمَّنِ افْتَرٰى عَلَى اللّٰهِ
كَذِبًا اَوْ كَذَّبَ بِاٰيٰتِهٖ ؕ اِنَّهٗ لَا يُفْلِحُ
الْمُجْرِمُوْنَ ﴿١٧﴾

**11 - 14** ప్రజలు ప్రాపంచిక ప్రయోజనాలను కోరడంలో ఎంత తొందర పడతారో అల్లాహ్ వారిపట్ల చెడుగా వ్యవహరించడంలో కూడా అంతే తొందరపడితే వారి కర్మాచరణ వ్యవధి ఎప్పుడో అంతం చెయ్యబడి ఉండేది. (కాని మేము అలా చెయ్యము). అందువల్ల మేము మమ్మల్ని కలుసుకునే నమ్మకం లేనివారికి తమ తలబిరుసుతనంతో భ్రష్టులై తిరిగే స్వేచ్ఛను ఇస్తాము. మానవుడి స్థితి ఎలాంటిదంటే; అతడికి కష్టకాలం దాపురించినప్పుడు నిలబడీ, కూర్చుండీ, పరుండీ మాకు మొరపెట్టుకుంటాడు. కాని మేము అతడి ఆపదను తొలగించినప్పుడు అతడు ఎప్పుడూ తనకు కలిగిన ఏ గడ్డు కాలంలోనూ మాకు మొరపెట్టుకోనేలేదు అనే విధంగా ప్రవర్తిస్తాడు. ఈ విధంగా మితిమీరి ప్రవర్తించేవారికి వారి చేష్టలు ఆకర్షకములుగా చెయ్యబడ్డాయి. ప్రజలారా! మీకు పూర్వం ఉన్న జాతులను[3] మేము నాశనం చేశాము ఎందుకంటే, వారు దుర్మార్గపు వైఖరిని అవలంబించారు. వారి ప్రవక్తలు వారివద్దకు స్పష్టమైన నిదర్శనాలను తీసుకొని వచ్చినప్పుడు వారు విశ్వసించనే లేదు. ఈ విధంగా మేము దోషులకు వారు చేసిన దోషాలకు ప్రతిఫలాన్ని ఇస్తూ ఉంటాము. ఇప్పుడు వారి తరువాత మేము మీకు భూమిపై వారి స్థానాన్ని ఇచ్చాము, మీరు ఎలా ప్రవర్తిస్తారో చూద్దామని.

**15 - 17** మమ్మల్ని కలిసే నమ్మకం లేని వారికి స్పష్టమైన మా మాటలను వినిపించినప్పుడు ఇలా అంటారు: "దీనికి బదులుగా మరొక ఖురాను తీసుకురా లేదా ఇందులో సవరణలు చెయ్యి." ప్రవక్తా! వారితో ఇలా అను: "ఇందులో నా అంతట నేను మార్పులూ చేర్పులూ చెయ్యటం నా పని ఎంత మాత్రం కాదు. నేను నా వద్దకు పంపబడే వహీని మాత్రమే అనుసరిస్తాను. నేను గనుక నా ప్రభువుపట్ల అవిధేయత చూపితే, ఒక పెద్ద భయంకరమైన దినంనాడు పడే శిక్షకు నేను భయపడుతాను." ఇంకా ఇలా అను : "అల్లాహ్ సంకల్పం ఇదే గనక అయితే నేను ఈ ఖురానును మీకు ఎన్నటికీ వినిపించి ఉండేవాణ్ణి కాదు. అల్లాహ్ దానిని గురించి మీకు అసలు తెలిపి ఉండేవాడే కాదు. ఈ గ్రంథం అవతరించక పూర్వం నేను మీ మధ్య ఒక జీవిత కాలాన్నంతా గడిపాను. మీరు బుద్ధిని ఉపయోగించరా?"[4] ఒక అబద్ధ విషయాన్ని సృష్టించి దానిని అల్లాహ్‌కు ఆపాదించే వాడికంటే లేదా అల్లాహ్ యొక్క నిజమైన ఆయతులను అబద్ధాలుగా నిర్ధారించే వాడికంటే పరమ దుర్మార్గు డెవడుంటాడు? నిశ్చయంగా దోషులు ఎన్నటికీ సాఫల్యాన్ని పొందలేరు.

وَ يَعۡبُدُوۡنَ مِنۡ دُوۡنِ اللّٰهِ مَا لَا يَضُرُّهُمۡ وَ لَا
يَنۡفَعُهُمۡ وَ يَقُوۡلُوۡنَ هٰٓؤُلَآءِ شُفَعَآؤُنَا عِنۡدَ
اللّٰهِ ؕ قُلۡ اَتُنَـبِّـئُوۡنَ اللّٰهَ بِمَا لَا يَعۡلَمُ فِى
السَّمٰوٰتِ وَ لَا فِى الۡاَرۡضِ ؕ سُبۡحٰنَهٗ وَ تَعٰلٰى
عَمَّا يُشۡرِكُوۡنَ ﴿۱۸﴾ وَ مَا كَانَ النَّاسُ اِلَّاۤ اُمَّةً
وَّاحِدَةً فَاخۡتَلَفُوۡا ؕ وَ لَوۡ لَا كَلِمَةٌ سَبَقَتۡ مِنۡ
رَّبِّكَ لَقُضِىَ بَيۡنَهُمۡ فِيۡمَا فِيۡهِ يَخۡتَلِفُوۡنَ ﴿۱۹﴾
وَيَقُوۡلُوۡنَ لَوۡ لَاۤ اُنۡزِلَ عَلَيۡهِ اٰيَةٌ مِّنۡ رَّبِّهٖ ۚ
فَقُلۡ اِنَّمَا الۡغَيۡبُ لِلّٰهِ فَانۡتَظِرُوۡا ۚ اِنِّىۡ مَعَكُمۡ
مِّنَ الۡمُنۡتَظِرِيۡنَ ﴿۲۰﴾

**18** ఈ ప్రజలు అల్లాహ్‌ను కాదని తమకు నష్టాన్నిగానీ లాభాన్నిగానీ కలిగించలేనివారిని పూజిస్తున్నారు. పైగా ఇలా అంటున్నారు: "వారు అల్లాహ్ వద్ద మా కొరకు సిఫారసు చేస్తారు." ప్రవక్తా! వారితో ఇలా అను : "ఆకాశాలలోగానీ, భూమిలో[5]గానీ అల్లాహ్ ఎరుగని విషయాన్ని గురించి ఆయనకు మీరు తెలుపుతున్నారా?" ఆయన పరిశుద్ధుడు. ఈ ప్రజలు చేసే షిర్కుకు అతీతుడూ, ఉన్నతుడూను.

**19** ప్రారంభంలో సర్వమానవులూ ఒకే సంఘంగా ఉండేవారు. తరువాత వారు విభిన్న విశ్వాసాలను, ఆచారాలను సృష్టించుకున్నారు. నీ ప్రభువు తరఫు నుండి ముందుగానే ఒక విషయం నిర్ణయించబడకుండా ఉన్నట్లయితే వారు పరస్పరం విభేదించుకుంటున్నటువంటి విషయాన్ని గురించి తీర్పు ఎప్పుడో చెయ్యబడి ఉండేది.[6]

**20** ఇక "ఈ ప్రవక్తపై ఇతని ప్రభువు తరఫు నుండి ఏదైనా సూచన ఎందుకు అవతరింపజెయ్యబడలేదు?" అని వారు అన్నదానికి నీవు ఇలా బదులు చెప్పు: అగోచరాలన్నింటికీ యజమానీ, అధికారీ అల్లాహ్ మాత్రమే. మంచిది, నిరీక్షించండి. నేను కూడా మీతోపాటు నిరీక్షిస్తాను.

---

3. అసలు ఇక్కడ ఖర్న్ అనే పదం ఉపయోగించబడింది. సాధారణంగా ఈ పదానికి అరబ్బీ భాషలో "ఒకే కాలానికి చెందిన ప్రజలు" అని భావం. కాని ఖురానులో పలు సందర్భాలలో ఈ పదాన్ని ప్రయోగించిన పద్ధతిని చూస్తే ఖర్న్ అంటే అర్థం తన కాలంలో అభివృద్ధి శిఖరాలకు చేరిన జాతి అని తెలుస్తోంది. అటువంటి జాతి నాశనం కావటం అనే దానికి అర్థం తప్పనిసరిగా "దానిని పూర్తిగా నామరూపాలు లేకుండా నాశనం చెయ్యటం జరిగింది" అని మాత్రమే కాదు. అది దాని ఉన్నత స్థానం నుండి పడవేయబడటం, దాని నాగరికత, దాని సంస్కృతీ నాశనం కావటం, దాని ప్రత్యేక లక్షణాలు తుడిచిపెట్టుకు పోవటం, అది ముక్కలు ముక్కలుగా చీలిపోయి ఇతర జాతుల్లో లీనమైపోవటం అని కూడా అర్థం.
4. అంటే, నేను మీకు కొత్తవాణ్ణేమీ కాను. మీ పట్టణంలోనే పుట్టాను. మీ మధ్యనే బాల్యం నుండి పెరిగి పెద్ద వాడిని అయ్యాను. నా పూర్తి జీవితాన్ని చూస్తూ కూడా ఈ ఖురాను నేను స్వయంగా రచించిన గ్రంథం అని మీరు నిజాయితీతో చెప్పగలరా? నేనే కల్పించి ఇది అల్లాహ్ తరఫు నుండి నాపై అవతరించిందనేటంత పెద్ద అబద్ధాన్ని నేను ప్రజలకు చెపుతానని మీరు నమ్మగలరా?
5. ఒక వస్తువును గురించి అల్లాహ్‌కు తెలియదు అని అంటే అలాంటిది అసలు లేనేలేదు అని అర్థం. ఎందుకంటే ఉన్నదంతా అల్లాహ్‌కు తెలుసు. కనుక సిఫారసు చేసేవారు అసలు లేరు అని చెప్పటానికి ఇదొక అత్యంత సూక్ష్మమైన విధానం. భూమిలోగానీ ఆకాశాలలోగానీ మీ తరఫున అల్లాహ్ సమక్షంలో సిఫారసు చేసేవాడున్నాడని అల్లాహ్‌కు మాత్రం తెలియదు. అలాంటప్పుడు మీరు ఏ సిఫారసుదారులను గురించి ఆయనకు తెలుపుతున్నారు?
6. అంటే, తీర్పు ప్రళయం నాడు జరుగుతుందని అల్లాహ్ గనక మొదట్లోనే నిర్ణయించి ఉండకపోతే ఇక్కడే దాని తీర్పు చెయ్యబడి ఉండేది.

وَ إِذَآ أَذَقْنَا النَّاسَ رَحْمَةً مِّنۢ بَعْدِ ضَرَّآءَ
مَسَّتْهُمْ إِذَا لَهُم مَّكْرٌ فِىٓ ءَايَاتِنَا ۚ قُلِ اللَّهُ
أَسْرَعُ مَكْرًا ۚ إِنَّ رُسُلَنَا يَكْتُبُونَ مَا
تَمْكُرُونَ ﴿٢١﴾ هُوَ الَّذِى يُسَيِّرُكُمْ فِى الْبَرِّ وَ
الْبَحْرِ ۖ حَتَّىٰٓ إِذَا كُنتُمْ فِى الْفُلْكِ ۚ وَ جَرَيْنَ
بِهِم بِرِيحٍ طَيِّبَةٍ وَّ فَرِحُوا بِهَا جَآءَتْهَا
رِيحٌ عَاصِفٌ وَّ جَآءَهُمُ الْمَوْجُ مِن كُلِّ
مَكَانٍ وَّ ظَنُّوٓا أَنَّهُمْ أُحِيطَ بِهِمْ ۙ دَعَوُا اللَّهَ
مُخْلِصِينَ لَهُ الدِّينَ ۚ لَئِنْ أَنجَيْتَنَا مِنْ
هَٰذِهِ لَنَكُونَنَّ مِنَ الشَّٰكِرِينَ ﴿٢٢﴾ فَلَمَّآ أَنجَىٰهُمْ
إِذَا هُمْ يَبْغُونَ فِى الْأَرْضِ بِغَيْرِ الْحَقِّ ۗ
يَٰٓأَيُّهَا النَّاسُ إِنَّمَا بَغْيُكُمْ عَلَىٰٓ أَنفُسِكُم ۙ مَّتَاعَ
الْحَيَوٰةِ الدُّنْيَا ۖ ثُمَّ إِلَيْنَا مَرْجِعُكُمْ فَنُنَبِّئُكُم
بِمَا كُنتُمْ تَعْمَلُونَ ﴿٢٣﴾ إِنَّمَا مَثَلُ الْحَيَوٰةِ
الدُّنْيَا كَمَآءٍ أَنزَلْنَٰهُ مِنَ السَّمَآءِ فَاخْتَلَطَ بِهِ
نَبَاتُ الْأَرْضِ مِمَّا يَأْكُلُ النَّاسُ وَالْأَنْعَامُ ۗ
حَتَّىٰٓ إِذَآ أَخَذَتِ الْأَرْضُ زُخْرُفَهَا وَازَّيَّنَتْ
وَ ظَنَّ أَهْلُهَآ أَنَّهُمْ قَٰدِرُونَ عَلَيْهَآ ۙ أَتَىٰهَآ
أَمْرُنَا لَيْلًا أَوْ نَهَارًا فَجَعَلْنَٰهَا حَصِيدًا كَأَن
لَّمْ تَغْنَ بِالْأَمْسِ ۗ كَذَٰلِكَ نُفَصِّلُ الْءَايَٰتِ
لِقَوْمٍ يَتَفَكَّرُونَ ﴿٢٤﴾

**21 - 30** ప్రజలు ఎలా ప్రవర్తిస్తారంటే ఆపదల బారిన పడినప్పుడు మేము వారికి కారుణ్యం రుచి చూపిన వెంటనే వారు మా సూచనల విషయంలో ఎత్తులు వేయటం ప్రారంభిస్తారు.[7] వారితో ఇలా అను: "అల్లాహ్ ఎత్తులు వేయటంలో మీకంటే శీఘ్రగామి. ఆయన దూతలు మీ పన్నాగాలను వ్రాస్తూ పోతున్నారు." మిమ్మల్ని నేలపైనా నీటిపైనా నడిపేవాడు అల్లాహ్‌యే. కాబట్టి మీరు ఓడలపై ఎక్కి వాయువులు అనుకూలంగా వీస్తూ ఉండగా ఆనందంగా, ఆహ్లాదంగా ప్రయాణం చేస్తూ ఉంటారు. ఆ తరువాత అకస్మాత్తుగా ఎదురుగాలి ఉధృతమై అన్ని దిశల నుండి అలల దెబ్బలు తగలగా ప్రయాణీకులు తాము తుఫానులో చిక్కుకుపోయామని తెలుసుకుంటారు. ఆ సమయంలో అందరూ తమ ధర్మాన్ని కేవలం అల్లాహ్‌కే ప్రత్యేకం చేసుకొని ఆయనను ఇలా వేడుకుంటారు: "నీవు గనక మాకు ఈ ఆపద నుండి విముక్తి కలిగిస్తే మేము కృతజ్ఞతలు తెలుపుకునే దాసులమవుతాము." కాని ఆయన వారిని రక్షించిన తరువాత వారే సత్యానికి విముఖులై భూతలంపై తిరుగుబాటు చేస్తారు. ప్రజలారా! మీరు చేసే ఈ తిరుగుబాటు మీకే హాని కలిగిస్తుంది. ఇహలోక జీవిత సుఖాలు కొన్ని రోజుల సుఖాలు మాత్రమే. (వాటిని అనుభవించండి). తరువాత మా వైపునకే మీరు మరలి రావలసి ఉన్నది. అప్పుడు మేము మీకు తెలుపుతాము, మీరు ఏమేమి చేస్తూ ఉండేవారో. ఈ ప్రాపంచిక జీవితాన్ని (దాని నిషాలోపడి మీరు మా సూచనల పట్ల అశ్రద్ధ వహిస్తున్నారు) ఇలా పోల్చవచ్చు - మేము ఆకాశం నుండి నీటిని కురిపించగా మనుషులూ పశువులూ అందరూ తినే భూ ఉత్పత్తులు బాగా దట్టంగా తయారయ్యాయి. ఆపై భూమి మంచి స్థితిలో ఉన్నప్పుడు పొలాలు బాగా పండి శోభిల్లుతూ ఉన్నప్పుడు వాటి యజమానులు, "ఇక మేము వాటివల్ల లాభం పొందగలము" అని అనుకుంటున్న సమయంలో, అకస్మాత్తుగా రాత్రి వేళనో పగటిపూటనో మా ఆజ్ఞ వచ్చేసింది. అప్పుడు మేము అసలు అక్కడ నిన్న ఏమీ లేనట్లు దానిని సర్వనాశనం చేశాము. ఇలా మేము మా సూచనలను స్పష్టంగా వివరిస్తాము. ఆలోచించే వారి కొరకూ అర్థం చేసుకునే వారికొరకు.

وَاللّٰهُ يَدْعُوْٓا اِلٰى دَارِ السَّلٰمِ ؕ وَ يَهْدِيْ مَنْ
يَّشَآءُ اِلٰى صِرَاطٍ مُّسْتَقِيْمٍ ﴿٢٥﴾ لِلَّذِيْنَ
اَحْسَنُوا الْحُسْنٰى وَ زِيَادَةٌ ؕ وَ لَا يَرْهَقُ
وُجُوْهَهُمْ قَتَرٌ وَّ لَا ذِلَّةٌ ؕ اُولٰٓئِكَ اَصْحٰبُ
الْجَنَّةِ ۚ هُمْ فِيْهَا خٰلِدُوْنَ ﴿٢٦﴾ وَ الَّذِيْنَ كَسَبُوا
السَّيِّاٰتِ جَزَآءُ سَيِّئَةٍ بِمِثْلِهَا ۙ وَ تَرْهَقُهُمْ
ذِلَّةٌ ؕ مَا لَهُمْ مِّنَ اللّٰهِ مِنْ عَاصِمٍ ۚ كَاَنَّمَآ
اُغْشِيَتْ وُجُوْهُهُمْ قِطَعًا مِّنَ الَّيْلِ مُظْلِمًا ؕ
اُولٰٓئِكَ اَصْحٰبُ النَّارِ ۚ هُمْ فِيْهَا خٰلِدُوْنَ ﴿٢٧﴾ وَ
يَوْمَ نَحْشُرُهُمْ جَمِيْعًا ثُمَّ نَقُوْلُ لِلَّذِيْنَ
اَشْرَكُوْا مَكَانَكُمْ اَنْتُمْ وَ شُرَكَآؤُكُمْ ۚ فَزَيَّلْنَا
بَيْنَهُمْ وَ قَالَ شُرَكَآؤُهُمْ مَّا كُنْتُمْ اِيَّانَا
تَعْبُدُوْنَ ﴿٢٨﴾ فَكَفٰى بِاللّٰهِ شَهِيْدًۢا بَيْنَنَا وَ
بَيْنَكُمْ اِنْ كُنَّا عَنْ عِبَادَتِكُمْ لَغٰفِلِيْنَ ﴿٢٩﴾
هُنَالِكَ تَبْلُوْا كُلُّ نَفْسٍ مَّآ اَسْلَفَتْ وَ رُدُّوْٓا
اِلَى اللّٰهِ مَوْلٰىهُمُ الْحَقِّ وَ ضَلَّ عَنْهُمْ مَّا كَانُوْا
يَفْتَرُوْنَ ﴿٣٠﴾ ع

(మీరు అశాశ్వతమైన ఈ జీవితం యొక్క మోసానికి గురి అవుతున్నారు). అల్లాహ్ మిమ్మల్ని దారుస్సలామ్ వైపునకు ఆహ్వానిస్తున్నాడు.[8] (మార్గదర్శకత్వం ఆయన చేతుల్లో ఉంది) ఆయన తాను కోరుకున్న వారికి సరియైన మార్గం చూపుతాడు. మంచి పనులు చేసినవారికి మంచి బహుమానాలు లభిస్తాయి. ఇంకా ఎక్కువ అనుగ్రహం లభిస్తుంది. వారి ముఖాలను నల్లదనం గానీ, అవమానంగానీ కప్పివేయవు. వారు స్వర్గానికి అర్హులు, అక్కడనే శాశ్వతంగా ఉంటారు. చెడులు సంపాదించు కున్నవారు తమ చెడులాంటి ప్రతిఫలాన్నే పొందుతారు; అవమానం వారిని కప్పివేస్తుంది; అల్లాహ్ నుండి వారిని రక్షించేవాడెవడూ ఉండడు. వారి ముఖాలను చీకటి కప్పి వేస్తుంది, రాత్రి యొక్క నల్లని తెరలు వారిపై పడి ఉన్నట్లు. వారు నరకానికి అర్హులు. అక్కడనే వారు శాశ్వతంగా ఉంటారు. మేము వారందరినీ ఒకేసారి (మా న్యాయస్థానంలో) సమావేశపరిచే రోజున షిర్కు చేసిన వారితో ఇలా అంటాము: "ఆగండి మీరూ, మాకు మీరు భాగస్వాములుగా కల్పించిన వారూ!" ఆ తరువాత మేము వారి మధ్య ఉన్నటువంటి అపరిచయపు తెరను తొలగిస్తాము.[9] వారు కల్పించిన భాగస్వాములు ఇలా అంటారు: "మీరు మమ్మల్ని ఆరాధించ లేదు. మీకూ మాకూ మధ్య అల్లాహ్ సాక్ష్యం చాలు. (ఒకవేళ మీరు మమ్మల్ని ఆరాధించి ఉండినా) మీరు చేసిన ఆ ఆరాధనను గురించి మాకు ఏమాత్రమూ తెలియదు." అప్పుడు ప్రతి మనిషీ తాను చేసిన దానిని రుచి చూస్తాడు. అందరూ తమ నిజమైన ప్రభువు వైపునకు మరలింపబడతారు. వారు కల్పించిన అబద్ధాలన్నీ మటుమాయమైపోతాయి.

7. అంటే, ఆపద అల్లాహ్ తరఫు నుండి ఒక సూచన. యథార్థానికి అల్లాహ్ తప్ప దానిని ఎవడూ తొలగించలేడని అది మానవుడు భావించేలా చేస్తుంది. కాని అది తొలగిపోయి మంచికాలం వచ్చినప్పుడు వారు ఇది మేము ఆరాధించే దేవుళ్ళ యొక్క సిఫారసుదారుల యొక్క అనుగ్రహ ఫలితమే అని అంటారు.
8. అంటే, పరలోకంలో మిమ్మల్ని దారుస్సలామ్‌కు అర్హులుగా చేసే జీవన విధానం వైపునకు ఆహ్వానిస్తున్నాడు. దారుస్సలామ్ అంటే స్వర్గం అని భావం. స్వర్గం అంటే శాంతినిలయం. ఏఆపదా ఏనష్టమూ, ఏ విషాదమూ ఏ బాధా ఉండని స్థలము.
9. అంటే, "వారు మమ్మల్ని ఆరాధించేవారు" అని ముష్రిక్కుల దేవుళ్ళు వారిని గుర్తుపడతారు. "వారిని మేము ఆరాధించేవారము" అని ముష్రిక్కులు తమ దేవుళ్ళను గుర్తుపడతారు.

قُلْ مَنْ يَّرْزُقُكُمْ مِّنَ السَّمَآءِ وَالْاَرْضِ اَمَّنْ
يَّمْلِكُ السَّمْعَ وَالْاَبْصَارَ وَ مَنْ يُّخْرِجُ الْحَيَّ
مِنَ الْمَيِّتِ وَ يُخْرِجُ الْمَيِّتَ مِنَ الْحَيِّ وَ مَنْ
يُّدَبِّرُ الْاَمْرَ ؕ فَسَيَقُوْلُوْنَ اللّٰهُ ۚ فَقُلْ اَفَلَا
تَتَّقُوْنَ ﴿۳۱﴾ فَذٰلِكُمُ اللّٰهُ رَبُّكُمُ الْحَقُّ ۚ فَمَاذَا
بَعْدَ الْحَقِّ اِلَّا الضَّلٰلُ ۖۚ فَاَنّٰى تُصْرَفُوْنَ ﴿۳۲﴾
كَذٰلِكَ حَقَّتْ كَلِمَتُ رَبِّكَ عَلَى الَّذِيْنَ
فَسَقُوْۤا اَنَّهُمْ لَا يُؤْمِنُوْنَ ﴿۳۳﴾ قُلْ هَلْ مِنْ
شُرَكَآئِكُمْ مَّنْ يَّبْدَؤُا الْخَلْقَ ثُمَّ يُعِيْدُهٗ ؕ
قُلِ اللّٰهُ يَبْدَؤُا الْخَلْقَ ثُمَّ يُعِيْدُهٗ فَاَنّٰى
تُؤْفَكُوْنَ ﴿۳۴﴾ قُلْ هَلْ مِنْ شُرَكَآئِكُمْ مَّنْ
يَّهْدِيْۤ اِلَى الْحَقِّ ؕ قُلِ اللّٰهُ يَهْدِيْ لِلْحَقِّ ؕ
اَفَمَنْ يَّهْدِيْۤ اِلَى الْحَقِّ اَحَقُّ اَنْ يُّتَّبَعَ اَمَّنْ
لَّا يَهِدِّيْۤ اِلَّاۤ اَنْ يُّهْدٰى ۚ فَمَا لَكُمْ ۟ كَيْفَ
تَحْكُمُوْنَ ﴿۳۵﴾ وَ مَا يَتَّبِعُ اَكْثَرُهُمْ اِلَّا ظَنًّا ؕ
اِنَّ الظَّنَّ لَا يُغْنِيْ مِنَ الْحَقِّ شَيْـًٔا ؕ اِنَّ اللّٰهَ
عَلِيْمٌۢ بِمَا يَفْعَلُوْنَ ﴿۳۶﴾

**31 - 33** వారిని అడుగు: ఆకాశం నుండీ భూమి నుండీ మీకు ఉపాధినిచ్చేవాడు ఎవడు? వినేశక్తీ, చూసే శక్తీ ఎవడి అధీనంలో ఉన్నాయి? ప్రాణము లేని దానినుండి ప్రాణమున్న దానినీ ప్రాణమున్న దానినుండి ప్రాణము లేని దానినీ వెలికితీసేవాడు ఎవడు? ఈ విశ్వవ్యవస్థను నడుపుతున్నవాడు ఎవడు? వారు అల్లాహ్ అని తప్పకుండా అంటారు. ఇలా అను: "అలాంటప్పుడు మీరు (సత్యానికి వ్యతిరేకంగా నడవటం) మానుకోరేమిటి? ఆ అల్లాహ్‌యే మీ నిజమైన ప్రభువు. కనుక సత్యాన్ని తృణీకరిస్తే మార్గభ్రష్టత్వం తప్ప ఇక మిగిలేదేమిటి? అసలు మీరు ఎటు మరలింపబడు తున్నారు?[10] (ప్రవక్తా చూడు) ఈ విధంగా అవిధేయతకు పాల్పడేవారి విషయంలో వారు విశ్వసించరు అని నీ ప్రభువు అన్నమాట ఇలా రూఢి అయింది.

**34** వారిని అడుగు: మీరు దేవునికి భాగస్వాములుగా నిలబెట్టిన వారిలో సృష్టిని ప్రారంభించేవాడూ, దానిని తిరిగి సృష్టించే వాడూ ఎవడైనా ఉన్నాడా? అని. ఇలా అను: సృష్టిని ప్రారంభిం చేవాడూ, దానిని తిరిగి సృష్టించేవాడూ కేవలం అల్లాహ్ మాత్రమే. అయినా, మీరు ఎలా త్రోవ తప్పించబడు తున్నారు?

**35** వారిని ఇలా అడుగు: మీరు అల్లాహ్‌కు భాగస్వాములుగా నిలబెట్టిన వారిలో సత్యం వైపునకు మార్గం చూపేవాడు కూడా ఎవడైనా ఉన్నాడా? ఇలా అను: కేవలం అల్లాహ్‌యే సత్యం వైపునకు మార్గం చూపుతాడు. అలాంటప్పుడు మీరే చెప్పండి, సత్యం వైపునకు మార్గం చూపేవాడా విధేయతకు ఎక్కువ అర్హుడు? లేక తనకు ఎవడైనా మార్గం చూపితే తప్ప స్వయంగా మార్గాన్ని పొందలేనివాడా? అసలు మీకేమయింది, ఇటువంటి తలకిందులు నిర్ణయాలు చేస్తున్నారు?

**36** వాస్తవం ఏమిటంటే వారిలో చాలామంది కేవలం ఊహ, అనుమానాల వెనుక నడుస్తూ పోతున్నారు.[11] నిజానికి సత్యం అవసరాన్ని అనుమానం ఎంత మాత్రం తీర్చలేదు. వారు చేస్తూ ఉన్నదానినంతా అల్లాహ్ బాగా ఎరుగును.

10. ఈ సంబోధన జనసామాన్యానికి ఉద్దేశించబడింది అని జ్ఞాపకం ఉంచుకోవాలి. వారిని "మీరు ఎటు మరలి పోతున్నారు" అని ప్రశ్నించటంలేదు, మీరు ఎటు మరలింపబడుతున్నారు అని ప్రశ్నించటం జరిగింది. దీనివల్ల స్పష్టమయ్యే విషయమేమిటంటే, మార్గం తప్పిన ఒకవ్యక్తి లేదా ఒక వర్గం ప్రజలను సరియైన మార్గం నుండి

**37** అల్లాహ్ పంపిన వహీ, ఆయన చేసిన బోధనలు లేకుండా రచించబడే వస్తువుకాదు ఈ ఖురాను. ఇది పూర్వం వచ్చిన దానికి ధ్రువీకరణ, "అల్ కితాబ్"కు వివరణ. ఇది విశ్వపాలకుని తరఫునుండి వచ్చిందనే విషయంలో ఎంతమాత్రం సందేహం లేదు.

**38 - 41** ప్రవక్తయే దీనిని స్వయంగా రచించాడని ఈ ప్రజలు అంటున్నారా ఏమిటి? ఇలా అను: "మీరు గనక మీ ఆరోపణలో సత్యవంతులే అయితే ఇటువంటి సూరా ఒకదానిని రచించి తీసుకురండి. ఒక్క అల్లాహ్‌ను వదలి ఎవరెవరిని పిలువగలరో సహాయం కొరకు పిలవండి." అసలు విషయం ఏమిటంటే వారి జ్ఞానపరిధికి ఆ విషయం రాలేదు కాబట్టి ఇంకా దాని పర్యవసానం వారి ముందుకు రాలేదు. కాబట్టి దానిని వారు (ఆధారం లేకుండా ఇట్టే) తిరస్కరించారు. ఇలాగే వారి పూర్వీకులు కూడా తిరస్కరించారు. చూడు, తరువాత ఆ దుర్మార్గుల ముగింపు ఎలా జరిగిందో! వారిలో కొందరు విశ్వసిస్తారు, కొందరు విశ్వసించరు. నీ ప్రభువు ఈ కల్లోలకారులను బాగా ఎరుగును. వారు గనక నిన్ను తిరస్కరిస్తే వారితో ఇలా అను: "నా పనులు నావే, మీ పనులు మీవే. నేను చేసే పని బాధ్యత మీపై లేదు. మీరు చేసే పని బాధ్యత నాపై లేదు."[12]

وَ مَا كَانَ هٰذَا الْقُرْاٰنُ اَنْ يُّفْتَرٰى مِنْ دُوْنِ
اللّٰهِ وَ لٰكِنْ تَصْدِيْقَ الَّذِيْ بَيْنَ يَدَيْهِ وَ
تَفْصِيْلَ الْكِتٰبِ لَا رَيْبَ فِيْهِ مِنْ رَّبِّ
الْعٰلَمِيْنَ ﴿۳۷﴾ اَمْ يَقُوْلُوْنَ افْتَرٰىهُ ؕ قُلْ فَاْتُوْا
بِسُوْرَةٍ مِّثْلِهٖ وَ ادْعُوْا مَنِ اسْتَطَعْتُمْ مِّنْ
دُوْنِ اللّٰهِ اِنْ كُنْتُمْ صٰدِقِيْنَ ﴿۳۸﴾ بَلْ كَذَّبُوْا
بِمَا لَمْ يُحِيْطُوْا بِعِلْمِهٖ وَ لَمَّا يَاْتِهِمْ تَاْوِيْلُهٗ ؕ
كَذٰلِكَ كَذَّبَ الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ فَانْظُرْ كَيْفَ
كَانَ عَاقِبَةُ الظّٰلِمِيْنَ ﴿۳۹﴾ وَ مِنْهُمْ مَّنْ يُّؤْمِنُ
بِهٖ وَ مِنْهُمْ مَّنْ لَّا يُؤْمِنُ بِهٖ ؕ وَ رَبُّكَ اَعْلَمُ
بِالْمُفْسِدِيْنَ ﴿۴۰﴾ ع وَ اِنْ كَذَّبُوْكَ فَقُلْ لِّيْ
عَمَلِيْ وَ لَكُمْ عَمَلُكُمْ ۚ اَنْتُمْ بَرِيْٓـُٔوْنَ مِمَّاۤ
اَعْمَلُ وَ اَنَا بَرِيْٓءٌ مِّمَّا تَعْمَلُوْنَ ﴿۴۱﴾

తొలగించి తప్పుడు మార్గం వైపునకు మరలిస్తున్నారు అనేది. ఈ కారణంగానే ప్రజలతో మీరు గుడ్డిగా తప్పుదారి చూపేవారి వెనుక ఎందుకు నడుస్తున్నారు? అని అనబడుతోంది. యథార్థం ఇదైనప్పుడు అసలు మీరు ఎటు నడుపబడుతున్నారో అనే విషయాన్ని గురించి మీ సొంత తెలివిని ఉపయోగించి ఎందుకు ఆలోచించరు?

11. అంటే, మతాలను సృష్టించినవారూ తత్వశాస్త్రాలను రచించినవారూ జీవితపు చట్టాలను ప్రతిపాదించినవారూ– వారందరూ జ్ఞానం ఆధారంగా కాక అనుమానమూ ఊహ ఆధారంగా ఇదంతా చేశారు. ఈ మత ప్రాపంచిక మార్గదర్శకులను అనుసరించిన వారు కూడా తెలిసీ, అవగాహన చేసుకునీ కాదు. కేవలం ఈ అనుమానం ఆధారంగా వారికి విధేయత చూపారు. అటువంటి పెద్దవాళ్ళు ఇలా అంటున్నప్పుడు, తాత ముత్తాతలు వారిని విశ్వసిస్తూ వస్తున్నప్పుడు, ప్రపంచమంతా వారిని అనుసరిస్తూ ఉన్నప్పుడు, వారు తప్పకుండా సత్యమే పలుకుతున్నారు అనే అనుమానం.

12. అంటే, అనవసరంగా ఘర్షణలు పడటం వితండ వాదాలు చెయ్యటం నిరుపయోగం. ఒకవేళ నేను అబద్ధాలను కల్పించి చెబితే దానికి నేనే స్వయంగా బాధ్యుణ్ణి, మీరు దానికి ఏ విధంగానూ బాధ్యులు కారు. ఒకవేళ మీరు సత్య విషయాన్ని తిరస్కరిస్తే నాకేమీ నష్టం కలిగించలేరు. మీకు మీరే నష్టం కలిగించుకుంటారు.

وَمِنْهُمْ مَّنْ يَّسْتَمِعُوْنَ اِلَيْكَ ؕ اَفَاَنْتَ تُسْمِعُ
الصُّمَّ وَ لَوْ كَانُوْا لَا يَعْقِلُوْنَ ﴿۴۲﴾ وَ مِنْهُمْ مَّنْ
يَّنْظُرُ اِلَيْكَ ؕ اَفَاَنْتَ تَهْدِى الْعُمْىَ وَ لَوْ
كَانُوْا لَا يُبْصِرُوْنَ ﴿۴۳﴾ اِنَّ اللّٰهَ لَا يَظْلِمُ النَّاسَ
شَيْـًٔا وَّ لٰكِنَّ النَّاسَ اَنْفُسَهُمْ يَظْلِمُوْنَ ﴿۴۴﴾ وَ
يَوْمَ يَحْشُرُهُمْ كَاَنْ لَّمْ يَلْبَثُوْۤا اِلَّا سَاعَةً
مِّنَ النَّهَارِ يَتَعَارَفُوْنَ بَيْنَهُمْ ؕ قَدْ خَسِرَ
الَّذِيْنَ كَذَّبُوْا بِلِقَآءِ اللّٰهِ وَ مَا كَانُوْا
مُهْتَدِيْنَ ﴿۴۵﴾ وَ اِمَّا نُرِيَنَّكَ بَعْضَ الَّذِىْ
نَعِدُهُمْ اَوْ نَتَوَفَّيَنَّكَ فَاِلَيْنَا مَرْجِعُهُمْ ثُمَّ اللّٰهُ
شَهِيْدٌ عَلٰى مَا يَفْعَلُوْنَ ﴿۴۶﴾ وَ لِكُلِّ اُمَّةٍ
رَّسُوْلٌ ۚ فَاِذَا جَآءَ رَسُوْلُهُمْ قُضِىَ بَيْنَهُمْ
بِالْقِسْطِ وَ هُمْ لَا يُظْلَمُوْنَ ﴿۴۷﴾

**42 - 46** వారిలో చాలా మంది నీ మాటలను వింటారు. కాని నీవు చెవిటి వారికి వినిపించగలవా, వారు ఏమీ అర్థం చేసుకోకపోయినప్పటికీ?[13] వారిలో చాలామంది నిన్ను చూస్తారు. కాని నీవు గుడ్డివారికి మార్గం చూపగలవా వారికి ఏమీ కనిపించనప్పటికీ? యథార్థమేమిటంటే అల్లాహ్ ప్రజలకు అన్యాయం చెయ్యడు. ప్రజలే తమకు తాము అన్యాయం చేసు కుంటారు. (ఈ రోజు వారు ఇహలోక జీవితంలో మునిగి ఉన్నారు) అల్లాహ్ వారిని సమావేశపరిచే రోజున (ఇహలోక జీవితం వారికి ఎలా అనిపిస్తుందంటే) వారు కేవలం ఒక గడియకాలం వరకు ఒకరినొకరు గుర్తుపట్టటానికి మాత్రమే ఆగారా అన్నట్లు. అల్లాహ్‌తో సమావేశాన్ని తిరస్కరించినవారు వాస్తవానికి తీవ్రమైన నష్టానికి గురిఅయ్యారు అనీ, వారు సన్మార్గంపై ఎంతమాత్రంలేరు అనీ. (అప్పుడు నిర్ధారణ అవుతుంది) ఏ దుష్ఫలితాలను గురించి మేము వారిని భయ పెడుతున్నామో వాటిలో ఒకటో అరో మేము నీవు బ్రతికి ఉండగానే చూపినా, లేదా దానికి ముందే మేము నిన్ను లేపు కున్నా, ఎలా అయినా సరే వారు రావలసింది మా వైపునకే కదా. వారు చేస్తున్న దానికల్లా అల్లాహ్‌యే సాక్షి.

**47** ప్రతి సంఘానికి ఒక ప్రవక్త[14] ఉంటాడు. కనుక ఒక సంఘం వద్దకు దాని ప్రవక్త వచ్చినప్పుడు ఆ సంఘం విషయంలో పూర్తి న్యాయంతో కూడుకున్న తీర్పు చెయ్యబడుతుంది. దానికి రవ్వంత అన్యాయం కూడా జరగదు.

13. ఒక రకమైన వినటం జంతువులు ధ్వని వినటం వంటిది. రెండోరకం వినటం అర్థం పట్ల శ్రద్ధ చూపుతూ వినటం. అంతేకాదు, ఒకవేళ విషయం సమంజసమైనదైతే దానిని ఆమోదించటానికి సిద్ధపడటం.

14. "సంఘం" (ఉమ్మత్) అనే పదం ఇక్కడ కేవలం జాతి అన్న అర్థంలో వాడబడలేదు. ఒక ప్రవక్త వచ్చిన తరువాత ఆయన సందేశం అందిన వారందరూ ఆయన సంఘము. దీనికోసం దైవప్రవక్త వారి మధ్య ఉండవలసిన అవసరం కూడా లేదు. దైవప్రవక్త తరువాత కూడా, ఆయన ఉపదేశం ఉన్నంత కాలం ఆయన ఉపదేశించిన విషయాన్ని తెలుసుకోవటం ప్రతి వ్యక్తికి సాధ్యపడినంత కాలం ప్రపంచ ప్రజలందరూ ఆయన సంఘంగానే పరిగణింపబడతారు. ఇక ముందు రాబోయే ఆదేశం వారికి వర్తిస్తుంది. దాని ప్రకారం మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) విచ్చేసిన తరువాత సమస్త ప్రపంచ మానవులు ఆయన సంఘం వారు అవుతారు. దివ్య ఖుర్ఆను తన అసలైన రూపంలో ఉన్నంతకాలం ఆయన సంఘం వారుగానే ఉంటారు. ఈ కారణం వల్లనే ఆయతులో, "ప్రతి జాతికి ఒక ప్రవక్త ఉంటాడు" అని అనబడలేదు. "ప్రతి సంఘానికి ఒక ప్రవక్త ఉంటాడు" అని అనబడింది.

**48 - 52** వారు ఇలా అడుగుతారు: "నీ బెదరింపే నిజమైతే అది ఎప్పుడు నెరవేరుతుంది?" ఇలా అను: "నా అధీనంలో స్వయంగా నా లాభనష్టాలు సైతమూ లేవు. అంతా అల్లాహ్ సంకల్పం మీద ఆధారపడి ఉంది. ప్రతి సంఘానికి గడువు కాలం ఒకటి ఉంది. ఈ గడువు పూర్తి అయినప్పుడు ఒక్క గడియకాలం కూడా ముందూ వెనుకా కావటం జరగదు. వారితో ఇలా అను: "ఎప్పుడైనా మీరు ఈ విషయం గురించి ఆలోచించారా? ఒకవేళ అల్లాహ్ శిక్ష హఠాత్తుగా రాత్రిగాని పగలుగాని వస్తే (అప్పుడు మీరేమి చెయ్యగలరు?)" అసలు అది ఎలాంటి విషయమని, దాని కొరకు నేరస్తులు తొందర పెడుతున్నారు, అది మీపై వచ్చిపడినప్పుడే మీరు దానిని నమ్ముతారా? - ఇప్పుడు తప్పించుకోవాలనుకుంటున్నారా? వాస్తవానికి స్వయంగా మీరే అది తొందరగా రావాలని కోరుతూ ఉండేవారు. తరువాత దుష్టులతో ఇలా అనడం జరుగుతుంది: "ఇక శాశ్వతంగా ఉండే శిక్షను రుచి చూడండి! మీరు సంపాదించిన దానికి అనుగుణమైన ప్రతిఫలం తప్ప మరొక ప్రతిఫలం మీకు ఎలా ఇవ్వబడుతుంది?"

**53 - 56** ఇంకా ఇలా అడుగుతారు: "నిజంగా మీరు చెప్పేది సత్యమేనా?" ఇలా అను: "నా ప్రభువు సాక్షిగా అది పూర్తిగా సత్యం. అది సంభవించకుండా ఆపే శక్తి మీకు లేదు." దుర్మార్గం చేసిన ప్రతి మనిషి వద్ద ఒకవేళ భూమిపై ఉన్న మొత్తం ధనం ఉంటే ఆ బాధనుండి రక్షింపబడేందుకు అతడు దానినంతా కూడా పరిహారంగా ఇవ్వటానికి సిద్ధపడతాడు. వారు ఆ బాధను చూసినప్పుడు లోలోన పశ్చాత్తాపపడతారు; అయినా వారిమధ్య పూర్తి న్యాయంతో తీర్పు చెయ్యబడుతుంది. వారికి ఏ విధమైన అన్యాయం జరుగదు. వినండి! ఆకాశాలలో భూమిపై ఉన్న సమస్తం అల్లాహ్‌దే. తెలుసుకోండి! అల్లాహ్ వాగ్దానం నిజమైనది కాని చాలామందికి తెలియదు. ఆయనే జీవితాన్ని ప్రసాదిస్తాడు. ఆయనే మరణాన్ని కలుగజేస్తాడు. ఆయన వైపునకే మీరంతా మరలిపోవాలి.

وَ يَقُوْلُوْنَ مَتٰى هٰذَا الْوَعْدُ اِنْ كُنْتُمْ
صٰدِقِيْنَ ﴿۴۸﴾ قُلْ لَّاۤ اَمْلِكُ لِنَفْسِيْ ضَرًّا وَّ لَا
نَفْعًا اِلَّا مَا شَآءَ اللّٰهُ ؕ لِكُلِّ اُمَّةٍ اَجَلٌ ؕ
اِذَا جَآءَ اَجَلُهُمْ فَلَا يَسْتَاْخِرُوْنَ سَاعَةً وَّ لَا
يَسْتَقْدِمُوْنَ ﴿۴۹﴾ قُلْ اَرَءَيْتُمْ اِنْ اَتٰىكُمْ
عَذَابُهٗ بَيَاتًا اَوْ نَهَارًا مَّاذَا يَسْتَعْجِلُ مِنْهُ
الْمُجْرِمُوْنَ ﴿۵۰﴾ اَثُمَّ اِذَا مَا وَقَعَ اٰمَنْتُمْ بِهٖ ؕ
آٰلْـٰٔنَ وَ قَدْ كُنْتُمْ بِهٖ تَسْتَعْجِلُوْنَ ﴿۵۱﴾ ثُمَّ قِيْلَ
لِلَّذِيْنَ ظَلَمُوْا ذُوْقُوْا عَذَابَ الْخُلْدِ ۚ هَلْ
تُجْزَوْنَ اِلَّا بِمَا كُنْتُمْ تَكْسِبُوْنَ ﴿۵۲﴾
وَيَسْتَنْۢبِـُٔوْنَكَ اَحَقٌّ هُوَ ؕ قُلْ اِيْ وَ رَبِّيْۤ اِنَّهٗ
لَحَقٌّ ۚ وَ مَاۤ اَنْتُمْ بِمُعْجِزِيْنَ ﴿۵۳﴾ وَ لَوْ اَنَّ
لِكُلِّ نَفْسٍ ظَلَمَتْ مَا فِي الْاَرْضِ لَافْتَدَتْ
بِهٖ ؕ وَ اَسَرُّوا النَّدَامَةَ لَمَّا رَاَوُا الْعَذَابَ ۚ
وَقُضِيَ بَيْنَهُمْ بِالْقِسْطِ وَ هُمْ لَا يُظْلَمُوْنَ ﴿۵۴﴾
اَلَاۤ اِنَّ لِلّٰهِ مَا فِي السَّمٰوٰتِ وَ الْاَرْضِ ؕ اَلَاۤ
اِنَّ وَعْدَ اللّٰهِ حَقٌّ وَّ لٰكِنَّ اَكْثَرَهُمْ لَا
يَعْلَمُوْنَ ﴿۵۵﴾ هُوَ يُحْيٖ وَ يُمِيْتُ وَ اِلَيْهِ
تُرْجَعُوْنَ ﴿۵۶﴾

وقف النبی صلی اللہ علیہ وسلم

يٰٓاَيُّهَا النَّاسُ قَدْ جَآءَتْكُمْ مَّوْعِظَةٌ مِّنْ
رَّبِّكُمْ وَ شِفَآءٌ لِّمَا فِي الصُّدُوْرِ ۙ وَ هُدًى
وَّ رَحْمَةٌ لِّلْمُؤْمِنِيْنَ ﴿۵۷﴾ قُلْ بِفَضْلِ اللّٰهِ وَ
بِرَحْمَتِهٖ فَبِذٰلِكَ فَلْيَفْرَحُوْا ؕ هُوَ خَيْرٌ مِّمَّا
يَجْمَعُوْنَ ﴿۵۸﴾ قُلْ اَرَءَيْتُمْ مَّآ اَنْزَلَ اللّٰهُ لَكُمْ
مِّنْ رِّزْقٍ فَجَعَلْتُمْ مِّنْهُ حَرَامًا وَّ حَلٰلًا ؕ قُلْ
آٰللّٰهُ اَذِنَ لَكُمْ اَمْ عَلَى اللّٰهِ تَفْتَرُوْنَ ﴿۵۹﴾ وَ مَا
ظَنُّ الَّذِيْنَ يَفْتَرُوْنَ عَلَى اللّٰهِ الْكَذِبَ يَوْمَ
الْقِيٰمَةِ ؕ اِنَّ اللّٰهَ لَذُوْ فَضْلٍ عَلَى النَّاسِ
وَلٰكِنَّ اَكْثَرَهُمْ لَا يَشْكُرُوْنَ ﴿۶۰﴾ وَ مَا تَكُوْنُ فِيْ ع ٦ ١١
شَاْنٍ وَّ مَا تَتْلُوْا مِنْهُ مِنْ قُرْاٰنٍ وَّ لَا
تَعْمَلُوْنَ مِنْ عَمَلٍ اِلَّا كُنَّا عَلَيْكُمْ شُهُوْدًا
اِذْ تُفِيْضُوْنَ فِيْهِ ؕ وَ مَا يَعْزُبُ عَنْ رَّبِّكَ
مِنْ مِّثْقَالِ ذَرَّةٍ فِي الْاَرْضِ وَ لَا فِي السَّمَآءِ وَ
لَآ اَصْغَرَ مِنْ ذٰلِكَ وَ لَآ اَكْبَرَ اِلَّا فِيْ كِتٰبٍ
مُّبِيْنٍ ﴿۶۱﴾ اَلَآ اِنَّ اَوْلِيَآءَ اللّٰهِ لَا خَوْفٌ
عَلَيْهِمْ وَ لَا هُمْ يَحْزَنُوْنَ ﴿۶۲﴾ الَّذِيْنَ اٰمَنُوْا وَ
كَانُوْا يَتَّقُوْنَ ﴿۶۳﴾ لَهُمُ الْبُشْرٰى فِي الْحَيٰوةِ الدُّنْيَا
وَ فِي الْاٰخِرَةِ ؕ لَا تَبْدِيْلَ لِكَلِمٰتِ اللّٰهِ ؕ ذٰلِكَ
هُوَ الْفَوْزُ الْعَظِيْمُ ﴿۶۴﴾ وَ لَا يَحْزُنْكَ قَوْلُهُمْ ۘ اِنَّ وقف لازم
الْعِزَّةَ لِلّٰهِ جَمِيْعًا ؕ هُوَ السَّمِيْعُ الْعَلِيْمُ ﴿۶۵﴾

**57 - 60** మానవులారా! మీవద్దకు మీ ప్రభువు తరఫునుండి హితోపదేశం వచ్చేసింది. అది హృదయాల వ్యాధులకు స్వస్థత. దానిని స్వీకరించేవారికి అది మార్గదర్శకత్వం, కారుణ్యం. ప్రవక్తా ఇలా అను: "అల్లాహ్ తన అనుగ్రహం వల్ల తన కారుణ్యం వల్ల దానిని పంపాడు. దానికి ప్రజలు సంబర పడాలి. ప్రజలు కూడబెట్టే వాటన్నింటికంటే అది ఉత్తమ మైనది." ప్రవక్తా! వారితో ఇలా అను: "మీరెప్పుడైనా ఈ విషయం గురించి కూడా ఆలోచించారా? అల్లాహ్ మీ కొరకు అవతరింపజేసిన (రిజ్ఖ్) ఆహార పదార్థాలలో[15] కొన్నింటిని స్వయంగా మీరే నిషిద్ధం చేసుకున్నారు. మరికొన్నింటిని ధర్మసమ్మతం చేసుకున్నారు?"[16] వారిని ఇలా అడుగు: "అల్లాహ్ మీకు దానికి అనుమతి ఇచ్చాడా? లేక అబద్ధాన్ని మీరు అల్లాహ్‌కు ఆపాదిస్తున్నారా?"[17] అల్లాహ్‌కు అబద్ధాన్ని ఆపాదించేవారు ప్రళయంనాడు ఆయన తమతో ఎలా వ్యవహరిస్తాడని అనుకుంటున్నారు? అల్లాహ్ మానవులను దయా దృష్టితో చూస్తాడు. కాని చాలామంది మానవులు కృతజ్ఞతలు చూపరు.

**61 - 65** ప్రవక్తా! నీవు ఏ స్థితిలో ఉన్నా, ఖురాను నుండి దేనిని వినిపించినా, మానవులారా! మీరు ఏది చేసినా, ఆ అన్ని సందర్భాలలోనూ మేము మిమ్మల్ని చూస్తూనే ఉంటాము. భూమ్యాకాశాలలో ఉన్నటువంటి వస్తువు ఏదైనా సరే, అది చిన్నదిగానీ పెద్దదిగానీ దాని అణువు కూడా నీ ప్రభువు దృష్టికి గోప్యంగా లేదు. ఒక స్పష్టమైన గ్రంథంలో వ్రాయబడకుండానూ లేదు. విను, అల్లాహ్‌కు స్నేహితులైనవారికీ ఆయనను విశ్వసించి భయభక్తుల వైఖరిని అవలంబించిన వారికీ ఏ విధమైన భయం కానీ, విషాదం కానీ కలిగే అవకాశం లేదు. ఇహపరజీవితాలు రెండింటిలో కూడా వారికి శుభవార్తలే శుభవార్తలు. అల్లాహ్ మాటలు మారవు. ఇదే ఘన విజయం. ప్రవక్తా! నిన్ను గురించి వారు కల్పించే మాటల వల్ల నీవు శోకానికి గురి కాకూడదు. గౌరవం అంతా అల్లాహ్ అధీనం లోనే ఉంది. ఆయన అన్నీ వినేవాడూ, అన్నీ తెలిసినవాడూను.

15. ఉర్దూ భాషలో "రిజ్ఖ్" అనే పదం కేవలం తినే వస్తువులకు, త్రాగే వస్తువులకు మాత్రమే వర్తిస్తుంది. కాని అరబ్బీ భాషలో "రిజ్ఖ్" అనే పదం కేవలం ఆహార పదార్థాలు అనే అర్థానికే పరిమితం కాదు. అనుగ్రహం,

أَلَآ إِنَّ لِلّٰهِ مَنْ فِي السَّمٰوٰتِ وَمَنْ فِي
الْأَرْضِ ؕ وَمَا يَتَّبِعُ الَّذِيْنَ يَدْعُوْنَ مِنْ
دُوْنِ اللّٰهِ شُرَكَآءَ ؕ إِنْ يَّتَّبِعُوْنَ إِلَّا الظَّنَّ وَ
إِنْ هُمْ إِلَّا يَخْرُصُوْنَ ﴿٦٦﴾ هُوَ الَّذِيْ جَعَلَ
لَكُمُ الَّيْلَ لِتَسْكُنُوْا فِيْهِ وَالنَّهَارَ مُبْصِرًا ؕ إِنَّ
فِيْ ذٰلِكَ لَاٰيٰتٍ لِّقَوْمٍ يَّسْمَعُوْنَ ﴿٦٧﴾ قَالُوا
اتَّخَذَ اللّٰهُ وَلَدًا سُبْحٰنَهٗ ؕ هُوَ الْغَنِيُّ ؕ لَهٗ مَا
فِي السَّمٰوٰتِ وَمَا فِي الْأَرْضِ ؕ إِنْ عِنْدَكُمْ
مِّنْ سُلْطٰنٍۭ بِهٰذَا ؕ أَتَقُوْلُوْنَ عَلَى اللّٰهِ مَا لَا
تَعْلَمُوْنَ ﴿٦٨﴾ قُلْ إِنَّ الَّذِيْنَ يَفْتَرُوْنَ عَلَى
اللّٰهِ الْكَذِبَ لَا يُفْلِحُوْنَ ﴿٦٩﴾ مَتَاعٌ فِي الدُّنْيَا
ثُمَّ إِلَيْنَا مَرْجِعُهُمْ ثُمَّ نُذِيْقُهُمُ الْعَذَابَ
الشَّدِيْدَ بِمَا كَانُوْا يَكْفُرُوْنَ ﴿٧٠﴾ ع ١٢ الثلثة

**66 - 67** తెలుసుకో! ఆకాశాలలో ఉండేవారైనా, భూమిలో ఉండేవారైనా సర్వులూ అల్లాహ్ పాలితులే. అల్లాహ్‌ను కాదని (తాము కల్పించిన) కొందరు భాగస్వాములను వేడుకుంటున్న వారు కేవలం భ్రమనూ, అనుమానాన్నీ అనుసరిస్తున్నారు. కేవలం ఊహాగానాలు చేస్తున్నారు. మీరు ప్రశాంతిని పొందే టందుకు మీకొరకు రాత్రిని సృష్టించినవాడూ, పగలును కాంతి మంతం చేసినవాడూ అల్లాహ్‌యే. (చెవియొగ్గి ప్రవక్త సందేశాన్ని) వినేవారికి ఇందులో సూచనలు ఉన్నాయి.

**68 - 70** అల్లాహ్ ఎవరినో కొడుకుగా చేసుకున్నాడు అని ప్రజలు అన్నారు. సుబ్‌హానల్లాహ్! (అల్లాహ్ అత్యంత పవిత్రుడు) ఆయన ఏ అక్కరా లేనివాడు. ఆకాశాలలో భూమిలో ఉన్నదంతా ఆయన ఆస్తియే. ఈ మాటకు అసలు మీ వద్ద ఉన్న నిదర్శనమేమిటి? అల్లాహ్‌ను గురించి మీకు తెలియని మాటలంటున్నారా? ప్రవక్తా! ఇలా ప్రకటించు: అల్లాహ్‌కు అబద్ధాలను అంటగట్టేవారు ఎన్నటికీ సాఫల్యాన్ని పొందలేరు. కొన్ని రోజుల ఇహలోక జీవితంలో సుఖాలను అనుభవించ వచ్చుకానీ తరువాత మా వైపునకే వారు మరలి రావాలి. అప్పుడు మేము వారి అవిశ్వాసానికి ప్రతిఫలంగా వారికి కఠిన బాధను రుచి చూపిస్తాము.

కానుక, అదృష్టం అనే అర్థాలలో కూడా సాధారణంగా వాడబడుతుంది. ప్రపంచంలో అల్లాహ్ మానవునికి ఇచ్చినదంతా ఆయన రిజ్‌ఖ్‌యే.

16. అంటే, స్వయంగా తమ కొరకు శాసనాన్నీ, షరీయత్తునూ నిర్మించుకునేటంతటి స్వతంత్రులై కూర్చున్నారు. వాస్తవానికి, రిజ్‌ఖ్ ప్రదాతయే దానిని ఉపయోగించటానికి ధర్మసమ్మతమైన, ధర్మసమ్మతం కాని మార్గాలకు హద్దులను, నియమాలను నిర్ణయించే హక్కును కలిగివున్నాడు.

17. "అబద్ధాన్ని ఆపాదించటం" అనేది మూడు విధాలుగా ఉంటుంది. ఒకటి : అల్లాహ్ ఈ అధికారాలను మానవులకు అప్పగించాడు అని అనటం. రెండు: మా కొరకు శాసనాన్నీ, షరీయత్తునూ నిర్ణయించటం అల్లాహ్ పని కాదు అని అనటం. మూడు : హరాము, హలాలు ఆజ్ఞలను అల్లాహ్‌కు ఆపాదించి అల్లాహ్ యొక్క ఏ గ్రంథాన్నీ దానికి ప్రమాణంగా చూపించలేకపోవటం.

وقف لازم

وَاتْلُ عَلَيْهِمْ نَبَاَ نُوْحٍ ۘ اِذْ قَالَ لِقَوْمِهٖ
يٰقَوْمِ اِنْ كَانَ كَبُرَ عَلَيْكُمْ مَّقَامِيْ
وَتَذْكِيْرِيْ بِاٰيٰتِ اللّٰهِ فَعَلَى اللّٰهِ تَوَكَّلْتُ
فَاَجْمِعُوْٓا اَمْرَكُمْ وَشُرَكَآءَكُمْ ثُمَّ لَا يَكُنْ
اَمْرُكُمْ عَلَيْكُمْ غُمَّةً ثُمَّ اقْضُوْٓا اِلَيَّ وَلَا
تُنْظِرُوْنِ ﴿٧١﴾ فَاِنْ تَوَلَّيْتُمْ فَمَا سَاَلْتُكُمْ مِّنْ
اَجْرٍ ؕ اِنْ اَجْرِيَ اِلَّا عَلَى اللّٰهِ ۙ وَ اُمِرْتُ
اَنْ اَكُوْنَ مِنَ الْمُسْلِمِيْنَ ﴿٧٢﴾ فَكَذَّبُوْهُ فَنَجَّيْنٰهُ
وَمَنْ مَّعَهٗ فِي الْفُلْكِ وَ جَعَلْنٰهُمْ خَلٰٓئِفَ
وَاَغْرَقْنَا الَّذِيْنَ كَذَّبُوْا بِاٰيٰتِنَا ۚ فَانْظُرْ كَيْفَ
كَانَ عَاقِبَةُ الْمُنْذَرِيْنَ ﴿٧٣﴾ ثُمَّ بَعَثْنَا مِنْۢ
بَعْدِهٖ رُسُلًا اِلٰى قَوْمِهِمْ فَجَآءُوْهُمْ بِالْبَيِّنٰتِ
فَمَا كَانُوْا لِيُؤْمِنُوْا بِمَا كَذَّبُوْا بِهٖ مِنْ قَبْلُ ؕ
كَذٰلِكَ نَطْبَعُ عَلٰى قُلُوْبِ الْمُعْتَدِيْنَ ﴿٧٤﴾ ثُمَّ
بَعَثْنَا مِنْۢ بَعْدِهِمْ مُّوْسٰى وَهٰرُوْنَ اِلٰى
فِرْعَوْنَ وَ مَلَا۟ئِهٖ بِاٰيٰتِنَا فَاسْتَكْبَرُوْا وَكَانُوْا
قَوْمًا مُّجْرِمِيْنَ ﴿٧٥﴾ فَلَمَّا جَآءَهُمُ الْحَقُّ مِنْ
عِنْدِنَا قَالُوْٓا اِنَّ هٰذَا لَسِحْرٌ مُّبِيْنٌ ﴿٧٦﴾

**71 - 73** వారికి నూహ్ గాథను వినిపించు. అతను తన జాతి వారితో ఇలా అన్నప్పటి గాథను: “నా జాతి సోదరులారా! నేను మీ మధ్య ఉండటం, అల్లాహ్ ఆయతులను మాటిమాటికి వినిపించి మిమ్మల్ని ఏమరుపాటునుండి మేల్కొలపటం మీకు సహింపశక్యం కాకపోతే సరే, నేను మాత్రం అల్లాహ్‌నే నమ్ముకున్నాను. మీరు నిలబెట్టిన భాగస్వాములను తోడుగా తీసుకొని మీరు ఒక ఏకగ్రీవ నిర్ణయానికి రండి. మీ దృష్టిలో ఉన్న పథకం గురించి సావధానంగా ఆలోచించి అర్థం చేసుకోండి, దానికి సంబంధించిన ఏ కోణమూ మీ దృష్టికి గోప్యంగా ఉండకుండా ఉండేందుకు. తరువాత దానిని నాకు వ్యతిరేకంగా ప్రయోగించండి. నాకు ఏమాత్రం వ్యవధి నివ్వకండి. మీరు నా హితోపదేశానికి వైముఖ్యం వ్యక్తం చేసి (నాకేమి నష్టం కలిగించారు) నేను మీ నుండి ఏ ప్రతిఫలాన్నీ కోరి ఉండలేదే! నాకు ప్రతిఫలాన్నివ్వటం అనేది అల్లాహ్ బాధ్యత. (ఎవరు విశ్వసించినా, విశ్వసించకపోయినా) స్వయంగా నేను మాత్రం ముస్లిము అయివుండాలని నాకు ఆజ్ఞ ఇవ్వబడింది.”– వారు అతనిని తిరస్కరించారు. దానికి ఫలితంగా మేము అతనినీ, అతనితో పాటు ఓడలో ఉన్నవారినీ కాపాడాము. వారినే భూమిపై వారసులుగా చేశాము. మా ఆయతులను తిరస్కరించిన వారందరినీ ముంచి వేశాము. కనుక, హెచ్చరిక చెయ్యబడినా (విశ్వసించని) వారి ముగింపు ఎలా జరిగిందో చూడు!

**74** నూహ్ తరువాత మేము అనేకమంది ప్రవక్తలను వారి వారి జాతుల వైపునకు పంపాము. వారు వారివద్దకు స్పష్టమైన నిదర్శనాలను తీసుకు వచ్చారు. కాని వారు మొదట తిరస్కరించిన విషయాన్ని మళ్ళీ విశ్వసించలేదు. ఈ విధంగా మేము హద్దులను అతిక్రమించే వారి హృదయాలపై ముద్ర వేస్తాము.

**75 - 82** వారి తరువాత మేము మూసానూ, హారూనునూ మా సూచనలతో ఫిరౌను వద్దకూ అతని సర్దారుల వద్దకూ పంపాము. కాని వారు తమ పెద్దరికపు అహంభావానికి గురి అయ్యారు. వారు అపరాధులైన ప్రజలు. కనుక మా వద్ద నుండి వారి ముందుకు సత్యం వచ్చినప్పుడు వారు: “ఇది స్పష్టమైన మంత్రజాలమే” అని అన్నారు.

قَالَ مُوْسٰۤى اَتَقُوْلُوْنَ لِلْحَقِّ لَمَّا جَآءَكُمْ ؕ
اَسِحْرٌ هٰذَا ؕ وَ لَا يُفْلِحُ السّٰحِرُوْنَ ۝۷۷ قَالُوْۤا
اَجِئْتَنَا لِتَلْفِتَنَا عَمَّا وَجَدْنَا عَلَيْهِ اٰبَآءَنَا وَ
تَكُوْنَ لَكُمَا الْكِبْرِيَآءُ فِي الْاَرْضِ ؕ وَ مَا
نَحْنُ لَكُمَا بِمُؤْمِنِيْنَ ۝۷۸ وَ قَالَ فِرْعَوْنُ
ائْتُوْنِيْ بِكُلِّ سٰحِرٍ عَلِيْمٍ ۝۷۹ فَلَمَّا جَآءَ
السَّحَرَةُ قَالَ لَهُمْ مُّوْسٰۤى اَلْقُوْا مَاۤ اَنْتُمْ
مُّلْقُوْنَ ۝۸۰ فَلَمَّاۤ اَلْقَوْا قَالَ مُوْسٰى مَا جِئْتُمْ
بِهِ ۙ السِّحْرُ ؕ اِنَّ اللّٰهَ سَيُبْطِلُهٗ ؕ اِنَّ اللّٰهَ لَا
يُصْلِحُ عَمَلَ الْمُفْسِدِيْنَ ۝۸۱ وَ يُحِقُّ اللّٰهُ الْحَقَّ
بِكَلِمٰتِهٖ وَ لَوْ كَرِهَ الْمُجْرِمُوْنَ ۝۸۲ ع فَمَاۤ اٰمَنَ
لِمُوْسٰۤى اِلَّا ذُرِّيَّةٌ مِّنْ قَوْمِهٖ عَلٰى خَوْفٍ مِّنْ
فِرْعَوْنَ وَ مَلَا۟ئِهِمْ اَنْ يَّفْتِنَهُمْ ؕ وَ اِنَّ
فِرْعَوْنَ لَعَالٍ فِي الْاَرْضِ ۚ وَ اِنَّهٗ لَمِنَ
الْمُسْرِفِيْنَ ۝۸۳

మూసా ఇలా అన్నాడు: "సత్యం మీ ముందుకు వచ్చినప్పుడు ఇలా అంటారా? ఇది ఇంద్రజాలమా? వాస్తవానికి ఇంద్రజాలికులు సాఫల్యం పొందలేరు.[18]" సమాధానంగా వారు ఇలా అన్నారు: "మా పూర్వీకులు నడచిన మార్గం నుండి మమ్మల్ని మళ్లించటానికా నీవు వచ్చినది! మీ ఇద్దరి పెద్దరికాన్ని భువిలో స్థాపించటానికా నీవు వచ్చినది? నీ మాటను మేము విశ్వసించము." ఫిరౌను (తన మనుషులతో) "ఆరితేరిన ప్రతి మాంత్రికుణ్ణీ నా ముందు హాజరుపరచండి"– అని అన్నాడు. మాంత్రికులు వచ్చినప్పుడు మూసా వారితో "మీరు విసరదలచుకున్న దాన్ని విసరండి" అని అన్నాడు. వారు తమ మంత్ర సాధనాలను విసరగానే, మూసా ఇలా అన్నాడు: "మీరు విసరినది మంత్రజాలం. అల్లాహ్ ఇప్పుడే దానిని మిథ్యగా చేసి చూపిస్తాడు. దుర్మార్గుల పనిని అల్లాహ్ చక్కబడనివ్వడు. అల్లాహ్ తన ఆజ్ఞల ద్వారా సత్యాన్ని సత్యంగా చేసి చూపుతాడు, అది దోషులకు ఎంత సహించరానిదైనా సరే."

**83** (చూడండి) మూసాను అతని జాతిలోని కొందరు యువకులు[19] తప్ప మరెవ్వరూ విశ్వసించలేదు. ఎందుకంటే వారు ఫిరౌనుకు భయపడ్డారు. స్వయంగా తమ జాతిలో పెద్దలుగా ఉన్నవారికి భయపడ్డారు. (ఆ పెద్దలు) ఫిరౌను తమను యాతనకు గురిచేస్తాడని భయపడ్డారు. యథార్థం ఏమిటంటే ఫిరౌను భూమిపై ప్రాబల్యం కలిగి ఉండేవాడు. అతడు ఏ హద్దునూ లెక్క చెయ్యనివారి కోవకు చెందినవాడు.[20]

18. భావం ఏమిటంటే, స్థూలదృష్టితో ఇంద్రజాలానికి, మహిమకూ మధ్య ఉండే పోలికను ఆధారంగా తీసుకొని మీరు నిస్సంకోచంగా దీనిని ఇంద్రజాలంగా నిర్ణయించారు. కాని అవివేకులారా! మంత్రగాళ్ళు ఎటువంటి శీలం కలవారో, ఎటువంటి నీతి కలవారో, ఇంకా ఏ ప్రయోజనాల నిమిత్తం మంత్రతంత్రాలు ఉపయోగిస్తారో ఆ విషయాన్ని మీరు చూడలేదు. నిస్వార్థంగా, నిస్సంకోచంగా ఒక నిరంకుశ పరిపాలకుని దర్బారులోకి పోవటం, అతడిని అతడి మార్గభ్రష్టత్వానికి మందలించటం, ఇంకా దైవభక్తినీ, ఆత్మ పరిశుద్ధతనూ అవలంబించాలని సందేశం ఇవ్వటం ఏ మాంత్రికుడైనా చేస్తాడా?

19. మూలంలో "జుర్రియ్యహ్" అనే పదం ఉపయోగించబడింది. దానికి సంతానం అని అర్థం. మేము దానిని "యువకులు" అని అనువాదం చేశాము. అసలు ఈ ప్రత్యేక పదాన్ని ఉపయోగించటం ద్వారా ఖురాను చెప్పదలచుకున్న విషయం ఇది, ప్రమాదభరితమయిన ఈ కాలంలో సత్యానికి తోడ్పడటానికీ, సత్య ధ్వజవాహకులను తమకు మార్గదర్శకులుగా స్వీకరించటానికీ కొందరు యువతీయువకులు ధైర్యం చేసి ముందుకు వచ్చారు. కాని తల్లులకూ తండ్రులకూ జాతి పెద్దలకూ ఈ భాగ్యం కలుగలేదు. స్వలాభాపేక్ష ప్రాపంచిక ప్రయోజనాల దాస్యం, భోగలాలసత్వం వారిని చుట్టుముట్టాయి. ఈ కారణంగా వారు ఇటువంటి సత్యానికి తోడ్పడటానికి

**84 - 86** మూసా తన జాతివారితో ఇలా అన్నాడు: "ప్రజలారా! మీకు నిజంగానే అల్లాహ్‌పై విశ్వాసం ఉంటే, ఆయనను నమ్మండి, మీరు గనక ముస్లిములే అయితే." వారు ఇలా జవాబు[21] పలికారు: "మేము అల్లాహ్‌నే నమ్ముకున్నాము. మా ప్రభూ! మమ్మల్ని దుర్మార్గులకు పరీక్షా సాధనంగా చెయ్యకు. నీ కారుణ్యం ద్వారా మాకు అవిశ్వాసుల నుండి విముక్తి కలుగజెయ్యి."

**87** మేము మూసాకూ, అతని సోదరునికీ ఇలా సూచించాము: "ఈజిప్టులో మీ జాతి వారి కొరకు కొన్ని గృహాలను సమకూర్చండి. ఆ గృహాలను ఖిబ్లాగా నిర్ణయించుకొనండి. నమాజును స్థాపించండి.[22] విశ్వాసులకు శుభవార్తను అందజేయండి."

**88 - 89** మూసా ఇలా ప్రార్థించాడు: "మా ప్రభూ! నీవు ఫిరౌనుకూ అతని సర్దారులకూ ఇహలోక జీవితంలో వైభవమును సంపదను ప్రసాదించావు. ప్రభూ! వారు ప్రజలను నీ మార్గం నుంచి తప్పించటానికా ఇవి? ప్రభూ! వారి సంపదను ధ్వంసం చెయ్యి. వ్యధాభరితమైన శిక్షను చూసేవరకూ వారు విశ్వసించకుండా వారి హృదయాలకు ముద్రవెయ్యి."[23] సమాధానంగా అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: "మీ ఉభయుల ప్రార్థన అంగీకరించబడింది. ధృఢచిత్తులై ఉండండి. జ్ఞానహీనుల మార్గాన్ని ఎంతమాత్రం అనుసరించకండి."

وَقَالَ مُوْسٰى يٰقَوْمِ اِنْ كُنْتُمْ اٰمَنْتُمْ بِاللّٰهِ
فَعَلَيْهِ تَوَكَّلُوْٓا اِنْ كُنْتُمْ مُّسْلِمِيْنَ ﴿۸۴﴾ فَقَالُوْا
عَلَى اللّٰهِ تَوَكَّلْنَا ۚ رَبَّنَا لَا تَجْعَلْنَا فِتْنَةً لِّلْقَوْمِ
الظّٰلِمِيْنَ ۙ﴿۸۵﴾ وَ نَجِّنَا بِرَحْمَتِكَ مِنَ الْقَوْمِ
الْكٰفِرِيْنَ ﴿۸۶﴾ وَ اَوْحَيْنَآ اِلٰى مُوْسٰى وَ اَخِيْهِ اَنْ
تَبَوَّاٰ لِقَوْمِكُمَا بِمِصْرَ بُيُوْتًا وَّ اجْعَلُوْا بُيُوْتَكُمْ
قِبْلَةً وَّ اَقِيْمُوا الصَّلٰوةَ ؕ وَ بَشِّرِ الْمُؤْمِنِيْنَ ﴿۸۷﴾
وَ قَالَ مُوْسٰى رَبَّنَآ اِنَّكَ اٰتَيْتَ فِرْعَوْنَ وَ
مَلَاَهٗ زِيْنَةً وَّ اَمْوَالًا فِى الْحَيٰوةِ الدُّنْيَا ۙ رَبَّنَا
لِيُضِلُّوْا عَنْ سَبِيْلِكَ ۚ رَبَّنَا اطْمِسْ عَلٰٓى اَمْوَالِهِمْ
وَ اشْدُدْ عَلٰى قُلُوْبِهِمْ فَلَا يُؤْمِنُوْا حَتّٰى يَرَوُا
الْعَذَابَ الْاَلِيْمَ ﴿۸۸﴾ قَالَ قَدْ اُجِيْبَتْ
دَّعْوَتُكُمَا فَاسْتَقِيْمَا وَ لَا تَتَّبِعٰٓنِّ سَبِيْلَ
الَّذِيْنَ لَا يَعْلَمُوْنَ ﴿۸۹﴾

సిద్ధపడలేదు. ఆ సత్యమార్గం వారికి ప్రమాదాలతో నిండి ఉన్నట్లుగా కనిపించింది. వారు 'మూసా దరిదాపులకు కూడా వెళ్ళకండి. ఒకవేళ వెళితే మీరు కూడా ఫిరౌను ఆగ్రహానికి గురిఅవుతారు, అంతేకాదు మాపైకి కూడా ఆపదలను తీసుకొనివస్తారు' అని యువకులను నిరోధించారు.

20. అంటే, స్వార్థం కోసం అతి దుష్టమైన మార్గాన్ని కూడా అవలంబించటానికి సంకోచించడు. హింస, దుశ్శీలత, క్రూరత్వం, అమానుషత్వం మొదలైనవాటికి పాల్పడటానికి వెనుకాడడు. తన కోరికలను తీర్చుకోవటానికి ఏదైనా చేస్తాడు. అతనికి అడ్డూ అదుపూ లేదు.

21. మూసా (అస్సలామ్) కు తమ తోడ్పాటును వ్యక్తం చేసిన యువకులు ఇచ్చిన జవాబు ఇది. ఇక్కడ 'ఖాలూ' (వారు పలికారు) అనే క్రియలోని సర్వనామం జాతికి కాదు, జుర్రియ్యత్ (యువకుల)కు వర్తిస్తుంది. ఈ విషయం ఉపన్యాస సందర్భాన్ని బట్టి విశదమౌతోంది.

22. ఈజిప్టులో ప్రభుత్వ దౌర్జన్యం వల్లా, ఇస్రాయీలు సంతతివారి విశ్వాస వార్ధక్యం వల్లా ఇస్రాయీలు సంతతివారిలోనూ ఈజిప్టు ముస్లిమ్‌లలోనూ సామూహిక ప్రార్థనా వ్యవస్థ అంతరించిపోయింది. ఇది వారి మధ్య ఐకమత్యం విచ్ఛిన్నం కావటానికి, వారి ధర్మస్రవంతి ఇంకిపోవటానికి ఒక ప్రబలమైన కారణం. ఇందుకని ఈ వ్యవస్థను మళ్ళీ కొత్తగా స్థాపించవలసినదనీ, ఈజిప్టులో సామూహికంగా నమాజు చెయ్యటానికి

وَجٰوَزْنَا بِبَنِيْٓ اِسْرَآءِيْلَ الْبَحْرَ فَاَتْبَعَهُمْ
فِرْعَوْنُ وَجُنُوْدُهٗ بَغْيًا وَّ عَدْوًا ؕ حَتّٰٓى اِذَآ
اَدْرَكَهُ الْغَرَقُ ۙ قَالَ اٰمَنْتُ اَنَّهٗ لَآ اِلٰهَ اِلَّا
الَّذِيْٓ اٰمَنَتْ بِهٖ بَنُوْٓا اِسْرَآءِيْلَ وَاَنَا مِنَ
الْمُسْلِمِيْنَ ﴿٩٠﴾ آٰلْـٰٔنَ وَ قَدْ عَصَيْتَ قَبْلُ وَ
كُنْتَ مِنَ الْمُفْسِدِيْنَ ﴿٩١﴾ فَالْيَوْمَ نُنَجِّيْكَ
بِبَدَنِكَ لِتَكُوْنَ لِمَنْ خَلْفَكَ اٰيَةً ؕ وَ اِنَّ
كَثِيْرًا مِّنَ النَّاسِ عَنْ اٰيٰتِنَا لَغٰفِلُوْنَ ﴿٩٢﴾ ع وَ ع ١٤
لَقَدْ بَوَّاْنَا بَنِيْٓ اِسْرَآءِيْلَ مُبَوَّاَ صِدْقٍ وَّ
رَزَقْنٰهُمْ مِّنَ الطَّيِّبٰتِ ۚ فَمَا اخْتَلَفُوْا حَتّٰى
جَآءَهُمُ الْعِلْمُ ؕ اِنَّ رَبَّكَ يَقْضِيْ بَيْنَهُمْ يَوْمَ
الْقِيٰمَةِ فِيْمَا كَانُوْا فِيْهِ يَخْتَلِفُوْنَ ﴿٩٣﴾ فَاِنْ
كُنْتَ فِيْ شَكٍّ مِّمَّآ اَنْزَلْنَآ اِلَيْكَ فَسْـَٔلِ
الَّذِيْنَ يَقْرَءُوْنَ الْكِتٰبَ مِنْ قَبْلِكَ ۚ لَقَدْ
جَآءَكَ الْحَقُّ مِنْ رَّبِّكَ فَلَا تَكُوْنَنَّ مِنَ
الْمُمْتَرِيْنَ ﴿٩٤﴾ ۙ وَلَا تَكُوْنَنَّ مِنَ الَّذِيْنَ كَذَّبُوْا
بِاٰيٰتِ اللّٰهِ فَتَكُوْنَ مِنَ الْخٰسِرِيْنَ ﴿٩٥﴾

**90 - 92** మేము ఇస్రాయీలు సంతతిని సముద్రం దాటించాము. తరువాత ఫిరౌనూ, అతని సైన్యాలూ హింసించే ఉద్దేశ్యంతో, అణచివేసే ఉద్దేశ్యంతో వారిని వెంబడించారు. చివరకు ఫిరౌను మునిగిపోతున్నప్పుడు ఇలా అరవ సాగాడు: "ఇస్రాయీలు సంతతివారు విశ్వసించిన దేవుడే నిజమైన దేవుడు అనీ, ఆయన తప్ప మరొక దేవుడు ఎవడూ లేడు అనీ నేనూ విశ్వసించాను. నేను కూడా విధేయతతో శిరస్సు వంచేవారిలోని వాడనే." ఇలా (జవాబు ఇవ్వబడింది): "ఇప్పుడు విశ్వసిస్తున్నావా! వాస్తవానికి ఇంతవరకు నీవు అవిధేయత చూపుతూ ఉండేవాడివి. ఇంకా కల్లోలాన్ని రేకెత్తించేవారిలో కూడా ఉన్నావు. ఇప్పుడు మేము కేవలం నీ శవాన్ని మాత్రమే రక్షిస్తాము, నీవు వచ్చే తరాల వారికి గుణపాఠం గుర్తుగా ఉండేటందుకు. కాని చాలా మంది మానవులు మా సూచనలను నిర్లక్ష్యం చేస్తారు."

**93** మేము ఇస్రాయీలు సంతతివారికి చాలా చక్కని నివాస స్థలాన్ని ఇచ్చాము. ఎంతో శ్రేష్ఠమైన జీవిత వనరులను వారికి ప్రసాదించాము. తరువాత వారి మధ్య విభేదాలు పొడసూపలేదు. కాని జ్ఞానం వారివద్దకు వచ్చేసినపుడు మాత్రమే (అవి పొడసూపాయి). నిశ్చయంగా నీ ప్రభువు ప్రళయం నాడు వారు భిన్నాభిప్రాయములు కలిగివున్న విషయాన్ని గురించి వారిమధ్య తీర్పు చెబుతాడు.

**94 - 95** ఇప్పుడు ఒకవేళ నీకు, మేము నీపై అవతరింపజేసిన హితబోధను గురించి ఏమాత్రం సందేహం ఉన్నా, నీకు పూర్వం నుండీ గ్రంథాలను చదువుతూ ఉన్న ప్రజలను అడుగు. యథార్థంగా నీ ప్రభువు తరఫు నుండి నీ వద్దకు వచ్చినటువంటిది సత్యమే. కనుక నీవు సందేహించే వారిలోని వాడవు కావద్దు. అల్లాహ్ ఆయతులను తిరస్కరించినవారిలో చేరిపోకు. అలా చేస్తే నీవు నష్టపడే వారిలో చేరిపోతావు.[24]

కొన్ని గృహాలను నిర్మించవలసినదనీ లేదా ఎన్నుకోవలసినదనీ హ(జత్ మూసా (అస్సలామ్)ను ఆదేశించటం జరిగింది. ఈ గృహాలను ఖిబ్లాగా నిర్ణయించే దాని భావం ఇది : ఈ గృహాలను సమస్త జాతి కొరకు కేంద్రాలుగానూ సమావేశస్థలాలుగానూ రూపొందించాలి అని. ఆ తరువాత "నమాజ్‌ను స్థాపించండి" అని అనేదాని భావం ఏమిటంటే వేరువేరుగా తమ తమ గృహాలలో నమాజును చేయటానికి బదులుగా, ప్రజలు ఈ నిర్ణీత స్థలాలలో సమావేశమై నమాజును చేస్తూ ఉండాలి అని.

**96 - 98** యథార్థం ఏమిటంటే, ఎవరి విషయంలో నీ ప్రభువు వాక్కు నిజమని నిరూపించబడిందో,[25] వారి ముందుకు ఏ నిదర్శనం వచ్చినా వారు ఎన్నటికీ విశ్వసించరు, బాధాకర మైన శిక్ష వారి ముందుకు వస్తూ కనబడితే తప్ప. తరువాత ఒక నగరం శిక్షను చూసి విశ్వసించటం అనే విషయమూ, ఇంకా దాని విశ్వాసం దానికి లాభదాయకం కావడం అనే ఉదాహరణా, ఎక్కడైనా ఉందా ఒక్క యూనుస్ జాతి తప్ప? (అలాంటి ఉదాహరణ లేదు) ఆ జాతి విశ్వసించగానే, మేము దానిపైనుండి ఇహలోక జీవితంలో అవమానకరమైన శిక్షను తొలగించాము.[26] దానికి కొంత కాలం వరకు జీవితాన్ని అనుభవించే అవకాశం కలుగజేశాము.

**99 - 100** నీ ప్రభువు అభీష్టం గనక ఇదే అయితే (అంటే భూమిపై ఉండేవారంతా విశ్వాసులూ, విధేయులూ అవ్వాలి అనేది) సమస్త భూవాసులూ విశ్వసించి ఉండేవారే. అలాం టప్పుడు నీవు ప్రజలను విశ్వాసులుగా మారండి అని బలవంతం చేస్తావా? ఏ ప్రాణి అయినాసరే అల్లాహ్ అనుమతి లేకుండా విశ్వసించదు. అల్లాహ్ విధానం ఏమిటంటే, బుద్ధి జ్ఞానాలతో వ్యవహరించని వారిపై ఆయన మాలిన్యాన్ని పడవేస్తాడు.

اِنَّ الَّذِيْنَ حَقَّتْ عَلَيْهِمْ كَلِمَتُ رَبِّكَ لَا
يُؤْمِنُوْنَ ﴿٩٦﴾ وَلَوْ جَآءَتْهُمْ كُلُّ اٰيَةٍ حَتّٰى يَرَوُا
الْعَذَابَ الْاَلِيْمَ ﴿٩٧﴾ فَلَوْلَا كَانَتْ قَرْيَةٌ اٰمَنَتْ
فَنَفَعَهَآ اِيْمَانُهَآ اِلَّا قَوْمَ يُوْنُسَ ۭ لَمَّآ اٰمَنُوْا
كَشَفْنَا عَنْهُمْ عَذَابَ الْخِزْيِ فِي الْحَيٰوةِ الدُّنْيَا
وَمَتَّعْنٰهُمْ اِلٰى حِيْنٍ ﴿٩٨﴾ وَلَوْ شَآءَ رَبُّكَ لَاٰمَنَ
مَنْ فِي الْاَرْضِ كُلُّهُمْ جَمِيْعًا ۭ اَفَاَنْتَ تُكْرِهُ
النَّاسَ حَتّٰى يَكُوْنُوْا مُؤْمِنِيْنَ ﴿٩٩﴾ وَمَا كَانَ
لِنَفْسٍ اَنْ تُؤْمِنَ اِلَّا بِاِذْنِ اللّٰهِ ۭ وَيَجْعَلُ
الرِّجْسَ عَلَى الَّذِيْنَ لَا يَعْقِلُوْنَ ﴿١٠٠﴾

23. హజ్రత్ మూసా (అస్సలామ్) ఈ ప్రార్థనను ఈజిప్టును వదలి వెళ్ళేముందు చేశారు. ఫిరౌను, అతని సర్దారులు సూచనల పరంపరను చూసిన తరువాత కూడా, ధార్మికవాదము పూర్తిఅయిన తరువాత కూడా, సత్యవిరోధంలో అతి మొండి వైఖరిని అవలంబించిన కాలంలో ఆయన ఈ దుఆను చేశారు. అటువంటి సమయంలో దైవప్రవక్త ఏమని శపిస్తాడో అది సరిగ్గా అవిశ్వాసం పట్ల మూర్ఖత్వం వహించే వారి విషయంలో అల్లాహ్ స్వయంగా చేసే తీర్పే అవుతుంది. అంటే మళ్ళీ వారికి విశ్వసించే భాగ్యాన్ని కలిగించకుండా ఉండటం.

24. పైకి ఈ సంబోధన మహాప్రవక్త (సఅసమ్)కు వర్తిస్తుంది. కాని అసలు ఉద్దేశ్యం ఆయన సందేశాన్ని శంకించే వారికి దీనిని వినిపించటం, గ్రంథ ప్రజలను ఉదాహరణంగా పేర్కొనటానికి కారణం ఇది: అరేబియా జనబాహుళ్యానికి ఆకాశగ్రంథాల జ్ఞానం తెలియనే తెలియదు. వారికి ఈ పిలుపు ఒక కొత్త పిలుపు. కాని గ్రంథ ప్రజల విద్వాంసులలో ధర్మనిష్ఠాపరులు, న్యాయబుద్ధి కలవారు పూర్వం దైవప్రవక్తలు ఇచ్చిన సందేశాన్నే ఖురాను కూడా ఇస్తోంది అనే విషయాన్ని ధ్రువీకరించగలిగి ఉండేవారు.

25. అంటే, ఈ వాక్కు స్వయంగా సత్యాన్ని కాంక్షించనివారికీ, తమ హృదయాలకు మూర్ఖత్వం, పక్షపాతం, మంకుపట్టు అనే తాళాలు వేసేవారికీ ప్రపంచ వ్యామోహంలో మునిగివుండేవారికి, పరలోకం పట్ల నిర్లక్ష్యంగా ఉండేవారికీ విశ్వాస భాగ్యం కలుగదు.

26. వ్యాఖ్యాతలు దీనికి కారణం ఏమిటో ఇలా వివరించారు: శిక్షను గురించి హజ్రత్ యూనుస్ (అస్సలామ్) హెచ్చరిక చేసిన తరువాత అల్లాహ్ అనుమతి లేకుండానే స్వస్థలాన్ని విడిచి వెళ్ళిపోయాడు. ఇందువల్ల శిక్షా సూచనలను చూసిన అసీరియనులు పశ్చాత్తాపపడి క్షమాభిక్ష కోరినప్పుడు అల్లాహ్ వారిని క్షమించాడు.

قُلِ انْظُرُوْا مَاذَا فِي السَّمٰوٰتِ وَ الْاَرْضِ ؕ
وَمَا تُغْنِي الْاٰيٰتُ وَ النُّذُرُ عَنْ قَوْمٍ لَّا
يُؤْمِنُوْنَ ﴿١٠١﴾ فَهَلْ يَنْتَظِرُوْنَ اِلَّا مِثْلَ اَيَّامِ
الَّذِيْنَ خَلَوْا مِنْ قَبْلِهِمْ ؕ قُلْ فَانْتَظِرُوْۤا اِنِّيْ
مَعَكُمْ مِّنَ الْمُنْتَظِرِيْنَ ﴿١٠٢﴾ ثُمَّ نُنَجِّيْ رُسُلَنَا وَ
الَّذِيْنَ اٰمَنُوْا كَذٰلِكَ ۚ حَقًّا عَلَيْنَا نُنْجِ
الْمُؤْمِنِيْنَ ﴿١٠٣﴾ قُلْ يٰۤاَيُّهَا النَّاسُ اِنْ كُنْتُمْ فِيْ ع ١٥
شَكٍّ مِّنْ دِيْنِيْ فَلَاۤ اَعْبُدُ الَّذِيْنَ تَعْبُدُوْنَ
مِنْ دُوْنِ اللّٰهِ وَ لٰكِنْ اَعْبُدُ اللّٰهَ الَّذِيْ
يَتَوَفّٰىكُمْ ۖۚ وَ اُمِرْتُ اَنْ اَكُوْنَ مِنَ
الْمُؤْمِنِيْنَ ﴿١٠٤﴾ وَ اَنْ اَقِمْ وَجْهَكَ لِلدِّيْنِ
حَنِيْفًا ۚ وَ لَا تَكُوْنَنَّ مِنَ الْمُشْرِكِيْنَ ﴿١٠٥﴾ وَ لَا
تَدْعُ مِنْ دُوْنِ اللّٰهِ مَا لَا يَنْفَعُكَ وَ لَا
يَضُرُّكَ ۚ فَاِنْ فَعَلْتَ فَاِنَّكَ اِذًا مِّنَ
الظّٰلِمِيْنَ ﴿١٠٦﴾ وَ اِنْ يَّمْسَسْكَ اللّٰهُ بِضُرٍّ فَلَا
كَاشِفَ لَهٗۤ اِلَّا هُوَ ۚ وَ اِنْ يُّرِدْكَ بِخَيْرٍ فَلَا
رَآدَّ لِفَضْلِهٖ ؕ يُصِيْبُ بِهٖ مَنْ يَّشَآءُ مِنْ
عِبَادِهٖ ؕ وَ هُوَ الْغَفُوْرُ الرَّحِيْمُ ﴿١٠٧﴾

**101 - 103** వారితో ఇలా అను: "భూమిలోనూ, ఆకాశాల లోనూ ఉన్నటు వంటి దానిని కళ్ళు తెరచి చూడండి." అసలు విశ్వసించటానికే ఇష్టపడని వారికి సూచనలుగానీ, హెచ్చరికలు గానీ ఎలా ఉపయోగపడతాయి? ఇప్పుడు వారు ఇంకా దేనికోసం నిరీక్షిస్తున్నారు, వారికి పూర్వం గతించిన ప్రజలు చూచినటువంటి చెడు దినాలనే చూడటం కోసం తప్ప? వారితో ఇలా అను: "మంచిది, నిరీక్షించండి. నేను కూడా మీతోపాటు నిరీక్షిస్తాను." తరువాత (అటువంటి సమయం వచ్చినప్పుడు) మేము మా ప్రవక్తలనూ, విశ్వాసులనూ కాపాడుతూ ఉంటాము. మా విధానం ఇదే. విశ్వాసులను రక్షించటం మా విధి.

**104 - 107** ప్రవక్తా ఇలా అను: "మానవులారా! మీరు గనక ఇంకా నా ధర్మం గురించి ఏదైనా సంశయం కలిగివుంటే, వినండి, మీరు అల్లాహ్‌ను కాదని ఆరాధించే వారిని నేను ఆరాధించను. ఏ దేవుని అధీనంలో మీ మరణం ఉన్నదో ఆ దేవుడినే నేను ఆరాధిస్తాను. నేను విశ్వాసులలో ఒకడిగా ఉండాలని నాకు ఆదేశం ఇవ్వబడింది. నాతో ఇలా అనబడినది: ఏకాగ్రతతో చిత్తశుద్ధితో నిన్ను నీవు పూర్తిగా ఈ ధర్మానికి సమర్పించుకో.[27] ముష్రిక్కులలో ఎంతమాత్రమూ కలిసిపోకు. అల్లాహ్‌ను వదలి నీకు నష్టాన్నిగాని లాభాన్నిగాని కలిగించలేని ఏ శక్తినీ వేడుకోకు. ఒకవేళ అలాచేస్తే నీవూ దుర్మార్గుడవై పోతావు. అల్లాహ్ గనక నిన్ను ఏదైనా ఆపదకు గురిచేస్తే స్వయంగా ఆయన తప్ప ఆ ఆపదను తొలగించేవారు ఎవ్వరూ లేరు. ఇంకా ఆయన గనక నీ విషయంలో ఏదైనా మేలు చెయ్యాలని సంకల్పిస్తే, ఆయన అనుగ్రహాన్ని మళ్ళించే వాడు కూడా ఎవ్వడూ లేడు. ఆయన తన దాసులలో తాను కోరిన వారికి తన అనుగ్రహాన్ని ప్రసాదిస్తాడు. ఆయన క్షమించే వాడూ, కరుణించేవాడూను."

27. అసలు పదాలు ఇవి : "అఖిమ్ వజ్‌హక లిద్దీని హనీఫా". అందులో "అఖిమ్ వజ్‌హక" అంటే "నీ ముఖాన్ని నిలుపు" అని శబ్దార్థం. కాబట్టి దీని పూర్తి భావం ఇది : నీ ముఖం ఒకే దిక్కులో స్థిరంగా ఉండాలి.

قُلْ يَآيُّهَا النَّاسُ قَدْ جَآءَكُمُ الْحَقُّ مِنْ
رَّبِّكُمْ ۚ فَمَنِ اهْتَدٰى فَاِنَّمَا يَهْتَدِيْ
لِنَفْسِهٖ ۚ وَ مَنْ ضَلَّ فَاِنَّمَا يَضِلُّ عَلَيْهَا ۚ وَ مَآ
اَنَا عَلَيْكُمْ بِوَكِيْلٍ ۞۱۰۸ وَ اتَّبِعْ مَا يُوْحٰٓى اِلَيْكَ
وَ اصْبِرْ حَتّٰى يَحْكُمَ اللّٰهُ ۚ وَ هُوَ خَيْرُ الْحٰكِمِيْنَ ۞۱۰۹

**108 - 109** ముహమ్మద్! ఇలా చెప్పు: “మానవులారా! మీ వద్దకు మీ ప్రభువు తరఫు నుండి సత్యం వచ్చేసింది. ఇప్పుడు ఎవడైనా రుజుమార్గాన్ని అవలంబిస్తే అతడి రుజుమార్గ అనుసరణం అతనికే లాభదాయకం. ఎవడైనా మార్గం తప్పితే అతడి ఆ మార్గం తప్పటం అతనికే వినాశకరం. నేను మీకు కావలివాణ్ణి మాత్రం కాను.” ప్రవక్తా! నీవు నీ వద్దకు వహీ ద్వారా పంపబడుతూ వున్న హితబోధను అనుసరిస్తూ ఉండు. అల్లాహ్ తీర్పు చేసేవరకు ఓర్పు వహించు. ఆయన మాత్రమే ఉత్తమంగా తీర్పు చేసేవాడు.

తొణకకుండా బెణకకుండా ఉండాలి. ఒకప్పుడు వెనుకకూ, మరొకప్పుడు ముందుకూ, ఒకప్పుడు కుడివైపునకూ మరొకప్పుడు ఎడమవైపునకూ తిరగకూడదు. పూర్తిగా ముక్కుకు సూటిగా నీకు చూపబడిన మార్గంపైననే దృష్టి నిలిపి నడువు. ఈ ఆంక్ష చాలా కఠినమైనది. అయినా దానితో తృప్తిపడలేదు. దానికి మరొక ఆంక్ష హనీఫా అనేది కూడా చేర్చబడింది. అన్ని దిక్కులనూ వదలి ఒకే దిక్కుకు మరలే మనిషిని హనీఫ్ అంటారు.

١١ سُوْرَةُ هُوْدٍ مَكِّيَّةٌ ٥٢
اٰيَاتُهَا ١٢٣ رُكُوْعَاتُهَا ١٠

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

الٓرٰ ۚ كِتٰبٌ اُحْكِمَتْ اٰيٰتُهٗ ثُمَّ فُصِّلَتْ مِنْ
لَّدُنْ حَكِيْمٍ خَبِيْرٍ ۙ﴿١﴾ اَلَّا تَعْبُدُوْٓا اِلَّا اللّٰهَ ؕ
اِنَّنِيْ لَكُمْ مِّنْهُ نَذِيْرٌ وَّبَشِيْرٌ ۙ﴿٢﴾ وَّ اَنِ
اسْتَغْفِرُوْا رَبَّكُمْ ثُمَّ تُوْبُوْٓا اِلَيْهِ يُمَتِّعْكُمْ
مَّتَاعًا حَسَنًا اِلٰٓى اَجَلٍ مُّسَمًّى وَّ يُؤْتِ كُلَّ
ذِيْ فَضْلٍ فَضْلَهٗ ؕ وَ اِنْ تَوَلَّوْا فَاِنِّيْٓ اَخَافُ
عَلَيْكُمْ عَذَابَ يَوْمٍ كَبِيْرٍ ﴿٣﴾ اِلَى اللّٰهِ
مَرْجِعُكُمْ ۚ وَ هُوَ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ ﴿٤﴾ اَلَآ
اِنَّهُمْ يَثْنُوْنَ صُدُوْرَهُمْ لِيَسْتَخْفُوْا مِنْهُ ؕ
اَلَا حِيْنَ يَسْتَغْشُوْنَ ثِيَابَهُمْ ۙ يَعْلَمُ مَا
يُسِرُّوْنَ وَمَا يُعْلِنُوْنَ ۚ اِنَّهٗ عَلِيْمٌۢ بِذَاتِ
الصُّدُوْرِ ﴿٥﴾ وَ مَا مِنْ دَآبَّةٍ فِي الْاَرْضِ اِلَّا
عَلَى اللّٰهِ رِزْقُهَا وَ يَعْلَمُ مُسْتَقَرَّهَا وَ
مُسْتَوْدَعَهَا ؕ كُلٌّ فِيْ كِتٰبٍ مُّبِيْنٍ ﴿٦﴾

## 11. హూద్

ఆయతులు 123 | అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 4** అలిఫ్ లామ్ రా. ఇది ఒక ఫర్మానా.[1] ఇందులోని ఆయతులు నిర్దుష్టమైనవీ, సవివరంగా చెప్పబడినవీ-వివేక వంతుడూ అన్నీ ఎరిగినవాడూ అయిన వాని తరఫునుండి. (ఆ ఫర్మానా ఏమిటంటే) నీవు అల్లాహ్‌ను తప్ప మరెవరినీ ఆరాధించకు-నేను ఆయన తరఫు నుండి మీకు హెచ్చరిక చేసేవాణ్ణీ, శుభవార్తలు అందజేసేవాణ్ణి కూడా. ఇంకా మీరు మీ ప్రభువును క్షమాభిక్ష కోరండి. ఆయన వైపునకు మరలి రండి. అప్పుడు ఆయన ఒక నిర్ణీత కాలం వరకూ మీకు మంచి జీవిత సామగ్రిని[2] అనుగ్రహిస్తాడు. అనుగ్రహాలకు అర్హుడైన ప్రతివానికీ ఆయన తన అనుగ్రహాలు ప్రసాదిస్తాడు.[3] కాని మీరు గనక విముఖులైతే, ఒక అతి భయంకరమైన దినంనాటి యాతనకు మీరు గురి అవుతారేమో అని నేను భయపడుతున్నాను. మీరందరూ అల్లాహ్ వైపునకే మరలవలసి వున్నది. ఆయన సర్వమూ చెయ్యగల సమర్థుడు.

**5 - 6** చూడండి వారు తమ వక్షములను తిప్పుకుంటారు, అతని నుండి దాక్కుందామని.[4] జాగ్రత్త! వారు బట్టలతో తమను తాము కప్పుకున్నప్పటికీ, అల్లాహ్ వారి గుప్త విషయాలనూ ఎరుగును, వారి బహిరంగ విషయాలనూ ఎరుగును. ఆయన హృదయాలలో ఉన్న రహస్యాలను కూడా ఎరుగును. ధరణిపై సంచరించే ఏ ప్రాణి ఉపాధి అయినా అల్లాహ్ బాధ్యతలో లేకుండా లేదు. ఆ ప్రాణి ఎక్కడ నివసిస్తుందో అది ఎక్కడకు చేర్చబడనున్నదో ఆయనకు తెలియకుండా లేవు. సమస్తమూ ఒక స్పష్టమైన గ్రంథంలో వ్రాయబడి ఉన్నది.

1. ఉపన్యాసం తీరును బట్టి ఇక్కడ "కితాబ్" అనే పదానికి ఫర్మానా అని అనువాదం చెయ్యటం జరిగింది. అరబ్బీ భాషలో ఈ పదానికి గ్రంథం, వ్రాయబడినటు వంటిది అనే అర్థాలే కాదు ఆజ్ఞ, రాజశాసనం అనే అర్థాలు కూడా ఉన్నాయి. ఖురానులోనే పలుచోట్ల ఈ పదం ఈ అన్ని అర్థాలలోనూ ప్రయోగించబడింది.
2. అంటే, మీరు ప్రపంచంలో ఉండటానికి నిర్ణయమై ఉన్న గడువు వరకు, ఆయన మిమ్మల్ని చెడ్డగా కాదు చక్కగా ఉంచుతాడు. ఆయన వరాలు మీపై వర్షిస్తాయి. ఆయన అనుగ్రహాలను పొందే భాగ్యం మీకు కలుగుతుంది.

**7 - 8** ఆకాశాలనూ, భూమినీ ఆరు దినాలలో సృష్టించిన వాడు ఆయనే- దానికి పూర్వం ఆయన సింహాసనం నీళ్ళపై ఉండేది[5]- మీలో ఎవడు మంచి పనులు చేస్తాడో మిమ్మల్ని పరీక్షించి చూద్దామని.[6] ప్రవక్తా! ఇప్పుడు నీవు గనక వారితో "ప్రజలారా! మరణించిన తరువాత మీరు మళ్ళీ లేపబడతారు" అని అంటే అవిశ్వాసులు తక్షణం ఇలా అంటారు: "ఇది స్పష్టమైన ఇంద్రజాలం"[7]. ఒకవేళ మేము వారి శిక్షను ఒక నిర్ణీత వ్యవధి వరకు వాయిదా వేస్తే వారు, అసలు దానిని ఏ వస్తువు పట్టి ఆపుతోంది? అని అనటం ప్రారంభిస్తారు. వినండి, ఆ శిక్షా సమయం వచ్చే రోజున దానిని ఎవరూ మరలించలేరు. వారు ఎగతాళి చేస్తూ ఉన్నదే వారిని చుట్టుముట్టుతుంది.

**9 - 11** ఒకవేళ మేము ఎప్పుడైనా మానవునికి మా కారుణ్యాన్ని ప్రసాదించి, తరువాత అది అతనికి లేకుండా చేస్తే అతడు నిరాశ చెందుతాడు. కృతఘ్నుత చూపుతాడు. అతనిపై పడిన ఆపద (తొలగిన) తరువాత, ఒకవేళ మేము అతనికి అనుగ్రహాన్ని రుచి చూపిస్తే, "కష్టాలన్నీ తొలగి పోయాయి" అని అంటాడు. అతడు తరువాత ఉబ్బితబ్బిబ్బవు తాడు, విర్రవీగుతాడు. సహనశీలురూ, సత్కార్యపరులూ అయినవారు మాత్రమే ఈ దోషానికి అతీతులు. వారికే మన్నింపూ, పెద్ద బహుమానమూను.

وَ هُوَ الَّذِيْ خَلَقَ السَّمٰوٰتِ وَ الْاَرْضَ فِيْ
سِتَّةِ اَيَّامٍ وَّ كَانَ عَرْشُهٗ عَلَى الْمَآءِ
لِيَبْلُوَكُمْ اَيُّكُمْ اَحْسَنُ عَمَلًا ؕ وَ لَئِنْ قُلْتَ
اِنَّكُمْ مَّبْعُوْثُوْنَ مِنْۢ بَعْدِ الْمَوْتِ لَيَقُوْلَنَّ
الَّذِيْنَ كَفَرُوْۤا اِنْ هٰذَاۤ اِلَّا سِحْرٌ مُّبِيْنٌ ٧ وَ
لَئِنْ اَخَّرْنَا عَنْهُمُ الْعَذَابَ اِلٰۤى اُمَّةٍ مَّعْدُوْدَةٍ
لَّيَقُوْلُنَّ مَا يَحْبِسُهٗ ؕ اَلَا يَوْمَ يَاْتِيْهِمْ لَيْسَ
مَصْرُوْفًا عَنْهُمْ وَ حَاقَ بِهِمْ مَّا كَانُوْا بِهٖ
يَسْتَهْزِءُوْنَ ٨ وَ لَئِنْ اَذَقْنَا الْاِنْسَانَ مِنَّا ع
رَحْمَةً ثُمَّ نَزَعْنٰهَا مِنْهُ ۚ اِنَّهٗ لَيَـُٔوْسٌ
كَفُوْرٌ ٩ وَ لَئِنْ اَذَقْنٰهُ نَعْمَآءَ بَعْدَ ضَرَّآءَ
مَسَّتْهُ لَيَقُوْلَنَّ ذَهَبَ السَّيِّاٰتُ عَنِّيْ ؕ اِنَّهٗ
لَفَرِحٌ فَخُوْرٌ ١٠ اِلَّا الَّذِيْنَ صَبَرُوْا وَ عَمِلُوا
الصّٰلِحٰتِ ؕ اُولٰٓئِكَ لَهُمْ مَّغْفِرَةٌ وَّ اَجْرٌ كَبِيْرٌ ١١

---

సుఖంగా, సంపన్నులుగా ఉంటారు. జీవితంలో శాంతి సౌమనస్యాలు లభిస్తాయి. అవమానంతో పరాభవంతో కాదు, పరువు ప్రతిష్ఠలతో జీవిస్తారు.

3. అంటే, ఒక వ్యక్తి సత్ప్రవర్తనలో, సత్కార్యాలలో ఎంత ముందుకు పోతాడో, అంతే గొప్పస్థానాన్ని అల్లాహ్ అతనికి ప్రసాదిస్తాడు. ఒక వ్యక్తి తన శీలం ద్వారా, తన నడవడికద్వారా ఏ ఔన్నత్యానికి తాను అర్హుడని నిరూపించుకుంటాడో, ఆ ఔన్నత్యం అతనికి తప్పనిసరిగా ఇవ్వబడుతుంది.

4. మక్కా అవిశ్వాసుల స్థితి ఇలా ఉండేది: మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్)ను చూసి, ఆయన వైపు నుండి తమ ముఖాలను త్రిప్పుకునేవారు, ఆయన వారికి ఎదురు పడకుండా ఉండటానికి.

5. ఇక్కడ నీళ్లు అంటే భావం ఏమిటో మేము చెప్పలేము. మనం నీళ్ళు అనే పేరుతో పిలిచే నీళ్ళేనా ఈ నీళ్ళు? లేదా పదార్థం ప్రస్తుత రూపంలోకి మార్చబడటానికి పూర్వం ఉండే దాని ద్రవస్థితికి చిహ్నంగా ఈ పదం వాడబడిందా? ఇక సింహాసనం నీళ్ళపై ఉండేది అనే భావాన్ని నిర్ణయించటం కూడా కష్టమే. బహుశా దీని అర్థం అప్పుడు దేవుని సామ్రాజ్యం నీళ్ళపై ఉండేది అని కావచ్చు.

6. అంటే, సృష్టి లక్ష్యం ప్రపంచంలో మానవుణ్ణి పుట్టించి అతణ్ణి పరీక్షించటం.

فَلَعَلَّكَ تَارِكٌۢ بَعْضَ مَا يُوْحٰۤى اِلَيْكَ وَ
ضَآئِقٌۢ بِهٖ صَدْرُكَ اَنْ يَّقُوْلُوْا لَوْ لَاۤ اُنْزِلَ
عَلَيْهِ كَنْزٌ اَوْ جَآءَ مَعَهٗ مَلَكٌ ؕ اِنَّمَاۤ اَنْتَ
نَذِيْرٌ ؕ وَ اللّٰهُ عَلٰى كُلِّ شَيْءٍ وَّكِيْلٌ ﴿١٢﴾ اَمْ
يَقُوْلُوْنَ افْتَرٰىهُ ؕ قُلْ فَاْتُوْا بِعَشْرِ سُوَرٍ
مِّثْلِهٖ مُفْتَرَيٰتٍ وَّ ادْعُوْا مَنِ اسْتَطَعْتُمْ مِّنْ
دُوْنِ اللّٰهِ اِنْ كُنْتُمْ صٰدِقِيْنَ ﴿١٣﴾ فَاِلَّمْ
يَسْتَجِيْبُوْا لَكُمْ فَاعْلَمُوْۤا اَنَّمَاۤ اُنْزِلَ بِعِلْمِ اللّٰهِ
وَ اَنْ لَّاۤ اِلٰهَ اِلَّا هُوَ ۚ فَهَلْ اَنْتُمْ
مُّسْلِمُوْنَ ﴿١٤﴾ مَنْ كَانَ يُرِيْدُ الْحَيٰوةَ الدُّنْيَا وَ
زِيْنَتَهَا نُوَفِّ اِلَيْهِمْ اَعْمَالَهُمْ فِيْهَا وَ هُمْ
فِيْهَا لَا يُبْخَسُوْنَ ﴿١٥﴾ اُولٰٓئِكَ الَّذِيْنَ لَيْسَ
لَهُمْ فِي الْاٰخِرَةِ اِلَّا النَّارُ ۖ وَ حَبِطَ مَا صَنَعُوْا
فِيْهَا وَ بٰطِلٌ مَّا كَانُوْا يَعْمَلُوْنَ ﴿١٦﴾ اَفَمَنْ كَانَ
عَلٰى بَيِّنَةٍ مِّنْ رَّبِّهٖ وَ يَتْلُوْهُ شَاهِدٌ مِّنْهُ وَ
مِنْ قَبْلِهٖ كِتٰبُ مُوْسٰۤى اِمَامًا وَّ رَحْمَةً ؕ
اُولٰٓئِكَ يُؤْمِنُوْنَ بِهٖ ؕ وَ مَنْ يَّكْفُرْ بِهٖ مِنَ
الْاَحْزَابِ فَالنَّارُ مَوْعِدُهٗ ۚ فَلَا تَكُ فِيْ مِرْيَةٍ
مِّنْهُ ۗ اِنَّهُ الْحَقُّ مِنْ رَّبِّكَ وَلٰكِنَّ اَكْثَرَ
النَّاسِ لَا يُؤْمِنُوْنَ ﴿١٧﴾

**12** ప్రవక్తా! వహీ ద్వారా నీకు తెలుపబడుతూవున్న విషయాలలో దేనినైనా (ప్రకటించకుండా) వదలిపెట్టబోకుము సుమా! వారు "ఈ వ్యక్తిపై ఏదైనా నిధి ఎందుకు దింపబడలేదు?" లేదా "ఇతనితో పాటు దైవదూత ఎవడైనా ఎందుకు రాలేదు?" అని అంటారని నీ మనస్సు బాధ పడకూడదు. నీవు కేవలం హెచ్చరిక చేసేవాడవు. ఆపై అన్నింటికీ అల్లాహ్‌యే బాధ్యుడు.

**13 - 14** ప్రవక్తయే స్వయంగా ఈ గ్రంథాన్ని కల్పించాడని వారు అంటున్నారా? ఇలా అను: "సరే విషయం గనక ఇదే అయితే ఇటువంటి కల్పించ బడిన పది సూరాలను మీరు రచించి తీసుకురండి. అల్లాహ్‌ను తప్ప, (మీ ఆరాధ్య దైవాలలో) ఎవరినైనా సరే సహాయం కొరకు పిలువ గలిగితే పిలుచుకొండి, మీరేగనక (వారిని ఆరాధ్య దైవాలుగా భావించటంలో) సత్యవంతులే అయితే. ఇప్పుడు ఒకవేళ వారు (మీ ఆరాధ్యదైవాలు) మీ సహాయం కొరకు రాలేకపోతే, తెలుసుకోండి, ఈ గ్రంథం అల్లాహ్ ఎరుకతోనే అవతరించిందని, అల్లాహ్ తప్ప నిజమైన దేవుడు మరొకడు లేడని. ఇప్పుడైనా మీరు (ఈ సత్యవిషయాన్ని) శిరసావహిస్తారా?"

**15 - 16** కేవలం ఈ ప్రాపంచిక జీవితాన్నీ, దాని ఆకర్షకాలనూ కోరుకునే వారు చేసిన పనులకు పూర్తి ప్రతిఫలాన్ని మేము వారికి ఇక్కడనే ఇచ్చేస్తాము. ఇందులో వారికి తక్కువచెయ్యటం అంటూ జరుగదు. అయితే పరలోకంలో అటువంటి వారికి అగ్ని తప్ప మరేమీ ఉండదు. (అక్కడ తెలిసిపోతుంది) వారు ప్రపంచంలో చేసినదంతా మట్టిలో కలసిపోయింది అనీ, వారు చేసినదంతా కేవలం మిథ్యఅనీ.

**17** ఒక వ్యక్తి తన ప్రభువు తరఫునుండి వచ్చిన ఒక స్పష్టమైన నిదర్శనాన్ని కలిగి ఉన్నాడు.[8] ఆపై ప్రభువు తరఫు నుండి (ఆ నిదర్శనాన్ని బలపరుస్తూ) ఒక సాక్షి కూడా వచ్చింది.[9] ఆ వ్యక్తికి పూర్వం మార్గదర్శకంగా, కారుణ్యంగా వచ్చిన మూసా గ్రంథం కూడా ఉన్నది. (అటువంటి వ్యక్తి కూడా ప్రపంచ పూజారులు మాదిరిగా ఈ సందేశాన్ని తిరస్కరించగలుగుతాడా?) అటువంటి ప్రజలు దానిని తప్పకుండా విశ్వసిస్తారు. మానవ వర్గాలలో ఏ వర్గమైనా సరే దానిని తిరస్కరిస్తే, దానికి వాగ్దానం చెయ్యబడిన నివాస స్థానం నరకము. కనుక ప్రవక్తా! దాని విషయంలో నీవు ఏ సంశయానికీ లోనుకావద్దు. అది నీ ప్రభువు తరఫు నుండి వచ్చిన సత్యము. కాని చాలా మంది నమ్మరు.

وَ مَنْ اَظْلَمُ مِمَّنِ افْتَرٰی عَلَی اللّٰهِ كَذِبًا ؕ
اُولٰٓئِكَ یُعْرَضُوْنَ عَلٰی رَبِّهِمْ وَ یَقُوْلُ الْاَشْهَادُ
هٰۤؤُلَآءِ الَّذِیْنَ كَذَبُوْا عَلٰی رَبِّهِمْ ۚ اَلَا لَعْنَةُ
اللّٰهِ عَلَی الظّٰلِمِیْنَ ۙ﴿۱۸﴾ الَّذِیْنَ یَصُدُّوْنَ عَنْ
سَبِیْلِ اللّٰهِ وَ یَبْغُوْنَهَا عِوَجًا ؕ وَ هُمْ بِالْاٰخِرَةِ
هُمْ كٰفِرُوْنَ ﴿۱۹﴾ اُولٰٓئِكَ لَمْ یَكُوْنُوْا مُعْجِزِیْنَ فِی
الْاَرْضِ وَ مَا كَانَ لَهُمْ مِّنْ دُوْنِ اللّٰهِ مِنْ
اَوْلِیَآءَ ۘ یُضٰعَفُ لَهُمُ الْعَذَابُ ؕ مَا كَانُوْا وقف لازم
یَسْتَطِیْعُوْنَ السَّمْعَ وَ مَا كَانُوْا یُبْصِرُوْنَ ﴿۲۰﴾
اُولٰٓئِكَ الَّذِیْنَ خَسِرُوْۤا اَنْفُسَهُمْ وَ ضَلَّ عَنْهُمْ
مَّا كَانُوْا یَفْتَرُوْنَ ﴿۲۱﴾ لَا جَرَمَ اَنَّهُمْ فِی
الْاٰخِرَةِ هُمُ الْاَخْسَرُوْنَ ﴿۲۲﴾ اِنَّ الَّذِیْنَ اٰمَنُوْا
وَ عَمِلُوا الصّٰلِحٰتِ وَ اَخْبَتُوْۤا اِلٰی رَبِّهِمْ ۙ
اُولٰٓئِكَ اَصْحٰبُ الْجَنَّةِ ۚ هُمْ فِیْهَا خٰلِدُوْنَ ﴿۲۳﴾
مَثَلُ الْفَرِیْقَیْنِ كَالْاَعْمٰی وَ الْاَصَمِّ وَ الْبَصِیْرِ وَ
السَّمِیْعِ ؕ هَلْ یَسْتَوِیٰنِ مَثَلًا ؕ اَفَلَا تَذَكَّرُوْنَ ﴿۲۴﴾ ع

**18 - 24** అల్లాహ్‌కు అబద్ధం అంటగట్టే వాడికంటే పరమ దుర్మార్గుడెవడు?[10] అటువంటి వారు అల్లాహ్ సమక్షంలో హాజరవుతారు. తమ ప్రభువునకు అబద్ధాన్ని అంటగట్టినవారు వారే అని అపుడు సాక్షులు సాక్ష్యం చెబుతారు. విను! దుర్మార్గుల మీద దేవుని శాపం పడుతుంది.[11] దేవుని మార్గం నుండి ప్రజలను ఆపే దుర్మార్గుల మీద, ఆయన మార్గాన్ని వక్రీకరించ గోరే దుర్మార్గుల మీద, పరలోకాన్ని తిరస్కరించే దుర్మార్గుల మీద–వారు భూమిపై అల్లాహ్‌ను నిస్సహాయునిగా చేయలేక పోయారు. అల్లాహ్‌కు వ్యతిరేకంగా వారిని రక్షించేవాడు కూడా లేకుండా పోయాడు. వారికి ఇప్పుడు రెట్టింపు శిక్షపడుతుంది. ఎందుకంటే వారు ఎవరి మాటనూ వినేవారూ కాదు, స్వయంగా వారికి ఏ విషయమూ తట్టేదీ కాదు. తమను తాము స్వయంగా నష్టానికి గురిచేసుకున్నవారూ, తాము కల్పించిన దానినంతా కోల్పోయిన వారూ వారే. వారు పరలోకంలో అందరికంటే అధికంగా నష్టపోవటం అనివార్యం. ఇక విశ్వసించి సత్కార్యాలు చేసినవారూ, తమ ప్రభువుకే అంకితమై పోయినవారూ నిశ్చయంగా స్వర్గానికి పోతారు. స్వర్గంలోనే వారు శాశ్వతంగా ఉంటారు. ఈ ఉభయపక్షాల పోలిక ఇలా ఉంది: ఒకడు గుడ్డివాడు, చెవిటివాడు. రెండో వాడు చూడగలిగేవాడు, వినగలిగేవాడూ. వారు ఉభయులూ సమానులౌతారా? మీరు (ఈ పోలిక ద్వారా) గుణ పాఠాన్ని గ్రహించరా?

7. అంటే, మరణించిన తరువాత ప్రజలు మళ్ళీ బ్రతకటం అనేది అసంభవం. కాని మేము ఈ అసంభవ విషయాన్ని నమ్మాలని మా బుద్ధులను ఇంద్రజాలానికి గురిచెయ్యటం జరుగుతోంది.

8. అంటే, ఆ వ్యక్తికి స్వయంగా తమ ఉనికిలో, భూమ్యాకాశాల నిర్మాణంలో, సృష్టి వ్యవస్థలో, దాని క్రమబద్ధతలో, ఈ ప్రపంచానికి సృష్టికర్త, ప్రభువు, స్వామి, అధికారి, పరిపాలకుడు అయిన దేవుడు ఒక్కడే అనే విషయాన్ని చాటే స్పష్టమైన నిదర్శనాలు లభిస్తున్నాయి. ఆ నిదర్శనాలనే చూసి మానవుడు తన దేవునికి తన పనులను గురించి లెక్క ఇవ్వటానికి తాను చేసిన దానికి ప్రతిఫలాన్నిగానీ శిక్షనుగానీ పొందటానికీ ఈ జీవితం తరువాత మరొక జీవితం తప్పకుండా ఉండితీరాలి అని కూడా అతని మనస్సు మొదటి నుండే సాక్ష్యం ఇస్తున్నది.

9. అంటే, ఖురాను అది అవతరించి సహజమైన, సహేతుకమైన ఈ నిదర్శనాన్ని సమర్థించింది. వాస్తవానికి విశ్వంలోనూ నీలోనూ ఉన్నటువంటి సూచనలలో నీవు చూసిన యథార్థమే అసలు యథార్థమని కూడా అతనికి తెలియజేసింది.

10. అంటే, అల్లాహ్‌తోపాటు దైవత్వంలోనూ, దాస్యం చేయించుకునే హక్కులోనూ ఇతరులు కూడా భాగస్వాములే అని అనటం లేదా తన దాసులకు మార్గదర్శకత్వం ఇవ్వటం పట్ల వారి మార్గభ్రష్టత్వం పట్ల దేవునికి ఏ విధమైన ఆసక్తి లేదు అని అనటం. ఇంకా దేవుడు గ్రంథాన్నిగానీ, ప్రవక్తనుగానీ మా మార్గదర్శకత్వం కోసం

وَ لَقَدْ اَرْسَلْنَا نُوْحًا اِلٰى قَوْمِهٖۤ ۡ اِنِّىْ لَكُمْ
نَذِيْرٌ مُّبِيْنٌ ﴿۲۵﴾ اَنْ لَّا تَعْبُدُوْۤا اِلَّا اللّٰهَ ؕ اِنِّىْۤ
اَخَافُ عَلَيْكُمْ عَذَابَ يَوْمٍ اَلِيْمٍ ﴿۲۶﴾ فَقَالَ
الْمَلَاُ الَّذِيْنَ كَفَرُوْا مِنْ قَوْمِهٖ مَا نَرٰىكَ اِلَّا
بَشَرًا مِّثْلَنَا وَ مَا نَرٰىكَ اتَّبَعَكَ اِلَّا الَّذِيْنَ
هُمْ اَرَاذِلُنَا بَادِىَ الرَّاْىِ ۚ وَ مَا نَرٰى لَكُمْ
عَلَيْنَا مِنْ فَضْلٍۭ بَلْ نَظُنُّكُمْ كٰذِبِيْنَ ﴿۲۷﴾ قَالَ
يٰقَوْمِ اَرَءَيْتُمْ اِنْ كُنْتُ عَلٰى بَيِّنَةٍ مِّنْ رَّبِّىْ
وَ اٰتٰىنِىْ رَحْمَةً مِّنْ عِنْدِهٖ فَعُمِّيَتْ عَلَيْكُمْ ؕ
اَنُلْزِمُكُمُوْهَا وَ اَنْتُمْ لَهَا كٰرِهُوْنَ ﴿۲۸﴾ وَ يٰقَوْمِ
لَاۤ اَسْـَٔلُكُمْ عَلَيْهِ مَالًا ؕ اِنْ اَجْرِىَ اِلَّا عَلَى
اللّٰهِ وَ مَاۤ اَنَا بِطَارِدِ الَّذِيْنَ اٰمَنُوْا ؕ اِنَّهُمْ
مُّلٰقُوْا رَبِّهِمْ وَ لٰكِنِّىْۤ اَرٰىكُمْ قَوْمًا
تَجْهَلُوْنَ ﴿۲۹﴾ وَ يٰقَوْمِ مَنْ يَّنْصُرُنِىْ مِنَ اللّٰهِ
اِنْ طَرَدْتُّهُمْ ؕ اَفَلَا تَذَكَّرُوْنَ ﴿۳۰﴾ وَ لَاۤ اَقُوْلُ
لَكُمْ عِنْدِىْ خَزَآئِنُ اللّٰهِ وَ لَاۤ اَعْلَمُ الْغَيْبَ وَ
لَاۤ اَقُوْلُ اِنِّىْ مَلَكٌ وَّ لَاۤ اَقُوْلُ لِلَّذِيْنَ
تَزْدَرِىْۤ اَعْيُنُكُمْ لَنْ يُّؤْتِيَهُمُ اللّٰهُ خَيْرًا ؕ اَللّٰهُ
اَعْلَمُ بِمَا فِىْۤ اَنْفُسِهِمْ ۚۖ اِنِّىْۤ اِذًا لَّمِنَ الظّٰلِمِيْنَ ﴿۳۱﴾

**25 - 31** మేము నూహ్‌ను అతని జాతి వైపునకు పంపాము (అప్పుడు కూడా ఇటువంటి పరిస్థితులే నెలకొని ఉన్నాయి). (అతను ఇలా ప్రకటించాడు): "నేను స్పష్టంగా మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను. అల్లాహ్‌ను తప్ప మరెవరినీ ఆరాధించకండి. అలా చేస్తే మీపై ఒక రోజున బాధాకరమైన శిక్ష వచ్చిపడుతుందని నేను భయపడుతున్నాను." సమాధానంగా, అతని మాటను తిరస్కరించిన అతని జాతి సర్దారులు ఇలా అన్నారు: "మా దృష్టిలో నీవు కేవలం మావంటి ఒక మానవుడు తప్ప మరేమీ కావు. అదీగాక మా జాతిలో అల్పులైన వారే ఆలోచించకుండా, అర్థం చేసుకోకుండా నిన్ను అనుసరించటాన్ని మేము చూస్తూనే ఉన్నాము. ఏ విషయంలో కూడా మీరు మా కంటే మెరుగుగా ఉన్నట్లు మాకు కనిపించదు. పైగా మేము నిన్ను అసత్యవాదిగా భావిస్తున్నాము." అతను ఇలా అన్నాడు: "నా జాతి సోదరులారా! కొంచెం ఆలోచించండి. ఒకవేళ నేను నా ప్రభువు తరఫు నుండి వచ్చిన ఒక స్పష్టమైన నిదర్శనంపై నిలబడి ఉంటే, తరువాత ఆయన నాకు తన ప్రత్యేక కారుణ్యభాగ్యాన్ని కూడా కలుగజేస్తే – కాని అది మీకు కనిపించకపోతే, మీరు నమ్మటానికి సిద్ధంగా లేకపోయినా, మేము దానిని మీ నెత్తిపై బలవంతంగా ఎలా రుద్దగలము? నా జాతి సోదరులారా! ఈ పనికి నేను మీ నుండి ధనమేమీ కోరటం లేదు. నాకు ప్రతిఫలం ఇవ్వటం అనేది అల్లాహ్ బాధ్యత. నా మాటను విశ్వసించిన వారిని నేను గెంటివెయ్య లేను. స్వయంగా వారే తమ ప్రభువు సన్నిధానానికి వెళ్ళనున్నారు. అయితే, నేను చూస్తున్నాను. మీరు అజ్ఞానులుగా ప్రవర్తిస్తున్నారు. ప్రజలారా! ఒకవేళ నేను వారిని తరిమివేస్తే, అల్లాహ్ శిక్ష నుండి నన్ను రక్షించటానికి ఎవడు వస్తాడు? మీకు ఈ చిన్న విషయం కూడా అర్థం కాదా? నావద్ద అల్లాహ్ నిధులున్నాయని నేను మీతో చెప్పటంలేదే. నాకు అగోచర జ్ఞానం ఉందని కూడా అనటం లేదే. నేను దైవ దూతనని కూడా ప్రకటించలేదు కదా! మీ కళ్ళు అసహ్యతతో చూస్తున్న వారికి అల్లాహ్ ఏ శుభాన్నీ ఇవ్వలేదని కూడా నేను అనలేదు. వారి మనస్సులలో ఏమి ఉన్నదో అల్లాహ్‌కే బాగా తెలుసు. ఒకవేళ అలా అంటే నేను దుర్మార్గుడనే."

قَالُوْا يٰنُوْحُ قَدْ جٰدَلْتَنَا فَاَكْثَرْتَ جِدَالَنَا
فَاْتِنَا بِمَا تَعِدُنَآ اِنْ كُنْتَ مِنَ الصّٰدِقِيْنَ ﴿۳۲﴾
قَالَ اِنَّمَا يَاْتِيْكُمْ بِهِ اللّٰهُ اِنْ شَآءَ وَ مَآ اَنْتُمْ
بِمُعْجِزِيْنَ ﴿۳۳﴾ وَلَا يَنْفَعُكُمْ نُصْحِيْٓ اِنْ اَرَدْتُّ
اَنْ اَنْصَحَ لَكُمْ اِنْ كَانَ اللّٰهُ يُرِيْدُ اَنْ
يُّغْوِيَكُمْ ؕ هُوَ رَبُّكُمْ ۫ وَ اِلَيْهِ تُرْجَعُوْنَ ﴿۳۴﴾ؕ اَمْ
يَقُوْلُوْنَ افْتَرٰىهُ ؕ قُلْ اِنِ افْتَرَيْتُهٗ فَعَلَيَّ
اِجْرَامِيْ وَ اَنَا بَرِيْٓءٌ مِّمَّا تُجْرِمُوْنَ ﴿۳۵﴾ؒ وَ ع ۳
اُوْحِيَ اِلٰى نُوْحٍ اَنَّهٗ لَنْ يُّؤْمِنَ مِنْ قَوْمِكَ
اِلَّا مَنْ قَدْ اٰمَنَ فَلَا تَبْتَئِسْ بِمَا كَانُوْا
يَفْعَلُوْنَ ﴿۳۶﴾ۚۖ وَ اصْنَعِ الْفُلْكَ بِاَعْيُنِنَا وَوَحْيِنَا وَ
لَا تُخَاطِبْنِيْ فِي الَّذِيْنَ ظَلَمُوْا ۚ اِنَّهُمْ
مُّغْرَقُوْنَ ﴿۳۷﴾ وَ يَصْنَعُ الْفُلْكَ ۫ وَ كُلَّمَا مَرَّ عَلَيْهِ
مَلَاٌ مِّنْ قَوْمِهٖ سَخِرُوْا مِنْهُ ؕ قَالَ اِنْ
تَسْخَرُوْا مِنَّا فَاِنَّا نَسْخَرُ مِنْكُمْ كَمَا تَسْخَرُوْنَ ﴿۳۸﴾ؕ
فَسَوْفَ تَعْلَمُوْنَ ۙ مَنْ يَّاْتِيْهِ عَذَابٌ يُّخْزِيْهِ وَ
يَحِلُّ عَلَيْهِ عَذَابٌ مُّقِيْمٌ ﴿۳۹﴾

**32 – 34** చివరకు వారు ఇలా అన్నారు: "నూహ్! నీవు మాతో వాదించావు. ఎన్నోసార్లు వాదించావు. ఇక చాలు. నీవు గనక సత్యవంతుడవే అయితే ఆ శిక్షను తీసుకురా, దానిని గురించి నీవు మమ్మల్ని బెదిరిస్తున్నావు." నూహ్ ఇలా జవాబు పలికాడు: దానిని అల్లాహ్‌యే తీసుకువస్తాడు, ఆయన గనక కోరితే. దానిని నిరోధించే సామర్థ్యం మీకు లేదు. అల్లాహ్‌యే మిమ్మల్ని మార్గభ్రష్టులుగా చెయ్యాలని సంకల్పించుకున్నప్పుడు,[12] నేను ఇప్పుడు మీ శ్రేయస్సును ఎంతగా కోరినా నా శ్రేయోభిలాష మీకు ఏ లాభాన్నీ చేకూర్చలేదు. ఆయనే మీ ప్రభువు. ఆయన వైపునకే మీరు మరలవలసి ఉన్నది."

**35** ప్రవక్తా! ఇదంతా స్వయంగా అతనే కల్పించాడని వారు అంటున్నారా? వారికి ఇలా చెప్పు: "ఒకవేళ నేనే స్వయంగా దీనిని కల్పించి ఉన్నట్లయితే ఆ నేరము యొక్క బాధ్యత నాపై ఉన్నది. మీరు చేస్తూవున్న నేరం బాధ్యతతో నాకు ఏ సంబంధమూ లేదు."

**36 – 37** నూహ్‌కు వహీద్వారా ఇలా తెలుపబడింది: నీ జాతిలో విశ్వసించేవారు ఇదివరకే విశ్వసించారు. ఇక కొత్తగా విశ్వసించే వారెవరూ లేరు. వారి అకృత్యాలకు బాధపడటం మానుకో. మా పర్యవేక్షణలో మా వహీకి అనుగుణంగా ఒక పడవను తయారుచెయ్యి. చూడు! దుర్మార్గం చేసిన వారిని గురించి నాకు సిఫారసు చెయ్యకు. వారందరూ ఇప్పుడు మునిగిపోయేవారే.

**38 – 39** నూహ్ పడవను తయారుచేస్తున్నాడు. అతని జాతి సర్దారులలో అతనివైపుగా పోయే ప్రతివాడూ అతనిని ఎగతాళి చేసేవాడు. అతను ఇలా అన్నాడు: "మీరు గనక మమ్మల్ని చూసి నవ్వుతూ ఉంటే మేము కూడా మిమ్మల్ని చూసి నవ్వుతున్నాము. అతి త్వరలో స్వయంగా మీకే తెలుస్తుంది. అవమానం పాలుచేసే శిక్ష ఎవరిపై పడుతుందో, తొలగించినా తొలగని ఆపద ఎవరిపై విరుచుకుపడుతుందో."[13]

పంపలేదు. నచ్చిన మార్గాన్ని అవలంబించండి అని మమ్మల్ని స్వతంత్రులుగా విడిచిపెట్టాడు అని అనటం లేదా దేవుడు మమ్మల్ని ఊరికే ఆటగా పుట్టించాడు. ఊరికే నశింపజేస్తాడు. మేము ఆయన ముందు సమాధానం చెప్పుకోవటమనేది ఏదీ లేదు. ప్రతిఫలమూ లేదు, శిక్షా లేదు అని అనటం.

حَتّٰۤى اِذَا جَآءَ اَمْرُنَا وَفَارَ التَّنُّوْرُ ۙ قُلْنَا
احْمِلْ فِيْهَا مِنْ كُلٍّ زَوْجَيْنِ اثْنَيْنِ وَ اَهْلَكَ
اِلَّا مَنْ سَبَقَ عَلَيْهِ الْقَوْلُ وَ مَنْ اٰمَنَ ؕ وَ
مَاۤ اٰمَنَ مَعَهٗۤ اِلَّا قَلِيْلٌ ﴿۴۰﴾ وَ قَالَ ارْكَبُوْا
فِيْهَا بِسْمِ اللّٰهِ مَجْرٖىهَا وَ مُرْسٰىهَا ؕ اِنَّ رَبِّيْ
لَغَفُوْرٌ رَّحِيْمٌ ﴿۴۱﴾ وَ هِيَ تَجْرِيْ بِهِمْ فِيْ مَوْجٍ
كَالْجِبَالِ ۟ وَنَادٰى نُوْحُ ۨابْنَهٗ وَ كَانَ فِيْ
مَعْزِلٍ يّٰبُنَيَّ ارْكَبْ مَّعَنَا وَ لَا تَكُنْ مَّعَ
الْكٰفِرِيْنَ ﴿۴۲﴾ قَالَ سَاٰوِيْۤ اِلٰى جَبَلٍ يَّعْصِمُنِيْ
مِنَ الْمَآءِ ؕ قَالَ لَا عَاصِمَ الْيَوْمَ مِنْ اَمْرِ
اللّٰهِ اِلَّا مَنْ رَّحِمَ ۚ وَ حَالَ بَيْنَهُمَا الْمَوْجُ
فَكَانَ مِنَ الْمُغْرَقِيْنَ ﴿۴۳﴾

**40 - 41** చివరకు మా ఆజ్ఞ వచ్చేసినప్పుడు, పొయ్యి పొంగింది.[14] అప్పుడు మేము ఇలా అన్నాము: "ప్రతి జాతి నుండి ఒక్కొక్క జంటను పడవలో ఎక్కించు. నీ ఇంటివారిని కూడా– ఇదివరకే సూచింపబడిన వ్యక్తులు తప్ప–[15] ఇందులో ఎక్కించు. ఇంకా విశ్వాసులను కూడా ఎక్కించుకో. నూహ్‌తో పాటు విశ్వసించిన వారు చాలా కొద్దిమంది మాత్రమే. నూహ్ ఇలా అన్నాడు: "ఇందులో ఎక్కండి. అల్లాహ్ పేరుతోనే దాని పయనం కూడా, దాని ఆగటం కూడా. నా ప్రభువు క్షమించే వాడూ, కనికరించేవాడూనూ."

**42 - 43** పడవ వారిని తీసుకుని తరలిపోతోంది. ఒక్కొక్క కెరటం పర్వతం మాదిరిగా లేస్తూ ఉంది. నూహ్ కుమారుడు చాలా దూరాన ఉన్నాడు. నూహ్ ఎలుగెత్తి పిలిచాడు: "బాబూ! మాతోపాటు ఎక్కెయ్యి. అవిశ్వాసులతో ఉండకు." అతడు తిరిగి సమాధానం పలికాడు: "నేను ఇప్పుడే ఒక కొండ పైకి ఎక్కుతాను. అది నన్ను నీళ్ళనుండి కాపాడుతుంది." నూహ్ ఇలా అన్నాడు: "అల్లాహ్ తీర్పునుండి ఈనాడు రక్షించే వస్తువు ఏదీ లేదు, అల్లాహ్‌యే ఎవరినైనా కరుణిస్తే తప్ప." ఇంతలోనే ఒక కెరటం వారిద్దరికీ మధ్య అడ్డుగా వచ్చింది. అతడు కూడా మునిగిపోయే వారిలో కలసి పోయాడు.

قرء حفص بفتح الميم وا لما لقالر ٦:٢٤

11. ఉపన్యాస ధోరణినిబట్టి, ఈ విషయం పరలోకంలో వారి విచారణ జరిగేటప్పుడు అనబడుతుంది అనేది సుస్పష్టం.

12. అంటే, ఒకవేళ అల్లాహ్ మీ మొండి వైఖరినీ, మీ దుష్టబుద్ధినీ, పరులకు మేలుచేయటం పట్ల అనాసక్తినీ చూసి రుజుమార్గాన్ని పొందే భాగ్యాన్ని కలిగించకూడదని, మీరు తిరుగాడాలని కోరుకునే భ్రష్టమార్గాలలోనే మీరు తిరిగేలా చెయ్యాలని అల్లాహ్ గనక నిర్ణయిస్తే, ఇక మీ మేలు కొరకు నేను చేసే ప్రయత్నం ఏదీ ఫలించదు.

13. ఇదొక విచిత్రమైన విషయం. దానిని గురించి ఆలోచిస్తే, మానవుడు ప్రపంచపు పై మెరుగులను చూసి ఎలా మోసపోతాడో తెలుస్తుంది. నూహ్ (అస్సలామ్) నదికి చాలా దూరంగా నేలపై తమ పడవను తయారుచేసుకుంటూ ఉండి ఉంటారు. అప్పుడు ప్రజలకు నిజంగా అదొక వెర్రిబాగులవాని పనిగా తోచి ఉంటుంది. వారు నవ్వుతూ, ఈ పెద్దమనిషి పిచ్చితనం చివరకు నేలపై పడవ నడిపేటంతవరకు పోయింది అని అనిఉంటారు. అప్పుడు, కొన్నిరోజుల తరువాత నిజంగానే అక్కడ పడవ నడుస్తుందనే విషయం గురించి ఎవరికీ కల కూడా వచ్చివుండదు.కాని యథార్థానికి సంబంధించిన జ్ఞానం కల వ్యక్తి, రేపు ఇక్కడ పడవ అవసరం ఎందుకు కలుగుతుందో తెలిసిన వ్యక్తి ఈ ప్రజల అజ్ఞానాన్నీ, వారి నిర్లక్ష్యస్థితినీ, వారి మూర్ఖపు తృప్తినీ చూసి ఎంతో నవ్వుకుని ఉంటారు. ఆయన ఇలా అనుకుని ఉంటారు: ఎంత అవివేకులు ఈ ప్రజలు, ఆపద వీరి నెత్తిపై వ్రేలాడుతోంది, అది వచ్చిపడుతుందని నేను వారికి హెచ్చరిక చేశాను. వారి కళ్ళముందే దాని నుండి తప్పించుకునే సన్నాహాలు కూడా చేస్తున్నాను. కాని వారు నిమ్మకు నీరెత్తినట్లు స్థిమితంగా కూర్చున్నారు. పైగా నన్ను పిచ్చివాడు అని అనుకుంటున్నారు.

وَ قِيۡلَ يٰۤاَرۡضُ ابۡلَعِىۡ مَآءَكِ وَ يٰسَمَآءُ
اَقۡلِعِىۡ وَغِيۡضَ الۡمَآءُ وَ قُضِىَ الۡاَمۡرُ وَ اسۡتَوَتۡ
عَلَى الۡجُوۡدِىِّ وَ قِيۡلَ بُعۡدًا لِّلۡقَوۡمِ الظّٰلِمِيۡنَ ﴿۴۴﴾
وَ نَادٰى نُوۡحٌ رَّبَّهٗ فَقَالَ رَبِّ اِنَّ ابۡنِىۡ مِنۡ
اَهۡلِىۡ وَ اِنَّ وَعۡدَكَ الۡحَـقُّ وَ اَنۡتَ اَحۡكَمُ
الۡحٰكِمِيۡنَ ﴿۴۵﴾ قَالَ يٰـنُوۡحُ اِنَّهٗ لَـيۡسَ مِنۡ
اَهۡلِكَ‌ ۚ اِنَّهٗ عَمَلٌ غَيۡرُ صَالِحٍ‌ ‌ۖ فَلَا تَسۡـئَلۡنِ
مَا لَـيۡسَ لَكَ بِهٖ عِلۡمٌ‌ ؕ اِنِّىۡۤ اَعِظُكَ اَنۡ
تَكُوۡنَ مِنَ الۡجٰهِلِيۡنَ ﴿۴۶﴾ قَالَ رَبِّ اِنِّىۡۤ
اَعُوۡذُ بِكَ اَنۡ اَسۡـئَلَكَ مَا لَـيۡسَ لِىۡ بِهٖ عِلۡمٌ‌ ؕ وَ
اِلَّا تَغۡفِرۡ لِىۡ وَتَرۡحَمۡنِىۡۤ اَكُنۡ مِّنَ الۡخٰسِرِيۡنَ ﴿۴۷﴾
قِيۡلَ يٰـنُوۡحُ اهۡبِطۡ بِسَلٰمٍ مِّنَّا وَبَرَكٰتٍ عَلَيۡكَ
وَعَلٰٓى اُمَمٍ مِّمَّنۡ مَّعَكَ‌ ؕ وَاُمَمٌ سَنُمَتِّعُهُمۡ ثُمَّ
يَمَسُّهُمۡ مِّنَّا عَذَابٌ اَلِيۡمٌ ﴿۴۸﴾

**44** ఆజ్ఞ జారీ అయింది: "భూమీ! నీ నీళ్ళన్నీ మింగివెయ్యి. ఆకాశమా! కురవటం మానివెయ్యి." అప్పుడు నీరు భూమిలో ఇంకిపోయింది. తీర్పు జరిగిపోయింది. పడవ జూదీ[16]పై ఆగి పోయింది. "దుర్మార్గుల జాతి తొలగిపోయింది" అని చెప్ప బడింది.

**45 - 47** నూహ్ తన ప్రభువుతో ఇలా మొరపెట్టుకున్నాడు. "ప్రభూ! నా కుమారుడు నా కుటుంబంలోని వాడు. నీ వాగ్దానం నిజమైనటువంటిది, నీవు పాలకులలోకెల్లా గొప్ప వాడవు, ఉత్తముడవు." సమాధానంగా ఇలా అనబడింది: "నూహ్! అతడు నీ కుటుంబంలోనివాడు కాదు. అతడు ఒక చెడిపోయిన పని.[17] కనుక ఏ విషయం యొక్క యథార్థం నీకు తెలియదో ఆ విషయం గురించి నన్ను వేడుకోకు. నిన్ను నీవు అజ్ఞానుల మాదిరిగా చేసుకోకు అని నేను నీకు ఉపదేశి స్తున్నాను." నూహ్ వెంటనే ఇలా విన్నవించుకున్నాడు: "నా ప్రభూ! నాకు తెలియనిదానిని[18] గురించి నిన్ను అడగటం నుండి నేను నీ శరణు వేడుకుంటున్నాను. నీవు గనక నన్ను క్షమించకపోతే, నన్ను కరుణించకపోతే నేను సర్వనాశనం అయిపోతాను."

**48** ఇలా ఆజ్ఞ ఇవ్వబడింది: "నూహ్! దిగిపో. నీపై నీతో పాటు ఉన్న వర్గాలపై మా తరఫునుండి శాంతీ శుభాలూ కలుగుగాక. కొన్ని వర్గాలకు మేము కొంతకాలం వరకు జీవన సామగ్రిని ప్రసాదిస్తాము. తరువాత మా తరఫు నుండి వ్యథా భరితమైన శిక్ష వారిపై పడుతుంది."

---

14. దీనిని గురించి వ్యాఖ్యాతల వివరణలు విభిన్నంగా ఉన్నాయి. కాని మా దృష్టిలో ఖురానులోని స్పష్టమైన పదాల ద్వారా వ్యక్తమయ్యేదే నిజం. అంటే తుఫాను ఒక ప్రత్యేకమైన పొయ్యి నుండి బయలుదేరింది. దాని క్రింది నుండి నీళ్ళ ఊట పైకి ఉబికింది. ఒకవైపు ఆకాశం నుండి ఎడతెగని వర్షం ప్రారంభమయింది. రెండోవైపు నేల నుండి పలుచోట్ల ఊటలు ఉబుకసాగాయి.

15. అంటే, అవిశ్వాసులు అనీ, అల్లాహ్ కారుణ్యానికి అర్హులు కారనీ మొదట్లోనే తెలుపబడిన నీ ఇంటివారిని పడవలో కూర్చోబెట్టకు.

16. జూదీ కొండ కుర్దుస్థాన్ ప్రాంతంలో ఇబ్నె ఉమర్ ద్వీపానికి ఈశాన్య భాగంలో ఉంది. ఈనాడు కూడా ఆ పేరుతోనే ప్రసిద్ధిగాంచింది.

17. ఇది ఒక మనిషి శరీరంలోని కుళ్ళిపోయిన ఒక భాగాన్ని కోసిపారెయ్యాలని డాక్టర్ నిర్ణయించిన విధంగా ఉంది. ఇప్పుడు ఆ రోగి డాక్టర్‌తో ఇలా అంటున్నాడు : ఇది నా శరీరంలోని ఒక భాగం కదా! దానిని ఎందుకు కోసిపారేస్తారు? దానికి సమాధానంగా డాక్టర్ ఇలా అంటున్నాడు: ఇక ఇది మీ శరీర భాగం కాదు,

**49** ప్రవక్తా! ఇవి అగోచర సమాచారములు. వాటిని మేము నీకు వహీ ద్వారా తెలుపుతున్నాము. ఇంతకు పూర్వం నీవుగానీ నీ జాతివారుగానీ వాటిని ఎరుగరు. కనుక ఓర్పు వహించు. ఫలితం భయభక్తులుగలవారినే వరిస్తుంది.[19]

**50 - 52** ఆద్ జాతి వైపునకు మేము వారి సోదరుడైన హూద్‌ను పంపాము. అతను ఇలా అన్నాడు: "నా జాతి సోదరులారా! అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక దేవుడు లేడు. మీరు సృష్టించినటువంటిది కేవలం అబద్ధమే. నా జాతి సోదరులారా! ఈ పనికై మీ నుండి ఏ ప్రతి ఫలాన్నీ కోరను. నాకు ప్రతిఫలం ఇవ్వటం నన్ను సృష్టించిన వాని బాధ్యత-మీరు తెలివిని ఏమాత్రం ఉపయోగించరా? నా జాతి ప్రజలారా! మీ ప్రభువును క్షమాభిక్ష కోరండి. ఆయన వైపునకు పశ్చాత్తాపంతో మరలండి. ఆయన మీకై ఆకాశ ద్వారాలను తెరిచేస్తాడు. ఇప్పుడు మీకున్న శక్తిని మరింత శక్తి ఇచ్చి పెంచు తాడు. దోషులై (ఆరాధనకు) విముఖులు కాకండి."

**53 - 54** వారు ఇలా జవాబు చెప్పారు: హూద్! నీవు మా వద్దకు స్పష్టమైన ఏ సాక్ష్యాన్నీ తీసుకురాలేదు. నీవు చెప్పినంత మాత్రాన మేము మా ఆరాధ్య దైవాలను వదలిపెట్టలేము. నిన్ను మేము విశ్వసించబోవటం లేదు. నీపై మా ఆరాధ్యదైవాలలో ఎవరి దెబ్బ అయినా పడిందని మేము అనుకుంటున్నాము.[20]

**54 - 57** హూద్ ఇలా అన్నాడు: "నేను అల్లాహ్‌ను సాక్షిగా నిలబెడ్తున్నాను. మీరు కూడా సాక్షులుగా ఉండండి, అల్లాహ్‌తో పాటు మీరు ఇతరులను దైవత్వంలో భాగస్వాములుగా చేసిన విషయంతో నాకు ఏ విధమైన సంబంధం లేదు అనేదానికి. మీరంతా కలిసి నాకు వ్యతిరేకంగా చెయ్యవలసినదంతా చేయండి. ఏవిధమైన లోటూ రానివ్వకండి. నాకు కొద్దిపాటి వ్యవధికూడా ఇవ్వకండి. నా నమ్మకం అల్లాహ్ మీదనే. ఆయన నాకూ ప్రభువే, మీకూ ప్రభువే. ఏ ప్రాణి జుట్టు అయినా ఆయన చేతులలో లేకుండా లేదు. నిశ్చయంగా నా ప్రభువు మార్గమే సరియైన మార్గం. మీరు గనక మీ ముఖాలను తిప్పుకోదలిస్తే తిప్పుకోండి. ఏ సందేశంతో నేను మీ వద్దకు పంపబడ్డానో, ఆ సందేశాన్ని నేను మీకు అందజేశాను. ఇక నా ప్రభువు మీ స్థానంలో మరొక జాతిని ప్రభవింపజేస్తాడు. ఆయనకు మీరు ఏమాత్రం హానిచెయ్యలేరు. నిశ్చయంగా నా ప్రభువు ప్రతి వస్తువునూ కనిపెట్టి ఉంటాడు.

تِلْكَ مِنْ اَنْۢبَآءِ الْغَيْبِ نُوْحِيْهَآ اِلَيْكَ ۚ مَا
كُنْتَ تَعْلَمُهَآ اَنْتَ وَ لَا قَوْمُكَ مِنْ قَبْلِ هٰذَا ۛؕ
فَاصْبِرْ ۛؕ اِنَّ الْعَاقِبَةَ لِلْمُتَّقِيْنَ ﴿۴۹﴾ وَ اِلٰى عَادٍ
اَخَاهُمْ هُوْدًا ؕ قَالَ يٰقَوْمِ اعْبُدُوا اللّٰهَ مَا
لَكُمْ مِّنْ اِلٰهٍ غَيْرُهٗ ؕ اِنْ اَنْتُمْ اِلَّا
مُفْتَرُوْنَ ﴿۵۰﴾ يٰقَوْمِ لَاۤ اَسْـَٔلُكُمْ عَلَيْهِ اَجْرًا ؕ
اِنْ اَجْرِىَ اِلَّا عَلَى الَّذِىْ فَطَرَنِىْ ؕ اَفَلَا
تَعْقِلُوْنَ ﴿۵۱﴾ وَ يٰقَوْمِ اسْتَغْفِرُوْا رَبَّكُمْ ثُمَّ
تُوْبُوْۤا اِلَيْهِ يُرْسِلِ السَّمَآءَ عَلَيْكُمْ مِّدْرَارًا
وَّيَزِدْكُمْ قُوَّةً اِلٰى قُوَّتِكُمْ وَ لَا تَتَوَلَّوْا
مُجْرِمِيْنَ ﴿۵۲﴾ قَالُوْا يٰهُوْدُ مَا جِئْتَنَا بِبَيِّنَةٍ وَّ
مَا نَحْنُ بِتَارِكِىْۤ اٰلِهَتِنَا عَنْ قَوْلِكَ وَمَا
نَحْنُ لَكَ بِمُؤْمِنِيْنَ ﴿۵۳﴾ اِنْ نَّقُوْلُ اِلَّا اعْتَرٰىكَ
بَعْضُ اٰلِهَتِنَا بِسُوْٓءٍ ؕ قَالَ اِنِّىْۤ اُشْهِدُ اللّٰهَ وَ
اشْهَدُوْۤا اَنِّىْ بَرِىْٓءٌ مِّمَّا تُشْرِكُوْنَ ﴿۵۴﴾ مِنْ
دُوْنِهٖ فَكِيْدُوْنِىْ جَمِيْعًا ثُمَّ لَا تُنْظِرُوْنِ ﴿۵۵﴾ اِنِّىْ
تَوَكَّلْتُ عَلَى اللّٰهِ رَبِّىْ وَ رَبِّكُمْ ؕ مَا مِنْ دَآبَّةٍ
اِلَّا هُوَ اٰخِذٌۢ بِنَاصِيَتِهَا ؕ اِنَّ رَبِّىْ عَلٰى صِرَاطٍ
مُّسْتَقِيْمٍ ﴿۵۶﴾ فَاِنْ تَوَلَّوْا فَقَدْ اَبْلَغْتُكُمْ مَّاۤ
اُرْسِلْتُ بِهٖۤ اِلَيْكُمْ ؕ وَ يَسْتَخْلِفُ رَبِّىْ قَوْمًا
غَيْرَكُمْ ۚ وَ لَا تَضُرُّوْنَهٗ شَيْـًٔا ؕ اِنَّ رَبِّىْ عَلٰى
كُلِّ شَىْءٍ حَفِيْظٌ ﴿۵۷﴾

معانقة ٩ الوقف على فاصبر

وَ لَمَّا جَآءَ اَمْرُنَا نَجَّيْنَا هُوْدًا وَّ الَّذِيْنَ اٰمَنُوْا
مَعَهٗ بِرَحْمَةٍ مِّنَّا ۚ وَ نَجَّيْنٰهُمْ مِّنْ عَذَابٍ
غَلِيْظٍ ﴿٥٨﴾ وَ تِلْكَ عَادٌ ۟ۙ جَحَدُوْا بِاٰيٰتِ رَبِّهِمْ
وَ عَصَوْا رُسُلَهٗ وَ اتَّبَعُوْۤا اَمْرَ كُلِّ جَبَّارٍ
عَنِيْدٍ ﴿٥٩﴾ وَ اُتْبِعُوْا فِيْ هٰذِهِ الدُّنْيَا لَعْنَةً وَّ
يَوْمَ الْقِيٰمَةِ ؕ اَلَاۤ اِنَّ عَادًا كَفَرُوْا رَبَّهُمْ
اَلَا بُعْدًا لِّعَادٍ قَوْمِ هُوْدٍ ﴿٦٠﴾ وَ اِلٰى ثَمُوْدَ
اَخَاهُمْ صٰلِحًا ۘ قَالَ يٰقَوْمِ اعْبُدُوا اللّٰهَ مَا
لَكُمْ مِّنْ اِلٰهٍ غَيْرُهٗ ؕ هُوَ اَنْشَاَكُمْ مِّنَ
الْاَرْضِ وَ اسْتَعْمَرَكُمْ فِيْهَا فَاسْتَغْفِرُوْهُ ثُمَّ
تُوْبُوْۤا اِلَيْهِ ؕ اِنَّ رَبِّيْ قَرِيْبٌ مُّجِيْبٌ ﴿٦١﴾

**58** తరువాత మా ఆజ్ఞ వచ్చేసినప్పుడు, మేము మా కారుణ్యం ద్వారా హూద్‌కూ, అతనితో పాటు విశ్వసించిన ప్రజలకూ విముక్తిని ప్రసాదించాము. ఒక కఠిన శిక్ష నుండి వారిని రక్షించాము.

**59 - 60** వీరే ఆద్ జాతివారు. వారు తమ ప్రభువు ఆయతులను తిరస్కరించారు. ఆయన పంపిన ప్రవక్తల మాటలను వారు పాటించలేదు. అధికారంకల నిరంకుశుడైన ప్రతి సత్య విరోధికి విధేయత చూపారు. చివరకు ఈ లోకంలో కూడా వారిపై శాపం పడింది. ప్రళయం నాడు కూడా పడుతుంది. విను! ఆద్ జాతి వారు తమ ప్రభువును తిరస్కరించారు. విను! ఆద్, హూద్ జాతుల ప్రజలు దూరంగా విసరివేయబడ్డారు.

**61** సమూద్ జాతి వద్దకు మేము వారి సోదరుడైన సాలిహ్‌ను పంపాము. అతను ఇలా హితోపదేశం చేశాడు: "నా జాతి ప్రజలారా! అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక దేవుడు లేడు. ఆయనే మిమ్మల్ని భూమి నుండి సృష్టించాడు. ఇక్కడ మీకు నివాసం ఏర్పాటు చేశాడు. కనుక మీరు ఆయనను క్షమాభిక్ష కోరండి. ఆయన వైపునకు పశ్చాత్తాపంతో మరలిరండి. నిశ్చయంగా నా ప్రభువు దగ్గరలోనే ఉన్నాడు. ఆయన ప్రార్థనలకు సమాధానం కూడా ఇస్తాడు."[21]

ఎందుకంటే ఇది కుళ్ళిపోయింది. కనుక సజ్జనుడైన ఒక తండ్రితో అయోగ్యుడైన ఆయన కుమారుని గురించి, ఇదొక చెడిపోయినపని అని అనే దాని భావం ఏమిటంటే, నీవు అతణ్ణి పెంచటానికి పడిన శ్రమ అంతా వృధా అయిపోయింది. ఈ పని చెడిపోయింది.

18. అంటే నాకు సరైనదని తెలియనిదానిని గురించి అడగటం నుండి.

19. అంటే, నూహ్ (అస్సలామ్) మాటే, ఆయన సహచరుల మాటే గెలిచినవిధంగా మీ మాటా మీ సహచరుల మాట కూడా గెలుస్తుంది. కనుక ఇప్పుడు మీపై వచ్చిపడే కష్టాలకు నిరాశ చెందకండి. ధైర్యంతో మీ పనిచేస్తూ ముందుకు నడవండి.

20. అంటే, నీవు ఏ దేవిపట్లనైనా లేక ఏ దేవతపట్లనైనా లేక ఏ హజ్రత్‌ల పట్లనైనా అగౌరవంగా ప్రవర్తించావేమో, దానికి శిక్షనే నీవు ఇప్పుడు అనుభవిస్తున్నావు, అందువల్లనే పిచ్చి పిచ్చి మాటలు పలుకుతున్నావు. నిన్నటి వరకు నీవు గౌరవంగా బ్రతికిన పట్టణాలలోనే ఈనాడు నిన్ను తిట్లతో, రాళ్ళతో సత్కరిస్తున్నారు.

21. ఈ సంగ్రహ వాక్యంలో దైవప్రవక్త హజ్రత్ సాలిహ్ (అస్సలామ్) అన్నిరకాల షిర్కును కూకటివ్రేళ్ళతో పెకిలించివేశారు. విశ్వదేవుని పరిశుద్ధ సాన్నిధ్యం సామాన్య ప్రజలకు అందుబాటులో లేదు. ఆయన దర్బారుకు సామాన్య మానవుడు ఎలా పోగలడు? అక్కడ దాకా ప్రార్థనలు చేరటం, వాటికి సమాధానం లభించటం ఏ విధంగానూ సాధ్యం కాదు. దీనికొరకు పవిత్రాత్మల ఆధారాన్ని అన్వేషించాలి. పై వరకు మొక్కుబడులను, అర్చనలను, అర్జీలను పంపే చాతుర్యం గల, తంత్రాన్ని ఎరిగిన మతగురువుల సహాయం పొందాలి అని

قَالُوْا يٰصٰلِحُ قَدْ كُنْتَ فِيْنَا مَرْجُوًّا قَبْلَ هٰذَآ
اَتَنْهٰنَآ اَنْ نَّعْبُدَ مَا يَعْبُدُ اٰبَآؤُنَا وَ اِنَّنَا لَفِيْ
شَكٍّ مِّمَّا تَدْعُوْنَآ اِلَيْهِ مُرِيْبٍ ﴿٦٢﴾ قَالَ يٰقَوْمِ
اَرَءَيْتُمْ اِنْ كُنْتُ عَلٰى بَيِّنَةٍ مِّنْ رَّبِّيْ وَ
اٰتٰىنِيْ مِنْهُ رَحْمَةً فَمَنْ يَّنْصُرُنِيْ مِنَ اللّٰهِ اِنْ
عَصَيْتُهٗ فَمَا تَزِيْدُوْنَنِيْ غَيْرَ تَخْسِيْرٍ ﴿٦٣﴾ وَ
يٰقَوْمِ هٰذِهٖ نَاقَةُ اللّٰهِ لَكُمْ اٰيَةً فَذَرُوْهَا
تَاْكُلْ فِيْٓ اَرْضِ اللّٰهِ وَ لَا تَمَسُّوْهَا بِسُوْٓءٍ
فَيَاْخُذَكُمْ عَذَابٌ قَرِيْبٌ ﴿٦٤﴾ فَعَقَرُوْهَا فَقَالَ
تَمَتَّعُوْا فِيْ دَارِكُمْ ثَلٰثَةَ اَيَّامٍ ؕ ذٰلِكَ وَعْدٌ
غَيْرُ مَكْذُوْبٍ ﴿٦٥﴾

**62** వారు ఇలా అన్నారు: "సాలిహ్! నిన్నటివరకు మా మధ్య ఉన్న నీమీద మేము పెద్ద పెద్ద ఆశలు పెట్టుకున్నాము. మా తాత ముత్తాతలు పూజించిన దేవుళ్ళను పూజించకుండా మమ్మల్ని ఆపదలచుకున్నావా? నీవు ఏ మార్గం వైపునకు మమ్మల్ని పిలుస్తున్నావో, ఆ మార్గాన్ని గురించి మాకు పెద్ద అనుమానం ఉన్నది. అది మమ్మల్ని కలతకు గురిచేసింది."

**63 - 64** సాలిహ్ ఇలా అన్నాడు: "నా జాతి సోదరులారా! కొంచెం ఈ విషయాన్ని గురించి కూడా ఆలోచించారా? ఒకవేళ నేను నా ప్రభువు తరఫు నుండి వచ్చిన ఒక స్పష్టమైన నిదర్శనాన్ని కలిగివుంటే, ఇంకా ఆయన నాకు తన కారుణ్యాన్ని కూడా ప్రసాదించి ఉంటే, ఆ తరువాత ఒకవేళ నేను అల్లాహ్‌కు అవిధేయత చూపితే ఆయన పట్టునుండి నన్ను ఎవడు రక్షిస్తాడు? మీరు నాకు ఏ విధంగా ఉపయోగపడతారు, నన్ను ఇంకా నష్టంలోకి నెట్టటానికి తప్ప? నా జాతి ప్రజలారా! చూడండి! అల్లాహ్ యొక్క ఈ ఒంటె మీకు ఒక నిదర్శనంగా ఉంది. దానిని అల్లాహ్ భూమిపై మేయటానికి స్వేచ్ఛగా వదలి పెట్టండి. దాని జోలికి ఏమాత్రం పోకండి. ఒకవేళ అలాచేస్తే దైవశిక్ష మీపై పడటానికి ఎంతోసేపు పట్టదు."

**65** కాని వారు ఒంటెను చంపివేశారు. అప్పుడు సాలిహ్ వారిని ఇలా హెచ్చరించాడు: "ఇంకా మూడురోజులు మాత్రం మీరు మీ ఇళ్ళల్లో హాయిగా గడపండి. ఈ గడువు అబద్ధం కాబోదు."

ముష్రిక్కులు భావిస్తారు. వారిని కొందరు తెలివిగలవాళ్ళు ఆ విషయంలో ప్రోత్సహిస్తారు. ఈ అపార్థమే, ఈ అపోహయే దాసునికీ దేవునికీ మధ్య చిన్నా పెద్దా దేవుళ్ళకూ సిఫారసుదారుల ఒక పెద్ద గుంపునూ నిలబెట్టింది. హజ్రత్ సాలిహ్ (అస్సలామ్) ఈ అజ్ఞాన విగ్రహాన్ని కేవలం రెండు పదాలతో పగలగొట్టేశారు. ఒకటి : అల్లాహ్ దగ్గరలోనే ఉన్నాడు. రెండు : ఆయన ప్రార్థనలకు సమాధానం పలుకుతాడు. అంటే, ఆయన మీకు దూరంగా ఉన్నాడు అనే మీ అభిప్రాయమూ తప్పే. మీరు నేరుగా ఆయనను పిలిచి మీ ప్రార్థనలకు సమాధానాన్ని పొందలేరు అనేది కూడా తప్పే. మీలో ప్రతి వ్యక్తీ తన వద్దనే ఆయనను పొందగలుగుతాడు. ఆయనతో గుసగుస లాడగలుగుతాడు. తన అర్జీలను ప్రత్యక్షంగా ఆయన సన్నిధానంలో సమర్పించుకోగలుగుతాడు. ఆయన నేరుగా తన ప్రతి దాసుని ప్రార్థనలకు సమాధానాన్ని కూడా స్వయంగానే ఇస్తాడు. కనుక విశ్వప్రభువు యొక్క బహిరంగ దర్బారు ప్రతి నిత్యం ప్రతి వ్యక్తి కొరకు తెరుచుకునే ఉంటుంది. ప్రతి వ్యక్తికీ దగ్గరలోనే ఉంటుంది. అలాంటప్పుడు దాని కొరకు అవివేకంలో పడి వేరే ఆధారాలనూ, మధ్యవర్తులనూ, సిఫారసుదారులనూ వెతుకుతూ తిరుగుతారేమిటి?

فَلَمَّا جَآءَ اَمْرُنَا نَجَّيْنَا صٰلِحًا وَّ الَّذِيْنَ اٰمَنُوْا
مَعَهٗ بِرَحْمَةٍ مِّنَّا وَ مِنْ خِزْيِ يَوْمِىِٕذٍ ؕ اِنَّ
رَبَّكَ هُوَ الْقَوِيُّ الْعَزِيْزُ ﴿٦٦﴾ وَ اَخَذَ الَّذِيْنَ
ظَلَمُوا الصَّيْحَةُ فَاَصْبَحُوْا فِيْ دِيَارِهِمْ
جٰثِمِيْنَ ﴿٦٧﴾ كَاَنْ لَّمْ يَغْنَوْا فِيْهَا ؕ اَلَاۤ اِنَّ
ثَمُوْدَا۟ كَفَرُوْا رَبَّهُمْ ؕ اَلَا بُعْدًا لِّثَمُوْدَ ﴿٦٨﴾ وَ ع ٨ ٦
لَقَدْ جَآءَتْ رُسُلُنَاۤ اِبْرٰهِيْمَ بِالْبُشْرٰى قَالُوْا
سَلٰمًا ؕ قَالَ سَلٰمٌ فَمَا لَبِثَ اَنْ جَآءَ بِعِجْلٍ
حَنِيْذٍ ﴿٦٩﴾ فَلَمَّا رَاٰۤ اَيْدِيَهُمْ لَا تَصِلُ اِلَيْهِ
نَكِرَهُمْ وَ اَوْجَسَ مِنْهُمْ خِيْفَةً ؕ قَالُوْا لَا
تَخَفْ اِنَّاۤ اُرْسِلْنَاۤ اِلٰى قَوْمِ لُوْطٍ ﴿٧٠﴾ وَامْرَاَتُهٗ
قَآىِٕمَةٌ فَضَحِكَتْ فَبَشَّرْنٰهَا بِاِسْحٰقَ ۙ وَ مِنْ
وَّرَآءِ اِسْحٰقَ يَعْقُوْبَ ﴿٧١﴾ قَالَتْ يٰوَيْلَتٰۤى ءَاَلِدُ
وَ اَنَا عَجُوْزٌ وَّ هٰذَا بَعْلِيْ شَيْخًا ؕ اِنَّ هٰذَا
لَشَيْءٌ عَجِيْبٌ ﴿٧٢﴾ قَالُوْۤا اَتَعْجَبِيْنَ مِنْ اَمْرِ
اللّٰهِ رَحْمَتُ اللّٰهِ وَ بَرَكٰتُهٗ عَلَيْكُمْ اَهْلَ
الْبَيْتِ ؕ اِنَّهٗ حَمِيْدٌ مَّجِيْدٌ ﴿٧٣﴾

**66 - 68** చివరకు మా తీర్పు సమయం వచ్చేసినప్పుడు, మేము మా కారుణ్యంతో సాలిహ్‌నూ, అతనితో పాటు విశ్వసించిన వారినీ రక్షించాము. ఆ దినపు పరాభవం నుండి వారిని కాపాడాము. నిస్సంశయంగా నీ ప్రభువు మాత్రమే శక్తిమంతుడూ ప్రాబల్యం కలవాడూను. ఇక దుర్మార్గానికి పాల్పడిన వారు, వారిపై ఒక పెద్ద ప్రేలుడు విరుచుకుపడింది. అప్పుడు వారు తమ గృహాలలో చలనమూ చైతన్యమూ లేకుండా పడిపోయారు, అసలు వారు ఎప్పుడూ అక్కడ నివసించనే లేదన్నట్లుగా. విను! సమూద్ జాతివారు తమ ప్రభువును తిరస్కరించారు. విను! సమూద్ జాతివారు దూరంగా విసిరి వెయ్యబడ్డారు!

**69 - 73** చూడు! ఇబ్రాహీమ్ వద్దకు మా దూతలు శుభవార్తను తీసుకుని చేరారు. "మీకు సలామ్" అని వారు అన్నారు. "మీకూ సలామ్" అని ఇబ్రాహీమ్ బదులుపలికాడు. ఆ తరువాత కొద్దిసేపటికే ఇబ్రాహీమ్ వేపిన ఆవుదూడను (వారి ఆతిధ్యానికి) తీసుకొని వచ్చాడు.[22] కాని వారి చేతులు భోజనం మీదకు పోకుండా ఉండటాన్ని[23] చూసి ఆయన వారిని శంకించాడు. మనస్సులో వారంటే భయపడసాగాడు. వారు ఇలా అన్నారు: "భయపడకు, మేము లూత్ జాతి వైపునకు పంపబడ్డాము." ఇబ్రాహీము భార్య కూడా అక్కడ నిలబడి ఉన్నది. ఆమె ఇది విని నవ్వింది. అప్పుడు మేము ఆమెకు ఇస్‌హాఖ్ శుభవార్తనూ, ఇస్‌హాఖ్ తరువాత యాఖూబ్ శుభవార్తను అంద జేశాము. ఆమె ఇలా అన్నది: "అయ్యో నా దౌర్భాగ్యం![24] నాకు ఇప్పుడా పిల్లలు పుట్టేది? నేనూ ముసలిదాన్నే! నా భర్తకూడా ముసలివారే. ఇది చాలా విచిత్రమైన విషయం." దైవదూతలు ఇలా అన్నారు: "అల్లాహ్ ఆజ్ఞ పట్ల ఆశ్చర్యపడుతున్నావా? ఇబ్రాహీము కుటుంబ సభ్యులారా! అల్లాహ్ కారుణ్యమూ, ఆయన శుభాశీస్సులూ మీపై ఉన్నాయి. నిశ్చయంగా అల్లాహ్ స్తోత్రానికి ఎంతో అర్హుడూ, మహాఘనత కలవాడూ."

22. దీనిద్వారా తెలిసేది ఏమిటంటే, దైవదూతలు హజ్రత్ ఇబ్రాహీము (అస్సలామ్) వద్దకు మానవరూపంలో వెళ్ళారు. మొదట వారు తమను పరిచయం చేసుకోలేదు. అందుకని హజ్రత్ ఇబ్రాహీము వారిని కొత్త అతిథులు అని భావించారు. వారు వచ్చిన వెంటనే భోజనం ఏర్పాటు చేశారు.
23. దీనిద్వారా వారు దైవదూతలని హజ్రత్ ఇబ్రాహీము (అస్సలామ్) గ్రహించారు.

فَلَمَّا ذَهَبَ عَنْ اِبْرٰهِيْمَ الرَّوْعُ وَجَآءَتْهُ
الْبُشْرٰى يُجَادِلُنَا فِيْ قَوْمِ لُوْطٍ ﴿٧٤﴾ اِنَّ اِبْرٰهِيْمَ
لَحَلِيْمٌ اَوَّاهٌ مُّنِيْبٌ ﴿٧٥﴾ يٰۤاِبْرٰهِيْمُ اَعْرِضْ عَنْ
هٰذَا ۚ اِنَّهٗ قَدْ جَآءَ اَمْرُ رَبِّكَ ۚ وَ اِنَّهُمْ
اٰتِيْهِمْ عَذَابٌ غَيْرُ مَرْدُوْدٍ ﴿٧٦﴾ وَ لَمَّا جَآءَتْ
رُسُلُنَا لُوْطًا سِیْٓءَ بِهِمْ وَ ضَاقَ بِهِمْ ذَرْعًا
وَّ قَالَ هٰذَا يَوْمٌ عَصِيْبٌ ﴿٧٧﴾ وَ جَآءَهٗ قَوْمُهٗ
يُهْرَعُوْنَ اِلَيْهِ ؕ وَ مِنْ قَبْلُ كَانُوْا يَعْمَلُوْنَ
السَّيِّاٰتِ ؕ قَالَ يٰقَوْمِ هٰۤؤُلَآءِ بَنَاتِيْ هُنَّ
اَطْهَرُ لَكُمْ فَاتَّقُوا اللّٰهَ وَ لَا تُخْزُوْنِ فِيْ ضَيْفِيْ ؕ
اَلَيْسَ مِنْكُمْ رَجُلٌ رَّشِيْدٌ ﴿٧٨﴾ قَالُوْا لَقَدْ
عَلِمْتَ مَا لَنَا فِيْ بَنٰتِكَ مِنْ حَقٍّ ۚ وَ اِنَّكَ
لَتَعْلَمُ مَا نُرِيْدُ ﴿٧٩﴾ قَالَ لَوْ اَنَّ لِيْ بِكُمْ قُوَّةً اَوْ
اٰوِيْۤ اِلٰى رُكْنٍ شَدِيْدٍ ﴿٨٠﴾ قَالُوْا يٰلُوْطُ اِنَّا
رُسُلُ رَبِّكَ لَنْ يَّصِلُوْۤا اِلَيْكَ فَاَسْرِ بِاَهْلِكَ
بِقِطْعٍ مِّنَ الَّيْلِ وَ لَا يَلْتَفِتْ مِنْكُمْ اَحَدٌ اِلَّا
امْرَاَتَكَ ؕ اِنَّهٗ مُصِيْبُهَا مَاۤ اَصَابَهُمْ ؕ اِنَّ
مَوْعِدَهُمُ الصُّبْحُ ؕ اَلَيْسَ الصُّبْحُ بِقَرِيْبٍ ﴿٨١﴾

**74 - 76** తరువాత ఇబ్రాహీము యొక్క భయం తొలగి పోయినప్పుడు (సంతానం శుభవార్తవల్ల) అతని మనస్సు ఆనందపడినప్పుడు, అతను లూత్ జాతి వారి వ్యవహారం గురించి నాతో పోట్లాడసాగాడు.[25] యథార్థంగా ఇబ్రాహీము సహనశీలుడూ, మృదుహృదయుడూ అయిన మనిషి. అన్ని పరిస్థితులలోనూ మా వైపునకు మరలేవాడు. (చివరకు మా దూతలు అతనితో అన్నారు): "ఇబ్రాహీమూ! దీన్ని మానుకో, నీ ప్రభువు ఆజ్ఞ ప్రకటించబడింది. ఇక వారిపై ఆ శిక్ష వచ్చి పడటం తథ్యం. అది ఎవరు మరలించినా మరలదు."

**77 - 81** మా దూతలు లూత్ వద్దకు వచ్చినప్పుడు, వారి రాకకు అతను చాలా భయపడ్డాడు. అతని హృదయం క్రుంగి పోయింది. "ఈ రోజు పెద్ద ఆపద రోజు"[26] అని అతను అనసాగాడు. (ఈ అతిథులు రాగానే) అతని జాతి ప్రజలు అప్రయత్నంగా అతని ఇంటి వైపునకు పరుగెత్తారు. మొదటి నుండీ వారు ఇటువంటి నీచపు పనులకే అలవాటుపడ్డవారు. లూత్ వారితో ఇలా అన్నాడు: "సోదరులారా! ఇదిగో, నా కూతుళ్ళు ఉన్నారు. వీరు మీకు ఎక్కువ పరిశుద్ధులు అయిన వారు.[27] కొంచెమన్నా దేవునికి భయ పడండి. నా అతిథుల విషయంలో నన్ను అవమానం పాలు చెయ్యకండి. మీలో ఒక్కడైనా మంచివాడు లేడా?" వారు ఇలా సమాధానం చెప్పారు: "నీ కూతుళ్ళు మాకు అవసరం లేదని నీకు బాగా తెలుసుకదా! అసలు మేము కోరేది ఏమిటో కూడా నీకు తెలుసు." లూత్ ఇలా అన్నాడు: "మీకు బుద్ధి చెప్పే బలం నాకు ఉంటే ఎంత బాగుండేది! లేదా శరణు పొందటానికి ఏదైనా పటిష్ఠమైన ఆధారం అయినా ఉంటే ఎంత బాగుండేది!" అప్పుడు దైవదూతలు అతనితో ఇలా అన్నారు: "లూత్! మేము నీ ప్రభువు పంపిన దూతలము. వారు నీకు ఏమాత్రం కీడు చెయ్యలేరు. కనుక కొంతరాత్రి ఉండగానే నీవు నీ ఇంటివారిని తీసుకుని బయలుదేరు. చూడు! మీలో ఎవరూ వెనక్కి తిరిగి చూడకూడదు. కాని నీ భార్య (నీతో రాకూడదు). ఎందుకంటే, వారికి ఏది జరుగనున్నదో అదే ఆమెకూ జరుగుతుంది. వారి వినాశానికి ఉదయ సమయం నిర్ణయం అయింది – ఉదయం కావటానికి ఇంకెంత ఆలస్యం ఉందని!"

فَلَمَّا جَآءَ اَمْرُنَا جَعَلْنَا عَالِيَهَا سَافِلَهَا وَ
اَمْطَرْنَا عَلَيْهَا حِجَارَةً مِّنْ سِجِّيْلٍ ۙ
مَّنْضُوْدٍ ﴿۸۲﴾ مُّسَوَّمَةً عِنْدَ رَبِّكَ ؕ وَ مَا هِيَ
مِنَ الظّٰلِمِيْنَ بِبَعِيْدٍ ﴿۸۳﴾ وَ اِلٰى مَدْيَنَ النصف
اَخَاهُمْ شُعَيْبًا ؕ قَالَ يٰقَوْمِ اعْبُدُوا اللّٰهَ مَا
لَكُمْ مِّنْ اِلٰهٍ غَيْرُهٗ ؕ وَ لَا تَنْقُصُوا الْمِكْيَالَ
وَالْمِيْزَانَ اِنِّيْۤ اَرٰىكُمْ بِخَيْرٍ وَّ اِنِّيْۤ اَخَافُ
عَلَيْكُمْ عَذَابَ يَوْمٍ مُّحِيْطٍ ﴿۸۴﴾ وَ يٰقَوْمِ اَوْفُوا
الْمِكْيَالَ وَالْمِيْزَانَ بِالْقِسْطِ وَ لَا تَبْخَسُوا
النَّاسَ اَشْيَآءَهُمْ وَ لَا تَعْثَوْا فِي الْاَرْضِ
مُفْسِدِيْنَ ﴿۸۵﴾ بَقِيَّتُ اللّٰهِ خَيْرٌ لَّكُمْ اِنْ كُنْتُمْ
مُّؤْمِنِيْنَ ۚ وَ مَاۤ اَنَا عَلَيْكُمْ بِحَفِيْظٍ ﴿۸۶﴾

**82 - 83** తరువాత మా తీర్పు సమయం వచ్చేసినప్పుడు, మేము ఆ పట్టణాన్ని తల్లక్రిందులు చేసేశాము. దానిమీద కాల్చిన మట్టితో చేయబడిన రాళ్ళు ఎడతెగకుండా కురిపించాము. వాటిలోని ప్రతి రాయికీ గుర్తు[28] నీ ప్రభువు వద్ద వేయబడింది. ఈ శిక్ష దుర్మార్గులకు ఎంతో దూరంలో లేదు.

**84 - 86** మద్‌యన్ ప్రజల వైపునకు మేము వారి సోదరుడైన షుఐబ్‌ను పంపాము. అతను ఇలా అన్నాడు: "నా జాతి ప్రజలారా! అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక దేవుడు ఎవ్వడూ లేడు. కొలుచుటలో, తూచుటలో తక్కువ చెయ్యకండి. నేను ఈనాడు మిమ్మల్ని మంచిస్థితిలో చూస్తున్నాను. కాని రేపు మీపైకి ఒక దినం రానున్నది అనీ, దాని శిక్ష మీ అందరినీ చుట్టుముట్టుతుంది అనీ నేను భయపడుతున్నాను. నా జాతి సోదరులారా! కచ్చితంగా, న్యాయంగా పూర్తిగా కొలవండి, తూచండి. ప్రజలకు వారి వస్తువులను తక్కువచేసి ఇవ్వకండి. భూమిపై సంక్షోభాన్ని వ్యాపింపజేస్తూ తిరగకండి. అల్లాహ్ ప్రసాదించిన మిగులే (అందరికీ న్యాయంగా ఇచ్చిన తరువాత మిగిలినది) మీకు మేలైనది, మీరు విశ్వాసులే అయితే. ఏమైనప్పటికీ, నేను మీపై కావలి వాణ్ణి మట్టుకు కాను."

24. హ్రజత్ సారా నిజానికి ఆ వార్తకు సంతోషపడటానికి బదులు దానిని ఆమె దురదృష్టంగా భావించారు అని దీని భావం కాదు. అసలు ఇవి స్త్రీలు సాధారణంగా ఆశ్చర్యపడే సమయంలో ఉపయోగించే పదాలు.

25. 'పోట్లాట' అనే పదం, ఈ సందర్భంలో హ్రజత్ ఇబ్రాహీము (అస్సలామ్) అల్లాహ్‌తో కలిగివున్న అత్యంత ప్రేమానురాగాల సన్నిహిత సంబంధాన్ని స్పష్టం చేస్తుంది. ఈ పదం ద్వారా ఈ చిత్రం కళ్ళముందు తిరుగుతుంది: దాసునికీ దేవునికీ మధ్య చాలాసేపు వాద ప్రతివాదాలు జరుగుతాయి. లూత్ జాతిపై నుండి శిక్షను ఏ విధంగానైనా తప్పించాలని దాసుడు మరీ మరీ కోరుతున్నాడు. దేవుడు దానికి సమాధానంగా, ఈ జాతిలో ఇప్పుడు మంచితనం అనేదే లేదు. మన్నించటానికి వీలులేని విధంగా హద్దులు మీరి అది నేరాలు చేసింది అని అంటున్నాడు. కాని దాసుడు మళ్ళీ ఇదే అంటూ పోతాడు : "స్వామీ! కొంచెం మంచితనం అయినా ఆ జాతిలో మిగిలివుంటే, దానికి మరికొంత గడువు ఇవ్వు. బహుశా ఆ మంచితనం ఫలిస్తుందేమో!"

26. ఈ దైవదూతలు అందమైన బాలుర రూపంలో హ్రజత్ లూత్ (అస్సలామ్)వద్దకు వెళ్ళారు. వారు దైవదూతలని హ్రజత్ లూత్ (అస్సలామ్)కు తెలియదు. అందువల్ల ఈ అతిథుల ఆగమనం కారణంగా ఆయనకు తీవ్రమైన మనస్తాపం, కలవరపాటూ కలిగాయి. తన జాతి ఎంత దుర్నీతికీ, సిగ్గులేనితనానికీ, దుశ్శీలానికీ గురిఅయిందో ఆయనకు తెలుసు.

27. హ్రజత్ లూత్ (అస్సలామ్) వారి ముందు తన కూతుళ్ళను వ్యభిచారం కోసం ఉంచారని దీని భావం కాదు. "వారు మీకు ఎక్కువ పరిశుద్ధమైన వారు" అనే వాక్యం ఈ తప్పుడు భావానికి అసలు ఆస్కారాన్నే ఇవ్వదు. హ్రజత్ లూత్ (అస్సలామ్) స్పష్టమైన ఉద్దేశ్యం ఏమిటంటే, మీ కామవాంఛలను అల్లాహ్ నిర్ణయించిన సహజసిద్ధమైన, ధర్మసమ్మతమైన మార్గం ద్వారా తీర్చుకోండి, దానికొరకు స్త్రీల కొరత లేదు.

قَالُوْا يٰشُعَيْبُ اَصَلٰوتُكَ تَاْمُرُكَ اَنْ نَّتْرُكَ مَا
يَعْبُدُ اٰبَآؤُنَآ اَوْ اَنْ نَّفْعَلَ فِيْٓ اَمْوَالِنَا مَا
نَشٰٓؤُا ؕ اِنَّكَ لَاَنْتَ الْحَلِيْمُ الرَّشِيْدُ ﴿۸۷﴾ قَالَ
يٰقَوْمِ اَرَءَيْتُمْ اِنْ كُنْتُ عَلٰى بَيِّنَةٍ مِّنْ رَّبِّيْ
وَرَزَقَنِيْ مِنْهُ رِزْقًا حَسَنًا ؕ وَمَآ اُرِيْدُ اَنْ
اُخَالِفَكُمْ اِلٰى مَآ اَنْهٰكُمْ عَنْهُ ؕ اِنْ اُرِيْدُ
اِلَّا الْاِصْلَاحَ مَا اسْتَطَعْتُ ؕ وَمَا تَوْفِيْقِيْٓ اِلَّا
بِاللّٰهِ ؕ عَلَيْهِ تَوَكَّلْتُ وَاِلَيْهِ اُنِيْبُ ﴿۸۸﴾ وَيٰقَوْمِ
لَا يَجْرِمَنَّكُمْ شِقَاقِيْٓ اَنْ يُّصِيْبَكُمْ مِّثْلُ مَآ
اَصَابَ قَوْمَ نُوْحٍ اَوْ قَوْمَ هُوْدٍ اَوْ قَوْمَ صٰلِحٍ ؕ
وَمَا قَوْمُ لُوْطٍ مِّنْكُمْ بِبَعِيْدٍ ﴿۸۹﴾ وَاسْتَغْفِرُوْا
رَبَّكُمْ ثُمَّ تُوْبُوْٓا اِلَيْهِ ؕ اِنَّ رَبِّيْ رَحِيْمٌ
وَّدُوْدٌ ﴿۹۰﴾ قَالُوْا يٰشُعَيْبُ مَا نَفْقَهُ كَثِيْرًا مِّمَّا
تَقُوْلُ وَاِنَّا لَنَرٰىكَ فِيْنَا ضَعِيْفًا ۚ وَلَوْلَا
رَهْطُكَ لَرَجَمْنٰكَ ز وَمَآ اَنْتَ عَلَيْنَا
بِعَزِيْزٍ ﴿۹۱﴾

**87** వారు ఇలా సమాధానం చెప్పారు: "షుఐబ్! మా తాత ముత్తాతలు పూజించిన దేవుళ్ళందరినీ మేము వదిలిపెట్టాలనీ, లేదా మా ధనాన్ని మా ఇష్టానుసారం ఖర్చుచేసుకునే అధికారం మాకు ఉండకూడదనీ, నీకు నీ నమాజు నేర్పుతున్నదా? ఇక ఉదాత్త హృదయుడవూ, ఋజువర్తనుడవూ కేవలం నీవు ఒక్కడివే మిగిలిపోయావు!"

**88 - 90** షుఐబ్ ఇలా అన్నాడు: "సోదరులారా! స్వయంగా మీరే ఆలోచించండి. ఒకవేళ నేను నా ప్రభువు తరఫునుండి ఒక స్పష్టమైన నిదర్శనాన్ని కలిగివుంటే తరువాత ఆయన నాకు తన వద్దనుండి మంచి ఉపాధిని కూడా ప్రసాదిస్తే[29] (దాని తరువాత నేను మీ భ్రష్టమార్గాలలో మీ అక్రమ కార్యాలలో మీతో కలసి ఎలా ఉండగలుగుతాను?) ఏ విషయాల నుండి నేను మిమ్మల్ని వారిస్తున్నానో వాటిని నేనే స్వయంగా చెయ్యటాన్ని నేను సుతరామూ ఇష్టపడను. నేను మాత్రం నా శక్తిమేరకు మిమ్మల్ని సంస్కరించ దలచుకున్నాను. నేను చెయ్యదలచుకున్న ఇదంతా పూర్తిగా అల్లాహ్ సహాయంపైనే ఆధారపడి వుంది. ఆయననే నేను నమ్ముకున్నాను. ప్రతి వ్యవహారంలో ఆయన వైపునకే మరలుతాను. నా జాతి సోదరులారా! నాకు వ్యతిరేకంగా అవలంబిస్తున్న మీ మొండివైఖరి చివరకు నూహ్ జాతిపై లేదా హూద్ జాతిపై లేదా సాలిహ్ జాతిపై పడిన శిక్షయే మీపై కూడా పడేవరకు తీసుకునిపోదు కదా! లూత్ జాతివారు మీకు ఎంతో దూరంలో కూడా లేరు. చూడండి! మీ ప్రభువును క్షమాభిక్ష కోరండి. ఆయన వైపునకు పశ్చాత్తాపంతో మరలిరండి. నిస్సందేహంగా నా ప్రభువు కారుణ్యమూర్తి. తన సృష్టిని ప్రేమిస్తాడు."

**91** వారు ఇలా బదులు చెప్పారు: "షుఐబ్! నీవు చెప్పే చాలా విషయాలు మాకు అర్థమే కావు. మేము చూస్తూ ఉన్నాము– నీవు మాలో ఒక దుర్బలుడవు. నీ వంశం వారే గనక లేకుండా ఉంటే మేము నిన్ను ఎప్పుడో రాళ్ళతో కొట్టి చంపివుండేవాళ్ళం. మాపై ఆధిక్యం పొందగలిగే అంత శక్తి నీకు లేదు."

28. అంటే, ప్రతి రాయి అల్లాహ్ తరఫు నుండి నియమించబడింది – విధ్వంసానికి సంబంధించిన ఏ పనిని అది చెయ్యాలి, ఏ రాయి ఏ దోషిపై పడాలి అని.

قَالَ يٰقَوْمِ أَرَهْطِيْٓ أَعَزُّ عَلَيْكُمْ مِّنَ اللّٰهِ
وَاتَّخَذْتُمُوْهُ وَرَآءَكُمْ ظِهْرِيًّا إِنَّ رَبِّيْ بِمَا
تَعْمَلُوْنَ مُحِيْطٌ ﴿٩٢﴾ وَيٰقَوْمِ اعْمَلُوْا عَلٰى
مَكَانَتِكُمْ إِنِّيْ عَامِلٌ سَوْفَ تَعْلَمُوْنَ مَنْ
يَّأْتِيْهِ عَذَابٌ يُّخْزِيْهِ وَمَنْ هُوَ كَاذِبٌ
وَارْتَقِبُوْٓا إِنِّيْ مَعَكُمْ رَقِيْبٌ ﴿٩٣﴾ وَلَمَّا جَآءَ
أَمْرُنَا نَجَّيْنَا شُعَيْبًا وَّالَّذِيْنَ اٰمَنُوْا مَعَهٗ
بِرَحْمَةٍ مِّنَّا وَأَخَذَتِ الَّذِيْنَ ظَلَمُوا الصَّيْحَةُ
فَأَصْبَحُوْا فِيْ دِيَارِهِمْ جٰثِمِيْنَ ﴿٩٤﴾ كَأَنْ لَّمْ
يَغْنَوْا فِيْهَا أَلَا بُعْدًا لِّمَدْيَنَ كَمَا بَعِدَتْ
ثَمُوْدُ ﴿٩٥﴾ وَلَقَدْ أَرْسَلْنَا مُوْسٰى بِاٰيٰتِنَا وَ ع ١٢ ٨
سُلْطٰنٍ مُّبِيْنٍ ﴿٩٦﴾ إِلٰى فِرْعَوْنَ وَمَلَا۠ئِهٖ
فَاتَّبَعُوْٓا أَمْرَ فِرْعَوْنَ وَمَآ أَمْرُ فِرْعَوْنَ
بِرَشِيْدٍ ﴿٩٧﴾ يَقْدُمُ قَوْمَهٗ يَوْمَ الْقِيٰمَةِ فَأَوْرَدَ
هُمُ النَّارَ وَبِئْسَ الْوِرْدُ الْمَوْرُوْدُ ﴿٩٨﴾ وَ
أُتْبِعُوْا فِيْ هٰذِهٖ لَعْنَةً وَّيَوْمَ الْقِيٰمَةِ بِئْسَ
الرِّفْدُ الْمَرْفُوْدُ ﴿٩٩﴾ ذٰلِكَ مِنْ أَنْۢبَآءِ الْقُرٰى
نَقُصُّهٗ عَلَيْكَ مِنْهَا قَآئِمٌ وَّحَصِيْدٌ ﴿١٠٠﴾ وَمَا
ظَلَمْنٰهُمْ وَلٰكِنْ ظَلَمُوْٓا أَنْفُسَهُمْ فَمَآ أَغْنَتْ
عَنْهُمْ اٰلِهَتُهُمُ الَّتِيْ يَدْعُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ مِنْ
شَيْءٍ لَّمَّا جَآءَ أَمْرُ رَبِّكَ وَمَا زَادُوْهُمْ
غَيْرَ تَتْبِيْبٍ ﴿١٠١﴾

**92 - 93** షుఐబ్ ఇలా అన్నాడు: “సోదరులారా! మా వంశం వారు మీపై అల్లాహ్ కంటె ఎక్కువ ఆధిక్యం కలవారా, మీరు (మా వంశం వారికి భయపడ్డారు కాని) అల్లాహ్‌ను మాత్రం పూర్తిగా వెనక్కు నెట్టేశారు? తెలుసుకోండి! మీరు చేస్తున్నదంతా అల్లాహ్ శక్తిపరిధికి అతీతంగా లేదు. నా జాతి జనులారా! మీరు మీ విధానం ప్రకారం పనిచేస్తూ పొండి. నేను నా విధానం ప్రకారం పనిచేస్తూ ఉంటాను. త్వరలోనే మీకు తెలిసిపోతుంది, అవమాన భరితమైన శిక్ష ఎవరిపై పడుతుందో, అసత్యవాది ఎవడో. మీరూ నిరీక్షించండి. మీతో పాటు నేనూ నిరీక్షిస్తాను.”

**94** చివరకు మా తీర్పు సమయం వచ్చేసినప్పుడు మేము మా కారుణ్యంతో షుఐబ్‌నూ, అతనితోటి విశ్వాసులనూ రక్షించాము. దుర్మార్గం చేసినవారిపై ఒక తీవ్రమైన ప్రేలుడు విరుచుకుపడింది. వారు తమ నివాసాలలో చలనమూ, చైతన్యమూ లేకుండా పడి పోయారు, అక్కడ వారు ఎప్పుడూ నివసించి ఉండలేదన్నట్లుగా.

**95** విను! సమూద్ జాతి వారు విసిరివేయబడినట్లు మద్‌యన్ వారు కూడా దూరంగా విసిరివేయబడ్డారు.

**96 - 99** ఇంకా మేము మూసాను మా సూచనలతో, స్పష్టమైన నియామకపు ఉత్తరువుతో ఫిరౌను వద్దకు అతని రాజ్యాధికారుల వద్దకు పంపాము. కాని వారు ఫిరౌను ఆజ్ఞను అనుసరించారు. వాస్తవానికి ఫిరౌను ఆజ్ఞ న్యాయమైనది కాదు. ప్రళయం నాడు అతడు తన జాతివారికి ముందు ముందు ఉంటాడు. తన నాయకత్వంలో వారిని నరకం వైపునకు తీసుకుపోతాడు. ఎవరైనా చేరటానికి అది ఎంత నికృష్టమైన గమ్యస్థానం! ప్రపంచంలో కూడా వారిపై శాపం పడింది. ప్రళయం నాడు కూడా పడుతుంది. ఎవరికైనా దొరికే ఈ ప్రతిఫలం ఎంత చెడ్డది!

**100 - 101** ఇవి కొన్ని పట్టణాల గాథలు. వాటిని మేము నీకు వినిపిస్తున్నాము. ఆ పట్టణాలలో కొన్ని ఇప్పటికీ నిలబడి ఉన్నాయి. కొన్ని పంట పొలాలు మాదిరిగా కొయ్యబడ్డాయి. మేము వారికి అన్యాయం చెయ్యలేదు. వారు తమను తామే ఆపదలకు గురిచేసుకున్నారు. అల్లాహ్ ఆజ్ఞ వచ్చేసినప్పుడు, అల్లాహ్‌ను వదలి వారు ప్రార్థిస్తూవచ్చిన దేవుళ్ళు వారికి ఏ విధంగానూ సాయపడ లేదు. ఆ దేవుళ్ళు వారికి వినాశం, విధ్వంసం తప్ప ఏ ప్రయోజనాన్నీ సమకూర్చలేదు.

وَ كَذٰلِكَ اَخْذُ رَبِّكَ اِذَآ اَخَذَ الْقُرٰى وَهِىَ ظَالِمَةٌ ۭ اِنَّ اَخْذَهٗٓ اَلِيْمٌ شَدِيْدٌ ﴿۱۰۲﴾ اِنَّ فِىْ ذٰلِكَ لَاٰيَةً لِّمَنْ خَافَ عَذَابَ الْاٰخِرَةِ ۭ ذٰلِكَ يَوْمٌ مَّجْمُوْعٌ ۙ لَّهُ النَّاسُ وَ ذٰلِكَ يَوْمٌ مَّشْهُوْدٌ ﴿۱۰۳﴾ وَ مَا نُؤَخِّرُهٗٓ اِلَّا لِاَجَلٍ مَّعْدُوْدٍ ﴿۱۰۴﴾ يَوْمَ يَاْتِ لَا تَكَلَّمُ نَفْسٌ اِلَّا بِاِذْنِهٖ ۚ فَمِنْهُمْ شَقِىٌّ وَّ سَعِيْدٌ ﴿۱۰۵﴾ فَاَمَّا الَّذِيْنَ شَقُوْا فَفِى النَّارِ لَهُمْ فِيْهَا زَفِيْرٌ وَّ شَهِيْقٌ ﴿۱۰۶﴾ لا خٰلِدِيْنَ فِيْهَا مَا دَامَتِ السَّمٰوٰتُ وَالْاَرْضُ اِلَّا مَا شَآءَ رَبُّكَ ۭ اِنَّ رَبَّكَ فَعَّالٌ لِّمَا يُرِيْدُ ﴿۱۰۷﴾ وَ اَمَّا الَّذِيْنَ سُعِدُوْا فَفِى الْجَنَّةِ خٰلِدِيْنَ فِيْهَا مَا دَامَتِ السَّمٰوٰتُ وَ الْاَرْضُ اِلَّا مَا شَآءَ رَبُّكَ ۭ عَطَآءً غَيْرَ مَجْذُوْذٍ ﴿۱۰۸﴾ فَلَا تَكُ فِىْ مِرْيَةٍ مِّمَّا يَعْبُدُ هٰٓؤُلَآءِ ۭ مَا يَعْبُدُوْنَ اِلَّا كَمَا يَعْبُدُ اٰبَآؤُهُمْ مِّنْ قَبْلُ ۭ وَ اِنَّا لَمُوَفُّوْهُمْ نَصِيْبَهُمْ غَيْرَ مَنْقُوْصٍ ﴿۱۰۹﴾ ع ٩

**102 - 108** నీ ప్రభువు ఒక దుర్మార్గపు నగరాన్ని శిక్షించదలిస్తే ఆయన శిక్ష ఇలాగే ఉంటుంది. నిజంగానే ఆయన శిక్ష బహు కఠినమైనది, బహుబాధాకరమైనది. వాస్తవానికి పరలోక శిక్షకు భయపడే ప్రతి మనిషికీ ఇందులో ఒక సూచన ఉంది. అది సర్వమానవులు సమావేశమయ్యే రోజు. ఆ రోజు జరిగేదంతా అందరి కళ్ళ ముందే జరుగుతుంది. మేము దానిని తీసుకు రావటంలో అంత ఎక్కువ ఆలస్యం ఏమీ చెయ్యటంలేదు. దాని నిమిత్తం ఒక గడువు నిర్ణయమై ఉంది. అది వచ్చినప్పుడు నోరెత్తటానికి ఎవరికీ గుండెలు ఉండవు, దేవుని అనుమతితో ఏమైనా మనవి చేసుకోవటం తప్ప. ఆ రోజున దురదృష్టవంతులు కొందరు ఉంటారు. అదృష్టవంతులు కొందరు ఉంటారు. అభాగ్యులైన వారు నరకానికి పోతారు. (అక్కడి తీవ్రమైన వేడి, దప్పికల వల్ల) వారు రొప్పుతూ రొజుతూ ఉంటారు. అదేస్థితిలో వారు కలకాలం ఉంటారు, భూమ్యాకాశాలు ఉన్నంతవరకు,[30] నీ ప్రభువు మరొకటి తలిస్తేతప్ప. నిస్సందేహంగా నీ ప్రభువు తాను కోరినది చెయ్యటానికి సంపూర్ణమైన అధికారం కలిగి వున్నాడు. ఇక అదృష్టవంతులుగా తేలినవారు-వారు స్వర్గానికిపోతారు. అక్కడ శాశ్వతంగా ఉంటారు, భూమ్యాకాశాలు ఉన్నంతవరకు, నీ ప్రభువు మరొకటి తలిస్తే తప్ప. ఎన్నటికీ తరిగిపోని అనుగ్రహం వారికి లభిస్తుంది.

**109** కనుక ప్రవక్తా! వారు ఆరాధిస్తున్న దేవుళ్ళను గురించి నీవు ఏ సందేహానికీ గురికాకు. పూర్వం వారి తాత ముత్తాతలు చేసినట్లుగానే వారు కూడా (అంధులై) పూజా పురస్కారాలు చేసుకుంటూ పోతున్నారు, మేము వారికి ఇవ్వవలసిన దానిని వారికి పూర్తిగా ఇస్తాము, ఎలాంటి తగ్గింపు లేకుండా.

29. అంటే, నా ప్రభువు నాకు సత్యాన్ని గ్రహించే దూరదృష్టిని కూడా ఇచ్చివున్నప్పుడు, హలాలు (పరిశుద్ధమైన) ఉపాధిని కూడా ప్రసాదించి ఉన్నప్పుడు, ఇలా దేవుడు నాపై ఇన్ని అనుగ్రహాలను కురిపించివుండగా నేను మీ మార్గభ్రష్టత్వాలను, మీ హరాము కార్యాలను సత్యమైనవిగా, హలాలు అయినవిగా నిర్ణయించి ఆయనకు కృతఘ్నుణ్ణి కావటం నాకు ఎలా ధర్మసమ్మతం (జాయజ్) కాగలదు?

30. ఈ పదాలు నానుడిగా శాశ్వతత్వం అనే అర్థంలో ఉపయోగించబడతాయి.

وَ لَقَدۡ اٰتَيۡنَا مُوۡسَى الۡكِتٰبَ فَاخۡتُلِفَ فِيۡهِ ؕ وَ
لَوۡ لَا كَلِمَةٌ سَبَقَتۡ مِنۡ رَّبِّكَ لَقُضِىَ بَيۡنَهُمۡ ؕ
وَ اِنَّهُمۡ لَفِىۡ شَكٍّ مِّنۡهُ مُرِيۡبٍ ﴿۱۱۰﴾ وَاِنَّ كُلًّا
لَّمَّا لَيُوَفِّيَنَّهُمۡ رَبُّكَ اَعۡمَالَهُمۡ ؕ اِنَّهٗ بِمَا
يَعۡمَلُوۡنَ خَبِيۡرٌ ﴿۱۱۱﴾ فَاسۡتَقِمۡ كَمَاۤ اُمِرۡتَ وَ
مَنۡ تَابَ مَعَكَ وَ لَا تَطۡغَوۡا ؕ اِنَّهٗ بِمَا
تَعۡمَلُوۡنَ بَصِيۡرٌ ﴿۱۱۲﴾ وَ لَا تَرۡكَنُوۡۤا اِلَى الَّذِيۡنَ
ظَلَمُوۡا فَتَمَسَّكُمُ النَّارُ ۙ وَ مَا لَكُمۡ مِّنۡ دُوۡنِ اللّٰهِ
مِنۡ اَوۡلِيَآءَ ثُمَّ لَا تُنۡصَرُوۡنَ ﴿۱۱۳﴾ وَ اَقِمِ الصَّلٰوةَ
طَرَفَىِ النَّهَارِ وَ زُلَفًا مِّنَ الَّيۡلِ ؕ اِنَّ
الۡحَسَنٰتِ يُذۡهِبۡنَ السَّيِّاٰتِ ؕ ذٰلِكَ ذِكۡرٰى
لِلذّٰكِرِيۡنَ ۚ ﴿۱۱۴﴾ وَ اصۡبِرۡ فَاِنَّ اللّٰهَ لَا يُضِيۡعُ اَجۡرَ
الۡمُحۡسِنِيۡنَ ﴿۱۱۵﴾

**110 - 115** మేము ఇదివరకు మూసాకు కూడా గ్రంథాన్ని ఇచ్చివున్నాము. దాని విషయంలో కూడా విభేధించటం జరిగింది. (ఇప్పుడు నీకు ఇవ్వబడిన ఈ గ్రంథం విషయంలో విభేదించటం జరుగుతున్నట్లుగా). నీ ప్రభువు తరపు నుండి ఒక విషయం ముందే గనక నిర్ణయింపబడి ఉండకపోతే, ఈ విభేదించే వారి విషయంలో ఎప్పుడో తీర్పు జరిగివుండేది. వారు దీని విషయంలో సంశయానికీ, అయోమయానికీ గురి అయ్యారు అనేది యథార్థం. నీ ప్రభువు వారికి వారు చేసిన పనులకు పూర్తి ప్రతిఫలాన్ని తప్పకుండా ఇస్తాడు అనేది కూడా యథార్థమే. నిశ్చయంగా ఆయన వారి అన్ని చేష్టలను ఎరిగిన వాడు. కనుక ప్రవక్తా! నీవూ, (అవిశ్వాసం తిరుగుబాటుల నుండి విశ్వాసం, విధేయతల వైపునకు) మరలివచ్చిన నీ సహచ రులూ నీకు ఆజ్ఞాపించిన విధంగా ఋజుమార్గంపై స్థిరంగా ఉండండి. దైవదాస్యపు హద్దులను అతిక్రమించకండి. మీరు చేస్తున్న దానిని మీ ప్రభువు కనిపెట్టి ఉంటాడు. ఈ దుర్మార్గుల వైపునకు కొంచెమైనా మొగ్గకండి. ఒకవేళ మొగ్గినట్లయితే నరకంలో చిక్కుకుపోతారు. మిమ్మల్ని దేవుని నుండి కాపాడగల సహాయకుడూ, సంరక్షకుడూ ఎవ్వడూ మీకు దొరకడు. ఎక్కడి నుండి మీకు సహాయం లభించదు. చూడు! నమాజును స్థాపించు, పగటి యొక్క రెండు సరిహద్దు సమయాలలోనూ, కొంతరాత్రి గడిచిన తరువాతనూ.[31] వాస్తవానికి సత్కార్యాలు దుష్కార్యాలను దూరం చేస్తాయి. అల్లాహ్‌ను జ్ఞాపకం ఉంచుకునే వారికి ఇది ఒక జ్ఞాపిక. ఓర్మి కలిగి ఉండు. అల్లాహ్ మంచి చేసేవారి ప్రతిఫలాన్ని ఎన్నటికీ వృధా చెయ్యడు.

31. "పగటి యొక్క సరిహద్దుసమయాలు" అంటే ప్రాతఃకాలం, సాయంకాలం అని భావం. కొంతరాత్రి పోయిన తరువాత అంటే ఇషా సమయం అని భావం. (నమాజు సమయాల వివరాల కొరకు, బనీ ఇస్రాయీలు సూరాలో 78వ ఆయత్‌ను, తాహా సూరాలో 130వ ఆయత్‌నూ, రూమ్ సూరాలో 17, 18 ఆయతులను దయచేసి చూడండి).

فَلَوْ لَا كَانَ مِنَ الْقُرُوْنِ مِنْ قَبْلِكُمْ اُولُوْا
بَقِيَّةٍ يَّنْهَوْنَ عَنِ الْفَسَادِ فِي الْاَرْضِ اِلَّا
قَلِيْلًا مِّمَّنْ اَنْجَيْنَا مِنْهُمْ ۚ وَ اتَّبَعَ الَّذِيْنَ
ظَلَمُوْا مَآ اُتْرِفُوْا فِيْهِ وَ كَانُوْا مُجْرِمِيْنَ ﴿١١٦﴾ وَ
مَا كَانَ رَبُّكَ لِيُهْلِكَ الْقُرٰى بِظُلْمٍ وَّ اَهْلُهَا
مُصْلِحُوْنَ ﴿١١٧﴾ وَ لَوْ شَآءَ رَبُّكَ لَجَعَلَ النَّاسَ
اُمَّةً وَّاحِدَةً وَّ لَا يَزَالُوْنَ مُخْتَلِفِيْنَ ﴿١١٨﴾ اِلَّا
مَنْ رَّحِمَ رَبُّكَ ؕ وَ لِذٰلِكَ خَلَقَهُمْ ؕ وَ تَمَّتْ
كَلِمَةُ رَبِّكَ لَاَمْلَئَنَّ جَهَنَّمَ مِنَ الْجِنَّةِ
وَالنَّاسِ اَجْمَعِيْنَ ﴿١١٩﴾ وَ كُلًّا نَّقُصُّ عَلَيْكَ مِنْ
اَنْۢبَآءِ الرُّسُلِ مَا نُثَبِّتُ بِهٖ فُؤَادَكَ ۚ وَجَآءَكَ
فِيْ هٰذِهِ الْحَقُّ وَ مَوْعِظَةٌ وَّذِكْرٰى
لِلْمُؤْمِنِيْنَ ﴿١٢٠﴾ وَ قُلْ لِّلَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ
اعْمَلُوْا عَلٰى مَكَانَتِكُمْ ؕ اِنَّا عٰمِلُوْنَ ﴿١٢١﴾
وَانْتَظِرُوْا ۚ اِنَّا مُنْتَظِرُوْنَ ﴿١٢٢﴾ وَ لِلّٰهِ غَيْبُ
السَّمٰوٰتِ وَالْاَرْضِ وَ اِلَيْهِ يُرْجَعُ الْاَمْرُ كُلُّهٗ
فَاعْبُدْهُ وَ تَوَكَّلْ عَلَيْهِ ؕ وَمَا رَبُّكَ بِغَافِلٍ
عَمَّا تَعْمَلُوْنَ ﴿١٢٣﴾ ع

**116 - 119** నీకు ముందు గతించిన జాతులలో ప్రజలను భూమిపై కల్లోలాన్ని రేకెత్తించకుండా నిరోధించే సజ్జనులు ఎందుకు లేరు? ఒకవేళ అటువంటివారు ఉండినా, వారు చాలా కొద్దిమంది మాత్రమే! వారిని మేము ఆ జాతుల బారి నుండి రక్షించాము. దుర్మార్గులు ఐహిక సుఖాల వెంటనే పడ్డారు. ఆ సుఖసాధనాలు వారికి పుష్కలంగా ఇవ్వబడ్డాయి. వారు దోషులే అయిపోయారు. నీ ప్రభువు పట్టణాలను అన్యాయంగా నాశనం చేసేవాడు ఎంతమాత్రం కాదు, వాటి ప్రజలు సంస్కరణాకార్యాలు చేసేవారైనప్పటికీ. నీ ప్రభువు సంకల్పిస్తే సర్వ మానవులనూ నిస్సందేహంగా ఒకే వర్గంగా చెయ్యగలిగేవాడే; కాని ఇప్పుడు వారు విభిన్న మార్గాలలోనే నడుస్తారు. కేవలం నీ ప్రభువు కరుణకు నోచుకున్నవారే అపమార్గాలకు లోను కాకుండా ఉంటారు. ఆయన వారిని దీని కొరకే (ఎంపిక, ఆచరణల స్వాతంత్ర్యాన్నిచ్చి పరీక్షించే నిమిత్తమే) సృష్టించాడు. "నేను నరకాన్ని జిన్నాతులతో, మానవులతో నింపుతాను" అని నీ ప్రభువు అన్నమాట నెరవేరింది.

**120 - 123** ప్రవక్తా! మేము నీకు వినిపిస్తున్న ఈ ప్రవక్తల గాధల ద్వారా నీ హృదయాన్ని శక్తిమంతం చేస్తున్నాము. వాటి ద్వారా నీకు యథార్థానికి సంబంధించిన జ్ఞానం లభించింది. విశ్వాసులకు హితవూ, జాగృతీ పొందే భాగ్యం కలిగింది. పోతే ఇక అవిశ్వాసులు, వారితో ఇలా అను: మీరు మీ పద్ధతి ప్రకారం పనిచేస్తూ ఉండండి; మేము మా పద్ధతి ప్రకారం పనిచేస్తూ ఉంటాము. ముగింపు కొరకు మీరూ వేచిచూడండి, మేమూ వేచివుంటాము. ఆకాశాలలో, భూమిలో దాగివున్నదంతా అల్లాహ్ అధీనంలో ఉన్నది. అన్ని విషయాలూ ఆయన వైపునకే మరలింపబడతాయి. కనుక ప్రవక్తా! నీవు ఆయననే సేవించు. ఆయననే నమ్ముకో. మీరు చేస్తున్నదంతా నీ ప్రభువుకు తెలియకుండా లేదు.










అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 3** అలిఫ్ లామ్ రా. ఇవి తన ఉద్దేశ్యాన్ని స్పష్టంగా ప్రకటించే గ్రంథంలోని ఆయతులు. మేము దానిని ఖురానుగా[1] చేసి అరబ్బీ భాషలో అవతరింప జేశాము, మీరు (అరేబియా వాసులు) దానిని చక్కగా అర్థం చేసుకోగలందులకు. ప్రవక్తా! మేము ఈ ఖురానును వహీద్వారా నీ వద్దకు పంపి అత్యుత్తమ మైన రీతిలో సంఘటనలనూ యథార్థాలనూ నీకు వివరిస్తు న్నాము. ఇంతకు ముందు (ఈ విషయాలు) నీకు ఎంతమాత్రం తెలియవు.

**4 - 6** ఇది యూసుఫ్ తన తండ్రితో ఇలా అన్నప్పటి ప్రస్తావన: “తండ్రీ! నేను ఒక కలగన్నాను; అందులో పదకొండు నక్షత్రా లనూ, సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ చూశాను. అవి నాముందు సాష్టాంగపడ్డాయి.” సమాధానంగా అతని తండ్రి ఇలా అన్నాడు: “కుమారా! నీ స్వప్నాన్ని గురించి నీ సోదరులకు చెప్పకు. ఎందుకంటే వారు నీకు వ్యతిరేకంగా కుట్రలు పన్నుతారు.[2] వాస్తవం ఏమిటంటే షైతాను మనిషికి బహిరంగ శత్రువు. ఆ విధంగానే జరుగుతుంది (నీవు కలలో చూసిన విధంగా). నీ ప్రభువు నిన్ను (తన పనికొరకు) ఎన్నుకుంటాడు. నీకు విషయాల లోతును అందుకోవటం నేర్పుతాడు.[3] నీకూ యాఖూబ్ సంతతికీ తన అనుగ్రహాన్ని పూర్తిగా ప్రసాదిస్తాడు, ఇంతకు పూర్వం ఆయన నీ పెద్దలైన ఇబ్రాహీముకూ, ఇస్హాఖుకూ పూర్తిగా ప్రసాదించినట్లు. నిశ్చయంగా నీ ప్రభువు సర్వజ్ఞుడు, మహావివేకి.










بِسۡمِ اللّٰہِ الرَّحۡمٰنِ الرَّحِیۡمِ ○
الٓرٰ ۟ تِلۡکَ اٰیٰتُ الۡکِتٰبِ الۡمُبِیۡنِ ① اِنَّاۤ
اَنۡزَلۡنٰہُ قُرۡءٰنًا عَرَبِیًّا لَّعَلَّکُمۡ تَعۡقِلُوۡنَ ②
نَحۡنُ نَقُصُّ عَلَیۡکَ اَحۡسَنَ الۡقَصَصِ بِمَاۤ
اَوۡحَیۡنَاۤ اِلَیۡکَ ہٰذَا الۡقُرۡاٰنَ ٭ وَ اِنۡ کُنۡتَ مِنۡ
قَبۡلِہٖ لَمِنَ الۡغٰفِلِیۡنَ ③ اِذۡ قَالَ یُوۡسُفُ
لِاَبِیۡہِ یٰۤاَبَتِ اِنِّیۡ رَاَیۡتُ اَحَدَ عَشَرَ کَوۡکَبًا وَّ
الشَّمۡسَ وَ الۡقَمَرَ رَاَیۡتُہُمۡ لِیۡ سٰجِدِیۡنَ ④ قَالَ
یٰبُنَیَّ لَا تَقۡصُصۡ رُءۡیَاکَ عَلٰۤی اِخۡوَتِکَ فَیَکِیۡدُوۡا
لَکَ کَیۡدًا ؕ اِنَّ الشَّیۡطٰنَ لِلۡاِنۡسَانِ عَدُوٌّ مُّبِیۡنٌ ⑤
وَ کَذٰلِکَ یَجۡتَبِیۡکَ رَبُّکَ وَ یُعَلِّمُکَ مِنۡ
تَاۡوِیۡلِ الۡاَحَادِیۡثِ وَ یُتِمُّ نِعۡمَتَہٗ عَلَیۡکَ وَ عَلٰۤی
اٰلِ یَعۡقُوۡبَ کَمَاۤ اَتَمَّہَا عَلٰۤی اَبَوَیۡکَ مِنۡ قَبۡلُ
اِبۡرٰہِیۡمَ وَ اِسۡحٰقَ ؕ اِنَّ رَبَّکَ عَلِیۡمٌ حَکِیۡمٌ ⑥ ع

1. ఖురాను అంటే “చదవటం” అని నిఘంటువు అర్థం. గ్రంథాన్ని ఈ పేరుతో పిలవటంలోని భావం ఏమిటంటే, ఇది పండితులూ, పామరులూ అందరూ చదవటానికి ఉద్దేశింపబడిన గ్రంథం అని, అత్యధికంగా చదువబడే గ్రంథం అని.
2. హజ్రత్ యూసుఫ్ (అస్సలామ్)కు పదిమంది సవతిసోదరులు ఉండేవారు. ఆయనకు ఒక సొంత తమ్ముడు కూడా ఉండేవాడు. సవతి సోదరులు యూసుఫ్ (అస్సలామ్) అంటే అసూయపడుతున్నారని, నైతికంగా అంత మంచివారు కాదని, స్వప్రయోజనం కోసం ఎలాంటి కుట్రలు పన్నటానికైనా వెనుకాడరని హజ్రత్ యాఖూబ్ (అస్సలామ్)కు తెలుసు. కనుక గుణవంతుడైన తన కొడుకును వారితో జాగ్రత్తగా మెలగు అని హెచ్చరించారు. స్వప్న భావం ఏమిటంటే, సూర్యుడంటే హజ్రత్ యాఖూబ్ (అస్సలామ్) అని భావం. చంద్రుడంటే

لَقَدْ كَانَ فِيْ يُوْسُفَ وَ اِخْوَتِهٖٓ اٰيٰتٌ
لِّلسَّآئِلِيْنَ ۝٧ اِذْ قَالُوْا لَيُوْسُفُ وَ اَخُوْهُ
اَحَبُّ اِلٰٓى اَبِيْنَا مِنَّا وَ نَحْنُ عُصْبَةٌ ؕ اِنَّ
اَبَانَا لَفِيْ ضَلٰلٍ مُّبِيْنِۚۖ ۝٨ اقْتُلُوْا يُوْسُفَ اَوِ
اطْرَحُوْهُ اَرْضًا يَّخْلُ لَكُمْ وَجْهُ اَبِيْكُمْ
وَتَكُوْنُوْا مِنْۢ بَعْدِهٖ قَوْمًا صٰلِحِيْنَ ۝٩ قَالَ
قَآئِلٌ مِّنْهُمْ لَا تَقْتُلُوْا يُوْسُفَ وَاَلْقُوْهُ فِيْ
غَيٰبَتِ الْجُبِّ يَلْتَقِطْهُ بَعْضُ السَّيَّارَةِ اِنْ
كُنْتُمْ فٰعِلِيْنَ ۝١٠ قَالُوْا يٰٓاَبَانَا مَا لَكَ لَا تَاْمَنَّا
عَلٰى يُوْسُفَ وَ اِنَّا لَهٗ لَنٰصِحُوْنَ ۝١١ اَرْسِلْهُ
مَعَنَا غَدًا يَّرْتَعْ وَيَلْعَبْ وَ اِنَّا لَهٗ
لَحٰفِظُوْنَ ۝١٢ قَالَ اِنِّيْ لَيَحْزُنُنِيْٓ اَنْ تَذْهَبُوْا
بِهٖ وَ اَخَافُ اَنْ يَّاْكُلَهُ الذِّئْبُ وَ اَنْتُمْ عَنْهُ
غٰفِلُوْنَ ۝١٣ قَالُوْا لَئِنْ اَكَلَهُ الذِّئْبُ وَ نَحْنُ
عُصْبَةٌ اِنَّآ اِذًا لَّخٰسِرُوْنَ ۝١٤ فَلَمَّا ذَهَبُوْا بِهٖ وَ
اَجْمَعُوْٓا اَنْ يَّجْعَلُوْهُ فِيْ غَيٰبَتِ الْجُبِّ ۚ وَ
اَوْحَيْنَآ اِلَيْهِ لَتُنَبِّئَنَّهُمْ بِاَمْرِهِمْ هٰذَا وَ هُمْ لَا
يَشْعُرُوْنَ ۝١٥ وَ جَآءُوْٓ اَبَاهُمْ عِشَآءً
يَّبْكُوْنَ ۝١٦

**7 - 18** యథార్థానికి యూసుఫ్ అతని సోదరుల గాథలో ఈ అడిగే వారికి గొప్ప సూచనలు ఉన్నాయి. ఈ గాథ ఇలా ప్రారంభమవుతుంది. అతని సోదరులు పరస్పరం ఇలా చెప్పుకున్నారు: "వాస్తవానికి మనదొక పెద్ద బలగమైనప్పటికీ యూసుఫ్, అతని సొంత సోదరుడూ[4] ఇద్దరూ అంటే మన తండ్రికి, మన అందరికంటే ఎక్కువ ఇష్టం. నిజంగానే మన తండ్రికి పూర్తిగా మతి భ్రమించింది. కనుక పదండి, యూసుఫ్‌ను చంపెయ్యండి లేదా అతణ్ణి ఎక్కడైనా పార వెయ్యండి, మీ తండ్రి ధ్యాస కేవలం మీపైనే ఉండేందుకు. ఈ పనిచేసిన తరువాత తిరిగి సజ్జనులుగా ఉండాలి." అప్పుడు వారిలో ఒకడు ఇలా అన్నాడు: "యూసుఫ్‌ను చంపకండి. ఒకవేళ అతన్ని ఏదైనా చెయ్యాలనే అనుకుంటే, అతన్ని ఒక చీకటి బావిలో పడవెయ్యండి. వచ్చే పోయే బాటసారుల బృందమేదైనా అతన్ని తీసుకుపోతుంది." ఈ నిర్ణయం తరువాత వారు వెళ్ళి తమ తండ్రితో ఇలా అన్నారు: "నాన్నా! మీరు యూసుఫ్ విషయంలో మమ్మల్ని ఎందుకని నమ్మరు? వాస్తవానికి మేము అతని నిజమైన శ్రేయోభిలాషులం. రేపు అతనిని మాతో పంపండి. పండ్లూ ఫలాలూ స్వేచ్ఛగా మెక్కుతాడు.[5] ఆటలతో ఆనందిస్తాడు. అతన్ని కాపాడటానికి మేము ఉన్నాము కదా!" తండ్రి ఇలా అన్నాడు: "మీరు అతన్ని తీసుకుపోతే నాకు బాధ కలుగుతుంది. అతని విషయంలో మీరు పరాకుగా ఉన్నప్పుడు ఏదైనా తోడేలు అతనిని తినేస్తుందేమో అని నా భయం." వారు ఇలా సమాధానం ఇచ్చారు: "పెద్ద బలగమైన మేము వెంట వుండికూడా అతనిని గనక తోడేలు తినివేస్తే మేము వట్టి చేతగాని వాళ్ళము అవుతాము." ఇలా ఒత్తిడి చేసి వారు అతనిని తీసుకునివెళ్ళి ఒక చీకటి బావిలో పడవేద్దామని నిర్ణయించుకున్నప్పుడు, మేము యూసుఫ్‌కు వహీద్వారా ఇలా తెలిపాము: "నీవు వారికి వారు చేసిన ఈ చేష్టను ఎత్తి చూపే సమయం వస్తుంది. వారు తమ ఈ దుశ్చర్య ఫలితాలను గ్రహించటం లేదు." సాయంత్రం వారు నెత్తీ నోరూ బాదుకుంటూ తమ తండ్రి వద్దకు వచ్చి

ఆయన భార్య (హజ్రత్ యూసుఫ్ -అస్సలామ్- సవతి తల్లి) అని అర్థం. పదకొండు నక్షత్రాలు అంటే పదకొండు మంది సోదరులు అని భావం.

قَالُوْا يٰٓاَبَانَآ اِنَّا ذَهَبْنَا نَسْتَبِقُ وَ تَرَكْنَا
يُوْسُفَ عِنْدَ مَتَاعِنَا فَاَكَلَهُ الذِّئْبُ ۚ وَ مَآ
اَنْتَ بِمُؤْمِنٍ لَّنَا وَ لَوْ كُنَّا صٰدِقِيْنَ ﴿۱۷﴾ وَ جَآءُوْ الثلثة
عَلٰى قَمِيْصِهٖ بِدَمٍ كَذِبٍ ؕ قَالَ بَلْ سَوَّلَتْ لَكُمْ
اَنْفُسُكُمْ اَمْرًا ؕ فَصَبْرٌ جَمِيْلٌ ؕ وَ اللّٰهُ
الْمُسْتَعَانُ عَلٰى مَا تَصِفُوْنَ ﴿۱۸﴾ وَجَآءَتْ سَيَّارَةٌ
فَاَرْسَلُوْا وَارِدَهُمْ فَاَدْلٰى دَلْوَهٗ ؕ قَالَ
يٰبُشْرٰى هٰذَا غُلٰمٌ ؕ وَ اَسَرُّوْهُ بِضَاعَةً ؕ وَ
اللّٰهُ عَلِيْمٌۢ بِمَا يَعْمَلُوْنَ ﴿۱۹﴾ وَ شَرَوْهُ بِثَمَنٍۭ
بَخْسٍ دَرَاهِمَ مَعْدُوْدَةٍ ۚ وَكَانُوْا فِيْهِ مِنَ
الزّٰهِدِيْنَ ﴿۲۰﴾ ع وَ قَالَ الَّذِى اشْتَرٰىهُ مِنْ مِّصْرَ ع ٢ ١٤ ١٢
لِامْرَاَتِهٖٓ اَكْرِمِىْ مَثْوٰىهُ عَسٰٓى اَنْ يَّنْفَعَنَآ اَوْ
نَتَّخِذَهٗ وَلَدًا ؕ وَ كَذٰلِكَ مَكَّنَّا لِيُوْسُفَ فِى
الْاَرْضِ ۫ وَ لِنُعَلِّمَهٗ مِنْ تَاْوِيْلِ الْاَحَادِيْثِ ؕ
وَ اللّٰهُ غَالِبٌ عَلٰٓى اَمْرِهٖ وَ لٰكِنَّ اَكْثَرَ النَّاسِ لَا
يَعْلَمُوْنَ ﴿۲۱﴾ وَلَمَّا بَلَغَ اَشُدَّهٗٓ اٰتَيْنٰهُ حُكْمًا وَّ
عِلْمًا ؕ وَ كَذٰلِكَ نَجْزِى الْمُحْسِنِيْنَ ﴿۲۲﴾ وَ
رَاوَدَتْهُ الَّتِىْ هُوَ فِىْ بَيْتِهَا عَنْ نَّفْسِهٖ وَ
غَلَّقَتِ الْاَبْوَابَ وَ قَالَتْ هَيْتَ لَكَ ؕ قَالَ
مَعَاذَ اللّٰهِ اِنَّهٗ رَبِّىْٓ اَحْسَنَ مَثْوَاىَ ؕ اِنَّهٗ لَا
يُفْلِحُ الظّٰلِمُوْنَ ﴿۲۳﴾

ఇలా అన్నారు: "నాన్నా! మేము పరుగు పందెంలో మునిగిపోయాము. యూసుఫ్‌ను మేము మా సామానువద్ద వదిలిపెట్టాము. అంతలోనే తోడేలు ఒకటి వచ్చి అతన్ని తినివేసింది. మేము నిజం చెబుతున్నా మీరు మా మాటను నమ్మరు." వారు యూసుఫ్ చొక్కాకు బూటకపు రక్తం పూసి తీసుకు వచ్చారు. ఇది విని వారి తండ్రి ఇలా అన్నాడు: "మీ దుష్ట మనస్సులు మీచేత ఒక ఘోరకార్యాన్ని చాలా తేలికగా చేయించాయి. సరే, ఓర్చుకుంటాను. బాగా ఓర్చుకుంటాను. మీరు కల్పిస్తున్న మాటల విషయంలో సహాయం కోసం అల్లాహ్‌నే అర్థించాలి."

**19 - 20** అటు వైపునకు ఒక బాటసారుల బృందం వచ్చింది. వారు నీళ్ళు తోడే తన నౌకరును, నీళ్ళకొరకు పంపారు. ఆ నౌకరు చేదను బావి లోకి వదలినప్పుడు (యూసుఫ్‌ను చూసి) "శుభం! ఇక్కడ ఒక బాలుడు ఉన్నాడు" అని అరిచాడు. వారు అతనిని వ్యాపార సరకుగా భావించి దాచుకున్నారు. వాస్తవానికి వారు చేస్తూ ఉన్నదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు. చివరకు వారు స్వల్పధరకు, కొన్ని దిర్హములకు అతనిని అమ్మివేశారు. వారు అతని ధర విషయంలో అంతకన్నా ఎక్కువ ఆశించలేదు.

**21 - 22** అతనిని కొన్న ఈజిప్టు వ్యక్తి తన భార్యతో ఇలా అన్నాడు: "ఇతనిని బాగా చూసుకో. ఇతను మనకు లాభదాయకం కావచ్చు లేదా మనం ఇతనిని కొడుకుగా చేసుకోవచ్చు." ఇలా మేము యూసుఫ్‌కు ఆ భూభాగంపై స్థిరపడే అవకాశాన్ని కల్పించాము. అంతేకాదు అతనికి వ్యవహార జ్ఞానాన్ని నేర్చుకునే ఏర్పాటు చేశాము. అల్లాహ్ తన పనిని చేసి తీరుతాడు. కాని చాలామందికి ఈ విషయం తెలియదు. అతను తన నిండు యౌవనానికి చేరుకున్నప్పుడు, మేము అతనికి నిర్ణయ శక్తినీ, జ్ఞానాన్నీ ప్రసాదించాము. ఇలా మేము సజ్జనులను బహూకరిస్తాము.

**23 - 29** అతను ఉంటున్న ఇంటిలోని స్త్రీ అతని కోసం వల పన్నసాగింది. ఒక రోజున తలుపులు మూసి "వచ్చెయ్యి!" అని అన్నది. యూసుఫ్ ఇలా అన్నాడు: "నేను అల్లాహ్ శరణు వేడుకుంటున్నాను. నా ప్రభువు[6] నాకు మంచి స్థానం ప్రసాదించాడు. (నేను ఈ పని ఎలా చెయ్యను?) అటువంటి దుర్మార్గులు ఎన్నటికీ సాఫల్యం పొందలేరు."

وَ لَقَدْ هَمَّتْ بِهٖ ۚ وَ هَمَّ بِهَا لَوْ لَاۤ اَنْ رَّاٰ
بُرْهَانَ رَبِّهٖ ؕ كَذٰلِكَ لِنَصْرِفَ عَنْهُ السُّوْٓءَ وَ
الْفَحْشَآءَ ؕ اِنَّهٗ مِنْ عِبَادِنَا الْمُخْلَصِيْنَ ﴿۲۴﴾ وَ
اسْتَبَقَا الْبَابَ وَ قَدَّتْ قَمِيْصَهٗ مِنْ دُبُرٍ
وَّ اَلْفَيَا سَيِّدَهَا لَدَا الْبَابِ ؕ قَالَتْ مَا جَزَآءُ
مَنْ اَرَادَ بِاَهْلِكَ سُوْٓءًا اِلَّاۤ اَنْ يُّسْجَنَ اَوْ
عَذَابٌ اَلِيْمٌ ﴿۲۵﴾ قَالَ هِيَ رَاوَدَتْنِيْ عَنْ
نَّفْسِيْ وَ شَهِدَ شَاهِدٌ مِّنْ اَهْلِهَا ۚ اِنْ كَانَ
قَمِيْصُهٗ قُدَّ مِنْ قُبُلٍ فَصَدَقَتْ وَ هُوَ مِنَ
الْكٰذِبِيْنَ ﴿۲۶﴾ وَ اِنْ كَانَ قَمِيْصُهٗ قُدَّ مِنْ دُبُرٍ
فَكَذَبَتْ وَ هُوَ مِنَ الصّٰدِقِيْنَ ﴿۲۷﴾ فَلَمَّا رَاٰ
قَمِيْصَهٗ قُدَّ مِنْ دُبُرٍ قَالَ اِنَّهٗ مِنْ كَيْدِكُنَّ ؕ
اِنَّ كَيْدَكُنَّ عَظِيْمٌ ﴿۲۸﴾ يُوْسُفُ اَعْرِضْ عَنْ
هٰذَا ٚ وَ اسْتَغْفِرِيْ لِذَنْۢبِكِ ۖ ۚ اِنَّكِ كُنْتِ مِنَ
الْخٰطِـِٕيْنَ ﴿۲۹﴾ ع ۳ ۱۲

ఆమె అతని వైపునకు రాసాగింది; యూసుఫ్ కూడా ఆమె వైపునకు పోయివుండేవాడే, ఒకవేళ తన ప్రభువు నిదర్శనాన్ని చూసి[7] ఉండకపోతే. మేము చెడునూ, నీతిబాహ్యతనూ అతనికి దూరంగా ఉంచటానికి అలా జరిగింది. వాస్తవానికి అతను మేము వరించిన దాసులలోని వాడు. తుదకు యూసుఫ్, ఆమె ఒకరి వెనుక ఒకరు తలుపు వైపునకు పరుగెత్తారు. ఆమె వెనుక నుండి యూసుఫ్ చొక్కాను లాగి చింపివేసింది. వాకిలివద్ద ఉభయులూ ఆమె భర్తను చూశారు. ఆయనను చూడగానే ఆ స్త్రీ ఇలా అనసాగింది: "నీ ఇల్లాలిని పాడుచేసే బుద్ధి కలవాడికి శిక్ష ఏమిటి? అతనిని జైల్లో పెట్టటమో లేక తీవ్రయాతనకు గురిచెయ్యటమో తప్ప మరొక శిక్ష ఏమవుతుంది?" యూసుఫ్ ఇలా అన్నాడు: "ఈమెయే నన్ను వలలో వేసుకోవటానికి ప్రయత్నం చేసింది." ఆ స్త్రీ కుటుంబానికి చెందిన ఒక వ్యక్తి ఇలా సాక్ష్యమిచ్చాడు: "యూసుఫ్ చొక్కా గనక ముందు భాగం చినిగివున్నట్లయితే, అప్పుడు ఈ స్త్రీ చెప్పేది నిజం, అతను పలికేది అబద్ధం. కాని అతని చొక్కా గనక వెనుకభాగాన చినిగివున్నట్లయితే, అప్పుడు స్త్రీ చెప్పేది అబద్ధం, ఆయన పలికేది నిజం."[8] యూసుఫ్ చొక్కా వెనుకనుంచి చినిగి ఉండటాన్ని చూసిన భర్త ఇలా అన్నాడు: "ఇవి మీ స్త్రీల పన్నాగాలు. నిజంగా మీ పన్నాగాలు ఎంతో భయంకరంగా ఉంటాయి. యూసుఫ్! ఈ వ్యవహారాన్ని ఇంతటితో వదిలెయ్యి. ఓ స్త్రీ! నీవు నీ తప్పునకు క్షమాభిక్ష కోరుకో. అసలు తప్పు చేసినదానివి నీవే."

3. అసలు, "తవీలుల్ అహాదీస్" అనే పదాలు వాడబడ్డాయి. కొందరు భావించినట్లు వాటి అర్థం కేవలం స్వప్నఫలాన్ని వివరించే జ్ఞానం అని కాదు. దాని అర్థం ఏమిటంటే, అల్లాహ్ నీకు వ్యవహార జ్ఞానాన్నీ, యథార్థాన్నీ గ్రహించే నేర్పును బోధిస్తాడు. నీకు దూరదృష్టిని ప్రసాదిస్తాడు. దానిద్వారా నీవు ప్రతి వ్యవహారం యొక్క లోతులకు పోగలుగుతావు. దాని అసలు స్వరూప స్వభావాలను గ్రహించే సామర్థ్యం పొందుతావు.

4. హజ్రత్ యూసుఫ్ (అస్సలామ్) సొంత తమ్ముడైన బిన్ యమీన్ అని అర్థం. ఆయన హజ్రత్ యూసుఫ్ (అస్సలామ్) కంటే ఎన్నో ఏళ్ళు చిన్నవారు.

5. అడవిలో తిరిగి పండ్లూ ఫలాలూ తింటాడనే భావంతో ముద్దుగా ఇలా అనటం జరిగింది.

6. సాధారణంగా వ్యాఖ్యాతలు, అనువాదకులు ఇక్కడ "నా ప్రభువు" అనే పదాన్ని హజ్రత్ యూసుఫ్ (అస్సలామ్) తాము అప్పుడు ఏ వ్యక్తి వద్ద ఉద్యోగం చేస్తూ ఉండేవారో, ఆ వ్యక్తిని ఉద్దేశించి వాడారు అని భావించారు. దాని ప్రకారం ఆయన ఈ జవాబునకు అర్థం ఏమిటంటే, "నా యజమాని నన్ను ఇంత బాగా చూస్తున్నాడే, నేను ఆయన భార్యతో వ్యభిచారం చేసే అంత స్వామిద్రోహానికి ఎలా పాల్పడగలను" అని. కాని ప్రవక్త అయిన

وَ قَالَ نِسۡوَةٌ فِی الۡمَدِیۡنَةِ امۡرَاَتُ الۡعَزِیۡزِ
تُرَاوِدُ فَتٰىهَا عَنۡ نَّفۡسِهٖ ۚ قَدۡ شَغَفَهَا حُبًّا ؕ
اِنَّا لَنَرٰىهَا فِیۡ ضَلٰلٍ مُّبِیۡنٍ ﴿۳۰﴾ فَلَمَّا سَمِعَتۡ
بِمَكۡرِهِنَّ اَرۡسَلَتۡ اِلَیۡهِنَّ وَ اَعۡتَدَتۡ لَهُنَّ
مُتَّكَاً وَّ اٰتَتۡ كُلَّ وَاحِدَةٍ مِّنۡهُنَّ سِكِّیۡنًا وَّ
قَالَتِ اخۡرُجۡ عَلَیۡهِنَّ ۚ فَلَمَّا رَاَیۡنَهٗۤ اَكۡبَرۡنَهٗ
وَ قَطَّعۡنَ اَیۡدِیَهُنَّ وَ قُلۡنَ حَاشَ لِلّٰهِ مَا هٰذَا
بَشَرًا ؕ اِنۡ هٰذَاۤ اِلَّا مَلَكٌ كَرِیۡمٌ ﴿۳۱﴾ قَالَتۡ
فَذٰلِكُنَّ الَّذِیۡ لُمۡتُنَّنِیۡ فِیۡهِ ؕ وَ لَقَدۡ رَاوَدۡتُّهٗ
عَنۡ نَّفۡسِهٖ فَاسۡتَعۡصَمَ ؕ وَ لَئِنۡ لَّمۡ یَفۡعَلۡ مَاۤ
اٰمُرُهٗ لَیُسۡجَنَنَّ وَ لَیَكُوۡنًا مِّنَ الصّٰغِرِیۡنَ ﴿۳۲﴾ قَالَ
رَبِّ السِّجۡنُ اَحَبُّ اِلَیَّ مِمَّا یَدۡعُوۡنَنِیۡۤ اِلَیۡهِ ۚ
وَ اِلَّا تَصۡرِفۡ عَنِّیۡ كَیۡدَهُنَّ اَصۡبُ اِلَیۡهِنَّ وَ
اَكُنۡ مِّنَ الۡجٰهِلِیۡنَ ﴿۳۳﴾ فَاسۡتَجَابَ لَهٗ رَبُّهٗ
فَصَرَفَ عَنۡهُ كَیۡدَهُنَّ ؕ اِنَّهٗ هُوَ السَّمِیۡعُ
الۡعَلِیۡمُ ﴿۳۴﴾

**30 - 34** నగర స్త్రీలు పరస్పరం, ఇలా చర్చించుకోసాగారు: "అజీజ్ భార్య[9] తన పడుచు బానిసవెంట పడినది. వలపు ఆమెను అదుపులో లేకుండా చేసింది. మా దృష్టిలో ఆమె చేసినది స్పష్టంగా తప్పు." వారి మోసపు మాటలను విని ఆమె వారికి ఆహ్వానం పంపింది. వారి కొరకు దిండ్లతో అలంకరించబడిన వేదికపై సమావేశాన్ని ఏర్పాటు చేసింది. విందులో ప్రతి ఒక్కరిముందు ఒక్కొక్క కత్తిని పెట్టింది. (తరువాత సరిగ్గా వారు పండ్లు కోసి తినే సమయంలో) ఆమె యూసుఫ్‌కు సైగ చేసింది "వీరి ముందుకు రా" అని. ఆ స్త్రీల చూపులు అతనిపై పడినప్పుడు, వారు దిగ్భ్రమచెందారు. తమ చేతులను కోసుకున్నారు. అప్రయత్నంగా ఇలా అరిచారు: "హాషాలిల్లాహ్! (అల్లాహ్ మహిమ) ఇతను మానవుడు కాదు. ఇతను ఎవరో గొప్ప దైవదూతయే." అప్పుడు అజీజ్ భార్య ఇలా అన్నది: "చూశారా, ఇతనే ఆ మనిషి, ఇతనిని గురించే మీరు నాపై నిందలు వేశారు. నిస్సందేహంగా నేను ఇతనిని మోహింప చేయటానికి ప్రయత్నించాను. కాని, ఇతడు తప్పించుకున్నాడు. ఇతడు గనక నా మాట వినకపోతే చెరసాల పాలౌతాడు, తీవ్ర అవమానానికి గురిఅవుతాడు." యూసుఫ్ ఇలా అన్నాడు: "నా ప్రభూ, చెరసాల నాకు ఇష్టమే, వారు కోరే పనిని చెయ్యటం కంటే. నీవు గనక వారి జిత్తుల నుండి నన్ను తప్పించకపోతే నేను వారి వలలో చిక్కుకుపోతాను. అజ్ఞానులలో కలసిపోతాను"- అతని ప్రభువు అతని ప్రార్థనను అంగీకరించాడు. ఆ స్త్రీల జిత్తుల నుండి అతనిని తప్పించాడు. నిస్సందేహంగా ఆయనే అందరి మొరలనూ వినేవాడు, అంతా తెలిసినవాడు.

---

వ్యక్తి ఒక పాపకార్యానికి దూరంగా ఉండేందుకు అల్లాహ్‌కు బదులుగా ఒక దాసునికి భయపడటం అనేది ఆయన హోదాకు తగినది కాదు. ఏ ప్రవక్త అయినా ఎప్పుడైనా అల్లాహ్‌ను కాక మరొకరిని తన ప్రభువు అని పిలిచినట్లు ఖురానులో ఎక్కడా ఉదాహరణ లేదు.

7. బుర్‌హాన్ అంటే నిదర్శనం, వాదం అని భావం. ప్రభువు నిదర్శనం అంటే అర్థం, అల్లాహ్ ప్రేరణవల్ల తోచిన నిదర్శనం. దానివల్లనే హజ్రత్ యూసుఫ్ (అస్సలామ్) అంతరాత్మ ఆయన మనస్సును, ఆ స్త్రీ ఆహ్వానాన్ని అంగీకరించటం నీకు తగదు అని ఒప్పించింది. ఆ నిదర్శనం దీనికి ముందు వాక్యంలో ఇలా వచ్చింది : "నా ప్రభువు నాకు మంచి వసతిని ప్రసాదించాడు. నేను ఈ పని ఎలా చెయ్యను? అటువంటి దుర్మార్గులు ఎన్నటికీ సాఫల్యం పొందలేరు."

ثُمَّ بَدَا لَهُمْ مِّنْ بَعْدِ مَا رَاَوُا الْاٰيٰتِ
لَيَسْجُنُنَّهٗ حَتّٰى حِيْنٍ ﴿٣٥﴾ وَ دَخَلَ مَعَهُ السِّجْنَ ع
فَتَيٰنِ ؕ قَالَ اَحَدُهُمَاۤ اِنِّيْۤ اَرٰىنِيْۤ اَعْصِرُ
خَمْرًا ۚ وَ قَالَ الْاٰخَرُ اِنِّيْۤ اَرٰىنِيْۤ اَحْمِلُ فَوْقَ
رَاْسِيْ خُبْزًا تَاْكُلُ الطَّيْرُ مِنْهُ ؕ نَبِّئْنَا
بِتَاْوِيْلِهٖ ۚ اِنَّا نَرٰىكَ مِنَ الْمُحْسِنِيْنَ ﴿٣٦﴾ قَالَ
لَا يَاْتِيْكُمَا طَعَامٌ تُرْزَقٰنِهٖۤ اِلَّا نَبَّاْتُكُمَا
بِتَاْوِيْلِهٖ قَبْلَ اَنْ يَّاْتِيَكُمَا ؕ ذٰلِكُمَا مِمَّا عَلَّمَنِيْ
رَبِّيْ ؕ اِنِّيْ تَرَكْتُ مِلَّةَ قَوْمٍ لَّا يُؤْمِنُوْنَ بِاللّٰهِ
وَ هُمْ بِالْاٰخِرَةِ هُمْ كٰفِرُوْنَ ﴿٣٧﴾ وَ اتَّبَعْتُ مِلَّةَ
اٰبَآءِيْۤ اِبْرٰهِيْمَ وَ اِسْحٰقَ وَ يَعْقُوْبَ ؕ مَا كَانَ
لَنَاۤ اَنْ نُّشْرِكَ بِاللّٰهِ مِنْ شَيْءٍ ؕ ذٰلِكَ مِنْ
فَضْلِ اللّٰهِ عَلَيْنَا وَ عَلَى النَّاسِ وَلٰكِنَّ اَكْثَرَ
النَّاسِ لَا يَشْكُرُوْنَ ﴿٣٨﴾ يٰصَاحِبَيِ السِّجْنِ
ءَاَرْبَابٌ مُّتَفَرِّقُوْنَ خَيْرٌ اَمِ اللّٰهُ الْوَاحِدُ
الْقَهَّارُ ﴿٣٩﴾ مَا تَعْبُدُوْنَ مِنْ دُوْنِهٖۤ اِلَّاۤ اَسْمَآءً
سَمَّيْتُمُوْهَاۤ اَنْتُمْ وَ اٰبَآؤُكُمْ مَّاۤ اَنْزَلَ اللّٰهُ بِهَا
مِنْ سُلْطٰنٍ ؕ اِنِ الْحُكْمُ اِلَّا لِلّٰهِ ؕ اَمَرَ اَلَّا
تَعْبُدُوْۤا اِلَّاۤ اِيَّاهُ ؕ ذٰلِكَ الدِّيْنُ الْقَيِّمُ وَ لٰكِنَّ
اَكْثَرَ النَّاسِ لَا يَعْلَمُوْنَ ﴿٤٠﴾ يٰصَاحِبَيِ السِّجْنِ
اَمَّاۤ اَحَدُكُمَا فَيَسْقِيْ رَبَّهٗ خَمْرًا ۚ وَ اَمَّا
الْاٰخَرُ فَيُصْلَبُ فَتَاْكُلُ الطَّيْرُ مِنْ رَّاْسِهٖ ؕ
قُضِيَ الْاَمْرُ الَّذِيْ فِيْهِ تَسْتَفْتِيٰنِ ﴿٤١﴾

**35** తరువాత అతనిని కొంతకాలం జైలులో పెట్టాలనే ఆలోచన వారికి (పురుషులకు) తట్టింది. వాస్తవానికి వారు (అతని నిర్దోషిత్వానికీ తమ స్త్రీల దుశ్శీలతకూ సంబంధించిన) స్పష్టమైన నిదర్శనాలను కూడా చూశారు.[10]

**36 - 41** జైలులో అతనితోపాటు ఇంకా ఇద్దరు బానిసలు కూడా ప్రవేశించారు. ఒకనాడు వారిలో ఒకడు ఇలా అన్నాడు: "నేను సారాయి పిండుతూ ఉన్నట్లు నన్ను నేను కలలో చూశాను," రెండో అతను ఇలా చెప్పాడు: "నా తలపై రొట్టెలు ఉన్నాయి, వాటిని పక్షులు తింటున్నట్లు నేను చూశాను." ఉభయులూ ఇలా అడిగారు: "మాకు వాటి భావం వివరించు, మేము చూస్తూ ఉన్నాము, నీవు చాలా మంచి వాడవు." యూసుఫ్ ఇలా అన్నాడు: "ఇక్కడ మీకు ఇవ్వబడే భోజనం రాకముందు నేను ఈ స్వప్నాల భావాన్ని మీకు వివరిస్తాను. ఇది నా ప్రభువు నాకు ప్రసాదించిన విద్యల లోనిదే. అసలు విషయం ఏమిటంటే, అల్లాహ్‌ను విశ్వసించనివారి, పరలోకాన్ని తిరస్కరించే వారి విధానాన్ని నేను వదలిపెట్టి, నా పెద్దలైన ఇబ్రాహీమ్, ఇస్‌హాఖ్, యాఖూబ్‌ల విధానాన్ని అవలంబించాను. ఎవడినైనా అల్లాహ్‌కు భాగస్వామిగా చెయ్యటం మా విధానం కాదు. వాస్తవానికి ఇది అల్లాహ్ అనుగ్రహమే మనపైనా, సమస్త మానవులపైనా (ఆయన మనలను తనకు తప్ప ఇతరులెవ్వరికీ దాసులుగా చెయ్యలేదు అనేది). కాని చాలా మంది ప్రజలు కృతజ్ఞతలు చూపరు. నాతోటి ఖైదీలారా! స్వయంగా మీరే ఆలోచించండి, చాలామంది విభిన్న ప్రభువులు మేలా లేక సర్వశక్తిమంతుడు అయిన ఏకైక దేవుడు అల్లాహ్ మేలా? ఆయనను కాదని మీరు దాస్యం చేస్తున్నవారు, మీరూ మీ తాత ముత్తాతలూ కల్పించుకున్న కొన్ని పేర్లు మాత్రమే తప్ప మరొకటేమీ కాదు. వారికొరకు అల్లాహ్ ఏ నిదర్శనాన్నీ అవతరింపజెయ్యలేదు. పరిపాలించే అధికారం అల్లాహ్‌కు తప్ప మరొకరెవరికీ లేదు. ఆయనను తప్ప మీరు ఎవరి దాస్యాన్నీ చెయ్యకూడదని ఆయన ఆజ్ఞ. ఇదే శుద్ధమైన, సరియైన జీవిత విధానం. కాని ఇది చాలా మందికి తెలియదు. తోటి ఖైదీలారా! మీ స్వప్నాలకు భావం ఇదిగో, మీలో ఒకడు తన ప్రభువు (ఈజిప్టు పాదుషా[11])నకు త్రాగటానికి మధువును అందిస్తాడు. ఇక రెండో అతను, అతడు శిలువ వేయబడతాడు. పక్షులు అతని తలను పొడిచి పొడిచీ తింటాయి. మీరు అడిగిన విషయం పరిష్కారమై పోయింది."

**42** వారిలో విడుదల అవుతాడు అని తాను భావించిన వానితో యూసుఫ్ ఇలా అన్నాడు: "నీ ప్రభువు (ఈజిప్టు రాజు) దగ్గర నా ప్రస్తావన చెయ్యి." కాని షైతాను అతనిని మరుపునకు లోనుచేశాడు. అతడు తన ప్రభువు (ఈజిప్టు రాజు) దగ్గర అతనిని గురించి ప్రస్తావించటం మరచిపోయాడు. అందుచేత యూసుఫ్ జైలులోనే ఎన్నో సంవత్సరాలు ఉండిపోయాడు.

**43 - 44** ఒకరోజు[12] రాజు ఇలా అన్నాడు: "నేను కలలో చూశాను. బలిసిన ఏడు ఆవులను బక్కచిక్కిన ఏడు ఆవులు తింటున్నాయి. ఏడు ధాన్యపు వెన్నులు పచ్చగా ఉన్నాయి. మరొక ఏడు ఎండిపోయి ఉన్నాయి. సభా సదులారా! మీకు స్వప్నాల అర్థం తెలిస్తే నాకు ఈ స్వప్నఫలాన్ని వివరించండి." వారు ఇలా చెప్పారు: "ఇవి పీడ కలలకు సంబంధించిన విషయాలు. మాకు ఇటువంటి కలల భావం తెలియదు."

**45** ఆ ఇద్దరు ఖైదీలలో విడుదలయిపోయిన వ్యక్తికి చాలా కాలం తరువాత ఇప్పుడు విషయం గుర్తుకు వచ్చింది. అతడు ఇలా అన్నాడు: "నేను మీకు దీని ఫలాన్ని వివరిస్తాను. నన్ను కొంచెం (జైలులోని యూసుఫ్ వద్దకు) పంపండి."

**46 - 49** అతడు అక్కడకు పోయి ఇలా అన్నాడు: "యూసుఫ్, నిలువెల్ల సత్యమైనవాడా![13] నాకు ఈ స్వప్న ఫలాన్ని తెలుపు. ఏడు లావుపాటి ఆవులను, ఏడు సన్నపాటి ఆవులు తింటున్నాయి. ఏడు వెన్నులు పచ్చగా ఉంటే, మరొక ఏడు ఎండిపోయి ఉన్నాయి. బహుశా నేను వారివద్దకు తిరిగి వెళతాను. అప్పుడు వారు తెలుసుకుంటారు."[14] యూసుఫ్ ఇలా అన్నాడు: "ఏడు సంవత్సరాల వరకు మీరు ఎడతెగకుండా సేద్యం చేస్తూ ఉంటారు. ఆ కాలంలో మీరు కోసిన పంటలో కొంతభాగాన్ని మీకు ఆహారంగా పనికివచ్చేటందుకు తీసిపెట్టుకోండి. మిగతా భాగాన్ని వెన్నులలోనే ఉంచండి. తరువాతి ఏడు సంవత్సరాలు బహు గడ్డుగా ఉంటాయి. ఆ కాలంలో అప్పటికొరకు మీరు నిలువచేసి ఉంచిన ధాన్యం మొత్తం మీరు తింటారు. ఒకవేళ కొద్దిగా ఏమైనా మిగిలితే, అది మీరు దాచిపెట్టి ఉంచు కున్నదే. దాని తరువాత మరొక సంవత్సరం వస్తుంది, అప్పుడు ప్రజల మొరలను ఆలకించి పుష్కలమైన వర్షాలతో వారిని ఆదుకోవటం జరుగుతుంది. వారు రసాన్ని పిండుతారు."

وَقَالَ لِلَّذِيْ ظَنَّ اَنَّهٗ نَاجٍ مِّنْهُمَا اذْكُرْنِيْ
عِنْدَ رَبِّكَ ۫ فَاَنْسٰىهُ الشَّيْطٰنُ ذِكْرَ رَبِّهٖ
فَلَبِثَ فِي السِّجْنِ بِضْعَ سِنِيْنَ ۟﴿٤٢﴾ وَقَالَ ع ٥/١٥
الْمَلِكُ اِنِّيْۤ اَرٰى سَبْعَ بَقَرٰتٍ سِمَانٍ
يَّاْكُلُهُنَّ سَبْعٌ عِجَافٌ وَّسَبْعَ سُنْۢبُلٰتٍ خُضْرٍ
وَّاُخَرَ يٰبِسٰتٍ ؕ يٰۤاَيُّهَا الْمَلَاُ اَفْتُوْنِيْ فِيْ
رُءْيَايَ اِنْ كُنْتُمْ لِلرُّءْيَا تَعْبُرُوْنَ ﴿٤٣﴾ قَالُوْۤا
اَضْغَاثُ اَحْلَامٍ ۚ وَمَا نَحْنُ بِتَاْوِيْلِ
الْاَحْلَامِ بِعٰلِمِيْنَ ﴿٤٤﴾ وَقَالَ الَّذِيْ نَجَا مِنْهُمَا
وَادَّكَرَ بَعْدَ اُمَّةٍ اَنَا اُنَبِّئُكُمْ بِتَاْوِيْلِهٖ
فَاَرْسِلُوْنِ ﴿٤٥﴾ يُوْسُفُ اَيُّهَا الصِّدِّيْقُ اَفْتِنَا
فِيْ سَبْعِ بَقَرٰتٍ سِمَانٍ يَّاْكُلُهُنَّ سَبْعٌ عِجَافٌ
وَّسَبْعِ سُنْۢبُلٰتٍ خُضْرٍ وَّاُخَرَ يٰبِسٰتٍ ۙ لَّعَلِّيْۤ
اَرْجِعُ اِلَى النَّاسِ لَعَلَّهُمْ يَعْلَمُوْنَ ﴿٤٦﴾ قَالَ
تَزْرَعُوْنَ سَبْعَ سِنِيْنَ دَاَبًا ۚ فَمَا حَصَدْتُّمْ
فَذَرُوْهُ فِيْ سُنْۢبُلِهٖۤ اِلَّا قَلِيْلًا مِّمَّا تَاْكُلُوْنَ ﴿٤٧﴾
ثُمَّ يَاْتِيْ مِنْۢ بَعْدِ ذٰلِكَ سَبْعٌ شِدَادٌ يَّاْكُلْنَ مَا
قَدَّمْتُمْ لَهُنَّ اِلَّا قَلِيْلًا مِّمَّا تُحْصِنُوْنَ ﴿٤٨﴾ ثُمَّ
يَاْتِيْ مِنْۢ بَعْدِ ذٰلِكَ عَامٌ فِيْهِ يُغَاثُ النَّاسُ
وَفِيْهِ يَعْصِرُوْنَ ﴿٤٩﴾ ع ٦/١٦

| | |
|---|---|
| **50 - 51** రాజు ఇలా అన్నాడు: "అతనిని నా వద్దకు తీసుకురండి." కాని రాజదూత యూసుఫ్ వద్దకు వెళ్ళినప్పుడు యూసుఫ్ ఇలా అన్నాడు: "నీ ప్రభువు వద్దకు తిరిగి వెళ్ళు. తమ చేతులను కోసుకున్న నారీమణుల వ్యవహారం గురించి అతనిని అడుగు. నా ప్రభువునకు వారి జిత్తులను గురించి బాగానే తెలుసు." ఆపై రాజు ఆ స్త్రీలను ఇలా విచారించాడు: "మీరు యూసుఫ్‌ను మోహింపజెయ్యటానికి ప్రయత్నించినప్పుడు మీకు కలిగిన అనుభవం ఎటువంటిది?" వారందరూ ఏకవాక్యంగా ఇలా అన్నారు: "హాషాలిల్లాహ్! (దేవుడు మమ్మల్ని రక్షించుగాక). మేము అతనిలో దోషలేశాన్ని కూడా చూడలేదు." అజీజ్ భార్య ఇలా అన్నది: "ఇప్పుడు నిజం బయటపడింది. అతనిని మరులు గొల్పటానికి ప్రయత్నించింది నేనే. నిస్సందేహంగా అతడు పూర్తిగా సత్యవంతుడు." **52 - 53** (యూసుఫ్ ఇలా అన్నాడు): ఇలా చెయ్యటంలో నా ఉద్దేశ్యం ఏమిటంటే, నేను చాటుమాటుగా అతనికి ద్రోహం చెయ్యలేదనీ, ద్రోహుల జిత్తులను అల్లాహ్ పారనీయడనీ (అజీజ్) తెలుసుకోవాలి. నేను నా మనస్సు నిర్దోషిత్వాన్ని చాటుకోవటం లేదు. మనస్సు చెడుకై ప్రేరేపిస్తూనే ఉంటుంది, నా ప్రభువు కరుణించినవారిని తప్ప. నిస్సందేహంగా నా ప్రభువు క్షమించేవాడూ, కరుణించేవాడూను. | وَ قَالَ الْمَلِكُ ائْتُوْنِيْ بِهٖ ۚ فَلَمَّا جَآءَهُ الرَّسُوْلُ قَالَ ارْجِعْ اِلٰى رَبِّكَ فَسْـَٔلْهُ مَا بَالُ النِّسْوَةِ الّٰتِيْ قَطَّعْنَ اَيْدِيَهُنَّ ؕ اِنَّ رَبِّيْ بِكَيْدِهِنَّ عَلِيْمٌ ﴿٥٠﴾ قَالَ مَا خَطْبُكُنَّ اِذْ رَاوَدْتُّنَّ يُوْسُفَ عَنْ نَّفْسِهٖ ؕ قُلْنَ حَاشَ لِلّٰهِ مَا عَلِمْنَا عَلَيْهِ مِنْ سُوْٓءٍ ؕ قَالَتِ امْرَاَتُ الْعَزِيْزِ الْـٰٔنَ حَصْحَصَ الْحَقُّ ۫ اَنَا رَاوَدْتُّهٗ عَنْ نَّفْسِهٖ وَ اِنَّهٗ لَمِنَ الصّٰدِقِيْنَ ﴿٥١﴾ ذٰلِكَ لِيَعْلَمَ اَنِّيْ لَمْ اَخُنْهُ بِالْغَيْبِ وَ اَنَّ اللّٰهَ لَا يَهْدِيْ كَيْدَ الْخَآئِنِيْنَ ﴿٥٢﴾ وَ مَاۤ اُبَرِّئُ نَفْسِيْ ۚ اِنَّ النَّفْسَ لَاَمَّارَةٌۢ بِالسُّوْٓءِ اِلَّا مَا رَحِمَ رَبِّيْ ؕ اِنَّ رَبِّيْ غَفُوْرٌ رَّحِيْمٌ ﴿٥٣﴾ |

8. దీని భావం ఏమిటంటే, ఒకవేళ యూసుఫ్ (అస్సలామ్) చొక్కా ముందు భాగంలో చినిగివున్నట్లయితే యూసుఫ్ (అస్సలామ్) బలాత్కారం చేశారు. స్త్రీ తనను తాను రక్షించుకోవటానికి పెనుగులాడింది అనే విషయాన్ని ఇది స్పష్టంగా సూచిస్తుంది. కాని ఒకవేళ యూసుఫ్ (అస్సలామ్) చొక్కా వెనుక భాగంలో చినిగివుంటే, స్త్రీ ఆయన వెంటపడింది, యూసుఫ్ (అస్సలామ్) ఆమెను తప్పించుకొని వెళ్ళిపోవాలనుకున్నారు అనే యథార్థం స్పష్టంగా రూఢి అవుతుంది. ఇదికాక నిర్ధారణకు ఈ సాక్ష్యంలో మరొక సాక్ష్యం కూడా దాగి ఉంది. అదేమిటంటే, ఆ వ్యక్తి కేవలం యూసుఫ్ (అస్సలామ్) చొక్కానే సాక్ష్యంగా ఎత్తిచూపాడు. దీనివల్ల విశదమయిందేమిటంటే, స్త్రీ ఒంటిపై గాని ఆమె బట్టలపైగాని బలాత్కారం చేసిన గుర్తులు అసలు లేనేలేవు. వాస్తవానికి ఒకవేళ ఈ కేసు మానభంగ ప్రయత్నానికి సంబంధించినదైనట్లయితే, స్త్రీపై దాని యొక్క స్పష్టమైన గుర్తులు కనిపించేవి.

9. అజీజ్ ఆ మనిషి పేరు కాదు. ఈజిప్టులో అత్యున్నత అధికారం కల మనిషికి సాధారణంగా ఈ బిరుదు ఉపయోగించబడేది.

10. దీనివల్ల తెలిసిందేమిటంటే, ఒక వ్యక్తిని న్యాయసూత్రాల ప్రకారం కేసు పెట్టి న్యాయస్థానంలో నేరస్తుడుగా నిరూపించకుండా, కేవలం ఇట్టే పట్టుకుని జైలుకు పంపటం దుర్మార్గపు ప్రభుత్వాధినేతల పాత సంప్రదాయం. ఈ విషయంలో కూడా నేటి షైతానులు నాలుగువేల సంవత్సరాలకు పూర్వం ఈజిప్టును పాలించిన దుర్మార్గులకు ఏమాత్రం తీసిపోరు.

11. 23వ ఆయత్‌తో ఈ ఆయత్‌ను కలిపి చదివితే తెలిసేదేమిటంటే, యూసుఫ్ (అస్సలామ్) "నా ప్రభువు" అని అన్నప్పుడు దానికి అల్లాహ్ అని అర్థం. ఈజిప్ట్ రాజు యొక్క బానిసతో, "నీ ప్రభువుకు మధువును త్రాగిస్తావు" అని అన్నప్పుడు, దానికి ఈజిప్టు రాజు అని అర్థం. ఎందుకంటే, అతడు ఈజిప్టు రాజునే తన ప్రభువుగా భావించేవాడు.

وَ قَالَ الْمَلِكُ ائْتُوْنِيْ بِهٖۤ اَسْتَخْلِصْهُ لِنَفْسِيْ ۚ
فَلَمَّا كَلَّمَهٗ قَالَ اِنَّكَ الْيَوْمَ لَدَيْنَا مَكِيْنٌ
اَمِيْنٌ ﴿٥٤﴾ قَالَ اجْعَلْنِيْ عَلٰى خَزَآئِنِ
الْاَرْضِ ۚ اِنِّيْ حَفِيْظٌ عَلِيْمٌ ﴿٥٥﴾ وَ كَذٰلِكَ مَكَّنَّا
لِيُوْسُفَ فِي الْاَرْضِ ۚ يَتَبَوَّاُ مِنْهَا حَيْثُ
يَشَآءُ ؕ نُصِيْبُ بِرَحْمَتِنَا مَنْ نَّشَآءُ وَ لَا
نُضِيْعُ اَجْرَ الْمُحْسِنِيْنَ ﴿٥٦﴾ وَ لَاَجْرُ الْاٰخِرَةِ
خَيْرٌ لِّلَّذِيْنَ اٰمَنُوْا وَ كَانُوْا يَتَّقُوْنَ ﴿٥٧﴾ وَ جَآءَ
اِخْوَةُ يُوْسُفَ فَدَخَلُوْا عَلَيْهِ فَعَرَفَهُمْ وَ هُمْ
لَهٗ مُنْكِرُوْنَ ﴿٥٨﴾ وَ لَمَّا جَهَّزَهُمْ بِجَهَازِهِمْ
قَالَ ائْتُوْنِيْ بِاَخٍ لَّكُمْ مِّنْ اَبِيْكُمْ ۚ اَلَا تَرَوْنَ
اَنِّيْۤ اُوْفِي الْكَيْلَ وَ اَنَا خَيْرُ الْمُنْزِلِيْنَ ﴿٥٩﴾
فَاِنْ لَّمْ تَاْتُوْنِيْ بِهٖ فَلَا كَيْلَ لَكُمْ عِنْدِيْ وَ لَا
تَقْرَبُوْنِ ﴿٦٠﴾ قَالُوْا سَنُرَاوِدُ عَنْهُ اَبَاهُ وَ اِنَّا
لَفٰعِلُوْنَ ﴿٦١﴾ وَ قَالَ لِفِتْيٰنِهِ اجْعَلُوْا بِضَاعَتَهُمْ
فِيْ رِحَالِهِمْ لَعَلَّهُمْ يَعْرِفُوْنَهَاۤ اِذَا انْقَلَبُوْۤا اِلٰۤى
اَهْلِهِمْ لَعَلَّهُمْ يَرْجِعُوْنَ ﴿٦٢﴾

ع

**54** రాజు ఇలా అన్నాడు: అతనిని నా వద్దకు తీసుకురండి. నేను అతనిని ప్రత్యేకంగా నా కోసం వినియోగించుకుంటాను...

**54 - 55** ... యూసుఫ్ అతనితో మాట్లాడినప్పుడు అతను అలా అన్నాడు: "ఇప్పుడు మీకు మా వద్ద గౌరవప్రదమైన స్థానం ఉన్నది. మీరు విశ్వసనీయులు. మాకు మీపై పూర్తి నమ్మకం ఉంది." యూసుఫ్ ఇలా అన్నాడు: "దేశంలోని ఖజానాలను నాకు అప్పగించండి. వాటిని నేను రక్షించగలను. అందుకు తగిన జ్ఞానం నాకు ఉన్నది."

**56 - 57** ఇలా మేము ఆ భూభాగంపై యూసుఫ్ కొరకు అధికార మార్గాన్ని సుగమం చేశాము. ఆ భూభాగంపై తాను కోరినచోట తన స్థానాన్ని ఏర్పాటు చేసుకునే హక్కు అతనికి ఉన్నది.[15] మాకు ఇష్టమైనవారికి మా కారుణ్యభాగ్యాన్ని మేము కలుగజేస్తాము. సజ్జనుల ప్రతిఫలం మా వద్ద వృధా కాదు. విశ్వసించి భయభక్తులతో వ్యవహరించే వారికి పరలోక ప్రతిఫలమే ఎక్కువ ఉత్తమమైనది.

**58 - 62** యూసుఫ్ సోదరులు ఈజిప్టుకు వచ్చారు. అతని ముందు హాజరయ్యారు.[16] అతను వారిని గుర్తుపట్టాడు. కాని వారు అతనిని గుర్తు పట్టలేదు. తరువాత అతను వారి సామానును సిద్ధం చేయించి వారు బయలుదేరుతుండగా వారితో ఇలా అన్నాడు: "మీ మారు సోదరుణ్ణి నా వద్దకు తీసుకురండి. నేను ఎలా కొలపాత్రను నింపి ఇస్తున్నానో, ఎంత చక్కగా అతిథులను సత్కరిస్తున్నానో మీరు చూడటం లేదా! మీరు గనక అతనిని తీసుకురాకపోతే, మీకు నా వద్ద ధాన్యం లభించదు. మీరు నా దరిదాపులకు కూడా రావద్దు.[17] వారు ఇలా అన్నారు: "తండ్రిగారు అతనిని పంపటానికి సమ్మతించేలా మేము ప్రయత్నం చేస్తాము. మేము అలా తప్పకుండా చేస్తాము." యూసుఫ్ తన నౌకర్లకు సంజ్ఞ చేశాడు: "వారు ధాన్యానికి బదులుగా ఇచ్చిన సొమ్మును మెల్లగా వాళ్ళ సామానులోనే పెట్టెయ్యండి." వారు ఇంటికి చేరి, తిరిగి పొందిన తమ సొమ్మును గుర్తిస్తారనీ, (లేక ఈ దాతృత్వానికి కృతజ్ఞులౌతారనీ) వారు తిరిగివచ్చినా ఆశ్చర్యం లేదనీ ఆశించి యూసుఫ్ ఇలా చేశాడు.

12. మధ్యలో ఎన్నో సంవత్సరాలు జైలులో ఉన్న కాలంనాటి వివరాలను వదలిపెట్టి, ఇప్పుడు కథ హజ్రత్ యూసుఫ్ (అస్సలామ్) లోకంలో ఉన్నతస్థితి పొందిన నాటి నుంచి తిరిగి ప్రారంభమవుతోంది.

فَلَمَّا رَجَعُوْٓا اِلٰٓى اَبِيْهِمْ قَالُوْا يٰٓاَبَانَا مُنِعَ مِنَّا
الْكَيْلُ فَاَرْسِلْ مَعَنَآ اَخَانَا نَكْتَلْ وَ اِنَّا لَهٗ
لَحٰفِظُوْنَ ﴿٦٣﴾ قَالَ هَلْ اٰمَنُكُمْ عَلَيْهِ اِلَّا كَمَآ
اَمِنْتُكُمْ عَلٰٓى اَخِيْهِ مِنْ قَبْلُ ؕ فَاللّٰهُ خَيْرٌ
حٰفِظًا ۪ وَّ هُوَ اَرْحَمُ الرّٰحِمِيْنَ ﴿٦٤﴾ وَ لَمَّا
فَتَحُوْا مَتَاعَهُمْ وَجَدُوْا بِضَاعَتَهُمْ رُدَّتْ
اِلَيْهِمْ ؕ قَالُوْا يٰٓاَبَانَا مَا نَبْغِيْ ؕ هٰذِهٖ
بِضَاعَتُنَا رُدَّتْ اِلَيْنَا ۚ وَ نَمِيْرُ اَهْلَنَا وَ
نَحْفَظُ اَخَانَا وَ نَزْدَادُ كَيْلَ بَعِيْرٍ ؕ ذٰلِكَ
كَيْلٌ يَّسِيْرٌ ﴿٦٥﴾ قَالَ لَنْ اُرْسِلَهٗ مَعَكُمْ حَتّٰى
تُؤْتُوْنِ مَوْثِقًا مِّنَ اللّٰهِ لَتَاْتُنَّنِيْ بِهٖٓ اِلَّآ اَنْ
يُّحَاطَ بِكُمْ ۚ فَلَمَّآ اٰتَوْهُ مَوْثِقَهُمْ قَالَ اللّٰهُ
عَلٰى مَا نَقُوْلُ وَكِيْلٌ ﴿٦٦﴾ وَقَالَ يٰبَنِيَّ لَا
تَدْخُلُوْا مِنْۢ بَابٍ وَّاحِدٍ وَّادْخُلُوْا مِنْ اَبْوَابٍ
مُّتَفَرِّقَةٍ ؕ وَ مَآ اُغْنِيْ عَنْكُمْ مِّنَ اللّٰهِ مِنْ
شَيْءٍ ؕ اِنِ الْحُكْمُ اِلَّا لِلّٰهِ ؕ عَلَيْهِ تَوَكَّلْتُ ۚ
وَعَلَيْهِ فَلْيَتَوَكَّلِ الْمُتَوَكِّلُوْنَ ﴿٦٧﴾ وَ لَمَّا دَخَلُوْا
مِنْ حَيْثُ اَمَرَهُمْ اَبُوْهُمْ ؕ مَا كَانَ يُغْنِيْ
عَنْهُمْ مِّنَ اللّٰهِ مِنْ شَيْءٍ اِلَّا حَاجَةً فِيْ نَفْسِ
يَعْقُوْبَ قَضٰىهَا ؕ وَ اِنَّهٗ لَذُوْ عِلْمٍ لِّمَا عَلَّمْنٰهُ
وَلٰكِنَّ اَكْثَرَ النَّاسِ لَا يَعْلَمُوْنَ ﴿٦٨﴾ ع ٨ ١١ ٢

**63 - 68** వారు తమ తండ్రివద్దకు పోయి ఇలా అన్నారు: "నాన్నా! ఇక ముందు మనకు ధాన్యం ఇవ్వటానికి తిరస్కరించారు. కనుక, ధాన్యం తెచ్చేందుకు మీరు మా తమ్ముణ్ణి మాతోపాటు పంపండి. అతనిని రక్షించే బాధ్యత మాది." తండ్రి ఇలా సమాధానం చెప్పాడు : "నేను అతని విషయం లో మిమ్మల్ని ఇదివరకు అతని సోదరుని విషయంలో నమ్మినట్లుగానే నమ్మాలా? అల్లాహ్‌యే ఉత్తమ రక్షకుడు. ఆయనే అందరికంటే అధికంగా కరుణించేవాడు." తరువాత వారు తమ సామాను సంచులు విప్పగా, వారిసొమ్ము వారికి తిరిగి ఇవ్వబడినట్లు గమనించారు. ఇది చూచి వారు ఇలా అరిచారు: "నాన్నా! ఇంకా మనకేం కావాలి, చూడండి! మన సొమ్ము కూడ మనకు తిరిగి ఇవ్వబడింది. కనుక ఇక మేము వెళ్ళుతాము. మా ఆలుబిడ్డల కొరకు ఆహారపదార్థాలను తీసుకొనివస్తాము. మా సోదరుని రక్షణ విషయం కూడా చూసుకుంటాము. అదనంగా ఒక ఒంటె మోసే బరువు ధాన్యాన్ని కూడా తీసుకువస్తాము. ఇంత అదనంగా ధాన్యం తేలికగా లభిస్తుంది." వారి తండ్రి ఇలా అన్నాడు: "నేను అతనిని మీవెంట ఎంత మాత్రం పంపను, అతనిని తప్పకుండా తిరిగి నా వద్దకు తీసుకుని వస్తామని, అల్లాహ్ పేరుతో నా ముందు మీరు ప్రమాణం చేస్తే తప్ప. మీరు ముట్టడికి గురి అయితే అది వేరే విషయం. వారు అతని ముందు తమ తమ ప్రమాణాలను చేసినప్పుడు అతను ఇలా అన్నాడు: "చూడండి! మన ఈ మాటలను అల్లాహ్ గమనిస్తున్నాడు." అతను ఇలా అన్నాడు: "కుమారులారా! ఈజిప్టు రాజధాని లోనికి ఒకే ద్వారం గుండా ప్రవేశించకండి.[18] విభిన్న ద్వారాల గుండా పొండి. కాని నేను అల్లాహ్ సంకల్పం నుండి మిమ్మల్ని కాపాడలేను. ఆజ్ఞ ఆయనది తప్ప మరెవరిదీ చెల్లదు. ఆయననే నేను నమ్ముకున్నాను. నమ్మదలచుకున్న వారందరూ ఆయననే నమ్ముకోవాలి. జరిగింది కూడా అదే. వారు తమ తండ్రి ఆజ్ఞానుసారం నగరంలో (విభిన్న ద్వారాల గుండా) ప్రవేశించినప్పుడు, అతని ఈ ముందు జాగ్రత్త చర్య అల్లాహ్ సంకల్పం ముందు దేనికీ పనికి రాకుండా పోయింది. యాఖూబ్ తన మనస్సులో ఉన్న సంకోచాన్ని నివృత్తి చేసుకోవటానికి- తనకు తోచిన కృషి చేశాడు, అంతే. నిస్సందేహంగా అతను మేము నేర్పిన విద్యవల్ల జ్ఞాని అయ్యాడు. కాని చాలామంది వ్యవహారానికి సంబంధించిన యథార్థాన్ని ఎరుగరు.

وَ لَمَّا دَخَلُوۡا عَلٰی یُوۡسُفَ اٰوٰۤی اِلَیۡہِ اَخَاہُ
قَالَ اِنِّیۡۤ اَنَا اَخُوۡکَ فَلَا تَبۡتَئِسۡ بِمَا کَانُوۡا
یَعۡمَلُوۡنَ ﴿۶۹﴾ فَلَمَّا جَہَّزَہُمۡ بِجَہَازِہِمۡ جَعَلَ
السِّقَایَۃَ فِیۡ رَحۡلِ اَخِیۡہِ ثُمَّ اَذَّنَ مُؤَذِّنٌ
اَیَّتُہَا الۡعِیۡرُ اِنَّکُمۡ لَسٰرِقُوۡنَ ﴿۷۰﴾ قَالُوۡا وَ اَقۡبَلُوۡا
عَلَیۡہِمۡ مَّاذَا تَفۡقِدُوۡنَ ﴿۷۱﴾ قَالُوۡا نَفۡقِدُ صُوَاعَ
الۡمَلِکِ وَ لِمَنۡ جَآءَ بِہٖ حِمۡلُ بَعِیۡرٍ وَّ اَنَا بِہٖ
زَعِیۡمٌ ﴿۷۲﴾ قَالُوۡا تَاللّٰہِ لَقَدۡ عَلِمۡتُمۡ مَّا جِئۡنَا
لِنُفۡسِدَ فِی الۡاَرۡضِ وَ مَا کُنَّا سٰرِقِیۡنَ ﴿۷۳﴾ قَالُوۡا
فَمَا جَزَآؤُہٗۤ اِنۡ کُنۡتُمۡ کٰذِبِیۡنَ ﴿۷۴﴾ قَالُوۡا
جَزَآؤُہٗ مَنۡ وُّجِدَ فِیۡ رَحۡلِہٖ فَہُوَ جَزَآؤُہٗ ؕ
کَذٰلِکَ نَجۡزِی الظّٰلِمِیۡنَ ﴿۷۵﴾ فَبَدَاَ بِاَوۡعِیَتِہِمۡ
قَبۡلَ وِعَآءِ اَخِیۡہِ ثُمَّ اسۡتَخۡرَجَہَا مِنۡ وِّعَآءِ
اَخِیۡہِ ؕ کَذٰلِکَ کِدۡنَا لِیُوۡسُفَ ؕ مَا کَانَ
لِیَاۡخُذَ اَخَاہُ فِیۡ دِیۡنِ الۡمَلِکِ اِلَّاۤ اَنۡ یَّشَآءَ
اللّٰہُ ؕ نَرۡفَعُ دَرَجٰتٍ مَّنۡ نَّشَآءُ ؕ وَ فَوۡقَ کُلِّ
ذِیۡ عِلۡمٍ عَلِیۡمٌ ﴿۷۶﴾

**69** వారు యూసుఫ్ సమక్షానికి పోయినప్పుడు అతను తన వద్దకు తన సొంత సోదరుణ్ణి వేరుగా పిలిపించుకున్నాడు. అతనికి ఇలా తెలిపాడు: "నేను (తప్పిపోయిన) నీ అన్నయ్యనే. వారు చేస్తూ ఉండిన పనులకు నీవు ఇప్పుడు చింతించకు."[19]

**70 - 76** తన సోదరుల సామాను బస్తాలకు ఎత్తించే ఏర్పాట్లు చేస్తూ, యూసుఫ్ తన సొంత సోదరుని సామానులో తన పాత్రను పెట్టాడు. ప్రకటనలు చేసే ఉద్యోగి ఒకడు ఎలుగెత్తి ఇలా అన్నాడు: "బిడారు జనులారా! అసలు మీరు దొంగలు." వారు వెనుకకు తిరిగి ఇలా అడిగారు: "మీదే వస్తువు పోయిందేమిటీ?" ప్రభుత్వోద్యోగులు ఇలా అన్నారు: "రాజు గారి పాత్ర మాకు కనిపించటం లేదు." (వారి జమేదారు ఇలా అన్నాడు): "దానిని తెచ్చినవారికి ఒక ఒంటె బరువు ధాన్యం బహుమానంగా లభిస్తుంది. ఆ బాధ్యత నాది." ఆ సోదరులు ఇలా అన్నారు: "అల్లాహ్ మీద ఒట్టు! మీకు బాగా తెలుసు. మేము ఈ దేశంలో సంక్షోభం సృష్టించటానికి రాలేదు. మేము దొంగతనాలు చేసేవాళ్ళం కాము." వారు ఇలా అన్నారు: "సరే, మీ మాట అబద్ధమని తేలితే అప్పుడు దొంగకు శిక్ష ఏమిటి?" వారు ఇలా పలికారు: "వాడికి శిక్ష ఏమిటా? ఎవడి సామానులో వస్తువు దొరుకుతుందో అతడే తనకు శిక్షగా బానిసగా ఉంచుకోబడాలి. మావద్ద అటువంటి దుర్మార్గులను శిక్షించే పద్ధతి ఇదే." అప్పుడు యూసుఫ్ తన సొంత సోదరుని సంచి వెతికేముందు మారు సోదరుల సంచులను వెతకటం ప్రారంభించాడు. తరువాత, తన సోదరుని సంచి నుండి పోయిన వస్తువును బయటకు తీశాడు. ఈ విధంగా మేము యూసుఫ్‌కు మా యుక్తి ద్వారా సహాయపడ్డాము. రాజ ధర్మం (అంటే ఈజిప్టు రాజ శాసనం) ప్రకారం తన సోదరుణ్ణి బంధించటం అతనికి తగదు. ఒకవేళ అల్లాహ్‌యే అలా కోరితే తప్ప.[20] మేము కోరిన వారి స్థానాలను పెంచుతాము. జ్ఞానులందరినీ మించిన జ్ఞాని ఒకడు ఉన్నాడు.

---

13. అసలు "సిద్దీఖ్" అనే పదం ఉపయోగించబడింది. అది అరబ్బీ భాషలో పరమ నిజాయితీ, పరమ సత్యసంధత అనే అర్థాలలో వాడబడుతుంది. దానిద్వారా కారాగార నివాసకాలంలో ఆ వ్యక్తి యూసుఫ్ (అస్సలామ్) పరిశుద్ధ శీలాన్ని చూసి ఎంతో ప్రభావితుడయ్యాడనీ, ఇంకా ఈ ప్రభావం ఒక సుదీర్ఘకాలం తరువాత కూడా చెరిగిపోలేదనీ విశదమవుతోంది.

قَالُوْٓا اِنْ يَّسْرِقْ فَقَدْ سَرَقَ اَخٌ لَّهٗ مِنْ قَبْلُ ۚ فَاَسَرَّهَا يُوْسُفُ فِيْ نَفْسِهٖ وَلَمْ يُبْدِهَا لَهُمْ ۚ قَالَ اَنْتُمْ شَرٌّ مَّكَانًا ۚ وَاللّٰهُ اَعْلَمُ بِمَا تَصِفُوْنَ ﴿٧٧﴾

**77** సోదరులు అన్నారు: "ఇతడు గనక దొంగతనం చేస్తే ఇది అంత ఆశ్చర్యకరమైన విషయమేమీ కాదు. ఇదివరకు ఇతని సోదరుడు (యూసుఫ్) కూడా దొంగతనం చేసి ఉన్నాడు." యూసుఫ్ వారి ఈ మాటలను విని తన భావాలను అణచివుంచాడు. యథార్థాన్ని వారిముందు బయటపెట్ట లేదు. అయితే (లోలోన) మాత్రం ఇలా అనుకున్నాడు: "మీరు చాలా దుర్మార్గులు. (నా ముఖం మీదే) నాపై మీరు మోపుతున్న అభియోగం యొక్క వాస్తవాన్ని అల్లాహ్ బాగా ఎరుగును."

14. అంటే, మీ విలువను, మీ స్థానాన్ని వారు తెలుసుకుంటారు. ఎంత గొప్ప మనిషిని వారు ఎక్కడ బంధించి ఉంచారో తెలుసుకుంటారు. ఈ విధంగా నేను జైలులో ఉన్నప్పుడు మీకు చేసిన వాగ్దానాన్ని నెరవేర్చే అవకాశం నాకు లభిస్తుంది.

15. అంటే, ఇప్పుడు ఈజిప్టు భూభాగం అంతా ఆయనదే. అందులో ప్రతి ప్రాంతాన్నీ ఆయన తన స్థలం అని అనగలడు. అక్కడ ఆయనకు నిషిద్ధమైన ప్రాంతం ఏదీ లేదు. ఇది హజ్రత్ యూసుఫ్ (అస్సలామ్)కు ఆ దేశంపై లభించిన పరిపూర్ణమయిన ప్రాబల్యానికి, సమగ్రమైన అధికారానికీ సంబంధించిన ప్రకటన. ప్రాచీన వ్యాఖ్యాతలు కూడా ఈ ఆయత్తును గురించి ఇలానే వ్యాఖ్యానించారు. ఉదాహరణకు, ఇబ్నె జైద్ దీని అర్థాన్ని ఇలా వివరించారు : "మేము యూసుఫ్ (అస్సలామ్)ను ఈజిప్టు దేశంలో ఉన్న సమస్త వస్తువులకూ యజమానిగా చేశాము. ప్రపంచంలోని ఈ భాగంలో ఆయన ఎక్కడ ఏది కోరితే అది చెయ్యగలరు. ఆ భూభాగం ఆయనకు అప్పజెప్పబడింది. చివరకు ఆయన ఫిరౌనును సైతం తన అధికారం క్రిందకు తీసుకురాగోరి అతనికి యజమాని కాదలిస్తే, అది కూడా చెయ్యగలడు. "ఈజిప్టు రాజు యూసుఫ్ (అస్సలామ్) చేతిమీదుగా ఇస్లామ్‌ను స్వీకరించాడు" అని ముజాహిద్ అభిప్రాయం.

16. ఇక్కడ మళ్ళీ ఏడెనిమిది సంవత్సరాల సంఘటనలను మధ్యలో వదిలిపెట్టి కథా క్రమాన్ని ఇక్కడ నుండి తిరిగి ప్రారంభించటం జరిగింది. ఇక్కడ నుండే ఇస్రాయీలు సంతతివారు ఈజిప్టుకు రావటం ప్రారంభమయింది.

17. హజ్రత్ యూసుఫ్ (అస్సలామ్) కరువుకాటకాల వల్ల ఈజిప్టులో ధాన్యంపై కంట్రోలు ఉన్న కారణంగా ఇలా అని ఉంటారు. ధాన్యం తీసుకోవటానికి వచ్చిన సోదరులు పదిమంది తమ తండ్రి భాగాన్నీ తమ పదకొండవ సోదరుని భాగాన్నీ కూడా అడిగి ఉంటారు. దానికి హజ్రత్ యూసుఫ్ (అస్సలామ్) ఇలా అని ఉంటారు : స్వయంగా మీ తండ్రి రాకపోవటానికి ఆయన చాలా ముసలివారూ, అంధులూ అనే కారణం సమంజసమైనదే. కాని సోదరుడు రాకపోవటానికి సమంజసమైన కారణం ఏమున్నది? సరే, ఇప్పటికి మేము మీ మాటను నమ్మి, మీకు పూర్తిగా ధాన్యాన్ని ఇస్తాము. కాని ఇకముందు ఒకవేళ మీరు అతనిని మీతో తీసుకురాకపోతే, మాకు మీపై నమ్మకం పోతుంది. అంతేకాదు, మీకు మా దగ్గర ధాన్యం ఏమీ దొరకదు.

18. బహుశా హజ్రత్ యాఖూబ్ (అస్సలామ్)కు ఇలాంటి భయం కలిగివుండవచ్చు: ఈ కరువు కాలంలో ఒకవేళ వారు ఒక ముఠాగా ఈజిప్టులోకి ప్రవేశిస్తే, వారు అనుమానింపబడవచ్చు, వారు ఇక్కడకు దోపిడీ చేసే ఉద్దేశ్యంతో వచ్చారు అని శంకించే అవకాశం కూడా ఉంది.

19. బహుశా ఈ సమావేశంలో బిన్ యమీన్ తన మారు సోదరులు తన పట్ల ఎంత అమర్యాదగా, ఎంత చెడ్డగా వ్యవహరించింది వినిపించి ఉంటారు. హజ్రత్ యూసుఫ్(అస్సలామ్) తన తమ్ముణ్ణి "ఇక నీవు నా వద్దనే ఉంటావు. ఈ దుర్మార్గుల కబంధ హస్తాలలోకి మళ్ళీ నిన్ను పోనివ్వను" అని ఓదార్చి ఉంటారు. ఈ సమయంలోనే సోదరులిద్దరి మధ్య ఈ విషయం కూడా నిర్ణయమై ఉండటం అనేది అసంభవం కాదు – హజ్రత్ యూసుఫ్ (అస్సలామ్) ఇంకా దాచి ఉంచాలని భావిస్తున్న విషయాన్ని దాచివుంచుతూనే బిన్ యమీన్‌ను ఈజిప్టులో నిలిపివుంచటానికి ఏ యుక్తిని పన్నాలి అనేది.

20. సాధారణంగా ఈ ఆయతులను ఇలా తర్జుమా చేస్తారు : "యూసుఫ్ (అస్సలామ్) రాజుగారి చట్టం ప్రకారం

قَالُوْا يٰۤاَيُّهَا الْعَزِيْزُ اِنَّ لَهٗۤ اَبًا شَيْخًا كَبِيْرًا
فَخُذْ اَحَدَنَا مَكَانَهٗ ۚ اِنَّا نَرٰىكَ مِنَ
الْمُحْسِنِيْنَ ﴿٧٨﴾ قَالَ مَعَاذَ اللّٰهِ اَنْ نَّاْخُذَ اِلَّا
مَنْ وَّجَدْنَا مَتَاعَنَا عِنْدَهٗۤ ۙ اِنَّاۤ اِذًا لَّظٰلِمُوْنَ ﴿٧٩﴾
فَلَمَّا اسْتَيْـَٔسُوْا مِنْهُ خَلَصُوْا نَجِيًّا ؕ قَالَ
كَبِيْرُهُمْ اَلَمْ تَعْلَمُوْۤا اَنَّ اَبَاكُمْ قَدْ اَخَذَ
عَلَيْكُمْ مَّوْثِقًا مِّنَ اللّٰهِ وَ مِنْ قَبْلُ مَا فَرَّطْتُّمْ
فِيْ يُوْسُفَ ۚ فَلَنْ اَبْرَحَ الْاَرْضَ حَتّٰى يَاْذَنَ لِيْۤ
اَبِيْۤ اَوْ يَحْكُمَ اللّٰهُ لِيْ ۚ وَهُوَ خَيْرُ الْحٰكِمِيْنَ ﴿٨٠﴾
اِرْجِعُوْۤا اِلٰۤى اَبِيْكُمْ فَقُوْلُوْا يٰۤاَبَانَاۤ اِنَّ ابْنَكَ
سَرَقَ ۚ وَ مَا شَهِدْنَاۤ اِلَّا بِمَا عَلِمْنَا وَ مَا كُنَّا
لِلْغَيْبِ حٰفِظِيْنَ ﴿٨١﴾ وَسْـَٔلِ الْقَرْيَةَ الَّتِيْ كُنَّا فِيْهَا
وَ الْعِيْرَ الَّتِيْۤ اَقْبَلْنَا فِيْهَا ؕ وَ اِنَّا لَصٰدِقُوْنَ ﴿٨٢﴾

**78 - 79** వారు ఇలా అన్నారు: "అధికారం గల ఓ నాయకుడా (అజీజ్)![21] ఇతని తండ్రి చాలా ముసలివాడు. ఇతనికి బదులు మీరు మాలో ఒకరిని ఉంచుకోండి. మేము మిమ్మల్ని మంచి మనస్సు కలవారుగా చూస్తున్నాము." యూసుఫ్ ఇలా అన్నాడు: "అల్లాహ్ రక్షించుగాక! ఎవని వద్ద మా సొమ్ము దొరికినదో[22] అతనిని వదిలిపెట్టి మరొకరిని మేము ఎలా బంధించగలము? ఒకవేళ అలా చేస్తే మేము దుర్మార్గులమైపోతాము!"

**80 - 82** వారు యూసుఫ్ పట్ల నిరాశచెంది, ఒక మూలకు పోయి పరస్పరం సంప్రదించుకున్నారు. వారిలో అందరికంటే పెద్దవాడు ఇలా అన్నాడు: "మీ తండ్రి అల్లాహ్ పేరు మీద మీ చేత ప్రమాణం చేయించుకున్న విషయం మీకు తెలియదా? లోగడ యూసుఫ్ విషయంలో మీరు చేసినది కూడా మీకు తెలుసు. ఇప్పుడు నేను మాత్రం ఇక్కడినుంచి వెళ్ళను, నాతండ్రి నాకు అనుమతిని ఇవ్వనంతవరకు లేదా అల్లాహ్యే నా విషయంలో ఏదైనా తీర్పు చెయ్యనంతవరకు. ఎందుకంటే ఆయన అందరికంటే ఉత్తమముగా తీర్పు చేసేవాడు. మీరు వెళ్ళి మీ తండ్రితో ఇలా అనండి: "తండ్రీ! మీ కుమారుడు దొంగతనం చేశాడు. మేము అతనిని దొంగతనం చేస్తూ ఉండగా చూడలేదు. మాకు తెలిసిన దానిని మాత్రమే మేము చెబుతున్నాము. రహస్యంగా జరిగే దానిని మేము చూడలేము కదా! మేము బసచేసిన నగరంలోని వారిని మీరు అడిగి తెలుసుకోండి. మేము కలసి తిరుగు ప్రయాణం చేసిన బిడారును విచారించండి. మేము చెప్పేది పూర్తిగా నిజము."

తన తమ్ముణ్ణి బంధించలేడు" కాని ఆయతును ఈ అర్థంలో తీసుకుంటే విషయం పూర్తిగా అర్థరహితం అయిపోతుంది. రాజుగారి చట్టం ప్రకారం దొంగను పట్టుకోలేక పోవటానికి కారణం ఏమిటి? ప్రపంచంలో ఎప్పుడైనా దొంగను అరెస్టుచేసే అనుమతిని ఇవ్వని చట్టం చేసిన రాజ్యం ఏదైనా ఉందా? కనుక యథార్థ విషయం ఏమిటంటే అల్లాహ్ ప్రవక్త అయిన యూసుఫ్ (అస్సలామ్)కు రాజుగారి చట్టం ప్రకారం ఆచరించటం భావ్యం కాదు. ఈ కారణంగానే హజ్రత్ యూసుఫ్ (అస్సలామ్) తన సోదరులను వారి చట్టాన్ని గురించి అడిగి తెలుసుకొని ఇబ్రాహీము షరీయతు ప్రకారం తన తమ్ముణ్ణి బంధించారు.

21. ఇక్కడ హజ్రత్ యూసుఫ్ (అస్సలామ్) కొరకు "అజీజ్" అనే పదం ఉపయోగించ బడింది. కేవలం ఆ పదం ఆధారంగానే వ్యాఖ్యాతలు, పూర్వం జులైఖా భర్త ఉన్న పదవిలోనే హజ్రత్ యూసుఫ్ (అస్సలామ్) నియమించ బడ్డారు అని ఊహించారు. కాని ఈ పదవి ఈజిప్టులో ఒక ప్రత్యేకమైన పదవి పేరు కాదనీ, కేవలం "అధికారం కలవ్యక్తి" కొరకు ఉపయోగించబడేదనీ మేము 9వ వివరణలో విశదం చేశాము.

22. ఎంత జాగ్రత్తో చూడండి: "దొంగ" అని అనలేదు. "ఎవరి వద్ద మా సొమ్ము దొరికినదో" అని అన్నారు. దీనిని

قَالَ بَلْ سَوَّلَتْ لَكُمْ اَنْفُسُكُمْ اَمْرًا ؕ فَصَبْرٌ
جَمِيْلٌ ؕ عَسَى اللّٰهُ اَنْ يَّاْتِيَنِيْ بِهِمْ جَمِيْعًا ؕ
اِنَّهٗ هُوَ الْعَلِيْمُ الْحَكِيْمُ ﴿۸۳﴾ وَ تَوَلّٰى عَنْهُمْ وَ
قَالَ يٰۤاَسَفٰى عَلٰى يُوْسُفَ وَ ابْيَضَّتْ عَيْنٰهُ مِنَ
الْحُزْنِ فَهُوَ كَظِيْمٌ ﴿۸۴﴾ قَالُوْا تَاللّٰهِ تَفْتَؤُا
تَذْكُرُ يُوْسُفَ حَتّٰى تَكُوْنَ حَرَضًا اَوْ تَكُوْنَ
مِنَ الْهٰلِكِيْنَ ﴿۸۵﴾ قَالَ اِنَّمَاۤ اَشْكُوْا بَثِّيْ وَحُزْنِيْۤ
اِلَى اللّٰهِ وَاَعْلَمُ مِنَ اللّٰهِ مَا لَا تَعْلَمُوْنَ ﴿۸۶﴾
يٰبَنِيَّ اذْهَبُوْا فَتَحَسَّسُوْا مِنْ يُّوْسُفَ وَ اَخِيْهِ وَ
لَا تَايْــَٔسُوْا مِنْ رَّوْحِ اللّٰهِ ؕ اِنَّهٗ لَا يَايْــَٔسُ مِنْ
رَّوْحِ اللّٰهِ اِلَّا الْقَوْمُ الْكٰفِرُوْنَ ﴿۸۷﴾

**83 - 87** వారి తండ్రి ఈ గాధను విని ఇలా అన్నాడు: "అసలు మీ దుష్ట మనస్సులు మీచేత మరొక ఘోర కార్యాన్ని తేలికగా చేయించాయి.[23] సరే, దీనిని కూడా సహిస్తాను, బాగా సహిస్తాను. అల్లాహ్ చివరకు వారందరినీ తెచ్చి నాతో కలుపుట జరగవచ్చు కదా! ఆయనకు సర్వమూ తెలుసు. ఆయన పనులన్నీ వివేకంతో నిండివుంటాయి." తరువాత అతను వారివైపు నుండి తన ముఖాన్ని తిప్పుకుని కూర్చుండిపోయాడు. "అయ్యో! యూసుఫ్" అంటూ వాపోయాడు. అతను లోలోన దుఃఖంతో క్రుంగి పోసాగాడు. అతని నేత్రాలు తెలుపెక్కాయి- కొడుకులు ఇలా అన్నారు: "అయ్యో దైవమా! మీరు ఒక్క యూసుఫ్‌నే జ్ఞాపకం చేసుకుంటూ ఉంటారు. చివరకు అతని పట్ల దుఃఖంతోనే మీరు కృశించిపోతారు లేదా మీ ప్రాణాన్ని తీసుకుంటారు." అతను ఇలా అన్నాడు: "నేను నా ఆందోళనను గురించి, నా ఆవేదనను గురించి అల్లాహ్‌కు తప్ప మరెవరికీ ఫిర్యాదు చెయ్యను. అల్లాహ్‌ను నేను ఎరిగినట్లు మీరు ఎరుగరు. కుమారులారా! వెళ్ళి, యూసుఫ్‌ను గురించీ అతని సోదరుని గురించీ దర్యాప్తు చెయ్యండి. అల్లాహ్ కారుణ్యం పట్ల నిరాశ చెందకండి. ఆయన కారుణ్యం పట్ల కేవలం అవిశ్వాసులే నిరాశ చెందుతారు."

---

షరీయతు పరిభాషలో "తౌరియ" అని అంటారు. అంటే "యథార్థాన్ని కప్పిపుచ్చటం" లేక "జరిగిన విషయాన్ని దాచటం". ఒక బాధితుణ్ణి దుర్మార్గుని బారి నుండి రక్షించటానికి, ఒక పెద్ద ఉపద్రవాన్ని తొలగించటానికీ, యథార్థానికి భిన్నంగా ఉన్న విషయం చెప్పటం లేదా వాస్తవానికి వ్యతిరేకంగా ఉన్నటువంటి సాకు చూపటం తప్ప మార్గాంతరం లేకపోతే, అటువంటి పరిస్థితిలో భయభక్తులు గల మనిషి స్పష్టంగా అబద్ధం చెప్పకుండా యథార్థాన్ని దాచి చెడును నిర్మూలించటానికి దోహదం చేసే మాటలు అనటానికీ, యుక్తులు పన్నటానికీ ప్రయత్నం చేస్తాడు. ఇప్పుడు చూడండి: ఈ మొత్తం వ్యవహారంలో హజ్రత్ యూసుఫ్ (అస్సలామ్) ధర్మసమ్మతమైన "తవ్రియ" షరతులను ఎలా పూర్తిచేశారో, తమ్ముడి అంగీకారం తోనే అతని సామానులో పాత్రను ఉంచారు. కాని అతనిపై దొంగతనం మోపండి అని రాజోద్యోగులకు చెప్పలేదు. ప్రభుత్వ సిబ్బంది దొంగతనం నేరం క్రింద వారిని పట్టి తెచ్చినప్పుడు ఏమీ అనకుండా మౌనంగా లేచి వెతికి చూశారు. తరువాత బిన్ యమీన్‌కు బదులుగా మాలో ఎవరినైనా ఉంచుకోండి అని సవతి సోదరులు చెప్పినప్పుడు దానికి సమాధానంగా కూడా, ఎవని వద్ద సొమ్ము బయటపడిందో అతణ్ణే ఉంచుకోవాలి అని మీరే తీర్పు చెప్పారు అని చెప్పి, వారి మాటను వారికే అప్పజెప్పారు. కనుక ఇప్పుడు మీ సమక్షంలో బిన్ యమీన్ సామాను నుండి మా సొమ్ము బయటపడింది. అతణ్ణే మేము ఉంచుకుంటాము, అతనికి బదులుగా మరొకణ్ణి ఎలా ఉంచుకోగలుగుతాము అని వాదించారు.

23. అంటే, సౌశీల్యవంతుడైన నా కుమారుడు ఒక పాత్రను దొంగిలించాడని నమ్మటం మీకు చాలా సులభం. పూర్వం మీకు మీ సోదరుడు ఒకనిని బుద్ధిపూర్వకంగా తప్పిపోయేలా చేసి అతని చొక్కాకు బూటకపు రక్తాన్ని

فَلَمَّا دَخَلُوْا عَلَيْهِ قَالُوْا يٰۤاَيُّهَا الْعَزِيْزُ مَسَّنَا وَ
اَهْلَنَا الضُّرُّ وَجِئْنَا بِبِضَاعَةٍ مُّزْجٰىةٍ فَاَوْفِ
لَنَا الْكَيْلَ وَتَصَدَّقْ عَلَيْنَا ؕ اِنَّ اللّٰهَ يَجْزِى
الْمُتَصَدِّقِيْنَ ﴿۸۸﴾ قَالَ هَلْ عَلِمْتُمْ مَّا فَعَلْتُمْ
بِيُوْسُفَ وَ اَخِيْهِ اِذْ اَنْتُمْ جٰهِلُوْنَ ﴿۸۹﴾ قَالُوْۤا
ءَاِنَّكَ لَاَنْتَ يُوْسُفُ ؕ قَالَ اَنَا يُوْسُفُ وَ
هٰذَاۤ اَخِىْ ۫ قَدْ مَنَّ اللّٰهُ عَلَيْنَا ؕ اِنَّهٗ مَنْ
يَّتَّقِ وَ يَصْبِرْ فَاِنَّ اللّٰهَ لَا يُضِيْعُ اَجْرَ
الْمُحْسِنِيْنَ ﴿۹۰﴾ قَالُوْا تَاللّٰهِ لَقَدْ اٰثَرَكَ اللّٰهُ
عَلَيْنَا وَاِنْ كُنَّا لَخٰطِـِٕيْنَ ﴿۹۱﴾ قَالَ لَا
تَثْرِيْبَ عَلَيْكُمُ الْيَوْمَ ؕ يَغْفِرُ اللّٰهُ لَكُمْ ۫ وَ هُوَ
اَرْحَمُ الرّٰحِمِيْنَ ﴿۹۲﴾ اِذْهَبُوْا بِقَمِيْصِىْ هٰذَا
فَاَلْقُوْهُ عَلٰى وَجْهِ اَبِىْ يَاْتِ بَصِيْرًا ۚ وَاْتُوْنِىْ
بِاَهْلِكُمْ اَجْمَعِيْنَ ﴿۹۳﴾ وَ لَمَّا فَصَلَتِ الْعِيْرُ قَالَ
اَبُوْهُمْ اِنِّىْ لَاَجِدُ رِيْحَ يُوْسُفَ لَوْ لَاۤ اَنْ
تُفَنِّدُوْنِ ﴿۹۴﴾ قَالُوْا تَاللّٰهِ اِنَّكَ لَفِىْ ضَلٰلِكَ
الْقَدِيْمِ ﴿۹۵﴾ فَلَمَّاۤ اَنْ جَآءَ الْبَشِيْرُ اَلْقٰىهُ
عَلٰى وَجْهِهٖ فَارْتَدَّ بَصِيْرًا ۚ قَالَ اَلَمْ اَقُلْ
لَّكُمْ ۚ اِنِّىْۤ اَعْلَمُ مِنَ اللّٰهِ مَا لَا تَعْلَمُوْنَ ﴿۹۶﴾

**88 - 93** వారు ఈజిప్టుకు పోయి యూసుఫ్ దర్బారులో ప్రవేశించి ఇలా విన్నవించుకున్నారు: "అధికారం గల ఓ నాయకుడా! మేమూ, మా కుటుంబమూ పెద్ద ఆపదకు గురి అయ్యాము. మేము కొద్దిసొమ్మును మాత్రమే తీసుకుని వచ్చాము. కనుక మీరు దయచేసి మాకు ధాన్యాన్ని పూర్తిగా ఇప్పించండి. మాకు దానం చెయ్యండి. దానం చేసేవారికి అల్లాహ్ ప్రతిఫలం ఇస్తాడు." (ఇది విని యూసుఫ్ ఉండబట్ట లేకపొయ్యాడు). అతను ఇలా అన్నాడు: "అజ్ఞానంలో పడి మీరు యూసుఫ్ పట్లా అతని సోదరునిపట్లా ఎలా వ్యవహరించారో మీకు తెలుసా?" వారు ఉలిక్కిపడి ఇలా అన్నారు: "ఆ! ఏమిటీ నీవు యూసుఫ్‌వా?" అతను ఇలా చెప్పాడు: "అవును, నేను యూసుఫ్‌ను. ఇతడు నా సోదరుడు. అల్లాహ్ మాపై దయచూపాడు. వాస్తవం ఏమిటంటే భయభక్తులతో, ఓర్మితో వ్యవహరించే సత్పురుషుల ప్రతిఫలం అల్లాహ్ వద్ద వృథా కాదు." వారు ఇలా అన్నారు: "అల్లాహ్ తోడు! అల్లాహ్ మాకంటే నీకు ఎక్కువ ఔన్నత్యాన్ని ప్రసాదించాడు. మేము నిజంగానే దోషులం." అతను ఇలా జవాబు పలికాడు: "ఈ రోజు మిమ్మల్ని నిందించటం జరగదు. అల్లాహ్ మిమ్మల్ని క్షమించుగాక, ఆయన అందరి కంటే అధికంగా కరుణించేవాడు. వెళ్ళండి, ఈ నా చొక్కాను తీసుకుని వెళ్ళండి. నా తండ్రి ముఖంపై వేయండి. ఆయనకు తిరిగి దృష్టి వస్తుంది. మీ కుటుంబ సభ్యులందరినీ నా వద్దకు తీసుకురండి."

**94 - 95** ఇక్కడ ఆ బిడారు (ఈజిప్టు నుండి) బయలుదేరినప్పుడు, అక్కడ (కనాన్‌లో)వారి తండ్రి ఇలా అన్నాడు: "నాకు యూసుఫ్ పరిమళం స్ఫురిస్తోంది. ముసలితనం వల్ల నా మతి చలించిందని మీరు అనుకోవచ్చు." అతని ఇంటివారు ఇలా అన్నారు: "అల్లాహ్ తోడు! మీరు ఇంకా మీ పాత పిచ్చిలోనే పడివున్నారు."

**96 - 98** తరువాత శుభవార్తాహరుడు వచ్చి యూసుఫ్ చొక్కాను యాఖూబ్ ముఖంపై వేశాడు. హఠాత్తుగా ఆయనకు మళ్లీ దృష్టి వచ్చింది. అప్పుడు అతను ఇలా అన్నాడు: "నేను మీకు చెబుతూ ఉండేవాణ్ణి కాదా? మీకు తెలియంది అల్లాహ్ తరఫు నుండి నాకు తెలుసు అని."

قَالُوْا يٰٓاَبَانَا اسْتَغْفِرْلَنَا ذُنُوْبَنَآ اِنَّا كُنَّا
خٰطِئِيْنَ ﴿٩٧﴾ قَالَ سَوْفَ اَسْتَغْفِرُ لَكُمْ رَبِّيْ ؕ
اِنَّهٗ هُوَ الْغَفُوْرُ الرَّحِيْمُ ﴿٩٨﴾ فَلَمَّا دَخَلُوْا عَلٰى
يُوْسُفَ اٰوٰٓى اِلَيْهِ اَبَوَيْهِ وَ قَالَ ادْخُلُوْا
مِصْرَ اِنْ شَآءَ اللّٰهُ اٰمِنِيْنَ ﴿٩٩﴾ وَرَفَعَ اَبَوَيْهِ
عَلَى الْعَرْشِ وَ خَرُّوْا لَهٗ سُجَّدًا ۚ وَ قَالَ يٰٓاَبَتِ
هٰذَا تَاْوِيْلُ رُءْيَايَ مِنْ قَبْلُ ۫ قَدْ جَعَلَهَا
رَبِّيْ حَقًّا ؕ وَ قَدْ اَحْسَنَ بِيْٓ اِذْ اَخْرَجَنِيْ مِنَ
السِّجْنِ وَجَآءَ بِكُمْ مِّنَ الْبَدْوِ مِنْۢ بَعْدِ اَنْ نَّزَغَ
الشَّيْطٰنُ بَيْنِيْ وَبَيْنَ اِخْوَتِيْ ؕ اِنَّ رَبِّيْ
لَطِيْفٌ لِّمَا يَشَآءُ ؕ اِنَّهٗ هُوَ الْعَلِيْمُ الْحَكِيْمُ ﴿١٠٠﴾
رَبِّ قَدْ اٰتَيْتَنِيْ مِنَ الْمُلْكِ وَ عَلَّمْتَنِيْ مِنْ
تَاْوِيْلِ الْاَحَادِيْثِ ۚ فَاطِرَ السَّمٰوٰتِ وَ
الْاَرْضِ ۟ اَنْتَ وَلِيّٖ فِي الدُّنْيَا وَ الْاٰخِرَةِ ۚ
تَوَفَّنِيْ مُسْلِمًا وَّ اَلْحِقْنِيْ بِالصّٰلِحِيْنَ ﴿١٠١﴾ ذٰلِكَ
مِنْ اَنْۢبَآءِ الْغَيْبِ نُوْحِيْهِ اِلَيْكَ ۚ وَمَا كُنْتَ
لَدَيْهِمْ اِذْ اَجْمَعُوْٓا اَمْرَهُمْ وَ هُمْ
يَمْكُرُوْنَ ﴿١٠٢﴾ وَ مَآ اَكْثَرُ النَّاسِ وَ لَوْ حَرَصْتَ
بِمُؤْمِنِيْنَ ﴿١٠٣﴾ وَ مَا تَسْـَٔلُهُمْ عَلَيْهِ مِنْ اَجْرٍ ؕ
اِنْ هُوَ اِلَّا ذِكْرٌ لِّلْعٰلَمِيْنَ ﴿١٠٤﴾ ع ١١

అంతా ఇలా అన్నారు: “నాన్నా! మా పాపాలను క్షమించ వలసినదిగా మీరు అల్లాహ్‌ను ప్రార్థించండి. మేము నిజంగానే దోషులము.” అతను ఇలా అన్నాడు: “మిమ్ములను క్షమించ వలసినదిగా నేను నా ప్రభువును అర్థిస్తాను. ఆయన అమితంగా క్షమించేవాడూ, కరుణించేవాడూనూ.”

**99** తరువాత వారు యూసుఫ్ వద్దకు వెళ్ళినప్పుడు, అతను తన తల్లిదండ్రులను తనవద్ద కూర్చోబెట్టుకున్నాడు. (తన కుటుంబం వారితో) ఇలా అన్నాడు: “పదండి, ఇక పట్టణంలోకి పదండి. అల్లాహ్ సంకల్పిస్తే మీరు సుఖశాంతులతో జీవిస్తారు.”

**100 - 101** (పట్టణంలో ప్రవేశించిన తరువాత) అతను తన తల్లిదండ్రులను తన చేతులతో ఎత్తి సింహాసనం మీద తనతో కూర్చోబెట్టుకున్నాడు. అందరూ అతని ముందు అప్రయత్నంగా సజ్‌దాలో[24] పడిపోయారు. యూసుఫ్ ఇలా అన్నాడు: “తండ్రీ! నేను పూర్వం కన్న కలకు ఇదీ ఫలం. నా ప్రభువు దానిని నిజం చేశాడు. అంతా ఆయన దయ! ఆయన నన్ను కారాగారం నుండి బయటకు తీశాడు. మిమ్మల్ని ఎడారి నుండి తీసుకొని వచ్చి నాతో కలిపాడు. వాస్తవానికి షైతాను నా మధ్య నా సోదరుల మధ్య కలహాన్ని సృష్టించాడు. యథార్థం ఏమిటంటే, నా ప్రభువు ప్రజలు గ్రహించలేని యుక్తుల ద్వారా తన సంకల్పాన్ని నెరవేరుస్తాడు. నిస్సందేహంగా ఆయన తెలిసినవాడూ వివేకవంతుడూను. నా ప్రభూ! నీవు నాకు అధికారాన్ని ప్రసాదించావు. మాటల లోతును అందుకోవటం నేర్పావు. భూమ్యాకాశాల నిర్మాతా! నీవే ఇహపర లోకాలలో నాకు సంరక్షకుడవు. నేను ఇస్లామ్ ధర్మంలో ఉన్న స్థితిలోనే నా జీవితాన్ని సమాప్తం చెయ్యి. చివరకు నన్ను సజ్జనులతో కలుపు.”

**102 - 104** ప్రవక్తా! ఈ గాథ అగోచర విషయాలలోనిది. దానిని మేము నీకు వహీద్వారా తెలియజేస్తున్నాము. ఎందుకంటే యూసుఫ్ సోదరులు పరస్పరం కూడబలుకుకొని కుట్రపన్నిన సమయంలో నీవు లేవుకదా! కానీ ఎంతగా నీవు కోరినా వీరిలో చాలామంది విశ్వసించరు. వాస్తవానికి నీవు ఈ సేవకు వారినుండి ఏ విధమైన ప్రతిఫలాన్ని కూడా కోరటం లేదు. ప్రపంచంలోని ప్రజలందరికీ ఇది ఒక హితబోధ.

وَكَاَيِّنۡ مِّنۡ اٰيَةٍ فِى السَّمٰوٰتِ وَالۡاَرۡضِ
يَمُرُّوۡنَ عَلَيۡهَا وَهُمۡ عَنۡهَا مُعۡرِضُوۡنَ ﴿١٠٥﴾ وَمَا
يُؤۡمِنُ اَكۡثَرُهُمۡ بِاللّٰهِ اِلَّا وَهُمۡ مُّشۡرِكُوۡنَ ﴿١٠٦﴾
اَفَاَمِنُوۡۤا اَنۡ تَاۡتِيَهُمۡ غَاشِيَةٌ مِّنۡ عَذَابِ اللّٰهِ
اَوۡ تَاۡتِيَهُمُ السَّاعَةُ بَغۡتَةً وَّهُمۡ لَا
يَشۡعُرُوۡنَ ﴿١٠٧﴾ قُلۡ هٰذِهٖ سَبِيۡلِىۡۤ اَدۡعُوۡۤا اِلَى اللّٰهِ
عَلٰى بَصِيۡرَةٍ اَنَا وَمَنِ اتَّبَعَنِىۡ‌ؕ وَسُبۡحٰنَ
اللّٰهِ وَمَاۤ اَنَا مِنَ الۡمُشۡرِكِيۡنَ ﴿١٠٨﴾ وَمَاۤ
اَرۡسَلۡنَا مِنۡ قَبۡلِكَ اِلَّا رِجَالًا نُّوۡحِىۡۤ اِلَيۡهِمۡ
مِّنۡ اَهۡلِ الۡقُرٰى‌ؕ اَفَلَمۡ يَسِيۡرُوۡا فِى الۡاَرۡضِ
فَيَنۡظُرُوۡا كَيۡفَ كَانَ عَاقِبَةُ الَّذِيۡنَ مِنۡ
قَبۡلِهِمۡ‌ؕ وَلَدَارُ الۡاٰخِرَةِ خَيۡرٌ لِّلَّذِيۡنَ اتَّقَوۡا‌ؕ
اَفَلَا تَعۡقِلُوۡنَ ﴿١٠٩﴾ حَتّٰۤى اِذَا اسۡتَايۡــَٔسَ الرُّسُلُ
وَظَنُّوۡۤا اَنَّهُمۡ قَدۡ كُذِبُوۡا جَآءَهُمۡ نَصۡرُنَا ۙ
فَنُجِّىَ مَنۡ نَّشَآءُ‌ؕ وَلَا يُرَدُّ بَاۡسُنَا عَنِ
الۡقَوۡمِ الۡمُجۡرِمِيۡنَ ﴿١١٠﴾

وقف النبي صلى الله عليه وسلم

**105 - 108** భూమిలో ఆకాశాలలో ఎన్ని సూచనలు లేవు! కాని వారు వాటిని చూస్తూపోతూ ఉంటారు. కొంచెమైనా గమనించరు. వారిలో అల్లాహ్‌ను విశ్వసించేవారు ఎంతమంది లేరు! కాని వారు ఆయనతోపాటు ఇతరులను భాగస్వాములుగా నిలబెడుతూ ఉంటారు. దైవశిక్షకు సంబంధించిన ఆపద ఏదీ వారిని చుట్టుముట్టదనీ, తెలియకుండా వారిపైకి ప్రళయగడియ అకస్మాత్తుగా వచ్చిపడదనీ వారు నిశ్చింతగా ఉన్నారా? నీవు వారికి స్పష్టంగా ఇలా తెలియజెయ్యి: "నా మార్గం ఇది–నేను అల్లాహ్ వైపునకు పిలుస్తాను. స్వయంగా నేను కూడా నిండు వెలుగులో నా మార్గాన్ని చూస్తున్నాను. నా సహచరులు కూడా చూస్తున్నారు. అల్లాహ్ పరిశుద్ధుడు. షిర్కు చేసేవారితో నాకు ఏ సంబంధమూ లేదు."

**109 - 110** ప్రవక్తా! నీకు పూర్వం మేము పంపిన ప్రవక్తలందరు కూడా మానవులే. ఈ పట్టణవాసులలోని వారే, వారి వైపునకే మేము 'వహీ'ని పంపుతూ వచ్చాము. ఆ ప్రజలు భూమిపై సంచారం చెయ్యలేదా, తమకు ముందు గతించిన జాతుల వారి ముగింపును వారు చూడలేదా? నిశ్చయంగా పరలోక గృహం (ప్రవక్తల మాటలను విశ్వసించి) భయభక్తుల వైఖరిని అవలంబించిన వారికి (ఇహలోక గృహం కంటే) ఎంతో మేలైనది. ఇప్పుడు కూడా మీరు అర్థం చేసుకోరా? (పూర్వపు ప్రవక్తల విషయంలో కూడా ఇలానే జరిగింది. వారు ఎంతోకాలం హితబోధ చేశారు. అయినా ప్రజలు వినలేదు). చివరకు ప్రవక్తలు ప్రజలను గురించి నిరాశచెంది నప్పుడు, ప్రజలు కూడా తమకు అబద్ధం చెప్పబడిందని భావించి నప్పుడు, అకస్మాత్తుగా మా సహాయం ప్రవక్తలకు చేరింది. అటువంటి సమయం ఆసన్నమైనప్పుడు, మా సంప్రదాయం ఏమిటంటే, మేము కోరినవారిని రక్షించుకుంటాము. కాని మా శిక్షను దోషులపై పడకుండా తొలగించటం సాధ్యం కాదు.

పులిమి తీసుకురావటం మీకు చాల సులభమైన పని అయిపోయింది. అదేవిధంగా ఇప్పుడు మరొక సోదరుణ్ణి వాస్తవంగా దొంగ అని నమ్మటం, వచ్చి నాకు దాని సమాచారం తెలుపటం కూడా మీకు సులభమైపోయింది.

24. "సజ్‌దా" అనే పదం చాలమందిని అపోహకు గురిచేసింది. చివరకు ఒక వర్గం వారు దీనినే ప్రమాణంగా తీసుకొని, రాజులకు, గురువులకు సజ్‌దయే తహియ్య, సజ్‌దయే తాజీమీ (గౌరవ పురస్కారంగా చేసే సజ్‌దా)లను

| | |
|---|---|
| **111** పూర్వపు ప్రజలకు సంబంధించిన ఈ గాథలలో బుద్ధి, స్పృహ ఉన్న వారికి ఒక గుణపాఠం ఉన్నది. ఖురానులో చెప్పబడుతున్న ఇవన్నీ కల్పిత విషయాలు కావు. వాస్తవానికి ఇవి ఇదివరకు వచ్చిన గ్రంథాలకు ధ్రువీకరణ. ప్రతి విషయానికీ వివరణ.[25] విశ్వసించేవారికి హితబోధా, (దేవుని) కారుణ్యమూను. | لَقَدْ كَانَ فِي قَصَصِهِمْ عِبْرَةٌ لِّأُولِي الْأَلْبَابِ ۗ مَا كَانَ حَدِيثًا يُفْتَرَىٰ وَلَٰكِن تَصْدِيقَ الَّذِي بَيْنَ يَدَيْهِ وَتَفْصِيلَ كُلِّ شَيْءٍ وَهُدًى وَرَحْمَةً لِّقَوْمٍ يُؤْمِنُونَ ﴿١١١﴾ ع |

చేసే వీలును కల్పించారు. మరొక వర్గం వారు తాము ఈ చెడుగు నుంచి తప్పించుకోవటానికి దానిని ఇలా వివరించవలసి వచ్చింది : "పూర్వపు షరీయతులలో కేవలం ఆరాధనా భావంతో చేసే సజ్దా అల్లాహ్‌యేతరులైన దైవాలకు నిషిద్ధంగా ఉండేది. ఆరాధనాభావం లేని సజ్దా, అది దేవునికి తప్ప ఇతరులకు కూడా చెయ్యవచ్చు. అయితే, ముహమ్మద్ (సఅసమ్) షరీయతులో ప్రతి సజ్దా అల్లాహ్‌యేతరులకు నిషేధించబడింది." అసలు ఈ అపోహలన్నీ "సజ్దా" పదానికి కూడా ప్రస్తుత ఇస్లామీ పరిభాషలో ఉన్న అర్థమే ఉందని భావించటం వల్ల కలిగాయి. అంటే, చేతులనూ, మోకాళ్ళనూ, నుదుటినీ భూమిపై ఆనించటం, సజ్దా అసలు అర్థం కేవలం వంగటమే. ఇక్కడ ఈ పదం ఇదే భావంలో ఉపయోగించబడింది.

25. అంటే, మానవునికి హితోపదేశం చెయ్యటానికీ, అతనికి మార్గం చూపటానికీ, అవసరమైన ప్రతి విషయానికి సంబంధించిన వివరాలు. కొందరు, "ప్రతి విషయానికీ వివరణ" అనే మాటలకు అనవసరంగా సమస్త విషయాలకు సంబంధించిన వివరణ అని అర్థం చెబుతారు. తరువాత వారు, ఖురానులో అడవులు, వైద్యం, గణితం ఇంకా ఇతర శాస్త్రాలు కళలను గురించి ఏ వివరాలూ దొరకవే అని వాపోతారు. ఇంకా కొందరు బలవంతంగా ప్రతి కళకు సంబంధించిన వివరాలను ఖురాను నుండి వెలికితీయాలని చూస్తారు.

ఆయతులు 43

## 13. అర్రాద్

అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1** అలిఫ్ లామ్ మీమ్ రా. ఇవి అల్లాహ్ గ్రంథంలోని ఆయతులు. నీ ప్రభువు తరపునుండి నీపై అవతరింపచేయబడినదంతా పూర్తిగా సత్యం. కాని (మీ జాతికి చెందిన) చాలా మంది విశ్వసించటం లేదు.

**2** మీకు కనిపించే ఆధారాలు లేకుండా ఆకాశాలను నిలిపినవాడు అల్లాహ్‌యే.[1] తరువాత ఆయన తన రాజ్యపీఠాన్ని అలంకరించాడు. ఆయన సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ ఒక నియమానికి బద్ధులుగా చేశాడు. ఈ సమస్త వ్యవస్థకు చెందిన ప్రతి వస్తువూ ఒక నిర్ణీతకాలం వరకు పయనిస్తోంది. అల్లాహ్‌యే ఈ మొత్తం వ్యవహారాన్ని నడుపుతున్నాడు. ఆయన తన సూచనలను స్పష్టంగా వివరిస్తున్నాడు,[2] బహుశా మీరు మీ ప్రభువును కలుసుకునే విషయాన్ని నమ్ముతారేమో అని.

**3** ఆయనే ఈ భూమిని విశాలంగా పరచినవాడు; అందులో పర్వతాలను గుంజలవలె పాతిపెట్టినవాడు, నదులను ప్రవహింపజేసినవాడు, ఆయనే అన్ని రకాల పండ్ల జతలను పండించినవాడు, ఆయనే పగలుపై రాత్రిని కప్పేవాడు. ఈ అన్ని విషయాలలోనూ ఆలోచించే వారికొరకు పెద్ద సూచనలు ఉన్నాయి.

**4** చూడండి! భూమిలో వేర్వేరు ప్రదేశాలు ఉన్నాయి. అవి ఒకదానికొకటి ప్రక్కప్రక్కన ఉన్నాయి. ద్రాక్ష తోటలూ ఉన్నాయి, పంటపొలాలూ ఉన్నాయి, ఖర్జూరపు చెట్లూ ఉన్నాయి– వాటిలో కొన్ని ఒక్కొక్కటిగానూ మరికొన్ని జంటలుగానూ ఉన్నాయి– వాటన్నింటికీ ఒకే నీరు పారుతోంది. కానీ మేము కొన్నింటిని ఎక్కువ రుచికరమైనవిగా చేశాము. మరికొన్నింటిని తక్కువ రుచికరమైనవిగా చేశాము. ఈ అన్ని విషయాలలోనూ బుద్ధిని ఉపయోగించే వారికి చాలా సూచనలు ఉన్నాయి.

١٣ سُوۡرَةُ الرَّعۡدِ مَکِّیَّةٌ ٩٦

اٰیاتها ٤٣ | رکوعاتها ٦

بِسۡمِ اللّٰہِ الرَّحۡمٰنِ الرَّحِیۡمِ ○

الٓمّٓرٰ ۟ تِلۡکَ اٰیٰتُ الۡکِتٰبِ ؕ وَ الَّذِیۡۤ اُنۡزِلَ
اِلَیۡکَ مِنۡ رَّبِّکَ الۡحَقُّ وَ لٰکِنَّ اَکۡثَرَ النَّاسِ لَا
یُؤۡمِنُوۡنَ ۝١ اَللّٰہُ الَّذِیۡ رَفَعَ السَّمٰوٰتِ بِغَیۡرِ
عَمَدٍ تَرَوۡنَہَا ثُمَّ اسۡتَوٰی عَلَی الۡعَرۡشِ وَ سَخَّرَ
الشَّمۡسَ وَ الۡقَمَرَ ؕ کُلٌّ یَّجۡرِیۡ لِاَجَلٍ مُّسَمًّی ؕ
یُدَبِّرُ الۡاَمۡرَ یُفَصِّلُ الۡاٰیٰتِ لَعَلَّکُمۡ بِلِقَآءِ
رَبِّکُمۡ تُوۡقِنُوۡنَ ۝٢ وَ ہُوَ الَّذِیۡ مَدَّ الۡاَرۡضَ
وَ جَعَلَ فِیۡہَا رَوَاسِیَ وَ اَنۡہٰرًا ؕ وَ مِنۡ کُلِّ
الثَّمَرٰتِ جَعَلَ فِیۡہَا زَوۡجَیۡنِ اثۡنَیۡنِ یُغۡشِی
الَّیۡلَ النَّہَارَ ؕ اِنَّ فِیۡ ذٰلِکَ لَاٰیٰتٍ لِّقَوۡمٍ
یَّتَفَکَّرُوۡنَ ۝٣ وَ فِی الۡاَرۡضِ قِطَعٌ مُّتَجٰوِرٰتٌ وَّ
جَنّٰتٌ مِّنۡ اَعۡنَابٍ وَّ زَرۡعٌ وَّ نَخِیۡلٌ صِنۡوَانٌ
وَّ غَیۡرُ صِنۡوَانٍ یُّسۡقٰی بِمَآءٍ وَّاحِدٍ ۟ وَ نُفَضِّلُ
بَعۡضَہَا عَلٰی بَعۡضٍ فِی الۡاُکُلِ ؕ اِنَّ فِیۡ ذٰلِکَ
لَاٰیٰتٍ لِّقَوۡمٍ یَّعۡقِلُوۡنَ ۝٤

1. వేరే మాటలలో చెప్పాలంటే, ఆకాశాలను ఊహకు అందని, కంటికి కనిపించని ఆధారాలపై నిలబెట్టాడు. సువిశాలమైన అంతరిక్షంలో పరిభ్రమిస్తున్న అనంతమైన, అసంఖ్యాకమైన గ్రహాలను, నక్షత్రాలను పట్టివుంచే

وَ اِنۡ تَعۡجَبۡ فَعَجَبٌ قَوۡلُهُمۡ ءَاِذَا كُنَّا تُرٰبًا
ءَاِنَّا لَفِىۡ خَلۡقٍ جَدِيۡدٍ ؕ اُولٰٓئِكَ الَّذِيۡنَ
كَفَرُوۡا بِرَبِّهِمۡ ۚ وَ اُولٰٓئِكَ الۡاَغۡلٰلُ فِىۡۤ
اَعۡنَاقِهِمۡ ۚ وَ اُولٰٓئِكَ اَصۡحٰبُ النَّارِ ۚ هُمۡ فِيۡهَا
خٰلِدُوۡنَ ۝۵ وَيَسۡتَعۡجِلُوۡنَكَ بِالسَّيِّئَةِ قَبۡلَ
الۡحَسَنَةِ وَقَدۡ خَلَتۡ مِنۡ قَبۡلِهِمُ الۡمَثُلٰتُ ؕ وَ
اِنَّ رَبَّكَ لَذُوۡ مَغۡفِرَةٍ لِّلنَّاسِ عَلٰى ظُلۡمِهِمۡ ۚ وَ
اِنَّ رَبَّكَ لَشَدِيۡدُ الۡعِقَابِ ۝۶ وَ يَقُوۡلُ
الَّذِيۡنَ كَفَرُوۡا لَوۡ لَاۤ اُنۡزِلَ عَلَيۡهِ اٰيَةٌ مِّنۡ
رَّبِّهٖ ؕ اِنَّمَاۤ اَنۡتَ مُنۡذِرٌ وَّ لِكُلِّ قَوۡمٍ هَادٍ ۝۷ ع
اَللّٰهُ يَعۡلَمُ مَا تَحۡمِلُ كُلُّ اُنۡثٰى وَ مَا تَغِيۡضُ
الۡاَرۡحَامُ وَ مَا تَزۡدَادُ ؕ وَ كُلُّ شَىۡءٍ عِنۡدَهٗ
بِمِقۡدَارٍ ۝۸ عٰلِمُ الۡغَيۡبِ وَالشَّهَادَةِ الۡكَبِيۡرُ
الۡمُتَعَالِ ۝۹ سَوَآءٌ مِّنۡكُمۡ مَّنۡ اَسَرَّ الۡقَوۡلَ وَ
مَنۡ جَهَرَ بِهٖ وَ مَنۡ هُوَ مُسۡتَخۡفٍۢ بِالَّيۡلِ
وَسَارِبٌۢ بِالنَّهَارِ ۝۱۰ لَهٗ مُعَقِّبٰتٌ مِّنۡۢ بَيۡنِ
يَدَيۡهِ وَ مِنۡ خَلۡفِهٖ يَحۡفَظُوۡنَهٗ مِنۡ اَمۡرِ اللّٰهِ ؕ
اِنَّ اللّٰهَ لَا يُغَيِّرُ مَا بِقَوۡمٍ حَتّٰى يُغَيِّرُوۡا مَا
بِاَنۡفُسِهِمۡ ؕ وَ اِذَاۤ اَرَادَ اللّٰهُ بِقَوۡمٍ سُوۡٓءًا فَلَا
مَرَدَّ لَهٗ ۚ وَ مَا لَهُمۡ مِّنۡ دُوۡنِهٖ مِنۡ وَّالٍ ۝۱۱

**5** ఒకవేళ మీరు ఇప్పుడు ఆశ్చర్యపడవలసివుంటే, ఆశ్చర్య పడదగిన విషయం ప్రజలయొక్క ఈ మాట: "మేము మరణించి మట్టిగా మారిపోయినప్పుడు మళ్ళీ మేము సరికొత్తగా పుట్టించ బడతామా?" వారే తమ ప్రభువును తిరస్కరించినవారు.[3] వారి మెడలలోనే కంఠపట్టికలు ఉండేది.[4] వారు నరకవాసులు. నరకంలో కలకాలం ఉంటారు.

**6** వారు మేలుకు ముందు కీడుకొరకు తొందర పెడుతున్నారు.[5] వాస్తవానికి వారికి పూర్వం (ఈ వైఖరినే అవలంబించిన వారిపై దేవుని శిక్ష పడిన) గుణపాఠాన్ని నేర్పే దృష్టాంతాలు ఎన్నో జరిగాయి. నిజం ఏమిటంటే ప్రజలు దుర్మార్గాలు చేసిన తరువాత కూడా, నీ ప్రభువు వారిని మన్నించి వదలి వేస్తాడు. నీ ప్రభువు కఠినంగా శిక్షించే వాడనేది కూడా నిజమే.

**7** నీ మాటను వినటానికి నిరాకరించిన వారు ఇలా అంటారు: "ఈ వ్యక్తిపై ఇతని ప్రభువు తరఫు నుండి ఒక నిదర్శనం ఏదైనా ఎందుకు అవతరించలేదు?"– నీవు కేవలం హెచ్చరించేవాడివి మాత్రమే. ప్రతి జాతి కొరకూ ఒక మార్గదర్శకుడు ఉన్నాడు.

**8 - 11** అల్లాహ్‌కు ప్రతి గర్భిణి యొక్క గర్భాన్ని గురించి తెలుసు; అందులో తయారయ్యేది కూడా ఆయనకు తెలుసు; అందులో జరిగే హెచ్చు తగ్గులను గురించి కూడా ఆయనకు తెలుసు. ఆయన వద్ద ప్రతి వస్తువు కొరకు ఒక పరిమాణం నిర్ణయమై ఉన్నది. ఆయన గోప్యంగా ఉన్నటువంటి, బహిరంగంగా ఉన్నటువంటి ప్రతి వస్తువును గురించీ తెలిసిన పండితుడు. ఆయన గొప్ప వాడు. సర్వకాల సర్వావస్థలలో ఆధిక్యం కలిగి ఉండేవాడు. మీలో ఎవరైనా బిగ్గరగా మాట్లాడినా లేక మెల్లగా మాట్లాడినా మీలో ఎవరైనా రాత్రి చీకటిలో దాగి వున్నా లేక పగటి వెలుగులో నడుస్తూ ఉన్నా, ఆయనకు వారంతా సమానమే. ప్రతి మనిషికీ ముందూ వెనకా ఆయన నియమించిన కావలివాళ్ళు అంటి ఉన్నారు. వారు అల్లాహ్ ఆజ్ఞాను సారం అతనిని కాపాడుతూ ఉంటారు. యథార్థం ఏమిటంటే, ఒక జాతి స్వయంగా తన లక్షణాలను మార్చుకోనంత వరకు అల్లాహ్ దాని స్థితిని మార్చడు. అల్లాహ్ ఒక జాతిని తన శిక్షకు గురిచేసే నిర్ణయం తీసుకున్నప్పుడు, దానిని ఎవరు తొలగించదలచుకున్నా అది తొలగదు; అల్లాహ్‌కు ప్రతి కూలంగా అటువంటి జాతిని రక్షించేవాడూ, ఆదుకునేవాడూ ఎవడూ ఉండడు.

هُوَ الَّذِيْ يُرِيْكُمُ الْبَرْقَ خَوْفًا وَّ طَمَعًا وَّ
يُنْشِئُ السَّحَابَ الثِّقَالَ ﴿١٢﴾ وَ يُسَبِّحُ الرَّعْدُ
بِحَمْدِهٖ وَ الْمَلٰٓئِكَةُ مِنْ خِيْفَتِهٖ ۚ وَ يُرْسِلُ
الصَّوَاعِقَ فَيُصِيْبُ بِهَا مَنْ يَّشَآءُ وَهُمْ
يُجَادِلُوْنَ فِي اللّٰهِ ۚ وَ هُوَ شَدِيْدُ الْمِحَالِ ﴿١٣﴾
لَهٗ دَعْوَةُ الْحَقِّ ؕ وَ الَّذِيْنَ يَدْعُوْنَ مِنْ
دُوْنِهٖ لَا يَسْتَجِيْبُوْنَ لَهُمْ بِشَيْءٍ اِلَّا كَبَاسِطِ
كَفَّيْهِ اِلَى الْمَآءِ لِيَبْلُغَ فَاهُ وَ مَا هُوَ بِبَالِغِهٖ ؕ
وَ مَا دُعَآءُ الْكٰفِرِيْنَ اِلَّا فِيْ ضَلٰلٍ ﴿١٤﴾ وَ لِلّٰهِ
يَسْجُدُ مَنْ فِي السَّمٰوٰتِ وَ الْاَرْضِ طَوْعًا
وَّ كَرْهًا وَّ ظِلٰلُهُمْ بِالْغُدُوِّ وَ الْاٰصَالِ ﴿١٥﴾ السجدة ٢

**12 - 13** ఆయనే మీ ముందు మెరుపులను మెరిపింప జేస్తున్నాడు. వాటిని చూసి మీలో భయాలూ చెలరేగుతాయి, ఆశలూ చిగురిస్తాయి. ఆయనే నీళ్ళతో బరువెక్కిన మేఘాలను పైకి లేపుతున్నాడు. మేఘాల గర్జన ఆయనకు స్తోత్రం చేస్తూ ఆయన పవిత్రతను కొనియాడుతోంది.[6] దైవదూతలు ఆయన భయంవల్ల వణికిపోతూ ఆయనను కీర్తిస్తూ ఉంటారు. ఆయన ఫెళ ఫెళమనే పిడుగులను పంపుతాడు. (తరచుగా)వాటిని తాను కోరిన వారిపై, సరిగ్గా ప్రజలు అల్లాహ్‌ను గురించి ఘర్షణపడే సమయంలో పడవేస్తాడు. వాస్తవంగా ఆయన యుక్తి అతి శక్తిమంతమైనది.

**14 - 15** ఆయనను మాత్రమే వేడుకోవటం[7] ధర్మం. ఇక వారు ఆయనను వదలి వేడుకుంటున్న ఇతర శక్తులు–అవి వారి ప్రార్థనలకు ఏ సమాధానమూ ఇవ్వలేవు. వాటిని వేడుకోవటం ఒక మనిషి నీళ్ళవైపు చేతులుచాచి, దానిని “నీవు నా నోటిదాకా వచ్చెయ్యి” అని అభ్యర్థన చేసిన మాదిరిగా ఉన్నది. వాస్తవానికి నీరు అతని వద్దకు చేరటం జరగదు. కనుక ఇదేవిధంగా అవిశ్వాసుల ప్రార్థనలు కూడా గురిలేని బాణాలే తప్ప మరేమీ కావు. భూమ్యాకాశాలలో ఉన్న ప్రతి వస్తువూ ఇష్టం ఉన్నా ఇష్టం లేకపోయినా అల్లాహ్‌కే సజ్దా చేస్తూ ఉన్నది.[8] అన్ని వస్తువుల నీడలు ఉదయం, సాయంత్రం ఆయన ముందు వంగుతాయి.[9]

---

ఏ వస్తువూ పైకి కనిపించదు. కాని ఇంద్రియ గోచరం కాని శక్తి ఒకటి ఉన్నది. అది ప్రతిదానిని తన స్థానంలోనే, తన కక్ష్యలోనే ఆపి ఉంచింది. మహోజ్వలములైన ఈ ఖగోళ వస్తువులను భూగోళంపైగాని ఒకదానిపై మరొకదానిని గాని పడనివ్వదు.

2. అంటే, దైవప్రవక్త (సఅసమ్) తెలియజేస్తున్నటువంటి యథార్థాలను సత్యమైనవని తెలిపే సూచనలు. సృష్టిలో అన్ని వైపులా ఆ యథార్థాలకు సాక్షులుగా ఉండే నిదర్శనాలు వ్యాపించి ఉన్నాయి. ప్రజలు గనక కళ్ళు తెరిచి చూస్తే, ఖురానులో విశ్వసించండి అని ఆహ్వానించటం జరిగిన ఆయా విషయాలను భూమ్యాకాశాలలో వ్యాపించివున్న ఎనలేని సూచనలు ధ్రువీకరిస్తున్నట్లు వారికి కన్పిస్తుంది.

3. వారు పరలోకాన్ని తిరస్కరిస్తున్నారు అంటే అసలు దేవుణ్ణీ ఆయన శక్తినీ, ఆయన వివేకాన్నీ తిరస్కరిస్తున్నారన్నమాట. వారు కేవలం, “మేము మట్టిలో కలిసిపోయిన తరువాత మళ్ళీ పుట్టటం అసంభవం” అని మాత్రమే అనరు. వారి ఈ మాటలలో వారిని పుట్టించిన దేవుడు నిస్సహాయుడూ, వివేకహీనుడూ (అల్లాహ్ శరణు) అనే అభిప్రాయం కూడా దాగివుంది.

4. మెడలో కంఠపట్టిక ఉండటం ఖైదీ అనటానికి సంకేతం. ఈ ప్రజల మెడలో కంఠపట్టిక ఉన్నది అంటే, వారు తమ అజ్ఞానానికీ, తమ మూర్ఖత్వానికీ, తమ మనోవాంఛలకూ, తమ తాత ముత్తాతలను గ్రుడ్డిగా అనుసరించటానికీ బానిసలయ్యారు అని అర్థం. వారు స్వతంత్రంగా ఆలోచించలేరు. వారిని వారి దురభిమానాలు పరలోకాన్ని

**16** "భూమ్యాకాశాలకు ప్రభువు ఎవరు?" అని వారిని అడుగు. "అల్లాహ్" అని అను. తరువాత వారితో ఇలా అను: "యదార్థం ఇదైనప్పుడు, మీరు ఆయనను వదలి, స్వయంగా తమ విషయంలో కూడా లాభనష్టాల అధికారం లేనటువంటి ఆ దేవుళ్ళనా మీరు మీ పనులు నేరవేర్చేవారుగా ఎన్నుకున్నారు?" ఇలా అను: "గుడ్డివాడూ కళ్ళున్నవాడూ సమానులు కాగలరా? వెలుగూ చీకట్లూ ఒకటి కాగలవా? అలా కాకపోతే, వారు నిలబెట్టిన భాగస్వాములు కూడా అల్లాహ్ మాదిరిగానే దేని నయినా సృష్టించారా, దాని కారణంగా సృష్టి విషయంలో వారికి అనుమానం కలగటానికి?" – ఇలా అను: "ప్రతి వస్తువునూ అల్లాహ్‌యే సృష్టించాడు. ఆయన అద్వితీయుడు. అందరిపై ఆధిక్యం కలవాడు."

**17** అల్లాహ్ ఆకాశం నుండి నీళ్ళను కురిపించాడు. ప్రతి నదీ, ప్రతి కాలువా తన శక్తికొలది దానిని గ్రహించి బయలు దేరింది. వరద వచ్చినప్పుడు నీళ్ళ ఉపరితలంపైకి నురుగులు కూడా వచ్చాయి. అటువంటి నురుగులే నగలూ, పాత్రలూ మొదలైనవి చెయ్యటానికి ప్రజలు కరిగించే లోహాలపై కూడా లేస్తాయి. ఇటువంటి ఉదాహరణ ద్వారా అల్లాహ్ సత్యమేదో, అసత్యమేదో సుస్పష్టం చేస్తాడు. నురుగంతా ఎగిరిపోతుంది. మానవులకు లాభం కలిగించే వస్తువు భూమిలో ఉండి పోతుంది. ఈ విధంగా అల్లాహ్ ఉదాహరణల ద్వారా తన మాటలను వివరిస్తాడు.

**18** తమ ప్రభువు సందేశాన్ని స్వీకరించిన వారికి మేలు జరుగుతుంది. దానిని స్వీకరించని వారు సమస్త భూసంపదకు యజమానులు అయినా ఇంకా అంతే సమకూర్చుకున్నా, వారు అల్లాహ్ శిక్ష నుండి తప్పించుకోవటానికి దానినంతటినీ పరిహారంగా ఇవ్వటానికి సిద్ధపడతారు. అటువంటి ప్రజల నుండి దారుణంగా లెక్క తీసుకోబడుతుంది. వారి నివాసం నరకం. అది బహుచెడ్డ నివాసం.

قُلْ مَنْ رَّبُّ السَّمٰوٰتِ وَالْاَرْضِ ؕ قُلِ
اللّٰهُ ؕ قُلْ اَفَاتَّخَذْتُمْ مِّنْ دُوْنِهٖۤ اَوْلِيَآءَ لَا
يَمْلِكُوْنَ لِاَنْفُسِهِمْ نَفْعًا وَّ لَا ضَرًّا ؕ قُلْ
هَلْ يَسْتَوِي الْاَعْمٰى وَ الْبَصِيْرُ ۙ اَمْ هَلْ
تَسْتَوِي الظُّلُمٰتُ وَ النُّوْرُ ۚ اَمْ جَعَلُوْا لِلّٰهِ
شُرَكَآءَ خَلَقُوْا كَخَلْقِهٖ فَتَشَابَهَ الْخَلْقُ
عَلَيْهِمْ ؕ قُلِ اللّٰهُ خَالِقُ كُلِّ شَيْءٍ وَّ هُوَ
الْوَاحِدُ الْقَهَّارُ ﴿۱۶﴾ اَنْزَلَ مِنَ السَّمَآءِ مَآءً
فَسَالَتْ اَوْدِيَةٌۢ بِقَدَرِهَا فَاحْتَمَلَ السَّيْلُ زَبَدًا
رَّابِيًا ؕ وَ مِمَّا يُوْقِدُوْنَ عَلَيْهِ فِي النَّارِ
ابْتِغَآءَ حِلْيَةٍ اَوْ مَتَاعٍ زَبَدٌ مِّثْلُهٗ ؕ كَذٰلِكَ
يَضْرِبُ اللّٰهُ الْحَقَّ وَالْبَاطِلَ ؕ فَاَمَّا الزَّبَدُ
فَيَذْهَبُ جُفَآءً ۚ وَ اَمَّا مَا يَنْفَعُ النَّاسَ
فَيَمْكُثُ فِي الْاَرْضِ ؕ كَذٰلِكَ يَضْرِبُ اللّٰهُ
الْاَمْثَالَ ﴿۱۷﴾ لِلَّذِيْنَ اسْتَجَابُوْا لِرَبِّهِمُ الْحُسْنٰى ؕ وقف النبی صلی اللہ علیہ وسلم
وَ الَّذِيْنَ لَمْ يَسْتَجِيْبُوْا لَهٗ لَوْ اَنَّ لَهُمْ مَّا فِي
الْاَرْضِ جَمِيْعًا وَّ مِثْلَهٗ مَعَهٗ لَافْتَدَوْا بِهٖ ؕ
اُولٰٓئِكَ لَهُمْ سُوْٓءُ الْحِسَابِ ۙ وَ مَاْوٰىهُمْ جَهَنَّمُ ؕ
وَبِئْسَ الْمِهَادُ ﴿۱۸﴾ ع النصف

నమ్మకుండా గట్టిగా బంధించి ఉంచాయి, నమ్మటం సమంజసం, సహేతుకం అయినప్పటికీ. వారి దురభిమానాలు వారు పరలోకాన్ని దృఢంగా తిరస్కరించేలా చేశాయి, అది పూర్తిగా అసమంజసమైనప్పటికీ.

5. అంటే, శిక్షను కోరుతున్నారు.

6. అంటే, మేఘాల గర్జన ఇలా ప్రకటిస్తోంది: వాయువులను నడిపే, ఆవిరులను లేపే, దట్టమయిన మేఘాలను

**19 - 25** నీ ప్రభువు నీపై అవతరింపజేసిన ఈ గ్రంథం సత్యమని గ్రహించిన వ్యక్తీ, ఈ యదార్థం పట్ల అంధుడైన వ్యక్తీ- వారు ఉభయులూ ఎలా సమానులు కాగలరు? హిత బోధను వివేకవంతులు మాత్రమే స్వీకరిస్తారు. వారి ప్రవర్తన ఎలా ఉంటుందంటే, వారు అల్లాహ్‌తో చేసుకున్న తమ ఒడం బడికను నెరవేరుస్తారు. దానిని దృఢపరచిన తరువాత భంగ పరచరు. వారి వైఖరి ఎలా ఉంటుందంటే, స్థిరపరచండి అని అల్లాహ్ ఆదేశించిన సంబంధాలను స్థిరపరుస్తారు. తమ ప్రభువునకు భయపడుతూ ఉంటారు. తమ నుండి కఠినంగా లెక్క తీసుకోబడుతుందేమో అని భయపడుతూ ఉంటారు. వారి పరిస్థితి ఎలా ఉంటుందంటే, తమ ప్రభువు ప్రసన్నత కోసం సహనంతో వ్యవహరిస్తారు. నమాజును స్థాపిస్తారు. మేము ప్రసాదించిన ఉపాధి నుండి బహిరంగంగా, రహస్యంగా ఖర్చుచేస్తారు. చెడును మంచి ద్వారా పారద్రోలుతారు. పరలోక గృహం వారికొరకే ఉన్నది. అంటే, వారికి శాశ్వత నివాస స్థలంగా ఉండే ఉద్యానవనములు. వారు కూడా వాటిలో ప్రవేశి స్తారు. వారి పూర్వీకులలో, వారి భార్యలలో, వారి సంతానంలో సజ్జనులైన వారు కూడా వారితో అక్కడకు పోతారు. ప్రతి వైపునుండి దైవదూతలు వారికి స్వాగతం పలకటానికి వస్తారు. వారితో ఇలా అంటారు: "మీపై శాంతి వర్షించుగాక! ప్రపంచంలో మీరు సహనంతో వ్యవహరించటం వల్ల ఈ రోజు మీరు దీనికి అర్హులయ్యారు." - ఎంత మంచిది ఈ పరలోక గృహం! ఇక వారు, అల్లాహ్‌తో చేసుకున్న ఒడంబడి కను దృఢపరచిన తరువాత భంగపరచేవారు, అల్లాహ్ కలపండి అని ఆదేశించిన సంబంధాలను త్రెంచేవారూ, ధరణిపై కల్లోలాన్ని వ్యాపింపజేసేవారూ, వారు శాపానికి అర్హులు. వారి కొరకు పరలోకంలో బహుచెడ్డ నివాసం ఉన్నది.

**26** అల్లాహ్ తన ఇష్టప్రకారం కొందరికి ఎక్కువ జీవనోపాధిని ప్రసాదిస్తాడు, మరికొందరికి తక్కువ జీవనోపాధిని ప్రసాది స్తాడు. వారు ప్రాపంచిక జీవితంలో మునిగిపోయి ఉన్నారు. వాస్తవానికి పరలోకం ముందు ప్రాపంచిక జీవితం ఒక చిరుసంపద తప్ప మరేమీ కాదు.

اَفَمَنْ يَّعْلَمُ اَنَّمَاۤ اُنْزِلَ اِلَيْكَ مِنْ رَّبِّكَ
الْحَقُّ كَمَنْ هُوَ اَعْمٰى ؕ اِنَّمَا يَتَذَكَّرُ اُولُوا
الْاَلْبَابِ ﴿١٩﴾ الَّذِيْنَ يُوْفُوْنَ بِعَهْدِ اللّٰهِ وَ لَا
يَنْقُضُوْنَ الْمِيْثَاقَ ﴿٢٠﴾ وَالَّذِيْنَ يَصِلُوْنَ مَاۤ
اَمَرَ اللّٰهُ بِهٖۤ اَنْ يُّوْصَلَ وَ يَخْشَوْنَ رَبَّهُمْ
وَيَخَافُوْنَ سُوْٓءَ الْحِسَابِ ﴿٢١﴾ وَ الَّذِيْنَ صَبَرُوا
ابْتِغَآءَ وَجْهِ رَبِّهِمْ وَ اَقَامُوا الصَّلٰوةَ وَ اَنْفَقُوْا
مِمَّا رَزَقْنٰهُمْ سِرًّا وَّعَلَانِيَةً وَّ يَدْرَءُوْنَ
بِالْحَسَنَةِ السَّيِّئَةَ اُولٰٓئِكَ لَهُمْ عُقْبَى الدَّارِ ﴿٢٢﴾
جَنّٰتُ عَدْنٍ يَّدْخُلُوْنَهَا وَ مَنْ صَلَحَ مِنْ
اٰبَآئِهِمْ وَاَزْوَاجِهِمْ وَ ذُرِّيّٰتِهِمْ وَ الْمَلٰٓئِكَةُ
يَدْخُلُوْنَ عَلَيْهِمْ مِّنْ كُلِّ بَابٍ ﴿٢٣﴾ سَلٰمٌ
عَلَيْكُمْ بِمَا صَبَرْتُمْ فَنِعْمَ عُقْبَى الدَّارِ ﴿٢٤﴾
وَالَّذِيْنَ يَنْقُضُوْنَ عَهْدَ اللّٰهِ مِنْۢ بَعْدِ مِيْثَاقِهٖ
وَ يَقْطَعُوْنَ مَاۤ اَمَرَ اللّٰهُ بِهٖۤ اَنْ يُّوْصَلَ
وَيُفْسِدُوْنَ فِى الْاَرْضِ ۙ اُولٰٓئِكَ لَهُمُ اللَّعْنَةُ
وَلَهُمْ سُوْٓءُ الدَّارِ ﴿٢٥﴾ اَللّٰهُ يَبْسُطُ الرِّزْقَ لِمَنْ
يَّشَآءُ وَيَقْدِرُ ؕ وَ فَرِحُوْا بِالْحَيٰوةِ الدُّنْيَا ؕ وَ
مَا الْحَيٰوةُ الدُّنْيَا فِى الْاٰخِرَةِ اِلَّا مَتَاعٌ ﴿٢٦﴾ ع ٨ ٩

وَ يَقُوْلُ الَّذِيْنَ كَفَرُوْا لَوْ لَآ اُنْزِلَ عَلَيْهِ اٰيَةٌ
مِّنْ رَّبِّهٖ ؕ قُلْ اِنَّ اللّٰهَ يُضِلُّ مَنْ يَّشَآءُ وَ
يَهْدِيْۤ اِلَيْهِ مَنْ اَنَابَ ۖۚ ﴿٢٧﴾ اَلَّذِيْنَ اٰمَنُوْا وَ
تَطْمَئِنُّ قُلُوْبُهُمْ بِذِكْرِ اللّٰهِ ؕ اَلَا بِذِكْرِ اللّٰهِ
تَطْمَئِنُّ الْقُلُوْبُ ؕ ﴿٢٨﴾ اَلَّذِيْنَ اٰمَنُوْا وَعَمِلُوا
الصّٰلِحٰتِ طُوْبٰى لَهُمْ وَ حُسْنُ مَاٰبٍ ﴿٢٩﴾
كَذٰلِكَ اَرْسَلْنٰكَ فِيْۤ اُمَّةٍ قَدْ خَلَتْ مِنْ
قَبْلِهَاۤ اُمَمٌ لِّتَتْلُوَاۡ عَلَيْهِمُ الَّذِيْۤ اَوْحَيْنَاۤ
اِلَيْكَ وَ هُمْ يَكْفُرُوْنَ بِالرَّحْمٰنِ ؕ قُلْ هُوَ رَبِّيْ
لَاۤ اِلٰهَ اِلَّا هُوَ ۚ عَلَيْهِ تَوَكَّلْتُ وَ اِلَيْهِ
مَتَابِ ﴿٣٠﴾ وَ لَوْ اَنَّ قُرْاٰنًا سُيِّرَتْ بِهِ الْجِبَالُ
اَوْ قُطِّعَتْ بِهِ الْاَرْضُ اَوْ كُلِّمَ بِهِ الْمَوْتٰى ؕ
بَلْ لِّلّٰهِ الْاَمْرُ جَمِيْعًا ؕ اَفَلَمْ يَايْـَٔسِ الَّذِيْنَ
اٰمَنُوْۤا اَنْ لَّوْ يَشَآءُ اللّٰهُ لَهَدَى النَّاسَ
جَمِيْعًا ؕ وَ لَا يَزَالُ الَّذِيْنَ كَفَرُوْا تُصِيْبُهُمْ
بِمَا صَنَعُوْا قَارِعَةٌ اَوْ تَحُلُّ قَرِيْبًا مِّنْ
دَارِهِمْ حَتّٰى يَاْتِيَ وَعْدُ اللّٰهِ ؕ اِنَّ اللّٰهَ لَا
يُخْلِفُ الْمِيْعَادَ ﴿٣١﴾ ع

**27 - 29** (ముహమ్మద్‌ను ప్రవక్తగా విశ్వసించటానికి) నిరాకరించిన ఈ ప్రజలు ఇలా అంటారు: "ఈ వ్యక్తిపై ఇతని ప్రభువు సన్నిధి నుండి ఏదైనా సూచన ఎందుకు అవతరించ లేదు?" ఇలా అను: "అల్లాహ్ తాను కోరినవారిని మార్గభ్రష్టులుగా చేస్తాడు. ఆయన తన వైపునకు మరలేవారికి మాత్రమే తన వైపునకు వచ్చే మార్గాన్ని చూపుతాడు. అటువంటి ప్రజలే (ఈ ప్రవక్త సందేశాన్ని) విశ్వసించారు. వారి హృదయాలకు అల్లాహ్ సంస్మరణం వల్ల తృప్తి కలుగుతుంది. తెలుసుకోండి! అల్లాహ్ సంస్మరణ ద్వారానే హృదయాలకు తృప్తిని పొందే భాగ్యం లభిస్తుంది. సత్య సందేశాన్ని విశ్వసించి సత్కార్యాలు చేసేవారు సౌభాగ్యవంతులు. వారికి మంచి ఫలం లభిస్తుంది.

**30** ప్రవక్తా! అదేవిధంగా మేము నిన్ను ప్రవక్తగా నియమించి ఒక జాతివద్దకు పంపాము.[10] దానికి పూర్వం ఎన్నో జాతులు గతించాయి, ఆ జాతి ప్రజలకు మేము నీపై అవతరింపజేసిన సందేశాన్ని నీవు వినిపించేందుకుగాను. వాస్తవానికి వారు ఎంతో కరుణామయుడైన తమ దేవుణ్ణి తిరస్కరించారు. వారితో ఇలా అను: "ఆయనే నా ప్రభువు. ఆయన తప్ప మరొక దేవుడు లేడు. ఆయననే నేను నమ్ముకున్నాను. ఆయనే నా ఏకైక ఆశ్రయం."

**31 - 32** పర్వతాలను నడిపించే, భూమిని బద్దలుచేసే, మృతులను గోరీల నుండి బయటికి రప్పించి మాట్లాడించే శక్తి కలిగిన ఖురాను దేనినైనా అవతరింపజేస్తే ఏమై ఉండేది? (ఇటువంటి సూచనలు చూపించటం పెద్ద కష్టమేమీ కాదు) ఎందుకంటే అధికారం సమస్తమూ అల్లాహ్ చేతులలోనే ఉంది.[11] అల్లాహ్ గనక కోరితే మానవులందరికీ మార్గం చూపేవాడు అనే[12] విషయాన్ని (తెలుసుకొని) కూడా విశ్వాసులు (అవిశ్వాసుల కోరికకు సమాధానంగా ఏదైనా సూచన ప్రత్యక్షమవుతుందనే) ఆశ వదులుకోలేదా? అల్లాహ్ పట్ల అవిశ్వాసవైఖరిని అవలంబించిన వారిపైకి వారి చేష్టలు కారణంగా ఏదో ఒక ఆపద వస్తూనే ఉంటుంది. లేదా వారి ఇళ్ళకు సమీపంలో ఎక్కడైనా దిగుతుంది. అల్లాహ్ వాగ్దానం నెరవేరేవరకు ఈ పరంపర సాగిపోతూనే ఉంటుంది. నిశ్చయంగా అల్లాహ్ తన వాగ్దానాన్ని భంగపరచడు.

وَ لَقَدِ اسْتُهْزِئَ بِرُسُلٍ مِّنْ قَبْلِكَ فَاَمْلَيْتُ
لِلَّذِيْنَ كَفَرُوْا ثُمَّ اَخَذْتُهُمْ ۫ فَكَيْفَ كَانَ
عِقَابِ ﴿٣٢﴾ اَفَمَنْ هُوَ قَآىِٕمٌ عَلٰى كُلِّ نَفْسٍۭ بِمَا
كَسَبَتْ ۚ وَ جَعَلُوْا لِلّٰهِ شُرَكَآءَ ؕ قُلْ سَمُّوْهُمْ ؕ
اَمْ تُنَبِّـُٔوْنَهٗ بِمَا لَا يَعْلَمُ فِي الْاَرْضِ اَمْ
بِظَاهِرٍ مِّنَ الْقَوْلِ ؕ بَلْ زُيِّنَ لِلَّذِيْنَ
كَفَرُوْا مَكْرُهُمْ وَ صُدُّوْا عَنِ السَّبِيْلِ ؕ وَ مَنْ
يُّضْلِلِ اللّٰهُ فَمَا لَهٗ مِنْ هَادٍ ﴿٣٣﴾ لَهُمْ عَذَابٌ فِي
الْحَيٰوةِ الدُّنْيَا وَ لَعَذَابُ الْاٰخِرَةِ اَشَقُّ ۚ وَ مَا
لَهُمْ مِّنَ اللّٰهِ مِنْ وَّاقٍ ﴿٣٤﴾ مَثَلُ الْجَنَّةِ الَّتِيْ
وُعِدَ الْمُتَّقُوْنَ ؕ تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ ؕ
اُكُلُهَا دَآىِٕمٌ وَّ ظِلُّهَا ؕ تِلْكَ عُقْبَى الَّذِيْنَ
اتَّقَوْا ۖۗ وَّ عُقْبَى الْكٰفِرِيْنَ النَّارُ ﴿٣٥﴾

నీకు పూర్వం కూడా చాలామంది ప్రవక్తలను ఎగతాళి చెయ్యటం జరిగింది. కాని నేను ఎల్లప్పుడూ తిరస్కారులకు కొంత సడలింపు ఇచ్చాను. చివరకు వారిని పట్టుకున్నాను. చూడండి, నా శిక్ష ఎంత కఠినంగా ఉంటుందో!

**33 - 35** ఒక్కొక్క మనిషి సంపాదించేదానిపై నిఘావేసి ఉండేవానికి భాగస్వాములుగా నిలబెట్టే (అంతటి దుస్సాహసానికి పాల్పడుతున్నారా) ప్రజలు? ప్రవక్తా! వారితో ఇలా అను: "(నిజంగానే వారు దేవుడు స్వయంగా చేసుకున్న భాగస్వాములే అయితే) కొంచెం వారెవరో వారి పేర్లు ఏమిటో చెప్పండి?"–తన భూమిలో ఉన్నట్లు అల్లాహ్‌కు తెలియని ఒక కొత్త విషయాన్ని గురించి మీరు ఆయనకు తెలుపుతున్నారా? లేక మీరు ఇట్టే నోటికి వచ్చినదల్లా వాగుతున్నారా? యథార్థం ఏమిటంటే, సత్యసందేశాన్ని స్వీకరించటానికి తిరస్కరించిన వారికి తమ పన్నుగడలు[13] ఆకర్షకములుగా చెయ్యబడ్డాయి. వారు సన్మార్గం నుండి నిరోధించబడ్డారు. అల్లాహ్ మార్గ భ్రష్టత్వంలోకి విసిరివేసిన వాడికి మార్గం చూపే వాడెవడూ లేడు. అటువంటి వారికి ప్రాపంచిక జీవితంలోనే శిక్ష పడుతుంది. పరలోక శిక్ష దీనికంటే కూడా ఎంతో కఠినంగా ఉంటుంది. వారిని దేవుని నుండి రక్షించే వాడెవడూ లేడు. దైవభక్తిగల మానవులకు వాగ్దానం చెయ్యబడిన స్వర్గవైభవం ఇలా ఉంటుంది: దానిక్రింద కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి. దాని ఫలాలు శాశ్వతమైనవి. దాని నీడ నశించనిది. భయభక్తులు కలవారికి లభించే ప్రతిఫలం ఇలా ఉంటుంది. సత్య తిరస్కారులకు లభించే ప్రతిఫలం నరకాగ్ని.

---

పోగుచేసే, మెరుపును వర్షానికి సాధనంగా చేసి భూమండలంలోని ప్రాణికోటికి నీరు లభించే ఏర్పాటుచేసే దేవుడు తన వివేకంలో, తన శక్తిలో పరిపూర్ణుడు. తన గుణవిశేషాలలో దోషరహితుడు. తన దైవత్వంలో ఇతరుల భాగస్వామ్యం లేనివాడు. పశువుల మాదిరిగా వినేవారు ఈ మేఘాలలో గర్జనల ధ్వనిని మాత్రమే వింటారు. కాని తెలివివున్న చెవులు కలవారు మేఘాల భాష ద్వారా "అల్లాహ్ ఒక్కడే" అనే ప్రకటన వింటారు.

7. అంటే తమ అవసరాలకు సహాయపడవలసిందిగా వేడుకోవటం. భావం ఏమిటంటే అవసరాలను తీర్చే, కష్టాలను తొలగించే పూర్తి అధికారాలు ఆయన చేతులలోనే ఉన్నాయి కాబట్టి ఆయననే ప్రార్థించటం న్యాయ సమ్మతం అని.

8. సజ్దా అంటే, విధేయతతో వంగటం, ఆజ్ఞలను పాలించటం, అంగీకార సూచకంగా తలవంచటం.

9. నీడలు వంగుతాయి అంటే వస్తువుల నీడలు ఉదయమూ సాయంత్రమూ తూర్పు పడమరల వైపునకు పడటం అనేది ఈ వస్తువులన్నీ ఒకరి ఆజ్ఞకు లోబడి ఉన్నాయి. ఒకరి శాసనానికి కట్టుబడి ఉన్నాయి అనే విషయాన్ని సూచిస్తుంది.

وَ الَّذِيْنَ اٰتَيْنٰهُمُ الْكِتٰبَ يَفْرَحُوْنَ بِمَآ اُنْزِلَ
اِلَيْكَ وَ مِنَ الْاَحْزَابِ مَنْ يُّنْكِرُ بَعْضَهٗ ؕ
قُلْ اِنَّمَآ اُمِرْتُ اَنْ اَعْبُدَ اللّٰهَ وَ لَآ اُشْرِكَ
بِهٖ ؕ اِلَيْهِ اَدْعُوْا وَ اِلَيْهِ مَاٰبِ ۳۶ وَ كَذٰلِكَ
اَنْزَلْنٰهُ حُكْمًا عَرَبِيًّا ؕ وَلَئِنِ اتَّبَعْتَ
اَهْوَآءَهُمْ بَعْدَ مَا جَآءَكَ مِنَ الْعِلْمِ ۙ مَا لَكَ
مِنَ اللّٰهِ مِنْ وَّلِيٍّ وَّ لَا وَاقٍ ۳۷ وَ لَقَدْ ع
اَرْسَلْنَا رُسُلًا مِّنْ قَبْلِكَ وَ جَعَلْنَا لَهُمْ
اَزْوَاجًا وَّ ذُرِّيَّةً ؕ وَ مَا كَانَ لِرَسُوْلٍ اَنْ يَّاْتِيَ
بِاٰيَةٍ اِلَّا بِاِذْنِ اللّٰهِ ؕ لِكُلِّ اَجَلٍ كِتَابٌ ۳۸
يَمْحُوا اللّٰهُ مَا يَشَآءُ وَ يُثْبِتُ ۖۚ وَ عِنْدَهٗۤ اُمُّ
الْكِتٰبِ ۳۹

**36 – 37** ప్రవక్తా! మేము మునుపు గ్రంథాన్ని ఇచ్చిన వారు, మేము మీపై అవతరింపజేసిన గ్రంథంపట్ల సంతోషంగా ఉన్నారు. దానిలోని కొన్ని విషయాలను నమ్మనివారు కూడా విభిన్న వర్గాలలో కొందరు ఉన్నారు. నీవు స్పష్టంగా ఇలా అను: "అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించు అని నాకు ఆజ్ఞాపించబడింది. ఇతరులను ఆయనకు భాగస్వాములుగా నిలబెట్టకు అని నాకు నిషేధించబడింది. కనుక నేను మిమ్మల్ని ఆయన వైపునకే ఆహ్వానిస్తున్నాను. ఆయన వైపునకే నేను మరలుతాను." ఈ మార్గదర్శకత్వంతోనే మేము ఈ అరబ్బీ ఫర్మానాను నీపై అవతరింపజేశాము. ఇక నీవు గనక, నీవద్దకు ఈ జ్ఞానం వచ్చిన తరువాత కూడా, ప్రజల కోరికలను అనుసరిస్తే, అల్లాహ్ సమక్షంలో నిన్ను రక్షించేవాడుగానీ నీకు సహాయపడేవాడుగానీ ఎవడూ ఉండడు. మరెవడూ ఆయన శిక్ష నుండి నిన్ను తప్పించనూ లేడు.

**38 – 39** నీకు పూర్వం కూడా మేము చాలామంది ప్రవక్తలను పంపాము. మేము వారిని ఆలుబిడ్డలు కలవారిగానే చేశాము.[14] అల్లాహ్ అనుమతి లేకుండా ఏ సూచననూ స్వయంగా తెచ్చి చూపే శక్తి ఏ ప్రవక్తకూ లేదు. ప్రతి యుగానికీ ఒక గ్రంథం ఉన్నది. అల్లాహ్ తాను రద్దుచేయదలచుకున్న దానిని రద్దు చేస్తాడు. తాను ఉంచదలచుకున్నదానిని స్థిరంగా ఉంచుతాడు. అసలు గ్రంథం ఆయన దగ్గరే ఉన్నది.[15]

10. అంటే, ఈ ప్రజలు కోరే నిదర్శనం ఏదీ లేకుండానే.

11. అంటే, సూచనలను చూపించకపోవటానికి కారణం అల్లాహ్‌కు వాటిని చూపే శక్తిలేదు అని దాని భావం కాదు. అసలు కారణం ఏమిటంటే, ఈ పద్ధతులను ఉపయోగించటం అల్లాహ్ పథకానికి వ్యతిరేకం. ఎందుకంటే, అసలు ఉద్దేశ్యం మార్గదర్శకత్వమేకాని ఒక ప్రవక్త యొక్క ప్రవక్త పదవిని ప్రజలచేత ఎలాగైనా అంగీకరింపజెయ్యటం కాదు. ప్రజల ఆలోచనా విధానం, వివేచనా పద్ధతి సంస్కరింపబడనంత వరకు మార్గదర్శకత్వం పొందటం అనేది సాధ్యపడదు.

12. అంటే, ఒకవేళ ఆలోచించకుండా, అర్థం చేసుకోకుండా కేవలం చైతన్య రహితంగా విశ్వసించటం అనేదే ఉద్దేశించబడి ఉంటే, ఇటువంటి నిదర్శనాలను చూపటానికి సంకోచించవలసిన అవసరం ఏముంటుంది. ఈ పని అల్లాహ్ మానవులందరినీ విశ్వాసులుగా పుట్టిస్తే పూర్తి అయిపొయ్యేది.

13. ఇక్కడ షిర్కును ఒక పన్నుగడగా వర్ణించటానికి కారణం ఏమిటంటే, అసలు దేవుని గుణాలూ, దేవుని అధికారాలూ కలవారని పరిగణించబడిన నక్షత్రాలూ, గ్రహాలూ, దైవదూతలూ, ఆత్మలూ, మహనీయులూ దేవుని ప్రత్యేక హక్కులలో భాగస్వాములుగా చెయ్యటం జరిగిన వారిలో ఎవరైనా సరే, ఎన్నడూ తాము ఈ గుణాలకూ ఈ అధికారాలకూ దావేదారులము అని చెప్పుకోలేదు. ఎన్నడూ ఆ హక్కులను కోరలేదు. ఇంకా మా పట్ల భక్తి

وَاِنْ مَّا نُرِيَنَّكَ بَعْضَ الَّذِيْ نَعِدُهُمْ اَوْ
نَتَوَفَّيَنَّكَ فَاِنَّمَا عَلَيْكَ الْبَلٰغُ وَ عَلَيْنَا
الْحِسَابُ ﴿٤٠﴾ اَوَ لَمْ يَرَوْا اَنَّا نَاْتِي الْاَرْضَ
نَنْقُصُهَا مِنْ اَطْرَافِهَا ؕ وَ اللّٰهُ يَحْكُمُ لَا مُعَقِّبَ
لِحُكْمِهٖ ؕ وَ هُوَ سَرِيْعُ الْحِسَابِ ﴿٤١﴾ وَقَدْ مَكَرَ
الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ فَلِلّٰهِ الْمَكْرُ جَمِيْعًا ؕ يَعْلَمُ
مَا تَكْسِبُ كُلُّ نَفْسٍ ؕ وَسَيَعْلَمُ الْكُفّٰرُ لِمَنْ
عُقْبَى الدَّارِ ﴿٤٢﴾ وَيَقُوْلُ الَّذِيْنَ كَفَرُوْا لَسْتَ
مُرْسَلًا ؕ قُلْ كَفٰى بِاللّٰهِ شَهِيْدًۢا بَيْنِيْ
وَبَيْنَكُمْ ۙ وَمَنْ عِنْدَهٗ عِلْمُ الْكِتٰبِ ﴿٤٣﴾ ع ٦ ١٢

**40 - 42** ప్రవక్తా! ఏ చెడు పర్యవసానాన్ని గురించి మేము ఈ ప్రజలను బెదరిస్తూ వచ్చామో, అందులో ఒక భాగాన్ని మేము నీ జీవితకాలంలో చూపించినా లేదా అది సంభవించే ముందే మేము నిన్ను లేపుకున్నా ఏ పరిస్థితిలోనైనా, నీ పని కేవలం సందేశాన్ని అందజెయ్యటమే. లెక్క తీసుకోవటం మటుకు మా పని. ఈ ప్రజలు చూడటంలేదా, మేము ఈ భూ భాగంపై పురోగమిస్తూ దాని పరిధిని అన్ని వైపుల నుండి తగ్గిస్తూ వస్తున్నాము?[16] అల్లాహ్ (సృష్టిని) శాసిస్తున్నాడు. ఆయన నిర్ణయాలను పునఃపరిశీలించగల వాడెవడూ లేడు. లెక్క తీసుకోవటం ఆయనకు ఎంతోసేపు పట్టదు. వారికి పూర్వం గతించిన ప్రజలు కూడా పెద్ద పెద్ద పన్నాగాలు పన్నారు. కాని నిర్ణయాత్మకమైన అసలు పన్నాగం పూర్తిగా అల్లాహ్ చేతులలోనే ఉన్నది. ఎవరు ఏమేమి సంపాదిస్తున్నారో ఆయనకు తెలుసు. త్వరలోనే ఈ సత్య తిరస్కారులు చూస్తారు ఎవరి పర్యవసానం మేలైనది అవుతుందో!

**43** ఈ తిరస్కారులు "నీవు అల్లాహ్ పంపినవాడవు కావు" అని అంటున్నారు. ఇలా అను: "నాకూ మీకూ మధ్య అల్లాహ్ సాక్ష్యమే చాలు. ఆపై ఆకాశ గ్రంథజ్ఞానం కలవాడి సాక్ష్యం చాలు."

---

ప్రపత్తులు చూపండి. మేము మీ పనులను చేసిపెడతాము అని వారికి ఎన్నడూ బోధించలేదు. ఇది జిత్తులమారి మానవులు చేసిన పనే. వారు ప్రజలలో తమ పలుకుబడిని పెంచుకోవటానికి, వారి సంపాదనలలో భాగం కొట్టెయ్యటానికి, కొందరు బూటకపు దేవుళ్ళను సృష్టించారు. ప్రజలను వారికి విశ్వాసులుగా చేశారు. తమను తాము ఏదో ఒక విధంగా వారికి ప్రతినిధులుగా చేసుకుని తమ లక్ష్యాలను సాధించుకునేవారు.

14. మహాప్రవక్త (సఅసమ్)ను గురించి చెయ్యబడిన ఒక అభ్యంతరానికి ఇది జవాబు. ఆయన భలే ప్రవక్త. భార్యాపిల్లలూ కలిగివున్నాడు! దైవప్రవక్తలకు కూడా మనో వాంఛలతో సంబంధం ఉంటుందా? అని వారు అనేవారు. వాస్తవానికి ఖురైష్ ప్రజలు స్వయంగా తాము హజ్రత్ ఇబ్రాహీము (అస్సలామ్) ప్రవక్త, ఇస్మాయీలు (అస్సలామ్) ప్రవక్త సంతానం అయినందుకు గర్వించేవారు.

15. "అసలు గ్రంథం" అంటే, సమస్త ఆకాశ గ్రంథాలకు మూలాధారమైన గ్రంథం అని భావం.

16. అంటే, ఇస్లామ్ అరేబియా భూభాగంలో మూలమూలలకూ వ్యాపిస్తూ నలువైపుల నుండి తమకు దేశ సరిహద్దులు ఇరుకైపోతూ ఉన్న విషయం మీ విరోధులకు కనిపించటం లేదా? ఇవి వారిపైకి ఆపద రాబోతోంది అని తెలిపే సూచనలు కాకపోతే మరేమిటి? అల్లాహ్, "మేము ఈ భూభాగంపై పురోగమిస్తున్నాము" అని అనటం ఒక అత్యంత సూక్ష్మమైన ప్రకటనా పద్ధతి. సత్య సందేశం అల్లాహ్ తరఫు నుండే వచ్చింది కాబట్టి, అల్లాహ్ దానిని అందజేసే వారితోనే ఉంటాడు. అందుకని ఒక భూభాగంలో ఈ సందేశం వ్యాపించటాన్ని అల్లాహ్ "మేమే స్వయంగా ఈ భూభాగంపై పురోగమిస్తున్నాము" అనే మాటల ద్వారా వర్ణిస్తున్నాడు.

ఆయతులు 52 | **14. ఇబ్రాహీమ్** | అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 – 2** అలిఫ్ లామ్ రా. ముహమ్మద్! ఇది ఒక గ్రంథం. మేము దీనిని నీ వైపునకు అవతరింపజేశాము, నీవు ప్రజలను వారి ప్రభువు అనుమతితో చీకట్లలో నుండి వెలికితీసి వెలుగులోకి తీసుకురావాలని– మహాశక్తి మంతుడూ, స్వతహ స్తోత్రాలకు అర్హుడూ,[1] భూమ్యాకాశాలలో ఉన్న సమస్తానికీ స్వామి అయిన దేవుని మార్గం మీదకు తీసుకురావాలని.

**2 – 3** సత్యాన్ని స్వీకరించటానికి తిరస్కరించేవారికి కఠినమైన, వినాశకరమైన శిక్ష పడుతుంది. వారు పరలోక జీవితం కంటే ఇహలోక జీవితానికి ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. వారు ప్రజలను అల్లాహ్ మార్గం నుండి వారిస్తారు. వారు ఈ మార్గం (తమ కోరికలకు అనుగుణంగా) వక్రమైనదిగా కావాలని కోరుతున్నారు. వారు మార్గభ్రష్టత్వంలో చాలాదూరం వెళ్లి పోయారు.

**4** మేము మా సందేశాన్ని అందజేసే నిమిత్తం ప్రవక్తను పంపినప్పుడల్లా, అతడు తన జాతి ప్రజలు మాట్లాడే భాషలోనే మా సందేశాన్ని అందజేశాడు, వారికి అతడు విషయాన్ని చక్కగా అర్థమయ్యేటట్టు చెప్పటానికి. అల్లాహ్ తాను మార్గభ్రష్టులుగా చేయదలచుకున్న వారిని మార్గభ్రష్టులుగా చేస్తాడు. తాను మార్గం చూపదలచుకున్నవారికి మార్గం చూపుతాడు. ఆయన శక్తి సంపన్నుడూ, వివేక సంపన్నుడూను.

**5** మేము ఇంతకు ముందు మూసాను కూడా మా సూచనలను ఇచ్చి పంపి వున్నాము. ఆయనను కూడా మేము ఇలా ఆజ్ఞాపించాము: నీ జాతివారిని చీకట్లలోనుండి బయటికి తీసి వెలుగులోకి తీసుకురా. దైవ చరిత్రలోని[2] గుణపాఠంతో నిండివున్న సంఘటనలను వారికి వినిపించి హితబోధ చెయ్యి. ఈ సంఘటనలలో సహనశీలుడూ కృతజ్ఞుడూ అయిన ప్రతి మనిషికీ గొప్ప నిదర్శనాలు ఉన్నాయి.[3]

١٤ سُوۡرَةُ اِبۡرٰهِيۡمَ مَكِّيَّةٌ ٧٢

اٰيَاتُهَا ٥٢ | رُكُوۡعَاتُهَا ٧

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○

الٓرٰ‌ كِتٰبٌ اَنۡزَلۡنٰهُ اِلَيۡكَ لِـتُخۡرِجَ النَّاسَ مِنَ
الظُّلُمٰتِ اِلَى النُّوۡرِ ۙ بِاِذۡنِ رَبِّهِمۡ اِلٰى صِرَاطِ
الۡعَزِيۡزِ الۡحَمِيۡدِۙ ① اللّٰهِ الَّذِىۡ لَهٗ مَا فِى
السَّمٰوٰتِ وَمَا فِى الۡاَرۡضِ‌ ؕ وَوَيۡلٌ
لِّلۡكٰفِرِيۡنَ مِنۡ عَذَابٍ شَدِيۡدِ ۙ ② اۨلَّذِيۡنَ
يَسۡتَحِبُّوۡنَ الۡحَيٰوةَ الدُّنۡيَا عَلَى الۡاٰخِرَةِ وَ
يَصُدُّوۡنَ عَنۡ سَبِيۡلِ اللّٰهِ وَيَبۡغُوۡنَهَا عِوَجًا‌ ؕ
اُولٰۤـئِكَ فِىۡ ضَلٰلٍۢ بَعِيۡدٍ ③ وَمَاۤ اَرۡسَلۡنَا مِنۡ
رَّسُوۡلٍ اِلَّا بِلِسَانِ قَوۡمِهٖ لِيُبَيِّنَ لَهُمۡ‌ ؕ
فَيُضِلُّ اللّٰهُ مَنۡ يَّشَآءُ وَيَهۡدِىۡ مَنۡ يَّشَآءُ ‌ؕ
وَهُوَ الۡعَزِيۡزُ الۡحَكِيۡمُ ④ وَلَـقَدۡ اَرۡسَلۡنَا
مُوۡسٰى بِاٰيٰتِنَاۤ اَنۡ اَخۡرِجۡ قَوۡمَكَ مِنَ الظُّلُمٰتِ
اِلَى النُّوۡرِ ۙ وَذَكِّرۡهُمۡ بِاَيّٰٮمِ اللّٰهِ‌ ؕ اِنَّ فِىۡ
ذٰ لِكَ لَاٰيٰتٍ لِّـكُلِّ صَبَّارٍ شَكُوۡرٍ ⑤

1. "హమీద్" అన్నా "మహ్మూద్" అన్నా అర్థం ఒక్కటే. అయినప్పటికీ రెంటికీ మధ్య ఒక సూక్ష్మమైన భేదం ఉంది. ఒక వ్యక్తిని "మహ్మూద్" అని, అతను పొగడబడినపుడు లేదా పొగడబడుతూ ఉన్నప్పుడు అంటారు. కాని "హమీద్" అంటే స్వతహాగా అతనే స్తోత్రాలకు అర్హుడు–ఇతరులు అతనిని స్తోత్రం చేసినా సరే, చెయ్యక పోయినా సరే.

**6 - 8** ఆ సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకో. అప్పుడు మూసా తన జాతివారితో ఇలా అన్నాడు: "అల్లాహ్ మీకు చేసిన మేలును జ్ఞాపకం ఉంచుకోండి. ఆయన మీకు ఫిరౌను ప్రజల నుండి విముక్తి కలిగించాడు. వారు మిమ్మల్ని తీవ్రమైన బాధ లకు గురిచేస్తూ ఉండేవారు. మీ కొడుకులను చంపేవారు. మీ కూతుళ్ళను బ్రతుకనిచ్చేవారు. ఇది మీ ప్రభువు తరఫు నుండి మీకు పెద్ద పరీక్ష! జ్ఞాపకం ఉంచుకోండి. మీ ప్రభువు ఇలా హెచ్చరిక చేశాడు: మీరు గనక కృతజ్ఞులైతే, నేను మిమ్మల్ని ఇంకా ఎక్కువగా అనుగ్రహిస్తాను. ఒకవేళ కృతఘ్నుతకు పాల్పడితే నా శిక్ష చాలా కఠినముగా ఉంటుంది." మూసా ఇలా అన్నాడు: "ఒకవేళ మీరు అవిశ్వాసానికి పాల్పడినా, భూమిపై ఉండే వారందరూ అవిశ్వాసులైపోయినా, అల్లాహ్ ఏ అక్కరాలేనివాడు, స్వతహా స్తోత్రాలకు అర్హుడు."

**9 - 12** మీకు[4] పూర్వం గతించిన జాతుల గాధలు మీదాకా చేరలేదా? నూహ్ జాతి, ఆద్ జాతి, సమూద్ జాతి, ఇంకా వాటి తరువాత వచ్చిన అనేక జాతులూ, వాటి సంఖ్యా అల్లాహ్‌కు మాత్రమే తెలుసు. వారి ప్రవక్తలు వారి వద్దకు స్పష్టమైన మాటలను, ప్రస్ఫుటమైన నిదర్శనాలనూ తీసుకుని వచ్చినప్పుడు వారు తమ నోళ్ళల్లో చేతులు బిగబట్టి[5] ఇలా అన్నారు: "ఏ సందేశంతో నీవు పంపబడ్డావో ఆ సందేశాన్ని మేము విశ్వసించము. ఏ విషయం వైపునకు నీవు మమ్మల్ని ఆహ్వానిస్తున్నావో, మేము ఆ విషయాన్ని గురించి కలతలో, సందేహంలో పడ్డాము. వారి ప్రవక్తలు ఇలా అన్నారు: "ఆకాశా లకూ భూమికీ సృష్టికర్త అయిన అల్లాహ్ పట్ల సందేహమా? ఆయన మిమ్మల్ని పిలుస్తున్నాడు, మీ తప్పులను మన్నించ టానికి, మీకు ఒక నిర్ణీతకాలం వరకు వ్యవధినివ్వ టానికి." వారు ఇలా జవాబు పలికారు: "నీవు మా వంటి ఒక మానవుడవు తప్ప మరేమీ కావు. మా తాత ముత్తాతల కాలం నుండీ ఆరాధించబడుతూ వచ్చిన శక్తుల ఆరాధన నుండి నీవు మమ్మల్ని ఆపాలని అనుకుంటున్నావు. సరే, స్పష్టమైన ప్రమాణాన్ని దేనినైనా తీసుకునిరా."

وَ اِذْ قَالَ مُوْسٰى لِقَوْمِهِ اذْكُرُوْا نِعْمَةَ اللّٰهِ
عَلَيْكُمْ اِذْ اَنْجٰىكُمْ مِّنْ اٰلِ فِرْعَوْنَ يَسُوْمُوْنَكُمْ
سُوْٓءَ الْعَذَابِ وَ يُذَبِّحُوْنَ اَبْنَآءَكُمْ
وَيَسْتَحْيُوْنَ نِسَآءَكُمْ ؕ وَ فِيْ ذٰلِكُمْ بَلَآءٌ مِّنْ
رَّبِّكُمْ عَظِيْمٌ ۝٦ وَ اِذْ تَاَذَّنَ رَبُّكُمْ لَئِنْ ع ١٢/٢
شَكَرْتُمْ لَاَزِيْدَنَّكُمْ وَ لَئِنْ كَفَرْتُمْ اِنَّ عَذَابِيْ
لَشَدِيْدٌ ۝٧ وَ قَالَ مُوْسٰٓى اِنْ تَكْفُرُوْٓا اَنْتُمْ وَ
مَنْ فِي الْاَرْضِ جَمِيْعًا ۙ فَاِنَّ اللّٰهَ لَغَنِيٌّ
حَمِيْدٌ ۝٨ اَلَمْ يَاْتِكُمْ نَبَؤُا الَّذِيْنَ مِنْ قَبْلِكُمْ
قَوْمِ نُوْحٍ وَّ عَادٍ وَّ ثَمُوْدَ ۛؕ وَ الَّذِيْنَ مِنْۢ
بَعْدِهِمْ ۛؕ لَا يَعْلَمُهُمْ اِلَّا اللّٰهُ ؕ جَآءَتْهُمْ مع
رُسُلُهُمْ بِالْبَيِّنٰتِ فَرَدُّوْٓا اَيْدِيَهُمْ فِيْٓ اَفْوَاهِهِمْ
وَ قَالُوْٓا اِنَّا كَفَرْنَا بِمَآ اُرْسِلْتُمْ بِهٖ وَ اِنَّا
لَفِيْ شَكٍّ مِّمَّا تَدْعُوْنَنَآ اِلَيْهِ مُرِيْبٍ ۝٩ قَالَتْ الثلثة
رُسُلُهُمْ اَفِي اللّٰهِ شَكٌّ فَاطِرِ السَّمٰوٰتِ وَ
الْاَرْضِ ؕ يَدْعُوْكُمْ لِيَغْفِرَ لَكُمْ مِّنْ ذُنُوْبِكُمْ وَ
يُؤَخِّرَكُمْ اِلٰٓى اَجَلٍ مُّسَمًّى ؕ قَالُوْٓا اِنْ اَنْتُمْ
اِلَّا بَشَرٌ مِّثْلُنَا ؕ تُرِيْدُوْنَ اَنْ تَصُدُّوْنَا عَمَّا
كَانَ يَعْبُدُ اٰبَآؤُنَا فَاْتُوْنَا بِسُلْطٰنٍ مُّبِيْنٍ ۝١٠

2. "అయ్యామ్" అనే పదం అరబ్బీ భాషలో జ్ఞాపకం ఉంచుకోదగిన చారిత్రాత్మక సంఘటనల కోసం వాడబడుతుంది. "అయ్యాముల్లాహ్" అంటే పూర్వకాలపు జాతులకూ, గొప్ప గొప్ప వ్యక్తులకూ అల్లాహ్ వారి కర్మల ప్రకారం ప్రతిఫలంగానీ, శిక్షగానీ ఇచ్చిన మానవ చరిత్రలోని ముఖ్యమైన అధ్యాయాలు అని భావం.

قَالَتْ لَهُمْ رُسُلُهُمْ اِنْ نَّحْنُ اِلَّا بَشَرٌ مِّثْلُكُمْ
وَ لٰكِنَّ اللّٰهَ يَمُنُّ عَلٰى مَنْ يَّشَآءُ مِنْ عِبَادِهٖ ؕ
وَمَا كَانَ لَنَآ اَنْ نَّاْتِيَكُمْ بِسُلْطٰنٍ اِلَّا بِاِذْنِ
اللّٰهِ ؕ وَعَلَى اللّٰهِ فَلْيَتَوَكَّلِ الْمُؤْمِنُوْنَ ﴿۱۱﴾ وَ مَا
لَنَآ اَلَّا نَتَوَكَّلَ عَلَى اللّٰهِ وَ قَدْ هَدٰىنَا
سُبُلَنَا ؕ وَ لَنَصْبِرَنَّ عَلٰى مَآ اٰذَيْتُمُوْنَا ؕ وَ عَلَى
اللّٰهِ فَلْيَتَوَكَّلِ الْمُتَوَكِّلُوْنَ ﴿۱۲﴾ وَ قَالَ الَّذِيْنَ
كَفَرُوْا لِرُسُلِهِمْ لَنُخْرِجَنَّكُمْ مِّنْ اَرْضِنَآ اَوْ
لَتَعُوْدُنَّ فِيْ مِلَّتِنَا ؕ فَاَوْحٰۤى اِلَيْهِمْ رَبُّهُمْ
لَنُهْلِكَنَّ الظّٰلِمِيْنَ ﴿۱۳﴾ وَ لَنُسْكِنَنَّكُمُ الْاَرْضَ
مِنْۢ بَعْدِهِمْ ؕ ذٰلِكَ لِمَنْ خَافَ مَقَامِيْ وَ خَافَ
وَعِيْدِ ﴿۱۴﴾ وَاسْتَفْتَحُوْا وَخَابَ كُلُّ جَبَّارٍ
عَنِيْدٍ ﴿۱۵﴾ مِّنْ وَّرَآئِهٖ جَهَنَّمُ وَيُسْقٰى مِنْ مَّآءٍ
صَدِيْدٍ ﴿۱۶﴾ يَّتَجَرَّعُهٗ وَ لَا يَكَادُ يُسِيْغُهٗ
وَيَاْتِيْهِ الْمَوْتُ مِنْ كُلِّ مَكَانٍ وَّ مَا هُوَ
بِمَيِّتٍ ؕ وَ مِنْ وَّرَآئِهٖ عَذَابٌ غَلِيْظٌ ﴿۱۷﴾

వారి ప్రవక్తలు వారితో ఇలా అన్నారు: "నిజంగానే, మేము మీవంటి మానవులం తప్ప మరేమీకాము. కాని అల్లాహ్ తన దాసులలో తాను అనుగ్రహించదలచిన వారిని అనుగ్రహిస్తాడు. ఏదైనా ప్రమాణాన్ని తెచ్చి మీకు ఇవ్వటం అనేది మా అధికారంలో లేదు. ప్రమాణం అనేది అల్లాహ్ అనుమతితో మాత్రమే రాగలుగుతుంది. విశ్వాసులు అల్లాహ్‌నే నమ్ముకోవాలి. మన జీవనమార్గాలలో అల్లాహ్ మనకు మార్గదర్శకత్వం వహించినప్పుడు మనం అల్లాహ్‌ను ఎందుకు నమ్ముకోకూడదు? మీరు మమ్మల్ని పెడుతున్న బాధలను ఓర్పుతో సహిస్తాము. నమ్ముకునే వారు అల్లాహ్‌ను మాత్రమే నమ్ముకోవాలి."

**13 - 17** చివరకు తిరస్కారులు తమ ప్రవక్తలతో ఇలా అన్నారు: "మీరు మా మతంలోకి తిరిగి రావాలి.[6] లేకపోతే మేము మిమ్మల్ని మా దేశం నుండి బహిష్కరిస్తాము." అప్పుడు వారి ప్రభువు వారికి ఇలా "వహీ"ని పంపాడు. "మేము ఈ దుర్మార్గులను నాశనం చేస్తాము. వారి తరువాత మిమ్మల్ని భూమిపై వసింపజేస్తాము. నా సాన్నిధ్యంలో సమాధానం చెప్పుకోవలసి ఉందని భయపడుతూ నా శిక్షకు భయపడే వ్యక్తికే ఈ బహుమానం." వారు తీర్పును కోరారు. (అప్పుడు వారికి తీర్పు ఇవ్వబడింది). బలమదాంధుడైన ప్రతి సత్య విరోధి అవమానం పాలయ్యాడు." దాని తరువాత ముమ్ముందు అతడి కొరకు నరకం ఉంది. అక్కడ అతడికి త్రాగటానికి చీము, నెత్తురు లాంటి చెడు నీరు ఇవ్వబడుతుంది. దానిని అతడు బలవంతంగా గొంతులోకి దించటానికి ప్రయత్నిస్తాడు. అతి కష్టంతో దించగలుగుతాడు. మరణం అతణ్ణి అన్ని వైపుల నుండి చుట్టుముట్టి ఉంటుంది. కాని అతడు మరణించలేడు. అతని ముందు ఒక కఠినమైన శిక్ష అతడి ప్రాణానికి సంకటంగా ఉంటుంది.

3. అంటే, ఈ నిదర్శనాలు ఎప్పటి నుంచో ఉన్నాయి. కాని పరీక్షలను సహనంతోనూ సాహసంతోనూ ఎదుర్కొనేవారూ, అల్లాహ్ అనుగ్రహాల విలువను గ్రహించి వాటికి సరియైన కృతజ్ఞతలు తెలిపేవారూ మాత్రమే వాటి ద్వారా ప్రయోజనాన్ని పొందగలుగుతారు.

4. హజ్రత్ మూసా (అస్సలామ్) ఉపన్యాసం పైన సమాప్తమయింది. ఇప్పుడు నేరుగా మక్కా అవిశ్వాసులను ఉద్దేశించి ప్రసంగం ప్రారంభమవుతోంది.

مَثَلُ الَّذِيْنَ كَفَرُوْا بِرَبِّهِمْ اَعْمَالُهُمْ كَرَمَادِ ِ
اشْتَدَّتْ بِهِ الرِّيْحُ فِيْ يَوْمٍ عَاصِفٍ ؕ لَا
يَقْدِرُوْنَ مِمَّا كَسَبُوْا عَلٰى شَيْءٍ ؕ ذٰلِكَ هُوَ
الضَّلٰلُ الْبَعِيْدُ ﴿۱۸﴾ اَلَمْ تَرَ اَنَّ اللّٰهَ خَلَقَ
السَّمٰوٰتِ وَ الْاَرْضَ بِالْحَقِّ ؕ اِنْ يَّشَاْ
يُذْهِبْكُمْ وَيَاْتِ بِخَلْقٍ جَدِيْدٍ ﴿۱۹﴾ وَّ مَا ذٰلِكَ
عَلَى اللّٰهِ بِعَزِيْزٍ ﴿۲۰﴾ وَبَرَزُوْا لِلّٰهِ جَمِيْعًا فَقَالَ
الضُّعَفٰٓؤُا لِلَّذِيْنَ اسْتَكْبَرُوْۤا اِنَّا كُنَّا لَكُمْ تَبَعًا
فَهَلْ اَنْتُمْ مُّغْنُوْنَ عَنَّا مِنْ عَذَابِ اللّٰهِ مِنْ
شَيْءٍ ؕ قَالُوْا لَوْ هَدٰىنَا اللّٰهُ لَهَدَيْنٰكُمْ ؕ سَوَآءٌ
عَلَيْنَاۤ اَجَزِعْنَاۤ اَمْ صَبَرْنَا مَا لَنَا مِنْ
مَّحِيْصٍ ﴿۲۱﴾ وَ قَالَ الشَّيْطٰنُ لَمَّا قُضِيَ الْاَمْرُ ع ۳ ۱۵
اِنَّ اللّٰهَ وَعَدَكُمْ وَعْدَ الْحَقِّ وَوَعَدْتُّكُمْ
فَاَخْلَفْتُكُمْ ؕ وَمَا كَانَ لِيَ عَلَيْكُمْ مِّنْ سُلْطٰنٍ
اِلَّاۤ اَنْ دَعَوْتُكُمْ فَاسْتَجَبْتُمْ لِيْ ۚ فَلَا تَلُوْمُوْنِيْ
وَلُوْمُوْۤا اَنْفُسَكُمْ ؕ مَاۤ اَنَا بِمُصْرِخِكُمْ وَ مَاۤ
اَنْتُمْ بِمُصْرِخِيَّ ؕ اِنِّيْ كَفَرْتُ بِمَاۤ اَشْرَكْتُمُوْنِ
مِنْ قَبْلُ ؕ اِنَّ الظّٰلِمِيْنَ لَهُمْ عَذَابٌ اَلِيْمٌ ﴿۲۲﴾

**18 - 20** తమ ప్రభువును విశ్వసించనివారి పనులను తుఫాను రోజున వీచే పెనుగాలి ఎగురవేసే బూడిదతో పోల్చవచ్చు. వారు తాము చేసిన దానికి ఎటువంటి ప్రతిఫలాన్నీ పొందలేరు. ఇదే మార్గభ్రష్టత్వానికి పరాకాష్ఠ అంటే. అల్లాహ్ భూమ్యాకాశాల సృష్టిని సత్యంపై నెలకొల్పటాన్ని నీవు చూడటం లేదా? ఆయన సంకల్పిస్తే మిమ్మల్ని తొలగించగలడు. మీ స్థానంలో మరొక క్రొత్త సృష్టిని తీసుకురాగలడు. అలా చెయ్యటం ఆయనకు ఎంతమాత్రం కష్టం కాదు.

**21** ఈ ప్రజలందరినీ కలిపి అల్లాహ్ ముందు హాజరుపరచినప్పుడు, వారిలో ప్రపంచంలో బలహీనులుగా ఉన్నవారు ప్రపంచంలో పెద్ద మనుషులుగా చలామణీ అయినవారితో ఇలా అంటారు: "ప్రపంచంలో మేము మిమ్మల్ని అనుసరించాము. ఇప్పుడు అల్లాహ్ శిక్షనుండి మమ్మల్ని కాపాడటానికి మీరేమైనా చెయ్యగలరా?" వారు ఇలా సమాధానం చెబుతారు: "అల్లాహ్ మాకు ముక్తిమార్గాన్ని దేనినైనా చూపి ఉండినట్లయితే మేము తప్పకుండా మీకూ చూపి ఉండేవారము. ఇప్పుడు మనము ఏడ్చి మొత్తుకున్నా లేక ఓర్పు వహించినా రెండూ ఒకటే. ఎట్టి పరిస్థితుల్లోనూ, మనం తప్పించుకునే మార్గం ఏదీ లేదు."

**22** తీర్పు జరిగిపోయినప్పుడు షైతాను ఇలా అంటాడు: "వాస్తవం ఏమిటంటే, అల్లాహ్ మీకు చేసిన వాగ్దానాలన్నీ నిజమైనవే. నేను మీకు చేసిన వాగ్దానాలలో ఒక్కదానిని కూడా నేను నెరవేర్చలేదు. నాకు మీమీద ఎటువంటి అధికారమూ లేదు. నేను మిమ్మల్ని నా మార్గం వైపునకు ఆహ్వానించటం తప్ప మరేమీ చెయ్యలేదు. మీరు నా ఆహ్వానానికి అంగీకారం వ్యక్తం చేశారు. ఇప్పుడు నన్ను నిందించకండి. మిమ్మల్ని మీరే నిందించుకోండి. ఇక్కడ మీ మొరలను నేనూ ఆలకించలేను, నా మొరలను మీరూ ఆలకించలేరు. ఇంతకు పూర్వం మీరు నన్ను దైవత్వంలో భాగస్థునిగా చేసివుంచారు,[7] దానికి నా బాధ్యత ఏమీ లేదు. అటువంటి దుర్మార్గులకు వ్యథాభరితమైన శిక్ష తథ్యం."

5. ఇది, తెలుగు భాషలో "చెవులు మూసుకోవటం" అనే నానుడి, "పళ్ళు కొరకటం" అనే నానుడి వంటిది.

وَ اُدۡخِلَ الَّذِيۡنَ اٰمَنُوۡا وَعَمِلُوا الصّٰلِحٰتِ
جَنّٰتٍ تَجۡرِىۡ مِنۡ تَحۡتِهَا الۡاَنۡهٰرُ خٰلِدِيۡنَ فِيۡهَا
بِاِذۡنِ رَبِّهِمۡ ؕ تَحِيَّتُهُمۡ فِيۡهَا سَلٰمٌ ﴿۲۳﴾ اَلَمۡ
تَرَ كَيۡفَ ضَرَبَ اللّٰهُ مَثَلًا كَلِمَةً طَيِّبَةً
كَشَجَرَةٍ طَيِّبَةٍ اَصۡلُهَا ثَابِتٌ وَّ فَرۡعُهَا فِى
السَّمَآءِ ﴿۲۴﴾ تُؤۡتِىۡۤ اُكُلَهَا كُلَّ حِيۡنٍۢ بِاِذۡنِ رَبِّهَا ؕ
وَيَضۡرِبُ اللّٰهُ الۡاَمۡثَالَ لِلنَّاسِ لَعَلَّهُمۡ
يَتَذَكَّرُوۡنَ ﴿۲۵﴾ وَمَثَلُ كَلِمَةٍ خَبِيۡثَةٍ كَشَجَرَةٍ
خَبِيۡثَةِ اجۡتُثَّتۡ مِنۡ فَوۡقِ الۡاَرۡضِ مَا لَهَا
مِنۡ قَرَارٍ ﴿۲۶﴾ يُثَبِّتُ اللّٰهُ الَّذِيۡنَ اٰمَنُوۡا
بِالۡقَوۡلِ الثَّابِتِ فِى الۡحَيٰوةِ الدُّنۡيَا وَ فِى
الۡاٰخِرَةِ ۚ وَ يُضِلُّ اللّٰهُ الظّٰلِمِيۡنَ ۙ وَيَفۡعَلُ
اللّٰهُ مَا يَشَآءُ ﴿۲۷﴾ اَلَمۡ تَرَ اِلَى الَّذِيۡنَ بَدَّلُوۡا
نِعۡمَتَ اللّٰهِ كُفۡرًا وَّاَحَلُّوۡا قَوۡمَهُمۡ دَارَ
الۡبَوَارِ ﴿۲۸﴾ جَهَنَّمَ ۚ يَصۡلَوۡنَهَا ؕ وَبِئۡسَ الۡقَرَارُ ﴿۲۹﴾
وَ جَعَلُوۡا لِلّٰهِ اَنۡدَادًا لِّيُضِلُّوۡا عَنۡ سَبِيۡلِهٖ ؕ
قُلۡ تَمَتَّعُوۡا فَاِنَّ مَصِيۡرَكُمۡ اِلَى النَّارِ ﴿۳۰﴾ قُلۡ
لِّعِبَادِىَ الَّذِيۡنَ اٰمَنُوۡا يُقِيۡمُوا الصَّلٰوةَ وَ يُنۡفِقُوۡا
مِمَّا رَزَقۡنٰهُمۡ سِرًّا وَّ عَلَانِيَةً مِّنۡ قَبۡلِ اَنۡ
يَّاۡتِىَ يَوۡمٌ لَّا بَيۡعٌ فِيۡهِ وَ لَا خِلٰلٌ ﴿۳۱﴾

**23 - 27** దీనికి భిన్నంగా, ప్రపంచంలో విశ్వసించి మంచి పనులు చేసిన వారు క్రింద కాలువలు ప్రవహించే తోటలలో ప్రవేశింపజెయ్యబడతారు. అక్కడ వారు తమ ప్రభువు అనుమతితో శాశ్వతంగా ఉంటారు. అక్కడ వారికి "మీకు శాంతి కలుగుగాక" అని స్వాగతం పలుకబడుతుంది. పరిశుద్ధ వాక్కును అల్లాహ్ ఏ వస్తువుతో పోల్చాడో మీరు గమనించటం లేదా? దాని పోలిక ఇలా ఉంది: ఒక మేలుజాతి చెట్టు వుంది. దాని వేరు భూమిలో లోతుగా నాటుకుపోయింది. కొమ్మలు ఆకాశాన్ని అంటాయి. ప్రతిక్షణం అది తన ప్రభువు ఆజ్ఞానుసారం తన పండ్లను ఇస్తోంది. ప్రజలు గుణపాఠం నేర్చుకోవాలని అల్లాహ్ ఇటువంటి ఉపమానాలను ఇస్తున్నాడు. అపరిశుద్ధ వాక్కును ఒక చెడుజాతి చెట్టుతో పోల్చవచ్చు. అది భూమి ఉపరితలం నుండి పీకిపార వేయబడుతుంది. దానికి స్థిరత్వం అనేదే లేదు. ఒక స్థిరమైన వాక్కు ఆధారంగా ఇహలోకంలోనూ, పరలోకంలోనూ విశ్వాసులకు అల్లాహ్ నిలకడను ప్రసాదిస్తాడు. అల్లాహ్ దుర్మార్గులను మార్గభ్రష్టులుగా చేస్తాడు. తమకు ఇష్టమైన దానిని చేసే అధికారం అల్లాహ్‌కు ఉన్నది.

**28 - 30** అల్లాహ్ అనుగ్రహాన్ని పొంది, దానికి మారుగా కృతఘ్నుతను చూపిన వారిని నీవు చూశావా? వారు (తమతో పాటు) తమ జాతిని కూడా వినాశగృహంలోకి- అంటే నరకంలోకి త్రోసివేశారు. అందులో వారు కాలిపోతారు. అది అతి ఘోరమైన నివాస స్థలం. వారు కొందరిని అల్లాహ్‌కు సమానులుగా నిలబెట్టారు- వారు ప్రజలను అల్లాహ్ మార్గం నుండి తప్పించటానికి. వారితో ఇలా అను: సరే సుఖాలను అనుభవించండి. చివరకు మీరు మరలి నరకానికేపోవాలి.

**31** ప్రవక్తా! విశ్వసించిన నా దాసులకు చెప్పు: నమాజును స్థాపించండి. మేము వారికి ఇచ్చిన దానినుండి బహిరంగంగా, గుప్తంగా (మంచిపనుల కోసం) ఖర్చుపెట్టండి - క్రయ విక్రయాలు జరగటంకానీ, మిత్రుల సాయం పొందటంగానీ సాధ్యపడని రోజు రాకపూర్వమే.

6. దైవప్రవక్తలు ప్రవక్త పదవిని అలంకరించక పూర్వం అపమార్గం పట్టిన తమ జాతుల ధర్మాలను అనుసరించేవారని దీని భావం కాదు. ప్రవక్త పదవికి పూర్వం వారు ఒక విధమైన నిశ్శబ్ద జీవితం గడిపేవారు. ఒక ధర్మాన్ని ప్రచారం చెయ్యడంగానీ, ఆ కాలంలో చలామణిలో ఉన్న ధర్మాన్ని ఖండించటం గానీ చేసేవారు కాదు. ఈ

**32 - 34** భూమినీ, ఆకాశాలను పుట్టించినవాడూ, ఆకాశం నుండి నీళ్ళను కురిపించినవాడూ, దానిద్వారా మీ ఆహారం కొరకు రక రకాల ఫలాలను సృష్టించినవాడూ, తన ఆజ్ఞాను సారం సముద్రంలో నడవాలని పడవను మీ సేవకై మీకు లోబరచినవాడూ, నదులను మీ సేవకై మీకు లోబరచినవాడూ, నిరంతర ప్రయాణం చేస్తూ పోతున్న సూర్యచంద్రులను మీ సేవకై మీకు లోబరచినవాడూ, రాత్రినీ పగలునూ మీ సేవకై మీకు లోబరచినవాడూ,[8] మీరు అడిగిన సమస్తాన్నీ మీకు ఇచ్చినవాడూ అల్లాహ్‌యే.[9] మీరు గనక అల్లాహ్ అనుగ్రహాలను లెక్కించదలిస్తే, లెక్కించలేరు. నిజముగా మానవుడు అన్యాయ వర్తనుడు, కృతఘ్నుడు.

**35 - 41** ఇబ్రాహీమ్ ఇలా ప్రార్థించిన సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకో: "ప్రభూ! ఈ నగరాన్ని (అంటే మక్కాను) శాంతి నగరంగా చెయ్యి. నన్నూ, నా సంతానాన్నీ విగ్రహ పూజ నుండి కాపాడు. ప్రభూ ఈ విగ్రహాలు చాలా మందిని మార్గం తప్పించాయి. (నా సంతానాన్ని కూడా ఇవి మార్గం తప్పించే అవకాశం ఉంది కనుక వారిలో) నా విధానంపై నడిచేవాడు నావాడు, నాకు వ్యతిరేకంగా ఉన్న విధానాన్ని ఎవడైనా అవలంబిస్తే నిశ్చయంగా నీవు క్షమించేవాడవు, కరుణామయుడవు. ప్రభూ! తృణకాష్ట జలరహితమైన లోయలో నా సంతానంలో కొందరిని తెచ్చి నీ పవిత్ర గృహం వద్ద నివసింపజేశాను. ప్రభూ! వారు ఇక్కడ నమాజును స్థాపించాలని నేను ఇలా చేశాను. కనుక నీవు ప్రజల హృదయాలను ఆసక్తితో వారివైపునకు మొగ్గేలా చెయ్యి, తినటానికి వారికి పండ్లు ప్రసాదించు, బహుశా వారు కృతజ్ఞులౌతారేమో. ప్రభూ! మేము దాచే దానినీ, బహిరంగపరచే దానినీ నీవు ఎరుగుదువు." నిశ్చయంగా అల్లాహ్‌కు గుప్తంగా ఉన్నది ఏదీ లేదు, భూమి లోకాని, ఆకాశాలలో కాని. "నాకు ఈ ముసలితనంలో ఇస్మాయీలు, ఇస్హాఖ్ వంటి కొడుకులను ప్రసాదించిన దేవునికి కృతజ్ఞతలు. యథార్థం ఏమిటంటే, నా ప్రభువు తప్పకుండా ప్రార్థనను ఆలకిస్తాడు.

اَللّٰهُ الَّذِیْ خَلَقَ السَّمٰوٰتِ وَ الْاَرْضَ
وَاَنْزَلَ مِنَ السَّمَآءِ مَآءً فَاَخْرَجَ بِهٖ مِنَ
الثَّمَرٰتِ رِزْقًا لَّكُمْ ۚ وَسَخَّرَ لَكُمُ الْفُلْكَ لِتَجْرِیَ
فِی الْبَحْرِ بِاَمْرِهٖ ۚ وَسَخَّرَ لَكُمُ الْاَنْهٰرَ ﴿۳۲﴾ وَ
سَخَّرَ لَكُمُ الشَّمْسَ وَالْقَمَرَ دَآىِٕبَیْنِ ۚ وَ سَخَّرَ
لَكُمُ الَّیْلَ وَ النَّهَارَ ﴿۳۳﴾ وَاٰتٰىكُمْ مِّنْ كُلِّ مَا
سَاَلْتُمُوْهُ ؕ وَ اِنْ تَعُدُّوْا نِعْمَتَ اللّٰهِ لَا
تُحْصُوْهَا ؕ اِنَّ الْاِنْسَانَ لَظَلُوْمٌ كَفَّارٌ ﴿۳۴﴾ وَاِذْ ع۶
قَالَ اِبْرٰهِیْمُ رَبِّ اجْعَلْ هٰذَا الْبَلَدَ اٰمِنًا
وَّاجْنُبْنِیْ وَ بَنِیَّ اَنْ نَّعْبُدَ الْاَصْنَامَ ﴿۳۵﴾ رَبِّ
اِنَّهُنَّ اَضْلَلْنَ كَثِیْرًا مِّنَ النَّاسِ ۚ فَمَنْ
تَبِعَنِیْ فَاِنَّهٗ مِنِّیْ ۚ وَمَنْ عَصَانِیْ فَاِنَّكَ غَفُوْرٌ
رَّحِیْمٌ ﴿۳۶﴾ رَبَّنَآ اِنِّیْۤ اَسْكَنْتُ مِنْ ذُرِّیَّتِیْ
بِوَادٍ غَیْرِ ذِیْ زَرْعٍ عِنْدَ بَیْتِكَ الْمُحَرَّمِ ۙ
رَبَّنَا لِیُقِیْمُوا الصَّلٰوةَ فَاجْعَلْ اَفْىِٕدَةً مِّنَ
النَّاسِ تَهْوِیْۤ اِلَیْهِمْ وَارْزُقْهُمْ مِّنَ الثَّمَرٰتِ
لَعَلَّهُمْ یَشْكُرُوْنَ ﴿۳۷﴾ رَبَّنَاۤ اِنَّكَ تَعْلَمُ مَا نُخْفِیْ
وَ مَا نُعْلِنُ ؕ وَ مَا یَخْفٰی عَلَی اللّٰهِ مِنْ شَیْءٍ
فِی الْاَرْضِ وَ لَا فِی السَّمَآءِ ﴿۳۸﴾ اَلْحَمْدُ لِلّٰهِ
الَّذِیْ وَهَبَ لِیْ عَلَی الْكِبَرِ اِسْمٰعِیْلَ وَ
اِسْحٰقَ ؕ اِنَّ رَبِّیْ لَسَمِیْعُ الدُّعَآءِ ﴿۳۹﴾

కారణంగా వారి జాతి "వారు మా ధర్మాన్నే అనుసరిస్తూ ఉన్నారు" అని అనుకునేది అని భావం. ప్రవక్త పదవికి సంబంధించిన పని ప్రారంభించిన తరువాత, వారు తమ పూర్వీకుల ధర్మాన్ని పరిత్యజించారు అనే అభియోగం వారిపై మోపబడేది. వాస్తవానికి వారు ప్రవక్త పదవికి పూర్వం కూడా ఎన్నడూ ముష్రిక్కుల ధర్మాన్ని అవలంబించలేదు. కనుక వారు దాన్ని విసర్జించారు అనే అభియోగానికి ఆస్కారం లేదు.

رَبِّ اجْعَلْنِيْ مُقِيْمَ الصَّلٰوةِ وَ مِنْ ذُرِّيَّتِيْ ۖ
رَبَّنَا وَ تَقَبَّلْ دُعَآءِ ۝٤٠ رَبَّنَا اغْفِرْ لِيْ
وَلِوَالِدَيَّ وَلِلْمُؤْمِنِيْنَ يَوْمَ يَقُوْمُ
الْحِسَابُ ۝٤١ وَ لَا تَحْسَبَنَّ اللّٰهَ غَافِلًا عَمَّا ع ٧ ١٨
يَعْمَلُ الظّٰلِمُوْنَ ۗ اِنَّمَا يُؤَخِّرُهُمْ لِيَوْمٍ
تَشْخَصُ فِيْهِ الْاَبْصَارُ ۝٤٢ مُهْطِعِيْنَ مُقْنِعِيْ
رُءُوْسِهِمْ لَا يَرْتَدُّ اِلَيْهِمْ طَرْفُهُمْ ۚ
وَاَفْـِٕدَتُهُمْ هَوَآءٌ ۝٤٣ وَ اَنْذِرِ النَّاسَ يَوْمَ
يَاْتِيْهِمُ الْعَذَابُ فَيَقُوْلُ الَّذِيْنَ ظَلَمُوْا رَبَّنَآ
اَخِّرْنَآ اِلٰٓى اَجَلٍ قَرِيْبٍ ۙ نُّجِبْ دَعْوَتَكَ وَ
نَتَّبِعِ الرُّسُلَ ؕ اَوَلَمْ تَكُوْنُوْۤا اَقْسَمْتُمْ مِّنْ
قَبْلُ مَا لَكُمْ مِّنْ زَوَالٍ ۝٤٤ وَّ سَكَنْتُمْ فِيْ
مَسٰكِنِ الَّذِيْنَ ظَلَمُوْۤا اَنْفُسَهُمْ وَتَبَيَّنَ لَكُمْ
كَيْفَ فَعَلْنَا بِهِمْ وَضَرَبْنَا لَكُمُ الْاَمْثَالَ ۝٤٥ وَ
قَدْ مَكَرُوْا مَكْرَهُمْ وَعِنْدَ اللّٰهِ مَكْرُهُمْ ؕ
وَاِنْ كَانَ مَكْرُهُمْ لِتَزُوْلَ مِنْهُ الْجِبَالُ ۝٤٦

ప్రభూ! నన్ను నమాజును స్థాపించేవాడుగా చెయ్యి. నా సంతతిలో కూడా (ఈ పని చేసేవాళ్ళను లేపు). ప్రభూ! నా ప్రార్థనను స్వీకరించు. ప్రభూ! నన్నూ, నా తల్లిదండ్రులనూ[10] విశ్వసించే వారందరినీ లెక్క ఖరారు అయ్యేరోజున క్షమించు."

**42 - 46** ఇప్పుడు ఈ దుర్మార్గులు చేస్తున్నదానిని అల్లాహ్ పట్టించుకోవటం లేదని నీవు భావించకు. అల్లాహ్ వారి విషయాన్ని ఆనాటికి వాయిదా వేస్తున్నాడు. ఆనాడు పరిస్థితి ఇలా ఉంటుంది: విచ్చుకున్న నేత్రాలు విచ్చుకున్నట్లే ఉంటాయి. వారు తలపైకెత్తి పారిపోతూ ఉంటారు. పైనే దృష్టి నిలిచి ఉంటుంది. వారు శూన్య హృదయులైపోతారు. ప్రవక్తా! శిక్ష వచ్చి వారిని పట్టుకునే రోజును గురించి నీవు వారిని భయపెట్టు. అప్పుడు ఈ దుర్మార్గులు ఇలా అంటారు: "ప్రభూ! మాకు మరికొంత వ్యవధిని ప్రసాదించు. మేము నీ సందేశాన్ని స్వీకరిస్తాము. ప్రవక్తలను అనుసరిస్తాము." (కాని వారికి స్పష్టంగా ఇలా జవాబు ఇవ్వబడుతుంది): "క్షీణదశ మాకు ఎన్నటికీ రాదు అని పూర్వం మాటిమాటికీ ప్రమాణం చేసి చెప్పినవారు మీరు కాదా? వాస్తవానికి తమకు తాము అన్యాయం చేసుకున్న జాతుల పట్టణాలలో మీరు నివసించారు. మేము వారిపట్ల వ్యవహరించిన తీరు కూడా మీరు చూశారు, వారిని ఉదాహరణగా మాటిమాటికీ ఇచ్చి మేము మీకు నచ్చ జెప్పాము కూడా. వారు తమ ఎత్తులన్నీ వేసి చూశారు. కాని అల్లాహ్ వారి ప్రతి ఎత్తునూ చిత్తుచేశాడు. వాస్తవానికి వారి ఎత్తులు కొండలను సైతం కదలించేటంతటి భయంకరమైనవి."

7. విశ్వాసం రీత్యా షైతానును ఎవడూ దేవుని దైవత్వంలో భాగస్వామిగానూ చెయ్యడు, వాడిని భక్తితో పూజించనూ పూజించడు. అందరూ వాణ్ణి శపిస్తారు. కాని వాడిపట్ల విధేయతను పాటిస్తారు. వాడికి బానిసత్వం చేస్తారు. వాడి విధానాలను గుడ్డిగాగానీ బుద్ధిపూర్వకంగా గానీ తప్పకుండా అనుసరిస్తారు. దీనినే ఇక్కడ "షిర్కు" అనే పదంతో పోల్చటం జరిగింది.

8. "మీ సేవకై మీకు లోబరచినవాడు" అనే మాటలను సాధారణంగా ప్రజలు పొరపాటుగా "మీకు విధేయులుగా చేశాడు" అనే అర్థంలో తీసుకుంటారు. ఈ మాటలు ఉన్న ఆయతుల ద్వారా విచిత్రములైన అర్థాలను సృష్టిస్తారు. చివరకు కొంతమంది ఈ ఆయతుల ప్రకారం మానవుని జీవిత పరమార్థం భూమ్యాకాశాలను లోబరచుకోవటమే అనేవరకు పోయారు. వాస్తవానికి మానవునికి వాటిని లోబరచాడు అనే మాటలకు భావం ఇది తప్ప మరొకటి కాదు. అల్లాహ్ వాటిని కొన్ని నియమాలకు బద్ధులుగా చేశాడు. ఆ కారణంగా అవి మానవునికి లాభదాయకమయ్యాయి.

فَلَا تَحْسَبَنَّ اللّٰهَ مُخْلِفَ وَعْدِهٖ رُسُلَهٗ ؕ
اِنَّ اللّٰهَ عَزِيْزٌ ذُوانْتِقَامٍ ﴿٤٧﴾ يَوْمَ تُبَدَّلُ
الْاَرْضُ غَيْرَ الْاَرْضِ وَ السَّمٰوٰتُ وَ بَرَزُوْا
لِلّٰهِ الْوَاحِدِ الْقَهَّارِ ﴿٤٨﴾ وَتَرَى الْمُجْرِمِيْنَ
يَوْمَئِذٍ مُّقَرَّنِيْنَ فِي الْاَصْفَادِ ﴿٤٩﴾ سَرَابِيْلُهُمْ
مِّنْ قَطِرَانٍ وَّتَغْشٰى وُجُوْهَهُمُ النَّارُ ﴿٥٠﴾ لِيَجْزِيَ
اللّٰهُ كُلَّ نَفْسٍ مَّا كَسَبَتْ ؕ اِنَّ اللّٰهَ سَرِيْعُ
الْحِسَابِ ﴿٥١﴾ هٰذَا بَلٰغٌ لِّلنَّاسِ وَلِيُنْذَرُوْا بِهٖ
وَ لِيَعْلَمُوْٓا اَنَّمَا هُوَ اِلٰهٌ وَّاحِدٌ وَّلِيَذَّكَّرَ اُولُوا
الْاَلْبَابِ ﴿٥٢﴾ ع

**47 - 51** కనుక ప్రవక్తా! అల్లాహ్ ఎన్నడూ తన ప్రవక్తలకు చేసిన వాగ్దానాలకు భిన్నంగా వ్యవహరిస్తాడని నీవు ఎంత మాత్రం సందేహించకు. అల్లాహ్ శక్తి మంతుడు, ప్రతీకారం చెయ్యగల సమర్థుడు. భూమ్యాకాశాల రూపాలను పూర్తిగా మార్చటం జరిగే[11] రోజును గురించి నీవు వారిని భయపెట్టు. అద్వితీయుడూ, రౌద్రుడూ అయిన అల్లాహ్ ముందు అందరూ హాజరవుతారు. ఆ రోజు నీవు దోషులను చూస్తావు. వారి చేతులూ, కాళ్ళూ బేడీలతో బంధించబడి ఉంటాయి. వారు తారు వస్త్రాలను ధరించి ఉంటారు. అగ్ని జ్వాలలు వారి ముఖాలను క్రమ్ముకుంటాయి. అల్లాహ్ ప్రతి వ్యక్తికీ అతను చేసిన దానికి ప్రతిఫలం ఇచ్చేందుకు ఇలా జరుగుతుంది. లెక్క తీసుకోవటానికి అల్లాహ్‌కు ఎంతో ఆలస్యం కాదు.

**52** సర్వమానవులకు ఇదొక సందేశం. వారిని హెచ్చరించాలనీ, యథార్థంగా దేవుడు కేవలం ఒక్కడేఅని వారు తెలుసుకోవాలనీ, బుద్ధి ఉన్నవారు గ్రహించాలనీ ఇది పంపబడినది.

9. అంటే, స్వాభావికములైన మీ కోర్కెలన్నింటినీ తీర్చాడు. మీ జీవితం కోసం అవసరమైన సామగ్రిని సమకూర్చాడు. మీ మనుగడ కొరకు మీ ప్రగతి కొరకు అవసరములైన ఒనరులన్నింటినీ సృష్టించాడు.

10. హజ్రత్ ఇబ్రాహీము (అస్సలామ్) ఈ క్షమా ప్రార్థనలో తాను స్వదేశం నుండి బయలుదేరేటప్పుడు చేసిన వాగ్దానం ప్రకారం తన తండ్రి కొరకు ప్రార్థించాడు. "సఅస్తగ్ఫిరులక రబ్బీ" (మర్యమ్ సూరా 47వ ఆయతు). కాని తరువాత తన తండ్రి అల్లాహ్ శత్రువని తెలియరాగానే, ఆయన తన తండ్రికి చేసిన వాగ్దానాన్ని విరమించుకున్నాడు. (అత్ తౌబా : 114వ ఆయతు).

11. ఈ ఆయత్ ద్వారా, ఖురానులోని ఇతర సూచనల ద్వారా తెలిసేదేమిటంటే, ప్రళయం సంభవించినప్పుడు భూమ్యాకాశాలు సమూలంగా నాశనం కావు. కాని కేవలం ప్రస్తుత భౌతిక వ్యవస్థ మాత్రమే ఛిన్నాభిన్నం అవుతుంది. ఆ తరువాత మొదటి శంఖం ఊదటానికి చివరి శంఖం ఊదటానికీ మధ్య ఒక ప్రత్యేక కాలంలో - దానిని అల్లాహ్ మాత్రమే ఎరుగును - భూమ్యాకాశాల ప్రస్తుత రూపం మారుతుంది. ఒక కొత్త వ్యవస్థ క్రొత్త ప్రకృతి నియమాలతో సృష్టించబడుతుంది. అదే పరలోకం అవుతుంది. తరువాత చివరి శంఖనాదంతోనే ఆదమ్ (అస్సలామ్) సృష్టి నుండి ప్రళయం వరకు పుట్టిన మానవులందరూ సరిక్రొత్తగా బ్రతికింపబడతారు. అల్లాహ్ సన్నిధానంలో హాజరుపరచబడతారు. దీనినే ఖురాను భాషలో "హషర్" అంటారు. నిఘంటువు అర్థం ఇది : ఒకచోట చేర్చుట, ప్రోగుచేయుట.

| ఆయతులు 99 | 15. అల్ హిజ్ర్ | అవతరణ మక్కాలో |
|---|---|---|

۱۵ سُوْرَةُ الْحِجْرِ مَكِّيَّةٌ ۵۴

اٰياتها ۹۹ — ركوعاتها ۶

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

الٓرٰ ۚ تِلْكَ اٰيٰتُ الْكِتٰبِ وَ قُرْاٰنٍ مُّبِيْنٍ ①
رُبَمَا يَوَدُّ الَّذِيْنَ كَفَرُوْا لَوْ كَانُوْا
مُسْلِمِيْنَ ② ذَرْهُمْ يَاْكُلُوْا وَ يَتَمَتَّعُوْا وَ يُلْهِهِمُ
الْاَمَلُ فَسَوْفَ يَعْلَمُوْنَ ③ وَ مَاۤ اَهْلَكْنَا مِنْ
قَرْيَةٍ اِلَّا وَ لَهَا كِتَابٌ مَّعْلُوْمٌ ④ مَا تَسْبِقُ
مِنْ اُمَّةٍ اَجَلَهَا وَ مَا يَسْتَاْخِرُوْنَ ⑤ وَ قَالُوْا
يٰۤاَيُّهَا الَّذِيْ نُزِّلَ عَلَيْهِ الذِّكْرُ اِنَّكَ
لَمَجْنُوْنٌ ⑥ لَوْ مَا تَاْتِيْنَا بِالْمَلٰٓئِكَةِ اِنْ كُنْتَ
مِنَ الصّٰدِقِيْنَ ⑦ مَا نُنَزِّلُ الْمَلٰٓئِكَةَ اِلَّا
بِالْحَقِّ وَمَا كَانُوْۤا اِذًا مُّنْظَرِيْنَ ⑧ اِنَّا نَحْنُ
نَزَّلْنَا الذِّكْرَ وَ اِنَّا لَهٗ لَحٰفِظُوْنَ ⑨

**1** అలిఫ్ లామ్ రా. ఇవి దైవ గ్రంథమైనటువంటి స్పష్టమైన ఖురానులోని ఆయతులు.[1]

**2 - 5** ఆ సమయం ఎంతో దూరంలో లేదు, (ఇస్లామ్ సందేశాన్ని స్వీకరించటానికి) తిరస్కరించిన వారే అప్పుడు పశ్చాత్తాపపడుతూ: "అయ్యో! మేము ముస్లిములము అయి వుంటే ఎంత బాగుండేది" అని అంటారు. వారిని వదిలి పెట్టు– తినటానికి త్రాగటానికి సుఖాలు అనుభవించటానికీ, లేనిపోని ఆశలు వారిని భ్రమలో పడవేసి ఉంచటానికీ. అతి త్వరలోనే వారు దానిని గ్రహిస్తారు. మేము ఇంతకు పూర్వం నాశనం చేసిన ప్రతి పట్టణానికీ ఒక ప్రత్యేకమైన కార్యాచరణ వ్యవధి ఇదివరకే వ్రాయబడి ఉన్నది. ఏ జాతి అయినా తన నిర్ణీత కాలానికి ముందే నాశనమూ కాదు, ఆ తరువాత తప్పించుకోనూ లేదు.

**6 - 9** ఈ ప్రజలు ఇలా అంటారు: "ఈ జ్ఞాపిక[2] అవతరించిన[3] మనిషీ! నీవు నిజంగానే పిచ్చివాడవు. నీవు చెప్పేది గనక సత్యమే అయితే మా ముందుకు దైవదూతలను ఎందుకు తీసుకురావు?" మేము దైవదూతలను ఊరకే అవతరింపజెయ్యము. వారు అవతరించినప్పుడు సత్యంతోపాటు అవతరిస్తారు, తరువాత ప్రజలకు వ్యవధి ఇవ్వటం అనేది జరగదు.[4] ఇక ఈ జ్ఞాపిక, దానిని మేము అవతరింపజేశాము. స్వయంగా మేమే దానిని రక్షిస్తాము.

1. ఖురాను కొరకు "ముబీన్" (స్పష్టమైనది) అనే పదం ఒక విశేషణంగా వాడబడింది. అంటే ఈ ఆయతులు తన ఉద్దేశ్యాన్ని స్పష్టంగా ప్రకటించే ఖురానులోనివి అని అర్థం.
2. "జ్ఞాపిక" (జిక్ర్) అనే పదం ఖురానులో హితబోధ అయిన దైవవాణికి పారిభాషికపదంగా వాడబడింది. పూర్వం దైవప్రవక్తలపై అవతరించిన గ్రంథాలన్నీ "జ్ఞాపిక" (జిక్ర్) లే, ఈ ఖురాను కూడా "జ్ఞాపికే" (జిక్ర్). జిక్ర్ అంటే అసలు అర్థం "జ్ఞాపకం చేయుట", "జాగృతం చేయుట", "బోధ చేయుట."
3. ఈ వాక్యాన్ని వారు వ్యంగ్యంగా అనేవారు. ఈ జ్ఞాపిక మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్)పై అవతరించిందని వారు అసలు అంగీకరించేవారే కాదు. అంగీకరించి ఉంటే వారు ఆయనను "పిచ్చివాడు" అని అనగలిగేవారు కాదు. అంటే, "నాపై జ్ఞాపిక అవతరించిందని దావా చేసే ఓ వ్యక్తీ!" అని వారి అసలు భావం.

**10 - 15** ప్రవక్తా! మేము నీకు పూర్వం, గతించిన అనేక జాతులవద్దకు ప్రవక్తలను పంపివున్నాము. వారివద్దకు ప్రవక్త రావటమూ, వారు ఆయనను ఎగతాళి చెయ్యకుండా ఉండటమూ అనేది ఎన్నడూ జరగలేదు. దోషుల గుండెలలోకి మేము ఈ జ్ఞాపికను (ఊచలా) పోనిచ్చినా[5] వారు దానిని విశ్వసించటం అనేది జరగదు. పూర్వకాలం నుండి కూడా ఇటువంటి ప్రజల విధానం ఇలాగే ఉంటూ వచ్చింది. ఒకవేళ మేము వారికొరకు ఏదైనా ఆకాశద్వారాన్ని తెరిచినా, వారు పట్టపగలు అందులోకి ఎక్కిపోతూ ఉన్నప్పుడు కూడా వారు ఇదే అంటారు: "మా కళ్ళు మోసపోతున్నాయి. మాపై మంత్ర జాలం ప్రయోగించారు."

**16 - 18** ఇది మేము చేసిన పని. మేము ఆకాశంలో దృఢతరములైన ఎన్నో కోటలను నిర్మించాము.[6] చూపరుల కోసం వాటిని (నక్షత్రాలతో) అలంకరించాము. శాపగ్రస్తుడైన ప్రతి షైతాను నుండి వాటిని సురక్షితం చేశాము. షైతాను ఎవడైనా వాటిలోకి పోలేడు, దొంగచాటుగా ఏదైనా వినటం తప్ప.[7] దొంగచాటుగా వినే ప్రయత్నం వాడు చేసినప్పుడు అగ్ని జ్వాల ఒకటి వాణ్ణి వెంటాడుతుంది.[8]

**19 - 25** మేము భూమిని పరిచాము. అందులో కొండలను పాతాము. అందులో అన్ని రకాల చెట్లు చేమలను కచ్చితమైన తగిన పరిమాణంలో సృష్టించాము. ఇంకా అందులో జీవనో పాధికి వనరులను ఏర్పాటు చేశాము– మీకూ మీరు పోషింపని అనేక ఇతర ప్రాణికోటికి కూడా. మావద్ద పుష్కలంగా నిలువలు లేని వస్తువంటూ ఏదీ లేదు. మేము ఏ వస్తువును అవత రింపజేసినా, దానిని ఒక నిర్ణీత పరిమాణంలో అవతరింప జేస్తాము. ఉత్పత్తికారకములైన గాలులను మేమే పంపు తున్నాము. ఆ తరువాత ఆకాశం నుండి నీళ్ళను వర్షింపజేస్తు న్నాము. ఆ నీళ్ళను మీకు తనివితీరా త్రాగటానికి ఇస్తున్నాము. ఈ సంపదకు యజమానులు మీరు కాదు. జీవన మరణాలను మేము కలిగిస్తున్నాము. మేమే అందరికీ వారసులము అయ్యే వారము.[9] మీలో పూర్వం గతించిన వారిని కూడా మేము చూశాము. తరువాత వచ్చేవారు కూడా మా దృష్టిలో ఉన్నారు. నిశ్చయంగా మీ ప్రభువు వారందరినీ సమావేశ పరుస్తాడు. ఆయన వివేకవంతుడూ, అన్నీ తెలిసినవాడూను.

وَ لَقَدۡ اَرۡسَلۡنَا مِنۡ قَبۡلِكَ فِىۡ شِيَعِ
الۡاَوَّلِيۡنَ ﴿١٠﴾ وَ مَا يَاۡتِيۡهِمۡ مِّنۡ رَّسُوۡلٍ اِلَّا
كَانُوۡا بِهٖ يَسۡتَهۡزِءُوۡنَ ﴿١١﴾ كَذٰلِكَ نَسۡلُكُهٗ فِىۡ
قُلُوۡبِ الۡمُجۡرِمِيۡنَ ﴿١٢﴾ لَا يُؤۡمِنُوۡنَ بِهٖ وَ قَدۡ
خَلَتۡ سُنَّةُ الۡاَوَّلِيۡنَ ﴿١٣﴾ وَلَوۡ فَتَحۡنَا عَلَيۡهِمۡ
بَابًا مِّنَ السَّمَآءِ فَظَلُّوۡا فِيۡهِ يَعۡرُجُوۡنَ ﴿١٤﴾
لَقَالُوۡۤا اِنَّمَا سُكِّرَتۡ اَبۡصَارُنَا بَلۡ نَحۡنُ قَوۡمٌ
مَّسۡحُوۡرُوۡنَ ﴿١٥﴾ وَ لَقَدۡ جَعَلۡنَا فِى السَّمَآءِ بُرُوۡجًا ع ١٥
وَّ زَيَّنّٰهَا لِلنّٰظِرِيۡنَ ﴿١٦﴾ وَ حَفِظۡنٰهَا مِنۡ كُلِّ
شَيۡطٰنٍ رَّجِيۡمٍ ﴿١٧﴾ اِلَّا مَنِ اسۡتَرَقَ السَّمۡعَ
فَاَتۡبَعَهٗ شِهَابٌ مُّبِيۡنٌ ﴿١٨﴾ وَ الۡاَرۡضَ مَدَدۡنٰهَا
وَ اَلۡقَيۡنَا فِيۡهَا رَوَاسِىَ وَ اَنۡۢبَتۡنَا فِيۡهَا مِنۡ كُلِّ
شَىۡءٍ مَّوۡزُوۡنٍ ﴿١٩﴾ وَجَعَلۡنَا لَـكُمۡ فِيۡهَا مَعَايِشَ وَ
مَنۡ لَّسۡتُمۡ لَهٗ بِرٰزِقِيۡنَ ﴿٢٠﴾ وَ اِنۡ مِّنۡ شَىۡءٍ اِلَّا
عِنۡدَنَا خَزَآٮِٕنُهٗ وَ مَا نُنَزِّلُهٗۤ اِلَّا بِقَدَرٍ
مَّعۡلُوۡمٍ ﴿٢١﴾ وَاَرۡسَلۡنَا الرِّيٰحَ لَوَاقِحَ فَاَنۡزَلۡنَا
مِنَ السَّمَآءِ مَآءً فَاَسۡقَيۡنٰكُمُوۡهُ وَ مَاۤ اَنۡتُمۡ لَهٗ
بِخٰزِنِيۡنَ ﴿٢٢﴾ وَ اِنَّا لَنَحۡنُ نُحۡىٖ وَ نُمِيۡتُ وَ
نَحۡنُ الۡوٰرِثُوۡنَ ﴿٢٣﴾ وَلَقَدۡ عَلِمۡنَا الۡمُسۡتَقۡدِمِيۡنَ
مِنۡكُمۡ وَ لَقَدۡ عَلِمۡنَا الۡمُسۡتَاۡخِرِيۡنَ ﴿٢٤﴾ وَاِنَّ
رَبَّكَ هُوَ يَحۡشُرُهُمۡ اِنَّهٗ حَكِيۡمٌ عَلِيۡمٌ ﴿٢٥﴾ ع ٢

وَلَقَدْ خَلَقْنَا الْاِنْسَانَ مِنْ صَلْصَالٍ مِّنْ حَمَاٍ
مَّسْنُوْنٍ ﴿٢٦﴾ وَالْجَآنَّ خَلَقْنٰهُ مِنْ قَبْلُ مِنْ
نَّارِ السَّمُوْمِ ﴿٢٧﴾ وَاِذْ قَالَ رَبُّكَ لِلْمَلٰٓئِكَةِ
اِنِّيْ خَالِقٌۢ بَشَرًا مِّنْ صَلْصَالٍ مِّنْ حَمَاٍ
مَّسْنُوْنٍ ﴿٢٨﴾ فَاِذَا سَوَّيْتُهٗ وَنَفَخْتُ فِيْهِ مِنْ
رُّوْحِيْ فَقَعُوْا لَهٗ سٰجِدِيْنَ ﴿٢٩﴾ فَسَجَدَ الْمَلٰٓئِكَةُ
كُلُّهُمْ اَجْمَعُوْنَ ﴿٣٠﴾ اِلَّآ اِبْلِيْسَ ؕ اَبٰٓى اَنْ
يَّكُوْنَ مَعَ السّٰجِدِيْنَ ﴿٣١﴾ قَالَ يٰٓاِبْلِيْسُ مَا
لَكَ اَلَّا تَكُوْنَ مَعَ السّٰجِدِيْنَ ﴿٣٢﴾ قَالَ لَمْ اَكُنْ
لِّاَسْجُدَ لِبَشَرٍ خَلَقْتَهٗ مِنْ صَلْصَالٍ مِّنْ
حَمَاٍ مَّسْنُوْنٍ ﴿٣٣﴾ قَالَ فَاخْرُجْ مِنْهَا فَاِنَّكَ
رَجِيْمٌ ﴿٣٤﴾ وَّاِنَّ عَلَيْكَ اللَّعْنَةَ اِلٰى يَوْمِ
الدِّيْنِ ﴿٣٥﴾ قَالَ رَبِّ فَاَنْظِرْنِيْٓ اِلٰى يَوْمِ
يُبْعَثُوْنَ ﴿٣٦﴾ قَالَ فَاِنَّكَ مِنَ الْمُنْظَرِيْنَ ﴿٣٧﴾ اِلٰى
يَوْمِ الْوَقْتِ الْمَعْلُوْمِ ﴿٣٨﴾ قَالَ رَبِّ بِمَآ اَغْوَيْتَنِيْ
لَاُزَيِّنَنَّ لَهُمْ فِي الْاَرْضِ وَلَاُغْوِيَنَّهُمْ اَجْمَعِيْنَ ﴿٣٩﴾
اِلَّا عِبَادَكَ مِنْهُمُ الْمُخْلَصِيْنَ ﴿٤٠﴾ قَالَ هٰذَا
صِرَاطٌ عَلَيَّ مُسْتَقِيْمٌ ﴿٤١﴾ اِنَّ عِبَادِيْ لَيْسَ لَكَ
عَلَيْهِمْ سُلْطٰنٌ اِلَّا مَنِ اتَّبَعَكَ مِنَ
الْغٰوِيْنَ ﴿٤٢﴾ وَاِنَّ جَهَنَّمَ لَمَوْعِدُهُمْ اَجْمَعِيْنَ ﴿٤٣﴾

**26 - 43** మేము మానవుణ్ణి కుళ్ళిన మట్టి యొక్క ఎండిన గారతో సృష్టించాము.[10] దీనికి పూర్వం జిన్నాతులను మేము తీవ్రమైన ఉష్ణజ్వాలతో సృష్టించి ఉన్నాము.[11] నీ ప్రభువు దైవ దూతలతో ఇలా అన్న సమయాన్ని జ్ఞాపకం తెచ్చుకో: "నేను కుళ్ళిన మట్టియొక్క ఎండినగారతో ఒక మానవుణ్ణి సృష్టిస్తు న్నాను. నేను అతణ్ణి పూర్తిగా తయారుచేసి, అతనిలో నా ఆత్మను కొద్దిగా ఊదినప్పుడు, మీరంతా అతని ముందు సాష్టాంగపడాలి." అప్పుడు దైవదూతలందరూ సాష్టాంగ పడ్డారు, ఒక్క ఇబ్లీసు తప్ప. అతడు సాష్టాంగ పడేవారితో చేరటానికి తిరస్కరించాడు. ప్రభువు ఇలా అడిగాడు: "ఇబ్లీస్! నీకేమయిందని నీవు సాష్టాంగపడేవారితో చేరిపోలేదు?" అతడు ఇలా అన్నాడు: "కుళ్ళిన మట్టియొక్క ఎండినగారతో నీవు సృష్టించిన ఈ మనిషికి సాష్టాంగపడటం నాకు తగిన పనికాదు." ప్రభువు ఇలా సెలవిచ్చాడు: "సరే, అయితే, వెళ్ళిపో ఇక్కడినుంచి. ఎందుకంటే, నీవు శాపగ్రస్తుడవయ్యావు. ఇక తీర్పుదినం వరకూ నీపై శాపం ఉంటుంది." అతడు ఇలా విన్నవించుకున్నాడు: "ప్రభూ! అలాగైతే మానవులందరూ మళ్ళీ లేపబడే రోజు వరకు నాకు వ్యవధి ప్రసాదించు." ఇలా సెలవిచ్చాడు: "మంచిది, ఆ రోజు వరకు నీకు వ్యవధి ఇవ్వ బడుతోంది. ఆ రోజు వచ్చే సమయం మాకు తెలుసు." అతడు ఇలా చెప్పాడు: "ప్రభూ! నీవు నన్ను అపమార్గం పట్టించినట్లే ఇక నేను వారికొరకు మనస్సును మోహింపజేసే విషయాలను భూమిలో సృష్టించి వారందరినీ అపమార్గం పట్టిస్తాను, వారిలో నీవు ప్రత్యేకం చేసుకున్న నీ దాసులను తప్ప." ఇలా సెలవిచ్చాడు: "నన్ను చేరే తిన్నని మార్గం ఇదే.[12] నిస్సందే హంగా, నా నిజమైన దాసులపై నీ అధికారం సాగదు. నీ అధికారం కేవలం నిన్ను అనుసరించే భ్రష్టులపై మాత్రమే సాగుతుంది.[13] వారందరి కొరకు వాగ్దానం చెయ్యబడిన నివాస స్థలం నరకం."

4. అంటే, ఒక జాతి, "దైవదూతలను పిలిపించు" అని అన్నంత మాత్రాన వారు వెంటనే దింపబడరు. ఎందుకంటే దైవదూతలు తమాషా చూపించటానికి దింపబడరు. ఒక జాతిని గురించి తీసుకున్న శిక్షా నిర్ణయాన్ని అమలుపరచే కాలం ఆసన్నమైనప్పుడే దైవదూతలను పంపటం జరుగుతుంది. "సత్యంతోపాటు అవతరిస్తారు" అంటే "సత్యం తీసుకుని అవతరిస్తారు" అని భావం. అంటే, అల్లాహ్ వద్ద నుండి సత్యమైన తీర్పును తీసుకుని వస్తారు. దానిని అమలుపరచి తీరుతారు.

لَهَا سَبْعَةُ اَبْوَابٍ ؕ لِكُلِّ بَابٍ مِّنْهُمْ جُزْءٌ
مَّقْسُوْمٌ ﴿۴۴﴾ اِنَّ الْمُتَّقِيْنَ فِىْ جَنّٰتٍ
وَّعُيُوْنٍ ؕ ﴿۴۵﴾ اُدْخُلُوْهَا بِسَلٰمٍ اٰمِنِيْنَ ﴿۴۶﴾ وَ
نَزَعْنَا مَا فِىْ صُدُوْرِهِمْ مِّنْ غِلٍّ اِخْوَانًا عَلٰى
سُرُرٍ مُّتَقٰبِلِيْنَ ﴿۴۷﴾ لَا يَمَسُّهُمْ فِيْهَا نَصَبٌ وَّ مَا
هُمْ مِّنْهَا بِمُخْرَجِيْنَ ﴿۴۸﴾

**44 - 48** (ఇబ్లీసు అనుచరులకు వాగ్దానం చెయ్యబడిన) ఈ నరకానికి ఏడు ద్వారాలు ఉన్నాయి. ఒక్కొక్క ద్వారం వారిలోని ఒక్కొక్క ప్రత్యేక వర్గానికి కేటాయించబడింది.[14] దీనికి భిన్నంగా, భయభక్తులు కలవారు తోటలలో చెలమల మధ్య ఉంటారు. వారితో ఇలా అనబడుతుంది: "ప్రవేశించండి వాటి లోకి, శాంతితోనూ, నిర్భయంగానూ." వారి హృదయాలలో ఇంకా మిగిలి వున్న మాలిన్యాన్నీ కాపట్యాన్నీ మేము తొలగిస్తాము. వారు పరస్పరం సోదరులై ఎదురెదురుగా పీఠాలపై కూర్చుంటారు. అక్కడ వారు ఎట్టి శ్రమకూ గురికారు. అక్కడి నుండి వారు బహిష్కరింపనూబడరు.

5. అసలు "నస్లుకుహు" అనే పదం ఉపయోగించబడింది. అరబ్బీ భాషలో "సలక్" అంటే అర్థం: ఒక వస్తువును మరొక వస్తువులోనికి ప్రవేశింపజేయటం, మరొక వస్తువు గుండా దాటించటం, మరొక వస్తువులో గ్రుచ్చటం దారాన్ని సూదిలో గుచ్చినట్లు. కనుక ఆయత్తు భావం ఏమిటంటే, ఈ జ్ఞాపిక హృదయానికి చల్లదనమై, ఆత్మకు ఆహారమై విశ్వాసుల అంతరంగంలోనికి దిగుతుంది. కాని ఇది అపరాధుల హృదయాలకు బల్లెమై గ్రుచ్చుకుంటుంది. దానిని విని వారి అంతరంగంలో అగ్ని రగులుతుంది, కాలే సలాక గుండెలలోకి దిగినట్లుగా.

6. అసలు "బురూజ్" అనే పదం ఉపయోగించబడింది. అరబ్బీ భాషలో కోటను, ప్రాసాదాన్ని, సుస్థిరమైన కట్టడాన్ని బురుజు అని అంటారు. తరువాతి అంశాన్ని గురించి ఆలోచిస్తే తెలిసేదేమిటంటే, దీని అర్థం గగన మండలంలోని భాగాలు అని కావచ్చు. వాటిలోని ప్రతి భాగాన్ని మరొక భాగం నుండి స్థిరమైన, పటిష్టమైన సరిహద్దులు వేరుచేసి ఉంచాయి. ఈ భావం ప్రకారం మేము బురూజ్‌ను సురక్షిత భాగాలు అనే అర్థంలో తీసుకోవటం సరియైనదని భావిస్తున్నాము.

7. అంటే, తమ నేస్తాలకు అగోచర సమాచారాలను తెచ్చియిచ్చే ప్రయత్నం చేసే షైతానులు అని అర్థం. వారి వద్ద అగోచరాలను తెలుసుకునే మార్గాలు ఏవీ లేవు. సృష్టి వారి కొరకు తెరగా పడి లేదు, వారు ఎక్కడకు పడితే అక్కడకు పోవటానికి, అల్లాహ్ రహస్యాలను తెలుసుకోవటానికి. అయినా వారు దొంగచాటుగా తెలుసుకోవటానికి ప్రయత్నిస్తారు. కాని నిజానికి వారికి ఏదీ ప్రాప్తం కాదు.

8. "షిహాబుమ్ముబీన్" అంటే, "కాంతిమంతమైన జ్వాల" అని నిఘంటు అర్థం. మరొకచోట ఖురానులో దీని కొరకు "షిహాబున్సాఖిబ్" అనే పదం వాడబడింది. అంటే, "చీకటిని చీల్చే జ్వాల" అని అర్థం. (అది ఉల్కయే కానక్కరలేదు) ఇవి మరొక విధమైన కిరణాలు కావచ్చు. ఉదాహరణకు, రోదసీ కిరణాలు (Cosmic Rays) లేదా వాటి కంటే కూడా ఎక్కువ తీక్షణమైనటువంటి, మన జ్ఞానపరిధిలోకి ఇంకా రానటువంటి వేరు విధమైన కిరణాలు కావచ్చు. అయినప్పటికీ అప్పుడప్పుడూ భూమి వైపునకు రాలే ఉల్కలు కూడా కావచ్చు. ఇవే గగన మండలం వైపునకు షైతానులు ఎగురకుండా అడ్డుపడవచ్చు.

9. అంటే, మీ తరువాత మేమే మిగిలి ఉండేవారము అని అర్థం. మీకు దొరికినది ఏదైనా సరే అది కేవలం తాత్కాలికమైనది. చివరకు మేము ఇచ్చిన ప్రతి వస్తువునూ మీరు ఇట్టే వదలిపెట్టి వట్టి చేతులతో సెలవు తీసుకుంటారు. ఈ వస్తువులు అన్నీ యథాతథంగా మా ఖజానాలలోనే ఉండిపోతాయి.

10. ఇక్కడ ఖురాను ఒక విషయాన్ని విశదపరుస్తోంది. మానవుడు జంతు దశల నుండి పరిణామం చెందుతూ మానవత్వపు దశలోకి రాలేదు, డార్విన్ సిద్ధాంతం చేత ప్రభావితులైన ఖురాను వ్యాఖ్యాతలు కొందరు నిరూపించటానికి ప్రయత్నం చేస్తున్న మాదిరిగా. మానవ సృష్టి ప్రారంభం నేరుగా భూమిలోని పదార్థాలతోనే

نَبِّئْ عِبَادِيْٓ اَنِّيْٓ اَنَا الْغَفُوْرُ الرَّحِيْمُ ۙ﴿۴۹﴾ وَ اَنَّ
عَذَابِيْ هُوَ الْعَذَابُ الْاَلِيْمُ ﴿۵۰﴾ وَ نَبِّئْهُمْ عَنْ
ضَيْفِ اِبْرٰهِيْمَ ﴿۵۱﴾ اِذْ دَخَلُوْا عَلَيْهِ فَقَالُوْا
سَلٰمًا ؕ قَالَ اِنَّا مِنْكُمْ وَجِلُوْنَ ﴿۵۲﴾ قَالُوْا لَا
تَوْجَلْ اِنَّا نُبَشِّرُكَ بِغُلٰمٍ عَلِيْمٍ ﴿۵۳﴾ قَالَ
اَبَشَّرْتُمُوْنِيْ عَلٰٓى اَنْ مَّسَّنِيَ الْكِبَرُ فَبِمَ
تُبَشِّرُوْنَ ﴿۵۴﴾ قَالُوْا بَشَّرْنٰكَ بِالْحَقِّ فَلَا تَكُنْ مِّنَ
الْقٰنِطِيْنَ ﴿۵۵﴾ قَالَ وَ مَنْ يَّقْنَطُ مِنْ رَّحْمَةِ
رَبِّهٖٓ اِلَّا الضَّآلُّوْنَ ﴿۵۶﴾ قَالَ فَمَا خَطْبُكُمْ اَيُّهَا
الْمُرْسَلُوْنَ ﴿۵۷﴾ قَالُوْٓا اِنَّآ اُرْسِلْنَآ اِلٰى قَوْمٍ
مُّجْرِمِيْنَ ۙ﴿۵۸﴾ اِلَّآ اٰلَ لُوْطٍ ؕ اِنَّا لَمُنَجُّوْهُمْ
اَجْمَعِيْنَ ۙ﴿۵۹﴾ اِلَّا امْرَاَتَهٗ قَدَّرْنَآ ۙ اِنَّهَا لَمِنَ
الْغٰبِرِيْنَ ﴿۶۰﴾ ع

وقف لازم

**49 - 50** ప్రవక్తా! నేను చాలా క్షమించేవాణ్ణి అనీ, కరుణించే వాణ్ణి అనీ, దీనితోపాటు, నా శిక్షకూడా చాలా బాధాకరమైన శిక్షే అనీ నా దాసులకు చెప్పు.

**51 - 60** వారికి ఇబ్రాహీము అతిథుల గాథను కొంచెం వినిపించు. వారు అతని వద్దకు వచ్చి, "మీకు శాంతి కలుగు గాక" అని అన్నప్పుడు, అతను ఇలా అన్నాడు: "మేము మిమ్మల్ని చూచి భయపడుతున్నాము." వారు ఇలా సమాధానం పలికారు: "భయపడకండి, మేము మహా వివేకవంతుడైన ఒక కుమారుడు మీకు కలుగుతాడు అనే శుభవార్తను మీకు అందజేస్తున్నాము."[15] ఇబ్రాహీము ఇలా అన్నాడు: "ఏమిటి, ఈ ముసలితనంలో మీరు నాకు సంతాన శుభవార్తను అంద జేస్తున్నారా? కొంచెం ఆలోచించండి, మీరు ఎటువంటి శుభ వార్తను నాకు అందజేస్తున్నారో?" వారు ఇలా జవాబు ఇచ్చారు: "మేము మీకు సత్యమైన శుభవార్తను అందజేస్తు న్నాము. మీరు నిరాశపడకండి." ఇబ్రాహీము ఇలా అన్నాడు: "తమ ప్రభువు కారుణ్యంపట్ల మార్గం తప్పినవారు మాత్రమే నిరాశపడతారు." ఇబ్రాహీము ఇలా అడిగాడు: "అల్లాహ్ దూతలారా! ఏ కార్యం నిమిత్తం తమరు వేంచేశారు?" వారు ఇలా చెప్పారు: "మేము ఒక నేరస్థజాతి వైపునకు పంప బడ్డాము. కేవలం లూత్ ఇంటివారే మినహాయించబడ్డారు. వారందరినీ మేము రక్షిస్తాము, ఒక్క అతని భార్యను తప్ప. ఎందుకంటే వెనుక ఉండిపోయేవారిలో ఆమె చేరిపోతుందని మేము నిర్ణయించాము" (అని అల్లాహ్ అన్నాడు).

జరిగింది. వాటి స్థితిని అల్లాహ్, "సల్సాలిమ్ మిన హమయిమ్ మస్నూన్" అనే పదాలలో అభివర్ణించాడు. ఈ పదాలు స్పష్టంగా తెలిపేదేమిటంటే, కుళ్ళిన మట్టితో ఒక ప్రతిమ తయారు చేయబడింది. తరువాత అది ఎండినది. అప్పుడు అందులో ప్రాణాన్ని ఊదటం జరిగింది.

11. "సమూమ్" అంటే "వేడిగాలి" అని అర్థము. "నార్" అనే పదాన్ని "సమూమ్"తో కలిపితే "అగ్ని"కి బదులు తీవ్రమైన వేడి అనే అర్థం వస్తుంది. ఖురానులో "జిన్నాతులు నిప్పుతో సృష్టించబడ్డారు" అని వచ్చిన చోటనల్లా తీవ్రమైన వేడితో సృష్టించబడ్డారు అని అర్థం తీసుకోవాలి.

12. "హాజా సిరాతున్ అలయ్య ముస్తఖీమ్" అనే దానికి రెండు అర్థాలు వచ్చే అవకాశం ఉంది. ఒకటి : పైన తర్జుమాలో మేము చేసినది. రెండు: "ఈ మాట నిజమే, నేను కూడా దానికి బద్ధుడనై ఉంటాను" అనేది.

13. ఈ వాక్యానికి రెండో అర్థం ఇది కూడా కావచ్చు: నా దాసుల (అంటే మానవులందరి)ను బలవంతంగా అవిధేయులుగా చేసే అధికారం ఏదీ నీకు ఉండదు. అయితే, స్వయంగా మార్గభ్రష్టులై వారే నిన్ను అనుస రించదలచుకుంటే, నీ మార్గాన్ని అనుసరించే స్వేచ్ఛ వారికి ఇవ్వబడుతుంది. మీరు అలా చేయవద్దు అని వారిని మేము బలవంతం చేయము.

فَلَمَّا جَآءَ اٰلَ لُوْطِ ِۨالْمُرْسَلُوْنَ ﴿٦١﴾ قَالَ اِنَّكُمْ
قَوْمٌ مُّنْكَرُوْنَ ﴿٦٢﴾ قَالُوْا بَلْ جِئْنٰكَ بِمَا كَانُوْا
فِيْهِ يَمْتَرُوْنَ ﴿٦٣﴾ وَ اَتَيْنٰكَ بِالْحَقِّ وَ اِنَّا
لَصٰدِقُوْنَ ﴿٦٤﴾ فَاَسْرِ بِاَهْلِكَ بِقِطْعٍ مِّنَ الَّيْلِ
وَ اتَّبِعْ اَدْبَارَهُمْ وَ لَا يَلْتَفِتْ مِنْكُمْ اَحَدٌ وَّ
امْضُوْا حَيْثُ تُؤْمَرُوْنَ ﴿٦٥﴾ وَقَضَيْنَآ اِلَيْهِ ذٰلِكَ
الْاَمْرَ اَنَّ دَابِرَ هٰٓؤُلَآءِ مَقْطُوْعٌ مُّصْبِحِيْنَ ﴿٦٦﴾
وَجَآءَ اَهْلُ الْمَدِيْنَةِ يَسْتَبْشِرُوْنَ ﴿٦٧﴾ قَالَ
اِنَّ هٰٓؤُلَآءِ ضَيْفِيْ فَلَا تَفْضَحُوْنِ ﴿٦٨﴾ وَ اتَّقُوا
اللّٰهَ وَلَا تُخْزُوْنِ ﴿٦٩﴾ قَالُوْٓا اَوَلَمْ نَنْهَكَ عَنِ
الْعٰلَمِيْنَ ﴿٧٠﴾ قَالَ هٰٓؤُلَآءِ بَنٰتِيْٓ اِنْ كُنْتُمْ
فٰعِلِيْنَ ﴿٧١﴾ لَعَمْرُكَ اِنَّهُمْ لَفِيْ سَكْرَتِهِمْ
يَعْمَهُوْنَ ﴿٧٢﴾ فَاَخَذَتْهُمُ الصَّيْحَةُ مُشْرِقِيْنَ ﴿٧٣﴾
فَجَعَلْنَا عَالِيَهَا سَافِلَهَا وَ اَمْطَرْنَا عَلَيْهِمْ
حِجَارَةً مِّنْ سِجِّيْلٍ ﴿٧٤﴾ اِنَّ فِيْ ذٰلِكَ لَاٰيٰتٍ
لِّلْمُتَوَسِّمِيْنَ ﴿٧٥﴾ وَ اِنَّهَا لَبِسَبِيْلٍ مُّقِيْمٍ ﴿٧٦﴾ اِنَّ
فِيْ ذٰلِكَ لَاٰيَةً لِّلْمُؤْمِنِيْنَ ﴿٧٧﴾ وَاِنْ كَانَ اَصْحٰبُ
الْاَيْكَةِ لَظٰلِمِيْنَ ﴿٧٨﴾ فَانْتَقَمْنَا مِنْهُمْ وَ اِنَّهُمَا وقف لازم
لَبِاِمَامٍ مُّبِيْنٍ ﴿٧٩﴾ ع ٥ ١٩ ٥

**61 - 66** తరువాత ఈ దైవదూతలు లూత్ వద్దకు వెళ్ళినప్పుడు, అతను, "మీరు కొత్తవారుగా కనిపిస్తున్నారు" అని అన్నాడు. వారు ఇలా సమాధానం చెప్పారు: "కాదు, కాని ఈ ప్రజలు దేనిరాకనైతే శంకిస్తున్నారో దాన్ని మేము తీసుకు వచ్చాము. మేము నీతో నిజం చెబుతున్నాము. మేము సత్యంతో నీ వద్దకు వచ్చామని. కనుక ఇప్పుడు, నీవు కొంచెం రాత్రి ఉండగానే నీ ఇంటి వారిని తీసుకుని బయలుదేరు. స్వయంగా నీవూ వారి వెనుక నడువు. మీలో ఎవరూ వెనక్కి తిరిగి చూడకూడదు, 'పొండి' అని మిమ్మల్ని ఆజ్ఞాపించే వైపునకే మీరు నేరుగా పొండి." ఉదయం అవుతూ ఉండగానే వారు సమూలంగా నాశనం చెయ్యబడతారని మేము అతనికి మా నిర్ణయాన్ని తెలియజేశాము.

**67 - 71** ఇంతలోనే నగరవాసులు సంతోషం పట్టలేక లూత్ ఇంటిమీదికి వచ్చారు. లూత్ ఇలా అన్నాడు: "సోదరులారా! వీరు నా అతిథులు. నన్ను నవ్వులపాలు చెయ్యకండి. అల్లాహ్‌కు భయపడండి. నన్ను అవమానపరచకండి." వారు ఇలా చెప్పారు: "ప్రపంచంలోని ప్రతివాణ్ణీ వెనకేసుకు రావద్దని మేము నిన్ను ఎన్నోసార్లు వారించలేదా?" లూత్ (బ్రతిమాలుతూ) ఇలా అన్నాడు: "మీకు ఏదన్నా చెయ్యాలనే ఉంటే, ఇదిగో నా ఈ కూతుళ్ళు ఉన్నారు."[16]

**72 - 74** ప్రవక్తా! నీ ప్రాణం సాక్షిగా! ఆ సమయంలో వారికి ఒక కైపులాంటిది ఎక్కింది. దానితో వారు స్వాధీనత కోల్పోయారు. చివరకు తెల్లవారగానే ఒక భయంకరమైన ప్రేలుడు వారిపైకి వచ్చిపడింది. మేము ఆ నగరాన్ని తల్లక్రిందులు చేసేశాము. వారిపై కాల్చిన మట్టి రాళ్ళ వర్షాన్ని కురిపించాము.

**75 - 77** దూరదృష్టిగల వారికి ఈ సంఘటనలో గొప్ప సూచనలు ఉన్నాయి. (ఈ సంఘటన జరిగిన) ఆ ప్రాంతం రహదారిపై ఉన్నది.[17] ఇందులో విశ్వాసులకు గుణపాఠం నేర్పే విషయాలు ఉన్నాయి.

**78 - 79** "అయికహ్ జాతీయులు"[18] దుర్మార్గులు. కనుక, చూడండి, మేము కూడా వారికి ప్రతీకారం చేశాము. ఈ రెండు జాతుల శిథిలమైన ప్రాంతాలు రహదారులపై ఉన్నాయి.[19]

وَ لَقَدْ كَذَّبَ اَصْحٰبُ الْحِجْرِ الْمُرْسَلِيْنَ ﴿٨٠﴾
وَ اٰتَيْنٰهُمْ اٰيٰتِنَا فَكَانُوْا عَنْهَا مُعْرِضِيْنَ ﴿٨١﴾ وَ
كَانُوْا يَنْحِتُوْنَ مِنَ الْجِبَالِ بُيُوْتًا اٰمِنِيْنَ ﴿٨٢﴾
فَاَخَذَتْهُمُ الصَّيْحَةُ مُصْبِحِيْنَ ﴿٨٣﴾ فَمَآ اَغْنٰى
عَنْهُمْ مَّا كَانُوْا يَكْسِبُوْنَ ﴿٨٤﴾ وَ مَا خَلَقْنَا
السَّمٰوٰتِ وَ الْاَرْضَ وَ مَا بَيْنَهُمَآ اِلَّا
بِالْحَقِّ ؕ وَ اِنَّ السَّاعَةَ لَاٰتِيَةٌ فَاصْفَحِ
الصَّفْحَ الْجَمِيْلَ ﴿٨٥﴾ اِنَّ رَبَّكَ هُوَ الْخَلّٰقُ
الْعَلِيْمُ ﴿٨٦﴾ وَ لَقَدْ اٰتَيْنٰكَ سَبْعًا مِّنَ الْمَثَانِيْ وَ
الْقُرْاٰنَ الْعَظِيْمَ ﴿٨٧﴾ لَا تَمُدَّنَّ عَيْنَيْكَ اِلٰى مَا
مَتَّعْنَا بِهٖۤ اَزْوَاجًا مِّنْهُمْ وَ لَا تَحْزَنْ عَلَيْهِمْ
وَ اخْفِضْ جَنَاحَكَ لِلْمُؤْمِنِيْنَ ﴿٨٨﴾ وَ قُلْ اِنِّيْۤ
اَنَا النَّذِيْرُ الْمُبِيْنُ ﴿٨٩﴾ كَمَآ اَنْزَلْنَا عَلَى
الْمُقْتَسِمِيْنَ ﴿٩٠﴾ الَّذِيْنَ جَعَلُوا الْقُرْاٰنَ
عِضِيْنَ ﴿٩١﴾ فَوَ رَبِّكَ لَنَسْـَٔلَنَّهُمْ اَجْمَعِيْنَ ﴿٩٢﴾
عَمَّا كَانُوْا يَعْمَلُوْنَ ﴿٩٣﴾ ع

**80 - 84** హిజ్ర్ ప్రజలు కూడా ప్రవక్తలను నిరాకరించారు. మేము మా ఆయతులను వారికడకు పంపాము. మా సూచనలను వారికి చూపాము. కాని వారు వాటన్నింటినీ విస్మరిస్తూనే వచ్చారు. వారు కొండలను తొలిచి గృహాలను నిర్మిస్తూ ఉండేవారు. వారు తమ స్థానంలో నిర్భయంగా, నిశ్చింతగా ఉండేవారు. తుదకు ఉదయం వేళ ఒక తీవ్రమైన ప్రేలుడు వారిపై వచ్చిపడింది. వారి సంపాదన వారికి ఏ మాత్రం పనికిరాకుండా పోయింది.

**85 - 93** మేము భూమినీ, ఆకాశాలనూ వాటిలో ఉన్న సమస్తాన్నీ సత్యం పునాదిగా తప్ప మరొకటేదీ పునాదిగా సృష్టించలేదు. తీర్పు గడియ నిశ్చయముగా రానున్నది. కనుక ప్రవక్తా! నీవు (వారి కుచేష్టలను) పెద్దమనిషి తరహాలో మన్నించు. నిశ్చయంగా నీ ప్రభువు అందరినీ సృష్టించిన వాడూ అంతా తెలిసినవాడూను. మేము నీకు ఏడు ఆయతులను ఇచ్చాము. అవి మాటిమాటికీ పఠింపదగినవి.[20] ఇంకా నీకు మహత్తరమైన ఖురానును ప్రసాదించాము. వారిలోని విభిన్న వర్గాల వారికి మేము ఇచ్చిన ఐహిక సంపద వైపు నీవు కన్నెత్తి కూడా చూడకు. వారి స్థితికి బాధపడకు. వారిని విడిచిపెట్టి విశ్వాసుల వైపునకు మొగ్గు. ఇంకా (అవిశ్వాసులతో) "నేను స్పష్టంగా హెచ్చరించేవాణ్ణి మాత్రమే" అని అను. ఇది తమ ఖురానును తుత్తునియలుగా చేసిన విభేదకారకుల వైపునకు మేము పంపిన హెచ్చరిక వంటిదే.[21] కనుక నీ ప్రభువు సాక్షిగా మేము తప్పకుండా వారందరినీ "మీరేమి చేస్తూ ఉండేవారు?" అని అడుగుతాము.

14. ఈ నరకద్వారాలు బహుశా మనిషి అవలంబించే అపమార్గాలనుబట్టి అతడు చేసే పాపాలనుబట్టి ఉంటాయి. వాటిద్వారానే అతడు తన కోసం నరకద్వారాన్ని తెరుచుకుంటాడు. ఉదాహరణకు, ఒకడు నాస్తికమార్గం గుండా నరకం వైపునకు పోతే మరొకడు షిర్కు మార్గం ద్వారా పోతాడు. ఇంకొకడు కాపట్య మార్గం ద్వారా పోతాడు. ఒకడు మనోవాంఛల అనుసరణ మార్గం ద్వారా, అవిధేయతా మార్గం ద్వారా, చెడు నడవడిక మార్గం ద్వారా పోతాడు. మరొకడు అన్యాయం, హింసల ద్వారా ప్రజలను పీడించటం ద్వారా పోతాడు. ఇంకొకడు భ్రష్టమార్గం బోధించటం ద్వారా, అవిశ్వాసాన్ని స్థాపించటం ద్వారా పోతాడు. మరొకడు అశ్లీల విషయాల ప్రచారం ద్వారా, చెడు విషయాల ప్రచురణల ద్వారా పోతాడు. వ్యక్తి చేసిన పాపం యొక్క స్వభావాన్నిబట్టి, దాని పరిమాణాన్నిబట్టి అతడు నరకం వైపునకు పోవటానికి మార్గం నిర్ణయింపబడుతుంది.

15. అంటే, హజ్రత్ ఇస్హాఖ్ (అస్సలామ్) జననానికి సంబంధించిన శుభవార్త, హూద్ సూరాలో విశదంగా చెప్పబడినట్లు.

16. వ్యాఖ్యానం కొరకు హూద్ సూరాలోని 26, 27 వివరణలు చూడండి.

فَاصۡدَعۡ بِمَا تُؤۡمَرُ وَ اَعۡرِضۡ عَنِ
الۡمُشۡرِكِيۡنَ ﴿٩٤﴾ اِنَّا كَفَيۡنٰكَ الۡمُسۡتَهۡزِءِيۡنَ ﴿٩٥﴾
الَّذِيۡنَ يَجۡعَلُوۡنَ مَعَ اللّٰهِ اِلٰهًا اٰخَرَ ۚ فَسَوۡفَ
يَعۡلَمُوۡنَ ﴿٩٦﴾ وَ لَقَدۡ نَعۡلَمُ اَنَّكَ يَضِيۡقُ
صَدۡرُكَ بِمَا يَقُوۡلُوۡنَ ﴿٩٧﴾ فَسَبِّحۡ بِحَمۡدِ
رَبِّكَ وَ كُنۡ مِّنَ السّٰجِدِيۡنَ ﴿٩٨﴾ وَاعۡبُدۡ رَبَّكَ
حَتّٰى يَاۡتِيَكَ الۡيَقِيۡنُ ﴿٩٩﴾ ع ٦

**94 - 96** కనుక ప్రవక్తా! నీకు ఆజ్ఞాపించబడుతూ ఉండిన విషయాన్ని బహిరంగంగా ఎలుగెత్తి చాటు. షిర్కు చేసేవారిని ఏమాత్రం లెక్కచేయకు. నిన్ను ఎగతాళి చేసేవారికీ, అల్లాహ్‌తో పాటు ఇతరులను కూడా దేవుళ్ళుగా నిర్ణయించేవారికీ నీ తరపున బుద్ధి చెప్పటానికి మేము చాలు. త్వరలోనే వారికి తెలిసిపోతుంది.

**97 - 99** వారు నిన్ను గురించి కల్పిస్తున్న మాటలవల్ల నీ మనస్సుకు మిక్కిలి కష్టం కలుగుతోందని మాకు తెలుసు. (దానికి చికిత్స ఏమిటంటే) నీ ప్రభువు స్తోత్రం చేస్తూ ఆయన పవిత్ర నామాన్ని స్మరించు. ఆయన సన్నిధానంలో సాష్టాంగ పడు. తప్పకుండా వచ్చే చివరి గడియవరకూ నీ ప్రభువు దాస్యం చేస్తూ వుండు.

17. అంటే, హిజాజ్ నుండి సిరియాకు, ఇరాఖు నుండి ఈజిప్టుకు పోయే మార్గంలో సర్వనాశనమైపోయిన ఈ ప్రదేశం ఉన్నది. సాధారణంగా వ్యాపార బృందాల ప్రజలు ఇప్పుడు కూడా ఆ మొత్తం ప్రాంతంలో వినాశం యొక్క స్పష్టమైన గుర్తులను చూస్తారు.
18. అంటే, దైవప్రవక్త హజ్రత్ షుఐబ్ (అస్సలామ్) జాతికి చెందిన ప్రజలు, అయ్‌కా అనేది తబూక్ యొక్క పాత పేరు.
19. మద్‌యన్ ప్రాంతమూ అస్‌హాబుల్ అయ్‌కా ప్రాంతమూ కూడా హిజాజ్ నుండి పాలస్తీనాకు, సిరియాకు పోయే మార్గంలో ఉన్నాయి.
20. అంటే, ఫాతిహ సూరాలోని ఆయతులు అని అర్థం. గత విద్వాంసులలో అధిక సంఖ్యాకులు ఈ అభిప్రాయంతో ఏకీభవించారు. స్వయంగా మహాప్రవక్త (సఅసమ్) "సబ్‌ఉమ్ మినల్ మసానీ" అంటే ఫాతిహ సూరా అని తెలిపారని ఇమామ్ బుఖారీ (రహ్మలై) వివరిస్తూ, దానికి తార్కాణంగా రెండు హదీసులను ఉదాహరించారు.
21. అంటే, ఖురాను మాదిరిగా ఇవ్వబడిన గ్రంథాన్ని ముక్కలు ముక్కలుగా చేశారు. అందులోని ఒక భాగాన్ని అనుసరిస్తే మరొక భాగాన్ని విస్మరించారు.

١٦ سُوْرَةُ النَّحْلِ مَكِّيَّةٌ ٧٠

اٰياتها ١٢٨ | ركوعاتها ١٦

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○

اَتٰۤى اَمۡرُ اللّٰهِ فَلَا تَسۡتَعۡجِلُوۡهُ ؕ سُبۡحٰنَهٗ وَ تَعٰلٰى
عَمَّا يُشۡرِكُوۡنَ ① يُنَزِّلُ الۡمَلٰۤـئِكَةَ بِالرُّوۡحِ مِنۡ
اَمۡرِهٖ عَلٰى مَنۡ يَّشَآءُ مِنۡ عِبَادِهٖۤ اَنۡ اَنۡذِرُوۡۤا
اَنَّهٗ لَاۤ اِلٰهَ اِلَّاۤ اَنَا فَاتَّقُوۡنِ ② خَلَقَ
السَّمٰوٰتِ وَ الۡاَرۡضَ بِالۡحَـقِّ ؕ تَعٰلٰى عَمَّا
يُشۡرِكُوۡنَ ③ خَلَقَ الۡاِنۡسَانَ مِنۡ نُّطۡفَةٍ فَاِذَا هُوَ
خَصِيۡمٌ مُّبِيۡنٌ ④ وَ الۡاَنۡعَامَ خَلَقَهَا ۚ لَـكُمۡ فِيۡهَا
دِفۡءٌ وَّ مَنَافِعُ وَمِنۡهَا تَاۡكُلُوۡنَ ۖ⑤ وَ لَـكُمۡ فِيۡهَا
جَمَالٌ حِيۡنَ تُرِيۡحُوۡنَ وَحِيۡنَ تَسۡرَحُوۡنَ ۖ⑥ وَ
تَحۡمِلُ اَثۡقَالَـكُمۡ اِلٰى بَلَدٍ لَّمۡ تَكُوۡنُوۡا بٰلِغِيۡهِ اِلَّا
بِشِقِّ الۡاَنۡفُسِ ؕ اِنَّ رَبَّكُمۡ لَرَءُوۡفٌ رَّحِيۡمٌ ۙ⑦
وَّالۡخَيۡلَ وَ الۡبِغَالَ وَ الۡحَمِيۡرَ لِتَرۡكَبُوۡهَا وَ
زِيۡنَةً ؕ وَ يَخۡلُقُ مَا لَا تَعۡلَمُوۡنَ ⑧ وَعَلَى اللّٰهِ
قَصۡدُ السَّبِيۡلِ وَ مِنۡهَا جَآئِرٌ ؕ وَ لَوۡ شَآءَ
لَهَدٰٮكُمۡ اَجۡمَعِيۡنَ ⑨ ع ١

## 16. అన్ నహ్ల్

ఆయతులు 128 | అవతరణ మక్కాలో

*అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

**1 – 3** అల్లాహ్ తీర్పు వచ్చేసింది.[1] ఇక దానికొరకు తొందర పెట్టకండి. ఆయన పరిశుద్ధుడు. వారు చేస్తూవున్న షిర్కుకు అతీతుడు, ఉన్నతుడు. ఆయన ఈ ఆత్మను[2] తనకు నచ్చిన తన దాసునిపై తన ఆజ్ఞతో దైవదూతల ద్వారా అవతరింపజేస్తాడు. (ఈ ఉపదేశంతో ప్రజలను) హెచ్చరించండి: "నేను తప్ప మీకు మరొక దేవుడు ఎవ్వడూ లేడు. కనుక మీరు నాకే భయపడండి." ఆయన ఆకాశాన్నీ భూమినీ సత్యం పునాదిగా సృష్టించాడు. ఈ ప్రజలు చేసే షిర్కుకు ఆయన అతీతుడు, ఉన్నతుడు.

**4 – 9** ఆయన మానవుణ్ణి స్వల్పమైన బిందువుతో సృష్టించాడు. చూస్తూ చూస్తూ ఉండగానే అతడు ఒక బహిరంగ వివాదిగా మారిపోయాడు.[3] ఆయన పశువులను సృష్టించాడు. వాటిలో మీకొరకు దుస్తులూ ఉన్నాయి, ఆహారమూ ఉన్నది. ఇంకా రకరకాల ఇతర ఉపయోగాలు కూడా ఉన్నాయి. ఉదయం పూట మీరు వాటిని మేపటానికి తోలుకుని వెళ్ళేటప్పుడూ, సాయంత్రం పూట వాటిని తిరిగి తోలుకొని వచ్చేటప్పుడూ అవి మీకు రమణీయంగా కనిపిస్తాయి. ఎంతో కష్టంతో తప్ప మీరు చేరలేని ప్రదేశాలకు సయితం అవి మీకొరకు బరువును మోసుకునిపోతాయి. యథార్థమేమిటంటే, మీ ప్రభువు ఎంతో వాత్సల్యం కలవాడు, ఎంతో కనికరించేవాడు. ఆయన గుర్రాలనూ, కంచర గాడిదలనూ, గాడిదలనూ సృష్టించాడు. మీరు వాటిపై స్వారీ చెయ్యటానికి, అవి మీ జీవితాలకు శోభను చేకూర్చటానికి. ఆయన ఇంకా చాలా వస్తువులను (మీ ప్రయోజనం కొరకు) సృష్టిస్తాడు. వాటిని గురించి మీకసలు తెలియనే తెలియదు.[4] వక్రములైన మార్గాలు కూడా ఉన్నప్పుడు, సక్రమమైన మార్గం చూపటం అల్లాహ్ బాధ్యతే. ఆయన తలచుకుని ఉంటే మీ అందరికీ సన్మార్గం చూపి ఉండేవాడే.

هُوَ الَّذِيْٓ اَنْزَلَ مِنَ السَّمَآءِ مَآءً لَّكُمْ مِّنْهُ
شَرَابٌ وَّ مِنْهُ شَجَرٌ فِيْهِ تُسِيْمُوْنَ ﴿١٠﴾ يُنْۢبِتُ
لَكُمْ بِهِ الزَّرْعَ وَ الزَّيْتُوْنَ وَ النَّخِيْلَ وَ
الْاَعْنَابَ وَ مِنْ كُلِّ الثَّمَرٰتِ ؕ اِنَّ فِيْ ذٰلِكَ
لَاٰيَةً لِّقَوْمٍ يَّتَفَكَّرُوْنَ ﴿١١﴾ وَسَخَّرَ لَكُمُ الَّيْلَ
وَ النَّهَارَ ۙ وَ الشَّمْسَ وَ الْقَمَرَ ؕ وَالنُّجُوْمُ
مُسَخَّرٰتٌۢ بِاَمْرِهٖ ؕ اِنَّ فِيْ ذٰلِكَ لَاٰيٰتٍ لِّقَوْمٍ
يَّعْقِلُوْنَ ۙ﴿١٢﴾ وَ مَا ذَرَاَ لَكُمْ فِي الْاَرْضِ
مُخْتَلِفًا اَلْوَانُهٗ ؕ اِنَّ فِيْ ذٰلِكَ لَاٰيَةً لِّقَوْمٍ
يَّذَّكَّرُوْنَ ﴿١٣﴾ وَ هُوَ الَّذِيْ سَخَّرَ الْبَحْرَ لِتَاْكُلُوْا
مِنْهُ لَحْمًا طَرِيًّا وَّ تَسْتَخْرِجُوْا مِنْهُ حِلْيَةً
تَلْبَسُوْنَهَا ۚ وَ تَرَى الْفُلْكَ مَوَاخِرَ فِيْهِ وَ
لِتَبْتَغُوْا مِنْ فَضْلِهٖ وَ لَعَلَّكُمْ تَشْكُرُوْنَ ﴿١٤﴾
وَاَلْقٰى فِي الْاَرْضِ رَوَاسِيَ اَنْ تَمِيْدَ بِكُمْ وَ
اَنْهٰرًا وَّ سُبُلًا لَّعَلَّكُمْ تَهْتَدُوْنَ ۙ﴿١٥﴾ وَعَلٰمٰتٍ ؕ
وَ بِالنَّجْمِ هُمْ يَهْتَدُوْنَ ﴿١٦﴾ اَفَمَنْ يَّخْلُقُ كَمَنْ
لَّا يَخْلُقُ ؕ اَفَلَا تَذَكَّرُوْنَ ﴿١٧﴾ وَ اِنْ تَعُدُّوْا
نِعْمَةَ اللّٰهِ لَا تُحْصُوْهَا ؕ اِنَّ اللّٰهَ لَغَفُوْرٌ
رَّحِيْمٌ ﴿١٨﴾ وَاللّٰهُ يَعْلَمُ مَا تُسِرُّوْنَ وَ مَا
تُعْلِنُوْنَ ﴿١٩﴾

**10 - 11** ఆకాశం నుండి మీకోసం నీళ్ళను కురిపించేవాడు ఆయనే. ఆ నీటిని మీరూ తనివితీరా త్రాగుతారు, ఆ నీటివల్ల మీ పశువులకు కూడా మేత మొలుస్తుంది. ఆయన ఆ నీటి ద్వారా పొలాలను పండిస్తాడు. జైతూను, ఖర్జూరం, ద్రాక్ష ఇంకా రకరకాల ఇతర పండ్లను పండిస్తాడు. ఆలోచించే వారికి ఇందులో ఒక గొప్ప నిదర్శనం ఉంది.

**12 - 13** ఆయన మీ మేలు కోసం రాత్రినీ, పగలునూ, సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ మీకు వశపరిచాడు. నక్షత్రాలు కూడా ఆయన ఆజ్ఞ వల్లనే మీకు వశమై ఉన్నాయి. బుద్ధిని ఉపయోగించేవారికి ఇందులో చాలా సూచనలు ఉన్నాయి. ఆయన మీకోసం భూమిలో సృష్టించిన అనేక రంగు రంగుల వస్తువులలో కూడా గుణపాఠం నేర్చుకునేవారికి నిశ్చయంగా సూచన ఉంది.

**14** సముద్రాన్ని మీ సేవకోసం నియోగించినవాడు ఆయనే, దానినుండి మీరు తాజా మాంసాన్ని తీసుకుని తినేటందుకు, మీరు ధరించే ఆభరణాలను దానినుండి వెలికి తీసుకునేటందుకు. సముద్రం రొమ్మును చీలుస్తూ ఓడ పయనించటాన్ని మీరు చూస్తారు. ఇదంతా ఎందుకంటే, మీరు మీ ప్రభువు అనుగ్రహాన్ని అన్వేషించాలనీ,[5] ఆయనకు కృతజ్ఞులు కావాలనీ.

**15 - 16** ఆయన భూమిలో పర్వతాలను మేకులుగా పాతాడు, భూమి మిమ్మల్ని తీసుకొని దొర్లిపోకుండా ఉండాలని. ఆయన నదులను ప్రవహింప జేశాడు. సహజ మార్గాలను నిర్మించాడు, మీరు సరైన మార్గం పొందటానికి. ఆయన భూమిలో మార్గం చూపే సంకేతాలను పెట్టాడు. నక్షత్రాల ద్వారా కూడా ప్రజలు మార్గం తెలుసుకుంటారు.

**17 - 19** సృష్టించేవాడూ, అసలు ఏమీ సృష్టించనివాడూ ఉభయులూ సమానులేనా? మీరు ఈ మాత్రం అర్థం చేసుకోలేరా? ఒకవేళ మీరు అల్లాహ్ అనుగ్రహాలను లెక్కించదలిస్తే, లెక్కించలేరు. యథార్థమేమిటంటే ఆయన ఎంతో మన్నించేవాడూ, కరుణామయుడూను. ఆయన మీ బాహ్యాన్నీ ఎరుగును, మీ గోప్యాన్నీ ఎరుగును.

**20 - 21** అల్లాహ్‌ను వదలి, ప్రజలు వేడుకుంటున్న ఇతర శక్తులు ఏ వస్తువుకూ సృష్టికర్తలు కారు. వారు స్వయంగా సృష్టింప బడినవారు, నిర్జీవులే కాని సజీవులు కారు. వారు ఎప్పుడు (మళ్ళీ బ్రతికించబడి) లేపబడనున్నారో[6] వారికెంత మాత్రం తెలియదు.

**22 - 23** మీ దేవుడు కేవలం ఒక్కడే. కాని పరలోకాన్ని నమ్మని వారి హృదయాలలో తిరస్కారం తిష్ఠవేసుకొని ఉంది. వారు విర్రవీగుతున్నారు. అల్లాహ్‌కు నిశ్చయంగా వారి చేష్టలన్నీ తెలుసు- దాగివున్నవి కూడా, బహిరంగముగా ఉన్నవి కూడా. అహంభావానికి గురైన వారిని ఆయన ఏమాత్రం ప్రేమించడు.

**24 - 29** ఎవరైనా వారిని, "మీ ప్రభువు అవతరింపజేసినటు వంటిది ఏమిటి?"[7] అని అడిగితే ఇలా అంటారు: "అవండీ, అవి పాతకాలపు కట్టు కథలు." ఈ మాటలను అని వారు ప్రళయంనాడు తమ బరువును పూర్తిగా మోస్తారు. దానికితోడు వారు అజ్ఞానం వల్ల అపమార్గం పట్టిస్తున్న వారి బరువును కూడా కొంత మోస్తారు. చూడండి! ఎంత కఠినమైన బాధ్యతను వారు తమ నెత్తిపై వేసుకుంటున్నారో! వారికి పూర్వం కూడా చాలామంది (సత్యాన్ని అణచటానికి) ఇటువంటి దుష్టపన్నాగాలనే పన్నారు. చూడండి, అప్పుడు అల్లాహ్ వారి పన్నాగపు కట్టడాన్ని పునాదులతో సహా పెకలించి పారవేశాడు. పైనుండి దాని కప్పు వారి తలలపై పడింది. శిక్ష వస్తుందని వారికి అనుమానం కూడా లేనటువంటి దిక్కునుండి అది వారిపైకి వచ్చి పడింది. తరువాత ప్రళయంనాడు అల్లాహ్ వారిని అవమానపరుస్తాడు, హీనపరుస్తాడు. వారితో ఇలా అంటాడు: మీరు (సత్యవాదులతో) నా భాగస్వాముల తరఫున పోట్లాడుతూ ఉండేవారు కదా! ఇప్పుడు ఆ నా భాగస్వాములు ఎక్కడ ఉన్నారో చెప్పండి - ప్రపంచంలో జ్ఞానం లభించిన వారు "అవిశ్వాసులకు ఈ రోజు (లభించేది) అవమానమూ, దౌర్భాగ్యమూను" అని అంటారు. అవును, తమ ఆత్మలకు అన్యాయం చేసుకుంటూ ఉన్నప్పుడు దైవదూతలు ప్రాణాలు తీసే అవిశ్వాసులకు. అప్పుడు వారు (తలబిరుసు తనాన్ని విడిచిపెట్టి) వెంటనే పూర్తిగా లొంగిపోయి, "మేము ఏ తప్పూ చేసి ఉండలేదు" అని అంటారు. దానికి దైవ దూతలు ఇలా అంటారు: "ఎందుకు చేసి ఉండలేదు! అల్లాహ్ మీ చేష్టలను బాగా ఎరుగును. ఇక పొండి. నరక ద్వారాలలో దూరిపొండి. అక్కడనే మీరు శాశ్వతంగా ఉంటారు." కనుక యథార్థం ఏమిటంటే, గర్విష్ఠులకు లభించే నివాసం చాలా చెడ్డది.

وَ الَّذِيْنَ يَدْعُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ لَا يَخْلُقُوْنَ
شَيْـًٔا وَّ هُمْ يُخْلَقُوْنَ ﴿٢٠﴾ اَمْوَاتٌ غَيْرُ اَحْيَآءٍ ۚ
وَ مَا يَشْعُرُوْنَ ۙ اَيَّانَ يُبْعَثُوْنَ ﴿٢١﴾ اِلٰـهُكُمْ اِلٰهٌ ع ١٢/٨
وَّاحِدٌ ۚ فَالَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ
قُلُوْبُهُمْ مُّنْكِرَةٌ وَّ هُمْ مُّسْتَكْبِرُوْنَ ﴿٢٢﴾ لَا جَرَمَ
اَنَّ اللّٰهَ يَعْلَمُ مَا يُسِرُّوْنَ وَ مَا يُعْلِنُوْنَ ؕ اِنَّهٗ
لَا يُحِبُّ الْمُسْتَكْبِرِيْنَ ﴿٢٣﴾ وَ اِذَا قِيْلَ لَهُمْ
مَّاذَاۤ اَنْزَلَ رَبُّكُمْ ۙ قَالُوْۤا اَسَاطِيْرُ
الْاَوَّلِيْنَ ﴿٢٤﴾ لِيَحْمِلُوْۤا اَوْزَارَهُمْ كَامِلَةً يَّوْمَ
الْقِيٰمَةِ ۙ وَ مِنْ اَوْزَارِ الَّذِيْنَ يُضِلُّوْنَهُمْ
بِغَيْرِ عِلْمٍ ؕ اَلَا سَآءَ مَا يَزِرُوْنَ ﴿٢٥﴾ قَدْ مَكَرَ ع ٣/٩
الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ فَاَتَى اللّٰهُ بُنْيَانَهُمْ مِّنَ
الْقَوَاعِدِ فَخَرَّ عَلَيْهِمُ السَّقْفُ مِنْ فَوْقِهِمْ وَ
اَتٰىهُمُ الْعَذَابُ مِنْ حَيْثُ لَا يَشْعُرُوْنَ ﴿٢٦﴾ ثُمَّ
يَوْمَ الْقِيٰمَةِ يُخْزِيْهِمْ وَ يَقُوْلُ اَيْنَ
شُرَكَآءِيَ الَّذِيْنَ كُنْتُمْ تُشَآقُّوْنَ فِيْهِمْ ؕ قَالَ
الَّذِيْنَ اُوْتُوا الْعِلْمَ اِنَّ الْخِزْيَ الْيَوْمَ
وَالسُّوْٓءَ عَلَى الْكٰفِرِيْنَ ﴿٢٧﴾ الَّذِيْنَ تَتَوَفّٰىهُمُ
الْمَلٰٓئِكَةُ ظَالِمِيْٓ اَنْفُسِهِمْ ۪ فَاَلْقَوُا السَّلَمَ مَا كُنَّا
نَعْمَلُ مِنْ سُوْٓءٍ ؕ بَلٰٓى اِنَّ اللّٰهَ عَلِيْمٌۢ بِمَا
كُنْتُمْ تَعْمَلُوْنَ ﴿٢٨﴾ فَادْخُلُوْۤا اَبْوَابَ جَهَنَّمَ
خٰلِدِيْنَ فِيْهَا ؕ فَلَبِئْسَ مَثْوَى الْمُتَكَبِّرِيْنَ ﴿٢٩﴾

وَ قِيۡلَ لِلَّذِيۡنَ اتَّقَوۡا مَاذَآ اَنۡزَلَ رَبُّكُمۡ ؕ
قَالُوۡا خَيۡرًا ؕ لِلَّذِيۡنَ اَحۡسَنُوۡا فِىۡ هٰذِهِ الدُّنۡيَا
حَسَنَةٌ ؕ وَلَدَارُ الۡاٰخِرَةِ خَيۡرٌ ؕ وَ لَنِعۡمَ دَارُ
الۡمُتَّقِيۡنَ ۙ﴿۳۰﴾ جَنّٰتُ عَدۡنٍ يَّدۡخُلُوۡنَهَا تَجۡرِىۡ
مِنۡ تَحۡتِهَا الۡاَنۡهٰرُ لَهُمۡ فِيۡهَا مَا يَشَآءُوۡنَ ؕ
كَذٰلِكَ يَجۡزِى اللّٰهُ الۡمُتَّقِيۡنَ ۙ﴿۳۱﴾ الَّذِيۡنَ
تَتَوَفّٰهُمُ الۡمَلٰٓئِكَةُ طَيِّبِيۡنَ ۙ يَقُوۡلُوۡنَ سَلٰمٌ
عَلَيۡكُمُ ۙ ادۡخُلُوا الۡجَنَّةَ بِمَا كُنۡتُمۡ تَعۡمَلُوۡنَ ﴿۳۲﴾

**30 - 32** మరోవైపు దైవభీతి కలవారిని, మీ ప్రభువు తరఫు నుండి అవతరించినటువంటిది ఏమిటి? అని అడిగినప్పుడు, వారు "అత్యుత్తమమైనది అవతరించినది" అని సమాధానం చెబుతారు. ఇటువంటి సజ్జనులకు ఈ ప్రపంచంలోనూ మేలు జరుగుతుంది. ఇక పరలోక గృహం కూడా తప్పని సరిగా వారికి ఎంతో మేలైనదిగా ఉంటుంది. భయభక్తులు కలవారి ఇల్లు ఎంతో మంచి ఇల్లు, శాశ్వత నివాసంగా ఉండే ఉద్యాన వనాలు- వాటిలో వారు ప్రవేశిస్తారు. క్రింద కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి. అక్కడ అంతా వారి అభిమతానికి అనుగుణంగానే జరుగుతుంది. భయభక్తులు కలవారికి అల్లాహ్ ఇటువంటి ప్రతిఫలాన్ని ఇస్తాడు. వారు పరిశుద్ధావస్థలో ఉన్నప్పుడు దైవదూతలు వారి ప్రాణాలు తీస్తూ "మీకు శాంతి కలుగుగాక! మీ కర్మలకు ప్రతిఫలంగా స్వర్గంలో ప్రవేశించండి" అని అంటారు.

---

1. అంటే, అల్లాహ్ తీర్పు ప్రత్యక్షమయ్యే సమయం, అది అమలుపరచబడే సమయం దగ్గరపడింది అని అర్థం. బహుశా ఈ తీర్పు మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) మక్కా నుండి మదీనాకు వలస పోవటానికి సంబంధించినది కావచ్చు. తీర్పు వచ్చిన కొంతకాలానికి వలస పోవటానికి సంబంధించిన ఆజ్ఞ వచ్చింది. ఖురాను అధ్యయనం వల్ల తెలిసేది ఇది : ప్రజలు తిరస్కారపు చివరి హద్దుకు చేరినప్పుడు వారి వద్దకు పంపబడిన దైవప్రవక్తకు వలసకు ఆదేశం ఇవ్వబడుతుంది. ఆ ఆదేశమే వారి అదృష్టాన్ని నిర్ణయిస్తుంది. ఆ తరువాత వారిపై వినాశకరమైన శిక్షన్నా విరుచుకుపడుతుంది లేదా దైవప్రవక్త యొక్క ఆయన అనుచరుల యొక్క చేతుల మీదుగా వారు సమూలంగా నాశనం కావటమైనా జరుగుతుంది.
2. రూహ్ (ఆత్మ) అంటే ప్రవక్త పదవి యొక్క ఆత్మ అని అర్థం. వహీ అని కూడా అర్థం. దాని ఆధారంగా దైవప్రవక్త మాట్లాడతాడు, పనిచేస్తాడు.
3. దీనికి రెండు అర్థాలు చెప్పవచ్చు. బహుశా రెండూ ఉద్దేశింపబడి ఉంటాయి. మొదటిది : అల్లాహ్ ఒక అత్యల్పమైన బిందువుతో మానవుణ్ణి సృష్టించాడు. ఆ మానవుడు వాదించే సామర్థ్యమూ తన వాదానికి హేతువులు చూపే ప్రజ్ఞా కలవాడు. తన అభిప్రాయాన్ని సమర్థించుకోవటానికి వాదాలు కల్పిస్తాడు. రెండోది : దేవుడు వీర్య బిందువు వంటి అల్పమైన దానితో పుట్టించిన మానవుడి దురహంకారం చూడండి. అతడు స్వయంగా దేవునికే వ్యతిరేకంగా వాదులాటకు దిగాడు.
4. అంటే, మానవుని మేలు కొరకు పనిచేస్తూ ఉన్న వస్తువులు ఎన్నో ఉన్నాయి. ఎక్కడెక్కడ ఎంతమంది సేవకులు అతని సేవలో నిమగ్నులై ఉన్నారో, ఎటువంటి సేవచేస్తున్నారో మానవుడికి తెలియనుకూడా తెలియదు.
5. అంటే, హలాలు (ధర్మసమ్మతమైన) పద్ధతుల ద్వారా ఉపాధిని పొందే ప్రయత్నం చెయ్యండి అని అర్థం.
6. ఇక్కడ ప్రత్యేకంగా ఖండించటం జరిగిన బూటకపు దేవుళ్ళు అంటే మరణించిన మానవులు అని ఈ పదాలు స్పష్టంగా తెలియజేస్తున్నాయి. ఎందుకంటే, దైవదూతలు సజీవులు. వారు మరణించరు. ఇక కొయ్య విగ్రహాలు, రాతి విగ్రహాల వ్యవహారంలో వాటిని మళ్ళీ బ్రతికించి లేపే ప్రశ్నే ఉదయించదు.
7. అరేబియాలో మహాప్రవక్త (సఅసమ్)ను గురించి చర్చలు ప్రారంభమైనప్పుడు, బయటి ప్రజలు ఆయన్ని గురించి ఖురానును గురించి మక్కావాసులను ప్రశ్నలు అడిగేవారు.

هَلْ يَنْظُرُوْنَ اِلَّاۤ اَنْ تَاْتِيَهُمُ الْمَلٰٓئِكَةُ اَوْ يَاْتِيَ
اَمْرُ رَبِّكَ ؕ كَذٰلِكَ فَعَلَ الَّذِيْنَ مِنْ
قَبْلِهِمْ ؕ وَ مَا ظَلَمَهُمُ اللّٰهُ وَ لٰكِنْ كَانُوْۤا
اَنْفُسَهُمْ يَظْلِمُوْنَ ﴿٣٣﴾ فَاَصَابَهُمْ سَيِّاٰتُ مَا
عَمِلُوْا وَحَاقَ بِهِمْ مَّا كَانُوْا بِهٖ يَسْتَهْزِءُوْنَ ﴿٣٤﴾ ع ١٠
وَ قَالَ الَّذِيْنَ اَشْرَكُوْا لَوْ شَآءَ اللّٰهُ مَا عَبَدْنَا
مِنْ دُوْنِهٖ مِنْ شَيْءٍ نَّحْنُ وَلَاۤ اٰبَآؤُنَا وَ لَا
حَرَّمْنَا مِنْ دُوْنِهٖ مِنْ شَيْءٍ ؕ كَذٰلِكَ فَعَلَ
الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ ۚ فَهَلْ عَلَى الرُّسُلِ اِلَّا
الْبَلٰغُ الْمُبِيْنُ ﴿٣٥﴾ وَ لَقَدْ بَعَثْنَا فِيْ كُلِّ اُمَّةٍ
رَّسُوْلًا اَنِ اعْبُدُوا اللّٰهَ وَ اجْتَنِبُوا
الطَّاغُوْتَ ۚ فَمِنْهُمْ مَّنْ هَدَى اللّٰهُ وَمِنْهُمْ مَّنْ
حَقَّتْ عَلَيْهِ الضَّلٰلَةُ ؕ فَسِيْرُوْا فِي الْاَرْضِ
فَانْظُرُوْا كَيْفَ كَانَ عَاقِبَةُ الْمُكَذِّبِيْنَ ﴿٣٦﴾ اِنْ
تَحْرِصْ عَلٰى هُدٰىهُمْ فَاِنَّ اللّٰهَ لَا يَهْدِيْ مَنْ
يُّضِلُّ وَمَا لَهُمْ مِّنْ نّٰصِرِيْنَ ﴿٣٧﴾ وَاَقْسَمُوْا
بِاللّٰهِ جَهْدَ اَيْمَانِهِمْ ۙ لَا يَبْعَثُ اللّٰهُ مَنْ
يَّمُوْتُ ؕ بَلٰى وَعْدًا عَلَيْهِ حَقًّا وَّ لٰكِنَّ اَكْثَرَ
النَّاسِ لَا يَعْلَمُوْنَ ﴿٣٨﴾ لِيُبَيِّنَ لَهُمُ الَّذِيْ
يَخْتَلِفُوْنَ فِيْهِ وَ لِيَعْلَمَ الَّذِيْنَ كَفَرُوْۤا اَنَّهُمْ
كَانُوْا كٰذِبِيْنَ ﴿٣٩﴾ اِنَّمَا قَوْلُنَا لِشَيْءٍ اِذَاۤ
اَرَدْنٰهُ اَنْ نَّقُوْلَ لَهٗ كُنْ فَيَكُوْنُ ﴿٤٠﴾ ع ١١

**33 - 34** ప్రవక్తా! వారు ఇంకా నిరీక్షిస్తున్నారా, వారికి ఇంకా మిగిలింది ఏమిటి, దైవదూతలు వచ్చెయ్యటమో లేదా నీ ప్రభువు తీర్పు జారీ కావటమో తప్ప? వారికి పూర్వం చాలామంది ఇలానే మొండిగా ప్రవర్తించారు. తరువాత వారి విషయంలో జరిగింది అల్లాహ్ చేసిన అన్యాయం కాదు. ఆ అన్యాయం వారిదే, దానిని వారు తమకు తామే చేసుకున్నారు. వారు చేసిన పనుల దుష్ఫలితాలు చివరకు వారినే పట్టుకున్నాయి. వారు ఎగతాళి చేస్తూ ఉండినదే వారిని చుట్టుముట్టింది.

**35 - 37** ఈ ముష్రిక్కులు ఇలా అంటారు: "అల్లాహ్ కోరి ఉన్నట్లయితే మేముగానీ మా తాత ముత్తాతలుగానీ ఆయనను తప్ప మరెవ్వరినీ ఆరాధించి ఉండేవారము కాదు. ఆయన ఆజ్ఞ లేకుండా ఏ వస్తువునూ నిషేధించి ఉండేవారము కూడా కాదు." ఇటువంటి సాకులనే వారికి పూర్వం వారు కూడా చెప్పేవారు. అయితే విషయాన్ని స్పష్టంగా అందజేసే బాధ్యత తప్ప మరొక బాధ్యత కూడా ప్రవక్తలపై ఏదైనా ఉందా? మేము ప్రతి జాతిలోనూ ఒక ప్రవక్తను ప్రభవింపజేశాము. అతని ద్వారా అందరికీ ఇలా హెచ్చరిక చేశాము: "అల్లాహ్‌ను ఆరాధించండి. మిథ్యా దైవాల ఆరాధనకు దూరంగా ఉండండి." దాని తరువాత అల్లాహ్ వారిలో కొందరికి సన్మార్గాన్ని ప్రసాదించాడు. మరికొందరిని అపమార్గం లోగొన్నది. కొంచెం భువిలో సంచారంచేసి చూడండి, తిరస్కారులకు ఏ గతి పట్టిందో - ప్రవక్తా! వారికి సన్మార్గం లభించాలని నీవు ఎంతగా కోరుకున్నా అల్లాహ్ తాను అపమార్గం పట్టించే వాడికి మళ్ళీ సన్మార్గం చూపడు. అటువంటి వారికి ఎవరూ సహాయం చేయలేరు.

**38 - 40** వీరు అల్లాహ్ పేరుతో దృఢమైన ప్రమాణాలు చేసి ఇలా చెబుతారు: "చనిపోయినవాణ్ణి ఎవణ్ణీ అల్లాహ్ మళ్ళీ బ్రతికించి లేపడు."- ఎందుకు లేపడు? ఇది ఆయన చేసిన ఒక వాగ్దానం. దానిని నెరవేర్చటాన్ని ఆయన తన విధిగా చేసుకున్నాడు. కాని చాలామందికి ఆ విషయం తెలియదు. అలా తప్పకుండా జరగాలి; ఎందుకంటే వారి ముందు అల్లాహ్ వారు విభేదిస్తూ ఉన్నటువంటి యథార్థాన్ని బహిర్గతం చెయ్యటానికి, సత్యతిరస్కారులు తాము అబద్ధీకులమని తెలుసుకోవటానికి. (ఇక అది సంభవించే విషయాన్ని గురించి) ఒక వస్తువును ఉనికిలోనికి తీసుకురావటానికి, దానిని 'అయిపో' అని ఆజ్ఞాపిస్తే చాలు, వెంటనే అది అయి పోతుంది. అంతకంటే ఎక్కువ చేయవలసిన అవసరం మాకు లేదు.

**41 - 42** దౌర్జన్యాన్ని అనుభవించిన తరువాత అల్లాహ్ కోసం వలసపోయిన వారికి మేము ప్రపంచంలో తప్పకుండా మంచి నివాసాన్ని ఇస్తాము. పరలోక ప్రతిఫలమైతే ఇంతకంటే గొప్పగా ఉంటుంది,[8] సహనం చూపినటువంటి, తమ ప్రభువుపై నమ్మకంతో పనిచేస్తున్నటువంటి బాధితులు (ఎంతో చక్కని ముగింపు తమ కొరకు వేచి చూస్తోందని) తెలుసుకుంటే ఎంత బాగుండును!

**43 - 44** ప్రవక్తా! మేము నీకు పూర్వం కూడా ప్రవక్తలను పంపినపుడల్లా మానవులనే ప్రవక్తలుగా పంపాము. వారివైపు నకు మేము మా సందేశాలను వహీ ద్వారా పంపుతూ ఉండే వారము. మీకు (మక్కావాసులు) తెలియకపోతే జ్ఞాపిక కలవారిని అడగండి.[9] పూర్వపు ప్రవక్తలను కూడా మేము స్పష్టమైన నిదర్శనాలతోనూ, గ్రంథాలతోనూ పంపివున్నాము. ఇప్పుడు ఈ జ్ఞాపికను నీ (ప్రవక్త)పై అవతరింపజేశాము, నీవు ప్రజల ముందు వారికోసం అవతరింపజేయబడిన ఉపదేశాన్ని స్పష్టంగా వివరించటానికీ[10] (స్వయంగా) ప్రజలు కూడా ఆలోచించటానికీ.

**45 - 47** (ప్రవక్త సందేశానికి వ్యతిరేకంగా) అత్యంత దుష్ట పన్నాగాలను పన్నుతున్న వారిని అల్లాహ్ భూమిలో దిగబడి పోయేలా చేస్తాడనీ లేదా వారికి అనుమానం కూడా కలుగని దిక్కునుండి వారిపైకి శిక్షను తీసుకు వస్తాడనీ, లేదా వారు తిరుగాడుతూ ఉన్నప్పుడు అకస్మాత్తుగా పట్టుకుంటాడనీ, లేదా రాబోయే ఆపదను గురించి భయపడి దానినుండి తప్పించుకోవటానికి వారు జాగ్రత్త పడుతున్న స్థితిలో వారిని పట్టుకుంటాడనీ వారికి ఏమాత్రం భయం లేకుండా పోయిందా? ఆయన ఏమి చేయదలచుకున్నా, వారు మాత్రం ఆయనను అశక్తుడుగా చేయలేరు. వాస్తవం ఏమిటంటే, నీ ప్రభువు మృదు హృదయుడూ, కరుణామయుడూను.

وَ الَّذِيْنَ هَاجَرُوْا فِي اللّٰهِ مِنْۢ بَعْدِ مَا ظُلِمُوْا
لَنُبَوِّئَنَّهُمْ فِي الدُّنْيَا حَسَنَةً ؕ وَ لَاَجْرُ
الْاٰخِرَةِ اَكْبَرُ ۘ لَوْ كَانُوْا يَعْلَمُوْنَ ﴿٤١﴾ الَّذِيْنَ وقف لازم
صَبَرُوْا وَ عَلٰى رَبِّهِمْ يَتَوَكَّلُوْنَ ﴿٤٢﴾ وَ مَاۤ
اَرْسَلْنَا مِنْ قَبْلِكَ اِلَّا رِجَالًا نُّوْحِيْۤ اِلَيْهِمْ
فَسْـَٔلُوْۤا اَهْلَ الذِّكْرِ اِنْ كُنْتُمْ لَا تَعْلَمُوْنَ ﴿٤٣﴾ۙ
بِالْبَيِّنٰتِ وَ الزُّبُرِ ؕ وَ اَنْزَلْنَاۤ اِلَيْكَ الذِّكْرَ
لِتُبَيِّنَ لِلنَّاسِ مَا نُزِّلَ اِلَيْهِمْ وَ لَعَلَّهُمْ
يَتَفَكَّرُوْنَ ﴿٤٤﴾ اَفَاَمِنَ الَّذِيْنَ مَكَرُوا السَّيِّاٰتِ الصف
اَنْ يَّخْسِفَ اللّٰهُ بِهِمُ الْاَرْضَ اَوْ يَاْتِيَهُمُ
الْعَذَابُ مِنْ حَيْثُ لَا يَشْعُرُوْنَ ﴿٤٥﴾ۙ اَوْ
يَاْخُذَهُمْ فِيْ تَقَلُّبِهِمْ فَمَا هُمْ بِمُعْجِزِيْنَ ﴿٤٦﴾ۙ
اَوْ يَاْخُذَهُمْ عَلٰى تَخَوُّفٍ ؕ فَاِنَّ رَبَّكُمْ لَرَءُوْفٌ
رَّحِيْمٌ ﴿٤٧﴾

8. అవిశ్వాసులు పెట్టిన బాధలకు తట్టుకోలేక హబష్ (అబిసీనియా) వైపునకు వలసపోయిన ముస్లిములు ఇక్కడ సూచించబడ్డారు.

9. అంటే, ఆకాశ గ్రంథాల జ్ఞానం కలవారిని అడగండి, దైవప్రవక్తలు మానవులేనా లేక మరొకరెవరైనానా అని.

10. అంటే, మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్)పై గ్రంథం ఎందుకు అవతరింప జెయ్యబడిందంటే, ఆయన తమ వాక్కు ద్వారా, తమ కర్మ ద్వారా, దాని ఉపదేశాలను దాని ఆదేశాలను వివరించి విశదపరచటానికి మహా ప్రవక్త (సఅసమ్) సంప్రదాయం (సున్నత్) ఖురాను యొక్క ప్రామాణికమైన అధికారిక వివరణ అని దీనిద్వారా నిరూపితమవుతోంది.

اَوَلَمۡ يَرَوۡا اِلٰى مَا خَلَقَ اللّٰهُ مِنۡ شَىۡءٍ
يَّتَفَيَّؤُا ظِلٰلُهٗ عَنِ الۡيَمِيۡنِ وَ الشَّمَآئِلِ سُجَّدًا
لِّلّٰهِ وَ هُمۡ دٰخِرُوۡنَ ﴿٤٨﴾ وَ لِلّٰهِ يَسۡجُدُ مَا فِى
السَّمٰوٰتِ وَ مَا فِى الۡاَرۡضِ مِنۡ دَآبَّةٍ وَّ
الۡمَلٰٓئِكَةُ وَ هُمۡ لَا يَسۡتَكۡبِرُوۡنَ ﴿٤٩﴾ يَخَافُوۡنَ
رَبَّهُمۡ مِّنۡ فَوۡقِهِمۡ وَ يَفۡعَلُوۡنَ مَا يُؤۡمَرُوۡنَ ۩ ﴿٥٠﴾ السجدة ٣ ع ١٢
وَقَالَ اللّٰهُ لَا تَتَّخِذُوۡۤا اِلٰهَيۡنِ اثۡنَيۡنِ ۚ اِنَّمَا
هُوَ اِلٰهٌ وَّاحِدٌ ۚ فَاِيَّاىَ فَارۡهَبُوۡنِ ﴿٥١﴾ وَ لَهٗ مَا
فِى السَّمٰوٰتِ وَا لۡاَرۡضِ وَ لَهُ الدِّيۡنُ وَاصِبًا ؕ
اَفَغَيۡرَ اللّٰهِ تَتَّقُوۡنَ ﴿٥٢﴾ وَ مَا بِكُمۡ مِّنۡ نِّعۡمَةٍ
فَمِنَ اللّٰهِ ثُمَّ اِذَا مَسَّكُمُ الضُّرُّ فَاِلَيۡهِ
تَجۡـَٔرُوۡنَ ۚ ﴿٥٣﴾ ثُمَّ اِذَا كَشَفَ الضُّرَّ عَنۡكُمۡ اِذَا
فَرِيۡقٌ مِّنۡكُمۡ بِرَبِّهِمۡ يُشۡرِكُوۡنَ ﴿٥٤﴾ لِيَكۡفُرُوۡا بِمَاۤ
اٰتَيۡنٰهُمۡ ؕ فَتَمَتَّعُوۡا ۗ فَسَوۡفَ تَعۡلَمُوۡنَ ﴿٥٥﴾
وَيَجۡعَلُوۡنَ لِمَا لَا يَعۡلَمُوۡنَ نَصِيۡبًا مِّمَّا
رَزَقۡنٰهُمۡ ؕ تَاللّٰهِ لَتُسۡـَٔـلُنَّ عَمَّا كُنۡتُمۡ
تَفۡتَرُوۡنَ ﴿٥٦﴾

**48 - 50** వారు అల్లాహ్‌చే సృష్టింపబడిన ఏ వస్తువునూ గమనించరా, అది అల్లాహ్ సాన్నిధ్యంలో సాష్టాంగపడుతూ తన నీడను కుడి వైపునకూ ఎడమ వైపునకూ ఎలా తిప్పుతూ ఉంటుందో?[11] ఈ విధంగా అన్నీ వినమ్రతను ప్రదర్శిస్తు న్నాయి. భూమిలోనూ ఆకాశాలలోనూ ఉన్న సమస్త జీవ రాసులూ, సర్వ దైవదూతలూ అల్లాహ్ ముందు సాష్టాంగపడు తున్నారు. వారు ఎంతమాత్రం తలబిరుసుతనంతో ప్రవర్తిం చరు. తమపైన ఉన్న ప్రభువునకు భయపడతారు. తమకు ఇవ్వబడిన ఆదేశం ప్రకారమే పని చేస్తారు.

**51 - 52** అల్లాహ్ ఇలా ఆజ్ఞాపించాడు:"ఇద్దరిని దేవుళ్ళుగా చేసుకోకండి.[12] దేవుడు మటుకు ఒక్కడే. కనుక మీరు నాకే భయపడండి." ఆకాశాలలో ఉన్నదంతా, భూమిలో ఉన్నదంతా ఆయనదే. కేవలం ఆయన ధర్మం మాత్రమే (సృష్టిలో అంతటా) అనుసరింపబడుతోంది.[13] అలాంటప్పుడు, మీరు అల్లాహ్‌ను కాదని మరొకరికి భయపడతారా?

**53 - 55** మీకు లభించిన అనుగ్రహం ఏదైనా అది అల్లాహ్ తరపు నుండే లభించినది. మీకేదైనా గడ్డుకాలం దాపురించి నప్పుడు మీరు మీ మొరలతో ఆయన వైపునకే పరుగెడతారు. కాని అల్లాహ్ ఆ గడ్డుకాలాన్ని తొలగించినప్పుడు (ఈ కనికరానికి కృతజ్ఞతగా) మీలో ఒక వర్గం ఒక్కసారిగా తన ప్రభువునకు ఇతరులను భాగస్వాములుగా చెయ్యటం ప్రారం భిస్తుంది, అల్లాహ్ చేసిన ఉపకారానికి కృతఘ్నుతగా. సరే, మంచిది, సుఖాలను అనుభవించండి. త్వరలోనే మీకు తెలిసి పోతుంది.

**56** ఎవరిని గురించి వీరు ఏమాత్రమూ ఎరుగరో వారికి, మేము ఇచ్చిన ఉపాధిలో భాగాలను నిర్ణయిస్తారు. దేవుని తోడు, ఈ అబద్ధాన్ని మీరు ఎలా కల్పించారు? అని మిమ్మల్ని తప్పనిసరిగా అడగటం జరుగుతుంది.

11. అంటే, శరీరంకల అన్ని వస్తువుల నీడలు పర్వతాల, వృక్షాల, పశువుల, మానవుల నీడలు సమస్తమూ ఒక సమగ్రమైన శాసనానికి కట్టుబడి ఉన్నాయి అనే విషయానికి సంకేతంగా ఉన్నాయి. వాటి నుదుటిపై దైవ దాస్యపు గురుతు ఏర్పడి ఉంటుంది. దేవుని దైవత్వంలో వాటికి ఏమాత్రం భాగం లేదు. నీడ పడటం అనేది ఒక వస్తువు భౌతికమైనది అని అనటానికి ప్రత్యక్ష నిదర్శనం. భౌతికమైనవి కావటం అనేది అవి దాస్యం చేసేవీ, సృష్టింపబడినటువంటివీ అని చెప్పటానికి ప్రత్యక్ష తార్కాణం.

وَ يَجْعَلُوْنَ لِلّٰهِ الْبَنٰتِ سُبْحٰنَهٗ ۙ وَلَهُمْ مَّا
يَشْتَهُوْنَ ﴿٥٧﴾ وَ اِذَا بُشِّرَ اَحَدُهُمْ بِالْاُنْثٰى
ظَلَّ وَجْهُهٗ مُسْوَدًّا وَّ هُوَ كَظِيْمٌ ﴿٥٨﴾ يَتَوَارٰى
مِنَ الْقَوْمِ مِنْ سُوْٓءِ مَا بُشِّرَ بِهٖ ؕ اَيُمْسِكُهٗ
عَلٰى هُوْنٍ اَمْ يَدُسُّهٗ فِى التُّرَابِ ؕ اَلَا سَآءَ
مَا يَحْكُمُوْنَ ﴿٥٩﴾ لِلَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ
مَثَلُ السَّوْءِ ۚ وَ لِلّٰهِ الْمَثَلُ الْاَعْلٰى ؕ وَ هُوَ
الْعَزِيْزُ الْحَكِيْمُ ﴿٦٠﴾ وَ لَوْ يُؤَاخِذُ اللّٰهُ النَّاسَ
بِظُلْمِهِمْ مَّا تَرَكَ عَلَيْهَا مِنْ دَآبَّةٍ وَّ لٰكِنْ
يُّؤَخِّرُهُمْ اِلٰٓى اَجَلٍ مُّسَمًّى ۚ فَاِذَا جَآءَ
اَجَلُهُمْ لَا يَسْتَاْخِرُوْنَ سَاعَةً وَّ لَا
يَسْتَقْدِمُوْنَ ﴿٦١﴾ وَيَجْعَلُوْنَ لِلّٰهِ مَا يَكْرَهُوْنَ
وَتَصِفُ اَلْسِنَتُهُمُ الْكَذِبَ اَنَّ لَهُمُ الْحُسْنٰى ؕ لَا
جَرَمَ اَنَّ لَهُمُ النَّارَ وَ اَنَّهُمْ مُّفْرَطُوْنَ ﴿٦٢﴾ تَاللّٰهِ
لَقَدْ اَرْسَلْنَآ اِلٰٓى اُمَمٍ مِّنْ قَبْلِكَ فَزَيَّنَ لَهُمُ
الشَّيْطٰنُ اَعْمَالَهُمْ فَهُوَ وَلِيُّهُمُ الْيَوْمَ وَ لَهُمْ
عَذَابٌ اَلِيْمٌ ﴿٦٣﴾ وَمَآ اَنْزَلْنَا عَلَيْكَ الْكِتٰبَ
اِلَّا لِتُبَيِّنَ لَهُمُ الَّذِى اخْتَلَفُوْا فِيْهِ ۙ وَ هُدًى
وَّ رَحْمَةً لِّقَوْمٍ يُّؤْمِنُوْنَ ﴿٦٤﴾

**57 - 60** వారు దేవునికి కూతుళ్ళను కల్పిస్తారు.[14] అల్లాహ్ పరిశుద్ధుడు. తమ కోసమేమో వారు స్వయంగా కోరుకున్నదా?[15] వారిలో ఎవడికైనా కూతురు పుట్టినదనే శుభవార్తను అందజేస్తే అతడి ముఖాన్ని నల్లని ఛాయలు ఆవరిస్తాయి. అతడు లోలోన కుమిలిపోతాడు. ఈ దుర్వార్త విన్న తరువాత ఇక లోకులకు ఎలా ముఖం చూపాలి అని అతడు నక్కి నక్కి తిరుగుతూ ఉంటాడు. అవమానాన్ని భరిస్తూ కూతుర్ని ఇంట్లో ఉంచుకోవాలా లేక ఆమెను మట్టిలో పాతి పెట్టాలా? అని ఆలోచిస్తాడు-చూడు! వారు దేవుని విషయంలో చేసే నిర్ణయాలు ఎంత దుష్టమైనవో![16] పరలోకాన్ని విశ్వసించని వారే, చెడుగుణాలు ఆరోపింపదగినవారు. ఇక అల్లాహ్-ఆయనకు అందరికంటే ఉన్నతమైన గుణాలు ఉన్నాయి. ఆయనే అందరిపై ప్రాబల్యం కలవాడు. వివేకంలో పరిపూర్ణుడూనూ.

**61 - 62** ఒకవేళ అల్లాహ్ ప్రజలను వారి మితిమీరిన ప్రవర్తనకు వెంటనే పట్టుకోదలిస్తే, భూమిపై ఏ ప్రాణినీ వదలిపెట్టడు. కాని ఆయన అందరికీ ఒక నిర్ణీత కాలం వరకు గడువు ఇస్తాడు. ఆ కాలం వచ్చేసినప్పుడు, అది ఒక్క గడియ కూడా వెనుకా ముందూ కాజాలదు. ఈనాడు వారు అల్లాహ్ కోసం తాము తమ కోసం ఇష్టపడని వస్తువులను కల్పిస్తున్నారు. తమకోసం ఉన్నదంతా శుభమే అని వారి నాలుకలు అబద్ధం పలుకుతున్నాయి. వారికోసం ఉన్నది ఒకే ఒక వస్తువు, అది నరకాగ్ని. వారు అందరికంటే ముందు అందులోకి తప్పని సరిగా పంపబడతారు.

**63 - 64** దేవునితోడు, ప్రవక్తా! నీకు పూర్వం కూడా ఎన్నో జాతుల వద్దకు మేము ప్రవక్తలను పంపి వున్నాము. (పూర్వం కూడా ఇలాగే జరుగుతూ ఉండేది) షైతాన్ వారి చెడ్డపనులను వారికి మనోహరమైనవిగా చేసి చూపాడు. (కాబట్టి ప్రవక్తల మాటను వారు నమ్మలేదు) ఆ షైతానే ఈనాడు వీరికి కూడా సంరక్షకుడై కూర్చున్నాడు. వీరు వేదనా భరితమైన శిక్షకు అర్హులవుతున్నారు. మేము ఈ గ్రంథాన్ని నీపై ఎందుకు అవతరింప జేశామంటే, వారు గురిఅయిన విభేదాల యథార్థాన్ని నీవు వారికి స్పష్టం చెయ్యాలని. ఈ గ్రంథం తనను విశ్వసించే వారికోసం మార్గదర్శకత్వంగానూ, కారుణ్యంగానూ అవతరించింది.

وَاللّٰهُ اَنۡزَلَ مِنَ السَّمَآءِ مَآءً فَاَحۡيَا بِهِ
الۡاَرۡضَ بَعۡدَ مَوۡتِهَا ؕ اِنَّ فِىۡ ذٰلِكَ لَاٰيَةً
لِّقَوۡمٍ يَّسۡمَعُوۡنَ ﴿۶۵﴾ وَاِنَّ لَـكُمۡ فِى الۡاَنۡعَامِ ع ۸ ۱۴
لَعِبۡرَةً ؕ نُسۡقِيۡكُمۡ مِّمَّا فِىۡ بُطُوۡنِهٖ مِنۡۢ بَيۡنِ
فَرۡثٍ وَّدَمٍ لَّبَنًا خَالِصًا سَآئِغًا لِّلشّٰرِبِيۡنَ ﴿۶۶﴾
وَمِنۡ ثَمَرٰتِ النَّخِيۡلِ وَالۡاَعۡنَابِ تَتَّخِذُوۡنَ
مِنۡهُ سَكَرًا وَّرِزۡقًا حَسَنًا ؕ اِنَّ فِىۡ ذٰلِكَ
لَاٰيَةً لِّقَوۡمٍ يَّعۡقِلُوۡنَ ﴿۶۷﴾ وَاَوۡحٰى رَبُّكَ اِلَى
النَّحۡلِ اَنِ اتَّخِذِىۡ مِنَ الۡجِبَالِ بُيُوۡتًا وَّمِنَ
الشَّجَرِ وَمِمَّا يَعۡرِشُوۡنَ ﴿۶۸﴾ ثُمَّ كُلِىۡ مِنۡ كُلِّ
الثَّمَرٰتِ فَاسۡلُكِىۡ سُبُلَ رَبِّكِ ذُلُلًا ؕ يَخۡرُجُ مِنۡۢ
بُطُوۡنِهَا شَرَابٌ مُّخۡتَلِفٌ اَلۡوَانُهٗ فِيۡهِ شِفَآءٌ
لِّلنَّاسِ ؕ اِنَّ فِىۡ ذٰلِكَ لَاٰيَةً لِّقَوۡمٍ يَّتَفَكَّرُوۡنَ ﴿۶۹﴾

**65** (మీరు ప్రతి వర్షాకాలంలోనూ చూస్తారు), అల్లాహ్ ఆకాశం నుండి నీళ్ళను కురిపించాడు. నిర్జీవంగా పడివున్న భూమిలో ఒక్కసారిగా దాని ద్వారా ప్రాణం పోశాడు.[17] నిశ్చయంగా ఇందులో వినేవారికి ఒక నిదర్శనం ఉన్నది.

**66** మీకు పశువులలో కూడా ఒక గుణపాఠం ఉన్నది. వాటి గర్భంలో పేడ, రక్తానికి మధ్య ఉన్న ఒక వస్తువును మేము మీకు త్రాగిస్తాము. అంటే స్వచ్ఛమైన పాలు. అది త్రాగేవారికి ఎంతో కమ్మనిది.

**67** (ఇదేవిధంగా) ఖర్జూరపు చెట్లు, ద్రాక్ష తీగెల నుండి కూడా మేము ఒక పదార్థాన్ని మీకు త్రాగిస్తాము. దానిని మీరు మత్తు పానీయంగా కూడా చేసుకుంటారు, పరిశుద్ధమైన ఆహారంగా కూడా.[18] బుద్ధిని ఉపయోగించే వారికి ఇందులో నిశ్చయంగా ఒక సూచన ఉంది.

**68 - 69** చూడండి, మీ ప్రభువు తేనెటీగకు వహీద్వారా ఈ విషయాన్ని తెలిపాడు.[19] "కొండలలో, చెట్లమీద, తడికలపై ఎక్కించబడిన తీగెలలో నీ తెట్టెలను నిర్మించుకో, అన్ని రకాల పండ్లరసాన్ని పీల్చు, నీ ప్రభువు సుగమం చేసిన మార్గాలపై నడుస్తూ ఉండు." ఈ ఈగ కడుపులో నుండి రంగు రంగుల పానకం ఒకటి వెలువడుతుంది. అందులో ప్రజల కోసం వ్యాధి నివారణ శక్తి ఉన్నది. ఆలోచించేవారికి ఇందులో కూడా నిశ్చయంగా ఒక సూచన ఉంది.

---

12. "ఇద్దరిని దేవుళ్ళుగా చేసుకోకండి" అని అనటంలో ఎక్కువమంది దేవుళ్ళను ఆరాధించకండి అనే విషయం అంతర్లీనమై ఉన్నది.
13. అంటే, ఆయనపట్ల విధేయత చూపటంపైననే విశ్వకర్మాగార వ్యవస్థ మొత్తం ఆధారపడి ఉన్నది.
14. అరేబియా ముష్రిక్కులు ఆరాధించే దైవాలలో మగదైవాలు తక్కువ, ఆడ దైవాలు ఎక్కువ. ఆడ దైవాలు దేవుని కుమార్తెలని వారి విశ్వాసం. అట్లే దైవదూతలను కూడా వారు దేవుని కుమార్తెలుగా పరిగణించేవారు.
15. అంటే కొడుకులు అని భావం.
16. అంటే, మీరు తమకు అవమానకరమైనదిగా భావించే కూతురునే నిస్సంకోచంగా దేవునికి కూతురుగా ప్రతిపాదిస్తారు.
17. అంటే, మీ కళ్ళు ప్రతి సంవత్సరమూ ఈ దృశ్యాన్ని చూస్తాయి : భూమి బీడుగా పడివున్నది. జీవం ఉన్న సూచనలు ఏమాత్రమూ లేవు. గడ్డీ గాదం పెరగలేదు. చెట్లూ చేమలూ లేవు. మొక్కలూ మొలకలూ లేవు. పూలూ లేవు. మొగ్గలూ లేవు. పురుగూ పుట్రా లేవు. ఇంతలోనే వర్షరుతువు వచ్చింది. ఒకటీ రెండు చినుకులు పడగానే అదే భూమిలో జీవం తొణికిసలాడింది. భూమి పొరలలో అణగివున్న అసంఖ్యాకమైన వేళ్ళు అకస్మాత్తుగా బ్రతికాయి. ప్రతి వేరులో నుండి, పూర్వం కురిసిన వర్షంలో మొలిచి పెరిగి చచ్చిన చెట్లు చేమలే మళ్ళీ

وَ اللّٰهُ خَلَقَكُمْ ثُمَّ يَتَوَفّٰىكُمْ ۙ وَ مِنْكُمْ مَّنْ
يُّرَدُّ اِلٰۤى اَرْذَلِ الْعُمُرِ لِكَيْ لَا يَعْلَمَ بَعْدَ عِلْمٍ
شَيْـًٔا ؕ اِنَّ اللّٰهَ عَلِيْمٌ قَدِيْرٌ ﴿٧٠﴾ وَ اللّٰهُ فَضَّلَ ع ١٥
بَعْضَكُمْ عَلٰى بَعْضٍ فِي الرِّزْقِ ۚ فَمَا الَّذِيْنَ
فُضِّلُوْا بِرَآدِّيْ رِزْقِهِمْ عَلٰى مَا مَلَكَتْ
اَيْمَانُهُمْ فَهُمْ فِيْهِ سَوَآءٌ ؕ اَفَبِنِعْمَةِ اللّٰهِ
يَجْحَدُوْنَ ﴿٧١﴾ وَ اللّٰهُ جَعَلَ لَكُمْ مِّنْ اَنْفُسِكُمْ
اَزْوَاجًا وَّجَعَلَ لَكُمْ مِّنْ اَزْوَاجِكُمْ بَنِيْنَ
وَحَفَدَةً وَّ رَزَقَكُمْ مِّنَ الطَّيِّبٰتِ ؕ اَفَبِالْبَاطِلِ
يُؤْمِنُوْنَ وَ بِنِعْمَتِ اللّٰهِ هُمْ يَكْفُرُوْنَ ﴿٧٢﴾
وَيَعْبُدُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ مَا لَا يَمْلِكُ لَهُمْ
رِزْقًا مِّنَ السَّمٰوٰتِ وَالْاَرْضِ شَيْـًٔا وَّ لَا
يَسْتَطِيْعُوْنَ ﴿٧٣﴾ فَلَا تَضْرِبُوْا لِلّٰهِ الْاَمْثَالَ ؕ اِنَّ
اللّٰهَ يَعْلَمُ وَ اَنْتُمْ لَا تَعْلَمُوْنَ ﴿٧٤﴾ ضَرَبَ اللّٰهُ
مَثَلًا عَبْدًا مَّمْلُوْكًا لَّا يَقْدِرُ عَلٰى شَيْءٍ وَّ مَنْ
رَّزَقْنٰهُ مِنَّا رِزْقًا حَسَنًا فَهُوَ يُنْفِقُ مِنْهُ سِرًّا
وَّجَهْرًا ؕ هَلْ يَسْتَوٗنَ ؕ اَلْحَمْدُ لِلّٰهِ ؕ بَلْ
اَكْثَرُهُمْ لَا يَعْلَمُوْنَ ﴿٧٥﴾ وَضَرَبَ اللّٰهُ مَثَلًا
رَّجُلَيْنِ اَحَدُهُمَاۤ اَبْكَمُ لَا يَقْدِرُ عَلٰى شَيْءٍ وَّ
هُوَ كَلٌّ عَلٰى مَوْلٰىهُ ۙ اَيْنَمَا يُوَجِّهْهُّ لَا يَاْتِ
بِخَيْرٍ ؕ هَلْ يَسْتَوِيْ هُوَ ۙ وَ مَنْ يَّاْمُرُ
بِالْعَدْلِ ۙ وَ هُوَ عَلٰى صِرَاطٍ مُّسْتَقِيْمٍ ﴿٧٦﴾ ع ١٦

**70** చూడండి, అల్లాహ్ మిమ్మల్ని పుట్టించాడు. తరువాత ఆయన మీకు మృత్యువును కలుగజేస్తాడు. మీలో ఒకడు అతి నికృష్టమైన వయస్సుకు చేర్చబడతాడు, అంతా తెలిసిన తరువాత కూడా ఏమీ తెలియనివాడుగా అయ్యేందుకు. సత్యం ఏమిటంటే అల్లాహ్ మాత్రమే జ్ఞానంలో కూడా పరిపూర్ణుడు, శక్తిలో కూడా.

**71** చూడండి, అల్లాహ్ మీలో కొందరికి కొందరికంటె జీవన సామగ్రి విషయంలో ఆధిక్యం ప్రసాదించాడు. అయితే ఈ ఆధిక్యం ఇవ్వబడిన వారు తమ జీవన సామగ్రిని తమ బానిసల వైపునకు మళ్ళించరు కదా? వారు ఇద్దరూ ఈ జీవన సామగ్రిలో సమాన భాగస్తులు అయ్యేటందుకు. అల్లాహ్ ఉపకారాన్నే ఒప్పుకోవటానికి వారు తిరస్కరిస్తున్నారా?[20]

**72 - 74** అల్లాహ్‌యే మీ కోసం మీ జాతినుండే భార్యలను చేశాడు. ఆయనే ఆ భార్యల ద్వారా మీకు కుమారులను, మనుమలను ప్రసాదించాడు. మంచి మంచి వస్తువులను మీకు తినటానికి ఇచ్చాడు. అయితే వారు (ఇదంతా చూస్తూ కూడా ఇదంతా తెలిసికూడా) అసత్యాన్నే విశ్వసిస్తున్నారా![21] అల్లాహ్ ఉపకారాన్నే తిరస్కరిస్తున్నారా? అల్లాహ్‌ను వదలిపెట్టి ఆకాశాల నుండిగానీ, భూమినుండిగానీ వారికి ఆహారం ఇవ్వనటువంటి వారిని ఆ పని చెయ్యగల శక్తి లేనివారినీ పూజిస్తున్నారా? కనుక అల్లాహ్‌కు పోలికలను కల్పించకండి.[22] అల్లాహ్ ఎరుగును, మీరెరుగరు.

**75** అల్లాహ్ ఒక ఉదాహరణను ఇస్తున్నాడు: ఒకడేమో బానిస-ఇతరుల యాజమాన్యంలో ఉన్నవాడు, స్వయంగా ఏ అధికారమూ లేనివాడు. ఇక రెండోవాడు-అతనికి మేము మా తరఫు నుండి మంచి ఉపాధిని ప్రసాదించాము, అతడు అందులో నుండి బహిరంగంగానూ, రహస్యంగానూ బాగా ఖర్చు చేస్తాడు. చెప్పండి, వారు ఇద్దరూ సమానులేనా? - అల్ హమ్‌దులిల్లాహ్[23] (స్తోత్రం అల్లాహ్ కొరకే). కాని అనేకులు (ఈ సామాన్య విషయాన్ని) ఎరుగరు.

**76** అల్లాహ్ మరొక ఉదాహరణను ఇస్తున్నాడు: ఇద్దరు మనుషులున్నారు. ఒకడు మూగవాడు, చెవిటివాడు. ఏ పనీ చెయ్యలేడు. తన యజమానికి భారమై కూర్చున్నాడు. ఆయన అతన్ని ఎక్కడకు పంపినా అతనివల్ల మంచి పని ఏదీ జరుగదు. ఇక రెండో మనిషి - అతడు న్యాయం చెయ్యండి అని ఆజ్ఞాపిస్తాడు. స్వయంగా సన్మార్గంలో స్థిరంగా ఉన్నాడు. చెప్పండి, వారు ఇద్దరూ సమానులేనా?

**77** భూమిలోనూ ఆకాశాలలోనూ దాగివున్న యథార్థాల జ్ఞానం అల్లాహ్‌కు మాత్రమే ఉన్నది. ప్రళయం సంభవించటానికి ఎంతోసేపు పట్టదు, కేవలం రెప్పపాటు కాలం తప్ప. ఇంకా దానికంటే కూడా కొంచెం తక్కువే – యథార్థమేమిటంటే, అల్లాహ్ అన్నీ చెయ్యగల సమర్థుడు.

**78** అల్లాహ్ మిమ్మల్ని మీ మాతృగర్భాల నుండి మీరు ఏమీ ఎరుగని స్థితిలో ఉండగా బయటికి తీశాడు. ఆయన మీకు చెవులు ఇచ్చాడు. కళ్ళు ఇచ్చాడు. ఆలోచించే మనస్సూ ఇచ్చాడు– మీరు కృతజ్ఞులు కావాలని.

**79** గగనమండలంలో భద్రంగా విహరించే పక్షులను వారు ఎన్నడూ చూడలేదా? అల్లాహ్ తప్ప వాటిని క్రిందపడకుండా నిలిపి ఉంచినదెవరు? విశ్వాసులకు ఇందులో చాలా నిదర్శనాలు ఉన్నాయి.

**80 - 83** అల్లాహ్ మీకోసం మీ గృహాలను శాంతినీ, విశ్రాంతినీ ఇచ్చే స్థలాలుగా తీర్చిదిద్దాడు. పశువుల చర్మాలతో ఆయన మీ కోసం ఇళ్ళను చేశాడు. మీరు ప్రయాణంలో ఉన్నప్పుడూ బసచేసినప్పుడూ ఈ రెండు స్థితులలోనూ అవి మీకు తేలికగా ఉంటాయి.[24] పశువుల మృదు రోమాలతోనూ, ఉన్నితోనూ, వెంట్రుకలతోనూ మీ కోసం తొడుక్కునే వస్తువులనూ, వాడుకునే వస్తువులనూ ఎన్నింటినో సృష్టించాడు. అవి జీవిత కాలం అంతా మీకు పనికొస్తాయి. ఆయన తనచే సృష్టింపబడిన ఎన్నో వస్తువులతో మీకోసం నీడను ఏర్పాటు చేశాడు. పర్వతాలలో మీకోసం ఆశ్రయ స్థలాలను నిర్మించాడు. మిమ్మల్ని వేడిమినుండి కాపాడే దుస్తులనూ, యుద్ధ రంగాలలో మిమ్మల్ని రక్షించే కవచాలనూ మీకు ప్రసాదించాడు. ఈ విధంగా ఆయన తన అనుగ్రహాలను మీకు పూర్తిగా ప్రసాదిస్తాడు, మీరు విధేయులౌతారేమో అని. ఇక, వారు ఒకవేళ విముఖులైతే, ప్రవక్తా! సత్యసందేశాన్ని స్పష్టంగా అందజెయ్యటం తప్ప నీపై మరొక బాధ్యత లేదు. వారు అల్లాహ్ ఉపకారాన్ని గుర్తిస్తారు. అయినా దాన్ని తిరస్కరిస్తారు. వారిలో చాలామంది సత్యాన్ని స్వీకరించటానికి సిద్ధంగా లేరు.

وَ لِلّٰهِ غَیْبُ السَّمٰوٰتِ وَالْاَرْضِ ؕ وَمَاۤ اَمْرُ
السَّاعَةِ اِلَّا كَلَمْحِ الْبَصَرِ اَوْ هُوَ اَقْرَبُ ؕ اِنَّ
اللّٰهَ عَلٰى كُلِّ شَیْءٍ قَدِیْرٌ ﴿۷۷﴾ وَ اللّٰهُ اَخْرَجَكُمْ
مِّنْۢ بُطُوْنِ اُمَّهٰتِكُمْ لَا تَعْلَمُوْنَ شَیْـًٔا ۙ
وَّجَعَلَ لَكُمُ السَّمْعَ وَالْاَبْصَارَ وَ الْاَفْـِٕدَةَ ۙ
لَعَلَّكُمْ تَشْكُرُوْنَ ﴿۷۸﴾ اَلَمْ یَرَوْا اِلَى الطَّیْرِ
مُسَخَّرٰتٍ فِیْ جَوِّ السَّمَآءِ ؕ مَا یُمْسِكُهُنَّ اِلَّا
اللّٰهُ ؕ اِنَّ فِیْ ذٰلِكَ لَاٰیٰتٍ لِّقَوْمٍ یُّؤْمِنُوْنَ ﴿۷۹﴾
وَ اللّٰهُ جَعَلَ لَكُمْ مِّنْۢ بُیُوْتِكُمْ سَكَنًا وَّجَعَلَ
لَكُمْ مِّنْ جُلُوْدِ الْاَنْعَامِ بُیُوْتًا تَسْتَخِفُّوْنَهَا
یَوْمَ ظَعْنِكُمْ وَ یَوْمَ اِقَامَتِكُمْ ۙ وَ مِنْ
اَصْوَافِهَا وَاَوْبَارِهَا وَ اَشْعَارِهَاۤ اَثَاثًا وَّ
مَتَاعًا اِلٰى حِیْنٍ ﴿۸۰﴾ وَاللّٰهُ جَعَلَ لَكُمْ مِّمَّا
خَلَقَ ظِلٰلًا وَّ جَعَلَ لَكُمْ مِّنَ الْجِبَالِ اَكْنَانًا وَّ
جَعَلَ لَكُمْ سَرَابِیْلَ تَقِیْكُمُ الْحَرَّ وَسَرَابِیْلَ
تَقِیْكُمْ بَاْسَكُمْ ؕ كَذٰلِكَ یُتِمُّ نِعْمَتَهٗ عَلَیْكُمْ
لَعَلَّكُمْ تُسْلِمُوْنَ ﴿۸۱﴾ فَاِنْ تَوَلَّوْا فَاِنَّمَا عَلَیْكَ
الْبَلٰغُ الْمُبِیْنُ ﴿۸۲﴾ یَعْرِفُوْنَ نِعْمَتَ اللّٰهِ ثُمَّ
یُنْكِرُوْنَهَا وَاَكْثَرُهُمُ الْكٰفِرُوْنَ ﴿۸۳﴾ ع ١٧

బయటపడ్డాయి. ఎండాకాలంలో నామరూపాలు కూడా లేకుండా పోయినటువంటి అసంఖ్యాకమయినటువంటి భూమిలోని క్రిమికీటకాలు హఠాత్తుగా, పూర్వం కురిసిన వర్షంలో కన్పించినట్లు అదే దర్పంతో మళ్ళీ

وَ يَوْمَ نَبْعَثُ مِنْ كُلِّ اُمَّةٍ شَهِيْدًا ثُمَّ لَا
يُؤْذَنُ لِلَّذِيْنَ كَفَرُوْا وَ لَا هُمْ يُسْتَعْتَبُوْنَ ﴿٨٤﴾
وَ اِذَا رَاَ الَّذِيْنَ ظَلَمُوا الْعَذَابَ فَلَا يُخَفَّفُ
عَنْهُمْ وَ لَا هُمْ يُنْظَرُوْنَ ﴿٨٥﴾ وَ اِذَا رَاَ الَّذِيْنَ
اَشْرَكُوْا شُرَكَآءَهُمْ قَالُوْا رَبَّنَا هٰٓؤُلَآءِ
شُرَكَآؤُنَا الَّذِيْنَ كُنَّا نَدْعُوْا مِنْ دُوْنِكَ ج
فَاَلْقَوْا اِلَيْهِمُ الْقَوْلَ اِنَّكُمْ لَكٰذِبُوْنَ ﴿٨٦﴾ ج وَ
اَلْقَوْا اِلَى اللّٰهِ يَوْمَئِذِنِ السَّلَمَ وَ ضَلَّ عَنْهُمْ مَّا
كَانُوْا يَفْتَرُوْنَ ﴿٨٧﴾ اَلَّذِيْنَ كَفَرُوْا وَ صَدُّوْا
عَنْ سَبِيْلِ اللّٰهِ زِدْنٰهُمْ عَذَابًا فَوْقَ الْعَذَابِ
بِمَا كَانُوْا يُفْسِدُوْنَ ﴿٨٨﴾

الثلثة

**84 - 88** (ఆ రోజున ఏమవుతుందో వారు కొంచెమైనా ఆలోచించారా?) అప్పుడు మేము ప్రతి సంఘం నుండి ఒక సాక్షిని నిలబెడతాము. అవిశ్వాసులకు వాదాలు వినిపించే అవకాశం ఇవ్వటంగానీ,[25] వారిని పశ్చాత్తాపపడండి అనిగానీ, క్షమాభిక్షను అర్థించండి అనిగానీ అడగటం జరగదు. దుర్మార్గులు ఒకసారి శిక్షను చూసిన తరువాత వారి శిక్షను తగ్గించటమూ జరగదు. వారికి ఒక క్షణంపాటు వ్యవధి ఇవ్వటమూ జరగదు. ప్రపంచంలో షిర్కు చేసిన వారు, తాము అల్లాహ్‌కు భాగస్వాములుగా నిలబెట్టినవారిని చూసి నప్పుడు ఇలా అంటారు: "ప్రభూ! మేము నిన్ను వదలిపెట్టి వేడుకుంటూ ఉండిన భాగస్వాములు వీరే. అప్పుడు వారు కల్పించిన ఈ దేవుళ్ళు 'మీరు అబద్ధం చెబుతున్నారు'[26] అని స్పష్టంగా సమాధానం ఇస్తారు. ఆ సమయంలో వీరంతా అల్లాహ్ ముందు వినమ్రులౌతారు. వారు ప్రపంచంలో చేస్తూ ఉండిన కల్పనలన్నీ మటుమాయమౌతాయి. స్వయంగా అవిశ్వాస మార్గాన్ని అవలంబించిన వారికీ, ఇతరులను అల్లాహ్ మార్గం నుండి నిరోధించిన వారికీ మేము శిక్షపై శిక్షను విధిస్తాము, వారు ప్రపంచంలో రెచ్చగొట్టిన దుర్మార్గానికి ఫలితంగా.

ప్రత్యక్షమయ్యాయి. ఇదంతా మీరు జీవితంలో మాటిమాటికీ చూస్తారు. అలాంటప్పుడు అల్లాహ్ సర్వ మానవులను మరణించిన తరువాత మళ్ళీ బ్రతికిస్తాడు అనే విషయాన్ని ప్రవక్త నోట విని మీకు ఆశ్చర్యం కలుగుతోందా?

18. సారాయి పరిశుద్ధమైన పానీయం కాదు అని చెప్పటంలో దాని నిషేధాన్ని కూడా సూచనప్రాయంగా తెలుపటం జరిగింది.

19. "వహీ" అంటే రహస్యమైన, సూక్ష్మమైన సూచన అని నిఘంటువు అర్థం. సూచన చేసేవారూ, సూచన పొందేవారూ తప్ప మరొకరెవ్వరూ దానిని గ్రహించలేరు. దాని ప్రకారమే ఈ పదం "ఇల్‌ఖా" (హృదయంలో విషయాన్ని స్ఫురింపచేయటం), "ఇల్‌హామ్" (రహస్యబోధ) అనే అర్థాలలో ఉపయోగించబడుతుంది.

20. ఆధునికులైన కొందరు వ్యాఖ్యాతలు ఈ ఆయత్‌కు అర్థం ఇలా వివరించారు: అల్లాహ్ ఉపాధిని పుష్కలంగా ప్రసాదించినవారు ఆ ఉపాధిని తమ నౌకర్లకు, బానిసలకు తప్పకుండా పంచిపెట్టాలి. ఒకవేళ అలా పంచిపెట్టకపోతే వారు అల్లాహ్ కానుకలను తిరస్కరించినవారుగా పరిగణించబడతారు. వాస్తవానికి పై ప్రసంగమంతా షిర్కు బూటకము అని ఖండిస్తూ, దేవుడు ఒక్కడే అనే సిద్ధాంతం నిజము అని నిరూపించింది. ఇక ముందు కూడా పరంపరగా ఇదే విషయం కొనసాగుతుంది. సందర్భాన్నిబట్టి చూస్తే స్పష్టమయ్యే విషయం ఇది – "మీరే స్వయంగా మీ సంపదలో మీ బానిసలకు, మీ నౌకర్లకు సమానమైన భాగం ఇవ్వనప్పుడు అల్లాహ్ మీకు చేసిన ఉపకారాలకు మీరు ఆయనకు తెలిపే కృతజ్ఞతలలో అల్లాహ్‌తో పాటు ఏ అధికారాలూ లేని ఆయన దాసులకు కూడా భాగం కల్పించటమూ, మీ అంతట మీరు అధికారాలలో హక్కులలో ఈ దాసులు కూడా ఆయనతో సమానమైన భాగస్వాములే అనిఅనుకోవటమూ సరియైనదని మీరు ఎలా భావిస్తారు?" అనే హేతువు ఇక్కడ చూపబడింది.

وَ يَوْمَ نَبْعَثُ فِيْ كُلِّ اُمَّةٍ شَهِيْدًا عَلَيْهِمْ مِّنْ
اَنْفُسِهِمْ وَ جِئْنَا بِكَ شَهِيْدًا عَلٰى هٰٓؤُلَآءِ ؕ وَ
نَزَّلْنَا عَلَيْكَ الْكِتٰبَ تِبْيَانًا لِّكُلِّ شَيْءٍ وَّ
هُدًى وَّرَحْمَةً وَّ بُشْرٰى لِلْمُسْلِمِيْنَ ﴿٨٩﴾ اِنَّ ع ١٢/١٨
اللّٰهَ يَاْمُرُ بِالْعَدْلِ وَالْاِحْسَانِ وَ اِيْتَآئِ ذِي
الْقُرْبٰى وَ يَنْهٰى عَنِ الْفَحْشَآءِ وَالْمُنْكَرِ وَ
الْبَغْيِ ۚ يَعِظُكُمْ لَعَلَّكُمْ تَذَكَّرُوْنَ ﴿٩٠﴾ وَ اَوْفُوْا
بِعَهْدِ اللّٰهِ اِذَا عٰهَدْتُّمْ وَ لَا تَنْقُضُوا الْاَيْمَانَ
بَعْدَ تَوْكِيْدِهَا وَ قَدْ جَعَلْتُمُ اللّٰهَ عَلَيْكُمْ
كَفِيْلًا ؕ اِنَّ اللّٰهَ يَعْلَمُ مَا تَفْعَلُوْنَ ﴿٩١﴾ وَ لَا
تَكُوْنُوْا كَالَّتِيْ نَقَضَتْ غَزْلَهَا مِنْۢ بَعْدِ قُوَّةٍ
اَنْكَاثًا ؕ تَتَّخِذُوْنَ اَيْمَانَكُمْ دَخَلًۢا بَيْنَكُمْ اَنْ
تَكُوْنَ اُمَّةٌ هِيَ اَرْبٰى مِنْ اُمَّةٍ ؕ اِنَّمَا
يَبْلُوْكُمُ اللّٰهُ بِهٖ ؕ وَلَيُبَيِّنَنَّ لَكُمْ يَوْمَ الْقِيٰمَةِ
مَا كُنْتُمْ فِيْهِ تَخْتَلِفُوْنَ ﴿٩٢﴾ وَلَوْ شَآءَ اللّٰهُ
لَجَعَلَكُمْ اُمَّةً وَّاحِدَةً وَّ لٰكِنْ يُّضِلُّ مَنْ
يَّشَآءُ وَ يَهْدِيْ مَنْ يَّشَآءُ ؕ وَ لَتُسْئَلُنَّ عَمَّا
كُنْتُمْ تَعْمَلُوْنَ ﴿٩٣﴾

**89** మేము ప్రతి సంఘంలో నుండి ఒక సాక్షిని లేపి నిలబెట్టే రోజును గురించి, ప్రవక్తా! వారిని హెచ్చరించు. ఆ సాక్షి తన సంఘానికి వ్యతిరేకంగా సాక్ష్యమిస్తాడు. వారికి వ్యతిరేకంగా సాక్ష్యమివ్వటానికి మేము నిన్ను తీసుకొని వస్తాము. (ఈ సాక్ష్యం కొరకు సన్నాహంగా) మేము ఈ గ్రంథాన్ని నీపై అవతరింపజేశాము. అది ప్రతి విషయాన్నీ స్పష్టంగా వివరిస్తుంది. విధేయులైన వారికి అది ఉపదేశం, కారుణ్యం, శుభవార్త.

**90 - 93** న్యాయం చెయ్యండి అనీ, ఉపకారం చెయ్యండి అనీ, బంధువుల హక్కులు నెరవేర్చండి అనీ అల్లాహ్ ఆజ్ఞాపిస్తున్నాడు. చెడునూ, అశ్లీలతనూ, అన్యాయాన్నీ, మితిమీరి ప్రవర్తించటాన్నీ నిషేధిస్తున్నాడు. ఆయన మీకు హితబోధ చేస్తున్నాడు, మీరు గుణపాఠం నేర్చుకోవాలని. మీరు అల్లాహ్‌తో ఏదైనా వాగ్దానం చేసివుంటే ఆ వాగ్దానాన్ని నెరవేర్చండి. అల్లాహ్ సాక్షిగా చేసిన ప్రమాణాలను దృఢపరచిన తరువాత భంగపరచకండి. అల్లాహ్ మీ పనులన్నింటినీ ఎరుగును. స్వయంగా తాను శ్రమతో నూలు వడకి, తరువాత తానే దానిని ముక్కలు ముక్కలుగా చేసిన స్త్రీ స్థితి వంటిది మీ స్థితి కాకూడదు. మీరు మీ ప్రమాణాలను మీ వ్యవహారాలలో పరస్పరం మోసగించుకోవటానికి పని ముట్లుగా చేసుకుంటారు, ఒక జాతి రెండోజాతికంటే ఎక్కువగా లాభాలను పొందటానికి. వాస్తవానికి అల్లాహ్ ఈ ప్రమాణాల ద్వారా మిమ్మల్ని పరీక్షకు గురిచేస్తున్నాడు. తప్పకుండా ఆయన ప్రళయం నాడు మీ సమస్త అభిప్రాయ భేదాల తత్వాన్ని మీకు విశదం చేస్తాడు. ఒకవేళ అల్లాహ్ సంకల్పం ఇదే అయివుంటే, (అంటే మీలో ఏ భేదాభిప్రాయమూ ఉండకూడదు అని) ఆయన మీ అందరినీ ఒకే సమాజంగా చేసి ఉండేవాడు. కాని ఆయన తన ఇష్ట ప్రకారం కొందరిని అపమార్గానికి గురిచేస్తాడు. తన ఇష్ట ప్రకారం కొందరికి సన్మార్గం చూపుతాడు. తప్పకుండా మీ పనులను గురించి మిమ్మల్ని సంజాయిషీ అడగటం జరిగి తీరుతుంది.

21. అంటే, వారు ఆధారంలేని, వాస్తవికత లోపించిన ఈ విశ్వాసం కలిగివున్నారు: వారి అదృష్టాలను బాగుపరచటం, చెడగొట్టటం, వారి కోరికలను తీర్చటం, వారి ప్రార్థనలను ఆలకించటం, వారికి సంతానం ఇవ్వటం, వారికి జీవనోపాధి ఇప్పించటం, వారి కేసులను గెలిపించటం, వారిని వ్యాధుల నుండి కాపాడటం – ఇవన్నీ కొందరు దేవుళ్ళూ, దేవతలూ, జిన్నాతులూ, గతించిన, సజీవులుగా ఉన్న మతగురువుల చేతులలో ఉన్నాయి.

**94 - 97** (ముస్లిములారా!) మీరు మీ ప్రమాణాలను ఒకరి నొకరు మోసగించుకోవటానికి సాధనాలుగా చేసుకోకండి. ఇలా చేస్తే స్థిరపడి పోయిన పాదాలు తరువాత చలిస్తాయేమో, మీరు అల్లాహ్ మార్గం నుండి ప్రజలను నిరోధించిన అపరాధానికి దుష్ఫలితాన్ని చూస్తారేమో, శిక్షను అనుభవిస్తారేమో.[27] మీరు అల్లాహ్‌కు చేసిన వాగ్దానాన్ని స్వల్ప లాభానికి అమ్మి వేయకండి. అల్లాహ్ వద్ద ఉన్నది మీకు ఎక్కువ మేలు కలిగిస్తుంది, మీరు గనక తెలుసుకుంటే. మీ దగ్గరున్నదంతా ఖర్చు అయిపోయేదే. అల్లాహ్ వద్ద ఉన్నదే అసలు మిగిలి వుండేది. సహనంతో వ్యవహరించే వారికి మేము వారి ప్రతిఫలాన్ని వారి ఉత్తమ కార్యాలకు అనుగుణంగా తప్పకుండా ఇస్తాము. పురుషుడైనా స్త్రీ అయినా సత్కర్మలు చేస్తే, విశ్వాసి అయినపక్షంలో మేము అతనిని ప్రపంచంలో పరిశుద్ధ జీవితం గడిపేలా చేస్తాము. (పరలోకంలో) అటువంటి వారికి వారి ఉత్తమ కార్యాలకు అనుగుణంగా ప్రతిఫలాలను ప్రసాదిస్తాము.

**98 - 100** మీరు ఖురాను పఠనం ప్రారంభించినప్పుడు శాపగ్రస్తుడైన షైతాను బారినుండి అల్లాహ్ శరణు కోరుకొనండి.[28] విశ్వసించి తమ ప్రభువును నమ్ముకున్న వారిపై వాడి అధికారం సాగదు. వాడిని తమ సంరక్షకుడుగా చేసుకుని వాడి మోసానికి గురిఅయి షిర్కు చేసేవారిపైనే వాడి అధికారం సాగుతుంది.

وَ لَا تَتَّخِذُوْٓا اَيْمَانَكُمْ دَخَلًاۢ بَيْنَكُمْ فَتَزِلَّ
قَدَمٌۢ بَعْدَ ثُبُوْتِهَا وَ تَذُوْقُوا السُّوْٓءَ بِمَا
صَدَدْتُّمْ عَنْ سَبِيْلِ اللّٰهِ ۚ وَ لَكُمْ عَذَابٌ
عَظِيْمٌ ﴿٩٤﴾ وَلَا تَشْتَرُوْا بِعَهْدِ اللّٰهِ ثَمَنًا قَلِيْلًا ؕ
اِنَّمَا عِنْدَ اللّٰهِ هُوَ خَيْرٌ لَّكُمْ اِنْ كُنْتُمْ
تَعْلَمُوْنَ ﴿٩٥﴾ مَا عِنْدَكُمْ يَنْفَدُ وَ مَا عِنْدَ اللّٰهِ
بَاقٍ ؕ وَ لَنَجْزِيَنَّ الَّذِيْنَ صَبَرُوْٓا اَجْرَهُمْ
بِاَحْسَنِ مَا كَانُوْا يَعْمَلُوْنَ ﴿٩٦﴾ مَنْ عَمِلَ صَالِحًا
مِّنْ ذَكَرٍ اَوْ اُنْثٰى وَ هُوَ مُؤْمِنٌ فَلَنُحْيِيَنَّهٗ
حَيٰوةً طَيِّبَةً ۚ وَلَنَجْزِيَنَّهُمْ اَجْرَهُمْ بِاَحْسَنِ مَا
كَانُوْا يَعْمَلُوْنَ ﴿٩٧﴾ فَاِذَا قَرَاْتَ الْقُرْاٰنَ فَاسْتَعِذْ
بِاللّٰهِ مِنَ الشَّيْطٰنِ الرَّجِيْمِ ﴿٩٨﴾ اِنَّهٗ لَيْسَ لَهٗ
سُلْطٰنٌ عَلَى الَّذِيْنَ اٰمَنُوْا وَعَلٰى رَبِّهِمْ
يَتَوَكَّلُوْنَ ﴿٩٩﴾ اِنَّمَا سُلْطٰنُهٗ عَلَى الَّذِيْنَ
يَتَوَلَّوْنَهٗ وَ الَّذِيْنَ هُمْ بِهٖ مُشْرِكُوْنَ ﴿١٠٠﴾ ع ١٣ ١١ ١٩

22. అంటే, అల్లాహ్‌ను ప్రపంచంలోని పాదుషాలతోను, రాజులతోనూ, మహారాజుల తోనూ పోల్చకండి. ఒక మనిషి వారి దర్బారులో ఉండే సేవకులూ సమీప ఉద్యోగులూ సాయం లేకుండా వారికి తన విజ్ఞాపనలను విన్నవించుకోలేడు. తన పనిని సాధించుకోలేడు. అలాగే అల్లాహ్ తన దర్బారులో దైవదూతలూ, మహాపురుషులూ ఇతర సమీపుల మధ్య కొలువుతీరి కూర్చున్నాడనీ, ఎవరైనా ఈ మధ్యవర్తుల సాయం లేకుండా ఆయన వద్ద తమ పనులను సాధించుకోలేడనీ మీరు భావించకూడదు.

23. ఈ ప్రశ్నకు సమాధానంగా ముష్రిక్కులు "ఇద్దరూ సమానులే" అని అనలేక పోయారు. కాబట్టి "అల్ హమ్‌దులిల్లాహ్, ఈ విషయమైనా మీ అవగాహనలోకి వచ్చింది" అని సెలవీయబడింది.

24. అంటే, తోలు గుడారాలు. అరేబియాలో ఇవి చెలామణిలో ఉన్నాయి.

25. వారికి తమను గురించి సంజాయిషీ చెప్పుకునే అనుమతి ఇవ్వబడదు అని భావం కాదు. వారి నేరాలు తిరస్కరించటానికి అలవికానటువంటి, సాకులు చెప్పటానికి వీలులేనటువంటి సాక్ష్యాలతో స్పష్టంగా నిరూపించ బడతాయనీ, అందుచేత వారికి తమను గురించి సంజాయిషీ చెప్పుకునే ఆస్కారమే ఉండదు అనీ భావం.

26. అంటే, మేము మీతో "మీరు దేవుణ్ణి వదలిపెట్టి మమ్మల్ని వేడుకోండి" అని ఎన్నడూ చెప్పలేదు. మీరు చేసిన ఈ పనిపట్ల మాకు సంతోషమూ లేదు. పైగా మీరు మమ్మల్ని వేడుకుంటున్నారన్న సంగతే మాకు తెలియదు.

وَ اِذَا بَدَّلْنَاۤ اٰيَةً مَّكَانَ اٰيَةٍ ۙ وَّ اللّٰهُ اَعْلَمُ بِمَا
يُنَزِّلُ قَالُوْۤا اِنَّمَاۤ اَنْتَ مُفْتَرٍ ؕ بَلْ اَكْثَرُهُمْ
لَا يَعْلَمُوْنَ ﴿١٠١﴾ قُلْ نَزَّلَهٗ رُوْحُ الْقُدُسِ مِنْ
رَّبِّكَ بِالْحَقِّ لِيُثَبِّتَ الَّذِيْنَ اٰمَنُوْا وَ هُدًى
وَّبُشْرٰى لِلْمُسْلِمِيْنَ ﴿١٠٢﴾ وَ لَقَدْ نَعْلَمُ اَنَّهُمْ
يَقُوْلُوْنَ اِنَّمَا يُعَلِّمُهٗ بَشَرٌ ؕ لِسَانُ الَّذِيْ
يُلْحِدُوْنَ اِلَيْهِ اَعْجَمِيٌّ وَّهٰذَا لِسَانٌ عَرَبِيٌّ
مُّبِيْنٌ ﴿١٠٣﴾ اِنَّ الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِاٰيٰتِ اللّٰهِ ۙ
لَا يَهْدِيْهِمُ اللّٰهُ وَ لَهُمْ عَذَابٌ اَلِيْمٌ ﴿١٠٤﴾ اِنَّمَا
يَفْتَرِى الْكَذِبَ الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِاٰيٰتِ
اللّٰهِ ۚ وَاُولٰٓئِكَ هُمُ الْكٰذِبُوْنَ ﴿١٠٥﴾

**101 - 102** మేము ఒక ఆయత్ స్థానంలో మరొక ఆయత్‌ను అవతరింపజేసినప్పుడు - దేనిని అవతరింపజెయ్యాలో అల్లాహ్‌కు బాగా తెలుసు- నీవు స్వయంగా ఈ ఖురానును కల్పించి వ్రాస్తున్నావు అని వారు అంటారు. అసలు విషయం ఏమిటంటే వారిలో, చాలామందికి యథార్థం ఏమిటో తెలియదు. వారితో ఇలా అను: దీనిని పరిశుద్ధాత్మ ఉన్నది ఉన్నట్లుగా నా ప్రభువు తరఫు నుండి క్రమక్రమంగా అవతరింప జేశాడు,[29] విశ్వాసుల విశ్వాసాన్ని పటిష్ఠం చేసేటందుకూ, జీవితానికి సంబంధించిన వ్యవహారాలలో విధేయులకు సరియైన మార్గం చూపేటందుకూ, వారికి సాఫల్యం, సౌభాగ్యాల శుభవార్తను ఇచ్చేటందుకూ.

**103 - 105** "ఇతనికి ఒకానొక మనిషి నేర్పుతున్నాడు" అని వారు నిన్ను గురించి అంటున్న విషయం మాకు తెలుసు. వాస్తవానికి, వారు సూచిస్తున్న మనిషి మాట్లాడే భాష అన్య దేశపు భాష. ఇదేమో స్పష్టమైన అరబ్బీ భాష. యథార్థమేమి టంటే, అల్లాహ్ ఆయతులను విశ్వసించని వారికి అల్లాహ్ ఎన్నడూ సరియైన విషయం వరకు చేరుకునే భాగ్యాన్ని కలుగ జెయ్యడు. అటువంటి వారికి బాధాకరమైన శిక్ష పడుతుంది. అబద్ధాలను దైవప్రవక్త కల్పించడు, అల్లాహ్ ఆయతులను విశ్వసించనివారే అబద్ధాలను కల్పిస్తున్నారు.[30] అసలు వారే అసత్యవాదులు.

27. అంటే, ఒక వ్యక్తి ఇస్లామ్ ధర్మము సత్యము అని అంగీకరించిన తరువాత మీ చెడు నడతను చూసి, ఆ ధర్మానికి దూరం కాకూడదు. విశ్వాసుల వర్గంలో చేరిపోకుండా ఆగిపోకూడదు. ఆ వర్గంలో తాను సంబంధాలు కలిగివున్నవారు నైతిక ప్రవర్తనలో, వ్యాపార ఉద్యోగ వ్యవహారాలలో అవిశ్వాసులకు ఎంతమాత్రం తీసిపోరు అనే భావం అతనికి కలుగకూడదు అని అర్థం.

28. దీని భావం కేవలం నోటితో "అఊజుబిల్లాహి మినష్షయ్‌తా నిర్రజీమ్" అని అనటమే కాదు. దానితో పాటు ఖురాను పఠించేటప్పుడు అపమార్గం పట్టించే షైతాను దుష్టభావాల నుండి తనను సురక్షితంగా ఉంచాలని హృదయపూర్వకంగా అల్లాహ్‌ను ప్రార్థించాలి. ఎందుకంటే, ఖురాను నుండి మార్గదర్శకత్వం పొందలేనివాడు మరెక్కడ నుండి మార్గదర్శకత్వాన్ని పొందలేడు. ఈ గ్రంథం నుండి మార్గభ్రష్టత్వాన్ని వెతికితీసే వాడిని ప్రపంచంలో ఏ శక్తి మార్గభ్రష్టత్వపు వలయం నుండి బయటికి తీసుకురాజాలదు.

29. "రూహుల్ ఖుద్స్" యొక్క శబ్దానువాదం "పరిశుద్ధమైన ఆత్మ" లేక "పరిశుద్ధత యొక్క ఆత్మ". అసలు ఇది హజ్రత్ జిబ్రీల్ (అస్సలామ్)కు ఇవ్వబడిన బిరుదు. ఇక్కడ వహీని తెచ్చే దైవదూత పేరుకు బదులుగా, ఆయన బిరుదు ఉపయోగించబడింది. ఎందుకంటే మానవ సహజమైన బలహీనతలూ, పొరపాట్లూ లేని పరిశుద్ధమైన ఆత్మ ఈ గ్రంథాన్ని తీసుకుని వస్తుందనీ, పూర్తి విశ్వసనీయతతో అల్లాహ్ సందేశాన్ని అందజేస్తుందనీ శ్రోతలకు తెలుపుటకు.

30. రెండో అనువాదం ఇలా కూడా చెయ్యవచ్చు: అల్లాహ్ ఆయతులను విశ్వసించనివారే అబద్ధాన్ని కల్పిస్తూ ఉంటారు.

مَنْ كَفَرَ بِاللّٰهِ مِنْۢ بَعْدِ اِيْمَانِهٖۤ اِلَّا مَنْ اُكْرِهَ
وَ قَلْبُهٗ مُطْمَىِٕنٌّۢ بِالْاِيْمَانِ وَ لٰكِنْ مَّنْ شَرَحَ
بِالْكُفْرِ صَدْرًا فَعَلَيْهِمْ غَضَبٌ مِّنَ اللّٰهِ ۚ
وَلَهُمْ عَذَابٌ عَظِيْمٌ ﴿١٠٦﴾ ذٰلِكَ بِاَنَّهُمُ اسْتَحَبُّوا
الْحَيٰوةَ الدُّنْيَا عَلَى الْاٰخِرَةِ ۙ وَ اَنَّ اللّٰهَ لَا
يَهْدِى الْقَوْمَ الْكٰفِرِيْنَ ﴿١٠٧﴾ اُولٰٓىِٕكَ الَّذِيْنَ
طَبَعَ اللّٰهُ عَلٰى قُلُوْبِهِمْ وَسَمْعِهِمْ وَاَبْصَارِهِمْ ۚ
وَ اُولٰٓىِٕكَ هُمُ الْغٰفِلُوْنَ ﴿١٠٨﴾ لَا جَرَمَ اَنَّهُمْ فِى
الْاٰخِرَةِ هُمُ الْخٰسِرُوْنَ ﴿١٠٩﴾ ثُمَّ اِنَّ رَبَّكَ
لِلَّذِيْنَ هَاجَرُوْا مِنْۢ بَعْدِ مَا فُتِنُوْا ثُمَّ جٰهَدُوْا
وَصَبَرُوْۤا ۙ اِنَّ رَبَّكَ مِنْۢ بَعْدِهَا لَغَفُوْرٌ
رَّحِيْمٌ ﴿١١٠﴾ يَوْمَ تَاْتِىْ كُلُّ نَفْسٍ تُجَادِلُ عَنْ ع ١٤/٢٠
نَّفْسِهَا وَ تُوَفّٰى كُلُّ نَفْسٍ مَّا عَمِلَتْ وَهُمْ لَا
يُظْلَمُوْنَ ﴿١١١﴾ وَ ضَرَبَ اللّٰهُ مَثَلًا قَرْيَةً كَانَتْ
اٰمِنَةً مُّطْمَىِٕنَّةً يَّاْتِيْهَا رِزْقُهَا رَغَدًا مِّنْ كُلِّ
مَكَانٍ فَكَفَرَتْ بِاَنْعُمِ اللّٰهِ فَاَذَاقَهَا اللّٰهُ لِبَاسَ
الْجُوْعِ وَالْخَوْفِ بِمَا كَانُوْا يَصْنَعُوْنَ ﴿١١٢﴾ وَ
لَقَدْ جَآءَهُمْ رَسُوْلٌ مِّنْهُمْ فَكَذَّبُوْهُ
فَاَخَذَهُمُ الْعَذَابُ وَ هُمْ ظٰلِمُوْنَ ﴿١١٣﴾

**106 - 111** ఎవరైనా విశ్వసించిన తరువాత బలవంతం చెయ్యబడటం వల్ల అవిశ్వాసిగా మారినపక్షంలో, అప్పుడు అతని హృదయం విశ్వాసం పట్ల తృప్తితో ఉంటే (అది వేరే విషయం). కాని ఎవరైనా హృదయపూర్వకంగా అవిశ్వాసానికి పాల్పడితే అతనిపై అల్లాహ్ ఆగ్రహం పడుతుంది. అటువంటి వారందరికీ తీవ్రమైన శిక్ష పడుతుంది.[31] ఎందుకంటే, వారు పరలోకానికి బదులుగా ప్రాపంచిక జీవితాన్ని కోరుకున్నారు. అల్లాహ్ తన అనుగ్రహాన్ని తిరస్కరించేవారికి మోక్షమార్గం చూపడు. ఇది ఆయన విధానం. వారి హృదయాలలకూ, వారి చెవులకూ, వారి కళ్ళకూ అల్లాహ్ ముద్రవేశాడు. వారు అశ్రద్ధలో మునిగిపోయారు. అందుచేత వారు పరలోకంలో తప్పక నష్టానికి గురిఅవుతారు.[32] దీనికి భిన్నంగా (విశ్వసించిన కారణంగా) బాధలకు గురి చెయ్యబడినప్పుడు ఇల్లూ వాకిలీ విడిచిపెట్టినవారూ, వలసపోయిన వారూ దైవమార్గంలో కష్టాలను భరించినవారూ సహనంతో వ్యవహరించిన వారూ- వారికొరకు నీ ప్రభువు నిశ్చయంగా క్షమించేవాడుగా కరుణించే వాడుగా ఉంటాడు. ప్రతి ప్రాణీ తనను తాను మాత్రమే రక్షించుకునే ఆలోచనలో మునిగి ఉండేరోజున, ప్రతి ఒక్కనికీ తాను చేసిన దానికి ప్రతిఫలం పూర్తిగా ఇవ్వబడేరోజున, ఎవరికీ ఏమాత్రమూ అన్యాయం జరగని రోజున (వారందరి విషయంలో తీర్పు జరుగుతుంది).

**112 - 113** అల్లాహ్ ఒక జనపదానికి సంబంధించిన ఉదాహరణ ఇస్తున్నాడు: ఆ జనపదం శాంతిమయమూ సంతృప్తికరమూ అయిన జీవితాన్ని గడుపుతూ ఉండేది. ప్రతి వైపునుండీ దానికి ఆహారం పుష్కలంగా చేరుతూ ఉండేది. అప్పుడు అది అల్లాహ్ కానుకలకు కృతఘ్నత చూపటం ప్రారంభించింది. అప్పుడు అల్లాహ్ దాని పౌరులకు వారి అకృత్యాల రుచిని ఇలా చూపాడు: ఆకలీ భయమూ అనే ఆపదలు వారిని చుట్టుముట్టాయి. వారి వద్దకు వారి జాతి నుండే ఒక ప్రవక్త వచ్చాడు. కాని వారు ఆయనను తిరస్కరించారు. చివరకు వారు పూర్తిగా దుర్మార్గులై పోయినప్పుడు వారిని శిక్ష పట్టుకున్నది.[33]

31. ఈ ఆయత్, అప్పుడు చిత్రహింసలకు గురిచేయబడుతున్నటువంటి భరింపశక్యం కాని యాతనలకు గురిచేయబడి అవిశ్వాస మార్గాన్ని స్వీకరించండి అని బలవంతం చెయ్యబడుతున్న ముస్లిములకు సంబంధించినది. ఒకవేళ మీరు ఎప్పుడైనా హింసకు తాళలేక కేవలం ప్రాణరక్షణ కోసం అవిశ్వాస వచనాన్ని నోటితో ఉచ్చరించినా మీ

**114 - 117** కనుక ప్రజలారా! అల్లాహ్ మీకు ప్రసాదించిన ధర్మసమ్మతమైనటువంటి, పరిశుద్ధమైనటువంటి ఆహారాన్ని తినండి, అల్లాహ్ చేసిన మేలునకు కృతజ్ఞతలు తెలుపండి, నిజంగా మీరు ఆయననే ఆరాధించేవారు అయితే. అల్లాహ్ మీకు నిషిద్ధం చేసినవి ఇవి: దానంతట అది చచ్చిన పశువు, రక్తము, పందిమాంసము, అల్లాహ్ తప్ప ఇతరుల పేరు ఉచ్చరింపబడిన జంతువు. అయితే ఆకలికి తాళలేక గత్యం తరంలేని పరిస్థితిలో ఎవరైనా వాటిని తింటే, అతడు దైవశాస నాన్ని ఉల్లంఘించే ఉద్దేశ్యం కూడా కలిగి ఉండకపోయి నట్లయితే, లేదా అవసరానికి మించి తినకుండా ఉన్నట్లయితే–అప్పుడు నిశ్చయంగా అల్లాహ్ క్షమిస్తాడు, కరుణిస్తాడు. ఈ వస్తువు ధర్మసమ్మతం అనీ, ఆ వస్తువు నిషిద్ధం అనీ మీ నాలుకలు అబద్ధపు నిర్ణయాలను జారీ చేస్తున్నాయి.[34] ఇటువంటి నిర్ణయాలను తీసుకొని అల్లాహ్‌కు అబద్ధాన్ని ఆపాదించకండి. అల్లాహ్‌కు అబద్ధాన్ని ఆపాదించేవారు ఎంత మాత్రం సాఫల్యం పొందలేరు. ప్రాపంచిక సుఖాలు మూడునాళ్ళ ముచ్చటే. చివరకు వారికి బాధాకరమైన శిక్ష పడుతుంది.

فَكُلُوْا مِمَّا رَزَقَكُمُ اللّٰهُ حَلٰلًا طَيِّبًا ۪ وَّاشْكُرُوْا
نِعْمَتَ اللّٰهِ اِنْ كُنْتُمْ اِيَّاهُ تَعْبُدُوْنَ ﴿١١٤﴾ اِنَّمَا
حَرَّمَ عَلَيْكُمُ الْمَيْتَةَ وَالدَّمَ وَلَحْمَ الْخِنْزِيْرِ وَ
مَآ اُهِلَّ لِغَيْرِ اللّٰهِ بِهٖ ۚ فَمَنِ اضْطُرَّ غَيْرَ بَاغٍ
وَّ لَا عَادٍ فَاِنَّ اللّٰهَ غَفُوْرٌ رَّحِيْمٌ ﴿١١٥﴾ وَ لَا
تَقُوْلُوْا لِمَا تَصِفُ اَلْسِنَتُكُمُ الْكَذِبَ هٰذَا
حَلٰلٌ وَّ هٰذَا حَرَامٌ لِّتَفْتَرُوْا عَلَى اللّٰهِ
الْكَذِبَ ؕ اِنَّ الَّذِيْنَ يَفْتَرُوْنَ عَلَى اللّٰهِ
الْكَذِبَ لَا يُفْلِحُوْنَ ﴿١١٦﴾ؕ مَتَاعٌ قَلِيْلٌ ۪ وَّ لَهُمْ
عَذَابٌ اَلِيْمٌ ﴿١١٧﴾

హృదయం గనక అవిశ్వాసానికి లొంగిపోకుండా సురక్షితంగా ఉంటే మాత్రం క్షమించటం జరుగుతుంది. కాని ఒకవేళ మీరు మనఃపూర్వకంగా అవిశ్వాస మార్గాన్ని స్వీకరిస్తే, ఈ ప్రపంచంలో ప్రాణాలను రక్షించుకున్నా పరలోకంలో మాత్రం దేవుని శిక్షను తప్పించుకోలేరు అని వారికి తెలుపబడుతోంది.

32. విశ్వాస మార్గం కఠినంగా ఉండటం చూసి దాని నుండి మరలిపోయి మళ్ళీ తమ అవిశ్వాసుల, ముష్రిక్కు జాతులలో కలిసిపోయిన వారిని గురించి ఈ విషయం చెప్పబడింది.

33. ఇక్కడ మక్కా పట్టణం పేరెత్తకుండా ఉదాహరణగా పేర్కొనబడినది అని హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజిఅన్) గారి అభిప్రాయం : ఆయన వ్యాఖ్యానం ప్రకారం, ఇక్కడ ప్రస్తావించబడిన భయమూ, ఆకలి అనే ఆపద అంటే మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) ప్రభవించిన తరువాత చాలాకాలం వరకు మక్కా వాసులను తీవ్రబాధలకు గురిచేసిన కరువు అని భావం.

34. ఈ ఆయత్ ఒక వస్తువును ధర్మసమ్మతం చేసే హక్కూ లేక నిషిద్ధం చేసే హక్కూ అల్లాహ్‌కు తప్ప మరెవరికీ లేదు అని స్పష్టంగా వివరిస్తోంది. ఫలానా వస్తువు ధర్మసమ్మతం (జాయజ్), ఫలానాది ధర్మసమ్మతం కాదు (నాజాయజ్) అని నిర్ణయించటానికి ధైర్యం చేసేవాడు తన హద్దును అతిక్రమిస్తున్నాడు - అతడు దైవ శాసనాన్ని ప్రమాణంగా స్వీకరించి దాని సూత్రాలను వర్తింపజేస్తూ ఫలానా వస్తువు లేదా ఫలానా పని ధర్మసమ్మతం, ఫలానాది ధర్మసమ్మతం కాదు అని నిశ్చయిస్తే తప్ప. ఒక మనిషి స్వతంత్రంగా ఏవి ధర్మసమ్మతాలో, ఏవి నిషిద్ధాలో నిర్ణయించటం అల్లాహ్‌కు అబద్ధాన్ని ఆపాదించటమే అవుతుంది అని ఎందుకు అనబడిందంటే, ఇలా ఆజ్ఞలను ఎవరైనా జారీ చేస్తే దానికి రెండు కారణాలు చూపవచ్చు.అతడు దైవగ్రంథ ప్రమాణాన్ని తృణీకరించి తాను ధర్మ సమ్మతం లేక నిషిద్ధం అని నిర్ణయించిన దానినే దేవుడు ధర్మసమ్మత మైనదిగా లేక నిషిద్ధమైనదిగా నిర్ణయించాడు అని చాటుతాడు.లేదా అల్లాహ్ ధర్మసమ్మతం, నిషేధించే తన అధికారాలను వదలుకుని మానవుడికి తనకు ఇష్టమైన శాసనాలను నిర్మించుకునే స్వేచ్ఛను ఇచ్చాడు అని ప్రకటిస్తాడు. ఈ రెంటిలో అతడు ఏదిచేసినా అదిపూర్తిగా అల్లాహ్‌కు అబద్ధాన్ని ఆపాదించటమే అవుతుంది.

وَعَلَى الَّذِيْنَ هَادُوْا حَرَّمْنَا مَا قَصَصْنَا
عَلَيْكَ مِنْ قَبْلُ ۚ وَمَا ظَلَمْنٰهُمْ وَلٰكِنْ كَانُوْٓا
اَنْفُسَهُمْ يَظْلِمُوْنَ ﴿١١٨﴾ ثُمَّ اِنَّ رَبَّكَ لِلَّذِيْنَ
عَمِلُوا السُّوْٓءَ بِجَهَالَةٍ ثُمَّ تَابُوْا مِنْۢ بَعْدِ
ذٰلِكَ وَاَصْلَحُوْٓا ۙ اِنَّ رَبَّكَ مِنْۢ بَعْدِهَا لَغَفُوْرٌ
رَّحِيْمٌ ﴿١١٩﴾ اِنَّ اِبْرٰهِيْمَ كَانَ اُمَّةً قَانِتًا لِّلّٰهِ ع ١٥ ٩ ٢١
حَنِيْفًا ۭ وَلَمْ يَكُ مِنَ الْمُشْرِكِيْنَ ﴿١٢٠﴾ ۙ شَاكِرًا
لِّاَنْعُمِهٖ ۭ اِجْتَبٰىهُ وَهَدٰىهُ اِلٰى صِرَاطٍ
مُّسْتَقِيْمٍ ﴿١٢١﴾ وَاٰتَيْنٰهُ فِي الدُّنْيَا حَسَنَةً ۭ وَاِنَّهٗ
فِي الْاٰخِرَةِ لَمِنَ الصّٰلِحِيْنَ ﴿١٢٢﴾ ۭ ثُمَّ اَوْحَيْنَآ
اِلَيْكَ اَنِ اتَّبِعْ مِلَّةَ اِبْرٰهِيْمَ حَنِيْفًا ۭ وَمَا
كَانَ مِنَ الْمُشْرِكِيْنَ ﴿١٢٣﴾ اِنَّمَا جُعِلَ السَّبْتُ
عَلَى الَّذِيْنَ اخْتَلَفُوْا فِيْهِ ۭ وَاِنَّ رَبَّكَ
لَيَحْكُمُ بَيْنَهُمْ يَوْمَ الْقِيٰمَةِ فِيْمَا كَانُوْا فِيْهِ
يَخْتَلِفُوْنَ ﴿١٢٤﴾ اُدْعُ اِلٰى سَبِيْلِ رَبِّكَ بِالْحِكْمَةِ
وَالْمَوْعِظَةِ الْحَسَنَةِ وَجَادِلْهُمْ بِالَّتِيْ هِيَ
اَحْسَنُ ۭ اِنَّ رَبَّكَ هُوَ اَعْلَمُ بِمَنْ ضَلَّ عَنْ
سَبِيْلِهٖ وَهُوَ اَعْلَمُ بِالْمُهْتَدِيْنَ ﴿١٢٥﴾ وَاِنْ
عَاقَبْتُمْ فَعَاقِبُوْا بِمِثْلِ مَا عُوْقِبْتُمْ بِهٖ ۭ وَلَىِٕنْ
صَبَرْتُمْ لَهُوَ خَيْرٌ لِّلصّٰبِرِيْنَ ﴿١٢٦﴾ وَاصْبِرْ وَمَا
صَبْرُكَ اِلَّا بِاللّٰهِ وَلَا تَحْزَنْ عَلَيْهِمْ وَلَا
تَكُ فِيْ ضَيْقٍ مِّمَّا يَمْكُرُوْنَ ﴿١٢٧﴾ اِنَّ اللّٰهَ مَعَ
الَّذِيْنَ اتَّقَوْا وَّالَّذِيْنَ هُمْ مُّحْسِنُوْنَ ﴿١٢٨﴾ ع ١٦ ٩ ٢٢

**118 - 124** ఇంతకు పూర్వం మేము నీతో ప్రస్తావించిన వస్తువులను ప్రత్యేకంగా యూదులకు నిషిద్ధం చేశాము. ఇలా వారికి అన్యాయం చేసినది మేము కాదు. వారే తమకు తాము అన్యాయం చేసుకున్నారు. అయితే, అజ్ఞానం వల్ల చెడుపని చేసి తరువాత పశ్చాత్తాపపడి తమ ప్రవర్తనను సంస్కరించు కున్నవారిని నీ ప్రభువు నిశ్చయంగా పశ్చాత్తాపం, సంస్కరణల తరువాత క్షమిస్తాడు, కనికరిస్తాడు. నిజానికి ఇబ్రాహీమ్ తనకు తానే ఒక సంఘం. అల్లాహ్‌కు పరమ విధేయుడు. ఆయన యందే మనస్సు నిలిపిన వాడు. అతను ఎన్నడూ ముష్రిక్కుగా ఉండలేదు. అల్లాహ్ అనుగ్రహాలకు కృతజ్ఞతలు తెలుపుతూ ఉండేవాడు. అల్లాహ్ అతనిని ఎన్నుకున్నాడు. అతనికి ఋజుమార్గాన్ని చూపాడు. ప్రపంచంలో అతనికి మేలును ప్రసాదించాడు. పరలోకంలో అతను నిశ్చయంగా సజ్జనులలో ఒకడుగా ఉంటాడు. తరువాత మేము "ఏకాగ్రచిత్తుడవై ఇబ్రాహీమ్ విధానాన్ని అనుసరించు - అతను ముష్రిక్కులలోని వాడు కాడు" అనే వహీని నీ వద్దకు పంపాము. ఇక సబ్బత్ విషయం, దానికి సంబంధించిన ఆదేశాలతో విభేదించిన వారిపై మేము దానిని విధించాము. వారు విభేదిస్తూ ఉండిన అన్ని విషయాలను గురించి నిశ్చయంగా నీ ప్రభువు ప్రళయం నాడు తీర్పు చేస్తాడు.

**125 - 128** ప్రవక్తా! నీ ప్రభువు మార్గం వైపునకు ఆహ్వానించు, వివేకంతో చక్కని హితబోధతో. ప్రజలతో ఉత్తమోత్తమమైన రీతిలో వాదించు. నీ ప్రభువుకే బాగా తెలుసు, ఆయన మార్గంనుండి తప్పిపోయినవాడు ఎవడో, ఋజు మార్గంలో ఉన్నవాడు ఎవడో. ఒకవేళ మీరు ప్రతీకారం చేస్తే కేవలం మీపై దౌర్జన్యం జరిగిన మేరకే ప్రతీకారం చెయ్యండి. కాని మీరు సహనం చూపితే, అది నిశ్చయంగా సహనం చూపేవారికే మంచిది. ప్రవక్తా! సహనంతో పనిచేస్తూ పో- నీకు ఈ సహన భాగ్యం అల్లాహ్ అనుగ్రహం వల్లనే కలిగింది- వారి చేష్టలకు వగవకు. వారి పన్నాగాలకు మనస్సులో ఖేద పడకు. భయ భక్తులతో పని చేస్తూ ఉదాత్తవైఖరి కలిగివుండే వారితో అల్లాహ్ ఉంటాడు.

## 17. బనీ ఇస్రాయీల్

అవతరణ మక్కాలో | ఆయతులు 111

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

1 కొన్ని నిదర్శనాలను చూపటానికి[1] తన దాసుణ్ణి ఒక రాత్రి మస్జిదె హరామ్‌నుండి, దూరంగా ఉన్న మసీదు వద్దకు తీసుకు పోయిన ఆయన పరిశుద్ధుడు. ఆ మసీదు పరిసరాలను ఆయన శుభవంతం చేశాడు. నిజానికి ఆయనే అన్నీ వినేవాడూ, అన్నీ చూసేవాడూను.

2 – 8 మేము ఇంతకుపూర్వం మూసాకు గ్రంథాన్ని ఇచ్చాము. దానిని ఇస్రాయీల్ సంతతికి మార్గదర్శక సాధనంగా చేశాము, మీరు నన్ను తప్ప మరెవరినీ సంరక్షకుడుగా చేసుకో వద్దు[2] అనే ఆజ్ఞతో. మేము నూహ్ ప్రవక్తతో పాటు ఓడలోకి ఎక్కించిన వారి సంతానమే మీరు. నూహ్ ప్రవక్త ఒక కృతజ్ఞుడైన దాసుడు. మేము మా గ్రంథంలో[3] ఇస్రాయీల్ సంతతిని "మీరు భువిలో రెండు సార్లు గొప్ప సంక్షోభాన్ని సృష్టిస్తారు. దురహంకారాన్ని ప్రదర్శిస్తారు" అనే విషయాన్ని గురించి కూడా హెచ్చరించాము. చివరకు వారిలో మొదటిసారి దురహంకారం వ్యక్తమైనప్పుడు, ఇస్రాయీలు సంతతి ప్రజలారా! మిమ్మల్ని ఎదుర్కోవటానికి మేము మహా బలాఢ్యులైన మా దాసులను లేపాము. వారు మీ దేశంలో చొరబడి అన్ని వైపులా వ్యాపించారు.[4] ఇదొక వాగ్దానం. అది తప్పనిసరిగా నెరవేర్చబడవలసి ఉండింది.

١٧ سُوْرَةُ بَنِیٓ اِسْرَآءِیْلَ مَکِّیَّةٌ ٥٠

اٰیاتها ١١١ | رکوعاتها ١٢

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِیْمِ ○

سُبْحٰنَ الَّذِیْٓ اَسْرٰی بِعَبْدِهٖ لَیْلًا مِّنَ
الْمَسْجِدِ الْحَرَامِ اِلَی الْمَسْجِدِ الْاَقْصَا الَّذِیْ
بٰرَکْنَا حَوْلَهٗ لِنُرِیَهٗ مِنْ اٰیٰتِنَا ۭ اِنَّهٗ هُوَ
السَّمِیْعُ الْبَصِیْرُ ۝١ وَ اٰتَیْنَا مُوْسَی الْکِتٰبَ
وَجَعَلْنٰهُ هُدًی لِّبَنِیْٓ اِسْرَآءِیْلَ اَلَّا تَتَّخِذُوْا
مِنْ دُوْنِیْ وَکِیْلًا ۝٢ ۭ ذُرِّیَّةَ مَنْ حَمَلْنَا مَعَ
نُوْحٍ ۭ اِنَّهٗ کَانَ عَبْدًا شَکُوْرًا ۝٣ وَ قَضَیْنَآ
اِلٰی بَنِیْٓ اِسْرَآءِیْلَ فِی الْکِتٰبِ لَتُفْسِدُنَّ فِی
الْاَرْضِ مَرَّتَیْنِ وَ لَتَعْلُنَّ عُلُوًّا کَبِیْرًا ۝٤
فَاِذَا جَآءَ وَعْدُ اُوْلٰهُمَا بَعَثْنَا عَلَیْکُمْ عِبَادًا
لَّنَآ اُولِیْ بَاْسٍ شَدِیْدٍ فَجَاسُوْا خِلٰلَ
الدِّیَارِ ۭ وَکَانَ وَعْدًا مَّفْعُوْلًا ۝٥

المنزل ٤ الجزء ١٥

1. ఇక్కడ "మేరాజ్" పేరుతో ప్రసిద్ధిగాంచిన సంఘటన ప్రస్తావించబడినది. విశ్వసనీయమయిన అనేక హదీసుల ప్రకారం, ఈ సంఘటన హిజ్రత్‌కు ఒక సంవత్సరం ముందు జరిగింది. హదీసు గ్రంథాలలో, మహాప్రవక్త (సఅసమ్) జీవిత చరిత్ర గ్రంథాలలో ఈ సంఘటన వివరాలను ఆయన ప్రత్యక్ష సహచరులు అనేకమంది ఉల్లేఖించారు. వారి సంఖ్య 25 వరకూ ఉంటుంది. ఖురాను కేవలం మహాప్రవక్త (సఅసమ్) మస్జిదె హరామ్ (అంటే కాబా గృహం) నుండి మస్జిదె అఖ్సా (అంటే బైతుల్ మఖ్దిస్) వరకు పోవటాన్ని మాత్రమే వివరిస్తుంది. హదీసులలో బైతుల్ మఖ్దిస్ నుండి ఊర్ధ్వలోకాలలో అత్యున్నత స్థానానికి పోయి అల్లాహ్ సాన్నిధ్యంలో ఆయన హాజరయిన విషయాన్ని గురించి సవివరమైన ప్రస్తావన ఉన్నది. ఈ ప్రయాణం యొక్క స్వరూప స్వభావాలు ఎటువంటివి? ఇది స్వప్నావస్థలో జరిగిందా లేక జాగృదావస్థలోనా? మహాప్రవక్త (సఅసమ్) స్వయంగా శరీరంతో వెళ్ళారా లేదా ఆయన ఉన్న స్థలంలోనే ధ్యానంలో ఆయనకు ఇదంతా చూపబడిందా? ఈ ప్రశ్నలకు స్వయంగా ఖురాను పదాలే సమాధానాలిస్తున్నాయి : "కొన్ని నిదర్శనాలను చూపటానికి తన దాసుణ్ణి ఒక రాత్రి మస్జిదె హరామ్ నుండి దూరంగా ఉన్న మసీదువద్దకు తీసుకుపోయిన ఆయన పరిశుద్ధుడు" అనే పదాలతో ఉపన్యాసాన్ని ప్రారంభించటం స్వయంగా ఇదొక మహత్తరమైన, అసాధారణమైన సంఘటన అనీ, అది అల్లాహ్ అసాధారణ శక్తివల్ల జరిగింది అనీ తెలుపుతోంది. ఈ సంఘటన కేవలం కల

ثُمَّ رَدَدْنَا لَكُمُ الْكَرَّةَ عَلَيْهِمْ وَ اَمْدَدْنٰكُمْ
بِاَمْوَالٍ وَّبَنِيْنَ وَجَعَلْنٰكُمْ اَكْثَرَ نَفِيْرًا ﴿٦﴾ اِنْ
اَحْسَنْتُمْ اَحْسَنْتُمْ لِاَنْفُسِكُمْ ۫ وَ اِنْ اَسَاْتُمْ
فَلَهَا ؕ فَاِذَا جَآءَ وَعْدُ الْاٰخِرَةِ لِيَسُوْٓءٗا
وُجُوْهَكُمْ وَ لِيَدْخُلُوا الْمَسْجِدَ كَمَا دَخَلُوْهُ
اَوَّلَ مَرَّةٍ وَّ لِيُتَبِّرُوْا مَا عَلَوْا تَتْبِيْرًا ﴿٧﴾
عَسٰى رَبُّكُمْ اَنْ يَّرْحَمَكُمْ ۚ وَ اِنْ عُدْتُّمْ
عُدْنَا ۘ وَ جَعَلْنَا جَهَنَّمَ لِلْكٰفِرِيْنَ حَصِيْرًا ﴿٨﴾ وقف لازم
اِنَّ هٰذَا الْقُرْاٰنَ يَهْدِيْ لِلَّتِيْ هِيَ اَقْوَمُ
وَيُبَشِّرُ الْمُؤْمِنِيْنَ الَّذِيْنَ يَعْمَلُوْنَ
الصّٰلِحٰتِ اَنَّ لَهُمْ اَجْرًا كَبِيْرًا ﴿٩﴾ ۙ وَّاَنَّ
الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ اَعْتَدْنَا لَهُمْ
عَذَابًا اَلِيْمًا ﴿١٠﴾ ع

దాని తరువాత మేము మీకు వారిపై ప్రాబల్యం వహించే అవకాశాన్ని కలిగించాము. సంపదతోనూ సంతానంతోనూ మీకు సహాయపడ్డాము. మీ సంఖ్యా బలాన్ని ఇదివరకటికంటె పెంచాము. చూడండి, మీరు మంచిని చేస్తే అది మీకే మీరు మంచిని చేసుకున్నట్లు. చెడును చేస్తే అది మీకు మీరే చెడును చేసుకున్నట్లు. రెండో వాగ్దానం నెరవేర్చవలసిన సమయం ఆసన్నమైనప్పుడు మేము ఇతర శత్రువులను మీపైకి పంపాము, వారు మీ ముఖాలను వికృతం చెయ్యటానికి, మసీదు (బైతుల్ మఖ్దిస్)లోకి పూర్వం శత్రువులు చొరబడిన విధంగా చొరబడ టానికి, వారి చేతికందిన ప్రతిదానినీ ధ్వంసం చేసెయ్యటా నికి[5]– బహుశా మీ ప్రభువు మీపై ఇప్పుడు కరుణ చూపవచ్చు. కాని ఒకవేళ మీరు మీ పాతవైఖరిని తిరిగి అవలంబిస్తే మేము కూడా మా శిక్షను తిరిగి విధిస్తాము. అనుగ్రహాలను పొంది కృతఘ్నులైన ప్రజలకు మేము నరకాన్ని కారాగారంగా చేసివుంచాము.

**9 - 10** యథార్థం ఏమిటంటే ఈ ఖురాను పూర్తి సరియైన సవ్యమైన మార్గాన్ని చూపుతోంది. తనను విశ్వసించి మంచి పనులు చేసేవారికి గొప్ప ప్రతిఫలం ఉంది అనే శుభవార్తను అందజేస్తోంది. పరలోకాన్ని విశ్వసించని వారికి మేము వ్యథా భరితమైన శిక్షను సిద్ధపరచి ఉంచాము అనే వార్తను వినిపిస్తోంది.

---

అయివుంటే, లేదా ధ్యానదర్శనమే అయివుంటే "సమస్త బలహీనతలకు, లోపాలకు అతీతుడూ పరిశుద్ధుడూ అయిన ఆయన" అని పరిచయం చెయ్యవలసిన పనిలేదు. పైగా "ఒక రాత్రి తన దాసుణ్ణి తీసుకుపోయాడు" అనే పదాలు కూడా శారీరక ప్రయాణాన్నే స్పష్టంగా నిరూపిస్తున్నాయి. స్వప్న యాత్రకు లేక ధ్యాన యాత్రకు ఈ పదాలు ఏ విధంగానూ సముచితమైనవి కాలేవు. కనుక ఇది కేవలం ఒక ఆధ్యాత్మిక అనుభవం కాదు అనీ, మహాప్రవక్త (సఅసమ్)చే అల్లాహ్ చేయించిన శారీరక ప్రయాణం అనీ, ప్రత్యక్ష సందర్శనం అనీ ఒప్పుకోవడం తప్ప మనకు మార్గాంతరం లేదు.

2. అంటే, నమ్మదగినవాడూ ఆధారపడదగినవాడూ అయిన ఆయనపై మనం భారం మోపవచ్చు. ఆయనకు మన వ్యవహారాలను అప్పగించవచ్చు. ఆయన వైపునకు మార్గదర్శకత్వం కోసమైె, సహాయం కోసమైె మరలవచ్చు.

3. గ్రంథం అంటే ఇక్కడ తౌరాతు గ్రంథం అని భావం కాదు. సమస్త ఆకాశ గ్రంథాల సంకలనం అని భావం. దాని కొరకు ఖురానులో పారిభాషికంగా "అల్ కితాబ్" అనే పదం పలుచోట్ల ఉపయోగించబడింది.

4. అసీరియన్ల, బాబిలోనియన్ల చేతులలో ఇస్రాయీలు సంతతికి కలిగిన భయంకరమైన వినాశం అని దీని భావం.

وَ يَدۡعُ الۡاِنۡسَانُ بِالشَّرِّ دُعَآءَهٗ بِالۡخَيۡرِ ؕ
وَكَانَ الۡاِنۡسَانُ عَجُوۡلًا ⑪ وَ جَعَلۡنَا الَّيۡلَ وَ
النَّهَارَ اٰيَتَيۡنِ فَمَحَوۡنَاۤ اٰيَةَ الَّيۡلِ وَ جَعَلۡنَاۤ اٰيَةَ
النَّهَارِ مُبۡصِرَةً لِّتَبۡتَغُوۡا فَضۡلًا مِّنۡ رَّبِّكُمۡ وَ
لِتَعۡلَمُوۡا عَدَدَ السِّنِيۡنَ وَالۡحِسَابَ ؕ وَ كُلَّ شَىۡءٍ
فَصَّلۡنٰهُ تَفۡصِيۡلًا ⑫ وَكُلَّ اِنۡسَانٍ اَلۡزَمۡنٰهُ
طٰۤـئِرَهٗ فِىۡ عُنُقِهٖ ؕ وَ نُخۡرِجُ لَهٗ يَوۡمَ الۡقِيٰمَةِ
كِتٰبًا يَّلۡقٰهُ مَنۡشُوۡرًا ⑬ اِقۡرَاۡ كِتٰبَكَ ؕ كَفٰى
بِنَفۡسِكَ الۡيَوۡمَ عَلَيۡكَ حَسِيۡبًا ⑭ مَنِ
اهۡتَدٰى فَاِنَّمَا يَهۡتَدِىۡ لِنَفۡسِهٖ ۚ وَ مَنۡ ضَلَّ
فَاِنَّمَا يَضِلُّ عَلَيۡهَا ؕ وَ لَا تَزِرُ وَازِرَةٌ وِّزۡرَ
اُخۡرٰى ؕ وَ مَا كُنَّا مُعَذِّبِيۡنَ حَتّٰى نَبۡعَثَ
رَسُوۡلًا ⑮

**11** మానవుడు మేలును ఎలా అర్థించాలో కీడును అలా అర్థిస్తాడు. మానవుడు నిజంగానే తొందరపాటు కలవాడు, ఓర్పులేనివాడు.[6]

**12** చూడండి, మేము రాత్రినీ పగలునూ రెండు సూచనలుగా చేశాము. రాత్రి సూచనను మేము కాంతిహీనం చేశాము, పగటి సూచనను కాంతి మంతం చేశాము, మీరు మీ ప్రభువు అనుగ్రహాన్ని అన్వేషించగలగటానికి, ఇంకా నెలల, సంవత్సరాల లెక్కను తెలుసుకోగలగటానికి. ఇదేవిధంగా మేము ప్రతి విషయాన్నీ వేరువేరుగా స్పష్టపరచి ఉంచాము.

**13 - 14** ప్రతి మనిషి జాతకాన్ని మేము అతని మెడకే వ్రేలాడగట్టాము.[7] ప్రళయంనాడు మేము ఒక పుస్తకాన్ని అతని కొరకు బయటికి తీస్తాము. అతడు దాన్ని ఒక తెరచిన గ్రంథం వంటిదని తెలుసుకుంటాడు– చదువు నీ కర్మపత్రాన్ని, ఈనాడు నీ లెక్క కట్టటానికి స్వయంగా నీవే సరిపోతావు.

**15** ఋజుమార్గాన్ని అవలంబించేవాని ఋజువర్తనం స్వయంగా వానికే ప్రయోజనకరం. మార్గం తప్పినవాడు తన మార్గభ్రష్టత్వం యొక్క దుష్ఫలితాన్ని తానే అనుభవిస్తాడు. బరువు మోసేవాడెవడూ ఇతరుల బరువును మోయడు.[8] (ప్రజలకు సత్యాసత్యాల భేదాన్ని తెలియజెప్పే) ఒక సందేశ హరుణ్ణి పంపనంత వరకు మేము ఎవరినీ శిక్షించము.

5. అంటే రోమన్లు అని భావం. వారు బైతుల్ మఖ్‌దిస్‌ను పూర్తిగా ధ్వంసం చేశారు. ఇస్రాయీలు సంతతిని చావగొట్టి పాలస్తీనా నుండి వెళ్ళగొట్టారు. నేటికీ రెండువేల సంవత్సరాల తరువాత కూడా వారు చెల్లాచెదరై స్థిమితం లేకుండా ప్రపంచమంతటా తిరుగుతున్నారు.

6. “సరే, నీవు మమ్మల్ని భయపెడుతూ ఉన్న ఆ శిక్షను తీసుకురా” అని మక్కా అవిశ్వాసులు మాటిమాటికి మహాప్రవక్త (సఅసమ్)తో అనే మూర్ఖపు మాటలకు ఇది సమాధానం. పై ఉపన్యాసం తరువాత అకస్మాత్తుగా ఈ వాక్యాన్ని చెప్పటానికి కారణం “బుద్ధిహీనులారా! మేలును కోరటానికి బదులు శిక్షను కోరుకుంటున్నారా? ఒక జాతిపైకి దేవుని శిక్ష వచ్చిపడితే, దాని గతి ఏమవుతుందో మీకు అసలేమైనా తెలుసా?” అని హెచ్చరిక చెయ్యటానికే. దీనితోపాటు ఈ వాక్యంలో ఒక సూక్ష్మమైన హెచ్చరిక ముస్లిములకు కూడా ఉన్నది. వారు అవిశ్వాసుల దుర్మార్గానికీ, హింసలకూ, వారి మొండి వైఖరికీ విసిగి వేసారిపోయి సహనాన్ని కోల్పోయి వారిపై శిక్ష అవతరించాలని అప్పుడప్పుడు ప్రార్థిస్తూ ఉండేవారు. వాస్తవానికి ఆ అవిశ్వాసులలోనే ముప్ముందు విశ్వసించి ప్రపంచమంతా ఇస్లామ్ జెండాను ఎగురవేసేవారూ ఉన్నారు. దానిపై అల్లాహ్ ఇలా అంటున్నాడు: మానవుడు నిజంగానే సహనం లేనివాడు. తక్షణం అతనికి అవసరమయినదిగా కనిపించే ప్రతిదానినీ కోర్తాడు. ఒకవేళ ఆ సమయంలో అతని ప్రార్థన అంగీకరించబడి ఉన్నట్లయితే, అది అతనికి మేలు చేసేది కాదు అని తరువాత, అతనికే స్వయంగా అనుభవపూర్వకంగా తెలిసిపోతుంది.

وَ اِذَآ اَرَدْنَآ اَنْ نُّهْلِكَ قَرْيَةً اَمَرْنَا
مُتْرَفِيْهَا فَفَسَقُوْا فِيْهَا فَحَقَّ عَلَيْهَا الْقَوْلُ
فَدَمَّرْنٰهَا تَدْمِيْرًا ﴿١٦﴾ وَ كَمْ اَهْلَكْنَا مِنَ
الْقُرُوْنِ مِنْۢ بَعْدِ نُوْحٍ ؕ وَكَفٰى بِرَبِّكَ
بِذُنُوْبِ عِبَادِهٖ خَبِيْرًۢا بَصِيْرًا ﴿١٧﴾ مَنْ كَانَ
يُرِيْدُ الْعَاجِلَةَ عَجَّلْنَا لَهٗ فِيْهَا مَا نَشَآءُ لِمَنْ
نُّرِيْدُ ثُمَّ جَعَلْنَا لَهٗ جَهَنَّمَ ۚ يَصْلٰىهَا مَذْمُوْمًا
مَّدْحُوْرًا ﴿١٨﴾ وَ مَنْ اَرَادَ الْاٰخِرَةَ وَ سَعٰى لَهَا
سَعْيَهَا وَ هُوَ مُؤْمِنٌ فَاُولٰٓئِكَ كَانَ سَعْيُهُمْ
مَّشْكُوْرًا ﴿١٩﴾ كُلًّا نُّمِدُّ هٰٓؤُلَآءِ وَ هٰٓؤُلَآءِ مِنْ
عَطَآءِ رَبِّكَ ؕ وَ مَا كَانَ عَطَآءُ رَبِّكَ
مَحْظُوْرًا ﴿٢٠﴾ اُنْظُرْ كَيْفَ فَضَّلْنَا بَعْضَهُمْ عَلٰى
بَعْضٍ ؕ وَ لَلْاٰخِرَةُ اَكْبَرُ دَرَجٰتٍ وَّ اَكْبَرُ
تَفْضِيْلًا ﴿٢١﴾ لَا تَجْعَلْ مَعَ اللّٰهِ اِلٰهًا اٰخَرَ
فَتَقْعُدَ مَذْمُوْمًا مَّخْذُوْلًا ﴿٢٢﴾ ع وَ قَضٰى رَبُّكَ
اَلَّا تَعْبُدُوْٓا اِلَّآ اِيَّاهُ وَبِالْوَالِدَيْنِ اِحْسَانًا ؕ
اِمَّا يَبْلُغَنَّ عِنْدَكَ الْكِبَرَ اَحَدُهُمَآ اَوْ كِلٰهُمَا
فَلَا تَقُلْ لَّهُمَآ اُفٍّ وَّ لَا تَنْهَرْهُمَا وَ قُلْ لَّهُمَا
قَوْلًا كَرِيْمًا ﴿٢٣﴾ وَ اخْفِضْ لَهُمَا جَنَاحَ الذُّلِّ
مِنَ الرَّحْمَةِ وَ قُلْ رَّبِّ ارْحَمْهُمَا كَمَا رَبَّيٰنِيْ
صَغِيْرًا ﴿٢٤﴾

**16 - 17** మేము ఒక పట్టణాన్ని నాశనం చెయ్యదలచుకున్నప్పుడు, అందలి స్థితిమంతులకు మొదట ఒక ఆజ్ఞను పంపుతాము. వారు ఆ ఆజ్ఞ విషయంలో అవిధేయతకు పాల్పడతారు. అప్పుడు శిక్షానిర్ణయానికి ఆ పట్టణం అర్హమవుతుంది. మేము దానిని సర్వనాశనం చేసివేస్తాము.[9] చూడు, నూహ్ తరువాత మా ఆజ్ఞ ప్రకారం నాశనమైన తరాలు ఎన్ని ఉన్నాయో. నీ ప్రభువునకు తన దాసుల పాపాలను గురించి పూర్తిగా తెలుసు. ఆయన సర్వాన్నీ చూస్తూ ఉన్నాడు.

**18 - 21** (ఈ లోకంలో) తక్షణ లాభాలను కోరుకునే వాడికి ఇక్కడే వాటిని మేము ఇచ్చివేస్తాము, ఎవరికి ఎంత ఇవ్వదలచుకుంటామో అంత మేరకు. తరువాత అతని జాతకంలో నరకం వ్రాసేస్తాము. అందులో అతడు దహింపబడతాడు, దూషింపబడినవాడై కారుణ్యానికి దూరమైనవాడై. పరలోకాన్ని కోరుకుని దానికై కృషి చెయ్యవలసిన విధంగా కృషిచేసేవాడు గనక అయితే పైగా అతడు విశ్వాసి కూడా అయివుంటే - అటువంటి ప్రతి వ్యక్తి కృషీ గుర్తింపబడుతుంది.[10] వీరికీ వారికీ, ఉభయపక్షాల వారికీ మేము (ప్రపంచంలో) జీవనసామగ్రిని ఇస్తూ పోతున్నాము. ఇది నీ ప్రభువు ప్రసాదించినది. నీ ప్రభువు ప్రసాదించిన దానిని ఆపగలిగే వాడెవడూ లేడు. కాని చూడండి, ప్రపంచంలోనే మేము ఒక వర్గానికి మరొక వర్గంపై ఎటు వంటి ఆధిక్యాన్ని ప్రసాదించామో.[11] పరలోకంలో ఆ వర్గం స్థానాలు మరింత గొప్పగా ఉంటాయి. దాని ఆధిక్యం మరింత పెరుగుతుంది.

**22** నీవు అల్లాహ్‌తోపాటు మరొకణ్ణి ఆరాధ్యుడుగా చేసుకోకు. అలా చేసు కుంటే నిందలపాలవుతావు. స్నేహితుడూ, సహాయకుడూ ఎవడూ లేనివాడవై పోతావు.

**23 - 37** నీ ప్రభువు ఇలా నిర్ణయం చేశాడు: మీరు కేవలం ఆయనను తప్ప మరెవరినీ ఆరాధించకండి. తల్లిదండ్రులతో మంచితనంతో వ్యవహరించండి. ఒకవేళ మీవద్ద వారిలో ఒకరు గాని ఇద్దరు గాని ముసలివారై ఉంటే, వారి ముందు విసుగ్గా "ఛీ" అని కూడా అనకండి. వారిని కసురుకుంటూ సమాధానం ఇవ్వకండి. వారితో మర్యాదగా మాట్లాడండి. మృదుత్వమూ, దయాభావమూ కలిగి వారి ముందు వినమ్రులై ఉండండి. ఇలా ప్రార్థిస్తూ ఉండండి: "ప్రభూ! వారిపై కరుణజూపు, బాల్యంలో వారు నన్ను కారుణ్యంతో,వాత్సల్యంతో పోషించినట్లు."

رَبُّكُمْ اَعْلَمُ بِمَا فِيْ نُفُوْسِكُمْ ؕ اِنْ تَكُوْنُوْا
صٰلِحِيْنَ فَاِنَّهٗ كَانَ لِلْاَوَّابِيْنَ غَفُوْرًا ﴿٢٥﴾ وَاٰتِ
ذَا الْقُرْبٰى حَقَّهٗ وَالْمِسْكِيْنَ وَ ابْنَ السَّبِيْلِ وَ لَا
تُبَذِّرْ تَبْذِيْرًا ﴿٢٦﴾ اِنَّ الْمُبَذِّرِيْنَ كَانُوْٓا اِخْوَانَ
الشَّيٰطِيْنِ ؕ وَ كَانَ الشَّيْطٰنُ لِرَبِّهٖ كَفُوْرًا ﴿٢٧﴾ وَ
اِمَّا تُعْرِضَنَّ عَنْهُمُ ابْتِغَآءَ رَحْمَةٍ مِّنْ رَّبِّكَ
تَرْجُوْهَا فَقُلْ لَّهُمْ قَوْلًا مَّيْسُوْرًا ﴿٢٨﴾ وَ لَا تَجْعَلْ
يَدَكَ مَغْلُوْلَةً اِلٰى عُنُقِكَ وَ لَا تَبْسُطْهَا كُلَّ
الْبَسْطِ فَتَقْعُدَ مَلُوْمًا مَّحْسُوْرًا ﴿٢٩﴾ اِنَّ رَبَّكَ
يَبْسُطُ الرِّزْقَ لِمَنْ يَّشَآءُ وَيَقْدِرُ ؕ اِنَّهٗ كَانَ
بِعِبَادِهٖ خَبِيْرًا بَصِيْرًا ﴿٣٠﴾ وَ لَا تَقْتُلُوْٓا اَوْلَادَكُمْ ع
خَشْيَةَ اِمْلَاقٍ ؕ نَحْنُ نَرْزُقُهُمْ وَاِيَّاكُمْ ؕ اِنَّ
قَتْلَهُمْ كَانَ خِطْاً كَبِيْرًا ﴿٣١﴾ وَ لَا تَقْرَبُوا الزِّنٰٓى
اِنَّهٗ كَانَ فَاحِشَةً ؕ وَ سَآءَ سَبِيْلًا ﴿٣٢﴾ وَ لَا
تَقْتُلُوا النَّفْسَ الَّتِيْ حَرَّمَ اللّٰهُ اِلَّا بِالْحَقِّ ؕ وَ
مَنْ قُتِلَ مَظْلُوْمًا فَقَدْ جَعَلْنَا لِوَلِيِّهٖ سُلْطٰنًا فَلَا
يُسْرِفْ فِّي الْقَتْلِ ؕ اِنَّهٗ كَانَ مَنْصُوْرًا ﴿٣٣﴾ وَ لَا
تَقْرَبُوْا مَالَ الْيَتِيْمِ اِلَّا بِالَّتِيْ هِيَ اَحْسَنُ حَتّٰى
يَبْلُغَ اَشُدَّهٗ ۪ وَاَوْفُوْا بِالْعَهْدِ ۚ اِنَّ الْعَهْدَ كَانَ
مَسْئُوْلًا ﴿٣٤﴾ وَ اَوْفُوا الْكَيْلَ اِذَا كِلْتُمْ وَزِنُوْا
بِالْقِسْطَاسِ الْمُسْتَقِيْمِ ؕ ذٰلِكَ خَيْرٌ وَّاَحْسَنُ تَاْوِيْلًا ﴿٣٥﴾
وَ لَا تَقْفُ مَا لَيْسَ لَكَ بِهٖ عِلْمٌ ؕ اِنَّ السَّمْعَ
وَ الْبَصَرَ وَ الْفُؤَادَ كُلُّ اُولٰٓئِكَ كَانَ عَنْهُ
مَسْئُوْلًا ﴿٣٦﴾ وَ لَا تَمْشِ فِي الْاَرْضِ مَرَحًا ۚ اِنَّكَ
لَنْ تَخْرِقَ الْاَرْضَ وَ لَنْ تَبْلُغَ الْجِبَالَ طُوْلًا ﴿٣٧﴾

మీ హృదయాలలో ఉన్నది ఏమిటో మీ ప్రభువునకు బాగా తెలుసు. మీరు గనక మంచివారుగా నడుచుకుంటే – తమ తప్పులను గ్రహించి దాస్యవైఖరి వైపునకు మరలివచ్చే ఇలాంటి వారందరినీ ఆయన మన్నిస్తాడు. బంధువుల పట్ల మీ విధులను నిర్వహించండి. పేదవారిపట్ల, బాటసారులపట్ల, మీ విధులను నిర్వర్తించండి. వృధా ఖర్చు చెయ్యకండి. వృధా ఖర్చు చేసేవారు షైతాను సోదరులు. షైతాను తన ప్రభువునకు కృతఘ్నుడు. మీరు ఆశించే అల్లాహ్ కారుణ్యాన్ని మీరు ఇంకా అన్వేషిస్తూ ఉన్నందువల్ల, మీరు వారిని (అంటే అవసరాలు తీరని బంధువులు, లేమికి గురిఅయినవారు,బాటసారులు) తప్పించుకోవలసి ఉంటే, వారికి మృదువుగా సమాధానం చెప్పండి. మీ చేతిని మెడకు బంధించి ఉంచకండి, దానిని పూర్తిగా స్వేచ్ఛగానూ వదలి పెట్టకండి.[12] అలాచేస్తే నిందల పాలవుతారు, దిక్కులేని వారవుతారు. నీ ప్రభువు తన ఇష్టప్రకారం కొందరి ఉపాధిని సమృద్ధం చేస్తాడు. కొందరి ఉపాధిని పరిమితం చేస్తాడు. ఆయన తన దాసుల స్థితిని బాగా ఎరుగును. ఆయన వారిని పరికిస్తున్నాడు. పేదరికానికి భయపడి మీరు మీ సంతానాన్ని హత్య చేయకండి. మేము వారికీ ఉపాధిని ఇస్తాము, మీకూ ఇస్తాము. వాస్తవానికి వారిని హత్య చేయటం ఒక పెద్ద నేరం. వ్యభిచారం దరిదాపులకు కూడా పోకండి. అది అతిదుష్ట కార్యం. బహుచెడ్డ మార్గం. ఏ ప్రాణాన్నీ హత మార్చకండి న్యాయంగా తప్ప. దానిని హత మార్చడాన్ని అల్లాహ్ నిషేధించాడు. అన్యాయంగా హత్య చేయబడిన మనిషి వారసునికి మేము "ఖిసాస్"ను కోరే హక్కును ప్రసాదించాము.[13] కాని ఆ వారసుడు హత్యలో హద్దులు మీరకుండా ఉండాలి.[14] అప్పుడు అతనికి సహాయం చెయ్యటం జరుగుతుంది.[15] సత్క్రమమైన పద్ధతిలో తప్ప అనాథుని సొమ్ము జోలికిపోకండి, అతడు యుక్త వయస్సునకు చేరేవరకు. చేసిన వాగ్దానాన్ని నెరవేర్చండి. నిస్సందేహంగా వాగ్దానం విషయంలో మీరు సమాధానం చెప్పవలసి ఉంటుంది. కొలపాత్రతో ఇస్తే, పూర్తిగా నింపి ఇవ్వండి, తూచినట్లయితే సరైన తరాజుతో తూచండి. ఇది మంచి పద్ధతి. పర్యవసానాన్ని బట్టి కూడా ఇదే ఉత్తమం. మీకు తెలియని విషయం వెంటపడకండి.[16] నిశ్చయంగా కళ్ళూ, చెవులూ, మనస్సూ అన్నింటి విషయంలోనూ విచారణ జరుగుతుంది. భూమిపై విర్రవీగుతూ నడవకండి. మీరు భూమిని చీల్చనూ లేరు, పర్వతాల ఎత్తుకు చేరనూలేరు.

كُلُّ ذٰلِكَ كَانَ سَيِّئُهٗ عِنْدَ رَبِّكَ مَكْرُوْهًا ﴿٣٨﴾
ذٰلِكَ مِمَّآ اَوْحٰٓى اِلَيْكَ رَبُّكَ مِنَ الْحِكْمَةِ ؕ
وَ لَا تَجْعَلْ مَعَ اللّٰهِ اِلٰهًا اٰخَرَ فَتُلْقٰى فِىْ جَهَنَّمَ
مَلُوْمًا مَّدْحُوْرًا ﴿٣٩﴾ اَفَاَصْفٰىكُمْ رَبُّكُمْ
بِالْبَنِيْنَ وَ اتَّخَذَ مِنَ الْمَلٰٓئِكَةِ اِنَاثًا ؕ اِنَّكُمْ
لَتَقُوْلُوْنَ قَوْلًا عَظِيْمًا ﴿٤٠﴾

**38 - 39** ఈ ఆజ్ఞలలో ఏ ఒక్కదానిని అతిక్రమించినా అది నీ ప్రభువునకు అనిష్టమైనది.[17] ఇవి వివేకంతో నిండివున్న విషయాలు. వాటిని నీ ప్రభువు నీకు వహీద్వారా తెలియజేశాడు...

**39 - 40** ... చూడు! అల్లాహ్‌తో పాటు మరొకరిని ఆరాధ్యుడుగా చేసుకోకు. అలా చేస్తే నిందల పాలవుతావు. ప్రతి మేలుకూ దూరమవుతావు. నరకంలో పడవెయ్యబడతావు.[18]- మీ ప్రభువు మీకు కొడుకులను ప్రసాదించాడా, తాను మాత్రం దైవదూతలను తనకు కూతుళ్ళుగా చేసుకున్నాడా? ఎంత విచిత్రం! మీరు చెప్పే ఈ విషయం పరమ అబద్ధం.

7. అంటే, ప్రతి మానవుని అదృష్టం దురదృష్టాలూ, అతని ముగింపు యొక్క మంచి చెడులకు కారణాలూ స్వయంగా అతనిలోనే ఉన్నాయి.

8. అంటే, ప్రతి మానవుడూ ఒక శాశ్వతమైన నైతిక బాధ్యతను కలిగి ఉన్నాడు. వ్యక్తిగతంగా అతడు అల్లాహ్ ముందు జవాబుదారు. ఈ వ్యక్తిగత బాధ్యతలో మరొకవ్యక్తి ఎవడూ అతనికి భాగస్వామి కాదు అని అర్థం.

9. ఈ ఆయత్‌లో హెచ్చరించబడిన యథార్థం ఇది : ఒక సమాజాన్ని చివరకు నాశనం చేసేది, అందలి సంపన్నుల ఉన్నతవర్గాలవారి దుర్నడతయే. ఒక జాతికి వినాశకాలం దాపురించినప్పుడు అందలి సంపన్నులయిన ప్రజలూ అధికారం కలవారూ అవినీతికీ, అన్యాయానికీ పాల్పడతారు. దుర్మార్గం, హింస, నీతిబాహ్యమైన పనులు, ఆగడాలు మొదలయినవి చెయ్యటం ప్రారంభిస్తారు. చివరకు ఈ ఉపద్రవమే జాతిని ముంచివేస్తుంది. కనుక తనకు తాను శత్రువు కాని సమాజం తన అధికారపగ్గాలనూ, ఆర్థిక ఒనరులనూ, అల్పమనస్కులూ, అవినీతిపరులూ అయిన వారి చేతులలోకి పోకుండా జాగ్రత్తపడాలి.

10. అంటే, అతడు చేసిన పనికి తగిన విలువ ఇవ్వబడుతుంది. అతడు పరలోక సాఫల్యం కొరకు చేసిన ప్రయత్నాలకు అనుగుణంగా ప్రతిఫలాన్ని తప్పకుండా పొందుతాడు.

11. అంటే, పరలోక ప్రియులు ఇహలోక వ్యామోహపరులపై ఆధిక్యాన్ని కలిగివుంటారు. ఈ భేదం ప్రపంచంలోనే ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. ఈ ఆధిక్యానికి కారణం వారి భోజనం, దుస్తులూ, ఇళ్ళూ, వాహనాలూ, సభ్యతా, సంస్కృతులూ మొదలగు వాని దర్పం కాదు. కారణం ఏమిటంటే వారు పొందే ప్రతిదానినీ సత్యసంధత, న్యాయబుద్ధి, విశ్వసనీయతల ద్వారా పొందుతారు. కాని ఇహలోక వ్యామోహపరులు పొందే ప్రతిదానినీ దుర్మార్గం ద్వారా, అన్యాయం ద్వారా, రకరకాల అక్రమమార్గాల ద్వారా పొందుతున్నారు. పరలోక ప్రియులకు లభించేదల్లా సమంజసంగా ఖర్చవుతుంది. దాని నుండి హక్కుదారుల హక్కులు ఇవ్వబడతాయి. అక్కరగలవారికీ, నిరుపేదలకూ భాగం తీయబడుతుంది. దేవుని మెప్పు పొందే నిమిత్తం సత్కార్యాలలో కూడా ఖర్చు చెయ్యబడుతుంది. దీనికి భిన్నంగా ఇహలోక వ్యామోహపరులకు లభించేది ఎక్కువగా భోగాలకూ, నిషిద్ధ కార్యాలకూ, కల్లోలాన్ని రేకెత్తించే రకరకాల పనులకూ నీళ్ళు మాదిరిగా ప్రవహింపజెయ్యబడుతుంది. ఇట్లే పరలోక ప్రియుల జీవితం ఇహలోక వ్యామోహపరుల జీవితం కంటే అన్ని విధాలా ఉన్నతమయినదిగా ఉంటుంది.

وَ لَقَدْ صَرَّفْنَا فِيْ هٰذَا الْقُرْاٰنِ لِيَذَّكَّرُوْا ؕ وَ
مَا يَزِيْدُهُمْ اِلَّا نُفُوْرًا ﴿۴۱﴾ قُلْ لَّوْ كَانَ مَعَهٗۤ
اٰلِهَةٌ كَمَا يَقُوْلُوْنَ اِذًا لَّابْتَغَوْا اِلٰى ذِى
الْعَرْشِ سَبِيْلًا ﴿۴۲﴾ سُبْحٰنَهٗ وَ تَعٰلٰى عَمَّا
يَقُوْلُوْنَ عُلُوًّا كَبِيْرًا ﴿۴۳﴾ تُسَبِّحُ لَهُ السَّمٰوٰتُ
السَّبْعُ وَ الْاَرْضُ وَ مَنْ فِيْهِنَّ ؕ وَ اِنْ مِّنْ
شَيْءٍ اِلَّا يُسَبِّحُ بِحَمْدِهٖ وَ لٰكِنْ لَّا تَفْقَهُوْنَ
تَسْبِيْحَهُمْ ؕ اِنَّهٗ كَانَ حَلِيْمًا غَفُوْرًا ﴿۴۴﴾ وَ اِذَا
قَرَاْتَ الْقُرْاٰنَ جَعَلْنَا بَيْنَكَ وَ بَيْنَ الَّذِيْنَ
لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ حِجَابًا مَّسْتُوْرًا ﴿۴۵﴾ وَّ
جَعَلْنَا عَلٰى قُلُوْبِهِمْ اَكِنَّةً اَنْ يَّفْقَهُوْهُ وَ فِيْۤ
اٰذَانِهِمْ وَقْرًا ؕ وَ اِذَا ذَكَرْتَ رَبَّكَ فِي الْقُرْاٰنِ
وَحْدَهٗ وَلَّوْا عَلٰۤى اَدْبَارِهِمْ نُفُوْرًا ﴿۴۶﴾ نَحْنُ
اَعْلَمُ بِمَا يَسْتَمِعُوْنَ بِهٖۤ اِذْ يَسْتَمِعُوْنَ اِلَيْكَ وَ
اِذْ هُمْ نَجْوٰۤى اِذْ يَقُوْلُ الظّٰلِمُوْنَ اِنْ تَتَّبِعُوْنَ
اِلَّا رَجُلًا مَّسْحُوْرًا ﴿۴۷﴾ اُنْظُرْ كَيْفَ ضَرَبُوْا لَكَ
الْاَمْثَالَ فَضَلُّوْا فَلَا يَسْتَطِيْعُوْنَ سَبِيْلًا ﴿۴۸﴾ ع

**41 - 44** మేము ఈ ఖురానులో ప్రజలకు రకరకాలుగా బోధించాము. వారు స్పృహలోకి రావాలని. కాని వారు సత్యానికి మరింత దూరంగానే పారిపోతున్నారు. ప్రవక్తా! వారితో ఇలా అను: ఒకవేళ అల్లాహ్‌తో పాటు, వారు అనేవిధంగా ఇతర దేవుళ్ళు కూడా ఉంటే వారు సింహాసనాధీశుని స్థానానికి చేరే ప్రయత్నాన్ని తప్పకుండా చేస్తారు. ఆయన పరిశుద్ధుడు. వారు చెప్పే మాటలకు ఎంతో అతీతుడు, ఎంతో ఉన్నతుడు. ఆయన పరిశుద్ధతను సప్తాకాశాలూ, భూమీ, భూమ్యాకాశాలలో ఉన్న సమస్తమూ కొనియాడుతున్నాయి.[19] ఆయన స్తోత్రంతో పాటు ఆయన పరిశుద్ధతను కొనియాడనటువంటిది ఏదీ లేదు. కాని మీరు వాటి స్తుతిని అర్థం చేసుకోలేరు. యథార్థానికి ఆయన అత్యంత సౌమ్య మనస్కుడు, మన్నించేవాడూను.

**45 - 48** నీవు ఖురానును పఠించేటప్పుడు మేము నీకూ, పరలోకాన్ని విశ్వసించని వారికీ మధ్య ఒక తెరను అడ్డుగా నిలుపుతాము. వారి హృదయాలకు గలేబులు తొడుగుతాము. ఇక వారు ఏమీ అర్థం చేసుకోలేరు. వారి చెవులను మొద్దుబారజేస్తాము.[20] నీవు ఖురాను పఠిస్తూ నీ ఏకైక ప్రభువును గురించి మాత్రమే ప్రస్తావించినప్పుడు, వారు అసహ్యించుకుంటూ ముఖాలను ప్రక్కకు త్రిప్పుకుంటారు.[21] నీ మాటను చెవియొగ్గి విన్నప్పుడు అసలు వారు ఏమి వింటారో, కూర్చుండి పరస్పరం గుసగుసలాడుకున్నప్పుడు ఏమి చెప్పుకుంటారో మాకు తెలుసు. ఈ దుర్మార్గులు పరస్పరం ఇలా చెప్పుకుంటారు: "మీరు అనుసరిస్తున్న ఈ మనిషి మంత్రప్రభావానికి గురిఅయినవాడు."[22] చూడు, వారు ఎటువంటి మాటలను నిన్ను గురించి కల్పిస్తున్నారో! వారు మార్గం తప్పారు. కాబట్టి వారికి సరైన మార్గం దొరకదు.

12. చేతిని బంధించి ఉంచటం అనేది లోభత్వానికి సంకేతంగా వాడబడింది. దానిని స్వేచ్ఛగా వదలిపెట్టటం అంటే దుబారా ఖర్చుపెట్టటం అని భావం.

13. అసలు పదాలు ఇవి : "అతని వారసునికి మేము 'సుల్‌తాన్'ను ప్రసాదించాము." "సుల్తాన్" అంటే ఇక్కడ "వాదము" (హక్కు) అని భావం. దాని ఆధారంగా అతడు "కిసాస్"ను కోరగలుగుతాడు.

14. హత్యలో హద్దులు మీరటం అనేది అనేక రూపాలలో ఉండవచ్చు. అవన్నీ నిషేధించబడ్డాయి. ఉదాహరణకు, ప్రతీకార ఉద్రేకంలో అపరాధితో పాటు ఇతరులను కూడా వధించటం, లేదా అపరాధిని చిత్రహింసలకు గురిచేసి చంపటం లేదా చంపిన తరువాత అతని శవంపై కసి తీర్చుకోవటం లేదా రక్తపరిహారం తీసుకున్న తరువాత అతనిని చంపటం వగైరా.

15. అప్పటివరకు ఇస్లామీ ప్రభుత్వం ఏర్పడలేదు కాబట్టి, అతనికి ఎవరు సహాయం చెయ్యాలి అనే విషయం

49 - 52 వారు ఇలా అంటారు: "మేము ఎముకలుగా, మట్టిగా మారిపోయినప్పుడు, సరికొత్తగా సృష్టింపబడి లేపబడతామా?" - వారితో ఇలా అను: "మీరు రాయిగాగాని ఇనుముగాగాని మారిపోయినా లేదా తిరిగి బ్రతికింపబడి లేపబడటానికి అసాధ్యమైనదని మీరు భావిస్తున్నటువంటి వాటికంటే కూడా ఎక్కువ కఠినమైనటువంటి వస్తువుగా మారిపోయినాసరే (మీరు లేచి తీరుతారు)." వారు తప్పకుండా ఇలా అడుగుతారు: "మమ్మల్ని మళ్ళీ బ్రతికించి లేపగలవాడు ఎవడు?" సమాధానంగా ఇలా అను: "మిమ్మల్ని మొదటిసారి పుట్టించినవాడే." వారు తలలు ఊపుతూ[23] "సరే, ఇది ఎప్పుడు జరుగుతుంది?" అని అడుగుతారు. నీవు ఇలా చెప్పు: "ఆ సమయం దగ్గరలోనే ఉందన్నా ఆశ్చర్యపడనక్కరలేదు. ఆనాడు ఆయన మిమ్మల్ని పిలుస్తాడు. మీరు ఆయనను స్తుతిస్తూ ఆయన పిలుపునకు సమాధానంగా బయటకు వస్తారు." అప్పుడు మీరు "మేము కేవలం కొంత సేపు మాత్రమే ఈ స్థితిలో పడివున్నాము"[24] అని అనుకుంటారు.

وَ قَالُوۡۤا ءَاِذَا كُنَّا عِظَامًا وَّ رُفَاتًا ءَ اِنَّا
لَمَبۡعُوۡثُوۡنَ خَلۡقًا جَدِيۡدًا ﴿۴۹﴾ قُلۡ كُوۡنُوۡا
حِجَارَةً اَوۡ حَدِيۡدًا ﴿۵۰﴾ اَوۡ خَلۡقًا مِّمَّا يَكۡبُرُ فِىۡ
صُدُوۡرِكُمۡ‌ ۚ فَسَيَقُوۡلُوۡنَ مَنۡ يُّعِيۡدُنَا ‌ؕ قُلِ
الَّذِىۡ فَطَرَكُمۡ اَوَّلَ مَرَّةٍ‌ ۚ فَسَيُنۡغِضُوۡنَ اِلَيۡكَ
رُءُوۡسَهُمۡ وَيَقُوۡلُوۡنَ مَتٰى هُوَ‌ ؕ قُلۡ عَسٰٓى اَنۡ
يَّكُوۡنَ قَرِيۡبًا ﴿۵۱﴾ يَوۡمَ يَدۡعُوۡكُمۡ فَتَسۡتَجِيۡبُوۡنَ
بِحَمۡدِهٖ وَتَظُنُّوۡنَ اِنۡ لَّبِثۡتُمۡ اِلَّا قَلِيۡلًا ﴿۵۲﴾ ع

తెలియజేయబడలేదు. వలస తరువాత మదీనా పట్టణంలో ఇస్లామీ ప్రభుత్వం ఏర్పడినప్పుడు, అతనికి సహాయం చెయ్యటం అనేది అతని తెగవారి యొక్కయూ, అతని మిత్రపక్షం వారి యొక్కయూ పనికాదు అనీ, అది ఇస్లామీ ప్రభుత్వం దాని న్యాయస్థానాల యొక్క బాధ్యత అనీ నిర్ణయించబడింది. ఏ వ్యక్తికయినా, ఏ వర్గానికయినా స్వయంగా హత్యకు ప్రతీకారం చేసే అధికారం లేదు. ఆ పని ఇస్లామీ ప్రభుత్వానిది. కనుక న్యాయాన్ని పొందటానికి దాని సహాయాన్నే కోరాలి.

16. ఈ ఆజ్ఞ ఉద్దేశ్యం ఏమిటంటే, ప్రజలు తమ వ్యక్తిగతమైన, సామూహికమైన జీవితాలలో ఊహలకూ అనుమానాలకూ బదులు జ్ఞానాన్ని అనుసరించాలి అనేది.

17. అంటే, ఈ ఆజ్ఞలలో దేనిపట్ల అవిధేయత చూపినా అది అభిలషణీయం కాదు.

18. ఈ ఆజ్ఞ ప్రతి మానవుడికీ వర్తిస్తుంది. అంటే, "మానవుడా! నీవు ఈ పని చెయ్యకు" అని భావం.

19. అంటే, సమస్త విశ్వమూ అందులోని ప్రతి వస్తువూ అణువణువునా ఈ యథార్థానికి సాక్ష్యమిస్తున్నాయి - వాటిని పుట్టించి వాటికి పోషకుడుగా సంరక్షకుడుగా ఉంటున్న ఆయన ప్రతి లోపానికీ దోషానికీ బలహీనతకూ అతీతుడు. దైవత్వంలో ఆయనకు ఇతరులు భాగస్వాములు, సహచరులు అనే విషయానికి ఆయన పూర్తిగా అతీతుడు, పరిశుద్ధుడు.

20. అంటే, పరలోకాన్ని విశ్వసించకపోవటం వల్ల సంభవించే సహజసిద్ధమైన పరిణామం ఏమిటంటే, మనిషి హృదయానికి తాళం పడిపోతుంది. అతని చెవులు ఖురాను ప్రబోధించే సందేశాన్ని వినకుండా మూసుకుపోతాయి. ఖురాను సందేశానికైతే ఆధారాలు ఇవి : ప్రపంచ జీవితపు బాహ్యరూపాన్ని చూసి మోసపోవద్దు. సత్యాసత్యాల నిర్ణయాలు ఈ లోకంలో కాదు, పరలోకంలో జరుగుతాయి. పరలోకంలో మంచి ప్రతిఫలాన్ని కలిగించేదే సత్కార్యం, ప్రపంచంలో దానివల్ల మనిషికి ఎన్ని కష్టాలు కలిగినా సరే. పరలోకంలో తప్పనిసరిగా చెడు ప్రతిఫలాన్ని కలిగించేదే దుష్కార్యం; ప్రపంచంలో అది ఎంత రుచికరమైనదిగా, ఎంత ప్రయోజనకరమైనదిగా ఉన్నా సరే. కనుక పరలోకాన్నే విశ్వసించనివాడు ఖురానుయొక్క ఈ సందేశం పట్ల ఎలా శ్రద్ధ వహించగలడు?

وَ قُلْ لِّعِبَادِیْ یَقُوْلُوا الَّتِیْ هِیَ اَحْسَنُ ؕ اِنَّ
الشَّیْطٰنَ یَنْزَغُ بَیْنَهُمْ ؕ اِنَّ الشَّیْطٰنَ كَانَ
لِلْاِنْسَانِ عَدُوًّا مُّبِیْنًا ﴿۵۳﴾ رَبُّكُمْ اَعْلَمُ بِكُمْ ؕ
اِنْ یَّشَاْ یَرْحَمْكُمْ اَوْ اِنْ یَّشَاْ یُعَذِّبْكُمْ ؕ وَ مَاۤ
اَرْسَلْنٰكَ عَلَیْهِمْ وَكِیْلًا ﴿۵۴﴾ وَ رَبُّكَ اَعْلَمُ
بِمَنْ فِی السَّمٰوٰتِ وَ الْاَرْضِ ؕ وَ لَقَدْ فَضَّلْنَا
بَعْضَ النَّبِیّٖنَ عَلٰى بَعْضٍ وَّ اٰتَیْنَا دَاوٗدَ
زَبُوْرًا ﴿۵۵﴾ قُلِ ادْعُوا الَّذِیْنَ زَعَمْتُمْ مِّنْ
دُوْنِهٖ فَلَا یَمْلِكُوْنَ كَشْفَ الضُّرِّ عَنْكُمْ وَ لَا
تَحْوِیْلًا ﴿۵۶﴾ اُولٰٓىِٕكَ الَّذِیْنَ یَدْعُوْنَ یَبْتَغُوْنَ
اِلٰى رَبِّهِمُ الْوَسِیْلَةَ اَیُّهُمْ اَقْرَبُ وَ یَرْجُوْنَ
رَحْمَتَهٗ وَ یَخَافُوْنَ عَذَابَهٗ ؕ اِنَّ عَذَابَ رَبِّكَ
كَانَ مَحْذُوْرًا ﴿۵۷﴾

**53 - 54** ప్రవక్తా! నా దాసుల (అంటే విశ్వాసులైన దాసుల)కు, వారు తమనోట అత్యుత్తమమైన మాటనే పలుకుతూ ఉండాలి[25] అని చెప్పు. అసలు మానవుల మధ్య కలహాన్ని సృష్టించటానికి ప్రయత్నం చేసేవాడు షైతానే. నిజానికి షైతాను మానవుడికి బహిరంగ శత్రువు. మీ ప్రభువు మీ పరిస్థితిని బాగా ఎరుగును. ఆయన తన ఇష్టప్రకారం మిమ్మల్ని కరుణిస్తాడు. తన ఇష్టం ప్రకారం మిమ్మల్ని శిక్షిస్తాడు.[26] ప్రవక్తా! మేము నిన్ను ప్రజలకు సంరక్షకుడుగా నియమించి పంపలేదు.

**55** భూమ్యాకాశాలలోని ప్రాణికోటిని నీ ప్రభువు బాగా ఎరుగును. మేము కొందరు ప్రవక్తలకు మరి కొందరు ప్రవక్తల కంటే ఉన్నత స్థానాలను ఇచ్చాము. మేమే దావూదుకు జబూర్ గ్రంథాన్ని ఇచ్చాము.

**56 - 57** వారితో ఇలా అను: "మీరు దేవుణ్ణి కాదని (మీ పనులు నెరవేర్చే వారుగా) భావించి ఆరాధించే వారిని పిలిచి చూడండి. వారు మీ ఏ ఆపదనూ మరల్చనూలేరు,[27] మార్చనూ లేరు." ఈ ప్రజలు మొరపెట్టుకుంటున్న వారే స్వయంగా తమ ప్రభువు సాన్నిధ్యాన్ని పొందటానికి మార్గాన్ని వెతుకుతున్నారు. ఒకరితో ఒకరు పోటీపడుతున్నారు. వారు, ఆయన కారుణ్యాన్ని ఆశిస్తున్నారు. ఆయన శిక్షకు భయపడుతున్నారు.[28] నిజానికి నీ ప్రభువు శిక్షే భయపడదగినటువంటిది.

21. అంటే, నీవు కేవలం ఒక్క అల్లాహ్‌ను మాత్రమే ప్రభువుగా, స్వామిగా నిశ్చయించటం, ఆయన స్తోత్రగానమే చేస్తూ ఉండటం వారికి చాల దుస్సహంగా ఉంటుంది. వారు ఇలా అంటారు : ఇతడు ఒక విచిత్రమైన వ్యక్తి. ఇతని ప్రకారం అగోచరజ్ఞానం ఉన్నది అల్లాహ్‌కు మాత్రమే. అధికారాలూ, హక్కులు కలవాడు అల్లాహ్ మాత్రమే. అసలు మేము పూజించే దేవుళ్ళు ఏమీ కారా? వారికి అసలు విలువే లేదా? వారేకదా మాకు సంతానం ఇస్తున్నదీ, రోగులకు స్వస్థత చేకూరుస్తున్నదీ, వ్యాపారాలను అభివృద్ధిపరుస్తున్నదీ, కోరికలు నెరవేరుస్తున్నది!

22. మక్కా అవిశ్వాసుల పరిస్థితి ఇలా ఉండేది : వారు దాగి దాగి ఖురాన్‌ను వినేవారు. దీనికి విరుగుడు ఏమిటి? అని పరస్పరం సంప్రదించుకునేవారు. తరచుగా వారికి తమ వారిలోనే ఎవరిపైనైనా బహుశా అతడు ఖురాను విని కొద్దిగా ప్రభావితుడయ్యాడేమో అనే అనుమానం కూడా కలిగేది. అందుకని వారంతా కలిసి అతనికి ఇలా నచ్చజెప్పేవారు : "ఏమండీ, మీరు ఎటువంటి మనిషి వలలో పడుతున్నారో తెలుసా? ఈ మనిషి మంత్ర ప్రభావానికి గురిఅయ్యాడు. ఎవడో శత్రువు ఇతనికి చేతబడి చేశాడు. అందుకనే పిచ్చిపిచ్చిగా మాట్లాడుతున్నాడు."

23. మూలంలో ఉన్న "ఇన్‌గాజ్" అనే పదానికి భావం ఏమిటంటే, తలను పైనుండి క్రిందికి, క్రింది నుండి పైకి ఊపటం. ఒక మనిషి ఆశ్చర్యం వెలిబుచ్చటానికిగానీ హేళన చెయ్యటానికిగానీ ఇలా చేస్తాడు.

24. అంటే, ప్రపంచంలో మరణించిన సమయం నుండి ప్రళయం నాడు లేచే సమయం వరకు ఉన్న కాలం, మీకు కొన్ని గంటల కాలం కంటే ఎక్కువ అనిపించదు. మీరు ఆ సమయంలో, మేము కొంచెం సేపు నిద్రపోయ్యామో లేదో, అకస్మాత్తుగా ప్రళయ కోలాహలం మమ్మల్ని లేపింది అని అనుకుంటారు.

**58** ప్రళయానికి ముందు మేము నాశనం చెయ్యని లేక కఠిన శిక్షకు గురి చెయ్యని పట్టణమంటూ ఏదీ ఉండదు. ఈ విషయం దైవగ్రంథంలో వ్రాయబడి ఉన్నది.

**59 - 60** నిదర్శనాలను పంపకుండా మమ్మల్ని ఏదీ ఆపలేదు, వారికి పూర్వం ఉన్న ప్రజలు వాటిని తిరస్కరించారు అనే విషయం తప్ప.[29] (ఉదాహరణకు) సమూదుకు మేము ప్రత్యక్ష నిదర్శనంగా ఒక ఆడ ఒంటెను తెచ్చి ఇచ్చాము. వారు దానిపట్ల క్రూరంగా ప్రవర్తించారు. మేము నిదర్శనాలను పంపుతున్నది ప్రజలు వాటిని చూసి భయపడాలనే. జ్ఞాపకం తెచ్చుకో, ప్రవక్తా! నీ ప్రభువు ఈ ప్రజలను పరివేష్టించి ఉన్నాడని మేము నీకు ఇది వరకే చెప్పివున్నాము. మేము నీకు ఇప్పుడు చూపించిన దానినీ,[30] ఖురానులో శపించబడిన వృక్షాన్నీ[31] మేము వారికి ఒక పరీక్షగా చేశాము.[32] మేము వారికి హెచ్చరికపై హెచ్చరిక చేస్తూవున్నాము. కాని ప్రతి హెచ్చరిక వారి మూర్ఖత్వాన్ని పెంచుతూనే ఉన్నది.

**61 - 65** జ్ఞాపకం తెచ్చుకో: మేము దైవదూతలతో ఆదమ్‌కు సాష్టాంగ పడండి అని చెప్పాము. అప్పుడు అంతా సాష్టాంగ పడ్డారు. కాని ఇబ్లీసు అలా చెయ్యలేదు. వాడు "ఏమిటి నీవు మట్టితో చేసినవాడికి నేను సాష్టాంగ పడాలా?" అని అన్నాడు. మళ్ళీ వాడు ఇలా అన్నాడు: "కొంచెం వాణ్ణి చూడు. వాడు తగినవాడనా, నీవు వాడికి నాపై ఆధిక్యం ఇచ్చావు? నీవు గనక నాకు ప్రళయదినం వరకు వ్యవధినిస్తే నేను వాడి మొత్తం వంశాన్ని సమూలంగా నాశనం చేస్తాను. కేవలం కొందరు మాత్రమే నానుండి తప్పించుకోగలుగుతారు." అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: "సరే, పో. వారిలో నిన్ను అనుసరించే వారందరికీ నీతోపాటు నరకమే పరిపూర్ణమైన ప్రతిఫలంగా లభిస్తుంది. నీవు ఎవరెవరిని నీ సందేశంతో భ్రష్టులుగా చెయ్య గలవో చెయ్యి. వారిపైకి నీ ఆశ్వికదళాన్ని, నీ పదాతిదళాన్ని పంపు. ధనంలోనూ, సంతానంలోనూ వారితో పాటు భాగాన్ని కలిగివుండు. వారిని వాగ్దానాల వలలో బంధించు - షైతాను వాగ్దానాలు ఒక మోసం తప్ప మరేమీ కావు - నిశ్చయంగా నా దాసులపై నీకు ఏ అధికారమూ లభించదు. నమ్ముకోవ టానికి నీ ప్రభువే చాలు."

وَ اِنْ مِّنْ قَرْيَةٍ اِلَّا نَحْنُ مُهْلِكُوْهَا قَبْلَ
يَوْمِ الْقِيٰمَةِ اَوْ مُعَذِّبُوْهَا عَذَابًا شَدِيْدًا ؕ
كَانَ ذٰلِكَ فِي الْكِتٰبِ مَسْطُوْرًا ﴿۵۸﴾ وَ مَا مَنَعَنَاۤ
اَنْ نُّرْسِلَ بِالْاٰيٰتِ اِلَّاۤ اَنْ كَذَّبَ بِهَا
الْاَوَّلُوْنَ ؕ وَ اٰتَيْنَا ثَمُوْدَ النَّاقَةَ مُبْصِرَةً
فَظَلَمُوْا بِهَا ؕ وَ مَا نُرْسِلُ بِالْاٰيٰتِ اِلَّا تَخْوِيْفًا ﴿۵۹﴾
وَ اِذْ قُلْنَا لَكَ اِنَّ رَبَّكَ اَحَاطَ بِالنَّاسِ ؕ وَمَا
جَعَلْنَا الرُّءْيَا الَّتِيْۤ اَرَيْنٰكَ اِلَّا فِتْنَةً لِّلنَّاسِ
وَالشَّجَرَةَ الْمَلْعُوْنَةَ فِي الْقُرْاٰنِ ؕ وَ نُخَوِّفُهُمْ ۙ
فَمَا يَزِيْدُهُمْ اِلَّا طُغْيَانًا كَبِيْرًا ﴿۶۰﴾ وَ اِذْ قُلْنَا ع ٦ ٨
لِلْمَلٰٓئِكَةِ اسْجُدُوْا لِاٰدَمَ فَسَجَدُوْۤا اِلَّاۤ
اِبْلِيْسَ ؕ قَالَ ءَاَسْجُدُ لِمَنْ خَلَقْتَ
طِيْنًا ﴿۶۱﴾ قَالَ اَرَءَيْتَكَ هٰذَا الَّذِيْ كَرَّمْتَ
عَلَيَّ ٘ لَئِنْ اَخَّرْتَنِ اِلٰى يَوْمِ الْقِيٰمَةِ
لَاَحْتَنِكَنَّ ذُرِّيَّتَهٗۤ اِلَّا قَلِيْلًا ﴿۶۲﴾ قَالَ اذْهَبْ
فَمَنْ تَبِعَكَ مِنْهُمْ فَاِنَّ جَهَنَّمَ جَزَآؤُكُمْ
جَزَآءً مَّوْفُوْرًا ﴿۶۳﴾ وَ اسْتَفْزِزْ مَنِ اسْتَطَعْتَ
مِنْهُمْ بِصَوْتِكَ وَاَجْلِبْ عَلَيْهِمْ بِخَيْلِكَ وَ
رَجِلِكَ وَ شَارِكْهُمْ فِي الْاَمْوَالِ وَ الْاَوْلَادِ
وَعِدْهُمْ ؕ وَ مَا يَعِدُهُمُ الشَّيْطٰنُ اِلَّا
غُرُوْرًا ﴿۶۴﴾ اِنَّ عِبَادِيْ لَيْسَ لَكَ عَلَيْهِمْ
سُلْطٰنٌ ؕ وَكَفٰى بِرَبِّكَ وَكِيْلًا ﴿۶۵﴾

رَبُّكُمُ الَّذِيْ يُزْجِيْ لَكُمُ الْفُلْكَ فِي الْبَحْرِ
لِتَبْتَغُوْا مِنْ فَضْلِهٖ ؕ اِنَّهٗ كَانَ بِكُمْ
رَحِيْمًا ﴿۶۶﴾ وَ اِذَا مَسَّكُمُ الضُّرُّ فِي الْبَحْرِ ضَلَّ
مَنْ تَدْعُوْنَ اِلَّاۤ اِيَّاهُ ۚ فَلَمَّا نَجّٰىكُمْ اِلَى الْبَرِّ
اَعْرَضْتُمْ ؕ وَ كَانَ الْاِنْسَانُ كَفُوْرًا ﴿۶۷﴾
اَفَاَمِنْتُمْ اَنْ يَّخْسِفَ بِكُمْ جَانِبَ الْبَرِّ اَوْ
يُرْسِلَ عَلَيْكُمْ حَاصِبًا ثُمَّ لَا تَجِدُوْا لَكُمْ
وَكِيْلًا ﴿ۙ۶۸﴾ اَمْ اَمِنْتُمْ اَنْ يُّعِيْدَكُمْ فِيْهِ تَارَةً
اُخْرٰى فَيُرْسِلَ عَلَيْكُمْ قَاصِفًا مِّنَ الرِّيْحِ
فَيُغْرِقَكُمْ بِمَا كَفَرْتُمْ ۙ ثُمَّ لَا تَجِدُوْا لَكُمْ
عَلَيْنَا بِهٖ تَبِيْعًا ﴿۶۹﴾ وَلَقَدْ كَرَّمْنَا بَنِيْۤ اٰدَمَ وَ
حَمَلْنٰهُمْ فِي الْبَرِّ وَ الْبَحْرِ وَ رَزَقْنٰهُمْ مِّنَ
الطَّيِّبٰتِ وَ فَضَّلْنٰهُمْ عَلٰى كَثِيْرٍ مِّمَّنْ خَلَقْنَا
تَفْضِيْلًا ﴿۷۰﴾ يَوْمَ نَدْعُوْا كُلَّ اُنَاسٍۭ بِاِمَامِهِمْ ۚ ع ۷
فَمَنْ اُوْتِيَ كِتٰبَهٗ بِيَمِيْنِهٖ فَاُولٰٓئِكَ يَقْرَءُوْنَ
كِتٰبَهُمْ وَ لَا يُظْلَمُوْنَ فَتِيْلًا ﴿۷۱﴾ وَ مَنْ كَانَ فِيْ
هٰذِهٖۤ اَعْمٰى فَهُوَ فِي الْاٰخِرَةِ اَعْمٰى وَ اَضَلُّ
سَبِيْلًا ﴿۷۲﴾

**66 - 72** సముద్రంలో మీ ఓడలను నడిపేవాడే మీ (అసలు) ప్రభువు, తద్వారా మీరు ఆయన అనుగ్రహాన్ని అన్వేషిస్తారు. వాస్తవానికి ఆయన మీపట్ల ఎంతో కనికరం కలవాడు. సముద్రంలో మీకేదన్నా ఆపద కలిగినప్పుడు ఆయన ఒక్కడు తప్ప మీరు పిలిచేవారంతా మటుమాయమై పోతారు. కాని ఆయన మిమ్మల్ని రక్షించి నేలపైకి చేర్చినప్పుడు మీరు ఆయన నుండి ముఖం తిప్పుకుంటారు. మానవుడు నిజంగా చాలా కృతఘ్నుడు. సరే మీరు ఈ విషయాన్ని గురించి పూర్తిగా నిర్భయంగా ఉన్నారా, దేవుడు మిమ్మల్ని ఎన్నడూ సముద్రం వెలుపలే భూమిలోనికి అణగదొక్కడనీ లేదా మీపైకి రాళ్ళను కురిపించే తుఫానును పంపడనీ మీరు నిర్భయంగా ఉన్నారా? అప్పుడు మిమ్మల్ని రక్షించే ఏ సహాయకుణ్ణీ మీరు పొందలేరు. దేవుడు మళ్ళీ ఎప్పుడైనా మిమ్మల్ని సముద్రంలోనికి తీసుకు పోతాడనీ, మీ కృతఘ్నుతకు ఫలితంగా మీపైకి తీవ్రమైన తుఫాను గాలులను పంపి మిమ్మల్ని ముంచివేస్తాడనీ, మీ ఈ ముగింపును గురించి ఆయనను అడిగే వాడెవ్వడూ మీకు లభించడనీ మీరు భయపడటం లేదా?-మేము ఆదమ్ సంతతికి పెద్దరికాన్ని ప్రసాదించాము. వారికి నేలపై, నీటిలో నడిచే వాహనాలను ప్రసాదించాము. వారికి పరిశుద్ధమైన వస్తువులను ఆహారంగా ఇచ్చాము. మేము సృష్టించిన ఎన్నో ప్రాణులపై వారికి స్పష్టమైన ఆధిక్యాన్ని అనుగ్రహించాము. ఇదంతా మా అనుగ్రహం. ఆరోజును గురించి ఆలోచించండి. అప్పుడు మేము ప్రతి మానవ వర్గాన్ని దాని నాయకునితో పాటు పిలుస్తాము. ఆ సమయంలో తమ కుడిచేతికి కర్మ పత్రం ఇవ్వబడినవారు, తాము చేసిన పనులను చదువుకుంటారు. వారికి రవ్వంత అన్యాయం కూడా జరగదు. ఈ ప్రపంచంలో అంధుడై మెలగేవాడు, పరలోకంలో కూడా అంధుడు గానే ఉంటాడు. అంతేకాదు మార్గాన్ని పొందటంలో అంధుని కంటే కూడా అధికంగా విఫలుడౌతాడు.

25. అంటే, విరోధులు సహించరాని మాటలు ఎటువంటివి అన్నప్పటికీ, ముస్లిములు మాత్రం సత్యదూరమైన ఏ మాటనూ పలకటంగానీ, కోపోద్రేకంతో అసభ్యకరమైన మాటలకు, అసభ్యకరమైన జవాబు ఇవ్వటంగానీ చెయ్యకూడదు. ప్రశాంతమైన మనస్సుతో వారికి సముచితమైన, సత్యవంతమైన, తమ సందేశ గౌరవానికి అనుగుణమైన మాటలతోనే సమాధానం చెప్పాలి.

وَ اِنۡ كَادُوۡا لَيَفۡتِنُوۡنَكَ عَنِ الَّذِىۡۤ اَوۡحَيۡنَاۤ
اِلَيۡكَ لِتَفۡتَرِىَ عَلَيۡنَا غَيۡرَهٗ ۖ وَاِذًا
لَّاتَّخَذُوۡكَ خَلِيۡلًا ۝٧٣ وَلَوۡلَاۤ اَنۡ ثَبَّتۡنٰكَ
لَقَدۡ كِدْتَّ تَرۡكَنُ اِلَيۡهِمۡ شَيۡـًٔـا قَلِيۡلًا ۝٧٤ اِذًا
لَّاَذَقۡنٰكَ ضِعۡفَ الۡحَيٰوةِ وَضِعۡفَ الۡمَمَاتِ ثُمَّ
لَا تَجِدُ لَكَ عَلَيۡنَا نَصِيۡرًا ۝٧٥ وَاِنۡ كَادُوۡا
لَيَسۡتَفِزُّوۡنَكَ مِنَ الۡاَرۡضِ لِيُخۡرِجُوۡكَ مِنۡهَا
وَاِذًا لَّا يَلۡبَثُوۡنَ خِلٰفَكَ اِلَّا قَلِيۡلًا ۝٧٦ سُنَّةَ
مَنۡ قَدۡ اَرۡسَلۡنَا قَبۡلَكَ مِنۡ رُّسُلِنَا وَلَا
تَجِدُ لِسُنَّتِنَا تَحۡوِيۡلًا ۝٧٧ ع ٨

**73 - 75** ప్రవక్తా! ఈ ప్రజలు నిన్ను పరీక్షకు గురిచేసి మేము నీ వైపునకు పంపిన వహీ నుండి నిన్ను మరలించటానికి ప్రయత్నం చేయటంలో ఏ కొరతా చేయలేదు. నీవు మా పేరుతో నీ తరపు నుండి ఏదైనా విషయాన్ని కల్పించాలని వారు ఇలా చేశారు. ఒకవేళ నీవు అలా కల్పించివుంటే వారు తప్పకుండా నిన్ను తమ మిత్రుడుగా చేసుకుని ఉండేవారు. మేము గనక నీకు మనోబలాన్ని ఇచ్చివుండకపోతే నీవు వారి వైపునకు కొంతైనా మొగ్గి ఉండేవాడవు అనేది అసంభవమేమీ కాదు. కాని ఒకవేళ నీవు అలా మొగ్గి వుంటే, మేము నీకు ప్రపంచంలో కూడా రెట్టింపు శిక్షను రుచిచూపించి ఉండే వారము. పరలోకంలో కూడా రెట్టింపు శిక్షే. మాకు వ్యతిరేకంగా నీవు ఏ సహాయకుడినీ పొందివుండేవాడవు కాదు.

**76** వారు నీకు ఈ భూభాగంలో నిలువనీడ లేకుండా చెయ్యటానికీ నిన్ను ఇక్కడ నుండి వెళ్ళగొట్టటానికీ పూనుకున్నారు. కాని ఒకవేళ వారు అలా చేస్తే నీ తరువాత వారు కూడా ఇక్కడ ఎంతోకాలం నిలువలేరు.

**77** ఇది మా సనాతన సంప్రదాయం. దీనినే నీకు పూర్వం మేము పంపిన ప్రవక్తలందరి విషయంలోనూ అనుసరించాము. మా సంప్రదాయంలో నీవు ఏ మార్పునూ చూడలేవు.

26. అంటే, "మేము స్వర్గానికి పోతాము. ఫలానా మనిషి, ఫలానా వర్గం నరకానికి పోతారు" అని విశ్వాసులు చెప్పకూడదు. ఈ విషయానికి సంబంధించిన నిర్ణయం అల్లాహ్ చేతులలోనే ఉంది. ఆయన మానవుల బాహ్యాంతర్యాలనూ, వర్తమాన భవిష్యత్తులనూ ఎరుగును. ఎవరిని కరుణించాలి, ఎవరిని శిక్షించాలి అనే తీర్పును ఆయనే చెయ్యాలి. అల్లాహ్ గ్రంథం ప్రకారం ఎటువంటి మనుషులు కారుణ్యానికి అర్హులో మరెటువంటి వారు శిక్షకు అర్హులో అనే విషయాన్ని ఒక ముస్లిము సూత్రప్రాయంగా అయితే చెప్పగలడు. కాని ఒక మనిషి తప్పకుండా శిక్షింపబడతాడు, ఒక మనిషి తప్పకుండా క్షమింపబడతాడు అని చెప్పే హక్కు ఎవరికీ లేదు.

27. దీనిద్వారా స్పష్టంగా తెలిసేదేమిటంటే దైవేతరుల ముందు సాష్టాంగపడటం మాత్రమే షిర్కు కాదు. దేవుణ్ణి తప్ప ఇతర శక్తులను ప్రార్థించటం లేదా వాటిని సహాయం కొరకు వేడుకోవటం కూడా షిర్కే.

28. ఈ పదాలు స్పష్టంగా తెలిపేదేమిటంటే ఇక్కడ ప్రస్తావించబడిన ముష్రిక్కుల దేవుళ్ళు, ముష్రిక్కులు మొరపెట్టుకునే శక్తులు రాతివిగ్రహాలుకారు. వారు దైవదూతలయినా కావాలి లేదా గత కాలానికి చెందిన పుణ్యపురుషులైనా కావాలి.

29. ముహమ్మద్ (సఅసమ్) తమకు ఏదైనా మహిమను చూపించాలి అనే అవిశ్వాసుల కోరికకు ఇది జవాబు : భావం ఏమిటంటే, అటువంటి మహిమను చూసిన పిదప ప్రజలు గనక దానిని తిరస్కరిస్తే, అప్పుడు వారిపై శిక్ష అవతరించటం అనివార్యం అవుతుంది. అటువంటి జాతిని సర్వనాశనం చెయ్యకుండా వదలటం జరగదు. అటువంటి మహిమను దేనినీ పంపకపోవటం అనేది కేవలం అల్లాహ్ కారుణ్య ఫలితమే. కాని ఎంత బుద్ధిహీనులు మీరు, మహిమను చూపించు అని మళ్ళీ మళ్ళీ కోరి, సమూద్ జాతి వారు చవిచూసినటువంటి పర్యవసానాన్ని కోరుకుంటున్నారు.

30. ఇక్కడ మేరాజ్‌ను సూచించటం జరిగింది. "రుయా" అనే పదం "స్వప్నం" అనే అర్థంలో కాకుండా కళ్ళతో చూడటం అనే అర్థంలో ఉపయోగించబడింది.

أَقِمِ الصَّلٰوةَ لِدُلُوْكِ الشَّمْسِ إِلٰى غَسَقِ الَّيْلِ
وَ قُرْاٰنَ الْفَجْرِ ؕ إِنَّ قُرْاٰنَ الْفَجْرِ كَانَ
مَشْهُوْدًا ﴿٧٨﴾ وَ مِنَ الَّيْلِ فَتَهَجَّدْ بِهٖ نَافِلَةً
لَّكَ ۖ عَسٰى أَنْ يَّبْعَثَكَ رَبُّكَ مَقَامًا
مَّحْمُوْدًا ﴿٧٩﴾ وَ قُلْ رَّبِّ أَدْخِلْنِيْ مُدْخَلَ
صِدْقٍ وَّأَخْرِجْنِيْ مُخْرَجَ صِدْقٍ وَّ اجْعَلْ لِّيْ
مِنْ لَّدُنْكَ سُلْطٰنًا نَّصِيْرًا ﴿٨٠﴾ وَ قُلْ جَآءَ
الْحَقُّ وَ زَهَقَ الْبَاطِلُ ؕ إِنَّ الْبَاطِلَ كَانَ
زَهُوْقًا ﴿٨١﴾ وَ نُنَزِّلُ مِنَ الْقُرْاٰنِ مَا هُوَ شِفَآءٌ
وَّرَحْمَةٌ لِّلْمُؤْمِنِيْنَ ۙ وَ لَا يَزِيْدُ الظّٰلِمِيْنَ إِلَّا
خَسَارًا ﴿٨٢﴾ وَإِذَآ أَنْعَمْنَا عَلَى الْإِنْسَانِ أَعْرَضَ
وَنَاٰ بِجَانِبِهٖ ۚ وَ إِذَا مَسَّهُ الشَّرُّ كَانَ يَئُوْسًا ﴿٨٣﴾
قُلْ كُلٌّ يَّعْمَلُ عَلٰى شَاكِلَتِهٖ ؕ فَرَبُّكُمْ أَعْلَمُ
بِمَنْ هُوَ أَهْدٰى سَبِيْلًا ﴿٨٤﴾

**78 - 79** నమాజును స్థాపించు. పొద్దు వాలినప్పటినుండి రాత్రి చీకటిపడే వరకు,[33] ప్రాతఃకాలంలో ఖుర్‌ఆన్ పారాయణం పట్ల ప్రత్యేక శ్రద్ధవహించు. ఎందుకంటే ప్రాతః కాలపు ఖుర్‌ఆన్ పారాయణం సాక్ష్యంగా ఉంటుంది.[34] రాత్రిపూట "తహజ్జుద్" నమాజు చెయ్యి.[35] ఇది నీకు అదనపు నమాజు. నీ ప్రభువు నిన్ను ప్రశంసనీయమైన ఉన్నత స్థానంలో ప్రతిష్ఠింపజేయటం అసంభవం ఏమీ కాదు.[36]

**80** ఇలా ప్రార్థించు: ప్రభూ! నీవు నన్ను ఎక్కడకు తీసుకొని వెళ్ళినా సత్యంతో తీసుకొని వెళ్ళు. ఎక్కడ నుండి తీసినా సత్యంతో తియ్యి. నీ తరఫు నుండి ఒక అధికారాన్ని నాకు సహాయంగా పంపించు.[37]

**81** ఇలా ప్రకటించు: "సత్యం వచ్చేసింది. అసత్యం నశించింది. అసత్యం నశించక తప్పదు."

**82 - 84** మేము ఈ ఖురాను భాగాల అవతరణ క్రమంలో అవతరింపజేస్తున్నటువంటి ప్రతి భాగమూ విశ్వాసులకు స్వస్థత కారుణ్యమునూ, కాని దుర్మార్గులకు అది నష్టాన్ని తప్ప మరి దేనినీ పెంచదు. మానవుడు ఎలాంటి వాడంటే మేము అతన్ని అనుగ్రహించినప్పుడు విర్రవీగుతాడు. వెనక్కి మరలి పోతాడు. కొంచెం కష్టానికి గురిఅయితే చాలు, నిరాశపడి పోతాడు. ప్రవక్తా! ఈ ప్రజలతో ఇలా అను: "ప్రతి ఒక్కడూ తన విధానాన్నే అనుసరిస్తున్నాడు. ఇక ఋజుమార్గంలో ఎవడు న్నాడో అనే విషయం నీ ప్రభువునకే బాగా తెలుసు."

31. అంటే, "జఖ్ఖూమ్" వృక్షము. దానిని గురించి ఖురానులో ఇలా చెప్పబడింది : అది నరకం అడుగుభాగంలో పుడుతుంది. నరకవాసులు దానిని తినవలసి ఉంటుంది. దానిని శపించటం అంటే అది అల్లాహ్ కారుణ్యానికి దూరమవుతుంది అని భావం.
32. అంటే, మేము వారి మేలుకొరకు నీకు మేరాజ్ విశేషాలను చూపించాము – నీవంటి సత్యసంధుడూ, నమ్మకస్తుడూ అయిన మనిషి ద్వారా వారికి అసలైన సత్యజ్ఞానం లభించాలని, వారు అప్రమత్తులై ఋజుమార్గం పైకి రావాలని. కాని వారు దీనికి భిన్నంగా ఈ విషయాన్ని గురించి నిన్ను ఎగతాళి చేశారు. ఇక్కడ మీరు చేసే నిషిద్ధకార్యాలు చివరకు మీకు జఖ్ఖూమ్ చెట్టు ముద్దలను తినిపించి తీరుతాయి అని మేము నీద్వారా వారిని హెచ్చరించాము. కాని వారు దానికి వికటాట్టహాసం చేశారు. "కొంచెం ఈ మనిషిని చూడండి. ఒకవైపేమో నరకంలో భయంకరమైన అగ్ని ప్రజ్వరిల్లుతూ ఉంటుంది అనీ, మరొక వైపేమో అక్కడ చెట్లు మొలుస్తాయి అనీ అంటున్నాడు" అని హేళన చేయసాగారు.
33. ఇందులో జుహర్ నుండి ఇషా వరకు గల నాలుగు నమాజులూ సూచించబడ్డాయి.
34. "ప్రాతఃకాలంలో ఖురాను పారాయణం" అంటే ఫజరు నమాజులో ఖురాను పఠించటం అని భావం. "ప్రాతఃకాలపు ఖురాను సాక్ష్యంగా ఉంటుంది" అంటే భావం దైవదూతలు ప్రత్యేకంగా దానికి సాక్షులుగా ఉంటారు. ఎందుకంటే దానికి ఒక ప్రత్యేకమైన ప్రాముఖ్యం ఉంది.

وَ يَسْـَٔلُوْنَكَ عَنِ الرُّوْحِ ؕ قُلِ الرُّوْحُ مِنْ اَمْرِ
رَبِّيْ وَ مَاۤ اُوْتِيْتُمْ مِّنَ الْعِلْمِ اِلَّا قَلِيْلًا ۝۸۵ وَ
لَئِنْ شِئْنَا لَنَذْهَبَنَّ بِالَّذِيْۤ اَوْحَيْنَاۤ اِلَيْكَ ثُمَّ
لَا تَجِدُ لَكَ بِهٖ عَلَيْنَا وَكِيْلًا ۝۸۶ۙ اِلَّا رَحْمَةً
مِّنْ رَّبِّكَ ؕ اِنَّ فَضْلَهٗ كَانَ عَلَيْكَ كَبِيْرًا ۝۸۷
قُلْ لَّئِنِ اجْتَمَعَتِ الْاِنْسُ وَ الْجِنُّ عَلٰۤى اَنْ
يَّاْتُوْا بِمِثْلِ هٰذَا الْقُرْاٰنِ لَا يَاْتُوْنَ بِمِثْلِهٖ وَ لَوْ
كَانَ بَعْضُهُمْ لِبَعْضٍ ظَهِيْرًا ۝۸۸ وَلَقَدْ صَرَّفْنَا
لِلنَّاسِ فِيْ هٰذَا الْقُرْاٰنِ مِنْ كُلِّ مَثَلٍ ؗ فَاَبٰۤى
اَكْثَرُ النَّاسِ اِلَّا كُفُوْرًا ۝۸۹ وَ قَالُوْا لَنْ نُّؤْمِنَ
لَكَ حَتّٰى تَفْجُرَ لَنَا مِنَ الْاَرْضِ يَنْۢبُوْعًا ۝۹۰ۙ اَوْ
تَكُوْنَ لَكَ جَنَّةٌ مِّنْ نَّخِيْلٍ وَّ عِنَبٍ فَتُفَجِّرَ
الْاَنْهٰرَ خِلٰلَهَا تَفْجِيْرًا ۝۹۱ۙ اَوْ تُسْقِطَ السَّمَآءَ
كَمَا زَعَمْتَ عَلَيْنَا كِسَفًا اَوْ تَاْتِيَ بِاللّٰهِ
وَالْمَلٰٓئِكَةِ قَبِيْلًا ۝۹۲ۙ اَوْ يَكُوْنَ لَكَ بَيْتٌ مِّنْ
زُخْرُفٍ اَوْ تَرْقٰى فِي السَّمَآءِ ؕ وَلَنْ نُّؤْمِنَ
لِرُقِيِّكَ حَتّٰى تُنَزِّلَ عَلَيْنَا كِتٰبًا نَّقْرَؤُهٗ ؕ قُلْ
سُبْحَانَ رَبِّيْ هَلْ كُنْتُ اِلَّا بَشَرًا رَّسُوْلًا ۝۹۳ ع
وَ مَا مَنَعَ النَّاسَ اَنْ يُّؤْمِنُوْۤا اِذْ جَآءَهُمُ
الْهُدٰۤى اِلَّاۤ اَنْ قَالُوْۤا اَبَعَثَ اللّٰهُ بَشَرًا
رَّسُوْلًا ۝۹۴ قُلْ لَّوْ كَانَ فِي الْاَرْضِ مَلٰٓئِكَةٌ
يَّمْشُوْنَ مُطْمَئِنِّيْنَ لَنَزَّلْنَا عَلَيْهِمْ مِّنَ السَّمَآءِ
مَلَكًا رَّسُوْلًا ۝۹۵

**85 - 88** ఈ ప్రజలు నిన్ను ఆత్మను గురించి ప్రశ్నిస్తున్నారు. ఇలా అను: "ఈ ఆత్మ నా ప్రభువు ఆజ్ఞానుసారం వస్తుంది. కాని మీకు ప్రసాదించబడిన జ్ఞానం బహుస్వల్పమైనది."[38] ప్రవక్తా! మేము కోరితే, వహీద్వారా మేము నీకు ప్రసాదించిన దాన్నంతా నీనుండి లాక్కోగలము. తరువాత మాకు వ్యతిరేకంగా దానిని తిరిగి ఇప్పించగలిగే సహాయకుణ్ణి ఎవణ్ణీ నీవు పొందలేవు. నీకు లభించినదంతా నీ ప్రభువు కారుణ్యం వల్లనే లభించింది. వాస్తవం ఏమిటంటే నీపై ఆయనకు ఉన్న అనుగ్రహం చాలా గొప్పది. ఇలా అను:"ఒకవేళ మానవులూ, జిన్నాతులూ, అందరూ కలసి ఈ ఖురాను వంటి దానిని దేనినయినా తీసుకువచ్చే ప్రయత్నం చేసినప్పటికీ తీసుకురాలేరు, వారందరూ ఒకరికొకరు సహాయకులైనప్పటికినీ."

**89 - 93** మేము ఈ ఖురానులో ప్రజలకు రకరకాలుగా హిత బోధచేశాము. కాని చాలామంది ప్రజలు అవిశ్వాస స్థితిలోనే స్థిరంగా ఉండిపోయారు. వారు ఇలా అన్నారు: "మేము నీ మాటను నమ్మము. నీవు భూమిని చీల్చి మా కోసం ఒక చెలమను పొంగింపచెయ్యాలి. ఖర్జూరపు చెట్లూ ద్రాక్షలతలు కల తోట ఒకటి నీకోసం ఉద్భవించాలి. అందులో నీవు కాలువలను ప్రవహింపజెయ్యాలి. నీవు ప్రకటిస్తున్న విధంగా ఆకాశాన్ని ముక్కలు ముక్కలుగా చేసి మాపై పడవెయ్యాలి. దేవుణ్ణీ, దైవ దూతలనూ మా ఎదుటకు తీసుకు రావాలి. నీకోసం ఒక స్వర్ణగృహం తయారు కావాలి. నీవు ఆకాశాన్ని అధిరోహించాలి. అంతవరకు నీ మాటను మేము నమ్మము. అంతేకాదు, మేము చదవటానికి నీవు మాపై ఒక రచన అవతరించేటట్లు చేయనంత వరకు మేము నీ అధిరోహించటాన్ని కూడా నమ్మము. ప్రవక్తా! వారితో ఇలా అను: "నా ప్రభువు పరిశుద్ధుడు! నేను సందేశాన్ని తెచ్చే ఒక మానవ మాత్రుడు తప్ప మరింకేమైనా అవుతానా?"

**94 - 95** ప్రజల ముందుకు మార్గదర్శకత్వం వచ్చినప్పుడల్లా, దానిని విశ్వసించకుండా వారిని ఆపిన విషయం "ఏమిటి, అల్లాహ్ మానవుణ్ణి ప్రవక్తగా చేసి పంపాడా?" అనే వారి పలుకు తప్ప మరేమీ కాదు. వారికి ఇలా చెప్పు: "భువిలో దైవదూతలు నిశ్చింతగా తిరుగుతూ ఉండివుంటే, మేము తప్పకుండా ఆకాశం నుండి దైవదూతనే వారికోసం ప్రవక్తగా పంపి ఉండేవారము."

96 ప్రవక్తా! వారితో ఇలా అను: "నాకూ మీకూ మధ్య కేవలం ఒక్క అల్లాహ్ సాక్ష్యమే సరిపోతుంది. ఎందుకంటే ఆయన తన దాసుల స్థితిని బాగా ఎరిగినవాడు. అన్నింటినీ చూస్తూ ఉన్నవాడు."

97 - 99 అల్లాహ్ మార్గం చూపినవాడే సన్మార్గాన్ని పొందుతాడు. ఆయన మార్గం తప్పించినవారికి ఆయనను తప్ప, అండగా ఉండేవాణ్ణీ, సహాయపడే వాణ్ని ఎవణ్ణీ నీవు పొందలేవు. వారిని మేము ప్రళయంనాడు గుడ్డివారుగా, మూగవారుగా, చెవిటివారుగా చేసి బోర్లాపడవేసి లాక్కు వస్తాము. వారి నివాసం నరకం. దాని మంట మందగించి నప్పుడల్లా మేము దానిని మరింత మండింపజేస్తాము. ఇది ప్రతిఫలం వారి దుశ్చేష్టకు. వారు మా ఆయతులను తిరస్కరించి ఇలా అన్నారు: "మేము కేవలం ఎముకలుగా, దుమ్ముగా, ధూళిగా మారిపోయిన తరువాత సరికొత్తగా మమ్మల్ని పుట్టించి లేపి నిలబెట్టడం జరుగుతుందా?" భూమినీ ఆకాశాలనీ సృష్టించిన దేవుడు అటువంటివారిని పుట్టించే శక్తిని కూడా తప్పకుండా కలిగివుంటాడనే విషయం వారికి తోచనే లేదా? ఆయన వారిని తిరిగిలేపటానికి ఒక సమయాన్ని నిర్ణయించి ఉంచాడు. అది రావటం తథ్యం. కాని దుర్మార్గులు మొండిగా దానిని తిరస్కరించటానికే పూనుకున్నారు.

قُلۡ كَفٰى بِاللّٰهِ شَهِيۡدًاۢ بَيۡنِىۡ وَبَيۡنَكُمۡ‌ ؕ اِنَّهٗ
كَانَ بِعِبَادِهٖ خَبِيۡرًۢا بَصِيۡرًا ۝٩٦ وَمَنۡ يَّهۡدِ اللّٰهُ
فَهُوَ الۡمُهۡتَدِ‌ ۚ وَمَنۡ يُّضۡلِلۡ فَلَنۡ تَجِدَ لَهُمۡ
اَوۡلِيَآءَ مِنۡ دُوۡنِهٖ‌ ؕ وَنَحۡشُرُهُمۡ يَوۡمَ الۡقِيٰمَةِ
عَلٰى وُجُوۡهِهِمۡ عُمۡيًا وَّبُكۡمًا وَّصُمًّا‌ ؕ مَاۡوٰٮهُمۡ
جَهَنَّمُ‌ ؕ كُلَّمَا خَبَتۡ زِدۡنٰهُمۡ سَعِيۡرًا ۝٩٧ ذٰلِكَ
جَزَآؤُهُمۡ بِاَنَّهُمۡ كَفَرُوۡا بِاٰيٰتِنَا وَقَالُوۡۤا ءَاِذَا
كُنَّا عِظَامًا وَّرُفَاتًا ءَاِنَّا لَمَبۡعُوۡثُوۡنَ خَلۡقًا
جَدِيۡدًا ۝٩٨ اَوَلَمۡ يَرَوۡا اَنَّ اللّٰهَ الَّذِىۡ خَلَقَ
السَّمٰوٰتِ وَالۡاَرۡضَ قَادِرٌ عَلٰٓى اَنۡ يَّخۡلُقَ
مِثۡلَهُمۡ وَجَعَلَ لَهُمۡ اَجَلًا لَّا رَيۡبَ فِيۡهِ‌ ؕ
فَاَبَى الظّٰلِمُوۡنَ اِلَّا كُفُوۡرًا ۝٩٩

النصف

35. "తహజ్జుద్" అంటే నిద్రాభంగం చేసి మేల్కోవటం అని అర్థం. కనుక రాత్రివేళ తహజ్జుద్ చెయ్యటం అంటే రాత్రి ఒక భాగం నిదురపోయిన తరువాత మళ్ళీ లేచి నమాజు చెయ్యటం అని భావం.

36. అంటే, ప్రపంచంలోనూ పరలోకంలోనూ మీరు అందరి ప్రశంసలకు పాత్రులు అయ్యేటటువంటి, అన్నివైపుల నుండి మీపై ప్రశంసల, పొగడ్తల జల్లులు పడేటటువంటి, మీరు ప్రశంసనీయమైన వ్యక్తిగా రూపొందేటటువంటి ఉన్నత స్థానానికి మిమ్మల్ని చేర్చటం.

37. అంటే, స్వయంగా నాకైనా అధికారాన్ని ఇవ్వు లేదా ఒక ప్రభుత్వాన్ని అయినా నాకు సహాయకారిగా చెయ్యి. దాని బలంతో నేను ప్రపంచంలోని చెడును రూపుమాపగలుగుతాను. అశ్లీల కార్యాల, పాపకార్యాల వరదను నిరోధించ గలుగుతాను. నీ న్యాయశాస్త్రాన్ని స్థాపించగలుగుతాను.

38. సాధారణంగా ఇక్కడ "ఆత్మ" అంటే ప్రాణం అని భావించబడుతోంది. అంటే ప్రజలు మహాప్రవక్త (సఅసమ్)ను "జీవాత్మ" ను గురించీ, దాని వాస్తవికతను గురించీ అడగ్గా, అది అల్లాహ్ ఆదేశానుసారం వస్తుంది అని ఆయన చెప్పారు. కాని వాక్యక్రమాన్ని దృష్టిలో ఉంచుకుని చూసినట్లయితే స్పష్టంగా తెలిసేదేమిటంటే, ఇక్కడ "ఆత్మ" అంటే దైవదౌత్య జీవము లేక వహీ అని భావం. ఈ విషయమే నహ్ల్ సూరా 2వ ఆయత్‌లో, మోమిన్ సూరా 15వ ఆయత్‌లో, షూరా సూరా 52వ ఆయత్‌లో పేర్కొనబడింది. ప్రాచీన విద్వాంసులలో ఇబ్నె అబ్బాస్ (రజిఅన్), ఖతాదా, హసన్ బస్రీ (రహ్మహుముల్లాహ్)లు కూడా ఇదేవిధంగా వ్యాఖ్యానించారు. హసన్, ఖతాదాగార్ల అభిప్రాయాన్ని రూహుల్ మఆని కృతికర్త ఇలా ప్రస్తావించారు : "ఆత్మ అంటే జిబ్రీల్ (అస్సలామ్) అని భావం. కాని ఆయన ఎలా అవతరిస్తారు, ఏ విధంగా మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) హృదయఫలకంపై వహీ అవతరిస్తుంది అనేది అసలు ప్రశ్న."

قُلْ لَّوْ اَنْتُمْ تَمْلِكُوْنَ خَزَآئِنَ رَحْمَةِ رَبِّیْۤ
اِذًا لَّاَمْسَكْتُمْ خَشْيَةَ الْاِنْفَاقِ ؕ وَ كَانَ
الْاِنْسَانُ قَتُوْرًا ﴿۱۰۰﴾ وَلَقَدْ اٰتَيْنَا مُوْسٰى تِسْعَ ع
اٰيٰتٍۭ بَيِّنٰتٍ فَسْـَٔلْ بَنِیْۤ اِسْرَآءِيْلَ اِذْ جَآءَهُمْ
فَقَالَ لَهٗ فِرْعَوْنُ اِنِّیْ لَاَظُنُّكَ يٰمُوْسٰى
مَسْحُوْرًا ﴿۱۰۱﴾ قَالَ لَقَدْ عَلِمْتَ مَاۤ اَنْزَلَ
هٰۤؤُلَآءِ اِلَّا رَبُّ السَّمٰوٰتِ وَ الْاَرْضِ
بَصَآئِرَ ۚ وَ اِنِّیْ لَاَظُنُّكَ يٰفِرْعَوْنُ مَثْبُوْرًا ﴿۱۰۲﴾
فَاَرَادَ اَنْ يَّسْتَفِزَّهُمْ مِّنَ الْاَرْضِ فَاَغْرَقْنٰهُ
وَ مَنْ مَّعَهٗ جَمِيْعًا ۙ﴿۱۰۳﴾ وَّ قُلْنَا مِنْۢ بَعْدِهٖ لِبَنِیْۤ
اِسْرَآءِيْلَ اسْكُنُوا الْاَرْضَ فَاِذَا جَآءَ وَعْدُ
الْاٰخِرَةِ جِئْنَا بِكُمْ لَفِيْفًا ؕ﴿۱۰۴﴾ وَ بِالْحَقِّ اَنْزَلْنٰهُ
وَبِالْحَقِّ نَزَلَ ؕ وَ مَاۤ اَرْسَلْنٰكَ اِلَّا مُبَشِّرًا وَّ
نَذِيْرًا ﴿۱۰۵﴾ وَ قُرْاٰنًا فَرَقْنٰهُ لِتَقْرَاَهٗ عَلَى النَّاسِ وقف لازم
عَلٰى مُكْثٍ وَّنَزَّلْنٰهُ تَنْزِيْلًا ﴿۱۰۶﴾ قُلْ اٰمِنُوْا بِهٖۤ اَوْ
لَا تُؤْمِنُوْا ؕ اِنَّ الَّذِيْنَ اُوْتُوا الْعِلْمَ مِنْ
قَبْلِهٖۤ اِذَا يُتْلٰى عَلَيْهِمْ يَخِرُّوْنَ لِلْاَذْقَانِ
سُجَّدًا ۙ﴿۱۰۷﴾ وَّيَقُوْلُوْنَ سُبْحٰنَ رَبِّنَاۤ اِنْ كَانَ
وَعْدُ رَبِّنَا لَمَفْعُوْلًا ﴿۱۰۸﴾ وَ يَخِرُّوْنَ لِلْاَذْقَانِ السجدة ۳
يَبْكُوْنَ وَ يَزِيْدُهُمْ خُشُوْعًا ﴿۱۰۹﴾

**100** ప్రవక్తా! వారితో ఇలా అను: ఒకవేళ నా ప్రభువు కారుణ్య నిధులు మీ అధీనంలో ఉండి ఉన్నట్లయితే అవి ఖర్చయి పోతాయనే భయంవల్ల, వాటిని మీరు కదపకుండా ఉంచేవారు. యథార్థానికి మానవుడు ఎంతో సంకుచిత హృదయుడు.[39]

**101 - 104** మేము మూసాకు ప్రస్ఫుటంగా కనిపించే తొమ్మిది నిదర్శనాలను ప్రసాదించాము.[40] ఇప్పుడు నీవే స్వయంగా ఇస్రాయీలు సంతతిని అడుగు. మూసా వారివద్దకు వచ్చి నప్పుడు ఫిరౌను రాజు అన్నది ఇదేకదా, "మూసా! నీవు నిశ్చయంగా మంత్రజాలానికి గురిఅయిన మనిషివని నేను భావిస్తున్నాను" అని. దానికి సమాధానంగా మూసా ఇలా అన్నాడు: "నీకు బాగా తెలుసు, గుణపాఠం నేర్పే ఈ నిదర్శనా లను భూమ్యాకాశాల ప్రభువు తప్ప మరెవ్వడూ అవతరింపజెయ్య లేదు.[41] ఫిరౌన్! నీవు నిశ్చయంగా శాపానికి గురిఅయిన వాడవు అని నేను భావిస్తున్నాను." చివరకు ఫిరౌను మూసానూ, ఇస్రాయీలు సంతతినీ భూమిపై లేకుండా చేయాలని సంకల్పిం చుకున్నాడు. కాని మేము అతడినీ, అతడి సహచరులనూ మూకుమ్మడిగా ముంచివేశాము. ఆ తరువాత ఇస్రాయీలు సంతతితో మేము ఇలా అన్నాము: "ఇక మీరు భూమిపై సుఖంగా నివసించండి. ప్రళయ వాగ్దాన సమయం ఆసన్నమైనప్పుడు మేము మీ అందరినీ కలిపి హాజరుపరుస్తాము."

**105 - 109** ఈ ఖురానును మేము సత్యంతో అవతరింప జేశాము. సత్యంతోనే అది అవతరించింది. ప్రవక్తా! (విశ్వాసు లకు) శుభవార్త అందించటానికి (అవిశ్వాసులకు) హెచ్చరిక చెయ్యటానికి తప్ప మేము నిన్ను మరొక పనికొరకు పంపలేదు. మేము ఈ ఖురానును కొద్దికొద్దిగా అవతరింప జేశాము, నీవు దానిని నెమ్మది నెమ్మదిగా ప్రజలకు వినిపించాలని. మేము దానిని సందర్భాన్ని బట్టి క్రమక్రమంగా అవతరింపజేశాము. ప్రవక్తా! వారితో ఇలా అను: మీరు దీనిని నమ్మండి నమ్మక పోండి. ఇదివరకు జ్ఞానం ఇవ్వబడిన వారికి దానిని వినిపించి నప్పుడు వారు ముఖాన్ని నేలకు ఆనించి సాష్టాంగపడి ముక్త కంఠంతో ఇలా అంటారు: "మా ప్రభువు పరిశుద్ధుడు. ఆయన వాగ్దానం పూర్తిఅయి తీరవలసిందే." వారు ముఖాన్ని నేలకు ఆనించి విలపిస్తూ పడిపోతారు. దానిని విన్న తరువాత వారి అణకువ మరింత పెరుగుతుంది.

قُلِ ادْعُوا اللّٰهَ اَوِ ادْعُوا الرَّحْمٰنَ ؕ اَيًّامَّا
تَدْعُوْا فَلَهُ الْاَسْمَآءُ الْحُسْنٰى ۚ وَ لَا تَجْهَرْ
بِصَلَاتِكَ وَ لَا تُخَافِتْ بِهَا وَابْتَغِ بَيْنَ ذٰلِكَ
سَبِيْلًا ﴿١١٠﴾ وَ قُلِ الْحَمْدُ لِلّٰهِ الَّذِىْ لَمْ يَتَّخِذْ
وَلَدًا وَّ لَمْ يَكُنْ لَّهٗ شَرِيْكٌ فِى الْمُلْكِ وَ لَمْ
يَكُنْ لَّهٗ وَلِىٌّ مِّنَ الذُّلِّ وَ كَبِّرْهُ تَكْبِيْرًا ﴿١١١﴾ ع ١٢

**110 - 111** ప్రవక్తా! వారితో ఇలా అను: "అల్లాహ్ అని అయినా పిలవండి. లేదా రహ్మాన్ అని అయినా సరే. ఏ పేరుతో అయినా పిలవండి. ఆయనకు గల పేర్లు అన్నీ[42] చక్కనివే. మీరు నమాజును చేసేటప్పుడు కంఠాన్ని మరీ పెంచకండి, మరీ తగ్గించకండి. ఈ రెంటికీ మధ్య సగటు స్థాయిలో ఉండే స్వరంతో నమాజు చేయండి."[43] ఇంకా ఇలా అను: ఎవరినీ తన కొడుకుగా చేసుకోనటువంటి, తన రాజ్యంలో ఇతరులెవ్వరూ భాగస్వాములుగా లేనటువంటి, నిస్సహాయుడు కాకపోవటం వల్ల తనకు సంరక్షకుడు ఎవడూ అవసరం లేనటువంటి దేవునికే స్తోత్రము. ఆయన గొప్పతనాన్ని, మహోన్నతమైన శ్రేణికిచెందిన గొప్పతనాన్ని చాటండి.

39. మక్కా ముష్రిక్కులు మహాప్రవక్త (సఅసమ్) దౌత్యాన్ని తిరస్కరించటానికి ప్రబలమైన ఒక మానసిక కారణం ఇది: వారు ఈ విధంగా ఆయన ఘనతను, ఆధిక్యాన్ని అంగీకరించవలసి వస్తుంది. మానవుడు తన సమకాలికుని ఆధిక్యాన్ని, తన తోటివాని ఆధిక్యాన్ని అతి కష్టం మీద అంగీకరిస్తాడు. ఒక వ్యక్తికి వాస్తవంగా ఉన్నటువంటి ఉన్నత స్థానాన్ని, అతని సామర్థ్యాన్ని అంగీకరిస్తూ కూడా లోలోన బాధపడే లోభులకు దేవుడు ఒకవేళ అపారమైన తన అనుగ్రహ నిధుల తాళపు చెవులను అప్పగిస్తే, వారు ఎవ్వరికీ చిల్లిగవ్వ కూడా ఇవ్వరు అని ఇక్కడ చెప్పబడుతోంది.

40. ఈ తొమ్మిది నిదర్శనాలకు సంబంధించిన వివరాలు అల్ ఆరాఫ్ సూరాలో ప్రస్తావించబడ్డాయి.

41. ఈ విషయాన్ని మూసా (అస్సలామ్) ఎందుకన్నారంటే, దేశమంతటా కరువు కాటకాలు రావటం, లేక భూమిపై లక్షలాది చదరపుమైళ్ళు వ్యాపించివున్న ప్రాంతంలో కప్పలు ఒక ఉపద్రవంగా పెల్లుబకటం, లేక సమస్త దేశంలో ఉన్న ధాన్యపు గిడ్డంగులకు పుచ్చుపట్టటం ఇంకా ఇటువంటి ఎన్నో ఆపదలు ఒక మాంత్రికుని మంత్రప్రభావం వల్లగాని లేదా ఒక మానవ శక్తి వల్లగాని సంభవించలేవు. మాంంత్రికులు కేవలం ఒక పరిమిత స్థలంలో కొందరు ప్రేక్షకుల దృష్టిని మంత్రప్రభావానికి లోనుచేసి వారికి కొన్ని తమాషాలను చూపించగలరు. అవైనా యథార్థాలు కావు. దృష్టిని మోసగించే భ్రమలు.

42. ఇది "సృష్టికర్తకు 'అల్లాహ్' అనే పేరు ఉన్నదని మేము విన్నాము. కాని 'రహ్మాన్' అనే ఈ పేరును మీరు ఎక్కణ్ణుంచి తీసుకువచ్చారు?" అన్న మక్కా ముష్రిక్కుల అభ్యంతరానికి జవాబు. అల్లాహ్‌కు ఈ పేరు వారి మధ్య చలామణీలో లేకపోవటం వల్ల వారు ఇదంటే ముక్కుపుటలు ఎగరేసేవారు.

43. ఇబ్నె అబ్బాస్ (రజిఅన్) ఇలా అన్నారు : మక్కాలో మహాప్రవక్త (సఅసమ్) గానీ ఆయన సహచరులుగానీ నమాజుచేసే సమయంలో బిగ్గరగా ఖుర్ఆన్ చదువుతూ ఉంటే అవిశ్వాసులు గోల చేసేవారు. తరచుగా తిట్ల వర్షం కురిపించేవారు. అప్పుడు, అవిశ్వాసులు విని గుమిగూడేటంత బిగ్గరగానూ, మీతోటి వారు కూడా విన లేనంత మెల్లగానూ ఖురాను పఠించవద్దు అనే ఆజ్ఞ ఇవ్వబడింది. ఈ ఆజ్ఞ కేవలం అప్పటి పరిస్థితులకే వర్తిస్తుంది. మదీనాలో పరిస్థితులు మారిపోయినప్పుడు ఈ ఆజ్ఞను అనుసరించవలసిన అవసరం లేకపోయింది. అయితే ఎప్పుడైనా ముస్లిములు మక్కాలాంటి పరిస్థితులకు గురిఅయితే వారు ఈ ఆజ్ఞ ప్రకారమే నడుచుకోవలసి ఉంటుంది.

ఆయతులు 110

# 18. అల్ కహఫ్

అవతరణ మక్కాలో

١٨ سُوْرَةُ الْكَهْفِ مَكِّيَّةٌ ٦٩

اٰیاتھا ١١٠ رکوعاتھا ١٢

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 – 5** అల్లాహ్ మాత్రమే స్తుతింపదగినవాడు. ఆయన తన దాసునిపై ఈ గ్రంథాన్ని అవతరింపజేశాడు; అందులో ఏ విధమైన వక్రత్వాన్నీ ఉంచలేదు - అది సూటిగా, ఉన్నది ఉన్నట్లుగా ప్రకటించే గ్రంథం దాని ద్వారా అతను దేవుని కఠిన శిక్షను గురించి ప్రజలను హెచ్చరించాలని, విశ్వసించి సత్కార్యాలు చేసే వారికి మంచి ప్రతిఫలం లభిస్తుంది అనే శుభవార్తనూ, అందులోనే వారు కలకాలం ఉంటారు అనే శుభవార్తనూ అందజేయాలని, అల్లాహ్ ఎవరినో కుమారుడుగా వరించాడు అని పలికే ప్రజలను భయపెట్టాలని. ఈ విషయం గురించి వారికిగానీ, వారి తాతముత్తాతలకు గానీ ఏ జ్ఞానమూలేదు. వారి నోట వెలువడే ఈ మాట అత్యంత దారుణమైనది. వారు కేవలం అబద్ధాన్ని మాత్రమే వాగుతున్నారు.

**6 – 8** అయితే ప్రవక్తా! ఒకవేళ వారు ఈ ఉపదేశాన్ని విశ్వసించకపోతే, బహుశా నీవు వారి కోసం దుఃఖిస్తూ నీ ప్రాణాన్నే కోల్పోతావేమో! నిజానికి, ప్రజలలో మంచి పనులు చేసేవారెవరో పరీక్షించాలని, భూమిపై ఉన్న వస్తు సామగ్రినంతటినీ మేము భూమికి అలంకారంగా చేశాము. చివరకు మేము దీనినంతటినీ చదునైన మైదానంగా చేసివేయనున్నాము.

**9 – 12** గుహవారు, శిలాఫలకం వారు[1] మా సూచనలలో ఒక అద్భుతమైన సూచన అని మీరు భావిస్తున్నారా? ఆ గుహలో ఆశ్రయం పొందిన ఆ యువకులు "ప్రభూ! నీ ప్రత్యేక కారుణ్యాన్ని మాకు ప్రసాదించు, మా వ్యవహారాన్ని చక్కబెట్టు!" అని వేడుకున్నారు. అప్పుడు మేము వారిని అదే గుహలో జోకొట్టి ఏళ్లతరబడి గాఢనిద్రలో ఉంచాము. తరువాత మేము వారిని మేల్కొలిపాము, ఆ రెండు వర్గాలలో ఏ వర్గం వారు తాము గుహలో ఉన్న కాలాన్ని కచ్చితంగా లెక్కకడతారో పరీక్షిద్దామని.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ۝

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِيْٓ اَنْزَلَ عَلٰى عَبْدِهِ الْكِتٰبَ وَ
لَمْ يَجْعَلْ لَّهٗ عِوَجًا ۜ ۝١ قَيِّمًا لِّيُنْذِرَ بَاْسًا
شَدِيْدًا مِّنْ لَّدُنْهُ وَيُبَشِّرَ الْمُؤْمِنِيْنَ
الَّذِيْنَ يَعْمَلُوْنَ الصّٰلِحٰتِ اَنَّ لَهُمْ اَجْرًا
حَسَنًا ۙ ۝٢ مَّاكِثِيْنَ فِيْهِ اَبَدًا ۙ ۝٣ وَّ يُنْذِرَ
الَّذِيْنَ قَالُوا اتَّخَذَ اللّٰهُ وَلَدًا ۗ ۝٤ مَا لَهُمْ بِهٖ
مِنْ عِلْمٍ وَّ لَا لِاٰبَآئِهِمْ ۭ كَبُرَتْ كَلِمَةً تَخْرُجُ
مِنْ اَفْوَاهِهِمْ ۭ اِنْ يَّقُوْلُوْنَ اِلَّا كَذِبًا ۝٥
فَلَعَلَّكَ بَاخِعٌ نَّفْسَكَ عَلٰٓى اٰثَارِهِمْ اِنْ لَّمْ
يُؤْمِنُوْا بِهٰذَا الْحَدِيْثِ اَسَفًا ۝٦ اِنَّا جَعَلْنَا مَا
عَلَى الْاَرْضِ زِيْنَةً لَّهَا لِنَبْلُوَهُمْ اَيُّهُمْ
اَحْسَنُ عَمَلًا ۝٧ وَ اِنَّا لَجٰعِلُوْنَ مَا عَلَيْهَا
صَعِيْدًا جُرُزًا ۝٨ اَمْ حَسِبْتَ اَنَّ اَصْحٰبَ
الْكَهْفِ وَالرَّقِيْمِ ۙ كَانُوْا مِنْ اٰيٰتِنَا عَجَبًا ۝٩
اِذْ اَوَى الْفِتْيَةُ اِلَى الْكَهْفِ فَقَالُوْا رَبَّنَآ اٰتِنَا
مِنْ لَّدُنْكَ رَحْمَةً وَّ هَيِّئْ لَنَا مِنْ اَمْرِنَا
رَشَدًا ۝١٠ فَضَرَبْنَا عَلٰٓى اٰذَانِهِمْ فِي الْكَهْفِ
سِنِيْنَ عَدَدًا ۙ ۝١١ ثُمَّ بَعَثْنٰهُمْ لِنَعْلَمَ اَيُّ
الْحِزْبَيْنِ اَحْصٰى لِمَا لَبِثُوْٓا اَمَدًا ۝١٢ ع

**13 - 16** మేము వారి అసలు గాధను నీకు వినిపిస్తున్నాము. వారు తమ ప్రభువును విశ్వసించిన కొందరు యువకులు. మేము వారికి సన్మార్గంపై నడవటంలో అభివృద్ధిని ప్రసాదించాము.[2] వారు లేచి ఈ ప్రకటన చేసినప్పుడు మేము వారి హృదయాలకు దృఢత్వాన్ని కలుగజేశాము; "ఆకాశాలకూ, భూమికీ ప్రభువైనవాడే మా ప్రభువు. మేము ఆయనను త్రోసిరాజని మరొకణ్ణి దేవుడుగా చేసుకొని వేడుకోము. ఒకవేళ మేము అలా చేస్తే, పూర్తిగా అనుచితమైన దానిని చేసిన వారమవుతాము." (తరువాత వారు పరస్పరం ఇలా అనుకున్నారు) మన జాతివారైన వీరు విశ్వప్రభువును కాదని ఇతర దైవాలను సృష్టించుకున్నారు. ఈ దైవాలు ఆరాధ్యులని స్పష్టమైన ప్రమాణాన్ని దేన్నయినా ఈ ప్రజలు ఎందుకు తీసుకురారు? అల్లాహ్ విషయంలో అభూత కల్పనకు పాల్పడే వాడిని మించిన దుర్మార్గుడెవడు? ఇప్పుడు మీరు వారితోను, అల్లాహ్‌ను కాదని వారు ఆరాధించే దేవుళ్లతోను సంబంధాలను త్రెంచుకున్నారు. కనుక, ఇక పదండి. ఫలానా గుహలో ప్రవేశించి ఆశ్రయం పొందండి. మీ ప్రభువు మీపై తన కారుణ్య ఛాయను విస్తరింపజేస్తాడు, మీ కార్యసిద్ధికై సకల సామగ్రిని సమకూరుస్తాడు.

**17 - 18** వారిని నీవు గుహలో చూసినప్పుడు,[3] సూర్యుడు ఉదయించేటప్పుడు, వారి గుహను తాకకుండా కుడి ప్రక్కగా పైకిపోయినట్లునూ, అస్తమించేటప్పుడు వారికి దూరంగా ఎడమ ప్రక్కగా దిగిపోయినట్లునూ నీకు గోచరిస్తుంది. వారేమో గుహలోపల ఒక సువిశాలమైన స్థలంలో పడి ఉన్నారు. ఇది అల్లాహ్ సూచనలలో ఒక సూచన. అల్లాహ్ సన్మార్గం చూపిన వాడే అసలు సన్మార్గం పొందేవాడు. అల్లాహ్ - మార్గం తప్పించే వాడికి మార్గం చూపి, సంరక్షించేవాణ్ణి నీవు పొందలేవు. వారిని నీవు చూచి, వారు మేల్కొనే ఉన్నారని అనుకుంటావు. వాస్తవానికి వారు నిద్రపోతున్నారు. మేము వారిని కుడిప్రక్కకూ, ఎడమ ప్రక్కకూ దొరిలేలా మరలి పడుకునేలా చేసేవారము; వారి కుక్క గుహ ముఖ ద్వారం వద్ద ముందు కాళ్ళను చాచి కూర్చుండి ఉండేది. ఒకవేళ నీవు వారిని తొంగిచూస్తే, వెనక్కి తిరిగి పారిపోతావు. ఆ దృశ్యాన్ని చూసిన కారణంగా నీవు భయకంపితుడవు అవుతావు.

نَحْنُ نَقُصُّ عَلَيْكَ نَبَاَهُمْ بِالْحَقِّ ؕ اِنَّهُمْ
فِتْيَةٌ اٰمَنُوْا بِرَبِّهِمْ وَ زِدْنٰهُمْ هُدًى ﴿۱۳﴾ وَّ
رَبَطْنَا عَلٰى قُلُوْبِهِمْ اِذْ قَامُوْا فَقَالُوْا رَبُّنَا رَبُّ
السَّمٰوٰتِ وَ الْاَرْضِ لَنْ نَّدْعُوَا۠ مِنْ دُوْنِهٖۤ
اِلٰهًا لَّقَدْ قُلْنَاۤ اِذًا شَطَطًا ﴿۱۴﴾ هٰۤؤُلَآءِ قَوْمُنَا
اتَّخَذُوْا مِنْ دُوْنِهٖۤ اٰلِهَةً ؕ لَوْ لَا يَاْتُوْنَ
عَلَيْهِمْ بِسُلْطٰنٍۭ بَيِّنٍ ؕ فَمَنْ اَظْلَمُ مِمَّنِ افْتَرٰى
عَلَى اللّٰهِ كَذِبًا ﴿۱۵﴾ وَ اِذِ اعْتَزَلْتُمُوْهُمْ وَ مَا
يَعْبُدُوْنَ اِلَّا اللّٰهَ فَاْوٗۤا اِلَى الْكَهْفِ يَنْشُرْ لَكُمْ
رَبُّكُمْ مِّنْ رَّحْمَتِهٖ وَ يُهَيِّئْ لَكُمْ مِّنْ اَمْرِكُمْ
مِّرْفَقًا ﴿۱۶﴾ وَ تَرَى الشَّمْسَ اِذَا طَلَعَتْ تَّزٰوَرُ
عَنْ كَهْفِهِمْ ذَاتَ الْيَمِيْنِ وَ اِذَا غَرَبَتْ
تَّقْرِضُهُمْ ذَاتَ الشِّمَالِ وَ هُمْ فِيْ فَجْوَةٍ مِّنْهُ ؕ
ذٰلِكَ مِنْ اٰيٰتِ اللّٰهِ ؕ مَنْ يَّهْدِ اللّٰهُ فَهُوَ
الْمُهْتَدِ ۚ وَ مَنْ يُّضْلِلْ فَلَنْ تَجِدَ لَهٗ وَلِيًّا
مُّرْشِدًا ﴿۱۷﴾ وَ تَحْسَبُهُمْ اَيْقَاظًا وَّ هُمْ رُقُوْدٌ ۖۗ وَّ ع ۲/۱۴
نُقَلِّبُهُمْ ذَاتَ الْيَمِيْنِ وَ ذَاتَ الشِّمَالِ ۖۗ وَ كَلْبُهُمْ
بَاسِطٌ ذِرَاعَيْهِ بِالْوَصِيْدِ ؕ لَوِ اطَّلَعْتَ عَلَيْهِمْ
لَوَلَّيْتَ مِنْهُمْ فِرَارًا وَّ لَمُلِئْتَ مِنْهُمْ
رُعْبًا ﴿۱۸﴾

وَ كَذٰلِكَ بَعَثْنٰهُمْ لِيَتَسَآءَلُوْا بَيْنَهُمْ ؕ قَالَ
قَآئِلٌ مِّنْهُمْ كَمْ لَبِثْتُمْ ؕ قَالُوْا لَبِثْنَا يَوْمًا اَوْ
بَعْضَ يَوْمٍ ؕ قَالُوْا رَبُّكُمْ اَعْلَمُ بِمَا لَبِثْتُمْ ؕ
فَابْعَثُوْٓا اَحَدَكُمْ بِوَرِقِكُمْ هٰذِهٖٓ اِلَى الْمَدِيْنَةِ
فَلْيَنْظُرْ اَيُّهَآ اَزْكٰى طَعَامًا فَلْيَاْتِكُمْ بِرِزْقٍ مِّنْهُ
وَلْيَتَلَطَّفْ وَ لَا يُشْعِرَنَّ بِكُمْ اَحَدًا ﴿١٩﴾ اِنَّهُمْ
اِنْ يَّظْهَرُوْا عَلَيْكُمْ يَرْجُمُوْكُمْ اَوْ يُعِيْدُوْكُمْ
فِىْ مِلَّتِهِمْ وَ لَنْ تُفْلِحُوْٓا اِذًا اَبَدًا ﴿٢٠﴾ وَ كَذٰلِكَ
اَعْثَرْنَا عَلَيْهِمْ لِيَعْلَمُوْٓا اَنَّ وَعْدَ اللّٰهِ حَقٌّ وَّ
اَنَّ السَّاعَةَ لَا رَيْبَ فِيْهَا ۚ اِذْ يَتَنَازَعُوْنَ
بَيْنَهُمْ اَمْرَهُمْ فَقَالُوا ابْنُوْا عَلَيْهِمْ بُنْيَانًا ؕ
رَبُّهُمْ اَعْلَمُ بِهِمْ ؕ قَالَ الَّذِيْنَ غَلَبُوْا عَلٰٓى
اَمْرِهِمْ لَنَتَّخِذَنَّ عَلَيْهِمْ مَّسْجِدًا ﴿٢١﴾

نصف القرآن باعتبار عدد الحروف أي ان التاء بعد الياء من النصف الاول و اللام الثانية من النصف الاخير ١٢

**19 - 21** మేము ఇదే అద్భుత మహిమ ద్వారా వారిని మేల్కొలిపి కూర్చోబెట్టాము.[4] వారు పరస్పరం ప్రశ్నించుకోవాలని; వారిలో ఒకడు, "మనం ఈ స్థితిలో ఎంతకాలం ఉన్నాము?" అని అడిగాడు. మిగతావారు, "బహుశా ఒక రోజంతానో లేక దానికంటే కొంచెం తక్కువగానో ఉండి ఉంటాము" అని అన్నారు. మళ్లీ ఇలా అన్నారు వారంతా, "అల్లాహ్‌యే బాగా ఎరుగును మనం ఈ స్థితిలో ఎంతకాలం గడిపామో: సరే, ఇక ఈ వెండి నాణాన్ని ఇచ్చి మనలో ఎవరినైనా నగరానికి పంపుదాము. అతడు మంచి భోజనం ఎక్కడ దొరుకుతుందో కనుక్కొని, తినటానికేదైనా తీసుకువస్తాడు. అతడు కాస్త తెలివిగా వ్యవహరించాలి. మనం ఇక్కడున్నామని ఎవరికైనా తెలిసే విధంగా అతడు ప్రవర్తించకూడదు. ఒకవేళ వారు మనల్ని పట్టుకుంటే, రాళ్లతో కొట్టి చంపేస్తారు. లేదా బలవంతంగా మనల్ని తమ సంఘంలో మళ్లీ కలుపుకుంటారు. అలా జరిగితే, మనం ఎన్నటికీ సాఫల్యం పొందలేము." ఈ విధంగా మేము నగరవాసులకు వారి ఉనికిని గురించి తెలియజేశాము.[5] అల్లాహ్ చేసిన వాగ్దానం సత్యమైనదనీ ప్రళయ సమయం నిస్సందేహంగా వచ్చి తీరుతుందనీ ప్రజలు తెలుసుకోవాలని (అప్పుడు వారు అసలు ఆలోచించవలసినది పై విషయం గురించి). కాని ప్రజలు వారి (గుహవాసుల)తో ఎలా వ్యవహరించాలి అనే విషయం గురించి పరస్పరం వాదులాడుకుంటున్నారు. కొందరు "వారిమీద ఒక గోడ కట్టండి. వారి ప్రభువుకే వారి వ్యవహారం గురించి బాగా తెలుసు[6] అని అన్నారు. కాని ఈ వ్యవహారంలో పై చేయిగా ఉన్నవారు, "మేము వారిమీద ఒక ఆరాధనా మందిరాన్ని నిర్మిస్తాము"[7] అని అన్నారు.

1. అంటే, తమ విశ్వాసాన్ని రక్షించుకోవడానికి, గుహను శరణుజొచ్చిన యువకులు. వారి గుహకు ఆ తరువాత స్మారక శిలాఫలకం ఒకటి ప్రతిష్ఠించబడింది.
2. ఈ యువకులు క్రీస్తు శకం ప్రారంభకాలానికి చెందిన ఏసుక్రీస్తు అనుయాయులలోని వారు అనీ, రోమన్ దేశ పౌరులు అనీ ఉల్లేఖనాల ద్వారా తెలుస్తున్నది. ఆనాటి రోమన్ పాలకులు బహుదైవోపాసకులు. వారు ఏక దైవోపాసకులకు బద్ధ విరోధులయ్యారు.
3. రాళ్ళతో కొట్టి చంపే శిక్ష నుంచి తప్పించుకోవటానికి, మతభ్రష్టుల్ని చేసే వత్తిడి నుంచి తప్పించుకోవటానికిగాను వారు తాము తీసుకున్న సమిష్టి నిర్ణయం ప్రకారం, నగరం నుండి బయటపడి, కొండల మధ్య ఉన్న ఒక గుహకు వెళ్ళి దాక్కున్నారు. అయితే ఈ ప్రస్తావనను ఇక్కడ వదలిపెట్టడం జరిగింది.

سَيَقُوْلُوْنَ ثَلٰثَةٌ رَّابِعُهُمْ كَلْبُهُمْ ۚ وَ يَقُوْلُوْنَ
خَمْسَةٌ سَادِسُهُمْ كَلْبُهُمْ رَجْمًا بِالْغَيْبِ ۚ وَ
يَقُوْلُوْنَ سَبْعَةٌ وَّ ثَامِنُهُمْ كَلْبُهُمْ ؕ قُلْ رَّبِّيْٓ
اَعْلَمُ بِعِدَّتِهِمْ مَّا يَعْلَمُهُمْ اِلَّا قَلِيْلٌ ۬ فَلَا
تُمَارِ فِيْهِمْ اِلَّا مِرَآءً ظَاهِرًا ۖ وَّ لَا تَسْتَفْتِ
فِيْهِمْ مِّنْهُمْ اَحَدًا ﴿٢٢﴾ وَلَا تَقُوْلَنَّ لِشَايْءٍ اِنِّيْ ع ٣ ٥ ١٥
فَاعِلٌ ذٰلِكَ غَدًا ﴿٢٣﴾ اِلَّآ اَنْ يَّشَآءَ اللّٰهُ ز
وَاذْكُرْ رَّبَّكَ اِذَا نَسِيْتَ وَ قُلْ عَسٰٓى اَنْ
يَّهْدِيَنِ رَبِّيْ لِاَقْرَبَ مِنْ هٰذَا رَشَدًا ﴿٢٤﴾ وَ
لَبِثُوْا فِيْ كَهْفِهِمْ ثَلٰثَ مِائَةٍ سِنِيْنَ وَ
ازْدَادُوْا تِسْعًا ﴿٢٥﴾ قُلِ اللّٰهُ اَعْلَمُ بِمَا لَبِثُوْا ۚ لَهٗ
غَيْبُ السَّمٰوٰتِ وَ الْاَرْضِ ؕ اَبْصِرْ بِهٖ وَ
اَسْمِعْ ؕ مَا لَهُمْ مِّنْ دُوْنِهٖ مِنْ وَّلِيٍّ ز وَّ لَا
يُشْرِكُ فِيْ حُكْمِهٖٓ اَحَدًا ﴿٢٦﴾

**22 - 26** కొంతమంది, "వారు ముగ్గురు, నాలుగోది వారి కుక్క" అని అంటారు. మరికొందరు, "వారు ఐదుగురు, ఆరోది వారి కుక్క" అని అంటారు. వారందరూ కేవలం అర్థరహితంగా వాగుతున్నారు. ఇంకా కొందరు, "వారు ఏడుగురు, ఎనిమిదోది వారి కుక్క"[8] అని కూడ అంటారు. ఇలా అను: "వారు ఎందరో నా ప్రభువే బాగా ఎరుగును. కొందరికి మాత్రమే వారి నిజమైన సంఖ్య తెలుసు. కనుక స్థూలంగా తప్ప వారి సంఖ్యను గురించి ప్రజలతో వాదించకు. ఇంకా వారిని గురించి ఎవరినీ ఏమీ అడగవద్దు.[9] చూడు[10] ఏ విషయాన్ని గురించియైనా, ఎన్నడూ "నేను ఈ పనిని రేపు చేస్తాను" అని అనకు. (నీవు ఏమీ చేయలేవు) అల్లాహ్ కోరితేనే తప్ప. ఒకవేళ మరపువల్ల నీవు అలా అంటే, వెంటనే నీ ప్రభువును స్మరించుకొని ఇలా అను, "నా ప్రభువు ఈ వ్యవహారంలో సత్యానికి అతి దగ్గరగా ఉన్న విషయం వైపునకు నాకు మార్గం చూపుతాడని నేను ఆశిస్తున్నాను." – వారు తమ గుహలో మూడు వందల సంవత్సరాలు ఉన్నారు, (కొందరు గడువు అంచనాలో) తొమ్మిది సంవత్సరాలు ఇంకా ఎక్కువ పెంచారు. నీవు ఇలా చెప్పు: "వారు ఆ స్థితిలో ఉన్న కాలాన్ని అల్లాహ్‌యే బాగా ఎరుగును.[11] ఆకాశాలలోనూ, భూమిలోనూ గుప్తంగా ఉన్న సమస్త విషయాలు ఆయనకు మాత్రమే తెలుసు. ఎంత అద్భుతమైన వాడు ఆ చూసేవాడు ఆ వినేవాడు (భూమ్యాకాశాలలోని సృజింపబడిన వాటిని) ఆయన తప్ప (ఆదుకునేవాడు) మరెవ్వడూ లేడు. అంతేకాదు ఆయన తన ప్రభుత్వాధికారంలో ఎవరినీ భాగస్వామిగా చేర్చుకోడు."

4. అంటే, విచిత్రమైన రీతిలో వారు పడుకోబెట్టబడినట్లే, వారి స్థితిని గురించి ప్రపంచానికి ఏమాత్రం తెలియకుండా ఉంచటం జరిగినట్లే, ఒక సుదీర్ఘకాలం తరువాత వారు మేల్కోవటం కూడ వింతగొలిపే ఒక దైవ మహిమయే.

5. అంటే, ఆ వ్యక్తి ఆహార పదార్థాలను కొనుక్కురావటానికి నగరానికి వెళ్ళినప్పుడు, ప్రపంచం పూర్తిగా మారిపోయినట్లు తెలుసుకున్నాడు. విగ్రహారాధనలో కూరుకుపోయిన రోమన్ సామ్రాజ్యం క్రైస్తవ ధర్మాన్ని స్వీకరించి చాలా కాలమయిపోయింది. భాషలో, సంస్కృతిలో, నాగరికతలో, ప్రతి విషయంలోనూ స్పష్టమైన మార్పు వచ్చేసింది. రెండువందల సంవత్సరాల నాటి ఈ మనిషి తన స్వరూప స్వభావాలనుబట్టి, వేషభాషలనుబట్టి వెంటనే ఒక వింతగా కన్పించాడు. అతడు పూర్వకాలపు నాణాన్ని భోజనం కొనటానికి ఇచ్చినప్పుడు, దుకాణదారుని కళ్లు తెరచుకున్నవి తెరచుకున్నట్లుగానే ఉండిపోయాయి. పరిశోధన జరుపగా ఈ మనిషి రెండువందల సంవత్సరాలకు పూర్వం తమ మత విశ్వాస రక్షణ కోసం పారిపోయిన క్రీస్తు అనుచరులలోని వాడు అని తెలిసింది. ఈ వార్త క్షణాల్లో నగరంలోని క్రైస్తవ జనావాసాలలోకి వ్యాపించింది. ప్రభుత్వాధికారులతో పాటు ప్రజలు కూడా పెద్ద సంఖ్యలో ఆ గుహవద్ద గుమికూడారు. 200 సంవత్సరాల తరువాత తాము నిదుర

وَاتْلُ مَا أُوحِيَ إِلَيْكَ مِنْ كِتَابِ رَبِّكَ ۖ لَا
مُبَدِّلَ لِكَلِمَاتِهِ ۚ وَلَنْ تَجِدَ مِنْ دُونِهِ
مُلْتَحَدًا ﴿٢٧﴾ وَاصْبِرْ نَفْسَكَ مَعَ الَّذِينَ
يَدْعُونَ رَبَّهُمْ بِالْغَدَاةِ وَالْعَشِيِّ يُرِيدُونَ
وَجْهَهُ ۖ وَلَا تَعْدُ عَيْنَاكَ عَنْهُمْ تُرِيدُ زِينَةَ
الْحَيَاةِ الدُّنْيَا ۖ وَلَا تُطِعْ مَنْ أَغْفَلْنَا قَلْبَهُ
عَنْ ذِكْرِنَا وَاتَّبَعَ هَوَاهُ وَكَانَ أَمْرُهُ
فُرُطًا ﴿٢٨﴾ وَقُلِ الْحَقُّ مِنْ رَبِّكُمْ ۖ فَمَنْ شَاءَ
فَلْيُؤْمِنْ وَمَنْ شَاءَ فَلْيَكْفُرْ ۚ إِنَّا أَعْتَدْنَا
لِلظَّالِمِينَ نَارًا أَحَاطَ بِهِمْ سُرَادِقُهَا ۚ وَإِنْ
يَسْتَغِيثُوا يُغَاثُوا بِمَاءٍ كَالْمُهْلِ يَشْوِي
الْوُجُوهَ ۚ بِئْسَ الشَّرَابُ وَسَاءَتْ
مُرْتَفَقًا ﴿٢٩﴾ إِنَّ الَّذِينَ آمَنُوا وَعَمِلُوا
الصَّالِحَاتِ إِنَّا لَا نُضِيعُ أَجْرَ مَنْ أَحْسَنَ
عَمَلًا ﴿٣٠﴾ أُولَٰئِكَ لَهُمْ جَنَّاتُ عَدْنٍ تَجْرِي مِنْ
تَحْتِهِمُ الْأَنْهَارُ يُحَلَّوْنَ فِيهَا مِنْ أَسَاوِرَ مِنْ
ذَهَبٍ وَيَلْبَسُونَ ثِيَابًا خُضْرًا مِنْ سُنْدُسٍ وَ
إِسْتَبْرَقٍ مُتَّكِئِينَ فِيهَا عَلَى الْأَرَائِكِ ۚ نِعْمَ
الثَّوَابُ ۚ وَحَسُنَتْ مُرْتَفَقًا ﴿٣١﴾

**27 - 31** ప్రవక్తా! నీ ప్రభువు గ్రంథం నుండి నీపై అవతరింపజేయబడిన దానిని (యథాతథంగా) వినిపించు. ఆయన ప్రవచనాలను మార్చే అధికారం ఎవరికీ లేదు. (ఒకవేళ ఎవరి కోసమైనా నీవు అందులో మార్పులు, చేర్పులు చేసినట్లయితే) ఆయనను తప్పించుకొని పారిపోయి నీవు ఏ ఆశ్రయాన్నీ పొందలేవు. తమ ప్రభువు ప్రసన్నతను అర్థిస్తూ ఎవరు ఉదయం, సాయంత్రం ఆయనను వేడుకుంటారో, వారి సాహచర్యం పట్ల నీ హృదయాన్ని సంతృప్తి పరచుకో. వారి నుండి నీ దృష్టిని ఏమాత్రం మరల్చకు. నీవు ఇహలోకపు మెరుగులను కోరుకుంటావా? ఎవని మనస్సును మేము మా ధ్యానం పట్ల శ్రద్ధలేకుండా చేశామో, ఎవడు తన వాంఛలకు అనుగుణంగా వర్తించాడో, ఎవడి పనితీరు అతివాదంపై ఆధార పడి ఉంటుందో అటువంటి వ్యక్తి పట్ల విధేయత చూపకు.[12] స్పష్టంగా ఇలా ప్రకటించు, "ఇది సత్యం మీ ప్రభువు నుండి వచ్చింది. ఇష్టమైన వారు దానిని స్వీకరించనూవచ్చు, ఇష్టం కాని వారు దానిని తిరస్కరించనూవచ్చు. మేము (సత్యాన్ని తిరస్కరించే) దుర్మార్గుల కొరకు ఒక అగ్నిని సిద్ధపరచి ఉంచాము, దాని జ్వాలలు వారిని చుట్టుముట్టుతాయి. అక్కడ వారు గనుక మంచినీళ్లు అడిగితే, నూనె మడ్డిలాంటి నీటితో వారిని సత్కరించటం జరుగుతుంది. అది వారి ముఖాలను మాడుస్తుంది. అది ఎంత జుగుప్సాకరమైన పానీయం! అది ఎంత నికృష్టమైన విశ్రాంతి స్థలం! ఇక విశ్వసించి సత్కార్యాలు చేసేవారి విషయం – మేము నిశ్చయంగా వారి ప్రతిఫలాన్ని వృథాచేయము. వారికై నిత్య హరితవనాలు ఉన్నాయి; వాటి క్రింద కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి; అక్కడ వారు బంగారు కంకణాలను ధరిస్తారు;[13] ఆకుపచ్చని సన్నని జలతారు పట్టు వస్త్రాలను ధరిస్తారు; ఎత్తైన ఆసనాలపై దిండ్లకు ఆనుకుని ఆసీనులై ఉంటారు. అది ఎంత శ్రేష్ఠమైన ప్రతిఫలం! అది ఎంత మహోన్నతమైన నివాస స్థలం!

నుండి మేల్కొన్నాము అని తెలుసుకున్న ఆ గుహనివాసులు, తమ క్రైస్తవ సోదరులకు సలాము చేసి పండుకున్నారు. వారి ఆత్మలు వారి శరీరాలను విడిచిపెట్టి పైకి ఎగిరిపోయాయి.

6. సందర్భాన్నిబట్టి ఇది క్రైస్తవులలోని సద్వర్తనుల అభిప్రాయం అని తెలుస్తోంది. గుహవాసులు గుహలో పండుకుని ఉన్న విధంగానే వారిని పండుకోనివ్వాలని, గుహ ద్వారాన్ని ఇటుకలతో గోడకట్టి మూసివేయాలని, అసలు వారు ఎవరో, వారి అంతస్తు ఏమిటో, వారు ఎట్టి ప్రతిఫలానికి అర్హులో వారి ప్రభువునకే తెలుసు అని వారి అభిప్రాయం.

وَاضْرِبْ لَهُمْ مَّثَلًا رَّجُلَيْنِ جَعَلْنَا لِأَحَدِهِمَا
جَنَّتَيْنِ مِنْ أَعْنَابٍ وَحَفَفْنَاهُمَا بِنَخْلٍ وَجَعَلْنَا
بَيْنَهُمَا زَرْعًا ﴿٣٢﴾ كِلْتَا الْجَنَّتَيْنِ آتَتْ أُكُلَهَا
وَلَمْ تَظْلِمْ مِنْهُ شَيْئًا ۚ وَفَجَّرْنَا خِلَالَهُمَا نَهَرًا ﴿٣٣﴾
وَكَانَ لَهُ ثَمَرٌ فَقَالَ لِصَاحِبِهِ وَهُوَ يُحَاوِرُهُ
أَنَا أَكْثَرُ مِنْكَ مَالًا وَأَعَزُّ نَفَرًا ﴿٣٤﴾

**32 - 44** ప్రవక్తా! వారి ముందు ఒక ఉపమానం పేర్కొను: ఇద్దరు వ్యక్తులు ఉండేవారు. వారిలో ఒకనికి మేము రెండు ద్రాక్ష తోటలు ఇచ్చాము. వాటి చుట్టూ ఖర్జూరపు చెట్ల కంచెను పెంచాము. ఇంకా వాటి మధ్య సేద్యపు భూమిని ఉంచాము. ఆ రెండు తోటలు పుష్కలంగా పండాయి. పండటంలో అవి ఎంత మాత్రమూ కొరత చూపలేదు. ఆ తోటల మధ్య ఒక కాలువను ప్రవహింపజేశాము. యజమానికి మంచి లాభాలు వచ్చాయి. ఇదంతా పొంది కూడా అతడు ఒకనాడు తన పొరుగు మిత్రునితో మాట్లాడుతూ ఇలా అన్నాడు: "నేను నీ కంటే ఎక్కువ ధనం కలవాణ్ణి, ఎక్కువ బలవంతులైన జనం కలవాణ్ణి."

7. దీనికి కారణం ఏమిటంటే, ఆ కాలంలో సామాన్య క్రైస్తవ ప్రజల్లో కూడ బహుదైవారాధన భావాలు వ్యాపించి ఉన్నాయి. పాత విగ్రహాలకు మారుగా వారికి ఈ కొత్త దేవుళ్ళు పూజించటానికి దొరికారు.

8. దీనిద్వారా తెలిసేది ఏమిటంటే, ఈ సంఘటన జరిగిన 275 సంవత్సరాల తరువాత, దివ్య ఖురాను అవతరించిన కాలంలో, దాని వివరాలను గురించి విభిన్నములైన కథలు క్రైస్తవులలో వ్యాపించి ఉన్నాయి. సాధారణంగా ప్రజలకు ప్రామాణిక సమాచారం తెలియదు. అయినప్పటికీ, మూడో అభిప్రాయాన్ని అల్లాహ్ ఖండించలేదు. కాబట్టి వారి సంఖ్య ఏడే (7) అని ఊహించవచ్చు.

9. అంటే, అసలు విషయం వారి సంఖ్య కాదు, అసలు విషయం, ఈ గాథ నేర్పే గుణపాఠాలు అని అర్థం.

10. ఇదొక అవాంతర వాక్యం. ఇంతకు ముందు వాక్యంలోని విషయ ఔచిత్యాన్నిబట్టి ప్రసంగాన్ని ఆపి, ఈ వాక్యాన్ని మధ్యలో చెప్పటం జరిగింది. ఇంతకు ముందు వాక్యంలో గుహవాసుల సంఖ్యకు సంబంధించిన నిర్దిష్ట సమాచారం అల్లాహ్‌కు తెలుసుననీ, దానిని గురించి పరిశోధించటం అనవసర శ్రమ అనీ బోధించబడింది. ఈ సందర్భంలో, తరువాతి విషయాన్ని బోధించేముందు, అవాంతర వాక్యంగా మరొక ఉపదేశం కూడ మహాప్రవక్త (సఅసమ్)కూ, విశ్వాసులకూ చేయబడింది. అదేమిటంటే, "నేను ఫలానా పనిని రేపు తప్పకుండా చేస్తాను" అని మీరు ఎన్నడూ అనకండి. మీరు ఆ పనిని చేయగలరో లేదో మీకు తెలియదుకదా!

11. అంటే, గుహవాసుల సంఖ్యను గురించినట్లే, వారు గుహలో ఉన్న కాలాన్ని గురించి కూడా, ప్రజలలో అభిప్రాయ భేదాలు ఉన్నాయి. మీరు దానిని గురించి పరిశోధన చేసే అవసరం లేదు. వారు ఈ స్థితిలో ఎంతకాలం ఉన్నారో అల్లాహ్‌కే తెలుసు.

12. అంటే, అతడి మాటను వినవద్దు, అతడికి లొంగకు, అతడి ఉద్దేశ్యాన్ని నెరవేరనివ్వకు, అతడి ఆజ్ఞలను అనుసరించకు. ఇక్కడ 'విధేయత' అనే పదం విశాలమైన భావంలో వాడబడింది.

13. ప్రాచీన కాలంలో రాజులు బంగారు కంకణాలను ధరించేవారు. స్వర్గవాసుల వస్త్రధారణలో ఈ వస్తువును ప్రస్తావించటంలోని ఉద్దేశ్యం, అక్కడ వారికి రాజ వస్త్రాలు తొడిగించబడతాయి అని తెలుపటానికే. అవిశ్వాసి, దుష్టుడు అయిన రాజు అక్కడ అగౌరవం పాలవుతాడు. నీచుడుగా చూడబడతాడు. సజ్జనుడూ, విశ్వాసి అయిన ఒక శ్రామికుడు అక్కడ మహారాజులు మాదిరిగా దర్పంగా, ఠీవిగా ఉంటాడు.

وَ دَخَلَ جَنَّتَهٗ وَ هُوَ ظَالِمٌ لِّنَفْسِهٖ ۚ قَالَ مَا
اَظُنُّ اَنْ تَبِيْدَ هٰذِهٖٓ اَبَدًا ۙ﴿۳۵﴾ وَّمَآ اَظُنُّ
السَّاعَةَ قَآئِمَةً ۙ وَّ لَئِنْ رُّدِدْتُّ اِلٰى رَبِّيْ
لَاَجِدَنَّ خَيْرًا مِّنْهَا مُنْقَلَبًا ﴿۳۶﴾ قَالَ لَهٗ
صَاحِبُهٗ وَ هُوَ يُحَاوِرُهٗٓ اَكَفَرْتَ بِالَّذِيْ
خَلَقَكَ مِنْ تُرَابٍ ثُمَّ مِنْ نُّطْفَةٍ ثُمَّ سَوّٰىكَ
رَجُلًا ؕ﴿۳۷﴾ لٰكِنَّا۠ هُوَ اللّٰهُ رَبِّيْ وَ لَآ اُشْرِكُ
بِرَبِّيْٓ اَحَدًا ﴿۳۸﴾ وَ لَوْلَآ اِذْ دَخَلْتَ جَنَّتَكَ
قُلْتَ مَا شَآءَ اللّٰهُ ۙ لَا قُوَّةَ اِلَّا بِاللّٰهِ ۚ اِنْ
تَرَنِ اَنَا اَقَلَّ مِنْكَ مَالًا وَّ وَلَدًا ﴿۳۹﴾ فَعَسٰى
رَبِّيْٓ اَنْ يُّؤْتِيَنِ خَيْرًا مِّنْ جَنَّتِكَ وَ يُرْسِلَ
عَلَيْهَا حُسْبَانًا مِّنَ السَّمَآءِ فَتُصْبِحَ صَعِيْدًا
زَلَقًا ۙ﴿۴۰﴾ اَوْ يُصْبِحَ مَآؤُهَا غَوْرًا فَلَنْ تَسْتَطِيْعَ
لَهٗ طَلَبًا ﴿۴۱﴾ وَ اُحِيْطَ بِثَمَرِهٖ فَاَصْبَحَ يُقَلِّبُ
كَفَّيْهِ عَلٰى مَآ اَنْفَقَ فِيْهَا وَ هِيَ خَاوِيَةٌ عَلٰى
عُرُوْشِهَا وَ يَقُوْلُ يٰلَيْتَنِيْ لَمْ اُشْرِكْ بِرَبِّيْٓ
اَحَدًا ﴿۴۲﴾ وَلَمْ تَكُنْ لَّهٗ فِئَةٌ يَّنْصُرُوْنَهٗ مِنْ
دُوْنِ اللّٰهِ وَ مَا كَانَ مُنْتَصِرًا ﴿۴۳﴾ هُنَالِكَ
الْوَلَايَةُ لِلّٰهِ الْحَقِّ ؕ هُوَ خَيْرٌ ثَوَابًا وَّخَيْرٌ
عُقْبًا ﴿۴۴﴾ ع ۱۳/۱۷

తరువాత అతడు తన స్వర్గంలో ప్రవేశించాడు; తన ఆత్మకు అన్యాయం చేసుకున్నవాడై ఇలా ప్రకటించాడు: "ఎన్నటికైనా ఈ సంపద నశిస్తుందని నేను భావించటం లేదు. ఎప్పటికైనా ప్రళయ ఘడియ వస్తుందనే నమ్మకం కూడ నాకు లేదు. అయినప్పటికీ, ఒకవేళ ఎప్పుడైనా నేను నా ప్రభువు సన్నిధికి మరలింపబడినట్లయితే తప్పకుండా దీనికంటే మహోజ్వలమైన స్థానాన్ని పొందుతాను." అప్పుడు అతని పొరుగువాడు మాట్లాడుతూ అతనితో ఇలా అన్నాడు: "నిన్ను మట్టితోనూ, తరువాత వీర్య బిందువుతోనూ పుట్టించి ఒక సంపూర్ణ మానవునిగా తీర్చిదిద్దిన ఆయనను నీవు తిరస్కరిస్తున్నావా? ఇక నా విషయం, నా ప్రభువైతే అల్లాహ్‌యే. నేను ఎవరినీ ఆయనకు భాగస్వామిగా చేయను. నీవు నీ వనంలోకి ప్రవేశిస్తూ ఉన్న సమయంలో నీ నోట **'మాషా అల్లాహ్' 'లాఖువ్వత ఇల్లా బిల్లాహ్'**[14] అనే మాటలు ఎందుకు రాలేదు? ఒకవేళ నీవు నన్ను సంపదలో, సంతానంలో నీ కంటె తక్కువ వాడిగా చూస్తూ ఉన్నప్పటికీ, నా ప్రభువు నీ స్వర్గం కంటే ఉత్తమమైన దానిని నాకు ప్రసాదించటమూ, నీ 'స్వర్గం' మీదకు ఆకాశం నుండి ఏదైనా ఆపదను పంపించటమూ, ఆ కారణంగా అది చదునైన మైదానంగా మారిపోవటమూ లేదా దాని నీరు భూమిలో ఇంకిపోవటమూ తరువాత నీవు దానిని ఏ విధంగానూ తిరిగి పొందలేకపోవటమూ అనేది అసంభవమేమీ కాదు." చివరకు జరిగిందేమిటంటే, అతని పంట మొత్తం ధ్వంసం అయింది, తన ద్రాక్షతోట తలక్రిందులుగా తడికలపై కూలి పోవటాన్ని చూచి అతడు తాను పెట్టిన పెట్టుబడిని గురించి చేతులు నులుముకుంటూ ఉండిపోయాడు. ఇంకా "అయ్యో! నేను నా ప్రభువునకు ఇతరులెవరినీ భాగస్థులుగా చేయకుండా ఉంటే ఎంత బాగుండేది!" అని వాపోయాడు - అల్లాహ్‌కు వ్యతిరేకంగా అతనికి సహాయపడటానికి అతని వద్ద ఏ జన సమూహమూ లేకుండా పోయింది. అతడు స్వయంగానూ ఆ ఆపదను ఎదుర్కోలేకపోయాడు - అప్పుడు తెలిసింది ఆదుకునే శక్తి ఒక్క సత్యదేవునికే ఉందని, ఆయన ప్రసాదించే బహుమానమే ఉత్తమమైనదని, ఆయన చూపించే ఫలితమే శ్రేష్ఠమైనదని.

وَ اضۡرِبۡ لَهُمۡ مَّثَلَ الۡحَيٰوةِ الدُّنۡيَا كَمَآءٍ
اَنۡزَلۡنٰهُ مِنَ السَّمَآءِ فَاخۡتَلَطَ بِهٖ نَبَاتُ
الۡاَرۡضِ فَاَصۡبَحَ هَشِيۡمًا تَذۡرُوۡهُ الرِّيٰحُ ؕ وَ
كَانَ اللّٰهُ عَلٰى كُلِّ شَىۡءٍ مُّقۡتَدِرًا ﴿۴۵﴾ اَلۡمَالُ وَ
الۡبَنُوۡنَ زِيۡنَةُ الۡحَيٰوةِ الدُّنۡيَا ۚ وَالۡبٰقِيٰتُ
الصّٰلِحٰتُ خَيۡرٌ عِنۡدَ رَبِّكَ ثَوَابًا وَّخَيۡرٌ
اَمَلًا ﴿۴۶﴾ وَ يَوۡمَ نُسَيِّرُ الۡجِبَالَ وَ تَرَى
الۡاَرۡضَ بَارِزَةً ۙ وَّحَشَرۡنٰهُمۡ فَلَمۡ نُغَادِرۡ
مِنۡهُمۡ اَحَدًا ﴿۴۷﴾ وَعُرِضُوۡا عَلٰى رَبِّكَ صَفًّا ؕ
لَقَدۡ جِئۡتُمُوۡنَا كَمَا خَلَقۡنٰكُمۡ اَوَّلَ مَرَّةٍ ۢ بَلۡ
زَعَمۡتُمۡ اَلَّنۡ نَّجۡعَلَ لَكُمۡ مَّوۡعِدًا ﴿۴۸﴾ وَ وُضِعَ
الۡكِتٰبُ فَتَرَى الۡمُجۡرِمِيۡنَ مُشۡفِقِيۡنَ مِمَّا فِيۡهِ
وَ يَقُوۡلُوۡنَ يٰوَيۡلَتَنَا مَالِ هٰذَا الۡكِتٰبِ لَا
يُغَادِرُ صَغِيۡرَةً وَّ لَا كَبِيۡرَةً اِلَّاۤ اَحۡصٰٮهَا ۚ وَ
وَجَدُوۡا مَا عَمِلُوۡا حَاضِرًا ؕ وَ لَا يَظۡلِمُ رَبُّكَ
اَحَدًا ﴿۴۹﴾ وَ اِذۡ قُلۡنَا لِلۡمَلٰٓئِكَةِ اسۡجُدُوۡا لِاٰدَمَ ع ٦ ٥ ١٨
فَسَجَدُوۡۤا اِلَّاۤ اِبۡلِيۡسَ ؕ كَانَ مِنَ الۡجِنِّ
فَفَسَقَ عَنۡ اَمۡرِ رَبِّهٖ ؕ اَفَتَتَّخِذُوۡنَهٗ وَذُرِّيَّتَهٗۤ
اَوۡلِيَآءَ مِنۡ دُوۡنِىۡ وَهُمۡ لَـكُمۡ عَدُوٌّ ؕ بِئۡسَ
لِلظّٰلِمِيۡنَ بَدَلًا ﴿۵۰﴾

**45 - 49** ప్రవక్తా! ఐహిక జీవిత వాస్తవాన్ని వారికి ఈ ఉపమానం ద్వారా బోధించు: ఈనాడు మేము ఆకాశం నుండి వర్షాన్ని కురిపిస్తే నేలపై పచ్చిక బాగా దట్టంగా పెరుగుతుంది. మరునాడు అదే పచ్చిక పొట్టుగా మారిపోతుంది. దానిని గాలులు లేపుకుపోయి తిరుగుతూ ఉంటాయి. అల్లాహ్ ప్రతి దానిపై అధికారం కలవాడు. ఈ సంపదా, ఈ సంతానమూ కేవలం ఐహిక జీవితపు తాత్కాలిక అలంకారాలు మాత్రమే. అసలు, శాశ్వతంగా ఉండిపోయే పుణ్యకార్యాలే నీ ప్రభువు దగ్గర పరిణామం రీత్యా ఉత్తమమైనవి. కాబట్టి వాటి మీదనే పెద్ద ఆశలు పెట్టుకోవచ్చు. ఆలోచించవలసినది ఆ రోజును గురించి: ఆ రోజున మేము పర్వతాలను నడిపిస్తాము, భూమి అంతా బోసిపోయినట్లుగా మీరు చూస్తారు. (ఆదిమానవులలో, అంత్య మానవులలో) ఒక్కరు కూడ మిగిలిపోకుండా మేము మానవులందరినీ చుట్టుముట్టి సమావేశపరుస్తాము. వారంతా నీ ప్రభువు సాన్నిధ్యంలో వరుసలు వరుసలుగా ప్రవేశపెట్టబడతారు– ఇదిగో చూడండి, మేము మిమ్మల్ని మొదటిసారి పుట్టించిన స్థితిలోనే మీరు మా వద్దకు వచ్చేశారు కదా! మాతో సమావేశమయ్యే కాలాన్ని దేనినీ మేము మీ కొరకు నిర్ణయించనే లేదని మీరు భ్రమపడ్డారు–అప్పుడు కర్మల పత్రం వారి ముందు ఉంచబడుతుంది. ఆ సమయంలో అపరాధులు తమ జీవిత గ్రంథంలో నమోదు చేయబడిన విషయాలకు భయపడుతూ ఉండటాన్ని నీవు చూస్తావు. వారు "అయ్యో మా దౌర్భాగ్యం! ఇదేమి గ్రంథం! మేము చేసిన చిన్న పనిగానీ, పెద్దపనిగానీ ఏదీ ఈ గ్రంథంలో నమోదు చేయబడకుండా ఉండలేదే" అని అంటూ ఉంటారు. వారు ఏమేమి చేశారో అదంతా తమ ముందు ప్రత్యక్షం కావటాన్ని చూస్తారు. నీ ప్రభువు ఎవరికీ ఏ మాత్రమూ అన్యాయం చేయడు.

**50 - 51** ఈ విషయాన్ని జ్ఞాపకం తెచ్చుకో; ఆదమ్‌కు సజ్దా చేయమని మేము దైవదూతలతో అన్నప్పుడు వారు అతనికి సజ్దా చేశారు, కాని ఇబ్లీస్ చేయలేదు. అతడు జిన్నాతులలోని వాడు, కనుకనే తన ప్రభువు ఆజ్ఞను ఉల్లంఘించటానికి ఒడి గట్టాడు.[15] మీరు నన్ను కాదని వాడూ, వాడి సంతతీ మీకు శత్రువులైనప్పటికీ, మీరు వారిని మీకు సంరక్షకులుగా చేసుకుంటారా? ఈ దుర్మార్గులెంత చెడ్డ ప్రత్యామ్నాయాన్ని వరిస్తున్నారు!

مَآ اَشْهَدْتُّهُمْ خَلْقَ السَّمٰوٰتِ وَالْاَرْضِ وَ
لَا خَلْقَ اَنْفُسِهِمْ ۖ وَ مَا كُنْتُ مُتَّخِذَ
الْمُضِلِّيْنَ عَضُدًا ﴿٥١﴾ وَ يَوْمَ يَقُوْلُ نَادُوْا
شُرَكَآءِيَ الَّذِيْنَ زَعَمْتُمْ فَدَعَوْهُمْ فَلَمْ
يَسْتَجِيْبُوْا لَهُمْ وَجَعَلْنَا بَيْنَهُمْ مَّوْبِقًا ﴿٥٢﴾ وَ رَاَ
الْمُجْرِمُوْنَ النَّارَ فَظَنُّوْٓا اَنَّهُمْ مُّوَاقِعُوْهَا وَلَمْ
يَجِدُوْا عَنْهَا مَصْرِفًا ﴿٥٣﴾ وَ لَقَدْ صَرَّفْنَا فِيْ هٰذَا ع ۹
الْقُرْاٰنِ لِلنَّاسِ مِنْ كُلِّ مَثَلٍ ۭ وَكَانَ الْاِنْسَانُ
اَكْثَرَ شَيْءٍ جَدَلًا ﴿٥٤﴾ وَ مَا مَنَعَ النَّاسَ اَنْ
يُّؤْمِنُوْٓا اِذْ جَآءَهُمُ الْهُدٰى وَ يَسْتَغْفِرُوْا
رَبَّهُمْ اِلَّآ اَنْ تَاْتِيَهُمْ سُنَّةُ الْاَوَّلِيْنَ اَوْ
يَاْتِيَهُمُ الْعَذَابُ قُبُلًا ﴿٥٥﴾

నేను ఆకాశాన్నీ, భూమినీ సృష్టించేటప్పుడు వారిని ఆహ్వానించ లేదు. స్వయంగా వారిని సృష్టించేటప్పుడు సైతం వారిని నాకు భాగస్వాములుగా చేసుకోలేదు. మార్గం తప్పించే వారిని సహాయకులుగా చేసుకోవటం నా పనికాదు.[16]

**52 - 53** వారి ప్రభువు వారితో ఇలా అనే రోజున వారు ఏమి చేస్తారు? "ఇప్పుడు పిలవండి మీరు, నాకు భాగస్వాము లని మీరు భావిస్తున్న ఆ శక్తులను." అప్పుడు వారు వారిని పిలుస్తారు. కాని వారు వారి సహాయానికై రారు. మేము వారికి ఒకే వినాశ గుండాన్ని ఏర్పాటు చేస్తాము. అపరాధులందరూ ఆ రోజున అగ్నిని చూస్తారు. ఇక తాము అందులో పడవలసి ఉన్నదని తెలుసుకుంటారు, దాని నుండి తప్పించుకోవటానికి వారు ఏ ఆశ్రయాన్నీ పొందలేరు.

**54 - 55** మేము ఈ ఖురానులో ప్రజలకు పలు విధాలుగా హితవు గరపాము. కాని మానవుడు పరమ జగడాలమారి. వారి ముందుకు మార్గదర్శకత్వం వచ్చినప్పుడు, దానిని స్వీకరిం చకుండా, తమ ప్రభువు సన్నిధానంలో క్షమాభిక్షను కోరకుండా, అసలు వారిని ఏ విషయం వారించింది? ఆ విషయం ఇది తప్ప మరొకటేమీ కాదు – పూర్వపు జాతుల విషయంలో జరిగినదే తమ విషయంలో కూడ జరగాలని వారు నిరీక్షిస్తు న్నారు. లేదా శిక్ష తమ ముందుకు వస్తూ ఉండగా చూడాలని వారు కోరుకుంటున్నారు.

14. అంటే, అల్లాహ్ కోరేదే జరుగుతుంది. నా శక్తిగానీ, మరెవరి శక్తిగానీ ఎందుకూ కొరగాదు. ఒకవేళ మనమేదైనా చేయగలిగితే, అది కేవలం దైవ సహాయం వల్లనే, ఆయన ప్రసాదించే సద్బుద్ధి వల్లనే చేయగలము.

15. అంటే, షైతాను దైవదూతల జాతికి చెందినవాడు కాడు. జిన్నాతుల జాతికి చెందినవాడు. కనుకనే విధేయతా పరిధిని ఉల్లంఘించటం వాడికి సాధ్యపడింది. దైవదూతలలోని వాడయినట్లయితే, అవిధేయతకు పాల్పడగలిగేవాడే కాడు. దీనికి భిన్నంగా వాడు మానవుల మాదిరిగానే స్వేచ్ఛా, అధికారముగల ప్రాణి. విధేయుడుగా పుట్టించబడ లేదు. అవిశ్వాస విశ్వాసాలు, విధేయతా, అవిధేయతలు – ఈ రెంటి మధ్య తనకు ఇష్టమైన దానిని ఎన్నుకునే అధికారం వాడికి ఇవ్వబడింది.

16. అర్థం ఏమిటంటే, మీరు విధేయత చూపటానికి, దాస్యం చేయటానికీ, అసలు ఈ షైతానులు అర్హులెలా అయ్యారు? దాస్యానికి అర్హుడు కేవలం సృష్టికర్త మాత్రమే కాగలడు. ఈ షైతానులకు భూమ్యాకాశాలను సృష్టించటంలో ఎలాంటి భాగస్వామ్యమూ లేదు. ఎందుకంటే వారే సృష్టింపబడినారు.

**56 - 57** మేము ప్రవక్తలను, శుభవార్తను అందజేసేందుకూ హెచ్చరికను చేసేందుకూ తప్ప మరే ఉద్దేశ్యంతోనూ పంపము. కాని, అవిశ్వాసులు అసత్యవాదపు ఆయుధాలతో సత్యాన్ని ఖండించటానికి ప్రయత్నం చేస్తారు, వారు నా వాక్యాలనూ, వారికి చేయబడిన హెచ్చరికలనూ హాస్యంగా తీసుకున్నారు. ఇక తన ప్రభువు వాక్యాలను అతనికి వినిపించి హితోపదేశం చేయగా, వాటికి విముఖుడై, తనకు తానే చేతులారా చేసుకున్న దాని యొక్క దుష్పరిణామాన్ని మరచిపోయే వ్యక్తి కంటే దుర్మార్గుడెవడు? (ఈ వైఖరిని అవలంబించిన) వారి హృదయాలకు మేము గలీబులు తొడిగాము. అవి వారిని ఖురానును అర్థం చేసుకోనీయవు; వారి చెవులకు మేము చెవుడు కలిగించాము. నీవు వారిని సన్మార్గం వైపునకు ఎంత పిలిచినా, వారు ఈ స్థితిలో ఎన్నటికీ సన్మార్గాన్ని పొందలేరు.

**58** నీ ప్రభువు ఎంతో మన్నించేవాడు, కరుణించేవాడూను, వారి చేష్టలకు ఆయన వారిని పట్టుకోదలిస్తే, తొందరగానే శిక్షను పంపి ఉండేవాడు. కాని వారి శిక్షకోసం ఒక సమయం నిర్ణయించబడి ఉన్నది. దాని నుండి తప్పించుకుని పారిపోయే ఏ మార్గాన్నీ వారు పొందలేరు.

**59** శిక్షకు గురిఅయిన ఈ పట్టణాలు మీ ఎదుట ఉన్నాయి. వారు దుర్మార్గం చేయగా, మేము వారిని నాశనం చేశాము. వారిలోని ప్రతి ఒక్కరి వినాశానికి మేము సమయం నిర్ణయిం చేసి ఉంచాము.

**60 - 65** (మూసాకు సంబంధించిన గాథను వారికి వినిపించు) అప్పుడు మూసా తన సేవకునితో ఇలా అన్నాడు: "రెండు నదుల సంగమ స్థలానికి చేరనంతవరకు, నేను నా ప్రయాణాన్ని ఆపను. లేకపోతే నేను సుదీర్ఘకాలం నడుస్తూనే ఉంటాను."[17] తరువాత వారు వాటి సంగమ ప్రదేశానికి చేరినప్పుడు, తమ చేప విషయంలో అశ్రద్ధవహించారు. అది నదిలోకి సొరంగం గుండా పోయినట్లు దూసుకు పోయింది. ముందుకు పోయిన తరువాత, మూసా తన సేవకునితో ఇలా అన్నాడు, "మా ఉదయపు ఆహారం తీసుకురా. ఈనాటి ప్రయాణంలో మేము బాగా అలసిపోయాము."

وَ مَا نُرۡسِلُ الۡمُرۡسَلِيۡنَ اِلَّا مُبَشِّرِيۡنَ
وَمُنۡذِرِيۡنَ ۚ وَ يُجَادِلُ الَّذِيۡنَ كَفَرُوۡا
بِالۡبَاطِلِ لِيُدۡحِضُوۡا بِهِ الۡحَقَّ وَ اتَّخَذُوۡۤا
اٰيٰتِىۡ وَ مَاۤ اُنۡذِرُوۡا هُزُوًا ﴿۵۶﴾ وَ مَنۡ اَظۡلَمُ
مِمَّنۡ ذُكِّرَ بِاٰيٰتِ رَبِّهٖ فَاَعۡرَضَ عَنۡهَا وَ نَسِىَ
مَا قَدَّمَتۡ يَدٰهُ ؕ اِنَّا جَعَلۡنَا عَلٰى قُلُوۡبِهِمۡ
اَكِنَّةً اَنۡ يَّفۡقَهُوۡهُ وَ فِىۡۤ اٰذَانِهِمۡ وَقۡرًا ؕ وَاِنۡ
تَدۡعُهُمۡ اِلَى الۡهُدٰى فَلَنۡ يَّهۡتَدُوۡۤا اِذًا اَبَدًا ﴿۵۷﴾
وَرَبُّكَ الۡغَفُوۡرُ ذُو الرَّحۡمَةِ ؕ لَوۡ يُؤَاخِذُهُمۡ بِمَا
كَسَبُوۡا لَعَجَّلَ لَهُمُ الۡعَذَابَ ؕ بَلْ لَّهُمۡ مَّوۡعِدٌ
لَّنۡ يَّجِدُوۡا مِنۡ دُوۡنِهٖ مَوۡئِلًا ﴿۵۸﴾ وَتِلۡكَ الۡقُرٰٓى
اَهۡلَكۡنٰهُمۡ لَمَّا ظَلَمُوۡا وَ جَعَلۡنَا لِمَهۡلِكِهِمۡ
مَّوۡعِدًا ﴿۵۹﴾ وَ اِذۡ قَالَ مُوۡسٰى لِفَتٰىهُ لَاۤ اَبۡرَحُ ع
حَتّٰٓى اَبۡلُغَ مَجۡمَعَ الۡبَحۡرَيۡنِ اَوۡ اَمۡضِىَ حُقُبًا ﴿۶۰﴾
فَلَمَّا بَلَغَا مَجۡمَعَ بَيۡنِهِمَا نَسِيَا حُوۡتَهُمَا فَاتَّخَذَ
سَبِيۡلَهٗ فِى الۡبَحۡرِ سَرَبًا ﴿۶۱﴾ فَلَمَّا جَاوَزَا قَالَ
لِفَتٰىهُ اٰتِنَا غَدَآءَنَا ۟ لَقَدۡ لَقِيۡنَا مِنۡ سَفَرِنَا
هٰذَا نَصَبًا ﴿۶۲﴾

قَالَ اَرَءَيْتَ اِذْ اَوَيْنَآ اِلَى الصَّخْرَةِ فَاِنِّيْ
نَسِيْتُ الْحُوْتَ ۬ وَ مَآ اَنْسٰنِيْهُ اِلَّا الشَّيْطٰنُ
اَنْ اَذْكُرَهٗ ۚ وَاتَّخَذَ سَبِيْلَهٗ فِي الْبَحْرِ ۖ
عَجَبًا ﴿۶۳﴾ قَالَ ذٰلِكَ مَا كُنَّا نَبْغِ ۖ فَارْتَدَّا عَلٰٓى
اٰثَارِهِمَا قَصَصًا ۙ ﴿۶۴﴾ فَوَجَدَا عَبْدًا مِّنْ
عِبَادِنَآ اٰتَيْنٰهُ رَحْمَةً مِّنْ عِنْدِنَا وَ عَلَّمْنٰهُ مِنْ
لَّدُنَّا عِلْمًا ﴿۶۵﴾ قَالَ لَهٗ مُوْسٰى هَلْ اَتَّبِعُكَ عَلٰٓى
اَنْ تُعَلِّمَنِ مِمَّا عُلِّمْتَ رُشْدًا ﴿۶۶﴾ قَالَ اِنَّكَ
لَنْ تَسْتَطِيْعَ مَعِيَ صَبْرًا ﴿۶۷﴾ وَكَيْفَ تَصْبِرُ عَلٰى
مَا لَمْ تُحِطْ بِهٖ خُبْرًا ﴿۶۸﴾ قَالَ سَتَجِدُنِيْٓ اِنْ
شَآءَ اللّٰهُ صَابِرًا وَّ لَآ اَعْصِيْ لَكَ اَمْرًا ﴿۶۹﴾
قَالَ فَاِنِ اتَّبَعْتَنِيْ فَلَا تَسْئَلْنِيْ عَنْ شَيْءٍ حَتّٰٓى
اُحْدِثَ لَكَ مِنْهُ ذِكْرًا ﴿۷۰﴾ ع فَانْطَلَقَا ۫ حَتّٰٓى
اِذَا رَكِبَا فِي السَّفِيْنَةِ خَرَقَهَا ۭ قَالَ اَخَرَقْتَهَا
لِتُغْرِقَ اَهْلَهَا ۚ لَقَدْ جِئْتَ شَيْـًٔا اِمْرًا ﴿۷۱﴾ قَالَ
اَلَمْ اَقُلْ اِنَّكَ لَنْ تَسْتَطِيْعَ مَعِيَ صَبْرًا ﴿۷۲﴾
قَالَ لَا تُؤَاخِذْنِيْ بِمَا نَسِيْتُ وَ لَا تُرْهِقْنِيْ
مِنْ اَمْرِيْ عُسْرًا ﴿۷۳﴾

సేవకుడు ఇలా అన్నాడు, "చూశారా ఏమయిందో! మనం ఆ రాయి వద్ద విశ్రాంతికై ఆగి ఉన్న సమయంలో నాకు చేప విషయమే జ్ఞాపకం లేకుండాపోయింది. షైతాను నన్ను ఏమరుపాటుకు గురిచేశాడు. నేను దాని ప్రస్తావనను (మీతో చెయ్యటం) మరచిపోయాను. చేప విచిత్రమైన రీతిలో బయటపడి నదిలోకి వెళ్ళిపోయింది." మూసా "మనం అన్వేషిస్తూ వచ్చినది దీని కొరకేకదా!"[18] అని అన్నాడు. కనుక వారు ఉభయులూ తమ అడుగుజాడలలో వెనక్కి తిరిగి వెళ్ళారు. అక్కడ వారు మా దాసులలోని ఒక దాసుని కనుగొన్నారు; మేము అతనికి మా కారుణ్యాన్ని ప్రసాదించాము. మా తరఫునుండి ఒక ప్రత్యేక జ్ఞానాన్ని ప్రసాదించాము.[19]

**66 – 70** మూసా అతనితో ఇలా అన్నాడు, "మీరు నేర్చుకున్న వివేకాన్ని, మీరు నాకు కూడ బోధించేందుకు నేను మీ వెంట ఉండవచ్చా?" అతను ఇలా అన్నాడు, "మీరు నా విషయంలో సహనంతో వ్యవహరించలేరు. అసలు మీకు తెలియని విషయాన్ని గురించి సహనం చూపటం మీకు ఎలా సాధ్యం?" మూసా ఇలా జవాబు పలికాడు, "ఇన్షాఅల్లాహ్ (అల్లాహ్ సంకల్పిస్తే) మీరు నన్ను సహనశీలునిగా చూస్తారు. ఏ వ్యవహారంలోనూ నేను మీకు అవిధేయత చూపను." అతను ఇలా అన్నాడు, "మంచిది ఒకవేళ మీరు నాతో రాదలిస్తే స్వయంగా నేను మీతో ప్రస్తావించే వరకు నన్ను ఏ విషయమూ అడగకండి."

**71 – 73** అప్పుడు వారు ఉభయులూ బయల్దేరారు, చివరకు వారు ఒక పడవ ఎక్కినప్పుడు, ఆ వ్యక్తి పడవకు రంధ్రం చేశాడు. మూసా అప్పుడు ఇలా అన్నాడు, "పడవలో ఉన్న వారందరినీ ముంచటానికా మీరు దానికి రంధ్రం చేశారు? మీరు చేసినది దారుణమైన పనే." అతను ఇలా పలికాడు, "మీరు నా పట్ల సహనం చూపలేరని నేను మీకు చెప్పలేదా?" మూసా ఇలా అన్నాడు, "మరచిపోయి చేసిన దానికి నన్ను తప్పు పట్టకండి నా విషయంలో కఠినంగా వ్యవహరించకండి."

17. హజ్రత్ మూసా (అస్సలామ్) ప్రవక్త చేసిన ఈ ప్రయాణం ఎప్పుడు జరిగింది అనే విషయమూ, ఏ రెండు నదుల సంగమం వద్ద ఈ సంఘటన జరిగింది, ఆ రెండు నదులు ఏవి అనే విషయమూ, తెలుసుకోవటానికి ప్రామాణికమైన ఆధారం ఏదీ లేదు. అయితే, సంఘటనను గురించి ఆలోచిస్తే, హజ్రత్ మూసా ప్రవక్త

فَانْطَلَقَا ٚ حَتّٰٓى اِذَا لَقِيَا غُلٰمًا فَقَتَلَهٗ ۙ قَالَ
اَقَتَلْتَ نَفْسًا زَكِيَّةًۢ بِغَيْرِ نَفْسٍ ؕ لَقَدْ جِئْتَ
شَيْـًٔا نُّكْرًا ﴿٧٤﴾ قَالَ اَلَمْ اَقُلْ لَّكَ اِنَّكَ لَنْ
تَسْتَطِيْعَ مَعِيَ صَبْرًا ﴿٧٥﴾ قَالَ اِنْ سَاَلْتُكَ عَنْ
شَيْءٍۭ بَعْدَهَا فَلَا تُصٰحِبْنِيْ ۚ قَدْ بَلَغْتَ مِنْ
لَّدُنِّيْ عُذْرًا ﴿٧٦﴾ فَانْطَلَقَا ٚ حَتّٰٓى اِذَآ اَتَيَآ
اَهْلَ قَرْيَةِ ۨ اسْتَطْعَمَآ اَهْلَهَا فَاَبَوْا اَنْ
يُّضَيِّفُوْهُمَا فَوَجَدَا فِيْهَا جِدَارًا يُّرِيْدُ اَنْ
يَّنْقَضَّ فَاَقَامَهٗ ؕ قَالَ لَوْ شِئْتَ لَتَّخَذْتَ
عَلَيْهِ اَجْرًا ﴿٧٧﴾ قَالَ هٰذَا فِرَاقُ بَيْنِيْ وَ
بَيْنِكَ ۚ سَاُنَبِّئُكَ بِتَاْوِيْلِ مَا لَمْ تَسْتَطِعْ عَّلَيْهِ
صَبْرًا ﴿٧٨﴾ اَمَّا السَّفِيْنَةُ فَكَانَتْ لِمَسٰكِيْنَ
يَعْمَلُوْنَ فِي الْبَحْرِ فَاَرَدْتُّ اَنْ اَعِيْبَهَا وَكَانَ
وَرَآءَهُمْ مَّلِكٌ يَّاْخُذُ كُلَّ سَفِيْنَةٍ غَصْبًا ﴿٧٩﴾ وَ
اَمَّا الْغُلٰمُ فَكَانَ اَبَوٰهُ مُؤْمِنَيْنِ فَخَشِيْنَآ اَنْ
يُّرْهِقَهُمَا طُغْيَانًا وَّ كُفْرًا ۚ ﴿٨٠﴾ فَاَرَدْنَآ اَنْ
يُّبْدِلَهُمَا رَبُّهُمَا خَيْرًا مِّنْهُ زَكٰوةً وَّاَقْرَبَ
رُحْمًا ﴿٨١﴾ وَ اَمَّا الْجِدَارُ فَكَانَ لِغُلٰمَيْنِ
يَتِيْمَيْنِ فِي الْمَدِيْنَةِ وَكَانَ تَحْتَهٗ كَنْزٌ لَّهُمَا
وَكَانَ اَبُوْهُمَا صَالِحًا ۚ فَاَرَادَ رَبُّكَ اَنْ يَّبْلُغَآ
اَشُدَّهُمَا وَيَسْتَخْرِجَا كَنْزَهُمَا ۖ رَحْمَةً مِّنْ
رَّبِّكَ ۚ وَمَا فَعَلْتُهٗ عَنْ اَمْرِيْ ؕ ذٰلِكَ تَاْوِيْلُ
مَا لَمْ تَسْطِعْ عَّلَيْهِ صَبْرًا ﴿٨٢﴾ ع

**74 - 76** తరువాత వారు ప్రయాణం సాగించారు. చివరకు వారిని ఒక బాలుడు కలిశాడు; ఆ వ్యక్తి అతనిని చంపివేశాడు. మూసా ఇలా అన్నాడు, "మీరు ఒక అమాయకుని ప్రాణాన్ని తీశారు. వాస్తవానికి అతడు ఎవరినీ హత్యచేయలేదు కదా! మీరు చేసిన పని చాల చెడ్డది." అతను ఇలా అన్నాడు, "మీరు నాతో సహనంగా ఉండలేరని నేను మీకు చెప్పలేదా!" మూసా ఇలా పలికాడు, "దీని తరువాత ఒకవేళ నేను మిమ్మల్ని ఏదైనా అడిగితే, మీరు నన్ను మీ వెంట ఉండనీయకండి. ఇదిగో, ఇప్పుడు మీకు నా వైపు నుండి సాకు దొరికిపోయింది."

**77 - 82** తరువాత వారు ముందుకు సాగిపోయారు. చివరకు ఒక పట్టణానికి చేరుకున్నారు. అక్కడి ప్రజలను అన్నం పెట్టమని అభ్యర్థించారు. కాని వారు వీరిద్దరికీ ఆతిథ్యమీయటానికి తిరస్కరించారు. అక్కడ వారు కూలిపోనున్న ఒక గోడను చూశారు. ఆ వ్యక్తి ఆ గోడను మళ్ళీ నిలబెట్టాడు. మూసా ఇలా అన్నాడు, "మీకు ఇష్టమైతే ఈ శ్రమకు ప్రతిఫలం తీసుకునేవారు." ఆయన ఇలా అన్నారు, "ఇక చాలు మన సహవాసం ముగిసింది. ఇక మీరు సహనం చూపలేకపోయిన ఆ విషయాల తత్వాన్ని నేను మీకు వివరిస్తాను. ఆ పడవ వృత్తాంతం ఏమిటంటే, అది నదిలో కష్టపడి పని చేసుకునే కొందరు నిరుపేదలది. నేను దానికి లోపం కల్పించాలని ఎందుకు అనుకొన్నానంటే ప్రతి పడవను బలవంతంగా వశపరచుకొనే ఒక రాజుకు చెందిన ప్రాంతం ముందు రాబోతోంది. ఇక ఆ బాలుని విషయం- అతని తల్లిదండ్రులు విశ్వాసులు. అతడు తన తలబిరుసుతనం వల్లా, తన అవిశ్వాసం వల్లా, వారిని వేధిస్తాడనే భయం మాకు కలిగింది. ఈ కారణం వల్ల మేము కోరుకున్నదేమిటంటే, వారి ప్రభువు అతనికి మారుగా, నడవడికలో అతనికంటే మంచివాడునూ, రక్త సంబంధీకులను ఎక్కువగా కనికరిస్తాడని ఆశించదగిన వాడునూ అయిన మరొక బిడ్డను వారికి ఇవ్వాలని. ఇక గోడ విషయం ఏమిటంటే, అది ఈ పట్టణంలోనే నివసిస్తున్న ఇద్దరు అనాథ బాలురిది. ఆ గోడ క్రింద ఈ బాలుర కోసం ఒక నిధి పాతి పెట్టబడి ఉన్నది. వారి తండ్రి చాల మంచివాడు. అందు కని ఈ ఇద్దరు బాలురూ యుక్తవయస్కులైన పిమ్మట తమ నిధిని తాము తీసుకోవాలని నీ ప్రభువు సంకల్పించాడు. ఇదంతా నీ ప్రభువు కారుణ్యం మూలంగా నేను చేశాను. నా అంతట నేను చేయలేదు. నీవు సహనం[20] చూపలేని విషయాల వాస్తవికత ఇది."

**83** ప్రవక్తా! ఈ ప్రజలు నిన్ను జుల్‌ఖర్‌నైన్‌ను గురించి అడుగుతున్నారు. వారితో "నేను అతనిని గురించి మీకు కొంచెం వినిపిస్తాను" అని అను.

**84 - 88** మేము అతనికి ధరణిలో అధికారాన్ని ప్రసాదించాము. అతనికి అన్ని రకాల సాధనాలనూ, వనరులనూ ఇచ్చాము. అతను (మొదట పశ్చిమ దిశకు దండయాత్ర చేయటానికి) సన్నాహాలు చేశాడు. చివరకు అతను సూర్యుడు అస్తమించే హద్దుకు చేరినప్పుడు,[21] నల్లని నీటిలో సూర్యుడు మునుగుతూ ఉండగా[22] అతను చూశాడు. అక్కడ అతనికి ఒక జాతి ప్రజలు కనిపించారు. అప్పుడు మేము ఇలా అన్నాము, "జుల్‌ఖర్‌నైన్! ఆ జాతి ప్రజలను శిక్షించటానికిగానీ, వారిపట్ల ఉదార వైఖరిని అవలంబించటానికి గానీ నీకు అధికారం ఉన్నది." అతను ఇలా అన్నాడు, "వారిలో దౌర్జన్యం చేసేవాడిని మేము శిక్షిస్తాము. ఆపై అతడు తన ప్రభువు వైపునకు మరలింపబడతాడు. అప్పుడు ఆయన అతనికి మరింత తీవ్రమైన శిక్ష విధిస్తాడు. వారిలో విశ్వసించినవాడికీ, సత్కార్యాలు చేసేవాడికీ మంచి ప్రతిఫలం లభిస్తుంది. అంతేకాదు మేము అతడికి తేలికపాటి ఆజ్ఞలను ఇస్తాము."

وَ يَسْـَٔلُوْنَكَ عَنْ ذِي الْقَرْنَيْنِ ؕ قُلْ سَاَتْلُوْا
عَلَيْكُمْ مِّنْهُ ذِكْرًا ؕ﴿۸۳﴾ اِنَّا مَكَّنَّا لَهٗ فِي
الْاَرْضِ وَاٰتَيْنٰهُ مِنْ كُلِّ شَيْءٍ سَبَبًا ۙ﴿۸۴﴾ فَاَتْبَعَ
سَبَبًا ﴿۸۵﴾ حَتّٰۤى اِذَا بَلَغَ مَغْرِبَ الشَّمْسِ
وَجَدَهَا تَغْرُبُ فِيْ عَيْنٍ حَمِئَةٍ وَّوَجَدَ
عِنْدَهَا قَوْمًا ؕ قُلْنَا يٰذَا الْقَرْنَيْنِ اِمَّاۤ اَنْ
تُعَذِّبَ وَ اِمَّاۤ اَنْ تَتَّخِذَ فِيْهِمْ حُسْنًا ﴿۸۶﴾ قَالَ
اَمَّا مَنْ ظَلَمَ فَسَوْفَ نُعَذِّبُهٗ ثُمَّ يُرَدُّ اِلٰى
رَبِّهٖ فَيُعَذِّبُهٗ عَذَابًا نُّكْرًا ﴿۸۷﴾ وَ اَمَّا مَنْ اٰمَنَ وَ
عَمِلَ صَالِحًا فَلَهٗ جَزَآءً الْحُسْنٰى ۚ وَ سَنَقُوْلُ
لَهٗ مِنْ اَمْرِنَا يُسْرًا ﴿۸۸﴾

---

(అస్సలామ్) ఈజిప్టులో ఉన్న కాలంలో ఇది జరిగిందనీ, అప్పుడు ఆయనకూ, ఫిరౌనుకూ మధ్య సంఘర్షణ జరుగుతూ ఉన్నదనీ అనిపిస్తుంది. ఇదే గనుక నిజమైతే, ఆ రెండు నదులు నీలం నైలు, తెల్ల నైలు అవుతాయి. వాటి సంగమస్థలం వద్దనే ఇప్పుడు 'ఖార్తూమ్' అనే ప్రముఖ నగరం ఉన్నది. పూర్తి వివరాలకోసం, తఫ్‌హీముల్ ఖురాన్, 3వ సంపుటం, కహఫ్ సూరాలోని మా వ్యాఖ్యానాన్ని చూడండి.

18. అంటే, గమ్యస్థానం గుర్తు ఇదే అని మనకు తెలియజేయబడింది.

19. ఈ భక్తుని పేరు 'ఖిజర్' అని ప్రామాణికములైన హదీసులన్నింటిలోనూ పేర్కొనబడింది.

20. ఈ గాథలో హజ్రత్ ఖిజర్ చేసిన మూడు పనులు, అల్లాహ్ ఆదేశానుసారమే చేశారు అనే విషయం సుస్పష్టం. అయితే, వాటిలో మొదటి రెండు పనుల విషయంలో, దేవుడు ఇంతవరకు పంపిన ఏ షరీఅత్‌లోను ఏ మానవుడికీ అనుమతి ఎన్నడూ ఇవ్వటం జరగలేదు అనే విషయం కూడ సుస్పష్టమే. ఒకరి సొంత పడవను, దుర్మార్గుడెవడో అన్యాయంగా అపహరించబోతున్నాడని దైవప్రేరణ ద్వారా తెలుసుకుని దానిని పాడుచేసే అధికారం ఏ మానవుడికీ లేదు. ఒక కుర్రవాణ్ణి, అతడు భవిష్యత్తులో తిరుగుబాటుదారుగానో లేక అవిశ్వాసిగానో మారబోనున్నాడని, హత్యచేసే అధికారం కూడ ఏ మానవుడికీ లేదు. కనుక హజ్రత్ ఖిజర్ ఈ పనులను షరీఅత్ ఆజ్ఞలు ఆధారంగా కాక, దైవాజ్ఞలు ఆధారంగా చేశారు. మరి అటువంటి ఆజ్ఞలను అమలు చేయటానికి అల్లాహ్ మానవ జాతిని కాక, తన సృష్టిలోని మరొక ప్రాణిని వినియోగించుకుంటాడు అని నమ్మటం కంటే గత్యంతరం లేదు. అల్లాహ్ తన దాసుడైన ఖిజర్ వద్దకు హజ్రత్ మూసాను పంపటానికి గల కారణమేమిటంటే, దైవ సంకల్పం ప్రకారం నడిచే ఈ సృష్టి మర్మాలను ఆయనకు ఎరుకపరచటానికే. ఈ మర్మాలు మానవుడికి

ثُمَّ اَتْبَعَ سَبَبًا ﴿٨٩﴾ حَتّٰىٓ اِذَا بَلَغَ مَطْلِعَ
الشَّمْسِ وَجَدَهَا تَطْلُعُ عَلٰى قَوْمٍ لَّمْ نَجْعَلْ لَّهُمْ
مِّنْ دُوْنِهَا سِتْرًا ﴿٩٠﴾ كَذٰلِكَ ۗ وَقَدْ اَحَطْنَا
بِمَا لَدَيْهِ خُبْرًا ﴿٩١﴾ ثُمَّ اَتْبَعَ سَبَبًا ﴿٩٢﴾ حَتّٰىٓ
اِذَا بَلَغَ بَيْنَ السَّدَّيْنِ وَجَدَ مِنْ دُوْنِهِمَا
قَوْمًا ۙ لَّا يَكَادُوْنَ يَفْقَهُوْنَ قَوْلًا ﴿٩٣﴾ قَالُوْا
يٰذَا الْقَرْنَيْنِ اِنَّ يَاْجُوْجَ وَمَاْجُوْجَ مُفْسِدُوْنَ
فِى الْاَرْضِ فَهَلْ نَجْعَلُ لَكَ خَرْجًا عَلٰٓى اَنْ
تَجْعَلَ بَيْنَنَا وَبَيْنَهُمْ سَدًّا ﴿٩٤﴾ قَالَ مَا مَكَّنِّىْ
فِيْهِ رَبِّىْ خَيْرٌ فَاَعِيْنُوْنِىْ بِقُوَّةٍ اَجْعَلْ بَيْنَكُمْ
وَبَيْنَهُمْ رَدْمًا ۙ ﴿٩٥﴾ اٰتُوْنِىْ زُبَرَ الْحَدِيْدِ ۗ حَتّٰىٓ
اِذَا سَاوٰى بَيْنَ الصَّدَفَيْنِ قَالَ انْفُخُوْا ۗ
حَتّٰىٓ اِذَا جَعَلَهٗ نَارًا ۙ قَالَ اٰتُوْنِىْٓ اُفْرِغْ
عَلَيْهِ قِطْرًا ﴿٩٦﴾ فَمَا اسْطَاعُوْٓا اَنْ يَّظْهَرُوْهُ وَمَا
اسْتَطَاعُوْا لَهٗ نَقْبًا ﴿٩٧﴾ قَالَ هٰذَا رَحْمَةٌ مِّنْ
رَّبِّىْ ۚ فَاِذَا جَآءَ وَعْدُ رَبِّىْ جَعَلَهٗ دَكَّآءَ ۚ وَ
كَانَ وَعْدُ رَبِّىْ حَقًّا ﴿٩٨﴾ وَتَرَكْنَا بَعْضَهُمْ
يَوْمَئِذٍ يَّمُوْجُ فِىْ بَعْضٍ وَّنُفِخَ فِى الصُّوْرِ
فَجَمَعْنٰهُمْ جَمْعًا ۙ ﴿٩٩﴾ وَّعَرَضْنَا جَهَنَّمَ يَوْمَئِذٍ
لِّلْكٰفِرِيْنَ عَرْضَا ۙ ﴿١٠٠﴾ الَّذِيْنَ كَانَتْ اَعْيُنُهُمْ فِىْ
غِطَآءٍ عَنْ ذِكْرِىْ وَكَانُوْا لَا يَسْتَطِيْعُوْنَ سَمْعًا ﴿١٠١﴾ ع ١١ ١٩ ٢

**89 - 91** తరువాత అతను (మరొక దండయాత్ర కోసం) సన్నాహాలు చేశాడు. చివరకు అతను సూర్యుడు ఉదయించే హద్దువరకు పోయాడు.[23] అక్కడ అతను ఒక జాతిపై సూర్యుడు ఉదయించటం చూశాడు, దాని కోసం మేము ఎండనుండి రక్షణ పొందే ఏర్పాటు ఏదీ చేయలేదు. ఇదీ వారి స్థితి. జుల్‌ఖర్‌నైన్ వద్ద ఉన్నది ఏమిటో మాకు తెలుసు.

**92 - 98** తరువాత అతను (మరొక దండయాత్రకు) సన్నాహాలు చేశాడు; చివరకు అతను రెండు పర్వతాల మధ్యకు చేరినప్పుడు, అక్కడ అతనికి ఒక జాతి కనిపించింది. ఆ జాతి ఏ విషయాన్నైనా అతి కష్టం మీదగాని అర్థం చేసుకోలేదు. వారు ఇలా అన్నారు, "జుల్‌ఖర్‌నైన్! యాజూజ్, మాజూజ్[24]లు ఈ భూభాగంలో కల్లోలాన్ని వ్యాపింపజేస్తున్నారు. కనుక నీవు మాకూ వారికీ మధ్య అడ్డంగా ఒక గోడను నిర్మించు. అందుకు మేము నీకు ఏదైనా సుంకం చెల్లించాలా?" అప్పుడు అతను ఇలా అన్నాడు, "నా ప్రభువు నాకు ఇచ్చినదే నాకు చాలు. మీరు మటుకు శ్రమద్వారా నాకు సహాయపడండి, నేను మీకూ, వారికీ మధ్య అడ్డంగా గోడ కడతాను. నాకు ఇనుపరేకులను తెచ్చి ఇవ్వండి." చివరకు ఆ రెండు పర్వతాల మధ్య ఉన్న ఖాళీ స్థలాన్ని అతను పూడ్చివేసి, ప్రజలతో "ఇక మంటలు రగిలించండి" అని అన్నాడు. తరువాత (ఆ ఇనుప గోడను) పూర్తిగా నిప్పుమాదిరిగా ఎర్రగాచేసి అతను, "ఇక కరిగిన రాగిని తీసుకురండి. దీనిపై కుమ్మరిస్తాను" అని అన్నాడు. (ఈ గోడ ఎటువంటిదంటే) యాజూజ్, మాజూజ్‌లు దానిపైకి ఎక్కిరానూలేరు; దానికి కన్నం వేయటం వారికి ఇంకా కష్ట తరం. జుల్‌ఖర్‌నైన్ ఇలా అన్నాడు, "ఇది నా ప్రభువు కరుణ, కాని నా ప్రభువు యొక్క వాగ్దాన సమయం ఆసన్నమయి నప్పుడు, ఆయన దానిని నేలమట్టం చేస్తాడు. నా ప్రభువు వాగ్దానం నిజమైనది."

**99 - 101** ఆ రోజున[25] మేము ప్రజలను వదలిపెడతాము. వారు (సముద్రపు అలలు మాదిరిగా) ఒకరితో ఒకరు అల్లకల్లోలంగా కలిసిపోతారు. బాకా ఊదబడుతుంది. మేము మానవులను అందరినీ ఒకేసారి సమావేశపరుస్తాము. ఆ రోజున మేము నరకాన్ని అవిశ్వాసుల ముందుకు తీసుకు వస్తాము; వారు మా హితోపదేశం పట్ల గుడ్డివారై పోయారు. అసలు దానిని వినటానికి ఏమాత్రం సిద్ధపడలేదు.

**102** అయితే ఈ తిరస్కారులు, నన్ను కాదని, నా దాసులను తమ కార్యసాధకులుగా చేసుకునే తలంపు కలిగి ఉన్నారా? అటువంటి అవిశ్వాసులకు ఆతిథ్యంగా మేము నరకాన్ని సిద్ధం చేసి ఉంచాము.

**103 - 108** ప్రవక్తా! వారితో ఇలా అను: తాము చేసిన పనుల విషయంలో అందరికంటే ఎక్కువగా విఫలులయ్యేవారు ఎవరో, నష్టపోయే వారెవరో మేము మీకు తెలుపమంటారా? వారెవరంటే, ప్రాపంచిక జీవితంలో వారి ప్రయత్నాలు అన్నీ ఋజుమార్గం నుండి వైదొలగి ఉంటాయి. అయినా వారు తాము చేసే దంతా సవ్యంగానే ఉందని భావిస్తారు. వారు తమ ప్రభువు వాక్యాలను నమ్మకుండా తిరస్కరించినవారు. ఆయన సాన్నిధ్యంలో హాజరు కావలసి ఉన్నదనే విషయాన్ని విశ్వసించనివారు. ఇందువల్ల వారి కర్మలన్నీ వృధా అయి పోయాయి. ప్రళయదినం నాడు మేము వాటికి ఏమాత్రమూ విలువనీయము. వారి ప్రతిఫలం నరకం-వారు అవిశ్వాసానికి పాల్పడినందుకు బదులుగా, వారు మా వాక్యాలనూ, మా ప్రవక్తలనూ ఎగతాళి చేసినదానికి ఫలితంగా. అయితే విశ్వసించి సత్కార్యాలు చేసిన వారికి ఆతిథ్యంగా ఫిరదౌసు (స్వర్గపు) ఉద్యానవనాలు ఉంటాయి. వాటిలో వారు కలకాలం ఉంటారు. ఆ స్థలాన్ని వదలి మరెక్కడికైనా పోవాలని వారి మనస్సు ఎన్నడూ కోరదు.

**109** ప్రవక్తా! ఇలా ప్రకటించు, "ఒకవేళ నా ప్రభువు మాటలు వ్రాయటానికి సముద్రజలమే సిరాఅయినా, అది ఖాళీ అయి పోతుంది గాని, నా ప్రభువు మాటలు మాత్రం పూర్తికావు. అంతేకాదు, మేము మళ్లీ ఇంతే సిరాను తెచ్చినా, అది కూడ సరిపోదు."[26]

**110** ప్రవక్తా! ఇలా చెప్పు, "నేను కేవలం ఒక మానవుణ్ణి, మీలాంటివాణ్ణి, నాకు వహీద్వారా ఇలా తెలుపబడింది. మీ దైవం కేవలం ఒకే దైవం. కనుక తన ప్రభువును కలుసుకోవాలని ఆశించేవాడు సత్కార్యాలు చేయాలి, ఆరాధనలో తన ప్రభువుతో పాటు మరెవ్వరినీ చేర్చకూడదు."

اَفَحَسِبَ الَّذِيْنَ كَفَرُوْٓا اَنْ يَّتَّخِذُوْا عِبَادِيْ
مِنْ دُوْنِيْٓ اَوْلِيَآءَ ؕ اِنَّآ اَعْتَدْنَا جَهَنَّمَ
لِلْكٰفِرِيْنَ نُزُلًا ﴿۱۰۲﴾ قُلْ هَلْ نُنَبِّئُكُمْ
بِالْاَخْسَرِيْنَ اَعْمَالًا ؕ﴿۱۰۳﴾ اَلَّذِيْنَ ضَلَّ سَعْيُهُمْ
فِي الْحَيٰوةِ الدُّنْيَا وَ هُمْ يَحْسَبُوْنَ اَنَّهُمْ
يُحْسِنُوْنَ صُنْعًا ﴿۱۰۴﴾ اُولٰٓئِكَ الَّذِيْنَ كَفَرُوْا
بِاٰيٰتِ رَبِّهِمْ وَ لِقَآئِهٖ فَحَبِطَتْ اَعْمَالُهُمْ فَلَا
نُقِيْمُ لَهُمْ يَوْمَ الْقِيٰمَةِ وَزْنًا ﴿۱۰۵﴾ ذٰلِكَ
جَزَآؤُهُمْ جَهَنَّمُ بِمَا كَفَرُوْا وَاتَّخَذُوْٓا اٰيٰتِيْ وَ
رُسُلِيْ هُزُوًا ﴿۱۰۶﴾ اِنَّ الَّذِيْنَ اٰمَنُوْا وَعَمِلُوا
الصّٰلِحٰتِ كَانَتْ لَهُمْ جَنّٰتُ الْفِرْدَوْسِ نُزُلًا ۙ﴿۱۰۷﴾
خٰلِدِيْنَ فِيْهَا لَا يَبْغُوْنَ عَنْهَا حِوَلًا ﴿۱۰۸﴾ قُلْ لَّوْ
كَانَ الْبَحْرُ مِدَادًا لِّكَلِمٰتِ رَبِّيْ لَنَفِدَ الْبَحْرُ
قَبْلَ اَنْ تَنْفَدَ كَلِمٰتُ رَبِّيْ وَ لَوْ جِئْنَا بِمِثْلِهٖ
مَدَدًا ﴿۱۰۹﴾ قُلْ اِنَّمَآ اَنَا بَشَرٌ مِّثْلُكُمْ يُوْحٰٓى اِلَيَّ
اَنَّمَآ اِلٰهُكُمْ اِلٰهٌ وَّاحِدٌ ۚ فَمَنْ كَانَ يَرْجُوْا
لِقَآءَ رَبِّهٖ فَلْيَعْمَلْ عَمَلًا صَالِحًا وَّ لَا يُشْرِكْ
بِعِبَادَةِ رَبِّهٖٓ اَحَدًا ع ﴿۱۱۰﴾ ع ۱۲ ۹ ۳

అర్థం కావు. హ(జత్ ఖిజర్‌ను అల్లాహ్ కేవలం "దాసుడు" అని సంబోధించాడనే విషయం ఆధారంగా ఆయనను మానవుడుగా పరిగణించటానికి వీల్లేదు. అంబియా సూరా ఆయత్ 26లో, జుఖ్రుఫ్ సూరా ఆయత్19లో ఇంకా ఇతర(త్రా అనేకచోట్ల ఈ పదం దైవదూతల కోసం కూడ వాడబడింది.

21. అంటే, పశ్చిమ దిక్కు చివరి వరకు.

22. అంటే, అక్కడ సూర్యాస్తమయం సమయంలో, సూర్యుడు సముద్రపు నల్లని మురికి నీటిలో మునుగుతూ ఉన్నట్లు అనిపిస్తుంది.

23. అంటే, తూర్పు దిక్కు చివరి వరకు.

24. యాజూజ్, మాజూజ్ అంటే, ఆసియా ఖండపు ఈశాన్య భాగంలో ఉండే ఆటవిక జాతులు. పూర్వకాలం నుండి ఈ జాతులు ఆసియా, ఐరోపా ఖండమందలి నాగరిక దేశాలపై దండయాత్రలు చేసి వాటిని సర్వనాశనం చేసేవి. యజకీయల్ గ్రంథంలోని 38, 39 అధ్యాయాల ప్రకారం, ఈ జాతులు రష్యా లోనూ, తూబల్‌లోనూ, మాస్కోలోనూ ఉండేవి. ఇస్రాయీల్ చరిత్రకారుడైన జోసెఫస్ ప్రకారం,ఈ జాతులు సిధియన్ జాతులు.ఇవి నల్లసముద్రపు ఉత్తర, తూర్పు ప్రాంతాలలో ఉండేవి. 'జెరూమ్' ప్రకారం, మాజూజ్ జాతి కాస్పియన్ సముద్రానికి సమీపంలో ఉన్న కౌకాషియాకు ఉత్తర భాగంలో ఉండేది.

25. అంటే, ప్రళయదినం. ప్రళయానికి సంబంధించిన సత్య వాగ్దానం గురించి జుల్‌ఖర్‌నైన్ చేసిన సూచనను బలపరుస్తూ ఈ ఆయతులు (99 - 101) సెలవీయబడ్డాయి.

26. "ప్రభువు మాటలు" అంటే, ఆయన చేతలు, ఘనతలు, ఆయన శక్తికీ, వివేచనకూ సంబంధించిన అద్భుతాలు అని భావం.

ఆయతులు 98 | **19. మర్యమ్** | అవతరణ మక్కాలో

١٩ سُوۡرَةُ مَرۡيَمَ مَكِّيَّةٌ ٤٤

اٰياتها ٩٨ | ركوعاتها ٦

అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 – 3** కాఫ్.హా.యా.ఐన్.సాద్. ఇది నీ ప్రభువు తన దాసుడైన జకరియ్యాపై చూపిన కారుణ్య ప్రస్తావన – అపుడు అతను తన ప్రభువునకు ఏకాంతంగా మొరపెట్టుకున్నాడు.

**4 – 11** అతను ఇలా మనవి చేసుకున్నాడు, "ప్రభూ! నా ఎముకలు సైతం కృశించిపోయాయి. ముదిమి వల్ల తల (నెరసి) మెరిసిపోతోంది. ప్రభూ! నిన్ను వేడుకుని నేను ఎన్నడూ నిష్ఫలుణ్ణి కాలేదు. నా తరువాత నా బంధు మిత్రులు చేసే చెడు పనులను గురించి నేను భయపడుతున్నాను; నా భార్యేమో గొడ్రాలు కనుక నీవు నీ ప్రత్యేక అనుగ్రహం ద్వారా నాకు ఒక వారసుణ్ణి ప్రసాదించు. అతడు నాకు వారసుడూ కావాలి, యాఖూబ్ సంతతి వారసత్వాన్నీ పొందాలి. ప్రభూ! అతనిని అందరికీ ఇష్టుడైన వ్యక్తిగా చేయి." (ఇలా జవాబు ఇవ్వబడింది) "జకరియ్యా! మేము నీకు యహ్యా అనే పేరుగల ఒక కుమారుని శుభవార్తను తెలియజేస్తున్నాము. ఈ పేరుగల మనిషిని మేము ఇంతకు పూర్వం ఎన్నడూ పుట్టించలేదు." ఇలా మనవి చేసుకున్నాడు, "ప్రభూ! నాకు కుమారుడెలా పుడతాడు, నా భార్యయేమో గొడ్రాలు, నేనా, వృద్ధుడనై కృశించి పోయాను." బదులు లభించింది, "అలాగే జరుగుతుంది."[1] నీ ప్రభువు ఇలా సెలవిస్తున్నాడు, "ఇది నాకు చాల చిన్న విషయం. వాస్తవానికి ఇంతకు ముందు నీవు అసలు ఏమీ కానపుడు, నేను నిన్ను పుట్టించాను కదా!" జకరియ్యా ఇలా అన్నాడు, "ప్రభూ! నా కొరకేదైనా గుర్తును నిర్ణయించు." సెలవిచ్చాడు, "నీ కొరకు గుర్తు ఏమిటంటే, నీవు వరుసగా మూడు రోజుల వరకు ప్రజలతో మాట్లాడలేవు." తరువాత అతను తన ప్రత్యేకమైన గదినుండి బయటకు వచ్చి తన జాతివారి వద్దకు వెళ్ళి, ఉదయం, సాయంత్రం దేవుని పవిత్రతను కొనియాడండి అని సైగ ద్వారా వారికి హితోపదేశం చేశాడు.

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○
كٓهٰيٰعٓصٓ ١ ذِكۡرُ رَحۡمَتِ رَبِّكَ عَبۡدَهٗ
زَكَرِيَّا ٢ اِذۡ نَادٰى رَبَّهٗ نِدَآءً خَفِيًّا ٣
قَالَ رَبِّ اِنِّىۡ وَهَنَ الۡعَظۡمُ مِنِّىۡ وَ اشۡتَعَلَ
الرَّاۡسُ شَيۡبًا وَّ لَمۡ اَكُنۡۢ بِدُعَآئِكَ رَبِّ
شَقِيًّا ٤ وَ اِنِّىۡ خِفۡتُ الۡمَوَالِىَ مِنۡ وَّرَآءِىۡ وَ
كَانَتِ امۡرَاَتِىۡ عَاقِرًا فَهَبۡ لِىۡ مِنۡ لَّدُنۡكَ
وَلِيًّا ٥ يَّرِثُنِىۡ وَيَرِثُ مِنۡ اٰلِ يَعۡقُوۡبَ ۖ وَ
اجۡعَلۡهُ رَبِّ رَضِيًّا ٦ يٰزَكَرِيَّاۤ اِنَّا نُبَشِّرُكَ
بِغُلٰمِ ۨاسۡمُهٗ يَحۡيٰى ۙ لَمۡ نَجۡعَلۡ لَّهٗ مِنۡ قَبۡلُ
سَمِيًّا ٧ قَالَ رَبِّ اَنّٰى يَكُوۡنُ لِىۡ غُلٰمٌ وَّكَانَتِ
امۡرَاَتِىۡ عَاقِرًا وَّ قَدۡ بَلَغۡتُ مِنَ الۡكِبَرِ عِتِيًّا ٨
قَالَ كَذٰلِكَ ۚ قَالَ رَبُّكَ هُوَ عَلَىَّ هَيِّنٌ وَّ قَدۡ
خَلَقۡتُكَ مِنۡ قَبۡلُ وَ لَمۡ تَكُ شَيۡـًٔا ٩ قَالَ
رَبِّ اجۡعَلۡ لِّىۡۤ اٰيَةً ؕ قَالَ اٰيَتُكَ اَلَّا تُكَلِّمَ
النَّاسَ ثَلٰثَ لَيَالٍ سَوِيًّا ١٠ فَخَرَجَ عَلٰى قَوۡمِهٖ
مِنَ الۡمِحۡرَابِ فَاَوۡحٰۤى اِلَيۡهِمۡ اَنۡ سَبِّحُوۡا بُكۡرَةً
وَّ عَشِيًّا ١١

يٰيَحْيٰى خُذِ الْكِتٰبَ بِقُوَّةٍ ؕ وَاٰتَيْنٰهُ الْحُكْمَ
صَبِيًّا ﴿١٢﴾ لا وَّحَنَانًا مِّنْ لَّدُنَّا وَزَكٰوةً ؕ وَكَانَ
تَقِيًّا ﴿١٣﴾ لا وَّبَرًّا بِوَالِدَيْهِ وَلَمْ يَكُنْ جَبَّارًا
عَصِيًّا ﴿١٤﴾ وَسَلٰمٌ عَلَيْهِ يَوْمَ وُلِدَ وَيَوْمَ
يَمُوْتُ وَيَوْمَ يُبْعَثُ حَيًّا ﴿١٥﴾ ع وَاذْكُرْ فِي ع ٥
الْكِتٰبِ مَرْيَمَ ۘ اِذِ انْتَبَذَتْ مِنْ اَهْلِهَا وقف لازم
مَكَانًا شَرْقِيًّا ﴿١٦﴾ لا فَاتَّخَذَتْ مِنْ دُوْنِهِمْ
حِجَابًا ۗ قف فَاَرْسَلْنَآ اِلَيْهَا رُوْحَنَا فَتَمَثَّلَ لَهَا
بَشَرًا سَوِيًّا ﴿١٧﴾ قَالَتْ اِنِّيْٓ اَعُوْذُ بِالرَّحْمٰنِ
مِنْكَ اِنْ كُنْتَ تَقِيًّا ﴿١٨﴾ قَالَ اِنَّمَآ اَنَا رَسُوْلُ
رَبِّكِ ۖ صلے لِاَهَبَ لَكِ غُلٰمًا زَكِيًّا ﴿١٩﴾ قَالَتْ اَنّٰى
يَكُوْنُ لِيْ غُلٰمٌ وَّلَمْ يَمْسَسْنِيْ بَشَرٌ وَّلَمْ اَكُ
بَغِيًّا ﴿٢٠﴾ قَالَ كَذٰلِكِ ۚ قَالَ رَبُّكِ هُوَ عَلَيَّ الربع
هَيِّنٌ ۚ وَلِنَجْعَلَهٗٓ اٰيَةً لِّلنَّاسِ وَرَحْمَةً مِّنَّا ۚ
وَكَانَ اَمْرًا مَّقْضِيًّا ﴿٢١﴾

**12 - 15** మేము అతనితో, "యహ్యా! దైవగ్రంథాన్ని గట్టిగా పట్టుకో"[2] అని అన్నాము. మేము అతనికి బాల్యంలోనే 'హుక్మ్'[3] (వివేకం)ను ప్రసాదించాము. తరువాత మా తరఫు నుండి అతనికి దయార్ద్ర హృదయాన్నీ, పరిశుద్ధతనూ అనుగ్రహించాము. అతను ఎక్కువ భయభక్తులు కలవాడు. తల్లిదండ్రుల హక్కులను గుర్తించినవాడు. అతను దౌర్జన్యపరుడూ కాడు, అవిధేయుడూ కాడు. అతను పుట్టిన రోజునా, అతను మరణించే రోజునా, అతనిని బ్రతికించి లేపే రోజునా అతనిపై శాంతి నెలకొనుగాక.

**16 - 21** ప్రవక్తా! ఈ గ్రంథంలో, మర్యమ్ తన వారినుండి వేరైపోయి, తూర్పు దిక్కున ఏకాంతంగా[4] కూర్చుండి, వారికి చాటుగా తెర కట్టుకుని[5] ఉండిపోయినప్పటి వృత్తాంతాన్ని ప్రస్తావించు. ఈ స్థితిలో మేము ఆమె వద్దకు మా 'ఆత్మ'ను (అంటే దూతను) పంపాము. అప్పుడు అతడు ఆమె ముందు పరిపూర్ణమైన మానవాకారంలో ప్రత్యక్షమయ్యాడు. వెంటనే మర్యమ్ ఇలా పలికింది, "నీవు దైవభీతి కల మనిషివే అయితే, నేను నీ బారినుండి రక్షించవలసినదిగా దయామయుడైన దేవుని శరణు కోరుకుంటున్నాను." అతను "నేను నీ ప్రభువు దూతను మాత్రమే. నీకు ఒక పరిశుద్ధ పుత్రుణ్ణి ఇచ్చేందుకు పంపబడ్డాను" అని చెప్పాడు. మర్యమ్ "నాకు పుత్రుడు ఎలా పుడతాడు, నన్ను పురుషుడు ఎవడూ తాకనైనా లేదు, నేను చెడు నడత గల దానినీ కాను" అని అన్నది. దైవదూత ఇలా అన్నాడు,"అలాగే జరుగుతుంది."[6] నీ ప్రభువు, "అలా చేయటం నాకు చాల సులభం. ఆ బాలుణ్ణి ప్రజలకొరకు ఒక సూచనగా,[7] మా తరఫు నుండి ఒక కారుణ్యంగా చేయాలని మేము ఈ పని చేస్తున్నాము. ఇది జరిగి తీరవలసిన విషయమే" అని సెలవిస్తున్నాడు.

1. అంటే, నీవు వృద్ధాప్యంలో ఉన్నా, నీ భార్య గొడ్రాలు అయినా, నీకు ఒక కుమారుడు కలుగుతాడు అని అర్థం.
2. ఈ దైవాజ్ఞ ప్రకారం హజ్రత్ యహ్యా పుట్టడం, యౌవన దశకు చేరటం అనే వివరాలు మధ్యలో విడిచి పెట్టబడ్డాయి.
3. "హుక్మ్" అంటే, నిర్ణయ సామర్థ్యం, ధర్మబద్ధంగా అభిప్రాయాలు వ్యక్తీకరించే ప్రజ్ఞ, దైవ శాసనానికి సరియైన వివరణ ఇచ్చే నేర్పు, వ్యవహారదక్షత, అల్లాహ్ తరఫు నుండి వ్యవహారాలలో తీర్పు చెప్పే అధికారం.
4. అంటే, 'బైతుల్ మఖ్దిస్'కు తూర్పు భాగాన.

**22 - 26** మర్యమ్ ఆ మగ శిశువును గర్భంలో దాల్చింది. గర్భవతి అయిన ఆమె ఒక దూర ప్రదేశానికి వెళ్ళిపోయింది. తరువాత ప్రసవ వేదన పడుతూ ఆమె ఒక ఖర్జూరపు చెట్టు క్రిందకు చేరింది. ఆమె ఇలా వాపోయింది, “అయ్యో! నేను ఇంతకు ముందే మరణించి ఉంటే, నామరూపాలు[8] లేకుండా నశించి ఉంటే ఎంత బాగుండేది!” అపుడు దైవ దూత కాళ్ళవైపు నుండి ఆమెను పిలిచి ఇలా అన్నాడు, “బాధపడకు. నీ ప్రభువు నీకు దిగువ భాగంలో ఒక సెలయేరును సృజించాడు. నీవు ఈ చెట్టు మొదలు కొంచెం ఊపు. నీపై స్వచ్ఛమైన తాజా ఖర్జూరపు పండ్లు రాల్తాయి. నీవు తిను, త్రాగు, నీ కళ్లను చల్లబరచుకో. తరువాత ఎవరైనా మనిషి నీకు కనిపిస్తే, అతనికి, నేను కరుణామయుని కోసం ఉపవాస ముంటానని మొక్కుకున్నాను. కనుక ఈ రోజు నేను ఎవరితోనూ మాట్లాడను” అని చెప్పు.

**27 - 33** తరువాత ఆమె ఆ బాలుణ్ణి తీసుకొని తన జాతి వారి వద్దకు వచ్చింది. ప్రజలు ఇలా అన్నారు, “మర్యమ్! నీవు పెద్ద పాపమే చేశావు. ఓ హారున్ సోదరీ![9] నీ తండ్రి కూడ చెడ్డ మనిషికాడే; నీ తల్లి కూడ నీతి బాహ్యమైన నడతగల స్త్రీకాదే!” మర్యమ్ బాలునివైపు సైగజేసి చూపింది. దానికి ప్రజలు, “ఉయ్యాలలోని ఈ పసిపిల్లవానితో మేము ఏం మాట్లాడము?” అని అన్నారు. పిల్లవాడు ఇలా పలికాడు, “నేను అల్లాహ్ దాసుణ్ణి.[10] ఆయన నాకు గ్రంథాన్ని ఇచ్చాడు, నన్ను ప్రవక్తగా నియమించాడు. నేను ఎక్కడున్నా సరే, ఆయన నన్ను శుభవంతునిగా చేశాడు. నేను జీవించి ఉన్నంత కాలం నమాజును, జకాతును పాటించు అని ఆజ్ఞాపించాడు. నా తల్లి హక్కును నెరవేర్చేవానిగా నన్ను చేశాడు.[11] నన్ను దౌర్జన్య పరునిగాను, పాషాణ హృదయునిగాను చేయలేదు. నేను పుట్టిన రోజునా, నేను మరణించే రోజునా, బ్రతికింపబడి లేపబడే[12] రోజునా నాకు శాంతి కలుగుతుంది.”

فَحَمَلَتْهُ فَانْتَبَذَتْ بِهٖ مَكَانًا قَصِيًّا ﴿٢٢﴾
فَاَجَآءَهَا الْمَخَاضُ اِلٰى جِذْعِ النَّخْلَةِ ۚ قَالَتْ
يٰلَيْتَنِيْ مِتُّ قَبْلَ هٰذَا وَ كُنْتُ نَسْيًا
مَّنْسِيًّا ﴿٢٣﴾ فَنَادٰىهَا مِنْ تَحْتِهَآ اَلَّا تَحْزَنِيْ قَدْ
جَعَلَ رَبُّكِ تَحْتَكِ سَرِيًّا ﴿٢٤﴾ وَهُزِّيْٓ اِلَيْكِ
بِجِذْعِ النَّخْلَةِ تُسٰقِطْ عَلَيْكِ رُطَبًا جَنِيًّا ﴿٢٥﴾
فَكُلِيْ وَ اشْرَبِيْ وَ قَرِّيْ عَيْنًا ۚ فَاِمَّا تَرَيِنَّ
مِنَ الْبَشَرِ اَحَدًا ۙ فَقُوْلِيْٓ اِنِّيْ نَذَرْتُ
لِلرَّحْمٰنِ صَوْمًا فَلَنْ اُكَلِّمَ الْيَوْمَ اِنْسِيًّا ﴿٢٦﴾ ۚ
فَاَتَتْ بِهٖ قَوْمَهَا تَحْمِلُهٗ ؕ قَالُوْا يٰمَرْيَمُ لَقَدْ
جِئْتِ شَيْـًٔا فَرِيًّا ﴿٢٧﴾ يٰٓاُخْتَ هٰرُوْنَ مَا كَانَ
اَبُوْكِ امْرَاَ سَوْءٍ وَّ مَا كَانَتْ اُمُّكِ بَغِيًّا ﴿٢٨﴾ ۖ
فَاَشَارَتْ اِلَيْهِ ؕ قَالُوْا كَيْفَ نُكَلِّمُ مَنْ كَانَ
فِي الْمَهْدِ صَبِيًّا ﴿٢٩﴾ قَالَ اِنِّيْ عَبْدُ اللّٰهِ ؕ اٰتٰىنِيَ
الْكِتٰبَ وَ جَعَلَنِيْ نَبِيًّا ﴿٣٠﴾ ۙ وَّ جَعَلَنِيْ مُبٰرَكًا
اَيْنَ مَا كُنْتُ ۪ وَ اَوْصٰنِيْ بِالصَّلٰوةِ وَ الزَّكٰوةِ
مَا دُمْتُ حَيًّا ﴿٣١﴾ ۪ۖ وَّ بَرًّا بِوَالِدَتِيْ ۫ وَ لَمْ
يَجْعَلْنِيْ جَبَّارًا شَقِيًّا ﴿٣٢﴾ وَالسَّلٰمُ عَلَيَّ يَوْمَ
وُلِدْتُّ وَ يَوْمَ اَمُوْتُ وَ يَوْمَ اُبْعَثُ حَيًّا ﴿٣٣﴾

5. అంటే, ప్రార్థనకోసం, ఆమె ఏకాంతంలోకి వెళ్లిపోయింది.
6. అంటే, ఏ పురుషుడూ నిన్ను తాకకుండానే, నీకు ఒక కుమారుడు పుడతాడు.
7. అంటే, మేము ఈ బాలుణ్ణి ఒక సజీవ మహిమగా చేయదలచుకున్నాము.

ذٰلِكَ عِيۡسَى ابۡنُ مَرۡيَمَ ۚ قَوۡلَ الۡحَقِّ الَّذِىۡ
فِيۡهِ يَمۡتَرُوۡنَ ﴿۳۴﴾ مَا كَانَ لِلّٰهِ اَنۡ يَّتَّخِذَ مِنۡ
وَّلَدٍ ۙ سُبۡحٰنَهٗ ؕ اِذَا قَضٰٓى اَمۡرًا فَاِنَّمَا يَقُوۡلُ
لَهٗ كُنۡ فَيَكُوۡنُ ﴿۳۵﴾ وَاِنَّ اللّٰهَ رَبِّىۡ وَرَبُّكُمۡ
فَاعۡبُدُوۡهُ ؕ هٰذَا صِرَاطٌ مُّسۡتَقِيۡمٌ ﴿۳۶﴾ فَاخۡتَلَفَ
الۡاَحۡزَابُ مِنۡۢ بَيۡنِهِمۡ ۚ فَوَيۡلٌ لِّلَّذِيۡنَ كَفَرُوۡا
مِنۡ مَّشۡهَدِ يَوۡمٍ عَظِيۡمٍ ﴿۳۷﴾ اَسۡمِعۡ بِهِمۡ وَاَبۡصِرۡ ۙ
يَوۡمَ يَاۡتُوۡنَنَا لٰـكِنِ الظّٰلِمُوۡنَ الۡيَوۡمَ فِىۡ ضَلٰلٍ
مُّبِيۡنٍ ﴿۳۸﴾ وَاَنۡذِرۡهُمۡ يَوۡمَ الۡحَسۡرَةِ اِذۡ قُضِىَ
الۡاَمۡرُ ۘ وَهُمۡ فِىۡ غَفۡلَةٍ وَّهُمۡ لَا يُؤۡمِنُوۡنَ ﴿۳۹﴾ وقف لازم
اِنَّا نَحۡنُ نَرِثُ الۡاَرۡضَ وَمَنۡ عَلَيۡهَا وَاِلَيۡنَا
يُرۡجَعُوۡنَ ﴿۴۰﴾ ع ٢ ٢٥ ٥

**34 - 35** ఇతనే మర్యమ్ కుమారుడు ఈసా; ఇదే అతనికి సంబంధించిన అసలు నిజం. దానిని గురించి ప్రజలు సందేహిస్తున్నారు. ఎవరినైనా తన కుమారుడుగా చేసుకోవడం అనేది అల్లాహ్‌కు తగిన పద్ధతి కాదు. ఆయన పరమ పవిత్రుడు. ఏ విషయాన్ని గురించియైనా ఆయన నిర్ణయం తీసుకుంటే, "అయిపో" అని ఆజ్ఞాపిస్తాడు. అంతే అది అయిపోతుంది.[13]

**36 - 40** (ఈసా ఇలా ప్రకటించాడు) "నాకూ, మీకూ ప్రభువు అల్లాహ్‌యే. కనుక మీరు ఆయనకే దాస్యం చేయండి. ఇదే ఋజుమార్గం." కాని తరువాత విభిన్న వర్గాలు పరస్పరం విభేదించుకోసాగాయి. కనుక అవిశ్వాసులకు తాము ఒక మహాదినాన్ని చూడబోయే సమయం ఎంతో వినాశాత్మకంగా ఉంటుంది. వారు మా ముందు హాజరయ్యే రోజున వారి చెవులు కూడ బాగానే వింటాయి, వారి కళ్ళు కూడ బాగానే చూస్తాయి. కాని ఈనాడు ఈ దుర్మార్గులు స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో పడిపోయారు. ప్రవక్తా! వారు ఏమరుపాటులో ఉన్నారు, విశ్వసించటానికి సిద్ధంగా లేరు. ఈ స్థితిలో వారిని దుఃఖం తప్ప మార్గాంతరమే ఉండని తీర్పు దినం గురించి భయపెట్టు. చివరకు మేమొక్కరమే భూమికీ, దానిపై ఉన్న సమస్తానికీ వారసులమవుతాము. ఆపై అందరూ మా వైపునకే మరలింపబడతారు.

8. ఇక్కడి సందర్భాన్ని గురించి ఆలోచిస్తే అర్థమయ్యేది ఏమిటంటే, హజ్రత్ మర్యమ్ ఈ మాటలు పురిటినొప్పుల కారణంగా అనలేదు; తండ్రి లేకుండా పుట్టిన ఈ బాబును తీసుకుని ఎక్కడకు పోవాలి అనే విషయం కారణంగా అన్నారు. ఈ కారణంవల్లనే ఆమె గర్భవతిగా ఉన్నప్పుడు ఒంటరిగా ఒక సుదూర ప్రాంతానికి వెళ్ళిపోయింది. వాస్తవానికి ఆమె తల్లీ, ఇతర కుటుంబ సభ్యులూ స్వగ్రామంలోనే ఉన్నారు.

9. అంటే, ప్రవక్త హారూన్ వంశపు బిడ్డ. ఇది ఒక అరబ్బీ జాతీయం. ఒక తెగకు చెందిన వ్యక్తిని ఆ తెగ సోదరుడు అని అంటారు. ఈ జాతీయం భావం ఏమిటంటే, "మాలో అందరికంటే ఉన్నతమైన ధార్మిక కుటుంబానికి చెందిన బిడ్డవైన నీవు చేసిన ఈ పని ఏమిటి?"

10. ఇంతకు ముందు 21వ వాక్యంలో ప్రస్తావించబడిన సూచన ఇదే. అప్పుడే పుట్టిన పిల్లవాడు ఉయ్యాలలో నుంచే మాట్లాడటం ప్రారంభించాడు. అతను ఏ పాపకర్మ ఫలమూ కాదు, అతడు అల్లాహ్ చూపిన ఒక మహిమ అనే విషయం అందరికీ స్పష్టంగా తెలిసిపోయింది. 'ఆలె ఇమ్రాన్' సూరా 46వ వాక్యంలో కూడ, మాఇదా సూరా 110వ వాక్యంలో కూడ, హజ్రత్ ఈసా (అ) ఉయ్యాలలో నుంచే మాట్లాడారు అని చెప్పబడింది.

11. తల్లిదండ్రుల హక్కు నెరవేర్చేవాడు అని కాక, కేవలం తల్లి హక్కు నెరవేర్చేవాడు అని చెప్పబడింది. హజ్రత్ ఈసాకు తండ్రి అనేవాడు ఎవ్వడూ లేడు అనే దానికి ఈ విషయం కూడ ఒక నిదర్శనమే. దీనికే మరొక స్పష్టమైన నిదర్శనం ఏమిటంటే, దివ్య ఖురాన్‌లో ప్రతిచోట ఆయనను మర్యమ్ కుమారుడు ఈసా అనే వ్యవహరించటం జరిగింది.

**41 - 50** ఈ గ్రంథంలో ఇబ్రాహీమ్ గాథను ప్రస్తావించు. నిస్సందేహంగా అతను సత్యసంధుడైన వ్యక్తి. ఒక దైవప్రవక్త. (వారికి ఆ సందర్భాన్ని జ్ఞాపకం చెయ్యి). అప్పుడు అతను తన తండ్రితో ఇలా అన్నాడు, "తండ్రీ! వినలేని, కనలేని, మీ ఏ పనినీ చేసిపెట్టలేని వాటిని మీరు ఎందుకు ఆరాధిస్తున్నారు? తండ్రీ! నా వద్దకు వచ్చిన జ్ఞానం మీ వద్దకు రాలేదు. మీరు నన్ను అనుసరించండి, నేను మీకు సరియైన మార్గం చూపుతాను. తండ్రీ! మీరు షైతానుకు దాస్యం చేయకండి. షైతాను కరుణామయుణ్ణి ధిక్కరించాడు. తండ్రీ! మీరు కరుణామయుని శిక్షకు గురి అవుతారేమో అని, షైతాను సహచరులైపోతారేమో అని నాకు భయంగా ఉంది." తండ్రి ఇలా అన్నాడు, "ఓ ఇబ్రాహీమ్! నీవు నాకు ఆరాధ్యులైన వాటికి విముఖుడవు అయ్యావా? నీవు దీనిని మానుకోకపోతే, నేను నిన్ను రాళ్లతో కొట్టి చంపేస్తాను. కనుక నీవు శాశ్వతంగా నాకు దూరంగా వెళ్లిపో." ఇబ్రాహీమ్ ఇలా అన్నాడు, "మీకు సలామ్. మిమ్మల్ని మన్నించవలసిందని నేను నా ప్రభువును ప్రార్థిస్తాను. నా ప్రభువు నాపై ఎంతో దయకలవాడు. నేను మిమ్మల్ని కూడ విడిచిపోతున్నాను, మీరు దేవుణ్ణి కాదని ప్రార్థిస్తున్న శక్తులను కూడ విడిచిపోతున్నాను. నేను నా ప్రభువునే ప్రార్థిస్తాను. నా ప్రభువును ప్రార్థించి నేను విఫలుణ్ణి కాబోనని నమ్ముతున్నాను." ఈ విధంగా అతను వారి నుండి, వారి అల్లాహ్‌యేతర ఆరాధ్యుల నుండి వేరైపోయినపుడు, మేము అతనికి ఇస్‌హాఖ్, యాఖూబ్‌ల వంటి సంతానాన్ని ప్రసాదించాము, ప్రతి ఒక్కరినీ ప్రవక్తగా చేశాము, వారికి మా కరుణను ప్రసాదించాము. వారికి నిజమైన, ఉన్నతమైన కీర్తి ప్రతిష్ఠలను కలుగజేశాము.

**51 - 53** మూసాను గురించి ఈ గ్రంథంలో ప్రస్తావించు. అతను ఎన్నుకోబడిన వ్యక్తి, ఒక సందేశహరుడైన ప్రవక్త.[14] మేము అతనిని తూర్ పర్వతం కుడివైపు నుండి పిలిచాము. రహస్య సంభాషణల ద్వారా అతనికి సాన్నిధ్యాన్ని ప్రసాదించాము. దయతో మేము అతని సోదరుడు హారూన్‌ను ప్రవక్తగా నియమించి అతనికి (సహాయకునిగా) ఇచ్చాము.

وَاذْكُرْ فِي الْكِتٰبِ اِبْرٰهِيْمَ ۬ اِنَّهٗ كَانَ
صِدِّيْقًا نَّبِيًّا ﴿۴۱﴾ اِذْ قَالَ لِاَبِيْهِ يٰۤاَبَتِ لِمَ
تَعْبُدُ مَا لَا يَسْمَعُ وَلَا يُبْصِرُ وَلَا يُغْنِيْ عَنْكَ
شَيْـًٔا ﴿۴۲﴾ يٰۤاَبَتِ اِنِّيْ قَدْ جَآءَنِيْ مِنَ الْعِلْمِ مَا
لَمْ يَاْتِكَ فَاتَّبِعْنِيْۤ اَهْدِكَ صِرَاطًا سَوِيًّا ﴿۴۳﴾
يٰۤاَبَتِ لَا تَعْبُدِ الشَّيْطٰنَ ؕ اِنَّ الشَّيْطٰنَ كَانَ
لِلرَّحْمٰنِ عَصِيًّا ﴿۴۴﴾ يٰۤاَبَتِ اِنِّيْۤ اَخَافُ اَنْ
يَّمَسَّكَ عَذَابٌ مِّنَ الرَّحْمٰنِ فَتَكُوْنَ لِلشَّيْطٰنِ
وَلِيًّا ﴿۴۵﴾ قَالَ اَرَاغِبٌ اَنْتَ عَنْ اٰلِهَتِيْ
يٰۤاِبْرٰهِيْمُ ۚ لَئِنْ لَّمْ تَنْتَهِ لَاَرْجُمَنَّكَ وَاهْجُرْنِيْ
مَلِيًّا ﴿۴۶﴾ قَالَ سَلٰمٌ عَلَيْكَ ۚ سَاَسْتَغْفِرُ لَكَ
رَبِّيْ ؕ اِنَّهٗ كَانَ بِيْ حَفِيًّا ﴿۴۷﴾ وَاَعْتَزِلُكُمْ وَمَا
تَدْعُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ وَاَدْعُوْا رَبِّيْ ۖ عَسٰۤى
اَلَّاۤ اَكُوْنَ بِدُعَآءِ رَبِّيْ شَقِيًّا ﴿۴۸﴾ فَلَمَّا اعْتَزَلَهُمْ
وَمَا يَعْبُدُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ ۙ وَهَبْنَا لَهٗۤ
اِسْحٰقَ وَيَعْقُوْبَ ؕ وَكُلًّا جَعَلْنَا نَبِيًّا ﴿۴۹﴾ وَ
وَهَبْنَا لَهُمْ مِّنْ رَّحْمَتِنَا وَجَعَلْنَا لَهُمْ لِسَانَ
صِدْقٍ عَلِيًّا ﴿۵۰﴾ وَاذْكُرْ فِي الْكِتٰبِ مُوْسٰۤى ۫ اِنَّهٗ
كَانَ مُخْلَصًا وَّكَانَ رَسُوْلًا نَّبِيًّا ﴿۵۱﴾ وَنَادَيْنٰهُ
مِنْ جَانِبِ الطُّوْرِ الْاَيْمَنِ وَقَرَّبْنٰهُ نَجِيًّا ﴿۵۲﴾ وَ
وَهَبْنَا لَهٗ مِنْ رَّحْمَتِنَاۤ اَخَاهُ هٰرُوْنَ نَبِيًّا ﴿۵۳﴾

**54 - 55** ఈ గ్రంథంలో ఇస్మాయీల్‌ను గురించి ప్రస్తావించు. అతను వాగ్దాన పాలకుడు, సందేశహరుడైన ప్రవక్త. అతను తన ఇంటివారిని నమాజు, జకాత్‌లను పాటించండి అని ఆజ్ఞాపించేవాడు. తన ప్రభువునకు ప్రీతిపాత్రుడు.

**56 - 57** ఈ గ్రంథంలో ఇద్రీస్‌ను గురించి ప్రస్తావించు. అతను ఒక నిజాయితీ పరుడైన మనిషి, ఒక ప్రవక్త. మేము అతనిని ఉన్నత స్థాయికి లేపాము.

وَ اذْكُرْ فِي الْكِتٰبِ اِسْمٰعِيْلَ ۚ اِنَّهٗ كَانَ صَادِقَ
الْوَعْدِ وَ كَانَ رَسُوْلًا نَّبِيًّا ﴿٥٤﴾ وَ كَانَ يَاْمُرُ
اَهْلَهٗ بِالصَّلٰوةِ وَ الزَّكٰوةِ ۪ وَ كَانَ عِنْدَ رَبِّهٖ
مَرْضِيًّا ﴿٥٥﴾ وَاذْكُرْ فِي الْكِتٰبِ اِدْرِيْسَ ۚ اِنَّهٗ
كَانَ صِدِّيْقًا نَّبِيًّا ﴿٥٦﴾ وَّ رَفَعْنٰهُ مَكَانًا عَلِيًّا ﴿٥٧﴾

12. దేవుడు ఈ సూచనను చూపి ఇస్రాయీల్ సంతతికి కడసారిగా ఈ హెచ్చరిక చేశాడు. హజ్రత్ ఈసా యువకుడైన తరువాత, దైవప్రవక్తగా సందేశ ప్రచారం ప్రారంభించగానే, ఆ జాతివారు ఆయనను తిరస్కరించటం మాత్రమే కాదు, ఆయన ప్రాణం తీయటానికి సైతం సంసిద్ధులయ్యారు, అంతేకాదు పరమ పవిత్ర అయిన ఆయన తల్లిపై వ్యభిచార నేరం మోపటానిక్కూడ వెనుకాడలేదు. అప్పుడు అల్లాహ్ ఏ జాతికీ విధించని శిక్షను ఆ జాతికి విధించాడు.

13. ఇది క్రైస్తవులకు వ్యతిరేకంగా మరొకవాదన. కేవలం మహిమద్వారా పుట్టటం అనేది ఆయనను దేవుని బిడ్డగా నిర్ణయించటానికి ప్రమాణం కానేకాదు.

14. 'సందేశహరుడు' అంటే 'పంపబడినవాడు' అని అర్థం. 'ప్రవక్త' – దీని అర్థం విషయంలో నిఘంటుకర్తలలో అభిప్రాయభేదం ఉంది. ప్రవక్త అంటే కొందరి దృష్టిలో వార్తలు తెచ్చేవాడని, మరికొందరి దృష్టిలో 'ఉన్నత శ్రేణికిచెందిన వ్యక్తి' అని, ఇంకొందరి దృష్టిలో 'మహోన్నతమైన స్థానం కలవ్యక్తి' అనే భావాలు ఉన్నాయి. కనుక "సందేశహరుడైన ప్రవక్త" అని ఏ వ్యక్తినైనా అంటే, అతను "మహోన్నతమైన స్థానం కల ప్రవక్త" లేదా "అల్లాహ్ తరఫు నుండి వార్తలు తెచ్చే ప్రవక్త" అని దీని అర్థం. దివ్య ఖురాన్‌లో ఈ రెండు పదాలు సాధారణంగా ఒకే అర్థంలో వాడబడ్డాయి. కాని కొన్నిచోట్ల రసూల్ – నబీ అనే పదాలు వాడబడిన విధానాన్నిబట్టి వాటిలో "స్థానం" లేదా పని స్వభావం రీత్యా ఏదో పారిభాషికమైన వ్యత్యాసం ఉన్నట్లు స్పష్టమవుతోంది. ఉదాహరణకు, హజ్ సూరాలో, 52వ వాక్యంలో ఇలా అనబడింది : "మేము నీకు పూర్వం ఏ సందేశహరుణ్ణీ, ఏప్రవక్తనూ పంపలేదు, కానీ ..." రసూలు, నబీ అనే పదాలు వేర్వేరు పదాలనీ, వాటి మధ్య అర్థానికి సంబంధించిన వ్యత్యాసం తప్పకుండా ఉందనీ స్పష్టంగా తెలుస్తోంది. ఈ కారణం వల్లనే ఖురాన్ వ్యాఖ్యాతల మధ్య ఈ వ్యత్యాసం స్వభావం గురించి వివాదం తలెత్తింది. కాని యథార్థం ఏమిటంటే, నిర్దిష్టమైన ఆధారాలతో ఎవ్వరూ రసూల్, నబీల భిన్నస్థితిని నిర్ధారించలేక పోయారు. రూఢిగా చెప్పదగిన విషయం ఏమిటంటే, రసూల్ అనే పదం నబీ అనే పదం కంటే ప్రత్యేకమైనది అంటే ప్రతి రసూలు నబీ కూడ కావచ్చును కాని, ప్రతి నబీ మాత్రం రసూల్ కాదు. వేరేవిధంగా చెప్పాలంటే ప్రవక్తలలో సాధారణ ప్రవక్తలకంటే అతి ముఖ్యమైన కార్యభారం మోపబడిన మహావ్యక్తుల కోసం రసూల్ అనే పదం ఉపయోగించబడింది. మహాప్రవక్త (సఅసమ్) గారి ఒక హదీసు కూడ ఈ విషయాన్ని బలపరుస్తోంది. అందులో మహాప్రవక్తను సందేశహరుల సంఖ్య ఎంత అని అడగ్గా, ఆయన 313 లేక 315 అని తెలిపారు; ప్రవక్తల సంఖ్య ఎంత అని అడుగగా ఆయన ఒక లక్షా 24 వేలు అని తెలిపారు.

أُولٰٓئِكَ الَّذِيْنَ اَنْعَمَ اللّٰهُ عَلَيْهِمْ مِّنَ النَّبِيّٖنَ
مِنْ ذُرِّيَّةِ اٰدَمَ ۙ وَ مِمَّنْ حَمَلْنَا مَعَ نُوْحٍ ؗ
وَّمِنْ ذُرِّيَّةِ اِبْرٰهِيْمَ وَ اِسْرَآءِيْلَ ؗ وَمِمَّنْ
هَدَيْنَا وَاجْتَبَيْنَا ؕ اِذَا تُتْلٰى عَلَيْهِمْ اٰيٰتُ
الرَّحْمٰنِ خَرُّوْا سُجَّدًا وَّبُكِيًّا ۩ ٥٨ فَخَلَفَ مِنْۢ السجدة
بَعْدِهِمْ خَلْفٌ اَضَاعُوا الصَّلٰوةَ وَاتَّبَعُوا
الشَّهَوٰتِ فَسَوْفَ يَلْقَوْنَ غَيًّا ۙ ٥٩ اِلَّا مَنْ تَابَ
وَاٰمَنَ وَ عَمِلَ صَالِحًا فَاُولٰٓئِكَ يَدْخُلُوْنَ
الْجَنَّةَ وَ لَا يُظْلَمُوْنَ شَيْـًٔا ۙ ٦٠ جَنّٰتِ عَدْنِ
الَّتِيْ وَعَدَ الرَّحْمٰنُ عِبَادَهٗ بِالْغَيْبِ ؕ اِنَّهٗ كَانَ
وَعْدُهٗ مَاْتِيًّا ٦١ لَا يَسْمَعُوْنَ فِيْهَا لَغْوًا اِلَّا
سَلٰمًا ؕ وَ لَهُمْ رِزْقُهُمْ فِيْهَا بُكْرَةً وَّ عَشِيًّا ٦٢
تِلْكَ الْجَنَّةُ الَّتِيْ نُوْرِثُ مِنْ عِبَادِنَا مَنْ
كَانَ تَقِيًّا ٦٣ وَ مَا نَتَنَزَّلُ اِلَّا بِاَمْرِ رَبِّكَ ۚ
لَهٗ مَا بَيْنَ اَيْدِيْنَا وَ مَا خَلْفَنَا وَمَا بَيْنَ
ذٰلِكَ ۚ وَ مَا كَانَ رَبُّكَ نَسِيًّا ٦٤ رَبُّ
السَّمٰوٰتِ وَالْاَرْضِ وَ مَا بَيْنَهُمَا فَاعْبُدْهُ وَ
اصْطَبِرْ لِعِبَادَتِهٖ ؕ هَلْ تَعْلَمُ لَهٗ سَمِيًّا ٦٥ ع ١٥ ٨

**58** అల్లాహ్ అనుగ్రహించిన దైవప్రవక్తలు వీరు, ఆదమ్ సంతతిలోనివారు, మేము నూహ్‌తోపాటు పడవపైకి ఎక్కించిన వారి వంశంలోనివారు, ఇబ్రాహీమ్ సంతతికి చెందినవారు, ఇస్రాయీల్ వంశానికి చెందినవారు, మేము ఋజుమార్గం చూపినవారు, మేము ఎన్నుకున్న ప్రజలలోనివారు. కరుణామయుని వాక్యాలు వారికి వినిపించినపుడు వారు విలపిస్తూ సజ్దాలో పడిపోయేవారు.

**59 - 63** వారి తరువాత కొందరు అయోగ్యులు వారి స్థానంలో వచ్చారు. వారు నమాజును త్యజించారు, మనో వాంఛలను అనుసరించారు. కనుక వారు త్వరలోనే మార్గం తప్పిన దానికి ఫలితం అనుభవిస్తారు. అయితే పశ్చాత్తాపపడి మరలేవారూ, విశ్వసించి సత్కార్యాలు చేసేవారూ స్వర్గంలో ప్రవేశిస్తారు. వారికి రవ్వంత అన్యాయం కూడ జరగదు. వారికై శాశ్వతంగా ఉండే స్వర్గవనాలు ఉన్నాయి. అవి అగోచర జగత్తులో లభిస్తాయని కరుణామయుడు తన దాసులకు వాగ్దానం చేసి ఉన్నాడు. నిశ్చయంగా ఈ వాగ్దానం నెరవేరి తీరుతుంది. అక్కడ వారు వ్యర్థమైన మాట ఏదీ వినరు. అక్కడ దేనిని విన్నా సరియైన దానినే వింటారు. వారి ఆహారం వారికి ఉదయం, సాయంత్రం నియమం తప్పకుండా లభిస్తూ ఉంటుంది. మేము మా దాసులలో భయభక్తుల జీవితం గడిపే వాణ్ణి వారసుడుగా చేసే స్వర్గం ఇదే.

**64 - 65** ప్రవక్తా! మేము నీ ప్రభువు ఆజ్ఞలేకుండా క్రిందికి దిగిరాము.[15] మా ముందు ఉన్నదానికీ, మా వెనుక ఉన్నదానికీ, ఈ రెండింటి మధ్య ఉన్న దానికీ, ప్రతిదానికీ ప్రభువు ఆయనే. నీ ప్రభువు ఎన్నడూ మరచిపోయేవాడు కాదు. ఆకాశాలకూ, భూమికీ, భూమ్యాకాశాల మధ్య ఉన్న సర్వానికి ఆయన ప్రభువు. కాబట్టి మీరు ఆయనకు దాస్యం చేయండి. ఆయన దాస్యంలోనే స్థిరంగా ఉండండి. మీకు తెలిసినంత వరకు, ఆయనతో సమానమైన స్థాయిగలవాడెవడైనా ఉన్నాడా?

15. ఇక్కడ మాటలు అల్లాహ్‌వే అయినప్పటికీ, వాటిని పలికినవారు దైవదూతలు. అంటే, దైవదూతలు మహనీయ సందేశహరునితో, “మా అంతట మేము రాము, అల్లాహ్ పంపినప్పుడే వస్తాము” అని అంటున్నారు.

وَ يَقُوْلُ الْاِنْسَانُ ءَاِذَا مَا مِتُّ لَسَوْفَ اُخْرَجُ
حَيًّا ﴿٦٦﴾ اَوَلَا يَذْكُرُ الْاِنْسَانُ اَنَّا خَلَقْنٰهُ مِنْ
قَبْلُ وَلَمْ يَكُ شَيْـًٔا ﴿٦٧﴾ فَوَرَبِّكَ لَنَحْشُرَنَّهُمْ
وَالشَّيٰطِيْنَ ثُمَّ لَنُحْضِرَنَّهُمْ حَوْلَ جَهَنَّمَ جِثِيًّا ﴿٦٨﴾
ثُمَّ لَنَنْزِعَنَّ مِنْ كُلِّ شِيْعَةٍ اَيُّهُمْ اَشَدُّ عَلَى
الرَّحْمٰنِ عِتِيًّا ﴿٦٩﴾ ثُمَّ لَنَحْنُ اَعْلَمُ بِالَّذِيْنَ هُمْ
اَوْلٰى بِهَا صِلِيًّا ﴿٧٠﴾ وَ اِنْ مِّنْكُمْ اِلَّا وَارِدُهَا
كَانَ عَلٰى رَبِّكَ حَتْمًا مَّقْضِيًّا ﴿٧١﴾ ثُمَّ نُنَجِّى
الَّذِيْنَ اتَّقَوْا وَّنَذَرُ الظّٰلِمِيْنَ فِيْهَا جِثِيًّا ﴿٧٢﴾
وَ اِذَا تُتْلٰى عَلَيْهِمْ اٰيٰتُنَا بَيِّنٰتٍ قَالَ الَّذِيْنَ
كَفَرُوْا لِلَّذِيْنَ اٰمَنُوْا اَىُّ الْفَرِيْقَيْنِ خَيْرٌ
مَّقَامًا وَّ اَحْسَنُ نَدِيًّا ﴿٧٣﴾ وَ كَمْ اَهْلَكْنَا قَبْلَهُمْ
مِّنْ قَرْنٍ هُمْ اَحْسَنُ اَثَاثًا وَّ رِءْيًا ﴿٧٤﴾ قُلْ
مَنْ كَانَ فِى الضَّلٰلَةِ فَلْيَمْدُدْ لَهُ الرَّحْمٰنُ مَدًّا
حَتّٰى اِذَا رَاَوْا مَا يُوْعَدُوْنَ اِمَّا الْعَذَابَ وَ
اِمَّا السَّاعَةَ فَسَيَعْلَمُوْنَ مَنْ هُوَ شَرٌّ مَّكَانًا
وَّ اَضْعَفُ جُنْدًا ﴿٧٥﴾ وَ يَزِيْدُ اللّٰهُ الَّذِيْنَ
اهْتَدَوْا هُدًى وَ الْبٰقِيٰتُ الصّٰلِحٰتُ خَيْرٌ
عِنْدَ رَبِّكَ ثَوَابًا وَّخَيْرٌ مَّرَدًّا ﴿٧٦﴾

**66 - 72** "ఏమిటి, నేను చనిపోయిన తరువాత, మళ్లీ నన్ను బ్రతికించటం నిజంగానే జరుగుతుందా?" అని అంటాడు మనిషి. అసలు అతడు ఏమీ కానపుడే మేము అతనిని సృష్టించామన్న విషయం అతడికి జ్ఞాపకం రావటం లేదా? నీ ప్రభువు సాక్షిగా! మేము వారందరినీ, వారితో పాటు షైతానులను కూడ తప్పకుండా పోగు చేస్తాము. తరువాత నరకం చుట్టూ హాజరుపరచి, వారిని మోకాళ్లపై కూలదోస్తాము. ఆ తరువాత కరుణామయునికి వ్యతిరేకంగా అహంకారంతో తిరుగుబాటు చేసిన ప్రతి వ్యక్తినీ ప్రతి వర్గం నుండీ వేరు చేస్తాము. ఇంకా వారిలో నరకంలో త్రోయబడటానికి ఎక్కువగా అర్హులెవరో మాకు తెలుసు. మీలో నరకం దరిదాపులకు పోనివాడెవడూ లేడు. ఇది ఒక నిర్ణీత విషయమే. దానిని నెరవేర్చటం నీ ప్రభువు బాధ్యత. తరువాత మేము (ప్రపంచంలో) భయభక్తులు కలిగి ఉన్నవారిని రక్షిస్తాము. దుర్మార్గులను అందులో వారు పడి ఉన్న స్థితిలోనే విడిచిపెడతాము.

**73 - 76** స్పష్టమైన మా ఆయతులను వారికి వినిపించినపుడు, తిరస్కారులు విశ్వాసులతో ఇలా అంటారు; "మన ఇరు వర్గాలలో మంచి స్థితిలో ఉన్న వర్గం ఏదో, ఎవరి సభలు అద్భుతంగా[16] ఉన్నాయో చెప్పండి." వాస్తవానికి మేము వారికి పూర్వం ఇలాంటి జాతులను ఎన్నింటినో నాశనం చేశాము. అవి వారికంటే అపారమైన వస్తుసామగ్రిని కలిగి ఉండేవి; బాహ్య ఆడంబరాల విషయంలో వారికన్న ఎంతో మిన్నగా ఉండేవి. వారితో ఇలా అనండి, మార్గం తప్పిన వ్యక్తికి కరుణామయుడు వ్యవధినిస్తూ పోతాడు. చిట్టచివరకు ఇలాంటి వ్యక్తులు తమకు వాగ్దానం చేయబడిన దానిని గమనించినప్పుడు– అది దైవశిక్ష అయినా కావచ్చు లేదా ప్రళయవేళ అయినా కావచ్చు – వారు తెలుసుకుంటారు, హీన స్థితిలో ఎవరు ఉన్నారో, బలహీనపక్షం ఎవరిదో, దానికి ప్రతిగా ఋజువైన మార్గం అవలంబించిన వారికి అల్లాహ్ ఋజుమార్గావలంబనలో వృద్ధిని ప్రసాదిస్తాడు. చిరస్థాయిగా ఉండిపోయే సత్కార్యాలు మాత్రమే నీ ప్రభువు దృష్టిలో ప్రతిఫలం రీత్యా, పర్యవసానం దృష్ట్యా ఉత్తమమైనవి.

اَفَرَءَيْتَ الَّذِىْ كَفَرَ بِاٰيٰتِنَا وَ قَالَ لَاُوْتَيَنَّ
مَالًا وَّ وَلَدًا ﴿۷۷﴾ اَطَّلَعَ الْغَيْبَ اَمِ اتَّخَذَ
عِنْدَ الرَّحْمٰنِ عَهْدًا ﴿۷۸﴾ كَلَّا ؕ سَنَكْتُبُ مَا
يَقُوْلُ وَ نَمُدُّ لَهٗ مِنَ الْعَذَابِ مَدًّا ﴿۷۹﴾ وَّ
نَرِثُهٗ مَا يَقُوْلُ وَ يَاْتِيْنَا فَرْدًا ﴿۸۰﴾ وَاتَّخَذُوْا
مِنْ دُوْنِ اللّٰهِ اٰلِهَةً لِّيَكُوْنُوْا لَهُمْ عِزًّا ﴿۸۱﴾
كَلَّا ؕ سَيَكْفُرُوْنَ بِعِبَادَتِهِمْ وَ يَكُوْنُوْنَ عَلَيْهِمْ
ضِدًّا ﴿۸۲﴾ اَلَمْ تَرَ اَنَّاۤ اَرْسَلْنَا الشَّيٰطِيْنَ عَلَى
الْكٰفِرِيْنَ تَؤُزُّهُمْ اَزًّا ﴿۸۳﴾ فَلَا تَعْجَلْ عَلَيْهِمْ ؕ
اِنَّمَا نَعُدُّ لَهُمْ عَدًّا ﴿۸۴﴾ يَوْمَ نَحْشُرُ الْمُتَّقِيْنَ
اِلَى الرَّحْمٰنِ وَفْدًا ﴿۸۵﴾ وَّنَسُوْقُ الْمُجْرِمِيْنَ اِلٰى
جَهَنَّمَ وِرْدًا ﴿۸۶﴾ لَا يَمْلِكُوْنَ الشَّفَاعَةَ اِلَّا مَنِ
اتَّخَذَ عِنْدَ الرَّحْمٰنِ عَهْدًا ﴿۸۷﴾

**77 - 80** ఇంకా, మా ఆయతులను తిరస్కరించి, "నేను సంపదతోనూ, సంతానంతోనూ అనుగ్రహింపబడుతూనే ఉంటాను" అని ప్రగల్భాలు పలికే వ్యక్తిని నీవు చూశావా? అగోచర విషయమేమైనా అతనికి తెలిసిపోయిందా లేక కరుణామయుడి నుండి అతడేమైనా వాగ్దానం పొంది ఉన్నాడా?- ఎంతమాత్రం కాదు, అతడు వాగే దానిని మేము వ్రాసుకుంటాము, అతడి శిక్షను మరింత పెంచుతాము. అతడు ప్రస్తావిస్తున్నటువంటి వస్తు సామగ్రి, మందీ మార్బలమూ, అంతా తిరిగి మా వద్దకే చేరిపోతుంది. అతడు ఒక్కడే ఒంటరిగా మా ముందు హాజరవుతాడు.

**81 - 82** వారు అల్లాహ్‌ను కాదని, కొందరిని తమ దేవుళ్ళుగా చేసుకున్నారు, తమకు వారు అండగా ఉంటారని భావించారు. కాని అండగా ఎవరూ ఉండరు. ఆ దేవుళ్ళు అందరూ వారి ఆరాధనను నిరాకరిస్తారు: పైగా వారికి ప్రత్యర్థులవుతారు.

**83 - 87** మేము సత్యధిక్కారుల మీదకు షైతానులను వదలిపెట్టి ఉన్న విషయాన్ని నీవు చూడటం లేదా? అవి వారిని (సత్యాన్ని వ్యతిరేకించండి అని) అమితంగా పురికొల్పుతున్నాయి. సరే, ఇక వారిపై శిక్ష అవతరించే విషయంలో నీవు తొందరపడకు. మేము వారి రోజులను లెక్కిస్తున్నాము. భయభక్తులు కలవారిని మేము అతిథులుగా కరుణామయుని సన్నిధిలో ప్రవేశ పెట్టబోయే రోజు, అపరాధులను దప్పికగొన్న జంతువులవలే నరకం వైపునకు తోలుకొని పోయే రోజు రానున్నది. అపుడు ప్రజలు ఏ సిఫారసునూ తీసుకు రాగలిగే శక్తిని కలిగి ఉండరు; కరుణామయుని సమ్ముఖం నుండి అనుమతి పత్రం పొంది ఉన్నవాడు తప్ప.

16. మక్కా అవిశ్వాసుల తర్కం ఏమిటంటే, చూడండి, ప్రపంచంలో అల్లాహ్ అనుగ్రహాలు, ఆయన కానుకలు ఎవరిని వరిస్తున్నాయో? ఎవరి గృహాలు బ్రహ్మాండంగా ఉన్నాయో? ఎవరి జీవన ప్రమాణం ఉన్నతంగా ఉన్నదో? ఎవరి సభలు ఘనంగా జరుగుతున్నాయో? ఇదంతా మాకు లభించినపుడు, మీరు, ముస్లిమ్‌లు ఇదంతా లేకుండా చేయబడినపుడు, స్వయంగా మీరే ఆలోచించండి, మేము గనుక అసత్యంపై ఉంటే, భోగభాగ్యాలు అనుభవించటం, మీరు గనుక సత్యంపై ఉంటే, లేమికి, దౌర్భాగ్యానికి గురికావటం ఎలా సాధ్యం?

وَ قَالُوا اتَّخَذَ الرَّحۡمٰنُ وَلَدًا ﴿۸۸﴾ لَقَدۡ جِئۡتُمۡ
شَيۡـًٔا اِدًّا ﴿۸۹﴾ تَكَادُ السَّمٰوٰتُ يَتَفَطَّرۡنَ مِنۡهُ
وَتَنۡشَقُّ الۡاَرۡضُ وَ تَخِرُّ الۡجِبَالُ هَدًّا ﴿۹۰﴾ اَنۡ
دَعَوۡا لِلرَّحۡمٰنِ وَلَدًا ﴿۹۱﴾ وَ مَا يَنۡۢبَغِىۡ لِلرَّحۡمٰنِ
اَنۡ يَّتَّخِذَ وَلَدًا ﴿۹۲﴾ اِنۡ كُلُّ مَنۡ فِى السَّمٰوٰتِ
وَ الۡاَرۡضِ اِلَّاۤ اٰتِى الرَّحۡمٰنِ عَبۡدًا ﴿۹۳﴾ لَقَدۡ
اَحۡصٰىهُمۡ وَعَدَّهُمۡ عَدًّا ﴿۹۴﴾ وَ كُلُّهُمۡ اٰتِيۡهِ يَوۡمَ
الۡقِيٰمَةِ فَرۡدًا ﴿۹۵﴾ اِنَّ الَّذِيۡنَ اٰمَنُوۡا وَ عَمِلُوا
الصّٰلِحٰتِ سَيَجۡعَلُ لَهُمُ الرَّحۡمٰنُ وُدًّا ﴿۹۶﴾ فَاِنَّمَا
يَسَّرۡنٰهُ بِلِسَانِكَ لِتُبَشِّرَ بِهِ الۡمُتَّقِيۡنَ وَ تُنۡذِرَ بِهٖ
قَوۡمًا لُّدًّا ﴿۹۷﴾ وَ كَمۡ اَهۡلَكۡنَا قَبۡلَهُمۡ مِّنۡ قَرۡنٍ
هَلۡ تُحِسُّ مِنۡهُمۡ مِّنۡ اَحَدٍ اَوۡ تَسۡمَعُ لَهُمۡ رِكۡزًا ﴿۹۸﴾ النصف ع ٦

**88 - 95** కరుణామయుడు ఎవరినో కుమారునిగా చేసుకున్నాడు అని వారు అంటారు - ఎంత ఘోరమైన విషయాన్ని మీరు కల్పించి తెచ్చారు! కరుణామయునికి సంతానం ఉన్నదని వారు చేసే వాదం కారణంగా, త్వరలోనే ఆకాశాలు పగిలిపోతాయేమో, భూమి బ్రద్దలవుతుందేమో, పర్వతాలు పడిపోతాయేమో! ఎవరినైనా కుమారునిగా చేసుకోవటం అనేది కరుణామయుని ఔన్నత్యానికి తగినది కాదు. భూమ్యాకాశాలలో ఉన్న వారందరూ ఆయన సమక్షంలో దాసులుగా హాజరు కానున్నారు. ఆయన అందరినీ పరివేష్టించి ఉన్నాడు, వారిని సరిగ్గా లెక్కపెట్టి ఉంచాడు. ప్రళయం నాడు అందరూ ఆయన ముందు ఒక్కొక్కరే హాజరవుతారు.

**96 - 98** నిశ్చయంగా, విశ్వసించి, సత్కార్యాలు చేస్తూ ఉన్న వారి పట్ల త్వరలోనే కరుణామయుడు ప్రేమను హృదయాలలో కలుగజేస్తాడు.[17] కనుక ప్రవక్తా! నీవు భయభక్తులు కలవారికి శుభవార్తను అందజేయాలనీ, వితండ వాదులను భయపెట్టాలనీ మేము ఈ గ్రంథాన్ని సులభతరం చేసి నీ భాషలో అవతరింపజేశాము. వారికి పూర్వం మేము ఎన్నో జాతులను నాశనం చేశాము. ఈనాడు ఎక్కడైనా నీవు వారి గుర్తులను చూస్తున్నావా? లేక ఎక్కడన్నా వారిని గురించిన గుస గుస ఏదైనా నీకు వినిపిస్తోందా?

17. అంటే, ఈనాడు మక్కా వీధులలో వారు పీడనకు గురిచేయబడుతున్నారు, అవమానించబడుతున్నారు. కాని ఈ పరిస్థితులు ఎంతోకాలం ఉండవు. వారు తమ సత్కార్యాలవల్ల, తమ మంచి నడతవల్ల ప్రజలచే ప్రేమించబడే సమయం, గౌరవించబడే సమయం దగ్గరలోనే ఉంది. హృదయాలు వారి వైపునకు ఆకర్షించబడతాయి, ప్రపంచం వారిని ఉన్నత గౌరవ ప్రపత్తులతో ఆదరిస్తుంది. దౌష్ట్యము, గర్వము, మదము, అబద్ధము, వంచనల ఆధారంగా నడిచే నాయకత్వం, మెడలను వంచవచ్చు, కాని హృదయాలను వశపరచుకోలేదు. దీనికి భిన్నంగా సత్యం, నిజాయితీ, చిత్తశుద్ధి, సత్ప్రవర్తనలతో సన్మార్గం వైపునకు పిలిచే వారిని ప్రపంచం మొదట తృణీకరించినా, చివరకు వారు ప్రజల హృదయాలను చూరగొంటారు. నిజాయితీ లేనివారు చెప్పే అబద్ధాలు వారి మార్గంలో ఎంతోకాలం అడ్డంకులు సృష్టించలేవు.

ఆయతులు 135 | 20. తాహా | అవతరణ మక్కాలో

٢٠ سُوْرَةُ طٰهٰ مَكِّيَّةٌ ٤٥
اٰياتها ١٣٥ رکوعاتها ٨

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ۝

طٰهٰ ۝١ مَاۤ اَنۡزَلۡنَا عَلَيۡكَ الۡقُرۡاٰنَ لِتَشۡقٰٓى ۝٢
اِلَّا تَذۡكِرَةً لِّمَنۡ يَّخۡشٰى ۝٣ تَنۡزِيۡلًا مِّمَّنۡ
خَلَقَ الۡاَرۡضَ وَالسَّمٰوٰتِ الۡعُلٰى ۝٤ اَلرَّحۡمٰنُ
عَلَى الۡعَرۡشِ اسۡتَوٰى ۝٥ لَهٗ مَا فِى السَّمٰوٰتِ وَ
مَا فِى الۡاَرۡضِ وَ مَا بَيۡنَهُمَا وَ مَا تَحۡتَ
الثَّرٰى ۝٦ وَ اِنۡ تَجۡهَرۡ بِالۡقَوۡلِ فَاِنَّهٗ يَعۡلَمُ
السِّرَّ وَاَخۡفٰى ۝٧ اَللّٰهُ لَاۤ اِلٰهَ اِلَّا هُوَ ؕ لَهُ
الۡاَسۡمَآءُ الۡحُسۡنٰى ۝٨ وَهَلۡ اَتٰٮكَ حَدِيۡثُ
مُوۡسٰى ۝٩ اِذۡ رَاٰ نَارًا فَقَالَ لِاَهۡلِهِ امۡكُثُوۡۤا
اِنِّىۡۤ اٰنَسۡتُ نَارًا لَّعَلِّىۡۤ اٰتِيۡكُمۡ مِّنۡهَا بِقَبَسٍ اَوۡ
اَجِدُ عَلَى النَّارِ هُدًى ۝١٠

**1 – 8** తాహా, మేము ఈ ఖుర్‌ఆన్‌ను నీపై అవతరింపజేసింది నిన్ను కష్టానికి గురిచేయటానికి మాత్రం కాదు. ఇది భయపడే[1] ప్రతి వ్యక్తికీ ఒక జ్ఞాపిక. భూమినీ, ఎత్తైన ఆకాశాలనూ సృష్టించిన వాని తరఫు నుండి ఇది అవతరింపజేయబడింది. ఆ కరుణామయుడు (సృష్టి) సామ్రాజ్య పీఠంపై ఆసీనుడై ఉన్నాడు. ఆకాశాలలో, భూమిలో మరియు భూమ్యాకాశాల మధ్య, ఇంకా నేల క్రింద ఉన్న వాటినన్నింటికీ ఆయన యజమాని. నీవు నీ మాటను బిగ్గరగా పలికినా పరవాలేదు. ఆయన మెల్లగా పలికిన మాటను మాత్రమే కాదు, దానికంటే అతి గోప్యమైన మాటను సైతమూ ఎరుగును. ఆయనే అల్లాహ్, ఆయన తప్ప మరొక దేవుడే లేడు. ఆయనకు ఉత్తమమైన పేర్లు ఉన్నాయి.

**9 – 10** మూసా వృత్తాంతం కూడ నీకేమైనా అందిందా? అప్పుడు అతను ఒక మంటను చూసి[2] తన ఆలుబిడ్డలతో ఇలా అన్నాడు, "కొంచెం ఆగండి, నేను ఒక మంటను చూశాను. బహుశా మీ కోసం కాస్త నిప్పును తీసుకు రాగలనేమో లేదా ఆ మంట వద్ద నాకేదైనా (దారికి సంబంధించిన) మార్గదర్శకత్వం లభిస్తుందేమో."[3]

وقف لازم

1. అంటే, ఓ ప్రవక్తా! ఈ ఖురాన్‌ను అవతరింపజేసి మేము నీ చేత అసాధ్యమైన ఏ పనినీ చేయించదలచలేదు. విశ్వసించదలచని వారిని తప్పనిసరిగా విశ్వసించేలా చేయటం, విశ్వాసానికి తావీయని హృదయాలలో విశ్వాసాన్ని తప్పనిసరిగా నెలకొల్పడం అనే బాధ్యతను మేము నీకు అప్పగించలేదు. ఇది కేవలం ఒక హితబోధ, ఒక జ్ఞాపిక మాత్రమే. దైవభీతికలవాడు దీనిని విని చైతన్యవంతుడు కావాలని ఇది పంపబడింది.
2. హజ్రత్ మూసా (అస్సలామ్) మద్యన్‌లో కొన్ని సంవత్సరాల దేశ బహిష్కార జీవితం గడపిన తరువాత, తన భార్యను (ఆమెతో మద్యన్‌లోనే వివాహం జరిగింది) తీసుకుని ఈజిప్టు వైపునకు తిరిగి వెలుతూ ఉన్నప్పుడు ఈ సంఘటన జరిగింది.
3. ఏమనితోస్తుందంటే, అప్పుడు అది రాత్రి సమయం, పైగా చలికాలం. హజ్రత్ మూసా (అ) సినాయ్ ద్వీపకల్పం దక్షిణ ప్రాంతంగుండా ప్రయాణం చేస్తున్నారు. దూరంగా ఒక మంటను చూసి, ఆయన "అక్కడకు పోతే కొంత నిప్పు దొరకవచ్చు, దాంతో రాత్రి అంతా భార్యాపిల్లలను వెచ్చగా ఉంచే ఏర్పాటు చేసుకోవచ్చు. లేదా కనీసం అక్కడ ముందు మార్గం ఎటుపోతుందో తెలుసుకోవచ్చు" అని అనుకున్నారు. ఆయన అనుకున్నది లౌకికమార్గం గురించి, కాని ఆయనకు దొరికింది పరలోకమార్గం.

فَلَمَّآ اَتٰهَانُوْدِیَ یٰمُوْسٰی ﴿١١﴾ اِنِّیْۤ اَنَا رَبُّكَ
فَاخْلَعْ نَعْلَیْكَ ۚ اِنَّكَ بِالْوَادِ الْمُقَدَّسِ
طُوًی ﴿١٢﴾ وَ اَنَا اخْتَرْتُكَ فَاسْتَمِعْ لِمَا یُوْحٰی ﴿١٣﴾
اِنَّنِیْۤ اَنَا اللّٰهُ لَاۤ اِلٰهَ اِلَّاۤ اَنَا فَاعْبُدْنِیْ ۙ وَ
اَقِمِ الصَّلٰوةَ لِذِكْرِیْ ﴿١٤﴾ اِنَّ السَّاعَةَ اٰتِیَةٌ
اَكَادُ اُخْفِیْهَا لِتُجْزٰی كُلُّ نَفْسٍۭ بِمَا تَسْعٰی ﴿١٥﴾
فَلَا یَصُدَّنَّكَ عَنْهَا مَنْ لَّا یُؤْمِنُ بِهَا وَ اتَّبَعَ
هَوٰىهُ فَتَرْدٰی ﴿١٦﴾ وَ مَا تِلْكَ بِیَمِیْنِكَ
یٰمُوْسٰی ﴿١٧﴾ قَالَ هِیَ عَصَایَ ۚ اَتَوَكَّؤُا عَلَیْهَا وَ
اَهُشُّ بِهَا عَلٰی غَنَمِیْ وَ لِیَ فِیْهَا مَاٰرِبُ
اُخْرٰی ﴿١٨﴾ قَالَ اَلْقِهَا یٰمُوْسٰی ﴿١٩﴾ فَاَلْقٰىهَا فَاِذَا
هِیَ حَیَّةٌ تَسْعٰی ﴿٢٠﴾ قَالَ خُذْهَا وَ لَا تَخَفْ ۫ وقفة
سَنُعِیْدُهَا سِیْرَتَهَا الْاُوْلٰی ﴿٢١﴾ وَاضْمُمْ یَدَكَ
اِلٰی جَنَاحِكَ تَخْرُجْ بَیْضَآءَ مِنْ غَیْرِ سُوْٓءٍ
اٰیَةً اُخْرٰی ﴿٢٢﴾ ۙ لِنُرِیَكَ مِنْ اٰیٰتِنَا الْكُبْرٰی ﴿٢٣﴾ ۚ
اِذْهَبْ اِلٰی فِرْعَوْنَ اِنَّهٗ طَغٰی ﴿٢٤﴾ ع

**11 - 39** ... అక్కడకు చేరగానే, ఒక వాణి ఇలా పిలిచింది, "మూసా! నేనే నీ ప్రభువును, చెప్పులు విడువు. నీవు పవిత్రమైన తువా లోయలో ఉన్నావు. నేను నిన్ను ఎన్నుకున్నాను. వహీ ద్వారా చెప్పబడే దానిని విను. నేనే అల్లాహ్‌ను, నేను తప్ప మరొక దేవుడు లేడు. కనుక నీవు నాకు దాస్యం చెయ్యి. నా జ్ఞాపకం కోసం నమాజును స్థాపించు. ప్రళయ ఘడియ తప్పని సరిగా వస్తుంది. నేను దాని సమయాన్ని గోప్యంగా ఉంచాలను కున్నాను. ప్రతి వ్యక్తీ తన కృషి ప్రకారం ప్రతిఫలం పొందగల గటానికి. కనుక దానిని విశ్వసించకుండా తన మనోవాంఛలకు దాసుడై పోయిన వ్యక్తి ఎవడైనా, నిన్ను ఆ ఘుడియను గురించిన చింతన నుండి మరల్చకూడదు; మరల్చితే నీవు వినాశానికి గురిఅవుతావు. – మూసా! నీ చేతిలో ఉన్నది ఏమిటి?" దానికి మూసా, "ఇది నా చేతికర్ర, దాని ఆధారంగా నడుస్తాను. దానితో నా మేకల కోసం ఆకులు రాలుస్తాను. ఇంకా ఎన్నో పనులు దానితో నెరవేర్చుకుంటాను" అని సమాధానం చెప్పాడు. "మూసా! దానిని విసరివెయ్యి" అని దేవుడు సెలవిచ్చాడు. అతను విసరివేశాడు. అకస్మాత్తుగా అది పరుగెత్తుతున్న ఒక పాముగా మారిపోయింది. దేవుడు ఇంకా ఇలా అన్నాడు, "దాన్ని పట్టుకో, భయపడకు. మేము దానిని మళ్ళీ అది పూర్వం ఉన్న మాదిరిగానే చేసివేస్తాము. నీ చేతిని కొంచెం నీ చంకలోకి నొక్కు అది మెరుస్తూ బయటకు వస్తుంది, ఎలాంటి బాధలేకుండానే.[4] ఇది రెండో సూచన. ఎందుకంటే, మేము నీకు మా పెద్ద సూచనలను చూపబోతున్నాము. ఇక నీవు ఫిరౌను వద్దకు వెళ్ళు, అతడు ధిక్కారి అయిపోయాడు."

4. అంటే, అది సూర్యుడు మాదిరిగా ప్రకాశిస్తుంది. కాని అది నీకు ఎలాంటి బాధనూ కలిగించదు.

قَالَ رَبِّ اشْرَحْ لِي صَدْرِي ﴿٢٥﴾ وَ يَسِّرْ لِيٓ
أَمْرِي ﴿٢٦﴾ وَ احْلُلْ عُقْدَةً مِّنْ لِّسَانِي ﴿٢٧﴾
يَفْقَهُوا قَوْلِي ﴿٢٨﴾ وَ اجْعَلْ لِّي وَزِيرًا مِّنْ
أَهْلِي ﴿٢٩﴾ هٰرُونَ أَخِي ﴿٣٠﴾ اشْدُدْ بِهٖٓ أَزْرِي ﴿٣١﴾
وَ أَشْرِكْهُ فِيٓ أَمْرِي ﴿٣٢﴾ كَيْ نُسَبِّحَكَ
كَثِيرًا ﴿٣٣﴾ وَّ نَذْكُرَكَ كَثِيرًا ﴿٣٤﴾ إِنَّكَ كُنْتَ بِنَا
بَصِيرًا ﴿٣٥﴾ قَالَ قَدْ أُوتِيتَ سُؤْلَكَ يٰمُوسٰى ﴿٣٦﴾
وَلَقَدْ مَنَنَّا عَلَيْكَ مَرَّةً أُخْرٰىٓ ﴿٣٧﴾ إِذْ
أَوْحَيْنَآ إِلٰىٓ أُمِّكَ مَا يُوحٰىٓ ﴿٣٨﴾ أَنِ اقْذِفِيهِ
فِي التَّابُوتِ فَاقْذِفِيهِ فِي الْيَمِّ فَلْيُلْقِهِ الْيَمُّ
بِالسَّاحِلِ يَأْخُذْهُ عَدُوٌّ لِّي وَ عَدُوٌّ لَّهٗ ۚ وَ
أَلْقَيْتُ عَلَيْكَ مَحَبَّةً مِّنِّي ۚ وَ لِتُصْنَعَ عَلٰى
عَيْنِيٓ ﴿٣٩﴾ إِذْ تَمْشِيٓ أُخْتُكَ فَتَقُولُ هَلْ أَدُلُّكُمْ
عَلٰى مَنْ يَّكْفُلُهٗ ۚ فَرَجَعْنٰكَ إِلٰىٓ أُمِّكَ كَيْ تَقَرَّ
عَيْنُهَا وَ لَا تَحْزَنَ ۚ وَقَتَلْتَ نَفْسًا فَنَجَّيْنٰكَ
مِنَ الْغَمِّ وَ فَتَنّٰكَ فُتُونًا ۚ فَلَبِثْتَ سِنِينَ فِيٓ
أَهْلِ مَدْيَنَ ۙ ثُمَّ جِئْتَ عَلٰى قَدَرٍ يّٰمُوسٰى ﴿٤٠﴾
وَ اصْطَنَعْتُكَ لِنَفْسِي ﴿٤١﴾ اِذْهَبْ أَنْتَ وَ أَخُوكَ
بِاٰيٰتِي وَ لَا تَنِيَا فِي ذِكْرِي ﴿٤٢﴾ اِذْهَبَآ إِلٰى
فِرْعَوْنَ إِنَّهٗ طَغٰى ﴿٤٣﴾ فَقُولَا لَهٗ قَوْلًا لَّيِّنًا
لَّعَلَّهٗ يَتَذَكَّرُ أَوْ يَخْشٰى ﴿٤٤﴾

وقف لازم

మూసా ఇలా మనవి చేసుకున్నాడు, "ప్రభూ! నా హృదయాన్ని తెరువు. నా కార్యాన్ని నా కొరకు సులభతరం చెయ్యి. ప్రజలు నా మాటలు అర్థం చేసుకోగలగటానికి, నా నాలుక ముడిని విప్పు. ఇంకా నా కొరకు నా కుటుంబం నుండే ఒక సహాయ కుణ్ణి నియమించు– నా సోదరుడు హారూన్‌ని – అతని ద్వారా నా చేతులను పటిష్ఠం చెయ్యి. అతనిని నా కార్యంలో నాకు సహాయపడేలా చెయ్యి. మేము నీ పరిశుద్ధతను అత్యధికంగా ప్రకటించేటందుకు, నిన్ను అమితంగా స్మరించేటందుకు. నీవు నిత్యమూ మా స్థితిని కనిపెట్టే ఉన్నావు." ఇలా సెలవిచ్చాడు; "మూసా! నీవు కోరినది ఇవ్వబడింది. మేము మరొకసారి నీకు ఉపకారం చేశాము. మేము నీ తల్లికి సూచన ఇచ్చిన సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకో. అది వహీ ద్వారా మాత్రమే ఇవ్వబడే సూచన. అది ఏమిటంటే; ఈ బాలుణ్ణి పెట్టెలో పెట్టి, ఆ పెట్టెను నదిలోకి వదలివెయ్యి. నది దానిని ఒడ్డున పడవేస్తుంది. నాకూ, ఈ బాలుడికీ శత్రువు అయిన వాడు దానిని పట్టుకువెళతాడు."

**... 39 - 44** నేను నా తరఫు నుండి నీపై ప్రేమను ఆవరింప జేశాను, నీవు నా పర్యవేక్షణలో పెంచబడే ఏర్పాటు చేశాను. జ్ఞాపకం తెచ్చుకో, అప్పుడు నీ సోదరి అనుసరిస్తూ అక్కడకు వెళ్లి, "ఈ బాలుణ్ణి చక్కగా పెంచి పోషించే[5] ఆమెను గురించి మీకు తెలుపనా?" అని అంటుంది. ఇలా మేము నిన్ను మళ్లీ నీ తల్లి వద్దకే చేర్చాము, ఆమె కళ్లు చల్లబడేందుకు, ఆమె దుఃఖించకుండా ఉండేందుకు. ఇంకా (ఈ విషయం కూడ జ్ఞాపకం తెచ్చుకో) నీవు ఒక వ్యక్తిని హత్య చేశావు. మేము ఆ ఉచ్చు నుండి నీకు విముక్తి కలిగించాము, తరువాత నిన్ను విభిన్న పరీక్షలకు గురిచేశాము. నీవు మద్యన్ ప్రజల మధ్య ఎన్నో సంవత్సరాలు గడిపావు. మూసా! ఇప్పుడు నీవు సరిగ్గా సమయానికి వచ్చేశావు. నేను నిన్ను నా కొరకు తీర్చి దిద్దుకున్నాను. వెళ్ళండి, నీవూ, నీ సోదరుడూ, నా సూచన లతో. చూడండి, మీరు నన్ను స్మరించే విషయంలో అశ్రద్ధ చెయ్యకండి. మీరు ఇద్దరూ కలసి ఫిరౌన్ వద్దకు వెళ్లండి, అతడు ధిక్కారి అయిపోయాడు. అతనితో మృదువుగా మాట్లా డండి, బహుశా అతడు హితబోధను స్వీకరిస్తాడేమో లేదా (దేవునికి) భయపడతాడేమో."

قَالَا رَبَّنَآ اِنَّنَا نَخَافُ اَنْ يَّفْرُطَ عَلَيْنَآ اَوْ اَنْ
يَّطْغٰى ﴿٤٥﴾ قَالَ لَا تَخَافَآ اِنَّنِيْ مَعَكُمَآ اَسْمَعُ وَ
اَرٰى ﴿٤٦﴾ فَاْتِيٰهُ فَقُوْلَآ اِنَّا رَسُوْلَا رَبِّكَ
فَاَرْسِلْ مَعَنَا بَنِيْٓ اِسْرَآءِيْلَ ۙ وَ لَا تُعَذِّبْهُمْ ؕ
قَدْ جِئْنٰكَ بِاٰيَةٍ مِّنْ رَّبِّكَ ؕ وَ السَّلٰمُ عَلٰى مَنِ
اتَّبَعَ الْهُدٰى ﴿٤٧﴾ اِنَّا قَدْ اُوْحِيَ اِلَيْنَآ اَنَّ
الْعَذَابَ عَلٰى مَنْ كَذَّبَ وَ تَوَلّٰى ﴿٤٨﴾ قَالَ فَمَنْ
رَّبُّكُمَا يٰمُوْسٰى ﴿٤٩﴾ قَالَ رَبُّنَا الَّذِيْٓ اَعْطٰى كُلَّ
شَيْءٍ خَلْقَهٗ ثُمَّ هَدٰى ﴿٥٠﴾ قَالَ فَمَا بَالُ
الْقُرُوْنِ الْاُوْلٰى ﴿٥١﴾ قَالَ عِلْمُهَا عِنْدَ رَبِّيْ فِيْ
كِتٰبٍ ۚ لَا يَضِلُّ رَبِّيْ وَ لَا يَنْسَى ﴿٥٢﴾ الَّذِيْ
جَعَلَ لَكُمُ الْاَرْضَ مَهْدًا وَّ سَلَكَ لَكُمْ فِيْهَا
سُبُلًا وَّ اَنْزَلَ مِنَ السَّمَآءِ مَآءً ؕ فَاَخْرَجْنَا بِهٖٓ
اَزْوَاجًا مِّنْ نَّبَاتٍ شَتّٰى ﴿٥٣﴾ كُلُوْا وَ ارْعَوْا
اَنْعَامَكُمْ ؕ اِنَّ فِيْ ذٰلِكَ لَاٰيٰتٍ لِّاُولِي النُّهٰى ﴿٥٤﴾
مِنْهَا خَلَقْنٰكُمْ وَ فِيْهَا نُعِيْدُكُمْ وَ مِنْهَا
نُخْرِجُكُمْ تَارَةً اُخْرٰى ﴿٥٥﴾

**45 - 48** ఉభయులూ ఇలా మనవి చేసుకున్నారు,[6] "ప్రభూ! అతడు మాపై దౌర్జన్యం చేస్తాడేమో అని లేక మాపై విరుచుకు పడతాడేమో అని మేము భయపడుతున్నాము." ఇలా సెలవిచ్చాడు, "భయపడకండి, మీతో పాటు నేనూ ఉన్నాను, అంతా వింటూ ఉన్నాను. చూస్తూ ఉన్నాను. అతని వద్దకు వెళ్లి ఇలా అనండి, 'మేము నీ ప్రభువు సందేశహరులము. ఇస్రాయీల్ సంతతివారు మాతో రావటానికి అనుమతించు. వారిని బాధపెట్టకు. మేము నీ వద్దకు నీ ప్రభువు సూచనలు తీసుకుని వచ్చాము. ఋజుమార్గం అనుసరించే వానికి శాంతి ఉంది. తిరస్కరించి విముఖుడయ్యే వానికి శిక్ష ఉంది' అని మాకు వహీ ద్వారా తెలుపబడింది."

**49 - 55** ఫిరౌను[7] "సరే, అయితే మూసా! మీ ఇద్దరి ప్రభువు ఎవడు?" అని అడిగాడు. దానికి మూసా "ప్రతి వస్తువుకూ దాని స్వరూపాన్ని ప్రసాదించి, తరువాత దానికి మార్గం చూపినవాడే[8] మా ప్రభువు" అని జవాబు చెప్పాడు. అప్పుడు ఫిరౌను, "అయితే పూర్వం గతించిన తరాల వారి స్థితి ఏమిటి?"[9] అని అన్నాడు. మూసా, "దానికి సంబంధించిన జ్ఞానం నా ప్రభువు వద్ద ఒక గ్రంథంలో సురక్షితంగా ఉంది. నా ప్రభువు పొరపాటూ చెయ్యడు, మరవడు కూడాను"[10] అని సమాధానం పలికాడు. ఆయనే[11] మీ కొరకు భూమిని పాన్పుగా పరిచాడు, దానిపై మీరు నడిచేందుకు మార్గాలను నిర్మించాడు; పై నుండి నీటిని కురిపించాడు. తరువాత దాని ద్వారా రకరకాల పంటలను పండించాడు. వాటిని తినండి, మీ పశువులను కూడ మేపండి. నిశ్చయంగా అర్థం చేసుకోగల వారికి ఇందులో ఎన్నో సూచనలు ఉన్నాయి. ఈ నేల నుండే మేము మిమ్మల్ని సృష్టించాము, దానిలోనికే మేము మిమ్మల్ని తిరిగి తీసుకు పోతాము. దాని నుండే మిమ్మల్ని మళ్ళీ వెలికి తీస్తాము.

5. అంటే, నదీ తీరం వెంట పెట్టెతోపాటు నడుస్తూ ఉంది. తరువాత ఫిరౌన్ కుటుంబం వారు బాలుణ్ణి ఎత్తుకున్నప్పుడు, అక్కడ ఆ బాలుని కోసం ఒక ఆయాను గురించి అన్వేషించగా, మూసా సోదరి అక్కడకు పోయి వారితో ఈ మాట అన్నది.

6. హజ్రత్ మూసా (అ) ఈజిప్టుకు పోయిన తరువాత, హజ్రత్ హారూన్ క్రియా శీలకంగా ఆయనతో కలసి సందేశ ప్రచారం చేస్తున్నప్పటి విషయం ఇది. అప్పుడు, ఫిరౌన్ వద్దకు పోయేముందు వారు ఉభయులూ అల్లాహ్ సన్నిధిలో ఈ విజ్ఞప్తి చేసి ఉండవచ్చు.

وَ لَقَدۡ اَرَيۡنٰهُ اٰيٰتِنَا كُلَّهَا فَكَذَّبَ وَاَبٰى ﴿٥٦﴾
قَالَ اَجِئۡتَنَا لِتُخۡرِجَنَا مِنۡ اَرۡضِنَا بِسِحۡرِكَ
يٰمُوۡسٰى ﴿٥٧﴾ فَلَنَاۡتِيَنَّكَ بِسِحۡرٍ مِّثۡلِهٖ فَاجۡعَلۡ
بَيۡنَنَا وَبَيۡنَكَ مَوۡعِدًا لَّا نُخۡلِفُهٗ نَحۡنُ وَ لَاۤ
اَنۡتَ مَكَانًا سُوًى ﴿٥٨﴾ قَالَ مَوۡعِدُكُمۡ يَوۡمُ
الزِّيۡنَةِ وَ اَنۡ يُّحۡشَرَ النَّاسُ ضُحًى ﴿٥٩﴾ فَتَوَلّٰى
فِرۡعَوۡنُ فَجَمَعَ كَيۡدَهٗ ثُمَّ اَتٰى ﴿٦٠﴾ قَالَ لَهُمۡ
مُّوۡسٰى وَيۡلَكُمۡ لَا تَفۡتَرُوۡا عَلَى اللّٰهِ كَذِبًا
فَيُسۡحِتَكُمۡ بِعَذَابٍ ۚ وَ قَدۡ خَابَ مَنِ افۡتَرٰى ﴿٦١﴾

**56 - 61** మేము ఫిరౌనుకు మా సమస్త సూచనలనూ చూపాము. కాని అతడు నిరాకరించాడు, విశ్వసించలేదు. ఇలా అన్నాడు, "మూసా! నీవు నీ మంత్రజాల శక్తితో మమ్మల్ని మా దేశం నుండి వెళ్లగొట్టటానికి మా వద్దకు వచ్చావా? సరే మేము కూడ నీకు పోటీగా అటువంటి మంత్రజాలాన్నే తీసుకు వస్తాము. ఎప్పుడు, ఎక్కడ ఎదుర్కోవాలో నిర్ణయించుకో. మేమూ ఈ ఒప్పందం నుండి మళ్లిపోము, నీవూ మళ్ళిపో కూడదు. బహిరంగ మైదానంలోనికి రా." మూసా, "ఉత్సవ దినం నిర్ణయమైంది. పొద్దెక్కిన తరువాత ప్రజలు సమావేశం కావాలి"[12] అని చెప్పాడు. ఫిరౌను మరలిపోయి, తన కుతంత్ర సామగ్రిని సమీకరించుకుని పోటీకి వచ్చాడు. (పోటీ ప్రారంభం లోనే ప్రత్యర్థి వర్గాన్ని సంబోధిస్తూ) మూసా ఇలా అన్నాడు, "దౌర్భాగ్యులారా; అల్లాహ్‌పై అపనిందలు మోపకండి.[13] అలా చేస్తే ఆయన మిమ్మల్ని ఒక కఠిన శిక్ష ద్వారా సర్వనాశనం చేస్తాడు. అబద్ధాన్ని ఎవడు కల్పించినా, వాడు విఫలుడే అయ్యాడు."

7. సోదరులిద్దరూ ఫిరౌన్ వద్దకు వెళ్ళినప్పటి కథ ఇప్పుడు ప్రారంభమవుతుంది.

8. అంటే, ప్రపంచంలోని ప్రతి వస్తువూ, అది ఏదయినప్పటికీ, ఆయన సృష్టించటం వల్లనే ఉనికిలోకి వచ్చింది. తరువాత ఆయన ప్రతి వస్తువుకూ దాని ప్రత్యేక ఆకారాన్ని ఇచ్చి, ఇట్టే వదలిపెట్టలేదు. ఆపైన ఆయన ఆ అన్ని వస్తువులకూ మార్గం కూడా చూపుతాడు. ఆయన ప్రపంచంలోని ప్రతి వస్తువుకూ అది తన దేహాన్ని ఉపయోగించుకునే విధానం ఏమిటో, తన సృష్టి లక్ష్యాన్ని నెరవేర్చుకునే పద్ధతి ఏమిటో నేర్పాడు. చెవికి వినటాన్ని, కళ్ళకు చూడటాన్ని, చేపకు ఈదటాన్నీ, పక్షికి ఎగురటాన్నీ నేర్పినవాడు ఆయనే. ఆయన ప్రతి వస్తువు యొక్క సృష్టికర్తయే కాదు, మార్గదర్శకుడు, గురువు కూడ.

9. అంటే, ప్రభువు అనేవాడు కేవలం ఆ ఒక్క దేవుడే అయితే వందల సంవత్సరాల నుండి మా తాత ముత్తాతలు వంశపారంపర్యంగా ఎంతోమంది దేవుళ్ళను పూజిస్తూ వస్తున్నారు, నీ దృష్టిలో వారి స్థితి ఏమిటి? వారందరూ శిక్షకు అర్హులేనా? వారు తెలివి తక్కువవారేనా?

10. ఫిరౌన్ ప్రశ్నా ఉద్దేశ్యం, సభికులలో విద్వేషాగ్నిని రగిలించి, వారి ద్వారా ప్రజలలో కూడా విద్వేషాగ్నిని రగిలింపజేయటం. హజ్రత్ మూసా (అ) ఇచ్చిన ఈ సమాధానం అతడి విషపు కోరలను పెరికేసింది. వారు ఎటువంటి వారైనాసరే, తమ వంతు పాత్రను నిర్వహించి దేవుని దగ్గరకు వెళ్లిపోయారు. వారు చేసిన ఒక్కొక్క పనీ, దానికి కలిగిన ప్రేరణలూ అల్లాహ్‌కు తెలుసు. వారితో ఎలా వ్యవహరించాలో కూడ ఆయనకే బాగా తెలుసు.

11. గ్రంథంలోని సంభాషణా వైఖరినిబట్టి, సందర్భాన్నిబట్టి తెలిసేది ఏమిటంటే, "నా ప్రభువు పొరపాటూ చెయ్యడు, మరచిపోడు" అని హజ్రత్ మూసా సమాధానం ముగించారు. ఇక్కడ నుండి 55వ వాక్యం వరకు గల భాగం అల్లాహ్ తరఫు నుండి ఒక వివరణగా, హితబోధగా చెప్పబడింది.

12. ఫిరౌను ఉద్దేశ్యం ఏమిటంటే, ఒకసారి మంత్రగాళ్లచేత కర్రలనూ, త్రాళ్లనూ పాములుగా చేయించి చూపినట్లయితే, మూసా ప్రదర్శించిన మహాత్మ్యాల ప్రభావం ప్రజల హృదయాల నుండి దూరమైపోతుంది. హజ్రత్ మూసా కోరిక కూడ ఇదే. ఆయన ఇలా అన్నారు, "ప్రత్యేకంగా మరొకదినం, మరొక స్థలం నిర్ణయించే అవసరమేముంది.

فَتَنَازَعُوْٓا اَمْرَهُمْ بَيْنَهُمْ وَ اَسَرُّوا النَّجْوٰى ﴿٦٢﴾
قَالُوْٓا اِنْ هٰذٰنِ لَسٰحِرٰنِ يُرِيْدٰنِ اَنْ
يُّخْرِجٰكُمْ مِّنْ اَرْضِكُمْ بِسِحْرِهِمَا وَيَذْهَبَا
بِطَرِيْقَتِكُمُ الْمُثْلٰى ﴿٦٣﴾ فَاَجْمِعُوْا كَيْدَكُمْ ثُمَّ ائْتُوْا
صَفًّا ۚ وَ قَدْ اَفْلَحَ الْيَوْمَ مَنِ اسْتَعْلٰى ﴿٦٤﴾
قَالُوْا يٰمُوْسٰٓى اِمَّآ اَنْ تُلْقِيَ وَ اِمَّآ اَنْ نَّكُوْنَ
اَوَّلَ مَنْ اَلْقٰى ﴿٦٥﴾ قَالَ بَلْ اَلْقُوْا ۚ فَاِذَا
حِبَالُهُمْ وَ عِصِيُّهُمْ يُخَيَّلُ اِلَيْهِ مِنْ سِحْرِهِمْ
اَنَّهَا تَسْعٰى ﴿٦٦﴾ فَاَوْجَسَ فِيْ نَفْسِهٖ خِيْفَةً
مُّوْسٰى ﴿٦٧﴾ قُلْنَا لَا تَخَفْ اِنَّكَ اَنْتَ الْاَعْلٰى ﴿٦٨﴾
وَ اَلْقِ مَا فِيْ يَمِيْنِكَ تَلْقَفْ مَا صَنَعُوْا ۗ اِنَّمَا
صَنَعُوْا كَيْدُ سٰحِرٍ ۗ وَ لَا يُفْلِحُ السَّاحِرُ حَيْثُ
اَتٰى ﴿٦٩﴾ فَاُلْقِيَ السَّحَرَةُ سُجَّدًا قَالُوْٓا اٰمَنَّا بِرَبِّ
هٰرُوْنَ وَ مُوْسٰى ﴿٧٠﴾ قَالَ اٰمَنْتُمْ لَهٗ قَبْلَ اَنْ
اٰذَنَ لَكُمْ ۗ اِنَّهٗ لَكَبِيْرُكُمُ الَّذِيْ عَلَّمَكُمُ
السِّحْرَ ۚ فَلَاُقَطِّعَنَّ اَيْدِيَكُمْ وَ اَرْجُلَكُمْ مِّنْ
خِلَافٍ وَّ لَاُوصَلِّبَنَّكُمْ فِيْ جُذُوْعِ النَّخْلِ ۫ وَ
لَتَعْلَمُنَّ اَيُّنَآ اَشَدُّ عَذَابًا وَّ اَبْقٰى ﴿٧١﴾

**62 - 64** ఇది విన్న తరువాత వారి మధ్య అభిప్రాయ భేదం తలెత్తింది. వారు తమలో తాము రహస్యంగా సంప్రదించుకోసాగారు.[14] చివరకు కొందరు ఇలా అన్నారు, "ఈ ఇద్దరు కేవలం మాంత్రికులే. వారి ఉద్దేశ్యం తమ మంత్రబలం ద్వారా మిమ్మల్ని మీ దేశం నుండి తరిమివేయటం. అంతేకాదు మీ ఆదర్శ జీవన విధానాన్ని అంతమొందించటం. కావున మీరు ఈనాడు మీ శక్తియుక్తులను సమీకరించుకోండి, సమైక్యంగా రంగంలోకి దిగండి. ఈనాడు ప్రాబల్యం వహించిన వాడే గెలిచాడు అనే విషయం తెలుసుకోండి."

**65 - 76** మాంత్రికులు, "మూసా! మొదట నీవు విసురుతావా లేక మేము విసరమా?" అని అడిగారు. దానికి మూసా, "లేదు, మీరే విసరండి" అని అన్నాడు. అపుడు అకస్మాత్తుగా వారి త్రాళ్లు, వారి కర్రలూ వారి మంత్రశక్తి వల్ల పరుగెత్తుతూ ఉన్నట్లు మూసాకు అనిపించింది. మూసా తన మనస్సులో భయపడ్డాడు.[15] మేము ఇలా అన్నాము, "భయపడకు, నీవే ఆధిక్యం వహిస్తావు. నీ చేతిలో ఉన్న దానిని విసరివెయ్యి. ఇప్పుడే అది వారు కల్పించిన వాటి నన్నింటినీ మింగివేస్తుంది. వారు కల్పించి తీసుకువచ్చింది కేవలం మాంత్రికుని తంత్రమే. మాంత్రికుడు ఎన్నడూ సఫలుడు కాలేడు, వాడు ఎంత నేర్పరి అయినాసరే. చివరకు జరిగిందేమిటంటే, మాంత్రికులందరూ సజ్దా (సాష్టాంగపడటం)లో పడవేయబడ్డారు.[16] వారు ఎలుగెత్తి, "మేము హారూన్, మూసాల ప్రభువును విశ్వసించాము" అని ప్రకటించారు. ఫిరౌను ఇలా అన్నాడు, "నేను మిమ్మల్ని అనుమతించక ముందే మీరు ఇతన్ని విశ్వసించారా? ఇతడు మీకు మంత్ర విద్య నేర్పిన గురువని తెలిసిపోయింది. సరే, ఇప్పుడు నేను మీ చేతులను, మీ కాళ్ళను వ్యతిరేక పార్శ్వాల నుండి (కుడిచెయ్యి, ఎడమకాలు, ఎడమ చెయ్యి కుడి కాలు) నరికిస్తాను. ఖర్జూరపు దూలాలపై శిలువ వేయిస్తాను. అప్పుడు మా ఇద్దరి శిక్షలలో ఏది ఎక్కువ కఠినమైనదో, ఏది దీర్ఘకాలిక మైనదో మీకు తెలుస్తుంది. (అంటే మీకు నేను ఎక్కువ కఠిన మైన శిక్ష విధించగలనా లేక మూసా విధించగలడా అని).

قَالُوْا لَنْ نُّؤْثِرَكَ عَلٰى مَا جَآءَنَا مِنَ الْبَيِّنٰتِ
وَالَّذِيْ فَطَرَنَا فَاقْضِ مَآ اَنْتَ قَاضٍ ۚ اِنَّمَا
تَقْضِيْ هٰذِهِ الْحَيٰوةَ الدُّنْيَا ﴿٧٢﴾ اِنَّآ اٰمَنَّا بِرَبِّنَا
لِيَغْفِرَ لَنَا خَطٰيٰنَا وَمَآ اَكْرَهْتَنَا عَلَيْهِ مِنَ
السِّحْرِ ۗ وَاللّٰهُ خَيْرٌ وَّاَبْقٰى ﴿٧٣﴾ اِنَّهٗ مَنْ يَّاْتِ الثلثة
رَبَّهٗ مُجْرِمًا فَاِنَّ لَهٗ جَهَنَّمَ ۗ لَا يَمُوْتُ فِيْهَا
وَلَا يَحْيٰى ﴿٧٤﴾ وَمَنْ يَّاْتِهٖ مُؤْمِنًا قَدْ عَمِلَ
الصّٰلِحٰتِ فَاُولٰٓئِكَ لَهُمُ الدَّرَجٰتُ الْعُلٰى ﴿٧٥﴾
جَنّٰتُ عَدْنٍ تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ
خٰلِدِيْنَ فِيْهَا ۗ وَذٰلِكَ جَزٰٓؤُا مَنْ تَزَكّٰى ﴿٧٦﴾ ع

మాంత్రికులు ఇలా జవాబు పలికారు, "మమ్మల్ని సృష్టించిన శక్తి సాక్షిగా! స్పష్టమైన సూచనలు ముందుకు వచ్చిన తరువాత కూడ (సత్యంపై) నీకు ప్రాధాన్యం ఇవ్వటం అనేది జరగని పని. నీవు చెయ్యదలచుకున్నది చేసుకో, మహాఅయితే నీవు ఈ ప్రపంచ జీవితం గురించి మాత్రమే నిర్ణయం చెయ్యగలవు. మేము మా ప్రభువును విశ్వసించాము. మా తప్పులను ఆయన క్షమించాలని, నీవు బలవంతంగా మా చేత చేయించిన మంత్ర తంత్రాలకు మమ్మల్ని మన్నించాలని. అల్లాహ్‌యే మంచివాడు, కలకాలం ఉండేవాడు."-యథార్థం[17] ఏమిటంటే, దోషిగా తన ప్రభువు ముందు హాజరయ్యేవాడికి నరకం తప్పదు. అందులో వాడు చావనూ లేడు, బ్రతకనూ లేడు. ఆయన సాన్నిధ్యంలో విశ్వాసిగా హాజరు అయి, సత్కార్యాలు చేసి ఉన్నవాడు,- అలాంటి వారందరికీ ఉన్నత స్థానాలు ఉన్నాయి. నిత్యం పచ్చగా ఉండే ఉద్యానవనాలు ఉన్నాయి. వాటి క్రింద కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి. వాటిలో వారు శాశ్వతంగా ఉంటారు. పరిశుద్ధతను పాటించే వ్యక్తికి లభించే ప్రతిఫలం ఇదే.

---

ఉత్సవ దినం దగ్గరలోనే ఉంది కదా! ఆనాడు దేశంలోని ప్రజలందరూ రాజధానికి ఎలానూ వస్తారు. తిరునాళ్ళ మైదానంలోనే పోటీ జరిగితే బాగుంటుంది, జాతి ప్రజలందరూ చూసుకుంటారు. అనుమానానికీ, సంశయానికీ ఆస్కారం లేకుండా ఉండేందుకు సమయం కూడ పట్టపగలే కావాలి."

13. అంటే, ఈ మహత్యాన్ని మంత్రజాలంగానూ, దానిని చూపే దైవప్రవక్తను మాంత్రికునిగానూ నిర్ణయించకండి.

14. దీనిద్వారా తెలిసేది ఏమిటంటే, వారు మనస్సులలో తమ బలహీనతను గురించి స్వయంగా తెలుసుకున్నారు. హజ్రత్ మూసాగారు ఫిరౌను దర్బారులో చూపించినదంతా మంత్రజాలం కాదని వారికి తెలుసు. వారు మొదటి నుంచే ఈ పోటీలో భయపడుతూ, సంకోచిస్తూ పాల్గొనటానికి వచ్చారు. సరిగ్గా సమయం వచ్చినప్పుడు, హజ్రత్ మూసాగారు వారిని బెదిరిస్తూ హెచ్చరించినప్పుడు, వారి పట్టుదల సడలిపోయింది. వారి మధ్య ఈ విషయం గురించి అభిప్రాయభేదం తలెత్తి ఉండవచ్చు : ఈ పెద్ద పండుగ జరిగే సందర్భంలో, దేశం నలు మూలల నుంచి ప్రజలు వచ్చి ఒకచోట సమావేశమయి నప్పుడు, బహిరంగ మైదానంలో, పట్టపగలు ఈ పోటీ జరగటం శ్రేయస్కరమా? కాదా? అనేది. ఒకవేళ మనం ఇక్కడ ఓడిపోతే, అందరి ముందు ఇంద్రజాలానికీ, మహిమకూ మధ్య ఉన్న భేదం స్పష్టమైపోతే, అప్పుడు మాట దక్కదు కదా!

15. అంటే, "విసరండి" అని హజ్రత్ మూసా మాంత్రికులతో అనగానే వారు ఒకేసారి తమ కర్రలనూ, త్రాళ్లనూ ఆయన వైపునకు విసిరారు. అకస్మాత్తుగా వందల సంఖ్యలో సర్పాలు తమ వైపునకు పరుగెత్తుకుంటూ రావటం మూసాకు కనిపించింది. ఈ దృశ్యాన్ని చూసిన వెంటనే ఒకవేళ మూసా తన అంతరంగంలో భయపడితే, అది వింత విషయమేమీ కాదు. ఎంతయినా మానవుడు మానవుడే కదా! దైవప్రవక్తే అయినా, మానవత్వపు బలహీనతలకు ఆయన అతీతుడు కాలేడు. సాధారణ మానవుల మాదిరిగానే దైవప్రవక్త కూడ మంత్రజాలానికి ప్రభావితుడు కాకుండా ఉండలేడు అనేదే ప్రస్తావించదగిన విషయం. ఆ విషయాన్నే ఇక్కడ ఖురాను

77 మేము[18] మూసాకు వహీద్వారా ఇలా తెలిపాము, "ఇక రాత్రికి రాత్రే నా దాసులను తీసుకుని బయలుదేరు, వారి కొరకు సముద్రంలో పొడిబాటను ఏర్పాటు చెయ్యి, ఎవరైనా వెంటాడుతారేమో అనే భయం నీకు ఏమాత్రం వద్దు, (సముద్రం మధ్యగా పోతున్నప్పుడు) భయపడనూవద్దు."

وَ لَقَدْ اَوْحَيْنَاۤ اِلٰى مُوْسٰۤى ۙ اَنْ اَسْرِ بِعِبَادِىْ فَاضْرِبْ لَهُمْ طَرِيْقًا فِى الْبَحْرِ يَبَسًا ۙ لَّا تَخٰفُ دَرَكًا وَّ لَا تَخْشٰى ﴿٧٧﴾ فَاَتْبَعَهُمْ فِرْعَوْنُ بِجُنُوْدِهٖ فَغَشِيَهُمْ مِّنَ الْيَمِّ مَا غَشِيَهُمْ ﴿٧٨﴾ وَ اَضَلَّ فِرْعَوْنُ قَوْمَهٗ وَ مَا هَدٰى ﴿٧٩﴾ يٰبَنِىْۤ اِسْرَآءِيْلَ قَدْ اَنْجَيْنٰكُمْ مِّنْ عَدُوِّكُمْ وَوٰعَدْنٰكُمْ جَانِبَ الطُّوْرِ الْاَيْمَنَ وَ نَزَّلْنَا عَلَيْكُمُ الْمَنَّ وَالسَّلْوٰى ﴿٨٠﴾ كُلُوْا مِنْ طَيِّبٰتِ مَا رَزَقْنٰكُمْ وَ لَا تَطْغَوْا فِيْهِ فَيَحِلَّ عَلَيْكُمْ غَضَبِىْ ۚ وَ مَنْ يَّحْلِلْ عَلَيْهِ غَضَبِىْ فَقَدْ هَوٰى ﴿٨١﴾ وَ اِنِّىْ لَغَفَّارٌ لِّمَنْ تَابَ وَاٰمَنَ وَعَمِلَ صَالِحًا ثُمَّ اهْتَدٰى ﴿٨٢﴾

78 - 79 వెనుక నుండి ఫిరౌను తన సేనలతో అక్కడకు చేరాడు. తరువాత సముద్రం వారిని క్రమ్ముకుంది, క్రమ్ముకోవలసిన విధంగా, ఫిరౌను తన జాతి ప్రజలను మార్గభ్రష్టులు గానే చేశాడు, వారికి సరియైన మార్గదర్శకత్వాన్ని ఇవ్వలేదు.

80 - 82 ఇస్రాయీల్ సంతానమా![19] మేము మీకు మీ శత్రువు నుండి విముక్తి కలిగించాము. తూర్ పర్వతం కుడి ప్రక్కన మీరు హాజరయ్యేందుకు గడువు నిర్ణయించాము. ఇంకా మీపై మన్నను, సల్వాను అవతరింపజేశాము – మేము ఇచ్చిన పరిశుద్ధమైన ఆహారాన్ని తినండి. దానిని తిని తిరుగుబాటు చెయ్యకండి. చేస్తే నా ఆగ్రహం మీపై విరుచుకు పడుతుంది. ఎవడి మీద నా ఆగ్రహం విరుచుకుపడుతుందో, అతడు పతనం కావటం తథ్యం. అయితే ఎవడు పశ్చాత్తాపపడతాడో మరియు విశ్వసించి మంచిపనులు చేస్తాడో, ఆ తరువాత సక్రమంగా నడుచుకుంటాడో, అతనిని నేను అమితంగా మన్నిస్తాను.

ధ్రువీకరిస్తోంది. మంత్రజాలం ఆయన దైవదౌత్య బాధ్యతల నిర్వహణలో ఆటంకాలు సృష్టించలేదుగాని, ఆయనలో ఉన్న మానవీయ శక్తులను తప్పకుండా ప్రభావితం చేయగలదు. హదీసులలో మహాప్రవక్త ముహమ్మద్ (స)పై మంత్రజాలం ప్రభావం పడింది అని చెప్పే ఉల్లేఖనాలను చదివి వాటిని తిరస్కరించటమే కాదు ఇంకా కొంచెం ముందుకుపోయి, ఆ హదీసులేవీ నమ్మదగినవి కావని ప్రకటించేవారి అభిప్రాయాలు కూడ తప్పుడు అభిప్రాయాలని తెలియవస్తోంది.

16. అంటే, వారు మూసా చేతి కర్ర ప్రతిభను చూసినప్పుడు, అది నిస్సందేహంగా మహిమే అనీ, అది మంత్రజాలం ఎంతమాత్రం కాదని వారికి నమ్మకం కలిగింది. అందువల్ల వారు ఏకాయెకిన, నిస్సంకోచంగా, ఎవరో వారిని పట్టుకుని అటూ ఇటూ ఊపి క్రిందపడవేసిన విధంగా, సాష్టాంగపడ్డారు.

17. మాంత్రికుల మాటలకు అదనంగా అల్లాహ్ తన తరపు నుండి చేర్చిన విషయం ఇది. ఈ వాక్యం మాంత్రికుల ప్రకటనలోని భాగం కాదని ఉపన్యాసం తీరే తెలుపుతోంది.

18. తరువాత మూసా ఈజిప్టులో గడిపిన సుదీర్ఘ కాలంలో జరిగిన విషయాలకు సంబంధించిన వివరాలు మధ్యలో వదలివేయబడ్డాయి. ఇక, ఇస్రాయీల్ సంతతిని తీసుకుని ఈజిప్టు నుండి బయలుదేరమని, మూసాకు ఆజ్ఞాపించినప్పటి విషయాల ప్రస్తావన ప్రారంభమవుతుంది.

وَ مَاۤ اَعۡجَلَكَ عَنۡ قَوۡمِكَ يٰمُوۡسٰى ﴿٨٣﴾ قَالَ
هُمۡ اُولَاۤءِ عَلٰۤى اَثَرِىۡ وَ عَجِلۡتُ اِلَيۡكَ رَبِّ
لِتَرۡضٰى ﴿٨٤﴾ قَالَ فَاِنَّا قَدۡ فَتَنَّا قَوۡمَكَ مِنۡۢ
بَعۡدِكَ وَ اَضَلَّهُمُ السَّامِرِىُّ ﴿٨٥﴾ فَرَجَعَ مُوۡسٰٓى
اِلٰى قَوۡمِهٖ غَضۡبَانَ اَسِفًا ۚ قَالَ يٰقَوۡمِ اَلَمۡ
يَعِدۡكُمۡ رَبُّكُمۡ وَعۡدًا حَسَنًا ؕ اَفَطَالَ عَلَيۡكُمُ
الۡعَهۡدُ اَمۡ اَرَدۡتُّمۡ اَنۡ يَّحِلَّ عَلَيۡكُمۡ غَضَبٌ
مِّنۡ رَّبِّكُمۡ فَاَخۡلَفۡتُمۡ مَّوۡعِدِىۡ ﴿٨٦﴾ قَالُوۡا مَاۤ
اَخۡلَفۡنَا مَوۡعِدَكَ بِمَلۡكِنَا وَ لٰكِنَّا حُمِّلۡنَاۤ
اَوۡزَارًا مِّنۡ زِيۡنَةِ الۡقَوۡمِ فَقَذَفۡنٰهَا فَكَذٰلِكَ
اَلۡقَى السَّامِرِىُّ ۙ ﴿٨٧﴾ فَاَخۡرَجَ لَهُمۡ عِجۡلًا
جَسَدًا لَّهٗ خُوَارٌ فَقَالُوۡا هٰذَاۤ اِلٰهُكُمۡ وَ اِلٰهُ
مُوۡسٰى ۙ فَنَسِىَ ﴿٨٨﴾ اَفَلَا يَرَوۡنَ اَلَّا يَرۡجِعُ
اِلَيۡهِمۡ قَوۡلًا ۙ وَّ لَا يَمۡلِكُ لَهُمۡ ضَرًّا وَّ لَا
نَفۡعًا ﴿٨٩﴾ وَ لَقَدۡ قَالَ لَهُمۡ هٰرُوۡنُ مِنۡ قَبۡلُ ع ١٣
يٰقَوۡمِ اِنَّمَا فُتِنۡتُمۡ بِهٖ ۚ وَاِنَّ رَبَّكُمُ الرَّحۡمٰنُ
فَاتَّبِعُوۡنِىۡ وَاَطِيۡعُوۡۤا اَمۡرِىۡ ﴿٩٠﴾ قَالُوۡا لَنۡ نَّبۡرَحَ
عَلَيۡهِ عٰكِفِيۡنَ حَتّٰى يَرۡجِعَ اِلَيۡنَا مُوۡسٰى ﴿٩١﴾

**83 - 85** మూసా! ఏ విషయం నిన్ను నీ జాతి ప్రజలకంటే, ముందుగానే ఇక్కడకు తీసుకువచ్చింది?[20] అతను ఇలా మనవి చేసుకున్నాడు, "ఇదిగో వారు నా వెనుక వస్తూనే ఉన్నారు. నేనే త్వరత్వరగా నీ సాన్నిధ్యానికి వచ్చాను, నా ప్రభూ! నీవు నా పట్ల ప్రసన్నుడవు కావాలని." ఇలా సెలవిచ్చాడు, "అయితే విను, మేము నీ వెనుక (నీవు లేనప్పుడు) నీ జాతి ప్రజలను పరీక్షకు గురిచేశాము. 'సామిరీ' వారిని మార్గం తప్పించాడు."[21]

**86 - 91** మూసా ఆగ్రహోదగ్రుడై, దుఃఖిస్తూ తన జాతి వారి వైపునకు మరలాడు. అక్కడకు వెళ్లి ఇలా అన్నాడు, "నా జాతి ప్రజలారా! మీ ప్రభువు మీకు మంచి వాగ్దానాలు చేయ లేదా?[22] అప్పుడే మీకు ఎన్నో రోజులు గడిచినట్లు అనిపించిందా? లేక మీరు మీ ప్రభువు ఆగ్రహాన్ని మీపైకి కొనితెచ్చుకోవాలని కోరుకున్నందువల్లనే మీరు నాకు చేసిన వాగ్దానాన్ని భంగం చేశారా?" దానికి సమాధానంగా వారు ఇలా అన్నారు, "మేము నీకు చేసిన వాగ్దానాన్ని మాకు మేమై భంగపరచలేదు. జరిగిందేమిటంటే, ప్రజల ఆభరణాల బరువు మాపై పడగా మేము వాటిని క్రింద పడవేశాము,[23] అంతే - తరువాత[24] ఇలానే సామిరీ కూడ ఏదో కొంత వేశాడు, వారికై ఒక ఆవు దూడ విగ్రహాన్ని చేసి వెలికి తీశాడు, దానిలో నుండి ఎద్దు అరుపువంటి శబ్దం వచ్చేది. ప్రజలు అరుస్తూ "ఇదే మీ దైవమూ, మూసా దైవము కూడా. మూసా దీనిని మరచి పోయాడు" అని అన్నారు. అది వారు అడిగిన దానికి సమాధానం చెప్పజాలదనే విషయాన్నీ, వారి లాభ నష్టాలపై దానికి ఏ అధికారమూ లేదు అనే విషయాన్నీ వారు గమనించటం లేదా? హారూన్ (మూసా రాకకు) ముందే వారితో ఇలా అన్నాడు, "ప్రజలారా! దీనివలన మీరు పెద్ద విపత్తులోనే పడిపోయారు. రహ్మానే (కరుణామయుడు) మీ ప్రభువు. కనుక మీరు నన్ను అనుసరించండి, నా మాట వినండి." కాని వారు అతనితో ఇలా అననే అన్నారు, "మావద్దకు మూసా తిరిగి వచ్చేవరకు, మేము దీనినే పూజిస్తూ ఉంటాము."

19. ఎర్ర సముద్రాన్ని దాటటం దగ్గర నుండి తూర్ కొండకు చేరే వరకుగల కథాక్రమం వదలివేయబడింది. దీనికి సంబంధించిన వివరాలు ఆరాఫ్ సూరాలోని 16, 17 రుకూలలో ఇదివరకే వచ్చాయి.

**92 - 98** మూసా (తన జాతివారిని మందలించిన తరువాత హారూన్ వైపునకు తిరిగి ఇలా) అన్నాడు, "హారూన్! వారు మార్గం తప్పుతున్నారనే విషయాన్ని నీవు గమనించినప్పుడు నా మార్గాన్ని అనుసరించకుండా నిన్ను వారించిన విషయం ఏమిటి? నీవు నా ఆజ్ఞను ఉల్లంఘించావా?"[25] హారూన్ ఇలా జవాబు చెప్పాడు, "నా తల్లి కుమారుడా! నా గడ్డాన్ని పట్టుకోకు, నా తల వెంట్రుకలను పట్టి లాగకు. 'ఇస్రాయీలు సంతతిలో నీవు చీలికలు తీసుకువచ్చావు. నా మాటను లక్ష్యపెట్టలేదు'[26] అని నీవు అంటావని నేను భయపడ్డాను." అప్పుడు మూసా, "అయితే, సామిరీ! నీ సంగతేమిటో చెప్పు" అని అడిగాడు. అతడు ఇలా అన్నాడు, "నేను వారికి కనిపించని దాన్ని ఒక దానిని చూశాను. అప్పుడు నేను సందేశహరుని అడుగుజాడలలో నుండి ఒక పిడికెడు మట్టిని తీసుకున్నాను. దానిని (ఆవు దూడపై) పోశాను. నా ఆత్మ నాకు అలానే సూచించింది."[27] మూసా ఇలా అన్నాడు, "సరే, వెళ్ళిపో, ఇక జీవితాంతం నీవు 'నన్ను ముట్టుకోకండి'[28] అని అరుస్తూనే ఉంటావు. నీ విచారణ కొరకు ఒక సమయం నిర్ణయమయ్యే ఉంది. అది నీ విషయంలో ఏమాత్రం తొలగదు. ఇక చూడు, శ్రద్ధాభక్తులతో నీవు ఆరాధించే నీ ఈ దైవాన్ని, ఇప్పుడు మేము కాల్చి పారవేస్తాము, భస్మంగా చేసి సముద్రంలో కలిపివేస్తాము. ప్రజలారా! మీ దేవుడు కేవలం ఒక్క అల్లాహ్ మాత్రమే. ఆయన తప్ప మరొక దేవుడు లేనేలేడు. ఆయన జ్ఞానం ప్రతి విషయాన్ని ఆవరించి ఉన్నది."

قَالَ يٰهٰرُوْنُ مَا مَنَعَكَ اِذْ رَاَيْتَهُمْ ضَلُّوْٓا ﴿٩٢﴾
اَلَّا تَتَّبِعَنِ ؕ اَفَعَصَيْتَ اَمْرِىْ ﴿٩٣﴾ قَالَ
يَبْنَؤُمَّ لَا تَاْخُذْ بِلِحْيَتِىْ وَلَا بِرَاْسِىْ ۚ اِنِّىْ
خَشِيْتُ اَنْ تَقُوْلَ فَرَّقْتَ بَيْنَ بَنِىْٓ
اِسْرَآءِيْلَ وَلَمْ تَرْقُبْ قَوْلِىْ ﴿٩٤﴾ قَالَ فَمَا
خَطْبُكَ يٰسَامِرِىُّ ﴿٩٥﴾ قَالَ بَصُرْتُ بِمَا لَمْ
يَبْصُرُوْا بِهٖ فَقَبَضْتُ قَبْضَةً مِّنْ اَثَرِ الرَّسُوْلِ
فَنَبَذْتُهَا وَكَذٰلِكَ سَوَّلَتْ لِىْ نَفْسِىْ ﴿٩٦﴾ قَالَ
فَاذْهَبْ فَاِنَّ لَكَ فِى الْحَيٰوةِ اَنْ تَقُوْلَ لَا
مِسَاسَ ۠ وَاِنَّ لَكَ مَوْعِدًا لَّنْ تُخْلَفَهٗ ۚ
وَانْظُرْ اِلٰٓى اِلٰهِكَ الَّذِىْ ظَلْتَ عَلَيْهِ عَاكِفًا ؕ
لَنُحَرِّقَنَّهٗ ثُمَّ لَنَنْسِفَنَّهٗ فِى الْيَمِّ نَسْفًا ﴿٩٧﴾
اِنَّمَآ اِلٰهُكُمُ اللّٰهُ الَّذِىْ لَآ اِلٰهَ اِلَّا هُوَ ؕ
وَسِعَ كُلَّ شَىْءٍ عِلْمًا ﴿٩٨﴾

20. ఇక హజ్రత్ మూసా, తూర్ పర్వతం క్రింది భాగంలో ఇస్రాయీలు వంశీయులను వదలిపెట్టి, షరీఅత్ ఆజ్ఞలను అందుకోవటానికి తూర్ పర్వతం పైకి వెళ్ళినప్పటి సమయం ప్రస్తావించబడుతోంది. అల్లాహ్ యొక్క ఈ సూక్తి ద్వారా తెలిసే విషయం ఏమిటంటే, హజ్రత్ మూసా తన జాతి వారిని మార్గమధ్యంలోనే వదలిపెట్టి, తన ప్రభువును కలుసుకోవాలనే ఆరాటంతో ఒంటరిగా ముందుకు వెళ్ళారు.

21. అంటే, బంగారపు ఆవు దూడను చేసి, వారు దానిని పూజించేలా చేశాడు.

22. అంటే, ఈ రోజు వరకు మీ ప్రభువు మీకు ఎన్ని మేళ్లను చేస్తానని వాగ్దానం చేశాడో, అవన్నీ మీకు లభిస్తూ వచ్చాయి. మిమ్మల్ని ఈజిప్ట్ నుండి క్షేమంగా బయటకు తీశాడు ; బానిసత్వం నుండి విముక్తి కలిగించాడు, మీ శత్రువులను పూర్తిగా నిర్మూలించాడు, మీ కోసం ఎడారులలో, పర్వత ప్రాంతాలలో నీడనూ, ఆహార పదార్థాలనూ ఏర్పాటు చేశాడు. ఈ మంచి వాగ్దానాలన్నీ నెరవేరలేదా? ఆయన ఇప్పుడు మీకు షరీఅత్‌నూ, మార్గదర్శక పత్రాన్నీ ప్రసాదిస్తానని చేసిన వాగ్దానం మీ దృష్టిలో మేలుతో కూడుకున్న వాగ్దానం కాదా?

كَذٰلِكَ نَقُصُّ عَلَيْكَ مِنْ اَنْۢبَآءِ مَا قَدْ
سَبَقَ ۚ وَ قَدْ اٰتَيْنٰكَ مِنْ لَّدُنَّا ذِكْرًا ﴿٩٩﴾ مَنْ
اَعْرَضَ عَنْهُ فَاِنَّهٗ يَحْمِلُ يَوْمَ الْقِيٰمَةِ
وِزْرًا ﴿١٠٠﴾ خٰلِدِيْنَ فِيْهِ ؕ وَ سَآءَ لَهُمْ يَوْمَ
الْقِيٰمَةِ حِمْلًا ﴿١٠١﴾ يَّوْمَ يُنْفَخُ فِي الصُّوْرِ وَ
نَحْشُرُ الْمُجْرِمِيْنَ يَوْمَئِذٍ زُرْقًا ﴿١٠٢﴾ يَّتَخَافَتُوْنَ
بَيْنَهُمْ اِنْ لَّبِثْتُمْ اِلَّا عَشْرًا ﴿١٠٣﴾ نَحْنُ اَعْلَمُ
بِمَا يَقُوْلُوْنَ اِذْ يَقُوْلُ اَمْثَلُهُمْ طَرِيْقَةً اِنْ
لَّبِثْتُمْ اِلَّا يَوْمًا ﴿١٠٤﴾ ع ١٥/١٤

**99 - 112** ప్రవక్తా! ఇలా మేము పూర్వం జరిగిన సంఘటనల చరిత్రను నీకు వినిపిస్తున్నాము. మేము ప్రత్యేకంగా మా వద్దనుండి నీకు ఒక "జ్ఞాపిక" (హితోపదేశం)ను ప్రసాదించాము. దానికి విముఖుడయ్యేవాడు ప్రళయం నాడు పెద్ద పాప భారాన్ని మోస్తాడు. అటువంటి వారందరూ ఆ సంకటంలో సదా చిక్కుకుని ఉంటారు. ప్రళయం నాడు (ఈ నేరం యొక్క బాధ్యతా భారం) వారికి ఎంతో బాధాకరమైన బరువుగా ఉంటుంది. శంఖం ఊదబడే ఆ రోజున మేము అపరాధులను ఒకచోట చేరుస్తాము. వారి కనుగుడ్లు భయం వల్ల తెలిపోయి ఉంటాయి. అప్పుడు వారు "ప్రపంచంలో మహా అయితే మీరు పదిరోజులు గడిపారేమో" అని పరస్పరం గుసగుస లాడుకుంటారు – వారు మాట్లాడుకుంటూ ఉండేది ఏమిటో మాకు బాగా తెలుసు. (ఇది కూడ మాకు తెలుసు). అప్పుడు వారిలో అతి జాగ్రత్తగా అంచనా వేసేవాడు సైతం "కాదు, ప్రపంచంలో మీ జీవితం కేవలం ఒక రోజు జీవితం మాత్రమే" అనే అంటాడు.

23. ఇది సామిరీ సృష్టించిన ఉపద్రవానికి గురిఅయిన వారి సాకు. వారు అనేది ఏమిటంటే, "మేము ఆభరణాలను విసరివేశాము. వాటితో ఆవుదూడను తయారుచేసే ఉద్దేశ్యమే మాకు లేదు. ఏమి తయారు కానున్నదో మాకు తెలియదు కూడ. తరువాత జరిగింది ఏమిటంటే, మేము అసంకల్పితంగా షిర్కుకు గురిఅయ్యాము."

24. ఇక్కడ నుండి 91వ ఆయతు చివరివరకు ఉన్న విషయం గురించి ఆలోచిస్తే, "విసరివేశాము" అనే పదాలతో ప్రజల సమాధానం ముగిసింది. తరువాతి వివరాలను స్వయంగా అల్లాహ్‌యే తెలియజేస్తున్నాడు.

25. ఆజ్ఞ అంటే, పర్వతం మీదకు పోయేటప్పుడు, తన స్థానంలో హజ్రత్ హారూన్‌ను ఇస్రాయీల్ వంశీయులకు నాయకునిగా నియమించేటప్పుడు హజ్రత్ మూసా ఇచ్చిన ఆజ్ఞ అని అర్థం. ఆరాఫ్ సూరాలోని 142వ ఆయతులో ఇదివరకే ఈ విషయం వచ్చేసింది : హజ్రత్ మూసా పోతూ పోతూ తన సోదరునితో, "నేను తిరిగి వచ్చేవరకు నా బాధ్యతలను నా ప్రతినిధిగా నిర్వహించు. జాతిని సంస్కరించు, అధర్మవర్తనుల పద్ధతులను అనుసరించకు" అని అన్నాడు.

26. హజ్రత్ హారూన్ ఇచ్చిన జవాబు అర్థం ఇది ఎంతమాత్రం కాదు : జాతి ఐకమత్యంగా ఉండటం అనేది, అది రుజుమార్గంపై ఉండటం అనేదానికంటే ఎంతో ముఖ్యమైనది; ఐకమత్యం అనేది, దాని పునాది షిర్కు అయినాసరే అనైక్యత కంటే ఉత్తమమైనది. ఎవరైనా ఈ వాక్యానికి ఈ రీతిగా అర్థం తీసుకుంటే, అతడు ఖురాను ద్వారా మార్గదర్శకత్వాన్ని కాదు, మార్గభ్రష్టత్వాన్ని పొందుతాడు. హజ్రత్ హారూన్ వివరణను పూర్తిగా అర్థం చేసుకోవటానికి, ఈ ఆయతును ఆరాఫ్ సూరాలోని 150వ ఆయతుతో కలిపి చదవాలి. అక్కడ హజ్రత్ హారూన్ ఇలా అన్నారు : "నా తల్లి కుమారా! ఈ ప్రజలు నన్ను లోబరచుకున్నారు. ఇంకాస్తయితే నన్ను చంపేసేవారే. కనుక నీవు శత్రువులకు, నన్ను చూసి నవ్వే అవకాశం ఇవ్వకు. ఈ దుర్మార్గపు ముఠాతో నన్ను కలపకు." ఇప్పుడు ఈ సంఘటన స్వరూపాన్నిబట్టి, అసలు విషయం ఏమిటో స్పష్టంగా అర్థమవుతుంది; హజ్రత్ హారూన్ ప్రజలను ఈ దురాచారం నుండి, ఈ దుర్మార్గం నుండి నిరోధించటానికి గట్టి ప్రయత్నమే చేశారు. కాని వారు ఆయనకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు, ఆయనను చంపటానికి సిద్ధపడ్డారు.

وَيَسْـَٔلُوْنَكَ عَنِ الْجِبَالِ فَقُلْ يَنْسِفُهَا رَبِّيْ
نَسْفًا ﴿١٠٥﴾ فَيَذَرُهَا قَاعًا صَفْصَفًا ﴿١٠٦﴾ لَّا تَرٰى
فِيْهَا عِوَجًا وَّلَآ اَمْتًا ﴿١٠٧﴾ يَوْمَئِذٍ يَّتَّبِعُوْنَ
الدَّاعِيَ لَا عِوَجَ لَهٗ ۚ وَخَشَعَتِ الْاَصْوَاتُ
لِلرَّحْمٰنِ فَلَا تَسْمَعُ اِلَّا هَمْسًا ﴿١٠٨﴾ يَوْمَئِذٍ لَّا
تَنْفَعُ الشَّفَاعَةُ اِلَّا مَنْ اَذِنَ لَهُ الرَّحْمٰنُ
وَرَضِيَ لَهٗ قَوْلًا ﴿١٠٩﴾ يَعْلَمُ مَا بَيْنَ اَيْدِيْهِمْ
وَمَا خَلْفَهُمْ وَلَا يُحِيْطُوْنَ بِهٖ عِلْمًا ﴿١١٠﴾ وَعَنَتِ
الْوُجُوْهُ لِلْحَيِّ الْقَيُّوْمِ ۭ وَقَدْ خَابَ مَنْ حَمَلَ
ظُلْمًا ﴿١١١﴾ وَمَنْ يَّعْمَلْ مِنَ الصّٰلِحٰتِ وَهُوَ
مُؤْمِنٌ فَلَا يَخٰفُ ظُلْمًا وَّلَا هَضْمًا ﴿١١٢﴾ وَكَذٰلِكَ
اَنْزَلْنٰهُ قُرْاٰنًا عَرَبِيًّا وَّصَرَّفْنَا فِيْهِ مِنَ الْوَعِيْدِ
لَعَلَّهُمْ يَتَّقُوْنَ اَوْ يُحْدِثُ لَهُمْ ذِكْرًا ﴿١١٣﴾

వారు నిన్ను, "ఇంతకూ, ఆ రోజున ఈ పర్వతాలు ఏమవుతాయి" అని అడుగుతారు. ఇలా చెప్పు, "నా ప్రభువు వాటిని ధూళిగా చేసి ఎగుర వేస్తాడు. భూమిని చదునైన ప్రదేశంగా చేస్తాడు. అందులో మీరు వంకరలు గాని, మిట్టపల్లాలు గాని చూడరు."– ఆ రోజున ప్రజలందరూ పిలిచేవాని పిలుపు వినగానే నేరుగా వచ్చేస్తారు, ఎవ్వడూ తలబిరుసుగా ప్రవర్తించలేడు. కంఠ స్వరాలన్నీ కరుణామయుని ముందు అణగిపోతాయి. ఒక్క చిరుసవ్వడి తప్ప మీరు ఏమీ వినలేరు. ఆ రోజున సిఫారసు ఏమాత్రమూ పనిచెయ్యదు. కరుణామయుడు ఎవరికైనా దానికి అనుమతిని ఇచ్చి అతని మాటను ఆలకించటానికి ఇష్టపడితే తప్ప – ఆయన ప్రజల పూర్వోత్తరాలను అన్నింటినీ ఎరుగును. ఇతరులకు వాటిని గురించి పూర్తిగా తెలియదు. – సజీవుడు, నిత్యుడు అయిన ఆయన ముందు ప్రజల శిరస్సులు వంగిపోతాయి. ఏదైనా అన్యాయం చేసి దాని పాప భారాన్ని తన నెత్తిపై మోసేవాడు అప్పుడు నష్ట పోతాడు. సత్కార్యాలు చేసినవానికి అతడు విశ్వాసి కూడ అయితే, ఏ అన్యాయమూ జరగదు. అతని హక్కులు కాజేయబడే ప్రమాదమూ ఉండదు.

**113** ఓ ప్రవక్తా! ఈ విధంగా మేము దీనిని అరబ్బీ ఖురాన్‌గా అవతరింపజేశాము,[29] అందులో పలురకాలుగా హెచ్చరికలు చేశాము, బహుశా వారు వక్రవైఖరిని విడనాడుతారేమో అని, లేక దీని కారణంగా వారిలో చేతన కలిగే సూచనలు జనిస్తాయేమో అని.

గత్యంతరం లేకపోవటం వల్లనే ఆయన ఈ భయంవల్ల మౌనంగా ఉండి పోయారు; హజ్రత్ మూసా రాకముందు, ఇక్కడ అంతర్యుద్ధం ప్రజ్వరిల్లి తుందేమో అని ఆయన వచ్చిన తరువాత, పరిస్థితులను అదుపుచేసే శక్తి నీకు లేనట్లయితే, పరిస్థితిని ఇంతగా ఎందుకు చెడిపోనిచ్చావు, నేను వచ్చేవరకు ఎందుకు ఆగలేకపోయావు అని నిందిస్తారేమో అని ఆయన భయపడి మౌనంగా ఉండిపోయారు.

27. సందేశహరుడు అంటే ఇక్కడ బహుశా హజ్రత్ మూసాయేనేమో. సామిరీ ఒక పచ్చి మోసగాడు, నయవంచకుడు. అతడు హజ్రత్ మూసాను సైతం తన వంచనా వలయంలో చిక్కుకునేలా చేయదలచుకున్నాడు; "అయ్యా, ఇది మీ పవిత్ర పాద ధూళి మహిమే! నేను దానిని కరిగిన బంగారపు ద్రవంలో వేసినంతనే, ఈ దర్పంగల ఆవుదూడ అందులో నుండి పుట్టుకొచ్చింది" అని ఆయనతో అన్నాడు.

28. అంటే, కేవలం జీవితాంతం వరకు సమాజంతో అతని సంబంధాలు త్రెంచివేయబడటం మాత్రమే కాదు, అతనిని అంటరానివాడుగా చేయటం మాత్రమే కాదు, ప్రతి వ్యక్తీ తన అంటరానితనం గురించి తెలియజేసే, "నేను అంటరానివాణ్ణి, నన్ను తాకకండి" అని దూరం నుండే ప్రజలకు చెప్పే బాధ్యత కూడ అతని మీదనే వేయబడింది.

فَتَعٰلَى اللّٰهُ الْمَلِكُ الْحَقُّ ۚ وَلَا تَعْجَلْ بِالْقُرْاٰنِ
مِنْ قَبْلِ اَنْ يُّقْضٰٓى اِلَيْكَ وَحْيُهٗ ۫ وَقُلْ رَّبِّ
زِدْنِىْ عِلْمًا ﴿١١٤﴾ وَلَقَدْ عَهِدْنَآ اِلٰٓى اٰدَمَ مِنْ
قَبْلُ فَنَسِىَ وَلَمْ نَجِدْ لَهٗ عَزْمًا ﴿١١٥﴾ وَاِذْ قُلْنَا ع ١٥
لِلْمَلٰٓئِكَةِ اسْجُدُوْا لِاٰدَمَ فَسَجَدُوْٓا اِلَّآ
اِبْلِيْسَ ؕ اَبٰى ﴿١١٦﴾ فَقُلْنَا يٰٓاٰدَمُ اِنَّ هٰذَا عَدُوٌّ
لَّكَ وَلِزَوْجِكَ فَلَا يُخْرِجَنَّكُمَا مِنَ الْجَنَّةِ
فَتَشْقٰى ﴿١١٧﴾ اِنَّ لَكَ اَلَّا تَجُوْعَ فِيْهَا وَلَا
تَعْرٰى ۙ ﴿١١٨﴾ وَاَنَّكَ لَا تَظْمَؤُا فِيْهَا وَلَا تَضْحٰى ﴿١١٩﴾
فَوَسْوَسَ اِلَيْهِ الشَّيْطٰنُ قَالَ يٰٓاٰدَمُ هَلْ
اَدُلُّكَ عَلٰى شَجَرَةِ الْخُلْدِ وَمُلْكٍ لَّا يَبْلٰى ﴿١٢٠﴾
فَاَكَلَا مِنْهَا فَبَدَتْ لَهُمَا سَوْاٰتُهُمَا وَطَفِقَا
يَخْصِفٰنِ عَلَيْهِمَا مِنْ وَّرَقِ الْجَنَّةِ ۫ وَعَصٰٓى
اٰدَمُ رَبَّهٗ فَغَوٰى ۖ ﴿١٢١﴾ ثُمَّ اجْتَبٰهُ رَبُّهٗ فَتَابَ
عَلَيْهِ وَهَدٰى ﴿١٢٢﴾

**114** కనుక అందరికంటే ఉన్నతుడు, గొప్పవాడు అల్లాహ్‌యే, ఆయనే నిజమైన చక్రవర్తి.[30] చూడు, ఖుర్ఆన్ చదవటంలో తొందరపడకు, నీ వైపునకు దాని వహీ పూర్తికానంత వరకు, ఇలా ప్రార్థించు, "ఓ ప్రభూ! నాకు మరింత జ్ఞానం ప్రసాదించు."[31]

**115 - 127** దీనికి పూర్వం మేము ఆదమ్‌కు ఒక ఆజ్ఞ ఇచ్చాము. కాని అతను దానిని మరచిపోయాడు. మేము అతనిలో నిలకడను[32] చూడలేదు. మేము దైవదూతలతో ఆదమ్‌కు సజ్దా చేయండి అని చెప్పిన సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకో. వారందరూ సజ్దా చేశారు. కాని ఒక్క ఇబ్లీస్ మాత్రం తిరస్కరించాడు. అప్పుడు మేము ఆదమ్‌తో ఇలా అన్నాము, "చూడు, ఇతడు నీకూ, నీ భార్యకూ శత్రువు. కనుక జాగ్రత్త. ఇతడు మిమ్మల్ని స్వర్గం నుండి బహిష్కరింపజేస్తాడేమో, మీరు ఆపదల పాలవుతారేమో, ఇక్కడ మీకు చాల సౌకర్యాలు ఉన్నాయి. పస్తులూ ఉండరు, దిగంబరులుగానూ ఉండరు. దప్పికా, ఎండా మిమ్మల్ని వేధించవు." కాని షైతాను అతనిని మోసం చేశాడు, ఇలా అన్నాడు,"ఓ ఆదమ్! శాశ్వత జీవితాన్నీ అంతంకాని సామ్రాజ్యాన్ని ఇచ్చే వృక్షాన్ని నీకు చూపేదా?" చివరకు వారు ఉభయులు (భార్యాభర్తలు) ఆ వృక్షఫలాన్ని తినేశారు. పర్యవసానంగా వెంటనే వారి మర్మాంగాలు ఒకరివి ఒకరి ముందు బహిర్గతమయ్యాయి. వారిరువురు స్వర్గపు ఆకులతో తమను తాము కప్పుకో[33] సాగారు. ఆదమ్ తన ప్రభువు పట్ల అవిధేయత చూపాడు. ఋజుమార్గం తప్పిపోయ్యాడు. దాని తరువాత అతని ప్రభువు అతనిని ఎన్నుకుని, అతని పశ్చాత్తాపాన్ని అంగీకరించాడు. అంతేకాదు, అతనికి మార్గదర్శకత్వాన్ని ప్రసాదించాడు.[34]

29. అంటే, అటువంటి విషయాలతో, హితబోధలతో, హెచ్చరికలతో నిండివున్నది అని భావం. ఇది దివ్యఖురానులో ఉన్నటువంటి అన్ని విషయాలను సూచిస్తుంది.

30. సాధారణంగా ఇటువంటి వాక్యాలు దివ్య ఖురానులో ఒక ఉపన్యాసాన్ని ముగిస్తూ చెప్పబడతాయి. ఉపన్యాసం ముగింపు అల్లాహ్ స్తోత్రంతో కావాలనేదే దాని ఉద్దేశ్యం. ఉపన్యాస ధోరణిని గురించీ, సందర్భాన్ని గురించీ ఆలోచిస్తే ఇక్కడ ఒక ఉపన్యాసం ముగిసిందనీ, "వలఖద్ అహిద్‌నా ఇలా ఆదమ" అనే పదాలతో మరొక ఉపన్యాసం ప్రారంభమయిందని అర్థమవుతోంది.

قَالَ اهْبِطَا مِنْهَا جَمِيعًا بَعْضُكُمْ لِبَعْضٍ عَدُوٌّ
فَإِمَّا يَأْتِيَنَّكُم مِّنِّي هُدًى فَمَنِ اتَّبَعَ هُدَايَ
فَلَا يَضِلُّ وَلَا يَشْقَىٰ ﴿١٢٣﴾ وَمَنْ أَعْرَضَ عَن
ذِكْرِي فَإِنَّ لَهُ مَعِيشَةً ضَنكًا وَنَحْشُرُهُ يَوْمَ
الْقِيَامَةِ أَعْمَىٰ ﴿١٢٤﴾ قَالَ رَبِّ لِمَ حَشَرْتَنِي
أَعْمَىٰ وَقَدْ كُنتُ بَصِيرًا ﴿١٢٥﴾ قَالَ كَذَٰلِكَ
أَتَتْكَ آيَاتُنَا فَنَسِيتَهَا وَكَذَٰلِكَ الْيَوْمَ
تُنسَىٰ ﴿١٢٦﴾ وَكَذَٰلِكَ نَجْزِي مَنْ أَسْرَفَ وَلَمْ
يُؤْمِن بِآيَاتِ رَبِّهِ وَلَعَذَابُ الْآخِرَةِ أَشَدُّ
وَأَبْقَىٰ ﴿١٢٧﴾ أَفَلَمْ يَهْدِ لَهُمْ كَمْ أَهْلَكْنَا قَبْلَهُم
مِّنَ الْقُرُونِ يَمْشُونَ فِي مَسَاكِنِهِمْ إِنَّ فِي
ذَٰلِكَ لَآيَاتٍ لِّأُولِي النُّهَىٰ ﴿١٢٨﴾ ع ١٢

ఇంకా ఇలా సెలవిచ్చాడు, "మీరిద్దరు (ప్రత్యర్థులు అంటే మానవుడు, షైతాన్) ఇక్కడి నుండి దిగిపోండి. మీరొకరికొకరు శత్రువులుగా ఉంటారు. ఇక నా తరఫు నుండి మార్గదర్శకత్వం ఏదైనా మీ వద్దకు వస్తే, ఎవడు నా ఈ మార్గదర్శకత్వాన్ని అనుసరిస్తాడో, అతడు మార్గమూ తప్పడు, దౌర్భాగ్యానికీ గురికాడు. నా జ్ఞాపికకు (హితోపదేశం) విముఖుడైన వానికి ప్రపంచంలో జీవితం ఇరుకవుతుంది.[35] ప్రళయం నాడు మేము అతనిని అంధుడిగా లేపుతాము."– అప్పుడు అతడు "ప్రభూ! ప్రపంచంలో నేను చూడగల వాణ్ణికదా! నన్ను ఇక్కడ అంధునిగా ఎందుకు లేపావు?" అని అడుగుతాడు. అల్లాహ్ ఇలా సెలవిస్తాడు, "మా ఆయతులు, నీ వద్దకు వచ్చినప్పుడు నీవు వాటిని విస్మరించావు. అదేవిధంగా ఈనాడు నీవు కూడ విస్మరించబడుతున్నావు." – ఈ విధంగా మేము హద్దులు అతిక్రమించేవాడికీ, తన ప్రభువు ఆయత్‌లను విశ్వసించని వాడికీ (ప్రపంచంలో) ప్రతిఫలం ఇస్తాము. ఇక పరలోక శిక్ష అయితే ఎక్కువ కఠినమైనదీ ఎక్కువ కాలం ఉండేదీనూ.

**128** వీరికి పూర్వం మేము ఎన్నో జాతులను నాశనం చేసి వేశాము. ఆ జాతుల (శిధిలమైన) నివాస స్థలాలలో ఈనాడు వీరు సంచరిస్తున్నారు. అయినా వీరికి (చరిత్ర నేర్పే ఈ గుణ పాఠం ద్వారా) మార్గదర్శకత్వం లభించలేదా? వాస్తవంగా వివేకవంతులకు ఇందులో ఎన్నో సూచనలు ఉన్నాయి.

31. ఈ పదాల ద్వారా స్ఫురించే విషయం ఏమిటంటే, మహాప్రవక్త (సఅసమ్) వహీ సందేశాన్ని పొందే సమయంలో, దానిని జ్ఞాపకం చెయ్యటానికీ, నోటితో తిరిగి చదవటానికీ, బహుశా ప్రయత్నం చేస్తూ ఉండేవారేమో; ఈ కారణం వల్ల వహీని శ్రద్ధగా వినే విషయంలో దృష్టిని కేంద్రీకరించటం సాధ్యపడటం లేదేమో. ఈ పరిస్థితిని చూసి వహీ అవతరించే సమయంలో ఆయన దానిని జ్ఞాపకం చేసే ప్రయత్నం చేయవలదని బోధించబడింది.

32. తెలిసిన విషయం ఏమిటంటే, తరువాత హజ్రత్ ఆదమ్ (అస్సలామ్) ఈ ఆజ్ఞను ఉల్లంఘించటం అనేది బుద్ధిపూర్వకంగా జరగలేదు, తిరుగుబాటు చేయటం వల్ల కాదు, అశ్రద్ధవల్ల, మరచిపోవటం వల్ల, పట్టుదలలో, నిర్ణయంలో బలహీనతకు గురికావటం వల్ల అలా జరిగింది.

33. వేరే మాటలలో చెప్పాలంటే, అవిధేయతకు పాల్పడినంతనే, వారికి అధికారికంగా ఇవ్వబడుతూ ఉన్న సౌకర్యాలు అన్నీ ఉపసంహరించుకోబడ్డాయి. మొట్టమొదట ప్రభుత్వపరంగా లభించే వస్త్రాలు ఒలువబడ్డాయి. ఆహార పానీయాలూ, ఇతర వసతులూ లేకుండా చేయటం అనేది తరువాత సంభవిస్తుంది.

34. అంటే, షైతాను మాదిరిగా ఆయన శపింపబడలేదు, తన తప్పును గ్రహించినంతనే సిగ్గుపడుతూ, దుఃఖిస్తూ పశ్చాత్తాపపడినప్పుడు, అల్లాహ్ ఆయన పట్ల కనికరంతో వ్యవహరించాడు.

وَ لَوۡ لَا کَلِمَۃٌ سَبَقَتۡ مِنۡ رَّبِّکَ لَکَانَ لِزَامًا
وَّ اَجَلٌ مُّسَمًّی ﴿۱۲۹﴾ فَاصۡبِرۡ عَلٰی مَا یَقُوۡلُوۡنَ
وَسَبِّحۡ بِحَمۡدِ رَبِّکَ قَبۡلَ طُلُوۡعِ الشَّمۡسِ
وَقَبۡلَ غُرُوۡبِہَا ۚ وَ مِنۡ اٰنَآیِٔ الَّیۡلِ فَسَبِّحۡ
وَاَطۡرَافَ النَّہَارِ لَعَلَّکَ تَرۡضٰی ﴿۱۳۰﴾ وَ لَا تَمُدَّنَّ
عَیۡنَیۡکَ اِلٰی مَا مَتَّعۡنَا بِہٖۤ اَزۡوَاجًا مِّنۡہُمۡ
زَہۡرَۃَ الۡحَیٰوۃِ الدُّنۡیَا ۬ۙ لِنَفۡتِنَہُمۡ فِیۡہِ ؕ وَ رِزۡقُ
رَبِّکَ خَیۡرٌ وَّ اَبۡقٰی ﴿۱۳۱﴾ وَاۡمُرۡ اَہۡلَکَ بِالصَّلٰوۃِ وَ
اصۡطَبِرۡ عَلَیۡہَا ؕ لَا نَسۡـَٔلُکَ رِزۡقًا ؕ نَحۡنُ
نَرۡزُقُکَ ؕ وَ الۡعَاقِبَۃُ لِلتَّقۡوٰی ﴿۱۳۲﴾ وَ قَالُوۡا لَوۡ لَا
یَاۡتِیۡنَا بِاٰیَۃٍ مِّنۡ رَّبِّہٖ ؕ اَوَلَمۡ تَاۡتِہِمۡ بَیِّنَۃُ مَا
فِی الصُّحُفِ الۡاُوۡلٰی ﴿۱۳۳﴾ وَلَوۡ اَنَّاۤ اَہۡلَکۡنٰہُمۡ
بِعَذَابٍ مِّنۡ قَبۡلِہٖ لَقَالُوۡا رَبَّنَا لَوۡ لَاۤ اَرۡسَلۡتَ
اِلَیۡنَا رَسُوۡلًا فَنَتَّبِعَ اٰیٰتِکَ مِنۡ قَبۡلِ اَنۡ
نَّذِلَّ وَنَخۡزٰی ﴿۱۳۴﴾ قُلۡ کُلٌّ مُّتَرَبِّصٌ
فَتَرَبَّصُوۡا ۚ فَسَتَعۡلَمُوۡنَ مَنۡ اَصۡحٰبُ الصِّرَاطِ
السَّوِیِّ وَ مَنِ اہۡتَدٰی ﴿۱۳۵﴾ ع

**129 - 132** నీ ప్రభువు తరఫునుండి మొదట్లోనే ఒక విషయం నిశ్చయమై ఉండకపోతే, ఒక గడువు కాలం నిర్ణయమై ఉండక పోతే, వీరి తీర్పు కూడ జరిగే ఉండేది. కనుక ఓ ప్రవక్తా! వీరు కల్పించే మాటల పట్ల సహనం వహించు; నీ ప్రభువు స్తోత్రంతో పాటు, ఆయన పవిత్రతను కొనియాడు, సూర్యుడు ఉదయించే ముందు, అస్తమించే ముందు, రాత్రి సమయాల్లో కూడ పగటి అంచులలో[36] కూడ ఆయనను స్తుతించు. బహుశా నీవు సంతుష్టుడవౌతావేమో.[37] వీరిలోని రకరకాల ప్రజలకు మేము ఇచ్చిన ప్రపంచ జీవితపు శోభావైభవాలను కన్నెత్తి కూడ చూడకు. వాటిని మేము వారిని పరీక్షకు గురిచెయ్యటానికే ఇచ్చాము. నీ ప్రభువు అనుగ్రహించిన హలాల్ ఉపాధియే[38] ఉత్తమమైనది, చిరకాలం ఉండేది. నీ కుటుంబ సభ్యులను నమాజు చెయ్యండి అని ఆజ్ఞాపించు. స్వయంగా నీవు కూడ దానిని పాటించు. మేము నీ నుండి ఉపాధినేమీ కోరడం లేదు. ఉపాధిని మేమే నీకు ఇస్తూ ఉన్నాము. చివరకు మేలు జరిగేది భయభక్తులకే.

**133 - 135** వారు, ఈ వ్యక్తి తన ప్రభువు దగ్గర నుండి ఏదైనా సూచనను (మహిమను) ఎందుకు తీసుకురాడూ? అని అడుగుతారు. పూర్వ గ్రంథాలలోని సమస్త బోధలుగల స్పష్టమైన నిదర్శనం వారి వద్దకు రాలేదా?[39] ఒకవేళ మేము దాని రాకకు పూర్వమే వారిని ఏదైనా శిక్ష ద్వారా నాశనం చేసి ఉంటే, వారే తరువాత ఇలా అని ఉండేవారు, "ఓ ప్రభూ! నీవు మా వద్దకు ప్రవక్తను ఎవరినైనా ఎందుకు పంపలేదు? అగౌరవ అవమానాల పాలుకాక ముందే మేము నీ ఆయత్‌లను అనుసరించి ఉండేవారము కదా!" ఓ ప్రవక్తా! వారితో ఇలా అను, "ప్రతివాడు అంతిమ ఫలితం కోసం నిరీక్షిస్తున్నాడు. కనుక మీరు కూడ నిరీక్షించండి. త్వరలోనే మీరు తెలుసుకుంటారు. ఋజుమార్గంలో నడిచేవారెవరో, మార్గదర్శకత్వం పొందినవారెవరో."

35. ప్రపంచంలో జీవితం ఇరుకైపోవటమంటే అర్థం, అతడు పేదరికానికి గురి అవుతాడు అని కాక, ఇక్కడ "అతడు మనశ్శాంతికి నోచుకోడు" అని అర్థం. కోటీశ్వరుడైనా అశాంతి అసుఖాలతో బాధపడతాడు. ఒక మహా సామ్రాజ్యానికి ఏలికఅయినా, అతడు అసంతృప్తి నుండి విముక్తి పొందలేడు. అతడి ప్రాపంచిక విజయాలు అన్నీ అతడు అవలంబించిన అనేక అధర్మ మార్గాల కారణంగా లభించినవి అవుతాయి. వాటి కారణంగా,

అతని అంతరాత్మతో పాటు, అతని చుట్టూ ఉన్న సామూహిక వాతావరణంలో ఉన్న ప్రతి వస్తువుతో అతను పోరాడుతూ ఉంటాడు; అది అతనికి శాంతినీ, తృప్తినీ, నిజమైన ఆనందాన్నీ లేకుండా చేస్తుంది.

36. "నీ ప్రభువు స్తోత్రంతో పాటు, ఆయన పవిత్రతను కొనియాడు" అంటే నమాజు అని అర్థం. దాని సమయాలను కూడ ఇక్కడ స్పష్టంగా సూచించటం జరిగింది. సూర్యుడు ఉదయించే ముందు ఉదయపు నమాజు, సూర్యుడు అస్తమించేముందు అసరు నమాజు, రాత్రి సమయంలో ఇషా, తహజ్జుద్ నమాజులు, ఇక పగటి చివరలు, అవి మూడే మూడు కాగలవు. ఒక చివర ఉదయం, రెండో చివర పొద్దువాలే సమయం; మూడో చివర సాయంత్రం. కనుక పగటి చివరలు అంటే ఉదయం, జొహర్, అసరు నమాజులే కాగలవు.

37. దీనికి రెండు అర్థాలు ఉన్నాయి: ఒకటి, మీరు ప్రస్తుతం ఉన్న స్థితిలో రాజీపడండి, తృప్తిపడండి; ఈ స్థితిలో మీరు చేపట్టిన పనికోసం మీరు ఎన్నో చెడ్డ విషయాలను భరిస్తున్నారు. రెండో అర్థం, మీరు ఈ పనిచేస్తూపోండి, దానివల్ల కలిగే ఫలితానికి మీ మనస్సు సంతోషపడుతుంది.

38. "రిజ్ఖ్"ను మేము హలాల్ ఉపాధిగా అనువాదం చేశాము, ఎందుకంటే దేవుడు దివ్య ఖురానులో నిషిద్ధసంపదను "ప్రభువు పెట్టిన ఉపాధి"తో ఎక్కడా పోల్చలేదు.

39. అంటే, వారిలో నుంచే చదువురాని ఒక వ్యక్తి, వారికి దివ్య ఖురానును అందించటం తక్కువ మహాత్మ్యమా? అందులో, మొదటి నుంచీ ఇప్పటివరకు వచ్చిన ఆకాశ గ్రంథాలలో ఉన్న బోధనల సారం ఉంది. మానవుడికి మార్గం చూపటానికి ఆ గ్రంథాలలో ఉన్నదంతా ఇందులో కూర్చబడింది. అంతేకాదు దానిని ఎంత స్పష్టంగా చెప్పటం జరిగిందంటే, ఒక ఎడారి మనిషి కూడ దానిని అర్థం చేసుకొని దానిద్వారా లాభం పొందగలడు.

ఆయతులు 112 | **21. అల్ అంబియా** | అవతరణ మక్కాలో

**అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.**

**1 – 3** మానవుల లెక్కల (పరిశీలన) సమయం సమీపించింది. అయినా వారు ఏమరుపాటులో పడి విముఖులై ఉన్నారు. వారి ప్రభువు తరఫు నుండి వారి వద్దకు ఏ తాజా ఉపదేశం వచ్చినా, దానిని వారు అనాసక్తితో వింటారు; ఆటలలో మునిగిపోయి ఉంటారు. వారి మనస్సులు (వేరే ఆలోచనలలో) లగ్నమై ఉన్నాయి. దుర్మార్గులు పరస్పరం ఇలా గుసగుసలాడుకుంటారు, "ఇంతకూ ఈ వ్యక్తి మీలాంటి ఒక మానవుడే కదా! అయినా మీరు చూస్తూ చూస్తూ మాంత్రిక వలయంలో చిక్కుకుపోతారా?"

**4 – 6** ప్రవక్త, "నా ప్రభువు ఆకాశంలోనూ, భూమిపైనా పలుకబడే ప్రతి మాటను ఎరుగును. ఆయన సర్వం వినేవాడూ, సర్వమూ తెలిసినవాడూ[1]ను" అని అన్నాడు. వారు ఇలా అన్నారు, "కాదు, ఇవి అస్పష్టములైన కలలు, కాదు, ఇది అతని కల్పన, కాదు ఇతను ఒక కవి. పూర్వకాలపు ప్రవక్తలు సూచనలతో పంపబడిన విధంగా ఇతన్ని కూడ ఏదైనా ఒక సూచనను తీసుకు రమ్మనండి." యథార్థం ఏమిటంటే, వారికి పూర్వం మేము నాశనం చేసిన ఏ జనవాసం కూడా విశ్వసించలేదు. ఇక వీరు మాత్రం విశ్వసిస్తారా?

**7 – 9** ఓ ప్రవక్తా! నీకు పూర్వం కూడ మేము మానవులనే ప్రవక్తలుగా పంపాము. వారికి మేము వహీని అందజేశాము. ఒకవేళ మీకు ఇది తెలియకపోతే, గ్రంథ ప్రజలను అడగండి. ఆ ప్రవక్తలకు మేము అన్నం తినే అవసరం లేని శరీరాలనూ ఇవ్వలేదు, వారు చిరంజీవులు కూడ కాదు. చూడు, చివరకు మేము వారికి చేసిన వాగ్దానాలను నెరవేర్చాము, వారినీ ఇంకా మేము ఇష్టపడిన వారినీ కాపాడాము; హద్దులు మీరిన వారిని నాశనం చేశాము.

٢١ سُوْرَةُ الْاَنْبِيَآءِ مَكِّيَّةٌ ٧٣

اٰيَاتُهَا ١١٢ | رُكُوْعَاتُهَا ٧

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

اِقْتَرَبَ لِلنَّاسِ حِسَابُهُمْ وَ هُمْ فِيْ غَفْلَةٍ

مُّعْرِضُوْنَ ۚ (١) مَا يَاْتِيْهِمْ مِّنْ ذِكْرٍ مِّنْ رَّبِّهِمْ

مُّحْدَثٍ اِلَّا اسْتَمَعُوْهُ وَهُمْ يَلْعَبُوْنَ (٢)

لَاهِيَةً قُلُوْبُهُمْ ۭ وَاَسَرُّوا النَّجْوَى ۖ الَّذِيْنَ

ظَلَمُوْا ۖ هَلْ هٰذَآ اِلَّا بَشَرٌ مِّثْلُكُمْ ۚ

اَفَتَاْتُوْنَ السِّحْرَ وَ اَنْتُمْ تُبْصِرُوْنَ (٣) قٰلَ

رَبِّيْ يَعْلَمُ الْقَوْلَ فِي السَّمَآءِ وَالْاَرْضِ ۡ وَ هُوَ

السَّمِيْعُ الْعَلِيْمُ (٤) بَلْ قَالُوْٓا اَضْغَاثُ اَحْلَامٍ

بَلِ افْتَرٰىهُ بَلْ هُوَ شَاعِرٌ ۚ فَلْيَاْتِنَا بِاٰيَةٍ كَمَآ

اُرْسِلَ الْاَوَّلُوْنَ (٥) مَآ اٰمَنَتْ قَبْلَهُمْ مِّنْ

قَرْيَةٍ اَهْلَكْنٰهَا ۚ اَفَهُمْ يُؤْمِنُوْنَ (٦) وَ مَآ

اَرْسَلْنَا قَبْلَكَ اِلَّا رِجَالًا نُّوْحِيْٓ اِلَيْهِمْ

فَسْـَٔلُوْٓا اَهْلَ الذِّكْرِ اِنْ كُنْتُمْ لَا تَعْلَمُوْنَ (٧)

وَ مَا جَعَلْنٰهُمْ جَسَدًا لَّا يَاْكُلُوْنَ الطَّعَامَ وَ مَا

كَانُوْا خٰلِدِيْنَ (٨) ثُمَّ صَدَقْنٰهُمُ الْوَعْدَ

فَاَنْجَيْنٰهُمْ وَ مَنْ نَّشَآءُ وَاَهْلَكْنَا الْمُسْرِفِيْنَ (٩)

الجزء ١٧

1. అంటే, మహాప్రవక్త (సఅసమ్) ఈ దుష్ప్రచారానికీ, ఈ గుసగుసల ఉద్యమానికీ సమాధానంగా "మీరు కల్పించే విషయాలన్నీ దేవునికి తెలుసు. ఆయన వాటిని వింటున్నాడు, మీరు పైకి బిగ్గరగా చెప్పినా, మెల్లమెల్లగా

**10** ప్రజలారా! మేము మీ వద్దకు ఒక గ్రంథాన్ని పంపాము, అందులో మీ ప్రస్తావనే ఉంది. అయినా మీరు అర్థం చేసుకోరేమిటీ?[2]

**11 - 15** దుష్ట జనవాసాలను ఎన్నింటినో మేము పిండి పిండిగా చేసి వేశాము; వారి తరువాత మరొక జాతి వారిని ఆవిర్భవింపజేశాము. వారు మా శిక్ష (రాక)ను గ్రహించి, అక్కణ్ణుంచి పారిపోసాగారు. (అప్పుడు వారికి ఇలా చెప్పటం జరిగింది) "పారిపోకండి; మీరు సుఖాలు అనుభవిస్తున్న ఆ ఇళ్లల్లోకే, ఆ విలాస వస్తువుల వైపునకే మరలిపోండి. బహుశా మీరు దానిని గురించి అడగబడతారేమో?"[3] అప్పుడు వారు ఇలా అనసాగారు, "అయ్యో, మా దౌర్భాగ్యం! నిస్సందేహంగా మేము అపరాధులమే." మేము వారిని నూర్పిడి చేసిన పంట వలె చేసే వరకు వారు ఇలానే అరుస్తూ ఉండిపోయారు. నిప్పు రవ్వంత ప్రాణమైనా వారిలో మిగలలేదు.

**16 - 18** మేము ఈ ఆకాశాన్నీ, ఈ భూమినీ వాటిలో ఉన్న సమస్తాన్నీ కాలక్షేపం కోసం సృష్టించలేదు. ఒకవేళ మేము ఏదైనా ఆట వస్తువును చేయదలిస్తే- అసలు మేము చేయవలసింది కేవలం ఇంతే అయితే - మేము మా వద్ద ఉన్న దానినే చేసుకునేవారము.[4] కాని మేము అసత్యాన్ని సత్యంతో దెబ్బతీస్తాము, అది దాని తలను పగలగొడుతుంది. చూస్తూ ఉండగానే అది సమసిపోతుంది. మీరు కల్పన చేస్తున్న విషయాల కారణంగా మీకు సర్వనాశనం తప్పదు.

لَقَدْ اَنْزَلْنَآ اِلَيْكُمْ كِتٰبًا فِيْهِ ذِكْرُكُمْ ؕ اَفَلَا
تَعْقِلُوْنَ ﴿١٠﴾ وَكَمْ قَصَمْنَا مِنْ قَرْيَةٍ كَانَتْ
ظَالِمَةً وَّ اَنْشَاْنَا بَعْدَهَا قَوْمًا اٰخَرِيْنَ ﴿١١﴾
فَلَمَّآ اَحَسُّوْا بَاْسَنَآ اِذَا هُمْ مِّنْهَا
يَرْكُضُوْنَ ﴿١٢﴾ؕ لَا تَرْكُضُوْا وَارْجِعُوْٓا اِلٰى مَآ
اُتْرِفْتُمْ فِيْهِ وَ مَسٰكِنِكُمْ لَعَلَّكُمْ تُسْـَٔلُوْنَ ﴿١٣﴾
قَالُوْا يٰوَيْلَنَآ اِنَّا كُنَّا ظٰلِمِيْنَ ﴿١٤﴾ فَمَا زَالَتْ
تِّلْكَ دَعْوٰىهُمْ حَتّٰى جَعَلْنٰهُمْ حَصِيْدًا
خٰمِدِيْنَ ﴿١٥﴾ وَ مَا خَلَقْنَا السَّمَآءَ وَ الْاَرْضَ وَ
مَا بَيْنَهُمَا لٰعِبِيْنَ ﴿١٦﴾ لَوْ اَرَدْنَآ اَنْ نَّتَّخِذَ
لَهْوًا لَّاتَّخَذْنٰهُ مِنْ لَّدُنَّآ ۖ اِنْ كُنَّا فٰعِلِيْنَ ﴿١٧﴾
بَلْ نَقْذِفُ بِالْحَقِّ عَلَى الْبَاطِلِ فَيَدْمَغُهٗ فَاِذَا
هُوَ زَاهِقٌ ؕ وَ لَكُمُ الْوَيْلُ مِمَّا تَصِفُوْنَ ﴿١٨﴾

---

చెవులు కొరుక్కున్నా అన్యాయపరులైన శత్రువులకు మాటకు మాట, దెబ్బకు దెబ్బ అనే రీతిలో సమాధానం చెప్పే స్థితికి ఆయన దిగలేదు" అని అన్నారు.

2. అంటే, ఇందులో ఊహాజనిత విషయాలు లేవు. మీకు సంబంధించిన ప్రస్తావనే ఇందులో ఉంది. మీ మనస్తత్వం, మీ జీవిత విషయాలే చర్చించబడ్డాయి. మీ నైజం, మీ స్వభావం, మీ పుట్టుక, మీ అంతం గురించే చెప్పబడింది. మీ చుట్టుపక్కల ఉన్న వాతావరణం నుంచే అసలైన సత్యాన్ని సూచించే కొన్ని సూచనలను ఎన్నుకుని చూపటం జరిగింది. మీ నైతిక గుణాలలో ఏవి మంచివో, ఏవి చెడ్డవో సుస్పష్టంగా చెప్పబడుతున్నాయి, అవి నిజమని మీ అంతరాత్మలు కూడ సాక్ష్యమిస్తున్నాయి. ఆలోచిస్తే నిజానికి ఈ విషయాలలో చిక్కు, అస్పష్టత, ఏమీ లేవే? మీరెందుకు అర్థం చేసుకోలేకపోతున్నారు?

3. దీనికి ఎన్నో అర్థాలు ఉన్నాయి. ఉదాహరణకు, (1) రేపు ఎవరైనా మిమ్మల్ని ఈ శిక్షను గురించి అడిగితే, ఉన్నది ఉన్నట్లుగా చెప్పగలందుకు దానిని జాగ్రత్తగా పరిశీలించండి. (2) పూర్వం మాదిరిగానే మీ సభలను

وَ لَهٗ مَنْ فِی السَّمٰوٰتِ وَ الْاَرْضِ ؕ وَ مَنْ
عِنْدَهٗ لَا یَسْتَكْبِرُوْنَ عَنْ عِبَادَتِهٖ وَ لَا
یَسْتَحْسِرُوْنَ ۟ۚ﴿۱۹﴾ یُسَبِّحُوْنَ الَّیْلَ وَ النَّهَارَ لَا
یَفْتُرُوْنَ ﴿۲۰﴾ اَمِ اتَّخَذُوْۤا اٰلِهَةً مِّنَ الْاَرْضِ
هُمْ یُنْشِرُوْنَ ﴿۲۱﴾ لَوْ كَانَ فِیْهِمَاۤ اٰلِهَةٌ اِلَّا اللّٰهُ
لَفَسَدَتَا ۚ فَسُبْحٰنَ اللّٰهِ رَبِّ الْعَرْشِ عَمَّا
یَصِفُوْنَ ﴿۲۲﴾ لَا یُسْـَٔلُ عَمَّا یَفْعَلُ وَ هُمْ
یُسْـَٔلُوْنَ ﴿۲۳﴾ اَمِ اتَّخَذُوْا مِنْ دُوْنِهٖۤ اٰلِهَةً ؕ قُلْ
هَاتُوْا بُرْهَانَكُمْ ۚ هٰذَا ذِكْرُ مَنْ مَّعِیَ وَ ذِكْرُ
مَنْ قَبْلِیْ ؕ بَلْ اَكْثَرُهُمْ لَا یَعْلَمُوْنَ ۙ الْحَقَّ
فَهُمْ مُّعْرِضُوْنَ ﴿۲۴﴾ وَ مَاۤ اَرْسَلْنَا مِنْ قَبْلِكَ
مِنْ رَّسُوْلٍ اِلَّا نُوْحِیْۤ اِلَیْهِ اَنَّهٗ لَاۤ اِلٰهَ اِلَّاۤ
اَنَا فَاعْبُدُوْنِ ﴿۲۵﴾

**19 - 20** భూమిపైనా, ఆకాశాలలోనూ సృజింపబడినవన్నీ అల్లాహ్‌వే. ఆయన వద్ద ఉండే (దైవదూతలు) వారు తమను తాము గొప్పవారుగా భావించుకుని ఆయన దాస్యాన్నీ ధిక్కరించరు, బాధపడరు కూడ.[5] రేయింబవళ్లు ఆయన స్తోత్రం చేస్తూనే ఉంటారు, విశ్రమించరు.

**21** వారు ప్రపంచంలో కల్పించుకున్న దేవుళ్లు (ప్రాణంలేని వాటికి ప్రాణం పోసి) లేపి నిలబెట్టగలరా?

**22 - 23** ఒకవేళ ఆకాశంలో, భూమిలో ఒక్క అల్లాహ్ తప్ప ఇతర దేవుళ్లు కూడ ఉంటే, అప్పుడు(భూమ్యాకాశాల) రెండింటి వ్యవస్థ ఛిన్నాభిన్నమై ఉండేది. కనుక అధికార పీఠానికి ప్రభువైన అల్లాహ్ వారు కల్పించే విషయాల నుండి పరిశుద్ధుడు. ఆయన తాను చేసే పనులకు (ఎవరి ముందూ) జవాబుదారుకాడు. కాని అందరూ (ఆయన ముందు) జవాబుదారులే.

**24 - 25** ఆయనను కాదని వారు వేరే దేవుళ్లను కల్పించుకున్నారా? ఓ ప్రవక్తా! వారితో ఇలా అను, "మీ రుజువును తీసుకురండి. ఈ గ్రంథం కూడ ఉన్నది. అందులో నా యుగపు ప్రజల కొరకు హితబోధ ఉన్నది. నాకు పూర్వం ఉన్న ప్రజల కొరకు హితబోధ గరిపిన గ్రంథాలు కూడ ఉన్నాయి." కాని వారిలో చాలమందికి యథార్థమేమిటో తెలియదు. కాబట్టి వారు విముఖులై ఉన్నారు. మేము నీకు పూర్వం ఏ ప్రవక్తను పంపినా, అతనికి వహీ ద్వారా, "నేను తప్ప దేవుడు లేడు. కనుక మీరు నాకే దాస్యం చేయండి" అనే విషయాన్నే తెలియజేశాము.

అత్యంత వైభవంగా నిర్వహించండి, బహుశా ఇప్పుడు కూడ మీ సేవకులు చేతులు కట్టుకుని మీ ముందుకు వచ్చి "ప్రభూ! ఆజ్ఞాపించండి" అని అడుగుతారు. (3) లోగడ వలెనే మీ కౌన్సిళ్ళనూ, మీ కమిటీలనూ సమావేశపరచుకోండి, బహుశా ఇప్పుడు కూడ వివేకవంతమైన మీ సలహాలవలనా, ఉన్నతమైన మీ ఆలోచనల వలనా లాభం పొందటానికి లోకమంతా మీ వద్దకు రావచ్చు.

4. అంటే, మాకు ఆడుకోవాలనే అభిలాష ఉంటే, ఏవో కొన్ని ఆట బొమ్మలను చేసి మేమే ఆడుకునేవారం. ఆ పక్షంలో, ఉత్త పుణ్యానికే, వివేకవంతుడూ, ప్రతిభాశాలీ, బాధ్యతాయుతుడూ అయిన మీ వంటి మానవ సృష్టి జరిగేదేకాదు, పరస్పర విరుద్ధములైన సత్యాసత్యాల మధ్య ఈ పోరాటాలూ, ఈ పెనుగులాటలూ జరిగి ఉండేవి కావు, కేవలం మా వినోదానికైతే పుణ్యమూర్తులైన మా దాసులను కష్టాలకు గురిచేసే వారముకాము.

**26 - 29** వారు, "కరుణామయుడు సంతానవంతుడు" అని అంటారు. అల్లాహ్ ఎంతో పరిశుద్ధుడు. వారు (దైవదూతలు) దాసులు, వారికి గౌరవం ఇవ్వబడింది. వారు ఆయన సాన్నిధ్యంలో ముందుకు వచ్చి మాట్లాడరు, కేవలం ఆయన ఆజ్ఞ ప్రకారమే నడుచుకుంటారు. ఆయన వారికి ముందు ఉన్న దానినీ ఎరుగును, వారికి గుప్తంగా ఉన్నదానినీ ఎరుగును. వారు ఎవరిని గురించీ సిఫారసు చేయరు, సిఫారసు వినటానికి అల్లాహ్ ఇష్టపడిన వాని విషయంలో తప్ప. ఆయన భయం వల్ల వారు భీతావహులై ఉంటారు. వారిలో ఎవరైనా, "అల్లాహ్‌తో పాటు, నేను కూడ ఒక దేవుడినే" అని అంటే, అతనికి మేము నరక శిక్ష విధిస్తాము. దుర్మార్గులకు మా వద్ద లభించే ప్రతిఫలం ఇదే.

**30 - 33** (ప్రవక్త మాటలను విశ్వసించకుండా) తిరస్కరించిన వారు ఈ విషయాలను గురించి ఆలోచించరా; ఆకాశాలూ భూమీ పరస్పరం కలసి ఉండేవనీ, తరువాత మేము వాటిని వేరు చేశామనీ, ప్రాణం ఉన్న ప్రతిదానిని నీళ్లతో సృష్టించామనీ? వారు (సృష్టించే మా ఈ శక్తిని) అంగీకరించరా? మేము భూమిపై పర్వతాలను పటిష్ఠంగా నిలబెట్టాము, అది వాటితో దొర్లిపోకుండా ఉండాలని. మేము దానిపై విశాలమైన మార్గాలను నిర్మించాము, బహుశా ప్రజలు తమ దారిని తెలుసుకుంటారని. మేము ఆకాశాన్ని ఒక సురక్షితమైన కప్పుగా చేశాము. కాని వారేమో సృష్టి యొక్క ఈ సూచనల వైపునకు తమ దృష్టినే మళ్లించరు. రాత్రినీ, పగలునూ సృష్టించిన వాడూ, సూర్యచంద్రులను పుట్టించిన వాడూ అల్లాహ్‌యే. అవన్నీ తమ తమ కక్ష్యలలో తేలియాడుతూ ఉన్నాయి. [6]

وَ قَالُوا اتَّخَذَ الرَّحْمٰنُ وَلَدًا سُبْحٰنَهٗ ؕ بَلْ
عِبَادٌ مُّكْرَمُوْنَ ﴿۲۶﴾ لَا يَسْبِقُوْنَهٗ بِالْقَوْلِ وَ
هُمْ بِاَمْرِهٖ يَعْمَلُوْنَ ﴿۲۷﴾ يَعْلَمُ مَا بَيْنَ
اَيْدِيْهِمْ وَ مَا خَلْفَهُمْ وَ لَا يَشْفَعُوْنَ ۙ اِلَّا
لِمَنِ ارْتَضٰى وَ هُمْ مِّنْ خَشْيَتِهٖ مُشْفِقُوْنَ ﴿۲۸﴾
وَ مَنْ يَّقُلْ مِنْهُمْ اِنِّيْۤ اِلٰهٌ مِّنْ دُوْنِهٖ فَذٰلِكَ
نَجْزِيْهِ جَهَنَّمَ ؕ كَذٰلِكَ نَجْزِي الظّٰلِمِيْنَ ﴿۲۹﴾ ع ۱۹ ۲
اَوَلَمْ يَرَ الَّذِيْنَ كَفَرُوْۤا اَنَّ السَّمٰوٰتِ
وَالْاَرْضَ كَانَتَا رَتْقًا فَفَتَقْنٰهُمَا ؕ وَ جَعَلْنَا
مِنَ الْمَآءِ كُلَّ شَيْءٍ حَيٍّ ؕ اَفَلَا يُؤْمِنُوْنَ ﴿۳۰﴾ وَ
جَعَلْنَا فِي الْاَرْضِ رَوَاسِيَ اَنْ تَمِيْدَ بِهِمْ ۪ وَ
جَعَلْنَا فِيْهَا فِجَاجًا سُبُلًا لَّعَلَّهُمْ يَهْتَدُوْنَ ﴿۳۱﴾
وَ جَعَلْنَا السَّمَآءَ سَقْفًا مَّحْفُوْظًا ۚۖ وَّ هُمْ عَنْ
اٰيٰتِهَا مُعْرِضُوْنَ ﴿۳۲﴾ وَ هُوَ الَّذِيْ خَلَقَ الَّيْلَ وَ
النَّهَارَ وَالشَّمْسَ وَ الْقَمَرَ ؕ كُلٌّ فِيْ فَلَكٍ
يَّسْبَحُوْنَ ﴿۳۳﴾

---

5. అంటే, దైవదాస్యం చెయ్యటం వారికి అప్రియమూ కాదు; కనుక వారు ఆయన దాస్యం నిరంతరం చేస్తున్నా విసుగుచెందరు; ఆయన ఆజ్ఞలను పాలించటం లోనూ అలసిపోరు.

6. అరబ్బీ భాషలో ఆకాశానికున్న సుప్రసిద్ధమైన పేర్లలో "ఫలక్" ఒకటి. "అవన్నీ ఒక్కొక్క కక్ష్యలో తేలియాడుతున్నాయి" అనే దానిద్వారా రెండు విషయాలు అర్థమవుతాయి. ఒకటి ఏమిటంటే, ఈ నక్షత్రాలన్నీ ఒకే కక్ష్యలో లేవు ప్రతిదానికీ ఒక్కొక్క కక్ష్య వేర్వేరుగా ఉన్నది. రెండో విషయం ఏమిటంటే, ఈ నక్షత్రాలన్నీ 'ఫలక్'లో మేకులు మాదిరిగా స్థిరంగా ఉన్నాయనీ, అది వాటితో పరిభ్రమిస్తోందనీ దీని అర్థం కాదు. అది ఒక ద్రవస్థితి లేదా వాతావరణం లేక వట్టి బయలు. అందులో ఈ నక్షత్రాల కదలిక నీటిలో తేలియాడుతున్నట్లుంటుంది.

وَ مَا جَعَلْنَا لِبَشَرٍ مِّنْ قَبْلِكَ الْخُلْدَ ؕ اَفَاۡئِنْ
مِّتَّ فَهُمُ الْخٰلِدُوْنَ ﴿٣٤﴾ كُلُّ نَفْسٍ ذَآئِقَةُ
الْمَوْتِ ؕ وَ نَبْلُوْكُمْ بِالشَّرِّ وَ الْخَيْرِ فِتْنَةً ؕ
وَاِلَيْنَا تُرْجَعُوْنَ ﴿٣٥﴾ وَ اِذَا رَاٰكَ الَّذِيْنَ
كَفَرُوْۤا اِنْ يَّتَّخِذُوْنَكَ اِلَّا هُزُوًا ؕ اَهٰذَا
الَّذِیْ يَذْكُرُ اٰلِهَتَكُمْ ۚ وَهُمْ بِذِكْرِ الرَّحْمٰنِ
هُمْ كٰفِرُوْنَ ﴿٣٦﴾ خُلِقَ الْاِنْسَانُ مِنْ عَجَلٍ ؕ
سَاُورِيْكُمْ اٰيٰتِیْ فَلَا تَسْتَعْجِلُوْنِ ﴿٣٧﴾ وَيَقُوْلُوْنَ
مَتٰى هٰذَا الْوَعْدُ اِنْ كُنْتُمْ صٰدِقِيْنَ ﴿٣٨﴾ لَوْ
يَعْلَمُ الَّذِيْنَ كَفَرُوْا حِيْنَ لَا يَكُفُّوْنَ عَنْ
وُّجُوْهِهِمُ النَّارَ وَ لَا عَنْ ظُهُوْرِهِمْ وَ لَا هُمْ
يُنْصَرُوْنَ ﴿٣٩﴾ بَلْ تَاْتِيْهِمْ بَغْتَةً فَتَبْهَتُهُمْ فَلَا
يَسْتَطِيْعُوْنَ رَدَّهَا وَ لَا هُمْ يُنْظَرُوْنَ ﴿٤٠﴾ وَ لَقَدِ
اسْتُهْزِئَ بِرُسُلٍ مِّنْ قَبْلِكَ فَحَاقَ بِالَّذِيْنَ
سَخِرُوْا مِنْهُمْ مَّا كَانُوْا بِهٖ يَسْتَهْزِءُوْنَ ﴿٤١﴾ ع
قُلْ مَنْ يَّكْلَؤُكُمْ بِالَّيْلِ وَ النَّهَارِ مِنَ
الرَّحْمٰنِ ؕ بَلْ هُمْ عَنْ ذِكْرِ رَبِّهِمْ مُّعْرِضُوْنَ ﴿٤٢﴾
اَمْ لَهُمْ اٰلِهَةٌ تَمْنَعُهُمْ مِّنْ دُوْنِنَا ؕ لَا
يَسْتَطِيْعُوْنَ نَصْرَ اَنْفُسِهِمْ وَ لَا هُمْ مِّنَّا
يُصْحَبُوْنَ ﴿٤٣﴾ بَلْ مَتَّعْنَا هٰۤؤُلَآءِ وَاٰبَآءَهُمْ حَتّٰى
طَالَ عَلَيْهِمُ الْعُمُرُ ؕ اَفَلَا يَرَوْنَ اَنَّا نَاْتِى
الْاَرْضَ نَنْقُصُهَا مِنْ اَطْرَافِهَا ؕ اَفَهُمُ الْغٰلِبُوْنَ ﴿٤٤﴾

**34 - 35** ఓ ప్రవక్తా! శాశ్వత జీవితాన్ని మేము నీకు పూర్వం కూడ ఏ మానవునికీ ప్రసాదించలేదు. ఒకవేళ నీవు మరణిస్తే, వారు మాత్రం శాశ్వతంగా జీవించి ఉంటారా? ప్రతి ప్రాణీ మృత్యువును తప్పకుండా చవిచూస్తుంది. మేము మీ అందరినీ మంచి పరిస్థితులకూ చెడు పరిస్థితులకూ గురిచేసి, పరీక్షిస్తున్నాము. చివరకు మీరు మా వైపునకే మరలవలసి ఉన్నది.

**36** ఈ సత్య తిరస్కారులు నిన్ను చూసినప్పుడు నీ పట్ల పరిహాసంతో వ్యవహరిస్తారు. "మీ దేవుళ్లను గురించి ప్రస్తావిస్తూ ఉండే వ్యక్తి ఇతనేనా?" అని అంటారు. కాని వారేమో కరుణామయుని ప్రస్తావనను తిరస్కరిస్తున్నారు.

**37 - 41** మానవుడు తొందరపడే ప్రాణి. ఇప్పుడే నేను నా సూచనలను నీకు చూపిస్తాను, నన్ను తొందరపెట్టకు– వారు "నీవు సత్యవంతుడవే అయితే, అసలు ఈ బెదిరింపు ఎప్పుడు నెరవేరుతుందో చెప్పు" అని అంటారు. అయ్యో! ఈ అవిశ్వాసులకు ఆ సమయం గురించి కొద్దిగానైనా తెలిసివుంటే ఎంత బాగుండును! అప్పుడు వారు అగ్ని నుండి తమ ముఖాలను గానీ తమ వీపులను గానీ కాపాడుకోలేరు. వారికి ఎక్కడ నుంచీ సహాయమూ అందదు. ఆ విపత్తు అకస్మాత్తుగా వచ్చిపడుతుంది. అది వారిని ఎంత హఠాత్తుగా చుట్టు ముట్టుతుందంటే, వారు దాన్ని వారించనూలేరు, వారికి ఒక్క క్షణం వ్యవధి కూడ దొరకదు. నీకు పూర్వం కూడ దైవప్రవక్తలు ఎగతాళి చేయబడ్డారు. కాని వారిని ఎగతాళి చేసేవారు, తాము ఎగతాళి చేసేసిన దానిలోనే చిక్కుకుపోయారు.

**42 - 46** ఓ ప్రవక్తా! వారిని "రాత్రిగానీ, పగలుగానీ మిమ్మల్ని కరుణామయుని నుండి కాపాడగలవాడెవడు?" అని అడుగు. కాని వారు తమ ప్రభువు హితబోధకు విముఖులవుతున్నారు. మాకు ప్రతికూలంగా వారికి సహాయం చేసే దేవుళ్లు ఎవరైనా వారికి ఉన్నారా? వారు తమకు తామే సహాయం చేసుకోనూ లేరు; వారికి మా సహాయ సహకారాలూ లేవు. అసలు విషయం ఏమిటంటే, వారికీ, వారి పూర్వీకులకూ మేము జీవితావసరాలను ఇస్తూ వచ్చాము; ఇలా వారిపై చాల కాలం గడచిపోయింది. కాని మేము భూమిని విభిన్న దిశల నుండి తగ్గిస్తూ[7] వస్తున్న విషయం వారికి కనిపించటంలేదా? వారు ఆధిక్యం వహించగలుగుతారా?

قُلْ اِنَّمَآ اُنْذِرُكُمْ بِالْوَحْيِ ۖ وَ لَا يَسْمَعُ الصُّمُّ
الدُّعَآءَ اِذَا مَا يُنْذَرُوْنَ ﴿٤٥﴾ وَ لَئِنْ مَّسَّتْهُمْ
نَفْحَةٌ مِّنْ عَذَابِ رَبِّكَ لَيَقُوْلُنَّ يٰوَيْلَنَآ اِنَّا
كُنَّا ظٰلِمِيْنَ ﴿٤٦﴾ وَ نَضَعُ الْمَوَازِيْنَ الْقِسْطَ
لِيَوْمِ الْقِيٰمَةِ فَلَا تُظْلَمُ نَفْسٌ شَيْـًٔا ؕ وَ اِنْ
كَانَ مِثْقَالَ حَبَّةٍ مِّنْ خَرْدَلٍ اَتَيْنَا بِهَا ؕ وَ
كَفٰى بِنَا حٰسِبِيْنَ ﴿٤٧﴾ وَ لَقَدْ اٰتَيْنَا مُوْسٰى وَ
هٰرُوْنَ الْفُرْقَانَ وَ ضِيَآءً وَّ ذِكْرًا
لِّلْمُتَّقِيْنَ ﴿٤٨﴾ الَّذِيْنَ يَخْشَوْنَ رَبَّهُمْ بِالْغَيْبِ
وَ هُمْ مِّنَ السَّاعَةِ مُشْفِقُوْنَ ﴿٤٩﴾ وَ هٰذَا ذِكْرٌ
مُّبٰرَكٌ اَنْزَلْنٰهُ ؕ اَفَاَنْتُمْ لَهٗ مُنْكِرُوْنَ ﴿٥٠﴾ وَ
لَقَدْ اٰتَيْنَآ اِبْرٰهِيْمَ رُشْدَهٗ مِنْ قَبْلُ وَ كُنَّا بِهٖ
عٰلِمِيْنَ ﴿٥١﴾ اِذْ قَالَ لِاَبِيْهِ وَقَوْمِهٖ مَا هٰذِهِ
التَّمَاثِيْلُ الَّتِيْٓ اَنْتُمْ لَهَا عٰكِفُوْنَ ﴿٥٢﴾ قَالُوْا
وَجَدْنَآ اٰبَآءَنَا لَهَا عٰبِدِيْنَ ﴿٥٣﴾ قَالَ لَقَدْ
كُنْتُمْ اَنْتُمْ وَ اٰبَآؤُكُمْ فِيْ ضَلٰلٍ مُّبِيْنٍ ﴿٥٤﴾
قَالُوْٓا اَجِئْتَنَا بِالْحَقِّ اَمْ اَنْتَ مِنَ
اللّٰعِبِيْنَ ﴿٥٥﴾ قَالَ بَلْ رَّبُّكُمْ رَبُّ السَّمٰوٰتِ وَ
الْاَرْضِ الَّذِيْ فَطَرَهُنَّ ۖ وَ اَنَا عَلٰى ذٰلِكُمْ
مِّنَ الشّٰهِدِيْنَ ﴿٥٦﴾ وَ تَاللّٰهِ لَاَكِيْدَنَّ اَصْنَامَكُمْ
بَعْدَ اَنْ تُوَلُّوْا مُدْبِرِيْنَ ﴿٥٧﴾

వారితో, "నేను వహీ ఆధారంగానే మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను" అని అను - కాని చెవిటివారిని హెచ్చరించినప్పటికీ వారు పిలుపును వినలేరు. ఒకవేళ నీ ప్రభువు శిక్ష వారిని ఏమాత్రం ముట్టుకున్నా వెంటనే, "అయ్యో మా దౌర్భాగ్యం! నిస్సందేహంగా మేము దోషులమే" అని ఆక్రందన చేస్తారు.

**47** కచ్చితంగా తూచేటటువంటి తరాజులను మేము ప్రళయం నాడు ఏర్పాటు చేస్తాము. ఏ వ్యక్తికైనా రవ్వంత అన్యాయం కూడ జరగదు. ఎవరైనా ఆవగింజంత పనిని చేసి ఉన్నా, దానిని మేము ముందుకు తీసుకువస్తాము. లెక్క చూడటానికి మేమే చాలు.

**48 - 50** పూర్వం మేము మూసా, హారూన్‌లకు గీటురాయినీ, జ్యోతినీ, జ్ఞాపికనూ ప్రసాదించి ఉన్నాము; దైవభీతి కలవారి మేలు కొరకు - వారు తమ ప్రభువుకు భయపడతారు, (లెక్క తీసుకునే) ఘడియను గురించి వారు బెదురుతూ ఉంటారు. ఇప్పుడు శుభప్రదమైన ఈ జ్ఞాపికను మేము (మీ కొరకు) అవతరింపజేశాము. అయితే మీరు దీనిని నిరాకరిస్తున్నారా?

**51 - 73** దానికి పూర్వమే మేము ఇబ్రాహీమ్‌కు బుద్ధికుశలతను ప్రసాదించాము, అతనిని గురించి మాకు బాగా తెలుసు. అతను తన తండ్రితో, తన జాతి వారితో ఇలా అన్నప్పటి సందర్భాన్నీ జ్ఞాపకం తెచ్చుకో, "మీరు అమిత భక్తితో ఆరాధిస్తున్న ఈ విగ్రహాలు ఏమిటీ?" వారు దానికి ఇలా బదులు చెప్పారు, "మా పితృపితామహులు వాటిని ఆరాధిస్తూ ఉండగా మేము చూశాము." అతను, "మీరూ మార్గభ్రష్టులే, మీ పితృపితామహులు కూడా పూర్తిగా మార్గభ్రష్టులే" అని అన్నాడు. వారు, "నీవు మా ముందు అసలైన నీ ఆలోచనలనే ప్రకటిస్తున్నావా లేక పరిహాసమాడుతున్నావా?" అని అడిగారు. అతను ఇలా జవాబు పలికాడు, "లేదు, వాస్తవానికి భూమికీ, ఆకాశాలకూ ప్రభువైనవాడే, వాటిని సృష్టించినవాడే మీ ప్రభువు. ఈ విషయం గురించి నేను మీ ముందు సాక్ష్య మిస్తున్నాను, దేవునిపై ప్రమాణం చేసి చెబుతున్నాను. మీరు లేనపుడు తప్పకుండా మీ విగ్రహాల పని పడతాను."

فَجَعَلَهُمْ جُذٰذًا اِلَّا كَبِيْرًا لَّهُمْ لَعَلَّهُمْ اِلَيْهِ
يَرْجِعُوْنَ ﴿٥٨﴾ قَالُوْا مَنْ فَعَلَ هٰذَا بِاٰلِهَتِنَآ
اِنَّهٗ لَمِنَ الظّٰلِمِيْنَ ﴿٥٩﴾ قَالُوْا سَمِعْنَا فَتًى
يَّذْكُرُهُمْ يُقَالُ لَهٗٓ اِبْرٰهِيْمُ ﴿٦٠﴾ قَالُوْا فَاْتُوْا بِهٖ
عَلٰٓى اَعْيُنِ النَّاسِ لَعَلَّهُمْ يَشْهَدُوْنَ ﴿٦١﴾ قَالُوْٓا
ءَاَنْتَ فَعَلْتَ هٰذَا بِاٰلِهَتِنَا يٰٓاِبْرٰهِيْمُ ﴿٦٢﴾ قَالَ
بَلْ فَعَلَهٗ ۖ كَبِيْرُهُمْ هٰذَا فَسْـَٔلُوْهُمْ اِنْ
كَانُوْا يَنْطِقُوْنَ ﴿٦٣﴾ فَرَجَعُوْٓا اِلٰٓى اَنْفُسِهِمْ
فَقَالُوْٓا اِنَّكُمْ اَنْتُمُ الظّٰلِمُوْنَ ﴿٦٤﴾ ثُمَّ نُكِسُوْا عَلٰى
رُءُوْسِهِمْ ۚ لَقَدْ عَلِمْتَ مَا هٰٓؤُلَآءِ يَنْطِقُوْنَ ﴿٦٥﴾
قَالَ اَفَتَعْبُدُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ مَا لَا يَنْفَعُكُمْ
شَيْـًٔا وَّ لَا يَضُرُّكُمْ ﴿٦٦﴾ اُفٍّ لَّكُمْ وَ لِمَا
تَعْبُدُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ ۗ اَفَلَا تَعْقِلُوْنَ ﴿٦٧﴾
قَالُوْا حَرِّقُوْهُ وَ انْصُرُوْٓا اٰلِهَتَكُمْ اِنْ كُنْتُمْ
فٰعِلِيْنَ ﴿٦٨﴾ قُلْنَا يٰنَارُ كُوْنِيْ بَرْدًا وَّ سَلٰمًا عَلٰٓى
اِبْرٰهِيْمَ ﴿٦٩﴾ وَاَرَادُوْا بِهٖ كَيْدًا فَجَعَلْنٰهُمُ
الْاَخْسَرِيْنَ ﴿٧٠﴾ وَ نَجَّيْنٰهُ وَلُوْطًا اِلَى الْاَرْضِ
الَّتِيْ بٰرَكْنَا فِيْهَا لِلْعٰلَمِيْنَ ﴿٧١﴾ وَوَهَبْنَا لَهٗٓ
اِسْحٰقَ ؕ وَ يَعْقُوْبَ نَافِلَةً ؕ وَ كُلًّا جَعَلْنَا
صٰلِحِيْنَ ﴿٧٢﴾ وَ جَعَلْنٰهُمْ اَئِمَّةً يَّهْدُوْنَ بِاَمْرِنَا
وَاَوْحَيْنَآ اِلَيْهِمْ فِعْلَ الْخَيْرٰتِ وَ اِقَامَ الصَّلٰوةِ
وَاِيْتَآءَ الزَّكٰوةِ ۚ وَكَانُوْا لَنَا عٰبِدِيْنَ ﴿٧٣﴾

ఆ విధంగా అతను వాటిని ముక్కలు ముక్కలుగా చేశాడు. కేవలం వాటిలో ఒక పెద్ద విగ్రహాన్ని మాత్రం విడిచిపెట్టాడు, బహుశా వారు దాని వైపునకు మరలటానికేమో (వారు వచ్చి, విగ్రహాల ఈ స్థితిని చూసి) ఇలా అన్నారు, "మా దేవుళ్లను ఇలా చేసిందెవరు? వాడెవడో పరమ దుర్మార్గుడే." (కొందరు) ఇలా అన్నారు, "ఒక యువకుడు వీటిని గురించి ప్రస్తావిస్తూ ఉండగా మేము విన్నాము. అతని పేరు ఇబ్రాహీమ్." వారు ఇలా అన్నారు, "అయితే వాణ్ణి అందరిముందుకు పట్టుకురండి (అతన్ని ఎలా శిక్షిస్తారో) ప్రజలు చూస్తారు," వారు (ఇబ్రాహీమ్ వచ్చినప్పుడు) "ఏమిటి ఇబ్రాహీమ్! మా దేవుళ్లను ఇలా చేసింది నీవేనా?" అని అడిగారు. అతను, "వాస్తవానికి వాటి ఈ నాయకుడే ఇదంతా చేశాడు. వాటినే అడగండి, అవి మాట్లాడ గలిగితే"[8] అని సమాధానం చెప్పాడు. ఇది విని వారు తమ అంతరాత్మల వైపునకు మరలారు. (తమ మనస్సులలో) ఇలా అనుకోసాగారు, "వాస్తవానికి స్వయంగా మీరే దుర్మార్గులు." కాని తరువాత వారి బుద్ధి తలక్రిందులైపోయింది; "ఇవి మాట్లాడలేవని నీకు తెలుసుగా!" అని అన్నారు. ఇబ్రాహీమ్ ఇలా అన్నాడు, "అయితే, మీరు అల్లాహ్‌ను కాదని మీకు లాభంకానీ, నష్టం కానీ కలిగించగల సామర్థ్యం లేని వాటిని పూజిస్తున్నారా? ధూత్కారం, మీపైనా, అల్లాహ్‌ను కాదని మీరు పూజించే దేవుళ్లపైనా, మీకు ఏమాత్రం బుద్ధిలేదా?" వారు ఇలా అన్నారు, "మీరేదైనా చేయదలిస్తే, ఇతనిని సజీవంగా దహనం చేయండి, మీ దేవుళ్లకు అండగా నిలవండి." అప్పుడు మేము ఇలా అన్నాము, "ఓ అగ్నీ! చల్లగా అయిపో ఇబ్రాహీమ్‌కు[9] భద్రత అయిపో." వారు ఇబ్రాహీమ్‌కు కీడు తలపెట్టారు. కాని మేము వారి కుతంత్రాలను వమ్ము చేశాము. మేము అతనిని, లూత్‌నూ కాపాడి, ప్రపంచ వాసులకు మేము శుభాలను నిక్షేపించిన భూభాగం వైపునకు వారిని తీసుకుని వెళ్లాము. మేము అతనికి ఇస్‌హాఖ్‌ను ప్రసాదించాము, అదనంగా[10] యాఖూబ్‌ను కూడ ఇచ్చాము; ప్రతి ఒక్కడినీ మేము సౌశీల్యవంతుడుగా చేశాము. మా ఆజ్ఞానుసారం మార్గ దర్శకత్వం నెరపేవారిని మేము నాయకులుగా చేశాము. మేము వహీ ద్వారా సత్కార్యాలు చెయ్యండి అనీ, నమాజ్‌ను స్థాపించండి అనీ, జకాత్ ఇవ్వండి అనీ వారికి బోధించాము. వారు మమ్మల్ని ఆరాధించేవారు.

وَ لُوْطًا اٰتَيْنٰهُ حُكْمًا وَّ عِلْمًا وَّ نَجَّيْنٰهُ مِنَ
الْقَرْيَةِ الَّتِيْ كَانَتْ تَّعْمَلُ الْخَبٰٓئِثَ ؕ اِنَّهُمْ
كَانُوْا قَوْمَ سَوْءٍ فٰسِقِيْنَ ﴿٧٤﴾ وَ اَدْخَلْنٰهُ فِيْ
رَحْمَتِنَا ؕ اِنَّهٗ مِنَ الصّٰلِحِيْنَ ﴿٧٥﴾ وَ نُوْحًا اِذْ ع ٥
نَادٰى مِنْ قَبْلُ فَاسْتَجَبْنَا لَهٗ فَنَجَّيْنٰهُ وَ اَهْلَهٗ
مِنَ الْكَرْبِ الْعَظِيْمِ ﴿٧٦﴾ وَ نَصَرْنٰهُ مِنَ الْقَوْمِ
الَّذِيْنَ كَذَّبُوْا بِاٰيٰتِنَا ؕ اِنَّهُمْ كَانُوْا قَوْمَ سَوْءٍ
فَاَغْرَقْنٰهُمْ اَجْمَعِيْنَ ﴿٧٧﴾

**74 - 75** మేము లూత్‌కు ఆజ్ఞనూ, జ్ఞానాన్నీ ప్రసాదించాము; సిగ్గుమాలిన చేష్టలు చేసే పట్టణం నుండి అతనికి విముక్తి కలిగించాము - వాస్తవంగానే అది పరమ నీచమైన, హద్దులు మీరిన పాపిష్ఠ జాతి-మేము లూత్‌ను మా కారుణ్యంలోకి ప్రవేశింపజేశాము. అతను నిజంగానే సజ్జనులలోని వాడు.

**76 - 77** ఈ కానుకనే మేము నూహ్‌కు ప్రసాదించాము. వీరందరికంటే ముందు అతను మమ్మల్ని వేడుకున్నప్పటి సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకో. మేము అతని ప్రార్థనను అంగీకరించాము. అతనికీ, అతని కుటుంబానికీ తీవ్రమైన వ్యధ నుండి విముక్తి కలిగించాము. మా ఆయతులు అసత్యాలని తిరస్కరించిన జాతి వారికి వ్యతిరేకంగా మేము అతనికి సహాయం చేశాము. వారు పరమ దుష్టులు, ఆ కారణంగా మేము వారందరినీ ముంచివేశాము.

7. అంటే, భూమి మీద అంతటా వ్యాపించి ఉన్న మా అసాధారణ శక్తి సూచనలు అనేక రీతులలో ప్రకటితమవుతూ ఉంటాయి : ఒకప్పుడు ఆకస్మికముగా సంభవించే కరువుకాటకాలు, తెగుళ్లరూపంలోనూ, మరొకప్పుడు వరదలు, భూకంపాల రూపంలోనూ, వేరొకప్పుడు లావాలు, హిమపాతాల రూపంలోనూ ఉపద్రవాలు వచ్చి మానవ నాగరికతను తుడిచిపెట్టేస్తాయి, లక్షలాది మంది ప్రజలు ప్రాణాలు కోల్పోతారు, ఊళ్లకు ఊళ్లే కనుమరుగైపోతాయి, పచ్చని పంటపొలాలు పాడైపోతాయి, దిగుబడి తగ్గిపోతుంది, వర్తక వాణిజ్యాలు కుంటుపడతాయి. ఒకటేమిటి మానవ జీవనానికే నష్టం వాటిల్లుతుంది. మానవుడు తన పూర్తి శక్తిని వినియోగించినా ఈ నష్టాలను నివారించలేడు.

8. ప్రజలు తాము పూజించే దేవుళ్లు నిస్సహాయులనీ, వారి నుండి ఏ సహాయాన్నీ ఆశించే అవకాశం లేదనీ తమ సమాధానం ద్వారా గ్రహించి ఒప్పుకొనేందుకు హజ్రత్ ఇబ్రాహీమ్ ఇలా అన్నారని ఆయన మాటలలోనే తెలుస్తోంది. అటువంటి సమయంలో ఒక వ్యక్తి, వాదన కోసం ఒక అవాస్తవ విషయాన్ని చెబితే, దానిని అబద్ధం అని అనకూడదు. ఎందుకంటే ఆయన అబద్ధమాడాలనే ఉద్దేశ్యంతో ఆ విషయం అనలేదు; వినే వాళ్లు సైతం దానిని అబద్ధమని భావించరు. చెప్పేవాడు దానిని సమర్థించుకోవడానికే తన వాదనను చెబుతున్నాడు, వినేవాడు కూడ దానిని ఈ అర్థంలోనే గ్రహిస్తాడు.

9. వారు నిజంగానే తమ తీర్పును అమలుపరచారు ; అగ్ని గుండాన్ని తయారుచేసి, అందులోకి వారు హజ్రత్ ఇబ్రాహీమ్‌ను త్రోసినపుడు, అల్లాహ్ ఎట్టి హానీ చేయకుండా చల్లబడిపొమ్మని అగ్నిని ఆజ్ఞాపించాడు. ఈ భావాన్నే గ్రంథంలోని మాటలు నిర్ధారిస్తున్నాయి, సమయం సందర్భాలు కూడ దీనినే బలపరుస్తున్నాయి. దివ్య ఖురానులో ప్రస్తావించబడిన మహిమలలో ఇది ఒకటి.

10. అంటే, మేము ఆయన కుమారుణ్ణీ, ఆయన మనుమణ్ణీ ఉభయులనూ ప్రవక్తలుగా చేశాము.

**78 - 79** ఈ కానుకనే ఇచ్చి మేము దావూద్‌నూ, సులైమాన్‌నూ అనుగ్రహించాము. వారు ఉభయులూ ఒక చేను వ్యాజ్యం విషయంలో తీర్పు చేస్తున్నప్పటి సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకో: రాత్రివేళ ఇతరుల మేకలు ఆ చేనులో పడి తిరిగాయి. వారు తీర్పు చేసే విధానాన్ని స్వయంగా మేము చూస్తూ ఉన్నాము. ఆ సమయంలో మేము సులైమాన్‌కు సరియైన తీర్పు అవగాహననూ కలుగజేశాము. యధార్థానికి న్యాయాన్నీ, జ్ఞానాన్నీ మేము ఉభయులకూ ప్రసాదించాము.

**80 - 82** దావూద్‌తో పాటు పర్వతాలు, పక్షులు (మా) స్తోత్రం చేసే కట్టుబాటు మేము చేశాము. ఈ పనిని చేసినవారము మేమే. మేము మీ ప్రయోజనం కోసం అతనికి కవచాలు తయారుచేసే కళను నేర్పాము, తద్వారా మిమ్మల్ని పరస్పర హాని నుండి రక్షిద్దామని. అలాంటప్పుడు మీరు కృతజ్ఞులుగా ఉన్నారా? మేము తీవ్రంగా వీచే గాలిని సులైమాన్‌కు లొంగేలా చేశాము. అది అతని ఆదేశం ప్రకారం మేము శుభాలను ఉంచిన భూభాగం వైపునకు పయనించేది. మేము సకల విషయ పరిజ్ఞానం కలవారము. మేము షైతానులలో చాలా మందిని అతనికి విధేయులుగా చేశాము. అవి అతని కొరకు సముద్రంలో మునకలు వేసేవి. ఇదేగాక అవి ఇంకా వేరే పనులు కూడ చేసేవి. వీరందరినీ కనిపెట్టి ఉండేవారం కూడ మేమే.

**83 - 84** మరియు దీనినే (బుద్ధికుశలత, తీర్పు చేసే సామర్థ్యం, జ్ఞానం అనే వరాన్ని) మేము అయ్యూబ్‌కు ప్రసాదించాము. అతను తన ప్రభువును ఇలా వేడుకున్నప్పటి సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకో; "నాకు వ్యాధి సోకింది. నీవు కరుణామయులలోకెల్లా గొప్ప కరుణామయుడవు." మేము అతని ప్రార్థనను అంగీకరించాము మరియు అతనికున్న బాధను తొలగించాము. అతనికి కేవలం అతని కుటుంబ సభ్యులను తిరిగిఇవ్వటమే కాకుండా వారితోపాటు, ఇంకా అంతేమందిని కూడ ఇచ్చాము, మా నుండి ప్రత్యేక అనుగ్రహంగా. ఎందుకంటే ఇది ఆరాధకులకు గుణపాఠంగా ఉండాలని.

**85 - 86** ఇదే వరాన్ని ఇస్మాయీల్‌కూ, ఇద్రీస్‌కూ, జుల్‌కిఫ్ల్‌కూ ఇచ్చాము, ఎందుకంటే వారందరూ సహనశీలురు. వారు సజ్జనుల్లోనివారు కాబట్టి మేము వారిని మా కారుణ్యంలోకి ప్రవేశింపజేశాము.

وَ دَاوٗدَ وَ سُلَيۡمٰنَ اِذۡ يَحۡكُمٰنِ فِى الۡحَرۡثِ اِذۡ
نَفَشَتۡ فِيۡهِ غَنَمُ الۡقَوۡمِ ۚ وَكُنَّا لِحُكۡمِهِمۡ
شٰهِدِيۡنَ ۙ ﴿٧٨﴾ فَفَهَّمۡنٰهَا سُلَيۡمٰنَ ۚ وَكُلًّا اٰتَيۡنَا
حُكۡمًا وَّعِلۡمًا ۖ وَّسَخَّرۡنَا مَعَ دَاوٗدَ الۡجِبَالَ
يُسَبِّحۡنَ وَالطَّيۡرَ ؕ وَكُنَّا فٰعِلِيۡنَ ﴿٧٩﴾ وَعَلَّمۡنٰهُ
صَنۡعَةَ لَبُوۡسٍ لَّـكُمۡ لِتُحۡصِنَكُمۡ مِّنۡۢ بَاۡسِكُمۡ ۚ
فَهَلۡ اَنۡتُمۡ شٰكِرُوۡنَ ﴿٨٠﴾ وَلِسُلَيۡمٰنَ الرِّيۡحَ
عَاصِفَةً تَجۡرِىۡ بِاَمۡرِهٖۤ اِلَى الۡاَرۡضِ الَّتِىۡ
بٰرَكۡنَا فِيۡهَا ؕ وَكُنَّا بِكُلِّ شَىۡءٍ عٰلِمِيۡنَ ﴿٨١﴾ وَ
مِنَ الشَّيٰطِيۡنِ مَنۡ يَّغُوۡصُوۡنَ لَهٗ وَيَعۡمَلُوۡنَ
عَمَلًا دُوۡنَ ذٰلِكَ ۚ وَكُنَّا لَهُمۡ حٰفِظِيۡنَ ۙ ﴿٨٢﴾ وَ
اَيُّوۡبَ اِذۡ نَادٰى رَبَّهٗۤ اَنِّىۡ مَسَّنِىَ الضُّرُّ وَاَنۡتَ
اَرۡحَمُ الرّٰحِمِيۡنَ ۖ ﴿٨٣﴾ فَاسۡتَجَبۡنَا لَهٗ فَكَشَفۡنَا مَا
بِهٖ مِنۡ ضُرٍّ وَّاٰتَيۡنٰهُ اَهۡلَهٗ وَمِثۡلَهُمۡ مَّعَهُمۡ
رَحۡمَةً مِّنۡ عِنۡدِنَا وَذِكۡرٰى لِلۡعٰبِدِيۡنَ ﴿٨٤﴾ وَ
اِسۡمٰعِيۡلَ وَاِدۡرِيۡسَ وَذَا الۡـكِفۡلِ ؕ كُلٌّ مِّنَ
الصّٰبِرِيۡنَ ۖ ﴿٨٥﴾ وَاَدۡخَلۡنٰهُمۡ فِىۡ رَحۡمَتِنَا ؕ اِنَّهُمۡ
مِّنَ الصّٰلِحِيۡنَ ﴿٨٦﴾

وَذَا النُّوْنِ اِذْ ذَّهَبَ مُغَاضِبًا فَظَنَّ اَنْ لَّنْ
نَّقْدِرَ عَلَيْهِ فَنَادٰى فِى الظُّلُمٰتِ اَنْ لَّآ اِلٰهَ
اِلَّآ اَنْتَ سُبْحٰنَكَ ۖ اِنِّىْ كُنْتُ مِنَ
الظّٰلِمِيْنَ ۝٨٧ فَاسْتَجَبْنَا لَهٗ ۙ وَنَجَّيْنٰهُ مِنَ
الْغَمِّ ۗ وَكَذٰلِكَ نُـْۨجِى الْمُؤْمِنِيْنَ ۝٨٨ وَزَكَرِيَّآ
اِذْ نَادٰى رَبَّهٗ رَبِّ لَا تَذَرْنِىْ فَرْدًا وَّ اَنْتَ
خَيْرُ الْوٰرِثِيْنَ ۝٨٩ فَاسْتَجَبْنَا لَهٗ ۡ وَ وَهَبْنَا لَهٗ
يَحْيٰى وَاَصْلَحْنَا لَهٗ زَوْجَهٗ ۗ اِنَّهُمْ كَانُوْا
يُسٰرِعُوْنَ فِى الْخَيْرٰتِ وَيَدْعُوْنَنَا رَغَبًا وَّ
رَهَبًا ۗ وَ كَانُوْا لَنَا خٰشِعِيْنَ ۝٩٠ وَالَّتِىْٓ
اَحْصَنَتْ فَرْجَهَا فَنَفَخْنَا فِيْهَا مِنْ رُّوْحِنَا
وَجَعَلْنٰهَا وَ ابْنَهَآ اٰيَةً لِّلْعٰلَمِيْنَ ۝٩١ اِنَّ هٰذِهٖٓ
اُمَّتُكُمْ اُمَّةً وَّاحِدَةً ۖ وَّ اَنَا رَبُّكُمْ
فَاعْبُدُوْنِ ۝٩٢ وَتَقَطَّعُوْٓا اَمْرَهُمْ بَيْنَهُمْ ۗ كُلٌّ
اِلَيْنَا رٰجِعُوْنَ ۝٩٣ فَمَنْ يَّعْمَلْ مِنَ الصّٰلِحٰتِ ع ١٨/٢
وَهُوَ مُؤْمِنٌ فَلَا كُفْرَانَ لِسَعْيِهٖ ۚ وَاِنَّا لَهٗ
كٰتِبُوْنَ ۝٩٤

**87 - 88** చేప వానిని[11] కూడ మేము అనుగ్రహించాము. అతను కోపంతో వెళ్ళిపోయినప్పటి[12] సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకో. దానికి మేము సంజాయిషీ అడగబోమని అతను భావించాడు. చివరకు అతను అగాధమైన చీకట్లల్లో నుండి ఇలా మొరపెట్టుకున్నాడు,[13] "నీవు తప్ప దేవుడు లేనే లేడు. నీవు పరిశుద్ధుడవు. నిస్సందేహంగా నేను తప్పు చేశాను." అప్పుడు మేము అతని ప్రార్థనను అంగీకరించి, అతనికి దుఃఖం నుండి విముక్తి కలిగించాము. ఈ విధంగానే మేము విశ్వాసు లను కాపాడుతూ ఉంటాము.

**89 - 90** మరియు జకరియ్యాను కూడా అనుగ్రహించాము. అప్పుడు అతను తన ప్రభువును ఇలా వేడుకున్నాడు, "ప్రభూ! నన్ను ఒంటరివాడు (సంతానహీనుడు)గా విడిచిపెట్టకు. మేలైన వారసుడవు నీవు మాత్రమే." మేము అతని ప్రార్థనను అంగీక రించాము మరియు అతనికి యహ్యాను ప్రసాదించాము. అతని భార్యను అతనికి (సంతానం కనే) యోగ్యురాలుగా సరి చేశాము. వారు మంచి పనుల కోసం ఎక్కువగా శ్రమించే వారు. ప్రేమతోనూ, భయంతోనూ మమ్మల్ని ప్రార్థించేవారు, మా సమక్షంలో వినమ్రులై ఉండేవారు.

**91** మరియు తన శీలాన్ని కాపాడుకున్న[14] ఆ మహిళను కూడ (అనుగ్రహించాము). మేము ఆమెలో మా ఆత్మ నుండి ఊదాము. ఆమెనూ, ఆమె కుమారుణ్ణీ సర్వప్రపంచానికి ఒక సూచనగా చేశాము.

**92 - 103** మీ ఈ సంఘం వాస్తవానికి ఒకే ఒక సంఘం, నేను మీ ప్రభువును. కనుక మీరు నన్ను ఆరాధించండి. కాని (ఇది ప్రజలు చేసుకున్న నిర్వాకమే) వారు తమలో తాము ధర్మాన్ని ముక్కలు ముక్కలుగా చేసుకున్నారు. – అందరూ మా వైపునకు మరల వలసి నదే. తరువాత విశ్వాసిగా ఉండి సత్కార్యాలు చేసే వాడి సత్కార్యా లను నిరాదరించటం జరగదు. వాటిని మేము వ్రాస్తున్నాము.

11. అంటే, హజ్రత్ యూనుస్ (అస్సలామ్). గ్రంథంలో ఒకచోట ఆయనను ఈ పేరుతో ప్రస్తావించటం జరిగింది. మరొక చోట "జున్నూన్", "సాహెబుల్ హూత్" అంటే చేపలవాడు అనే బిరుదులతో ప్రస్తావించటం జరిగింది. ఆయన చేపలు పడతాడనిగానీ, వాటిని అమ్ముతాడనిగానీ ఆయనను చేపలవాడని వ్యవహరించలేదు. అల్లాహ్

وَ حَرٰمٌ عَلٰى قَرْيَةٍ اَهْلَكْنٰهَآ اَنَّهُمْ لَا
يَرْجِعُوْنَ ﴿٩٥﴾ حَتّٰىٓ اِذَا فُتِحَتْ يَاْجُوْجُ وَ
مَاْجُوْجُ وَهُمْ مِّنْ كُلِّ حَدَبٍ يَّنْسِلُوْنَ ﴿٩٦﴾ وَ
اقْتَرَبَ الْوَعْدُ الْحَقُّ فَاِذَا هِيَ شَاخِصَةٌ
اَبْصَارُ الَّذِيْنَ كَفَرُوْا ؕ يٰوَيْلَنَا قَدْ كُنَّا فِيْ
غَفْلَةٍ مِّنْ هٰذَا بَلْ كُنَّا ظٰلِمِيْنَ ﴿٩٧﴾ اِنَّكُمْ
وَمَا تَعْبُدُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ حَصَبُ جَهَنَّمَ ؕ
اَنْتُمْ لَهَا وٰرِدُوْنَ ﴿٩٨﴾ لَوْ كَانَ هٰٓؤُلَآءِ اٰلِهَةً مَّا
وَرَدُوْهَا ؕ وَكُلٌّ فِيْهَا خٰلِدُوْنَ ﴿٩٩﴾ لَهُمْ فِيْهَا
زَفِيْرٌ وَّ هُمْ فِيْهَا لَا يَسْمَعُوْنَ ﴿١٠٠﴾ اِنَّ الَّذِيْنَ
سَبَقَتْ لَهُمْ مِّنَّا الْحُسْنٰىٓ ۙ اُولٰٓئِكَ عَنْهَا
مُبْعَدُوْنَ ﴿١٠١﴾ لَا يَسْمَعُوْنَ حَسِيْسَهَا ۚ وَهُمْ
فِيْ مَا اشْتَهَتْ اَنْفُسُهُمْ خٰلِدُوْنَ ﴿١٠٢﴾ لَا
يَحْزُنُهُمُ الْفَزَعُ الْاَكْبَرُ وَ تَتَلَقّٰىهُمُ الْمَلٰٓئِكَةُ ؕ
هٰذَا يَوْمُكُمُ الَّذِيْ كُنْتُمْ تُوْعَدُوْنَ ﴿١٠٣﴾ يَوْمَ
نَطْوِي السَّمَآءَ كَطَيِّ السِّجِلِّ لِلْكُتُبِ ؕ كَمَا
بَدَاْنَآ اَوَّلَ خَلْقٍ نُّعِيْدُهٗ ؕ وَعْدًا عَلَيْنَا ؕ اِنَّا
كُنَّا فٰعِلِيْنَ ﴿١٠٤﴾ وَ لَقَدْ كَتَبْنَا فِي الزَّبُوْرِ مِنْۢ
بَعْدِ الذِّكْرِ اَنَّ الْاَرْضَ يَرِثُهَا عِبَادِيَ
الصّٰلِحُوْنَ ﴿١٠٥﴾ اِنَّ فِيْ هٰذَا لَبَلٰغًا لِّقَوْمٍ
عٰبِدِيْنَ ﴿١٠٦﴾

మేము నాశనం చేసిన నగరం మళ్ళీ మరలి రావటం సంభవం కాని విషయం. చివరకు యాజూజ్, మాజూజ్‌లు వదలిపెట్టబడినప్పుడు, వారు ప్రతి ఎత్తైన ప్రదేశం నుండి బయల్పడినప్పుడు, సత్యవాగ్దానం నెరవేరే సమయం[15] దగ్గర పడినప్పుడు, హఠాత్తుగా అవిశ్వాసుల కనుగుడ్లు విచ్చుకున్నవి విచ్చుకున్నట్లుగానే ఉండిపోతాయి. వారు ఇలా అంటారు, "అయ్యో! మా దౌర్భాగ్యం! మేము దీని విషయంలో అశ్రద్ధకు లోనయ్యాము. అంతేకాదు మేము తప్పు చేశాము." నిస్సంశయంగా మీరూ, అల్లాహ్‌ను కాదని మీరు పూజించే మీ దైవాలూ నరకానికి ఇంధనం అవుతారు. అక్కడికే మీరు పోవలసి ఉన్నది.[16] వారు నిజంగానే దేవుళ్ళే అయితే, అక్కడకు పోయేవారు కాదు. ఇక అందరూ శాశ్వతంగా అందులోనే ఉండాలి. అక్కడ వారు రొప్పుతూ రోజుతూ బుసలు కొడతారు. ఇంకా అక్కడ పరిస్థితి ఎలా ఉంటుందంటే, అందులో వారికి ఏ శబ్దమూ వినిపించదు. ఇక, మా తరఫునుండి మేలు కలుగుతుందని మొదట్లోనే తీర్పు ఇవ్వబడిన ప్రజల విషయానికి వస్తే వారు నిశ్చయంగా దానికి దూరంగా ఉంచబడతారు: దాని రెపరెపను సైతం వారు వినరు. వారు సదా తమ మనస్సులు కోరుకునే వస్తువుల మధ్య ఉంటారు. మిక్కిలి కలవరపెట్టే ఆ సమయం వారిని ఏమాత్రం బాధపెట్టదు. దైవదూతలు ఎదురు వచ్చి వారికి స్వాగతం పలికి, "మీకు వాగ్దానం చేయబడిన మీ దినం ఇదే" అని అంటారు.

**104 - 106** ఆ రోజున మేము ఆకాశాన్ని చిట్టాకాగితాలను చుట్టే విధంగా చుట్టిపడేస్తాము. మేము మొదట్లో సృష్టిని చేసినట్లే మళ్ళీ దానిని చేస్తాము. ఇది మాపై బాధ్యతగా ఉన్న ఒక వాగ్దానం. మేము ఈ పనిని ఎలాగైనా చేయవలసే ఉన్నది. మేము జబూర్ గ్రంథంలోనూ హితబోధ చేసిన తరువాత, సౌశీల్యవంతులైన మా దాసులే భూమికి వారసులవు[17]తారని వ్రాసిపెట్టాము. ఆరాధనాపరుల కొరకు ఇందులో గొప్ప సమాచారం ఉన్నది.

ఆజ్ఞానుసారం ఒక చేప ఆయనను మింగడం వల్ల చేపలవాడు అని అనటం జరిగింది, సాఫ్ఫాత్ సూరా 142వ ఆయత్‌లో ప్రవచింపబడినవిధంగా.

وَ مَآ اَرْسَلْنٰكَ اِلَّا رَحْمَةً لِّلْعٰلَمِيْنَ ﴿١٠٧﴾ قُلْ
اِنَّمَا يُوْحٰٓى اِلَيَّ اَنَّمَآ اِلٰهُكُمْ اِلٰهٌ وَّاحِدٌ ۚ فَهَلْ
اَنْتُمْ مُّسْلِمُوْنَ ﴿١٠٨﴾ فَاِنْ تَوَلَّوْا فَقُلْ اٰذَنْتُكُمْ
عَلٰى سَوَآءٍ ؕ وَاِنْ اَدْرِيْٓ اَقَرِيْبٌ اَمْ بَعِيْدٌ
مَّا تُوْعَدُوْنَ ﴿١٠٩﴾ اِنَّهٗ يَعْلَمُ الْجَهْرَ مِنَ الْقَوْلِ
وَيَعْلَمُ مَا تَكْتُمُوْنَ ﴿١١٠﴾ وَ اِنْ اَدْرِيْ لَعَلَّهٗ
فِتْنَةٌ لَّكُمْ وَمَتَاعٌ اِلٰى حِيْنٍ ﴿١١١﴾ قٰلَ رَبِّ
احْكُمْ بِالْحَقِّ ؕ وَرَبُّنَا الرَّحْمٰنُ الْمُسْتَعَانُ عَلٰى
مَا تَصِفُوْنَ ﴿١١٢﴾ ع ١٩ النصف

**107 - 111** ఓ ప్రవక్తా! మేము నిన్ను ప్రపంచ మానవులకు కారుణ్యంగా పంపాము. వారితో ఇలా అను, "నా వద్దకు వచ్చే వహీ ఏమిటంటే; మీ దేవుడు కేవలం ఒక్కడే. ఇకనైనా మీరు విధేయులవుతారా?" ఒకవేళ వారు విముఖులైతే, అప్పుడు ఇలా అను, "నేను బహిరంగంగా మిమ్మల్ని హెచ్చరించాను. ఇక మీకు వాగ్దానం చేయబడుతూ ఉన్న విషయం దగ్గర్లో ఉందో లేక దూరంలో ఉందో నాకు తెలియదు. బిగ్గరగా పలికే మాటలను కూడ అల్లాహ్ ఎరుగును. మీరు రహస్యంగా పలికే మాటలను కూడ ఆయన ఎరుగును. బహుశా ఇది (ఆలస్యం) మీ కొరకు ఒక పరీక్షయేమో, ఒక ప్రత్యేక వ్యవధి వరకు ప్రపంచాన్ని అనుభవించటానికి మీకు అవకాశం ఇవ్వబడుతూ ఉన్నదేమో అని నేను అనుకుంటున్నాను."

**112** (చివరకు) దైవప్రవక్త ఇలా అన్నాడు, "నా ప్రభూ! సత్యంతో తీర్పు చేయి. ప్రజలారా! మీరు కల్పించే విషయాల బారినుండి కరుణామయుడైన మా ప్రభువే మాకు సహాయపడతాడని మేము నమ్ముకున్నాము."

12. అంటే, ఆయన వలసపోయేందుకు ప్రభువు ఆదేశం రాకమునుపే, తన జాతి ప్రజల మీద ఆగ్రహంతో వెళ్ళిపోయారు.
13. అంటే, అంధకారబంధురమైన చేప కడుపులో నుండి; దానితోపాటు చీకట్లమయమైన సముద్ర గర్భం నుండి.
14. అంటే, హజ్రత్ మర్యమ్ (అస్సలామ్) అని అర్థం.
15. అంటే, ప్రళయం సంభవించే సమయం.
16. ఒక హదీసు ప్రకారం ఈ ఆయతును గురించి ముష్రిక్కుల సర్దారు ఒకడు ఒక అధిక్షేపణను లేవనెత్తాడు. అదేమిటంటే, ఇలా చూస్తే కేవలం మేము పూజించే దేవుళ్ళు మాత్రమే కాక, ప్రవక్తలైన ఏసు, ఉజైర్‌లతో పాటు దేవదూతలు కూడ నరకానికి పోతారు. ఎందుకంటే, ప్రపంచంలో వారు కూడ పూజింపబడేవారు. దానికి మహాప్రవక్త (సఅసమ్) ఇలా సెలవిచ్చారు: అవును, అల్లాహ్‌కు బదులుగా తనను ఆరాధించటాన్ని ఇష్టపడిన ప్రతి వ్యక్తీ తనను ఆరాధించిన వారితో పాటు నరకానికే పోతాడు.
17. ఈ ఆయతును అర్థం చేసుకోవటానికి, జుమర్ సూరాలోని 73, 74 ఆయతులను చూడగలరు.

ఆయతులు 78 | **22. అల్ హజ్** | అవతరణ మదీనాలో

*అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

**1 – 2** మానవులారా! మీ ప్రభువు ఆగ్రహం నుండి మిమ్మల్ని మీరు రక్షించుకోండి. యథార్థం ఏమిటంటే, ప్రళయం నాటి భూకంపం మహా (భయంకరమైన) విషయం. దానిని మీరు చూచినప్పుడు దాని స్థితి ఎలా ఉంటుందంటే; పాలు పట్టే ప్రతి స్త్రీ పాలు త్రాగే తన పాపను మరచిపోతుంది, ప్రతి గర్భిణి యొక్క గర్భం పడిపోతుంది, ప్రజలు మీకు మత్తులో ఉన్నట్లు కనిపిస్తారు, వాస్తవానికి వారు త్రాగి ఉండరు. కాని అల్లాహ్ శిక్షయే అంత తీవ్రంగా ఉంటుంది.

**3 – 7** ప్రజలలో కొందరు జ్ఞానం లేకపోయినా అల్లాహ్‌ను గురించి వాదిస్తారు. తిరగబడిన ప్రతి షైతాన్‌ను అనుసరిస్తారు. వాస్తవానికి అతడి అదృష్టం ఇలా వ్రాయబడి ఉంది: వాడిని స్నేహితుడుగా చేసుకునే మనిషిని వాడు మార్గం తప్పించి మరీ వదలిపెడతాడు, నరకయాతన వైపునకు మార్గం చూపుతాడు. మానవులారా! ఒకవేళ మీకు మరణానంతర జీవితం గురించి ఏదైనా సందేహం ఉంటే, మీరు ఈ విషయాన్ని తెలుసుకోవాలి: మేము మిమ్మల్ని మట్టితో సృష్టించాము, తరువాత వీర్య బిందువుతో, ఆ తరువాత నెత్తుటి గడ్డతో, ఆపై మాంసపు కండతో; అది రూపం కలదిగానూ, రూపం లేనిది గానూ ఉంటుంది. (మేము ఈ విషయాన్ని) మీకు యథార్థం ఏమిటో స్పష్టం చెయ్యాలని (తెలుపుతున్నాము). మేము కోరిన (వీర్య బిందువును) దానిని ఒక ప్రత్యేక కాలం వరకు మాతృగర్భాలలో నిలిపి ఉంచుతాము. తరువాత మిమ్మల్ని ఒక శిశువు రూపంలో బయటికితీస్తాము. (ఆ తరువాత మీకు పెట్టి పోషిస్తాము) మీరు నిండు యౌవన దశకు చేరటానికి. మీలో ఒకడు ముందుగానే వెనుకకు పిలుచుకోబడతాడు, మరొకడు అతి నికృష్టమైన వయస్సు వైపునకు మరలింపబడతాడు, అంతా తెలిసిన తరువాత కూడ ఏమీ తెలియకుండా ఉండటానికి.

۲۲ سُوۡرَۃُ الۡحَجِّ مَدَنِیَّۃٌ ۱۰۳

اٰیاتھا ۷۸ | رکوعاتھا ۱۰

بِسۡمِ اللّٰہِ الرَّحۡمٰنِ الرَّحِیۡمِ ○

یٰۤاَیُّہَا النَّاسُ اتَّقُوۡا رَبَّکُمۡ ۚ اِنَّ زَلۡزَلَۃَ
السَّاعَۃِ شَیۡءٌ عَظِیۡمٌ ﴿۱﴾ یَوۡمَ تَرَوۡنَہَا تَذۡہَلُ
کُلُّ مُرۡضِعَۃٍ عَمَّاۤ اَرۡضَعَتۡ وَ تَضَعُ کُلُّ ذَاتِ
حَمۡلٍ حَمۡلَہَا وَ تَرَی النَّاسَ سُکٰرٰی وَ مَا ہُمۡ
بِسُکٰرٰی وَ لٰکِنَّ عَذَابَ اللّٰہِ شَدِیۡدٌ ﴿۲﴾ وَ مِنَ
النَّاسِ مَنۡ یُّجَادِلُ فِی اللّٰہِ بِغَیۡرِ عِلۡمٍ وَّ یَتَّبِعُ
کُلَّ شَیۡطٰنٍ مَّرِیۡدٍ ﴿۳﴾ کُتِبَ عَلَیۡہِ اَنَّہٗ مَنۡ
تَوَلَّاہُ فَاَنَّہٗ یُضِلُّہٗ وَ یَہۡدِیۡہِ اِلٰی عَذَابِ
السَّعِیۡرِ ﴿۴﴾ یٰۤاَیُّہَا النَّاسُ اِنۡ کُنۡتُمۡ فِیۡ رَیۡبٍ
مِّنَ الۡبَعۡثِ فَاِنَّا خَلَقۡنٰکُمۡ مِّنۡ تُرَابٍ ثُمَّ مِنۡ
نُّطۡفَۃٍ ثُمَّ مِنۡ عَلَقَۃٍ ثُمَّ مِنۡ مُّضۡغَۃٍ
مُّخَلَّقَۃٍ وَّ غَیۡرِ مُخَلَّقَۃٍ لِّنُبَیِّنَ لَکُمۡ ؕ وَ نُقِرُّ
فِی الۡاَرۡحَامِ مَا نَشَآءُ اِلٰۤی اَجَلٍ مُّسَمًّی ثُمَّ
نُخۡرِجُکُمۡ طِفۡلًا ثُمَّ لِتَبۡلُغُوۡۤا اَشُدَّکُمۡ ۚ وَ
مِنۡکُمۡ مَّنۡ یُّتَوَفّٰی وَ مِنۡکُمۡ مَّنۡ یُّرَدُّ اِلٰۤی اَرۡذَلِ
الۡعُمُرِ لِکَیۡلَا یَعۡلَمَ مِنۡۢ بَعۡدِ عِلۡمٍ شَیۡئًا ؕ

وَ تَرَى الْاَرْضَ هَامِدَةً فَاِذَآ اَنْزَلْنَا عَلَيْهَا
الْمَآءَ اهْتَزَّتْ وَ رَبَتْ وَ اَنْۢبَتَتْ مِنْ كُلِّ
زَوْجٍۢ بَهِيْجٍ ٥ ذٰلِكَ بِاَنَّ اللّٰهَ هُوَ الْحَقُّ وَ
اَنَّهٗ يُحْيِ الْمَوْتٰى وَ اَنَّهٗ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ ۙ ٦
وَّ اَنَّ السَّاعَةَ اٰتِيَةٌ لَّا رَيْبَ فِيْهَا ۙ وَ اَنَّ
اللّٰهَ يَبْعَثُ مَنْ فِي الْقُبُوْرِ ٧ وَ مِنَ النَّاسِ
مَنْ يُّجَادِلُ فِي اللّٰهِ بِغَيْرِ عِلْمٍ وَّ لَا هُدًى وَّ لَا
كِتٰبٍ مُّنِيْرٍ ۙ ٨ ثَانِيَ عِطْفِهٖ لِيُضِلَّ عَنْ
سَبِيْلِ اللّٰهِ ؕ لَهٗ فِي الدُّنْيَا خِزْيٌ وَّنُذِيْقُهٗ
يَوْمَ الْقِيٰمَةِ عَذَابَ الْحَرِيْقِ ٩ ذٰلِكَ بِمَا
قَدَّمَتْ يَدٰكَ وَ اَنَّ اللّٰهَ لَيْسَ بِظَلَّامٍ
لِّلْعَبِيْدِ ١٠ وَمِنَ النَّاسِ مَنْ يَّعْبُدُ اللّٰهَ عَلٰى ع ٨
حَرْفٍ ۚ فَاِنْ اَصَابَهٗ خَيْرُ ِۨاطْمَاَنَّ بِهٖ ۚ وَ اِنْ
اَصَابَتْهُ فِتْنَةُ ِۨانْقَلَبَ عَلٰى وَجْهِهٖ ۚ خَسِرَ الدُّنْيَا
وَالْاٰخِرَةَ ؕ ذٰلِكَ هُوَ الْخُسْرَانُ الْمُبِيْنُ ١١ يَدْعُوْا
مِنْ دُوْنِ اللّٰهِ مَا لَا يَضُرُّهٗ وَمَا لَا يَنْفَعُهٗ ؕ
ذٰلِكَ هُوَ الضَّلٰلُ الْبَعِيْدُ ۚ ١٢ يَدْعُوْا لَمَنْ ضَرُّهٗٓ
اَقْرَبُ مِنْ نَّفْعِهٖ ؕ لَبِئْسَ الْمَوْلٰى وَ لَبِئْسَ
الْعَشِيْرُ ١٣ اِنَّ اللّٰهَ يُدْخِلُ الَّذِيْنَ اٰمَنُوْا
وَعَمِلُوا الصّٰلِحٰتِ جَنّٰتٍ تَجْرِيْ مِنْ تَحْتِهَا
الْاَنْهٰرُ ؕ اِنَّ اللّٰهَ يَفْعَلُ مَا يُرِيْدُ ١٤ مَنْ كَانَ
يَظُنُّ اَنْ لَّنْ يَّنْصُرَهُ اللّٰهُ فِي الدُّنْيَا وَ الْاٰخِرَةِ
فَلْيَمْدُدْ بِسَبَبٍ اِلَى السَّمَآءِ ثُمَّ لْيَقْطَعْ فَلْيَنْظُرْ
هَلْ يُذْهِبَنَّ كَيْدُهٗ مَا يَغِيْظُ ١٥

ఎండిపోయిన నేలను మీరు చూస్తున్నారు, తరువాత మేము దానిపై వర్షం కురిపించగానే, అకస్మాత్తుగా అది పులకరిస్తుంది మరియు ఉబుకుతుంది, ఇంకా అది అన్ని రకాల మనోహరమైన మొక్కలను మొలకెత్తించటం ప్రారంభిస్తుంది. దీనికంతటికీ కారణం, అల్లాహ్‌యే సత్యం కావటం, ఆయన మృతులను బ్రతికించటం మరియు ప్రతిదానిపై అధికారం కలిగి ఉండటం; ఇంకా (ఇది మరొక విషయానిక్కాడ నిదర్శనమే) ఏమిటంటే, ప్రళయఘడియ తప్పకుండా వచ్చి తీరుతుంది, ఇందులో ఏ అనుమానానికీ ఆస్కారం లేదు, గోరీలలోకి వెళ్ళిపోయినవారిని అల్లాహ్ తప్పకుండా లేపుతాడు.

**8 - 10** మానవులలో ఇంకా కొందరు ఏ జ్ఞానమూ లేకపోయినా, ఏ మార్గదర్శకత్వమూ లేకపోయినా, జ్యోతిని ప్రసాదించే ఏ గ్రంథమూ లేకుండానే, తలబిరుసుతనంతో అల్లాహ్‌ను గురించి తగవులాడుతారు. తద్వారా వారు ప్రజలను అల్లాహ్ మార్గం నుండి తప్పింపజూస్తారు. అలాంటి వ్యక్తి ప్రపంచంలో అవమానం పాలవుతాడు, ప్రళయంనాడు మేము అతనికి అగ్ని బాధను రుచి చూపిస్తాము- ఇది నీ భవిష్యత్తు; దానిని స్వయంగా నీ చేతులే నీకై సిద్ధపరచి ఉంచాయి. నిజానికి అల్లాహ్ తన దాసులకు అన్యాయం చేసేవాడు కాదు.

**11 - 15** ప్రజలలో ఒకడు (విశ్వాసం) అంచులపై నిలబడి అల్లాహ్‌కు దాస్యం చేసేవాడు ఉన్నాడు;[1] ఒకవేళ లాభం కలిగితే తృప్తి పొందుతాడు; కాని ఏదైనా ఆపద సంభవిస్తే విముఖుడవుతాడు. అతనికి ఇహమూ దక్కదు, పరమూ దక్కదు. స్పష్టమైన నష్టం అంటే ఇదే. అతను అల్లాహ్‌ను కాదని, తనకు నష్టంగాని, లాభంగాని కలిగించలేని వారిని వేడుకుంటున్నాడు. ఇది మార్గభ్రష్టత్వానికి పరాకాష్ఠ. ఎవరి నష్టమైతే వారు చేసే లాభానికి అత్యంత సమీపంలో ఉందో, వారిని అతడు వేడుకుంటున్నాడు. ఎంత నికృష్టుడు అతని సంరక్షకుడు, ఎంత నికృష్టుడు అతని సహచరుడు. (దీనికి ప్రతిగా) ఎవరు విశ్వసించారో, మరెవరు మంచిపనులు చేశారో, వారిని అల్లాహ్ నిశ్చయంగా క్రింద సెలయేళ్లు ప్రవహించే ఉద్యానవనాల్లో ప్రవేశింప జేస్తాడు. అల్లాహ్ తాను కోరింది చేస్తాడు. ప్రపంచంలోనూ, పరలోకంలోనూ అల్లాహ్ తనకు ఏ సహాయమూ చేయడని అనుమానించే వ్యక్తి ఒక తాడు ద్వారా ఆకాశాన్ని చేరి దానికి కన్నం వేయాలి, తరువాత తనకు అయిష్టమైన దానిని తన యుక్తి నిరోధించగలుగుతుందేమో అనే విషయాన్ని ఆ కన్నం ద్వారా అతడు చూసుకోవాలి.

وَ كَذٰلِكَ اَنْزَلْنٰهُ اٰيٰتٍۭ بَيِّنٰتٍ ۙ وَّاَنَّ اللّٰهَ
يَهْدِيْ مَنْ يُّرِيْدُ ﴿١٦﴾ اِنَّ الَّذِيْنَ اٰمَنُوْا وَالَّذِيْنَ
هَادُوْا وَ الصّٰبِـِٕيْنَ وَ النَّصٰرٰى وَ الْمَجُوْسَ
وَالَّذِيْنَ اَشْرَكُوْٓا ۖ اِنَّ اللّٰهَ يَفْصِلُ بَيْنَهُمْ
يَوْمَ الْقِيٰمَةِ ؕ اِنَّ اللّٰهَ عَلٰى كُلِّ شَيْءٍ
شَهِيْدٌ ﴿١٧﴾ اَلَمْ تَرَ اَنَّ اللّٰهَ يَسْجُدُ لَهٗ مَنْ فِي
السَّمٰوٰتِ وَ مَنْ فِي الْاَرْضِ وَ الشَّمْسُ
وَالْقَمَرُ وَالنُّجُوْمُ وَ الْجِبَالُ وَ الشَّجَرُ وَالدَّ
وَآبُّ وَ كَثِيْرٌ مِّنَ النَّاسِ ؕ وَكَثِيْرٌ حَقَّ عَلَيْهِ
الْعَذَابُ ؕ وَ مَنْ يُّهِنِ اللّٰهُ فَمَا لَهٗ مِنْ
مُّكْرِمٍ ؕ اِنَّ اللّٰهَ يَفْعَلُ مَا يَشَآءُ ۩ ﴿١٨﴾ هٰذٰنِ السجدة ١٨
خَصْمٰنِ اخْتَصَمُوْا فِيْ رَبِّهِمْ ۫ فَالَّذِيْنَ كَفَرُوْا
قُطِّعَتْ لَهُمْ ثِيَابٌ مِّنْ نَّارٍ ؕ يُصَبُّ مِنْ
فَوْقِ رُءُوْسِهِمُ الْحَمِيْمُ ﴿١٩﴾ ۚ يُصْهَرُ بِهٖ مَا فِيْ
بُطُوْنِهِمْ وَالْجُلُوْدُ ﴿٢٠﴾ وَ لَهُمْ مَّقَامِعُ مِنْ
حَدِيْدٍ ﴿٢١﴾ كُلَّمَآ اَرَادُوْٓا اَنْ يَّخْرُجُوْا مِنْهَا مِنْ
غَمٍّ اُعِيْدُوْا فِيْهَا ۗ وَذُوْقُوْا عَذَابَ الْحَرِيْقِ ﴿٢٢﴾ ع ٢/٩
اِنَّ اللّٰهَ يُدْخِلُ الَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا
الصّٰلِحٰتِ جَنّٰتٍ تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ
يُحَلَّوْنَ فِيْهَا مِنْ اَسَاوِرَ مِنْ ذَهَبٍ وَّ لُؤْلُؤًا ؕ
وَ لِبَاسُهُمْ فِيْهَا حَرِيْرٌ ﴿٢٣﴾ وَ هُدُوْٓا اِلَى الطَّيِّبِ
مِنَ الْقَوْلِ ۚ وَ هُدُوْٓا اِلٰى صِرَاطِ الْحَمِيْدِ ﴿٢٤﴾

**16** ఇటువంటి స్పష్టమైన బోధలతోనే మేము ఈ ఖుర్ఆన్‌ను అవతరింపజేశాము. అల్లాహ్ తాను కోరిన వారికి మార్గం చూపుతాడు.

**17 - 18** విశ్వసించినవారు, యూదులుగా మారినవారు, సాబియీలు, క్రైస్తవులు, మజూసీలు (అగ్ని పూజారులు) షిర్కు చేసినవారు - వారందరిని గురించి అల్లాహ్ ప్రళయం నాడు తీర్పు చెబుతాడు. ప్రతి విషయమూ అల్లాహ్ దృష్టిలో ఉన్నది. ఆకాశాలలోనూ, భూమిలోనూ ఉన్న సమస్తమూ, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, పర్వతాలు, వృక్షాలు, జంతువులు, చాలమంది మానవులు, శిక్షకు అర్హులైన చాలమంది ప్రజలు అల్లాహ్ ముందు వినమ్రులై ఉండటాన్ని నీవు చూడటంలేదా? అల్లాహ్ ఎవరినైతే అవమానం పాలుజేస్తాడో, ఇక అతనికి గౌరవం ఇచ్చేవాడెవ్వడూ ఉండడు. అల్లాహ్ తాను కోరిన దానిని చేస్తాడు.

**19 - 24** అవి రెండు వర్గాలు, వాటి మధ్య తమ ప్రభువును గురించి వివాదం[2] తలెత్తింది. వారిలో అవిశ్వాసులైన వారి కొరకు అగ్ని వస్త్రాలు కత్తిరించబడి ఉన్నాయి, వారి శిరస్సులపై మరిగే నీరు పోయబడుతుంది. దానివల్ల వారి చర్మాలే కాదు, కడుపు లోపలి భాగాలు సైతం కరిగిపోతాయి. వారిని దండించటానికి ఇనుపగదలు ఉంటాయి. ఎప్పుడైనా వారు కంగారుపడి నరకం నుండి బయటపడే ప్రయత్నం చేస్తే, వారు మళ్లీ అందులోకే నెట్టబడతారు, "ఇప్పుడు చవి చూడండి దహన శిక్షను" అని అనబడుతూ (మరొకవైపు) విశ్వసించి, మంచి పనులు చేసినవారిని అల్లాహ్, క్రింద సెలయేళ్లు ప్రవహించే ఉద్యానవనాలలో ప్రవేశింపజేస్తాడు. అక్కడ వారు స్వర్ణ కంకణాలతో, ముత్యాలతో అలంకరించబడతారు. వారు పట్టు వస్త్రాలు ధరిస్తారు. (దీనికి కారణం) పరిశుద్ధ వచనాన్ని స్వీకరించే మార్గం వారికి ప్రసాదించబడింది, స్తుతింపబడే గుణ విశేషాలు గల దేవుని మార్గం వారికి చూపబడింది.

إِنَّ الَّذِينَ كَفَرُوا وَ يَصُدُّونَ عَنْ سَبِيلِ
اللهِ وَ الْمَسْجِدِ الْحَرَامِ الَّذِي جَعَلْنٰهُ لِلنَّاسِ
سَوَآءً الْعَاكِفُ فِيهِ وَالْبَادِ ۗ وَ مَنْ يُّرِدْ
فِيهِ بِإِلْحَادٍ بِظُلْمٍ نُّذِقْهُ مِنْ عَذَابٍ أَلِيمٍ ﴿٢٥﴾ ع ٣ ١٠
وَ إِذْ بَوَّأْنَا لِإِبْرٰهِيمَ مَكَانَ الْبَيْتِ أَنْ لَّا
تُشْرِكْ بِي شَيْئًا وَّ طَهِّرْ بَيْتِيَ لِلطَّآئِفِينَ وَ
الْقَآئِمِينَ وَالرُّكَّعِ السُّجُودِ ﴿٢٦﴾ وَ أَذِّنْ فِي
النَّاسِ بِالْحَجِّ يَأْتُوكَ رِجَالًا وَّعَلٰى كُلِّ ضَامِرٍ
يَّأْتِينَ مِنْ كُلِّ فَجٍّ عَمِيقٍ ﴿٢٧﴾ لِّيَشْهَدُوا
مَنَافِعَ لَهُمْ وَ يَذْكُرُوا اسْمَ اللهِ فِيٓ أَيَّامٍ
مَّعْلُومٰتٍ عَلٰى مَا رَزَقَهُمْ مِّنْۢ بَهِيمَةِ
الْأَنْعَامِ ۚ فَكُلُوا مِنْهَا وَ أَطْعِمُوا الْبَآئِسَ
الْفَقِيرَ ﴿٢٨﴾ ثُمَّ لْيَقْضُوا تَفَثَهُمْ وَلْيُوفُوا
نُذُورَهُمْ وَ لْيَطَّوَّفُوا بِالْبَيْتِ الْعَتِيقِ ﴿٢٩﴾
ذٰلِكَ ۗ وَ مَنْ يُّعَظِّمْ حُرُمٰتِ اللهِ فَهُوَ خَيْرٌ لَّهٗ
عِنْدَ رَبِّهٖ ۗ وَأُحِلَّتْ لَكُمُ الْأَنْعَامُ إِلَّا مَا
يُتْلٰى عَلَيْكُمْ فَاجْتَنِبُوا الرِّجْسَ مِنَ الْأَوْثَانِ
وَاجْتَنِبُوا قَوْلَ الزُّورِ ﴿٣٠﴾ حُنَفَآءَ لِلّٰهِ غَيْرَ
مُشْرِكِينَ بِهٖ ۗ وَ مَنْ يُّشْرِكْ بِاللهِ فَكَأَنَّمَا
خَرَّ مِنَ السَّمَآءِ فَتَخْطَفُهُ الطَّيْرُ أَوْ تَهْوِي بِهِ
الرِّيحُ فِي مَكَانٍ سَحِيقٍ ﴿٣١﴾

**25** ఎవరు తిరస్కరించారో, ఇంకా (ఈనాడు) అల్లాహ్ మార్గం వైపునకు రాకుండా (ప్రజలను) అడ్డగిస్తున్నారో,-మేము సర్వ మానవుల కొరకు నిర్మించిన[3] పరిశుద్ధ మసీదులో స్థానిక ప్రజల యొక్క మరియు బయటనుండి వచ్చే వారి యొక్క హక్కులు సరిసమానంగా ఉన్నాయి - దాని సందర్శనానికి అవరోధంగా ఉన్నారో (వారి వైఖరి నిశ్చయముగా శిక్షార్హ మైనదే). దీని (పరిశుద్ధ మసీదు)లో, నిజాయితీ నుండి వైదొలగి, అన్యాయపు పద్ధతిని అవలంబించే వాడికి మేము వ్యధాభరితమైన శిక్షను రుచి చూపిస్తాము.

**26 - 29** మేము ఇబ్రాహీమ్‌కు ఈ గృహం (కాబా గృహం) కొరకు స్థలాన్ని సూచించినప్పటి సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకో. (అప్పుడు మేము ఇలా ఉపదేశించాము) నాకు దేనినీ భాగస్వామిగా చేయకు, ప్రదక్షిణం చేసేవారి కొరకూ, ఖియామ్, రుకూ, సజ్దాలు చేసేవారి కొరకూ నా గృహాన్ని పరిశుద్ధంగా ఉంచు, హజ్ కొరకై మానవులందరికీ పిలుపు ఇవ్వు, వారు నీ వద్దకు ప్రతి సుదూర ప్రాంతం నుండి కాలినడకతోనూ, ఒంటెల పైనా ఎక్కి రావాలని మరియు వచ్చి వారు తమ కొరకు ఇక్కడ ఉంచబడిన ప్రయోజనాలను చూసుకోవాలని. అల్లాహ్ వారికి ప్రసాదించిన పశువుల మీద కొన్ని నిర్ణీత దినాలలో ఆయన పేరును స్మరించాలి, స్వయంగా వారూ తినాలి, లేమికి గురిఅయిన అగత్యపరులకూ పెట్టాలి. తరువాత వారు తమ మాలిన్యాన్ని దూరం చేసుకోవాలి, తమ మొక్కుబడులను చెల్లించుకోవాలి మరియు ఆ ప్రాచీన గృహానికి ప్రదక్షిణ చెయ్యాలి.

**30 ...** (కాబా నిర్మాణ లక్ష్యం) ఇది. ఎవడైనా అల్లాహ్ విధించిన పవిత్ర నియమాలను గౌరవిస్తే, అది అతని ప్రభువు దృష్టిలో స్వయంగా అతడికి శ్రేష్ఠమైనది.

... **30 - 31** మీ కొరకు పశువులు ధర్మసమ్మతము చేయబడ్డాయి,[4] ఇది వరకే మీకు తెలుపబడినవి తప్ప. కనుక విగ్రహాల మాలిన్యానికి దూరంగా ఉండండి, అబద్ధపు మాటలు పలక్కండి, ఏకాగ్రతతో అల్లాహ్‌కు దాసులు అవండి, దైవత్వంలో ఆయనకు ఎవరినీ భాగస్వాములుగా చేయకండి. ఇతరులను అల్లాహ్‌కు భాగస్వాములుగా చేసేవాడు ఆకాశం నుండి క్రిందపడిపోయినట్లే. అతనిని, ఇక పక్షులైనా తన్నుకుపోతాయి లేదా గాలి అతనిని ముక్కలు ముక్కలయ్యే[5] ప్రదేశానికైనా విసరివేస్తుంది.

ذٰلِكَ ۚ وَ مَنۡ یُّعَظِّمۡ شَعَآئِرَ اللّٰهِ فَاِنَّهَا مِنۡ
تَقۡوَی الۡقُلُوۡبِ ﴿۳۲﴾ لَكُمۡ فِیۡهَا مَنَافِعُ اِلٰۤی اَجَلٍ
مُّسَمًّی ثُمَّ مَحِلُّهَاۤ اِلَی الۡبَیۡتِ الۡعَتِیۡقِ ﴿۳۳﴾ وَ ع
لِكُلِّ اُمَّةٍ جَعَلۡنَا مَنۡسَكًا لِّیَذۡكُرُوا اسۡمَ اللّٰهِ
عَلٰی مَا رَزَقَهُمۡ مِّنۡۢ بَهِیۡمَةِ الۡاَنۡعَامِ ؕ فَاِلٰـهُكُمۡ
اِلٰهٌ وَّاحِدٌ فَلَهٗۤ اَسۡلِمُوۡا ؕ وَ بَشِّرِ الۡمُخۡبِتِیۡنَ ﴿۳۴﴾
الَّذِیۡنَ اِذَا ذُكِرَ اللّٰهُ وَجِلَتۡ قُلُوۡبُهُمۡ وَ
الصّٰبِرِیۡنَ عَلٰی مَاۤ اَصَابَهُمۡ وَ الۡمُقِیۡمِی الصَّلٰوةِ ۙ
وَ مِمَّا رَزَقۡنٰهُمۡ یُنۡفِقُوۡنَ ﴿۳۵﴾

**32** ఇదీ అసలు విషయం. (దానిని అర్థం చేసుకో) ఎవరైనా అల్లాహ్ నిర్ణయించిన చిహ్నాలను గౌరవిస్తున్నారంటే అది హృదయాలలోని దైవభీతి[6] వలననే.

**33** ఒక నిర్ణీత కాలం వరకు వాటి (హదీ పశువులు) ద్వారా లాభం పొందే హక్కు[7] మీకు ఉన్నది. ఆ తరువాత వాటిని (ఖుర్బానీ చేసే) స్థలం ఆ ప్రాచీన గృహం వద్దనే ఉన్నది.

**34 - 35** ప్రతి అనుచర సంఘానికి మేము ఒక ఖుర్బానీ పద్ధతిని నిర్ణయించాము; (ఆ అనుచర సంఘం) ప్రజలు అల్లాహ్ వారికి ప్రసాదించిన[8] పశువుల మీద ఆయన పేరును స్మరించటానికి. (ఈ విభిన్న పద్ధతుల ఉద్దేశ్యం ఒక్కటే). కనుక మీ దేవుడు ఒక్కడే. మీరు ఆయనకే విధేయులు అవండి. ఓ ప్రవక్తా! అణకువగల వైఖరిని అవలంబించే వారికి శుభ వార్తను అందజెయ్యి. వారి పరిస్థితి ఎలా ఉంటుందంటే, అల్లాహ్ ప్రస్తావన విన్నప్పుడు వారి గుండెలు అదిరిపోతాయి. వారి మీదకు ఏ ఆపద వచ్చిపడినా, దానికి వారు ఓరిమి వహిస్తారు, నమాజ్‌ను స్థాపిస్తారు, మేము వారికి ఇచ్చిన ఉపాధి నుండి ఖర్చు పెడతారు.

1. అంటే, అవిశ్వాసం ఇస్లాముల సరిహద్దు రేఖపై నిలబడి దాస్యం చేస్తాడు, సైన్యం పరిసరాలలో సంచరించే సంశయగ్రస్తుడైన సైనికుని మాదిరిగా. విజయం లభించే సూచనలు కనిపిస్తే, సైన్యంలోకి దూకుతాడు, పరాజయం సూచనలు చూసి మెల్లగా కాలికి బుద్ధిచెబుతాడు.
2. ఇక్కడ దేవుణ్ణి గురించి తర్కించే అన్ని వర్గాల వారిని, వారి సంఖ్యాబలంతో నిమిత్తం లేకుండా, రెండు ప్రధాన వర్గాలుగా విభజించటం జరిగింది. ఒకటి, దైవప్రవక్తల సందేశాన్ని విశ్వసించి, యథార్థ దైవదాస్యాన్ని అవలంబించే వర్గం. రెండోది, దైవప్రవక్తల సందేశాన్ని విశ్వసించక, అవిశ్వాస మార్గాన్ని అవలంబించే వర్గం. ఈ వర్గంలో వారికి ఎన్ని అభిప్రాయభేదాలు ఉన్నప్పటికీ, వారి అవిశ్వాసంలో ఎన్ని పోకడలు ఉన్నప్పటికీ.
3. అంటే, మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్)నూ, ఆయన అనుచరులనూ హజ్, ఉమ్రాలు చేయకుండా అడ్డుకున్నారు.
4. ఈ సందర్భంగా, మేసే పశువుల నిషేధం గురించి ప్రస్తావించటానికి కారణం, రెండు అపోహలను తొలగించటానికే. మొదటిది, ఖురైషులు, అరేబియా ముష్రిక్కులు బహీరాను, సాయిబాను, వశీలాను, హామ్‌ను అల్లాహ్ విధించిన నిషేధాలుగా పరిగణించేవారు. ఇవి ఆయన విధించిన నిషేధాలు కావు, ఆయన మేసే పశువులన్నింటినీ ధర్మసమ్మతం చేశాడు. రెండోది, ఇహ్రామ్ స్థితిలో వేటాడటాన్ని నిషేధించినట్లు, ఆ స్థితిలో మేసే పశువులను జిబాహ్ చేయటం, వాటిని తినటం కూడ నిషిద్ధమని భావించకూడదు. ఇవి అల్లాహ్ విధించిన నిషేధాలలోనివి కావని తెలుపబడుతోంది.
5. ఈ దృష్టాంతంలో ఆకాశం అంటే, మానవుని సహజ స్థితి అని అర్థం. ఆ స్థితిలో అతడు ఒక్క దేవునికి తప్ప మరెవరికీ దాసుడు కాలేడు, దేవుడు ఒక్కడే అనే విషయాన్ని తప్ప అతని నైజం మరొక మతాన్ని దేనినీ ఎరుగదు. ఒకవేళ మానవుడు దైవ ప్రవక్తలు అందజేసిన మార్గాన్ని అంగీకరిస్తే, అతడు ఆ సహజ స్థితిలోనే,

**36 - 37** (ఖుర్బానీ) ఒంటెలను మేము మీ కొరకు అల్లాహ్ చిహ్నాలలో చేర్చాము. మీకు వాటిలో మేలు ఉన్నది. కనుక వాటిని నిలబెట్టి వాటిపై అల్లాహ్ పేరును[9] స్మరించండి. (ఖుర్బానీ తరువాత) వాటి వీపులు నేలపై ఆనినప్పుడు,[10] వాటిలో నుండి స్వయంగానూ తినండి, (యాచించని) సంతుష్టులకూ తినిపించండి, తమ అవసరాలకు అడిగేవారికీ తినిపించండి. ఈ విధంగా మేము ఈ జంతువులను మీకు వశపరిచాము, మీరు కృతజ్ఞతలు తెలుపుకునేందుకు. వాటి మాంసమూ అల్లాహ్‌కు చేరదు, వాటి రక్తమూ చేరదు. కాని మీ భయభక్తులు ఆయనకు చేరుతాయి. ఆయన వాటిని మీకు ఈవిధంగా వశపరిచాడు; ఆయన ప్రసాదించిన మార్గదర్శకత్వానికి మీరు ఆయన గొప్పతనాన్ని చాటేందుకు.[11] ఓ ప్రవక్తా! సత్కార్యాలు చేసే వారికి శుభవార్త అందించు.

**38 - 41** నిశ్చయముగా అల్లాహ్ విశ్వసించినవారిని కాపాడతాడు. నిశ్చయముగా అల్లాహ్ నమ్మక ద్రోహి అయిన కృతఘ్నుణ్ణి ప్రేమించడు. ఎవరికి వ్యతిరేకంగా యుద్ధం చెయ్యబడుతూ ఉందో, వారికి (యుద్ధం చేయటానికి) అనుమతి ఇవ్వబడింది; ఎందుకంటే వారు అన్యాయానికి గురిఅయిన వారు.[12] నిశ్చయముగా అల్లాహ్ వారికి సహాయం చేయగల సమర్థుడు. వారు అన్యాయంగా తమ ఇళ్లనుండి తరిమివేయబడినవారు. వారి తప్పు కేవలం, “అల్లాహ్ మా ప్రభువు” అని అనటమే. అల్లాహ్ గనక ప్రజలను ఒకరి ద్వారా మరొకరిని తొలగిస్తూ ఉండకపోతే, ఆశ్రమాలు, చర్చీలు, యూదుల ప్రార్థనాలయాలు, మశీదులు-వేటిలో అల్లాహ్ పేరు అత్యధికంగా స్మరింపబడుతుందో - అన్నీ ధ్వంసం చేయబడి ఉండేవే. అల్లాహ్ తనకు సహాయం[13] చేసేవారికి తప్పకుండా సహాయపడతాడు. అల్లాహ్ మహా శక్తి మంతుడు, మహాబల వంతుడూను. మేము గనక వారికి భూమిపై అధికారాన్ని ప్రసాదిస్తే, వారు నమాజ్‌ను స్థాపిస్తారు, జకాత్ ఇస్తారు, మంచి చేయమని ఆజ్ఞాపిస్తారు, చెడునుండి నిరోధిస్తారు. సకల వ్యవహారాల అంతిమ నిర్ణయం అల్లాహ్ చేతులలో ఉంది.

وَالْبُدْنَ جَعَلْنٰهَا لَكُمْ مِّنْ شَعَآئِرِ اللّٰهِ لَكُمْ
فِيْهَا خَيْرٌ ۖ فَاذْكُرُوا اسْمَ اللّٰهِ عَلَيْهَا صَوَآفَّ ۚ
فَاِذَا وَجَبَتْ جُنُوْبُهَا فَكُلُوْا مِنْهَا وَ اَطْعِمُوا
الْقَانِعَ وَ الْمُعْتَرَّ ؕ كَذٰلِكَ سَخَّرْنٰهَا لَكُمْ
لَعَلَّكُمْ تَشْكُرُوْنَ ﴿٣٦﴾ لَنْ يَّنَالَ اللّٰهَ لُحُوْمُهَا وَ
لَا دِمَآؤُهَا وَ لٰكِنْ يَّنَالُهُ التَّقْوٰى مِنْكُمْ ؕ
كَذٰلِكَ سَخَّرَهَا لَكُمْ لِتُكَبِّرُوا اللّٰهَ عَلٰى مَا
هَدٰىكُمْ ؕ وَ بَشِّرِ الْمُحْسِنِيْنَ ﴿٣٧﴾ اِنَّ اللّٰهَ
يُدٰفِعُ عَنِ الَّذِيْنَ اٰمَنُوْا ؕ اِنَّ اللّٰهَ لَا يُحِبُّ
كُلَّ خَوَّانٍ كَفُوْرٍ ﴿٣٨﴾ ع اُذِنَ لِلَّذِيْنَ يُقٰتَلُوْنَ ع ٥ ١٢ الثلثة
بِاَنَّهُمْ ظُلِمُوْا ؕ وَاِنَّ اللّٰهَ عَلٰى نَصْرِهِمْ
لَقَدِيْرُ ۙ ﴿٣٩﴾ الَّذِيْنَ اُخْرِجُوْا مِنْ دِيَارِهِمْ بِغَيْرِ
حَقٍّ اِلَّآ اَنْ يَّقُوْلُوْا رَبُّنَا اللّٰهُ ؕ وَ لَوْ لَا دَفْعُ
اللّٰهِ النَّاسَ بَعْضَهُمْ بِبَعْضٍ لَّهُدِّمَتْ صَوَامِعُ وَ
بِيَعٌ وَّصَلَوٰتٌ وَّ مَسٰجِدُ يُذْكَرُ فِيْهَا اسْمُ اللّٰهِ
كَثِيْرًا ؕ وَلَيَنْصُرَنَّ اللّٰهُ مَنْ يَّنْصُرُهٗ ؕ اِنَّ اللّٰهَ
لَقَوِيٌّ عَزِيْزٌ ﴿٤٠﴾ اَلَّذِيْنَ اِنْ مَّكَّنّٰهُمْ فِى
الْاَرْضِ اَقَامُوا الصَّلٰوةَ وَ اٰتَوُا الزَّكٰوةَ وَ
اَمَرُوْا بِالْمَعْرُوْفِ وَ نَهَوْا عَنِ الْمُنْكَرِ ؕ وَ لِلّٰهِ
عَاقِبَةُ الْاُمُوْرِ ﴿٤١﴾

وَ اِنۡ يُّكَذِّبُوۡكَ فَقَدۡ كَذَّبَتۡ قَبۡلَهُمۡ قَوۡمُ نُوۡحٍ
وَّ عَادٌ وَّثَمُوۡدُ ﴿۴۲﴾ وَ قَوۡمُ اِبۡرٰهِيۡمَ وَ قَوۡمُ
لُوۡطٍ ﴿۴۳﴾ وَّاَصۡحٰبُ مَدۡيَنَ ۚ وَ كُذِّبَ مُوۡسٰى
فَاَمۡلَيۡتُ لِلۡكٰفِرِيۡنَ ثُمَّ اَخَذۡتُهُمۡ ۚ فَكَيۡفَ
كَانَ نَكِيۡرِ ﴿۴۴﴾ فَكَاَيِّنۡ مِّنۡ قَرۡيَةٍ اَهۡلَكۡنٰهَا وَ
هِىَ ظَالِمَةٌ فَهِىَ خَاوِيَةٌ عَلٰى عُرُوۡشِهَا وَ بِئۡرٍ
مُّعَطَّلَةٍ وَّ قَصۡرٍ مَّشِيۡدٍ ﴿۴۵﴾ اَفَلَمۡ يَسِيۡرُوۡا فِى
الۡاَرۡضِ فَتَكُوۡنَ لَهُمۡ قُلُوۡبٌ يَّعۡقِلُوۡنَ بِهَاۤ اَوۡ
اٰذَانٌ يَّسۡمَعُوۡنَ بِهَا ۚ فَاِنَّهَا لَا تَعۡمَى الۡاَبۡصَارُ
وَلٰكِنۡ تَعۡمَى الۡقُلُوۡبُ الَّتِىۡ فِى الصُّدُوۡرِ ﴿۴۶﴾

**42 - 46** ఓ ప్రవక్తా! వారు (అంటే అవిశ్వాసులు) నిన్ను నిరాకరిస్తున్నారంటే, వారికి పూర్వం నూహ్, ఆద్, సమూద్ జాతులు, ఇంకా ఇబ్రాహీమ్ జాతివారు, లూత్ జాతివారు, మద్యన్ వాసులు కూడ (తమ తమ ప్రవక్తలను) నిరాకరించారు (అనే విషయాన్ని జ్ఞాపకముంచుకో), ఇంకా మూసా కూడ తిరస్కరించబడ్డారు. ఈ సత్య తిరస్కారులందరికీ మొదట్లో నేను వ్యవధినిచ్చాను, తరువాత పట్టుకున్నాను. ఇక చూడు నా శిక్ష ఎంత భయంకరంగా ఉండినదో! పాపాల పుట్టలైన ఎన్నో జనపదాలను మేము నాశనం చేశాము, ఈనాడు అవి తమ కప్పులపై తలక్రిందులుగా పడి ఉన్నాయి, ఎన్నో బావులు నిరుపయోగంగా పడివున్నాయి, ఎన్నో ఎత్తైన భవనాలు శిధిలాలుగా మారిపోయాయి. వారు భూమిపై సంచరించలేదా వారి హృదయాలు అర్థం చేసుకోగలవిగా, వారి చెవులు వినగలవిగా కావటానికి? యథార్థం ఏమిటంటే, కళ్లు గుడ్డివి అవవు, కాని వక్షములలోపల ఉన్న హృదయాలు మాత్రం గుడ్డివి అయిపోతాయి.

జ్ఞానంతో, దూరదృష్టితో, స్థిరచిత్తంతో ఉండిపోతాడు. అతడు మరింత ఉన్నత స్థితికి చేరుకోవటానికి అర్రులు చాస్తూ ఉంటాడు, తక్కువ స్థితికి అంగీకరించడు. కాని షిర్కును అవలంబించినంతనే అతడు తన స్వాభావిక ఆకాశం నుండి హఠాత్తుగా క్రిందపడిపోతాడు. తరువాత అతనికి రెండే రెండు మార్గాలు శరణ్యాలు. ఒకటి, షైతానులు గానీ, సన్మార్గం తప్పించే మానవులు గానీ అతనిని చుట్టుముట్టి గద్దలు తన్నుకుపోయినట్టు తన్నుకుపోతారు. రెండు, స్వయంగా అతని మనోవాంఛలు, అతని ఉద్రేకాలు, అతని ఆలోచనలు అతనిని నిలవకుండా అటూ ఇటూ త్రిప్పి అగాధంలోకి ఒకనాడు విసరివేస్తాయి.

6. అంటే, ఈ గౌరవించటం అనేది వ్యక్తి హృదయంలోని భయభక్తుల ఫలితం; అతని హృదయంలో కొద్దో గొప్పో దైవభీతి ఉన్నదనే విషయానికి నిదర్శనం. కనుకనే అతను దేవుని చిహ్నాలను గౌరవిస్తున్నాడు.

7. మొదటి ఆయతులో అల్లాహ్ చిహ్నాలకు సంబంధించిన సాధారణ ఉత్తరువు ఇచ్చిన తరువాత, ఈ వాక్యం ఒక అపోహను తొలగించటానికి చెప్పటం జరిగింది. అల్లాహ్ చిహ్నాలలో ఖుర్బానీ పశువులు కూడా చేరివున్నాయి. ఈ ఖుర్బానీ పశువులను అల్లాహ్ గృహమైన కాబాకు తీసుకువెళ్లేటప్పుడు, వాటిపై స్వారీ చేయటంగానీ, వాటిపై సామానులను తీసుకువెళ్లటంగానీ, వాటి పాలు త్రాగుట కానీ నిషిద్ధమని అరేబియా వాసులు తలంచేవారు. ఈ అపోహను తొలగించటానికి, అవసరమైన పనికోసం వాటిని వినియోగించుకోవచ్చని ఇక్కడ చెప్పబడింది.

8. ఈ ఆయతు ద్వారా రెండు విషయాలు తెలుస్తున్నాయి. ఒకటి, ఖుర్బానీ అనేది దేవుని షరియత్తులలోని ఆరాధనా వ్యవస్థలో ఒక తప్పనిసరి కార్యం. రెండు, అసలు విషయం అల్లాహ్ పేరుతో ఖుర్బానీ ఇవ్వటం అనేది. ఇది అన్ని షరియత్తులలోనూ సమానముగా ఉన్నది. ఇక దాని సమయ సందర్భాలు, ఇతర వివరాలు; వాటిని గురించి భిన్నభిన్న కాలాలలో వచ్చిన షరియత్తులలోని ఆజ్ఞలు వేర్వేరుగా ఉన్నాయి.

9. వాటిపై అల్లాహ్ పేరును స్మరించండి అంటే, వాటిని జిబహ్ చేసేటప్పుడు అల్లాహ్ పేరును ఉచ్చరించండి అని అర్థం. మొదట ఒంటెను నిలబెట్టి, దాని గొంతును బల్లెముతో పొడవాలి. దీనినే నహ్ర్ ఇవ్వటం అంటారు.

وَيَسْتَعْجِلُوْنَكَ بِالْعَذَابِ وَلَنْ يُّخْلِفَ اللّٰهُ
وَعْدَهٗ ؕ وَاِنَّ يَوْمًا عِنْدَ رَبِّكَ كَاَلْفِ
سَنَةٍ مِّمَّا تَعُدُّوْنَ ﴿٤٧﴾ وَكَاَيِّنْ مِّنْ قَرْيَةٍ
اَمْلَيْتُ لَهَا وَهِيَ ظَالِمَةٌ ثُمَّ اَخَذْتُهَا ۚ وَاِلَيَّ
الْمَصِيْرُ ﴿٤٨﴾ قُلْ يٰۤاَيُّهَا النَّاسُ اِنَّمَاۤ اَنَا لَكُمْ
نَذِيْرٌ مُّبِيْنٌ ﴿٤٩﴾ فَالَّذِيْنَ اٰمَنُوْا وَعَمِلُوا
الصّٰلِحٰتِ لَهُمْ مَّغْفِرَةٌ وَّرِزْقٌ كَرِيْمٌ ﴿٥٠﴾ وَ
الَّذِيْنَ سَعَوْا فِيْۤ اٰيٰتِنَا مُعٰجِزِيْنَ اُولٰٓئِكَ
اَصْحٰبُ الْجَحِيْمِ ﴿٥١﴾

**47 - 48** వారు శిక్షకొరకై తొందరపెడుతున్నారు. అల్లాహ్ తన వాగ్దానానికి భంగకరంగా ఎంతమాత్రం వ్యవహరించడు. కాని నీ ప్రభువు వద్ద ఒక రోజు అంటే మీ లెక్కలో వెయ్యి సంవత్సరాలకు సమానమవుతుంది.[14] దుర్మార్గపు జనపదాలు ఎన్నో ఉండేవి, నేను మొదట వాటికి వ్యవధి ఇచ్చాను, తరువాత పట్టుకున్నాను. అందరూ తిరిగి నా వైపునకే రావలసి ఉంది.

**49 - 51** ఓ ప్రవక్తా! ఇలా అను, "మానవులారా! నేను మీకు కేవలం (కష్టకాలం రాకముందు) స్పష్టంగా హెచ్చరించే వ్యక్తిని మాత్రమే." కనుక విశ్వసించి మంచి పనులు చేసేవారికి క్షమాభిక్ష లభిస్తుంది, గౌరవప్రదమైన ఉపాధి కూడ లభిస్తుంది. మా ఆయతులను కించపరచటానికి ప్రయత్నం చేసే వారు నరకానికి మిత్రులు.

10. వీపులు నేలపై ఆనినప్పుడు అంటే, కేవలం అవి నేలపై ఒరిగిపోవటం అని మాత్రమే అర్థం కాదు. అవి నేలపై పడి చలనరహితమై పోవాలి, అంటే, విలవిలలాడటం మానెయ్యాలి, బొందినుండి ప్రాణం పూర్తిగా పోవాలి.

11. అంటే, మనఃపూర్వకంగా ఆయన ఘనతనూ, ఔన్నత్యాన్నీ అంగీకరించండి, దానిని ఆచరణ ద్వారా ప్రకటించండి, ప్రదర్శించండి. ఇది ఖుర్బానీ లక్ష్యాన్ని సూచిస్తుంది. ఖుర్బానీని విధిగా నిర్దేశించటానికి కారణం అల్లాహ్ పశువులను మన అధీనం చేసినందుకు కృతజ్ఞతా సూచకంగా మాత్రమే కాదు, ఈ పశువులు ఎవడివో, వాటిని ఎవడైతే మన అధీనంలో ఉంచాడో, వాడి యాజమాన్యపు హక్కులను మనము త్రికరణ శుద్ధిగా గౌరవించాలనేది కూడా ఒక కారణం, ఇదంతా మనసొత్తే అనే తలంపు కలలో కూడా రాకుండా ఉండేందుకు.

12. అల్లాహ్ మార్గంలో పోరాటం చేయటం గురించి అవతరించిన మొట్టమొదటి ఆయతు ఇది. ఈ ఆయతులో కేవలం అనుమతి మాత్రమే ఇవ్వబడింది. తరువాత బఖరా సూరాలో 190 నుంచి 193 వరకు గల ఆయతులు, ఆపై 216, 224 ఆయతులు అవతరించాయి. వాటిలో యుద్ధం చేయటానికి ఆదేశం ఇవ్వబడింది. ఈ ఉత్తరువుల మధ్య కేవలం కొన్ని మాసాల వ్యవధి మాత్రమే ఉన్నది. మా పరిశోధన ప్రకారం యుద్ధమునకు అనుమతి హిజ్రీ శకారంభంలో జిల్ హజ్జా మాసంలో అవతరించింది; యుద్ధపుటుత్తరువు బదర్ సంగ్రామానికి కొంచెం ముందు హిజ్రీ శకం రెండో సంవత్సరం రజ్జబ్ లేదా షాబాన్ మాసంలో అవతరించింది.

13. దేవుడు ఒక్కడే అనే విశ్వాసం వైపునకు మానవాళిని పిలిచేందుకు సత్య ధర్మ సంస్థాపనార్థమూ, చెడును త్రుంచి మంచిని పెంచటానికి పాటుపడేవారు అల్లాహ్ సహాయకులు అనే విషయం దివ్య ఖురానులో పలుచోట్ల ప్రస్తావనకు వచ్చింది. ఎందుకంటే ఇది దైవకార్యం. దాని నిర్వహణలో వారు తోడ్పడుతారు.

14. అంటే, మానవ జాతి చరిత్రకు సంబంధించిన దైవ నిర్ణయాలు మీ పంచాంగాలకు, మీరు గుణించే కాలానికి లోబడి ఉండవు. ఈ రోజు మీరు చేసే మంచి పనులకూ, చెడ్డపనులకూ వెంటనే ఫలితం మీకు కనిపించదు, ఒక జాతి వారితో, మీరు ఫలానా వైఖరిని అవలంబిస్తే, అది మీ పతనానికి దారితీస్తుంది అని అన్నప్పుడు, వారు, మేము ఈ వైఖరిని అవలంబించి 10 సంవత్సరాలో లేక 20 సంవత్సరాలో లేక 50 సంవత్సరాలో కావచ్చినా మాకు కీడేమీ జరగలేదు అని అంటే, ఆ జాతి తెలివి తక్కువ జాతి అని గ్రహించాలి. చారిత్రక ఫలితాలు సంభవించటానికి, రోజులూ, వారాలూ, నెలలూ, సంవత్సరాలే కాదు, శతాబ్దాలు కూడ పెద్ద లెక్కలోనికి రావు.

وَمَآ اَرْسَلْنَا مِنْ قَبْلِكَ مِنْ رَّسُوْلٍ وَّ لَا
نَبِيٍّ اِلَّآ اِذَا تَمَنّٰٓى اَلْقَى الشَّيْطٰنُ فِيْٓ
اُمْنِيَّتِهٖ ۚ فَيَنْسَخُ اللّٰهُ مَا يُلْقِي الشَّيْطٰنُ ثُمَّ
يُحْكِمُ اللّٰهُ اٰيٰتِهٖ ؕ وَ اللّٰهُ عَلِيْمٌ حَكِيْمٌ ۙ﴿٥٢﴾
لِّيَجْعَلَ مَا يُلْقِي الشَّيْطٰنُ فِتْنَةً لِّلَّذِيْنَ فِيْ
قُلُوْبِهِمْ مَّرَضٌ وَّ الْقَاسِيَةِ قُلُوْبُهُمْ ؕ وَ اِنَّ
الظّٰلِمِيْنَ لَفِيْ شِقَاقٍۭ بَعِيْدٍ ۙ﴿٥٣﴾ وَّ لِيَعْلَمَ
الَّذِيْنَ اُوْتُوا الْعِلْمَ اَنَّهُ الْحَقُّ مِنْ رَّبِّكَ
فَيُؤْمِنُوْا بِهٖ فَتُخْبِتَ لَهٗ قُلُوْبُهُمْ ؕ وَ اِنَّ
اللّٰهَ لَهَادِ الَّذِيْنَ اٰمَنُوْٓا اِلٰى صِرَاطٍ
مُّسْتَقِيْمٍ ﴿٥٤﴾ وَ لَا يَزَالُ الَّذِيْنَ كَفَرُوْا فِيْ
مِرْيَةٍ مِّنْهُ حَتّٰى تَاْتِيَهُمُ السَّاعَةُ بَغْتَةً اَوْ
يَاْتِيَهُمْ عَذَابُ يَوْمٍ عَقِيْمٍ ﴿٥٥﴾ اَلْمُلْكُ يَوْمَئِذٍ
لِّلّٰهِ ؕ يَحْكُمُ بَيْنَهُمْ ؕ فَالَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا
الصّٰلِحٰتِ فِيْ جَنّٰتِ النَّعِيْمِ ﴿٥٦﴾ وَ الَّذِيْنَ
كَفَرُوْا وَ كَذَّبُوْا بِاٰيٰتِنَا فَاُولٰٓئِكَ لَهُمْ عَذَابٌ
مُّهِيْنٌ ﴿٥٧﴾ وَ الَّذِيْنَ هَاجَرُوْا فِيْ سَبِيْلِ اللّٰهِ ع
ثُمَّ قُتِلُوْٓا اَوْ مَاتُوْا لَيَرْزُقَنَّهُمُ اللّٰهُ رِزْقًا
حَسَنًا ؕ وَ اِنَّ اللّٰهَ لَهُوَ خَيْرُ الرّٰزِقِيْنَ ﴿٥٨﴾
لَيُدْخِلَنَّهُمْ مُّدْخَلًا يَّرْضَوْنَهٗ ؕ وَ اِنَّ اللّٰهَ
لَعَلِيْمٌ حَلِيْمٌ ﴿٥٩﴾ ذٰلِكَ ۚ وَ مَنْ عَاقَبَ بِمِثْلِ مَا
عُوْقِبَ بِهٖ ثُمَّ بُغِيَ عَلَيْهِ لَيَنْصُرَنَّهُ اللّٰهُ ؕ اِنَّ
اللّٰهَ لَعَفُوٌّ غَفُوْرٌ ﴿٦٠﴾

**52 - 54** ఓ ప్రవక్తా! నీకు పూర్వం, అతను కోరుకున్నప్పుడు, అతని ఆ కోరికలో షైతాన్ జోక్యం చేసుకోని ఏ సందేశహరుణ్ణీ, ఏ ప్రవక్తనూ మేము పంపి ఉండలేదు. ఇటువంటి షైతాన్ జోక్యాలను అల్లాహ్ నిర్మూలిస్తాడు మరియు తన ఆయతులను పటిష్ఠపరుస్తాడు. అల్లాహ్ సర్వజ్ఞాని, మహా వివేకి. (ఆయన ఇలా ఎందుకు జరగనిస్తాడంటే) ఎవరి హృదయాలకు (కపటం) రోగం తగిలిందో, మరెవరి హృదయాలు మొద్దుబారి పోయాయో, వారికొరకై, షైతాన్ కల్పించిన చెడును, ఒక పరీక్షగా చెయ్యటానికి – యథార్థం ఏమిటంటే ఈ దుర్మార్గులు శత్రుత్వంలో చాల దూరం వెళ్లి పోయారు– జ్ఞాన సంపన్నులైన ప్రజలు ఇది నీ ప్రభువు నుండి వచ్చిన సత్యమని తెలుసుకోవటానికీ, వారు దాన్ని విశ్వసించటానికీ, వారి హృదయాలు ఆయన ముందు వంగిపోవటానికీ. నిశ్చయంగా అల్లాహ్, విశ్వసించే వారికి ఎల్లప్పుడూ ఋజువైన మార్గం చూపుతాడు.[15]

**55 - 60** అవిశ్వాసులు దానిని గురించి సంశయంలోనే పడి ఉంటారు, చివరికి వారిపైకి ప్రళయ ఘడియ అయినా వచ్చి పడుతుంది లేదా ఒక దౌర్భాగ్య దినపు శిక్ష అయినా అవతరిస్తుంది. ఆనాడు రాజ్యాధికారం అల్లాహ్‌దవుతుంది, ఆయన వారి మధ్య తీర్పు చేస్తాడు. విశ్వసించినవారు, మంచి పనులు చేసినవారు వరాలతో నిండి ఉన్న ఉద్యానవనాలలోకి పోతారు. అవిశ్వాసానికి పాల్పడి, మా ఆయతులను తిరస్కరించిన వారికి అవమానకరమైన శిక్షపడుతుంది. ఎవరు అల్లాహ్ మార్గంలో వలసపోయారో, తరువాత చంపబడ్డారో లేక మరణించారో వారికి అల్లాహ్ మంచి ఉపాధిని ప్రసాదిస్తాడు. నిశ్చయంగా అల్లాహ్ మాత్రమే ఉత్తమ ఉపాధి ప్రదాత. వారు తృప్తిపడే స్థలానికి ఆయన వారిని చేరుస్తాడు. నిస్సందేహంగా అల్లాహ్ సర్వమూ తెలిసినవాడు, సంయమనం కలవాడూను. ఇదీ వారి పరిణామం. ఇక, ఎవరయితే తనపై జరిగినమేరకే ప్రతీకారం చేస్తాడో, పైగా అతనిపై అత్యాచారం కూడా జరిగి వుంటే అల్లాహ్ అతనికి తప్పకుండా సహాయం చేస్తాడు. అల్లాహ్ క్షమించేవాడు, మన్నించేవాడూను.

ذٰلِكَ بِاَنَّ اللّٰهَ يُوْلِجُ الَّيْلَ فِي النَّهَارِ وَ
يُوْلِجُ النَّهَارَ فِي الَّيْلِ وَاَنَّ اللّٰهَ سَمِيْعٌۢ
بَصِيْرٌ ﴿٦١﴾ ذٰلِكَ بِاَنَّ اللّٰهَ هُوَ الْحَقُّ وَاَنَّ مَا
يَدْعُوْنَ مِنْ دُوْنِهٖ هُوَ الْبَاطِلُ وَ اَنَّ اللّٰهَ هُوَ
الْعَلِيُّ الْكَبِيْرُ ﴿٦٢﴾ اَلَمْ تَرَ اَنَّ اللّٰهَ اَنْزَلَ مِنَ
السَّمَآءِ مَآءً ۡ فَتُصْبِحُ الْاَرْضُ مُخْضَرَّةً ؕ اِنَّ
اللّٰهَ لَطِيْفٌ خَبِيْرٌ ﴿٦٣﴾ لَهٗ مَا فِي السَّمٰوٰتِ وَ مَا
فِي الْاَرْضِ ؕ وَ اِنَّ اللّٰهَ لَهُوَ الْغَنِيُّ الْحَمِيْدُ ﴿٦٤﴾ ع ٨ ١٥
اَلَمْ تَرَ اَنَّ اللّٰهَ سَخَّرَ لَكُمْ مَّا فِي الْاَرْضِ
وَالْفُلْكَ تَجْرِيْ فِي الْبَحْرِ بِاَمْرِهٖ ؕ وَ يُمْسِكُ
السَّمَآءَ اَنْ تَقَعَ عَلَى الْاَرْضِ اِلَّا بِاِذْنِهٖ ؕ
اِنَّ اللّٰهَ بِالنَّاسِ لَرَءُوْفٌ رَّحِيْمٌ ﴿٦٥﴾ وَ هُوَ
الَّذِيْٓ اَحْيَاكُمْ ۡ ثُمَّ يُمِيْتُكُمْ ثُمَّ يُحْيِيْكُمْ ؕ اِنَّ
الْاِنْسَانَ لَكَفُوْرٌ ﴿٦٦﴾

**61 - 66** ఇలా ఎందుకు జరుగుతుందంటే, రాత్రి నుండి పగలునూ, పగలు నుండి రాత్రినీ వెలికి తీసేవాడు అల్లాహ్‌యే గనుక. ఆయన అన్నీ వినేవాడు అన్నీ చూసేవాడు గనుక. ఇలా ఎందుకు జరుగుతుందంటే, అల్లాహ్‌యే సత్యం గనుక. అల్లాహ్‌ను కాదని వారు వేడుకునేవన్నీ అసత్యం గనుక. అల్లాహ్‌యే ఆధిక్యం గలవాడు మరియు మహోన్నతుడు. ఆకాశం నుండి అల్లాహ్ నీటిని కురిపించటాన్నీ, తద్వారా భూమి సస్యశ్యామలం అయిపోవటాన్నీ నీవు చూడటం లేదా? యథార్థం ఏమిటంటే, ఆయన అత్యంత సూక్ష్మ శక్తికలవాడు, సర్వమూ ఎరిగినవాడు.[16] ఆకాశాలలో ఉన్నదీ, భూమిపై ఉన్నదీ అంతా ఆయనదే. నిస్సందేహంగా ఆయనే నిరపేక్షా పరుడు, స్తుతింపబడేవాడు. భూమిపై ఉన్న సమస్తాన్నీ ఆయన మీకు వశపరచాడు. ఆయనే పడవను నియమబద్ధం చేశాడు, అది ఆయన ఆజ్ఞానుసారం సముద్రంలో నడుస్తుంది. ఆయనే ఆకాశాన్ని నిలిపి ఉంచాడు, అది ఆయన అనుమతి లేకుండా నేలపై పడజాలదు. ఇదంతా మీరు చూడటం లేదా? వాస్తవం ఏమిటంటే, మానవుల పట్ల అల్లాహ్ ఎంతో వాత్సల్యం కలవాడు, ఎంతో కరుణగలవాడు. ఆయనే మీకు జీవితాన్ని ప్రసాదించాడు, ఆయనే మీకు మృత్యువును కలుగజేస్తాడు; ఆయనే మిమ్మల్ని మళ్లీ బ్రతికిస్తాడు. నిజంగానే మానవుడు పరమ సత్యధిక్కారి.[17]

15. అర్థం ఏమిటంటే, షైతాను చేసే తుంటరి పనులను అల్లాహ్ ప్రజలకు పరీక్షగానూ, అసలు వస్తువును నకిలీ వస్తువు నుండి వేరు చేయటానికి మార్గముగానూ చేశాడు. దుష్టమనస్తత్వం కల ప్రజలు ఈ విషయాలను ఆధారంగా చేసుకుని తప్పుడు నిర్ణయాలు చేస్తారు. ఇవి వారు మార్గం తప్పటానికి సాధనాలుగా పనిచేస్తాయి. నిష్కల్మష హృదయం కలవారికి ఈ విషయాలే, మహాప్రవక్త (సఅసమ్) సత్యవంతుడనీ, దైవగ్రంథం సత్యమైనదనీ, నమ్మకం కలిగిస్తాయి. ఇంకా, ఇవన్నీ షైతాను ఆగడాలని వారు తెలుసుకుంటారు. ఈ సందేశం నిశ్చయంగా హితముతోనూ, సత్యముతోనూ కూడుకున్న సందేశమనీ, లేకపోతే షైతాను ఇంత కలవరపాటు చెందదనీ వారు సంతృప్తిని చెందుతారు. అప్పటి మహాప్రవక్త (సఅసమ్) సందేశస్థితిని స్థూలదృష్టితో చూసిన వారు ఆయన తమ లక్ష్యసాధనలో పరాజితులయ్యారు అని భ్రమపడ్డారు. ఒక వ్యక్తి తన జాతి ప్రజలు తనను దైవప్రవక్తగా విశ్వసించాలని ఆరాటపడ్డాడు; కాని ఆయనకు స్వదేశం విడిచి వలసపోవటం చివరకు తప్పలేదు, మక్కా అవిశ్వాసులు గెలిచారు అనే విషయం స్థూల దృష్టిగల వారికి గోచరమవుతుంది. ఈ పరిస్థితిలో, "నేను దైవప్రవక్తను, నాకు దేవుని తోడ్పాటు కలదు" అనే మహాప్రవక్త(స) ప్రకటనను, "ప్రవక్తను తిరస్కరించే జాతిపై అల్లాహ్ శిక్ష అవతరిస్తుంది" అనే ఖురాను వాక్యాలను చూసిన ప్రజలు మహాప్రవక్త (స) సత్యత, ఖురాను సత్యతల గురించి సంశయంలో పడేవారు. మహాప్రవక్త (స)ను వ్యతిరేకించేవారు, "దేవుని తోడ్పాటు ఏమయింది, శిక్షకు సంబంధించిన ఆ బెదిరింపులు ఏమయ్యాయి, మమ్మల్ని భయపెట్టిన శిక్ష ఇప్పుడు ఎందుకు రాదు" అని ఎగతాళిగా మాట్లాడేవారు. ఈ ప్రశ్నలకే ఈ ఆయతులలో సమాధానం ఇవ్వబడింది.

لِكُلِّ أُمَّةٍ جَعَلْنَا مَنسَكًا هُمْ نَاسِكُوهُ فَلَا
يُنَازِعُنَّكَ فِي الْأَمْرِ وَادْعُ إِلَىٰ رَبِّكَ ۖ إِنَّكَ
لَعَلَىٰ هُدًى مُّسْتَقِيمٍ ﴿٦٧﴾ وَإِن جَادَلُوكَ فَقُلِ
اللَّهُ أَعْلَمُ بِمَا تَعْمَلُونَ ﴿٦٨﴾ اللَّهُ يَحْكُمُ بَيْنَكُمْ
يَوْمَ الْقِيَامَةِ فِيمَا كُنتُمْ فِيهِ تَخْتَلِفُونَ ﴿٦٩﴾
أَلَمْ تَعْلَمْ أَنَّ اللَّهَ يَعْلَمُ مَا فِي السَّمَاءِ وَ
الْأَرْضِ ۗ إِنَّ ذَٰلِكَ فِي كِتَابٍ ۚ إِنَّ ذَٰلِكَ
عَلَى اللَّهِ يَسِيرٌ ﴿٧٠﴾ وَيَعْبُدُونَ مِن دُونِ اللَّهِ
مَا لَمْ يُنَزِّلْ بِهِ سُلْطَانًا وَمَا لَيْسَ لَهُم بِهِ
عِلْمٌ ۗ وَمَا لِلظَّالِمِينَ مِن نَّصِيرٍ ﴿٧١﴾ وَإِذَا
تُتْلَىٰ عَلَيْهِمْ آيَاتُنَا بَيِّنَاتٍ تَعْرِفُ فِي وُجُوهِ
الَّذِينَ كَفَرُوا الْمُنكَرَ ۖ يَكَادُونَ يَسْطُونَ
بِالَّذِينَ يَتْلُونَ عَلَيْهِمْ آيَاتِنَا ۗ قُلْ
أَفَأُنَبِّئُكُم بِشَرٍّ مِّن ذَٰلِكُمُ ۗ النَّارُ وَعَدَهَا
اللَّهُ الَّذِينَ كَفَرُوا ۖ وَبِئْسَ الْمَصِيرُ ﴿٧٢﴾ ع ٨ ١٢

**67 - 70** ప్రతి అనుచర సంఘానికి మేము ఒక ఆరాధనా పద్ధతిని నిర్ణయించాము, అది దానిని అనుసరిస్తోంది. కనుక ఓ ప్రవక్తా! వారు ఈ విషయంలో నీతో తగాదాపడకూడదు.[18] నీవు నీ ప్రభువు వైపునకు పిలువు. నిశ్చయంగా నీవు ఋజు మార్గంలో ఉన్నావు. ఒకవేళ వారు నీతో వివాదానికి తలపడితే, ఇలా అను, "మీరు చేసేదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు. ప్రళయం నాడు అల్లాహ్ మీ మధ్య మీరు విభేదించుకుంటూ వచ్చిన అన్ని విషయాలను గురించి తీర్పు చెబుతాడు." ఆకాశం లోనూ, భూమిపైనా ఉన్న ప్రతి వస్తువును గురించి అల్లాహ్‌కు తెలుసని నీవు ఎరుగవా? అంతా ఒక గ్రంథంలో వ్రాయబడి ఉంది. అల్లాహ్‌కు ఇదేమంత కష్టమైనది కానేకాదు.

**71-72** ఈ జనం అల్లాహ్‌ను కాదని ఎవరినైతే ఆరాధిస్తు న్నారో, వారి కొరకు అల్లాహ్ కూడ ఏ ప్రమాణాన్నీ అవతరింప జేయలేదు, వీరు కూడ వారిని గురించి ఏమీ ఎరుగరు. ఈ దుర్మార్గులకు సహాయపడే వాడెవ్వడూ లేడు. వారికి స్పష్టమైన మా ఆయతులను వినిపించినప్పుడు, సత్యతిరస్కారుల ముఖాలు మాడిపోవటాన్ని నీవు చూస్తావు. ఇంకా వారు మా ఆయతు లను వినిపించే వారిపై వెంటనే విరుచుకుపడతారేమో అనిపి స్తుంది. వారికి ఇలా చెప్పు, "దీనికంటే కూడ ఘోరమైన విషయ మేమిటో నేను మీకు తెలిపేదా? అది అగ్ని. సత్యాన్ని స్వీకరించక నిరాకరించే వారి విషయంలో అల్లాహ్ దానిని గురించిన వాగ్దానమే చేశాడు. అది అతి చెడ్డనివాస స్థలం."

16. అంటే, అవిశ్వాసముతోనూ, అన్యాయముతోనూ కూడిన వైఖరిని అవలంబించిన వారిపై శిక్షను అవతరింప జేయటమూ, విశ్వాసులూ, సజ్జనులూ అయిన భక్తులకు బహుమానం ఇవ్వటమూ; పీడితులైన సత్య విశ్వాసులను ఓదార్చటమూ; శక్తియుక్తులతో అన్యాయాన్ని ఎదిరించే వారికి తోడ్పడటమూ, ఇవన్నీ ఆయనలోని గుణవిశేషాలకు ప్రతిరూపాలు.

17. అంటే, ఇదంతా చూస్తూ కూడా, మానవుడు దైవప్రవక్తలు అందజేసిన యథార్థాన్ని తిరస్కరిస్తున్నాడు.

18. అంటే, పూర్వపు దైవప్రవక్తలు తమ తమ కాలాల సంఘాలకై ఒక ఆరాధనా వ్యవస్థను తీసుకువచ్చిన విధంగానే, ఈ కాలపు సంఘం కోసం నీవు ఒక ఆరాధనా వ్యవస్థను తీసుకువచ్చావు. ఇక దీని విషయంలో నీతో చర్చించే హక్కు ఎవరికీ లేనే లేదు. ఎందుకంటే ఈ కాలానికి ఇదియే సత్యమైన ఆరాధనా వ్యవస్థ.

يٰۤاَيُّهَا النَّاسُ ضُرِبَ مَثَلٌ فَاسْتَمِعُوْا لَهٗ ؕ اِنَّ
الَّذِيْنَ تَدْعُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ لَنْ يَّخْلُقُوْا
ذُبَابًا وَّ لَوِ اجْتَمَعُوْا لَهٗ ؕ وَ اِنْ يَّسْلُبْهُمُ
الذُّبَابُ شَيْـًٔا لَّا يَسْتَنْقِذُوْهُ مِنْهُ ؕ ضَعُفَ
الطَّالِبُ وَ الْمَطْلُوْبُ ﴿٧٣﴾ مَا قَدَرُوا اللّٰهَ حَقَّ
قَدْرِهٖ ؕ اِنَّ اللّٰهَ لَقَوِيٌّ عَزِيْزٌ ﴿٧٤﴾ اَللّٰهُ
يَصْطَفِيْ مِنَ الْمَلٰٓئِكَةِ رُسُلًا وَّ مِنَ النَّاسِ ؕ
اِنَّ اللّٰهَ سَمِيْعٌۢ بَصِيْرٌ ﴿٧٥﴾ يَعْلَمُ مَا بَيْنَ
اَيْدِيْهِمْ وَ مَا خَلْفَهُمْ ؕ وَ اِلَى اللّٰهِ تُرْجَعُ
الْاُمُوْرُ ﴿٧٦﴾ يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا ارْكَعُوْا
وَاسْجُدُوْا وَاعْبُدُوْا رَبَّكُمْ وَافْعَلُوا الْخَيْرَ
لَعَلَّكُمْ تُفْلِحُوْنَ ۚ۩ ﴿٧٧﴾ وَجَاهِدُوْا فِى اللّٰهِ حَقَّ
جِهَادِهٖ ؕ هُوَ اجْتَبٰىكُمْ وَمَا جَعَلَ عَلَيْكُمْ فِى
الدِّيْنِ مِنْ حَرَجٍ ؕ مِلَّةَ اَبِيْكُمْ اِبْرٰهِيْمَ ؕ هُوَ
سَمّٰىكُمُ الْمُسْلِمِيْنَ ۙ مِنْ قَبْلُ وَفِيْ هٰذَا
لِيَكُوْنَ الرَّسُوْلُ شَهِيْدًا عَلَيْكُمْ وَ تَكُوْنُوْا
شُهَدَآءَ عَلَى النَّاسِ ۚۖ فَاَقِيْمُوا الصَّلٰوةَ وَاٰتُوا
الزَّكٰوةَ وَاعْتَصِمُوْا بِاللّٰهِ ؕ هُوَ مَوْلٰىكُمْ ۚ فَنِعْمَ
الْمَوْلٰى وَ نِعْمَ النَّصِيْرُ ﴿٧٨﴾

السجدة عند الشافعي

ع ١٠

**73 - 74** మానవులారా! ఒక ఉదాహరణ ఇవ్వబడుతోంది; దానిని శ్రద్ధగా వినండి: అల్లాహ్‌ను కాదని మీరు ఏ దేవుళ్లను వేడుకుంటున్నారో, వారందరూ కలసి సమైక్యంగా ఒక్క ఈగను సృష్టించదలచినా, అలా చేయలేరు. అంతేకాదు, ఒకవేళ ఈగ వారినుండి ఏదైనా వస్తువును లాక్కుపోయినా, వారు దానిని విడిపించుకురానూలేరు. సహాయాన్ని అర్థించేవారూ బలహీనులే, సహాయం కోసం అర్థింపబడేవారూ బలహీనులే. అల్లాహ్ గొప్పతనాన్నే వారు గుర్తించ వలసిన విధంగా గుర్తించ లేదు. నిజానికి అల్లాహ్ మాత్రమే శక్తిమంతుడు, గౌరవనీయు డూను.

**75 - 76** యధార్థం ఏమిటంటే, అల్లాహ్ (తన ఉత్తరువులను అందజేయటానికి) సందేశహరులను దైవదూతల నుండీ, మానవులనుండీ ఎన్నుకుంటాడు. ఆయన అన్నీ వింటాడు, అన్నీ చూస్తాడు. ప్రజల ముందు ఉన్న దానిని ఆయన ఎరుగును, వారికి గోప్యంగా ఉన్నదాన్నీ ఆయన ఎరుగును. వ్యవహారాలన్నీ ఆయన వైపునకే మరలుతాయి.

**77 - 78** విశ్వాసులారా! రుకూ చేయండి, సజ్దా చెయ్యండి, మీ ప్రభువుకు దాస్యం చెయ్యండి, మంచిపనులు చెయ్యండి. దీని ద్వారానే మీకు సాఫల్య భాగ్యం లభిస్తుందని ఆశించవచ్చు. అల్లాహ్ మార్గంలో జిహాద్ చెయ్యండి, జిహాద్ చెయ్యవలసిన విధంగా. ఆయన మిమ్మల్ని తన సేవకై ఎన్ను కున్నాడు. ధర్మంలో మీకు ఏ ఇబ్బందినీ ఉంచలేదు. మీ తండ్రి ఇబ్రాహీమ్ ధర్మంపై స్థిరంగా ఉండండి. పూర్వం కూడ అల్లాహ్ మీకు "ముస్లిమ్" అనే పేరునే పెట్టాడు, ఇందులో (ఖుర్ఆన్‌లో) కూడ (మీ పేరు ఇదే); దైవ ప్రవక్త మీ విషయంలో సాక్షిగా ఉండటానికీ మరియు మీరు ప్రజల విషయంలో సాక్షులుగా ఉండటానికీ. కనుక నమాజును స్థాపించండి, జకాతు ఇవ్వండి, అల్లాహ్‌తో గట్టి సంబంధం కలిగి ఉండండి. ఆయన మీకు సంరక్షకుడు, ఎంతో మంచి సంరక్షకుడు, ఎంతో మంచి సహాయకుడు.

ఆయతులు 118 | **23. అల్ మూ'మినూన్** | అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 11** నిశ్చయముగా సాఫల్యం పొందే విశ్వాసులు తమ నమాజులో వినమ్రతను పాటిస్తారు, వ్యర్థ విషయాల జోలికి పోరు. జకాత్ విధానాన్ని ఆచరిస్తారు, తమ మర్మాంగాలను పరిరక్షించుకుంటారు,[1] - తమ భార్యల, తమ అధీనంలో ఉన్న స్త్రీల విషయంలో తప్ప.[2] వీరి విషయంలో పరిరక్షించు కోని పక్షంలో వారు నిందార్హులు కారు. అయితే ఎవరైనా దీనిని మించి కోరుకుంటే వారే అత్యాచారం చేసేవారు- తమ అమానతులకు, తమ వాగ్దానాలకు కట్టుబడి ఉంటారు, తమ నమాజులను శ్రద్ధగా కాపాడుకుంటారు. వారే స్వర్గాన్ని వారసత్వంగా పొందేవారు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు.

**12 - 16** మేము మానవుణ్ణి మట్టియొక్క సారంతో సృష్టించాము; తరువాత అతనిని ఒక సురక్షితమైన స్థానంలో పడే బిందువుగా మార్చాము, ఆ తరువాత ఈ బిందువుకు ముద్ద ఆకారాన్ని ఇచ్చాము, ఆపైన ముద్దను కండగా చేశాము, తరువాత మాంసపుకండను ఎముకలుగా చేశాము, ఆ తరువాత ఎముకలకు మాంసాన్ని తొడిగాము, ఆపైన దానిని భిన్నమైన సృష్టిగా చేసి నిలబెట్టాము.[3] కనుక అల్లాహ్ ఎంతో శుభప్రదుడు, సృజనకారులందరిలోకెల్లా ఉత్తమ సృజన కారుడు. దాని తరువాత మీరు తప్పనిసరిగా మరణిస్తారు, మళ్లీ ప్రళయం నాడు నిస్సందేహంగా లేపబడతారు.

٢٣ سُوْرَةُ الْمُؤْمِنُوْنَ مَكِّيَّةٌ ٧٤

اٰياتها ١١٨ | ركوعاتها ٦

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

قَدْ اَفْلَحَ الْمُؤْمِنُوْنَ ۝١ الَّذِيْنَ هُمْ فِيْ
صَلَاتِهِمْ خٰشِعُوْنَ ۝٢ وَالَّذِيْنَ هُمْ عَنِ اللَّغْوِ
مُعْرِضُوْنَ ۝٣ وَالَّذِيْنَ هُمْ لِلزَّكٰوةِ فٰعِلُوْنَ ۝٤
وَالَّذِيْنَ هُمْ لِفُرُوْجِهِمْ حٰفِظُوْنَ ۝٥ اِلَّا عَلٰٓى
اَزْوَاجِهِمْ اَوْ مَا مَلَكَتْ اَيْمَانُهُمْ فَاِنَّهُمْ غَيْرُ
مَلُوْمِيْنَ ۝٦ فَمَنِ ابْتَغٰى وَرَآءَ ذٰلِكَ فَاُولٰٓئِكَ
هُمُ الْعٰدُوْنَ ۝٧ وَالَّذِيْنَ هُمْ لِاَمٰنٰتِهِمْ وَ
عَهْدِهِمْ رٰعُوْنَ ۝٨ وَالَّذِيْنَ هُمْ عَلٰى صَلَوٰتِهِمْ
يُحَافِظُوْنَ ۝٩ اُولٰٓئِكَ هُمُ الْوٰرِثُوْنَ ۝١٠ الَّذِيْنَ
يَرِثُوْنَ الْفِرْدَوْسَ هُمْ فِيْهَا خٰلِدُوْنَ ۝١١
وَلَقَدْ خَلَقْنَا الْاِنْسَانَ مِنْ سُلٰلَةٍ مِّنْ طِيْنٍ ۝١٢
ثُمَّ جَعَلْنٰهُ نُطْفَةً فِيْ قَرَارٍ مَّكِيْنٍ ۝١٣ ثُمَّ
خَلَقْنَا النُّطْفَةَ عَلَقَةً فَخَلَقْنَا الْعَلَقَةَ مُضْغَةً
فَخَلَقْنَا الْمُضْغَةَ عِظٰمًا فَكَسَوْنَا الْعِظٰمَ لَحْمًا
ثُمَّ اَنْشَاْنٰهُ خَلْقًا اٰخَرَ فَتَبٰرَكَ اللّٰهُ اَحْسَنُ
الْخٰلِقِيْنَ ۝١٤ ثُمَّ اِنَّكُمْ بَعْدَ ذٰلِكَ لَمَيِّتُوْنَ ۝١٥
ثُمَّ اِنَّكُمْ يَوْمَ الْقِيٰمَةِ تُبْعَثُوْنَ ۝١٦

الجزء ١٨

وقف لازم

1. దీనికి రెండు అర్థాలు ఉన్నాయి; ఒకటి, తమ శరీరంలో సిగ్గు కలిగించే భాగాలను గోప్యంగా ఉంచుతారు అంటే దిగంబరత్వానికి దూరంగా ఉంటారు. తమ ఆచ్ఛాదనను ఇతరుల ముందు తీసివేయరు. రెండు, వారు తమ పవిత్రతనూ, తమ శీలాన్నీ కాపాడుకుంటారు. అంటే, కామ సంబంధమైన విషయాలలో విశృంఖలతను పాటించరు. ఇంద్రియ శక్తిని వినియోగించటంలో కూడ అతిగా వ్యవహరించరు.

**17 - 20** మీపైన మేము ఏడు మార్గాలను నిర్మించాము;[4] సృష్టిక్రియను మేము ఎరుగనివారము కాము.[5] ఆకాశం నుండి మేము సరిగ్గా లెక్క ప్రకారం ఒక ప్రత్యేక పరిమాణంలో నీటిని దింపాము, దానిని భూమిలోపల నిలువచేశాము. మేము దానిని ఎలా కోరితే అలా మాయం చేయగలం. తరువాత ఆ నీటి ద్వారా మేము మీ కొరకు ఖర్జూరపు తోటలనూ, ద్రాక్ష తోటలనూ సృష్టించాము. ఈ తోటలలో మీ కొరకు అత్యంత రుచికరమైన పండ్లు ఉన్నాయి; వాటి ద్వారా మీరు ఉపాధిని పొందుతారు. ఇంకా మేము తూరు సీనా ప్రాంతంలో పుట్టే చెట్టును[6] కూడ సృష్టించాము, అది నూనెను కూడ ఇస్తుంది. ఇంకా తినేవారికి కూరగా కూడ ఉపయోగపడుతుంది.

**21 - 22** నిజంగానే పశువులలో కూడ మీకు ఒక గుణపాఠం ఉంది. వాటి గర్భాలలో ఉన్న దానినుంచే మేము ఒక వస్తువును (అంటే పాలు) మీకు త్రాపుతున్నాము. మీకు వాటిలో ఇంకా ఎన్నో ఇతర లాభాలు కూడ ఉన్నాయి. వాటిని మీరు తింటారు, వాటిపైనా, పడవలలోనూ ఎక్కుతారు కూడ.

وَلَقَدْ خَلَقْنَا فَوْقَكُمْ سَبْعَ طَرَآئِقَ ۖ وَمَا كُنَّا عَنِ
الْخَلْقِ غٰفِلِيْنَ ١٧ وَاَنْزَلْنَا مِنَ السَّمَآءِ مَآءًۢ
بِقَدَرٍ فَاَسْكَنّٰهُ فِى الْاَرْضِ ۖ وَاِنَّا عَلٰى
ذَهَابٍۭ بِهٖ لَقٰدِرُوْنَ ١٨ فَاَنْشَاْنَا لَكُمْ بِهٖ
جَنّٰتٍ مِّنْ نَّخِيْلٍ وَّاَعْنَابٍ ۘ لَكُمْ فِيْهَا فَوَاكِهُ
كَثِيْرَةٌ وَّمِنْهَا تَاْكُلُوْنَ ١٩ وَشَجَرَةً تَخْرُجُ
مِنْ طُوْرِ سَيْنَآءَ تَنْۢبُتُ بِالدُّهْنِ وَصِبْغٍ
لِّلْاٰكِلِيْنَ ٢٠ وَاِنَّ لَكُمْ فِى الْاَنْعَامِ لَعِبْرَةً ۗ
نُسْقِيْكُمْ مِّمَّا فِىْ بُطُوْنِهَا وَلَكُمْ فِيْهَا مَنَافِعُ
كَثِيْرَةٌ وَّمِنْهَا تَاْكُلُوْنَ ٢١ وَعَلَيْهَا وَعَلَى
الْفُلْكِ تُحْمَلُوْنَ ٢٢

وقف لازم

ع ٢٢

2. అంటే, యుద్ధంలో అదుపులోకి తీసుకోబడిన బానిస స్త్రీలు. యుద్ధ ఖైదీల మార్పిడి జరగక పోవటం వల్ల, ఇస్లామ్ ప్రభుత్వము వారిని ప్రజలకు కేటాయించింది.

3. అంటే, జంతువుల విషయంలో కూడ, ఇదే సృష్టి ప్రక్రియ జరుగుతుంది, కాని అల్లాహ్ ఈ సృష్టి క్రమంలో మానవుణ్ణి ప్రత్యేక ప్రాణిగా మలచాడు. ఈ ప్రాణికోటిలో మానవుడు పూర్తిగా భిన్నమైనవాడు.

4. బహుశా దీని అర్థం సప్త గ్రహాలు పరిభ్రమించే మార్గాలు కావచ్చు. ఆ కాలం నాటి మానవుడికి సప్త గ్రహాలను గురించి మాత్రమే తెలుసు కాబట్టి, సప్తగ్రహాలను గురించి మాత్రమే చెప్పబడింది. అంతమాత్రం చేత అవి తప్ప ఇతర మార్గములు లేవనే అర్థం కాదు.

5. దీనిని ఇలా కూడ అనువాదం చెయ్యవచ్చు: సృష్టిపట్ల మేము అశ్రద్ధగా వ్యవహరించలేదు, వ్యవహరించటం లేదు. మొదటి అనువాదం ప్రకారం ఆయతు అర్థం ఏమిటంటే మేము సృష్టించినదంతా గుడ్డిగా సృష్టించలేదు, నైపుణ్యం లేకుండా సృష్టించినదీ కాదు. అంతేకాదు, ఇది బాగా ఆలోచించి తయారు చేసిన ఒక పథకం ప్రకారం, సంపూర్ణ జ్ఞానంతో, ఒక ఉన్నత లక్ష్యంతో సృష్టించబడింది. ఇందులో అతి ముఖ్యమైన భౌతిక ధర్మాలు పనిచేస్తున్నాయి. సృష్టి వ్యవస్థ అంతా అతి చిన్న వస్తువు నుండి అతి పెద్ద వస్తువు వరకు గల సర్వ విషయాలలో పరిపూర్ణమైన పొందిక కనబడుతుంది. ఈ మహత్తర సృష్టిలో అంతటా ఒక ఉన్నతాశయం గోచరిస్తుంది, అది సృష్టికర్త సర్వజ్ఞతను చాటుతుంది. రెండో అనువాదం ప్రకారం అర్థం ఏమిటంటే, ఈ సకల చరాచర సృష్టిలో ఏ సృష్టి అవసరం పట్లా మేము అజాగ్రత్తగా లేము, ఏ సృష్టిస్థితిని గురించి కూడ మాకు అవగాహన లేకుండా లేదు. మేము ఏ వస్తువునూ మా యోజనకు వ్యతిరేకంగా పెరగనీయనూ లేదు, వ్యాప్తికి అవకాశం ఇవ్వనూలేదు. ఏ వస్తువునకైననూ దాని ప్రాథమిక అవసరాలను తీర్చుటలో మేము అలక్ష్యం చేయలేదు. ప్రతి అణువును గురించీ, ప్రతి ఆకు స్థితిని గురించీ, వాటి అవసరాలను గురించీ మాకు తెలుసు.

وَ لَقَدۡ اَرۡسَلۡنَا نُوۡحًا اِلٰى قَوۡمِهٖ فَقَالَ يٰقَوۡمِ اعۡبُدُوا اللّٰهَ مَا لَـكُمۡ مِّنۡ اِلٰهٍ غَيۡرُهٗ ؕ اَفَلَا تَتَّقُوۡنَ ﴿۲۳﴾ فَقَالَ الۡمَلَؤُا الَّذِيۡنَ كَفَرُوۡا مِنۡ قَوۡمِهٖ مَا هٰذَاۤ اِلَّا بَشَرٌ مِّثۡلُكُمۡ ۙ يُرِيۡدُ اَنۡ يَّتَفَضَّلَ عَلَيۡكُمۡ ؕ وَلَوۡ شَآءَ اللّٰهُ لَاَنۡزَلَ مَلٰٓـئِكَةً ۖۚ مَّا سَمِعۡنَا بِهٰذَا فِىۡۤ اٰبَآئِنَا الۡاَوَّلِيۡنَ ﴿۲۴﴾ اِنۡ هُوَ اِلَّا رَجُلٌۢ بِهٖ جِنَّةٌ فَتَرَبَّصُوۡا بِهٖ حَتّٰى حِيۡنٍ ﴿۲۵﴾ قَالَ رَبِّ انۡصُرۡنِىۡ بِمَا كَذَّبُوۡنِ ﴿۲۶﴾ فَاَوۡحَيۡنَاۤ اِلَيۡهِ اَنِ اصۡنَعِ الۡـفُلۡكَ بِاَعۡيُنِنَا وَوَحۡيِنَا فَاِذَا جَآءَ اَمۡرُنَا وَفَارَ التَّنُّوۡرُ ۙ فَاسۡلُكۡ فِيۡهَا مِنۡ كُلٍّ زَوۡجَيۡنِ اثۡنَيۡنِ وَ اَهۡلَكَ اِلَّا مَنۡ سَبَقَ عَلَيۡهِ الۡقَوۡلُ مِنۡهُمۡ ۚ وَلَا تُخَاطِبۡنِىۡ فِى الَّذِيۡنَ ظَلَمُوۡا ۚ اِنَّهُمۡ مُّغۡرَقُوۡنَ ﴿۲۷﴾ فَاِذَا اسۡتَوَيۡتَ اَنۡتَ وَمَنۡ مَّعَكَ عَلَى الۡـفُلۡكِ فَقُلِ الۡحَمۡدُ لِلّٰهِ الَّذِىۡ نَجّٰٮنَا مِنَ الۡقَوۡمِ الظّٰلِمِيۡنَ ﴿۲۸﴾ وَقُلْ رَّبِّ اَنۡزِلۡنِىۡ مُنۡزَلًا مُّبٰـرَكًا وَّاَنۡتَ خَيۡرُ الۡمُنۡزِلِيۡنَ ﴿۲۹﴾ اِنَّ فِىۡ ذٰ لِكَ لَاٰيٰتٍ وَّاِنۡ كُنَّا لَمُبۡتَلِيۡنَ ﴿۳۰﴾

**23 - 29** మేము నూహ్‌ను అతని జాతి వారి వద్దకు పంపాము. అతను ఇలా అన్నాడు, "ఓ నా జాతి ప్రజలారా! అల్లాహ్‌కు దాస్యం చేయండి, ఆయన తప్ప మీకు ఆరాధ్య దైవమెవ్వడూ లేడు. కాబట్టి మీరు ఆయనకు భయపడరా?" విశ్వసించటానికి తిరస్కరించిన అతని జాతిలోని సర్దారులు ఇలా అనసాగారు, "ఈ వ్యక్తి మీవంటి ఒక మానవుడే తప్ప మరేమీ కాడు. మీపై ఆధిక్యత సాధించటం ఇతని అభిమతం. అల్లాహ్ గనుక పంపదలిస్తే, దైవదూతలను పంపిఉండేవాడు. (మానవులు దైవప్రవక్తలుగా వస్తారనే) ఈ విషయాన్ని మేము మా పెద్దల కాలాలలో కూడ ఎన్నడూ వినలేదు. ఏమీలేదు, ఈ మనిషికి కొంచెం పిచ్చిపట్టింది. ఇంకా కొంతకాలం వేచి చూడండి (బహుశా నయమవుతుందేమో). నూహ్ ఇలా అన్నాడు, "ప్రభూ! ఈ ప్రజలు నన్ను నిరాకరించారు ఇక నీవే నాకు దిక్కు." మేము అతనిపైకి ఇలా వహీ పంపాము, "మా పర్యవేక్షణలో, మా వహీ ప్రకారం ఒక నావను తయారు చెయ్యి. తరువాత మా ఆజ్ఞ వచ్చినప్పుడు, పొయ్యి పొంగి నప్పుడు, ప్రతి రకపు జంతుజాతి నుండి ఒక్కొక్క జంటను తీసుకుని అందులో ఎక్కు. నీ కుటుంబ సభ్యులను కూడ వెంట తీసుకునిపో, ఎవరికి వ్యతిరేకంగానైతే ఇదివరకే నిర్ణయం జరిగినదో వారిని తప్ప. దుర్మార్గుల విషయంలో నాతో ఏమీ చెప్పవద్దు. ఇక వారు మునిగిపోయేవారే. తరువాత నీవు నీ సహచరులతో పాటు నావపైకి ఎక్కినప్పుడు, "దుర్మార్గుల నుండి మాకు విమోచనం కలిగించిన దేవునికి కృతజ్ఞతలు" అని అను. ఇంకా, "స్వామీ! నన్ను శుభప్రదమైన స్థలంలో దించు, నీవు స్థలం ఇచ్చేవారిలో ఉత్తముడవు" అని పలుకు.

**30** ఈ గాథలో గొప్ప సూచనలు ఉన్నాయి. మేము ప్రజలను తప్పకుండా పరీక్షకు గురిచేస్తాము.

6. అంటే, జైతూన్ వృక్షము; ఇది మధ్యధరా సముద్రం చుట్టుప్రక్కలా ఉన్న ప్రాంతంలో అధికంగా పండేపంట. దీనికి సినాయ్ పర్వతప్రాంతానికి ఆరోపించటానికి కారణం, బహుశా జైతూన్ జన్మస్థానంలో సినాయ్ పర్వతం ప్రఖ్యాతిగాంచిన స్థలం కావచ్చు.

**31 - 41** వారి తరువాత మేము మరొక తరం వారిని లేపాము. వారివద్దకు వారి జాతికే చెందిన ఒక ప్రవక్తను పంపాము. (అతను వారికి ఇలా సందేశమిచ్చాడు) "అల్లాహ్‌కు దాస్యం చెయ్యండి. మీకు ఆయన తప్ప మరొక ఆరాధ్యుడెవ్వడూ లేడు. మీరు ఆయనకు భయపడరా?" విశ్వసించటానికి తిరస్కరించినటువంటి, పరలోక సమావేశం అబద్ధమని నిరాకరించినటు వంటి, ఇహలోక జీవితంలో మేము భాగ్యవంతులుగా చేసినటువంటి అతని జాతి సర్దారులు ఇలా అనటం ప్రారంభించారు, "ఈ వ్యక్తి ఏమీకాడు, మీవంటి ఒక మానవుడు తప్ప. మీరు తినేదాన్నే ఇతడూ తింటాడు, మీరు త్రాగే దాన్నే ఇతడూ త్రాగుతాడు. ఇప్పుడు మీరు గనుక మీ వంటివాడే అయిన ఒక మానవుడికి విధేయతను చూపి నట్లైతే, మీరు నష్టానికే గురిఅవుతారు. ఇతను మీకు తెలియజేసేదేమి టంటే, మీరు మరణించి మట్టిగా మారిపోయిన తరువాత, ఎముకల గూడుగా అయిపోయిన తరువాత, మీరు (గోరీల నుండి) బయటికి తీయబడతారట. అసంభవం, మీకు చేయబడే ఈ వాగ్దానం అసంభవం. ఇహలోక జీవితం తప్ప మరొక జీవితం లేనేలేదు. మనం ఇక్కడే జీవిస్తాము, ఇక్కడే మరణిస్తాము. మనం ఎంతమాత్రం తిరిగి లేపబడము. ఈ వ్యక్తి దేవుని పేరుతో కేవలం అబద్ధాలు కల్పిస్తున్నాడు. మేము అతను చెప్పేదానిని ఎన్నటికీ విశ్వసించం." దానిపై దైవప్రవక్త ఇలా ప్రార్థించాడు, "ప్రభూ! ఈ ప్రజలు నన్ను నిరాకరించారు. ఇక దాని విషయంలో నీవే నాకు సహాయపడు." దానికి బదులుగా ఇలా సెలవీయబడింది, "ఆ సమయం దగ్గరలోనే ఉంది. అప్పుడు వారు తాము చేసిన దానికి పశ్చాత్తాప పడతారు." చివరకు సరిగ్గా సత్యం ప్రకారమే ఒక పెద్ద కల్లోలం వారిని చుట్టుముట్టింది. దుష్టులారా దూరంగా పొండి, అని మేము వారిని కసువులాగా ఊడ్చి పారవేశాము.

**42 - 44** మేము వారి తరువాత ఇతర జాతులను లేపాము. ఏ జాతి అయినా తన గడువుకు ముందు నశింపనూలేదు, తన గడువుకు తరువాత జీవింపనూ లేదు. తరువాత మేము మా ప్రవక్తలను ఒకరి తరువాత ఒకరిని పంపాము. ఏ జాతి వద్దకైనా దాని ప్రవక్త వచ్చినప్పుడల్లా అది అతనిని నిరాకరిస్తూనే వచ్చింది. మేము ఒక జాతి తరువాత మరొక జాతిని నాశనం చేస్తూనే పోయాము; చివరకు వాటిని గాథలుగానే చేసి వదిలాము - విశ్వసించని వారిపై శాపం విరుచుకుపడుగాక!

ثُمَّ اَنْشَاْنَا مِنْۢ بَعْدِهِمْ قَرْنًا اٰخَرِيْنَ ۝٣١
فَاَرْسَلْنَا فِيْهِمْ رَسُوْلًا مِّنْهُمْ اَنِ اعْبُدُوا اللّٰهَ
مَا لَكُمْ مِّنْ اِلٰهٍ غَيْرُهٗ ؕ اَفَلَا تَتَّقُوْنَ ۝٣٢ وَ
قَالَ الْمَلَاُ مِنْ قَوْمِهِ الَّذِيْنَ كَفَرُوْا وَ كَذَّبُوْا
بِلِقَآءِ الْاٰخِرَةِ وَ اَتْرَفْنٰهُمْ فِي الْحَيٰوةِ الدُّنْيَا ۙ
مَا هٰذَاۤ اِلَّا بَشَرٌ مِّثْلُكُمْ ۙ يَاْكُلُ مِمَّا
تَاْكُلُوْنَ مِنْهُ وَ يَشْرَبُ مِمَّا تَشْرَبُوْنَ ۝٣٣ وَ
لَئِنْ اَطَعْتُمْ بَشَرًا مِّثْلَكُمْ اِنَّكُمْ اِذًا
لَّخٰسِرُوْنَ ۝٣٤ اَيَعِدُكُمْ اَنَّكُمْ اِذَا مِتُّمْ وَ كُنْتُمْ
تُرَابًا وَّ عِظَامًا اَنَّكُمْ مُّخْرَجُوْنَ ۝٣٥ هَيْهَاتَ
هَيْهَاتَ لِمَا تُوْعَدُوْنَ ۝٣٦ اِنْ هِيَ اِلَّا حَيَاتُنَا
الدُّنْيَا نَمُوْتُ وَ نَحْيَا وَ مَا نَحْنُ
بِمَبْعُوْثِيْنَ ۝٣٧ اِنْ هُوَ اِلَّا رَجُلُ افْتَرٰى عَلَى
اللّٰهِ كَذِبًا وَّ مَا نَحْنُ لَهٗ بِمُؤْمِنِيْنَ ۝٣٨ قَالَ
رَبِّ انْصُرْنِيْ بِمَا كَذَّبُوْنِ ۝٣٩ قَالَ عَمَّا
قَلِيْلٍ لَّيُصْبِحُنَّ نٰدِمِيْنَ ۝٤٠ فَاَخَذَتْهُمُ
الصَّيْحَةُ بِالْحَقِّ فَجَعَلْنٰهُمْ غُثَآءً ۚ فَبُعْدًا
لِّلْقَوْمِ الظّٰلِمِيْنَ ۝٤١ ثُمَّ اَنْشَاْنَا مِنْۢ بَعْدِهِمْ
قُرُوْنًا اٰخَرِيْنَ ۝٤٢ مَا تَسْبِقُ مِنْ اُمَّةٍ اَجَلَهَا
وَ مَا يَسْتَاْخِرُوْنَ ۝٤٣ ثُمَّ اَرْسَلْنَا رُسُلَنَا
تَتْرَا ؕ كُلَّمَا جَآءَ اُمَّةً رَّسُوْلُهَا كَذَّبُوْهُ
فَاَتْبَعْنَا بَعْضَهُمْ بَعْضًا وَّ جَعَلْنٰهُمْ اَحَادِيْثَ ۚ
فَبُعْدًا لِّقَوْمٍ لَّا يُؤْمِنُوْنَ ۝٤٤

ثُمَّ اَرْسَلْنَا مُوْسٰى وَ اَخَاهُ هٰرُوْنَ ۙ۬ بِاٰيٰتِنَا وَ
سُلْطٰنٍ مُّبِيْنٍ ﴿٤٥﴾ۙ اِلٰى فِرْعَوْنَ وَ مَلَا۟ئِهٖ
فَاسْتَكْبَرُوْا وَ كَانُوْا قَوْمًا عَالِيْنَ ﴿٤٦﴾ۚ فَقَالُوْٓا
اَنُؤْمِنُ لِبَشَرَيْنِ مِثْلِنَا وَقَوْمُهُمَا لَنَا
عٰبِدُوْنَ ﴿٤٧﴾ۚ فَكَذَّبُوْهُمَا فَكَانُوْا مِنَ
الْمُهْلَكِيْنَ ﴿٤٨﴾ وَ لَقَدْ اٰتَيْنَا مُوْسَى الْكِتٰبَ
لَعَلَّهُمْ يَهْتَدُوْنَ ﴿٤٩﴾ وَ جَعَلْنَا ابْنَ مَرْيَمَ وَ
اُمَّهٗٓ اٰيَةً وَّاٰوَيْنٰهُمَآ اِلٰى رَبْوَةٍ ذَاتِ قَرَارٍ وَّ
مَعِيْنٍ ﴿٥٠﴾ۧ يٰٓاَيُّهَا الرُّسُلُ كُلُوْا مِنَ الطَّيِّبٰتِ وَ ع٣
اعْمَلُوْا صَالِحًا ؕ اِنِّيْ بِمَا تَعْمَلُوْنَ عَلِيْمٌ ؕ﴿٥١﴾ وَ
اِنَّ هٰذِهٖٓ اُمَّتُكُمْ اُمَّةً وَّاحِدَةً وَّاَنَا رَبُّكُمْ
فَاتَّقُوْنِ ﴿٥٢﴾ فَتَقَطَّعُوْٓا اَمْرَهُمْ بَيْنَهُمْ زُبُرًا ؕ
كُلُّ حِزْبٍۭ بِمَا لَدَيْهِمْ فَرِحُوْنَ ﴿٥٣﴾ فَذَرْهُمْ
فِيْ غَمْرَتِهِمْ حَتّٰى حِيْنٍ ﴿٥٤﴾ اَيَحْسَبُوْنَ اَنَّمَا
نُمِدُّهُمْ بِهٖ مِنْ مَّالٍ وَّبَنِيْنَ ﴿٥٥﴾ۙ نُسَارِعُ لَهُمْ
فِي الْخَيْرٰتِ ؕ بَلْ لَّا يَشْعُرُوْنَ ﴿٥٦﴾ اِنَّ الَّذِيْنَ
هُمْ مِّنْ خَشْيَةِ رَبِّهِمْ مُّشْفِقُوْنَ ﴿٥٧﴾ۙ وَ الَّذِيْنَ
هُمْ بِاٰيٰتِ رَبِّهِمْ يُؤْمِنُوْنَ ﴿٥٨﴾ۙ وَ الَّذِيْنَ هُمْ
بِرَبِّهِمْ لَا يُشْرِكُوْنَ ﴿٥٩﴾ۙ وَ الَّذِيْنَ يُؤْتُوْنَ مَآ
اٰتَوْا وَّ قُلُوْبُهُمْ وَجِلَةٌ اَنَّهُمْ اِلٰى رَبِّهِمْ
رٰجِعُوْنَ ﴿٦٠﴾ۙ اُولٰٓئِكَ يُسٰرِعُوْنَ فِي الْخَيْرٰتِ وَ
هُمْ لَهَا سٰبِقُوْنَ ﴿٦١﴾

**45 - 49** తరువాత మేము మూసానూ, అతని సోదరుడు హారూన్‌నూ మా సూచనలతో, స్పష్టమైన అధికారిక ప్రమాణం తోనూ, ఫిరౌను వద్దకూ అతని అధికారుల వద్దకూ పంపాము. కాని వారు అహంభావం కనబరచారు మరీ పొగరుబోతులై. "మేము మా వంటివారే అయిన ఇద్దరు మనుషులను విశ్వసించాలా? ఆ మనుషులైనా మావద్ద బందీగా ఉన్న జాతికి చెందిన వారు" అని వారు ఆ ఇద్దరినీ తిరస్కరించారు, నాశనమయ్యే వారిలో చేరి పోయారు. ప్రజలు మార్గదర్శకత్వాన్ని పొందటానికి మేము మూసాకు గ్రంథాన్ని ప్రసాదించాము.

**50** మర్యమ్ కుమారుణ్ణీ, అతని తల్లినీ మేము ఒక సూచనగా చేశాము, వారిని ఒక పీఠభూమిపై ఉంచాము: అది మిక్కిలి ప్రశాంతమైన స్థలం, అందులో సెలయేళ్లు ప్రవహించేవి.

**51 - 52** ఓ ప్రవక్తలారా! స్వచ్ఛమైన వస్తువులను తినండి, మంచిపనులు చేయండి. మీరు ఏది చేసినా, అది నాకు తెలియకపోదు. మీ ఈ సంఘం ఒకే సంఘం, నేను మీ ప్రభువును, కనుక మీరు నాకు మాత్రమే భయపడండి.

**53 - 54** కాని తరువాత ప్రజలు తమ ధర్మాన్ని వారిలో వారే ముక్కలు ముక్కలుగా చేసుకున్నారు. ప్రతివర్గం తన వద్ద ఉన్న దానితోనే ఆనంద పరవశమై ఉన్నది - మంచిది, వారిని విడిచిపెట్టండి, ఒక ప్రత్యేక కాలం వరకు తమ అజాగ్రత్తలోనే మునిగి ఉండనివ్వండి.

**55 - 67** మేము వారికి సంపదలూ సంతానమూ ప్రసాదించి సహాయ పడుతూ ఉన్నాము అంటే, వారికి మేళ్లు చేయటంలో మేమే తొందర పడుతున్నామని వారు అనుకుంటున్నారా? లేదు, అసలు విషయమేమిటో వారికి తెలియదు. యథార్థానికి, ఎవరు తమ ప్రభువు భయంవల్ల భయపడుతూ ఉంటారో, ఎవరు తమ ప్రభువు వాక్యాలను విశ్వసిస్తారో, ఎవరు తమ ప్రభువునకు ఇతరులను భాగస్వాములుగా చేయరో, ఎవరు తాము ఇవ్వగలిగినది ఇస్తుంటారో, కాని వారి హృదయాలు తమ ప్రభువు వైపునకు మరలి పోవలసి ఉన్నది అనే భావన వల్ల వణుకుతూ ఉంటాయో వారే మేళ్ల వైపునకు పరుగులు తీస్తారు, పోటీపడి వాటిని పొందుతారు.

وَلَا نُكَلِّفُ نَفْسًا اِلَّا وُسْعَهَا وَلَدَيْنَا كِتٰبٌ
يَّنْطِقُ بِالْحَقِّ وَ هُمْ لَا يُظْلَمُوْنَ ﴿٦٢﴾ بَلْ
قُلُوْبُهُمْ فِيْ غَمْرَةٍ مِّنْ هٰذَا وَ لَهُمْ اَعْمَالٌ مِّنْ
دُوْنِ ذٰلِكَ هُمْ لَهَا عٰمِلُوْنَ ﴿٦٣﴾ حَتّٰىٓ اِذَآ
اَخَذْنَا مُتْرَفِيْهِمْ بِالْعَذَابِ اِذَا هُمْ
يَجْـَٔرُوْنَ ﴿٦٤﴾ لَا تَجْـَٔرُوا الْيَوْمَ اِنَّكُمْ مِّنَّا لَا
تُنْصَرُوْنَ ﴿٦٥﴾ قَدْ كَانَتْ اٰيٰتِيْ تُتْلٰى عَلَيْكُمْ
فَكُنْتُمْ عَلٰٓى اَعْقَابِكُمْ تَنْكِصُوْنَ ﴿٦٦﴾ مُسْتَكْبِرِيْنَ
بِهٖ سٰمِرًا تَهْجُرُوْنَ ﴿٦٧﴾ اَفَلَمْ يَدَّبَّرُوا الْقَوْلَ
اَمْ جَآءَهُمْ مَّا لَمْ يَاْتِ اٰبَآءَهُمُ الْاَوَّلِيْنَ ﴿٦٨﴾
اَمْ لَمْ يَعْرِفُوْا رَسُوْلَهُمْ فَهُمْ لَهٗ مُنْكِرُوْنَ ﴿٦٩﴾
اَمْ يَقُوْلُوْنَ بِهٖ جِنَّةٌ بَلْ جَآءَهُمْ بِالْحَقِّ وَ
اَكْثَرُهُمْ لِلْحَقِّ كٰرِهُوْنَ ﴿٧٠﴾ وَلَوِ اتَّبَعَ الْحَقُّ
اَهْوَآءَهُمْ لَفَسَدَتِ السَّمٰوٰتُ وَالْاَرْضُ وَ
مَنْ فِيْهِنَّ بَلْ اَتَيْنٰهُمْ بِذِكْرِهِمْ فَهُمْ عَنْ
ذِكْرِهِمْ مُّعْرِضُوْنَ ﴿٧١﴾ اَمْ تَسْـَٔلُهُمْ خَرْجًا
فَخَرَاجُ رَبِّكَ خَيْرٌ وَّ هُوَ خَيْرُ الرّٰزِقِيْنَ ﴿٧٢﴾ وَ
اِنَّكَ لَتَدْعُوْهُمْ اِلٰى صِرَاطٍ مُّسْتَقِيْمٍ ﴿٧٣﴾ وَ
اِنَّ الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ عَنِ
الصِّرَاطِ لَنٰكِبُوْنَ ﴿٧٤﴾

మేము ఏ వ్యక్తినీ అతని శక్తికి మించిన కష్టానికి గురిచేయము. మా వద్ద ఒక గ్రంథం ఉన్నది, అది (ప్రతి వ్యక్తిని గురించి) ఉన్నది ఉన్నట్లుగా తెలుపుతుంది.[7] ప్రజలకు ఎట్టి పరిస్థితుల్లోనూ అన్యాయం చెయ్యటం జరగదు. కాని వారికి ఈ విషయం గురించి తెలియదు. వారి కర్మలు కూడ (పైన ప్రస్తావించబడిన) పద్ధతికి భిన్నంగా ఉన్నాయి. (వారు తమ ఈ చేష్టలను చేస్తూనేపోతారు) చివరకు మేము వారి లోని భోగలాలసులను శిక్షించే నిమిత్తం పట్టుకున్నప్పుడు, వారు పెడబొబ్బలు పెట్టటం ప్రారంభిస్తారు – ఇక కట్టిపెట్టండి మీ ఫిర్యాదులను, మీ రోదనలను, మా తరఫు నుండి ఇక ఏ సహాయమూ మీకు లభించటం జరగదు. నా వాక్యాలు వినిపించబడేటప్పుడు మీరు (దైవప్రవక్త కంఠం విన్నంతనే) వెనక్కి తిరిగి పరుగెత్తే వారు, మీ అహంకారం వల్ల అతనిని అసలు లక్ష్యపెట్టేవారే కాదు, మీ చావిళ్లలో అతనిని ఎద్దేవా చేసేవారు, అతనిని గురించి వ్యర్థ ప్రలాపాలు పలికేవారు.

**68 - 71** వారు ఎన్నడూ ఈ (దైవ) వాక్కును గురించి ఆలోచించనేలేదా? లేక వారి పూర్వుల వద్దకు ఎన్నడూ రాని విషయాన్ని దేన్నయినా అతను తీసుకువచ్చాడా? లేక వారు తమ ప్రవక్తను ఇదివరకెన్నడూ ఎరుగరు కాబట్టి (కొత్త మనిషైన కారణంగా) అతనంటే బెదురుతున్నారా? లేక అతను పిచ్చి వాడని వారి అభిప్రాయమా? కాదు, పైగా అతను సత్యాన్ని తీసుకువచ్చాడు; అసలు వారిలో చాలామందికి సత్యమంటేనే గిట్టదు– సత్యమే గనక వారి కోరికలను అనుసరించి ఉంటే, భూమ్యాకాశాలూ, వాటిలోని జీవరాశి వ్యవస్థా ఛిన్నాభిన్నమై ఉండేవి–కాదు, అయితే మేమే వారి సొంత ప్రస్తావనను వారి ముందు తీసుకువచ్చాము. కాని వారు తమ ప్రస్తావన నుండి ముఖం తిప్పుకుంటున్నారు.

**72 - 74** నీవు వారిని ప్రతిఫలమేదైనా అడుగుతున్నావా? నీకు నీ ప్రభువు ఇచ్చినదే శ్రేష్ఠమైనది. ఆయన శ్రేష్ఠుడైన ఉపాధిప్రదాత. నీవు వారిని ఋజు మార్గం వైపునకు పిలుస్తున్నావు. కాని పరలోకాన్ని నమ్మనటువంటి వారు ఋజుమార్గం నుండి వైదొలగి నడువగోరుచున్నారు.

**75 - 77** ఒకవేళ మేము వారిపై దయచూపితే, వారు ఈనాడు గురిఅయిన[8] ఆపదను తొలగిస్తే, అప్పుడు వారు తమ తలబిరుసుతనంతో పూర్తిగా అంధులైపోతారు. అసలు వారి పరిస్థితి ఎలా ఉందంటే; మేము వారిని ఆపదకు గురి చేశాము, అయినా వారు తమ ప్రభువు ముందు వంగలేదు; అణకువనూ అవలంబించలేదు. కాని చివరకు మేము వారికై కఠిన శిక్షా ద్వారాన్ని తెరిచేటంతటి పరిస్థితి ఏర్పడినప్పుడు, వారు ప్రతిశుభం పట్ల హతాశులు కావటాన్ని నీవు అకస్మాత్తుగా చూస్తావు.

**78 - 83** మీకు వినేశక్తినీ చూసే శక్తినీ ఇచ్చినవాడు, ఆలోచించటానికి హృదయం ఇచ్చినవాడూ అల్లాహ్‌యే. కాని మీరు కృతజ్ఞత చూపటం అనేది చాల అరుదు. మిమ్మల్ని ధరణిపై వ్యాపింప జేసినవాడు ఆయనే, ఆయన వైపునకే మీరు సమీకరింపబడతారు. ఆయనే జీవితాన్ని ప్రసాదిస్తాడు మరియు ఆయనే మరణాన్నీ కలిగిస్తాడు. రేయింబవళ్ల పరిభ్రమణం ఆయన అధీనంలోనే ఉన్నది. ఈ విషయం మీకు అర్థం కావటం లేదా? కాని వారు తమ పూర్వీకులు అన్నదానినే అంటున్నారు. వారు ఇలా అంటారు, "మేము చచ్చి, మట్టిగా మారినప్పుడు, అస్థిపంజరంగా అయిపోయినప్పుడు, మమ్మల్ని మళ్లీ బ్రతికించి లేపటం అనేది జరుగుతుందా? మేము కూడ ఇటువంటి వాగ్దానాలు ఎన్నో విని ఉన్నాము; మాకు పూర్వం మా తాత ముత్తాతలు కూడ వింటూనే వచ్చారు. ఇవి కేవలం పాతకాలపు కట్టుకథలే."

**84-92** వారిని ఇలా అడుగు, "మీకు తెలిస్తే చెప్పండి, ఈ భూమీ, దానిలోని ప్రాణులన్నీ ఎవరివో?" వారు తప్పకుండా, "అల్లాహ్‌కు చెందుతాయి" అని అంటారు. "అలాంటప్పుడు మీరు ఈ విషయాన్ని ఎందుకు అర్థం చేసుకోరు?" అని అను. వారిని ఇంకా ఇలా అడుగు, "సప్తాకాశాలకూ, మహోన్నతమైన పీఠానికీ ప్రభువు ఎవరు?" వారు తప్పకుండా,"అల్లాహ్" అని అంటారు. "అలాంటప్పుడు మీరు ఎందుకు ఆయనకు భయపడరు?" అని అను.

وَلَوْ رَحِمْنٰهُمْ وَكَشَفْنَا مَا بِهِمْ مِّنْ ضُرٍّ لَّلَجُّوْا
فِيْ طُغْيَانِهِمْ يَعْمَهُوْنَ ﴿٧٥﴾ وَلَقَدْ اَخَذْنٰهُمْ
بِالْعَذَابِ فَمَا اسْتَكَانُوْا لِرَبِّهِمْ وَمَا
يَتَضَرَّعُوْنَ ﴿٧٦﴾ حَتّٰۤى اِذَا فَتَحْنَا عَلَيْهِمْ بَابًا ذَا
عَذَابٍ شَدِيْدٍ اِذَا هُمْ فِيْهِ مُبْلِسُوْنَ ﴿٧٧﴾ وَ
هُوَ الَّذِيْۤ اَنْشَاَ لَكُمُ السَّمْعَ وَالْاَبْصَارَ وَ
الْاَفْـِٕدَةَ ؕ قَلِيْلًا مَّا تَشْكُرُوْنَ ﴿٧٨﴾ وَهُوَ الَّذِيْ
ذَرَاَكُمْ فِي الْاَرْضِ وَاِلَيْهِ تُحْشَرُوْنَ ﴿٧٩﴾
وَهُوَ الَّذِيْ يُحْيٖ وَيُمِيْتُ وَلَهُ اخْتِلَافُ
الَّيْلِ وَالنَّهَارِ ؕ اَفَلَا تَعْقِلُوْنَ ﴿٨٠﴾ بَلْ قَالُوْا
مِثْلَ مَا قَالَ الْاَوَّلُوْنَ ﴿٨١﴾ قَالُوْۤا ءَاِذَا مِتْنَا وَ
كُنَّا تُرَابًا وَّعِظَامًا ءَاِنَّا لَمَبْعُوْثُوْنَ ﴿٨٢﴾ لَقَدْ
وُعِدْنَا نَحْنُ وَاٰبَآؤُنَا هٰذَا مِنْ قَبْلُ اِنْ
هٰذَاۤ اِلَّاۤ اَسَاطِيْرُ الْاَوَّلِيْنَ ﴿٨٣﴾ قُلْ لِّمَنِ
الْاَرْضُ وَمَنْ فِيْهَاۤ اِنْ كُنْتُمْ تَعْلَمُوْنَ ﴿٨٤﴾
سَيَقُوْلُوْنَ لِلّٰهِ ؕ قُلْ اَفَلَا تَذَكَّرُوْنَ ﴿٨٥﴾ قُلْ
مَنْ رَّبُّ السَّمٰوٰتِ السَّبْعِ وَرَبُّ الْعَرْشِ
الْعَظِيْمِ ﴿٨٦﴾ سَيَقُوْلُوْنَ لِلّٰهِ ؕ قُلْ اَفَلَا تَتَّقُوْنَ ﴿٨٧﴾

قُلۡ مَنۡۢ بِيَدِهٖ مَلَكُوۡتُ كُلِّ شَىۡءٍ وَّ هُوَ يُجِيۡرُ
وَ لَا يُجَارُ عَلَيۡهِ اِنۡ كُنۡتُمۡ تَعۡلَمُوۡنَ ﴿۸۸﴾
سَيَقُوۡلُوۡنَ لِلّٰهِ ؕ قُلۡ فَاَنّٰى تُسۡحَرُوۡنَ ﴿۸۹﴾ بَلۡ
اَتَيۡنٰهُمۡ بِالۡحَـقِّ وَ اِنَّهُمۡ لَـكٰذِبُوۡنَ ﴿۹۰﴾ مَا
اتَّخَذَ اللّٰهُ مِنۡ وَّلَدٍ وَّ مَا كَانَ مَعَهٗ مِنۡ اِلٰهٍ
اِذًا لَّذَهَبَ كُلُّ اِلٰهٍ ۢبِمَا خَلَقَ وَ لَعَلَا
بَعۡضُهُمۡ عَلٰى بَعۡضٍ ؕ سُبۡحٰنَ اللّٰهِ عَمَّا
يَصِفُوۡنَ ۙ﴿۹۱﴾ عٰلِمِ الۡغَيۡبِ وَ الشَّهَادَةِ فَتَعٰلٰى
عَمَّا يُشۡرِكُوۡنَ ﴿۹۲﴾

వారితో ఇంకా ఇలా అను, "మీరు గనక ఎరిగి ఉంటే చెప్పండి, ప్రతి దానిపై ఆధిపత్యం ఎవరికున్నదో? ఇంకా శరణు ఇచ్చే వాడెవడో చెప్పండి? ఆయనకు ప్రతిగా శరణు ఇవ్వగల వాడెవ్వడూ లేడు." వారు తప్పకుండా, "ఈ శక్తిగలవాడు అల్లాహ్‌యే" అని అంటారు. "అలాంటప్పుడు మీరు ఎలా మోసపోతున్నారు?" అని అను. సత్య విషయాన్ని మేము వారి ముందుకు తీసుకువచ్చాము. వారు అబద్ధం చెప్పేవారు[9] అనటంలో ఏమాత్రం సందేహం లేదు. అల్లాహ్ ఎవరినీ తన సంతానంగా చేసుకోలేదు[10] మరియు మరొక దేవుడెవ్వడూ ఆయనతో పాటు లేడు. ఒకవేళ అలా అయితే, ప్రతి దేవుడు తన సృష్టిని తీసుకుని వేరుపడిపోయేవాడు; తరువాత వారు ఒకరిపై ఒకరు దండయాత్రలు చేసి ఉండేవారు. వారు కల్పించే విషయాలు ఏమాత్రం వర్తించని పరిశుద్ధుడు అల్లాహ్. గోప్యంగా ఉన్నదానినీ, బహిరంగంగా ఉన్నదానినీ ఎరిగిన వాడు, దైవత్వంలో వారు ప్రతిపాదించే భాగస్వామ్యానికి ఆయన అతీతుడు.

---

7. అంటే, ప్రతి మనిషి కర్మపత్రం అని భావం. అందులో అతను చేసినదంతా వ్రాయబడి ఉంటుంది.

8. అంటే, మక్కానగరంలో వచ్చిన కరువు కాటకాలు. అవి మహాప్రవక్త (స) ప్రవక్త పదవిని అలంకరించిన తరువాత కొంతకాలం వరకు ఉన్నాయి.

9. అంటే, అల్లాహ్‌కే కాక ఇతరులకు కూడ ఆయన దైవత్వంలో ఆయన గుణవిశేషాలలో ఆయన హక్కులలో ఆయన అధికారాలలో భాగం కలదు అనే తమ ప్రకటనలో వారు అసత్యవాదులు. మరణానంతర జీవితం లేదు అనే వారి మాటకూడ అనృతమే. వారు చెప్పేదంతా అబద్ధమేనని వారి ఆక్షేపణలే స్పష్టం చేస్తున్నాయి. ఒకసారి భూమ్యాకాశాలకూ, సృష్టిలోని సకల విషయాలకూ అల్లాహ్‌యే ప్రభువు అని ఒప్పుకుంటారు. మరొకసారి దైవత్వం కేవలం ఆయన ఒక్కడిదే కాదు, ఇతరులకు (తప్పనిసరిగా వారు ఆయన దాసులు, ఇతర జీవాలునూ) కూడా అందులో భాగం కలదని అంటారు. ఈ రీతిగా ఈ రెండు విషయాలు పరస్పర విరుద్ధాలని తేటతెల్లమవుతోంది. ఇదేవిధంగా ఒకసారి, మమ్మల్నీ అద్భుతమైన ఈ సృష్టినీ దేవుడు సృష్టించాడు అని అంటూనే, మరొకసారి తాను సృష్టించిన జీవరాసిని ఈ దేవుడు రెండోసారి సృష్టించలేడు అని అంటారు. ఇది బుద్ధికి అందనిది. కనుక వారు నమ్మిన సత్యాలే, వారు అనుసరించిన షిర్కు, పరలోక తిరస్కారం అనే విశ్వాసాలు అబద్ధపు విశ్వాసాలని స్పష్టం చేస్తున్నాయి.

10. ఇక్కడ ఈ ఖురాను వాక్యం కేవలం క్రైస్తవాన్ని మాత్రమే ఖండిస్తుందని ఎవరూ అపోహపడకూడదు. అరేబియా ముష్రిక్కులు కూడ తమ దైవాలను దేవుని సంతానంగా చెప్పుకునేవారు. ప్రపంచంలో ముష్రిక్కులు అనేకులు ఇదే అపమార్గంలో వారితో పాటు ఉన్నారు.

قُلْ رَّبِّ اِمَّا تُرِيَنِّيْ مَا يُوْعَدُوْنَ ﴿٩٣﴾ رَبِّ فَلَا
تَجْعَلْنِيْ فِي الْقَوْمِ الظّٰلِمِيْنَ ﴿٩٤﴾ وَ اِنَّا عَلٰۤى
اَنْ نُّرِيَكَ مَا نَعِدُهُمْ لَقٰدِرُوْنَ ﴿٩٥﴾ اِدْفَعْ
بِالَّتِيْ هِيَ اَحْسَنُ السَّيِّئَةَ نَحْنُ اَعْلَمُ بِمَا
يَصِفُوْنَ ﴿٩٦﴾ وَ قُلْ رَّبِّ اَعُوْذُبِكَ مِنْ هَمَزٰتِ
الشَّيٰطِيْنِ ﴿٩٧﴾ وَ اَعُوْذُبِكَ رَبِّ اَنْ
يَّحْضُرُوْنِ ﴿٩٨﴾ حَتّٰۤى اِذَا جَآءَ اَحَدَهُمُ الْمَوْتُ
قَالَ رَبِّ ارْجِعُوْنِ ﴿٩٩﴾ لَعَلِّيْۤ اَعْمَلُ صَالِحًا
فِيْمَا تَرَكْتُ كَلَّا اِنَّهَا كَلِمَةٌ هُوَ قَآئِلُهَا وَ
مِنْ وَّرَآئِهِمْ بَرْزَخٌ اِلٰى يَوْمِ يُبْعَثُوْنَ ﴿١٠٠﴾
فَاِذَا نُفِخَ فِي الصُّوْرِ فَلَآ اَنْسَابَ بَيْنَهُمْ يَوْمَئِذٍ
وَّ لَا يَتَسَآءَلُوْنَ ﴿١٠١﴾ فَمَنْ ثَقُلَتْ مَوَازِيْنُهٗ
فَاُولٰٓئِكَ هُمُ الْمُفْلِحُوْنَ ﴿١٠٢﴾

**93 - 95** ఓ ప్రవక్తా! ఇలా ప్రార్థించు, "ప్రభూ! ఏ శిక్షను గురించి వారిని బెదిరించటం జరుగుతోందో, దానిని నేను ఉన్నప్పుడే నీవు అమలుపరచినట్లయితే, నా ప్రభూ! నన్ను ఈ దుర్మార్గులలో చేర్చకు."[11] యథార్థమేమిటంటే, మేము దేనిని గురించి వారిని బెదిరిస్తున్నామో దానిని నీకళ్ల ముందే అమలుచేయగల సకల శక్తిని మేము కలిగి ఉన్నాము.

**96 - 98** ఓ ప్రవక్తా! చెడును ఉత్తమమైన పద్ధతి ద్వారా నివారించు. ఏ విషయాలను వారు నిన్ను గురించి కల్పిస్తున్నారో, అవి మాకు బాగా తెలుసు. ఇలా ప్రార్థించు, "ప్రభూ! షైతానుల ప్రేరణల నుండి నేను నిన్ను శరణు వేడుకుంటున్నాను. నా ప్రభూ! అవి నా వద్దకు అసలు రాకుండేటట్లు నిన్ను శరణు వేడుకుంటున్నాను."

**99 - 115** (వారు తమ చేష్టలను మానుకోరు) చివరకు వారిలో ఎవడికైనా మరణం వస్తే వాడు ఇలా అనటం ప్రారంభిస్తాడు, "ఓ నా ప్రభూ! నేను వదలిపెట్టివచ్చిన లోకానికే నన్ను తిరిగి పంపెయ్యి; ఇక నేను మంచిపనులు చేస్తానని ఆశిస్తున్నాను." ఇది ఎంతమాత్రమూ జరిగేది కాదు, అతడు పలికేది కేవలం ఒక మాట మాత్రమే. ఇప్పుడు ఈ (మరణించేవారి) అందరి వెనుక ఒక గోడ అడ్డంగా ఉన్నది. అది మరొక జీవితం వచ్చే రోజు[12] వరకు ఉంటుంది. తరువాత శంఖం ఊదబడినంతనే వారి మధ్య ఏ బంధుత్వమూ ఉండదు, వారు ఒకరినొకరు పరామర్శించుకోరు. అప్పుడు ఎవరి (త్రాసు) పళ్లెములు బరువుగా ఉంటాయో వారే సాఫల్యం పొందుతారు.

11. ఆ శిక్షకు మహాప్రవక్త (సఅసమ్) కూడ గురిఅయ్యే (అల్లాహ్ అలా చేయకుండుగాక) ప్రమాదం తప్పక ఉన్నదనీ, లేదా ఆయన ఈ ప్రార్థన చేయకపోతే ఆ శిక్షకు గురి అవుతారనీ దీని అర్థం కాదు. కాని ఈ రీతి ప్రకటనలోని ఆంతర్యం ఏమిటంటే, అల్లాహ్ విధించే శిక్ష సర్వులూ భయపడవలసినంతటిదనీ, అది ఎంత భయంకరమైనదంటే, పాపాత్ములే కాదు, పుణ్యాత్ములైననూ ఆ శిక్ష నుండి తప్పించుకోవటానికి అల్లాహ్‌ను శరణు వేడవలసినదే అనే తలంపు కల్గించడం కొరకే.

وَ مَنۡ خَفَّتۡ مَوَازِيۡنُهٗ فَاُولٰٓئِكَ الَّذِيۡنَ
خَسِرُوۡۤا اَنۡفُسَهُمۡ فِىۡ جَهَنَّمَ خٰلِدُوۡنَ ﴿١٠٣﴾ تَلۡفَحُ
وُجُوۡهَهُمُ النَّارُ وَ هُمۡ فِيۡهَا كٰلِحُوۡنَ ﴿١٠٤﴾ اَلَمۡ
تَكُنۡ اٰيٰتِىۡ تُتۡلٰى عَلَيۡكُمۡ فَكُنۡتُمۡ بِهَا
تُكَذِّبُوۡنَ ﴿١٠٥﴾ قَالُوۡا رَبَّنَا غَلَبَتۡ عَلَيۡنَا
شِقۡوَتُنَا وَ كُنَّا قَوۡمًا ضَآلِّيۡنَ ﴿١٠٦﴾ رَبَّنَآ
اَخۡرِجۡنَا مِنۡهَا فَاِنۡ عُدۡنَا فَاِنَّا ظٰلِمُوۡنَ ﴿١٠٧﴾ قَالَ
اخۡسَئُوۡا فِيۡهَا وَ لَا تُكَلِّمُوۡنِ ﴿١٠٨﴾ اِنَّهٗ كَانَ فَرِيۡقٌ
مِّنۡ عِبَادِىۡ يَقُوۡلُوۡنَ رَبَّنَاۤ اٰمَنَّا فَاغۡفِرۡ لَنَا
وَارۡحَمۡنَا وَ اَنۡتَ خَيۡرُ الرّٰحِمِيۡنَ ﴿١٠٩﴾
فَاتَّخَذۡتُمُوۡهُمۡ سِخۡرِيًّا حَتّٰۤى اَنۡسَوۡكُمۡ ذِكۡرِىۡ وَ
كُنۡتُمۡ مِّنۡهُمۡ تَضۡحَكُوۡنَ ﴿١١٠﴾ اِنِّىۡ جَزَيۡتُهُمُ الۡيَوۡمَ
بِمَا صَبَرُوۡۤا ۙ اَنَّهُمۡ هُمُ الۡفَآئِزُوۡنَ ﴿١١١﴾ قٰلَ كَمۡ
لَبِثۡتُمۡ فِى الۡاَرۡضِ عَدَدَ سِنِيۡنَ ﴿١١٢﴾ قَالُوۡا لَبِثۡنَا
يَوۡمًا اَوۡ بَعۡضَ يَوۡمٍ فَسۡـئَلِ الۡعَآدِّيۡنَ ﴿١١٣﴾ قٰلَ
اِنۡ لَّبِثۡتُمۡ اِلَّا قَلِيۡلًا لَّوۡ اَنَّكُمۡ كُنۡتُمۡ
تَعۡلَمُوۡنَ ﴿١١٤﴾ اَفَحَسِبۡتُمۡ اَنَّمَا خَلَقۡنٰكُمۡ عَبَثًا
وَّاَنَّكُمۡ اِلَيۡنَا لَا تُرۡجَعُوۡنَ ﴿١١٥﴾

ఎవరి (త్రాసు) పళ్లెములు తేలికగా ఉంటాయో, వారే తమను తాము నష్టానికి గురిచేసుకునేవారు. వారు నరకంలో శాశ్వతంగా ఉంటారు, అగ్ని వారి ముఖాల చర్మాన్ని తిని వేస్తుంది, వారి దవడలు బయటపడతాయి – "నా వాక్యాలు మీకు వినిపించబడేటప్పుడు వాటిని నిరాకరించినవారు మీరేకదా?" వారు ఇలా అంటారు, "ఓ మా ప్రభూ! మా దౌర్భాగ్యం మమ్మల్ని కప్పేసింది. నిజంగానే మేము మార్గం తప్పిన వారము. ఓ స్వామీ! ఇక మమ్మల్ని ఇక్కణ్ణుంచి బయటకు తీయి. తరువాత మేము అటువంటి పాపాలు చేస్తే, దుర్మార్గులమవుతాము." అల్లాహ్ దానికి ఇలా సమాధానం పలుకుతాడు, "నా ముందునుంచి వెళ్లిపోండి, ఇందులోనే పడి ఉండండి, నాతో మాట్లాడకండి." నా దాసులు కొందరు, "మా ప్రభూ! మేము విశ్వసించాము. మమ్మల్ని క్షమించు. మాపై దయచూపు. నీవు కరుణామయులలోకెల్లా ఉత్తమ కరుణామయుడవు" అని అన్నప్పుడు, వారిని పరిహసించింది మీరేకదా! చివరకు వారి పట్ల మీ మంకువైఖరి మిమ్మల్ని, "నేనూ ఒకణ్ణి ఉన్నాను" అనే విషయాన్ని కూడ మరచిపోయేలా చేసింది. మీరు వారిని పరిహసిస్తూనే పోయారు. ఈనాడు నేను వారి సహనానికి ఈ ప్రతిఫలం ఇచ్చాను. వారే సఫలురు. తరువాత అల్లాహ్ వారిని ఇలా అడుగుతాడు, "చెప్పండి, భూలోకంలో మీరు ఎన్ని సంవత్సరాలు ఉన్నారు." వారు, "మేము ఒక రోజో లేక రోజులో కొంత భాగమో అక్కడ ఉన్నాము. లెక్కపెట్టేవారిని అడగండి" అని అంటారు. ఇలా సెలవీయబడుతుంది: "కొంతకాలమే ఉన్నారు కదా! అయ్యో మీరు ఈ విషయాన్ని అప్పుడు తెలుసుకుని ఉంటే ఎంత బాగుండేది. మేము మిమ్మల్ని వృథాగానే పుట్టించామని, మా వైపునకు మీరు ఎన్నడూ మరలిరావటమనేది జరగదని భావించారా?"

12. పర్దా అనే పారశీపదానికి అరబిక్ రూపం "బర్జఖ్". ఆయతు అర్థం ఏమిటంటే, వారికీ, ప్రపంచానికీ మధ్య ఒక అడ్డుగోడ వంటిది ఉన్నది, అది వారిని తిరిగి వెనుకకు మరలనీయదు, ప్రళయం వచ్చేవరకు వారు, ప్రపంచానికీ, పరలోకానికీ మధ్య ఉన్న ఈ అడ్డుగోడ మీదనే ఉంటారు.

فَتَعٰلَى اللّٰهُ الْمَلِكُ الْحَقُّ ۚ لَآ اِلٰهَ اِلَّا هُوَ ۚ
رَبُّ الْعَرْشِ الْكَرِيْمِ ﴿١١٦﴾ وَ مَنْ يَّدْعُ مَعَ اللّٰهِ
اِلٰهًا اٰخَرَ ۙ لَا بُرْهَانَ لَهٗ بِهٖ ۙ فَاِنَّمَا حِسَابُهٗ
عِنْدَ رَبِّهٖ ؕ اِنَّهٗ لَا يُفْلِحُ الْكٰفِرُوْنَ ﴿١١٧﴾ وَ قُلْ
رَّبِّ اغْفِرْ وَ ارْحَمْ وَ اَنْتَ خَيْرُ الرّٰحِمِيْنَ ﴿١١٨﴾ ع

**116 - 117** కనుక అల్లాహ్ మహోన్నతుడు, నిజమైన చక్రవర్తి. ఆయన తప్ప మరొక దేవుడు లేనేలేడు, గౌరవ పీఠానికి స్వామి. ఎవడైనా అల్లాహ్‌తో పాటు మరొక ఆరాధ్యుణ్ణి వేడుకుంటే, దానికి అతని వద్ద ఏ ప్రమాణమూ[13] లేదు. అతని లెక్క అతని ప్రభువు వద్ద ఉన్నది. అటువంటి అవిశ్వాసులు ఎన్నటికీ సాఫల్యం పొందలేరు.

**118** ఓ ప్రవక్తా! ఇలా అను: "నా ప్రభూ! మన్నించు, కరుణించు. కరుణామయులందరిలో కెల్లా నీవు ఉత్తమ కరుణామయుడవు."

13. మరొక రీతిలో కూడ ఇలా అనువాదం చేయవచ్చు; ఎవడైనా అల్లాహ్‌తో పాటు మరొకదేవుణ్ణి వేడుకుంటే, తాను చేసే పని సత్యమని చెప్పటానికి అతని వద్ద ఆధారమేమీ ఉండదు.

## 24. అన్ నూర్

ఆయతులు 64 | అవతరణ మదీనాలో

٢٤ سُورَةُ النُّورِ مَدَنِيَّةٌ ١٠٢

اٰيَاتُهَا ٦٤ | رُكُوْعَاتُهَا ٩

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

سُوْرَةٌ اَنْزَلْنٰهَا وَ فَرَضْنٰهَا وَ اَنْزَلْنَا فِيْهَاۤ اٰيٰتٍ بَيِّنٰتٍ لَّعَلَّكُمْ تَذَكَّرُوْنَ ① اَلزَّانِيَةُ وَ الزَّانِيْ فَاجْلِدُوْا كُلَّ وَاحِدٍ مِّنْهُمَا مِائَةَ جَلْدَةٍ ۪ وَّ لَا تَاْخُذْكُمْ بِهِمَا رَاْفَةٌ فِيْ دِيْنِ اللّٰهِ اِنْ كُنْتُمْ تُؤْمِنُوْنَ بِاللّٰهِ وَ الْيَوْمِ الْاٰخِرِ ۚ وَلْيَشْهَدْ عَذَابَهُمَا طَآىِٕفَةٌ مِّنَ الْمُؤْمِنِيْنَ ② اَلزَّانِيْ لَا يَنْكِحُ اِلَّا زَانِيَةً اَوْ مُشْرِكَةً ۫ وَّ الزَّانِيَةُ لَا يَنْكِحُهَاۤ اِلَّا زَانٍ اَوْ مُشْرِكٌ ۚ وَ حُرِّمَ ذٰلِكَ عَلَى الْمُؤْمِنِيْنَ ③

**1** ఇది మేము అవతరింపజేసిన ఒక సూరా. మేము దానిని విధిగా[1] జేశాము, మీరు గుణపాఠం నేర్చుకుంటారేమో అని, అందులో మేము స్పష్టమైన ఉపదేశాలను అవతరింపచేశాము.

**2** వ్యభిచారిణి, వ్యభిచారి–ఈ ఇద్దరిలో ప్రతి ఒక్కరినీ నూరేసి కొరడా[2] దెబ్బలు కొట్టండి. మీరు అల్లాహ్‌పై, అంతిమదినంపై విశ్వాసం ఉన్నవారే అయితే, వారి మీద కనికరం చూపే తలంపు అల్లాహ్ ప్రసాదించిన ధర్మ (నిర్వహణ) విషయంలో మిమ్మల్ని అడ్డుకోరాదు. వారిని శిక్షించేటప్పుడు విశ్వాసుల వర్గం ఒకటి అక్కడ ఉండాలి.[3]

**3** ఒక వ్యభిచారి, వ్యభిచారిణిని లేక ముష్రిక్ స్త్రీని తప్ప మరెవరినీ వివాహం చేసుకోకూడదు. వ్యభిచారిణిని ఒక వ్యభిచారి లేక ఒక ముష్రిక్కు పురుషుడు తప్ప మరెవ్వరూ వివాహం చేసుకోకూడదు. అటువంటి వివాహాలు విశ్వాసులకు నిషేధించబడ్డాయి.[4]

1. అంటే, ఈ సూరాలో చెప్పబడిన విషయాలు మీకు ఇష్టమైతే అనుసరించటానికీ, లేకుంటే, మానివేయటానికికాని "సలహాలు" కావు. ఇవి తప్పనిసరిగా పాటించవలసిన స్పష్టమైన ఆదేశాలు. మీరు విశ్వాసులైతే, వాటిని పాటించటం మీ విధి.

2. వ్యభిచారానికి సంబంధించిన తొలి ఆదేశం నిసా సూరాలోని 15వ వాక్యంలో వచ్చింది. ఇప్పుడు ఈ నేరానికి ఈ శిక్ష కడపటి శిక్షగా నిర్ణయించబడింది. వ్యభిచారులైన స్త్రీ పురుషులు ఇద్దరూ అవివాహితులైన పక్షంలోనే వారికి ఈ శిక్ష విధించబడుతుంది. ఈ విషయం నిసా సూరాలోని 25వ ఆయతులో కూడ సూచింపబడింది. ఎన్నో హదీసులు, మహాప్రవక్త గారు, ఖలీఫాలు అమలుపరచిన విధానం, ముస్లిమ్ సమాజంలోని ఏకాభిప్రాయం–వీటిననుసరించి వివాహితులైన స్త్రీ పురుషులు వ్యభిచరించినచో వారికి రాళ్లతో కొట్టి చంపే శిక్ష (రజమ్) విధించబడుతుంది.

3. అంటే, శిక్షను బహిరంగంగా అమలుపరచాలి. ఇందులోని ఆంతర్యం, నేరస్థుడు పరాభవం పాలు కావటం, ఇతరులు గుణపాఠాన్ని నేర్చుకోవటం, హితోపదేశాన్ని పొందటం, ఈ పాపకార్యం ముస్లిం సమాజంలో ప్రబలకుండా ఉండటం.

4. అంటే, పశ్చాత్తాపపడని ఒక వ్యభిచారికి ఒక వ్యభిచారిణి మాత్రమే తగినది లేదా ఒక ముష్రిక్కు స్త్రీయే తగినది. యోగ్యురాలూ, విశ్వాసురాలూ అయిన స్త్రీకి వాడు తగినవాడు కాడు. విశ్వాసులు తమ కూతుళ్లను తెలిసీ అటువంటి చెడునడతకల వారికి ఇచ్చి వివాహం చేయటం నిషిద్ధం. ఇదేవిధంగా, (పశ్చాత్తాపపడని) వ్యభిచారిణులకు అట్టి వ్యభిచారులే తగినవారు లేదా ముష్రిక్కులే తగినవారు. యోగ్యుడూ, విశ్వాసి అయిన పురుషునికి ఆమె తగినది కాదు. ఫలానా స్త్రీలు చెడునడత కలవారు అని తెలిసినప్పటికీ వారిని వివాహం

وَ الَّذِيْنَ يَرْمُوْنَ الْمُحْصَنٰتِ ثُمَّ لَمْ يَاْتُوْا
بِاَرْبَعَةِ شُهَدَآءَ فَاجْلِدُوْهُمْ ثَمٰنِيْنَ جَلْدَةً
وَّ لَا تَقْبَلُوْا لَهُمْ شَهَادَةً اَبَدًا ۚ وَ اُولٰٓئِكَ هُمُ
الْفٰسِقُوْنَ ۙ﴿٤﴾ اِلَّا الَّذِيْنَ تَابُوْا مِنْۢ بَعْدِ ذٰلِكَ
وَ اَصْلَحُوْا ۚ فَاِنَّ اللّٰهَ غَفُوْرٌ رَّحِيْمٌ ﴿٥﴾
وَالَّذِيْنَ يَرْمُوْنَ اَزْوَاجَهُمْ وَ لَمْ يَكُنْ لَّهُمْ
شُهَدَآءُ اِلَّآ اَنْفُسُهُمْ فَشَهَادَةُ اَحَدِهِمْ
اَرْبَعُ شَهٰدٰتٍۭ بِاللّٰهِ ۙ اِنَّهٗ لَمِنَ الصّٰدِقِيْنَ ﴿٦﴾
وَالْخَامِسَةُ اَنَّ لَعْنَتَ اللّٰهِ عَلَيْهِ اِنْ كَانَ مِنَ
الْكٰذِبِيْنَ ﴿٧﴾ وَ يَدْرَؤُا عَنْهَا الْعَذَابَ اَنْ
تَشْهَدَ اَرْبَعَ شَهٰدٰتٍۭ بِاللّٰهِ ۙ اِنَّهٗ لَمِنَ
الْكٰذِبِيْنَ ﴿٨﴾ وَ الْخَامِسَةَ اَنَّ غَضَبَ اللّٰهِ
عَلَيْهَآ اِنْ كَانَ مِنَ الصّٰدِقِيْنَ ﴿٩﴾ وَ لَوْ لَا
فَضْلُ اللّٰهِ عَلَيْكُمْ وَرَحْمَتُهٗ وَ اَنَّ اللّٰهَ تَوَّابٌ
حَكِيْمٌ ﴿١٠﴾ ع

**4 - 5** ఎవరైనా శీలవతులైన స్త్రీలపై నిందమోపి[5] తరువాత నలుగురు సాక్షులను తీసుకురాకపోతే, వారిని ఎనభై కొరడా దెబ్బలు కొట్టండి, వారి సాక్ష్యాన్ని ఇక ఎన్నడూ అంగీకరించ కండి. వారే దుర్మార్గులు - ఈ చేష్ట తరువాత పశ్చాత్తాపపడి తమను తాము సంస్కరించుకునేవారు తప్ప. అల్లాహ్ వారి విషయంలో తప్పకుండా క్షమించేవాడు, కరుణామయుడూను.[6]

**6 - 10** ఎవరైనా తమ భార్యలపై నింద[7] మోపినప్పుడు వారిద్దరూ తప్ప ఇతరులెవ్వరూ సాక్షులుగా వారి వద్ద లేనిపక్షంలో వారిలో ఒక వ్యక్తి సాక్ష్యం (ఏమిటంటే, తాను) నాలుగుసార్లు అల్లాహ్‌పై ప్రమాణం చేసి (తన నిందారోపణ) సత్యమని తాను సాక్ష్యం చెప్పాలి. ఐదోసారి, ఒకవేళ తాను (తన నిందారోపణలో) అబద్ధం చెప్పి ఉంటే, తనపై అల్లాహ్ శాపం అవతరించు గాక! అని అనాలి, భార్యకు శిక్ష ఎలా తప్పుతుందంటే, ఆమె నాలుగుసార్లు అల్లాహ్‌పై ప్రమాణం చేసి, ఈ వ్యక్తి (తన నిందారోపణలో) అబద్ధం చెపుతున్నాడని సాక్ష్యమివ్వాలి. ఐదోసారి, ఒకవేళ అతడు (తన నిందారోపణలో) సత్యవంతుడే అయితే, తనపై అల్లాహ్ ఆగ్రహం విరుచుకుపడుగాక! అని ఆమె అనాలి.[8] మీపై అల్లాహ్ అనుగ్రహం, కరుణ లేకపోతే, అల్లాహ్ క్షమించేవాడూ, వివేకవంతుడూ అయి ఉండకపోతే (భార్యలపై నిందమోపే వ్యవహారం మిమ్మల్ని పెద్ద చిక్కులో పడవేసి ఉండేదే).

---

చేసుకోవటం విశ్వాసులకు నిషిద్ధం. తమ చెడు వైఖరిపై స్థిరంగా ఉండే స్త్రీ పురుషులకు మాత్రమే ఈ ఆదేశం వర్తిస్తుంది. పశ్చాత్తాపపడి, తమను తాము సంస్కరించుకోగలిగే వారికి మాత్రం ఇది వర్తించదు. ఎందుకంటే, పశ్చాత్తాప, సంస్కరణల తరువాత వారికి వ్యభిచారపు ముద్ర అంటదు.

5. అంటే, వ్యభిచారపు నింద. శీలవంతులైన పురుషులపై ఇది ఆరోపించబడినప్పుడు కూడ ఈ ఆదేశమే వర్తిస్తుంది. షరియత్తు పరిభాషలో ఈ నిందారోపణను "ఖజఫ్" అని పేర్కొనబడింది.

6. పశ్చాత్తాపం వలన "ఖజఫ్" శిక్ష రద్దు కాదు అనే విషయంలో న్యాయవేత్తల మధ్య ఏకాభిప్రాయం ఉంది. పశ్చాత్తాపపడేవాడు ఎంతమాత్రం పాపాత్ముడుగా లెక్కింపబడడు, అల్లాహ్ అతనిని క్షమిస్తాడు అనే విషయంలో భిన్నాభిప్రాయం లేదు. అయితే పశ్చాత్తాపపడిన తరువాత అతని సాక్ష్యం ఆమోదయోగ్యమైనది అవునా, కాదా అనే విషయంలో మటుకు అభిప్రాయభేదం ఉన్నది. ఇమాము హనీఫా గారి అభిప్రాయంలో, అతని సాక్ష్యం ఆమోదయోగ్యం కాదు. కాని ఇమాము షాఫయీ, ఇమాము మాలిక్, ఇమాము అహ్మద్‌ల ప్రకారం అతని సాక్ష్యం ఆమోదయోగ్యమైనదే.

اِنَّ الَّذِيْنَ جَآءُوْ بِالْاِفْكِ عُصْبَةٌ مِّنْكُمْ ؕ لَا
تَحْسَبُوْهُ شَرًّا لَّكُمْ ؕ بَلْ هُوَ خَيْرٌ لَّكُمْ ؕ لِكُلِّ
امْرِئٍ مِّنْهُمْ مَّا اكْتَسَبَ مِنَ الْاِثْمِ ۚ وَالَّذِيْ
تَوَلّٰى كِبْرَهٗ مِنْهُمْ لَهٗ عَذَابٌ عَظِيْمٌ ﴿۱۱﴾ لَوْ لَآ
اِذْ سَمِعْتُمُوْهُ ظَنَّ الْمُؤْمِنُوْنَ وَ الْمُؤْمِنٰتُ
بِاَنْفُسِهِمْ خَيْرًا ۙ وَّ قَالُوْا هٰذَآ اِفْكٌ مُّبِيْنٌ ﴿۱۲﴾
لَوْ لَا جَآءُوْ عَلَيْهِ بِاَرْبَعَةِ شُهَدَآءَ ۚ فَاِذْ لَمْ
يَاْتُوْا بِالشُّهَدَآءِ فَاُولٰٓئِكَ عِنْدَ اللّٰهِ هُمُ
الْكٰذِبُوْنَ ﴿۱۳﴾ وَ لَوْ لَا فَضْلُ اللّٰهِ عَلَيْكُمْ وَ
رَحْمَتُهٗ فِي الدُّنْيَا وَ الْاٰخِرَةِ لَمَسَّكُمْ فِيْ مَآ
اَفَضْتُمْ فِيْهِ عَذَابٌ عَظِيْمٌ ﴿۱۴﴾ اِذْ تَلَقَّوْنَهٗ
بِاَلْسِنَتِكُمْ وَتَقُوْلُوْنَ بِاَفْوَاهِكُمْ مَّا لَيْسَ لَكُمْ
بِهٖ عِلْمٌ وَّتَحْسَبُوْنَهٗ هَيِّنًا ۖ وَّ هُوَ عِنْدَ اللّٰهِ
عَظِيْمٌ ﴿۱۵﴾

**11 - 15** ఈ అభాండాన్ని సృష్టించి తీసుకువచ్చినవారు, మీలోని ఒక వర్గం వారే.[9] ఈ సంఘటనను మీ విషయంలో కీడుగా భావించకండి, పైగా ఇది మీకు మేలైనదే.[10] ఎవడు ఇందులో ఎంత పాత్ర వహించాడో, వాడు అంతే పాపాన్ని మూటగట్టుకున్నాడు. ఇంకా ఈ బాధ్యతలో పెద్ద భాగాన్ని తన నెత్తిపై[11] వేసుకున్న వ్యక్తికి పెద్ద శిక్షపడుతుంది. మీరు దానిని గురించి విన్నప్పుడే విశ్వాసులైన పురుషులూ, విశ్వాసులైన స్త్రీలూ తమను గురించి తాము సదభిప్రాయాన్ని ఎందుకు ఏర్పరచుకోలేదు?[12] ఇది స్పష్టమైన అభాండమని ఎందుకు ఖండించలేదు? వారు (తమ నిందారోపణకు రుజువుగా) నలుగురు సాక్షులను ఎందుకు తీసుకురాలేదు? వారు ఇప్పుడు సాక్షులను తీసుకురాలేదు కాబట్టి, అల్లాహ్ దృష్టిలో వారే అసత్యవాదులు.[13] మీపై ప్రపంచంలోనూ, పరలోకంలోనూ, అల్లాహ్ అనుగ్రహం, ఆయన కారుణ్యం, కృప ఉండకపోతే, మీరు ఏ విషయాలలోనైతే పడిపోయారో, ఆ విషయాల పర్యవసానంగా, ఒక పెద్ద శిక్ష మిమ్మల్ని పట్టుకొని ఉండేది. (కొంచెం ఆలోచించండి, అపుడు మీరు ఎంత ఘోరమైన తప్పుచేశారో) అప్పుడు మీ నాలుకలు ఒక దానినుండి మరొకటి ఈ అబద్ధాన్ని అందుకుంటూ పోయాయి. మీరు మీకు తెలియని దాన్ని మీ నోటితో అంటూ పోయారు. మీరు దానిని మామూలు విషయంగా భావించారు. వాస్తవానికి అల్లాహ్ దృష్టిలో అది చాల పెద్ద విషయం.

7. అంటే, వ్యభిచారపు నిందమోపటం.

8. షరియత్తు పరిభాషలో దీనిని "లియాన్" అంటారు. "లియాన్" ఇంట్లో జరగకూడదు, న్యాయస్థానంలో జరగాలి. లియాన్‌ను పురుషుడు కూడ కోరవచ్చును. స్త్రీ కూడ కోరవచ్చును. నిందమోపిన తరువాత, ఒకవేళ పురుషుడు లియాన్ నుండి వైదొలగితే, లేదా స్త్రీ ప్రమాణం చేయటానికి తిరస్కరిస్తే, హనఫీ అభిప్రాయం ప్రకారం నేరస్థుడికి లియాన్ జైలుశిక్ష విధించాలి. ఉభయుల తరఫు నుండి లియాన్ జరిగిన తరువాత, స్త్రీ పురుషులిద్దరూ ఒకరికొకరు నిషిద్ధులవుతారు.

9. ఇక్కడ నుండి 26వ ఆయతు వరకు "ఇఫ్క్" అనే పేరుతో చరిత్రలో ప్రసిద్ధిగాంచిన సంఘటనను గురించి చెప్పటం జరిగింది. అప్పుడు కపటులు హజ్రత్ ఆయెషా (రజిఅన్)పై (అల్లాహ్ క్షమించుగాక!) వ్యభిచారపు నిందను మోపారు, దానిని గురించి ఎంత ప్రచారం చేశారంటే, కొంతమంది ముస్లిములు కూడ ప్రభావితులయ్యారు.

10. అర్థం ఏమిటంటే, భయపడకండి, కపటులు తమ ఎత్తుననుసరించి మీ మీద ఎంతో పెద్ద దెబ్బతీశారు. కాని, దేవుని సంకల్పమైతే, చివరకు అది తిరిగి వారి మీదనే పడుతుంది, మీకు శ్రేయోదాయకంగా పరిణమిస్తుంది.

وَ لَوْ لَاۤ اِذْ سَمِعْتُمُوْهُ قُلْتُمْ مَّا يَكُوْنُ لَنَاۤ اَنْ
نَّتَكَلَّمَ بِهٰذَا ۖ سُبْحٰنَكَ هٰذَا بُهْتَانٌ
عَظِيْمٌ ﴿١٦﴾ يَعِظُكُمُ اللّٰهُ اَنْ تَعُوْدُوْا لِمِثْلِهٖۤ اَبَدًا
اِنْ كُنْتُمْ مُّؤْمِنِيْنَ ۚ ﴿١٧﴾ وَ يُبَيِّنُ اللّٰهُ لَكُمُ
الْاٰيٰتِ ؕ وَ اللّٰهُ عَلِيْمٌ حَكِيْمٌ ﴿١٨﴾ اِنَّ الَّذِيْنَ
يُحِبُّوْنَ اَنْ تَشِيْعَ الْفَاحِشَةُ فِى الَّذِيْنَ اٰمَنُوْا
لَهُمْ عَذَابٌ اَلِيْمٌ ۙ فِى الدُّنْيَا وَ الْاٰخِرَةِ ؕ وَ
اللّٰهُ يَعْلَمُ وَاَنْتُمْ لَا تَعْلَمُوْنَ ﴿١٩﴾ وَ لَوْ لَا فَضْلُ
اللّٰهِ عَلَيْكُمْ وَرَحْمَتُهٗ وَ اَنَّ اللّٰهَ رَءُوْفٌ
رَّحِيْمٌ ﴿٢٠﴾ ع

**16 - 18** దానిని వినగానే మీరు ఇలా ఎందుకనలేదు, "ఇటువంటి విషయాన్ని నోటితో అనటం మాకు శోభించదు, అల్లాహ్ పరిశుద్ధుడు. ఇది పెద్ద అభాండం." మీరు విశ్వాసులే అయితే, ఇక ముందు ఎన్నడూ ఇటువంటి చేష్ట చేయకూడదని అల్లాహ్ మీకు ఉపదేశిస్తున్నాడు. అల్లాహ్ మీకు స్పష్టమైన ఉపదేశాలు ఇస్తున్నాడు; ఆయన జ్ఞాని, వివేకవంతుడూను.

**19 - 20** విశ్వాసుల వర్గంలో అశ్లీలత వ్యాపించాలని కోరేవారు, ప్రపంచంలోనూ, పరలోకంలోనూ వ్యధాభరితమైన శిక్షకు అర్హులు. అల్లాహ్ ఎరుగును, మీరు ఎరుగరు. ఒకవేళ అల్లాహ్ అనుగ్రహం, ఆయన కృపాకటాక్షాలు మీపైన లేకపోతే, అల్లాహ్ వాత్సల్యం కలవాడు, కరుణామయుడు అయి ఉండకపోతే, (ఇప్పుడు మీ మధ్య వ్యాపింపజేయబడిన విషయం దారుణమైన ఫలితాలకు కారణభూతమై ఉండేది).

---

11. అంటే, అబ్దుల్లా బిన్ ఉబై. అతడే ఈ నిందకు మూలకారకుడు, అతడే ఈ ఉపద్రవానికి కర్త.

12. ఇలా కూడ అనువాదం చేయవచ్చు : తమ సంఘానికీ, తమ సమాజానికీ చెందిన ప్రజలను గురించి వారికి సదభిప్రాయం ఎందుకు ఏర్పడలేదు. ఆయతులోని పదాలు రెండు భావాలను వ్యక్తం చేయటానికి అనువుగా ఉన్నాయి. కాని మేము అవలంబించిన అనువాదం మిక్కిలి అర్థవంతమైనది. దాని అర్థం ఏమిటంటే, మీలో ఎవరైనా హ(జత్ ఆయెషా (రజిఅన్) ఉన్న స్థితిలో ఉండి ఉన్నట్లయితే, అప్పుడు మీరు వ్యభిచారం చేసినట్లేనా? అని మీరు ఎందుకు ఆలోచించరు?

13. ఇక్కడ ఎవరికీ ఇటువంటి అపోహ కలగకూడదు; ఇక్కడ కేవలం సాక్షులు లేకపోవటాన్నే సాక్ష్యంగా, ఆధారంగా చూపి నిందారోపణ తప్పు అని ఖండించటం జరుగుతోందని, ఈ నిందారోపణ చేసేవారు నలుగురు సాక్షులను తీసుకురాలేకపోయారు కాబట్టి మీరు కూడ దీనిని కేవలం నిందగా మాత్రమే పరిగణించండి అని ముస్లిమ్‌లకు చెప్పబడుతోంది అని ఎవరూ అపోహపడ కూడదు. అక్కడ జరిగిన సంఘటన స్వరూప స్వభావాలు దృష్టిలో ఉంచుకోకపోవ టం వల్ల ఈ అపోహ కలుగుతుంది. నిందారోపకులు తమ నోటితో అంటున్న విషయాన్ని (అల్లాహ్ క్షమించుగాక!) తమ కళ్ల (తాము గాని తమలో ఎవరైనా గాని) తో చూసి ఈ నిందను మోపలేదు. యాదృచ్ఛికంగా హ(జత్ ఆయెషా బిడారానికి వెనక ఉండిపోయారు. తరువాత ఆమెను హ(జత్ సఫ్వాన్ తమ ఒంటె పైకి ఎక్కించి బిడారులోనికి తీసుకువచ్చారు అనే విషయం ఆధారంగా వారు ఇంత పెద్ద నిందను కల్పించి మోపారు. హ(జత్ ఆయెషా ఈ విధంగా వెనుక ఉండిపోవటం అనేది, అల్లాహ్ క్షమించుగాక; ఉద్దేశ్యపూర్వకమని వివేకం ఉన్న ఏ మనిషీ అనుకోడు. ఒక సైన్యాధిపతి భార్య ఒక వ్యక్తితో బిడారానికి వెనుక ఉండిపోవటం, అదే వ్యక్తి ఆమెను తన ఒంటెపై ఎక్కించి పట్టపగలు మిట్టమధ్యాహ్నం బిడారం ఉన్న చోటుకు తీసుకురావటం అనేది జరగదు. ఉద్దేశ్యపూర్వకంగా చేసేవారు ఇలా చేయరు. పరిస్థితే స్వయంగా వారి అమాయకత్వానికి సాక్ష్యం పలుకుతోంది. ఈ పరిస్థితులలో ఒకవేళ నిందమోపటానికేదైనా అవకాశం ఉంటే, అది నిందమోపేవారు తమ కళ్లతో ఏదైనా విషయాన్ని చూశారు అనే దాని ఆధారంగానే నిందమోపబడుతుంది.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَا تَتَّبِعُوا۟ خُطُوَٰتِ
ٱلشَّيْطَٰنِ ۚ وَمَن يَتَّبِعْ خُطُوَٰتِ ٱلشَّيْطَٰنِ فَإِنَّهُۥ
يَأْمُرُ بِٱلْفَحْشَآءِ وَٱلْمُنكَرِ ۚ وَلَوْلَا فَضْلُ ٱللَّهِ
عَلَيْكُمْ وَرَحْمَتُهُۥ مَا زَكَىٰ مِنكُم مِّنْ أَحَدٍ
أَبَدًا وَلَٰكِنَّ ٱللَّهَ يُزَكِّى مَن يَشَآءُ ۗ وَٱللَّهُ
سَمِيعٌ عَلِيمٌ ﴿٢١﴾ وَلَا يَأْتَلِ أُو۟لُوا۟ ٱلْفَضْلِ مِنكُمْ
وَٱلسَّعَةِ أَن يُؤْتُوٓا۟ أُو۟لِى ٱلْقُرْبَىٰ وَٱلْمَسَٰكِينَ وَ
ٱلْمُهَٰجِرِينَ فِى سَبِيلِ ٱللَّهِ ۖ وَلْيَعْفُوا۟
وَلْيَصْفَحُوٓا۟ ۗ أَلَا تُحِبُّونَ أَن يَغْفِرَ ٱللَّهُ لَكُمْ ۗ
وَٱللَّهُ غَفُورٌ رَّحِيمٌ ﴿٢٢﴾ إِنَّ ٱلَّذِينَ يَرْمُونَ
ٱلْمُحْصَنَٰتِ ٱلْغَٰفِلَٰتِ ٱلْمُؤْمِنَٰتِ لُعِنُوا۟ فِى ٱلدُّنْيَا
وَٱلْءَاخِرَةِ وَلَهُمْ عَذَابٌ عَظِيمٌ ﴿٢٣﴾ يَوْمَ
تَشْهَدُ عَلَيْهِمْ أَلْسِنَتُهُمْ وَأَيْدِيهِمْ وَأَرْجُلُهُم
بِمَا كَانُوا۟ يَعْمَلُونَ ﴿٢٤﴾ يَوْمَئِذٍ يُوَفِّيهِمُ ٱللَّهُ
دِينَهُمُ ٱلْحَقَّ وَيَعْلَمُونَ أَنَّ ٱللَّهَ هُوَ ٱلْحَقُّ
ٱلْمُبِينُ ﴿٢٥﴾

**21** విశ్వసించిన ప్రజలారా! షైతాను అడుగుజాడలలో నడవకండి. వాడిని ఎవరైనా అనుసరిస్తే వాడు అతనికి అశ్లీల తనే, చెడునే ఆజ్ఞాపిస్తాడు. ఒకవేళ అల్లాహ్ అనుగ్రహం ఆయన కారుణ్యం మీ మీద లేకపోతే, మీలో ఏ వ్యక్తీ పరిశుద్ధుడు కాలేడు. కాని అల్లాహ్‌యే తాను కోరిన వారిని పరిశుద్ధులుగా చేస్తాడు. అల్లాహ్ అన్నీ వినేవాడు, అన్నీ తెలిసినవాడూను.

**22** మీలోని ప్రముఖులు, స్థితిపరులు తమ బంధువులకూ, నిరుపేదలకూ, అల్లాహ్ మార్గంలో వలస వచ్చిన ప్రజలకూ, సహాయం చేయకూడదని ప్రమాణం చేయరాదు. వారిని క్షమించాలి, వారి (తప్పులను)ని ఉపేక్షించాలి. మిమ్మల్ని అల్లాహ్ క్షమించాలని మీరు కోరుకోరా? అల్లాహ్ గుణం ఏమిటంటే, ఆయన క్షమించేవాడు, కరుణించేవాడూను.[14]

**23 - 25** శీలవతులు, అమాయికలు అయిన విశ్వాసం గల స్త్రీలపై అభాండం వేసేవారు ప్రపంచంలోనూ, పరలోకంలోనూ శపించబడ్డారు. వారికి పెద్ద శిక్షపడుతుంది. వారి నోళ్లు, వారి కాళ్లు, చేతులూ వారి చేష్టలను గురించి స్వయంగా సాక్ష్యం పలికేరోజును వారు మరచి పోకూడదు. ఆ రోజు అల్లాహ్ వారికి తగిన ప్రతిఫలాన్ని పూర్తిగా ఇస్తాడు. ఇంకా సత్యాన్ని సత్యంగా చేసి చూపే అల్లాహ్‌యే సత్యమని, వారికి తెలిసిపోతుంది.

14. ఈ ఆయతు ఈ నేపథ్యంలో అవతరించింది : నిందమోపిన వారిలో అమాయకులైన కొందరు ముస్లిమ్‌లు కూడ ఉన్నారు. వారిలో ఒకరు హజ్రత్ అబూబకర్ (రజిఅన్) గారి దగ్గరి బంధువు. ఈ చుట్టానికి ఆయన ఆర్థిక సహాయం చేస్తూ ఉండేవారు. బాధాకరమైన ఈ సంఘటన అనంతరం, అతనికి ఇకపై ఎట్టి సహాయ సంపత్తులూ అందీయరాదని ఒట్టుపెట్టుకున్నారు. కాని హజ్రత్ అబూబకర్ లాంటి గొప్ప వ్యక్తి మన్నించకపోవటం, క్షమించకపోవటం అనే విషయం అల్లాహ్‌కు నచ్చలేదు.

اَلْخَبِيْثٰتُ لِلْخَبِيْثِيْنَ وَالْخَبِيْثُوْنَ لِلْخَبِيْثٰتِ ۚ وَ
الطَّيِّبٰتُ لِلطَّيِّبِيْنَ وَ الطَّيِّبُوْنَ لِلطَّيِّبٰتِ ۚ اُولٰٓئِكَ
مُبَرَّءُوْنَ مِمَّا يَقُوْلُوْنَ ؕ لَهُمْ مَّغْفِرَةٌ وَّرِزْقٌ
كَرِيْمٌ ﴿۲۶﴾ يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لَا تَدْخُلُوْا
بُيُوْتًا غَيْرَ بُيُوْتِكُمْ حَتّٰى تَسْتَاْنِسُوْا وَتُسَلِّمُوْا
عَلٰٓى اَهْلِهَا ؕ ذٰلِكُمْ خَيْرٌ لَّكُمْ لَعَلَّكُمْ
تَذَكَّرُوْنَ ﴿۲۷﴾ فَاِنْ لَّمْ تَجِدُوْا فِيْهَآ اَحَدًا فَلَا
تَدْخُلُوْهَا حَتّٰى يُؤْذَنَ لَكُمْ ۚ وَ اِنْ قِيْلَ لَكُمُ
ارْجِعُوْا فَارْجِعُوْا هُوَ اَزْكٰى لَكُمْ ؕ وَ اللّٰهُ بِمَا
تَعْمَلُوْنَ عَلِيْمٌ ﴿۲۸﴾ لَيْسَ عَلَيْكُمْ جُنَاحٌ اَنْ
تَدْخُلُوْا بُيُوْتًا غَيْرَ مَسْكُوْنَةٍ فِيْهَا مَتَاعٌ لَّكُمْ ؕ
وَ اللّٰهُ يَعْلَمُ مَا تُبْدُوْنَ وَ مَا تَكْتُمُوْنَ ﴿۲۹﴾

**26** అపవిత్ర స్త్రీలు అపవిత్ర పురుషుల కొరకు, అపవిత్ర పురుషులు అపవిత్ర స్త్రీల కొరకే. పవిత్ర స్త్రీలు పవిత్ర పురుషుల కొరకు, పవిత్ర పురుషులు పవిత్ర స్త్రీల కొరకే. నిందలు మోపే వారి నిందల నుండి వారు పరిశుద్ధులు. వారికై క్షమాభిక్ష, గౌరవప్రదమైన ఉపాధి ఉన్నాయి.

**27 - 29** విశ్వసించిన ప్రజలారా![15] మీ ఇళ్లల్లోకి తప్ప ఇతరుల ఇళ్లల్లోకి ప్రవేశించకండి, ఇంటి వారి అంగీకారం పొందనంత వరకు, ఇంటి వారికి సలామ్ చేయనంతవరకు. ఈ పద్ధతి మీకు ఎంతో ఉత్తమమైనది. దీనిని మీరు పాటిస్తారని ఆశించబడుతోంది. ఇంకా ఒకవేళ అక్కడ మీరు ఎవరినీ కనుగొనకపోతే, మీకు అనుమతి ఈయబడనంత వరకు[16] ప్రవేశించకూడదు. ఒకవేళ, తిరిగి వెళ్లిపొమ్మని మీతో అంటే, తిరిగి వెళ్ళిపోండి. ఇది మీకు ఎంతో పరిశుద్ధమైన పద్ధతి.[17] మీరు ఏది చేస్తారో, అది అల్లాహ్‌కు బాగా తెలుసు. అయితే ఎవరికీ నివాస స్థలం కానటువంటి మీకు ప్రయోజనకరమైన (లేక పనికివచ్చే) వస్తువేదైనా[18] ఉన్నటువంటి ఇళ్లల్లోకి ప్రవేశిస్తే అది మీకు దోషమేమీ కాదు. మీరు బహిరంగపరచేది, దాచేదీ అంతా అల్లాహ్‌కు తెలుసు.

15. సూరా ప్రారంభంలో ఇవ్వబడిన ఉత్తరువులు సమాజంలో చెడు ప్రబలినప్పుడు దానిని రూపుమాపటానికి సంబంధించినవి. అసలు సమాజంలో చెడు తల ఎత్తకుండా చేయటానికే సమాజంలో ఉన్న నాగరికతా పద్ధతులను సంస్కరించి, చెడు ప్రబలటానికి దోహదపడే కారణాలను నిర్మూలించటానికీ సంబంధించిన ఉత్తరువులు ఇప్పుడు ఇవ్వబడుతున్నాయి.
16. అంటే, గృహయజమాని అనుమతిస్తే తప్ప ఇతరుల ఖాళీ గృహంలోకి ప్రవేశించటం ధర్మసమ్మతం కాదు. ఉదాహరణకు, ఒకవేళ మీరు వచ్చినపుడు నేను లేకపోతే, మీరు నా గదిలో కూర్చోండి అని గృహయజమాని మీతో అనినా, లేదా యజమాని వేరొకచోట ఉండి మీ రాకను గురించి తెలుసుకుని, నేను ఇప్పుడే వస్తున్నాను, మీరు కూర్చోండి, అని వర్తమానం పంపినా, మీరు కూర్చోవచ్చు.
17. అంటే, దానికి అన్యథా భావించకూడదు. ఎవరినైనా కలుసుకోవటం ఇష్టం లేకపోతే, అలా తిరస్కరించేహక్కు ప్రతి మనిషికీ ఉంది. ఇతర వ్యాపకాలచే కలుసుకోవటం సాధ్యపడకపోతే, మన్నించమని అడిగే హక్కుకూడ అతనికి ఉంది.
18. అంటే హోటళ్లు, ధర్మసత్రాలు, అతిథిగృహాలు, దుకాణాలు అని అర్థం. ఈ ప్రదేశాలలో ప్రజలందరూ ప్రవేశించటానికి అనుమతి ఉంది.

**30** ప్రవక్తా! విశ్వసించిన పురుషులకు తమ చూపులను కాపాడుకోండి[19] అనీ తమ మర్మాంగాలను రక్షించుకోండి అనీ చెప్పు. ఇది వారికి ఎంతో పరిశుద్ధమైన పద్ధతి. వారు చేసే దానిని గురించి అల్లాహ్‌కు బాగా తెలుసు.

**31 ...** ప్రవక్తా! విశ్వసించిన మహిళలకు ఇలా చెప్పు, తమ చూపులను కాపాడుకోండి అని, తమ మర్మాంగాలను రక్షించుకోండి అని, తమ అలంకరణను[20] ప్రదర్శించవలదని- దానంతట అదే కనిపించేది తప్ప- తమ వక్షస్థలాలను ఓణీ అంచులతో కప్పుకోవాలని, వారు తమ అలంకరణను వీరి ముందు తప్ప మరెవరి ముందూ ప్రదర్శించకూడదని: భర్త, తండ్రి, భర్తల తండ్రులు,[21] తమ కుమారులు, భర్తల కుమారులు,[22] అన్నదమ్ములు,[23] అన్నదమ్ముల కుమారులు, అక్కా చెల్లెళ్ల కుమారులు[24] తమతో కలసీ మెలసీ ఉండే స్త్రీలు.[25] తమ స్త్రీ పురుష బానిసలు, వేరే ఏ ఉద్దేశ్యమూ లేని[26] వారి కింద పని చేసే పురుష సేవకులు. స్త్రీల గుప్త విషయాలను గురించి ఇంకా తెలియని బాలురు. తాము గుప్తంగా ఉంచిన తమ అలంకరణ ప్రజలకు తెలిసేలా వారు తమ కాళ్లను నేలపై కొడుతూ నడవరాదని కూడ వారికి చెప్పు.

**... 31** విశ్వసించిన ప్రజలారా! మీరంతా కలసి అల్లాహ్ వైపునకు మరలి క్షమాభిక్షను వేడుకోండి. మీకు సాఫల్యం కలగవచ్చు.

**32 - 33 ...** మీలో ఎవరు వివాహం లేకుండా ఒంటరిగా ఉంటున్నారో మీ స్త్రీ పురుష బానిసలలో ఎవరు గుణవంతులో, వారి వివాహాలు చేసి వేయండి. వారు గనక పేదవారయితే, అల్లాహ్ తన అనుగ్రహంతో వారిని సంపన్నులుగా చేస్తాడు. అల్లాహ్ అంతులేని వనరులు కలవాడు. సర్వమూ తెలిసిన వాడు. వివాహ అవకాశాన్ని ఇంకా పొందనివారు శీల శుద్ధతను పాటించాలి. అల్లాహ్ తన అనుగ్రహం ద్వారా వారికి కలిమి ఇచ్చేవరకు.

قُل لِّلْمُؤْمِنِينَ يَغُضُّوا مِنْ أَبْصَارِهِمْ وَيَحْفَظُوا
فُرُوجَهُمْ ۚ ذَٰلِكَ أَزْكَىٰ لَهُمْ ۗ إِنَّ اللَّهَ خَبِيرٌ
بِمَا يَصْنَعُونَ ﴿٣٠﴾ وَقُل لِّلْمُؤْمِنَاتِ يَغْضُضْنَ
مِنْ أَبْصَارِهِنَّ وَيَحْفَظْنَ فُرُوجَهُنَّ وَلَا
يُبْدِينَ زِينَتَهُنَّ إِلَّا مَا ظَهَرَ مِنْهَا
وَلْيَضْرِبْنَ بِخُمُرِهِنَّ عَلَىٰ جُيُوبِهِنَّ ۖ وَلَا
يُبْدِينَ زِينَتَهُنَّ إِلَّا لِبُعُولَتِهِنَّ أَوْ آبَائِهِنَّ
أَوْ آبَاءِ بُعُولَتِهِنَّ أَوْ أَبْنَائِهِنَّ أَوْ أَبْنَاءِ
بُعُولَتِهِنَّ أَوْ إِخْوَانِهِنَّ أَوْ بَنِي إِخْوَانِهِنَّ أَوْ
بَنِي أَخَوَاتِهِنَّ أَوْ نِسَائِهِنَّ أَوْ مَا مَلَكَتْ
أَيْمَانُهُنَّ أَوِ التَّابِعِينَ غَيْرِ أُولِي الْإِرْبَةِ مِنَ
الرِّجَالِ أَوِ الطِّفْلِ الَّذِينَ لَمْ يَظْهَرُوا عَلَىٰ
عَوْرَاتِ النِّسَاءِ ۖ وَلَا يَضْرِبْنَ بِأَرْجُلِهِنَّ
لِيُعْلَمَ مَا يُخْفِينَ مِن زِينَتِهِنَّ ۚ وَتُوبُوا
إِلَى اللَّهِ جَمِيعًا أَيُّهَ الْمُؤْمِنُونَ لَعَلَّكُمْ
تُفْلِحُونَ ﴿٣١﴾ وَأَنكِحُوا الْأَيَامَىٰ مِنكُمْ وَ
الصَّالِحِينَ مِنْ عِبَادِكُمْ وَإِمَائِكُمْ ۚ إِن
يَكُونُوا فُقَرَاءَ يُغْنِهِمُ اللَّهُ مِن فَضْلِهِ ۗ وَاللَّهُ
وَاسِعٌ عَلِيمٌ ﴿٣٢﴾ وَلْيَسْتَعْفِفِ الَّذِينَ لَا
يَجِدُونَ نِكَاحًا حَتَّىٰ يُغْنِيَهُمُ اللَّهُ مِن فَضْلِهِ ۗ

19. అసలు "గజ్జె బసర్" ఆదేశం ఇవ్వబడింది. 'గజ్జె బసర్'ను సాధారణంగా 'చూపును క్రిందికి దించుట' లేదా 'చూపును క్రిందికే సారించి ఉంచుట' అని అనువాదం చేస్తారు. కాని ఎల్లప్పుడూ క్రిందికే చూస్తూ ఉండాలని దీని అర్థం కాదు. అర్థం ఏమిటంటే, కళ్ళారా చూడరాదు, యథేచ్ఛగా కళ్లను సంచరించనీయవద్దు. అంటే చూపులను అదుపులో ఉంచుకోవాలని తాత్పర్యం. చూడదగని విషయాల నుండి చూపులను మరల్చుకోవాలి;

وَ الَّذِيْنَ يَبْتَغُوْنَ الْكِتٰبَ مِمَّا مَلَكَتْ اَيْمَانُكُمْ
فَكَاتِبُوْهُمْ اِنْ عَلِمْتُمْ فِيْهِمْ خَيْرًا ۖۗ وَّاٰتُوْهُمْ
مِّنْ مَّالِ اللّٰهِ الَّذِيْٓ اٰتٰىكُمْ ؕ وَ لَا تُكْرِهُوْا
فَتَيٰتِكُمْ عَلَى الْبِغَآءِ اِنْ اَرَدْنَ تَحَصُّنًا لِّتَبْتَغُوْا
عَرَضَ الْحَيٰوةِ الدُّنْيَا ؕ وَ مَنْ يُّكْرِهْهُّنَّ فَاِنَّ
اللّٰهَ مِنْ بَعْدِ اِكْرَاهِهِنَّ غَفُوْرٌ رَّحِيْمٌ ﴿۳۳﴾

**... 33 ...** మీ అధీనంలో ఉన్న వారిలో ఎవరైనా ముకాతబత్[27] (షరతుల పత్రం) కొరకు విజ్ఞప్తి చేస్తే, వారిలో మంచితనం[28] ఉందని మీరు గ్రహిస్తే, వారితో 'ముకాతబత్'ను కుదుర్చు కోండి. అల్లాహ్ మీకు ఇచ్చిన ధనం[29] నుండి మీరు వారికి ఇవ్వండి.

**... 33** మీ లౌకిక ప్రయోజనాల నిమిత్తం మీ బానిస స్త్రీలను వేశ్యావృత్తికై బలవంతపెట్టకండి. [30]వారే శీలవతులుగా ఉండ గోరినపుడు[31] ఎవరైనా వారిని బలవంతపెడితే, ఆ బలత్కారం తరువాత అల్లాహ్ వారి (బానిస స్త్రీల)ని క్షమించేవాడు, కరుణించేవాడూను.

దీనికై మనిషి తన ముఖాన్ని క్రిందకు దించినా ఫర్వాలేదు. మరొక వైపునకు మరల్చుకున్నా ఇబ్బంది లేదు. సందర్భాన్నిబట్టి తెలిసేది ఏమిటంటే, పురుషులు అన్య స్త్రీలను చూచుట, ఇతరుల ఆచ్ఛాదనీయ అవయవములను చూచుట, అసభ్య దృశ్యాలపై చూపును నిలుపుట అనే మూడు విషయాలకు ఈ కట్టుబాటు వర్తిస్తుంది.

20. దైవ శాసనం పురుషులకు విధించిన నియమాలతో పాటు చూపులను అదుపులో ఉంచుకొనుట, మర్మాంగాలను కాపాడుకొనుట – స్త్రీలకు మరికొన్ని విశేష నియమాలను కూడ విధించింది అనే విషయం దృష్టిలో ఉంచు కోవాలి. ఈ విషయంలో స్త్రీ పురుషులు సమానులు కారు అనే విషయం తెలుస్తోంది.

21. తండ్రులు అంటే తండ్రి తరపు తాతముత్తాతలు, తల్లి తరపు తాతముత్తాతలు అని అర్థం. ఒక స్త్రీ నిస్సంకోచంగా తన తండ్రి, తన మామల ఎదుటకు వచ్చినట్లుగా, తన తండ్రి తరపు తాతముత్తాతలు, తన తల్లి తరపు తాతముత్తాతలు, తన భర్త తండ్రి తరపు తాతముత్తాతలు, తన భర్త తల్లి తరపు తాతముత్తాతల ఎదుటకు రావచ్చును.

22. కుమారులలో తల్లిదండ్రుల తరపు మనుమలు, మునిమనుమలు అందరూ చేరి ఉన్నారు. ఈ విషయంలో కన్నకొడుకులు, సవతి కొడుకులు అనే భేదం లేదు. తన కన్న బిడ్డలు, వారి పిల్లల ముందు ఒక స్త్రీ తన అలంకరణలను చూపినట్లుగానే, తన సవతి పిల్లల సంతానం ముందు కూడ చూపవచ్చును.

23. సోదరులలో ఏకోదరులు, సవతి సోదరులు చేరి ఉన్నారు.

24. అన్నదమ్ములు, అక్క చెల్లెళ్ళు అంటే మూడు రకాల అన్నదమ్ములు, అక్క చెల్లెళ్ళు అని అర్థం. వారి కుమారులు వారి తండ్రి తరపు మనుమలు, తల్లి తరపు మనుమలు అందరూ వారి సంతానం క్రిందకే వస్తారు.

25. చెడు నడతగల, నీతి బాహ్యమైన స్త్రీల ముందు కులీనులైన ముస్లిమ్ వనితలు తమ సింగారాన్ని ప్రదర్శించకూడదు అనే విషయం స్పష్టమవుతోంది.

26. అంటే, సేవకులు కాబట్టి వారు తాము పని చేసే ఇంటి గృహిణుల విషయంలో చెడు తలంపులకు సాహసిస్తారనే అనుమానానికి ఆస్కారం ఉండదు.

27. 'ముకాతబత్' అంటే ఒక బానిసగానీ, ఒక బానిస స్త్రీగానీ తన విమోచనకై తన యజమానికి కొంత ధనం ఇస్తానని చేసే మనవి; యజమాని దానికి అంగీకరించినపుడు, వారిద్దరి మధ్య కుదిరిన ఒడంబడిక వ్రాత రూపంలో ఉండాలి.

28. మంచితనం అంటే, ఈ రెండు విషయాలు ఉండాలి అని అర్థం; ఒకటి, బానిస తన విమోచన ధనాన్ని చెల్లించగల సమర్థుడై ఉండాలి. రెండు, అతని మాటను నమ్మి ఒడంబడికను ఖరారు చేయటానికి అతనిలో నిజాయితీ, న్యాయబుద్ధి వంటి గుణాలు ఉండాలి.

وَلَقَدْ اَنْزَلْنَاۤ اِلَيْكُمْ اٰيٰتٍ مُّبَيِّنٰتٍ وَّ مَثَلًا
مِّنَ الَّذِيْنَ خَلَوْا مِنْ قَبْلِكُمْ وَمَوْعِظَةً
لِّلْمُتَّقِيْنَ ۝٣٤ اَللّٰهُ نُوْرُ السَّمٰوٰتِ وَالْاَرْضِ ؕ
مَثَلُ نُوْرِهٖ كَمِشْكٰوةٍ فِيْهَا مِصْبَاحٌ ؕ اَلْمِصْبَاحُ
فِيْ زُجَاجَةٍ ؕ اَلزُّجَاجَةُ كَاَنَّهَا كَوْكَبٌ دُرِّيٌّ
يُّوْقَدُ مِنْ شَجَرَةٍ مُّبٰرَكَةٍ زَيْتُوْنَةٍ لَّا شَرْقِيَّةٍ
وَّلَا غَرْبِيَّةٍ ۙ يَّكَادُ زَيْتُهَا يُضِيْٓءُ وَلَوْ لَمْ
تَمْسَسْهُ نَارٌ ؕ نُوْرٌ عَلٰى نُوْرٍ ؕ يَهْدِى اللّٰهُ
لِنُوْرِهٖ مَنْ يَّشَآءُ ؕ وَيَضْرِبُ اللّٰهُ الْاَمْثَالَ
لِلنَّاسِ ؕ وَاللّٰهُ بِكُلِّ شَيْءٍ عَلِيْمٌ ۙ ۝٣٥

**34** మేము స్పష్టమైన మార్గదర్శకత్వాన్నిచ్చే ఆయత్‌లను మీ వద్దకు పంపాము. మీకు పూర్వం గతించిన జాతుల గుణపాఠం నేర్పే ఉదాహరణలను కూడ మేము మీ ముందు పెట్టాము. భయభక్తులు కలవారికి అవసరమైన ఉపదేశాలను కూడ మేము చేశాము.

**35-40** అల్లాహ్ ఆకాశములకూ, భూమికీ వెలుగు.[32] (సృష్టిలో) ఆయన వెలుగు ఉపమానం ఇలా ఉంది: ఒక గూటిలో దీపం ఉన్నది, ఆ దీపం ఒక గాజు చిమ్నీలో ఉన్నది, ఆ గాజు కుప్పె ఆణిముత్యం మాదిరిగా మెరిసే నక్షత్రంలా ఉన్నది. ఆ దీపం శుభవంతమైన ఒక జైతూన్ వృక్షపు నూనెతో ప్రకాశింప జేయబడుతోంది. ఆ వృక్షం తూర్పుకూ చెందదు, పడమరకూ చెందదు; దాని నూనె నిప్పు తగలకపోయినా దానంతట అదే మండుతుంది. (ఈ విధంగా) వెలుగుపై వెలుగు (ద్విగుణీకృతమయ్యే కారణాలన్నీ ఏకమయ్యాయి[33]) అల్లాహ్ తన వెలుగు వైపునకు తనకు ఇష్టమైన వారికి మార్గం చూపుతాడు. ఆయన ప్రజలకు దృష్టాంతాల ద్వారా విషయాన్ని బోధిస్తాడు. ఆయన ప్రతి విషయాన్నీ బాగా ఎరుగును.

29. ఇది సాధారణ ఉత్తరువు. యజమాని కూడా విమోచన ధనంలో ఎంతో కొంత తగ్గించి ఔదార్యం చూపాలి. ముస్లిమ్ ప్రజలు కూడా తగిన సహాయం చేయాలి. ప్రభుత్వ ఖజానా నుండి కొంత ధనం వారికి ఇవ్వాలి.

30. అజ్ఞాన కాలంలో అరేబియా వాసులు బానిస స్త్రీలచే బలవంతంగా వ్యభిచారం చేయించి, ఆ సంపాదనను అనుభవించేవారు. ఇస్లామ్‌లో ఈ వృత్తి నిషేధించబడింది.

31. అర్థం ఏమిటంటే, ఒకవేళ బానిస స్త్రీ తన ఇష్టానుసారంగా చెడు నడతకు పాల్పడితే, ఆ నేరానికి బాధ్యత ఆమెదే, చట్టం ఆమె నేరానికి ఆమెనే పట్టుకుంటుంది. ఒకవేళ ఆమె యజమాని బలవంతంగా ఆమె చేత ఆ పనిని చేయించి నట్లయితే, అప్పుడు బాధ్యత పూర్తిగా యజమానిదే, చట్టం అతన్నే పట్టుకుంటుంది.

32. అంటే, అల్లాహ్ వెలుగువల్లనే (సృష్టిలో ఉన్నదంతా ప్రకాశిస్తోంది) లోకాలన్నీ ప్రకాశిస్తున్నాయి.

33. ఈ దృష్టాంతంలో అల్లాహ్‌ను దీపంతోనూ, సృష్టిని గూటితోనూ పోల్చటం జరిగింది. గాజు చిమ్ని ఒక తెర, దాని మరుగున దేవుడు సృష్టి దృష్టికి గోచరించకుండా ఉన్నాడు. అంటే, ఈ తెర వాస్తవానికి ఆచ్ఛాదన తెర కాదు, తీవ్ర వ్యక్తీకరణ తెర. ఈ సృష్టి దానిని చూడడం అశక్యం. కారణం ఆ జ్యోతి తీవ్రత, విస్తృతి, సమృద్ధతలే. ఈ పరిమితమైన ధృక్కులు దానిని అవగతం చేసుకోజాలవు. ఇక, "ఆ దీపం శుభప్రదమైన ఒక జైతూన్ వృక్షపు నూనెతో ప్రకాశింపజేయబడుతోంది. ఆ వృక్షం తూర్పునకూ చెందదు, పడమరకూ చెందదు" అని భావగర్భితంగా చెప్పబడింది. దీపపు వెలుగు యొక్క పరిపూర్ణతనూ, దాని తీవ్రతల భావనను జనింపజేయటానికి ఇలా చెప్పబడింది. ఎందుకంటే ప్రాచీన కాలంలో ఎక్కువగా జైతూన్ వృక్షపు నూనెతో వెలిగే దీపాల ద్వారా ప్రజలు కాంతిని పొందేవారు. మైదానములందలి మిట్ట ప్రాంతంలో పెరిగే జైతూన్ వృక్షాల నూనెతో వెలిగే దీపాలు ఎక్కువ కాంతిమంతముగా ఉండేవి. "దాని నూనె నిప్పు తగలకపోయినా దానంతట అదే మండుతుంది." ఇది కూడ దీపపు వెలుగుల తీక్షణతను చూపడానికి ఉద్దేశించింది.

فِيْ بُيُوْتٍ اَذِنَ اللّٰهُ اَنْ تُرْفَعَ وَ يُذْكَرَ فِيْهَا
اسْمُهٗ ۙ يُسَبِّحُ لَهٗ فِيْهَا بِالْغُدُوِّ وَالْاٰصَالِ ﴿٣٦﴾
رِجَالٌ ۙ لَّا تُلْهِيْهِمْ تِجَارَةٌ وَّ لَا بَيْعٌ عَنْ
ذِكْرِ اللّٰهِ وَ اِقَامِ الصَّلٰوةِ وَ اِيْتَآءِ الزَّكٰوةِ ۙ
يَخَافُوْنَ يَوْمًا تَتَقَلَّبُ فِيْهِ الْقُلُوْبُ وَ
الْاَبْصَارُ ﴿٣٧﴾ ۙ لِيَجْزِيَهُمُ اللّٰهُ اَحْسَنَ مَا عَمِلُوْا
وَ يَزِيْدَهُمْ مِّنْ فَضْلِهٖ ؕ وَ اللّٰهُ يَرْزُقُ مَنْ
يَّشَآءُ بِغَيْرِ حِسَابٍ ﴿٣٨﴾ وَ الَّذِيْنَ كَفَرُوْۤا
اَعْمَالُهُمْ كَسَرَابٍۭ بِقِيْعَةٍ يَّحْسَبُهُ الظَّمْاٰنُ
مَآءً ؕ حَتّٰۤى اِذَا جَآءَهٗ لَمْ يَجِدْهُ شَيْئًا وَّ
وَجَدَ اللّٰهَ عِنْدَهٗ فَوَفّٰىهُ حِسَابَهٗ ؕ وَ اللّٰهُ
سَرِيْعُ الْحِسَابِ ﴿٣٩﴾ ۙ اَوْ كَظُلُمٰتٍ فِيْ بَحْرٍ لُّجِّيٍّ
يَّغْشٰىهُ مَوْجٌ مِّنْ فَوْقِهٖ مَوْجٌ مِّنْ فَوْقِهٖ
سَحَابٌ ؕ ظُلُمٰتٌۢ بَعْضُهَا فَوْقَ بَعْضٍ ؕ اِذَاۤ
اَخْرَجَ يَدَهٗ لَمْ يَكَدْ يَرٰىهَا ؕ وَ مَنْ لَّمْ يَجْعَلِ
اللّٰهُ لَهٗ نُوْرًا فَمَا لَهٗ مِنْ نُّوْرٍ ﴿٤٠﴾ ع اَلَمْ تَرَ اَنَّ ع ٥
اللّٰهَ يُسَبِّحُ لَهٗ مَنْ فِي السَّمٰوٰتِ وَ الْاَرْضِ
وَالطَّيْرُ صٰٓفّٰتٍ ؕ كُلٌّ قَدْ عَلِمَ صَلَاتَهٗ وَ
تَسْبِيْحَهٗ ؕ وَ اللّٰهُ عَلِيْمٌۢ بِمَا يَفْعَلُوْنَ ﴿٤١﴾ وَ لِلّٰهِ
مُلْكُ السَّمٰوٰتِ وَالْاَرْضِ ۚ وَ اِلَى اللّٰهِ
الْمَصِيْرُ ﴿٤٢﴾

(ఆయన వెలుగు వైపునకు పోయేమార్గం పొందినవారు) ఏ గృహాలను మహోన్నతం చేయటానికీ, ఏ గృహాలలో తన నామాన్ని స్మరించటానికీ అల్లాహ్ అనుమతించాడో, ఆ గృహాలలో ఉంటారు. వ్యాపారంగానీ, క్రయవిక్రయాలుగానీ, అల్లాహ్ సంస్మరణ విషయంలో నమాజు సంస్థాపనం, జకాత్ ఇవ్వడం వంటి విషయాలలో, ఎవరినైతే అశ్రద్ధ వహించేలా చేయవో, అటువంటి వారు ఉదయం, సాయంత్రం ఆయన స్తోత్రం చేస్తారు. హృదయాలు తలక్రిందులై, కనుగ్రుడ్లు తేలిపోయే పరిస్థితి ఏర్పడబోయే రోజును గురించి వారు భయపడుతూ ఉంటారు. (వారు ఇదంతా ఎందుకు చేస్తారంటే) అల్లాహ్ వారి ఉత్తమ కర్మల ప్రతిఫలాన్ని వారికి ఇవ్వాలనీ, అదనంగా తన అనుగ్రహం నుండి ఇంకా ప్రసాదించాలనీ; అల్లాహ్ తాను కోరిన వారికి లెక్కలేకుండా ఇస్తాడు. (దానికి వ్యతిరేకంగా) అవిశ్వాసానికి పాల్పడిన వారి కర్మలకు ఉపమానంగా ఎడారిలోని ఎండమావిని చెప్పవచ్చు. దప్పిక గొన్నవాడు దానిని చూసి నీరు అనుకున్నాడు; కాని అక్కడకు చేరి ఏమీ పొందలేకపోయాడు. అయితే అతడు అక్కడ అల్లాహ్ ఉన్నట్లు కనుగొన్నాడు. ఆయన అతని లెక్కను పూర్తిగా తేల్చి వేశాడు. లెక్క తేల్చడంలో అల్లాహ్‌కు ఏమాత్రం ఆలస్యం కాదు. లేదా (వారి కర్మలకు) ఒక లోతైన సముద్రంలోని చీకటిని ఉపమానంగా చెప్పవచ్చు. దాని(ఆ చీకటి)పై ఒక అల వ్యాపించి ఉన్నది. దానిపై మరొక అల, దానిపై మేఘం. చీకటిపై చీకటి. మనిషి తన చేతిని బయటకు సాచితే, దానిని కూడ చూడలేడు. ఎవరికి అల్లాహ్ తన వెలుగును ప్రసాదించడో, అతనికి మరే వెలుగూలేదు.

**41 - 42** ఆకాశాలలోను, భూమిపైనా ఉన్న సమస్తమూ, రెక్కలు విప్పి ఎగిరే పక్షులు సైతమూ అల్లాహ్ స్తోత్రం చేయటాన్ని నీవు చూడటం లేదా? ప్రతి ఒక్కటీ తన నమాజును, తన స్తోత్రం చేసే పద్ధతిని ఎరుగును. అవి చేసే వాటినన్నింటినీ అల్లాహ్ బాగా ఎరుగును. ఆకాశముల మీద, భూమి మీద సామ్రాజ్యాధికారం అల్లాహ్‌దే. ఆయన వైపునకే అంతా మరలవలసి ఉన్నది.

**43 - 44** అల్లాహ్ మేఘాన్ని మెల్లమెల్లగా నడపటాన్నీ, దాని తునకలను ఒకదానితో ఒకటి కలపటాన్నీ, తరువాత దానిని పోగుచేసి ఒక దట్టమైన మబ్బుగా మలచటాన్నీ నీవు చూడవా? తరువాత దాని పైపొరనుండి వర్షపు చినుకులు రాలుతూ ఉండటాన్ని నీవు చూస్తావు. ఆయన ఆకాశం నుండి, దానిలోని ఎత్తైన[34] పర్వతాలు కారణంగా, వడగండ్లను కురిపిస్తాడు. తాను తలచిన వారికి వాటి ద్వారా నష్టం కలిగిస్తాడు, తాను తలచిన వారిని వాటి నుండి రక్షిస్తాడు. దాని పిడుగు యొక్క మెరుపు చూపులను చెదరగొడుతుంది. రేయింబవళ్ల పరిభ్రమణను ఆయనే చేస్తున్నాడు. కళ్లున్నవారికి ఇందులో గుణపాఠం ఉంది.

**45** అల్లాహ్ ప్రతి ప్రాణిని ఒక విధమైన నీటితో సృష్టించాడు. ఒకటి పొట్టపై నడుస్తుంటే, మరొకటి రెండు కాళ్లపై, ఇంకొకటి నాలుగు కాళ్ళపై నడుస్తోంది. ఆయన తనకు ఇష్టమైన దానిని సృష్టిస్తాడు. ఆయనకు ప్రతి దానిపై అధికారం ఉన్నది.

**46** మేము నిజాన్ని స్పష్టంగా తెలిపే వాక్యాలను అవతరింప జేశాము. ఇక ఋజుమార్గం వైపునకు అల్లాహ్‌యే తనకు ఇష్టమైన వారికి దారి చూపుతాడు.

اَلَمْ تَرَ اَنَّ اللّٰهَ يُزْجِيْ سَحَابًا ثُمَّ يُؤَلِّفُ
بَيْنَهٗ ثُمَّ يَجْعَلُهٗ رُكَامًا فَتَرَى الْوَدْقَ يَخْرُجُ
مِنْ خِلٰلِهٖ ۚ وَ يُنَزِّلُ مِنَ السَّمَآءِ مِنْ جِبَالٍ
فِيْهَا مِنْۢ بَرَدٍ فَيُصِيْبُ بِهٖ مَنْ يَّشَآءُ وَيَصْرِفُهٗ
عَنْ مَّنْ يَّشَآءُ ؕ يَكَادُ سَنَا بَرْقِهٖ يَذْهَبُ
بِالْاَبْصَارِ ﴿٤٣﴾ يُقَلِّبُ اللّٰهُ الَّيْلَ وَ النَّهَارَ ؕ
اِنَّ فِيْ ذٰلِكَ لَعِبْرَةً لِّاُولِي الْاَبْصَارِ ﴿٤٤﴾ وَ
اللّٰهُ خَلَقَ كُلَّ دَآبَّةٍ مِّنْ مَّآءٍ ۚ فَمِنْهُمْ مَّنْ
يَّمْشِيْ عَلٰى بَطْنِهٖ ۚ وَ مِنْهُمْ مَّنْ يَّمْشِيْ عَلٰى
رِجْلَيْنِ ۚ وَ مِنْهُمْ مَّنْ يَّمْشِيْ عَلٰۤى اَرْبَعٍ ؕ
يَخْلُقُ اللّٰهُ مَا يَشَآءُ ؕ اِنَّ اللّٰهَ عَلٰى كُلِّ شَيْءٍ
قَدِيْرٌ ﴿٤٥﴾ لَقَدْ اَنْزَلْنَآ اٰيٰتٍ مُّبَيِّنٰتٍ ؕ وَ اللّٰهُ
يَهْدِيْ مَنْ يَّشَآءُ اِلٰى صِرَاطٍ مُّسْتَقِيْمٍ ﴿٤٦﴾

34. దీని అర్థం చల్లదనంచే ఘనీభవించిన మేఘాలు కావచ్చు, వాటినే ఆలంకారికంగా ఆకాశపర్వతాలు అని అభివర్ణించి ఉండవచ్చు. భూమిపై ఉన్న పర్వతాలు కూడ కావచ్చు. అవి ఆకాశపు ఔన్నత్యంతో ఒప్పే శిఖరాలు కలవి. ఆ శిఖరములపై ఘనీభవించిన మంచు ప్రభావం వల్ల అనేక సమయాలలో గాలి అతిశీతలమై మేఘాలు ఘనీభవించి వడగండ్ల వానలు కురుస్తాయి.

وَ يَقُوْلُوْنَ اٰمَنَّا بِاللّٰهِ وَ بِالرَّسُوْلِ وَ اَطَعْنَا ثُمَّ
يَتَوَلّٰى فَرِيْقٌ مِّنْهُمْ مِّنْۢ بَعْدِ ذٰلِكَ ؕ وَ مَاۤ
اُولٰٓئِكَ بِالْمُؤْمِنِيْنَ ﴿۴۷﴾ وَ اِذَا دُعُوْۤا اِلَى اللّٰهِ وَ
رَسُوْلِهٖ لِيَحْكُمَ بَيْنَهُمْ اِذَا فَرِيْقٌ مِّنْهُمْ
مُّعْرِضُوْنَ ﴿۴۸﴾ وَ اِنْ يَّكُنْ لَّهُمُ الْحَقُّ يَاْتُوْۤا
اِلَيْهِ مُذْعِنِيْنَ ﴿۴۹﴾ؕ اَفِيْ قُلُوْبِهِمْ مَّرَضٌ اَمِ
ارْتَابُوْۤا اَمْ يَخَافُوْنَ اَنْ يَّحِيْفَ اللّٰهُ عَلَيْهِمْ
وَرَسُوْلُهٗ ؕ بَلْ اُولٰٓئِكَ هُمُ الظّٰلِمُوْنَ ﴿۵۰﴾ؒ اِنَّمَا ع
كَانَ قَوْلَ الْمُؤْمِنِيْنَ اِذَا دُعُوْۤا اِلَى اللّٰهِ وَ
رَسُوْلِهٖ لِيَحْكُمَ بَيْنَهُمْ اَنْ يَّقُوْلُوْا سَمِعْنَا وَ
اَطَعْنَا ؕ وَ اُولٰٓئِكَ هُمُ الْمُفْلِحُوْنَ ﴿۵۱﴾ وَ مَنْ يُّطِعِ
اللّٰهَ وَرَسُوْلَهٗ وَ يَخْشَ اللّٰهَ وَ يَتَّقْهِ فَاُولٰٓئِكَ
هُمُ الْفَآئِزُوْنَ ﴿۵۲﴾ وَاَقْسَمُوْا بِاللّٰهِ جَهْدَ
اَيْمَانِهِمْ لَئِنْ اَمَرْتَهُمْ لَيَخْرُجُنَّ ؕ قُلْ لَّا
تُقْسِمُوْا ۚ طَاعَةٌ مَّعْرُوْفَةٌ ؕ اِنَّ اللّٰهَ خَبِيْرٌۢ بِمَا
تَعْمَلُوْنَ ﴿۵۳﴾ قُلْ اَطِيْعُوا اللّٰهَ وَ اَطِيْعُوا
الرَّسُوْلَ ۚ فَاِنْ تَوَلَّوْا فَاِنَّمَا عَلَيْهِ مَا حُمِّلَ وَ
عَلَيْكُمْ مَّا حُمِّلْتُمْ ؕ وَاِنْ تُطِيْعُوْهُ تَهْتَدُوْا ؕ
وَ مَا عَلَى الرَّسُوْلِ اِلَّا الْبَلٰغُ الْمُبِيْنُ ﴿۵۴﴾

**47 - 52** మేము అల్లాహ్‌ను, దైవప్రవక్తను విశ్వసించాము, విధేయతను అంగీకరించాము, అని వారు అంటారు. కాని దాని తరువాత వారిలోని ఒక వర్గం (విధేయతపట్ల) విముఖతను చూపింది. అటువంటి వారు ఎంత మాత్రం విశ్వాసులు కారు. దైవప్రవక్త వారి మధ్య ఉన్న వ్యాజ్యం విషయంలో తీర్పు చెప్పటానికి వారిని అల్లాహ్ వైపునకూ, ప్రవక్త వైపునకూ రమ్మని పిలిచినప్పుడు, వారిలోని ఒక ప్రత్యర్థి వర్గం విముఖత చూపుతుంది. కాని ఒకవేళ సత్యం వారికి అనుకూలంగా ఉంటే, దైవప్రవక్త వద్దకు పెద్ద విధేయులు మాదిరిగా వచ్చేస్తారు. వారి హృదయాలకు (కపట) రోగమేదైనా తగిలిందా? లేదా వారు సంశయంలో పడిపోయారా? లేదా అల్లాహ్, మరియు ఆయన ప్రవక్త తమకు అన్యాయం చేస్తారని వారికి భయమా? అసలు విషయమేమిటంటే, అన్యాయపరులు స్వయంగా వారే. విశ్వసించే వారి పని ఏమిటంటే, తమ వ్యాజ్యాన్ని దైవప్రవక్త పరిష్కరించే విషయంలో వారు అల్లాహ్ వైపునకూ, ప్రవక్త వైపునకూ పిలువబడితే, "మేము విన్నాము, విధేయత చూపాము" అని అనాలి. అటువంటి వారే సాఫల్యం పొందుతారు. అల్లాహ్‌కూ, ప్రవక్తకూ విధేయత చూపేవారు, అల్లాహ్‌కు భయపడేవారు, ఆయన పట్ల అవిధేయతకు దూరంగా ఉండేవారు మాత్రమే విజయం పొందుతారు.

**53 - 54** వారు (కపటులు) అల్లాహ్ పేరుతో గట్టి గట్టి ప్రమాణాలు చేసి, "మీరు ఆజ్ఞాపిస్తే, మేము ఇళ్లనుండి బయలు దేరుతాము" అని అంటారు. వారితో, "ప్రమాణాలు చేయకండి, మీ విధేయత ఎలాంటిదో తెలుసు, మీ చేష్టలు అల్లాహ్ ఎరుగనివేమీ కావు" అని అను. ఇలా బోధించు, "అల్లాహ్‌కు విధేయులు కండి, దైవప్రవక్త ఆదేశాలను పాటించండి. కాని ఒకవేళ మీరు విముఖులైతే, బాగా తెలుసుకొండి, దైవప్రవక్తపై పెట్టబడిన కర్తవ్యభారం వరకే అతను బాధ్యుడు. మీపై మోపబడిన కర్తవ్య భారానికి మీరు బాధ్యులు. దైవప్రవక్తకు విధేయులైతే మీరే మార్గదర్శకత్వం పొందుతారు. లేకపోతే స్పష్టంగా ఆజ్ఞను అందజెయ్యటాన్ని మించి ఎక్కువ బాధ్యత దైవప్రవక్తపై లేదు."

وَعَدَ اللّٰهُ الَّذِيۡنَ اٰمَنُوۡا مِنۡكُمۡ وَ عَمِلُوا
الصّٰلِحٰتِ لَيَسۡتَخۡلِفَنَّهُمۡ فِى الۡاَرۡضِ كَمَا
اسۡتَخۡلَفَ الَّذِيۡنَ مِنۡ قَبۡلِهِمۡ ۖ وَ لَيُمَكِّنَنَّ لَهُمۡ
دِيۡنَهُمُ الَّذِى ارۡتَضٰى لَهُمۡ وَ لَيُبَدِّلَنَّهُمۡ مِّنۡۢ بَعۡدِ
خَوۡفِهِمۡ اَمۡنًا ؕ يَعۡبُدُوۡنَنِىۡ لَا يُشۡرِكُوۡنَ بِىۡ
شَيۡــًٔا ؕ وَ مَنۡ كَفَرَ بَعۡدَ ذٰلِكَ فَاُولٰٓـئِكَ هُمُ
الۡفٰسِقُوۡنَ ﴿۵۵﴾ وَ اَقِيۡمُوا الصَّلٰوةَ وَ اٰتُوا الزَّكٰوةَ
وَ اَطِيۡعُوا الرَّسُوۡلَ لَعَلَّكُمۡ تُرۡحَمُوۡنَ ﴿۵۶﴾ لَا
تَحۡسَبَنَّ الَّذِيۡنَ كَفَرُوۡا مُعۡجِزِيۡنَ فِى
الۡاَرۡضِ ۚ وَمَاۡوٰٮهُمُ النَّارُ ؕ وَ لَبِئۡسَ الۡمَصِيۡرُ ﴿۵۷﴾ ع ۸ ۱۲
يٰۤاَيُّهَا الَّذِيۡنَ اٰمَنُوۡا لِيَسۡتَاۡذِنۡكُمُ الَّذِيۡنَ
مَلَكَتۡ اَيۡمَانُكُمۡ وَ الَّذِيۡنَ لَمۡ يَبۡلُغُوا الۡحُلُمَ
مِنۡكُمۡ ثَلٰثَ مَرّٰتٍ ؕ مِنۡ قَبۡلِ صَلٰوةِ الۡفَجۡرِ
وَحِيۡنَ تَضَعُوۡنَ ثِيَابَكُمۡ مِّنَ الظَّهِيۡرَةِ وَمِنۡۢ
بَعۡدِ صَلٰوةِ الۡعِشَآءِ ؕ ثَلٰثُ عَوۡرٰتٍ لَّكُمۡ
لَيۡسَ عَلَيۡكُمۡ وَ لَا عَلَيۡهِمۡ جُنَاحٌۢ بَعۡدَهُنَّ ؕ
طَوّٰفُوۡنَ عَلَيۡكُمۡ بَعۡضُكُمۡ عَلٰى بَعۡضٍ ؕ كَذٰلِكَ
يُبَيِّنُ اللّٰهُ لَـكُمُ الۡاٰيٰتِ ؕ وَ اللّٰهُ عَلِيۡمٌ حَكِيۡمٌ ﴿۵۸﴾
وَاِذَا بَلَغَ الۡاَطۡفَالُ مِنۡكُمُ الۡحُلُمَ فَلۡيَسۡتَاۡذِنُوۡا
كَمَا اسۡتَاۡذَنَ الَّذِيۡنَ مِنۡ قَبۡلِهِمۡ ؕ كَذٰلِكَ
يُبَيِّنُ اللّٰهُ لَـكُمۡ اٰيٰتِهٖ ؕ وَ اللّٰهُ عَلِيۡمٌ حَكِيۡمٌ ﴿۵۹﴾

**55 - 57** మీలో విశ్వసించి మంచిపనులు చేసేవారికి అల్లాహ్ చేసిన వాగ్దానమేమిటంటే, ఆయన వారిని, వారికి పూర్వం గతించిన ప్రజలను చేసిన విధంగా, భూమిపై ఖలీఫాలు (ప్రతినిధులు)గా చేస్తాడు, అల్లాహ్ వారికై అంగీకరించిన వారి ధర్మాన్ని వారికొరకు పటిష్ఠమైన పునాదులపై స్థాపిస్తాడు. వారి యొక్క (ప్రస్తుత) భయస్థితిని శాంతిభద్రతలతో కూడిన స్థితిగా మారుస్తాడు. కనుక వారు నాకు దాస్యం చేయాలి, ఎవరినీ నాకు భాగస్వాములుగా చేయకూడదు.[35] దీని తరువాత ఎవరైనా అవిశ్వాసానికి[36] పాల్పడితే, అటువంటి వారే హద్దులు మీరినవారు. నమాజును స్థాపించండి, జకాత్ ఇవ్వండి, దైవప్రవక్తకు విధేయులుగా ఉండండి. అప్పుడు మీరు కరుణింప బడతారని ఆశించవచ్చు. అవిశ్వాసానికి పాల్పడేవారు అల్లాహ్‌ను లొంగదీయగలరని భ్రమపడకండి. వారి నివాసం నరకం, అది బహుచెడ్డ నివాసం.

**58 - 59** విశ్వసించిన ప్రజలారా! మీ బానిసలూ, యుక్త వయస్సుకు ఇంకా చేరని మీ పిల్లలు మూడు సమయాలలో తప్పనిసరిగా అనుమతి తీసుకున్న తరువాతనే మీ వద్దకు రావాలి, ఉదయం నమాజుకు ముందు, మధ్యాహ్నం మీరు బట్టలు మార్చుకున్నప్పుడు, ఇషా నమాజు తరువాత. ఈ మూడు సమయాలు మీకు పరదా సమయాలు. అవి మినహా వారు అనుమతి లేకుండా వస్తే, అది మీకూ పాపం కాదు, వారికీ పాపం కాదు. మీరు ఒకరి వద్దకు ఒకరు మాటిమాటికీ రావలసియే ఉంటుంది. ఈ విధంగా అల్లాహ్ మీకు తన సూక్తులను విశదీకరిస్తున్నాడు. ఆయన జ్ఞానీ, వివేకీను. మీ పిల్లలు యుక్త వయస్సుకు చేరుకున్నప్పుడు, తమ పెద్దలు అనుమతి తీసుకునే విధంగానే వారు కూడా అనుమతి తీసుకుని మరీ రావాలి. ఇలా అల్లాహ్ తన వాక్యాలను మీ ముందు విశదం చేస్తున్నాడు. ఆయన జ్ఞాని మరియు వివేకి.

35. కొందరు దీనిని ప్రభుత్వాధికారాలు పొందినవాడు ఖిలాఫత్‌ను పొందినట్లే అని అర్థం చేసుకున్నారు. వాస్తవానికి, ఆయతులో, విశ్వాసులైన వారికే అల్లాహ్ ఖిలాఫత్‌ను ప్రసాదిస్తాడు అని చెప్పబడింది.

وَ الْقَوَاعِدُ مِنَ النِّسَآءِ الّٰتِیْ لَا یَرْجُوْنَ
نِكَاحًا فَلَیْسَ عَلَیْهِنَّ جُنَاحٌ اَنْ یَّضَعْنَ
ثِیَابَهُنَّ غَیْرَ مُتَبَرِّجٰتٍۭ بِزِیْنَةٍ ؕ وَ اَنْ
یَّسْتَعْفِفْنَ خَیْرٌ لَّهُنَّ ؕ وَ اللّٰهُ سَمِیْعٌ عَلِیْمٌ ﴿۶۰﴾
لَیْسَ عَلَى الْاَعْمٰى حَرَجٌ وَّ لَا عَلَى الْاَعْرَجِ
حَرَجٌ وَّ لَا عَلَى الْمَرِیْضِ حَرَجٌ وَّ لَا عَلٰۤى
اَنْفُسِكُمْ اَنْ تَاْكُلُوْا مِنْۢ بُیُوْتِكُمْ اَوْ بُیُوْتِ
اٰبَآىِٕكُمْ اَوْ بُیُوْتِ اُمَّهٰتِكُمْ اَوْ بُیُوْتِ اِخْوَانِكُمْ
اَوْ بُیُوْتِ اَخَوٰتِكُمْ اَوْ بُیُوْتِ اَعْمَامِكُمْ اَوْ
بُیُوْتِ عَمّٰتِكُمْ اَوْ بُیُوْتِ اَخْوَالِكُمْ اَوْ بُیُوْتِ
خٰلٰتِكُمْ اَوْ مَا مَلَكْتُمْ مَّفَاتِحَهٗۤ اَوْ صَدِیْقِكُمْ ؕ
لَیْسَ عَلَیْكُمْ جُنَاحٌ اَنْ تَاْكُلُوْا جَمِیْعًا اَوْ
اَشْتَاتًا ؕ فَاِذَا دَخَلْتُمْ بُیُوْتًا فَسَلِّمُوْا عَلٰۤى
اَنْفُسِكُمْ تَحِیَّةً مِّنْ عِنْدِ اللّٰهِ مُبٰرَكَةً طَیِّبَةً ؕ
كَذٰلِكَ یُبَیِّنُ اللّٰهُ لَكُمُ الْاٰیٰتِ لَعَلَّكُمْ تَعْقِلُوْنَ ﴿۶۱﴾ ع ٨ ١٤

**60** యౌవనం ఉడిగిపోయి, వివాహం పట్ల ఉత్సాహం సన్నగిల్లిన స్త్రీలు తమ దుప్పట్లను తీసివేస్తే, వారు ఏ దోషమూ చేసినట్లు కాదు; అయితే వారు తమ అలంకరణను ప్రదర్శించే వారు కాకూడదు. అయినప్పటికీ, వారు సిగ్గునే పాటిస్తే, అది వారికే శ్రేయస్కరమైనది. అల్లాహ్ అన్నీ వింటాడు, అన్నీ తెలిసినవాడు.

**61** ఒకవేళ ఏ అంధుడైనా, ఏ కుంటివాడైనా, ఏ రోగిఅయినా (ఎవరి ఇంట్లోనైనా అన్నం తినివేసినట్లయితే) అది దోషం కాదు. మీరు మీ ఇంట్లో తిన్నా, మీ తండ్రీ తాతల ఇళ్లల్లో తిన్నా, మీ తల్లీ నాయనమ్మల ఇళ్లల్లో, మీ సోదరుల ఇళ్లల్లో లేదా మీ సోదరీమణుల ఇళ్లల్లో లేదా మీ తండ్రుల సోదరుల ఇళ్లల్లో లేదా మీ మేనత్తల ఇళ్లల్లో లేదా మేనమామల ఇళ్లల్లో లేదా మీ పిన్నమ్మల, పెద్దమ్మల ఇళ్లల్లో లేదా తాళపు చేతులు మీ అధీనంలో ఉన్న ఇళ్లల్లో లేదా మీ స్నేహితుల ఇళ్లల్లో తిన్నా మీకు ఏ ఆక్షేపణా ఉండదు. మీరు కలసి తిన్నా వేర్వేరుగా తిన్నా దోషమేమీ కాదు. అయితే ఇళ్లల్లోకి ప్రవేశించినప్పుడు, మీ వారికి సలాము చేయండి. ఇది మేలు కొరకు చేయబడే ప్రార్థన. అల్లాహ్ తరఫు నుండి నిర్ణయించబడింది. ఎంతో శుభవంతమైనది, పరిశుద్ధమైనది. ఈ విధంగా అల్లాహ్ తన ఆయతులను మీకు ఉపదేశిస్తున్నాడు, మీరు ఆలోచించి అర్థం చేసుకుని వ్యవహరిస్తారని ఆశించబడుతోంది.

36. దీని అర్థం ఇది కూడ కావచ్చు : ఖిలాఫత్ పొందిన తరువాత కృతఘ్నత చూపుట; కపట వైఖరిని అవలంబించటం కూడ కావచ్చు; పైకి విశ్వాసిగా కనిపించినా, యథార్థానికి లోపల విశ్వాసం లేకుండా ఉండటం.

**62** అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ హృదయపూర్వకంగా విశ్వసించేవారు ఏదైనా సామూహిక కార్యం నిమిత్తం దైవ ప్రవక్తతో ఉన్నప్పుడు అతని అనుమతి లేకుండా వెళ్ళని వారు మాత్రమే అసలైన విశ్వాసులు. ప్రవక్తా! నిన్ను అనుమతి అడిగేవారే అల్లాహ్‌ను, ప్రవక్తను విశ్వసించేవారు. కనుక వారు తమ ఏ పనికైనా అనుమతి అడిగితే నీవు కోరిన వారికి అనుమతి ఇస్తూ ఉండు. అటువంటి వారిని క్షమించు అని అల్లాహ్‌ను ప్రార్థించు. నిశ్చయంగా అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడూను.

**63 - 64** ముస్లిములారా! దైవప్రవక్త పిలుపును మీలో ఒకరినొకరు పిలుచుకునే పిలుపుగా భావించకండి. మీలో ఒకరి చాటున ఒకరు దాక్కుంటూ మెల్లగా జారిపోయేవారిని అల్లాహ్ బాగా ఎరుగును. దైవప్రవక్త ఆజ్ఞను ఉల్లంఘించేవారు, తాము ఏదైనా ఉపద్రవంలో చిక్కుకుపోతామేమో అనీ, తమపై బాధాకరమైన శిక్ష ఏదైనా అవతరిస్తుందేమో అనీ భయపడాలి. జాగ్రత్త! ఆకాశాలలోనూ, భూమిపైనా ఏది ఉన్నదో అది అల్లాహ్‌దే. మీరు ఏ వైఖరి అవలంబించినా దానిని అల్లాహ్ ఎరుగును. ప్రజలు ఆయన వైపునకు మరలింపబడేనాడు, వారు ఏమేమి చేసివచ్చారో ఆయన వారికి తెలియజేస్తాడు. ఆయనకు ప్రతి దానిని గురించీ పూర్తిగా తెలుసు.

إِنَّمَا الْمُؤْمِنُونَ الَّذِينَ آمَنُوا بِاللَّهِ وَرَسُولِهِ
وَإِذَا كَانُوا مَعَهُ عَلَىٰ أَمْرٍ جَامِعٍ لَمْ يَذْهَبُوا
حَتَّىٰ يَسْتَأْذِنُوهُ ۚ إِنَّ الَّذِينَ يَسْتَأْذِنُونَكَ
أُولَٰئِكَ الَّذِينَ يُؤْمِنُونَ بِاللَّهِ وَرَسُولِهِ ۚ
فَإِذَا اسْتَأْذَنُوكَ لِبَعْضِ شَأْنِهِمْ فَأْذَنْ لِمَنْ
شِئْتَ مِنْهُمْ وَاسْتَغْفِرْ لَهُمُ اللَّهَ ۚ إِنَّ اللَّهَ
غَفُورٌ رَحِيمٌ ﴿٦٢﴾ لَا تَجْعَلُوا دُعَاءَ الرَّسُولِ
بَيْنَكُمْ كَدُعَاءِ بَعْضِكُمْ بَعْضًا ۚ قَدْ يَعْلَمُ اللَّهُ
الَّذِينَ يَتَسَلَّلُونَ مِنْكُمْ لِوَاذًا ۚ فَلْيَحْذَرِ
الَّذِينَ يُخَالِفُونَ عَنْ أَمْرِهِ أَنْ تُصِيبَهُمْ فِتْنَةٌ
أَوْ يُصِيبَهُمْ عَذَابٌ أَلِيمٌ ﴿٦٣﴾ أَلَا إِنَّ لِلَّهِ مَا فِي
السَّمَاوَاتِ وَالْأَرْضِ ۖ قَدْ يَعْلَمُ مَا أَنْتُمْ
عَلَيْهِ وَيَوْمَ يُرْجَعُونَ إِلَيْهِ فَيُنَبِّئُهُمْ بِمَا
عَمِلُوا ۗ وَاللَّهُ بِكُلِّ شَيْءٍ عَلِيمٌ ﴿٦٤﴾ ع ٩ ١٥

ఆయతులు 77 | # 25. అల్ ఫుర్ఖాన్ | అవతరణ మక్కాలో

٢٥ سُوْرَةُ الْفُرْقَانِ مَكِّيَّةٌ ٤٢

اٰيَاتُهَا ٧٧ | رُكُوْعَاتُهَا ٦

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

تَبٰرَكَ الَّذِیْ نَزَّلَ الْفُرْقَانَ عَلٰی عَبْدِهٖ لِیَكُوْنَ
لِلْعٰلَمِیْنَ نَذِیْرَا ۙ ﴿١﴾ الَّذِیْ لَهٗ مُلْكُ السَّمٰوٰتِ
وَالْاَرْضِ وَ لَمْ یَتَّخِذْ وَلَدًا وَّ لَمْ یَكُنْ لَّهٗ
شَرِیْكٌ فِی الْمُلْكِ وَ خَلَقَ كُلَّ شَیْءٍ فَقَدَّرَهٗ
تَقْدِیْرًا ﴿٢﴾ وَاتَّخَذُوْا مِنْ دُوْنِهٖۤ اٰلِهَةً لَّا
یَخْلُقُوْنَ شَیْـًٔا وَّ هُمْ یُخْلَقُوْنَ وَ لَا یَمْلِكُوْنَ
لِاَنْفُسِهِمْ ضَرًّا وَّ لَا نَفْعًا وَّ لَا یَمْلِكُوْنَ مَوْتًا
وَّ لَا حَیٰوةً وَّ لَا نُشُوْرًا ﴿٣﴾ وَ قَالَ الَّذِیْنَ
كَفَرُوْۤا اِنْ هٰذَاۤ اِلَّاۤ اِفْكُ ۨافْتَرٰىهُ وَ اَعَانَهٗ
عَلَیْهِ قَوْمٌ اٰخَرُوْنَ ۛۚ فَقَدْ جَآءُوْ ظُلْمًا
وَّزُوْرًا ۚۛ ﴿٤﴾ وَ قَالُوْۤا اَسَاطِیْرُ الْاَوَّلِیْنَ اكْتَتَبَهَا
فَهِیَ تُمْلٰی عَلَیْهِ بُكْرَةً وَّ اَصِیْلًا ﴿٥﴾ قُلْ اَنْزَلَهُ
الَّذِیْ یَعْلَمُ السِّرَّ فِی السَّمٰوٰتِ وَالْاَرْضِ ؕ
اِنَّهٗ كَانَ غَفُوْرًا رَّحِیْمًا ﴿٦﴾

معانقة ١

**1 - 3** ఎనలేని శుభాలవాడు ఈ గీటురాయిని తన దాసునిపై అవతరింప జేశాడు, సకల విశ్వవాసులకు హెచ్చరిక చేసేదిగా ఉండేటందుకు. ఆయన భూమ్యాకాశాల సామ్రాజ్యానికి ప్రభువు. ఆయన ఎవరినీ కొడుకుగా చేసుకోలేదు. విశ్వ సామ్రాజ్యాధిపత్యంలో ఆయనకు భాగస్వాములెవ్వరూ లేరు. ఆయన ప్రతి దానినీ సృష్టించాడు. తరువాత దానికి ఒక విధినీ నిర్ణయించాడు. ప్రజలు ఆయనను కాదని కల్పించు కున్నట్టి దేవుళ్ళు ఏ వస్తువునూ సృష్టించలేరు, కాని వారే సృష్టింప బడతారు. వారు స్వయంగా తమ కొరకైనా ఏ లాభనష్టాల అధికారాన్నీ కలిగిలేరు. వారు చంపనూలేరు, బ్రతికించనూ లేరు, మరణించిన వాణ్ణి మళ్లీ లేపనూ లేరు.

**4 - 6** దైవప్రవక్త మాటను విశ్వసించటానికి నిరాకరించిన వారు ఇలా అంటారు, "ఈ గీటురాయి ఒక కల్పన, దానిని ఇతనే స్వయంగా కల్పించాడు. ఇతరులు కొందరు ఈ పనిలో అతనికి సాయపడ్డారు." వారు ఘోర అన్యాయానికీ, పరమ అబద్ధానికీ ఒడిగట్టారు. ఇంకా ఇలా అంటారు, "ఇవి పూర్వ కాలం నాటి వారు వ్రాసిన విషయాలు, వాటికి ఇతను నకలు వ్రాయిస్తున్నాడు. అవి ఇతనికి ఉదయం సాయంత్రం వినిపించ బడతాయి." ప్రవక్తా! వారితో, "భూమియొక్క ఆకాశముల యొక్క రహస్యాన్ని ఎరిగినవాడు, దానిని అవతరింపజేశాడు" అని అను. యధార్థమేమిటంటే, ఆయన ఎక్కువగా క్షమించే వాడు, కరుణించేవాడూను.

وَقَالُوْا مَالِ هٰذَا الرَّسُوْلِ يَاْكُلُ الطَّعَامَ وَ
يَمْشِيْ فِي الْاَسْوَاقِ ۭ لَوْلَآ اُنْزِلَ اِلَيْهِ مَلَكٌ
فَيَكُوْنَ مَعَهٗ نَذِيْرًا ٧ اَوْ يُلْقٰٓى اِلَيْهِ كَنْزٌ اَوْ
تَكُوْنُ لَهٗ جَنَّةٌ يَّاْكُلُ مِنْهَا ۭ وَقَالَ الظّٰلِمُوْنَ
اِنْ تَتَّبِعُوْنَ اِلَّا رَجُلًا مَّسْحُوْرًا ٨ اُنْظُرْ
كَيْفَ ضَرَبُوْا لَكَ الْاَمْثَالَ فَضَلُّوْا فَلَا
يَسْتَطِيْعُوْنَ سَبِيْلًا ٩ تَبٰرَكَ الَّذِيْٓ اِنْ شَاۗءَ ع ٩ ١٦
جَعَلَ لَكَ خَيْرًا مِّنْ ذٰلِكَ جَنّٰتٍ تَجْرِيْ مِنْ
تَحْتِهَا الْاَنْهٰرُ ۙ وَيَجْعَلْ لَّكَ قُصُوْرًا ١٠ بَلْ
كَذَّبُوْا بِالسَّاعَةِ ۣ وَاَعْتَدْنَا لِمَنْ كَذَّبَ
بِالسَّاعَةِ سَعِيْرًا ١١ اِذَا رَاَتْهُمْ مِّنْ مَّكَانٍۢ
بَعِيْدٍ سَمِعُوْا لَهَا تَغَيُّظًا وَّزَفِيْرًا ١٢ وَاِذَآ
اُلْقُوْا مِنْهَا مَكَانًا ضَيِّقًا مُّقَرَّنِيْنَ دَعَوْا
هُنَالِكَ ثُبُوْرًا ١٣ لَا تَدْعُوا الْيَوْمَ ثُبُوْرًا
وَّاحِدًا وَّادْعُوْا ثُبُوْرًا كَثِيْرًا ١٤ قُلْ اَذٰلِكَ
خَيْرٌ اَمْ جَنَّةُ الْخُلْدِ الَّتِيْ وُعِدَ الْمُتَّقُوْنَ ۭ
كَانَتْ لَهُمْ جَزَاۗءً وَّمَصِيْرًا ١٥ لَهُمْ فِيْهَا مَا
يَشَاۗءُوْنَ خٰلِدِيْنَ ۭ كَانَ عَلٰي رَبِّكَ وَعْدًا
مَّسْـُٔوْلًا ١٦

**7 - 10** వారు ఇలా అంటారు, "ఇతనేమి ప్రవక్త, అన్నం తింటాడు, బజారులో తిరుగుతూ ఉంటాడు? ఇతని వద్దకు ఒక దైవదూత అయినా ఎందుకు పంపబడలేదు, ఇతనితో ఉంటూ (విశ్వసించని వారిని) బెదిరించటానికి? లేదా ఏదిలేకపోయినా కనీసం ఇతని కొరకు ఒక నిధి అయినా ఎందుకు దించబడలేదు? లేదా ఇతనికి ఒక తోట అయినా ఎందుకు లేదు, దాని ద్వారా ఇతను (నిశ్చింతగా) ఉపాధిని పొందటానికి?" ఇంకా ఆ దుర్మార్గులు, "మీరు చేతబడి చేయ బడిన ఒక మనిషి వెంట నడుస్తున్నారు" అని అంటారు. చూడు, ఎటువంటి విచిత్రమైన వాదాలను నీ ముందు పెడుతున్నారో! వారు ఎంతగా మార్గం తప్పిపోయారంటే, స్థిరమైన మాట అనేది వారికసలు తోచదు. శుభప్రదుడైన ఆయన తాను కోరితే, వారు ప్రతిపాదించిన వస్తువుల కంటే ఎంతో ఎక్కువగా నీకు ఇవ్వగలుగుతాడు. (ఒకటి కాదు) క్రింద కాలువలు ప్రవహించే ఎన్నో తోటలు, పెద్ద పెద్ద భవనాలు.

**11 - 14** అసలు విషయమేమిటంటే, వారు ఆ "ఘడియ"ను తిరస్కరించారు.[1] ఆ ఘడియను తిరస్కరించేవాడి కోసం మేము జ్వలించే అగ్నిని సిద్ధం చేసి ఉంచాము. అది వారిని దూరం నుంచి చూచినప్పుడు, వారు దాని క్రోధ ధ్వనులు, విజృంభణ ధ్వనులను వింటారు. దానిలోని ఒక ఇరుకైన స్థలంలో వారు కాళ్ళూ, చేతులూ బంధించబడిన స్థితిలో క్రుక్కబడినప్పుడు, చావును పిలవటం ప్రారంభిస్తారు. (అప్పుడు వారితో ఇలా అనబడుతుంది), "ఈనాడు ఒక చావునే కాదు, ఎన్నో చావుల కోసం అరవండి."

**15 - 16** వారిని అడగండి, ఈ పర్యవసానం మంచిదా లేక శాశ్వతంగా ఉండే స్వర్గం మంచిదా అని. ఆ స్వర్గం దైవభక్తీ, దైవభీతీ కలవారికి వాగ్దానం చేయబడింది, అది వారి కర్మలకు ప్రతిఫలం. వారి ప్రయాణానికి చివరి గమ్యస్థానం, అందులో వారి ప్రతి కోరికా తీరుతుంది. అందులో వారు శాశ్వతంగా ఉంటారు. దానిని ప్రసాదించటం అనేది నీ ప్రభువు తప్పని సరిగా నెరవేర్చవలసిన ఒక వాగ్దానం.

وَ يَوْمَ يَحْشُرُهُمْ وَ مَا يَعْبُدُوْنَ مِنْ دُوْنِ
اللّٰهِ فَيَقُوْلُ ءَاَنْتُمْ اَضْلَلْتُمْ عِبَادِيْ هٰٓؤُلَآءِ
اَمْ هُمْ ضَلُّوا السَّبِيْلَ ﴿١٧﴾ قَالُوْا سُبْحٰنَكَ مَا
كَانَ يَنْۢبَغِيْ لَنَآ اَنْ نَّتَّخِذَ مِنْ دُوْنِكَ مِنْ
اَوْلِيَآءَ وَ لٰكِنْ مَّتَّعْتَهُمْ وَ اٰبَآءَهُمْ حَتّٰى نَسُوا
الذِّكْرَ ۚ وَ كَانُوْا قَوْمًۢا بُوْرًا ﴿١٨﴾ فَقَدْ كَذَّبُوْكُمْ
بِمَا تَقُوْلُوْنَ ۙ فَمَا تَسْتَطِيْعُوْنَ صَرْفًا وَّ لَا
نَصْرًا ۚ وَ مَنْ يَّظْلِمْ مِّنْكُمْ نُذِقْهُ عَذَابًا
كَبِيْرًا ﴿١٩﴾ وَ مَآ اَرْسَلْنَا قَبْلَكَ مِنَ
الْمُرْسَلِيْنَ اِلَّآ اِنَّهُمْ لَيَاْكُلُوْنَ الطَّعَامَ
وَيَمْشُوْنَ فِي الْاَسْوَاقِ ؕ وَ جَعَلْنَا بَعْضَكُمْ
لِبَعْضٍ فِتْنَةً ؕ اَتَصْبِرُوْنَ ۚ وَ كَانَ رَبُّكَ
بَصِيْرًا ﴿٢٠﴾ ع

**17 - 19** అదే రోజున (నీ ప్రభువు) ఈ ప్రజలను కూడ ఒక చోటకు చేరుస్తాడు. వారు అల్లాహ్‌ను కాదని ఈ రోజున పూజిస్తున్న దేవుళ్లను కూడ పిలుస్తాడు. తరువాత ఆయన ఆ దేవుళ్లను, "నా ఈ దాసులను మీరే మార్గం తప్పించారా లేక స్వయంగా వారే ఋజుమార్గం తప్పిపోయారా?" అని అడుగుతాడు. అప్పుడు వారు ఇలా విన్నవించుకుంటారు, "నీవు అత్యంత పరిశుద్ధుడవు. నిన్ను తప్ప మరొకరిని మా రక్షకుడుగా చేసుకునే ధైర్యం కూడ మాకు లేదు. కాని నీవు వారికి, వారి పూర్వీకులకు జీవితావసర వస్తువులను పుష్కలంగా ఇచ్చావు. చివరకు వారు బోధనను మరచిపోయి దౌర్భాగ్య స్థితికి గురి అయ్యారు." మీరు ఈనాడు అంటున్న మాటలను[2] ఈ విధంగా వారు (మీ దేవుళ్లు) తిరస్కరిస్తారు. ఇక మీరు మీ దౌర్భాగ్యాన్నీ ఆపలేరు, ఎక్కడ నుండీ సహాయాన్నీ పొందలేరు. మీలో ఎవడు దుర్మార్గం చేసినా, అతనికి మేము కఠిన శిక్షను రుచి చూపిస్తాము.

**20** "ప్రవక్తా! నీకు పూర్వం మేము పంపిన ప్రవక్తలందరూ అన్నం తినేవారే, బజారులలో సంచరించేవారే. అసలు మేము మిమ్మల్ని ఒకరి కొరకు మరొకరిని పరీక్షా సాధనాలుగా చేశాము.[3] నీవు సహనంతో ఉంటావా?[4] నీ ప్రభువు సర్వాన్నీ చూస్తున్నాడు."

1. అంటే ప్రళయాన్ని తిరస్కరించారు అని భావం.
2. సందర్భాన్నిబట్టి తెలిసే విషయం ఏమిటంటే, ఈ ఆయతులలో దేవుళ్లు అంటే విగ్రహాలూ కాదు, సూర్య చంద్రాదులూ కాదు, కాని దైవదూతలు, సజ్జనులు అని అర్థం. ప్రజలు వారిని ప్రపంచంలో దేవుళ్లుగా చేసేశారు.

وَقَالَ الَّذِيْنَ لَا يَرْجُوْنَ لِقَآءَنَا لَوْلَآ اُنْزِلَ
عَلَيْنَا الْمَلٰٓئِكَةُ اَوْ نَرٰى رَبَّنَا ؕ لَقَدِ اسْتَكْبَرُوْا فِيْٓ
اَنْفُسِهِمْ وَعَتَوْ عُتُوًّا كَبِيْرًا ﴿۲۱﴾ يَوْمَ يَرَوْنَ
الْمَلٰٓئِكَةَ لَا بُشْرٰى يَوْمَئِذٍ لِّلْمُجْرِمِيْنَ وَيَقُوْلُوْنَ
حِجْرًا مَّحْجُوْرًا ﴿۲۲﴾ وَقَدِمْنَآ اِلٰى مَا عَمِلُوْا مِنْ
عَمَلٍ فَجَعَلْنٰهُ هَبَآءً مَّنْثُوْرًا ﴿۲۳﴾ اَصْحٰبُ الْجَنَّةِ
يَوْمَئِذٍ خَيْرٌ مُّسْتَقَرًّا وَّاَحْسَنُ مَقِيْلًا ﴿۲۴﴾ وَيَوْمَ
تَشَقَّقُ السَّمَآءُ بِالْغَمَامِ وَنُزِّلَ الْمَلٰٓئِكَةُ تَنْزِيْلًا ﴿۲۵﴾
اَلْمُلْكُ يَوْمَئِذِ ٍالْحَقُّ لِلرَّحْمٰنِ ؕ وَكَانَ يَوْمًا عَلَى
الْكٰفِرِيْنَ عَسِيْرًا ﴿۲۶﴾ وَيَوْمَ يَعَضُّ الظَّالِمُ عَلٰى يَدَيْهِ
يَقُوْلُ يٰلَيْتَنِى اتَّخَذْتُ مَعَ الرَّسُوْلِ سَبِيْلًا ﴿۲۷﴾
يٰوَيْلَتٰى لَيْتَنِىْ لَمْ اَتَّخِذْ فُلَانًا خَلِيْلًا ﴿۲۸﴾ لَقَدْ
اَضَلَّنِىْ عَنِ الذِّكْرِ بَعْدَ اِذْ جَآءَنِىْ ؕ وَكَانَ
الشَّيْطٰنُ لِلْاِنْسَانِ خَذُوْلًا ﴿۲۹﴾ وَقَالَ الرَّسُوْلُ
يٰرَبِّ اِنَّ قَوْمِى اتَّخَذُوْا هٰذَا الْقُرْاٰنَ مَهْجُوْرًا ﴿۳۰﴾
وَكَذٰلِكَ جَعَلْنَا لِكُلِّ نَبِىٍّ عَدُوًّا مِّنَ الْمُجْرِمِيْنَ ؕ وَ
كَفٰى بِرَبِّكَ هَادِيًا وَّنَصِيْرًا ﴿۳۱﴾ وَقَالَ الَّذِيْنَ
كَفَرُوْا لَوْلَا نُزِّلَ عَلَيْهِ الْقُرْاٰنُ جُمْلَةً وَّاحِدَةً ۚۛ
كَذٰلِكَ ۚۛ لِنُثَبِّتَ بِهٖ فُؤَادَكَ وَرَتَّلْنٰهُ تَرْتِيْلًا ﴿۳۲﴾ وَلَا مع
يَأْتُوْنَكَ بِمَثَلٍ اِلَّا جِئْنٰكَ بِالْحَقِّ وَاَحْسَنَ
تَفْسِيْرًا ﴿۳۳﴾ ؕ

**21 - 30** మా సాన్నిధ్యంలో హాజరుకావలసి ఉన్నది అనే భయంలేని వారు ఇలా అంటారు, "దైవ దూతలు మా వద్దకు ఎందుకు పంపబడటం లేదు? మేము మా ప్రభువును ఎందుకు చూడకూడదు?" వారి మనస్సులలో మిక్కిలి అహంభావం ఉన్నది. వారు తమ తలబిరుసుతనంతో హద్దులు మీరి పోయారు. వారు దైవదూతలను చూసే రోజు నేరస్తులకు శుభవార్తల రోజేమీ కాదు - "అల్లాహ్ శరణు" అని వారు కేకవేస్తారు. అప్పుడు వారు చేసి ఉన్న దానినంతటినీ మేము తీసుకుని దుమ్ము మాదిరిగా ఎగురవేస్తాము. ఇక స్వర్గానికి అర్హులైన వారే ఆ రోజున మంచి స్థలంలో ఉంటారు. అంతే కాదు మధ్యాహ్నం విశ్రాంతి కొరకు చక్కని స్థలాన్ని పొందు తారు. ఆకాశాన్ని చీలుస్తూ ఒక మేఘం ఆ రోజున ప్రత్యక్ష మవుతుంది. దైవదూతలు వరుసలు వరుసలుగా దింపబడ తారు. ఆ రోజున నిజమైన రాజ్యాధికారం కేవలం కరుణా మయుని చేతులలో ఉంటుంది. అది అవిశ్వాసులకు ఎంతో కఠినమైన రోజు. దుర్మార్గపు మానవుడు తన చేతులను కొరు క్కుంటూ ఇలా అంటాడు, "అయ్యో నేను దైవప్రవక్తకు తోడుగా ఉంటే ఎంత బాగుండేది! అయ్యో నా దౌర్భాగ్యం! నేను ఫలానా వ్యక్తితో స్నేహం చేయకుండా ఉంటే ఎంత బాగుండేది! అతడి మాయలోపడి నేను నా వద్దకు వచ్చిన హితబోధను స్వీకరించ లేదు. షైతాను మానవుని విషయంలో నమ్మకద్రోహి అని తేలిపోయింది." దైవప్రవక్త ఇలా అంటాడు, "నా ప్రభూ! నా జాతి వారు ఈ ఖురానును ఒక పరిహాస విషయంగా చేసు కున్నారు."

**31** ప్రవక్తా! మేము ఇలానే అపరాధులను ప్రతి దైవప్రవక్తకు శత్రువులుగా చేశాము. నీ కొరకు నీ ప్రభువే మార్గదర్శకత్వం చేయటానికీ, సహాయపడటానికీ సరిపోతాడు.

**32 - 34** అవిశ్వాసులు ఇలా అడుగుతారు, "ఈ వ్యక్తిపై పూర్తి ఖురాను ఒకేసారి ఎందుకు అవతరింపబడలేదు?"- అవును, అలా ఎందుకు చేయబడిందంటే, మేము దానిని నీ మనస్సులో నాటుకునేలా చేస్తూ ఉండాలని. (ఈ ఉద్దేశ్యంతోనే) మేము దానిని ఒక ప్రత్యేకమైన క్రమంతో వేర్వేరు భాగాలుగా రూపొందించాము. ఇంకా (ఇందులో ఈ హేతువు కూడ ఉంది). వారు నీ ముందు ఏదైనా వినూత్న విషయాన్ని (వింత ప్రశ్నను) తీసుకువచ్చినప్పు డల్లా దానికి సరియైన జవాబును మేము సకాలంలో నీకు ఇచ్చాము.

اَلَّذِيْنَ يُحْشَرُوْنَ عَلٰى وُجُوْهِهِمْ اِلٰى جَهَنَّمَ ۙ
اُولٰٓئِكَ شَرٌّ مَّكَانًا وَّ اَضَلُّ سَبِيْلًا ﴿٣٤﴾ وَ لَقَدْ اٰتَيْنَا
مُوْسَى الْكِتٰبَ وَ جَعَلْنَا مَعَهٗٓ اَخَاهُ هٰرُوْنَ
وَزِيْرًا ﴿٣٥﴾ فَقُلْنَا اذْهَبَآ اِلَى الْقَوْمِ الَّذِيْنَ كَذَّبُوْا
بِاٰيٰتِنَا ؕ فَدَمَّرْنٰهُمْ تَدْمِيْرًا ﴿٣٦﴾ وَ قَوْمَ نُوْحٍ لَّمَّا
كَذَّبُوا الرُّسُلَ اَغْرَقْنٰهُمْ وَ جَعَلْنٰهُمْ لِلنَّاسِ اٰيَةً ؕ
وَ اَعْتَدْنَا لِلظّٰلِمِيْنَ عَذَابًا اَلِيْمًا ﴿٣٧﴾ وَّ عَادًا وَّ ثَمُوْدَاۡ
وَ اَصْحٰبَ الرَّسِّ وَ قُرُوْنًۢا بَيْنَ ذٰلِكَ كَثِيْرًا ﴿٣٨﴾
وَ كُلًّا ضَرَبْنَا لَهُ الْاَمْثَالَ ؗ وَ كُلًّا تَبَّرْنَا تَتْبِيْرًا ﴿٣٩﴾
وَ لَقَدْ اَتَوْا عَلَى الْقَرْيَةِ الَّتِيْۤ اُمْطِرَتْ مَطَرَ السَّوْءِ ؕ
اَفَلَمْ يَكُوْنُوْا يَرَوْنَهَا ۚ بَلْ كَانُوْا لَا يَرْجُوْنَ
نُشُوْرًا ﴿٤٠﴾ وَ اِذَا رَاَوْكَ اِنْ يَّتَّخِذُوْنَكَ اِلَّا
هُزُوًا ؕ اَهٰذَا الَّذِيْ بَعَثَ اللّٰهُ رَسُوْلًا ﴿٤١﴾ اِنْ كَادَ
لَيُضِلُّنَا عَنْ اٰلِهَتِنَا لَوْ لَاۤ اَنْ صَبَرْنَا عَلَيْهَا ؕ وَ سَوْفَ
يَعْلَمُوْنَ حِيْنَ يَرَوْنَ الْعَذَابَ مَنْ اَضَلُّ
سَبِيْلًا ﴿٤٢﴾

ఉత్తమమైన రీతిలో విషయాన్ని విస్పష్టం చేశాము - బోర్లగా నరకం వైపునకు నెట్టబడనున్న వారి పరిస్థితి ఎంతో చెడ్డది, వారి మార్గం ఎంతో తప్పైనది.

**35 - 40** మేము మూసాకు గ్రంథాన్ని ఇచ్చాము.[5] అతని సోదరుడు హారూన్‌ను అతనికి సహాయకుడుగా చేశాము. వారితో ఇలా అన్నాము, "మా ఆయతులను తిరస్కరించిన జాతి వద్దకు వెళ్లండి. చివరకు మేము ఆ జాతి ప్రజలను నాశనం చేసివేశాము. ఇదే గతి నూహు జాతి వారికీ పట్టింది; వారు దైవ ప్రవక్తలను తిరస్కరించారు. మేము వారిని ముంచి వేశాము. ప్రపంచ ప్రజలందరికీ గుణపాఠం గరపే గుర్తుగా చేశాము. ఆ దుర్మార్గుల కొరకు ఒక వ్యధాభరితమైన శిక్షను సిద్ధపరచి ఉంచాము. ఈ విధంగానే ఆద్ జాతివారు, సమూద్ జాతివారు, అర్‌రస్[6] ప్రజలు, ఇంకా ఆ మధ్యకాలంలో ఎన్నో తరాల వారు నాశనం చేయబడ్డారు. వారిలో ప్రతి ఒక్కరికీ మేము (పూర్వం నాశనమైనవారి) దృష్టాంతాలను ఇచ్చి నచ్చ జెప్పాము. చివరకు ప్రతి ఒక్కరినీ నాశనం చేశాము. వారు ఆ పట్టణం మీదుగా ప్రయాణం చేశారు. దాని మీద వినాశ కరమైన వర్షం కురిపించబడింది.[7] వారు దాని స్థితిని చూచి ఉండరా? అయినా వారు మరణానంతరం మరొక జీవితం సంభవమని తలంచరు.

**41 - 42** వారు నిన్ను చూచినప్పుడు నిన్ను పరిహసనీయ వస్తువుగా చేసుకుంటారు. ఇలా అంటారు, "ఈ వ్యక్తినేనా దేవుడు ప్రవక్తగా చేసి పంపినది? మేము మా దేవుళ్ల పట్ల విశ్వాసంపై స్థిరంగా ఉండకపోయినట్లయితే, ఇతను మమ్మల్ని మార్గం తప్పించి వాటికి దూరం చేసి ఉండేవాడు." సరే మంచిది, శిక్షను చూచినప్పుడు మార్గభ్రష్టత్వంలో ఎవరు ఎక్కువ దూరం వెళ్ళిపోయారో స్వయంగా వారే తెలిసికొనే సమయం ఎంతో దూరంలో లేదు.

3. అంటే, దైవప్రవక్తకూ, విశ్వాసులకూ అవిశ్వాసులు ఒక పరీక్ష వంటివారు. అదేవిధంగా అవిశ్వాసులకు దైవప్రవక్తా, విశ్వాసులూ ఒక పరీక్షవంటివారు.
4. అంటే, ఈ ఆంతర్యాన్ని తెలుసుకున్న తరువాత ఇక నీవు సహనంతో ఉంటావా? నీవు పాటుపడే మేలైన లక్ష్యసిద్ధికి ఈ పరీక్ష అనివార్యం. ఈ పరీక్షలో తప్పనిసరిగా కలిగే కష్టనష్టాలను భరించటానికి నీవు సిద్ధంగా ఉన్నావా?

أَرَءَيْتَ مَنِ اتَّخَذَ إِلَٰهَهُۥ هَوَىٰهُ أَفَأَنتَ تَكُونُ
عَلَيْهِ وَكِيلًا ﴿٤٣﴾ أَمْ تَحْسَبُ أَنَّ أَكْثَرَهُمْ
يَسْمَعُونَ أَوْ يَعْقِلُونَ ۚ إِنْ هُمْ إِلَّا كَالْأَنْعَامِ ۖ
بَلْ هُمْ أَضَلُّ سَبِيلًا ﴿٤٤﴾ أَلَمْ تَرَ إِلَىٰ رَبِّكَ كَيْفَ
مَدَّ الظِّلَّ وَلَوْ شَاءَ لَجَعَلَهُۥ سَاكِنًا ثُمَّ جَعَلْنَا
الشَّمْسَ عَلَيْهِ دَلِيلًا ﴿٤٥﴾ ثُمَّ قَبَضْنَٰهُ إِلَيْنَا قَبْضًا
يَسِيرًا ﴿٤٦﴾ وَهُوَ الَّذِي جَعَلَ لَكُمُ الَّيْلَ لِبَاسًا
وَالنَّوْمَ سُبَاتًا وَجَعَلَ النَّهَارَ نُشُورًا ﴿٤٧﴾ وَهُوَ
الَّذِي أَرْسَلَ الرِّيَٰحَ بُشْرًا بَيْنَ يَدَيْ رَحْمَتِهِۦ ۚ وَ
أَنزَلْنَا مِنَ السَّمَاءِ مَاءً طَهُورًا ﴿٤٨﴾ لِّنُحْـِۧيَ بِهِۦ بَلْدَةً
مَّيْتًا وَنُسْقِيَهُۥ مِمَّا خَلَقْنَا أَنْعَٰمًا وَأَنَاسِيَّ
كَثِيرًا ﴿٤٩﴾ وَلَقَدْ صَرَّفْنَٰهُ بَيْنَهُمْ لِيَذَّكَّرُوا فَأَبَىٰ
أَكْثَرُ النَّاسِ إِلَّا كُفُورًا ﴿٥٠﴾

**43 - 44** తన మనోవాంఛను తన దేవుడుగా చేసుకున్న వ్యక్తి యొక్క స్థితిని ఎప్పుడైనా నీవు గమనించావా? నీవు అలాంటి వ్యక్తిని రుజుమార్గానికి తెచ్చే బాధ్యతను స్వీకరించ గలవా? వారిలో చాలమంది వింటారని, అర్థం చేసుకుంటా రని నీవు అనుకుంటున్నావా? వారు పశువులలాంటివారు, కాదు వాటికంటే కూడ దిగజారిపోయినవారు.

**45 - 46** నీ ప్రభువు ఎలా నీడను విస్తరింపజేస్తాడో నీవు చూడలేదా? ఒకవేళ ఆయన కోరితే, దానిని శాశ్వతమైన నీడగా చేసేవాడు. మేము సూర్యుణ్ణి దానికి మార్గదర్శి[8] (దలీల్)గా చేశాము. తరువాత (సూర్యుడు పైకి లేస్తూ పోయేకొద్దీ) మేము ఈ నీడను క్రమక్రమంగా మా వైపునకు లాక్కుంటూ పోతాము.[9]

**47** మీ కొరకు రాత్రిని వస్త్రంగానూ, నిద్రను మృత్యు శాంతిగానూ, పగలును బ్రతికిలేచే సమయంగాను చేసినవాడు అల్లాహ్‌యే.

**48 - 50** తన కారుణ్యానికి ముందు గాలులను శుభవార్తలుగా చేసి పంపేవాడూ ఆయనే. తరువాత ఆకాశం నుండి పరి శుద్ధ జలాన్ని అవతరింపజేస్తాడు. దానిద్వారా ఒక మృత ప్రదేశా నికి ప్రాణం పోస్తాడు. తన సృష్టిలోని ఎన్నో జంతువులకు, ఎంతోమంది మానవులకు దప్పిక తీర్చుతాడు. మేము ఈ అద్భుతాన్ని వారు గుణపాఠం నేర్చుకోవాలని మాటిమాటికీ వారి ముందు ప్రదర్శిస్తాము. కాని అధిక సంఖ్యాకులు అవిశ్వాసం, కృతఘ్నుతలు తప్ప మరొక వైఖరిని అవలంబించటానికి తిరస్కరిస్తున్నారు.

5. ఇక్కడ గ్రంథం అంటే బహుశా, ఈజిప్టు నుండి వెళ్ళిపోయిన తరువాత హజ్రత్ మూసాకు ఇవ్వబడిన గ్రంథం కాదు, కాని ప్రవక్త పదవిని అలంకరించినప్పటి నుండి ఈజిప్టును వదిలే వరకు హజ్రత్ మూసాకు ఇవ్వబడిన మార్గదర్శక సూత్రాలు. అందులో అల్లాహ్ ఆజ్ఞానుసారం ఫిరౌను దర్బారులో హజ్రత్ మూసా చేసిన ఉపన్యాసాలు కూడ చేరి ఉన్నాయి ; ఇంకా ఆయన ఫిరౌనుకు వ్యతిరేకంగా ఉద్యమం నడిపేటప్పుడు ఆయనకు ఇవ్వబడినటువంటి మార్గదర్శక సూత్రాలు కూడ చేరి ఉన్నాయి. దివ్య ఖుర్ఆన్‌లో పలు సందర్భాలలో ఈ విషయాల ప్రస్తావన జరిగింది. కాని ఈ విషయాలు బహుశా తౌరాతు గ్రంథంలో చేర్చబడి ఉండవు. ఈజిప్టు నుండి వలసపోయిన తరువాత సినాయి పర్వతం మీద హజ్రత్ మూసాకు రాతిపలకల రూపంలో ఇవ్వబడిన పది శాసనాలతో తౌరాతు గ్రంథం ప్రారంభమయింది.

6. 'రస్'ను అరబ్బీ భాషలో పాడుబడిన బావి లేదా చీకటి బావి అని అంటారు. తమ ప్రవక్తను బావిలోకి త్రోసిగానీ, వ్రేలాడదీసిగానీ చంపిన ప్రజలు అర్రస్‌వాసులు.

وَلَوْ شِئْنَا لَبَعَثْنَا فِي كُلِّ قَرْيَةٍ نَّذِيرًا ۝٥١ فَلَا تُطِعِ
الْكٰفِرِيْنَ وَجَاهِدْهُمْ بِهٖ جِهَادًا كَبِيْرًا ۝٥٢ وَهُوَ
الَّذِيْ مَرَجَ الْبَحْرَيْنِ هٰذَا عَذْبٌ فُرَاتٌ وَّ هٰذَا
مِلْحٌ اُجَاجٌ وَجَعَلَ بَيْنَهُمَا بَرْزَخًا وَّ حِجْرًا
مَّحْجُوْرًا ۝٥٣ وَهُوَ الَّذِيْ خَلَقَ مِنَ الْمَآءِ بَشَرًا
فَجَعَلَهٗ نَسَبًا وَّ صِهْرًا ؕ وَكَانَ رَبُّكَ قَدِيْرًا ۝٥٤ وَ
يَعْبُدُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ مَا لَا يَنْفَعُهُمْ وَ لَا
يَضُرُّهُمْ ؕ وَكَانَ الْكَافِرُ عَلٰى رَبِّهٖ ظَهِيْرًا ۝٥٥ وَمَا
اَرْسَلْنٰكَ اِلَّا مُبَشِّرًا وَّنَذِيْرًا ۝٥٦ قُلْ مَا اَسْئَلُكُمْ
عَلَيْهِ مِنْ اَجْرٍ اِلَّا مَنْ شَآءَ اَنْ يَّتَّخِذَ اِلٰى رَبِّهٖ
سَبِيْلًا ۝٥٧

**51 - 52** ఒకవేళ మేము కోరినట్లయితే, ఒక్కొక్క ఊరిలో ఒక్కొక్క హెచ్చరిక చేసేవాణ్ణి ప్రభవింపజేసి ఉండేవారమే.[10] కనుక ప్రవక్తా! అవిశ్వాసుల మాటను ఎంతమాత్రం నమ్మకు. ఈ ఖురాను ద్వారా వారితో మహత్తరమైన పోరాటం జరుపు.

**53** రెండు సముద్రాలనూ కలిపి ఉంచినవాడు ఆయనే. ఒకటేమో రుచికరమైనది, మధురమైనదీను. రెండోది చేదైనది, ఉప్పైనదీను. ఆ రెంటి మధ్య ఒక తెర అడ్డంగా ఉన్నది. అది వాటిని కలసిపోకుండా ఆపి ఉంచే[11] అవరోధం.

**54** ఆయనే నీటితో మానవుణ్ణి సృష్టించాడు. తరువాత అతని ద్వారా(తన) వంశము, అత్తవారి వంశము అనే రెండు వేర్వేరు బంధుత్వపు క్రమాలను రూపొందించాడు. నీ ప్రభువు సర్వశక్తి సంపన్నుడు.

**55** అయినా, మానవులు అల్లాహ్‌ను కాదని తమకు లాభంగాని, నష్టంగాని కలిగించలేని వారిని పూజిస్తున్నారు. అదీగాక, అవిశ్వాసి తన ప్రభువునకు వ్యతిరేకంగా ప్రతి తిరుగు బాటుదారుడికి సహాయపడుతున్నాడు.

**56 - 57** ప్రవక్తా! నిన్ను మేము కేవలం ఒక శుభవార్తా హరునిగా, హెచ్చరిక చేసేవానిగా మాత్రమే పంపాము.[12] కనుక వారితో ఇలా అను, "నేను ఈ పనికై మిమ్మల్ని ఏ ప్రతిఫలాన్నీ కోరను. ఇష్టమున్న వ్యక్తి తన ప్రభువు మార్గాన్ని అవలంబించటమే నా ప్రతిఫలం."

---

7. అంటే, దైవప్రవక్త హజ్రత్ లూత్ జాతి ప్రజల పట్టణం అని అర్థం. వినాశకరమైన వర్షం అంటే రాళ్ల వర్షం అని అర్థం.
8. నావికుల పరిభాషలో ఓడలకు మార్గం చూపే వ్యక్తిని మార్గదర్శి (దలీల్) అని అంటారు. సూర్యుణ్ణి నీడకు మార్గదర్శిగా చేయటం అంటే, నీడ పెరుగుదల, తరుగుదలలు, సూర్యుని ఎదుగుదల, వాలు వంగులు, ఉదయాస్తమయాలపై ఆధారపడి ఉన్నాయి.
9. మా వైపునకు లాక్కోవటం అంటే, కనుమరుగు చేయటం, నాశనం చేయటం అని అర్థం. ఎందుకంటే నాశనమయ్యే ప్రతి వస్తువూ అల్లాహ్ వైపునకే మరలుతుంది. ప్రతి వస్తువూ ఆయన దగ్గర నుండే వస్తుంది. ఆయన దగ్గరకే తిరిగి చేరుతుంది.
10. అంటే, అలా చేయటం మా శక్తికి మించిన పని ఎంతమాత్రం కాదు. ఒకవేళ మేము తలంచినట్లయితే, ఊరూరా ఒక ప్రవక్తను ఆవిర్భవింపజేసేవారము. కాని మేము అలా చేయలేదు. ఈ ప్రపంచం అంతకీ ఒకే ప్రవక్తను ప్రభవింపజేశాము. ఎందుకంటే, లోకం అంతటికీ ఒకే సూర్యుడు సరిపోయినట్లు, ఈ సన్మార్గపు సూర్యుడు ఒక్కడే సరిపోతాడు.

وَ تَوَكَّلْ عَلَى الْحَيِّ الَّذِيْ لَا يَمُوْتُ وَسَبِّحْ
مع بِحَمْدِهٖ ۚ وَكَفٰى بِهٖ بِذُنُوْبِ عِبَادِهٖ خَبِيْرَا ۨ ﴿٥٨﴾
الَّذِيْ خَلَقَ السَّمٰوٰتِ وَالْاَرْضَ وَمَا بَيْنَهُمَا فِيْ
سِتَّةِ اَيَّامٍ ثُمَّ اسْتَوٰى عَلَى الْعَرْشِ ۚ اَلرَّحْمٰنُ
فَسْـَٔلْ بِهٖ خَبِيْرًا ﴿٥٩﴾ وَ اِذَا قِيْلَ لَهُمُ اسْجُدُوْا
لِلرَّحْمٰنِ قَالُوْا وَمَا الرَّحْمٰنُ ۗ اَنَسْجُدُ لِمَا تَاْمُرُنَا وَ
السجدة ع ٥ ١٦ زَادَهُمْ نُفُوْرًا ۩ ﴿٦٠﴾ تَبٰرَكَ الَّذِيْ جَعَلَ فِي السَّمَآءِ
بُرُوْجًا وَّ جَعَلَ فِيْهَا سِرٰجًا وَّ قَمَرًا مُّنِيْرًا ﴿٦١﴾ وَهُوَ
الَّذِيْ جَعَلَ الَّيْلَ وَالنَّهَارَ خِلْفَةً لِّمَنْ اَرَادَ اَنْ
يَّذَّكَّرَ اَوْ اَرَادَ شُكُوْرًا ﴿٦٢﴾

**58 - 59** ప్రవక్తా! సజీవుడూ, ఎన్నడూ మరణించనివాడూ అయిన దేవునిపై నమ్మకం ఉంచు. ఆయనను స్తుతించటంతో పాటు ఆయన పవిత్రతను కొనియాడు. తన దాసుల పాపాలను గురించి కేవలం ఆయనకు తెలిస్తే చాలు. ఆయన ఆరు దినాలలో భూమినీ, ఆకాశాలనూ, భూమ్యాకాశాల మధ్య ఉన్న సకల వస్తుజాలాన్నీ సృష్టించాడు. తరువాత ఆయనే "అర్ష్" (అధికార పీఠం)ను అధిష్ఠించాడు. ఆయన కరుణామయుడు, ఆయన ఘనతను గురించి ఎరిగిన వాడిని అడుగు.

**60** ఆ కరుణామయునికి సజ్దా చేయండి అని వారితో అన్నప్పుడు వారు ఇలా అంటారు, "ఈ కరుణామయుడన్నది ఏమిటి? నీవు చెప్పిన దానికల్లా మేము సజ్దా చేయవలసిందేనా?" ఈ సందేశం వారి ద్వేషాన్ని మరింత అధికమే చేస్తుంది.

**61 - 62** ఆకాశంలో బురుజులను నిర్మించినవాడూ, అందులో ఒక దీపాన్ని, ఒక మెరిసే చంద్రుణ్ణి వెలిగించిన వాడూ ఎంతో శుభప్రదుడు. ఆయనే రేయింబవళ్లను ఒక దాని వెంట ఒకటి వచ్చేలా చేశాడు, గుణపాఠం నేర్చుకోదలచిన లేదా కృతజ్ఞతలు తెలుపుకోదలచిన ప్రతి వ్యక్తి కోసం.

11. ఒక పెద్ద నది సముద్రంలో కలిసే ప్రతి చోట ఇది సంభవిస్తుంది. ఇదేకాక సముద్రంలోనే వివిధ ప్రాంతాలలో మంచి నీటి చెలమలు ఉన్నాయి. వాటి నీరు సముద్రపు ఉప్పునీటి మధ్య ఉన్నప్పటికీ తన తీయదనాన్ని వదలిపెట్టదు. ఉదాహరణకు, బెహ్రైన్, పర్షియన్ గల్ఫ్‌లోని ఇతర ప్రాంతాలలో ఇటువంటి చెలమలు ఎన్నో ఏర్పడి ఉన్నాయి. వాటి నుండి ప్రజలు మంచి నీటిని త్రాగుతారు.

12. అంటే, విశ్వసించే వాడికి ప్రతిఫలం ఇవ్వటంగానీ, తిరస్కరించేవాడికి శిక్ష విధించటంగానీ నీ పనికాదు. ఎవరినైనా విశ్వాసం వైపునకు బలవంతంగా లాక్కురావటం కోసం గానీ, తిరస్కరించేవాడిని బలవంతంగా తిరస్కరించకుండా ఆపటం కోసంగానీ నీవు నియమించబడలేదు. రుజుమార్గాన్ని అవలంబించిన వాడికి మంచి ఫలితం లభిస్తుందనే శుభవార్తను అందించటం, మూర్ఖంగా చెడుమార్గంపై ఉండే వారిని అల్లాహ్ శిక్షను గురించి హెచ్చరించటం మాత్రమే నీ బాధ్యత.

**63 - 76** కరుణామయుని (అసలు) దాసులు ఎవరంటే, నేలపై అణకువతో నడిచేవారూ,[13] మూర్ఖులు వారిని పలుకరించినప్పుడు, మీకో సలామ్ అని అనేవారూ, తమ ప్రభువు సన్నిధిలో సాష్టాంగపడీ (సజ్దాలోను) నిలబడి రాత్రులు గడిపేవారు, “మా ప్రభూ, నరకయాతన నుండి మమ్మల్ని కాపాడు, దాని శిక్ష ప్రాణాంతకమైనది, అది ఎంతో చెడు ప్రదేశం, ఎంతో చెడు నివాసం” అని ప్రార్థించేవారు. ఖర్చుపెడితే, దుబారాగానూ ఖర్చు పెట్టకుండా, లోభత్వాన్నీ ప్రదర్శించకుండా ఈ రెండు తీవ్రవైఖరుల మధ్య సమతూకాన్ని పాటించేవారు, అల్లాహ్‌ను తప్ప ఏ ఇతర దేవుణ్ణీ వేడుకోని వారు, అల్లాహ్ నిషేధించిన ఏ ప్రాణాన్నీ అన్యాయంగా హతమార్చనివారు, వ్యభిచారానికి పాల్పడనివారు - ఈ పనులను చేసినవాడు ఎవడైనా తన పాపఫలాన్ని పొందితీరుతాడు; తీర్పుదినంనాడు అతనికి రెట్టింపు శిక్ష పడుతుంది. అందులోనే అతడు శాశ్వతంగా హీనస్థితిలో పడిఉంటాడు. (ఈ పాపాల తరువాత) పశ్చాత్తాపపడి, విశ్వసించి మంచి పనులు చెయ్యటం ప్రారంభించే వాడు తప్ప. అటువంటి వాడి చెడులను అల్లాహ్ శుభాలుగా మారుస్తాడు. ఆయన క్షమించేవాడు, కరుణించేవాడూను. పశ్చాత్తాపపడి సద్వర్తనాన్ని అవలంబించే వ్యక్తి అల్లాహ్ వైపునకు మరలివస్తాడు. మరలి రావలసిన రీతిలో - (ఇంకా కరుణామయుని దాసులు ఎలాంటివారంటే) అబద్ధానికి సాక్షులు కానివారు, వ్యర్థమైన వాటి వైపుగా పోవటం జరిగితే, సంస్కారవంతులు మాదిరిగా దాటిపోతారు. వారికి తమ ప్రభువు ఆయతులను వినిపించి హితబోధ చేయటం జరిగితే, వారు దానిని గురించి అంధులుగా, చెవిటి వారుగా ఉండిపోరు. వారు ఇలా ప్రార్థిస్తూ ఉంటారు, “మా ప్రభూ! మాకు మా భార్యల ద్వారానూ మా సంతానం ద్వారానూ కన్నుల చల్లదనాన్ని ప్రసాదించు, మమ్మల్ని భయభక్తులు కలవారికి ఇమాములుగా[14] చేయి.”- తమ సహనానికి ప్రతిఫలంగా మహోన్నతమైన సౌధాలను పొందేవారు వారే. అక్కడ గౌరవ మర్యాదలతో, శాంతివచనాలతో వారికి స్వాగతం పలుకబడుతుంది.

وَعِبَادُ الرَّحْمٰنِ الَّذِيْنَ يَمْشُوْنَ عَلَى الْاَرْضِ هَوْنًا
وَّ اِذَا خَاطَبَهُمُ الْجٰهِلُوْنَ قَالُوْا سَلٰمًا ﴿٦٣﴾ وَالَّذِيْنَ
يَبِيْتُوْنَ لِرَبِّهِمْ سُجَّدًا وَّ قِيَامًا ﴿٦٤﴾ وَالَّذِيْنَ
يَقُوْلُوْنَ رَبَّنَا اصْرِفْ عَنَّا عَذَابَ جَهَنَّمَ ۖ اِنَّ
عَذَابَهَا كَانَ غَرَامًا ﴿٦٥﴾ اِنَّهَا سَآءَتْ مُسْتَقَرًّا وَّ
مُقَامًا ﴿٦٦﴾ وَالَّذِيْنَ اِذَآ اَنْفَقُوْا لَمْ يُسْرِفُوْا وَلَمْ
يَقْتُرُوْا وَكَانَ بَيْنَ ذٰلِكَ قَوَامًا ﴿٦٧﴾ وَالَّذِيْنَ لَا
يَدْعُوْنَ مَعَ اللّٰهِ اِلٰهًا اٰخَرَ وَلَا يَقْتُلُوْنَ النَّفْسَ
الَّتِيْ حَرَّمَ اللّٰهُ اِلَّا بِالْحَقِّ وَلَا يَزْنُوْنَ ۚ وَمَنْ
يَّفْعَلْ ذٰلِكَ يَلْقَ اَثَامًا ﴿٦٨﴾ يُّضٰعَفْ لَهُ الْعَذَابُ
يَوْمَ الْقِيٰمَةِ وَيَخْلُدْ فِيْهِ مُهَانًا ﴿٦٩﴾ اِلَّا مَنْ تَابَ
وَاٰمَنَ وَعَمِلَ عَمَلًا صَالِحًا فَاُولٰٓئِكَ يُبَدِّلُ اللّٰهُ
سَيِّاٰتِهِمْ حَسَنٰتٍ ۗ وَكَانَ اللّٰهُ غَفُوْرًا رَّحِيْمًا ﴿٧٠﴾
وَمَنْ تَابَ وَعَمِلَ صَالِحًا فَاِنَّهٗ يَتُوْبُ اِلَى اللّٰهِ
مَتَابًا ﴿٧١﴾ وَالَّذِيْنَ لَا يَشْهَدُوْنَ الزُّوْرَ ۙ وَ اِذَا
مَرُّوْا بِاللَّغْوِ مَرُّوْا كِرَامًا ﴿٧٢﴾ وَالَّذِيْنَ اِذَا ذُكِّرُوْا
بِاٰيٰتِ رَبِّهِمْ لَمْ يَخِرُّوْا عَلَيْهَا صُمًّا وَّ عُمْيَانًا ﴿٧٣﴾
وَالَّذِيْنَ يَقُوْلُوْنَ رَبَّنَا هَبْ لَنَا مِنْ اَزْوَاجِنَا
وَذُرِّيّٰتِنَا قُرَّةَ اَعْيُنٍ وَّاجْعَلْنَا لِلْمُتَّقِيْنَ اِمَامًا ﴿٧٤﴾
اُولٰٓئِكَ يُجْزَوْنَ الْغُرْفَةَ بِمَا صَبَرُوْا وَيُلَقَّوْنَ فِيْهَا
تَحِيَّةً وَّسَلٰمًا ﴿٧٥﴾

خٰلِدِيْنَ فِيْهَا ؕ حَسُنَتْ مُسْتَقَرًّا وَّمُقَامًا ۝٧٦ قُلْ مَا
يَعْبَؤُا بِكُمْ رَبِّيْ لَوْلَا دُعَآؤُكُمْ ۚ فَقَدْ كَذَّبْتُمْ
فَسَوْفَ يَكُوْنُ لِزَامًا ۝٧٧

వారు కలకాలం అక్కడనే ఉంటారు. ఎంత మంచిది ఆ స్థలం, ఎంత మంచిది ఆ నివాసం.

**77** ప్రవక్తా! ప్రజలతో ఇలా అను, "మీరు నా ప్రభువును వేడుకోకపోతే,[15] ఆయన మిమ్మల్ని ఎందుకు పట్టించుకోవాలి? ఇప్పుడు మీరు నిరాకరించారు, త్వరలోనే తప్పించుకో నలవికాని శిక్షను మీరు అనుభవిస్తారు.

13. అంటే, అహంభావంతో నిక్కుతూ నీల్గుతూ భూమిపై నడవరు, నిరంకుశులు, ఉపద్రవకారులు మాదిరిగా తమ పెత్తనాన్నీ, దౌర్జన్యాన్నీ చలాయించటానికి ప్రయత్నించరు. కాని వారి నడవడిక ఒక పెద్ద మనిషి, ఒక మృదు స్వభావుడు, ఒక ఉదాత్త హృదయుడూ అయిన ఒక మనిషి నడవడిక మాదిరిగా ఉంటుంది.

14. అంటే, మనం దైవభీతిలో, దైవ విధేయతలో అందరినీ అధిగమించాలి, మేలు చేయటంలో, పుణ్యకార్య నిర్వహణలో అందరికంటే ముందు ఉండాలి, కేవలం పుణ్యవంతులుగా ఉండటమే కాదు, పుణ్యవంతులకు నాయకులు కావాలి. మన కారణంగా లోకంలో మంచి పెరగాలి. ఇక్కడ ఈ విషయాన్ని ప్రస్తావించటానికి కారణం, వీరు సిరిసంపదలూ, పేరు ప్రతిష్ఠలూ పొందటంలో కాక దైవభీతిలో, పుణ్యాకార్యాలలో పోటీపడుతూ ఒకరినొకరు అధిగమించటానికి ప్రయత్నిస్తారు అనే విషయం తెలుపటానికే.

15. అంటే, ఒకవేళ మీరు అల్లాహ్‌ను ప్రార్థించకపోతే, ఆయనను ఆరాధించకపోతే, మీ అవసరాలు తీరటానికి ఆయన సహాయాన్ని మీరు అర్థించకపోతే, అల్లాహ్ దృష్టిలో మీకు ఏ విలువా లేదు. ఈ కారణంగా, ఆయన మిమ్మల్ని గడ్డిపోచకంటే హీనంగా చూస్తాడు. కేవలం ఆయన సృష్టిగా, మీకూ రాళ్లకూ మధ్య ఏ భేదమూ లేదు. అల్లాహ్ యొక్క ఏ అవసరమూ మీతో ముడివడిలేదు, కనుక మీరు ఆయనను సేవించకపోతే ఆయన పనులేవీ ఆగిపోవు. ఆయన దయార్ద్ర దృష్టిని మీ వైపునకు మరలేలా చేసే విషయం ఏమిటంటే, మీరు ఆయన వైపునకు చేతులెత్తి ప్రార్థించటమే. ఈ పని చేయకపోతే, మీరు చెత్తా చెదారంలా వదలివేయబడతారు.

آياتها ٢٢٧ ٢٦ سُوْرَةُ الشُّعَرَآءِ مَكِّيَّةٌ ٤٧ ركوعاتها ١١

ఆయతులు 227 | **26. అష్ షుఅరా** | అవతరణ మక్కాలో

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ

طٰسٓمّٓ ① تِلۡكَ اٰيٰتُ الۡكِتٰبِ الۡمُبِيۡنِ ② لَعَلَّكَ
بَاخِعٌ نَّفۡسَكَ اَلَّا يَكُوۡنُوۡا مُؤۡمِنِيۡنَ ③ اِنۡ نَّشَاۡ
نُنَزِّلۡ عَلَيۡهِمۡ مِّنَ السَّمَآءِ اٰيَةً فَظَلَّتۡ اَعۡنَاقُهُمۡ لَهَا
خٰضِعِيۡنَ ④ وَمَا يَاۡتِيۡهِمۡ مِّنۡ ذِكۡرٍ مِّنَ الرَّحۡمٰنِ
مُحۡدَثٍ اِلَّا كَانُوۡا عَنۡهُ مُعۡرِضِيۡنَ ⑤ فَقَدۡ
كَذَّبُوۡا فَسَيَاۡتِيۡهِمۡ اَنۡۢبٰٓؤُا مَا كَانُوۡا بِهٖ
يَسۡتَهۡزِءُوۡنَ ⑥ اَوَلَمۡ يَرَوۡا اِلَى الۡاَرۡضِ كَمۡ
اَنۡۢبَتۡنَا فِيۡهَا مِنۡ كُلِّ زَوۡجٍ كَرِيۡمٍ ⑦ اِنَّ فِىۡ ذٰلِكَ
لَاٰيَةً ؕ وَمَا كَانَ اَكۡثَرُهُمۡ مُّؤۡمِنِيۡنَ ⑧ وَاِنَّ
رَبَّكَ لَهُوَ الۡعَزِيۡزُ الرَّحِيۡمُ ⑨

*అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

**1 - 2** తా. సీన్. మీమ్. ఇవి స్పష్టమైన గ్రంథంలోని వాక్యాలు.[1]

**3 - 6** ప్రవక్తా! వారు విశ్వసించరు అని దుఃఖపడుతూ, బహుశా నీవు నీ ప్రాణాలను కోల్పోతావేమో. మేము కోరితే ఆకాశం నుండి ఒక సూచనను దించి దాని ముందు వారి మెడలు వంగిపోయేలా చేయగలం.[2] కరుణామయుని తరఫు నుండి వారి వద్దకు ఏ కొత్త ఉపదేశం వచ్చినా, దానికి వారు విముఖులే అవుతారు. ఇపుడు వారు తిరస్కరించారు కాబట్టి, త్వరలోనే వారికి, వారు ఎగతాళి చేస్తూ వచ్చిన విషయమందలి యథార్థమేమిటో (విభిన్న రూపాలలో) తెలుస్తుంది.

**7 - 9** వారు ఎన్నడూ తమ దృష్టిని భూమి వైపునకు మళ్లించలేదా; మేము దానిపై ఎంత పుష్కలంగా శ్రేష్ఠమైన రకరకాల చక్కని వృక్ష సంపదను సృష్టించామో? నిశ్చయంగా ఇందులో ఒక సూచన[3] ఉన్నది. కాని వారిలో అనేకులు విశ్వసించరు. వాస్తవం ఏమిటంటే నీ ప్రభువు శక్తిమంతుడే కాదు, కరుణామయుడు కూడా.[4]

---

1. అంటే, తన ఉద్దేశ్యాన్ని స్పష్టంగా వివరించే గ్రంథంలోని ఆయతులు. ఆ గ్రంథం ఏ విషయం వైపునకు పిలుస్తోంది, ఏ విషయం నుండి ఆపుతోంది, దేనిని సత్యమని, దేనిని అసత్యమని నిర్ధారిస్తోంది అనే విషయాలు దానిని చదివే ప్రతి వ్యక్తీ అర్థం చేసుకోగలుగుతాడు. ఒప్పుకోవటం, ఒప్పుకోకపోవటం, అది వేరే విషయం. కాని ఏ వ్యక్తీ, ఈ గ్రంథం తత్వం ఏమిటో తనకు అర్థం కాలేదని, అది తనను ఏ విషయాన్ని విసర్జించమని, దేనిని అవలంబించమని ఆహ్వానిస్తుందో తాను తెలుసుకోలేకపోయాననీ కుంటిసాకులు చెప్పలేడు.
2. అంటే, అవిశ్వాసులందరూ విశ్వాస, విధేయతల వైఖరిని తప్పనిసరిగా అవలంబించేలా చేయగల ఒక సూచనను మేము అవతరింపజేసి ఉండేవారము, ఇది అల్లాహ్‌కు ఏమంత కష్టమైన పనికాదు. ఆయన అలా చేయటంలేదు అంటే దానికి కారణం అది ఆయన శక్తికి మించినపని అని భావం కాదు. కాని దానికి కారణం ఏమిటంటే, బలవంతపు విశ్వాసం ఆయనకు సమ్మతం కాదు.
3. అంటే, సత్యాన్వేషణకోసం ఎవరికైనా ఒక సూచన అవసరమైతే, ఎక్కడికో పోనవసరం లేదు. వారు కళ్లు తెరచి ఈ భూమిపై గల చెట్టు చేమలను, పైరుపచ్చలను చూస్తే చాలు. దైవప్రవక్తలు తెలియజేసే ఈ సృష్టి వ్యవస్థ మర్మము నిజమైనదా లేక ముష్రిక్కులు, దైవ తిరస్కారులు చెప్పే సిద్ధాంతాలు నిజమైనవా అనే విషయం వారికి తెలిసిపోతుంది.

وَ اِذْ نَادٰى رَبُّكَ مُوْسٰۤى اَنِ ائْتِ الْقَوْمَ
الظّٰلِمِيْنَ ۙ﴿۱۰﴾ قَوْمَ فِرْعَوْنَ ؕ اَلَا يَتَّقُوْنَ ﴿۱۱﴾ قَالَ
رَبِّ اِنِّىْۤ اَخَافُ اَنْ يُّكَذِّبُوْنِ ؕ﴿۱۲﴾ وَ يَضِيْقُ
صَدْرِىْ وَ لَا يَنْطَلِقُ لِسَانِىْ فَاَرْسِلْ اِلٰى
هٰرُوْنَ ﴿۱۳﴾ وَلَهُمْ عَلَىَّ ذَنْۢبٌ فَاَخَافُ اَنْ يَّقْتُلُوْنِ ۚ﴿۱۴﴾
قَالَ كَلَّا ۚ فَاذْهَبَا بِاٰيٰتِنَاۤ اِنَّا مَعَكُمْ مُّسْتَمِعُوْنَ ﴿۱۵﴾
فَاْتِيَا فِرْعَوْنَ فَقُوْلَاۤ اِنَّا رَسُوْلُ رَبِّ الْعٰلَمِيْنَ ۙ﴿۱۶﴾
اَنْ اَرْسِلْ مَعَنَا بَنِىْۤ اِسْرَآءِيْلَ ؕ﴿۱۷﴾ قَالَ اَلَمْ
نُرَبِّكَ فِيْنَا وَلِيْدًا وَّ لَبِثْتَ فِيْنَا مِنْ عُمُرِكَ
سِنِيْنَ ۙ﴿۱۸﴾ وَفَعَلْتَ فَعْلَتَكَ الَّتِىْ فَعَلْتَ وَ اَنْتَ
مِنَ الْكٰفِرِيْنَ ﴿۱۹﴾ قَالَ فَعَلْتُهَاۤ اِذًا وَّ اَنَا مِنَ
الضَّآلِّيْنَ ؕ﴿۲۰﴾ فَفَرَرْتُ مِنْكُمْ لَمَّا خِفْتُكُمْ فَوَهَبَ
لِىْ رَبِّىْ حُكْمًا وَّجَعَلَنِىْ مِنَ الْمُرْسَلِيْنَ ﴿۲۱﴾ وَتِلْكَ
نِعْمَةٌ تَمُنُّهَا عَلَىَّ اَنْ عَبَّدْتَّ بَنِىْۤ اِسْرَآءِيْلَ ؕ﴿۲۲﴾

**10 - 17** నీ ప్రభువు మూసాను ఇలా ఆదేశించినప్పటి గాథను వారికి వినిపించు, “దుష్టులైన ఫిరౌను జాతి ప్రజల వద్దకు వెళ్ళు - వారు భయపడరా?” అతడు ఇలా విన్నవించుకున్నాడు, “నా ప్రభూ! వారు నన్ను అసత్యవాది అని తిరస్కరిస్తారేమో అని నా భయం. నా హృదయం కుంచించుకుపోతోంది. నేను ధారాళంగా మాట్లాడలేను. కనుక నీవు హారూన్‌ను ప్రవక్త పదవిలో నియమించు. నా మీద వారు ఒక నేరాన్ని కూడ మోపారు. ఈ కారణంగా నన్ను వారు హత్య చేస్తారేమో అని నేను భయపడుతున్నాను.” ఇలా సెలవిచ్చాడు, “అలా ఎంతమాత్రం జరగదు. మీరు ఉభయులూ నా సూచనలను తీసుకుని వెళ్ళండి. మేము మీతో పాటు అంతా వింటూ ఉంటాము. ఫిరౌను వద్దకు వెళ్ళి అతనితో ఇలా అనండి-నీవు ఇస్రాయీల్ సంతతి వారిని మాతో పంపు. ఇందుకే సకల లోకాల ప్రభువు మమ్మల్ని (నీ వద్దకు) పంపాడు.”

**18 - 31** ఫిరౌను ఇలా అన్నాడు, “మేము నిన్ను బాల్యంలో మా ఇంట్లో పెంచలేదా? నీవు నీ వయస్సులోని ఎన్నో సంవత్సరాల కాలం మా వద్ద గడిపావు. దాని తరువాత చేసిందేదో చేశావు. నీవు మిక్కిలి కృతఘ్నుడవు.” మూసా ఇలా సమాధానం చెప్పాడు, “అప్పుడు నేను ఆ పనిని పొరపాటు వల్ల చేశాను. తరువాత నేను మీకు భయపడి పారిపోయాను. ఆ తరువాత నా ప్రభువు నాకు వివేకాన్ని, జ్ఞానాన్ని ప్రసాదించాడు, నన్ను సందేశహరులలో చేర్చుకున్నాడు. పోతే ఇక నీవు నాకు ఉపకారం చేసి ఎత్తిపొడుస్తూ ఉన్న విషయం, దాని యథార్థం ఏమిటంటే, నీవు ఇస్రాయీలు సంతతి వారిని బానిసలుగా చేసుకున్నావు.”[5]

4. అంటే, ఆయనకున్న శక్తి సామర్థ్యాలు ఎంత అద్భుతమైనవంటే, ఆయన ఎవరినైనా శిక్షించదలిస్తే, వారిని రెప్పపాటులో సర్వనాశనం చేయగలడు. కాని అలా చేయగలిగినప్పటికీ, ఆయన కరుణామయుడు కాబట్టి, శిక్షించటంలో తొందరపడడు. సంవత్సరాలు, శతాబ్దాల వరకు సడలింపు ఇస్తాడు, ఆలోచించటానికీ, అర్థం చేసుకోవటానికీ, పరివర్తన చెందటానికీ వ్యవధి ఇస్తాడు; యావజ్జీవితంలో చేసిన పాపాలను ఒక్క పశ్చాత్తాపంతో క్షమించివేయటానికి సిద్ధమవుతాడు.

5. అంటే, నీ ఇంటిలో పెరగవలసిన అవసరం నాకెందుకు వచ్చింది? నీవు ఇస్రాయీల్ సంతతి వారికి అన్యాయాలు చేయటం వల్లనే కదా! నీ కిరాతకం వల్లనే నా తల్లి నన్ను బుట్టలో పెట్టి నదిలో వదలిపెట్టేసింది. నేను పెరగటానికి నాకు నా ఇల్లు లేదా? “నిన్ను పెంచి పెద్ద చేశాను” అని నీవు నాకు చేసిన ఉపకారాన్ని జ్ఞాపకం చేయటం నీకు తగినది కాదు.

قَالَ فِرۡعَوۡنُ وَمَا رَبُّ الۡعٰلَمِيۡنَ ؕ ٢٣ قَالَ رَبُّ
السَّمٰوٰتِ وَالۡاَرۡضِ وَمَا بَيۡنَهُمَا ؕ اِنۡ كُنۡتُمۡ
مُّوۡقِنِيۡنَ ٢٤ قَالَ لِمَنۡ حَوۡلَهٗۤ اَلَا تَسۡتَمِعُوۡنَ ٢٥
قَالَ رَبُّكُمۡ وَرَبُّ اٰبَآٮِٕكُمُ الۡاَوَّلِيۡنَ ٢٦ قَالَ اِنَّ
رَسُوۡلَكُمُ الَّذِىۡۤ اُرۡسِلَ اِلَيۡكُمۡ لَمَجۡنُوۡنٌ ٢٧ قَالَ
رَبُّ الۡمَشۡرِقِ وَالۡمَغۡرِبِ وَمَا بَيۡنَهُمَا ؕ اِنۡ كُنۡتُمۡ
تَعۡقِلُوۡنَ ٢٨ قَالَ لَٮِٕنِ اتَّخَذۡتَ اِلٰهًا غَيۡرِىۡ
لَاَجۡعَلَنَّكَ مِنَ الۡمَسۡجُوۡنِيۡنَ ٢٩ قَالَ اَوَلَوۡ جِئۡتُكَ
بِشَىۡءٍ مُّبِيۡنٍ ۚ ٣٠ قَالَ فَاۡتِ بِهٖۤ اِنۡ كُنۡتَ مِنَ
الصّٰدِقِيۡنَ ٣١ فَاَلۡقٰى عَصَاهُ فَاِذَا هِىَ ثُعۡبَانٌ
مُّبِيۡنٌ ۚ ٣٢ وَّنَزَعَ يَدَهٗ فَاِذَا هِىَ بَيۡضَآءُ لِلنّٰظِرِيۡنَ ٣٣ ع
قَالَ لِلۡمَلَاِ حَوۡلَهٗۤ اِنَّ هٰذَا لَسٰحِرٌ عَلِيۡمٌ ٣٤ يُّرِيۡدُ اَنۡ
يُّخۡرِجَكُمۡ مِّنۡ اَرۡضِكُمۡ بِسِحۡرِهٖ ۖ فَمَاذَا
تَاۡمُرُوۡنَ ٣٥ قَالُوۡۤا اَرۡجِهۡ وَاَخَاهُ وَابۡعَثۡ فِى
الۡمَدَآٮِٕنِ حٰشِرِيۡنَ ۙ ٣٦ يَاۡتُوۡكَ بِكُلِّ سَحَّارٍ
عَلِيۡمٍ ٣٧ فَجُمِعَ السَّحَرَةُ لِمِيۡقَاتِ يَوۡمٍ
مَّعۡلُوۡمٍ ۙ ٣٨ وَّقِيۡلَ لِلنَّاسِ هَلۡ اَنۡتُمۡ مُّجۡتَمِعُوۡنَ ۙ ٣٩
لَعَلَّنَا نَتَّبِعُ السَّحَرَةَ اِنۡ كَانُوۡا هُمُ الۡغٰلِبِيۡنَ ٤٠

ఫిరౌను ఇలా అన్నాడు, "ఈ సకల లోకాల ప్రభువు ఏమిటి?" దానికి మూసా, "ఆకాశాలకూ, భూమికీ ప్రభువు, భూమ్యాకాశాల మధ్య ఉన్న సమస్తానికీ ప్రభువు, నీవు (దేవుణ్ణి) నమ్మేవాడివే అయితే" అని జవాబు చెప్పాడు. ఫిరౌను తన చుట్టూ ఉన్న వారితో, "వింటున్నారా?" అని అన్నాడు. మూసా ఇలా అన్నాడు, "ఆయనే మీ ప్రభువు కూడ, పూర్వం గతించిన మీ తాతముత్తాతల ప్రభువు కూడా." ఫిరౌను (అక్కడి వారితో) ఇలా అన్నాడు, "మీ వద్దకు పంపబడిన మీ దైవప్రవక్త గారు పూర్తిగా పిచ్చివారుగా కనిపిస్తున్నారు." మూసా ఇంకా ఇలా అన్నాడు, "తూర్పుకూ, పడమరకూ, వాటిమధ్య ఉన్న సర్వానికీ ప్రభువు; మీరు వివేకం కలవారే అయితే." ఫిరౌను ఇలా అన్నాడు, "నీవు నన్ను కాదని మరెవరినైనా ఆరాధ్యుడుగా చేసుకుంటే, నిన్ను కూడ జైళ్ళల్లో పడి మ్రగ్గిపోతున్న వారిలో చేరుస్తాను." మూసా ఇలా అన్నాడు, "నేను నీ ముందుకు ఒక స్పష్టమైన విషయాన్ని తీసుకువచ్చిన తరువాత కూడానా?" దానికి ఫిరౌన్, "మంచిది తీసుకురా, నీవు సత్యవాదివే అయితే" అని అన్నాడు.

**32 - 33** (అతడు ఈ మాట అన్నంతనే) మూసా తన చేతి కర్రను విసిరాడు; వెంటనే స్పష్టంగా అదొక పెద్ద పామై పోయింది. తరువాత అతను తన చేతిని (చంకనుండి) లాగాడు. అది చూపరుల ముందు మెరిసిపోసాగింది.[6]

**34 - 40** ఫిరౌను తన చుట్టూ ఉన్న సర్దారులతో ఇలా అన్నాడు, "ఈ వ్యక్తి నిజంగానే చేయి తిరిగిన మంత్రగాడు. తన మంత్రబలం ద్వారా మిమ్మల్ని మీ దేశం నుండి తరిమివేయాలని[7] చూస్తున్నాడు. ఇప్పుడు చెప్పండి మీ ఆజ్ఞ ఏమిటో?" వారు ఇలా అన్నారు, "అతనినీ, అతని సోదరుణ్ణీ ఆపి ఉంచండి, పట్టణాలలోకి వార్తాహరులను పంపండి, నేర్పరులైన మంత్ర గాళ్లను మీ వద్దకు తీసుకు రమ్మనండి." ఆ విధంగా ఒకనాడు నిర్ణీత సమయానికి మంత్రగాళ్లు సమావేశపరచబడ్డారు. ప్రజలకు ఇలా చెప్పబడింది, "మీరు సభకు వస్తున్నారా? మంత్రగాళ్లు గెలిస్తే,[8] బహుశా మనం వారి ధర్మాన్నే అనుసరించవచ్చు."

فَلَمَّا جَآءَ السَّحَرَةُ قَالُوا لِفِرْعَوْنَ أَئِنَّ لَنَا لَأَجْرًا
إِن كُنَّا نَحْنُ الْغَالِبِينَ ﴿٤١﴾ قَالَ نَعَمْ وَإِنَّكُمْ إِذًا
لَّمِنَ الْمُقَرَّبِينَ ﴿٤٢﴾ قَالَ لَهُم مُّوسَىٰ أَلْقُوا مَا أَنتُم
مُّلْقُونَ ﴿٤٣﴾ فَأَلْقَوْا حِبَالَهُمْ وَعِصِيَّهُمْ وَقَالُوا بِعِزَّةِ
فِرْعَوْنَ إِنَّا لَنَحْنُ الْغَالِبُونَ ﴿٤٤﴾ فَأَلْقَىٰ مُوسَىٰ
عَصَاهُ فَإِذَا هِيَ تَلْقَفُ مَا يَأْفِكُونَ ﴿٤٥﴾ فَأُلْقِيَ
السَّحَرَةُ سَاجِدِينَ ﴿٤٦﴾ قَالُوا آمَنَّا بِرَبِّ
الْعَالَمِينَ ﴿٤٧﴾ رَبِّ مُوسَىٰ وَهَارُونَ ﴿٤٨﴾ قَالَ آمَنتُمْ
لَهُ قَبْلَ أَنْ آذَنَ لَكُمْ إِنَّهُ لَكَبِيرُكُمُ الَّذِي
عَلَّمَكُمُ السِّحْرَ فَلَسَوْفَ تَعْلَمُونَ لَأُقَطِّعَنَّ
أَيْدِيَكُمْ وَأَرْجُلَكُم مِّنْ خِلَافٍ وَلَأُصَلِّبَنَّكُمْ
أَجْمَعِينَ ﴿٤٩﴾ قَالُوا لَا ضَيْرَ إِنَّا إِلَىٰ رَبِّنَا
مُنقَلِبُونَ ﴿٥٠﴾ إِنَّا نَطْمَعُ أَن يَغْفِرَ لَنَا رَبُّنَا خَطَايَانَا
أَن كُنَّا أَوَّلَ الْمُؤْمِنِينَ ﴿٥١﴾

**41 - 51** మంత్రగాళ్లు రంగంలోకి దిగినప్పుడు, ఫిరౌనుతో ఇలా అన్నారు, "మేము గెలిస్తే, మాకు బహుమానం దొరుకుతుంది కదా?" అతడు, "అవును. అప్పుడు మీరు నా సన్నిహితులలో చేరిపోతారు" అని అన్నాడు. అప్పుడు మూసా, "విసరండి, మీరు విసరదలచుకున్న దానిని" అని అన్నాడు. వారు వెంటనే తమ త్రాళ్లనూ చేతికర్రలనూ విసిరి, "ఫిరౌను ఔన్నత్యం సాక్షిగా! మేమే విజయం సాధిస్తాము" అని అన్నారు. తరువాత మూసా తన చేతి కర్రను విసిరినప్పుడు, అది అకస్మాత్తుగా వారి బూటకపు మహిమలను కబళింపసాగింది. అప్పుడు మాంత్రికులందరూ అమాంతంగా సజ్దాలో పడిపోయారు. ఇలా అన్నారు, "విశ్వసించాము మేము, సకల లోకాల ప్రభువును– మూసా, హారూన్‌ల ప్రభువును." ఫిరౌను ఇలా అన్నాడు, "నేను మీకు అనుమతి ఇవ్వకముందే మీరు మూసా మాటను విశ్వసించారా? నిస్సందేహంగా ఇతడు మీకు గురువు, మీకు మంత్రవిద్యను నేర్పాడు. సరే మంచిది, ఇప్పుడే మీరు తెలుసుకుంటారు. నేను మీ చేతులను, కాళ్లను అభిముఖ దిశలలో నరికిస్తాను, మీ అందరినీ శిలువపైకి ఎక్కిస్తాను." దానికి వారు ఇలా పలికారు, "ఏమీ పర్వాలేదు, మేము మా ప్రభువు సాన్నిధ్యానికి చేరుకుంటాము. మా ప్రభువు మా పాపాలను క్షమిస్తాడని మేము ఆశిస్తున్నాము. ఎందుకంటే, అందరి కంటే ముందు మేమే విశ్వసించాము."

6. హ్జ్రత్ మూసా తన చేతిని చంకనుండి తీసినంతనే, హఠాత్తుగా పరిసరాలన్నీ దేదీప్యమానంగా ప్రకాశించాయి; సూర్యుడే కిందికి దిగివచ్చాడా అని అనిపించింది.

7. ఈ రెండు మహిమల ప్రభావం ఎంత పడిందో ఈ విషయం ద్వారా ఊహించవచ్చు: ఒక క్షణం పూర్వం ఫిరౌను, తన ప్రజలలోని ఒక వ్యక్తిని, "నేను దైవ ప్రవక్తను, ఇస్రాయీల్ సంతతిని నాతో పంపు" అని కోరగా చూచి, పిచ్చివాడు అని తేల్చేశాడు; అంతేకాదు, "నీవు గనక నన్ను కాదని ఇతరులను ప్రభువుగా అంగీకరిస్తే, నేను నిన్ను జైలులో పడవేసి, మ్రగ్గేలా చేసి చంపేస్తాను" అని కూడా బెదిరించాడు. ఇప్పుడు ఈ సూచనలను చూడగానే తన రాజ్యాధికారానికీ తన దేశానికి ప్రమాదం ఏర్పడిందనీ, అవి తన నుండి లాక్కోబడతాయనీ అతనికి బెంగపట్టుకుంది.

8. అంటే, కేవలం చాటింపులూ, ప్రకటనలూ చేయించటంతోటే తృప్తి పడలేదు, ప్రజలను ప్రేరేపించి ఈ పోటీని చూడటానికి వచ్చేలా చేయటానికి మనుషులు పంపబడ్డారు. దీనివల్ల తెలిసేదేమిటంటే, నిండు దర్బారులో హ్జ్రత్ మూసా ప్రదర్శించిన రెండు మహిమలకు సంబంధించిన సమాచారం జన సామాన్యంలో కూడా వ్యాపించింది. కనుక దేశ పౌరులు దానికి ప్రభావితులవుతూ పోతున్నారని ఫిరౌను భయపడ్డాడు. రాజ దర్బారులో హ్జ్రత్ మూసా చూపిన మహిమలను చూచిన వారూ, దానికి సంబంధించిన విశ్వసనీయ సమాచారం తెలుసుకున్నవారూ తమ పూర్వీకుల మతం పట్ల నమ్మకాన్ని కోల్పోసాగారు. ఇప్పుడు ఏదో ఒక విధంగా వారి

وَاَوْحَيْنَآ اِلٰى مُوْسٰٓى اَنْ اَسْرِ بِعِبَادِيْٓ اِنَّكُمْ
مُّتَّبَعُوْنَ ﴿٥٢﴾ فَاَرْسَلَ فِرْعَوْنُ فِى الْمَدَآئِنِ
حٰشِرِيْنَ ﴿٥٣﴾ اِنَّ هٰٓؤُلَآءِ لَشِرْذِمَةٌ قَلِيْلُوْنَ ﴿٥٤﴾ وَ
اِنَّهُمْ لَنَا لَغَآئِظُوْنَ ﴿٥٥﴾ وَاِنَّا لَجَمِيْعٌ حٰذِرُوْنَ ﴿٥٦﴾
فَاَخْرَجْنٰهُمْ مِّنْ جَنّٰتٍ وَّعُيُوْنٍ ﴿٥٧﴾ وَّكُنُوْزٍ وَّمَقَامٍ
كَرِيْمٍ ﴿٥٨﴾ كَذٰلِكَ وَاَوْرَثْنٰهَا بَنِيْٓ اِسْرَآءِيْلَ ﴿٥٩﴾
فَاَتْبَعُوْهُمْ مُّشْرِقِيْنَ ﴿٦٠﴾ فَلَمَّا تَرَآءَ الْجَمْعٰنِ قَالَ
اَصْحٰبُ مُوْسٰٓى اِنَّا لَمُدْرَكُوْنَ ﴿٦١﴾ قَالَ كَلَّا اِنَّ
مَعِىَ رَبِّىْ سَيَهْدِيْنِ ﴿٦٢﴾ فَاَوْحَيْنَآ اِلٰى مُوْسٰٓى اَنِ
اضْرِبْ بِّعَصَاكَ الْبَحْرَ فَانْفَلَقَ فَكَانَ كُلُّ فِرْقٍ
كَالطَّوْدِ الْعَظِيْمِ ﴿٦٣﴾ وَاَزْلَفْنَا ثَمَّ الْاٰخَرِيْنَ ﴿٦٤﴾ وَ
اَنْجَيْنَا مُوْسٰى وَمَنْ مَّعَهٗٓ اَجْمَعِيْنَ ﴿٦٥﴾ ثُمَّ اَغْرَقْنَا
الْاٰخَرِيْنَ ﴿٦٦﴾ اِنَّ فِىْ ذٰلِكَ لَاٰيَةً وَمَا كَانَ
اَكْثَرُهُمْ مُّؤْمِنِيْنَ ﴿٦٧﴾ وَاِنَّ رَبَّكَ لَهُوَ الْعَزِيْزُ
الرَّحِيْمُ ﴿٦٨﴾ ع

**52 - 59** "రాత్రికి రాత్రే నా దాసులను తీసుకుని వెళ్లిపో. మిమ్మల్ని తప్పక వెంటాడటం జరుగుతుంది" అని మేము[9] మూసాకు వహీ పంపాము. తరువాత ఫిరౌన్ (సైన్యాన్ని సమాయత్తపరిచే నిమిత్తం) పట్టణాలలోకి వార్తాహరులను పంపి ఇలా ప్రకటన చేయించాడు, "వీరు గుప్పెడు మంది మాత్రమే, మాకు చాల కోపం తెప్పించారు. మనం ఎల్లప్పుడూ అప్రమత్తంగా ఉండే లక్షణం గల జాతి ప్రజలం." ఈ విధంగా మేము వారిని తమ తోటల నుండీ, చెలమల నుండీ, ఖజానాల నుండీ, మహోన్నతమైన వారి నివాస స్థలాల నుండీ బయటికి తీసుకువచ్చాము. వారి విషయంలో ఇలా జరిగింది. (రెండో వైపు) ఇస్రాయీల్ సంతతి వారిని మేము వీటన్నిటికీ వారసులుగా చేశాము.

**60 - 66** తెల్లవారుతూ ఉండగా, వీరు వారిని వెంటాడ సాగారు. ఇరు పక్షాలవారు ఒకరికొకరు ఎదురు పడినప్పుడు, మూసా సహచరులు, "మేము పట్టుబడ్డాము" అని కేకవేశారు. మూసా, "అలా ఎంతమాత్రం జరగదు. నా ప్రభువు నాతో ఉన్నాడు. తప్పకుండా ఆయన నాకు మార్గం చూపుతాడు" అని అన్నాడు. మేము మూసాను, "నీ చేతికర్రతో సముద్రాన్ని కొట్టు" అని వహీ ద్వారా ఆజ్ఞాపించాము. అప్పుడు హఠాత్తుగా సముద్రం చీలిపోయింది. దాని ప్రతి భాగం ఒక మహోన్నతమైన పర్వతం మాదిరిగా అయిపోయింది. ఆ చోటికే మేము రెండో వర్గం వారిని కూడ చేర్చాము. మూసానూ, అతనితో ఉన్న వారందరినీ మేము రక్షించాము. మిగతా వారినందరినీ ముంచివేశాము.

**67 - 68** ఈ సంఘటనలో ఒక సూచన ఉన్నది. కాని వారిలో చాలామంది విశ్వసించరు. యథార్థమేమిటంటే, నీ ప్రభువు మహాశక్తిమంతుడు, అనంత కరుణామయుడు.

మాంత్రికులు కూడ మూసా చూపిన మహిమల్లాంటివి చూపిస్తేనే వారి మతం మనగలుగుతుంది. ఫిరౌను, అతని ముఖ్యులు ఈ పోటీని అతి ముఖ్యమైనదిగా భావించారు. వారు పంపిన మనుషులు ప్రజాబాహుళ్యానికి, "మన మాంత్రికులు గెలిస్తే మనం మూసా మతం బారి నుండి కాపాడబడతాము, లేకపోతే మన ధర్మానికీ, మన విశ్వాసానికీ భద్రతలేదు" అని చెప్పారు.

9. ఇప్పుడు ఒక దీర్ఘ కాలపు సంఘటనలను వదలిపెట్టి, వలసపొమ్మని మూసాను ఆజ్ఞాపించినప్పటి విషయం ప్రస్తావించబడుతోంది.

وَاتْلُ عَلَيْهِمْ نَبَاَ اِبْرٰهِيْمَ ﴿٦٩﴾ اِذْ قَالَ لِاَبِيْهِ وَ
قَوْمِهٖ مَا تَعْبُدُوْنَ ﴿٧٠﴾ قَالُوْا نَعْبُدُ اَصْنَامًا فَنَظَلُّ
لَهَا عٰكِفِيْنَ ﴿٧١﴾ قَالَ هَلْ يَسْمَعُوْنَكُمْ اِذْ
تَدْعُوْنَ ﴿٧٢﴾ اَوْ يَنْفَعُوْنَكُمْ اَوْ يَضُرُّوْنَ ﴿٧٣﴾ قَالُوْا بَلْ
وَجَدْنَاۤ اٰبَآءَنَا كَذٰلِكَ يَفْعَلُوْنَ ﴿٧٤﴾ قَالَ اَفَرَءَيْتُمْ
مَّا كُنْتُمْ تَعْبُدُوْنَ ﴿٧٥﴾ اَنْتُمْ وَ اٰبَآؤُكُمُ
الْاَقْدَمُوْنَ ﴿٧٦﴾ فَاِنَّهُمْ عَدُوٌّ لِّيْۤ اِلَّا رَبَّ
الْعٰلَمِيْنَ ﴿٧٧﴾ الَّذِيْ خَلَقَنِيْ فَهُوَ يَهْدِيْنِ ﴿٧٨﴾
وَالَّذِيْ هُوَ يُطْعِمُنِيْ وَ يَسْقِيْنِ ﴿٧٩﴾ وَ اِذَا مَرِضْتُ
فَهُوَ يَشْفِيْنِ ﴿٨٠﴾ وَالَّذِيْ يُمِيْتُنِيْ ثُمَّ يُحْيِيْنِ ﴿٨١﴾ وَ
الَّذِيْۤ اَطْمَعُ اَنْ يَّغْفِرَ لِيْ خَطِيْٓــَٔتِيْ يَوْمَ الدِّيْنِ ﴿٨٢﴾
رَبِّ هَبْ لِيْ حُكْمًا وَّ اَلْحِقْنِيْ بِالصّٰلِحِيْنَ ﴿٨٣﴾
وَاجْعَلْ لِّيْ لِسَانَ صِدْقٍ فِي الْاٰخِرِيْنَ ﴿٨٤﴾ وَ
اجْعَلْنِيْ مِنْ وَّرَثَةِ جَنَّةِ النَّعِيْمِ ﴿٨٥﴾ وَاغْفِرْ لِاَبِيْۤ
اِنَّهٗ كَانَ مِنَ الضَّآلِّيْنَ ﴿٨٦﴾ وَلَا تُخْزِنِيْ يَوْمَ
يُبْعَثُوْنَ ﴿٨٧﴾ يَوْمَ لَا يَنْفَعُ مَالٌ وَّلَا بَنُوْنَ ﴿٨٨﴾ اِلَّا
مَنْ اَتَى اللّٰهَ بِقَلْبٍ سَلِيْمٍ ﴿٨٩﴾ وَاُزْلِفَتِ الْجَنَّةُ
لِلْمُتَّقِيْنَ ﴿٩٠﴾ وَ بُرِّزَتِ الْجَحِيْمُ لِلْغٰوِيْنَ ﴿٩١﴾ وَقِيْلَ
لَهُمْ اَيْنَمَا كُنْتُمْ تَعْبُدُوْنَ ﴿٩٢﴾ مِنْ دُوْنِ اللّٰهِ هَلْ
يَنْصُرُوْنَكُمْ اَوْ يَنْتَصِرُوْنَ ﴿٩٣﴾ فَكُبْكِبُوْا فِيْهَا هُمْ
وَالْغَاوٗنَ ﴿٩٤﴾ وَجُنُوْدُ اِبْلِيْسَ اَجْمَعُوْنَ ﴿٩٥﴾

**69 - 89** ఇంకా వారికి ఇబ్రాహీము గాథను వినిపించు. అప్పుడు అతను తన తండ్రినీ, తన జాతి వారినీ, "మీరు వేటిని పూజిస్తున్నారు?" అని అడిగాడు. వారు, "ఇవి కొన్ని విగ్రహాలు, వాటిని మేము పూజిస్తాము. వాటి సేవలోనే మేము నిమగ్నులమై ఉంటాము" అని జవాబు పలికారు. అతను వారిని ఇలా అడిగాడు, "మీరు వీటిని పిలిచినప్పుడు, ఇవి మీ మొర ఆలకిస్తాయా? లేదా ఇవి మీకేమైనా లాభాన్నిగానీ, నష్టాన్నిగానీ కలిగిస్తాయా?" వారు ఇలా అన్నారు, "లేదు, కాని మేము మా తాతముత్తాతలు ఇలా చేస్తూ ఉండగా చూశాము." అప్పుడు ఇబ్రాహీము ఇలా అన్నాడు, "మీరూ, పూర్వం మీ తాతముత్తాతలూ పూజిస్తూ వస్తున్న వాటిని ఎప్పుడైనా మీరు (కళ్లు తెరచి) చూశారా? నాకు ఇవన్నీ శత్రువులే, ఒక్క సకల లోకాల ప్రభువు తప్ప. ఆయన నన్ను సృష్టించాడు. తరువాత ఆయనే నాకు మార్గం చూపుతున్నాడు. ఆయనే నాకు తినిపిస్తాడు, త్రాగిస్తాడు. నేను వ్యాధికి గురి అయినప్పుడు, ఆయనే నాకు స్వస్థతను చేకూరుస్తాడు. ఆయనే నాకు మృత్యువును కలిగిస్తాడు. తరువాత మళ్లీ నాకు జీవితాన్ని అనుగ్రహిస్తాడు. తీర్పుదినం నాడు నా పాపాలను క్షమిస్తాడని నేను ఆయన మీద ఆశలు పెట్టుకున్నాను." (దీని తరువాత ఇబ్రాహీమ్ ఇలా (ప్రార్థించాడు): "నా ప్రభూ! నాకు వివేకాన్ని ప్రసాదించు, నన్ను సజ్జనులలో కలుపు. తరువాత తరాల వారిలో నాకు మంచి పేరు ప్రసాదించు. నన్ను సుఖసౌభాగ్యాల స్వర్గవనానికి వారసులైన వారిలో చేర్చు. నా తండ్రిని క్షమించు. నిస్సందేహంగా ఆయన మార్గం తప్పిన వారిలోని వాడే. మానవులందరూ బ్రతికింపబడే రోజున నన్ను అవమానం పాలుజేయకు. అప్పుడు సంపదవల్ల గానీ, సంతానం వల్లగానీ ఏ లాభమూ కలగదు; ఏ వ్యక్తి అయినా మంచి మనస్సుతో అల్లాహ్ సాన్నిధ్యంలో హాజరైతే తప్ప."

**90 - 102** (ఆ రోజున)[10] స్వర్గం భయభక్తులు కలవారి దగ్గరకు తీసుకు రాబడుతుంది. నరకం మార్గం తప్పిన వారి ముందు తెరువబడుతుంది. వారిని ఇలా అడగటం జరుగుతుంది, "అల్లాహ్‌ను వదలిపెట్టి, మీరు ఆరాధించేవారు ఇప్పుడెక్కడున్నారు? వారు మీకేమైనా సహాయం చేస్తున్నారా? లేదా తమను తాము రక్షించుకోగలరా?" తరువాత ఆ దేవుళ్లూ, మార్గం తప్పిన ఈ మానవులూ, ఇబ్లీస్ సైన్యమూ, అందరూ దాని లోకి ఒకరి మీద ఒకరు పడేటట్లుగా త్రోయబడతారు.

قَالُوْا وَ هُمْ فِيْهَا يَخْتَصِمُوْنَ ﴿٩٦﴾ تَاللّٰهِ اِنْ كُنَّا لَفِيْ
ضَلٰلٍ مُّبِيْنٍ ﴿٩٧﴾ اِذْ نُسَوِّيْكُمْ بِرَبِّ الْعٰلَمِيْنَ ﴿٩٨﴾ وَ
مَآ اَضَلَّنَآ اِلَّا الْمُجْرِمُوْنَ ﴿٩٩﴾ فَمَا لَنَا مِنْ شَافِعِيْنَ ﴿١٠٠﴾
وَلَا صَدِيْقٍ حَمِيْمٍ ﴿١٠١﴾ فَلَوْ اَنَّ لَنَا كَرَّةً فَنَكُوْنَ مِنَ
الْمُؤْمِنِيْنَ ﴿١٠٢﴾ اِنَّ فِيْ ذٰلِكَ لَاٰيَةً ؕ وَ مَا كَانَ
اَكْثَرُهُمْ مُّؤْمِنِيْنَ ﴿١٠٣﴾ وَ اِنَّ رَبَّكَ لَهُوَ الْعَزِيْزُ
الرَّحِيْمُ ﴿١٠٤﴾ كَذَّبَتْ قَوْمُ نُوْحِ ِۣالْمُرْسَلِيْنَ ﴿١٠٥﴾ اِذْ
قَالَ لَهُمْ اَخُوْهُمْ نُوْحٌ اَلَا تَتَّقُوْنَ ﴿١٠٦﴾ اِنِّيْ لَكُمْ
رَسُوْلٌ اَمِيْنٌ ﴿١٠٧﴾ فَاتَّقُوا اللّٰهَ وَاَطِيْعُوْنِ ﴿١٠٨﴾ وَمَآ
اَسْئَلُكُمْ عَلَيْهِ مِنْ اَجْرٍ ۚ اِنْ اَجْرِيَ اِلَّا عَلٰى رَبِّ
الْعٰلَمِيْنَ ﴿١٠٩﴾ فَاتَّقُوا اللّٰهَ وَ اَطِيْعُوْنِ ﴿١١٠﴾ قَالُوْٓا
اَنُؤْمِنُ لَكَ وَ اتَّبَعَكَ الْاَرْذَلُوْنَ ﴿١١١﴾ قَالَ وَمَا
عِلْمِيْ بِمَا كَانُوْا يَعْمَلُوْنَ ﴿١١٢﴾ اِنْ حِسَابُهُمْ اِلَّا عَلٰى
رَبِّيْ لَوْ تَشْعُرُوْنَ ﴿١١٣﴾ وَمَآ اَنَا بِطَارِدِ الْمُؤْمِنِيْنَ ﴿١١٤﴾
اِنْ اَنَا اِلَّا نَذِيْرٌ مُّبِيْنٌ ﴿١١٥﴾ قَالُوْا لَئِنْ لَّمْ تَنْتَهِ
يٰنُوْحُ لَتَكُوْنَنَّ مِنَ الْمَرْجُوْمِيْنَ ﴿١١٦﴾ قَالَ رَبِّ اِنَّ
قَوْمِيْ كَذَّبُوْنِ ﴿١١٧﴾ فَافْتَحْ بَيْنِيْ وَ بَيْنَهُمْ فَتْحًا
وَّنَجِّنِيْ وَمَنْ مَّعِيَ مِنَ الْمُؤْمِنِيْنَ ﴿١١٨﴾ فَاَنْجَيْنٰهُ وَ
مَنْ مَّعَهٗ فِي الْفُلْكِ الْمَشْحُوْنِ ﴿١١٩﴾ ثُمَّ اَغْرَقْنَا بَعْدُ
الْبٰقِيْنَ ﴿١٢٠﴾ اِنَّ فِيْ ذٰلِكَ لَاٰيَةً ؕ وَمَا كَانَ اَكْثَرُهُمْ
مُّؤْمِنِيْنَ ﴿١٢١﴾ وَاِنَّ رَبَّكَ لَهُوَ الْعَزِيْزُ الرَّحِيْمُ ﴿١٢٢﴾

అక్కడ వారందరూ పరస్పరం పోట్లాడుకుంటారు. మార్గం తప్పిన ఈ మానవులు (తమ దేవుళ్లతో) ఇలా అంటారు, "దేవుని సాక్షిగా! సకల లోకాల ప్రభువుతో సమానమైన స్థానాన్ని మీకు ఇచ్చినప్పుడు మేము స్పష్టమైన మార్గభ్రష్టత్వానికి గురిఅయ్యాము. మమ్మల్ని మార్గం తప్పించినవారు నిజంగానే అపరాధులు. ఇప్పుడు మాకు సిఫారసు చేసేవాడు గానీ, ప్రాణ స్నేహితుడుగానీ, ఎవడూ లేడు. అయ్యో! ఒకసారి మళ్లీ మరలివెళ్లే అవకాశం మాకు దొరికితే, మేము తప్పకుండా విశ్వాసులమవుతాము."

**103 - 104** నిశ్చయంగా ఇందులో ఒక గొప్ప సూచన[11] ఉన్నది. కాని వారిలో అత్యధికులు విశ్వసించరు. యథార్థమేమిటంటే, నీ ప్రభువు అత్యంత శక్తిమంతుడు, కరుణామయుడూను.

**105 - 120** నూహు జాతివారు దైవప్రవక్తలను తిరస్కరించారు. అప్పుడు వారి సోదరుడు నూహు వారితో (ఇలా) అన్న విషయాన్ని జ్ఞాపకం తెచ్చుకో, "మీరు భయపడరా? నేను మీ కొరకు ఒక విశ్వసనీయుడైన సందేశ హరుడను. కనుక మీరు అల్లాహ్‌కు భయపడండి, విధేయత చూపండి. నేను ఈ పనికిగాను మీ నుండి ఏ ప్రతిఫలాన్నీ కోరను. నాకు ప్రతిఫలం ఇవ్వటం అనేది సకల లోకాల ప్రభువు బాధ్యత. కనుక మీరు అల్లాహ్‌కు భయపడండి, (నిస్సంకోచంగా) నాకు విధేయత చూపండి." వారు ఇలా జవాబు పలికారు, "ఏమిటీ, మేము నిన్ను విశ్వసించాలా? వాస్తవానికి అధములైన వారే నిన్ను అనుసరిస్తున్నారు." దానికి నూహ్ ఇలా అన్నాడు, "వారు చేసే పనులెలాంటివో నాకేమి తెలుసు? వారి లెక్క చూడటం నా ప్రభువు బాధ్యత. అయ్యో! మీరు కొంచెం తెలివిగా వ్యవహరిస్తే ఎంత బాగుంటుంది. విశ్వసించిన వారిని గెంటివేయడం నా పని కాదు. నేను కేవలం స్పష్టంగా హెచ్చరికచేసే వ్యక్తిని మాత్రమే." వారు దానికి, "ఓ నూహ్! ఒకవేళ నీవు దీనిని మానుకోకపోతే, తప్పక శాపగ్రస్తులలో చేరి పోతావు" అని అన్నారు. నూహ్ ఇలా ప్రార్థించాడు, "ఓ నా ప్రభూ! నా జాతివారు నేను అసత్యవాదినని నన్ను తిరస్కరించారు. ఇక నాకూ వారికీ మధ్య స్పష్టమైన తీర్పు చెయ్యి. నన్నూ, నాతోపాటు ఉన్న విశ్వాసులనూ కాపాడు." చివరకు మేము అతన్నీ, అతని సహచరులనూ ఒక నిండు పడవలో రక్షించాము.[12] దాని తరువాత మిగతా వారినందరినీ ముంచి వేశాము.

**121 - 122** నిశ్చయంగా ఇందులో ఒక సూచన ఉన్నది. కాని వారిలో చాలామంది విశ్వసించరు. యథార్థమేమిటంటే, నీ ప్రభువు మహాశక్తి మంతుడు, అత్యంత కరుణామయుడు.

كَذَّبَتْ عَادُ ٱلْمُرْسَلِينَ ﴿١٢٣﴾ إِذْ قَالَ لَهُمْ أَخُوهُمْ
هُودٌ أَلَا تَتَّقُونَ ﴿١٢٤﴾ إِنِّي لَكُمْ رَسُولٌ أَمِينٌ ﴿١٢٥﴾
فَاتَّقُوا اللّٰهَ وَأَطِيعُونِ ﴿١٢٦﴾ وَمَا أَسْأَلُكُمْ عَلَيْهِ مِنْ
أَجْرٍ إِنْ أَجْرِيَ إِلَّا عَلَىٰ رَبِّ الْعٰلَمِينَ ﴿١٢٧﴾
أَتَبْنُونَ بِكُلِّ رِيعٍ اٰيَةً تَعْبَثُونَ ﴿١٢٨﴾ وَتَتَّخِذُونَ
مَصَانِعَ لَعَلَّكُمْ تَخْلُدُونَ ﴿١٢٩﴾ وَإِذَا بَطَشْتُمْ بَطَشْتُمْ
جَبَّارِينَ ﴿١٣٠﴾ فَاتَّقُوا اللّٰهَ وَأَطِيعُونِ ﴿١٣١﴾ وَاتَّقُوا
الَّذِيٓ أَمَدَّكُمْ بِمَا تَعْلَمُونَ ﴿١٣٢﴾ أَمَدَّكُمْ بِأَنْعَامٍ وَّ
بَنِينَ ﴿١٣٣﴾ وَجَنّٰتٍ وَّعُيُونٍ ﴿١٣٤﴾ إِنِّيٓ أَخَافُ عَلَيْكُمْ
عَذَابَ يَوْمٍ عَظِيمٍ ﴿١٣٥﴾ قَالُوا سَوَآءٌ عَلَيْنَآ أَوَعَظْتَ
أَمْ لَمْ تَكُنْ مِّنَ الْوٰعِظِينَ ﴿١٣٦﴾ إِنْ هٰذَآ إِلَّا خُلُقُ
الْأَوَّلِينَ ﴿١٣٧﴾ وَمَا نَحْنُ بِمُعَذَّبِينَ ﴿١٣٨﴾ فَكَذَّبُوهُ
فَأَهْلَكْنٰهُمْ إِنَّ فِي ذٰلِكَ لَاٰيَةً وَمَا كَانَ
أَكْثَرُهُمْ مُّؤْمِنِينَ ﴿١٣٩﴾ وَإِنَّ رَبَّكَ لَهُوَ الْعَزِيزُ
الرَّحِيمُ ﴿١٤٠﴾ كَذَّبَتْ ثَمُودُ الْمُرْسَلِينَ ﴿١٤١﴾ إِذْ قَالَ ع ١٨ ١١
لَهُمْ أَخُوهُمْ صٰلِحٌ أَلَا تَتَّقُونَ ﴿١٤٢﴾ إِنِّي لَكُمْ رَسُولٌ
أَمِينٌ ﴿١٤٣﴾ فَاتَّقُوا اللّٰهَ وَأَطِيعُونِ ﴿١٤٤﴾

**123 - 139** ... ఆద్ జాతి దైవప్రవక్తలను తిరస్కరించింది. వారి సోదరుడు హూద్ వారితో ఇలా అన్నప్పటి విషయాన్ని జ్ఞాపకం తెచ్చుకో, "మీరు భయపడరా? నేను మీ కొరకు ఒక విశ్వసనీయుడైన దైవప్రవక్తను. కనుక మీరు అల్లాహ్‌కు భయపడండి, విధేయత చూపండి. నేను ఈ పనికి మిమ్మల్ని ఏ ప్రతిఫలమూ కోరను. నాకు ప్రతిఫలం ఇవ్వటం అనేది సకల లోకాల ప్రభువు బాధ్యత. ఏమిటీ మీ వ్యవహారం, ఎత్తుగా ఉన్న ప్రతి స్థలం మీదా ఏమీ ప్రయోజనం లేని ఒక స్మారక కట్టడాన్ని నిర్మిస్తున్నారు, మీరిక్కడే శాశ్వతంగా ఉండిపోతారనే విధంగా పెద్ద పెద్ద భవనాలను కడుతున్నారు? మీరు ఎవరినైనా పట్టుకుంటే, దౌర్జన్యపరులై పట్టుకుంటారు. కనుక మీరు అల్లాహ్‌కు భయపడండి. నా యెడల విధేయత చూపండి. ఆయనకు భయపడండి. ఆయనే మీకు తెలిసినవన్నీ ప్రసాదించాడు. మీకు పశువులు ఇచ్చాడు, సంతానం అనుగ్రహించాడు, తోటలు ప్రసాదించాడు, చెలమలు ఇచ్చాడు. ఒక మహా దినపు శిక్ష మీకు పడుతుందని నేను భయపడుతున్నాను." వారు ఇలా సమాధానం చెప్పారు, "నీవు బోధించినా, బోధించక పోయినా, మాకు అంతా ఒకటే. ఈ విషయాలు పూర్వం నుండీ ఇలానే జరుగుతూ వచ్చాయి. మేము శిక్షకు గురిఅయ్యే వారం మాత్రం కాము." చివరకు వారు అతనిని తిరస్కరించారు. మేము వారిని నాశనం చేశాము.

.... **139 - 140** నిశ్చయంగా ఇందులో ఒక సూచన ఉన్నది. కాని వారిలో చాలమంది విశ్వసించరు. యథార్థమేమిటంటే నీ ప్రభువు అత్యంత శక్తిమంతుడు, అపార కరుణామయుడూను.

**141 - 158**... సమూద్ జాతి దైవప్రవక్తలను తిరస్కరించింది. వారి సోదరుడు సాలెహ్ వారికి ఇలా చెప్పిన విషయాన్ని జ్ఞాపకం తెచ్చుకో, "ఏమిటీ మీరు భయపడరా? నేను మీకొరకు (వచ్చిన) ఒక విశ్వసనీయుడనైన దైవప్రవక్తను. కనుక మీరు అల్లాహ్‌కు భయపడండి. నా యెడల విధేయత చూపండి.

10. ఇక్కడ నుండి 102వ ఆయతు వరకు ఉన్నటువంటి విషయం హజ్రత్ ఇబ్రాహీమ్ ప్రసంగంలోని భాగం కాదు. దానిని అల్లాహ్ అదనంగా చేర్చాడు.
11. అంటే, హజ్రత్ ఇబ్రాహీమ్ గాధలో.

وَمَآ اَسْـَٔلُكُمْ عَلَيْهِ مِنْ اَجْرٍ ۚ اِنْ اَجْرِىَ اِلَّا عَلٰى
رَبِّ الْعٰلَمِيْنَ ﴿١٤٥﴾ اَتُتْرَكُوْنَ فِيْ مَا هٰهُنَآ
اٰمِنِيْنَ ﴿١٤٦﴾ فِيْ جَنّٰتٍ وَّعُيُوْنٍ ﴿١٤٧﴾ وَّزُرُوْعٍ وَّنَخْلٍ
طَلْعُهَا هَضِيْمٌ ﴿١٤٨﴾ وَتَنْحِتُوْنَ مِنَ الْجِبَالِ بُيُوْتًا
فٰرِهِيْنَ ﴿١٤٩﴾ فَاتَّقُوا اللّٰهَ وَاَطِيْعُوْنِ ﴿١٥٠﴾ وَلَا تُطِيْعُوْٓا
اَمْرَ الْمُسْرِفِيْنَ ﴿١٥١﴾ الَّذِيْنَ يُفْسِدُوْنَ فِى
الْاَرْضِ وَلَا يُصْلِحُوْنَ ﴿١٥٢﴾ قَالُوْٓا اِنَّمَآ اَنْتَ مِنَ
الْمُسَحَّرِيْنَ ﴿١٥٣﴾ مَآ اَنْتَ اِلَّا بَشَرٌ مِّثْلُنَا ۚ فَاْتِ
بِاٰيَةٍ اِنْ كُنْتَ مِنَ الصّٰدِقِيْنَ ﴿١٥٤﴾ قَالَ هٰذِهٖ نَاقَةٌ
لَّهَا شِرْبٌ وَّلَكُمْ شِرْبُ يَوْمٍ مَّعْلُوْمٍ ﴿١٥٥﴾ وَلَا
تَمَسُّوْهَا بِسُوْٓءٍ فَيَاْخُذَكُمْ عَذَابُ يَوْمٍ عَظِيْمٍ ﴿١٥٦﴾
فَعَقَرُوْهَا فَاَصْبَحُوْا نٰدِمِيْنَ ﴿١٥٧﴾ فَاَخَذَهُمُ
الْعَذَابُ ۗ اِنَّ فِيْ ذٰلِكَ لَاٰيَةً ۗ وَمَا كَانَ اَكْثَرُهُمْ
مُّؤْمِنِيْنَ ﴿١٥٨﴾ وَاِنَّ رَبَّكَ لَهُوَ الْعَزِيْزُ الرَّحِيْمُ ﴿١٥٩﴾
كَذَّبَتْ قَوْمُ لُوْطِ ِالْمُرْسَلِيْنَ ﴿١٦٠﴾ اِذْ قَالَ لَهُمْ
اَخُوْهُمْ لُوْطٌ اَلَا تَتَّقُوْنَ ﴿١٦١﴾ اِنِّيْ لَكُمْ رَسُوْلٌ
اَمِيْنٌ ﴿١٦٢﴾ فَاتَّقُوا اللّٰهَ وَاَطِيْعُوْنِ ﴿١٦٣﴾ وَمَآ اَسْـَٔلُكُمْ
عَلَيْهِ مِنْ اَجْرٍ ۚ اِنْ اَجْرِىَ اِلَّا عَلٰى رَبِّ
الْعٰلَمِيْنَ ﴿١٦٤﴾ اَتَاْتُوْنَ الذُّكْرَانَ مِنَ الْعٰلَمِيْنَ ﴿١٦٥﴾
وَتَذَرُوْنَ مَا خَلَقَ لَكُمْ رَبُّكُمْ مِّنْ اَزْوَاجِكُمْ
بَلْ اَنْتُمْ قَوْمٌ عٰدُوْنَ ﴿١٦٦﴾

నేను ఈ పనికై మీ నుండి ఏ ప్రతిఫలాన్నీ కోరను. నా ప్రతిఫలం సకల లోకాల ప్రభువు బాధ్యత. ఇక్కడున్న ఈ వస్తువుల మధ్య మిమ్మల్ని ఇలానే ప్రశాంతంగా ఉండనివ్వటం జరుగుతుందనుకుంటున్నారా, ఈ తోటలలో, ఈ జలధారల మధ్య? ఈ పొలాలలో, మాగిన పండ్ల గుత్తులు గల ఈ ఖర్జూరపు చెట్లనడుమ? మీరు కొండలను తొలిచి విర్రవీగుతూ వాటిలో భవనాలను నిర్మిస్తారు. అల్లాహ్‌కు భయపడండి, నా యెడల విధేయత చూపండి. హద్దులు మీరే వారి పట్ల విధేయత చూపకండి; వారు భూమిలో ఉపద్రవాన్ని సృష్టిస్తారు. ఏ సంస్కర ణనూ చేపట్టరు." వారు జవాబుగా ఇలా అన్నారు, "నీవు చేతబడి చేయబడిన ఒక వ్యక్తివి మాత్రమే. నీవు మా వంటి ఒక మానవుడవు తప్ప మరేమీ కావు. నీవు సత్యవంతుడవే అయితే, ఏదైనా సూచనను తీసుకురా." సాలిహ్ ఇలా అన్నాడు, "ఇదిగో ఈ ఒంటెను చూడండి. ఒకరోజు అది నీళ్ళు త్రాగుతుంది, ఒకరోజు మీరందరూ నీళ్ళు తోడుకుం టారు. ఆ ఒంటెకు ఏ మాత్రం హాని కలిగించకండి. అలాచేస్తే, ఒక మహాదినపు శిక్ష మిమ్మల్ని చుట్టుముట్టుతుంది." కాని వారు దాని వెనుక కాలి పెద్ద నరాన్ని కోసివేశారు. చివరకు విచారపడుతూ ఉండిపోయారు. శిక్ష వారిని పట్టుకుంది.

**... 158 -159** నిశ్చయంగా ఇందులో ఒక సూచన ఉన్నది. కాని వారిలో అధికులు విశ్వసించరు. యథార్థమేమిటంటే, నీ ప్రభువు శక్తిమంతుడు, కరుణామయుడు.

**160 - 173** లూత్ జాతి దైవప్రవక్తలను తిరస్కరించింది. వారి సోదరుడు లూత్ వారితో ఇలా అన్నప్పటి విషయాన్ని జ్ఞాపకం తెచ్చుకో. "మీరు భయపడరా? నేను మీ కొరకు (వచ్చిన) ఒక విశ్వసనీయుడనైన దైవప్రవక్తను. కనుక మీరు అల్లాహ్‌కు భయపడండి. నా యెడల విధేయత చూపండి. నేను ఈ పనికై మీ నుండి ఏ ప్రతిఫలాన్నీ కోరను. నా ప్రతిఫలం సకల లోకాల ప్రభువు బాధ్యత. మీరు ప్రపంచం లోని ప్రాణులలో పురుషుల వద్దకు పోతారేమిటి, మీ ప్రభువు మీ భార్యలలో మీకై సృష్టించిన దానిని విడిచిపెడుతున్నా రేమిటి? మీరు హద్దులన్నీ అతిక్రమించారు."

قَالُوْا لَئِنْ لَّمْ تَنْتَهِ يٰلُوْطُ لَتَكُوْنَنَّ مِنَ
الْمُخْرَجِيْنَ ﴿١٦٧﴾ قَالَ اِنِّيْ لِعَمَلِكُمْ مِّنَ الْقَالِيْنَ ﴿١٦٨﴾
رَبِّ نَجِّنِيْ وَاَهْلِيْ مِمَّا يَعْمَلُوْنَ ﴿١٦٩﴾ فَنَجَّيْنٰهُ وَ
اَهْلَهٗۤ اَجْمَعِيْنَ ﴿١٧٠﴾ اِلَّا عَجُوْزًا فِي الْغٰبِرِيْنَ ﴿١٧١﴾
ثُمَّ دَمَّرْنَا الْاٰخَرِيْنَ ﴿١٧٢﴾ وَاَمْطَرْنَا عَلَيْهِمْ
مَّطَرًا ۚ فَسَآءَ مَطَرُ الْمُنْذَرِيْنَ ﴿١٧٣﴾ اِنَّ فِيْ ذٰلِكَ
لَاٰيَةً ؕ وَمَا كَانَ اَكْثَرُهُمْ مُّؤْمِنِيْنَ ﴿١٧٤﴾ وَ
اِنَّ رَبَّكَ لَهُوَ الْعَزِيْزُ الرَّحِيْمُ ﴿١٧٥﴾ كَذَّبَ ع ٩ ٦ ١٣
اَصْحٰبُ لْئَيْكَةِ الْمُرْسَلِيْنَ ﴿١٧٦﴾ اِذْ قَالَ لَهُمْ
شُعَيْبٌ اَلَا تَتَّقُوْنَ ﴿١٧٧﴾ اِنِّيْ لَكُمْ رَسُوْلٌ اَمِيْنٌ ﴿١٧٨﴾
فَاتَّقُوا اللّٰهَ وَاَطِيْعُوْنِ ﴿١٧٩﴾ وَمَآ اَسْـَٔلُكُمْ عَلَيْهِ
مِنْ اَجْرٍ ۚ اِنْ اَجْرِيَ اِلَّا عَلٰى رَبِّ الْعٰلَمِيْنَ ﴿١٨٠﴾
اَوْفُوا الْكَيْلَ وَلَا تَكُوْنُوْا مِنَ الْمُخْسِرِيْنَ ﴿١٨١﴾
وَزِنُوْا بِالْقِسْطَاسِ الْمُسْتَقِيْمِ ﴿١٨٢﴾ وَلَا تَبْخَسُوا
النَّاسَ اَشْيَآءَهُمْ وَلَا تَعْثَوْا فِي الْاَرْضِ
مُفْسِدِيْنَ ﴿١٨٣﴾ وَاتَّقُوا الَّذِيْ خَلَقَكُمْ وَالْجِبِلَّةَ
الْاَوَّلِيْنَ ﴿١٨٤﴾ قَالُوْۤا اِنَّمَاۤ اَنْتَ مِنَ الْمُسَحَّرِيْنَ ﴿١٨٥﴾
وَمَاۤ اَنْتَ اِلَّا بَشَرٌ مِّثْلُنَا وَاِنْ نَّظُنُّكَ لَمِنَ
الْكٰذِبِيْنَ ﴿١٨٦﴾ فَاَسْقِطْ عَلَيْنَا كِسَفًا مِّنَ السَّمَآءِ
اِنْ كُنْتَ مِنَ الصّٰدِقِيْنَ ﴿١٨٧﴾ قَالَ رَبِّيْۤ اَعْلَمُ بِمَا
تَعْمَلُوْنَ ﴿١٨٨﴾ فَكَذَّبُوْهُ فَاَخَذَهُمْ عَذَابُ يَوْمِ
الظُّلَّةِ ؕ اِنَّهٗ كَانَ عَذَابَ يَوْمٍ عَظِيْمٍ ﴿١٨٩﴾ اِنَّ فِيْ
ذٰلِكَ لَاٰيَةً ؕ وَمَا كَانَ اَكْثَرُهُمْ مُّؤْمِنِيْنَ ﴿١٩٠﴾
وَاِنَّ رَبَّكَ لَهُوَ الْعَزِيْزُ الرَّحِيْمُ ﴿١٩١﴾ ع ١٠ ٦ ١٤

వారు ఇలా అన్నారు, "ఓ లూత్! నీవు ఈ మాటలు మానుకోకపోతే, మా నగరాల నుండి గెంటి వేయబడిన వారిలో నీవు కూడ తప్పక చేరిపోతావు." అతను ఇలా అన్నాడు, "మీ చేష్టలకు కుమిలిపోయేవారిలో నేనూ ఉన్నాను. ఓ ప్రభూ! నన్నూ, నా కుటుంబసభ్యులనూ వారి అశ్లీల చేష్టల నుండి కాపాడు." చివరకు మేము అతనినీ, అతని కుటుంబ సభ్యులందరినీ కాపాడాము. వెనుకనే ఉండిపోయిన వారిలోని ఒక ముసలి స్త్రీని తప్ప.[13] తరువాత మిగిలిపోయిన వారిని మేము నాశనం చేశాము, వారిపై ఒక వర్షాన్ని కురిపించాము, అతి భయంకర మైన వర్షాన్ని. అది హెచ్చరింపబడిన వారిపై అవతరించింది.

**174 - 175** నిశ్చయంగా ఇందులో ఒక సూచన ఉన్నది. అయితే వారిలో చాలామంది విశ్వసించరు. యథార్థమేమిటంటే నీ ప్రభువు మహాశక్తిమంతుడు, అనంత కరుణామయుడు.

**176 - 189** 'అయ్‌కహ్' ప్రజలు[14] దైవప్రవక్తలను తిరస్కరించారు. అప్పుడు షుఐబ్ వారితో ఇలా అన్న విషయాన్ని జ్ఞాపకం తెచ్చుకో. "మీరు భయపడరా? నేను మీ కొరకు (వచ్చిన) ఒక విశ్వసనీయుడనైన దైవప్రవక్తను. కనుక మీరు అల్లాహ్‌కు భయపడండి. నా యెడల విధేయత చూపండి. నేను ఈ పనికై, మీనుండి ఏ ప్రతిఫలాన్నీ కోరను. నా ప్రతిఫలం సకల లోకాల ప్రభువు బాధ్యత. కొలపాత్రలను పూర్తిగా నింపండి, ఎవరికీ తక్కువ చేసి ఇవ్వకండి. సరియైన తరాజుతో తూయండి. ప్రజలకు వారి వస్తువులను తక్కువ జేసి ఇవ్వకండి. భూమిపై కల్లోలాన్ని వ్యాపింపజేస్తూ తిరగకండి; మిమ్మల్నీ, మీకు పూర్వపు తరాల వారినీ సృష్టించిన ఆయనకు భయపడండి. వారు ఇలా అన్నారు, "నీవు కేవలం చేతబడి చేయబడిన ఒక వ్యక్తివి. నీవు ఏమీ కావు, మా వంటి ఒక మానవుడవు తప్ప. మేము నిన్ను అసత్యవాదిగా పరిగణిస్తున్నాము. నీవు సత్యవంతుడవే అయితే, ఆకాశపు తునకను దేనినయినా మా మీద పడేలా చేయి." షుఐబ్ ఇలా అన్నాడు, "నా ప్రభువుకు మీరు చేస్తున్నదంతా తెలుసు." వారు అతనిని తిరస్కరించారు. చివరకు ఛత్రదినపు శిక్ష వారిపైకి వచ్చిపడింది.[15] అది అతి భయంకరమైన దినపు శిక్ష.

**190 - 191** నిశ్చయంగా ఇందులో ఒక సూచన ఉన్నది. అయితే వారిలో అత్యధికులు విశ్వసించరు. యథార్థమేమిటంటే, నీ ప్రభువు శక్తిమంతుడు కూడ, కరుణామయుడు కూడా.

وَ اِنَّهٗ لَتَنْزِيْلُ رَبِّ الْعٰلَمِيْنَ ﴿١٩٢﴾ نَزَلَ بِهِ
الرُّوْحُ الْاَمِيْنُ ﴿١٩٣﴾ عَلٰى قَلْبِكَ لِتَكُوْنَ مِنَ
الْمُنْذِرِيْنَ ﴿١٩٤﴾ بِلِسَانٍ عَرَبِيٍّ مُّبِيْنٍ ﴿١٩٥﴾ وَ اِنَّهٗ
لَفِيْ زُبُرِ الْاَوَّلِيْنَ ﴿١٩٦﴾ اَوَلَمْ يَكُنْ لَّهُمْ اٰيَةً اَنْ
يَّعْلَمَهٗ عُلَمٰٓؤُا بَنِيْٓ اِسْرَآءِيْلَ ﴿١٩٧﴾ وَ لَوْ نَزَّلْنٰهُ
عَلٰى بَعْضِ الْاَعْجَمِيْنَ ﴿١٩٨﴾ فَقَرَاَهٗ عَلَيْهِمْ مَّا
كَانُوْا بِهٖ مُؤْمِنِيْنَ ﴿١٩٩﴾ كَذٰلِكَ سَلَكْنٰهُ فِيْ
قُلُوْبِ الْمُجْرِمِيْنَ ﴿٢٠٠﴾ لَا يُؤْمِنُوْنَ بِهٖ حَتّٰى
يَرَوُا الْعَذَابَ الْاَلِيْمَ ﴿٢٠١﴾ فَيَاْتِيَهُمْ بَغْتَةً وَّ
هُمْ لَا يَشْعُرُوْنَ ﴿٢٠٢﴾ فَيَقُوْلُوْا هَلْ نَحْنُ
مُنْظَرُوْنَ ﴿٢٠٣﴾ اَفَبِعَذَابِنَا يَسْتَعْجِلُوْنَ ﴿٢٠٤﴾
اَفَرَءَيْتَ اِنْ مَّتَّعْنٰهُمْ سِنِيْنَ ﴿٢٠٥﴾ ثُمَّ جَآءَهُمْ
مَّا كَانُوْا يُوْعَدُوْنَ ﴿٢٠٦﴾ مَآ اَغْنٰى عَنْهُمْ مَّا
كَانُوْا يُمَتَّعُوْنَ ﴿٢٠٧﴾ وَ مَآ اَهْلَكْنَا مِنْ قَرْيَةٍ مع
اِلَّا لَهَا مُنْذِرُوْنَ ﴿٢٠٨﴾ ذِكْرٰى وَمَا كُنَّا
ظٰلِمِيْنَ ﴿٢٠٩﴾

**192 - 203** ఇది సకల లోకాల ప్రభువు అవతరింపజేసినది.[16] దీనిని తీసుకుని విశ్వసనీయమైన ఆత్మ[17] నీ హృదయ ఫలకంపై అవతరించింది. స్వచ్ఛమైన అరబ్బీ భాషలో (దేవుని తరఫున దైవసృష్టికి) హెచ్చరిక చేసేవారిలో నీవు చేరిపోవాలని. పూర్వీకుల గ్రంథాలలో కూడ ఇది ఉన్నది.[18] దీనిని ఇస్రాయీలు సంతతి వారి విద్వాంసులు ఎరుగుదురనే[19] విషయం వారికి (మక్కావాసులకు) ఏ సూచనా కాదా? (వారి మంకుపట్టు ఎలా ఉందంటే) ఒకవేళ మేము దీనిని ఏ అరబ్బీయేతరుని పైనయినా అవతరింపజేసి ఉంటే, దీనిని (శిష్ట అరబ్బీ గ్రంథాన్ని) అతడు వారికి చదివి[20] వినిపించినప్పుడు కూడ వారు విశ్వసించేవారు కారు. ఇదే విధంగా మేము దీనిని (ఖురాన్‌ను) అపరాధుల హృదయాలలోకి చొచ్చుకుపోయేలా చేశాము. వ్యధాభరితమైన శిక్షను చూడనంతవరకు వారు దీనిని విశ్వసించరు. తరువాత అనూహ్య స్థితిలో అది వారిపైకి అకస్మాత్తుగా వచ్చిపడినప్పుడు వారు, "ఇప్పుడు మాకు కొంచెం గడువేమైనా దొరుకుతుందా?" అని అంటారు.

**204 - 207** అయితే వారు మేము విధించే శిక్షకై తొందర పడుతున్నారా? దీనిని గురించి నీవేమైనా ఆలోచించావా; ఒకవేళ మేము వారికి ఏళ్లతరబడి విలాస జీవితం గడిపే వ్యవధిని ఇచ్చినా, వారిని దేన్ని గురించి భయపెట్టటం జరుగుతూ వచ్చిందో, అదే తరువాత వారిపైకి వచ్చిపడినపుడు, వారికి లభించిన జీవిత సామగ్రి వారికి దేనికి పనికి వస్తుంది?

**208 - 209** (చూడు) హితబోధ బాధ్యతను నిర్వహించేందుకు హెచ్చరిక చేయువారు లేకుండానే మేము ఎన్నడూ, ఏ నగరాన్నీ నాశనం చేయలేదు. మేము అన్యాయపరులము కాము.

12. నిండుపడవ అంటే అర్థం, ఆ పడవ విశ్వాసులతోనూ, సమస్త జాతులకు చెందిన జంతువుల ఒక్కొక్క జంటతోనూ నిండిపోయింది, హూద్ సూరాలోని 40వ ఆయత్‌లో ఈ ప్రస్తావన వచ్చింది.
13. అంటే, హజ్రత్ లూత్ (అ) భార్య అని అర్థం.
14. 'అయ్‌కహ్' వాసులకు సంబంధించిన స్థూల ప్రస్తావన హిజ్ర్ సూరాలోని 78 - 84 ఆయతులలో ఇదివరకే వచ్చింది.
15. ఈ మాటల ద్వారా అర్థమయ్యే విషయం ఏమిటంటే, వారు ఆకాశపు శిక్షను కోరారు కాబట్టి, అల్లాహ్ వారిపైకి ఒక మేఘాన్ని పంపాడు. అది ఒక గొడుగు మాదిరిగా వారిపై వ్రేలాడుతూ ఉన్నది. జడివాన

**210 - 212** దీనిని (సుబోధకమైన గ్రంథాన్ని) తీసుకుని కిందికి దిగినవారు షైతానులు కారు, ఈ పని వాటికి యుక్త మైనదీకాదు, అవి అలా చేయనూ లేవు. దీనిని వినే విషయంలో కూడ అవి దూరంగా ఉంచబడ్డాయి.[21]

**213 - 220** కనుక ప్రవక్తా! అల్లాహ్‌తో పాటు మరొక దేవుణ్ణి ఎవడినీ వేడుకోకు. అలా చేస్తే నీవు కూడ శిక్షింపబడే వారిలో చేరిపోతావు. నీ దగ్గరి బంధువులను భయపెట్టు. విశ్వాసులలో నిన్ను అనుసరించే వారి పట్ల మృదువుగా మెలుగు. కాని ఒకవేళ వారు నీ పట్ల అవిధేయత చూపితే, అపుడు వారితో, "మీరు చేస్తున్న దానికి నేను బాధ్యుడను కాను" అని అను. మహాశక్తిమంతుడైన ఆ అనంతకరుణా మయుడిపై భారం మోపు. ఆయన నిన్ను, నీవు లేచినపుడు[22] చూస్తాడు, సజ్దా చేసేవారిలో నీ రాకపోకలను గమనిస్తాడు. ఆయన అన్నీ వింటాడు, అన్నీ తెలిసినవాడు.

**221 - 223** ప్రజలారా! షైతానులు ఎవరిపై దిగుతాయో నేను మీకు తెలుపనా? అవి వంచకుడైన ప్రతి దుర్మార్గుడిపై దిగుతాయి. గాలి వార్తలను చెవులలో ఊదుతాయి; వాటిలో అబద్ధాలు[23] చెప్పేవే ఎక్కువ.

وَ مَا تَنَزَّلَتْ بِهِ الشَّيٰطِيْنُ ﴿٢١٠﴾ وَ مَا يَنْۢبَغِيْ لَهُمْ
وَ مَا يَسْتَطِيْعُوْنَ ﴿٢١١﴾ اِنَّهُمْ عَنِ السَّمْعِ
لَمَعْزُوْلُوْنَ ﴿٢١٢﴾ فَلَا تَدْعُ مَعَ اللّٰهِ اِلٰهًا اٰخَرَ
فَتَكُوْنَ مِنَ الْمُعَذَّبِيْنَ ﴿٢١٣﴾ وَ اَنْذِرْ
عَشِيْرَتَكَ الْاَقْرَبِيْنَ ﴿٢١٤﴾ وَاخْفِضْ جَنَاحَكَ
لِمَنِ اتَّبَعَكَ مِنَ الْمُؤْمِنِيْنَ ﴿٢١٥﴾ فَاِنْ عَصَوْكَ
فَقُلْ اِنِّيْ بَرِيْٓءٌ مِّمَّا تَعْمَلُوْنَ ﴿٢١٦﴾ وَ تَوَكَّلْ
عَلَى الْعَزِيْزِ الرَّحِيْمِ ﴿٢١٧﴾ الَّذِيْ يَرٰىكَ حِيْنَ
تَقُوْمُ ﴿٢١٨﴾ وَتَقَلُّبَكَ فِي السّٰجِدِيْنَ ﴿٢١٩﴾ اِنَّهٗ هُوَ
السَّمِيْعُ الْعَلِيْمُ ﴿٢٢٠﴾ هَلْ اُنَبِّئُكُمْ عَلٰى مَنْ تَنَزَّلُ
الشَّيٰطِيْنُ ﴿٢٢١﴾ تَنَزَّلُ عَلٰى كُلِّ اَفَّاكٍ اَثِيْمٍ ﴿٢٢٢﴾
يُّلْقُوْنَ السَّمْعَ وَاَكْثَرُهُمْ كٰذِبُوْنَ ﴿٢٢٣﴾

---

రూపంలో శిక్ష అవతరించి వారిని సర్వనాశనం చేసేవరకు అది అలాగే వ్రేలాడుతూ ఉన్నది. హజ్రత్ షుఐబ్ మద్యన్ వైపునకూ ప్రవక్తగా పంపబడ్డారు, అలానే అయ్‌కహ్ వైపునకు కూడ పంపబడ్డారు అనే విషయాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. ఆ రెండు జాతులపై శిక్ష రెండు భిన్న రూపాలలో అవతరించింది.

16. అంటే, దివ్య ఖుర్ఆన్ దాని ఆయతులే ఇప్పుడు వినిపించబడుతున్నాయి.

17. అంటే జిబ్రీల్ (అస్సలామ్) అని అర్థం.

18. అంటే, ఇదే ప్రస్తావన, ఇదే అవతరణ, ఇదే బోధన పూర్వం వచ్చిన ఆకాశ గ్రంథాలలో కూడ ఉన్నది.

19. అంటే, దివ్య ఖుర్ఆన్‌లో ఉన్నటువంటి ఉపదేశాలు పూర్వపు ఆకాశ గ్రంథాలలో ఉన్నటువంటి ఉపదేశాలే అని ఇస్రాయీల్ సంతతి వారి పండితులకు తెలుసు. పూర్వపు గ్రంథాల ఉపదేశాలు దీనికి భిన్నంగా ఉన్నాయని వారు అనలేరు.

20. అంటే, ఇది సత్యప్రియుల హృదయాలలోకి ఆత్మశాంతిగా, హృదయ స్వస్థతగా దిగినట్లు వారిలోనికి దిగదు; ఒక వేడి ఇనుప కమ్మీ మాదిరిగా దిగుతుంది, దానికి వారు ఆగ్రహోదగ్రులవుతారు. దాని వాక్యాలను గురించి ఆలోచించటానికి బదులుగా దానిని ఖండించటానికి ఉపాయాలు వెతుకుతూ ఉంటారు.

21. అంటే, మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్)పై దివ్య ఖుర్ఆన్ అవతరించేటప్పుడు, షైతానులు కనీసం దానిని విననైనా లేరు; ఆయనపై ఏ విషయం అవతరిస్తోందో వారికి తెలియటం అనేది సుదూర విషయం.

وَ الشُّعَرَآءُ يَتَّبِعُهُمُ الْغَاوٗنَ ﴿٢٢٤﴾ اَلَمْ تَرَ اَنَّهُمْ فِيْ
كُلِّ وَادٍ يَّهِيْمُوْنَ ﴿٢٢٥﴾ وَاَنَّهُمْ يَقُوْلُوْنَ مَا لَا
يَفْعَلُوْنَ ﴿٢٢٦﴾ اِلَّا الَّذِيْنَ اٰمَنُوْا وَعَمِلُوا
الصّٰلِحٰتِ وَ ذَكَرُوا اللّٰهَ كَثِيْرًا وَّانْتَصَرُوْا مِنْ
بَعْدِ مَا ظُلِمُوْا ۗ وَ سَيَعْلَمُ الَّذِيْنَ ظَلَمُوْٓا اَيَّ
مُنْقَلَبٍ يَّنْقَلِبُوْنَ ﴿٢٢٧﴾

**224 - 227** ఇక కవులు.[24] వారి వెనుక మార్గభ్రష్టులే నడుస్తూ ఉంటారు. వారు ప్రతి లోయలో దారి తప్పటాన్నీ, తాము ఆచరించని దానిని చెప్పటాన్నీ నీవు చూడటం లేదా?- విశ్వసించి మంచి పనులు చేసేవారూ, అల్లాహ్‌ను అమితంగా స్మరించేవారూ, తమకు అన్యాయం జరిగినప్పుడు, కేవలం ప్రతిగా చర్యతీసుకునే [25] వారూ తప్ప- అన్యాయం చేసేవారికి త్వరలోనే తెలిసిపోతుంది, వారు ఏ పర్యవసానానికి గురి అవుతారో.[26]

22. లేచినప్పుడు అంటే రాత్రిళ్లు నమాజు కోసం లేచినప్పుడు అని కూడ అర్థం వస్తుంది, దైవ ప్రవక్తగా తన కర్తవ్యాన్ని నిర్వహించటానికి లేచినప్పుడు అని కూడ అర్థం.

23. మక్కా అవిశ్వాసులు మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) మాంత్రికుడు అని మోపిన అభియోగానికి ఇది జవాబు.

24. మహాప్రవక్త (సఅసమ్) ఒక కవి అని వారు మోపిన అభియోగానికి ఇది కూడ ప్రత్యుత్తరమే.

25. ఇక్కడ నాలుగు ప్రత్యేక లక్షణాలు గల కవులను పైన నిరసించబడిన కవుల పరిధి నుండి మినహాయించటం జరిగింది. ఒకటి, వారు విశ్వాసులై ఉండాలి. రెండు, ఆచరణలో సత్ప్రవర్తన కలిగి ఉండాలి. మూడు, అల్లాహ్‌ను నిరంతరం స్మరిస్తూ ఉండాలి. నాలుగు, అతను తన వ్యక్తిగత ప్రయోజనాలను ఆశించి ఎవరినీ ఎన్నడూ అగౌరవం పాలు చేయకూడదు. అయితే అన్యాయానికి వ్యతిరేకంగా సత్యాన్ని సమర్థించే అవసరం కలిగినప్పుడు, యుద్ధవీరుడు రణరంగంలో బాణాలనూ, ఖడ్గాలనూ ఉపయోగించిన విధంగా అతడు తన వాక్శక్తిని వినియోగించాలి.

26. అన్యాయం చేసేవారు అంటే, ఇక్కడ సత్యాన్ని కించపరచటానికి మొండిగా మహాప్రవక్తపై కవిత్వమూ, మతిభ్రమణమూ, ఇంద్రజాలమూ వంటి నీలాపనిందలు మోపేవారు, తెలియనివారిలో ఆయన సందేశం పట్ల అనుమానాలు, సందేహాలు కలగాలని, ఆయన ఉపదేశాలను గురించి ప్రజలు శ్రద్ధ చూపకూడదని.

آياتها ٩٣ | ٢٧ سُوْرَةُ النَّمْلِ مَكِّيَّةٌ ٤٨ | ركوعاتها ٧

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

طٰسٓ ۚ تِلْكَ اٰيٰتُ الْقُرْاٰنِ وَ كِتَابٍ مُّبِيْنٍ ۙ ١
هُدًى وَّبُشْرٰى لِلْمُؤْمِنِيْنَ ۙ ٢ الَّذِيْنَ يُقِيْمُوْنَ
الصَّلٰوةَ وَيُؤْتُوْنَ الزَّكٰوةَ وَ هُمْ بِالْاٰخِرَةِ هُمْ
يُوْقِنُوْنَ ٣ اِنَّ الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ
زَيَّنَّا لَهُمْ اَعْمَالَهُمْ فَهُمْ يَعْمَهُوْنَ ۗ ٤ اُولٰٓئِكَ
الَّذِيْنَ لَهُمْ سُوْٓءُ الْعَذَابِ وَ هُمْ فِي الْاٰخِرَةِ
هُمُ الْاَخْسَرُوْنَ ٥ وَ اِنَّكَ لَتُلَقَّى الْقُرْاٰنَ مِنْ
لَّدُنْ حَكِيْمٍ عَلِيْمٍ ٦ اِذْ قَالَ مُوْسٰى
لِاَهْلِهٖٓ اِنِّيْٓ اٰنَسْتُ نَارًا ۗ سَاٰتِيْكُمْ مِّنْهَا
بِخَبَرٍ اَوْ اٰتِيْكُمْ بِشِهَابٍ قَبَسٍ لَّعَلَّكُمْ
تَصْطَلُوْنَ ٧ فَلَمَّا جَآءَهَا نُوْدِيَ اَنْۢ بُوْرِكَ
مَنْ فِي النَّارِ وَمَنْ حَوْلَهَا ۗ وَ سُبْحٰنَ اللّٰهِ
رَبِّ الْعٰلَمِيْنَ ٨ يٰمُوْسٰٓى اِنَّهٗٓ اَنَا اللّٰهُ الْعَزِيْزُ
الْحَكِيْمُ ۙ ٩ وَاَلْقِ عَصَاكَ ۗ فَلَمَّا رَاٰهَا تَهْتَزُّ
كَاَنَّهَا جَآنٌّ وَّلّٰى مُدْبِرًا وَّ لَمْ يُعَقِّبْ ۗ
يٰمُوْسٰى لَا تَخَفْ ۚ اِنِّيْ لَا يَخَافُ لَدَيَّ
الْمُرْسَلُوْنَ ۚ ١٠ اِلَّا مَنْ ظَلَمَ ثُمَّ بَدَّلَ حُسْنًا
بَعْدَ سُوْٓءٍ فَاِنِّيْ غَفُوْرٌ رَّحِيْمٌ ١١

ఆయతులు 93 | **27. అన్ నమ్ల్** | అవతరణ మక్కాలో

*అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

**1 – 6** తా. సీన్. ఇవి ఖురాన్‌కు, స్పష్టమైన గ్రంథానికి[1] చెందిన వాక్యాలు; విశ్వాసులకు పూర్తిగా మార్గదర్శకత్వం, శుభవార్తలూను. వారు నమాజును స్థాపిస్తారు, జకాత్‌ను ఇస్తారు ఇంకా వారు పరలోకాన్ని పూర్తిగా నమ్ముతారు. యథార్థం ఏమిటంటే, పరలోకాన్ని విశ్వసించని వారి కొరకు మేము వారి చేష్టలను ఆకర్షవంతమైనవిగా చేశాము. అందువల్ల వారు దారితప్పి తిరుగుతూ ఉంటారు. నీచమైన శిక్షకు గురిఅయ్యేది వారే. పరలోకంలో అందరి కంటే ఎక్కువ నష్టపోయేది కూడా వారే. (ఓ ప్రవక్తా!) నిస్సందేహంగా నీవు ఈ ఖురాన్‌ను వివేకవంతుడూ, జ్ఞానసంపన్నుడూ అయిన వానివైపు నుండి పొందుతున్నావు.

**7 – 12** (వారికి అప్పటి గాథను వినిపించు) అప్పుడు మూసా తన ఇంటి వారితో ఇలా అన్నాడు, "నాకు అగ్నిలాంటిదొకటి కనిపించింది. నేను ఇప్పుడే అక్కడకు పోయి ఏదైనా వార్తను తీసుకువస్తాను లేదా మీరు కాచుకోవటానికి అగ్ని కణాన్నయినా తీసుకువస్తాను." అతను అక్కడకు చేరినప్పుడు, ఒక ధ్వని ఇలా వినిపించింది,"ఈ అగ్నిలోనూ, దాని పరిసరాలలోనూ ఉన్నవాడు శుభాలు కలవాడు. అల్లాహ్ పరిశుద్ధుడు, సకల లోకాలకు ప్రభువు. మూసా! ఇదిగో, నేను, అల్లాహ్‌ను, సర్వశక్తి మంతుడను, వివేకవంతుడను. ఏదీ, నీవు కొంచెం నీ చేతికర్రను విసరివెయ్యి." ఆ చేతికర్ర పాము మాదిరిగా కదలాడుతూ ఉండటం చూడగానే, మూసా వెన్ను చూపి పారిపోయాడు. వెనుకకు తిరిగి అయినా చూడలేదు. "మూసా! భయపడకు. నా సన్నిధిలో ప్రవక్తలు భయపడరు, తప్పు చేసిన వారు తప్ప. దుష్కార్యం చేసిన తరువాత అతను గనక దాన్ని సత్కార్యంగా మార్చు కుంటే, అప్పుడు నేను క్షమించే కరుణామయుణ్ణి.

وَ اَدۡخِلۡ یَدَکَ فِیۡ جَیۡبِکَ تَخۡرُجۡ بَیۡضَآءَ مِنۡ
غَیۡرِ سُوۡٓءٍ ۟ فِیۡ تِسۡعِ اٰیٰتٍ اِلٰی فِرۡعَوۡنَ وَ
قَوۡمِہٖ ؕ اِنَّہُمۡ کَانُوۡا قَوۡمًا فٰسِقِیۡنَ ﴿۱۲﴾ فَلَمَّا
جَآءَتۡہُمۡ اٰیٰتُنَا مُبۡصِرَۃً قَالُوۡا ہٰذَا سِحۡرٌ
مُّبِیۡنٌ ﴿ۚ۱۳﴾ وَ جَحَدُوۡا بِہَا وَ اسۡتَیۡقَنَتۡہَاۤ
اَنۡفُسُہُمۡ ظُلۡمًا وَّ عُلُوًّا ؕ فَانۡظُرۡ کَیۡفَ کَانَ
عَاقِبَۃُ الۡمُفۡسِدِیۡنَ ﴿۱۴﴾ وَ لَقَدۡ اٰتَیۡنَا دَاوٗدَ وَ ع ١٤/١٦
سُلَیۡمٰنَ عِلۡمًا ۚ وَ قَالَا الۡحَمۡدُ لِلّٰہِ الَّذِیۡ فَضَّلَنَا
عَلٰی کَثِیۡرٍ مِّنۡ عِبَادِہِ الۡمُؤۡمِنِیۡنَ ﴿۱۵﴾ وَ وَرِثَ
سُلَیۡمٰنُ دَاوٗدَ وَ قَالَ یٰۤاَیُّہَا النَّاسُ عُلِّمۡنَا
مَنۡطِقَ الطَّیۡرِ وَ اُوۡتِیۡنَا مِنۡ کُلِّ شَیۡءٍ ؕ اِنَّ
ہٰذَا لَہُوَ الۡفَضۡلُ الۡمُبِیۡنُ ﴿۱۶﴾ وَ حُشِرَ لِسُلَیۡمٰنَ
جُنُوۡدُہٗ مِنَ الۡجِنِّ وَ الۡاِنۡسِ وَ الطَّیۡرِ فَہُمۡ
یُوۡزَعُوۡنَ ﴿۱۷﴾ حَتّٰۤی اِذَاۤ اَتَوۡا عَلٰی وَادِ النَّمۡلِ ۙ
قَالَتۡ نَمۡلَۃٌ یّٰۤاَیُّہَا النَّمۡلُ ادۡخُلُوۡا مَسٰکِنَکُمۡ ۚ
لَا یَحۡطِمَنَّکُمۡ سُلَیۡمٰنُ وَ جُنُوۡدُہٗ ۙ وَ ہُمۡ لَا
یَشۡعُرُوۡنَ ﴿۱۸﴾ فَتَبَسَّمَ ضَاحِکًا مِّنۡ قَوۡلِہَا وَ قَالَ
رَبِّ اَوۡزِعۡنِیۡۤ اَنۡ اَشۡکُرَ نِعۡمَتَکَ الَّتِیۡۤ
اَنۡعَمۡتَ عَلَیَّ وَ عَلٰی وَالِدَیَّ وَ اَنۡ اَعۡمَلَ
صَالِحًا تَرۡضٰىہُ وَ اَدۡخِلۡنِیۡ بِرَحۡمَتِکَ فِیۡ عِبَادِکَ
الصّٰلِحِیۡنَ ﴿۱۹﴾

కొంచెం నీ చేతిని చొక్కాలోకి దూర్చు. అది మెరిసిపోతూ ఎలాంటి బాధాలేకుండానే బయటికి వస్తుంది. ఇవి (ఈ రెండు సూచనలు) తొమ్మిది సూచనలలోనివి, ఫిరౌను వద్దకూ అతడి జాతి ప్రజల వద్దకూ (తీసుకుపోయేందుకు ఇవ్వబడినవి) వారు పరమ దుర్మార్గులు."

**13 - 14** కాని, స్పష్టమైన మా సూచనలు వారి ముందుకు వచ్చినపుడు, వారు "ఇది స్పష్టమైన మాయాజాలమే" అని అన్నారు. వారు అన్యాయంగా, అహంకారంతో ఆ సూచనలను తిరస్కరించారు. అయితే వారి హృదయాలు మట్టుకు వాటిని అంగీకరించాయి. ఇక చూడు ఆ దుర్మార్గులకు ఎలాంటి గతి పట్టిందో.

**15 - 19** (మరోవైపు) మేము దావూద్‌కు, సులైమాన్‌కు జ్ఞానాన్ని ప్రసాదించాము. "విశ్వాసులైన అనేకమంది తన దాసులకంటే మాకు ఘనతను ప్రసాదించిన అల్లాహ్‌కు కృతజ్ఞతలు" అని వారు అన్నారు. సులైమాన్, దావూద్‌కు వారసుడయ్యాడు. అతను ఇలా అన్నాడు, "ప్రజలారా! మాకు పక్షుల భాషలు నేర్పబడ్డాయి. ఇంకా మాకు అన్ని రకాల వస్తువులు ఇవ్వబడ్డాయి.[2] నిస్సందేహంగా ఇది స్పష్టమైన (దేవుని) అనుగ్రహం." సులైమాన్ కొరకు జిన్నాతుల, మానవుల, పక్షుల సైన్యాలు సమీకరించబడ్డాయి. అవి గట్టి క్రమశిక్షణలో ఉంచబడేవి. (ఒకసారి అతను వాటిని తీసుకుని దండయాత్రకు బయలుదేరాడు). చివరకు వారంతా చీమల లోయకు చేరుకున్నప్పుడు, ఒక చీమ ఇలా అన్నది, "చీమలారా! మీరు మీ పుట్టలలోకి దూరిపోండి, లేకపోతే సులైమాన్, అతని సైనికులు మిమ్మల్ని నలిపివేస్తారు. ఆ సంగతి వారికి తెలియకపోవచ్చు కూడా." సులైమాన్ దాని మాటలకు మందహాసంతో నవ్వి ఇలా అన్నాడు, "ప్రభూ! నన్ను[3] అదుపులో ఉంచు, నీవు నాకూ, నా తల్లిదండ్రులకూ చేసిన ఉపకారానికి నేను కృతజ్ఞతలు తెలుపుతూ ఉండేందుకు, నీకు నచ్చిన మంచిపనులు చేస్తూ ఉండేందుకు. నీ కారుణ్యంతో నన్ను సజ్జనులైన నీ దాసులలో చేర్చు."

**20 - 26** (మరొక సందర్భంలో) సులైమాన్, పక్షులను పరిశీలించి ఇలా అన్నాడు, "హుద్ హుద్ పక్షి నాకు కనిపించటం లేదేమిటి? అది ఎటైనా అదృశ్యమైపోయిందా? నేను దానిని కఠినంగా శిక్షిస్తాను లేదా నరికివేస్తాను. అలా కాకపోతే, అది నాకు సరైన కారణం చూపవలసి ఉంటుంది." ఆ తరువాత ఎంతో సేపు గడవలేదు, అది వచ్చి ఇలా అన్నది, "మీకు తెలియని సమాచారాన్ని నేను సేకరించాను.నేను సబాను[4] గురించి నమ్మకమైన సమాచారాన్ని తీసుకువచ్చాను. నేను అక్కడ ఒక స్త్రీని చూశాను. ఆమె ఆ జాతిని ఏలుతోంది. ఆమెకు అన్ని రకాల వస్తుసామగ్రి ప్రసాదించబడింది. ఆమె సింహాసనం మహోజ్వలంగా ఉంది. నేను చూశాను, ఆమె, ఆమె జాతి వారు అల్లాహ్‌కు బదులు సూర్యుడి ముందు సాష్టాంగపడుతున్నారు"– షైతాన్[5] వారి పనులను వారికి మనోహరమైనవిగా కనిపించేలా చేశాడు. వారిని రాజమార్గం పైకి పోకుండా నిరోధించాడు. అందువల్ల వారు ఈ ఋజు మార్గాన్ని పొందలేకపోతున్నారు: ఆకాశాలలోనూ, భూమి లోనూ దాగివున్న వస్తువులను వెలికి తీసేవాడూ, మీరు దాచేదాన్ని, వ్యక్తపరిచే దాన్నీ ఎరిగినవాడూ అయిన దేవునికి సాష్టాంగపడటం అనేదే ఋజుమార్గం. అల్లాహ్; ఆయన తప్ప ఆరాధనకు అర్హుడైన వాడు ఎవ్వడూ లేడు. ఆయన మహోన్నతమైన అధికార పీఠానికి ప్రభువు.

وَ تَفَقَّدَ الطَّيْرَ فَقَالَ مَالِيَ لَآ اَرَى
الْهُدْهُدَ ۖ اَمْ كَانَ مِنَ الْغَآئِبِيْنَ ﴿٢٠﴾
لَاُعَذِّبَنَّهٗ عَذَابًا شَدِيْدًا اَوْ لَاَاذْبَحَنَّهٗٓ اَوْ
لَيَاْتِيَنِّيْ بِسُلْطٰنٍ مُّبِيْنٍ ﴿٢١﴾ فَمَكَثَ غَيْرَ بَعِيْدٍ
فَقَالَ اَحَطْتُّ بِمَا لَمْ تُحِطْ بِهٖ وَجِئْتُكَ مِنْ
سَبَاٍ بِنَبَاٍ يَّقِيْنٍ ﴿٢٢﴾ اِنِّيْ وَجَدْتُّ امْرَاَةً
تَمْلِكُهُمْ وَ اُوْتِيَتْ مِنْ كُلِّ شَيْءٍ وَّ لَهَا عَرْشٌ
عَظِيْمٌ ﴿٢٣﴾ وَجَدْتُّهَا وَ قَوْمَهَا يَسْجُدُوْنَ لِلشَّمْسِ
مِنْ دُوْنِ اللّٰهِ وَ زَيَّنَ لَهُمُ الشَّيْطٰنُ اَعْمَالَهُمْ
فَصَدَّهُمْ عَنِ السَّبِيْلِ فَهُمْ لَا يَهْتَدُوْنَ ﴿٢٤﴾ اَلَّا
يَسْجُدُوْا لِلّٰهِ الَّذِيْ يُخْرِجُ الْخَبْءَ فِي
السَّمٰوٰتِ وَ الْاَرْضِ وَ يَعْلَمُ مَا تُخْفُوْنَ وَ مَا
تُعْلِنُوْنَ ﴿٢٥﴾ اَللّٰهُ لَآ اِلٰهَ اِلَّا هُوَ رَبُّ الْعَرْشِ
الْعَظِيْمِ ﴿٢٦﴾ السجدة

1. అంటే, తన బోధనలనూ, తన ఆదేశాలనూ, తన ఉపదేశాలనూ స్పష్టంగా, సులభంగా వివరించే గ్రంథంలోని ఆయతులు అని అర్థం.
2. అంటే, మాకు అల్లాహ్ అన్ని రకాల వస్తువులు ప్రసాదించాడు.
3. అంటే, నీవు నాకు ప్రసాదించినటువంటి మహత్తరమైన శక్తి సామర్థ్యాలు ఎలాంటివంటే, ఒకవేళ నేను వాటిపట్ల ఏమాత్రం అజాగ్రత్తగా ఉన్నా, దాస్యపు హద్దులను అతిక్రమించి అహంభావపు మత్తులోపడి ఏమవుతానో తెలియదు. కనుక ప్రభూ! నీ వరాల పట్ల కృతఘ్నత కలగకుండా, కృతజ్ఞతా బుద్ధితో ఉండేందుకు నన్ను అదుపులో ఉంచు.
4. సబా అంటే దక్షిణ అరేబియాలో ప్రసిద్ధిగాంచిన వర్తక జాతి. వారి రాజధాని మారిబ్, అది 'సన్ఆ'కు రమారమి 55 మైళ్ల దూరంలో ఉంది.
5. వాక్య రచనను అనుసరించి స్పష్టమయ్యే విషయం ఏమిటంటే ఇక్కడ నుండి 26వ ఆయతు చివరి వరకు గల విషయం హుద్ హుద్ అను పక్షి పలుకులకు అదనంగా అల్లాహ్ చేర్చినది.

قَالَ سَنَنْظُرُ اَصَدَقْتَ اَمْ كُنْتَ مِنَ
الْكٰذِبِيْنَ ﴿٢٧﴾ اِذْهَبْ بِّكِتٰبِيْ هٰذَا فَاَلْقِهْ اِلَيْهِمْ
ثُمَّ تَوَلَّ عَنْهُمْ فَانْظُرْ مَاذَا يَرْجِعُوْنَ ﴿٢٨﴾ قَالَتْ
يٰۤاَيُّهَا الْمَلَؤُا اِنِّيْۤ اُلْقِيَ اِلَيَّ كِتٰبٌ كَرِيْمٌ ﴿٢٩﴾
اِنَّهٗ مِنْ سُلَيْمٰنَ وَ اِنَّهٗ بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ
الرَّحِيْمِ ﴿٣٠﴾ اَلَّا تَعْلُوْا عَلَيَّ وَاْتُوْنِيْ مُسْلِمِيْنَ ﴿٣١﴾ ع ٢ ١٧
قَالَتْ يٰۤاَيُّهَا الْمَلَؤُا اَفْتُوْنِيْ فِيْۤ اَمْرِيْ ۚ مَا
كُنْتُ قَاطِعَةً اَمْرًا حَتّٰى تَشْهَدُوْنِ ﴿٣٢﴾ قَالُوْا
نَحْنُ اُولُوْا قُوَّةٍ وَّ اُولُوْا بَاْسٍ شَدِيْدٍ ۙ وَّ
الْاَمْرُ اِلَيْكِ فَانْظُرِيْ مَاذَا تَاْمُرِيْنَ ﴿٣٣﴾ قَالَتْ
اِنَّ الْمُلُوْكَ اِذَا دَخَلُوْا قَرْيَةً اَفْسَدُوْهَا وَ
جَعَلُوْۤا اَعِزَّةَ اَهْلِهَاۤ اَذِلَّةً ۚ وَ كَذٰلِكَ
يَفْعَلُوْنَ ﴿٣٤﴾ وَ اِنِّيْ مُرْسِلَةٌ اِلَيْهِمْ بِهَدِيَّةٍ
فَنٰظِرَةٌۢ بِمَ يَرْجِعُ الْمُرْسَلُوْنَ ﴿٣٥﴾ فَلَمَّا جَآءَ
سُلَيْمٰنَ قَالَ اَتُمِدُّوْنَنِ بِمَالٍ ۫ فَمَاۤ اٰتٰىنِۦَ اللّٰهُ
خَيْرٌ مِّمَّاۤ اٰتٰىكُمْ ۚ بَلْ اَنْتُمْ بِهَدِيَّتِكُمْ
تَفْرَحُوْنَ ﴿٣٦﴾ اِرْجِعْ اِلَيْهِمْ فَلَنَاْتِيَنَّهُمْ بِجُنُوْدٍ
لَّا قِبَلَ لَهُمْ بِهَا وَلَنُخْرِجَنَّهُمْ مِّنْهَاۤ اَذِلَّةً وَّ هُمْ
صٰغِرُوْنَ ﴿٣٧﴾

**27 - 28** సులైమాన్ ఇలా అన్నాడు, "ఇప్పుడే మేము చూస్తాము. నీవు నిజం చెప్పావో లేక అబద్ధాలు చెప్పేవారిలోని వాడవో. నా ఈ ఉత్తరాన్ని తీసుకుపో, దానిని వారి వైపునకు విసరివేయి, తరువాత ఒక వైపునకు తొలగి, వారి ప్రతిస్పందన ఎలా ఉంటుందో చూడు."

**29 - 31** రాణి ఇలా పలికింది,[6] "ఆస్థాన సభ్యులారా! నా వైపునకు అతి ముఖ్యమైన ఒక లేఖ విసరివేయబడింది. అది సులైమాన్ తరఫు నుండి వచ్చింది. కరుణామయుడూ, కృపాశీలుడూ అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభించబడింది. అందులోని విషయం ఇలా ఉంది: "నాకు వ్యతిరేకంగా తిరుగుబాటు వైఖరిని అవలంబించకు. ముస్లిమ్ అయి[7] నా వద్దకు వచ్చెయ్యి."

**32 - 35** (లేఖ వినిపించిన తరువాత) రాణి ఇలా అన్నది, "జాతి నాయకులారా! ఈ విషయంలో మీరు నాకు సలహా ఇవ్వండి. నేను ఏ విషయంలోనూ మిమ్మల్ని సంప్రదించకుండా నిర్ణయం తీసుకోను." దానికి వారు ఇలా సమాధానం చెప్పారు, "మేము బలవంతులం, పోరాడగలవారం. అయితే నిర్ణయం మాత్రం మీ చేతులలో ఉన్నది. ఏ ఆజ్ఞ ఇవ్వాలో స్వయంగా మీరే ఆలోచించుకొండి." రాణి ఇలా అన్నది, "రాజులు ఏ దేశంలోనైనా జొరబడినపుడు, దానిని వారు నాశనం చేస్తారు. అక్కడి గౌరవనీయులను అవమానిస్తారు. వారు చేసేది ఇదే. నేను వారివద్దకు ఒక కానుకను పంపిస్తాను, తరువాత నా దూతలు ఏమి జవాబు తీసుకువస్తారో చూస్తాను."

**36 - 37** అతడు (రాణిగారి దూత) సులైమాన్ వద్దకు చేరుకున్నాడు. అప్పుడు సులైమాన్ ఇలా అన్నాడు, "ఏమిటి, మీరు ధనం ఇచ్చి నాకు సహాయం చేయదలచుకున్నారా? దేవుడు మీకు ఇచ్చిన దానికంటే నాకు ఇచ్చినది ఎంతో ఎక్కువ. మీ కానుకను మీరే అనుభవించండి. (ఓ దూతా) నిన్ను పంపిన వారి వద్దకు తిరిగి వెళ్లిపో, మేము వారిపైకి వారు ఎదిరించలేని సైన్యాలను తీసుకువస్తాము. మేము వారిని పరాభవించి అక్కడి నుండి పారద్రోలుతాము. వారు అవమానితులై ఉండిపోతారు."

**38 - 40** సులైమాన్ ఇలా అన్నాడు, "ఆస్థాన సభ్యులారా! వారు విధేయులై నా వద్దకు రాకమునుపే, మీలో ఎవరు ఆమె సింహాసనాన్ని నా దగ్గరకు తీసుకురాగలరు?" జిన్నాతులలో బలిష్ఠుడైన ఒకడు ఇలా మనవి చేసుకున్నాడు, "మీరు మీ స్థానం నుండి లేవకముందే నేను దానిని తీసుకువస్తాను. నాకు ఆ శక్తి ఉంది, నమ్మకస్తుణ్ణి కూడా." గ్రంథజ్ఞానం కల ఒకతను ఇలా అన్నాడు, "మీరు కళ్లుమూసి తెరిచేలోగా నేను దానిని తీసుకువస్తాను." సులైమాన్ తనముందు సింహాసనం పెట్టబడటం చూడగానే ఇలా అరిచాడు, "ఇది నా ప్రభువు అనుగ్రహం: నేను కృతజ్ఞతలు తెలుపుతానో లేక కృతఘ్నుడనై పోతానో పరీక్షించటానికి ఆయన ఇలా చేశాడు. ఎవడైనా కృతజ్ఞతలు తెలుపుకుంటే, అతని కృతజ్ఞతలు అతనికే లాభదాయకమవుతాయి. అలా చేయకుండా ఎవడైనా కృతఘ్నుతకు పాల్పడితే, నా ప్రభువు నిరపేక్షాపరుడు, తనంతటతానే ఘనుడైనవాడు."

**41 - 43** సులైమాన్[8] ఇలా అన్నాడు, "మెదలకుండా ఆమె సింహాసనాన్ని ఆమె ముందు పెట్టండి. సరైన విషయానికి చేరుతుందో లేక ఋజుమార్గం పొందని వారిలోనే ఉండి పోతుందో చూద్దాము. రాణి వచ్చినప్పుడు, ఆమెను, "నీ సింహాసనం ఇలాంటిదేనా?" అని అడగబడింది. దానికి ఆమె, "ఇది అచ్చంగా అలాంటిదే. మేము ఇంతకు ముందే విషయం తెలుసుకుని విధేయులమైపోయాము.[9] (లేక ముస్లిములమైపోయాము)" అని అన్నది. (విశ్వసించకుండా) ఆమెను ఆపి ఉంచిన విషయం, అల్లాహ్‌ను వదలి ఆమె పూజిస్తూ ఉండిన దైవాల ఆరాధనే. ఎందుకంటే, ఆమె అవిశ్వాస జాతికి చెందిన స్త్రీ.

**44** రాజగృహంలో ప్రవేశించు అని ఆమెకు చెప్పటం జరిగింది. ఆమె దానిని చూచి, అది నీటికొలను అని అనుకున్నది. అందులో దిగటానికి ఆమె తన కాళ్ల మీద వస్త్రాన్ని పైకి ఎత్తి పట్టుకున్నది. అప్పుడు సులైమాన్, "ఇది గాజుతో చేయబడిన నున్నని నేల మాత్రమే" అని అన్నాడు. అప్పుడు ఆమె ఎలుగెత్తి ఇలా అన్నది, "నా ప్రభూ! (ఈనాటి వరకు) నేను నా ఆత్మకు అన్యాయం చేసుకుంటూ ఉండేదాన్ని. ఇప్పుడు నేను సులైమాన్‌తో పాటు సకల లోకాల ప్రభువైన అల్లాహ్ పట్ల విధేయతను స్వీకరిస్తున్నాను."

قَالَ يٰۤاَيُّهَا الْمَلَؤُا اَيُّكُمْ يَاْتِيْنِيْ بِعَرْشِهَا
قَبْلَ اَنْ يَّاْتُوْنِيْ مُسْلِمِيْنَ ٣٨ قَالَ عِفْرِيْتٌ
مِّنَ الْجِنِّ اَنَا اٰتِيْكَ بِهٖ قَبْلَ اَنْ تَقُوْمَ مِنْ
مَّقَامِكَ ۚ وَ اِنِّيْ عَلَيْهِ لَقَوِيٌّ اَمِيْنٌ ٣٩ قَالَ
الَّذِيْ عِنْدَهٗ عِلْمٌ مِّنَ الْكِتٰبِ اَنَا اٰتِيْكَ بِهٖ
قَبْلَ اَنْ يَّرْتَدَّ اِلَيْكَ طَرْفُكَ ؕ فَلَمَّا رَاٰهُ
مُسْتَقِرًّا عِنْدَهٗ قَالَ هٰذَا مِنْ فَضْلِ رَبِّيْ ۖ
لِيَبْلُوَنِيْۤ ءَاَشْكُرُ اَمْ اَكْفُرُ ؕ وَمَنْ شَكَرَ فَاِنَّمَا
يَشْكُرُ لِنَفْسِهٖ ۚ وَمَنْ كَفَرَ فَاِنَّ رَبِّيْ غَنِيٌّ
كَرِيْمٌ ٤٠ قَالَ نَكِّرُوْا لَهَا عَرْشَهَا نَنْظُرْ
اَتَهْتَدِيْۤ اَمْ تَكُوْنُ مِنَ الَّذِيْنَ لَا
يَهْتَدُوْنَ ٤١ فَلَمَّا جَآءَتْ قِيْلَ اَهٰكَذَا
عَرْشُكِ ؕ قَالَتْ كَاَنَّهٗ هُوَ ۚ وَ اُوْتِيْنَا الْعِلْمَ
مِنْ قَبْلِهَا وَ كُنَّا مُسْلِمِيْنَ ٤٢ وَ صَدَّهَا مَا
كَانَتْ تَّعْبُدُ مِنْ دُوْنِ اللّٰهِ ؕ اِنَّهَا كَانَتْ مِنْ
قَوْمٍ كٰفِرِيْنَ ٤٣ قِيْلَ لَهَا ادْخُلِي الصَّرْحَ ۚ فَلَمَّا
رَاَتْهُ حَسِبَتْهُ لُجَّةً وَّ كَشَفَتْ عَنْ سَاقَيْهَا ؕ
قَالَ اِنَّهٗ صَرْحٌ مُّمَرَّدٌ مِّنْ قَوَارِيْرَ ؕ۬ قَالَتْ
رَبِّ اِنِّيْ ظَلَمْتُ نَفْسِيْ وَاَسْلَمْتُ مَعَ سُلَيْمٰنَ
لِلّٰهِ رَبِّ الْعٰلَمِيْنَ ٤٤ ع ٣ ١٨

وَلَقَدْ اَرْسَلْنَآ اِلٰى ثَمُوْدَ اَخَاهُمْ صٰلِحًا اَنِ
اعْبُدُوا اللّٰهَ فَاِذَا هُمْ فَرِيْقٰنِ يَخْتَصِمُوْنَ ﴿٤٥﴾
قَالَ يٰقَوْمِ لِمَ تَسْتَعْجِلُوْنَ بِالسَّيِّئَةِ قَبْلَ
الْحَسَنَةِ ۚ لَوْ لَا تَسْتَغْفِرُوْنَ اللّٰهَ لَعَلَّكُمْ
تُرْحَمُوْنَ ﴿٤٦﴾ قَالُوا اطَّيَّرْنَا بِكَ وَ بِمَنْ
مَّعَكَ ۗ قَالَ طٰٓئِرُكُمْ عِنْدَ اللّٰهِ بَلْ اَنْتُمْ
قَوْمٌ تُفْتَنُوْنَ ﴿٤٧﴾ وَ كَانَ فِى الْمَدِيْنَةِ تِسْعَةُ
رَهْطٍ يُّفْسِدُوْنَ فِى الْاَرْضِ وَ لَا
يُصْلِحُوْنَ ﴿٤٨﴾ قَالُوْا تَقَاسَمُوْا بِاللّٰهِ لَنُبَيِّتَنَّهٗ وَ
اَهْلَهٗ ثُمَّ لَنَقُوْلَنَّ لِوَلِيِّهٖ مَا شَهِدْنَا مَهْلِكَ
اَهْلِهٖ وَاِنَّا لَصٰدِقُوْنَ ﴿٤٩﴾ وَ مَكَرُوْا مَكْرًا
وَّمَكَرْنَا مَكْرًا وَّ هُمْ لَا يَشْعُرُوْنَ ﴿٥٠﴾ فَانْظُرْ
كَيْفَ كَانَ عَاقِبَةُ مَكْرِهِمْ ۙ اَنَّا دَمَّرْنٰهُمْ وَ
قَوْمَهُمْ اَجْمَعِيْنَ ﴿٥١﴾ فَتِلْكَ بُيُوْتُهُمْ خَاوِيَةًۢ بِمَا
ظَلَمُوْا ۗ اِنَّ فِىْ ذٰلِكَ لَاٰيَةً لِّقَوْمٍ يَّعْلَمُوْنَ ﴿٥٢﴾
وَاَنْجَيْنَا الَّذِيْنَ اٰمَنُوْا وَ كَانُوْا يَتَّقُوْنَ ﴿٥٣﴾

**45 - 47** సమూద్ జాతి వైపునకు మేము వారి సోదరుడు సాలిహ్‌ను, "అల్లాహ్‌ను ఆరాధించండి" అనే (సందేశాన్ని ఇచ్చి) పంపాము. అప్పుడు వారు ఒక్కసారిగా ఘర్షించుకునే రెండు వర్గాలుగా చీలిపోయారు. సాలిహ్ ఇలా అన్నాడు, "నా జాతి ప్రజలారా! మేలుకు బదులు కీడు కోసం ఎందుకు తొందర పెడుతున్నారు? అల్లాహ్‌ను క్షమాభిక్ష కోసం ఎందుకు అర్థించరు? మీరు కనికరించబడవచ్చు కదా!" వారు ఇలా అన్నారు, "మేము నిన్నూ, నీ సహచరులనూ అపశకునపు సూచనలుగా పరిగణిస్తున్నాము." సాలిహ్ ఇలా జవాబు చెప్పాడు, "మీ మంచి శకునాలు మీ చెడ్డ శకునాలు అన్నీ అల్లాహ్ వద్దనే ఉన్నాయి. అసలు విషయం ఏమిటంటే, మీరు పరీక్షింపబడుతున్నారు."

**48 - 53** ఆ నగరంలో తొమ్మిదిమంది ముఠానాయకులు ఉన్నారు. వారు దేశంలో అల్లకల్లోలాన్ని సృష్టిస్తూ ఉంటారు, ఎలాంటి సంస్కరణ కార్యాన్నీ చేసేవారు కాదు. వారు పరస్పరం ఇలా అనుకున్నారు, "దేవునిపై ప్రమాణం చేసి ఇలా ప్రతిజ్ఞ చెయ్యండి; మేము సాలిహ్‌పై, అతని కుటుంబ సభ్యులపై దాడి చేస్తాము. ఆ తరువాత అతని సంరక్షకునితో,[10] అతని కుటుంబం హత్య చేయబడినప్పుడు మేము అక్కడ లేము. మేము నిజమే పలుకుతున్నాము అని చెబుదాము." వారు ఈ విధంగా పన్నాగం పన్నారు. ఒక పన్నాగాన్ని మేము కూడ పన్నాము. దానిని గురించి వారికి తెలియనే తెలియదు. ఇక చూడండి, వారి పన్నాగం పర్యవసానం ఏమయిందో! మేము వారినీ, వారి జాతి మొత్తాన్ని సర్వనాశనం చేసివేశాము. అవిగో వారి గృహాలు, ఎలా ఖాళీగా పడి ఉన్నాయో చూడండి, వారు చేస్తూ ఉన్న దుర్మార్గానికి ఫలితంగా. జ్ఞానులకు ఇందులో ఒక గుణపాఠం ఉంది. విశ్వసించి, అవిధేయతకు దూరంగా ఉన్న వారిని మేము కాపాడాము.

6. మధ్యలోని గాథను వదలిపెట్టి, హుద్ హుద్ పక్షి రాణి ఎదుటకు ఉత్తరాన్ని విసరివేసినప్పటి ప్రస్తావన ఇక్కణ్ణుంచి ప్రారంభమవుతుంది.
7. అంటే, ఇస్లామ్ ధర్మాన్ని స్వీకరించి గానీ లేదా విధేయత చూపుతూ గానీ అని అర్థం.
8. ఇక రాణి సబా హజ్రత్ సులైమాన్‌ను కలుసుకోవటానికి వచ్చినప్పటి ప్రస్తావన ప్రారంభమవుతోంది.
9. అంటే, ఈ మహిమను చూడటానికి ముందే, మేము ఎరిగిన సులైమాన్ (అస్సలామ్) గుణ విశేషాలు ఆయన స్థితిగతులు ఆధారంగా, ఆయన అల్లాహ్ పంపిన ఒక ప్రవక్త అనీ, కేవలం ఒక సామ్రాజ్యానికి అధిపతి మాత్రమే కాదనీ మాకు నమ్మకం కలిగింది.

وَلُوْطًا اِذْ قَالَ لِقَوْمِهٖۤ اَتَاْتُوْنَ الْفَاحِشَةَ وَ
اَنْتُمْ تُبْصِرُوْنَ ﴿۵۴﴾ اَئِنَّكُمْ لَتَاْتُوْنَ الرِّجَالَ
شَهْوَةً مِّنْ دُوْنِ النِّسَآءِ ؕ بَلْ اَنْتُمْ قَوْمٌ
تَجْهَلُوْنَ ﴿۵۵﴾ فَمَا كَانَ جَوَابَ قَوْمِهٖۤ اِلَّاۤ اَنْ
قَالُوْۤا اَخْرِجُوْۤا اٰلَ لُوْطٍ مِّنْ قَرْيَتِكُمْ ۚ اِنَّهُمْ
اُنَاسٌ يَّتَطَهَّرُوْنَ ﴿۵۶﴾ فَاَنْجَيْنٰهُ وَ اَهْلَهٗۤ اِلَّا
امْرَاَتَهٗ ۫ قَدَّرْنٰهَا مِنَ الْغٰبِرِيْنَ ﴿۵۷﴾ وَ اَمْطَرْنَا
عَلَيْهِمْ مَّطَرًا ۚ فَسَآءَ مَطَرُ الْمُنْذَرِيْنَ ﴿۵۸﴾ قُلِ ع ٤ ١٤ ١٩
الْحَمْدُ لِلّٰهِ وَ سَلٰمٌ عَلٰى عِبَادِهِ الَّذِيْنَ
اصْطَفٰى ؕ آٰللّٰهُ خَيْرٌ اَمَّا يُشْرِكُوْنَ ﴿۵۹﴾
اَمَّنْ خَلَقَ السَّمٰوٰتِ وَ الْاَرْضَ وَ اَنْزَلَ لَكُمْ الجزء ٢٠
مِّنَ السَّمَآءِ مَآءً ۚ فَاَنْۢبَتْنَا بِهٖ حَدَآئِقَ ذَاتَ
بَهْجَةٍ ۚ مَا كَانَ لَكُمْ اَنْ تُنْۢبِتُوْا شَجَرَهَا ؕ
ءَاِلٰهٌ مَّعَ اللّٰهِ ؕ بَلْ هُمْ قَوْمٌ يَّعْدِلُوْنَ ﴿۶۰﴾
اَمَّنْ جَعَلَ الْاَرْضَ قَرَارًا وَّ جَعَلَ خِلٰلَهَاۤ
اَنْهٰرًا وَّ جَعَلَ لَهَا رَوَاسِيَ وَ جَعَلَ بَيْنَ
الْبَحْرَيْنِ حَاجِزًا ؕ ءَاِلٰهٌ مَّعَ اللّٰهِ ؕ بَلْ
اَكْثَرُهُمْ لَا يَعْلَمُوْنَ ﴿۶۱﴾

**54 - 58** మేము లూత్‌ను పంపాము. అతను తన జాతి వారితో, ఇలా అనిన సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకో, "మీరు చూస్తూ అశ్లీల కార్యం చేస్తారేమిటీ?[11] ఇదేనా మీ నడవడిక, కామతృష్ణను తీర్చుకోవటానికి స్త్రీలను వదలి పెట్టి పురుషుల వద్దకు పోతారేమిటి? వాస్తవానికి మీరు చాల అజ్ఞానపు పని చేస్తున్నారు." కానీ, ఈ సమాధానం తప్ప మరొకటి అతని జాతివారు ఇవ్వలేదు. వారు ఇలా అన్నారు, "లూత్ కుటుంబాన్ని మీ పట్టణం నుంచి వెళ్లగొట్టండి. వారు మహాపవిత్రులట!" చివరకు మేము అతనినీ అతని కుటుంబాన్నీ రక్షించాము, అతని భార్యను తప్ప. ఆమె, వెనుక ఉండిపోవాలని మేము నిర్ణయించాము. మేము వారిపై ఒక వర్షాన్ని కురిపించాము. అది హెచ్చరించబడిన వారి విషయంలో అత్యంత ఘోరమైన వర్షం.

**59....** ఓ ప్రవక్తా! ఇలా అను: "స్తోత్రం అల్లాహ్‌కు మాత్రమే తగినది. ఆయన ఎన్నుకున్న ఆయన దాసులకు శాంతి కలుగుగాక!

**... 59 - 60** (వారిని ఇలా అడగండి) అల్లాహ్ శ్రేష్ఠుడా లేక ఆయనకు సాటిగా వారు కల్పించే దేవుళ్ల శ్రేష్ఠులా? సరే, ఆకాశాలనూ, భూమినీ, ఎవరు సృష్టించారు? మీ కొరకు ఆకాశం నుండి నీటిని కురిపించి, తద్వారా మనోహరమైన తోటలను ఎవరు పండించారు? వాటిలోని చెట్లను మొలిపించటం మీకు సాధ్యమయ్యేపనికాదు. అల్లాహ్‌తోపాటు మరొక దేవుడు కూడ ఎవడైనా ఉన్నాడా (ఈ పనులలో పాలుపంచుకోవటానికి)? (లేదు) కాని వారే ఋజుమార్గం నుండి తొలగిపోతున్నారు.

**61** భూమిని నివాస స్థలంగా చేసినవాడు ఎవడు? అందులో నదులను ప్రవహింపజేసినవాడు ఎవడు? దానిమీద (పర్వతాల) మేకులను పాతిన వాడు ఎవడు? రెండు రకాల జలధుల మధ్య అడ్డు తెరలను పెట్టినవాడు ఎవడు? అల్లాహ్‌తోపాటు మరొక దేవుడు కూడ ఎవడైనా ఉన్నాడా (ఈ పనులలో పాలుపంచుకోవటానికి)? లేదు. కాని వారిలో అనేకమందికి తెలియదు.

**62** బాధితుడు మొరపెట్టుకున్నప్పుడు, అతని మొరను ఆలకించి అతని బాధను తొలగించేవాడు ఎవడు? భూమిపై మిమ్మల్ని ప్రతినిధులుగా చేసినవాడు ఎవడు? అల్లాహ్‌తో పాటు (ఈ పనులు చేసే) మరొక దేవుడు కూడ ఎవడైనా ఉన్నాడా? మీరు చాలా తక్కువగా ఆలోచిస్తారు.

**63** నేలపై, సముద్రంపై అంధకారంలో మీకు దారిచూపే వాడు ఎవడు? తన కారుణ్యానికి ముందు గాలులను శుభ వార్తతో పంపేవాడు ఎవడు? అల్లాహ్‌తో పాటు మరొక దేవుడు ఎవడైనా ఉన్నాడా (ఈ పనులు చేయటానికి)? వారు చేస్తూ ఉన్న షిర్క్‌కు అల్లాహ్ ఎంతో అతీతుడు, ఎంతో ఉన్నతుడు.

**64** సృష్టిని మొదటిసారిగా చేసినవాడు ఎవడు? దానిని పునః సృష్టించేవాడు ఎవడు? నింగి నుండీ, నేల నుండీ మీకు ఉపాధినిచ్చేవాడు ఎవడు? అల్లాహ్‌తో పాటు మరొక దేవుడు ఎవడైనా ఉన్నాడా (ఈ పనులలో పాలుపంచుకోవటానికి)? "మీరు సత్యవంతులే అయితే మీ ఆధారాన్ని తీసుకురండి" అని అడుగు.

**65** వారితో ఇలా అను, "ఆకాశాలలోనూ, భూమిలోనూ అల్లాహ్ తప్ప అగోచర జ్ఞానం కలవాడు మరెవ్వడూ లేడు. వారికి (మీ దేవుళ్ళకు) తాము ఎప్పుడు లేపబడతారో కూడ తెలియదు కదా!

**66 - 75** కాని పరలోకం గురించిన జ్ఞానమే వారి నుండి కనుమరుగైపోయింది. కాదు, దానిని గురించి వారు సంశయంలో పడిపోయారు. కాదు, వారు అసలు ఆ విషయం పట్ల అంధులైపోయారు. ఆ సత్యతిరస్కారులు ఇలా అంటారు, "మేమూ, మా తాతముత్తాతలూ మట్టిలో కలిసిపోయిన తరువాత కూడ నిజంగానే మమ్మల్ని సమాధుల నుండి లేపటం జరుగుతుందా? ఇలాంటి వార్తలు ఎన్నో మాకు కూడ అందించబడ్డాయి, పూర్వం మా తాతముత్తాతలకు కూడ అందించబడుతూ ఉండేవి. కాని ఇవి మేము పూర్వ కాలం నుంచి వింటూ వస్తున్న కట్టుకథలు మాత్రమే."

أَمَّنْ يُجِيبُ الْمُضْطَرَّ إِذَا دَعَاهُ وَيَكْشِفُ
السُّوٓءَ وَيَجْعَلُكُمْ خُلَفَآءَ الْأَرْضِ ۗ ءَإِلَٰهٌ
مَّعَ اللَّهِ ۚ قَلِيلًا مَّا تَذَكَّرُونَ ﴿٦٢﴾ أَمَّنْ
يَهْدِيكُمْ فِي ظُلُمَٰتِ الْبَرِّ وَالْبَحْرِ وَمَنْ
يُرْسِلُ الرِّيَٰحَ بُشْرًۢا بَيْنَ يَدَيْ رَحْمَتِهِۦ ۗ
ءَإِلَٰهٌ مَّعَ اللَّهِ ۚ تَعَٰلَى اللَّهُ عَمَّا يُشْرِكُونَ ﴿٦٣﴾
أَمَّنْ يَبْدَؤُا الْخَلْقَ ثُمَّ يُعِيدُهُۥ وَمَنْ يَرْزُقُكُمْ
مِّنَ السَّمَآءِ وَالْأَرْضِ ۗ ءَإِلَٰهٌ مَّعَ اللَّهِ ۚ قُلْ
هَاتُوا بُرْهَٰنَكُمْ إِنْ كُنْتُمْ صَٰدِقِينَ ﴿٦٤﴾ قُلْ لَّا
يَعْلَمُ مَنْ فِي السَّمَٰوَٰتِ وَالْأَرْضِ الْغَيْبَ إِلَّا
اللَّهُ ۚ وَمَا يَشْعُرُونَ أَيَّانَ يُبْعَثُونَ ﴿٦٥﴾ بَلِ
ادَّٰرَكَ عِلْمُهُمْ فِي الْأٓخِرَةِ ۚ بَلْ هُمْ فِي شَكٍّ
مِّنْهَا ۖ بَلْ هُمْ مِّنْهَا عَمُونَ ﴿٦٦﴾ وَقَالَ
الَّذِينَ كَفَرُوٓا أَءِذَا كُنَّا تُرَٰبًا وَءَابَآؤُنَآ أَئِنَّا
لَمُخْرَجُونَ ﴿٦٧﴾ لَقَدْ وُعِدْنَا هَٰذَا نَحْنُ وَ
ءَابَآؤُنَا مِنْ قَبْلُ ۙ إِنْ هَٰذَآ إِلَّآ أَسَٰطِيرُ
الْأَوَّلِينَ ﴿٦٨﴾

قُلۡ سِيۡرُوۡا فِى الۡاَرۡضِ فَانۡظُرُوۡا كَيۡفَ كَانَ
عَاقِبَةُ الۡمُجۡرِمِيۡنَ ۞٦٩ وَلَا تَحۡزَنۡ عَلَيۡهِمۡ وَلَا
تَكُنۡ فِىۡ ضَيۡقٍ مِّمَّا يَمۡكُرُوۡنَ ۞٧٠ وَيَقُوۡلُوۡنَ
مَتٰى هٰذَا الۡوَعۡدُ اِنۡ كُنۡتُمۡ صٰدِقِيۡنَ ۞٧١ قُلۡ
عَسٰٓى اَنۡ يَّكُوۡنَ رَدِفَ لَـكُمۡ بَعۡضُ الَّذِىۡ
تَسۡتَعۡجِلُوۡنَ ۞٧٢ وَاِنَّ رَبَّكَ لَذُوۡ فَضۡلٍ عَلَى
النَّاسِ وَلٰـكِنَّ اَكۡثَرَهُمۡ لَا يَشۡكُرُوۡنَ ۞٧٣ وَاِنَّ
رَبَّكَ لَيَـعۡلَمُ مَا تُكِنُّ صُدُوۡرُهُمۡ وَمَا
يُعۡلِنُوۡنَ ۞٧٤ وَمَا مِنۡ غَآئِبَةٍ فِى السَّمَآءِ وَ
الۡاَرۡضِ اِلَّا فِىۡ كِتٰبٍ مُّبِيۡنٍ ۞٧٥ اِنَّ هٰذَا
الۡقُرۡاٰنَ يَقُصُّ عَلٰى بَنِىۡۤ اِسۡرَآءِيۡلَ اَكۡثَرَ الَّذِىۡ
هُمۡ فِيۡهِ يَخۡتَلِفُوۡنَ ۞٧٦ وَاِنَّهٗ لَهُدًى وَّرَحۡمَةٌ
لِّلۡمُؤۡمِنِيۡنَ ۞٧٧ اِنَّ رَبَّكَ يَقۡضِىۡ بَيۡنَهُمۡ
بِحُكۡمِهٖ ۚ وَهُوَ الۡعَزِيۡزُ الۡعَلِيۡمُ ۞٧٨ فَتَوَكَّلۡ عَلَى
اللّٰهِ ؕ اِنَّكَ عَلَى الۡحَـقِّ الۡمُبِيۡنِ ۞٧٩ اِنَّكَ لَا
تُسۡمِعُ الۡمَوۡتٰى وَلَا تُسۡمِعُ الصُّمَّ الدُّعَآءَ اِذَا
وَلَّوۡا مُدۡبِرِيۡنَ ۞٨٠ وَمَاۤ اَنۡتَ بِهٰدِى الۡعُمۡىِ
عَنۡ ضَلٰلَتِهِمۡ ؕ اِنۡ تُسۡمِعُ اِلَّا مَنۡ يُّؤۡمِنُ
بِاٰيٰتِنَا فَهُمۡ مُّسۡلِمُوۡنَ ۞٨١

ఇలా అను, “భూమిపై తిరిగి చూడండి, నేరస్తులకు ఎటువంటి గతి పట్టినదో!” ఓ ప్రవక్తా! వారి స్థితిని గురించి బాధపడకు. వారి కుట్రల విషయంలో వ్యధ చెందకు– వారు, “నీవు చెబుతున్నది నిజమే అయితే ఈ బెదిరింపు ఎప్పుడు నెరవేరుతుంది?” అని అడుగుతారు. ఇలా అను, “మీరు ఏ శిక్షను గురించి తొందర పెడుతున్నారో, అందులోని ఒక భాగం మీ సమీపంలోనికే వచ్చి ఉందన్నా, ఆశ్చర్యంలేదు.”యథార్థం ఏమిటంటే, నీ ప్రభువు ప్రజల పట్ల ఎంతో అనుగ్రహం కలవాడు. కాని చాలమంది కృతజ్ఞతలు తెలుపరు. వారి హృదయాలు తమలో ఏమి దాచి ఉంచాయో, మరేమి బహిర్గతం చేస్తున్నాయో, నిస్సందేహంగా నీ ప్రభువుకు బాగా తెలుసు. ఆకాశంలో, భూమిలో దాగి ఉన్న ఏ వస్తువు అయినా, ఒక స్పష్టమైన గ్రంథంలో వ్రాయబడకుండా లేదు.[12]

**76 – 81** ఇస్రాయీల్ సంతతివారు విభేదిస్తూ ఉన్న విషయాల వాస్తవం ఏమిటో, ఈ ఖురాన్ వారికి ఎక్కువగా తెలియజేస్తోంది. ఇది విశ్వసించే వారికి మార్గదర్శకత్వం. కారుణ్యమూను. నిశ్చయంగా (ఇలాగే) నీ ప్రభువు వీరి మధ్య కూడ తన ఆజ్ఞ ద్వారా తీర్పుచేస్తాడు.[13] ఆయన ఎంతో శక్తిమంతుడు, అన్నీ ఎరిగినవాడూను. కనుక ఓ ప్రవక్తా! అల్లాహ్ మీద భారం వెయ్యి. నిశ్చయంగా నీవు స్పష్టంగా సత్యంపై ఉన్నావు. నీవు మృతులకు వినిపించలేవు.[14] వీపు త్రిప్పి పరుగెత్తే బధిరులకు కూడ నీ పిలుపును వినిపించలేవు. అంధులకు మార్గం చూపి, వారు తప్పిపోకుండా కాపాడనూలేవు. మా వాక్యాలను విశ్వసించి, విధేయులయ్యే వారికి మాత్రమే నీవు నీ మాటను వినిపించగలవు.

10. అంటే, ప్రవక్త సాలిహ్ (అ) తెగ యొక్క సర్దారుతో అని అర్థం. ప్రాచీన కాలపు తెగల ఆచార వ్యవహారముల ననుసరించి, ఆ సర్దారుకు తన తెగవారిని హత్య చేసిన వారి ఎడల ప్రతీకారం చేసే హక్కు సంక్రమిస్తుంది. మహాప్రవక్త (సఅసమ్) గారి కాలంలో ఆయన పినతండ్రి అబూ తాలిబ్‌కు గల స్థానం కూడా ఇదే. ఖురైష్ తెగకు చెందిన అవిశ్వాసులు కూడ ఇలానే భయపడేవారు; ఒకవేళ వారు మహాప్రవక్త (సఅసమ్)ను హత్య చేసినట్లయితే, బనీ హాషిమ్ తెగ సర్దారు అయిన అబూ తాలిబ్ తన తెగ వైపు నుండి బంధు రక్త ప్రతీకారానికి నడుం బిగిస్తాడు.

وَ اِذَا وَقَعَ الْقَوْلُ عَلَيْهِمْ اَخْرَجْنَا لَهُمْ
دَآبَّةً مِّنَ الْاَرْضِ تُكَلِّمُهُمْ ۙ اَنَّ النَّاسَ كَانُوْا
بِاٰيٰتِنَا لَا يُوْقِنُوْنَ ﴿٨٢﴾ وَ يَوْمَ نَحْشُرُ مِنْ كُلِّ ع
اُمَّةٍ فَوْجًا مِّمَّنْ يُّكَذِّبُ بِاٰيٰتِنَا فَهُمْ
يُوْزَعُوْنَ ﴿٨٣﴾ حَتّٰٓى اِذَا جَآءُوْ قَالَ اَكَذَّبْتُمْ
بِاٰيٰتِيْ وَ لَمْ تُحِيْطُوْا بِهَا عِلْمًا اَمَّا ذَا كُنْتُمْ
تَعْمَلُوْنَ ﴿٨٤﴾ وَ وَقَعَ الْقَوْلُ عَلَيْهِمْ بِمَا ظَلَمُوْا
فَهُمْ لَا يَنْطِقُوْنَ ﴿٨٥﴾ اَلَمْ يَرَوْا اَنَّا جَعَلْنَا الَّيْلَ
لِيَسْكُنُوْا فِيْهِ وَالنَّهَارَ مُبْصِرًا ؕ اِنَّ فِيْ ذٰلِكَ
لَاٰيٰتٍ لِّقَوْمٍ يُّؤْمِنُوْنَ ﴿٨٦﴾ وَ يَوْمَ يُنْفَخُ فِي
الصُّوْرِ فَفَزِعَ مَنْ فِي السَّمٰوٰتِ وَ مَنْ فِي
الْاَرْضِ اِلَّا مَنْ شَآءَ اللّٰهُ ؕ وَ كُلٌّ اَتَوْهُ
دٰخِرِيْنَ ﴿٨٧﴾ وَتَرَى الْجِبَالَ تَحْسَبُهَا جَامِدَةً وَّ
هِيَ تَمُرُّ مَرَّ السَّحَابِ ؕ صُنْعَ اللّٰهِ الَّذِيْٓ
اَتْقَنَ كُلَّ شَيْءٍ ؕ اِنَّهٗ خَبِيْرٌۢ بِمَا تَفْعَلُوْنَ ﴿٨٨﴾
مَنْ جَآءَ بِالْحَسَنَةِ فَلَهٗ خَيْرٌ مِّنْهَا ۚ وَ هُمْ مِّنْ
فَزَعٍ يَّوْمَئِذٍ اٰمِنُوْنَ ﴿٨٩﴾ وَ مَنْ جَآءَ بِالسَّيِّئَةِ
فَكُبَّتْ وُجُوْهُهُمْ فِي النَّارِ ؕ هَلْ تُجْزَوْنَ اِلَّا
مَا كُنْتُمْ تَعْمَلُوْنَ ﴿٩٠﴾

**82 - 86** మా మాట నెరవేరే సమయం వారిని సమీపించినప్పుడు, మేము వారి కొరకు భూమి నుండి ఒక జంతువును తీస్తాము. అది[15] వారితో ఇలా మాట్లాడుతుంది, "ప్రజలు మా వాక్యాలను విశ్వసించలేదు." ఆ రోజును గురించి కొంచెం ఆలోచించు. అప్పుడు మేము ప్రతి సముదాయం నుండి మా వాక్యాలను తిరస్కరించే ఒక్కొక్క జనసమూహాన్ని సమీకరిస్తాము. ఆపై వారిని (వారి వారి తరగతుల ప్రకారం అంతస్తుల వారీగా) ఒక క్రమపద్ధతిలో ఉంచటం జరుగుతుంది. చివరకు అందరూ వచ్చేసిన తరువాత (వారి ప్రభువు వారిని) ఇలా అడుగుతాడు, "మీరు నా వాక్యాలను శాస్త్రీయ పరిశీలన చేయకుండానే ఇట్టే తిరస్కరించారు. ఇది కాక మీరు చేసింది ఏమిటి?" వారు చేసిన దుర్మార్గం వల్ల శిక్షకు సంబంధించిన వాగ్దానం వారి విషయంలో నెరవేరుతుంది. అప్పుడు వారు ఏమీ మాట్లాడలేరు. వారు విశ్రాంతి పొందటానికి మేము రాత్రిని సృష్టించాము. మేము పగటిని ప్రకాశవంతంగా చేశాము. వారి బుద్ధికి ఈ విషయాలు తట్టేవి కావా? విశ్వసించే వారికి ఇందులో అనేక సూచనలు ఉండేవి.

**87 - 90** శంఖం ఊదబడే రోజున ఏమి జరుగుతుందో! ఆ రోజున, ఆకాశాలలోని, భూమిలోని సకల సృష్టిరాసులు భయంతో కంపించిపోతాయి. – ఆ భయానక పరిస్థితుల నుండి అల్లాహ్ కాపాడదలచిన వారు తప్ప– అందరూ లొంగిపోయి, వినమ్రులై ఆయన ముందు హాజరవుతారు. ఈ రోజున నీవు పర్వతాలను చూచి అవి బాగా స్థిరంగా ఉన్నాయని అనుకుంటున్నావు. కాని అప్పుడు మేఘాల మాదిరిగా అవి ఎగురుతూ ఉంటాయి. ఇది అల్లాహ్ శక్తి సామర్థ్యాల మహిమ. ఆయన ప్రతి వస్తువునూ వివేకంతో తీర్చిదిద్దాడు. మీరు చేసేదంతా ఆయనకు బాగా తెలుసు. మంచిని తీసుకువచ్చే వ్యక్తికి అంతకంటే మేలైన ప్రతిఫలం లభిస్తుంది. అటువంటి వారు ఆనాటి భయంకర పరిస్థితినుండి సురక్షితంగా ఉంటారు. చెడును తీసుకువచ్చే వారందరూ బోర్లగా అగ్నిలో విసరివేయబడతారు. మీరు చేసిన కర్మల ప్రకారం తప్ప మీరు మరొక విధమైన ప్రతిఫలాన్ని ఎలా పొందగలుగుతారు?

اِنَّمَآ اُمِرۡتُ اَنۡ اَعۡبُدَ رَبَّ هٰذِهِ الۡبَلۡدَةِ
الَّذِىۡ حَرَّمَهَا وَلَهٗ كُلُّ شَىۡءٍ وَّاُمِرۡتُ اَنۡ
اَكُوۡنَ مِنَ الۡمُسۡلِمِيۡنَ ﴿۹۱﴾ وَاَنۡ اَتۡلُوَا الۡقُرۡاٰنَ
فَمَنِ اهۡتَدٰى فَاِنَّمَا يَهۡتَدِىۡ لِنَفۡسِهٖ وَمَنۡ
ضَلَّ فَقُلۡ اِنَّمَاۤ اَنَا مِنَ الۡمُنۡذِرِيۡنَ ﴿۹۲﴾ وَقُلِ
الۡحَمۡدُ لِلّٰهِ سَيُرِيۡكُمۡ اٰيٰتِهٖ فَتَعۡرِفُوۡنَهَا وَمَا
رَبُّكَ بِغَافِلٍ عَمَّا تَعۡمَلُوۡنَ ﴿۹۳﴾

**91 - 93** (ఓ ప్రవక్తా! వారితో ఇలా అను): "ఈ నగరం (మక్కా) ప్రభువును మాత్రమే ఆరాధించాలని నాకు ఆజ్ఞ ఇవ్వబడింది. ఆయన దానిని పవిత్రమైన క్షేత్రంగా చేశాడు; ఆయన ప్రతిదానికీ యజమాని. నేను విధేయుడనై ఉండాలనీ, ఈ ఖురాన్‌ను చదివి వినిపించాలనీ నాకు ఆజ్ఞ ఇవ్వబడింది." ఇక సన్మార్గాన్ని అవలంబించేవాడు తన మేలు కొరకే సన్మార్గాన్ని అవలంబిస్తాడు. మార్గభ్రష్టుడైన వాడితో, "నేను కేవలం హెచ్చరించేవాణ్ణి మాత్రమే" అని అను. వారితో ఇంకా ఇలా అను, "స్తోత్రం కేవలం అల్లాహ్‌కు మాత్రమే తగినది, అతి త్వరలోనే ఆయన మీకు తన సూచనలను చూపుతాడు, మీరు వాటిని గుర్తిస్తారు." మీరు చేసే పనులన్నీ నీ ప్రభువునకు తెలియకుండా లేవు.

11. అంటే, పదిమందిలో సిగ్గువిడిచి అసభ్యకరమైన పని చేస్తారేమిటి; వారు తమ సభలలో, సమావేశాలలో ఈ అశ్లీలపు పని చేసేవారని ముందు అన్‌కబూత్ సూరా 29వ ఆయత్‌లో వివరించబడింది.

12. స్పష్టమైన గ్రంథం అంటే విధి వ్రాత అని అర్థం.

13. అంటే, ఖురైషు తెగకు చెందిన అవిశ్వాసులు, విశ్వాసుల మధ్య అని భావం.

14. అంటే, అంతరాత్మ మృతి చెందిన వారికి. వారిలో ఉన్నటువంటి మూర్ఖత్వం, మొండితనం, ఆచార వ్యవహారాల పట్ల వెర్రి వ్యామోహం. సత్యాసత్యాల మధ్య ఉన్న భేదాన్ని గుర్తించే సామర్థ్యాన్ని మట్టుపెట్టేశాయి.

15. హజ్రత్ ఇబ్నె ఉమర్ గారి మాట ప్రకారం, లోకంలో మంచి చేయమని ఆజ్ఞాపించేవాడూ, చెడు చేయవద్దని నిరోధించేవాడూ ఒక్కడు కూడా లేనప్పుడు ఇది సంభవిస్తుంది. ఇదే విషయాన్ని స్వయంగా మహాప్రవక్త (సఅసమ్) చెప్పగా తాను విన్నానని హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజిఅన్) ఒక హదీసులో ఉల్లేఖించారు. దీనిద్వారా తెలిసే విషయమేమిటంటే, మానవులు, మంచిని చేయమనీ చెడును వీడమనీ చెప్పటం మానివేసినప్పుడు, ప్రళయానికి ముందు అల్లాహ్ ఒక జంతువు ద్వారా చివరి సారిగా హెచ్చరిస్తాడు. కాని ఇది ఒకే మృగమా లేక ఒక ప్రత్యేక జాతికి చెందిన మృగములా అనే విషయం స్పష్టంగా చెప్పబడలేదు. "దాబ్బ-తన్-మిన్-అల్-అర్జ్" అనే పదాలలో ఈ రెండు అర్థాలకూ ఆస్కారం ఉన్నది. ఈ జంతువు ఎప్పుడు వస్తుంది అనే విషయం గురించి మహాప్రవక్త ఇలా అన్నారు: "సూర్యుడు పడమర దిక్కు నుండి ఉదయిస్తాడు. ఒక రోజున పట్టపగలు ఉన్నట్లు ఉండి ఈ మృగం ప్రత్యక్షమవు తుంది" ఇక ఒక మృగం మానవులతో మానవ భాషలో మాట్లాడటం, అదైతే దేవుని మహిమ. ఆయన తన ఇష్టప్రకారం దేనికైనా మాట్లాడే శక్తిని ప్రసాదించగలడు. ప్రళయానికి ముందు ఆయన ఒక మృగానికి మాత్రమే మాట్లాడే శక్తిని ప్రసాదిస్తాడు. కాని ప్రళయం వచ్చినప్పుడు, అల్లాహ్ న్యాయస్థానంలో మానవుని కళ్ళూ, చెవులూ, చివరకు అతని శరీరం యొక్క చర్మం కూడ పలుకుతుంది. ఈ విషయం దివ్య ఖురానులో 'హా మీమ్ అస్ సజ్దా' సూరాలోని 20, 21 ఆయతులలో వచ్చింది.

٢٨ سُوۡرَةُ الۡقَصَصِ مَكِّيَّةٌ ٤٩

اٰياتها ٨٨ | ركوعاتها ٩

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ

طٰسٓمّٓ (١) تِلۡكَ اٰيٰتُ الۡكِتٰبِ الۡمُبِيۡنِ (٢) نَتۡلُوۡا
عَلَيۡكَ مِنۡ نَّبَاِ مُوۡسٰى وَ فِرۡعَوۡنَ بِالۡحَـقِّ
لِقَوۡمٍ يُّؤۡمِنُوۡنَ (٣) اِنَّ فِرۡعَوۡنَ عَلَا فِى
الۡاَرۡضِ وَ جَعَلَ اَهۡلَهَا شِيَعًا يَّسۡتَضۡعِفُ
طَآئِفَةً مِّنۡهُمۡ يُذَبِّحُ اَبۡنَآءَهُمۡ وَيَسۡتَحۡىٖ
نِسَآءَهُمۡ ؕ اِنَّهٗ كَانَ مِنَ الۡمُفۡسِدِيۡنَ (٤)
وَنُرِيۡدُ اَنۡ نَّمُنَّ عَلَى الَّذِيۡنَ اسۡتُضۡعِفُوۡا فِى
الۡاَرۡضِ وَ نَجۡعَلَهُمۡ اَٮِٕمَّةً وَّ نَجۡعَلَهُمُ
الۡوٰرِثِيۡنَ (٥) وَنُمَكِّنَ لَهُمۡ فِى الۡاَرۡضِ وَ نُرِىَ
فِرۡعَوۡنَ وَهَامٰنَ وَجُنُوۡدَهُمَا مِنۡهُمۡ مَّا كَانُوۡا
يَحۡذَرُوۡنَ (٦) وَاَوۡحَيۡنَاۤ اِلٰٓى اُمِّ مُوۡسٰٓى اَنۡ
اَرۡضِعِيۡهِ ۚ فَاِذَا خِفۡتِ عَلَيۡهِ فَاَلۡقِيۡهِ فِى الۡيَمِّ
وَ لَا تَخَافِىۡ وَ لَا تَحۡزَنِىۡ ۚ اِنَّا رَآدُّوۡهُ اِلَيۡكِ
وَ جَاعِلُوۡهُ مِنَ الۡمُرۡسَلِيۡنَ (٧) فَالۡتَقَطَهٗۤ اٰلُ
فِرۡعَوۡنَ لِيَكُوۡنَ لَهُمۡ عَدُوًّا وَّحَزَنًا ؕ اِنَّ
فِرۡعَوۡنَ وَهَامٰنَ وَجُنُوۡدَهُمَا كَانُوۡا خٰطِــِٕيۡنَ (٨)
وَ قَالَتِ امۡرَاَتُ فِرۡعَوۡنَ قُرَّتُ عَيۡنٍ لِّىۡ وَ
لَكَ ؕ لَا تَقۡتُلُوۡهُ ۖ عَسٰٓى اَنۡ يَّنۡفَعَنَاۤ اَوۡ
نَتَّخِذَهٗ وَلَدًا وَّ هُمۡ لَا يَشۡعُرُوۡنَ (٩)

ఆయతులు 88 | అవతరణ మక్కాలో

# 28. అల్ ఖసస్

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 3** తా-సీన్-మీమ్. ఇవి స్పష్టమైన గ్రంథంలోని వాక్యాలు. మేము మూసా, ఫిరౌనుల కొంత వృత్తాంతాన్ని విశ్వసించే వారి ప్రయోజనం కోసం జరిగింది జరిగినట్లుగా మీకు వినిపిస్తున్నాము.

**4 - 6** అసలు విషయం ఏమిటంటే, ఫిరౌను భూమి మీద తిరుగుబాటు వైఖరిని అవలంబించాడు. దాని ప్రజలను వర్గాలుగా విభజించాడు. వారిలోని ఒక వర్గాన్ని అతడు నీచపరచేవాడు. వారి బాలురను హతమార్చేవాడు; వారి బాలికలను మాత్రం బ్రతుకనిచ్చేవాడు. నిశ్చయంగా అతడు దుష్టులలోని వాడు. భూమిలో అణచివేయబడిన వారిని కనికరించాలనీ, వారిని నాయకులుగా చేయాలనీ, వారినే వారసులుగా చేయాలనీ, భూమిలో వారికి అధికారాన్ని ప్రసాదించాలనీ, వారి ద్వారా ఫిరౌను, హామానులకూ, వారి సైన్యాలకూ తాము భయపడుతూ వచ్చిన దానినే చూపాలనీ మేము కోరాము.

**7 - 9** మేము మూసా తల్లికి ఇలా సూచించాము,[1] "అతనికి పాలుపట్టు, అతని ప్రాణానికి ప్రమాదముందని నీకు అనిపిస్తే అపుడు అతనిని నదిలో విడిచిపెట్టు, ఏమాత్రం భయపడకు, బాధపడకు, మేము అతనిని నీ వద్దకే తిరిగి తీసుకువస్తాము, అతనిని ప్రవక్తలలో ఒకడుగా చేస్తాము." చివరకు ఫిరౌను ఇంటివారు అతనిని (నదిలో నుండి) బయటికి తీశారు, అతను వారికి శత్రువై శోక కారణం అవటానికి. నిజంగానే ఫిరౌను, హామాను, వారి సైన్యాలు (తమ వ్యూహాల రీత్యా) ఎంతో పాపిష్టులు. ఫిరౌను భార్య (అతడితో) ఇలా అన్నది, "ఇతడు నీకూ నాకూ కంటి చలువ. ఇతనిని చంపకు. బహుశా ఇతడు మనకు ఉపయోగపడవచ్చు లేదా మనం ఇతనిని కుమారుని గానైనా చేసుకోవచ్చు." కాని వారికి (పర్యవసానం) తెలియదు.

وَاَصۡبَحَ فُؤَادُ اُمِّ مُوۡسٰى فٰرِغًا ؕ اِنۡ كَادَتۡ
لَتُبۡدِىۡ بِهٖ لَوۡلَاۤ اَنۡ رَّبَطۡنَا عَلٰى قَلۡبِهَا لِتَكُوۡنَ
مِنَ الۡمُؤۡمِنِيۡنَ ﴿۱۰﴾ وَقَالَتۡ لِاُخۡتِهٖ قُصِّيۡهِ ۫
فَبَصُرَتۡ بِهٖ عَنۡ جُنُبٍ وَّهُمۡ لَا يَشۡعُرُوۡنَ ۙ﴿۱۱﴾
وَحَرَّمۡنَا عَلَيۡهِ الۡمَرَاضِعَ مِنۡ قَبۡلُ فَقَالَتۡ هَلۡ
اَدُلُّكُمۡ عَلٰۤى اَهۡلِ بَيۡتٍ يَّكۡفُلُوۡنَهٗ لَـكُمۡ وَهُمۡ لَهٗ
نٰصِحُوۡنَ ﴿۱۲﴾ فَرَدَدۡنٰهُ اِلٰٓى اُمِّهٖ كَىۡ تَقَرَّ عَيۡنُهَا وَ
لَا تَحۡزَنَ وَلِتَعۡلَمَ اَنَّ وَعۡدَ اللّٰهِ حَقٌّ وَّلٰـكِنَّ
اَكۡثَرَهُمۡ لَا يَعۡلَمُوۡنَ ﴿۱۳﴾ وَلَمَّا بَلَغَ اَشُدَّهٗ ع ۱۳
وَاسۡتَوٰۤى اٰتَيۡنٰهُ حُكۡمًا وَّعِلۡمًا ؕ وَكَذٰلِكَ
نَجۡزِى الۡمُحۡسِنِيۡنَ ﴿۱۴﴾ وَدَخَلَ الۡمَدِيۡنَةَ عَلٰى
حِيۡنِ غَفۡلَةٍ مِّنۡ اَهۡلِهَا فَوَجَدَ فِيۡهَا
رَجُلَيۡنِ يَقۡتَتِلٰنِ ۖ هٰذَا مِنۡ شِيۡعَتِهٖ وَهٰذَا
مِنۡ عَدُوِّهٖ ۚ فَاسۡتَغَاثَهُ الَّذِىۡ مِنۡ شِيۡعَتِهٖ عَلَى
الَّذِىۡ مِنۡ عَدُوِّهٖ ۙ فَوَكَزَهٗ مُوۡسٰى فَقَضٰى
عَلَيۡهِ ۖ قَالَ هٰذَا مِنۡ عَمَلِ الشَّيۡطٰنِ ؕ اِنَّهٗ
عَدُوٌّ مُّضِلٌّ مُّبِيۡنٌ ﴿۱۵﴾ قَالَ رَبِّ اِنِّىۡ ظَلَمۡتُ
نَفۡسِىۡ فَاغۡفِرۡ لِىۡ فَغَفَرَ لَهٗ ؕ اِنَّهٗ هُوَ الۡغَفُوۡرُ
الرَّحِيۡمُ ﴿۱۶﴾ قَالَ رَبِّ بِمَاۤ اَنۡعَمۡتَ عَلَىَّ فَلَنۡ
اَكُوۡنَ ظَهِيۡرًا لِّلۡمُجۡرِمِيۡنَ ﴿۱۷﴾

**10 - 13** అటు మూసా తల్లి హృదయం తల్లడిల్లిపోతోంది. ఆమె (మా వాగ్దానం ఆధారంగా) విశ్వసించే వారిలో ఉండి పోవాలని, మేము ఆమె హృదయాన్ని ధైర్యంతో నింపాము. లేకపోతే, ఆమె అతని రహస్యాన్ని బయటపెట్టి ఉండేదే. ఆమె మూసా సోదరితో, "అతనిని వెంబడిస్తూ వెళ్ళు" అని అన్నది. తదనుగుణంగా ఆమె దూర దూరంగా ఉంటూ అతనిని గమనించసాగింది. కాని అది వారికి (శత్రువులకు) తెలియదు. మేము మొదట్లోనే పాలుపట్టే స్త్రీల స్తనాల నుండి పిల్లవాడు పాలు తాగకుండా నిషేధించాము. (ఈ పరిస్థితిని చూసి) ఆ బాలిక వారితో ఇలా అన్నది, "అతనిని పెంచి పోషించే బాధ్యతను స్వీకరించే, అతని మేలును కోరే ఇంటి వారిని గురించి నేను మీకు తెలిపేదా?" ఈ విధంగా మేము మూసాను అతని తల్లి వద్దకు తిరిగి తీసుకువచ్చాము. ఆమె కన్నులకు చల్లదనం కలగాలని, ఆమె దుఃఖపడకుండా ఉండాలని. అల్లాహ్ వాగ్దానం నిజమైనదని ఆమె తెలుసుకోవాలని. కాని చాలామందికి ఈ విషయం తెలియదు.

**14 - 17** మూసా తన నిండు యౌవనదశకు చేరుకున్నప్పుడు, అతని పెరుగుదల పరిపక్వతను సంతరించుకున్నప్పుడు, మేము అతనికి వివేకాన్నీ, జ్ఞానాన్నీ ప్రసాదించాము. మేము సజ్జనులకు ఇలాంటి ప్రతిఫలాన్నే ఇస్తూ ఉంటాము. (ఒకనాడు) నగరవాసులు ఏమరుపాటులో ఉన్న సమయంలో అతను నగరంలోకి ప్రవేశించాడు. అక్కడ అతను ఇద్దరు వ్యక్తులు ఘర్షణపడుతూ ఉండటాన్ని చూశాడు. ఒకడు స్వయంగా అతని జాతికి చెందినవాడు, రెండోవాడు అతని శత్రుజాతికి చెందినవాడు. అతని జాతి వ్యక్తి శత్రుజాతి వానికి వ్యతిరేకంగా సహాయపడమని అతనిని పిలిచాడు. మూసా అతనిని ఒక గుద్దుతో కడతేర్చాడు. (ఇది జరగగానే) మూసా, "ఇది షైతాను నిర్వాకం. అతడు ప్రబల శత్రువు, స్పష్టంగా దారితప్పించేవాడు" అని అన్నాడు. తరువాత అతను ఇలా అన్నాడు, "నా ప్రభూ! నేను నా ఆత్మకు అన్యాయం చేశాను, నన్ను క్షమించు." అప్పుడు అల్లాహ్ అతనిని క్షమించాడు.[2] ఆయన క్షమించేవాడు, కరుణించేవాడూను. మూసా ఇలా ప్రతిజ్ఞ చేశాడు, "నా ప్రభూ! నీవు నాకు మహోపకారం చేశావు.[3] ఇకపై నేను ఎన్నడూ నేరస్తులకు సహాయపడబోను."

فَاَصْبَحَ فِی الْمَدِیْنَةِ خَآئِفًا یَّتَرَقَّبُ فَاِذَا
الَّذِی اسْتَنْصَرَهٗ بِالْاَمْسِ یَسْتَصْرِخُهٗ ؕ قَالَ
لَهٗ مُوْسٰۤی اِنَّكَ لَغَوِیٌّ مُّبِیْنٌ ﴿۱۸﴾ فَلَمَّاۤ اَنْ
اَرَادَ اَنْ یَّبْطِشَ بِالَّذِیْ هُوَ عَدُوٌّ لَّهُمَا ۙ
قَالَ یٰمُوْسٰۤی اَتُرِیْدُ اَنْ تَقْتُلَنِیْ كَمَا قَتَلْتَ
نَفْسًۢا بِالْاَمْسِ ۖۗ اِنْ تُرِیْدُ اِلَّاۤ اَنْ تَكُوْنَ
جَبَّارًا فِی الْاَرْضِ وَ مَا تُرِیْدُ اَنْ تَكُوْنَ مِنَ
الْمُصْلِحِیْنَ ﴿۱۹﴾ وَ جَآءَ رَجُلٌ مِّنْ اَقْصَا
الْمَدِیْنَةِ یَسْعٰی ؗ قَالَ یٰمُوْسٰۤی اِنَّ الْمَلَاَ
یَاْتَمِرُوْنَ بِكَ لِیَقْتُلُوْكَ فَاخْرُجْ اِنِّیْ لَكَ مِنَ
النّٰصِحِیْنَ ﴿۲۰﴾ فَخَرَجَ مِنْهَا خَآئِفًا یَّتَرَقَّبُ ؗ
قَالَ رَبِّ نَجِّنِیْ مِنَ الْقَوْمِ الظّٰلِمِیْنَ ﴿۲۱﴾ وَ ع ۲ ۸ ۵
لَمَّا تَوَجَّهَ تِلْقَآءَ مَدْیَنَ قَالَ عَسٰی رَبِّیْۤ
اَنْ یَّهْدِیَنِیْ سَوَآءَ السَّبِیْلِ ﴿۲۲﴾ وَلَمَّا وَرَدَ
مَآءَ مَدْیَنَ وَجَدَ عَلَیْهِ اُمَّةً مِّنَ النَّاسِ
یَسْقُوْنَ ۬ۖ وَ وَجَدَ مِنْ دُوْنِهِمُ امْرَاَتَیْنِ
تَذُوْدٰنِ ۚ قَالَ مَا خَطْبُكُمَا ؕ قَالَتَا لَا نَسْقِیْ
حَتّٰی یُصْدِرَ الرِّعَآءُ ٚ وَ اَبُوْنَا شَیْخٌ كَبِیْرٌ ﴿۲۳﴾
فَسَقٰی لَهُمَا ثُمَّ تَوَلّٰۤی اِلَی الظِّلِّ فَقَالَ رَبِّ اِنِّیْ
لِمَاۤ اَنْزَلْتَ اِلَیَّ مِنْ خَیْرٍ فَقِیْرٌ ﴿۲۴﴾ فَجَآءَتْهُ
اِحْدٰىهُمَا تَمْشِیْ عَلَی اسْتِحْیَآءٍ ؗ قَالَتْ اِنَّ
اَبِیْ یَدْعُوْكَ لِیَجْزِیَكَ اَجْرَ مَا سَقَیْتَ لَنَا ؕ
فَلَمَّا جَآءَهٗ وَ قَصَّ عَلَیْهِ الْقَصَصَ ۙ قَالَ لَا
تَخَفْ ٙ نَجَوْتَ مِنَ الْقَوْمِ الظّٰلِمِیْنَ ﴿۲۵﴾

**18 - 21** మరుసటి రోజు ఉదయం అతను భయపడుతూ, ఏదైనా ప్రమాదం ముంచుకొస్తుందేమో అని జాగ్రత్తగా నలువైపులా పరికిస్తూ నగరంలో పోతూ ఉండగా అంతకు ముందురోజు సహాయానికై తనను పిలిచిన వ్యక్తే ఈ రోజు మళ్లీ తనను పిలుస్తూ ఉండటాన్ని అకస్మాత్తుగా చూశాడు. అపుడు "నీవు పూర్తిగా మార్గం తప్పిన వాడవు" అని మూసా అన్నాడు. తరువాత శత్రుజాతి వ్యక్తిపై దాడి చేద్దామని మూసా అనుకున్నప్పుడు, అతడు బిగ్గరగా ఇలా అన్నాడు,[4] "మూసా! నీవు నిన్న ఒక వ్యక్తిని చంపినట్లుగానే ఈ రోజు నన్ను కూడ చంపేస్తావా? నీవు ఈ దేశంలో దౌర్జన్యపరుడవుగా ఉండదలచు కున్నావా, సంస్కరణ చేయదలచుకోలేదా?" దీని తరువాత ఒక వ్యక్తి నగరం యొక్క ఆ చివర నుండి పరుగెత్తుకుంటూ వచ్చి ఇలా చెప్పాడు,[5] "మూసా! సర్దారులు నిన్ను హత్య చేయటానికి సంప్రదింపులు జరుపుతున్నారు. ఇక్కడ నుంచి వెళ్లిపో, నేను నీ శ్రేయోభిలాషిని." ఈ వార్త విన్నంతనే, మూసా భయపడుతూ జాగ్రత్తగా బయలుదేరాడు. అతను ఇలా ప్రార్థించాడు, "నా ప్రభూ! నన్ను దుర్మార్గుల నుండి రక్షించు."

**22 - 25** (ఈజిప్టు నుండి బయలుదేరి) మూసా మద్యన్ వైపునకు తిరిగినప్పుడు ఇలా అనుకున్నాడు, "నా ప్రభువు నన్ను సరియైన మార్గంలో నడుపుతాడని ఆశిస్తున్నాను."[6] అతడు మద్యన్ బావి వద్దకు చేరుకున్నప్పుడు చాలమంది ప్రజలు తమ పశువులకు నీరు త్రాపటాన్నీ, వారికి దూరంగా ఒక ప్రక్క ఇద్దరు స్త్రీలు తమ పశువులను ఆపుతూ ఉండటాన్నీ చూశాడు. మూసా ఆ స్త్రీలను, "మీకు వచ్చిన చిక్కు ఏమిటి?" అని అడిగాడు. వారు ఇలా జవాబు చెప్పారు, "ఈ పశువుల కాపరులు తమ పశువులను తోలుకు పోవనంతవరకు మేము మా పశువులకు నీరు తాపలేము. మా తండ్రి గారు చాలా వృద్ధులు." ఇది విని మూసా వారి పశువులకు నీరు త్రాపాడు. తరువాత నీడ ఉన్న ఒక స్థలంలోకి పోయి కూర్చున్నాడు, ఇలా అన్నాడు, "స్వామీ! నీవు నాపై ఏ మేలును అవతరింపజేసినా, నేను దాని అవసరం కలవాడనే." (ఎంతో సేపు కాలేదు) ఆ ఇద్దరు స్త్రీలలోని ఒకామె సిగ్గుపడుతూ, బిడియపడుతూ అతని వద్దకు నడచి వచ్చి ఇలా చెప్పసాగింది, "నా తండ్రి గారు మిమ్మల్ని పిలుస్తున్నారు, మీరు మా పశువులను నీరు త్రాపించిన దానికి గాను మీకు ప్రతిఫలమీయడానికి." మూసా ఆయన వద్దకు వెళ్లి తన పూర్తి వృత్తాంతాన్ని వినిపించినప్పుడు, ఆయన ఇలా అన్నారు, "ఏ మాత్రం భయపడకు. ఇప్పుడు నీవు దుర్మార్గపు ప్రజల బారినుండి బయటపడ్డావు."

قَالَتْ اِحْدٰىهُمَا يٰۤاَبَتِ اسْتَاْجِرْهُ٘ ۚ اِنَّ خَيْرَ
مَنِ اسْتَاْجَرْتَ الْقَوِيُّ الْاَمِيْنُ ۝٢٦ قَالَ اِنِّيْۤ
اُرِيْدُ اَنْ اُنْكِحَكَ اِحْدَى ابْنَتَيَّ هٰتَيْنِ عَلٰۤى
اَنْ تَاْجُرَنِيْ ثَمٰنِيَ حِجَجٍ ۚ فَاِنْ اَتْمَمْتَ عَشْرًا
فَمِنْ عِنْدِكَ ۚ وَ مَاۤ اُرِيْدُ اَنْ اَشُقَّ عَلَيْكَ ؕ
سَتَجِدُنِيْۤ اِنْ شَآءَ اللّٰهُ مِنَ الصّٰلِحِيْنَ ۝٢٧
قَالَ ذٰلِكَ بَيْنِيْ وَ بَيْنَكَ ؕ اَيَّمَا الْاَجَلَيْنِ
قَضَيْتُ فَلَا عُدْوَانَ عَلَيَّ ؕ وَاللّٰهُ عَلٰى مَا نَقُوْلُ
وَكِيْلٌ ۝٢٨ ۧ فَلَمَّا قَضٰى مُوْسَى الْاَجَلَ وَسَارَ
بِاَهْلِهٖۤ اٰنَسَ مِنْ جَانِبِ الطُّوْرِ نَارًا ۚ قَالَ
لِاَهْلِهِ امْكُثُوْۤا اِنِّيْۤ اٰنَسْتُ نَارًا لَّعَلِّيْۤ اٰتِيْكُمْ
مِّنْهَا بِخَبَرٍ اَوْ جَذْوَةٍ مِّنَ النَّارِ لَعَلَّكُمْ
تَصْطَلُوْنَ ۝٢٩

**26 - 28** ఆ ఇద్దరు స్త్రీలలోని ఒకామె తన తండ్రితో ఇలా అన్నది, "నాన్నా ఈ వ్యక్తిని నౌకరుగా పెట్టుకొనండి. బలవంతుడూ, నమ్మకస్తుడూ అయినవాడే మీరు నౌకరుగా పెట్టుకోవటానికి అన్ని విధాలా ఉత్తముడు." ఆమె తండ్రి (మూసాతో) ఇలా అన్నాడు, "నీవు నా వద్ద ఎనిమిది సంవత్సరాల వరకు నౌకరుగా ఉండే షరతుకు ఒప్పుకుంటే నా ఇద్దరు కుమార్తెలలో ఒకామెను నీకిచ్చి వివాహం చేయదలచుకున్నాను. ఒకవేళ పది సంవత్సరాలు పూర్తిచేయదలిస్తే అది నీ ఇష్టం. నేను నిన్ను బలవంతం చేయదలచుకోలేదు. అల్లాహ్ కోరితే నీవు నన్ను మంచి మనిషిగా చూస్తావు." మూసా ఇలా జవాబు పలికాడు, "ఈ విషయం మీకూ నాకూ మధ్య నిర్ణయమైపోయినట్లే. ఈ రెండు గడువులలో నేను దేన్ని పూర్తిచేసినా, దాని తరువాత మటుకు నాపై ఏ విధమైన ఒత్తిడి తీసుకు రాకూడదు. మనం ఖరారు చేసుకున్న మాటకు అల్లాహ్‌యే సాక్షి."

**29 - 35** గడువును పూర్తి చేసిన మూసా తన కుటుంబ సభ్యులను తీసుకుని ప్రయాణమైపోతూ ఉండగా, తూర్ పర్వతం ఉన్న దిక్కున ఒక మంట కనిపించింది. అతను తన ఇంటివారితో ఇలా అన్నాడు, "ఆగండి, నేను ఒక మంటను చూశాను, బహుశా నేను అక్కడ నుంచి ఏదైనా సమాచారాన్నయినా తీసుకొని వస్తాను, లేదా ఆ మంట నుండి నిప్పురవ్వనైనా పట్టుకొని వస్తాను, దానితో మీరు చలి కాచుకుందురు గాని."

1. ఇటువంటి పరిస్థితులలోనే ఇస్రాయీలు వంశీయులందు ఒక ఇంట్లో ఒక బాలుడు పుట్టాడు. అతను తరువాత దైవప్రవక్త మూసా (అస్సలామ్)గా ప్రపంచంలో ప్రసిద్ధిగాంచాడు. ఈ ప్రస్తావన మధ్యలో విడిచిపెట్టబడింది.
2. క్షమించుట అంటే, ఉపేక్షించుట, మన్నించుట అనే అర్థాలు కూడా ఉన్నాయి. కప్పిపుచ్చుట, మరుగుపరచుట అనే అర్థం కూడ ఉన్నది. హ్రజత్ మూసా ప్రార్థనలోని ఆంతర్యం ఏమిటంటే, "నేను చేసిన ఈ నేరాన్ని (దానిని నేను బుద్ధిపూర్వకంగా చేసింది కాదని నీకు తెలుసు) క్షమించు, శత్రువులకు తెలియకుండా దానిని కప్పిపుచ్చు."
3. అంటే, నేను చేసిన నేరం పైకి పొక్కలేదు, శత్రు జాతికి చెందిన వ్యక్తి ఎవడూ నన్ను చూడలేదు. తప్పించుకుని సురక్షితంగా పారిపోయే అవకాశం లభించింది.
4. ఈ మొరపెట్టుకునేవాడు హ్రజత్ మూసా (అస్సలామ్) సహాయం చేసిన ఇస్రాయీలు సంతతివాడే. అతనిని చీవాట్లు పెట్టిన తరువాత, మూసా (అస్సలామ్) ఈజిప్టు వాసిని కొట్టటానికి ముందుకుపోయినప్పుడు, ఇస్రాయీలు సంతతివాడు మూసా తనను కొట్టటానికి వస్తున్నాడనే భావంతో, అరవటం ప్రారంభించాడు; తెలివి తక్కువతనం వలన, గత దినం జరిగిన హత్యారహస్యాన్ని బయటపెట్టాడు.
5. అంటే, రెండో ఘర్షణలో హత్యారహస్యం బయటకు పొక్కగా ఈజిప్టువాసి ఈ విషయాన్ని పై అధికారులకు యథారీతిగా వివరించినపుడు ఈ సంఘటన జరిగింది.

فَلَمَّآ اَتٰىهَا نُوْدِيَ مِنْ شَاطِئِ الْوَادِ الْاَيْمَنِ
فِي الْبُقْعَةِ الْمُبٰرَكَةِ مِنَ الشَّجَرَةِ اَنْ يّٰمُوْسٰٓى
اِنِّيْٓ اَنَا اللّٰهُ رَبُّ الْعٰلَمِيْنَ ۳۰ وَاَنْ اَلْقِ
عَصَاكَ ؕ فَلَمَّا رَاٰهَا تَهْتَزُّ كَاَنَّهَا جَآنٌّ وَّلّٰى
مُدْبِرًا وَّلَمْ يُعَقِّبْ ؕ يٰمُوْسٰٓى اَقْبِلْ وَلَا
تَخَفْ ࣞ اِنَّكَ مِنَ الْاٰمِنِيْنَ ۳۱ اُسْلُكْ يَدَكَ
فِيْ جَيْبِكَ تَخْرُجْ بَيْضَآءَ مِنْ غَيْرِ سُوْٓءٍ ز وَّ
اضْمُمْ اِلَيْكَ جَنَاحَكَ مِنَ الرَّهْبِ فَذٰنِكَ
بُرْهَانٰنِ مِنْ رَّبِّكَ اِلٰى فِرْعَوْنَ وَمَلَا۟ئِهٖ ؕ
اِنَّهُمْ كَانُوْا قَوْمًا فٰسِقِيْنَ ۳۲ قَالَ رَبِّ اِنِّيْ
قَتَلْتُ مِنْهُمْ نَفْسًا فَاَخَافُ اَنْ يَّقْتُلُوْنِ ۳۳
وَاَخِيْ هٰرُوْنُ هُوَ اَفْصَحُ مِنِّيْ لِسَانًا فَاَرْسِلْهُ
مَعِيَ رِدْاً يُّصَدِّقُنِيْٓ ز اِنِّيْٓ اَخَافُ اَنْ
يُّكَذِّبُوْنِ ۳۴ قَالَ سَنَشُدُّ عَضُدَكَ بِاَخِيْكَ
وَنَجْعَلُ لَكُمَا سُلْطٰنًا فَلَا يَصِلُوْنَ اِلَيْكُمَا ۚ معانقة ١١
بِاٰيٰتِنَا ۚ اَنْتُمَا وَمَنِ اتَّبَعَكُمَا الْغٰلِبُوْنَ ۳۵ فَلَمَّا
جَآءَهُمْ مُّوْسٰى بِاٰيٰتِنَا بَيِّنٰتٍ قَالُوْا مَا هٰذَآ
اِلَّا سِحْرٌ مُّفْتَرًى وَّمَا سَمِعْنَا بِهٰذَا فِيْٓ اٰبَآئِنَا
الْاَوَّلِيْنَ ۳۶ وَقَالَ مُوْسٰى رَبِّيْٓ اَعْلَمُ بِمَنْ
جَآءَ بِالْهُدٰى مِنْ عِنْدِهٖ وَمَنْ تَكُوْنُ لَهٗ
عَاقِبَةُ الدَّارِ ؕ اِنَّهٗ لَا يُفْلِحُ الظّٰلِمُوْنَ ۳۷

అక్కడకు చేరినప్పుడు లోయ కుడిగట్టుపై[7] ఉన్న ఒక శుభవంతమైన స్థలంలోని ఒక చెట్టు నుండి ఒక పిలుపు వినవచ్చింది. “మూసా! నేను అల్లాహ్‌ను, సకల లోకాలకు ప్రభువును.” తరువాత “నీ కర్రను విసురు” (అని ఆజ్ఞాపించబడింది). ఆ కర్ర పాము మాదిరిగా కదలడం చూడగానే మూసా వెనక్కి తిరిగి పరుగెత్తాడు - తిరిగి కూడా చూడలేదు. (ఇలా సెలవీయబడింది), “మూసా! తిరిగి రా, భయపడకు, నీవు సురక్షితంగానే ఉన్నావు. నీ చేతిని ఛాతీ చొక్కాలోనికి పైకి దూర్చు, నీకు ఏ విధమైన నొప్పి కలిగించకుండానే అది ప్రకాశిస్తూ బయటికి వస్తుంది. భయం నుండి కాపాడుకోవటానికి నీ భుజాన్ని ప్రక్కకు అదుముకో.[8] ఇవి స్పష్టమైన రెండు సూచనలు, నీ ప్రభువు తరఫు నుండి, ఫిర్ఔన్, అతడి దర్బారీల ముందు ఉంచటానికి. వారు పరమ అవిధేయులు.” మూసా ఇలా మనవి చేసుకున్నాడు, “నా ప్రభూ! నేను వారి మనిషి నొకణ్ణి హత్య చేశాను. వారు నన్ను హత్య చేస్తారేమో అని భయపడుతున్నాను. నా సోదరుడు హారూన్ నా కంటే మంచి వాగ్ధాటి కలవాడు, నన్ను సమర్థించటానికి అతనిని సహాయకుడుగా నాతో పంపు. వారు నన్ను అసత్యవాదిగా తిరస్కరిస్తారేమో అని భయపడుతున్నాను.” ఇలా సెలవిచ్చాడు, “మేము నీ సోదరుని ద్వారా నీ చేతులకు బలాన్ని సమకూరుస్తాము. మేము మీ ఉభయులకు ఒక విశేషశక్తిని ప్రసాదిస్తాము. కాబట్టి వారు మీకు ఏమాత్రం హాని చేయలేరు. మా సూచనల బలం ఆధారంగా, ప్రాబల్యం మీదే, మీ అనుచరులదే అవుతుంది.”

**36 - 37** తరువాత మూసా, ఆ ప్రజల వద్దకు స్పష్టమైన మా సూచనలతో వెళ్లినప్పుడు, వారు ఇలా అన్నారు, “ఇది మాయాజాలం తప్ప మరేమీ కాదు. ఈ మాటలను మేము మా తాతముత్తాతల కాలంలో కూడ ఎన్నడూ వినలేదు.” మూసా ఇలా సమాధానమిచ్చాడు, “నా ప్రభువు తన వద్దనుండి మార్గదర్శకత్వాన్ని తీసుకొని వచ్చిన వ్యక్తి స్థితి ఎటువంటిదో బాగా ఎరుగును. ఇంకా చివర్లో ఎవరి పర్యవసానం మంచిదవుతుందో ఆయనకే బాగా తెలుసు. సత్యం ఏమిటంటే దుర్మార్గులు ఎన్నడూ సాఫల్యం పొందలేరు.”

6. అంటే, నేను సురక్షితంగా మద్యన్‌కు చేరుకోగల మార్గము అని అర్థము.
7. అంటే, హజ్రత్ మూసా (అస్సలామ్)కు కుడిపక్కన ఉన్నటువంటి గట్టు అని అర్థం.

وَ قَالَ فِرْعَوْنُ يٰٓاَيُّهَا الْمَلَاُ مَا عَلِمْتُ لَكُمْ
مِّنْ اِلٰهٍ غَيْرِيْ ۚ فَاَوْقِدْ لِيْ يٰهَامٰنُ عَلَى الطِّيْنِ
فَاجْعَلْ لِّيْ صَرْحًا لَّعَلِّيْٓ اَطَّلِعُ اِلٰٓى اِلٰهِ مُوْسٰى ۙ
وَاِنِّيْ لَاَظُنُّهٗ مِنَ الْكٰذِبِيْنَ ﴿٣٨﴾ وَاسْتَكْبَرَ هُوَ وَ
جُنُوْدُهٗ فِي الْاَرْضِ بِغَيْرِ الْحَقِّ وَ ظَنُّوْٓا اَنَّهُمْ
اِلَيْنَا لَا يُرْجَعُوْنَ ﴿٣٩﴾ فَاَخَذْنٰهُ وَ جُنُوْدَهٗ
فَنَبَذْنٰهُمْ فِي الْيَمِّ ۚ فَانْظُرْ كَيْفَ كَانَ عَاقِبَةُ
الظّٰلِمِيْنَ ﴿٤٠﴾ وَ جَعَلْنٰهُمْ اَىِٕمَّةً يَّدْعُوْنَ اِلَى
النَّارِ ۚ وَيَوْمَ الْقِيٰمَةِ لَا يُنْصَرُوْنَ ﴿٤١﴾ وَ
اَتْبَعْنٰهُمْ فِيْ هٰذِهِ الدُّنْيَا لَعْنَةً ۚ وَ يَوْمَ الْقِيٰمَةِ
هُمْ مِّنَ الْمَقْبُوْحِيْنَ ﴿٤٢﴾ وَ لَقَدْ اٰتَيْنَا مُوْسَى
الْكِتٰبَ مِنْۢ بَعْدِ مَآ اَهْلَكْنَا الْقُرُوْنَ الْاُوْلٰى
بَصَآىِٕرَ لِلنَّاسِ وَ هُدًى وَّ رَحْمَةً لَّعَلَّهُمْ
يَتَذَكَّرُوْنَ ﴿٤٣﴾ وَمَا كُنْتَ بِجَانِبِ الْغَرْبِيِّ اِذْ
قَضَيْنَآ اِلٰى مُوْسَى الْاَمْرَ وَمَا كُنْتَ مِنَ
الشّٰهِدِيْنَ ﴿٤٤﴾ ۙ وَ لٰكِنَّآ اَنْشَاْنَا قُرُوْنًا فَتَطَاوَلَ
عَلَيْهِمُ الْعُمُرُ ۚ وَ مَا كُنْتَ ثَاوِيًا فِيْٓ اَهْلِ مَدْيَنَ
تَتْلُوْا عَلَيْهِمْ اٰيٰتِنَا ۙ وَ لٰكِنَّا كُنَّا مُرْسِلِيْنَ ﴿٤٥﴾
وَمَا كُنْتَ بِجَانِبِ الطُّوْرِ اِذْ نَادَيْنَا وَلٰكِنْ
رَّحْمَةً مِّنْ رَّبِّكَ لِتُنْذِرَ قَوْمًا مَّآ اَتٰىهُمْ مِّنْ
نَّذِيْرٍ مِّنْ قَبْلِكَ لَعَلَّهُمْ يَتَذَكَّرُوْنَ ﴿٤٦﴾ وَ لَوْ
لَآ اَنْ تُصِيْبَهُمْ مُّصِيْبَةٌۢ بِمَا قَدَّمَتْ اَيْدِيْهِمْ
فَيَقُوْلُوْا رَبَّنَا لَوْ لَآ اَرْسَلْتَ اِلَيْنَا رَسُوْلًا
فَنَتَّبِعَ اٰيٰتِكَ وَ نَكُوْنَ مِنَ الْمُؤْمِنِيْنَ ﴿٤٧﴾

**38** ఫిరౌను ఇలా అన్నాడు, "సభ్యులారా! నేను కాక మీకు మరొక దేవుడెవడైనా ఉన్నాడేమో నేను ఎరుగను. హామాన్! ఇటుకలను కాల్చి నాకై ఒక ఎత్తైన కట్టడాన్ని నిర్మాణం చేయించు. దానిపైకి ఎక్కి బహుశా నేను మూసా దేవుణ్ణి చూడగలనేమో. నేను అతణ్ణి అసత్యవాదిగా పరిగణిస్తున్నాను."

**39 - 42** భూమిపై అతడూ, అతడి సైన్యాలూ ఏ విధమైన హక్కు లేకుండానే తమ పెద్దరికపు అహంభావాన్ని ప్రదర్శించారు. మా వైపునకు తాము ఎన్నడూ మరలిరావటమనేదే ఉండదని వారు భావించారు. చివరకు మేము అతనినీ అతని సైన్యాలనూ పట్టుకుని సముద్రంలోకి విసరివేశాము. చూడు ఆ దుర్మార్గులకు ఏ గతి పట్టిందో. మేము వారిని నరకం వైపునకు ప్రజలను ఆహ్వానించే నాయకులుగా చేశాము. ప్రళయంనాడు వారు ఎక్కడ నుంచీ ఏ సహాయాన్నీ పొందలేరు. మేము ఈ ప్రపంచంలో అభిశాపం వారిని వెంటాడేలా చేశాము. ప్రళయం నాడు వారు ఘోర దురవస్థకు గురి అవుతారు.

**43 - 47** పూర్వపు తరాల వారిని నాశనం చేసిన తరువాత, మేము మూసాకు గ్రంథాన్ని ప్రసాదించాము; మానవుల కొరకు దూరదృష్టి సాధనంగా చేసి, మార్గదర్శకత్వంగా, కారుణ్యంగా చేసి, తద్వారా వారు బహుశా గుణపాఠం నేర్చుకుంటారేమో అని. (ప్రవక్తా!) మేము మూసాకు ఈ షరియత్తు ఆదేశాన్ని ప్రసాదించినప్పుడు నీవు పశ్చిమ దిశలో లేవు.[9] ఇంకా, నీవు సాక్షులలోనూ లేవు. అంతేకాదు, దాని తరువాత (నీ కాలం వరకు) మేము ఎన్నో తరాల వారిని ప్రభవింపజేశాము, వారి మీదుగా ఒక సుదీర్ఘ కాలం గడిచిపోయింది. నీవు మద్యన్ వాసులలో కూడా నివసించి ఉండలేదు, వారికి మా ఆయతులను వినిపించి ఉండటానికి. కాని (అప్పటి ఈ వార్తలను) పంపేవారము మేమే. మేము (మూసాను ప్రప్రథమంగా) పిలిచినప్పుడు, నీవు తూర్ పర్వతం అడుగుభాగాన కూడా లేవు. కాని ఇది నీ ప్రభువు కారుణ్యం (నీకు ఈ సమాచారం అందించబడుతోంది), నీకు పూర్వం హెచ్చరిక చేసే వాడెవ్వడూ రాని ప్రజల వద్దకు నీవు పోయి హెచ్చరించటానికి; బహుశా వారు స్పృహలోకి వస్తారేమో అని. (మేము ఇలా ఎందుకు చేశామంటే), వారు స్వయంగా తాము చేసుకున్న కర్మల ఫలితంగా ఏదైనా ఆపద వారిపైకి వచ్చినప్పుడు, వారు "ప్రభూ! నీవు మా వద్దకు ఒక ప్రవక్తను ఎందుకు పంపలేదు. మేము నీ ఆయతులను తలదాల్చి ఉండేవారము కదా, విశ్వాసులలో చేరి ఉండే వారము కదా!" అని అనకుండా ఉండేటందుకు.

فَلَمَّا جَآءَهُمُ الْحَقُّ مِنْ عِنْدِنَا قَالُوْا لَوْ لَآ
أُوْتِيَ مِثْلَ مَآ أُوْتِيَ مُوْسٰى ؕ اَوَ لَمْ يَكْفُرُوْا
بِمَآ أُوْتِيَ مُوْسٰى مِنْ قَبْلُ ۚ قَالُوْا سِحْرٰنِ
تَظٰهَرَا ۣ وَقَالُوْٓا اِنَّا بِكُلٍّ كٰفِرُوْنَ ﴿٤٨﴾ قُلْ
فَاْتُوْا بِكِتٰبٍ مِّنْ عِنْدِ اللّٰهِ هُوَ اَهْدٰى مِنْهُمَآ
اَتَّبِعْهُ اِنْ كُنْتُمْ صٰدِقِيْنَ ﴿٤٩﴾ فَاِنْ لَّمْ
يَسْتَجِيْبُوْا لَكَ فَاعْلَمْ اَنَّمَا يَتَّبِعُوْنَ
اَهْوَآءَهُمْ ؕ وَمَنْ اَضَلُّ مِمَّنِ اتَّبَعَ هَوٰىهُ
بِغَيْرِ هُدًى مِّنَ اللّٰهِ ؕ اِنَّ اللّٰهَ لَا يَهْدِي
الْقَوْمَ الظّٰلِمِيْنَ ﴿٥٠﴾ وَ لَقَدْ وَصَّلْنَا لَهُمُ
الْقَوْلَ لَعَلَّهُمْ يَتَذَكَّرُوْنَ ﴿٥١﴾ اَلَّذِيْنَ اٰتَيْنٰهُمُ
الْكِتٰبَ مِنْ قَبْلِهٖ هُمْ بِهٖ يُؤْمِنُوْنَ ﴿٥٢﴾ وَ اِذَا
يُتْلٰى عَلَيْهِمْ قَالُوْٓا اٰمَنَّا بِهٖٓ اِنَّهُ الْحَقُّ مِنْ
رَّبِّنَآ اِنَّا كُنَّا مِنْ قَبْلِهٖ مُسْلِمِيْنَ ﴿٥٣﴾ اُولٰٓئِكَ
يُؤْتَوْنَ اَجْرَهُمْ مَّرَّتَيْنِ بِمَا صَبَرُوْا
وَيَدْرَءُوْنَ بِالْحَسَنَةِ السَّيِّئَةَ وَ مِمَّا رَزَقْنٰهُمْ
يُنْفِقُوْنَ ﴿٥٤﴾ وَ اِذَا سَمِعُوا اللَّغْوَ اَعْرَضُوْا
عَنْهُ وَ قَالُوْا لَنَآ اَعْمَالُنَا وَلَكُمْ اَعْمَالُكُمْ ۫
سَلٰمٌ عَلَيْكُمْ ۫ لَا نَبْتَغِي الْجٰهِلِيْنَ ﴿٥٥﴾ اِنَّكَ لَا
تَهْدِيْ مَنْ اَحْبَبْتَ وَ لٰكِنَّ اللّٰهَ يَهْدِيْ مَنْ
يَّشَآءُ ۚ وَ هُوَ اَعْلَمُ بِالْمُهْتَدِيْنَ ﴿٥٦﴾

النصف

**48 - 51** కాని మా తరఫు నుండి వారి వద్దకు సత్యం వచ్చిన తరువాత వారు ఇలా అన్నారు, "మూసాకు ఇవ్వబడిందే ఇతనికీ ఎందుకీయబడలేదు." ఇదివరకు మూసాకు ఇవ్వబడిన దానిని[10] వారు తిరస్కరించి ఉండలేదా? వారు, "రెండూ మాయాజాలాలే.[11] అవి ఒకదానికొకటి సహాయపడతాయి" అని అన్నారు. ఇంకా వారు, "మేము దేనినీ విశ్వసించము" అని కూడా అన్నారు. (ప్రవక్తా!) వారితో ఇలా అను, "సరే మీరు నిజాయితీపరులే అయితే అల్లాహ్ దగ్గర నుండి, ఈ రెండింటి కంటే మెరుగైన మార్గదర్శకత్వాన్ని ప్రసాదించే ఒక గ్రంథాన్ని తీసుకురండి. నేను దానిని అనుసరిస్తాను. ఇప్పుడు వారు నీ ఈ కోర్కెను తీర్చకపోతే అసలు వారు తమ మనో వాంఛలను అనుసరించేవారని తెలుసుకో. దేవుని మార్గదర్శకత్వం లేకుండా కేవలం తన కోరికలను అనుసరించే వ్యక్తి కంటే పరమ మార్గభ్రష్టుడెవడు? అటువంటి దుర్మార్గులకు అల్లాహ్ తన మార్గదర్శకత్వాన్ని ఎంతమాత్రం ప్రసాదించడు. (హితబోధ యొక్క) వచనాన్ని మేము ఎడతెగకుండా వారికి అందజేశాము, వారు ఏమరుపాటు నుండి మేల్కోవాలని.

**52 - 56** ఇంతకు పూర్వం మేము గ్రంథాన్ని ఇచ్చిన ప్రజలు దీనిని (ఖురాన్‌ను) విశ్వసిస్తారు.[12] ఇది వారికి వినిపించబడినప్పుడు, వారు ఇలా అంటారు, "మేము దీనిని విశ్వసించాము. ఇది నిజంగానే మా ప్రభువు తరఫు నుండి వచ్చిన సత్యం. మేము మొదటి నుండీ ముస్లిములమే." తాము చూపిన స్థైర్యానికి ఫలితంగా తమ ప్రతిఫలాన్ని రెండుసార్లు[13] పొందే వారు వారే. వారు చెడును మంచితో నివారిస్తారు. మేము వారికి ఇచ్చిన జీవనోపాధి నుండి ఖర్చు పెడతారు. వారు ఎప్పుడైనా అసహ్యకరమైన మాటను వింటే, ఇలా అంటూ దూరంగా జరిగిపోతారు, "మా కర్మలు మావి. మీ కర్మలు మీవి. మీకో సలామ్. మేము అజ్ఞానుల పద్ధతిని అవలంబించ దలచుకోలేదు."[14] ప్రవక్తా! నీకు ఇష్టమైన వారికి నీవు మార్గదర్శకత్వాన్ని ప్రసాదించలేవు. కాని అల్లాహ్ తనకు ఇష్టమైన వారికి మార్గదర్శకత్వాన్ని ప్రసాదించగలడు, ఆయన తన మార్గదర్శకత్వాన్ని స్వీకరించేవారిని బాగా ఎరుగును.

وَ قَالُوْۤا اِنْ نَّتَّبِعِ الْهُدٰى مَعَكَ نُتَخَطَّفْ
مِنْ اَرْضِنَا ؕ اَوَ لَمْ نُمَكِّنْ لَّهُمْ حَرَمًا اٰمِنًا
يُّجْبٰۤى اِلَيْهِ ثَمَرٰتُ كُلِّ شَیْءٍ رِّزْقًا مِّنْ لَّدُنَّا
وَلٰكِنَّ اَكْثَرَهُمْ لَا يَعْلَمُوْنَ ۝ وَ كَمْ اَهْلَكْنَا
مِنْ قَرْيَةٍۭ بَطِرَتْ مَعِيْشَتَهَا ۚ فَتِلْكَ مَسٰكِنُهُمْ
لَمْ تُسْكَنْ مِّنْۢ بَعْدِهِمْ اِلَّا قَلِيْلًا ؕ وَ كُنَّا
نَحْنُ الْوٰرِثِيْنَ ۝ وَ مَا كَانَ رَبُّكَ مُهْلِكَ
الْقُرٰى حَتّٰى يَبْعَثَ فِیْۤ اُمِّهَا رَسُوْلًا يَّتْلُوْا
عَلَيْهِمْ اٰيٰتِنَا ۚ وَ مَا كُنَّا مُهْلِكِی الْقُرٰۤى اِلَّا
وَ اَهْلُهَا ظٰلِمُوْنَ ۝

**57 ...** వారు ఇలా అంటారు, "ఒకవేళ నీతోపాటు మేము కూడా ఈ మార్గదర్శకత్వాన్ని అవలంబిస్తే, మేము మా భూభాగం నుండి తొలగింపబడతాము.[15]

**... 57** మేము శాంతికి నిలయమైన ఒక పవిత్ర స్థలాన్ని వారికి స్థిర నివాసంగా చేయటం, దాని వైపునకు అన్ని రకాల పండ్లూ, ఫలాలూ మా తరఫు నుండి జీవనోపాధిగా రావటం వాస్తవం కాదా?" కాని వారిలో చాలా మందికి తెలియదు.[16]

**58** మేము ఎన్ని జనపదాలను నాశనం చేయలేదు; వాటి ప్రజలు తమ సంపదను చూచుకుని పొంగిపోయేవారు. అవిగో చూడు, వారి నివాసాలు ఎలా పడి ఉన్నాయో, వారి తరువాత వాటిలో నివసించిన వారూ చాలా తక్కువే. చివరకు మేమే వారసులమయ్యాము.[17]

**59** నీ ప్రభువు జనపదాలను ఎంతమాత్రం నాశనం చేయడు. వాటి కేంద్రాలకు మా ఆయతులను వినిపించే ప్రవక్తలను పంపనంతవరకు. మేము జనపదాలను, వాటి ప్రజలు దుర్మార్గులయిపోతే తప్ప[18] ఎంతమాత్రం నాశనం చేయము.

8. అంటే, ఎప్పుడైనా నీ హృదయంలో భయాన్ని కలిగించే విపత్కర సందర్భం ఏర్పడినప్పుడు, నీ భుజాన్ని వెనక్కి ముడుచుకో. దీనివలన నీ హృదయం గట్టిపడుతుంది. ఇక భయం అనేది నీలో మిగిలి ఉండదు.
9. పశ్చిమ దిశ అంటే, సినాయి పర్వతం. అది హిజాజ్‌కు పడమరగా ఉన్నది.
10. అంటే, మక్కా అవిశ్వాసులు మూసా ప్రవక్తను ఎప్పుడు విశ్వసించారు కనుక, మూసా ప్రవక్తకు ఇవ్వబడినటువంటి మహిమలు ముహమ్మద్ (సఅసమ్)కు ఎందుకు ఇవ్వబడలేదు అని అడగటానికి.
11. అంటే, దివ్య ఖురాను, తౌరాతు గ్రంథాలు రెండూను.
12. గ్రంథ ప్రజలు అందరూ (యూదులు, క్రైస్తవులు) దివ్య ఖురానును విశ్వసిస్తారు అని దీని అర్థం కాదు. కాని వాస్తవానికి ఈ సూరా అవతరించేటప్పుడు జరిగిన ఒక సంఘటనను ఇది సూచిస్తుంది. మక్కావాసులు సిగ్గుపడేలా చేయటమే దీని లక్ష్యం: "సిరి రా మోకాలొడ్డినట్లు" మీరు మీ ఇంటికి వచ్చిన అదృష్టాన్ని కాలదన్నారు కదా! ఎక్కడెక్కడ ప్రజలు ఈ వార్తను విని ఇక్కడకు వస్తున్నారు, దాని విలువను గుర్తిస్తున్నారు, దాని వలన ఫలాన్ని పొందుతున్నారు. ఇక్కడ సూచించబడిన సంఘటన ఏమిటంటే హబష్ అనే ప్రాంతం నుండి సుమారు ఓ 20 మంది క్రైస్తవులు మహాప్రవక్త (సఅసమ్)ను దర్శించారు, ఆయన నుండి దివ్య ఖురానును విని, ఇస్లామ్ ధర్మాన్ని విశ్వసించారు.
13. అంటే, ఒక ప్రతిఫలం పూర్వపు గ్రంథాలను విశ్వసించినందుకు; రెండో ప్రతిఫలం దివ్య ఖురానును విశ్వసించి నందుకు.
14. వారు ఇస్లామ్ ధర్మాన్ని విశ్వసించినప్పుడు అబూజహల్ వారిని దూషించాడు. ఈ విషయమే ఇక్కడ ప్రస్తావించబడింది.

**60 - 61** మీకు ఇవ్వబడింది కేవలం ప్రాపంచిక జీవితపు సామగ్రి మరియు అలంకరణలు మాత్రమే. అల్లాహ్ వద్ద ఉన్నది దీనికంటె ఉత్తమమైనది, నిత్యమైనది. మీరు ఆలోచించరా? మేము తనకు చేసిన మంచి వాగ్దానాన్ని తప్పకుండా పొందనున్న వ్యక్తి, మేము కేవలం ఇహలోక జీవన సామగ్రి ఇచ్చిన తరువాత ప్రళయంనాడు శిక్షకై హాజరుపరచబడనున్న వ్యక్తీ ఒకటవుతారా?

**62 - 64** (వారు మరచిపోకూడదు) ఆ దినాన్ని. అప్పుడు ఆయన వారిని పిలిచి, "మీరు, నా భాగస్వాములుగా భావించిన వారెక్కడున్నారు?" అని అడుగుతాడు. ఈ మాట ఎవరికి వర్తిస్తుందో వారు ఇలా అంటారు, "మా ప్రభూ! నిస్సందేహంగా మేము అపమార్గం పట్టించింది వారినే. స్వయంగా మేము అపమార్గం పట్టిన విధంగానే,[19] మేమూ వారిని అపమార్గం పట్టించాము. వారిని గురించి మాకు ఏ విధమైన బాధ్యత లేదని మేము నీ సమక్షంలో ప్రకటిస్తున్నాము. అసలు వారు మమ్మల్ని పూజించనే లేదు."[20] తరువాత వారితో, "మీరు నిలబెట్టిన భాగస్వాములను ఇప్పుడు పిలవండి," అని అనబడుతుంది. వారు వారిని పిలుస్తారు; కాని వారు వారికి ఏ సమాధానమూ ఇవ్వరు. వారు శిక్షను చూస్తారు. అయ్యో! వారు సన్మార్గాన్ని అవలంబించి ఉంటే ఎంత బాగుండేది.

**65 - 67** (వారు విస్మరించకూడదు) ఆ దినాన్ని. అప్పుడు ఆయన వారిని పిలిచి, "పంపబడిన సందేశహరులకు మీరు ఏమని సమాధానమిచ్చారు?" అని అడుగుతాడు. ఆ సమయంలో వారికి ఏ సమాధానమూ తోచదు, వారు ఒకరినొకరు సంప్రదించుకోనూలేరు. అయితే ఎవడు ఇక్కడ పశ్చాత్తాప పడతాడో విశ్వసించి, మంచి పనులు చేస్తాడో, అతడు అక్కడ సాఫల్యం పొందేవారి మధ్య ఉండగలను అని ఆశించగలుగుతాడు.

وَمَآ أُوتِيتُم مِّن شَيْءٍ فَمَتَاعُ الْحَيٰوةِ الدُّنْيَا
وَزِينَتُهَا ۚ وَمَا عِندَ اللّٰهِ خَيْرٌ وَّأَبْقٰى ۚ أَفَلَا
تَعْقِلُونَ ﴿٦٠﴾ أَفَمَن وَّعَدْنٰهُ وَعْدًا حَسَنًا فَهُوَ ع
لَاقِيهِ كَمَن مَّتَّعْنٰهُ مَتَاعَ الْحَيٰوةِ الدُّنْيَا ثُمَّ
هُوَ يَوْمَ الْقِيٰمَةِ مِنَ الْمُحْضَرِينَ ﴿٦١﴾ وَيَوْمَ
يُنَادِيهِمْ فَيَقُولُ أَيْنَ شُرَكَآءِيَ الَّذِينَ كُنتُمْ
تَزْعُمُونَ ﴿٦٢﴾ قَالَ الَّذِينَ حَقَّ عَلَيْهِمُ الْقَوْلُ
رَبَّنَا هٰٓؤُلَآءِ الَّذِينَ أَغْوَيْنَا ۚ أَغْوَيْنٰهُمْ كَمَا
غَوَيْنَا ۚ تَبَرَّأْنَآ إِلَيْكَ ۖ مَا كَانُوٓا إِيَّانَا
يَعْبُدُونَ ﴿٦٣﴾ وَقِيلَ ادْعُوا شُرَكَآءَكُمْ
فَدَعَوْهُمْ فَلَمْ يَسْتَجِيبُوا لَهُمْ وَرَأَوُا
الْعَذَابَ ۚ لَوْ أَنَّهُمْ كَانُوا يَهْتَدُونَ ﴿٦٤﴾ وَيَوْمَ
يُنَادِيهِمْ فَيَقُولُ مَاذَآ أَجَبْتُمُ الْمُرْسَلِينَ ﴿٦٥﴾
فَعَمِيَتْ عَلَيْهِمُ الْأَنۢبَآءُ يَوْمَئِذٍ فَهُمْ لَا
يَتَسَآءَلُونَ ﴿٦٦﴾ فَأَمَّا مَن تَابَ وَءَامَنَ وَعَمِلَ
صَالِحًا فَعَسٰٓى أَن يَكُونَ مِنَ الْمُفْلِحِينَ ﴿٦٧﴾

15. ఖురైషు తెగకు చెందిన అవిశ్వాసులు ఇస్లామ్ ధర్మాన్ని స్వీకరించకపోవటానికి ఈ విషయాన్ని ఒక మిషగా చెప్పారు. వారి అభిప్రాయం ఏమిటంటే, ఈనాడు మేము అరేబియాలోని బహుదైవారాధకులందరికీ మత నాయకులముగా గుర్తించబడ్డాము. కాని ఒకవేళ మేము ముహమ్మద్ (సఅసమ్) చెప్పే విషయాన్ని అంగీకరిస్తే, అరేబియా మొత్తం మాపై కత్తికడుతుంది.

وَرَبُّكَ يَخْلُقُ مَا يَشَاۤءُ وَيَخْتَارُ ۗ مَا كَانَ
لَهُمُ الْخِيَرَةُ ۗ سُبْحٰنَ اللّٰهِ وَتَعٰلٰى عَمَّا
يُشْرِكُوْنَ ﴿٦٨﴾ وَرَبُّكَ يَعْلَمُ مَا تُكِنُّ صُدُوْرُهُمْ
وَمَا يُعْلِنُوْنَ ﴿٦٩﴾ وَهُوَ اللّٰهُ لَاۤ اِلٰهَ اِلَّا هُوَ ۗ
لَهُ الْحَمْدُ فِى الْاُوْلٰى وَالْاٰخِرَةِ ۚ وَلَهُ الْحُكْمُ
وَاِلَيْهِ تُرْجَعُوْنَ ﴿٧٠﴾ قُلْ اَرَءَيْتُمْ اِنْ جَعَلَ
اللّٰهُ عَلَيْكُمُ الَّيْلَ سَرْمَدًا اِلٰى يَوْمِ الْقِيٰمَةِ
مَنْ اِلٰهٌ غَيْرُ اللّٰهِ يَاْتِيْكُمْ بِضِيَاۤءٍ ۗ اَفَلَا
تَسْمَعُوْنَ ﴿٧١﴾ قُلْ اَرَءَيْتُمْ اِنْ جَعَلَ اللّٰهُ
عَلَيْكُمُ النَّهَارَ سَرْمَدًا اِلٰى يَوْمِ الْقِيٰمَةِ مَنْ
اِلٰهٌ غَيْرُ اللّٰهِ يَاْتِيْكُمْ بِلَيْلٍ تَسْكُنُوْنَ فِيْهِ ۗ
اَفَلَا تُبْصِرُوْنَ ﴿٧٢﴾ وَمِنْ رَّحْمَتِهٖ جَعَلَ لَكُمُ
الَّيْلَ وَالنَّهَارَ لِتَسْكُنُوْا فِيْهِ وَلِتَبْتَغُوْا مِنْ
فَضْلِهٖ وَلَعَلَّكُمْ تَشْكُرُوْنَ ﴿٧٣﴾

**68 - 73** నీ ప్రభువు తాను కోరిన దానిని సృష్టిస్తాడు. (స్వయంగా ఆయనే తన పని కోసం తాను కోరిన వారిని) ఎన్నుకుంటాడు. ఈ ఎన్నిక చేయటం అనేది వారి పనికాదు. అల్లాహ్ పరిశుద్ధుడు, వారు చేసే షిర్కుకు అతీతుడు. వారు తమ మనస్సులలో దాచిన దానినీ, బహిరంగపరచే దానినీ నీ ప్రభువు ఎరుగును. ఆయనే అల్లాహ్, ఆయన ఒక్కడు. ఆయన తప్ప ఆరాధనకు అర్హుడెవ్వడూ లేడు. ఈ లోకంలోనూ, పరలోకంలోనూ ఆయనే స్తుతింపదగిన వాడు. పరిపాలనాధికారం ఆయనదే, ఆయన వైపునకే మీరంతా మరలింప బడతారు. ప్రవక్తా! వారితో ఇలా అను, "ఈ విషయం గురించి మీరెప్పుడైనా ఆలోచించారా; ఒకవేళ అల్లాహ్ ప్రళయం వచ్చేవరకు మీపై శాశ్వతంగా రాత్రిని ఆవహింపజేస్తే, అల్లాహ్ తప్ప మీకు వెలుగును తెచ్చి ఇచ్చే దేవుడు ఎవడు? మీరు వినరా?" వారిని ఇంకా ఇలా అడుగు, "ఈ విషయం గురించి మీరెప్పుడైనా ఆలోచించారా; ఒకవేళ అల్లాహ్ ప్రళయం వరకు మీపై పగలును శాశ్వతంగా ఉండేలా చేస్తే, మీరు విశ్రాంతి పొందటానికి అల్లాహ్ తప్ప మీకు రాత్రిని తెచ్చి ఇచ్చే దేవుడెవడైనా ఉన్నాడా? మీకేమీ గోచరించటం లేదా?" ఇది ఆయన కారుణ్యమే; ఆయన మీ కొరకు రాత్రినీ, పగలునూ సృష్టించాడు, మీరు (రాత్రి సమయంలో) విశ్రాంతిని పొందటానికీ, (పగటి సమయంలో) మీ ప్రభువు అనుగ్రహాన్ని అన్వేషించటానికీ; బహుశా మీరు కృతజ్ఞులవుతారేమో అని.

16. ఇది అల్లాహ్ తరఫున నుండి వారి సాకుకు తొలి సమాధానం. దాని భావం ఇది : పవిత్ర కాబాకు ఉన్నటువంటి కేంద్రీయ స్థానం వలన, అక్కడ ఉన్నటువంటి శాంతి భద్రతల వలన ఈనాడు యావత్ప్రపంచం వర్తక వాణిజ్యాలకై సాగునకు పనికి రాని బంజరు భూమిగల ఈ లోయ వైపునకు ఆకర్షించబడుతోంది. దానికి శాంతినీ, కేంద్రీయ స్థానాన్నీ ఇవ్వటంలో మీ ప్రమేయం ఎంత?

17. వారి సాకుకు ఇది రెండవ సమాధానం. దాని భావం ఇది : ఏ సిరిసంపదలను, ఏ భోగభాగ్యాలను చూసి మీరు విర్రవీగుతున్నారో, వాటిని పోగొట్టుకుంటామనే భయంతో సత్యానికి విముఖులై అసత్యానికి అంటిపెట్టుకుని ఉండదలచుకున్నారో, వాటినే ఒకప్పుడు ఆద్‌జాతి, సమూద్ జాతి, ఇతర జాతులు కూడా కలిగి ఉన్నాయి. అయినప్పటికీ అవి వారిని నాశనం కాకుండా కాపాడగలిగాయా?

18. ఇది వారి మిషకు మూడవ సమాధానం. మీకు పూర్వం నాశనం చేయబడిన జాతుల ప్రజలందరూ దుర్మార్గులే. కాని దేవుడు వారిని నాశనం చేసేముందు, తన ప్రవక్తలను పంపి వారిని హెచ్చరించాడు. హెచ్చరిక తరువాత కూడ, వారు తమ వక్రమార్గాన్ని విడనాడనప్పుడు, ఆయన వారిని నాశనం చేశాడు. ఇప్పుడు మీరు కూడా అదే స్థితిలో ఉన్నారు.

وَ يَوْمَ يُنَادِيْهِمْ فَيَقُوْلُ اَيْنَ شُرَكَآءِيَ
الَّذِيْنَ كُنْتُمْ تَزْعُمُوْنَ ﴿٧٤﴾ وَ نَزَعْنَا مِنْ كُلِّ
اُمَّةٍ شَهِيْدًا فَقُلْنَا هَاتُوْا بُرْهَانَكُمْ فَعَلِمُوْٓا اَنَّ
الْحَقَّ لِلّٰهِ وَ ضَلَّ عَنْهُمْ مَّا كَانُوْا يَفْتَرُوْنَ ﴿٧٥﴾
اِنَّ قَارُوْنَ كَانَ مِنْ قَوْمِ مُوْسٰى فَبَغٰى
عَلَيْهِمْ ۪ وَ اٰتَيْنٰهُ مِنَ الْكُنُوْزِ مَآ اِنَّ مَفَاتِحَهٗ
لَتَنُوْٓاُ بِالْعُصْبَةِ اُولِي الْقُوَّةِ ۗ اِذْ قَالَ لَهٗ قَوْمُهٗ
لَا تَفْرَحْ اِنَّ اللّٰهَ لَا يُحِبُّ الْفَرِحِيْنَ ﴿٧٦﴾ وَ
ابْتَغِ فِيْمَآ اٰتٰىكَ اللّٰهُ الدَّارَ الْاٰخِرَةَ وَ لَا
تَنْسَ نَصِيْبَكَ مِنَ الدُّنْيَا وَ اَحْسِنْ كَمَآ
اَحْسَنَ اللّٰهُ اِلَيْكَ وَ لَا تَبْغِ الْفَسَادَ فِي
الْاَرْضِ ۭ اِنَّ اللّٰهَ لَا يُحِبُّ الْمُفْسِدِيْنَ ﴿٧٧﴾
قَالَ اِنَّمَآ اُوْتِيْتُهٗ عَلٰى عِلْمٍ عِنْدِيْ ۭ اَوَ لَمْ
يَعْلَمْ اَنَّ اللّٰهَ قَدْ اَهْلَكَ مِنْ قَبْلِهٖ مِنَ
الْقُرُوْنِ مَنْ هُوَ اَشَدُّ مِنْهُ قُوَّةً وَّ اَكْثَرُ
جَمْعًا ۭ وَ لَا يُسْـَٔلُ عَنْ ذُنُوْبِهِمُ الْمُجْرِمُوْنَ ﴿٧٨﴾

**74 - 75** (వారు జ్ఞాపకముంచుకోవాలి) ఆ దినాన్ని: అపుడు ఆయన వారిని పిలిచి, "మీరు నాకు భాగస్వాములుగా కల్పించిన వారెక్కడున్నారు?" అని అడుగుతాడు. మేము ప్రతి సంఘం నుండి ఒక సాక్షిని తీసుకువస్తాము. తరువాత, "మీ రుజువును ఇప్పుడు తీసుకురండి" అని అంటాము. అపుడు వారికి తెలిసిపోతుంది, సత్యం అల్లాహ్ వైపే ఉందని. వారు కల్పించిన అసత్యాలన్నీ మటుమాయమైపోతాయి.

**76 - 78** ఇదొక యథార్థం; ఖారూన్ మూసా జాతికి చెందిన ఒక వ్యక్తి. అతడు తన జాతికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేశాడు. మేము అతనికి ఎన్నో నిధులను ఇచ్చాము. వాటి తాళపు చెవులను బలాఢ్యులైన వ్యక్తుల ఒక సమూహం కూడా చాలా కష్టంగా ఎత్తగలదు. ఒకసారి అతని జాతి ప్రజలు అతనితో ఇలా అన్నారు, "విఱ్ఱవీగకు, విఱ్ఱవీగే వారిని అల్లాహ్ ప్రేమించదు. అల్లాహ్ నీకు ఇచ్చిన సంపదతో పరలోకంలో గృహాన్ని నిర్మించుకునే యోచన చేయి. ప్రపంచంలో కూడ నీ వాటాను విస్మరించకు, అల్లాహ్ నీకు ఉపకారం చేసిన విధంగానే నీవూ ఉపకారం చేయి. భూమిపై కల్లోలాన్ని సృష్టించే ప్రయత్నం చేయకు. అల్లాహ్ కల్లోలం సృష్టించే వారిని ప్రేమించదు." అపుడు అతడు ఇలా అన్నాడు, "నాకు లభ్యమైన జ్ఞానం మూలంగానే ఇదంతా నాకు ఇవ్వబడింది" - అతనికి పూర్వం అతనికంటే ఎక్కువ బలాన్నీ, అనుచర వర్గాన్ని కలిగి ఉన్న చాలామందిని అల్లాహ్ నాశనం చేశాడనే విషయం అతనికి తెలియదా? అపరాధులను మాత్రం వారి పాపాలను గురించి అడగటం జరగదు.[21]

19. ప్రపంచంలో దేవునికి భాగస్వాములుగా చేయబడ్డ జిన్నాతులలోని, మానవులలోని షైతానులు అని దీని భావం. దేవుని మాటల కంటె, దైవప్రవక్తల మాటల కంటె, వారి మాటలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వబడింది. వారిని నమ్మి ప్రజలు రుజుమార్గాన్ని వదలిపెట్టి, తప్పుడు జీవిత విధానాలను అవలంబించారు. అటువంటి వారిని ఎవరైనా ఆరాధ్యుడు, ప్రభువు అని పిలిచినా పిలవకపోయినా, ఎలా అయినా సరే, దేవుణ్ణి అనుసరించే విధంగా, దేవుని పట్ల విధేయత చూపినట్లు వారి పట్ల వ్యవహరిస్తే, తప్పనిసరిగా వారిని దేవునికి భాగస్వాములుగా చేసినట్లే.

20. అంటే, వారు తమ అంతరంగాలకే దాసులు కాని, మాకు దాసులు కారు.

21. అంటే, అపరాధులు ఎల్లప్పుడూ, "మేము చాల మంచివారము" అని నొక్కినొక్కి అంటూ ఉంటారు. వారు తమ చెడును ఎప్పుడు అంగీకరించారు? కాని వారికి పడే శిక్ష వారి ఒప్పుకోలుపై ఆధారపడి ఉండదు. వారిని పట్టుకున్నప్పుడు, మీరు చేసిన పాపాలు ఏమిటో చెప్పండి, అని అడిగి పట్టుకోవటం జరగదు.

فَخَرَجَ عَلٰى قَوْمِهٖ فِىْ زِيْنَتِهٖ ؕ قَالَ الَّذِيْنَ
يُرِيْدُوْنَ الْحَيٰوةَ الدُّنْيَا يٰلَيْتَ لَنَا مِثْلَ مَآ
اُوْتِىَ قَارُوْنُ ۙ اِنَّهٗ لَذُوْ حَظٍّ عَظِيْمٍ ﴿٧٩﴾ وَ
قَالَ الَّذِيْنَ اُوْتُوا الْعِلْمَ وَيْلَكُمْ ثَوَابُ اللّٰهِ
خَيْرٌ لِّمَنْ اٰمَنَ وَعَمِلَ صَالِحًا ۚ وَ لَا يُلَقّٰهَآ اِلَّا
الصّٰبِرُوْنَ ﴿٨٠﴾ فَخَسَفْنَا بِهٖ وَ بِدَارِهِ الْاَرْضَ ۗ
فَمَا كَانَ لَهٗ مِنْ فِئَةٍ يَّنْصُرُوْنَهٗ مِنْ دُوْنِ
اللّٰهِ ۗ وَ مَا كَانَ مِنَ الْمُنْتَصِرِيْنَ ﴿٨١﴾ وَ اَصْبَحَ
الَّذِيْنَ تَمَنَّوْا مَكَانَهٗ بِالْاَمْسِ يَقُوْلُوْنَ
وَيْكَاَنَّ اللّٰهَ يَبْسُطُ الرِّزْقَ لِمَنْ يَّشَآءُ مِنْ
عِبَادِهٖ وَ يَقْدِرُ ۚ لَوْ لَآ اَنْ مَّنَّ اللّٰهُ عَلَيْنَا
لَخَسَفَ بِنَا ؕ وَيْكَاَنَّهٗ لَا يُفْلِحُ الْكٰفِرُوْنَ ﴿٨٢﴾ ع
تِلْكَ الدَّارُ الْاٰخِرَةُ نَجْعَلُهَا لِلَّذِيْنَ لَا
يُرِيْدُوْنَ عُلُوًّا فِى الْاَرْضِ وَ لَا فَسَادًا ؕ وَ
الْعَاقِبَةُ لِلْمُتَّقِيْنَ ﴿٨٣﴾ مَنْ جَآءَ بِالْحَسَنَةِ فَلَهٗ
خَيْرٌ مِّنْهَا ۚ وَمَنْ جَآءَ بِالسَّيِّئَةِ فَلَا يُجْزَى
الَّذِيْنَ عَمِلُوا السَّيِّاٰتِ اِلَّا مَا كَانُوْا
يَعْمَلُوْنَ ﴿٨٤﴾

**79 - 80** ఒకనాడు అతడు తన జాతి ముందు తన పూర్తి వైభవంతో ప్రత్యక్షమయ్యాడు. ఐహిక జీవితం పట్ల వ్యామోహం కలవారు అతణ్ణి చూచి ఇలా అన్నారు, "ఖారూన్‌కు ఇవ్వబడింది మాకూ లభిస్తే ఎంత బాగుండును. అతడు చాలా అదృష్టవంతుడు." కాని జ్ఞాన సంపన్నులు ఇలా అన్నారు, "అయ్యో దౌర్భాగ్యులారా! అల్లాహ్ ఇచ్చే ప్రతిఫలమే విశ్వసించి మంచి పనులు చేసే వ్యక్తికి శ్రేష్ఠమైనది. ఈ మహాభాగ్యం సహనం చూపే వారికి తప్ప మరెవరికీ దొరకదు."

**81 - 82** చివరకు మేము అతన్నీ అతని గృహాన్నీ భూమిలోనికి అణగ ద్రొక్కాము. తరువాత అల్లాహ్‌కు వ్యతిరేకంగా, అతనికి సహాయం చేయటానికి ముందుకు వచ్చే అతని మద్దతుదారుల వర్గం ఏదీ లేదు. స్వయంగా అతను కూడా తనకు తాను సహాయం చేసుకోలేకపోయాడు. నిన్న అతని అంతస్తు కోసం ఉవ్విళ్లూరిన వారే ఇప్పుడు ఇలా అంటున్నారు, "అయ్యో, మా దౌర్భాగ్యం! మేము మరచే పోయాము, అల్లాహ్ తన ఇష్టప్రకారం తన దాసులలో కొందరి జీవనోపాధిని విస్తరింప జేస్తాడు అని, మరికొందరికి ఆచితూచి ఇస్తాడని. అల్లాహ్ మాపై దయచూపి ఉండకపోతే, మమ్మల్ని కూడా భూమి లోనికి అణగద్రొక్కి ఉండేవాడే. అయ్యో, మా దౌర్భాగ్యం! అవిశ్వాసులు సాఫల్యం పొందరని మాకు జ్ఞాపకమే లేదు."

**83 - 84** ఇక, పరలోకంలోని గృహాన్ని[22] మేము భూమిపై తమ పెద్దరికాన్ని కోరుకోనివారికీ, కల్లోలాన్ని సృష్టించగోరని వారికీ ప్రత్యేకించి ఉంచుతాము. మేలైన పరిణామం మాత్రం భయభక్తులు కలవారికే. మంచిని తెచ్చే వాడికి దానికంటే మేలైన మంచి లభిస్తుంది. ఇక చెడును తెచ్చేవారి విషయం; చెడు పనులు చేసేవారికి వారు చేసిన దాని ప్రకారమే ప్రతిఫలం లభిస్తుంది.

22. అంటే, యథార్థ విజయానికి స్థావరం అయిన స్వర్గం అని అర్థం.

إِنَّ الَّذِي فَرَضَ عَلَيْكَ الْقُرْآنَ لَرَادُّكَ إِلَىٰ
مَعَادٍ ۚ قُل رَّبِّي أَعْلَمُ مَن جَاءَ بِالْهُدَىٰ وَ
مَنْ هُوَ فِي ضَلَالٍ مُّبِينٍ ﴿٨٥﴾ وَمَا كُنتَ تَرْجُو
أَن يُلْقَىٰ إِلَيْكَ الْكِتَابُ إِلَّا رَحْمَةً مِّن رَّبِّكَ
فَلَا تَكُونَنَّ ظَهِيرًا لِّلْكَافِرِينَ ﴿٨٦﴾ وَلَا يَصُدُّنَّكَ
عَنْ آيَاتِ اللَّهِ بَعْدَ إِذْ أُنزِلَتْ إِلَيْكَ وَادْعُ
إِلَىٰ رَبِّكَ وَلَا تَكُونَنَّ مِنَ الْمُشْرِكِينَ ﴿٨٧﴾ وَ
لَا تَدْعُ مَعَ اللَّهِ إِلَٰهًا آخَرَ ۘ لَا إِلَٰهَ إِلَّا هُوَ
كُلُّ شَيْءٍ هَالِكٌ إِلَّا وَجْهَهُ ۚ لَهُ الْحُكْمُ
وَإِلَيْهِ تُرْجَعُونَ ﴿٨٨﴾

وقف لازم

**85 - 88** ప్రవక్తా! నీపై ఈ ఖురానును విధించిన[23] వాడు, నిన్ను ఒక ఉత్తమమైన ముగింపునకు చేర్చనున్నాడని విశ్వసించు. వారితో ఇలా అను, "నా ప్రభువునకు బాగా తెలుసు, ఎవడు సన్మార్గం తీసుకువచ్చాడో, ఎవడు స్పష్టమైన మార్గభ్రష్టత్వానికి లోనయ్యాడో." నీపై గ్రంథం అవతరింప చేయబడుతుందనే విషయాన్ని నీవు ఏమాత్రం ఆశించలేదు. ఇది కేవలం నీ ప్రభువు కారుణ్యం వల్లనే (నీపై అవతరించింది). కనుక నీవు అవిశ్వాసులకు సహాయకుడవు కాకూడదు. అల్లాహ్ వాక్యాలు నీపై అవతరించినప్పుడు, అవిశ్వాసులు నిన్ను వాటి నుండి వైదొలగించటం అనేది ఎన్నటికీ జరగకూడదు. నీ ప్రభువు వైపునకు ఆహ్వానించు. బహుదైవారాధకులలో ఎంతమాత్రం చేరిపోకు. అల్లాహ్‌తో పాటు ఏ ఇతర దేవుణ్ణి వేడుకోకు. ఆయన తప్ప మరొక ఆరాధ్యుడెవ్వడూ లేడు. ఒక్క ఆయన ఉనికి తప్ప ప్రతిదీ నశించేదే. విశ్వ సామ్రాజ్యాధికారం ఆయనదే; ఆయన వైపునకే మీరంతా మరలింపబడతారు.

23. అంటే, ఈ ఖురానును ప్రజలకు అందజేయడం, దానిని వారికి బోధించటం, అది చూపే మార్గదర్శకత్వం ప్రకారం లోకాన్ని సంస్కరించటం అనే బాధ్యతలు నీ భుజస్కంధాలపై ఉన్నవి.

ఆయతులు 69

# 29. అల్ అన్‌కబూత్

అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 – 3** అలిఫ్. లామ్. మీమ్. కేవలం, "మేము విశ్వసించాము" అని అన్నంత మాత్రాన్నే వారిని వదలివేయటం జరుగుతుందనీ, వారిని పరీక్షించటం జరగదనీ ప్రజలు భావిస్తున్నారా? వాస్తవానికి మేము వారికి పూర్వం గతించిన వారందరినీ పరీక్షించాము, అల్లాహ్‌కు సత్యవాదులెవరో, అసత్యవాదులెవరో తప్పనిసరిగా చూడవలసి ఉన్నది.

**4** చెడు చేష్టలు చేస్తున్నవారు[1] మమ్మల్ని మీరి పోగలమని అనుకుంటున్నారా? వారి నిర్ణయం చాలా తప్పుడు నిర్ణయం.

**5 – 7** ఎవడైనా అల్లాహ్‌ను కలిసే ఆశను కలిగి ఉంటే, (అతడు తెలుసు కోవాలి) అల్లాహ్ నిర్ణయించిన సమయం త్వరలోనే రానున్నదనీ, అల్లాహ్ అన్నీ వింటాడనీ, అన్నీ ఎరుగుననీ. ఏ వ్యక్తి అయినా అల్లాహ్ మార్గంలో తీవ్రంగా పరిశ్రమిస్తే అతడు తన మేలు కొరకే అలా చేస్తాడు.[2] నిశ్చయంగా అల్లాహ్ సకల లోకాలలోని వారి అక్కర ఎంతమాత్రం లేనివాడు.[3] విశ్వసించి మంచి పనులు చేసేవారి పాపాలను మేము వారినుండి తొలగిస్తాము, వారికి తాము చేసిన ఉత్తమ కర్మలకు ప్రతిఫలం ఇస్తాము.

**8 - 9** తన తల్లిదండ్రుల పట్ల సద్భావంతో మెలగుమని మేము మానవునికి ఉపదేశించాము. కాని ఒకవేళ వారు నీవు ఎరుగని వానిని (ఆరాధ్యుణ్ణి) నాకు భాగస్వామిగా చేయమని నిన్ను బలవంతపెడితే, అప్పుడు వారి యెడల విధేయత చూపకు.[4] నా వైపునకే మీరందరూ మరలి రావలసి ఉంది. అప్పుడు నేను మీరు ఏమేమి చేస్తూ ఉండేవారో మీకు తెలియజేస్తాను. ఎవరైనా విశ్వసించి మంచి పనులు చేసి ఉన్నట్లయితే, వారిని మేము తప్పకుండా సజ్జనులలో కలుపుతాము.

٢٩ سُوْرَةُ الْعَنْكَبُوْتِ مَكِّيَّةٌ ٨٥

اٰيَاتُهَا ٦٩ — رُكُوْعَاتُهَا ٧

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

الٓمّٓ ۚ﴿١﴾ اَحَسِبَ النَّاسُ اَنْ يُّتْرَكُوْٓا اَنْ
يَّقُوْلُوْٓا اٰمَنَّا وَهُمْ لَا يُفْتَنُوْنَ ﴿٢﴾ وَ لَقَدْ فَتَنَّا
الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ فَلَيَعْلَمَنَّ اللّٰهُ الَّذِيْنَ
صَدَقُوْا وَ لَيَعْلَمَنَّ الْكٰذِبِيْنَ ﴿٣﴾ اَمْ حَسِبَ
الَّذِيْنَ يَعْمَلُوْنَ السَّيِّاٰتِ اَنْ يَّسْبِقُوْنَا ؕ سَآءَ
مَا يَحْكُمُوْنَ ﴿٤﴾ مَنْ كَانَ يَرْجُوْا لِقَآءَ اللّٰهِ
فَاِنَّ اَجَلَ اللّٰهِ لَاٰتٍ ؕ وَ هُوَ السَّمِيْعُ
الْعَلِيْمُ ﴿٥﴾ وَ مَنْ جَاهَدَ فَاِنَّمَا يُجَاهِدُ
لِنَفْسِهٖ ؕ اِنَّ اللّٰهَ لَغَنِيٌّ عَنِ الْعٰلَمِيْنَ ﴿٦﴾ وَ
الَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا الصّٰلِحٰتِ لَنُكَفِّرَنَّ
عَنْهُمْ سَيِّاٰتِهِمْ وَ لَنَجْزِيَنَّهُمْ اَحْسَنَ الَّذِيْ
كَانُوْا يَعْمَلُوْنَ ﴿٧﴾ وَ وَصَّيْنَا الْاِنْسَانَ بِوَالِدَيْهِ
حُسْنًا ؕ وَ اِنْ جَاهَدٰكَ لِتُشْرِكَ بِيْ مَا لَيْسَ
لَكَ بِهٖ عِلْمٌ فَلَا تُطِعْهُمَا ؕ اِلَيَّ مَرْجِعُكُمْ
فَاُنَبِّئُكُمْ بِمَا كُنْتُمْ تَعْمَلُوْنَ ﴿٨﴾ وَ الَّذِيْنَ
اٰمَنُوْا وَ عَمِلُوا الصّٰلِحٰتِ لَنُدْخِلَنَّهُمْ فِي
الصّٰلِحِيْنَ ﴿٩﴾

1. విశ్వాసులను నానా రీతులుగా యాతనలకు గురిచేస్తున్నటువంటి, హీనాతిహీనమైన కుయుక్తులతో ఇస్లామ్ సందేశాన్ని భగ్నం చేయదలచుకున్నటువంటి దుర్మార్గులు అని గ్రంథ శైలి చెప్పకయే చెప్పుచున్నది.

**10 - 11** ప్రజలలో, "మేము అల్లాహ్‌ను విశ్వసించాము" అని అనే వ్యక్తి ఒకడు ఉన్నాడు, కాని అతడు అల్లాహ్ మార్గంలో హింసించబడినపుడు, లోకులు పెట్టిన పరీక్షను అల్లాహ్ విధించిన శిక్షగా భావిస్తాడు, ఇప్పుడు ఒకవేళ నీ ప్రభువు తరఫు నుండి సహాయం, విజయం వచ్చినట్లయితే, ఈ వ్యక్తియే, "మేము మీతోనే ఉన్నాము" అని అంటాడు. భూలోక వాసుల హృదయాల స్థితి అల్లాహ్‌కు బాగా తెలియదా? అల్లాహ్‌కు విశ్వాసులెవరో, కపటులెవరో తప్పనిసరిగా చూడ వలసి ఉంది.

**12 - 13** ఈ అవిశ్వాసులు విశ్వాసులతో, "మీరు మా విధానాన్ని అనుసరించండి. అప్పుడు మేము మీ పాపాలను మాపైన వేసుకుంటాము" అని అంటారు. నిజానికి వారు వారి పాపాలలోని ఏ పాపాన్నీ తమపై వేసుకోరు. వారు పూర్తిగా అబద్ధం చెపుతున్నారు, ఔను, వారు తప్పకుండా తమ బరువులనూ మోస్తారు, తమ బరువులతో పాటు అనేక ఇతర బరువులను[5] కూడా మోస్తారు. ప్రళయంనాడు నిశ్చయంగా వారిని వారి అభూత కల్పనలను గురించి అడగటం జరుగుతుంది.

**14 - 15** మేము నూహ్‌ను అతని జాతి వైపునకు పంపాము. అతను వారి మధ్య యాభై తక్కువ వేయి సంవత్సరాల వరకు ఉన్నాడు. చివరకు తుఫాను వచ్చి వారు దుర్మార్గులుగా ఉన్న స్థితిలో వారిని చుట్టుముట్టింది. తరువాత నూహ్‌నూ, నావలోని వారినీ మేము రక్షించాము, దానిని మేము ప్రపంచ వాసులకు ఒక గుణపాఠం వంటి సూచనగా చేశాము.[6]

وَ مِنَ النَّاسِ مَنۡ يَّقُوۡلُ اٰمَنَّا بِاللّٰهِ فَاِذَاۤ
اُوۡذِىَ فِى اللّٰهِ جَعَلَ فِتۡنَةَ النَّاسِ كَعَذَابِ
اللّٰهِ ؕ وَلَٮِٕنۡ جَآءَ نَصۡرٌ مِّنۡ رَّبِّكَ لَيَـقُوۡلُنَّ
اِنَّا كُنَّا مَعَكُمۡ ؕ اَوَلَيۡسَ اللّٰهُ بِاَعۡلَمَ بِمَا فِىۡ
صُدُوۡرِ الۡعٰلَمِيۡنَ ﴿۱۰﴾ وَلَيَـعۡلَمَنَّ اللّٰهُ الَّذِيۡنَ
اٰمَنُوۡا وَ لَيَـعۡلَمَنَّ الۡمُنٰفِقِيۡنَ ﴿۱۱﴾ وَقَالَ الَّذِيۡنَ
كَفَرُوۡا لِلَّذِيۡنَ اٰمَنُوا اتَّبِعُوۡا سَبِيۡلَنَا وَلۡنَحۡمِلۡ
خَطٰيٰكُمۡ ؕ وَمَا هُمۡ بِحٰمِلِيۡنَ مِنۡ خَطٰيٰهُمۡ مِّنۡ
شَىۡءٍ ؕ اِنَّهُمۡ لَـكٰذِبُوۡنَ ﴿۱۲﴾ وَلَيَحۡمِلُنَّ اَثۡقَالَهُمۡ
وَاَثۡقَالًا مَّعَ اَثۡقَالِهِمۡ وَلَيُسۡـَٔـلُنَّ يَوۡمَ الۡقِيٰمَةِ
عَمَّا كَانُوۡا يَفۡتَرُوۡنَ ﴿۱۳﴾ وَلَقَدۡ اَرۡسَلۡنَا نُوۡحًا ع
اِلٰى قَوۡمِهٖ فَلَبِثَ فِيۡهِمۡ اَلۡفَ سَنَةٍ اِلَّا
خَمۡسِيۡنَ عَامًا ؕ فَاَخَذَهُمُ الطُّوۡفَانُ وَهُمۡ
ظٰلِمُوۡنَ ﴿۱۴﴾ فَاَنۡجَيۡنٰهُ وَاَصۡحٰبَ السَّفِيۡنَةِ وَ
جَعَلۡنٰهَاۤ اٰيَةً لِّلۡعٰلَمِيۡنَ ﴿۱۵﴾

2. "ముజాదహ్" అంటే, అవిశ్వాసులకు వ్యతిరేకంగా, సత్యధర్మ ధ్వజాన్ని ఉన్నతం చేయటానికి, ఉన్నతంగా ఉంచటానికి తీవ్ర ప్రయత్నం చేయటం.

3. అంటే, అల్లాహ్ మిమ్మల్ని తీవ్ర ప్రయత్నం చేయమని కోరటానికి కారణం, ఆయన ప్రయోజనం ఏదో దీనితో ముడివడి ఉన్నది అని కాదు; కాని ఇది మీ నైతిక, ఆధ్యాత్మిక ప్రగతికి ఒక మార్గం.

4. మక్కా నగరంలో ఇస్లామ్ ధర్మాన్ని స్వీకరించిన యువకులను వారి తల్లిదండ్రులు దాని నుండి వైదొలగమని ఒత్తిడి చేశారు. దీనిపై ఇలా సెలవీయబడింది: తల్లిదండ్రులకు తమ సంతానంపై హక్కులు ఉన్నాయి. కాని తమ సంతానాన్ని దైవమార్గం నుండి తప్పించే హక్కు మాత్రం వారికి లేదు.

5. అంటే, ఒక బరువేమో, స్వయంగా, తాము మార్గభ్రష్టులు కావటం అనేది. ఇతర బరువులు, ఇతరులను మార్గ భ్రష్టులుగా చేయటం లేదా మార్గభ్రష్టులు అగుటకు బలవంతపెట్టటం అనేవి.

وَ اِبْرٰهِيْمَ اِذْ قَالَ لِقَوْمِهِ اعْبُدُوا اللّٰهَ وَ
اتَّقُوْهُ ؕ ذٰلِكُمْ خَيْرٌ لَّكُمْ اِنْ كُنْتُمْ تَعْلَمُوْنَ ﴿۱۶﴾
اِنَّمَا تَعْبُدُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ اَوْثَانًا وَّ
تَخْلُقُوْنَ اِفْكًا ؕ اِنَّ الَّذِيْنَ تَعْبُدُوْنَ مِنْ
دُوْنِ اللّٰهِ لَا يَمْلِكُوْنَ لَكُمْ رِزْقًا فَابْتَغُوْا عِنْدَ
اللّٰهِ الرِّزْقَ وَ اعْبُدُوْهُ وَ اشْكُرُوْا لَهٗ ؕ اِلَيْهِ
تُرْجَعُوْنَ ﴿۱۷﴾ وَ اِنْ تُكَذِّبُوْا فَقَدْ كَذَّبَ اُمَمٌ
مِّنْ قَبْلِكُمْ ؕ وَ مَا عَلَى الرَّسُوْلِ اِلَّا الْبَلٰغُ
الْمُبِيْنُ ﴿۱۸﴾ اَوَ لَمْ يَرَوْا كَيْفَ يُبْدِئُ اللّٰهُ
الْخَلْقَ ثُمَّ يُعِيْدُهٗ ؕ اِنَّ ذٰلِكَ عَلَى اللّٰهِ
يَسِيْرٌ ﴿۱۹﴾ قُلْ سِيْرُوْا فِي الْاَرْضِ فَانْظُرُوْا
كَيْفَ بَدَاَ الْخَلْقَ ثُمَّ اللّٰهُ يُنْشِئُ النَّشْاَةَ
الْاٰخِرَةَ ؕ اِنَّ اللّٰهَ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ ﴿۲۰﴾ ۚ
يُعَذِّبُ مَنْ يَّشَآءُ وَ يَرْحَمُ مَنْ يَّشَآءُ ۚ
وَ اِلَيْهِ تُقْلَبُوْنَ ﴿۲۱﴾ وَ مَاۤ اَنْتُمْ بِمُعْجِزِيْنَ فِي
الْاَرْضِ وَ لَا فِي السَّمَآءِ ؗ وَ مَا لَكُمْ مِّنْ دُوْنِ
اللّٰهِ مِنْ وَّلِيٍّ وَّ لَا نَصِيْرٍ ﴿۲۲﴾ وَ الَّذِيْنَ كَفَرُوْا ع ۲ ۱۴
بِاٰيٰتِ اللّٰهِ وَ لِقَآئِهٖۤ اُولٰٓئِكَ يَئِسُوْا مِنْ
رَّحْمَتِيْ وَ اُولٰٓئِكَ لَهُمْ عَذَابٌ اَلِيْمٌ ﴿۲۳﴾

**16 - 18** ఇబ్రాహీమ్‌ను పంపాము, అప్పుడు అతను తన జాతివారితో ఇలా అన్నాడు, "అల్లాహ్‌ను ఆరాధించండి, ఆయనకు భయపడండి. మీరు అర్థం చేసుకుంటే, ఇదే మీకు మేలైనది. అల్లాహ్‌ను కాకుండా మీరు పూజిస్తూ ఉన్నవి కేవలం విగ్రహాలు మాత్రమే. మీరు ఒక అభూత కల్పన చేస్తున్నారు. యథార్థానికి అల్లాహ్‌ను కాదని మీరు పూజిస్తున్నవి మీకు ఏ ఉపాధినీ ఇచ్చే అధికారం కలిగిలేవు, ఉపాధి కొరకు అల్లాహ్‌ను అడగండి, ఆయనకే దాస్యం చేయండి, ఆయనకు కృతజ్ఞతలు తెలుపండి. ఆయన వైపునకే మీరు మరలింపబడతారు. ఒకవేళ మీరు తిరస్కరిస్తే, మీకు పూర్వం ఎన్నో జాతులు తిరస్కరించాయి. స్పష్టంగా సందేశాన్ని అందజేయటం తప్ప దైవ ప్రవక్తపై మరొక బాధ్యత ఏదీ లేదు."

**19 - 23** అల్లాహ్ ఏ విధంగా సృష్టిని ప్రారంభిస్తాడో తిరిగి దాని పునఃసృష్టి ఎలా చేస్తాడో వారు ఎన్నడూ గమనించలేదా? నిశ్చయంగా ఇది (పునఃసృష్టి) అల్లాహ్‌కు ఎంతో సులువైనది. వారితో ఇలా అను, "భూమిపై తిరగండి, ఆయన, సృష్టిని ఏ విధంగా ప్రారంభించాడో చూడండి. అల్లాహ్ పునరుజ్జీవనాన్ని కూడా ప్రసాదిస్తాడు. నిశ్చయంగా అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు. ఆయన తనకు ఇష్టమైన వారిని శిక్షిస్తాడు, తనకు ఇష్టమైన వారిని కరుణిస్తాడు. ఆయన వైపునకే మీరు మరలింపబడతారు. మీరు (ఆయనను) భూమిలోనూ లొంగదీయలేరు, ఆకాశంలోనూ లొంగదీయ లేరు. అల్లాహ్ నుండి రక్షించడానికి మీకు ఏ సంరక్షకుడూ లేడు, ఏ సహాయకుడూ లేడు. అల్లాహ్ ఆయతులనూ, ఆయన సందర్శనాన్నీ తిరస్కరించిన వారు నా కరుణ పట్ల నిరాశ చెందుతారు,[7] వారికి బాధాకరమైన శిక్ష పడుతుంది.

6. దానిని అంటే, ఆ పడవను లేదా నూహ్ జాతిపై అవతరించిన శిక్షకు సంబంధించిన ఈ సంఘటనను గుణపాఠానికి గుర్తుగా చేశాము.

7. అంటే, వారు నా కరుణకు ఎంతమాత్రం పాత్రులు కారు. నా కృపకు పాత్రులు అవటానికి ఆశించే ఆస్కారం వారికి ఏమాత్రమూ లేదు. వారు పరలోకాన్నే తిరస్కరించినప్పుడు వారు దేవుని సన్నిధిలో నిలబడవలసి ఉన్నదనే విషయాన్నే నమ్మనప్పుడు, దాని అర్థం వారు దేవుని క్షమాభిక్షనూ, మన్నింపునూ ఆశించనే లేదు అన్నమాట.

**24 - 27** ఇబ్రాహీమ్ జాతివారు ఇలా సమాధానం పలకటం తప్ప మరొక విషయమేదీ అనలేదు, "ఇతనిని చంపండి, లేదా కాల్చివేయండి." చివరకు అల్లాహ్ అతనిని అగ్ని జ్వాలల నుండి రక్షించాడు. నిశ్చయంగా విశ్వాసులకు ఇందులో సూచనలు ఉన్నాయి. అతను ఇలా అన్నాడు, "మీరు ప్రపంచ జీవితంలో అల్లాహ్‌ను కాదని విగ్రహాలను మీ మధ్య, ప్రేమకు సాధనంగా చేసుకున్నారు,[8] కాని ప్రళయం నాడు మీరు ఒకరినొకరు తిరస్కరించుకుంటారు, ఒకరి నొకరు శపించుకుంటారు. అగ్ని మీ నివాసస్థలమవుతుంది, మీకు సహాయం చేసేవాడెవ్వడూ ఉండడు." అప్పుడు లూత్ అతనిని విశ్వసించాడు. ఇబ్రాహీమ్ ఇలా అన్నాడు, "నేను నా ప్రభువు వైపునకు వలసపోతాను. ఆయన సర్వశక్తిమంతుడు, మహావివేకవంతుడు." మేము అతనికి ఇస్‌హాఖ్, యాఖూబ్ (వంటి సంతానం) లను ప్రసాదించాము; అతని వంశంలో ప్రవక్త పదవినీ, గ్రంథాన్నీ ఉంచాము. ప్రపంచంలో అతనికి అతని ప్రతిఫలం ఇచ్చాము. పరలోకంలో అతను నిశ్చయంగా సజ్జనులలో చేర్చుకోబడతాడు.

**28 - 30** మేము లూత్‌ను పంపాము; అప్పుడు అతను తన జాతివారితో ఇలా అన్నాడు, "మీకు పూర్వం ప్రపంచ మానవు లలో ఎవ్వరూ చేయని అశ్లీల కార్యాన్ని మీరు చేస్తున్నారు. ఇదేమిటి, మీరు పురుషుల వద్దకుపోతారు, దారి దోపిడీలు చేస్తారు. మీ సభలో అసభ్యకరమైన పనులు చేస్తారు?" అప్పుడు అతని జాతివారు ఇలా సమాధానం ఇవ్వటం తప్ప మరొక విషయమేదీ పలుకలేదు. "నీవు నిజాయితీపరుడవే అయితే, తీసుకురా అల్లాహ్ శిక్షను." లూత్ ఇలా అన్నాడు, "నా ప్రభూ! ఈ దుష్టులకు వ్యతిరేకంగా నాకు సహాయపడు."

فَمَا كَانَ جَوَابَ قَوْمِهٖٓ اِلَّآ اَنْ قَالُوا اقْتُلُوْهُ
اَوْ حَرِّقُوْهُ فَاَنْجٰىهُ اللّٰهُ مِنَ النَّارِ ؕ اِنَّ فِيْ
ذٰلِكَ لَاٰيٰتٍ لِّقَوْمٍ يُّؤْمِنُوْنَ ۝٢٤ وَقَالَ اِنَّمَا
اتَّخَذْتُمْ مِّنْ دُوْنِ اللّٰهِ اَوْثَانًا ۙ مَّوَدَّةَ بَيْنِكُمْ
فِي الْحَيٰوةِ الدُّنْيَا ۚ ثُمَّ يَوْمَ الْقِيٰمَةِ يَكْفُرُ
بَعْضُكُمْ بِبَعْضٍ وَّيَلْعَنُ بَعْضُكُمْ بَعْضًا ۫ وَّ
مَاْوٰىكُمُ النَّارُ وَمَا لَكُمْ مِّنْ نّٰصِرِيْنَ ۝٢٥ فَاٰمَنَ
لَهٗ لُوْطٌ ۘ وَقَالَ اِنِّيْ مُهَاجِرٌ اِلٰى رَبِّيْ ؕ اِنَّهٗ
هُوَ الْعَزِيْزُ الْحَكِيْمُ ۝٢٦ وَوَهَبْنَا لَهٗٓ اِسْحٰقَ
وَيَعْقُوْبَ وَجَعَلْنَا فِيْ ذُرِّيَّتِهِ النُّبُوَّةَ وَ
الْكِتٰبَ وَاٰتَيْنٰهُ اَجْرَهٗ فِي الدُّنْيَا ۚ وَاِنَّهٗ فِي
الْاٰخِرَةِ لَمِنَ الصّٰلِحِيْنَ ۝٢٧ وَلُوْطًا اِذْ قَالَ
لِقَوْمِهٖٓ اِنَّكُمْ لَتَاْتُوْنَ الْفَاحِشَةَ ۡ مَا سَبَقَكُمْ
بِهَا مِنْ اَحَدٍ مِّنَ الْعٰلَمِيْنَ ۝٢٨ اَئِنَّكُمْ لَتَاْتُوْنَ
الرِّجَالَ وَتَقْطَعُوْنَ السَّبِيْلَ ۙ وَتَاْتُوْنَ فِيْ
نَادِيْكُمُ الْمُنْكَرَ ؕ فَمَا كَانَ جَوَابَ قَوْمِهٖٓ اِلَّآ
اَنْ قَالُوا ائْتِنَا بِعَذَابِ اللّٰهِ اِنْ كُنْتَ مِنَ
الصّٰدِقِيْنَ ۝٢٩ قَالَ رَبِّ انْصُرْنِيْ عَلَى الْقَوْمِ
الْمُفْسِدِيْنَ ۝٣٠

وقف لازم

8. అంటే, మీరు దైవారాధనకు బదులుగా విగ్రహారాధన పునాదిపై మీ సామూహిక జీవితాన్ని ఏర్పాటు చేసుకున్నారు. అది ఇహలోక జీవితానికి సంబంధించినంత వరకే మీ జాతి సమైక్యతను కాపాడగలుగుతుంది. ఎందుకంటే, ఇక్కడ ఏ విశ్వాసం ఆధారంగానయినా, సత్యాసత్యాలతో నిమిత్తం లేకుండా, ప్రజలను సమీకరించవచ్చు. ఎలాంటి తప్పుడు విశ్వాసాలు ఆధారంగా ఏర్పడే సమైక్యత అయినా, సంఘటన అయినా పరస్పర స్నేహితాలు, బంధుత్వాలు, సోదరభావాలు ఇంకా ఇతర సకల మత, సామాజిక, నాగరిక, ఆర్థిక, రాజకీయ సంబంధాల స్థాపనకు దోహదపడుతుంది.

وَ لَمَّا جَآءَتْ رُسُلُنَآ اِبْرٰهِيْمَ بِالْبُشْرٰى ۙ
قَالُوْٓا اِنَّا مُهْلِكُوْٓا اَهْلِ هٰذِهِ الْقَرْيَةِ ۚ اِنَّ
اَهْلَهَا كَانُوْا ظٰلِمِيْنَ ﴿٣١﴾ قَالَ اِنَّ فِيْهَا
لُوْطًا ؕ قَالُوْا نَحْنُ اَعْلَمُ بِمَنْ فِيْهَا ٝ
لَنُنَجِّيَنَّهٗ وَ اَهْلَهٗٓ اِلَّا امْرَاَتَهٗ ٝ كَانَتْ مِنَ
الْغٰبِرِيْنَ ﴿٣٢﴾ وَ لَمَّآ اَنْ جَآءَتْ رُسُلُنَا لُوْطًا
سِيْٓءَ بِهِمْ وَضَاقَ بِهِمْ ذَرْعًا وَّ قَالُوْا لَا
تَخَفْ وَ لَا تَحْزَنْ ۫ اِنَّا مُنَجُّوْكَ وَ اَهْلَكَ اِلَّا
امْرَاَتَكَ كَانَتْ مِنَ الْغٰبِرِيْنَ ﴿٣٣﴾ اِنَّا مُنْزِلُوْنَ
عَلٰٓى اَهْلِ هٰذِهِ الْقَرْيَةِ رِجْزًا مِّنَ السَّمَآءِ بِمَا
كَانُوْا يَفْسُقُوْنَ ﴿٣٤﴾ وَلَقَدْ تَّرَكْنَا مِنْهَآ اٰيَةًۢ
بَيِّنَةً لِّقَوْمٍ يَّعْقِلُوْنَ ﴿٣٥﴾ وَاِلٰى مَدْيَنَ
اَخَاهُمْ شُعَيْبًا ۙ فَقَالَ يٰقَوْمِ اعْبُدُوا اللّٰهَ
وَارْجُوا الْيَوْمَ الْاٰخِرَ وَ لَا تَعْثَوْا فِى الْاَرْضِ
مُفْسِدِيْنَ ﴿٣٦﴾ فَكَذَّبُوْهُ فَاَخَذَتْهُمُ الرَّجْفَةُ
فَاَصْبَحُوْا فِىْ دَارِهِمْ جٰثِمِيْنَ ﴿٣٧﴾ ٝ

**31 - 32** మా దూతలు ఇబ్రాహీమ్ వద్దకు శుభవార్తను తీసుకువెళ్ళినప్పుడు, అతనితో వారు ఇలా అన్నారు, "మేము ఈ పట్టణవాసులను నాశనం చేయబోతున్నాము.[9] దాని ప్రజలు పరమ దుర్మార్గులైపోయారు." ఇబ్రాహీమ్, "అక్కడ లూత్ ఉన్నాడు కదా!" అని అన్నాడు. వారు ఇలా అన్నారు, "అక్కడ ఎవరెవరున్నారో మాకు బాగా తెలుసు. అతని భార్యను తప్ప, అతనినీ, మిగిలిన అతని ఇంటిల్లిపాదినీ రక్షిస్తాము." అతని భార్య వెనుక ఉండిపోయేవారిలో ఉండిపోయింది.

**33 - 35** తరువాత మా దూతలు లూత్ వద్దకు వెళ్లినప్పుడు, వారి రాకను చూచి అతను ఎంతో ఆందోళన చెందాడు, మనస్సులో కుమిలిపోయాడు. వారు ఇలా అన్నారు, "భయ పడకు, బాధపడకు, మేము నిన్నూ నీ ఇంటివారినీ రక్షిస్తాము, ఒక్క నీ భార్యను తప్ప. ఆమె వెనుక ఉండి పోయేవారిలోనిది. మేము ఈ పట్టణవాసులపై ఆకాశంనుండి శిక్షను అవతరింప జేయబోతున్నాము. వారు చేస్తూ వచ్చిన ఘోర పాతకం కారణంగా." మేము ఆ పట్టణానికి చెందిన ఒక స్పష్టమైన సూచనను వదలిపెట్టాము,[10] బుద్ధీ విజ్ఞతలను ఉపయోగించే ప్రజల కొరకు.

**36 - 37** మద్యన్ వైపునకు మేము వారి సోదరుడు షుఐబ్‌ను పంపాము. అతను ఇలా అన్నాడు, "నా జాతి ప్రజలారా! అల్లాహ్‌కు దాస్యం చేయండి. అంతిమ దినము కొరకు ఎదురు చూడండి. దుర్మార్గులై భూమిపై అత్యాచారాలు చేస్తూ తిరగ కండి." కాని, వారు అతనిని తిరస్కరించారు. చివరకు ఒక తీవ్రమైన భూకంపం వారిని పట్టుకుంది; వారు తమ ఇళ్ళల్లో ఎక్కడ పడిపోయిన వారు అక్కడనే ఉండిపోయారు.

---

9. 'ఈ పట్టణం' ప్రవక్త లూత్ జాతి ఉండిన ప్రాంతాన్ని సూచిస్తుంది. ప్రవక్త ఇబ్రాహీమ్ అప్పుడు పాలస్తీనాలోని హెబ్రాన్ (ఈనాటి అల్ ఖలీల్) పట్టణంలో ఉండేవారు. ఈ పట్టణానికి ఆగ్నేయ దిశగా కొన్ని మైళ్ల దూరాన మృత సముద్రపు భాగం కొంత ఉన్నది. అక్కడ లూత్ జాతి ప్రజలు ఉండేవారు. ఇప్పుడు ఆ ప్రాంతాన్ని సముద్రం ఆక్రమించింది. ఇది పల్లపు ప్రాంతం; హెబ్రాన్‌లోని ఎత్తైన పర్వతాల నుండి చూస్తే అది స్పష్టంగా కనిపిస్తుంది. అందుకనే దైవ దూతలు దాని వైపు సైగ చేసి హజ్రత్ ఇబ్రాహీమ్‌తో, "మేము ఆ పట్టణాన్ని నాశనం చేయబోతున్నాము" అని అన్నారు.

وَ عَادًا وَّ ثَمُوْدَاۡ وَقَدْ تَّبَيَّنَ لَكُمْ مِّنْ
مَّسٰكِنِهِمْ ۗ وَ زَيَّنَ لَهُمُ الشَّيْطٰنُ اَعْمَالَهُمْ
فَصَدَّهُمْ عَنِ السَّبِيْلِ وَ كَانُوْا مُسْتَبْصِرِيْنَ ۙ﴿٣٨﴾
وَقَارُوْنَ وَ فِرْعَوْنَ وَهَامٰنَ ۗ وَلَقَدْ جَآءَهُمْ
مُّوْسٰى بِالْبَيِّنٰتِ فَاسْتَكْبَرُوْا فِى الْاَرْضِ وَ مَا
كَانُوْا سٰبِقِيْنَ ﴿٣٩﴾ فَكُلًّا اَخَذْنَا بِذَنْۢبِهٖ ۚ
فَمِنْهُمْ مَّنْ اَرْسَلْنَا عَلَيْهِ حَاصِبًا ۚ وَ مِنْهُمْ مَّنْ
اَخَذَتْهُ الصَّيْحَةُ ۚ وَمِنْهُمْ مَّنْ خَسَفْنَا بِهِ
الْاَرْضَ ۚ وَ مِنْهُمْ مَّنْ اَغْرَقْنَا ۚ وَ مَا كَانَ
اللّٰهُ لِيَظْلِمَهُمْ وَ لٰكِنْ كَانُوْۤا اَنْفُسَهُمْ
يَظْلِمُوْنَ ﴿٤٠﴾ مَثَلُ الَّذِيْنَ اتَّخَذُوْا مِنْ دُوْنِ
اللّٰهِ اَوْلِيَآءَ كَمَثَلِ الْعَنْكَبُوْتِ ۖۚ اِتَّخَذَتْ
بَيْتًا ؕ وَ اِنَّ اَوْهَنَ الْبُيُوْتِ لَبَيْتُ الْعَنْكَبُوْتِ ۘ وقف لازم
لَوْ كَانُوْا يَعْلَمُوْنَ ﴿٤١﴾ اِنَّ اللّٰهَ يَعْلَمُ مَا
يَدْعُوْنَ مِنْ دُوْنِهٖ مِنْ شَىْءٍ ؕ وَ هُوَ الْعَزِيْزُ
الْحَكِيْمُ ﴿٤٢﴾ وَ تِلْكَ الْاَمْثَالُ نَضْرِبُهَا لِلنَّاسِ ۚ
وَمَا يَعْقِلُهَاۤ اِلَّا الْعٰلِمُوْنَ ﴿٤٣﴾ خَلَقَ اللّٰهُ
السَّمٰوٰتِ وَالْاَرْضَ بِالْحَقِّ ؕ اِنَّ فِىْ ذٰلِكَ
لَاٰيَةً لِّلْمُؤْمِنِيْنَ ﴿٤٤﴾ ع ١٤/١٦

**38 - 40** ఆద్, సమూద్ జాతులను మేము నాశనం చేశాము. వారు నివసించిన ప్రదేశాలను నీవు చూసే ఉన్నావు. వారి పనులను షైతాను వారి కొరకు చక్కనివిగా తీర్చిదిద్దాడు; వారిని సన్మార్గం నుండి తప్పించాడు. వాస్తవానికి వారు తెలివిగలవారే. ఖారూన్, ఫిరౌన్, హామాన్‌లను మేము నాశనం చేశాము. మూసా వారి వద్దకు స్పష్టమైన సూచనలతో వచ్చాడు. కాని వారు తమ పెద్దరికం గురించి విర్రవీగారు. యథార్థానికి వారు మమ్మల్ని దాటి పోగలిగే వారేమీ కాదు. చివరికి ప్రతివాణ్ణీ మేము అతని పాపానికిగాను పట్టుకున్నాము. తరువాత వారిలోని కొందరిపైకి మేము రాళ్ళు విసిరే పెనుగాలిని పంపాము, మరికొందరిని ఒక భయంకరమైన ప్రేలుడు కబళించింది, ఇంకా కొందరిని మేము భూమిలో కూరుకు పోయేలా చేశాము. మరికొందరిని ముంచివేశాము. అల్లాహ్ వారికి అన్యాయం చేయలేదు, వారే తమకు తాము అన్యాయం చేసుకున్నారు.

**41 - 44** అల్లాహ్‌ను కాదని ఇతరులను సంరక్షకులుగా చేసుకున్నవారు సాలె పురుగును పోలి ఉన్నారు. అది తన కొరకు ఒక ఇల్లు కట్టుకుంటుంది. అన్ని ఇళ్ళకంటే అతి బలహీనమైన ఇల్లు సాలెపురుగు ఇల్లే అవుతుంది. అయ్యో! వారికి ఈ విషయం తెలిస్తే ఎంత బాగుంటుంది! వారు అల్లాహ్‌ను కాదని దేనిని వేడుకున్నా, అల్లాహ్ దానిని బాగా ఎరుగును. ఆయనే సర్వ శక్తిమంతుడు, వివేచనాపరుడునూ. మేము ఈ దృష్టాంతాలను ప్రజల అవగాహన నిమిత్తం వివరిస్తాము. కాని జ్ఞానసంపన్నులే వాటిని అర్థం చేసుకుంటారు. అల్లాహ్ ఆకాశాలనూ, భూమినీ సత్యంతో సృష్టించాడు. యథార్థంగానే విశ్వాసులకు ఇందులో ఒక సూచన ఉంది.

10. ఒక స్పష్టమైన సూచన అంటే, మృత సముద్రం అని అర్థం. దీనిని బహ్‌రె లూత్ (లూత్ సముద్రం) అని కూడా అంటారు. దివ్య ఖురానులో పలుచోట్ల మక్కా అవిశ్వాసులను ఉద్దేశించి ఇలా అనబడింది: "ఈ దుర్మార్గపు జాతి చేసిన పాడుపనుల వల్ల దానిపైకి వచ్చిపడిన శిక్ష యొక్క ఒక సూచన ఈనాడు కూడ రహదారిపై ఉన్నది, దాన్ని మీరు సిరియా వైపునకు చేసే వర్తక ప్రయాణాలలో రేయింబవళ్ళు చూస్తారు.



اُتْلُ مَاۤ اُوْحِیَ اِلَیْکَ مِنَ الْکِتٰبِ وَ اَقِمِ
الصَّلٰوۃَ ؕ اِنَّ الصَّلٰوۃَ تَنْهٰی عَنِ الْفَحْشَآءِ وَ
الْمُنْکَرِ ؕ وَ لَذِکْرُ اللّٰہِ اَکْبَرُ ؕ وَ اللّٰہُ یَعْلَمُ مَا
تَصْنَعُوْنَ ﴿٤٥﴾ وَ لَا تُجَادِلُوْۤا اَهْلَ الْکِتٰبِ اِلَّا
بِالَّتِیْ هِیَ اَحْسَنُ ٭ۖ اِلَّا الَّذِیْنَ ظَلَمُوْا مِنْهُمْ
وَ قُوْلُوْۤا اٰمَنَّا بِالَّذِیْۤ اُنْزِلَ اِلَیْنَا وَ اُنْزِلَ
اِلَیْکُمْ وَ اِلٰهُنَا وَ اِلٰهُکُمْ وَاحِدٌ وَّ نَحْنُ لَهٗ
مُسْلِمُوْنَ ﴿٤٦﴾ وَ کَذٰلِکَ اَنْزَلْنَاۤ اِلَیْکَ الْکِتٰبَ ؕ
فَالَّذِیْنَ اٰتَیْنٰهُمُ الْکِتٰبَ یُؤْمِنُوْنَ بِهٖ ۚ وَ مِنْ
هٰۤؤُلَآءِ مَنْ یُّؤْمِنُ بِهٖ ؕ وَ مَا یَجْحَدُ بِاٰیٰتِنَاۤ اِلَّا
الْکٰفِرُوْنَ ﴿٤٧﴾ وَ مَا کُنْتَ تَتْلُوْا مِنْ قَبْلِهٖ مِنْ
کِتٰبٍ وَّ لَا تَخُطُّهٗ بِیَمِیْنِکَ اِذًا لَّارْتَابَ
الْمُبْطِلُوْنَ ﴿٤٨﴾ بَلْ هُوَ اٰیٰتٌۢ بَیِّنٰتٌ فِیْ
صُدُوْرِ الَّذِیْنَ اُوْتُوا الْعِلْمَ ؕ وَ مَا یَجْحَدُ
بِاٰیٰتِنَاۤ اِلَّا الظّٰلِمُوْنَ ﴿٤٩﴾

**45** (ప్రవక్తా!) వహీ ద్వారా నీ వద్దకు పంపబడిన గ్రంథాన్ని పారాయణం చెయ్యి, నమాజును స్థాపించు నిశ్చయంగా నమాజు అశ్లీల కార్యాల నుండి, చెడు పనులనుండి నిరోధిస్తుంది. అల్లాహ్ సంస్మరణ దీనికంటె కూడా చాలా గొప్ప విషయం,[11] నీవు చేసేదంతా అల్లాహ్‌కు తెలుసు.

**46 - 47** గ్రంథ ప్రజలతో వాదించకు, ఉత్తమమైన రీతిలో తప్ప - అయితే వారిలోని దుర్మార్గులతో[12] మాత్రం కాదు - వారితో ఇలా అను, "మేము మా వద్దకు పంపబడిన దానినీ విశ్వసించాము, మీ వద్దకు పంపబడిన దానినీ విశ్వసించాము. మా దేవుడూ, మీ దేవుడూ ఒక్కడే, మేము ఆయనకే విధేయులం." (ఓ ప్రవక్తా!) ఇదే విధంగా మేము నీపై గ్రంథాన్ని అవతరింపజేశాము.[13] అందువల్ల పూర్వం మేము గ్రంథాన్ని ఇచ్చినవారు దీనిని విశ్వసిస్తారు.[14] ఈ ప్రజలలోని వారు కూడ చాలామంది దీనిని విశ్వసిస్తున్నారు.[15] మా ఆయతులను కేవలం అవిశ్వాసులు మాత్రమే తిరస్కరిస్తారు.

**48 - 52** (ప్రవక్తా!) నీవు ఇంతకు పూర్వం ఏ గ్రంథాన్నీ చదివేవాడవు కావు; నీ చేతితో వ్రాసేవాడవూ కావు. ఒకవేళ అలా జరిగి ఉంటే, అసత్యవాదులు అనుమానానికి లోనై ఉండేవారు. అసలు ఇవి జ్ఞానం ప్రసాదించబడిన[16] వారి హృదయాలకు స్పష్టమైన సూచనలు. మా ఆయతులను దుర్మార్గపు ప్రజలు తప్ప మరెవ్వరూ తిరస్కరించరు.

11. అర్థం ఏమిటంటే, అశ్లీల కార్యాల నుండి నిరోధించటం అనేది గొప్ప విశేషం కాదు, అల్లాహ్ స్మరణ అంటే నమాజు యొక్క శుభాలు దీనికంటె పదింతలు.

12. ఎవరైనా దుర్మార్గపు వైఖరిని అవలంబిస్తే, వారు చేసినటువంటి దుర్మార్గాన్ని బట్టి వారి పట్ల భిన్నమైన వైఖరిని కూడ అవలంబించవచ్చు. అర్థం ఏమిటంటే, సర్వకాల సర్వావస్థలలో అన్ని రకాల ప్రజలతో మృదుత్వంతోనే, సౌమ్య భావంతోనే మెలగటం తగదు, ఎందుకంటే, సత్యం వైపునకు పిలిచే వాని మంచితనాన్ని ఈ లోకం బలహీనతగా భావిస్తుంది. ఇస్లామ్ తనను అనుసరించేవారికి మంచీ మర్యాదలనూ, న్యాయవర్తననూ తప్పకుండా బోధిస్తుంది, కాని ప్రతి దుర్మార్గునికి అలుసయ్యేలా అశక్తతనూ, దైన్యమునూ ఎంతమాత్రం బోధించదు.

13. దీనికి రెండు అర్థాలు ఉన్నాయి : ఒకటి, పూర్వం మేము ఏ విధంగా ప్రవక్తలపై గ్రంథాలను అవతరింపజేశామో, అదేవిధంగా ఇప్పుడు ఈ గ్రంథాన్ని నీపై అవతరింపజేశాము. రెండు, మా పూర్వపు గ్రంథాలను తిరస్కరించకుండా, వాటి పట్ల విశ్వాసం ప్రకటిస్తూనే దీనిని నమ్మాలి అనే ఉపదేశంతోనే మేము ఈ గ్రంథాన్ని అవతరింపజేశాము.

وَ قَالُوْا لَوْ لَآ اُنْزِلَ عَلَيْهِ اٰيٰتٌ مِّنْ رَّبِّهٖ ؕ قُلْ
اِنَّمَا الْاٰيٰتُ عِنْدَ اللّٰهِ ؕ وَ اِنَّمَآ اَنَا نَذِيْرٌ
مُّبِيْنٌ ﴿٥٠﴾ اَوَ لَمْ يَكْفِهِمْ اَنَّآ اَنْزَلْنَا عَلَيْكَ
الْكِتٰبَ يُتْلٰى عَلَيْهِمْ ؕ اِنَّ فِيْ ذٰلِكَ لَرَحْمَةً وَّ
ذِكْرٰى لِقَوْمٍ يُّؤْمِنُوْنَ ﴿٥١﴾ ع قُلْ كَفٰى بِاللّٰهِ
بَيْنِيْ وَ بَيْنَكُمْ شَهِيْدًا ۚ يَعْلَمُ مَا فِي السَّمٰوٰتِ
وَالْاَرْضِ ؕ وَ الَّذِيْنَ اٰمَنُوْا بِالْبَاطِلِ
وَكَفَرُوْا بِاللّٰهِ ۙ اُولٰٓئِكَ هُمُ الْخٰسِرُوْنَ ﴿٥٢﴾ وَ
يَسْتَعْجِلُوْنَكَ بِالْعَذَابِ ؕ وَلَوْ لَآ اَجَلٌ
مُّسَمًّى لَّجَآءَهُمُ الْعَذَابُ ؕ وَلَيَاْتِيَنَّهُمْ بَغْتَةً
وَّ هُمْ لَا يَشْعُرُوْنَ ﴿٥٣﴾ يَسْتَعْجِلُوْنَكَ
بِالْعَذَابِ ؕ وَ اِنَّ جَهَنَّمَ لَمُحِيْطَةٌ بِالْكٰفِرِيْنَ ﴿٥٤﴾ ۙ
يَوْمَ يَغْشٰهُمُ الْعَذَابُ مِنْ فَوْقِهِمْ وَ مِنْ تَحْتِ
اَرْجُلِهِمْ وَيَقُوْلُ ذُوْقُوْا مَا كُنْتُمْ تَعْمَلُوْنَ ﴿٥٥﴾

వారు ఇలా అంటారు, “ఇతని ప్రభువు తరఫు నుండి ఇతనిపై సూచనలు ఎందుకు దించబడలేదు?” ఇలా అను, “సూచనలు అల్లాహ్ వద్ద ఉన్నాయి. నేను కేవలం స్పష్టంగా హెచ్చరించే వాణ్ణి మాత్రమే.” మేము నీపై అవతరింపజేసిన గ్రంథం వారి ముందు చదివి వినిపించబడుతోంది - ఇది (ఈ సూచన) వారికొరకు సరిపోదా? వాస్తవానికి ఇందులో కారుణ్యం ఉన్నది. విశ్వాసులకు హితబోధ ఉన్నది. (ప్రవక్తా!) ఇలా అను, “నాకూ మీకూ మధ్య సాక్షిగా అల్లాహ్‌యే సరిపోతాడు. ఆయన ఆకాశాలలోనూ, భూమిలోనూ ఉన్న సమస్తాన్నీ ఎరిగినవాడు, అసత్యాన్ని విశ్వసించి, అల్లాహ్‌ను తిరస్కరించేవారే అసలు నష్టానికి గురి అయ్యేవారు.

**53 - 55** వారు, శిక్షను త్వరగా తీసుకురావాలని నిన్ను కోరుతున్నారు. సమయం ఒకటి నిర్ణయమై ఉండకపోతే, వారి మీదకు శిక్ష ఎప్పుడో వచ్చిపడి ఉండేది. నిశ్చయంగా (సమయం రాగానే) ఆ శిక్ష వచ్చి తీరుతుంది, అకస్మాత్తుగా వస్తుంది, వారికి ఏమాత్రం తెలియని స్థితిలో వస్తుంది, వారు శిక్షను త్వరగా తీసుకురమ్మని కోరుతున్నారు. వాస్తవానికి ఈ అవిశ్వాసులను నరకం ఎప్పుడో చుట్టుముట్టింది. ఆ రోజున (వారికి ఈ విషయం తెలిసిపోతుంది); అప్పుడు శిక్ష వారిని పైనుండి కూడా కప్పివేస్తుంది, పాదాల క్రిందనుంచి కూడా కప్పివేస్తుంది; “ఇక రుచిచూడండి మీరు చేసిన చేష్టలకు” అని అంటుంది.

14. సందర్భమే ఈ విషయాన్ని తెలుపుతోంది : గ్రంథ ప్రజలందరూ కాదనీ, దైవగ్రంథాల యథార్థ జ్ఞానం, అవగాహనల భాగ్యం పొందిన గ్రంథ ప్రజలు మాత్రమే అని దీని భావం. అసలు వారే నిజమైన గ్రంథ ప్రజలు.

15. “ఈ ప్రజలు” అంటే అరేబియా వాసులు అని అర్థం. దీని భావం, సత్యకాముకులైన ప్రజలు ప్రతిచోట ఈ గ్రంథాన్ని విశ్వసిస్తున్నారు, గ్రంథ ప్రజలైనా కావచ్చు, తదితరులూ కావచ్చు.

16. అంటే, ఒక నిరక్షరాస్యుడు దివ్య ఖురాను వంటి గ్రంథాన్ని బోధించటమూ, అసాధారణమైన మహిమలను ఏ విధమైన ప్రయత్నమూ లేకుండానే ప్రదర్శించటమూ - విజ్ఞానం, వివేకం గల వారి దృష్టిలో ఈ విషయాలే ఆయన ప్రవక్త అని నిరూపించటానికి స్పష్టమైన సంకేతాలు.

يٰعِبَادِيَ الَّذِيۡنَ اٰمَنُوۡۤا اِنَّ اَرۡضِىۡ وَاسِعَةٌ
فَاِيَّاىَ فَاعۡبُدُوۡنِ ﴿٥٦﴾ كُلُّ نَفۡسٍ ذَآئِقَةُ
الۡمَوۡتِ ثُمَّ اِلَيۡنَا تُرۡجَعُوۡنَ ﴿٥٧﴾ وَ الَّذِيۡنَ
اٰمَنُوۡا وَ عَمِلُوا الصّٰلِحٰتِ لَنُبَوِّئَنَّهُمۡ مِّنَ
الۡجَنَّةِ غُرَفًا تَجۡرِىۡ مِنۡ تَحۡتِهَا الۡاَنۡهٰرُ
خٰلِدِيۡنَ فِيۡهَا ؕ نِعۡمَ اَجۡرُ الۡعٰمِلِيۡنَ ﴿٥٨﴾ الَّذِيۡنَ
صَبَرُوۡا وَعَلٰى رَبِّهِمۡ يَتَوَكَّلُوۡنَ ﴿٥٩﴾ وَكَاَيِّنۡ مِّنۡ
دَآبَّةٍ لَّا تَحۡمِلُ رِزۡقَهَا ۖ اللّٰهُ يَرۡزُقُهَا
وَاِيَّاكُمۡ ۖ وَهُوَ السَّمِيۡعُ الۡعَلِيۡمُ ﴿٦٠﴾ وَلَئِنۡ
سَاَلۡتَهُمۡ مَّنۡ خَلَقَ السَّمٰوٰتِ وَ الۡاَرۡضَ وَ
سَخَّرَ الشَّمۡسَ وَ الۡقَمَرَ لَيَـقُوۡلُنَّ اللّٰهُ ۚ فَاَنّٰى
يُؤۡفَكُوۡنَ ﴿٦١﴾ اَللّٰهُ يَبۡسُطُ الرِّزۡقَ لِمَنۡ يَّشَآءُ
مِنۡ عِبَادِهٖ وَ يَقۡدِرُ لَهٗ ؕ اِنَّ اللّٰهَ بِكُلِّ شَىۡءٍ
عَلِيۡمٌ ﴿٦٢﴾ وَلَئِنۡ سَاَلۡتَهُمۡ مَّنۡ نَّزَّلَ مِنَ السَّمَآءِ
مَآءً فَاَحۡيَا بِهِ الۡاَرۡضَ مِنۡۢ بَعۡدِ مَوۡتِهَا
لَيَـقُوۡلُنَّ اللّٰهُ ؕ قُلِ الۡحَمۡدُ لِلّٰهِ ؕ بَلۡ اَكۡثَرُهُمۡ
لَا يَعۡقِلُوۡنَ ﴿٦٣﴾ ع

**56 - 60** విశ్వసించిన నా దాసులారా! నా భూమి విశాలమైనది. కనుక మీరు నన్ను మాత్రమే ఆరాధించండి.[17] ప్రతి ప్రాణీ మరణాన్ని రుచి చూడవలసి ఉన్నది. తరువాత మీరందరూ మా వైపునకే మరలింపబడతారు, విశ్వసించి మంచి పనులు చేసేవారిని మేము స్వర్గంలోని ఎత్తైన భవనాలలో ఉంచుతాము, వాటి క్రింద సెలయేళ్లు ప్రవహిస్తూ ఉంటాయి. అక్కడనే వారు శాశ్వతంగా ఉంటారు. ఎంతమంచి ప్రతిఫలం– ఆచరించేవారికి, సహనం వహించిన వారికి, ఇంకా తమ ప్రభువునే నమ్ముకునే వారికి. తమ ఆహారాన్ని మోసుకుంటూ తిరగని జంతువులు ఎన్నో ఉన్నాయి. అల్లాహ్ వాటికి ఉపాధిని సమకూరుస్తాడు, మీ ఉపాధి ప్రదాత కూడా ఆయనే. ఆయన అన్నీ వినేవాడూ, అన్నీ ఎరిగినవాడూను.

**61 - 63** భూమినీ, ఆకాశాలనూ ఎవడు సృష్టించాడు, చంద్రుణ్ణీ, సూర్యుణ్ణీ ఎవడు అదుపులో ఉంచాడు, అని నీవు[18] వారిని అడిగితే, అప్పుడు వారు "అల్లాహ్" అని అంటారు. అయితే వారు ఎలా మోసపోతున్నారు? తన దాసులలో తనకు ఇష్టమైన వారి ఉపాధిని విస్తరింపజేసేవాడూ, తనకు ఇష్టమైన వారి ఉపాధిని పరిమితపరిచేవాడూ అల్లాహ్ మాత్రమే. నిశ్చయంగా అల్లాహ్ ప్రతి విషయాన్నీ ఎరిగినవాడు. ఇంకా నీవు వారిని, "ఆకాశం నుండి ఎవడు వర్షాన్ని కురిపించాడు, దాని ద్వారా మృతభూమిని ఎవడు బ్రతికించాడు" అని అడిగితే అప్పుడు వారు, "అల్లాహ్" అని తప్పకుండా అంటారు. "అల్ హమ్‌దులిల్లాహ్"[19] (అల్లాహ్‌యే స్తుతింపదగినవాడు) అని అను. కాని వారిలో చాలామంది అర్థం చేసుకోరు.

17. ఇది వలసను సూచిస్తుంది. అర్థం ఏమిటంటే, ఒకవేళ మక్కా నగరంలో దేవుణ్ణి ఆరాధించటం వీలుకానిచో, దేశాన్ని వదలిపెట్టి వెళ్లిపోండి. దైవభూమి ఇరుకైనది కాదు. ఎక్కడ మీరు దైవదాసులుగా జీవించగలరో, అక్కడకు వెళ్లండి.

18. ఇక్కడ నుండి దైవగ్రంథం సంబోధన మళ్ళీ మక్కా అవిశ్వాసుల వైపునకు మరలుతోంది.

19. ఇక్కడ "అల్‌హమ్‌దులిల్లాహ్" అనే పదం రెండు అర్థాలను సూచిస్తోంది: ఒకటి, ఈ పనులన్నీ అల్లాహ్‌యే చేసినపుడు, కేవలం ఆయన మాత్రమే స్తోత్రానికి అర్హుడు, ఇక ఇతరులకు స్తోత్రార్హత ఎక్కడిది? రెండు, దైవానికి ధన్యవాదాలు; ఈ విషయాన్ని స్వయంగా మీరు కూడ అంగీకరిస్తున్నారు.

وَ مَا هٰذِهِ الْحَيٰوةُ الدُّنْيَآ اِلَّا لَهْوٌ وَّ لَعِبٌ ؕ وَ
اِنَّ الدَّارَ الْاٰخِرَةَ لَهِيَ الْحَيَوَانُ ۘ لَوْ كَانُوْا
يَعْلَمُوْنَ ۝٦٤ فَاِذَا رَكِبُوْا فِي الْفُلْكِ دَعَوُا اللّٰهَ
مُخْلِصِيْنَ لَهُ الدِّيْنَ ۚ فَلَمَّا نَجّٰىهُمْ اِلَى الْبَرِّ
اِذَا هُمْ يُشْرِكُوْنَ ۝٦٥ لِيَكْفُرُوْا بِمَآ اٰتَيْنٰهُمْ ۚ وَ
لِيَتَمَتَّعُوْا ۟ فَسَوْفَ يَعْلَمُوْنَ ۝٦٦ اَوَلَمْ يَرَوْا
اَنَّا جَعَلْنَا حَرَمًا اٰمِنًا وَّيُتَخَطَّفُ النَّاسُ مِنْ
حَوْلِهِمْ ؕ اَفَبِالْبَاطِلِ يُؤْمِنُوْنَ وَ بِنِعْمَةِ اللّٰهِ
يَكْفُرُوْنَ ۝٦٧ وَ مَنْ اَظْلَمُ مِمَّنِ افْتَرٰى عَلَى
اللّٰهِ كَذِبًا اَوْ كَذَّبَ بِالْحَقِّ لَمَّا جَآءَهٗ ؕ
اَلَيْسَ فِيْ جَهَنَّمَ مَثْوًى لِّلْكٰفِرِيْنَ ۝٦٨ وَ
الَّذِيْنَ جَاهَدُوْا فِيْنَا لَنَهْدِيَنَّهُمْ سُبُلَنَا ؕ وَ
اِنَّ اللّٰهَ لَمَعَ الْمُحْسِنِيْنَ ۝٦٩

**64 - 69** ఈ ప్రాపంచిక జీవితం ఒక క్రీడ, ఒక వినోదం తప్ప మరేమీ కాదు, అసలు జీవన గృహం పరలోక గృహమే. అయ్యో! వారు (ఈ విషయాన్ని) తెలుసుకుంటే ఎంత బాగుం టుంది. వారు పడవలోకి ఎక్కినపుడు తమ ధర్మాన్ని అల్లాహ్‌కే ప్రత్యేకించుకుని ఆయన్ని వేడుకుంటారు. తరువాత ఆయన వారిని రక్షించి నేలపైకి తీసుకురాగానే, అకస్మాత్తుగా వారు బహు దైవారాధన చేయటం ప్రారంభిస్తారు; అల్లాహ్ కలుగ జేసిన విముక్తికి కృతఘ్నుత చూపటానికి, (ప్రాపంచిక జీవితపు) భోగాలను అనుభవించటానికి. మంచిది, త్వరలోనే వారికి తెలిసిపోతుంది. వారు ఈ విషయాన్ని చూడటం లేదా; మేము శాంతి నిలయమైన ఒక హరమ్‌ను నెలకొల్పాము. వాస్తవానికి వారి చుట్టుప్రక్కల ఉన్న ప్రజలు మాయం చేయబడుతు న్నారు.[20] అయినా వారు అసత్యాన్నే విశ్వసిస్తారా? అల్లాహ్ కానుకలను తిరస్కరిస్తారా? అల్లాహ్‌కు అబద్ధం ఆపాదించే వాణ్ణీ, సత్యం తన ముందుకు వచ్చిన తరువాత కూడా దానిని తిరస్కరించేవాణ్ణీ మించిన దుర్మార్గుడెవడు? అటువంటి అవిశ్వాసుల నివాసం నరకం కాదా? మా కొరకు తీవ్ర ప్రయత్నం చేసేవారికి మేము మా మార్గాలను చూపుతాము,[21] నిశ్చయంగా అల్లాహ్ సజ్జనులతో పాటే ఉంటాడు.

20. సంపూర్ణ శాంతి భద్రతలు లభించే, వారి మక్కా నగరాన్ని లాత్‌గాని, హుబల్‌గాని పవిత్ర స్థలంగా చేశాయా? 2500 సంవత్సరాల నుంచి అరేబియాలో నెలకొని ఉన్నటువంటి కల్లోల వాతావరణంలో ఈ స్థలాన్ని సకల ఉపద్రవాల నుండి, అల్లకల్లోలాల నుండి కాపాడటం ఏ దేవునికైనా, ఏ దేవతకైనా సాధ్యమయ్యేదా? దాని పవిత్రతను యథాతథంగా ఉంచిన వారము మేము కాక ఇంకెవరు?

21. అర్థం ఏమిటంటే, తన మార్గంలో చిత్తశుద్ధితో పోరాడే వారినీ, తన కోసమై యావత్ ప్రపంచంతో విరోధాన్ని కొనితెచ్చుకున్న వారినీ అల్లాహ్ ఏకాకిగా వదలిపెట్టడు. ఆయన వారికి తన అండదండలను అందిస్తాడు. మార్గదర్శకత్వం వహిస్తాడు, తన వైపునకు వచ్చే మార్గాలను తెరచి ఉంచుతాడు. ఆయన వారికి అడుగడుగునా తన ప్రసన్నతను ఏ రీతి పొందగలరో తెలుపుతాడు, ఆయన ప్రతి మలుపులో వారికి వెలుగును చూపుతాడు, తద్వారా వారు రుజుమార్గం ఎటు ఉన్నదో, తప్పుడు మార్గాలు ఏవో తెలుసుకుంటారు. ఎవరిలో ఎంత సత్ సంకల్ప బలం ఉంటుందో, ఎవరు ఎంత తీవ్రంగా మంచిని కాంక్షిస్తారో, దానినుసరించి అల్లాహ్ వారికి అంతటి సహాయ సహకారాలనూ, భాగ్యాన్నీ, మార్గదర్శకత్వాన్ని ప్రసాదిస్తాడు.

ఆయతులు 60

# 30. అర్ రూమ్

అవతరణ మక్కాలో

٣٠ سُوْرَةُ الرُّوْمِ مَكِّيَّةٌ ٨٤

اٰياتها ٦٠ رکوعاتها ٦

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

**1 - 6** అలిఫ్. లామ్. మీమ్. రోమన్ ప్రజలు పొరుగు భూభాగంలో పరాజితులయ్యారు; తమ ఈ పరాజయం తరువాత కొన్ని సంవత్సరాలలోనే వారు విజేతలవుతారు.[1] ముందయినా తరువాత అయినా అధికారం మట్టుకు అల్లాహ్‌దే. ఆ రోజున అల్లాహ్ ప్రసాదించిన విజయానికి విశ్వాసులు వేడుకలు జరుపుకుంటారు.[2] అల్లాహ్ తనకు ఇష్టమైన వారికి సహాయ పడతాడు. అల్లాహ్ అత్యంత శక్తిమంతుడు మరియు అనంతకరుణామయుడు, ఈ వాగ్దానం అల్లాహ్ చేసిన వాగ్దానం. అల్లాహ్ ఎన్నడూ తన వాగ్దానాన్ని భంగపరచడు. కాని ఈ విషయాన్ని చాలామంది ఎరుగరు.

**7 - 10** ప్రజలు ప్రాపంచిక జీవితపు బాహ్యరూపాన్ని మాత్రమే ఎరుగుదురు; పరలోకం గురించి స్వయంగా వారే ఉపేక్షా భావంతో ఉన్నారు. వారు తమను గురించి తాము ఎన్నడూ ఆలోచించలేదా? అల్లాహ్ భూమినీ, ఆకాశాలనూ, వాటి మధ్య ఉన్న సమస్త వస్తువులనూ సత్యంతో, ఒక నిర్ణీత గడువు వరకు మాత్రమే సృష్టించాడు. కాని చాలామంది తమ ప్రభువుతో సమావేశం కావలసి ఉన్నది అనే విషయాన్ని తిరస్కరిస్తున్నారు.[3] వారు భూమిపై ఎన్నడూ ప్రయాణం చేసి ఉండలేదా- తమకు పూర్వం గతించిన ప్రజల ముగింపును వారు చూడగలందులకు? వారు (పూర్వీకులు) వీరికంటే ఎక్కువ బలవంతులు. వారు భూమిని బాగా త్రవ్వారు. వారు దానిని వీరు చేసిన దానికంటే ఎక్కువగా వసింపచేశారు. వారి వద్దకు వారి ప్రవక్తలు స్పష్టమైన సూచనలు తీసుకుని వచ్చారు. ఇంకా అల్లాహ్ వారికి అన్యాయం చేసేవాడు కాదు, కాని స్వయంగా వారే తమకు తాము అన్యాయం చేసుకుంటూ ఉండినారు. చివరకు చెడు పనులు చేసిన వారి ముగింపు చాలా చెడ్డగా జరిగింది. ఎందుకంటే, వారు అల్లాహ్ వాక్యాలను తిరస్కరించారు; వాటిని ఎగతాళి చేశారు.

الٓمّٓ ۚ ① غُلِبَتِ الرُّوْمُ ② فِیْٓ اَدْنَی الْاَرْضِ وَ
هُمْ مِّنْۢ بَعْدِ غَلَبِهِمْ سَيَغْلِبُوْنَ ③ فِیْ بِضْعِ
سِنِيْنَ ۬ۗ لِلّٰهِ الْاَمْرُ مِنْ قَبْلُ وَ مِنْۢ بَعْدُ ؕ وَ
يَوْمَئِذٍ يَّفْرَحُ الْمُؤْمِنُوْنَ ④ بِنَصْرِ اللّٰهِ ؕ
يَنْصُرُ مَنْ يَّشَآءُ ؕ وَ هُوَ الْعَزِيْزُ الرَّحِيْمُ ⑤
وَعْدَ اللّٰهِ ؕ لَا يُخْلِفُ اللّٰهُ وَعْدَهٗ وَ لٰكِنَّ
اَكْثَرَ النَّاسِ لَا يَعْلَمُوْنَ ⑥ يَعْلَمُوْنَ ظَاهِرًا
مِّنَ الْحَيٰوةِ الدُّنْيَا ۖۚ وَ هُمْ عَنِ الْاٰخِرَةِ هُمْ
غٰفِلُوْنَ ⑦ اَوَلَمْ يَتَفَكَّرُوْا فِیْٓ اَنْفُسِهِمْ ۫ مَا
خَلَقَ اللّٰهُ السَّمٰوٰتِ وَ الْاَرْضَ وَمَا بَيْنَهُمَآ
اِلَّا بِالْحَقِّ وَ اَجَلٍ مُّسَمًّى ؕ وَ اِنَّ كَثِيْرًا مِّنَ
النَّاسِ بِلِقَآئِ رَبِّهِمْ لَكٰفِرُوْنَ ⑧ اَوَلَمْ
يَسِيْرُوْا فِی الْاَرْضِ فَيَنْظُرُوْا كَيْفَ كَانَ
عَاقِبَةُ الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ ؕ كَانُوْٓا اَشَدَّ
مِنْهُمْ قُوَّةً وَّ اَثَارُوا الْاَرْضَ وَ عَمَرُوْهَآ
اَكْثَرَ مِمَّا عَمَرُوْهَا وَ جَآءَتْهُمْ رُسُلُهُمْ
بِالْبَيِّنٰتِ ؕ فَمَا كَانَ اللّٰهُ لِيَظْلِمَهُمْ وَ لٰكِنْ
كَانُوْٓا اَنْفُسَهُمْ يَظْلِمُوْنَ ⑨ ثُمَّ كَانَ عَاقِبَةَ
الَّذِيْنَ اَسَآءُوا السُّوْٓاٰى اَنْ كَذَّبُوْا بِاٰيٰتِ
اللّٰهِ وَكَانُوْا بِهَا يَسْتَهْزِءُوْنَ ⑩ ع

اَللّٰهُ يَبْدَؤُا الْخَلْقَ ثُمَّ يُعِيْدُهٗ ثُمَّ اِلَيْهِ
تُرْجَعُوْنَ ﴿١١﴾ وَ يَوْمَ تَقُوْمُ السَّاعَةُ يُبْلِسُ
الْمُجْرِمُوْنَ ﴿١٢﴾ وَ لَمْ يَكُنْ لَّهُمْ مِّنْ شُرَكَآئِهِمْ
شُفَعٰٓؤُا وَ كَانُوْا بِشُرَكَآئِهِمْ كٰفِرِيْنَ ﴿١٣﴾ وَ يَوْمَ
تَقُوْمُ السَّاعَةُ يَوْمَئِذٍ يَّتَفَرَّقُوْنَ ﴿١٤﴾ فَاَمَّا
الَّذِيْنَ اٰمَنُوْا وَعَمِلُوا الصّٰلِحٰتِ فَهُمْ فِيْ
رَوْضَةٍ يُّحْبَرُوْنَ ﴿١٥﴾ وَ اَمَّا الَّذِيْنَ كَفَرُوْا
وَكَذَّبُوْا بِاٰيٰتِنَا وَ لِقَآئِ الْاٰخِرَةِ فَاُولٰٓئِكَ فِي
الْعَذَابِ مُحْضَرُوْنَ ﴿١٦﴾ فَسُبْحٰنَ اللّٰهِ حِيْنَ
تُمْسُوْنَ وَ حِيْنَ تُصْبِحُوْنَ ﴿١٧﴾ وَ لَهُ الْحَمْدُ فِي
السَّمٰوٰتِ وَ الْاَرْضِ وَ عَشِيًّا وَّ حِيْنَ
تُظْهِرُوْنَ ﴿١٨﴾ يُخْرِجُ الْحَيَّ مِنَ الْمَيِّتِ وَيُخْرِجُ
الْمَيِّتَ مِنَ الْحَيِّ وَ يُحْيِ الْاَرْضَ بَعْدَ
مَوْتِهَا ؕ وَكَذٰلِكَ تُخْرَجُوْنَ ﴿١٩﴾ وَ مِنْ اٰيٰتِهٖۤ ع ٢ ٥
اَنْ خَلَقَكُمْ مِّنْ تُرَابٍ ثُمَّ اِذَآ اَنْتُمْ بَشَرٌ
تَنْتَشِرُوْنَ ﴿٢٠﴾

**11 - 16** అల్లాహ్‌యే సృష్టిని ప్రారంభిస్తాడు, ఆయనే దానిని తిరిగి సృష్టిస్తాడు, తరువాత ఆయన వైపునకే మీరు మరలింప బడతారు. ఆ గడియ నెలకొన్ననాడు, అపరాధులు దిగ్భ్రమకు లోనవుతారు,[4] వారు అల్లాహ్‌కు భాగస్వాములుగా నిలబెట్టిన వారెవరూ వారిని గురించి సిఫారసు చేయరు. అప్పుడు వారు తాము కల్పించుకున్న దైవాలను సైతం తిరస్కరిస్తారు.[5] ఆ గడియ నెలకొన్న రోజున (మానవులందరూ) విభిన్న వర్గాలుగా చీలిపోతారు. విశ్వసించి మంచి పనులు చేసినవారు ఒక ఉద్యానవనంలో సుఖంగా సంతోషంగా ఉంచబడతారు, కాని విశ్వసించనివారు మా వాక్యాలనూ, పరలోక సమావేశాన్నీ నిరాకరించిన వారు శిక్షలోనే ఉంచబడతారు.

**17 - 19** కనుక నీవు అల్లాహ్ పరిశుద్ధతను కొనియాడు, సాయంత్రం అయినపుడు, ఉదయం అయినపుడు. ఆకాశాల లోనూ, భూమిలోనూ ఆయనే స్తుతింపదగినవాడు, మధ్యాహ్నం అయినపుడు[6] సూర్యాస్తమయం అయినప్పుడు (ఆయనను స్తుతించు). ఆయన జీవిని నిర్జీవి నుండి వెలికి తీస్తాడు, నిర్జీవిని జీవి నుండి వెలికి తీసుకువస్తాడు. భూమి మృతి చెందిన తరువాత దానికి ప్రాణం పోస్తాడు. ఇలానే నీవు కూడా (మరణావస్థ నుండి) వెలికి తీయబడతావు.

**20** ఆయన సూచనలలో ఒకటి ఏమిటంటే; ఆయన మిమ్మల్ని మట్టితో సృష్టించాడు. తరువాత అకస్మాత్తుగా మీరు మానవు లయ్యారు. (భూమిపై) వ్యాపిస్తూ ఉన్నారు.

1. రోమను, ఇరాను రాజ్యాల మధ్య నాడు జరుగుతూ ఉండిన యుద్ధాన్ని ఇది సూచిస్తుంది. అప్పుడు రోము దేశం చిత్తు చిత్తుగా ఓడిపోయింది. అది తిరిగి నిలదొక్కుకోగలదనీ, అధికారాన్ని చేజిక్కించుకొనగలదనీ ఎవరూ ఊహించలేక పోయారు. కాని అల్లాహ్ ఈ వాక్యంలో, రోమనులు కొన్ని సంవత్సరాలలోనే తిరిగి ప్రాబల్యాన్ని పొందగలరని జోస్యం చెబుతున్నాడు.
2. ఇది రెండో జోస్యం. దీని అర్థం బదర్ సంగ్రామంలో ముస్లిమ్‌లను విజయం వరించినప్పుడూ రోమనులు ఇరానీయులపై విజయాన్ని సాధించినప్పుడూ ఈ జోస్యం ప్రజలకు అవగతమయింది.
3. అంటే, మానవుడు గనక సృష్టి వ్యవస్థను పరిశీలనా దృష్టితో చూచినట్లయితే, అతనికి రెండు యథార్థాలు స్పష్టంగా గోచరిస్తాయి. ఒకటి, ఇది పిల్లవాడు ఆడుకునే ఆట వస్తువు కాదు, బుద్ధి సంపన్నత ఆధారంగా ఉన్నటువంటి, ఒక నిర్దిష్ట లక్ష్యంతో పనిచేసే వ్యవస్థ. రెండు, ఈ వ్యవస్థ శాశ్వతమైనది కాదు, ఏదో ఒక నాటికి తప్పకుండా ఇది నశిస్తుంది. ఈ రెండు విషయాలు పరలోక నిరూపణకు సాక్ష్యాలు. అయినా ప్రజలు ఇదంతా చూస్తూ కూడా దానిని తిరస్కరిస్తున్నారు.

وَ مِنۡ اٰيٰتِهٖۤ اَنۡ خَلَقَ لَكُمۡ مِّنۡ اَنۡفُسِكُمۡ
اَزۡوَاجًا لِّتَسۡكُنُوۡۤا اِلَيۡهَا وَ جَعَلَ بَيۡنَكُمۡ مَّوَدَّةً
وَّ رَحۡمَةً ؕ اِنَّ فِىۡ ذٰلِكَ لَاٰيٰتٍ لِّقَوۡمٍ
يَّتَفَكَّرُوۡنَ ﴿۲۱﴾ وَ مِنۡ اٰيٰتِهٖ خَلۡقُ السَّمٰوٰتِ وَ
الۡاَرۡضِ وَاخۡتِلَافُ اَلۡسِنَتِكُمۡ وَاَلۡوَانِكُمۡ ؕ اِنَّ
فِىۡ ذٰلِكَ لَاٰيٰتٍ لِّلۡعٰلِمِيۡنَ ﴿۲۲﴾ وَ مِنۡ اٰيٰتِهٖ
مَنَامُكُمۡ بِالَّيۡلِ وَ النَّهَارِ وَابۡتِغَآؤُكُمۡ مِّنۡ
فَضۡلِهٖ ؕ اِنَّ فِىۡ ذٰلِكَ لَاٰيٰتٍ لِّقَوۡمٍ
يَّسۡمَعُوۡنَ ﴿۲۳﴾ وَ مِنۡ اٰيٰتِهٖ يُرِيۡكُمُ الۡبَرۡقَ خَوۡفًا وَّ
طَمَعًا وَّيُنَزِّلُ مِنَ السَّمَآءِ مَآءً فَيُحۡىٖ بِهِ
الۡاَرۡضَ بَعۡدَ مَوۡتِهَا ؕ اِنَّ فِىۡ ذٰلِكَ لَاٰيٰتٍ
لِّقَوۡمٍ يَّعۡقِلُوۡنَ ﴿۲۴﴾ وَ مِنۡ اٰيٰتِهٖۤ اَنۡ تَقُوۡمَ
السَّمَآءُ وَ الۡاَرۡضُ بِاَمۡرِهٖ ؕ ثُمَّ اِذَا دَعَاكُمۡ
دَعۡوَةً ۖ مِّنَ الۡاَرۡضِ ۖ اِذَاۤ اَنۡتُمۡ تَخۡرُجُوۡنَ ﴿۲۵﴾
وَلَهٗ مَنۡ فِى السَّمٰوٰتِ وَ الۡاَرۡضِ ؕ كُلٌّ لَّهٗ
قٰنِتُوۡنَ ﴿۲۶﴾ وَ هُوَ الَّذِىۡ يَبۡدَؤُا الۡخَلۡقَ ثُمَّ
يُعِيۡدُهٗ وَ هُوَ اَهۡوَنُ عَلَيۡهِ ؕ وَ لَهُ الۡمَثَلُ
الۡاَعۡلٰى فِى السَّمٰوٰتِ وَ الۡاَرۡضِ ۚ وَ هُوَ
الۡعَزِيۡزُ الۡحَكِيۡمُ ﴿۲۷﴾ ع

**21** ఆయన సూచనలలో మరొకటి ఏమిటంటే; ఆయన మీ కొరకు భార్యలను మీ జాతిలో నుండే సృష్టించాడు- మీరు వారివద్ద శాంతిని పొందటానికి, మీ మధ్య ప్రేమనూ, కారుణ్యాన్నీ సృజించాడు. నిశ్చయంగా ఆలోచనాపరులకు ఇందులో ఎన్నో సూచనలు ఉన్నాయి.

**22** ఆయన సూచనలలో, ఆకాశాలనూ, భూమినీ సృష్టించటమూ, మీ భాషల, మీ రంగుల వైవిధ్యాలూ ఉన్నాయి. నిశ్చయంగా విజ్ఞులకు ఇందులో ఎన్నో సూచనలు ఉన్నాయి.

**23** ఆయన సూచనలలో రాత్రి, పగలు, మీరు నిద్రపోవటం, మీరు ఆయన అనుగ్రహాన్ని అన్వేషించటం కూడా ఉన్నాయి. నిశ్చయంగా, (శ్రద్ధగా) వినే వారికి ఇందులో చాలా సూచనలు ఉన్నాయి.

**24** ఇంకా ఆయన సూచనలలో మరొకటి ఏమిటంటే ఆయన మీకు మెరుపు తళతళలను చూపిస్తాడు, భయాన్ని కలిగిస్తూనూ, ఆశను రేకెత్తిస్తూనూ: ఆకాశం నుండి నీటిని కురిపిస్తున్నాడు, తరువాత దాని ద్వారా భూమికి, దాని మరణానంతరం జీవితాన్ని ప్రసాదిస్తున్నాడు, నిశ్చయంగా ఇందులో తెలివిని వినియోగించుకునే వారికి ఎన్నో సూచనలు ఉన్నాయి.

**25 - 27** ఆయన సూచనలలో ఇంకొకటి ఏమిటంటే, ఆకాశమూ, భూమీ ఆయన ఆజ్ఞ మూలంగానే సుస్థిరంగా ఉన్నాయి. తరువాత ఆయన మిమ్మల్ని భూమి నుండి రమ్మని పిలిచినంతనే, కేవలం ఒకే ఒక పిలుపునకు మీరు అకస్మాత్తుగా బయటికి వచ్చేస్తారు. ఆకాశాలలో, భూమిపై ఉన్న వారెవరైనా ఆయన దాసులే. అందరూ ఆయన ఆజ్ఞకే కట్టుబడి ఉన్నారు. ఆయనే సృష్టిని ప్రారంభిస్తాడు. ఆయనే దానిని మళ్ళీ సృష్టిస్తాడు. ఇది ఆయనకు సులభతరం. ఆకాశాలలోనూ, భూమిపైనా ఆయన గుణగణాలు సర్వోన్నతమైనవి, ఆయన శక్తిమంతుడు, వివేకవంతుడూను.

4. అసలు 'ముబ్లిసూన్' అనే పదం వాడబడింది. 'ఇబ్లాస్' అంటే, నిరాశ, నిస్పృహలవల్ల మనిషి నిశ్చేష్టుడైపోవడం.
5. అంటే, అప్పుడు ఈ ముష్రిక్కులే స్వయంగా తాము వారిని దేవునికి భాగస్వాములుగా చేసి తప్పు చేశామని అంగీకరిస్తారు.

**28 - 29** ఆయన మీకు స్వయంగా మీకే చెందిన ఒక ఉప మానాన్ని ఇస్తున్నాడు. మీ అధీనంలో ఉన్న బానిసలలో కొందరు మేము మీకు ఇచ్చిన సిరి సంపదలలో మీతోపాటు సమానమైన భాగస్వాములుగా ఉన్నవారూ, మీరు పరస్పరం మీ సమానులకు భయపడే విధంగా,[7] మీరు భయపడేటటువంటి వారు వారిలో ఎవరైనా ఉన్నారా?- ఈ విధంగా బుద్ధికుశలత కలవారికి మేము సూచనలను స్పష్టంగా వివరిస్తాము. కాని ఈ దుర్మార్గులు జ్ఞానం లేకుండానే తమ భ్రమలవెంట పడ్డారు. అల్లాహ్ అపమార్గం పట్టించిన వ్యక్తికి మార్గం చూపగల వాడెవడు? అటువంటి వారికి సాయపడే వాడెవడూ ఉండడు.

**30 - 32** కనుక (ప్రవక్తా! ప్రవక్త యొక్క అనుచరులారా!) ఏకాగ్రచిత్తంతో మీ ముఖాన్ని ఈ ధర్మం దిశలో స్థిరంగా నిలపండి. అల్లాహ్ మానవులను ఏ స్వభావం ఆధారంగా సృష్టించాడో దానిపై స్థిరంగా ఉండండి. అల్లాహ్ సృజించిన స్వరూప స్వభావాలు మార్చటానికి శక్యం కానివి,[8] ఇదే సవ్యమైన, తిన్నని ధర్మమార్గం, కాని చాలామందికి తెలియదు. (స్థిరముగా ఉండండి ఈ విషయంలో) అల్లాహ్ వైపునకు మరలుతూ; ఆయనకు భయపడండి, నమాజును స్థాపించండి, తమ ధర్మాన్ని వేర్వేరుగా రూపొందించుకున్న మరియు వర్గాలుగా చీలిపోయిన ముష్రిక్కులలో కలసిపోవకండి. ప్రతి వర్గమూ తన వద్ద ఉన్న దానితోనే ఆనందపడుతున్నది.

ضَرَبَ لَكُمْ مَّثَلًا مِّنْ اَنْفُسِكُمْ ؕ هَلْ لَّكُمْ
مِّنْ مَّا مَلَكَتْ اَيْمَانُكُمْ مِّنْ شُرَكَآءَ فِيْ مَا
رَزَقْنٰكُمْ فَاَنْتُمْ فِيْهِ سَوَآءٌ تَخَافُوْنَهُمْ
كَخِيْفَتِكُمْ اَنْفُسَكُمْ ؕ كَذٰلِكَ نُفَصِّلُ الْاٰيٰتِ
لِقَوْمٍ يَّعْقِلُوْنَ ﴿٢٨﴾ بَلِ اتَّبَعَ الَّذِيْنَ ظَلَمُوْٓا
اَهْوَآءَهُمْ بِغَيْرِ عِلْمٍ ۚ فَمَنْ يَّهْدِيْ مَنْ اَضَلَّ
اللّٰهُ ؕ وَ مَا لَهُمْ مِّنْ نّٰصِرِيْنَ ﴿٢٩﴾ فَاَقِمْ وَجْهَكَ
لِلدِّيْنِ حَنِيْفًا ؕ فِطْرَتَ اللّٰهِ الَّتِيْ فَطَرَ النَّاسَ
عَلَيْهَا ؕ لَا تَبْدِيْلَ لِخَلْقِ اللّٰهِ ؕ ذٰلِكَ الدِّيْنُ
الْقَيِّمُ ۙ وَ لٰكِنَّ اَكْثَرَ النَّاسِ لَا يَعْلَمُوْنَ ﴿٣٠﴾
مُنِيْبِيْنَ اِلَيْهِ وَاتَّقُوْهُ وَ اَقِيْمُوا الصَّلٰوةَ وَلَا
تَكُوْنُوْا مِنَ الْمُشْرِكِيْنَ ﴿٣١﴾ مِنَ الَّذِيْنَ فَرَّقُوْا
دِيْنَهُمْ وَكَانُوْا شِيَعًا ؕ كُلُّ حِزْبٍۭ بِمَا لَدَيْهِمْ
فَرِحُوْنَ ﴿٣٢﴾

6. ఈ వాక్యంలో, నమాజు యొక్క నాలుగు సమయాలను స్పష్టంగా సూచించటం జరిగింది, అవి ఫజర్ (ఉదయం), మగ్రిబ్ (సాయంత్రం), అసర్ (బాగా ప్రొద్దువాలక పూర్వం), జుహర్ (మధ్యాహ్నం తరువాత). దీనితోపాటు హూద్ సూరాలోని 114వ వాక్యాన్నీ, బనీ ఇస్రాయీల్ సూరాలోని 78వ వాక్యాన్నీ, తాహా సూరాలోని 130వ వాక్యాన్నీ కలిపి చదివితే, నమాజు యొక్క ఐదు సమయాలకు సంబంధించిన ఆజ్ఞ లభిస్తుంది.

7. నహల్ సూరాలోని 62వ వాక్యంలో వచ్చిన విషయమే ఇక్కడ కూడ వచ్చింది. రెండు చోట్లా వచ్చిన వాదము ఇదే : మీరు మీ సంపదలో మీ బానిసలకు భాగం ఇవ్వనప్పుడు, దేవుడు తన దైవత్వంలో తన దాసులకు భాగం ఇస్తాడు అని మీరు ఎలా అనుకోగలరు?

8. అంటే, దేవుడు మానవుణ్ణి తన దాసుడుగా చేసుకున్నాడు, తన దాస్యం నిమిత్తమే అతనిని పుట్టించాడు. ఈ సహజ గుణం ఎవరు మార్చినా మారనిది, మార్చజాలనిది. మనిషి ఎల్లప్పుడూ దాసుడే, అతని ఈ స్థితి మార్చశక్యము కానిది. దైవేతరుణ్ణి తన దైవముగా చేసుకుంటే, ఆ దైవము వాస్తవానికి అతని దైవము కాలేదు. మానవుడు తన కోరిక మేరకు ఎంతమంది దేవుళ్ళనైనా సృష్టించుకోవచ్చు. కాని యథార్థం ఏమిటంటే అతడు వారిలో ఎవరికినీ దాసుడు కాలేడు. లోకానికి దేవుడు ఒక్కడే కదా! దీనిని ఇలా కూడ అనువాదం చేయవచ్చు:

وَ اِذَا مَسَّ النَّاسَ ضُرٌّ دَعَوْا رَبَّهُمْ مُّنِيْبِيْنَ
اِلَيْهِ ثُمَّ اِذَآ اَذَاقَهُمْ مِّنْهُ رَحْمَةً اِذَا فَرِيْقٌ
مِّنْهُمْ بِرَبِّهِمْ يُشْرِكُوْنَ ﴿٣٣﴾ لِيَكْفُرُوْا بِمَآ
اٰتَيْنٰهُمْ ؕ فَتَمَتَّعُوْا ٝ فَسَوْفَ تَعْلَمُوْنَ ﴿٣٤﴾ اَمْ
اَنْزَلْنَا عَلَيْهِمْ سُلْطٰنًا فَهُوَ يَتَكَلَّمُ بِمَا كَانُوْا بِهٖ
يُشْرِكُوْنَ ﴿٣٥﴾ وَ اِذَآ اَذَقْنَا النَّاسَ رَحْمَةً
فَرِحُوْا بِهَا ؕ وَاِنْ تُصِبْهُمْ سَيِّئَةٌۢ بِمَا قَدَّمَتْ
اَيْدِيْهِمْ اِذَا هُمْ يَقْنَطُوْنَ ﴿٣٦﴾ اَوَلَمْ يَرَوْا اَنَّ
اللّٰهَ يَبْسُطُ الرِّزْقَ لِمَنْ يَّشَآءُ وَ يَقْدِرُ ؕ اِنَّ
فِيْ ذٰلِكَ لَاٰيٰتٍ لِّقَوْمٍ يُّؤْمِنُوْنَ ﴿٣٧﴾ فَاٰتِ ذَا
الْقُرْبٰى حَقَّهٗ وَ الْمِسْكِيْنَ وَ ابْنَ السَّبِيْلِ ؕ
ذٰلِكَ خَيْرٌ لِّلَّذِيْنَ يُرِيْدُوْنَ وَجْهَ اللّٰهِ ۫
وَاُولٰٓئِكَ هُمُ الْمُفْلِحُوْنَ ﴿٣٨﴾ وَ مَآ اٰتَيْتُمْ مِّنْ
رِّبًا لِّيَرْبُوَا۟ فِيْۤ اَمْوَالِ النَّاسِ فَلَا يَرْبُوْا عِنْدَ
اللّٰهِ ۚ وَمَآ اٰتَيْتُمْ مِّنْ زَكٰوةٍ تُرِيْدُوْنَ وَجْهَ
اللّٰهِ فَاُولٰٓئِكَ هُمُ الْمُضْعِفُوْنَ ﴿٣٩﴾

**33 - 35** మానవుల స్థితి ఎలాంటిదంటే, వారికి ఏదైనా కష్టం కలిగినపుడు, వారు తమ ప్రభువు వైపునకు మరలి ఆయనకు మొరపెట్టుకుంటారు. తరువాత ఆయన తన కారుణ్యపు మాధుర్యాన్ని కొంచెం వారికి రుచి చూపిస్తే అపుడు వారిలో కొందరు వెంటనే షిర్కు చేయటం ప్రారంభిస్తారు, మేము చేసిన ఉపకారానికి కృతఘ్నుత చూపటానికిగాను. సరే, మంచిది, సుఖాలు అనుభవించండి, త్వరలోనే మీకు తెలిసి పోతుంది. వారు చేస్తూ ఉన్న షిర్కు యొక్క సత్యతకు సాక్ష్యం పలికే ఏదైనా నిదర్శనాన్ని గానీ, ప్రమాణాన్ని గానీ మేము వారిపై అవతరింపజేశామా?

**36 - 39** మేము మానవులకు కారుణ్యపు కమ్మదనాన్ని రుచి చూపించి నప్పుడు, వారు దానికి పొంగిపోతారు. స్వయంగా వారు చేసుకున్న చేష్టలు కారణంగా వారిపైకి ఏదైనా ఆపద వచ్చిపడితే, వెంటనే వారు నిరాశకు లోనవుతారు. అల్లాహ్‌యే తనకు ఇష్టమైన వారి ఉపాధిని వృద్ధి పరుస్తాడు, (తనకు ఇష్ట మైన వారి ఉపాధిని) తక్కువ చేస్తాడు. ఈ విషయాన్ని వారు చూడటం లేదా? నిశ్చయంగా ఇందులో విశ్వసించే వారికి ఎన్నో సూచనలు ఉన్నాయి. కనుక (విశ్వాసీ) బంధువునకు అతని హక్కును ఇచ్చివేయి, పేదవానికీ, బాటసారికీ (వారి హక్కులను)[9] ఇచ్చివేయి. అల్లాహ్ ప్రసన్నతను కోరుకునే వారికి ఈ పద్ధతి ఉత్తమమైనది. వారే సాఫల్యం పొందేవారు. ప్రజల సంపదలో చేరి పెరగాలని మీరు ఇచ్చే వడ్డీ అల్లాహ్ దృష్టిలో పెరగదు.[10] అల్లాహ్ ప్రసన్నతను పొందే ఉద్దేశ్యంతో, మీరు ఇచ్చే జకాతు–దానిని ఇచ్చే వారే వాస్తవంగా తమ సంపదను వృద్ధి చేసుకుంటారు.

"అల్లాహ్ ప్రసాదించిన సహజ ప్రకృతికి వికారం కలిగించవద్దు." అంటే, అల్లాహ్ మానవుణ్ణి ఏ ప్రకృతి ధర్మంపై సృష్టించాడో, దానిని రూపుమాపటం తగదు.

9. బంధువులకూ, నిరుపేదలకూ, బాటసారులకూ దానం చేయండి అని చెప్పలేదు. ఇది వారి హక్కు. దానిని నీవు నెరవేర్చాలి, దానిని వారి హక్కుగా భావించి నీవు నెరవేర్చాలి, అని సెలవీయబడింది.

اَللّٰهُ الَّذِيْ خَلَقَكُمْ ثُمَّ رَزَقَكُمْ ثُمَّ يُمِيْتُكُمْ
ثُمَّ يُحْيِيْكُمْ ؕ هَلْ مِنْ شُرَكَآئِكُمْ مَّنْ يَّفْعَلُ
مِنْ ذٰلِكُمْ مِّنْ شَيْءٍ ؕ سُبْحٰنَهٗ وَتَعٰلٰى عَمَّا
يُشْرِكُوْنَ ﴿٤٠﴾ ظَهَرَ الْفَسَادُ فِي الْبَرِّ وَالْبَحْرِ بِمَا ع
كَسَبَتْ اَيْدِي النَّاسِ لِيُذِيْقَهُمْ بَعْضَ الَّذِيْ
عَمِلُوْا لَعَلَّهُمْ يَرْجِعُوْنَ ﴿٤١﴾ قُلْ سِيْرُوْا فِي
الْاَرْضِ فَانْظُرُوْا كَيْفَ كَانَ عَاقِبَةُ الَّذِيْنَ
مِنْ قَبْلُ ؕ كَانَ اَكْثَرُهُمْ مُّشْرِكِيْنَ ﴿٤٢﴾ فَاَقِمْ
وَجْهَكَ لِلدِّيْنِ الْقَيِّمِ مِنْ قَبْلِ اَنْ يَّاْتِيَ يَوْمٌ
لَّا مَرَدَّ لَهٗ مِنَ اللّٰهِ يَوْمَئِذٍ يَّصَّدَّعُوْنَ ﴿٤٣﴾ مَنْ
كَفَرَ فَعَلَيْهِ كُفْرُهٗ ۚ وَمَنْ عَمِلَ صَالِحًا
فَلِاَنْفُسِهِمْ يَمْهَدُوْنَ ﴿٤٤﴾ لِيَجْزِيَ الَّذِيْنَ اٰمَنُوْا
وَعَمِلُوا الصّٰلِحٰتِ مِنْ فَضْلِهٖ ؕ اِنَّهٗ لَا يُحِبُّ
الْكٰفِرِيْنَ ﴿٤٥﴾ وَمِنْ اٰيٰتِهٖۤ اَنْ يُّرْسِلَ الرِّيَاحَ
مُبَشِّرٰتٍ وَّلِيُذِيْقَكُمْ مِّنْ رَّحْمَتِهٖ وَلِتَجْرِيَ
الْفُلْكُ بِاَمْرِهٖ وَلِتَبْتَغُوْا مِنْ فَضْلِهٖ وَلَعَلَّكُمْ
تَشْكُرُوْنَ ﴿٤٦﴾ وَلَقَدْ اَرْسَلْنَا مِنْ قَبْلِكَ
رُسُلًا اِلٰى قَوْمِهِمْ فَجَآءُوْهُمْ بِالْبَيِّنٰتِ
فَانْتَقَمْنَا مِنَ الَّذِيْنَ اَجْرَمُوْا ؕ وَكَانَ حَقًّا
عَلَيْنَا نَصْرُ الْمُؤْمِنِيْنَ ﴿٤٧﴾ اَللّٰهُ الَّذِيْ يُرْسِلُ
الرِّيٰحَ فَتُثِيْرُ سَحَابًا فَيَبْسُطُهٗ فِي السَّمَآءِ كَيْفَ
يَشَآءُ وَيَجْعَلُهٗ كِسَفًا فَتَرَى الْوَدْقَ يَخْرُجُ
مِنْ خِلٰلِهٖ ۚ فَاِذَآ اَصَابَ بِهٖ مَنْ يَّشَآءُ مِنْ
عِبَادِهٖۤ اِذَا هُمْ يَسْتَبْشِرُوْنَ ﴿٤٨﴾

**40 - 45** అల్లాహ్‌యే మిమ్మల్ని పుట్టించాడు. తరువాత మీకు ఉపాధిని ఇచ్చాడు. ఆ తరువాత ఆయన మీకు మరణం కలిగిస్తాడు, తరువాత ఆయన మిమ్మల్ని బ్రతికిస్తాడు. మీరు దైవ సమానులుగా నిర్ణయించుకున్న వారిలో, ఎవడైనా ఈ పనులలో ఏ పనినైనా చేసే వాడు ఉన్నాడా? ఈ మానవులు చేసే షిర్కు నుండి ఆయన పరిశుద్ధుడు, మహోన్నతుడు. మానవులు చేజేతులా సంపాదించుకున్న[11] దాని ఫలితంగానే నేలపైనా, నీటిలోనూ కల్లోలం చెలరేగింది; వారి కొన్ని చేష్టల (ఫలితం)ను వారికి చవిచూపటానికి; బహుశా వారు తమను సంస్కరించుకుంటారేమో అని. (ప్రవక్తా) వారితో ఇలా అను, భూమిపై సంచారం చేసి చూడండి, పూర్వం గతించిన వారి ముగింపు ఎలా జరిగిందో, వారిలో చాల మంది బహుదైవారాధకులే. కనుక (ప్రవక్తా) ఈ సత్య ధర్మంవైపు నీ ముఖాన్ని స్థిరంగా నిలుపు- ఆ రోజు రాకముసుపే, ఏ రోజు తొలగిపోయే ఏ అవకాశమూ అల్లాహ్ తరఫు నుండి లేదో. ఆ రోజున మానవులు చెదరిపోయి ఒకరినుండి ఒకరు వేరై పోతారు, అవిశ్వాసానికి పాల్పడినవాడు తన అవిశ్వాసపు దుష్ఫలితాన్ని తానే అనుభవిస్తాడు. మంచి పనులు చేసేవారు తమ కొరకే (సాఫల్య మార్గాన్ని) సుగమం చేసుకుంటున్నారు; విశ్వసించి మంచి పనులు చేసే వారికి అల్లాహ్ తన అనుగ్రహం నుండి ప్రతిఫలం ఇచ్చేందుకు. నిశ్చయంగా ఆయన అవిశ్వాసులను ప్రేమించడు.

**46 - 47** ఇది, ఆయన సూచనలలోనిది. ఆయన వాయువులను పంపుతాడు, శుభవార్తను తెలిపేందుకూ, మీకు తన కారుణ్యాన్ని రుచి చూపేందుకూ, ఇంకా ఈ ఉద్దేశ్యంతో కూడా, పడవలు ఆయన ఆజ్ఞతో ప్రయాణించేటందుకు, మీరు ఆయన అనుగ్రహాన్ని అన్వేషించేటందుకు, ఆయనకు కృతజ్ఞతలు తెలిపేవారుగా అయ్యేటందుకు. మేము నీకు పూర్వం ప్రవక్తలను వారి జాతుల వైపునకు పంపాము, వారు వారి వద్దకు స్పష్టమైన సూచనలను తీసుకుని వచ్చారు. తరువాత నేరం చేసిన వారికి మేము ప్రతీకారం చేశాము. మేము విశ్వాసులకు సహాయపడటం అనేది వారికి మాపై ఉన్న హక్కు.

**48 - 53** అల్లాహ్‌యే గాలులను పంపేవాడు, అవి మేఘాలను లేపుతాయి, తరువాత ఆయన ఆ మేఘాలను తన ఇష్టం ప్రకారం ఆకాశంలో వ్యాపింపజేస్తాడు, వాటిని ఖండికలుగా విభజిస్తాడు, తరువాత మేఘంలో నుండి వర్షపు బిందువులు కురియటాన్ని నీవు చూస్తావు. ఆయన ఈ వర్షాన్ని తన దాసులలో తనకు ఇష్టమైన వారిపై కురిపించగానే, వారు ఆనందంతో పొంగిపోతారు.

وَ اِنْ كَانُوْا مِنْ قَبْلِ اَنْ يُّنَزَّلَ عَلَيْهِمْ مِّنْ
قَبْلِهٖ لَمُبْلِسِيْنَ ﴿٤٩﴾ فَانْظُرْ اِلٰٓى اٰثٰرِ رَحْمَتِ اللّٰهِ
كَيْفَ يُحْيِ الْاَرْضَ بَعْدَ مَوْتِهَا ؕ اِنَّ ذٰلِكَ
لَمُحْيِ الْمَوْتٰى ۚ وَهُوَ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ ﴿٥٠﴾ وَ
لَئِنْ اَرْسَلْنَا رِيْحًا فَرَاَوْهُ مُصْفَرًّا لَّظَلُّوْا
مِنْۢ بَعْدِهٖ يَكْفُرُوْنَ ﴿٥١﴾ فَاِنَّكَ لَا تُسْمِعُ الْمَوْتٰى وَ
لَا تُسْمِعُ الصُّمَّ الدُّعَآءَ اِذَا وَلَّوْا مُدْبِرِيْنَ ﴿٥٢﴾
وَمَآ اَنْتَ بِهٰدِ الْعُمْيِ عَنْ ضَلٰلَتِهِمْ ؕ اِنْ
تُسْمِعُ اِلَّا مَنْ يُّؤْمِنُ بِاٰيٰتِنَا فَهُمْ مُّسْلِمُوْنَ ﴿٥٣﴾ ع ٥
اَللّٰهُ الَّذِيْ خَلَقَكُمْ مِّنْ ضُعْفٍ ثُمَّ جَعَلَ مِنْۢ
بَعْدِ ضُعْفٍ قُوَّةً ثُمَّ جَعَلَ مِنْۢ بَعْدِ قُوَّةٍ
ضُعْفًا وَّشَيْبَةً ؕ يَخْلُقُ مَا يَشَآءُ ۚ وَ هُوَ
الْعَلِيْمُ الْقَدِيْرُ ﴿٥٤﴾ وَ يَوْمَ تَقُوْمُ السَّاعَةُ
يُقْسِمُ الْمُجْرِمُوْنَ ۙ مَا لَبِثُوْا غَيْرَ سَاعَةٍ ؕ
كَذٰلِكَ كَانُوْا يُؤْفَكُوْنَ ﴿٥٥﴾ وَقَالَ الَّذِيْنَ اُوْتُوا
الْعِلْمَ وَالْاِيْمَانَ لَقَدْ لَبِثْتُمْ فِيْ كِتٰبِ اللّٰهِ
اِلٰى يَوْمِ الْبَعْثِ ؗ فَهٰذَا يَوْمُ الْبَعْثِ
وَلٰكِنَّكُمْ كُنْتُمْ لَا تَعْلَمُوْنَ ﴿٥٦﴾ فَيَوْمَئِذٍ لَّا
يَنْفَعُ الَّذِيْنَ ظَلَمُوْا مَعْذِرَتُهُمْ وَ لَا هُمْ
يُسْتَعْتَبُوْنَ ﴿٥٧﴾

قرء حفص بضم الضاد وفتحها في الثلاثة لكن الضم مختار ١٢

వాస్తవానికి దాని అవతరణకు పూర్వం వారు నిరాశకు లోనై ఉండేవారు, అల్లాహ్ కారుణ్యం యొక్క ప్రభావాలను చూడు; నిర్జీవంగా పడి ఉన్న భూమిని ఆయన ఎలా బ్రతికించిలేపుతాడో; నిశ్చయంగా ఆయన మృతులకు ప్రాణం పోసేవాడు, ఆయన ప్రతి విషయంపై అధికారం కలవాడు. మేము గాలిని పంపితే, దాని ప్రభావం వల్ల వారు తమ పంటలు పసుపు పచ్చగా మారటాన్ని చూస్తే, అప్పుడు వారు అవిశ్వాసంపై మరింత స్థిరపడిపోతారు,[12] (ప్రవక్తా!) నీవు మృతులకు వినిపించలేవు,[13] వెనుతిరిగి వెళ్ళిపోయే చెవిటి వారికీ నీవు నీ సందేశాన్ని వినిపించలేవు; నీవు అంధులను అపమార్గం నుండి తప్పించి వారికి ఋజుమార్గమూ చూపలేవు. నీవు కేవలం మా వాక్యాలను విశ్వసించేవారికే, విధేయతతో తలవంచే వారికే వినిపించ గలవు.

**54 - 57** బలహీనావస్థ నుండి మీ పుట్టుకను ప్రారంభించినవాడూ, మళ్లీ ఆ బలహీనత తరువాత మీకు బలాన్ని ప్రసాదించినవాడూ, ఆ బలం తరువాత మళ్లీ మిమ్మల్ని బలహీనులుగా, ముసలివారుగా చేసినవాడూ అల్లాహ్‌యే కదా! ఆయన తనకు ఇష్టమైన దానిని సృష్టిస్తాడు. ఆయన అన్నీ తెలిసినవాడు, ప్రతిదానిపై అధికారం కలవాడు. ఆ గడియ[14] సంభవించినప్పుడు, నేరస్తులు ప్రమాణాలు చేసి, మేము ఒక గంటసేపు కంటే ఎక్కువ కాలం ఉండలేదు అని అంటారు. ఈ విధంగానే వారు ప్రాపంచిక జీవితంలో మోసపోతూ ఉండేవారు. కాని జ్ఞానమూ, విశ్వాసమూ అనుగ్రహింపబడిన వారు ఇలా అంటారు, "దైవలేఖనం ప్రకారం మీరు ప్రళయదినం వరకు పడి ఉన్నారు, కనుక ఇదే ఆ ప్రళయదినం, కాని మీకు తెలియదు." కనుక ఆ రోజున దుర్మార్గులకు వారి సాకులు ఏ ప్రయోజనాన్నీ కలిగించలేవు. వారిని క్షమాభిక్ష కోరండి అని అడగటమూ జరగదు.[15]

10. దివ్య ఖురానులో వడ్డీని నిరసిస్తూ అవతరించిన తొలి వాక్యం ఇది. తరువాత అవతరించిన ఆజ్ఞల కోసం చూడండి : ఆలి ఇమ్రాన్ సూరాలోని 130వ వాక్యం, బఖర సూరాలోని 275 నుండి 281 వరకు గల వాక్యాలు.

11. ఆ కాలంలో, రెండు గొప్ప ప్రపంచ శక్తులైన ఈరాను, రోము దేశాల మధ్య చెలరేగిన యుద్ధాన్ని ఇది సూచిస్తుంది.

وَلَقَدْ ضَرَبْنَا لِلنَّاسِ فِيْ هٰذَا الْقُرْاٰنِ مِنْ كُلِّ
مَثَلٍ ؕ وَلَئِنْ جِئْتَهُمْ بِاٰيَةٍ لَّيَقُوْلَنَّ الَّذِيْنَ
كَفَرُوْٓا اِنْ اَنْتُمْ اِلَّا مُبْطِلُوْنَ ﴿٥٨﴾ كَذٰلِكَ
يَطْبَعُ اللّٰهُ عَلٰى قُلُوْبِ الَّذِيْنَ لَا يَعْلَمُوْنَ ﴿٥٩﴾
فَاصْبِرْ اِنَّ وَعْدَ اللّٰهِ حَقٌّ وَّ لَا يَسْتَخِفَّنَّكَ
الَّذِيْنَ لَا يُوْقِنُوْنَ ﴿٦٠﴾ ع

**58 - 60** మేము ఈ ఖురానులో మానవులకు రకరకాలుగా బోధించాము. నీవు ఏ సూచనను తెచ్చినా, అవిశ్వాసులు, "నీవు అసత్యాన్ని ఆశ్రయించావు" అనే అంటారు. ఈ విధంగా అల్లాహ్ జ్ఞానహీనుల హృదయాలకు ముద్ర వేస్తాడు. "కనుక (ప్రవక్తా!) సహనంతో ఉండు, నిశ్చయంగా అల్లాహ్ వాగ్దానం సత్యమైనది, అవిశ్వాసులు[16] నిన్ను తేలికగా తీసుకోరాదు."

12. అంటే, వారు దేవుణ్ణి దూషిస్తారు, తమకు కలిగిన ఆపదలకు ఆయనే కారకుడని నిందిస్తారు. దేవుడు వారిపై వరాల వర్షాన్ని కురిపించినప్పుడు వారు దానికి కృతజ్ఞతలు తెలుపటానికి బదులుగా, కృతఘ్నులయ్యారు.

13. అంటే, మృతి చెందిన అంతరాత్మలు కలవారికి అని భావం.

14. అంటే, ప్రళయం. అది రానున్నదనే వార్త ఇవ్వబడుతోంది.

15. ఇలా కూడ అనువాదం చేయవచ్చు: "మీరు మీ ప్రభువును ప్రసన్నుడుగా చేసుకోండి అని వారిని కోరటమూ జరగదు."

16. అరుపులు, అల్లరుల ద్వారా మీరు లొంగిపోయే అంత దుర్బలురనీ, తమ నిందారోపణల దూషణల, మహోధృత ఉద్యమం ద్వారా బెదరిపోగల అంత బలహీనులనీ, ఎగతాళి చేసి, ఎత్తిపొడుపులు పొడిచి, కించపరచి మిమ్మల్ని అధైర్యపరచవచ్చునని, బెదరింపుల ద్వారా, బలప్రదర్శనల ద్వారా, హింసా దౌర్జన్యాల ద్వారా మిమ్మల్ని భయపెట్టవచ్చుననీ, ఎరలు, లాలూచీల ద్వారా మీరు జారిపోగలరనీ, మీ శత్రువు భావించకూడదు.

ఆయతులు 34

# 31. లుఖ్మాన్

అవతరణ మక్కాలో

۳۱ سُوْرَةُ لُقْمٰنَ مَكِّيَّةٌ ۵۷

اٰيَاتُهَا ۳۴ | رُكُوْعَاتُهَا ۴

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

الٓمّٓ ① تِلْكَ اٰيٰتُ الْكِتٰبِ الْحَكِيْمِ ② هُدًى
وَّ رَحْمَةً لِّلْمُحْسِنِيْنَ ③ الَّذِيْنَ يُقِيْمُوْنَ
الصَّلٰوةَ وَ يُؤْتُوْنَ الزَّكٰوةَ وَهُمْ بِالْاٰخِرَةِ هُمْ
يُوْقِنُوْنَ ④ اُولٰٓئِكَ عَلٰى هُدًى مِّنْ رَّبِّهِمْ وَ
اُولٰٓئِكَ هُمُ الْمُفْلِحُوْنَ ⑤ وَ مِنَ النَّاسِ مَنْ
يَّشْتَرِيْ لَهْوَ الْحَدِيْثِ لِيُضِلَّ عَنْ سَبِيْلِ اللّٰهِ
بِغَيْرِ عِلْمٍ ۖ وَّيَتَّخِذَهَا هُزُوًا ؕ اُولٰٓئِكَ لَهُمْ
عَذَابٌ مُّهِيْنٌ ⑥ وَ اِذَا تُتْلٰى عَلَيْهِ اٰيٰتُنَا وَلّٰى
مُسْتَكْبِرًا كَاَنْ لَّمْ يَسْمَعْهَا كَاَنَّ فِيْٓ اُذُنَيْهِ
وَقْرًا ۚ فَبَشِّرْهُ بِعَذَابٍ اَلِيْمٍ ⑦ اِنَّ الَّذِيْنَ
اٰمَنُوْا وَعَمِلُوا الصّٰلِحٰتِ لَهُمْ جَنّٰتُ النَّعِيْمِ ⑧
خٰلِدِيْنَ فِيْهَا ؕ وَعْدَ اللّٰهِ حَقًّا ؕ وَهُوَ الْعَزِيْزُ
الْحَكِيْمُ ⑨

**1 – 5** అలిఫ్. లామ్. మీమ్. ఇవి వివేచనగల గ్రంథంలోని వాక్యాలు,[1] సజ్జనులకు మార్గమును చూపేది మరియు కారుణ్యమూను. వారు నమాజును స్థాపిస్తారు. జకాత్ ఇస్తారు. పరలోకం పట్ల దృఢమైన నమ్మకం కలిగి ఉంటారు. ఇటువంటి వారే తమ ప్రభువు తరఫు నుండి లభించిన ఋజుమార్గంలో ఉన్నారు. వారే సాఫల్యం పొందేవారు.

**6 – 9** జ్ఞానం లేకుండానే ప్రజలను అల్లాహ్ మార్గం నుండి తప్పించటానికీ, ఈ మార్గం వైపునకు పిలిచే పిలుపును ఎగతాళి చేయటానికీ మానవులలోనే మనస్సును రంజింపజేసే ప్రసంగాన్ని కొనుక్కొని తీసుకువచ్చేవాడు[2] కూడా ఒకడు ఉంటాడు; అటువంటి వారికి తీవ్ర అవమానకరమైన శిక్ష పడుతుంది, అతనికి మా వాక్యాలు వినిపించినపుడు, అతను వాటిని అసలు విననేలేదన్నట్లుగా, అతని చెవులలో చెవుడు ఉన్నట్లుగా అహంకారంతో తన ముఖాన్ని తిప్పుకుంటాడు. సరే మంచిది, అతి బాధాకరమైన ఒక శిక్ష ఉన్నది – అనే శుభవార్తను అతనికి వినిపించు. అయితే విశ్వసించి, సత్కార్యాలు చేసేవారికి వరాలతో నిండియున్న ఉద్యానవనాలు ఉన్నాయి. వాటిలో వారు శాశ్వతంగా ఉంటారు. ఇది అల్లాహ్ చేసిన సత్య వాగ్దానం. ఆయన శక్తిమంతుడు మరియు వివేకవంతుడు.

1. అంటే, వివేకంతో నిండి ఉన్న గ్రంథంలోని వాక్యాలు, దానిలోని ప్రతి మాట బుద్ధి సంపన్నమైనది.
2. అసలు పదాలు "లహ్వల్ హదీస్" అనేవి. అంటే, మనిషిని పూర్తిగా తనలో లీనమైపోయేలా చేసి, పరిసరాలను పూర్తిగా అలక్ష్యం చేసేలా చేసే విషయం. హదీసులలో ఇలా చెప్పబడి ఉన్నది : ఖురైషు తెగ వారి తీవ్ర ప్రయత్నాల తరువాత కూడ, మహాప్రవక్త (స) గారి ధర్మప్రచారం వ్యాపించకుండా ఆగిపోనపుడు, వారు ఇరాను నుండి రుస్తుమ్, ఇస్ఫందియార్‌లకు సంబంధించిన కథలను తెప్పించుకొని వాటిని ప్రజలకు వినిపించటం ప్రారంభించారు. ఆటకత్తెలతో పాటకత్తెలతో వినోదాన్ని కల్పించారు, ప్రజలు వాటిలో మునిగి మహాప్రవక్త (సఅసమ్) గారి ఉపదేశాన్ని పెడచెవిని పెడతారనే భావంతో.

**10 - 11** ఆయన, ఆకాశాలను నీవు చూడగలిగే స్తంభాలు లేకుండానే సృష్టించాడు, ఆయన భూమిలో పర్వతాలను అమర్చాడు, మీతో పాటు దొర్లి పోకుండా ఉండేటందుకు. ఆయన అన్ని రకాల జంతువులను భూమిలో వ్యాపింపజేశాడు. ఆకాశం నుండి నీళ్లను కురిపించాడు. భూమిలో రకరకాల శ్రేష్ఠమైన పదార్థాలను పండించాడు. ఇది అల్లాహ్ సృష్టి, ఇక నాకు చూపండి ఈ ఇతరులు ఏమి సృష్టించారో? – అసలు విషయమేమిటంటే, ఈ దుర్మార్గపు ప్రజలు స్పష్టమైన మార్గభ్రష్టత్వానికి గురి అయ్యారు.

**12** మేము లుఖ్మాన్‌కు వివేకాన్ని ప్రసాదించాము, అతను అల్లాహ్‌కు కృతజ్ఞుడు కావాలని, ఎవడైనా కృతజ్ఞతలు తెలిపితే, అతని కృతజ్ఞతలు అతనికే లాభకరం, ఎవడైనా కృతఘ్నుతకు పాల్పడితే నిజానికి అల్లాహ్ అతీతుడు తనకు తానే స్తుతిపాత్రుడు.

**13 - 15** లుఖ్మాన్ తన కుమారునికి హితబోధ చేసిన విషయాన్ని జ్ఞాపకం తెచ్చుకో. అప్పుడు అతను ఇలా అన్నాడు, "కుమారా! దేవునికి భాగస్వాములుగా ఎవరినీ చేర్చకు, నిజం ఏమిటంటే, ఇతరులను దేవునికి భాగస్వాములుగా చేర్చటం పరమదుర్మార్గం" – మానవుడు తన తల్లిదండ్రుల హక్కును గుర్తించాలని స్వయంగా మేమే అతనికి నిర్దేశించాము. అతని తల్లి బలహీనతపై బలహీనతను సహించి అతనిని తన కడుపున మోసింది. అతను పాలు విడిచిపెట్టటానికి రెండు సంవత్సరాలు పట్టింది. (ఇందుకే మేము అతనికి ఇలా బోధించాము) "నాకు కృతజ్ఞుడవై ఉండు, నీ తల్లిదండ్రులకు కృతజ్ఞతలు తెలుపు. నా వైపునకే నీవు మరలి రావలసి ఉన్నది. ఒకవేళ నీవు ఎరుగని[3] వారి నెవరినైనా నాకు భాగస్వామిగా చేర్చు అని వారు నిన్ను బలవంతం చేస్తే, వారి మాటను ఏమాత్రం వినకు, ప్రపంచంలో వారి పట్ల సద్భావంతో మెలగుతూ ఉండు; కాని నా వైపునకు మరలిన వ్యక్తి మార్గాన్నే అనుసరించు. తరువాత మీరందరూ నా వైపునకే మరలవలసి ఉంది. అపుడు నేను మీకు తెలుపుతాను మీరు ఎలాంటి పనులు చేస్తూ ఉండేవారో.

خَلَقَ السَّمٰوٰتِ بِغَیۡرِ عَمَدٍ تَرَوۡنَہَا وَ اَلۡقٰی فِی
الۡاَرۡضِ رَوَاسِیَ اَنۡ تَمِیۡدَ بِکُمۡ وَ بَثَّ فِیۡہَا
مِنۡ کُلِّ دَآبَّۃٍ ؕ وَ اَنۡزَلۡنَا مِنَ السَّمَآءِ مَآءً
فَاَنۡۢبَتۡنَا فِیۡہَا مِنۡ کُلِّ زَوۡجٍ کَرِیۡمٍ ﴿۱۰﴾ ہٰذَا
خَلۡقُ اللّٰہِ فَاَرُوۡنِیۡ مَاذَا خَلَقَ الَّذِیۡنَ مِنۡ
دُوۡنِہٖ ؕ بَلِ الظّٰلِمُوۡنَ فِیۡ ضَلٰلٍ مُّبِیۡنٍ ﴿۱۱﴾ وَ
لَقَدۡ اٰتَیۡنَا لُقۡمٰنَ الۡحِکۡمَۃَ اَنِ اشۡکُرۡ لِلّٰہِ ؕ وَ
مَنۡ یَّشۡکُرۡ فَاِنَّمَا یَشۡکُرُ لِنَفۡسِہٖ ۚ وَ مَنۡ کَفَرَ
فَاِنَّ اللّٰہَ غَنِیٌّ حَمِیۡدٌ ﴿۱۲﴾ وَ اِذۡ قَالَ لُقۡمٰنُ
لِابۡنِہٖ وَ ہُوَ یَعِظُہٗ یٰبُنَیَّ لَا تُشۡرِکۡ بِاللّٰہِ ؕ اِنَّ
الشِّرۡکَ لَظُلۡمٌ عَظِیۡمٌ ﴿۱۳﴾ وَ وَصَّیۡنَا الۡاِنۡسَانَ
بِوَالِدَیۡہِ ۚ حَمَلَتۡہُ اُمُّہٗ وَہۡنًا عَلٰی وَہۡنٍ وَّ
فِصٰلُہٗ فِیۡ عَامَیۡنِ اَنِ اشۡکُرۡ لِیۡ وَ لِوَالِدَیۡکَ ؕ
اِلَیَّ الۡمَصِیۡرُ ﴿۱۴﴾ وَ اِنۡ جَاہَدٰکَ عَلٰۤی اَنۡ تُشۡرِکَ
بِیۡ مَا لَیۡسَ لَکَ بِہٖ عِلۡمٌ ۙ فَلَا تُطِعۡہُمَا وَ
صَاحِبۡہُمَا فِی الدُّنۡیَا مَعۡرُوۡفًا ۫ وَّ اتَّبِعۡ سَبِیۡلَ مَنۡ
اَنَابَ اِلَیَّ ۚ ثُمَّ اِلَیَّ مَرۡجِعُکُمۡ فَاُنَبِّئُکُمۡ بِمَا
کُنۡتُمۡ تَعۡمَلُوۡنَ ﴿۱۵﴾

ع
وقف النبی صلی اللہ علیہ وسلم
النصف

3. అంటే, అతడు నాకు భాగస్వామి కాడని నీకు తెలుసు.

**16 - 19** (లుఖ్మాన్ ఇలా అన్నాడు) "కుమారా! ఒక వస్తువు, అది ఆవగింజంతటిదైనప్పటికీ అది కొండరాయిలోగాని, ఆకాశాలలోగాని, భూమిలో గాని, ఎక్కడ దాగి ఉన్నప్పటికీ, అల్లాహ్ దానిని బయటికి తీసుకు వస్తాడు. ఆయన సూక్ష్మగ్రాహి మరియు సర్వజ్ఞుడు. కుమారా! నమాజును స్థాపించు, మంచిని ఆజ్ఞాపించు, చెడు పనుల నుండి నిరోధించు, ఏ కష్టం కలిగినా దానికి సహనం వహించు. ఈ విషయాలు ఎంతో గట్టిగా ఆజ్ఞాపించబడిన[4] విషయాలు. ప్రజలతో ముఖం ప్రక్కకు త్రిప్పి మాట్లాడకు, భూమిపై నిక్కుతూ నడవకు. అహంభావి, బడాయికోరు అయిన ఏ వ్యక్తినీ అల్లాహ్ ప్రేమించడు. నీ నడకలో సమమైన తూకం పాటించు, నీ కంఠస్వరాన్ని కొంచెం తగ్గించు, అన్ని స్వరాల కంటే అతి చెడ్డ స్వరం గార్దభాల స్వరం."

**20 - 21** భూమిలోనూ, ఆకాశాలలోనూ ఉన్న సకల వస్తువులను అల్లాహ్ మీకు వశం[5] చేసిన విషయాన్నీ తన గోచర, అగోచర వరాలను మీకు ఇచ్చిన విషయాన్నీ మీరు చూడటం లేదా? అయినా, పరిస్థితి ఎలా ఉందంటే, మానవులలో కొందరు అల్లాహ్‌ను గురించి వాదులాడుతున్నారు. వారి వద్ద, ఏ జ్ఞానమూ, ఏ మార్గదర్శకత్వమూ, వెలుగును చూపే ఏ గ్రంథమూ లేకుండానే. అల్లాహ్ అవతరింపజేసిన దాన్ని అనుసరించండి అని వారితో అన్నప్పుడు, వారు, "మా పూర్వీకులు దేనిపై నడుస్తూ ఉండగా మేము చూశామో, దానినే మేము అనుసరిస్తాము" అని అంటారు. షైతాను వారిని జ్వలించే అగ్ని వైపునకే ఆహ్వానిస్తూ ఉండినప్పటికీ వీరు వారినే అనుసరిస్తారా?

یٰبُنَیَّ اِنَّهَاۤ اِنۡ تَكُ مِثۡقَالَ حَبَّةٍ مِّنۡ خَرۡدَلٍ
فَتَكُنۡ فِیۡ صَخۡرَةٍ اَوۡ فِی السَّمٰوٰتِ اَوۡ فِی
الۡاَرۡضِ یَاۡتِ بِهَا اللّٰهُ ؕ اِنَّ اللّٰهَ لَطِیۡفٌ
خَبِیۡرٌ ﴿۱۶﴾ یٰبُنَیَّ اَقِمِ الصَّلٰوةَ وَاۡمُرۡ بِالۡمَعۡرُوۡفِ
وَانۡهَ عَنِ الۡمُنۡكَرِ وَاصۡبِرۡ عَلٰی مَاۤ اَصَابَكَ ؕ
اِنَّ ذٰلِكَ مِنۡ عَزۡمِ الۡاُمُوۡرِ ﴿۱۷﴾ وَ لَا تُصَعِّرۡ
خَدَّكَ لِلنَّاسِ وَلَا تَمۡشِ فِی الۡاَرۡضِ مَرَحًا ؕ
اِنَّ اللّٰهَ لَا یُحِبُّ كُلَّ مُخۡتَالٍ فَخُوۡرٍ ﴿۱۸﴾
وَاقۡصِدۡ فِیۡ مَشۡیِكَ وَاغۡضُضۡ مِنۡ صَوۡتِكَ ؕ
اِنَّ اَنۡكَرَ الۡاَصۡوَاتِ لَصَوۡتُ الۡحَمِیۡرِ ﴿۱۹﴾ اَلَمۡ ع ٢ / ١١
تَرَوۡا اَنَّ اللّٰهَ سَخَّرَ لَكُمۡ مَّا فِی السَّمٰوٰتِ وَ مَا
فِی الۡاَرۡضِ وَاَسۡبَغَ عَلَیۡكُمۡ نِعَمَهٗ ظَاهِرَةً وَّ
بَاطِنَةً ؕ وَ مِنَ النَّاسِ مَنۡ یُّجَادِلُ فِی اللّٰهِ
بِغَیۡرِ عِلۡمٍ وَّ لَا هُدًی وَّ لَا كِتٰبٍ مُّنِیۡرٍ ﴿۲۰﴾
وَاِذَا قِیۡلَ لَهُمُ اتَّبِعُوۡا مَاۤ اَنۡزَلَ اللّٰهُ قَالُوۡا
بَلۡ نَتَّبِعُ مَا وَجَدۡنَا عَلَیۡهِ اٰبَآءَنَا ؕ اَوَلَوۡ كَانَ
الشَّیۡطٰنُ یَدۡعُوۡهُمۡ اِلٰی عَذَابِ السَّعِیۡرِ ﴿۲۱﴾

4. దీనికి రెండో అర్థం ఇది కూడ కావచ్చు: ఇవి అచంచల ధైర్యం, సాహసాలతో కూడిన పనులు.

5. ఒక వస్తువును ఒకరి అధీనం చేయటం అనేది రెండు విధాలుగా ఉంటుంది: ఒకటి, ఆ వస్తువు అతనికి లోబడి ఉండేలా చేయటం; తాను కోరిన విధంగా దానిని వినియోగించే అధికారం ఇవ్వటం. రెండు, ఆ వస్తువును ఒక నియమానికి, ఒక న్యాయానికి కట్టుబడి ఉండేలా చేయటం. ఆ కారణంగా అది ఆ వ్యక్తికి లాభదాయకంగా ఉండాలి, అతని ప్రయోజనాలను నెరవేర్చేదిగా ఉండాలి. భూమ్యాకాశాలలో ఉన్న సర్వ వస్తువులను మానవునికై ఒకే అర్థంలో లోబడి ఉండేలా చేయలేదు. కొన్ని వస్తువులు మొదటి అర్థంలో లోబడి ఉండేలా చేశాడు. మరికొన్ని వస్తువులను రెండో అర్థంలో లోబడి ఉండేలా చేశాడు. ఉదాహరణకు, గాలి, నీరు, నేల, నిప్పు, చెట్లు చేమలూ, ఖనిజాలూ, పశువులూ మొదలైనటువంటి అసంఖ్యాకమైన వస్తువులు మొదటి అర్థంలో మనకై లోబడి ఉండేలా చేయబడ్డాయి. సూర్యచంద్రాదులు రెండో అర్థంలో లోబడి ఉండేలా చేయబడ్డాయి.

6. ఈ విషయమే కొద్దిపాటి తేడాతో, కహఫ్ సూరా 109వ వాక్యంలో వచ్చింది. ఇంత విశాలమైన సృష్టిని

**22 - 24** ఏ వ్యక్తి అయితే తనను తాను అల్లాహ్‌కు సమర్పించుకుంటాడో, ఆచరణ రీత్యా సద్వర్తనుడో, అతను నిజానికి నమ్మదగిన ఒక ఆధారాన్ని పట్టుకున్నాడు. సకల వ్యవహారాలకు సంబంధించిన చివరి తీర్పు అల్లాహ్ చేతులలోనే ఉన్నది, ఇక ఎవడైనా అవిశ్వాసానికి పాల్పడితే, అతని అవిశ్వాసం నిన్ను దుఃఖానికి గురిచేయకూడదు. వారు మరలిరావలసినది మా వైపునకే కదా, అప్పుడు మేము వారికి తెలుపుతాము, వారు ఏమేమి చేసివచ్చారో. నిశ్చయంగా అల్లాహ్, హృదయాలలో దాగి వున్న రహస్యాలను సైతం ఎరుగును. మేము వారికి కొంతకాలం ప్రపంచంలో సుఖాలను అనుభవించే అవకాశాన్ని ఇస్తున్నాము, తరువాత వారిని అశక్తులుగా చేసి ఒక కఠోర యాతన వైపునకు లాగుకొనిపోతాము.

**25 - 28** ఒకవేళ వారిని నీవు, భూమినీ, ఆకాశాలనూ ఎవడు సృష్టించాడు అని అడిగితే వారు "అల్లాహ్" అని తప్పకుండా అంటారు. ఇలా అను, "అల్‌హమ్‌దులిల్లాహ్" (అల్లాహ్ మాత్రమే స్తుతింపదగినవాడు). కాని వారిలో చాలామంది ఎరుగరు, ఆకాశాలలోనూ భూమిపైనా ఉన్నదంతా అల్లాహ్‌దే. నిస్సందేహంగా అల్లాహ్ అక్కరలేనివాడు, తనకు తానే స్తోత్రాలకు అర్హుడు. భూమిపై ఉన్న వృక్షాలన్నీ కలములై, సముద్రం (సిరాబుడ్డి అయి), దానికి ఇంకా ఏడు సముద్రాల సిరాను కలిపినా, అప్పటికీ అల్లాహ్ మాటలు (వ్రాయటానికి) పూర్తికావు.[6] నిస్సంశయంగా అల్లాహ్ మహాశక్తి సంపన్నుడు, మహా వివేకవంతుడూను. మీ మానవులందరినీ సృష్టించటం, తరువాత మళ్లీ వారిని బ్రతికించి లేపటం అనేది (ఆయన కొరకు) కేవలం ఒక మానవుణ్ణి, (సృష్టించి, బ్రతికించి తేవటం) వంటిదే. యథార్థమేమిటంటే, అల్లాహ్ సర్వమూ వినేవాడు సర్వమూ చూసేవాడూను.

**29 - 30** అల్లాహ్ రాత్రిని పగలులోకీ, పగలును రాత్రిలోకీ చొప్పించటాన్ని నీవు చూడటంలేదా? ఆయన సూర్యచంద్రులను నియమబద్ధులుగా చేసి ఉంచాడు. అన్నీ ఒక నిర్ణీత కాలం వరకు సాగిపోతున్నాయి.[7] నీవు ఏది చేసినా అది అల్లాహ్‌కు తెలుసు అని (నీవు ఎరుగవా?)

وَمَنْ يُّسْلِمْ وَجْهَهٗٓ اِلَى اللّٰهِ وَهُوَ مُحْسِنٌ فَقَدِ
اسْتَمْسَكَ بِالْعُرْوَةِ الْوُثْقٰى ؕ وَاِلَى اللّٰهِ عَاقِبَةُ
الْاُمُوْرِ ﴿٢٢﴾ وَمَنْ كَفَرَ فَلَا يَحْزُنْكَ كُفْرُهٗ ؕ
اِلَيْنَا مَرْجِعُهُمْ فَنُنَبِّئُهُمْ بِمَا عَمِلُوْا ؕ اِنَّ اللّٰهَ
عَلِيْمٌۢ بِذَاتِ الصُّدُوْرِ ﴿٢٣﴾ نُمَتِّعُهُمْ قَلِيْلًا ثُمَّ
نَضْطَرُّهُمْ اِلٰى عَذَابٍ غَلِيْظٍ ﴿٢٤﴾ وَلَئِنْ سَاَلْتَهُمْ
مَّنْ خَلَقَ السَّمٰوٰتِ وَالْاَرْضَ لَيَقُوْلُنَّ اللّٰهُ ؕ
قُلِ الْحَمْدُ لِلّٰهِ ؕ بَلْ اَكْثَرُهُمْ لَا يَعْلَمُوْنَ ﴿٢٥﴾
لِلّٰهِ مَا فِى السَّمٰوٰتِ وَالْاَرْضِ ؕ اِنَّ اللّٰهَ هُوَ
الْغَنِىُّ الْحَمِيْدُ ﴿٢٦﴾ وَلَوْ اَنَّ مَا فِى الْاَرْضِ مِنْ
شَجَرَةٍ اَقْلَامٌ وَّالْبَحْرُ يَمُدُّهٗ مِنْۢ بَعْدِهٖ
سَبْعَةُ اَبْحُرٍ مَّا نَفِدَتْ كَلِمٰتُ اللّٰهِ ؕ اِنَّ اللّٰهَ
عَزِيْزٌ حَكِيْمٌ ﴿٢٧﴾ مَا خَلْقُكُمْ وَلَا بَعْثُكُمْ اِلَّا
كَنَفْسٍ وَّاحِدَةٍ ؕ اِنَّ اللّٰهَ سَمِيْعٌۢ بَصِيْرٌ ﴿٢٨﴾
اَلَمْ تَرَ اَنَّ اللّٰهَ يُوْلِجُ الَّيْلَ فِى النَّهَارِ وَ
يُوْلِجُ النَّهَارَ فِى الَّيْلِ وَسَخَّرَ الشَّمْسَ وَ
الْقَمَرَ ؗ كُلٌّ يَّجْرِىْۤ اِلٰۤى اَجَلٍ مُّسَمًّى وَّاَنَّ اللّٰهَ
بِمَا تَعْمَلُوْنَ خَبِيْرٌ ﴿٢٩﴾

ఉనికిలోకి తీసుకువచ్చిన అనంతమైన శక్తి సామర్థ్యాలు కల ఆ దేవుని దైవత్వంలో అసలు ఏ సృష్టితమైనా ఎలా భాగస్వామి కాగలుగుతుంది.

7. అంటే, ఏ వస్తువుకు ఎంత ఆయుర్దాయం నిర్ణయింపబడిందో, అంతవరకు అది జీవించి ఉంటుంది. లోకంలో ఏదీ శాశ్వతంగా ఉండదు.

ذٰلِكَ بِاَنَّ اللّٰهَ هُوَ الۡحَقُّ وَاَنَّ مَا يَدۡعُوۡنَ
مِنۡ دُوۡنِهِ الۡبَاطِلُ ۙ وَ اَنَّ اللّٰهَ هُوَ الۡعَلِيُّ
الۡكَبِيۡرُ ﴿۳۰﴾ اَلَمۡ تَرَ اَنَّ الۡفُلۡكَ تَجۡرِيۡ فِي الۡبَحۡرِ
بِنِعۡمَتِ اللّٰهِ لِيُرِيَكُمۡ مِّنۡ اٰيٰتِهٖ ؕ اِنَّ فِيۡ ذٰلِكَ
لَاٰيٰتٍ لِّكُلِّ صَبَّارٍ شَكُوۡرٍ ﴿۳۱﴾ وَ اِذَا غَشِيَهُمۡ
مَّوۡجٌ كَالظُّلَلِ دَعَوُا اللّٰهَ مُخۡلِصِيۡنَ لَهُ
الدِّيۡنَ ۚ فَلَمَّا نَجّٰهُمۡ اِلَى الۡبَرِّ فَمِنۡهُمۡ مُّقۡتَصِدٌ ؕ
وَ مَا يَجۡحَدُ بِاٰيٰتِنَاۤ اِلَّا كُلُّ خَتَّارٍ كَفُوۡرٍ ﴿۳۲﴾
يٰۤاَيُّهَا النَّاسُ اتَّقُوۡا رَبَّكُمۡ وَاخۡشَوۡا يَوۡمًا لَّا
يَجۡزِيۡ وَالِدٌ عَنۡ وَّلَدِهٖ ۫ وَ لَا مَوۡلُوۡدٌ هُوَ جَازٍ
عَنۡ وَّالِدِهٖ شَيۡـًٔا ؕ اِنَّ وَعۡدَ اللّٰهِ حَقٌّ فَلَا
تَغُرَّنَّكُمُ الۡحَيٰوةُ الدُّنۡيَا ٚ وَلَا يَغُرَّنَّكُمۡ بِاللّٰهِ
الۡغَرُوۡرُ ﴿۳۳﴾ اِنَّ اللّٰهَ عِنۡدَهٗ عِلۡمُ السَّاعَةِ ۚ وَ
يُنَزِّلُ الۡغَيۡثَ ۚ وَ يَعۡلَمُ مَا فِي الۡاَرۡحَامِ ؕ وَ
مَا تَدۡرِيۡ نَفۡسٌ مَّاذَا تَكۡسِبُ غَدًا ؕ وَ مَا
تَدۡرِيۡ نَفۡسٌۢ بِاَيِّ اَرۡضٍ تَمُوۡتُ ؕ اِنَّ اللّٰهَ
عَلِيۡمٌ خَبِيۡرٌ ﴿۳۴﴾ ع ۴ ۱۳

ఇదంతా ఎందుచేతనంటే అల్లాహ్‌యే సత్యం కాబట్టి, ఆయనను కాదని వారు పిలిచేవన్నీ అసత్యాలు కాబట్టి, ఇంకా (ఈ కారణంచేత కూడా) అల్లాహ్‌యే మహనీయుడూ, మహోన్నతుడూ కాబట్టి.

**31 – 32** అల్లాహ్ తన అనుగ్రహంతో నావను సముద్రంలో పయనింపచేయటాన్ని నీవు గమనించటం లేదా నీకు తన సూచనలు కొన్నింటిని చూపాలని? వాస్తవంగానే ఇందులో ఎన్నో సూచనలు ఉన్నాయి, సహనం, కృతజ్ఞతాభావం కల ప్రతి వ్యక్తి కొరకు. (సముద్రంలో) వారి మీదకు ఒక కెరటం కప్పుల మాదిరిగా క్రమ్ముకొని వచ్చినప్పుడు వారు అల్లాహ్‌కు మొరపెట్టుకుంటారు, తమ ధర్మాన్ని పూర్తిగా ఆయనకే ప్రత్యేకం చేసుకొని. తరువాత ఆయన వారిని రక్షించి నేల మీదకు చేరవేసినప్పుడు, వారిలో కొందరు మితముగా వ్యవహరిస్తారు.[8] మా సూచనలను ద్రోహీ, కృతఘ్నుడూ అయిన వ్యక్తి తప్ప మరెవ్వడూ తిరస్కరించడు.

**33** మానవులారా! మీ ప్రభువు ఆగ్రహం నుండి మిమ్మల్ని మీరు రక్షించుకోండి. ఏ తండ్రీ తన కుమారునికి బదులుగా ముందుకు రాని, ఏ కుమారుడూ తన తండ్రికి బదులుగా నిలబడని ఆ రోజుకు భయపడండి, నిస్సందేహంగా అల్లాహ్ వాగ్దానం సత్యం.[9] కనుక ఈ ఐహిక జీవితం మిమ్మల్ని మోసానికి గురిచేయకూడదు. వంచకులు మిమ్మల్ని అల్లాహ్ విషయంలో వంచనకు గురి చేయకూడదు.

**34** ఆ గడియకు సంబంధించిన జ్ఞానం అల్లాహ్ వద్ద మాత్రమే ఉన్నది. ఆయనే వర్షాన్ని కురిపిస్తాడు, తల్లుల గర్భాలలో పెరుగుతున్నదేమిటో ఆయనే ఎరుగును. తాను రేపటి రోజున ఏమి సంపాదించనున్నదో ఏ ప్రాణీ ఎరుగదు. ఏ భూభాగంపై తనకు మృత్యువు రానున్నదో ఏ వ్యక్తీ ఎరుగడు, అల్లాహ్‌యే అంతా తెలిసినవాడూ, అన్నీ ఎరిగినవాడూను.

8. దీనికి రెండు అర్థాలు చెప్పవచ్చు : 'ఇఖ్తిసాద్' అనే పదాన్ని రుజువర్తనం అనే అర్థంలో తీసుకుంటే, దాని భావం ఇది : వారిలో కొందరు ఆ కాలం గడచిపోయిన తరువాత కూడ, దేవుడు ఒక్కడే అనే అమిత విశ్వాసంతో ఉంటారు. దానిని ఒకవేళ మితము లేక సమతూకం అనే అర్థంలో తీసుకుంటే, దాని భావం ఇది : కొందరు తమ షిర్కు, తమ నాస్తికత్వం అనే విశ్వాసాల పట్ల అంత ఎక్కువ అభిమానాన్ని చూపరు. లేదా కొందరిలో కష్టసమయంలో కలిగిన చిత్తశుద్ధి భావం చల్లబడిపోతుంది.
9. అంటే, ప్రళయానికి సంబంధించిన వాగ్దానం.

ఆయతులు 30 | **32. అస్ సజ్దహ్** | అవతరణ మక్కాలో

٣٢ سُوۡرَةُ السَّجۡدَةِ مَكِّيَّةٌ ٧٥

ایاتها ٣٠ | رکوعاتها ٣

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 3** అలిఫ్. లామ్. మీమ్. నిస్సందేహంగా ఈ గ్రంథం సకల లోకాల ప్రభువు తరఫు నుండి అవతరించింది. దీనిని స్వయంగా ఈ వ్యక్తియే కల్పించాడని వారు అంటున్నారా? కాదు, ఇది నీ ప్రభువు తరఫు నుండి వచ్చిన సత్యం; నీకు పూర్వం హెచ్చరించేవారెవరూ రాని జాతికి నీవు హెచ్చరిక చేసేందుకు, బహుశా వారు మార్గదర్శకత్వం పొందుతారేమో అని.

**4 - 9** ఆకాశాలనూ, భూమినీ, వాటి మధ్య ఉన్న సమస్త వస్తువులనూ ఆరు రోజులలో సృష్టించినవాడు, దాని తరువాత అధికార పీఠాన్ని అధిష్ఠించినవాడు అల్లాహ్యే, ఆయన తప్ప మిమ్మల్ని ఆదుకునేవాడూ, మీకు సహాయం చేసేవాడూ ఎవడూ లేడు, ఆయన సమక్షంలో సిఫారసు చేసేవాడు కూడా ఎవడూ లేడు. అలాంటప్పుడు మీరు ఆలోచించరెందుకని? ఆయన ఆకాశం నుండి భూమి వరకు గల ప్రపంచ వ్యవహారాలను నిర్వహిస్తున్నాడు. ఆ నిర్వహణా నివేదిక ఒక రోజున పైకి ఆయన సమ్ముఖానికి చేరుతుంది. ఆ రోజు పరిమాణం మీ అంచనా ప్రకారం వేయి సంవత్సరాలు.[1] గోప్యం గాను, బహిరంగంగాను ఉన్న ప్రతిదానిని ఎరిగినవాడూ, శక్తిమంతుడూ, కరుణామయుడూ ఆయనే, ఆయన ఏ వస్తువును చేసినా చక్కగానే చేశాడు. ఆయన మానవ సృష్టి ప్రారంభాన్ని మట్టితో చేశాడు. తరువాత అతని సంతతిని తుచ్ఛమైన ద్రవ పదార్థం వంటి ఒక సారంతో కొనసాగించాడు. ఆ తరువాత అతనిని నఖశిఖ పర్యంతం తీర్చిదిద్దాడు. అతనిలోనికి తన ఆత్మను ఊదాడు. మీకు చెవులిచ్చాడు, కళ్ళిచ్చాడు, హృదయాలిచ్చాడు. అయినా మీరు కృతజ్ఞతలు తెలపటం చాలా తక్కువ.

بِسۡمِ اللّٰہِ الرَّحۡمٰنِ الرَّحِیۡمِ ○
الٓمّٓ ۚ﴿۱﴾ تَنۡزِیۡلُ الۡکِتٰبِ لَا رَیۡبَ فِیۡہِ مِنۡ
رَّبِّ الۡعٰلَمِیۡنَ ؕ﴿۲﴾ اَمۡ یَقُوۡلُوۡنَ افۡتَرٰىہُ ۚ بَلۡ
ہُوَ الۡحَقُّ مِنۡ رَّبِّکَ لِتُنۡذِرَ قَوۡمًا مَّاۤ اَتٰىہُمۡ
مِّنۡ نَّذِیۡرٍ مِّنۡ قَبۡلِکَ لَعَلَّہُمۡ یَہۡتَدُوۡنَ ﴿۳﴾
اَللّٰہُ الَّذِیۡ خَلَقَ السَّمٰوٰتِ وَ الۡاَرۡضَ وَ مَا
بَیۡنَہُمَا فِیۡ سِتَّۃِ اَیَّامٍ ثُمَّ اسۡتَوٰی عَلَی
الۡعَرۡشِ ؕ مَا لَکُمۡ مِّنۡ دُوۡنِہٖ مِنۡ وَّلِیٍّ وَّ لَا
شَفِیۡعٍ ؕ اَفَلَا تَتَذَکَّرُوۡنَ ﴿۴﴾ یُدَبِّرُ الۡاَمۡرَ
مِنَ السَّمَآءِ اِلَی الۡاَرۡضِ ثُمَّ یَعۡرُجُ اِلَیۡہِ فِیۡ
یَوۡمٍ کَانَ مِقۡدَارُہٗۤ اَلۡفَ سَنَۃٍ مِّمَّا
تَعُدُّوۡنَ ﴿۵﴾ ذٰلِکَ عٰلِمُ الۡغَیۡبِ وَ الشَّہَادَۃِ
الۡعَزِیۡزُ الرَّحِیۡمُ ۙ﴿۶﴾ الَّذِیۡۤ اَحۡسَنَ کُلَّ شَیۡءٍ
خَلَقَہٗ وَ بَدَاَ خَلۡقَ الۡاِنۡسَانِ مِنۡ طِیۡنٍ ۚ﴿۷﴾ ثُمَّ
جَعَلَ نَسۡلَہٗ مِنۡ سُلٰلَۃٍ مِّنۡ مَّآءٍ مَّہِیۡنٍ ۚ﴿۸﴾ ثُمَّ
سَوّٰىہُ وَ نَفَخَ فِیۡہِ مِنۡ رُّوۡحِہٖ وَ جَعَلَ لَکُمُ
السَّمۡعَ وَ الۡاَبۡصَارَ وَ الۡاَفۡـِٕدَۃَ ؕ قَلِیۡلًا مَّا
تَشۡکُرُوۡنَ ﴿۹﴾

وَقَالُوْٓا ءَاِذَا ضَلَلْنَا فِي الْاَرْضِ ءَاِنَّا لَفِيْ
خَلْقٍ جَدِيْدٍ ۬ؕ بَلْ هُمْ بِلِقَآئِ رَبِّهِمْ
كٰفِرُوْنَ ۝١٠ قُلْ يَتَوَفّٰىكُمْ مَّلَكُ الْمَوْتِ الَّذِيْ
وُكِّلَ بِكُمْ ثُمَّ اِلٰى رَبِّكُمْ تُرْجَعُوْنَ ۝١١ وَلَوْ
تَرٰٓى اِذِ الْمُجْرِمُوْنَ نَاكِسُوْا رُءُوْسِهِمْ عِنْدَ
رَبِّهِمْ ؕ رَبَّنَآ اَبْصَرْنَا وَ سَمِعْنَا فَارْجِعْنَا
نَعْمَلْ صَالِحًا اِنَّا مُوْقِنُوْنَ ۝١٢ وَ لَوْ شِئْنَا
لَاٰتَيْنَا كُلَّ نَفْسٍ هُدٰىهَا وَ لٰكِنْ حَقَّ الْقَوْلُ
مِنِّيْ لَاَمْلَئَنَّ جَهَنَّمَ مِنَ الْجِنَّةِ وَ النَّاسِ
اَجْمَعِيْنَ ۝١٣ فَذُوْقُوْا بِمَا نَسِيْتُمْ لِقَآءَ يَوْمِكُمْ
هٰذَا ۚ اِنَّا نَسِيْنٰكُمْ وَ ذُوْقُوْا عَذَابَ الْخُلْدِ بِمَا
كُنْتُمْ تَعْمَلُوْنَ ۝١٤ اِنَّمَا يُؤْمِنُ بِاٰيٰتِنَا الَّذِيْنَ
اِذَا ذُكِّرُوْا بِهَا خَرُّوْا سُجَّدًا وَّ سَبَّحُوْا بِحَمْدِ
رَبِّهِمْ وَ هُمْ لَا يَسْتَكْبِرُوْنَ ۝١٥ تَتَجَافٰى
جُنُوْبُهُمْ عَنِ الْمَضَاجِعِ يَدْعُوْنَ رَبَّهُمْ خَوْفًا
وَّ طَمَعًا ؗ وَّمِمَّا رَزَقْنٰهُمْ يُنْفِقُوْنَ ۝١٦

ع ١٤ | السجدة ٩

**10 - 11** ఈ ప్రజలు ఇలా అంటారు; "మేము మట్టిలో కలిసి నశించిపోయినా, మళ్లీ మేము క్రొత్తగా సృష్టించబడ తామా? అసలు విషయం ఏమిటంటే వారు తమ ప్రభువును కలుసుకోవటాన్ని తిరస్కరిస్తారు. వారితో ఇలా అను, "మీపై నియమింపబడిన మృత్యుదూత మిమ్మల్ని పూర్తిగా కైవసం చేసుకుంటాడు, తరువాత మీరు మీ ప్రభువు వైపునకు మరలిం పబడి తీసుకుపోబడతారు."

**12 - 14** ఈ దోషులు తలలు వంచి తమ ప్రభువు సమక్షంలో నిలబడి ఉండే ఆ సమయాన్ని నీవు చూస్తే ఎంత బాగుండును! (అప్పుడు వారు ఇలా అంటారు), "మా ప్రభూ! మేము బాగా చూశాము, బాగా విన్నాము, ఇక మమ్మల్ని వెనక్కి పంపించు, మేము మంచిపనులు చేస్తాము. మాకు ఇప్పుడు నమ్మకం కలిగింది." (సమాధానంగా ఇలా అనబడుతుంది). మేము కోరితే, మొదట్లోనే ప్రతి ఆత్మకూ దాని యొక్క మార్గదర్శకత్వాన్ని ఇచ్చి ఉండేవారము. కాని నేను జిన్నాతులు, మానవులు అందరినీ కలిపి నరకాన్ని నింపుతాను అని నేను చెప్పిన నా మాట నెరవేరింది. మీరు ఈ నాటి సమావేశాన్ని విస్మరించారు; కనుక ఇప్పుడు మీ ఈ చేష్ట యొక్క రుచిని చూడండి. మేము కూడ ఇప్పుడు మిమ్మల్ని విస్మరించాము, చవిచూడండి శాశ్వ తంగా ఉండిపోయే యాతనను మీ చేష్టలకు పర్యవసానంగా.

**15 - 20** ఈ వాక్యాలను వినిపించి హితబోధ చేసినప్పుడు సజ్‌దాలో పడేవారూ, తమ ప్రభువును స్తుతిస్తూ ఆయన పరిశు ద్ధతను కొనియాడేవారూ, గర్వపడనివారూ మాత్రమే మా వాక్యా లను విశ్వసిస్తారు. వారి వీపులు పడకలకు ఎడంగా ఉంటాయి; తమ ప్రభువును వారు భయంతోనూ, ఆశతోనూ వేడుకుంటారు. మేము వారికి ప్రసాదించిన ఉపాధి నుండి ఖర్చు పెడతారు.

1. అంటే, వేయి సంవత్సరాల మీ చరిత్ర అల్లాహ్ వద్ద కేవలం ఒక రోజు పని మాత్రమే. దానికి సంబంధించిన ఒక పథకం ఈనాడు విధి నిర్వాహక దూతలకు అప్పజెప్పబడుతుంది, రేపు వారు దానికి సంబంధించిన నివేదికను అల్లాహ్ ముందు ఉంచుతారు; అప్పుడు ఆయన మరునాటి (అంటే మీ లెక్క ప్రకారం వేయి సంవత్సరాల కాలం) కార్యక్రమం వారికి అప్పగిస్తాడు.

فَلَا تَعْلَمُ نَفْسٌ مَّآ أُخْفِيَ لَهُم مِّن قُرَّةِ
أَعْيُنٍ ۚ جَزَآءًۢ بِمَا كَانُوا يَعْمَلُونَ ﴿١٧﴾ أَفَمَن
كَانَ مُؤْمِنًا كَمَن كَانَ فَاسِقًا ۚ لَّا يَسْتَوُونَ ﴿١٨﴾ وقف غفران
أَمَّا الَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ فَلَهُمْ
جَنَّاتُ الْمَأْوَىٰ نُزُلًا بِمَا كَانُوا يَعْمَلُونَ ﴿١٩﴾ وَ
أَمَّا الَّذِينَ فَسَقُوا فَمَأْوَاهُمُ النَّارُ ۖ كُلَّمَآ
أَرَادُوٓا أَن يَخْرُجُوا مِنْهَآ أُعِيدُوا فِيهَا وَ
قِيلَ لَهُمْ ذُوقُوا عَذَابَ النَّارِ الَّذِي كُنتُم بِهِ
تُكَذِّبُونَ ﴿٢٠﴾ وَلَنُذِيقَنَّهُم مِّنَ الْعَذَابِ الْأَدْنَىٰ
دُونَ الْعَذَابِ الْأَكْبَرِ لَعَلَّهُمْ يَرْجِعُونَ ﴿٢١﴾ وَ
مَنْ أَظْلَمُ مِمَّن ذُكِّرَ بِآيَاتِ رَبِّهِ ثُمَّ أَعْرَضَ
عَنْهَآ ۚ إِنَّا مِنَ الْمُجْرِمِينَ مُنتَقِمُونَ ﴿٢٢﴾ وَلَقَدْ ع ٢ ١٥ ٥
آتَيْنَا مُوسَى الْكِتَابَ فَلَا تَكُن فِي مِرْيَةٍ مِّن
لِّقَائِهِ ۖ وَجَعَلْنَاهُ هُدًى لِّبَنِي إِسْرَائِيلَ ﴿٢٣﴾ وَ
جَعَلْنَا مِنْهُمْ أَئِمَّةً يَهْدُونَ بِأَمْرِنَا لَمَّا
صَبَرُوا ۖ وَكَانُوا بِآيَاتِنَا يُوقِنُونَ ﴿٢٤﴾ إِنَّ
رَبَّكَ هُوَ يَفْصِلُ بَيْنَهُمْ يَوْمَ الْقِيَامَةِ فِيمَا
كَانُوا فِيهِ يَخْتَلِفُونَ ﴿٢٥﴾ أَوَلَمْ يَهْدِ لَهُمْ كَمْ
أَهْلَكْنَا مِن قَبْلِهِم مِّنَ الْقُرُونِ يَمْشُونَ فِي
مَسَاكِنِهِمْ ۚ إِنَّ فِي ذَٰلِكَ لَآيَاتٍ ۖ أَفَلَا يَسْمَعُونَ ﴿٢٦﴾

వారి కర్మలకు ప్రతిఫలంగా, కళ్లకు చలువ కలిగించే ఎటువంటి సామగ్రి వారి కొరకు దాచిపెట్టబడిందో ఆ సామగ్రిని గురించి ఏ ప్రాణికీ తెలియదు. విశ్వాసి అయిన వ్యక్తి విద్రోహిగా మారిపోవటం సాధ్యమేనా? ఈ ఉభయులూ సమానులు కాలేరు. విశ్వసించి సత్కార్యాలు చేసిన వారికి ఉద్యానవనాలలో నివాసాలు ఉన్నాయి, వారి కర్మలకు ప్రతిఫలంగా వారి ఆతిథ్యానికి. విద్రోహ వైఖరిని అవలంబించిన వారి నివాసం నరకం. వారు దాని నుండి బయటపడ దలచినపుడల్లా, అందు లోకే నెట్టబడతారు. వారితో, "మీరు తిరస్కరిస్తూ ఉండే అగ్ని బాధను ఇపుడు రుచి చూడండి" అని అనబడుతుంది.

**21 - 22** ఆ పెద్ద శిక్షకు ముందు, మేము ఈ లోకంలోనే (ఏదో ఒక చిన్న) శిక్షను వారికి రుచిచూపిస్తూ ఉంటాము, బహుశా వారు (తమ తిరుగుబాటు వైఖరిని) మానుకుంటా రేమో అని. తన ప్రభువు వాక్యాల ద్వారా హితబోధ చేయబడి నప్పుడు, వాటిపట్ల విముఖుడయ్యే వానికంటె పరమ దుర్మా ర్గుడెవడు? అటువంటి అపరాధులకు మేము తప్పనిసరిగా ప్రతీకారం చేసి తీరుతాము.

**23 - 25** ఇంతకు పూర్వం మేము మూసాకు గ్రంథాన్ని ఇచ్చి ఉన్నాము. కనుక అదే ప్రాప్తమయ్యే విషయంలో నీకు ఎలాంటి సందేహమూ ఉండనక్కర లేదు, ఆ గ్రంథాన్ని మేము ఇస్రాయీల్ సంతతి వారికి మార్గదర్శకత్వంగా చేశాము. వారు సహనం వహించినపుడు, మా వాక్యాలను గట్టిగా నమ్మి నపుడు, మేము వారిలో నాయకులను ప్రభవింపజేశాము, వారు మా ఆజ్ఞానుసారం మార్గం చూపేవారు. నిశ్చయంగా నీ ప్రభువే ప్రళయంనాడు (ఇస్రాయీల్ సంతతివారు) పరస్పరం విభేదిస్తూ ఉన్న విషయాలను గురించి తీర్పు చెబుతాడు.

**26 - 30** ఈ ప్రజలకు (ఈ చారిత్రక సంఘటనలలో) ఏ మార్గదర్శకత్వమూ లభించలేదా? - వారికి పూర్వం మేము ఎన్నో జాతులను నాశనం చేశాము; వారు నివసిం చిన ప్రదేశాలలోనే ఈనాడు వీరు సంచరిస్తున్నారు కదా? ఇందులో గొప్ప సూచనలు ఉన్నాయి. వారు వినటంలేదా?

وار ఈ దృశ్యాన్ని ఎన్నడూ చూడలేదా? - మేము ఒక బంజరు భూమి వైపునకు నీళ్లను ప్రవహింపజేస్తూ తీసుకు వస్తాము, తరువాత ఆ భూమి నుండే పంటలు పండిస్తాము, వాటిద్వారా వారి పశువులకూ మేత దొరుకుతుంది, స్వయంగా వారూ తింటారు. వారు దేనినీ చూడరా? వారు ఇలా అంటారు, “నీవు సత్యవంతుడవే అయితే, అసలు ఈ తీర్పు ఎప్పుడు జరుగుతుందో చెప్పు?” వారితో ఇలా అను, “తీర్పు దినం నాడు విశ్వసించటం అనేది అవిశ్వాసులకు ఏ మాత్రం లాభదాయకంగా ఉండబోదు. తరువాత వారికి గడువనేది దొరకదు.” సరే, మంచిది, వారి మానాన వారిని వదలిపెట్టు. నిరీక్షించు. వారూ నిరీక్షిస్తున్నారు.

اَوَلَمۡ يَرَوۡا اَنَّا نَسُوۡقُ الۡمَآءَ اِلَى الۡاَرۡضِ
الۡجُرُزِ فَنُخۡرِجُ بِهٖ زَرۡعًا تَاۡكُلُ مِنۡهُ اَنۡعَامُهُمۡ
وَاَنۡفُسُهُمۡ ؕ اَفَلَا يُبۡصِرُوۡنَ ﴿۲۷﴾ وَ يَقُوۡلُوۡنَ مَتٰى السجدة
هٰذَا الۡفَتۡحُ اِنۡ كُنۡتُمۡ صٰدِقِيۡنَ ﴿۲۸﴾ قُلۡ يَوۡمَ
الۡفَتۡحِ لَا يَنۡفَعُ الَّذِيۡنَ كَفَرُوۡۤا اِيۡمَانُهُمۡ وَ لَا
هُمۡ يُنۡظَرُوۡنَ ﴿۲۹﴾ فَاَعۡرِضۡ عَنۡهُمۡ وَانۡتَظِرۡ اِنَّهُمۡ
مُّنۡتَظِرُوۡنَ ﴿۳۰﴾ ع ٣ ١٦

آیاتها ٧٣ | ٣٣ سُوْرَةُ الْاَحْزَابِ مَدَنِيَّةٌ ٩٠ | ركوعاتها ٩

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِیۡمِ ۝

يٰۤاَيُّهَا النَّبِيُّ اتَّقِ اللّٰهَ وَ لَا تُطِعِ الْكٰفِرِيْنَ وَ
الْمُنٰفِقِيْنَ ؕ اِنَّ اللّٰهَ كَانَ عَلِيْمًا حَكِيْمًا ۙ۝١
وَّاتَّبِعْ مَا يُوْحٰۤى اِلَيْكَ مِنْ رَّبِّكَ ؕ اِنَّ اللّٰهَ
كَانَ بِمَا تَعْمَلُوْنَ خَبِيْرًا ۙ۝٢ وَّتَوَكَّلْ عَلَى
اللّٰهِ ؕ وَ كَفٰى بِاللّٰهِ وَكِيْلًا ۝٣ مَا جَعَلَ اللّٰهُ
لِرَجُلٍ مِّنْ قَلْبَيْنِ فِيْ جَوْفِهٖ ۚ وَ مَا جَعَلَ
اَزْوَاجَكُمُ الّٰٓـئِْ تُظٰهِرُوْنَ مِنْهُنَّ اُمَّهٰتِكُمْ ۚ وَ
مَا جَعَلَ اَدْعِيَآءَكُمْ اَبْنَآءَكُمْ ؕ ذٰلِكُمْ قَوْلُكُمْ
بِاَفْوَاهِكُمْ ؕ وَ اللّٰهُ يَقُوْلُ الْحَقَّ وَ هُوَ يَهْدِي
السَّبِيْلَ ۝٤ اُدْعُوْهُمْ لِاٰبَآئِهِمْ هُوَ اَقْسَطُ
عِنْدَ اللّٰهِ ۚ فَاِنْ لَّمْ تَعْلَمُوْۤا اٰبَآءَهُمْ فَاِخْوَانُكُمْ
فِي الدِّيْنِ وَمَوَالِيْكُمْ ؕ وَ لَيْسَ عَلَيْكُمْ جُنَاحٌ
فِيْمَاۤ اَخْطَاْتُمْ بِهٖ ۙ وَلٰكِنْ مَّا تَعَمَّدَتْ قُلُوْبُكُمْ
وَ كَانَ اللّٰهُ غَفُوْرًا رَّحِيْمًا ۝٥ اَلنَّبِيُّ اَوْلٰى
بِالْمُؤْمِنِيْنَ مِنْ اَنْفُسِهِمْ وَاَزْوَاجُهٗۤ اُمَّهٰتُهُمْ ؕ
وَاُولُوا الْاَرْحَامِ بَعْضُهُمْ اَوْلٰى بِبَعْضٍ فِيْ
كِتٰبِ اللّٰهِ مِنَ الْمُؤْمِنِيْنَ وَ الْمُهٰجِرِيْنَ اِلَّاۤ
اَنْ تَفْعَلُوْۤا اِلٰۤى اَوْلِيٰٓئِكُمْ مَّعْرُوْفًا ؕ كَانَ ذٰلِكَ
فِي الْكِتٰبِ مَسْطُوْرًا ۝٦

ఆయతులు 73 | **33. అల్ అహ్‌జాబ్** | అవతరణ మదీనాలో

**అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.**

**1 – 3** ప్రవక్తా! అల్లాహ్‌కు భయపడు. అవిశ్వాసులకూ, కపటులకూ విధేయత చూపకు. వాస్తవానికి అల్లాహ్‌యే జ్ఞాని మరియు వివేకి. నీ ప్రభువు తరఫు నుండి నీకు సూచింపబడే విషయాన్ని మాత్రమే అనుసరించు. అల్లాహ్‌కు నీవు చేసే ప్రతిపనీ తెలుసు. అల్లాహ్‌పై నమ్మకం ఉంచు, సంరక్షకుడుగా అల్లాహ్ మాత్రమే సరిపోతాడు.

**4 – 5** అల్లాహ్ ఏ వ్యక్తి శరీరంలోనూ రెండు హృదయాలను పెట్టలేదు; మీరు 'జిహార్'[1] చేసే మీ భార్యలనూ ఆయన మీకు తల్లులుగా చేయలేదు; ఇంకా ఆయన మీ దత్తపుత్రులనూ మీ సొంత పుత్రులుగా చేయలేదు; ఇవి మీరు పలికే మీ నోటిమాటలు మాత్రమే. కాని అల్లాహ్ మాత్రం సత్యం పునాదిగా ఉన్నమాటనే అంటున్నాడు. ఆయనే సరియైన విధానం వైపునకు మార్గం చూపుతున్నాడు. దత్తపుత్రులను వారి తండ్రులతో ఉన్న సంబంధం ప్రకారం పిలవండి. ఇది అల్లాహ్ దృష్టిలో ఎంతో న్యాయ సమ్మతమైన విషయం. ఒకవేళ వారి తండ్రులెవరో మీకు తెలియకపోతే, అప్పుడు వారు మీకు ధార్మిక సోదరులు మరియు సహచరులు. పొరపాటు వల్ల మీరు ఏదైనా మాట అంటే, దానికి మిమ్మల్ని పట్టుకోవటం జరగదు. కాని మీరు బుద్ధిపూర్వకంగా అనే మాటకు తప్పని సరిగా మిమ్మల్ని పట్టుకోవటం జరుగుతుంది. అల్లాహ్ మన్నించేవాడు, కరుణించేవాడూను.

**6** నిస్సందేహంగా విశ్వాసులకు దైవప్రవక్త స్వయంగా తమ కంటే కూడా ముఖ్యుడు. దైవప్రవక్త భార్యలు వారికి తల్లులు. కాని అల్లాహ్ గ్రంథం ప్రకారం సాధారణ విశ్వాసులు మరియు వలస వచ్చిన వారికంటె రక్తసంబంధీకులు ఒకరిపై ఒకరు ఎక్కువ హక్కులు కలిగి ఉంటారు. అయితే, మీ సహచరులకు మీరు ఏదైనా మేలు (చేయదలిస్తే) చేయవచ్చు. ఈ ఆజ్ఞ దైవ గ్రంథంలో వ్రాయబడి ఉంది.

وَ اِذْ اَخَذْنَا مِنَ النَّبِيّٖنَ مِيْثَاقَهُمْ وَ مِنْكَ
وَ مِنْ نُّوْحٍ وَّ اِبْرٰهِيْمَ وَمُوْسٰى وَ عِيْسَى ابْنِ
مَرْيَمَ ۠ وَاَخَذْنَا مِنْهُمْ مِّيْثَاقًا غَلِيْظًا ۝٧
لِّيَسْـَٔلَ الصّٰدِقِيْنَ عَنْ صِدْقِهِمْ ۚ وَ اَعَدَّ
لِلْكٰفِرِيْنَ عَذَابًا اَلِيْمًا ۝٨ يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا
اذْكُرُوْا نِعْمَةَ اللّٰهِ عَلَيْكُمْ اِذْ جَآءَتْكُمْ جُنُوْدٌ
فَاَرْسَلْنَا عَلَيْهِمْ رِيْحًا وَّجُنُوْدًا لَّمْ تَرَوْهَا ۭ وَ
كَانَ اللّٰهُ بِمَا تَعْمَلُوْنَ بَصِيْرًا ۝٩ اِذْ جَآءُوْكُمْ
مِّنْ فَوْقِكُمْ وَمِنْ اَسْفَلَ مِنْكُمْ وَ اِذْ زَاغَتِ
الْاَبْصَارُ وَ بَلَغَتِ الْقُلُوْبُ الْحَنَاجِرَ وَ تَظُنُّوْنَ
بِاللّٰهِ الظُّنُوْنَا ۝١٠ هُنَالِكَ ابْتُلِيَ الْمُؤْمِنُوْنَ وَ
زُلْزِلُوْا زِلْزَالًا شَدِيْدًا ۝١١

**7 - 8** (ఓ ప్రవక్తా!) మేము దైవప్రవక్తలందరి చేత చేయించిన వాగ్దానాన్ని జ్ఞాపకముంచుకో. నీతో కూడ (చేయించాము) మరియు నూహ్, ఇబ్రాహీమ్, మూసా, మర్యమ్ కుమారుడు ఈసాలతో కూడా (చేయించాము), అందరితో మేము గట్టి వాగ్దానం [2] చేయించాము; నిజాయితీపరులను (వారి ప్రభువు) వారి నిజాయితీని గురించి ప్రశ్నించేందుకు. అవిశ్వాసులకు ఆయన అత్యంత బాధాకరమైన శిక్షను సిద్ధంచేసే ఉంచాడు.

**9 - 11** విశ్వసించిన ఓ ప్రజలారా! [3] అల్లాహ్ మీకు (ఈ మధ్యనే) చేసిన ఉపకారాన్ని జ్ఞాపకం తెచ్చుకోండి. సైన్యాలు మీపైకి దండెత్తి వచ్చినప్పుడు, మేము వాటి మీదకు ఒక పెనుగాలిని పంపాము; మీకు కానరాని[4] సైన్యాలను పంపాము. మీరు ఆ సమయంలో చేస్తున్నదంతా అల్లాహ్ చూస్తూనే ఉన్నాడు. శత్రువులు మీ మీదకు పై నుండీ, క్రింద నుండీ దండెత్తి వచ్చినప్పుడు, భయంవల్ల మీ కళ్ళు తేలగిల్లి నప్పుడు మీ గుండెకాయలు గొంతులలోనికి వచ్చినప్పుడు, మీరు అల్లాహ్‌ను గురించి రకరకాలుగా అనుమానిస్తు న్నప్పుడు, ఆ సమయంలో విశ్వాసులు కఠిన పరీక్షకు గురి అయ్యారు, తీవ్రంగా ఊపి వేయబడ్డారు.

1. "జిహార్" అంటే భార్యను తల్లిగా తలంచుట.
2. దైవప్రవక్తలందరి వలెనే మహాప్రవక్త (సఅసమ్) చేత కూడ గట్టి వాగ్దానం చేయించి, దానిని తు.చ. తప్పకుండా పాటించవలసి ఉంటుంది అనే విషయాన్ని ఆయనకు ఈ వాక్యంలో అల్లాహ్ జ్ఞాపకం చేస్తున్నాడు. పై గ్రంథ వాక్యాలను గురించి ఆలోచిస్తే స్పష్టంగా తెలిసే విషయం ఇది : ఈ వాగ్దానం ఏమిటంటే, అల్లాహ్ యొక్క ప్రతి ఆజ్ఞను దైవప్రవక్త స్వయంగా తాను ఆచరిస్తూ, ఇతరులు కూడ దానిని ఆచరించేలా చేయటం, అల్లాహ్ ఆజ్ఞలను యథాతథంగా ప్రజలకు అందజేయటం, వాటిని అమలుపరచటానికి గట్టి ప్రయత్నం చేయటం. ఈ విషయం దివ్య ఖురానులో అనేకచోట్ల చెప్పబడింది : ఉదాహరణకు, అల్ బఖరా సూరాలోని 83వ వాక్యం, ఆలి ఇమ్రాన్ సూరాలోని 187వ వాక్యం, అల్ మాఇద సూరాలోని 7వ వాక్యం, అల్ ఆరాఫ్ సూరాలోని 169 నుండి 171 వరకు గల వాక్యాలు, అష్షూరా సూరాలోని 13వ వాక్యం.
3. ఇక్కడ నుండి 27వ వాక్యం వరకు కందకాల సంగ్రామం (అహ్‌జాబ్) గురించీ, బనీ ఖురైజహ్‌పై దండయాత్రను గురించీ ప్రస్తావించబడింది.
4. అంటే, దైవదూతల సైన్యాలు అని అర్థం.

وَ اِذْ يَقُوْلُ الْمُنٰفِقُوْنَ وَ الَّذِيْنَ فِيْ قُلُوْبِهِمْ
مَّرَضٌ مَّا وَعَدَنَا اللّٰهُ وَرَسُوْلُهٗۤ اِلَّا غُرُوْرًا ﴿١٢﴾
وَ اِذْ قَالَتْ طَّآئِفَةٌ مِّنْهُمْ يٰۤاَهْلَ يَثْرِبَ لَا
مُقَامَ لَكُمْ فَارْجِعُوْا ۚ وَيَسْتَاْذِنُ فَرِيْقٌ مِّنْهُمُ
النَّبِيَّ يَقُوْلُوْنَ اِنَّ بُيُوْتَنَا عَوْرَةٌ ۛؕ وَمَا هِيَ ربع
بِعَوْرَةٍ ۛۚ اِنْ يُّرِيْدُوْنَ اِلَّا فِرَارًا ﴿١٣﴾ وَ لَوْ
دُخِلَتْ عَلَيْهِمْ مِّنْ اَقْطَارِهَا ثُمَّ سُئِلُوا
الْفِتْنَةَ لَاٰتَوْهَا وَ مَا تَلَبَّثُوْا بِهَاۤ اِلَّا يَسِيْرًا ﴿١٤﴾
وَ لَقَدْ كَانُوْا عَاهَدُوا اللّٰهَ مِنْ قَبْلُ لَا يُوَلُّوْنَ
الْاَدْبَارَ ؕ وَ كَانَ عَهْدُ اللّٰهِ مَسْئُوْلًا ﴿١٥﴾ قُلْ
لَّنْ يَّنْفَعَكُمُ الْفِرَارُ اِنْ فَرَرْتُمْ مِّنَ الْمَوْتِ
اَوِ الْقَتْلِ وَ اِذًا لَّا تُمَتَّعُوْنَ اِلَّا قَلِيْلًا ﴿١٦﴾ قُلْ
مَنْ ذَا الَّذِيْ يَعْصِمُكُمْ مِّنَ اللّٰهِ اِنْ اَرَادَ بِكُمْ
سُوْٓءًا اَوْ اَرَادَ بِكُمْ رَحْمَةً ؕ وَ لَا يَجِدُوْنَ
لَهُمْ مِّنْ دُوْنِ اللّٰهِ وَلِيًّا وَّ لَا نَصِيْرًا ﴿١٧﴾ قَدْ
يَعْلَمُ اللّٰهُ الْمُعَوِّقِيْنَ مِنْكُمْ وَالْقَآئِلِيْنَ
لِاِخْوَانِهِمْ هَلُمَّ اِلَيْنَا ۚ وَلَا يَاْتُوْنَ الْبَاْسَ
اِلَّا قَلِيْلًا ﴿١٨﴾

**12 - 15** కపటులూ, రోగగ్రస్త హృదయులూ అందరూ, "అల్లాహ్, ఆయన ప్రవక్త మనతో చేసిన వాగ్దానాలన్నీ భ్రమలు తప్ప మరేమీ కావు" అని స్పష్టంగా ప్రకటించినప్పటి సమయాన్ని జ్ఞాపకం తెచ్చుకో. అప్పుడు వారిలోని ఒక వర్గం, "ఓ యస్‌రిబ్ ప్రజలారా! ఇక మీకు ఇక్కడ ఉండే అవకాశమేదీ లేదు, వెనక్కి వెళ్ళిపొండి" అని అన్నది. అప్పుడు వారిలోని మరొక వర్గం "మా గృహాలు ప్రమాదంలో చిక్కుకున్నాయి" అని దైవప్రవక్తకు చెప్పి సెలవు కోరింది. వాస్తవానికి వాటికి ఏ ప్రమాదమూ లేదు. అసలు వారు (యుద్ధ మైదానం నుండి) పారిపోదలచారు. ఒకవేళ నగరం చుట్టు పక్కల నుండి శత్రువులు లోపలకు జొరబడి వారిని విద్రోహ చర్యకు పాల్పడమని పిలుపు ఇస్తే, అప్పుడు వారు తప్పకుండా అలా చేస్తారు; విద్రోహ చర్యలో పాల్గొనటానికి వారు చాలా తక్కువగా సంకోచిస్తారు. వారు ఇదివరకు తాము వెన్ను చూపము అని అల్లాహ్‌కు వాగ్దానం చేసి ఉన్నారు. అల్లాహ్‌కు చేసిన వాగ్దానం గురించి తప్పకుండా ప్రశ్నించటం జరుగుతుంది.

**16 - 17** ఓ ప్రవక్తా! వారితో ఇలా అను, "ఒకవేళ మీరు మృత్యువు బారినుండి లేదా హత్యబారి నుండి తప్పించుకోవాలని పారిపోతే, ఈ పారి పోవటం మీకు ఏమాత్రం లాభదాయకం కాబోదు. దీని తరువాత జీవిత సుఖాలను అనుభవించటానికి కొద్దిపాటి అవకాశం మాత్రమే మీకు లభిస్తుంది." వారిని ఇలా అడుగు, "ఒకవేళ అల్లాహ్ మీకు నష్టం కలిగించదలిస్తే, ఆయన నుండి మిమ్మల్ని కాపాడగలిగేవాడెవడు? ఒకవేళ అల్లాహ్ మిమ్మల్ని కరుణించదలిస్తే, ఆయన కరుణను ఆపగల వాడెవడు? అల్లాహ్‌కు ప్రతిగా వారు ఏ సంరక్షకుణ్ణీ, ఏ సహాయకుణ్ణీ పొందలేరు."

**18 - 20** మీలో (యుద్ధకార్యంలో) ప్రతిబంధకాలు సృష్టించే వారినీ, తమ సోదరులను "మా వైపునకు రండి" అని పిలిచే వారినీ, లెక్కకు మాత్రమే యుద్ధంలో పాల్గొనేవారినీ, నీకు తోడ్పడే విషయంలో పరమ లోభులైన వారినీ అల్లాహ్ బాగా ఎరుగును.

اَشِحَّةً عَلَيْكُمْ ۚ فَاِذَا جَآءَ الْخَوْفُ رَاَيْتَهُمْ
يَنْظُرُوْنَ اِلَيْكَ تَدُوْرُ اَعْيُنُهُمْ كَالَّذِيْ يُغْشٰى
عَلَيْهِ مِنَ الْمَوْتِ ۚ فَاِذَا ذَهَبَ الْخَوْفُ
سَلَقُوْكُمْ بِاَلْسِنَةٍ حِدَادٍ اَشِحَّةً عَلَى الْخَيْرِ ؕ
اُولٰٓئِكَ لَمْ يُؤْمِنُوْا فَاَحْبَطَ اللّٰهُ اَعْمَالَهُمْ ؕ وَ
كَانَ ذٰلِكَ عَلَى اللّٰهِ يَسِيْرًا ﴿۱۹﴾ يَحْسَبُوْنَ
الْاَحْزَابَ لَمْ يَذْهَبُوْا ۚ وَ اِنْ يَّاْتِ الْاَحْزَابُ
يَوَدُّوْا لَوْ اَنَّهُمْ بَادُوْنَ فِي الْاَعْرَابِ يَسْاَلُوْنَ
عَنْ اَنْۢبَآئِكُمْ ؕ وَ لَوْ كَانُوْا فِيْكُمْ مَّا قٰتَلُوْٓا اِلَّا
قَلِيْلًا ۧ ﴿۲۰﴾ لَقَدْ كَانَ لَكُمْ فِيْ رَسُوْلِ اللّٰهِ اُسْوَةٌ ع ۲/۱۲ ۱۸
حَسَنَةٌ لِّمَنْ كَانَ يَرْجُوا اللّٰهَ وَ الْيَوْمَ الْاٰخِرَ
وَ ذَكَرَ اللّٰهَ كَثِيْرًا ﴿۲۱﴾ؕ وَ لَمَّا رَاَ الْمُؤْمِنُوْنَ
الْاَحْزَابَ ۙ قَالُوْا هٰذَا مَا وَعَدَنَا اللّٰهُ
وَرَسُوْلُهٗ وَصَدَقَ اللّٰهُ وَ رَسُوْلُهٗ ۫ وَ مَا
زَادَهُمْ اِلَّآ اِيْمَانًا وَّتَسْلِيْمًا ﴿۲۲﴾ؕ مِنَ الْمُؤْمِنِيْنَ
رِجَالٌ صَدَقُوْا مَا عَاهَدُوا اللّٰهَ عَلَيْهِ ۚ فَمِنْهُمْ
مَّنْ قَضٰى نَحْبَهٗ وَمِنْهُمْ مَّنْ يَّنْتَظِرُ ۖ وَ مَا
بَدَّلُوْا تَبْدِيْلًا ﴿۲۳﴾ۙ لِّيَجْزِيَ اللّٰهُ الصّٰدِقِيْنَ
بِصِدْقِهِمْ وَ يُعَذِّبَ الْمُنٰفِقِيْنَ اِنْ شَآءَ اَوْ
يَتُوْبَ عَلَيْهِمْ ؕ اِنَّ اللّٰهَ كَانَ غَفُوْرًا
رَّحِيْمًا ۚ ﴿۲۴﴾

మరణ సమయంలో అపస్మారక స్థితికి గురిఅయిన వానివలె వారు ప్రమాదం సంభవించినప్పుడు గుడ్లు తిప్పుతూ నీ వైపు చూస్తారు. కాని ప్రమాదం తొలగిపోగానే, వారే లాభాలను పొందాలని దురాశాపరులై కత్తెరలవలె ఆడే నాలుకలతో నీకు స్వాగతం చెప్పటానికి వస్తారు. వారు ఏమాత్రం విశ్వసించినవారు కారు. కనుకనే అల్లాహ్ వారి కర్మలను అన్నింటినీ నిరర్థకం చేశాడు. అల్లాహ్‌కు అలా చెయ్యటం చాలా సులభం. దాడి చేసిన వర్గాలు ఇంకా వెళ్ళిపోలేదు అనే వారు భావిస్తున్నారు. ఒకవేళ ఆ వర్గాలు మళ్లీ దాడిచేస్తే, ఎడారిలో ఎక్కడికైనా పోయి పల్లెలలో అరబ్బుల మధ్య కూర్చుందామనీ, అక్కడ నుండే మీ పరిస్థితులను గురించి తెలుసుకుందామనీ వారి మనస్సు కోరుతోంది. ఒకవేళ వారు మీ మధ్య ఉన్నా, యుద్ధంలో చాలా తక్కువగానే పాల్గొంటారు.

**21 - 24** వాస్తవంగానే అల్లాహ్ ప్రవక్తలో మీకు ఒక మంచి ఆదర్శం[5] ఉండినది; అల్లాహ్‌పై, అంతిమ దినంపై ఆశలు పెట్టుకుని అత్యధికంగా అల్లాహ్‌ను స్మరించే ప్రతి వ్యక్తికి. సత్య విశ్వాసుల (స్థితి అప్పుడు ఇలా ఉంది), వారు దాడి చేసిన సైన్యాలను చూసినప్పుడు, ఇలా పలికారు, "అల్లాహ్, ఆయన ప్రవక్త మనకు వాగ్దానం చేసిన విషయం ఇదే. అల్లాహ్, ఆయన ప్రవక్త నిజమే పలికారు." ఈ సంఘటన వారి విశ్వాసాన్నీ, వారి ఆత్మ సమర్పణనూ మరింత అధికం చేసింది. విశ్వాసులలో, అల్లాహ్‌కు తాము చేసిన వాగ్దానాన్ని నిజం చేసి చూపినవారు ఉన్నారు, వారిలో కొందరు తమ మొక్కుబడిని తీర్చుకున్నారు, మరికొందరు సమయం కోసం నిరీక్షిస్తున్నారు. వారు తమ వైఖరిని ఏమాత్రం మార్చుకోలేదు. (ఇదంతా ఎందుకు జరిగిందంటే) నిజాయితీపరులకు అల్లాహ్ వారి నిజాయితీకి ప్రతిఫలం ఇవ్వటానికి, కపటులకు తనకు ఇష్టమైతే శిక్ష విధించటానికి లేదా తనకు ఇష్టమైతే వారి పశ్చాత్తాపాన్ని స్వీకరించటానికి. నిస్సందేహంగా అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడూను.

5. మంచి ఆదర్శం ఉన్నది అని కూడ అనువాదం చేయవచ్చు.

وَرَدَّ اللّٰهُ الَّذِيْنَ كَفَرُوْا بِغَيْظِهِمْ لَمْ يَنَالُوْا
خَيْرًا ؕ وَكَفَى اللّٰهُ الْمُؤْمِنِيْنَ الْقِتَالَ ؕ وَكَانَ
اللّٰهُ قَوِيًّا عَزِيْزًا ﴿٢٥﴾ؕ وَاَنْزَلَ الَّذِيْنَ
ظَاهَرُوْهُمْ مِّنْ اَهْلِ الْكِتٰبِ مِنْ صَيَاصِيْهِمْ
وَقَذَفَ فِيْ قُلُوْبِهِمُ الرُّعْبَ فَرِيْقًا تَقْتُلُوْنَ
وَتَاْسِرُوْنَ فَرِيْقًا ﴿٢٦﴾ؕ وَاَوْرَثَكُمْ اَرْضَهُمْ وَ
دِيَارَهُمْ وَاَمْوَالَهُمْ وَاَرْضًا لَّمْ تَطَئُوْهَا ؕ
وَكَانَ اللّٰهُ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرًا ﴿٢٧﴾ؑ يٰۤاَيُّهَا ع ٣ / ١٩
النَّبِيُّ قُلْ لِّاَزْوَاجِكَ اِنْ كُنْتُنَّ تُرِدْنَ
الْحَيٰوةَ الدُّنْيَا وَزِيْنَتَهَا فَتَعَالَيْنَ اُمَتِّعْكُنَّ
وَاُسَرِّحْكُنَّ سَرَاحًا جَمِيْلًا ﴿٢٨﴾ وَاِنْ كُنْتُنَّ
تُرِدْنَ اللّٰهَ وَرَسُوْلَهٗ وَالدَّارَ الْاٰخِرَةَ فَاِنَّ
اللّٰهَ اَعَدَّ لِلْمُحْسِنٰتِ مِنْكُنَّ اَجْرًا عَظِيْمًا ﴿٢٩﴾
يٰنِسَآءَ النَّبِيِّ مَنْ يَّاْتِ مِنْكُنَّ بِفَاحِشَةٍ
مُّبَيِّنَةٍ يُّضٰعَفْ لَهَا الْعَذَابُ ضِعْفَيْنِ ؕ وَكَانَ
ذٰلِكَ عَلَى اللّٰهِ يَسِيْرًا ﴿٣٠﴾ وَمَنْ يَّقْنُتْ الجزء ٢٢
مِنْكُنَّ لِلّٰهِ وَرَسُوْلِهٖ وَتَعْمَلْ صَالِحًا نُّؤْتِهَاۤ
اَجْرَهَا مَرَّتَيْنِ ۙ وَاَعْتَدْنَا لَهَا رِزْقًا كَرِيْمًا ﴿٣١﴾

**25 - 27** అల్లాహ్ అవిశ్వాసులను వెనక్కి తరిమాడు; వారు ఏ లాభాన్నీ పొందకుండానే, కడుపు మంటతో మరలి పోయారు. విశ్వాసుల పక్షాన యుద్ధం చేయటానికి అల్లాహ్‌యే సరిపోయాడు. అల్లాహ్ సర్వశక్తి సంపన్నుడు, సర్వసమర్థుడూను. ఈ దాడి చేసిన వారికి తోడ్పడిన[6] గ్రంథ ప్రజలను తమ దుర్గాల నుండి అల్లాహ్ క్రిందికి తీసుకువచ్చాడు, వారి హృదయాలను భయంతో నింపాడు. ఈనాడు వారిలోని ఒక వర్గం వారిని మీరు చంపుతున్నారు, మరొక వర్గం వారిని మీరు ఖైదీలుగా చేస్తున్నారు. ఆయన మిమ్మల్ని వారి భూమికీ, వారి గృహాలకూ, వారి ఆస్తులకూ వారసులుగా చేశాడు; మీరు ఎన్నడూ అడుగుమోపని ప్రాంతాన్ని ఆయన మీకు ఇచ్చాడు. అల్లాహ్ అన్నీ చేయగల సమర్థుడు.

**28 - 29** ఓ ప్రవక్తా! నీ భార్యలతో ఇలా అను; "ఒకవేళ మీరు ప్రాపంచిక జీవితాన్నీ, దాని శోభనూ కోరుతూ ఉన్నట్లయితే, రండి, నేను మీకు ఎంతో కొంత ఇచ్చివేసి మంచి పద్ధతి ప్రకారం సాగనంపుతాను.[7] కాని ఒకవేళ మీరు అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను, పరలోక నివాసాన్ని కోరుతూ ఉన్నట్లయితే, తెలుసుకోండి, మీలోని పుణ్యవతుల నిమిత్తం అల్లాహ్ గొప్ప ప్రతిఫలాన్ని సిద్ధపరచి ఉంచాడు."

**30 - 31** ఓ ప్రవక్త భార్యలారా! మీలో ఎవరైనా ఏదైనా స్పష్టమైన నీతి బాహ్యమైన పని చేస్తే ఆమెకు రెట్టింపు శిక్ష విధించబడుతుంది.[8] అల్లాహ్‌కు ఇది చాల సులభమైన పని. మీలో ఎవరు అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు విధేయత చూపుతారో, సత్కార్యాలు చేస్తారో, ఆమెకు మేము రెట్టింపు ప్రతిఫలం ఇస్తాము. మేము ఆమెకు గౌరవప్రదమైన ఉపాధిని సిద్ధపరచి ఉంచాము.

6. అంటే, బనీ ఖురైజాకు చెందిన యూదులు.

7. మహాప్రవక్త (సఅసమ్) గారి ఇంట్లో తినటానికి ఏమీలేక, ఆకలితో అలమటిస్తూ ఉన్న సమయంలో, ఆయన పవిత్ర సతీమణులు తీవ్ర ఆందోళనకు గురిఅయిన సమయంలో ఈ వాక్యం అవతరించింది.

8. మహాప్రవక్త (సఅసమ్) గారి పవిత్ర సతీమణులు (అల్లాహ్ క్షమించుగాక) ఏదైనా కూడని పని చేసే ప్రమాదం ఉన్నదేమో అని దీని అర్థం కాదు. మీరు ముస్లిమ్ సమాజానికే తల్లులు. కనుక మీరు మీ ఈ స్థానానికి పొసగని పని ఏదీ చేయకూడదు అనే భావం వారిలో కలిగించటం దీని ఉద్దేశ్యం.

يٰنِسَآءَ النَّبِيِّ لَسْتُنَّ كَاَحَدٍ مِّنَ النِّسَآءِ اِنِ
اتَّقَيْتُنَّ فَلَا تَخْضَعْنَ بِالْقَوْلِ فَيَطْمَعَ الَّذِيْ
فِيْ قَلْبِهٖ مَرَضٌ وَّ قُلْنَ قَوْلًا مَّعْرُوْفًا ﴿٣٢﴾ وَ
قَرْنَ فِيْ بُيُوْتِكُنَّ وَ لَا تَبَرَّجْنَ تَبَرُّجَ
الْجَاهِلِيَّةِ الْاُوْلٰى وَ اَقِمْنَ الصَّلٰوةَ وَ اٰتِيْنَ
الزَّكٰوةَ وَاَطِعْنَ اللّٰهَ وَرَسُوْلَهٗ ؕ اِنَّمَا يُرِيْدُ
اللّٰهُ لِيُذْهِبَ عَنْكُمُ الرِّجْسَ اَهْلَ الْبَيْتِ
وَيُطَهِّرَكُمْ تَطْهِيْرًا ﴿٣٣﴾ وَاذْكُرْنَ مَا يُتْلٰى فِيْ
بُيُوْتِكُنَّ مِنْ اٰيٰتِ اللّٰهِ وَ الْحِكْمَةِ ؕ اِنَّ اللّٰهَ
كَانَ لَطِيْفًا خَبِيْرًا ﴿٣٤﴾ اِنَّ الْمُسْلِمِيْنَ وَ ع
الْمُسْلِمٰتِ وَالْمُؤْمِنِيْنَ وَالْمُؤْمِنٰتِ وَالْقٰنِتِيْنَ
وَالْقٰنِتٰتِ وَالصّٰدِقِيْنَ وَالصّٰدِقٰتِ وَالصّٰبِرِيْنَ
وَالصّٰبِرٰتِ وَالْخٰشِعِيْنَ وَالْخٰشِعٰتِ وَالْمُتَصَدِّقِيْنَ
وَالْمُتَصَدِّقٰتِ وَالصَّآئِمِيْنَ وَالصّٰٓئِمٰتِ
وَالْحٰفِظِيْنَ فُرُوْجَهُمْ وَالْحٰفِظٰتِ وَ الذّٰكِرِيْنَ
اللّٰهَ كَثِيْرًا وَّالذّٰكِرٰتِ ۙ اَعَدَّ اللّٰهُ لَهُمْ مَّغْفِرَةً
وَّ اَجْرًا عَظِيْمًا ﴿٣٥﴾ وَ مَا كَانَ لِمُؤْمِنٍ وَّ لَا
مُؤْمِنَةٍ اِذَا قَضَى اللّٰهُ وَ رَسُوْلُهٗۤ اَمْرًا اَنْ
يَّكُوْنَ لَهُمُ الْخِيَرَةُ مِنْ اَمْرِهِمْ ؕ وَ مَنْ
يَّعْصِ اللّٰهَ وَرَسُوْلَهٗ فَقَدْ ضَلَّ ضَلٰلًا مُّبِيْنًا ﴿٣٦﴾

**32 - 34** ఓ ప్రవక్త భార్యలారా! మీరు సాధారణ స్త్రీల వంటి వారు కారు. మీరు అల్లాహ్‌కు భయపడేవారు అయితే, తగ్గు స్వరంతో మాట్లాడకండి, ఎందుకంటే దుష్ట మనస్సు గల వ్యక్తి ఎవడైనా వ్యామోహపడవచ్చు. కాబట్టి స్పష్టంగా, సూటిగా మాట్లాడండి. ఇళ్లల్లోనే ఉండిపొండి. పూర్వపు అజ్ఞాన కాలంలో మాదిరిగా అలంకరణను ప్రదర్శిస్తూ తిరగకండి. నమాజును స్థాపించండి, జకాత్ ఇవ్వండి. అల్లాహ్‌కూ, ఆయన ప్రవక్తకూ విధేయత చూపండి. దైవప్రవక్త కుటుంబీకులైన మీ నుండి కల్మషాన్ని తొలగించాలని, మిమ్మల్ని పూర్తిగా పరిశుద్ధపర చాలని అల్లాహ్ కోరుతున్నాడు. మీ ఇళ్లల్లో వినిపించబడే అల్లాహ్ వాక్యాలనూ, వివేకంతో కూడుకున్న విషయాలనూ జ్ఞాపకముంచుకోండి. నిస్సందేహంగా అల్లాహ్ అత్యంత సూక్ష్మ గ్రాహి,[9] అన్నీ తెలిసినవాడు.

**35** నిశ్చయంగా ముస్లిములూ, విశ్వాసులూ, విధేయులూ, నిజాయితీపరులూ, సహనశీలురూ, అల్లాహ్ ముందు వినమ్ర ములయ్యేవారూ, దాన ధర్మాలు చేసే వారూ, ఉపవాసం ఉండే వారూ, తమ మర్మాంగాలను కాపాడు కునేవారూ, అల్లాహ్‌ను అత్యధికంగా స్మరించేవారూ అయిన స్త్రీ పురుషుల నిమిత్తం అల్లాహ్ క్షమాభిక్షను, గొప్ప ప్రతిఫలాన్ని సిద్ధపరచి ఉంచాడు.

**36** అల్లాహ్, ఆయన ప్రవక్తా, ఏ విషయంలోనైనా ఒక తీర్పు చేసినపుడు విశ్వాసి అయిన ఏ పురుషునికైనా, విశ్వాసురాలైన ఏ స్త్రీకైనా, తరువాత తమ యొక్క ఆ విషయంలో స్వయంగా మళ్లీ ఒక నిర్ణయం తీసుకునే హక్కు లేదు. ఇంకా ఎవడైనా అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు అవిధేయత చూపితే, అతను స్పష్టంగా మార్గభ్రష్టతకు గురిఅయినట్లే.

9. అంటే గోప్యాతిగోప్యమైన విషయాన్ని సైతం ఎరిగినవాడు.

وَ اِذْ تَقُوْلُ لِلَّذِيْٓ اَنْعَمَ اللّٰهُ عَلَيْهِ وَاَنْعَمْتَ
عَلَيْهِ اَمْسِكْ عَلَيْكَ زَوْجَكَ وَاتَّقِ اللّٰهَ
وَتُخْفِيْ فِيْ نَفْسِكَ مَا اللّٰهُ مُبْدِيْهِ وَ تَخْشَى
النَّاسَ ۚ وَاللّٰهُ اَحَقُّ اَنْ تَخْشٰىهُ ؕ فَلَمَّا قَضٰى
زَيْدٌ مِّنْهَا وَطَرًا زَوَّجْنٰكَهَا لِكَيْ لَا يَكُوْنَ عَلَى
الْمُؤْمِنِيْنَ حَرَجٌ فِيْٓ اَزْوَاجِ اَدْعِيَآىِٕهِمْ اِذَا
قَضَوْا مِنْهُنَّ وَطَرًا ؕ وَ كَانَ اَمْرُ اللّٰهِ
مَفْعُوْلًا ﴿٣٧﴾ مَا كَانَ عَلَى النَّبِيِّ مِنْ حَرَجٍ فِيْمَا
فَرَضَ اللّٰهُ لَهٗ ؕ سُنَّةَ اللّٰهِ فِي الَّذِيْنَ خَلَوْا
مِنْ قَبْلُ ؕ وَ كَانَ اَمْرُ اللّٰهِ قَدَرًا
مَّقْدُوْرَا ۙ ﴿٣٨﴾ الَّذِيْنَ يُبَلِّغُوْنَ رِسٰلٰتِ اللّٰهِ
وَيَخْشَوْنَهٗ وَ لَا يَخْشَوْنَ اَحَدًا اِلَّا اللّٰهَ ؕ وَ
كَفٰى بِاللّٰهِ حَسِيْبًا ﴿٣٩﴾ مَا كَانَ مُحَمَّدٌ اَبَآ
اَحَدٍ مِّنْ رِّجَالِكُمْ وَلٰكِنْ رَّسُوْلَ اللّٰهِ وَ خَاتَمَ
النَّبِيّٖنَ ؕ وَ كَانَ اللّٰهُ بِكُلِّ شَيْءٍ عَلِيْمًا ﴿٤٠﴾ ع

**37 - 39** ఓ ప్రవక్తా! అల్లాహ్, నీవు, ఏ వ్యక్తికి మేలు చేశారో ఆ వ్యక్తితో "నీవు నీ భార్యను విడిచి పెట్టకు, అల్లాహ్‌కు భయపడు"[10] అని అంటున్న ఆ సమయాన్ని జ్ఞాపకం తెచ్చుకో. అప్పుడు నీవు అల్లాహ్ బయటపెట్టదలచిన విషయాన్నీ మనస్సులో దాచి ఉంచావు. నీవు ప్రజలకు భయపడుతున్నావు. వాస్తవానికి నీవు భయపడటానికి[11] అల్లాహ్‌యే ఎక్కువ హక్కు దారుడు. తరువాత జైద్ ఆమె విషయంలో తన అవసరాన్ని పూర్తి చేసుకున్నప్పుడు,[12] మేము ఆమె (విడాకులు పొందిన స్త్రీ)తో నీకు వివాహం జరిపించాము. విశ్వాసులకు తమ దత్తపుత్రుల భార్యల విషయంలో, వారు తమ భార్యలకు సంబంధించిన తమ అవసరాన్ని పూర్తి చేసుకున్నప్పుడు, ఏ విధమైన ఇబ్బంది కలుగకుండా ఉండేందుకు. అల్లాహ్ ఆదేశం అమలులోకి రావలసిందే. అల్లాహ్ తనకు విధించిన ఏ పనినైనా చేయటంలో దైవప్రవక్తకు ఏ ప్రతిబంధకమూ లేదు. గతించిన దైవప్రవక్తలందరి విషయంలోనూ అల్లాహ్ యొక్క ఈ సంప్రదాయమే అమలులో ఉండేది. అల్లాహ్ ఆజ్ఞ పూర్తిగా తిరుగులేని తీర్పు. (ఇది అల్లాహ్ సంప్రదాయం) అల్లాహ్ సందేశాలను అందజేసేవారికి, ఆయనకు మాత్రమే భయపడేవారికి, ఒకే దేవునికి తప్ప మరెవరికీ భయపడని వారికి. లెక్క చూడటానికి కేవలం అల్లాహ్‌యే చాలు.

**40** (మానవులారా) ముహమ్మద్ మీలోని ఏ పురుషునికీ తండ్రికారు. కాని ఆయన అల్లాహ్ యొక్క ప్రవక్త, దైవప్రవక్తల పరంపరను సమాప్తం చేసే చివరివారు. అల్లాహ్ సకల విషయాల జ్ఞానం కలవాడు.[13]

10. 'ఆ వ్యక్తి' అంటే, హ్రజత్ జైద్ బిన్ హారిస (రజిఅన్) అని అర్థం. ఆయనకు మహాప్రవక్త (సఅసమ్) బానిసత్వం నుండి విముక్తి కలిగించి దత్తపుత్రునిగా స్వీకరించారు. ఆయన భార్య అంటే హ్రజత్ జైనబ్ (రజిఅన్) అని అర్థం. ఆమె మహాప్రవక్త (సఅసమ్) గారి మేనత్త కూతురు. ఆయన గారు (స) ఆమెను హ్రజత్ జైద్‌కు ఇచ్చి వివాహం చేశారు. కాని వారు ఉభయులూ అన్యోన్యంగా కలసిమెలసి ఉండలేకపోయారు. హ్రజత్ జైద్ ఆమెకు విడాకులు ఇవ్వాలనే నిర్ణయానికి వచ్చారు.

11. అంటే, హ్రజత్ జైద్ (ర), హ్రజత్ జైనబ్‌కు విడాకులిచ్చినప్పుడు, ఆమెను స్వయంగా మహాప్రవక్త (స)యే వివాహం చేసుకుని దత్తపుత్రుణ్ణి సొంత పుత్రునిగా భావించే ప్రాచీనపు ఆచారాన్ని రూపుమాపటమే అల్లాహ్ ఆశయం. కాని మహాప్రవక్త (స), ఇలాచేస్తే అరబ్బులు తీవ్రంగా ప్రతిస్పందించి విమర్శలకు గురిచేస్తారనే భయం వల్ల, ఈ పరీక్ష నుండి తప్పించుకోవాలని అనుకున్నారు. కనుకనే ఆయన హ్రజత్ జైద్ తన భార్యకు విడాకులు ఇవ్వకుండా చేయటానికి తమ శాయశక్తులా కృషి చేశారు.

يَاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا اذْكُرُوا اللّٰهَ ذِكْرًا
كَثِيْرًا ۝ وَّ سَبِّحُوْهُ بُكْرَةً وَّ اَصِيْلًا ۝ هُوَ
الَّذِيْ يُصَلِّيْ عَلَيْكُمْ وَ مَلٰٓئِكَتُهٗ لِيُخْرِجَكُمْ
مِّنَ الظُّلُمٰتِ اِلَى النُّوْرِ ؕ وَكَانَ بِالْمُؤْمِنِيْنَ
رَحِيْمًا ۝ تَحِيَّتُهُمْ يَوْمَ يَلْقَوْنَهٗ سَلٰمٌ ۚۖ وَ
اَعَدَّ لَهُمْ اَجْرًا كَرِيْمًا ۝ يٰٓاَيُّهَا النَّبِيُّ اِنَّآ
اَرْسَلْنٰكَ شَاهِدًا وَّ مُبَشِّرًا وَّ نَذِيْرًا ۝ وَّ
دَاعِيًا اِلَى اللّٰهِ بِاِذْنِهٖ وَ سِرَاجًا مُّنِيْرًا ۝ وَ
بَشِّرِ الْمُؤْمِنِيْنَ بِاَنَّ لَهُمْ مِّنَ اللّٰهِ فَضْلًا
كَبِيْرًا ۝ وَ لَا تُطِعِ الْكٰفِرِيْنَ وَالْمُنٰفِقِيْنَ وَدَعْ
اَذٰىهُمْ وَ تَوَكَّلْ عَلَى اللّٰهِ ؕ وَ كَفٰى بِاللّٰهِ وَكِيْلًا ۝

**41 - 44** విశ్వసించిన ఓ మానవులారా! అల్లాహ్‌ను అత్యధికంగా స్మరించండి. ఉదయం, సాయంత్రం ఆయన పవిత్రతను కొనియాడుతూ ఉండండి. ఆయనే మీపై కరుణచూపేవాడు. ఆయన దూతలు మీ కొరకు కారుణ్యానికై ప్రార్థనలు చేస్తారు, మిమ్మల్ని ఆయన చీకట్లలో నుండి వెలికి తీసి వెలుగులోకి తీసుకురావాలని. విశ్వాసుల పట్ల ఆయన అమిత దయ కలవాడు. వారు ఆయనను కలిసే రోజున వారికి శాంతి వచనాలతో స్వాగతం లభిస్తుంది. అల్లాహ్ వారికి ఎంతో గౌరవప్రదమైన ప్రతిఫలాన్ని సమకూర్చి ఉంచాడు.

**45 - 48** ఓ ప్రవక్తా! మేము నిన్ను సాక్షిగా చేసి, శుభవార్తను ఇచ్చేవానిగా, హెచ్చరిక చేసేవానిగా చేసి అల్లాహ్ అనుమతితో ఆయన వైపునకు పిలుపు ఇచ్చేవానిగా చేసి, ప్రకాశించే దీపంగా చేసి పంపాము. (నిన్ను) విశ్వసించిన మానవులకు శుభవార్త ఇవ్వు, వారికి అల్లాహ్ తరఫు నుండి గొప్ప అనుగ్రహాలు ఉన్నాయని. అవిశ్వాసుల కపటుల ఒత్తిడికి ఎంతమాత్రం లొంగకు, వారి వేధింపులను లెక్క చేయకు,[14] అల్లాహ్‌నే నమ్ముకో. మనిషి తన వ్యవహారాలను అప్పగించటానికి అల్లాహ్‌యే చాలు.

12. అంటే, విడాకులిచ్చే కోరికను కలిగి ఉన్న ఆయన దానిని నెరవేర్చారు. ఇక ఆయనకు ఆమెతో ఎట్టి సంబంధమూ లేకుండా పోయింది.

13. ఈ ఒక్క వాక్యమే మహాప్రవక్త (స) చేసుకున్న ఈ వివాహం పట్ల విరోధులు లేవనెత్తిన అన్ని అభ్యంతరాలను నిర్ద్వంద్వంగా ఖండించింది. ఆయన తమ కోడల్ని వివాహం చేసుకున్నారు అనేది వారి మొట్టమొదటి అభ్యంతరం. దానికి సమాధానంగా ఇలా చెప్పటం జరిగింది : "ముహమ్మద్ (సఅసమ్) మీలోని ఏ పురుషునికీ తండ్రి కారు." అంటే, అతను కొడుకుగా ఎప్పుడైనాడు కనుక, అతను విడాకులిచ్చిన స్త్రీ నిషిద్ధం కావటానికి? వారి రెండో అభ్యంతరం ఏమిటంటే, ఒకవేళ దత్తపుత్రుడు కన్న పుత్రుడు కాకపోయినప్పటికీ, అతను విడాకులిచ్చిన స్త్రీని వివాహం చేసుకోవలసిన అగత్యం లేదు కదా! దీనికి జవాబుగా ఇలా అనబడింది: కాని ఆయన దైవ సందేశహరులు. అంటే, దైవప్రవక్తగా ఆయనపై ఇలా చెప్పే బాధ్యత ఉన్నది. ధర్మసమ్మతమైన దానిని మీ ఆచారాలు ఉత్త పుణ్యానికే నిషిద్ధం చేశాయి, దానిని గురించి ఉన్నటువంటి ద్వేషాలు పక్షపాతాలు అన్నీ నిర్మూలించబడాలి; అది ధర్మసమ్మతమైనటువంటిది అనే విషయంలో ఎటువంటి అనుమానాలకూ ఆస్కారం ఉండకూడదు. మరింత నొక్కి చెప్పటానికి ఇలా అనబడింది: "ఆయన దైవప్రవక్తల పరంపరను సమాప్తం చేసే చివరివారు." అంటే, ఆయన తరువాత సందేశహరుడు రావటమనేదే సుదూర విషయం, ప్రవక్త కూడ ఎవరూ రాబోవటం లేదు, ఆయన గారి కాలంలో చట్టంలోనూ సంఘంలోనూ ఏదైనా సంస్కరణ జరగకుండా ఉండిపోతే, దానిని తీసుకురావటానికి. కావున ఈ అజ్ఞానపు దురాచారాన్ని స్వయంగా ఆయనే రూపుమాపి నిష్క్రమించటం అనేది ఆవశ్యకమైపోయింది. దీని తరువాత మరింత నొక్కివక్కాణిస్తూ ఇలా సెలవీయబడింది: "అల్లాహ్ సకల విషయాల జ్ఞానం కలవాడు" అంటే, అప్పుడు ముహమ్మద్ (సఅసమ్) చేతులమీదుగా ఈ

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓا۟ إِذَا نَكَحْتُمُ ٱلْمُؤْمِنَٰتِ
ثُمَّ طَلَّقْتُمُوهُنَّ مِن قَبْلِ أَن تَمَسُّوهُنَّ فَمَا
لَكُمْ عَلَيْهِنَّ مِنْ عِدَّةٍ تَعْتَدُّونَهَا ۖ فَمَتِّعُوهُنَّ
وَسَرِّحُوهُنَّ سَرَاحًا جَمِيلًا ٤٩ يَٰٓأَيُّهَا ٱلنَّبِىُّ
إِنَّآ أَحْلَلْنَا لَكَ أَزْوَٰجَكَ ٱلَّٰتِىٓ ءَاتَيْتَ
أُجُورَهُنَّ وَمَا مَلَكَتْ يَمِينُكَ مِمَّآ أَفَآءَ ٱللَّهُ
عَلَيْكَ وَبَنَاتِ عَمِّكَ وَبَنَاتِ عَمَّٰتِكَ وَبَنَاتِ
خَالِكَ وَبَنَاتِ خَٰلَٰتِكَ ٱلَّٰتِى هَاجَرْنَ مَعَكَ
وَٱمْرَأَةً مُّؤْمِنَةً إِن وَهَبَتْ نَفْسَهَا لِلنَّبِىِّ
إِنْ أَرَادَ ٱلنَّبِىُّ أَن يَسْتَنكِحَهَا خَالِصَةً لَّكَ
مِن دُونِ ٱلْمُؤْمِنِينَ ۗ قَدْ عَلِمْنَا مَا فَرَضْنَا
عَلَيْهِمْ فِىٓ أَزْوَٰجِهِمْ وَمَا مَلَكَتْ أَيْمَٰنُهُمْ
لِكَيْلَا يَكُونَ عَلَيْكَ حَرَجٌ ۗ وَكَانَ ٱللَّهُ
غَفُورًا رَّحِيمًا ٥٠

**49** విశ్వాసులైన మానవులారా! మీరు విశ్వాసినులైన స్త్రీలను వివాహం చేసుకుని, తరువాత వారిని ముట్టుకోకమునుపే విడాకులిస్తే, అప్పుడు మీ తరఫు నుండి "ఇద్దత్" ఏదీ వారిపై ఖరారు కాదు; అది పూర్తి అవ్వాలని మీరు కోరలేరు. కనుక వారికి కొంత ధనం ఇచ్చి మంచి పద్ధతిలో సాగనంపండి.

**50 - 52** ప్రవక్తా! మేము (ఈ క్రింది వారిని) నీకు ధర్మ సమ్మతం చేశాము: నీవు మహర్ చెల్లించిన నీ భార్యలను,[15] అల్లాహ్ ప్రసాదించిన బానిస స్త్రీల నుండి నీ అధీనంలోకి వచ్చిన స్త్రీలను, నీతోపాటు వలస వచ్చిన నీ పినతండ్రి కుమార్తెలను, నీ మేనత్తల కుమార్తెలను, నీ మేనమామల కుమార్తెలను, నీ పినతల్లుల కుమార్తెలను, తనను తాను దైవప్రవక్తకు సమర్పించుకున్న విశ్వాసిని అయిన స్త్రీని- ఒకవేళ దైవప్రవక్త ఆమెను వివాహం చేసుకోదలిస్తే:[16] ఈ మినహాయింపు కేవలం నీకే పరిమితం, ఇతర విశ్వాసులకు ఇది లేదు. సాధారణ విశ్వాసులకు, వారి భార్యల, బానిస స్త్రీల విషయంలో మేము విధించిన పరిమితులు మాకు బాగా తెలుసు. నీకు ఏ విధమైన ఇబ్బందీ కలుగకుండా ఉండాలని (మేము నిన్ను ఈ పరిమితుల నుండి మినహాయించాము). అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడూను.

అజ్ఞానపు దురాచారాన్ని నిర్మూలింపజేసే అవసరం దేనికి కలిగింది, అలా చేయించకపోవటం వల్ల కలిగే నష్టమేమిటి అనే విషయాలు అల్లాహ్‌కు తెలుసు.

14. అంటే, ఈ వివాహం గురించి ప్రజలు చేసే విమర్శలు, దూషణలు అని అర్థం.

15. ముహమ్మద్ (సఅసమ్) ఇతరులు ఒకే కాలంలో నలుగురు కంటే ఎక్కువ మంది భార్యలను కలిగి ఉండటం నిషిద్ధం అని చెప్పారు. కాని స్వయంగా తామే ఈ ఐదవ భార్యను ఎందుకు చేసుకున్నారు? అని అభ్యంతరం లేవనెత్తిన ప్రజలకు ఇది సమాధానం. అప్పటికే మహాప్రవక్త (స) గారికి నలుగురు భార్యలు - హజ్రత్ ఆయెషా (ర), హజ్రత్ సవ్దా (ర), హజ్రత్ హఫ్సా (ర), హజ్రత్ ఉమ్మె సల్మా (ర) - ఉన్నారు అనే విషయం తెలిసి ఉండాలి.

16. అంటే, ఈ ఐదుమంది భార్యలు కాక అదనంగా ఈ సూరాలో ప్రస్తావించబడిన వావివరుసలు గల స్త్రీలను కూడ తమ వైవాహిక బంధంలోకి తీసుకోవచ్చు అనే అనుమతి మహాప్రవక్తకు ఇవ్వబడింది.

تُرْجِيْ مَنْ تَشَآءُ مِنْهُنَّ وَتُـْٔوِيْٓ اِلَيْكَ مَنْ
تَشَآءُ ۭ وَمَنِ ابْتَغَيْتَ مِمَّنْ عَزَلْتَ فَلَا
جُنَاحَ عَلَيْكَ ۭ ذٰلِكَ اَدْنٰٓى اَنْ تَقَرَّ اَعْيُنُهُنَّ
وَلَا يَحْزَنَّ وَيَرْضَيْنَ بِمَآ اٰتَيْتَهُنَّ كُلُّهُنَّ ۭ وَ
اللّٰهُ يَعْلَمُ مَا فِيْ قُلُوْبِكُمْ ۭ وَكَانَ اللّٰهُ عَلِيْمًا
حَلِيْمًا ﴿٥١﴾ لَا يَحِلُّ لَكَ النِّسَآءُ مِنْ بَعْدُ وَلَآ
اَنْ تَبَدَّلَ بِهِنَّ مِنْ اَزْوَاجٍ وَّ لَوْ اَعْجَبَكَ
حُسْنُهُنَّ اِلَّا مَا مَلَكَتْ يَمِيْنُكَ ۭ وَكَانَ اللّٰهُ
عَلٰى كُلِّ شَيْءٍ رَّقِيْبًا ﴿٥٢﴾ يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا
لَا تَدْخُلُوْا بُيُوْتَ النَّبِيِّ اِلَّآ اَنْ يُّؤْذَنَ لَكُمْ
اِلٰى طَعَامٍ غَيْرَ نٰظِرِيْنَ اِنٰىهُ ۙ وَلٰكِنْ اِذَا
دُعِيْتُمْ فَادْخُلُوْا فَاِذَا طَعِمْتُمْ فَانْتَشِرُوْا وَلَا
مُسْتَاْنِسِيْنَ لِحَدِيْثٍ ۭ اِنَّ ذٰلِكُمْ كَانَ يُؤْذِي
النَّبِيَّ فَيَسْتَحْيٖ مِنْكُمْ ۡ وَاللّٰهُ لَا يَسْتَحْيٖ مِنَ
الْحَقِّ ۭ وَاِذَا سَاَلْتُمُوْهُنَّ مَتَاعًا فَسْـَٔلُوْهُنَّ
مِنْ وَّرَآءِ حِجَابٍ ۭ ذٰلِكُمْ اَطْهَرُ لِقُلُوْبِكُمْ
وَقُلُوْبِهِنَّ ۭ وَمَا كَانَ لَكُمْ اَنْ تُؤْذُوْا رَسُوْلَ
اللّٰهِ وَلَآ اَنْ تَنْكِحُوْٓا اَزْوَاجَهٗ مِنْۢ بَعْدِهٖٓ
اَبَدًا ۭ اِنَّ ذٰلِكُمْ كَانَ عِنْدَ اللّٰهِ عَظِيْمًا ﴿٥٣﴾ اِنْ
تُبْدُوْا شَيْـًٔا اَوْ تُخْفُوْهُ فَاِنَّ اللّٰهَ كَانَ بِكُلِّ
شَيْءٍ عَلِيْمًا ﴿٥٤﴾

నీ భార్యలలో నీకు ఇష్టమైన వారిని నీనుండి వేరుగా ఉంచేందుకూ, నీకు ఇష్టమైన వారిని నీతో ఉంచుకునేందుకూ, నీకు ఇష్టమైన వారిని వేరుగా ఉంచిన తరువాత (కూడ) నీ వద్దకు పిలిపించుకునేందుకూ నీకు అధికారం ఇవ్వబడుతోంది. ఈ విషయంలో నీపై ఏ దోషమూ లేదు. ఈ విధంగా వారి కళ్లు చల్లదనం పొందుతాయనీ, వారు బాధపడరనీ, నీవు వారికి ఏది ఇచ్చినా వారు సంతోషిస్తారనీ ఎక్కువగా ఆశించ వచ్చు. మీ మనస్సులలో ఏముందో అల్లాహ్‌కు తెలుసు. అల్లాహ్ సర్వమూ తెలిసిన వాడు సంయమనం కలవాడూను. వీరుగాక ఇతర స్త్రీలు నీకు ధర్మసమ్మతం కారు: వారి స్థానంలో మరెవరినీ భార్యలుగా తీసుకువచ్చే అనుమతి కూడ నీకు లేదు, వారి అందచందాలు నీకు ఎంత నచ్చినా సరే.[17] అయితే బానిస స్త్రీల విషయంలో నీకు అనుమతి[18] ఉన్నది. అల్లాహ్ ప్రతి విషయాన్నీ కనిపెడుతూనే ఉంటాడు.

**53 - 54** విశ్వాసులైన ప్రజలారా! దైవప్రవక్త ఇళ్లల్లోకి అనుమతి లేకుండా ప్రవేశించకండి. భోజన సమయానికై కాచుకుని కూర్చోకండి. కాని మిమ్మల్ని భోజనానికి పిలిస్తే, తప్పకుండా వెళ్లండి, అయితే భోజనం చేసిన వెంటనే, బయటికి వెళ్లిపొండి. పిచ్చాపాటి మాట్లాడుకుంటూ ఉండిపోవకండి. మీ ఈ చేష్టలు ప్రవక్తకు కష్టం కలిగిస్తాయి. అయినా ఆయన, మొగమాటం వల్ల ఏమీ అనరు. అల్లాహ్ సత్య విషయం చెప్పటానికి మొగమాట పడడు. ప్రవక్త భార్యలను మీరు ఏదైనా అడగవలసి ఉంటే, తెరచాటున ఉండి అడగండి. ఇది మీ హృదయాల, వారి హృదయాల పరిశుద్ధత కొరకు ఎంతో సముచితమైన పద్ధతి. దైవప్రవక్తకు కష్టం కలిగించటం మీకు ఏ మాత్రం ధర్మసమ్మతం కాదు. ఇంకా, ఆయన తరువాత ఆయన భార్యలను వివాహం చేసుకోవటం కూడ మీకు ధర్మ సమ్మతం కాదు. ఇది అల్లాహ్ దృష్టిలో మహాపాపం. మీరు ఏదైనా విషయాన్ని వ్యక్తం చేసినా లేక దానిని గోప్యంగా ఉంచినా, అల్లాహ్‌కు ప్రతి విషయమూ తెలుసు.

17. ఈ దైవవాక్కుకు రెండు అర్థాలు ఉన్నాయి: ఒకటి; పైన 50వ వాక్యంలో మహాప్రవక్త (స)కు ధర్మసమ్మతం చేయబడిన స్త్రీలు తప్ప, ఇతర స్త్రీలు ఎవరూ ఆయనకై ధర్మసమ్మతం కారు. రెండు, మీ భార్యలు మీతోపాటు కష్టాలలోనూ, కడగండ్లలోనూ పాలుపంచుకోవటానికి (పరలోకం కోసం ఇహలోకాన్ని త్యాగం చేయటానికి),

لَا جُنَاحَ عَلَيْهِنَّ فِيْٓ اٰبَآئِهِنَّ وَ لَآ اَبْنَآئِهِنَّ
وَلَآ اِخْوَانِهِنَّ وَ لَآ اَبْنَآءِ اِخْوَانِهِنَّ وَ لَآ
اَبْنَآءِ اَخَوٰتِهِنَّ وَلَا نِسَآئِهِنَّ وَ لَا مَا مَلَكَتْ
اَيْمَانُهُنَّ ۚ وَاتَّقِيْنَ اللّٰهَ ؕ اِنَّ اللّٰهَ كَانَ عَلٰى
كُلِّ شَيْءٍ شَهِيْدًا ﴿٥٥﴾ اِنَّ اللّٰهَ وَ مَلٰٓئِكَتَهٗ
يُصَلُّوْنَ عَلَى النَّبِيِّ ؕ يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا
صَلُّوْا عَلَيْهِ وَسَلِّمُوْا تَسْلِيْمًا ﴿٥٦﴾ اِنَّ الَّذِيْنَ
يُؤْذُوْنَ اللّٰهَ وَ رَسُوْلَهٗ لَعَنَهُمُ اللّٰهُ فِي الدُّنْيَا وَ
الْاٰخِرَةِ وَ اَعَدَّ لَهُمْ عَذَابًا مُّهِيْنًا ﴿٥٧﴾ وَ الَّذِيْنَ
يُؤْذُوْنَ الْمُؤْمِنِيْنَ وَالْمُؤْمِنٰتِ بِغَيْرِ مَا
اكْتَسَبُوْا فَقَدِ احْتَمَلُوْا بُهْتَانًا وَّاِثْمًا مُّبِيْنًا ﴿٥٨﴾ ع

**55** దైవప్రవక్త భార్యలకు ఈ విషయంలో ఏ దోషమూ అంటదు. వారి తండ్రులు, వారి కొడుకులు, వారి సోదరులు, వారి సోదరుల కొడుకులు, వారి సోదరీమణుల కుమారులు, వారితో కలుపుగోలుగా ఉండే స్త్రీలు, వారి బానిసలు, వారి ఇళ్లల్లోకి రావచ్చు. (మహిళల్లారా!) మీరు అల్లాహ్ పట్ల అవిధేయతకు పాల్పడకండి; అల్లాహ్ ప్రతి విషయాన్నీ గమనిస్తున్నాడు.

**56** అల్లాహ్ ఆయన దూతలు దైవప్రవక్తకై 'దురూద్'ను పంపుతారు. విశ్వాసులారా! మీరు కూడ ఆయనకై దురూద్, సలామ్‌లు పంపండి.[19]

**57 - 58** అల్లాహ్‌కూ, ఆయన ప్రవక్తకూ బాధకలిగించిన వారిని అల్లాహ్ ఇహపరాలు రెండింటిలోనూ శపించాడు; వారికి అవమానకరమైన శిక్షను సిద్ధపరచి ఉంచాడు. ఏ తప్పూ చేయకపోయినా విశ్వాసులైన స్త్రీ పురుషులకు మనస్తాపం కలిగించేవారు, ఒక పెద్ద అభాండభారాన్ని ఒక స్పష్టమైన పాపభారాన్ని తమ తలపై మోపుకున్నట్లే.

---

సంసిద్ధతను వ్యక్తం చేసినప్పుడు, మీరు వారిపట్ల ఎలా వ్యవహరించినా, వారు దానికి సమ్మతిని తెలియజేస్తున్నప్పుడు, అట్టి వారిలో ఎవరికైనా విడాకులిచ్చి ఆమె స్థానంలో మరొక స్త్రీని భార్యగా చేపట్టటం ఇక మీకు ధర్మసమ్మతం కాదు.

18. వివాహం చేసుకున్న భార్యలతోనే కాక తన బానిస స్త్రీలతో కూడ సాంసారిక సంబంధాలను కలిగి ఉండే అనుమతి ఉన్నది, వారి విషయంలో సంఖ్యా పరిమితి లేదు. ఈ విషయానికి సంబంధించిన వివరణ నిసా సూరాలోని 3వ వాక్యంలోనూ, మోమినూన్ సూరాలోని 6వ వాక్యంలోనూ, అల్ మారిజ్ సూరాలోని 30వ వాక్యంలోనూ వచ్చింది.

19. అల్లాహ్ తరపు నుండి తన ప్రవక్తకై దురూద్ పంపటం అంటే ఆయన తన ప్రవక్తపై ఎనలేని కరుణ కనబరుస్తాడు, అతనిని ప్రశంసిస్తాడు, అతని పనులను నెరవేరుస్తాడు, అతని పేరుకు ఘనతను కలిగిస్తాడు, అతనిపై తన కారుణ్యాలను కురిపిస్తాడు. దైవదూతల తరపు నుండి అతనికై దురూద్ పంపటం అంటే, వారు అతనిని అమితంగా ప్రేమిస్తారు, అతనికి మహోన్నత స్థానాలు ప్రసాదించమని అల్లాహ్‌ను ప్రార్థిస్తారు. విశ్వాసుల తరపు నుండి మహాప్రవక్తకై దురూద్ సలాములు పంపటం అంటే, వారు అతనిపై కృపాకటాక్షాలను అవతరింపజేయుము అని అల్లాహ్‌ను ప్రార్థిస్తారు.

يٰٓاَيُّهَا النَّبِيُّ قُلْ لِّاَزْوَاجِكَ وَ بَنٰتِكَ وَنِسَآءِ
الْمُؤْمِنِيْنَ يُدْنِيْنَ عَلَيْهِنَّ مِنْ جَلَابِيْبِهِنَّ ؕ
ذٰلِكَ اَدْنٰٓى اَنْ يُّعْرَفْنَ فَلَا يُؤْذَيْنَ ؕ وَ كَانَ
اللّٰهُ غَفُوْرًا رَّحِيْمًا ﴿٥٩﴾ لَئِنْ لَّمْ يَنْتَهِ
الْمُنٰفِقُوْنَ وَ الَّذِيْنَ فِيْ قُلُوْبِهِمْ مَّرَضٌ
وَّالْمُرْجِفُوْنَ فِي الْمَدِيْنَةِ لَنُغْرِيَنَّكَ بِهِمْ ثُمَّ لَا
يُجَاوِرُوْنَكَ فِيْهَآ اِلَّا قَلِيْلًا ﴿٦٠﴾ مَّلْعُوْنِيْنَ ۛ
اَيْنَمَا ثُقِفُوْٓا اُخِذُوْا وَ قُتِّلُوْا تَقْتِيْلًا ﴿٦١﴾ سُنَّةَ
اللّٰهِ فِي الَّذِيْنَ خَلَوْا مِنْ قَبْلُ ۚ وَلَنْ تَجِدَ
لِسُنَّةِ اللّٰهِ تَبْدِيْلًا ﴿٦٢﴾ يَسْئَلُكَ النَّاسُ عَنِ
السَّاعَةِ ؕ قُلْ اِنَّمَا عِلْمُهَا عِنْدَ اللّٰهِ ؕ وَ مَا
يُدْرِيْكَ لَعَلَّ السَّاعَةَ تَكُوْنُ قَرِيْبًا ﴿٦٣﴾ اِنَّ
اللّٰهَ لَعَنَ الْكٰفِرِيْنَ وَ اَعَدَّ لَهُمْ سَعِيْرًا ﴿٦٤﴾
خٰلِدِيْنَ فِيْهَآ اَبَدًا ۚ لَا يَجِدُوْنَ وَلِيًّا وَّ لَا
نَصِيْرًا ﴿٦٥﴾ يَوْمَ تُقَلَّبُ وُجُوْهُهُمْ فِي النَّارِ
يَقُوْلُوْنَ يٰلَيْتَنَآ اَطَعْنَا اللّٰهَ وَاَطَعْنَا
الرَّسُوْلَا ﴿٦٦﴾ وَقَالُوْا رَبَّنَآ اِنَّآ اَطَعْنَا سَادَتَنَا
وَكُبَرَآءَنَا فَاَضَلُّوْنَا السَّبِيْلَا ﴿٦٧﴾ رَبَّنَآ اٰتِهِمْ
ضِعْفَيْنِ مِنَ الْعَذَابِ وَ الْعَنْهُمْ لَعْنًا كَبِيْرًا ﴿٦٨﴾

**59** ప్రవక్తా! నీ భార్యలకూ, నీ కూతుళ్లకూ, విశ్వాసుల యొక్క స్త్రీలకూ తమ దుప్పట్ల కొంగులను తమపై వ్రేలాడతీసుకోమని[20] చెప్పు; వారు గుర్తింపబడటానికీ, వేధింపబడకుండా[21] ఉండేందుకూ ఇది ఎంతో సముచితమైన పద్ధతి. అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడూను.

**60 – 62** ఒకవేళ కపటులూ, కలుషిత హృదయులూ మదీనా నగరంలో సంచలనం కలిగించే వదంతులను వ్యాపింపజేసేవారూ తమ దుశ్చేష్టలను మానుకోకపోతే, వారికి వ్యతిరేకంగా చర్య తీసుకోవటానికి, మేము మిమ్మల్ని నిలబెడతాము. తరువాత వారు ఈ నగరంలో మీతో కలసి ఉండటం అనేది కష్టసాధ్యమవుతుంది. అన్ని వైపుల నుండి వారిపై శాపాలు విరుచుకుపడతాయి. వారు ఎక్కడ కనబడితే అక్కడ పట్టుకోబడతారు. దారుణంగా చంపబడతారు. ఇది అల్లాహ్ సంప్రదాయం; పూర్వం నుంచీ అటువంటి వారి విషయంలో అమలవుతూ వస్తున్నదే. మీరు అల్లాహ్ సంప్రదాయంలో ఏ మార్పునూ కానలేరు.

**63 – 68** ప్రళయఘడియ ఎప్పుడు వస్తుంది అని ప్రజలు నిన్ను అడుగుతారు. అది అల్లాహ్‌కే తెలుసు అని చెప్పు. బహుశా అది సమీపంలోనే ఉందో ఏమో, నీకేమి ఎరుక. ఏది ఏమైనా, ఇది మటుకు వాస్తవం: అల్లాహ్ అవిశ్వాసులను శపించాడు. వారికొరకు మండే అగ్నిని సిద్ధపరచి ఉంచాడు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు; ఏ స్నేహితుణ్ణీ, ఏ సహాయకుణ్ణీ పొందలేరు. వారి ముఖాలను నిప్పులపై అటూ ఇటూ త్రిప్పటం జరిగేనాడు వారు ఇలా అంటారు, "అయ్యో! మేము అల్లాహ్‌కూ, దైవప్రవక్తకూ విధేయత చూపి ఉంటే ఎంత బాగుండేది!" ఇంకా ఇలా అంటారు, "ఓ మా ప్రభూ! మేము మా నాయకులకూ, మా పెద్దలకూ విధేయత చూపాము. వారు మమ్మల్ని ఋజుమార్గం నుండి తప్పించారు. ఓ ప్రభూ! వారికి రెట్టింపు యాతన విధించు, వారిని తీవ్రంగా శపించు."

20. అంటే, దుప్పట్లు కప్పుకుని పై నుంచి ముసుగు వేసుకోవాలి. వేరే మాటలలో చెప్పాలంటే ముసుగు లేకుండా తిరగకూడదు.

يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لَا تَكُوْنُوْا كَالَّذِيْنَ اٰذَوْا
مُوْسٰى فَبَرَّاَهُ اللّٰهُ مِمَّا قَالُوْا ؕ وَكَانَ عِنْدَ
اللّٰهِ وَجِيْهًا ۝٦٩ يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا اتَّقُوا اللّٰهَ
وَقُوْلُوْا قَوْلًا سَدِيْدًا ۝٧٠ يُّصْلِحْ لَكُمْ اَعْمَالَكُمْ
وَيَغْفِرْ لَكُمْ ذُنُوْبَكُمْ ؕ وَ مَنْ يُّطِعِ اللّٰهَ وَ
رَسُوْلَهٗ فَقَدْ فَازَ فَوْزًا عَظِيْمًا ۝٧١ اِنَّا عَرَضْنَا
الْاَمَانَةَ عَلَى السَّمٰوٰتِ وَالْاَرْضِ وَ الْجِبَالِ
فَاَبَيْنَ اَنْ يَّحْمِلْنَهَا وَ اَشْفَقْنَ مِنْهَا وَ حَمَلَهَا
الْاِنْسَانُ ؕ اِنَّهٗ كَانَ ظَلُوْمًا جَهُوْلًا ۝٧٢
لِّيُعَذِّبَ اللّٰهُ الْمُنٰفِقِيْنَ وَالْمُنٰفِقٰتِ
وَالْمُشْرِكِيْنَ وَالْمُشْرِكٰتِ وَ يَتُوْبَ اللّٰهُ عَلَى
الْمُؤْمِنِيْنَ وَالْمُؤْمِنٰتِ ؕ وَكَانَ اللّٰهُ غَفُوْرًا
رَّحِيْمًا ۝٧٣ ع

**69 - 71** విశ్వాసులారా! మూసాకు మనస్తాపం కలిగించిన ప్రజల మాదిరిగా అయిపోకండి. తరువాత అల్లాహ్, వారు కల్పించిన మాటల బారినుండి అతనికి విముక్తి కలిగించాడు. అతను అల్లాహ్ దృష్టిలో ఎంతో గౌరవనీయుడు. విశ్వాసులారా! అల్లాహ్‌కు భయపడండి, రుజువాక్కును పలకండి. అప్పుడు అల్లాహ్ మీ కర్మలను చక్కబరుస్తాడు, మీ తప్పులను మన్నిస్తాడు. అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకూ విధేయత చూపేవాడు గొప్ప సాఫల్యం పొందుతాడు.

**72 - 73** మేము ఈ అమానతును[22] ఆకాశాల ముందూ, భూమి ముందూ, పర్వతాల ముందూ పెట్టాము. అవి దానిని మోయటానికి సిద్ధపడలేదు. దానికి భయపడ్డాయి. కాని మానవుడు దాన్ని తనపై మోపుకున్నాడు. నిస్సందేహంగా, అతడు అన్యాయం చేసుకున్నాడు, మూర్ఖుడు[23] (ఈ అమానతు భారాన్ని పైన వేసుకున్న దాని అనివార్య ఫలితం ఏమిటంటే) కపటులైన స్త్రీ పురుషులనూ, ముష్రిక్కులైన స్త్రీ పురుషులనూ అల్లాహ్ శిక్షించటం, విశ్వాసులైన స్త్రీ పురుషుల పశ్చాత్తాపాన్ని అంగీకరించటం. అల్లాహ్ మన్నించేవాడు, కరుణించే వాడూను.

21. "గుర్తింపబడటానికి" అంటే, వారిని ఈ నిరాడంబర వస్త్రధారణలో చూచి, ప్రతివాడూ వారు కులీనులనీ, పరిశుద్ధలనీ గుర్తిస్తాడు. వారు కులటలుకారు, చెడునడత కలిగిన వ్యక్తులకు వారిని చూసినప్పుడు చెడుతలంపులు కలగటానికి.

22. అమానతు అంటే, అల్లాహ్ తన ఈ భూమిలో మానవునికి అధికారాలూ, తార్కిక బుద్ధీ ఇచ్చి అతనిపై మోపిన బరువు బాధ్యతలు అని అర్థం.

23. అంటే, ఈ అమానతు భారాన్ని మోస్తూ కూడ, తన బాధ్యతలను గుర్తించడు. మీదు మిక్కిలి నమ్మకద్రోహానికి పాల్పడి తనకు తానే అన్యాయం చేసుకుంటాడు.

ఆయతులు 54 | 34. సబా | అవతరణ మక్కాలో

سُورَةُ سَبَإٍ ٣٤ مَكِّيَّةٌ ٥٨

آياتها ٥٤ رکوعاتها ٦

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 – 2** కేవలం అల్లాహ్‌యే స్తుతికి పాత్రుడు. ఆయన ఆకాశాలలోనూ, భూమిలోనూ ఉన్న ప్రతి వస్తువుకూ స్వామి. పరలోకంలో కూడా ఆయనే స్తోత్రానికి పాత్రుడు. ఆయన వివేచన కలవాడు, అన్నీ ఎరిగినవాడు. భూమిలోకి ప్రవేశించేదీ, దానినుండి వెలికి వచ్చేదీ, ఆకాశం నుండి దిగేదీ, దానిలోకి ఎక్కేదీ, ఇదంతా ఆయనకు తెలుసు. ఆయన కరుణించేవాడు, క్షమించేవాడూను.

**3 – 6** ఏదీ, ప్రళయం ఇంకా మా మీదకు రావటం లేదేమిటి? అని అవిశ్వాసులు అంటారు. వారితో ఇలా అను, "అగోచర విషయజ్ఞాని అయిన నా ప్రభువు సాక్షిగా! అది మీ మీదకు తప్పకుండా వస్తుంది. రవ్వంత వస్తువైనా సరే ఆయనకు ఆకాశాలలోనూ గోప్యంగా లేదు, భూమిపైనా గోప్యంగా లేదు. రవ్వకంటే పెద్దదైనా సరే దానికంటె చిన్నదైనా సరే అంతా ఒక స్పష్టమైన దస్త్రములో వ్రాయబడి ఉన్నది." విశ్వసించి, సత్కార్యాలు చేసిన వారికి అల్లాహ్ మంచి ప్రతిఫలం ఇవ్వటానికి ఈ ప్రళయం వస్తుంది, వారికి క్షమాభిక్ష లభిస్తుంది, గౌరవప్రదమైన ఉపాధి సిద్ధిస్తుంది. మా వాక్యాలను అగౌరవ పరచటానికి విశ్వప్రయత్నాలు చేసినవారికి తీవ్రమైన, బాధాకరమైన శిక్షపడుతుంది. ప్రవక్తా! నీ ప్రభువు తరఫు నుండి ఏదైతే నీపై అవతరించిందో, అది పూర్తిగా సత్యమనీ, శక్తిమంతుడూ, స్తవనీయుడూ అయిన దేవుని మార్గం చూపుతుందనీ జ్ఞానులు బాగా గ్రహిస్తారు.

**7 – 8**... అవిశ్వాసులు ప్రజలతో ఇలా అంటారు: "మీ శరీరం లోని అణువణువు చెల్లాచెదరై పోయినప్పుడు మీరు మళ్లీ కొత్తగా సృష్టింప బడతారని తెలియజేసే వ్యక్తిని మీకు చూపమంటారా?

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِيْ لَهٗ مَا فِي السَّمٰوٰتِ وَ مَا فِي
الْاَرْضِ وَ لَهُ الْحَمْدُ فِي الْاٰخِرَةِ ۭ وَ هُوَ
الْحَكِيْمُ الْخَبِيْرُ ① يَعْلَمُ مَا يَلِجُ فِي
الْاَرْضِ وَ مَا يَخْرُجُ مِنْهَا وَ مَا يَنْزِلُ مِنَ
السَّمَآءِ وَمَا يَعْرُجُ فِيْهَا ۭ وَ هُوَ الرَّحِيْمُ
الْغَفُوْرُ ② وَ قَالَ الَّذِيْنَ كَفَرُوْا لَا تَاْتِيْنَا
السَّاعَةُ ۭ قُلْ بَلٰى وَ رَبِّيْ لَتَاْتِيَنَّكُمْ ۙ عٰلِمِ
الْغَيْبِ ۚ لَا يَعْزُبُ عَنْهُ مِثْقَالُ ذَرَّةٍ فِي
السَّمٰوٰتِ وَ لَا فِي الْاَرْضِ وَ لَآ اَصْغَرُ مِنْ
ذٰلِكَ وَ لَآ اَكْبَرُ اِلَّا فِيْ كِتٰبٍ مُّبِيْنٍ ③
لِّيَجْزِيَ الَّذِيْنَ اٰمَنُوْا وَعَمِلُوا الصّٰلِحٰتِ ۭ
اُولٰٓئِكَ لَهُمْ مَّغْفِرَةٌ وَّ رِزْقٌ كَرِيْمٌ ④ وَ
الَّذِيْنَ سَعَوْ فِيْٓ اٰيٰتِنَا مُعٰجِزِيْنَ اُولٰٓئِكَ لَهُمْ
عَذَابٌ مِّنْ رِّجْزٍ اَلِيْمٌ ⑤ وَيَرَى الَّذِيْنَ
اُوْتُوا الْعِلْمَ الَّذِيْٓ اُنْزِلَ اِلَيْكَ مِنْ رَّبِّكَ هُوَ
الْحَقَّ ۙ وَ يَهْدِيْٓ اِلٰى صِرَاطِ الْعَزِيْزِ
الْحَمِيْدِ ⑥ وَ قَالَ الَّذِيْنَ كَفَرُوْا هَلْ
نَدُلُّكُمْ عَلٰى رَجُلٍ يُّنَبِّئُكُمْ اِذَا مُزِّقْتُمْ كُلَّ
مُمَزَّقٍ ۙ اِنَّكُمْ لَفِيْ خَلْقٍ جَدِيْدٍ ⑦

ఈ వ్యక్తి అల్లాహ్ పేరుతో అబద్ధాలు కల్పిస్తున్నాడో లేక ఇతనికి పిచ్చి ఏమైనా పట్టిందో తెలియటం లేదు."

**... 8 - 9** కాదు. వాస్తవానికి పరలోకాన్ని విశ్వసించనివారే యాతనకు గురి అయ్యేవారు, వారే ఘోరంగా మార్గం తప్పిన వారు. వారిని ముందు నుంచీ, వెనక నుంచీ చుట్టుముట్టి ఉన్న భూమ్యాకాశాలను వారు ఎన్నడూ చూడలేదా? మేము కోరితే వారిని భూమిలోకి కూరుకుపోయేలా చేయగలము లేదా ఆకాశ ఖండాలను కొన్నింటిని వారి మీద పడవేయ గలము. నిజంగానే దేవుని వైపునకు మరలే ప్రతి దాసుని కొరకు ఇందులో ఒక సూచన ఉన్నది.

**10 - 11** మేము దావూద్‌కు మా తరఫు నుండి గొప్ప అనుగ్రహాన్ని ప్రసాదించాము. (మేము ఇలా ఆజ్ఞాపించాము) పర్వతములారా! ఇతనితో కలిసి కీర్తన చేయండి. (ఇదే ఆజ్ఞను మేము) పక్షులకు కూడా ఇచ్చాము. మేము ఇనుమును అతని కొరకు మెత్తపడేటట్లుగా చేశాము. ఇలా ఆదేశిస్తూ "కవచాలు తయారు చెయ్యి, వాటి వలయాలను సరిగ్గా లెక్క ప్రకారం పేర్చు." (దావూద్ ప్రజలారా!) మంచి పనులు చెయ్యండి. మీరు చేస్తున్నదల్లా నేను చూస్తున్నాను.

**12 - 13** మేము సులేమాన్‌కు గాలిని వశపరచాము. అది ఉదయం పూట ఒక నెల రోజుల పాటి ప్రయాణాన్ని పూర్తి చేయగలిగేది. సాయంకాలం పూట కూడా ఒక నెల రోజుల పాటి ప్రయాణాన్ని చేయగలిగేది. మేము ఆయనకు కరిగిన రాగి ఊటను ప్రవహింపజేశాము. తమ ప్రభువు ఆదేశాను సారం అతని సన్నిధిలో సేవలు చేసే జిన్నాతులను మేము అతనికి వశవర్తులుగా చేశాము. వారిలో మా ఆజ్ఞను ఉల్లం ఘించిన వాడికి మేము జ్వలించే అగ్నిని రుచిచూపేవారము. వారు అతనికి అతను కోరినవన్నీ చేసేవారు, ఎత్తైన కట్టడాలు, చిత్రాలు,[1] కోనేరులవంటి పెద్ద పళ్లాలు, తమ స్థానం నుండి కదలని భారీ డేగిసాలు–దావూద్ ప్రజలారా! కృతజ్ఞతతో పని చేయండి,[2] నా దాసులలో కృతజ్ఞతలు తెలిపేవారు తక్కువే.

أَفْتَرٰى عَلَى اللّٰهِ كَذِبًا أَمْ بِهٖ جِنَّةٌ ۗ بَلِ
الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ فِى الْعَذَابِ
وَالضَّلٰلِ الْبَعِيْدِ ۝٨ أَفَلَمْ يَرَوْا إِلٰى مَا بَيْنَ
أَيْدِيْهِمْ وَمَا خَلْفَهُمْ مِّنَ السَّمَآءِ وَالْأَرْضِ ۗ
إِنْ نَّشَأْ نَخْسِفْ بِهِمُ الْأَرْضَ أَوْ نُسْقِطْ
عَلَيْهِمْ كِسَفًا مِّنَ السَّمَآءِ ۗ إِنَّ فِىْ ذٰلِكَ لَاٰيَةً
لِّكُلِّ عَبْدٍ مُّنِيْبٍ ۝٩ وَلَقَدْ اٰتَيْنَا دَاوٗدَ مِنَّا ع
فَضْلًا ۗ يٰجِبَالُ أَوِّبِىْ مَعَهٗ وَالطَّيْرَ ۚ وَأَلَنَّا لَهُ
الْحَدِيْدَ ۝١٠ أَنِ اعْمَلْ سٰبِغٰتٍ وَّقَدِّرْ فِى
السَّرْدِ وَاعْمَلُوْا صَالِحًا ۗ إِنِّىْ بِمَا تَعْمَلُوْنَ
بَصِيْرٌ ۝١١ وَلِسُلَيْمٰنَ الرِّيْحَ غُدُوُّهَا شَهْرٌ وَّ
رَوَاحُهَا شَهْرٌ ۚ وَأَسَلْنَا لَهٗ عَيْنَ الْقِطْرِ ۗ
وَمِنَ الْجِنِّ مَنْ يَّعْمَلُ بَيْنَ يَدَيْهِ بِإِذْنِ
رَبِّهٖ ۗ وَمَنْ يَّزِغْ مِنْهُمْ عَنْ أَمْرِنَا نُذِقْهُ
مِنْ عَذَابِ السَّعِيْرِ ۝١٢ يَعْمَلُوْنَ لَهٗ مَا يَشَآءُ
مِنْ مَّحَارِيْبَ وَتَمَاثِيْلَ وَجِفَانٍ كَالْجَوَابِ
وَقُدُوْرٍ رّٰسِيٰتٍ ۗ اِعْمَلُوْٓا اٰلَ دَاوٗدَ شُكْرًا ۗ
وَقَلِيْلٌ مِّنْ عِبَادِيَ الشَّكُوْرُ ۝١٣

1. చిత్రాలు అంటే, అవి మానవ చిత్రాలు లేక జంతు చిత్రాలు కావాలనే నియమం లేదు. దైవప్రవక్త మూసా షరియత్తునే హజ్రత్ సులేమాన్ అస్సలామ్ అనుసరించేవారు. హజ్రత్ మూసా షరియత్తు ప్రకారం సజీవ రూపాలకు ప్రతిరూపాలు చేయటం నిషిద్ధం. దైవప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) షరియత్తులో కూడ ఇలా చేయటం నిషిద్ధం.

**14** ఆ తరువాత సులేమాన్‌పై మేము మరణ నిర్ణయాన్ని అమలు జరిపినప్పుడు, జిన్నాతులకు అతని మరణం గురించి తెలియ జేసిన వస్తువు అతని చేతి కర్రను తింటూ ఉన్న చీడ పురుగే తప్ప మరొకటేదీ కాదు, ఈ విధంగా సులేమాన్ పడిపోగా, తమకు అగోచర విషయాలు తెలిసి ఉంటే అవమానకరమైన ఈ బాధకు గురిఅయి ఉండేవారముకాము అని జిన్నాతులకు స్పష్టంగా తెలిసిపోయింది.

**15 - 17** సబా కొరకు స్వయంగా వారి స్వస్థలంలోనే ఒక సూచన ఉండేది; కుడి ప్రక్కా ఎడమ ప్రక్కా[3] రెండు వైపులా రెండు తోటలు; మీ ప్రభువు ప్రసాదించిన దానిని తినండి. ఆయనకు కృతజ్ఞతలు తెలుపండి: దేశమేమో మంచిది, పవిత్ర మైనది. ప్రభువేమో మన్నించేవాడు, అయినప్పటికీ వారు విముఖత చూపారు. చివరకు మేము వారిపైకి కట్ట తెంచే వరదను పంపాము, వారి పూర్వపు రెండు తోటల స్థానంలో మరో రెండు తోటలను వారికి ఇచ్చాము. వాటిలో చేదు పండ్లు, ఝావుక వృక్షాలు ఉండేవి, కొన్ని రేగిచెట్లు కూడా ఉండేవి. ఇది వారి అవిశ్వాసానికి మేము వారికిచ్చిన ప్రతిఫలం. కృతఘ్నుడైన మానవుడికి తప్ప ఇటువంటి ప్రతిఫలాన్ని మేము మరెవ్వరికీ ఇవ్వము.

**18 - 21** మేము వారికీ, మేము శుభాలు ప్రసాదించిన పట్టణాలకూ మధ్య స్పష్టంగా కనిపించే జనపదాలు స్థాపించాము. వాటిలో ప్రయాణ దూరాలను ఒక అంచనా ప్రకారం ఏర్పాటు చేశాము.[4] "ఈ మార్గాలలో రేయింబవళ్లు సురక్షితంగా ప్రయాణం చేయండి." కాని వారు, "మా ప్రభూ! మా ప్రయాణ దూరాలను పొడిగించు[5]" అని అన్నారు. వారు తమకు తామే అన్యాయం చేసుకున్నారు. చివరకు మేము వారిని ఒక కథగా మిగిల్చాము, చెల్లాచెదరు చేసివేశాము. నిశ్చయంగా ఇందులో సహనశీలుడూ, కృతజ్ఞుడూ అయిన ప్రతి వ్యక్తికీ సూచనలు ఉన్నాయి. వారి విషయంలో షైతాన్ తన అనుమానం నిజమైందని తెలుసుకున్నాడు. వారు అతడినే అనుసరించారు, విశ్వాసులైన ఒక చిన్న వర్గం వారు తప్ప. షైతానుకు వారిపై ఎలాంటి అధికారమూ లభించి ఉండ లేదు. కాని ఇదంతా ఎందుకు జరిగిందంటే, పరలోకాన్ని విశ్వ సించినవాడు ఎవడో, దానిని గురించి సంశయపడినవాడు ఎవడో మేము చూడదలచాము. నీ ప్రభువు ప్రతి విషయాన్నీ కనిపెట్టి ఉన్నాడు.

فَلَمَّا قَضَيْنَا عَلَيْهِ الْمَوْتَ مَا دَلَّهُمْ عَلٰى مَوْتِهٖٓ
اِلَّا دَآبَّةُ الْاَرْضِ تَاْكُلُ مِنْسَاَتَهٗ ۚ فَلَمَّا
خَرَّ تَبَيَّنَتِ الْجِنُّ اَنْ لَّوْ كَانُوْا يَعْلَمُوْنَ
الْغَيْبَ مَا لَبِثُوْا فِي الْعَذَابِ الْمُهِيْنِ ﴿۱۴﴾ لَقَدْ
كَانَ لِسَبَاٍ فِيْ مَسْكَنِهِمْ اٰيَةٌ ۚ جَنَّتٰنِ عَنْ
يَّمِيْنٍ وَّ شِمَالٍ ۬ؕ كُلُوْا مِنْ رِّزْقِ رَبِّكُمْ
وَاشْكُرُوْا لَهٗ ؕ بَلْدَةٌ طَيِّبَةٌ وَّ رَبٌّ غَفُوْرٌ ﴿۱۵﴾
فَاَعْرَضُوْا فَاَرْسَلْنَا عَلَيْهِمْ سَيْلَ الْعَرِمِ
وَبَدَّلْنٰهُمْ بِجَنَّتَيْهِمْ جَنَّتَيْنِ ذَوَاتَيْ اُكُلٍ خَمْطٍ وَّ
اَثْلٍ وَّ شَيْءٍ مِّنْ سِدْرٍ قَلِيْلٍ ﴿۱۶﴾ ذٰلِكَ
جَزَيْنٰهُمْ بِمَا كَفَرُوْا ؕ وَ هَلْ نُجٰزِيْٓ اِلَّا
الْكَفُوْرَ ﴿۱۷﴾ وَ جَعَلْنَا بَيْنَهُمْ وَ بَيْنَ الْقُرَى الَّتِيْ
بٰرَكْنَا فِيْهَا قُرًى ظَاهِرَةً وَّ قَدَّرْنَا فِيْهَا
السَّيْرَ ؕ سِيْرُوْا فِيْهَا لَيَالِيَ وَ اَيَّامًا
اٰمِنِيْنَ ﴿۱۸﴾ فَقَالُوْا رَبَّنَا بٰعِدْ بَيْنَ اَسْفَارِنَا
وَظَلَمُوْٓا اَنْفُسَهُمْ فَجَعَلْنٰهُمْ اَحَادِيْثَ وَمَزَّقْنٰهُمْ
كُلَّ مُمَزَّقٍ ؕ اِنَّ فِيْ ذٰلِكَ لَاٰيٰتٍ لِّكُلِّ صَبَّارٍ
شَكُوْرٍ ﴿۱۹﴾ وَ لَقَدْ صَدَّقَ عَلَيْهِمْ اِبْلِيْسُ ظَنَّهٗ
فَاتَّبَعُوْهُ اِلَّا فَرِيْقًا مِّنَ الْمُؤْمِنِيْنَ ﴿۲۰﴾ وَمَا
كَانَ لَهٗ عَلَيْهِمْ مِّنْ سُلْطٰنٍ اِلَّا لِنَعْلَمَ مَنْ
يُّؤْمِنُ بِالْاٰخِرَةِ مِمَّنْ هُوَ مِنْهَا فِيْ شَكٍّ ؕ
وَرَبُّكَ عَلٰى كُلِّ شَيْءٍ حَفِيْظٌ ﴿۲۱﴾ ع
ع ۲ / ۱۲ / ۸

قُلِ ادْعُوا الَّذِينَ زَعَمْتُم مِّن دُونِ اللَّهِ ۖ لَا
يَمْلِكُونَ مِثْقَالَ ذَرَّةٍ فِي السَّمٰوٰتِ وَلَا فِي
الْأَرْضِ وَمَا لَهُمْ فِيهِمَا مِن شِرْكٍ وَمَا لَهُ
مِنْهُم مِّن ظَهِيرٍ ﴿٢٢﴾ وَلَا تَنفَعُ الشَّفَاعَةُ
عِندَهُ إِلَّا لِمَنْ أَذِنَ لَهُ ۚ حَتَّىٰ إِذَا فُزِّعَ
عَن قُلُوبِهِمْ قَالُوا مَاذَا ۙ قَالَ رَبُّكُمْ ۖ قَالُوا
الْحَقَّ ۖ وَهُوَ الْعَلِيُّ الْكَبِيرُ ﴿٢٣﴾ قُلْ مَن
يَرْزُقُكُم مِّنَ السَّمٰوٰتِ وَالْأَرْضِ ۖ قُلِ اللَّهُ ۙ
وَإِنَّا أَوْ إِيَّاكُمْ لَعَلَىٰ هُدًى أَوْ فِي ضَلٰلٍ
مُّبِينٍ ﴿٢٤﴾ قُل لَّا تُسْأَلُونَ عَمَّا أَجْرَمْنَا وَلَا
نُسْأَلُ عَمَّا تَعْمَلُونَ ﴿٢٥﴾ قُلْ يَجْمَعُ بَيْنَنَا رَبُّنَا
ثُمَّ يَفْتَحُ بَيْنَنَا بِالْحَقِّ ۖ وَهُوَ الْفَتَّاحُ
الْعَلِيمُ ﴿٢٦﴾ قُلْ أَرُونِيَ الَّذِينَ أَلْحَقْتُم بِهِ
شُرَكَاءَ ۖ كَلَّا ۚ بَلْ هُوَ اللَّهُ الْعَزِيزُ الْحَكِيمُ ﴿٢٧﴾

**22 - 23** (ప్రవక్తా! ఈ ముష్రిక్కులతో) ఇలా అను, "అల్లాహ్‌ను కాదని మీరు ఆరాధ్యులుగా భావించిన వారిని పిలిచి చూడండి. వారు ఆకాశాలలో గాని, భూమిలోగాని, రవ్వంత వస్తువుకు కూడా యజమానులుకారు. ఇంకా వారు భూమ్యాకాశాల ఆధిపత్యంలో భాగస్వాములునూ కారు. వారిలో ఎవ్వడూ అల్లాహ్‌కు సహాయకుడూ కాడు, అల్లాహ్ ఏ వ్యక్తి విషయంలో సిఫారసుకు అనుమతి ఇచ్చాడో, ఆ వ్యక్తికి తప్ప మరెవరికినీ ఏ సిఫారసూ అల్లాహ్ సమక్షంలో లాభదాయకం కాదు, చివరకు ప్రజల హృదయాల నుండి భయం తొలగిపోయి నపుడు, వారు (సిఫారసు చేసే వారిని) "మీ ప్రభువు ఏమని సమాధానం పలికాడు?" అని అడుగుతారు. వారు, "సరైన సమాధానమే దొరికింది, ఆయన మహిమాన్వితుడు, మహోన్న తుడూను" అని చెబుతారు.

**24 - 27** (ప్రవక్తా!) వారిని ఇలా అడుగు, "ఆకాశాల నుండీ, భూమి నుండీ మీకు ఉపాధిని ఎవడు ఇస్తున్నాడు?" ఇలా అను, "అల్లాహ్‌యే. ఇప్పుడు నిశ్చయంగా మేమో, మీరో ఎవరో ఒకరు మాత్రమే సన్మార్గంలో ఉన్నాము లేదా స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో పడి ఉన్నాము." ఇంకా వారితో ఇలా అను, "మేము చేసిన తప్పులను గురించి మిమ్మల్ని ఏమాత్రం ప్రశ్నిం చటం జరగదు, మీరు చేస్తూ ఉన్న దానిని గురించి మమ్మల్నీ అడగటం జరగదు." ఇలా అను, "మన ప్రభువు మనల్ని సమావేశపరుస్తాడు: తరువాత మన మధ్య సరైన తీర్పు చేస్తాడు. ఆయన సర్వజ్ఞుడైన న్యాయాధిపతి." వారితో ఇలా అను, "ఆయనకు భాగస్వాములుగా మీరు కలిపిన ఆ శక్తులేవో నాకూ కొంచెం చూపించండి." ఎంతమాత్రం కాదు అల్లాహ్ మాత్రమే శక్తిమంతుడు వివేకవంతుడూను.

2. అంటే, కృతజ్ఞత గల దాసులవలె పని చేయండి.

3. దేశం మొత్తంమీద రెండే రెండు తోటలు ఉన్నాయి అని దీని భావం కాదు. కాని సబా దేశమే తోటలమయం. మనిషి ఏ ప్రాంతంలో ఉన్నా, అతనికి ఇరుప్రక్కలా తోటలే కనిపిస్తాయి.

4. "శుభవంతమైన నివాస స్థలాలు" అంటే సిరియా, పాలస్తీనా దేశాలు అని భావం. "స్పష్టంగా కనిపించే నివాస స్థలాలు" అంటే పెద్ద పెద్ద రహదారులపై ఉన్నటువంటి నివాస స్థలాలు అని భావం. మారుమూల ప్రాంతాలలో ఉన్నవి కావు. ప్రయాణ దూరాలను ఒక అంచనా ప్రకారం ఏర్పాటు చేయటం అంటే, యమన్ నుండి

وَمَآ اَرۡسَلۡنٰكَ اِلَّا كَآفَّةً لِّلنَّاسِ بَشِيۡرًا
وَّنَذِيۡرًا وَّ لٰكِنَّ اَكۡثَرَ النَّاسِ لَا يَعۡلَمُوۡنَ ﴿۲۸﴾
وَيَقُوۡلُوۡنَ مَتٰى هٰذَا الۡوَعۡدُ اِنۡ كُنۡتُمۡ
صٰدِقِيۡنَ ﴿۲۹﴾ قُلۡ لَّكُمۡ مِّيۡعَادُ يَوۡمٍ لَّا
تَسۡتَاۡخِرُوۡنَ عَنۡهُ سَاعَةً وَّلَا تَسۡتَقۡدِمُوۡنَ ﴿۳۰﴾
وَقَالَ الَّذِيۡنَ كَفَرُوۡا لَنۡ نُّؤۡمِنَ بِهٰذَا الۡقُرۡاٰنِ
وَلَا بِالَّذِىۡ بَيۡنَ يَدَيۡهِ‌ؕ وَلَوۡ تَرٰٓى اِذِ
الظّٰلِمُوۡنَ مَوۡقُوۡفُوۡنَ عِنۡدَ رَبِّهِمۡ‌ ۖۚ يَرۡجِعُ
بَعۡضُهُمۡ اِلٰى بَعۡضِ اۨلۡقَوۡلَ‌ ۚ يَقُوۡلُ الَّذِيۡنَ
اسۡتُضۡعِفُوۡا لِلَّذِيۡنَ اسۡتَكۡبَرُوۡا لَوۡلَاۤ اَنۡتُمۡ
لَكُنَّا مُؤۡمِنِيۡنَ ﴿۳۱﴾ قَالَ الَّذِيۡنَ اسۡتَكۡبَرُوۡا
لِلَّذِيۡنَ اسۡتُضۡعِفُوۡۤا اَنَحۡنُ صَدَدۡنٰكُمۡ عَنِ
الۡهُدٰى بَعۡدَ اِذۡ جَآءَكُمۡ‌ بَلۡ كُنۡتُمۡ
مُّجۡرِمِيۡنَ ﴿۳۲﴾ وَقَالَ الَّذِيۡنَ اسۡتُضۡعِفُوۡا
لِلَّذِيۡنَ اسۡتَكۡبَرُوۡا بَلۡ مَكۡرُ الَّيۡلِ وَالنَّهَارِ اِذۡ
تَاۡمُرُوۡنَنَاۤ اَنۡ نَّكۡفُرَ بِاللّٰهِ وَنَجۡعَلَ لَهٗۤ
اَنۡدَادًا‌ ؕ وَاَسَرُّوا النَّدَامَةَ لَمَّا رَاَوُا الۡعَذَابَ‌ ؕ
وَجَعَلۡنَا الۡاَغۡلٰلَ فِىۡۤ اَعۡنَاقِ الَّذِيۡنَ كَفَرُوۡا‌ ؕ
هَلۡ يُجۡزَوۡنَ اِلَّا مَا كَانُوۡا يَعۡمَلُوۡنَ ﴿۳۳﴾

**28** (ప్రవక్తా!) మేము నిన్ను సర్వమానవులకు శుభవార్తను ఇచ్చేవాడుగా, హెచ్చరిక చేసేవాడుగా నియమించి పంపాము. కాని చాలామంది మానవులు దీనిని ఎరుగరు.

**29 - 30** వారు నీతో ఇలా అంటారు, "నీవు నిజాయితీ పరుడవే అయితే, ఆ (ప్రళయ) వాగ్దానం ఎప్పుడు నెరవేరు తుంది?" ఇలా అను, "మీ కొఱకు ఆ రోజు యొక్క గడువు నిర్ణయమయ్యే ఉన్నది. దాని రాకను మీరు ఒక గంట ఆలస్యమూ చేయలేరు, ఒక గంట శీఘ్రతరమూ చేయలేరు."

**31 - 33** ఈ అవిశ్వాసులు ఇలా అంటున్నారు, "మేము ఈ ఖురానును ఎన్నటికీ విశ్వసించము. దీనికి పూర్వం వచ్చిన ఏ గ్రంథాన్నీ అంగీకరించము." ఈ దుర్మార్గులు తమ ప్రభువు సమక్షంలో నిలబడునప్పటి స్థితిని నీవు చూస్తే ఎంత బాగుం దును! అప్పుడు వారు ఒకరిపై ఒకరు నిందారోపణలు చేసు కుంటూ ఉంటారు. ప్రపంచంలో అణగద్రొక్కబడిన వారు పెద్దలమనుకున్న వారితో, "మీరు లేకపోయినట్లయితే మేము విశ్వాసులమై ఉండేవారము" అని అంటారు. ఆ పెద్దల మనుకున్న వారు, అణగద్రొక్కబడిన వారికి ఇలా జవాబు ఇస్తారు, "మీ వద్దకు వచ్చిన సన్మార్గాన్ని అవలంబించకుండా మేము మిమ్మల్ని ఆపామా? లేదు. మీరు స్వయంకృతాప రాధులు." అణగద్రొక్కబడిన వారు ఆ పెద్దలమనుకున్న వారితో ఇలా అంటారు, "కాదు, ఇది మీరు అహోరాత్రాలు పన్నిన కుట్ర. అల్లాహ్‌ను తిరస్కరించండి అనీ ఇతరులను ఆయనకు సహవర్తులుగా చెయ్యండి అనీ మీరు మాకు బోధించారు." చివరకు వారు శిక్షను చూసినప్పుడు, తమ మనస్సులలో పశ్చాత్తాపపడతారు. మేము ఈ అవిశ్వాసుల మెడలకు గుది బండలు వేస్తాము. ప్రజలకు వారి కర్మలు ఎలాంటివో అలాంటి ప్రతిఫలమే దొరుకుతుంది. దానికి భిన్నమైన ప్రతిఫలాన్ని వారికి ఇవ్వటం సాధ్యమా?

సిరియా వరకు గల ప్రయాణం జనావాసం గల మార్గంలోనే సాగుతుంది. ఒక మజిలీ నుండే మరొక మజిలీ వరకు గల దూరం అందరికీ తెలిసినదే.

5. వారు మాటలలోనే ఈ ప్రార్థన చేశారు అని చెప్పనక్కరలేదు. అనేక సందర్భాలలోని మానవుని ప్రవర్తనుబట్టి అతడు దేవునితో ఇలా మొరపెట్టుకుంటున్నాడా అని అనిపిస్తుంది, "నీవు నాకు ప్రసాదించిన ఈ వరానికి నేను తగిన వాడనుకాను." ఆయతులోని పదాలను బట్టి స్పష్టమయ్యే విషయం ఏమిటంటే, ఆ జాతివారు తమ

**34 - 38** మేము హెచ్చరిక చేసే వానిని ఏదైనా పట్టణానికి పంపినపుడు, ఆ పట్టణంలోని సంపన్నులు, "నీవు తీసుకొని వచ్చిన సందేశాన్ని మేము విశ్వసించము" అని అనకుండా ఉండటం అనేది ఎన్నడూ జరగలేదు. వారు ఎల్లప్పుడు ఇలానే అన్నారు, "మేము నీకంటె ఎక్కువ సంపదనూ, ఎక్కువ సంతానాన్నీ కలిగి ఉన్నాము. మేము ఎంతమాత్రం శిక్షింపబడే వారము కాము." ప్రవక్తా! వారితో ఇలా అను, "నా ప్రభువు తనకు ఇష్టమైన వారికి విస్తారంగా ఉపాధిని ప్రసాదిస్తాడు, తనకు ఇష్టమైనవారికి ఆచితూచి ఇస్తాడు. కాని చాలామంది దీని యథార్థాన్ని గ్రహించరు." మిమ్మల్ని మాకు దగ్గర చేసేది, మీ సంపద కానీ, మీ సంతానం కానీ కాదు, విశ్వసించి సత్కార్యాలు చేసేవారు మాత్రమే (మాకు దగ్గరవుతారు). ఇటువంటి వారికే తాము చేసిన దానికి రెట్టింపు ప్రతిఫలం లభించేది, వారు ఎత్తైన భవనాలలో సురక్షితంగా ఉంటారు, ఇక మా వాక్యాలను చులకనపరచటానికి నిరంతరం ప్రయత్నం చేసేవారు, వారు యాతనకు గురిఅవుతారు.

**39** ప్రవక్తా! వారితో ఇలా అను, "నా ప్రభువు తన దాసులలో తన కిష్టమైన వారికి విస్తృతమైన ఉపాధిని ఇస్తాడు. తనకిష్టమైన వారికి ఆచి తూచి ఇస్తాడు. మీరు దేనిని ఖర్చు చేసినప్పటికీ దాని స్థానంలో ఆయనే మీకు మరింత ఇస్తాడు, ఉపాధి ప్రదాతలందరికంటె ఆయనే శ్రేష్ఠుడైన ఉపాధి దాత."

**40 - 42** ఆయన మానవులందరినీ సమావేశపరచే రోజున దైవదూతలను, "వీరు మిమ్మల్నే ఆరాధిస్తూ ఉండేవారా?" అని అడుగుతాడు. అప్పుడు వారు ఇలా జవాబు చెబుతారు, "నీవు పరిశుద్ధుడవు. మా సంబంధం నీతోనేగాని వీరితో మాత్రం కాదు, అసలు వీరు మమ్మల్ని కాదు, జిన్నాతులను ఆరాధించే వారు, వీరిలో చాలామంది వారినే విశ్వసించారు."[6] (అప్పుడు మేము ఇలా అంటాము) ఈ రోజున మీలో ఎవరూ ఎవరికీ లాభాన్నిగానీ, నష్టాన్నిగానీ కలిగించలేరు. మేము దుర్మార్గులతో, "ఇక రుచి చూడండి మీరు తిరస్కరిస్తూ ఉండే నరకబాధను" అని అంటాము.

وَمَآ اَرْسَلْنَا فِىْ قَرْيَةٍ مِّنْ نَّذِيْرٍ اِلَّا قَالَ
مُتْرَفُوْهَآ ۙ اِنَّا بِمَآ اُرْسِلْتُمْ بِهٖ كٰفِرُوْنَ ﴿٣٤﴾ وَ
قَالُوْا نَحْنُ اَكْثَرُ اَمْوَالًا وَّ اَوْلَادًا ۙ وَّ مَا
نَحْنُ بِمُعَذَّبِيْنَ ﴿٣٥﴾ قُلْ اِنَّ رَبِّىْ يَبْسُطُ
الرِّزْقَ لِمَنْ يَّشَآءُ وَيَقْدِرُ وَ لٰكِنَّ اَكْثَرَ
النَّاسِ لَا يَعْلَمُوْنَ ﴿٣٦﴾ وَمَآ اَمْوَالُكُمْ وَ لَآ
اَوْلَادُكُمْ بِالَّتِىْ تُقَرِّبُكُمْ عِنْدَنَا زُلْفٰٓى اِلَّا مَنْ
اٰمَنَ وَ عَمِلَ صَالِحًا ۫ فَاُولٰٓئِكَ لَهُمْ جَزَآءُ
الضِّعْفِ بِمَا عَمِلُوْا وَ هُمْ فِى الْغُرُفٰتِ
اٰمِنُوْنَ ﴿٣٧﴾ وَالَّذِيْنَ يَسْعَوْنَ فِىْٓ اٰيٰتِنَا
مُعٰجِزِيْنَ اُولٰٓئِكَ فِى الْعَذَابِ مُحْضَرُوْنَ ﴿٣٨﴾
قُلْ اِنَّ رَبِّىْ يَبْسُطُ الرِّزْقَ لِمَنْ يَّشَآءُ مِنْ
عِبَادِهٖ وَيَقْدِرُ لَهٗ ۭ وَ مَآ اَنْفَقْتُمْ مِّنْ شَىْءٍ
فَهُوَ يُخْلِفُهٗ ۚ وَهُوَ خَيْرُ الرّٰزِقِيْنَ ﴿٣٩﴾ وَ يَوْمَ
يَحْشُرُهُمْ جَمِيْعًا ثُمَّ يَقُوْلُ لِلْمَلٰٓئِكَةِ اَهٰٓؤُلَآءِ
اِيَّاكُمْ كَانُوْا يَعْبُدُوْنَ ﴿٤٠﴾ قَالُوْا سُبْحٰنَكَ
اَنْتَ وَلِيُّنَا مِنْ دُوْنِهِمْ ۚ بَلْ كَانُوْا يَعْبُدُوْنَ
الْجِنَّ ۚ اَكْثَرُهُمْ بِهِمْ مُّؤْمِنُوْنَ ﴿٤١﴾ فَالْيَوْمَ لَا
يَمْلِكُ بَعْضُكُمْ لِبَعْضٍ نَّفْعًا وَّلَا ضَرًّا ۭ وَ
نَقُوْلُ لِلَّذِيْنَ ظَلَمُوْا ذُوْقُوْا عَذَابَ النَّارِ الَّتِىْ
كُنْتُمْ بِهَا تُكَذِّبُوْنَ ﴿٤٢﴾

وَ اِذَا تُتْلٰى عَلَيْهِمْ اٰيٰتُنَا بَيِّنٰتٍ قَالُوْا مَا
هٰذَآ اِلَّا رَجُلٌ يُّرِيْدُ اَنْ يَّصُدَّكُمْ عَمَّا كَانَ
يَعْبُدُ اٰبَآؤُكُمْ ۚ وَ قَالُوْا مَا هٰذَآ اِلَّآ اِفْكٌ
مُّفْتَرًى ۭ وَ قَالَ الَّذِيْنَ كَفَرُوْا لِلْحَقِّ لَمَّا
جَآءَهُمْ ۙ اِنْ هٰذَآ اِلَّا سِحْرٌ مُّبِيْنٌ ﴿٤٣﴾ وَ مَآ
اٰتَيْنٰهُمْ مِّنْ كُتُبٍ يَّدْرُسُوْنَهَا وَ مَآ اَرْسَلْنَآ
اِلَيْهِمْ قَبْلَكَ مِنْ نَّذِيْرٍ ﴿٤٤﴾ وَكَذَّبَ الَّذِيْنَ
مِنْ قَبْلِهِمْ ۙ وَ مَا بَلَغُوْا مِعْشَارَ مَآ اٰتَيْنٰهُمْ
فَكَذَّبُوْا رُسُلِيْ ۣ فَكَيْفَ كَانَ نَكِيْرِ ﴿٤٥﴾ قُلْ
اِنَّمَآ اَعِظُكُمْ بِوَاحِدَةٍ ۚ اَنْ تَقُوْمُوْا لِلّٰهِ مَثْنٰى
وَفُرَادٰى ثُمَّ تَتَفَكَّرُوْا ۣ مَا بِصَاحِبِكُمْ مِّنْ
جِنَّةٍ ۭ اِنْ هُوَ اِلَّا نَذِيْرٌ لَّكُمْ بَيْنَ يَدَيْ
عَذَابٍ شَدِيْدٍ ﴿٤٦﴾ قُلْ مَا سَاَلْتُكُمْ مِّنْ اَجْرٍ
فَهُوَ لَكُمْ ۭ اِنْ اَجْرِيَ اِلَّا عَلَى اللّٰهِ ۚ وَهُوَ عَلٰى
كُلِّ شَيْءٍ شَهِيْدٌ ﴿٤٧﴾ قُلْ اِنَّ رَبِّيْ يَقْذِفُ
بِالْحَقِّ ۚ عَلَّامُ الْغُيُوْبِ ﴿٤٨﴾ قُلْ جَآءَ الْحَقُّ
وَمَا يُبْدِئُ الْبَاطِلُ وَمَا يُعِيْدُ ﴿٤٩﴾ قُلْ اِنْ
ضَلَلْتُ فَاِنَّمَآ اَضِلُّ عَلٰى نَفْسِيْ ۚ وَ اِنِ
اهْتَدَيْتُ فَبِمَا يُوْحِيْٓ اِلَيَّ رَبِّيْ ۭ اِنَّهٗ سَمِيْعٌ
قَرِيْبٌ ﴿٥٠﴾

**43 - 45** స్పష్టమైన మా వాక్యాలను వారికి వినిపించినపుడు, వారు, "ఈ వ్యక్తి మీ తాతముత్తాతలు ఆరాధించిన ఆరాధ్యుల నుండి మిమ్మల్ని దూరం చేయాలని కోరుతున్నాడు" అని అంటారు. ఇంకా, "ఇది (ఖురాన్) కేవలం కల్పితమైన అబద్ధం మాత్రమే" అని అంటారు. ఈ అవిశ్వాసుల ముందుకు సత్యం వచ్చినప్పుడు, వారు ఇది స్పష్టమైన మంత్రజాలమే అని అన్నారు. వాస్తవానికి మేము వారికి ఇదివరకు కూడా ఏ గ్రంథాన్నీ ఇవ్వలేదు, దానిని వారు చదివేందుకు. నీకు పూర్వం వారి వైపునకు హెచ్చరిక చేసేవారినెవరినీ పంపలేదు, వారికి పూర్వం గతించినవారు ఇదే విధంగా తిరస్కరించారు, మేము వారికి ఇచ్చిన దానిలో పదోవంతుకు కూడ వీరు చేరలేదు, కాని వారు నా ప్రవక్తలను నిరాకరించినపుడు, చూడండి నేను వారికి విధించిన శిక్ష ఎంత కఠినంగా ఉండినదో.

**46 - 50** ప్రవక్తా! వారితో ఇలా అను, "నేను మీకు ఒక విషయాన్ని బోధిస్తున్నాను. అల్లాహ్ కోసం, మీరు ఒక్కరొక్కరూ ఇద్దరిద్దరూ కలిసి మీ మేధను ఉపయోగించి ఆలోచించండి, అసలు మీ సహచరుని[7] మాటలలో పిచ్చితనం ఏముందో అని? అతను, ఒక తీవ్రమైన శిక్షరావటానికి ముందు మీకు హెచ్చరిక చేసేవాడు మాత్రమే" వారితో ఇలా అను : "ఒకవేళ నేను మీ నుండి ప్రతిఫలమేదైనా కోరి ఉంటే, దానిని మీరే ఉంచుకోండి, ఇక నా ప్రతిఫలం అది అల్లాహ్ బాధ్యత, ఆయన సర్వసాక్షి." వారితో ఇలా అను, "నా ప్రభువు (నాకు) సత్య స్ఫూర్తిని పంపుతున్నాడు. ఆయన గుప్తములైన యథార్థాలను అన్నింటినీ ఎరిగినవాడు." ఇలా అను, "సత్యం వచ్చేసింది ఇక అసత్యం ఏమి చేసినా నెగ్గజాలదు." ఇలా అను, "ఒకవేళ నేను మార్గభ్రష్టుడనైతే, నా మార్గభ్రష్టత్వపు పాపఫలం నా మీదనే ఉంటుంది. ఒకవేళ నేను సన్మార్గంపై ఉంటే, నా ప్రభువు నాపై అవతరింపజేసే వహీ ఆధారంగానే ఉన్నాను. ఆయన అన్నీ వింటాడు, దగ్గరలోనే ఉన్నాడు."

అధిక జనాభాను తమకు ఒక ఇక్కట్టుగా భావించి, తమ ప్రయాణపు మజిలీలు దూరదూరంగా ఉండే రీతిలో జనాభా తగ్గాలని కోరుకునేవారు.

6. అరేబియా ముష్రిక్కులు దైవదూతలను దేవతలుగా చేసుకుని పూజించేవారు. అందుకని అల్లాహ్ ఇలా తెలియ జేస్తున్నాడు: ప్రళయ దినంనాడు ఈ విషయం గురించి దైవదూతలను ప్రశ్నించినప్పుడు వారు, "అసలు వారు

وَلَوْ تَرٰٓى اِذْ فَزِعُوْا فَلَا فَوْتَ وَاُخِذُوْا مِنْ
مَّكَانٍ قَرِيْبٍ ﴿٥١﴾ وَّقَالُوْٓا اٰمَنَّا بِهٖ ۚ وَاَنّٰى لَهُمُ
التَّنَاوُشُ مِنْ مَّكَانٍ بَعِيْدٍ ﴿٥٢﴾ وَّقَدْ كَفَرُوْا
بِهٖ مِنْ قَبْلُ ۚ وَيَقْذِفُوْنَ بِالْغَيْبِ مِنْ مَّكَانٍ
بَعِيْدٍ ﴿٥٣﴾ وَحِيْلَ بَيْنَهُمْ وَبَيْنَ مَا يَشْتَهُوْنَ
كَمَا فُعِلَ بِاَشْيَاعِهِمْ مِّنْ قَبْلُ ۗ اِنَّهُمْ كَانُوْا
فِيْ شَكٍّ مُّرِيْبٍ ﴿٥٤﴾ ع ٦/١٢

**51 - 54** నీవు ఆ సమయంలో వారిని చూస్తే ఎంత బాగుండును. అప్పుడు వారు భయకంపితులై తిరుగుతూ ఉంటారు, ఎటూ తప్పించుకుని పోలేరు. దగ్గరనుండే పట్టుకోబడతారు, అప్పుడు వారు, "మేము దానిని విశ్వసించాము" అని అంటారు. వాస్తవానికి దూరమైపోయిన వస్తువు ఇప్పుడెలా చేతికందుతుంది. ఇది వరకు వారు అవిశ్వాసానికి పాల్పడి ఉన్నారు; నిజం తెలుసుకోకుండానే, దూరం నుంచే ఊహాపోహలు చేశారు- అప్పుడు వారు తాము ఎక్కువగా కోరుకునే దానికి దూరం చేయబడతారు; వారివంటి వారి పూర్వీకులు దూరం చేయబడినట్లు. వారు, అపమార్గం పట్టించే పెద్ద సంశయంలో పడిపోయారు.

మమ్మల్ని పూజించేవారు కాదు, మా పేరుతో షైతానులను పూజించేవారు. ఎందుకంటే, షైతానులే దేవుణ్ణి వదలిపెట్టి ఇతరులను తమ కోరికలు తీర్చేవారుగా విశ్వసించమనీ, వారికి మొక్కుబళ్లు చెల్లించమనీ బోధించి వారిని అపమార్గంలో పెట్టారు" అని సమాధానం చెబుతారు.

7. అంటే, దైవప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) అని భావం. ఆయనకు "మీ సహచరుడు" అనే పదం ఎందుకు వాడబడిందంటే, ఆయన వారికి అపరిచితుడేమీ కాదు, వారి నగరవాసులే వారి తెగకు చెందినవారే.

ఆయతులు 45

# 35. ఫాతిర్

అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 2** అల్లాహ్ మాత్రమే స్తుతింపదగినవాడు. ఆయన ఆకాశాలనూ, భూమినీ సృష్టించాడు. ఆయన దైవదూతలను సందేశహరులుగా నియమిస్తాడు. (ఎటువంటి దైవదూతలంటే) వారికి రెండేసి, మూడేసి, నాలుగేసి బాహువులు ఉంటాయి. ఆయన తన సృష్టి స్వరూపాన్ని తన ఇష్ట ప్రకారం పెంచుతాడు. నిశ్చయంగా అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు. అల్లాహ్ ప్రజల కొరకు ఏ కారుణ్య ద్వారాన్ని తెరిచినా, దానిని అడ్డుకునే వాడెవ్వడూ లేడు. ఆయన మూసివేసిన దానిని అల్లాహ్ తరువాత మళ్ళీ తెరిచేవాడూ ఎవ్వడూ లేడు. ఆయన శక్తిమంతుడు, వివేచన కలవాడు.

**3 - 4** మానవులారా! అల్లాహ్ మీకు చేసిన ఉపకారాలను జ్ఞాపకం ఉంచుకోండి. అల్లాహ్ కాక, భూమ్యాకాశాల నుండి మీకు ఉపాధినిచ్చే మరొక సృష్టికర్త కూడా ఎవడైనా ఉన్నాడా- ఆయన తప్ప మరొక ఆరాధ్యుడెవ్వడూ లేడు. అసలు మీరు ఎవని వల్ల మోసపోతున్నారు? ఇప్పుడు ఒకవేళ (ప్రవక్తా) వారు నిన్ను తిరస్కరిస్తున్నారు అంటే (ఇది క్రొత్త విషయమేమీ కాదు). నీకు పూర్వం కూడా చాలామంది దైవప్రవక్తలు తిరస్కరించబడ్డారు. వ్యవహారాలన్నీ చివరకు అల్లాహ్ వైపునకే మరలనున్నాయి.

**5 - 7** మానవులారా! నిశ్చయముగా అల్లాహ్ వాగ్దానం సత్యమైనది. కనుక ప్రాపంచిక జీవితం మిమ్మల్ని మోసానికి గురిచేయకూడదు. ఆ మహావంచకుడు కూడా మిమ్మల్ని అల్లాహ్ విషయంలో మోసగించగలగ కూడదు. యథార్థానికి షైతాను మీకు శత్రువు. కనుక మీరు కూడా వాడు మీ శత్రువే అని భావించండి. వాడు, తన అనుచరులు నరక వాసులలో చేరిపోవాలని వారిని తన మార్గం వైపునకు పిలుస్తున్నాడు,

٣٥ سُوْرَةُ فَاطِرٍ مَّكِّيَّةٌ ٤٣

اٰياتها ٤٥ | ركوعاتها ٥

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

اَلْحَمْدُ لِلّٰهِ فَاطِرِ السَّمٰوٰتِ وَ الْاَرْضِ جَاعِلِ
الْمَلٰٓئِكَةِ رُسُلًا اُولِيْٓ اَجْنِحَةٍ مَّثْنٰى وَ ثُلٰثَ وَ
رُبٰعَ ؕ يَزِيْدُ فِي الْخَلْقِ مَا يَشَآءُ ؕ اِنَّ اللّٰهَ
عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ ① مَا يَفْتَحِ اللّٰهُ لِلنَّاسِ
مِنْ رَّحْمَةٍ فَلَا مُمْسِكَ لَهَا ۚ وَ مَا يُمْسِكْ ۙ
فَلَا مُرْسِلَ لَهٗ مِنْۢ بَعْدِهٖ ؕ وَ هُوَ الْعَزِيْزُ
الْحَكِيْمُ ② يٰٓاَيُّهَا النَّاسُ اذْكُرُوْا نِعْمَتَ اللّٰهِ
عَلَيْكُمْ ؕ هَلْ مِنْ خَالِقٍ غَيْرُ اللّٰهِ يَرْزُقُكُمْ
مِّنَ السَّمَآءِ وَ الْاَرْضِ ؕ لَآ اِلٰهَ اِلَّا هُوَ ۫ فَاَنّٰى
تُؤْفَكُوْنَ ③ وَ اِنْ يُّكَذِّبُوْكَ فَقَدْ كُذِّبَتْ
رُسُلٌ مِّنْ قَبْلِكَ ؕ وَ اِلَى اللّٰهِ تُرْجَعُ
الْاُمُوْرُ ④ يٰٓاَيُّهَا النَّاسُ اِنَّ وَعْدَ اللّٰهِ حَقٌّ
فَلَا تَغُرَّنَّكُمُ الْحَيٰوةُ الدُّنْيَا ٚ وَ لَا يَغُرَّنَّكُمْ
بِاللّٰهِ الْغَرُوْرُ ⑤ اِنَّ الشَّيْطٰنَ لَكُمْ عَدُوٌّ
فَاتَّخِذُوْهُ عَدُوًّا ؕ اِنَّمَا يَدْعُوْا حِزْبَهٗ لِيَكُوْنُوْا
مِنْ اَصْحٰبِ السَّعِيْرِ ⑥ ؕ

اَلَّذِيْنَ كَفَرُوْا لَهُمْ عَذَابٌ شَدِيْدٌ ۬ وَ
الَّذِيْنَ اٰمَنُوْا وَعَمِلُوا الصّٰلِحٰتِ لَهُمْ مَّغْفِرَةٌ وَّ
اَجْرٌ كَبِيْرٌ ٧ اَفَمَنْ زُيِّنَ لَهٗ سُوْٓءُ عَمَلِهٖ فَرَاٰهُ ع
حَسَنًا ؕ فَاِنَّ اللّٰهَ يُضِلُّ مَنْ يَّشَآءُ وَيَهْدِيْ
مَنْ يَّشَآءُ ۖ فَلَا تَذْهَبْ نَفْسُكَ عَلَيْهِمْ
حَسَرٰتٍ ؕ اِنَّ اللّٰهَ عَلِيْمٌۢ بِمَا يَصْنَعُوْنَ ٨ وَ
اللّٰهُ الَّذِيْٓ اَرْسَلَ الرِّيٰحَ فَتُثِيْرُ سَحَابًا
فَسُقْنٰهُ اِلٰى بَلَدٍ مَّيِّتٍ فَاَحْيَيْنَا بِهِ الْاَرْضَ
بَعْدَ مَوْتِهَا ؕ كَذٰلِكَ النُّشُوْرُ ٩ مَنْ كَانَ
يُرِيْدُ الْعِزَّةَ فَلِلّٰهِ الْعِزَّةُ جَمِيْعًا ؕ اِلَيْهِ يَصْعَدُ
الْكَلِمُ الطَّيِّبُ وَ الْعَمَلُ الصَّالِحُ يَرْفَعُهٗ ؕ
وَالَّذِيْنَ يَمْكُرُوْنَ السَّيِّاٰتِ لَهُمْ عَذَابٌ
شَدِيْدٌ ؕ وَمَكْرُ اُولٰٓئِكَ هُوَ يَبُوْرُ ١٠ وَاللّٰهُ
خَلَقَكُمْ مِّنْ تُرَابٍ ثُمَّ مِنْ نُّطْفَةٍ ثُمَّ جَعَلَكُمْ
اَزْوَاجًا ؕ وَمَا تَحْمِلُ مِنْ اُنْثٰى وَلَا تَضَعُ
اِلَّا بِعِلْمِهٖ ؕ وَمَا يُعَمَّرُ مِنْ مُّعَمَّرٍ وَّ لَا
يُنْقَصُ مِنْ عُمُرِهٖٓ اِلَّا فِيْ كِتٰبٍ ؕ اِنَّ ذٰلِكَ
عَلَى اللّٰهِ يَسِيْرٌ ١١ وَمَا يَسْتَوِي الْبَحْرٰنِ ۖ
هٰذَا عَذْبٌ فُرَاتٌ سَآئِغٌ شَرَابُهٗ وَهٰذَا مِلْحٌ
اُجَاجٌ ؕ وَمِنْ كُلٍّ تَاْكُلُوْنَ لَحْمًا طَرِيًّا وَّ
تَسْتَخْرِجُوْنَ حِلْيَةً تَلْبَسُوْنَهَا ۚ وَتَرَى الْفُلْكَ
فِيْهِ مَوَاخِرَ لِتَبْتَغُوْا مِنْ فَضْلِهٖ وَلَعَلَّكُمْ
تَشْكُرُوْنَ ١٢

అవిశ్వాసానికి పాల్పడే వారికి కఠిన శిక్ష పడుతుంది. విశ్వసించి మంచిపనులు చేసేవారికి క్షమాభిక్ష, గొప్ప ప్రతిఫలం లభిస్తాయి.

**8 - 9** ఎవనికి తన దుష్కార్యం అందంగా కనిపించేలా చేయ బడిందో మరియు అతడు దానిని మేలైనదిగా భావిస్తున్నాడో (ఆ వ్యక్తి మార్గభ్రష్టత్వానికి అసలు హద్దు అంటూ ఏమైనా ఉందా?) యథార్థం ఏమిటంటే, అల్లాహ్ తాను కోరిన వారిని మార్గభ్రష్ట త్వానికి గురిచేస్తాడు. తాను కోరిన వారికి ఋజుమార్గం చూపు తాడు. కనుక (ప్రవక్తా) అనవసరంగా నీ ప్రాణం ఈ ప్రజల కోసం దుఃఖానికీ, బాధకూ గురిఅయి హరించిపోకూడదు. వారు చేస్తూ ఉన్నదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు. వాయువులను పంపేవాడు అల్లాహ్‌యే. తరువాత అవి మేఘాన్ని లేపుతాయి, ఆ తరువాత మేము దానిని ఒక పాడుబడ్డ నేల వైపునకు తీసుకు పోతాము, దానిద్వారా చచ్చిపడి వున్న ఆ నేలనే బ్రతికిస్తాము. మరణించిన మానవులు బ్రతికి లేవటం కూడా ఇలానే జరుగు తుంది.

**10** అల్లాహ్ మాత్రమే గౌరవానికి పూర్తిగా అర్హుడనే విషయాన్ని గౌరవాభిలాషి అయిన ప్రతివాడూ తెలుసుకోవాలి. ఆయన వద్దకు అధిరోహించే వస్తువు పరిశుద్ధ వాక్కు మాత్రమే, సత్కర్మ దానిని పైకి ఎక్కిస్తుంది. ఇక కుతంత్రాలు చేసేవారు, వారికైతే కఠిన శిక్ష పడుతుంది. వారి కుతంత్రం దానంతట అదే నాశనమై పోతుంది.

**11 - 14** అల్లాహ్ మిమ్మల్ని మట్టితో సృష్టించాడు. తరువాత ఇంద్రియ బిందువులతో, ఆ తరువాత మిమ్మల్ని జంటలుగా చేశాడు (అంటే స్త్రీ పురుషులు). అల్లాహ్‌కు తెలియకుండా ఏ స్త్రీ అయిన గర్భం దాల్చనూ లేదు, ప్రసవించనూలేదు. వయసు పెరుగుతున్న వాడెవడూ ఆయువును పొందలేడు. ఎవరి ఆయువులోనూ తగ్గింపు అనేది జరగదు, గ్రంథంలో వ్రాయబడి ఉన్నదాని ప్రకారం తప్ప. ఇది అల్లాహ్‌కు చాలా సులభమైన పని. నీటి వనరులు రెండూ సమానం కావు; ఒకటేమో తియ్యనిది, దప్పికను తీర్చేది, త్రాగటానికి మధురమైనది. రెండోదేమో గొంతు మండించే అంత ఉప్పనిది. కాని రెండింటి నుంచీ మీరు స్వచ్ఛమైన తాజా మాంసాన్ని పొందుతారు. ధరించటానికి అలంకరణ సామగ్రిని వెలికి తీసుకుంటారు. మీరు చూస్తూనే ఉన్నారు ఈ నీటిలోనే పడవలు దాని గుండెలను చీల్చుకుంటూ పోతూ ఉంటాయి. మీరు అల్లాహ్ అనుగ్రహాన్ని అన్వేషించేందుకు తద్వారా ఆయనకు కృతజ్ఞులు అయ్యేందుకు.

يُوْلِجُ الَّيْلَ فِي النَّهَارِ وَ يُوْلِجُ النَّهَارَ فِي
الَّيْلِ ۙ وَ سَخَّرَ الشَّمْسَ وَالْقَمَرَ ۖ كُلٌّ يَّجْرِيْ
لِاَجَلٍ مُّسَمًّى ؕ ذٰلِكُمُ اللّٰهُ رَبُّكُمْ لَهُ
الْمُلْكُ ؕ وَالَّذِيْنَ تَدْعُوْنَ مِنْ دُوْنِهٖ مَا
يَمْلِكُوْنَ مِنْ قِطْمِيْرٍ ﴿١٣﴾ اِنْ تَدْعُوْهُمْ لَا
يَسْمَعُوْا دُعَآءَكُمْ ۚ وَ لَوْ سَمِعُوْا مَا اسْتَجَابُوْا
لَكُمْ ؕ وَيَوْمَ الْقِيٰمَةِ يَكْفُرُوْنَ بِشِرْكِكُمْ ؕ وَلَا
يُنَبِّئُكَ مِثْلُ خَبِيْرٍ ﴿١٤﴾ يٰۤاَيُّهَا النَّاسُ اَنْتُمُ الثلثة ع
الْفُقَرَآءُ اِلَى اللّٰهِ ۚ وَاللّٰهُ هُوَ الْغَنِيُّ الْحَمِيْدُ ﴿١٥﴾
اِنْ يَّشَاْ يُذْهِبْكُمْ وَيَاْتِ بِخَلْقٍ جَدِيْدٍ ﴿١٦﴾ وَ
مَا ذٰلِكَ عَلَى اللّٰهِ بِعَزِيْزٍ ﴿١٧﴾ وَلَا تَزِرُ وَازِرَةٌ
وِّزْرَ اُخْرٰى ؕ وَ اِنْ تَدْعُ مُثْقَلَةٌ اِلٰى حِمْلِهَا
لَا يُحْمَلْ مِنْهُ شَيْءٌ وَّ لَوْ كَانَ ذَا قُرْبٰى ؕ اِنَّمَا
تُنْذِرُ الَّذِيْنَ يَخْشَوْنَ رَبَّهُمْ بِالْغَيْبِ وَ
اَقَامُوا الصَّلٰوةَ ؕ وَمَنْ تَزَكّٰى فَاِنَّمَا يَتَزَكّٰى
لِنَفْسِهٖ ؕ وَ اِلَى اللّٰهِ الْمَصِيْرُ ﴿١٨﴾ وَمَا يَسْتَوِي
الْاَعْمٰى وَ الْبَصِيْرُ ۙ﴿١٩﴾ وَ لَا الظُّلُمٰتُ وَ لَا
النُّوْرُ ۙ﴿٢٠﴾ وَ لَا الظِّلُّ وَ لَا الْحَرُوْرُ ۚ﴿٢١﴾ وَ مَا
يَسْتَوِي الْاَحْيَآءُ وَ لَا الْاَمْوَاتُ ؕ اِنَّ اللّٰهَ
يُسْمِعُ مَنْ يَّشَآءُ ۚ وَ مَآ اَنْتَ بِمُسْمِعٍ مَّنْ فِي
الْقُبُوْرِ ﴿٢٢﴾ اِنْ اَنْتَ اِلَّا نَذِيْرٌ ﴿٢٣﴾

ఆయన పగలులోనికి రాత్రినీ, రాత్రిలోనికి పగలునూ జొనుపుతున్నాడు. సూర్యచంద్రులను ఆయన నియమబద్ధులను చేసి ఉంచాడు. ఇదంతా ఒక నిర్ణీత వ్యవధి వరకు సాగిపోతోంది. (ఈ పనులన్నీ చేసే) ఆ అల్లాహ్‌యే మీ ప్రభువు. సామ్రాజ్యాధికారం ఆయనదే. ఆయనను కాదని మీరు పిలిచే ఇతరులు కనీసం ఒక గడ్డిపోచకు కూడా యజమానులు కారు. వారిని వేడుకుంటే, వారు మీ ప్రార్థనలను వినలేరు. ఒకవేళ విన్నా, వాటికి ఏ సమాధానమూ మీకు ఇవ్వలేరు. మీరు కల్పించిన దైవత్వపు భాగస్వామ్యాన్ని వారు ప్రళయంనాడు తిరస్కరిస్తారు. సత్యాన్ని గురించిన ఈ సరైన సమాచారాన్ని తెలిసినవాడు తప్ప మరొకడెవ్వడూ మీకు అందజేయలేడు.

**15 - 26** మానవులారా! అల్లాహ్ అవసరం కలవారు మీరే. అల్లాహ్ సర్వసంపన్నుడు. స్వయంగానే స్తుతిపాత్రుడు. ఆయన కోరితే, మిమ్మల్ని తొలగించి, మరేదైనా సృష్టిని మీ స్థానంలో తీసుకురాగలడు. అలా చేయటం అల్లాహ్‌కు ఏ మాత్రమూ కష్టం కాదు. బరువు మోసే వాడెవ్వడూ మరెవరి బరువునూ మోయడు, బరువును మోసే ఆత్మ ఏదైనా తన బరువును మోయమని ఇతరులను పిలిచినప్పుడు, దాని బరువు యొక్క రవ్వంత భాగాన్నయినా ఎత్తుకోవటానికి ఎవ్వడూ ముందుకు రాడు, అతడు ఎంత సమీపబంధువైనా సరే. (ప్రవక్తా) చూడకపోయినప్పటికీ తమ ప్రభువునకు భయపడేవారినీ, నమాజును స్థాపించేవారిని మాత్రమే నీవు హెచ్చరించగలవు. ఏ వ్యక్తి అయినా తన మేలు కొరకే పరిశుద్ధతను అవలంబిస్తాడు. అల్లాహ్ వైపునకే అందరూ మరలవలసి ఉన్నది. గుడ్డివాడూ, కళ్ళున్నవాడూ సమానులు కాలేరు. చీకట్లూ, వెలుగూ ఒకటి కావు. చల్లని నీడా, ఎండతాపమూ ఒకే విధంగా ఉండవు. బ్రతికి ఉన్నవారూ, చనిపోయిన వారూ సమానులు కాలేరు. అల్లాహ్ తనకు ఇష్టమైన వారికి వినిపింపజేస్తాడు. కాని (ప్రవక్తా) సమాధులలో ఖననమైన[1] వారికి నీవు వినిపించలేవు. నీవు కేవలం హెచ్చరిక చేసేవాడవు మాత్రమే.

1. అంటే, అల్లాహ్ అపారమైన శక్తిసామర్థ్యాలు కలవాడు. కనుక, ఆయన తలచుకుంటే, రాళ్లకు కూడ వినే శక్తిని ప్రసాదించగలడు. కాని ఎవరి అంతరాత్మలు నిర్జీవమైపోయాయో, వారి మనస్సులలోనికి తన సందేశాన్ని ప్రవేశింపజేయటం, ఎవరు మాటను వినటానికి సైతం సిద్ధంగా లేరో, వారి చెవిటి చెవులకు సత్య విషయాన్ని

إِنَّآ أَرْسَلْنٰكَ بِالْحَقِّ بَشِيْرًا وَّ نَذِيْرًا ؕ وَ اِنْ
مِّنْ اُمَّةٍ اِلَّا خَلَا فِيْهَا نَذِيْرٌ ﴿۲۴﴾ وَ اِنْ
يُّكَذِّبُوْكَ فَقَدْ كَذَّبَ الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ ۚ
جَآءَتْهُمْ رُسُلُهُمْ بِالْبَيِّنٰتِ وَ بِالزُّبُرِ وَبِالْكِتٰبِ
الْمُنِيْرِ ﴿۲۵﴾ ثُمَّ اَخَذْتُ الَّذِيْنَ كَفَرُوْا فَكَيْفَ
كَانَ نَكِيْرِ ﴿۲۶﴾ اَلَمْ تَرَ اَنَّ اللّٰهَ اَنْزَلَ مِنَ ع ۳ ۱۲ ۱۵
السَّمَآءِ مَآءً ۚ فَاَخْرَجْنَا بِهٖ ثَمَرٰتٍ مُّخْتَلِفًا
اَلْوَانُهَا ؕ وَمِنَ الْجِبَالِ جُدَدٌۢ بِيْضٌ وَّ حُمْرٌ
مُّخْتَلِفٌ اَلْوَانُهَا وَغَرَابِيْبُ سُوْدٌ ﴿۲۷﴾ وَ مِنَ
النَّاسِ وَ الدَّوَآبِّ وَ الْاَنْعَامِ مُخْتَلِفٌ اَلْوَانُهٗ
كَذٰلِكَ ؕ اِنَّمَا يَخْشَى اللّٰهَ مِنْ عِبَادِهِ
الْعُلَمٰٓؤُا ؕ اِنَّ اللّٰهَ عَزِيْزٌ غَفُوْرٌ ﴿۲۸﴾ اِنَّ
الَّذِيْنَ يَتْلُوْنَ كِتٰبَ اللّٰهِ وَ اَقَامُوا الصَّلٰوةَ وَ
اَنْفَقُوْا مِمَّا رَزَقْنٰهُمْ سِرًّا وَّعَلَانِيَةً يَّرْجُوْنَ
تِجَارَةً لَّنْ تَبُوْرَ ﴿۲۹﴾ لِيُوَفِّيَهُمْ اُجُوْرَهُمْ
وَيَزِيْدَهُمْ مِّنْ فَضْلِهٖ ؕ اِنَّهٗ غَفُوْرٌ شَكُوْرٌ ﴿۳۰﴾

మేము నిన్ను సత్యంతో పంపాము. శుభవార్త ఇచ్చే వానిగా, భయపెట్టేవానిగా జేసి. హెచ్చరిక చేసే వాడెవ్వడూ రాని జాతి ఏదీ లేదు. ఒకవేళ ఇప్పుడు ఈ ప్రజలు నిన్ను తిరస్కరిస్తున్నా రంటే, వీరికి పూర్వం గతించిన వారు కూడా తిరస్కరించారు. వారి వద్దకు వారి ప్రవక్తలు స్పష్టమైన ప్రమాణాలనూ, గ్రంథా లనూ, కాంతిమంతమైన మార్గదర్శక సూత్రాలు ఇచ్చే ఉద్గ్రం థాన్నీ తీసుకు వచ్చారు. తరువాత విశ్వసించని వారిని నేను పట్టుకున్నాను; చూడండి, నా శిక్ష ఎంత కఠినమైనదో.

**27 - 28** ఆకాశం నుండి అల్లాహ్ వర్షం కురిపించటాన్ని నీవు చూడటం లేదా? తరువాత దాని ద్వారా మేము రకరకాల రంగు రంగుల పండ్లను ఉత్పత్తి చేస్తాము. కొండలలో కూడా తెల్లని, ఎఱ్ఱని, కారునలుపు చారలు కనిపిస్తాయి, వాటి రంగులు వేర్వేరుగా ఉంటాయి. ఈ విధంగానే మానవుల, జంతువుల, పశువుల రంగులు కూడా భిన్నమైనవే. యథార్థ మేమిటంటే, అల్లాహ్ దాసులలో జ్ఞానులు మాత్రమే ఆయనకు భయపడతారు.[2] నిస్సందేహంగా అల్లాహ్ శక్తిమంతుడు, మన్నించేవాడూను.

**29 - 35** అల్లాహ్ గ్రంథాన్ని పారాయణం చేసేవారూ, నమాజును స్థాపించేవారూ, మేము వారికి ఇచ్చిన ఉపాధి నుండి బహిరంగం గానూ, రహస్యం గానూ ఖర్చు చేసేవారూ నిశ్చయంగా ఏమాత్రం నష్టం రాని వ్యాపారాన్ని కోరుకుంటున్నారు. (ఈ వ్యాపారంలో వారు తమ సర్వస్వాన్నీ ఎందుకు ధారపోశారంటే), అల్లాహ్ వారి ప్రతిఫలాలను పూర్తిగా వారికి ఇవ్వాలని, అదనంగా తన అనుగ్రహం నుండి ఇంకా వారికి ప్రసాదించాలని. నిస్సంశయంగా అల్లాహ్ క్షమించేవాడూ, విలువనిచ్చేవాడూను.

వినిపింపజేయటం, దైవప్రవక్తకు సాధ్యంకాని పని. సమంజసమైన విషయాన్ని చెవి యొగ్గి వినటానికి సుముఖంగా ఉన్నవారికి మాత్రమే ఆయన తన సందేశాన్ని వినిపించగలరు.

2. పుస్తకాలు చదివినంత మాత్రాన ఒకడు పండితుడు కాడు, దైవభీతి కలవాడే పండితుడు.

(ప్రవక్తా) మేము వహీ ద్వారా నీ వైపునకు పంపిన గ్రంథమే సత్యమైనది, దానికి పూర్వం వచ్చిన గ్రంథాలను ధ్రువీకరించేది. నిస్సందేహంగా అల్లాహ్ తన దాసుల స్థితిని బాగా ఎరిగిన వాడు, ప్రతిదానిపై దృష్టిని ఉంచేవాడు. తరువాత మేము (ఈ గ్రంథ వారసత్వం కోసం) మా దాసులలో నుండి మేము ఎన్నుకున్న వారినే ఈ గ్రంథానికి వారసులుగా చేశాము. ఇప్పుడు వారిలో ఒకడు తన ఆత్మకు అన్యాయం చేసుకుంటు న్నాడు. మరొకడు, మధ్యస్థంగా ఉంటున్నాడు, ఇంకొకడు అల్లాహ్ అనుమతితో పుణ్యకార్యాలలో ముందడుగు వేస్తు న్నాడు. ఇదే మహాఅనుగ్రహం. శాశ్వతంగా ఉండే ఉద్యాన వనాలలోకి వారు ప్రవేశిస్తారు. అక్కడ వారిని సువర్ణ కంకణా లతో, ముత్యాలతో అలంకరించటం జరుగుతుంది. అక్కడ వారు పట్టు వస్త్రాలు ధరిస్తారు. ఇలా అంటారు, "అల్లాహ్‌కు కృతజ్ఞతలు. ఆయన మా దుఃఖాన్ని తొలగించాడు. నిశ్చయంగా మా ప్రభువు క్షమించే వాడూ, విలువ ఇచ్చేవాడూను. ఆయన మమ్మల్ని తన అనుగ్రహం వల్ల శాశ్వత నివాస స్థలంలో నివసింపజేశాడు. ఇక ఇక్కడ మాకు ఏ కష్టమూ ఉండదు, ఏ అలసటా కలుగదు."

**36 - 37** అవిశ్వాసానికి పాల్పడిన వారికి నరకాగ్ని ఉన్నది. వారు చనిపోవాలనే తీర్పూ ఇవ్వబడదు, వారి నరక యాతనను ఏమాత్రం తగ్గించటమూ జరుగదు. ఇలా మేము అవిశ్వాసానికి పాల్పడే ప్రతి వ్యక్తికీ ప్రతిఫలం ఇస్తాము. వారు అక్కడ పెడబొబ్బలు పెడుతూ ఇలా అంటారు, "మా ప్రభూ! మమ్మల్ని ఇక్కడ నుండి బయటకు తియ్యి, మేము పూర్వం చేసిన పనులకు భిన్నంగా మంచి పనులు చేయటానికి." (వారికి ఇలా జవాబు ఇవ్వబడుతుంది) గుణపాఠం నేర్చుకో దలచినవాడు గుణపాఠం నేర్చుకోవటానికి సరిపడిన ఆయు ష్షును మేము మీకు ఇవ్వలేదా? మీ వద్దకు హెచ్చరిక చేసేవాడు కూడా వచ్చి ఉన్నాడు కదా! ఇక రుచి చూడండి (యాతనను). దుర్మార్గులకు ఇక్కడ సహాయం చేసేవాడెవ్వడూ లేదు.

وَ الَّذِیۡۤ اَوۡحَیۡنَاۤ اِلَیۡکَ مِنَ الۡکِتٰبِ ہُوَ الۡحَقُّ
مُصَدِّقًا لِّمَا بَیۡنَ یَدَیۡہِ ؕ اِنَّ اللّٰہَ بِعِبَادِہٖ
لَخَبِیۡرٌۢ بَصِیۡرٌ ﴿۳۱﴾ ثُمَّ اَوۡرَثۡنَا الۡکِتٰبَ الَّذِیۡنَ
اصۡطَفَیۡنَا مِنۡ عِبَادِنَا ۚ فَمِنۡہُمۡ ظَالِمٌ لِّنَفۡسِہٖ ۚ وَ
مِنۡہُمۡ مُّقۡتَصِدٌ ۚ وَ مِنۡہُمۡ سَابِقٌۢ بِالۡخَیۡرٰتِ
بِاِذۡنِ اللّٰہِ ؕ ذٰلِکَ ہُوَ الۡفَضۡلُ الۡکَبِیۡرُ ﴿ؕ۳۲﴾
جَنّٰتُ عَدۡنٍ یَّدۡخُلُوۡنَہَا یُحَلَّوۡنَ فِیۡہَا مِنۡ
اَسَاوِرَ مِنۡ ذَہَبٍ وَّ لُؤۡلُؤًا ۚ وَ لِبَاسُہُمۡ فِیۡہَا
حَرِیۡرٌ ﴿۳۳﴾ وَ قَالُوا الۡحَمۡدُ لِلّٰہِ الَّذِیۡۤ اَذۡہَبَ
عَنَّا الۡحَزَنَ ؕ اِنَّ رَبَّنَا لَغَفُوۡرٌ شَکُوۡرُۨ ﴿ۙ۳۴﴾
الَّذِیۡۤ اَحَلَّنَا دَارَ الۡمُقَامَۃِ مِنۡ فَضۡلِہٖ ۚ لَا
یَمَسُّنَا فِیۡہَا نَصَبٌ وَّ لَا یَمَسُّنَا فِیۡہَا لُغُوۡبٌ ﴿۳۵﴾
وَ الَّذِیۡنَ کَفَرُوۡا لَہُمۡ نَارُ جَہَنَّمَ ۚ لَا یُقۡضٰی
عَلَیۡہِمۡ فَیَمُوۡتُوۡا وَ لَا یُخَفَّفُ عَنۡہُمۡ مِّنۡ
عَذَابِہَا ؕ کَذٰلِکَ نَجۡزِیۡ کُلَّ کَفُوۡرٍ ﴿ۚ۳۶﴾ وَ ہُمۡ
یَصۡطَرِخُوۡنَ فِیۡہَا ۚ رَبَّنَاۤ اَخۡرِجۡنَا نَعۡمَلۡ صَالِحًا
غَیۡرَ الَّذِیۡ کُنَّا نَعۡمَلُ ؕ اَوَ لَمۡ نُعَمِّرۡکُمۡ مَّا
یَتَذَکَّرُ فِیۡہِ مَنۡ تَذَکَّرَ وَ جَآءَکُمُ النَّذِیۡرُ ؕ
فَذُوۡقُوۡا فَمَا لِلظّٰلِمِیۡنَ مِنۡ نَّصِیۡرٍ ﴿٪۳۷﴾ ع

اِنَّ اللّٰهَ عٰلِمُ غَيۡبِ السَّمٰوٰتِ وَالۡاَرۡضِ ؕ
اِنَّهٗ عَلِيۡمٌۢ بِذَاتِ الصُّدُوۡرِ ﴿۳۸﴾ هُوَ الَّذِيۡ
جَعَلَكُمۡ خَلٰٓئِفَ فِي الۡاَرۡضِ ؕ فَمَنۡ كَفَرَ فَعَلَيۡهِ
كُفۡرُهٗ ؕ وَلَا يَزِيۡدُ الۡكٰفِرِيۡنَ كُفۡرُهُمۡ عِنۡدَ
رَبِّهِمۡ اِلَّا مَقۡتًا ۚ وَلَا يَزِيۡدُ الۡكٰفِرِيۡنَ كُفۡرُهُمۡ
اِلَّا خَسَارًا ﴿۳۹﴾ قُلۡ اَرَءَيۡتُمۡ شُرَكَآءَكُمُ
الَّذِيۡنَ تَدۡعُوۡنَ مِنۡ دُوۡنِ اللّٰهِ ؕ اَرُوۡنِيۡ مَاذَا
خَلَقُوۡا مِنَ الۡاَرۡضِ اَمۡ لَهُمۡ شِرۡكٌ فِي
السَّمٰوٰتِ ۚ اَمۡ اٰتَيۡنٰهُمۡ كِتٰبًا فَهُمۡ عَلٰى بَيِّنَتٍ
مِّنۡهُ ۚ بَلۡ اِنۡ يَّعِدُ الظّٰلِمُوۡنَ بَعۡضُهُمۡ بَعۡضًا
اِلَّا غُرُوۡرًا ﴿۴۰﴾ اِنَّ اللّٰهَ يُمۡسِكُ السَّمٰوٰتِ
وَالۡاَرۡضَ اَنۡ تَزُوۡلَا ۚ وَلَئِنۡ زَالَتَاۤ اِنۡ
اَمۡسَكَهُمَا مِنۡ اَحَدٍ مِّنۡۢ بَعۡدِهٖ ؕ اِنَّهٗ كَانَ حَلِيۡمًا
غَفُوۡرًا ﴿۴۱﴾ وَاَقۡسَمُوۡا بِاللّٰهِ جَهۡدَ اَيۡمَانِهِمۡ
لَئِنۡ جَآءَهُمۡ نَذِيۡرٌ لَّيَكُوۡنُنَّ اَهۡدٰى مِنۡ
اِحۡدَى الۡاُمَمِ ۚ فَلَمَّا جَآءَهُمۡ نَذِيۡرٌ مَّا
زَادَهُمۡ اِلَّا نُفُوۡرَا ۙ ﴿۴۲﴾

**38 - 39** నిస్సందేహంగా అల్లాహ్ ఆకాశాలలోనూ, భూమిపైనా అగోచరముగా ఉన్న ప్రతి దానిని ఎరుగును. గుండెలలో దాగి ఉన్న రహస్యాలను సయితం ఆయన ఎరుగును. మిమ్మల్ని భూమిపై ఖలీఫాలుగా చేసినవాడు ఆయనేగా! ఇక ఎవడైనా అవిశ్వాసానికి పాల్పడితే, అతని అవిశ్వాసం సంకటమై అతని మీదనే ఉంటుంది. అవిశ్వాసుల అవిశ్వాసం వారి ప్రభువు యొక్క ఆగ్రహాన్ని వారిపై ఉగ్రతరం చేస్తుందే తప్ప వారికి ఏ వృద్ధినీ కలిగించదు. అవిశ్వాసులకు నష్టంలో పెరుగుదల తప్ప అభివృద్ధి ఏమీ ఉండదు.

**40 - 41** (ప్రవక్తా!) వారితో ఇలా అను, "అల్లాహ్‌ను కాదని మీరు వేడుకునే మీ భాగస్వాములను మీరు ఎప్పుడైనా చూశారా? వారు భూమిపై సృష్టించింది ఏమిటో నాకు చూపండి? లేక ఆకాశాలలో వారికున్న భాగ స్వామ్యం ఏమిటి?" (ఒకవేళ వారు చూపలేకపోతే, ఇలా అడుగు) మేము వారికి ఏదైనా పత్రాన్ని వ్రాసి ఇచ్చామా, దాని ఆధారంగా వారు (తమ ఈ షిర్క్ విషయంలో) స్పష్టమైన ఒక ప్రమాణం కలిగి ఉండటానికి? లేదు. అయితే ఈ దుర్మార్గులు ఒకరినొకరు కేవలం కుయుక్తులతో మోసగించుకుంటూ పోతున్నారు. యథార్థమేమిటంటే ఆకాశాలనూ, భూమిని (తమ స్థానాల నుండి) తొలగిపోకుండా ఆపి ఉంచినవాడు అల్లాహ్‌యే. ఒకవేళ అవి తొలగిపోతే, అల్లాహ్ తరువాత వాటిని నిలిపి ఉంచేవాడు మరొక డెవడూ లేడు. నిస్సందేహంగా అల్లాహ్ సహనశీలుడు, క్షమించేవాడూను.

**42 - 45** ఒకవేళ హెచ్చరిక చేసేవాడు తమ వద్దకు వచ్చి ఉన్నట్లయితే, తాము ప్రపంచంలోని ప్రతి జాతికంటె మిక్కిలి సన్మార్గగాములమై ఉండేవారము అని వారు కఠోరమైన ప్రమాణాలు చేసి అంటూ ఉండేవారు. కాని హెచ్చరిక జేసేవాడు వారి వద్దకు వచ్చినపుడు, అతని ఆగమనం వారిలో సత్యం నుండి పలాయనాన్ని తప్ప మరి దేనినీ అధికం చేయలేకపోయింది.

اسْتِكْبَارًا فِي الْأَرْضِ وَمَكْرَ السَّيِّئِ ۚ وَلَا
يَحِيقُ الْمَكْرُ السَّيِّئُ إِلَّا بِأَهْلِهِ ۚ فَهَلْ
يَنْظُرُونَ إِلَّا سُنَّتَ الْأَوَّلِينَ ۚ فَلَنْ تَجِدَ
لِسُنَّتِ اللَّهِ تَبْدِيلًا ۖ وَلَنْ تَجِدَ لِسُنَّتِ اللَّهِ
تَحْوِيلًا ﴿٤٣﴾ أَوَلَمْ يَسِيرُوا فِي الْأَرْضِ
فَيَنْظُرُوا كَيْفَ كَانَ عَاقِبَةُ الَّذِينَ مِنْ قَبْلِهِمْ
وَكَانُوا أَشَدَّ مِنْهُمْ قُوَّةً ۚ وَمَا كَانَ اللَّهُ
لِيُعْجِزَهُ مِنْ شَيْءٍ فِي السَّمَاوَاتِ وَلَا فِي
الْأَرْضِ ۚ إِنَّهُ كَانَ عَلِيمًا قَدِيرًا ﴿٤٤﴾ وَلَوْ
يُؤَاخِذُ اللَّهُ النَّاسَ بِمَا كَسَبُوا مَا تَرَكَ عَلَىٰ
ظَهْرِهَا مِنْ دَابَّةٍ وَلَٰكِنْ يُؤَخِّرُهُمْ إِلَىٰ أَجَلٍ
مُسَمًّى ۖ فَإِذَا جَاءَ أَجَلُهُمْ فَإِنَّ اللَّهَ كَانَ
بِعِبَادِهِ بَصِيرًا ﴿٤٥﴾ ع

వారు భూమిపై మరింత దురహంకారముతో తిరుగసాగారు, దుష్టపన్నాగాలు పన్నసాగారు. వాస్తవానికి దుష్ట పన్నాగాలు వాటిని పన్నేవారినే ముంచి వేస్తాయి. ఇక పూర్వపు జాతుల పట్ల అల్లాహ్ అవలంబించిన విధానాన్నే వారిపట్ల కూడా అవలంబించాలని వారు నిరీక్షిస్తున్నారా?

అలా అయితే, నీవు అల్లాహ్ విధానంలో మార్పును ఎంత మాత్రం చూడలేవు. అల్లాహ్ సంప్రదాయాన్ని దాని నిర్ణీత మార్గం నుండి ఏ శక్తీ మరల్చటాన్ని కూడా నీవు ఎన్నటికీ చూడలేవు. వారు భూమిపై ఎన్నడూ సంచరించి ఉండలేదా-వారికి పూర్వం గతించిన మరియు వారికంటే అత్యంత బలవంతులైన ప్రజలు ఎదుర్కొన్న పరిణామం ఎలాంటిదో వారికి కనిపించేందుకు? అల్లాహ్‌ను అశక్తుడుగా చేసే వస్తువు ఏదీ ఆకాశాలలోనూ లేదు, భూమిపైనా లేదు. ఆయన సర్వమూ ఎరిగినవాడు, సర్వమూ చేయగల సమర్థుడు. ఒకవేళ ఆయన ప్రజలను వారు చేసిన అకృత్యాలకుగాను పట్టుకుంటే, భూమిపై ఏ ప్రాణినీ సజీవంగా వదలిపెట్టేవాడు కాడు. కాని ఆయన వారికి ఒక నిర్ణీత కాలం వరకు గడువు ఇస్తున్నాడు. తరువాత వారి నిర్ణీత వ్యవధి పూర్తి అయినప్పుడు, అల్లాహ్‌యే స్వయంగా తన దాసులను చూసుకుంటాడు.

ఆయతులు 83 | **36. యాసీన్** | అవతరణ మక్కాలో

٣٦ سُوْرَةُ يٰسٓ مَكِّيَّةٌ ٤١

اٰياتها ٨٣ | ركوعاتها ٥

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

**1 - 6** యాసీన్. వివేక విలసితమైన ఖురాన్ సాక్షిగా! నీవు నిశ్చయముగా దైవప్రవక్తలలోని వాడవు; ఋజుమార్గంలో ఉన్నావు. (ఈ ఖురాన్) శక్తిమంతుడూ, కరుణామయుడూ అయినవాడు అవతరింపజేసినది; నీవు ఒక జాతిని హెచ్చరిం చేందుకు. దాని పూర్వీకులు హెచ్చరిక చేయబడని కారణంగా అశ్రద్ధకు గురిఅయి ఉన్నారు.

**7 - 11** వారిలో అనేకులు శిక్షా నిర్ణయానికి అర్హులయ్యే ఉన్నారు. కనుకనే వారు విశ్వసించటం లేదు.[1] మేము వారి మెడలలో పట్టాలు వేశాము, వాటివల్ల వారు గడ్డాల వరకు బంధించబడ్డారు. అందుకని వారు తలను ఎత్తి నిలుచున్నారు.[2] మేము వారి ముందు ఒక గోడనూ, వారి వెనుక మరొక గోడనూ నిలబెట్టాము. మేము వారిని (ఈ విధంగా) కప్పి వేశాము, ఇక వారికి ఏమీ తోచదు.[3] నీవు వారిని హెచ్చరించినా, హెచ్చరించకపోయినా వారికి ఒక్కటే; వారు విశ్వసించరు. నీవు హితబోధను అనుసరించేవాణ్ణి మాత్రమే, కరుణామయుడైన దేవుణ్ణి చూడకుండానే భయపడేవాణ్ణి మాత్రమే హెచ్చరించగలవు. అతనికి క్షమాభిక్షా, గొప్ప ప్రతిఫలమూ లభిస్తాయనే శుభవార్త అందించు.

**12** మేము నిశ్చయంగా ఒక రోజున మృతులను బ్రతికిస్తాము. వారు చేసే పనులన్నింటినీ మేము నమోదు చేస్తూనే ఉన్నాము. వారు తమ వెనుక విడిచివెళ్ళిన చిహ్నాలను కూడా మేము నమోదు చేస్తూ ఉన్నాము. ప్రతి విషయాన్నీ మేము ఒక స్పష్టమైన గ్రంథంలో వ్రాసిపెట్టాము.

يٰسٓ ۚ ۝١ وَ الْقُرْاٰنِ الْحَكِيْمِ ۝٢ ۙ اِنَّكَ لَمِنَ
الْمُرْسَلِيْنَ ۝٣ ۙ عَلٰى صِرَاطٍ مُّسْتَقِيْمٍ ۝٤ ؕ تَنْزِيْلَ
الْعَزِيْزِ الرَّحِيْمِ ۝٥ ۙ لِتُنْذِرَ قَوْمًا مَّآ اُنْذِرَ
اٰبَآؤُهُمْ فَهُمْ غٰفِلُوْنَ ۝٦ لَقَدْ حَقَّ الْقَوْلُ عَلٰٓى
اَكْثَرِهِمْ فَهُمْ لَا يُؤْمِنُوْنَ ۝٧ اِنَّا جَعَلْنَا فِيْٓ
اَعْنَاقِهِمْ اَغْلٰلًا فَهِيَ اِلَى الْاَذْقَانِ فَهُمْ
مُّقْمَحُوْنَ ۝٨ وَجَعَلْنَا مِنْۢ بَيْنِ اَيْدِيْهِمْ سَدًّا
وَّ مِنْ خَلْفِهِمْ سَدًّا فَاَغْشَيْنٰهُمْ فَهُمْ لَا
يُبْصِرُوْنَ ۝٩ وَسَوَآءٌ عَلَيْهِمْ ءَاَنْذَرْتَهُمْ اَمْ
لَمْ تُنْذِرْهُمْ لَا يُؤْمِنُوْنَ ۝١٠ اِنَّمَا تُنْذِرُ مَنِ
اتَّبَعَ الذِّكْرَ وَ خَشِيَ الرَّحْمٰنَ بِالْغَيْبِ ۚ
فَبَشِّرْهُ بِمَغْفِرَةٍ وَّ اَجْرٍ كَرِيْمٍ ۝١١ اِنَّا نَحْنُ
نُحْيِ الْمَوْتٰى وَ نَكْتُبُ مَا قَدَّمُوْا وَ اٰثَارَهُمْ ۟ؕ
وَكُلَّ شَيْءٍ اَحْصَيْنٰهُ فِيْٓ اِمَامٍ مُّبِيْنٍ ۝١٢ ع

وقف غفران | ع ١٢/١٨

1. దైవప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) సందేశం పట్ల మూర్ఖంగా, మొండితనంతో వ్యవహరించిన వారి ప్రస్తావన ఇది. వారు ఆయన మాటను విశ్వసించకూడదని నిశ్చయించుకున్నారు. వారి విషయం ఇలా చెప్పబడింది : "వారు శిక్షా నిర్ణయానికి అర్హులయ్యే ఉన్నారు. కనుకనే వారు విశ్వసించటం లేదు."

وقف لازم

وَاضۡرِبۡ لَهُمۡ مَّثَلًا اَصۡحٰبَ الۡقَرۡيَةِ ۘ اِذۡ
جَآءَهَا الۡمُرۡسَلُوۡنَ ۚ‏ ﴿١٣﴾ اِذۡ اَرۡسَلۡنَاۤ اِلَيۡهِمُ
اثۡنَيۡنِ فَكَذَّبُوۡهُمَا فَعَزَّزۡنَا بِثَالِثٍ فَقَالُوۡۤا اِنَّاۤ
اِلَيۡكُمۡ مُّرۡسَلُوۡنَ ﴿١٤﴾ قَالُوۡا مَاۤ اَنۡتُمۡ اِلَّا بَشَرٌ
مِّثۡلُنَا ۙ وَمَاۤ اَنۡزَلَ الرَّحۡمٰنُ مِنۡ شَىۡءٍ ۙ اِنۡ
اَنۡتُمۡ اِلَّا تَكۡذِبُوۡنَ ﴿١٥﴾ قَالُوۡا رَبُّنَا يَعۡلَمُ اِنَّاۤ
اِلَيۡكُمۡ لَمُرۡسَلُوۡنَ ﴿١٦﴾ وَمَا عَلَيۡنَاۤ اِلَّا الۡبَلٰغُ
الۡمُبِيۡنُ ﴿١٧﴾ قَالُوۡۤا اِنَّا تَطَيَّرۡنَا بِكُمۡ ۚ لَئِنۡ لَّمۡ
تَنۡتَهُوۡا لَنَرۡجُمَنَّكُمۡ وَلَيَمَسَّنَّكُمۡ مِّنَّا عَذَابٌ
اَلِيۡمٌ ﴿١٨﴾ قَالُوۡا طَآئِرُكُمۡ مَّعَكُمۡ ؕ اَئِنۡ
ذُكِّرۡتُمۡ ؕ بَلۡ اَنۡتُمۡ قَوۡمٌ مُّسۡرِفُوۡنَ ﴿١٩﴾ وَجَآءَ
مِنۡ اَقۡصَا الۡمَدِيۡنَةِ رَجُلٌ يَّسۡعٰى قَالَ يٰقَوۡمِ
اتَّبِعُوا الۡمُرۡسَلِيۡنَ ۙ ﴿٢٠﴾ اتَّبِعُوۡا مَنۡ لَّا يَسۡـَٔلُكُمۡ
اَجۡرًا وَّهُمۡ مُّهۡتَدُوۡنَ ﴿٢١﴾ وَمَا لِىَ لَاۤ اَعۡبُدُ
الَّذِىۡ فَطَرَنِىۡ وَاِلَيۡهِ تُرۡجَعُوۡنَ ﴿٢٢﴾

الجزء ٢٣

**13 - 15** ఉదాహరణగా వారికి ఆ పట్టణవాసుల గాథను వినిపించు; అక్కడకు దైవప్రవక్తలు వచ్చినప్పటి గాథను; మేము వారివద్దకు ఇద్దరు ప్రవక్తలను పంపాము. వారు ఆ ఇద్దరినీ అసత్యవాదులు అని తిరస్కరించారు. తరువాత మేము వారికి సహాయంగా మూడో అతన్ని పంపాము. వారందరూ, "మేము మీ వద్దకు దైవ ప్రవక్తలుగా పంపబడ్డాము" అని అన్నారు. పట్టణవాసులు ఇలా అన్నారు, "మీరు మా వంటి కొందరు మానవులు తప్ప మరేమీ కారు. కరుణామయుడైన దేవుడు ఏ విషయాన్నీ అవతరింపజేయలేదు, మీరు కేవలం అబద్ధం పలుకుతున్నారు."

**16 - 19** దైవప్రవక్తలు ఇలా అన్నారు, "మేము నిశ్చయంగా మీ వద్దకు దైవప్రవక్తలుగా పంపబడిన విషయాన్ని మా ప్రభువు ఎరుగును. స్పష్టంగా సందేశాన్ని అందజేయటం తప్ప మాపైని మరొక బాధ్యత ఏదీ లేదు. పట్టణవాసులు ఇలా అన్నారు, "మేము మిమ్మల్ని (మాకు) ఒక దుశ్శకునంగా పరిగణిస్తున్నాము. మీరు (ఈ పనిని) మానుకోకపోతే, మేము మిమ్మల్ని రాళ్లతో కొట్టి చంపేస్తాము. మీరు మా తరఫు నుండి అత్యంత బాధాకరమైన శిక్షను పొందుతారు." దానికి దైవప్రవక్తలు ఇలా అన్నారు: "మీ దుశ్శకునం స్వయంగా మీ వెంటనే ఉంది. మీకు హితబోధ చేయటంవల్లనేగా మీరు ఇలా మాట్లాడుతున్నారు? అసలు విషయం, మీరు హద్దులను అతిక్రమించారు."

**20 - 25** ఇంతలోనే పట్టణంలోని ఒక మారుమూల ప్రాంతం నుండి ఒక వ్యక్తి పరుగెత్తుకుంటూ వచ్చి ఇలా అన్నాడు: "నా జాతి ప్రజలారా! దైవప్రవక్తలను అనుసరించండి. మీ నుండి ఏ ప్రతిఫలమూ కోరనివారిని, సత్యమార్గంలో ఉన్న వారిని అనుసరించండి. ఎవరు నన్ను సృష్టించారో, ఎవరి వైపునకు మీరంతా మరలిపోనున్నారో, ఆయనను నేనెందుకు పూజించకూడదు?

2. "పట్టెడ" అంటే వారి మూర్ఖత్వానికి గుర్తు అని భావం. అది వారిని సత్యస్వీకారం పట్ల విముఖులుగా చేసింది. "గడ్డాల వరకు బంధించబడటం," 'తలను ఎత్తి నిలబడటం' అంటే, మెడ బిర్రబిగిసిఉండటం,అది వారి గర్వాహంకారాల ఫలం.

3. ముందు ఒక గోడ, వెనుక మరొక గోడ నిలబెట్టే దాని భావం ఏమిటంటే, వారు తమ గర్వాహంకారాల వలన, గత చరిత్ర నుండి ఏ గుణపాఠాన్నీ నేర్చుకోరు, భవిష్యత్తులో కలుగబోయే ఫలితాలను గురించి ఎన్నడూ ఆలోచించరు. వారి దురభిమానాలు నలువైపుల నుండి వారిని కప్పివేశాయి; వారి అపార్థాలు వారి కళ్ళకు గంతలు కట్టాయి. కనుక సౌజన్యశీలురకూ, పక్షపాతరహితులకూ గోచరించే యథార్థ విషయాలు వారికి కనిపించవు.

ءَاَتَّخِذُ مِنْ دُوْنِهٖۤ اٰلِهَةً اِنْ يُّرِدْنِ الرَّحْمٰنُ
بِضُرٍّ لَّا تُغْنِ عَنِّيْ شَفَاعَتُهُمْ شَيْئًا وَّ لَا
يُنْقِذُوْنِ ﴿۲۳﴾ اِنِّيْۤ اِذًا لَّفِيْ ضَلٰلٍ مُّبِيْنٍ ﴿۲۴﴾ اِنِّيْۤ
اٰمَنْتُ بِرَبِّكُمْ فَاسْمَعُوْنِ ﴿۲۵﴾ قِيْلَ ادْخُلِ
الْجَنَّةَ ؕ قَالَ يٰلَيْتَ قَوْمِيْ يَعْلَمُوْنَ ﴿۲۶﴾ بِمَا
غَفَرَ لِيْ رَبِّيْ وَجَعَلَنِيْ مِنَ الْمُكْرَمِيْنَ ﴿۲۷﴾ وَ مَاۤ
اَنْزَلْنَا عَلٰى قَوْمِهٖ مِنْۢ بَعْدِهٖ مِنْ جُنْدٍ مِّنَ
السَّمَآءِ وَ مَا كُنَّا مُنْزِلِيْنَ ﴿۲۸﴾ اِنْ كَانَتْ اِلَّا
صَيْحَةً وَّاحِدَةً فَاِذَا هُمْ خٰمِدُوْنَ ﴿۲۹﴾ يٰحَسْرَةً
عَلَى الْعِبَادِ ۚ مَا يَاْتِيْهِمْ مِّنْ رَّسُوْلٍ اِلَّا كَانُوْا
بِهٖ يَسْتَهْزِءُوْنَ ﴿۳۰﴾ اَلَمْ يَرَوْا كَمْ اَهْلَكْنَا
قَبْلَهُمْ مِّنَ الْقُرُوْنِ اَنَّهُمْ اِلَيْهِمْ لَا
يَرْجِعُوْنَ ﴿۳۱﴾ وَ اِنْ كُلٌّ لَّمَّا جَمِيْعٌ لَّدَيْنَا
مُحْضَرُوْنَ ﴿۳۲﴾ وَاٰيَةٌ لَّهُمُ الْاَرْضُ الْمَيْتَةُ ۖۚ
اَحْيَيْنٰهَا وَ اَخْرَجْنَا مِنْهَا حَبًّا فَمِنْهُ
يَاْكُلُوْنَ ﴿۳۳﴾ وَجَعَلْنَا فِيْهَا جَنّٰتٍ مِّنْ نَّخِيْلٍ
وَّاَعْنَابٍ وَّ فَجَّرْنَا فِيْهَا مِنَ الْعُيُوْنِ ﴿۳۴﴾
لِيَاْكُلُوْا مِنْ ثَمَرِهٖ ۙ وَ مَا عَمِلَتْهُ اَيْدِيْهِمْ ؕ
اَفَلَا يَشْكُرُوْنَ ﴿۳۵﴾ سُبْحٰنَ الَّذِيْ خَلَقَ
الْاَزْوَاجَ كُلَّهَا مِمَّا تُنْۢبِتُ الْاَرْضُ وَمِنْ
اَنْفُسِهِمْ وَ مِمَّا لَا يَعْلَمُوْنَ ﴿۳۶﴾

وقف غفران

ع ۲ ۲۰

ఆయనను కాదని నేను ఇతరులను ఆరాధ్యులుగా చేసుకోవాలా? వాస్తవానికి ఒకవేళ కరుణామయుడైన దేవుడు నాకేదైనా నష్టం కలిగించదలిస్తే నాకు వారి సిఫారసూ ఏ విధంగానూ ఉపయోగపడదు, వారు నన్ను విడిపించనూ లేరు. ఒకవేళ నేను అలాచేస్తే, స్పష్టమైన మార్గభ్రష్టత్వానికి గురి అవుతాను. నేను మీ ప్రభువును విశ్వసించాను. కనుక మీరు కూడా నా మాట వినండి."

**26 - 27** (చివరకు వారు అతన్ని హత్య చేశారు) ఆ వ్యక్తితో, "స్వర్గంలో ప్రవేశించు" అని అనబడింది. అతను ఇలా అన్నాడు: "నా ప్రభువు ఏ విషయాన్నిబట్టి నన్ను క్షమించి, గౌరవనీయులలోకి ప్రవేశింపజేశాడో, నా జాతి వారికి తెలిస్తే ఎంత బాగుండును!"

**28 - 32** ఆ తరువాత అతని జాతి మీదకు మేము ఆకాశం నుండి ఏ సైన్యాన్నీ దించలేదు. అసలు సైన్యాన్ని పంపే అవసరం మాకు లేదు. కేవలం ఒక ప్రేలుడు మాత్రమే సంభవించింది. అంతే వారంతా ఒక్క సారిగా ఆరిపోయారు. దాసుల స్థితి కడు శోచనీయం. వారి వద్దకు ఏ దైవప్రవక్త వచ్చినా, వారు అతన్ని ఎగతాళే చేశారు. వారికి పూర్వం మేము ఎన్నో జాతులను నాశనం చేసిన విషయాన్ని వారు చూడలేదా? తరువాత అవి మళ్ళీ ఎన్నడూ వారి వద్దకు తిరిగి రాని విషయాన్ని కూడా వారు గమనించలేదా? వారందరూ ఒకరోజు మా ముందు హాజరు పరచబడవలసి ఉన్నది.

**33 - 36** వారికి మృతభూమి ఒక సూచన. మేము దానికి ప్రాణం పోశాము. దాని నుండి మీరు తినే ధాన్యం ఉత్పత్తి చేశాము. మేము దానిలో ఖర్జూరం, ద్రాక్ష తోటలను పెంచాము. దానిలో నుండి ఊటలు చిమ్మేలా చేశాము, వారు దాని ఫలాలను తినాలని. ఇదంతా వారి చేతులు సృష్టించింది కాదు కదా! అలాంటప్పుడు వారు కృతజ్ఞతలు తెలుపరా? అన్ని రకాల జంటలను సృష్టించిన ఆయన పరిశుద్ధుడు. అవి భూమిలో నుండి పుట్టే వృక్షరాసులలోనివైనా సరే లేదా స్వయంగా వారి జాతి (అంటే మానవులు)లో నుండి అయినా సరే లేదా వారు అసలే ఎరుగని వస్తువులలో నుండి అయినాసరే.

وَ اٰيَةٌ لَّهُمُ الَّيۡلُ ۖۚ نَسۡلَخُ مِنۡهُ النَّهَارَ فَاِذَا هُمۡ
مُّظۡلِمُوۡنَ ۙ٣٧ وَ الشَّمۡسُ تَجۡرِيۡ لِمُسۡتَقَرٍّ لَّهَا ؕ
ذٰلِكَ تَقۡدِيۡرُ الۡعَزِيۡزِ الۡعَلِيۡمِ ؕ٣٨ وَ الۡقَمَرَ
قَدَّرۡنٰهُ مَنَازِلَ حَتّٰى عَادَ كَالۡعُرۡجُوۡنِ
الۡقَدِيۡمِ ٣٩ لَا الشَّمۡسُ يَنۡۢبَغِيۡ لَهَاۤ اَنۡ تُدۡرِكَ
الۡقَمَرَ وَ لَا الَّيۡلُ سَابِقُ النَّهَارِ ؕ وَ كُلٌّ فِيۡ
فَلَكٍ يَّسۡبَحُوۡنَ ٤٠ وَ اٰيَةٌ لَّهُمۡ اَنَّا حَمَلۡنَا
ذُرِّيَّتَهُمۡ فِي الۡفُلۡكِ الۡمَشۡحُوۡنِ ۙ٤١ وَ خَلَقۡنَا لَهُمۡ
مِّنۡ مِّثۡلِهٖ مَا يَرۡكَبُوۡنَ ٤٢ وَ اِنۡ نَّشَاۡ نُغۡرِقۡهُمۡ
فَلَا صَرِيۡخَ لَهُمۡ وَ لَا هُمۡ يُنۡقَذُوۡنَ ۙ٤٣ اِلَّا
رَحۡمَةً مِّنَّا وَ مَتَاعًا اِلٰى حِيۡنٍ ٤٤ وَ اِذَا قِيۡلَ
لَهُمُ اتَّقُوۡا مَا بَيۡنَ اَيۡدِيۡكُمۡ وَ مَا خَلۡفَكُمۡ
لَعَلَّكُمۡ تُرۡحَمُوۡنَ ٤٥ وَ مَا تَاۡتِيۡهِمۡ مِّنۡ اٰيَةٍ مِّنۡ
اٰيٰتِ رَبِّهِمۡ اِلَّا كَانُوۡا عَنۡهَا مُعۡرِضِيۡنَ ٤٦ وَ اِذَا
قِيۡلَ لَهُمۡ اَنۡفِقُوۡا مِمَّا رَزَقَكُمُ اللّٰهُ ۙ قَالَ
الَّذِيۡنَ كَفَرُوۡا لِلَّذِيۡنَ اٰمَنُوۡۤا اَنُطۡعِمُ مَنۡ لَّوۡ
يَشَآءُ اللّٰهُ اَطۡعَمَهٗۤ ۖۚ اِنۡ اَنۡتُمۡ اِلَّا فِيۡ ضَلٰلٍ
مُّبِيۡنٍ ٤٧

**37 - 40** వారికి, రాత్రి మరొక సూచన. మేము దానిపై నుండి పగలును తొలగించినప్పుడు వారిని చీకటి ఆవరిస్తుంది. ఇక సూర్యుడు - అతడు తన నిజస్థానం దిశగా పయనిస్తున్నాడు. ఇది మహా శక్తిమంతుడూ, గొప్ప జ్ఞానీ అయిన దేవుడు నిర్దేశించిన నియమావళి. ఇక చంద్రుడు, అతడి కొరకు మేము దశలను నిర్దేశించాము. వాటిని దాటుకుంటూ వెళ్లి, చివరకు అతడు మళ్లీ ఎండిన ఖర్జూరపు కొమ్మ మాదిరిగా మారిపోతాడు. చంద్రుణ్ణి పట్టుకోవటం సూర్యుడి తరం కాదు. అదేవిధంగా రాత్రి, పగలును దాటి పోజాలదు. అవన్నీ వేర్వేరు కక్ష్యలలో తేలియాడుతూ ఉన్నాయి.

**41 - 44** వారికి ఇది కూడా ఒక సూచనే. మేము వారి సంతతిని నిండు నావలోకి[4] ఎక్కించాము, తరువాత అటువంటి నావలనే వారికొరకు ఎన్నో సృజించాము. వాటిలో వారు ప్రయాణం చేస్తున్నారు. మేము తలచుకుంటే వారిని ముంచి వేయగలము. అప్పుడు వారి మొర ఆలకించేవాడెవ్వడూ ఉండడు. ఏ విధంగానూ వారు రక్షింపబడలేరు. కేవలం మా అనుగ్రహమే వారిని గట్టెక్కించి ఒక ప్రత్యేక గడువు వరకు జీవితాన్ని అనుభవించే అవకాశాన్ని కలిగిస్తుంది.

**45 - 47** మీకు ముందు రాబోతున్న పరిణామం నుండి, మీకు పూర్వం జరిగిన పరిణామం నుండి మిమ్మల్ని మీరు కాపాడుకొనండి. బహుశా మీపై దయచూపటం జరుగుతుంది అని వారితో అన్నపుడు (వారు వినీ విననట్లు వెళ్లిపోతారు). వారి ముందుకు వారి ప్రభువు సూచనలలోని ఏ సూచన వచ్చినా దానిపట్ల వారు ఏమాత్రం శ్రద్ధ వహించరు. ఇంకా, అల్లాహ్, మీకు ప్రసాదించిన ఉపాధి నుండి కొంత అల్లాహ్ మార్గంలో కూడా ఖర్చుపెట్టండి అని వారికి చెప్పినపుడు, తిరస్కరించేవారు విశ్వసించే వారితో, "అల్లాహ్ తలిస్తే తానే స్వయంగా ఆహారమివ్వగల వారికి మేము ఆహారమివ్వాలా? మీరు పూర్తిగా మార్గం తప్పిపోయారు" అని అంటారు.

4. నావ అంటే దైవప్రవక్త నూహ్ (అస్సలామ్) నావ అని భావం.

**48 - 53** వారు "ప్రళయం గురించిన ఈ బెదిరింపు అసలు ఎప్పుడు నెరవేరుతుంది? నీవు సత్యవంతుడవయితే చెప్పు?" అని అడుగుతారు. వాస్తవానికి వారు దేనికొరకు నిరీక్షిస్తున్నారో, అది కేవలం ఒక ప్రేలుడు మాత్రమే. అది వారిని అకస్మాత్తుగా పట్టుకుంటుంది; అప్పుడు వారు (తమ ప్రాపంచిక వ్యవహారాలను గురించి) వివాదపడుతూ ఉంటారు. ఆ సమయంలో వారు మరణ శాసనం సయితమూ వ్రాయలేరు. తమ ఇళ్లకు తిరిగి పోనూ లేరు. ఆ తరువాత ఒక శంఖం ఊదబడుతుంది. అప్పుడు వారు హఠాత్తుగా తమ ప్రభువు ముందు హాజరయ్యేందుకు తమ సమాధుల నుండి బయటికి వస్తారు. భయాందోళనలతో వారు "అరే, మనల్ని మన పడకల నుండి లేపి ఎవరు నిలబెట్టారు?" అని అంటారు. "ఇది దయామయుడైన దేవుడు వాగ్దానం చేసిన విషయమే. దైవప్రవక్తల మాట పూర్తిగా నిజమే"[5] అది భయంకరమైన ఒక ధ్వని మాత్రమే. దానితో అందరూ మా ముందు హాజరు పరచబడతారు.

**54 - 64** ఈనాడు ఎవరికీ రవ్వంత అన్యాయమైనా జరగదు. మీరు చేస్తూ ఉండిన కర్మల ప్రకారమే మీకు ప్రతిఫలం ఇవ్వబడుతుంది–ఈనాడు స్వర్గవాసులు సుఖాలు అనుభవించటంలో నిమగ్నులై ఉంటారు. వారూ, వారి సతీమణులూ చల్లని నీడలలో, మెత్తని పీఠాలపై విశ్రాంతి తీసుకుంటూ ఉంటారు. వారు తినటానికి, త్రాగటానికీ రుచికరమైన సకల పదార్థాలు అక్కడ ఉంటాయి. వారు కోరేదల్లా వారి కొరకు సిద్ధంగా ఉంటుంది. కారుణ్య ప్రభువు తరపు నుండి వారికి సలామ్ (శాంతి వచనం) చెప్పబడుతుంది - అపరాధులారా! ఈనాడు మీరు వేరు అయిపొండి. ఆదమ్ సంతానమా! నేను మీకు ఉపదేశించలేదా, సైతానుకు దాస్యం చెయ్యవద్దని, వాడు మీకు బహిరంగ శత్రువని, నా దాస్యమే చెయ్యండి అని, ఇదే సరైన మార్గమని? కాని, దీని తరువాత కూడా వాడు మీలోని ఒక పెద్ద వర్గాన్ని అపమార్గం పట్టించాడు. మీకు బుద్ధిలేకుండా పోయిందా? భయపడండి అని మీకు చెబుతూ ఉండిన నరకం ఇదే. ప్రపంచంలో మీరు పాల్పడిన అవిశ్వాసానికి ఫలితంగా ఇపుడు దీనికి ఇంధనం అయిపొండి.

وَ يَقُوْلُوْنَ مَتٰى هٰذَا الْوَعْدُ اِنْ كُنْتُمْ
صٰدِقِيْنَ ﴿۴۸﴾ مَا يَنْظُرُوْنَ اِلَّا صَيْحَةً وَّاحِدَةً
تَاْخُذُهُمْ وَ هُمْ يَخِصِّمُوْنَ ﴿۴۹﴾ فَلَا يَسْتَطِيْعُوْنَ
تَوْصِيَةً وَّلَآ اِلٰٓى اَهْلِهِمْ يَرْجِعُوْنَ ﴿۵۰﴾ وَ نُفِخَ
فِى الصُّوْرِ فَاِذَا هُمْ مِّنَ الْاَجْدَاثِ اِلٰى رَبِّهِمْ
يَنْسِلُوْنَ ﴿۵۱﴾ قَالُوْا يٰوَيْلَنَا مَنْۢ بَعَثَنَا مِنْ
مَّرْقَدِنَا ۜ هٰذَا مَا وَعَدَ الرَّحْمٰنُ وَ صَدَقَ
الْمُرْسَلُوْنَ ﴿۵۲﴾ اِنْ كَانَتْ اِلَّا صَيْحَةً وَّاحِدَةً
فَاِذَا هُمْ جَمِيْعٌ لَّدَيْنَا مُحْضَرُوْنَ ﴿۵۳﴾ فَالْيَوْمَ لَا
تُظْلَمُ نَفْسٌ شَيْـًٔا وَّ لَا تُجْزَوْنَ اِلَّا مَا كُنْتُمْ
تَعْمَلُوْنَ ﴿۵۴﴾ اِنَّ اَصْحٰبَ الْجَنَّةِ الْيَوْمَ فِىْ
شُغُلٍ فٰكِهُوْنَ ﴿۵۵﴾ هُمْ وَ اَزْوَاجُهُمْ فِىْ ظِلٰلٍ
عَلَى الْاَرَآئِكِ مُتَّكِـُٔوْنَ ﴿۵۶﴾ لَهُمْ فِيْهَا فَاكِهَةٌ
وَّلَهُمْ مَّا يَدَّعُوْنَ ﴿۵۷﴾ سَلٰمٌ قَوْلًا مِّنْ رَّبٍّ
رَّحِيْمٍ ﴿۵۸﴾ وَامْتَازُوا الْيَوْمَ اَيُّهَا الْمُجْرِمُوْنَ ﴿۵۹﴾
اَلَمْ اَعْهَدْ اِلَيْكُمْ يٰبَنِىْٓ اٰدَمَ اَنْ لَّا تَعْبُدُوا
الشَّيْطٰنَ اِنَّهٗ لَكُمْ عَدُوٌّ مُّبِيْنٌ ﴿۶۰﴾ وَّ اَنِ
اعْبُدُوْنِىْ هٰذَا صِرَاطٌ مُّسْتَقِيْمٌ ﴿۶۱﴾ وَلَقَدْ
اَضَلَّ مِنْكُمْ جِبِلًّا كَثِيْرًا اَفَلَمْ تَكُوْنُوْا
تَعْقِلُوْنَ ﴿۶۲﴾ هٰذِهٖ جَهَنَّمُ الَّتِىْ كُنْتُمْ
تُوْعَدُوْنَ ﴿۶۳﴾ اِصْلَوْهَا الْيَوْمَ بِمَا كُنْتُمْ تَكْفُرُوْنَ ﴿۶۴﴾

وقف منزل
وقف غفران

**65** ఈనాడు మేము వారి నోళ్లు మూయిస్తాము. వారు ప్రపంచంలో ఏమేమి సంపాదిస్తూ ఉండేవారో వారి చేతులు మాకు చెబుతాయి, వారి కాళ్లు సాక్ష్యమిస్తాయి.

**66 - 68** మేము తలచుకుంటే, వారి కళ్లను మూసివేయగలం, అప్పుడు వారిని దారివైపునకు పరుగిడి చూడమనండి. వారికి దారి ఎలా కనిపిస్తుంది? మేము తలచుకుంటే వారిని వారి స్థానంలోనే కదలకుండా ఉంచగలం. ఇక వారు ముందుకూ నడవలేరు, వెనుకకూ తిరగలేరు. మేము దీర్ఘాయుష్షునిచ్చే, వ్యక్తి స్వరూపాన్నే మార్చివేస్తాము. (ఈ పరిస్థితులను చూసైనా) వారికి బుద్ధి రాదేమిటి?

**69 - 70** మేము అతనికి (ఈ ప్రవక్తకు) కవిత్వం నేర్పలేదు, కవిత్వం అతనికి శోభించదు కూడా. ఇది ఒక హితబోధ మాత్రమే, స్పష్టంగా పఠనీయ మైన గ్రంథం మాత్రమే- అతను బ్రతికి ఉన్న ప్రతి మనిషినీ హెచ్చరించేందుకూ; తిరస్కారులకు వ్యతిరేకంగా అభియోగం స్థాపించబడేందుకు.

**71 - 76** మా చేతులు రూపకల్పన చేసిన దాని నుండి ప్రజలకై మేము పశువులను సృజించాము, ఇపుడు వారు వాటికి యజమానులయ్యారు. వారు ఈ విషయాన్ని గమనించరా? మేము వాటిని వారికి ఇలా స్వాధీనపరిచాము- వాటిలో కొన్నిటిపై వారు స్వారి చేస్తారు, కొన్నిటి మాంసాన్ని తింటారు. వాటిలో వారికి రకరకాల ప్రయోజనాలూ పానీయాలూ ఉన్నాయి. అయినా వారు కృతజ్ఞత చూపరేమిటి? ఇవన్నీ వాస్తవాలైనప్పటికీ వారు అల్లాహ్‌ను కాదని ఇతరులను దేవుళ్ళుగా చేసుకున్నారు. తమకు సహాయం చేయటం జరుగుతుందని వారు ఆశలు పెట్టుకున్నారు. కాని వారు వారికి ఏ సహాయమూ చేయలేరు. అయినా ప్రజలు వారి కొరకు సైన్యం మాదిరిగా సర్వసన్నద్ధులై ఉన్నారు. సరే కానీ నీవు మాత్రం వారు కల్పిస్తున్న మాటలకు బాధపడకు. వారి రహస్య విషయాలను బహిరంగ విషయాలనూ అన్నింటినీ మేము ఎరుగుదుము.

اَلْيَوْمَ نَخْتِمُ عَلٰۤى اَفْوَاهِهِمْ وَ تُكَلِّمُنَاۤ اَيْدِيْهِمْ
وَ تَشْهَدُ اَرْجُلُهُمْ بِمَا كَانُوْا يَكْسِبُوْنَ ﴿٦٥﴾ وَ
لَوْ نَشَآءُ لَطَمَسْنَا عَلٰۤى اَعْيُنِهِمْ فَاسْتَبَقُوا
الصِّرَاطَ فَاَنّٰى يُبْصِرُوْنَ ﴿٦٦﴾ وَ لَوْ نَشَآءُ
لَمَسَخْنٰهُمْ عَلٰى مَكَانَتِهِمْ فَمَا اسْتَطَاعُوْا مُضِيًّا وَّ
لَا يَرْجِعُوْنَ ﴿٦٧﴾ وَمَنْ نُّعَمِّرْهُ نُنَكِّسْهُ فِى ع ٤
الْخَلْقِ ؕ اَفَلَا يَعْقِلُوْنَ ﴿٦٨﴾ وَ مَا عَلَّمْنٰهُ الشِّعْرَ
وَ مَا يَنْۢبَغِيْ لَهٗ ؕ اِنْ هُوَ اِلَّا ذِكْرٌ وَّ قُرْاٰنٌ
مُّبِيْنٌ ﴿٦٩﴾ لِّيُنْذِرَ مَنْ كَانَ حَيًّا وَّيَحِقَّ الْقَوْلُ
عَلَى الْكٰفِرِيْنَ ﴿٧٠﴾ اَوَلَمْ يَرَوْا اَنَّا خَلَقْنَا لَهُمْ
مِّمَّا عَمِلَتْ اَيْدِيْنَاۤ اَنْعَامًا فَهُمْ لَهَا
مٰلِكُوْنَ ﴿٧١﴾ وَ ذَلَّلْنٰهَا لَهُمْ فَمِنْهَا رَكُوْبُهُمْ وَ
مِنْهَا يَاْكُلُوْنَ ﴿٧٢﴾ وَ لَهُمْ فِيْهَا مَنَافِعُ
وَمَشَارِبُ ؕ اَفَلَا يَشْكُرُوْنَ ﴿٧٣﴾ وَ اتَّخَذُوْا مِنْ
دُوْنِ اللّٰهِ اٰلِهَةً لَّعَلَّهُمْ يُنْصَرُوْنَ ﴿٧٤﴾ لَا
يَسْتَطِيْعُوْنَ نَصْرَهُمْ ۙ وَهُمْ لَهُمْ جُنْدٌ
مُّحْضَرُوْنَ ﴿٧٥﴾ فَلَا يَحْزُنْكَ قَوْلُهُمْ ۘ اِنَّا نَعْلَمُ وقف لازم
مَا يُسِرُّوْنَ وَ مَا يُعْلِنُوْنَ ﴿٧٦﴾

اَوَلَمۡ یَرَ الۡاِنۡسَانُ اَنَّا خَلَقۡنٰهُ مِنۡ نُّطۡفَةٍ فَاِذَا
هُوَ خَصِیۡمٌ مُّبِیۡنٌ ﴿۷۷﴾ وَ ضَرَبَ لَنَا مَثَلًا وَّ
نَسِیَ خَلۡقَهٗ ؕ قَالَ مَنۡ یُّحۡیِ الۡعِظَامَ وَ هِیَ
رَمِیۡمٌ ﴿۷۸﴾ قُلۡ یُحۡیِیۡهَا الَّذِیۡۤ اَنۡشَاَهَاۤ اَوَّلَ
مَرَّةٍ ؕ وَ هُوَ بِكُلِّ خَلۡقٍ عَلِیۡمُۨ ﴿۷۹﴾ الَّذِیۡ جَعَلَ
لَكُمۡ مِّنَ الشَّجَرِ الۡاَخۡضَرِ نَارًا فَاِذَاۤ اَنۡتُمۡ
مِّنۡهُ تُوۡقِدُوۡنَ ﴿۸۰﴾ اَوَ لَیۡسَ الَّذِیۡ خَلَقَ
السَّمٰوٰتِ وَ الۡاَرۡضَ بِقٰدِرٍ عَلٰۤی اَنۡ یَّخۡلُقَ
مِثۡلَهُمۡ ؕ بَلٰی ٭ وَ هُوَ الۡخَلّٰقُ الۡعَلِیۡمُ ﴿۸۱﴾ اِنَّمَاۤ
اَمۡرُهٗۤ اِذَاۤ اَرَادَ شَیۡـًٔا اَنۡ یَّقُوۡلَ لَهٗ كُنۡ
فَیَكُوۡنُ ﴿۸۲﴾ فَسُبۡحٰنَ الَّذِیۡ بِیَدِهٖ مَلَكُوۡتُ
كُلِّ شَیۡءٍ وَّ اِلَیۡهِ تُرۡجَعُوۡنَ ﴿۸۳﴾

وقف غفران

**77 - 83** మేము మానవుడిని వీర్య బిందువుతో సృజించిన విషయం అతను చూడటం లేదా? అయినా అతడు బహిరంగ ప్రత్యర్థిగా నిలబడ్డాడు. ఇపుడు అతడు మాకు పోలికలు కల్పిస్తున్నాడు, తన పుట్టుకనే మరిచిపోతున్నాడు. పైగా, శిథిలమై పోయిన ఈ ఎముకలకు తిరిగి ఎవరు జీవం పోస్తారు? అని వాదిస్తున్నాడు. అతడికి ఇలా చెప్పు, "మొదట వాటిని సృష్టించిన వాడే మళ్లీ వాటికి జీవం పోస్తాడు." సృష్టికి సంబంధించిన ప్రతి విషయమూ ఆయనకు తెలుసు. మీకై ఆయనే పచ్చని వృక్షాల నుండి అగ్నిని సృష్టించాడు. మీరు దానితో కుంపట్లు రాజేసుకుంటారు. ఆకాశాలనూ భూమినీ సృష్టించగలిగిన వాడు వీరిలాంటి వారిని పుట్టించలేడా? ఎందుకు చేయలేడు, ఆయన మహా నిపుణుడైన సృష్టికర్త అయినప్పుడు? ఆయన ఏదైనా చేయదలచుకున్నప్పుడు, దాన్ని కేవలం "అయిపో" అని మాత్రమే ఆజ్ఞాపిస్తాడు. అంతే అది అయిపోతుంది. ప్రతి విషయానికి సంబంధించిన సర్వాధికారాలు తన చేతిలో ఇముడ్చుకున్న ఆయన ఎంతో పరిశుద్ధుడు. ఆయన సన్నిధికే మీరంతా మరలిపోవలసి ఉంది.

5. ఈ సమాధానాన్ని విశ్వాసులు వారికి ఇచ్చి ఉండవచ్చు. కొంతసేపటి తరువాత ఏ దినం గురించి దైవప్రవక్తలు మాకు సమాచారం ఇస్తూ ఉండేవారో, ఆ దినం ఈ దినమేనని వారు తమంతట తామే గ్రహించి ఉండవచ్చు, దైవదూతలు వారికి ఈ సమాధానం ఇచ్చి ఉండవచ్చు, లేదా ప్రళయదినం నాటి స్థితి వారికి ఈ విషయం తెలిపి ఉండవచ్చు.

آیاتها ١٨٢ | ٣٧ سُورَةُ الصّٰفّٰتِ مَكِّيَّةٌ ٥٦ | ركوعاتها ٥

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○

وَالصّٰٓفّٰتِ صَفًّا ۙ﴿۱﴾ فَالزّٰجِرٰتِ زَجۡرًا ۙ﴿۲﴾ فَالتّٰلِيٰتِ
ذِكۡرًا ۙ﴿۳﴾ اِنَّ اِلٰهَكُمۡ لَوَاحِدٌ ؕ﴿۴﴾ رَبُّ السَّمٰوٰتِ
وَالۡاَرۡضِ وَمَا بَيۡنَهُمَا وَرَبُّ الۡمَشَارِقِ ؕ﴿۵﴾
اِنَّا زَيَّنَّا السَّمَآءَ الدُّنۡيَا بِزِيۡنَةِ ۨالۡكَوَاكِبِ ۙ﴿۶﴾
وَحِفۡظًا مِّنۡ كُلِّ شَيۡطٰنٍ مَّارِدٍ ۚ﴿۷﴾ لَا يَسَّمَّعُوۡنَ
اِلَى الۡمَلَاِ الۡاَعۡلٰى وَيُقۡذَفُوۡنَ مِنۡ كُلِّ
جَانِبٍ ۖ﴿۸﴾ دُحُوۡرًا وَّلَهُمۡ عَذَابٌ وَّاصِبٌ ۙ﴿۹﴾
اِلَّا مَنۡ خَطِفَ الۡخَطۡفَةَ فَاَتۡبَعَهٗ شِهَابٌ
ثَاقِبٌ ﴿۱۰﴾ فَاسۡتَفۡتِهِمۡ اَهُمۡ اَشَدُّ خَلۡقًا اَمۡ مَّنۡ
خَلَقۡنَا ؕ اِنَّا خَلَقۡنٰهُمۡ مِّنۡ طِيۡنٍ لَّازِبٍ ﴿۱۱﴾ بَلۡ
عَجِبۡتَ وَيَسۡخَرُوۡنَ ۖ﴿۱۲﴾ وَاِذَا ذُكِّرُوۡا لَا
يَذۡكُرُوۡنَ ۖ﴿۱۳﴾ وَاِذَا رَاَوۡا اٰيَةً يَّسۡتَسۡخِرُوۡنَ ۖ﴿۱۴﴾
وَقَالُوۡۤا اِنۡ هٰذَاۤ اِلَّا سِحۡرٌ مُّبِيۡنٌ ۖۚ﴿۱۵﴾ ءَاِذَا
مِتۡنَا وَكُنَّا تُرَابًا وَّعِظَامًا ءَاِنَّا لَمَبۡعُوۡثُوۡنَ ۙ﴿۱۶﴾
اَوَ اٰبَآؤُنَا الۡاَوَّلُوۡنَ ؕ﴿۱۷﴾ قُلۡ نَعَمۡ وَاَنۡتُمۡ
دَاخِرُوۡنَ ۚ﴿۱۸﴾

المنزل ٦

ఆయతులు 182 | 37. అస్ సాఫ్ఫాత్ | అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 5** వరుసగా బారులు తీరి నిలబడే వారు సాక్షిగా, గద్దించేవారూ, శపించేవారూ సాక్షిగా, హితబోధ వాక్కులు వినిపించేవారు[1] సాక్షిగా, మీ నిజమైన ఆరాధ్యదైవం కేవలం ఒక్కడే – ఆయన భూమికీ, ఆకాశాలకూ, భూమ్యాకాశాలలో ఉన్న సమస్తానికీ ప్రభువు, తూర్పు దిక్కులన్నింటికీ ప్రభువు.[2]

**6 - 10** మేము ప్రపంచాకాశాన్ని[3] నక్షత్రాల అలంకరణతో తీర్చిదిద్దాము, ధిక్కారి అయిన ప్రతి షైతాన్ బారినుండి దానిని సురక్షితంగా ఉంచాము. ఈ షైతానులు పై లోకపు[4] అధిష్టానపు దూతల మాటలు వినలేరు, ప్రతి దిశ నుండి కొట్టబడతారు, తరుమబడతారు, వారికి ఎడతెగని శిక్షపడుతుంది. ఒకవేళ వారిలో ఎవడైనా ఏదైనా మాటను ఎగరేసుకుపోతున్నప్పుడు, ఒక తీక్షణమైన అగ్నిజ్వాల అతడిని వెంటాడుతుంది.

**11 - 18** ఇపుడు వారిని అడగండి. వారిని సృష్టించటం కష్టతరమా లేక మేము సృష్టించిన ఈ సకల చరాచరాలను సృష్టించటం కష్టతరమా అని. వారిని మేము జిగురు వంటి మట్టితో సృజించాము. మీరు (అల్లాహ్ శక్తి సామర్థ్యాల మహిమలను చూచి) ఆశ్చర్య చకితులవుతున్నారు, వారేమో పరిహసిస్తున్నారు. ఎంత నచ్చజెప్పినా వారు చెవికెక్కించుకోరు. ఏదైనా సూచనను చూస్తే, వారు దానిని ఎగతాళి చేసి ఎగుర గొడతారు, ఇలా అంటారు, "ఇది పూర్తిగా మాయాజాలమే. కాకపోతే, మేము చనిపోయి, మట్టిగా మారి, అస్థిపంజరంగా మిగిలిపోయినపుడు, మళ్ళీ మమ్మల్ని బ్రతికించి లేపటం జరిగేపనేనా? పూర్వకాలం నాటి మా తాత, ముత్తాతలు సైతం లేపబడతారా?" వారితో, "అవును (లేపబడతారు) మీరు (దేవుని ముందు) నిస్సహాయులు" అని అను.

**19 - 32** అది కేవలం ఒక పెద్ద గద్దింపు మాత్రమే. హఠాత్తుగా వారు (తమకు తెలుపబడుతూ ఉన్న విషయాలనన్నింటినీ) కళ్ళారా చూస్తూ ఉంటారు. అప్పుడు వారు "మేమెంత దౌర్భాగ్యులం, ఇది తీర్పుదినం కదా! అని అంటారు– మీరు తిరస్కరిస్తూ[5] ఉండే తీర్పుదినమే ఇది. (ఆజ్ఞ అవుతుంది) దుర్మార్గులందరినీ, వారి సహచరులను దేవుణ్ణి కాదని వారు ఆరాధిస్తూ ఉండిన దైవాలనూ[6] చుట్టుముట్టి తీసుకురండి. తరువాత వారందరికీ నరకానికి దారి చూపండి." కాస్త వారిని ఆపండి, ఒక విషయం అడగాలి. "ఏమయింది మీకు ఇపుడెందుకని ఒకరికొకరు సహాయం చేసుకోరు? అరే, ఈరోజు వారు తమను తామూ (ఒకరినొకరు) అప్పగిస్తున్నారేమిటి!" ఆ తరువాత వారు ఒకరి వైపునకు మరొకరు తిరిగి పరస్పరం వాదించుకోవటం ప్రారంభిస్తారు. (అనుచరులు తమ నాయకులతో ఇలా) అంటారు, "మీరు మా వద్దకు కుడివైపు నుండి వచ్చేవారు."[7] వారు సమాధానం ఇస్తారు,"అది కాదు, అసలు మీరే విశ్వసించేవారు కారు, మీ మీద మాకు అధికారం లేదు, మీరు సహజంగానే తలబిరుసువాళ్ళు. చివరకు మీరు తప్పకుండా యాతనను చవిచూస్తారు" అని మా ప్రభువు అన్న మాటకు మేము అర్హులమైపోయాము. కనుక మేము మిమ్మల్ని మార్గభ్రష్టులుగా చేశాము, స్వయంగా మేము కూడా మార్గభ్రష్టులమయ్యే ఉన్నాము.

**33 - 39** ఈ విధంగా వారందరూ ఆ రోజు ఉమ్మడిగా శిక్ష అనుభవిస్తారు. మేము అపరాధుల విషయంలో ఇలానే చేస్తూ ఉంటాము. వారు ఎలాంటి వారంటే, "అల్లాహ్ తప్ప మరొక సత్యమైన ఆరాధ్యుడు లేడు" అని చెప్పినపుడు, వారు అహంకారంతో, "మేము ఒక పిచ్చి కవి కోసం మా దేవుళ్లను వదలుకోవాలా?" అని అనేవారు. వాస్తవానికి అతను సత్యాన్నే తెచ్చాడు, దైవప్రవక్తలను ధ్రువీకరించాడు (ఇపుడు వారితో ఇలా అనటం జరుగుతుంది) మీరు తప్పని సరిగా బాధాకరమైన శిక్ష చవిచూస్తారు. మీకు ఏ ప్రతిఫలం ఇవ్వబడుతూ ఉన్నా అది మీరు చేస్తూ ఉండిన కర్మల ఫలమే.

فَاِنَّمَا هِیَ زَجۡرَةٌ وَّاحِدَةٌ فَاِذَا هُمۡ یَنۡظُرُوۡنَ ﴿۱۹﴾
وَ قَالُوۡا یٰوَیۡلَنَا هٰذَا یَوۡمُ الدِّیۡنِ ﴿۲۰﴾ هٰذَا
یَوۡمُ الۡفَصۡلِ الَّذِیۡ کُنۡتُمۡ بِهٖ تُکَذِّبُوۡنَ ﴿۲۱﴾ ع ۲۱/۵
اُحۡشُرُوا الَّذِیۡنَ ظَلَمُوۡا وَ اَزۡوَاجَهُمۡ وَ مَا کَانُوۡا
یَعۡبُدُوۡنَ ﴿۲۲﴾ مِنۡ دُوۡنِ اللّٰهِ فَاهۡدُوۡهُمۡ اِلٰی
صِرَاطِ الۡجَحِیۡمِ ﴿۲۳﴾ وَقِفُوۡهُمۡ اِنَّهُمۡ
مَّسۡـُٔوۡلُوۡنَ ﴿۲۴﴾ مَا لَکُمۡ لَا تَنَاصَرُوۡنَ ﴿۲۵﴾ بَلۡ هُمُ
الۡیَوۡمَ مُسۡتَسۡلِمُوۡنَ ﴿۲۶﴾ وَ اَقۡبَلَ بَعۡضُهُمۡ عَلٰی
بَعۡضٍ یَّتَسَآءَلُوۡنَ ﴿۲۷﴾ قَالُوۡۤا اِنَّکُمۡ کُنۡتُمۡ
تَاۡتُوۡنَنَا عَنِ الۡیَمِیۡنِ ﴿۲۸﴾ قَالُوۡا بَلۡ لَّمۡ تَکُوۡنُوۡا
مُؤۡمِنِیۡنَ ﴿۲۹﴾ وَمَا کَانَ لَنَا عَلَیۡکُمۡ مِّنۡ سُلۡطٰنٍ
بَلۡ کُنۡتُمۡ قَوۡمًا طٰغِیۡنَ ﴿۳۰﴾ فَحَقَّ عَلَیۡنَا قَوۡلُ
رَبِّنَاۤ ٭ۖ اِنَّا لَذَآئِقُوۡنَ ﴿۳۱﴾ فَاَغۡوَیۡنٰکُمۡ اِنَّا
کُنَّا غٰوِیۡنَ ﴿۳۲﴾ فَاِنَّهُمۡ یَوۡمَئِذٍ فِی الۡعَذَابِ
مُشۡتَرِکُوۡنَ ﴿۳۳﴾ اِنَّا کَذٰلِکَ نَفۡعَلُ
بِالۡمُجۡرِمِیۡنَ ﴿۳۴﴾ اِنَّهُمۡ کَانُوۡۤا اِذَا قِیۡلَ لَهُمۡ لَاۤ
اِلٰهَ اِلَّا اللّٰهُ ۙ یَسۡتَکۡبِرُوۡنَ ﴿۳۵﴾ وَ یَقُوۡلُوۡنَ اَئِنَّا
لَتَارِکُوۡۤا اٰلِهَتِنَا لِشَاعِرٍ مَّجۡنُوۡنٍ ﴿۳۶﴾ بَلۡ جَآءَ
بِالۡحَقِّ وَ صَدَّقَ الۡمُرۡسَلِیۡنَ ﴿۳۷﴾ اِنَّکُمۡ لَذَآئِقُوا
الۡعَذَابِ الۡاَلِیۡمِ ﴿۳۸﴾ وَ مَا تُجۡزَوۡنَ اِلَّا مَا کُنۡتُمۡ
تَعۡمَلُوۡنَ ﴿۳۹﴾

إِلَّا عِبَادَ اللّٰهِ الْمُخْلَصِينَ ۝٤٠ أُولَٰئِكَ لَهُمْ
رِزْقٌ مَّعْلُومٌ ۝٤١ فَوَاكِهُ ۖ وَهُم مُّكْرَمُونَ ۝٤٢
فِي جَنَّاتِ النَّعِيمِ ۝٤٣ عَلَىٰ سُرُرٍ مُّتَقَابِلِينَ ۝٤٤
يُطَافُ عَلَيْهِم بِكَأْسٍ مِّن مَّعِينٍ ۝٤٥ بَيْضَاءَ
لَذَّةٍ لِّلشَّارِبِينَ ۝٤٦ لَا فِيهَا غَوْلٌ وَلَا هُمْ
عَنْهَا يُنزَفُونَ ۝٤٧ وَعِندَهُمْ قَاصِرَاتُ الطَّرْفِ
عِينٌ ۝٤٨ كَأَنَّهُنَّ بَيْضٌ مَّكْنُونٌ ۝٤٩ فَأَقْبَلَ
بَعْضُهُمْ عَلَىٰ بَعْضٍ يَتَسَاءَلُونَ ۝٥٠ قَالَ قَائِلٌ
مِّنْهُمْ إِنِّي كَانَ لِي قَرِينٌ ۝٥١ يَقُولُ أَئِنَّكَ
لَمِنَ الْمُصَدِّقِينَ ۝٥٢ أَإِذَا مِتْنَا وَكُنَّا تُرَابًا وَ
عِظَامًا أَإِنَّا لَمَدِينُونَ ۝٥٣ قَالَ هَلْ أَنتُم
مُّطَّلِعُونَ ۝٥٤ فَاطَّلَعَ فَرَآهُ فِي سَوَاءِ
الْجَحِيمِ ۝٥٥ قَالَ تَاللّٰهِ إِن كِدتَّ
لَتُرْدِينِ ۝٥٦ وَلَوْلَا نِعْمَةُ رَبِّي لَكُنتُ مِنَ
الْمُحْضَرِينَ ۝٥٧ أَفَمَا نَحْنُ بِمَيِّتِينَ ۝٥٨ إِلَّا
مَوْتَتَنَا الْأُولَىٰ وَمَا نَحْنُ بِمُعَذَّبِينَ ۝٥٩

**40 - 49** అయితే, ఎన్నుకోబడిన దైవదాసులు మాత్రం (ఈ దుష్ఫలితానికి గురికాకుండా) సురక్షితంగా ఉంటారు. వారి కొరకు అందరూ ఎరిగిన ఆహారమే ఉన్నది, రుచికరమైన అన్ని రకాల పదార్థాలు ఉన్నాయి, భోగభాగ్యాలతో విలసిల్లే ఉద్యానవనాలు ఉన్నాయి. అందు వారు సగౌరవంగా ఉంచ బడతారు. సోఫాలపై ఎదురెదురుగా కూర్చుంటారు. మద్యపు చెలమల నుండి పాత్రలు మాటిమాటికీ నింపబడి వారి మధ్య త్రిప్పబడతాయి. మెరిసిపోతున్న మధువు, త్రాగేవారికి అది ఎంతో మధురం. దానివల్ల వారి శరీరానికి నష్టం ఉండదు, వారి బుద్ధీ చెడిపోదు. వారి దగ్గర తమ చూపులను నిగ్రహించుకునే అందమైన కళ్లు గల స్త్రీలు ఉంటారు. వారు గ్రుడ్డు గుల్ల క్రింద దాగి ఉండే పొరలాంటి కోమలాంగులు.

**50 - 59** తరువాత వారు ఒకరి వైపునకొకరు తిరిగి పరిస్థితులను గురించి పరస్పరం అడిగి తెలుసుకుంటారు. వారిలో ఒకడు ఇలా అంటాడు: "ప్రపంచంలో నాకు ఒక మిత్రుడు ఉండేవాడు. అతను నాతో ఇలా అంటూండేవాడు, నీవు కూడా ధ్రువీకరించే వారిలో చేరిపోయావా? మనం చనిపోయి, మట్టిగా మారి, అస్థిపంజరంగా మిగిలిపోయి నపుడు నిజంగానే మనకు ప్రతిఫలమూ, శిక్షా అనేవి ఉంటాయా? ఇప్పుడతను ఎక్కడున్నాడో, మీరు చూడదలచుకు న్నారా?" ఇలా చెప్పి అతను తొంగి చూడగానే, అతనికి నరకం లోని ఒక అగాధంలో అతను కనిపిస్తాడు. అపుడు అతన్ని సంబోధిస్తూ ఇలా అంటాడు, "దేవుని సాక్షిగా, నీవు నన్ను సర్వనాశనం చేసి ఉండేవాడివి. నా ప్రభువు అనుగ్రహం లేకపోయి ఉంటే, ఈ రోజు నేను కూడా పట్టుబడి వచ్చిన వారిలో ఒకడినై ఉండేవాణ్ణి. సరే,[8] అయితే ఇక మేము చనిపోమా? మాకు రావలసిన చావేదో ముందు వచ్చేసిందా? ఇక మాకు ఎలాంటి శిక్షాపడదా?"

1. ఈ మూడు వర్గాలు దైవదూతల వర్గాలు అని దివ్య ఖురాను వ్యాఖ్యాతలలో చాలామంది ఏకాభిప్రాయం కలిగి ఉన్నారు. వారు అనునిత్యం అల్లాహ్ ఆజ్ఞలను అమలుపరచటానికి సంసిద్ధులుగా ఉంటారు, ఆయన పట్ల అవిధేయత చూపే వారిని గద్దిస్తూ ఉంటారు, శపిస్తూ ఉంటారు, పలురీతులలో అల్లాహ్‌ను జ్ఞప్తికి తెస్తారు, గ్రంథ బోధనలను వినిపిస్తారు.
2. సూర్యుడు ఎల్లప్పుడూ ఒకే స్థానం నుంచి ఉదయించడు, ప్రతిరోజూ ఒక కొత్త స్థానం నుంచి ఉదయిస్తాడు. ఇంకా, భూగోళమంతటా సూర్యోదయం ఒకేసారి జరగదు. కాని భిన్నప్రాంతాలలో భిన్న సమయాలలో

اِنَّ هٰذَا لَهُوَ الْفَوْزُ الْعَظِيْمُ ﴿٦٠﴾ لِمِثْلِ هٰذَا
فَلْيَعْمَلِ الْعٰمِلُوْنَ ﴿٦١﴾ اَذٰلِكَ خَيْرٌ نُّزُلًا اَمْ
شَجَرَةُ الزَّقُّوْمِ ﴿٦٢﴾ اِنَّا جَعَلْنٰهَا فِتْنَةً
لِّلظّٰلِمِيْنَ ﴿٦٣﴾ اِنَّهَا شَجَرَةٌ تَخْرُجُ فِيْٓ اَصْلِ
الْجَحِيْمِ ﴿٦٤﴾ طَلْعُهَا كَاَنَّهٗ رُءُوْسُ الشَّيٰطِيْنِ ﴿٦٥﴾
فَاِنَّهُمْ لَاٰكِلُوْنَ مِنْهَا فَمَالِـُٔوْنَ مِنْهَا
الْبُطُوْنَ ﴿٦٦﴾ ثُمَّ اِنَّ لَهُمْ عَلَيْهَا لَشَوْبًا مِّنْ
حَمِيْمٍ ﴿٦٧﴾ ثُمَّ اِنَّ مَرْجِعَهُمْ لَاۡاِلَى الْجَحِيْمِ ﴿٦٨﴾
اِنَّهُمْ اَلْفَوْا اٰبَآءَهُمْ ضَآلِّيْنَ ﴿٦٩﴾ فَهُمْ عَلٰٓى
اٰثٰرِهِمْ يُهْرَعُوْنَ ﴿٧٠﴾ وَ لَقَدْ ضَلَّ قَبْلَهُمْ اَكْثَرُ
الْاَوَّلِيْنَ ﴿٧١﴾ وَ لَقَدْ اَرْسَلْنَا فِيْهِمْ مُّنْذِرِيْنَ ﴿٧٢﴾
فَانْظُرْ كَيْفَ كَانَ عَاقِبَةُ الْمُنْذَرِيْنَ ﴿٧٣﴾ اِلَّا
عِبَادَ اللّٰهِ الْمُخْلَصِيْنَ ﴿٧٤﴾ وَلَقَدْ نَادٰىنَا نُوْحٌ
فَلَنِعْمَ الْمُجِيْبُوْنَ ﴿٧٥﴾ وَ نَجَّيْنٰهُ وَ اَهْلَهٗ مِنَ
الْكَرْبِ الْعَظِيْمِ ﴿٧٦﴾ وَ جَعَلْنَا ذُرِّيَّتَهٗ هُمُ
الْبٰقِيْنَ ﴿٧٧﴾ وَتَرَكْنَا عَلَيْهِ فِى الْاٰخِرِيْنَ ﴿٧٨﴾ سَلٰمٌ
عَلٰى نُوْحٍ فِى الْعٰلَمِيْنَ ﴿٧٩﴾ اِنَّا كَذٰلِكَ نَجْزِى
الْمُحْسِنِيْنَ ﴿٨٠﴾ اِنَّهٗ مِنْ عِبَادِنَا الْمُؤْمِنِيْنَ ﴿٨١﴾
ثُمَّ اَغْرَقْنَا الْاٰخَرِيْنَ ﴿٨٢﴾

**60 - 74** నిశ్చయంగా ఇదే మహత్తరమైన విజయం. ఇలాంటి విజయం కోసమే కర్మశీలురు కర్మలు చేయాలి. చెప్పండి, ఈ ఆతిథ్యం మంచిదా లేక రాకాసి జముడు (జఖ్ఖూమ్) చెట్టు ఆతిథ్యం మంచిదా? మేము ఆ చెట్టును దుర్మార్గుల పాలిటి పరీక్షగా చేశాము.[9] అది నరకం అడుగు భాగం నుండి మొలిచే ఒక చెట్టు. దాని మొగ్గలు షైతానుల తలలు మాదిరిగా ఉంటాయి. నరకవాసులు వాటిని తింటారు. వాటితోనే కడుపు నింపుకుంటారు. అదీగాక, త్రాగటానికి వారికి సలసల కాగే నీరు లభిస్తుంది. ఆ తరువాత వారు మళ్లీ నరకాగ్ని వైపునకే తిరిగి వస్తారు. తమ తాతముత్తాతలు మార్గభ్రష్టులవటాన్ని చూసినప్పటికీ, వారి అడుగు జాడలలోనే పరుగెత్తిన వారు వీరే. వాస్తవానికి వారికి పూర్వం కూడా చాలా మంది మార్గభ్రష్టులైపోయారు. వారివద్దకు మేము హెచ్చరిక చేసే సందేశహరులను పంపాము. ఇక చూడండి, హెచ్చరించబడిన వారి పర్యవసానం ఏమయిందో. ఈ దుష్పరిణామం నుండి అల్లాహ్ తన కొరకు ప్రత్యేకించుకున్న దాసులు మాత్రమే సురక్షితంగా ఉన్నారు.

**75 - 82** మమ్మల్ని (ఇంతకు పూర్వం) నూహ్ వేడుకున్నాడు. కనుక చూడండి, మేము (ప్రార్థనలకు) ఎంత మంచి సమాధానం ఇచ్చేవారమో. మేము అతనినీ అతని కుటుంబాన్నీ పెద్ద విపత్తు నుండి కాపాడాము. అతని సంతతి మాత్రమే మిగిలి ఉండేలా చేశాము. ఇంకా తరువాతి తరాల వారిలో అతని కీర్తి ప్రతిష్ఠలు నిలిచి ఉండేలా చేశాము. సమస్త ప్రపంచ వాసులలో నూహ్‌కు శాంతి కలుగుగాక! మేము సత్కార్యం చేసేవారికి ఇటువంటి ప్రతిఫలాన్నే ఇస్తూ ఉంటాము. నిశ్చయంగా అతను విశ్వాసులైన మా దాసులలోని వాడు, తరువాత మేము రెండో వర్గాన్ని ముంచివేశాము.

సూర్యోదయం జరుగుతూ ఉంటుంది. ఈ హేతువుల చేత, "తూర్పు"కు బదులు "తూర్పులు" అని బహువచన రూపం వాడబడింది. దీనితోపాటు "పడమరలు" అని చెప్పబడలేదు. ఎందుకంటే తూర్పులు అనే శబ్దమే పడమరలను చెప్పకయే చెబుతుంది.

3. ప్రపంచాకాశం అంటే మనకు కనిపించే సమీప ఆకాశం. దానిని, దుర్భిణి సహాయం లేకుండానే మనం ఒట్టి కళ్లతో చూడగలము.

4. పై లోకపు జీవులు అంటే దైవదూతలు.

وَ اِنَّ مِنْ شِيْعَتِهٖ لَاِبْرٰهِيْمَ ﴿۸۳﴾ اِذْ جَآءَ رَبَّهٗ
بِقَلْبٍ سَلِيْمٍ ﴿۸۴﴾ اِذْ قَالَ لِاَبِيْهِ وَقَوْمِهٖ مَاذَا
تَعْبُدُوْنَ ﴿۸۵﴾ اَئِفْكًا اٰلِهَةً دُوْنَ اللّٰهِ
تُرِيْدُوْنَ ﴿۸۶﴾ فَمَا ظَنُّكُمْ بِرَبِّ الْعٰلَمِيْنَ ﴿۸۷﴾
فَنَظَرَ نَظْرَةً فِي النُّجُوْمِ ﴿۸۸﴾ فَقَالَ اِنِّيْ سَقِيْمٌ ﴿۸۹﴾
فَتَوَلَّوْا عَنْهُ مُدْبِرِيْنَ ﴿۹۰﴾ فَرَاغَ اِلٰٓى اٰلِهَتِهِمْ
فَقَالَ اَلَا تَاْكُلُوْنَ ﴿۹۱﴾ مَا لَكُمْ لَا تَنْطِقُوْنَ ﴿۹۲﴾
فَرَاغَ عَلَيْهِمْ ضَرْبًا بِالْيَمِيْنِ ﴿۹۳﴾ فَاَقْبَلُوْٓا اِلَيْهِ
يَزِفُّوْنَ ﴿۹۴﴾ قَالَ اَتَعْبُدُوْنَ مَا تَنْحِتُوْنَ ﴿۹۵﴾ وَ
اللّٰهُ خَلَقَكُمْ وَمَا تَعْمَلُوْنَ ﴿۹۶﴾ قَالُوا ابْنُوْا لَهٗ
بُنْيَانًا فَاَلْقُوْهُ فِي الْجَحِيْمِ ﴿۹۷﴾ فَاَرَادُوْا بِهٖ
كَيْدًا فَجَعَلْنٰهُمُ الْاَسْفَلِيْنَ ﴿۹۸﴾

وقف لازم

**83 - 87** ఇబ్రాహీమ్, నూహ్ మార్గంలోనే నడిచేవాడు. అతను తన ప్రభువు సాన్నిధ్యానికి నిర్మల హృదయంతో వచ్చినప్పుడు: తన తండ్రితోనూ, తన జాతి ప్రజలతోనూ ఇలా అన్నాడు, "మీరు ఆరాధిస్తున్న ఈ వస్తువులేమిటి? అల్లాహ్‌ను కాదని మీరు, మిథ్యా దైవాలను కోరుకుంటున్నారా, అసలు సకల లోకాల ప్రభువు విషయంలో మీ అభిప్రాయమేమిటి?"

**88 - 98** ఆ తరువాత అతను తన దృష్టిని[10] నక్షత్రాల వైపు సారించి, వారితో "నా ఆరోగ్యం బాగాలేదు"[11] అని అన్నాడు. అందువల్ల వారు అతనిని వదలిపెట్టి వెళ్ళిపోయారు. వారు వెళ్ళిన తరువాత అతను మెల్లగా వారి దేవుళ్ల ఆలయంలోకి జొరబడి, "మీరు తినరేమిటి? అసలు ఏమయింది మీకు, మీరు పలకను కూడా పలుకుటలేదే?" అని అడిగాడు. ఆ తరువాత అతను వాటిపై విరుచుకుపడి కుడిచేత్తో వాటిని గట్టిగా కొట్టాడు. వారు (తిరిగి వచ్చి) అతని వద్దకు పరుగెత్తు కుంటూ వచ్చారు. అపుడు అతను ఇలా అన్నాడు, "స్వయంగా మీరే చెక్కుకున్న వస్తువులను మీరు పూజిస్తారా? వాస్తవానికి అల్లాహ్‌యే మిమ్మల్నీ సృష్టించాడు, మీరు తయారు చేసే వస్తువులనూ సృష్టించాడు." వారు పరస్పరం ఇలా చెప్పు కున్నారు, "ఇతని కొరకు ఒక గుండం తయారు చేసి, భగభగ మండే అగ్నిలోకి ఇతనిని విసరివేయండి." వారు అతనికి ప్రతికూలంగా ఒక చర్య తీసుకోదలిచారు. కాని మేము వారినే మట్టి కరిపించాము.

5. ఈ విషయాన్ని విశ్వాసులు వారితో అని ఉండవచ్చు; ఇది దైవదూతల మాట కావచ్చు; తీర్పుదినపు మైదానంలో నెలకొని ఉన్న పరిస్థితులు ఇలా అని ఉండవచ్చు; ఇది వారిలో కలిగిన మరొక ప్రతిస్పందన కూడ కావచ్చు. అంటే, తమ మనస్సులలో తామే తమను సంబోధించుకుని, "తీర్పుదినం అనేదొకటి రానేరాదు అని ప్రపంచంలో మీరు భావిస్తూ ఉండేవారు" అని అనుకుని ఉండవచ్చు. ఇక మీరు శిక్షను తప్పించుకోలేరు, మీరు తిరస్కరిస్తూ వచ్చిన దినమే మీ ముందుకు వచ్చింది.

6. ఇక్కడ "దేవుళ్లు" అంటే దైవదూతలు, సత్పురుషులు, దైవప్రవక్తలు అని అర్థం కాదు. కాని రెండు రకాల దేవుళ్లు అని భావం. మొదటి రకం, మానవులు, షైతానులు. ప్రజలు దేవుణ్ణి వదలివేసి తమను సేవించాలనేదే వారి ఆకాంక్ష, వారి ప్రయత్నం. రెండోరకం, విగ్రహాలు. ప్రపంచంలో ప్రజలు వాటిని పూజించేవారు.

7. అసలు "యమీన్" అనే పదం వాడబడింది. ఈ జాతీయం ప్రకారం, ఒకవేళ దానిని శక్తి, బలము అనే అర్థంలో తీసుకుంటే, అప్పుడు దాని భావం ఇది: మీరు మమ్మల్ని మీ బలం ద్వారా మార్గభ్రష్టత్వం వైపునకు లాక్కువెళ్లారు. ఒకవేళ దానిని మేలు, మంచి అనే అర్థంలో తీసుకుంటే, అప్పుడు దాని భావం ఇది : మీరు మా శ్రేయోభిలాషులని భ్రమ కల్పించి మమ్మల్ని మోసం చేశారు. ఒకవేళ దానిని ప్రమాణం అనే భావంలో

وَ قَالَ اِنِّيْ ذَاهِبٌ اِلٰى رَبِّيْ سَيَهْدِيْنِ ﴿۹۹﴾
رَبِّ هَبْ لِيْ مِنَ الصّٰلِحِيْنَ ﴿۱۰۰﴾ فَبَشَّرْنٰهُ بِغُلٰمٍ
حَلِيْمٍ ﴿۱۰۱﴾ فَلَمَّا بَلَغَ مَعَهُ السَّعْيَ قَالَ يٰبُنَيَّ اِنِّيْٓ
اَرٰى فِي الْمَنَامِ اَنِّيْٓ اَذْبَحُكَ فَانْظُرْ مَا
ذَا تَرٰى ؕ قَالَ يٰٓاَبَتِ افْعَلْ مَا تُؤْمَرُ ۫
سَتَجِدُنِيْٓ اِنْ شَآءَ اللّٰهُ مِنَ الصّٰبِرِيْنَ ﴿۱۰۲﴾
فَلَمَّآ اَسْلَمَا وَ تَلَّهٗ لِلْجَبِيْنِ ﴿۱۰۳﴾ وَ نَادَيْنٰهُ اَنْ
يّٰٓاِبْرٰهِيْمُ ﴿۱۰۴﴾ قَدْ صَدَّقْتَ الرُّءْيَا ۚ اِنَّا كَذٰلِكَ
نَجْزِي الْمُحْسِنِيْنَ ﴿۱۰۵﴾ اِنَّ هٰذَا لَهُوَ الْبَلٰٓؤُا
الْمُبِيْنُ ﴿۱۰۶﴾ وَ فَدَيْنٰهُ بِذِبْحٍ عَظِيْمٍ ﴿۱۰۷﴾ وَ تَرَكْنَا
عَلَيْهِ فِي الْاٰخِرِيْنَ ﴿۱۰۸﴾ سَلٰمٌ عَلٰٓى اِبْرٰهِيْمَ ﴿۱۰۹﴾
كَذٰلِكَ نَجْزِي الْمُحْسِنِيْنَ ﴿۱۱۰﴾ اِنَّهٗ مِنْ عِبَادِنَا
الْمُؤْمِنِيْنَ ﴿۱۱۱﴾ وَ بَشَّرْنٰهُ بِاِسْحٰقَ نَبِيًّا مِّنَ
الصّٰلِحِيْنَ ﴿۱۱۲﴾ وَ بٰرَكْنَا عَلَيْهِ وَ عَلٰٓى اِسْحٰقَ ؕ وَ
مِنْ ذُرِّيَّتِهِمَا مُحْسِنٌ وَّ ظَالِمٌ لِّنَفْسِهٖ مُبِيْنٌ ﴿۱۱۳﴾ ع ۳

**99 - 113** ఇబ్రాహీమ్ ఇలా అన్నాడు: "నేను నా ప్రభువు వైపునకు వెళుతున్నాను,[12] ఆయనే నాకు మార్గం చూపుతాడు. ప్రభూ! నాకు శీలవంతుడైన ఒక కుమారుణ్ణి ప్రసాదించు." (ఈ ప్రార్థనకు సమాధానంగా) మేము అతనికి ఒక సహన శీలుడైన కుమారుడు కలుగుతాడనే శుభవార్తను[13] అంద జేశాము. ఆ బాలుడు అతనికి తోడుగా పనిచేసే వయస్సుకు చేరుకున్నప్పుడు (ఒకనాడు) ఇబ్రాహీమ్ అతనితో ఇలా అన్నాడు: "కుమారా! నేను నిన్ను 'జిబహ్' (బలి) చేస్తున్నట్లుగా కలలో చూశాను. ఇక నీ అభిప్రాయమేమిటో చెప్పు." అతను ఇలా అన్నాడు:"నాన్నగారూ! మీకు ఆజ్ఞాపించబడిన దానిని నెరవేర్చండి. అల్లాహ్ సంకల్పిస్తే మీరు నన్ను సహనశీలునిగా చూస్తారు." చివరకు వారు ఉభయులూ (దైవాజ్ఞను) శిరసా వహించారు. తరువాత ఇబ్రాహీమ్ తన కుమారుణ్ణి నుదుటిపై బోరగిల పరుండబెట్టాడు. అప్పుడు మేము అతనిని పిలిచి ఇలా అన్నాము: "ఇబ్రాహీమ్! నీవు కలను నిజం చేసి చూపించావు.[14] సత్కార్యం చేసేవారికి మేము ఇలాంటి ప్రతిఫలాన్నే ఇస్తాము. నిశ్చయంగా ఇది ఒక స్పష్టమైన పరీక్ష." మేము ఒక పెద్ద ఖుర్బానీని[15] పరిహారంగా ఇచ్చి ఆ బాలుణ్ణి విడిపించుకున్నాము; అతని కీర్తి ప్రతిష్ఠలు తరువాతి తరాల వారిలో శాశ్వతంగా నిలిచిపోయేలా చేశాము. ఇబ్రాహీమ్‌కు శాంతి కలుగు గాక! మేము సత్కార్యాలు చేసే వారికి ఇటువంటి ప్రతిఫలాన్నే ఇస్తాము. నిశ్చయంగా అతను విశ్వసించిన మా దాసులలోని వాడు. మేము అతనికి ఇస్‌హాఖ్‌ను గురించిన శుభవార్తను[16] అందజేశాము. (అతను) ఒక దైవప్రవక్త, సజ్జనులలోని వాడు. అతనికీ ఇస్‌హాఖ్‌కూ మేము శుభాలను ఇచ్చాము. ఇపుడు వారిద్దరి సంతతిలో ఒకడు సత్క్రియా శీలుడైతే మరొకడు స్పష్టంగా తన ఆత్మకు ద్రోహం చేసు కున్నవాడు.

---

తీసుకుంటే, అప్పుడు దాని అర్థం ఇది : మీరు ప్రమాణాల మీద ప్రమాణాలు చేసి, "మేము చెప్పేదే సత్యమని" మాకు నమ్మకం కలిగించారు.

8. గ్రంథరచనా విన్యాసాన్నిబట్టి, ఒక స్వర్గవాసి తన స్నేహితుడైన నరకవాసితో మాట్లాడుతూ, ఉన్నట్టు ఉండి తనలో తాను మాట్లాడుకోవటం ప్రారంభిస్తాడు. ఎవరైనా ఒక మనిషి తాను ఇంతకు ముందెన్నడూ ఊహించనైనా ఊహించనటువంటి ఉన్నతస్థితిలో తనను చూసి, అతిశయించిన, విస్మయానందాలతో తనలో తాను మాట్లాడు కుంటున్న విధంగా ఈ వాక్యాలు అతని నోటి నుండి వెలువడ్డాయి.

**114 - 122** మేము మూసాకు, హారూన్‌కూ మేలు చేశాము. వారికీ వారి జాతి ప్రజలకూ మహా విపత్తు నుండి విముక్తి కలిగించాము. మేము వారికి సహాయం చేశాము. కనుకనే వారు ప్రాబల్యం వహించారు. మేము వారికి స్పష్టమైన గ్రంథాన్ని ప్రసాదించాము. వారికి ఋజుమార్గం చూపాము. తరువాతి తరాల వారిలో వారిని గురించిన మంచి ప్రస్తావన మిగిలి ఉండేలా చేశాము. మూసాకూ, హారూన్‌కూ శాంతి కలుగుగాక! మేము పుణ్యకార్యాలు చేసేవారికి ఇటువంటి ప్రతిఫలాన్నే ఇస్తాము. నిశ్చయంగా వారు విశ్వాసులైన మా దాసులలోని వారు.

**123 - 132** నిశ్చయంగా ఇల్యాస్ కూడా మా సందేశహరులలో ఒకడు. జ్ఞాపకం తెచ్చుకో, అప్పుడు అతను తన జాతి వారితో "మీరు భయపడరా? సృష్టికర్తలలోకెల్లా ఉత్తముడైన సృష్టికర్తయున్నూ మీకూ, మీకు పూర్వం ఉండిన మీ తాత ముత్తాతలకూ ప్రభువున్నూ అయిన అల్లాహ్‌ను వదలివేసి మీరు 'బఅల్'ను వేడుకుంటున్నారా?" కాని వారు అతనిని అసత్యవాది అని తిరస్కరించారు. కనుక వారు తప్పనిసరిగా శిక్ష కొరకు హాజరుపరచబడతారు, ప్రత్యేకించుకోబడిన దైవ దాసులు తప్ప. ఇల్యాస్‌ను గురించిన మంచి ప్రస్తావనను మేము తరువాతి తరాలలో నిలిచి ఉండేలా చేశాము. ఇల్యాస్‌కు శాంతి కలుగుగాక! మేము సత్కార్యాలు చేసేవారికి ఇటువంటి ప్రతిఫలాన్నే ఇస్తాము. నిస్సందేహంగా అతను విశ్వాసులైన మా దాసులలో ఒకడు.

وَلَقَدْ مَنَنَّا عَلٰى مُوْسٰى وَ هٰرُوْنَ ﴿۱۱۴﴾ وَ
نَجَّيْنٰهُمَا وَ قَوْمَهُمَا مِنَ الْكَرْبِ الْعَظِيْمِ ﴿۱۱۵﴾ وَ
نَصَرْنٰهُمْ فَكَانُوْا هُمُ الْغٰلِبِيْنَ ﴿۱۱۶﴾ وَاٰتَيْنٰهُمَا
الْكِتٰبَ الْمُسْتَبِيْنَ ﴿۱۱۷﴾ وَهَدَيْنٰهُمَا الصِّرَاطَ
الْمُسْتَقِيْمَ ﴿۱۱۸﴾ وَ تَرَكْنَا عَلَيْهِمَا فِي الْاٰخِرِيْنَ ﴿۱۱۹﴾
سَلٰمٌ عَلٰى مُوْسٰى وَ هٰرُوْنَ ﴿۱۲۰﴾ اِنَّا كَذٰلِكَ
نَجْزِي الْمُحْسِنِيْنَ ﴿۱۲۱﴾ اِنَّهُمَا مِنْ عِبَادِنَا
الْمُؤْمِنِيْنَ ﴿۱۲۲﴾ وَاِنَّ اِلْيَاسَ لَمِنَ
الْمُرْسَلِيْنَ ﴿۱۲۳﴾ اِذْ قَالَ لِقَوْمِهٖٓ اَلَا
تَتَّقُوْنَ ﴿۱۲۴﴾ اَتَدْعُوْنَ بَعْلًا وَّ تَذَرُوْنَ اَحْسَنَ
الْخٰلِقِيْنَ ﴿۱۲۵﴾ اللّٰهَ رَبَّكُمْ وَ رَبَّ اٰبَآئِكُمُ
الْاَوَّلِيْنَ ﴿۱۲۶﴾ فَكَذَّبُوْهُ فَاِنَّهُمْ لَمُحْضَرُوْنَ ﴿۱۲۷﴾
اِلَّا عِبَادَ اللّٰهِ الْمُخْلَصِيْنَ ﴿۱۲۸﴾ وَ تَرَكْنَا عَلَيْهِ فِي
الْاٰخِرِيْنَ ﴿۱۲۹﴾ سَلٰمٌ عَلٰٓى اِلْ يَاسِيْنَ ﴿۱۳۰﴾ اِنَّا
كَذٰلِكَ نَجْزِي الْمُحْسِنِيْنَ ﴿۱۳۱﴾ اِنَّهٗ مِنْ عِبَادِنَا
الْمُؤْمِنِيْنَ ﴿۱۳۲﴾

9. అంటే, ఈ విషయం విన్న తరువాత, అవిశ్వాసులకు దివ్య ఖురానును హేళన చేయటానికీ, దైవప్రవక్తను పరిహసించటానికీ ఒక కొత్త అవకాశం దొరికింది. వారు ఈ విషయాన్ని విని, పక పక నవ్వి ఇలా అన్నారు: "మరో కొత్త విషయం వినండి భగ భగమండే నరకాగ్ని నుండి చెట్టుపుడుతుందట."
10. అరబ్బీ భాషలో ఈ పదాలను ఒక జాతీయంగా, "అతను ఆలోచించాడు" లేదా "అతను ఆలోచించసాగాడు" అనే అర్థాలలో వాడతారు.
11. హ॥జత్ ఇబ్రాహీమ్‌కు అప్పుడు ఏ బాధాలేదు అని చెప్పటానికి మా వద్ద తగిన ఆధారాలు లేవు. కనుక ఆయన, వాస్తవ విరుద్ధమైన మిషతో చెప్పాడని అనటానికి అవకాశం లేదు.
12. అంటే, నా ప్రభువు కోసం నేను ఇల్లూవాకిలినీ, దేశాన్నీ విడిచిపెడుతున్నాను.
13. అంటే, ఇస్మాయిల్ (అస్సలామ్)అని భావం.
14. కలలో ఖుర్బానీ ఇస్తున్నట్లుగా చూపబడింది గాని, ఖుర్బానీ ఇచ్చినట్లుగా చూపబడలేదు. అందుకని హ॥జత్ ఇబ్రాహీమ్, ఖుర్బానీ ఇవ్వటానికి సర్వసన్నాహాలు చేసుకున్నపుడు "నీవు నీ స్వప్నాన్ని నిజం చేసి చూపావు" అని అనబడింది.

وَ اِنَّ لُوْطًا لَّمِنَ الْمُرْسَلِيْنَ ﴿۱۳۳﴾ اِذْ نَجَّيْنٰهُ وَ
اَهْلَهٗۤ اَجْمَعِيْنَ ﴿۱۳۴﴾ اِلَّا عَجُوْزًا فِي الْغٰبِرِيْنَ ﴿۱۳۵﴾
ثُمَّ دَمَّرْنَا الْاٰخَرِيْنَ ﴿۱۳۶﴾ وَ اِنَّكُمْ لَتَمُرُّوْنَ
عَلَيْهِمْ مُّصْبِحِيْنَ ﴿۱۳۷﴾ وَ بِالَّيْلِ ؕ اَفَلَا تَعْقِلُوْنَ ﴿۱۳۸﴾ ع ۵ ۸
وَاِنَّ يُوْنُسَ لَمِنَ الْمُرْسَلِيْنَ ﴿۱۳۹﴾ اِذْ اَبَقَ اِلَى
الْفُلْكِ الْمَشْحُوْنِ ﴿۱۴۰﴾ فَسَاهَمَ فَكَانَ مِنَ
الْمُدْحَضِيْنَ ﴿۱۴۱﴾ فَالْتَقَمَهُ الْحُوْتُ وَ هُوَ
مُلِيْمٌ ﴿۱۴۲﴾ فَلَوْلَاۤ اَنَّهٗ كَانَ مِنَ الْمُسَبِّحِيْنَ ﴿۱۴۳﴾ النصف
لَلَبِثَ فِيْ بَطْنِهٖۤ اِلٰى يَوْمِ يُبْعَثُوْنَ ﴿۱۴۴﴾ فَنَبَذْنٰهُ
بِالْعَرَآءِ وَ هُوَ سَقِيْمٌ ﴿۱۴۵﴾ وَاَنْۢبَتْنَا عَلَيْهِ شَجَرَةً
مِّنْ يَّقْطِيْنٍ ﴿۱۴۶﴾ وَ اَرْسَلْنٰهُ اِلٰى مِائَةِ اَلْفٍ اَوْ
يَزِيْدُوْنَ ﴿۱۴۷﴾ فَاٰمَنُوْا فَمَتَّعْنٰهُمْ اِلٰى حِيْنٍ ﴿۱۴۸﴾

**133-138** లూత్ కూడా దైవప్రవక్తలుగా నియమించి పంపబడిన వారిలో ఒకడు. జ్ఞాపకం తెచ్చుకో, అపుడు మేము అతనికీ, అతని కుటుంబంలోని వారికందరికీ విముక్తి కలిగించాము, ఒక వృద్ధురాలికి తప్ప; ఆమె, వెనుక ఉండిపోయిన వారిలో ఉండిపోయింది. ఆ తరువాత మిగతా వారందరినీ సర్వనాశనం చేశాము. ఈనాడు మీరు రేయింబవళ్లు వారి శిథిల ప్రదేశాల మీదుగా పోతూ ఉంటారు. (వాటిని చూచి అయినా) మీకు బుద్ధిరాదా?

**139 -148** నిశ్చయంగా యూనుస్ కూడా దైవప్రవక్తలలోని వాడే. జ్ఞాపకం తెచ్చుకో, అపుడు అతను నిండు పడవ వైపునకు పరుగెత్తాడు. అక్కడ చీటీలో పాల్గొన్నాడు, కానీ ఓడిపోయాడు. చివరకు అతనిని చేప మ్రింగివేసింది. అతను దూషితుడయ్యాడు.[17] అపుడు అతను దైవనామ స్మరణం చేసేవారిలో ఒకడై ఉండకపోయినట్లయితే, ప్రళయదినం వరకు ఆ చేప కడుపులోనే ఉండిపోయేవాడు.[18] చివరకు మేము అతనిని తీవ్ర అస్వస్థితిలో ఒక తీర మైదానం మీద పడవేశాము. అతని మీద ఒక తీగల చెట్టును మొలిపించాము. ఆ తరువాత మేము అతన్ని ఒక లక్ష లేక అంతకంటె ఎక్కువ మంది ప్రజల వద్దకు[19] పంపాము. వారు విశ్వసించారు. మేము ఒక నిర్ణీత కాలం వరకు వారు జీవించి ఉండేలా చేశాము.

---

15. "పెద్ద ఖుర్బానీ" అంటే దైవదూత హ(జత్ ఇబ్రాహీమ్ ముందు ఉంచిన పొట్టేలు, దాన్ని తన కుమారునికి బదులుగా జిబహ్ చేసేందుకు. దానిని 'పెద్ద ఖుర్బానీ' అనే పదంతో పోల్చటానికి హేతువు ఏమిటంటే, అది హ(జత్ ఇబ్రాహీమ్ వంటి విశ్వాసపాత్రుడైన సేవకుని కోసం, ఇబ్రాహీమ్ కుమారుని వంటి సహనశీలి, వినయ విధేయతలుగల బాలునికి పరిహారం అయినందుకు. ఇదే కాక, దానిని పెద్ద ఖుర్బానీ అని చెప్పటానికి మరొక కారణం కూడ ఉన్నది. ప్రళయం వచ్చేవరకు, విశ్వాసులందరూ ప్రపంచమంతటా ఒకేరోజున ఈ జంతు ఖుర్బానీని పాటించాలనీ, భక్తి విశ్వాసాలకు ప్రతీక అయిన ఈ మహత్తర సంఘటన జ్ఞప్తిలో ఉండాలనీ, అల్లాహ్ ఈ సంప్రదాయాన్ని విధించాడు.
16. అంటే, ఈ ఖుర్బానీ తరువాత, హ(జత్ ఇస్హాఖ్ జన్మ గురించిన శుభవార్త తెలియజేయబడింది.
17. ఈ వాక్యాలను నిశితంగా గమనించినట్లయితే, జరిగిన సంఘటన పూర్వాపరాలు ఏమిటో అర్థమవుతాయి.(1) దైవప్రవక్త హ(జత్ యూనుస్ ఎక్కిన పడవ, దాని బరువుకు మించి నిండిపోయింది. (2) లాటరీ పడవమీదే జరిగింది; సముద్ర ప్రయాణం జరిగేటప్పుడు, పడవ బరువు అధికమై ప్రయాణీకుల ప్రాణాలకు ముప్పు ఏర్పడిందని అనిపించినప్పుడు, బహుశా ఈ లాటరీ జరిగింది. కనుక లాటరీలో చీటి తీసినప్పుడు, ఎవరిపేరు వస్తుందో వారిని నీళ్లల్లోకి తోసివేయాలని లాటరీ నిర్వహింపబడింది. (3) లాటరీలో ప్రవక్త హ(జత్ యూనుస్ పేరే వచ్చింది. అందుకని ఆయనను సముద్రంలోకి విసరివేశారు. అప్పుడు ఆయనను ఒక చేప మింగివేసింది. (4) ఈ ఆపదకు ప్రవక్త యూనుస్ (అస్సలామ్) గురిఅవటానికి కారణం, ఆయన తన యజమాని అయిన

فَاسْتَفْتِهِمْ اَلِرَبِّكَ الْبَنَاتُ وَ لَهُمُ الْبَنُوْنَ ﴿١٤٩﴾
اَمْ خَلَقْنَا الْمَلٰٓئِكَةَ اِنَاثًا وَّ هُمْ شٰهِدُوْنَ ﴿١٥٠﴾
اَلَآ اِنَّهُمْ مِّنْ اِفْكِهِمْ لَيَقُوْلُوْنَ ﴿١٥١﴾ وَلَدَ
اللّٰهُ وَ اِنَّهُمْ لَكٰذِبُوْنَ ﴿١٥٢﴾ اَصْطَفَى الْبَنَاتِ
عَلَى الْبَنِيْنَ ﴿١٥٣﴾ مَا لَكُمْ كَيْفَ تَحْكُمُوْنَ ﴿١٥٤﴾
اَفَلَا تَذَكَّرُوْنَ ﴿١٥٥﴾ اَمْ لَكُمْ سُلْطٰنٌ مُّبِيْنٌ ﴿١٥٦﴾
فَاْتُوْا بِكِتٰبِكُمْ اِنْ كُنْتُمْ صٰدِقِيْنَ ﴿١٥٧﴾ وَ جَعَلُوْا
بَيْنَهٗ وَبَيْنَ الْجِنَّةِ نَسَبًا وَ لَقَدْ عَلِمَتِ
الْجِنَّةُ اِنَّهُمْ لَمُحْضَرُوْنَ ﴿١٥٨﴾ سُبْحٰنَ اللّٰهِ عَمَّا
يَصِفُوْنَ ﴿١٥٩﴾ اِلَّا عِبَادَ اللّٰهِ الْمُخْلَصِيْنَ ﴿١٦٠﴾
فَاِنَّكُمْ وَ مَا تَعْبُدُوْنَ ﴿١٦١﴾ مَآ اَنْتُمْ عَلَيْهِ
بِفٰتِنِيْنَ ﴿١٦٢﴾ اِلَّا مَنْ هُوَ صَالِ الْجَحِيْمِ ﴿١٦٣﴾ وَ
مَا مِنَّآ اِلَّا لَهٗ مَقَامٌ مَّعْلُوْمٌ ﴿١٦٤﴾ وَ اِنَّا لَنَحْنُ
الصَّآفُّوْنَ ﴿١٦٥﴾ وَ اِنَّا لَنَحْنُ الْمُسَبِّحُوْنَ ﴿١٦٦﴾

**149 - 157** వారిని కొంచెం ఇలా అడుగు; నీ ప్రభువునకు కూతుళ్లున్నూ వారికి కొడుకులూనా? (వారి మనస్సుకు ఇది నచ్చే విషయమేనా). మేము నిజంగా దైవదూతలను స్త్రీలుగానే సృష్టించామా? వారు కళ్లతో చూసిన విషయాన్నే పలుకుతున్నారా? బాగా విను, అల్లాహ్ సంతానవంతుడు అనే విషయాన్ని వారే స్వయంగా కల్పించి అంటున్నారు. వాస్తవంగానే వారు అసత్యవాదులు. అల్లాహ్ తన కొరకు కొడుకులకు బదులుగా కూతుళ్ళను కోరుకున్నాడా? ఏమయింది మీకు, ఇటువంటి నిర్ణయం తీసుకుంటున్నారు? మీకు స్పృహలేదా? లేక మీరు చెబుతున్న ఈ మాటలకు మీ వద్ద స్పష్టమైన ప్రమాణం అంటూ ఏదైనా ఉంటే, మీ గ్రంథాన్ని తీసుకురండి, మీరు సత్యవంతులే అయితే.

**158 - 166** వారు అల్లాహ్‌కూ, దైవదూతలకూ[20] మధ్య రక్త సంబంధాన్ని కల్పించారు. వాస్తవానికి వారు నేరస్తులుగా ప్రవేశ పెట్టబడేవారని దైవదూతలకు బాగా తెలుసు. (ఈ దైవదూతలు ఇలా అంటారు), "ఆయన విశుద్ధ దాసులు తప్ప, ఇతరులు, తనకు ఆపాదించే గుణగణాల నుండి అల్లాహ్ పరిశుద్ధుడు. కనుక మీరూ మీ ఈ దైవాలూ అల్లాహ్ నుండి ఎవరినీ మళ్లించలేరు; భగ భగ మండే నరకాగ్నిలో కాలిపోనున్నవాణ్ణి తప్ప. మా పరిస్థితి ఇది: మాలో ప్రతి ఒక్కరికీ ఒక స్థానం అంటూ నిర్ణయమై ఉన్నది. మేము పంక్తులు తీరి ఉన్న సేవకులం, స్తోత్రం చేసేవాళ్లం."

అల్లాహ్ అనుజ్ఞలేకుండానే, తన నియామక స్థానాన్ని వదలిపెట్టి పారిపోవటమే. ఈ అర్థాన్నే "అబఖ" అనే పదం సమర్థిస్తుంది. ఎందుకంటే, అరబ్బీ భాషలో ఆ పదం, యజమాని గృహం నుండి పారిపోయే బానిసకు వాడబడుతుంది.

18. అంటే, ప్రళయం వచ్చేవరకు, ఈ చేపగర్భమే హజ్రత్ యూనుస్ సమాధి అయి ఉండేది.

19. "ఒక లక్ష లేక అంతకంటె ఎక్కువ" అని చెప్పటంలో ఆంతర్యం, అల్లాహ్‌కు వారి సంఖ్య విషయమై సందేహం ఉందని అర్థం కాదు. కాని దాని అర్థం ఏమిటంటే, ఒక వ్యక్తి వారి పట్టణాన్ని చూచినట్లయితే, అక్కడి జనాభా ఒక లక్షకు పైబడ్డమాటే, అంతకు తక్కువ కాదు అని అంచనా వేస్తాడు.

20. 'జిన్న్' అనే పదం వాడబడినా, రాబోయే వాక్యాలనుబట్టి, దైవదూతలు అని స్పష్టమవుతోంది. జిన్న్ అంటే అగోచర ప్రాణి అని అర్థం.

وَ اِنْ كَانُوْا لَيَقُوْلُوْنَ ﴿١٦٧﴾ لَوْ اَنَّ عِنْدَنَا ذِكْرًا
مِّنَ الْاَوَّلِيْنَ ﴿١٦٨﴾ لَكُنَّا عِبَادَ اللّٰهِ
الْمُخْلَصِيْنَ ﴿١٦٩﴾ فَكَفَرُوْا بِهٖ فَسَوْفَ يَعْلَمُوْنَ ﴿١٧٠﴾
وَ لَقَدْ سَبَقَتْ كَلِمَتُنَا لِعِبَادِنَا الْمُرْسَلِيْنَ ﴿١٧١﴾
اِنَّهُمْ لَهُمُ الْمَنْصُوْرُوْنَ ﴿١٧٢﴾ وَ اِنَّ جُنْدَنَا لَهُمُ
الْغٰلِبُوْنَ ﴿١٧٣﴾ فَتَوَلَّ عَنْهُمْ حَتّٰى حِيْنٍ ﴿١٧٤﴾
وَّ اَبْصِرْهُمْ فَسَوْفَ يُبْصِرُوْنَ ﴿١٧٥﴾ اَفَبِعَذَابِنَا
يَسْتَعْجِلُوْنَ ﴿١٧٦﴾ فَاِذَا نَزَلَ بِسَاحَتِهِمْ فَسَآءَ
صَبَاحُ الْمُنْذَرِيْنَ ﴿١٧٧﴾ وَ تَوَلَّ عَنْهُمْ حَتّٰى
حِيْنٍ ﴿١٧٨﴾ وَّ اَبْصِرْ فَسَوْفَ يُبْصِرُوْنَ ﴿١٧٩﴾ سُبْحٰنَ
رَبِّكَ رَبِّ الْعِزَّةِ عَمَّا يَصِفُوْنَ ﴿١٨٠﴾ وَسَلٰمٌ عَلَى
الْمُرْسَلِيْنَ ﴿١٨١﴾ وَ الْحَمْدُ لِلّٰهِ رَبِّ الْعٰلَمِيْنَ ﴿١٨٢﴾ ع

**167 - 179** వారు ఇంతకు పూర్వం ఇలా అంటూ ఉండే వారు, "పూర్వపు జాతులకు లభించిన 'జిక్ర్' (గ్రంథం) మా వద్ద ఉండినట్లయితే, మేము నిజమైన అల్లాహ్ భక్తులమై ఉండేవారము." కాని (అది వచ్చేసినపుడు) వారు దానిని నిరాకరించారు. ఇక త్వరలోనే వారికి (ఈ వైఖరికి పర్యవసానం) తెలిసిపోతుంది. మేము పంపిన మా దాసులకు మేము ఇది వరకే వాగ్దానం చేసి ఉన్నాము, తప్పకుండా వారికి సహాయం చేయబడుతుందనీ మా సైన్యమే ప్రాబల్యం వహించి తీరుతుందనీ. కనుక ప్రవక్తా! కొంతకాలం వరకు, వారిని వారి స్థితిలో వదలిపెట్టి చూస్తూ ఉండు. త్వరలోనే స్వయంగా వారు కూడా చూస్తారు. వారు మా శిక్ష రాకకోసం తొందర పెడుతున్నారా? ఆ శిక్ష వారి ఇంటి ప్రాంగణంలో దిగేరోజున హెచ్చరించబడిన వారికి అత్యంత కఠినంగా ఉంటుంది. కనుక కొంత కాలం పాటు వారిని వారి మానాన వదలివేసి చూస్తూ ఉండు, త్వరలోనే స్వయంగా వారు కూడా చూస్తారు.

**180 - 182** నీ ప్రభువు పరిశుద్ధుడు, గొప్ప గౌరవోన్నతులు కలవాడు, వారు కల్పిస్తున్న అన్ని విషయాలకూ అతీతుడు. దైవప్రవక్తలపై శాంతి వర్షించుగాక! సకల లోకాల ప్రభువే సకల స్తోత్రాలకు అర్హుడు.

آیاتها ٨٨ | ٣٨ سُوْرَةُ صٓ مَكِّيَّةٌ ٣٨ | رکوعاتها ٥

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○

صٓ وَ الۡقُرۡاٰنِ ذِی الذِّكۡرِؕ ① بَلِ الَّذِيۡنَ
كَفَرُوۡا فِیۡ عِزَّةٍ وَّ شِقَاقٍ ② كَمۡ اَهۡلَكۡنَا مِنۡ
قَبۡلِهِمۡ مِّنۡ قَرۡنٍ فَنَادَوۡا وَّلَاتَ حِيۡنَ
مَنَاصٍ ③ وَ عَجِبُوۡۤا اَنۡ جَآءَهُمۡ مُّنۡذِرٌ
مِّنۡهُمۡ وَ قَالَ الۡكٰفِرُوۡنَ هٰذَا سٰحِرٌ
كَذَّابٌۖ ④ اَجَعَلَ الۡاٰلِهَةَ اِلٰهًا وَّاحِدًا ۖۚ اِنَّ
هٰذَا لَشَیۡءٌ عُجَابٌ ⑤ وَانۡطَلَقَ الۡمَلَاُ مِنۡهُمۡ
اَنِ امۡشُوۡا وَ اصۡبِرُوۡا عَلٰۤی اٰلِهَتِكُمۡ ۖۚ اِنَّ هٰذَا
لَشَیۡءٌ يُّرَادُ ۖۚ ⑥ مَا سَمِعۡنَا بِهٰذَا فِی الۡمِلَّةِ
الۡاٰخِرَةِ ۖۚ اِنۡ هٰذَاۤ اِلَّا اخۡتِلَاقٌ ۖۚ ⑦ ءَاُنۡزِلَ
عَلَيۡهِ الذِّكۡرُ مِنۡۢ بَيۡنِنَا ؕ بَلۡ هُمۡ فِیۡ شَكٍّ مِّنۡ
ذِكۡرِیۡ ۚ بَلۡ لَّمَّا يَذُوۡقُوۡا عَذَابِ ؕ ⑧ اَمۡ
عِنۡدَهُمۡ خَزَآئِنُ رَحۡمَةِ رَبِّكَ الۡعَزِيۡزِ
الۡوَهَّابِ ۚ ⑨ اَمۡ لَهُمۡ مُّلۡكُ السَّمٰوٰتِ وَالۡاَرۡضِ
وَ مَا بَيۡنَهُمَا ۟ فَلۡيَرۡتَقُوۡا فِی الۡاَسۡبَابِ ⑩

ఆయతులు 88 | **38. సాద్** | అవతరణ మక్కాలో

*అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

**1 – 3** సాద్. హితబోధతో నిండి ఉన్న ఖుర్ఆన్ సాక్షిగా! అసలు విషయం ఏమిటంటే విశ్వసించటానికి తిరస్కరించిన ఈ ప్రజలే దురహంకారులు, పరమమూర్ఖులు,[1] వారికి పూర్వం మేము ఇటువంటి ఎన్నో జాతులను నాశనం చేశాము. (వారికి పోగాలము దాపురించగా) అపుడు వారు హాహాకారాలు చేశారు. కాని అది తప్పించుకునే సమయం కాదు కదా!

**4 – 8...** భయపెట్టేవాడొకడు స్వయంగా తమనుండే వచ్చాడని వారు ఆశ్చర్యపడ్డారు. సత్యతిరస్కారులు ఇలా అనసాగారు, "ఇతడు మంత్రవాది, అసత్యవాది, సమస్త దైవాల స్థానంలో కేవలం ఒకే ఒక దైవాన్ని నిలబెట్టాడేమిటి? ఇది ఎంతో విచిత్రమైన విషయం." జాతి నాయకులు ఇలా అంటూ వెళ్ళిపోయారు, "పదండి మీ దైవాల ఆరాధన పట్ల స్థిరంగా ఉండండి. ఈ విషయం ఒక ప్రయోజనం కోరి చెప్పబడు తోంది.[2] ఈ విషయాన్ని మేము ఇటీవలి కాలపు సమాజంలో ఎవరి నోటా వినలేదు. ఇది కల్పిత విషయం తప్ప మరేమీ కాదు. మన అందరిలోనూ కేవలం ఇతడొక్కడే అర్హుడా ఇతని మీదనే అల్లాహ్ యొక్క 'హితోపదేశం' అవతరించటానికి?"

**... 8 – 10** అసలు విషయం ఏమిటంటే, వారు నా "జిక్ర్" (గ్రంథం) గురించి సంశయగ్రస్తులయ్యారు.[3] వారు నా శిక్షను రుచి చూడలేదు కాబట్టి ఈ మాటలన్నీ అంటున్నారు. ప్రబలుడు, ప్రదాత అయిన నీ ప్రభువు కారుణ్య నిధులు వారి అధీనంలో ఉన్నాయా? ఆకాశాలకూ, భూమికీ, వాటికి మధ్య ఉన్న వస్తువులకూ వారు యజమానులా? అలా అయితే, ప్రాపంచిక సాధనాల శిఖరాలకు చేరి చూడమనండి.

1. అంటే, ఈ అవిశ్వాసుల అవిశ్వాసానికి కారణం, వారికి బోధించబడే మత ధర్మంలో ఏదో దోషమో, లోపమో ఉండటం కాదు, కాని దానికి వారి అహంకారం, మూర్ఖత్వం, మంకుపట్టులే కాని వేరేమీ కావు.

جُنْدٌ مَّا هُنَالِكَ مَهْزُوْمٌ مِّنَ الْاَحْزَابِ ﴿۱۱﴾
كَذَّبَتْ قَبْلَهُمْ قَوْمُ نُوْحٍ وَّ عَادٌ وَّ فِرْعَوْنُ
ذُو الْاَوْتَادِ ﴿۱۲﴾ وَ ثَمُوْدُ وَقَوْمُ لُوْطٍ وَّاَصْحٰبُ
لْـَٔيْكَةِ ؕ اُولٰٓئِكَ الْاَحْزَابُ ﴿۱۳﴾ اِنْ كُلٌّ اِلَّا
كَذَّبَ الرُّسُلَ فَحَقَّ عِقَابِ ﴿۱۴﴾ وَ مَا يَنْظُرُ
هٰٓؤُلَآءِ اِلَّا صَيْحَةً وَّاحِدَةً مَّا لَهَا مِنْ
فَوَاقٍ ﴿۱۵﴾ وَ قَالُوْا رَبَّنَا عَجِّلْ لَّنَا قِطَّنَا قَبْلَ
يَوْمِ الْحِسَابِ ﴿۱۶﴾ اِصْبِرْ عَلٰى مَا يَقُوْلُوْنَ
وَاذْكُرْ عَبْدَنَا دَاوٗدَ ذَا الْاَيْدِ ۚ اِنَّهٗٓ اَوَّابٌ ﴿۱۷﴾
اِنَّا سَخَّرْنَا الْجِبَالَ مَعَهٗ يُسَبِّحْنَ بِالْعَشِيِّ وَ
الْاِشْرَاقِ ﴿۱۸﴾ وَالطَّيْرَ مَحْشُوْرَةً ؕ كُلٌّ لَّهٗٓ
اَوَّابٌ ﴿۱۹﴾ وَ شَدَدْنَا مُلْكَهٗ وَاٰتَيْنٰهُ الْحِكْمَةَ وَ
فَصْلَ الْخِطَابِ ﴿۲۰﴾ وَ هَلْ اَتٰىكَ نَبَؤُا الْخَصْمِ ۘ
اِذْ تَسَوَّرُوا الْمِحْرَابَ ﴿۲۱﴾ اِذْ دَخَلُوْا عَلٰى دَاوٗدَ
فَفَزِعَ مِنْهُمْ قَالُوْا لَا تَخَفْ ۚ خَصْمٰنِ بَغٰى
بَعْضُنَا عَلٰى بَعْضٍ فَاحْكُمْ بَيْنَنَا بِالْحَقِّ وَلَا
تُشْطِطْ وَاهْدِنَآ اِلٰى سَوَآءِ الصِّرَاطِ ﴿۲۲﴾ اِنَّ
هٰذَآ اَخِيْ ۫ لَهٗ تِسْعٌ وَّتِسْعُوْنَ نَعْجَةً وَّلِيَ
نَعْجَةٌ وَّاحِدَةٌ ۫ فَقَالَ اَكْفِلْنِيْهَا وَعَزَّنِيْ فِي
الْخِطَابِ ﴿۲۳﴾

**11 - 16** ఇది బృందాలలోని ఒక చిన్న బృందం మాత్రమే. ఇదే స్థలంలో అది పరాజయం పాలు కానున్నది.[4] వీరికి పూర్వం నూహ్ జాతివారు, ఆద్ జాతివారు, మేకుల ఫిరౌన్, సమూద్ జాతివారు, లూత్ జాతివారు, "అయికా" వారు తిరస్కరించే ఉన్నారు. వారూ బృందాలే. వాటిలో ప్రతి బృందమూ దైవసందేశ హరులు అసత్యవాదులని తిరస్కరించింది. నా శిక్షా నిర్ణయం వారికి సరిగ్గా అతికిపోయింది. వీరు కూడా కేవలం ఒక్క ప్రేలుడు కోసమే ఎదురు చూస్తున్నారు. ఆ తరువాత మరొక ప్రేలుడేదీ సంభవించదు. వారు, "మా ప్రభూ! లెక్కదినానికి ముందే మా భాగం మాకు తొందరగా ఇచ్చివెయ్యి" అని అంటున్నారు.

**17 - 26** ప్రవక్తా! వారు కల్పించే మాటల పట్ల సహనం వహించు. వారికి మా దాసుడు దావూద్ వృత్తాంతాన్ని వినిపించు. అతను గొప్ప బలవంతుడు, ప్రతి వ్యవహారంలోనూ అల్లాహ్ వైపునకు మరలుతూ ఉండేవాడు. మేము పర్వతాలను అతనికి లొంగిపోయేలా చేశాము. ఉదయం, సాయంత్రం అవి అతనితో పాటు కీర్తన చేసేవి. పక్షులు గుమిగూడేవి, అవన్నీ అతని కీర్తన వైపునకు శ్రద్ధతో మరలేవి. మేము అతని రాజ్యాన్ని శక్తిమంత మైనదిగా చేశాము. అతనికి వివేకాన్ని ప్రసాదించాము. తిరుగు లేని తీర్పు చెప్పే సామర్థ్యాన్ని అనుగ్రహించాము. ఇంకా, గోడపైకి ఎక్కి అతని మేడ గదిలోకి జొరబడిన వ్యాజ్యగాళ్ల వార్త ఏదైనా నీదాకా వచ్చిందా? వారు దావూద్ ముందుకు వచ్చినపుడు అతను వారిని చూచి కలవరపడ్డాడు. వారు ఇలా అన్నారు: "భయ పడకండి. ఒక వ్యాజ్యంలో మేము ఇద్దరం ప్రత్యర్థులం. మాలో ఒకడు మరొకనికి అన్యాయం చేశాడు. కనుక మీరు మా మధ్య సత్యం ప్రకారం సరియైన తీర్పు చెయ్యండి. అన్యాయం చేయకండి. మాకు ఋజుమార్గం చూపండి. ఇతను నా సోదరుడు, ఇతని వద్ద తొంభైతొమ్మిది గొర్రెలు ఉన్నాయి. నా దగ్గరేమో కేవలం ఒకే గొర్రె ఉన్నది. ఈ ఒక్క గొర్రెను కూడా నాకు ఇచ్చివేయి అని ఇతడు అన్నాడు. మాటలతో నన్ను వశపరచుకున్నాడు.[5]"

2. ఈ సందేశం పయోముఖ విషకుంభం లాంటిదని వారి తలంపు. వారు, "మనమంతా ముహమ్మద్ (సఅసమ్)కు లోబడి ఉండాలనేదే ఆయన మనపై అధికారం చెలాయించాలనేదే ఈ సందేశంలోని మర్మం" అని భావించారు.
3. వేరే మాటలలో చెప్పాలంటే, అల్లాహ్ ఇలా అంటున్నాడు, "ముహమ్మద్ (సఅసమ్)! ఈ ప్రజలు వాస్తవానికి నిన్ను తిరస్కరించటం లేదు, నన్ను తిరస్కరిస్తున్నారు. వారు నీ నిజాయితీని శంకించటం లేదు, నా బోధనలను మాత్రమే శంకిస్తున్నారు."

قَالَ لَقَدْ ظَلَمَكَ بِسُؤَالِ نَعْجَتِكَ اِلٰى نِعَاجِهٖ ؕ
وَ اِنَّ كَثِيْرًا مِّنَ الْخُلَطَآءِ لَيَبْغِيْ بَعْضُهُمْ عَلٰى
بَعْضٍ اِلَّا الَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا الصّٰلِحٰتِ
وَقَلِيْلٌ مَّا هُمْ ؕ وَ ظَنَّ دَاوٗدُ اَنَّمَا فَتَنّٰهُ
السجدة ١٠ فَاسْتَغْفَرَ رَبَّهٗ وَخَرَّ رَاكِعًا وَّاَنَابَ ۩ ٢٤ فَغَفَرْنَا
لَهٗ ذٰلِكَ ؕ وَ اِنَّ لَهٗ عِنْدَنَا لَزُلْفٰى وَحُسْنَ
مَاٰبٍ ٢٥ يٰدَاوٗدُ اِنَّا جَعَلْنٰكَ خَلِيْفَةً فِى
الْاَرْضِ فَاحْكُمْ بَيْنَ النَّاسِ بِالْحَقِّ وَ لَا
تَتَّبِعِ الْهَوٰى فَيُضِلَّكَ عَنْ سَبِيْلِ اللّٰهِ ؕ اِنَّ
الَّذِيْنَ يَضِلُّوْنَ عَنْ سَبِيْلِ اللّٰهِ لَهُمْ عَذَابٌ
شَدِيْدٌۢ بِمَا نَسُوْا يَوْمَ الْحِسَابِ ٢٦ ع وَ مَا خَلَقْنَا ١٢/١١
السَّمَآءَ وَ الْاَرْضَ وَ مَا بَيْنَهُمَا بَاطِلًا ؕ
ذٰلِكَ ظَنُّ الَّذِيْنَ كَفَرُوْا ۚ فَوَيْلٌ لِّلَّذِيْنَ
كَفَرُوْا مِنَ النَّارِ ٢٧ اَمْ نَجْعَلُ الَّذِيْنَ اٰمَنُوْا
وَ عَمِلُوا الصّٰلِحٰتِ كَالْمُفْسِدِيْنَ فِى الْاَرْضِ ۫
اَمْ نَجْعَلُ الْمُتَّقِيْنَ كَالْفُجَّارِ ٢٨ كِتٰبٌ
اَنْزَلْنٰهُ اِلَيْكَ مُبٰرَكٌ لِّيَدَّبَّرُوْۤا اٰيٰتِهٖ وَ
لِيَتَذَكَّرَ اُولُوا الْاَلْبَابِ ٢٩

దావూద్ ఇలా సమాధానం చెప్పాడు: "ఈ వ్యక్తి తన గొర్రెలలో నీ గొర్రెను కలుపుకోవాలని అనుకుని నిస్సందేహంగా నీకు అన్యాయం చేశాడు. యథార్థం ఏమిటంటే, కలసి ఒకచోట ఉండేవారు తరచూ ఒకరికొకరు అన్యాయం చేసుకుంటూ ఉంటారు. అయితే విశ్వసించి, సత్కార్యాలు చేసేవారు మాత్రం దీనికి దూరంగా ఉంటారు. అటువంటివారు కొందరు మాత్రమే." (ఈ విషయం అంటూ) అసలు అతన్ని పరీక్షించేందుకే మేము ఇలా చేశామని దావూద్ అర్థం చేసుకున్నాడు. కనుక అతను తన ప్రభువును క్షమాభిక్ష కోరాడు, సజ్దాలో పడిపోయాడు, పశ్చాత్తాపంతో మరలాడు. అపుడు మేము అతని తప్పును మన్నించాము.[6] నిశ్చయంగా మా వద్ద అతని కొరకు సాన్నిహిత్యం, ఉత్తమ పర్యవసానం ఉన్నాయి. (మేము అతనితో ఇలా అన్నాము), "దావూద్! మేము నిన్ను భూమిపై ప్రతినిధిగా నియమించాము. కనుక నీవు ప్రజల మధ్య న్యాయంతో పరిపాలన చెయ్యి. మనోరథాలను అనుసరించకు, ఎందుకంటే అది నిన్ను అల్లాహ్ మార్గం నుండి తప్పిస్తుంది. అల్లాహ్ మార్గం నుండి తప్పిపోయిన వారికి తీవ్రమైన శిక్ష పడటం నిశ్చయం. ఎందుకంటే, వారు లెక్కల దినాన్ని మరచి పోయారు.

**27 - 29** మేము ఈ ఆకాశాన్నీ, ఈ భూమినీ వాటి మధ్య ఉన్న ఈ ప్రపంచాన్నీ వృథాగా సృజించలేదు. ఇది అవిశ్వాసుల భ్రమమాత్రమే. అటువంటి అవిశ్వాసులకు నరకాగ్ని ద్వారా వినాశం తప్పదు. విశ్వసించి సత్కార్యాలు చేసేవారినీ, ధరణిపై కల్లోలాన్ని రేకెత్తించే వారినీ మేము ఒకటిగా చేసెయ్యాలా? భయభక్తులు కలవారిని మేము పాపాత్ములు మాదిరిగా చేయాలా? – (ప్రవక్తా!) మేము ఎంతో శుభవంతమైన ఈ గ్రంథాన్ని నీపై అవతరింపజేశాము; ప్రజలు దాని వాక్యాలను గురించి ఆలోచించాలనీ, బుద్ధిమంతులూ, ఆలోచనాపరులూ దానినుండి గుణపాఠం నేర్చుకోవాలనీని.

4. "ఇదే స్థలం" అనేది పరోక్షంగా మక్కా నగరాన్ని సూచిస్తున్నది. అంటే, ఏ స్థలంలోనైతే వారు ఈ లేనిపోని మాటలను చెబుతున్నారో, అదే స్థలంలో వారు పరాజితులయ్యే రోజు రానున్నది. వారు ఈనాడు ఏ వ్యక్తిని అల్పుడుగా భావించి ప్రవక్తగా విశ్వసించటానికి తిరస్కరిస్తున్నారో, ఆ వ్యక్తి ముందు తలలు వంచి నిలబడే రోజు రానున్నది.

وَ وَهَبْنَا لِدَاوٗدَ سُلَيْمٰنَ ؕ نِعْمَ الْعَبْدُ ؕ اِنَّهٗۤ
اَوَّابٌ ﴿٣٠﴾ اِذْ عُرِضَ عَلَيْهِ بِالْعَشِيِّ الصّٰفِنٰتُ
الْجِيَادُ ﴿٣١﴾ فَقَالَ اِنِّيْۤ اَحْبَبْتُ حُبَّ الْخَيْرِ عَنْ
ذِكْرِ رَبِّيْ ۚ حَتّٰى تَوَارَتْ بِالْحِجَابِ ﴿٣٢﴾
رُدُّوْهَا عَلَيَّ ؕ فَطَفِقَ مَسْحًۢا بِالسُّوْقِ وَ
الْاَعْنَاقِ ﴿٣٣﴾ وَ لَقَدْ فَتَنَّا سُلَيْمٰنَ وَ اَلْقَيْنَا عَلٰى
كُرْسِيِّهٖ جَسَدًا ثُمَّ اَنَابَ ﴿٣٤﴾ قَالَ رَبِّ
اغْفِرْ لِيْ وَهَبْ لِيْ مُلْكًا لَّا يَنْۢبَغِيْ لِاَحَدٍ مِّنْۢ
بَعْدِيْ ۚ اِنَّكَ اَنْتَ الْوَهَّابُ ﴿٣٥﴾ فَسَخَّرْنَا لَهُ
الرِّيْحَ تَجْرِيْ بِاَمْرِهٖ رُخَآءً حَيْثُ اَصَابَ ﴿٣٦﴾
وَ الشَّيٰطِيْنَ كُلَّ بَنَّآءٍ وَّ غَوَّاصٍ ﴿٣٧﴾ وَّ اٰخَرِيْنَ
مُقَرَّنِيْنَ فِي الْاَصْفَادِ ﴿٣٨﴾ هٰذَا عَطَآؤُنَا
فَامْنُنْ اَوْ اَمْسِكْ بِغَيْرِ حِسَابٍ ﴿٣٩﴾ وَ اِنَّ لَهٗ
عِنْدَنَا لَزُلْفٰى وَ حُسْنَ مَاٰبٍ ﴿٤٠﴾ ع ٣ ١٢

**30 - 40** దావూద్‌కు మేము సులైమాన్ (వంటి కొడుకు)ను ప్రసాదించాము; అతను మంచిదాసుడు, అత్యధికంగా తన ప్రభువు వైపునకు మరలుతూ ఉండేవాడు. బాగా తర్ఫీదు పొందిన అతివేగంగా పరుగెత్తే గుర్రాలు అతని ముందుకు తీసుకురాబడినప్పటి ఆ సాయంత్ర సమయం ప్రస్తావించదగినది. అప్పుడు అతను ఇలా అన్నాడు: "నేను ఈ సంపదను నా ప్రభువు సంస్మరణార్థం ప్రేమించాను." చివరికి ఆ గుర్రాలు కనుమరుగైపోయినపుడు, "వాటిని నా వద్దకు తిరిగి తీసుకు రండి" (అని ఆజ్ఞాపించాడు). తరువాత అతను వాటి పిక్కలనూ, మెడలనూ నిమురసాగాడు. (చూడండి) మేము సులైమాన్‌ను కూడా పరీక్షకు గురిచేశాము. అతని సింహాసనంపై ఒక కళేబరాన్ని తెచ్చి పడవేశాము. అప్పుడు అతను (అల్లాహ్ వైపునకు) మరలి ఇలా అన్నాడు: "నా ప్రభూ! నన్ను క్షమించు. నా తరువాత మరెవ్వరికీ లభించని రాజ్యాధికారాన్ని నాకు ప్రసాదించు. నిస్సందేహంగా అసలు దాతవు నీవే."[7] అప్పుడు మేము గాలిని అతని వశం చేశాము. అది అతని ఆజ్ఞానుసారం అతను కోరిన వైపునకు మృదువుగా వీచేది. మేము షైతానులను అతని అధీనంలో ఉంచాము. వాటిలో నిర్మాణం చేసేవీ, నీటిలో మునిగి వెదికేవీ, సంకెళ్లతో బంధింపబడిన ఇతరమైనవి కూడా ఉన్నాయి. (మేము అతనితో ఇలా అన్నాము), "ఇది మా అనుగ్రహం, నీకు ఇష్టమైన వాడికి దానిని ఇచ్చివేయి. నీకు ఇష్టం కాని వాడికి ఇవ్వకు, నీకు ఆ అధికారం ఉన్నది. లెక్క అడగటం ఉండదు." నిశ్చయంగా అతనికి మా వద్ద సమీప స్థానమూ ఉత్తమ ఫలితమూ ఉన్నాయి.

5. ఫిర్యాది, "నా గొర్రెను బలవంతంగా తీసుకున్నాడు" అని చెప్పలేదు, కాని, నా గొర్రెను కూడ తనకివ్వమని అడిగాడు, దానిని తనకు స్వాధీనం చేయవలసినదిగా కోరాడు. తాను పలుకుబడి, అధికారం గల వ్యక్తికాబట్టి, నాపై ఈ విషయంలో ఒత్తిడి తెచ్చాడు.

6. దీనిద్వారా తెలిసేది ఏమిటంటే, హజ్రత్ దావూద్ చేసింది నిజంగా తప్పే. అది గొర్రెల వారి వ్యాజ్యమును ఎంతో కొంత పోలి ఉన్నది. కనుక దానికి సంబంధించిన తీర్పును వినిపించేటప్పుడు, "నేను పరీక్షించబడుతున్నాను" అనే తలంపు ఆయనకు కలిగింది. ఆయన చేసిన తప్పు క్షమించరానంతటి తీవ్రమైనది కాదు. ఒకవేళ దానిని క్షమించినా క్షమించకపోయినా ఆయన ఉన్నత స్థానానికి భంగం కలిగి ఉండేది కాదు. అల్లాహ్‌యే స్వయంగా ఇలా వివరిస్తున్నాడు : ఆయన సాష్టాంగపడి, పశ్చాత్తాపపడినపుడు ఆయనను మన్నించటం జరిగింది. అంతేకాదు, ఇహపరలోకాలలో ఆయనకున్న ఉన్నత స్థానం కూడ ఏమాత్రం చెక్కుచెదరలేదు.

وقف لازم

وَاذْكُرْ عَبْدَنَآ اَيُّوْبَ ۘ اِذْ نَادٰى رَبَّهٗٓ اَنِّىْ
مَسَّنِىَ الشَّيْطٰنُ بِنُصْبٍ وَّ عَذَابٍ ﴿٤١﴾ اُرْكُضْ
بِرِجْلِكَ ۚ هٰذَا مُغْتَسَلٌۢ بَارِدٌ وَّ شَرَابٌ ﴿٤٢﴾
وَوَهَبْنَا لَهٗٓ اَهْلَهٗ وَ مِثْلَهُمْ مَّعَهُمْ رَحْمَةً مِّنَّا
وَذِكْرٰى لِاُولِى الْاَلْبَابِ ﴿٤٣﴾ وَ خُذْ بِيَدِكَ
ضِغْثًا فَاضْرِبْ بِّهٖ وَلَا تَحْنَثْ ؕ اِنَّا وَجَدْنٰهُ
صَابِرًا ؕ نِعْمَ الْعَبْدُ ؕ اِنَّهٗٓ اَوَّابٌ ﴿٤٤﴾ وَ اذْكُرْ
عِبٰدَنَآ اِبْرٰهِيْمَ وَ اِسْحٰقَ وَيَعْقُوْبَ اُولِى
الْاَيْدِىْ وَ الْاَبْصَارِ ﴿٤٥﴾ اِنَّآ اَخْلَصْنٰهُمْ
بِخَالِصَةٍ ذِكْرَى الدَّارِ ۚ ﴿٤٦﴾ وَ اِنَّهُمْ عِنْدَنَا
لَمِنَ الْمُصْطَفَيْنَ الْاَخْيَارِ ؕ ﴿٤٧﴾ وَاذْكُرْ اِسْمٰعِيْلَ
وَ الْيَسَعَ وَ ذَا الْكِفْلِ ؕ وَكُلٌّ مِّنَ الْاَخْيَارِ ؕ ﴿٤٨﴾
هٰذَا ذِكْرٌ ؕ وَ اِنَّ لِلْمُتَّقِيْنَ لَحُسْنَ مَاٰبٍ ۙ ﴿٤٩﴾
جَنّٰتِ عَدْنٍ مُّفَتَّحَةً لَّهُمُ الْاَبْوَابُ ۚ ﴿٥٠﴾ مُتَّكِـِٕيْنَ
فِيْهَا يَدْعُوْنَ فِيْهَا بِفَاكِهَةٍ كَثِيْرَةٍ وَّ
شَرَابٍ ﴿٥١﴾ وَعِنْدَهُمْ قٰصِرٰتُ الطَّرْفِ اَتْرَابٌ ﴿٥٢﴾
الثلثة
هٰذَا مَا تُوْعَدُوْنَ لِيَوْمِ الْحِسَابِ ﴿٥٣﴾ اِنَّ هٰذَا
لَرِزْقُنَا مَا لَهٗ مِنْ نَّفَادٍ ۚ ﴿٥٤﴾

**41 - 44** మా దాసుడు అయ్యూబ్‌ను గురించి ప్రస్తావించు; అప్పుడు అతను, "షైతాన్ నన్ను దుఃఖానికీ, యాతనకూ గురి చేశాడు,[8]" అని తన ప్రభువునకు మొరపెట్టుకున్నాడు. (మేము అతనికి ఇలా ఆజ్ఞాపించాము), "నీ కాలుతో నేలపై కొట్టు; ఇదో చల్లని నీరు; స్నానానికీ, త్రాగటానికీను." మేము అతనికి అతని కుటుంబాన్ని తిరిగి ఇచ్చాము. వారితో పాటు ఇంకా అంతమందిని కూడా ఇచ్చాము, మా తరఫు నుండి కారుణ్యం గానూ, బుద్ధీ యోచన కలవారి కొరకు హితబోధగా ఉండేం దుకు. (మేము అతనితో ఇలా అన్నాము), "గుప్పెడు పుల్లలు తీసుకో, వాటితో కొట్టు, నీ ఒట్టును భగ్నం చేయకు,"[9] మేము అతనిని సహనశీలునిగా చూశాము; అతను మంచిదాసుడు, తన ప్రభువు వైపునకు ఎక్కువగా మరలుతూ ఉండేవాడు.

**45 - 48** మా దాసులైన ఇబ్రాహీమ్, ఇస్‌హాఖ్, యాఖూబ్‌లను గురించి ప్రస్తావించు. వారు గొప్ప కార్యశీలురు, దూరదృష్టికల వారు. మేము వారిని ఒక విశిష్టగుణం కారణంగా ఎన్నుకు న్నాము- అది వారిలోని పరలోక చింతన. నిశ్చయంగా మా దృష్టిలో వారు ఎన్నుకోబడిన పుణ్యపురుషులలో పరిగణింపబడ తారు. ఇస్మాయీల్, అల్‌యస్అ, జుల్‌కిఫ్లలను గురించి ప్రస్తావించు; వారందరూ పుణ్యపురుషులలోని వారు.

**49 - 54** ఇది ఒక ప్రస్తావన: (ఇక వినండి) భయభక్తులు కలవారి కొరకు నిశ్చయంగా ఉత్తమ నివాసం ఉన్నది; శాశ్వత మైన స్వర్గవనాలు ఉన్నాయి; వాటి ద్వారాలు వారి కొరకు తెరువబడి ఉంటాయి; వాటిలో వారు దిండ్లకు ఆనుకుని కూర్చుంటారు; ఎక్కువగా పండ్లనూ పానీయాలనూ కోరుతూ ఉంటారు; వారి ప్రక్కన సమవయస్కులైన, లజ్జావతులైన భార్యలు ఉంటారు. ఈ వస్తువులే లెక్కల రోజున మీకు ప్రసాదించబడతాయని వాగ్దానం చేయబడుతోంది. ఇది మా ప్రసాదం, ఇది అనంతం.

7. గ్రంథంలోని సందర్భాన్నిబట్టి, ఇక్కడ ఈ విషయాన్ని చెప్పటం దేవుని అభిమతం అనే విషయం స్పష్టం; ఉన్నత శ్రేణికి చెందిన, తనకు అత్యంత ప్రీతిపాత్రులైన సేవకులు హ॥జత్ దావూద్, హ॥జత్ సులైమాన్‌లను కూడ దేవుడు సంజాయిషీ అడగకుండా వదలిపెట్టలేదు. ఏ పరీక్షను గురించి ఇక్కడ ప్రస్తావించటం జరిగిందో, ఆ పరీక్షకు సంబంధించిన, వ్యాఖ్యాతలందరూ ఏకాభిప్రాయం కలిగిన విశ్వసనీయమైన వివరాలు మనకు తెలియవు. కాని హ॥జత్ సులైమాన్ చేసిన ప్రార్థనలోని "నా ప్రభూ! నన్ను మన్నించు. నా తరువాత మరెవరూ పొందలేని

هٰذَا ۭ وَ اِنَّ لِلطّٰغِيْنَ لَشَرَّ مَاٰبٍ ﴿٥٥﴾ جَهَنَّمَ
يَصْلَوْنَهَا ۚ فَبِئْسَ الْمِهَادُ ﴿٥٦﴾ هٰذَا ۙ فَلْيَذُوْقُوْهُ
حَمِيْمٌ وَّغَسَّاقٌ ﴿٥٧﴾ وَّ اٰخَرُ مِنْ شَكْلِهٖٓ
اَزْوَاجٌ ﴿٥٨﴾ هٰذَا فَوْجٌ مُّقْتَحِمٌ مَّعَكُمْ ۚ لَا
مَرْحَبًۢا بِهِمْ ۭ اِنَّهُمْ صَالُوا النَّارِ ﴿٥٩﴾ قَالُوْا بَلْ
اَنْتُمْ ۣ لَا مَرْحَبًۢا بِكُمْ ۭ اَنْتُمْ قَدَّمْتُمُوْهُ لَنَا ۚ
فَبِئْسَ الْقَرَارُ ﴿٦٠﴾ قَالُوْا رَبَّنَا مَنْ قَدَّمَ لَنَا
هٰذَا فَزِدْهُ عَذَابًا ضِعْفًا فِي النَّارِ ﴿٦١﴾ وَ قَالُوْا
مَا لَنَا لَا نَرٰى رِجَالًا كُنَّا نَعُدُّهُمْ مِّنَ
الْاَشْرَارِ ﴿٦٢﴾ اَتَّخَذْنٰهُمْ سِخْرِيًّا اَمْ زَاغَتْ
عَنْهُمُ الْاَبْصَارُ ﴿٦٣﴾ اِنَّ ذٰلِكَ لَحَقٌّ تَخَاصُمُ
اَهْلِ النَّارِ ﴿٦٤﴾ ع ٢٤ ١٣

**55 - 64** ఇది భయభక్తులు కలవారి పర్యవసానం. ఇక తలబిరుసుతనం కలవారికి అతి చెడ్డ నివాసం ఉన్నది, అది నరకం; అందులో వారు కాల్చబడుతూ ఉంటారు. అది బహు చెడ్డ నివాస స్థలం. ఇదీ వారికి లభించేది; కనుక వారు సలసల మరిగే నీటినీ, చీము, నెత్తురులనూ, ఇంకా ఇటువంటి చేదు పదార్థాలనూ రుచి చూడాలి. (తమ అనుచరులు నరకం వైపునకు రావటాన్ని చూచి వారు పరస్పరం ఇలా అనుకుంటారు) "ఇది ఒక సైన్యం, మీ వైపునకు తోసుకుంటూ వస్తోంది. వారికి స్వాగతం పలకటం అనేదిలేదు, వారు అగ్నిలో కాలే వాళ్లు" వారు వీరితో ఇలా అంటారు: "లేదు, స్వయంగా మీరే కాల్చబడుతున్నారు. మీకు ఏ స్వాగతమూ లేదు. ఈ పర్యవసానాన్ని మా ముందుకు తెచ్చింది మీరేకదా! ఎంత పాపిష్ఠ నివాస స్థలం ఇది." వారు ఇంకా ఇలా అంటారు: "మా ప్రభూ! మమ్మల్ని ఈ దుష్పరిణామానికి చేరవేసే ఏర్పాట్లు చేసిన వాడికి రెట్టింపు నరక శిక్షను ఇవ్వు." తరువాత వారు ఒకరితో ఒకరు ఇలా అనుకుంటారు, "ఏమిటి ఈ విశేషం! మనం ప్రపంచంలో చెడ్డవారుగా భావించినవారు మనకు ఎక్కడా కనిపించరే? మనం ఊరికే వారిని ఎగతాళి చేశామా లేక వారు మనకు కనుమరుగయ్యారా?" నిస్సందేహంగా ఇది నిజం; నరకవాసుల మధ్య ఇటువంటి తగాదాలే జరుగుతాయి.

---

సామ్రాజ్యాన్ని నాకు ప్రసాదించు" అన్న మాటలనూ, ఇస్రాయీల్ సంతతి వారి చరిత్రనూ దృష్టిలో పెట్టుకుని చూస్తే, ఇలా అనిపిస్తుంది; తన తరువాత తన కుమారుడు వారసుడు కావాలనీ ప్రభుత్వమూ, రాజ్యాధిపత్యమూ మున్ముందు కూడ తన వంశీయులకే ఉండాలనీ బహుశా ఆయన తన మనస్సులో కోరుకుని ఉండవచ్చు. దీనినే అల్లాహ్ ఆయన విషయంలో ఒక పరీక్ష అన్నాడు. తన వారసుడైన 'రహూబామ్' అయోగ్యుడైన యువకునిగా రూపొందినప్పుడు, అతడు దావూద్, సులైమాన్‌ల సామ్రాజ్యాన్ని నాలుగు రోజులు కూడా నిలుపుకోలేడు అనే విషయాన్ని అతని లక్షణాలు స్పష్టం చేస్తున్నప్పుడు ఆయన గ్రహించగలిగారు. ఆయన సింహాసనంపై ఒక కళేబరాన్ని తెచ్చిపడవేసే దాని భావం బహుశా తన సింహాసనంపై తన వారసుడుగా కూర్చోబెట్టాలని ఆయన అనుకున్న ఆ కుమారుడు ఒక అయోగ్యుడే అని.

8. షైతాను నన్ను వ్యాధికి గురిచేశాడు, నాకు అనేక ఆపదలు కలిగించాడు అని దీని అర్థం కాదు. కాని దీని అర్థం ఇది; వ్యాధితీవ్రత, ఆస్తిపాస్తుల నష్టం, అయినవారందరూ నన్ను ఏకాకిగా చేయటం - వీటి కారణంగా నేను ఏ బాధలకు, ఏ శిక్షకు గురిఅయ్యానో, దానికంటే ఎక్కువ బాధకు నన్ను గురిచేసిన విషయం ఏమిటంటే, షైతాను తన చెడు తలంపులతో నన్ను హింసించటం, ఈ క్లిష్ట పరిస్థితులలో వాడు నన్ను నా ప్రభువు పట్ల నిరాశచెందేలా చేయటానికి ప్రయత్నించటం, నన్ను నా ప్రభువుకు కృతఘ్నుడుగా చేయగోరటం, నేను సహనాన్ని కోల్పోయేలా చేయటానికి వాడు నా వెంటపడటం.

قُلْ اِنَّمَآ اَنَا مُنْذِرٌ ۖ وَّ مَا مِنْ اِلٰهٍ اِلَّا اللّٰهُ
الْوَاحِدُ الْقَهَّارُ ﴿۶۵﴾ رَبُّ السَّمٰوٰتِ وَ الْاَرْضِ
وَمَا بَيْنَهُمَا الْعَزِيْزُ الْغَفَّارُ ﴿۶۶﴾ قُلْ هُوَ نَبَؤٌا
عَظِيْمٌ ﴿۶۷﴾ اَنْتُمْ عَنْهُ مُعْرِضُوْنَ ﴿۶۸﴾ مَا كَانَ لِيَ
مِنْ عِلْمٍ بِالْمَلَاِ الْاَعْلٰٓى اِذْ يَخْتَصِمُوْنَ ﴿۶۹﴾ اِنْ
يُّوْحٰٓى اِلَيَّ اِلَّآ اَنَّمَآ اَنَا نَذِيْرٌ مُّبِيْنٌ ﴿۷۰﴾ اِذْ
قَالَ رَبُّكَ لِلْمَلٰٓئِكَةِ اِنِّيْ خَالِقٌۢ بَشَرًا مِّنْ
طِيْنٍ ﴿۷۱﴾ فَاِذَا سَوَّيْتُهٗ وَ نَفَخْتُ فِيْهِ مِنْ
رُّوْحِيْ فَقَعُوْا لَهٗ سٰجِدِيْنَ ﴿۷۲﴾ فَسَجَدَ الْمَلٰٓئِكَةُ
كُلُّهُمْ اَجْمَعُوْنَ ﴿۷۳﴾ اِلَّآ اِبْلِيْسَ ؕ اِسْتَكْبَرَ وَ
كَانَ مِنَ الْكٰفِرِيْنَ ﴿۷۴﴾ قَالَ يٰٓاِبْلِيْسُ مَا
مَنَعَكَ اَنْ تَسْجُدَ لِمَا خَلَقْتُ بِيَدَيَّ ؕ
اَسْتَكْبَرْتَ اَمْ كُنْتَ مِنَ الْعَالِيْنَ ﴿۷۵﴾ قَالَ اَنَا
خَيْرٌ مِّنْهُ ؕ خَلَقْتَنِيْ مِنْ نَّارٍ وَّ خَلَقْتَهٗ مِنْ
طِيْنٍ ﴿۷۶﴾ قَالَ فَاخْرُجْ مِنْهَا فَاِنَّكَ رَجِيْمٌ ﴿۷۷﴾ وَّ
اِنَّ عَلَيْكَ لَعْنَتِيْٓ اِلٰى يَوْمِ الدِّيْنِ ﴿۷۸﴾ قَالَ
رَبِّ فَاَنْظِرْنِيْٓ اِلٰى يَوْمِ يُبْعَثُوْنَ ﴿۷۹﴾ قَالَ
فَاِنَّكَ مِنَ الْمُنْظَرِيْنَ ﴿۸۰﴾ اِلٰى يَوْمِ الْوَقْتِ
الْمَعْلُوْمِ ﴿۸۱﴾ قَالَ فَبِعِزَّتِكَ لَاُغْوِيَنَّهُمْ
اَجْمَعِيْنَ ﴿۸۲﴾ اِلَّا عِبَادَكَ مِنْهُمُ الْمُخْلَصِيْنَ ﴿۸۳﴾
قَالَ فَالْحَقُّ ۫ وَ الْحَقَّ اَقُوْلُ ﴿۸۴﴾ لَاَمْلَئَنَّ
جَهَنَّمَ مِنْكَ وَمِمَّنْ تَبِعَكَ مِنْهُمْ اَجْمَعِيْنَ ﴿۸۵﴾

**65 - 68** (ప్రవక్తా!) వారితో ఇలా అను, "నేను కేవలం హెచ్చరిక చేసేవాణ్ణి మాత్రమే. అల్లాహ్ తప్ప నిజమైన ఆరాధ్య దైవం ఎవ్వడూ లేడు, ఆయన అద్వితీయుడు, అందరిపై ఆధిక్యం కలవాడు, ఆకాశాలకూ, భూమికీ స్వామి, వాటి మధ్య ఉన్న సకల వస్తువులకూ ప్రభువు, మహాశక్తిమంతుడు, క్షమించే వాడు." వారితో ఇంకా ఇలా అను: "ఇది ఒక గొప్ప వార్త. దానిని విని కూడా మీరు పెడముఖం పెడుతున్నారు."

**69 - 85** (వారితో ఇలా అను), "ఉన్నత స్థాయిలో ఉన్నవారి మధ్య వివాదం జరిగినప్పటి సమయం గురించి నాకు ఏమీ తెలియదు. నేను స్పష్టంగా బహిరంగంగా హెచ్చరిక చేసేవాణ్ణి అయినందువల్లనే ఈ విషయాలు వహీ ద్వారా నాకు తెలుప బడుతున్నాయి." నీ ప్రభువు దైవదూతలతో ఇలా అన్నాడు, "నేను మట్టితో ఒక మనిషిని సృజించబోతున్నాను. అతని సృష్టిని పూర్తిచేసిన తరువాత, నేను అతనిలోకి నా ఆత్మను ఊదుతాను, అపుడు మీరు అతని ముందు మోకరిల్లి సజ్దా చేయండి." ఈ ఆజ్ఞ ప్రకారం దైవదూతలందరూ సజ్దా చేశారు. కాని ఇబ్లీస్ తాను గొప్పవాడినని గర్వించాడు; అతడు తిరస్కారులలో కలిసిపోయాడు. ప్రభువు ఇలా సెలవిచ్చాడు, "ఇబ్లీస్! నేను నా రెండు చేతులతో సృజించినవానికి సజ్దా చెయ్యకుండా నిన్ను ఏ విషయం ఆపింది? నీవు గొప్ప వాడివై పోయావా లేదా ఉన్నత శ్రేణికి చెందినవారిలోని వాడవా?" అతడు ఇలా సమాధానం చెప్పాడు: "నేను అతడి కంటె శ్రేష్ఠుణ్ణి. మీరు నన్ను అగ్నితో పుట్టించారు. ఇతన్నేమో మట్టితో సృష్టించారు." ఇలా సెలవిచ్చాడు : "సరే, ఇక్కడ నుండి వెళ్లిపో. నీవు శపించబడ్డావు. నీ మీద నా శాపం ప్రతిఫలదినం వచ్చే వరకూ ఉంటుంది." అతడు ఇలా అన్నాడు: "ప్రభూ! అలా అయితే వారు మళ్లీ లేపబడే దినం వరకూ నాకు గడువు ఇవ్వు." ఇలా సెలవిచ్చాడు, "సరే, ఆ రోజు వరకూ నీకు గడువు ఉంది. అది వచ్చే కాలం నాకు తెలుసు." అతడు ఇలా అన్నాడు, "నీ గౌరవం సాక్షిగా! నేను వారందరినీ మార్గ భ్రష్టులుగా చేసి తీరుతాను, నీవు ప్రత్యేకంగా ఎన్నుకున్న దాసులను తప్ప." ఇలా సెలవిచ్చాడు, "కనుక సత్యం ఇదే; నేను సత్యాన్నే పలుకుతాను. నీతోనూ, ఈ మానవులలో నిన్ను అనుసరించే వారందరితోనూ నరకాన్ని నింపుతాను."

قُلْ مَآ اَسْـَٔلُكُمْ عَلَيْهِ مِنْ اَجْرٍ وَّ مَآ اَنَا مِنَ
الْمُتَكَلِّفِيْنَ ﴿٨٦﴾ اِنْ هُوَ اِلَّا ذِكْرٌ لِّلْعٰلَمِيْنَ ﴿٨٧﴾
وَلَتَعْلَمُنَّ نَبَاَهٗ بَعْدَ حِيْنٍ ﴿٨٨﴾

**86 - 88** ప్రవక్తా! వారితో ఇలా అను, "నేను ఈ ధర్మ ప్రచారానికి మీనుండి ఎటువంటి ప్రతిఫలాన్నీ కోరను, నేను వంచకులలోని వాడను కాను. ఇది ఒక హితబోధ, విశ్వ ప్రజలందరికినీ, అచిర కాలంలోనే మీకు స్వయంగా దీని పరిస్థితి ఏమిటో తెలిసిపోతుంది."

9. సావధానంగా ఈ మాటలను గమనించినట్లయితే, స్పష్టమయ్యే విషయం ఏమిటంటే, ప్రవక్త హజ్రత్ అయ్యూబ్ వ్యాధిగ్రస్తులైనప్పుడు కోపంలో ఎవరినో కొడతానని శపథం చేశారు. (ఒక సంప్రదాయం ప్రకారం తన భార్యను కొడతాననే శపథం చేశారు) ఆ శపథం చేసేటప్పుడే ఆయన "నిన్ను ఇన్ని దెబ్బలు కొడతాను" అని అన్నారు. అల్లాహ్ ఆయనకు పరిపూర్ణ ఆరోగ్యాన్ని ప్రసాదించినప్పుడు, అనారోగ్య స్థితిలో కలిగిన కోపం పటాపంచలైనప్పుడు, ఆయన శపథాన్ని నెరవేరిస్తే అన్యాయంగా ఒక నిర్దోషిని బాధించినట్లవుతుంది, శపథం పూర్తి చేయకపోతే పాపం చేసినట్లు అవుతుంది అని ఆందోళనపడ్డారు. ఈ కష్టం నుండి అల్లాహ్ ఆయనను ఈ విధంగా గట్టెక్కించాడు; "ఒక చీపురుకట్టను తీసుకో, నీవు ఎన్ని దెబ్బలు కొడతానని ఒట్టుబెట్టుకొన్నావో, అన్ని పుల్లలు అందులో ఉండాలి. ఆ చీపురుకట్టతో ఆ వ్యక్తిని ఒక్కసారి కొట్టు. దానివల్ల నీ శపథమూ నెరవేరుతుంది, ఆ వ్యక్తికి ఎక్కువ బాధా కలగదు" అని ఆజ్ఞాపించాడు.

## 39. అజ్ జుమర్

ఆయతులు 75 | అవతరణ మక్కాలో

۳۹ سُوْرَةُ الزُّمَرِ مَكِّيَّةٌ ۵۹

اٰیاتھا ۷۵ | رکوعاتھا ۸

*అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

تَنْزِيْلُ الْكِتٰبِ مِنَ اللّٰهِ الْعَزِيْزِ الْحَكِيْمِ ①
اِنَّاۤ اَنْزَلْنَاۤ اِلَيْكَ الْكِتٰبَ بِالْحَقِّ فَاعْبُدِ اللّٰهَ
مُخْلِصًا لَّهُ الدِّيْنَ ② اَلَا لِلّٰهِ الدِّيْنُ
الْخَالِصُ ؕ وَ الَّذِيْنَ اتَّخَذُوْا مِنْ دُوْنِهٖۤ
اَوْلِيَآءَ ۘ مَا نَعْبُدُهُمْ اِلَّا لِيُقَرِّبُوْنَاۤ اِلَى اللّٰهِ
زُلْفٰى ؕ اِنَّ اللّٰهَ يَحْكُمُ بَيْنَهُمْ فِيْ مَا هُمْ فِيْهِ
يَخْتَلِفُوْنَ ؕ۬ اِنَّ اللّٰهَ لَا يَهْدِيْ مَنْ هُوَ كٰذِبٌ
كَفَّارٌ ③ لَوْ اَرَادَ اللّٰهُ اَنْ يَّتَّخِذَ وَلَدًا
لَّاصْطَفٰى مِمَّا يَخْلُقُ مَا يَشَآءُ ۙ سُبْحٰنَهٗ ؕ هُوَ
اللّٰهُ الْوَاحِدُ الْقَهَّارُ ④ خَلَقَ السَّمٰوٰتِ وَ
الْاَرْضَ بِالْحَقِّ ۚ يُكَوِّرُ الَّيْلَ عَلَى النَّهَارِ وَ
يُكَوِّرُ النَّهَارَ عَلَى الَّيْلِ وَ سَخَّرَ الشَّمْسَ
وَالْقَمَرَ ؕ كُلٌّ يَّجْرِيْ لِاَجَلٍ مُّسَمًّى ؕ اَلَا هُوَ
الْعَزِيْزُ الْغَفَّارُ ⑤

وقف لازم

**1** ఈ గ్రంథం మహాశక్తి సంపన్నుడూ, మహా వివేకవంతుడూ అయిన అల్లాహ్ తరఫు నుండి అవతరించింది.

**2 - 3** (ఓ ప్రవక్తా!) మేము ఈ గ్రంథాన్ని సత్యంతో నీపై అవతరింప జేశాము. కనుక నీవు ధర్మాన్ని అల్లాహ్‌కే ప్రత్యేకిస్తూ అల్లాహ్‌కు మాత్రమే దాస్యం చెయ్యి. జాగ్రత్త! ధర్మం ప్రత్యేకంగా అల్లాహ్‌కు చెందిన హక్కు మాత్రమే. ఇక ఆయనను వదలివేసి ఇతరులను సంరక్షకులుగా చేసుకున్న వారు, (తమ ఈ చర్యకు కారణంగా) “వారు మమ్మల్ని అల్లాహ్ వద్దకు చేరుస్తారని మాత్రమే మేము వారిని ఆరాధిస్తున్నాము” అని అంటారు. అల్లాహ్ నిశ్చయంగా వారి మధ్యన వారు విభేదిస్తున్న అన్ని విషయాలను గురించి తీర్పు చెబుతాడు. అసత్యవాదీ, సత్య ధిక్కారీ అయిన ఏ వ్యక్తికీ అల్లాహ్ సన్మార్గం చూపడు.

**4 - 6** ఒకవేళ అల్లాహ్ ఎవరినైనా తన కుమారుడుగా చేసుకోదలిస్తే, తన సృష్టిలో తాను కోరిన వారిని ఎన్నుకుని ఉండేవాడు. ఆయన పరిశుద్ధుడు. (ఆయనకు కుమారుడు ఉంటాడు అనే విషయానికి) అతీతుడు. ఆయన అల్లాహ్ ఒక్కడే, అందరిపై ఆధిక్యం కలవాడు. ఆయన ఆకాశాలనూ, భూమినీ సత్యంతో సృష్టించాడు. ఆయనే పగటిని రేయితోనూ, రేయిని పగటితోనూ చుట్టివేస్తాడు. ఆయనే సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ నియమబద్ధులుగా చేసి ఉంచాడు. వాటిలో ప్రతి ఒక్కటీ ఒక నిర్ణీతకాలం వరకు సంచరిస్తూ వుంటుంది. తెలుసుకోండి, ఆయన మహాశక్తిమంతుడు మరియు మన్నించేవాడూను.

మిమ్మల్ని ఒకే ప్రాణి నుండి పుట్టించినవాడు ఆయనే, తిరిగి ఆయనే ఆ ప్రాణి నుండి దాని జంటను సృజించాడు. ఇంకా ఆయనే మీ కొరకు పశువులలో ఎనిమిది మగ, ఆడ జాతులను సృష్టించాడు.[1] ఆయన మీ తల్లుల గర్భాలలో మూడేసి చీకటి తెరలలో మీకు ఒక రూపం తరువాత మరొక రూపాన్ని ఇస్తూ పోతున్నాడు.[2] (ఈ కార్యాలు నిర్వహించే) ఈ దేవుడే మీ ప్రభువు, సృష్టి సామ్రాజ్యం ఆయనదే. ఆయన తప్ప మరొక దేవుడు ఎవ్వడూ లేడు. అలాంటప్పుడు మీరు ఎలా మరలింప బడుతున్నారు?

**7** ఒకవేళ మీరు తిరస్కార వైఖరిని అవలంబిస్తే అల్లాహ్ మీ అక్కర ఎంత మాత్రం లేనివాడు. కాని ఆయన తన దాసులు తిరస్కార వైఖరిని అవలంబించటాన్ని ఇష్టపడడు. ఒకవేళ మీరు కృతజ్ఞతలు తెలిపితే, దాన్ని ఆయన మీ కొరకు ఇష్ట పడతాడు. బరువు మోసేవాడెవ్వడూ ఇతరుల బరువును మోయడు. చివరకు మీరందరూ మీ ప్రభువు వైపునకే మరల వలసి ఉంది. అప్పుడు ఆయన మీకు మీరు ఏమేమి చేస్తూ ఉండేవారో తెలుపుతాడు. ఆయన హృదయాల స్థితిని సైతం ఎరుగును.

**8 - 9** మనిషిపైకి ఎప్పుడైనా ఏదైనా ఆపద వచ్చిపడితే, అతడు తన ప్రభువు వైపునకు మరలి ఆయనకు మొఱ పెట్టు కుంటాడు. తరువాత అతడి ప్రభువు అతడికి తన అనుగ్రహాన్ని ప్రసాదించినపుడు, అతడు గతంలో ఏ ఆపదను గురించి మొఱపెట్టుకున్నాడో, ఆ ఆపదను మరచి పోయి, ఇతరులను అల్లాహ్‌కు సమానులుగా నిలబెడతాడు. ఈ విధంగా అతడు (ప్రజలను కూడా) అల్లాహ్ మార్గం నుండి తప్పిస్తాడు. (ఓ ప్రవక్తా!) అతడితో, "కొన్నాళ్ళపాటు నీ తిరస్కార వైఖరి ద్వారా ఆనందాన్ని అనుభవించు. చివరకు నీవు తప్పకుండా నరకానికి పోయేవాడివే" అని చెప్పు. (ఈ వ్యక్తి వైఖరి మంచిదా లేక ఆ వ్యక్తి వైఖరి మంచిదా) ఎవడైతే విధేయుడో, రాత్రి గడియలలో (నమాజు చేస్తూ) నిలబడతాడో, సజ్దాలు చేస్తాడో, పరలోకా నికి భయపడతాడో, తన ప్రభువు కారు ణ్యాన్ని ఆశిస్తాడో? వీరిని అడుగు, తెలిసినవారూ, తెలియని వారూ ఇద్దరూ ఎప్పుడైనా సమానులు కాగలరా? బుద్ధి మంతులు మాత్రమే హిత బోధను స్వీకరిస్తారు.

خَلَقَكُمْ مِّنْ نَّفْسٍ وَّاحِدَةٍ ثُمَّ جَعَلَ مِنْهَا
زَوْجَهَا وَ اَنْزَلَ لَكُمْ مِّنَ الْاَنْعَامِ ثَمٰنِيَةَ
اَزْوَاجٍ ؕ يَخْلُقُكُمْ فِيْ بُطُوْنِ اُمَّهٰتِكُمْ خَلْقًا مِّنْۢ
بَعْدِ خَلْقٍ فِيْ ظُلُمٰتٍ ثَلٰثٍ ؕ ذٰلِكُمُ اللّٰهُ رَبُّكُمْ
لَهُ الْمُلْكُ ؕ لَآ اِلٰهَ اِلَّا هُوَ ۚ فَاَنّٰى
تُصْرَفُوْنَ ۝٦ اِنْ تَكْفُرُوْا فَاِنَّ اللّٰهَ غَنِيٌّ
عَنْكُمْ ۗ وَلَا يَرْضٰى لِعِبَادِهِ الْكُفْرَ ۚ وَ اِنْ
تَشْكُرُوْا يَرْضَهُ لَكُمْ ؕ وَلَا تَزِرُ وَازِرَةٌ وِّزْرَ
اُخْرٰى ؕ ثُمَّ اِلٰى رَبِّكُمْ مَّرْجِعُكُمْ فَيُنَبِّئُكُمْ بِمَا
كُنْتُمْ تَعْمَلُوْنَ ؕ اِنَّهٗ عَلِيْمٌۢ بِذَاتِ
الصُّدُوْرِ ۝٧ وَ اِذَا مَسَّ الْاِنْسَانَ ضُرٌّ دَعَا
رَبَّهٗ مُنِيْبًا اِلَيْهِ ثُمَّ اِذَا خَوَّلَهٗ نِعْمَةً مِّنْهُ
نَسِيَ مَا كَانَ يَدْعُوْۤا اِلَيْهِ مِنْ قَبْلُ وَجَعَلَ
لِلّٰهِ اَنْدَادًا لِّيُضِلَّ عَنْ سَبِيْلِهٖ ؕ قُلْ تَمَتَّعْ
بِكُفْرِكَ قَلِيْلًا ۖۗ اِنَّكَ مِنْ اَصْحٰبِ النَّارِ ۝٨
اَمَّنْ هُوَ قَانِتٌ اٰنَآءَ الَّيْلِ سَاجِدًا وَّ قَآئِمًا
يَّحْذَرُ الْاٰخِرَةَ وَيَرْجُوْا رَحْمَةَ رَبِّهٖ ؕ قُلْ
هَلْ يَسْتَوِي الَّذِيْنَ يَعْلَمُوْنَ وَ الَّذِيْنَ لَا
يَعْلَمُوْنَ ؕ اِنَّمَا يَتَذَكَّرُ اُولُوا الْاَلْبَابِ ۝٩ ع ١٥

قُلْ يٰعِبَادِ الَّذِيْنَ اٰمَنُوا اتَّقُوْا رَبَّكُمْ ؕ
لِلَّذِيْنَ اَحْسَنُوْا فِيْ هٰذِهِ الدُّنْيَا حَسَنَةٌ ؕ وَ
اَرْضُ اللّٰهِ وَاسِعَةٌ ؕ اِنَّمَا يُوَفَّى الصّٰبِرُوْنَ
اَجْرَهُمْ بِغَيْرِ حِسَابٍ ﴿١٠﴾ قُلْ اِنِّيْۤ اُمِرْتُ اَنْ
اَعْبُدَ اللّٰهَ مُخْلِصًا لَّهُ الدِّيْنَ ﴿١١﴾ وَاُمِرْتُ
لِاَنْ اَكُوْنَ اَوَّلَ الْمُسْلِمِيْنَ ﴿١٢﴾ قُلْ اِنِّيْۤ
اَخَافُ اِنْ عَصَيْتُ رَبِّيْ عَذَابَ يَوْمٍ
عَظِيْمٍ ﴿١٣﴾ قُلِ اللّٰهَ اَعْبُدُ مُخْلِصًا لَّهٗ
دِيْنِيْ ﴿١٤﴾ فَاعْبُدُوْا مَا شِئْتُمْ مِّنْ دُوْنِهٖ ؕ قُلْ
اِنَّ الْخٰسِرِيْنَ الَّذِيْنَ خَسِرُوْۤا اَنْفُسَهُمْ وَ
اَهْلِيْهِمْ يَوْمَ الْقِيٰمَةِ ؕ اَلَا ذٰلِكَ هُوَ الْخُسْرَانُ
الْمُبِيْنُ ﴿١٥﴾ لَهُمْ مِّنْ فَوْقِهِمْ ظُلَلٌ مِّنَ النَّارِ وَ
مِنْ تَحْتِهِمْ ظُلَلٌ ؕ ذٰلِكَ يُخَوِّفُ اللّٰهُ بِهٖ
عِبَادَهٗ ؕ يٰعِبَادِ فَاتَّقُوْنِ ﴿١٦﴾ وَ الَّذِيْنَ اجْتَنَبُوا
الطَّاغُوْتَ اَنْ يَّعْبُدُوْهَا وَاَنَابُوْۤا اِلَى اللّٰهِ لَهُمُ
الْبُشْرٰى ۚ فَبَشِّرْ عِبَادِ ﴿١٧﴾ الَّذِيْنَ يَسْتَمِعُوْنَ
الْقَوْلَ فَيَتَّبِعُوْنَ اَحْسَنَهٗ ؕ اُولٰٓئِكَ الَّذِيْنَ
هَدٰىهُمُ اللّٰهُ وَاُولٰٓئِكَ هُمْ اُولُوا الْاَلْبَابِ ﴿١٨﴾
اَفَمَنْ حَقَّ عَلَيْهِ كَلِمَةُ الْعَذَابِ ؕ اَفَاَنْتَ
تُنْقِذُ مَنْ فِي النَّارِ ﴿١٩﴾ لٰكِنِ الَّذِيْنَ اتَّقَوْا
رَبَّهُمْ لَهُمْ غُرَفٌ مِّنْ فَوْقِهَا غُرَفٌ مَّبْنِيَّةٌ ۙ
تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ ۬ؕ وَعْدَ اللّٰهِ ؕ لَا
يُخْلِفُ اللّٰهُ الْمِيْعَادَ ﴿٢٠﴾

**10** (ఓ ప్రవక్తా!) ఇలా చెప్పు, "విశ్వసించిన నా దాసులారా! మీ ప్రభువునకు భయపడండి. ఈ లోకంలో సద్వర్తనను అవలంబించే వారికి మేలు జరుగుతుంది. దేవుని భూమి విశాల మైనటువంటిది.[3] ఓర్పు వహించేవారికి లెక్క లేనంత ప్రతిఫలం ఇవ్వబడుతుంది."

**11 - 18** (ఓ ప్రవక్తా!) వారికి ఇలా చెప్పు, "ధర్మాన్ని అల్లాహ్‌కే ప్రత్యేకించి, ఆయనకు మాత్రమే దాస్యం చేయి అని నాకు ఆజ్ఞ ఇవ్వబడింది. అందరికంటే ముందు స్వయంగా నేను ముస్లిమ్ అయిపోవాలని కూడ నాకు ఆజ్ఞ ఇవ్వబడింది." ఇంకా ఇలా చెప్పు, "ఒకవేళ నేను నా ప్రభువునకు అవిధేయత చూపితే, నేను ఒక మహాదినం నాటి శిక్షను గురించి భయపడు తున్నాను." ఇలా కూడ చెప్పు, "నేను మాత్రం నా ధర్మాన్ని అల్లాహ్‌కే ప్రత్యేకించి, ఆయనకు మాత్రమే దాస్యం చేస్తాను. మీరు ఆయన దాస్యం తప్ప, ఎవరెవరి దాస్యం చెయ్యదలచు కున్నారో, చేస్తూ ఉండండి." ఇలా అను, "ప్రళయంనాడు తమనూ, తమ భార్యలనూ, పిల్లలనూ నష్టంలో పడవేసుకునే వారే అసలైన దివాళాకోరులు. బాగా వినండి. స్పష్టమైన దివాళా అంటే ఇదే. వారి మీద నిప్పు గొడుగులు పైనుండి కూడ క్రమ్ముకుని ఉంటాయి, క్రింద నుంచి కూడా. ఈ పర్యవసానం గురించే అల్లాహ్ తన దాసులను భయపెడుతు న్నాడు. కనుక నా దాసులారా! నా ఆగ్రహం నుండి తప్పించు కోండి. దీనికి భిన్నంగా తాగూత్ దాస్యాన్ని విసర్జించి, అల్లాహ్ వైపునకు మరలేవారికి శుభవార్త ఉన్నది. కనుక (ఓ ప్రవక్తా!) మాటను శ్రద్ధగా విని, అందులోని మంచి మంచి విషయా లను అనుసరించే నా దాసులకు శుభవార్త అందజెయ్యి. అల్లాహ్ సన్మార్గం చూపిన వారు వీరే. విజ్ఞులు కూడ వీరే.

**19 - 20** (ఓ ప్రవక్తా!) శిక్షా నిర్ణయం రూఢి అయిపోయిన వ్యక్తిని ఎవడు రక్షించగలడు? అగ్నిలో పడిపోయినవాణ్ని నీవు రక్షించగలవా? అయితే, తమ ప్రభువునకు భయపడుతూ ఉండేవారికి అంతస్తుపై అంతస్తుగా కట్టబడిన ఎత్తైన భవనాలు ఉన్నాయి. వాటి క్రింద కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి. ఇది అల్లాహ్ వాగ్దానం. అల్లాహ్ ఎన్నడూ తన వాగ్దానాన్ని భంగపరచడు.

أَلَمْ تَرَ أَنَّ اللّٰهَ أَنْزَلَ مِنَ السَّمَآءِ مَآءً
فَسَلَكَهٗ يَنَابِيْعَ فِي الْأَرْضِ ثُمَّ يُخْرِجُ بِهٖ
زَرْعًا مُّخْتَلِفًا أَلْوَانُهٗ ثُمَّ يَهِيْجُ فَتَرٰىهُ
مُصْفَرًّا ثُمَّ يَجْعَلُهٗ حُطَامًا ؕ إِنَّ فِيْ ذٰلِكَ
لَذِكْرٰى لِأُولِي الْأَلْبَابِ ﴿٢١﴾ أَفَمَنْ شَرَحَ اللّٰهُ ع
صَدْرَهٗ لِلْإِسْلَامِ فَهُوَ عَلٰى نُوْرٍ مِّنْ رَّبِّهٖ ؕ
فَوَيْلٌ لِّلْقٰسِيَةِ قُلُوْبُهُمْ مِّنْ ذِكْرِ اللّٰهِ ؕ
أُولٰٓئِكَ فِيْ ضَلٰلٍ مُّبِيْنٍ ﴿٢٢﴾ اَللّٰهُ نَزَّلَ أَحْسَنَ
الْحَدِيْثِ كِتٰبًا مُّتَشَابِهًا مَّثَانِيَ ۖ تَقْشَعِرُّ مِنْهُ
جُلُوْدُ الَّذِيْنَ يَخْشَوْنَ رَبَّهُمْ ۚ ثُمَّ تَلِيْنُ
جُلُوْدُهُمْ وَقُلُوْبُهُمْ إِلٰى ذِكْرِ اللّٰهِ ؕ ذٰلِكَ
هُدَى اللّٰهِ يَهْدِيْ بِهٖ مَنْ يَّشَآءُ ؕ وَمَنْ
يُّضْلِلِ اللّٰهُ فَمَا لَهٗ مِنْ هَادٍ ﴿٢٣﴾ أَفَمَنْ يَّتَّقِيْ
بِوَجْهِهٖ سُوْٓءَ الْعَذَابِ يَوْمَ الْقِيٰمَةِ ؕ وَقِيْلَ
لِلظّٰلِمِيْنَ ذُوْقُوْا مَا كُنْتُمْ تَكْسِبُوْنَ ﴿٢٤﴾ كَذَّبَ
الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ فَأَتٰىهُمُ الْعَذَابُ مِنْ حَيْثُ
لَا يَشْعُرُوْنَ ﴿٢٥﴾ فَأَذَاقَهُمُ اللّٰهُ الْخِزْيَ فِي
الْحَيٰوةِ الدُّنْيَا ۚ وَلَعَذَابُ الْاٰخِرَةِ أَكْبَرُ ۘ لَوْ وقف لازم
كَانُوْا يَعْلَمُوْنَ ﴿٢٦﴾

**21 - 22** మీరు గమనించరా - అల్లాహ్ ఆకాశం నుండి వర్షాన్ని కురిపించాడు. తరువాత దానిని ఊటలు, చలమలు, నదుల రూపాలలో[4] భూమిలో ప్రవేశింపజేశాడు. తరువాత ఈ నీటి ద్వారా ఆయన రకరకాల పంటలు పండిస్తున్నాడు. వాటి రంగులు కూడ భిన్నంగా ఉంటాయి. ఆ తరువాత ఆ పంటలు పండి ఎండిపోతాయి. మళ్లీ, అవి పసుపు రంగుగా మారిపోవటాన్ని మీరు చూస్తారు. చివరకు అల్లాహ్ వాటిని పొట్టుగా మార్చివేస్తాడు. యథార్థానికి ఇందులో బుద్ధిమంతులకు గుణపాఠం ఉంది. ఇక ఏ వ్యక్తి హృదయాన్ని అల్లాహ్ ఇస్లామ్‌కై తెరిచాడో, ఏ వ్యక్తి తన ప్రభువు చూపిన వెలుగులో నడుస్తున్నాడో, ఆ వ్యక్తి (ఈ విషయాల నుండి ఏ గుణపాఠమూ నేర్చుకోని వ్యక్తిలాంటి వాడు కాగలడా?) అల్లాహ్ హితోపదేశం వల్ల ఎవరి హృదయాలు మరింత కఠినమైపోతాయో, వారికి వినాశం ఉన్నది. వారు స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో పడి ఉన్నారు.

**23 - 26** అల్లాహ్ ఎంతో శ్రేష్ఠమైన వచనాన్ని అవతరింపజేశాడు. ఇది ఒకే పోలిక కలిగివున్న భాగాలు కల గ్రంథం. ఇందులో, విషయాలు మాటిమాటికీ పునరుక్తం చేయబడినాయి. దానిని విన్నప్పుడు, తమ ప్రభువునకు భయపడే వారి రోమాలు నిక్కబొడుచుకుంటాయి; తరువాత వారి శరీరాలూ, వారి హృదయాలూ మెత్తబడి అల్లాహ్ ధ్యానం వైపునకు మొగ్గుతాయి. ఇది అల్లాహ్ మార్గదర్శకత్వం, దాని ద్వారా ఆయన తాను కోరిన వారిని సత్యమార్గంపైకి తీసుకువస్తాడు. స్వయంగా అల్లాహ్ మార్గం చూపనివాడికి, మరొక మార్గదర్శకుడు ఎవ్వడూ లేడు, ఇక ప్రళయం నాడు శిక్ష యొక్క తీవ్రమైన దెబ్బను తన ముఖం మీద తినేవాడి దుస్థితిని గురించి నీవేమి అంచనా వేయగలవు? అటువంటి దుర్మార్గులతో, "ఇక మీరు సంపాదించిన దానిని రుచి చూడండి" అని అనబడుతుంది. వారికి పూర్వం కూడ చాలమంది ప్రజలు ఇదేవిధంగా తిరస్కరించారు. చివరికి వారిపైకి శిక్ష, వారు ఊహించను కూడ లేనటువంటి దిశ నుండి వచ్చి పడింది. తరువాత అల్లాహ్ వారికి ఇహలోక జీవితంలోనే అవమానాన్ని రుచి చూపించాడు. పరలోక శిక్ష అయితే దాని కంటే కూడ ఎంతో తీవ్రమైనదిగా ఉంటుంది. అయ్యో! వారు గ్రహిస్తే ఎంత బాగుంటుంది.

وَلَقَدْ ضَرَبْنَا لِلنَّاسِ فِيْ هٰذَا الْقُرْاٰنِ مِنْ كُلِّ
مَثَلٍ لَّعَلَّهُمْ يَتَذَكَّرُوْنَ ﴿٢٧﴾ قُرْاٰنًا عَرَبِيًّا
غَيْرَ ذِيْ عِوَجٍ لَّعَلَّهُمْ يَتَّقُوْنَ ﴿٢٨﴾ ضَرَبَ
اللّٰهُ مَثَلًا رَّجُلًا فِيْهِ شُرَكَآءُ مُتَشٰكِسُوْنَ وَ
رَجُلًا سَلَمًا لِّرَجُلٍ ۭ هَلْ يَسْتَوِيٰنِ مَثَلًا ۭ
اَلْحَمْدُ لِلّٰهِ ۚ بَلْ اَكْثَرُهُمْ لَا يَعْلَمُوْنَ ﴿٢٩﴾
اِنَّكَ مَيِّتٌ وَّ اِنَّهُمْ مَّيِّتُوْنَ ﴿٣٠﴾ ثُمَّ اِنَّكُمْ
يَوْمَ الْقِيٰمَةِ عِنْدَ رَبِّكُمْ تَخْتَصِمُوْنَ ﴿٣١﴾
فَمَنْ اَظْلَمُ مِمَّنْ كَذَبَ عَلَى اللّٰهِ وَكَذَّبَ
بِالصِّدْقِ اِذْ جَآءَهٗ ۭ اَلَيْسَ فِيْ جَهَنَّمَ مَثْوًى
لِّلْكٰفِرِيْنَ ﴿٣٢﴾ وَالَّذِيْ جَآءَ بِالصِّدْقِ وَصَدَّقَ
بِهٖٓ اُولٰۗىِٕكَ هُمُ الْمُتَّقُوْنَ ﴿٣٣﴾ لَهُمْ مَّا يَشَاۗءُوْنَ
عِنْدَ رَبِّهِمْ ۭ ذٰلِكَ جَزٰۗؤُا الْمُحْسِنِيْنَ ﴿٣٤﴾
لِيُكَفِّرَ اللّٰهُ عَنْهُمْ اَسْوَاَ الَّذِيْ عَمِلُوْا
وَيَجْزِيَهُمْ اَجْرَهُمْ بِاَحْسَنِ الَّذِيْ كَانُوْا
يَعْمَلُوْنَ ﴿٣٥﴾

الجزء ٢٤

**27 - 35** మేము ఈ ఖురాన్‌లో ప్రజల కొరకు రకరకాల దృష్టాంతాలను ఇచ్చాము, వారు స్పృహలోనికి వస్తారేమో అని. అరబ్బీ భాషలో ఉన్న ఈ ఖురాన్‌లో ఎలాంటి వక్రతాలేదు; వారు తమను చెడు పర్యవసానం నుండి కాపాడుకుంటారేమో అని. అల్లాహ్ ఒక దృష్టాంతం ఇస్తున్నాడు–ఒక వ్యక్తి ఉన్నాడు: అతనిని తమ తమ వైపునకు లాగే సంస్కార హీనులైన యజమానులు అనేకమంది ఉన్నారు. మరొక వ్యక్తి ఉన్నాడు: అతను పూర్తిగా ఒకే యజమానికి బానిసగా ఉన్నాడు. ఆ ఇద్దరు వ్యక్తుల పరిస్థితి ఒకటే అవుతుందా?– "అల్‌హమ్‌దు లిల్లాహ్" (స్తోత్రం కేవలం అల్లాహ్‌కే), కాని చాలా మంది అజ్ఞానంలో పడి ఉన్నారు.[5] (ఓ ప్రవక్తా!) నీవూ మరణిస్తావు, వారూ మరణిస్తారు. చివరకు ప్రళయం నాడు మీరంతా మీ ప్రభువు సమక్షంలో మీమీ వ్యాజ్యాలను వినిపిస్తారు. ఎవడు అల్లాహ్‌కు అబద్ధాన్ని ఆపాదిస్తాడో, సత్యం అతడి ముందుకు వచ్చినప్పుడు అది అబద్ధమని దానిని తిరస్కరిస్తాడో, అతడి కంటే పరమ దుర్మార్గుడెవడు? అటువంటి వారికి నరకంలో స్థానమేమీ లేదా? సత్యాన్ని తీసుకు వచ్చిన వ్యక్తీ, అది సత్యమని అంగీకరించిన ప్రజలూ మాత్రమే శిక్ష తప్పించుకుంటారు. వారికి తమ ప్రభువు వద్ద వారు కోరుకునేదంతా లభిస్తుంది. ఇది సత్కార్యాలు చేసే వారికి దొరికే ప్రతిఫలం; వారు చేసిన అత్యంత ఘోరమైన పనులను అల్లాహ్ వారి లెక్క నుండి తీసివెయ్యటానికి, వారు చేసిన ఎంతో మంచి పనులకు గాను వారికి ప్రతిఫలం ప్రసాదించటానికి.

1. పశువు అంటే, ఒంటె, ఆవు, గొర్రె, మేక అని భావం. అవి ఆడ మగా కలిసి నాలుగు జంటలు అనగా ఎనిమిది పశువులు.
2. మూడు తెరలు అంటే, ఉదరము, గర్భాశయము, పిండాన్ని ఆవరించి ఉండే సన్నని పొర అని భావము.
3. అంటే, ఒకవేళ అల్లాహ్ దాసులకు ఒక పట్టణంగానీ, ఒక ప్రాంతంగానీ, ఒక దేశం గానీ ఇరుకైపోతే, వారు ఎట్టి ఇక్కట్లు లేని మరొక చోటునకు వెళ్లవచ్చు.
4. అసలు 'యనాబీ' అనే పదం వాడబడింది. అది ఈ మూడు జలోత్పత్తులకు వర్తిస్తుంది.
5. అంటే, ఒక ప్రభువు బానిసత్వానికీ, ఎంతోమంది ప్రభువుల బానిసత్వానికీ మధ్య గల భేదాన్ని వారు చక్కగా అర్థం చేసుకుంటారు. కాని ఒక దేవుని దాస్యానికీ, ఎంతోమంది దేవుళ్ల దాస్యానికీ మధ్య ఉన్న భేదాన్ని వారికి తెలిపినప్పుడు, వారు దానిని గ్రహించలేరు.

اَلَيْسَ اللّٰهُ بِكَافٍ عَبْدَهٗ ۭ وَيُخَوِّفُوْنَكَ
بِالَّذِيْنَ مِنْ دُوْنِهٖ ۭ وَمَنْ يُّضْلِلِ اللّٰهُ فَمَا لَهٗ
مِنْ هَادٍ ﴿٣٦﴾ وَمَنْ يَّهْدِ اللّٰهُ فَمَا لَهٗ مِنْ
مُّضِلٍّ ۭ اَلَيْسَ اللّٰهُ بِعَزِيْزٍ ذِي انْتِقَامٍ ﴿٣٧﴾ وَ
لَئِنْ سَاَلْتَهُمْ مَّنْ خَلَقَ السَّمٰوٰتِ وَالْاَرْضَ
لَيَقُوْلُنَّ اللّٰهُ ۭ قُلْ اَفَرَءَيْتُمْ مَّا تَدْعُوْنَ مِنْ
دُوْنِ اللّٰهِ اِنْ اَرَادَنِيَ اللّٰهُ بِضُرٍّ هَلْ هُنَّ
كٰشِفٰتُ ضُرِّهٖٓ اَوْ اَرَادَنِيْ بِرَحْمَةٍ هَلْ هُنَّ
مُمْسِكٰتُ رَحْمَتِهٖ ۭ قُلْ حَسْبِيَ اللّٰهُ ۭ عَلَيْهِ
يَتَوَكَّلُ الْمُتَوَكِّلُوْنَ ﴿٣٨﴾ قُلْ يٰقَوْمِ اعْمَلُوْا عَلٰى
مَكَانَتِكُمْ اِنِّيْ عَامِلٌ ۚ فَسَوْفَ تَعْلَمُوْنَ ﴿٣٩﴾ مَنْ
يَّاْتِيْهِ عَذَابٌ يُّخْزِيْهِ وَيَحِلُّ عَلَيْهِ عَذَابٌ
مُّقِيْمٌ ﴿٤٠﴾ اِنَّآ اَنْزَلْنَا عَلَيْكَ الْكِتٰبَ لِلنَّاسِ
بِالْحَقِّ ۚ فَمَنِ اهْتَدٰى فَلِنَفْسِهٖ ۚ وَمَنْ ضَلَّ
فَاِنَّمَا يَضِلُّ عَلَيْهَا ۚ وَمَآ اَنْتَ عَلَيْهِمْ بِوَكِيْلٍ ﴿٤١﴾ ع
اَللّٰهُ يَتَوَفَّى الْاَنْفُسَ حِيْنَ مَوْتِهَا وَالَّتِيْ لَمْ
تَمُتْ فِيْ مَنَامِهَا ۚ فَيُمْسِكُ الَّتِيْ قَضٰى عَلَيْهَا
الْمَوْتَ وَيُرْسِلُ الْاُخْرٰٓى اِلٰٓى اَجَلٍ مُّسَمًّى ۭ
اِنَّ فِيْ ذٰلِكَ لَاٰيٰتٍ لِّقَوْمٍ يَّتَفَكَّرُوْنَ ﴿٤٢﴾ اَمِ
اتَّخَذُوْا مِنْ دُوْنِ اللّٰهِ شُفَعَاۗءَ ۭ قُلْ اَوَلَوْ
كَانُوْا لَا يَمْلِكُوْنَ شَيْـًٔا وَّلَا يَعْقِلُوْنَ ﴿٤٣﴾ قُلْ
لِّلّٰهِ الشَّفَاعَةُ جَمِيْعًا ۭ لَهٗ مُلْكُ السَّمٰوٰتِ وَ
الْاَرْضِ ۭ ثُمَّ اِلَيْهِ تُرْجَعُوْنَ ﴿٤٤﴾

**36 - 41** (ఓ ప్రవక్తా!) అల్లాహ్ తన దాసునికి సరిపోడా? వారు ఆయనను గురించి కాక, ఇతరులను గురించి నిన్ను భయపెడుతున్నారు. వాస్తవానికి, అల్లాహ్ దారి తప్పించేవాడికి దారి చూపే వాడెవ్వడూ లేడు. ఆయన దారి చూపేవాడిని దారి తప్పించేవాడు కూడ ఎవ్వడూ లేడు. అల్లాహ్ మహాశక్తిమంతుడూ, ప్రతీకారం చేసేవాడూ కాడా? ఒకవేళ నీవు వారిని, భూమ్యాకాశాలను ఎవడు సృష్టించాడు అని అడిగితే, వారే స్వయంగా, "అల్లాహ్‌యే" అని అంటారు. వారిని ఇలా అడుగు; "యథార్థం ఇదైనప్పుడు, ఒకవేళ అల్లాహ్ నాకేదైనా నష్టాన్ని కలిగించగోరితే, మీరు అల్లాహ్‌ను కాదని వేడుకునే మీ దేవీలు, ఆయన కలిగించే నష్టం నుండి నన్ను కాపాడగలరా? లేదా అల్లాహ్ నాపై కనికరం చూపగోరితే, వారు ఆయన కారుణ్యాన్ని అడ్డుకోగలరా? మీ అభిప్రాయమేమిటి?" కనుక వారితో ఇలా అను, "నాకు అల్లాహ్ ఒక్కడే చాలు, నమ్ముకునే వారు ఆయననే నమ్ముకుంటారు." వారికి స్పష్టంగా ఇలా చెప్పు, "నా జాతి ప్రజలారా! మీరు మీ ఇష్టం ప్రకారం మీ పనులు చేస్తూ ఉండండి. నా పనేదో నేనూ చేస్తూ ఉంటాను. త్వరలోనే మీకు తెలిసిపోతుంది, ఎవరి మీదకు అవమానకరమైన శిక్ష వచ్చిపడుతుందో, ఇంకా ఎవరికి ఎన్నడూ తొలగిపోని శిక్ష లభిస్తుందో." (ఓ ప్రవక్తా!) మేము మానవులందరి కోసం ఈ సత్యగ్రంథాన్ని నీపై అవతరింపజేశాము. ఇక ఎవడు ఋజుమార్గాన్ని అవలంబిస్తాడో, అతడు తన మేలు కోసమే అలా చేస్తాడు. ఎవడు మార్గం తప్పుతాడో, ఆ మార్గం తప్పటమనే కీడుకు అతడే బాధ్యుడు అవుతాడు. నీవు వారికి బాధ్యుడవు కావు.

**42 - 44** మరణ సమయంలో ఆత్మలను వశపరచుకునేవాడు అల్లాహ్‌యే; ఇంకా మరణించని వాడి ఆత్మను అతడు నిద్రావస్థలో ఉన్నప్పుడు వశపరచు కుంటాడు. ఆయన ఎవడి విషయంలో, మరణ నిర్ణయం అమలు చేస్తాడో, దానిని (అతడి ఆత్మను) ఆపి ఉంచుతాడు; మిగతావారి ఆత్మలను ఒక నిర్ణీత సమయం వరకు తిరిగి పంపివేస్తాడు. ఆలోచించే వారికి ఇందులో గొప్ప సూచనలు ఉన్నాయి. అటువంటి దేవుణ్ణి వదలిపెట్టి, వారు ఇతరులను సిఫారసుదారులుగా చేసుకున్నారా?[6] వారికి ఇలా చెప్పు, "వారికి కించిత్తు అధికారం ఉన్నా లేకపోయినా, వారికి అవగాహన ఉన్నా లేకపోయినా వారు సిఫారసు చేయగలరా?" ఇంకా ఇలా అను, "సిఫారసు అనేది పూర్తిగా అల్లాహ్ చేతిలోనే ఉన్నది.[7] భూమ్యాకాశాల సామ్రాజ్యానికి అధిపతి ఆయనే. తరువాత ఆయన వైపునకే మీరు మరలింపబడతారు."

وَ اِذَا ذُكِرَ اللّٰهُ وَحْدَهُ اشْمَاَزَّتْ قُلُوْبُ
الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ بِالْاٰخِرَةِ ۚ وَ اِذَا ذُكِرَ
الَّذِيْنَ مِنْ دُوْنِهٖۤ اِذَا هُمْ يَسْتَبْشِرُوْنَ ۝٤٥
قُلِ اللّٰهُمَّ فَاطِرَ السَّمٰوٰتِ وَ الْاَرْضِ عٰلِمَ
الْغَيْبِ وَ الشَّهَادَةِ اَنْتَ تَحْكُمُ بَيْنَ عِبَادِكَ
فِيْ مَا كَانُوْا فِيْهِ يَخْتَلِفُوْنَ ۝٤٦ وَلَوْ اَنَّ
لِلَّذِيْنَ ظَلَمُوْا مَا فِي الْاَرْضِ جَمِيْعًا وَّ مِثْلَهٗ
مَعَهٗ لَافْتَدَوْا بِهٖ مِنْ سُوْٓءِ الْعَذَابِ يَوْمَ
الْقِيٰمَةِ ؕ وَبَدَا لَهُمْ مِّنَ اللّٰهِ مَا لَمْ يَكُوْنُوْا
يَحْتَسِبُوْنَ ۝٤٧ وَبَدَا لَهُمْ سَيِّاٰتُ مَا كَسَبُوْا وَ
حَاقَ بِهِمْ مَّا كَانُوْا بِهٖ يَسْتَهْزِءُوْنَ ۝٤٨

**45 - 48** ఒక్క అల్లాహ్‌ను గురించి మాత్రమే ప్రస్తావించటం జరిగినప్పుడు, పరలోకం పట్ల విశ్వాసం లేని వారి హృదయాలు బాధపడతాయి. ఆయనను తప్ప ఇతరులను గురించి ప్రస్తావించటం జరిగినప్పుడు, యకాయకి వారి ముఖాలు సంతోషంతో వెలిగిపోతాయి.[8] ఇలా అను, "దైవమా! భూమ్యాకాశాలకు సృష్టికర్తా! గోచర అగోచరాలను ఎరిగినవాడా! నీవే నీ దాసుల మధ్య వారు విభేదిస్తూ ఉన్న విషయం గురించి తీర్పు చేస్తావు. ఒకవేళ ఈ దుర్మార్గుల వద్ద భూమిలో ఉన్న మొత్తం సంపద ఉంటే, ఇంకా అంతే సంపద కూడ ఉంటే, వారు ప్రళయం నాటి దారుణ శిక్ష నుండి తప్పించుకోవటానికి ఈ మొత్తం సంపదను పరిహారంగా ఇవ్వటానికి సిద్ధపడతారు. అక్కడ అల్లాహ్ తరఫు నుండి వారి ముందుకు, వారు ఎన్నడూ ఊహించి కూడ ఉండనిదంతా వస్తుంది. అక్కడ తమ సంపాదన యొక్క దుష్ఫలితాలన్నీ వారికి స్పష్టంగా తెలిసిపోతాయి. వారు ఎగతాళి చేస్తూ వచ్చినదే వారిని చుట్టుముట్టుతుంది.

6. అంటే, కొంతమందికి అల్లాహ్ దగ్గర మంచి పలుకుబడి కలదనీ, వారి సిఫారసు ఏ విధంగానూ వమ్ముకాదనీ వారు తమంతటతామే ఊహించుకున్నారు : వాస్తవానికి, వారు సిఫారసు చేసే వ్యక్తులు అని అనటానికి ఎటువంటి ఆధారమూ లేదు. వారికి తన వద్ద ఫలానా స్థానం ఉన్నదని అల్లాహ్ ఏనాడూ చెప్పనూ లేదు. స్వయంగా వారు కూడ, తమ పలుకుబడిని ఉపయోగించి వారి సకల కార్యాలూ నెరవేరుస్తామని, ఎన్నడూ అననూ లేదు. ఇంతేకాక, వారి తెలివితక్కువతనం మరొకటి ఏమిటంటే, అసలు ప్రభువును వదలి, కల్పిత సిఫారసుదారులను సర్వశక్తిమంతులని నమ్మి, తమ మొక్కుబడులన్నింటినీ వారికే అర్పించారు.

7. అంటే, అల్లాహ్ సమక్షంలో, సిఫారసుదారునిగా నిలబడే అధికారమే ఎవరికీ లేనప్పుడు, సిఫారసును అంగీకరింపజేసే విషయం గురించి ఇక చెప్పేదేముంది? తాను కోరిన వారికి సిఫారసు చేసే అనుమతి ఇవ్వటం, ఇవ్వకపోవటం అనే అధికారం కేవలం అల్లాహ్‌కే కలదు. తాను ఇష్టపడిన వారి విషయంలో మాత్రమే ఆయన సిఫారసు చేయనిస్తాడు, తాను ఇష్టపడని వారి విషయంలో సిఫారసు చేయనివ్వడు. ఇది ఆయన అధికారం.

8. ఈ జాడ్యం దాదాపు ప్రపంచంలోని ముష్రిక్కులందరిలోనూ కనిపిస్తుంది. దౌర్భాగ్యులైన కొందరు ముస్లిములు కూడ ఈ జాడ్యానికి లోనయ్యారు. "మేము అల్లాహ్ విశ్వాసులమే" నని వారు చెప్పటమైతే చెబుతారు కాని, ఒక్క అల్లాహ్‌ను మాత్రమే ప్రస్తావించినప్పుడు వారి ముఖాలు వికృతాలవుతాయి. అప్పుడు వారు ఇలా అంటారు, "ఇతడు మహనీయులనూ, పుణ్యపురుషులనూ విశ్వసించడు, కనుకనే ఎంతసేపటికీ అల్లాహ్, అల్లాహ్ అనే పలుకుతూ ఉంటాడు. ఇతరులను గురించి కూడ ప్రస్తావించినప్పుడు, వారి హృదయ కుసుమాలు వికసిస్తాయి, వారి ముఖాలు సంతోషంతో వెల్లివిరుస్తాయి.

**49 - 52** ఈ మానవుడే తనకు కొంచెం కష్టం కలిగినప్పుడు, మాకు మొరపెట్టుకుంటాడు. మేము అతనికి మా తరపు నుండి, అనుగ్రహాన్ని ప్రసాదించినప్పుడు, “నాకు ఉన్న జ్ఞానం కారణంగానే ఇది నాకు ఇవ్వబడింది” అని అతడు అంటాడు. కాని అది కాదు, ఇది ఒక పరీక్ష. అయితే వారిలో చాలా మంది ఎరుగరు. ఈ మాటనే వారికి పూర్వం గతించిన వారు కూడ అన్నారు. కాని, వారు సంపాదించినదేదీ వారికి ఏ విధంగానూ పనికి రాకుండా పోయింది. తరువాత తమ సంపాదన యొక్క దుష్ఫలితాలను వారు అనుభవించారు. వారిలోని దుర్మార్గులు త్వరలోనే తమ సంపాదన యొక్క దుష్ఫలితాలను అనుభవిస్తారు. వారు మమ్మల్ని అశక్తులుగా చేయలేరు. అల్లాహ్ తాను కోరిన వారికి ఉపాధిని అపరిమితంగా ఇస్తాడనీ, తాను కోరిన వారికి ఉపాధిని పరిమితంగా ఇస్తాడనీ వారికి తెలియదా? ఇందులో విశ్వసించే వారికి సూచనలు ఉన్నాయి.

**53 - 61** (ఓ ప్రవక్తా!) ఇలా అను, “మీ ఆత్మలకు అన్యాయం చేసుకున్న నా దాసులారా[9] అల్లాహ్ కారుణ్యం పట్ల నిరాశ చెందకండి. నిశ్చయంగా అల్లాహ్ అన్ని పాపాలనూ క్షమిస్తాడు. ఆయన క్షమించేవాడు, కరుణించేవాడూను. మీ మీదకు శిక్ష రాకమునుపే, మీకు ఎవరి నుండీ సహాయం లభించని పరిస్థితి ఏర్పడకమునుపే, మీరు మీ ప్రభువు వైపునకు మరలి, ఆయనకు విధేయత చూపండి. మీకు తెలియకుండానే మీ మీదకు అకస్మాత్తుగా శిక్ష రాకముందే, మీ ప్రభువు పంపిన గ్రంథంలోని ఉత్తమమైన విషయాలను[10] అనుసరించండి. తరువాత ఏ వ్యక్తి అయినా ఇలా అనే పరిస్థితి రాకూడదు సుమా! “అల్లాహ్ విషయంలో నేను చూపిన నిర్లక్ష్యతకు నేను ఎంతో చింతిస్తున్నాను. పైగా నేను ఎగతాళి చేసే వారిలో చేరి పోయాను.” లేదా “అయ్యో! అల్లాహ్ నాకు సన్మార్గం చూపి ఉంటే, నేను కూడ భయభక్తులు కలవారిలో చేరిపోయే వాణ్ణి.” లేదా శిక్షను చూసి, “అయ్యో! నాకు మరొక అవకాశం దొరికితే ఎంత బాగుండును. నేను కూడ సత్కార్యాలు చేసేవారిలో కలిసి పోతాను.” (అప్పుడు అతనికి ఈ జవాబు దొరకకూడదు) “లేదు. నా వాక్యాలు నీ వద్దకు వచ్చాయి. కాని నీవు వాటిని తిరస్కరించావు; విర్రవీగావు. నీవు అవిశ్వాసులలోని వాడవు.”

فَاِذَا مَسَّ الْاِنْسَانَ ضُرٌّ دَعَانَا ثُمَّ اِذَا
خَوَّلْنٰهُ نِعْمَةً مِّنَّا قَالَ اِنَّمَآ اُوْتِيْتُهٗ عَلٰى عِلْمٍ
بَلْ هِىَ فِتْنَةٌ وَّ لٰكِنَّ اَكْثَرَهُمْ لَا يَعْلَمُوْنَ ﴿٤٩﴾
قَدْ قَالَهَا الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ فَمَآ اَغْنٰى عَنْهُمْ
مَّا كَانُوْا يَكْسِبُوْنَ ﴿٥٠﴾ فَاَصَابَهُمْ سَيِّاٰتُ مَا
كَسَبُوْا وَ الَّذِيْنَ ظَلَمُوْا مِنْ هٰٓؤُلَآءِ سَيُصِيْبُهُمْ
سَيِّاٰتُ مَا كَسَبُوْا وَمَا هُمْ بِمُعْجِزِيْنَ ﴿٥١﴾ اَوَلَمْ
يَعْلَمُوْٓا اَنَّ اللّٰهَ يَبْسُطُ الرِّزْقَ لِمَنْ يَّشَآءُ وَ
يَقْدِرُ اِنَّ فِيْ ذٰلِكَ لَاٰيٰتٍ لِّقَوْمٍ يُّؤْمِنُوْنَ ﴿٥٢﴾
قُلْ يٰعِبَادِىَ الَّذِيْنَ اَسْرَفُوْا عَلٰٓى اَنْفُسِهِمْ لَا
تَقْنَطُوْا مِنْ رَّحْمَةِ اللّٰهِ اِنَّ اللّٰهَ يَغْفِرُ
الذُّنُوْبَ جَمِيْعًا اِنَّهٗ هُوَ الْغَفُوْرُ الرَّحِيْمُ ﴿٥٣﴾
وَ اَنِيْبُوْٓا اِلٰى رَبِّكُمْ وَ اَسْلِمُوْا لَهٗ مِنْ قَبْلِ
اَنْ يَّاْتِيَكُمُ الْعَذَابُ ثُمَّ لَا تُنْصَرُوْنَ ﴿٥٤﴾ وَ
اتَّبِعُوْٓا اَحْسَنَ مَآ اُنْزِلَ اِلَيْكُمْ مِّنْ رَّبِّكُمْ
مِّنْ قَبْلِ اَنْ يَّاْتِيَكُمُ الْعَذَابُ بَغْتَةً وَّ اَنْتُمْ
لَا تَشْعُرُوْنَ ﴿٥٥﴾ اَنْ تَقُوْلَ نَفْسٌ يّٰحَسْرَتٰى عَلٰى
مَا فَرَّطْتُّ فِيْ جَنْۢبِ اللّٰهِ وَ اِنْ كُنْتُ لَمِنَ
السّٰخِرِيْنَ ﴿٥٦﴾ اَوْ تَقُوْلَ لَوْ اَنَّ اللّٰهَ هَدٰىنِيْ لَكُنْتُ
مِنَ الْمُتَّقِيْنَ ﴿٥٧﴾ اَوْ تَقُوْلَ حِيْنَ تَرَى الْعَذَابَ
لَوْ اَنَّ لِيْ كَرَّةً فَاَكُوْنَ مِنَ الْمُحْسِنِيْنَ ﴿٥٨﴾ بَلٰى
قَدْ جَآءَتْكَ اٰيٰتِيْ فَكَذَّبْتَ بِهَا وَاسْتَكْبَرْتَ وَ
كُنْتَ مِنَ الْكٰفِرِيْنَ ﴿٥٩﴾

وَ يَوْمَ الْقِيٰمَةِ تَرَى الَّذِيْنَ كَذَبُوْا عَلَى اللّٰهِ
وُجُوْهُهُمْ مُّسْوَدَّةٌ ؕ اَلَيْسَ فِيْ جَهَنَّمَ مَثْوًى
لِّلْمُتَكَبِّرِيْنَ ﴿٦٠﴾ وَ يُنَجِّي اللّٰهُ الَّذِيْنَ اتَّقَوْا
بِمَفَازَتِهِمْ ۫ لَا يَمَسُّهُمُ السُّوْٓءُ وَ لَا هُمْ
يَحْزَنُوْنَ ﴿٦١﴾ اَللّٰهُ خَالِقُ كُلِّ شَيْءٍ ۫ وَّ هُوَ عَلٰى
كُلِّ شَيْءٍ وَّكِيْلٌ ﴿٦٢﴾ لَهٗ مَقَالِيْدُ السَّمٰوٰتِ وَ
الْاَرْضِ ؕ وَ الَّذِيْنَ كَفَرُوْا بِاٰيٰتِ اللّٰهِ اُولٰٓئِكَ
هُمُ الْخٰسِرُوْنَ ﴿٦٣﴾ قُلْ اَفَغَيْرَ اللّٰهِ تَاْمُرُوْٓنِّيْٓ
اَعْبُدُ اَيُّهَا الْجٰهِلُوْنَ ﴿٦٤﴾ وَ لَقَدْ اُوْحِيَ اِلَيْكَ
وَ اِلَى الَّذِيْنَ مِنْ قَبْلِكَ ۚ لَئِنْ اَشْرَكْتَ
لَيَحْبَطَنَّ عَمَلُكَ وَلَتَكُوْنَنَّ مِنَ الْخٰسِرِيْنَ ﴿٦٥﴾
بَلِ اللّٰهَ فَاعْبُدْ وَكُنْ مِّنَ الشّٰكِرِيْنَ ﴿٦٦﴾ وَ مَا
قَدَرُوا اللّٰهَ حَقَّ قَدْرِهٖ ۖ وَالْاَرْضُ جَمِيْعًا
قَبْضَتُهٗ يَوْمَ الْقِيٰمَةِ وَ السَّمٰوٰتُ مَطْوِيّٰتٌۢ
بِيَمِيْنِهٖ ؕ سُبْحٰنَهٗ وَ تَعٰلٰى عَمَّا يُشْرِكُوْنَ ﴿٦٧﴾
وَنُفِخَ فِي الصُّوْرِ فَصَعِقَ مَنْ فِي السَّمٰوٰتِ وَ
مَنْ فِي الْاَرْضِ اِلَّا مَنْ شَآءَ اللّٰهُ ؕ ثُمَّ نُفِخَ
فِيْهِ اُخْرٰى فَاِذَا هُمْ قِيَامٌ يَّنْظُرُوْنَ ﴿٦٨﴾ وَ
اَشْرَقَتِ الْاَرْضُ بِنُوْرِ رَبِّهَا وَ وُضِعَ الْكِتٰبُ
وَ جِايْٓءَ بِالنَّبِيّٖنَ وَالشُّهَدَآءِ وَ قُضِيَ بَيْنَهُمْ
بِالْحَقِّ وَ هُمْ لَا يُظْلَمُوْنَ ﴿٦٩﴾ وَوُفِّيَتْ كُلُّ
نَفْسٍ مَّا عَمِلَتْ وَ هُوَ اَعْلَمُ بِمَا يَفْعَلُوْنَ ﴿٧٠﴾

ఈనాడు అల్లాహ్‌కు అసత్యాన్ని ఆపాదించిన వారి ముఖాలు, ప్రళయం నాడు నల్లగా మారిపోవటాన్ని నీవు చూస్తావు. నరకంలో గర్విష్ఠులకు సరిపోయే స్థలం లేదా? దీనికి భిన్నంగా ఇక్కడ అల్లాహ్‌కు భయపడిన వారికి, వారి సాఫల్యానికి దోహదం చేసిన కారణాల వల్ల, అల్లాహ్ ముక్తిని ప్రసాదిస్తాడు. వారికి ఏ కష్టమూ కలగదు, వారికి ఎలాంటి విచారమూ ఉండదు.

**62 - 66** ప్రతి వస్తువునూ సృష్టించిన వాడు అల్లాహ్‌యే. ప్రతి వస్తువునకూ సంరక్షకుడు కూడ ఆయనే. భూమిలో, ఆకాశాలలో ఉన్న నిక్షేపాల తాళపు చెవులు ఆయన వద్దనే ఉన్నాయి. అల్లాహ్ వాక్యాలను తిరస్కరించే వారే నష్టానికి గురిఅయ్యేవారు. (ఓ ప్రవక్తా!) వారితో ఇలా అను, “అయితే, ఓ మూర్ఖులారా! అల్లాహ్‌ను కాదని మరొకరికి దాస్యం చేయమని మీరు నాకు చెబుతున్నారా?” (ఈ విషయాన్ని నీవు వారికి స్పష్టంగా చెప్పు. ఎందుకంటే) నీ వద్దకూ, నీకు పూర్వం గతించిన ప్రవక్తల వద్దకూ ఇలా వహీ పంపబడింది: “ఒకవేళ మీరు షిర్కు (బహుదైవారాధన) చేస్తే, మీ కర్మలన్నీ వ్యర్థమైపోతాయి; మీరు నష్టానికి గురి అవుతారు.” కనుక (ఓ ప్రవక్తా!) నీవు కేవలం అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించు. కృతజ్ఞులై ఉండే దాసులలో చేరిపో.

**67 - 70** వారు అల్లాహ్‌ను ఏ విధంగా గౌరవించాలో, ఆ విధంగా గౌరవించనే లేదు. (ఆయన శక్తి సామర్థ్యాలు ఎలాంటివంటే) ప్రళయంనాడు, యావత్తు భూమండలం ఆయన పిడికిలిలో ఉంటుంది. ఆకాశాలు ఆయన కుడి చేతిలో చుట్టబడి ఉంటాయి.[11] వారు చేస్తున్న షిర్కు (బహు దైవారాధన)కు ఆయన అతీతుడు, పరిశుద్ధుడు. ఆ రోజున శంఖం పూరించబడుతుంది, ఆకాశాలలో, భూమిలో ఉన్న వారు అందరూ చచ్చిపడి పోతారు, అల్లాహ్ సజీవంగా ఉంచదలచుకున్నవారు తప్ప. తరువాత రెండోసారి శంఖం పూరించబడుతుంది: అప్పుడు ఒక్కసారిగా అందరూ లేచి చూడటం ప్రారంభిస్తారు. భూమి తన ప్రభువు యొక్క తేజస్సుతో వెలిగిపోతుంది. కర్మల చిట్టా తీసుకురాబడుతుంది. దైవ ప్రవక్తలూ, సాక్షులూ అందరూ హాజరుపరచబడతారు. ప్రజలకు సరిగ్గా, న్యాయంగా తీర్పు చేయబడుతుంది. వారికి ఎలాంటి అన్యాయమూ జరగదు. ప్రతి ఆత్మకూ అది చేసుకున్న కర్మల ప్రకారం పూర్తి ప్రతిఫలం ఇవ్వబడుతుంది. ప్రజలు చేస్తున్నదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు.

وَسِيْقَ الَّذِيْنَ كَفَرُوْٓا اِلٰى جَهَنَّمَ زُمَرًا ؕ حَتّٰٓى
اِذَا جَآءُوْهَا فُتِحَتْ اَبْوَابُهَا وَ قَالَ لَهُمْ
خَزَنَتُهَآ اَلَمْ يَاْتِكُمْ رُسُلٌ مِّنْكُمْ يَتْلُوْنَ
عَلَيْكُمْ اٰيٰتِ رَبِّكُمْ وَ يُنْذِرُوْنَكُمْ لِقَآءَ يَوْمِكُمْ
هٰذَا ؕ قَالُوْا بَلٰى وَ لٰكِنْ حَقَّتْ كَلِمَةُ
الْعَذَابِ عَلَى الْكٰفِرِيْنَ ﴿٧١﴾ قِيْلَ ادْخُلُوْٓا
اَبْوَابَ جَهَنَّمَ خٰلِدِيْنَ فِيْهَا ۚ فَبِئْسَ مَثْوَى
الْمُتَكَبِّرِيْنَ ﴿٧٢﴾ وَ سِيْقَ الَّذِيْنَ اتَّقَوْا رَبَّهُمْ
اِلَى الْجَنَّةِ زُمَرًا ؕ حَتّٰٓى اِذَا جَآءُوْهَا
وَفُتِحَتْ اَبْوَابُهَا وَ قَالَ لَهُمْ خَزَنَتُهَا سَلٰمٌ
عَلَيْكُمْ طِبْتُمْ فَادْخُلُوْهَا خٰلِدِيْنَ ﴿٧٣﴾ وَ قَالُوا
الْحَمْدُ لِلّٰهِ الَّذِيْ صَدَقَنَا وَعْدَهٗ وَاَوْرَثَنَا
الْاَرْضَ نَتَبَوَّاُ مِنَ الْجَنَّةِ حَيْثُ نَشَآءُ ۚ
فَنِعْمَ اَجْرُ الْعٰمِلِيْنَ ﴿٧٤﴾ وَ تَرَى الْمَلٰٓئِكَةَ
حَآفِّيْنَ مِنْ حَوْلِ الْعَرْشِ يُسَبِّحُوْنَ بِحَمْدِ
رَبِّهِمْ ۚ وَ قُضِيَ بَيْنَهُمْ بِالْحَقِّ وَقِيْلَ الْحَمْدُ
لِلّٰهِ رَبِّ الْعٰلَمِيْنَ ﴿٧٥﴾

**71 - 72** (ఈ తీర్పు తరువాత) సత్యాన్ని తిరస్కరించినవారు, నరకం వైపునకు గుంపులు, గుంపులుగా తోలబడతారు. చివరకు వారు అక్కడకు చేరినప్పుడు దాని ద్వారాలు తెరువ బడతాయి. దాని కాపలాదారులు వారితో ఇలా అంటారు, "స్వయంగా మీలో నుండే, మీకు, మీ ప్రభువు వాక్యాలను వినిపించి, ఎప్పుడో ఒకప్పుడు, మీరు ఈ దినాన్ని కూడ చూడవలసి వస్తుందని, మిమ్మల్ని హెచ్చరించిన ప్రవక్తలు మీ వద్దకు రాలేదా?" వారు, "అవును, వచ్చారు. కాని శిక్షా నిర్ణయం అవిశ్వాసుల విషయంలో రూఢి అయి పోయింది" అని సమాధానం చెబుతారు. ఇలా అనబడుతుంది, "నరక ద్వారాలలో ప్రవేశించండి. ఇక్కడ మీరు ఇక శాశ్వతంగా ఉండవలసి ఉంది. ఇది గర్విష్ఠుల నివాసం, చాల చెడ్డ నివాసం."

**73 - 74** తమ ప్రభువు పట్ల అవిధేయతకు దూరంగా ఉన్న వారిని, బృందాలు, బృందాలుగా స్వర్గం వైపునకు తీసుకు పోవటం జరుగుతుంది. చివరకు వారు అక్కడకు చేరినప్పుడు, దాని తలుపులు ముందుగానే తెరువబడి ఉంటాయి. దాని నిర్వహణాధికారులు వారితో ఇలా అంటారు, "మీకు శాంతి కలుగుగాక! మీరు చక్కగా ప్రవర్తించారు. ప్రవేశించండి ఇందు లోకి, శాశ్వతంగా ఉండేటందుకు." వారు ఇలా అంటారు, "మాకు చేసిన వాగ్దానాన్ని నిజం చేసి చూపిన, మమ్మల్ని భూమికి వారసులుగా చేసిన దేవునికి కృతజ్ఞతలు. ఇక మేము, స్వర్గంలో ఎక్కడ కోరుకుంటే అక్కడ నివాసం ఏర్పరచుకో గలము." కనుక (సత్కార్యాలు) ఆచరించేవారికి ఎంత మంచి ప్రతిఫలం!

**75** దైవ సింహాసనం చుట్టూ దైవదూతలు వలయంగా ఏర్పడి తమ ప్రభువును స్తుతించటాన్నీ, ఆయన పవిత్ర నామాన్ని కొనియాడుతూ ఉండటాన్నీ నీవు చూస్తావు. ప్రజల మధ్య సక్రమంగా, న్యాయంగా తీర్పు చేయటం జరుగుతుంది. "స్తోత్రం కేవలం సకల లోకాలకు ప్రభువైన అల్లాహ్‌కు మాత్రమే చెందుతుంది" అని ప్రకటించబడుతుంది.

9. కొందరు ఈ మాటలకు ఈవిధంగా విపరీతార్థాన్ని కల్పించి చెప్పారు, అల్లాహ్‌యే స్వయంగా ప్రవక్త ముహమ్మద్ (సఅసమ్)కు, "ఓ నా దాసులారా" అని ప్రజలను సంబోధించుము అని ఆజ్ఞాపించాడు, కనుక మానవులందరూ దైవప్రవక్తకు దాసులే. ఇది అసలు వివరణేకాదు; ఖురానుకు అతి దారుణమైన వికృతార్థం చెప్పటమే, అల్లాహ్ గ్రంథంతో ఆడుకోవటమే. ఈ వివరణే గనక నిజమైతే, యావత్తు ఖురాను గ్రంథం దోషభూయిష్టమైపోతుంది. ఎందుకంటే, ఖురాను, ఆది నుండి అంతం వరకు, మానవులందరూ కేవలం అల్లాహ్ దాసులు మాత్రమే అని చెబుతుంది. దాని సందేశ సారాంశం అంతా, "మీరు ఒక్క అల్లాహ్‌ను తప్ప మరెవరినీ సేవించకండి" అనే విషయం చుట్టూ పరిభ్రమిస్తుంది.

10. దైవగ్రంథంలోని మంచి విషయాలను అనుసరించండి అంటే, అల్లాహ్ చేయుమని ఆజ్ఞాపించిన పనులను నెరవేర్చటం, ఆయన నిషేధించిన పనులను మానెయ్యటం, దృష్టాంతాలలో, గాథలలో ఆయన బోధించిన విషయాల ద్వారా గుణపాఠాన్నీ, హితోపదేశాన్నీ నేర్చుకోవటం. దీనికి భిన్నంగా, దైవాజ్ఞల పట్ల విముఖత చూపే వ్యక్తి, నిషిద్ధపు పనులను చేసే వ్యక్తి, అల్లాహ్ బోధల ద్వారా ఎటువంటి ప్రభావానికీ లోనుకాని వ్యక్తి, దైవగ్రంథం చెడ్డవి అని నిర్దేశించిన విషయాలను అనుసరిస్తున్నాడు.

11. నింగీ నేలలపై అల్లాహ్‌కు పరిపూర్ణమైన అధికారం ఉందనే విషయం అలంకారికంగా చెప్పబడింది. ఒక మనిషి ఒక చిన్న బంతిని తన అరచేతిలోనికి సునాయాసంగా ఇముడ్చుకున్నట్లు, లేక ఒక చేతి రుమాలును అవలీలగా చుట్టగా చుట్టి తన చేతిలోనికి తీసుకున్నట్లు ప్రళయదినం నాడు మానవులందరూ (ఈనాడు అల్లాహ్ ఔన్నత్యాన్ని, ఆయన వైభవాన్ని ఊహించలేనివారు) నింగీ నేలలు అల్లాహ్ చేతిలో ఒక అల్పమైన బంతివలె, ఒక చిన్న చేతి రుమాలు వలె ఇమిడి ఉండటాన్ని ప్రత్యక్షంగా చూడగలరు.

ఆయతులు 85 | **40. అల్ మూ'మిన్** | అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 3** హా. మీమ్. ఈ గ్రంథం అల్లాహ్ తరఫు నుండి అవతరించింది. ఆయన మహాశక్తిమంతుడు, మహాజ్ఞాని, పాపాలను క్షమించేవాడూ, పశ్చాత్తాపాన్ని అంగీకరించే వాడూను; కఠినంగా శిక్షించేవాడూ, ఘనంగా కరుణించే వాడూను. ఆయన తప్ప ఆరాధ్య దైవం మరెవ్వడూలేడు. ఆయన వైపునకే అందరూ తిరిగి పోవలసి ఉన్నది.

**4 - 6** ఒక్క అవిశ్వాసులు తప్ప మరెవ్వరూ అల్లాహ్ వాక్యాలను గురించి వివాదపడరు. కనుక ప్రపంచ దేశాలలోని వారు అట్టహాసంగా తిరగటాన్ని చూచి మీరు మోసపోకూడదు. వారికి పూర్వం నూహ్ జాతి కూడ తిరస్క రించింది. దాని తరువాత ఎన్నో ఇతర వర్గాలు కూడ ఇలానే చేశాయి. ప్రతి జాతీ తన ప్రవక్తను నిర్బంధించేందుకు అతనిపై విరుచుకు పడింది. వారందరూ కలిసి అసత్యమనే ఆయుధంతో సత్యాన్ని ఓడించటానికి ప్రయత్నించారు. కాని చివరకు నేను వారిని పట్టుకున్నాను. చూడండి, నా శిక్ష ఎంత కఠినమో. ఇదేవిధంగా అవిశ్వాసానికి పాల్పడిన వారందరిని గురించి, వారు నరకంలో ప్రవేశిస్తారని నీ ప్రభువు చేసిన తీర్పు కూడా నెరవేరింది.

**7 - 9** దైవ సింహాసనాన్ని మోసే దైవదూతలూ, ఆ సింహాసనం చుట్టూ ఉండే దైవదూతలూ, అందరూ తమ ప్రభువును స్తుతిస్తూ ఆయన పవిత్రతను కొనియాడుతున్నారు. వారు ఆయనను విశ్వసిస్తున్నారు, విశ్వసించేవారిని క్షమించు అని ప్రార్థనలు చేస్తున్నారు. వారు ఇలా అంటారు, "ప్రభూ! నీవు నీ కారుణ్యంతో, నీ జ్ఞానంతో ప్రతి వస్తువుపై వ్యాపించి ఉన్నావు. కనుక పశ్చాత్తాపంతో నీ వైపునకు మరలినవారిని, నీ మార్గాన్ని అనుసరించినవారిని క్షమించు. వారిని నరకయాతన నుండి కాపాడు,

٤٠ سُوْرَةُ الْمُؤْمِنِ مَكِّيَّةٌ ٦٠

اٰيَاتُهَا ٨٥ | رُكُوْعَاتُهَا ٩

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

حٰمٓ (١) تَنْزِيْلُ الْكِتٰبِ مِنَ اللّٰهِ الْعَزِيْزِ
الْعَلِيْمِ (٢) غَافِرِ الذَّنْۢبِ وَ قَابِلِ التَّوْبِ
شَدِيْدِ الْعِقَابِ ذِى الطَّوْلِ ؕ لَاۤ اِلٰهَ اِلَّا
هُوَ ؕ اِلَيْهِ الْمَصِيْرُ (٣) مَا يُجَادِلُ فِىْۤ اٰيٰتِ
اللّٰهِ اِلَّا الَّذِيْنَ كَفَرُوْا فَلَا يَغْرُرْكَ تَقَلُّبُهُمْ
فِى الْبِلَادِ (٤) كَذَّبَتْ قَبْلَهُمْ قَوْمُ نُوْحٍ وَّ
الْاَحْزَابُ مِنْۢ بَعْدِهِمْ ۪ وَ هَمَّتْ كُلُّ اُمَّةٍۭ
بِرَسُوْلِهِمْ لِيَاْخُذُوْهُ وَجٰدَلُوْا بِالْبَاطِلِ
لِيُدْحِضُوْا بِهِ الْحَقَّ فَاَخَذْتُهُمْ ۫ فَكَيْفَ كَانَ
عِقَابِ (٥) وَ كَذٰلِكَ حَقَّتْ كَلِمَتُ رَبِّكَ عَلَى
الَّذِيْنَ كَفَرُوْۤا اَنَّهُمْ اَصْحٰبُ النَّارِ (٦) اَلَّذِيْنَ وقف النبي صلى الله عليه وسلم وقف لازم
يَحْمِلُوْنَ الْعَرْشَ وَ مَنْ حَوْلَهٗ يُسَبِّحُوْنَ
بِحَمْدِ رَبِّهِمْ وَ يُؤْمِنُوْنَ بِهٖ وَ يَسْتَغْفِرُوْنَ
لِلَّذِيْنَ اٰمَنُوْا ۚ رَبَّنَا وَسِعْتَ كُلَّ شَىْءٍ
رَّحْمَةً وَّ عِلْمًا فَاغْفِرْ لِلَّذِيْنَ تَابُوْا وَ اتَّبَعُوْا
سَبِيْلَكَ وَقِهِمْ عَذَابَ الْجَحِيْمِ (٧)

رَبَّنَا وَاَدْخِلْهُمْ جَنّٰتِ عَدْنِ ِۨالَّتِیْ وَ عَدْتَّهُمْ وَ
مَنْ صَلَحَ مِنْ اٰبَآىِٕهِمْ وَ اَزْوَاجِهِمْ وَ
ذُرِّیّٰتِهِمْ ؕ اِنَّكَ اَنْتَ الْعَزِیْزُ الْحَكِیْمُ ۙ﴿۸﴾ وَ
قِهِمُ السَّیِّاٰتِ ؕ وَ مَنْ تَقِ السَّیِّاٰتِ یَوْمَىِٕذٍ
فَقَدْ رَحِمْتَهٗ ؕ وَ ذٰلِكَ هُوَ الْفَوْزُ الْعَظِیْمُ ۧ﴿۹﴾ ع
اِنَّ الَّذِیْنَ كَفَرُوْا یُنَادَوْنَ لَمَقْتُ اللّٰهِ اَكْبَرُ
مِنْ مَّقْتِكُمْ اَنْفُسَكُمْ اِذْ تُدْعَوْنَ اِلَى الْاِیْمَانِ
فَتَكْفُرُوْنَ ﴿۱۰﴾ قَالُوْا رَبَّنَاۤ اَمَتَّنَا اثْنَتَیْنِ وَ
اَحْیَیْتَنَا اثْنَتَیْنِ فَاعْتَرَفْنَا بِذُنُوْبِنَا فَهَلْ
اِلٰى خُرُوْجٍ مِّنْ سَبِیْلٍ ﴿۱۱﴾ ذٰلِكُمْ بِاَنَّهٗۤ اِذَا
دُعِیَ اللّٰهُ وَحْدَهٗ كَفَرْتُمْ ۚ وَ اِنْ یُّشْرَكْ بِهٖ
تُؤْمِنُوْا ؕ فَالْحُكْمُ لِلّٰهِ الْعَلِیِّ الْكَبِیْرِ ﴿۱۲﴾ هُوَ
الَّذِیْ یُرِیْكُمْ اٰیٰتِهٖ وَ یُنَزِّلُ لَكُمْ مِّنَ السَّمَآءِ
رِزْقًا ؕ وَ مَا یَتَذَكَّرُ اِلَّا مَنْ یُّنِیْبُ ﴿۱۳﴾
فَادْعُوا اللّٰهَ مُخْلِصِیْنَ لَهُ الدِّیْنَ وَ لَوْ كَرِهَ
الْكٰفِرُوْنَ ﴿۱۴﴾ رَفِیْعُ الدَّرَجٰتِ ذُو الْعَرْشِ ۚ
یُلْقِی الرُّوْحَ مِنْ اَمْرِهٖ عَلٰى مَنْ یَّشَآءُ مِنْ
عِبَادِهٖ لِیُنْذِرَ یَوْمَ التَّلَاقِ ۙ﴿۱۵﴾

ప్రభూ! ఇంకా, వారిని శాశ్వతంగా ఉండే స్వర్గవనాలలో ప్రవేశింపజెయ్యి; వాటిని గురించి నీవు వారికి వాగ్దానం చేసి ఉన్నావు. వారి తల్లిదండ్రులలో, వారి భార్యలలో, వారి సంతానంలో సజ్జనులైన వారిని కూడ (వారితో పాటే అక్కడకు చేర్చు). నిస్సందేహంగా నీవు మహాశక్తిసంపన్నుడవు, మహా వివేకవంతుడవూను. వారిని చెడుల నుండి కాపాడు. ప్రళయం నాడు నీవు చెడుల నుండి కాపాడేవాడిని నీవు ఎంతో కరుణించావన్నమాట. ఇదే గొప్ప సాఫల్యం.

**10 - 12** అవిశ్వాసానికి పాల్పడిన వారిని ప్రళయం నాడు పిలిచి, "ఈనాడు మీకు మీ పట్ల ఎంత తీవ్రమైన కోపం వచ్చిందో, మిమ్మల్ని విశ్వాసం వైపునకు పిలువగా, మీరు నిరాకరించిననాడు అల్లాహ్‌కు మీ పట్ల అంతకంటే తీవ్రంగానే కోపం వచ్చింది" అని అనటం జరుగుతుంది. వారు ఇలా అంటారు: "ప్రభూ! నిజంగానే నీవు మాకు రెండుసార్లు మరణాన్నీ, రెండు సార్లు జీవితాన్నీ ఇచ్చావు.[1] ఇప్పుడు మేము మా తప్పులను ఒప్పుకుంటున్నాము. కనుక ఇక్కడ నుండి బయటపడే మార్గం కూడా ఏదైనా ఉందా?"(ఇలా సమాధానం వస్తుంది): "మీరు గురియైన ఈ దుస్థితికి కారణం ఏమిటంటే, ఏకైక దేవుడు అయిన అల్లాహ్ వైపునకు మాత్రమే పిలిచినప్పుడు, మీరు విశ్వసించకుండా తిరస్కరించేవారు. ఇతరులను ఆయనకు సమానులుగా చేసినప్పుడు, మీరు వెంటనే విశ్వసించేవారు. ఇప్పుడు తీర్పు, మహనీయుడూ, మహోన్నతుడూ అయిన అల్లాహ్ చేతులలో ఉన్నది."

**13 - 14** ఆయనే మీకు తన సూచనలను చూపిస్తాడు, ఆకాశం నుండి మీ కొరకు ఆహారాన్ని అవతరింపజేస్తాడు.[2] కాని (ఈ సూచనలను చూచి) కేవలం అల్లాహ్ వైపునకు మరలే మనిషి మాత్రమే గుణపాఠం నేర్చుకుంటాడు. (కనుక అల్లాహ్ వైపునకు మరలే ప్రజలారా!) అల్లాహ్‌ను మాత్రమే వేడుకోండి, మీ ధర్మాన్ని ఆయనకై ప్రత్యేకించుకొని, మీరు చేసే ఈ పని అవిశ్వాసులకు ఎంత అనిష్టంగా ఉన్నాసరే.

**15 - 20** ఆయన మహోన్నతమైన స్థానాలు కలవాడు, విశ్వసామ్రాజ్యపీఠానికి అధిపతి. తన దాసులలో తనకు ఇష్టమైన వారిపై తన ఆజ్ఞ ప్రకారం ఆత్మను అవతరింపజేస్తాడు; అతను సమావేశదినం గురించి హెచ్చరించేటందుకు.

يَوْمَ هُمْ بٰرِزُوْنَ ۚ لَا يَخْفٰى عَلَى اللّٰهِ مِنْهُمْ
شَيْءٌ ؕ لِمَنِ الْمُلْكُ الْيَوْمَ ؕ لِلّٰهِ الْوَاحِدِ
الْقَهَّارِ ﴿١٦﴾ اَلْيَوْمَ تُجْزٰى كُلُّ نَفْسٍ بِمَا
كَسَبَتْ ؕ لَا ظُلْمَ الْيَوْمَ ؕ اِنَّ اللّٰهَ سَرِيْعُ
الْحِسَابِ ﴿١٧﴾ وَاَنْذِرْهُمْ يَوْمَ الْاٰزِفَةِ اِذِ
الْقُلُوْبُ لَدَى الْحَنَاجِرِ كٰظِمِيْنَ ؕ مَا لِلظّٰلِمِيْنَ
مِنْ حَمِيْمٍ وَّ لَا شَفِيْعٍ يُّطَاعُ ﴿١٨﴾ يَعْلَمُ خَآئِنَةَ
الْاَعْيُنِ وَ مَا تُخْفِى الصُّدُوْرُ ﴿١٩﴾ وَ اللّٰهُ
يَقْضِىْ بِالْحَقِّ ؕ وَ الَّذِيْنَ يَدْعُوْنَ مِنْ دُوْنِهٖ
لَا يَقْضُوْنَ بِشَيْءٍ ؕ اِنَّ اللّٰهَ هُوَ السَّمِيْعُ
الْبَصِيْرُ ﴿٢٠﴾ اَوَلَمْ يَسِيْرُوْا فِى الْاَرْضِ ع
فَيَنْظُرُوْا كَيْفَ كَانَ عَاقِبَةُ الَّذِيْنَ كَانُوْا مِنْ
قَبْلِهِمْ ؕ كَانُوْا هُمْ اَشَدَّ مِنْهُمْ قُوَّةً وَّ اٰثَارًا
فِى الْاَرْضِ فَاَخَذَهُمُ اللّٰهُ بِذُنُوْبِهِمْ ؕ وَ مَا
كَانَ لَهُمْ مِّنَ اللّٰهِ مِنْ وَّاقٍ ﴿٢١﴾ ذٰلِكَ بِاَنَّهُمْ
كَانَتْ تَّاْتِيْهِمْ رُسُلُهُمْ بِالْبَيِّنٰتِ فَكَفَرُوْا
فَاَخَذَهُمُ اللّٰهُ ؕ اِنَّهٗ قَوِيٌّ شَدِيْدُ الْعِقَابِ ﴿٢٢﴾

పరదాలు తొలగిపోయి అందరూ బయటకు వచ్చిన రోజున, వారికి సంబంధించిన విషయమేదీ అల్లాహ్‌కు రహస్యంగా ఉండదు. (ఆ రోజున బహిరంగంగా ఇలా అడగటం జరుగుతుంది) "ఈనాడు విశ్వ సామ్రాజ్యాధికారం ఎవరిది?" అని. (విశ్వం మొత్తం ముక్తకంఠంతో ఇలా అంటుంది), "అది ఒకే దేవుడూ, సర్వాధిక్యం కలవాడూ అయిన అల్లాహ్‌ది" అని. (ఇలా అనటం జరుగుతుంది), "ఈనాడు ప్రతి ప్రాణికీ అది సంపాదించిన దాని ప్రకారమే ప్రతిఫలం ఇవ్వబడుతుంది. ఈనాడు ఎవరికీ ఎలాంటి అన్యాయమూ జరగదు. అల్లాహ్ మిక్కిలి వేగంగా లెక్క తీసుకుంటాడు. ఓ ప్రవక్తా! దగ్గర పడిన ఆ రోజును గురించి వారిని భయపెట్టు. అప్పుడు గుండెలు గొంతులకు అడ్డంపడుతూ ఉంటాయి. ప్రజలు దుఃఖాన్ని దిగమ్రింగి మౌనంగా నిలబడి ఉంటారు. దుర్మార్గులకు ఆప్తమిత్రుడుగానీ, మాట చెల్లుబడి అయ్యే సిఫారసు చేసేవాడు గానీ ఎవ్వడూ ఉండడు. అల్లాహ్, చూపుల చౌర్యాన్ని సైతం ఎరుగును. హృదయాలు దాచి ఉంచిన రహస్యాన్ని సైతం ఆయన ఎరుగును. అల్లాహ్ కచ్చితంగా, న్యాయంగా తీర్పు చేస్తాడు. ఇక అల్లాహ్‌ను వదలిపెట్టి (ఈ ముష్రిక్కులు) వేడుకునేవారి విషయం, వారు ఏ విషయం గురించీ తీర్పు చెప్పగలవారు కారు. నిస్సందేహంగా అల్లాహ్ మాత్రమే అన్నీ వినేవాడు, అన్నీ చూచేవాడూను.

**21 - 22** వారు భూమిలో ఎన్నడూ సంచరించలేదా, వారికి పూర్వం గతించిన ప్రజల ముగింపు ఎలా జరిగిందో వారికి కనిపించేందుకు? వారు వీరికంటే ఎక్కువ బలాఢ్యులు, వీరికి మించిన గొప్ప గుర్తులను భూమిపై వదలివెళ్లారు. కాని అల్లాహ్ వారి పాపాలకు గాను వారిని పట్టుకున్నాడు. అల్లాహ్ పట్టు నుండి వారిని రక్షించేవాడెవడూ లేకపోయాడు. వారి ముగింపు ఇలా ఎందుకు జరిగిందంటే, వారి వద్దకు వారి ప్రవక్తలు స్పష్టమైన సూచనలు[3] తీసుకుని వచ్చారు; కాని వారు విశ్వసించకుండా వాటిని తిరస్కరించారు. చివరకు అల్లాహ్ వారిని పట్టుకున్నాడు. నిశ్చయంగా ఆయన అత్యంత శక్తిమంతుడూ, శిక్షించటంలో కఠినుడూను.

1. రెండుసార్లు మరణాన్నీ, రెండుసార్లు ప్రాణాన్నీ ఇచ్చావు, అంటే 'బఖర' సూరాలోని 28వ ఆయతులో ప్రస్తావించబడిన విషయం అని భావం.

وَ لَقَدْ اَرْسَلْنَا مُوْسٰى بِاٰيٰتِنَا وَ سُلْطٰنٍ
مُّبِيْنٍ ﴿۲۳﴾ اِلٰى فِرْعَوْنَ وَهَامٰنَ وَ قَارُوْنَ
فَقَالُوْا سٰحِرٌ كَذَّابٌ ﴿۲۴﴾ فَلَمَّا جَآءَهُمْ بِالْحَقِّ
مِنْ عِنْدِنَا قَالُوا اقْتُلُوْۤا اَبْنَآءَ الَّذِيْنَ اٰمَنُوْا
مَعَهٗ وَ اسْتَحْيُوْا نِسَآءَهُمْ ؕ وَ مَا كَيْدُ
الْكٰفِرِيْنَ اِلَّا فِيْ ضَلٰلٍ ﴿۲۵﴾ وَ قَالَ فِرْعَوْنُ
ذَرُوْنِيْۤ اَقْتُلْ مُوْسٰى وَلْيَدْعُ رَبَّهٗ ۚ اِنِّيْۤ
اَخَافُ اَنْ يُّبَدِّلَ دِيْنَكُمْ اَوْ اَنْ يُّظْهِرَ فِي
الْاَرْضِ الْفَسَادَ ﴿۲۶﴾ وَقَالَ مُوْسٰۤى اِنِّيْ عُذْتُ
بِرَبِّيْ وَ رَبِّكُمْ مِّنْ كُلِّ مُتَكَبِّرٍ لَّا يُؤْمِنُ
بِيَوْمِ الْحِسَابِ ﴿۲۷﴾ وَ قَالَ رَجُلٌ مُّؤْمِنٌ ۖ ع ۳ ۸
مِّنْ اٰلِ فِرْعَوْنَ يَكْتُمُ اِيْمَانَهٗۤ اَتَقْتُلُوْنَ
رَجُلًا اَنْ يَّقُوْلَ رَبِّيَ اللّٰهُ وَ قَدْ جَآءَكُمْ
بِالْبَيِّنٰتِ مِنْ رَّبِّكُمْ ؕ وَ اِنْ يَّكُ كَاذِبًا فَعَلَيْهِ
كَذِبُهٗ ۚ وَاِنْ يَّكُ صَادِقًا يُّصِبْكُمْ بَعْضُ الَّذِيْ
يَعِدُكُمْ ؕ اِنَّ اللّٰهَ لَا يَهْدِيْ مَنْ هُوَ مُسْرِفٌ
كَذَّابٌ ﴿۲۸﴾ يٰقَوْمِ لَكُمُ الْمُلْكُ الْيَوْمَ ظٰهِرِيْنَ
فِي الْاَرْضِ ۫ فَمَنْ يَّنْصُرُنَا مِنْۢ بَاْسِ اللّٰهِ اِنْ
جَآءَنَا ؕ قَالَ فِرْعَوْنُ مَاۤ اُرِيْكُمْ اِلَّا مَاۤ
اَرٰى وَ مَاۤ اَهْدِيْكُمْ اِلَّا سَبِيْلَ الرَّشَادِ ﴿۲۹﴾

**23 - 25** మేము మూసాను ఫిరౌన్, హామాన్, ఖారూన్‌ల వద్దకు మా సూచనలతో, స్పష్టమైన నియమాధికారంతో పంపాము. కాని వారు, "ఇతడు మాంత్రికుడు, అసత్యవాది" అని అన్నారు. తరువాత అతను మా వద్ద నుండి సత్యాన్ని వారి ముందుకు తీసుకురాగా, వారు ఇలా అన్నారు, "విశ్వసించి ఇతనితో చేరిపోయినవారందరి కొడుకులనూ చంపండి, వారి కూతుళ్లను వదలిపెట్టండి." కాని అవిశ్వాసుల పన్నాగం విఫలమే అయింది.

**26** ఒకరోజు ఫిరౌన్ తన దర్బారు జనులతో ఇలా అన్నాడు, "నన్ను వదలండి, నేను ఈ మూసాను చంపివేస్తాను. ఇతడు తన ప్రభువును పిలుచుకోనివ్వండి. ఇతడు మీ మతాన్ని మార్చివేస్తాడేమో అని, లేదా దేశంలో సంక్షోభాన్ని రేకెత్తిస్తాడేమో అని నేను భయపడుతున్నాను."

**27** మూసా ఇలా అన్నాడు, "నేను లెక్కల రోజును విశ్వసించని ప్రతి దురహంకారి బారి నుండి కాపాడు అని నా ప్రభువును, మీ ప్రభువునూ శరణుకోరాను."

**28 - 29** ఈ సందర్భంగా, తన విశ్వాసాన్ని గుప్తంగా ఉంచిన ఫిరౌన్ జాతికి చెందిన ఒక విశ్వాసి ఇలా అన్నాడు: "మీరు ఒక వ్యక్తిని, కేవలం అతడు, 'నా ప్రభువు అల్లాహ్' అని అన్నంత మాత్రాన్నే చంపేస్తారా? వాస్తవానికి అతను మీ ప్రభువు వద్దనుండి మీ వద్దకు స్పష్టమైన సూచనలు తీసుకు వచ్చాడు. ఒకవేళ అతను అబద్ధాలు చెప్పేవాడే అయితే, అతని అబద్ధం స్వయంగా అతని మీదనే తిరిగి పడుతుంది. కాని ఒకవేళ అతను సత్యమే చెబుతున్నట్లయితే, అతను మిమ్మల్ని భయపెడుతున్న భయంకరమైన పరిణామాలలో కొన్ని అయినా మీ మీదకు తప్పకుండా వచ్చిపడతాయి. హద్దులను అతిక్రమించే, అసత్యాలు పలికే ఏ వ్యక్తికీ అల్లాహ్ సన్మార్గం చూపడు. నా జాతి ప్రజలారా! మీకు ఈనాడు రాజ్యాధికారం ఉన్నది. భూమిపై మీరు ప్రాబల్యం వహించి ఉన్నారు. కాని ఒకవేళ దైవశిక్ష మనపైకి వచ్చిపడితే, అప్పుడు మనకు సహాయం చేయగల వాడెవడైనా ఉన్నాడా?" ఫిరౌన్ ఇలా అన్నాడు, "నాకు సముచితంగా తోచిన సలహానే నేను మీకు ఇస్తున్నాను. సత్క్రమమైన మార్గం వైపునకే నేను మిమ్మల్ని నడుపుతున్నాను."

وَ قَالَ الَّذِيۡۤ اٰمَنَ يٰقَوۡمِ اِنِّيۡۤ اَخَافُ عَلَيۡكُمۡ
مِّثۡلَ يَوۡمِ الۡاَحۡزَابِۙ ﴿۳۰﴾ مِثۡلَ دَاۡبِ قَوۡمِ
نُوۡحٍ وَّ عَادٍ وَّ ثَمُوۡدَ وَالَّذِيۡنَ مِنۡۢ بَعۡدِهِمۡ ؕ وَ
مَا اللّٰهُ يُرِيۡدُ ظُلۡمًا لِّلۡعِبَادِ ﴿۳۱﴾ وَ يٰقَوۡمِ اِنِّيۡۤ
اَخَافُ عَلَيۡكُمۡ يَوۡمَ التَّنَادِۙ ﴿۳۲﴾ يَوۡمَ تُوَلُّوۡنَ
مُدۡبِرِيۡنَ ۚ مَا لَـكُمۡ مِّنَ اللّٰهِ مِنۡ عَاصِمٍ ۚ وَ مَنۡ
يُّضۡلِلِ اللّٰهُ فَمَا لَهٗ مِنۡ هَادٍ ﴿۳۳﴾ وَ لَقَدۡ جَآءَكُمۡ
يُوۡسُفُ مِنۡ قَبۡلُ بِالۡبَيِّنٰتِ فَمَا زِلۡتُمۡ فِىۡ شَكٍّ
مِّمَّا جَآءَكُمۡ بِهٖ ؕ حَتّٰٓى اِذَا هَلَكَ قُلۡتُمۡ لَنۡ
يَّبۡعَثَ اللّٰهُ مِنۡۢ بَعۡدِهٖ رَسُوۡلًا ؕ كَذٰلِكَ يُضِلُّ
اللّٰهُ مَنۡ هُوَ مُسۡرِفٌ مُّرۡتَابُ ۖۚ ﴿۳۴﴾ اۨلَّذِيۡنَ
يُجَادِلُوۡنَ فِىۡۤ اٰيٰتِ اللّٰهِ بِغَيۡرِ سُلۡطٰنٍ اَتٰٮهُمۡ ؕ
كَبُرَ مَقۡتًا عِنۡدَ اللّٰهِ وَ عِنۡدَ الَّذِيۡنَ اٰمَنُوۡا ؕ
كَذٰلِكَ يَطۡبَعُ اللّٰهُ عَلٰى كُلِّ قَلۡبِ مُتَكَبِّرٍ
جَبَّارٍ ﴿۳۵﴾ وَ قَالَ فِرۡعَوۡنُ يٰهَامٰنُ ابۡنِ لِىۡ
صَرۡحًا لَّعَلِّىۡۤ اَبۡلُغُ الۡاَسۡبَابَۙ ﴿۳۶﴾ اَسۡبَابَ
السَّمٰوٰتِ فَاَطَّلِعَ اِلٰٓى اِلٰهِ مُوۡسٰى وَ اِنِّىۡ
لَاَظُنُّهٗ كَاذِبًا ؕ وَ كَذٰلِكَ زُيِّنَ لِفِرۡعَوۡنَ سُوۡٓءُ
عَمَلِهٖ وَ صُدَّ عَنِ السَّبِيۡلِ ؕ وَ مَا كَيۡدُ
فِرۡعَوۡنَ اِلَّا فِىۡ تَبَابٍ ﴿۳۷﴾ ع

**30 - 35** విశ్వసించిన ఆ వ్యక్తి ఇలా అన్నాడు, "నా జాతి ప్రజలారా! పూర్వం అనేక జన సమూహాలకు దాపురించిన దినమే, మీకు కూడా దాపురిస్తుందేమో అని నేను భయపడు తున్నాను–నూహ్ జాతి, ఆద్ జాతి, సమూద్ జాతులకూ వారి తరువాత వచ్చిన జాతులకూ దాపురించిన దినం. తన దాసు లకు అన్యాయం చేయాలనే ఉద్దేశ్యం అల్లాహ్‌కు ఎంత మాత్రం లేదు అనేది వాస్తవం. నా జాతి ప్రజలారా! మీరు రోదించే దినమేదైనా మీపైకి వచ్చిపడుతుందేమో అని నేను భయపడు తున్నాను; అప్పుడు మీరు ఒకరినొకరు పిలుచుకుంటారు, పరుగెత్తుతూ తిరుగుతూ ఉంటారు. కాని ఆ సమయంలో అల్లాహ్ నుండి మిమ్మల్ని రక్షించేవాడెవడూ ఉండడు. నిజం ఏమిటంటే, అల్లాహ్, మార్గం తప్పించిన వాడికి మళ్లీ మార్గం చూపే వాడెవడూ ఉండడు. పూర్వం యూసుఫ్ మీ వద్దకు స్పష్టమైన ప్రమాణాలను తీసుకువచ్చాడు. కాని మీరు అతను తెచ్చిన బోధను గురించి అనుమానానికే గురిఅయ్యారు. తరువాత అతను మరణించినప్పుడు మీరు, "ఇక అతని తరువాత అల్లాహ్ మరొక ప్రవక్తను పంపడు" అని అన్నారు– ఇదే విధంగా[4] అల్లాహ్, హద్దులను అతిక్రమించేవారినీ, శంకితులనూ, తమ వద్దకు ఏ ధ్రువపత్రమూ, ఏ ఆధారమూ రాకపోయినా అల్లాహ్ వాక్యాల విషయంలో వాదించేవారినీ మార్గభ్రష్టత్వానికి గురిచేస్తాడు. వారి ఈ వైఖరి అల్లాహ్ దృష్టిలో, విశ్వాసుల దృష్టిలో మిక్కిలి గర్హనీయమైనది. ఇలాగే అల్లాహ్, దురహంకారీ, నిరంకుశుడూ అయిన ప్రతి వ్యక్తి హృదయానికి ముద్రవేస్తాడు.

**36 - 37** ఫిరౌన్ ఇలా అన్నాడు, "హామాన్! నా కోసం ఒక ఎత్తైన సౌధాన్ని నిర్మించు, నేను మార్గాల వరకు–ఆకాశాలకు వెళ్ళే మార్గాల వరకు చేరగలిగేందుకు, మూసా దేవుణ్ణి తొంగి చూసేందుకు. నాకు ఈ మూసా అబద్ధాల కోరుగానే కనిపిస్తు న్నాడు– ఈ విధంగా ఫిరౌన్‌కు అతడి దుష్కార్యం మనోహర మైనదిగా చేయబడింది; అతడు సత్యమార్గం వైపునకు రాకుండా ఆపబడ్డాడు. ఫిరౌన్ పన్నాగమంతా (స్వయంగా అతని) వినాశ మార్గానికే వినియోగపడింది.

2. అంటే, మీ జీవనోపాధికి ఆధారభూతమైన వర్షాన్నీ ఆయన కురిపిస్తాడు; ఆహారోత్పత్తిలో ప్రముఖ పాత్రవహించే శీతోష్ణాలను ఆయన అవతరింపజేస్తాడు.

وَ قَالَ الَّذِيْٓ اٰمَنَ يٰقَوْمِ اتَّبِعُوْنِ اَهْدِكُمْ
سَبِيْلَ الرَّشَادِ ﴿٣٨﴾ يٰقَوْمِ اِنَّمَا هٰذِهِ الْحَيٰوةُ
الدُّنْيَا مَتَاعٌ ۡ وَّ اِنَّ الْاٰخِرَةَ هِيَ دَارُ
الْقَرَارِ ﴿٣٩﴾ مَنْ عَمِلَ سَيِّئَةً فَلَا يُجْزٰٓى اِلَّا
مِثْلَهَا ۚ وَ مَنْ عَمِلَ صَالِحًا مِّنْ ذَكَرٍ اَوْ اُنْثٰى
وَ هُوَ مُؤْمِنٌ فَاُولٰٓئِكَ يَدْخُلُوْنَ الْجَنَّةَ
يُرْزَقُوْنَ فِيْهَا بِغَيْرِ حِسَابٍ ﴿٤٠﴾ وَ يٰقَوْمِ مَا لِيْٓ
اَدْعُوْكُمْ اِلَى النَّجٰوةِ وَ تَدْعُوْنَنِيْٓ اِلَى النَّارِ ﴿٤١﴾ النصف
تَدْعُوْنَنِيْ لِاَكْفُرَ بِاللّٰهِ وَ اُشْرِكَ بِهٖ مَا لَيْسَ
لِيْ بِهٖ عِلْمٌ ۡ وَّ اَنَا اَدْعُوْكُمْ اِلَى الْعَزِيْزِ
الْغَفَّارِ ﴿٤٢﴾ لَا جَرَمَ اَنَّمَا تَدْعُوْنَنِيْٓ اِلَيْهِ
لَيْسَ لَهٗ دَعْوَةٌ فِي الدُّنْيَا وَ لَا فِي الْاٰخِرَةِ
وَ اَنَّ مَرَدَّنَآ اِلَى اللّٰهِ وَ اَنَّ الْمُسْرِفِيْنَ هُمْ
اَصْحٰبُ النَّارِ ﴿٤٣﴾ فَسَتَذْكُرُوْنَ مَآ اَقُوْلُ لَكُمْ ۭ
وَ اُفَوِّضُ اَمْرِيْٓ اِلَى اللّٰهِ ۭ اِنَّ اللّٰهَ بَصِيْرٌۢ
بِالْعِبَادِ ﴿٤٤﴾

**38 - 44** విశ్వసించిన ఆ వ్యక్తి ఇంకా ఇలా అన్నాడు, "నా జాతి ప్రజలారా! నా మాట వినండి. నేను మీకు సరైన మార్గాన్ని చూపిస్తాను. నా జాతీయులారా! ఈ ప్రాపంచిక జీవితం తాత్కాలికం, శాశ్వత నివాస స్థలం పరలోకమే. చెడు చేసినవాడికి, అతడు చేసినంత చెడుకు మాత్రమే ప్రతిఫలం లభిస్తుంది. మంచి పనులు చేసినవ్యక్తి, పురుషుడైనా స్త్రీ అయినా, విశ్వాసి అయితే, అటువంటి వారందరూ స్వర్గంలో ప్రవేశిస్తారు. అక్కడ వారికి అపరిమితమైన జీవన సామగ్రి ఇవ్వబడుతుంది. నా జాతీయులారా! ఇదేమి వైపరీత్యం! నేను మిమ్మల్ని ముక్తివైపునకు పిలుస్తున్నాను, మీరేమో నన్ను అగ్ని వైపునకు పిలుస్తున్నారు! నేను అల్లాహ్‌ను తిరస్కరించాలనీ, నేను ఎరుగని[5] శక్తులను ఆయనకు భాగస్వాములుగా నిలబెట్టాలనీ మీరు నాకు పిలుపు ఇస్తున్నారు. నిజానికి నేను మిమ్మల్ని సర్వశక్తి సంపన్నుడూ, క్షమాశీలుడూ అయిన దేవుని వైపునకు పిలుస్తున్నాను. కాదు, సత్యం ఇదే, దీనికి భిన్నంగా జరగటానికి వీల్లేదు: మీరు నన్ను ఎవరి వైపునకు పిలుస్తున్నారో, వారి వైపునకు పిలుపు అనేది ఇహలోకంలోనూ లేదు పరలోకం[6] లోనూ లేదు. మనం అందరం అల్లాహ్ వద్దకే మరలిపోవలసి ఉంది. హద్దులు మీరేవారే అగ్నిలోకి పోయే వారు. ఈనాడు నేను చెప్పేదాన్ని మీరు జ్ఞాపకం చేయనున్న సమయం త్వరలోనే రాబోతోంది. నా వ్యవహారాన్ని నేను అల్లాహ్‌కు అప్పగిస్తున్నాను. ఆయన తన దాసులను కనిపెట్టుకుని ఉంటాడు.

3. 'బయ్యినాత్' అంటే ఈ మూడు విషయాలు : ఒకటి; ఆయన అల్లాహ్‌చే సందేశహరునిగా నియమించబడ్డారు అనే దానికి సాక్షీభూతాలైన సూచనలు, గుర్తులు. రెండు; ఆయన చేసే ఉపదేశాలు సత్యాలని నిరూపించే స్పష్టమైన ప్రమాణాలు. మూడు; జీవిత సమస్యలు, వ్యవహారాలకు సంబంధించిన విస్పష్టమైన మార్గదర్శక సూత్రాలు; వాటిని చూసి, యోగ్యుడైన ప్రతి మనిషీ, ఇటువంటి పరిశుద్ధమైన బోధలను అసత్యవాదీ, స్వార్థపరుడూ అయిన వ్యక్తి చేయలేడు అని గ్రహిస్తాడు.

4. స్థూలదృష్టితో చూస్తే, ఇలా అనిపిస్తుంది: ఇక ముందు రాబోయే కొన్ని వాక్యాలను, ఫిరౌను ప్రజలలోని ఒక విశ్వాసి మాటలకు వివరణగా అల్లాహ్ అదనంగా సెలవిచ్చాడు.

5. అంటే, నాకు తెలిసినంత వరకు, వారికి దైవత్వంలో భాగస్వామ్యం లేదు.

6. ఈ వాక్యానికి అనేక అర్థాలు చెప్పవచ్చు: ఒకటి, వారి దైవత్వం వైపునకు ప్రజలను ఆహ్వానించి, అంగీకరింపజేసేందుకు, వారికి ఈ ప్రపంచంలోనూ హక్కులేదు ఆ ప్రపంచంలోనూ లేదు. రెండు, వారిని ప్రజలు బలవంతంగా దేవుళ్లుగా చేశారు. ఎందుకంటే, వారు ఈ లోకంలోనూ తాము దైవత్వానికి హక్కుదారులమని

فَوَقٰىهُ اللّٰهُ سَيِّاٰتِ مَا مَكَرُوْا وَحَاقَ بِاٰلِ
فِرْعَوْنَ سُوْٓءُ الْعَذَابِ ﴿٤٥﴾ اَلنَّارُ يُعْرَضُوْنَ
عَلَيْهَا غُدُوًّا وَّ عَشِيًّا ۚ وَ يَوْمَ تَقُوْمُ السَّاعَةُ ۟
اَدْخِلُوْٓا اٰلَ فِرْعَوْنَ اَشَدَّ الْعَذَابِ ﴿٤٦﴾ وَ اِذْ
يَتَحَآجُّوْنَ فِي النَّارِ فَيَقُوْلُ الضُّعَفٰٓؤُا لِلَّذِيْنَ
اسْتَكْبَرُوْٓا اِنَّا كُنَّا لَكُمْ تَبَعًا فَهَلْ اَنْتُمْ
مُّغْنُوْنَ عَنَّا نَصِيْبًا مِّنَ النَّارِ ﴿٤٧﴾ قَالَ الَّذِيْنَ
اسْتَكْبَرُوْٓا اِنَّا كُلٌّ فِيْهَآ ۙ اِنَّ اللّٰهَ قَدْ حَكَمَ
بَيْنَ الْعِبَادِ ﴿٤٨﴾ وَ قَالَ الَّذِيْنَ فِي النَّارِ
لِخَزَنَةِ جَهَنَّمَ ادْعُوْا رَبَّكُمْ يُخَفِّفْ عَنَّا يَوْمًا
مِّنَ الْعَذَابِ ﴿٤٩﴾ قَالُوْٓا اَوَلَمْ تَكُ تَاْتِيْكُمْ
رُسُلُكُمْ بِالْبَيِّنٰتِ ؕ قَالُوْا بَلٰى ؕ قَالُوْا
فَادْعُوْا ۚ وَ مَا دُعٰٓؤُا الْكٰفِرِيْنَ اِلَّا فِيْ ضَلٰلٍ ﴿٥٠﴾ ع ٥

**45 - 50** చివరకు ఆ విశ్వాసికి వ్యతిరేకంగా వారు, పన్నిన అన్ని కుయుక్తుల నుండి అల్లాహ్ అతనిని రక్షించాడు.[7] ఫిరౌన్ అనుచరులే ఒక భయంకరమైన శిక్షలో చిక్కుకున్నారు. వారు ఉదయం సాయంత్రం నరకాగ్ని ముందు ఉంచబడుతూ ఉంటారు. ప్రళయ గడియవచ్చినప్పుడు, "ఫిరౌన్ ప్రజలను తీవ్రమైన శిక్షలోకి ప్రవేశింపజెయ్యండి" అని ఆజ్ఞాపించబడు తుంది. ఇంకా, వారు నరకంలో ఒకరితో ఒకరు కలహించే సందర్భం గురించి ఆలోచించు. ప్రపంచంలో బలహీనులుగా ఉన్నవారు, పెద్ద మనుషులుగా చెల్లుబడి అయిన వారితో ఇలా అంటారు, "మేము మిమ్మల్ని అనుసరిస్తూ ఉండేవారము. ఇప్పుడు మీరు ఇక్కడ నరకాగ్ని బాధ నుండి కొంతవరకైనా మమ్మల్ని కాపాడతారా?" ఆ పెద్ద మనుషులు ఇలా జవాబు ఇస్తారు, "ఇక్కడ మనమందరం ఒకే స్థితిలో ఉన్నాము. దాసుల మధ్య అల్లాహ్ తీర్పు చేసేశాడు." తరువాత అగ్నిలో పడి ఉన్న వారు నరకభటులతో, "మా శిక్షను కనీసం ఒక్కరోజైనా తగ్గించమని మీరు మీ ప్రభువును ప్రార్థించండి" అని అర్థిస్తారు. భటులు ఇలా అడుగుతారు, "మీ వద్దకు దైవప్రవక్తలు స్పష్టమైన సూచనలు తీసుకుని రాలేదా?" అప్పుడు వారు, "అవును, వచ్చారు" అని అంటారు. నరకభటులు, "అలా అయితే, మీరే ప్రార్థించండి; సత్యతిరస్కారుల ప్రార్థన నిరర్థకమే అవుతుంది" అని అంటారు.

చెప్పలేదు, పరలోకంలోనూ వారు, "మేము సైతం దేవుళ్లమే కదా! మీరు మమ్మల్ని ఎందుకు విశ్వసించలేదు" అని చెప్పరు. మూడు; వారిని వేడుకోవటం వల్ల ఇక్కడా ఉపయోగం లేదు అక్కడా ఉపయోగం లేదు. ఎందుకంటే, వారు అధికారహీనులు, వారిని వేడుకోవటం పూర్తిగా నిరర్థకం.

7. దీనిద్వారా తెలిసే విషయం ఏమిటంటే, ఫిరౌను రాజ్యంలో ఆ వ్యక్తి ఎంతో ప్రాముఖ్యం కలవాడు, కనుకనే నిండుదర్బారులో ఫిరౌను ముఖం మీద సత్యాన్ని చెప్పినప్పటికీ, బహిరంగంగా అతన్ని శిక్షించటానికి ఎవరికీ ధైర్యం చాలలేదు. అందుచేత, ఫిరౌనూ, అతని మద్దతుదారులూ అతనిని చంపటానికి రహస్యంగా కుట్రలు పన్నవలసి వచ్చింది. కాని అల్లాహ్ ఆ కుట్రలనన్నింటినీ భగ్నం చేశాడు.

**51 - 56** నిశ్చయంగా మేము మా ప్రవక్తలకూ, విశ్వాసులకూ ఇహలోక జీవితంలో కూడా తప్పకుండా సహాయం చేస్తాము; సాక్షులు నిలబడే రోజున కూడా సహాయం చేస్తాము. ఆ రోజున దుర్మార్గులకు వారి సాకు ఏమాత్రం ఉపయోగపడదు, వారి మీద శాపం విరుచుకుపడుతుంది, అతి నికృష్టమైన నివాసం వారి వాటాగా లభిస్తుంది. చూడండి, చివరకు మేము మూసాకు దారి చూపాము. బుద్ధీ వివేకాలు కలవారికి మార్గ దర్శకత్వం, హితోపదేశం అయిన గ్రంథానికి ఇస్రాయీల్ ప్రజలను వారసులుగా చేశాము. కనుక ఓ ప్రవక్తా! ఓర్మి చూపు. అల్లాహ్ వాగ్దానం సత్యం. నీ తప్పులకు క్షమాభిక్ష వేడుకో.[8] ఉదయం, సాయంత్రం నీ ప్రభువును స్తుతిస్తూ, ఆయన పరిశుద్ధతను కొనియాడు. తమ వద్దకు ఏ అధికార పత్రమూ రాకుండానే అల్లాహ్ వాక్యాల విషయంలో వాదులాడే వారి మనస్సులు గర్వంతో నిండిపోయాయి. కాని తాము గర్వపడుతూ ఉన్నంత గొప్పతనానికి వారు చేరుకోలేరు. కనుక అల్లాహ్ శరణువేడుకో; ఆయన అన్నీ చూస్తాడు, అన్నీ వింటాడు.

**57 - 59** మానవుణ్ణి సృష్టించటం కంటే ఆకాశాలనూ, భూమినీ సృష్టించటం నిశ్చయంగా ఎంతో గొప్ప పని. కాని అనేకులు ఎరుగరు. కళ్లు లేనివాడూ, కళ్ళు ఉన్నవాడూ సమానం కావటం; విశ్వసించి సత్కార్యాలు చేసేవారూ, దుర్వర్తనులూ సరిసమానం కావటం అనేది ఎంతమాత్రం జరగదు. కాని మీరు అర్థం చేసుకోవటం చాలా తక్కువ.

اِنَّا لَنَنْصُرُ رُسُلَنَا وَالَّذِيْنَ اٰمَنُوْا فِي الْحَيٰوةِ
الدُّنْيَا وَيَوْمَ يَقُوْمُ الْاَشْهَادُ ۙ﴿٥١﴾ يَوْمَ لَا
يَنْفَعُ الظّٰلِمِيْنَ مَعْذِرَتُهُمْ وَلَهُمُ اللَّعْنَةُ وَ
لَهُمْ سُوْٓءُ الدَّارِ ﴿٥٢﴾ وَلَقَدْ اٰتَيْنَا مُوْسَى
الْهُدٰى وَاَوْرَثْنَا بَنِيْٓ اِسْرَآءِيْلَ الْكِتٰبَ ۙ﴿٥٣﴾
هُدًى وَّذِكْرٰى لِاُولِى الْاَلْبَابِ ﴿٥٤﴾ فَاصْبِرْ اِنَّ
وَعْدَ اللّٰهِ حَقٌّ وَّاسْتَغْفِرْ لِذَنْۢبِكَ وَسَبِّحْ
بِحَمْدِ رَبِّكَ بِالْعَشِيِّ وَالْاِبْكَارِ ﴿٥٥﴾ اِنَّ
الَّذِيْنَ يُجَادِلُوْنَ فِيْٓ اٰيٰتِ اللّٰهِ بِغَيْرِ سُلْطٰنٍ
اَتٰىهُمْ ۙ اِنْ فِيْ صُدُوْرِهِمْ اِلَّا كِبْرٌ مَّا هُمْ
بِبَالِغِيْهِ ۚ فَاسْتَعِذْ بِاللّٰهِ ۭ اِنَّهٗ هُوَ السَّمِيْعُ
الْبَصِيْرُ ﴿٥٦﴾ لَخَلْقُ السَّمٰوٰتِ وَالْاَرْضِ اَكْبَرُ
مِنْ خَلْقِ النَّاسِ وَلٰكِنَّ اَكْثَرَ النَّاسِ لَا
يَعْلَمُوْنَ ﴿٥٧﴾ وَمَا يَسْتَوِي الْاَعْمٰى وَالْبَصِيْرُ ۙ
وَالَّذِيْنَ اٰمَنُوْا وَعَمِلُوا الصّٰلِحٰتِ وَلَا
الْمُسِيْٓءُ ۭ قَلِيْلًا مَّا تَتَذَكَّرُوْنَ ﴿٥٨﴾

---

8. ఈ మాట చెప్పిన సందర్భాన్ని గురించి ఆలోచించినట్లయితే, స్పష్టంగా తెలిసే విషయం ఏమిటంటే, ఇక్కడ "తప్పు" అంటే, తీవ్రమైన వ్యతిరేకతను చూసి, ముఖ్యంగా తన సహచరులు హింసకు గురి అవుటను చూసి, మహాప్రవక్త (సఅసమ్)లో కలిగిన అసహనస్థితి. వెంటనే ఏదైనా మహిమను చూపి తద్వారా అవిశ్వాసులను ఒప్పించాలనీ లేదా అల్లాహ్ నుండి మరొక విషయం ఏదైనా ప్రత్యక్షమై ఈ వ్యతిరేకతా ప్రభంజనాన్ని అణచివేయాలనీ ఆయన మనసారా కోరుకునేవారు. ఈ కోరిక నిజానికి ఏ పాపమూ కాదు. దీనికి పశ్చాత్తాప పడడం, క్షమాభిక్ష అర్థించడం అవసరం లేకపోయినప్పటికీ మహాప్రవక్తకు అల్లాహ్ ప్రసాదించిన మహోన్నత స్థానాన్నిబట్టి, ఆయనలో ఉండవలసినటువంటి సంయమనాన్నీ ఆత్మ నిగ్రహాన్నీబట్టి, ఈ కించిత్తు అసహనం కూడ అల్లాహ్ దృష్టిలో ఆయన స్థాయికి తగినటువంటిది కాదు. కావున ఈ బలహీనతకు తన ప్రభువును క్షమాభిక్ష వేడుకోమని చెప్పబడింది, కొండమాదిరిగా చలించకుండా, తన నిర్ణయానికి కట్టుబడి ఉండాలనీ, ఆయన ఉన్నత స్థానానికి ఇదే తగినదనీ చెప్పబడింది.

إِنَّ السَّاعَةَ لَآتِيَةٌ لَّا رَيْبَ فِيهَا وَلَٰكِنَّ
أَكْثَرَ النَّاسِ لَا يُؤْمِنُونَ ﴿٥٩﴾ وَقَالَ رَبُّكُمُ
ادْعُونِي أَسْتَجِبْ لَكُمْ ۚ إِنَّ الَّذِينَ
يَسْتَكْبِرُونَ عَنْ عِبَادَتِي سَيَدْخُلُونَ جَهَنَّمَ
دَاخِرِينَ ﴿٦٠﴾ اللَّهُ الَّذِي جَعَلَ لَكُمُ اللَّيْلَ ع ٦
لِتَسْكُنُوا فِيهِ وَالنَّهَارَ مُبْصِرًا ۚ إِنَّ اللَّهَ
لَذُو فَضْلٍ عَلَى النَّاسِ وَلَٰكِنَّ أَكْثَرَ النَّاسِ لَا
يَشْكُرُونَ ﴿٦١﴾ ذَٰلِكُمُ اللَّهُ رَبُّكُمْ خَالِقُ كُلِّ شَيْءٍ وقف لازم
لَّا إِلَٰهَ إِلَّا هُوَ ۖ فَأَنَّىٰ تُؤْفَكُونَ ﴿٦٢﴾ كَذَٰلِكَ
يُؤْفَكُ الَّذِينَ كَانُوا بِآيَاتِ اللَّهِ يَجْحَدُونَ ﴿٦٣﴾
اللَّهُ الَّذِي جَعَلَ لَكُمُ الْأَرْضَ قَرَارًا
وَالسَّمَاءَ بِنَاءً وَصَوَّرَكُمْ فَأَحْسَنَ صُوَرَكُمْ
وَرَزَقَكُم مِّنَ الطَّيِّبَاتِ ۚ ذَٰلِكُمُ اللَّهُ رَبُّكُمْ
فَتَبَارَكَ اللَّهُ رَبُّ الْعَالَمِينَ ﴿٦٤﴾ هُوَ الْحَيُّ لَا
إِلَٰهَ إِلَّا هُوَ فَادْعُوهُ مُخْلِصِينَ لَهُ الدِّينَ ۗ
الْحَمْدُ لِلَّهِ رَبِّ الْعَالَمِينَ ﴿٦٥﴾ قُلْ إِنِّي نُهِيتُ
أَنْ أَعْبُدَ الَّذِينَ تَدْعُونَ مِن دُونِ اللَّهِ لَمَّا
جَاءَنِيَ الْبَيِّنَاتُ مِن رَّبِّي وَأُمِرْتُ أَنْ
أُسْلِمَ لِرَبِّ الْعَالَمِينَ ﴿٦٦﴾

నిశ్చయంగా ప్రళయ గడియ తప్పకుండా వస్తుంది. అది వచ్చే విషయం గురించి ఏమాత్రం సందేహం లేదు. కాని చాలా మంది నమ్మరు.

**60** నీ ప్రభువు ఇలా అంటున్నాడు, “నన్ను ప్రార్థించండి, నేను మీ ప్రార్థనలను అంగీకరిస్తాను.[9] గర్వానికి లోనై నా ఆరాధనకు విముఖులయ్యేవారు తప్పనిసరిగా అవమానానికీ, పరాభవానికీ గురయి నరకంలో ప్రవేశిస్తారు.”[10]

**61 - 63** మీరు విశ్రాంతి తీసుకోవటానికి మీ కొరకు రాత్రిని సృష్టించిన వాడూ, పగలును వెలుగుతో నింపినవాడూ అల్లాహ్‌యే కదా! వాస్తవానికి అల్లాహ్ ప్రజలపట్ల ఎంతో దయగలవాడు. కాని ఎక్కువ మంది కృతజ్ఞతలు తెలుపరు. ఆ అల్లాహ్‌యే (మీ కొరకు ఇదంతా చేసినవాడు) మీ ప్రభువు, ప్రతిదాన్నీ సృజించినవాడు. ఆయన తప్ప మరొక ఆరాధ్యుడు లేడు. అలాంటప్పుడు మీరు ఎలా మార్గం తప్పిపోతున్నారు? ఇదేవిధంగా అల్లాహ్ వాక్యాలను తిరస్కరించేవారందరూ మార్గం నుంచి తప్పించబడుతూ వచ్చారు.

**64 - 65** మీకొరకు భూమిని నివాస స్థలంగా చేసినవాడూ, పైని ఆకాశాన్ని కప్పుగా నిర్మించినవాడూ, మీ రూపాన్ని తీర్చిదిద్దినవాడూ, దానిని ఎంతో చక్కగా మలచినవాడూ, మీకు పరిశుభ్రమైన పదార్థాలను ఆహారంగా ఇచ్చిన వాడూ, అల్లాహ్‌యే కదా! ఆ అల్లాహ్‌యే (ఈ పనులన్నీ చేసినవాడు) మీ ప్రభువు. ఆ విశ్వప్రభువు అసంఖ్యాకమైన శుభాలు కలవాడు. ఆయనే సజీవుడు. ఆయన తప్ప మరొక ఆరాధ్యుడు ఎవ్వడూ లేడు. ఆయననే మీరు వేడుకోండి, మీ ధర్మాన్ని ఆయనకే ప్రత్యేకంచేసి. సకల ప్రశంసలూ సర్వలోకాలకూ ప్రభువైన అల్లాహ్‌కే చెందుతాయి.

**66** ప్రవక్తా! వారితో ఇలా అను: “అల్లాహ్‌ను కాదని మీరు వేడుకుంటున్న వారి ఆరాధన చేయకూడదని నన్ను వారించటం జరిగింది. నా ప్రభువు వైపు నుండి నా వద్దకు స్పష్టమైన సూచనలు వచ్చాయి. (నేను ఈ పనిని ఎలా చేయగలను) సకల లోకాల ప్రభువునకు విధేయత చూపాలని నేను ఆజ్ఞాపించబడ్డాను.

هُوَ الَّذِىْ خَلَقَكُمْ مِّنْ تُرَابٍ ثُمَّ مِنْ نُّطْفَةٍ
ثُمَّ مِنْ عَلَقَةٍ ثُمَّ يُخْرِجُكُمْ طِفْلًا ثُمَّ
لِتَبْلُغُوْٓا اَشُدَّكُمْ ثُمَّ لِتَكُوْنُوْا شُيُوْخًا ۚ وَ
مِنْكُمْ مَّنْ يُّتَوَفّٰى مِنْ قَبْلُ وَ لِتَبْلُغُوْٓا اَجَلًا
مُّسَمًّى وَّلَعَلَّكُمْ تَعْقِلُوْنَ ۝٦٧ هُوَ الَّذِىْ يُحْىٖ وَ
يُمِيْتُ ۚ فَاِذَا قَضٰٓى اَمْرًا فَاِنَّمَا يَقُوْلُ لَهٗ كُنْ
فَيَكُوْنُ ۝٦٨ ع اَلَمْ تَرَ اِلَى الَّذِيْنَ يُجَادِلُوْنَ فِىْٓ ع ٨ معانقة ١٣
اٰيٰتِ اللّٰهِ ؕ اَنّٰى يُصْرَفُوْنَ ۝٦٩ الَّذِيْنَ كَذَّبُوْا
بِالْكِتٰبِ وَ بِمَآ اَرْسَلْنَا بِهٖ رُسُلَنَا ۛ فَسَوْفَ
يَعْلَمُوْنَ ۝٧٠ اِذِ الْاَغْلٰلُ فِىْٓ اَعْنَاقِهِمْ
وَالسَّلٰسِلُ ؕ يُسْحَبُوْنَ ۝٧١ فِى الْحَمِيْمِ ۙ ثُمَّ فِى
النَّارِ يُسْجَرُوْنَ ۝٧٢ ثُمَّ قِيْلَ لَهُمْ اَيْنَ مَا
كُنْتُمْ تُشْرِكُوْنَ ۝٧٣ مِنْ دُوْنِ اللّٰهِ ؕ قَالُوْا
ضَلُّوْا عَنَّا بَلْ لَّمْ نَكُنْ نَّدْعُوْا مِنْ قَبْلُ
شَيْـًٔا ؕ كَذٰلِكَ يُضِلُّ اللّٰهُ الْكٰفِرِيْنَ ۝٧٤ ذٰلِكُمْ
بِمَا كُنْتُمْ تَفْرَحُوْنَ فِى الْاَرْضِ بِغَيْرِ الْحَقِّ وَ
بِمَا كُنْتُمْ تَمْرَحُوْنَ ۝٧٥

**67 - 68** ఆయనే మిమ్మల్ని మట్టితో సృజించాడు, ఆపై రేతస్సుతో, తరువాత నెత్తురు ముద్దతో, ఆ పిదప ఆయన మిమ్మల్ని శిశువు రూపంలో బయటికి తీస్తాడు. తదనంతరం మీరు పూర్తి బలం పుంజుకునే వరకు మిమ్మల్ని పోషిస్తాడు. ఆ పిమ్మట మీరు ముదిమికి చేరుకునేవరకు, మిమ్మల్ని పెంచుతాడు. మీలో కొందరు ముందే పిలువబడతారు. మీరు మీ నిర్ణీత వ్యవధికి చేరి యథార్థం ఏమిటో అర్థం చేసుకోవాలని ఇదంతా చేయబడుతోంది. ఆయనే జీవితాన్ని ఇస్తాడు, ఆయనే మరణాన్నీ ఇస్తాడు. ఆయన ఏ విషయాన్ని గురించి నిర్ణయం చేసినా, అది అయిపోవాలని కేవలం ఒక ఆజ్ఞ జారీ చేస్తాడు, అంతే, అది అయిపోతుంది.

**69 - 77** అల్లాహ్ వాక్యాలను గురించి వాదులాడే వారిని నీవు చూశావా, వారు ఎలా విముఖులుగా చేయబడుతున్నారో? ఈ గ్రంథాన్నీ, మేము (ఇది వరకు) మా ప్రవక్తలతో పంపిన అన్ని గ్రంథాలనూ తిరస్కరించే వారికి త్వరలోనే తెలిసిపోతుంది; అప్పుడు వారి మెడలలో కంఠపాశాలు ఉంటాయి, సంకెళ్లు కూడ ఉంటాయి; వాటితో వారు కాగే నీటి వైపునకు ఈడ్వ బడతారు, తరువాత నరకాగ్నిలోకి నెట్టబడతారు. అప్పుడు వారిని ఇలా అడగటం జరుగుతుంది: "అల్లాహ్‌ను కాదని మీరు అల్లాహ్‌కు భాగస్వాములుగా నిలబెట్టిన దేవుళ్లు ఇప్పుడు ఎక్కడున్నారు?" వారు ఇలా సమాధానం చెబుతారు, "వారు మానుండి విడిపోయారు. దీనికి పూర్వం మేము అసలు దేనినీ ప్రార్థించేవారము కాదు." ఈ విధంగా అల్లాహ్ అవిశ్వాసులు ఎలా మార్గభ్రష్టులయిందీ ఋజువు చేస్తాడు. వారితో ఇలా అనబడుతుంది: "మీ ఈ ముగింపునకు కారణం మీరు భూమిలో అసత్యాన్ని అనుసరించి ఆనందించటమే, దానికి గర్వపడటమే.

9. అంటే, ప్రార్థనలు విని, వాటిని నెరవేర్చే సర్వాధికారాలు నాకే ఉన్నాయి, కనుక మీరు ఇతరులను ప్రార్థించకండి, నన్ను ప్రార్థించండి.

10. ప్రతి వ్యక్తి దృష్టిలో ఉంచుకోదగ్గ విషయాలు ఈ ఆయతులో రెండు ఉన్నాయి; మొదటిది ప్రార్థననూ, ఆరాధననూ ఇక్కడ పర్యాయపదాలుగా ఉపయోగించటం జరిగింది. ఎందుకంటే, మొదటి వాక్యంలో ప్రార్థనతో పోల్చబడిన దానినే రెండో వాక్యంలో,ఆరాధన అనే పదంతో పోల్చటం జరిగింది. దీనిద్వారా స్పష్టంగా తెలిసే విషయం ఏమిటంటే, ప్రార్థనే ఆరాధన, ఆరాధనా సారమే ప్రార్థన. రెండోది, అల్లాహ్‌ను ప్రార్థించని వారికొరకు "అహంకారం చేత నా ఆరాధన నుండి ముఖం తిప్పుకుంటారు" అనే పదాలు వాడబడ్డాయి. దీనిద్వారా

اُدْخُلُوْٓا اَبْوَابَ جَهَنَّمَ خٰلِدِيْنَ فِيْهَا ۚ فَبِئْسَ
مَثْوَى الْمُتَكَبِّرِيْنَ ﴿٧٦﴾ فَاصْبِرْ اِنَّ وَعْدَ اللّٰهِ
حَقٌّ ۚ فَاِمَّا نُرِيَنَّكَ بَعْضَ الَّذِيْ نَعِدُهُمْ اَوْ
نَتَوَفَّيَنَّكَ فَاِلَيْنَا يُرْجَعُوْنَ ﴿٧٧﴾ وَ لَقَدْ اَرْسَلْنَا
رُسُلًا مِّنْ قَبْلِكَ مِنْهُمْ مَّنْ قَصَصْنَا عَلَيْكَ
وَمِنْهُمْ مَّنْ لَّمْ نَقْصُصْ عَلَيْكَ ؕ وَ مَا كَانَ
لِرَسُوْلٍ اَنْ يَّاْتِيَ بِاٰيَةٍ اِلَّا بِاِذْنِ اللّٰهِ ۚ فَاِذَا
جَآءَ اَمْرُ اللّٰهِ قُضِيَ بِالْحَقِّ وَ خَسِرَ هُنَالِكَ
الْمُبْطِلُوْنَ ﴿٧٨﴾ ع اَللّٰهُ الَّذِيْ جَعَلَ لَكُمُ الْاَنْعَامَ ٨ ع ١٣
لِتَرْكَبُوْا مِنْهَا وَمِنْهَا تَاْكُلُوْنَ ﴿٧٩﴾ وَ لَكُمْ فِيْهَا
مَنَافِعُ وَ لِتَبْلُغُوْا عَلَيْهَا حَاجَةً فِيْ صُدُوْرِكُمْ
وَعَلَيْهَا وَ عَلَى الْفُلْكِ تُحْمَلُوْنَ ﴿٨٠﴾ وَ يُرِيْكُمْ
اٰيٰتِهٖ ۖ فَاَيَّ اٰيٰتِ اللّٰهِ تُنْكِرُوْنَ ﴿٨١﴾ اَفَلَمْ
يَسِيْرُوْا فِي الْاَرْضِ فَيَنْظُرُوْا كَيْفَ كَانَ
عَاقِبَةُ الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ ؕ كَانُوْٓا اَكْثَرَ
مِنْهُمْ وَ اَشَدَّ قُوَّةً وَّاٰثَارًا فِي الْاَرْضِ فَمَآ
اَغْنٰى عَنْهُمْ مَّا كَانُوْا يَكْسِبُوْنَ ﴿٨٢﴾ فَلَمَّا
جَآءَتْهُمْ رُسُلُهُمْ بِالْبَيِّنٰتِ فَرِحُوْا بِمَا عِنْدَهُمْ
مِّنَ الْعِلْمِ وَحَاقَ بِهِمْ مَّا كَانُوْا بِهٖ
يَسْتَهْزِءُوْنَ ﴿٨٣﴾

ఇక వెళ్ళండి, నరక ద్వారాలలో ప్రవేశించండి, కలకాలం మీరు అక్కడనే ఉండవలసి ఉంది. అది దురహంకారుల నివాసం, బహుచెడ్డది." కనుక ప్రవక్తా! సహనం వహించు. అల్లాహ్ వాగ్దానం సత్యమైనది. ఇప్పుడు నీ సమక్షంలోనే మేము వారిని భయపెడుతూ వచ్చిన దుష్పరిణామాలను కొన్నింటిని వారికి చూపినా లేదా (దానికి ముందే) నిన్ను ప్రపంచం నుండి పిలిపించుకున్నా, వారు తిరిగి రావలసింది మా వైపునకే కదా."

**78 - 81** ఓ ప్రవక్తా! నీకు పూర్వం మేము ఎంతోమంది ప్రవక్తలను పంపాము. వారిలో కొందరి పరిస్థితులను గురించి మేము నీకు తెలిపాము, కొందరిని గురించి తెలుపలేదు. అల్లాహ్ అనుమతిలేకుండా ఏ సూచననైనా స్వయంగా తెచ్చే శక్తి ఏ ప్రవక్తకూ లేదు. అల్లాహ్ ఆజ్ఞ వచ్చేసిన తరువాత, సత్యం ప్రకారం నిర్ణయం జరిగింది, అప్పుడు దుర్జనులు నష్టానికి గురి అయ్యారు. అల్లాహ్‌యే మీ కొరకు ఈ పశువులను సృష్టించాడు; వాటిలో కొన్నిటిపై మీరు స్వారి చేస్తారు, కొన్నిటి మాంసం తింటారు. వాటి వల్ల మీకు ఇంకా ఎన్నో లాభాలు ఉన్నాయి. మీరు ఎక్కడకు పోవాలని కోరుకుంటే, అక్కడకు మీరు పోగలగటానికి కూడా అవి ఉపయోగపడతాయి. వాటిపైనా, పడవలపైనా మీరు ప్రయాణం చేస్తూ ఉంటారు. అల్లాహ్ తన ఈ సూచనలను మీకు చూపుతున్నాడు. అసలు మీరు ఆయన యొక్క ఏయే సూచనలను తిరస్కరిస్తారు?

**82 - 85** వారు భూమిలో సంచారం చేయలేదా, వారికి పూర్వం గతించిన ప్రజల ముగింపు ఎటువంటిదో వారికి కనిపించటానికి? వారు సంఖ్యా బలంలో వీరికంటే అధికులు, వీరికంటే ఎక్కువ బలవంతులు, భూమిలో వీరికంటే అత్యంత మహోజ్వలమైన గుర్తులు విడిచివెళ్లారు. అసలు వారి సంపాదన అంతా వారికి దేనికి పనికొచ్చింది? వారి ప్రవక్తలు వారి వద్దకు స్పష్టమైన సూచనలు తెచ్చినప్పుడు, వారు తమ వద్ద ఉన్న జ్ఞానంతోనే ఆనందపరవశులై ఉన్నారు. వారు ఎగతాళి చేస్తూ ఉండే దానిలోనే వారు తరువాత చిక్కుకుపోయారు.

తెలిసింది ఏమిటంటే, దాస్యం ఎల్లప్పుడూ అల్లాహ్‌ను ప్రార్థించమనే కోరుతుంది. దానిపట్ల విముఖత చూపటం అంటే మనిషి అహంభావానికి గురిఅయ్యాడని అర్థం.

فَلَمَّا رَاَوۡا بَاۡسَنَا قَالُوۡۤا اٰمَنَّا بِاللّٰهِ وَحۡدَهٗ وَ
كَفَرۡنَا بِمَا كُنَّا بِهٖ مُشۡرِكِيۡنَ ﴿٨٤﴾ فَلَمۡ يَكُ
يَنۡفَعُهُمۡ اِيۡمَانُهُمۡ لَمَّا رَاَوۡا بَاۡسَنَاؕ سُنَّتَ
اللّٰهِ الَّتِىۡ قَدۡ خَلَتۡ فِىۡ عِبَادِهٖۚ وَخَسِرَ
هُنَالِكَ الۡكٰفِرُوۡنَ ﴿٨٥﴾ ع ٩ ١٤

వారు మా శిక్షను చూచిన పిమ్మట ఇలా అన్నారు: "ఒక్కడూ, ఏ భాగస్వాములు లేనివాడూ అయిన అల్లాహ్‌ను మేము విశ్వసించాము. మేము ఆయనకు భాగస్వాములుగా నిలబెట్టిన వేల్పులనందరినీ నిరాకరిస్తున్నాము." కాని మా శిక్షను చూచిన తర్వాత వారి విశ్వాసం వారికి ఏమాత్రం లాభదాయకం కాజాలదు. ఎందుకంటే, అల్లాహ్ నిర్ణయించిన నియమావళి ఇదే. ఆయన దాసులలో ఎల్లప్పుడూ అమలులో ఉండేది ఈ నియమావళియే. అప్పుడు అవిశ్వాసులు నష్టానికి గురిఅయ్యారు.

ఆయతులు 54 | **41. హా మీమ్ అస్ సజ్దహ్** | అవతరణ మక్కాలో

*అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

**1 - 4** ...హా. మీమ్. ఇది కరుణామయుడూ, కృపాశీలుడూ అయిన దేవుని సన్నిధి నుండి అవతరింపజేయబడింది; స్పష్టంగా వివరించబడిన వాక్యాలు కల గ్రంథం. అరబ్బీ భాషలో ఉన్న (ఈ) ఖుర్ఆన్, జ్ఞానుల కొరకు; ఇది శుభవార్త లను ఇచ్చేది, భయపెట్టేదీను.

**... 4 - 5** కాని వారిలో చాలామంది దాని పట్ల విముఖు లయ్యారు, కనుక వారు వినరు. వారు ఇలా అంటారు, "నీవు దేని వైపునకు మమ్మల్ని పిలుస్తున్నావో, దానిని గురించి మా హృదయాలను తెరలు కప్పివేశాయి, మా చెవులు చెవిటివై పోయాయి. మాకూ నీకూ మధ్య ఒక తెర అడ్డుపడింది. నీవు నీ పని చెయ్యి, మేము మా పని చేస్తాము."

**6 - 8** ప్రవక్తా! వారితో ఇలా అను, "నేను కూడ మీలాంటి ఒక మనిషినే. వహీ ద్వారా నాకు ఇలా తెలుపబడుతోంది: మీ దేవుడు కేవలం ఒకే దేవుడు. కనుక మీరు నేరుగా ఆయన వైపునకే మరలండి; క్షమించు అని ఆయనను వేడుకోండి. జకాత్ ఇవ్వనివారునూ, పరలోకాన్ని తిరస్కరించే వారునూ అయిన బహుదైవారాధకులు వినాశం పాలవుతారు. ఇక విశ్వ సించి మంచి పనులు చేసినవారు; నిశ్చయంగా వారికి ఎడతెగని ప్రతిఫలం లభిస్తుంది."

**9 - 12** ప్రవక్తా! వారితో ఇలా అను: "భూమిని రెండు రోజులలో సృష్టించిన దేవుణ్ణి మీరు తిరస్కరిస్తారా? ఇతరులను ఆయనకు సమానులుగా నిలబెడతారా? సకల లోకాల వారికి ప్రభువు ఆయనేకదా! ఆయన (భూమిని ఉనికి లోనికి తీసుకువచ్చిన తరువాత) దానిమీద పర్వతాలను నెలకొలిపాడు; అందులో శుభాలను పెట్టాడు; అర్థించేవారందరికోసం[1] దాని లోపల వారి కోరికలకూ, అవసరాలకూ అనుగుణంగా కచ్చితంగా అంచనావేసి ఆహార వస్తువులను సమకూర్చాడు. ఈ పనులన్నీ నాలుగు రోజులలో పూర్తి అయ్యాయి.

﴿٤١﴾ سُوْرَةُ حٰمٓ السَّجْدَةِ مَكِّيَّةٌ ﴿٦١﴾

اٰياتها ٥٤ — ركوعاتها ٦

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

حٰمٓ ① تَنْزِيْلٌ مِّنَ الرَّحْمٰنِ الرَّحِيْمِ ② كِتٰبٌ
فُصِّلَتْ اٰيٰتُهٗ قُرْاٰنًا عَرَبِيًّا لِّقَوْمٍ يَّعْلَمُوْنَ ③
بَشِيْرًا وَّنَذِيْرًا فَاَعْرَضَ اَكْثَرُهُمْ فَهُمْ لَا
يَسْمَعُوْنَ ④ وَقَالُوْا قُلُوْبُنَا فِيْۤ اَكِنَّةٍ مِّمَّا
تَدْعُوْنَاۤ اِلَيْهِ وَفِيْۤ اٰذَانِنَا وَقْرٌ وَّمِنْۢ بَيْنِنَا وَ
بَيْنِكَ حِجَابٌ فَاعْمَلْ اِنَّنَا عٰمِلُوْنَ ⑤ قُلْ
اِنَّمَاۤ اَنَا بَشَرٌ مِّثْلُكُمْ يُوْحٰۤى اِلَيَّ اَنَّمَاۤ اِلٰهُكُمْ
اِلٰهٌ وَّاحِدٌ فَاسْتَقِيْمُوْۤا اِلَيْهِ وَاسْتَغْفِرُوْهُ
وَوَيْلٌ لِّلْمُشْرِكِيْنَ ⑥ الَّذِيْنَ لَا يُؤْتُوْنَ
الزَّكٰوةَ وَهُمْ بِالْاٰخِرَةِ هُمْ كٰفِرُوْنَ ⑦ اِنَّ
الَّذِيْنَ اٰمَنُوْا وَعَمِلُوا الصّٰلِحٰتِ لَهُمْ اَجْرٌ غَيْرُ
مَمْنُوْنٍ ⑧ قُلْ اَئِنَّكُمْ لَتَكْفُرُوْنَ بِالَّذِيْ خَلَقَ
الْاَرْضَ فِيْ يَوْمَيْنِ وَتَجْعَلُوْنَ لَهٗۤ اَنْدَادًا
ذٰلِكَ رَبُّ الْعٰلَمِيْنَ ⑨ وَجَعَلَ فِيْهَا رَوَاسِيَ
مِنْ فَوْقِهَا وَبٰرَكَ فِيْهَا وَقَدَّرَ فِيْهَاۤ اَقْوَاتَهَا
فِيْۤ اَرْبَعَةِ اَيَّامٍ سَوَآءً لِّلسَّآئِلِيْنَ ⑩

ثُمَّ اسْتَوٰۤى اِلَى السَّمَآءِ وَ هِىَ دُخَانٌ فَقَالَ لَهَا
وَ لِلْاَرْضِ ائْتِيَا طَوْعًا اَوْ كَرْهًا ؕ قَالَتَاۤ اَتَيْنَا
طَآٮِٕعِيْنَ ﴿۱۱﴾ فَقَضٰٮهُنَّ سَبْعَ سَمٰوَاتٍ فِىْ
يَوْمَيْنِ وَ اَوْحٰى فِىْ كُلِّ سَمَآءٍ اَمْرَهَا ؕ وَ
زَيَّنَّا السَّمَآءَ الدُّنْيَا بِمَصَابِيْحَ ۖ وَحِفْظًا ؕ ذٰلِكَ
تَقْدِيْرُ الْعَزِيْزِ الْعَلِيْمِ ﴿۱۲﴾ فَاِنْ اَعْرَضُوْا فَقُلْ
اَنْذَرْتُكُمْ صٰعِقَةً مِّثْلَ صٰعِقَةِ عَادٍ وَّثَمُوْدَ ﴿۱۳﴾
اِذْ جَآءَتْهُمُ الرُّسُلُ مِنْۢ بَيْنِ اَيْدِيْهِمْ وَ
مِنْ خَلْفِهِمْ اَلَّا تَعْبُدُوْۤا اِلَّا اللّٰهَ ؕ قَالُوْا لَوْ
شَآءَ رَبُّنَا لَاَنْزَلَ مَلٰۤٮِٕكَةً فَاِنَّا بِمَاۤ اُرْسِلْتُمْ
بِهٖ كٰفِرُوْنَ ﴿۱۴﴾ فَاَمَّا عَادٌ فَاسْتَكْبَرُوْا فِى
الْاَرْضِ بِغَيْرِ الْحَقِّ وَ قَالُوْا مَنْ اَشَدُّ مِنَّا
قُوَّةً ؕ اَوَلَمْ يَرَوْا اَنَّ اللّٰهَ الَّذِىْ خَلَقَهُمْ هُوَ
اَشَدُّ مِنْهُمْ قُوَّةً ؕ وَ كَانُوْا بِاٰيٰتِنَا
يَجْحَدُوْنَ ﴿۱۵﴾ فَاَرْسَلْنَا عَلَيْهِمْ رِيْحًا صَرْصَرًا
فِىْۤ اَيَّامٍ نَّحِسَاتٍ لِّنُذِيْقَهُمْ عَذَابَ الْخِزْىِ فِى
الْحَيٰوةِ الدُّنْيَا ؕ وَلَعَذَابُ الْاٰخِرَةِ اَخْزٰى وَ
هُمْ لَا يُنْصَرُوْنَ ﴿۱۶﴾

తరువాత కేవలం పొగగా ఉన్న ఆకాశం వైపునకు ఆయన తన ధ్యానాన్ని[2] మరల్చాడు. ఆయన ఆకాశాన్నీ, భూమినీ ఉద్దేశించి ఇలా అన్నాడు: "ఉనికిలోకి రండి, మీకు ఇష్ట మయినా, ఇష్టం కాకపోయినా." అవి రెండూ, "మేము వచ్చేశాము, విధేయులు మాదిరిగా" అని అన్నాయి. అప్పుడు ఆయన రెండు రోజులలో ఏడు ఆకాశాలను నిర్మించాడు, ప్రతి ఆకాశంలోనూ దాని చట్టాన్ని వహీ ద్వారా నిర్దేశించాడు. ప్రపంచ ఆకాశాన్ని మేము దీపాలతో అలంకరించాము. దానిని బాగా సురక్షితమైనదిగా చేశాము. ఇదంతా ఒక మహాశక్తి మంతుడైన జ్ఞాని పథకం.

**13 - 14** ఇప్పుడు ఒకవేళ వారు విముఖులైతే, వారితో ఇలా అను, "ఆద్, సమూద్ జాతులపై అవతరించినటు వంటిదీ, అకస్మాత్తుగా విరుచుకుపడేదీ అయిన ఒక శిక్షను గురించి నేను మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను." దైవప్రవక్తలు వారివద్దకు ముందు నుంచీ, వెనుక నుంచీ అన్ని వైపుల నుంచీ వచ్చి, "అల్లాహ్‌ను తప్ప మరెవరినీ ఆరాధించకండి" అని వారికి నచ్చజెప్పినప్పుడు, వారు ఇలా అన్నారు, "మా ప్రభువు తలచుకుంటే దైవ దూతలను పంపి ఉండేవాడు. కనుక నీవు ఏ విషయం కోసమైతే పంపబడ్డావో, ఆ విషయాన్ని మేము నమ్మము."

**15 - 16** ఆద్ జాతి పరిస్థితి ఇలా ఉండేది: వారు ఏ హక్కూ అర్హతలూ లేకుండానే భూమిపై పెద్దవారై పోయారు. "మాకంటే ఎక్కువ బలవంతుడెవడున్నాడు?" అని అనసాగారు. వారిని సృష్టించిన దేవుడు వారికంటే ఎక్కువ బలవంతుడనే విషయం వారికి స్ఫురించలేదా? వారు మా వాక్యాలను తిరస్కరిస్తూనే ఉండేవారు. చివరకు మేము వారికి ఈ లోకంలోనే అవమాన కరమైన శిక్షను రుచి చూపించాలని, కొన్ని అశుభకరమైన దినాలలో తీవ్రమైన తుఫాను గాలిని వారిపైకి పంపాము. పరలోక శిక్ష అయితే, దీనికంటే కూడా ఎంతో అవమానకర మైనది. అక్కడ వారికి సహాయపడేవాడెవ్వడూ ఉండడు.

1. అంటే, ఆహారాన్ని కోరే సమస్త ప్రాణికోటికి.
2. భూమినీ జీవరాసులనీ సృష్టించిన తరువాత, ఆకాశాలను సృష్టించాడు అని దీని అర్థం కాదు. ఇక్కడ 'తరువాత' అనే పదం కాలక్రమాన్ని సూచించటానికి వాడబడలేదు. వర్ణనాక్రమాన్ని సూచించటానికే వాడబడింది అనే విషయం తరువాత వాక్యం ద్వారా స్పష్టం.

وَ اَمَّا ثَمُوْدُ فَهَدَيْنٰهُمْ فَاسْتَحَبُّوا الْعَمٰى عَلَى
الْهُدٰى فَاَخَذَتْهُمْ صٰعِقَةُ الْعَذَابِ الْهُوْنِ بِمَا
كَانُوْا يَكْسِبُوْنَ ﴿١٧﴾ وَ نَجَّيْنَا الَّذِيْنَ اٰمَنُوْا وَ
كَانُوْا يَتَّقُوْنَ ﴿١٨﴾ وَيَوْمَ يُحْشَرُ اَعْدَآءُ اللّٰهِ ع ٢ ١٦
اِلَى النَّارِ فَهُمْ يُوْزَعُوْنَ ﴿١٩﴾ حَتّٰٓى اِذَا مَا
جَآءُوْهَا شَهِدَ عَلَيْهِمْ سَمْعُهُمْ وَ اَبْصَارُهُمْ وَ
جُلُوْدُهُمْ بِمَا كَانُوْا يَعْمَلُوْنَ ﴿٢٠﴾ وَقَالُوْا
لِجُلُوْدِهِمْ لِمَ شَهِدْتُّمْ عَلَيْنَا ؕ قَالُوْٓا اَنْطَقَنَا
اللّٰهُ الَّذِيْٓ اَنْطَقَ كُلَّ شَيْءٍ وَّ هُوَ خَلَقَكُمْ
اَوَّلَ مَرَّةٍ وَّ اِلَيْهِ تُرْجَعُوْنَ ﴿٢١﴾ وَ مَا كُنْتُمْ
تَسْتَتِرُوْنَ اَنْ يَّشْهَدَ عَلَيْكُمْ سَمْعُكُمْ وَ لَآ
اَبْصَارُكُمْ وَ لَا جُلُوْدُكُمْ وَلٰكِنْ ظَنَنْتُمْ اَنَّ اللّٰهَ
لَا يَعْلَمُ كَثِيْرًا مِّمَّا تَعْمَلُوْنَ ﴿٢٢﴾ وَ ذٰلِكُمْ ظَنُّكُمُ
الَّذِيْ ظَنَنْتُمْ بِرَبِّكُمْ اَرْدٰىكُمْ فَاَصْبَحْتُمْ مِّنَ
الْخٰسِرِيْنَ ﴿٢٣﴾ فَاِنْ يَّصْبِرُوْا فَالنَّارُ مَثْوًى لَّهُمْ ۚ
وَ اِنْ يَّسْتَعْتِبُوْا فَمَا هُمْ مِّنَ الْمُعْتَبِيْنَ ﴿٢٤﴾ وَ
قَيَّضْنَا لَهُمْ قُرَنَآءَ فَزَيَّنُوْا لَهُمْ مَّا بَيْنَ
اَيْدِيْهِمْ وَ مَا خَلْفَهُمْ وَ حَقَّ عَلَيْهِمُ الْقَوْلُ
فِيْٓ اُمَمٍ قَدْ خَلَتْ مِنْ قَبْلِهِمْ مِّنَ الْجِنِّ
وَالْاِنْسِ ۚ اِنَّهُمْ كَانُوْا خٰسِرِيْنَ ﴿٢٥﴾ ع ٣ ١٧

**17 - 18** ఇక సమూద్ జాతివారు; మేము వారి ముందు సత్యమార్గాన్ని పెట్టాము; కాని వారు మార్గాన్ని చూడటానికి బదులుగా, అంధులుగా ఉండి పోవటానికే ఇష్టపడ్డారు. చివరకు వారి అకృత్యాలకు ఫలితంగా, అవమానకరమైన శిక్ష వారిపై విరుచుకుపడింది. విశ్వసించి, మార్గభ్రష్టత్వానికీ, దుష్కర్మలకూ దూరంగా ఉండేవారిని మేము రక్షించాము.

**19 - 25** అల్లాహ్ యొక్క ఈ శత్రువులు నరకం వైపునకు పంపబడటానికి సమీకరింపబడే[3] సమయాన్ని గురించి కొంచెం ఆలోచించు. వారి పూర్వీకులను, వారి వెనుకవారు వచ్చేవరకు ఆపటం జరుగుతుంది.[4] తరువాత అందరూ అక్కడకు చేరినప్పుడు, వారి చెవులూ, వారి కళ్ళూ, వారి శరీర చర్మాలూ వారు ప్రపంచంలో చేస్తూ ఉన్న దానిని గురించి సాక్ష్యమిస్తాయి. అప్పుడు వారు తమ శరీర చర్మాలను, "మీరు మాకు వ్యతిరేకంగా ఎందుకు సాక్ష్యం చెప్పారు?" అని అడుగుతారు. అవి ఇలా సమాధానం చెబుతాయి, "ప్రతి వస్తువుకూ మాట్లాడే శక్తిని ఇచ్చిన దేవుడే మాకూ మాట్లాడే శక్తిని ఇచ్చాడు. ఆయనే మిమ్మల్ని మొదట సృజించాడు, ఇప్పుడు ఆయన వైపునకే మీరు మరల్పబడుతున్నారు. ప్రపంచంలో మీరు రహస్యంగా నేరాలు చేస్తూ ఉన్నప్పుడు, స్వయంగా మీ చెవులే, మీ కళ్ళే, మీ శరీర చర్మాలే మీకు వ్యతిరేకంగా సాక్ష్యమిస్తాయనే ఆలోచన మీకు ఉండేదే కాదు. అంతేకాదు, మీరు చేసే చాలా పనులను గురించి అల్లాహ్‌కు కూడా తెలియదని మీరు అనుకునేవారు. మీరు మీ ప్రభువు పట్ల కలిగి ఉన్న ఈ ఆలోచనే మిమ్మల్ని నట్టేట ముంచింది. ఈ కారణం వల్లనే మీరు నష్టానికి గురి అయ్యారు." ఈ స్థితిలో వారు సహనం చూపినా (చూపక పోయినా) అగ్నియే వారి నివాస స్థానం అవుతుంది. ఒకవేళ వారు క్షమాభిక్ష కోరినా, అటువంటి అవకాశమేదీ వారికి ఇవ్వబడదు. మేము వారికి సహచరులుగా ఎటువంటి వారిని తగిలించామంటే, వారు వారికి ముందూ వెనుకా ఉన్న ప్రతి వస్తువునూ ఆకర్షకంగా మలచి చూపించే వారు. చివరకు వారికి పూర్వం గతించిన జిన్నాతులు, మానవుల వర్గాల విషయంలో జరిగిన శిక్షా నిర్ణయమే వారి విషయంలో కూడ జరిగింది. నిస్సందేహంగా వారే నష్టానికి గురి అయినవారు.

وَقَالَ الَّذِيْنَ كَفَرُوْا لَا تَسْمَعُوْا لِهٰذَا الْقُرْاٰنِ
وَالْغَوْا فِيْهِ لَعَلَّكُمْ تَغْلِبُوْنَ ﴿٢٦﴾ فَلَنُذِيْقَنَّ
الَّذِيْنَ كَفَرُوْا عَذَابًا شَدِيْدًا ۙ وَّلَنَجْزِيَنَّهُمْ
اَسْوَاَ الَّذِيْ كَانُوْا يَعْمَلُوْنَ ﴿٢٧﴾ ذٰلِكَ جَزَآءُ
اَعْدَآءِ اللّٰهِ النَّارُ ۚ لَهُمْ فِيْهَا دَارُ الْخُلْدِ ؕ
جَزَآءًۢ بِمَا كَانُوْا بِاٰيٰتِنَا يَجْحَدُوْنَ ﴿٢٨﴾ وَقَالَ
الَّذِيْنَ كَفَرُوْا رَبَّنَآ اَرِنَا الَّذَيْنِ اَضَلّٰنَا مِنَ
الْجِنِّ وَالْاِنْسِ نَجْعَلْهُمَا تَحْتَ اَقْدَامِنَا
لِيَكُوْنَا مِنَ الْاَسْفَلِيْنَ ﴿٢٩﴾ اِنَّ الَّذِيْنَ قَالُوْا
رَبُّنَا اللّٰهُ ثُمَّ اسْتَقَامُوْا تَتَنَزَّلُ عَلَيْهِمُ
الْمَلٰٓئِكَةُ اَلَّا تَخَافُوْا وَلَا تَحْزَنُوْا وَاَبْشِرُوْا
بِالْجَنَّةِ الَّتِيْ كُنْتُمْ تُوْعَدُوْنَ ﴿٣٠﴾ نَحْنُ
اَوْلِيٰٓؤُكُمْ فِي الْحَيٰوةِ الدُّنْيَا وَفِي الْاٰخِرَةِ ۚ
وَلَكُمْ فِيْهَا مَا تَشْتَهِيْٓ اَنْفُسُكُمْ وَلَكُمْ فِيْهَا مَا
تَدَّعُوْنَ ﴿٣١﴾ ؕ نُزُلًا مِّنْ غَفُوْرٍ رَّحِيْمٍ ﴿٣٢﴾ ع ٤ ١٨

**26 - 29** ఈ సత్యతిరస్కారులు ఇలా అంటారు: "ఈ ఖుర్ఆన్‌ను అసలు వినకండి. అది వినిపించబడేటప్పుడు వినబడకుండా విఘ్నం కలిగించండి. బహుశా ఇలాగైనా మీరు ప్రాబల్యం వహించవచ్చు." మేము ఈ అవిశ్వాసులకు కఠినమైన శిక్షను తప్పకుండా రుచి చూపిస్తాము. వారు చేసిన పరమ దుష్కార్యాలకు పూర్తి ప్రతిఫలం వారికి ఇస్తాము. అది నరకం; అల్లాహ్ శత్రువులకు ప్రతిఫలంగా దొరికేది. అందు లోనే వారు శాశ్వతంగా నివసిస్తారు. వారు మా వాక్యాలను తిరస్కరిస్తూ వచ్చిన నేరానికి ఇది శిక్ష. అక్కడ ఈ అవిశ్వాసులు ఇలా అంటారు, "మా ప్రభూ! మమ్మల్ని మార్గభ్రష్టులుగా చేసిన జిన్నాతులనూ, మానవులనూ కొంచెం మాకు చూపించు. మేము వారిని మా పాదాల క్రిందపడవేసి తొక్కుతాము, వారు మరింత పరాభవంపాలు కావటానికి."

**30 - 32** అల్లాహ్‌యే మా ప్రభువు అని పలికి ఆ మాట మీదనే స్థిరంగా[5] నిలబడే వారిపై నిశ్చయంగా దైవదూతలు అవతరిస్తారు. వారు వారితో ఇలా అంటారు, "భయపడకండి, బాధపడకండి; మీకు వాగ్దానం చేయబడిన స్వర్గం అనే శుభ వార్తను విని ఆనందించండి. మేము ఈ ప్రాపంచిక జీవితంలో కూడ మీకు సహచరులుగా ఉంటాము, పరలోకంలో కూడ. అక్కడ మీరు కోరినదల్లా మీకు లభిస్తుంది; మీరు ఆశించే ప్రతి వస్తువూ మీదవుతుంది. ఇవీ మీకు లభించే ఆతిథ్యపు ఏర్పాట్లు, క్షమాశీలుడూ, కరుణామయుడూ అయిన దేవుని వైపు నుండి.

3. అసలు ఉద్దేశ్యం ఇలా చెప్పటం; అల్లాహ్ న్యాయస్థానంలో హాజరుపరచటానికి వారు సమీకరింపబడినప్పుడు; కాని ఈ విషయాన్ని ఈ పదాలలో ఇలా చెప్పటం జరిగింది; నరకం వైపునకు పోవటానికి వారు సమీకరింపబడతారు. ఎందుకంటే, వారి అంతిమ ఫలితం వారు నరకానికి పోవటమే.

4. అంటే, అన్ని తరాలవారు, అన్ని జాతులవారు ఏక కాలంలోనే సమావేశపరచబడతారు, వారందరి నుండి సమిష్టిగానే సమాధానం కోరబడుతుంది, వేర్వేరుగా కాదు. ఎందుకంటే, వెనుక తరంవారు మంచివారుగా కానీ, చెడ్డవారుగా కానీ రూపొందటంలో ముందు తరంవారు విడిచివెళ్ళిన ధార్మిక, నైతిక వారసత్వపు విషయాలకు కూడ పాత్ర ఉన్నది.

5. అంటే, వారు తమ ప్రభువు అల్లాహ్ అని ఎప్పుడో, కాకతాళీయంగా చెప్పలేదు; అల్లాహ్‌ను తమ ప్రభువు అనడంతోపాటు ఇతరులను కూడ తమ ప్రభువులుగా చేసుకొనే దోషానికి వారు పాల్పడలేదు, కాని వారు ఒకసారి ఈ విశ్వాసాన్ని అంగీకరించిన తరువాత, జీవితాంతం దానికి కట్టుబడి ఉన్నారు; దానికి భిన్నంగా

**33** అల్లాహ్ వైపునకు, పిలిచి మంచి పనులు చేసి, నేను ముస్లిమ్‌ను అని ప్రకటించే వ్యక్తి మాటకంటే మంచి మాట మరెవరిది కాగలదు.

**34 - 36** ప్రవక్తా! మంచీ, చెడూ ఒకటి కావు. నీవు చెడును శ్రేష్ఠమైన మంచి ద్వారా తొలగించు. అప్పుడు నీపట్ల శత్రు భావం కలవాడు నీకు ప్రాణస్నేహితుడై పోవటాన్ని నీవు గమనిస్తావు. ఈ సుగుణయోగం సహనశీలురకు తప్ప మరెవరికీ లభ్యంకాదు. ఈ స్థానం మహా అదృష్టవంతులకు తప్ప మరెవరికీ దక్కదు. ఒకవేళ నీకు షైతాను నుండి ఏదైనా దుష్ ప్రేరణ కలిగితే అప్పుడు అల్లాహ్ శరణు కోరుకో,[6] ఆయన అన్నీ వినేవాడూ, అన్నీ ఎరిగినవాడూను.

**37 - 38** ఈ రేయింబవళ్ళూ, ఈ సూర్యచంద్రులూ అల్లాహ్ సూచనలలోనివే. సూర్యచంద్రులకు సాష్టాంగపడకండి; వాటిని సృజించిన దేవునికి సాష్టాంగపడండి; నిజంగానే మీరు ఆయనను ఆరాధించే వారు అయితే. కాని ఒకవేళ వారు అహంభావానికి గురిఅయి, తమ మాటే నిజమని మంకుపట్టు పట్టితే ఏమీ పరవాలేదు, నీ ప్రభువునకు దగ్గరగా ఉన్న దైవ దూతలు రేయింబవళ్లు ఆయనను స్తుతిస్తూ ఉన్నారు, వారు ఎన్నటికీ అలసిపోరు.

**39** అల్లాహ్ సూచనలలో ఒక సూచన ఏమిటంటే, ఎండి పోయిన నేలపై మేము వర్షం కురిపించగానే, అది అకస్మాత్తుగా పులకించటాన్నీ, ఉబికిపోవటాన్ని నీవు గమనిస్తావు. నిశ్చయంగా ఈ మృతభూమిని బ్రతికించి లేపే దేవుడే మృతులకు కూడ ప్రాణభిక్ష పెడతాడు. నిస్సందేహంగా ఆయన ప్రతి దానిపై అధికారం కలిగి ఉన్నాడు.

وَ مَنْ اَحْسَنُ قَوْلًا مِّمَّنْ دَعَاۤ اِلَى اللّٰهِ وَ
عَمِلَ صَالِحًا وَّقَالَ اِنَّنِیْ مِنَ الْمُسْلِمِیْنَ ﴿۳۳﴾ وَ
لَا تَسْتَوِی الْحَسَنَةُ وَلَا السَّیِّئَةُ ؕ اِدْفَعْ
بِالَّتِیْ هِیَ اَحْسَنُ فَاِذَا الَّذِیْ بَیْنَكَ وَ بَیْنَهٗ
عَدَاوَةٌ كَاَنَّهٗ وَلِیٌّ حَمِیْمٌ ﴿۳۴﴾ وَ مَا یُلَقّٰىهَاۤ اِلَّا
الَّذِیْنَ صَبَرُوْا ۚ وَمَا یُلَقّٰىهَاۤ اِلَّا ذُوْحَظٍّ
عَظِیْمٍ ﴿۳۵﴾ وَاِمَّا یَنْزَغَنَّكَ مِنَ الشَّیْطٰنِ نَزْغٌ
فَاسْتَعِذْ بِاللّٰهِ ؕ اِنَّهٗ هُوَ السَّمِیْعُ الْعَلِیْمُ ﴿۳۶﴾ وَ
مِنْ اٰیٰتِهِ الَّیْلُ وَ النَّهَارُ وَالشَّمْسُ وَالْقَمَرُ ؕ
لَا تَسْجُدُوْا لِلشَّمْسِ وَلَا لِلْقَمَرِ وَ اسْجُدُوْا
لِلّٰهِ الَّذِیْ خَلَقَهُنَّ اِنْ كُنْتُمْ اِیَّاهُ
تَعْبُدُوْنَ ﴿۳۷﴾ فَاِنِ اسْتَكْبَرُوْا فَالَّذِیْنَ عِنْدَ
رَبِّكَ یُسَبِّحُوْنَ لَهٗ بِالَّیْلِ وَالنَّهَارِ وَ هُمْ لَا
یَسْـَٔمُوْنَ ۩ ﴿۳۸﴾ وَ مِنْ اٰیٰتِهٖۤ اَنَّكَ تَرَى الْاَرْضَ
خَاشِعَةً فَاِذَاۤ اَنْزَلْنَا عَلَیْهَا الْمَآءَ اهْتَزَّتْ
وَرَبَتْ ؕ اِنَّ الَّذِیْۤ اَحْیَاهَا لَمُحْیِ الْمَوْتٰى ؕ
اِنَّهٗ عَلٰى كُلِّ شَیْءٍ قَدِیْرٌ ﴿۳۹﴾

السجدة ۱۱

మరొక విశ్వాసాన్ని దేనినీ చేపట్టలేదు; ఈ విశ్వాసాన్ని మరొక అసత్యపు విశ్వాసంతో ముడిపెట్టలేదు; దేవుడు ఒక్కడే అనే విశ్వాసాన్ని తమ నిత్య జీవితాలలో త్రికరణ శుద్ధిగా పాటించారు.

6. షైతాను ప్రేరణ అంటే, ఆగ్రహం కలిగించటం అని భావం. దూషించేవారు, నిందలు మోపేవారు అయిన ప్రత్యర్థుల మాటలకు మనస్సులో ఆగ్రహం కలుగుతూ ఉన్నట్లు మనిషి భావిస్తే, మాటకు మాట, దెబ్బకు దెబ్బ చెల్లించాలనే సంకల్పం ఏర్పడినప్పుడు, ఇదంతా షైతాను తంత్రమే అని మనిషి భావించాలి; అల్పులైన తన ప్రత్యర్థుల స్థాయికి అతను దిగిరావాలని షైతాను ప్రేరేపిస్తున్నాడు.

إِنَّ الَّذِينَ يُلْحِدُونَ فِيٓ ءَايٰتِنَا لَا يَخْفَوْنَ
عَلَيْنَا ۗ أَفَمَنْ يُلْقٰى فِي النَّارِ خَيْرٌ أَمْ مَّنْ
يَّأْتِيٓ ءَامِنًا يَّوْمَ الْقِيٰمَةِ ۚ اِعْمَلُوا مَا شِئْتُمْ ۙ
إِنَّهٗ بِمَا تَعْمَلُونَ بَصِيرٌ ﴿٤٠﴾ إِنَّ الَّذِينَ
كَفَرُوا بِالذِّكْرِ لَمَّا جَآءَهُمْ ۚ وَإِنَّهٗ لَكِتٰبٌ
عَزِيزٌ ﴿٤١﴾ لَّا يَأْتِيهِ الْبٰطِلُ مِنْۢ بَيْنِ يَدَيْهِ وَ
لَا مِنْ خَلْفِهٖ ۗ تَنْزِيلٌ مِّنْ حَكِيمٍ حَمِيدٍ ﴿٤٢﴾
مَا يُقَالُ لَكَ إِلَّا مَا قَدْ قِيلَ لِلرُّسُلِ مِنْ
قَبْلِكَ ۗ إِنَّ رَبَّكَ لَذُو مَغْفِرَةٍ وَّذُو عِقَابٍ
أَلِيمٍ ﴿٤٣﴾ وَلَوْ جَعَلْنٰهُ قُرْءَانًا أَعْجَمِيًّا لَّقَالُوا
لَوْلَا فُصِّلَتْ ءَايٰتُهٗ ۗ ءَاعْجَمِيٌّ وَّعَرَبِيٌّ ۗ قُلْ
هُوَ لِلَّذِينَ ءَامَنُوا هُدًى وَّشِفَآءٌ ۗ وَالَّذِينَ
لَا يُؤْمِنُونَ فِيٓ ءَاذَانِهِمْ وَقْرٌ وَّهُوَ عَلَيْهِمْ
عَمًى ۗ أُولٰٓئِكَ يُنَادَوْنَ مِنْ مَّكَانٍۢ بَعِيدٍ ﴿٤٤﴾
وَلَقَدْ ءَاتَيْنَا مُوسَى الْكِتٰبَ فَاخْتُلِفَ فِيهِ ۗ وَلَوْ
لَا كَلِمَةٌ سَبَقَتْ مِنْ رَّبِّكَ لَقُضِيَ بَيْنَهُمْ ۚ
وَإِنَّهُمْ لَفِي شَكٍّ مِّنْهُ مُرِيبٍ ﴿٤٥﴾

قرآءة حفص بتسهيل الهمزة الثانية ١٢

ع ٥ / ٢١ / ١٩

**40 - 42** మా వాక్యాలకు పెడర్థాలు అంటగట్టేవారు మాకు కనిపించకుండా ఏమీలేరు. స్వయంగా మీరు ఆలోచించండి; ఏ వ్యక్తి మెరుగైనవాడు, అగ్నిలో పడవేయబడేవాడా లేక ప్రళయం నాడు భద్రమైన స్థితిలో హాజరయ్యేవాడా? మీరు కోరినదెల్లా చేస్తూ ఉండండి, మీ చేష్టలు అన్నింటినీ అల్లాహ్ చూస్తూనే ఉన్నాడు. తమ ముందుకు హితబోధ వచ్చినప్పుడు, దానిని విశ్వసించకుండా తిరస్కరించిన వారు వీరే. కాని యథార్థమేమిటంటే, ఇది ఒక శక్తిమంతమైన గ్రంథం. అసత్యం దాని మీదకు ముందునుండీ రాజాలదు, వెనుకనుండీ రాజాలదు.[7] వివేకవంతుడూ, స్తుతిపాత్రుడూ అయిన దేవుడే అవతరింపజేసిన గ్రంథం ఇది.

**43** ప్రవక్తా! నిన్ను గురించి అనుకుంటున్న విషయాలలో ఏదీ నీకు పూర్వం గతించిన దైవప్రవక్తలను గురించి అనని విషయం ఏదీ కాదు. నిస్సందేహంగా నీ ప్రభువు అమితంగా మన్నించేవాడు; దీనితో పాటు వ్యధాభరిత మైన శిక్షను విధించే వాడు కూడాను.

**44 - 45** ఒకవేళ మేము ఈ ఖుర్‌ఆన్‌ను అరబ్బీయేతర భాషలో పంపి ఉన్నట్లయితే, వారు ఇలా అని ఉండేవారు: "దీని ఆయతులు స్పష్టంగా ఎందుకు వివరించబడలేదు? ఎంత విచిత్రమైన విషయం, గ్రంథమేమో అరబ్బీయేతర భాషలో, సంబోధితులేమో అరబ్బులు."[8] వారితో ఇలా అను, "ఈ ఖురాన్ విశ్వాసులకు మార్గం చూపేది, స్వస్థత చేకూర్చేది. కాని విశ్వసించని వారి చెవులకు ఇది అవరోధం, వారి కళ్లకు ఇది గంత. వారి స్థితి దూరం నుండి ఎవరో వారిని కేకవేసి పిలిచినట్లుగా ఉన్నది. ఇంతకు పూర్వం మేము మూసాకు గ్రంథాన్ని ఇచ్చాము. దాని విషయంలో కూడా ఈ విభేదమే వ్యక్తమయింది. ఒకవేళ నీ ప్రభువు మొదటే ఒక విషయాన్ని నిర్ణయించి ఉండకపోతే, ఈ విభేదించే వారి మధ్య ఎప్పుడో తీర్పు చేయబడి ఉండేది. యథార్థం ఏమిటంటే, వారు దానిని గురించి తీవ్రమైన ఆందోళన కలిగించే సందేహానికి గురి అయ్యారు.

7. ముందు నుండి రాజాలదు అనే దాని అర్థం ఏమిటంటే ; దివ్య ఖురాను మీద ఎవరైనా ప్రత్యక్షంగా దాడిచేసి, దానిలోని ఏమాటనైనా తప్పు అని, దానిలో ఏ బోధనైనా అసత్యమని నిరూపించదలిస్తే, అతడు సఫలీకృతుడు

مَنْ عَمِلَ صَالِحًا فَلِنَفْسِهٖ وَمَنْ اَسَآءَ
فَعَلَيْهَا ۭ وَمَا رَبُّكَ بِظَلَّامٍ لِّلْعَبِيْدِ ﴿٤٦﴾
اِلَيْهِ يُرَدُّ عِلْمُ السَّاعَةِ ۭ وَمَا تَخْرُجُ مِنْ
ثَمَرٰتٍ مِّنْ اَكْمَامِهَا وَمَا تَحْمِلُ مِنْ اُنْثٰى وَ
لَا تَضَعُ اِلَّا بِعِلْمِهٖ ۭ وَيَوْمَ يُنَادِيْهِمْ اَيْنَ
شُرَكَآءِيْ ۙ قَالُوْٓا اٰذَنّٰكَ ۙ مَا مِنَّا مِنْ شَهِيْدٍ ﴿٤٧﴾
وَضَلَّ عَنْهُمْ مَّا كَانُوْا يَدْعُوْنَ مِنْ قَبْلُ
وَظَنُّوْا مَا لَهُمْ مِّنْ مَّحِيْصٍ ﴿٤٨﴾ لَا يَسْـَٔمُ
الْاِنْسَانُ مِنْ دُعَآءِ الْخَيْرِ ۡ وَاِنْ مَّسَّهُ الشَّرُّ
فَيَـُٔوْسٌ قَنُوْطٌ ﴿٤٩﴾ وَلَئِنْ اَذَقْنٰهُ رَحْمَةً مِّنَّا
مِنْۢ بَعْدِ ضَرَّآءَ مَسَّتْهُ لَيَقُوْلَنَّ هٰذَا لِيْ ۙ وَمَآ
اَظُنُّ السَّاعَةَ قَآئِمَةً ۙ وَّلَئِنْ رُّجِعْتُ اِلٰى
رَبِّيْٓ اِنَّ لِيْ عِنْدَهٗ لَلْحُسْنٰى ۚ فَلَنُنَبِّئَنَّ الَّذِيْنَ
كَفَرُوْا بِمَا عَمِلُوْا ۡ وَلَنُذِيْقَنَّهُمْ مِّنْ عَذَابٍ
غَلِيْظٍ ﴿٥٠﴾

**46** మంచిపని చేసేవాడు తనకు తానే మేలు చేసుకుంటాడు. చెడ్డ పని చేసేవాడు, దాని దుష్ఫలితాన్ని తానే అనుభవిస్తాడు. నీ ప్రభువు తన దాసులకు అన్యాయం చేసేవాడు కాడు.

**47 - 48** ఆ గడియకు[9] సంబంధించిన జ్ఞానం అల్లాహ్ వద్దనే ఉన్నది. తమ తొడిమల నుండి బయటికి వచ్చే ఫలాల నన్నింటినీ ఆయనే ఎరుగును. ఆయనకు తెలియకుండా ఏ స్త్రీ అయినా గర్భం దాల్చదు, ఏ స్త్రీ అయినా ప్రసవించదు. ఆయన వారిని కేకవేసి, "ఎక్కడ ఉన్నారు ఆ నా భాగస్వాములు?" అని అడిగే రోజున వారు ఇలా అంటారు, "ఈనాడు మాలో దానికి సాక్ష్యమిచ్చేవాడు ఎవడూ లేడని మేము ఇదివరకే మనవి చేసుకున్నాము." ఆ సమయంలో వారు ఇంతకు పూర్వం మొరపెట్టుకున్న దైవాలన్నీ మటుమాయమైపోతాయి. ఇప్పుడు తమ కొరకు ఆశ్రయస్థాన మనేది ఏదీ లేదని వారు గ్రహిస్తారు.

**49 - 50** మానవుడు మేలుకోసం ప్రార్థిస్తూ ఎన్నడూ అలసిపోడు. అతనికి ఏదైనా ఆపద కలిగినప్పుడు, నిరాశా నిస్పృహలకు లోనై భగ్నహృదయుడవుతాడు. కాని కష్టకాలం తీరిపోయిన తరువాత, మేము అతనికి మా కారుణ్యాన్ని రుచి చూపినప్పుడు ఇలా అంటాడు, "నేను అసలు దీనికే అర్హుణ్ణి. ప్రళయం ఎప్పుడైనా వస్తుందని నేను అనుకోవటం లేదు. కాని ఒకవేళ నిజంగానే నేను నా ప్రభువు వైపునకు మరలింపబడితే, అక్కడ కూడా నేను సుఖాలనే అనుభవిస్తాను." నిశ్చయంగా సత్య తిరస్కారులకు వారు ఏమేమి చేసి వచ్చారో మేము తప్పకుండా తెలియజేస్తాము. వారికి మేము జుగుప్సాకరమైన శిక్షను రుచి చూపిస్తాము.

కాలేదు. వెనుక నుండి రాజాలదు అనే దాని అర్థం ఏమిటంటే, దివ్య ఖురాను ప్రతిపాదించే యథార్థాలకు భిన్నంగా ఉన్నటువంటి ఏ విషయమూ ప్రళయం వచ్చేవరకు ఉత్పన్నం కాదు, నిజంగానే 'జ్ఞానం' అని అనిపించుకునే జ్ఞానం ఏదీ, దివ్య ఖురాను బోధించే జ్ఞానాన్ని ఖండించే జ్ఞానం ఏదీ పుట్టదు; విశ్వాసాలు, సత్ప్రవర్తన, చట్టాలు, నాగరికత, సంస్కృతి, ఆర్థిక, సామాజిక, రాజకీయ వ్యవహారాలకు సంబంధించి, దివ్య ఖురాను మానవుడికి ఇచ్చిన మార్గదర్శక సూత్రాలు తప్పు అనీ, దోషభూయిష్టమైనవనీ నిరూపించే ప్రయోగం గానీ పరిశోధన గానీ ఉండదు.

وَ اِذَآ اَنۡعَمۡنَا عَلَى الۡاِنۡسَانِ اَعۡرَضَ
وَنَاٰبِجَانِبِهٖ ۚ وَ اِذَا مَسَّهُ الشَّرُّ فَذُوۡ دُعَآءٍ
عَرِيۡضٍ ﴿۵۱﴾ قُلۡ اَرَءَيۡتُمۡ اِنۡ كَانَ مِنۡ عِنۡدِ
اللّٰهِ ثُمَّ كَفَرۡتُمۡ بِهٖ مَنۡ اَضَلُّ مِمَّنۡ هُوَ فِىۡ
شِقَاقٍۢ بَعِيۡدٍ ﴿۵۲﴾ سَنُرِيۡهِمۡ اٰيٰتِنَا فِى الۡاٰفَاقِ وَ
فِىۡۤ اَنۡفُسِهِمۡ حَتّٰى يَتَبَيَّنَ لَهُمۡ اَنَّهُ الۡحَقُّ ؕ
اَوَلَمۡ يَكۡفِ بِرَبِّكَ اَنَّهٗ عَلٰى كُلِّ شَىۡءٍ
شَهِيۡدٌ ﴿۵۳﴾ اَلَاۤ اِنَّهُمۡ فِىۡ مِرۡيَةٍ مِّنۡ لِّقَآءِ
رَبِّهِمۡ ؕ اَلَاۤ اِنَّهٗ بِكُلِّ شَىۡءٍ مُّحِيۡطٌ ﴿۵۴﴾ ع

**51** మానవుడికి మేము కానుకలను ప్రసాదించినప్పుడు, ముఖం త్రిప్పు కుంటాడు, విర్రవీగుతాడు. కాని అతనికి ఏదైనా ఆపద కలిగినప్పుడు, సుదీర్ఘమైన ప్రార్థనలు చేస్తాడు.

**52** ప్రవక్తా! వారితో ఇలా అను: "ఎప్పుడైనా మీరు ఇలా కూడా ఆలోచిం చారా– ఒకవేళ నిజంగానే ఈ ఖురాన్ అల్లాహ్ తరఫు నుండి వచ్చి, దానిని గనక మీరు తిరస్కరిస్తూ ఉన్నట్ల యితే, దానిని వ్యతిరేకించటంలో చాల దూరం వెళ్లిపోయిన వ్యక్తిని మించిన మార్గభ్రష్టుడెవడు?"

**53 - 54** మేము త్వరలోనే వారికి మా సూచనలను వారి చుట్టూ ఉన్న ప్రపంచంలోనూ చూపిస్తాము, వారిలోనూ చూపి స్తాము. చివరకు ఈ ఖురాన్ నిస్సందేహంగా సత్యమైనదని వారికి విశదమైపోతుంది. నీ ప్రభువు ప్రతిదానికి సాక్షి అనే విషయం సరిపోదా? తెలుసుకో, వారు తమ ప్రభువును కలుసు కునే విషయం పట్ల సందేహం కలిగి ఉన్నారు. విను, ఆయన ప్రతి వస్తువునూ పరివేష్టించి ఉన్నాడు.[10]

8. అవిశ్వాసులు ఇలా అనేవారు; ముహమ్మద్ (సఅసమ్) అరేబియావాసి, ఈయన అరబ్బీ భాషలో ఖురాను చెబితే, దానిని ఆయన స్వయంగా కల్పించలేదనీ, దేవుడు ఆయనపై దానిని అవతరింపజేశాడనీ ప్రజలకు నమ్మకం కలిగేదెలా? ఈ గ్రంథాన్ని దేవుడే అవతరింపజేశాడని నమ్మాలంటే, ఈయన తనకు తెలియని పరాయి భాషలో, అంటే, ఫారసీభాష, ల్యాటిన్ భాష, గ్రీకు భాషలలో ధారాళంగా ఎకాయెకిన మాట్లాడటం ప్రారంభించాలి. వారి వాదాన్ని ఖండిస్తూ అల్లాహ్ ఇలా అంటున్నాడు; ఇప్పుడు వారు అర్థం చేసుకునే వారి మాతృభాషలోనే దివ్యఖురాను పంపబడినప్పుడు, ఒక అరేబియా వాసి ద్వారా అరబ్బీ భాషలో ఈ గ్రంథం ఎందుకు అవతరింపజేయబడింది? అని అభ్యంతరం లేవదీస్తారు. కాని అన్య భాషలో గ్రంథాన్ని పంపితే, ఆ ప్రజలే ఇలా అభ్యంతరం పలుకుతారు; ఒక అరబ్బు జాతి వద్దకు ఒక అరబ్బు ప్రవక్తగా పంపబడ్డాడు, కాని ఆయనపై అవతరింపచేయబడిన గ్రంథ భాష స్వయంగా ఆయనకూ అర్థం కాదు, ఆయన జాతి వారికి అర్థం కాదు. (ఇది ఎంత వింతైన విషయం).

9. అంటే, ప్రళయం అని భావం.

10. అంటే, ఏ విషయమూ ఆయన అవగాహనానికి అతీతమైనదీ గాదు, ఆయన జ్ఞానానికి అందనిదీ కాదు.

## 42. అష్ షూరా

అవతరణ మక్కాలో | ఆయతులు 53

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 – 6** హా. మీమ్. ఐన్. సీన్. ఖాఫ్. ఇదేవిధంగా శక్తిమంతుడూ, వివేకవంతుడూ అయిన అల్లాహ్ నీ వైపునకూ, నీకు పూర్వం గతించిన (దైవప్రవక్తల) వైపునకూ వహీ ద్వారా సందేశం పంపుతూ వచ్చాడు.[1] ఆకాశాలలో, భూమిలో ఉన్నదంతా ఆయనదే. ఆయన మహోన్నతుడు, మహిమాన్వితుడు. త్వరలోనే ఆకాశం పైనుంచి బ్రద్దలైపోతుంది.[2] దైవదూతలు తమ ప్రభువును స్తుతిస్తూ ఆయన పవిత్రతను కొనియాడుతున్నారు, భూలోక వాసులను మన్నించమని విన్నపాలు చేస్తున్నారు. వాస్తవానికి అల్లాహ్ మన్నించేవాడూ, కరుణించేవాడూను అని తెలుసుకో. ఆయనను త్రోసిరాజని ఇతరులను తమ సంరక్షకులుగా[3] చేసుకున్న వారిని అల్లాహ్ కనిపెట్టే ఉన్నాడు. నీవు వారికి కాపలాదారువు కావు.

**7** అవును, ప్రవక్తా! ఇదేవిధంగా, ఈ అరబ్బీ ఖురాన్‌ను మేము నీ వైపునకు వహీ ద్వారా పంపాము, నీవు జనపదాల కేంద్రం (మక్కా నగరం) లోనూ దాని పరిసరాలలోనూ ఉండే ప్రజలను హెచ్చరించాలనీ, సమావేశదినం గురించి వారిని భయపెట్టాలనీ; అది వచ్చే విషయంలో ఏమాత్రం సందేహం లేదు. ఒక వర్గం వారు స్వర్గానికిపోతారు, మరొక వర్గం వారు నరకానికి పోతారు.

**8 – 9** అల్లాహ్ కోరి ఉంటే, వారందరినీ ఒకే సంఘంగా చేసి ఉండేవాడు. కాని ఆయన తాను కోరిన వారిని తమ కృపకు పాత్రులను చేస్తాడు. దుర్మార్గులను రక్షించేవాడుగానీ, వారికి సహాయపడేవాడు గానీ ఎవ్వడూ లేడు. వారు (ఎంతటి అవివేకులు) ఆయనను కాదని ఇతరులను సంరక్షకులుగా చేసుకున్నారు? సంరక్షకుడు ఒక్క అల్లాహ్ మాత్రమే. ఆయనే మృతులను బ్రతికిస్తాడు. ఆయన ప్రతి దానిపై అధికారం కలవాడు.

۴۲ سُوْرَةُ الشُّوْرٰی مَکِّیَّةٌ ۶۲

اٰیاتھا ۵۳ | رکوعاتھا ۵

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِیْمِ ○

حٰمٓ ۝۱ عٓسٓقٓ ۝۲ كَذٰلِكَ یُوْحِیْٓ اِلَیْكَ وَ اِلَی
الَّذِیْنَ مِنْ قَبْلِكَ ۙ اللّٰهُ الْعَزِیْزُ الْحَكِیْمُ ۝۳
لَهٗ مَا فِی السَّمٰوٰتِ وَمَا فِی الْاَرْضِ ؕ وَ هُوَ
الْعَلِیُّ الْعَظِیْمُ ۝۴ تَكَادُ السَّمٰوٰتُ یَتَفَطَّرْنَ
مِنْ فَوْقِهِنَّ وَ الْمَلٰٓئِكَةُ یُسَبِّحُوْنَ بِحَمْدِ رَبِّهِمْ
وَیَسْتَغْفِرُوْنَ لِمَنْ فِی الْاَرْضِ ؕ اَلَآ اِنَّ
اللّٰهَ هُوَ الْغَفُوْرُ الرَّحِیْمُ ۝۵ وَ الَّذِیْنَ اتَّخَذُوْا
مِنْ دُوْنِهٖٓ اَوْلِیَآءَ اللّٰهُ حَفِیْظٌ عَلَیْهِمْ ۫ۖ وَ مَآ
اَنْتَ عَلَیْهِمْ بِوَكِیْلٍ ۝۶ وَ كَذٰلِكَ اَوْحَیْنَآ
اِلَیْكَ قُرْاٰنًا عَرَبِیًّا لِّتُنْذِرَ اُمَّ الْقُرٰی وَ مَنْ
حَوْلَهَا وَ تُنْذِرَ یَوْمَ الْجَمْعِ لَا رَیْبَ فِیْهِ ؕ
فَرِیْقٌ فِی الْجَنَّةِ وَ فَرِیْقٌ فِی السَّعِیْرِ ۝۷ وَلَوْ
شَآءَ اللّٰهُ لَجَعَلَهُمْ اُمَّةً وَّاحِدَةً وَّ لٰكِنْ
یُّدْخِلُ مَنْ یَّشَآءُ فِیْ رَحْمَتِهٖ ؕ وَ الظّٰلِمُوْنَ
مَا لَهُمْ مِّنْ وَّلِیٍّ وَّ لَا نَصِیْرٍ ۝۸ اَمِ اتَّخَذُوْا
مِنْ دُوْنِهٖٓ اَوْلِیَآءَ ۚ فَاللّٰهُ هُوَ الْوَلِیُّ وَ هُوَ یُحْیِ
الْمَوْتٰی ۫ وَ هُوَ عَلٰی كُلِّ شَیْءٍ قَدِیْرٌ ۝۹ ع

وَ مَا اخْتَلَفْتُمْ فِيْهِ مِنْ شَيْءٍ فَحُكْمُهٗۤ اِلَى
اللّٰهِ ؕ ذٰلِكُمُ اللّٰهُ رَبِّيْ عَلَيْهِ تَوَكَّلْتُ ۖۗ وَ اِلَيْهِ
اُنِيْبُ ⑩ فَاطِرُ السَّمٰوٰتِ وَالْاَرْضِ ؕ جَعَلَ
لَكُمْ مِّنْ اَنْفُسِكُمْ اَزْوَاجًا وَّ مِنَ الْاَنْعَامِ
اَزْوَاجًا ۚ يَذْرَؤُكُمْ فِيْهِ ؕ لَيْسَ كَمِثْلِهٖ
شَيْءٌ ۚ وَهُوَ السَّمِيْعُ الْبَصِيْرُ ⑪ لَهٗ مَقَالِيْدُ
السَّمٰوٰتِ وَالْاَرْضِ ۚ يَبْسُطُ الرِّزْقَ لِمَنْ
يَّشَآءُ وَ يَقْدِرُ ؕ اِنَّهٗ بِكُلِّ شَيْءٍ عَلِيْمٌ ⑫

**10 - 12** మీ[4] మధ్య ఏ విషయంలో అభిప్రాయభేదం తలెత్తినా, దానిని గురించి తీర్పు చెప్పటం అల్లాహ్ పని. ఆ అల్లాహ్‌యే నా ప్రభువు, ఆయననే నేను నమ్ముకున్నాను, ఆయన దెసకే నేను (పశ్చాత్తాపంతో) మరలుతాను. ఆకాశాలకూ, భూమికీ సృష్టికర్త అయిన ఆయన, స్వయంగా మీ జాతి నుండే మీ కొరకు జంటలను సృజించాడు; ఇదేవిధంగా పశువులలో కూడా (వాటి జాతి) జంటలను సృష్టించాడు. ఈ విధంగా ఆయన మీ సంతతులను వ్యాపింపజేస్తాడు. ఆయనను పోలిన వస్తువు సృష్టిలో ఏదీ లేదు. ఆయన అన్నీ వినేవాడూ, అన్నీ చూసేవాడూను. భూమ్యాకాశాలలోని నిక్షేపాల తాళపు చెవులు ఆయన వద్దనే ఉన్నాయి. తాను కోరిన వారికి ఆయన పుష్కలంగా ఉపాధిని ఇస్తాడు; తాను కోరినవారికి ఆయన ఆచితూచి ఉపాధిని ఇస్తాడు. ఆయనకు ప్రతి విషయం గురించీ తెలుసు.

1. అంటే, దివ్య ఖురానులో చెప్పబడుతూ ఉన్న విషయాలనే అల్లాహ్, మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్)పై వహీద్వారా అవతరింపజేశాడు, పూర్వపు ప్రవక్తలపై కూడ ఈ విషయాలనే అవతరింపజేశాడు.
2. అంటే, దేవుని దైవత్వంలో ఏ స్థితిలోనైనా ఏ ప్రాణినైనా భాగస్వామిగా చేయటం అనేది మామూలు విషయమేమీ కాదు. అది ఎంత తీవ్రమైన విషయమంటే, దానివల్ల ఆకాశం బ్రద్దలైనా, ఆశ్చర్యపడవలసిన పనిలేదు.
3. అసలు, సంరక్షకులు (ఔలియా) అనే పదం వాడబడింది. అరబ్బీ భాషలో దానికి విపులమైన అర్థం ఉన్నది. అసత్యపు దేవుళ్లను గురించి మార్గభ్రష్టులైన మానవులకు విభిన్న విశ్వాసాలు, విభిన్న ఆరాధనా పద్ధతులు ఉన్నాయి. దివ్య ఖురానులో వాటినే "అల్లాహ్‌ను తప్ప ఇతరులను తమ సంరక్షకులుగా చేసుకోవటం"తో పోల్చబడింది. దివ్య ఖురాను ప్రకారం మానవుడు తన సంరక్షకుడుగా ఎవరిని గ్రహిస్తాడంటే ;
   (1) ఎవరి మాటల ప్రకారం అతడు నడుచుకుంటాడో, ఎవరి ఉపదేశాలను అతడు పాటిస్తాడో, ఎవరు నిర్ణయించిన పద్ధతులనూ, ఆచారాలనూ, చట్టాలనూ, నిబంధనలనూ, అతడు అనుసరిస్తాడో వారిని అతడు తన సంరక్షకులుగా భావిస్తాడు. (2) ఎవరి మార్గదర్శకత్వం పట్ల అతడికి నమ్మకం ఉందో, ఎవరు తనకు సరియైన మార్గం చూపుతారనీ, తప్పుడు మార్గం నుండి కాపాడుతారనీ అతడు భావిస్తాడో, వారిని అతడు తన సంరక్షకులుగా చేసుకుంటాడు. (3) నేను ప్రపంచంలో ఏది చేసినా, దాని వలన కలిగే చెడు ఫలితాల నుండి, ఒకవేళ దేవుడు ఉంటే, ప్రళయం వస్తే, వాటి వలన పడే శిక్ష నుండీ, ఎవరు తనను కాపాడుతారని విశ్వసిస్తాడో, వారిని అతడు సంరక్షకులుగా ఆమోదిస్తాడు. (4) ఎవరు ప్రపంచంలో తనకు అసాధారణ రీతులలో సహాయం చేస్తారనీ, కష్టాల నుండీ, కడగండ్ల నుండీ తనను రక్షిస్తారనీ, తనకు ఉపాధిని కలిగిస్తారనీ, సంతానాన్ని ప్రసాదిస్తారనీ, తన కోరికలను నెరవేరుస్తారనీ, తనకు కావలసిన ఇతర అన్ని అవసరాలను తీరుస్తారనీ అతడు నమ్ముతాడో, వారిని తన సంరక్షకులుగా భావిస్తాడు.
4. ఇక్కడ నుండి 12వ ఆయతు చివరి వరకు గల మొత్తం విషయం అల్లాహ్ వద్ద నుండి వచ్చిన వహీయే. కాని ఇందులో మాట్లాడేవాడు అల్లాహ్ కాదు, ఆయన పంపిన ప్రవక్త ముహమ్మద్ మాత్రమే. మరొకవిధంగా చెప్పాలంటే, సర్వశక్తిమంతుడైన అల్లాహ్, "నీవు ఈ ప్రకటన చేయి", అని తన ప్రవక్తకు బోధిస్తున్నాడు. ఫాతిహా సూరా దీనికి ఉదాహరణ. అది దైవవాక్కే. కాని దాసులు తమ తరపు నుండి దానిని ప్రార్థనగా అల్లాహ్ సమక్షంలో సమర్పించుకుంటారు.

شَرَعَ لَكُمْ مِّنَ الدِّيْنِ مَا وَصّٰى بِهٖ نُوْحًا وَّالَّذِیْۤ اَوْحَيْنَاۤ اِلَيْكَ وَمَا وَصَّيْنَا بِهٖۤ اِبْرٰهِيْمَ وَ مُوْسٰى وَعِيْسٰۤى اَنْ اَقِيْمُوا الدِّيْنَ وَ لَا تَتَفَرَّقُوْا فِيْهِ ؕ كَبُرَ عَلَى الْمُشْرِكِيْنَ مَا تَدْعُوْهُمْ اِلَيْهِ ؕ اَللّٰهُ يَجْتَبِیْۤ اِلَيْهِ مَنْ يَّشَآءُ وَ يَهْدِیْۤ اِلَيْهِ مَنْ يُّنِيْبُ ﴿۱۳﴾ وَ مَا تَفَرَّقُوْۤا اِلَّا مِنْۢ بَعْدِ مَا جَآءَهُمُ الْعِلْمُ بَغْيًۢا بَيْنَهُمْ ؕ وَ لَوْ لَا كَلِمَةٌ سَبَقَتْ مِنْ رَّبِّكَ اِلٰۤى اَجَلٍ مُّسَمًّى لَّقُضِیَ بَيْنَهُمْ ؕ وَ اِنَّ الَّذِيْنَ اُوْرِثُوا الْكِتٰبَ مِنْۢ بَعْدِهِمْ لَفِیْ شَكٍّ مِّنْهُ مُرِيْبٍ ﴿۱۴﴾ فَلِذٰلِكَ فَادْعُ ۚ وَ اسْتَقِمْ كَمَاۤ اُمِرْتَ ۚ وَ لَا تَتَّبِعْ اَهْوَآءَهُمْ ۚ وَ قُلْ اٰمَنْتُ بِمَاۤ اَنْزَلَ اللّٰهُ مِنْ كِتٰبٍ ۚ وَ اُمِرْتُ لِاَعْدِلَ بَيْنَكُمْ ؕ اَللّٰهُ رَبُّنَا وَ رَبُّكُمْ ؕ لَنَاۤ اَعْمَالُنَا وَ لَكُمْ اَعْمَالُكُمْ ؕ لَا حُجَّةَ بَيْنَنَا وَ بَيْنَكُمْ ؕ اَللّٰهُ يَجْمَعُ بَيْنَنَا ۚ وَ اِلَيْهِ الْمَصِيْرُ ﴿۱۵﴾

**13** ఆయన నూహ్ ప్రవక్తకు ఆజ్ఞాపించిన ధర్మాన్నే నీకు కూడా నిర్ణయించాడు. దానినే (ముహమ్మద్ (సఅసమ్) ఇప్పుడు నీ వైపునకు మేము వహీ ద్వారా పంపాము; దానినే మేము ఇబ్రాహీమ్‌కు, మూసాకు, ఈసాకు బోధించాము; ఈ ధర్మాన్ని స్థాపించండి అనీ, దానిని గురించి విభేదాలకు లోను కాకండి అనీ తాకీదు చేస్తూ. ఈ విషయమే ఈ బహుదైవారాధకులకు ఎంతో అసహనం కలిగించింది; దాని వైపునకే (ముహమ్మద్ (సఅసమ్) నీవు వారిని ఆహ్వానిస్తున్నావు. అల్లాహ్ తాను కోరిన వారిని తనవారుగా చేసుకుంటాడు. ఆయన తన వైపునకు మరలేవారికి మాత్రమే తన వైపునకు వచ్చే మార్గాన్ని చూపుతాడు.

**14** ప్రజల వద్దకు జ్ఞానం వచ్చిన తరువాతనే వారిలో విభేదం తలఎత్తింది, వారు ఒకరికొకరు అన్యాయం చేయదలచుకున్న కారణంగానే తల ఎత్తింది. ఒక నిర్ణీతకాలం వరకు తీర్పు నిలిపివేయబడింది అని నీ ప్రభువు మొదట్లోనే సెలవిచ్చి ఉండకపోతే, వారి వ్యవహారం తేల్చివేయబడి ఉండేదే. యథార్థం ఏమిటంటే, వారి తరువాత గ్రంథానికి వారసులుగా చేయబడిన వారు దానిని గురించి ఆందోళనకరమైన సంశయానికి గురిఅయ్యారు.[5]

**15** (ఈ పరిస్థితి ఉత్పన్నమయింది కాబట్టి) కనుక ముహమ్మద్! ఇప్పుడు నీవు ఆ ధర్మం వైపునకే ప్రజలను ఆహ్వానించు. నీకు ఆజ్ఞాపించబడిన విధంగా, దానిపై స్థిరంగా ఉండు, వారి కోరికలను అనుసరించకు. వారితో ఇలా అను, "అల్లాహ్ అవతరింపజేసిన గ్రంథాన్నల్లా నేను విశ్వసించాను. మీ మధ్య న్యాయం చేయమని నాకు ఆజ్ఞాపించబడింది. మా ప్రభువూ అల్లాహ్‌యే, మీ ప్రభువు కూడా అల్లాహ్‌యే. మా కర్మలు మాకే, మీ కర్మలు మీకే. మీకూ మాకూ మధ్య ఏ వివాదమూ లేదు.[6] ఒక రోజున అల్లాహ్ మన అందరినీ సమావేశపరుస్తాడు. అందరూ ఆయన వైపునకే పోవలసి ఉన్నది."

5. అంటే, తమకు సంక్రమించిన గ్రంథాలు ఎంత పరిశుద్ధమైనవో, ఎక్కడెక్కడ ఎన్నెన్ని మార్పులు చేయబడ్డాయో తరువాత తరాలవారు నిశ్చయంగా చెప్పలేరు. అలాగే వారి ప్రవక్తలు ఏ ఉపదేశాలు తీసుకువచ్చారో అనే విషయం కూడ వారికి నమ్మకంగా తెలియదు. వారి దృష్టికి ప్రతి విషయమూ అనుమానాస్పదమే, మనస్సులలో కలతలు రేపేదే.

وَ الَّذِیۡنَ یُحَآجُّوۡنَ فِی اللّٰہِ مِنۡۢ بَعۡدِ مَا
اسۡتُجِیۡبَ لَہٗ حُجَّتُہُمۡ دَاحِضَۃٌ عِنۡدَ رَبِّہِمۡ وَ
عَلَیۡہِمۡ غَضَبٌ وَّ لَہُمۡ عَذَابٌ شَدِیۡدٌ ﴿۱۶﴾ اَللّٰہُ
الَّذِیۡۤ اَنۡزَلَ الۡکِتٰبَ بِالۡحَقِّ وَ الۡمِیۡزَانَ ؕ وَ مَا
یُدۡرِیۡکَ لَعَلَّ السَّاعَۃَ قَرِیۡبٌ ﴿۱۷﴾ یَسۡتَعۡجِلُ
بِہَا الَّذِیۡنَ لَا یُؤۡمِنُوۡنَ بِہَا ۚ وَ الَّذِیۡنَ اٰمَنُوۡا
مُشۡفِقُوۡنَ مِنۡہَا ۙ وَ یَعۡلَمُوۡنَ اَنَّہَا الۡحَقُّ ؕ اَلَاۤ
اِنَّ الَّذِیۡنَ یُمَارُوۡنَ فِی السَّاعَۃِ لَفِیۡ ضَلٰلٍۭ
بَعِیۡدٍ ﴿۱۸﴾ اَللّٰہُ لَطِیۡفٌۢ بِعِبَادِہٖ یَرۡزُقُ مَنۡ
یَّشَآءُ ۚ وَ ہُوَ الۡقَوِیُّ الۡعَزِیۡزُ ﴿۱۹﴾ؑ مَنۡ کَانَ یُرِیۡدُ ع ۲
حَرۡثَ الۡاٰخِرَۃِ نَزِدۡ لَہٗ فِیۡ حَرۡثِہٖ ۚ وَ مَنۡ کَانَ
یُرِیۡدُ حَرۡثَ الدُّنۡیَا نُؤۡتِہٖ مِنۡہَا وَ مَا لَہٗ فِی
الۡاٰخِرَۃِ مِنۡ نَّصِیۡبٍ ﴿۲۰﴾ اَمۡ لَہُمۡ شُرَکٰٓؤُا
شَرَعُوۡا لَہُمۡ مِّنَ الدِّیۡنِ مَا لَمۡ یَاۡذَنۡۢ بِہِ
اللّٰہُ ؕ وَ لَوۡ لَا کَلِمَۃُ الۡفَصۡلِ لَقُضِیَ بَیۡنَہُمۡ ؕ وَ
اِنَّ الظّٰلِمِیۡنَ لَہُمۡ عَذَابٌ اَلِیۡمٌ ﴿۲۱﴾ تَرَی
الظّٰلِمِیۡنَ مُشۡفِقِیۡنَ مِمَّا کَسَبُوۡا وَ ہُوَ وَاقِعٌۢ
بِہِمۡ ؕ وَ الَّذِیۡنَ اٰمَنُوۡا وَ عَمِلُوا الصّٰلِحٰتِ فِیۡ
رَوۡضٰتِ الۡجَنّٰتِ ۚ لَہُمۡ مَّا یَشَآءُوۡنَ عِنۡدَ
رَبِّہِمۡ ؕ ذٰلِکَ ہُوَ الۡفَضۡلُ الۡکَبِیۡرُ ﴿۲۲﴾

**16** అల్లాహ్ సందేశాన్ని స్వీకరించిన తరువాత, (స్వీకరించిన వారితో) అల్లాహ్‌ను గురించి వివాదపడే వారి వాదం వారి ప్రభువు దృష్టిలో అసత్యమైనది, వారిపై అల్లాహ్ ఆగ్రహం పడుతుంది, వారికి కఠిన శిక్ష విధించబడుతుంది.

**17 - 18** సత్యసమేతమైన ఈ గ్రంథాన్నీ, తరాజునూ అల్లాహ్‌యే అవతరింపజేశాడు.[7] మీకేమి తెలుసు, బహుశా తీర్పు గడియ సమీపంలోనే ఉన్నదేమో. దాని రాకను విశ్వసించనివారే, దాని కొరకు తొందరపెడతారు. కాని దానిని విశ్వసించేవారు మాత్రం దానికి భయపడతారు. అది తప్పకుండా వస్తుందని వారికి తెలుసు. బాగా వినండి, ఆ గడియను గురించి సందేహం రేకెత్తించే వాదనలు చేసేవారు అపమార్గంలో చాలా దూరం వెళ్లిపోయారు.

**19 - 20** అల్లాహ్ తన దాసుల పట్ల ఎంతో దయకలవాడు: తాను ఎవరికి ఏది ఇవ్వాలని కోరుకుంటాడో, అది వారికి ఇస్తాడు. ఆయన ఎంతో బలవంతుడు, ఎంతో శక్తిమంతుడూను. పరలోకపు పంటను ఎవడు కోరుకుంటాడో, మేము అతనికై ఆ పంటను వృద్ధిపరుస్తాము. ఇహలోకపు పంటను ఎవడు కోరుకుంటాడో, మేము అతనికి ఇహలోకంలోనిది మాత్రమే ఇస్తాము. కాని అతనికి పరలోకంలో మాత్రం ఏ వాటా ఉండదు.

**21 - 23** అల్లాహ్ అనుమతించకుండానే, ధర్మం వంటి స్వభావం గల ఒక విధానాన్ని తమ కొరకు రూపొందించిన దైవ భాగస్వాముల నెవరినైనా వారు కలిగి ఉన్నారా?[8] తీర్పు విషయం నిర్ణయింపబడి ఉండకపోతే, వారి వ్యవహారం ఎప్పుడో తేల్చివేయబడివుండేది. నిశ్చయంగా ఈ దుర్మార్గులకు వ్యధాభరితమైన శిక్ష పడుతుంది. అప్పుడు ఈ దుర్మార్గులు తాము చేసిన దాని పరిణామానికి భయపడుతూ ఉండటాన్ని నీవు చూస్తావు. అది తప్పకుండా వారి మీదకు వచ్చిపడుతుంది. దీనికి భిన్నంగా విశ్వసించి, సత్కార్యాలు చేసినవారు స్వర్గ వనాలలో ఉంటారు. వారు తాము కోరిన దానిని తమ ప్రభువు వద్ద పొందుతారు. ఇదే గొప్ప అనుగ్రహం.

ذٰلِكَ الَّذِىۡ يُبَشِّرُ اللّٰهُ عِبَادَهُ الَّذِيۡنَ اٰمَنُوۡا وَعَمِلُوا الصّٰلِحٰتِ‌ؕ قُلْ لَّاۤ اَسۡـَٔلُكُمۡ عَلَيۡهِ اَجۡرًا اِلَّا الۡمَوَدَّةَ فِى الۡقُرۡبٰى‌ؕ وَمَنۡ يَّقۡتَرِفۡ حَسَنَةً نَّزِدۡ لَهٗ فِيۡهَا حُسۡنًا‌ؕ اِنَّ اللّٰهَ غَفُوۡرٌ شَكُوۡرٌ ﴿۲۳﴾

దీని శుభవార్తనే అల్లాహ్ విశ్వసించి, సత్కార్యాలు చేసే తన దాసులకు తెలియజేస్తున్నాడు. ప్రవక్తా! వారితో ఇలా అను, "నేను ఈ పనికి మీనుండి ఏ ప్రతిఫలాన్నీ కోరను. అయితే బంధుప్రేమను తప్పకుండా కోర్తాను."[9] ఎవడు మంచిని సంపాదించుకుంటాడో, మేము అతని మంచిని మరింత పెంచుతాము. నిస్సందేహంగా అల్లాహ్ ఎంతో మన్నించే వాడూ, విలువనిచ్చి గుర్తించే వాడూను.

6. అంటే, సహేతుకమైన ఆధారాలతో విషయాన్ని తెలియజేయటానికి మేము శక్తివంచన లేకుండా ప్రయత్నం చేశాము. ఇక అనవసరంగా వాద వివాదాల వలన ఏం ప్రయోజనం. మీరు మాతో వాదానికి దిగినా, మేము మీతో వాదానికి సిద్ధంగా లేము.

7. తరాజు అంటే, అల్లాహ్ షరియత్తు అని భావం. అది అన్నింటినీ తూచి, తప్పొప్పులు; సత్యాసత్యాలు, న్యాయాన్యాయాలు, ధర్మాధర్మాల మధ్య గల అంతరాన్ని స్పష్టంగా చూపుతుంది.

8. ఈ ఆయతులో "షురకా" అంటే, ఎవరిని ప్రజలు వేడుకుంటారో, ఎవరికి మొక్కుబడులు చెల్లిస్తారో, ఎవరి ముందు పూజాపురస్కారాలు నిర్వహిస్తారో, వారు కారని స్పష్టం. కాని, అల్లాహ్ విశ్వాధిపత్యంలో, అధికారంలో ప్రజలు ఎవరిని భాగస్వాములుగా చేస్తారో ఎవరి భావాలను, విశ్వాసాలను, సిద్ధాంతాలను, వేదాంతాలను ప్రజలు విశ్వసిస్తారో, ఎవరి విలువలను ప్రజలు గౌరవిస్తున్నారో, ఎవరు ప్రవేశపెట్టిన నైతిక సూత్రాలనూ, నాగరికతా సంస్కృతీ ప్రమాణాలను ప్రజలు సమ్మతించారో, ఎవరు చేసిన చట్టాలను, విధానాలను, నియమనిబంధనలను, ప్రజలు తమ మత సంబంధమైన ఆచారాలలో, ఆరాధనలలో, తమ వ్యక్తిగత, సామూహిక జీవితాలలో, తమ నాగరికతలో, తమ వర్తక వాణిజ్య వ్యవహారాలలో, తమ రాజకీయాలలో, ప్రభుత్వాలలో షరియత్తును అవలంబించవలసిన రీతిగా అవలంబిస్తారో, వారు అని అర్థం.

9. ఈ ఆయతుకు మూడు రకాల వ్యాఖ్యానాలు చేయబడ్డాయి : (1) నేను ఈ పనికి మీ నుండి ఏ ప్రతిఫలాన్నీ కోరను. కాని, "మీరు (అంటే ఖురైషు ప్రజలు) కనీసం మన మధ్యగల బంధుత్వాన్ని అయినా మన్నించాలి, అని నేను తప్పకుండా కోరుకుంటాను. అందరికంటే మీరే ఎక్కువగా నా పట్ల శత్రు భావంతో ఉన్నారు, ఇదేమి వైపరీత్యం! (2) నేను ఈ పనికై మీ నుండి ఎటువంటి ప్రతిఫలాన్నీ కోరను. కాని మీలో అల్లాహ్‌కు దగ్గర కావాలనే కోరిక జనించాలనేదే నా ప్రగాఢ వాంఛ. (3) మూడో వ్యాఖ్యానం చేసిన వారిలో కొందరు బంధుత్వం అంటే, మొత్తం అబ్దుల్ ముత్తలిబ్ సంతతి అనే అర్థం తీసుకున్నారు. కొందరు దానిని కేవలం హజ్రత్ అలీ, హజ్రత్ ఫాతిమాలు, వారి సంతతి అని పరిమితం చేశారు. కాని అనేక కారణాల వలన ఈ వ్యాఖ్యానం ఏ విధంగానూ ఆమోదయోగ్యం కాదు. మొదటి కారణం ఏమిటంటే, పవిత్ర మక్కా నగరంలో "షూరా" అనే సూరా అవతరించే నాటికి హజ్రత్ అలీ, ఫాతిమాల వివాహం కూడ కాలేదు. కనుక వారి సంతతిని గురించిన ప్రశ్నే పుట్టదు. అబ్దుల్ ముత్తలిబ్ సంతతిలోని వారందరూ మహాప్రవక్త (సఅసమ్)కు సహాయపడలేదు. కొందరైతే ప్రత్యక్షంగా శత్రువులతో చేతులు కలిపారు. అబూలహబ్ శత్రుత్వం లోకం ఎరిగిందే కదా! రెండో కారణం, మహాప్రవక్త (సఅసమ్) బంధువులు కేవలం అబ్దుల్ ముత్తలిబ్ సంతతివారు మాత్రమే కారు. ఆయన తల్లిదండ్రులూ, ఆయన సతీమణి హజ్రత్ ఖదీజా (రజిఅన్)ల కుటుంబాల ద్వారా, ఖురైషు తెగవారి అన్ని కుటుంబాలతో ఆయనకు బంధుత్వం ఏర్పడింది. ఈ అన్ని కుటుంబాలలో ఆయనకు బద్ధ విరోధులూ ఉన్నారు, ప్రాణస్నేహితులూ ఉన్నారు, వీటన్నిటికంటే ముఖ్యమైన మూడో విషయం; ఒక ఉన్నత స్థానంపై నుండి "అల్లాహ్ వైపునకు రండి" అని ప్రజలను పిలుస్తూ, అదే స్థానం నుండి ఈ మహత్తర కార్యం కోసం, "మీరు నా బంధువులను ప్రేమించండి" అని ప్రతిఫలం కోరటం ఆయన యోగ్యతకు తగినది

أَمْ يَقُولُونَ افْتَرَىٰ عَلَى اللَّهِ كَذِبًا ۖ فَإِن يَشَإِ
اللَّهُ يَخْتِمْ عَلَىٰ قَلْبِكَ ۗ وَيَمْحُ اللَّهُ الْبَاطِلَ وَ
يُحِقُّ الْحَقَّ بِكَلِمَاتِهِ ۚ إِنَّهُ عَلِيمٌ بِذَاتِ
الصُّدُورِ ﴿٢٤﴾ وَ هُوَ الَّذِي يَقْبَلُ التَّوْبَةَ عَنْ
عِبَادِهِ وَ يَعْفُوا عَنِ السَّيِّئَاتِ وَ يَعْلَمُ مَا
تَفْعَلُونَ ﴿٢٥﴾ وَ يَسْتَجِيبُ الَّذِينَ آمَنُوا وَ
عَمِلُوا الصَّالِحَاتِ وَ يَزِيدُهُم مِّن فَضْلِهِ ۚ
وَالْكَافِرُونَ لَهُمْ عَذَابٌ شَدِيدٌ ﴿٢٦﴾ وَ لَوْ بَسَطَ
اللَّهُ الرِّزْقَ لِعِبَادِهِ لَبَغَوْا فِي الْأَرْضِ وَ لَٰكِن
يُنَزِّلُ بِقَدَرٍ مَّا يَشَاءُ ۚ إِنَّهُ بِعِبَادِهِ خَبِيرٌ
بَصِيرٌ ﴿٢٧﴾

**24 - 26** అతను అల్లాహ్‌ను గురించి అభాండాన్ని కల్పించాడని వారు అంటున్నారా? అల్లాహ్ కోరితే నీ హృదయానికి సీలువేస్తాడు.[10] ఆయన అసత్యాన్ని రూపుమాపుతాడు, సత్యాన్ని తన వచనాల ద్వారా సత్యంగా నిరూపిస్తాడు. ఆయన, గుండెలలో దాగివున్న రహస్యాలను సైతం ఎరుగును. ఆయనే తన దాసులనుండి పశ్చాత్తాపాన్ని స్వీకరిస్తాడు, వారి చెడులను ఉపేక్షిస్తాడు. వాస్తవానికి మీ చేష్టలన్నీ ఆయనకు తెలుసు. ఆయన, విశ్వసించి మంచిపనులు చేసేవారి ప్రార్థనలను అంగీకరిస్తాడు. తన కృప నుండి వారికి ఇంకా ఎక్కువగా ఇస్తాడు. ఇక తిరస్కరించే వారి విషయం; వారికైతే కఠిన శిక్ష పడుతుంది.

**27 - 35** ఒకవేళ అల్లాహ్ తన దాసులందరికీ పుష్కలంగా ఉపాధి ఇచ్చినట్లయితే, వారు ధరణిపై తిరుగుబాటు తుఫాను రేపి ఉండేవారు. కాని ఆయన ఒక లెక్క ప్రకారం తాను కోరినంత దానిని అవతరింపజేస్తాడు. నిశ్చయంగా ఆయన తన దాసులను బాగా ఎరుగును. ఆయన వారిని కనిపెట్టే ఉంటాడు.

కాదు. అల్లాహ్ తన ప్రవక్తకు ఈ అల్ప విషయాన్ని నేర్పి ఉంటాడనీ, ఆయన ఖురైషు ప్రజల మధ్య నిలబడి ఆ విషయాన్ని చెప్పాడనీ ఉత్తమ స్వభావం గల మనిషి ఎవడూ ఊహించడు. ఈ గ్రంథ సంబోధితులు విశ్వాసులు కారు, అవిశ్వాసులనే విషయం మనం గమనించినప్పుడు, ఈ విషయం మరింత అసంబద్ధంగా తోస్తుంది. పై నుండి ఉపన్యాసం అంతా వారినే సంబోధిస్తూ వస్తోంది; ఇక రాబోయే విషయం కూడ వారికి సంబంధించిందే. ఉపన్యాస క్రమాన్ని చూస్తే, శత్రువులను ఏ విధమైన ప్రతిఫలం కోరే ప్రశ్నే ఉదయించదు. ఒక మనిషి తమకు చేసిన సేవలను గుర్తించిన వారి నుండే ప్రతిఫలం కోరాలి.

10. అర్థం ఏమిటంటే, ప్రవక్తా! వారు నిన్ను కూడ తమవంటి మనిషిగానే భావించారు; తమ లక్ష్యసాధన కోసం ఎంతటి పెద్ద అబద్ధాన్నయినా ఆడటానికి వెనుకాడనట్లే, నీవు కూడ నీ కార్యాన్ని చక్కబెట్టుకోవటానికి ఒక అబద్ధాన్ని కల్పించి తీసికొచ్చావని వారు అనుకున్నారు. ఇది అల్లాహ్ అనుగ్రహం కనుక, ఆయన వారి హృదయాలపై ముద్రవేసినట్లు నీ హృదయంపై ముద్రవేయలేదు.

وَ هُوَ الَّذِيْ يُنَزِّلُ الْغَيْثَ مِنْۢ بَعْدِ مَا قَنَطُوْا
وَ يَنْشُرُ رَحْمَتَهٗ ؕ وَ هُوَ الْوَلِيُّ الْحَمِيْدُ ﴿۲۸﴾ وَ مِنْ
اٰيٰتِهٖ خَلْقُ السَّمٰوٰتِ وَ الْاَرْضِ وَ مَا بَثَّ
فِيْهِمَا مِنْ دَآبَّةٍ ؕ وَ هُوَ عَلٰى جَمْعِهِمْ اِذَا يَشَآءُ
قَدِيْرٌ ﴿۲۹﴾ وَ مَاۤ اَصَابَكُمْ مِّنْ مُّصِيْبَةٍ فَبِمَا
كَسَبَتْ اَيْدِيْكُمْ وَ يَعْفُوْا عَنْ كَثِيْرٍ ؕ ﴿۳۰﴾ وَ مَاۤ
اَنْتُمْ بِمُعْجِزِيْنَ فِي الْاَرْضِ ۖۚ وَ مَا لَكُمْ مِّنْ
دُوْنِ اللّٰهِ مِنْ وَّلِيٍّ وَّ لَا نَصِيْرٍ ﴿۳۱﴾ وَ مِنْ اٰيٰتِهِ
الْجَوَارِ فِي الْبَحْرِ كَالْاَعْلَامِ ﴿۳۲﴾ اِنْ يَّشَاْ
يُسْكِنِ الرِّيْحَ فَيَظْلَلْنَ رَوَاكِدَ عَلٰى ظَهْرِهٖ ؕ
اِنَّ فِيْ ذٰلِكَ لَاٰيٰتٍ لِّكُلِّ صَبَّارٍ شَكُوْرٍ ﴿۳۳﴾ اَوْ
يُوْبِقْهُنَّ بِمَا كَسَبُوْا وَ يَعْفُ عَنْ كَثِيْرٍ ﴿۳۴﴾ وَّ
يَعْلَمَ الَّذِيْنَ يُجَادِلُوْنَ فِيْۤ اٰيٰتِنَا ؕ مَا لَهُمْ
مِّنْ مَّحِيْصٍ ﴿۳۵﴾ فَمَاۤ اُوْتِيْتُمْ مِّنْ شَيْءٍ فَمَتَاعُ
الْحَيٰوةِ الدُّنْيَا ۚ وَ مَا عِنْدَ اللّٰهِ خَيْرٌ وَّ اَبْقٰى
لِلَّذِيْنَ اٰمَنُوْا وَ عَلٰى رَبِّهِمْ يَتَوَكَّلُوْنَ ﴿۳۶﴾ وَ
الَّذِيْنَ يَجْتَنِبُوْنَ كَبٰٓئِرَ الْاِثْمِ وَ الْفَوَاحِشَ وَ
اِذَا مَا غَضِبُوْا هُمْ يَغْفِرُوْنَ ﴿۳۷﴾ وَ الَّذِيْنَ
اسْتَجَابُوْا لِرَبِّهِمْ وَ اَقَامُوا الصَّلٰوةَ ۪ وَ اَمْرُهُمْ
شُوْرٰى بَيْنَهُمْ ۪ وَ مِمَّا رَزَقْنٰهُمْ يُنْفِقُوْنَ ﴿۳۸﴾
وَ الَّذِيْنَ اِذَاۤ اَصَابَهُمُ الْبَغْيُ هُمْ يَنْتَصِرُوْنَ ﴿۳۹﴾

ప్రజలు నిరాశకు గురిఅయినప్పుడు ఆయనే వర్షాన్ని కురిపిస్తాడు, తన కారుణ్యాన్ని వ్యాపింపజేస్తాడు. ఆయనే సకల ప్రశంసలకూ అర్హుడైన సంరక్షకుడు. ఈ భూమ్యాకాశాల సృష్టీ, ఆ రెండు చోట్లా ఆయన వ్యాపింపజేసిన ఈ జీవరాసులూ ఆయన సూచనలలోనివే. ఆయన తాను కోరినప్పుడు వాటిని సమీకరించగలడు. మీపైకి వచ్చిన ఆపద, మీరు మీ చేజేతులా చేసుకున్న దానివల్లనే వచ్చింది.[11] చాలా పొరపాట్లను ఆయన ఇట్టే మన్నించివేస్తాడు. మీరు భూమిలో దేవుణ్ణి అశక్తుడుగా చేయలేరు; అల్లాహ్‌కు వ్యతిరేకంగా మీకు సహాయపడేవాడూ, మిమ్మల్ని రక్షించేవాడూ ఎవ్వడూ లేడు. సముద్రంలో కొండలు మాదిరిగా కనిపించే ఈ ఓడలు ఆయన సూచనలలోనివే. అల్లాహ్ తాను కోరినప్పుడు గాలిని స్తంభింపజేస్తాడు, అప్పుడు అవి సముద్రం వీపుపై నిలిచి ఉన్నవి నిలిచి ఉన్నట్లుగానే ఉండిపోతాయి- అత్యున్నత శ్రేణికి చెందిన సహనమూ కృతజ్ఞతా కల ప్రతి వ్యక్తికీ ఇందులో గొప్ప సూచనలు ఉన్నాయి. - లేదా (వాటిపై ప్రయాణం చేసేవారి) అనేక పాపాలను క్షమిస్తూనే, వారు చేసిన కొన్ని అకృత్యాల ఫలితం గానే వారిని ముంచి వేయవచ్చు. అప్పుడు మా వాక్యాలను గురించి వివాదాలకు దిగే వారికి, తమకు ఆశ్రయం లభించే స్థలం ఏదీలేదని తెలిసిపోతుంది.

**36 - 43** మీకు ఇవ్వబడినదంతా కేవలం కొన్ని రోజుల ప్రాపంచిక జీవితపు సామగ్రిమాత్రమే. కాని అల్లాహ్ వద్ద ఉన్నది శ్రేష్ఠమైనది, శాశ్వతమైనది కూడా. అది ఎవరికోసమంటే: విశ్వసించి, తమ ప్రభువును నమ్ముకున్నవారి కోసం, పెద్ద పెద్ద పాపాలకూ, సిగ్గుమాలిన పనులకూ దూరంగా ఉండే వారి కోసం, కోపం వచ్చినప్పుడు కూడా క్షమించే వారి కోసం, తమ ప్రభువు ఆజ్ఞను పాలించేవారికోసం, నమాజ్‌ను స్థాపించేవారికోసం, తమ వ్యవహారాలను పరస్పర సంప్రదింపుల ద్వారా నడుపుకునే వారి కోసం, మేము వారికి ఇచ్చిన ఉపాధి నుండి ఖర్చుచేసేవారి కోసం, తమపై దౌర్జన్యం జరిగినప్పుడు దానిని ఎదుర్కొనేవారి కోసం[12]-

11. ఆ సమయంలో మక్కా నగరంలో ప్రబలిన కరువుకాటకాలను ఇది సూచిస్తుంది.
12. ఇక్కడ నుండి 43వ ఆయతు చివరి వరకు గల భాగము, 39వ ఆయతునకు వివరణ.

وَ جَزٰٓؤُا سَيِّئَةٍ سَيِّئَةٌ مِّثْلُهَا ۚ فَمَنْ عَفَا وَ
اَصْلَحَ فَاَجْرُهٗ عَلَى اللّٰهِ ؕ اِنَّهٗ لَا يُحِبُّ
الظّٰلِمِيْنَ ﴿٤٠﴾ وَلَمَنِ انْتَصَرَ بَعْدَ ظُلْمِهٖ فَاُولٰٓئِكَ
مَا عَلَيْهِمْ مِّنْ سَبِيْلٍ ﴿٤١﴾ اِنَّمَا السَّبِيْلُ عَلَى
الَّذِيْنَ يَظْلِمُوْنَ النَّاسَ وَ يَبْغُوْنَ فِي الْاَرْضِ
بِغَيْرِ الْحَقِّ ؕ اُولٰٓئِكَ لَهُمْ عَذَابٌ اَلِيْمٌ ﴿٤٢﴾ وَ
لَمَنْ صَبَرَ وَ غَفَرَ اِنَّ ذٰلِكَ لَمِنْ عَزْمِ
الْاُمُوْرِ ﴿٤٣﴾ وَ مَنْ يُّضْلِلِ اللّٰهُ فَمَالَهٗ مِنْ وَّلِيٍّ ع ٤ ١٤ ٥
مِّنْۢ بَعْدِهٖ ؕ وَتَرَى الظّٰلِمِيْنَ لَمَّا رَاَوُا
الْعَذَابَ يَقُوْلُوْنَ هَلْ اِلٰى مَرَدٍّ مِّنْ
سَبِيْلٍ ﴿٤٤﴾ وَتَرٰىهُمْ يُعْرَضُوْنَ عَلَيْهَا خٰشِعِيْنَ
مِنَ الذُّلِّ يَنْظُرُوْنَ مِنْ طَرْفٍ خَفِيٍّ ؕ وَقَالَ
الَّذِيْنَ اٰمَنُوْٓا اِنَّ الْخٰسِرِيْنَ الَّذِيْنَ خَسِرُوْٓا
اَنْفُسَهُمْ وَ اَهْلِيْهِمْ يَوْمَ الْقِيٰمَةِ ؕ اَلَآ اِنَّ
الظّٰلِمِيْنَ فِيْ عَذَابٍ مُّقِيْمٍ ﴿٤٥﴾ وَ مَا كَانَ لَهُمْ
مِّنْ اَوْلِيَآءَ يَنْصُرُوْنَهُمْ مِّنْ دُوْنِ اللّٰهِ ؕ وَ مَنْ
يُّضْلِلِ اللّٰهُ فَمَالَهٗ مِنْ سَبِيْلٍ ﴿٤٦﴾ اِسْتَجِيْبُوْا
لِرَبِّكُمْ مِّنْ قَبْلِ اَنْ يَّاْتِيَ يَوْمٌ لَّا مَرَدَّ لَهٗ مِنَ
اللّٰهِ ؕ مَا لَكُمْ مِّنْ مَّلْجَاٍ يَّوْمَئِذٍ وَّ مَا لَكُمْ مِّنْ
نَّكِيْرٍ ﴿٤٧﴾

చెడుకు ప్రతిక్రియ అదేరకమైన చెడు. కాని ఎవడైనా క్షమించి, రాజీపడితే దానికి ప్రతిఫలం ఇవ్వటం అల్లాహ్ బాధ్యత. అల్లాహ్ దుర్మార్గులంటే ఇష్టపడడు. తమకు అపకారం జరిగినప్పుడు ఎవరైనా ప్రతీకారం చేస్తే, వారిని నిందించటానికి వీలులేదు. అసలు నిందార్హులు ఇతరులకు అన్యాయం చేసేవారే, భూమిపై అన్యాయంగా దౌర్జన్యాలు చేసేవారే. అటువంటి వారికి వ్యథాపూరితమైన శిక్షపడుతుంది. అయితే ఎవరైనా సహనంతో వ్యవహరిస్తే, క్షమించివేస్తే, అది పెద్ద సాహసంతో, దృఢ సంకల్పంతో కూడుకున్న పని.

**44 - 46** అల్లాహ్‌యే మార్గం తప్పించిన వాడిని ఆదుకునే వాడు అల్లాహ్ తప్ప మరెవ్వడూ లేడు. ఈ దుర్మార్గులు శిక్షను చూచినప్పుడు, వెనక్కి వెళ్లి పోవటానికి మార్గమేదైనా ఉందా? అని అడగటాన్ని నీవు చూస్తావు. వారిని నరకం ముందుకు తీసుకు వచ్చినప్పుడు వారు అవమానభారంతో క్రుంగి పోవటాన్నీ, దానిని దొంగచూపులతో చూడటాన్నీ నీవు గమనిస్తావు. అప్పుడు విశ్వాసులు ఇలా అంటారు, "ప్రళయదినం నాడు తననూ, తన సంబంధీకులనూ నష్టానికి గురిచేసేవాడే అసలు నష్టపోయేవాడు. జాగ్రత్త! దుర్మార్గులు శాశ్వతమైన యాతనకు గురిఅవుతారు. అల్లాహ్‌కు వ్యతిరేకంగా వారి సహాయానికి వచ్చే సహాయకులు గానీ, సంరక్షకులుగానీ ఎవ్వరూ ఉండరు. అల్లాహ్ అపమార్గం పట్టించిన వాడికి దాని నుండి బయటపడే మార్గమేదీ ఉండదు.

**47 - 48** అల్లాహ్ తరఫు నుండి తొలగింపబడే అవకాశం ఏ మాత్రం లేనటువంటి ఆ రోజు రాక మునుపే, మీరు మీ ప్రభువు మాటను స్వీకరించండి. ఆరోజున మీకు ఎక్కడా ఆశ్రయం లభించదు, మీ స్థితిని మార్చటానికి ప్రయత్నం చేసేవాడూ ఎవడూ ఉండడు.[13]

13. అసలు పదాలు ఇవి, "మాలకుమ్మిన్నకీర్". ఈ వాక్యానికి ఇంకా ఎన్నో అర్థాలు ఉన్నాయి. ఒకటి ; మీరు చేసిన దుష్కార్యాలలో దేనినీ మీరు తిరస్కరించలేరు. రెండు, మారువేషంలో కూడ మీరు దాక్కోలేరు. మూడు, మీ విషయంలో ఏది జరిగినా, దానిని నిరసించలేరు, దానికి వ్యతిరేకంగా అసమ్మతి తెలుపలేరు. నాలుగు, మీరు గురిచేయబడిన స్థితిని మార్చటం మీ తరంకాదు.

فَاِنْ اَعْرَضُوْا فَمَآ اَرْسَلْنٰكَ عَلَيْهِمْ حَفِيْظًا ؕ
اِنْ عَلَيْكَ اِلَّا الْبَلٰغُ ؕ وَ اِنَّاۤ اِذَاۤ اَذَقْنَا
الْاِنْسَانَ مِنَّا رَحْمَةً فَرِحَ بِهَا ۚ وَاِنْ تُصِبْهُمْ
سَيِّئَةٌۢ بِمَا قَدَّمَتْ اَيْدِيْهِمْ فَاِنَّ الْاِنْسَانَ
كَفُوْرٌ ﴿۴۸﴾ لِلّٰهِ مُلْكُ السَّمٰوٰتِ وَالْاَرْضِ ؕ
يَخْلُقُ مَا يَشَآءُ ؕ يَهَبُ لِمَنْ يَّشَآءُ اِنَاثًا
وَّيَهَبُ لِمَنْ يَّشَآءُ الذُّكُوْرَ ﴿۴۹﴾ اَوْ يُزَوِّجُهُمْ
ذُكْرَانًا وَّاِنَاثًا ۚ وَيَجْعَلُ مَنْ يَّشَآءُ عَقِيْمًا ؕ
اِنَّهٗ عَلِيْمٌ قَدِيْرٌ ﴿۵۰﴾ وَمَا كَانَ لِبَشَرٍ اَنْ
يُّكَلِّمَهُ اللّٰهُ اِلَّا وَحْيًا اَوْ مِنْ وَّرَآئِ حِجَابٍ
اَوْ يُرْسِلَ رَسُوْلًا فَيُوْحِيَ بِاِذْنِهٖ مَا يَشَآءُ ؕ
اِنَّهٗ عَلِيٌّ حَكِيْمٌ ﴿۵۱﴾ وَكَذٰلِكَ اَوْحَيْنَاۤ اِلَيْكَ
رُوْحًا مِّنْ اَمْرِنَا ؕ مَا كُنْتَ تَدْرِيْ مَا
الْكِتٰبُ وَلَا الْاِيْمَانُ وَلٰكِنْ جَعَلْنٰهُ نُوْرًا
نَّهْدِيْ بِهٖ مَنْ نَّشَآءُ مِنْ عِبَادِنَا ؕ وَاِنَّكَ
لَتَهْدِيْۤ اِلٰى صِرَاطٍ مُّسْتَقِيْمٍ ﴿۵۲﴾ صِرَاطِ اللّٰهِ
الَّذِيْ لَهٗ مَا فِي السَّمٰوٰتِ وَمَا فِي الْاَرْضِ ؕ
اَلَاۤ اِلَى اللّٰهِ تَصِيْرُ الْاُمُوْرُ ﴿۵۳﴾ ع

ఇప్పుడు ఒకవేళ వారు ముఖం తిప్పుకుంటే, ప్రవక్తా! మేము నిన్ను వారిపై కాపలాదారుగా నియమించి పంపలేదు కదా! కేవలం మాటను అందజేసే బాధ్యత మాత్రమే నీపైన ఉన్నది. మానవుడి స్థితి ఎటువంటిదంటే, మేము అతనికి మా కారుణ్యాన్ని రుచి చూపించినప్పుడు, దానికి అతడు ఆనందంతో పొంగిపోతాడు. ఒకవేళ అతడు తన చేతులతో చేసిందే ఆపద రూపంలో అతడిపైకి వచ్చిపడితే, అతడు కరుడుకట్టిన కృతఘ్నుడైపోతాడు.

**49 - 50** భూమ్యాకాశాల సామ్రాజ్యానికి అల్లాహ్ ప్రభువు; ఆయన తాను కోరిన దానిని సృష్టిస్తాడు; తనకు ఇష్టమైన వారికి కూతుళ్ళనూ, తాను కోరినవారికి కొడుకులనూ ఇస్తాడు; తనకు ఇష్టమైనవారికి కొడుకులనూ, కూతుళ్లనూ కలిపి ఇస్తాడు; తాను కోరినవారికి అసలు సంతానమే ఇవ్వడు. ఆయనకు అంతా తెలుసు, ఆయనకు అన్నిటిపైనా అధికారం ఉన్నది.

**51 - 53** అల్లాహ్ ముఖాముఖి మాట్లాడే అంత స్థానం మానవునిది కాదు. ఆయన మాట్లాడటం అనేది వహీ (సంకేతం)[14] ద్వారానైనా జరుగుతుంది లేదా తెర వెనుకనుండి అయినా జరుగుతుంది[15] లేదా ఆయన సందేశహరుణ్ణి (దైవ దూత) ఎవరినైనా పంపుతాడు; అతను ఆయన ఆజ్ఞానుసారం ఆయన కోరిన దానిని వహీ చేస్తాడు.[16] ఆయన ఉన్నతుడూ, వివేకవంతుడూను. ఇదే విధంగా ప్రవక్తా! మేము మా ఆజ్ఞ ద్వారా ఒక ఆత్మను నీ వైపునకు వహీ చేశాము.[17] గ్రంథం అంటే ఏమిటో, విశ్వాసం అంటే ఏమిటో నీవు అసలు ఎరుగవు. కాని మేము ఆ ఆత్మను ఒక జ్యోతిగా చేసి దాని ద్వారా మా దాసులలో మేము కోరిన వారికి మార్గం చూపుతాము. నిశ్చయంగా నీవు ఋజు మార్గం వైపునకు దారి చూపుతున్నావు, భూమ్యాకాశాలలో ఉన్న ప్రతి దానికీ ప్రభువైన దేవుని మార్గం వైపునకు దారి చూపుతున్నావు. జాగ్రత్త! వ్యవహారాలన్నీ అల్లాహ్ వైపునకే మరలుతాయి.

14. ఇక్కడ వహీ అంటే, ప్రేరేపించుట, మనస్సుకు తోచేటట్లు చేయుట, హృదయంలో మాటను నాటుట లేదా కలలో దేనినైనా చూపుట, హజ్రత్ ఇబ్రాహీమ్‌కూ, హజ్రత్ యూసుఫ్‌కూ చూపిన రీతిగా.
15. భావం ఏమిటంటే, దాసుడు ఒక వాణిని వింటాడు, కాని అతనికి మాట్లాడేవాడు కనిపించడు; హజ్రత్ మూసా విషయంలో జరిగిన విధంగా: తూర్ పర్వతం మీద ఒక వృక్షం నుండి అకస్మాత్తుగా అతనికి ఒక వాణి వినిపించటం ప్రారంభమయింది, కాని మాట్లాడేవాడు అతని కళ్లకు కనిపించటం లేదు.
16. ఇది వహీ వచ్చే రూపాలలో ఒకటి. దానిద్వారా సమస్త ఆకాశ గ్రంథాలు దైవప్రవక్తలకు లభించాయి.
17. "ఇదే విధంగా" అంటే కేవలం వహీ యొక్క చివరి రూపం అని అర్థం కాదు, కాని పై ఆయతులలో ప్రస్తావించబడిన మూడు రూపాలని అర్థం. ఆత్మ అంటే, వహీ లేదా మహాప్రవక్తకు వహీ ద్వారా ఇవ్వబడిన ఉపదేశాలు అని అర్థం.

ఆయతులు 89 | **43. అజ్ జుఖ్రుఫ్** | అవతరణ మక్కాలో

٤٣ سُوْرَةُ الزُّخْرُفِ مَكِّيَّةٌ ٦٣

اٰياتها ٨٩ | ركوعاتها ٧

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ۝

حٰمٓ ۚ ۝١ وَ الْكِتٰبِ الْمُبِيْنِ ۝٢ اِنَّا جَعَلْنٰهُ مع
قُرْءٰنًا عَرَبِيًّا لَّعَلَّكُمْ تَعْقِلُوْنَ ۝٣ وَ اِنَّهٗ فِيْٓ
اُمِّ الْكِتٰبِ لَدَيْنَا لَعَلِيٌّ حَكِيْمٌ ۝٤ اَفَنَضْرِبُ
عَنْكُمُ الذِّكْرَ صَفْحًا اَنْ كُنْتُمْ قَوْمًا
مُّسْرِفِيْنَ ۝٥ وَ كَمْ اَرْسَلْنَا مِنْ نَّبِيٍّ فِي
الْاَوَّلِيْنَ ۝٦ وَ مَا يَاْتِيْهِمْ مِّنْ نَّبِيٍّ اِلَّا كَانُوْا
بِهٖ يَسْتَهْزِءُوْنَ ۝٧ فَاَهْلَكْنَآ اَشَدَّ مِنْهُمْ بَطْشًا
وَّ مَضٰى مَثَلُ الْاَوَّلِيْنَ ۝٨ وَلَئِنْ سَاَلْتَهُمْ مَّنْ
خَلَقَ السَّمٰوٰتِ وَ الْاَرْضَ لَيَقُوْلُنَّ خَلَقَهُنَّ
الْعَزِيْزُ الْعَلِيْمُ ۝٩

**1 - 4** హా. మీమ్. స్పష్టమైన ఈ గ్రంథం సాక్షిగా! మీరు అర్థం చేసుకోవాలని మేము దీనిని అరబ్బీ భాషలో ఖురానుగా చేశాము.[1] వాస్తవానికి ఇది మా వద్ద ఉన్న మాతృగ్రంథం (ఉమ్ముల్ కితాబ్)లో లిఖించబడి ఉన్నది;[2] మహోన్నతమైన స్థానం గల వివేకంతో నిండిన గ్రంథం అది.

**5 - 8** ఇప్పుడు మేము మీతో విసిగిపోయి (కేవలం మీరు హద్దులు మీరి పోయారనే కారణంగా) ఈ హితబోధను మీ వద్దకు పంపటం మానెయ్యాలా? పూర్వం గతించిన జాతుల వద్దకు కూడ మేము ఎంతోమంది ప్రవక్తలను పంపాము, దైవప్రవక్త ఎవరైనా వారి వద్దకు రావటం, వారు అతనిని ఎగతాళి చేయకుండా ఉండటం అనేది ఎన్నడూ జరగలేదు. కనుక వీరికంటె ఎన్నోరెట్లు ఎక్కువ శక్తిమంతులైన వారిని మేము నాశనంచేశాము. పూర్వపు జాతుల దృష్టాంతాలు కాలగర్భంలో కలిసిపోయాయి.

**9 - 14** ఒకవేళ నీవు వారిని, "భూమినీ, ఆకాశాలనూ ఎవడు సృష్టించాడు?" అని అడిగితే, స్వయంగా వారే, "వాటిని ఆ మహా బలవంతుడే, ఆ మహాజ్ఞానియే సృష్టించాడు" అని అంటారు.

1. "ఈ గ్రంథాన్ని మేము రచించాము, ముహమ్మద్ (స) కాదు" అనే విషయాన్ని ఖురానుపై ప్రమాణం చేసి చెప్పటం జరిగింది. 'ఈ గ్రంథం స్పష్టమైనది' అనే ఖురాను గుణ విశేషం ప్రమాణం కోసం ఎన్నుకోబడింది. ఈ గుణ విశేషాన్ని దృష్టిలో పెట్టుకుని, దివ్య ఖురాను విశ్వ ప్రభువు గ్రంథమే అనే విషయాన్ని చెప్పటానికి, స్వయంగా ఖురానుపై ప్రమాణం చేయటం ఈ అర్థాన్ని చెప్పకయే చెబుతోంది : "ప్రజలారా! స్పష్టమైన ఈ గ్రంథం మీ ముందు ఉన్నది, దానిని జాగ్రత్తగా చదవండి. దానిలోని సంగతులు, ఉపదేశాలు, దాని భాష ఇవన్నీ ఈ గ్రంథ రచయిత విశ్వప్రభువు తప్ప వేరెవరూ కాలేరనే యథార్థానికి స్పష్టమైన నిదర్శనాలు."
2. 'ఉమ్ముల్ కితాబ్' అంటే 'అసలు గ్రంథం.' అంటే దైవప్రవక్తలందరిపై అవతరింపజేయబడిన గ్రంథాలన్నీ ఉద్భవించిన గ్రంథం అని అర్థం. దీనికై బురూజ్ సూరాలో 'లౌహె మహ్ఫూజ్' అనే పదాలు వాడబడ్డాయి. అంటే చెరిపివేయటానికి వీలుకాని వ్రాతగల అన్ని రకాల జోక్యాలకు అతీతమైన శిలాఫలకం.

الَّذِىْ جَعَلَ لَكُمُ الْاَرْضَ مَهْدًا وَّ جَعَلَ لَكُمْ
فِيْهَا سُبُلًا لَّعَلَّكُمْ تَهْتَدُوْنَ ۝١٠ وَالَّذِىْ نَزَّلَ
مِنَ السَّمَآءِ مَآءًۢ بِقَدَرٍ ۚ فَاَنْشَرْنَا بِهٖ بَلْدَةً
مَّيْتًا ۚ كَذٰلِكَ تُخْرَجُوْنَ ۝١١ وَالَّذِىْ خَلَقَ
الْاَزْوَاجَ كُلَّهَا وَ جَعَلَ لَكُمْ مِّنَ الْفُلْكِ
وَالْاَنْعَامِ مَا تَرْكَبُوْنَ ۝١٢ لِتَسْتَوٗا عَلٰى ظُهُوْرِهٖ
ثُمَّ تَذْكُرُوْا نِعْمَةَ رَبِّكُمْ اِذَا اسْتَوَيْتُمْ عَلَيْهِ
وَتَقُوْلُوْا سُبْحٰنَ الَّذِىْ سَخَّرَ لَنَا هٰذَا وَ مَا
كُنَّا لَهٗ مُقْرِنِيْنَ ۝١٣ وَاِنَّآ اِلٰى رَبِّنَا
لَمُنْقَلِبُوْنَ ۝١٤ وَ جَعَلُوْا لَهٗ مِنْ عِبَادِهٖ جُزْءًا ؕ
اِنَّ الْاِنْسَانَ لَكَفُوْرٌ مُّبِيْنٌ ۝١٥ اَمِ اتَّخَذَ مِمَّا ع ٥/٧
يَخْلُقُ بَنٰتٍ وَّ اَصْفٰكُمْ بِالْبَنِيْنَ ۝١٦ وَ اِذَا
بُشِّرَ اَحَدُهُمْ بِمَا ضَرَبَ لِلرَّحْمٰنِ مَثَلًا ظَلَّ
وَجْهُهٗ مُسْوَدًّا وَّ هُوَ كَظِيْمٌ ۝١٧ اَوَ مَنْ يُّنَشَّؤُا
فِى الْحِلْيَةِ وَهُوَ فِى الْخِصَامِ غَيْرُ مُبِيْنٍ ۝١٨

మీ కొరకు ఈ భూమిని ఊయలగా చేసినవాడూ, అందులో మీకై మార్గాలను[3] ఏర్పరచినవాడూ– మీరు మీ గమ్యస్థానానికి చేరే మార్గం పొందాలని – ఒక ప్రత్యేక పరిమాణంలో ఆకాశం నుండి నీటిని దించి, దాని ద్వారా మృతభూమిని బ్రతికించిన వాడు ఆయనే కదా! – ఇదే విధంగా ఒకనాడు మీరు నేలనుండి బయటకు తీయబడతారు–ఈ జంటలనన్నింటినీ పుట్టించిన వాడు ఆయనే కదా! మీ కొరకు పడవలనూ, పశువులనూ వాహనాలుగా చేసినవాడు ఆయనే కదా! మీరు వాటి వీపులపై ఎక్కటానికి మీరు వాటిమీద కూర్చున్నప్పుడు మీ ప్రభువు ఉపకారాన్ని జ్ఞాపకం చేసుకొని ఇలా అనండి, "వాటిని మాకు వశపరచినవాడు పరిశుద్ధుడు. లేకపోతే, వాటిని వశపరచుకునే శక్తి మాకు లేదు. ఒక రోజున మేము మా ప్రభువు వైపునకు మరలిపోవలసి ఉన్నది."

**15** (ఇదంతా తెలిసీ, ఒప్పుకుని కూడా) వారు ఆయన దాసులలో కొందరిని ఆయనలో భాగంగా చేసేశారు. మానవుడు పరమకృతఘ్నుడు అనేది యథార్థం.

**16 – 18** అల్లాహ్ తన సృష్టిలో నుండి తన కొరకు కూతుళ్లను ఎన్నుకొని, మీ కొరకు కొడుకులను ప్రసాదించాడా? అసలు పరిస్థితి ఏమిటంటే; వారు కరుణామయుడైన దేవునికి అంట గట్టే సంతానమే వారిలోని ఒకడికి కలిగిందనే వార్త అందజేస్తే, అతడి ముఖం నల్లబడిపోతుంది, అతడు దుఃఖంలో మునిగిపోతాడు. నగల మధ్య పెంచబడే సంతానం, వాదప్రతి వాదాలలో తన అభిప్రాయాన్ని పూర్తిగా వివరించలేని సంతానం అల్లాహ్ భాగానికి వచ్చిందా?

3. పర్వతాలలో కనుమలు (మార్గాలు) కొండలలో సెలయేళ్లు, మైదానాలు – ఇవన్నీ ప్రకృతి సిద్ధమైన రహదారులు. వాటిని అల్లాహ్ భూమిపై నెలకొల్పాడు. మానవుడు వాటిద్వారా ఇతర ప్రాంతాలకు వ్యాపించాడు. అల్లాహ్ యొక్క మరొక అనుగ్రహం ఏమిటంటే, ఆయన భూమినంతటినీ ఏకరీతిగా సృష్టించలేదు. అందులో రకరకాల సంకేతాలను ఏర్పాటు చేశాడు. వాటి సహాయంతో మానవుడు భిన్న ప్రాంతాలను గుర్తిస్తాడు. ఒక ప్రాంతానికీ, వేరొక ప్రాంతానికీ మధ్య గల వ్యత్యాసాన్ని తెలుసుకుంటాడు.

**19** దయామయుడైన దేవుని ప్రత్యేక దాసులైన దైవదూతలను వారు స్త్రీలుగా నిర్ణయించారు. వారి శరీర నిర్మాణాన్ని వారు చూశారా? వారి సాక్ష్యం వ్రాయబడుతుంది; వారు దానికి సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది.

**20 - 25** "దయామయుడైన దేవుడు (మేము వారిని ఆరాధించకూడదని) కోరి ఉన్నట్లయితే, మేము వారిని ఎన్నటికీ పూజించి ఉండేవారం కాదు"[4] అని వారు అంటారు. వారు ఈ వ్యవహారం యొక్క వాస్తవాన్ని ఏమాత్రం ఎరుగరు, కేవలం ఊహాగానాలు చేస్తున్నారు. మేము దీనికి పూర్వం, వారికి ఏదైనా గ్రంథాన్ని ఇచ్చి ఉన్నామా, దాని ప్రమాణం (ఈ దైవదూతలను పూజించటానికిగాను) వారి వద్ద ఉండటానికి? లేదు, కాని వారు ఏమంటారంటే; "మేము మా తాతముత్తాతలు ఒక మార్గంలో నడుస్తూ ఉండగా చూశాము; మేము వారి అడుగుజాడలలోనే నడుస్తున్నాము." ఇదేవిధంగా నీకు పూర్వం మేము హెచ్చరించేవాణ్ణి ఏ పట్టణానికి పంపినా, అక్కడి సంపన్నులు ఇలానే అన్నారు, "మేము మా పూర్వీకులు ఒక మార్గంలో నడుస్తూ ఉండగా చూశాము, మేము వారి అడుగు జాడలనే అనుసరిస్తున్నాము." ప్రతి దైవప్రవక్తా వారిని ఇలా అడిగాడు; "మీ పూర్వీకులు నడుస్తూ ఉండగా మీరు చూచిన మార్గం కంటే సరియైన, ఉత్తమమైన మార్గాన్ని నేను మీకు చూపినప్పటికీ మీరు ఆ పూర్వ మార్గంలోనే నడుస్తారా?" వారు దైవప్రవక్తలందరికీ ఇలానే సమాధానం ఇచ్చారు, "నీవు ఏ ధర్మం వైపునకు పిలవటానికి పంపబడ్డావో, మేము ఆ ధర్మాన్ని తిరస్కరిస్తున్నాము." చివరకు మేము వారికి తగిన శిక్షను విధించాము. చూడండి, సత్యతిరస్కారుల గతి ఏమయిందో!

**26 - 30** ఇబ్రాహీమ్ తన తండ్రికీ, తన జాతి వారికీ ఇలా చెప్పిన ఆ సమయాన్ని జ్ఞాపకం తెచ్చుకో, "మీరు పూజిస్తున్న వాటితో నాకు ఏ సంబంధమూ లేదు. నా సంబంధం కేవలం నన్ను సృష్టించిన వానితోనే ఉన్నది. ఆయనే నాకు మార్గం చూపుతాడు." ఇబ్రాహీమ్ ఈ వచనాన్నే తన తరువాత తన సంతానంకోసం విడిచివెళ్లాడు, వారు దాని వైపునకు మరలేందుకు.[5]

وَجَعَلُوا الْمَلٰٓئِكَةَ الَّذِيْنَ هُمْ عِبٰدُ الرَّحْمٰنِ
اِنَاثًا ۭ اَشَهِدُوْا خَلْقَهُمْ ۭ سَتُكْتَبُ شَهَادَتُهُمْ
وَيُسْـَٔلُوْنَ ﴿١٩﴾ وَقَالُوْا لَوْ شَاۗءَ الرَّحْمٰنُ مَا
عَبَدْنٰهُمْ ۭ مَا لَهُمْ بِذٰلِكَ مِنْ عِلْمٍ ۤ اِنْ هُمْ
اِلَّا يَخْرُصُوْنَ ﴿٢٠﴾ اَمْ اٰتَيْنٰهُمْ كِتٰبًا مِّنْ قَبْلِهٖ
فَهُمْ بِهٖ مُسْتَمْسِكُوْنَ ﴿٢١﴾ بَلْ قَالُوْٓا اِنَّا وَجَدْنَآ
اٰبَاۗءَنَا عَلٰٓي اُمَّةٍ وَّاِنَّا عَلٰٓي اٰثٰرِهِمْ مُّهْتَدُوْنَ ﴿٢٢﴾
وَكَذٰلِكَ مَآ اَرْسَلْنَا مِنْ قَبْلِكَ فِيْ قَرْيَةٍ
مِّنْ نَّذِيْرٍ اِلَّا قَالَ مُتْرَفُوْهَآ ۙ اِنَّا وَجَدْنَآ
اٰبَاۗءَنَا عَلٰٓي اُمَّةٍ وَّاِنَّا عَلٰٓي اٰثٰرِهِمْ
مُّقْتَدُوْنَ ﴿٢٣﴾ قٰلَ اَوَلَوْ جِئْتُكُمْ بِاَهْدٰى مِمَّا
وَجَدْتُّمْ عَلَيْهِ اٰبَاۗءَكُمْ ۭ قَالُوْٓا اِنَّا بِمَآ
اُرْسِلْتُمْ بِهٖ كٰفِرُوْنَ ﴿٢٤﴾ فَانْتَقَمْنَا مِنْهُمْ فَانْظُرْ
كَيْفَ كَانَ عَاقِبَةُ الْمُكَذِّبِيْنَ ﴿٢٥﴾ وَاِذْ قَالَ ع
اِبْرٰهِيْمُ لِاَبِيْهِ وَقَوْمِهٖٓ اِنَّنِيْ بَرَاۗءٌ مِّمَّا
تَعْبُدُوْنَ ﴿٢٦﴾ اِلَّا الَّذِيْ فَطَرَنِيْ فَاِنَّهٗ
سَيَهْدِيْنِ ﴿٢٧﴾ وَجَعَلَهَا كَلِمَةًۢ بَاقِيَةً فِيْ عَقِبِهٖ
لَعَلَّهُمْ يَرْجِعُوْنَ ﴿٢٨﴾

بَلْ مَتَّعْتُ هٰٓؤُلَآءِ وَاٰبَآءَهُمْ حَتّٰى جَآءَهُمُ
الْحَقُّ وَرَسُوْلٌ مُّبِيْنٌ ﴿٢٩﴾ وَلَمَّا جَآءَهُمُ الْحَقُّ
قَالُوْا هٰذَا سِحْرٌ وَّاِنَّا بِهٖ كٰفِرُوْنَ ﴿٣٠﴾ وَقَالُوْا
لَوْلَا نُزِّلَ هٰذَا الْقُرْاٰنُ عَلٰى رَجُلٍ مِّنَ
الْقَرْيَتَيْنِ عَظِيْمٍ ﴿٣١﴾ اَهُمْ يَقْسِمُوْنَ رَحْمَتَ
رَبِّكَ ۭ نَحْنُ قَسَمْنَا بَيْنَهُمْ مَّعِيْشَتَهُمْ فِي
الْحَيٰوةِ الدُّنْيَا وَرَفَعْنَا بَعْضَهُمْ فَوْقَ بَعْضٍ
دَرَجٰتٍ لِّيَتَّخِذَ بَعْضُهُمْ بَعْضًا سُخْرِيًّا ۭ وَ
رَحْمَتُ رَبِّكَ خَيْرٌ مِّمَّا يَجْمَعُوْنَ ﴿٣٢﴾ وَلَوْلَآ
اَنْ يَّكُوْنَ النَّاسُ اُمَّةً وَّاحِدَةً لَّجَعَلْنَا لِمَنْ
يَّكْفُرُ بِالرَّحْمٰنِ لِبُيُوْتِهِمْ سُقُفًا مِّنْ فِضَّةٍ وَّ
مَعَارِجَ عَلَيْهَا يَظْهَرُوْنَ ﴿٣٣﴾ وَلِبُيُوْتِهِمْ اَبْوَابًا وَّ
سُرُرًا عَلَيْهَا يَتَّكِـُٔوْنَ ﴿٣٤﴾ وَزُخْرُفًا ۭ وَاِنْ كُلُّ
ذٰلِكَ لَمَّا مَتَاعُ الْحَيٰوةِ الدُّنْيَا ۭ وَالْاٰخِرَةُ
عِنْدَ رَبِّكَ لِلْمُتَّقِيْنَ ﴿٣٥﴾

(దీని తరువాత కూడ వారు ఇతరులను పూజించటం మొదలు పెట్టినప్పుడు, నేను వారిని రూపుమాపలేదు). కాని నేను వారికీ, వారి పూర్వీకులకూ ప్రాపంచిక జీవిత సంపదను ఇస్తూనే వచ్చాను. చివరకు వారి వద్దకు సత్యం వచ్చింది, స్పష్టంగా వివరించి చెప్పే దైవప్రవక్త కూడ వచ్చేశాడు. కాని ఆ సత్యం వారి వద్దకు వచ్చినప్పుడు, వారు, "ఇది మంత్ర జాలం. మేము దానిని విశ్వసించము, తిరస్కరిస్తున్నాము" అని అనేశారు.

**31 - 35** వారు ఇలా అంటారు: "ఈ ఖురాను రెండు నగరాలలోని పెద్ద మనుష్యులలో ఏ ఒక్క పెద్ద మనిషిపైనైనా ఎందుకు అవతరించలేదు?"[6] నీ ప్రభువు కారుణ్యాన్ని పంచి పెట్టేవారు వారేనా? ఈ ప్రపంచ జీవితంలో వారి బ్రతుకు తెరువు మార్గాలను మేమే వారి మధ్య పంచాము. వారిలో కొందరికి మరి కొందరిపై అంతస్తుల వారిగా ఆధిక్యం ఇచ్చాము, వారు ఒకరినొకరు సేవించుకోవటానికి. నీ ప్రభువు కారుణ్యం (అంటే ప్రవక్త పదవి) వారు సమీకరించే సంపద కంటే ఎంతో విలువైనది. మానవులందరూ ఒకే మార్గాన్ని అనుసరిస్తారేమో అనే భయం లేకపోతే మేము కరుణామయు డైన దేవుణ్ణి తిరస్కరించే వారి ఇళ్లకప్పులనూ, వారు తమ మేడల పైకి ఎక్కే మెట్లనూ, వారి తలుపులనూ, వారు దిండ్లపై ఆను కుని కూర్చునే తఖతులనూ, అన్నింటినీ వెండితో, బంగారంతో చేయించి ఉండేవారమే. ఇవి కేవలం ఐహిక జీవిత సంపదలు మాత్రమే. నీ ప్రభువు దగ్గర గల పరలోకం కేవలం దేవుని పట్ల భయభక్తులు గల వారికే లభిస్తుంది.

---

4. తమ దురదృష్టమే తమ ఈ అపమార్గానికి కారణమని వారు వాదిస్తారు. ప్రతి యుగంలోనూ తప్పుడు పనులు చేసే వారు చేసే కుతర్కమే ఇది.
5. అంటే, రుజుమార్గం నుండి ఎప్పుడైనా వారు ఒక్క అడుగు వైదొలగినా, వారు దాని వైపునకే మరలి రావటానికి ఈ వచనం వారికి మార్గం చూపటానికి సిద్ధంగా ఉండాలి. ఈ సంఘటనను ఇక్కడ చెప్పటంలో గల ఉద్దేశ్యం ఖురైషు అవిశ్వాసులను ఈ విషయంలో సిగ్గుపడేలా చేయటమే. మీరు మీ పూర్వీకులను అనుసరించి కూడ, ఆ అనుసరణ కోసం, మహోత్తములైన మీ పూర్వికులు హజ్రత్ ఇబ్రాహీమ్‌నూ, హజ్రత్ ఇస్మాయీల్‌నూ కాదని, హీనులైన వారిని ఎన్నుకున్నారు.
6. రెండు నగరాలు అంటే మక్కా, తాయిఫ్ నగరాలు. అవిశ్వాసులు ఇలా అనేవారు, "ఒకవేళ దేవుడు నిజంగానే ఒక సందేశహరుణ్ణి పంపవలసి ఉంటే, అతనిపై గ్రంథాన్ని అవతరింపజేయవలసిన సంకల్పమే ఆయనకు ఉంటే, ఈ ప్రధాన నగరాల నుండి ఒక పెద్ద మనిషిని ఈ పని కోసం ఎన్నుకుని ఉండవలసింది."

وَ مَنۡ يَّعۡشُ عَنۡ ذِكۡرِ الرَّحۡمٰنِ نُقَيِّضۡ لَهٗ
شَيۡطٰنًا فَهُوَ لَهٗ قَرِيۡنٌ ۝٣٦ وَ اِنَّهُمۡ لَيَصُدُّوۡنَهُمۡ
عَنِ السَّبِيۡلِ وَيَحۡسَبُوۡنَ اَنَّهُمۡ مُّهۡتَدُوۡنَ ۝٣٧
حَتّٰۤى اِذَا جَآءَنَا قَالَ يٰلَيۡتَ بَيۡنِىۡ وَ بَيۡنَكَ
بُعۡدَ الۡمَشۡرِقَيۡنِ فَبِئۡسَ الۡقَرِيۡنُ ۝٣٨ وَ لَنۡ
يَّنۡفَعَكُمُ الۡيَوۡمَ اِذۡ ظَّلَمۡتُمۡ اَنَّكُمۡ فِى الۡعَذَابِ
مُشۡتَرِكُوۡنَ ۝٣٩ اَفَاَنۡتَ تُسۡمِعُ الصُّمَّ اَوۡ تَهۡدِى
الۡعُمۡىَ وَ مَنۡ كَانَ فِىۡ ضَلٰلٍ مُّبِيۡنٍ ۝٤٠ فَاِمَّا
نَذۡهَبَنَّ بِكَ فَاِنَّا مِنۡهُمۡ مُّنۡتَقِمُوۡنَ ۝٤١ اَوۡ
نُرِيَنَّكَ الَّذِىۡ وَعَدۡنٰهُمۡ فَاِنَّا عَلَيۡهِمۡ
مُّقۡتَدِرُوۡنَ ۝٤٢ فَاسۡتَمۡسِكۡ بِالَّذِىۡۤ اُوۡحِىَ
اِلَيۡكَ ۚ اِنَّكَ عَلٰى صِرَاطٍ مُّسۡتَقِيۡمٍ ۝٤٣ وَ اِنَّهٗ
لَذِكۡرٌ لَّكَ وَلِقَوۡمِكَ ۚ وَ سَوۡفَ تُسۡـَٔلُوۡنَ ۝٤٤
وَسۡـَٔلۡ مَنۡ اَرۡسَلۡنَا مِنۡ قَبۡلِكَ مِنۡ رُّسُلِنَاۤ
اَجَعَلۡنَا مِنۡ دُوۡنِ الرَّحۡمٰنِ اٰلِهَةً يُّعۡبَدُوۡنَ ۝٤٥

**36 - 39** కరుణామయుని స్మరణను నిర్లక్ష్యం చేసే వ్యక్తిపై మేము ఒక షైతానును నియమిస్తాము, వాడు అతని సహచరుడవుతాడు. ఈ షైతానులు అలాంటి వారిని ఋజుమార్గంపైకి రాకుండా ఆపుతారు. వారు, "మేము సక్రమమైన మార్గంలోనే పయనిస్తున్నాము" అని అనుకుంటారు. చివరకు ఆ వ్యక్తి మా వద్దకు వచ్చినప్పుడు, తన వెంట ఉన్న షైతానుతో ఇలా అంటాడు, "నీకూ, నాకూ మధ్య తూర్పు పడమరల మధ్య ఉన్నంత దూరం ఉండి ఉంటే ఎంత బాగుండేది! నీవు అతి చెడ్డ స్నేహితుడవని నిరూపించుకున్నావు." అప్పుడు వారితో ఇలా అనటం జరుగుతుంది: మీరు దుర్మార్గం చేశారు; కనుక ఈనాడు మీరూ, మీ షైతానులూ శిక్షను సమిష్టిగా పంచుకుంటారు అనే విషయం మీకు ఏమాత్రం లాభం కలిగించదు.

**40 - 45** ప్రవక్తా! నీవు చెవిటి వారికి వినిపించగలవా? అంధులకూ, స్పష్టంగా మార్గం తప్పినవారికీ మార్గం చూపగలవా? ఇప్పుడు మేము వారిని శిక్షించవలసియే ఉన్నది; మేము నిన్ను ప్రపంచం నుండి తీసుకు పోయినా లేదా మేము వారికి వాగ్దానం చేసిన ముగింపును నీకు చూపినా, వారిపై మాకు పూర్తి అధికారం ఉన్నది. కనుక నీవు వహీ ద్వారా నీ వద్దకు పంపబడిన గ్రంథాన్ని గట్టిగా పట్టుకో. నిశ్చయంగా నీవు ఋజుమార్గంలో ఉన్నావు. వాస్తవం ఏమిటంటే, ఈ గ్రంథం నీకూ, నీ జాతి వారికీ ఒక పెద్ద గౌరవం. త్వరలోనే మీరు దీనిని గురించి జవాబు చెప్పుకోవలసి ఉన్నది.[7] నీకు పూర్వం మేము పంపిన ప్రవక్తలను అడిగిచూడు, మేము కరుణామయుడైన దేవుణ్ణి తప్ప ఇతర దైవాలను కూడా ఆరాధనకు నిర్ణయించామా[8] అని.

7. మానవులలో ఒకరిని అల్లాహ్ తన గ్రంథాన్ని అవతరింపజేయటానికి ఎన్నుకోవటం అనే దానికంటే మించిన అదృష్టం అతనికి మరొకటి ఉండదు. ప్రపంచంలోని జాతులనన్నింటినీ వదలి ఒక ప్రత్యేక జాతిలో అల్లాహ్ తన ప్రవక్తను ఆవిర్భవింపజేయటం, ఆ జాతి భాషలోనే తన గ్రంథాన్ని అవతరింపజేయటం, ప్రపంచంలో దైవ సందేశాన్ని ప్రచారం చేసే భాగ్యాన్ని దానికి కలుగజేయటం అనే అదృష్టాలను గురించి ఆ జాతి విషయంలో ఊహించలేము. ఇది మహత్తర గౌరవం అనే భావన ఖురైషులకూ, అరేబియా వాసులకూ కలుగకపోతే, వారు దాని విలువను గుర్తించకపోతే, దానిని గురించి వారు సమాధానం చెప్పుకోవలసిన సమయం వస్తుంది.
8. ప్రవక్తలను అడిగిచూడు అంటే, వారు తెచ్చిన గ్రంథాల నుండి తెలుసుకోవటం అని భావం.

**46 - 53** మేము మూసాను మా సూచనలతో ఫిరౌన్ వద్దకూ, అతని ప్రభుత్వాధికారుల వద్దకూ పంపాము. అతను అక్కడకు పోయి, “నేను సకల లోకాల ప్రభువు యొక్క ప్రవక్తను” అని అన్నాడు. తరువాత అతను మా సూచనలను వారి ముందు పెట్టినప్పుడు, వారు ఎగతాళి చేస్తూ నవ్వ సాగారు. మేము వారికి ఎన్నో సూచనలను ఒక దానిని మించిన మరొక దానిని వరుసగా చూపిస్తూపోయాము. వారు తమ వైఖరిని మార్చుకోవాలని మేము వారిని శిక్షకు గురిచేశాము. శిక్షకు గురిఅయినప్పుడల్లా వారు, “మాంత్రికుడా! నీ ప్రభువు తరఫు నుండి నీకు లభించిన పదవి ఆధారంగా మా కొరకు ఆయనను ప్రార్థించు, మేము తప్పకుండా సన్మార్గం వైపునకు వస్తాము” అని అనేవారు. కాని మేము వారి మీద నుండి శిక్షను తొలగించినంతనే, వారు ఆడిన మాటను తప్పుతారు. ఒకరోజు ఫిరౌన్ తన జాతివారి మధ్యకు పోయి ఇలా ప్రకటించాడు, “ప్రజలారా! ఈజిప్టు సామ్రాజ్యం నాదికాదా, ఈ కాలువలు నా క్రింద ప్రవహించటం లేదా? మీకు కనిపించటం లేదా, శ్రేష్ఠుణ్ణి నేనా లేక నీచుడూ, అల్పుడూ, తన మాటను సైతం స్పష్టంగా వివరించలేని ఇతడా? ఇతనిపై బంగారు కంకణాలు ఎందుకు దించబడలేదు? దైవదూతల బృందం పరిచారకులుగా ఇతని వెంట ఎందుకు రాలేదు?”

**54 - 56** అతడు తన జాతి వారిని తేలికగా చూశాడు. వారూ అతడు చెప్పినట్లే విన్నారు. వాస్తవానికి వారు పాపాత్ములు.[9] చివరకు వారు మాకు ఆగ్రహం కలిగించినప్పుడు, మేము వారికి ప్రతీకారం చేశాము. వారందరినీ కలిపి ముంచివేశాము, వారిని ముందు తరాల వారికి పూర్వీకులుగా గుణపాఠం గరిపే ఒక నిదర్శనంగా చేశాము.

وَلَقَدْ اَرْسَلْنَا مُوْسٰى بِاٰيٰتِنَآ اِلٰى فِرْعَوْنَ
وَمَلَا۟ئِهٖ فَقَالَ اِنِّىْ رَسُوْلُ رَبِّ الْعٰلَمِيْنَ ﴿٤٦﴾
فَلَمَّا جَآءَهُمْ بِاٰيٰتِنَآ اِذَا هُمْ مِّنْهَا يَضْحَكُوْنَ ﴿٤٧﴾
وَمَا نُرِيْهِمْ مِّنْ اٰيَةٍ اِلَّا هِىَ اَكْبَرُ مِنْ
اُخْتِهَا ۫ وَاَخَذْنٰهُمْ بِالْعَذَابِ لَعَلَّهُمْ
يَرْجِعُوْنَ ﴿٤٨﴾ وَقَالُوْا يٰٓاَيُّهَ السّٰحِرُ ادْعُ لَنَا
رَبَّكَ بِمَا عَهِدَ عِنْدَكَ ۚ اِنَّنَا لَمُهْتَدُوْنَ ﴿٤٩﴾
فَلَمَّا كَشَفْنَا عَنْهُمُ الْعَذَابَ اِذَا هُمْ يَنْكُثُوْنَ ﴿٥٠﴾
وَنَادٰى فِرْعَوْنُ فِىْ قَوْمِهٖ قَالَ يٰقَوْمِ اَلَيْسَ
لِىْ مُلْكُ مِصْرَ وَهٰذِهِ الْاَنْهٰرُ تَجْرِىْ مِنْ
تَحْتِىْ ۚ اَفَلَا تُبْصِرُوْنَ ﴿٥١﴾ اَمْ اَنَا خَيْرٌ مِّنْ
هٰذَا الَّذِىْ هُوَ مَهِيْنٌ ۙ وَّلَا يَكَادُ يُبِيْنُ ﴿٥٢﴾ فَلَوْلَآ
اُلْقِىَ عَلَيْهِ اَسْوِرَةٌ مِّنْ ذَهَبٍ اَوْ جَآءَ
مَعَهُ الْمَلٰٓئِكَةُ مُقْتَرِنِيْنَ ﴿٥٣﴾ فَاسْتَخَفَّ قَوْمَهٗ
فَاَطَاعُوْهُ ؕ اِنَّهُمْ كَانُوْا قَوْمًا فٰسِقِيْنَ ﴿٥٤﴾ فَلَمَّآ
اٰسَفُوْنَا انْتَقَمْنَا مِنْهُمْ فَاَغْرَقْنٰهُمْ اَجْمَعِيْنَ ﴿٥٥﴾
فَجَعَلْنٰهُمْ سَلَفًا وَّمَثَلًا لِّلْاٰخِرِيْنَ ﴿٥٦﴾ ع

9. ఈ చిన్న వాక్యంలో ఒక గొప్ప నిజం చెప్పబడింది – ఒక వ్యక్తి తన నిరంకుశాధికారాన్ని దేశంలో చెలాయించదలిస్తే దానికోసం బాహాటంగానే యుక్తులూ, కుయుక్తులూ పన్నుతూ మోసాలతో, దగాలతో వ్యవహరిస్తూ నిస్సంకోచంగా అంతరాత్మలను అమ్మే, కొనే వ్యాపారం నిర్వహిస్తూ ఉంటాడు. అంతటితో ఆగక తన దారికి అడ్డమొచ్చిన వారిని నిర్దాక్షిణ్యంగా అణచివేస్తాడు, హింసకు గురిచేస్తాడు. ఈ విషయాలను అతడు మాటలలో కాకపోయినా, చేతలలోనైనా స్పష్టంగా ఇలా వ్యక్తం చేస్తాడు – తాను ఈ దేశ పౌరుల బుద్ధిబలాన్నీ, నీతీ నిజాయితీలను, శౌర్యప్రతాపాలను తక్కువ అంచనా వేస్తాడు. బుద్ధిహీనులు, అంతరాత్మ రహితులు, భీరువులు అయిన ప్రజలను తాను అనుకొన్న చోటుకు తరిమివేయగలనని అనుకుంటాడు. తరువాత అతని ఈ వ్యూహాలు ఫలించినప్పుడు, ప్రజలందరూ అతడికి విధేయులైన బానిసలుగా తయారయినప్పుడు, ఆ దుర్మార్గుడు తమను గురించి ఏ

وَ لَمَّا ضُرِبَ ابْنُ مَرْيَمَ مَثَلًا اِذَا قَوْمُكَ
مِنْهُ يَصِدُّوْنَ ﴿٥٧﴾ وَ قَالُوْٓا ءَاٰلِهَتُنَا خَيْرٌ اَمْ
هُوَ ؕ مَا ضَرَبُوْهُ لَكَ اِلَّا جَدَلًا ؕ بَلْ هُمْ
قَوْمٌ خَصِمُوْنَ ﴿٥٨﴾ اِنْ هُوَ اِلَّا عَبْدٌ اَنْعَمْنَا
عَلَيْهِ وَ جَعَلْنٰهُ مَثَلًا لِّبَنِيْٓ اِسْرَآءِيْلَ ﴿٥٩﴾ وَلَوْ
نَشَآءُ لَجَعَلْنَا مِنْكُمْ مَّلٰٓئِكَةً فِي الْاَرْضِ
يَخْلُفُوْنَ ﴿٦٠﴾ وَاِنَّهٗ لَعِلْمٌ لِّلسَّاعَةِ فَلَا تَمْتَرُنَّ
بِهَا وَاتَّبِعُوْنِ ؕ هٰذَا صِرَاطٌ مُّسْتَقِيْمٌ ﴿٦١﴾ وَ لَا
يَصُدَّنَّكُمُ الشَّيْطٰنُ ۚ اِنَّهٗ لَكُمْ عَدُوٌّ مُّبِيْنٌ ﴿٦٢﴾
وَ لَمَّا جَآءَ عِيْسٰى بِالْبَيِّنٰتِ قَالَ قَدْ جِئْتُكُمْ
بِالْحِكْمَةِ وَلِاُبَيِّنَ لَكُمْ بَعْضَ الَّذِيْ
تَخْتَلِفُوْنَ فِيْهِ ۚ فَاتَّقُوا اللّٰهَ وَ اَطِيْعُوْنِ ﴿٦٣﴾
اِنَّ اللّٰهَ هُوَ رَبِّيْ وَ رَبُّكُمْ فَاعْبُدُوْهُ ؕ هٰذَا
صِرَاطٌ مُّسْتَقِيْمٌ ﴿٦٤﴾ فَاخْتَلَفَ الْاَحْزَابُ مِنْ
بَيْنِهِمْ ۚ فَوَيْلٌ لِّلَّذِيْنَ ظَلَمُوْا مِنْ عَذَابِ
يَوْمٍ اَلِيْمٍ ﴿٦٥﴾

**57 - 65** మర్యమ్ కుమారుణ్ణి ఒక ఉదాహరణగా పేర్కొనగానే, నీజాతి ప్రజలు దానిని గురించి పెద్ద గొడవ చేస్తూ, మా దేవుళ్లు మంచివారా లేక అతడా?[10] అని అనసాగారు. ఈ అభ్యంతరాన్ని వారు కేవలం పిడివాదం కోసమే నీ ముందుకు తీసుకువచ్చారు. వాస్తవం ఏమిటంటే, వారు స్వతహాగా కలహప్రియులు. మర్యమ్ కుమారుడు ఒక దాసుడు తప్ప మరేమీ కాడు. మేము అతనిని అనుగ్రహించాము, ఇస్రాయీల్ సంతతి వారికి అతనిని మా శక్తికి నిదర్శనంగా చేశాము. మేము కోరితే మీ తరువాత భూమిపై మీ స్థానాన్ని ఆక్రమించగల దైవదూతలను మీనుండి పుట్టించగలము. నిజానికి అతను (అంటే మర్యమ్ కుమారుడు) ప్రళయానికి సూచన. కనుక మీరు దానిని శంకించకండి,[11] నా మాట నమ్మండి. ఇదే సరియైన మార్గం. షైతాన్ మిమ్మల్ని దాని వైపునకు పోకుండా ఆపకూడదు. అతడు మీకు బహిరంగ శత్రువు. స్పష్టమైన సూచనలను తీసుకువచ్చిన ఈసా ఇలా అన్నాడు, "నేను మీవద్దకు వివేకం తీసుకుని వచ్చాను, మీరు విభేదాలకు లోనైన కొన్ని విషయాల వాస్తవాన్ని మీకు స్పష్టంగా వివరించటానికి వచ్చాను. కనుక మీరు అల్లాహ్‌కు భయపడండి, నన్ను అనుసరించండి. యదార్థం ఏమిటంటే, అల్లాహ్‌యే మీ ప్రభువూ, నా ప్రభువూనూ, ఆయననే మీరు ఆరాధించండి. ఇదే సరియైన మార్గం.[12] కాని (అతను చేసిన స్పష్టమైన ఈ బోధ తరువాత కూడా) వర్గాలు విభేదాలకే లోనయ్యాయి,[13] కనుక దుర్మార్గానికి ఒడిగట్టినవారు వ్యధాభరితమైన ఒక దినాన పడే శిక్ష వల్ల సర్వనాశనం అవుతారు.

విధంగా భావించాడో ఆ విధంగానే ఉన్నామని వారు తమ ప్రవర్తన ద్వారా రుజువు చేసుకుంటారు. వారు ఈ నీచస్థితికి గురికావటానికి అసలు కారణం వారు మౌలికంగా పాపాత్ములు కావటమే.

10. ఇంతకుముందు 45వ ఆయతులో ఇలా చెప్పబడింది : "మేము దయామయుడైన దేవుని మినహా, ఇతర దేవుళ్లను కూడ ఆరాధనకై నియమించామా అని నీకు పూర్వం గతించిన ప్రవక్తలందరినీ అడిగి చూడు. "ఈ విషయాన్ని మక్కా ప్రజల ముందు ఉంచినపుడు, వారిలో ఒకడు ఇలా అభ్యంతరాన్ని లేవదీశాడు; "క్రైస్తవులు మర్యమ్ కుమారుణ్ణి దేవునిగా చేసుకుని అతనిని ఆరాధించటం లేదా ఏమి? అలాంటప్పుడు మా దేవుళ్లు చేసిన పాపం ఏమిటి?" ఈ విషయం చెప్పగానే అవిశ్వాసుల సమూహం నుండి పకపక అంటూ వికృతపు నవ్వులు వినిపించాయి; ఈ అభ్యంతరానికి మీ సమాధానం ఏమిటి అంటూ నినాదాలు చేశారు.

11. ఇలా కూడ అనువాదం చేయవచ్చు : "అతను ప్రళయ కాల జ్ఞానానికి ఒక మార్గము." ఇక్కడ ఒక ప్రశ్న పుడుతుంది: ఏసుక్రీస్తు, ప్రళయానికి సూచన అనీ లేదా అతను ప్రళయ కాలజ్ఞానానికి మార్గము అనీ ఏ అర్థంలో చెప్పబడింది? పలువురు వ్యాఖ్యాతలు ఇలా అన్నారు: ఇది హజ్రత్ ఏసుక్రీస్తు మలి రాకను తెలియజేస్తుంది.

هَلۡ يَنۡظُرُوۡنَ اِلَّا السَّاعَةَ اَنۡ تَاۡتِيَهُمۡ بَغۡتَةً
وَّهُمۡ لَا يَشۡعُرُوۡنَ ﴿۶۶﴾ اَلۡاَخِلَّآءُ يَوۡمَئِذٍۢ
بَعۡضُهُمۡ لِبَعۡضٍ عَدُوٌّ اِلَّا الۡمُتَّقِيۡنَ ﴿۶۷﴾ يٰعِبَادِ ع ٦ ١١ ١٢
لَا خَوۡفٌ عَلَيۡكُمُ الۡيَوۡمَ وَلَاۤ اَنۡتُمۡ
تَحۡزَنُوۡنَ ﴿۶۸﴾ اَلَّذِيۡنَ اٰمَنُوۡا بِاٰيٰتِنَا وَكَانُوۡا
مُسۡلِمِيۡنَ ﴿۶۹﴾ اُدۡخُلُوا الۡجَنَّةَ اَنۡتُمۡ وَاَزۡوَاجُكُمۡ
تُحۡبَرُوۡنَ ﴿۷۰﴾ يُطَافُ عَلَيۡهِمۡ بِصِحَافٍ مِّنۡ
ذَهَبٍ وَّاَكۡوَابٍ ۚ وَفِيۡهَا مَا تَشۡتَهِيۡهِ
الۡاَنۡفُسُ وَتَلَذُّ الۡاَعۡيُنُ ۚ وَاَنۡتُمۡ فِيۡهَا
خٰلِدُوۡنَ ﴿۷۱﴾ وَتِلۡكَ الۡجَنَّةُ الَّتِيۡۤ اُوۡرِثۡتُمُوۡهَا
بِمَا كُنۡتُمۡ تَعۡمَلُوۡنَ ﴿۷۲﴾ لَكُمۡ فِيۡهَا فَاكِهَةٌ
كَثِيۡرَةٌ مِّنۡهَا تَاۡكُلُوۡنَ ﴿۷۳﴾

**66 - 78** ఇప్పుడు వారు కేవలం తమకు తెలియకుండానే తమపైకి అకస్మాత్తుగా ప్రళయం వచ్చి పడాలని నిరీక్షిస్తున్నారా? ఆ దినం వచ్చిన ప్పుడు- స్నేహితులందరూ భయభక్తులు కలవారు తప్ప ఒకరికొకరు శత్రు వులైపోతారు. ఆ రోజున మా వాక్యాలను విశ్వసించి, మా ఆజ్ఞలకు బద్ధులై జీవితం గడిపిన వారితో ఇలా అనబడుతుంది: “నా దాసులారా! ఈనాడు మీకు ఏ భయమూ లేదు, మీకు ఏ దుఃఖమూ కలుగదు. మీరూ, మీ భార్యలూ స్వర్గంలో ప్రవేశించండి, మిమ్మల్ని ఆనందింపచేయటం జరుగుతుంది.” వారి మధ్య బంగారు పళ్లాలూ, గిన్నెలూ త్రిప్పబడతాయి. మనస్సు ఇష్టపడే, కళ్లకు ఇంపుగా ఉండే ప్రతి వస్తువూ అక్కడ ఉంటుంది. వారితో ఇలా అనబడుతుంది: “ఇక మీరు ఇక్కడ శాశ్వతంగా ఉంటారు. మీరు ప్రపంచంలో చేసిన కర్మలు కారణంగా మీరు ఈ స్వర్గానికి వారసులయ్యారు. మీకు ఇక్కడ పండ్లూ ఫలాలూ పుష్కలంగా లభిస్తాయి, వాటిని మీరు తింటారు.”

ఈ విషయమే ఎన్నో హదీసులలో వచ్చింది. కాని తరువాతి వాక్యం ఈ అర్థానికి విరుద్ధంగా ఉంది. ఆయన రెండోసారి రావటం అనేది, రాబోయే కాలంలో ఉండే ప్రజలకు మాత్రమే లేదా తరువాత పుట్టేవారికి మాత్రమే ప్రళయకాల జ్ఞాన మార్గం కాగలుగుతుంది. మక్కా అవిశ్వాసులకు ఆయన జ్ఞాన మార్గం ఎలా కాగలుగుతారని, వారిని సంబోధిస్తూ, “కనుక మీరు దానిని గురించి సందేహించకండి” అని చెప్పబడింది? కాబట్టి మా దృష్టిలో కొందరు ఇతర వ్యాఖ్యాతలు చేసిన ఈ వ్యాఖ్యానమే సరియైనది: ఇక్కడ హజ్రత్ ఈసా (అస్సలామ్) తండ్రి లేకుండా పుట్టడం, ఆయన మట్టితో పక్షులను తయారుచేయటం, మృతులను బ్రతికించటం అనేవి ప్రళయం సంభవిస్తుందనటానికి నిదర్శనాలుగా చూపబడ్డాయి. దైవసూక్తి అర్థం ఏమిటంటే, ఏ దేవుడైతే తండ్రి లేకనే బిడ్డను పుట్టించగలడో, ఏ దేవుని దాసుడు మట్టి ప్రతిమలో ప్రాణం పోయగలడో, నిర్జీవులను జీవులుగా చేయగలడో, అట్టి దేవునికి మిమ్మల్నీ మానవులందరినీ మరణానంతరం మళ్లీ బ్రతికించగలగటం అసాధ్యమని మీరు ఎందుకు భావిస్తారు?

12. అంటే, క్రైస్తవులు వారి అభిమతాన్ని అనుసరించి ఏమి చేసినా, ఏమి చెప్పినా, ఏసుక్రీస్తు మాత్రం, తాను దేవుడనని కానీ, దైవ కుమారుడనని కానీ, తనను ఆరాధించమనిగానీ ఏనాడూ చెప్పలేదు. ఇతర ప్రవక్తలందరూ బోధించిన సందేశాన్నే ఈయనా బోధించారు. ఇప్పుడు ముహమ్మద్ (సఅసమ్) మీకు ఇచ్చే సందేశం కూడ అదే.

13. అంటే, ఒక వర్గం ఆయనను తిరస్కరించింది; అది తన వైషమ్యంలో, ఆయన అక్రమ సంతానమని నిందించే అంత స్థాయికి వెళ్ళింది. రెండోవర్గం ఆయనను విశ్వసించింది, తన అతిశయించిన విశ్వాసం వల్ల, అది ఆయనను దేవుడుగా చేసేసింది. అయితే ఒక మానవుడు దేవుడు కావటం అనేది వారికి ఒక చిక్కు సమస్యగా పరిణమించింది, ఆ చిక్కును విడదీసే ప్రయత్నంలో వారు అనేక వర్గాలుగా చీలిపోయారు.

إِنَّ الْمُجْرِمِينَ فِي عَذَابِ جَهَنَّمَ خَالِدُونَ ﴿٧٤﴾
لَا يُفَتَّرُ عَنْهُمْ وَهُمْ فِيهِ مُبْلِسُونَ ﴿٧٥﴾ وَمَا
ظَلَمْنَاهُمْ وَلَٰكِن كَانُوا هُمُ الظَّالِمِينَ ﴿٧٦﴾ وَنَادَوْا
يَا مَالِكُ لِيَقْضِ عَلَيْنَا رَبُّكَ ۖ قَالَ إِنَّكُم
مَّاكِثُونَ ﴿٧٧﴾ لَقَدْ جِئْنَاكُم بِالْحَقِّ وَلَٰكِنَّ
أَكْثَرَكُمْ لِلْحَقِّ كَارِهُونَ ﴿٧٨﴾ أَمْ أَبْرَمُوا أَمْرًا
فَإِنَّا مُبْرِمُونَ ﴿٧٩﴾ أَمْ يَحْسَبُونَ أَنَّا لَا نَسْمَعُ
سِرَّهُمْ وَنَجْوَاهُم ۚ بَلَىٰ وَرُسُلُنَا لَدَيْهِمْ
يَكْتُبُونَ ﴿٨٠﴾ قُلْ إِن كَانَ لِلرَّحْمَٰنِ وَلَدٌ فَأَنَا
أَوَّلُ الْعَابِدِينَ ﴿٨١﴾ سُبْحَانَ رَبِّ السَّمَاوَاتِ وَ
الْأَرْضِ رَبِّ الْعَرْشِ عَمَّا يَصِفُونَ ﴿٨٢﴾
فَذَرْهُمْ يَخُوضُوا وَيَلْعَبُوا حَتَّىٰ يُلَاقُوا يَوْمَهُمُ
الَّذِي يُوعَدُونَ ﴿٨٣﴾

ఇక అపరాధులు; వారు నరక శిక్షను శాశ్వతంగా అనుభవిస్తూ ఉంటారు. వారి శిక్ష తగ్గటం అనేది ఎన్నటికీ జరగదు; వారు అందులో హతాశులైపడి ఉంటారు. మేము వారికి అన్యాయం చేయలేదు; వారే తమకు తాము అన్యాయం చేసుకున్నారు. వారు, "ఓ మాలిక్![14] నీ ప్రభువు మమ్మల్ని అంతం చేస్తే బాగుంటుంది" అని వేడుకుంటారు. దానికి అతడు, "మీరు ఇలాగే పడి ఉంటారు. మేము మీ దగ్గరకు సత్యాన్ని తీసుకుని వచ్చాము. కాని మీలో చాలామందికి సత్యం అంటేనే గిట్టేది కాదు"[15] అని సమాధానం చెబుతాడు.

**79 - 80** వారు ఏదైనా చర్యను తీసుకోవటానికి నిర్ణయించుకున్నారా?[16] అలా అయితే మేము కూడా ఒక నిర్ణయం తీసుకుంటాము. మేము వారి రహస్య విషయాలనూ, వారి గుసగుసలనూ వినటం లేదని వారు అనుకుంటున్నారా? మేము అన్నీ వింటూనే ఉన్నాము. అంతేకాదు మా దూతలు వారి వద్దనే ఉండి వ్రాస్తున్నారు.

**81 - 83** వారితో ఇలా అను, "ఒకవేళ నిజంగానే కరుణామయునికి సంతానం ఉంటే, అందరికంటే ముందు నేనే వారిని ఆరాధించి ఉండేవాణ్ణి." భూమ్యాకాశాల పాలకుడూ, సింహాసన ప్రభువూ అయిన ఆయన, వారు ఆపాదించే సకల విషయాలకు అతీతుడు, పరిశుద్ధుడునూ. సరే, మంచిది, వారిని తమ అసత్యపు ఆలోచనలలో మునిగి ఉండనీ, తమ ఆటలలో నిమగ్నులై ఉండనీ. చివరకు వారు, తమను ఏ దినం గురించి భయపెట్టటం జరుగుతుందో, ఆ దినాన్ని చూస్తారు.

14. మాలిక్ అంటే, నరకపాలకుడు అని భావం. సందర్భాన్నిబట్టి కూడ ఈ విషయం నిర్ధారణ అవుతుంది.
15. "మేము మీ దగ్గరకు సత్యాన్ని తీసుకుని వచ్చాము" అనే నరక పాలకుని మాటలలోని "మేము" అనే పదం, ప్రభుత్వం తరఫున ఒక ప్రభుత్వాధికారి మాట్లాడుతూ "మేము" అనే పదం వాడిన రీతిలో ఉన్నది. మా ప్రభుత్వం ఈ పని చేసింది లేదా ఈ ఉత్తరువును జారీ చేసింది అని దాని భావం.
16. ఖురైషు సర్దారులు, తమ రహస్య సమావేశాలలో దైవప్రవక్త ముహమ్మద్ (సఅసమ్)కు వ్యతిరేకంగా నిర్ణయాత్మకమైన చర్య తీసుకునే విషయంలో, చెప్పిన మాటలను ఇది సూచిస్తుంది.

وَ هُوَ الَّذِیْ فِی السَّمَآءِ اِلٰهٌ وَّ فِی الْاَرْضِ
اِلٰهٌ ؕ وَهُوَ الْحَكِیْمُ الْعَلِیْمُ ﴿۸۴﴾ وَتَبٰرَكَ الَّذِیْ
لَهٗ مُلْكُ السَّمٰوٰتِ وَ الْاَرْضِ وَ مَا بَیْنَهُمَا ۚ
وَعِنْدَهٗ عِلْمُ السَّاعَةِ ۚ وَاِلَیْهِ تُرْجَعُوْنَ ﴿۸۵﴾ وَ
لَا یَمْلِكُ الَّذِیْنَ یَدْعُوْنَ مِنْ دُوْنِهِ
الشَّفَاعَةَ اِلَّا مَنْ شَهِدَ بِالْحَقِّ وَ هُمْ
یَعْلَمُوْنَ ﴿۸۶﴾ وَ لَئِنْ سَاَلْتَهُمْ مَّنْ خَلَقَهُمْ
لَیَقُوْلُنَّ اللّٰهُ فَاَنّٰی یُؤْفَكُوْنَ ﴿۸۷﴾ وَقِیْلِهٖ یٰرَبِّ
اِنَّ هٰۤؤُلَآءِ قَوْمٌ لَّا یُؤْمِنُوْنَ ﴿۸۸﴾ فَاصْفَحْ عَنْهُمْ
وَ قُلْ سَلٰمٌ ؕ فَسَوْفَ یَعْلَمُوْنَ ﴿۸۹﴾

**84 - 85** ఆకాశంలోనూ, భూమిలోనూ దేవుడు ఆయన ఒక్కడే. ఆయనే వివేకవంతుడు, జ్ఞానసంపన్నుడు; భూమ్యాకాశాల మీదా, వాటి మధ్య ఉన్న ప్రతివస్తువు మీదా అధికారం గల ఆయన ఎంతో ఉన్నతుడు. ప్రళయ గడియను గురించి తెలిసినవాడు కూడ ఆయనే. ఆయన వైపునకే మీరంతా మరలింపబడనున్నారు.

**86** ఆయనను త్రోసిరాజని వారు వేడుకునే దేవుళ్లకు సిఫారసు చేసే అధికారం ఏమాత్రమూ లేదు, ఎవరైనా జ్ఞానం ఆధారంగా ఇది సత్యమని, సాక్ష్యం పలికితే తప్ప.[17]

**87 - 88** నీవు, "మిమ్మల్ని ఎవరు పుట్టించారు" అని వారిని అడిగితే, స్వయంగా వారే 'అల్లాహ్' అని అంటారు.[18] అయితే వారు ఎలా మోసపోతున్నారు? ప్రవక్త యొక్క ఈ సూక్తి సాక్షిగా! "ప్రభూ! ఈ ప్రజలు విశ్వసించే వారు కారు."[19]

**89** మంచిది, ప్రవక్తా! వారిని మన్నించు. 'మీకు సలామ్' అని వారితో అను. త్వరలోనే వారికి తెలిసిపోతుందిలే.

17. అంటే, ఒక వ్యక్తి ఒకవేళ తాను దేవుళ్లుగా చేసుకున్న శక్తులకు తప్పకుండా మధ్యవర్తిత్వం నెరిపే అధికారాలు ఉన్నాయనీ వాటికి అల్లాహ్ వద్ద పలుకుబడి ఉందనీ, ఆ పలుకుబడి ద్వారా అవి తాము కోరిన వారిని క్షమింపజేయగలవనీ చెబితే అప్పుడు అతను జ్ఞానం ఆధారంగా ఈ విషయాన్ని ధృవీకరించగలడా?

18. ఈ ఆయతునకు రెండు అర్థాలు ఉన్నాయి. ఒకటి, ఒకవేళ నీవు "మిమ్మల్ని సృష్టించినది ఎవరు" అని వారిని అడిగితే, వారు దానికి అల్లాహ్‌యే అని అంటారు. రెండు, అలాగే, "మీ దేవుళ్లను సృష్టించినది ఎవరు?" అని అడిగితే దానికినీ వారు అల్లాహ్‌యే అని సమాధానమిస్తారు.

19. అర్థం ఏమిటంటే, "ఓ ప్రభూ! ఈ ప్రజలు విశ్వసించేవారు కారు" అనే ప్రవక్త వచనం సాక్షిగా! ఎంత వింతైన ఆత్మ ద్రోహానికి వారు ఒడిగట్టారు! తమకూ, తమ దేవుళ్లకూ సృష్టికర్త అల్లాహ్‌యే అని వారంతట వారే సమ్మతించారు. అయినా కూడా వారు సృష్టికర్తను వదలి, సృష్టింపబడినవారిని ఆరాధించాలనే మొండిగా వాదిస్తారు.

ఆయతులు 59 | **44. అద్ దుఖాన్** | అవతరణ మక్కాలో

*అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

**1 - 9** హా. మీమ్. స్పష్టమైన ఈ గ్రంథం సాక్షిగా! మేము దానిని ఎంతో మేలైన, అత్యంత శుభవంతమైన రాత్రివేళ అవతరింపజేశాము.[1] ఎందుకంటే మేము ప్రజలను హెచ్చరించ దలచాము. ఈ రాత్రే ప్రతి విషయానికీ సంబంధించిన వివేకవంతమైన నిర్ణయం మా ఆజ్ఞానుసారం జారీ అవు తుంది.[2] మేము ఒక ప్రవక్తను నీ ప్రభువు కారుణ్యంగా పంపా లనుకున్నాము. నిశ్చయంగా ఆయన మాత్రమే అన్నీ వినేవాడు, అన్నీ ఎరిగినవాడు, ఆకాశాలకూ భూమికీ ప్రభువు, భూమ్యా కాశాల మధ్య ఉన్న ప్రతి వస్తువునకూ ప్రభువు- మీరు నిజంగా విశ్వాసులే అయితే (ఈ విషయాన్ని గ్రహించండి). ఆయన తప్ప ఆరాధ్యదైవం ఎవ్వడూ లేడు.[3] ఆయనే జీవితాన్ని ప్రసాదిస్తాడు, ఆయనే మరణాన్నీ ఇస్తాడు. ఆయనే మీ ప్రభువు, గతించిన మీ పూర్వీకుల ప్రభువు. (కాని వాస్తవంగా వారికి నమ్మకం లేదు) అయితే వారు శంకతో ఆడుకుంటున్నారు.

**10 - 16** సరే, స్పష్టమైన పొగను ఆకాశం తీసుకుని వచ్చే దినం కొరకు నిరీక్షించండి. అది ప్రజలను కమ్ముకుంటుంది. ఇదే, వ్యధాభరితమైన శిక్ష.

۴۴ سُوْرَةُ الدُّخَانِ مَكِّيَّةٌ ۶۴

اٰياتها ۵۹ | ركوعاتها ۳

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

حٰمٓ ۝۱ وَ الْكِتٰبِ الْمُبِيْنِ ۝۲ اِنَّآ اَنْزَلْنٰهُ فِيْ
لَيْلَةٍ مُّبٰرَكَةٍ اِنَّا كُنَّا مُنْذِرِيْنَ ۝۳ فِيْهَا
يُفْرَقُ كُلُّ اَمْرٍ حَكِيْمٍ ۝۴ اَمْرًا مِّنْ عِنْدِنَا ط
اِنَّا كُنَّا مُرْسِلِيْنَ ۝۵ رَحْمَةً مِّنْ رَّبِّكَ ط
اِنَّهٗ هُوَ السَّمِيْعُ الْعَلِيْمُ ۝۶ رَبِّ السَّمٰوٰتِ وَ
الْاَرْضِ وَ مَا بَيْنَهُمَا م اِنْ كُنْتُمْ مُّوْقِنِيْنَ ۝۷
لَآ اِلٰهَ اِلَّا هُوَ يُحْيٖ وَيُمِيْتُ ط رَبُّكُمْ وَ
رَبُّ اٰبَآئِكُمُ الْاَوَّلِيْنَ ۝۸ بَلْ هُمْ فِيْ شَكٍّ
يَّلْعَبُوْنَ ۝۹ فَارْتَقِبْ يَوْمَ تَاْتِي السَّمَآءُ
بِدُخَانٍ مُّبِيْنٍ ۝۱۰ يَّغْشَى النَّاسَ ط هٰذَا عَذَابٌ
اَلِيْمٌ ۝۱۱

1. అంటే, లైలతుల్ ఖద్ర్, మహిమాన్వితమైన రాత్రి అని భావం.
2. అల్లాహ్ పాలనా వ్యవస్థలో ఈ రాత్రికి ఎంతో ప్రాముఖ్యం ఉన్నది. ఆ రాత్రి ఆయన వ్యక్తుల, జాతుల, దేశాల అదృష్టాదృష్టాలకు సంబంధించిన నిర్ణయాలు చేసి వాటిని తన దూతలకు అప్పగిస్తాడు. వారు వాటిని తగురీతిలో అమలుపరుస్తారు.
3. ఆరాధ్య దైవం అంటే నిజమైన ఆరాధ్య దైవం అని భావం. ప్రజలు చేసే ఆరాధన (దాస్యము, పూజ)పై ఆయనకు మాత్రమే హక్కు ఉన్నది.

رَبَّنَا اكْشِفْ عَنَّا الْعَذَابَ إِنَّا مُؤْمِنُونَ ﴿١٢﴾
أَنَّىٰ لَهُمُ الذِّكْرَىٰ وَقَدْ جَاءَهُمْ رَسُولٌ
مُبِينٌ ﴿١٣﴾ ثُمَّ تَوَلَّوْا عَنْهُ وَقَالُوا مُعَلَّمٌ
مَجْنُونٌ ﴿١٤﴾ إِنَّا كَاشِفُو الْعَذَابِ قَلِيلًا إِنَّكُمْ
عَائِدُونَ ﴿١٥﴾ يَوْمَ نَبْطِشُ الْبَطْشَةَ الْكُبْرَىٰ
إِنَّا مُنْتَقِمُونَ ﴿١٦﴾ وَلَقَدْ فَتَنَّا قَبْلَهُمْ قَوْمَ
فِرْعَوْنَ وَجَاءَهُمْ رَسُولٌ كَرِيمٌ ﴿١٧﴾ أَنْ أَدُّوا
إِلَيَّ عِبَادَ اللَّهِ ۖ إِنِّي لَكُمْ رَسُولٌ أَمِينٌ ﴿١٨﴾ وَ
أَنْ لَا تَعْلُوا عَلَى اللَّهِ ۖ إِنِّي آتِيكُمْ بِسُلْطَانٍ
مُبِينٍ ﴿١٩﴾ وَإِنِّي عُذْتُ بِرَبِّي وَرَبِّكُمْ أَنْ
تَرْجُمُونِ ﴿٢٠﴾ وَإِنْ لَمْ تُؤْمِنُوا لِي
فَاعْتَزِلُونِ ﴿٢١﴾ فَدَعَا رَبَّهُ أَنَّ هَٰؤُلَاءِ قَوْمٌ
مُجْرِمُونَ ﴿٢٢﴾ فَأَسْرِ بِعِبَادِي لَيْلًا إِنَّكُمْ
مُتَّبَعُونَ ﴿٢٣﴾ وَاتْرُكِ الْبَحْرَ رَهْوًا ۖ إِنَّهُمْ جُنْدٌ
مُغْرَقُونَ ﴿٢٤﴾ كَمْ تَرَكُوا مِنْ جَنَّاتٍ وَعُيُونٍ ﴿٢٥﴾
وَزُرُوعٍ وَمَقَامٍ كَرِيمٍ ﴿٢٦﴾ وَنَعْمَةٍ كَانُوا فِيهَا
فَاكِهِينَ ﴿٢٧﴾ كَذَٰلِكَ ۖ وَأَوْرَثْنَاهَا قَوْمًا
آخَرِينَ ﴿٢٨﴾ فَمَا بَكَتْ عَلَيْهِمُ السَّمَاءُ وَ
الْأَرْضُ وَمَا كَانُوا مُنْظَرِينَ ﴿٢٩﴾

(అప్పుడు వారు ఇలా అంటారు) "ప్రభూ! ఈ శిక్షను మాపై నుండి తొలగించు. మేము విశ్వసిస్తున్నాము."[4] వారి అశ్రద్ధ ఎలా దూరం అవుతుంది? వారి వద్దకు సాక్షాత్తుగా ఒక ప్రవక్త[5] వచ్చినప్పటికీ, వారు అతని పట్ల శ్రద్ధ చూపలేదు సరికదా పైగా, "ఇతను ఒక పిచ్చివాడు, ఇతరుల నుండి నేర్చుకున్నాడు" అని అన్నారు. ఇలా ఉంది వారి పరిస్థితి. మేము శిక్షను కొంచెం తొలగిస్తే, మీరు పూర్వం చేస్తూ ఉన్నదానినే మళ్లీ చేస్తారు. మేము గట్టిదెబ్బకొట్టే ఆ రోజు, మేము మీకు ప్రతీకారం చేసేరోజు అవుతుంది.

**17 - 33** మేము వారికి పూర్వం, ఫిరౌన్ జాతి వారిని ఇటువంటి పరీక్షకే గురిచేశాము. వారివద్దకు ఎంతో మర్యాదస్తుడైన ఒక ప్రవక్త వచ్చాడు. అతను ఇలా అన్నాడు, "అల్లాహ్ సేవకులను నాకు అప్పగించండి. నేను మీ కొరకు వచ్చిన ఒక నమ్మకస్తుడనైన ప్రవక్తను. అల్లాహ్‌కు వ్యతిరేకంగా తిరుగుబాటు చేయకండి. నేను మీ ముందు (నా నియామకానికి సంబంధించిన) స్పష్టమైన ప్రమాణాన్ని ఉంచుతున్నాను. మీరు నా మీద దాడిచేయకుండా నేను మన ప్రభువు యొక్క శరణుపొందాను. ఒకవేళ మీరు నా మాట నమ్మకపోతే సరే, నా జోలికి మట్టుకు రాకండి." చివరకు అతను, "ఈ ప్రజలు అపరాధులు" అని తన ప్రభువుతో చెప్పుకున్నాడు. (ఇలా జవాబు ఇవ్వబడింది), "మంచిది. రాత్రికి రాత్రే నా సేవకులను తీసుకుని బయలుదేరు. మిమ్మల్ని వెంటాడటం జరుగుతుంది. సముద్రాన్ని అది ఉన్న స్థితిలోనే విడిచి పెట్టు. అప్పుడు ఈ సైన్యం అంతా మునిగిపోతుంది." వారు ఎన్ని తోటలను, ఎన్ని నీటి బుగ్గలను, ఎన్ని పొలాలను, ఎన్ని అందమైన సౌధాలను వదలివెళ్లారు! వారు అనుభవిస్తూ ఉన్న విలాస వస్తువులు ఎన్నో వారి వెనుకనే ఉండిపోయాయి! ఇలా జరిగింది వారి ముగింపు. మేము ఇతరులను ఈ వస్తువులకు వారసులుగా చేశాము. తరువాత వారి కొరకు ఆకాశమూ విలపించలేదు, భూమీ విలపించలేదు. వారికి కొద్దిపాటి వ్యవధి కూడా ఇవ్వబడలేదు.

4. ఈ ఆయతులలోనూ, 16వ ఆయతులోనూ ప్రళయ శిక్షకు సంబంధించిన ప్రస్తావన చేయబడింది. 15వ ఆయతులో, ఈ సూరా అవతరించినప్పటి కాలంలో మక్కావాసులు గురి అయినటువంటి కరువు కాటకాలు ప్రస్తావించబడ్డాయి.

ఈ విధంగా మేము ఇస్రాయీల్ సంతతి వారికి అత్యంత అవమానకరమైన శిక్ష నుండి, ఫిరౌన్ నుండి విమోచనం కలిగించాము. అతడు హద్దులు మీరిన వారిలో నిజంగానే అగ్రశ్రేణికి చెందినవాడు. వారి పరిస్థితిని ఎరిగి ఉండి కూడా వారికి ప్రపంచంలోని ఇతర జాతులపై ప్రాధాన్యం ఇచ్చాము. వారి కొరకు స్పష్టమైన పరీక్షగా సూచనలను వారికి చూపించాము.

**34 - 42** వారు ఇలా అంటారు, "మాకు మా మొదటి మరణమే తప్ప తరువాత మరింకేమీ లేదు. దాని తరువాత మేము లేపబడే వారము కానేకాము. నీవు నిజమే పలుకుతున్నట్లయితే, మా తాతముత్తాతలను లేపి తీసుకురా." వారు మేలైనవారా లేక తుబ్బా జాతి[6] వారా, దానికి ముందు వారా? వారు అపరాధులై పోయిన కారణంగానే మేము వారిని నాశనం చేశాము. ఈ ఆకాశాన్నీ, ఈ భూమినీ, వాటి మధ్య ఉన్న వస్తువులనూ మేము వినోదం కోసం సృష్టించలేదు సుమా. వాటిని మేము సత్యంతోనే సృష్టించాము. కాని వారిలో అనేకులు ఎరుగరు. వారందరూ లేపబడటానికి నిర్ణయించబడిన సమయం తీర్పు దినమే. ఆనాడు దగ్గరబంధువు అయినా సరే తన దగ్గర బంధువుకి కూడా ఎంతమాత్రం ఉపయోగపడడు; ఎవరి నుండీ వారికి ఏ సహాయమూ లభించదు; అల్లాహ్‌యే ఎవరి మీదనయినా కరుణ చూపితే తప్ప. ఆయన శక్తిమంతుడు, కరుణామయుడూను.

**43 - 50** జఖ్ఖూమ్ వృక్షం పాపాత్ములకు ఆహారం అవుతుంది. అది నూనె మడ్డిలాగా ఉంటుంది. సలసల కాగే నీరు మాదిరిగా అది కడుపులో మసలుతూ ఉంటుంది. అతనిని పట్టుకోండి, నరకం మధ్యకు ఈడ్చుకుంటూ తీసుకువెళ్లండి, వాడి తల మీద సలసల కాగే నీటి శిక్షను పొర్లించండి. నీవు గొప్ప బలవంతుడవూ, గౌరవనీయుడవూ అయిన మనిషివి. మీరు ఏ విషయం రాకను గురించి సందేహించేవారో, ఆ విషయం ఇదే.

وَلَقَدْ نَجَّيْنَا بَنِيٓ إِسْرَآءِيلَ مِنَ الْعَذَابِ
الْمُهِينِ ﴿۳۰﴾ مِنْ فِرْعَوْنَ ۚ إِنَّهُ كَانَ عَالِيًا مِّنَ
الْمُسْرِفِينَ ﴿۳۱﴾ وَلَقَدِ اخْتَرْنٰهُمْ عَلٰى عِلْمٍ عَلَى
الْعٰلَمِينَ ﴿۳۲﴾ وَاٰتَيْنٰهُمْ مِّنَ الْاٰيٰتِ مَا فِيهِ بَلٰٓؤٌا
مُّبِينٌ ﴿۳۳﴾ إِنَّ هٰٓؤُلَآءِ لَيَقُولُونَ ﴿۳۴﴾ إِنْ هِيَ إِلَّا
مَوْتَتُنَا الْاُولٰى وَمَا نَحْنُ بِمُنْشَرِينَ ﴿۳۵﴾ فَاْتُوْا
بِاٰبَآئِنَآ إِنْ كُنْتُمْ صٰدِقِينَ ﴿۳۶﴾ أَهُمْ خَيْرٌ أَمْ
قَوْمُ تُبَّعٍ ۙ وَّالَّذِينَ مِنْ قَبْلِهِمْ ۚ أَهْلَكْنٰهُمْ ۫
إِنَّهُمْ كَانُوْا مُجْرِمِينَ ﴿۳۷﴾ وَمَا خَلَقْنَا
السَّمٰوٰتِ وَالْاَرْضَ وَمَا بَيْنَهُمَا لٰعِبِينَ ﴿۳۸﴾
مَا خَلَقْنٰهُمَآ إِلَّا بِالْحَقِّ وَلٰكِنَّ أَكْثَرَهُمْ لَا
يَعْلَمُونَ ﴿۳۹﴾ إِنَّ يَوْمَ الْفَصْلِ مِيقَاتُهُمْ
أَجْمَعِينَ ﴿۴۰﴾ يَوْمَ لَا يُغْنِي مَوْلًى عَنْ مَّوْلًى
شَيْئًا وَّلَا هُمْ يُنْصَرُونَ ﴿۴۱﴾ إِلَّا مَنْ رَّحِمَ
اللّٰهُ ۚ إِنَّهُ هُوَ الْعَزِيزُ الرَّحِيمُ ﴿۴۲﴾ إِنَّ شَجَرَتَ ع
الزَّقُّومِ ﴿۴۳﴾ طَعَامُ الْاَثِيمِ ﴿۴۴﴾ كَالْمُهْلِ ۚ يَغْلِي
فِي الْبُطُونِ ﴿۴۵﴾ كَغَلْيِ الْحَمِيمِ ﴿۴۶﴾ خُذُوهُ
فَاعْتِلُوهُ إِلٰى سَوَآءِ الْجَحِيمِ ﴿۴۷﴾ ثُمَّ صُبُّوْا
فَوْقَ رَاْسِهٖ مِنْ عَذَابِ الْحَمِيمِ ﴿۴۸﴾ ذُقْ
إِنَّكَ أَنْتَ الْعَزِيزُ الْكَرِيمُ ﴿۴۹﴾ إِنَّ هٰذَا مَا
كُنْتُمْ بِهٖ تَمْتَرُونَ ﴿۵۰﴾

اِنَّ الْمُتَّقِيْنَ فِيْ مَقَامٍ اَمِيْنٍ ﴿۵۱﴾ فِيْ جَنّٰتٍ
وَّعُيُوْنٍ ﴿۵۲﴾ يَّلْبَسُوْنَ مِنْ سُنْدُسٍ وَّاِسْتَبْرَقٍ
مُّتَقٰبِلِيْنَ ﴿۵۳﴾ كَذٰلِكَ وَ زَوَّجْنٰهُمْ بِحُوْرٍ
عِيْنٍ ﴿۵۴﴾ يَدْعُوْنَ فِيْهَا بِكُلِّ فَاكِهَةٍ اٰمِنِيْنَ ﴿۵۵﴾
لَا يَذُوْقُوْنَ فِيْهَا الْمَوْتَ اِلَّا الْمَوْتَةَ الْاُوْلٰى
وَوَقٰىهُمْ عَذَابَ الْجَحِيْمِ ﴿۵۶﴾ فَضْلًا مِّنْ رَّبِّكَ
ذٰلِكَ هُوَ الْفَوْزُ الْعَظِيْمُ ﴿۵۷﴾ فَاِنَّمَا يَسَّرْنٰهُ
بِلِسَانِكَ لَعَلَّهُمْ يَتَذَكَّرُوْنَ ﴿۵۸﴾ فَارْتَقِبْ
اِنَّهُمْ مُّرْتَقِبُوْنَ ﴿۵۹﴾

**51 - 57** దైవభీతి గలవారు శాంతి భద్రతల గల ప్రదేశంలో ఉంటారు. ఉద్యానవనాలలో, సెలయేళ్లలో, సన్నని పట్టు వస్త్రాలూ, జరీ పట్టు వస్త్రాలూ ధరించి, ఒకరికొకరు ఎదురుగా కూర్చుండి ఉంటారు. ఇలా ఉంటుంది వారి దర్పం. పసిమి రంగు మేనులూ, అందమైన విశాలమైన కళ్లూ గల స్త్రీలను వారికి ఇచ్చి వివాహం చేస్తాము. అక్కడ వారు రుచికరమైన అన్ని రకాల పదార్థాలనూ నిస్సంకోచంగా అడుగుతారు. అక్కడ వారు మరణాన్ని ఎన్నటికీ రుచి చూడరు. ప్రపంచంలో వచ్చిన మరణమే మరణం. అల్లాహ్ తన కృపతో వారిని నరక శిక్ష నుండి కాపాడుతాడు. ఇదే గొప్ప సాఫల్యం.

**58 - 59** ప్రవక్తా! వారు హితబోధ పొందటానికి మేము ఈ గ్రంథాన్ని నీ భాషలో సరళం చేశాము, ఇక నీవు కూడా నిరీక్షించు, వారు కూడా నిరీక్షిస్తున్నారు.

5. అంటే, ఆయన ప్రవక్త అనే విషయంలో ఏ విధమైన సందేహానికి తావులేదు. అది తేటతెల్లమే.
6. విభిన్న దేశాలకు చెందిన రాజులకు గల ప్రత్యేకమైన బిరుదుల-కిస్రా, ఖైసర్, ఫిరౌన్ - వలె తుబ్బా అనే బిరుదు హిమైరా తెగకు చెందిన రాజులకు ఉండేది. వీరు సబా జాతికి చెందిన ఒక శాఖతో సంబంధం కలిగి ఉన్నారు; వీరు అరేబియాను అనేక శతాబ్దాలు పాలించారు.

ఆయతులు 37

## 45. అల్ జాసియహ్

అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 – 2** హా. మీమ్. ఈ గ్రంథం శక్తిమంతుడూ, వివేకవంతుడూ అయిన అల్లాహ్ తరఫు నుండి అవతరించింది.

**3 - 6** వాస్తవంగానే విశ్వాసుల కొరకు ఆకాశాలలోనూ, భూమిలోనూ అసంఖ్యాకమైన సూచనలు ఉన్నాయి. మిమ్మల్ని సృష్టించటంలోనూ, అల్లాహ్ (భూమిలో) వ్యాపింపజేస్తూ ఉన్నటువంటి జంతువులలోనూ, నమ్మేవారి కొరకు గొప్ప సూచనలు ఉన్నాయి. రేయింబవళ్ల మధ్య ఉన్న వ్యత్యాసంలో, వ్యతిరేకతలో, ఆకాశం నుండి అల్లాహ్ అవతరింపజేస్తున్న ఆహారంలో – దాని ద్వారా ఆయన మృతభూమిని బ్రతికిస్తాడు – వాయువుల పరిభ్రమణంలో, బుద్ధిని ఉపయోగించే వారికి ఎన్నో సూచనలు ఉన్నాయి. ఇవన్నీ అల్లాహ్ సూచనలు, మేము వాటిని నీకు యథాతథంగా వివరిస్తున్నాము. ఇక అసలు వారు అల్లాహ్‌నూ, ఆయన వాక్యాలనూ కాక మరే విషయాన్ని విశ్వసిస్తారు?

**7 - 10** అసత్యవాది, దుష్కార్యపరుడు అయిన ప్రతివ్యక్తి సర్వనాశనమవుతాడు. అతడి ముందు అల్లాహ్ వాక్యాలు పఠించబడతాయి, వాటిని అతడు వింటాడు. ఆ తరువాత అతడు వాటిని ఎన్నడూ విననివాని మాదిరిగా అహంభావంతో తన తిరస్కార వైఖరిపై మొండిగా ఉండిపోతాడు. అటువంటి వ్యక్తికి అత్యంత బాధాకరమైన శిక్షపడుతుందనే శుభవార్తను వినిపించు. మా వాక్యాలకు సంబంధించిన విషయం ఏదైనా అతడికి తెలిసినప్పుడు, దానిని అతడు ఎగతాళి చేస్తాడు. అటువంటి వారందరికీ అవమానకరమైన శిక్షపడుతుంది. వారి ముందు నరకం ఉన్నది. వారు ప్రపంచంలో సముపార్జించుకున్న దానిలో ఏదీ వారికి ఏ విధంగానూ పనికిరాదు. అల్లాహ్‌ను కాదని వారు తమ సంరక్షకులుగా చేసుకున్న వారు సైతం, వారికొరకు ఏమీ చేయలేరు. వారి కొరకు పెద్దయాతన ఉన్నది.

**11** ఈ ఖురాను పూర్తిగా మార్గదర్శకత్వమే. తమ ప్రభువు వాక్యాలను విశ్వసించకుండా తిరస్కరించిన వారికి వ్యథాభరిత మైన పెద్ద శిక్ష పడుతుంది.

## ٤٥ سُوْرَةُ الْجَاثِيَةِ مَكِّيَّةٌ ٦٥

اٰيَاتُهَا ٣٧ رُكُوْعَاتُهَا ٤

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

حٰمٓ ① تَنْزِيْلُ الْكِتٰبِ مِنَ اللّٰهِ الْعَزِيْزِ
الْحَكِيْمِ ② اِنَّ فِي السَّمٰوٰتِ وَ الْاَرْضِ لَاٰيٰتٍ
لِّلْمُؤْمِنِيْنَ ③ وَ فِيْ خَلْقِكُمْ وَ مَا يَبُثُّ مِنْ
دَآبَّةٍ اٰيٰتٌ لِّقَوْمٍ يُّوْقِنُوْنَ ④ وَ اخْتِلَافِ
الَّيْلِ وَ النَّهَارِ وَ مَآ اَنْزَلَ اللّٰهُ مِنَ السَّمَآءِ
مِنْ رِّزْقٍ فَاَحْيَا بِهِ الْاَرْضَ بَعْدَ مَوْتِهَا وَ
تَصْرِيْفِ الرِّيٰحِ اٰيٰتٌ لِّقَوْمٍ يَّعْقِلُوْنَ ⑤
تِلْكَ اٰيٰتُ اللّٰهِ نَتْلُوْهَا عَلَيْكَ بِالْحَقِّ ۚ فَبِاَيِّ
حَدِيْثٍۭ بَعْدَ اللّٰهِ وَ اٰيٰتِهٖ يُؤْمِنُوْنَ ⑥ وَيْلٌ
لِّكُلِّ اَفَّاكٍ اَثِيْمٍ ⑦ يَّسْمَعُ اٰيٰتِ اللّٰهِ تُتْلٰى
عَلَيْهِ ثُمَّ يُصِرُّ مُسْتَكْبِرًا كَاَنْ لَّمْ يَسْمَعْهَا ۚ
فَبَشِّرْهُ بِعَذَابٍ اَلِيْمٍ ⑧ وَ اِذَا عَلِمَ مِنْ
اٰيٰتِنَا شَيْـًٔا اتَّخَذَهَا هُزُوًا ۭ اُولٰٓئِكَ لَهُمْ
عَذَابٌ مُّهِيْنٌ ⑨ مِنْ وَّرَآئِهِمْ جَهَنَّمُ ۚ وَلَا
يُغْنِيْ عَنْهُمْ مَّا كَسَبُوْا شَيْـًٔا وَّ لَا مَا اتَّخَذُوْا
مِنْ دُوْنِ اللّٰهِ اَوْلِيَآءَ ۚ وَ لَهُمْ عَذَابٌ
عَظِيْمٌ ⑩ هٰذَا هُدًى ۚ وَ الَّذِيْنَ كَفَرُوْا بِاٰيٰتِ
رَبِّهِمْ لَهُمْ عَذَابٌ مِّنْ رِّجْزٍ اَلِيْمٌ ⑪ ع ١/١٧

اَللّٰهُ الَّذِیْ سَخَّرَ لَكُمُ الْبَحْرَ لِتَجْرِیَ الْفُلْكُ
فِیْهِ بِاَمْرِهٖ وَ لِتَبْتَغُوْا مِنْ فَضْلِهٖ وَ لَعَلَّكُمْ
تَشْكُرُوْنَ ۚ۝١٢ وَ سَخَّرَ لَكُمْ مَّا فِی السَّمٰوٰتِ وَ مَا
فِی الْاَرْضِ جَمِیْعًا مِّنْهُ ؕ اِنَّ فِیْ ذٰلِكَ لَاٰیٰتٍ
لِّقَوْمٍ یَّتَفَكَّرُوْنَ ۝١٣ قُلْ لِّلَّذِیْنَ اٰمَنُوْا یَغْفِرُوْا
لِلَّذِیْنَ لَا یَرْجُوْنَ اَیَّامَ اللّٰهِ لِیَجْزِیَ قَوْمًۢا
بِمَا كَانُوْا یَكْسِبُوْنَ ۝١٤ مَنْ عَمِلَ صَالِحًا
فَلِنَفْسِهٖ ۚ وَ مَنْ اَسَآءَ فَعَلَیْهَا ؗ ثُمَّ اِلٰی رَبِّكُمْ
تُرْجَعُوْنَ ۝١٥ وَ لَقَدْ اٰتَیْنَا بَنِیْۤ اِسْرَآءِیْلَ
الْكِتٰبَ وَ الْحُكْمَ وَ النُّبُوَّةَ وَ رَزَقْنٰهُمْ مِّنَ
الطَّیِّبٰتِ وَ فَضَّلْنٰهُمْ عَلَی الْعٰلَمِیْنَ ۚ۝١٦ وَ اٰتَیْنٰهُمْ
بَیِّنٰتٍ مِّنَ الْاَمْرِ ۚ فَمَا اخْتَلَفُوْۤا اِلَّا مِنْۢ بَعْدِ
مَا جَآءَهُمُ الْعِلْمُ ۙ بَغْیًۢا بَیْنَهُمْ ؕ اِنَّ رَبَّكَ
یَقْضِیْ بَیْنَهُمْ یَوْمَ الْقِیٰمَةِ فِیْمَا كَانُوْا فِیْهِ
یَخْتَلِفُوْنَ ۝١٧ ثُمَّ جَعَلْنٰكَ عَلٰی شَرِیْعَةٍ مِّنَ
الْاَمْرِ فَاتَّبِعْهَا وَ لَا تَتَّبِعْ اَهْوَآءَ الَّذِیْنَ لَا
یَعْلَمُوْنَ ۝١٨ اِنَّهُمْ لَنْ یُّغْنُوْا عَنْكَ مِنَ اللّٰهِ
شَیْـًٔا ؕ وَ اِنَّ الظّٰلِمِیْنَ بَعْضُهُمْ اَوْلِیَآءُ
بَعْضٍ ۚ وَ اللّٰهُ وَلِیُّ الْمُتَّقِیْنَ ۝١٩ هٰذَا بَصَآئِرُ
لِلنَّاسِ وَ هُدًی وَّ رَحْمَةٌ لِّقَوْمٍ یُّوْقِنُوْنَ ۝٢٠

**12 - 13** సముద్రాన్ని మీకు వశపరచినవాడు అల్లాహ్‌యే కదా! ఆయన ఆదేశానుసారం అందులో ఓడలు ప్రయాణం చేయటానికి; మీరు ఆయన అనుగ్రహాన్ని అన్వేషించటానికి; కృతజ్ఞులు కావటానికి: భూమిలోని, ఆకాశాలలోని సకల వస్తువులనూ ఆయన మీకు వశపరచాడు. ఇదంతా తన వద్ద నుండే[1]– ఆలోచనాపరులకు ఇందులో గొప్ప సూచనలు ఉన్నాయి.

**14 - 15** ప్రవక్తా! విశ్వాసులతో ఇలా అను: "అల్లాహ్ తరఫు నుండి చెడ్డ రోజులు వస్తాయని భయపడని వారి చేష్టలను క్షమించండి; స్వయంగా అల్లాహ్ ఒక వర్గం వారికి వారి సంపాదనకు ప్రతిఫలం ఇవ్వటానికి. సత్కార్యం చేసేవాడు దానిని తన కొరకే చేసుకుంటాడు. దుష్కార్యం చేసేవాడు తానే దాని ఫలితాన్ని అనుభవిస్తాడు. తరువాత అందరూ తమ ప్రభువు వైపునకే మరలిపోతారు.

**16 - 20** పూర్వం మేము ఇస్రాయీల్ సంతతి వారికి గ్రంథాన్నీ, ఆజ్ఞనూ, ప్రవక్త పదవినీ ప్రసాదించాము. వారికి మేము మంచి జీవన సామగ్రిని అనుగ్రహించాము. ప్రపంచంలోని ప్రజలందరిపై వారికి ఘనతను దయ చేశాము. ధర్మం విషయంలో వారికి స్పష్టమైన ఉపదేశాలను ఇచ్చాము. తరువాత వారి మధ్య తలెత్తిన విభేదాలు (తెలియకపోవటం వల్లకాదు కాని) జ్ఞానం వచ్చిన తరువాతనే తలెత్తాయి, వారు ఒకరికొకరు అన్యాయం చేయదలచుకున్న కారణంగానే తలెత్తాయి. ప్రళయం నాడు అల్లాహ్ వారు విభేదిస్తూ ఉన్న వ్యవహారాలను గురించి తీర్పు చెబుతాడు. ఇప్పుడు ప్రవక్తా! మేము నిన్ను ధర్మం విషయంలో ఒక స్పష్టమైన రాజమార్గంపై (షరియత్) స్థిరపరిచాము. కనుక నీవు దానిపై మాత్రమే నడువు. జ్ఞాన హీనుల కోరికలను అనుసరించకు. అల్లాహ్‌కు ప్రతిగా వారు నీకు ఏమాత్రం ఉపయోగపడరు.[2] దుర్మార్గులు ఒకరికొకరు సహాయకులు. భయభక్తులు కలవారి సహాయకుడు అల్లాహ్. దూరదృష్టితో నిండివున్న ఈ కాంతులు ప్రజలందరి కొరకు; నమ్మే వారికి ఇవి మార్గదర్శకత్వం, కారుణ్యమూను.

**21 - 22** చెడులకు పాల్పడినవారు, తమనూ, విశ్వసించి మంచిపనులు చేసేవారినీ మేము సమానంగా చేస్తామనీ, వారి జీవన్మరణాలు ఒకే విధంగా ఉండేలా చేస్తామనీ అనుకుంటు న్నారా? వారు చేసే నిర్ణయాలు చాల చెడ్డవి. అల్లాహ్ ఆకాశా లనూ, భూమినీ సత్యంతో సృజించాడు, ప్రతి ప్రాణికీ దాని సంపాదన ప్రకారం ప్రతిఫలం ఇవ్వాలని సృజించాడు. ప్రజలకు అన్యాయం ఎంతమాత్రం జరగదు.

**23** తన మనోవాంఛలను తన దేవుడుగా చేసుకున్న వ్యక్తి స్థితిని గురించి కూడా నీవు ఎప్పుడైనా ఆలోచించావా? జ్ఞానం[3] ఉన్నప్పటికీ, అతనిని అల్లాహ్ మార్గభ్రష్టత్వంలోకి విసిరి వేశాడు, అతని హృదయం మీదా, చెవుల మీదా ముద్రవేశాడు, అతని కళ్లకు తెరవేశాడు. ఇక అల్లాహ్ తప్ప అతనికి మార్గం చూపే వాడెవడున్నాడు? మీరు గుణపాఠాన్ని నేర్చుకోరా?

**24 - 27** వారు ఇలా అంటారు, "జీవితం అంటే కేవలం మన ఈ ప్రాపంచిక జీవితం మాత్రమే. ఇక్కడే మన మరణం, ఇక్కడే మన జీవనం. కాల పరిభ్రమణం తప్ప, మనలను ఏదీ చంపలేదు." వాస్తవంగా ఈ విషయానికి సంబంధించిన జ్ఞానమేదీ వారివద్ద లేదు. వారు కేవలం ఊహ ఆధారంగా ఈ మాటలు అంటున్నారు. స్పష్టమైన మా వాక్యాలను వారికి వినిపించినప్పుడు, "నీవు సత్యవంతుడవే అయితే, మా తాత ముత్తాతలను లేపి తీసుకురా" అనేది తప్ప వారివద్ద మరొక తర్కం ఏదీ ఉండదు. ప్రవక్తా! వారితో ఇలా అను, "అల్లాహ్‌యే మీకు జీవితం ప్రసాదిస్తున్నాడు, తరువాత ఆయనే మీకు మరణం కలుగజేస్తున్నాడు, ఆపైన ఆయనే మిమ్మల్ని ప్రళయం నాడు సమావేశపరుస్తాడు; అది వచ్చే విషయం గురించి ఏమాత్రం సందేహం లేదు. కాని చాలా మందికి ఈ విషయం తెలియదు. భూమి, ఆకాశాల సామ్రాజ్యాధికారం అల్లాహ్‌దే. ప్రళయగడియ వచ్చిపడే ఆనాడు అసత్యవాదులు నష్టానికి గురిఅవుతారు.

اَمۡ حَسِبَ الَّذِيۡنَ اجۡتَرَحُوا السَّيِّاٰتِ اَنۡ
نَّجۡعَلَهُمۡ كَالَّذِيۡنَ اٰمَنُوۡا وَعَمِلُوا الصّٰلِحٰتِ ۙ
سَوَآءً مَّحۡيَاهُمۡ وَ مَمَاتُهُمۡ ؕ سَآءَ مَا يَحۡكُمُوۡنَ ﴿٢١﴾ ع ٢ ١٠ ١٨
وَ خَلَقَ اللّٰهُ السَّمٰوٰتِ وَ الۡاَرۡضَ بِالۡحَقِّ
وَلِتُجۡزٰى كُلُّ نَفۡسٍۭ بِمَا كَسَبَتۡ وَ هُمۡ لَا
يُظۡلَمُوۡنَ ﴿٢٢﴾ اَفَرَءَيۡتَ مَنِ اتَّخَذَ اِلٰهَهٗ هَوٰٮهُ
وَ اَضَلَّهُ اللّٰهُ عَلٰى عِلۡمٍ وَّخَتَمَ عَلٰى سَمۡعِهٖ وَ
قَلۡبِهٖ وَ جَعَلَ عَلٰى بَصَرِهٖ غِشٰوَةً ؕ فَمَنۡ يَّهۡدِيۡهِ
مِنۡۢ بَعۡدِ اللّٰهِ ؕ اَفَلَا تَذَكَّرُوۡنَ ﴿٢٣﴾ وَ قَالُوۡا مَا
هِىَ اِلَّا حَيَاتُنَا الدُّنۡيَا نَمُوۡتُ وَنَحۡيَا وَ مَا
يُهۡلِكُنَاۤ اِلَّا الدَّهۡرُ ۚ وَمَا لَهُمۡ بِذٰلِكَ مِنۡ
عِلۡمٍ ۚ اِنۡ هُمۡ اِلَّا يَظُنُّوۡنَ ﴿٢٤﴾ وَ اِذَا تُتۡلٰى
عَلَيۡهِمۡ اٰيٰتُنَا بَيِّنٰتٍ مَّا كَانَ حُجَّتَهُمۡ اِلَّاۤ اَنۡ
قَالُوا ائۡتُوۡا بِاٰبَآٮِٕنَاۤ اِنۡ كُنۡتُمۡ صٰدِقِيۡنَ ﴿٢٥﴾ قُلِ
اللّٰهُ يُحۡيِيۡكُمۡ ثُمَّ يُمِيۡتُكُمۡ ثُمَّ يَجۡمَعُكُمۡ اِلٰى
يَوۡمِ الۡقِيٰمَةِ لَا رَيۡبَ فِيۡهِ وَلٰـكِنَّ اَكۡثَرَ
النَّاسِ لَا يَعۡلَمُوۡنَ ﴿٢٦﴾ ع وَ لِلّٰهِ مُلۡكُ السَّمٰوٰتِ ع ٣ ٥ ١٩
وَالۡاَرۡضِ ؕ وَيَوۡمَ تَقُوۡمُ السَّاعَةُ يَوۡمَٮِٕذٍ
يَّخۡسَرُ الۡمُبۡطِلُوۡنَ ﴿٢٧﴾

وَتَرٰى كُلَّ اُمَّةٍ جَاثِيَةً ۫ كُلُّ اُمَّةٍ تُدْعٰٓى
اِلٰى كِتٰبِهَا ؕ اَلْيَوْمَ تُجْزَوْنَ مَا كُنْتُمْ
تَعْمَلُوْنَ ﴿٢٨﴾ هٰذَا كِتٰبُنَا يَنْطِقُ عَلَيْكُمْ
بِالْحَقِّ ؕ اِنَّا كُنَّا نَسْتَنْسِخُ مَا كُنْتُمْ
تَعْمَلُوْنَ ﴿٢٩﴾ فَاَمَّا الَّذِيْنَ اٰمَنُوْا وَعَمِلُوا
الصّٰلِحٰتِ فَيُدْخِلُهُمْ رَبُّهُمْ فِيْ رَحْمَتِهٖ ؕ ذٰلِكَ
هُوَ الْفَوْزُ الْمُبِيْنُ ﴿٣٠﴾ وَاَمَّا الَّذِيْنَ كَفَرُوْا ۫
اَفَلَمْ تَكُنْ اٰيٰتِيْ تُتْلٰى عَلَيْكُمْ فَاسْتَكْبَرْتُمْ وَ
كُنْتُمْ قَوْمًا مُّجْرِمِيْنَ ﴿٣١﴾ وَاِذَا قِيْلَ اِنَّ وَعْدَ
اللّٰهِ حَقٌّ وَّالسَّاعَةُ لَا رَيْبَ فِيْهَا قُلْتُمْ مَّا
نَدْرِيْ مَا السَّاعَةُ ۙ اِنْ نَّظُنُّ اِلَّا ظَنًّا وَّ مَا
نَحْنُ بِمُسْتَيْقِنِيْنَ ﴿٣٢﴾ وَبَدَا لَهُمْ سَيِّاٰتُ مَا
عَمِلُوْا وَحَاقَ بِهِمْ مَّا كَانُوْا بِهٖ
يَسْتَهْزِءُوْنَ ﴿٣٣﴾ وَ قِيْلَ الْيَوْمَ نَنْسٰىكُمْ كَمَا
نَسِيْتُمْ لِقَآءَ يَوْمِكُمْ هٰذَا وَ مَاْوٰىكُمُ النَّارُ وَمَا
لَكُمْ مِّنْ نّٰصِرِيْنَ ﴿٣٤﴾ ذٰلِكُمْ بِاَنَّكُمُ اتَّخَذْتُمْ
اٰيٰتِ اللّٰهِ هُزُوًا وَّ غَرَّتْكُمُ الْحَيٰوةُ الدُّنْيَا ۚ
فَالْيَوْمَ لَا يُخْرَجُوْنَ مِنْهَا وَ لَا هُمْ
يُسْتَعْتَبُوْنَ ﴿٣٥﴾ فَلِلّٰهِ الْحَمْدُ رَبِّ السَّمٰوٰتِ
وَرَبِّ الْاَرْضِ رَبِّ الْعٰلَمِيْنَ ﴿٣٦﴾ وَ لَهُ
الْكِبْرِيَآءُ فِي السَّمٰوٰتِ وَ الْاَرْضِ ۠ وَ هُوَ
الْعَزِيْزُ الْحَكِيْمُ ﴿٣٧﴾ ع ٤ ١١ ٢٠

**28 – 35** అప్పుడు నీవు ప్రతి వర్గమూ మోకరిల్లి ఉండటాన్ని చూస్తావు. వచ్చి, తన కర్మల పత్రాన్ని చూడవలసినదిగా ప్రతి వర్గాన్నీ పిలవటం జరుగుతుంది. వారితో ఇలా అనబడుతుంది, "ఈనాడు మీకు మీరు చేసిన కర్మలకు ప్రతిఫలం ఇవ్వబడు తుంది. ఇది మేము తయారు చేయించిన కర్మల పత్రం. అది మీ విషయంలో జరిగింది జరిగినట్లుగా సాక్ష్యమిస్తుంది. మీరు చేస్తూ ఉండినదంతా మేము వ్రాయిస్తూ పోయాము." విశ్వసించి, మంచిపనులు చేస్తూ ఉండిన వారిని వారి ప్రభువు తన కారుణ్యంలోకి ప్రవేశింపజేస్తాడు. అసలు స్పష్టమైన సాఫల్యం అంటే ఇదే. అవిశ్వాసులై పోయిన వారితో (ఇలా అనబడుతుంది), "నా వాక్యాలు మీకు వినిపించబడుతూ ఉండలేదా? కాని మీరు అహంభావానికి వశులై అపరాధులై పోయారు. అల్లాహ్ వాగ్దానం సత్యమైనదనీ, ప్రళయం వచ్చే విషయం గురించి ఏమాత్రం సందేహం లేదనీ అనబడిన ప్పుడు, మీరు, ప్రళయం అంటే ఏమిటో మాకు తెలియదు. మేము కేవలం అనుమానాస్పదమైన విషయంగానే తలుస్తాము. మాకు నమ్మకం లేదు" అని అనేవారు. అప్పుడు వారికి తమ కర్మల కీడులు ఏమిటో ప్రస్ఫుటమవుతాయి. వారు తాము ఎగతాళి చేసిన దాని యొక్క వలయంలోనే చిక్కుకుపోతారు. వారితో ఇలా అనటం జరుగుతుంది, "మీరు ఈనాటి సమా వేశాన్ని మరచిపోయిన విధంగానే, మేము కూడ ఈనాడు మిమ్మల్ని మరచిపోతాము. మీ నివాసం ఇక నరకమే. మీకు సహాయం చేసేవాడెవడూ లేడు. మీరు అల్లాహ్ వాక్యాలను పరిహాసంగా తీసుకోవటంవల్లా, ప్రాపంచిక జీవితం మిమ్మల్ని మోసానికి గురిచేయటం వల్లా మీ గతి ఇలా అయింది. కనుక ఈనాడు వారిని నరకం నుండి బయటకు తీయటమూ జరగదు, క్షమాభిక్షను అనుగ్రహించు అని వేడుకొని మీ ప్రభువును ప్రసన్నుడుగా చేసుకోండి[4] అని వారికి చెప్పటమూ జరగదు."

**36 – 37** కనుక అల్లాహ్ మాత్రమే స్తుతిపాత్రుడు. ఆయన భూమికీ, ఆకాశాలకూ ప్రభువు; సకల లోకాలకూ ప్రభువు. భూమ్యాకాశాలలో ఘనత ఆయనకు మాత్రమే చెందుతుంది. శక్తిమంతుడూ, వివేకవంతుడూ ఆయన మాత్రమే.

1. దీనికి రెండు అర్థాలు ఉన్నాయి. ఒకటి ; అల్లాహ్ యొక్క ఈ వరం ప్రపంచంలోని రాజులు ఇచ్చే వరాలవంటి వరం ఎంతమాత్రం కాదు. వారు ప్రజల నుండి వసూలుచేసిన సొత్తును ప్రజలలో తమకు ఇష్టమైన వారికి వరంగా ఇస్తారు. దీనికి భిన్నంగా ఈ వరాలన్నీ అల్లాహ్ సృష్టించినవే, ఆయన వాటిని తన తరఫు నుండి వారికి ప్రసాదిస్తాడు. రెండు; ఈ వరాలను సృష్టించటంలోనేమీ, వాటిని మానవులకు స్వాధీనం చేయటంలోనేమీ అల్లాహ్‌కు ఇతరుల భాగస్వామ్యమూ లేదు, జోక్యమూ లేదు. వాటి సృష్టికర్త కేవలం అల్లాహ్‌యే. ఆయనే తన తరఫు నుండి వాటిని మానవులకు ప్రసాదించాడు.

2. అంటే, ఒకవేళ నీవు ప్రజలను సంతోషపెట్టటానికి అల్లాహ్ ధర్మంలో ఎటువంటి మార్పులు, చేర్పులు చేసినా అప్పుడు అల్లాహ్ విధించే దండన నుండి, ఆయన ముందు జవాబుదారీ నుండి వారు నిన్ను రక్షించలేరు.

3. అసలు "అజల్లహుల్లాహు అలా ఇల్మిన్" అనే పదాలు ఉపయోగించబడ్డాయి. ఈ పదాల ఒక అర్థం ఇది: ఆ వ్యక్తి విద్వాంసుడు అయినప్పటికీ, అల్లాహ్ అతనిని అపమార్గంలో విసరివేశాడు. ఎందుకంటే, అతను మనోవాంఛలకు దాసుడైపోయాడు. వాటి రెండో అర్థం ఇది : అతను తన మనోవాంఛలను తన దేవుడుగా చేసుకున్నాడు అనే విషయం తెలిసిన అల్లాహ్ అతనిని మార్గభ్రష్టునిగా చేశాడు.

4. ఈ చివరి వాక్యం : ఒక యజమాని తన కొందరు సేవకుల మీద కసురుకొన్న తరువాత, ఇతరులను ఉద్దేశించి, "బాగు బాగు, ఈ అయోగ్యులకు ఈ శిక్ష పడవలసిందే" అని అన్నట్లుగా ఉంది.

آياتها ٣٥ ٤٦ سُوْرَةُ الْاَحْقَافِ مَكِّيَّةٌ ٦٦ ركوعاتها ٤

ఆయతులు 35 **46. అల్ అహ్ఖాఫ్** అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○

حٰمٓ ۚ ① تَنۡزِيۡلُ الۡكِتٰبِ مِنَ اللّٰهِ الۡعَزِيۡزِ
الۡحَكِيۡمِ ② مَا خَلَقۡنَا السَّمٰوٰتِ وَ الۡاَرۡضَ وَ
مَا بَيۡنَهُمَاۤ اِلَّا بِالۡحَقِّ وَ اَجَلٍ مُّسَمًّى ؕ وَ
الَّذِيۡنَ كَفَرُوۡا عَمَّاۤ اُنۡذِرُوۡا مُعۡرِضُوۡنَ ③
قُلۡ اَرَءَيۡتُمۡ مَّا تَدۡعُوۡنَ مِنۡ دُوۡنِ اللّٰهِ
اَرُوۡنِىۡ مَاذَا خَلَقُوۡا مِنَ الۡاَرۡضِ اَمۡ لَهُمۡ
شِرۡكٌ فِى السَّمٰوٰتِ ؕ اِيۡتُوۡنِىۡ بِكِتٰبٍ مِّنۡ قَبۡلِ
هٰذَاۤ اَوۡ اَثٰرَةٍ مِّنۡ عِلۡمٍ اِنۡ كُنۡتُمۡ صٰدِقِيۡنَ ④
وَمَنۡ اَضَلُّ مِمَّنۡ يَّدۡعُوۡا مِنۡ دُوۡنِ اللّٰهِ مَنۡ
لَّا يَسۡتَجِيۡبُ لَهٗۤ اِلٰى يَوۡمِ الۡقِيٰمَةِ وَهُمۡ عَنۡ
دُعَآئِهِمۡ غٰفِلُوۡنَ ⑤ وَ اِذَا حُشِرَ النَّاسُ كَانُوۡا
لَهُمۡ اَعۡدَآءً وَّ كَانُوۡا بِعِبَادَتِهِمۡ كٰفِرِيۡنَ ⑥

**1 – 2** హా. మీమ్. ఈ గ్రంథం మహాశక్తిమంతుడూ, మహా వివేకవంతుడూ అయిన అల్లాహ్ తరఫు నుండి అవతరించింది.

**3** మేము భూమినీ, ఆకాశాలనూ, వాటి మధ్య ఉన్న సకల వస్తువులనూ సత్యం ప్రకారం, ఒక ప్రత్యేక కాల నిర్ణయంతో సృష్టించాము. కాని ఏ యథార్థం గురించి ఈ అవిశ్వాసులకు హెచ్చరిక చేయబడిందో, ఆ యథార్థానికి వారు విముఖులయ్యారు.

**4 – 6** ప్రవక్తా! వారితో ఇలా అను, "మీరు దేవుణ్ణి త్రోసిరాజని వేడుకుంటున్న శక్తులు అసలు ఏమిటో ఎప్పుడైనా మీరు కళ్లు తెరచి చూశారా? భూమిలో వారు సృష్టించింది ఏమిటో, కొంచెం నాకు చూపండి? లేదా ఆకాశాల సృష్టిలో, వాటి నిర్వహణలో వాటి పాత్ర ఏమైనా ఉందా? ఒకవేళ ఇదివరకు వచ్చిన ఏదైనా గ్రంథంగానీ లేదా జ్ఞాన అవశేషం గానీ (ఈ విశ్వాసాలకు ఆధారంగా) మీదగ్గర ఉంటే, దాన్నే తీసుకురండి, మీరు సత్యవంతులే అయితే." అల్లాహ్‌ను కాదని, ప్రళయం వచ్చే వరకు అతనికి సమాధానమైనా ఇవ్వలేని వారిని,[1] మొరపెట్టుకునే వారు తమకు మొరపెట్టుకుంటున్నారనే విషయం కూడ ఎరుగని వారిని వేడుకునే వాడికంటే పరమ భ్రష్టుడైన మానవుడు ఎవడు ఉంటాడు? మానవులందరినీ సమావేశపరచినప్పుడు, వారు తమను వేడుకున్న వారికి విరోధులైపోతారు, వారి ఆరాధనను తిరస్కరిస్తారు.[2]

1. సమాధానం ఇవ్వటం అంటే, ప్రజల విజ్ఞప్తులపై తగు నిర్ణయాలు చేసి అమలుపరచటం. అర్థం ఏమిటంటే, వారి ప్రార్థనలపై, వారి విజ్ఞప్తులపై తగు నిర్ణయాలు చేసి వాటిని అమలుపరచే అధికారాలేవీ ఈ దేవుళ్లకు లేవు.
2. అంటే, వారు నిర్మొహమాటంగా ఇలా అనేస్తారు : మీరు సహాయం కోసం మాతో మొరపెట్టుకోమనిగానీ, మేము మీ అవసరాలను తీర్చగలమనిగానీ మేము వారికి ఎన్నడూ చెప్పలేదు; వారు మమ్మల్ని వేడుకుంటారనే విషయం కూడ మాకు తెలియదు. వారంతట వారే మమ్మల్ని తమ అవసరాలు తీర్చేవారుగా ఊహించి మమ్మల్ని వేడుకోవటం ప్రారంభించారు.

وَ اِذَا تُتۡلٰى عَلَيۡهِمۡ اٰيٰتُنَا بَيِّنٰتٍ قَالَ الَّذِيۡنَ
كَفَرُوۡا لِلۡحَقِّ لَمَّا جَآءَهُمۡ ۙ هٰذَا سِحۡرٌ
مُّبِيۡنٌ ؕ﴿۷﴾ اَمۡ يَقُوۡلُوۡنَ افۡتَرٰٮهُ ؕ قُلۡ اِنِ
افۡتَرَيۡتُهٗ فَلَا تَمۡلِكُوۡنَ لِىۡ مِنَ اللّٰهِ شَيۡـًٔا ؕ هُوَ
اَعۡلَمُ بِمَا تُفِيۡضُوۡنَ فِيۡهِ ؕ كَفٰى بِهٖ شَهِيۡدًۢا
بَيۡنِىۡ وَبَيۡنَكُمۡ ؕ وَهُوَ الۡغَفُوۡرُ الرَّحِيۡمُ ﴿۸﴾ قُلۡ
مَا كُنۡتُ بِدۡعًا مِّنَ الرُّسُلِ وَمَاۤ اَدۡرِىۡ مَا
يُفۡعَلُ بِىۡ وَلَا بِكُمۡ ؕ اِنۡ اَتَّبِعُ اِلَّا مَا يُوۡحٰٓى
اِلَىَّ وَمَاۤ اَنَا اِلَّا نَذِيۡرٌ مُّبِيۡنٌ ﴿۹﴾ قُلۡ
اَرَءَيۡتُمۡ اِنۡ كَانَ مِنۡ عِنۡدِ اللّٰهِ وَكَفَرۡتُمۡ بِهٖ
وَشَهِدَ شَاهِدٌ مِّنۡۢ بَنِىۡۤ اِسۡرَآءِيۡلَ عَلٰى مِثۡلِهٖ
فَاٰمَنَ وَاسۡتَكۡبَرۡتُمۡ ؕ اِنَّ اللّٰهَ لَا يَهۡدِى
الۡقَوۡمَ الظّٰلِمِيۡنَ ﴿۱۰﴾ ع

**7 - 8** ఎంతో స్పష్టమైన మా వాక్యాలను వారికి వినిపించినప్పుడు, సత్యం వారి ముందుకు వచ్చినప్పుడు, ఈ అవిశ్వాసులు దానిని గురించి, "ఇది స్పష్టంగా మంత్రజాలమే" అని అంటారు. అయితే ప్రవక్తయే దానిని కల్పించాడని వారి భావమా? వారితో ఇలా అను, "ఒకవేళ నేనే దానిని కల్పించి ఉన్నట్లయితే, మీరు దేవుని శిక్ష నుండి నన్ను ఏమాత్రం కాపాడలేరు. మీరు కల్పించే విషయాలను అల్లాహ్ బాగా ఎరుగును. నాకూ మీకూ మధ్య సాక్షిగా దేవుడే సరిపోతాడు. ఆయన ఎక్కువగా మన్నించేవాడు, కరుణించేవాడూను."[3]

**9 - 10** వారితో ఇలా అను, "నేను కొత్త ప్రవక్తనేమీ కాను.[4] రేపు మీకు ఏమి జరుగనున్నదో, నాకు ఏమి కానున్నదో, నాకైతే తెలియదు. నేను నావద్దకు పంపబడే దైవవాణి (వహీ)ని మాత్రమే అనుసరిస్తున్నాను. నేను స్పష్టంగా హెచ్చరిక చేసే వాణ్ణి తప్ప మరేమీ కాను." ప్రవక్తా! వారికి ఇలా చెప్పు: "ఒకవేళ ఈ గ్రంథం అల్లాహ్ తరఫు నుండి వచ్చి ఉండి, మీరు దానిని తిరస్కరిస్తూ ఉన్నట్లయితే, (అప్పుడు మీ గతి ఏమవుతుందో) అనే విషయం గురించి మీరెప్పుడైనా ఆలోచించారా? ఇటువంటి ఒక గ్రంథాన్ని గురించి ఇస్రాయీల్ సంతతికి చెందిన ఒక సాక్షి సాక్ష్యం కూడ ఇచ్చి ఉన్నాడు. అతడేమో విశ్వసించాడు, మీరేమో అహంభావానికి లోనయ్యారు.[5] అటువంటి దుర్మార్గులకు అల్లాహ్ సన్మార్గం చూపడు."

3. ఇక్కడ ఈ వాక్యానికి రెండు అర్థాలున్నాయి : ఒకటి, నిజానికి అల్లాహ్ కరుణ, సహనముల వల్లనే, దైవగ్రంథం అసత్యమని చెప్పటానికి జంకనివారు సైతం జీవిస్తున్నారు. కాకుంటే, ఒకవేళ నిర్దయుడూ, క్రూరుడూ అయిన దేవుడు ఈ సృష్టికి ప్రభువు అయితే, ఇటువంటి దుస్సాహసాలకు ఒడిగట్టే అహంభావులు ఒక్క క్షణమైనా బ్రతకలేరు. రెండు, దుర్మార్గులారా! ఇప్పుడైనా మీరు మీ మొండి వైఖరిని మానుకుంటే, దేవుని కారుణ్య ద్వారాలు మీకై తెరచి ఉంటాయి, మీరు ఇంతకు ముందు చేసిన పాపాలు పోతాయి.

4. అంటే, గత ప్రవక్తలందరూ మానవులే అయినట్లు నేనునూ ఒక మానవుడనే. వారికి దైవ గుణాలలో, దైవాధికారాలలో భాగస్వామ్యం లేనట్లు, నాకునూ వాటిలో భాగస్వామ్యం లేదు.

5. ఇక్కడ సాక్షి అంటే ఎవరో ఒక ప్రత్యేక వ్యక్తి అని భావం కాదు; ఇస్రాయీల్ సంతతికి చెందిన ఒక సామాన్య మానవుడు అని అర్థం. దైవసూక్తి ఉద్దేశ్యం ఏమిటంటే, దివ్య ఖురాను ఏ బోధలనైతే మీ ముందు ఉంచుతోందో, అవి కొత్తవీ కావు, ప్రపంచంలో మొట్టమొదటిసారిగా మీ ముందే ఉంచబడినవీ కావు ; మానవజాతి ముందు ఎన్నడూ ఇంతవరకు ఉంచబడని వింత విషయాలు అనే నెపంతో మీరు నమ్మజాలని విషయాలూ కావు. ఇంతకు ముందు ఈ బోధలే ఈ విధంగానే వహీ ద్వారా ఇస్రాయీల్ వంశీయుల ముందు తౌరాత్, ఇతర

**11 - 14** విశ్వసించేందుకు తిరస్కరించినవారు, విశ్వసించే వారిని గురించి, "ఈ గ్రంథాన్ని విశ్వసించటం అనేది మంచి పనే అయితే, వారు ఈ విషయంలో మాకంటే ముందుకు పోగలిగేవారు కాదు"[6] అని అంటారు. వారు దానినుండి మార్గదర్శకత్వం పొందలేదు కాబట్టి, "ఇది పాత అబద్ధమే" అని తప్పకుండా అంటారు. వాస్తవానికి ఇంతకు పూర్వం మూసా గ్రంథం మార్గదర్శిగా, కారుణ్యంగా వచ్చేసింది. ఈ గ్రంథం దానిని ధ్రువీకరిస్తూ అరబ్బీ భాషలో వచ్చింది; దుర్మార్గులను హెచ్చరించటానికీ, సద్వైఖరి అవలంబించే వారికి శుభవార్తలు ఇవ్వటానికిన్నీ. నిశ్చయంగా అల్లాహ్‌యే మా ప్రభువు అని ప్రకటించి, దానిపై స్థిరంగా ఉండిపోయిన వారికి ఏ భయమూలేదు, వారు దుఃఖించటమూ జరగదు. అటువంటి వారే స్వర్గానికి పోయేవారు. అక్కడనే వారు శాశ్వతంగా ఉంటారు, ప్రపంచంలో తాము చేసిన పనులకు ప్రతిఫలంగా.

**15 - 20** మేము మానవునికి, అతను తన తల్లిదండ్రుల పట్ల సద్భావంతో మెలగాలని ఉపదేశించాము. అతని తల్లి అతనిని ఎంతో శ్రమతో తన గర్భంలో పెట్టుకొని మోసింది; ఎంతో శ్రమతోనే అతనిని కన్నది. అతనిని గర్భంలో పెట్టుకొని మోసేందుకు, అతనిచే పాలు మాన్పించేందుకు ముప్పై మాసాలు పట్టింది. చివరకు అతను పరిపూర్ణ శక్తిని పొంది, నలభై సంవత్సరాల వయస్సుకు చేరినప్పుడు, ఇలా అన్నాడు, "నా ప్రభూ! నాకూ, నా తల్లిదండ్రులకూ నీవు ప్రసాదించిన మహాభాగ్యాలకు గాను, నీకు కృతజ్ఞతలు తెలిపే, నీవు ఇష్టపడే సత్కార్యాలు చేసే సద్బుద్ధిని నాకు ప్రసాదించు. ఇంకా, నా సంతానాన్ని కూడ మంచివారుగా చేసి నాకు సుఖాన్ని ఇవ్వు. నేను నీ సన్నిధిలో పశ్చాత్తాప పడుతూ నీ వైపునకు మరలు తున్నాను. నేను విధేయు(ముస్లిమ్)లైన దాసులలోని వాడను."

وَقَالَ الَّذِيْنَ كَفَرُوْا لِلَّذِيْنَ اٰمَنُوْا لَوْ كَانَ
خَيْرًا مَّا سَبَقُوْنَآ اِلَيْهِ ؕ وَ اِذْ لَمْ يَهْتَدُوْا بِهٖ
فَسَيَقُوْلُوْنَ هٰذَآ اِفْكٌ قَدِيْمٌ ﴿۱۱﴾ وَ مِنْ قَبْلِهٖ
كِتٰبُ مُوْسٰٓى اِمَامًا وَّرَحْمَةً ؕ وَ هٰذَا كِتٰبٌ
مُّصَدِّقٌ لِّسَانًا عَرَبِيًّا لِّيُنْذِرَ الَّذِيْنَ ظَلَمُوْا ۖ
وَبُشْرٰى لِلْمُحْسِنِيْنَ ﴿۱۲﴾ اِنَّ الَّذِيْنَ قَالُوْا
رَبُّنَا اللّٰهُ ثُمَّ اسْتَقَامُوْا فَلَا خَوْفٌ عَلَيْهِمْ وَ
لَا هُمْ يَحْزَنُوْنَ ﴿۱۳﴾ اُولٰٓئِكَ اَصْحٰبُ الْجَنَّةِ
خٰلِدِيْنَ فِيْهَا ۚ جَزَآءًۢ بِمَا كَانُوْا يَعْمَلُوْنَ ﴿۱۴﴾
وَوَصَّيْنَا الْاِنْسَانَ بِوَالِدَيْهِ اِحْسٰنًا ؕ حَمَلَتْهُ
اُمُّهٗ كُرْهًا وَّوَضَعَتْهُ كُرْهًا ؕ وَحَمْلُهٗ وَفِصٰلُهٗ
ثَلٰثُوْنَ شَهْرًا ؕ حَتّٰٓى اِذَا بَلَغَ اَشُدَّهٗ وَ بَلَغَ
اَرْبَعِيْنَ سَنَةً ۙ قَالَ رَبِّ اَوْزِعْنِيْٓ اَنْ
اَشْكُرَ نِعْمَتَكَ الَّتِيْٓ اَنْعَمْتَ عَلَيَّ وَ عَلٰى وَالِدَيَّ
وَ اَنْ اَعْمَلَ صَالِحًا تَرْضٰىهُ وَ اَصْلِحْ لِيْ فِيْ
ذُرِّيَّتِيْ ۚ اِنِّيْ تُبْتُ اِلَيْكَ وَ اِنِّيْ مِنَ
الْمُسْلِمِيْنَ ﴿۱۵﴾

6. ఆకాశ గ్రంథాల రూపంలో వచ్చేశాయి, సాధారణ ఇస్రాయీల్ వంశీయుడు వాటిని గాఢంగా విశ్వసించాడు. వారి అంతరార్థం ఏమిటంటే, కొంతమంది తెలివితక్కువవారు మాత్రమే దివ్య ఖురానును విశ్వసించారు. ఒకవేళ ఇలా చేయటం మంచిపనే అయితే, మా వంటి ధీమంతులు, విద్యావంతులు దానిని విశ్వసించే విషయంలో ఎలా వెనుకబడి ఉంటారు.

أُولَٰئِكَ الَّذِينَ نَتَقَبَّلُ عَنْهُمْ أَحْسَنَ مَا
عَمِلُوا وَنَتَجَاوَزُ عَن سَيِّئَاتِهِمْ فِي أَصْحَابِ
الْجَنَّةِ ۖ وَعْدَ الصِّدْقِ الَّذِي كَانُوا
يُوعَدُونَ ﴿١٦﴾ وَالَّذِي قَالَ لِوَالِدَيْهِ أُفٍّ لَّكُمَا
أَتَعِدَانِنِي أَنْ أُخْرَجَ وَقَدْ خَلَتِ الْقُرُونُ مِن
قَبْلِي وَهُمَا يَسْتَغِيثَانِ اللَّهَ وَيْلَكَ آمِنْ
إِنَّ وَعْدَ اللَّهِ حَقٌّ فَيَقُولُ مَا هَٰذَا إِلَّا
أَسَاطِيرُ الْأَوَّلِينَ ﴿١٧﴾ أُولَٰئِكَ الَّذِينَ حَقَّ
عَلَيْهِمُ الْقَوْلُ فِي أُمَمٍ قَدْ خَلَتْ مِن قَبْلِهِم
مِّنَ الْجِنِّ وَالْإِنسِ ۖ إِنَّهُمْ كَانُوا
خَاسِرِينَ ﴿١٨﴾ وَلِكُلٍّ دَرَجَاتٌ مِّمَّا عَمِلُوا ۖ وَ
لِيُوَفِّيَهُمْ أَعْمَالَهُمْ وَهُمْ لَا يُظْلَمُونَ ﴿١٩﴾ وَ
يَوْمَ يُعْرَضُ الَّذِينَ كَفَرُوا عَلَى النَّارِ
أَذْهَبْتُمْ طَيِّبَاتِكُمْ فِي حَيَاتِكُمُ الدُّنْيَا
وَاسْتَمْتَعْتُم بِهَا فَالْيَوْمَ تُجْزَوْنَ عَذَابَ
الْهُونِ بِمَا كُنتُمْ تَسْتَكْبِرُونَ فِي الْأَرْضِ بِغَيْرِ
الْحَقِّ وَبِمَا كُنتُمْ تَفْسُقُونَ ﴿٢٠﴾ ع ٢

ఇటువంటి వారి నుండి మేము వారు చేసిన మంచి కర్మలను స్వీకరిస్తాము; వారు చేసిన చెడు కర్మలను మన్నిస్తాము. వారికి చేయబడుతూ వచ్చిన సత్యవాగ్దానం ప్రకారం, వారు స్వర్గవాసులలో చేరిపోతారు. ఏ వ్యక్తి తన తల్లిదండ్రులతో ఇలా అన్నాడో, "ఛీ, పోండి, మీరు నన్ను విసిగిస్తున్నారు. మరణించిన తరువాత నేను సమాధి నుండి లేపబడతానని మీరు నన్ను భయపెడుతున్నారా? వాస్తవానికి నాకు పూర్వం ఎన్నో తరాలు గతించాయి (వారిలో నుండి ఎవ్వడూ లేచిరాలేదు కదా!)" ఆ వ్యక్తిని గురించి తల్లిదండ్రులు ఇద్దరూ సహాయం కోసం అల్లాహ్‌కు మొరపెట్టుకొని ఇలా అన్నారు, "ఓరి దౌర్భాగ్యుడా! విశ్వసించు. అల్లాహ్ వాగ్దానం సత్యమైనది." కాని అతడు, "ఇవన్నీ పాతకాలపు కట్టుకథలు" అని కొట్టిపారేశాడు. ఇటువంటి వారి మీదనే శిక్షా నిర్ణయం రూఢీ అయిపోయింది. వారికి పూర్వం గతించిన జిన్నాతులు, మానవుల గుంపులలోనే వారు కూడా పోయి చేరుతారు. నిస్సందేహంగా వారు నష్టంలోపడి ఉండిపోయేవారు. రెండు వర్గాలలోని ప్రతి ఒక్క వర్గానికి దాని కర్మలను బట్టి దాని అంతస్తు ఉంటుంది. వారు చేసిన దానికి పూర్తి ప్రతిఫలం ఇవ్వటానికి అల్లాహ్ ఇలా చేస్తాడు. వారికి అన్యాయం ఎంత మాత్రం జరగదు. తరువాత ఈ అవిశ్వాసులను అగ్ని ముందుకు తీసుకువచ్చి నిలబెట్టినప్పుడు, వారితో ఇలా అనటం జరుగుతుంది; "మీరు మీ వంతు వరాలను మీ ప్రాపంచిక జీవితంలో పొందారు. వాటిద్వారా ఆనందాన్ని మీరు అక్కడే అనుభవించారు. ఇక ఏ హక్కూ అర్హతా లేకుండా మీరు భూమిపై ప్రదర్శిస్తూ ఉండిన దురహంకారానికి, మీ అవిధేయతా చేష్టలకు పర్యవసానంగా, ఈ రోజు మీకు అవమానకరమైన శిక్ష విధించబడుతుంది."

وَ اذْكُرْ اَخَا عَادٍ ؕ اِذْ اَنْذَرَ قَوْمَهٗ بِالْاَحْقَافِ وَ قَدْ خَلَتِ النُّذُرُ مِنْۢ بَيْنِ يَدَيْهِ وَ مِنْ خَلْفِهٖۤ اَلَّا تَعْبُدُوْۤا اِلَّا اللّٰهَ ؕ اِنِّیْۤ اَخَافُ عَلَيْكُمْ عَذَابَ يَوْمٍ عَظِيْمٍ ﴿٢١﴾ قَالُوْۤا اَجِئْتَنَا لِتَاْفِكَنَا عَنْ اٰلِهَتِنَا ۚ فَاْتِنَا بِمَا تَعِدُنَاۤ اِنْ كُنْتَ مِنَ الصّٰدِقِيْنَ ﴿٢٢﴾ قَالَ اِنَّمَا الْعِلْمُ عِنْدَ اللّٰهِ ۖؗ وَ اُبَلِّغُكُمْ مَّاۤ اُرْسِلْتُ بِهٖ وَلٰكِنِّیْۤ اَرٰىكُمْ قَوْمًا تَجْهَلُوْنَ ﴿٢٣﴾ فَلَمَّا رَاَوْهُ عَارِضًا مُّسْتَقْبِلَ اَوْدِيَتِهِمْ ۙ قَالُوْا هٰذَا عَارِضٌ مُّمْطِرُنَا ؕ بَلْ هُوَ مَا اسْتَعْجَلْتُمْ بِهٖ ؕ رِيْحٌ فِيْهَا عَذَابٌ اَلِيْمٌ ﴿٢٤﴾ۙ تُدَمِّرُ كُلَّ شَیْءٍۢ بِاَمْرِ رَبِّهَا فَاَصْبَحُوْا لَا يُرٰۤى اِلَّا مَسٰكِنُهُمْ ؕ كَذٰلِكَ نَجْزِی الْقَوْمَ الْمُجْرِمِيْنَ ﴿٢٥﴾ وَلَقَدْ مَكَّنّٰهُمْ فِيْمَاۤ اِنْ مَّكَّنّٰكُمْ فِيْهِ وَ جَعَلْنَا لَهُمْ سَمْعًا وَّ اَبْصَارًا وَّ اَفْـِٕدَةً ۖؗ فَمَاۤ اَغْنٰى عَنْهُمْ سَمْعُهُمْ وَلَاۤ اَبْصَارُهُمْ وَ لَاۤ اَفْـِٕدَتُهُمْ مِّنْ شَیْءٍ اِذْ كَانُوْا يَجْحَدُوْنَ ۙ بِاٰيٰتِ اللّٰهِ وَ حَاقَ بِهِمْ مَّا كَانُوْا بِهٖ يَسْتَهْزِءُوْنَ ﴿٢٦﴾ ع

**21 - 26** వారికి కొంచెం ఆద్ సోదరుని (హూద్) గాథను వినిపించు. అప్పుడు అతను ఇసుక గుట్టల మధ్య నివసించే తన జాతి వారిని ఇలా హెచ్చరించాడు - అలా హెచ్చరించేవారు అతనికి పూర్వం కూడవచ్చారు, అతని తరువాత కూడ వచ్చారు- "అల్లాహ్‌ను తప్ప మరెవరినీ ఆరాధించకండి. మీ విషయంలో ఒక భయంకర దినాన విధించబడే శిక్షను గురించి నేను భయపడుతున్నాను." దానికి వారు ఇలా అన్నారు, "మాయమాటలు చెప్పి మా దేవతల నుండి మమ్మల్ని దూరం చేయటానికా వచ్చింది నీవు? సరే, మంచిది, నీవు సత్యవంతుడవే అయితే, నీవు మమ్మల్ని భయపెడుతూ ఉన్నటు వంటి ఆ శిక్షను తీసుకు రా." అతను ఇలా అన్నాడు, "దానిని గురించి అల్లాహ్‌కు మాత్రమే తెలుసు.[7] ఏ సందేశాన్ని ఇచ్చి నన్ను పంపడం జరిగిందో ఆ సందేశాన్నే నేను మీకు అందజేస్తున్నాను. కాని నేను గమనిస్తున్నాను, మీరు అజ్ఞానులుగా ప్రవర్తిస్తున్నారు." తరువాత వారు ఆ శిక్షను తమ లోయల వైపునకు వస్తూ ఉండగా చూసి, "ఇవి పుష్కలంగా మాకు వర్షాన్ని కురిపించే మేఘాలు" అని అనసాగారు- కాదు,[8] కాని ఇది మీరు తొందరపెడుతూ ఉన్న విషయం. ఇది తుఫాను గాలి, వ్యధాపూరితమైన శిక్షను తెస్తోంది, తన ప్రభువు ఆజ్ఞానుసారం ప్రతివస్తువునూ సర్వ నాశనం చేస్తుంది. చివరకు వారి నివాస స్థలాలు తప్ప అక్కడ ఏమీ కనిపించకుండా పోయింది. ఈ విధంగా మేము నేరస్తులకు ప్రతిఫలం ఇస్తూ ఉంటాము. మీకు ఇవ్వనివి ఎన్నో మేము వారికి ఇచ్చాము. మేము వారికి చెవులూ, కళ్లూ, మనస్సూ అన్నీ ఇచ్చాము. కాని ఆ చెవులూ వారికి ఏ విధంగానూ పనికి రాలేదు, కళ్లూ మనస్సూ కూడా (పనికిరాలేదు). ఎందుకంటే వారు అల్లాహ్ వాక్యాలను తిరస్కరిస్తూ ఉండేవారు. వారు దేనిని గురించి వేళాకోళం చేస్తూ ఉండేవారో, దాని వలలోనే వారు చిక్కుకు పొయ్యారు.

7. అంటే, మీకు శిక్షను ఎప్పుడు విధించాలి, మీకు ఎంత గడువు ఇవ్వాలి అనే విషయాలకు సంబంధించిన పరిజ్ఞానం.
8. ఇక్కడ, వారికి ఈ సమాధానం ఎవరు ఇచ్చారో వివరించబడలేదు. గ్రంథరచనా విధానం ప్రకారం, అప్పటి పరిస్థితులే ఈ సమాధానం ఇచ్చినట్లు స్పష్టమవుతోంది. ఈ మేఘాలు తమకు వర్షాన్ని ఇవ్వటానికి వస్తున్నాయని వారు భావించారు కాని నిజానికి అది వారిని సర్వనాశనం చేయటానికి వచ్చిన గాలి తుఫాను.

وَ لَقَدْ اَهْلَكْنَا مَا حَوْلَكُمْ مِّنَ الْقُرٰى وَ صَرَّفْنَا
الْاٰيٰتِ لَعَلَّهُمْ يَرْجِعُوْنَ ﴿٢٧﴾ فَلَوْ لَا نَصَرَهُمُ
الَّذِيْنَ اتَّخَذُوْا مِنْ دُوْنِ اللّٰهِ قُرْبَانًا اٰلِهَةً ؕ
بَلْ ضَلُّوْا عَنْهُمْ ۚ وَ ذٰلِكَ اِفْكُهُمْ وَ مَا كَانُوْا
يَفْتَرُوْنَ ﴿٢٨﴾ وَ اِذْ صَرَفْنَاۤ اِلَيْكَ نَفَرًا مِّنَ
الْجِنِّ يَسْتَمِعُوْنَ الْقُرْاٰنَ ۚ فَلَمَّا حَضَرُوْهُ قَالُوْۤا
اَنْصِتُوْا ۚ فَلَمَّا قُضِيَ وَلَّوْا اِلٰى قَوْمِهِمْ
مُّنْذِرِيْنَ ﴿٢٩﴾ قَالُوْا يٰقَوْمَنَاۤ اِنَّا سَمِعْنَا كِتٰبًا
اُنْزِلَ مِنْۢ بَعْدِ مُوْسٰى مُصَدِّقًا لِّمَا بَيْنَ يَدَيْهِ
يَهْدِيْۤ اِلَى الْحَقِّ وَ اِلٰى طَرِيْقٍ مُّسْتَقِيْمٍ ﴿٣٠﴾
يٰقَوْمَنَاۤ اَجِيْبُوْا دَاعِيَ اللّٰهِ وَ اٰمِنُوْا بِهٖ
يَغْفِرْ لَكُمْ مِّنْ ذُنُوْبِكُمْ وَ يُجِرْكُمْ مِّنْ عَذَابٍ
اَلِيْمٍ ﴿٣١﴾ وَ مَنْ لَّا يُجِبْ دَاعِيَ اللّٰهِ فَلَيْسَ
بِمُعْجِزٍ فِي الْاَرْضِ وَ لَيْسَ لَهٗ مِنْ دُوْنِهٖۤ
اَوْلِيَآءُ ؕ اُولٰٓئِكَ فِيْ ضَلٰلٍ مُّبِيْنٍ ﴿٣٢﴾

**27 - 28** మీ చుట్టుపక్కల ప్రాంతాలలోని ఎన్నో జనపదాలను మేము నాశనం చేసివేశాము. మేము మా వాక్యాలను పంపి మాటిమాటికి రకరకాలుగా వారికి నచ్చజెప్పాము, బహుశా వారు దారికి వస్తారేమో అని. అల్లాహ్‌ను వదలిపెట్టి, వారు ఏ శక్తులను అల్లాహ్ సాన్నిధ్యాన్ని పొందటానికి సాధనాలుగా భావించి, దైవాలుగా చేసుకున్నారో,[9] ఆ శక్తులు వారికి ఎందుకు సహాయం చేయవు? పైగా అవి వారికి కనుమరుగైపోయాయి. ఇది వారి అబద్ధాలకూ, వారు కల్పించుకున్న కృత్రిమ విశ్వాసాలకూ పర్యవసానం.

**29 - 32** (ఆ సంఘటన కూడ ప్రస్తావించదగినదే) అప్పుడు మేము జిన్నాతుల ఒక వర్గాన్ని ఖురాన్ వినేందుకు[10] నీ వద్దకు తీసుకువచ్చాము. నీవు ఖురాన్ పఠిస్తూ ఉండిన స్థలానికి చేరిన తరువాత, వారు పరస్పరం "నిశ్శబ్దంగా ఉండండి" అని చెప్పుకున్నారు. అది చదవటం ముగిసిన పిదప, వారు హెచ్చరిక చేసేవారుగా తమ జాతి వైపునకు తిరిగి వెళ్లి పోయారు. వారు అక్కడకు వెళ్లి ఇలా అన్నారు, "ఓ మా జాతి ప్రజలారా! మేము ఒక గ్రంథాన్ని విన్నాము. అది మూసా ప్రవక్త తరువాత అవతరించింది తనకు పూర్వం అవతరించిన గ్రంథాలను ధ్రువీకరిస్తుంది, సత్యం వైపునకూ, ఋజుమార్గం వైపునకూ[11] దారిచూపుతుంది. ఓ మా జాతి ప్రజలారా! అల్లాహ్ వైపునకు పిలిచే వాని సందేశాన్ని స్వీకరించండి, అతనిని విశ్వసించండి. అప్పుడు అల్లాహ్ మీ పాపాలను క్షమిస్తాడు, మిమ్మల్ని భయంకరమైన శిక్ష నుండి రక్షిస్తాడు." అల్లాహ్ వైపునకు పిలిచే వాని మాటను విననివాడు భూమిలో అల్లాహ్‌ను అశక్తుడుగా చేసే శక్తిని కలిగిలేడు. అతనిని అల్లాహ్ నుండి రక్షించేందుకు ఎలాంటి మద్దతుదారులు గానీ, సంరక్షకులు గానీ ఎవరూ ఉండరు. అటువంటి వారు స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో పడిఉన్నారు.

9. అంటే, ఆ శక్తులు దేవునికి అత్యంత ప్రీతిపాత్రమైన దాసులనీ, వాటిద్వారా తాము దేవుని సాన్నిధ్యాన్ని పొందవచ్చుననీ భావించి వారు తొలినాళ్లల్లో వాటిపట్ల విశ్వాసం చూపసాగారు. కాని కాలక్రమంలో వారు ఆ శక్తులనే తమ దేవుళ్లుగా మలచుకున్నారు, సహాయం కోసం వాటిని వేడుకోసాగారు, వాటికి ప్రార్థనలు చేయసాగారు; అవి తమ తలవ్రాతలను మార్చగలవనీ, తమ విన్నపాలను విని, తమను కష్టాల నుండి గట్టెక్కించగలవనీ వారు వాటి గురించి గట్టి విశ్వాసం ఏర్పరచుకున్నారు. ఈ మార్గభ్రష్టత్వం నుండి వారిని

**33 - 34** ఏ దేవుడైతే ఈ భూమినీ, ఈ ఆకాశాన్నీ సృష్టించాడో, వాటిని సృష్టించటంలో అలసిపోలేదో, ఆ దేవుడు మృతులను తప్పకుండా బ్రతికించి లేపగల శక్తిని కూడ కలిగి ఉన్నాడనే విషయం వారికి తోచటంలేదా? ఎందుకు కలిగిలేడు, నిశ్చయంగా ఆయన ప్రతి దానినీ చేయగల శక్తి సామర్థ్యాలు కలవాడు. అవిశ్వాసులు అగ్ని ముందుకు తీసుకురాబడే రోజున వారిని, "ఇది సత్యం కాదా?" అని అడగటం జరుగుతుంది. వారు, "అవును, మా ప్రభువు సాక్షిగా! (ఇది నిజంగానే సత్యం)" అని అంటారు. అల్లాహ్, "సరే, ఇక మీరు తిరస్కరిస్తూ ఉండిన దాని పర్యవసానంగా, శిక్షను రుచిచూడండి" అని సెలవిస్తాడు.

**35** కనుక ప్రవక్తా! సహనం వహించు, దృఢచిత్తులైన ప్రవక్తలు సహనం వహించినట్లుగా. వారి విషయంలో తొందరపడకు. దేనిని గురించి వారిని ఇప్పుడు భయపెట్టటం జరుగుతోందో, దానిని వారు చూసిన రోజున, వారికి ప్రపంచంలో దినంలోని ఒక గడియకంటే ఎక్కువ కాలం కూడ ఉండలేదు అని అనిపిస్తుంది. సందేశం అందజేయబడింది. ఇక అవిధేయులు తప్ప మరెవరు నాశనమవుతారు?

اَوَلَمْ يَرَوْا اَنَّ اللّٰهَ الَّذِيْ خَلَقَ السَّمٰوٰتِ وَ
الْاَرْضَ وَلَمْ يَعْيَ بِخَلْقِهِنَّ بِقٰدِرٍ عَلٰٓى اَنْ
يُّحْيِۦَ الْمَوْتٰى ؕ بَلٰٓى اِنَّهٗ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ ﴿٣٣﴾
وَ يَوْمَ يُعْرَضُ الَّذِيْنَ كَفَرُوْا عَلَى النَّارِ ؕ
اَلَيْسَ هٰذَا بِالْحَقِّ ؕ قَالُوْا بَلٰى وَ رَبِّنَا ؕ
قَالَ فَذُوْقُوا الْعَذَابَ بِمَا كُنْتُمْ تَكْفُرُوْنَ ﴿٣٤﴾
فَاصْبِرْ كَمَا صَبَرَ اُولُوا الْعَزْمِ مِنَ الرُّسُلِ وَ
لَا تَسْتَعْجِلْ لَّهُمْ ؕ كَاَنَّهُمْ يَوْمَ يَرَوْنَ مَا
يُوْعَدُوْنَ ۙ لَمْ يَلْبَثُوْٓا اِلَّا سَاعَةً مِّنْ نَّهَارٍ ؕ
بَلٰغٌ ۚ فَهَلْ يُهْلَكُ اِلَّا الْقَوْمُ الْفٰسِقُوْنَ ﴿٣٥﴾

వెలికి తీయటానికి అల్లాహ్ తన ఆయతులను తన ప్రవక్తల ద్వారా పంపి రకరకాలుగా వారికి నచ్చజెప్పటానికి ప్రయత్నం చేశాడు. కాని వారు తమ బూటకపు దేవుళ్ల దాస్యానికే అంటిపెట్టుకున్నారు; మేము అల్లాహ్‌కు బదులు వీటినే వేడుకుంటాము అని హఠం చేశారు. ఇప్పుడు చెప్పండి, తమ మార్గభ్రష్టత్వం చేత వారిపైకి అల్లాహ్ శిక్ష వచ్చిపడినప్పుడు, విన్నపాలు వినే, ఆపదలు తొలగించే ఆ దేవుళ్ళు ఎక్కడ మాయమైపోయారు? ఈ కష్టకాలంలో వారిని ఆదుకోవటానికి రారేమి?

10. దైవప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) తాయఫ్ నుండి మక్కాకు చేసిన తిరుగు ప్రయాణంలో జరిగిన సంఘటనకు సంబంధించిన ప్రస్తావన ఇది. ఆయన నమాజులో దివ్య ఖురానును పారాయణం చేస్తూ ఉండగా, జిన్నాతుల వర్గం ఒకటి ఈ మార్గం గుండా పోతూ, ఆయన చేసే పారాయణాన్ని వినాలని ఆగింది. ఈ విషయం గురించి హదీసులన్నీ ఒక్క విషయంలో ఏకాభిప్రాయం కలిగి ఉన్నాయి; ఈ సందర్భంలో జిన్నాతులు మహాప్రవక్త ముందుకు రాలేదు. ఆయనకు అవి వచ్చిన జాడ కూడ స్ఫురించలేదు. కాని తరువాత అల్లాహ్ వహీ ద్వారా అవి రావటాన్ని, ఖురాను పఠనాన్ని వినటాన్ని గురించి ఆయనకు తెలియజేశాడు.

11. ఈ జిన్నాతులు ఇదివరకే హజ్రత్ మూసా ప్రవక్తపట్ల, ఆకాశగ్రంథాల పట్ల విశ్వాసం కలిగి ఉండేవని దీనిద్వారా తెలుస్తోంది. దివ్య ఖురాను విన్న తరువాత అవి, పూర్వపు ప్రవక్తలు చేసిన బోధలే ఇవి అని తెలుసుకున్నాయి. కనుక అవి ఈ గ్రంథాన్ని, దానిని తెచ్చిన ప్రవక్త ముహమ్మద్ (సఅసమ్)ను కూడ విశ్వసించాయి.

٤٧ سُوْرَةُ مُحَمَّدٍ مَّدَنِيَّةٌ ٩٥

اٰيَاتُهَا ٣٨ | رُكُوْعَاتُهَا ٤

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

اَلَّذِيْنَ كَفَرُوْا وَ صَدُّوْا عَنْ سَبِيْلِ اللّٰهِ
اَضَلَّ اَعْمَالَهُمْ (١) وَ الَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا
الصّٰلِحٰتِ وَ اٰمَنُوْا بِمَا نُزِّلَ عَلٰى مُحَمَّدٍ وَّ هُوَ
الْحَقُّ مِنْ رَّبِّهِمْ ۙ كَفَّرَ عَنْهُمْ سَيِّاٰتِهِمْ وَاَصْلَحَ
بَالَهُمْ (٢) ذٰلِكَ بِاَنَّ الَّذِيْنَ كَفَرُوا اتَّبَعُوا
الْبَاطِلَ وَاَنَّ الَّذِيْنَ اٰمَنُوا اتَّبَعُوا الْحَقَّ مِنْ
رَّبِّهِمْ ؕ كَذٰلِكَ يَضْرِبُ اللّٰهُ لِلنَّاسِ
اَمْثَالَهُمْ (٣) فَاِذَا لَقِيْتُمُ الَّذِيْنَ كَفَرُوْا
فَضَرْبَ الرِّقَابِ ؕ حَتّٰۤى اِذَاۤ اَثْخَنْتُمُوْهُمْ
فَشُدُّوا الْوَثَاقَ ۙ فَاِمَّا مَنًّۢا بَعْدُ وَ اِمَّا فِدَآءً
حَتّٰى تَضَعَ الْحَرْبُ اَوْزَارَهَا ۛ ذٰلِكَ ؕ وَلَوْ
يَشَآءُ اللّٰهُ لَانْتَصَرَ مِنْهُمْ وَ لٰكِنْ لِّيَبْلُوَا۠
بَعْضَكُمْ بِبَعْضٍ ؕ وَالَّذِيْنَ قُتِلُوْا فِيْ سَبِيْلِ
اللّٰهِ فَلَنْ يُّضِلَّ اَعْمَالَهُمْ (٤) سَيَهْدِيْهِمْ وَ
يُصْلِحُ بَالَهُمْ (٥) وَ يُدْخِلُهُمُ الْجَنَّةَ
عَرَّفَهَا لَهُمْ (٦) يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْۤا اِنْ تَنْصُرُوا
اللّٰهَ يَنْصُرْكُمْ وَ يُثَبِّتْ اَقْدَامَكُمْ (٧)

ع ١ وقد يبتدا بقوله ذٰلك ولكن حسن اتصاله بما قبله و يوقف على ذٰلك ١٢

ఆయతులు 38 | **47. ముహమ్మద్** | అవతరణ మదీనాలో

*అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

**1 - 3** అవిశ్వాసానికి పాల్పడి, (ప్రజలను) అల్లాహ్ మార్గం వైపునకు పోకుండా నిరోధించిన వారి కర్మలను అల్లాహ్ నిరర్థకమైనవిగా చేశాడు. విశ్వసించి, మంచిపనులు చేసినటువంటి, ముహమ్మద్‌పై అవతరించినది- అది పూర్తిగా సత్యమేనని, అది వారి ప్రభువు వద్దనుండి వచ్చినదని - నమ్మినటువంటి వారి నుండి అల్లాహ్ వారి చెడుగులను దూరం చేసి, వారి స్థితిని చక్కబరిచాడు. దానికి కారణం అవిశ్వాసులు అసత్యాన్ని అనుసరించుటయే. విశ్వాసులు ఈ విధంగా తమ ప్రభువు వద్దనుండి వచ్చిన సత్యాన్ని అనుసరించుటయే. అల్లాహ్, ప్రజలకు తమ నిజమైన స్థానం ఏమిటో తెలియజేస్తాడు.

**4 - 6** కనుక మీరు ఈ అవిశ్వాసులతో తలపడినప్పుడు, వారి మెడలను ఖండించటమే మీరు చేయవలసిన మొదటి పని. చివరకు మీరు వారిని పూర్తిగా అణచివేసిన తరువాత, ఖైదీలను గట్టిగా బంధించండి. ఆ తరువాత (మీకు ఇలా చేసే అధికారం ఉంది). వారికి మేలైనా చేయండి లేదా వారి నుండి పరిహారం (సొమ్ము) తీసుకొని వదలివేయండి. యుద్ధంలో తన ఆయుధాలు క్రిందపడవేసే వరకు (ఇలా జరగాలి).[1] ఇది మీరు చేయవలసిన పని. అల్లాహ్ తలచుకుంటే స్వయంగా ఆయనే వారిని ఎదుర్కొనేవాడు. అయితే మిమ్మల్ని ఒకరి ద్వారా మరొకరిని పరీక్షించటానికి[2] (ఆయన ఈ పద్ధతిని అవలంబించాడు). అల్లాహ్ తన మార్గంలో చంపబడిన వారి కర్మలను ఎంతమాత్రం వ్యర్థం చేయడు. ఆయన వారికి మార్గం చూపుతాడు,[3] వారి స్థితిని చక్కబరుస్తాడు, తాను వారికి తెలియజేసిన స్వర్గంలో వారిని ప్రవేశింపజేస్తాడు.

**7 - 12** విశ్వాసులారా! మీరు అల్లాహ్‌కు సహాయం చేస్తే, ఆయన మీకు సహాయం చేస్తాడు,[4] మీ పాదాలను స్థిరంగా ఉంచుతాడు.

وَ الَّذِيۡنَ كَفَرُوۡا فَتَعۡسًا لَّهُمۡ وَ اَضَلَّ
اَعۡمَالَهُمۡ ⑧ ذٰلِكَ بِاَنَّهُمۡ كَرِهُوۡا مَاۤ اَنۡزَلَ
اللّٰهُ فَاَحۡبَطَ اَعۡمَالَهُمۡ ⑨ اَفَلَمۡ يَسِيۡرُوۡا فِى
الۡاَرۡضِ فَيَنۡظُرُوۡا كَيۡفَ كَانَ عَاقِبَةُ الَّذِيۡنَ
مِنۡ قَبۡلِهِمۡ ؕ دَمَّرَ اللّٰهُ عَلَيۡهِمۡ ۖ وَلِلۡكٰفِرِيۡنَ
اَمۡثَالُهَا ⑩ ذٰلِكَ بِاَنَّ اللّٰهَ مَوۡلَى الَّذِيۡنَ اٰمَنُوۡا
وَاَنَّ الۡكٰفِرِيۡنَ لَا مَوۡلٰى لَهُمۡ ⑪ اِنَّ اللّٰهَ ع ١١/٥
يُدۡخِلُ الَّذِيۡنَ اٰمَنُوۡا وَ عَمِلُوا الصّٰلِحٰتِ
جَنّٰتٍ تَجۡرِىۡ مِنۡ تَحۡتِهَا الۡاَنۡهٰرُ ؕ وَ الَّذِيۡنَ
كَفَرُوۡا يَتَمَتَّعُوۡنَ وَ يَاۡكُلُوۡنَ كَمَا تَاۡكُلُ
الۡاَنۡعَامُ وَالنَّارُ مَثۡوًى لَّهُمۡ ⑫

ఇక అవిశ్వాసుల విషయానికి వస్తే, వారికి వినాశం తప్పదు. అల్లాహ్ వారి కర్మలను తోవ దప్పించాడు. ఎందుకంటే వారు అల్లాహ్ అవతరింపజేసిన దానిని అంగీకరించలేదు. కనుక అల్లాహ్ వారి కర్మలను వ్యర్థపరిచాడు. వారికి పూర్వం గతించిన ప్రజల పర్యవసానం ఎలా జరిగిందో చూసేందుకు వారు భూమిపై సంచరించలేదా? అల్లాహ్ వారిని సమూలంగా తుడిచిపెట్టాడు. ఇటువంటి ఫలితాలే ఈ అవిశ్వాసులకు వ్రాసిపెట్టబడి ఉన్నాయి.[5] ఎందుకంటే, విశ్వాసులకు రక్షకుడూ, సహాయకుడూ అల్లాహ్‌యే. అయితే అవిశ్వాసులకు సహాయకుడూ, రక్షకుడూ అనేవాడు ఎవ్వడూ లేడు. విశ్వసించి, మంచిపనులు చేసే వారిని అల్లాహ్, క్రింద సెలయేళ్లు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింప జేస్తాడు. అవిశ్వాసులు కేవలం కొన్నాళ్ల ప్రాపంచిక జీవితంలోని సౌఖ్యాలను జుర్రుకుంటున్నారు. పశువులు మాదిరిగా తింటున్నారు, త్రాగుతున్నారు. వారి అంతిమ నివాసం నరకం అవుతుంది.

1. ఈ ఆయతు పదాల ద్వారా, అది అవతరించిన సమయ సందర్భాలనుబట్టి స్పష్టంగా తెలిసే విషయం ఏమిటంటే, యుద్ధం చేయుము అనే ఆదేశం వచ్చిన తరువాత, అసలు యుద్ధం ప్రారంభానికి ముందు ఈ ఆయతు అవతరించింది. "మీరు అవిశ్వాసులతో తలపడినప్పుడు" అనే పదాలు కూడ ఇంకా యుద్ధారంభం కాలేదని ధ్రువీకరిస్తున్నాయి. యుద్ధం జరగటానికి ముందు ఈ ఉపదేశం ఇవ్వబడింది : యుద్ధం జరిగితే, ముస్లిమ్‌లు ముందుగా తమ దృష్టిని శత్రువుల పోరాటశక్తిని సమూలంగా నిర్వీర్యం చేయటం మీద సారించాలి. దీని తరువాత, అదుపులోనికి తీసుకోబడిన యుద్ధ ఖైదీల విషయంలో, ముస్లిమ్‌లు వారి నుండి పరిహారం తీసుకుని లేదా తమ ముస్లిమ్ ఖైదీలకు బదులుగా వారిని విడిచిపెట్టే అధికారం కలిగి ఉన్నారు. ఇంకా వారిని కారాగారంలో పెట్టి వారిపట్ల ఉదార బుద్ధితో వ్యవహరించే అధికారం కూడ వారికి ఉన్నది. ఇంకా వీలైతే అనుగ్రహబుద్ధితో వారిని విడుదల చేసే అధికారం కూడ వారికి ఉన్నది.
2. అంటే, ఒకవేళ అల్లాహ్‌కు అసత్యవాదులను అణగద్రొక్కాలనే తలంపే ఉంటే, ఈ పనికై ఆయనకు మీ సహాయం అవసరమే ఉండదు. ఈ పనినైతే ఒక్క క్షణంలో ఆయన భూకంపం ద్వారానో, తుఫాను ద్వారానో సాధించగలడు. కాని ఆయన ఉద్దేశ్యం ప్రకారం, మానవులలోని సత్యవాదులు అసత్యవాదులను ఎదుర్కొని, వారికి వ్యతిరేకంగా జిహాదు చేయాలి; ఎవరిలో ఏ గుణగణాలు ఉన్నయ్యో, అవి ఈ పరీక్ష ద్వారా నిగ్గుదేలి, పూర్తిగా ప్రస్ఫుటం కావాలి; ప్రతి ఒక్కడూ తన ప్రవర్తన ప్రకారం ఏ స్థానానికి అర్హుడో అతనికి అది ఇవ్వాలి.
3. అంటే, స్వర్గానికి మార్గం చూపుతాడు.
4. అల్లాహ్‌కు సహాయం చేయటం అంటే, అల్లాహ్ వచనం ఔన్నత్యం కోసం, సత్యం గొప్పతనం కోసం జరిగే పనులలో పాలుపంచుకోవటం.
5. దీనికి రెండర్థాలు ఉన్నాయి: ఒకటి, ఆ అవిశ్వాసులు ఏ విధ్వంసానికి గురిచేయబడ్డారో, ఆ విధ్వంసమే ముహమ్మద్ (సఅసమ్) సందేశాన్ని అంగీకరించని ఈ అవిశ్వాసుల విషయంలో వ్రాయబడి ఉంది. రెండో అర్థం, వారి విధ్వంసం కేవలం ప్రాపంచిక శిక్షతో అంతం కాలేదు; ఇదే విధ్వంసానికి వారు పరలోకంలో కూడ గురి అవుతారు.

وَ كَاَيِّنْ مِّنْ قَرْيَةٍ هِيَ اَشَدُّ قُوَّةً مِّنْ قَرْيَتِكَ
الَّتِيْۤ اَخْرَجَتْكَ ۚ اَهْلَكْنٰهُمْ فَلَا نَاصِرَ لَهُمْ ﴿۱۳﴾
اَفَمَنْ كَانَ عَلٰى بَيِّنَةٍ مِّنْ رَّبِّهٖ كَمَنْ زُيِّنَ لَهٗ
سُوْٓءُ عَمَلِهٖ وَاتَّبَعُوْۤا اَهْوَآءَهُمْ ﴿۱۴﴾ مَثَلُ
الْجَنَّةِ الَّتِيْ وُعِدَ الْمُتَّقُوْنَ ؕ فِيْهَاۤ اَنْهٰرٌ مِّنْ
مَّآءٍ غَيْرِ اٰسِنٍ ۚ وَاَنْهٰرٌ مِّنْ لَّبَنٍ لَّمْ يَتَغَيَّرْ
طَعْمُهٗ ۚ وَ اَنْهٰرٌ مِّنْ خَمْرٍ لَّذَّةٍ لِّلشّٰرِبِيْنَ ۚ۬ وَ
اَنْهٰرٌ مِّنْ عَسَلٍ مُّصَفًّى ؕ وَ لَهُمْ فِيْهَا مِنْ كُلِّ
الثَّمَرٰتِ وَ مَغْفِرَةٌ مِّنْ رَّبِّهِمْ ؕ كَمَنْ هُوَ
خَالِدٌ فِي النَّارِ وَ سُقُوْا مَآءً حَمِيْمًا فَقَطَّعَ
اَمْعَآءَهُمْ ﴿۱۵﴾ وَ مِنْهُمْ مَّنْ يَّسْتَمِعُ اِلَيْكَ ۚ
حَتّٰۤى اِذَا خَرَجُوْا مِنْ عِنْدِكَ قَالُوْا لِلَّذِيْنَ
اُوْتُوا الْعِلْمَ مَاذَا قَالَ اٰنِفًا ۫ اُولٰٓئِكَ الَّذِيْنَ
طَبَعَ اللّٰهُ عَلٰى قُلُوْبِهِمْ وَاتَّبَعُوْۤا اَهْوَآءَهُمْ ﴿۱۶﴾
وَ الَّذِيْنَ اهْتَدَوْا زَادَهُمْ هُدًى وَّ اٰتٰىهُمْ
تَقْوٰىهُمْ ﴿۱۷﴾ فَهَلْ يَنْظُرُوْنَ اِلَّا السَّاعَةَ اَنْ
تَاْتِيَهُمْ بَغْتَةً ۚ فَقَدْ جَآءَ اَشْرَاطُهَا ۚ فَاَنّٰى لَهُمْ
اِذَا جَآءَتْهُمْ ذِكْرٰىهُمْ ﴿۱۸﴾

**13 - 15** ప్రవక్తా! నిన్ను బహిష్కరించిన[6] నగరం కంటే ఎంతో శక్తిమంతములైన నగరాలు ఎన్నో గతించిపోయాయి. మేము వాటిని ఎవ్వరూ కాపాడలేనంతగా సర్వనాశనం చేశాము. తన ప్రభువు తరఫు నుండి ఒక స్పష్టమైన సన్మార్గం పొందినవాడు, తమ దుష్కార్యాలు మనోహరమైనవిగా కనిపించేలా చేయబడి, తమ కోరికలకు దాసులైన వారి మాదిరిగా ఎలా కాగలుగుతాడు? భయభక్తులు కలవారికి వాగ్దానం చేయబడిన స్వర్గం యొక్క వైభవం ఇలా ఉంది, అందులో నిర్మలమైన నీటి కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి, ఏ మాత్రమూ మారని రుచిగల పాల కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి, సేవించే వారికి మధురంగా ఉండే మద్యపు కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి, స్వచ్ఛమైన తేనె కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి.[7] అందులో వారికొరకు అన్ని రకాల పండ్లు ఉంటాయి. ఇంకా వారి ప్రభువు తరఫు నుండి క్షమాభిక్ష కూడ. (ఇలాంటి స్వర్గాన్ని తన వంతు భాగంగా పొందనున్న వ్యక్తి) నరకంలో శాశ్వతంగా ఉండిపోయేవారి మాదిరిగా పేగులను సైతం కోసివేసేటటువంటి సల సల కాగే నీరు ఇవ్వబడే వారి మాదిరిగా కాగలడా?

**16 - 18** వారిలో నీ మాటలను చెవియొగ్గి వినేవారు కొందరు ఉన్నారు. అయితే నీ దగ్గర నుండి వెళ్లిపోయిన తరువాత, జ్ఞాన భాగ్యం ప్రసాదించబడిన వారిని, "ఇంతకు ముందు అతను అన్నది ఏమిటి?" అని అడుగుతారు.[8] హృదయాలపై అల్లాహ్ ముద్రవేసిన వారు వీరే. వారు తమ కోరికలకు దాసులై పోయినవారు. ఇక మార్గం పొందినవారు, అల్లాహ్ వారికి ఇంకా ఎక్కువగా మార్గం చూపుతాడు, వారికి వారి వంతు భయభక్తులను ప్రసాదిస్తాడు. ఇప్పుడు వారు ప్రళయం కొరకే ఎదురు చూస్తున్నారా, అది అకస్మాత్తుగా వారి మీద విరుచుకుపడాలని? దాని సూచనలైతే వచ్చేశాయి. స్వయంగా అదే వచ్చినప్పుడు, ఇక వారికి హితోపదేశం స్వీకరించే అవకాశం ఎక్కడ మిగిలి ఉంటుంది?

6. అంటే, మక్కా నగరం. అక్కడ నుంచే ఖురైషు తెగవారు మహాప్రవక్త (సఅసమ్)ను వలసపోయేలా బలవంతం చేశారు.
7. హదీసులో దానికి సంబంధించిన వివరణ ఇలా ఉంది : స్వర్గంలో లభించే పాలు పశువుల పొదుగుల నుండి పిండిన పాలు కావు, అక్కడి సారాయి కుళ్లిన పండ్లను బట్టీలలో కాచి చేసిన సారాయి కాదు, అక్కడ దొరికే తేనె తేనెటీగల కడుపులలో నుండి వచ్చే తేనె కాదు, ఇవన్నీ సహజసిద్ధమైన సెలయేళ్ల రూపంలో ప్రవహిస్తూ ఉంటాయి.

**19** కనుక ప్రవక్తా! బాగా తెలుసుకో, అల్లాహ్ తప్ప ఆరాధనకు అర్హుడైనవాడు ఎవ్వడూ లేడు అని. నీ పొరపాట్లకు క్షమాభిక్ష పెట్టుము అని వేడుకో, విశ్వాసులైన స్త్రీ పురుషుల పొరపాట్లకు కూడ.[9] అల్లాహ్ నీ కార్యకలాపాలను కూడ ఎరుగును, నీ విశ్రాంతి స్థలాన్ని కూడా ఎరుగును.

**20 - 28** విశ్వాసులు[10] "(యుద్ధానికి సంబంధించిన ఆదేశం గల) సూరా ఏదైనా ఎందుకు అవతరించదు" అని అంటూ ఉండేవారు. కాని యుద్ధ ప్రస్తావన గల ఒక నిర్దిష్టమైన సూరా అవతరింప జేయబడినప్పుడు తమ హృదయాలలో వ్యాధిగల వారు, మరణం ఆవహించిన వారి మాదిరిగా నీ వైపు చూడటాన్ని నీవు గమనిస్తావు. వారి వైఖరి ఎంతో శోచనీయం. విధేయతను పాటిస్తామనే వారి వాగ్దానమూ, మంచి మంచి మాటలూ (కేవలం నోటి మాటలే) కాని స్పష్టమైన ఆజ్ఞ ఇవ్వబడినప్పుడు, వారు తాము అల్లాహ్‌కు చేసిన ప్రమాణాన్ని నెరవేర్చటంలో తమ నిజాయితీని నిరూపించుకుని ఉంటే, అది వారికే శ్రేయస్కరమైనదిగా ఉండేది. ఇక మీ నుండి ఇంతకంటే ఏమి ఆశించవచ్చు; ఒకవేళ మీరు విముఖులైపోతే, భూమిపై మళ్లీ కల్లోలాన్ని రేకెత్తిస్తారు, పరస్పరం గొంతులు కోసుకుంటారు.[11] అల్లాహ్ శపించినవారూ, అంధులుగానూ, బధిరులుగానూ చేసిన వారూ వీరే. వారు ఖురాన్‌ను గురించి ఆలోచించలేదా? లేక వారి హృదయాలకు తాళాలు పడి ఉన్నాయా? యథార్థ మేమిటంటే, మార్గదర్శకత్వం వారికి స్పష్టపడిన తరువాత కూడ దానికి విముఖులైన వారికి షైతాను ఈ వైఖరిని అవలంబించడం సులభతరం చేశాడు, లేనిపోని ఆశల పరంపరను వారికొరకు పెంచివేశాడు. అందుకే వారు అల్లాహ్ అవతరింపజేసిన ధర్మాన్ని ద్వేషించే వారితో "కొన్ని విషయాలలో మేము మిమ్మల్ని అనుసరిస్తాము"[12] అని అన్నారు. అల్లాహ్ వారి ఈ రహస్యాలోచనలను బాగా ఎరుగును. దైవదూతలు వారి ఆత్మలను వశపరచుకునేటప్పుడు, వారి ముఖాలపై, వీపులపై కొడుతూ వారిని తీసుకువెళ్లేటప్పుడు, వారి పరిస్థితి ఎలా ఉంటుంది? ఇలా ఎందుకు జరుగుతుందంటే, వారు అల్లాహ్‌కు ఆగ్రహం కలిగించే విధానాన్ని అనుసరించారు, ఆయన ప్రసన్నుడయ్యే మార్గాన్ని అవలంబించటానికి ఇష్టపడలేదు. ఈ కారణంగానే ఆయన వారి కర్మలు అన్నింటినీ వృథాచేశాడు.[13]

فَاعْلَمْ اَنَّهٗ لَآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَاسْتَغْفِرْ لِذَنْۢبِكَ
وَلِلْمُؤْمِنِيْنَ وَالْمُؤْمِنٰتِ ؕ وَاللّٰهُ يَعْلَمُ
مُتَقَلَّبَكُمْ وَمَثْوٰىكُمْ ﴿۱۹﴾ وَ يَقُوْلُ الَّذِيْنَ اٰمَنُوْا
لَوْ لَا نُزِّلَتْ سُوْرَةٌ ۚ فَاِذَآ اُنْزِلَتْ سُوْرَةٌ
مُّحْكَمَةٌ وَّ ذُكِرَ فِيْهَا الْقِتَالُ ۙ رَاَيْتَ الَّذِيْنَ
فِيْ قُلُوْبِهِمْ مَّرَضٌ يَّنْظُرُوْنَ اِلَيْكَ نَظَرَ
الْمَغْشِيِّ عَلَيْهِ مِنَ الْمَوْتِ ؕ فَاَوْلٰى لَهُمْ ﴿۲۰﴾
طَاعَةٌ وَّ قَوْلٌ مَّعْرُوْفٌ ۫ فَاِذَا عَزَمَ الْاَمْرُ ۫
فَلَوْ صَدَقُوا اللّٰهَ لَكَانَ خَيْرًا لَّهُمْ ﴿۲۱﴾ فَهَلْ
عَسَيْتُمْ اِنْ تَوَلَّيْتُمْ اَنْ تُفْسِدُوْا فِي الْاَرْضِ
وَتُقَطِّعُوْٓا اَرْحَامَكُمْ ﴿۲۲﴾ اُولٰٓئِكَ الَّذِيْنَ لَعَنَهُمُ
اللّٰهُ فَاَصَمَّهُمْ وَ اَعْمٰٓى اَبْصَارَهُمْ ﴿۲۳﴾ اَفَلَا
يَتَدَبَّرُوْنَ الْقُرْاٰنَ اَمْ عَلٰى قُلُوْبٍ اَقْفَالُهَا ﴿۲۴﴾
اِنَّ الَّذِيْنَ ارْتَدُّوْا عَلٰٓى اَدْبَارِهِمْ مِّنْۢ بَعْدِ
مَا تَبَيَّنَ لَهُمُ الْهُدَى ۙ الشَّيْطٰنُ سَوَّلَ لَهُمْ ؕ
وَاَمْلٰى لَهُمْ ﴿۲۵﴾ ذٰلِكَ بِاَنَّهُمْ قَالُوْا لِلَّذِيْنَ
كَرِهُوْا مَا نَزَّلَ اللّٰهُ سَنُطِيْعُكُمْ فِيْ بَعْضِ
الْاَمْرِ ۚ وَ اللّٰهُ يَعْلَمُ اِسْرَارَهُمْ ﴿۲۶﴾ فَكَيْفَ
اِذَا تَوَفَّتْهُمُ الْمَلٰٓئِكَةُ يَضْرِبُوْنَ وُجُوْهَهُمْ وَ
اَدْبَارَهُمْ ﴿۲۷﴾ ذٰلِكَ بِاَنَّهُمُ اتَّبَعُوْا مَآ اَسْخَطَ
اللّٰهَ وَ كَرِهُوْا رِضْوَانَهٗ فَاَحْبَطَ اَعْمَالَهُمْ ﴿۲۸﴾

أَمْ حَسِبَ الَّذِينَ فِي قُلُوبِهِمْ مَرَضٌ أَنْ لَنْ يُخْرِجَ اللَّهُ أَضْغَانَهُمْ ﴿٢٩﴾ وَلَوْ نَشَاءُ لَأَرَيْنَاكَهُمْ فَلَعَرَفْتَهُمْ بِسِيمَاهُمْ ۚ وَلَتَعْرِفَنَّهُمْ فِي لَحْنِ الْقَوْلِ ۚ وَاللَّهُ يَعْلَمُ أَعْمَالَكُمْ ﴿٣٠﴾ وَلَنَبْلُوَنَّكُمْ حَتَّىٰ نَعْلَمَ الْمُجَاهِدِينَ مِنْكُمْ وَالصَّابِرِينَ وَنَبْلُوَ أَخْبَارَكُمْ ﴿٣١﴾

**29 - 31** హృదయాలలో వ్యాధి కలవారు, తమ మనస్సుల లోని కల్మషాన్ని అల్లాహ్ బహిర్గతం చేయడని అనుకుంటు న్నారా? మేము తలచుకుంటే వారిని నీకు చూపిస్తాము, వారి ముఖాలనుబట్టి నీవు వారిని గుర్తిస్తావు. అసలు వారు మాట్లాడే తీరునుబట్టే నీవు వారిని గురించి తెలుసుకుంటావు. అల్లాహ్ మీ అందరి కర్మలను గురించి బాగా ఎరుగును. మేము మిమ్మల్ని తప్పకుండా పరీక్షిస్తాము, తద్వారా మీ స్థితిని నిర్ణయి స్తాము. మీలో అల్లాహ్ మార్గంలో గట్టిగా కృషిచేసేవారు ఎవరో, స్థిరచిత్తులు ఎవరో చూస్తాము.

8. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) ఏర్పాటు చేసిన సభలో పాల్గొని, ఆయన ఉపదేశాలను లేదా దివ్య ఖురాను వాక్యాలను వినేటటువంటి, గ్రంథ ప్రజలకు చెందిన అవిశ్వాసులకూ, కపటులకూ, తిరస్కారులకూ సంబంధించిన ప్రస్తావన ఇది. కాని వారి హృదయాలలో ఆయన చెప్పే పరిశుద్ధ విషయాలపట్ల అయిష్టత, ద్వేషం ఉండటం చేత, వారు అన్ని విషయాలూ విన్నప్పటికీ ఏదీ అర్థం చేసుకునేవారు కాదు. బయటకు వచ్చిన తరువాత ముస్లిమ్‌లను, "ఇందాక ఆయన చెప్పింది ఏమిటి" అని అడిగేవారు.

9. మానవుడికి ఇస్లామ్ నేర్పే నీతులలో ఒకటి ఇది : ఒక దాసుడు తన ప్రభువుకు దాస్యం చేయటంలోనేమి, ఆయనను ఆరాధించటంలోనేమి, ఆయన ధర్మం కోసం పరిశ్రమించటంలోనేమి, అతను తన శక్తిమేరకు ఎంత కృషి చేసినాసరే, అతనికి "నేను చేయవలసినదంతా చేసేశాను" అనే అహంభావం ఎన్నడూ కలగకూడదు. అతను ఎల్లప్పుడూ, "నాపై నా ప్రభువు హక్కు ఎంత ఉన్నదో, దానిని నేను నెరవేర్చలేకపోయాను" అని భావిస్తూ ఉండాలి. ఎల్లప్పుడూ అతను తన తప్పులను ఒప్పుకుంటూ, "నిన్ను సేవించటంలో నా వల్ల జరిగిన లోటును మన్నించు" అని ప్రార్థిస్తూ ఉండాలి. ఈ దైవవాక్కు, "ప్రవక్తా! నీ పొరపాట్లలకు క్షమాభిక్ష పెట్టమని వేడుకో" సారాంశం కూడ ఇదే.

10. భావం ఏమిటంటే, నిజమైన ముస్లిమ్‌లు మాత్రం యుద్ధం చేయమనే ఆజ్ఞ ఎప్పుడొస్తుందా అని ఆత్రుతతో, అసహనంతో ఎదురుచూడసాగారు. కాని నిజమైన విశ్వాసం లేకుండా ముస్లిమ్‌ల పంక్తులలో చేరిపోయినవారు, యుద్ధం చేయమనే ఆజ్ఞ రాగానే, తమ ప్రాణాలకు ముప్పు ఏర్పడిందని అనుకున్నారు.

11. ఈ సూక్తి అర్థం ఏమిటంటే, ఒకవేళ మీరు ఇప్పుడు ఇస్లామ్‌ను సమర్థించటంలో, దానిని రక్షించటంలో వెనుకంజవేస్తే, మహాప్రవక్త (సఅసమ్), ఆయన అనుచరులు కలిసి తీసుకురావటానికి కృషి చేస్తున్నటువంటి మహత్తరమైన సంస్కరణ విప్లవం కోసం ప్రాణాలొడ్డి, ధనం వెచ్చించి పోరాడకపోతే, దాని పర్యవసానం ఎలా ఉంటుందంటే, మీరు మళ్లీ అజ్ఞానపు వ్యవస్థ వైపునకు వెళ్లిపోతారు; ఆ వ్యవస్థలో మీరు శతాబ్దాల తరబడి ఒకరి గొంతును మరొకరు కోసుకునేవారు, మీ సంతానాన్నే మీరు సజీవ దహనం చేసేవారు, దైవ భూమిలో సంక్షోభాన్ని లేవదీసేవారు, అన్యాయాలు చేసేవారు.

12. అంటే, విశ్వాసాన్ని బహిరంగంగా స్వీకరించి, ముస్లిమ్ సమాజంలో చేరిపోయిన తరువాత కూడ, వారు రహస్యంగా ఇస్లామ్ విరోధులతో కలసి కుట్రలు పన్నారు, "కొన్ని విషయాలలో మేము మిమ్మల్ని సమర్థిస్తాము" అని వారికి వాగ్దానం చేసేవారు.

13. కర్మలు అంటే, ముస్లిమ్‌లు అయిన తరువాత వారు చేసిన కర్మలు. వారి నమాజులు, ఉపవాసాలు, జకాతు దానం - ఒకటేమిటి, వారి సకల ఆరాధనలు, తమ బాహ్యరూపం రీత్యా సత్కార్యాలుగా పరిగణింపబడే పుణ్యకార్యాలు అన్నీ వృథా అయిపోయాయి, ఎందుకంటే, వారు ముస్లిమ్‌లు అయికూడ, అల్లాహ్‌పట్ల, ఆయన ధర్మంపట్ల, ముస్లిమ్ సమాజంపట్ల చిత్తశుద్ధి, విశ్వాసాలతో కూడుకున్న వైఖరిని అవలంబించలేదు. దీనికి భిన్నంగా వారు కేవలం అశాశ్వతమైన తమ భౌతిక ప్రయోజనాల నిమిత్తం, ధర్మ విరోధులతో చేతులు కలిపి కుట్రలు పన్నారు. ఇంకా అల్లాహ్ మార్గంలో జిహాదు చేసే అవకాశం కలిగినప్పుడు, వారు స్వీయరక్షణ కోసం మార్గాలు వెతకసాగారు.

إِنَّ الَّذِينَ كَفَرُوا وَصَدُّوا عَن سَبِيلِ اللَّهِ
وَشَاقُّوا الرَّسُولَ مِن بَعْدِ مَا تَبَيَّنَ لَهُمُ
الْهُدَىٰ لَن يَضُرُّوا اللَّهَ شَيْئًا وَسَيُحْبِطُ
أَعْمَالَهُمْ ﴿٣٢﴾ يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا أَطِيعُوا اللَّهَ
وَأَطِيعُوا الرَّسُولَ وَلَا تُبْطِلُوا أَعْمَالَكُمْ ﴿٣٣﴾ إِنَّ
الَّذِينَ كَفَرُوا وَصَدُّوا عَن سَبِيلِ اللَّهِ ثُمَّ
مَاتُوا وَهُمْ كُفَّارٌ فَلَن يَغْفِرَ اللَّهُ لَهُمْ ﴿٣٤﴾ فَلَا
تَهِنُوا وَتَدْعُوا إِلَى السَّلْمِ وَأَنتُمُ
الْأَعْلَوْنَ وَاللَّهُ مَعَكُمْ وَلَن يَتِرَكُمْ
أَعْمَالَكُمْ ﴿٣٥﴾ إِنَّمَا الْحَيَاةُ الدُّنْيَا لَعِبٌ وَلَهْوٌ
وَإِن تُؤْمِنُوا وَتَتَّقُوا يُؤْتِكُمْ أُجُورَكُمْ وَ
لَا يَسْأَلْكُمْ أَمْوَالَكُمْ ﴿٣٦﴾ إِن يَسْأَلْكُمُوهَا فَيُحْفِكُمْ
تَبْخَلُوا وَيُخْرِجْ أَضْغَانَكُمْ ﴿٣٧﴾ هَا أَنتُمْ هَٰؤُلَاءِ
تُدْعَوْنَ لِتُنفِقُوا فِي سَبِيلِ اللَّهِ فَمِنكُم مَّن
يَبْخَلُ وَمَن يَبْخَلْ فَإِنَّمَا يَبْخَلُ عَن نَّفْسِهِ
وَاللَّهُ الْغَنِيُّ وَأَنتُمُ الْفُقَرَاءُ وَإِن تَتَوَلَّوْا
يَسْتَبْدِلْ قَوْمًا غَيْرَكُمْ ثُمَّ لَا يَكُونُوا
أَمْثَالَكُم ﴿٣٨﴾ ع

**32 - 38** ఋజుమార్గం ఏదో స్పష్టంగా తెలిసినప్పటికీ, సత్యాన్ని తిరస్కరించి, అల్లాహ్ మార్గం నుండి (ప్రజలను) నిరోధిస్తూ, ప్రవక్తతో వివాదపడిన వారు నిజానికి అల్లాహ్‌కు ఏ మాత్రం నష్టం కలిగించలేరు. పైగా అల్లాహ్‌యే వారు చేసిన పనులన్నింటినీ నిష్ఫలం చేస్తాడు. విశ్వాసులారా! మీరు అల్లాహ్‌కు విధేయత చూపండి, ప్రవక్తకు విధేయత చూపండి, మీ పనులను వృధా చేసుకోకండి.[14] అవిశ్వాసానికి పాల్పడే వారినీ, దైవమార్గం వైపునకు పోకుండా (ప్రజలను) నిరోధించే వారినీ, మృత్యువు వచ్చేవరకు సత్య తిరస్కార స్థితిపై స్థిరంగా ఉండేవారిని అల్లాహ్ ఎంతమాత్రం క్షమించడు. కనుక మీరు అధైర్యపడకండి, రాజీపడటానికి వారిని పిలవకండి.[15] మీరే ఆధిక్యం పొందేవారు. అల్లాహ్ మీకు తోడుగా ఉన్నాడు. ఆయన మీ కర్మలను నిరర్థకం చేయడు. ఈ ప్రాపంచిక జీవితం ఒక ఆట మాత్రమే. ఒక వినోదం మాత్రమే. మీరు విశ్వసించి, భయభక్తుల వైఖరిని అవలంబిస్తే, అల్లాహ్ మీకు మీ ప్రతిఫలాన్ని ఇస్తాడు. ఆయన మీనుండి మీ ధనాన్ని అడుగడు.[16] ఒకవేళ ఆయన మీనుండి మీ ధనాన్ని అడిగితే, మీ ధనం మొత్తాన్ని కోరితే, మీరు పిసినారితనం చూపుతారు. ఆయన మీ దోషాన్ని వెలికితీస్తాడు. చూడండి! అల్లాహ్ మార్గంలో ధనం ఖర్చుపెట్టండి అని మీకు పిలుపు ఇవ్వబడుతోంది. దాని విషయంలో మీలో కొందరు పిసినారితనంతో వ్యవహరిస్తారు. కాని పిసినారితనం వహించే వ్యక్తి నిజానికి తనపట్ల తానే పిసినారితనం చూపుతున్నాడు. అల్లాహ్ అయితే ఎంతో సంపన్నుడు, మీరే ఆయనపై ఆధారపడి ఉన్నవారు. ఒకవేళ మీరు విముఖులైతే, అల్లాహ్ మీ స్థానంలో మరోజాతిని దేన్నయినా తీసుకువస్తాడు. వారు మీ వంటి వారై ఉండరు.

14. ఇంకొక రకంగా చెప్పాలంటే, పనులు లాభదాయకంగా ఉండాలన్నా, సఫలం కావాలన్నా, అది అల్లాహ్‌కూ, ఆయన ప్రవక్తకూ చూపే విధేయత మీదనే పూర్తిగా ఆధారపడి ఉంటుంది. విధేయత నుండి వైదొలగిన తరువాత, మనిషి చేసే ఏ పనికూడ మంచి పనిగా ఉండదు. కనుక ఎటువంటి ప్రతిఫలానికి అతడు నోచుకోడు.

15. ఇక్కడ ఒక విషయాన్ని దృష్టిలో ఉంచుకోవాలి; చిన్న పట్టణమైన మదీనాలో కొన్ని వందల మంది మహాజిర్లు, అన్సారులు గల ఒక చిన్న పక్షం ఇస్లామ్ జెండాను ఎగురవేసినప్పుడు, ఇంకా ఆ పక్షం, శక్తిమంతమైన ఖురైషు తెగను మాత్రమే కాక, మొత్తం అరేబియా దేశంలోని అవిశ్వాసులను, ముష్రిక్కులను కూడా ఎదుర్కోవలసి వచ్చిన సమయంలో ఈ ప్రసంగం అవతరించింది. ఈ పరిస్థితులలో, మనస్థైర్యాన్ని కోల్పోయి, శత్రువులతో సంధి కోసం దేవురించ కూడదు, వారితో పోరాడటానికి సర్వసన్నద్ధులై ఉండాలి అని చెప్పబడింది.

16. అంటే, అల్లాహ్ స్వయం సమృద్ధుడు. తన స్వార్థంకోసం మీ నుండి దేనినీ తీసుకోవలసిన అగత్యం ఎంతమాత్రంలేదు. ఒకవేళ తన మార్గంలో ఖర్చు పెట్టమని మిమ్మల్ని ఆయన కోరితే, అది తన కోసం కాక, మీ శ్రేయస్సుకు మాత్రమే ఆయన కోరాడు.

آیاتها ۲۹ | ۴۸ سُوْرَةُ الْفَتْحِ مَدَنِيَّةٌ ۱۱۱ | رکوعاتها ۴

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

اِنَّا فَتَحْنَا لَكَ فَتْحًا مُّبِيْنًا ۝۱ لِّيَغْفِرَ لَكَ اللّٰهُ
مَا تَقَدَّمَ مِنْ ذَنْۢبِكَ وَ مَا تَاَخَّرَ وَ يُتِمَّ نِعْمَتَهٗ
عَلَيْكَ وَ يَهْدِيَكَ صِرَاطًا مُّسْتَقِيْمًا ۝۲ وَّ
يَنْصُرَكَ اللّٰهُ نَصْرًا عَزِيْزًا ۝۳ هُوَ الَّذِيْٓ اَنْزَلَ
السَّكِيْنَةَ فِيْ قُلُوْبِ الْمُؤْمِنِيْنَ لِيَزْدَادُوْٓا
اِيْمَانًا مَّعَ اِيْمَانِهِمْ ؕ وَ لِلّٰهِ جُنُوْدُ السَّمٰوٰتِ وَ
الْاَرْضِ ؕ وَ كَانَ اللّٰهُ عَلِيْمًا حَكِيْمًا ۝۴
لِّيُدْخِلَ الْمُؤْمِنِيْنَ وَ الْمُؤْمِنٰتِ جَنّٰتٍ
تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ خٰلِدِيْنَ فِيْهَا وَ
يُكَفِّرَ عَنْهُمْ سَيِّاٰتِهِمْ ؕ وَ كَانَ ذٰلِكَ عِنْدَ اللّٰهِ
فَوْزًا عَظِيْمًا ۝۵ وَّ يُعَذِّبَ الْمُنٰفِقِيْنَ وَ الْمُنٰفِقٰتِ
وَ الْمُشْرِكِيْنَ وَ الْمُشْرِكٰتِ الظَّآنِّيْنَ بِاللّٰهِ ظَنَّ
السَّوْءِ ؕ عَلَيْهِمْ دَآئِرَةُ السَّوْءِ ۚ وَ غَضِبَ اللّٰهُ
عَلَيْهِمْ وَ لَعَنَهُمْ وَ اَعَدَّ لَهُمْ جَهَنَّمَ ؕ وَ سَآءَتْ
مَصِيْرًا ۝۶ وَ لِلّٰهِ جُنُوْدُ السَّمٰوٰتِ وَ الْاَرْضِ ؕ
وَ كَانَ اللّٰهُ عَزِيْزًا حَكِيْمًا ۝۷

ఆయతులు 29 | # 48. అల్ ఫత్హ్ | అవతరణ మదీనాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 – 7** ఓ ప్రవక్తా! మేము నీకు స్పష్టమైన విజయాన్ని ప్రసాదించాము,[1] అల్లాహ్ నీ పూర్వపు పొరపాట్లను, భావి కాలపు పొరపాట్లను మన్నించాలని,[2] నీపై తన అనుగ్రహాన్ని పూర్తిచేయాలని, నీకు ఋజుమార్గం చూపాలని,[3] నీకు గొప్ప సహాయం చేయాలని. ఆయనే విశ్వాసుల హృదయాలపై సకీనత్ (శాంతి సంతృప్తుల)ను అవతరింపజేశాడు,[4] తమ విశ్వాసానికి వారు అదనంగా మరొక విశ్వాసాన్ని కలుపుకోవాలని. భూమిలోని, ఆకాశాలలోని సైన్యాలన్నీ అల్లాహ్ అధీనంలోనే ఉన్నాయి. ఆయన జ్ఞానీ మరియు వివేకి. (ఆయన ఇలా ఎందుకు చేశాడంటే) విశ్వాసులైన పురుషులూ, స్త్రీలూ శాశ్వతంగా ఉండేటందుకు ఆయన వారిని క్రింద కాలువలు ప్రవహించే వనాలలో ప్రవేశింపజేయాలని; వారి పాపాలను వారి నుండి దూరం చేయాలని– అల్లాహ్ దృష్టిలో ఇది గొప్ప విజయం – అల్లాహ్ విషయంలో కుశంకలు గల కపటులైన పురుషులను, స్త్రీలను మరియు బహుదైవో పాసకులైన పురుషులను, స్త్రీలను శిక్షించాలని. చెడుల వలయంలోకి స్వయంగా వారే వచ్చిపడ్డారు. అల్లాహ్ ఆగ్రహం వారిపై పడింది, ఆయన వారిని శపించాడు, వారికై నరకాన్ని సిద్ధం చేశాడు. అది మహాచెడ్డ నివాసం. భూమ్యాకాశాలలోని సైన్యాలు అన్నీ అల్లాహ్ అధీనంలోనే ఉన్నాయి. ఆయన శక్తిమంతుడు, వివేకవంతుడూను.

1. హుదైబియా సంధి తరువాత, విజయానికి సంబంధించిన ఈ శుభవార్తను ప్రకటించినప్పుడు, "ఈ సంధిని విజయం అని ఎలా అనగలము. అందులో అవిశ్వాసులు కోరిన అన్ని షరతులనూ స్థూలంగా మనం ఒప్పుకున్నాము" అని ప్రజలు ఆశ్చర్యపడ్డారు. కాని కొద్దికాలం తరువాతనే, ఈ సంధి నిజానికి ఒక విజయమే అని తెలిసిపోయింది.

إِنَّآ أَرْسَلْنَٰكَ شَٰهِدًا وَمُبَشِّرًا وَنَذِيرًا ﴿٨﴾
لِّتُؤْمِنُوا بِاللَّهِ وَرَسُولِهِ وَتُعَزِّرُوهُ وَ
تُوَقِّرُوهُ ۚ وَتُسَبِّحُوهُ بُكْرَةً وَأَصِيلًا ﴿٩﴾ إِنَّ
الَّذِينَ يُبَايِعُونَكَ إِنَّمَا يُبَايِعُونَ اللَّهَ يَدُ اللَّهِ
فَوْقَ أَيْدِيهِمْ ۚ فَمَن نَّكَثَ فَإِنَّمَا يَنكُثُ عَلَىٰ
نَفْسِهِ ۖ وَمَنْ أَوْفَىٰ بِمَا عَٰهَدَ عَلَيْهُ اللَّهَ
فَسَيُؤْتِيهِ أَجْرًا عَظِيمًا ﴿١٠﴾

**8 – 9** ప్రవక్తా! మేము నిన్ను సాక్షి (షాహిద్) గాను,[5] శుభ వార్త అందజేసేవాని గానూ, హెచ్చరిక చేసేవానిగానూ చేసి పంపాము. ఎందుకంటే, ప్రజలారా! మీరు అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ విశ్వసించాలని, (ప్రవక్తకు) సహకరించాలని, అతనిని గౌరవించాలని; ఉదయం, సాయంత్రం అల్లాహ్‌ను స్తుతించాలని.

**10** ప్రవక్తా! నీతో విధేయతా ప్రమాణం చేసినవారు[6] నిజానికి అల్లాహ్‌తో విధేయతా ప్రమాణం చేశారు. వారి చేతులపై అల్లాహ్ హస్తం ఉన్నది.[7] ఇప్పుడిక ఎవడు ఈ ప్రమాణాన్ని భంగపరుస్తాడో, అతడి ప్రమాణభంగం వల్ల కలిగే కీడు స్వయంగా అతడినే చుట్టుకుంటుంది. ఎవడు తాను అల్లాహ్‌తో చేసిన ప్రమాణానికి కట్టుబడి ఉంటాడో, అతనికి అల్లాహ్ త్వరలోనే గొప్ప ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాడు.

2. ఈ వాక్యం చెప్పబడిన సమయ సందర్భాలను దృష్టిలో ఉంచుకుంటే, స్పష్టపడే విషయం ఏమిటంటే, మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) నాయకత్వంలో గత 19 సంవత్సరాల నుండి ముస్లిమ్‌లు ఇస్లామ్ విజయం కోసం, ఔన్నత్యం కోసం చేస్తూ వచ్చిన కృషిలో కనిపించని లోపాలు, దోషాలను మన్నించే విషయం ఇక్కడ ప్రస్తావించబడింది. ఈ దోషాలు ఏ మానవుడికీ కనిపించవు. ఎందుకంటే ఆ కృషిలో గల దోషాలను ఎన్నదగిన స్థితికి మానవుడి బుద్ధి ఎదగలేదు. అల్లాహ్ దృష్టిలో పరిపూర్ణతకు నిర్దేశింపబడిన ఉన్నతమైన ప్రమాణం ప్రకారం, ఆ కృషిలో కొన్ని లోపాలు తప్పకుండా ఉన్నాయి. వాటి కారణంగానే ముస్లిమ్‌లు అరేబియా ముష్రిక్కులపై విజయాన్ని వెంటనే సాధించలేకపోయారు. అల్లాహ్ వాక్కు అర్థం ఏమిటంటే, ఈ దోషాలతోనే మీరు ముందుకు సాగినట్లయితే, అరేబియాను జయించటానికి చాలా కాలం – అవసరమై ఉండేది. కాని మేము ఆ లోటుపాట్లను మన్నించి, కేవలం మా అనుగ్రహంతో వాటిని పరిహరించాము; హుదైబియా వద్ద మీకు విజయాన్ని ప్రసాదించాము. సాధారణంగా మీరు చేసే ప్రయత్నాల వల్ల ఆ భాగ్యం లభించేది కాదు.
3. ఇక్కడ మహాప్రవక్తకు రుజుమార్గం చూపటం అంటే అర్థం విజయ పథాన్ని చూపటం.
4. "సకీనత్" అంటే ప్రశాంతత, మానసిక సంతృప్తి అని భావం. అర్థం ఏమిటంటే, హుదైబియా ఒప్పందం సందర్భంగా నెలకొన్న ఉద్రేకపూరితమైన పరిస్థితులలో, ముస్లిమ్‌లు సహనంతో వ్యవహరించటం, మహాప్రవక్త(సఅసమ్) నాయకత్వం పట్ల పరిపూర్ణమైన విశ్వాసంతో ఆ సంక్లిష్ట పరిస్థితుల నుండి గట్టెక్కడం, అనేవన్నీ అల్లాహ్ చలువ వల్లనే జరిగాయి. లేకపోతే అప్పుడు ఒక చిన్న దోషం సైతం మొత్తం వ్యవహారాన్ని తారుమారు చేసేది.
5. షా వలీ ఉల్లాహ్ గారు 'షాహిద్'ను "సత్యానికి సాక్షీభూతుడు" అని అనువదించారు. అంటే సత్యానికి సాక్షిగా నిలిచేవాడు.
6. పవిత్ర మక్కాలో హజ్రత్ ఉస్మాన్ (రజిఅన్) అమరగతిని పొందారు అనే వార్తను విని మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) తమ అనుచరుల నుండి హుదైబియా ప్రాంతాన తీసుకున్నటువంటి విధేయతా పూర్వక ప్రమాణాన్ని ఇది సూచిస్తుంది. ఈ ప్రమాణాన్ని ఈ విషయం గురించి తీసుకోవటం జరిగింది; హజ్రత్ ఉస్మాన్ (రజిఅన్) అమరగతి పొందారు అనేవిషయం యథార్థమని నిరూపించబడితే, ఇక్కడే, ఇప్పుడే ఖురైషు తెగ వారితో ముస్లిమ్‌లు తలబడాలి, ఆ కారణంగా వారి ప్రాణాలు పోయినాసరే.

سَيَقُوْلُ لَكَ الْمُخَلَّفُوْنَ مِنَ الْاَعْرَابِ
شَغَلَتْنَآ اَمْوَالُنَا وَاَهْلُوْنَا فَاسْتَغْفِرْ لَنَا ۚ
يَقُوْلُوْنَ بِاَلْسِنَتِهِمْ مَّا لَيْسَ فِيْ قُلُوْبِهِمْ ۗ
قُلْ فَمَنْ يَّمْلِكُ لَكُمْ مِّنَ اللّٰهِ شَيْـًٔا اِنْ
اَرَادَ بِكُمْ ضَرًّا اَوْ اَرَادَ بِكُمْ نَفْعًا ۗ بَلْ كَانَ
اللّٰهُ بِمَا تَعْمَلُوْنَ خَبِيْرًا ﴿١١﴾ بَلْ ظَنَنْتُمْ اَنْ
لَّنْ يَّنْقَلِبَ الرَّسُوْلُ وَ الْمُؤْمِنُوْنَ اِلٰٓى اَهْلِيْهِمْ
اَبَدًا وَّ زُيِّنَ ذٰلِكَ فِيْ قُلُوْبِكُمْ وَ ظَنَنْتُمْ ظَنَّ
السَّوْءِ ۖۚ وَ كُنْتُمْ قَوْمًاۢ بُوْرًا ﴿١٢﴾ وَ مَنْ لَّمْ
يُؤْمِنْ بِاللّٰهِ وَ رَسُوْلِهٖ فَاِنَّآ اَعْتَدْنَا لِلْكٰفِرِيْنَ
سَعِيْرًا ﴿١٣﴾ وَ لِلّٰهِ مُلْكُ السَّمٰوٰتِ وَالْاَرْضِ ۗ
يَغْفِرُ لِمَنْ يَّشَآءُ وَ يُعَذِّبُ مَنْ يَّشَآءُ ۗ وَ
كَانَ اللّٰهُ غَفُوْرًا رَّحِيْمًا ﴿١٤﴾

**11 - 12** ప్రవక్తా! పల్లెటూరి అరబ్బులలో వెనుక ఉండిపోయిన వారు[8] ఇప్పుడు నీ వద్దకు వచ్చి తప్పకుండా ఇలా అంటారు, "మా ఆస్తిపాస్తులూ, మా ఆలు బిడ్డలను గురించిన చింతనా మాకు తీరిక లేకుండా చేశాయి. మీరు మాకై క్షమాభిక్ష ప్రార్థన చేయండి." వారు తమ మనస్సులలో లేని విషయాలను తమ నోటితో అంటారు. వారితో ఇలా అను: "మంచిది, అలాగైతే, అల్లాహ్ మీకు ఏదైనా నష్టాన్ని కలుగజేయ దలిస్తే లేదా ఏదైనా లాభాన్ని చేకూర్చదలిస్తే, అల్లాహ్ యొక్క ఈ నిర్ణయాన్ని అడ్డుకునే అధికారం ఎవరికైనా కాస్తయినా ఉందా? మీ కర్మలను గురించి అల్లాహ్‌కే బాగా తెలుసు. (కాని అసలు విషయం మీరు చెప్పేది కాదు) కాని, ప్రవక్త మరియు విశ్వాసులు తమ ఇంటి వారివద్దకు తిరిగి రానేరారు అని మీరు భావించారు. ఈ ఆలోచన మీ మనస్సులకు బాగా నచ్చింది. మీరు చాలా చెడ్డగా అనుమానించారు, మీరు చాలా చెడ్డ ఆంతర్యం కలవారు."

**13 - 14** అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ విశ్వసించని అవిశ్వాసుల కొరకు మేము భగభగ మండే అగ్నిని సిద్ధపరచి ఉంచాము. భూమ్యాకాశాల సామ్రాజ్యాధిపత్యానికి యజమాని అల్లాహ్‌యే. ఆయన తాను కోరిన వారిని క్షమిస్తాడు, తాను కోరిన వారిని శిక్షిస్తాడు. ఆయన క్షమించేవాడు, కరుణించే వాడూను.

7. అంటే, ప్రజలు అప్పుడు ఏ చేతిమీద చేయివేసి ప్రమాణం చేశారో, ఆ చేయి దైవప్రవక్త చేయి కాదు, అల్లాహ్ ప్రతినిధి చేయి. ఈ ప్రమాణం దైవప్రవక్త ద్వారా అల్లాహ్‌తో చేసిన ప్రమాణమే.

8. 'ఉమ్‌రా'కు సంబంధించిన సన్నాహాలు చేయటం ప్రారంభించినపుడు, మహాప్రవక్త (సఅసమ్) తమతో రమ్మని ఆహ్వానించిన మదీనా పట్టణ పరిసరాలలోని ప్రజల ప్రస్తావన ఇది. కాని వారు తమ విశ్వాసాన్ని ప్రకటించిన తరువాత కూడ, ఇల్లు వదలి బయటకు రాలేదంటే, వారు తమ ప్రాణాలనే మిన్నగా చూసుకున్నారు. ఈ సమయంలో శత్రువులైన ఖురైషుల దేశానికి యాత్ర పోవటం అంటే మృత్యు ముఖంలోకి పోవటమేనని వారు భావించారు.

سَيَقُوْلُ الْمُخَلَّفُوْنَ اِذَا انْطَلَقْتُمْ اِلٰى مَغَانِمَ
لِتَاْخُذُوْهَا ذَرُوْنَا نَتَّبِعْكُمْ ۚ يُرِيْدُوْنَ اَنْ
يُّبَدِّلُوْا كَلٰمَ اللّٰهِ ؕ قُلْ لَّنْ تَتَّبِعُوْنَا كَذٰلِكُمْ
قَالَ اللّٰهُ مِنْ قَبْلُ ۚ فَسَيَقُوْلُوْنَ بَلْ
تَحْسُدُوْنَنَا ؕ بَلْ كَانُوْا لَا يَفْقَهُوْنَ اِلَّا
قَلِيْلًا ﴿۱۵﴾ قُلْ لِّلْمُخَلَّفِيْنَ مِنَ الْاَعْرَابِ
سَتُدْعَوْنَ اِلٰى قَوْمٍ اُولِيْ بَاْسٍ شَدِيْدٍ
تُقَاتِلُوْنَهُمْ اَوْ يُسْلِمُوْنَ ۚ فَاِنْ تُطِيْعُوْا يُؤْتِكُمُ
اللّٰهُ اَجْرًا حَسَنًا ۚ وَاِنْ تَتَوَلَّوْا كَمَا تَوَلَّيْتُمْ
مِّنْ قَبْلُ يُعَذِّبْكُمْ عَذَابًا اَلِيْمًا ﴿۱۶﴾ لَيْسَ عَلَى
الْاَعْمٰى حَرَجٌ وَّلَا عَلَى الْاَعْرَجِ حَرَجٌ
وَّلَا عَلَى الْمَرِيْضِ حَرَجٌ ؕ وَمَنْ يُّطِعِ اللّٰهَ وَ
رَسُوْلَهٗ يُدْخِلْهُ جَنّٰتٍ تَجْرِيْ مِنْ تَحْتِهَا
الْاَنْهٰرُ ۚ وَمَنْ يَّتَوَلَّ يُعَذِّبْهُ عَذَابًا اَلِيْمًا ﴿۱۷﴾ ع ٢
لَقَدْ رَضِيَ اللّٰهُ عَنِ الْمُؤْمِنِيْنَ اِذْ يُبَايِعُوْنَكَ
تَحْتَ الشَّجَرَةِ فَعَلِمَ مَا فِيْ قُلُوْبِهِمْ فَاَنْزَلَ
السَّكِيْنَةَ عَلَيْهِمْ وَاَثَابَهُمْ فَتْحًا قَرِيْبًا ﴿۱۸﴾ وَّ
مَغَانِمَ كَثِيْرَةً يَّاْخُذُوْنَهَا ؕ وَكَانَ اللّٰهُ عَزِيْزًا
حَكِيْمًا ﴿۱۹﴾

**15 - 17** నీవు విజయ ధనాన్ని పొందటానికి వెళ్లేటప్పుడు, వెనుక ఉండి పోయినవారు నీతో, "మమ్మల్ని కూడా మీ వెంట రానీయండి"[9] అని తప్ప కుండా అంటారు. వారు అల్లాహ్ ఉత్తరువును మార్చ గోరుతున్నారు. వారికి స్పష్టంగా ఇలా చెప్పు, "మీరు మాతో రావటానికి ఎంతమాత్రం వీలులేదు. అల్లాహ్ ఈ విషయాన్ని ముందే చెప్పేశాడు." వారు, "అది కాదు, మీరు మేమంటే అసూయ పడుతున్నారు" అని అంటారు. (అసలు ఇక్కడ విషయం అసూయకు సంబంధిం చింది కాదు). కాని వారు సరియైన మాటను చాలా తక్కువగానే అర్థం చేసుకుంటారు. వెనుక ఉండిపోయిన ఈ గ్రామీణ అరబ్బులతో ఇలా అను, "త్వరలోనే, ఎంతో బలాఢ్యులైన ప్రజలతో పోరాడేందుకు మిమ్మల్ని పిలవటం జరుగుతుంది. మీరు వారితో యుద్ధం చేయవలసి ఉంటుంది లేదా వారు లొంగిపోతారు. అప్పుడు మీరు జిహాద్ ఆజ్ఞను శిరసావహిస్తే, అల్లాహ్ మీకు మంచి ప్రతిఫలం ఇస్తాడు. ఒకవేళ మీరు పూర్వం విముఖులైనట్లు మళ్లీ విముఖులైతే, అల్లాహ్ మీకు అత్యంత బాధాకరమైన శిక్ష విధిస్తాడు. అయితే ఒకవేళ అంధుడూ, కుంటివాడూ, వ్యాధిగ్రస్తుడూ జిహాద్ కొరకు రాకపోతే, అందులో ఎలాంటి దోషమూ లేదు. అల్లాహ్‌కూ, ఆయన ప్రవక్తకూ విధేయత చూపేవానిని అల్లాహ్ క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. విముఖుడయ్యే వానికి ఆయన వ్యధాభరితమైన శిక్ష విధిస్తాడు."

**18 - 21** విశ్వాసులు వృక్షం క్రింద నీతో విధేయతా ప్రమాణం చేస్తున్నప్పుడు, అల్లాహ్ వారిని చూసి ఆనందించాడు. వారి హృదయాల స్థితి ఆయనకు తెలుసు. కనుక ఆయన వారిపై 'సకీనత్' (శాంతి సంతృప్తుల)ను అవతరింపజేశాడు,[10] వారికి బహుమానంగా సమీపంలోని విజయాన్ని ప్రసా దించాడు అపార విజయధనాన్ని వారికి అనుగ్రహిం చాడు. దానిని వారు (త్వరలోనే) పొందుతారు.[11] అల్లాహ్ అత్యంత శక్తిమంతుడు, మహా వివేకవంతుడూను.

9. అంటే, ఈనాడు ప్రమాదభరితమైన ఈ దండయాత్రకు మీతోపాటు రావటానికి విముఖులుగా ఉన్నవారే, స్వయంగా పరుగెత్తుకుంటూ వచ్చి "మమ్మల్ని కూడా మీతో పాటు తీసుకువెళ్లండి" అని ప్రాధేయపడే సమయం త్వరలోనే రాబోతోంది. అప్పుడు మీరు చేయబోయే దండయాత్రను చూసి, విజయం సులభంగానే లభించటమే కాక యుద్ధపుసొత్తు కూడా ఎక్కువగా దొరుకుతుందని వారికి అనిపిస్తుంది.

وَعَدَكُمُ اللّٰهُ مَغَانِمَ كَثِيْرَةً تَاْخُذُوْنَهَا
فَعَجَّلَ لَكُمْ هٰذِهٖ وَ كَفَّ اَيْدِيَ النَّاسِ عَنْكُمْ
وَلِتَكُوْنَ اٰيَةً لِّلْمُؤْمِنِيْنَ وَ يَهْدِيَكُمْ صِرَاطًا
مُّسْتَقِيْمًا ﴿٢٠﴾ وَّ اُخْرٰى لَمْ تَقْدِرُوْا عَلَيْهَا قَدْ
اَحَاطَ اللّٰهُ بِهَا ؕ وَ كَانَ اللّٰهُ عَلٰى كُلِّ شَيْءٍ
قَدِيْرًا ﴿٢١﴾ وَ لَوْ قٰتَلَكُمُ الَّذِيْنَ كَفَرُوْا لَوَلَّوُا
الْاَدْبَارَ ثُمَّ لَا يَجِدُوْنَ وَلِيًّا وَّ لَا نَصِيْرًا ﴿٢٢﴾
سُنَّةَ اللّٰهِ الَّتِيْ قَدْ خَلَتْ مِنْ قَبْلُ ۖۚ وَ لَنْ
تَجِدَ لِسُنَّةِ اللّٰهِ تَبْدِيْلًا ﴿٢٣﴾ وَ هُوَ الَّذِيْ كَفَّ
اَيْدِيَهُمْ عَنْكُمْ وَ اَيْدِيَكُمْ عَنْهُمْ بِبَطْنِ مَكَّةَ مِنْۢ
بَعْدِ اَنْ اَظْفَرَكُمْ عَلَيْهِمْ ؕ وَكَانَ اللّٰهُ بِمَا
تَعْمَلُوْنَ بَصِيْرًا ﴿٢٤﴾

అల్లాహ్ మీకు అమితమైన విజయ ధనాలను వాగ్దానం చేస్తున్నాడు. వాటిని మీరు పొందుతారు.[12] వెంటనే ఆయన మీకు ఈ విజయాన్ని ప్రసాదించాడు,[13] ప్రజల చేతులు మీ పైకి లేవకుండా నిరోధించాడు,[14] ఇది విశ్వాసుల కొరకు ఒక సూచన కావాలని, అల్లాహ్ మిమ్మల్ని ఋజుమార్గం వైపునకు నడపాలని. ఇదేకాకుండా, ఇతర విజయ ధనాలను గురించి కూడ ఆయన మీకు వాగ్దానం చేస్తున్నాడు. వాటిపై మీరు ఇంకా అదుపు సాధించలేదు. అల్లాహ్ వాటిని చుట్టుముట్టి ఉన్నాడు.[15] అల్లాహ్‌కు ప్రతిదానిపై అధికారం ఉన్నది.

**22 - 26** ఈ అవిశ్వాసులు ఈ సమయంలో మీతో యుద్ధానికి దిగి ఉన్నట్లయితే, నిశ్చయంగా వెన్నుచూపి పారిపోయేవారు. ఇక ఏ సహాయకుణ్ణీ, ఏ రక్షకుణ్ణీ పొంది ఉండేవారు కాదు. ఇది అల్లాహ్ సంప్రదాయం; మొదటి నుండే వస్తూ ఉన్నది. మీరు అల్లాహ్ సంప్రదాయంలో ఏ మార్పునూ చూడలేరు. మక్కా లోయలో వారి చేతులను మీ నుండి, మీ చేతులను వారి నుండి ఆపినవాడు ఆయనే. వాస్తవానికి ఆయన మీకు వారిపై ఆధిక్యం ఇచ్చాడు. మీరు చేస్తూ ఉన్నదంతా అల్లాహ్ చూస్తూ ఉండినాడు.

---

10. ఇక్కడ "సకీనత్" అంటే ఒక ప్రత్యేకమైన హృదయస్థితి. దాని ఆధారంగా ఒక వ్యక్తి ఒక మహత్తర లక్ష్యం కోసం నిశ్చలమైన మనస్సుతో, పరిపూర్ణమైన శాంతి సంతృప్తులతో తనను తాను ప్రమాదానికి గురిచేసుకుంటాడు, ఫలితం ఏమైనా ఈ పని తప్పకుండా చేయవలసినదే అని నిర్భయంగా నిర్ణయం చేసుకుంటాడు.
11. ఇది ఖైబర్ విజయాన్నీ, దానివల్ల లభించిన యుద్ధసొత్తులనూ సూచిస్తుంది.
12. ఖైబర్ విజయం తరువాత, ముస్లిమ్‌లకు వరుసగా లభించిన ఇతర విజయాలు అని దీని భావం.
13. హుదైబియా ఒప్పందం అని దీని అర్థం. దీనిని సూరా ప్రారంభంలో స్పష్టమైన విజయం అని అభివర్ణించబడింది.
14. అంటే, అవిశ్వాసులైన ఖురైషులను ఆయన, హుదైబియా వద్ద మీపై దాడి చేయకుండా నిరోధించాడు. వాస్తవానికి బాహ్య పరిస్థితులను బట్టి చూస్తే, వారు మీకంటే ఎంతో మంచి స్థితిలో ఉన్నారు. యుద్ధం రీత్యా, ఆయుధ సంపత్తి రీత్యా, వారికంటే మీరు ఎంతో బలహీనంగా ఉన్నారు.
15. బహుశా ఇది మక్కా విజయాన్ని సూచిస్తుంది. అంటే మక్కా ఇంకా మీ స్వాధీనం కాలేదు. కాని అల్లాహ్ దానిని తన అదుపులోకి తీసుకున్నాడు. హుదైబియా వద్ద లభించిన ఈ విజయం ఫలితంగా అది కూడా మీ ఆక్రమణలోనికి వస్తుంది.

هُمُ الَّذِيْنَ كَفَرُوْا وَصَدُّوْكُمْ عَنِ الْمَسْجِدِ
الْحَرَامِ وَ الْهَدْيَ مَعْكُوْفًا اَنْ يَّبْلُغَ مَحِلَّهٗ ؕ وَ
لَوْ لَا رِجَالٌ مُّؤْمِنُوْنَ وَ نِسَآءٌ مُّؤْمِنٰتٌ لَّمْ
تَعْلَمُوْهُمْ اَنْ تَطَـُٔوْهُمْ فَتُصِيْبَكُمْ مِّنْهُمْ مَّعَرَّةٌۢ
بِغَيْرِ عِلْمٍ ۚ لِيُدْخِلَ اللّٰهُ فِيْ رَحْمَتِهٖ مَنْ
يَّشَآءُ ۚ لَوْ تَزَيَّلُوْا لَعَذَّبْنَا الَّذِيْنَ كَفَرُوْا
مِنْهُمْ عَذَابًا اَلِيْمًا ﴿٢٥﴾ اِذْ جَعَلَ الَّذِيْنَ
كَفَرُوْا فِيْ قُلُوْبِهِمُ الْحَمِيَّةَ حَمِيَّةَ الْجَاهِلِيَّةِ
فَاَنْزَلَ اللّٰهُ سَكِيْنَتَهٗ عَلٰى رَسُوْلِهٖ وَ عَلَى
الْمُؤْمِنِيْنَ وَ اَلْزَمَهُمْ كَلِمَةَ التَّقْوٰى وَ كَانُوْا
اَحَقَّ بِهَا وَاَهْلَهَا ؕ وَ كَانَ اللّٰهُ بِكُلِّ شَيْءٍ
عَلِيْمًا ﴿٢٦﴾ لَقَدْ صَدَقَ اللّٰهُ رَسُوْلَهُ الرُّءْيَا ٣ ع ٩ ١١
بِالْحَقِّ ۚ لَتَدْخُلُنَّ الْمَسْجِدَ الْحَرَامَ اِنْ شَآءَ
اللّٰهُ اٰمِنِيْنَ ۙ مُحَلِّقِيْنَ رُءُوْسَكُمْ
وَمُقَصِّرِيْنَ ۙ لَا تَخَافُوْنَ ؕ فَعَلِمَ مَا لَمْ تَعْلَمُوْا
فَجَعَلَ مِنْ دُوْنِ ذٰلِكَ فَتْحًا قَرِيْبًا ﴿٢٧﴾

సత్యాన్ని తిరస్కరించి, మిమ్మల్ని మస్జిదే హరామ్‌కు రాకుండా నిరోధించి, ఖుర్బానీ ఒంటెలను వాటి వధ్య స్థలాల దగ్గరకు చేరనీయకుండా చేసినది వారేకదా! (మక్కాలో) నీవు ఎరుగని విశ్వాసులైన స్త్రీ పురుషులు లేకుండా ఉన్నట్లయితే, తెలియక పోవటం వల్ల నీవు వారిని కాలరాస్తావనే ప్రమాదం, దానివల్ల నీపై అపవాదు వస్తుందనే భయం లేకపోయి ఉంటే (యుద్ధాన్ని ఆపటం జరిగేది కాదు. దానిని ఎందువల్ల ఆపటం జరిగిందంటే) అల్లాహ్ తన కారుణ్యంలోకి తాను కోరిన వారిని ప్రవేశింపజేసేటందుకు. ఆ విశ్వాసులు వేరుగాపోయి ఉంటే, (మక్కా వాసులలోని) అవిశ్వాసులను తప్పకుండా మేము కఠినంగా శిక్షించి ఉండేవారము.[16] (ఈ కారణం వల్లనే) ఈ అవిశ్వాసులు తమ హృదయాలలో మూఢాభిమానాన్ని పెంచుకున్నప్పుడు, అల్లాహ్ తన ప్రవక్తపై, విశ్వాసులపై 'సకీనత్' (శాంతి సంతృప్తుల)ను అవతరింపజేశాడు,[17] విశ్వాసులను భయభక్తుల మాటపై స్థిరంగా ఉంచాడు. వారే దానికి ఎక్కువ హక్కుదారులును, అర్హులూను. అల్లాహ్‌కు ప్రతి విషయం గురించి తెలుసు.

**27** నిశ్చయంగా అల్లాహ్ తన ప్రవక్తకు సత్యమైన స్వప్నాన్ని చూపించాడు. అది పూర్తిగా సత్యానికి అనుగుణంగా ఉన్నది.[18] అల్లాహ్ సంకల్పిస్తే, మీరు తప్పకుండా మస్జిదే హరామ్‌లో పూర్తి శాంతితో ప్రవేశిస్తారు.[19] మీరు శిరోముండనం చేయించుకొంటారు, వెంట్రుకలను కత్తిరించుకొంటారు. మీకు ఏ భయమూ ఉండదు. మీకు తెలియని విషయం ఆయనకు తెలుసు. కనుక ఆ స్వప్నం నిజం కాకముందే, ఆయన ఈ సమీప విజయాన్ని మీకు ప్రసాదించాడు.

16. అల్లాహ్, హుదైబియాలో యుద్ధం జరగకుండా చేయటానికి కారణం ఇదే. పవిత్ర మక్కాలో అప్పుడు అనేకమంది ముస్లిమ్ పురుషులు, స్త్రీలు ఉండేవారు. వారిలో కొందరు తమ విశ్వాసాన్ని గుట్టుగా ఉంచారు, మరికొందరు తమ విశ్వాసం వ్యక్తం కావటం వలనా, వలస పోవటానికి తగిన అవకాశం లేకపోవటం వలనా, హింసకూ, దౌర్జన్యానికి గురిఅయ్యారు. ఈ పరిస్థితులలో ఒకవేళ యుద్ధమే జరిగితే, ముస్లిమ్‌లు అవిశ్వాసులను నెట్టుకుంటూ పవిత్ర మక్కాలో ప్రవేశిస్తే, అవిశ్వాసులతో పాటు ఈ ముస్లిమ్‌లు కూడా తెలియనితనం చేత ముస్లిమ్‌ల చేతులలో చంపబడతారు. మరో ఆశయం ఏమిటంటే, అల్లాహ్ ఖురైషులను రక్తపాతపు యుద్ధంతో ఓటమి పాల్జేసి, మక్కాను ముస్లిమ్‌లు కైవసం చేసుకునేలా చేయదలచలేదు. ఆయన తలంపు ఏమిటంటే, రెండు సంవత్సరాల లోపలే ఖురైషులను నలువైపుల నుండి చుట్టుముట్టి, తద్వారా వారిని నిస్సహాయులుగా చేసి

هُوَ الَّذِيْٓ اَرْسَلَ رَسُوْلَهٗ بِالْهُدٰى وَدِيْنِ
الْحَقِّ لِيُظْهِرَهٗ عَلَى الدِّيْنِ كُلِّهٖ ؕ وَكَفٰى بِاللّٰهِ
شَهِيْدًا ۝٢٨ مُحَمَّدٌ رَّسُوْلُ اللّٰهِ ؕ وَالَّذِيْنَ
مَعَهٗٓ اَشِدَّآءُ عَلَى الْكُفَّارِ رُحَمَآءُ بَيْنَهُمْ
تَرٰىهُمْ رُكَّعًا سُجَّدًا يَّبْتَغُوْنَ فَضْلًا مِّنَ اللّٰهِ
وَرِضْوَانًا ؗ سِيْمَاهُمْ فِيْ وُجُوْهِهِمْ مِّنْ اَثَرِ
السُّجُوْدِ ؕ ذٰلِكَ مَثَلُهُمْ فِى التَّوْرٰىةِ ۛۖ وَ
مَثَلُهُمْ فِى الْاِنْجِيْلِ ۛ كَزَرْعٍ اَخْرَجَ شَطْئَهٗ
فَاٰزَرَهٗ فَاسْتَغْلَظَ فَاسْتَوٰى عَلٰى سُوْقِهٖ يُعْجِبُ
الزُّرَّاعَ لِيَغِيْظَ بِهِمُ الْكُفَّارَ ؕ وَعَدَ اللّٰهُ
الَّذِيْنَ اٰمَنُوْا وَعَمِلُوا الصّٰلِحٰتِ مِنْهُمْ مَّغْفِرَةً
وَّاَجْرًا عَظِيْمًا ۝٢٩

28 - 29 అల్లాహ్‌యే తన ప్రవక్తకు మార్గదర్శకత్వాన్నీ, సత్యధర్మాన్నీ ఇచ్చి పంపాడు, అది అన్ని ధర్మాలపై ఆధిక్యం కలిగి ఉండేలా చేయటానికి. ఈ వాస్తవానికి అల్లాహ్ సాక్ష్యమే చాలు.[20] ముహమ్మద్ అల్లాహ్ ప్రవక్త. ఆయన వెంట ఉన్న వారు అవిశ్వాసుల పట్ల కఠినులు[21]గానూ ఉంటారు, పరస్పరం కరుణామయులు[22]గానూ ఉంటారు. నీవు వారిని చూసినప్పుడు, వారు రుకూ సజ్దాలలో, అల్లాహ్ అనుగ్రహాన్నీ, ఆయన ప్రసన్నతనూ అర్థించటంలో నిమగ్నులై ఉండటం కనిపిస్తుంది. సజ్దాల సూచనలు వారి ముఖాలపై ఉంటాయి, వాటివల్ల వారు ప్రత్యేకంగా గుర్తించబడతారు.[23] వారి గుణగణాలు తౌరాత్‌లో ఇలా ఉన్నాయి. ఇక ఇన్‌జీల్‌లో వారు ఒక పంటపొలంతో పోల్చబడ్డారు. ఆ పొలం మొదట్లో మొలకను అంకురింపజేసింది, తరువాత దానికి బలం చేకూర్చింది, ఆ తరువాత అది లావుగా ఏపుగా పెరిగింది, ఆపై తన కాండంపై నిలబడింది. రైతులను అది ఆనంద పరుస్తుంది, అవిశ్వాసులు వారి వృద్ధివికాసాలను చూచి అసూయపడాలని. విశ్వసించి సత్కార్యాలు చేసే ఈ వర్గం వారికి క్షమాభిక్షనూ, గొప్ప ప్రతిఫలాన్నీ ప్రసాదిస్తానని అల్లాహ్ వాగ్దానం చేశాడు.

ప్రతిఘటన లేకుండా తమకు తాముగా లొంగిపోయేలా చేయటం; తరువాత ఈ తెగ మొత్తం ఇస్లామ్‌ను అంగీకరించి అల్లాహ్ కారుణ్యానికి పాత్రులు కావటం. మక్కా జయింపబడినప్పుడు ఇలానే జరిగింది.

17. ఇక్కడ 'సకీనత్' అంటే సహనం, హుందాతనం అని అర్థం. వాటి ద్వారానే మహాప్రవక్త (సఅసమ్), ముస్లిమ్‌లు అవిశ్వాసుల అజ్ఞానపు దురభిమానాలను ఎదుర్కొన్నారు. వారు అవిశ్వాసుల మంకుతనానికీ, అహంకారపు ప్రవర్తనకూ రెచ్చిపోయి దారుణ కార్యాలకు పాల్పడలేదు. దానికి సమాధానంగా వారు సత్యానికీ, నిజాయితీకి విరుద్ధంగా ఉన్నటువంటి ఏ మాటా పలకలేదు. వ్యవహారం సానుకూలంగా పరిష్కారం అవటానికి బదులుగా, దానిని మరింత జటిలం చేసి బెడిసికొట్టే ఏ మాటను కూడ వారు పలుకలేదు.

18. ముస్లిమ్‌ల మనస్సులను నిరంతరం అనుమానాలకు గురిచేసే ప్రశ్నకు సమాధానం ఇది. వారు ఇలా అనేవారు: "మహాప్రవక్త (సఅసమ్) తాము మస్జిదె హరామ్‌లో ప్రవేశించినట్లూ, పవిత్ర కాబాను ప్రదక్షిణం చేసినట్లూ కలగన్నారు. అటువంటప్పుడు మేము ఉమ్రా చేయకుండా ఎందుకు తిరిగి వెళుతున్నాము." ఈ విషయమే వారికి సందేహాన్ని కలిగించింది.

19. ఈ వాగ్దానం రాబోయే సంవత్సరం 7వ హిజ్రీ, జిల్ ఖాయిదా మాసంలో నెరవేరింది. ఈ ఉమ్‌రాహ్ చరిత్రలో "ఉమ్‌రతుల్ ఖజా" అనే పేరుతో ప్రసిద్ధిగాంచింది.

20. ఇక్కడ ఈ విషయం చెప్పటానికి కారణం ఏమిటంటే, హుదైబియాలో శాంతి ఒప్పందం వ్రాయబడేటప్పుడు, మహాప్రవక్త (సఅసమ్) పవిత్ర నామంతోపాటు 'రసూలుల్లాహ్' (అల్లాహ్ ప్రవక్త) అనే పదం వ్రాయటం పట్ల

అభ్యంతరం లేవదీశారు. దానిపై ఇలా చెప్పబడింది : ఎవరు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా ప్రవక్త ప్రవక్తయే అనేది నిప్పులాంటి నిజం. ఈ విషయాన్ని కొందరు ఒప్పుకోకపోతే ఒప్పుకోకపోనివ్వండి. ఇది యదార్థమనటానికి, అల్లాహ్ సాక్ష్యమే చాలు.

21. మహాప్రవక్త (సఅసమ్) సహచరులు అవిశ్వాసులపట్ల కఠినులు అనే దాని భావం ఏమిటంటే, విశ్వాసులు మైనములాంటి వారు కారు, అవిశ్వాసులు వారిని ఎటుకోరితే అటు వంచటానికి. వారు మెత్తని మేత కాదు, అవిశ్వాసులు వారిని తేలికగా నమిలి మింగటానికి. వారిని భయపెట్టి లొంగదీసుకోవటం అంత తేలికైన పని కాదు. ఎరచూసి వారిని కొనటం సాధ్యం కాదు. ఏ మహత్తర లక్ష్యసాధనకై వారు తమ ప్రాణాలను సైతం పణంగా పెట్టి మహాప్రవక్త (సఅసమ్) కు సహాయపడటానికి ఉద్యమించారో, ఆ లక్ష్యం నుండి వారిని మరలించే శక్తి అవిశ్వాసులకు లేదు.

22. అంటే, వారి కాఠిన్యం ఎంతటిదైనా ఎట్టిదైనా, అది ధర్మ విరోధుల కోసమే, విశ్వాసుల కోసం కాదు. విశ్వాసుల ఎడల వారు మార్దవం, కారుణ్యం, వాత్సల్యం, సానుభూతి, జాలి కలవారు. సిద్ధాంతం పట్ల, లక్ష్యం పట్ల వారికి గల ఏకతా భావం వారిలో ఒకరి యందు ఒకరికి ప్రేమానురాగాలు, సామరస్యం, పరస్పర సహకారం పెంపొందించింది.

23. దీని అర్థం, ఇవి సజ్దాలు చేసిన కారణంగా కొందరు నమాజీల నుదుటిపై ఏర్పడే ఆనవాళ్ల వంటివి కావు. కాని అవి, దైవభీతి, దయాగుణం, మంచితనం, సత్ప్రవర్తనలకు గుర్తులు. ఆ గుర్తులు దేవుని ముందు మోకరిల్లుట వలన సహజసిద్ధముగా మనిషి ముఖంపై రూపుదిద్దుకున్నవి. అల్లాహ్ ఉద్దేశ్యం ఏమిటంటే, మహాప్రవక్త (సఅసమ్) సహచరులు ఎటువంటి వారంటే, వారిని చూచీ చూడటంతోనే ఒక మనిషి వారు సౌశీల్యవంతులని తెలుసుకుంటాడు. ఎందుకంటే దైవభక్తి వల్ల కలిగే దివ్య తేజస్సు వారి ముఖాలపై ప్రకాశిస్తూ ఉంటుంది.

آياتها ١٨ | ركوعاتها ٢

٤٩ سُوْرَةُ الْحُجُرٰتِ مَدَنِيَّةٌ ١٠٦

ఆయతులు 18 | **49. అల్ హుజురాత్** | అవతరణ మదీనాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لَا تُقَدِّمُوْا بَيْنَ يَدَيِ اللّٰهِ وَ رَسُوْلِهٖ وَاتَّقُوا اللّٰهَ ؕ اِنَّ اللّٰهَ سَمِيْعٌ عَلِيْمٌ ۝١ يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لَا تَرْفَعُوْٓا اَصْوَاتَكُمْ فَوْقَ صَوْتِ النَّبِيِّ وَ لَا تَجْهَرُوْا لَهٗ بِالْقَوْلِ كَجَهْرِ بَعْضِكُمْ لِبَعْضٍ اَنْ تَحْبَطَ اَعْمَالُكُمْ وَاَنْتُمْ لَا تَشْعُرُوْنَ ۝٢ اِنَّ الَّذِيْنَ يَغُضُّوْنَ اَصْوَاتَهُمْ عِنْدَ رَسُوْلِ اللّٰهِ اُولٰٓئِكَ الَّذِيْنَ امْتَحَنَ اللّٰهُ قُلُوْبَهُمْ لِلتَّقْوٰى ؕ لَهُمْ مَّغْفِرَةٌ وَّ اَجْرٌ عَظِيْمٌ ۝٣ اِنَّ الَّذِيْنَ يُنَادُوْنَكَ مِنْ وَّرَآءِ الْحُجُرٰتِ اَكْثَرُهُمْ لَا يَعْقِلُوْنَ ۝٤ وَ لَوْ اَنَّهُمْ صَبَرُوْا حَتّٰى تَخْرُجَ اِلَيْهِمْ لَكَانَ خَيْرًا لَّهُمْ ؕ وَ اللّٰهُ غَفُوْرٌ رَّحِيْمٌ ۝٥

**1** విశ్వాసులారా! అల్లాహ్‌కూ, ఆయన ప్రవక్తకూ ముందు[1] నడవకండి. అల్లాహ్‌కు భయపడండి. అల్లాహ్ సమస్తమూ వినేవాడు, సర్వమూ ఎరిగిన వాడూను.

**2 – 3** విశ్వాసులారా! మీ కంఠస్వరాన్ని ప్రవక్త కంఠస్వరం కంటే పెంచకండి. మీరు పరస్పరం మాట్లాడుకునే విధంగా ప్రవక్తతో బిగ్గరగా మాట్లాడకండి, దానివల్ల, బహుశా మీరు చేసినదంతా మీకు తెలియకుండానే వ్యర్థమైపోవచ్చు. ఆ సంగతి మీకు తెలియను కూడా తెలియకపోవచ్చు. ప్రవక్త సన్నిధిలో తమ కంఠస్వరాన్ని తగ్గించి మాట్లాడేవారి హృదయాలనే వాస్తవానికి భయభక్తుల విషయంలో అల్లాహ్ పరీక్షించాడు.[2] వారికి క్షమాభిక్ష, గొప్ప ప్రతిఫలం లభిస్తాయి.

**4 – 5** ప్రవక్తా! నిన్ను నీ గృహాల బయటినుండి బిగ్గరగా పిలిచేవారిలో అనేకులు బుద్ధిహీనులు. వారు గనక నీవు బయటకు వచ్చేవరకు ఓపికపట్టి ఉంటే, అది వారికే శ్రేయస్కరముగా ఉండేది.[3] అల్లాహ్ మన్నించేవాడు, కరుణామయుడూను.

1. అంటే, అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ అధిగమించకండి, అనుసరించండి; ప్రముఖులు కాకండి, విధేయులై ఉండండి. మీ వ్యవహారాలలో మీరే చొరవ తీసుకుని నిర్ణయాలు చేసుకోకండి. కాని మొదట అల్లాహ్ గ్రంథంలో, ఆయన ప్రవక్త సూక్తులలో ఆ వ్యవహారాలకు సంబంధించిన మార్గదర్శక సూత్రాలు ఏమున్నాయో తెలుసుకోండి.

2. అంటే, అల్లాహ్ పెట్టిన పరీక్షలలో నెగ్గినవారు మాత్రమే, ఆ పరీక్షలలో నిలబడి తమ హృదయాలలో నిజంగానే దైవభీతి ఉన్నదని నిరూపించుకున్నవారు మాత్రమే, అల్లాహ్ ప్రవక్తను గౌరవించగలరు. ఈ అల్లాహ్ సూక్తి ద్వారా వ్యక్తమయ్యే విషయమేమిటంటే, ఏ హృదయాలలో ప్రవక్తపట్ల గౌరవం లేదో, ఆ హృదయాలు నిజానికి దైవభీతి కలవి కావు.

3. అరేబియాలోని విభిన్న ప్రాంతాల నుండి మహాప్రవక్తను కలుసుకోవటానికి వచ్చేవారిలో కొందరు మొరటువారు. తమ రాకను ఒక పరిచారకుని ద్వారానైనా తెలియజేయాలనే జ్ఞానం కూడా లేనివారు. మహాప్రవక్త ధర్మపత్నుల గదుల వద్దకు పోయి బయటి నుంచే ఆయనను పిలిచేవారు. వారి ఈ చేష్టలు మహాప్రవక్తకు ఇబ్బంది కలిగించేవి. కాని ఆయన స్వతహా సంయమనశీలి అగుటచే, వాటిని సహించేవారు. చివరకు అల్లాహ్ ఈ వ్యవహారంలో జోక్యం చేసుకుని, అనాగరికమైన వారి నడతను గర్హిస్తూ ఇలా బోధించాడు: వారు మహాప్రవక్తను చూడాలని వచ్చినప్పుడు, ఒకవేళ ఆయన కనపడకపోతే ఆయనంతట ఆయనే బయటకు వచ్చేవరకు ఓర్పుతో వేచి ఉండాలి. మాటి మాటికి అరిచి పిలవకూడదు.

يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْۤا اِنْ جَآءَكُمْ فَاسِقٌۢ بِنَبَاٍ
فَتَبَيَّنُوْۤا اَنْ تُصِيْبُوْا قَوْمًۢا بِجَهَالَةٍ
فَتُصْبِحُوْا عَلٰى مَا فَعَلْتُمْ نٰدِمِيْنَ ۝٦ وَاعْلَمُوْۤا
اَنَّ فِيْكُمْ رَسُوْلَ اللّٰهِ ؕ لَوْ يُطِيْعُكُمْ فِيْ كَثِيْرٍ
مِّنَ الْاَمْرِ لَعَنِتُّمْ وَلٰكِنَّ اللّٰهَ حَبَّبَ اِلَيْكُمُ
الْاِيْمَانَ وَزَيَّنَهٗ فِيْ قُلُوْبِكُمْ وَكَرَّهَ اِلَيْكُمُ
الْكُفْرَ وَالْفُسُوْقَ وَالْعِصْيَانَ ؕ اُولٰٓئِكَ هُمُ
الرّٰشِدُوْنَ ۙ۝٧ فَضْلًا مِّنَ اللّٰهِ وَنِعْمَةً ؕ وَاللّٰهُ
عَلِيْمٌ حَكِيْمٌ ۝٨ وَاِنْ طَآئِفَتٰنِ مِنَ
الْمُؤْمِنِيْنَ اقْتَتَلُوْا فَاَصْلِحُوْا بَيْنَهُمَا ۚ فَاِنْۢ
بَغَتْ اِحْدٰىهُمَا عَلَى الْاُخْرٰى فَقَاتِلُوا الَّتِيْ
تَبْغِيْ حَتّٰى تَفِيْٓءَ اِلٰٓى اَمْرِ اللّٰهِ ۚ فَاِنْ فَآءَتْ
فَاَصْلِحُوْا بَيْنَهُمَا بِالْعَدْلِ وَاَقْسِطُوْا ؕ اِنَّ
اللّٰهَ يُحِبُّ الْمُقْسِطِيْنَ ۝٩ اِنَّمَا الْمُؤْمِنُوْنَ
اِخْوَةٌ فَاَصْلِحُوْا بَيْنَ اَخَوَيْكُمْ وَاتَّقُوا اللّٰهَ
لَعَلَّكُمْ تُرْحَمُوْنَ ۧ ۝١٠ ع

**6 - 8** విశ్వాసులారా! ఎవడైనా దుర్మార్గుడు మీ వద్దకు ఏదైనా సమాచారాన్ని తీసుకువస్తే, నిజానిజాలు విచారించి తెలుసుకోండి. లేకపోతే మీకు తెలియకుండానే మీరు ఏదైనా వర్గానికి నష్టం కలిగించవచ్చు, తరువాత చేసినదానికి పశ్చాత్తాపపడవలసి రావచ్చు.[4] మీ మధ్య అల్లాహ్ ప్రవక్త ఉన్నాడనే విషయాన్ని బాగా గుర్తు ఉంచుకోండి, ఒకవేళ ప్రవక్త గనక అనేక వ్యవహారాలలో మీ మాట విన్నట్లయితే, మీరే స్వయంగా కష్టాలలో పడిపోతారు. కాని అల్లాహ్ మీలో విశ్వాసం పట్ల ప్రేమను కలుగజేశాడు, దానిని మీకు మనోరంజకమైనదిగా చేశాడు. అవిశ్వాసం, దుర్మార్గం, అవిధేయతలపట్ల మీకు వెగటు కలిగేలా చేశాడు. అటువంటి ప్రజలే అల్లాహ్ అనుగ్రహం వల్ల, ఆయన మహోపకారం వల్ల సన్మార్గగాములయ్యారు. అల్లాహ్ సర్వజ్ఞాని, మహా వివేకీను.

**9 - 10** ఒకవేళ విశ్వాసులలోని రెండు వర్గాలవారు పరస్పరం పోట్లాడుకుంటే,[5] వారి మధ్య రాజీ కుదిరించండి. తరువాత, ఒకవేళ వారిలో ఒక వర్గం వారు రెండో వర్గం వారిపై దౌర్జన్యం చేస్తే, దౌర్జన్యం చేసినవారు అల్లాహ్ ఆజ్ఞ వైపునకు మరలేవరకు వారికి వ్యతిరేకంగా పోరాడండి. తరువాత వారు గనక మరలి వస్తే, వారి మధ్య రాజీ కుదర్చండి. న్యాయం చేయండి, ఎందుకంటే అల్లాహ్ న్యాయం చేసేవారిని ప్రేమిస్తాడు. విశ్వాసులు పరస్పరం అన్నదమ్ములు. కనుక మీ సోదరుల మధ్య సంబంధాలను సంస్కరించండి. అల్లాహ్‌కు భయపడండి, మీపై దయ చూపటం జరగవచ్చు.

4. ఈ ఆయతులో ముస్లిములకు ఇవ్వబడిన మార్గదర్శక సూత్రం ఇది: గొప్ప పర్యవసానం కలిగే అవకాశం ఉన్న అత్యంత ప్రాముఖ్యంగల సమాచారం ఏదైనా మీకు అందితే దానిని స్వీకరించే ముందు, ఆ సమాచారం తెచ్చిన వ్యక్తి ఎటువంటివాడో తెలుసుకోవాలి. ఒకవేళ అతడు అసత్యవాది అయితే,– అతడి మాటలు నమ్మదగినవి కావని అతడి బాహ్యస్థితియే తెలుపుతోంది– అతడు తెచ్చిన సమాచారాన్ని అమలుపరచే ముందే, అసలు విషయం ఏమిటో పరిశోధించి తెలుసుకోండి.

5. "విశ్వాసులలోని ఇరు వర్గాల వారు పరస్పరం ఎప్పుడైనా తలపడితే" అని చెప్పబడలేదు. "విశ్వాసులలోని ఇరు వర్గాల వారు ఒకవేళ తలపడితే" అని చెప్పబడినది. ఈ పదాలను బట్టి తెలిసే విషయం ఏమిటంటే, పరస్పరం తలబడటం ముస్లిముల లక్షణం కాదు, కాకూడదు కూడ. వారు విశ్వాసులై కూడ, పరస్పరం పోరాడుకుంటారనే విషయం వారిని గురించి ఆశించరానటు వంటిది. కాని ఒకవేళ ఎప్పుడైనా అలాఅయితే, అప్పుడు ముందు రాబోయే పద్ధతిని అవలంబించాలి.

11 విశ్వాసులారా! పురుషులు ఇతర పురుషులను ఎగతాళి చేయకూడదు. వీరికంటే వారే శ్రేష్ఠులై ఉండవచ్చు. అలాగే స్త్రీలు ఇతర స్త్రీలను ఎగతాళి చేయకూడదు. వీరికంటే వారే శ్రేష్ఠురాండ్రయి ఉండవచ్చు.[6] ఒకరినొకరు ఎత్తిపొడుచుకోకండి,[7] ఒకరినొకరు చెడ్డ పేర్లతో పిలుచుకోకండి.[8] విశ్వసించిన తరువాత చెడ్డతనంలో పేరు సంపాదించటం చాలా నీచమైన విషయం. ఈ వైఖరిని మానుకోనివారే దుర్మార్గులు.

12 విశ్వాసులారా! అతిగా అనుమానించటం మానివేయండి. కొన్ని అనుమానాలు పాపాలు అవుతాయి.[9] గూఢచారులుగా వ్యవహరించకండి.[10] మీలో ఎవరూ ఎవరినీ పరోక్షంగా నిందించరాదు.[11] మీలో ఎవరైనా మీ మృత సోదరుని మాంసం తినటానికి ఇష్టపడతారా?[12] చూడండి, మీరే స్వయంగా దీనిని అసహ్యించుకుంటారు. అల్లాహ్‌కు భయపడండి, అల్లాహ్ అత్యధికంగా పశ్చాత్తాపాన్ని స్వీకరించేవాడు, కరుణించేవాడూను.

13 మానవులారా! మేము మిమ్మల్ని ఒకే పురుషుని నుండి, ఒకే స్త్రీ నుండి సృజించాము. తరువాత మీరు ఒకరినొకరు పరిచయం చేసుకునేందుకు మిమ్మల్ని జాతులుగానూ, తెగలుగానూ చేశాము. వాస్తవానికి మీలో అందరి కంటే ఎక్కువ భయభక్తులు కలవాడే[13] అల్లాహ్ దృష్టిలో ఎక్కువ గౌరవపాత్రుడు. నిశ్చయంగా అల్లాహ్ సర్వజ్ఞానం కలవాడు, సకల విషయాలూ తెలిసినవాడూను.

يَاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لَا يَسْخَرْ قَوْمٌ مِّنْ قَوْمٍ
عَسٰى اَنْ يَّكُوْنُوْا خَيْرًا مِّنْهُمْ وَ لَا نِسَآءٌ مِّنْ
نِّسَآءٍ عَسٰى اَنْ يَّكُنَّ خَيْرًا مِّنْهُنَّ ۚ وَ
لَا تَلْمِزُوْٓا اَنْفُسَكُمْ وَ لَا تَنَابَزُوْا بِالْاَلْقَابِ ؕ
بِئْسَ الِاسْمُ الْفُسُوْقُ بَعْدَ الْاِيْمَانِ ۚ وَمَنْ
لَّمْ يَتُبْ فَاُولٰٓئِكَ هُمُ الظّٰلِمُوْنَ ﴿١١﴾ يَاَيُّهَا
الَّذِيْنَ اٰمَنُوا اجْتَنِبُوْا كَثِيْرًا مِّنَ الظَّنِّ ۫ اِنَّ
بَعْضَ الظَّنِّ اِثْمٌ وَّ لَا تَجَسَّسُوْا وَ لَا يَغْتَبْ
بَّعْضُكُمْ بَعْضًا ؕ اَيُحِبُّ اَحَدُكُمْ اَنْ يَّاْكُلَ
لَحْمَ اَخِيْهِ مَيْتًا فَكَرِهْتُمُوْهُ ؕ وَاتَّقُوا اللّٰهَ ؕ
اِنَّ اللّٰهَ تَوَّابٌ رَّحِيْمٌ ﴿١٢﴾ يَاَيُّهَا النَّاسُ اِنَّا
خَلَقْنٰكُمْ مِّنْ ذَكَرٍ وَّاُنْثٰى وَ جَعَلْنٰكُمْ شُعُوْبًا وَّ
قَبَآئِلَ لِتَعَارَفُوْا ؕ اِنَّ اَكْرَمَكُمْ عِنْدَ اللّٰهِ
اَتْقٰكُمْ ؕ اِنَّ اللّٰهَ عَلِيْمٌ خَبِيْرٌ ﴿١٣﴾

6. ఎగతాళి చేయటం అంటే, కేవలం మాటలతో మాత్రమే ఎగతాళి చేయటం కాదు. ఎవరినైనా ఏ సందర్భంలోనైనా అనుకరించటం, అతని వైపునకు సైగలు చేస్తూ అభినయించటం, అతని మాటలు వినీ, అతని పనులను చూచీ, అతని ఆకారాన్ని చూసీ, అతని వేషధారణను చూసీ నవ్వటం, లేదా అతనిలోని లోపాలను, దోషాలను ఎత్తి చూపి ప్రజలు నవ్వేలా చేయటం ఇవన్నీ ఎగతాళి చేయటంలో ఉండే అంశాలు.

7. వక్రోక్తులు పలకటం, ఎగతాళి చేయటం, నీలాపనిందలు వేయటం, వంకలెన్నటం, తప్పులు వెదకటం, బహిరంగంగా కాని లేదా మూకాభినయం ద్వారాగాని ఎవరినైనా నిందకు గురిచేయటం ఇవన్నీ దీనికిందకే వస్తాయి.

8. ఈ ఆజ్ఞ ఉద్దేశ్యం ఏమిటంటే, ఏ వ్యక్తినైనా అతనిని కించపరిచే పేరుతో వ్యవహరించకూడదు, ఏ వ్యక్తికైనా అతనిని కించ పరిచే బిరుదు ఇవ్వకూడదు. ఉదాహరణకు, ఎవరినైనా పాపి అనీ, కపటి అనీ అనటం, ఎవరినైనా కుంటివాడనీ, గుడ్డివాడనీ, ఒంటికన్నువాడనీ అనటం, ఎవరికైనా, అతనిలోగానీ, అతని తల్లిదండ్రులలోగానీ, అతని వంశంలోగానీ, ఉన్నటువంటి ఏదైనా లోపాన్నిగానీ, బలహీనతను గానీ సూచించే బిరుదులు ఇవ్వటం, ఇస్లామ్ స్వీకరించిన పిదప ఆ వ్యక్తిని అతని పూర్వపు మతం ఆధారంగా యూదుడు అనీ లేక క్రైస్తవుడనీ పిలవటం. ఒక వ్యక్తినిగానీ ఒక కుటుంబాన్ని గానీ, ఒక జాతిని గానీ, ఒక వర్గాన్ని గానీ కించపరిచే రీతిలో అవమానపరచే ధోరణిలో పేర్కొనటం. బాహ్యరూపాన్నిబట్టి వికారంగా కనిపించే బిరుదులు ఈ ఆజ్ఞ పరిధిలోనికి రావు. ఎందుకంటే అవి వారిని కించపరచటానికి ఉద్దేశింపబడినవి కావు. మీదుమిక్కిలి అవి ఆయా వ్యక్తులను గుర్తించటానికి సాధనాలు అవుతాయి.

قَالَتِ الْاَعْرَابُ اٰمَنَّا ؕ قُلْ لَّمْ تُؤْمِنُوْا وَ لٰكِنْ قُوْلُوْۤا اَسْلَمْنَا وَلَمَّا يَدْخُلِ الْاِيْمَانُ فِيْ قُلُوْبِكُمْ ؕ وَ اِنْ تُطِيْعُوا اللّٰهَ وَرَسُوْلَهٗ لَا يَلِتْكُمْ مِّنْ اَعْمَالِكُمْ شَيْـًٔا ؕ اِنَّ اللّٰهَ غَفُوْرٌ رَّحِيْمٌ ﴿۱۴﴾ اِنَّمَا الْمُؤْمِنُوْنَ الَّذِيْنَ اٰمَنُوْا بِاللّٰهِ وَ رَسُوْلِهٖ ثُمَّ لَمْ يَرْتَابُوْا وَ جٰهَدُوْا بِاَمْوَالِهِمْ وَ اَنْفُسِهِمْ فِيْ سَبِيْلِ اللّٰهِ ؕ اُولٰٓئِكَ هُمُ الصّٰدِقُوْنَ ﴿۱۵﴾

**14 - 15** ఈ సంచార అరబ్బులు, "మేము విశ్వసించాము"[14] అని అంటారు. వారితో ఇలా అను, "మీరు విశ్వసించలేదు. మేము లొంగిపోయాము" అని అనండి. విశ్వాసం ఇంకా మీ హృదయాలలోకి ప్రవేశించలేదు. మీరు గనక అల్లాహ్ పట్ల విధేయతనూ, ఆయన ప్రవక్త పట్ల విధేయతనూ పాటిస్తే, ఆయన మీ కర్మల ప్రతిఫలాన్ని ఏమాత్రం తగ్గించడు. నిశ్చయంగా అల్లాహ్ అత్యధికంగా మన్నించేవాడు మరియు కరుణించేవాడూను. అసలు అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ విశ్వసించి, ఇక ఎలాంటి అనుమానానికీ గురికాకుండా, తమ ప్రాణాలతో, తమ సిరిసంపదలతో అల్లాహ్ మార్గంలో పోరాడేవారే నిజమైన విశ్వాసులు. వారే సత్యసంధులు.

ఉదాహరణకు, గుడ్డి డాక్టరు; అంటే ఆ వ్యక్తిని సులభంగా గుర్తించటానికి మాత్రమే ఉపకరించేది కాని, కించపరచటానికి ఏమాత్రం ఉద్దేశించబడినది కాదు అని గ్రహించాలి.

9. అసలు అనుమానించటం తగదు అనే విషయం నిషేధింపబడలేదు. అతిగా అనుమానించటం, ప్రతి అనుమానాన్ని లెక్కలోకి తీసుకోవటం - ఈ రెండూ నిషేధింపబడ్డాయి. ఎందుకంటే కొన్ని అనుమానాలు పాపభూయిష్టాలు అని చెప్పబడింది. పాపపు అనుమానాలు ఇవి : ఒకడు ఇంకొకడిని అకారణంగా అనుమానించటం, లేదా అనుమానం ఆధారంగా ఇతరులను గురించి ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకోవటం లేదా రూపురేఖా విలాసాలను బట్టి సాధువులు, సౌశీల్యవంతులు అయిన వ్యక్తులపట్ల అపనమ్మకంతో వ్యవహరించటం; ఒకవ్యక్తి మాటలో, చేష్టలో మంచీచెడులు సమపాళ్లల్లో ఉన్నప్పుడు, మనం కేవలం అనుమానంతో వ్యవహరించి అతనిని చెడ్డవాడేనని భావించటమూ పాపకార్యమే.

10. అంటే, ప్రజల రహస్యాలను దేవులాడకండి. ఒకరు మరొకరి లోపాలను వెదకకండి. ఇతరుల స్థితిగతులను గురించీ వ్యవహారాలను గురించీ దొంగతనంగా తెలుసుకోవటానికి ప్రయత్నించకండి. ఇతరుల ఉత్తరాలు చదవటం, ఇద్దరు మనుషుల సంభాషణలు చాటుగా ఉండి వినటం, ఇరుగు పొరుగుల ఇళ్లల్లోకి తొంగిచూడటం, విభిన్న పద్ధతుల ద్వారా ఇతరుల ఆంతరంగిక జీవితాలను గురించిగానీ వారి కుటుంబ వ్యవహారాలను గురించి గానీ తెలుసుకోవటం- ఇవన్నీ ఇతరుల రహస్యాలను వెదకటం కిందకు వస్తాయి. అది నిషేధించబడింది.

11. పరోక్షనింద అంటే ఏమిటో వివరించమని మహాప్రవక్త (సఅసమ్)ను అడగటం జరిగింది. దానికి ఆయన ఇలా అన్నారు : "నీవు నీ సోదరుణ్ణి గురించి, అతనికి బాధకలిగే విధంగా ప్రస్తావించటం." ఇలా అడిగారు, "ఒకవేళ నేను ప్రస్తావించే విషయం నా సోదరునిలో ఉంటే, అప్పుడు మీరేమంటారు?" దానికి ఆయన, "ఒకవేళ ఆ విషయం నీ సోదరునిలో ఉంటే, నీవు అతనిని పరోక్షంగా నిందించినట్లే. ఒకవేళ అది అతనిలో లేకపోతే, నీవు అతనిపై అభాండం వేసినట్లే" అని సెలవిచ్చారు. ఈ నిషేధం నుండి ఈ సందర్భాలు మినహాయించబడ్డాయి: పరోక్షంగానో లేదా మరణానంతరమో, ఒక వ్యక్తిలోని చెడులను బయటపెట్టవలసిన అవసరం ఏర్పడితే, షరియత్ శాస్త్రం ప్రకారం (ఆ అవసరం) తప్పనిసరి అయితే, ఆ అవసరం పరోక్షనింద చేయకుండా తీరనట్లయితే దానికోసం పరోక్ష నింద చేయనప్పుడు, ఒక పెద్ద విపత్తు సంభవించే అవకాశం ఉన్నట్లయితే. మహాప్రవక్త (సఅసమ్) ఈ మినహాయింపును ఇలా సూత్రీకరించారు: "ఒక ముస్లిమ్‌ను అకారణంగా అగౌర వంపాలు చేయటం అతి నికృష్టమైన పని." ఈ సూక్తిలో, "అన్యాయంగా" అనే షరతు "న్యాయంగా" అలా చేయటం ధర్మసమ్మతమే అని తెలియజేస్తోంది. ఉదాహరణకు: దుర్మార్గాన్ని రూపుమాపి తనను రక్షిస్తాడనే తలంపుతో తాను నమ్మిన ప్రతి వ్యక్తి దగ్గరా అన్యాయానికి గురి అయినవాడు అన్యాయానికి వ్యతిరేకంగా ఫిర్యాదు చేయటం; సంస్కరణ లక్ష్యంతో, ఒక వ్యక్తిలోగానీ, ఒక వర్గంలోగానీ ఉన్నటువంటి చెడులను, వాటిని సమర్థవంతంగా దూరం చేయగల వారి ముందు ప్రస్తావించటం, మత సంబంధమైన

قُلْ اَتُعَلِّمُوْنَ اللّٰهَ بِدِيْنِكُمْ ؕ وَ اللّٰهُ يَعْلَمُ مَا
فِي السَّمٰوٰتِ وَ مَا فِي الْاَرْضِ ؕ وَ اللّٰهُ بِكُلِّ
شَيْءٍ عَلِيْمٌ ﴿١٦﴾ يَمُنُّوْنَ عَلَيْكَ اَنْ اَسْلَمُوْا ؕ
قُلْ لَّا تَمُنُّوْا عَلَيَّ اِسْلَامَكُمْ ۚ بَلِ اللّٰهُ يَمُنُّ
عَلَيْكُمْ اَنْ هَدٰىكُمْ لِلْاِيْمَانِ اِنْ كُنْتُمْ
صٰدِقِيْنَ ﴿١٧﴾ اِنَّ اللّٰهَ يَعْلَمُ غَيْبَ السَّمٰوٰتِ
وَالْاَرْضِ ؕ وَاللّٰهُ بَصِيْرٌۢ بِمَا تَعْمَلُوْنَ ﴿١٨﴾ ع ٢ ١٨ ١٤

**16 - 18** ప్రవక్తా! వారి (విశ్వసించామని చెప్పుకునేవారి)తో ఇలా అను, "మీరు అల్లాహ్‌కు మీ ధర్మ స్వీకారం గురించి తెలియజేస్తున్నారా? వాస్తవానికి అల్లాహ్, భూమిలోనూ, ఆకాశాలలోనూ ఉన్న ప్రతి వస్తువునూ ఎరుగును. ఆయనకు ప్రతి వస్తువును గురించిన జ్ఞానం ఉన్నది." వారు ఇస్లామ్‌ను స్వీకరించి తామేదో మీకు మేలు చేసినట్లు చెబుతున్నారు. వారితో ఇలా అను, "ఇస్లామ్‌కు సంబంధించిన మేలును నా మీద మోపకండి. అల్లాహ్ మీకు విశ్వాసానికి సంబంధించిన మార్గం చూపి, ఆయనే మీకు ఉపకారం చేశాడు - మీరు గనక (మీ విశ్వాస ప్రకటనలో) నిజాయితీపరులే అయితే. అల్లాహ్‌కు భూమిలోనూ, ఆకాశాలలోనూ దాగి ఉన్న ప్రతి వస్తువును గురించీ తెలుసు. మీరు చేసేదంతా ఆయన దృష్టిలో ఉన్నది.

లేదా న్యాయశాస్త్ర సంబంధమైన తీర్పును పొందే ఉద్దేశ్యంతో, ఒక వ్యక్తిలోని చెడులను గురించి మత గురువు ముందు చెప్పటం; ఒక వ్యక్తి కీడును గురించి లేదా కొందరు వ్యక్తుల కీడును గురించి ప్రజలను హెచ్చరించటం, ఆ కీడు నుండి ప్రజలు తమను తాము రక్షించుకోవటానికి; పాపాన్నీ, కీడునూ వ్యాపింపజేసే వారికి వ్యతిరేకంగానూ, లేదా ధర్మశాస్త్రంలో లేని విషయాలను ప్రచారం చేసేవారికి వ్యతిరేకంగానూ అపమార్గాలను ప్రచారం చేసేవారికి వ్యతిరేకంగానూ లేదా ప్రజలను ధర్మభ్రష్టులుగా చేసి, వారిని అన్యాయానికి, హింసకు గురిచేసే వారికి వ్యతిరేకంగానూ బహిరంగంగా గొంతెత్తటం, వారి చెడులను విమర్శించటం.

12. పరోక్ష నిందను మృత సోదరుని మాంసం తినటంతో ఎందుకు పోల్చటం జరిగిందంటే పాపం, పరోక్షనిందకు గురిఅయ్యే వ్యక్తి ఎవరు, ఎక్కడ తనను పరోక్షనిందకు గురిచేస్తున్నారో ఏమాత్రం తెలియనివాడు.

13. పూర్వపు ఆయతులలో ముస్లిములను సంబోధించి, ముస్లిమ్ సమాజాన్ని చెడుల నుండి పరిరక్షించటానికి అవసరమైన మార్గదర్శక సూత్రాలు చెప్పబడ్డాయి. ఇప్పుడు ఈ ఆయతులో మొత్తం మానవ జాతిని సంబోధించి, ప్రపంచంలో ఎల్లప్పుడూ విశ్వ సంక్షోభానికి దోహదపడే, వంశము, వర్ణము, దేశము, భాష, జాతీయతా విద్వేషాలను సంస్కరించటం జరిగింది. ఈ చిన్న ఆయతులో అల్లాహ్ మానవులందరినీ సంబోధించి మూడు ముఖ్య విషయాలు చెప్పాడు : ఒకటి, మీరందరూ ఒకే మూలానికి చెందినవారు. మీ జాతి అంతా ఒకే పురుషుడు ఒకే స్త్రీ నుండి ఆవిర్భవించింది. ఈనాడు ప్రపంచంలో ఉన్న మీ జాతులన్నీ వాస్తవానికి మొట్టమొదటి వంశానికి చెందిన భిన్న శాఖలు మాత్రమే. ఆ వంశం ఒకే తండ్రి, ఒకే తల్లితో ప్రారంభమయింది. రెండు, మీ మూలం ఒకటే అయినప్పటికీ, మీరు పలు జాతులుగా, తెగలుగా చీలిపోవటం అత్యంత సహజమైన విషయం. కాని సహజమైన ఈ విభాగాలను ఆధారంగా చేసుకుని, సమాజంలో ఎక్కువ తక్కువలూ, అల్పులూ అధికులూ, ఉన్నతులూ నీచులూ అనే అంతరాలను సృష్టించకూడదు, ఒక వంశం మరొక వంశంపై ఆధిక్యతను చూపకూడదు, ఒక వర్ణంవారు మరొక వర్ణంవారిని అల్పులుగా, హీనులుగా చూడకూడదు, ఒక జాతి మరొక జాతిపై తన ఆధిపత్యాన్ని చూపకూడదు. విశ్వసృష్టికర్త, మానవులను జాతులుగా, తెగలుగా తీర్చిదిద్దటానికి కారణం వారి మధ్య పరస్పర సహకార, పరిచయాలకు ప్రకృతిసిద్ధమైన మార్గం ఇదొక్కటే. మూడు, మానవుల మధ్య ఔన్నత్యానికీ, ఆధిక్యతకూ పునాది ఏదైనా ఉంటే అది కేవలం నైతికపరమైన ఆధిక్యతయే.

14. దీని భావం ఎడారి అరబ్బులు అందరూ అని కాదు. ఇక్కడ ఇస్లామ్ మతం పుచ్చుకున్న కొన్ని ఎడారి అరబ్బు వర్గాలు ప్రస్తావించబడ్డాయి. పెరుగుతున్న ఇస్లామ్ ప్రాబల్యాన్ని చూసి ముస్లిముల దాడి నుండి రక్షణ పొందటానికీ, ఇస్లామ్ విజయాల ద్వారా సమకూరే భౌతిక ప్రయోజనాలను పొందటానికీ, వారు ఇస్లామ్ మతాన్ని చేపట్టారు. నిజానికి వారు హృదయపూర్వకంగా ఇస్లామ్‌ను స్వీకరించలేదు, కేవలం మాటలలోనే విశ్వాసాన్ని ప్రకటించారు; ఏదో ప్రయోజనాన్ని ఆశించి వారు ముస్లిములలో చేరిపోయారు.

ఆయతులు 45 | **50. ఖాఫ్** | అవతరణ మక్కాలో

*అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

**1 - 4** ఖాఫ్. మహోన్నతమైన ఖురాన్ సాక్షిగా– అయితే, హెచ్చరిక చేసేవాడు స్వయంగా వారిలో నుండే వారివద్దకు వచ్చాడనే విషయం[1] వారికి ఆశ్చర్యం కలిగించింది. తరువాత సత్య తిరస్కారులు ఇలా అనసాగారు, "మేము మరణించి మట్టిగా మారిపోయినప్పటికీ, (మళ్లీ బ్రతికింపబడతామా?) ఇది చాల విచిత్రంగా ఉంది. ఈ తిరుగు ప్రయాణం అనేది బుద్ధికి అందని విషయం.[2] (వాస్తవానికి) వారి శరీరాలలో నుండి భూమి తినేదంతా మాకు తెలుసు. మా వద్ద ఒక గ్రంథం ఉన్నది, అందులో అంతా సురక్షితంగా ఉన్నది.

**5** కాని, వారు సత్యం వారి వద్దకు వచ్చినప్పుడే దానిని బాహాటంగా తిరస్కరించారు. ఈ కారణంవల్లనే వారు ఇప్పుడు చిక్కులలో పడిపోయారు.

**6 - 11** సరే, అయితే వారు తమపై ఉన్న ఆకాశం వైపు ఎన్నడూ చూడ లేదా? మేము దానిని ఎలా నిర్మించి, అలంకరించామో? అందులో ఎలాంటి పగుళ్లూ లేవు. మేము భూమిని పరిచాము, అందులో పర్వతాలను స్థిరపరచాము. అందులో మనోహరమైన అన్నిరకాల వృక్షజాతులను మొలకెత్తించాము. (సత్యం వైపునకు) మరలే ప్రతి దాసునికి ఇవన్నీ కళ్లు తెరిపించేవీ, గుణపాఠం నేర్పేవీ అయిన విషయాలు. ఆకాశం నుండి మేము శుభవంతమైన నీటిని అవతరింపజేశాము. తరువాత దాని ద్వారా తోటలనూ, పంట ధాన్యాలనూ, ఎంతో పొడవైన ఖర్జూరపు వృక్షాలనూ పుట్టించాము. వాటికి పండ్లు గుత్తులు గుత్తులుగా కాస్తాయి. ఇది దాసులకు ఉపాధినిచ్చే ఏర్పాటు. ఈ నీటితో మేము మృత భూమికి ప్రాణం పోస్తాము. (మరణించిన మానవులు భూమినుండి) లేవటం కూడ ఈ విధంగానే జరుగుతుంది.

٥٠ سُوْرَةُ قٓ مَكِّيَّةٌ ٣٤

اٰيَاتُهَا ٤٥ | رُكُوْعَاتُهَا ٣

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ۝

قٓ ۚ وَ الْقُرْاٰنِ الْمَجِيْدِ ۝١ بَلْ عَجِبُوْٓا اَنْ
جَآءَهُمْ مُّنْذِرٌ مِّنْهُمْ فَقَالَ الْكٰفِرُوْنَ هٰذَا
شَيْءٌ عَجِيْبٌ ۝٢ ءَاِذَا مِتْنَا وَكُنَّا تُرَابًا ۚ ذٰلِكَ
رَجْعٌۢ بَعِيْدٌ ۝٣ قَدْ عَلِمْنَا مَا تَنْقُصُ
الْاَرْضُ مِنْهُمْ ۚ وَ عِنْدَنَا كِتٰبٌ حَفِيْظٌ ۝٤
بَلْ كَذَّبُوْا بِالْحَقِّ لَمَّا جَآءَهُمْ فَهُمْ فِيْٓ اَمْرٍ
مَّرِيْجٍ ۝٥ اَفَلَمْ يَنْظُرُوْٓا اِلَى السَّمَآءِ فَوْقَهُمْ
كَيْفَ بَنَيْنٰهَا وَزَيَّنّٰهَا وَ مَا لَهَا مِنْ فُرُوْجٍ ۝٦
وَالْاَرْضَ مَدَدْنٰهَا وَاَلْقَيْنَا فِيْهَا رَوَاسِيَ وَ
اَنْۢبَتْنَا فِيْهَا مِنْ كُلِّ زَوْجٍۢ بَهِيْجٍ ۝٧ تَبْصِرَةً
وَّ ذِكْرٰى لِكُلِّ عَبْدٍ مُّنِيْبٍ ۝٨ وَنَزَّلْنَا مِنَ
السَّمَآءِ مَآءً مُّبٰرَكًا فَاَنْۢبَتْنَا بِهٖ جَنّٰتٍ وَّ حَبَّ
الْحَصِيْدِ ۝٩ وَالنَّخْلَ بٰسِقٰتٍ لَّهَا طَلْعٌ نَّضِيْدٌ ۝١٠
رِّزْقًا لِّلْعِبَادِ ۙ وَ اَحْيَيْنَا بِهٖ بَلْدَةً مَّيْتًا ۭ
كَذٰلِكَ الْخُرُوْجُ ۝١١

المنزل ٧

كَذَّبَتْ قَبْلَهُمْ قَوْمُ نُوحٍ وَّ اَصْحٰبُ الرَّسِّ وَ
ثَمُوْدُ ﴿١٢﴾ وَ عَادٌ وَّفِرْعَوْنُ وَ اِخْوَانُ لُوْطٍ ﴿١٣﴾ وَّ
اَصْحٰبُ الْاَيْكَةِ وَ قَوْمُ تُبَّعٍ ؕ كُلٌّ كَذَّبَ
الرُّسُلَ فَحَقَّ وَعِيْدِ ﴿١٤﴾ اَفَعَيِيْنَا بِالْخَلْقِ
الْاَوَّلِ ؕ بَلْ هُمْ فِيْ لَبْسٍ مِّنْ خَلْقٍ جَدِيْدٍ ﴿١٥﴾ ع ٥ / ١٥
وَ لَقَدْ خَلَقْنَا الْاِنْسَانَ وَنَعْلَمُ مَا تُوَسْوِسُ بِهٖ
نَفْسُهٗ ۖۚ وَ نَحْنُ اَقْرَبُ اِلَيْهِ مِنْ حَبْلِ
الْوَرِيْدِ ﴿١٦﴾ اِذْ يَتَلَقَّى الْمُتَلَقِّيٰنِ عَنِ الْيَمِيْنِ وَ
عَنِ الشِّمَالِ قَعِيْدٌ ﴿١٧﴾ مَا يَلْفِظُ مِنْ قَوْلٍ اِلَّا
لَدَيْهِ رَقِيْبٌ عَتِيْدٌ ﴿١٨﴾ وَجَآءَتْ سَكْرَةُ
الْمَوْتِ بِالْحَقِّ ؕ ذٰلِكَ مَا كُنْتَ مِنْهُ تَحِيْدُ ﴿١٩﴾
وَ نُفِخَ فِي الصُّوْرِ ؕ ذٰلِكَ يَوْمُ الْوَعِيْدِ ﴿٢٠﴾ وَ
جَآءَتْ كُلُّ نَفْسٍ مَّعَهَا سَآئِقٌ وَّ شَهِيْدٌ ﴿٢١﴾
لَقَدْ كُنْتَ فِيْ غَفْلَةٍ مِّنْ هٰذَا فَكَشَفْنَا عَنْكَ
غِطَآءَكَ فَبَصَرُكَ الْيَوْمَ حَدِيْدٌ ﴿٢٢﴾ وَ قَالَ
قَرِيْنُهٗ هٰذَا مَا لَدَيَّ عَتِيْدٌ ﴿٢٣﴾

**12 - 14** వారికి పూర్వం నూహ్ జాతి, అర్రస్ వాసులు మరియు సమూద్, ఆద్, ఫిరౌన్ జాతులు, లూత్ సోదరులు, అయ్కా వారు మరియు తుబ్బా జాతి ప్రజలు కూడా తిరస్కరించారు. చివరకు నా హెచ్చరిక వారి విషయంలో యదార్థమని నిరూపితమైపోయింది.

**15** మొదటిసారి సృష్టితోనే మేము అశక్తులమైపోయామా? అయినా వారు కొత్త సృష్టిని గురించి అనుమానంలో పడిపోయారు.

**16 - 29** మేము మానవుణ్ణి సృష్టించాము, అతని మనస్సులో మెదిలే ఊహలను సైతం మేము ఎరుగుదుము. మేము అతని కంఠరక్తనాళం కంటే కూడా అతనికి చాలా దగ్గరగా ఉన్నాము. అంతేకాదు (మా ఈ ప్రత్యక్ష సమాచారం కాక) ఇద్దరు లేఖకులు అతనికి కుడి ఎడమ ప్రక్కల కూర్చుండి ప్రతి విషయాన్నీ నమోదు చేస్తూ ఉన్నారు. అతని నోటి నుండి వెడలే ప్రతి మాటనూ వ్రాయటానికి అనుక్షణం ఒక పరిశీలకుడు సిద్ధంగా ఉంటాడు. ఇదిగో, చూడండి, మరణయాతన సత్యంతో వచ్చేసింది. నీవు తప్పించుకోవటానికి ప్రయత్నం చేసిన విషయం ఇదే. తరువాత శంఖం ఊదబడింది; ఈ దినాన్ని గురించే నిన్ను భయపెట్టటం జరుగుతూ ఉండేది. ప్రతి వ్యక్తీ తన వెంట ఒక తోలేవాడూ, ఒక సాక్ష్యం చెప్పేవాడూ ఉన్న స్థితిలో వస్తాడు. ఈ విషయం గురించి నీవు అశ్రద్ధలో పడి ఉన్నావు. మేము నీ ముందు పడి ఉన్న తెరను తొలగించాము, ఈనాడు నీ దృష్టి చాలా సునిశితంగా[3] ఉన్నది. అతని సహచరుడు,[4] "ఇదిగో, నా అధీనంలో ఉన్న ఇతనిని హాజరుపరుస్తున్నాను" అని విన్నవించుకున్నాడు.

1. భావం ఏమిటంటే, మక్కావాసులు మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) దైవదౌత్యాన్ని సమంజసమైన కారణం ఆధారంగా కాక పూర్తిగా అసమంజసమైన కారణం ఆధారంగా తిరస్కరించారు - తమవంటి ఒక మనిషి, తమ జాతికే చెందిన ఒక వ్యక్తి దేవుని తరఫు నుండి హెచ్చరికలు చేసేవానిగా రావటం అనేది వారి దృష్టిలో మిక్కిలి ఆశ్చర్యకరమైన విషయం.
2. వారి ఆశ్చర్యానికి రెండో హేతువు ఇది. ఒక మానవుడు ప్రవక్తగా రావటం అనేది మొదటి హేతువు. చనిపోయిన తరువాత మానవులందరూ తిరిగి బ్రతికింపబడటం, వారందరినీ పోగుచేసి అల్లాహ్ న్యాయస్థానంలో హాజరుపరచటం అనేది వారిని మరింత ఆశ్చర్యపరచిన రెండో విషయం.
3. అంటే, దైవప్రవక్తలు పూర్వం నీకు తెలిపిన విషయాలన్నీ ఈనాడు ఇక్కడ నీవు స్పష్టంగా చూస్తున్నావు.
4. సహచరుడు అంటే, తరుముకుంటూ తీసుకువచ్చే దైవదూత. అతనే దేవుని న్యాయస్థానంలో ప్రవేశించి, "నా స్వాధీనంలో ఉన్న వ్యక్తిని నేను ప్రభువు దర్బారులో హాజరుపరుస్తున్నాను" అని అంటాడు.

اَلْقِيَا فِيْ جَهَنَّمَ كُلَّ كَفَّارٍ عَنِيْدٍ ٢٤ مَّنَّاعٍ
لِّلْخَيْرِ مُعْتَدٍ مُّرِيْبٍ ٢٥ الَّذِيْ جَعَلَ مَعَ اللّٰهِ
اِلٰهًا اٰخَرَ فَاَلْقِيٰهُ فِي الْعَذَابِ الشَّدِيْدِ ٢٦ قَالَ
قَرِيْنُهٗ رَبَّنَا مَآ اَطْغَيْتُهٗ وَ لٰكِنْ كَانَ فِيْ
ضَلٰلٍ بَعِيْدٍ ٢٧ قَالَ لَا تَخْتَصِمُوْا لَدَيَّ وَ قَدْ
قَدَّمْتُ اِلَيْكُمْ بِالْوَعِيْدِ ٢٨ مَا يُبَدَّلُ
الْقَوْلُ لَدَيَّ وَمَآ اَنَا بِظَلَّامٍ لِّلْعَبِيْدِ ٢٩ ع ٢ ١٤ ١٦
يَوْمَ نَقُوْلُ لِجَهَنَّمَ هَلِ امْتَلَاْتِ وَتَقُوْلُ هَلْ
مِنْ مَّزِيْدٍ ٣٠ وَ اُزْلِفَتِ الْجَنَّةُ لِلْمُتَّقِيْنَ غَيْرَ
بَعِيْدٍ ٣١ هٰذَا مَا تُوْعَدُوْنَ لِكُلِّ اَوَّابٍ
حَفِيْظٍ ٣٢ مَنْ خَشِيَ الرَّحْمٰنَ بِالْغَيْبِ وَ جَآءَ
بِقَلْبٍ مُّنِيْبِ ٣٣ ادْخُلُوْهَا بِسَلٰمٍ ذٰلِكَ يَوْمُ
الْخُلُوْدِ ٣٤ لَهُمْ مَّا يَشَآءُوْنَ فِيْهَا وَ لَدَيْنَا
مَزِيْدٌ ٣٥

ఇలా ఆజ్ఞాపించడుతుంది; "కరుడుకట్టిన ప్రతి అవిశ్వాసిని నరకంలో విసరి వేయండి. అతడు సత్యం పట్ల ద్వేషభావం కలిగి ఉండేవాడు, మంచిని నిరోధిస్తూ ఉండేవాడు, హద్దులు అతిక్రమిస్తూ ఉండేవాడు, అనుమానంలో పడి ఉండేవాడు, అల్లాహ్‌తోపాటు ఇతరులను కూడా దేవుళ్ళుగా చేసుకున్న వాడు. కనుక అతనిని తీవ్రమైన శిక్షకు గురిచేయండి." అతని సహచరుడు ఇలా మనవి చేసుకున్నాడు,[5] "స్వామీ! నేను ఇతనిని తిరుగుబాటుదారుగా చేయలేదు. కాని ఇతడే స్వయంగా మార్గం తప్పి చాలాదూరం పోయాడు." దానికి ఇలా సెలవీయబడింది, "నా సమక్షంలో వాదించకండి. నేను ముందుగానే చెడు పర్యవసానం గురించి హెచ్చరికచేసి ఉన్నాను. నా దగ్గర మాట మార్చటం అంటూ జరగదు. నేను నా దాసులపై దౌర్జన్యం చేసేవాడను కాను."

**30 - 35** ఆనాడు మేము నరకాన్ని, "నీవు నిండిపోయావా?" అని అడిగినప్పుడు, అది, "ఇంకేమైనా మిగిలిఉందా?"[6] అని అంటుంది. స్వర్గం భయభక్తులు కలవారికి చాల దగ్గరగా తీసుకురాబడుతుంది, ఏమాత్రం దూరంగా ఉండదు. ఇంకా ఇలా సెలవీయబడుతుంది, "మీకు వాగ్దానం చేయబడుతూ ఉండిన విషయం ఇదే ఎక్కువగా అల్లాహ్ వైపునకు మరలే వాడూ,[7] అల్లాహ్ హద్దులను పరిరక్షించే వాడూ,[8] చూడకుండానే కరుణామయుడికి భయపడేవాడూ, ఏకాగ్రహృదయంతో వచ్చినవాడూ అయిన ప్రతి వ్యక్తికీ ఇది లభిస్తుంది. స్వర్గంలో ప్రవేశించండి, శాంతిసౌభాగ్యాలతో." ఆ దినం శాశ్వత జీవిత దినం అవుతుంది. అక్కడ వారికి వారు కోరుకునేవన్నీ లభిస్తాయి. అవికాక మా వద్ద వారికి ఇంకా ఎన్నో లభిస్తాయి. అత్యధికం గానూ లభిస్తాయి.

5. ఇక్కడ సహచరుడు అంటే, ప్రపంచంలో అవిధేయుడైన మానవుని నీడలా వెన్నంటి తిరిగే షైతాను అని అర్థం.
6. దీనికి రెండు అర్థాలు చెప్పవచ్చు. ఒకటి, "నా దగ్గర ఇంకెవరికీ ఏమాత్రం చోటులేదు". రెండు, "దోషులందరినీ తీసుకురండి."
7. అంటే, అవిధేయత, మనోవాంఛల అనుసరణ మార్గాన్ని విడనాడి, విధేయత, దైవప్రసన్నతల మార్గాన్ని అవలంబించినవాడు అని అర్థం; అల్లాహ్‌ను నిరంతరం స్మరించేవాడు, తన సమస్త జీవిత వ్యవహారాలను ఆయనకే అప్పజెప్పేవాడు అని భావం.
8. అంటే, అల్లాహ్ ఏర్పరచిన హద్దులనూ, ఆయన శాసించిన విధులనూ, ఆయన నిషేధించిన విషయాలనూ, ఆయన అప్పగించిన అమానతులనూ పరిరక్షించే వాడు అని భావం. ఇంకా తాను తన మాటలలో, చేతలలో ప్రభువు ఎడల అవిధేయతకు పాల్పడుతున్నానా అని ఎల్లప్పుడూ ఆత్మపరిశీలనం చేసుకునేవాడు అని అర్థం.

**36 - 37** మేము వారికి పూర్వం ఎన్నో జాతులను నాశనం చేసి ఉన్నాము. వారు వీరికంటే ఎంతో ఎక్కువ శక్తిమంతులు, వారు అనేక ప్రపంచ దేశాలను చుట్టివచ్చారు. అయితే వారు ఎక్కడైనా, ఏదైనా ఆశ్రయం పొందగలిగారా? హృదయం ఉండీ, విషయాన్ని శ్రద్ధగా ఆలకించే ప్రతి వ్యక్తికీ ఈ చరిత్రలో గుణపాఠం ఉన్నది.

**38 - 40** మేము భూమినీ, ఆకాశాలనూ, వాటి మధ్య ఉన్న సమస్త వస్తువులనూ ఆరు దినాలలో సృష్టించాము. కాని మాకు ఎలాంటి అలసటా కలుగలేదు. కనుక ప్రవక్తా! వారు కల్పిస్తున్న విషయాల పట్ల సహనం వహించు. నీ ప్రభువు స్తోత్రంతోపాటు ఆయన పవిత్ర నామాన్ని జపిస్తూ ఉండు. సూర్యోదయానికి ముందు, సూర్యాస్తమయానికి ముందు, రాత్రి సమయంలో కూడా ఆయన పవిత్ర నామాన్ని జపించు, సజ్దాలు చేయటం పూర్తి అయిన తరువాత కూడా.[9]

**41 - 44** ఇంకా విను: ఏ రోజు చాటింపువేసేవాడు (ప్రతి మనిషికీ) అతి దగ్గర నుండే కేకవేస్తాడో,[10] ఏ రోజు ప్రజలం దరూ హష్ర్ కేకను స్పష్టంగా వింటూ ఉంటారో, ఆ రోజు భూమి నుండి మృతులు బయల్పడే రోజు అవుతుంది. మేమే ప్రాణం పోస్తున్నాము, మేమే ప్రాణం తీస్తున్నాము, మా వైపునకే ఆనాడు అందరూ మరలి రావలసి ఉంటుంది. ఆనాడు భూమి బ్రద్దలవుతుంది, మానవులు దాని లోపల నుండి బయల్పడి తొందర తొందరగా పరుగెత్తుతూ ఉంటారు. బ్రతికించి, సమీక రించటం అనే ఈ విషయం మాకు ఎంతో తేలికైన పని.

**45** ప్రవక్తా! వారు కల్పిస్తున్న విషయాలు ఏమిటో మేము బాగా ఎరుగుదుము. వారిచేత బలవంతంగా విషయాన్ని ఒప్పించటం నీ పని కాదు. కనుక నీవు ఈ ఖురాన్ ద్వారా నా హెచ్చరికకు భయపడే ప్రతి వ్యక్తికీ హితోపదేశం చేయి.

وَكَمْ اَهْلَكْنَا قَبْلَهُمْ مِّنْ قَرْنٍ هُمْ اَشَدُّ مِنْهُمْ
بَطْشًا فَنَقَّبُوْا فِي الْبِلَادِ ؕ هَلْ مِنْ مَّحِيْصٍ ﴿٣٦﴾
اِنَّ فِيْ ذٰلِكَ لَذِكْرٰى لِمَنْ كَانَ لَهٗ قَلْبٌ اَوْ
اَلْقَى السَّمْعَ وَهُوَ شَهِيْدٌ ﴿٣٧﴾ وَلَقَدْ خَلَقْنَا
السَّمٰوٰتِ وَالْاَرْضَ وَمَا بَيْنَهُمَا فِيْ سِتَّةِ
اَيَّامٍ ۖ وَّمَا مَسَّنَا مِنْ لُّغُوْبٍ ﴿٣٨﴾ فَاصْبِرْ عَلٰى
مَا يَقُوْلُوْنَ وَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ قَبْلَ طُلُوْعِ
الشَّمْسِ وَقَبْلَ الْغُرُوْبِ ﴿٣٩﴾ وَمِنَ الَّيْلِ
فَسَبِّحْهُ وَاَدْبَارَ السُّجُوْدِ ﴿٤٠﴾ وَاسْتَمِعْ يَوْمَ
يُنَادِ الْمُنَادِ مِنْ مَّكَانٍ قَرِيْبٍ ﴿٤١﴾ يَّوْمَ
يَسْمَعُوْنَ الصَّيْحَةَ بِالْحَقِّ ؕ ذٰلِكَ يَوْمُ
الْخُرُوْجِ ﴿٤٢﴾ اِنَّا نَحْنُ نُحْيٖ وَنُمِيْتُ وَاِلَيْنَا
الْمَصِيْرُ ﴿٤٣﴾ يَوْمَ تَشَقَّقُ الْاَرْضُ عَنْهُمْ
سِرَاعًا ؕ ذٰلِكَ حَشْرٌ عَلَيْنَا يَسِيْرٌ ﴿٤٤﴾ نَحْنُ
اَعْلَمُ بِمَا يَقُوْلُوْنَ وَمَآ اَنْتَ عَلَيْهِمْ بِجَبَّارٍ
فَذَكِّرْ بِالْقُرْاٰنِ مَنْ يَّخَافُ وَعِيْدِ ﴿٤٥﴾ ع

9. ప్రభువు స్తోత్రంతోపాటు ఆయన పవిత్ర నామాన్ని జపించటం అంటే ఇక్కడ నమాజు అని అర్థం. "సూర్యోదయానికి ముందు" నమాజు అంటే, ఫజర్ (ఉదయం) నమాజు. "సూర్యాస్తమయానికి ముందు" రెండు నమాజులు ఉన్నాయి. ఒకటి జొహర్ నమాజు, రెండోది అసర్ నమాజు. రాత్రి సమయంలో, మగ్రిబ్, ఇషా నమాజులు ఉన్నాయి. మూడోది "తహజ్జుద్" నమాజు. అది కూడ రాత్రి స్తోత్రంలో చేరి ఉన్నది.

10. అంటే, ఒక వ్యక్తి మరణించి ఎక్కడ పడివున్నా లేదా అతడు ప్రపంచంలో ఎక్కడ మరణించినా, అక్కడనే చాటింపు వేసేవాని కేక అతనికి వినిపిస్తుంది – "లే, నీ లెక్క ఇవ్వటానికి నీ ప్రభువు వద్దకు పద." భూమిపై ఎక్కడైనా ఒక వ్యక్తి బ్రతికి లేచినట్లయితే, అతడు, పిలిచేవాడు దగ్గర నుండే తనను పిలుస్తున్న అనుభూతి పొందుతాడు.

ఆయతులు 60 | ## 51. అజ్ జారియాత్ | అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 6** దుమారాన్ని లేపే గాలుల సాక్షిగా! ఆ గాలులు నీటితో నిండి ఉన్న మేఘాలను లేపుతాయి. తరువాత అవి మెల్లగా సాగిపోతాయి, ఆ తరువాత అవి ఒక పెద్ద కార్యాన్ని (వర్షాన్ని) పంచుతాయి. వాస్తవం ఏమిటంటే, మిమ్మల్ని ఏ విషయం గురించి భయపెట్టటం జరుగుతోందో, ఆ విషయం సత్యం. కర్మలకు ప్రతిఫలం లభించటం అనే పని తప్పకుండా జరగవలసి ఉన్నది.[1]

**7 - 19** విభిన్న ఆకారాలు గల ఆకాశం సాక్షిగా! (పరలోక విషయం గురించి) మీ మాటలు పరస్పరం విరుద్ధంగా ఉన్నాయి.[2] సత్యం నుండి ముఖం తిప్పుకున్నవాడే దానినుండి విముఖుడవుతాడు. ఊహ, అనుమానాలు ఆధారంగా నిర్ణయం చేసేవారు నాశనమవుదురు గాక! వారు అజ్ఞానంలో కూరుకు పోయారు. మరియు ఏమరుపాటు మైకంలో[3] పడి ఉన్నారు. అసలు ఆ తీర్పు దినం ఎప్పుడు వస్తుంది అని అడుగుతున్నారు. అది వారు అగ్నిలో దహింపజేయబడే రోజున వస్తుంది. (వారితో ఇలా అనబడుతుంది) ఇక చవిచూడండి మీ ఆగడాల రుచిని; మీరు తొందర పెడుతూ ఉన్న విషయం ఇదే.[4] అయితే భయ భక్తులు కలవారు ఆ రోజున ఉద్యానవనాలలో, నీటి బుగ్గల మధ్య ఉంటారు. వారు తమ ప్రభువు తమకు ఇచ్చిన దానిని అమితమైన సంతోషంతో తీసుకుంటారు. ఆ దినం రాకపూర్వం, వారు సత్కార్యాలు చేసే వారుగా, రాత్రి వేళలలో చాలా తక్కువ నిదురపోయేవారుగా, అదే రాత్రి చివరి గడియలలో క్షమాపణ వేడుకునేవారుగా ఉండేవారు. వారి సంపదలో యాచకులకూ, అగత్యం కలవారికీ హక్కు ఉండేది.[5]

٥١ سُوْرَةُ الذّٰرِيٰتِ مَكِّيَّةٌ ٦٧

اٰياتها ٦٠ | ركوعاتها ٣

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

وَ الذّٰرِيٰتِ ذَرْوًا ۙ① فَالْحٰمِلٰتِ وِقْرًا ۙ②
فَالْجٰرِيٰتِ يُسْرًا ۙ③ فَالْمُقَسِّمٰتِ اَمْرًا ۙ④ اِنَّمَا
تُوْعَدُوْنَ لَصَادِقٌ ۙ⑤ وَّ اِنَّ الدِّيْنَ لَوَاقِعٌ ؕ⑥
وَالسَّمَآءِ ذَاتِ الْحُبُكِ ۙ⑦ اِنَّكُمْ لَفِيْ قَوْلٍ
مُّخْتَلِفٍ ۙ⑧ يُّؤْفَكُ عَنْهُ مَنْ اُفِكَ ؕ⑨ قُتِلَ
الْخَرّٰصُوْنَ ۙ⑩ الَّذِيْنَ هُمْ فِيْ غَمْرَةٍ
سَاهُوْنَ ۙ⑪ يَسْـَٔلُوْنَ اَيَّانَ يَوْمُ الدِّيْنِ ؕ⑫
يَوْمَ هُمْ عَلَى النَّارِ يُفْتَنُوْنَ ⑬ ذُوْقُوْا
فِتْنَتَكُمْ ؕ هٰذَا الَّذِيْ كُنْتُمْ بِهٖ
تَسْتَعْجِلُوْنَ ⑭ اِنَّ الْمُتَّقِيْنَ فِيْ جَنّٰتٍ
وَّعُيُوْنٍ ۙ⑮ اٰخِذِيْنَ مَآ اٰتٰهُمْ رَبُّهُمْ ؕ اِنَّهُمْ
كَانُوْا قَبْلَ ذٰلِكَ مُحْسِنِيْنَ ؕ⑯ كَانُوْا قَلِيْلًا
مِّنَ الَّيْلِ مَا يَهْجَعُوْنَ ⑰ وَبِالْاَسْحَارِ هُمْ
يَسْتَغْفِرُوْنَ ⑱ وَ فِيْٓ اَمْوَالِهِمْ حَقٌّ لِّلسَّآئِلِ
وَالْمَحْرُوْمِ ⑲

وَ فِي الْاَرْضِ اٰيٰتٌ لِّلْمُوْقِنِيْنَ ﴿٢٠﴾ وَ فِيْٓ
اَنْفُسِكُمْ ۭ اَفَلَا تُبْصِرُوْنَ ﴿٢١﴾ وَ فِي السَّمَاۗءِ
رِزْقُكُمْ وَ مَا تُوْعَدُوْنَ ﴿٢٢﴾ فَوَ رَبِّ السَّمَاۗءِ وَ
الْاَرْضِ اِنَّهٗ لَحَقٌّ مِّثْلَ مَآ اَنَّكُمْ تَنْطِقُوْنَ ﴿٢٣﴾ ع ٢٣ ١٨

**20 - 23** (నమ్మేవారి కొరకు) భూమిలో ఎన్నో నిదర్శనాలు ఉన్నాయి, స్వయంగా మీలోనూ ఉన్నాయి. మీరు ఆలోచించరా? ఆకాశంలోనే ఉంది మీ ఉపాధి కూడా, మీకు వాగ్దానం చేయబడుతున్నది కూడా.[6] కనుక భూమ్యాకాశాల ప్రభువు సాక్షిగా! ఇది సత్యం, మీరు ఇప్పుడు మాట్లాడుతున్నంత నమ్మకమైనది.

1. ప్రమాణం చేసి చెప్పిన విషయం ఇది. ఈ ప్రమాణం అర్థం ఏమిటంటే; అద్వితీయమైన రీతిలో నియమిత కాలంలో మీ కళ్ల ముందు కురిసే మహత్తరమైన వర్షపు తీరు, దాని వెనుక నిగూఢంగా ఉన్న ఉద్దేశ్యం, వివేకం - ఇవి అనంత కాలంగా సాగుతున్న జీవిత నాటకంలో గల నిరర్థకమైన ఒక బొమ్మరిల్లు కాదు ఈ ప్రపంచం అని సాక్ష్యమిస్తున్నాయి. నిజానికి ఇది అత్యున్నతమైన విజ్ఞతతో కూడిన ఒక వ్యవస్థ, అందులో ప్రతి పనీ ఒక లక్ష్యంతో, ఒక ప్రయోజనంతో జరుగుతోంది. మానవునికి భూమిపై కొన్ని అధికారాలు ఇచ్చి అతనిని ఇట్టే వదలివేయటం, ఆ అధికారాలను అతడు ఏ విధంగా వినియోగించాడు అని లెక్క తీసుకోకుండా ఉండటం అనేది ఈ వ్యవస్థలో వీలుపడదు.
2. అంటే, ఆకాశంలోని మేఘాలు, నక్షత్రాల సమూహాలు ఆకారంలో భిన్నంగా ఉన్నట్లుగానే, వాటిలో పొందిక లేనట్లుగానే పరలోకం గురించి మీరు రకరకాలుగా మాట్లాడుతున్నారు, మీ మాటలలో ఎక్కడా ఏకాభిప్రాయం కనబడటం లేదు. వహీనీ, దైవ సందేశాలనూ కాదని, మానవుడు తన యొక్క ఈ ప్రపంచం యొక్క పర్యవసానం గురించి ఎప్పుడు ఏ అభిప్రాయాన్ని ఏర్పరచుకున్నా, దానిని అతను జ్ఞానం లేకుండానే ఏర్పరచుకున్నాడు అనే విషయానికి ఈ భిన్న భావాలు నిదర్శనాలు. లేకపోతే, ఒకవేళ మానవుని వద్ద ఈ విషయం గురించి నిజంగానే ప్రత్యక్ష జ్ఞానం పొందటానికి ఏదైనా మార్గం ఉండి ఉంటే, విభిన్నమైన, పరస్పర విరుద్ధమైన ఇన్ని విశ్వాసాలు ఏర్పడి ఉండేవి కావు.
3. అంటే, తమ ఈ తప్పుడు ఊహల కారణంగా తాము ఎటువైపునకు పోతున్నారో వారికి తెలియదు. పరలోకం గురించి తప్పుడు అభిప్రాయాలు ఏర్పరచుకొని, వారు ఏ మార్గాన్ని అనుసరించినా, అది వారి నాశనానికే దోహదపడుతుంది.
4. "అసలు ఆ ప్రతిఫలదినం ఎప్పుడు రాబోతోంది" అని అవిశ్వాసులు అడగటం లోనే "అది రావటానికి ఎందుకు ఆలస్యమవుతోంది" అనే భావం అంతర్లీనమై ఉన్నది. మేము దానిని తిరస్కరించినప్పుడు, ఆ తిరస్కారానికి మాకు శిక్ష పడటం అనివార్యమైనప్పుడు, అది వెనువెంటనే ఎందుకు రావటంలేదు?
5. ఇంకొక రీతిలో చెప్పాలంటే, ఒకవైపు వారు తమపై ఉన్న తమ ప్రభువు హక్కును గుర్తించి, నెరవేరుస్తారు. రెండో వైపు తోటి దాసులతో ఎలా ప్రవర్తిస్తారంటే, వారికి అల్లాహ్ ఏది ఇచ్చి ఉన్నప్పటికీ, అది కొంచెమయినా సరే గొప్ప అయినా సరే, అందులో తమకూ, తమ భార్యాపిల్లలకూ మాత్రమే హక్కు ఉన్నదని భావించరు. "మావద్ద ఉన్న ఈ ధనంలో అవసరం ఉన్న ప్రతి దైవదాసునికి హక్కు ఉన్నది" అని వారు భావిస్తారు.
6. ఆకాశం అంటే ఇక్కడ ఆకాశాలు అని అర్థం. మానవుని మనుగడకూ అతను పనిచేయటానికీ ఇవ్వబడేదంతా ఉపాధియే. "మీకు వాగ్దానం చేయబడుతున్నది" అంటే ప్రళయం, అందరినీ ఒక చోటకు చేర్చటం, లెక్క అడగటం, బాధ్యత వహించటం, బహుమానాలు, శిక్షలు, స్వర్గనరకాలు అని అర్థం. అవి సంభవిస్తాయని ఆకాశ గ్రంథాలన్నింటిలోనూ వాగ్దానం చేయబడింది, ఇప్పుడు ఖురాన్‌లో కూడ వాగ్దానం చేయబడుతోంది. దైవసూక్తి అర్థం ఏమిటంటే, మీలో ఎవరెవరికి ఎంతెంత ఈ ప్రపంచంలో ఇవ్వబడాలో పైన స్వర్గంలోనే నిర్ణయింపబడుతుంది; మిమ్మల్ని ప్రశ్నించటానికి, కర్మలకు తగిన ప్రతిఫలం ఇవ్వటానికి ఎప్పుడు పిలవాలో అనేది కూడ అక్కడనే నిర్ణయింపబడుతుంది.

هَلْ اَتٰىكَ حَدِيْثُ ضَيْفِ اِبْرٰهِيْمَ الْمُكْرَمِيْنَ ۝٢٤
اِذْ دَخَلُوْا عَلَيْهِ فَقَالُوْا سَلٰمًا ؕ قَالَ سَلٰمٌ ۚ
قَوْمٌ مُّنْكَرُوْنَ ۝٢٥ فَرَاغَ اِلٰۤى اَهْلِهٖ فَجَآءَ
بِعِجْلٍ سَمِيْنٍ ۝٢٦ فَقَرَّبَهٗۤ اِلَيْهِمْ قَالَ اَلَا
تَاْكُلُوْنَ ۝٢٧ فَاَوْجَسَ مِنْهُمْ خِيْفَةً ؕ قَالُوْا لَا
تَخَفْ ؕ وَ بَشَّرُوْهُ بِغُلٰمٍ عَلِيْمٍ ۝٢٨ فَاَقْبَلَتِ
امْرَاَتُهٗ فِیْ صَرَّةٍ فَصَكَّتْ وَجْهَهَا وَ قَالَتْ
عَجُوْزٌ عَقِيْمٌ ۝٢٩ قَالُوْا كَذٰلِكِ ۙ قَالَ رَبُّكِ ؕ
اِنَّهٗ هُوَ الْحَكِيْمُ الْعَلِيْمُ ۝٣٠ قَالَ فَمَا خَطْبُكُمْ
اَيُّهَا الْمُرْسَلُوْنَ ۝٣١ قَالُوْۤا اِنَّاۤ اُرْسِلْنَاۤ اِلٰى
قَوْمٍ مُّجْرِمِيْنَ ۝٣٢ لِنُرْسِلَ عَلَيْهِمْ حِجَارَةً
مِّنْ طِيْنٍ ۝٣٣ مُّسَوَّمَةً عِنْدَ رَبِّكَ
لِلْمُسْرِفِيْنَ ۝٣٤ فَاَخْرَجْنَا مَنْ كَانَ فِيْهَا مِنَ
الْمُؤْمِنِيْنَ ۝٣٥ فَمَا وَجَدْنَا فِيْهَا غَيْرَ بَيْتٍ
مِّنَ الْمُسْلِمِيْنَ ۝٣٦ وَ تَرَكْنَا فِيْهَاۤ اٰيَةً لِّلَّذِيْنَ
يَخَافُوْنَ الْعَذَابَ الْاَلِيْمَ ۝٣٧

وقف لازم

الجزء ٢٧

**24 - 37** ఓ ప్రవక్తా! ఇబ్రాహీమ్ యొక్క గౌరవనీయులైన అతిథుల గాథ కూడా నీకు చేరిందా? వారు అతని వద్దకు వచ్చి, "మీకు సలామ్" అని అన్నారు. అతను, "మీకు కూడ సలామ్ - ఎవరో కొత్తవారులాగా ఉన్నారే!"[7] అని అన్నాడు. తరువాత అతను మౌనంగా తన ఇంటి వారి దగ్గరకు వెళ్ళి, ఒక (వేపబడిన) బలిసిన మంచి ఆవు దూడను తెచ్చి అతిథుల ముందు పెట్టాడు. అతను "మీరు తినరా?" అని అడిగాడు. ఆ తరువాత అతను తన మనస్సులో వారంటే భయపడ్డాడు. వారు "భయపడకండి" అని అన్నారు. వారు అతనికి ఒక జ్ఞాన సంపన్నుడైన కుమారుడు జన్మిస్తాడని శుభవార్త[8] వినిపించారు. ఇది విన్నంతనే అతని భార్య అరుస్తూ బయటికి వచ్చి, నెత్తీనోరూ బాదుకుంటూ, "ముసలిదానికా, గొడ్రాలికా"[9] అని అన్నది. అప్పుడు వారు, "నీ ప్రభువు ఇదే అన్నాడు. ఆయన వివేకవంతుడూ, అన్నీ తెలిసినవాడూను" అని అన్నారు. ఇబ్రాహీమ్, "దైవదూతలారా! మీరు ఏ మహాకార్యం నిమిత్తం వచ్చారు" అని అడిగాడు. వారు ఇలా అన్నారు, "మేము ఒక నేరస్తుల జాతి వైపునకు పంపబడ్డాము,[10] దాని మీద కాల్చబడిన మట్టి రాళ్లను వర్షింపజేయటానికి. అవి నీ ప్రభువు దృష్టిలో హద్దులు మీరిన వారి కొరకు గుర్తు వేయబడిన రాళ్లు.[11] తరువాత మేము[12] విశ్వాసులు అందరినీ ఆ జనపదం నుండి బయటకు తీసుకువచ్చాము. అక్కడ మేము ఒకే ఒక గృహాన్ని తప్ప మరే ముస్లిమ్ గృహాన్ని చూడలేదు. ఆ తరువాత అక్కడ మేము వ్యధాభరితమైన శిక్షకు భయపడే[13] వారి కొరకు కేవలం ఒకే ఒక సూచనను వదలిపెట్టాము.

7. సందర్భాన్నిబట్టి ఈ ఆయతుకు రెండు అర్థాలు చెప్పవచ్చు : ఒకటి, హజ్రత్ ఇబ్రాహీమ్ (అస్సలామ్) స్వయంగా తన అతిథులతో ఇలా అన్నాడు: "ఇదివరకెన్నడూ మిమ్మల్ని చూసేభాగ్యం కలగలేదు. మీరు బహుశా ఈ ప్రాంతానికి కొత్తకావచ్చు." రెండు, వారి సలాముకు సమాధానమిచ్చిన పిమ్మట, హజ్రత్ ఇబ్రాహీమ్ స్వగతంలో ఇలా అనుకున్నాడు లేదా ఇంట్లో విందు ఏర్పాట్లు చేయటానికి లోపలకుపోతూ తన సేవకులతో ఇలా అన్నాడు; "వారు కొత్తవారుగా కనిపిస్తున్నారు. పూర్వం ఎన్నడూ ఈ ప్రాంతంలో ఇటువంటి ఉదారస్వభావులు, రూపసంపన్నులు అయిన వ్యక్తులు కనిపించలేదు."
8. హూద్ సూరాలో చెప్పబడిన విధంగా, ఇది ప్రవక్త హజ్రత్ ఇస్హాఖ్ జన్మకు సంబంధించిన శుభవార్త.
9. అంటే, నేను ముసలిదాన్ని, గొడ్రాలిని కూడ. ఇక నాకు పిల్లలు ఎలా పుడతారు? బైబిలుననుసరించి, ప్రవక్త ఇబ్రాహీమ్‌కు అప్పటికి నూరు సంవత్సరాలు, హజ్రత్ సారాకు తొంబై సంవత్సరాలు. (సృష్టిప్రకరణం:17: 18)

وَ فِيْ مُوْسٰۤى اِذْ اَرْسَلْنٰهُ اِلٰى فِرْعَوْنَ بِسُلْطٰنٍ
مُّبِيْنٍ ﴿۳۸﴾ فَتَوَلّٰى بِرُكْنِهٖ وَ قَالَ سٰحِرٌ اَوْ
مَجْنُوْنٌ ﴿۳۹﴾ فَاَخَذْنٰهُ وَ جُنُوْدَهٗ فَنَبَذْنٰهُمْ فِي
الْيَمِّ وَ هُوَ مُلِيْمٌ ﴿۴۰﴾ وَ فِيْ عَادٍ اِذْ اَرْسَلْنَا
عَلَيْهِمُ الرِّيْحَ الْعَقِيْمَ ﴿۴۱﴾ مَا تَذَرُ مِنْ شَيْءٍ
اَتَتْ عَلَيْهِ اِلَّا جَعَلَتْهُ كَالرَّمِيْمِ ﴿۴۲﴾ وَ فِيْ
ثَمُوْدَ اِذْ قِيْلَ لَهُمْ تَمَتَّعُوْا حَتّٰى حِيْنٍ ﴿۴۳﴾
فَعَتَوْا عَنْ اَمْرِ رَبِّهِمْ فَاَخَذَتْهُمُ الصّٰعِقَةُ
وَهُمْ يَنْظُرُوْنَ ﴿۴۴﴾ فَمَا اسْتَطَاعُوْا مِنْ قِيَامٍ وَّ
مَا كَانُوْا مُنْتَصِرِيْنَ ﴿۴۵﴾ وَ قَوْمَ نُوْحٍ مِّنْ
قَبْلُ اِنَّهُمْ كَانُوْا قَوْمًا فٰسِقِيْنَ ﴿۴۶﴾ ع ۲۳

**38 - 40** మరియు మూసా గాథలో (మీ కొరకు సూచన ఉన్నది) మేము అతనిని స్పష్టమైన ప్రమాణంతో ఫిరౌన్ వద్దకు పంపాము.[14] అతడు తన బలాన్ని చూసుకొని విర్రవీగాడు. ఇతడు మాంత్రికుడు లేదా పిచ్చివాడు అని అన్నాడు. చివరకు మేము అతడినీ, అతడి సైన్యాలనూ పట్టుకున్నాము. వారందరినీ సముద్రంలోనికి విసరివేశాము. అతడు నిందింపదగినవాడుగా మిగిలిపోయాడు.

**41 - 42** ఆద్ జాతిలో (మీ కొరకు ఒక సూచన ఉన్నది) అప్పుడు మేము వారి మీదకు ఒక వినాశకరమైన గాలిని పంపాము. అది దేనిపై వీచినా, దానిని నాశనం చేసి వదలి పెట్టింది.

**43 - 45** సమూద్ జాతిలో (మీ కొరకు సూచన ఉన్నది) అప్పుడు వారికి ఒక నిర్ణీత కాలం వరకు సుఖాలను అనుభవిస్తూ ఉండండి అని చెప్పటం జరిగింది. కాని ఇలా హెచ్చరిక చేసినప్పటికీ వారు తమ ప్రభువు ఆదేశాన్ని ధిక్కరించారు. చివరకు వారు చూస్తూ ఉండగానే అకస్మాత్తుగా విరుచుకుపడే ఒక ఆపద వారిని చుట్టుముట్టింది. తరువాత వారికి లేచి నిలబడే శక్తి కూడా లేకుండాపోయింది; వారు తమను తాము రక్షించుకోనూ లేకపోయారు.

**46** వారందరికంటే ముందు మేము నూహ్ జాతిని నాశనం చేశాము. ఎందుకంటే, వారు కడు దుర్మార్గులు.

10. లూత్ జాతి ప్రజలు అని భావం. వారి నేరాలు ఎంతగా పెరిగిపోయాయంటే, 'నేరస్తుల జాతి' అనే పదాలే వారు ఏ జాతి ప్రజలో చెప్పటానికి సరిపోతాయి.

11. అంటే, ప్రతి రాయి మీద నీ ప్రభువు ఆజ్ఞానుసారం గుర్తువేయబడింది, అది ఏ నేరస్తుడికి చెందుతుందో తెలుపటానికి ఉద్దేశించింది.

12. హజ్రత్ ఇబ్రాహీమ్ (అస్సలామ్) వద్ద నుండి ఈ దూతలు ప్రవక్త హజ్రత్ లూత్ వద్దకు ఎలా వచ్చారో, అక్కడ వారికీ, లూత్ జాతి ప్రజలకూ మధ్య ఏం జరిగిందో అనే విషయం వదలివేయబడింది.

13. ఒక గుర్తు అంటే, మృత సముద్రం అని అర్థం. దాని దక్షిణ ప్రాంతంలో ఒక పెద్ద ఉపద్రవం సంభవించినట్లుగా ఇప్పటికీ గుర్తులు కనిపిస్తాయి.

14. అంటే, స్పష్టమైన మహిమలతో, ప్రత్యక్ష నిదర్శనాలతో పంపాము; ఆయన భూమ్యాకాశాల సృష్టికర్త తరఫు నుండి నియమింపబడి వచ్చారు అనే విషయం వాటివల్ల సందేహరహితమయింది.

وَ السَّمَآءَ بَنَيْنٰهَا بِاَيْىدٍ وَّ اِنَّا لَمُوْسِعُوْنَ ﴿٤٧﴾
وَالْاَرْضَ فَرَشْنٰهَا فَنِعْمَ الْمٰهِدُوْنَ ﴿٤٨﴾ وَ مِنْ
كُلِّ شَيْءٍ خَلَقْنَا زَوْجَيْنِ لَعَلَّكُمْ تَذَكَّرُوْنَ ﴿٤٩﴾
فَفِرُّوْٓا اِلَى اللّٰهِ ؕ اِنِّيْ لَكُمْ مِّنْهُ نَذِيْرٌ
مُّبِيْنٌ ﴿٥٠﴾ وَ لَا تَجْعَلُوْا مَعَ اللّٰهِ اِلٰهًا اٰخَرَ ؕ اِنِّيْ
لَكُمْ مِّنْهُ نَذِيْرٌ مُّبِيْنٌ ﴿٥١﴾ كَذٰلِكَ مَآ اَتَى
الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ مِّنْ رَّسُوْلٍ اِلَّا قَالُوْا
سَاحِرٌ اَوْ مَجْنُوْنٌ ﴿٥٢﴾ اَتَوَاصَوْا بِهٖ ۚ بَلْ هُمْ
قَوْمٌ طَاغُوْنَ ﴿٥٣﴾ فَتَوَلَّ عَنْهُمْ فَمَآ اَنْتَ
بِمَلُوْمٍ ﴿٥٤﴾ وَّذَكِّرْ فَاِنَّ الذِّكْرٰى تَنْفَعُ
الْمُؤْمِنِيْنَ ﴿٥٥﴾

**47 - 51** మేము ఆకాశాన్ని స్వశక్తితో నిర్మించాము. మేము అలా చేసే సామర్థ్యం కలిగి ఉన్నాము.[15] మేము భూమిని పరిచాము. మేము ఎంతో చక్కగా పరిచేవారము. ప్రతి వస్తువునూ మేము జంటలుగా సృష్టించాము,[16] బహుశా మీరు గుణపాఠం నేర్చుకుంటారని.[17] కనుక పరుగెత్తండి అల్లాహ్ వైపునకు, నేను ఆయన తరపున మీకు స్పష్టంగా హెచ్చరిక చేసేవాడుగా వచ్చాను. అల్లాహ్‌తో పాటు మరెవరినీ ఆరాధ్యులుగా చేసుకోకండి. నేను ఆయన తరపున మీకు స్పష్టంగా హెచ్చరించేవానిగా వచ్చాను.[18]

**52 - 55** ఇలాగే జరుగుతూ వచ్చింది; వారికి పూర్వపు జాతుల వద్దకు కూడా, "ఇతడు మాంత్రికుడు లేదా పిచ్చివాడు" అని నిందింపబడనటువంటి ఏ ప్రవక్తా రాలేదు. ఈ విషయం గురించి వారంతా పరస్పరం కూడ బలుక్కున్నారా ఏమిటి? అది కాదు, అసలు వారంతా హద్దులు మీరినవారు.[19] కనుక ప్రవక్తా! వారి నుండి ముఖం మరల్చుకో. నీపై ఎలాంటి ఆక్షేపణా ఉండదు. అయితే ఉపదేశిస్తూ ఉండు. ఎందుకంటే, ఉపదేశం, విశ్వాసులకు ప్రయోజనకరమైనది.

15. అసలు పదాలు ఇవి, "వ ఇన్నా లమూసిఊన్." 'మూసి' అంటే శక్తిసామర్థ్యాలు కలవాడు అనీ, విస్తరింపజేసేవాడు అనీ అర్థం. మొదటి అర్థం ప్రకారం ఈ ఆయతు భావం ఏమిటంటే, మేము ఈ ఆకాశాన్ని ఎవరి అండదండలు లేకుండానే, స్వశక్తితోనే నిర్మించాము. ఈ సృష్టి మా శక్తికి మించినది కాదు. అలాంటప్పుడు, మేము తిరిగి మిమ్మల్ని పుట్టించలేము అనే ఆలోచన మీ బుర్రలలోకి ఎలా వచ్చింది? రెండో అర్థం ప్రకారం, ఈ ఆయతు అర్థం ఏమిటంటే, అఖండ బ్రహ్మాండమైన ఈ సృష్టిని మేము ఒకసారి చేసి ఊరుకోలేదు. కాని నిరంతరం దానిని విస్తరింపజేస్తూనే ఉన్నాము. క్షణక్షణం ఇందులో మా సృష్టికి చెందిన అద్భుత విషయాలు కనిపిస్తూనే ఉన్నాయి. అటువంటి శక్తి సంపన్నుడైన సృష్టికర్త, తిరిగి సృష్టించే విషయంలో అశక్తుడని మీరు ఎందుకనుకున్నారు?

16. అంటే, ప్రపంచంలోని అన్ని వస్తువులు జంటల సూత్రం ఆధారంగా సృష్టించబడ్డాయి. కొన్ని వస్తువులు మరికొన్ని వస్తువులతో జతపడి ఉన్నాయి అనే సూత్రం ఆధారంగా (ఈ యావత్తు విశ్వకర్మాగారం) నడుస్తోంది; అవి అలా జతపడటం వల్లనే అనంతమైన కొత్త కొత్త రూపాలు, కొత్త కొత్త జంటలు ఉద్భవిస్తున్నాయి. లోకంలో మరొక వస్తువు జతగా లేనటువంటి వస్తువు ఏదీ లేదు. ప్రతి వస్తువు తనకు జోడైన వస్తువుతో చేరినప్పుడే ఫలప్రదమవుతుంది.

17. అంటే, ఈ గుణపాఠం: ఇహలోకానికి పరలోకం భాగస్వామి, ఇది లేకపోతే, ప్రాపంచిక జీవితం నిరర్థకమవుతుంది.

18. ఈ వాక్యాలు అల్లాహ్ మాటలేఅయినా, ఇక్కడి వక్త దైవప్రవక్త (సఅసమ్)యే కాని అల్లాహ్ కాదు. కనుక విషయం ఇది: అల్లాహ్ తన ప్రవక్త ద్వారా "అల్లాహ్ వైపునకు పరుగెత్తండి, నేను ఆయన తరపున హెచ్చరిస్తున్నాను" అని పలికిస్తున్నాడు.

وَ مَا خَلَقْتُ الْجِنَّ وَالْاِنْسَ اِلَّا لِيَعْبُدُوْنِ ﴿٥٦﴾
مَآ اُرِيْدُ مِنْهُمْ مِّنْ رِّزْقٍ وَّمَآ اُرِيْدُ اَنْ
يُّطْعِمُوْنِ ﴿٥٧﴾ اِنَّ اللّٰهَ هُوَ الرَّزَّاقُ ذُو الْقُوَّةِ
الْمَتِيْنُ ﴿٥٨﴾ فَاِنَّ لِلَّذِيْنَ ظَلَمُوْا ذَنُوْبًا مِّثْلَ
ذَنُوْبِ اَصْحٰبِهِمْ فَلَا يَسْتَعْجِلُوْنِ ﴿٥٩﴾ فَوَيْلٌ
لِّلَّذِيْنَ كَفَرُوْا مِنْ يَّوْمِهِمُ الَّذِىْ يُوْعَدُوْنَ ﴿٦٠﴾ ع

**56 - 60** నేను జిన్నాతులనూ, మానవులనూ నా ఆరాధన[20] కొరకు తప్ప మరి దేని కొరకూ సృష్టించలేదు. నేను వారి నుండి ఎలాంటి ఉపాధినీ కోరను; వారు నాకు అన్నం పెట్టాలనీ నేను కోరను. అల్లాహ్ స్వయంగా ఉపాధి ప్రదాత, గొప్ప శక్తిసంపన్నుడు, అత్యంత దృఢమైనవాడూను. కనుక అన్యాయానికి[21] పాల్పడిన వారి భాగానికి కూడా అటువంటి శిక్షయే సిద్ధంగా ఉంది, ఎటువంటిది వారి వంటి ప్రజల వంతుకు లభించిందో, దానికై వారు నన్ను తొందరపెట్టకూడదు. చివరకు ఆ రోజున అవిశ్వాసానికి పాల్పడిన వారికి వినాశం కలుగుతుంది. ఆ రోజును గురించే వారిని భయపెట్టటం జరుగుతోంది.

19. అంటే, వేల సంవత్సరాలుగా ప్రతి యుగంలోనూ విభిన్న దేశాలకు, జాతులకు చెందిన ప్రజలు, దైవప్రవక్తల సందేశానికి ప్రతిగా ఒకే వైఖరిని అవలంబించటానికి కారణం వారు ఒక మహాసభను ఏర్పాటుచేసి, ఎప్పుడైనా ఒక ప్రవక్త వచ్చి ఈ సందేశాన్ని ప్రచారం చేస్తే, దానికి ఈ విధమైన జవాబు ఇవ్వాలని పరస్పరం నిర్ణయం చేసుకున్నారు అనే విషయం కాదు. యదార్థానికి వారి వైఖరిలోని ఈ ఏకతాభావానికి కారణం, తిరుగుబాటుతనం, అతిక్రమణం వారందరి సాధారణ లక్షణం కావటమే.

20. అంటే, నేను వారిని సృష్టించింది నా దాస్యం కోసమే కాని ఇతరుల దాస్యం కోసం కాదు. నేను వారి సృష్టికర్తను గనుక వారు నన్ను సేవించాలి. ఇతరులెవ్వరూ వారిని సృష్టించనప్పుడు, వారు తమను సేవించమని అడిగే హక్కు వారికి ఎంతమాత్రం లేదు. వారి సృష్టికర్తను నేనుకాగా, నన్ను వదలి ఇతరులను సేవించటం అనేది వారికి ధర్మసమ్మతం ఎలా కాగలుగుతుంది?

21. అన్యాయం అంటే ఇక్కడ, యథార్థానికీ, సత్యానికీ అన్యాయం చేయటం, ఇంకా తమకు తామే అన్యాయం చేసుకోవటం.

ఆయతులు 49

# 52. అత్ తూర్

అవతరణ మక్కాలో

٥٢ سُوْرَةُ الطُّوْرِ مَكِّيَّةٌ ٧٦

اٰياتها ٤٩ | ركوعاتها ٢

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

وَ الطُّوْرِ ۙ﴿۱﴾ وَ كِتٰبٍ مَّسْطُوْرٍ ۙ﴿۲﴾ فِيْ رَقٍّ
مَّنْشُوْرٍ ۙ﴿۳﴾ وَّالْبَيْتِ الْمَعْمُوْرِ ۙ﴿۴﴾ وَ السَّقْفِ
الْمَرْفُوْعِ ۙ﴿۵﴾ وَ الْبَحْرِ الْمَسْجُوْرِ ۙ﴿۶﴾ اِنَّ عَذَابَ
رَبِّكَ لَوَاقِعٌ ۙ﴿۷﴾ مَّا لَهٗ مِنْ دَافِعٍ ۙ﴿۸﴾ يَّوْمَ
تَمُوْرُ السَّمَآءُ مَوْرًا ۙ﴿۹﴾ وَّ تَسِيْرُ الْجِبَالُ
سَيْرًا ؕ﴿۱۰﴾ فَوَيْلٌ يَّوْمَئِذٍ لِّلْمُكَذِّبِيْنَ ۙ﴿۱۱﴾
الَّذِيْنَ هُمْ فِيْ خَوْضٍ يَّلْعَبُوْنَ ۘ﴿۱۲﴾ يَوْمَ
يُدَعُّوْنَ اِلٰى نَارِ جَهَنَّمَ دَعًّا ؕ﴿۱۳﴾ هٰذِهِ النَّارُ
الَّتِيْ كُنْتُمْ بِهَا تُكَذِّبُوْنَ ﴿۱۴﴾ اَفَسِحْرٌ هٰذَاۤ اَمْ
اَنْتُمْ لَا تُبْصِرُوْنَ ﴿۱۵﴾ اِصْلَوْهَا فَاصْبِرُوْۤا اَوْ لَا
تَصْبِرُوْا ۚ سَوَآءٌ عَلَيْكُمْ ؕ اِنَّمَا تُجْزَوْنَ مَا
كُنْتُمْ تَعْمَلُوْنَ ﴿۱۶﴾

وقف لازم

**1 – 16** తూర్ పర్వతం సాక్షిగా! మృదువైన చర్మపు కాగితంపై వ్రాయబడిన స్పష్టమైన గ్రంథం సాక్షిగా! సందర్శనాలయం (కాబా గృహం) సాక్షిగా! ఎత్తైన కప్పు సాక్షిగా! అల్లకల్లోలపు సముద్రం సాక్షిగా! నీ ప్రభువు శిక్ష తప్పకుండా సంభవించనున్నది. దానిని ఎవ్వడూ అడ్డుకోజాలడు.[1] ఆకాశం భయంకరంగా కనిపించే రోజున పర్వతాలు ఎగురుతూ తిరిగే రోజున అది సంభవిస్తుంది. ఈనాడు ఒక ఆటగా వితండవాదనలు చేస్తున్న సత్య తిరస్కారులకు ఆనాడు వినాశం కలుగుతుంది. ఆ రోజున వారిని కొట్టుతూ, నెట్టుతూ నరకం వైపునకు తీసుకువెళ్లటం జరుగుతుంది. అప్పుడు వారితో ఇలా అనబడుతుంది, "మీరు తిరస్కరిస్తూ ఉండిన నరకాగ్ని ఇదే. ఇప్పుడు చెప్పండి, ఇది మంత్రజాలమా లేక మీకేమీ స్ఫురించటం లేదా? ఇక వెళ్లండి, అందులో కాలిపోతూ ఉండండి. మీరు సహనం వహించినా, వహించకపోయినా, మీకు ఒకటే. మీరు చేస్తూ ఉండిన కర్మల ప్రకారమే మీకు ప్రతిఫలం ఇవ్వబడుతోంది."

1. ప్రభువు శిక్ష అంటే, పరలోకం అని అర్థం. ఎందుకంటే, పరలోకాన్ని తిరస్కరించేవారికి అది రావటం అంటే శిక్షరావటమే. దాని ఆగమనం గురించి ఐదు విషయాలపై ప్రమాణం చేయటం జరిగింది; అంటే ఈ విషయాలు దాని రాకకు నిదర్శనాలు : (1) తూర్ పర్వతం; ఒక పీడిత జాతిని పైకెత్తటానికీ, పీడించే జాతిని అణగదొక్కటానికి కూడ ఇక్కడే నిర్ణయం జరిగింది. దేవుని సామ్రాజ్యం గుడ్డి సామ్రాజ్యం కాదని ఈ నిర్ణయం వెల్లడిజేస్తోంది. (2) పరిశుద్ధమైన గ్రంథాలు; ప్రాచీనకాలంలో ఈ గ్రంథాలు ఉల్లిపొరల్లాంటి సన్నని కాగితాలపై వ్రాయబడేవి. ప్రతి యుగంలో అల్లాహ్ నుండి వచ్చిన ప్రవక్తలు పరలోకం వస్తుందనే సమాచారం ఇచ్చారు అని గ్రంథాలు సాక్ష్యమిస్తున్నాయి. (3) సందర్శనాలయం అంటే కాబా గృహం : అది ఒక ఎడారి ప్రదేశంలో నిర్మించబడింది. తరువాత అల్లాహ్ ప్రపంచంలో ఏ గృహానికీ లేని వైభవాన్ని దీనికి ప్రసాదించటం చేత, యాత్రికులు గుంపులు గుంపులుగా వస్తారు. దైవప్రవక్తలు ఎన్నడూ గాలి పలుకులు పలకరు అని చెప్పటానికి ఇదొక స్పష్టమైన నిదర్శనం. హజ్రత్ ఇబ్రాహీమ్ దానిని నిశ్శబ్దం రాజ్యం చేస్తున్న పర్వతాల మధ్య నిర్మించి, హజ్ కోసం ప్రజలను పిలిచినప్పుడు, వేలాది సంవత్సరాల పాటు నిరంతరాయంగా మానవులు గుంపులు గుంపులుగా దానిని సందర్శిస్తారని ఎవరూ ఊహించలేదు. (4) ఎత్తైన కప్పు అంటే ఆకాశం. (5) ఘోషించే సముద్రం, ఇవి అల్లాహ్ శక్తిసామర్థ్యాలకు స్పష్టమైన నిదర్శనాలు. వానిని సృజించినవాడు, పరలోకాన్ని తీసుకువచ్చే విషయంలో అశక్తుడు ఎంతమాత్రం కాదు అని ఇవి సాక్ష్యమిస్తున్నాయి.

إِنَّ الْمُتَّقِينَ فِي جَنّٰتٍ وَّ نَعِيمٍ ﴿١٧﴾ فٰكِهِينَ بِمَآ
اٰتٰىهُمْ رَبُّهُمْ ۚ وَوَقٰىهُمْ رَبُّهُمْ عَذَابَ
الْجَحِيمِ ﴿١٨﴾ كُلُوا وَ اشْرَبُوا هَنِيٓئًا بِمَا كُنْتُمْ
تَعْمَلُونَ ﴿١٩﴾ مُتَّكِـِٔينَ عَلٰى سُرُرٍ مَّصْفُوفَةٍ ۚ
وَزَوَّجْنٰهُمْ بِحُورٍ عِينٍ ﴿٢٠﴾ وَ الَّذِينَ اٰمَنُوا وَ
اتَّبَعَتْهُمْ ذُرِّيَّتُهُمْ بِاِيمَانٍ اَلْحَقْنَا بِهِمْ ذُرِّيَّتَهُمْ
وَ مَآ اَلَتْنٰهُمْ مِّنْ عَمَلِهِمْ مِّنْ شَيْءٍ ۭ كُلُّ
امْرِئٍۢ بِمَا كَسَبَ رَهِينٌ ﴿٢١﴾ وَ اَمْدَدْنٰهُمْ
بِفَاكِهَةٍ وَّلَحْمٍ مِّمَّا يَشْتَهُونَ ﴿٢٢﴾ يَتَنَازَعُونَ
فِيهَا كَاْسًا لَّا لَغْوٌ فِيهَا وَلَا تَاْثِيمٌ ﴿٢٣﴾ وَ
يَطُوفُ عَلَيْهِمْ غِلْمَانٌ لَّهُمْ كَاَنَّهُمْ لُؤْلُؤٌ
مَّكْنُونٌ ﴿٢٤﴾ وَ اَقْبَلَ بَعْضُهُمْ عَلٰى بَعْضٍ
يَّتَسَآءَلُونَ ﴿٢٥﴾ قَالُوٓا اِنَّا كُنَّا قَبْلُ فِيٓ اَهْلِنَا
مُشْفِقِينَ ﴿٢٦﴾ فَمَنَّ اللّٰهُ عَلَيْنَا وَ وَقٰىنَا عَذَابَ
السَّمُومِ ﴿٢٧﴾ اِنَّا كُنَّا مِنْ قَبْلُ نَدْعُوهُ ۭ اِنَّهٗ
هُوَ الْبَرُّ الرَّحِيمُ ﴿٢٨﴾ ع ٢٨/٣

**17 - 28** భయభక్తులు కలవారు అక్కడ ఉద్యానవనాలలో, భోగభాగ్యాలతో ఉంటారు. వారి ప్రభువు వారికి ఇచ్చే వాటిని హాయిగా అనుభవిస్తూ ఉంటారు. వారి ప్రభువు వారిని నరక శిక్ష నుండి రక్షించుకుంటాడు. (వారితో ఇలా అనబడుతుంది): "హాయిగా తినండి, త్రాగండి, మీరు చేస్తూ ఉండిన కర్మలకు ప్రతిఫలంగా, వారు వేయబడిన ఆసనాలపై దిండ్లకు ఆనుకుని ఎదురెదురుగా కూర్చొని ఉంటారు. మేము వారికి అందమైన కళ్లుగల సుందరాంగులనిచ్చి వివాహం చేస్తాము. విశ్వాసుల సంతానం కూడ, విశ్వాసం విషయంలో దాదాపు వారి అడుగు జాడలలో నడిచి ఉంటే, వారి ఈ సంతానాన్ని కూడా మేము (స్వర్గంలో) వారితో కలుపుతాము. ఇంకా వారి కర్మలలో వారికి ఏమాత్రం నష్టం కలుగజేయము. ప్రతి వ్యక్తీ తాను సంపాదించిన దానికి తాకట్టుగా[2] ఉన్నాడు. మేము వారు కోరిన విధంగా వారికి అన్ని రకాల పండ్లు, మాంసం పుష్కలంగా ఇస్తూ ఉంటాము. వారు ఒకరి నుండి ఒకరు మధుపాత్రలను అమితోత్సాహంతో అందుకుంటూ ఉంటారు. దానిని సేవించటం వల్ల ప్రేలాపనలూ ఉండవు, చెడు నడతా ఉండదు.[3] వారి (సేవ) కొరకే ప్రత్యేకించబడిన, దాచబడిన ఆణిముత్యాల వంటి అందమైన బాలురు వారి సేవలో పరుగెడుతూ అటూ ఇటూ తిరుగుతూ ఉంటారు. వారు పరస్పరం (ప్రపంచంలో జరిగిన) పరిస్థితులను గురించి అడిగి తెలుసుకుంటారు. వారు ఇలా అంటారు, "మేము మొదట మా కుటుంబం వారి మధ్య (దేవునికి) భయపడుతూ జీవితం గడిపేవారం.[4] చివరకు అల్లాహ్ మాపై కనికరం చూపాడు, మమ్మల్ని తీవ్రమైన వడగాలి శిక్ష నుండి రక్షించాడు. మేము గతజీవితంలో ఆయననే వేడుకుంటూ ఉండేవారము. ఆయన నిజంగానే మహోపకారి మరియు అనంత కరుణామయుడు."

2. అంటే, ఒక వ్యక్తి అప్పు తీర్చకుండానే తాను తాకట్టుపెట్టిన వస్తువును విడిపించుకోలేని విధంగానే, ఒక వ్యక్తి తన విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చకుండానే, తనను తాను అల్లాహ్ ముందు జవాబుదారీ నుండి కాపాడుకోలేడు. పిల్లలు మంచివారు కాకపోతే, తాతముత్తాతల మంచితనం వారి ముక్తికి సాధనం కాలేదు.

3. అంటే, స్వర్గంలోని మద్యం మత్తు కలిగించదు కనుక దానిని త్రాగిన మనిషికి మైకం రాదు, అతను వదరుబోతు కాడు, అసభ్యంగా మాట్లాడడు, కయ్యానికి కాలుదువ్వడు, లోకంలో తాగుబోతులు చేసే అశ్లీల కార్యాలు చేయడు.

فَذَكِّرْ فَمَآ اَنْتَ بِنِعْمَتِ رَبِّكَ بِكَاهِنٍ
وَّلَا مَجْنُوْنٍ ﴿٢٩﴾ اَمْ يَقُوْلُوْنَ شَاعِرٌ نَّتَرَبَّصُ
بِهٖ رَيْبَ الْمَنُوْنِ ﴿٣٠﴾ قُلْ تَرَبَّصُوْا فَاِنِّيْ مَعَكُمْ
مِّنَ الْمُتَرَبِّصِيْنَ ﴿٣١﴾ اَمْ تَاْمُرُهُمْ اَحْلَامُهُمْ
بِهٰذَآ اَمْ هُمْ قَوْمٌ طَاغُوْنَ ﴿٣٢﴾ اَمْ يَقُوْلُوْنَ
تَقَوَّلَهٗ ۚ بَلْ لَّا يُؤْمِنُوْنَ ﴿٣٣﴾ فَلْيَاْتُوْا بِحَدِيْثٍ
مِّثْلِهٖٓ اِنْ كَانُوْا صٰدِقِيْنَ ﴿٣٤﴾

**29** కనుక ప్రవక్తా! నీవు హితోపదేశం చేస్తూ ఉండు. నీ ప్రభువు దయవల్ల నీవు జ్యోతిష్యుడవూ కావు, పిచ్చివాడవూ కావు.[5]

**30 - 32** "ఈయన కవి, ఈయన వినాశకాలం కోసం మేము ఎదురు చూస్తున్నాము" అని వారు అంటున్నారా? సరే, ఎదురు చూడండి, నేను కూడా మీతోపాటు ఎదురు చూస్తాను, అని వారికి చెప్పు. వారి బుద్ధులు వారిని ఇలాంటి మాటలే పలుకండి అని ప్రేరేపిస్తున్నాయా? లేక వారసలు దుర్మార్గంలో హద్దులు మీరినవారా?[6]

**33 - 34** ఈయన ఈ ఖురాన్‌ను స్వయంగా కల్పించాడని వారు అంటున్నారా? అసలు విషయం ఏమిటంటే, వారు విశ్వసించదలచుకోలేదు. ఒకవేళ వారు తమ ఈ మాటలో సత్యవంతులే అయితే, ఇలాంటి ఔన్నత్యం గల వాణినే రచించి తీసుకురావాలి.

4. అంటే, మేము భూమి మీద విలాసాలలో మునిగితేలుతూ, భౌతిక విషయాలలో నిమగ్నమై, అజాగ్రత్తతో కూడుకున్న జీవితం గడపలేదు. దేవుని ముందు సమాధానం చెప్పుకోవలసివచ్చే పాడుపని ఏదైనా మా వల్ల జరుగుతుందేమో అనే భయం మమ్మల్ని ఎల్లప్పుడూ వెంటాడుతూ ఉండేది. ఇక్కడ ప్రత్యేకంగా, అయినవారి మధ్య భయపడుతూ జీవితం గడపటాన్ని ఎందుకు ప్రస్తావించటం జరిగిందంటే, తన భార్యాపిల్లల సుఖాలకై, వారి భావి జీవితం అనాయాసంగా గడచిపోవటానికి మానవుడు పాపకార్యాలు చేయటానికి వెనుకాడడు.

5. పరలోక సన్నివేశాన్ని వర్ణించిన తరువాత, ఇక ప్రసంగం మక్కా అవిశ్వాసుల మొండి వైఖరి, మూర్ఖత్వాలను గురించి ప్రస్తావిస్తోంది. వారు ఈ వైఖరి ద్వారా మహాప్రవక్త (సఅసమ్) సందేశాన్ని అడ్డుకున్నారు. ఈ ఆయతులో, మహాప్రవక్త (సఅసమ్)ను సంబోధించినట్లు పైకి కనిపించినా, ఆయన ద్వారా ఈ విషయాన్ని మక్కా అవిశ్వాసులకు వినిపించటమే ప్రధాన లక్ష్యం.

6. ఈ చిన్న చిన్న వాక్యాలలో శత్రువుల దుష్ప్రచారాలనన్నింటినీ బట్టబయలు చేసి ఖండించటం జరిగింది. ఆ వాదన సారాంశం ఈ విధంగా ఉంది : ఖురైషు తెగ సర్దారులు, పెద్దలు తాము అపారమైన ప్రజ్ఞాపాటవాలు కలవారమని ప్రజలను భ్రమింపజేసేవారు. కాని వారి ప్రజ్ఞాపాటవాలు ఈ విషయాన్నే చెబుతాయా - కవి కానివానిని కవి అనమని చెబుతున్నాయా? లోకం వివేకిగా ఎరిగిన వానిని ఉన్మాది అనమని చెబుతున్నాయా? జ్యోతిష్యం అంటే ఏమిటో తెలియని వానిని జ్యోతిష్యుడు అని అనమని చెబుతున్నాయా? వారు ఈ విషయాలను హేతువు ఆధారంగానే చెప్పినట్లయితే, వారందరూ ఒకే అభిప్రాయాన్ని వ్యక్తం చేసి ఉండవలసింది. పరస్పర విరుద్ధంగా ఉన్న అభిప్రాయాలను ఏకకాలంలో వ్యక్తం చేయరు. ఒకే వ్యక్తి ఏకకాలంలో కవీ, ఉన్మాదీ, జ్యోతిష్యుడూ ఎలా కాగలుగుతాడు.

**35 - 36** వారు సృష్టికర్త లేకుండా తమంతట తామే పుట్టారా? లేక వారు తమకు తామే సృష్టికర్తలా? లేక వారు భూమినీ, ఆకాశాలనూ సృష్టించారా? అసలు విషయం ఏమిటంటే, వారికి నమ్మకం లేదు.[7]

**37 - 39** నీ ప్రభువు నిక్షేపాలు వారి అధీనంలో ఉన్నాయా? లేక వాటిపై వారి అధికారమే చలామణీ అవుతుందా?[8] వారి దగ్గర నిచ్చెన ఏదైనా ఉందా, దానిపై ఎక్కి వారు పై లోకం మాటలు వినిరావటానికి. వారిలో ఎవడైనా విని ఉంటే, వాడు ఏదైనా స్పష్టమైన ప్రమాణం తీసుకురావాలి. అల్లాహ్‌కేమో కూతుళ్లా, మీకేమో కొడుకులా?[9]

**40 - 41** నీవు ప్రతిఫలమేదైనా ఇవ్వండి అని వారిని అడుగు తున్నావా, బలవంతంగా పడే ఋణభారం క్రింద వారు అణిగి పోవటానికి? అగోచర సత్యాలేమైనా వారికి తెలుసా, వాటి ఆధారంగా వారు వ్రాయటానికి?[10]

أَمْ خُلِقُوا مِنْ غَيْرِ شَيْءٍ أَمْ هُمُ الْخَالِقُونَ ﴿٣٥﴾ أَمْ خَلَقُوا السَّمٰوٰتِ وَ الْأَرْضَ ۚ بَلْ لَا يُوقِنُونَ ﴿٣٦﴾ أَمْ عِنْدَهُمْ خَزَآئِنُ رَبِّكَ أَمْ هُمُ الْمُصَيْطِرُونَ ﴿٣٧﴾ أَمْ لَهُمْ سُلَّمٌ يَسْتَمِعُونَ فِيهِ ۚ فَلْيَأْتِ مُسْتَمِعُهُمْ بِسُلْطٰنٍ مُبِينٍ ﴿٣٨﴾ أَمْ لَهُ الْبَنٰتُ وَ لَكُمُ الْبَنُونَ ﴿٣٩﴾ أَمْ تَسْئَلُهُمْ أَجْرًا فَهُمْ مِنْ مَغْرَمٍ مُثْقَلُونَ ﴿٤٠﴾ أَمْ عِنْدَهُمُ الْغَيْبُ فَهُمْ يَكْتُبُونَ ﴿٤١﴾

7. అంటే, తమనూ, ఈ యావత్తు ప్రపంచాన్నీ సృష్టించినవాడు అల్లాహ్‌యే అని వారు పెదవులతో పలుకుతారు. అయితే సృష్టికర్త అయిన ఆ అల్లాహ్‌కు మాత్రమే దాస్యం చేయండి అని అంటే, వారందరూ కయ్యానికి కాలుదువ్వుతారు. దేవునియందు నమ్మకం వారికి లేదనటానికి ఇదే నిదర్శనం.

8. అసలు అబ్దుల్లాహ్ కుమారులైన ముహమ్మద్ (సఅసమ్)నే ఎందుకు ప్రవక్తగా చేశారు అనే మక్కా అవిశ్వాసుల ఆక్షేపణకు ఇది సమాధానం. ఈ సమాధానంలోని ఆంతర్యం ఏమిటంటే, వారిని అపమార్గం నుండి మళ్లించ టానికి, ఎవరినో ఒకరిని ప్రవక్తగా నియమించాలి కదా! దేవుడు తన ప్రవక్తగా ఎవరిని నియమించాలి, ఎవరిని కూడదు అనే విషయాన్ని ఎవరు నిర్ణయించాలి అనేదే ఇప్పటి ప్రశ్న. ఒకవేళ వారు అల్లాహ్ నియమించిన ప్రవక్తను విశ్వసించటానికి తిరస్కరిస్తే, దాని అర్థమేమిటంటే, దేవుని దైవత్వానికి తామే అధిపతులమని వారు భావించారు లేదా దేవుడు తన దైవత్వానికి తానే యజమానిగా ఉండాలి కాని అధికారం మాత్రం వారిది చలామణి కావాలి.

9. అంటే, ఒకవేళ మీరు ప్రవక్త వచనాన్ని విశ్వసించకుండా తిరస్కరిస్తే యథార్థాన్ని తెలుసుకోవటానికి మీ వద్ద ఉన్న మార్గం ఏది? మీలో ఎవరైనా ఊర్ధ్వలోకాలకు పోయి ప్రత్యక్షంగా అల్లాహ్‌నుగానీ, ఆయన దూతలను గాని కలిసి, తమ ధర్మానికి పునాదులుగా అయిన విశ్వాసాలు యథార్థానికి అనుగుణంగా ఉన్నాయి అని అడిగి తెలుసుకున్నారా? ఒకవేళ మీరు అలా అడిగి ఉండకపోతే, (స్వయంగా మీరే ఆలోచించండి) మీరు సకల లోకాల ప్రభువైన అల్లాహ్‌కు పిల్లలున్నారనీ, అందునా ఆడవారనీ ఆరోపిస్తారు. స్వయంగా మీరే ఆడ పిల్లలంటే అవమానకరంగా భావిస్తారు. ఈ విధంగా చెప్పే మీ విశ్వాసం ఎంత పరిహాస భాజనమైనదో ఒకసారి మీ అంతట మీరే ఆలోచించండి.

10. అంటే, అగోచర సత్యాలను గురించి మహాప్రవక్త (సఅసమ్) చెప్పిన విషయాలు యథార్థాలు కావని చెప్పటానికి వారేమైనా తెరవెనుక ఉన్న అగోచరమైన విషయాలను పరికించామని వ్రాతపూర్వకంగా ఇవ్వగలరా?

أَمْ يُرِيدُونَ كَيْدًا ۖ فَالَّذِينَ كَفَرُوا هُمُ الْمَكِيدُونَ ﴿٤٢﴾ أَمْ لَهُمْ إِلَٰهٌ غَيْرُ اللَّهِ ۚ سُبْحَانَ اللَّهِ عَمَّا يُشْرِكُونَ ﴿٤٣﴾ وَإِن يَرَوْا كِسْفًا مِّنَ السَّمَاءِ سَاقِطًا يَقُولُوا سَحَابٌ مَّرْكُومٌ ﴿٤٤﴾ فَذَرْهُمْ حَتَّىٰ يُلَاقُوا يَوْمَهُمُ الَّذِي فِيهِ يُصْعَقُونَ ﴿٤٥﴾ يَوْمَ لَا يُغْنِي عَنْهُمْ كَيْدُهُمْ شَيْئًا وَلَا هُمْ يُنصَرُونَ ﴿٤٦﴾ وَإِنَّ لِلَّذِينَ ظَلَمُوا عَذَابًا دُونَ ذَٰلِكَ وَلَٰكِنَّ أَكْثَرَهُمْ لَا يَعْلَمُونَ ﴿٤٧﴾ وَاصْبِرْ لِحُكْمِ رَبِّكَ فَإِنَّكَ بِأَعْيُنِنَا ۖ وَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ حِينَ تَقُومُ ﴿٤٨﴾ وَمِنَ اللَّيْلِ فَسَبِّحْهُ وَإِدْبَارَ النُّجُومِ ﴿٤٩﴾

ع ٢

**42 - 47** వారేదైనా పన్నాగం పన్నదలచారా? (ఇదే గనక నిజం అయితే) అవిశ్వాసుల పన్నాగం స్వయంగా వారికే బెడిసికొడుతుంది. వారికి అల్లాహ్ తప్ప మరొక ఆరాధ్యుడు ఉన్నాడా? వారు చేసే షిర్క్ నుండి అల్లాహ్ పరిశుద్ధుడు. వారు ఆకాశపు తునకలు సైతం రాలిపడటం చూసినా, ఇవి దట్టమైన మేఘాలు అని అంటారు. కనుక ప్రవక్తా! వారి మానాన వారిని వదలిపెట్టు, వారిని కొట్టి పడవేసే రోజు వచ్చేవరకు. అప్పుడు వారు దెబ్బలు తిని క్రిందపడిపోతారు. ఆ రోజున వారి పన్నాగాలేవీ వారికి ఏ మాత్రమూ పనికిరావు. వారిని ఆదుకోవటానికి కూడా ఎవడూ రాడు. ఇంకా ఆ సమయం రావటానికి ముందు కూడా దుర్మార్గులకు ఒక శిక్ష ఉంది. కాని వారిలో చాలామంది ఎరుగరు.

**48 - 49** ప్రవక్తా! నీ ప్రభువు ఉత్తరువు వచ్చేవరకు ఓర్పు వహించు. నీవు మా దృష్టిలో ఉన్నావు. నీవు లేచినప్పుడు, నీ ప్రభువు స్తోత్రం చేయటంతో పాటు, ఆయన పవిత్రనామాన్ని జపించు.[11] రాత్రివేళ కూడా ఆయన పవిత్రనామాన్ని జపించు, నక్షత్రాలు అస్తమిస్తున్నవేళ కూడా.[12]

11. మీరు నమాజుకై నిలబడినప్పుడు, అల్లాహ్‌ను స్తుతిస్తూ, ఆయన పవిత్రతను కొనియాడుతూ నమాజును ప్రారంభించండి. ఈ ఆదేశాలనుసారమే మహాప్రవక్త (సఅసమ్), "తక్బీరె తహ్రీమా" తరువాత, నమాజు ఈ మాటలతో ప్రారంభం కావాలని బోధించారు : సుబ్‌హాన కల్లాహుమ్మ వబిహమ్‌దిక వతబారకస్‌ముక వత ఆలా జద్దుక వలా ఇలాహ గైరుక.
12. ఇది ఉదయపు నమాజు సమయాన్ని సూచిస్తుంది.

ఆయతులు 62 | **53. అన్ నజ్మ్** | అవతరణ మక్కాలో

٥٣ سُوْرَةُ النَّجْمِ مَكِّيَّةٌ ٢٣

اٰياتها ٦٢ | ركوعاتها ٣

*అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

**1 - 12** అప్పుడే అస్తమించిన[1] నక్షత్రం సాక్షిగా! మీ సహచరుడు దారీ తప్పలేదు, తప్పుదారీ పట్టలేదు.[2] అతను తన మనోవాంఛలను అనుసరించి చెప్పటం లేదు. ఇది ఒక వహీ, అతనిపై అవతరింపజేయబడుతుంది. గొప్ప శక్తిసంపన్నుడు అతనికి నేర్పుతున్నాడు. ఆయన గొప్ప వివేకవంతుడు.[3] అతను దిజ్మండలం ఎగువ భాగంపై[4] ఉన్నప్పుడు ఆయన అతని ముందుకు వచ్చి నిలబడ్డాడు, తరువాత మరింత దగ్గరకు వచ్చి పైన ఆగిపోయాడు. ఈ విధంగా ఆయన రెండు ధనుస్సుల అంత లేదా అంతకంటే కొంచెం తక్కువ దూరంలో ఆగిపోయాడు.[5] అప్పుడు ఆయన అల్లాహ్ భక్తునికి, చేరవేయవలసి ఉన్న వహీని చేరవేశాడు. (అతని) కళ్లు చూచిన దానిలో (అతని) హృదయం అసత్యాన్ని కలుపలేదు.[6] అయితే మీరు, అతను కళ్లారా చూస్తూ ఉన్నదానిని గురించి అతనితో వివాదానికి దిగుతారా?

وَالنَّجْمِ اِذَا هَوٰى ① مَا ضَلَّ صَاحِبُكُمْ وَ مَا
غَوٰى ② وَ مَا يَنْطِقُ عَنِ الْهَوٰى ③ اِنْ هُوَ
اِلَّا وَحْيٌ يُّوْحٰى ④ عَلَّمَهٗ شَدِيْدُ الْقُوٰى ⑤
ذُوْمِرَّةٍ فَاسْتَوٰى ⑥ وَ هُوَ بِالْاُفُقِ
الْاَعْلٰى ⑦ ثُمَّ دَنَا فَتَدَلّٰى ⑧ فَكَانَ قَابَ
قَوْسَيْنِ اَوْ اَدْنٰى ⑨ فَاَوْحٰى اِلٰى عَبْدِهٖ مَآ
اَوْحٰى ⑩ مَا كَذَبَ الْفُؤَادُ مَا رَاٰى ⑪
اَفَتُمٰرُوْنَهٗ عَلٰى مَا يَرٰى ⑫

1. అంటే, చివరి నక్షత్రం అస్తమించి ఉదయం అయినప్పుడు అని భావం.
2. సహచరుడు అంటే, మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) అని అర్థం. ఎందుకంటే ఆయన మక్కా అవిశ్వాసులకు కొత్తవారేమీ కారు. ఆయన వారి మధ్యనే పుట్టారు, బాల్యం గడిపి యౌవనంలోకి అడుగుపెట్టారు, యౌవనం నుండి మధ్య వయస్సులోకి ప్రవేశించారు. భావం ఏమిటంటే, మహాప్రవక్త (సఅసమ్) మీరు బాగా ఎరిగిన మనిషే. ఆయన మార్గమూ తప్పలేదు, అపమార్గమూ పట్టలేదు అనే విషయం ప్రకాశవంతమైన ఉదయం వలె తేటతెల్లం.
3. ముందు రాబోయే విషయం ప్రస్ఫుటం చేస్తున్నట్లు, ఇక్కడ ఉద్దేశింపబడింది అల్లాహ్ కాదు జిబ్రీల్ (అస్సలామ్).
4. దిజ్మండలం అంటే ఆకాశపు తూరుపుటంచు. అక్కడి నుంచే సూర్యుడు ఉదయిస్తాడు, పగటి కాంతులు వెదజల్లబడతాయి. అర్థం ఏమిటంటే, మొదటిసారిగా మహాప్రవక్త (సఅసమ్)కు జిబ్రీల్ (అస్సలామ్) కనిపించినప్పుడు, ఆయన ఆకాశపు తూరుపుటంచు నుండి ప్రత్యక్షమయ్యారు.
5. అంటే, ఆకాశపు తూరుపుటంచు పై భాగంలో ప్రత్యక్షమైన తరువాత, జిబ్రీల్ (అస్సలామ్) మహాప్రవక్త వైపునకు రాసాగారు, ముందుకు సాగిపోతూ ఆయన మహాప్రవక్త (సఅసమ్)పైకి వచ్చి ఆకాశంలో నిలబడ్డారు, తరువాత జిబ్రీల్, దైవప్రవక్త వైపునకు వంగి ఆయనకు ఎంత సన్నిహితమయ్యారంటే, వారివురి మధ్యగల దూరం రెండు ధనుస్సుల దూరంగానీ, కొంచెం తక్కువగానీ ఉంటుంది. ఏ రెండు ధనుస్సులూ సమానంగా ఉండవు గనుక, దూరాన్ని ఇంచుమించు అంచనా వేయటానికి, రెండు ధనుస్సుల పొడవుగానీ లేదా కొంచెం తక్కువగానీ అని చెప్పబడింది.

وَلَقَدْ رَاٰهُ نَزْلَةً اُخْرٰى ﴿١٣﴾ عِنْدَ سِدْرَةِ
الْمُنْتَهٰى ﴿١٤﴾ عِنْدَهَا جَنَّةُ الْمَاْوٰى ﴿١٥﴾ اِذْ يَغْشَى
السِّدْرَةَ مَا يَغْشٰى ﴿١٦﴾ مَا زَاغَ الْبَصَرُ وَ مَا
طَغٰى ﴿١٧﴾ لَقَدْ رَاٰى مِنْ اٰيٰتِ رَبِّهِ الْكُبْرٰى ﴿١٨﴾
اَفَرَءَيْتُمُ اللّٰتَ وَ الْعُزّٰى ﴿١٩﴾ وَ مَنٰوةَ الثَّالِثَةَ
الْاُخْرٰى ﴿٢٠﴾ اَلَكُمُ الذَّكَرُ وَ لَهُ الْاُنْثٰى ﴿٢١﴾
تِلْكَ اِذًا قِسْمَةٌ ضِيْزٰى ﴿٢٢﴾ اِنْ هِيَ اِلَّآ
اَسْمَآءٌ سَمَّيْتُمُوْهَآ اَنْتُمْ وَ اٰبَآؤُكُمْ مَّآ اَنْزَلَ
اللّٰهُ بِهَا مِنْ سُلْطٰنٍ اِنْ يَّتَّبِعُوْنَ اِلَّا الظَّنَّ
وَ مَا تَهْوَى الْاَنْفُسُ وَ لَقَدْ جَآءَهُمْ مِّنْ
رَّبِّهِمُ الْهُدٰى ﴿٢٣﴾ اَمْ لِلْاِنْسَانِ مَا تَمَنّٰى ﴿٢٤﴾
فَلِلّٰهِ الْاٰخِرَةُ وَ الْاُوْلٰى ﴿٢٥﴾ ع

**13 - 18** తరువాత మరొకసారి అతను 'సిద్‌రతుల్ మున్‌తహా'[7] వద్ద ఆయనను దిగుతూ ఉండగా చూశాడు. అక్కడికి దగ్గరలోనే "జన్నతుల్ మావా" (స్వర్గనివాస స్థలం) ఉంది. ఆ సమయంలో "సిద్‌రహ్"ను అలము కొనేది అలము కుంటూ ఉన్నది. (అతని) చూపులు తప్పిపోనూ లేదు, హద్దును దాటిపోనూ లేదు. అతను తన ప్రభువు యొక్క గొప్ప గొప్ప సూచనలను చూశాడు.[8]

**19 - 25** ఇప్పుడు చెప్పండి; ఈ లాత్, ఈ ఉజ్జా, మూడోది ఒక దేవత అయిన మనాత్‌ల వాస్తవికతను గురించి మీరు కాస్తయినా ఆలోచించారా?[9] ఏమిటి, మీ కోసం కుమారు లున్నూ, దేవుని కోసం కుమార్తెలూనా?[10] ఇది చాలా ఘోర మైన విభజన! అసలు ఇవి ఏమీ కావు. మీరూ, మీ తాత ముత్తాతలూ పెట్టుకున్న కొన్ని పేర్లు మాత్రమే. అల్లాహ్ వాటికై ఏ ప్రమాణాన్నీ పంపలేదు. యధార్థమేమిటంటే, వారు కేవలం ఊహలనూ, అనుమానాలనూ అనుసరిస్తున్నారు, మనోవాంఛ లకు దాసులైపోయారు. వాస్తవానికి వారి ప్రభువు తరఫు నుండి వారి వద్దకు సన్మార్గం వచ్చేసింది. మానవుడు కోరేదల్లా అతనికి సత్యం అవుతుందా?[11] ప్రపంచానికీ, పరలోకానికీ యజమాని అల్లాహ్ మాత్రమే.

6. అంటే, పగటి వెలుగులో, పరిపూర్ణమైన చేతనావస్థలో, కళ్లు తెరచి మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) చూశారు. దానికి ఆయన హృదయం స్పందిస్తూ ఇది దృష్టిభ్రాంతి అని కానీ, నాకు కనిపించేది ఒక జిన్నాతు, లేక ఒక షైతాను అనికానీ, నా ముందుకు ఒక ఊహా చిత్రం వచ్చిందని కానీ, మేల్కొని ఉండే కలగంటున్నానని గానీ అనలేదు. ఆయన కళ్లు చూచిన దానినే ఆయన హృదయం కూడ అర్థం చేసుకుంది. జిబ్రీల్ (అస్సలామ్) విషయంలోగానీ, ఆయన అందజేసిన సందేశం విషయంలో గానీ దైవప్రవక్తకు ఎటువంటి అనుమానం లేదు.
7. అరబ్బీ భాషలో "సిద్రహ్" అంటే ఒక రేగు చెట్టు. 'మున్‌తహ' అంటే చిట్టచివరిది. "సిద్రతుల్ మున్‌తహా" యొక్క నైఘంటిక అర్థం ఏమిటంటే, కట్టకడపటి స్థానంలో ఉన్న రేగు చెట్టు. ఈ భౌతిక ప్రపంచపు చిట్టచివరి సరిహద్దున గల రేగు చెట్టు ఎటువంటిదో, దాని యథార్థ స్వభావం ఎట్టిదో తెలుసుకోవటం మనకు సాధ్యం కాదు. ఇవి దైవసృష్టిలో గల నిగూఢ రహస్యాలు. ఇవి మన గ్రహణ శక్తికి అతీతమైనవి. ఏదిఏమైనా, అల్లాహ్ దృష్టిలో మానవ భాషలో 'సిద్రహ్' అనే పదం కంటే తగిన పదం దీనికి మరొకటి లేదు.
8. మహాప్రవక్త (సఅసమ్) అల్లాహ్‌ను చూడలేదనీ, మహత్తరమైన అల్లాహ్ సూచనలను మాత్రమే ఆయన చూశారనీ ఈ ఆయతు స్పష్టంగా చెబుతోంది. సందర్భాన్నిబట్టి చూస్తే, రెండోసారి కూడ, మొదటిసారి కలిసిన వ్యక్తినే కలవటం జరిగింది. కనుక తప్పనిసరిగా ఈ విషయాన్ని ఒప్పుకోవలసి ఉంటుంది, దిఙ్మండలం మీద మొదటిసారి ఆయన చూసినది కూడ అల్లాహ్‌ను కాదు, రెండోసారి సిద్రతుల్ మున్‌తహా వద్ద ఆయన చూసినది కూడ అల్లాహ్‌ను కాదు. ఒకవేళ ఆయన ఈ రెండు సందర్భాలలో ఏ సందర్భంలోనైనా, అత్యంత శక్తిమంతుడైన

وَكَمْ مِّنْ مَّلَكٍ فِي السَّمٰوٰتِ لَا تُغْنِيْ شَفَاعَتُهُمْ
شَيْـًٔا اِلَّا مِنْۢ بَعْدِ اَنْ يَّاْذَنَ اللّٰهُ لِمَنْ يَّشَآءُ
وَيَرْضٰى ﴿٢٦﴾ اِنَّ الَّذِيْنَ لَا يُؤْمِنُوْنَ
بِالْاٰخِرَةِ لَيُسَمُّوْنَ الْمَلٰٓئِكَةَ تَسْمِيَةَ
الْاُنْثٰى ﴿٢٧﴾ وَمَا لَهُمْ بِهٖ مِنْ عِلْمٍ ؕ اِنْ
يَّتَّبِعُوْنَ اِلَّا الظَّنَّ ۚ وَاِنَّ الظَّنَّ لَا يُغْنِيْ مِنَ
الْحَقِّ شَيْـًٔا ﴿٢٨﴾ فَاَعْرِضْ عَنْ مَّنْ تَوَلّٰى ۙ عَنْ
ذِكْرِنَا وَلَمْ يُرِدْ اِلَّا الْحَيٰوةَ الدُّنْيَا ﴿٢٩﴾ ذٰلِكَ
مَبْلَغُهُمْ مِّنَ الْعِلْمِ ؕ اِنَّ رَبَّكَ هُوَ اَعْلَمُ بِمَنْ
ضَلَّ عَنْ سَبِيْلِهٖ ۙ وَهُوَ اَعْلَمُ بِمَنِ اهْتَدٰى ﴿٣٠﴾
وَلِلّٰهِ مَا فِي السَّمٰوٰتِ وَمَا فِي الْاَرْضِ ۙ
لِيَجْزِيَ الَّذِيْنَ اَسَآءُوْا بِمَا عَمِلُوْا وَيَجْزِيَ
الَّذِيْنَ اَحْسَنُوْا بِالْحُسْنٰى ﴿٣١﴾ اَلَّذِيْنَ يَجْتَنِبُوْنَ
كَبٰٓئِرَ الْاِثْمِ وَالْفَوَاحِشَ اِلَّا اللَّمَمَ ؕ اِنَّ
رَبَّكَ وَاسِعُ الْمَغْفِرَةِ ؕ هُوَ اَعْلَمُ بِكُمْ اِذْ
اَنْشَاَكُمْ مِّنَ الْاَرْضِ وَاِذْ اَنْتُمْ اَجِنَّةٌ فِيْ
بُطُوْنِ اُمَّهٰتِكُمْ ۚ فَلَا تُزَكُّوْۤا اَنْفُسَكُمْ ؕ هُوَ
اَعْلَمُ بِمَنِ اتَّقٰى ﴿٣٢﴾

**26 - 28** ఆకాశాలలో ఎంతోమంది దైవదూతలు ఉన్నారు. కాని వారి సిఫారసు ఏమాత్రం ఉపయోగపడదు, అల్లాహ్ తాను ఎవరిని గురించైతే ఏదైనా విన్నపం వినదలుస్తాడో, ఎవడైతే ఆయనకు ఇష్టుడో, అటువంటి వ్యక్తి విషయంలో దానికి (సిఫారసుకు) అనుమతి ఇస్తేనేతప్ప. కాని పరలోకాన్ని విశ్వసించని వారు దైవదూతలను దేవతల పేర్లతో పిలుస్తు న్నారు. వాస్తవానికి ఈ విషయంలో వారి వద్ద ఎటువంటి జ్ఞానమూ లేదు. వారు కేవలం అనుమానాలను అనుసరిస్తు న్నారు. సత్యం స్థానంలో అనుమానం ఏమాత్రం ఉపయోగ పడదు కదా!

**29 - 32** కనుక ప్రవక్తా! మా ప్రస్తావన నుండి ముఖం త్రిప్పుకుని, భౌతిక జీవితం తప్ప మరొక తలంపు లేని వ్యక్తిని అతని మానాన అతనిని వదలిపెట్టు- వారికున్న[12] జ్ఞానం మొత్తం ఇంతే. ఆయన మార్గం నుండి ఎవడు తప్పిపోయాడు, ఎవడు ఋజుమార్గంలో ఉన్నాడు అనే విషయాన్ని నీ ప్రభువే బాగా ఎరుగును. భూమ్యాకాశాలలోని ప్రతి వస్తువుకూ యజమాని అల్లాహ్‌యే- చెడు చేసేవారికి[13] అల్లాహ్ వారి కర్మలకు ప్రతిఫలం ఇచ్చేందుకు, సదాచరణ వైఖరి అవలంబిం చిన వారికి మంచి ప్రతిఫలం ప్రసాదించేందుకు. వారు పెద్ద పెద్ద పాపాలకు, స్పష్టమైన అసభ్య చేష్టలకు దూరంగా ఉంటారు, కొన్ని పొరపాట్లు తప్ప. నిస్సంశయంగా నీ ప్రభువు క్షమాగుణ పరిధి అత్యంత విశాలమైనది. ఆయన మిమ్మల్ని భూమినుండి సృష్టించినప్పటి నుండీ, మీరు మీ మాతృ గర్భా లలో ఇంకా పిండాలుగానే ఉన్నప్పటి నుండీ బాగా ఎరుగును. కనుక మీ పవిత్రతను గురించి గొప్పలు చెప్పుకోకండి. నిజ మైన భయభక్తులు గల వాడెవడో ఆయనకే బాగా తెలుసు.

అల్లాహ్‌నే చూసి ఉన్నట్లయితే, అదొక అద్భుతమైన సంఘటనగా విరాజిల్లేది, ఇక్కడ దానికి సంబంధించిన వివరణ తప్పకుండా ఇవ్వబడేది కూడ.

9. అర్థం ఏమిటంటే, మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) మీకు చేసే బోధలు అపమార్గం పట్టించేవనీ, అసత్యాలనీ మీరు నిర్ణయించారు. వాస్తవానికి ఈ జ్ఞాన విషయాలు వారికి అల్లాహ్ తరపు నుండి ఇవ్వబడుతున్నాయి. అల్లాహ్ ఆయన కళ్లకు చూపిన సత్యాలను గురించి ఆయన మీ ముందు సాక్ష్యమిస్తున్నారు. ఏ విశ్వాసాల అనుసరణ పట్ల మీరు ఇంత పట్టుదల చూపుతున్నారో, అవి ఎంత నిర్హేతుకమైనవో, వాటికి మారుగా మీకు

أَفَرَءَيْتَ الَّذِي تَوَلَّىٰ ﴿٣٣﴾ وَأَعْطَىٰ قَلِيلًا وَأَكْدَىٰ ﴿٣٤﴾ أَعِندَهُ عِلْمُ الْغَيْبِ فَهُوَ يَرَىٰ ﴿٣٥﴾ أَمْ لَمْ يُنَبَّأْ بِمَا فِي صُحُفِ مُوسَىٰ ﴿٣٦﴾ وَإِبْرَاهِيمَ الَّذِي وَفَّىٰ ﴿٣٧﴾ أَلَّا تَزِرُ وَازِرَةٌ وِزْرَ أُخْرَىٰ ﴿٣٨﴾ وَأَن لَّيْسَ لِلْإِنسَانِ إِلَّا مَا سَعَىٰ ﴿٣٩﴾ وَأَنَّ سَعْيَهُ سَوْفَ يُرَىٰ ﴿٤٠﴾ ثُمَّ يُجْزَاهُ الْجَزَاءَ الْأَوْفَىٰ ﴿٤١﴾ وَأَنَّ إِلَىٰ رَبِّكَ الْمُنتَهَىٰ ﴿٤٢﴾

**33 - 55** ప్రవక్తా! దైవమార్గం నుండి ముఖం త్రిప్పుకుని కొంచెం మాత్రమే ఇచ్చి ఆగిపోయిన[14] వ్యక్తిని కూడ నీవు చూశావా? అతని వద్ద అతీంద్రియ జ్ఞానమేదైనా ఉందా అతడు యథార్థాన్ని చూసేందుకు? మూసా ప్రవక్త గ్రంథాలలోనూ, తన వాగ్దానాన్ని నెరవేర్చి[15] తన నిజాయితీని నిరూపించుకున్న ఇబ్రాహీమ్ ప్రవక్త గ్రంథాలలోనూ వివరించ బడిన విషయాల సమాచారమేదీ అతనికి అందలేదా? ఆ విషయాలు ఏమిటంటే; బరువు మోసేవాడెవడూ ఇతరుల బరువును మోయడు.[16] దేనికై మానవుడు కృషి చేస్తాడో,[17] అది తప్ప అతనికి మరొకటేదీ లభించదు. త్వరలోనే అతని కృషిని చూసి, దాని ప్రతిఫలం పూర్తిగా అతనికి ఇవ్వబడు తుంది. చివరకు నీ ప్రభువు వద్దకే చేరవలసి ఉంది.

రుజుమార్గం చూపెడుతున్న వ్యక్తిని వ్యతిరేకించి, అసలు మీరు ఎవరికి నష్టం కలిగిస్తున్నారో, కొంచెం మీరే ఆలోచించుకోండి.

10. అంటే, ఈ దేవతలను మీరు సకల లోకాల ప్రభువుకు కుమార్తెలుగా చేశారు. ఈ అంధ విశ్వాసాన్ని కొత్తగా కల్పించుకున్నప్పుడు, మీరు ఇలా కూడ ఆలోచించలేదు; ఆడపిల్లల పుట్టుకను మీరు అవమానకరంగా తలుస్తారు. మీరు మగసంతానం కావాలని కోరుకుంటారు. కాని అల్లాహ్‌కు ఆడపిల్లలను మాత్రమే ప్రతిపాదిస్తారు.

11. ఈ ఆయతుకు రెండో అర్థం ఇలా కూడ చెప్పవచ్చు : మానవునకు తాను కోరిన వారిని ఆరాధ్యులుగా చేసుకోగల హక్కు ఉన్నదా? మూడో అర్థం ఇలా చెప్పవచ్చు : ఈ ఆరాధ్యులను ప్రార్థించి, మానవుడు తన అభీష్టాలను సాధించుకో గలడా?

12. ఇది అవాంతర వాక్యం, ఈ వాక్యం ప్రసంగ క్రమాన్ని భంగపరచి, పూర్వపు విషయానికి వివరణగా చెప్పబడింది.

13. ఇక్కడ నుంచి ఇంతకుముందు చెప్పబడుతూ ఉన్న ప్రసంగక్రమం తిరిగి ప్రారంభమవుతుంది. అవాంతర వాక్యాన్ని వదలిపెడితే, వాక్యక్రమం ఇలా ఉంటుంది; అతనిని అతని మానాన వదలిపెట్టండి, చెడు చేసేవారికి అల్లాహ్‌యే తగిన ప్రతిఫలం ఇవ్వటానికి.

14. ఖురైషు తెగకు చెందిన పెద్ద సర్దారులలో ఒకడైన వలిద్ బిన్ ముగైరాహ్‌ను ఇది సూచిస్తుంది. ఇతను మొదట మహాప్రవక్త (సఅసమ్) సందేశాన్ని స్వీకరించటానికి అంగీకరించాడు. అతను ముస్లిమ్‌గా మారే అభిలాష కలిగి ఉన్నాడనే విషయం తెలుసుకున్న అతని ముష్రిక్కు స్నేహితుడొకాయన ఇలా అన్నాడు, నీవు పరంపరగా వచ్చే ధర్మాన్ని విడిచిపెట్టకు. ఒకవేళ నీకు పరలోక యాతనా భయం ఉంటే కొంత సొమ్ము నాకు ఇవ్వు, అప్పుడు నీకు బదులుగా నేను అక్కడి యాతనను భరించే బాధ్యతను స్వీకరిస్తాను. వలీద్ ఈ విషయాన్ని ఒప్పుకున్నాడు, దైవమార్గం వైపునకు వస్తూ వస్తూ ఆగిపోయాడు. కాని తన ముష్రిక్కు స్నేహితునికి ఇవ్వదలచుకున్న మొత్తంలో కొంత భాగాన్ని మాత్రమే ఇచ్చి మిగతాది తన వద్దనే ఉంచుకున్నాడు.

15. హజ్రత్ మూసా (అస్సలామ్), హజ్రత్ ఇబ్రాహీమ్ (అస్సలామ్)ల ఫలకాలలో అవతరించిన ఉపదేశాల సారాన్ని ముందు చెప్పటం జరుగుతుంది.

16. అంటే, ప్రతి వ్యక్తీ తాను చేసిన పనికి తానే బాధ్యుడు. ఒక వ్యక్తి బాధ్యతను మరొక వ్యక్తిపై వేయటం జరగదు. ఒక వ్యక్తి తాను కోరినప్పటికీ, మరొక వ్యక్తి చేసిన పనికి బాధ్యతను తనపై వేసుకోలేడు. అసలు నేరస్తుడి స్థానంలో, అతడి శిక్షను అనుభవించటానికి మరొక వ్యక్తి తనను తాను సమర్పించుకున్న కారణంగా అతనిని వదలిపెట్టడం జరగదు.

وَ اَنَّهٗ هُوَ اَضۡحَكَ وَ اَبۡكٰى ۙ﴿۴۳﴾ وَ اَنَّهٗ هُوَ اَمَاتَ
وَ اَحۡيَا ۙ﴿۴۴﴾ وَ اَنَّهٗ خَلَقَ الزَّوۡجَيۡنِ الذَّكَرَ
وَالۡاُنۡثٰى ۙ﴿۴۵﴾ مِنۡ نُّطۡفَةٍ اِذَا تُمۡنٰى ﴿۴۶﴾ وَ اَنَّ
عَلَيۡهِ النَّشۡاَةَ الۡاُخۡرٰى ۙ﴿۴۷﴾ وَ اَنَّهٗ هُوَ اَغۡنٰى وَ
اَقۡنٰى ۙ﴿۴۸﴾ وَ اَنَّهٗ هُوَ رَبُّ الشِّعۡرٰى ۙ﴿۴۹﴾ وَ اَنَّهٗۤ
اَهۡلَكَ عَادَا ۨ الۡاُوۡلٰى ۙ﴿۵۰﴾ وَ ثَمُوۡدَاۡ فَمَاۤ اَبۡقٰى ۙ﴿۵۱﴾ وَ
قَوۡمَ نُوۡحٍ مِّنۡ قَبۡلُ ؕ اِنَّهُمۡ كَانُوۡا هُمۡ اَظۡلَمَ
وَاَطۡغٰى ﴿۵۲﴾ وَالۡمُؤۡتَفِكَةَ اَهۡوٰى ۙ﴿۵۳﴾ فَغَشّٰٮهَا مَا
غَشّٰى ﴿۵۴﴾ فَبِاَىِّ اٰلَاۤءِ رَبِّكَ تَتَمَارٰى ﴿۵۵﴾ هٰذَا
نَذِيۡرٌ مِّنَ النُّذُرِ الۡاُوۡلٰى ﴿۵۶﴾ اَزِفَتِ
الۡاٰزِفَةُ ﴿۵۷﴾ لَيۡسَ لَهَا مِنۡ دُوۡنِ اللّٰهِ
كَاشِفَةٌ ؕ﴿۵۸﴾ اَفَمِنۡ هٰذَا الۡحَدِيۡثِ تَعۡجَبُوۡنَ ۙ﴿۵۹﴾
وَتَضۡحَكُوۡنَ وَلَا تَبۡكُوۡنَ ۙ﴿۶۰﴾ وَ اَنۡتُمۡ سٰمِدُوۡنَ ﴿۶۱﴾
فَاسۡجُدُوۡا لِلّٰهِ وَاعۡبُدُوۡا ۩ ﴿۶۲﴾ السجدة ۱۲

ఆయనే నవ్విస్తున్నాడు, ఆయనే ఏడిపిస్తున్నాడు.[18] ఆయనే మరణం ఇచ్చాడు, ఆయనే జీవితాన్ని ప్రసాదించాడు. విడిచే ఒక బిందువు ద్వారా ఆడా మగల జంటను ఆయనే సృష్టించాడు. మరొక జీవితాన్ని ప్రసాదించటం కూడా ఆయన బాధ్యతే. సంపన్నునిగా చేసింది ఆయనే, ఆస్తిపాస్తులను ప్రసాదించిందీ ఆయనే. ఆయనే సిరియస్ (అగ్ని నక్షత్రం) నక్షత్రానికి కూడ ప్రభువు;[19] ఆయనే ప్రాచీన ఆద్ జాతిని నాశనం చేశాడు; సమూద్ జాతిని ఒక్కడూ మిగలకుండా పూర్తిగా తుడిచి పెట్టాడు; వారికి పూర్వం నూహ్ జాతిని నాశనం చేశాడు; ఎందుకంటే వారు స్వతహాగా పరమ దుర్మార్గులు, పరమ విద్రోహులు. తలక్రిందులుగా పడిపోయిన జనపదాలను ఎత్తి విసిరిపారేశాడు. తరువాత వాటిపై దానిని ఆవరింపజేశాడు, (నీకు తెలిసే ఉంది) దేనిని ఆవరింపజేశాడో.[20] కనుక ఓ మానవుడా! నీ ప్రభువు యొక్క ఏయే భాగ్యాలను గురించి నీవు అనుమానిస్తావు?

**56 - 62** ఇదివరకు వచ్చిన హెచ్చరికలలోని ఒక హెచ్చరిక ఇది. రానున్న గడియ సమీపంలోనే ఉన్నది. అల్లాహ్ తప్ప మరెవరూ దానిని తొలగించలేరు. ఇక మీరు ఆశ్చర్యం వెలిబుచ్చే విషయాలు ఇవేనా? మీరు నవ్వుతున్నారా, ఏడ్పు రావటం లేదా మీకు? పాటలతో, ఆటలతో వాటిని నిర్లక్ష్యం చేస్తున్నారా? అల్లాహ్ ముందు మోకరిల్లండి, ఆయనకు దాస్యం చేయండి.

17. అంటే, ప్రతి వ్యక్తీ తాను చేసిన పనుల ప్రతిఫలాన్ని మాత్రమే పొందుతాడు. ఒక వ్యక్తి చేసిన పనుల ప్రతిఫలం మరొక వ్యక్తికి లభించదు. ఏ వ్యక్తి అయినా ప్రయత్నం లేకుండా, ఆచరణలేకుండా దేనినీ పొందలేడు.

18. అంటే, సుఖదుఃఖాలు రెండూ ఆయన వల్లనే కలుగుతాయి. అదృష్టదురదృష్టాల నియంత్రణ కూడ ఆయన చేతులలోనే ఉన్నది. ఈ అదృష్టదురదృష్టాలను మార్చటంలో ప్రమేయం గల శక్తి ఏదీ ఈ సృష్టిలో లేదు.

19. షిఅరా (అగ్ని నక్షత్రం) ఆకాశంలో దేదీప్యమానంగా ఉండే నక్షత్రం. ఈ నక్షత్రం మానవుని అదృష్టదురదృష్టాలను ప్రభావితం చేస్తుందని ఈజిప్టు, అరేబియా దేశాల ప్రజలు నమ్మేవారు. ఈ కారణంగానే అది వారి దేవుళ్ల జాబితాలో చేరిపోయింది.

20. తలక్రిందులుగా పడిపోయిన జనపదాలు అంటే లూత్ ప్రవక్త జాతి జనపదాలు అని అర్థం. "వాటిపై దానిని ఆవరింపజేశాడు" అంటే, బహుశా వారి జనావాసాలు భూమిలోకి క్రుంగిపోయిన తరువాత, వాటిని ఆవరించిన మృతసముద్రపు నీరు అని అర్థం కావచ్చు. ఈనాటికి కూడ ఆ సముద్రపు నీరు ఆ ప్రాంతాన్ని ఆవరించి ఉన్నది.

ఆయతులు 55 | **54. అల్ ఖమర్** | అవతరణ మక్కాలో

٥٤ سُورَةُ الْقَمَرِ مَكِّيَّةٌ ٣٧

اٰیاتها ٥٥ | رکوعاتها ٣

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِیۡمِ ○

اِقۡتَرَبَتِ السَّاعَةُ وَ انۡشَقَّ الۡقَمَرُ ① وَ اِنۡ
یَّرَوۡا اٰیَةً یُّعۡرِضُوۡا وَ یَقُوۡلُوۡا سِحۡرٌ مُّسۡتَمِرٌّ ②
وَ كَذَّبُوۡا وَاتَّبَعُوۡۤا اَهۡوَآءَهُمۡ وَكُلُّ اَمۡرٍ
مُّسۡتَقِرٌّ ③ وَ لَقَدۡ جَآءَهُمۡ مِّنَ الۡاَنۡۢبَآءِ مَا
فِیۡهِ مُزۡدَجَرٌ ④ حِكۡمَةٌۢ بَالِغَةٌ فَمَا تُغۡنِ
النُّذُرُ ⑤ فَتَوَلَّ عَنۡهُمۡ ۘ یَوۡمَ یَدۡعُ الدَّاعِ اِلٰی
شَیۡءٍ نُّكُرٍ ⑥ خُشَّعًا اَبۡصَارُهُمۡ یَخۡرُجُوۡنَ مِنَ
الۡاَجۡدَاثِ كَاَنَّهُمۡ جَرَادٌ مُّنۡتَشِرٌ ⑦ مُّهۡطِعِیۡنَ
اِلَی الدَّاعِ ؕ یَقُوۡلُ الۡكٰفِرُوۡنَ هٰذَا یَوۡمٌ
عَسِرٌ ⑧

وقف لازم

**1 – 3** ప్రళయ గడియ దగ్గరకు వచ్చేసింది. చంద్రుడు చీలి పోయాడు.[1] కాని వారి పరిస్థితి ఎలా ఉందంటే, వారు ఏ సూచనను చూచినా తమ ముఖాలను తిప్పుకుంటున్నారు. ఇది నడుస్తున్న మంత్రజాలమే అని అంటున్నారు. వారు (దీనిని కూడా) తిరస్కరించారు, తమ మనోవాంఛలను అనుసరించారు. ప్రతి వ్యవహారం చివరకు ఒక పర్యవసానానికి చేరవలసి ఉంటుంది.

**4 – 8** వారి ముందుకు (పూర్వపు జాతుల) స్థితిగతులు వచ్చాయి; తలబిరుసుతనం నుండి వారిని దూరంగా ఉంచటానికి వాటిలో కావలసినంత గుణపాఠం ఉంది; హితబోధ లక్ష్యం చాలవరకు నెరవేరటానికి కావలసిన వివేకమూ ఉంది. కాని హెచ్చరికలు వారి మీద పనిచేయటం లేదు. కనుక ప్రవక్తా! వారినుండి ముఖం త్రిప్పుకో. పిలిచేవాడు దుర్భరమైన, భయంకరమైన ఒక విషయం వైపునకు పిలిచే రోజున, ప్రజలు బిక్కచచ్చిన చూపులతో తమ సమాధుల నుండి, చెల్లా చెదరైపోయిన మిడుతల మాదిరిగా బయల్పడతారు; పిలిచే వాని వైపునకు పరుగెత్తుతూ ఉంటారు. (ఈ విషయాన్ని ప్రపంచంలో నిరాకరిస్తూ ఉండిన) తిరస్కారులే అప్పుడు, "ఈ రోజుమటుకు చాల కఠినమైన రోజు" అని అంటారు.

1. అంటే, ప్రళయం దగ్గరలోనే ఉన్నదనీ, అది ఏ క్షణంలోనైనా సంభవించవచ్చుననీ చెప్పటానికి చంద్రుడు ముక్కలైపోవటమే ఒక సంకేతం. ఈ వాక్యమూ దీని తరువాత వచ్చే విషయమూ రెండూ అప్పుడు చంద్రుడు నిజంగానే ముక్కలైపోయాడనే విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. ఈ సంఘటనను కళ్లారా చూచినవారు ఇలా అన్నారు : పధ్నాల్గవ రాత్రి ఉదయించిన కొద్దిసేపటికే చంద్రుడు అకస్మాత్తుగా ముక్కలైపోయాడు; దాని రెండు ముక్కలు ఎదురుగానున్న కొండకు ఇరువైపులా కనిపించాయి; మరుక్షణంలో ఆ రెండు ముక్కలు ఒకటైపోయాయి. మహాప్రవక్త (సఅసమ్) సైగవల్ల ఈ విశేషం జరిగిందనీ, మక్కా అవిశ్వాసులు మహిమలు చూపమని కోరినప్పుడు, ఈ మహిమ చూపబడిందనీ, కొందరు ధర్మబోధకులు చెప్పే విషయంలో యథార్థం లేదని మహాప్రవక్త (సఅసమ్) సూక్తుల ద్వారా తెలుస్తోంది.

**9 - 17** వారికి పూర్వం నూహ్ జాతి వారు తిరస్కరించారు. వారు మా భక్తుణ్ణి అసత్యవాదిగా నిర్ణయించి, ఇతడు పిచ్చివాడు అని అన్నారు. అతను దారుణంగా కసిరికొట్టబడ్డాడు. చివరకు అతను తన ప్రభువును ఇలా వేడుకున్నాడు, "నేను ఓడి పోయాను. ఇక నీవే వారికి ప్రతీకారం చేయి." అప్పుడు మేము కుంభవృష్టి కురిసేలా ఆకాశద్వారాలు తెరిచాము. భూమిని చీల్చి చెలమలుగా మార్చివేశాము. విధి నిర్ణయించిన పనిని పూర్తి చేయటానికి ఈ నీరంతా ఏకమైపోయింది. మేము నూహ్‌ను పలకలు, మేకులు గల[2] దానిపైకి ఎక్కించాము. అది మా పర్యవేక్షణలో నడుస్తూ ఉండేది. ఇది విలువ ఇవ్వ బడని వ్యక్తి కోసం చేయబడిన ప్రతీకారం. ఆ నావను మేము ఒక సూచనగా చేసి వదలిపెట్టాము. మరి హితబోధను స్వీకరిం చేవాడు ఎవడైనా ఉన్నాడా? చూడండి, నా శిక్ష ఎలా ఉండి నదో, నా హెచ్చరికలు ఎలా ఉండినవో. మేము ఈ ఖురాన్‌ను హితబోధ కొరకు సులభమైన మార్గంగా చేశాము.[3] అయితే హితబోధను స్వీకరించేవాడు ఎవడైనా ఉన్నాడా?

**18 - 22** ఆద్ జాతి ప్రజలు తిరస్కరించారు. అప్పుడు నా శిక్ష ఎలా ఉండినదో, నా హెచ్చరికలు ఎలా ఉండినవో చూడండి. పూర్తిగా అరిష్టదాయకమైన ఒక దుర్దినాన మేము ప్రచండమైన ఒక తుఫాను గాలిని వారిపైకి పంపాము. అది ప్రజలను వ్రేళ్లు తెగిపోయిన ఖర్జూరపు బోదెల మాదిరిగా ఎత్తి ఎత్తి విసిరిపడవేస్తుండేది. కనుక చూడండి, ఎటువంటిదో నా శిక్ష, ఎటువంటివో నా హెచ్చరికలు. మేము ఈ ఖురాన్‌ను హితబోధకై సులభమైన మార్గంగా చేశాము. కాబట్టి హిత బోధను స్వీకరించేవాడెవడైనా ఉన్నాడా?

كَذَّبَتْ قَبْلَهُمْ قَوْمُ نُوحٍ فَكَذَّبُوا عَبْدَنَا وَ
قَالُوا مَجْنُونٌ وَّازْدُجِرَ ۝٩ فَدَعَا رَبَّهٗٓ اَنِّيْ
مَغْلُوبٌ فَانْتَصِرْ ۝١٠ فَفَتَحْنَآ اَبْوَابَ السَّمَآءِ
بِمَآءٍ مُّنْهَمِرٍ ۝١١ وَّ فَجَّرْنَا الْاَرْضَ عُيُوْنًا
فَالْتَقَى الْمَآءُ عَلٰٓى اَمْرٍ قَدْ قُدِرَ ۝١٢ وَحَمَلْنٰهُ
عَلٰى ذَاتِ اَلْوَاحٍ وَّدُسُرٍ ۝١٣ تَجْرِيْ بِاَعْيُنِنَا
جَزَآءً لِّمَنْ كَانَ كُفِرَ ۝١٤ وَ لَقَدْ تَّرَكْنٰهَآ اٰيَةً
فَهَلْ مِنْ مُّدَّكِرٍ ۝١٥ فَكَيْفَ كَانَ عَذَابِيْ
وَنُذُرِ ۝١٦ وَ لَقَدْ يَسَّرْنَا الْقُرْاٰنَ لِلذِّكْرِ فَهَلْ
مِنْ مُّدَّكِرٍ ۝١٧ كَذَّبَتْ عَادٌ فَكَيْفَ كَانَ عَذَابِيْ
وَ نُذُرِ ۝١٨ اِنَّآ اَرْسَلْنَا عَلَيْهِمْ رِيْحًا صَرْصَرًا
فِيْ يَوْمِ نَحْسٍ مُّسْتَمِرٍّ ۝١٩ تَنْزِعُ النَّاسَ
كَاَنَّهُمْ اَعْجَازُ نَخْلٍ مُّنْقَعِرٍ ۝٢٠ فَكَيْفَ كَانَ
عَذَابِيْ وَنُذُرِ ۝٢١ وَ لَقَدْ يَسَّرْنَا الْقُرْاٰنَ لِلذِّكْرِ
فَهَلْ مِنْ مُّدَّكِرٍ ۝٢٢ ع ٢٢ ٨

2. తుఫాను రాకకు పూర్వమే అల్లాహ్ ఆదేశానుసారం, ప్రవక్త హజ్రత్ నూహ్ (అస్సలామ్) తయారు చేసుకున్న ఓడ అని అర్థం.

3. అర్థం ఏమిటంటే, తిరుగుబాటు జాతులపై అవతరించిన భయంకరమైన శిక్షలు హితబోధ చేయటానికి ఒక సాధనం. రెండో సాధనం ఈ ఖురాను. అది ప్రమాణాల ద్వారా హెచ్చరికల ద్వారా మీకు రుజుమార్గం చూపుతోంది. మొదటి సాధనం కంటే, రెండో సాధనం చాలా సులభతరమైనది. అలాంటప్పుడు మీరు దీని ద్వారా ఎందుకు లాభపడరు, శిక్షనే చూడాలని పదే పదే ఎందుకు కోరతారు?

كَذَّبَتْ ثَمُوْدُ بِالنُّذُرِ ﴿٢٣﴾ فَقَالُوْٓا اَبَشَرًا مِّنَّا
وَاحِدًا نَّتَّبِعُهٗٓ ۙ اِنَّآ اِذًا لَّفِيْ ضَلٰلٍ وَّ سُعُرٍ ﴿٢٤﴾
ءَاُلْقِيَ الذِّكْرُ عَلَيْهِ مِنْۢ بَيْنِنَا بَلْ هُوَ كَذَّابٌ
اَشِرٌ ﴿٢٥﴾ سَيَعْلَمُوْنَ غَدًا مَّنِ الْكَذَّابُ
الْاَشِرُ ﴿٢٦﴾ اِنَّا مُرْسِلُوا النَّاقَةِ فِتْنَةً لَّهُمْ
فَارْتَقِبْهُمْ وَاصْطَبِرْ ﴿٢٧﴾ وَ نَبِّئْهُمْ اَنَّ الْمَآءَ
قِسْمَةٌۢ بَيْنَهُمْ ۚ كُلُّ شِرْبٍ مُّحْتَضَرٌ ﴿٢٨﴾ فَنَادَوْا
صَاحِبَهُمْ فَتَعَاطٰى فَعَقَرَ ﴿٢٩﴾ فَكَيْفَ كَانَ عَذَابِيْ
وَ نُذُرِ ﴿٣٠﴾ اِنَّآ اَرْسَلْنَا عَلَيْهِمْ صَيْحَةً
وَّاحِدَةً فَكَانُوْا كَهَشِيْمِ الْمُحْتَظِرِ ﴿٣١﴾ وَ لَقَدْ
يَسَّرْنَا الْقُرْاٰنَ لِلذِّكْرِ فَهَلْ مِنْ مُّدَّكِرٍ ﴿٣٢﴾

**23 - 32** సమూద్ జాతి వారు హెచ్చరికలను తిరస్కరించి ఇలా అన్నారు, "అతను ఒక్కడు, అందులోనూ మనలోనివాడు. మనం అలాంటి వ్యక్తి వెనుక నడవాలా? మనం గనక అతని యెడల విధేయతను ఒప్పుకుంటే, దాని అర్థం, మనం మార్గం తప్పిపోయామన్నమాట, మన మతిపోయిందన్న మాట. మన మధ్య కేవలం అతను ఒక్కడిపైనేనా దేవుని ప్రస్తావన అవతరింపజేయబడింది? కాదు, కాని ఇతడు పెద్ద అబద్ధాలరాయుడు, డంబాలు పలికేవాడు. (మేము మా ప్రవక్తతో ఇలా అన్నాము), "అబద్ధాలరాయుడు, డంబాలు పలికేవాడు ఎవడో రేపే వారికి తెలిసిపోతుంది. మేము ఆడ ఒంటెను వారి కొరకు ఒక పరీక్షగా చేసి పంపుతున్నాము. ఇక కొంచెం ఓపికతో చూడు, వారి గతి ఏమవుతుందో. వారికీ, ఒంటెకూ మధ్య నీరు పంచబడాలనీ, ప్రతి ఒక్కరూ తమ వంతు రోజున నీటి వద్దకు[4] రావాలనీ వారికి తెలుపు." చివరకు వారు తమ మనిషిని పిలిచి చెప్పారు. అతడు ఈ కార్యభారాన్ని తన నెత్తిపై వేసుకుని ఆడ ఒంటెను చంపేశాడు. చూడండి, ఆపైన నా శిక్ష ఎలా ఉండినదో, నా హెచ్చరికలు ఎలా ఉండినవో. మేము వారిపైకి ఒకే ఒక ప్రేలుడును వదిలాము. అప్పుడు వారు త్రొక్కబడిన పశువుల దొడ్డి కంచె మాదిరిగా నుగ్గునుగ్గు అయిపోయారు.[5] మేము ఈ ఖురాన్‌ను హితబోధకై సులభమైనమార్గంగా చేశాము. ఇక హితబోధను స్వీకరించేవాడెవడైనా ఉన్నాడా?

4. "మేము ఆడ ఒంటెను వారికి ఒక పరీక్షగా చేసి పంపుతున్నాము" అనే ఆయతుకు ఇది వివరణ. ఆ పరీక్ష ఏమిటంటే, అకస్మాత్తుగా ఒక ఆడ ఒంటెను తెచ్చి వారి ముందు నిలబెట్టడం జరిగింది. వారితో ఇలా అనడం జరిగింది : ఒకరోజు ఇదొక్కటే నీళ్లు తాగుతుంది, రెండో రోజు మీరందరూ మీ కోసం, మీ పశువుల కోసం నీళ్లు తీసుకుంటారు. దాని వంతు వచ్చిన రోజున మీలో ఎవరూ ఏ చెలమవద్దకూ, ఏ బావివద్దకూ స్వయంగానూ నీళ్లకోసం వెళ్లకూడదు, మీ పశువులనూ నీళ్లు తాగించటం కోసం తీసుకుపోకూడదు. సైన్యాలుగానీ, సహాయపడే సమూహాలు గానీ లేనివాడు అని వారు చెప్పే వ్యక్తియే ఈ సవాలు విసిరాడు.

5. పశుసంపద కలిగినవారు తమ పశువులను కాపాడుకోవటానికి కర్రలతోనూ, అడవి కంపతోనూ కంచెను ఏర్పాటు చేస్తారు. ఈ కంచెకు ఉపయోగించిన కంప క్రమక్రమంగా ఎండి రాలిపోతుంది. పశువుల రాకపోకల వలన కంప తొక్కబడి తునాతునకలై పోతుంది. సమూద్ జాతి జనుల కుళ్లిపోయిన మృతకళేబరాలను ఈ తునాతునకలతోనే పోల్చటం జరిగింది.

كَذَّبَتْ قَوْمُ لُوْطٍۭ بِالنُّذُرِ ﴿٣٣﴾ اِنَّآ اَرْسَلْنَا
عَلَيْهِمْ حَاصِبًا اِلَّآ اٰلَ لُوْطٍ ؕ نَجَّيْنٰهُمْ
بِسَحَرٍ ﴿٣٤﴾ نِّعْمَةً مِّنْ عِنْدِنَا ؕ كَذٰلِكَ نَجْزِيْ
مَنْ شَكَرَ ﴿٣٥﴾ وَ لَقَدْ اَنْذَرَهُمْ بَطْشَتَنَا
فَتَمَارَوْا بِالنُّذُرِ ﴿٣٦﴾ وَ لَقَدْ رَاوَدُوْهُ عَنْ
ضَيْفِهٖ فَطَمَسْنَآ اَعْيُنَهُمْ فَذُوْقُوْا عَذَابِيْ وَ
نُذُرِ ﴿٣٧﴾ وَ لَقَدْ صَبَّحَهُمْ بُكْرَةً عَذَابٌ
مُّسْتَقِرٌّ ﴿٣٨﴾ فَذُوْقُوْا عَذَابِيْ وَ نُذُرِ ﴿٣٩﴾ وَ لَقَدْ
يَسَّرْنَا الْقُرْاٰنَ لِلذِّكْرِ فَهَلْ مِنْ مُّدَّكِرٍ ﴿٤٠﴾ وَ
لَقَدْ جَآءَ اٰلَ فِرْعَوْنَ النُّذُرُ ﴿٤١﴾ كَذَّبُوْا
بِاٰيٰتِنَا كُلِّهَا فَاَخَذْنٰهُمْ اَخْذَ عَزِيْزٍ مُّقْتَدِرٍ ﴿٤٢﴾
اَكُفَّارُكُمْ خَيْرٌ مِّنْ اُولٰٓئِكُمْ اَمْ لَكُمْ بَرَآءَةٌ فِي
الزُّبُرِ ﴿٤٣﴾ اَمْ يَقُوْلُوْنَ نَحْنُ جَمِيْعٌ مُّنْتَصِرٌ ﴿٤٤﴾
سَيُهْزَمُ الْجَمْعُ وَ يُوَلُّوْنَ الدُّبُرَ ﴿٤٥﴾ بَلِ
السَّاعَةُ مَوْعِدُهُمْ وَالسَّاعَةُ اَدْهٰى وَ
اَمَرُّ ﴿٤٦﴾ اِنَّ الْمُجْرِمِيْنَ فِيْ ضَلٰلٍ وَّ سُعُرٍ ﴿٤٧﴾
يَوْمَ يُسْحَبُوْنَ فِي النَّارِ عَلٰى وُجُوْهِهِمْ ؕ ذُوْقُوْا
مَسَّ سَقَرَ ﴿٤٨﴾ اِنَّا كُلَّ شَيْءٍ خَلَقْنٰهُ بِقَدَرٍ ﴿٤٩﴾
وَ مَآ اَمْرُنَآ اِلَّا وَاحِدَةٌ كَلَمْحٍۭ بِالْبَصَرِ ﴿٥٠﴾

ع ٢/١٨

وقف لازم

**33 - 40** లూత్ జాతి హెచ్చరికలను తిరస్కరించింది. మేము దానిపైకి రాళ్లు విసరివేసే గాలిని పంపాము, కేవలం లూత్ ఇంటివారు మాత్రమే దానినుండి సురక్షితంగా ఉన్నారు. మేము వారిని మా అనుగ్రహంతో రాత్రివేళ వేకువ జామున రక్షించాము. కృతజ్ఞతలు తెలిపే ప్రతి మనిషికీ మేము ఇలా ప్రతిఫలం ఇస్తాము. లూత్ తన జాతి ప్రజలను మా పట్టును గురించి హెచ్చరించాడు. కాని వారు హెచ్చరికలనన్నింటినీ సందేహాస్పదమైనవిగా భావించి మాటలతో ఎగరగొట్టేశారు. తరువాత అతనిని వారు తన అతిథులను రక్షించుకోకుండా దూరంగా ఉంచటానికి ప్రయత్నించారు. చివరకు మేము వారి కళ్లుపోగొట్టాము. (వారితో ఇలా అన్నాము), “ఇక నా శిక్షను, నా హెచ్చరికలను రుచి చూడండి. ఉదయం పెందలకడనే ఒక తిరుగులేని శిక్ష వారిని పట్టుకుంది. ఇప్పుడు నా శిక్షను, నా హెచ్చరికలను రుచి చూడండి.” మేము ఈ ఖురాన్‌ను హితబోధకై సులభమైన మార్గంగా చేశాము. కనుక హితబోధను స్వీకరించే వాడెవడైనా ఉన్నాడా?

**41 - 42** ఫిరౌన్ ప్రజలవద్దకు కూడా హెచ్చరికలు వచ్చాయి. కాని వారు మా సూచనలు అన్నింటినీ తిరస్కరించారు. చివరకు మేము వారిని పట్టుకున్నాము, మహత్తర శక్తి సంపన్నుడు పట్టుకునే విధంగా.

**43 - 48** మీ అవిశ్వాసులు వారికంటే ఏమైనా శ్రేష్ఠులా?[6] లేక ఆకాశ గ్రంథాలలో మీ కొరకేదైనా మినహాయింపు వ్రాయబడి ఉన్నదా? లేకపోతే వారు, “మాది ఒక శక్తిమంతమైన వర్గం, మమ్మల్ని మేము రక్షించుకోగలం” అని అంటారా? త్వరలోనే ఈ వర్గం పరాజయం పాలవుతుంది, వారంతా వెన్ను చూపి పారిపోతూ కనిపిస్తారు. కాని వారి పీచం అణచటానికి అసలు వాగ్దానం చేయబడిన సమయం ప్రళయమే. అది ఎంతో విపత్కరమైన, అత్యంత జుగుప్సాకరమైన సమయం. అసలు నేరస్తులు అపార్థానికి గురి అయ్యారు, వారికి మతిపోయింది. వారు బోర్లా పడవేయబడి, అగ్నిలోకి ఈడ్చబడే రోజున వారితో, “ఇప్పుడు చవి చూడండి నరకం తాకిడిని” అని చెప్పబడుతుంది.

**49 - 53** మేము ప్రతి వస్తువునూ ఒక విధి నిర్ణయంతో పాటు సృష్టించాము.[7] మా ఆజ్ఞ కేవలం ఒకే ఆజ్ఞ అవుతుంది; రెప్పపాటులోనే అది అమలులోకి వస్తుంది.

وَلَقَدْ اَهْلَكْنَآ اَشْيَاعَكُمْ فَهَلْ مِنْ مُّدَّكِرٍ ﴿٥١﴾
وَكُلُّ شَيْءٍ فَعَلُوْهُ فِي الزُّبُرِ ﴿٥٢﴾ وَكُلُّ صَغِيْرٍ وَّ
كَبِيْرٍ مُّسْتَطَرٌ ﴿٥٣﴾ اِنَّ الْمُتَّقِيْنَ فِيْ جَنّٰتٍ وَّ
ع ٣ ١٥ ١٠ نَهَرٍ ﴿٥٤﴾ فِيْ مَقْعَدِ صِدْقٍ عِنْدَ مَلِيْكٍ مُّقْتَدِرٍ ﴿٥٥﴾

మీవంటి చాలా మందిని మేము నాశనం చేశాము. మరి హిత బోధను స్వీకరించే వాడెవడైనా ఉన్నాడా? వారు చేసిన దంతా గ్రంథాలలో నమోదు చేయబడి ఉంది. ప్రతి విషయం చిన్నదీ, పెద్దదీ వ్రాయబడి ఉంది.

**54 - 55** అవిధేయతకు దూరంగా ఉండేవారు, నిశ్చయంగా తోటలలో, కాలువలలో ఉంటారు, నిజమైన గౌరవ స్థానం, మహత్తరమైన అధికారాలు కల చక్రవర్తికి సమీపంలో.

6. ఇక్కడ ఖురైష ప్రజలు సంబోధించబడ్డారు. అర్థం ఏమిటంటే, అవిశ్వాసం, మంకుతనం, సత్యతిరస్కారం గల వైఖరిని అవలంబించిన జాతులను శిక్షకు గురిచేసినప్పుడు అదే వైఖరిని మీరు అవలంబిస్తే, మిమ్మల్ని ఎందుకు శిక్షించకూడదు? మీలో ఉన్న ప్రత్యేకత ఏమిటి?

7. ప్రపంచంలోని ఏ వస్తువూ అనాలోచితంగా, ఆకస్మికంగా సృష్టించబడలేదు. ప్రతి వస్తువుకూ ఒక జాతకం ఉంటుంది. దాని ప్రకారం అది ఒక ప్రత్యేక సమయంలో ఆవిర్భవిస్తుంది, ఒక ప్రత్యేక రూపాన్ని సంతరించు కుంటుంది, ఒక ప్రత్యేక పరిమితికి లోబడి పెరుగుతుంది, ఒక ప్రత్యేక గడువు వరకు జీవిస్తుంది, ఒక ప్రత్యేక సమయంలో నశిస్తుంది.

ఆయతులు 78 | **55. అర్ రహ్మాన్** | అవతరణ మదీనాలో

٥٥ سُوْرَةُ الرَّحْمٰنِ مَدَنِيَّةٌ ٩٧

اٰياتها ٧٨ | ركوعاتها ٣

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

اَلرَّحْمٰنُ ① عَلَّمَ الْقُرْاٰنَ ② خَلَقَ الْاِنْسَانَ ③
عَلَّمَهُ الْبَيَانَ ④ اَلشَّمْسُ وَ الْقَمَرُ
بِحُسْبَانٍ ⑤ وَّالنَّجْمُ وَالشَّجَرُ يَسْجُدٰنِ ⑥
وَالسَّمَآءَ رَفَعَهَا وَوَضَعَ الْمِيْزَانَ ⑦ اَلَّا
تَطْغَوْا فِي الْمِيْزَانِ ⑧ وَاَقِيْمُوا الْوَزْنَ
بِالْقِسْطِ وَلَا تُخْسِرُوا الْمِيْزَانَ ⑨ وَالْاَرْضَ
وَضَعَهَا لِلْاَنَامِ ⑩ فِيْهَا فَاكِهَةٌ وَّالنَّخْلُ
ذَاتُ الْاَكْمَامِ ⑪ وَالْحَبُّ ذُو الْعَصْفِ وَ
الرَّيْحَانُ ⑫ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ⑬

**1 – 4** పరమ కృపాశీలుడు (అయిన దేవుడు) ఈ ఖురాన్ బోధించాడు. ఆయనే మానవుణ్ణి సృష్టించి, అతనికి మాట్లాడటం నేర్పాడు.

**5 – 9** సూర్యుడూ, చంద్రుడూ ఒక నియమావళికి కట్టుబడి ఉన్నారు. నక్షత్రాలూ, వృక్షాలూ అన్నీ సాష్టాంగపడుతూ ఉన్నాయి.[1] ఆయన ఆకాశాన్ని పైకిలేపాడు, త్రాసును నెలకొలిపాడు.[2] కనుక మీరు సమతూకాన్ని భంగపరచకండి; న్యాయంగా, కచ్చితంగా తూచండి, తూకంలో తక్కువ చేయకండి.[3]

**10 – 13** ఆయన భూమిని సకల సృష్టిరాసులకై సృజించాడు. అందులో అన్నిరకాల రుచికరమైన పండ్లు పుష్కలంగా ఉన్నాయి, ఖర్జూరపు వృక్షాలు ఉన్నాయి; వాటి పండ్లు పొరలలో చుట్టబడి ఉన్నాయి. రకరకాల ధాన్యాలు ఉన్నాయి. వాటిలో పొట్టుకూడ ఉంటుంది, గింజలూ ఉంటాయి. కనుక జిన్నాతులారా! మానవులారా! మీరు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను తిరస్కరించగలరు?[4]

1. అంటే, అవి అల్లాహ్ ఆజ్ఞకు లోబడి ఉన్నాయి, ఆయన పట్ల అవి రవ్వంత అవిధేయతను కూడ చూపవు.
2. ఇంచుమించు దివ్య ఖురాను వ్యాఖ్యాతలందరూ ఇక్కడ మీజాన్ (తరాజు) అంటే న్యాయం అనే అర్థాన్ని నిర్ణయించారు, త్రాసును నెలకొల్పుట అంటే, ఈ చరాచర జగత్తు యొక్క వ్యవస్థను ఆయన న్యాయం ఆధారంగా సృష్టించాడు అని వ్యాఖ్యానించారు.
3. అంటే, న్యాయం ఆధారంగా ఏర్పడిన వ్యవస్థ గల ఈ సమతూకపు సృష్టిలో మీరు ఉంటున్నారు కనుక, మీరు కూడ న్యాయానికి కట్టుబడి ఉండాలి. ఏ పరిధిలో మీకు అధికారాలు ఇవ్వబడ్డాయో, ఆ పరిధిలో ఒకవేళ మీరు అన్యాయంగా ప్రవర్తిస్తే అప్పుడు ప్రకృతి స్వభావానికి మీరు ఎదురు తిరిగినట్లే.
4. అసలు "ఆలా" అనే పదం ఉపయోగించబడింది. రాబోయే ఆయతులలో ఈ పదం పదే పదే వాడబడింది. మేము దాని అర్థాన్ని భిన్న సందర్భాలలో భిన్న పదాలలో సూచించాము. దానికి వరాలు, మహిమలు, గుణ విశేషాలు అనే అర్థాలు ఉన్నాయి. ప్రతిచోట సందర్భంలోని ఔచిత్యాన్నిబట్టి దాని అర్థ నిర్ణయం జరిగింది.

خَلَقَ الْاِنْسَانَ مِنْ صَلْصَالٍ كَالْفَخَّارِ ﴿١٤﴾ وَ
خَلَقَ الْجَآنَّ مِنْ مَّارِجٍ مِّنْ نَّارٍ ﴿١٥﴾ فَبِاَيِّ
اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿١٦﴾ رَبُّ الْمَشْرِقَيْنِ
وَرَبُّ الْمَغْرِبَيْنِ ﴿١٧﴾ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا
تُكَذِّبٰنِ ﴿١٨﴾ مَرَجَ الْبَحْرَيْنِ يَلْتَقِيٰنِ ﴿١٩﴾
بَيْنَهُمَا بَرْزَخٌ لَّا يَبْغِيٰنِ ﴿٢٠﴾ فَبِاَيِّ اٰلَآءِ
رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿٢١﴾ يَخْرُجُ مِنْهُمَا اللُّؤْلُؤُ
وَالْمَرْجَانُ ﴿٢٢﴾ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿٢٣﴾
وَلَهُ الْجَوَارِ الْمُنْشَئٰتُ فِي الْبَحْرِ كَالْاَعْلَامِ ﴿٢٤﴾
فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿٢٥﴾ كُلُّ مَنْ عَلَيْهَا ع ٢٥ النصف
فَانٍ ﴿٢٦﴾ وَّ يَبْقٰى وَجْهُ رَبِّكَ ذُو الْجَلٰلِ
وَالْاِكْرَامِ ﴿٢٧﴾ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿٢٨﴾
يَسْـَٔلُهٗ مَنْ فِي السَّمٰوٰتِ وَ الْاَرْضِ ؕ كُلَّ
يَوْمٍ هُوَ فِيْ شَاْنٍ ﴿٢٩﴾ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا
تُكَذِّبٰنِ ﴿٣٠﴾

**14 - 16** ఆయన మానవుణ్ణి పెంకువంటి ఎండిన మురుగుడు మట్టితో సృష్టించాడు; జిన్నాతులను అగ్ని జ్వాలలతో పుట్టించాడు. కనుక జిన్నాతులారా! మానవులారా! మీరు మీ ప్రభువు శక్తిసామర్థ్యాల ఏయే విచిత్రకార్యాలను తిరస్కరిస్తారు?

**17 - 18** రెండు తూర్పు (దిక్కు)లకూ, రెండు పడమర (దిక్కు)లకూ, అన్నింటికీ యజమాని, ప్రభువు[5] ఆయనే. కనుక జిన్నాతులారా! మానవులారా! మీరు మీ ప్రభువు యొక్క ఏయే ప్రతిభా విశేషాలను తిరస్కరిస్తారు?

**19 - 23** రెండు సముద్రాలు ఒకదానితో ఒకటి కలిసిపోయేటందుకు ఆయన వాటిని వదలిపెట్టాడు. అయినా వాటిమధ్య ఒక తెర అడ్డంగా ఉన్నది. అవి దానిని అతిక్రమించవు. కనుక జిన్నాతులారా! మానవులారా! మీరు మీ ప్రభువు శక్తియుక్తుల ఏయే మహిమలను తిరస్కరిస్తారు? ఈ సముద్రాలలో ముత్యాలూ, పగడాలూ లభిస్తాయి. కనుక జిన్నాతులారా! మానవులారా! మీరు మీ ప్రభువు ప్రజ్ఞాపాటవాల ఏయే ఘనకార్యాలను తిరస్కరిస్తారు?

**24 - 25** సముద్రంలో కొండలవలె నిలబడి ఉన్న ఎత్తైన ఈ ఓడలు ఆయనవే. కాబట్టి జిన్నాతులారా! మానవులారా! మీరు మీ ప్రభువు యొక్క ఏయే ఉపకారాలను తిరస్కరించగలరు?

**26 - 30** ఈ పుడమిపై ఉన్న ప్రతి వస్తువూ నాశనమైపోయేదే. కేవలం మహోన్నతుడూ, మహోపకారీ అయిన నీ ప్రభువు మాత్రమే మిగిలి ఉండే వాడు. కనుక జిన్నాతులారా! మానవులారా! మీరు మీ ప్రభువు ప్రజ్ఞాపాటవాల ఏయే ఘనకార్యాలను తిరస్కరిస్తారు? భూమి మీదా, ఆకాశాలలోనూ ఉన్న సమస్తమూ తమ అవసరాలు తీరే నిమిత్తం ఆయననే అర్థిస్తున్నాయి. ప్రతి క్షణం ఆయన ఒక వినూత్న వైభవంతో[6] వెలుగుతూ ఉంటాడు. కాబట్టి జిన్నాతులారా! మానవులారా! మీరు మీ ప్రభువు యొక్క ఏయే ప్రశంసనీయ లక్షణాలను తిరస్కరిస్తారు?

سَنَفْرُغُ لَكُمْ اَيُّهَ الثَّقَلٰنِ ﴿۳۱﴾ فَبِاَيِّ اٰلَآءِ
رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿۳۲﴾ يٰمَعْشَرَ الْجِنِّ وَ الْاِنْسِ
اِنِ اسْتَطَعْتُمْ اَنْ تَنْفُذُوْا مِنْ اَقْطَارِ
السَّمٰوٰتِ وَ الْاَرْضِ فَانْفُذُوْا ؕ لَا تَنْفُذُوْنَ
اِلَّا بِسُلْطٰنٍ ﴿۳۳﴾ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿۳۴﴾
يُرْسَلُ عَلَيْكُمَا شُوَاظٌ مِّنْ نَّارٍ ۙ وَّ نُحَاسٌ فَلَا
تَنْتَصِرٰنِ ﴿۳۵﴾ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿۳۶﴾
فَاِذَا انْشَقَّتِ السَّمَآءُ فَكَانَتْ وَرْدَةً
كَالدِّهَانِ ﴿۳۷﴾ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿۳۸﴾
فَيَوْمَئِذٍ لَّا يُسْـَٔلُ عَنْ ذَنْۢبِهٖۤ اِنْسٌ
وَّلَا جَآنٌّ ﴿۳۹﴾ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿۴۰﴾
يُعْرَفُ الْمُجْرِمُوْنَ بِسِيْمٰهُمْ فَيُؤْخَذُ
بِالنَّوَاصِيْ وَ الْاَقْدَامِ ﴿۴۱﴾ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا
تُكَذِّبٰنِ ﴿۴۲﴾ هٰذِهٖ جَهَنَّمُ الَّتِيْ يُكَذِّبُ بِهَا
الْمُجْرِمُوْنَ ﴿۴۳﴾ يَطُوْفُوْنَ بَيْنَهَا وَ بَيْنَ حَمِيْمٍ اٰنٍ ﴿۴۴﴾
فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿۴۵﴾

**31 - 36** భూమికి భారమైన వారలారా![7] అతి త్వరలోనే మేము తీరిక చేసుకుని మీ లెక్క తీసుకుంటాము[8] (అప్పుడు చూసుకుందాము) మీరు మీ ప్రభువు యొక్క ఏయే ఉపకారాలను నిరాకరిస్తారో. జిన్నాతుల, మానవుల వర్గీయులారా! మీరు గనక భూమ్యాకాశాల సరిహద్దుల నుండి బయట పడి పారిపోగలిగితే, పారిపోయి చూడండి. మీరు అలా పారిపోలేరు. దానికోసం ఎంతో శక్తి[9] కావలసి ఉంటుంది. మీ ప్రభువు యొక్క ఏయే శక్తి సామర్థ్యాలను నిరాకరిస్తారు? (మీరొకవేళ పారిపోవటానికి ప్రయత్నం చేసినట్లయితే) మీపైకి అగ్ని జ్వాలలను, పొగను వదలటం జరుగుతుంది. దానిని మీరు ఎదుర్కోలేరు. జిన్నాతులారా! మానవులారా! మీరు మీ ప్రభువు యొక్క ఏయే శక్తిసామర్థ్యాలను తిరస్కరించగలరు?

**37 - 38** తరువాత ఆకాశం బ్రద్దలై[10] ఎర్రని చర్మం మాదిరిగా ఎర్రబడిపోయినప్పుడు (మీ పరిస్థితి ఏమవుతుంది?) జిన్నాతులారా! మానవులారా! (అప్పుడు) మీరు మీ ప్రభువు యొక్క ఏయే శక్తి సామర్థ్యాలను తిరస్కరించగలరు?

**39 - 45** ఆ రోజున ఏ మానవుణ్ణీ, ఏ జిన్నాతునూ అతని పాపాలను గురించి అడిగే అవసరం ఉండదు; (తరువాత) అప్పుడు (చూసుకుందాము) మీ ఇరువర్గాల వారు మీ ప్రభువు యొక్క ఏయే ఉపకారాలను తిరస్కరిస్తారో, అక్కడ నేరస్తులు తమ ముఖాలనుబట్టే గుర్తించబడతారు. వారిని నుదుటి జుత్తు, కాళ్లూ పట్టుకొని ఈడ్చుకుపోవటం జరుగుతుంది. (అప్పుడు) మీరు మీ ప్రభువు యొక్క ఏయే శక్తి సామర్థ్యాలను తిరస్కరించగలరు? (అప్పుడు ఇలా అనటం జరుగుతుంది). నేరస్తులు అబద్ధమని కొట్టిపారేస్తూ ఉండే నరకమే ఇది. అదే నరకంలో, కాగుతున్న నీళ్ల మధ్య వారు అటూ ఇటూ తిరుగుతూ ఉంటారు. అలాంటప్పుడు మీరు మీ ప్రభువు యొక్క ఏయే శక్తి సామర్థ్యాలను తిరస్కరించగలుగుతారు?

5. రెండు తూర్పులు, రెండు పడమరలు అంటే, చలి కాలపు కురచ దినాలలో వేసవి కాలపు దీర్ఘ దినాలలో సూర్యోదయ సూర్యాస్తమయాలు సంభవించే రెండు ప్రదేశాలు అని అర్థం కావచ్చు; భూమిలోని రెండు అర్ధగోళాలలో కనిపించే తూర్పుపడమరలు.

6. అంటే, ఈ విశ్వంలో సృష్టి వ్యాపారాన్ని ఆయన ఎడతెగకుండా కొనసాగిస్తున్నాడు. ఇంకా ఆయన అనంతంగా, అసంఖ్యాకంగా వస్తువులను కొత్త కొత్త రూపాలతో, స్వభావాలతో సృష్టిస్తున్నాడు. ఆయన ప్రపంచం ఎన్నడూ

**46 - 59** తన ప్రభువు సన్నిధిలో హాజరుకావలసి ఉంటుందనే భయం[11] కలిగి ఉండే ప్రతి వ్యక్తికీ రెండు తోటలు లభిస్తాయి. కనుక మీ ప్రభువు యొక్క ఏయే బహుమానాలను మీరు నిరాకరిస్తారు? పచ్చగా, కనుల పండువుగా ఉండే కొమ్మలతో, రెమ్మలతో నిండి ఉంటాయి; మీ ప్రభువు యొక్క ఏయే బహుమానాలను మీరు నిరాకరించగలరు? రెండు తోటలలోనూ రెండు సెలయేర్లు ప్రవహిస్తూ ఉంటాయి. మరి మీ ప్రభువు యొక్క ఏయే బహుమానాలను మీరు నిరాకరించగలరు? రెండు తోటలలోనూ ప్రతిపండూ రెండు విధాలుగా[12] ఉంటుంది. మీ ప్రభువు యొక్క ఏఏ బహుమానాలను మీరు తిరస్కరించ గలరు? స్వర్గవాసులు దళసరి పట్టు వస్త్రపు అంచుగల తివాచీలపై దిండ్లకు ఆనుకుని ఆసీనులై ఉంటారు. ఆ తోటల లోని చెట్ల కొమ్మలు పండ్లతో వంగిపోయి ఉంటాయి. మీ ప్రభువు యొక్క ఏయే బహుమానాలను మీరు తిరస్కరించ గలరు? ఈ మహాభాగ్యాల మధ్య సిగ్గులొలికే చూపులు గల సుకన్యలు[13] ఉంటారు. ఈ స్వర్గవాసులకు పూర్వం వారిని ఏ మానవుడుగానీ, ఏ జిన్నాతుగానీ తాకి[14] ఉండలేదు. కనుక మీ ప్రభువు యొక్క ఏయే బహుమానాలను మీరు నిరాకరించగలరు? వారు కెంపుల, ముత్యాల మాదిరిగా ఎంతో అందంగా ఉంటారు. మీ ప్రభువు యొక్క ఏయే బహుమానా లను మీరు తిరస్కరించగలరు?

وَلِمَنْ خَافَ مَقَامَ رَبِّهٖ جَنَّتٰنِ ﴿٤٦﴾ فَبِاَيِّ
اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿٤٧﴾ ذَوَاتَآ اَفْنَانٍ ﴿٤٨﴾
فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿٤٩﴾ فِيْهِمَا عَيْنٰنِ
تَجْرِيٰنِ ﴿٥٠﴾ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿٥١﴾
فِيْهِمَا مِنْ كُلِّ فَاكِهَةٍ زَوْجٰنِ ﴿٥٢﴾ فَبِاَيِّ اٰلَآءِ
رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿٥٣﴾ مُتَّكِـِٕيْنَ عَلٰى فُرُشٍۢ بَطَآئِنُهَا
مِنْ اِسْتَبْرَقٍ ؕ وَ جَنَا الْجَنَّتَيْنِ دَانٍ ﴿٥٤﴾
فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿٥٥﴾ فِيْهِنَّ قٰصِرٰتُ
الطَّرْفِ ۙ لَمْ يَطْمِثْهُنَّ اِنْسٌ قَبْلَهُمْ وَلَا جَآنٌّ ﴿٥٦﴾
فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿٥٧﴾ كَاَنَّهُنَّ
الْيَاقُوْتُ وَ الْمَرْجَانُ ﴿٥٨﴾ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا
تُكَذِّبٰنِ ﴿٥٩﴾

ఒకే స్థితిలో ఉండదు. అనుక్షణం దాని స్థితిగతులు మారుతూ ఉంటాయి. దాని సృష్టికర్త ప్రతిసారీ దానికి ఒక కొత్త రూపాన్ని సంతరింపజేస్తూ ఉంటాడు, అది పూర్వపు రూపాలకంటె భిన్నంగా ఉంటుంది.

7. అసలు 'సఖలాన్' అనే పదం వాడబడింది. 'సఖల్' అని బండి మీద వేసిన బరువును అంటారు. "సఖలాన్" అనే పదానికి, "వేయబడిన రెండు బరువులు" అని భావం. ఇక్కడ ఈ పదం జిన్నాతులకూ, మానవులకూ వాడబడింది. ఎందుకంటే వారు ఇరువురూ భూమికి భారమే. తమ ప్రభువు పట్ల విధేయత చూపటానికీ, తమ ప్రభువు దాస్యం చేయటానికీ విముఖులైన జిన్నాతులనూ, మానవులనూ సంబోధించటం జరుగుతోంది కాబట్టి, వారిని "భూభారకులారా!" అని సంబోధించటం జరిగింది. సృష్టికర్త తన సృష్టిలోని అయోగ్యులైన ఈ ఇరువర్గాలతో ఇలా అంటున్నాడు, "నా భూమికి భారమైన ఓ ప్రజలారా! త్వరలోనే నేను మిమ్మల్ని శిక్షించటానికి పూనుకుంటాను."

8. ఈ సమయంలో అల్లాహ్ పలు కార్యాలలో నిమగ్నమై ఉన్నాడు, కనుక ఆయనకు అవిశ్వాసులను లెక్క అడిగే తీరికలేదు అని దీని అర్థం కాదు. దాని అర్థం ఏమిటంటే, అల్లాహ్ ఒక ప్రత్యేకమైన సమయపట్టికను (Time Table) నిర్ణయించి ఉంచాడు. దాని ప్రకారం మానవులను, జిన్నాతులను చివరి లెక్క అడిగే సమయం ఇంకా రాలేదు.

9. భూమి, ఆకాశాలు అంటే సృష్టి అని అర్థం. లేదా ఇంకో రీతిలో చెప్పాలంటే, దేవుని దైవత్వం అని అర్థం. ఆయతు అర్థం ఏమిటంటే, దేవుని పట్టు నుంచి తప్పించుకుని బయటపడటం మీ వశం కాదు. మిమ్మల్ని

هَلْ جَزَآءُ الْاِحْسَانِ اِلَّا الْاِحْسَانُ ﴿٦٠﴾ فَبِاَيِّ
اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿٦١﴾ وَ مِنْ دُوْنِهِمَا
جَنَّتٰنِ ﴿٦٢﴾ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿٦٣﴾
مُدْهَآمَّتٰنِ ﴿٦٤﴾ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا
تُكَذِّبٰنِ ﴿٦٥﴾ فِيْهِمَا عَيْنٰنِ نَضَّاخَتٰنِ ﴿٦٦﴾ فَبِاَيِّ
اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿٦٧﴾ فِيْهِمَا فَاكِهَةٌ وَّ
نَخْلٌ وَّ رُمَّانٌ ﴿٦٨﴾ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا
تُكَذِّبٰنِ ﴿٦٩﴾ فِيْهِنَّ خَيْرٰتٌ حِسَانٌ ﴿٧٠﴾ فَبِاَيِّ
اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿٧١﴾ حُوْرٌ مَّقْصُوْرٰتٌ فِي
الْخِيَامِ ﴿٧٢﴾ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿٧٣﴾ لَمْ
يَطْمِثْهُنَّ اِنْسٌ قَبْلَهُمْ وَ لَا جَآنٌّ ﴿٧٤﴾ فَبِاَيِّ اٰلَآءِ
رَبِّكُمَا تُكَذِّبٰنِ ﴿٧٥﴾ مُتَّكِـِٕيْنَ عَلٰى رَفْرَفٍ خُضْرٍ
وَّ عَبْقَرِيٍّ حِسَانٍ ﴿٧٦﴾ فَبِاَيِّ اٰلَآءِ رَبِّكُمَا
تُكَذِّبٰنِ ﴿٧٧﴾ تَبٰرَكَ اسْمُ رَبِّكَ ذِي الْجَلٰلِ
وَالْاِكْرَامِ ﴿٧٨﴾

**60 - 77** సత్కార్యానికి ప్రతిఫలం సత్కార్యం కాక మరేమవుతుంది? కనుక జిన్నాతులారా! మానవులారా! మీ ప్రభువు యొక్క ఏయే ప్రశంసనీయ లక్షణాలను మీరు తిరస్కరించగలరు? ఆ రెండు తోటలు కాక మరో రెండు[15] తోటలు కూడా ఉంటాయి. మీ ప్రభువు యొక్క ఏయే బహుమానాలను మీరు తిరస్కరించగలరు? అవి దట్టమైన ముదురు పచ్చని తోటలు. మీ ప్రభువు యొక్క ఏయే బహుమానాలను మీరు నిరాకరించగలరు? ఆ రెండు తోటలలోనూ రెండు చెలమలు పొంగి పొరలుతూ ఉంటాయి. మీ ప్రభువు యొక్క ఏయే బహుమానాలను మీరు తిరస్కరిస్తారు? వాటిలో పండ్లూ ఫలాలూ, ఖర్జూరాలూ, దానిమ్మ కాయలూ పుష్కలంగా ఉంటాయి. మీ ప్రభువు యొక్క ఏయే బహుమానాలను మీరు తిరస్కరించగలరు? ఈ మహాభాగ్యాల మధ్య శీలవతులూ, సౌందర్యవతులూ అయిన భార్యలు ఉంటారు. మీ ప్రభువు యొక్క ఏయే బహుమానాలను మీరు నిరాకరించగలరు? గుడారాలలో సురక్షితంగా ఉంచబడిన సుందరీమణులు[16] ఉంటారు. మీ ప్రభువు యొక్క ఏయే బహుమానాలను మీరు తిరస్కరించగలరు? ఈ స్వర్గవాసులకు పూర్వం ఎన్నడూ ఏ మానవుడు గాని, ఏ జిన్నాతుగాని వారిని తాకివుండలేదు. మీరు మీ ప్రభువు యొక్క ఏ ఏ అనుగ్రహాలను తిరస్కరిస్తారు? ఆ స్వర్గవాసులు ఆకుపచ్చని తివాచీలపై, అందమైన, విలువైన పరుపులపై దిండ్లకు ఆనుకొని ఆసీనులై ఉంటారు. మీ ప్రభువు యొక్క ఏయే బహుమానాలను మీరు తిరస్కరిస్తారు?

**78** మహామహిమాన్వితుడూ, దయామయుడూ అయిన నీ ప్రభువు పేరు ఎంతో శుభకరమైనది.

ప్రశ్నించటం జరుగు తుందని మీకు సమాచారం ఇవ్వబడుతూ ఉన్న సమయం ఆసన్నమైనపుడు, మీరెక్కడున్నా, ఏ స్థితిలో ఉన్నా, మిమ్మల్ని పట్టుకుని అల్లాహ్ ముందు నిలబెడతారు. దాని నుండి తప్పించుకోవాలంటే, మీరు అల్లాహ్ విశ్వం నుండి పారిపోవలసి ఉంటుంది. కాని అంత శక్తి మీకు లేదు. మీరంత శక్తిమంతులైతే, దానిని యథేచ్ఛగా ఉపయోగించి చూడండి.

10. ఆకాశం బ్రద్దలవటం అంటే, సృష్టిలోని సంబంధాలు తెగిపోవటం, విశ్వవ్యవస్థ ఛిన్నాభిన్నమైపోవటం, నక్షత్రాలు, గ్రహాలు చెల్లాచెదరైపోవటం.

11. అంటే, ప్రపంచంలో దేవునికి భయపడుతూ జీవితం గడిపినవాడు, ఒక రోజు తన ప్రభువు ఎదుట నిలబడి, తన పనులను గురించి సమాధానం చెప్పుకోవలసి ఉన్నదని భావిస్తూ పని చేసినవాడు అని అర్థం.

12. దీనికి ఒక అర్థం ఇది కావచ్చు : ఈ రెండు తోటలలోని పండ్లూ ఫలాలు విలక్షణమైన రుచీవాసనలు కలిగి ఉంటాయి. అతను ఒక తోటలోనికి పోతే అక్కడ ఒక రకమైన ఫలాల గుత్తులను చెట్ల కొమ్మలకు చూస్తాడు. రెండో తోటలోనికిపోతే, అక్కడ ఫలాల తీరు తెన్నులు వేరుగా ఉంటాయి. రెండో అర్థం ఇది కూడ కావచ్చు: ప్రతి తోటలోనూ ఒక రకమైన పండ్లు లోక ప్రసిద్ధమైనవి. అవి, అతను ప్రపంచంలో కూడ బాగా ఎరిగినటువంటివి; అవి ప్రపంచంలోని పండ్లకంటే రుచిలో శ్రేష్ఠమైనవి. రెండోరకం పండ్లు అరుదైనవి, అనూహ్యామైనవి; అతను వాటిని ప్రపంచంలో కలలోనైనా తిని ఎరుగనివి.

13. సిగ్గూ బిడియం కలిగి ఉండటం, అదుపు ఆజ్ఞలలో మెలగటం చూపులలో వ్రీడ కలిగి ఉండటం ఇవి ఉత్తమ స్త్రీ లక్షణాలు. ఇందువల్లనే అల్లాహ్ స్వర్గంలో గల వరాలలో స్త్రీలను గురించి ప్రస్తావిస్తూ, అన్నిటికంటే ముందు, వారి అందచందాలను గురించి చెప్పకుండా, వారి సిగ్గూబిడియాలను, పవిత్రతను గురించే చెప్పాడు. అందమైన స్త్రీలు క్లబ్బులలోనూ, సినిమా స్టూడియోలలోనూ సమావేశమవుతారు. అందాల పోటీలలోకి స్త్రీలను వడబోసి, ఒక అందగత్తెను మించిన మరొక అందగత్తెను తీసుకువస్తారు. కాని నీచ స్వభావం కల వ్యక్తులే వాటి పట్ల ఆసక్తి చూపుతారు. వికారపు చూపులు చూసే ప్రతి వ్యక్తినీ చూడమని ఆహ్వానించే అందం, ప్రతి ఒడిలోనికి ఒరిగిపోవాలని కోరే అందం ఒక మర్యాదస్తుణ్ణి ఆకర్షించలేదు.

14. దీనిద్వారా తెలిసేది ఏమిటంటే, సజ్జనులైన మానవుల మాదిరిగానే, సజ్జనులైన జిన్నాతులు కూడ స్వర్గంలో ప్రవేశిస్తారు. మానవ పురుషులకై మానవ స్త్రీలు ఉంటారు. అలాగే జిన్నాతు పురుషులకై జిన్నాతు స్త్రీలు ఉంటారు. అల్లాహ్ మహిమ వల్ల వారందరూ కన్యలుగా చేయబడతారు.

15. బహుశా, మొదటి రెండు తోటలు నివాస స్థలాలు కావచ్చు. మిగతా రెండు తోటలు విహార స్థలాలు కావచ్చు.

16. గుడారాలు అంటే, బహుశా ఉన్నతులకు, సర్దారులకు ఉద్యానవనాలలో ఏర్పాటు చేయబడే గుడారాలు కావచ్చు. ఆ స్వర్గోద్యానవనాలలో పలుచోట్ల ఇటువంటి గుడారాలు ఉంటాయి. వాటిలో వారి భోగాలకూ వినోదాలకూ కావలసిన ఏర్పాట్లను స్వర్గలోకపు స్త్రీలు చేస్తారు.

## 56. అల్ వాఖిఅహ్

ఆయతులు 96 | అవతరణ మక్కాలో

سُوْرَةُ الْوَاقِعَةِ مَكِّيَّةٌ ٥٦ ٤٦

اٰيَاتُهَا ٩٦ رُكُوْعَاتُهَا ٣

బిస్మిల్లాహ్ తర్వాత: అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 – 26** జరుగవలసి ఉన్న ఆ సంఘటన సంభవించినప్పుడు, దాని సంభవాన్ని ఇక ఎవరూ తిరస్కరించలేరు. అది తారుమారు చేసివేసే ఆపద అవుతుంది. భూమి మొత్తం అప్పుడు ఒక్క సారిగా తీవ్రంగా ఊపివేయబడుతుంది,[1] పర్వతాలు చెదరి పోయిన ధూళిరేణువుల మాదిరిగా తుత్తునియలైపోతాయి. మీరు అప్పుడు మూడు వర్గాలుగా విడిపోతారు: కుడిపక్షం వారు; కుడిపక్షం వారి (అదృష్టాన్ని)ని గురించి ఏమనాలి. ఎడమ పక్షంవారు; ఎడమ పక్షంవారి (దురదృష్టాన్ని)ని గురించి ఏమనాలి. ముందు వారైతే ముందున్నవారే. వారే సాన్నిధ్యులు, సకల భోగభాగ్యాలతో నిండి వున్న స్వర్గవనాలలో ఉంటారు. వారిలో ముందువారి నుండి చాలా మంది ఉంటారు, వెనుక వారి నుండి తక్కువ మంది ఉంటారు. బంగారు జలతారుతో అల్లిన ఆసనాలపై దిండ్లకు ఆనుకొని ఎదురెదురుగా కూర్చుండి ఉంటారు. వారి సమావేశాలలో నిత్య బాల్యం కల బాలురు,[2] మధువు ప్రవహించే చెలమ నుండి నింపిన మధు పాత్రలు, గిన్నెలు, గాజుపాత్రలు కూజాలు తీసుకొని పరుగుతో తిరుగుతూ ఉంటారు. దానిని త్రాగటం వల్ల వారి తల తిరగటం కాని, వారికి బుద్ధి మాంద్యం కలగటం గాని జరగదు. వారు వారి ముందు రకరకాల రుచికరమైన పండ్లను ఉంచుతారు, ఇష్టమైన దానిని తీసుకోవటానికి; పక్షుల మాంసాన్ని ఉంచుతారు, ఏ పక్షి మాంసం ఇష్టమైతే అది తినాలని. వారి కొరకు అందమైన కళ్ళుగల 'హూర్'లు (రమణీ మణులు) ఉంటారు. వారు దాచిపెట్టిన ఆణిముత్యాల మాదిరిగా ఎంతో అందంగా ఉంటారు. ఇదంతా వారు ప్రపంచంలో చేస్తూ వచ్చిన కర్మలకు ప్రతిఫలంగా వారికి లభిస్తుంది. అక్కడ వారు పనికి మాలిన విషయాలు గానీ, పాప విషయాలు గానీ వినరు. ఏ మాట అయినా సరే, సరిగానే, సవ్యముగానే ఉంటుంది.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○
اِذَا وَقَعَتِ الْوَاقِعَةُ ۙ ① لَيْسَ لِوَقْعَتِهَا كَاذِبَةٌ ۘ ②
خَافِضَةٌ رَّافِعَةٌ ۙ ③ اِذَا رُجَّتِ الْاَرْضُ
رَجًّا ۙ ④ وَّبُسَّتِ الْجِبَالُ بَسًّا ۙ ⑤ فَكَانَتْ هَبَآءً
مُّنْۢبَثًّا ۙ ⑥ وَّ كُنْتُمْ اَزْوَاجًا ثَلٰثَةً ۭ ⑦ فَاَصْحٰبُ
الْمَيْمَنَةِ ۙ مَآ اَصْحٰبُ الْمَيْمَنَةِ ۭ ⑧ وَ اَصْحٰبُ
الْمَشْـَٔمَةِ ۙ مَآ اَصْحٰبُ الْمَشْـَٔمَةِ ۭ ⑨ وَالسّٰبِقُوْنَ
السّٰبِقُوْنَ ۚۙ ⑩ اُولٰٓئِكَ الْمُقَرَّبُوْنَ ۚ ⑪ فِيْ جَنّٰتِ
النَّعِيْمِ ⑫ ثُلَّةٌ مِّنَ الْاَوَّلِيْنَ ۙ ⑬ وَ قَلِيْلٌ مِّنَ
الْاٰخِرِيْنَ ۭ ⑭ عَلٰى سُرُرٍ مَّوْضُوْنَةٍ ۙ ⑮ مُّتَّكِـِٕيْنَ
عَلَيْهَا مُتَقٰبِلِيْنَ ⑯ يَطُوْفُ عَلَيْهِمْ وِلْدَانٌ
مُّخَلَّدُوْنَ ۙ ⑰ بِاَكْوَابٍ وَّ اَبَارِيْقَ ۙ وَ كَاْسٍ
مِّنْ مَّعِيْنٍ ۙ ⑱ لَّا يُصَدَّعُوْنَ عَنْهَا وَ لَا
يُنْزِفُوْنَ ۙ ⑲ وَ فَاكِهَةٍ مِّمَّا يَتَخَيَّرُوْنَ ۙ ⑳ وَ
لَحْمِ طَيْرٍ مِّمَّا يَشْتَهُوْنَ ۭ ㉑ وَ حُوْرٌ عِيْنٌ ۙ ㉒
كَاَمْثَالِ اللُّؤْلُؤِ الْمَكْنُوْنِ ۚ ㉓ جَزَآءًۢ بِمَا كَانُوْا
يَعْمَلُوْنَ ㉔ لَا يَسْمَعُوْنَ فِيْهَا لَغْوًا
وَّلَا تَاْثِيْمًا ۙ ㉕ اِلَّا قِيْلًا سَلٰمًا سَلٰمًا ㉖

وقف لازم

1. అంటే, అది ఒక ప్రాంతానికే పరిమితమైన భూకంపం కాదు. మొత్తం భూగోళమే ఒక్కసారిగా కంపించిపోతుంది.

**27 - 40** ఇక కుడిపక్షం వారు, కుడిపక్షం వారి (అదృష్టాన్ని)ని గురించి ఏమనాలి. వారు ముళ్లులేని రేగుచెట్లు,[3] అరటి పండ్ల గెలలు, దూరంగా వ్యాపించి ఉండే నీడలు, ఎల్లప్పుడూ ప్రవహించే నీరు, ఎన్నటికీ అంతంకాని, నిరాటంకంగా లభించే అసంఖ్యాకమైన పండ్లు మరియు ఎత్తైన ఆసనాలు వీటి మధ్య ఉంటారు. వారి భార్యలను మేము ప్రత్యేకంగా సరిక్రొత్త పంథాలో సృష్టిస్తాము, వారిని కన్యలుగా చేస్తాము. వారు తమ భర్తలను అమితంగా ప్రేమిస్తారు, వయస్సులో సమంగా ఉంటారు. ఇదంతా కుడిపక్షం వారి కొరకు. వారిలో ముందు వారు చాలామంది ఉంటారు, వెనుక వారు కూడా చాలామంది ఉంటారు.

**41 - 56** వామపక్షంవారు; వామపక్షం వారి (దౌర్భాగ్యాన్ని)ని గురించి ఏమని చెప్పాలి. వారు వడగాలి మధ్య, సలసల కాగే నీటిలో, నల్లని పొగల నీడలో ఉంటారు. అది చల్లగానూ ఉండదు, సుఖంగానూ ఉండదు. ఈ గతి పట్టకముందు వారు సంపన్నులుగా ఉండేవారు, చెప్పినా వినకుండా మూర్ఖంగా మహాపాపాలు చేస్తూ ఉండేవారు. వారు ఇలా అనేవారు, "మేము మరణించి మట్టిగా మారిపోయినప్పుడు, అస్థిపంజరంగా అయిపోయినప్పుడు, మళ్లీ లేపబడతామా? పూర్వం గతించిన మా తాతముత్తాతలు కూడా లేపబడతారా?" ప్రవక్తా! వారితో ఇలా అను, "నిశ్చయంగా గతించిన వారు, తరువాత వారు, అందరూ ఒక రోజున తప్పకుండా సమావేశ పరచబడతారు. దాని కాలం కూడ నిర్ణయమైపోయింది." మార్గభ్రష్టులారా! తిరస్కారులారా! మీరు జఖ్ఖూమ్ చెట్టును ఆహారంగా తింటారు. దానితోనే మీరు మీ కడుపులను నింపుకుంటారు. ఆపై సలసల కాగే నీటిని దప్పికగొన్న ఒంటెల మాదిరిగా త్రాగుతారు. తీర్పు దినంనాడు (ఈ వామ పక్షంవారికి లభించే) ఆతిథ్యపు పదార్థాలు ఇవి.

وَ اَصْحٰبُ الْيَمِيْنِ ۙ مَاۤ اَصْحٰبُ الْيَمِيْنِ ﴿٢٧﴾ فِيْ
سِدْرٍ مَّخْضُوْدٍ ﴿٢٨﴾ وَّ طَلْحٍ مَّنْضُوْدٍ ﴿٢٩﴾ وَّ ظِلٍّ
مَّمْدُوْدٍ ﴿٣٠﴾ وَّ مَآءٍ مَّسْكُوْبٍ ﴿٣١﴾ وَّ فَاكِهَةٍ
كَثِيْرَةٍ ﴿٣٢﴾ لَّا مَقْطُوْعَةٍ وَّ لَا مَمْنُوْعَةٍ ﴿٣٣﴾ وَّ
فُرُشٍ مَّرْفُوْعَةٍ ﴿٣٤﴾ اِنَّاۤ اَنْشَاْنٰهُنَّ اِنْشَآءً ﴿٣٥﴾
فَجَعَلْنٰهُنَّ اَبْكَارًا ﴿٣٦﴾ عُرُبًا اَتْرَابًا ﴿٣٧﴾ لِّاَصْحٰبِ
الْيَمِيْنِ ﴿٣٨﴾ ثُلَّةٌ مِّنَ الْاَوَّلِيْنَ ﴿٣٩﴾ وَ ثُلَّةٌ مِّنَ ع
الْاٰخِرِيْنَ ﴿٤٠﴾ وَ اَصْحٰبُ الشِّمَالِ ۙ مَاۤ اَصْحٰبُ
الشِّمَالِ ﴿٤١﴾ فِيْ سَمُوْمٍ وَّ حَمِيْمٍ ﴿٤٢﴾ وَّ ظِلٍّ مِّنْ
يَّحْمُوْمٍ ﴿٤٣﴾ لَّا بَارِدٍ وَّ لَا كَرِيْمٍ ﴿٤٤﴾ اِنَّهُمْ كَانُوْا
قَبْلَ ذٰلِكَ مُتْرَفِيْنَ ﴿٤٥﴾ وَ كَانُوْا يُصِرُّوْنَ عَلَى
الْحِنْثِ الْعَظِيْمِ ﴿٤٦﴾ وَ كَانُوْا يَقُوْلُوْنَ ۙ
اَئِذَا مِتْنَا وَ كُنَّا تُرَابًا وَّ عِظَامًا ءَاِنَّا
لَمَبْعُوْثُوْنَ ﴿٤٧﴾ اَوَ اٰبَآؤُنَا الْاَوَّلُوْنَ ﴿٤٨﴾ قُلْ اِنَّ
الْاَوَّلِيْنَ وَ الْاٰخِرِيْنَ ﴿٤٩﴾ لَمَجْمُوْعُوْنَ ۙ اِلٰى
مِيْقَاتِ يَوْمٍ مَّعْلُوْمٍ ﴿٥٠﴾ ثُمَّ اِنَّكُمْ اَيُّهَا
الضَّآلُّوْنَ الْمُكَذِّبُوْنَ ﴿٥١﴾ لَاٰكِلُوْنَ مِنْ شَجَرٍ
مِّنْ زَقُّوْمٍ ﴿٥٢﴾ فَمَالِـُٔوْنَ مِنْهَا الْبُطُوْنَ ﴿٥٣﴾
فَشٰرِبُوْنَ عَلَيْهِ مِنَ الْحَمِيْمِ ﴿٥٤﴾ فَشٰرِبُوْنَ
شُرْبَ الْهِيْمِ ﴿٥٥﴾ هٰذَا نُزُلُهُمْ يَوْمَ الدِّيْنِ ﴿٥٦﴾

2. నిత్యం బాల్యావస్థలో ఉండే బాలురు అని అర్థం. వారి వయస్సు ఎల్లప్పుడూ ఒకే అవస్థలో ఉంటుంది అంటే అది కౌమారావస్థకు చేరనిది.

3. అంటే, అవి ముళ్లులేని చెట్లు. రేగు పండ్లు ఎంత మధురంగా ఉంటాయో ఆ చెట్లకు ముళ్లు అంత తక్కువగానే ఉంటాయి. కనుకనే స్వర్గములోని రేగు పండ్ల చెట్లకు అసలు ముళ్లే ఉండవు. అంటే అవి ప్రపంచంలో ఎక్కడా లభ్యంకాని మేలు జాతి ఫలాలు.

نَحۡنُ خَلَقۡنٰكُمۡ فَلَوۡ لَا تُصَدِّقُوۡنَ ﴿٥٧﴾ اَفَرَءَيۡتُمۡ
مَّا تُمۡنُوۡنَ ﴿٥٨﴾ ءَاَنۡتُمۡ تَخۡلُقُوۡنَهٗۤ اَمۡ نَحۡنُ
الۡخٰلِقُوۡنَ ﴿٥٩﴾ نَحۡنُ قَدَّرۡنَا بَيۡنَكُمُ الۡمَوۡتَ وَ مَا
نَحۡنُ بِمَسۡبُوۡقِيۡنَ ﴿٦٠﴾ عَلٰٓى اَنۡ نُّبَدِّلَ اَمۡثَالَكُمۡ
وَ نُنۡشِئَكُمۡ فِىۡ مَا لَا تَعۡلَمُوۡنَ ﴿٦١﴾ وَ لَقَدۡ عَلِمۡتُمُ
النَّشۡاَةَ الۡاُوۡلٰى فَلَوۡ لَا تَذَكَّرُوۡنَ ﴿٦٢﴾ اَفَرَءَيۡتُمۡ
مَّا تَحۡرُثُوۡنَ ﴿٦٣﴾ ءَاَنۡتُمۡ تَزۡرَعُوۡنَهٗۤ اَمۡ نَحۡنُ
الزّٰرِعُوۡنَ ﴿٦٤﴾ لَوۡ نَشَآءُ لَجَعَلۡنٰهُ حُطَامًا
فَظَلۡتُمۡ تَفَكَّهُوۡنَ ﴿٦٥﴾ اِنَّا لَمُغۡرَمُوۡنَ ﴿٦٦﴾ بَلۡ
نَحۡنُ مَحۡرُوۡمُوۡنَ ﴿٦٧﴾ اَفَرَءَيۡتُمُ الۡمَآءَ الَّذِىۡ
تَشۡرَبُوۡنَ ﴿٦٨﴾ ءَاَنۡتُمۡ اَنۡزَلۡتُمُوۡهُ مِنَ الۡمُزۡنِ اَمۡ
نَحۡنُ الۡمُنۡزِلُوۡنَ ﴿٦٩﴾ لَوۡ نَشَآءُ جَعَلۡنٰهُ اُجَاجًا
فَلَوۡ لَا تَشۡكُرُوۡنَ ﴿٧٠﴾ اَفَرَءَيۡتُمُ النَّارَ الَّتِىۡ
تُوۡرُوۡنَ ﴿٧١﴾ ءَاَنۡتُمۡ اَنۡشَاۡتُمۡ شَجَرَتَهَاۤ اَمۡ نَحۡنُ
الۡمُنۡشِئُوۡنَ ﴿٧٢﴾ نَحۡنُ جَعَلۡنٰهَا تَذۡكِرَةً وَّ مَتَاعًا
لِّلۡمُقۡوِيۡنَ ﴿٧٣﴾ فَسَبِّحۡ بِاسۡمِ رَبِّكَ الۡعَظِيۡمِ ﴿٧٤﴾ ع ٢ ٣ ١٥

**57 - 62** మేము మిమ్మల్ని సృష్టించాము, మరెందుకు మీరు ఈ విషయాన్ని ధ్రువీకరించరు?[4] ఎప్పుడైనా మీరు ఇలా ఆలోచించారా: మీరు విడిచే ఈ రేతస్సుతో బిడ్డను మీరు తయారు చేస్తారా లేక దానిని సృష్టించేవారము మేమా? మేము మీ మధ్య మరణాన్ని విభజించాము, మీ రూపాలను మార్చివేసి, మీరు ఎరుగని మరేదైనా రూపంలో మిమ్మల్ని సృష్టించే విషయంలో మేము అశక్తులము కాము. మీ మొదటి పుట్టుకను గురించి మీకు తెలిసే ఉంది. మరెందుకు మీరు గుణపాఠం నేర్చుకోరు?

**63 - 67** ఎప్పుడైనా మీరు ఇలా ఆలోచించారా: మీరు నాటే ఈ విత్తనాలతో పొలాలను మీరు పండిస్తారా లేక వాటిని పండించేవారము మేమా? మేము తలచుకుంటే ఈ పంట పొలాలను పొట్టుగా చేసి వేస్తాము. అప్పుడు మీరు, "మేము చాలా నష్టంలో పడిపోయామని, అసలు మా అదృష్టమే కాలి పోయిందని" రకరకాలుగా మాటలు చెప్పుకుంటారు.

**68 - 70** ఎప్పుడైనా మీరు కళ్లు తెరచి చూశారా; మీరు త్రాగే ఈ నీటిని మేఘాలనుండి మీరు కురిపించారా లేక దానిని కురిపించేవారము మేమా? మేము తలచుకుంటే దానిని ఎంతో ఉప్పగా ఉండేలా చేయగలము. అలాంటప్పుడు మీరు కృతజ్ఞులై ఎందుకు ఉండరు?

**71 - 74** మీరు రాజేసే అగ్నిని గురించి ఎప్పుడైనా ఆలోచించారా? దానికి సంబంధించిన వృక్షాన్ని మీరు సృష్టించారా లేక దానిని సృష్టించిన వారము మేమా?[5] మేము దానిని జ్ఞాపక సాధనంగాను, అవసరం ఉన్న వారికొరకు ప్రయోజనకారిగాను చేశాము. కనుక ప్రవక్తా! మహోన్నతుడైన నీ ప్రభువు నామాన్ని స్తుతించు.[6]

4. అంటే, మేమే మీ ప్రభువులమనీ, ఆరాధ్యులమనీ, తిరిగి మిమ్మల్ని బ్రతికించగలమనీ ధ్రువీకరించుట.
5. అంటే, మీరు నిప్పుకోసం ఉపయోగించే చెట్టుకర్రను సృష్టించింది మీరా? మేమా?
6. అంటే, ఆయన శుభకరమైన పేరుతో, అవిశ్వాసులు, ముష్రిక్కులు ఆయనకు ఆపాదించే లోపాలు, దోషాలు, దౌర్బల్యాలకు ఆయన అతీతుడు అనే విషయాన్ని బాహాటంగా చాటు. ఇవి అవిశ్వాసం, షిర్కులకు సంబంధించిన మత విశ్వాసాలలో, పరలోక తిరస్కారుల తర్కాలలో ఉంటాయి.

فَلَآ اُقۡسِمُ بِمَوٰقِعِ النُّجُوۡمِ ﴿۷۵﴾ وَ اِنَّهٗ لَقَسَمٌ
لَّوۡ تَعۡلَمُوۡنَ عَظِيۡمٌ ﴿۷۶﴾ اِنَّهٗ لَقُرۡاٰنٌ كَرِيۡمٌ ﴿۷۷﴾ فِىۡ
كِتٰبٍ مَّكۡنُوۡنٍ ﴿۷۸﴾ لَّا يَمَسُّهٗۤ اِلَّا الۡمُطَهَّرُوۡنَ ﴿۷۹﴾
تَنۡزِيۡلٌ مِّنۡ رَّبِّ الۡعٰلَمِيۡنَ ﴿۸۰﴾ اَفَبِهٰذَا الۡحَدِيۡثِ
اَنۡتُمۡ مُّدۡهِنُوۡنَ ﴿۸۱﴾ وَتَجۡعَلُوۡنَ رِزۡقَكُمۡ اَنَّكُمۡ
تُكَذِّبُوۡنَ ﴿۸۲﴾ فَلَوۡلَاۤ اِذَا بَلَغَتِ الۡحُلۡقُوۡمَ ﴿۸۳﴾
وَ اَنۡتُمۡ حِيۡنَٮِٕذٍ تَنۡظُرُوۡنَ ﴿۸۴﴾ وَ نَحۡنُ اَقۡرَبُ
اِلَيۡهِ مِنۡكُمۡ وَ لٰكِنۡ لَّا تُبۡصِرُوۡنَ ﴿۸۵﴾ فَلَوۡلَاۤ اِنۡ
كُنۡتُمۡ غَيۡرَ مَدِيۡنِيۡنَ ﴿۸۶﴾ تَرۡجِعُوۡنَهَاۤ اِنۡ كُنۡتُمۡ
صٰدِقِيۡنَ ﴿۸۷﴾ فَاَمَّاۤ اِنۡ كَانَ مِنَ الۡمُقَرَّبِيۡنَ ﴿۸۸﴾
فَرَوۡحٌ وَّ رَيۡحَانٌ ۙ وَّ جَنَّتُ نَعِيۡمٍ ﴿۸۹﴾ وَاَمَّاۤ اِنۡ
كَانَ مِنۡ اَصۡحٰبِ الۡيَمِيۡنِ ﴿۹۰﴾ فَسَلٰمٌ لَّكَ مِنۡ
اَصۡحٰبِ الۡيَمِيۡنِ ﴿۹۱﴾ وَ اَمَّاۤ اِنۡ كَانَ مِنَ
الۡمُكَذِّبِيۡنَ الضَّآلِّيۡنَ ﴿۹۲﴾ فَنُزُلٌ مِّنۡ حَمِيۡمٍ ﴿۹۳﴾ وَّ
تَصۡلِيَةُ جَحِيۡمٍ ﴿۹۴﴾ اِنَّ هٰذَا لَهُوَ حَقُّ
الۡيَقِيۡنِ ﴿۹۵﴾ فَسَبِّحۡ بِاسۡمِ رَبِّكَ الۡعَظِيۡمِ ﴿۹۶﴾

**75 - 82** కనుక (అది) కాదు,[7] నక్షత్రాల స్థానాలు, కక్ష్యలు సాక్షిగా చెబుతున్నాము: మీరు తెలుసుకుంటే, ఇది చాలా పెద్ద ప్రమాణం: ఇది ఒక మహోన్నతమైన ఖురాన్;[8] ఒక సురక్షితమైన గ్రంథంలో వ్రాయబడి ఉంది. దానిని పరిశుద్ధులు తప్ప మరెవరూ తాకలేరు.[9] ఇది సకల లోకాల ప్రభువు అవతరింప జేసినటువంటిది. అయినా మీరు ఈ వాణిని తేలిక విషయంగా తీసుకుంటారా? ఈ మహాభాగ్యాన్ని తిరస్కరించటమే మీరు మీ జీవనోపాధిగా చేసుకున్నారా?

**83 - 94** ఇక మీరు గనక ఎవరికీ బానిస కాకపోతే, ఈ అభిప్రాయంలో మీరు గనక సత్యవంతులే అయితే, చనిపోయే వాడి ప్రాణం గొంతులోకి వచ్చినప్పుడు, అతడు చనిపోతున్నాడని మీరు కళ్లారా చూస్తూ ఉంటారు, ఆ సమయంలో పోయే ప్రాణాన్ని మీరు తిరిగి ఎందుకు తీసుకురాలేరు? అప్పుడు మీకంటే మేము అతనికి చాల దగ్గరలో ఉంటాము, కాని మీకు కనిపించము. తరువాత ఆ చనిపోయే మనిషి సాన్నిధ్యుల లోని వాడైతే, అతని కొరకు సుఖం, మంచి ఆహారం, మహాభాగ్యాలతో నిండి ఉన్న స్వర్గం ఉంటాయి. ఒకవేళ అతడు కుడిపక్షంలోనివాడై ఉంటే, "నీకు శాంతి కలుగుగాక! నీవు కుడిపక్షంలోని వాడవు" అని అతనికి స్వాగతం చెప్పబడుతుంది. ఒకవేళ అతడు తిరస్కరించే మార్గభ్రష్టులలోని వాడై ఉంటే, అతనికి ఇవ్వబడే ఆతిథ్యం సల సల కాగే నీరు మరియు నరకంలోకి విసరివేయటం.

**95 - 96** ఇదంతా తిరుగులేని సత్యం, కనుక ప్రవక్తా! మహోన్నతుడైన నీ ప్రభువు పేరును స్తుతించు.[10]

7. అంటే, మీరు అవగాహన చేసుకున్న విషయం కాదు ఇది. ఇక్కడ దివ్య ఖురాను అల్లాహ్ తరఫు నుండే వచ్చింది అనే విషయాన్ని గురించి ప్రమాణం చేసేముందు "లా" అనే పదం ఉపయోగించబడింది. ప్రజలు ఈ పరిశుద్ధ గ్రంథం గురించి కల్పిస్తున్న విషయాలను ఖండించటానికే ఈ ప్రమాణం చేయబడింది అనే విషయాన్ని ఈ పదం విశదపరుస్తోంది.
8. నక్షత్రాల, గ్రహాల స్థానాలు అంటే అవి ఉండే స్థలాలు, కక్ష్యలు, వాటి అవస్థలు అని అర్థం. దివ్య ఖురాను మహోన్నతమైన గ్రంథం అని ప్రమాణం చేసే దాని భావం ఏమిటంటే, ఖగోళ వ్యవస్థ ఎంత స్థిరంగా, ఎంత పటిష్ఠంగా ఉంటుందో, దివ్య ఖురాన్ కూడ అంత స్థిరత్వమూ, అంత పటుత్వమూ కలది. దానిని సృష్టించిన దేవుడే దీనినీ సృష్టించాడు.
9. అంటే, ఇది పరిశుద్ధులైన దైవదూతల ద్వారా వచ్చింది. ఇందులో షైతానుల ప్రమేయం ఏదీ లేదు.
10. ఈ ఉపదేశం ప్రకారమే, మహాప్రవక్త (స), "రుకూ" తరువాత "సుబ్‌హాన రబ్బియల్ అజీమ్" అని పఠించాలని ఆదేశించారు.

# 57. అల్ హదీద్

ఆయతులు 29 | అవతరణ మదీనాలో

٥٧ سُوْرَةُ الْحَدِيْدِ مَدَنِيَّةٌ ٩٤

اٰیاتها ٢٩ | رکوعاتها ٤

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 6** భూమిలోనూ, ఆకాశాలలోనూ ఉన్న ప్రతి వస్తువూ అల్లాహ్ పవిత్రతను కొనియాడుతోంది. ఆయనే శక్తిమంతుడు, వివేకవంతుడూను. భూమ్యాకాశాల సామ్రాజ్యానికి ప్రభువు ఆయనే. ఆయనే జీవితాన్ని ప్రసాదిస్తున్నాడు, మరణాన్ని కలిగిస్తున్నాడు, ప్రతి వస్తువుపై అధికారం కలిగి ఉన్నాడు. ఆయనే ఆరంభమూ, ఆయనే అంతమూ; ఆయనే బాహ్యమూ, ఆయనే గూఢమూ.[1] ఆయనకు ప్రతి వస్తువును గురించి తెలుసు. ఆయనే ఆకాశాలనూ, భూమినీ, ఆరు దినాలలో సృష్టించాడు, తరువాత అధికార పీఠాన్ని అధిష్ఠించాడు. భూమి లోపలకు పోయేదీ, అందులో నుండి వెలుపలకు వచ్చేదీ, ఆకాశం నుండి దిగేదీ, దాని లోపలకు ఎక్కేదీ,[2] అంతా ఆయన జ్ఞాన పరిధిలో ఉన్నది. మీరు ఎక్కడ ఉన్నా ఆయన మీతో ఉన్నాడు. మీరు ఏ పని చేస్తూ ఉన్నా, దానిని ఆయన చూస్తు న్నాడు. ఆయనే భూమ్యాకాశాల సామ్రాజ్యానికి అధిపతి. సమస్త వ్యవహారాలు నిర్ణయ నిమిత్తం ఆయన వైపునకే తీసుకు పోబడతాయి. ఆయనే రాత్రిని పగలులోకీ పగలును రాత్రిలోకి ప్రవేశింపజేస్తాడు. హృదయాలలో దాగి ఉన్న రహస్యాలను సైతం ఆయన ఎరుగును.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

سَبَّحَ لِلّٰهِ مَا فِي السَّمٰوٰتِ وَ الْاَرْضِ ۚ وَ هُوَ
الْعَزِيْزُ الْحَكِيْمُ ① لَهٗ مُلْكُ السَّمٰوٰتِ وَ
الْاَرْضِ ۚ يُحْيٖ وَيُمِيْتُ ۚ وَ هُوَ عَلٰى كُلِّ
شَيْءٍ قَدِيْرٌ ② هُوَ الْاَوَّلُ وَالْاٰخِرُ وَالظَّاهِرُ
وَ الْبَاطِنُ ۚ وَ هُوَ بِكُلِّ شَيْءٍ عَلِيْمٌ ③ هُوَ
الَّذِيْ خَلَقَ السَّمٰوٰتِ وَ الْاَرْضَ فِيْ سِتَّةِ
اَيَّامٍ ثُمَّ اسْتَوٰى عَلَى الْعَرْشِ ۭ يَعْلَمُ مَا يَلِجُ
فِي الْاَرْضِ وَ مَا يَخْرُجُ مِنْهَا وَ مَا يَنْزِلُ مِنَ
السَّمَآءِ وَ مَا يَعْرُجُ فِيْهَا ۭ وَ هُوَ مَعَكُمْ اَيْنَ
مَا كُنْتُمْ ۭ وَ اللّٰهُ بِمَا تَعْمَلُوْنَ بَصِيْرٌ ④ لَهٗ
مُلْكُ السَّمٰوٰتِ وَالْاَرْضِ ۭ وَاِلَى اللّٰهِ تُرْجَعُ
الْاُمُوْرُ ⑤ يُوْلِجُ الَّيْلَ فِي النَّهَارِ وَ يُوْلِجُ
النَّهَارَ فِي الَّيْلِ ۭ وَ هُوَ عَلِيْمٌۢ بِذَاتِ
الصُّدُوْرِ ⑥

1. అంటే, ఏమీ లేనపుడు ఆయన ఉన్నాడు. ఏమీ ఉండనపుడూ ఆయన ఉంటాడు. గోచరించే వారందరికంటే ఆయన మరింత స్పష్టంగా గోచరిస్తాడు. ఎందుకంటే, ప్రపంచంలో గోచరించేవన్నీ ఆయన గుణవిశేషాలే, ఆయన కార్యకలాపాలే, ఆయన వెలుగే. ఆయన నిగూఢంగా ఉన్నవారిలో మరింత నిగూఢుడు. ఎందుకంటే, ఇంద్రియాల ద్వారా ఆయనను గ్రహించటం సుదూర విషయం; బుద్ధీ, ఆలోచన, ఊహల ద్వారా కూడా ఆయనకు సంబంధించిన ఉనికినీ, యథార్థాన్ని తెలుసుకోలేము.
2. మరొకవిధంగా చెప్పాలంటే, ఆయన సర్వమూ తెలిసిన జ్ఞానిమాత్రమే కాదు, సూక్ష్మ విషయాలను సైతం బాగా ఎరిగినవాడు. భూమిలోపలకు చొచ్చుకొని పోయే ఒక్కొక్క గింజ, భూమి నుండి పైకి వచ్చే ఒక్కొక్క ఆకు, ఒక్కొక్క మొగ్గ, ఆకాశం నుండి పడే ఒక్కొక్క వర్షపు చినుకు, సముద్రాల నుండి, సరస్సుల నుండీ ఆవిరి రూపంలో ఆకాశాన్ని చేరే ఒక్కొక్క నీటి కణం ఇవన్నీ ఆయన దృష్టిలో ఉన్నాయి. భూమిలో ఏ గింజ ఎక్కడ

اٰمِنُوْا بِاللّٰهِ وَرَسُوْلِهٖ وَاَنْفِقُوْا مِمَّا جَعَلَكُمْ
مُّسْتَخْلَفِيْنَ فِيْهِ ؕ فَالَّذِيْنَ اٰمَنُوْا مِنْكُمْ
وَاَنْفَقُوْا لَهُمْ اَجْرٌ كَبِيْرٌ ۝٧ وَمَا لَكُمْ لَا
تُؤْمِنُوْنَ بِاللّٰهِ ۚ وَالرَّسُوْلُ يَدْعُوْكُمْ لِتُؤْمِنُوْا
بِرَبِّكُمْ وَقَدْ اَخَذَ مِيْثَاقَكُمْ اِنْ كُنْتُمْ
مُّؤْمِنِيْنَ ۝٨ هُوَ الَّذِيْ يُنَزِّلُ عَلٰى عَبْدِهٖٓ اٰيٰتٍۢ
بَيِّنٰتٍ لِّيُخْرِجَكُمْ مِّنَ الظُّلُمٰتِ اِلَى النُّوْرِ ؕ
وَاِنَّ اللّٰهَ بِكُمْ لَرَءُوْفٌ رَّحِيْمٌ ۝٩ وَمَا لَكُمْ
اَلَّا تُنْفِقُوْا فِيْ سَبِيْلِ اللّٰهِ وَلِلّٰهِ مِيْرَاثُ
السَّمٰوٰتِ وَالْاَرْضِ ؕ لَا يَسْتَوِيْ مِنْكُمْ مَّنْ
اَنْفَقَ مِنْ قَبْلِ الْفَتْحِ وَقٰتَلَ ؕ اُولٰٓئِكَ
اَعْظَمُ دَرَجَةً مِّنَ الَّذِيْنَ اَنْفَقُوْا مِنْۢ بَعْدُ وَ
قٰتَلُوْا ؕ وَكُلًّا وَّعَدَ اللّٰهُ الْحُسْنٰى ؕ وَاللّٰهُ بِمَا
تَعْمَلُوْنَ خَبِيْرٌ ۝١٠ ع

**7 - 10** అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ విశ్వసించండి.[3] ఆయన మిమ్మల్ని ఏ వస్తువులపై ఖలీఫా(ప్రతినిధి)గా నియమించాడో, వాటిలో నుండి ఖర్చు పెట్టండి. మీలో విశ్వసించి ధనం ఖర్చుపెట్టే వారికి గొప్ప ప్రతిఫలం లభిస్తుంది. మీకు ఏమయింది, అల్లాహ్‌ను మీరు విశ్వసించరు? వాస్తవానికి ప్రవక్త, మీ ప్రభువును విశ్వసించండని మీకు పిలుపునిస్తున్నాడు,[4] ఆయన మీచేత ప్రమాణం చేయించుకున్నాడు,[5] మీరు నిజమైన విశ్వాసులే అయితే. తన దాసునిపై స్పష్టమైన వాక్యాలను అవతరింపజేస్తూ ఉన్నవాడు అల్లాహ్‌యే. ఆయన వాటి ద్వారా మిమ్మల్ని చీకట్ల నుండి వెలుగులోకి తీసుకురాదలచుకున్నాడు. యథార్థం ఏమిటంటే, అల్లాహ్‌కు మీరంటే ఎంతో వాత్సల్యం, ఎంతో దయ ఉన్నాయి. అసలు మీరు అల్లాహ్ మార్గంలో ఖర్చుపెట్టకపోవటానికి కారణం ఏమిటి? వాస్తవానికి భూమీ, ఆకాశముల వారసత్వం అల్లాహ్‌కు మాత్రమే ఉంది.[6] మీలో విజయం తరువాత ఖర్చు పెట్టినవారు, జిహాద్ చేసినవారు, విజయానికి పూర్వం ఖర్చుపెట్టిన వారితో, జిహాద్ చేసిన వారితో ఎన్నటికీ సమానులు కాలేరు. వారి అంతస్తు, తరువాత ఖర్చుపెట్టిన వారికంటే, జిహాద్ చేసినవారి కంటే గొప్పది. అయినా అల్లాహ్ ఉభయులకూ మంచి వాగ్దానాలు చేసి ఉన్నాడు.[7] మీరు చేసిన దానిని అల్లాహ్ బాగా ఎరుగును.

---

పడిందో ఆయనకు తెలుసు. కనుకనే ఆయన ఆ గింజను మొలకెత్తింపజేస్తాడు; తరువాత దానిని పెంచి పెద్దదిగా చేస్తాడు. ఎక్కడెక్కడ నుండి ఎంతెంత ఆవిరి లేచిందో, ఎక్కడెక్కడకు చేరిందో ఆయనకు తెలుసు. కనుకనే ఆయన ఆ ఆవిరినంతనూ పోగుచేసి మేఘాలుగా రూపొందిస్తాడు. భూమిలోని విభిన్న ప్రాంతాలలో ఎంతెంత వర్షపాతం కావాలో, ఒక లెక్క ప్రకారం కురిపిస్తాడు.

3. ఇక్కడ విశ్వసించటం అంటే ఇస్లామ్‌ను నోటి మాటలతో చెప్పటం కాదు, చిత్తశుద్ధితో విశ్వసించటం అని అర్థం.
4. ఇక్కడ కూడ విశ్వసించటం అంటే, చిత్తశుద్ధితో విశ్వసించటం అని అర్థం.
5. అంటే విధేయతా ప్రమాణం.
6. దీనికి రెండర్థాలు ఉన్నాయి : ఒకటి; ఈ సంపద నీ వద్ద కలకాలం ఉండేది కాదు. ఒకనాడు నీవు దీనిని తప్పకుండా విడిచిపెట్టే వెళ్లాలి. అప్పుడు అల్లాహ్‌యే దానికి వారసుడవుతాడు. రెండో అర్థం; అల్లాహ్ మార్గంలో సంపద ఖర్చుపెడుతూ పేదరికం వస్తుందేమో అని భయం నీకు కలగకూడదు. ఎందుకంటే, ఏ దేవుని కోసం నీవు సంపదను ఖర్చుపెడుతున్నావో, ఆ దేవుడే భూమ్యాకాశాలలో ఉన్న సర్వ నిధులకు యజమాని. ఈనాడు ఆయన మీకు ఎంత ఇచ్చాడో, అంతేకాదు ఆయన దగ్గర ఉన్నది, రేపు మీకు ఆయన అంతకంటే ఎక్కువగానే ఇవ్వగలడు.

مَنْ ذَا الَّذِیْ یُقْرِضُ اللّٰهَ قَرْضًا حَسَنًا
فَیُضٰعِفَهٗ لَهٗ وَلَهٗۤ اَجْرٌ كَرِیْمٌ ﴿١١﴾ یَوْمَ تَرَى
الْمُؤْمِنِیْنَ وَالْمُؤْمِنٰتِ یَسْعٰى نُوْرُهُمْ بَیْنَ
اَیْدِیْهِمْ وَبِاَیْمَانِهِمْ بُشْرٰىكُمُ الْیَوْمَ جَنّٰتٌ
تَجْرِیْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ خٰلِدِیْنَ فِیْهَا ؕ
ذٰلِكَ هُوَ الْفَوْزُ الْعَظِیْمُ ﴿١٢﴾ یَوْمَ یَقُوْلُ
الْمُنٰفِقُوْنَ وَ الْمُنٰفِقٰتُ لِلَّذِیْنَ اٰمَنُوا انْظُرُوْنَا
نَقْتَبِسْ مِنْ نُّوْرِكُمْ ۚ قِیْلَ ارْجِعُوْا وَرَآءَكُمْ
فَالْتَمِسُوْا نُوْرًا ؕ فَضُرِبَ بَیْنَهُمْ بِسُوْرٍ لَّهٗ
بَابٌ ؕ بَاطِنُهٗ فِیْهِ الرَّحْمَةُ وَظَاهِرُهٗ مِنْ
قِبَلِهِ الْعَذَابُ ﴿١٣﴾ یُنَادُوْنَهُمْ اَلَمْ نَكُنْ
مَّعَكُمْ ؕ قَالُوْا بَلٰى وَلٰكِنَّكُمْ فَتَنْتُمْ اَنْفُسَكُمْ
وَتَرَبَّصْتُمْ وَارْتَبْتُمْ وَغَرَّتْكُمُ الْاَمَانِیُّ حَتّٰى
جَآءَ اَمْرُ اللّٰهِ وَ غَرَّكُمْ بِاللّٰهِ الْغَرُوْرُ ﴿١٤﴾
فَالْیَوْمَ لَا یُؤْخَذُ مِنْكُمْ فِدْیَةٌ وَّ لَا مِنَ
الَّذِیْنَ كَفَرُوْا ؕ مَاْوٰىكُمُ النَّارُ ؕ هِیَ مَوْلٰىكُمْ
وَ بِئْسَ الْمَصِیْرُ ﴿١٥﴾

**11 - 15** అల్లాహ్‌కు రుణం ఇచ్చేవాడెవడైనా ఉన్నాడా? మంచి రుణం: అటువంటి వానికి అల్లాహ్ దానిని ఎన్నో రెట్లు పెంచి తిరిగి ఇస్తాడు. అతనికి ఎంతో శ్రేష్ఠమైన ప్రతిఫలం[8] లభిస్తుంది. విశ్వాసులైన స్త్రీ పురుషుల ముందూ, వారి కుడివైపునా వారి వెలుగు పరుగెడుతూ[9] ఉండటాన్ని నీవు చూస్తావు. ఆ రోజున (వారితో) "ఈనాడు మీకు శుభ వార్త ఉన్నది" అని అనబడుతుంది. క్రిందకాలువలు ప్రవ హించే స్వర్గవనాలు ఉంటాయి, అక్కడ వారు శాశ్వతంగా ఉంటారు. ఇదే మహత్తరమైన సాఫల్యం. ఆనాడు కపట పురుషుల కపట స్త్రీల పరిస్థితి ఎలా ఉంటుందంటే, వారు విశ్వాసులతో, "కొంచెం మావైపు చూడండి, మేము మీ వెలుగు ద్వారా కొంత ప్రయోజనం పొందుతాము" అని అంటారు. కాని వారితో, "వెనక్కి వెళ్లండి. మీ వెలుగును మరొక చోట ఎక్కడైనా వెతుక్కోండి" అని అనబడుతుంది. తరువాత వారి మధ్య ఒక గోడను అడ్డుగా నిలబెట్టడం జరుగుతుంది. దానికి ఒక ద్వారం కూడ ఉంటుంది. ఆ ద్వారానికి లోపల సౌఖ్యం, బయట మాత్రం యాతన. వారు విశ్వాసులతో, "మేము మీతో కలసి ఉండలేదా?" అని ఎలుగెత్తి మాటిమాటికీ అరుస్తూ ఉంటారు. విశ్వాసులు ఇలా సమాధానం ఇస్తారు, "నిజమే, కాని మిమ్మల్ని మీరే స్వయంగా పరీక్షకు గురిచేసుకున్నారు. అవకాశవాదానికి పాల్పడ్డారు, సందేహంలో పడిపోయారు. లేనిపోని ఆశలు మిమ్మల్ని మోసం చేశాయి. చివరకు అల్లాహ్ నిర్ణయం వచ్చేసింది. అంతిమ క్షణం వరకూ ఆ గజమోస గాడు (షైతాన్) మిమ్మల్ని అల్లాహ్ విషయంలో మోసం చేస్తూ వచ్చాడు. కనుక ఈ రోజు మీనుండి ఎలాంటి పరిహారమూ తీసుకోబడదు. బాహాటంగా అవిశ్వాసానికి ఒడిగట్టిన వారి నుండి కూడా పరిహారమూ తీసుకోవటం జరగదు. మీ నివాస స్థలం నరకం, అదే మీ మంచి సెబ్బరలను చూస్తుంది. ఇది చాలా చెడ్డ పర్యవసానం.

7. దీనిద్వారా తెలిసేది ఏమిటంటే, అవిశ్వాసం, అవిశ్వాసుల బలం అధికమై, ఇస్లామ్ ప్రాబల్యం వహించే ఛాయలు పైకి ఎక్కడా కనిపించనప్పుడు, ఎవరు ఇస్లామ్ కోసం ధన ప్రాణాలొడ్డి పోరాడతారో, వారి స్థానాలను ఇస్లామ్, అవిశ్వాసాల మధ్య జరుగుతున్న సంఘర్షణలో ఇస్లామ్‌కు విజయం లభించిన తరువాత త్యాగాలు చేసేవారు పొందలేరు.

8. ఇది అల్లాహ్ చూపిన ఔదార్యం, ఆయన చేసిన మేలు; అల్లాహ్ ప్రసాదించిన సిరిసంపదలను మానవుడు ఆయన మార్గంలో ఖర్చుపెట్టినట్లయితే, ఆయన దానిని తనకీయబడిన రుణంగా భావిస్తాడు, అది మంచి రుణం (ఖరజెహసన్) అంటే, సత్సంకల్పంతో, స్వలాభాపేక్ష రహితంగా ఇవ్వబడే రుణం అని భావం. ఈ

**16 - 17** విశ్వాసుల[10] హృదయాలు అల్లాహ్ ప్రస్తావనతో చలించే సమయం, ఆయన అవతరింపజేసిన సత్యం ముందు వంగిపోయే సమయం ఇంకా రాలేదా? పూర్వం గ్రంథం ఇవ్వబడిన ప్రజల మాదిరిగా వారు మారిపోకూడదు. ఒక సుదీర్ఘకాలం వారిపై గడచిపోయింది. అప్పుడు వారి హృదయాలు కఠినమయ్యాయి. ఈనాడు వారిలో అనేకులు పరమ దుర్మార్గులు. బాగా తెలుసుకోండి, అల్లాహ్ భూమికి, మరణం తరువాత జీవం పోస్తాడని;[11] మేము సూచనలను మీకు స్పష్టంగా చూపించాము, బహుశా మీరు విజ్ఞతతో వ్యవహరిస్తారని.

**18 - 19** స్త్రీ పురుషులలో దానధర్మాలు[12] (సదఖా) చేసి అల్లాహ్‌కు మంచి రుణం ఇచ్చేవారికి, ఎన్నో రెట్లు పెంచి దానిని తిరిగి ఇవ్వటం జరుగుతుంది; వారికి ఎంతో మంచి ప్రతిఫలం లభిస్తుంది. అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తలనూ విశ్వసించిన వారే తమ ప్రభువు దృష్టిలో సత్యసంధులు[13] (సిద్దీఖ్) మరియు సాక్షులూను[14] (షహీద్). వారికి వారి ప్రతిఫలం, వారి జ్యోతి లభిస్తాయి. అవిశ్వాసానికి ఒడిగట్టిన వారు, మా వాక్యాలను నిరాకరించినవారు నరకవాసులవుతారు.

اَلَمْ يَاْنِ لِلَّذِيْنَ اٰمَنُوْٓا اَنْ تَخْشَعَ قُلُوْبُهُمْ
لِذِكْرِ اللّٰهِ وَ مَا نَزَلَ مِنَ الْحَقِّ ۙ وَلَا يَكُوْنُوْا
كَالَّذِيْنَ اُوْتُوا الْكِتٰبَ مِنْ قَبْلُ فَطَالَ عَلَيْهِمُ
الْاَمَدُ فَقَسَتْ قُلُوْبُهُمْ ؕ وَ كَثِيْرٌ مِّنْهُمْ
فٰسِقُوْنَ ﴿۱۶﴾ اِعْلَمُوْٓا اَنَّ اللّٰهَ يُحْيِ الْاَرْضَ
بَعْدَ مَوْتِهَا ؕ قَدْ بَيَّنَّا لَكُمُ الْاٰيٰتِ لَعَلَّكُمْ
تَعْقِلُوْنَ ﴿۱۷﴾ اِنَّ الْمُصَّدِّقِيْنَ وَالْمُصَّدِّقٰتِ وَ
اَقْرَضُوا اللّٰهَ قَرْضًا حَسَنًا يُّضٰعَفُ لَهُمْ وَ لَهُمْ
اَجْرٌ كَرِيْمٌ ﴿۱۸﴾ وَ الَّذِيْنَ اٰمَنُوْا بِاللّٰهِ وَ رُسُلِهٖٓ
اُولٰٓئِكَ هُمُ الصِّدِّيْقُوْنَ ۖ وَ الشُّهَدَآءُ عِنْدَ
رَبِّهِمْ ؕ لَهُمْ اَجْرُهُمْ وَنُوْرُهُمْ ؕ وَ الَّذِيْنَ
كَفَرُوْا وَكَذَّبُوْا بِاٰيٰتِنَآ اُولٰٓئِكَ اَصْحٰبُ
الْجَحِيْمِ ﴿۱۹﴾ ع ٢ ١٨

రుణం గురించి అల్లాహ్ రెండు వాగ్దానాలు చేశాడు. ఒకటి; ఆ రుణాన్ని బహువిధాలుగా పెంచి చెల్లిస్తాడు. రెండు; ఆయన దానికి తన తరఫు నుండి ఉత్తమ ప్రతిఫలాన్ని అందజేస్తాడు.

9. ఇక్కడ పాఠకుని మనస్సులో ఒక సందేహం పొడసూపవచ్చు : వారి ముందు వెలుగు పరుగెత్తటం అంటే ఏమిటో అర్థమవుతుంది, కాని వెలుగు కేవలం కుడివైపుననే పరుగెత్తటం అంటే అర్థం ఏమిటీ? వారి ఎడమ వైపున చీకటి ఉన్నదనా దాని అర్థం? దానికి సమాధానం ఇది : ఒక వ్యక్తి తన కుడిచేతిలో జ్యోతితో నడుస్తూ ఉంటే, దానివల్ల అతని ఎడమ భాగం కూడ ప్రకాశిస్తుంది. కాని యదార్థమేమిటంటే, జ్యోతి అతని కుడి చేతిలో ఉంటుంది.

10. ఇక్కడ "విశ్వాసులు" అంటే ముస్లిమ్‌లందరూ అని కాదు. కాని విశ్వసించి మహాప్రవక్త (సఅసమ్) అనుచరులలో చేరి కూడ తమ హృదయాలలో ఇస్లామ్ తత్వం మచ్చుకు కూడ కనిపించనటువంటి ఒక ప్రత్యేక ముస్లిమ్ వర్గం అని భావం.

11. ఇక్కడ ఏ సందర్భాన్నిబట్టి ఈ విషయం చెప్పబడిందో, ఆ సందర్భాన్ని బాగా అవగాహన చేసుకోవాలి. దివ్య ఖురాన్‌లో పలుచోట్ల, దైవప్రవక్త పదవిని, గ్రంథం అవతరణను వర్షపు శుభాలతో పోల్చటం జరిగింది. ఎందుకంటే, వర్షం వలన భూమి ఎటువంటి ప్రభావానికి గురిఅవుతుందో, అదే రీతిలో దైవప్రవక్తల వలన, దైవగ్రంథం వలన మానవజాతి కూడ ప్రభావితమవుతుంది. ఏమాత్రం సారం ఉన్న భూమి అయినా, వర్షం చినుకు పడగానే పైరుపచ్చలతో కళకళలాడుతుంటుంది. కాని బంజరు భూమి మాత్రం బంజరు భూమిగానే ఉంటుంది.

اِعۡلَمُوۡۤا اَنَّمَا الۡحَيٰوةُ الدُّنۡيَا لَعِبٌ وَّلَهۡوٌ وَّ
زِيۡنَةٌ وَّتَفَاخُرٌۢ بَيۡنَكُمۡ وَتَكَاثُرٌ فِى الۡاَمۡوَالِ
وَالۡاَوۡلَادِ‌ؕ كَمَثَلِ غَيۡثٍ اَعۡجَبَ الۡكُفَّارَ
نَبَاتُهٗ ثُمَّ يَهِيۡجُ فَتَرٰٮهُ مُصۡفَرًّا ثُمَّ يَكُوۡنُ
حُطٰمًا‌ ؕ وَفِى الۡاٰخِرَةِ عَذَابٌ شَدِيۡدٌ ۙ
وَّمَغۡفِرَةٌ مِّنَ اللّٰهِ وَرِضۡوَانٌ‌ ؕ وَمَا الۡحَيٰوةُ
الدُّنۡيَاۤ اِلَّا مَتَاعُ الۡغُرُوۡرِ ۝٢٠ سَابِقُوۡۤا اِلٰى
مَغۡفِرَةٍ مِّنۡ رَّبِّكُمۡ وَجَنَّةٍ عَرۡضُهَا كَعَرۡضِ
السَّمَآءِ وَالۡاَرۡضِۙ اُعِدَّتۡ لِلَّذِيۡنَ اٰمَنُوۡا
بِاللّٰهِ وَرُسُلِهٖ‌ؕ ذٰلِكَ فَضۡلُ اللّٰهِ يُؤۡتِيۡهِ مَنۡ
يَّشَآءُ‌ ؕ وَاللّٰهُ ذُو الۡفَضۡلِ الۡعَظِيۡمِ ۝٢١

**20 - 21** బాగా తెలుసుకోండి, ఈ ప్రపంచ జీవితం ఒక ఆట, ఒక వినోదం, బాహ్య పటాటోపం, పరస్పరం ప్రగల్భాలు పలకటం, సంపద, సంతానాల విషయంలో ఒకరిపై ఒకరు ఆధిక్యం పొందటానికి ప్రయత్నించటం తప్ప మరేమీ కాదు. దాని దృష్టాంతం ఇలా ఉంది: ఒక వర్షం కురిసింది. అప్పుడు దాని వల్ల మొలకెత్తి పెరిగిన చెట్లూ చేమలను చూచి, రైతులు సంబరపడ్డారు. తరువాత, అవే పండుతాయి. ఆ తరువాత అవి పసుపుపచ్చగా మారిపోవటాన్ని నీవు చూస్తావు. ఆపై అవి ఎండిపోయి పొట్టుగా మారిపోతాయి. దీనికి భిన్నంగా, పరలోకం ఇలా ఉంటుంది: అక్కడ తీవ్రమైన శిక్ష ఉంటుంది, అల్లాహ్ క్షమాభిక్ష, ఆయన ప్రసన్నత ఉంటాయి. ప్రాపంచిక జీవితం ఒక మాయ తడిక తప్ప మరేమీ కాదు. మీ ప్రభువు క్షమాభిక్ష వైపునకు పరుగెత్తండి, ఒకరికంటే ఒకరు ముందుకు పోయే కృషి చేయండి; ఆకాశాలంత, భూమియంత విశాలమైన[15] స్వర్గం వైపునకు పరుగెత్తండి. అది అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తలనూ విశ్వసించిన వారి కొరకు సిద్ధం చేయబడింది. ఇది అల్లాహ్ అనుగ్రహం; తాను కోరిన వారికి ఆయన దానిని ప్రసాదిస్తాడు. అల్లాహ్ ఎంతో అనుగ్రహం కలవాడు.

---

12. 'సదఖా' అనే పదం ఉర్దూ భాషలోనైతే ఎన్నో చెడ్డ అర్థాలలో వాడబడుతుంది. కాని ఇస్లామ్ పరిభాషలో నిండు హృదయంతో, సత్సంకల్పంతో, కేవలం అల్లాహ్ తృప్తికోసం ఇవ్వబడే, ఆడంబరం, ఎత్తిపొడుపులేని దానధర్మాలు అని అర్థం.
13. "సిద్దీఖ్" (సత్యసంధులు) "సిద్ఖ్" యొక్క అతిశయోక్తి రూపం. 'సాదిఖ్' అంటే సత్యసంధుడు; సిద్దీఖ్ అంటే అత్యంత సత్యసంధుడు. అంటే, ఎటువంటి దోషములూ లేని రుజువర్తనుడు, సత్యం, రుజువర్తనంల నుండి ఎన్నడూ వైదొలగనివాడు, అంతరాత్మకు వ్యతిరేకంగా ఎన్నడూ మాట్లాడనివాడు, ఒక విషయాన్ని విశ్వసిస్తే, నిండు మనస్సుతో విశ్వసించేవాడు, తాను నమ్మిన దానిని త్రికరణశుద్ధిగా ఆచరించేవాడు, ఒక విశ్వాసి ఎలా ఉండాలో ఆ విషయాన్ని తన ఆచరణ ద్వారా నిరూపించినవాడు.
14. షహీద్ అంటే ఇక్కడ తన మాటల ద్వారా, తన చేతల ద్వారా సత్యానికి సాక్ష్యమిచ్చే వ్యక్తి అని అర్థం.
15. ఈ ఆయతును ఆలె ఇమ్రాన్ సూరాలోని 133వ ఆయతుతో కలిపి చదివితే, ఒక భావం ఏర్పడుతుంది : స్వర్గంలో ఒక మనిషికి లభించే భవనాలు, ఉద్యానవనాలు అతనికి నివాస స్థలాలుగా మాత్రమే ఉంటాయి. కాని సృష్టి అంతా అతనికి విహార స్థలమే.

مَآ اَصَابَ مِنْ مُّصِيْبَةٍ فِي الْاَرْضِ وَلَا فِيْٓ
اَنْفُسِكُمْ اِلَّا فِيْ كِتٰبٍ مِّنْ قَبْلِ اَنْ نَّبْرَاَهَا ؕ
اِنَّ ذٰلِكَ عَلَى اللّٰهِ يَسِيْرٌ ﴿۲۲﴾ لِّكَيْلَا تَاْسَوْا عَلٰى
مَا فَاتَكُمْ وَلَا تَفْرَحُوْا بِمَآ اٰتٰىكُمْ ؕ وَاللّٰهُ لَا
يُحِبُّ كُلَّ مُخْتَالٍ فَخُوْرِ ۙ ﴿۲۳﴾ الَّذِيْنَ يَبْخَلُوْنَ
وَيَاْمُرُوْنَ النَّاسَ بِالْبُخْلِ ؕ وَمَنْ يَّتَوَلَّ فَاِنَّ
اللّٰهَ هُوَ الْغَنِيُّ الْحَمِيْدُ ﴿۲۴﴾ لَقَدْ اَرْسَلْنَا
رُسُلَنَا بِالْبَيِّنٰتِ وَاَنْزَلْنَا مَعَهُمُ الْكِتٰبَ
وَالْمِيْزَانَ لِيَقُوْمَ النَّاسُ بِالْقِسْطِ ۚ وَاَنْزَلْنَا
الْحَدِيْدَ فِيْهِ بَاْسٌ شَدِيْدٌ وَّمَنَافِعُ لِلنَّاسِ
وَلِيَعْلَمَ اللّٰهُ مَنْ يَّنْصُرُهٗ وَرُسُلَهٗ بِالْغَيْبِ ؕ
اِنَّ اللّٰهَ قَوِيٌّ عَزِيْزٌ ﴿۲۵﴾ ع ٣ ١٩

**22 - 24** భూమిపై గానీ లేదా స్వయంగా మీ ఆత్మలపై గానీ అవతరించే ఏ ఆపద అయినా సరే, దానిని మేము ఉనికిలోకి తీసుకువచ్చే ముందు ఒక గ్రంథం (అంటే భాగ్య గ్రంథం)లో వ్రాసి పెట్టకుండా ఉండలేదు. అలా చేయటం అల్లాహ్‌కు చాలా సులభం. (ఇదంతా ఎందుకంటే) మీకు ఎలాంటి నష్టం జరిగినా, దానికి మీరు బాధపడకుండా ఉండాలని, అల్లాహ్ మీకు ఏదైనా ప్రసాదిస్తే, దానికి మీరు మురిసిపోకుండా ఉండాలని. తమను తాము గొప్ప వారమని భావించి, అహంభావం ప్రదర్శించే వారిని అల్లాహ్ ప్రేమిం చడు. వారు స్వయంగా లోభత్వం పాటించటమే కాక, ఇతరు లను కూడా లోభత్వానికి పురికొలుపుతారు. ఇక, ఒకవేళ ఎవడైనా ముఖం త్రిప్పుకుంటే, సద్గుణ సంపన్నుడైన అల్లాహ్ అక్కరలేనివాడు.

**25** మేము మా ప్రవక్తలను స్పష్టమైన సూచనలతో, హితోపదేశా లతో పంపాము. వారితో పాటు గ్రంథాన్నీ, త్రాసునూ అవత రింపజేశాము; ప్రజలు న్యాయంపై స్థిరంగా[16] నిలబడాలని. ఇనుమునూ దింపాము. అందులో మహత్తరమైన శక్తి ఉన్నది, ప్రజలకు ప్రయోజనాలూ[17] ఉన్నాయి. ఇలా ఎందుకు చేయబడిం దంటే, ఆయనను చూడకుండానే ఎవడు ఆయనకూ, ఆయన ప్రవక్తలకూ సహాయపడతాడో అల్లాహ్‌కు తెలియాలని. నిశ్చ యంగా అల్లాహ్ ఎంతో దృఢమైనవాడు, సర్వశక్తిమంతుడూను.

16. ఈ చిన్న వాక్యంలో దైవప్రవక్తల సందేశసారం ఏమిటో చెప్పబడింది. అల్లాహ్ తరఫు నుండి ప్రపంచంలో అడుగుబెట్టిన దైవప్రవక్తలందరూ మూడు విషయాలను తీసుకువచ్చారు : (1) బయ్యినాత్, అంటే, స్పష్టమైన సూచనలు, ప్రస్ఫుటమైన నిదర్శనాలు, తేటతెల్లమైన ఉపదేశాలు. (2) గ్రంథం : మానవుడి మార్గదర్శకత్వానికి కావలసిన ఉపదేశాలన్నీ ఇందులో వ్రాయబడి ఉన్నాయి; ప్రజలు సన్మార్గం కోసం దాని వైపునకు మరలగలుగుతారు. (3) మీజాన్, అంటే, సత్యాసత్యాల గీటురాయి. అది కచ్చితంగా తరాజుమాదిరిగా తూచి, ఆలోచనలు, నీతి నియమాలు, దైనందిన వ్యవహారాలలో కలతరేగినప్పుడు ఉత్పన్నమయ్యే విభిన్న అతివాదాల మధ్య న్యాయం ఏమిటో చెబుతుంది.

17. దైవప్రవక్తలు సందేశం ఏమిటో చెప్పిన తరువాత, ఇలా అనటం ఇక్కడ ఇనుము అంటే రాజకీయ బలం, సైనిక బలం అనే అర్థాన్ని సూచిస్తుంది. ఈ ఆయతు తాత్పర్యం ఇది : అల్లాహ్ తన ప్రవక్తలను న్యాయసంస్థాపనానికి సంబంధించిన ఒక ప్రణాళికను మాత్రమే ప్రజల ముందు పెట్టటానికి పంపలేదు. ఆ న్యాయస్థాపన కోసం ఆచరణాత్మకమైన గట్టి ప్రయత్నం చేయటం కూడ వారి బాధ్యత. న్యాయస్థాపనార్థం అవసరమైన శక్తినంతటినీ సమీకరించటం కూడ వారి బాధ్యతే. ఈ వ్యవస్థను విచ్ఛిన్నపరచే వారిని శిక్షించటం, దానిని ఎదిరించే వారి శక్తిని అణగద్రొక్కటం కూడ వారి బాధ్యతే.

**26 - 27** మేము నూహ్‌నూ, ఇబ్రాహీమ్‌నూ పంపాము. ఆ ఉభయుల సంతతిలో ప్రవక్త పదవినీ, గ్రంథాన్నీ పెట్టాము. తరువాత వారి సంతానంలో కొందరు సన్మార్గాన్ని అవలంబించారు; కాని చాలా మంది అవిధేయులై పోయారు. వారి తరువాత మేము వరుసగా ప్రవక్తలను పంపాము. వారందరి తరువాత మర్యమ్ కుమారుడు ఈసాను ప్రభవింపజేశాము, ఆయనకు ఇన్‌జీల్‌ను ప్రసాదించాము. ఆయనను అనుసరించిన వారి హృదయాలలో మేము జాలిని, కరుణను కలిగించాము. వైరాగ్యాన్ని[18] (రుహ్‌బానియత్) వారు స్వయంగా కనిపెట్టారు. మేము దానిని వారిపై విధించలేదు. కాని అల్లాహ్ ప్రసన్నతను పొందటానికి వారే స్వయంగా ఈ దురాచారాన్ని సృష్టించారు. తరువాత దానిని పాటించే విషయంలో, న్యాయం చేకూర్చలేకపోయారు. వారిలో విశ్వసించిన వారికి మేము వారి ప్రతిఫలాన్ని ప్రసాదించాము. కాని వారిలో పలువురు అవిధేయులు.

**28 - 29** విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్‌కు భయపడండి, ఆయన ప్రవక్త (ముహమ్మద్ - సఅసమ్)ను విశ్వసించండి. అల్లాహ్ మీకు తన కారుణ్యంలో నుంచి రెట్టింపు భాగాన్ని ప్రసాదిస్తాడు, మీకు జ్యోతిని ప్రసాదిస్తాడు, దాని వెలుగులో మీరు నడుస్తారు, మీ పొరపాట్లను క్షమిస్తాడు. అల్లాహ్ ఎంతో క్షమించేవాడు, కనికరించేవాడూను. అల్లాహ్ అనుగ్రహంపై వారికి ఏ విధమైన గుత్తాధిపత్యం లేదనీ, అల్లాహ్ అనుగ్రహం స్వయంగా ఆయన చేతులలోనే ఉన్నదనీ, తాను కోరిన వారికి ఆయన దానిని ప్రసాది స్తాడనీ, ఆయన గొప్ప అనుగ్రహశాలి అనీ గ్రంథ ప్రజలు తెలుసుకోవాలని.

وَلَقَدْ اَرْسَلْنَا نُوْحًا وَّ اِبْرٰهِيْمَ وَ جَعَلْنَا فِيْ
ذُرِّيَّتِهِمَا النُّبُوَّةَ وَالْكِتٰبَ فَمِنْهُمْ مُّهْتَدٍ ۚ وَ
كَثِيْرٌ مِّنْهُمْ فٰسِقُوْنَ ﴿٢٦﴾ ثُمَّ قَفَّيْنَا عَلٰٓى
اٰثَارِهِمْ بِرُسُلِنَا وَ قَفَّيْنَا بِعِيْسَى ابْنِ مَرْيَمَ
وَاٰتَيْنٰهُ الْاِنْجِيْلَ ۙ وَ جَعَلْنَا فِيْ قُلُوْبِ الَّذِيْنَ
اتَّبَعُوْهُ رَاْفَةً وَّ رَحْمَةً ؕ وَ رَهْبَانِيَّةَ ۨ
ابْتَدَعُوْهَا مَا كَتَبْنٰهَا عَلَيْهِمْ اِلَّا ابْتِغَآءَ
رِضْوَانِ اللّٰهِ فَمَا رَعَوْهَا حَقَّ رِعَايَتِهَا ۚ فَاٰتَيْنَا
الَّذِيْنَ اٰمَنُوْا مِنْهُمْ اَجْرَهُمْ ۚ وَكَثِيْرٌ مِّنْهُمْ
فٰسِقُوْنَ ﴿٢٧﴾ يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا اتَّقُوا اللّٰهَ
وَاٰمِنُوْا بِرَسُوْلِهٖ يُؤْتِكُمْ كِفْلَيْنِ مِنْ رَّحْمَتِهٖ
وَيَجْعَلْ لَّكُمْ نُوْرًا تَمْشُوْنَ بِهٖ وَيَغْفِرْ لَكُمْ ؕ
وَاللّٰهُ غَفُوْرٌ رَّحِيْمٌ ﴿٢٨﴾ ۙ لِّئَلَّا يَعْلَمَ اَهْلُ
الْكِتٰبِ اَلَّا يَقْدِرُوْنَ عَلٰى شَيْءٍ مِّنْ فَضْلِ
اللّٰهِ وَ اَنَّ الْفَضْلَ بِيَدِ اللّٰهِ يُؤْتِيْهِ مَنْ
يَّشَآءُ ؕ وَ اللّٰهُ ذُو الْفَضْلِ الْعَظِيْمِ ﴿٢٩﴾ ع ٢٠

18. 'రుహ్ బానియత్' (వైరాగ్యం) అంటే ప్రపంచాన్ని విడిచిపెట్టడం. లౌకిక జీవితం నుండి పారిపోయి, కొండలలోనూ, కోనలలోనూ తలదాచుకోవటం లేదా మఠాలలో ఉండటం.

## 58. అల్ ముజాదలహ్

ఆయతులు 22 | అవతరణ మదీనాలో

٥٨ سُوْرَةُ الْمُجَادَلَةِ مَدَنِيَّةٌ ١٠٥

أياتها ٢٢ | ركوعاتها ٣

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 4** ...తన భర్త వ్యవహారంలో నీతో వాదిస్తూ ఉన్న, అల్లాహ్‌తో మొరపెట్టుకుంటూ ఉన్న స్త్రీ మాటలను అల్లాహ్[1] విన్నాడు. అల్లాహ్ మీ ఉభయుల సంభాషణను వింటున్నాడు; ఆయన అన్నీ వినేవాడు, అన్నీ చూసేవాడూను. మీలో ఎవరు తమ భార్యలను "జిహార్"[2] ద్వారా దూరంగా ఉంచుతారో వారికి వారి భార్యలు తల్లులు కాజాలరు. వారిని కన్నవారే వారి తల్లులు, వారు ఎంతో అనుచితమైన, ఎంతో అసత్యమైన మాటను పలుకుతున్నారు. యథార్థమేమిటంటే అల్లాహ్ ఎంతో క్షమించేవాడు, (దోషాలను) ఉపేక్షించేవాడూను.[3] ఎవరైనా తమ భార్యలను "జిహార్" ద్వారా దూరంగా ఉంచి, ఆ తరువాత తాము అన్న మాటను వారు ఉపసంహరించు[4]కోదలిస్తే, వారు ఉభయులు ఒకరినొకరు తాకకముందే, ఒక బానిసను విడుదల చేయవలసి ఉంటుంది. దీనిద్వారా మీకు ఉపదేశం చేయబడుతోంది; మీరు చేసేదంతా అల్లాహ్‌కు తెలుసు.[5] ఎవరికైనా బానిస లభించని పక్షంలో, ఉభయులు ఒకరినొకరు తాకకముందే, అతను వరుసగా రెండు నెలలపాటు ఉపవాసముండాలి.[6] ఈ పనికూడ చేసే శక్తిలేనివాడు, అరవై మంది నిరుపేదలకు భోజనం పెట్టాలి.[7]

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

قَدْ سَمِعَ اللّٰهُ قَوْلَ الَّتِيْ تُجَادِلُكَ فِيْ زَوْجِهَا
وَ تَشْتَكِيْٓ اِلَى اللّٰهِ ۖ وَ اللّٰهُ يَسْمَعُ تَحَاوُرَكُمَا ؕ
اِنَّ اللّٰهَ سَمِيْعٌۢ بَصِيْرٌ ① اَلَّذِيْنَ يُظٰهِرُوْنَ
مِنْكُمْ مِّنْ نِّسَآئِهِمْ مَّا هُنَّ اُمَّهٰتِهِمْ ؕ اِنْ
اُمَّهٰتُهُمْ اِلَّا الّٰٓـِٔيْ وَلَدْنَهُمْ ؕ وَ اِنَّهُمْ لَيَقُوْلُوْنَ
مُنْكَرًا مِّنَ الْقَوْلِ وَزُوْرًا ؕ وَ اِنَّ اللّٰهَ لَعَفُوٌّ
غَفُوْرٌ ② وَ الَّذِيْنَ يُظٰهِرُوْنَ مِنْ نِّسَآئِهِمْ
ثُمَّ يَعُوْدُوْنَ لِمَا قَالُوْا فَتَحْرِيْرُ رَقَبَةٍ مِّنْ
قَبْلِ اَنْ يَّتَمَآسَّا ؕ ذٰلِكُمْ تُوْعَظُوْنَ بِهٖ ؕ وَ اللّٰهُ
بِمَا تَعْمَلُوْنَ خَبِيْرٌ ③ فَمَنْ لَّمْ يَجِدْ فَصِيَامُ
شَهْرَيْنِ مُتَتَابِعَيْنِ مِنْ قَبْلِ اَنْ يَّتَمَآسَّا ۚ
فَمَنْ لَّمْ يَسْتَطِعْ فَاِطْعَامُ سِتِّيْنَ مِسْكِيْنًا ؕ

الجزء ٢٨

1. ఈ ఆయతులు ఖవ్‌లా బిన్‌తె సాలబహ్ అనే స్త్రీ వ్యవహారం గురించి అవతరించాయి. ఆమెను ఆమె భర్త "జిహార్" చేశాడు. ఇస్లామ్‌లో జిహార్‌కు సంబంధించిన ఆజ్ఞ ఏమిటో తెలుపమని అడిగేందుకు ఆమె మహాప్రవక్త (సఅసమ్) వద్దకు వచ్చింది. అప్పటి వరకు ఈ వ్యవహారం గురించి అల్లాహ్ తరఫు నుండి ఏ ఆజ్ఞా అవతరించలేదు. కనుక ఆయన "నా అభిప్రాయంలో నీవు నీ భర్తకు నిషిద్ధమైపోయావు" అని అన్నారు. అప్పుడు ఆమె రోదిస్తూ, తన జీవితం, తన పిల్లల జీవితం నాశనమైపోతుందని, ఫిర్యాదు చేసింది. ఈ సమయంలోనే, నా ఇల్లు విచ్ఛిన్నం కాకుండా సురక్షితంగా ఉండేందుకు మార్గమేదైనా చూపమని ఆమె విలపిస్తూ మహాప్రవక్త (సఅసమ్)ను వేడుకున్నప్పుడు, అల్లాహ్ తరఫు నుండి 'వహీ' అవతరించింది, ఈ సమస్యకు సంబంధించి ఆజ్ఞ ఏమిటో చెప్పబడింది.
2. అరేబియాలో ఇటువంటి సందర్భాలు అనేకం తరచూ ఉత్పన్నమయ్యేవి : భార్యాభర్తల మధ్య కలతలు చెలరేగినప్పుడు, భర్త ఆగ్రహోదగ్రుడై, "నీవు నాకు నా తల్లి వీపు వంటి దానివి" అని అంటాడు. దీని అసలు భావం ఏమిటంటే, "నీతో సంభోగించటం నా తల్లితో సంభోగించటం లాంటిది." ఈ కాలంలో కూడ, తెలివి

ذٰلِكَ لِتُؤْمِنُوْا بِاللّٰهِ وَ رَسُوْلِهٖ ؕ وَ تِلْكَ
حُدُوْدُ اللّٰهِ ؕ وَ لِلْكٰفِرِيْنَ عَذَابٌ اَلِيْمٌ ④ اِنَّ
الَّذِيْنَ يُحَآدُّوْنَ اللّٰهَ وَ رَسُوْلَهٗ كُبِتُوْا كَمَا
كُبِتَ الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ وَ قَدْ اَنْزَلْنَاۤ اٰيٰتٍۭ
بَيِّنٰتٍ ؕ وَ لِلْكٰفِرِيْنَ عَذَابٌ مُّهِيْنٌ ⑤ يَوْمَ
يَبْعَثُهُمُ اللّٰهُ جَمِيْعًا فَيُنَبِّئُهُمْ بِمَا عَمِلُوْا ؕ
اَحْصٰىهُ اللّٰهُ وَ نَسُوْهُ ؕ وَ اللّٰهُ عَلٰى كُلِّ شَيْءٍ
شَهِيْدٌ ⑥

**... 4 - 6** మీరు అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ విశ్వసించేందుకు ఈ ఆజ్ఞ ఇవ్వబడుతోంది.[8] ఇవి అల్లాహ్ నిర్ణయించిన హద్దులు. తిరస్కారులకు బాధాకరమైన శిక్షపడుతుంది. అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ వ్యతిరేకించే వారు తీవ్రంగా అవమానంపాలు చేయబడతారు, వారికి పూర్వం గతించిన వారు అవమానంపాలు చేయబడిన విధంగా. మేము స్పష్టమైన ఆయతులను అవతరింపజేశాము, ఇక తిరస్కారులకు తీవ్ర అవమానంతో కూడుకున్న శిక్షపడుతుంది. అల్లాహ్ వారందరినీ మళ్లీ బ్రతికించి లేపి వారేమేమి చేసి వచ్చిందీ వారికి తెలియజేసే రోజున (వారికి అవమానభరితమైన శిక్ష పడుతుంది). వారు మరచిపోయారు కాని, అల్లాహ్ వారు చేసినవన్నీ ఒక్కొక్క దానిని లెక్కబెట్టి భద్రంగా ఉంచాడు. అల్లాహ్ ప్రతి ఒక్కదానికీ సాక్షిగా ఉన్నాడు.

తక్కువవారు చాలమంది భార్యతో కలహించి, ఆమెను తల్లితో, సోదరితో, కూతురితో పోలుస్తారు. దాని అర్థం ఏమిటంటే, మనిషి ఇప్పుడు ఆమెను తన భార్యగాకాక, తనకు నిషిద్ధమైన స్త్రీల మాదిరిగా భావిస్తాడు. దీనినే జిహార్ అంటారు. అజ్ఞానపు యుగంలో, అరేబియావాసులు దీనిని (జిహార్‌ను) విడాకుల కంటే కూడ ఎంతో తీవ్రమైన విషయంగా పరిగణించేవారు.

3. అంటే, ఈ చేష్ట ఎటువంటిదంటే, అది చేసిన మనిషికి చాల కఠినమైన శిక్ష విధించాలి. కాని ఇది అల్లాహ్ కనికరం; ఆయన మొదట 'జిహార్'కు సంబంధించిన అజ్ఞానకాలపు సంప్రదాయాన్ని రద్దుచేసి మీ కుటుంబ జీవితం నాశనం కాకుండా కాపాడాడు. తరువాత, ఈ చేష్టకు పాల్పడేవారికి చాల తేలికపాటి శిక్షను ప్రతిపాదించాడు.

4. దీనికి రెండర్థాలు చెప్పవచ్చు : ఒకటి, "వారు తాము అన్న మాటకు పరిహారం చెల్లించదలిస్తే", రెండు, "వారు ఈ మాట పలకటం ద్వారా నిషిద్ధం చేసుకోదలచిన దానిని వారు తమ కోసం ధర్మసమ్మతం చేసుకోదలిస్తే."

5. అంటే, ఒకవేళ ఒక మనిషి తన ఇంట్లో రహస్యంగా తన భార్యతో జిహార్ చేస్తే, తరువాత పరిహారం చెల్లించకుండానే భార్యాభర్తల మధ్య గతంలో మాదిరిగా దాంపత్యపు సంబంధాలు కొనసాగితే, లోకంలో ఇది ఎవరికీ తెలియకపోయినా, అల్లాహ్‌కు మాత్రం ఈ విషయం తెలిసితీరుతుంది. అల్లాహ్ శిక్ష నుండి తప్పించుకుని బయటపడటం వారికి ఏ విధంగానూ సాధ్యం కాదు.

6. అంటే, ఎడతెగకుండా రెండు నెలలపాటు ఉపవాసం ఉండాలి. మధ్యలో నాగాలు ఉండకూడదు.

7. అంటే, రెండు పూటలా కడుపునిండా అన్నం పెట్టాలి. వండిన అన్నమైనా సరే లేక స్వయం పాకానికి కావలసిన పదార్థాలైనసరే ఇవ్వాలి. 60 మందికి ఒక రోజు భోజనంగానీ, ఒక మనిషికి 60 రోజులుగానీ భోజనం ఏర్పాటు చేయాలి.

أَلَمْ تَرَ أَنَّ اللّٰهَ يَعْلَمُ مَا فِي السَّمٰوٰتِ وَ مَا فِي
الْأَرْضِ ۖ مَا يَكُوْنُ مِنْ نَّجْوٰى ثَلٰثَةٍ إِلَّا هُوَ
رَابِعُهُمْ وَ لَا خَمْسَةٍ إِلَّا هُوَ سَادِسُهُمْ وَ لَا
أَدْنٰى مِنْ ذٰلِكَ وَ لَا أَكْثَرَ إِلَّا هُوَ مَعَهُمْ أَيْنَ
مَا كَانُوْا ۚ ثُمَّ يُنَبِّئُهُمْ بِمَا عَمِلُوْا يَوْمَ
الْقِيٰمَةِ ۖ إِنَّ اللّٰهَ بِكُلِّ شَيْءٍ عَلِيْمٌ ٧ أَلَمْ تَرَ
إِلَى الَّذِيْنَ نُهُوْا عَنِ النَّجْوٰى ثُمَّ يَعُوْدُوْنَ لِمَا
نُهُوْا عَنْهُ وَ يَتَنٰجَوْنَ بِالْإِثْمِ وَ الْعُدْوَانِ
وَمَعْصِيَتِ الرَّسُوْلِ ۫ وَ إِذَا جَآءُوْكَ حَيَّوْكَ
بِمَا لَمْ يُحَيِّكَ بِهِ اللّٰهُ ۙ وَيَقُوْلُوْنَ فِي أَنْفُسِهِمْ
لَوْ لَا يُعَذِّبُنَا اللّٰهُ بِمَا نَقُوْلُ ۖ حَسْبُهُمْ
جَهَنَّمُ ۚ يَصْلَوْنَهَا ۚ فَبِئْسَ الْمَصِيْرُ ٨

**7 - 8** భూమీ, ఆకాశాలలో ఉన్న ప్రతి వస్తువును గురించి అల్లాహ్‌కు తెలుసనే విషయం నీకు తెలియదా?[9] ముగ్గురు వ్యక్తులు కలసి ఏవైనా మంతనాలు జరిపినప్పుడు, వారిమధ్య నాలుగోవాడుగా అల్లాహ్ కాకుండా ఉండటం అనేది ఎన్నడూ జరగదు. లేదా ఐదుగురు వ్యక్తులు కలసి మంతనాలు జరిపినప్పుడు, వారిలో ఆరో వాడుగా అల్లాహ్ కాకుండా ఉండటం అనేది కూడ ఎన్నడూ జరగదు. రహస్యాలోచనలు జరిపేవారు వీరికంటె తక్కువ మంది ఉన్నా లేక ఎక్కువమంది ఉన్నా, వారు ఎక్కడ ఉన్నా, అల్లాహ్ వారితో పాటు ఉంటాడు. ఆ తరువాత ప్రళయదినాన, ఆయన వారికి వారేమేమి చేసి వచ్చారో అంతా తెలియజేస్తాడు. అల్లాహ్ ప్రతి విషయం తెలిసినవాడు. రహస్య సమాలోచనలు చేయవద్దని నిషేధించటం జరిగినప్పటికీ, తిరిగి, నిషేధించబడిన దానినే చేస్తున్న వారిని నీవు చూడలేదా? వారు రహస్యంగా, పాపమూ, దౌర్జన్యమూ ప్రవక్త పట్ల అవిధేయతలకూ సంబంధించిన విషయాలను పరస్పరం మాట్లాడుకుంటారు. వారు నీ వద్దకు వచ్చినప్పుడు, అల్లాహ్ నీకు సలామ్ చేయని[10] రీతిలో వారు నీకు సలామ్ చేస్తారు. మనం చెప్పుకునే ఈ మాటలకు అల్లాహ్ మనల్ని ఎందుకు శిక్షించడు? అని వారు తమ మనస్సులలో అనుకుంటారు-వారికి నరకమే చాలు; వారు దానికే ఇంధనమవుతారు. వారి పర్యవసానం అత్యంత ఘోరమైనది.

8. ఇక్కడ "విశ్వసించటం" అంటే, చిత్తశుద్ధిగల విశ్వాసుల వైఖరివంటి వైఖరిని అవలంబించడం అని అర్థం.

9. ఇక్కడ నుండి 10వ ఆయతు వరకు వరుసగా ముస్లిమ్ సమాజంలోని కపటులు అప్పుడు అవలంబించిన వైఖరిని ఖండించటం జరిగింది. పైకి మాత్రం వారు ముస్లిమ్ సమాజంలోని మనుషులుగా కనిపించినా, విశ్వాసులకు భిన్నంగా, రహస్యంగా తమ బృందాన్ని ఒక దానిని ఏర్పాటు చేసుకున్నారు. ఎప్పుడు ముస్లిమ్‌లు వారిని పరికించినా, వారు రహస్యంగా గుసగుసలాడుకోవటం కనిపించేది. ఈ రహస్య సమాలోచనలలోనే, ముస్లిమ్ సమాజంలో విభేదాలు సృష్టించటానికీ, కల్లోలాన్ని రేకెత్తించటానికీ, భయోత్పాతాలను కలిగించటానికీ అనేకమైన పన్నాగాలు పన్నేవారు, కొత్త కొత్త వదంతులను వ్యాపింపజేసేవారు.

10. ఇది యూదుల, కపటుల సమిష్టి వైఖరి. అనేక హదీసులలో ఈ విషయం వచ్చింది : యూదులు కొందరు మహాప్రవక్త (సఅసమ్) కడకు వచ్చి, "అస్సామ్ అలైక యా అబుల్ ఖాశిమ్" అని అన్నారు. అంటే, "అస్సామ్ అలైక"నుఎలా ఉచ్చరించేవారంటే, దానిని విన్నవారు, వారు సలామ్ అన్నారని భావించేవారు. కాని వారు నిజానికి "సామ్" అని అన్నారు, "సలామ్" అని అనలేదు. దాని అర్థం మరణం.

يَاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْۤا اِذَا تَنَاجَيْتُمْ فَلَا تَتَنَاجَوْا بِالْاِثْمِ وَ الْعُدْوَانِ وَ مَعْصِيَتِ الرَّسُوْلِ وَ تَنَاجَوْا بِالْبِرِّ وَ التَّقْوٰى ؕ وَ اتَّقُوا اللّٰهَ الَّذِیْۤ اِلَيْهِ تُحْشَرُوْنَ ۝٩ اِنَّمَا النَّجْوٰى مِنَ الشَّيْطٰنِ لِيَحْزُنَ الَّذِيْنَ اٰمَنُوْا وَ لَيْسَ بِضَآرِّهِمْ شَيْـًٔا اِلَّا بِاِذْنِ اللّٰهِ ؕ وَ عَلَى اللّٰهِ فَلْيَتَوَكَّلِ الْمُؤْمِنُوْنَ ۝١٠ يَاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْۤا اِذَا قِيْلَ لَكُمْ تَفَسَّحُوْا فِی الْمَجٰلِسِ فَافْسَحُوْا يَفْسَحِ اللّٰهُ لَكُمْ ۚ وَ اِذَا قِيْلَ انْشُزُوْا فَانْشُزُوْا يَرْفَعِ اللّٰهُ الَّذِيْنَ اٰمَنُوْا مِنْكُمْ ۙ وَالَّذِيْنَ اُوْتُوا الْعِلْمَ دَرَجٰتٍ ؕ وَ اللّٰهُ بِمَا تَعْمَلُوْنَ خَبِيْرٌ ۝١١ يَاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْۤا اِذَا نَاجَيْتُمُ الرَّسُوْلَ فَقَدِّمُوْا بَيْنَ يَدَیْ نَجْوٰىكُمْ صَدَقَةً ؕ ذٰلِكَ خَيْرٌ لَّكُمْ وَاَطْهَرُ ؕ فَاِنْ لَّمْ تَجِدُوْا فَاِنَّ اللّٰهَ غَفُوْرٌ رَّحِيْمٌ ۝١٢ ءَاَشْفَقْتُمْ اَنْ تُقَدِّمُوْا بَيْنَ يَدَیْ نَجْوٰىكُمْ صَدَقٰتٍ ؕ فَاِذْ لَمْ تَفْعَلُوْا وَ تَابَ اللّٰهُ عَلَيْكُمْ فَاَقِيْمُوا الصَّلٰوةَ وَاٰتُوا الزَّكٰوةَ وَ اَطِيْعُوا اللّٰهَ وَ رَسُوْلَهٗ ؕ وَ اللّٰهُ خَبِيْرٌۢ بِمَا تَعْمَلُوْنَ ۝١٣ ع ٢

**9 - 10** విశ్వాసులారా! మీరు గనక పరస్పరం రహస్య విషయాలు మాట్లాడుకుంటే, పాపమూ, దౌర్జన్యమూ, దైవప్రవక్త పట్ల అవిధేయతలకూ సంబంధించిన విషయాలు కాకుండా, సత్యానికీ, దైవభీతికీ సంబంధించిన విషయాలు మాట్లాడుకోండి. మీరు దేవునికి భయపడుతూ ఉండండి. పునరుత్థాన దినాన మీరు ఆయన సన్నిధిలో హాజరుకావలసి ఉంది. రహస్య మంత నాలు జరపటం షైతాను చేష్ట. విశ్వాసులకు మనస్తాపం కలిగించ టానికే ఈ చేష్టచేయబడుతుంది. వాస్తవానికి దైవాజ్ఞ లేనిదే అది వారికి ఏమాత్రం నష్టం కలిగించజాలదు, విశ్వాసులు అల్లాహ్‌నే నమ్ముకోవాలి.

**11** విశ్వసించిన ఓ ప్రజలారా! మీ సమావేశాలలో (వచ్చే వారికి) చోటు కల్పించండని మీతో అన్నప్పుడు, మీరు జరిగి, చోటు కల్పించండి. అల్లాహ్ మీకు విశాలమైన చోటును ప్రసాదిస్తాడు.[11] మిమ్మల్ని లేచివెళ్లండి అని అన్నప్పుడు, లేచివెళ్లండి.[12] మీలో విశ్వసించిన వారికి, జ్ఞానం ప్రసాదించబడిన వారికి అల్లాహ్ ఉన్నత స్థానాలు ప్రసాదిస్తాడు. మీరు చేసేదంతా అల్లాహ్‌కు తెలుసు.

**12** విశ్వసించిన ఓ ప్రజలారా! మీరు దైవప్రవక్తతో ఏకాంతంలో మాట్లాడదలిస్తే, మాట్లాడబోయేముందు, ఏదైనా కొంచెం దానం[13] చెయ్యండి. ఇది మీ కొరకు ఉత్తమమైనది, ఎంతో పవిత్రమైనది. అయితే దానం చేయటానికి మీ వద్ద ఏమీ లేకపోతే, అప్పుడు అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడు అని తెలుసుకోండి.

**13** మీరు ఏకాంతంలో మాట్లాడే ముందు, దానం చేయవలసి వస్తుందని భయపడ్డారా? సరే, ఒకవేళ మీరు అలా చేయకపోతే, పోనివ్వండి - అల్లాహ్ ఈ విషయంలో మిమ్మల్ని మన్నించాడు- అందువల్ల (కనీసం) నమాజ్‌ను స్థాపిస్తూ ఉండండి, జకాత్ చెల్లిస్తూ ఉండండి, అల్లాహ్‌కూ, ఆయన ప్రవక్తకూ విధేయత చూపుతూ ఉండండి. మీరు చేసేదంతా అల్లాహ్‌కు తెలుసు.[14]

11. అల్లాహ్, ఆయన ప్రవక్త (సఅసమ్) ముస్లిమ్‌లకు నేర్పిన మర్యాదలలో ఇది ఒకటి. ఒక సమావేశంలో మొదట్నుంచే కూర్చొని ఉన్నవారు ఉన్నట్లయితే, తరువాత మరికొందరు వచ్చినట్లయితే, ముందునుంచే కూర్చున్నవారు కొత్తగా వచ్చినవారికి చోటివ్వటం, సాధ్యమైనంత వరకు ఒద్దికగా కూర్చుని వారికి ఎక్కువ స్థలం ఇవ్వటం అనే నాగరికతను పాటించాలి. తరువాత వచ్చినవారు బలవంతంగా వారిలోకి చొచ్చుకుపోకూడదు, ఎవరూ ఎవరినీ లేపి వారి స్థలాన్ని ఆక్రమించి కూర్చోకూడదు. ఈ మర్యాదను కొత్తవారు పాటించాలి.

اَلَمْ تَرَ اِلَى الَّذِيْنَ تَوَلَّوْا قَوْمًا غَضِبَ اللّٰهُ
عَلَيْهِمْ ؕ مَا هُمْ مِّنْكُمْ وَ لَا مِنْهُمْ ۙ وَ يَحْلِفُوْنَ
عَلَى الْكَذِبِ وَهُمْ يَعْلَمُوْنَ ﴿١٤﴾ اَعَدَّ اللّٰهُ لَهُمْ
عَذَابًا شَدِيْدًا ؕ اِنَّهُمْ سَآءَ مَا كَانُوْا
يَعْمَلُوْنَ ﴿١٥﴾ اِتَّخَذُوْٓا اَيْمَانَهُمْ جُنَّةً فَصَدُّوْا
عَنْ سَبِيْلِ اللّٰهِ فَلَهُمْ عَذَابٌ مُّهِيْنٌ ﴿١٦﴾ لَنْ
تُغْنِيَ عَنْهُمْ اَمْوَالُهُمْ وَ لَاۤ اَوْلَادُهُمْ مِّنَ اللّٰهِ
شَيْـًٔا ؕ اُولٰٓئِكَ اَصْحٰبُ النَّارِ ؕ هُمْ فِيْهَا
خٰلِدُوْنَ ﴿١٧﴾ يَوْمَ يَبْعَثُهُمُ اللّٰهُ جَمِيْعًا فَيَحْلِفُوْنَ
لَهٗ كَمَا يَحْلِفُوْنَ لَكُمْ وَيَحْسَبُوْنَ اَنَّهُمْ عَلٰى
شَيْءٍ ؕ اَلَاۤ اِنَّهُمْ هُمُ الْكٰذِبُوْنَ ﴿١٨﴾ اِسْتَحْوَذَ
عَلَيْهِمُ الشَّيْطٰنُ فَاَنْسٰىهُمْ ذِكْرَ اللّٰهِ ؕ اُولٰٓئِكَ
حِزْبُ الشَّيْطٰنِ ؕ اَلَاۤ اِنَّ حِزْبَ الشَّيْطٰنِ هُمُ
الْخٰسِرُوْنَ ﴿١٩﴾ اِنَّ الَّذِيْنَ يُحَآدُّوْنَ اللّٰهَ
وَرَسُوْلَهٗۤ اُولٰٓئِكَ فِي الْاَذَلِّيْنَ ﴿٢٠﴾ كَتَبَ اللّٰهُ
لَاَغْلِبَنَّ اَنَا وَ رُسُلِيْ ؕ اِنَّ اللّٰهَ قَوِيٌّ عَزِيْزٌ ﴿٢١﴾

**14 - 21** అల్లాహ్ ఆగ్రహానికి గురైన ఒక వర్గం వారిని మిత్రులుగా చేసుకున్న ప్రజలను మీరు చూడలేదా? వారు మీ మనుషులూ కారు, వారి మనుషులూ కారు. వారు బుద్ధిపూర్వకంగా అసత్య విషయాలపై ప్రమాణం చేస్తారు. అల్లాహ్ వారి కోసం కఠిన శిక్షను సిద్ధపరచి ఉంచాడు. వారు చేస్తున్నవన్నీ అతి చెడ్డ పనులు. వారు తమ ప్రమాణాలను డాలుగా చేసుకుని, దాని చాటున ప్రజలను అల్లాహ్ మార్గం నుండి నిరోధిస్తున్నారు. దీనికిగాను వారికి అవమానభరితమైన శిక్షపడుతుంది. అల్లాహ్ (శిక్ష) నుండి వారిని కాపాడటానికి వారి సంపదలూ పనికిరావు, వారి సంతానమూ ఉపయోగ పడదు. వారు నరకవాసులు, అందులోనే వారు శాశ్వతంగా ఉంటారు. అల్లాహ్ వారందరినీ లేపినరోజున, వారు ఆయన ముందుకూడ, మీ ముందు చేసినట్లే ప్రమాణాలు చేస్తారు. దీనివల్ల తమ పని కొంత నెరవేరుతుందని వారు అనుకుంటారు. బాగా తెలుసుకోండి, వారు పరమ అసత్యవాదులు. షైతాను వారిని ఆవహించి ఉన్నాడు, వారు తమ హృదయాలలో దేవుని సంస్మరణను మరచిపోయేలా జేశాడు. వారు షైతాన్ పక్షానికి చెందినవారు. జాగ్రత్త! షైతాన్ పక్షంవారే నష్టానికి గురిఅయ్యేవారు. నిశ్చయంగా అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ వ్యతిరేకించేవారు నీచాతి నీచమైన సృష్టికి చెందిన వారు. నేనూ, నా ప్రవక్త మాత్రమే ఆధిక్యం వహించి తీరుతాము అని అల్లాహ్ వ్రాసేపెట్టాడు. నిజానికి అల్లాహ్ సర్వశక్తిమంతుడు, సర్వాధికుడూను.

12. అంటే, సమావేశం ముగిసిందని చెప్పిన తరువాత, సభ్యులు లేచి వెళ్ళిపోవాలి, అక్కడే కదలకుండా కూర్చోరాదు.

13. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజిఅన్) ఈ ఆజ్ఞకు గల కారణాన్ని ఇలా వివరించారు : చాలా ఎక్కువగా, అవసరం లేకుండానే ప్రజలు మహాప్రవక్త (సఅసమ్)తో రహస్యంగా మాట్లాడవలసి ఉందని విజ్ఞప్తి చేసేవారు.

14. ఈ రెండో ఆజ్ఞ, పై ఆజ్ఞ వచ్చిన కొంతకాలం తరువాతనే అవతరించింది. విధిగా దానం చేయాలనే షరతును ఇది రద్దు చేసింది. దానం చేయాలి అనే ఆజ్ఞ ఎంతకాలం ఉన్నది అనే విషయంలో అభిప్రాయభేదాలు ఉన్నాయి. అది ఒకరోజు కంటే తక్కువ కాలం వరకు అమలులో ఉంది, తరువాత రద్దుచేయబడింది అని ఖతాదా అన్నారు. పదిరోజుల వరకు అమలులో ఉంది అని ముఖాతిల్ బిన్ హయ్యాన్ అన్నారు. ఈ ఆజ్ఞ అమలులో ఉన్న గడువు ఏ హదీసులోనైనా పది రోజుల కంటే ఎక్కువగా లేదు.

لَا تَجِدُ قَوْمًا يُّؤْمِنُوْنَ بِاللّٰهِ وَ الْيَوْمِ الْاٰخِرِ
يُوَآدُّوْنَ مَنْ حَآدَّ اللّٰهَ وَ رَسُوْلَهٗ وَ لَوْ كَانُوْٓا
اٰبَآءَهُمْ اَوْ اَبْنَآءَهُمْ اَوْ اِخْوَانَهُمْ اَوْ
عَشِيْرَتَهُمْ ؕ اُولٰٓئِكَ كَتَبَ فِيْ قُلُوْبِهِمُ الْاِيْمَانَ
وَ اَيَّدَهُمْ بِرُوْحٍ مِّنْهُ ؕ وَ يُدْخِلُهُمْ جَنّٰتٍ
تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ خٰلِدِيْنَ فِيْهَا ؕ
رَضِيَ اللّٰهُ عَنْهُمْ وَ رَضُوْا عَنْهُ ؕ اُولٰٓئِكَ
حِزْبُ اللّٰهِ ؕ اَلَآ اِنَّ حِزْبَ اللّٰهِ هُمُ الْمُفْلِحُوْنَ ﴿۲۲﴾ ع ٣

**22** అల్లాహ్‌నూ, పరలోకాన్నీ విశ్వసించేవారు, అల్లాహ్‌నూ ఆయన ప్రవక్తనూ వ్యతిరేకించే వారిని ప్రేమించటాన్ని నీవు ఎన్నడూ చూడలేవు. ఆ వ్యతిరేకించేవారు వారి తల్లిదండ్రులైనా, వారి కుమారులైనా, వారి సోదరులైనా సరే లేదా వారి కుటుంబీకులైనా సరే. వారి హృదయాలలో అల్లాహ్ విశ్వాసాన్ని స్థిరంగా నాటాడు, తన తరఫు నుండి ఒక ఆత్మను ప్రసాదించి వారికి బలాన్ని ఇచ్చాడు. ఆయన వారిని క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. ఆ వనాలలో వారు శాశ్వతంగా ఉంటారు. అల్లాహ్ వారి పట్ల ప్రసన్నుడయ్యాడు, వారు అల్లాహ్ పట్ల సంతుష్టిచెందారు. వారు అల్లాహ్ పక్షానికి చెందినవారు. జాగ్రత్త! అల్లాహ్ పక్షం వారే సఫలీకృతులయ్యే వారు.

ఆయతులు 24 | **59. అల్ హష్ర్** | అవతరణ మదీనాలో

٥٩ سُوْرَةُ الْحَشْرِ مَدَنِيَّةٌ ١٠١

ايَاتُهَا ٢٤ | رُكُوْعَاتُهَا ٣

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

سَبَّحَ لِلّٰهِ مَا فِي السَّمٰوٰتِ وَ مَا فِي الْاَرْضِ ۚ وَ
هُوَ الْعَزِيْزُ الْحَكِيْمُ ① هُوَ الَّذِيْۤ اَخْرَجَ
الَّذِيْنَ كَفَرُوْا مِنْ اَهْلِ الْكِتٰبِ مِنْ دِيَارِهِمْ
لِاَوَّلِ الْحَشْرِ ؔ مَا ظَنَنْتُمْ اَنْ يَّخْرُجُوْا وَ ظَنُّوْۤا
اَنَّهُمْ مَّانِعَتُهُمْ حُصُوْنُهُمْ مِّنَ اللّٰهِ فَاَتٰىهُمُ اللّٰهُ
مِنْ حَيْثُ لَمْ يَحْتَسِبُوْا ۚ وَ قَذَفَ فِيْ قُلُوْبِهِمُ
الرُّعْبَ يُخْرِبُوْنَ بُيُوْتَهُمْ بِاَيْدِيْهِمْ وَ اَيْدِي
الْمُؤْمِنِيْنَ ۚ فَاعْتَبِرُوْا يٰۤاُولِي الْاَبْصَارِ ② وَ
لَوْ لَاۤ اَنْ كَتَبَ اللّٰهُ عَلَيْهِمُ الْجَلَآءَ لَعَذَّبَهُمْ
فِي الدُّنْيَا ؕ وَ لَهُمْ فِي الْاٰخِرَةِ عَذَابُ النَّارِ ③
ذٰلِكَ بِاَنَّهُمْ شَآقُّوا اللّٰهَ وَ رَسُوْلَهٗ ۚ وَ مَنْ
يُّشَآقِّ اللّٰهَ فَاِنَّ اللّٰهَ شَدِيْدُ الْعِقَابِ ④ مَا
قَطَعْتُمْ مِّنْ لِّيْنَةٍ اَوْ تَرَكْتُمُوْهَا قَآئِمَةً عَلٰۤى
اُصُوْلِهَا فَبِاِذْنِ اللّٰهِ وَ لِيُخْزِيَ الْفٰسِقِيْنَ ⑤

وقف النبي صلى الله عليه وسلم

**1 – 2** ఆకాశాలలోనూ, భూమిలోనూ ఉన్న ప్రతి వస్తువూ అల్లాహ్‌నే స్తుతిస్తోంది. ఆయనే సర్వాధికుడు, వివేకవంతుడూను. ఆయనే గ్రంథ ప్రజలలోని తిరస్కారులను మొదటి దెబ్బలోనే వారి గృహాల నుండి గెంటివేశాడు.[1] వారు వెళ్ళిపోతారని మీరు ఏమాత్రం ఊహించి ఉండలేదు. వారు కూడ తమను అల్లాహ్ నుండి తమ కోటలు రక్షిస్తాయని భావించారు. కాని అల్లాహ్ వారిపైకి వారు ఊహించని దిశనుండి[2] వచ్చాడు. ఆయన వారి హృదయాలలో బెదురు పుట్టించాడు. తత్ఫలితంగా వారు తమ ఇళ్లను తమ చేతులారా కూడా నాశనం చేసుకున్నారు. విశ్వాసుల చేతుల ద్వారా కూడా నాశనం చేయించుకున్నారు. కనుక కళ్లున్న ప్రజలారా! గుణపాఠం నేర్చుకోండి.

**3 – 4** ఒకవేళ అల్లాహ్ దేశబహిష్కార విషయాన్ని వారి నొసట వ్రాసి ఉండకపోతే, ప్రపంచంలోనే ఆయన వారిని శిక్షించి ఉండేవాడు.[3] పరలోకంలో వారి కొరకు నరక శిక్ష ఉండనే ఉంది. వారు అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ వ్యతిరేకించి నందువల్లనే ఇదంతా జరిగింది. అల్లాహ్‌ను ఎవడు వ్యతిరేకించినా, వాడిని అల్లాహ్ చాల కఠినంగా శిక్షిస్తాడు.

**5** మీరు ఏ ఖర్జూరపు చెట్లను నరికివేశారో లేక ఏ ఖర్జూరపు చెట్లను వాటి వ్రేళ్లపై యథాతథంగా ఉండనిచ్చారో, ఇదంతా అల్లాహ్ ఆజ్ఞతోనే జరిగింది.[4] (అల్లాహ్ ఈ ఆజ్ఞను) దుర్మార్గులను అవమానపరచేందుకు[5] (ఇచ్చాడు).

1. గ్రంథ ప్రజలలోని అవిశ్వాసులు అంటే, ఇక్కడ మదీనా నగరంలోని ఒక ప్రాంతంలో నివసిస్తూ ఉండే, బనీ నజీర్‌కు చెందిన యూదుల తెగ అని అర్థం. ఈ తెగవారు మహాప్రవక్త (సఅసమ్)తో ఒక ఒడంబడిక చేసుకున్నారు. కాని వారు దానిని మాటిమాటికీ ఉల్లంఘించేవారు. ఈ కారణంగా రబీఉల్ అవ్వల్ 4వ తేదీ హిజ్రీలో, మహాప్రవక్త వారికి ఒక నోటీసును జారీ చేశారు. అందులో ఆయన వారిని, మదీనా నగరాన్ని విడిచివెళ్ళటమో లేదా యుద్ధానికి సంసిద్ధులు కావటమో నిర్ణయించుకోమన్నారు. వారు వెళ్లిపోవటానికి తిరస్కరించటం చేత, మహాప్రవక్త (సఅసమ్) ముస్లిమ్ సైన్యాన్ని తీసుకుని వారిపై దాడి చేశారు. కాని యుద్ధ ప్రారంభానికి ముందే, వారు దేశబహిష్కరణకు అంగీకరించారు. వాస్తవానికి వారి కోటలు పటిష్ఠంగా ఉండేవి, వారి సంఖ్య ముస్లిమ్‌ల సంఖ్యకంటే తక్కువ ఏమీకాదు, యుద్ధసామగ్రి సమృద్ధిగా ఉండేది. అయినా వారు దేశబహిష్కరణకే అంగీకరించారు.

**6 - 10** ఏ ఆస్తులను[6] అల్లాహ్, వారి అధీనంలో నుండి తీసుకుని తన ప్రవక్త వైపునకు తరలించాడో,[7] అవి మీరు మీ గుర్రాలనూ, ఒంటెలనూ పరుగెత్తించగా లభించినటువంటి ఆస్తులు కావు. అల్లాహ్ తన ప్రవక్తలకు తాను కోరిన వారిపై ఆధిపత్యాన్ని ప్రసాదిస్తాడు. అల్లాహ్ ప్రతిదానిపై అధికారం కలిగి[8] ఉన్నాడు. అల్లాహ్ ఇతర వాడల ప్రజల నుండి దేనినయితే తన ప్రవక్త వైపునకు మరలిస్తాడో, అందులో అల్లాహ్‌కు, ప్రవక్తకు, బంధువులకు,[9] అనాధులకు, నిరుపేదలకు, బాటసారులకు హక్కు ఉన్నది. అది మీ ధనికుల మధ్యనే తిరగకుండా ఉండేందుకు[10] ఇలా నిర్ణయించబడింది. దైవప్రవక్త మీకు ఇచ్చిన దాన్ని తీసుకోండి, ఆయన మిమ్మల్ని నిషేధించిన దాని జోలికి పోకండి. అల్లాహ్‌కు భయపడండి, అల్లాహ్ కఠినంగా శిక్షించేవాడు.[11] (ఇంకా ఆ ఆస్తులలో) తమ ఇళ్ల నుండీ, తమ ఆస్తిపాస్తుల నుండీ తరిమివేయబడిన నిరుపేద శరణార్థులకు కూడ హక్కు ఉంది. వారు అల్లాహ్ అనుగ్రహాన్నీ, ఆయన ప్రసన్నతనూ కోరుకుంటున్నారు. ఇంకా వారు అల్లాహ్‌కూ, ఆయన ప్రవక్తకూ సహాయపడేందుకు సదా సంసిద్ధంగా ఉంటారు. వారే ఋజువర్తనులు. (ఇంకా ఆ ఆస్తులలో) ఈ శరణార్థుల రాకకు పూర్వమే, విశ్వసించి వలస కేంద్రంలో స్థిరపడిన వారికి కూడ హక్కు ఉంది.[12] వారు తమ వద్దకు వలస వచ్చిన వారిని ప్రేమిస్తారు. వారికి ఏది ఇవ్వబడినా, దాని అవసరం సైతం ఉన్నట్లుగా వారు తమ మనస్సులలో భావించరు. వారు స్వయంగా అగత్యం కలవారైనప్పటికీ, తమకంటే ఇతరులకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. వాస్తవానికి హృదయ లోభత్వం నుండి రక్షింపబడినవారే సాఫల్యం పొందేవారు. (ఇంకా ఆ ఆస్తులలో) వారి తరువాత వచ్చిన వారికి కూడ హక్కు ఉంది.[13] వారు ఇలా అంటారు, "ఓ ప్రభూ! మమ్మల్నీ, మాకు పూర్వం విశ్వసించిన మా సోదరులందరినీ క్షమించు, మా హృదయాలలో విశ్వాసుల పట్ల ఎలాంటి ద్వేషాన్నీ కలిగించకు. మా ప్రభూ! నీవు చాలా కనికరించేవాడవు, కరుణామయుడవూను."[14]

وَمَآ اَفَآءَ اللّٰهُ عَلٰى رَسُوْلِهٖ مِنْهُمْ فَمَآ اَوْجَفْتُمْ
عَلَيْهِ مِنْ خَيْلٍ وَّلَا رِكَابٍ وَّلٰكِنَّ اللّٰهَ يُسَلِّطُ
رُسُلَهٗ عَلٰى مَنْ يَّشَآءُ ؕ وَاللّٰهُ عَلٰى كُلِّ شَىْءٍ
قَدِيْرٌ ﴿٦﴾ مَآ اَفَآءَ اللّٰهُ عَلٰى رَسُوْلِهٖ مِنْ اَهْلِ
الْقُرٰى فَلِلّٰهِ وَلِلرَّسُوْلِ وَلِذِى الْقُرْبٰى وَ
الْيَتٰمٰى وَالْمَسٰكِيْنِ وَابْنِ السَّبِيْلِ ۙ كَىْ لَا يَكُوْنَ
دُوْلَةًۢ بَيْنَ الْاَغْنِيَآءِ مِنْكُمْ ؕ وَمَآ اٰتٰىكُمُ
الرَّسُوْلُ فَخُذُوْهُ ۚ وَمَا نَهٰىكُمْ عَنْهُ فَانْتَهُوْا ۚ
وَاتَّقُوا اللّٰهَ ؕ اِنَّ اللّٰهَ شَدِيْدُ الْعِقَابِ ﴿٧﴾ لِلْفُقَرَآءِ وقف لازم
الْمُهٰجِرِيْنَ الَّذِيْنَ اُخْرِجُوْا مِنْ دِيَارِهِمْ وَ
اَمْوَالِهِمْ يَبْتَغُوْنَ فَضْلًا مِّنَ اللّٰهِ وَرِضْوَانًا وَّ
يَنْصُرُوْنَ اللّٰهَ وَرَسُوْلَهٗ ؕ اُولٰٓئِكَ هُمُ
الصّٰدِقُوْنَ ﴿٨﴾ وَالَّذِيْنَ تَبَوَّؤُ الدَّارَ وَالْاِيْمَانَ
مِنْ قَبْلِهِمْ يُحِبُّوْنَ مَنْ هَاجَرَ اِلَيْهِمْ وَلَا
يَجِدُوْنَ فِىْ صُدُوْرِهِمْ حَاجَةً مِّمَّآ اُوْتُوْا وَ
يُؤْثِرُوْنَ عَلٰٓى اَنْفُسِهِمْ وَلَوْ كَانَ بِهِمْ
خَصَاصَةٌ ؕ وَمَنْ يُّوْقَ شُحَّ نَفْسِهٖ فَاُولٰٓئِكَ هُمُ
الْمُفْلِحُوْنَ ﴿٩﴾ وَالَّذِيْنَ جَآءُوْ مِنْ بَعْدِهِمْ
يَقُوْلُوْنَ رَبَّنَا اغْفِرْ لَنَا وَلِاِخْوَانِنَا الَّذِيْنَ
سَبَقُوْنَا بِالْاِيْمَانِ وَلَا تَجْعَلْ فِىْ قُلُوْبِنَا غِلًّا
لِّلَّذِيْنَ اٰمَنُوْا رَبَّنَآ اِنَّكَ رَءُوْفٌ رَّحِيْمٌ ﴿١٠﴾ ع

2. అల్లాహ్ వారిపైకి వచ్చాడు అంటే, అల్లాహ్ ఎక్కడనో ఉన్నాడు, అక్కడ నుండి ఆయన వారిపైకి దాడిచేశాడు అని అర్థం కాదు. అయితే ఇక్కడ ఈ విషయం భావగర్భితంగా చెప్పబడింది. దీని ఉద్దేశ్యం, ఈ భావాన్ని కలిగించటం : ముస్లిమ్‌లు దాడి చేయకముందు, "బయటి నుండి ఎవరైనా దాడిచేస్తే, మేము మా కోటలలో నుంచే దానిని ప్రతిఘటిస్తాము" అని వారు అనుకున్నారు. కాని ఆపద వస్తుందని వారు ఊహించనైనా

اَلَمْ تَرَ اِلَى الَّذِيْنَ نَافَقُوْا يَقُوْلُوْنَ
لِاِخْوَانِهِمُ الَّذِيْنَ كَفَرُوْا مِنْ اَهْلِ الْكِتٰبِ
لَئِنْ اُخْرِجْتُمْ لَنَخْرُجَنَّ مَعَكُمْ وَ لَا نُطِيْعُ فِيْكُمْ
اَحَدًا اَبَدًا ۙ وَّ اِنْ قُوْتِلْتُمْ لَنَنْصُرَنَّكُمْ ؕ وَ
اللّٰهُ يَشْهَدُ اِنَّهُمْ لَكٰذِبُوْنَ ﴿١١﴾ لَئِنْ اُخْرِجُوْا
لَا يَخْرُجُوْنَ مَعَهُمْ ۚ وَلَئِنْ قُوْتِلُوْا لَا
يَنْصُرُوْنَهُمْ ۚ وَ لَئِنْ نَّصَرُوْهُمْ لَيُوَلُّنَّ
الْاَدْبَارَ ۟ ثُمَّ لَا يُنْصَرُوْنَ ﴿١٢﴾ لَاَنْتُمْ اَشَدُّ
رَهْبَةً فِيْ صُدُوْرِهِمْ مِّنَ اللّٰهِ ؕ ذٰلِكَ بِاَنَّهُمْ
قَوْمٌ لَّا يَفْقَهُوْنَ ﴿١٣﴾ لَا يُقَاتِلُوْنَكُمْ جَمِيْعًا اِلَّا فِيْ
قُرًى مُّحَصَّنَةٍ اَوْ مِنْ وَّرَآءِ جُدُرٍ ؕ بَاْسُهُمْ
بَيْنَهُمْ شَدِيْدٌ ؕ تَحْسَبُهُمْ جَمِيْعًا وَّ قُلُوْبُهُمْ
شَتّٰى ؕ ذٰلِكَ بِاَنَّهُمْ قَوْمٌ لَّا يَعْقِلُوْنَ ﴿١٤﴾
كَمَثَلِ الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ قَرِيْبًا ذَاقُوْا وَبَالَ
اَمْرِهِمْ ۚ وَ لَهُمْ عَذَابٌ اَلِيْمٌ ﴿١٥﴾ كَمَثَلِ
الشَّيْطٰنِ اِذْ قَالَ لِلْاِنْسَانِ اكْفُرْ ۚ فَلَمَّا كَفَرَ
قَالَ اِنِّيْ بَرِيْٓءٌ مِّنْكَ اِنِّيْٓ اَخَافُ اللّٰهَ رَبَّ
الْعٰلَمِيْنَ ﴿١٦﴾ فَكَانَ عَاقِبَتَهُمَآ اَنَّهُمَا فِي النَّارِ
خَالِدَيْنِ فِيْهَا ؕ وَ ذٰلِكَ جَزٰٓؤُا الظّٰلِمِيْنَ ﴿١٧﴾ ع ٢ ٥

**11 - 17** కపట వైఖరి అవలంబించిన వారిని నీవు[15] చూడ లేదా? వీరు గ్రంథ ప్రజలలోని అవిశ్వాసులైన తమ సోదరులతో ఇలా అంటారు, "ఒకవేళ మిమ్మల్ని బహిష్కరించటం జరిగితే, మేము కూడ మీతో పాటు వస్తాము. మీ వ్యవహారంలో మేము ఎవరి మాటైనా ఎంతమాత్రం వినము. ఒకవేళ మీతో యుద్ధం జరిగితే, మీకు మేము సహాయపడతాము." కాని వీరు పరమ అసత్యపరులు; దీనికి అల్లాహ్‌యే సాక్షి. వారు గనక బహిష్కరింపబడితే, వీరు వారితోపాటు ఎంతమాత్రం వెళ్లరు. ఒకవేళ వారితో యుద్ధం జరిగితే, వీరు వారికి ఏ మాత్రం సహాయపడరు. ఒకవేళ వీరు వారికి సహాయపడినా, వెన్ను చూపి పారిపోతారు ఆ తరువాత ఎక్కడ నుండీ ఎలాంటి సహాయాన్నీ పొందలేరు. వీరి హృదయాలలో అల్లాహ్ భయం కంటే మీ భయమే ఎక్కువగా ఉంది; ఎందుకంటే వీరు బుద్ధి హీనులు.[16] వీరు ఎన్నడూ ఒకచోట గుమిగూడి (బహిరంగ మైదానంలో) మిమ్మల్ని ఎదుర్కోలేరు. ఒకవేళ పోరాడినా, కోటల రక్షణగల వాడలలో కూర్చుండిగానీ లేదా ప్రాకారాల వెనుక దాగి ఉండిగానీ పోరాడతారు. వీరు పరస్పరం తీవ్రంగా కలహించుకుంటారు. వీరు కలసికట్టుగా ఉన్నారని నీవు భావిస్తున్నావు. కాని వీరి మనస్సులు పరస్పరం చీలిపోయి ఉన్నాయి. వీరు బుద్ధిహీనులు కావటం వల్లనే వీరి స్థితి ఇలా తయారయింది. వీరికి కొంతకాలం ముందు, తాము చేసిన దాని ఫలితాన్ని చవిచూసిన ప్రజల మాదిరిగానే వీరూ ఉన్నారు.[17] వీరికి బాధాకరమైన శిక్ష పడుతుంది. వీరి దృష్టాంతం షైతాన్ దృష్టాంతం మాదిరిగా ఉంది; ప్రారంభంలో వాడు మానవునితో, "సత్యాన్ని తిరస్కరించు" అని అంటాడు. తీరా మానవుడు సత్యాన్ని తిరస్కరిస్తే, వాడు, "నీ పట్ల నాకు ఏ విధమైన బాధ్యతా లేదు. సకల లోకాల ప్రభువైన అల్లాహ్ అంటే నాకు భయంగా ఉంది" అని అంటాడు. తరువాత ఆ ఇద్దరి పర్యవసానం, శాశ్వతంగా నరకానికి పోవటమే. దుర్మార్గులకు లభించే ప్రతిఫలం ఇదే.

ఊహించని దిక్కు నుండి అల్లాహ్ వారిపై దాడిచేశాడు. ఆ దిక్కు ఏదంటే ఆయన అంతర్గతంగా వారి మనస్థైర్యాన్ని దెబ్బతీశాడు, వారి పోరాటపటిమను బలహీనపరచాడు. ఆ తరువాత వారి ఆయుధాలు, శక్తిమంతమైన వారి కోటలు సైతం దేనికీ కొరగాకుండా పోయాయి.

يَاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا اتَّقُوا اللّٰهَ وَلْتَنْظُرْ نَفْسٌ
مَّا قَدَّمَتْ لِغَدٍ ۚ وَاتَّقُوا اللّٰهَ ؕ اِنَّ اللّٰهَ
خَبِيْرٌۢ بِمَا تَعْمَلُوْنَ ۝١٨ وَلَا تَكُوْنُوْا كَالَّذِيْنَ
نَسُوا اللّٰهَ فَاَنْسٰهُمْ اَنْفُسَهُمْ ؕ اُولٰٓئِكَ هُمُ
الْفٰسِقُوْنَ ۝١٩ لَا يَسْتَوِيْٓ اَصْحٰبُ النَّارِ
وَاَصْحٰبُ الْجَنَّةِ ؕ اَصْحٰبُ الْجَنَّةِ هُمُ
الْفَآئِزُوْنَ ۝٢٠

**18 - 20** విశ్వసించిన ఓ ప్రజలారా! అల్లాహ్‌కు భయపడండి. ప్రతి వ్యక్తీ తాను రేపటి కొరకు ఏమి సమకూర్చుకున్నాడో[18] చూసుకోవాలి. అల్లాహ్‌కు భయపడుతూ ఉండండి, నిశ్చయంగా అల్లాహ్‌కు మీరు చేసే పనులన్నీ తెలుసు. అల్లాహ్‌ను మరచిపోయిన వారి మాదిరిగా మీరూ అయిపోకండి. (అల్లాహ్‌ను మరచిపోవటం వల్ల) అల్లాహ్ వారిని తమను తాము మరచిపోయేలా చేశాడు.[19] వారే దుర్మార్గులు. నరకానికి పోయే వారూ స్వర్గానికి పోయేవారూ ఎన్నటికీ ఒకటి కాలేరు. అసలు స్వర్గానికి పోయేవారే కృతార్థులు.

3. ప్రపంచంలో శిక్షించటం అంటే, వారు నామరూపాలు లేకుండా పోవటం. వారు సంధిచేసుకుని తమ ప్రాణాలు కాపాడుకునే బదులు, యుద్ధం చేసి ఉన్నట్లయితే, వారు పూర్తిగా తుడిచిపెట్టుకుని పోయేవారు.

4. ఇది ఈ వ్యవహారాన్ని సూచిస్తోంది : బనీ నజీర్ పట్టణపరిసరాలలో ఉన్న ఒయాసిస్సులోని చెట్లను ముస్లిమ్‌లు ముట్టడి ప్రారంభంలో నరికివేయటమో, కాల్చివేయటమో చేశారు. ముట్టడి సులభతరమవుతుందనే ఉద్దేశ్యంతో ఇలా చేశారు. సైన్యం కదలికలకు అడ్డురాని వృక్షాలను మాత్రం వదలివేశారు. దీనిపై మదీనా నగరంలోని కపటులు, యూదులు పెద్ద గొడవ చేశారు. "ముహమ్మద్ (సఅసమ్) భూమిపై సంక్షోభాన్ని సృష్టించవద్దని నిషేధించారు ; కాని చూడండి, పచ్చని ఫలవృక్షాలు నరికివేయబడుతున్నాయి. ఇది లోకంలో సంక్షోభం సృష్టించటం కాకపోతే మరేమిటి?" దీనిపై అల్లాహ్ ఈ ఉత్తరువును అవతరింపజేశాడు : "మీరు కొన్ని వృక్షాలను నరికారు, కొన్ని వృక్షాలను నరకలేదు. ఈ రెండు పనులలో ఏ పనీ తప్పుకాదు. ఆ రెంటికీ అల్లాహ్ అనుమతి ఉన్నది."

5. అంటే, అల్లాహ్ అభిమతం ఏమిటంటే, ఈ వృక్షాలు నరకటం వలన కూడ వారు అవమానం పాలు కావాలి; నరకకుండా ఉంచటం వలన కూడ అవమానం పాలు కావాలి. నరకటం వల్ల వారు అవమానం పాలుకావాలి అనే దాని సందర్భం ఏమిటంటే, ఏ తోటలను వారు తమ చేతులతో నాటారో, ఏ తోటలకు వారు ఎన్నో తరాల నుండి యజమానులుగా ఉంటూ వచ్చారో, ఆ తోటలలోని వృక్షాలు వారి కళ్లయెదుటే నరకబడుతున్నాయి, కాని వారు నరికే వారిని వారించలేక నిస్సహాయులుగా చూస్తూ ఉండిపోయారు. వృక్షాలను నరకకుండా ఉంచటం వల్ల కూడ వారు అవమానంపాలు కావాలి అనే దాని సందర్భమేమిటంటే, వారు మదీనా నగరాన్ని విడిచిపెట్టిపోతూ, నిన్నటి వరకు తమ అధీనంలో ఉన్న ఈ పచ్చని పండ్లతోటలు ఈనాడు ముస్లిమ్‌ల చేతులలోకి వెళ్ళిపోవటాన్ని వారు ప్రత్యక్షంగా చూశారు. వారు బలవంతులై ఉంటే, ఆ తోటలను పూర్తిగా ధ్వంసం చేసి ఉండేవారు, ఒక్క చెట్టును కూడ ముస్లిమ్‌లకు దక్కకుండా చేసేవారు. కాని వారు నిస్సహాయులై, విఫల మనోరథులై నిరాశా నిస్పృహలతో ఎలా ఉన్న దానిని అలానే వదలి వెళ్లిపోయారు.

6. దేశ బహిష్కారానికి గురిఅయిన బనీ నజీర్ తెగవారి ఆస్తిపాస్తులు అన్నీ ఇస్లామీ ప్రభుత్వాధీనంలోకి వచ్చాయి. ఇప్పుడు వాటిని ఏ విధంగా నిర్వహించాలో అనే విషయాన్ని గురించి ఇక్కడ నుండి పదవ ఆయతు వరకు, అల్లాహ్ తెలియజేస్తున్నాడు.

7. ఈ పదాల మూలంగా తేటతెల్లమయ్యే విషయమేమిటంటే, ఈ భూమిపైగానీ, ఇక్కడ ఉన్న వస్తువులపైగానీ, అల్లాహ్‌పై తిరుగుబాటు చేసిన వారికి ఏ అధికారమూ లేదు. కనుక, ఒక ధర్మసమ్మతమైన యుద్ధం ద్వారా, అవిశ్వాసుల చేతుల నుండి విశ్వాసుల చేతులలోకి వచ్చిన ఆస్తిపాస్తుల వ్యవహారం ఏమిటంటే, వాటి యజమాని వాటిని, నమ్మకద్రోహులు, తిరుగుబాటుదారులైన తన సేవకుల కబ్జా నుండి తీసి, విశ్వాసపాత్రులూ, విధేయులూ

21 ఒకవేళ మేము ఈ ఖుర్‌ఆన్‌ను ఏ పర్వతంపైనైనా అవతరింపజేస్తే, అది అల్లాహ్ భయంవల్ల క్రుంగిపోయి, బ్రద్దలైపోవటాన్ని[20] నీవు చూస్తావు. ప్రజలు (తమ స్థితిని గురించి) ఆలోచించాలని మేము ఈ దృష్టాంతాలను వారి ముందు ఉంచుతున్నాము.

لَوْ اَنْزَلْنَا هٰذَا الْقُرْاٰنَ عَلٰى جَبَلٍ لَّرَاَيْتَهٗ
خَاشِعًا مُّتَصَدِّعًا مِّنْ خَشْيَةِ اللّٰهِ ؕ وَ تِلْكَ
الْاَمْثَالُ نَضْرِبُهَا لِلنَّاسِ لَعَلَّهُمْ يَتَفَكَّرُوْنَ ﴿٢١﴾

అయిన సేవకులకు అప్పగించాడు. ఇందువల్లనే ఇటువంటి ఆస్తిపాస్తులను ఇస్లామీ చట్ట పరిభాషలో 'ఫయ్' (వాపసు తీసుకురాబడిన ఆస్తిపాస్తులు) అని అంటారు.

8. అంటే, ఈ ఆస్తిపాస్తులు ముస్లిమ్‌ల అధీనంలోకి రావటం అనేది సైనికులు యుద్ధభూమిలో పోరాడటం వలన జరిగింది మాత్రం కాదు. అల్లాహ్ తన ప్రవక్త (సఅసమ్)కూ, అతని సంఘానికీ, అతను స్థాపించిన వ్యవస్థకూ ప్రసాదించిన సామూహిక శక్తి వలన జరిగింది. ఈ కారణం వల్ల, ఈ ఆస్తిపాస్తులు విజయధనానికి పూర్తిగా భిన్నమైనవి. కనుక యుద్ధ సైనికులకు వాటిపై ఏ మాత్రం హక్కులేదు; విజయధనం మాదిరిగా వాటిని సైనికులకు పంచటానికి వీలులేదు. ఈ విధంగా షరియత్ శాస్త్రంలో విజయధనానికి మరియు "ఫయ్"కీ సంబంధించిన ఉత్తరువులు వేరువేరుగా ఉన్నాయి. విజయధనం అంటే, యుద్ధ చర్యలు జరిగేటప్పుడు, శత్రు సైన్యాల నుండి లభించిన చరాస్తులు అని అర్థం. అవికాక, శత్రుదేశంలోని భూములు, ఇళ్లు, ఇంకా ఇతర స్థిరచరాస్తులు విజయధనం పరిధిలోనికి రావు, 'ఫయ్' పరిధిలోనికి వస్తాయి.

9. బంధువులు అంటే, మహాప్రవక్త (సఅసమ్) గారి బంధువులు అని అర్థం; అంటే హాషిమ్ సంతతివారు, ముత్తలిబ్ సంతతివారు. ఈ భాగం ఎందుకు నిర్ణయించబడిందంటే, మహాప్రవక్త (సఅసమ్) తన అవసరాలను, తన కుటుంబీకుల అవసరాలను తీర్చటంతో పాటు, తన సహాయానికి అర్హులైన బంధువుల హక్కులు లేదా తాను సహాయం చేయటం అవసరమని భావించిన వారి హక్కులు కూడ నెరవేర్చగలందులకు. మహాప్రవక్త (సఅసమ్) మరణానంతరం, ఇది ఒక ప్రత్యేకమైన, ఒక శాశ్వతమైన భాగంగా ఉండలేదు. కాని ఇతర ముస్లిమ్ నిరుపేదలు, అనాథులు, బాటసారులతో పాటు హాషిమ్ సంతతివారిలోని, ముత్తలిబ్ సంతతి వారిలోని నిస్సహాయుల హక్కులను కూడ నెరవేర్చే బాధ్యతలను "బైతుల్ మాల్"కు అప్పగించటం జరిగింది. అయితే, వారికి జకాతులో భాగం లేదుగనుక, వారి హక్కును ఇతరుల హక్కులకంటే మిన్నగా పరిగణించటం జరిగింది.

10. ఇది దివ్య ఖురాను ప్రవచించిన ముఖ్యమైన మార్గదర్శక సూత్రాలలో ఒకటి. ఇందులో ఇస్లామీ సమాజం, ప్రభుత్వాల ఆర్థికవిధానం యొక్క ప్రాథమిక నియమం ఏమిటో చెప్పబడింది : సంపద సమాజంలో ఎల్లప్పుడూ చేతులు మారుతూ తిరుగుతూ ఉండాలే కాని కేవలం ధనవంతుల మధ్యనే తిరుగుతూ ఉండకూడదు, ధనవంతుడు మరింత ధనవంతుడుగానూ, నిరుపేద మరింత నిరుపేదగానూ అయిపోకూడదు.

11. ఈ ఉత్తరువు బనీ నజీర్‌కు చెందిన ఆస్తుల పంపిణీ విషయంలో అవతరించింది, కాని అది అందరికీ వర్తిస్తుంది. కనుక దాని ఉద్దేశ్యం ఏమిటంటే, ముస్లిములందరూ సకల వ్యవహారాలలో మహాప్రవక్త (సఅసమ్)కు విధేయులై ఉండాలి. ఈ ఉద్దేశ్యాన్ని ఈ విషయం మరింత విశదపరుస్తోంది : "దైవప్రవక్త మీకు ఇచ్చిన దానిని"కి మారుగా "దైవప్రవక్త మీకు ఇవ్వని దానిని" అనే పదాలు వాడబడలేదు; కాని "ఆయన మీకు నిషేధించిన దాని జోలికి పోకండి" అని సెలవీయబడింది.

12. అన్సారులు అని అర్థం. అంటే, 'ఫయ్'లో కేవలం మహాజిరులకు మాత్రమే హక్కులేదు. పూర్వం నుంచీ 'దారుస్సలామ్'లో నివసిస్తూ ఉన్నటువంటి ముస్లిములు కూడ అందులో భాగం పొందటానికి హక్కుదారులు.

13. అంటే 'ఫయ్'లోని ఆస్తులకు ఈ తరం వారికి మాత్రమే కాక భావి తరాలవారికి కూడ హక్కు ఉన్నది.

هُوَ اللّٰهُ الَّذِىۡ لَاۤ اِلٰهَ اِلَّا هُوَ‌ ۚ عٰلِمُ الۡغَيۡبِ وَ
الشَّهَادَةِ‌ ۚ هُوَ الرَّحۡمٰنُ الرَّحِيۡمُ ﴿۲۲﴾ هُوَ اللّٰهُ
الَّذِىۡ لَاۤ اِلٰهَ اِلَّا هُوَ‌ ۚ اَلۡمَلِكُ الۡقُدُّوۡسُ
السَّلٰمُ الۡمُؤۡمِنُ الۡمُهَيۡمِنُ الۡعَزِيۡزُ الۡجَبَّارُ
الۡمُتَكَبِّرُ‌ ؕ سُبۡحٰنَ اللّٰهِ عَمَّا يُشۡرِكُوۡنَ ﴿۲۳﴾ هُوَ
اللّٰهُ الۡخَالِقُ الۡبَارِئُ الۡمُصَوِّرُ‌ لَهُ الۡاَسۡمَآءُ
الۡحُسۡنٰى‌ ؕ يُسَبِّحُ لَهٗ مَا فِى السَّمٰوٰتِ
وَالۡاَرۡضِ‌ ۚ وَهُوَ الۡعَزِيۡزُ الۡحَكِيۡمُ ﴿۲۴﴾ ع ۳

**22 - 24** ఆయనే అల్లాహ్; ఆయన తప్ప ఆరాధ్యుడెవ్వడూ[21] లేడు; దృశ్యాదృశ్య విషయాలన్నీ ఎరిగినవాడు. ఆయనే కరుణామయుడు, కృపాశీలుడు. ఆయనే అల్లాహ్, ఆయన తప్ప ఆరాధ్యుడెవ్వడూ లేడు. ఆయన చక్రవర్తి, ఎంతో పరిశుద్ధుడు,[22] సురక్షితుడు,[23] శాంతిప్రదాత,[24] సంరక్షకుడు,[25] సర్వాధికుడు, తన ఉత్తరువులను తిరుగులేని విధంగా అమలుపరచేవాడు, ఎల్లప్పుడూ గొప్ప వాడుగానే ఉండేవాడు. ప్రజలు కల్పించే దైవత్వపు భాగస్వామ్యం వర్తించని పరిశుద్ధుడు అల్లాహ్, సృష్టి వ్యూహాన్ని రచించేవాడు, దానిని అమలుపరచేవాడు, ఆపై దాని ప్రకారం రూపకల్పన చేసేవాడు. ఆయనకు మంచి పేర్లు ఉన్నాయి. ఆకాశాలలోనూ, భూమిలోనూ ఉన్న ప్రతి వస్తువూ ఆయన పరిశుద్ధను కీర్తిస్తోంది. [26] ఆయన సర్వాధికుడు, వివేకవంతుడూను.

14. ఈ ఆయతులో ముస్లిములకు ఒక ముఖ్యమైన నైతిక ఉపదేశం చేయబడింది: వారు తోటి ముస్లిముల పట్ల తమ హృదయాలలో అసూయా ద్వేషాలు కలిగి ఉండకూడదు, తమకు ముందు గతించిన ముస్లిముల దోషాలను క్షమించమని అల్లాహ్‌ను ప్రార్థిస్తూ ఉండాలి, వారిని దూషించకూడదు, శపించనూ కూడదు.

15. ఈ మొత్తం రుకూలో కపటుల వైఖరిని గురించి చెప్పటం జరిగింది : మహాప్రవక్త (సఅసమ్) బనీ నజీర్‌ను పది రోజులలో మక్కా నగరాన్ని విడిచిపెట్టి వెళ్లిపొమ్మని నోటీసు పంపారు; వారి ఇళ్లను ముట్టడించటం ఇంకా ప్రారంభం కాలేదు. అప్పుడు మదీనాలోని వంచకుల నాయకులు వారికి ఈ మేరకు ఒక వర్తమానాన్ని పంపించారు : మేము రెండు వేలమంది మనుషులతో మీకు సహాయపడటానికి వస్తాము, బనీ ఖురైజా, బనీ గతఫాన్ తెగలు కూడ మీకు అండగా నిలబడతారు. కనుక మీరు ముస్లిములను ధైర్యంగా ఎదుర్కోండి, వారికి ఎంతమాత్రం లొంగకండి. ముస్లిములు మీతో యుద్ధం చేస్తే, మేము మీ వైపు నుండి పోరాడతాము. ఒకవేళ మీరు ఇక్కడ నుండి తరమబడితే, మీతోపాటు మేము కూడ వెళ్లిపోతాము.

16. ఈ చిన్న వాక్యంలో ఒక గొప్ప సత్యం చెప్పబడింది. తెలివిగల ఒక మనిషి, అసలు భయపడటానికి తగినది అల్లాహ్ శక్తియే కాని, మానవశక్తి మాత్రం కానేకాదు. కనుక లెక్క అడిగే మానవశక్తి ఒకటి ఉన్నా లేకున్నా అతడు దైవదండనకు గురిచేసే ప్రతి కార్యానికి దూరంగా ఉంటాడు; అల్లాహ్ అతనిపై విధించిన ప్రతి కర్తవ్యాన్ని నిర్వహించటానికి అతను సంసిద్ధుడవుతాడు; ప్రాపంచిక శక్తులు ఎన్ని అడ్డగించినా అతను తన కర్తవ్యాన్ని వదలడు. కాని ఒక తెలివి తక్కువ మనిషి, జీవిత వ్యవహారాలనన్నింటిలో తన వైఖరినీ, తన కార్యాచరణనూ, దైవశక్తికంటే మానవశక్తిమీదనే ఆధారపడి నిర్ణయించుకుంటాడు. కొన్ని పనులకు అతడు దూరంగా ఉండటానికి కారణం దైవశిక్షకు భయపడికాదు, తన ముందుగల మానవశక్తికి భీతి చెంది మాత్రమే. కొన్ని పనులను అతడు చేయటానికి కారణం, దైవాజ్ఞ అని కాదు; మానవుడి ఆజ్ఞ అనియే, మానవశక్తుల తృప్తికొరకే. ఈ తెలివీ - తెలివితక్కువతనాల మధ్య ఉన్న భేదమే, యథార్థానికి ఒక విశ్వాసికీ, ఒక అవిశ్వాసికీ ప్రవర్తనలోగల పరస్పర భేదాలను ప్రస్ఫుటం చేస్తుంది.

17. ఇది ఖురైషు అవిశ్వాసులనూ, యూదుల తెగ ఖయ్‌నుఖానూ సూచిస్తుంది. వారు, అధిక సంఖ్యాబలమూ, విశేషసాధన సంపత్తీ కలిగి కూడ, ఈ బలహీనతల మూలంగానే, తగిన సాధన సంపత్తిలేని, అల్పసంఖ్యాకుల చేతిలో ఓడిపోయారు.

18. రేపు అంటే, పరలోకం అని అర్థం. ప్రాపంచిక జీవితం అంతా "ఈనాడు" దీనికి రేపు ప్రళయదినం.

19. అంటే, దేవుణ్ణి మరచిపోవటం అనే దాని అనివార్య ఫలితం మనిషి తనను తాను మరచిపోవటం. తాను ఒకరికి దాసుడననే విషయాన్ని మనిషి మరచిపోయినప్పుడు, అతడు ప్రపంచంలో తన స్థానాన్ని గురించి తప్పనిసరిగా తప్పుడు అభిప్రాయాన్ని ఏర్పాటు చేసుకుంటాడు. అతని యావత్ జీవితం ఈ మౌలిక అపోహ కారణంగా తప్పుడు మార్గంలో పడిపోతుంది. ఇదే మాదిరిగా, అతడు, తాను ఒక్క అల్లాహ్‌కు తప్ప మరెవరికీ దాసుడను కాను అనే విషయాన్ని మరచిపోయినప్పుడు, తాను వాస్తవంగా ఎవరికి దాసుడో, ఆయనను మాత్రం సేవించడు. కానీ తాను నిజంగా దాసుడు కాని వారినెందరినో సేవిస్తూ ఉంటాడు.

20. ఈ ఉదాహరణ అర్థం ఏమిటంటే, దేవుని ఔన్నత్యం గురించీ, ఆయన ముందు దాసుల బాధ్యత, జవాబుదారీలను గురించీ దివ్య ఖురాను చెబుతున్న విషయానికి సంబంధించిన అవగాహనా భాగ్యం పర్వతం వంటి మహత్తరమైన సృష్టికి కలిగితే, సర్వశక్తిమంతుడైన అల్లాహ్ ముందు తనకు కూడ తన పనులను గురించి సమాధానం చెప్పుకోవలసి ఉందనే విషయం దానికి తెలిస్తే అది కూడ భయంతో కంపిస్తుంది.

21. అంటే, దాస్యానికీ, ఆరాధనకూ అర్హతను పొందే స్థితీ, స్థాయీ, స్థానమూ గలవాడు ఒక్క అల్లాహ్ తప్ప మరొకడెవ్వడూ లేడు : ఆరాధ్య దైవం అవటానికి హక్కుగల దైవత్వపు గుణ విశేషాలూ, అధికారాలూ కలవాడు కూడ ఆయన తప్ప మరెవ్వడూ లేడు.

22. అంటే, ఆయనలో ఒక లోపం గాని, ఒక దోషంగానీ, ఒక అవగుణం గానీ ఉన్నాయనే విషయానికి ఆయన అతీతుడు. ఆయన పరమ పవిత్రుడు ; ఆయన విషయంలో చెడును గురించి ఊహించటానికి సైతం అవకాశం లేనివాడు.

23. అంటే, ఆయనకు కష్టాలు కలుగుతాయనీ, ఆయన బలహీనతలకు లోనవుతాడనీ, ఆయన లోటుపాట్లకు గురిఅవుతాడనీ, లేదా ఆయన శక్తిసామర్థ్యాలకూ, ఆయన పరిపూర్ణతకూ క్షీణదశ కలుగుతుందనీ – అనే విషయాలకు ఆయన అతీతుడు.

24. అంటే, ఆయన తన సృష్టికి ఎన్నడూ అన్యాయం చేయడనీ, దాని హక్కులకు భంగం కలిగించడనీ, దాని ప్రతిఫలాన్ని ఎంతమాత్రం వ్యర్థం చేయడనీ, దానితో ఆయన చేసిన వాగ్దానాలను వమ్ముచేయడనీ, సృష్టికి గట్టి విశ్వాసం ఉన్నది.

25. అసలు "అల్-ముహయ్‌మిన్" అనే పదం ఉపయోగించబడింది; దానికి మూడు అర్థాలు ఉన్నాయి : ఒకటి, సంరక్షకుడు, కాపాడేవాడు. రెండు, ఎవడు ఏమి చేస్తున్నాడో చూసే సాక్షీభూతుడు. మూడు, ప్రజల అవసరాలనూ, కోరికలనూ తీర్చే బాధ్యతను వహించినవాడు.

26. అంటే, తన సృష్టికర్త ప్రతి లోపానికీ, దోషానికీ, బలహీనతకూ, తప్పుకూ అతీతుడని సృష్టిలోని ప్రతి ప్రాణీ ఎలుగెత్తి చాటుతోంది.

ఆయతులు 13 | 60. అల్ ముమ్‌తహినహ్ | అవతరణ మదీనాలో

٦٠ سُوْرَةُ الْمُمْتَحِنَةِ مَدَنِيَّةٌ ٩١

اٰیاتھا ١٣ | رکوعاتھا ٢

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِیْمِ ○

**1 – 3** విశ్వసించిన ఓ ప్రజలారా![1] మీరు గనక నా మార్గంలో జిహాద్ చేయటానికీ, నా ప్రసన్నతను పొందటానికీ (స్వస్థలాన్ని విడిచి ఇళ్లనుండి) బయలుదేరినపుడు నాకూ, మీకూ శత్రువులైన వారితో స్నేహం చేయకండి. అసలు మీరు వారితో స్నేహం ఎలా చేస్తారు; మీ వద్దకు వచ్చిన సత్యాన్ని వారు విశ్వసించటానికి నిరాకరించారు కదా! కేవలం మీరు మీ ప్రభువైన అల్లాహ్‌ను విశ్వసించారనే నేరంపై వారు దైవప్రవక్తనూ, స్వయంగా మిమ్మల్నీ దేశబహిష్కరణకు గురిచేశారు. ఇదీ వారి వైఖరి. ఇలాంటి వారికి మీరు రహస్యంగా స్నేహ సందేశం పంపుతారా? వాస్తవానికి మీరు రహస్యంగా చేసేది, బహిరంగంగా చేసేది అంతా నాకు బాగా తెలుసు. మీలో అలా ఎవరు చేసినా అతను నిశ్చయంగా ఋజుమార్గం తప్పి పోయినట్లే. వారి వైఖరి ఎలా ఉందంటే; ఒకవేళ మీపై అదుపు సాధిస్తే, వారు మీకు విరోధులై పోయి, చేష్టలతో, మాటలతో మిమ్మల్ని వేధిస్తారు. మీరు ఎలాగైనా సరే అవిశ్వాసులై పోవాలని వారు కోరుతున్నారు. ప్రళయం నాడు మీ బంధుత్వాలు గానీ, మీ సంతానం[2] గానీ ఏ విధంగానూ పనికిరావు. ఆ రోజున అల్లాహ్ మీ మధ్య ఎడబాటు[3] కలిగిస్తాడు; ఆయనే మీ కర్మలను చూసేవాడు.

یٰۤاَیُّهَا الَّذِیْنَ اٰمَنُوْا لَا تَتَّخِذُوْا عَدُوِّیْ وَ عَدُوَّكُمْ اَوْلِیَآءَ تُلْقُوْنَ اِلَیْهِمْ بِالْمَوَدَّةِ وَ قَدْ كَفَرُوْا بِمَا جَآءَكُمْ مِّنَ الْحَقِّ ۚ یُخْرِجُوْنَ الرَّسُوْلَ وَ اِیَّاكُمْ اَنْ تُؤْمِنُوْا بِاللّٰهِ رَبِّكُمْ ؕ اِنْ كُنْتُمْ خَرَجْتُمْ جِهَادًا فِیْ سَبِیْلِیْ وَ ابْتِغَآءَ مَرْضَاتِیْ ۖۗ تُسِرُّوْنَ اِلَیْهِمْ بِالْمَوَدَّةِ ۖۗ وَ اَنَا اَعْلَمُ بِمَاۤ اَخْفَیْتُمْ وَ مَاۤ اَعْلَنْتُمْ ؕ وَ مَنْ یَّفْعَلْهُ مِنْكُمْ فَقَدْ ضَلَّ سَوَآءَ السَّبِیْلِ ① اِنْ یَّثْقَفُوْكُمْ یَكُوْنُوْا لَكُمْ اَعْدَآءً وَّ یَبْسُطُوْۤا اِلَیْكُمْ اَیْدِیَهُمْ وَ اَلْسِنَتَهُمْ بِالسُّوْٓءِ وَ وَدُّوْا لَوْ تَكْفُرُوْنَ ؕ② لَنْ تَنْفَعَكُمْ اَرْحَامُكُمْ وَ لَاۤ اَوْلَادُكُمْ ۛۚ یَوْمَ الْقِیٰمَةِ ۛۚ یَفْصِلُ بَیْنَكُمْ ؕ وَ اللّٰهُ بِمَا تَعْمَلُوْنَ بَصِیْرٌ ③

معانقة ١٢ السماع الرفق على القيمة ١٢ ج

1. ఈ విషయంలో వ్యాఖ్యాతలందరూ ఏకాభిప్రాయంతో ఉన్నారు: మక్కా ముష్రిక్కులకు హజ్రత్ హాతిబ్ బిన్ అబీ బల్‌తఆ వ్రాసిన ఉత్తరం పట్టుబడినప్పుడు ఈ ఆయతులు అవతరించాయి. ఆ ఉత్తరంలో ఆయన, మహాప్రవక్త మక్కాపై దాడి చేయనున్నారనే వార్తను శత్రువులకు ముందుగానే తెలియజేశారు.
2. యుద్ధ సమయంలో మక్కాలో ఉన్నటువంటి తన కుటుంబం సురక్షితంగా ఉండాలని హజ్రత్ హాతిబ్ (రజిఅన్) ఈ పని చేశారు కాబట్టి, "నీవు ఏ సంతానం నిమిత్తం ఈ పని చేశావో, ఆ సంతానం పరలోకంలో నీకు ఏ మాత్రం ఉపయోగపడదు" అని సెలవీయబడింది.
3. అంటే, ఇహలోకపు బాంధవ్యాలు, రాగబంధాలు సంబంధాలు అన్నీ అక్కడ తెగిపోతాయి; ప్రతి వ్యక్తీ తన వ్యక్తిగత హోదాలో హాజరవుతాడు, ప్రతివాడూ తన స్వవిషయాన్ని గురించి మాత్రమే లెక్క ఇచ్చుకోవాలి. కనుక ఈ ప్రపంచంలో ఏ వ్యక్తిగానీ బంధుత్వం కోసమో, స్నేహం కోసమో, ఒక వర్గం కోసమో ధర్మ సమ్మతం కాని ఏ పనినీ చేయకూడదు. ఎందుకంటే, స్వయం కృతాపరాధానికి తానే శిక్షను అనుభవించవలసి ఉంటుంది. అతని వ్యక్తిగత బాధ్యతలో ఇతరులెవ్వరూ పాలుపంచుకోరు.

قَدْ كَانَتْ لَكُمْ اُسْوَةٌ حَسَنَةٌ فِيْٓ اِبْرٰهِيْمَ وَ
الَّذِيْنَ مَعَهٗ ۚ اِذْ قَالُوْا لِقَوْمِهِمْ اِنَّا بُرَءٰٓؤُا
مِنْكُمْ وَ مِمَّا تَعْبُدُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ ۫ كَفَرْنَا
بِكُمْ وَ بَدَا بَيْنَنَا وَ بَيْنَكُمُ الْعَدَاوَةُ
وَالْبَغْضَآءُ اَبَدًا حَتّٰى تُؤْمِنُوْا بِاللّٰهِ وَحْدَهٗٓ اِلَّا
قَوْلَ اِبْرٰهِيْمَ لِاَبِيْهِ لَاَسْتَغْفِرَنَّ لَكَ وَ مَآ
اَمْلِكُ لَكَ مِنَ اللّٰهِ مِنْ شَيْءٍ ۭ رَبَّنَا عَلَيْكَ
تَوَكَّلْنَا وَ اِلَيْكَ اَنَبْنَا وَ اِلَيْكَ الْمَصِيْرُ ۝٤
رَبَّنَا لَا تَجْعَلْنَا فِتْنَةً لِّلَّذِيْنَ كَفَرُوْا وَاغْفِرْ لَنَا
رَبَّنَا ۚ اِنَّكَ اَنْتَ الْعَزِيْزُ الْحَكِيْمُ ۝٥ لَقَدْ
كَانَ لَكُمْ فِيْهِمْ اُسْوَةٌ حَسَنَةٌ لِّمَنْ كَانَ يَرْجُوا
اللّٰهَ وَ الْيَوْمَ الْاٰخِرَ ۭ وَ مَنْ يَّتَوَلَّ فَاِنَّ اللّٰهَ
هُوَ الْغَنِيُّ الْحَمِيْدُ ۝٦ ع

**4 – 5** ఇబ్రాహీమ్‌లో ఆయన సహచరులలో మీకై ఒక మంచి ఆదర్శం ఉన్నది. వారు తమ జాతివారితో స్పష్టంగా ఇలా అన్నారు, "మీపట్ల, దేవుణ్ణి వదలి మీరు పూజించే ఇతర దైవాల పట్ల మేము పూర్తిగా విసిగిపోయాము. మేము మిమ్మల్ని తిరస్కరించాము.[4] మీరు ఏకైక ప్రభువైన అల్లాహ్‌ను విశ్వసించనంతవరకు మాకూ మీకూ మధ్య విరోధ, విద్వేషాలు ఉండిపోతాయి. అయితే ఇబ్రాహీమ్ తన తండ్రితో ఇలా అనటం, "నేను మీ మన్నింపుకొరకు తప్పకుండా అల్లాహ్‌కు విన్నవిస్తాను. మీ కొరకు అల్లాహ్‌నుండి మరేదీ పొందే అధికారం నాకు లేదు."[5] (ఈ విషయం దీనినుండి మినహాయించబడింది). (ఇబ్రాహీమ్ మరియు అతని అనుయాయులు ఇలా ప్రార్థించారు), "మా ప్రభూ! మేము నిన్నే నమ్ముకున్నాము, నీ వైపునకే మేము మరలాము, నీ సన్నిధికే మేము మరలి రావలసి ఉన్నది. ప్రభూ! మమ్మల్ని అవిశ్వాసుల కొరకు పరీక్షా విషయంగా చేయకు.[6] ప్రభూ! మా తప్పులను మన్నించు, నిస్సందేహంగా నీవే మహాశక్తి సంపన్నుడవు, గొప్ప వివేకవంతుడవూను."

**6** వారి జీవన సరళిలోనే మీకూ, అల్లాహ్‌నూ అంతిమదినాన్నీ నమ్ముకున్న ప్రతి వ్యక్తికీ గొప్ప ఆదర్శం ఉన్నది. ఎవడైనా దీనికి విముఖుడైతే, అల్లాహ్ ఏ అవసరమూ లేనివాడు, స్వతహాగా ప్రశంసనీయుడు (అని వారు తెలుసుకోవాలి).

4. అంటే, మేము మిమ్మల్ని తిరస్కరిస్తున్నాము; మీరూ సత్యవంతులు కారు, మీ ధర్మమూ సత్యవంతమైనది కాదు.

5. వేరే మాటలలో దాని అర్థం ఏమిటంటే, హజ్రత్ ఇబ్రాహీమ్ తన అవిశ్వాస, ముష్రిక్కు జాతి పట్ల తన అసమ్మతిని వ్యక్తం చేసి వారితో తెగదెంపులు చేసుకునే విషయం మీరు అనుసరించదగినదే; కాని ఆయన తన ముష్రిక్కు తండ్రికై మన్నింపు ప్రార్థనలు చేస్తానని వాగ్దానం చేయటం, నిజంగానే ఆయన దానిని కార్యరూపంలో పెట్టటం అనే విషయం మీకు అనుసరణీయం కాదు.

6. అవిశ్వాసులకు విశ్వాసులు పరీక్ష అవటం అనేది అనేక రూపాలలో ఉంటుంది : ఉదాహరణకు; అవిశ్వాసులు విశ్వాసులపై ప్రాబల్యం వహించి, తాము సత్యమార్గంలో ఉన్నామనీ, విశ్వాసులు అసత్యమార్గంలో ఉన్నారనీ, దానికి తమ ప్రాబల్యమే ఒక నిదర్శనమనీ భావించవచ్చు. లేదా విశ్వాసులపై అవిశ్వాసుల దౌర్జన్యాలు సహింపరానివై, చివరకు వారు లొంగిపోయి తమ ధర్మం, తమ నీతి విషయంలో రాజీపడేరీతిలో బేరసారాలకు దిగవచ్చు లేదా సత్యధర్మానికి ప్రాతినిధ్యం వహించే ఉన్నతమైన స్థానంలో ఉండి కూడ, విశ్వాసులలో తమ స్థానానికి అనుగుణమైన నైతిక బలం లేకపోవటం; వారి ప్రవర్తనలో అజ్ఞాన కాలపు సమాజంలో ప్రబలిన దోషాలు, బలహీనతలు, ప్రజలకు గోచరించవచ్చు; ఈ ధర్మానికి మా అవిశ్వాసంపై ఆధిక్యతను ప్రసాదించే ఏ ఘనత దీనిలో ఉన్నది అనే అవకాశం అవిశ్వాసులకు లభిస్తుంది.

**7** మీరు ఈనాడు ఎవరితో విరోధం కొని తెచ్చుకున్నారో,[7] వారికీ మీకూ మధ్య ఎప్పుడో ఒకప్పుడు అల్లాహ్, ప్రేమను కలిగించటం అసంభవమేమీ కాదు. అల్లాహ్ సర్వశక్తి మంతుడు; ఇంకా ఆయన క్షమించేవాడు, కరుణించేవాడూను.

**8 – 9** ఎవరైతే ధర్మం విషయంలో మీతో యుద్ధం చేయలేదో, మిమ్మల్ని మీ ఇళ్లనుండి వెళ్లగొట్టలేదో, వారిపట్ల మీరు మంచితనంతో, న్యాయంతో వ్యవహరించటాన్ని అల్లాహ్ నిరోధించడు. అల్లాహ్ న్యాయం చేసేవారిని ప్రేమిస్తాడు.[8] ఎవరు మీతో ధర్మం విషయంలో యుద్ధం చేశారో, మిమ్మల్ని మీ ఇళ్లనుండి బహిష్కరించారో, మిమ్మల్ని బహిష్కరించటంలో పరస్పరం సహకరించుకున్నారో, వారితో మీరు స్నేహం చేయటాన్ని మాత్రం అల్లాహ్ వారిస్తున్నాడు. అటువంటి వారితో స్నేహం చేసేవారే దుర్మార్గులు.

عَسَى اللّٰهُ اَنْ يَّجْعَلَ بَيْنَكُمْ وَ بَيْنَ الَّذِيْنَ
عَادَيْتُمْ مِّنْهُمْ مَّوَدَّةً ؕ وَ اللّٰهُ قَدِيْرٌ ؕ وَ اللّٰهُ
غَفُوْرٌ رَّحِيْمٌ ۝٧ لَا يَنْهٰىكُمُ اللّٰهُ عَنِ الَّذِيْنَ
لَمْ يُقَاتِلُوْكُمْ فِى الدِّيْنِ وَ لَمْ يُخْرِجُوْكُمْ مِّنْ
دِيَارِكُمْ اَنْ تَبَرُّوْهُمْ وَتُقْسِطُوْٓا اِلَيْهِمْ ؕ اِنَّ
اللّٰهَ يُحِبُّ الْمُقْسِطِيْنَ ۝٨ اِنَّمَا يَنْهٰىكُمُ اللّٰهُ
عَنِ الَّذِيْنَ قٰتَلُوْكُمْ فِى الدِّيْنِ وَ اَخْرَجُوْكُمْ
مِّنْ دِيَارِكُمْ وَ ظٰهَرُوْا عَلٰٓى اِخْرَاجِكُمْ اَنْ
تَوَلَّوْهُمْ ۚ وَمَنْ يَّتَوَلَّهُمْ فَاُولٰٓئِكَ هُمُ
الظّٰلِمُوْنَ ۝٩

7. పై ఆయతులలో ముస్లిములకు తమ అవిశ్వాసపు బంధువులతో బాంధవ్యాన్ని తెగతెంపులు చేసుకోమని బోధించిన తరువాత, మీ ఈ బంధువర్గమే రేపు ముస్లిములుగా మారవచ్చు, ఈనాటి శత్రుత్వమే రేపటికి ప్రేమగా మారే సమయం కూడ రావచ్చు అని ఆశ కలిగించటం కూడ జరిగింది.

8. అర్థం ఏమిటంటే, మీతో విరోధించని వారితో మీరునూ విరోధించకండి. న్యాయం ఇదే. శత్రువునూ శత్రువు కానివాణ్ణి ఒకే గాటన కట్టటం న్యాయం కాదు. ఇస్లామ్ ధర్మాన్ని స్వీకరించినందుకు మిమ్మల్ని పీడించిన వారి యెడల, స్వదేశాన్ని విడిచిపెట్టి వెళ్లేలా బలవంతం చేసిన వారి యెడల, వెళ్లిపోయిన తరువాత కూడ మిమ్మల్ని వెంటాడం మానని వారియెడల కఠిన వైఖరి అవలంబించే హక్కు మీకు ఉన్నది. ఈ పీడనతో ఏ ప్రమేయమూ లేని వారి పట్ల మీరు సద్భావంతో ప్రవర్తించండి. న్యాయం ఇదే. రక్త సంబంధాలు, ఇతర బాంధవ్యాల కారణంగా మీపై ఉన్న వారి హక్కులను నెరవేర్చటంలో లోటు రానీయకండి.

يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْٓا اِذَا جَآءَكُمُ الْمُؤْمِنٰتُ مُهٰجِرٰتٍ فَامْتَحِنُوْهُنَّ ؕ اَللّٰهُ اَعْلَمُ بِاِيْمَانِهِنَّ ۚ فَاِنْ عَلِمْتُمُوْهُنَّ مُؤْمِنٰتٍ فَلَا تَرْجِعُوْهُنَّ اِلَى الْكُفَّارِ ؕ لَا هُنَّ حِلٌّ لَّهُمْ وَ لَا هُمْ يَحِلُّوْنَ لَهُنَّ ؕ وَ اٰتُوْهُمْ مَّآ اَنْفَقُوْا ؕ وَ لَا جُنَاحَ عَلَيْكُمْ اَنْ تَنْكِحُوْهُنَّ اِذَآ اٰتَيْتُمُوْهُنَّ اُجُوْرَهُنَّ ؕ وَ لَا تُمْسِكُوْا بِعِصَمِ الْكَوَافِرِ وَسْـَٔلُوْا مَآ اَنْفَقْتُمْ وَلْيَسْـَٔلُوْا مَآ اَنْفَقُوْا ؕ ذٰلِكُمْ حُكْمُ اللّٰهِ ؕ يَحْكُمُ بَيْنَكُمْ ؕ وَ اللّٰهُ عَلِيْمٌ حَكِيْمٌ ⑩ وَ اِنْ فَاتَكُمْ شَيْءٌ مِّنْ اَزْوَاجِكُمْ اِلَى الْكُفَّارِ فَعَاقَبْتُمْ فَاٰتُوا الَّذِيْنَ ذَهَبَتْ اَزْوَاجُهُمْ مِّثْلَ مَآ اَنْفَقُوْا ؕ وَاتَّقُوا اللّٰهَ الَّذِيْٓ اَنْتُمْ بِهٖ مُؤْمِنُوْنَ ⑪

**10 - 11** విశ్వసించిన ప్రజలారా! విశ్వసించిన స్త్రీలు మీ వద్దకు వలసవచ్చినప్పుడు (వారు విశ్వసించిన వారవునో కాదో) పరీక్షించి తెలుసుకోండి. వారి విశ్వాసం ఎంత వాస్తవ మైనదో అల్లాహ్‌యే బాగా ఎరుగును. తరువాత, వారు విశ్వసించిన వారే అని మీకు తెలిస్తే, వారిని అవిశ్వాసుల వద్దకు తిప్పి పంపకండి.[9] వారూ అవిశ్వాసులకు ధర్మసమ్మతంకారు, అవిశ్వాసులూ వారికి ధర్మసమ్మతం కారు, అవిశ్వాసులైన వారి భర్తలు వారికిచ్చిన 'మహర్'ను వారికి తిరిగి ఇచ్చివెయ్యండి. మీరు వారికి ఇవ్వవలసిన మహర్‌ను[10] వారికి ఇచ్చివేస్తే, అప్పుడు మీరు వారిని వివాహమాడటంలో దోషం లేదు. స్వయంగా మీరు కూడ అవిశ్వాసులైన స్త్రీలను మీ వివాహ బంధంలో ఆపివుంచకండి. అవిశ్వాసులైన మీ భార్యలకు మీరు ఇచ్చిన మహర్‌ను అడిగి వెనక్కి తీసుకోండి. అలాగే అవిశ్వాసులు విశ్వాసినులైన తమ భార్యలకు ఇచ్చిన మహర్‌ను వారు తిరిగి తీసుకోవచ్చు. ఇది అల్లాహ్ ఆజ్ఞ. ఆయన మీ మధ్య తీర్పు చేస్తున్నాడు. ఆయన సర్వమూ తెలిసినవాడు వివేకవంతుడూను. ఒకవేళ అవిశ్వాసినులైన మీ భార్యల మహర్‌లోని కొంతభాగమేదైనా అవిశ్వాసుల నుండి మీకు తిరిగి లభించక పోతే, తరువాత మీ వంతు వచ్చినప్పుడు, ఎవరి భార్యలైతే ఆ వైపున ఉండిపోయారో, వారికి వారు ఇచ్చి ఉన్నంత మహర్ మొత్తాన్ని చెల్లించండి. మీరు విశ్వసించిన దేవునికి భయపడుతూ ఉండండి.

---

9. హుదైబియా సంధి జరిగిన తరువాత, తొలిరోజులలో ముస్లిమ్ పురుషులు మక్కా నుండి పారిపోయి మదీనాకు చేరేవారు; సంధి షరతులననుసరించి వారిని వెనక్కి పంపేవారు. తరువాత ముస్లిమ్ స్త్రీల రాక ప్రారంభమయింది. అవిశ్వాసులు ఒడంబడికలోని అంశాలను అధికారికంగా చూపుతూ, వారిని కూడ తిరిగి పంపమని డిమాండు చేశారు. ఈ సందర్భంలో, హుదైబియా ఒడంబడిక స్త్రీలకు కూడ వర్తిస్తుందా అనే ప్రశ్న తల ఎత్తింది. ఈ ప్రశ్నకే అల్లాహ్ ఇక్కడ జవాబు చెప్పాడు. వారు ముస్లిములు అయితే, నిజంగా వారు విశ్వాసం కోసమే వలస వచ్చారనీ, మరొక ఉద్దేశ్యం ఏదీ లేదనీ నమ్మకం కలిగితే, వారిని వెనక్కి పంపించకూడదు. ఒడంబడికలో వ్రాయబడిన షరతులలో "రజులున్" (పురుషులు) అనే పదం వ్రాయబడింది, దీని ఆధారంగానే ఈ ఆజ్ఞ ఇవ్వబడింది. ఇదే విషయం బుఖారీ గ్రంథంలో ఉన్నది.

10. అర్థం ఏమిటంటే, వారి అవిశ్వాసపు భర్తలకు తిరిగి ఇవ్వబడే మహరులే ఈ స్త్రీల మహరులుగా పరిగణింపబడవు. ఇప్పుడు వారిలోని ఒక స్త్రీని వివాహం చేసుకోదలచిన ఒక ముస్లిమ్ ఆమెకు మహరును ఇవ్వాలి, తరువాత ఆమెను వివాహం చేసుకోవాలి.

يٰۤاَيُّهَا النَّبِيُّ اِذَا جَآءَكَ الْمُؤْمِنٰتُ يُبَايِعْنَكَ
عَلٰۤى اَنْ لَّا يُشْرِكْنَ بِاللّٰهِ شَيْـًٔا وَّ لَا يَسْرِقْنَ وَ
لَا يَزْنِيْنَ وَ لَا يَقْتُلْنَ اَوْلَادَهُنَّ وَ لَا يَاْتِيْنَ
بِبُهْتَانٍ يَّفْتَرِيْنَهٗ بَيْنَ اَيْدِيْهِنَّ وَ اَرْجُلِهِنَّ وَ
لَا يَعْصِيْنَكَ فِيْ مَعْرُوْفٍ فَبَايِعْهُنَّ وَ اسْتَغْفِرْ
لَهُنَّ اللّٰهَ ؕ اِنَّ اللّٰهَ غَفُوْرٌ رَّحِيْمٌ ﴿۱۲﴾ يٰۤاَيُّهَا
الَّذِيْنَ اٰمَنُوْا لَا تَتَوَلَّوْا قَوْمًا غَضِبَ اللّٰهُ
عَلَيْهِمْ قَدْ يَئِسُوْا مِنَ الْاٰخِرَةِ كَمَا يَئِسَ
الْكُفَّارُ مِنْ اَصْحٰبِ الْقُبُوْرِ ﴿۱۳﴾ ع

**12** ప్రవక్తా! విశ్వసించిన స్త్రీలు బైత్ చేయటానికి నీ వద్దకు వచ్చి,[11] తాము ఎవరినీ అల్లాహ్‌కు సాటిగా నిలబెట్టము అనీ, దొంగతనం చేయము అనీ, వ్యభిచారం చేయము అనీ, తమ సంతానాన్ని హత్యచేయము అనీ, తమ కాళ్లూ చేతుల మధ్య ఏ అపనిందనూ కల్పించి తీసుకురాము[12] అనీ, ధర్మ సమ్మత మైన మంచి విషయాలలో మీకు అవిధేయత చూపము[13] అనీ ప్రమాణం చేస్తే, వారినుండి బైత్ తీసుకో; వారిని క్షమించు అని అల్లాహ్‌ను ప్రార్థించు. నిశ్చయంగా అల్లాహ్ ఎంతో క్షమించేవాడు, కరుణించేవాడూను.

**13** విశ్వాసులారా! అల్లాహ్ ఆగ్రహానికి గురిఅయిన వారిని స్నేహితులుగా చేసుకోకండి. సమాధులలో పడి ఉన్న అవిశ్వాసులు నిరాశచెందినట్లుగా, వారు పరలోకం పట్ల నిరాశచెందారు.

11. ఈ ఆయతు, మక్కా విజయానికి కొంచెం ముందుగా అవతరించింది. దీని అవతరణ అనంతరం, మక్కా జయించబడింది. అప్పుడు ఖురైషు తెగకు చెందిన ప్రజలు తండోపతండాలుగా మహాప్రవక్త (సఅసమ్)తో విధేయతా ప్రమాణం (బైత్) చేయటానికి హాజరయ్యారు. దైవప్రవక్తే స్వయంగా సఫా కొండపై పురుషుల నుండి విధేయతా ప్రమాణం తీసుకున్నారు. స్త్రీల నుండి విధేయతా ప్రమాణం తీసుకోవటానికీ, ఈ ఆయతులో చెప్పబడిన విషయాలను గురించి వారిచే ప్రమాణం చేయించటానికీ, ఆయన తమ తరఫున హజ్రత్ ఉమర్ (రజిఅన్)ను నియమించారు. మదీనా నగరానికి తిరిగి వచ్చిన తరువాత, ఆయన ఒక గృహంలో అన్సారు స్త్రీలను సమావేశపరచమని ఆజ్ఞాపించారు వారి నుండి విధేయతా ప్రమాణం తీసుకోమని హజ్రత్ ఉమర్‌ను పంపారు.

12. ఇక్కడ రెండు రకాల అపనిందలు ఉన్నాయి. ఒకటి; ఒక స్త్రీ తోటి స్త్రీలపై, వారికి పరాయి పురుషులతో అక్రమ సంబంధాలు ఉన్నాయని నిందను మోపటం, ఇటువంటి కట్టుకథలను ప్రజలలో వ్యాపింపజేయటం. రెండు; ఒక స్త్రీ పరపురుషుడికి బిడ్డనుకని, ఆ బిడ్డ తన బిడ్డయే అని భర్తను నమ్మింపజేయటం.

13. ఈ చిన్న వాక్యంలో అతి ముఖ్యమైన రెండు న్యాయ విషయాలు చెప్పబడ్డాయి. ఒకటి ; మహాప్రవక్త (సఅసమ్)కు విధేయత చూపటం అనేది కూడ హితకార్యాల విషయంలో మాత్రమే అనే షరతు విధించబడింది. మహాప్రవక్త (సఅసమ్) ఎన్నడైనా చెడు చేయమని ఆజ్ఞాపిస్తారేమో అని ఎంతమాత్రం సందేహించవలసిన పనిలేదు. దీనిద్వారా స్పష్టమయ్యే విషయమేమిటంటే, ఈ లోకంలో, దేవుని చట్ట పరిధులను అతిక్రమించి ఎవరికీ విధేయత చూపటానికి వీలులేదు. ఎందుకంటే, దైవప్రవక్త (సఅసమ్)కు విధేయత చూపటంలో కూడ మంచి విషయాలలోనే అనే షరతు విధించబడినప్పుడు, తమకు బేషరతుగా విధేయత చూపమని అడిగే హక్కు ఇతరులకు ఎలా సంక్రమిస్తుంది? దైవశాసనానికి భిన్నంగా ఉన్న వారి ఆజ్ఞలను, చట్టాలను, నియమాలను, సంప్రదాయాలను అనుసరించటం ఎలా సాధ్యం? న్యాయరీత్యా అధిక ప్రాముఖ్యం గల రెండో విషయం ఏమిటంటే, ఈ ఆయతులో ఐదు నిషేధపుటుత్తర్వులను ఇచ్చిన పిదప, నిర్దిష్టమైన, ఒకే ఒక ఆజ్ఞ ఇవ్వబడింది. అది ఏమిటంటే, హితకార్యాలన్నింటిలో, మహాప్రవక్త (సఅసమ్) ఆజ్ఞలను శిరసావహించాలి. ఇక చెడ్డ విషయాలను గురించి; అజ్ఞానయుగపు స్త్రీలు గురిఅయిన పెద్ద పెద్ద చెడులను ప్రస్తావించటం జరిగింది; వాటికి దూరంగా ఉండాలనే విషయంలో కూడ ప్రమాణం ఖరారు చేయబడింది. కాని హితకార్యాల విషయంలో, ఒక జాబితా ఇచ్చి ఫలానా పనులు చేయండి అని ప్రమాణం చేయించటం జరగలేదు. కాని ఏ సత్కార్యం గురించి మహాప్రవక్త (సఅసమ్) ఉత్తరువు ఇచ్చినా, దానిని తప్పకుండా అనుసరించాలి అనే విషయంలో మాత్రమే ప్రమాణం చేయించటం జరిగింది.

## ٦١ سُوْرَةُ الصَّفِّ مَدَنِيَّةٌ ١٠٩

اٰياتها ١٤ — ركوعاتها ٢

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

سَبَّحَ لِلّٰهِ مَا فِي السَّمٰوٰتِ وَ مَا فِي الْاَرْضِ ۚ وَ
هُوَ الْعَزِيْزُ الْحَكِيْمُ ١ يٰاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لِمَ
تَقُوْلُوْنَ مَا لَا تَفْعَلُوْنَ ٢ كَبُرَ مَقْتًا عِنْدَ
اللّٰهِ اَنْ تَقُوْلُوْا مَا لَا تَفْعَلُوْنَ ٣ اِنَّ اللّٰهَ
يُحِبُّ الَّذِيْنَ يُقَاتِلُوْنَ فِيْ سَبِيْلِهٖ صَفًّا كَاَنَّهُمْ
بُنْيَانٌ مَّرْصُوْصٌ ٤ وَ اِذْ قَالَ مُوْسٰى
لِقَوْمِهٖ يٰقَوْمِ لِمَ تُؤْذُوْنَنِيْ وَ قَدْ تَّعْلَمُوْنَ اَنِّيْ
رَسُوْلُ اللّٰهِ اِلَيْكُمْ ۭ فَلَمَّا زَاغُوْٓا اَزَاغَ اللّٰهُ
قُلُوْبَهُمْ ۭ وَ اللّٰهُ لَا يَهْدِي الْقَوْمَ الْفٰسِقِيْنَ ٥

## 61. అస్ సఫ్

ఆయతులు 14 — అవతరణ మదీనాలో

*అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

**1** ఆకాశాలలోనూ, భూమిలోనూ ఉన్న ప్రతి వస్తువూ అల్లాహ్‌నే స్తుతిస్తోంది. ఆయన ఆధిక్యత కలవాడు, వివేకవంతుడూను.

**2 - 4** విశ్వాసులారా! మీరు చేయని విషయాన్ని చేస్తాము అని చెబుతారెందుకు? మీరు చేయని దానిని చేస్తాము అని చెప్పటం అల్లాహ్ దృష్టిలో అత్యంత అప్రియమైన విషయం. అసలు అల్లాహ్‌కు ఆయన మార్గంలో సీసంతో పోసిన[1] గోడవలె దృఢమైన బారులు తీరి నిలబడి పోరాడే వారంటేనే ఇష్టం.

**5** మూసా తన జాతివారితో అన్న ఈ విషయాన్ని జ్ఞాపకం తెచ్చుకో; "ఓ నాజాతి ప్రజలారా! మీరు నన్ను ఎందుకు వేధిస్తు న్నారు? నేను మీ వద్దకు అల్లాహ్‌చే పంపబడిన ప్రవక్తనని మీకు తెలుసుకదా!"[2] ఆ తరువాత వారు వక్రమార్గాన్ని అవలం బించినపుడు, అల్లాహ్ కూడా వారి హృదయాలను వక్రీకరిం చాడు. అల్లాహ్ దుర్మార్గులకు సన్మార్గం చూపడు.[3]

1. దీనిద్వారా తెలిసే తొలి విషయం ఏమిటంటే, ప్రాణాలకు తెగించి అల్లాహ్ మార్గంలో పోరాడటానికీ, ప్రమాదాలను సైతం ఎదుర్కోవటానికీ సంసిద్ధులయ్యే విశ్వాసులకు మాత్రమే అల్లాహ్ ప్రసన్నతా భాగ్యం కలుగుతుంది. మలి విషయం ఏమిటంటే, అల్లాహ్‌కు ప్రీతిపాత్రమైన సైన్యానికి మూడు గుణాలు ఉండాలి. ఒకటి, ఆ సైన్యం అల్లాహ్ మార్గంలో వివేచనతో, విమర్శనాబుద్ధితో పోరాడాలి, అల్లాహ్ మార్గంగా పరిగణింపబడని ఏ మార్గంలోనూ పోరాడకూడదు. రెండు, అది క్రమశిక్షణా రాహిత్యానికి, కలతలకూ లోనుకాకూడదు; కట్టుదిట్టమైన క్రమశిక్షణతో బారులు తీరి పోరాడాలి. మూడు, శత్రువు ఎదుట, ఈ సైన్యం పోతపోసిన సీసపు గోడవలె నిలబడాలి.
2. ఇస్రాయీల్ సంతతివారు తమ ప్రవక్తల పట్ల అవలంబించిన వైఖరిని ముస్లిమ్‌లు తమ ప్రవక్త పట్ల అవలంబించకూడదు. కానిచో, ఇస్రాయీల్ సంతతివారికి పట్టిన గతే వారికీ పడుతుంది అని హెచ్చరిక చేయబడుతోంది.
3. అంటే, వక్రమార్గాన్ని అవలంబించదలచిన వారికి, అనవసరంగా రుజుమార్గం చూపటం, అల్లాహ్ పట్ల అవిధేయత చూపటానికే నిర్ణయించుకున్నవారికి సన్మార్గభాగ్యం కలిగించటం అల్లాహ్ విధానం కాదు.

وَ اِذْ قَالَ عِيْسَى ابْنُ مَرْيَمَ يٰبَنِيْٓ اِسْرَآءِيْلَ
اِنِّيْ رَسُوْلُ اللّٰهِ اِلَيْكُمْ مُّصَدِّقًا لِّمَا بَيْنَ
يَدَيَّ مِنَ التَّوْرٰىةِ وَ مُبَشِّرًۢا بِرَسُوْلٍ يَّاْتِيْ مِنْۢ
بَعْدِي اسْمُهٗٓ اَحْمَدُ ؕ فَلَمَّا جَآءَهُمْ بِالْبَيِّنٰتِ
قَالُوْا هٰذَا سِحْرٌ مُّبِيْنٌ ﴿٦﴾ وَ مَنْ اَظْلَمُ مِمَّنِ
افْتَرٰى عَلَى اللّٰهِ الْكَذِبَ وَهُوَ يُدْعٰٓى اِلَى
الْاِسْلَامِ ؕ وَ اللّٰهُ لَا يَهْدِي الْقَوْمَ
الظّٰلِمِيْنَ ﴿٧﴾ يُرِيْدُوْنَ لِيُطْفِـُٔوْا نُوْرَ اللّٰهِ
بِاَفْوَاهِهِمْ وَاللّٰهُ مُتِمُّ نُوْرِهٖ وَ لَوْ كَرِهَ
الْكٰفِرُوْنَ ﴿٨﴾ هُوَ الَّذِيْٓ اَرْسَلَ رَسُوْلَهٗ
بِالْهُدٰى وَ دِيْنِ الْحَقِّ لِيُظْهِرَهٗ عَلَى الدِّيْنِ
كُلِّهٖ وَ لَوْ كَرِهَ الْمُشْرِكُوْنَ ﴿٩﴾ ع

**6** ... మర్యమ్ కుమారుడు ఈసా అనిన మాటలను జ్ఞాపకం తెచ్చుకో, "ఓ ఇస్రాయీల్ సంతతి వారలారా! నేను మీ వద్దకు అల్లాహ్‌చే పంపబడిన సందేశహరుణ్ణి;[4] నాకు పూర్వం వచ్చిన తౌరాత్ గ్రంథాన్ని ధృవపరుస్తున్నాను; నా తరువాత అహ్మద్[5] అనే ప్రవక్త రాబోతున్నాడు అనే శుభవార్తను అందజేస్తున్నాను.

**... 6 - 9** అయితే ఆయన (ముహమ్మద్ - సఅసమ్) వారి వద్దకు స్పష్టమైన సూచనలను తెచ్చినప్పుడు, వారు ఇది పూర్తిగా మోసమే[6] అని అన్నారు, ఇక ఇస్లామ్ (అల్లాహ్‌కు తనను తాను సమర్పించుకోవటం) సందేశం[7] అందజేయబడుతున్నప్పటికీ, అల్లాహ్‌పై అపనిందలు[8] మోపేవాడి కంటే పరమ దుర్మార్గుడెవడు? అటువంటి దుర్మార్గులకు అల్లాహ్ సన్మార్గం చూపడు. వారు అల్లాహ్ జ్యోతిని తమ నోటితో ఊది ఆర్పగోరుతున్నారు. కాని అవిశ్వాసులకు ఎంత అనిష్టంగా ఉన్నాసరే అల్లాహ్ తన జ్యోతిని పూర్తిగా వ్యాపింపజేయటానికే నిర్ణయించుకున్నాడు. ఆయనే తన ప్రవక్తకు మార్గదర్శకత్వాన్నీ, సత్యధర్మాన్నీ ఇచ్చి పంపాడు. దానిని సకల ధర్మాలపై ఆధిక్యం వహించే ధర్మంగా చేయటానికి; ఇది బహుదైవారాధకులకు ఎంత అనిష్టమైనాసరే.

4. ఇది ఇస్రాయీల్ సంతతివారి రెండో అవిధేయతకు సంబంధించిన ప్రస్తావన. వారు ఉచ్ఛస్థితిలో ఉన్న తొలినాళ్లల్లో మొదటిసారిగా అవిధేయతకు పాల్పడ్డారు. ఈ ప్రాభవపు తుదినాళ్లల్లో వారు రెండోసారి అవిధేయతకు తిరిగి ఒడిగట్టారు. దాని తరువాత వారిపై శాశ్వతంగా అల్లాహ్ శాపం పడింది. ఈ రెండు సంఘటనలను గురించి చెప్పటంలో గల ఉద్దేశ్యం ఏమిటంటే, ఇస్రాయీల్ సంతతివారు తమ ప్రవక్తల యెడల అవలంబించిన వైఖరిని ముస్లిమ్‌లు కూడ తమ ప్రవక్త యెడల అవలంబించినట్లయితే, వారు అనుభవించిన ఫలితాలనే, వీరు కూడ అనుభవిస్తారని హెచ్చరిక చేయటం.
5. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) ఆగమనాన్ని గురించి హజ్రత్ ఈసా చెప్పిన జోస్యానికి సంబంధించిన ప్రస్తావన ఇది. దీనికి సంబంధించిన సాక్ష్యాధారాలను మేము "తఫీముల్ ఖుర్ఆన్" ఐదవ సంపుటిలో, ఈ ఆయతును వివరిస్తూ ఇచ్చాము.
6. అసలు 'సిహ్ర్' అనే పదం వాడబడింది. ఇక్కడ ఈ పదం ఇంద్రజాలం అనే అర్థంలోకాక, మోసం, వంచన అనే అర్థంలో ఉపయోగించబడింది. అరబ్బీ నిఘంటువులో, ఇంద్రజాలం అనే అర్థం మాదిరిగానే ఈ అర్థాలు కూడ ప్రసిద్ధాలు. ఈ ఆయతు అర్థం ఏమిటంటే, ఏ ప్రవక్త ఆగమనాన్ని గురించి హజ్రత్ ఈసా (అస్సలామ్) జోస్యం చెప్పారో, ఆ ప్రవక్త తన ప్రవక్త పదవికి సంబంధించిన నిదర్శనాలతో వచ్చినప్పుడు, ఇస్రాయీల్ సంతతివారూ, యేసు అనుయాయులూ ఆయన ప్రవక్త పదవి ప్రకటనను స్పష్టమైన మోసం అని అన్నారు.
7. అంటే, అసలు దైవప్రవక్తను బూటకపు ప్రవక్త అని చెప్పటమే ఒక పెద్ద దుర్మార్గం, అంతటితో ఆగక, దైవప్రవక్త దైవదాస్యం వైపునకు, దైవవిధేయత వైపునకు పిలిచినప్పుడు, దానికి సమాధానంగా ఆయనను తిట్టటం, ఆయన సందేశాన్ని దెబ్బతీయటానికి వివిధ రీతులలో అబద్ధాలు చెప్పటం, నీలాపనిందలు మోపటం పరమదుర్మార్గం.

يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا هَلْ اَدُلُّكُمْ عَلٰى تِجَارَةٍ
تُنْجِيْكُمْ مِّنْ عَذَابٍ اَلِيْمٍ ﴿١٠﴾ تُؤْمِنُوْنَ بِاللّٰهِ وَ
رَسُوْلِهٖ وَ تُجَاهِدُوْنَ فِيْ سَبِيْلِ اللّٰهِ
بِاَمْوَالِكُمْ وَ اَنْفُسِكُمْ ؕ ذٰلِكُمْ خَيْرٌ لَّكُمْ اِنْ
كُنْتُمْ تَعْلَمُوْنَ ﴿١١﴾ يَغْفِرْ لَكُمْ ذُنُوْبَكُمْ وَ
يُدْخِلْكُمْ جَنّٰتٍ تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ وَ
مَسٰكِنَ طَيِّبَةً فِيْ جَنّٰتِ عَدْنٍ ؕ ذٰلِكَ الْفَوْزُ
الْعَظِيْمُ ﴿١٢﴾ وَ اُخْرٰى تُحِبُّوْنَهَا ؕ نَصْرٌ مِّنَ اللّٰهِ
وَ فَتْحٌ قَرِيْبٌ ؕ وَ بَشِّرِ الْمُؤْمِنِيْنَ ﴿١٣﴾ يٰٓاَيُّهَا
الَّذِيْنَ اٰمَنُوْا كُوْنُوْٓا اَنْصَارَ اللّٰهِ كَمَا قَالَ
عِيْسَى ابْنُ مَرْيَمَ لِلْحَوَارِيّٖنَ مَنْ اَنْصَارِيْٓ
اِلَى اللّٰهِ ؕ قَالَ الْحَوَارِيُّوْنَ نَحْنُ اَنْصَارُ اللّٰهِ
فَاٰمَنَتْ طَّآئِفَةٌ مِّنْ بَنِيْٓ اِسْرَآءِيْلَ وَ كَفَرَتْ
طَّآئِفَةٌ ۚ فَاَيَّدْنَا الَّذِيْنَ اٰمَنُوْا عَلٰى عَدُوِّهِمْ
فَاَصْبَحُوْا ظٰهِرِيْنَ ﴿١٤﴾

**10 - 13** విశ్వసించిన ఓ ప్రజలారా! మిమ్మల్ని వ్యధాభరిత మైన శిక్ష నుండి రక్షించే వ్యాపారమేమిటో[9] నేను మీకు తెలుపనా? విశ్వసించండి అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను పోరాడండి అల్లాహ్ మార్గంలో మీ సంపదలను, మీ ప్రాణా లను ధారపోసి. మీరు గనక గ్రహిస్తే, ఇదే మీకు మేలైనది. అప్పుడు అల్లాహ్ మీ పాపాలను క్షమిస్తాడు, మిమ్మల్ని సెలయేళ్లు ప్రవహించే వనాలలో ప్రవేశింపజేస్తాడు. అంతేకాదు శాశ్వతమైన ఆ స్వర్గవనాలలో మీకు ఎంతో అందమైన గృహా లను ప్రసాదిస్తాడు. ఇదే గొప్ప సాఫల్యం. మీరు కోరుకుంటున్న ఇతర వస్తువులు కూడా మీకు అనుగ్రహిస్తాడు– అవి అల్లాహ్ నుండి పొందే సహాయం మరియు త్వరలో లభించబోయే విజయం. ఓ ప్రవక్తా! ఈ శుభవార్తను విశ్వాసులకు అంద జెయ్యి.

**14** విశ్వసించిన ఓ ప్రజలారా! మర్యమ్ కుమారుడు ఈసా, హవారీలతో అన్నట్లు మీరు అల్లాహ్‌కు సహాయకులుకండి. వారితో ఈసా ఇలా అన్నాడు, "అల్లాహ్ వైపునకు (పిలిచే పనిలో) నాకు సహాయపడేవారు ఎవరైనా ఉన్నారా?" దానికి హవారీలు, "మేము ఉన్నాము అల్లాహ్‌కు సహాయకులం" అని సమాధానమిచ్చారు. అప్పుడు ఇస్రాయీల్ సంతతిలోని ఒక వర్గం విశ్వసించింది, మరొక వర్గం తిరస్కరించింది. తరువాత మేము విశ్వసించిన వారిని వారి శత్రువులకు వ్యతి రేకంగా బలపరిచాము. వారే ఆధిక్యం వహించారు.[10]

8. అంటే, అల్లాహ్ పంపిన ప్రవక్తను బూటకపు ప్రవక్త అని చెప్పటం ప్రవక్తపై అవతరిస్తున్న అల్లాహ్ గ్రంథాన్ని ప్రవక్తయే కల్పించాడని అనటం.

9. వ్యాపారంలో లాభార్జనకై ఒక మనిషి తన సంపదనూ, సమయాన్నీ, శ్రమనూ, తెలివినీ, సామర్థ్యాన్నీ పణంగా పెడతాడు. ఇదే రీతిలో ఇక్కడ విశ్వాసాన్నీ, దైవమార్గంలో యత్నించటాన్నీ (జిహాద్) వ్యాపారం అని చెప్పబడింది. అర్థం ఏమిటంటే, ఈ మార్గంలో మీ సర్వస్వాన్నీ గుప్పించినట్లయితే, రాబోయే ఆయతులలో చెప్పబడిన లాభాలన్నీ మీరు పొందగలరు.

10. యూదులు హజ్రత్ ఈసాను విశ్వసించలేదు. క్రైస్తవులూ, ముస్లిములూ ఆయనను విశ్వసించారు. అల్లాహ్ మొదట యూదులపై క్రైస్తవులు ప్రాబల్యం వహించేలా చేశాడు. తరువాత ముస్లిములు కూడ వారిపై ప్రాబల్యం వహించారు. ఈ విధంగా ఏసుక్రీస్తును తిరస్కరించినవారు, పై రెండు వర్గాల వారి చేతులలోనూ, ఓటమిని చవిచూశారు. ఈ వ్యవహారం ఇక్కడ చెప్పబడటానికి హేతువు ఏమిటంటే, ఏ విధంగా మొదట, ఏసుక్రీస్తును విశ్వసించినవారు ఆయనను విశ్వసించనివారిపై ప్రాబల్యం వహించారో, అదేవిధంగా మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్)ను విశ్వసించినవారు ఆయనను విశ్వసించనివారిపై ప్రాబల్యం వహిస్తారు అని ముస్లిములకు నమ్మకం కలగటానికే.

## 62. అల్ జుముఅహ్

ఆయతులు 11 | అవతరణ మదీనాలో

٦٢ سُوْرَةُ الْجُمُعَةِ مَدَنِيَّةٌ ١١٠

اٰیاتھا ۱۱ | رکوعاتھا ۲

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِیۡمِ

يُسَبِّحُ لِلّٰهِ مَا فِى السَّمٰوٰتِ وَمَا فِى الْاَرْضِ الْمَلِكِ الْقُدُّوْسِ الْعَزِيْزِ الْحَكِيْمِ ① هُوَ الَّذِىْ بَعَثَ فِى الْاُمِّيّٖنَ رَسُوْلًا مِّنْهُمْ يَتْلُوْا عَلَيْهِمْ اٰيٰتِهٖ وَيُزَكِّيْهِمْ وَيُعَلِّمُهُمُ الْكِتٰبَ وَالْحِكْمَةَ وَاِنْ كَانُوْا مِنْ قَبْلُ لَفِىْ ضَلٰلٍ مُّبِيْنٍ ② وَّاٰخَرِيْنَ مِنْهُمْ لَمَّا يَلْحَقُوْا بِهِمْ ؕ وَهُوَ الْعَزِيْزُ الْحَكِيْمُ ③ ذٰلِكَ فَضْلُ اللّٰهِ يُؤْتِيْهِ مَنْ يَّشَآءُ ؕ وَاللّٰهُ ذُو الْفَضْلِ الْعَظِيْمِ ④

**1** ఆకాశాలలోని ప్రతివస్తువూ, భూమిలోని ప్రతి వస్తువూ అల్లాహ్‌ను స్తుతిస్తోంది. ఆయన విశ్వసమ్రాట్టు, ఎంతో పరిశుద్ధుడు, అత్యంత శక్తిమంతుడు, వివేకవంతుడు.

**2 - 4** ఆయనే నిరక్షరాస్యులలో[1] (ఉమ్మీలు) ఒక ప్రవక్తను స్వయంగా వారి నుండే లేపాడు. ఆ ప్రవక్త వారికి ఆయన వాక్యాలను వినిపిస్తున్నాడు, వారి జీవితాలను తీర్చిదిద్దుతున్నాడు, వారికి గ్రంథాన్నీ, వివేకాన్నీ బోధిస్తున్నాడు. వాస్తవానికి దీనికి పూర్వం వారు పూర్తిగా మార్గం తప్పి ఉన్నారు. ఇంకా వారితో చేరని ఇతరుల కొరకు కూడ[2] (ఈ ప్రవక్త ప్రభవించబడ్డాడు). అల్లాహ్ అత్యంత శక్తిమంతుడు, వివేకవంతుడూను.[3] ఇది ఆయన అనుగ్రహం, తాను కోరిన వారికి దానిని ప్రసాదిస్తాడు. ఆయన గొప్ప అనుగ్రహశాలి.

---

1. ఇక్కడ ఉమ్మీ అనే పదం యూదుల పరిభాషగా వాడబడింది. ఇందులో ఒక సున్నితమైన చమత్కారం నిగూఢంగా ఉన్నది. దీని అర్థం ఏమిటంటే, ఏ అరబ్బులను యూదులు హీనభావంతో "ఉమ్మీలు" అంటారో, తమకంటే తక్కువవారుగా భావిస్తారో, వారిలో నుండే సర్వశక్తిమంతుడూ, వివేచనాపరుడూ అయిన అల్లాహ్ ఒక ప్రవక్తను ప్రభవింపజేశాడు. ఆయన తనంతటతానుగా ప్రభవించినవాడు కాడు. ఆయనను ప్రభవింపజేసినవాడు సర్వశక్తిమంతుడూ, వివేచనాపరుడూ అయిన విశ్వసమ్రాట్టు. ఆయనను ఎదిరించి ఈ ప్రజలు తమను తామే నాశనం చేసుకుంటారు, ఆయనకు ఏమాత్రం నష్టం కలిగించలేరు.
2. అంటే, మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) ప్రవక్త పదవి కేవలం అరబ్బు జాతికే పరిమితం కాదు. యావత్తు ప్రపంచంలోని ఇతర జాతులు, తెగలు అన్నింటికీ ఆయనే ప్రవక్త. వాటిలో ఇంకా విశ్వాసుల వర్గంలో చేరని వారికినీ, ప్రళయం వచ్చేవరకు పుట్టబోయే వారికినీ ఆయనే ప్రవక్త.
3. అంటే, అనాగరికులూ, నిరక్షరాస్యులూ అయిన వారిలో ఒక గొప్ప ప్రవక్తను ప్రభవింపజేయటంలో ఆయన శక్తి యుక్తులు ప్రదర్శితమైనాయి. అతని ఉపదేశాలూ, మార్గదర్శక సూత్రాలూ విప్లవాత్మకమైనటువంటివి; అవి సార్వజనీనమూ, సార్వకాలికమూ అయిన సూత్రాలు. వాటి ఆధారంగా మానవజాతి అంతా ఒకే సంఘంగా రూపొందగలదు; వాటి నుండి మానవుడు ఎల్లప్పుడూ మార్గదర్శకత్వాన్ని పొందగలడు.

مَثَلُ الَّذِيْنَ حُمِّلُوا التَّوْرٰىةَ ثُمَّ لَمْ يَحْمِلُوْهَا
كَمَثَلِ الْحِمَارِ يَحْمِلُ اَسْفَارًا ؕ بِئْسَ مَثَلُ
الْقَوْمِ الَّذِيْنَ كَذَّبُوْا بِاٰيٰتِ اللّٰهِ ؕ وَ اللّٰهُ لَا
يَهْدِى الْقَوْمَ الظّٰلِمِيْنَ ۝۵ قُلْ يٰۤاَيُّهَا
الَّذِيْنَ هَادُوْۤا اِنْ زَعَمْتُمْ اَنَّكُمْ اَوْلِيَآءُ لِلّٰهِ
مِنْ دُوْنِ النَّاسِ فَتَمَنَّوُا الْمَوْتَ اِنْ كُنْتُمْ
صٰدِقِيْنَ ۝۶ وَ لَا يَتَمَنَّوْنَهٗۤ اَبَدًاۢ بِمَا قَدَّمَتْ
اَيْدِيْهِمْ ؕ وَ اللّٰهُ عَلِيْمٌۢ بِالظّٰلِمِيْنَ ۝۷ قُلْ اِنَّ
الْمَوْتَ الَّذِيْ تَفِرُّوْنَ مِنْهُ فَاِنَّهٗ مُلٰقِيْكُمْ ثُمَّ
تُرَدُّوْنَ اِلٰى عٰلِمِ الْغَيْبِ وَ الشَّهَادَةِ
فَيُنَبِّئُكُمْ بِمَا كُنْتُمْ تَعْمَلُوْنَ ۝۸ يٰۤاَيُّهَا الَّذِيْنَ ع ٢/٨
اٰمَنُوْۤا اِذَا نُوْدِيَ لِلصَّلٰوةِ مِنْ يَّوْمِ الْجُمُعَةِ
فَاسْعَوْا اِلٰى ذِكْرِ اللّٰهِ وَ ذَرُوا الْبَيْعَ ؕ ذٰلِكُمْ
خَيْرٌ لَّكُمْ اِنْ كُنْتُمْ تَعْلَمُوْنَ ۝۹ فَاِذَا قُضِيَتِ
الصَّلٰوةُ فَانْتَشِرُوْا فِي الْاَرْضِ وَ ابْتَغُوْا مِنْ
فَضْلِ اللّٰهِ وَ اذْكُرُوا اللّٰهَ كَثِيْرًا لَّعَلَّكُمْ
تُفْلِحُوْنَ ۝۱۰

**5** తౌరాత్ గ్రంథబాధ్యతా భారం మోపబడినప్పటికీ, దానిని మోయనివారు, పుస్తకాల బరువును మోసే గాడిదను పోలి ఉన్నారు. అల్లాహ్ వాక్యాలను తిరస్కరించిన వారి పోలిక దీనికంటె కూడ ఘోరమైనది.[4] ఇటువంటి దుర్మార్గులకు అల్లాహ్ సన్మార్గం చూపడు.

**6 – 8** వారితో ఇలా అను, "యూదులైపోయిన ప్రజలారా![5] ఒకవేళ మిగతా ప్రజలందరికంటే మీరు మాత్రమే అల్లాహ్‌కు ప్రియమైనవారు అనే గర్వం మీకు ఉంటే, చావును కోరుకోండి. మీరు పలికే ఈ ప్రగల్భాలు, నిజమే అయితే,[6] ఈ పని చెయ్యండి." కాని వారు తాము చేసుకున్న అకృత్యాల కారణంగా చావును ఎన్నటికీ కోరుకోరు. అల్లాహ్ ఈ దుర్మార్గులను బాగా ఎరుగును. వారికి ఇలా చెప్పు: "ఏ చావు నుండి మీరు పారి పోతున్నారో, అది మీకు తప్పకుండా వచ్చి తీరుతుంది. ఆ తరువాత మీరు రహస్య విషయాలు, బహిరంగ విషయాలు అన్నింటినీ ఎరిగినవారి ముందు హాజరు పరచబడతారు. అప్పుడు ఆయన మీకు మీరేమేమి చేస్తూ ఉండేవారో అవన్నీ తెలుపుతాడు."

**9 - 10** విశ్వాసులారా! శుక్రవారం నాడు నమాజుకై పిలిచినప్పుడు, అల్లాహ్ సంస్మరణ వైపునకు పరుగెత్తండి; క్రయవిక్రయాలను వదలిపెట్టండి.[7] మీరు గ్రహించగలిగితే, ఇదే మీకు అత్యంత శ్రేయస్కరమైనది. ఆపై నమాజు ముగిసిన తరువాత భూమిపై వ్యాపించండి, అల్లాహ్ అనుగ్రహాన్ని అన్వేషించండి;[8] అల్లాహ్‌ను అత్యధికంగా స్మరిస్తూ ఉండండి, బహుశా మీకు సాఫల్య భాగ్యం కలుగవచ్చు.[9]

4. అంటే, వారి స్థితి గాడిద స్థితికంటె హీనమైనది. అది జ్ఞానహీన కావున క్షమార్హమైనది. కాని వారికి జ్ఞానం ఉన్నది. వారు తౌరాతు గ్రంథాన్ని చక్కగా చదవనూగలరు, బోధించనూగలరు. దాని అర్థం తెలియని వారూ కారు. అయినా వారు దాని ఉపదేశాలను బుద్ధిపూర్వకంగా పెడచెవిన పెడుతున్నారు. తౌరాతు గ్రంథం ప్రకారం సత్యంపై ఉన్నటువంటి దైవప్రవక్తను వారు బుద్ధిపూర్వకంగా విశ్వసించటం లేదు. వారు అజ్ఞానం వల్ల దోషులుకారు; తెలిసీ అల్లాహ్ ఆయతులను తిరస్కరించిన దోషులు వారు.

5. ఈ విషయం గమనింపదగినది : "యూదులుగా మారిన ఓ ప్రజలారా!" లేదా యూదుమతాన్ని అవలంబించిన ప్రజలారా! అని చెప్పబడిందే కాని, "ఓ యూదులారా!" అని చెప్పబడలేదు. దీనికి కారణం ఏమిటంటే, మూసా (అస్సలామ్) ప్రవక్త, ఆయనకు పూర్వం, తరువాత వచ్చిన ప్రవక్తలందరూ తీసుకువచ్చిన ధర్మం ఇస్లామే. ఈ ప్రవక్తలలో ఎవరూ యూదులు కారు; వారి కాలంలో యూదుమతమూ పుట్టింది కాదు. ఈ యూదుమతం చాలా కాలం తరువాత ఈ పేరుతో వ్యాప్తిలోకి వచ్చింది.

| | |
|---|---|
| 11 వారు, వ్యాపారం, వినోదక్రీడలు జరుగుతూ ఉండగా చూచి, అటువైపు పరుగెత్తారు; నిన్ను నిలబడి ఉన్న స్థితిలో వదలివెళ్లారు.[10] వారితో ఇలా అను, "వినోదక్రీడల కంటే, వ్యాపారం కంటే అల్లాహ్ వద్ద ఉన్నదే శ్రేష్ఠమైనది.[11] అల్లాహ్ అందరికంటే మేలైన ఉపాధిప్రదాత."[12] | وَ اِذَا رَاَوْا تِجَارَةً اَوْ لَهْوَا انْفَضُّوْٓا اِلَيْهَا وَ تَرَكُوْكَ قَآئِمًا ؕ قُلْ مَا عِنْدَ اللّٰهِ خَيْرٌ مِّنَ اللَّهْوِ وَ مِنَ التِّجَارَةِ ؕ وَ اللّٰهُ خَيْرُ الرّٰزِقِيْنَ ﴿۱۱﴾ |

ع ٢

6. అరేబియా యూదులు తమ సంఖ్యాబలాన్ని బట్టీ, తమ శక్తినిబట్టీ, ఏ విధంగానూ ముస్లిమ్‌లకు తీసిపోరు. కాని వనరుల విషయంలో మాత్రం వారు ఆధిక్యతను కలిగి ఉన్నారు. వారు ఉభయులూ సమ ఉజ్జీలు కాకపోయినప్పటికీ, ముస్లిమ్‌లు ప్రాబల్యం వహించటానికీ, యూదులు పరాజితులు కావటానికి కారణం ముస్లిమ్‌లు అల్లాహ్ నిమిత్తం ప్రాణాలొగ్గటానికైనా వెనుదీయకపోవడమే, దాని పట్ల వారికి గల ప్రగాఢమైన ప్రీతియే. నిర్భయంగా, నిస్సంకోచంగా యుద్ధ భూమిలో కాలిడతారు. దీనికి భిన్నంగా, యూదులు దేని నిమిత్తంగానైనా ప్రాణాలొడ్డటానికి సంసిద్ధులు కారు, అల్లాహ్ నిమిత్తమైనా, తమ జాతి నిమిత్తమైనా, తమ ధన మాన ప్రాణాల నిమిత్తమైనా వారికి కావలసినది కేవలం బ్రతకడమే, అది ఎలాంటి బ్రతుకైనా సరే. ఈ విషయమే వారిని పిరికివాళ్లుగా చేసింది.

7. ఈ ఆజ్ఞలో గల 'సంస్మరణ' అంటే, 'హితబోధ' అని అర్థం. ఎందుకంటే, అజాను (నమాజుకు పిలుపు) తరువాత మహాప్రవక్త (సఅసమ్) చేసే మొదటి పని నమాజు కాదు, హితబోధ; ఎల్లప్పుడూ ఆయన హితబోధ చేసిన తరువాతే నమాజు చేసేవారు. "అల్లాహ్ సంస్మరణ వైపునకు పరుగెత్తండి" అంటే, పరుగెత్తుతూ రండి అని అర్థం కాదు ; సాధ్యమైనంత త్వరగా అక్కడకు చేరటానికి ప్రయత్నించండి అని దాని అర్థం. "క్రయవిక్రయాలను వదలిపెట్టండి" అంటే, కేవలం క్రయవిక్రయాలను మాత్రమే వదలటం అని అర్థం కాదు; నమాజు చింతన, దానికి సంబంధించిన సన్నాహం తప్ప మిగతా అన్ని వ్యాపకాలను వదలిపెట్టాలి అని దాని అర్థం. శుక్రవారపు నమాజు పిలుపు తరువాత, అన్ని రకాల వర్తక వాణిజ్యాలు నిషిద్ధం అనే విషయంలో ఇస్లామ్ ధర్మశాస్త్రవేత్తలు ఏకాభిప్రాయంతో ఉన్నారు. అయితే, హదీసుల ప్రకారం, పిల్లలు, స్త్రీలు, బానిసలు, రోగులు, బాటసారులు శుక్రవారపు నమాజు విధి నుండి మినహాయించబడ్డారు.

8. శుక్రవారపు నమాజు అనంతరం, జీవనోపాధి అన్వేషణకై, మీ మీ భూభాగాలకు పోయి అందులో తప్పనిసరిగా నిమగ్నమైపోవాలి అని దీని అర్థం కాదు. కాని ఇది అనుమతి అనే అర్థంలో చెప్పబడింది. శుక్రవారపు అజాను విని, సమస్త క్రయవిక్రయాలను విడిచిపెట్టాలనే ఆజ్ఞ ఇవ్వబడింది కాబట్టి, నమాజు సమాప్తమైన పిమ్మట, ఎవరి దారిన వారు వెళ్లి, తమ తమ పనులను కొనసాగించుకునే అనుమతి ఉన్నది. ఇది ఇహ్రామ్ స్థితిలో ఉన్నప్పుడు వేటాడటాన్ని నిషేధించిన తరువాత, మీరు ఇహ్రామ్‌ను తీసివేసిన తరువాత వేటాడండి అని చెప్పిన రీతిగా ఉన్నది (అల్ మాఇదా సూరా – 2వ ఆయతు). తప్పకుండా వేటాడాలి అని దీని అర్థం కాదు. దీని తరువాత కావాలంటే మీరు వేటాడవచ్చు అని దీని అర్థం. కనుక దివ్య ఖురాను ప్రకారం ఇస్లామ్‌లో శుక్రవారం సెలవు కాదు అని ఈ ఆయతు ఆధారంగా వాదించేవారు తప్పుగా వాదిస్తున్నారు. వారంలో ఒకరోజు సెలవు కావాలనుకుంటే, ముస్లిమ్‌లు శుక్రవారం రోజున సెలవు తీసుకోవాలి. యూదులు శనివారాన్ని, క్రైస్తవులు ఆదివారాన్ని సెలవును పాటించినట్లే.

9. ఇలాంటి సందర్భాలలోనే, 'బహుశా' అనే పదం వాడటం అల్లాహ్‌కు (అల్లాహ్ క్షమించుగాక!) ఈ విషయంలో సందేహం ఉందని అర్థం కాదు; కాని ఇది అసలు రాజఠీవితో చెప్పిన విషయం. దయార్ద్ర హృదయుడైన ఒక

యజమాని తన నౌకరుతో, "నీవు ఫలానా పని చేయి, బహుశా నీకు ఉన్నత స్థానం లభించవచ్చు" అనే రీతిలో ఇది ఉన్నది. ఇందులో ఒక చిన్న వాగ్దానం అంతర్లీనమై ఉన్నది. దాని యందలి ఆశతో నౌకరు మనఃస్ఫూర్తిగా పరమానందంతో ఆ పనిని నిర్వహిస్తాడు.

10. మదీనా నగర జీవితారంభ దశలో ఈ సంఘటన జరిగింది. సిరియా నుండి ఒక వర్తక బృందం శుక్రవారం నాడు సరిగ్గా నమాజు సమయానికే వచ్చింది. ఆ బృందం వారు అక్కడి ప్రజలకు తమ రాకను తెలియజేయడం కోసం నగారా మ్రోగించారు, బాకాలు ఊదారు. ఆ సమయంలో మహాప్రవక్త (సఅసమ్) జుమా ప్రసంగం చేస్తున్నారు. ఆ మోతలను విని ప్రజలు అతిశయించిన ఉత్సాహంతో ఒక దజనుమంది తప్ప మిగతా వారందరూ బయటికి వెళ్లిపోయారు.

11. మహాప్రవక్త (సఅసమ్) గారి అనుచరులు చేసిన అపరాధ స్వభావం ఎటువంటిదో ఈ వాక్యం తెలియజేస్తోంది. ఒకవేళ (అల్లాహ్ క్షమించుగాక!) దానికి కారణం విశ్వాస లోపమో, లేదా బుద్ధిపూర్వకంగా పరలోకం కంటే ఇహలోకానికి ప్రాధాన్యత ఇవ్వటమో గనక అయితే, అప్పుడు అల్లాహ్ ఆగ్రహం, దూషణల తీవ్రత, తీరుతెన్నులు మరొక విధంగా ఉండేవి. కాని అటువంటి రుగ్మత వారిలో లేదు. జరిగిందేదో అది శిక్షణా లోపం వల్లనే జరిగింది. ఇందుకని శుక్రవారపు నమాజుకు సంబంధించిన మంచీ మర్యాదలను గురించి చెప్పవలసిన రీతిలో చెప్పటం జరిగింది. తరువాత వారి దోషాన్ని ఎత్తిచూపుతూ, శిక్షణ గరపే రీతిలో ఇలా నచ్చజెప్పటం జరిగింది : శుక్రవారపు ప్రసంగం విన్నందువల్ల, శుక్రవారపు నమాజు చేయటం వల్ల దేవుని దగ్గర దొరికే ప్రతిఫలం, ఈ లోకపు వర్తకం కంటే, వినోద విలాసాలకంటే శ్రేష్ఠమైనది.

12. అంటే, ఈ ప్రపంచంలో స్వాభావికంగా జీవనోపాధికి మార్గాలు అయ్యేవాటన్నిటి కంటే శ్రేష్ఠుడైన ఉపాధిప్రదాత అల్లాహ్‌యే.

ఆయతులు 11 | **63. అల్ మునాఫిఖూన్** | అవతరణ మదీనాలో

٦٣ سُوْرَةُ الْمُنٰفِقُوْنَ مَدَنِيَّةٌ ١٠٤

اٰياتها ١١ | ركوعاتها ٢

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

اِذَا جَآءَكَ الْمُنٰفِقُوْنَ قَالُوْا نَشْهَدُ اِنَّكَ لَرَسُوْلُ اللّٰهِ ۘ وَ اللّٰهُ يَعْلَمُ اِنَّكَ لَرَسُوْلُهٗ ؕ وَ اللّٰهُ يَشْهَدُ اِنَّ الْمُنٰفِقِيْنَ لَكٰذِبُوْنَ ۚ① اِتَّخَذُوْٓا اَيْمَانَهُمْ جُنَّةً فَصَدُّوْا عَنْ سَبِيْلِ اللّٰهِ ؕ اِنَّهُمْ سَآءَ مَا كَانُوْا يَعْمَلُوْنَ ② ذٰلِكَ بِاَنَّهُمْ اٰمَنُوْا ثُمَّ كَفَرُوْا فَطُبِعَ عَلٰى قُلُوْبِهِمْ فَهُمْ لَا يَفْقَهُوْنَ ③ وَ اِذَا رَاَيْتَهُمْ تُعْجِبُكَ اَجْسَامُهُمْ ؕ وَ اِنْ يَّقُوْلُوْا تَسْمَعْ لِقَوْلِهِمْ ؕ كَاَنَّهُمْ خُشُبٌ مُّسَنَّدَةٌ ؕ يَحْسَبُوْنَ كُلَّ صَيْحَةٍ عَلَيْهِمْ ؕ هُمُ الْعَدُوُّ فَاحْذَرْهُمْ ؕ قٰتَلَهُمُ اللّٰهُ ۫ اَنّٰى يُؤْفَكُوْنَ ④

وقف لازم

**1 - 3** ఓ ప్రవక్తా! ఈ కపటులు నీ వద్దకు వచ్చినప్పుడు, "మీరు నిశ్చయంగా అల్లాహ్ ప్రవక్తలే అని మేము సాక్ష్యమిస్తున్నాము" అని అంటారు. అవును, నీవు నిజంగానే ఆయన ప్రవక్తవు అని అల్లాహ్‌కు తెలుసు. కాని ఈ కపటులు పచ్చి అసత్యవాదులని[1] అల్లాహ్ సాక్ష్యమిస్తున్నాడు. వారు తమ ప్రమాణాలను డాలుగా చేసుకున్నారు. మరియు ఈ విధంగా వారు అల్లాహ్ మార్గం అవలంబించకుండా స్వయంగానూ ఆగిపోతున్నారు, లోకాన్ని కూడ ఆపుతున్నారు. వారు చేస్తున్న చేష్టలు ఎంత నీచమైనవి. దీనికంతటికీ కారణం, వారు విశ్వసించిన తరువాత తిరస్కరించటమే. అందుకని వారి హృదయాలపై ముద్రవేయబడింది; ఇక వారు దేనినీ అర్థం చేసుకోరు.[2]

**4** వారిని చూస్తే, వారి రూపాలు నీకు ఎంతో అద్భుతంగా ఉన్నట్లు కనిపిస్తాయి. వారు మాట్లాడితే నీవు వారి మాటలను వింటూనే ఉండిపోతావు. కాని వారసలు గోడకు ఆనించబడిన కొయ్యదుంగల వంటివారు.[3] ప్రతి అరుపును వారు తమకు వ్యతిరేకమైనదిగా భావిస్తారు. వారు ఆగర్భ శత్రువులు, వారికి దూరంగా ఉండండి. అల్లాహ్ వారిని నాశనం చేయుగాక! వారు ఎలా పెడమార్గం వైపునకు మరలించబడుతున్నారు![4]

1. అంటే, వారు తమ నోటితో అంటున్న విషయం స్వతహాగా నిజమయిందే, కాని వారు తమ నోటితో వ్యక్తం చేస్తున్న విషయం వారి విశ్వాసాన్ని ప్రతిబింబించదు. కాబట్టి, "నీవు నిశ్చయంగా అల్లాహ్ ప్రవక్తవే అని మేము సాక్ష్యమిస్తున్నాము" అనే వారి ప్రకటనలో వారు అసత్యవాదులు.

2. ఈ ఆయతులో విశ్వసించటం అంటే, ఇస్లామ్‌ను స్వీకరించి ముస్లిమ్‌లలో చేరిపోవటం. తిరస్కరించటం అంటే, మనఃపూర్వకంగా ఇస్లామ్‌ను విశ్వసించకపోవటం, దాని మీదనే దృఢంగా ఉండటం, వారు మాటలలో విశ్వాసాన్ని ప్రకటించటానికి ముందు దృఢంగా ఉన్న మాదిరిగా. అల్లాహ్ తరఫు నుండి ఒకని హృదయంపై ముద్రవేయటం అంటే ఏమిటో స్పష్టంగా చెప్పబడిన వాక్యాలలో ఇది ఒక వాక్యం. అల్లాహ్ వారి హృదయాలపై ముద్రవేసిన కారణంగా విశ్వాసం వారి హృదయాలలో చోటు చేసుకోలేక పోయింది, కనుక గత్యంతరంలేక వారు కపటులయ్యారు అనేది ఈ కపటుల కాపట్యానికి హేతువు కాదు. కాని, వారు విశ్వాసాన్ని ప్రకటించిన తరువాత కూడ, మొండిగా అవిశ్వాసం మీదనే స్థిరంగా ఉండిపోయే నిర్ణయం తీసుకున్న మీదనే అల్లాహ్ వారి హృదయాలపై ముద్రవేశాడు. అప్పుడే వారు చిత్తశుద్ధితో ఇస్లామ్‌ను విశ్వసించే భాగ్యానికి దూరమయ్యారు, స్వయంగా వారు అవలంబించిన కాపట్యపు వైఖరి భాగ్యమే వారికి దక్కింది.

وَ اِذَا قِيْلَ لَهُمْ تَعَالَوْا يَسْتَغْفِرْ لَكُمْ رَسُوْلُ
اللّٰهِ لَوَّوْا رُءُوْسَهُمْ وَ رَاَيْتَهُمْ يَصُدُّوْنَ وَهُمْ
مُّسْتَكْبِرُوْنَ ۝٥ سَوَآءٌ عَلَيْهِمْ اَسْتَغْفَرْتَ لَهُمْ
اَمْ لَمْ تَسْتَغْفِرْ لَهُمْ ؕ لَنْ يَّغْفِرَ اللّٰهُ لَهُمْ ؕ
اِنَّ اللّٰهَ لَا يَهْدِى الْقَوْمَ الْفٰسِقِيْنَ ۝٦ هُمُ
الَّذِيْنَ يَقُوْلُوْنَ لَا تُنْفِقُوْا عَلٰى مَنْ عِنْدَ
رَسُوْلِ اللّٰهِ حَتّٰى يَنْفَضُّوْا ؕ وَ لِلّٰهِ خَزَآئِنُ
السَّمٰوٰتِ وَ الْاَرْضِ وَ لٰكِنَّ الْمُنٰفِقِيْنَ لَا
يَفْقَهُوْنَ ۝٧

**5 - 6** వారితో, "రండి, అల్లాహ్ ప్రవక్త మీకొరకు మన్నింపు ప్రార్థన చేస్తాడు" అని పిలిచినప్పుడు, వారు తల విదిలిస్తారు. వారు పొగరుబోతు తనంతో రాకుండా ఆగిపోవటాన్ని నీవు చూస్తావు.[5] ఓ ప్రవక్తా! నీవు వారి కొరకు మన్నింపు ప్రార్థన చేసినా, చేయకపోయినా, వారి విషయంలో ఒక్కటే; అల్లాహ్ వారిని ఎంతమాత్రం మన్నించడు. అల్లాహ్ దుర్మార్గులకు ఎన్నటికీ సన్మార్గం చూపడు.

**7 - 8** వారే ఇలా అనేది; "ప్రవక్త అనుచరులకోసం ఖర్చు పెట్టటం ఆపెయ్యండి అప్పుడు వారు చెల్లాచెదరై పోతారు". వాస్తవానికి భూమిలో, ఆకాశాలలో ఉన్న నిధులకు యజమాని అల్లాహ్‌యే. కాని ఈ కపటులు గ్రహించరు.

---

3. అంటే, గోడకు ఆనుకుని కూర్చున్న వీరు మానవులు కారు కలప దుంగలు మాత్రమే. వారిని కొయ్యతో పోల్చి, మానవత్వానికి ఆణిముత్యమైన మంచితనం వారిలో కొరవడటం వల్ల వారిని కొయ్యతో పోల్చటం జరిగింది. తరువాత వారిని గోడకు ఆనించబడి ఉన్న దుంగలతో పోల్చి వారు దేనికీ కొరగాని వారని కూడ చెప్పబడింది. ఎందుకంటే కొయ్యకూడ ఇంటి కప్పుగా, తలుపులూ, ద్వారబంధాలుగా, ఫర్నిచర్‌గా వాడబడినప్పుడే ప్రయోజనాన్ని కలిగిస్తుంది. దుంగరూపంలో గోడకు ఆనించబడిన కొయ్య ఏ ప్రయోజనాన్నీ కలిగించదు.

4. వారిని విశ్వాసం నుంచి కాపట్యం వైపునకు మరల్చినవాడు ఎవడో చెప్పబడలేదు. ఇందుచేత ఇక్కడ ఓ విషయం స్పష్టం; వారి ఈ తారుమారు స్థితికి ఒక్కటే ప్రేరణ కాదు, అనేక ప్రేరణలు ఉన్నాయి - షైతాను ఉన్నాడు, దుష్ట స్నేహితులు ఉన్నారు; వారి స్వార్థ ప్రయోజనాలు ఉన్నాయి; ఒకడికి అతని భార్య ప్రేరణ అయితే, మరొకడికి పిల్లలు ప్రేరణ, వేరొకడికి దుర్మార్గులైన అతని గోత్రీకులు ప్రేరణ, ఇంకొకడికి ప్రేరణ అతని అసూయా విద్వేషాలు, అతని అహంకారమూను.

5. అంటే, క్షమాభిక్షకై మహాప్రవక్త వద్దకు రాకపోవటమే కాదు, ఈ ఆహ్వానాన్ని విని వారు తలబిరుసుతనంతో, గర్వంతో తమ తలలను విదిలించుకుంటారు. మహాప్రవక్త (సఅసమ్) వద్దకు రావటాన్నీ, క్షమాభిక్షను కోరటాన్నీ వారు తమకు అవమానకరమని భావించి రాకుండా మొండిగా ఉండిపోయారు. వారు విశ్వాసులు కారని చెప్పటానికి ఇదొక స్పష్టమైన నిదర్శనం.

يَقُوْلُوْنَ لَئِنْ رَّجَعْنَآ اِلَى الْمَدِيْنَةِ لَيُخْرِجَنَّ
الْاَعَزُّ مِنْهَا الْاَذَلَّ ؕ وَ لِلّٰهِ الْعِزَّةُ وَلِرَسُوْلِهٖ
وَ لِلْمُؤْمِنِيْنَ وَ لٰكِنَّ الْمُنٰفِقِيْنَ لَا يَعْلَمُوْنَ ۟ؒ ٨ ع ١ ٨ ١٣
يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لَا تُلْهِكُمْ اَمْوَالُكُمْ وَ لَاۤ
اَوْلَادُكُمْ عَنْ ذِكْرِ اللّٰهِ ۚ وَ مَنْ يَّفْعَلْ ذٰلِكَ
فَاُولٰٓئِكَ هُمُ الْخٰسِرُوْنَ ۝ ٩ وَ اَنْفِقُوْا مِنْ مَّا
رَزَقْنٰكُمْ مِّنْ قَبْلِ اَنْ يَّاْتِيَ اَحَدَكُمُ الْمَوْتُ
فَيَقُوْلَ رَبِّ لَوْلَاۤ اَخَّرْتَنِيْۤ اِلٰۤى اَجَلٍ
قَرِيْبٍ ۙ فَاَصَّدَّقَ وَ اَكُنْ مِّنَ الصّٰلِحِيْنَ ۝ ١٠
وَلَنْ يُّؤَخِّرَ اللّٰهُ نَفْسًا اِذَا جَآءَ اَجَلُهَا ؕ وَاللّٰهُ
خَبِيْرٌۢ بِمَا تَعْمَلُوْنَ ۟ؒ ١١ ع ٢ ٣ ١٤

వారు ఇంకా ఇలా అంటారు, "మనం మదీనా నగరానికి తిరిగి వెళ్లిన తరువాత, మనలోని గౌరవనీయులు నీచులను అక్కణ్ణించి వెళ్లగొట్టాలి." వాస్తవానికి గౌరవం అనేది అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు, విశ్వాసులకు మాత్రమే చెల్లుతుంది. కాని ఈ కపటులు అది ఎరుగరు.

**9 - 11** విశ్వాసులారా! మీ సిరిసంపదలూ, మీ సంతానమూ మిమ్మల్ని అల్లాహ్ సంస్మరణ నుండి మరల్చరాదు. ఎవరైతే ఇలా మరల్చబడతారో వారే నష్టానికి గురి అయ్యేవారు. మీలో ఎవరికైనా మరణ సమయం సమీపించి, అతను, "ఓ నా ప్రభూ! నీవు నాకు మరికొంత వ్యవధి ఎందుకివ్వలేదు; నేను దానధర్మాలు చేసి సజ్జనులలో కలిసిపోయేవాణ్ణి కదా?" అని వాపోయే పరిస్థితి రాకముందే మేము మీకు ఇచ్చిన ఉపాధి నుండి ఖర్చుపెట్టండి. కాని ఎవరి ఆచరణ వ్యవధి అయినా ముగిసిపోయే సమయం ఆసన్నమైనప్పుడు, అల్లాహ్ ఇక అతనికి ఎంతమాత్రం అదనపు వ్యవధి ఇవ్వడు. మీరు చేస్తున్నదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు.

ఆయతులు 18 | **64. అత్ తగాబున్** | అవతరణ మదీనాలో

٦٤ سُوْرَةُ التَّغَابُنِ مَدَنِيَّةٌ ١٠٨

رکوعاتها ٢ | اٰیاتها ١٨

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ
يُسَبِّحُ لِلّٰهِ مَا فِي السَّمٰوٰتِ وَ مَا فِي الْاَرْضِ
لَهُ الْمُلْكُ وَ لَهُ الْحَمْدُ وَ هُوَ عَلٰى كُلِّ شَيْءٍ
قَدِيْرٌ ١ هُوَ الَّذِيْ خَلَقَكُمْ فَمِنْكُمْ كَافِرٌ وَّ
مِنْكُمْ مُّؤْمِنٌ وَ اللّٰهُ بِمَا تَعْمَلُوْنَ بَصِيْرٌ ٢
خَلَقَ السَّمٰوٰتِ وَ الْاَرْضَ بِالْحَقِّ وَ صَوَّرَكُمْ
فَاَحْسَنَ صُوَرَكُمْ وَ اِلَيْهِ الْمَصِيْرُ ٣ يَعْلَمُ مَا
فِي السَّمٰوٰتِ وَ الْاَرْضِ وَ يَعْلَمُ مَا تُسِرُّوْنَ وَ
مَا تُعْلِنُوْنَ وَ اللّٰهُ عَلِيْمٌۢ بِذَاتِ الصُّدُوْرِ ٤
اَلَمْ يَاْتِكُمْ نَبَؤُا الَّذِيْنَ كَفَرُوْا مِنْ قَبْلُ
فَذَاقُوْا وَبَالَ اَمْرِهِمْ وَ لَهُمْ عَذَابٌ اَلِيْمٌ ٥
ذٰلِكَ بِاَنَّهٗ كَانَتْ تَّاْتِيْهِمْ رُسُلُهُمْ بِالْبَيِّنٰتِ
فَقَالُوْۤا اَبَشَرٌ يَّهْدُوْنَنَا فَكَفَرُوْا وَ تَوَلَّوْا
وَّاسْتَغْنَى اللّٰهُ وَ اللّٰهُ غَنِيٌّ حَمِيْدٌ ٦

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 – 4** ఆకాశాలలో ఉన్న ప్రతివస్తువూ, భూమిలో ఉన్న ప్రతి వస్తువూ అల్లాహ్‌నే స్తుతిస్తోంది. విశ్వసామ్రాజ్యాధిపత్యమూ ఆయనదే, స్తోత్రమూ ఆయనకే. ఆయనకు ప్రతి వస్తువుపై అధికారం ఉన్నది.[1] ఆయనే మిమ్మల్ని సృష్టించాడు, అయినా మీలో కొందరు అవిశ్వాసులుగానూ, మరికొందరు విశ్వాసులు గానూ ఉన్నారు. అల్లాహ్ మీరు చేస్తున్నదంతా చూస్తున్నాడు. ఆయన భూమినీ, ఆకాశాలనూ సత్యం ఆధారంగా సృష్టించాడు, మీకు ఒక రూపాన్ని కల్పించాడు, దానిని చాలా అందంగా రూపొందించాడు. చివరకు మీరు ఆయన వైపునకే మరలవలసి ఉన్నది. భూమిలోనూ, ఆకాశాల్లోనూ ఉన్న ప్రతి వస్తువును గురించి ఆయనకు తెలుసు. మీరు దాచేదీ, మీరు వెల్లడిచేసేదీ,[2] అంతా ఆయనకు తెలుసు. ఆయన హృదయాల స్థితిని సైతం ఎరుగును.

**5 – 6** పూర్వం సత్యాన్ని తిరస్కరించి, తమ కర్మల దుష్ఫలితాలను చవిచూసిన వారి వృత్తాంతం నీకు చేరలేదా? మున్ముందు వారి కొరకు బాధాకరమైన శిక్ష ఉన్నది. ఈ పర్యవసానానికి వారు అర్హులు కావటానికి కారణం ఏమిటంటే; వారి వద్దకు వారి ప్రవక్తలు స్పష్టమైన ప్రమాణాలనూ, సూచనలనూ తీసుకుని వచ్చినప్పటికీ, వారు, "మానవులు మాకు మార్గదర్శకత్వం ఇవ్వగలరా?" అని అన్నారు. ఈ విధంగా వారు విశ్వసించకుండా తిరస్కరించారు, తమ ముఖాలను తిప్పుకున్నారు. అప్పుడు అల్లాహ్ కూడ వారిని నిర్లక్ష్యం చేశాడు. అసలు అల్లాహ్ ఎవరి అవసరమూ లేనివాడు, తనకు తానే స్తోత్రానికి అర్హుడు.

1. అంటే, పరిపూర్ణమైన అధికారం కలవాడు, తలచుకున్న దానిని చేయగల సమర్థుడు. ఆయన అధికారాన్ని పరిమితం చేయగల శక్తి ఏదీ లేదు.
2. ఇలా కూడ అనువాదం చేయవచ్చు: "దేనినైతే మీరు రహస్యంగా చేస్తారో, దేనినైతే మీరు బహిరంగంగా చేస్తారో."

زَعَمَ الَّذِيْنَ كَفَرُوْٓا اَنْ لَّنْ يُّبْعَثُوْا ؕ قُلْ بَلٰى
وَ رَبِّيْ لَتُبْعَثُنَّ ثُمَّ لَتُنَبَّؤُنَّ بِمَا عَمِلْتُمْ ؕ وَ
ذٰلِكَ عَلَى اللّٰهِ يَسِيْرٌ ﴿٧﴾ فَاٰمِنُوْا بِاللّٰهِ
وَ رَسُوْلِهٖ وَ النُّوْرِ الَّذِيْٓ اَنْزَلْنَا ؕ وَ اللّٰهُ بِمَا
تَعْمَلُوْنَ خَبِيْرٌ ﴿٨﴾ يَوْمَ يَجْمَعُكُمْ لِيَوْمِ
الْجَمْعِ ذٰلِكَ يَوْمُ التَّغَابُنِ ؕ وَ مَنْ يُّؤْمِنْۢ
بِاللّٰهِ وَ يَعْمَلْ صَالِحًا يُّكَفِّرْ عَنْهُ سَيِّاٰتِهٖ
وَيُدْخِلْهُ جَنّٰتٍ تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ
خٰلِدِيْنَ فِيْهَآ اَبَدًا ؕ ذٰلِكَ الْفَوْزُ الْعَظِيْمُ ﴿٩﴾ وَ
الَّذِيْنَ كَفَرُوْا وَ كَذَّبُوْا بِاٰيٰتِنَآ اُولٰٓئِكَ اَصْحٰبُ
النَّارِ خٰلِدِيْنَ فِيْهَا ؕ وَ بِئْسَ الْمَصِيْرُ ﴿١٠﴾ ع ١٥

**7** అవిశ్వాసులు తాము మరణించిన పిదప మళ్లీ లేపబడటం అనేది ఎంత మాత్రం జరగదు అని పెద్ద సవాలు విసిరారు. వారితో ఇలా అను, "కాదు, నా ప్రభువు సాక్షిగా! మీరు తప్పకుండా లేపబడతారు.[3] తరువాత, మీరు (ప్రపంచంలో) ఏమేమి చేశారో అదంతా మీకు తప్పకుండా తెలియజేయటం జరుగుతుంది. ఇలా చేయటం అల్లాహ్‌కు చాల సులభం."

**8 - 10** కనుక అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ, మేము అవతరింపజేసిన కాంతినీ[4] విశ్వసించండి. మీరు చేసేదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు. సమావేశపు రోజున ఆయన మీ అందరినీ సమీకరిస్తాడు.[5] (ఆరోజున మీకు ఈ సంగతి తెలిసిపోతుంది). అది ప్రజల మధ్య పరస్పర జయాపజయముల[6] రోజు అవుతుంది. ఎవడైతే అల్లాహ్‌ను విశ్వసించి, సత్కార్యాలు చేస్తాడో, అల్లాహ్ అతని పాపాలను ప్రక్షాళన చేస్తాడు, అతనిని సెలయేళ్లు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. వారు శాశ్వతంగా వాటిలోనే ఉంటారు. ఇదే గొప్ప విజయం. ఇక ఎవరు తిరస్కరించారో, మా ఆయతులను తృణీకరించారో, వారు నరకవాసులవుతారు. అందులోనే వారు శాశ్వతంగా ఉంటారు; అది బహుచెడ్డ నివాసం.

3. ఇక్కడ ఒక ప్రశ్న తల ఎత్తుతుంది: ఒక పరలోక తిరస్కారికి, మీరు పరలోకం రానున్నదనే వార్తను ప్రమాణ పూర్వకంగా చెప్పినా చెప్పకపోయినా, దానివల్ల ప్రయోజనం ఏమిటి? అతడు అసలు దానిని నమ్మే స్థితిలోనే లేనప్పుడు, మీరు కేవలం ప్రమాణం చేసి నొక్కి చెప్పినంతమాత్రాన అతడు దానిని ఎలా నమ్ముతాడు? దీనికి సమాధానం ఇది : మహాప్రవక్త సంబోధిస్తున్న ప్రజలు, ఆయనను వ్యక్తిగతంగా బాగా ఎరిగినవారు, ఆయనను గురించి అనుభవం రీత్యా బాగా తెలిసినవారు. ఈ కారణంగా ఆయన జీవితంలో ఎన్నడూ అబద్ధమాడి ఎరుగరని వారికి తెలుసు. కాబట్టి వారు ఆయనపై ఎన్ని అపనిందలు మోపినా, తమ మనస్సులలో మాత్రం, ఇంతటి సత్యసంధుడైన మానవుడు సత్యమని తనకు తెలియని విషయాన్ని, తాను నమ్మని విషయాన్ని దేవునిపై ప్రమాణం చేసి చెప్పగలడని ఊహించలేరు.

4. అల్లాహ్ అవతరింపజేసిన కాంతి అంటే, దివ్య ఖురాను అని ఇక్కడున్న సంగతి సందర్భాలే తెలియజేస్తున్నాయి. కాంతి స్వయంగా తాను ప్రకాశిస్తూ, పరిసర ప్రాంతాలలో చీకట్లల్లో దాగి ఉన్న అన్ని వస్తువులను ప్రకాశింపజేసినట్లు, ఒక దీపమైన దివ్య ఖురాను తాను సత్యమని స్వయంగా స్పష్టంచేస్తోంది, మానవుడు తన బుద్ధీ జ్ఞానములకు అతీతమైన సమస్యలను దాని వెలుగులో అవగాహన చేసుకుని పరిష్కరిస్తాడు.

5. సమావేశపు రోజు అంటే ప్రళయం. అందరినీ సమీకరించటం అంటే సృష్టి ప్రారంభం నుండి ప్రళయం వరకు ప్రపంచంలో పుట్టిన మానవులందరినీ ఏకకాలంలో బ్రతికించి సమావేశపరచుట.

6. అంటే, అసలైన జయాపజయాలు ప్రళయం నాడు నిర్ధారింపబడతాయి. అక్కడకు పోయిన తరువాత తెలుస్తుంది, ఎవడు నష్టపోయాడో, ఎవడు లాభపడ్డాడో, అసలు ఎవడు మాయలో పడ్డాడో, ఎవడు మాయామర్మాలను తెలుసుకున్నాడో; ఎవడు తన సర్వస్వాన్నీ ఒక తప్పుడు వ్యాపారంలో పెట్టుబడిగా పెట్టి తనను తాను దివాలాకు గురిచేసుకున్నాడో, ఎవడు తన శక్తిసామర్థ్యాలనూ, తన కృషినీ, తన సమయ సంపదలనూ, లాభసాటి బేరంలో పెట్టి లాభాలను దండుకున్నాడో – ఈ లాభాలన్నీ మొదటి వ్యక్తికి సైతం లభించి ఉండేవి, అతడు ఈ ప్రపంచం యొక్క యథార్థస్థితిని అవగాహన చేసుకోవటంలో మాయకు గురికాకుంటే.

مَآ اَصَابَ مِنْ مُّصِیْبَةٍ اِلَّا بِاِذْنِ اللّٰهِ ؕ وَ
مَنْ یُّؤْمِنْۢ بِاللّٰهِ یَهْدِ قَلْبَهٗ ؕ وَ اللّٰهُ بِكُلِّ
شَیْءٍ عَلِیْمٌ ﴿١١﴾ وَ اَطِیْعُوا اللّٰهَ وَ اَطِیْعُوا
الرَّسُوْلَ ۚ فَاِنْ تَوَلَّیْتُمْ فَاِنَّمَا عَلٰی رَسُوْلِنَا
الْبَلٰغُ الْمُبِیْنُ ﴿١٢﴾ اَللّٰهُ لَاۤ اِلٰهَ اِلَّا هُوَ ؕ وَ عَلَی
اللّٰهِ فَلْیَتَوَكَّلِ الْمُؤْمِنُوْنَ ﴿١٣﴾ یٰۤاَیُّهَا الَّذِیْنَ
اٰمَنُوْۤا اِنَّ مِنْ اَزْوَاجِكُمْ وَ اَوْلَادِكُمْ عَدُوًّا لَّكُمْ
فَاحْذَرُوْهُمْ ۚ وَ اِنْ تَعْفُوْا وَ تَصْفَحُوْا وَ تَغْفِرُوْا
فَاِنَّ اللّٰهَ غَفُوْرٌ رَّحِیْمٌ ﴿١٤﴾ اِنَّمَاۤ اَمْوَالُكُمْ
وَ اَوْلَادُكُمْ فِتْنَةٌ ؕ وَ اللّٰهُ عِنْدَهٗۤ اَجْرٌ عَظِیْمٌ ﴿١٥﴾
فَاتَّقُوا اللّٰهَ مَا اسْتَطَعْتُمْ وَ اسْمَعُوْا وَ اَطِیْعُوْا
وَ اَنْفِقُوْا خَیْرًا لِّاَنْفُسِكُمْ ؕ وَ مَنْ یُّوْقَ شُحَّ
نَفْسِهٖ فَاُولٰٓىِٕكَ هُمُ الْمُفْلِحُوْنَ ﴿١٦﴾ اِنْ تُقْرِضُوا
اللّٰهَ قَرْضًا حَسَنًا یُّضٰعِفْهُ لَكُمْ وَ یَغْفِرْ لَكُمْ ؕ
وَ اللّٰهُ شَكُوْرٌ حَلِیْمٌ ۙ﴿١٧﴾ عٰلِمُ الْغَیْبِ وَ الشَّهَادَةِ
الْعَزِیْزُ الْحَكِیْمُ ﴿١٨﴾ ع

**11 - 13** ఏ ఆపద అయినా అల్లాహ్ అనుమతి లేనిదే ఎన్నటికీ రాదు. ఎవడు అల్లాహ్‌ను విశ్వసిస్తాడో, అల్లాహ్ అతని హృదయానికి మార్గదర్శకత్వం ప్రసాదిస్తాడు. అల్లాహ్‌కు ప్రతి వస్తువును గురించీ తెలుసు. అల్లాహ్‌కు విధేయత చూపండి, ప్రవక్తకు విధేయత చూపండి. కాని ఒకవేళ మీరు విధేయతకు విముఖులైతే, (తెలుసుకోండి) మా ప్రవక్తపై సత్యాన్ని స్పష్టంగా అందజేసే బాధ్యత తప్ప మరొకటి ఏదీ లేదు. ఆయన అల్లాహ్; ఆయన తప్ప మరొక దేవుడులేడు. కనుక విశ్వాసులు అల్లాహ్ పైనే ఆధారపడాలి.[7]

**14 - 18** విశ్వాసులారా! మీ భార్యలలో, మీ సంతానంలో కొందరు మీకు శత్రువులు; వారి విషయంలో అప్రమత్తంగా ఉండండి. ఒకవేళ మీరు ఉపేక్షించి, మన్నిస్తే అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడూను.[8] మీ సిరిసంపదలూ, మీ సంతానమూ మీకొక పరీక్ష. అల్లాహ్ వద్దనే గొప్ప ప్రతిఫలం ఉంది. కనుక మీకు సాధ్యమైనంతవరకు అల్లాహ్‌కు భయపడుతూ ఉండండి. వినండి, విధేయత చూపండి; మీ సంపదను ఖర్చు పెట్టండి. ఇది మీకే శ్రేయస్కరం. తమ హృదయ లోభత్వం నుండి రక్షణ పొందినవారే సాఫల్యం పొందేవారు. మీరు గనక అల్లాహ్‌కు మంచి రుణాన్ని ఇస్తే, ఆయన మీకు దానిని ఎన్నోరెట్లు పెంచి తిరిగి ఇస్తాడు; మీ పొరపాట్లను మన్నిస్తాడు. అల్లాహ్ ఎంతో విలువనిచ్చేవాడు, సౌమ్యుడూను; గోచర అగోచరాలను ఎరిగినవాడూ, శక్తి సంపన్నుడు, మహా వివేకవంతుడూను.

7. అంటే, దైవత్వపుటధికారాలన్నీ అల్లాహ్ చేతులలోనే ఉన్నాయి. మీ అదృష్ట దురదృష్టాలను మార్చే శక్తి ఇతరులెవ్వరికీ లేదు. మంచిరోజులు ఆయన తెస్తేనే వస్తాయి. గడ్డురోజులు ఆయన తొలగిస్తేనే తొలగిపోతాయి. కనుక ఎవడు అల్లాహ్ ఒక్కడే దేవుడని నిండు మనస్సుతో విశ్వసిస్తాడో, అతని కోసం ఈ మార్గం తప్ప మరొక మార్గం లేనేలేదు. అతను అల్లాహ్‌నే నమ్ముకోవాలి; మేలు అనేది వాస్తవానికి అల్లాహ్ చూపిన మార్గంలోనే ఉన్నదనే నమ్మకంతో అతను తన కర్తవ్యాన్ని ఈ లోకంలో ఒక విశ్వాసిగా నిర్వహిస్తూపోవాలి.

8. అంటే, ప్రాపంచిక బంధుత్వం దృష్ట్యా, వారు ఒక మానవునికి అందరికంటే ఎక్కువ ప్రీతిపాత్రులు. కాని ధర్మం దృష్ట్యా వారు మీకు శత్రువులు. ఈ శత్రుత్వం ఈ రూపంలో ఉండవచ్చు; వారు మిమ్మల్ని మంచి నుండి నిరోధిస్తారు, చెడును చేయమని ప్రోత్సహిస్తారు. లేదా అది ఈ రూపంలోనైనా ఉండవచ్చు; వారు మిమ్మల్ని విశ్వాసంనుండి ఆపుతారు, అవిశ్వాసం వైపునకు లాగుతారు. లేదా అది ఈ రూపంలో కూడ ఉండవచ్చు; వారు అవిశ్వాసుల పట్ల సానుభూతి కలిగి ఉంటారు; ఏ సందర్భంలోనైనాసరే, మీరు ఈ విషయంలో అప్రమత్తులై ఉండాలి. వారిపై ప్రేమతో మీరు మీ పరలోకాన్ని పాడుచేసుకోకూడదు. కాని అంతమాత్రం చేత మీరు వారిని శత్రువులుగా భావించి వారి పట్ల కఠినంగా వ్యవహరించకూడదు. దాని అర్థం ఏమిటంటే, మీరు వారిని సంస్కరించలేకపోతే, కనీసం మిమ్మల్ని మీరు అపమార్గం వైపునకు పోకుండానైనా కాపాడుకోండి.

ఆయతులు 12 | ## 65. అత్ తలాఖ్ | అవతరణ మదీనాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 – 2 ...** ఓ ప్రవక్తా! మీరు గనక స్త్రీలకు విడాకులివ్వవలసి వస్తే, వారి నిర్ణీత గడువు (ఇద్దత్) కొరకు విడాకులివ్వండి,[1] మరియు నిర్ణీత గడువు కాలాన్ని కచ్చితంగా లెక్కపెట్టండి; మీ ప్రభువైన అల్లాహ్‌కు భయపడండి.[2] (ఆ గడువు కాలంలో) వారేదైనా స్పష్టమైన చెడుకు పాల్పడితే[3] తప్ప, మీరూ వారిని వారి ఇళ్ళనుండి వెళ్ళగొట్టకూడదు, స్వయంగా వారు కూడ పోకూడదు.[4] ఇవి అల్లాహ్ నిర్ణయించిన హద్దులు. ఎవడు అల్లాహ్ నిర్ణయించిన హద్దులను అతిక్రమిస్తాడో, అతడు స్వయంగా తనకు తానే అన్యాయం చేసుకుంటాడు. మీకు తెలియదు, బహుశా దీని తరువాత అల్లాహ్ ఏదైనా అనుకూల మార్గం చూపించవచ్చు. తరువాత వారి నిర్ణీత గడువు కాలం ముగిసినప్పుడు, వారిని ఉత్తమమైన రీతిలో (మీ వివాహ బంధంలో) ఆపి వుంచండి లేదా ఉత్తమమైన రీతిలో వారి నుంచి విడిపోండి. మీలో న్యాయశీలురైన ఇద్దరు వ్యక్తులను సాక్షులుగా[5] పెట్టుకోండి. (ఓ సాక్షులారా) అల్లాహ్ కొరకు ఉన్నది ఉన్నట్లుగా సాక్ష్యం చెప్పండి.

**... 2 – 3** అల్లాహ్‌ను, అంతిమ దినాన్ని విశ్వసిస్తున్న[6] ప్రతి వానికి ఈ విషయాలు బోధించబడుతున్నాయి. ఎవడు అల్లాహ్‌కు భయపడుతూ పని చేస్తాడో, అతనికి అల్లాహ్ కష్టాల నుండి గట్టెక్కే మార్గం చూపుతాడు. ఇంకా అతని ఊహకు కూడ అందనటువంటి మార్గం ద్వారా, అతనికి ఉపాధి ప్రసాదిస్తాడు. అల్లాహ్‌ను నమ్ముకున్నవానికి అల్లాహ్‌యే చాలు. అల్లాహ్ తన పనిని పూర్తి చేసి తీరుతాడు. అల్లాహ్ ప్రతిదానికి ఒక విధి నిర్ణయించి ఉంచాడు.

٦٥ سُوۡرَةُ الطَّلَاقِ مَدَنِيَّةٌ ٩٩

اٰياتها ١٢ | ركوعاتها ٢

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ۝
يٰۤاَيُّهَا النَّبِىُّ اِذَا طَلَّقۡتُمُ النِّسَآءَ فَطَلِّقُوۡهُنَّ
لِعِدَّتِهِنَّ وَاَحۡصُوا الۡعِدَّةَ ۚ وَاتَّقُوا اللّٰهَ
رَبَّكُمۡ ۚ لَا تُخۡرِجُوۡهُنَّ مِنۡۢ بُيُوۡتِهِنَّ وَلَا
يَخۡرُجۡنَ اِلَّاۤ اَنۡ يَّاۡتِيۡنَ بِفَاحِشَةٍ مُّبَيِّنَةٍ ؕ
وَتِلۡكَ حُدُوۡدُ اللّٰهِ ؕ وَمَنۡ يَّتَعَدَّ حُدُوۡدَ
اللّٰهِ فَقَدۡ ظَلَمَ نَفۡسَهٗ ؕ لَا تَدۡرِىۡ لَعَلَّ اللّٰهَ
يُحۡدِثُ بَعۡدَ ذٰلِكَ اَمۡرًا ۝١ فَاِذَا بَلَغۡنَ
اَجَلَهُنَّ فَاَمۡسِكُوۡهُنَّ بِمَعۡرُوۡفٍ اَوۡ فَارِقُوۡهُنَّ
بِمَعۡرُوۡفٍ وَّاَشۡهِدُوۡا ذَوَىۡ عَدۡلٍ مِّنۡكُمۡ وَ
اَقِيۡمُوا الشَّهَادَةَ لِلّٰهِ ؕ ذٰلِكُمۡ يُوۡعَظُ بِهٖ مَنۡ
كَانَ يُؤۡمِنُ بِاللّٰهِ وَالۡيَوۡمِ الۡاٰخِرِ ؕ وَمَنۡ
يَّتَّقِ اللّٰهَ يَجۡعَلۡ لَّهٗ مَخۡرَجًا ۝٢ وَّيَرۡزُقۡهُ
مِنۡ حَيۡثُ لَا يَحۡتَسِبُ ؕ وَمَنۡ يَّتَوَكَّلۡ عَلَى
اللّٰهِ فَهُوَ حَسۡبُهٗ ؕ اِنَّ اللّٰهَ بَالِغُ اَمۡرِهٖ ؕ قَدۡ
جَعَلَ اللّٰهُ لِكُلِّ شَىۡءٍ قَدۡرًا ۝٣

1. నిర్ణీత గడువు (ఇద్దత్)కై విడాకులివ్వటం అనే దానికి రెండర్థాలు ఉన్నాయి; ఈ సందర్భంలో ఈ రెండర్థాలూ అన్వయిస్తాయి. ఒకటి: బహిష్టు సమయంలో స్త్రీకి విడాకులు ఇవ్వవద్దు. కాని ఆమె నిర్ణీతగడువు ప్రారంభం కాగల సమయంలో విడాకులివ్వండి. రెండు : నిర్ణీత గడువు లోపల ఆమెతో రాజీపడే అవకాశం ఉండే రీతిలో విడాకులు ఇవ్వు. రాజీపడే అవకాశమే లేని పద్ధతిలో విడాకులు ఇవ్వవద్దు. మహాప్రవక్త (సఅసమ్) హదీసులలో, ఈ ఆజ్ఞకు లభించే వివరణ ప్రకారం విడాకులిచ్చే విధానం ఈ రీతిగా ఉన్నది: బహిష్టు కాలంలో

**4 - 5** మీ స్త్రీలలో ఎవరైనా ఋతుక్రమం విషయంలో ఆశ వదలుకుంటే వారి విషయంలో మీకేదైనా అనుమానం కలిగితే, అప్పుడు వారి నిర్ణీత గడువు మూడు మాసాలు (అని మీరు తెలుసుకోండి). ఇదే ఆజ్ఞ ఇంకా ఋతుక్రమం ప్రారంభం కాని వారికి కూడ వర్తిస్తుంది.[7] గర్భిణీ స్త్రీల నిర్ణీత గడువు వారి కాన్పు అయ్యేవరకు ఉంటుంది.[8] ఎవడు అల్లాహ్‌కు భయపడతాడో, అతని వ్యవహారంలో అల్లాహ్ సౌలభ్యం కలుగజేస్తాడు. ఇది అల్లాహ్ ఆజ్ఞ, దానిని ఆయన మీపై అవతరింపజేశాడు. ఎవడు అల్లాహ్‌కు భయపడతాడో, అల్లాహ్ అతని పాపాలను అతని నుండి దూరం చేస్తాడు; అతనికి గొప్ప ప్రతిఫలం ఇస్తాడు.

وَ الّٰٓـِٔيْ يَئِسْنَ مِنَ الْمَحِيْضِ مِنْ نِّسَآئِكُمْ اِنِ
ارْتَبْتُمْ فَعِدَّتُهُنَّ ثَلٰثَةُ اَشْهُرٍ ۙ وَّ الّٰٓـِٔيْ لَمْ
يَحِضْنَ ؕ وَ اُولَاتُ الْاَحْمَالِ اَجَلُهُنَّ اَنْ
يَّضَعْنَ حَمْلَهُنَّ ؕ وَ مَنْ يَّتَّقِ اللّٰهَ يَجْعَلْ
لَّهٗ مِنْ اَمْرِهٖ يُسْرًا ④ ذٰلِكَ اَمْرُ اللّٰهِ اَنْزَلَهٗۤ
اِلَيْكُمْ ؕ وَ مَنْ يَّتَّقِ اللّٰهَ يُكَفِّرْ عَنْهُ سَيِّاٰتِهٖ
وَ يُعْظِمْ لَهٗۤ اَجْرًا ⑤

విడాకులివ్వకూడదు. కాని భర్త భార్యతో సంభోగించని పరిశుద్ధ స్థితి (తుహర్)లోఇవ్వవచ్చు. లేదా స్త్రీ గర్భవతి అని తెలిసిన సమయంలో ఇవ్వవచ్చు. ఒకే సమయంలో మూడుసార్లు విడాకులివ్వకూడదు.

2. అంటే, విడాకులను వినోదంగా భావించకండి. విడాకులెప్పుడిచ్చారు, నిర్ణీత గడువు ఎప్పుడు ప్రారంభమయింది, అది ఎప్పుడు ముగుస్తుంది అనే విషయాలను జ్ఞాపకముంచుకోండి. విడాకులిచ్చినప్పుడు, దాని సమయాన్ని, దాని తేదీని గుర్తుంచుకోవాలి. ఇంకా స్త్రీకి ఏ స్థితిలో విడాకులిచ్చారో కూడా జ్ఞాపకముంచుకోవాలి.

3. అంటే, చెడు నడతకు ఒడిగడితే లేదా నిర్ణీత గడువులో తిట్లకూ సిగపట్లకూ పాల్పడితే.

4. అంటే, పురుషుడు కోపంతో స్త్రీని ఇంట్లో నుంచి వెళ్లగొట్టకూడదు. ఆమె కూడ అలిగిగానీ, విసిగి వేసారిగానీ ఇంటిని వదలిపోకూడదు. నిర్ణీత గడువులో ఆ ఇల్లు ఆమెదే. ఆ ఇంట్లోనే ఉభయులూ ఉండాలి; ఎందుకంటే, పరస్పరం సమాధానపడే అవకాశం ఏదైనా కలిగినప్పుడు, దానిద్వారా లాభం పొందే వీలు కలుగుతుంది. ఉభయులూ ఒకే కప్పు కింద ఉంటే, మూడు మాసాల వరకు లేదా మూడుసార్లు బహిష్టు వచ్చేవరకు, లేదా గర్భవతి అయితే కాన్పు అయ్యే వరకు రాజీపడే అవకాశాలు తారసిల్లవచ్చు.

5. అంటే, విడాకులిచ్చేటప్పుడు కూడ సాక్షులు ఉండాలి, రాజీపడే సమయంలో కూడ సాక్షులు ఉండాలి.

6. పైన పేర్కొనబడిన మార్గదర్శక సూత్రాలు హితబోధలే కాని శాసనాలు కావు అని ఈ మాటలే స్పష్టం చేస్తున్నాయి. పైన తెలిపిన పద్ధతికి భిన్నంగా విడాకులిచ్చినా, నిర్ణీత గడువును సరిగ్గా లెక్కించకపోయినా, భార్యను తగిన కారణం లేకుండానే ఇంటి నుంచి వెళ్లగొట్టినా, నిర్ణీత గడువు ముగిసే సమయంలో సతాయించటం కోసం రాజీపడినా, ఆమెను దెబ్బలాడుతూ పంపించినా, విడాకులిచ్చే సమయంలో, రాజీపడే సందర్భంలో, విడిపోయే వేళలో సాక్షులను పెట్టకపోయినా -వీటి వలన శాసనపరమైన ఫలితాలు కలిగే విషయంలో ఏ లోపమూ ఉండదు. అయితే, అల్లాహ్ హితబోధకు వ్యతిరేకంగా ప్రవర్తించటం అనేది, అతని హృదయంలో అల్లాహ్‌పైగానీ, అంతిమదినంపై గానీ, నిజమైన విశ్వాసం లేదనటానికి ఒక నిదర్శనం. అందుచేత ఒక నిజమైన విశ్వాసి అవలంబించదగని ఆచరణ వైఖరిని అతడు అవలంబించాడు.

اَسْكِنُوْهُنَّ مِنْ حَيْثُ سَكَنْتُمْ مِّنْ وُّجْدِكُمْ وَ
لَا تُضَآرُّوْهُنَّ لِتُضَيِّقُوْا عَلَيْهِنَّ ؕ وَ اِنْ كُنَّ
اُولَاتِ حَمْلٍ فَاَنْفِقُوْا عَلَيْهِنَّ حَتّٰى يَضَعْنَ
حَمْلَهُنَّ ۚ فَاِنْ اَرْضَعْنَ لَكُمْ فَاٰتُوْهُنَّ
اُجُوْرَهُنَّ ۚ وَاْتَمِرُوْا بَيْنَكُمْ بِمَعْرُوْفٍ ۚ وَاِنْ
تَعَاسَرْتُمْ فَسَتُرْضِعُ لَهٗۤ اُخْرٰى ﴿٦﴾ لِيُنْفِقْ
ذُوْ سَعَةٍ مِّنْ سَعَتِهٖ ؕ وَ مَنْ قُدِرَ عَلَيْهِ رِزْقُهٗ
فَلْيُنْفِقْ مِمَّاۤ اٰتٰىهُ اللّٰهُ ؕ لَا يُكَلِّفُ اللّٰهُ نَفْسًا
اِلَّا مَاۤ اٰتٰىهَا ؕ سَيَجْعَلُ اللّٰهُ بَعْدَ عُسْرٍ يُّسْرًا ﴿٧﴾ ع ١٧
وَ كَاَيِّنْ مِّنْ قَرْيَةٍ عَتَتْ عَنْ اَمْرِ رَبِّهَا
وَرُسُلِهٖ فَحَاسَبْنٰهَا حِسَابًا شَدِيْدًا ۙ وَّ
عَذَّبْنٰهَا عَذَابًا نُّكْرًا ﴿٨﴾ فَذَاقَتْ وَبَالَ اَمْرِهَا
وَ كَانَ عَاقِبَةُ اَمْرِهَا خُسْرًا ﴿٩﴾ اَعَدَّ اللّٰهُ لَهُمْ
عَذَابًا شَدِيْدًا ۙ فَاتَّقُوا اللّٰهَ يٰۤاُولِى الْاَلْبَابِ ۛۚ
الَّذِيْنَ اٰمَنُوْا ۛۚ قَدْ اَنْزَلَ اللّٰهُ اِلَيْكُمْ
ذِكْرًا ﴿١٠﴾ رَّسُوْلًا يَّتْلُوْا عَلَيْكُمْ اٰيٰتِ اللّٰهِ
مُبَيِّنٰتٍ لِّيُخْرِجَ الَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا
الصّٰلِحٰتِ مِنَ الظُّلُمٰتِ اِلَى النُّوْرِ ؕ وَ مَنْ
يُّؤْمِنْ بِاللّٰهِ وَ يَعْمَلْ صَالِحًا يُّدْخِلْهُ جَنّٰتٍ
تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ خٰلِدِيْنَ فِيْهَاۤ اَبَدًا ؕ
قَدْ اَحْسَنَ اللّٰهُ لَهٗ رِزْقًا ﴿١١﴾

**6 ...**వారిని (నిర్ణీత గడువు కాలంలో) మీరు నివసించే చోటనే ఉంచండి, మీకు ఎలాంటి చోటు లభించినా సరే. వారిని ఇబ్బందులపాలు చేయటానికి వేధించకండి.

**... 6 - 7** ఒకవేళ వారు గర్భవతులైతే, వారు ప్రసవించే వరకు వారి కోసం ఖర్చుచేస్తూ ఉండండి. తరువాత ఒకవేళ వారు మీకోసం (బిడ్డకు) పాలుపట్టే పక్షంలో, వారి ప్రతిఫలం వారికి ఇవ్వండి. ఉత్తమ రీతిలో (ప్రతిఫలం వ్యవహారాన్ని) పరస్పర సంప్రదింపుల ద్వారా నిర్ణయించుకోండి. కాని ఒకవేళ మీరు (ప్రతిఫల నిర్ణయంలో) ఒకరినొకరు ఇబ్బందుల పాల్జేసు కుంటే, బిడ్డకు మరొక స్త్రీ ఎవరైనా పాలుపట్టాలి. సంపన్నుడైన వ్యక్తి తన ఆర్థిక స్తోమతను బట్టి ఖర్చుపెట్టాలి. తక్కువ ఉపాధి ఇవ్వబడిన వ్యక్తి, అల్లాహ్ తనకు ఇచ్చిన ధనం నుండే ఖర్చుపెట్టాలి. అల్లాహ్ ఎవరికి ఎంత ఇచ్చాడో, దానికి మించి ఆయన అతనిపై భారం వేయడు. అల్లాహ్, పేదరికం తరువాత సంపన్న స్థితిని ప్రసాదించకపోడు.

**8 - 11** ఎన్నో[9] పట్టణాలు తమ ప్రభువు ఆజ్ఞలను, ఆయన ప్రవక్తల ఆజ్ఞలను ధిక్కరించాయి. అప్పుడు మేము వాటి ప్రజల నుండి కఠినంగా లెక్క తీసుకుని, వారిని తీవ్రంగా శిక్షించాము. వారు తాము చేసిన కర్మలను రుచి చూశారు. వారి పర్యవసానం అంతా నష్టమే. అల్లాహ్ (పరలోకంలో) వారి కొరకు కఠిన శిక్షను సిద్ధపరచి ఉంచాడు. కనుక విశ్వాసులైన బుద్ధి మంతులారా! అల్లాహ్‌కు భయపడండి. అల్లాహ్ మీ వద్దకు ఒక హితబోధను పంపాడు, ఒక ప్రవక్తను[10] పంపాడు, అతను మీకు స్పష్టమైన మార్గం చూపే అల్లాహ్ ఆయతులను వినిపిస్తున్నాడు, విశ్వసించి, సత్కార్యాలు చేసే వారిని చీకట్ల నుంచి వెలుగులోకి తీసుకురావటానికి. అల్లాహ్‌ను విశ్వసించి మంచి పనులు చేసేవాణ్ణి అల్లాహ్ సెలయేళ్లు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. వారు అక్కడ కలకాలం ఉంటారు. అల్లాహ్ అటువంటి వ్యక్తి కొరకు మంచి ఉపాధిని ఉంచాడు.

12 సప్తాకాశాలనూ, అలాంటివే ఎన్నో భూమండలాలనూ[11] సృజించినవాడు అల్లాహ్‌యే. వాటిపై అల్లాహ్ ఆజ్ఞ అవతరిస్తూ ఉంటుంది. అల్లాహ్ ప్రతి వస్తువుపై అధికారం కలిగి ఉన్నాడనీ, అల్లాహ్ జ్ఞానం ప్రతి వస్తువును పరివేష్టించి ఉన్నదనీ మీరు తెలుసుకోవటానికి (ఈ విషయం మీకు తెలియజేయబడు తోంది).

اَللّٰهُ الَّذِىۡ خَلَقَ سَبۡعَ سَمٰوٰتٍ وَّ مِنَ
الۡاَرۡضِ مِثۡلَهُنَّ ؕ يَتَنَزَّلُ الۡاَمۡرُ بَيۡنَهُنَّ
لِتَعۡلَمُوۡۤا اَنَّ اللّٰهَ عَلٰى كُلِّ شَىۡءٍ قَدِيۡرٌ ۙ وَّ اَنَّ
اللّٰهَ قَدۡ اَحَاطَ بِكُلِّ شَىۡءٍ عِلۡمًا ﴿۱۲﴾

ع ٢ ١٨

7. పిన్నవయస్సు కారణంగా బహిష్ఠు కాకపోయినా లేదా ఏ కారణంచేతనైనా కొంతమంది స్త్రీలకు బహిష్ఠు ఆలస్యమైనా, ఒక స్త్రీకి జీవిత పర్యంతం బహిష్ఠు రాకపోయినా – ఇది అరుదైన విషయం – ఈ అన్ని సందర్భాలలోనూ అటువంటి స్త్రీ యొక్క నిర్ణీత గడువు, బహిష్ఠుపట్ల నిరాశచెందిన స్త్రీ యొక్క నిర్ణీత గడువే, అంటే విడాకులిచ్చిన సమయం నుండి మూడు నెలల కాలం వరకు.

8. అంటే, స్త్రీ కాన్పు భర్త మరణించిన వెంటనే జరిగినా లేదా నాలుగు నెలల పదిరోజుల కంటే ఎక్కువ కాలం గడచినా, శిశువు పుట్టినంతనే స్త్రీ నిర్ణీత గడువు ముగుస్తుంది.

9. దైవప్రవక్త ద్వారా, దైవగ్రంథం ద్వారా ఇవ్వబడిన ఆజ్ఞలను ఒకవేళ ముస్లిములు ఉల్లంఘిస్తే, ఇహపరాలు రెండింటిలో వారు ఎటువంటి పరిణామాలను ఎదుర్కోవలసివస్తుందో, ఒకవేళ వారు ఈ ఆజ్ఞలను శిరసావహిస్తే, ఎటువంటి ప్రతిఫలాన్ని పొందుతారో, ముస్లిములకు హెచ్చరిక చేయబడింది.

10. వ్యాఖ్యాతలలో కొందరు 'హితబోధ' అంటే, 'ఖురాను గ్రంథం' అనీ, 'ప్రవక్త' అంటే ముహమ్మద్ (సఅసమ్) అనీ గ్రహించారు. కొందరు వ్యాఖ్యాతలు హితబోధను ముహమ్మదే (సఅసమ్) అని గ్రహించారు. అంటే, హితబోధయే ఆయన, ఆయనే హితబోధ అని భావం. మా దృష్టిలో ఈ రెండో వ్యాఖ్యానమే సమంజసమైనది.

11. "అలాంటివే" అంటే ఎన్ని ఆకాశాలను సృష్టించాడో, అన్నే భూములను కూడ సృష్టించాడు అని అర్థం కాదు. కాని దాని అర్థం ఏమిటంటే, ఏ విధంగా ఆయన ఎన్నో ఆకాశాలను సృష్టించాడో, అదేవిధంగా ఆయన ఎన్నో భూములను కూడ సృష్టించాడు. భూలోకాలను అంటే, ఏ విధంగా మానవులు నివసించే ఈ భూమి, తనలోని సమస్త జీవజాలానికి పాన్పుగానూ, ఉయ్యాలగానూ అయి ఉన్నదో, అదేవిధంగా ఈ విశ్వంలో అల్లాహ్ అనేక భూమండలాలను కూడ సృష్టించాడు. అవి తమ తమ జీవజాలాలకు పాన్పులుగానూ, ఉయ్యాలలు గానూ ఉపయోగపడుతున్నాయి. ఇంకొక రకంగా చెప్పాలంటే, కంటికి కనిపించే ఆకాశంలోని అసంఖ్యాకమైన నక్షత్రాలు, గ్రహాలు నిర్మానుష్యంగా లేవు. కాని భూమిలోవలె, వాటిలో ఎన్నింటిలోనో ప్రాణులు ఉన్నాయి.

ఆయతులు 12 | **66. అత్ తహ్రీమ్** | అవతరణ మదీనాలో

٦٦ سُوْرَةُ التَّحْرِيْمِ مَدَنِيَّةٌ ١٠٧

اٰياتها ١٢ | ركوعاتها ٢

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

يٰۤاَيُّهَا النَّبِيُّ لِمَ تُحَرِّمُ مَاۤ اَحَلَّ اللّٰهُ لَكَ ۚ تَبْتَغِيْ مَرْضَاتَ اَزْوَاجِكَ ؕ وَ اللّٰهُ غَفُوْرٌ رَّحِيْمٌ ① قَدْ فَرَضَ اللّٰهُ لَكُمْ تَحِلَّةَ اَيْمَانِكُمْ ۚ وَ اللّٰهُ مَوْلٰىكُمْ ۚ وَهُوَ الْعَلِيْمُ الْحَكِيْمُ ② وَ اِذْ اَسَرَّ النَّبِيُّ اِلٰى بَعْضِ اَزْوَاجِهٖ حَدِيْثًا ۚ فَلَمَّا نَبَّاَتْ بِهٖ وَ اَظْهَرَهُ اللّٰهُ عَلَيْهِ عَرَّفَ بَعْضَهٗ وَ اَعْرَضَ عَنْۢ بَعْضٍ ۚ فَلَمَّا نَبَّاَهَا بِهٖ قَالَتْ مَنْ اَنْۢبَاَكَ هٰذَا ؕ قَالَ نَبَّاَنِيَ الْعَلِيْمُ الْخَبِيْرُ ③

**1 – 2** ఓ ప్రవక్తా! అల్లాహ్ నీ కొరకు ధర్మసమ్మతం చేసిన దానిని నీవు ఎందుకు నిషేధించుకుంటున్నావు?[1](ఈ విధంగా) నీవు నీ భార్యల సంతోషం పొందగోరుతున్నావా?[2]- అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడూను. అల్లాహ్ నీ కొరకు నీ ప్రమాణాలు పాటింపు నుండి బయటపడే పద్ధతిని నిర్ణయించాడు.[3] అల్లాహ్ మీ యజమాని, ఆయనే అన్నీ తెలిసినవాడు, వివేచనాపరుడూను.

**3** (ఈ క్రింది వ్యవహారం కూడ గమనించదగిందే) ప్రవక్త ఒక విషయాన్ని తన భార్యలలో ఒకామెకు రహస్యంగా చెప్పాడు. తరువాత ఆమె (మరొకరికి) ఆ రహస్యాన్ని వెల్లడించింది. ప్రవక్తకు అల్లాహ్ ఆ విషయాన్ని (ఆ రహస్యం బయట పడిందన్న సంగతిని) తెలియజేశాడు. అప్పుడు ప్రవక్త ఆ విషయాన్ని కొంత (ఆమెకు) తెలియజేసి, కొంత తెలియజేయ లేదు. ఆ తరువాత ప్రవక్త ఆమెతో (రహస్యం బయటపడిన ఈ సంగతి) ఈ విషయం ప్రస్తావించినప్పుడు ఆమె "మీకీ విషయం ఎవరు తెలియజేశారు?" అని అడిగింది. అప్పుడు ప్రవక్త, "నాకీ విషయాన్ని అన్నీ తెలిసినవాడు, బాగా ఎరిగిన వాడు తెలియజేశాడు"[4] అని చెప్పారు.

---

1. నిజానికి ఇది ప్రశ్న కాదు, కేవలం అసమ్మతిని తెలియజేయటం. అంటే, మీరు ఇలా ఎందుకు చేశారని మహాప్రవక్త (సఅసమ్)ను అడగటంలో ఉద్దేశ్యం ఆరా తీయటం కాదు. కాని అల్లాహ్ ధర్మసమ్మతం చేసిన వస్తువును మహాప్రవక్త తన కోసం నిషిద్ధం చేసుకోవటం అనేది అల్లాహ్‌కు అప్రియమని ఆయనను హెచ్చరించటమే దీని లక్ష్యం. ఆయన దైవప్రవక్త హోదాలోని వారు కనుక, సాధారణ మానవులు కారు కనుక, ఏదైనా ఒక వస్తువును ప్రవక్త తన కోసం నిషిద్ధం చేసుకుంటే, ఆయన అనుచర సంఘం కూడ ఆ వస్తువును నిషిద్ధం చేసుకునే ప్రమాదమో లేదా కనీసం దానిని అప్రియమైనదిగా తలంచే ప్రమాదమో ఉత్పన్నమయ్యేది. కనుక అల్లాహ్ ఆయన చేసిన ఈ పనిని ఖండించాడు, దానిని మానుకోమని ఆజ్ఞాపించాడు. దీనిద్వారా మరొక విషయం కూడ తేటతెల్లమవుతోంది; మహాప్రవక్త సైతం స్వయంగా ఏ వస్తువునూ ధర్మసమ్మతంగా గానీ, నిషిద్ధంగా గానీ చేసే అధికారం కలిగి ఉండలేదు.
2. దీనిద్వారా తెలిసేది ఏమిటంటే, మహాప్రవక్త (సఅసమ్), నిషేధానికి సంబంధించిన ఈ పని తన కోసం చేసిందికాదు, తన భార్యల కోరిక మేరకు మాత్రమే చేశారు. కేవలం వారిని సంతోషపరచటానికే ఆయన ధర్మసమ్మతమైన వస్తువును తనకై నిషేధించుకున్నారు. ప్రామాణికమైన హదీసుల ప్రకారం, మహాప్రవక్త (సఅసమ్) సతీమణులలో ఒకామె

| | |
|---|---|
| **4 - 5** మీరు ఉభయులు పశ్చాత్తాపపడితే (అది మీకే శ్రేయస్కరం). ఎందుకంటే, మీ హృదయాలు ఋజుమార్గం నుండి తొలగిపోయాయి.[5] ఒకవేళ ప్రవక్తకు వ్యతిరేకంగా మీరు ముఠా కట్టితే, తెలుసుకోండి, అల్లాహ్ ఆయన యజమాని. ఇంకా జిబ్రీలు, సజ్జనులైన విశ్వాసులందరూ, దైవదూత లందరూ ఆయన సహచరులు, సహాయకులూను.[6] ఒకవేళ మీ అందరికీ ప్రవక్త విడాకులిస్తే, అల్లాహ్ మీకు బదులుగా ఆయనకు మీ కంటె మంచి[7] భార్యలను ప్రసాదిస్తాడు; వారు నిజమైన ముస్లిమ్‌లుగా, విశ్వాసం కలవారుగా, విధేయత చూపేవారుగా, పశ్చాత్తాపపడేవారుగా, ఆరాధన చేసేవారుగా, ఉపవాసం పాటించేవారుగా ఉంటారు, వారు భర్తృవిహీనులైనా లేదా కన్యలైనా కావచ్చు. | اِنْ تَتُوْبَآ اِلَى اللّٰهِ فَقَدْ صَغَتْ قُلُوْبُكُمَا ۚ وَاِنْ تَظٰهَرَا عَلَيْهِ فَاِنَّ اللّٰهَ هُوَ مَوْلٰىهُ وَ جِبْرِيْلُ وَصَالِحُ الْمُؤْمِنِيْنَ ۚ وَالْمَلٰٓئِكَةُ بَعْدَ ذٰلِكَ ظَهِيْرٌ ۝٤ عَسٰى رَبُّهٗٓ اِنْ طَلَّقَكُنَّ اَنْ يُّبْدِلَهٗٓ اَزْوَاجًا خَيْرًا مِّنْكُنَّ مُسْلِمٰتٍ مُّؤْمِنٰتٍ قٰنِتٰتٍ تٰٓئِبٰتٍ عٰبِدٰتٍ سٰٓئِحٰتٍ ثَيِّبٰتٍ وَّاَبْكَارًا ۝٥ |

(హజ్రత్ జైనబ్) ఇంటికి ఎక్కడ నుండో ఆయన ఎక్కువ మక్కువ పడే తేనె వచ్చింది. ఇందుచేత ఆయన వాడుకకు భిన్నంగా ఆమె నివాసంలోనే ఎక్కువకాలం గడిపేవారు. ఈ విషయాన్ని గమనించిన ఆయన భార్యలలో కొందరికి, "ఈ రీతిగానే ఆయన మా వద్ద కూడ గడిపితే ఎంత బాగుండు"ననే ప్రగాఢమైన వాంఛ కలిగింది. అప్పుడు వారందరూ ఏకమై "ఇక ఎన్నడూ ఎంతమాత్రం తేనెను ముట్టన"ని ప్రమాణం చేసేటంత ఏవగింపు ఆయనకు తేనెపై కలిగేలా చేశారు.

3. అర్థం ఏమిటంటే, పాపపరిహారం చెల్లించి ప్రమాణాల పాటింపు నుండి బయటపడటానికి, మాయిదా సూరాలోని 89వ ఆయతులో అల్లాహ్ నిర్ణయించిన పద్ధతిని ఆచరించి, ధర్మసమ్మతమైన ఒక వస్తువును తనకై నిషిద్ధంగా చేసుకోవటానికి చేసిన ప్రమాణాన్ని భంగపరచుకోవాలి.

4. ఆ రహస్యం ఇది అని ఇదమిత్థంగా చెప్పటానికి ఏ హదీసూ లేదు. ఈ ఆయతు అవతరించిన ఉద్దేశ్యాన్ని దృష్టిలో పెట్టుకుంటే, అసలు ఆ రహస్యపు విషయం ఏమిటో అన్న ప్రశ్నకు ప్రాధాన్యం ఉండనే ఉండదు. ఈ వ్యవహారాన్ని దివ్య ఖురానులో ఉల్లేఖించటంలో ప్రధానోద్దేశ్యం, రహస్య విషయాలను పరిరక్షించటంలో ఏమాత్రం అలక్ష్యం కూడదని పరిశుద్ధులైన మహాప్రవక్త (సఅసమ్) భార్యలనూ, వారి ద్వారా ముస్లిమ్ సమాజంలో బాధ్యులైన వ్యక్తుల భార్యలనూ హెచ్చరించటమే. ఒక వ్యక్తి తాను నిర్వహించే పదవీ బాధ్యత ఎంత పెద్దదైతే, అతని ఇంటి నుంచి రహస్యాలు బయటికి పొక్కడమూ అంతే ప్రమాదకరం. విషయం ప్రధానమా, అప్రధానమా అనేది ముఖ్యం కాదు, కాని రహస్య విషయాలను పరిరక్షించటంలో ఏమరుపాటుకు అలవాటుపడితే, అప్రధాన విషయాలు బయటపడిన మాదిరిగానే ప్రధానమైన విషయాలు కూడ బయటపడే అవకాశం ఉంటుంది.

5. ఈ ఉభయులు అంటే, హజ్రత్ ఉమర్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం, హజ్రత్ ఆయెషా (రజిఅన్), హజ్రత్ హఫ్సా (రజిఅన్) అని అర్థం. రుజుమార్గం నుండి తొలగిపోవటం అంటే హజ్రత్ ఉమర్ వివరణను అనుసరించి, ఈ భార్యలిద్దరూ మహాప్రవక్త యెడల అతి చనువుగా ప్రవర్తించసాగారు. ఇది అల్లాహ్‌కు నచ్చలేదు కనుక ఆయన వారిని హెచ్చరించాడు.

6. భావం ఏమిటంటే, మహాప్రవక్త (సఅసమ్)కు వ్యతిరేకంగా మీరు ఒకరితో ఒకరు చేతులు కలిపితే, చేజేతులా కీడును కొనితెచ్చుకున్న వారవుతారు. ఎందుకంటే, స్వయంగా అల్లాహ్‌యే ఆయన రక్షకుడు; జిబ్రీల్, దైవదూతలు, సజ్జనులైన విశ్వాసులందరూ ఆయన పక్షాన్నే ఉన్నారు. కనుక ఆయనకు వ్యతిరేకంగా చేతులు కలిపి ఎవడూ గెలవనూలేడు.

7. దీనిద్వారా తెలిసింది ఏమిటంటే, దోషం కేవలం హజ్రత్ ఆయెషా (రజిఅన్), హజ్రత్ హఫ్సా (రజిఅన్)లది

يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا قُوْۤا اَنْفُسَكُمْ وَاَهْلِيْكُمْ
نَارًا وَّقُوْدُهَا النَّاسُ وَالْحِجَارَةُ عَلَيْهَا مَلٰٓئِكَةٌ
غِلَاظٌ شِدَادٌ لَّا يَعْصُوْنَ اللّٰهَ مَاۤ اَمَرَهُمْ
وَيَفْعَلُوْنَ مَا يُؤْمَرُوْنَ ﴿٦﴾ يٰۤاَيُّهَا الَّذِيْنَ
كَفَرُوْا لَا تَعْتَذِرُوا الْيَوْمَ ؕ اِنَّمَا تُجْزَوْنَ مَا
كُنْتُمْ تَعْمَلُوْنَ ﴿٧﴾ يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا تُوْبُوْۤا ع ١٩
اِلَى اللّٰهِ تَوْبَةً نَّصُوْحًا ؕ عَسٰى رَبُّكُمْ اَنْ
يُّكَفِّرَ عَنْكُمْ سَيِّاٰتِكُمْ وَيُدْخِلَكُمْ جَنّٰتٍ
تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ ۙ يَوْمَ لَا يُخْزِى اللّٰهُ
النَّبِيَّ وَالَّذِيْنَ اٰمَنُوْا مَعَهٗ ۚ نُوْرُهُمْ يَسْعٰى
بَيْنَ اَيْدِيْهِمْ وَبِاَيْمَانِهِمْ يَقُوْلُوْنَ رَبَّنَاۤ
اَتْمِمْ لَنَا نُوْرَنَا وَاغْفِرْ لَنَا ۚ اِنَّكَ عَلٰى كُلِّ
شَيْءٍ قَدِيْرٌ ﴿٨﴾ يٰۤاَيُّهَا النَّبِيُّ جَاهِدِ الْكُفَّارَ
وَالْمُنٰفِقِيْنَ وَاغْلُظْ عَلَيْهِمْ ؕ وَمَاْوٰىهُمْ جَهَنَّمُ ؕ
وَبِئْسَ الْمَصِيْرُ ﴿٩﴾

**6 - 7** విశ్వాసులారా! మీరు మిమ్మల్నీ, మీ కుటుంబ సభ్యులనూ మానవులు, రాళ్లు ఇంధనం కాబోయే అగ్ని నుండి కాపాడుకోండి.[8] దానిపై ఎంతో బలిష్ఠులు, అత్యంత కఠినులు అయిన దైవదూతలు నియమించబడి ఉంటారు; వారు ఎన్నటికీ అల్లాహ్ ఆజ్ఞను ఉల్లంఘించరు, వారు తమకు ఏ ఆజ్ఞ ఇచ్చినా, దానిని పాటిస్తారు. (అప్పుడు ఇలా అనటం జరుగుతుంది), "అవిశ్వాసులారా! ఈనాడు సాకులు చెప్పకండి, మీరు చేస్తూ ఉండిన చేతలకు తగినట్టుగానే మీకు ప్రతిఫలం ఇవ్వబడుతుంది."

**8** విశ్వాసులారా! చిత్తశుద్ధితో కూడిన పశ్చాత్తాపంతో అల్లాహ్ వైపునకు మరలండి, అప్పుడు అల్లాహ్ మీ చెడులను మీ నుండి దూరం చేసి, మిమ్మల్ని సెలయేళ్లు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేయవచ్చు. అల్లాహ్ తన ప్రవక్తలనూ ఆయనతో పాటు విశ్వసించిన వారినీ అవమానం పాలు చేయని రోజు అదే.[9] వారి కాంతి వారికి అగ్రభాగంలో, వారికి కుడి వైపుగా పరుగెత్తుతూ ఉంటుంది. అప్పుడు వారు ఇలా అంటారు, "ప్రభూ! మా కాంతిని మా కొరకు పరిపూర్ణం చెయ్యి; మమ్మల్ని మన్నించు. నీవు ప్రతి దానిపై అధికారం కలవాడవు."

**9** ఓ ప్రవక్తా! అవిశ్వాసులతో, కపటులతో పోరాడు, వారి పట్ల కఠినంగా వ్యవహరించు, వారి నివాసం నరకమవుతుంది, అది అతి చెడ్డనివాసం.

మాత్రమే కాదు. పరిశుద్ధలైన ఇతర భార్యలు సైతం ఈ విషయంలో ఎంతోకొంత దోషం కలవారే. ఇందువల్లనే వారిరువురి తరువాత, ఈ ఆయతులో మిగిలిన భార్యలనందరినీ హెచ్చరించటం జరిగింది. హదీసుల ద్వారా తెలిసేది ఏమిటంటే ఆ కాలంలో మహాప్రవక్త (సఅసమ్)కు తన భార్యలపై ఎంతటి ఆగ్రహం కలిగిందంటే, ఒకనెల రోజులపాటు ఆయన వారితో ఏ విధమైన సంబంధాలు లేకుండా ఉన్నారు. దీని ఫలితంగా ప్రవక్త అనుచరులలో ఆయన తన భార్యలకు విడాకులిచ్చారనే వదంతి వ్యాపించింది.

8. ఈ ఆయతు తెలిపే విషయమేమిటంటే, ఒక వ్యక్తి బాధ్యత, కేవలం తనను మాత్రమే దైవశిక్ష నుండి కాపాడుకోవటానికి చేసే ప్రయత్నం వరకే పరిమితమై లేదు. ప్రకృతి ధర్మం ఆ వ్యక్తిపై ఏ కుటుంబపు బరువు బాధ్యతలను మోపుతుందో, ఆ కుటుంబ సభ్యులకు అతను సముచితమైన విద్యా శిక్షణలను శక్తివంచన లేకుండా గరపాలి. తద్వారా వారు అల్లాహ్‌కు ఇష్టులైన మానవులుగా రూపొందాలి. ఒకవేళ వారు నరకం వైపునకు వెళుతూ ఉంటే, యథాశక్తి వారిని అటుపోకుండా ఆపటానికి ప్రయత్నించాలి. రాళ్లు అగ్నికి ఇంధనాలవుతాయి అంటే బహుశా రాతిబొగ్గు కావచ్చు. ఇబ్నె మసూద్ (రజిఅన్), ఇబ్నె అబ్బాస్ (రజిఅన్), ముజాహిద్ (రహమలై), ఇమామ్ ముహమ్మద్ బాఖిర్ (రహమలై), సుద్దీ (రహమలై)లు అవి గంధకపురాళ్లు అని అన్నారు.

**10 - 12** అల్లాహ్ అవిశ్వాసుల విషయంలో, ప్రవక్త నూహ్, ప్రవక్త లూత్‌ల భార్యలను ఉదాహరణగా పేర్కొంటున్నాడు. వారు సజ్జనులైన మా ఇద్దరు దాసుల వివాహబంధంలో ఉండేవారు. కాని వారు తమ భర్తలకు ద్రోహం చేశారు.[10] వారు అల్లాహ్‌కు ప్రతిగా ఆ స్త్రీలకు ఏమాత్రం ఉపయోగపడ లేకపోయారు. వారిద్దరితో, "వెళ్లండి, అగ్నిలోకి వెళ్ళే వారితో పాటు మీరూ వెళ్లండి" అని చెప్పబడింది. విశ్వాసుల విషయంలో అల్లాహ్ ఫిరౌన్ భార్యను ఉదాహరణగా పేర్కొంటున్నాడు. అప్పుడు ఆమె ఇలా ప్రార్థించారు, "ప్రభూ! నా కొరకు నీ వద్ద స్వర్గంలో ఒక గృహాన్ని నిర్మించు. నన్ను ఫిరౌన్ నుండీ, అతని చేష్టల నుండీ కాపాడు, దుర్మార్గపు జాతి నుండి నాకు విముక్తి కలిగించు." ఇంకా ఇమ్రాన్ కుమార్తె[11] మర్యమ్‌ను కూడ ఉదాహరణగా పేర్కొంటున్నాడు: ఆమె తన మానాన్ని కాపాడుకున్నారు.[12] ఆ తరువాత మేము ఆమెలోకి మా తరపు నుండి ఆత్మను[13] ఊదాము. ఆమె తన ప్రభువు సూక్తులను, ఆయన గ్రంథాలను ధ్రువపరచారు. ఆమె వినయవిధేయతలు గల వారిలో ఒకరు.[14]

ضَرَبَ اللّٰهُ مَثَلًا لِّلَّذِيْنَ كَفَرُوا امْرَاَتَ نُوْحٍ وَّ امْرَاَتَ لُوْطٍ ؕ كَانَتَا تَحْتَ عَبْدَيْنِ مِنْ عِبَادِنَا صَالِحَيْنِ فَخَانَتٰهُمَا فَلَمْ يُغْنِيَا عَنْهُمَا مِنَ اللّٰهِ شَيْـًٔا وَّقِيْلَ ادْخُلَا النَّارَ مَعَ الدّٰخِلِيْنَ ⑩ وَضَرَبَ اللّٰهُ مَثَلًا لِّلَّذِيْنَ اٰمَنُوا امْرَاَتَ فِرْعَوْنَ ۘ اِذْ قَالَتْ رَبِّ ابْنِ لِيْ عِنْدَكَ بَيْتًا فِي الْجَنَّةِ وَنَجِّنِيْ مِنْ فِرْعَوْنَ وَعَمَلِهٖ وَنَجِّنِيْ مِنَ الْقَوْمِ الظّٰلِمِيْنَ ⑪ وَ مَرْيَمَ ابْنَتَ عِمْرٰنَ الَّتِيْۤ اَحْصَنَتْ فَرْجَهَا فَنَفَخْنَا فِيْهِ مِنْ رُّوْحِنَا وَصَدَّقَتْ بِكَلِمٰتِ رَبِّهَا وَ كُتُبِهٖ وَكَانَتْ مِنَ الْقٰنِتِيْنَ ⑫

9. అంటే, వారు చేసిన సత్కార్యాల ఫలాన్ని నిష్ఫలం చేయడు. "వారు దేవుణ్ణి ఆరాధించి ఏం ఫలం పొందారని" ఎత్తిపొడిచే అవకాశాన్ని అవిశ్వాసులకూ, వంచకులకూ ఎంతమాత్రం ఇవ్వడు. తిరుగుబాటుదారులకూ, అవిధేయులకూ మాత్రమే తలవంపులుగానీ, విశ్వసనీయులకూ, విధేయులకూ మాత్రం కాదు.

10. నమ్మకద్రోహం అంటే, వారు చెడునడతకు ఒడిగట్టారు అని అర్థం కాదు. కాని, దాని అర్థం ఏమిటంటే, వారు విశ్వాసమార్గంలో హజ్రత్ నూహ్ (అస్సలామ్)నూ, హజ్రత్ లూత్ (అస్సలామ్)నూ అనుసరించలేదు. పైగా వారికి ప్రతిగా, వారు ధర్మానికి శత్రువులైనవారిని అనుసరించారు.

11. హజ్రత్ మర్యమ్ తండ్రి పేరే ఇమ్రాన్ కావచ్చు లేదా ఆమె ఇమ్రాన్ సంతతికి చెందినదగుటచేత, ఆమెను ఇమ్రాన్ కూతురుగా వ్యవహరించబడి ఉండవచ్చు.

12. మర్యమ్ గర్భం నుండి హజ్రత్ ఈసా పుట్టటం అనేది, అల్లాహ్ క్షమించుగాక! పాపకార్యఫలమే అనే యూదులు మోపిన నిందను ఖండించటం జరిగింది. నిసా సూరా 156వ ఆయతులో, దుర్మార్గుల ఈ నిందనే పాపిష్ఠి కల్పనగా అభివర్ణించటం జరిగింది.

13. అంటే, ఆమెకు ఏ పురుషునితోనూ సంబంధం లేకుండానే, అల్లాహ్ ఆమె గర్భంలో ఒక ప్రాణిని ప్రవేశింపజేశాడు.

14. ఇక్కడ హజ్రత్ మర్యమ్‌ను ఉదాహరణగా పేర్కొనడంలో గల ప్రధానోద్దేశ్యం ఏమిటంటే, కన్యగా ఉన్నప్పుడు అల్లాహ్ ఆమెను ఒక మహిమ ద్వారా గర్భవతిని చేసి తీవ్రమైన పరీక్షకు గురిచేశాడు. కాని ఆమె సహనంతో అల్లాహ్ అభిమతాన్ని శిరసావహించింది.

ఆయతులు 30 | ## 67. అల్ ముల్క్ | అవతరణ మక్కాలో

٦٧ سُوْرَةُ الْمُلْكِ مَكِّيَّةٌ ٧٧

اٰياتها ٣٠ | ركوعاتها ٢

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

تَبٰرَكَ الَّذِيْ بِيَدِهِ الْمُلْكُ ۡ وَ هُوَ عَلٰى كُلِّ
شَيْءٍ قَدِيْرُ ۨ ۝١ الَّذِيْ خَلَقَ الْمَوْتَ وَالْحَيٰوةَ
لِيَبْلُوَكُمْ اَيُّكُمْ اَحْسَنُ عَمَلًا ؕ وَ هُوَ الْعَزِيْزُ
الْغَفُوْرُ ۨ ۝٢ الَّذِيْ خَلَقَ سَبْعَ سَمٰوٰتٍ طِبَاقًا ؕ
مَا تَرٰى فِيْ خَلْقِ الرَّحْمٰنِ مِنْ تَفٰوُتٍ ؕ
فَارْجِعِ الْبَصَرَ ۙ هَلْ تَرٰى مِنْ فُطُوْرٍ ۝٣ ثُمَّ
ارْجِعِ الْبَصَرَ كَرَّتَيْنِ يَنْقَلِبْ اِلَيْكَ الْبَصَرُ
خَاسِئًا وَّ هُوَ حَسِيْرٌ ۝٤ وَ لَقَدْ زَيَّنَّا السَّمَآءَ
الدُّنْيَا بِمَصَابِيْحَ وَ جَعَلْنٰهَا رُجُوْمًا لِّلشَّيٰطِيْنِ
وَ اَعْتَدْنَا لَهُمْ عَذَابَ السَّعِيْرِ ۝٥

**1 – 4** ఎవరి చేతులలో విశ్వసామ్రాజ్యం ఉన్నదో, ఆయన ఎంతో శుభకరుడు, ఎంతో మహోన్నతుడు. ఆయన ప్రతి దానిపై అధికారం[1] కలిగి ఉన్నాడు. మీలో మంచి పనులు[2] చేసేవారెవరో పరీక్షించి చూద్దామని ఆయన చావుబ్రతుకులను సృష్టించాడు. ఆయన అత్యంత శక్తిసంపన్నుడు, అత్యధికంగా మన్నించేవాడూను. ఆయన ఒక దానిపైనొకటి ఏడు ఆకాశాలను సృజించాడు. నీవు కరుణామయుని సృష్టిలో ఎలాంటి క్రమరాహిత్యాన్నీ చూడలేవు.[3] కావాలంటే మరొకసారి చూడు, అందులో నీకేమైనా లోపం కనిపిస్తున్నదా?[4] మళ్ళీ మళ్ళీ చూడు, నీ చూపులు అలసిపోయి విఫలమై వెనుకకు తిరిగి వస్తాయి.

**5** మేము మీకు దగ్గరగా ఉన్న ఆకాశాన్ని[5] మహోజ్వలమైన దీపాలతో అలంకరించాము, వాటిని, షైతానులను తరిమికొట్టే సాధనాలుగా చేశాము. ఈ షైతానుల కొరకు మేము మండే అగ్నిని సిద్ధం చేసి ఉంచాము.

---

1. అంటే, తాను కోరింది చేస్తాడు అని అర్థం. తాను కోరిన దానిని చేయకుండా ఆయనను ఆపే శక్తి ఏదీ లేదు.
2. అంటే, మానవులను పరీక్షించాలనీ, వారిలో ఎవరు ఉత్తమ కార్యాలు చేస్తారో చూడాలనీ అల్లాహ్ ప్రపంచంలో మానవుల జీవన్మరణాల పరంపరను ప్రారంభించాడు.
3. అసలు "తఫావుత్" అనే పదం ప్రయోగించబడింది. దాని అర్థం పొందిక లేకపోవడం, ఒక వస్తువుకు మరొక వస్తువుతో పొంతనలేకపోవటం.
4. అసలు "ఫుతూర్" అనే పదం ఉపయోగించబడింది. దాని అర్థం, బీటలు వారుట, చీలికలగుట, పగిలి ముక్కలగుట, తునాతునకలగుట. అర్థం ఏమిటంటే, ఈ సృష్టి నిర్మాణం అంతా చాలా కట్టుదిట్టంగా ఉన్నది. భూమియందలి అణువు నుండి వినువీధిలోని మహోజ్వలమైన పాలపుంతల వరకు గల ప్రతి వస్తువూ ఎంతో పొందికతో ఉన్నది. అందుచేత సృష్టి వ్యవస్థ అవిచ్ఛిన్నంగా సాగిపోతోంది. ఈ వ్యవస్థను ఏ కోణం నుంచి పరిశీలించినా, మీకు అందులో ఎక్కడా లోటు కనిపించదు.
5. దగ్గరగా ఉన్న ఆకాశం అంటే, దూరదర్శిని లేకుండా కళ్ళతో చూడగలిగే నక్షత్రాలు, గ్రహాలు గల ఆకాశం అని అర్థం.

وَ لِلَّذِيْنَ كَفَرُوْا بِرَبِّهِمْ عَذَابُ جَهَنَّمَ ؕ وَ
بِئْسَ الْمَصِيْرُ ٦ اِذَآ اُلْقُوْا فِيْهَا سَمِعُوْا لَهَا
شَهِيْقًا وَّ هِيَ تَفُوْرُ ٧ ۙ تَكَادُ تَمَيَّزُ مِنَ الْغَيْظِ ؕ
كُلَّمَآ اُلْقِيَ فِيْهَا فَوْجٌ سَاَلَهُمْ خَزَنَتُهَآ اَلَمْ
يَاْتِكُمْ نَذِيْرٌ ٨ قَالُوْا بَلٰى قَدْ جَآءَنَا نَذِيْرٌ ۙ
فَكَذَّبْنَا وَ قُلْنَا مَا نَزَّلَ اللّٰهُ مِنْ شَيْءٍ ۚ اِنْ
اَنْتُمْ اِلَّا فِيْ ضَلٰلٍ كَبِيْرٍ ٩ وَ قَالُوْا لَوْ كُنَّا
نَسْمَعُ اَوْ نَعْقِلُ مَا كُنَّا فِيْٓ اَصْحٰبِ
السَّعِيْرِ ١٠ فَاعْتَرَفُوْا بِذَنْۢبِهِمْ ۚ فَسُحْقًا
لِّاَصْحٰبِ السَّعِيْرِ ١١ اِنَّ الَّذِيْنَ يَخْشَوْنَ
رَبَّهُمْ بِالْغَيْبِ لَهُمْ مَّغْفِرَةٌ وَّ اَجْرٌ كَبِيْرٌ ١٢
وَاَسِرُّوْا قَوْلَكُمْ اَوِ اجْهَرُوْا بِهٖ ؕ اِنَّهٗ عَلِيْمٌۢ
بِذَاتِ الصُّدُوْرِ ١٣ اَلَا يَعْلَمُ مَنْ خَلَقَ ؕ
وَهُوَ اللَّطِيْفُ الْخَبِيْرُ ١٤ هُوَ الَّذِيْ جَعَلَ لَكُمُ ع
الْاَرْضَ ذَلُوْلًا فَامْشُوْا فِيْ مَنَاكِبِهَا وَكُلُوْا مِنْ
رِّزْقِهٖ ؕ وَ اِلَيْهِ النُّشُوْرُ ١٥ ءَاَمِنْتُمْ مَّنْ فِي
السَّمَآءِ اَنْ يَّخْسِفَ بِكُمُ الْاَرْضَ فَاِذَا هِيَ
تَمُوْرُ ١٦ ۙ

**6 - 11** తమ ప్రభువును తిరస్కరించిన ప్రజలకు నరక శిక్ష పడుతుంది: అది చాలా చెడ్డ నివాస స్థలం. వారిని అందులోకి విసిరివేసినప్పుడు, వారికి భయంకరమైన దాని గర్జన ధ్వని వినిపిస్తుంది.[6] అది అప్పుడు ఉద్రేకంతో ఉడికిపోతూ ఉంటుంది, తీవ్రమైన ఆగ్రహంతో బ్రద్దలవుతూ ఉంటుంది. ఏదైనా ఒక గుంపును అందులో వేసిన ప్రతిసారీ, దాని కాపలా దారులు, "మీ వద్దకు హెచ్చరించేవారు రాలేదా?" అని వారిని అడుగుతారు. దానికి వారు ఇలా జవాబు ఇస్తారు, "వచ్చాడు, హెచ్చరిక చేసే అతను మా వద్దకు వచ్చాడు. కాని మేము అతనిని తిరస్కరించాము. అల్లాహ్ దేన్నీ అవతరింపజేయలేదు, నీవు మార్గభ్రష్టుడవైపోయావు అని మేము అతనితో అన్నాము." ఇంకా వారు ఇలా అంటారు, "అయ్యో! మేము గనక (ఆనాడు) విని ఉంటే, లేదా గ్రహించి ఉంటే, ఈనాడు ఇలా మండే నరకాగ్ని శిక్షకు గురిఅయిన వారిలో చేరి ఉండేవారము కాదుకదా!" ఈ విధంగా వారే స్వయంగా తమ తప్పును ఒప్పుకుంటారు. ఈ నరకవాసులు నాశనమైపోను!

**12 - 14** చూడకుండానే తమ ప్రభువుకు భయపడేవారికి, తప్పకుండా మన్నింపు, గొప్ప ప్రతిఫలం లభిస్తాయి. మీరు మెల్లగా మాట్లాడినా లేక బిగ్గరగా పలికినా (అల్లాహ్‌కు రెండూ ఒకటే). ఆయన హృదయాల స్థితిని సైతం ఎరుగును. పుట్టించిన వాడికే తెలియదా?[7] వాస్తవానికి ఆయన సూక్ష్మగ్రాహి మరియు సమస్తమూ తెలిసినవాడూను.

**15 - 23** భూమిని మీ అధీనంలో ఉంచినవాడు ఆయనే, కనుక దానిమీద తిరగండి, దేవుడు ప్రసాదించిన ఆహారాన్ని తినండి. ఆయన సాన్నిధ్యానికే మీరు మళ్లీ సజీవులై పోవలసి ఉంది. ఆకాశంలో ఉన్నవాడు[8] మిమ్మల్ని భూమిలోకి దిగద్రొక్కడని, భూమి హఠాత్తుగా తీవ్ర కంపనాలకు గురికాదని మీరు నిర్భయంగా ఉన్నారా?

6. ఇది నరక ధ్వని అని గానీ, నరకం నుండి వచ్చే ధ్వని అని గానీ అర్థం చెప్పవచ్చు. వారికంటే ముందు అందులోకి విసరివేయబడిన వారి అరుపులు, పెడబొబ్బలు అన్నమాట.

7. రెండో అనువాదం ఇలా కూడా కావచ్చు : "ఆయన తన సృష్టినే ఎరుగడా?"

8. అల్లాహ్ ఆకాశంలో ఉంటాడని దీని అర్థం కాదు. ఇలా ఎందుకు సెలవీయబడిందంటే; మానవుడు దేవుణ్ణి కోరుకున్నప్పుడు, సహజంగానే ఆకాశం వైపు చూస్తాడు. ప్రార్థన చేసినా, ఆకాశం వైపే చేతులెత్తుతాడు.

اَمْ اَمِنْتُمْ مَّنْ فِي السَّمَآءِ اَنْ يُّرْسِلَ عَلَيْكُمْ
حَاصِبًا ۭ فَسَتَعْلَمُوْنَ كَيْفَ نَذِيْرِ ﴿١٧﴾ وَ لَقَدْ
كَذَّبَ الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ فَكَيْفَ كَانَ
نَكِيْرِ ﴿١٨﴾ اَوَلَمْ يَرَوْا اِلَى الطَّيْرِ فَوْقَهُمْ صٰٓفّٰتٍ
وَّ يَقْبِضْنَ ۚ مَا يُمْسِكُهُنَّ اِلَّا الرَّحْمٰنُ ۭ اِنَّهٗ
بِكُلِّ شَيْءٍۢ بَصِيْرٌ ﴿١٩﴾ اَمَّنْ هٰذَا الَّذِيْ هُوَ
جُنْدٌ لَّكُمْ يَنْصُرُكُمْ مِّنْ دُوْنِ الرَّحْمٰنِ ۭ اِنِ
الْكٰفِرُوْنَ اِلَّا فِيْ غُرُوْرٍ ﴿٢٠﴾ اَمَّنْ هٰذَا الَّذِيْ
يَرْزُقُكُمْ اِنْ اَمْسَكَ رِزْقَهٗ ۚ بَلْ لَّجُّوْا فِيْ عُتُوٍّ
وَّنُفُوْرٍ ﴿٢١﴾ اَفَمَنْ يَّمْشِيْ مُكِبًّا عَلٰى وَجْهِهٖٓ
اَهْدٰٓى اَمَّنْ يَّمْشِيْ سَوِيًّا عَلٰى صِرَاطٍ
مُّسْتَقِيْمٍ ﴿٢٢﴾ قُلْ هُوَ الَّذِيْٓ اَنْشَاَكُمْ وَجَعَلَ
لَكُمُ السَّمْعَ وَ الْاَبْصَارَ وَ الْاَفْـِٕدَةَ ۭ قَلِيْلًا
مَّا تَشْكُرُوْنَ ﴿٢٣﴾

وقف غفران وقف منزل وقف لازم

ఆకాశంలో ఉన్నవాడు మీపైకి రాళ్లను విసిరే పెనుగాలిని పంపడని మీరు నిర్భయంగా ఉన్నారా? అప్పుడు నా హెచ్చరిక ఎలా ఉంటుందో మీకు తెలిసిపోతుంది. వారికి పూర్వం గతించినవారు కూడ తిరస్కరించారు; అప్పుడు నా పట్టు ఎంత తీవ్రంగా ఉండినదో చూడండి. వారు తమ మీద ఎగిరే పక్షులు రెక్కలను ఎలా చాపుతూ ముడుచుకుంటూ ఎగురుతున్నాయో చూడటం లేదా? కరుణామయుడైన అల్లాహ్ తప్ప వాటిని అలా నిలిపి ఉంచేవారెవ్వరూ లేరు. ఆయనే ప్రతి వస్తువును కనిపెట్టి ఉండేవాడు. కరుణామయుడైన అల్లాహ్‌కు ప్రతికూలంగా మీకు సహాయం చేయగల సైన్యమేదైనా మీ వద్ద ఉన్నదా?[9] చూపించండి? అసలు విషయం ఏమిటంటే, ఈ తిరస్కారులు మోసంలో పడిపోయారు. లేదా ఒకవేళ కరుణామయుడైన అల్లాహ్ తాను ప్రసాదించే ఆహారాన్ని ఆపివేసినట్లయితే, ఇంకెవరు మీకు ఆహారమివ్వగలరు? చెప్పండి? వారసలు తలబిరుసుతనానికీ, సత్యతిరస్కారానికీ, మూర్ఖంగా అంటిపెట్టుకొని ఉన్నారు. బోర్లా పడుతూ లేస్తూ నడిచే[10] వ్యక్తి సరైన గమ్యానికి చేరుకుంటాడా లేక చదునైన బాటపై తలెత్తి నిటారుగా నడిచే వ్యక్తి గమ్యానికి చేరుకుంటాడా? కాస్త ఆలోచించండి. వారితో ఇలా అనండి, “మిమ్మల్ని పుట్టించినవాడు అల్లాహ్‌యే; ఆయనే మీకు వినే, చూసే శక్తులు ఇచ్చాడు. ఇంకా ఆయనే మీకు ఆలోచించే, అర్థం చేసుకునే మనస్సు కూడ ఇచ్చాడు. కాని మీరు చాల తక్కువగా కృతజ్ఞతలు తెలుపుతారు.[11]

ఆపద సమయంలో నిరాశానిస్పృహలకులోనై ఆకాశం వైపునకు తిరిగి అల్లాహ్‌ను వేడుకుంటాడు. అనుకోని ఆపద సంభవించినప్పుడు అది ఆకాశం నుంచే వచ్చిందని అంటాడు. అసాధారణ రీతిలో ఏదైనా వస్తువు లభిస్తే, అది పై లోకం నుంచి వచ్చిందంటాడు. అల్లాహ్ పంపిన గ్రంథాలను ఆకాశ గ్రంథాలని అంటారు. ఈ విషయాలన్నింటి ద్వారా స్పష్టమయ్యేదేమిటంటే, మానవుడు దేవుణ్ణి గురించి ఆలోచించినప్పుడు, అతని మనస్సు నేలపైకి కాక నింగిపైకే పోతుంది. ఇది మానవ స్వభావం.

9. రెండో అనువాదం ఇలా కూడా కావచ్చు : “మీ వద్దకు సైన్యరూపంలో వచ్చి మిమ్మల్ని ఆదుకునేందుకు కరుణామయుడు తప్ప మరెవడున్నాడు?”

10. అంటే, పశువుల మాదిరిగా తలదించుకుని ఏదో ఒక మార్గంలో పోవుట.

11. అంటే, బుద్ధీ జ్ఞానాలూ, కనేవినే శక్తులూ అనే ఈ వరాలను అల్లాహ్ మీకు సత్యాన్ని గ్రహించటానికే ప్రసాదించాడు. ఈ వరాలతో లోకంలోని పనులన్నీ సాధిస్తారు; కాని కృతఘ్నుతాబుద్ధితో అవి ఏ పని కోసం ఇవ్వబడ్డాయో ఆ పని మాత్రం వదిలేస్తారు.

قُلْ هُوَ الَّذِيْ ذَرَاَكُمْ فِي الْاَرْضِ وَ اِلَيْهِ
تُحْشَرُوْنَ ﴿۲۴﴾ وَ يَقُوْلُوْنَ مَتٰى هٰذَا الْوَعْدُ اِنْ
كُنْتُمْ صٰدِقِيْنَ ﴿۲۵﴾ قُلْ اِنَّمَا الْعِلْمُ عِنْدَ اللّٰهِ
وَ اِنَّمَاۤ اَنَا نَذِيْرٌ مُّبِيْنٌ ﴿۲۶﴾ فَلَمَّا رَاَوْهُ زُلْفَةً
سِيْٓـَٔتْ وُجُوْهُ الَّذِيْنَ كَفَرُوْا وَقِيْلَ هٰذَا
الَّذِيْ كُنْتُمْ بِهٖ تَدَّعُوْنَ ﴿۲۷﴾ قُلْ اَرَءَيْتُمْ اِنْ
اَهْلَكَنِيَ اللّٰهُ وَ مَنْ مَّعِيَ اَوْ رَحِمَنَا فَمَنْ يُّجِيْرُ
الْكٰفِرِيْنَ مِنْ عَذَابٍ اَلِيْمٍ ﴿۲۸﴾ قُلْ هُوَ الرَّحْمٰنُ
اٰمَنَّا بِهٖ وَ عَلَيْهِ تَوَكَّلْنَا فَسَتَعْلَمُوْنَ مَنْ هُوَ فِيْ
ضَلٰلٍ مُّبِيْنٍ ﴿۲۹﴾ قُلْ اَرَءَيْتُمْ اِنْ اَصْبَحَ
مَآؤُكُمْ غَوْرًا فَمَنْ يَّاْتِيْكُمْ بِمَآءٍ مَّعِيْنٍ ﴿۳۰﴾ ع

**24 - 27** వారితో ఇలా అను, "అల్లాహ్‌యే మిమ్మల్ని యావద్భూమిపై వ్యాపింపజేశాడు. ఆయన వైపునకే మీరు సమీకరింపబడతారు." అప్పుడు వారు, "నీవు గనక సత్యవంతుడవే అయితే, ఈ వాగ్దానం ఎప్పుడు నెరవేరుతుందో చెప్పు" అని అడుగుతారు. ఇలా చెప్పు,"దీనికి సంబంధించిన జ్ఞానం అల్లాహ్ వద్దనే ఉంది. నేను స్పష్టంగా హెచ్చరిక చేసేవాణ్ణి మాత్రమే." తరువాత (వారు) దానిని సమీపంలో ఉండటం చూసినప్పుడు, తిరస్కరించిన వారందరి ముఖాలు వెల వెల బోతాయి. అప్పుడు వారితో, "మీరు మాటి మాటికి అడుగుతుండేది ఇదే" అని అనటం జరుగుతుంది.

**28 - 30** వీరితో ఇలా చెప్పు, "మీరెప్పుడైనా ఈ విషయం గురించి ఆలోచించారా? అల్లాహ్ నన్నూ, నా అనుచరులనూ నాశనం చేయనూవచ్చు లేదా మమ్మల్ని కరుణించనూవచ్చు. కాని తిరస్కారులను వ్యధాభరితమైన శిక్ష నుండి ఎవరు రక్షిస్తారు?[12] వారితో ఇంకా ఇలా అను, "ఆయన ఎంతో కరుణామయుడు. ఆయననే మేము విశ్వసించాము; ఆయననే మేము నమ్ముకున్నాము. ఎవరు పూర్తిగా మార్గభ్రష్టులై ఉన్నారో, త్వరలోనే మీకు తెలిసిపోతుంది." వీరికి ఇలా చెప్పు, "ఎప్పుడైనా మీరు ఈ విషయం గురించి కూడా ఆలోచించారా? ఒకవేళ మీ బావులలోని నీరు భూమి లోపలకు ఇంకిపోతే, ప్రవహించే ఈ నీటి ఊటలను మళ్లీ మీ కోసం బయటకు తెచ్చేదెవరు?"

12. పవిత్ర మక్కా నగరంలో మహాప్రవక్త (సఅసమ్) ధర్మప్రచారాన్ని ప్రారంభించి నప్పుడు, ఖురైష్ తెగకు చెందిన విభిన్న వంశాలతో సంబంధం ఉన్న వ్యక్తులు ఇస్లామ్ ధర్మాన్ని స్వీకరించారు. అప్పుడు ప్రతి ఇంటివారు ఆయననూ, ఆయన అనుచరులనూ శపించటం ప్రారంభించారు. ఆయన నశించాలని చేతబడి చేయించారు. చివరకు ఆయనను చంపటానికిక్కూడ కుట్రలు పన్నసాగారు. దీనిపై ఇలా సెలవీయబడింది : వారితో ఇలా అను, "మేము నశించినా, అల్లాహ్ దయ వల్ల బ్రతికి ఉన్నా, మీకు వచ్చేదేమిటి? దైవశిక్ష నుండి మిమ్మల్ని మీరు ఎలా కాపాడుకుంటారో ఆలోచించుకోండి."

## 68. అల్ ఖలమ్

అవతరణ మక్కాలో | ఆయతులు 52

٦٨ سُوْرَةُ الْقَلَمِ مَكِّيَّةٌ ٢

رکوعاتها ٢ | اٰیاتها ٥٢

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ۝

نٓ وَالۡقَلَمِ وَمَا يَسۡطُرُوۡنَ ۝١ مَاۤ اَنۡتَ بِنِعۡمَةِ رَبِّكَ بِمَجۡنُوۡنٍ ۝٢ وَاِنَّ لَكَ لَاَجۡرًا غَيۡرَ مَمۡنُوۡنٍ ۝٣ وَاِنَّكَ لَعَلٰى خُلُقٍ عَظِيۡمٍ ۝٤ فَسَتُبۡصِرُ وَيُبۡصِرُوۡنَ ۝٥ بِاَيِّٮكُمُ الۡمَفۡتُوۡنُ ۝٦ اِنَّ رَبَّكَ هُوَ اَعۡلَمُ بِمَنۡ ضَلَّ عَنۡ سَبِيۡلِهٖ ۖ وَهُوَ اَعۡلَمُ بِالۡمُهۡتَدِيۡنَ ۝٧ فَلَا تُطِعِ الۡمُكَذِّبِيۡنَ ۝٨ وَدُّوۡا لَوۡ تُدۡهِنُ فَيُدۡهِنُوۡنَ ۝٩ وَلَا تُطِعۡ كُلَّ حَلَّافٍ مَّهِيۡنٍ ۝١٠ هَمَّازٍ مَّشَّآءٍۢ بِنَمِيۡمٍ ۝١١ مَّنَّاعٍ لِّلۡخَيۡرِ مُعۡتَدٍ اَثِيۡمٍ ۝١٢ عُتُلٍّۢ بَعۡدَ ذٰلِكَ زَنِيۡمٍ ۝١٣ اَنۡ كَانَ ذَا مَالٍ وَّبَنِيۡنَ ۝١٤ اِذَا تُتۡلٰى عَلَيۡهِ اٰيٰتُنَا قَالَ اَسَاطِيۡرُ الۡاَوَّلِيۡنَ ۝١٥ سَنَسِمُهٗ عَلَى الۡخُرۡطُوۡمِ ۝١٦

**1 - 16** నూన్. కలం సాక్షిగా, లేఖకులు లిఖించే[1] దాని సాక్షిగా నీవు నీ ప్రభువు దయవల్ల పిచ్చివాడవు కావు.[2] నిశ్చయంగా నీకు ఎన్నటికీ తరగిపోని[3] ప్రతిఫలం లభిస్తుంది. నీవు నిస్సందేహంగా మహోన్నతమైన శీలం[4] కలవాడవు. మీలో ఎవరు ఉన్మాదానికి లోనయ్యారో త్వరలోనే నీవూ చూస్తావు, వారూ చూస్తారు. నీ ప్రభువుకు, తన మార్గం నుండి తప్పిపోయిన వారెవరో బాగా తెలుసు, ఋజుమార్గంపై ఉన్న వారెవరో కూడ ఆయనకు బాగా తెలుసు. కనుక నీవు ఈ సత్యతిరస్కారుల ఒత్తిడికి ఏమాత్రం తల ఒగ్గకు. నీవు గనక రాజీపడితే, వారు కూడా రాజీపడదామని అనుకుంటున్నారు.[5] చీటికీ మాటికీ ఒట్టువేసే నీచుడికి ఏమాత్రం లొంగకు. వాడు ఎత్తిపొడుస్తూ ఉంటాడు, చాడీలు చెబుతూ తిరుగుతూ ఉంటాడు, మంచిని నిరోధిస్తూ ఉంటాడు, దౌర్జన్యం చెయ్యటంలోనూ, అత్యాచారం చెయ్యటంలోనూ హద్దులు మీరుతూ ఉంటాడు, పరమపాతకుడు, మిక్కిలి క్రూరుడు. ఈ లోపాలన్నింటితోపాటు వాడు హీన జన్ముడు కూడ. దీనంతటికీ కారణం వాడు అత్యధికంగా సిరిసంపదలూ, సంతానమూ కలిగి[6] ఉండటమే. మా ఆయతులు అతడికి వినిపించినప్పుడు, ఇవి పూర్వకాలం నాటి కట్టుకథలే కదా అని అంటాడు. అతి త్వరలోనే మేము అతడి మూతి మీద వాతలు పెడతాము.[7]

---

1. గొప్ప వ్యాఖ్యాత ముజాహిద్ ప్రకారం, కలం అంటే, దివ్యఖురాను వ్రాయబడిన కలం అని అర్థం. దీనివలన స్పష్టమయ్యేదేమిటంటే, వ్రాయబడినది అంటే దివ్య ఖురాను అని అర్థం.
2. ఇక్కడ సంబోధన మహాప్రవక్త (స)కు ఉద్దేశించినట్లు కనబడినా, దీని ప్రధానోద్దేశ్యం మక్కా అవిశ్వాసులు ఆయన పిచ్చివాడని మోపిన నిందకు సమాధానం చెప్పటం. అర్థం ఏమిటంటే, వహీ లేఖకులచే వ్రాయబడిన ఈ ఖురానే వారి ఈ నిందను ఖండించటానికి సరిపోతుంది.
3. అంటే, ప్రజలను సన్మార్గంలో పెట్టటానికి మీరు చేసే ప్రయత్నాలకు సమాధానంగా మనస్తాపాన్ని కలిగించే మాటలు వినవలసి వచ్చినా, మీరు మీ కర్తవ్యాన్ని నెరవేరుస్తున్నారు. దానికి మీకు అగణితమైన, అక్షయమైన, ప్రతిఫలం లభిస్తుంది.
4. అంటే, అవిశ్వాసులు మీపై మోపుతున్న మతిభ్రమణపు నింద నిరాధారమని చెప్పటానికి దివ్య ఖురానే కాక

إِنَّا بَلَوْنٰهُمْ كَمَا بَلَوْنَآ أَصْحٰبَ الْجَنَّةِ ۚ إِذْ
أَقْسَمُوا لَيَصْرِمُنَّهَا مُصْبِحِينَ ﴿١٧﴾ وَ لَا
يَسْتَثْنُونَ ﴿١٨﴾ فَطَافَ عَلَيْهَا طَآئِفٌ مِّن رَّبِّكَ
وَ هُمْ نَآئِمُونَ ﴿١٩﴾ فَأَصْبَحَتْ كَالصَّرِيمِ ﴿٢٠﴾
فَتَنَادَوْا مُصْبِحِينَ ﴿٢١﴾ أَنِ اغْدُوا عَلٰى حَرْثِكُمْ
إِن كُنتُمْ صٰرِمِينَ ﴿٢٢﴾ فَانطَلَقُوا وَ هُمْ
يَتَخَافَتُونَ ﴿٢٣﴾ أَن لَّا يَدْخُلَنَّهَا الْيَوْمَ عَلَيْكُم
مِّسْكِينٌ ﴿٢٤﴾ وَّ غَدَوْا عَلٰى حَرْدٍ قٰدِرِينَ ﴿٢٥﴾
فَلَمَّا رَأَوْهَا قَالُوٓا إِنَّا لَضَآلُّونَ ﴿٢٦﴾ بَلْ نَحْنُ
مَحْرُومُونَ ﴿٢٧﴾ قَالَ أَوْسَطُهُمْ أَلَمْ أَقُل لَّكُمْ لَوْ
لَا تُسَبِّحُونَ ﴿٢٨﴾ قَالُوا سُبْحٰنَ رَبِّنَآ إِنَّا كُنَّا
ظٰلِمِينَ ﴿٢٩﴾ فَأَقْبَلَ بَعْضُهُمْ عَلٰى بَعْضٍ
يَتَلٰوَمُونَ ﴿٣٠﴾ قَالُوا يٰوَيْلَنَآ إِنَّا كُنَّا
طٰغِينَ ﴿٣١﴾ عَسٰى رَبُّنَآ أَن يُبْدِلَنَا خَيْرًا مِّنْهَآ
إِنَّآ إِلٰى رَبِّنَا رٰغِبُونَ ﴿٣٢﴾ كَذٰلِكَ الْعَذَابُ ۖ
وَ لَعَذَابُ الْاٰخِرَةِ أَكْبَرُ ۘ لَوْ كَانُوا يَعْلَمُونَ ﴿٣٣﴾ ع وقف لازم

**17 - 33** మేము ఒక తోట యజమానులను పరీక్షకు గురిచేసిన విధంగానే వారిని (మక్కావాసులను) కూడ పరీక్షకు గురిచేశాము. ఆ తోట యజమానులు, "రేపు ఉదయం పెందలకడనే మేము వెళ్లి మా తోటలోని పండ్లు తప్పకుండా కోస్తాము" అని ప్రమాణం చేసి మరీ అన్నారు. వారు ఎలాంటి మినహాయింపులకూ (భయసందేహాలకూ) తావీయలేదు.[8] ఆ (రోజు) రాత్రి, వారు ఆదమరచి నిద్రపోతూ ఉండగా, నీ ప్రభువు నుండి ఒక ఆపదవచ్చి ఆ తోటపై విరుచుకుపడింది. అప్పుడు దాని స్థితి పంట కోసివేసిన తోటమాదిరిగా అయిపోయింది. మరునాడు ఉదయం వారు లేచి, "పండ్లు కోయదలచుకుంటే, ఉదయాన్నే మనం పొలానికి వెళదాము, బయలుదేరండి" అని ఒకరినొకరు పిలుచుకున్నారు. ఆ తరువాత వారు బయలుదేరారు; దారిలో నడుస్తూ, "ఈ రోజు బీదవాళ్లెవ్వరూ తోటలో మీ వద్దకు రాకూడదు సుమా" అని మెల్లగా వారు పరస్పరం చెప్పుకున్నారు. దానం ఏమీ చెయ్యకూడదని నిర్ణయించుకుని, వారు తెల్లవారగానే తొందర తొందరగా అక్కడకు వెళ్లారు, తామెలాగైనా పండ్లు కోయగలమనే ధీమాతో. కాని తోటను చూచి వారు, "ఇదేమిటి, మనం దారి తప్పి వచ్చామా – కాదు, కాదు మనం సర్వమూ కోల్పోయాము" అని అనసాగారు. వారందరిలో కాస్తంత మంచివాడు "మీరు దేవుణ్ణి ఎందుకు స్తుతించరు[9] అని నేను మిమ్మల్ని అడగలేదా?" అని అన్నాడు. అప్పుడు వారు, "మా ప్రభువు పరిశుద్ధుడు. నిజంగానే మేము పాపాత్ములం" అని అన్నారు. తరువాత వారిలోని ప్రతి ఒక్కడూ తోటివాణ్ణి నిందించసాగాడు. చివరకు వారు పశ్చాత్తాపపడుతూ ఇలా అన్నారు, "మన పరిస్థితి చాల శోచనీయం. నిస్సందేహంగా మనం మితిమీరి ప్రవర్తించాము. మన ప్రభువు మనకు దీనికి బదులుగా దీనికంటె మెరుగైన తోటను ప్రసాదించటం అసంభవమేమీ కాదు. మనం మన ప్రభువు వైపునకు మరలుదాము." ఇలా ఉంటుంది శిక్ష. పరలోక శిక్ష దీనికంటె కూడ ఘోరంగా ఉంటుంది. అయ్యో! వారు ఈ విషయాన్ని తెలుసుకుంటే ఎంత బాగుంటుంది.

ఉన్నతమైన మీ శీల సంపద కూడ ఒక ప్రత్యక్ష నిదర్శనం. ఎందుకంటే, ఉన్నతమైన శీలసంపద, ఉన్మాదం ఒకేచోట ఉండవు.

إِنَّ لِلْمُتَّقِينَ عِندَ رَبِّهِمْ جَنَّٰتِ ٱلنَّعِيمِ ﴿٣٤﴾
أَفَنَجْعَلُ ٱلْمُسْلِمِينَ كَٱلْمُجْرِمِينَ ﴿٣٥﴾ مَا لَكُمْ
كَيْفَ تَحْكُمُونَ ﴿٣٦﴾ أَمْ لَكُمْ كِتَٰبٌ فِيهِ
تَدْرُسُونَ ﴿٣٧﴾ إِنَّ لَكُمْ فِيهِ لَمَا تَخَيَّرُونَ ﴿٣٨﴾
أَمْ لَكُمْ أَيْمَٰنٌ عَلَيْنَا بَٰلِغَةٌ إِلَىٰ يَوْمِ ٱلْقِيَٰمَةِ
إِنَّ لَكُمْ لَمَا تَحْكُمُونَ ﴿٣٩﴾ سَلْهُمْ أَيُّهُم بِذَٰلِكَ
زَعِيمٌ ﴿٤٠﴾ أَمْ لَهُمْ شُرَكَآءُ فَلْيَأْتُوا۟
بِشُرَكَآئِهِمْ إِن كَانُوا۟ صَٰدِقِينَ ﴿٤١﴾

**34 - 41** నిశ్చయంగా[10] దైవభక్తి పరాయణుల కొరకు వారి ప్రభువు వద్ద భోగభాగ్యాలతో నిండిన స్వర్గవనాలు ఉన్నాయి. మేము విధేయుల స్థితిని అపరాధుల స్థితి మాదిరిగా చేస్తామా? ఏమయింది మీకు, ఇలాంటి నిర్ణయాలు చేస్తారు? అక్కడ మీకు తప్పకుండా మీరు మీ కోసం కోరుకునేదే లభిస్తుందని వ్రాసిపెట్టి ఉన్న గ్రంథం[11] ఏదైనా ఉందా మీరు చదవటానికి? మీరు నిర్ణయించుకున్నదే మీకు లభిస్తుందనటానికి ఆధారంగా ప్రళయదినం వరకూ మీరు మాతో చేసుకున్న ఒడంబడిక ఏదైనా ఉందా? మీలో ఎవరు దీనికి హామీగా ఉంటారు? అని వారిని అడగండి. లేక వారు నిలబెట్టిన భాగస్వాములెవ రైనా ఉన్నారా (దీనికి బాధ్యత వహించటానికి)? అలాగైతే తాము నిలబెట్టిన భాగస్వాములను తీసుకురావాలి, వారు గనక సత్యవంతులే అయితే.

5. అంటే, నీవు ఇస్లామ్ ధర్మ ప్రచారంలో కొంత సడలింపు చూపితే, వారు కూడ నిన్ను వ్యతిరేకించటంలో కొంత ఔదార్యం కనబరుస్తారు. లేదా వారి అపమార్గాల పట్ల కొంత ఔదార్యం చూపి, నీ ధర్మంలో కొన్ని సవరణలు చేయటానికి నీవు ఒప్పుకుంటే, అప్పుడు వారు నీతో రాజీపడటానికి సుముఖులవుతారు.
6. ఈ వాక్యానికి పై గ్రంథ క్రమంతోనూ, రాబోయే వాక్యంతోనూ సంబంధం ఉన్నది. మొదటి సందర్భంలో అర్థం ఏమిటంటే, కేవలం సంపదబలం, సంతానబలం ఉన్నంత మాత్రాన, మీరు ఒక వ్యక్తికి భయపడనక్కరలేదు. రెండో సందర్భంలో అర్థం ఇది : ఎక్కువ సంపద, సంతానం కలవాడు అవటం చేత, అతడు గర్విష్ఠి అయినాడు. మా ఆయతులు వాడికి వినిపించినప్పుడు, ఇవి పూర్వకాలపు కట్టుకథలే అని అంటాడు.
7. అతడు తనను తాను గొప్ప పరువు ప్రతిష్ఠలు కలవాడిగా భావించాడు. ఇందువల్ల అతని ముక్కును మూతి అని అనటం జరిగింది. మూతిపై వాత పెట్టుట అంటే అవమానపరచటం అని అర్థం. అంటే మేము ఇహపరాలు రెండింటి లోనూ అతడిని ఎంతగా అవమానపరుస్తామంటే, ఈ అవమానం అతణ్ణి ఎల్లప్పుడూ వెంటాడుతూనే ఉంటుంది.
8. అంటే, వారికి తమ శక్తిసామర్థ్యాలపైనా, అధికారం పట్లా దృఢమైన నమ్మకంతో మరునాటి ఉదయానికే తమ తోటలోని పండ్లను కోసుకొస్తామని ప్రమాణం చేసి నిస్సంకోచంగా చెప్పారు; అల్లాహ్ సంకల్పిస్తే మేము ఈ పని చేస్తాము అని అనే అవసరాన్ని గుర్తించలేదు.
9. అంటే, అల్లాహ్‌ను మీరెందుకు జ్ఞాపకం ఉంచుకోరు? పరిశుద్ధుడైన ప్రభువొకడు పైన ఉన్నాడనే విషయాన్ని ఎందుకు మరచిపోయారు?
10. మక్కాలోని పెద్ద పెద్ద సర్దారులు ముస్లిమ్‌లతో ఇలా అనేవారు, "మాకు ఈ ప్రపంచంలో లభించే ఈ వరాలు, మేము దేవునికి ప్రీతిపాత్రులమని చెప్పటానికి నిదర్శనాలు. మీరు దేవుని ఆగ్రహానికి గురిఅయ్యారని చెప్పటానికి మీ దుర్భర జీవితాలే సాక్ష్యాలు. కాబట్టి నీవు చెప్పినట్లు పరలోకమనేదే ఉంటే, మేము అక్కడ కూడ సుఖాలను పొందగలం. శిక్ష పడేది మీకేగాని మాకు కాదు." ఈ ఆయతులో దీనికి సమాధానం ఇవ్వబడింది.
11. అంటే, అల్లాహ్ పంపిన గ్రంథం.

يَوۡمَ يُكۡشَفُ عَنۡ سَاقٍ وَّ يُدۡعَوۡنَ اِلَى
السُّجُوۡدِ فَلَا يَسۡتَطِيۡعُوۡنَ ﴿٤٢﴾ خَاشِعَةً اَبۡصَارُهُمۡ
تَرۡهَقُهُمۡ ذِلَّةٌ ؕ وَ قَدۡ كَانُوۡا يُدۡعَوۡنَ اِلَى
السُّجُوۡدِ وَهُمۡ سٰلِمُوۡنَ ﴿٤٣﴾ فَذَرۡنِىۡ وَ مَنۡ
يُّكَذِّبُ بِهٰذَا الۡحَدِيۡثِ ؕ سَنَسۡتَدۡرِجُهُمۡ مِّنۡ
حَيۡثُ لَا يَعۡلَمُوۡنَ ﴿٤٤﴾ وَ اُمۡلِىۡ لَهُمۡ ؕ اِنَّ
كَيۡدِىۡ مَتِيۡنٌ ﴿٤٥﴾ اَمۡ تَسۡـَٔلُهُمۡ اَجۡرًا فَهُمۡ مِّنۡ
مَّغۡرَمٍ مُّثۡقَلُوۡنَ ﴿٤٦﴾ اَمۡ عِنۡدَهُمُ الۡغَيۡبُ فَهُمۡ
يَكۡتُبُوۡنَ ﴿٤٧﴾ فَاصۡبِرۡ لِحُكۡمِ رَبِّكَ وَ لَا تَكُنۡ
كَصَاحِبِ الۡحُوۡتِ ۘ اِذۡ نَادٰى وَ هُوَ مَكۡظُوۡمٌ ﴿٤٨﴾ وقف لازم
لَوۡ لَاۤ اَنۡ تَدٰرَكَهٗ نِعۡمَةٌ مِّنۡ رَّبِّهٖ لَنُبِذَ
بِالۡعَرَآءِ وَ هُوَ مَذۡمُوۡمٌ ﴿٤٩﴾ فَاجۡتَبٰهُ رَبُّهٗ
فَجَعَلَهٗ مِنَ الصّٰلِحِيۡنَ ﴿٥٠﴾ وَ اِنۡ يَّكَادُ الَّذِيۡنَ
كَفَرُوۡا لَيُزۡلِقُوۡنَكَ بِاَبۡصَارِهِمۡ لَمَّا سَمِعُوا وقف لازم
الذِّكۡرَ وَ يَقُوۡلُوۡنَ اِنَّهٗ لَمَجۡنُوۡنٌ ﴿٥١﴾ وَ مَا هُوَ
اِلَّا ذِكۡرٌ لِّلۡعٰلَمِيۡنَ ﴿٥٢﴾ ع

**42 - 43** కష్టకాలం దాపురించే రోజున సజ్దా చేయటానికి ప్రజలు పిలువబడతారు. అప్పుడు వారు సజ్దా చేయలేరు, వారి చూపులు క్రిందికి వాలి పోయి ఉంటాయి, అవమానం వారిని ఆవరించి ఉంటుంది. వారు నిక్షేపంగా ఉన్న కాలంలో వారిని సజ్దా చేయండి అని పిలవటం జరిగేది (కాని వారు తిరస్కరించేవారు).

**44 - 45** కనుక ఓ ప్రవక్తా! నీవు ఈ గ్రంథాన్ని తిరస్కరించే వారి వ్యవహారాన్ని నాకు వదిలెయ్యి. వారికి ఏమాత్రం తెలియని విధంగా మేము వారిని క్రమేణా వినాశం వైపునకు తీసుకుపోతాము. నేను వారికి కొంత వ్యవధినిస్తున్నాను. నా పన్నాగం ఎంతో పటిష్ఠమైనది.

**46 - 50** నీవు వారి నుండి ఏదైనా ప్రతిఫలం అడుగుతున్నావా, వారు దాని భారం క్రింద నలిగిపోతూ ఉండటానికి? వారి వద్ద ఏదైనా అతీంద్రియ జ్ఞానం ఉందా, వారు దాన్ని వ్రాస్తూ ఉండటానికి? సరే నీ ప్రభువు ఆజ్ఞ వెలువడే వరకు, సహనం వహిస్తూ ఉండు, చేపవాని (యూనుస్ - అస్సలామ్) మాదిరిగా వ్యవహరించకు.[12] అతను మొరపెట్టుకున్నప్పుడు దుఃఖంలో మునిగిఉన్నాడు. ఒకవేళ అతని ప్రభువు అనుగ్రహమే అతనికి తోడ్పడకపోయి ఉంటే, అతను అవమానకరమైన స్థితిలో నిస్సారమైన మైదానంలోకి విసరివేయబడి ఉండేవాడే. చివరకు అతని ప్రభువు అతనిని ఎన్నుకొని సజ్జనులైన దాసుల్లో చేర్చాడు.

**51 - 52** ఈ అవిశ్వాసులు ప్రబోధవాణి (ఖురాన్)ని విన్నపుడు, వారు నీ కాళ్లు ఊడగొడతారా అన్నట్లు నిన్ను కొరాకొరా చూస్తారు. ఇతను తప్పకుండా పిచ్చివాడే అని అంటారు. వాస్తవానికి ఇది సకల లోకాల వారి కొరకు అవతరించిన హితోపదేశం.

12. అంటే, ప్రవక్త యూనుస్ (అస్సలామ్) మాదిరిగా అసహనంతో ఉండవద్దు. అసహనం వల్లనే ఆయన చేప కడుపులోకి విసరివేయబడ్డాడు.

آياتها ٥٢ | ٦٩ سُوۡرَةُ الۡحَآقَّةِ مَكِّيَّةٌ ٧٨ | ركوعاتها ٢

ఆయతులు 52 | 69. అల్ హాఖ్ఖహ్ | అవతరణ మక్కాలో

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ۝

اَلۡحَآقَّةُ ۝١ مَا الۡحَآقَّةُ ۝٢ وَ مَاۤ اَدۡرٰىكَ مَا
الۡحَآقَّةُ ۝٣ كَذَّبَتۡ ثَمُوۡدُ وَ عَادٌۢ بِالۡقَارِعَةِ ۝٤
فَاَمَّا ثَمُوۡدُ فَاُهۡلِكُوۡا بِالطَّاغِيَةِ ۝٥ وَ اَمَّا عَادٌ
فَاُهۡلِكُوۡا بِرِيۡحٍ صَرۡصَرٍ عَاتِيَةٍ ۝٦ سَخَّرَهَا
عَلَيۡهِمۡ سَبۡعَ لَيَالٍ وَّ ثَمٰنِيَةَ اَيَّامٍ ۙ حُسُوۡمًا ۙ
فَتَرَى الۡقَوۡمَ فِيۡهَا صَرۡعٰى ۙ كَاَنَّهُمۡ اَعۡجَازُ
نَخۡلٍ خَاوِيَةٍ ۝٧ فَهَلۡ تَرٰى لَهُمۡ مِّنۡۢ بَاقِيَةٍ ۝٨
وَ جَآءَ فِرۡعَوۡنُ وَ مَنۡ قَبۡلَهٗ وَالۡمُؤۡتَفِكٰتُ
بِالۡخَاطِئَةِ ۝٩ فَعَصَوۡا رَسُوۡلَ رَبِّهِمۡ فَاَخَذَهُمۡ
اَخۡذَةً رَّابِيَةً ۝١٠ اِنَّا لَمَّا طَغَا الۡمَآءُ حَمَلۡنٰكُمۡ
فِى الۡجَارِيَةِ ۝١١ لِنَجۡعَلَهَا لَكُمۡ تَذۡكِرَةً وَّتَعِيَهَاۤ
اُذُنٌ وَّاعِيَةٌ ۝١٢

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 8** అనివార్యమైన సంఘటన![1] ఏమిటి ఆ అనివార్యమైన సంఘటన? ఆ అనివార్యమైన సంఘటన ఏమిటో నీకేమి తెలుసు? సమూద్, ఆద్ జాతుల వారు అకస్మాత్తుగా విరుచుకు పడే ఆ విపత్తును[2] నమ్మటానికి నిరాకరించారు. అందువల్ల సమూద్ జాతి వారు భయంకరమైన ఒక ఉపద్రవం ద్వారా నాశనం చేయబడ్డారు. ఆద్ జాతివారు ఒక పెద్ద గాలివాన ద్వారా నాశనం చేయబడ్డారు. అల్లాహ్ వరుసగా ఏడు రాత్రులు, ఎనిమిది పగళ్లు వారిని దానికి గురిచేశాడు. (నీవు అక్కడ ఉండివుంటే) వారు అక్కడ బోసి పోయిన ఖర్జూరపు చెట్ల బోదెలు మాదిరిగా చెల్లాచెదరుగా పడి ఉండటాన్ని నీవు చూస్తావు. ఇప్పుడు వారిలో మిగిలి ఉన్న వాడెవడైనా నీకు కనిపిస్తున్నాడా?

**9 - 10** ఇలాంటి మహాపరాధానికే ఫిరౌన్, అతనికి పూర్వం గతించిన ప్రజలు, తలక్రిందులైన పురముల లోనివారు[3] కూడ పాల్పడ్డారు. వారందరూ తమ ప్రభువు పంపిన ప్రవక్త చేసిన హితబోధను అంగీకరించలేదు. అప్పుడు ఆయన వారిని అతి కఠినంగా పట్టుకున్నాడు.

**11 - 12** గాలివాన ఉధృతమయినప్పుడు,[4] మేము మిమ్మల్ని నావలోకి ఎక్కించాము.[5] ఈ విధంగా మేము ఈ సంఘటనను మీకు గుణపాఠం నేర్పే జ్ఞాపికగా ఉండేలా చేశాము. జ్ఞాపకం ఉంచుకునే చెవులు దానిని చిరకాలం జ్ఞాపకం ఉంచుకునేలా కూడ చేశాము.

1. అసలు 'అల్ హాఖ్ఖా' అనే పదం ఉపయోగించబడింది. అంటే తప్పనిసరిగా జరిగి తీరవలసిన సంఘటన. అర్థం ఏమిటంటే, మీరు ఎంతగాకోరితే, అంతగా దానిని తిరస్కరించండి. అది మాత్రం జరిగే తీరుతుంది. మీ తిరస్కారం వలన దాని ఆగమనం ఆగిపోదు.
2. ప్రళయాన్ని అనివార్యమైన సంఘటనగా వర్ణించిన తరువాత, ఇక దాని భయానకతను తెలియజేయడం కోసం విపత్తు అనే ఈ పదం వాడబడింది.
3. అంటే, లూత్ జాతి ప్రజల పట్టణాలు అని అర్థం. అవి తలక్రిందులైపోయాయి.

فَاِذَا نُفِخَ فِی الصُّوۡرِ نَفۡخَةٌ وَّاحِدَةٌ ۝١٣ وَّ
حُمِلَتِ الۡاَرۡضُ وَ الۡجِبَالُ فَدُكَّتَا دَكَّةً
وَّاحِدَةً ۝١٤ فَيَوۡمَئِذٍ وَّقَعَتِ الۡوَاقِعَةُ ۝١٥
وَانۡشَقَّتِ السَّمَآءُ فَهِیَ يَوۡمَئِذٍ وَّاهِيَةٌ ۝١٦
وَّالۡمَلَكُ عَلٰٓی اَرۡجَآئِهَا ؕ وَ يَحۡمِلُ عَرۡشَ
رَبِّكَ فَوۡقَهُمۡ يَوۡمَئِذٍ ثَمٰنِيَةٌ ۝١٧ يَوۡمَئِذٍ
تُعۡرَضُوۡنَ لَا تَخۡفٰی مِنۡكُمۡ خَافِيَةٌ ۝١٨ فَاَمَّا مَنۡ
اُوۡتِیَ كِتٰبَهٗ بِيَمِيۡنِهٖ ۙ فَيَقُوۡلُ هَآؤُمُ اقۡرَءُوۡا
كِتٰبِيَهۡ ۝١٩ اِنِّیۡ ظَنَنۡتُ اَنِّیۡ مُلٰقٍ حِسَابِيَهۡ ۝٢٠
فَهُوَ فِیۡ عِيۡشَةٍ رَّاضِيَةٍ ۝٢١ فِیۡ جَنَّةٍ عَالِيَةٍ ۝٢٢
قُطُوۡفُهَا دَانِيَةٌ ۝٢٣ كُلُوۡا وَاشۡرَبُوۡا هَنِيۡٓئًا بِمَآ
اَسۡلَفۡتُمۡ فِی الۡاَيَّامِ الۡخَالِيَةِ ۝٢٤

**13 - 18** తరువాత ఒకసారి శంఖం ఊదబడుతుంది. భూమినీ, పర్వతాలనూ లేపి ఒకే ఒక దెబ్బతో తుత్తునియలుగా చేయటం జరుగుతుంది. ఆ రోజున జరగవలసిన సంఘటన జరుగుతుంది. ఆ రోజున ఆకాశం బ్రద్దలవుతుంది, దాని వ్యవస్థ సడలిపోతుంది. దైవదూతలు దాని చుట్టు ప్రక్కల చేరి ఉంటారు. ఎనిమిది మంది దైవదూతలు ఆ రోజున నీ ప్రభువు సింహాసనాన్ని తమపై ఎత్తుకుని మోస్తూ ఉంటారు.[6] అదే మీరు హాజరు పరచబడే రోజు. ఆ రోజున మీ రహస్యాలేవీ దాగి ఉండవు.

**19 - 24** అప్పుడు తన కర్మలపత్రం తన కుడి చేతికివ్వబడిన వ్యక్తి, "చూడండి, నా కర్మల పత్రాన్ని తీసుకుని చదవండి. నా లెక్క నాకు తప్ప కుండా లభిస్తుందని నేను అనుకుంటూ ఉండేవాణ్ణి"[7] అని అంటాడు. కనుక అతను తనకిష్టమైన భోగభాగ్యాలలో ఓలలాడుతాడు, అత్యున్నత స్వర్గవనాలలో ఉంటాడు, వాటి పండ్ల గుత్తులు వ్రేలాడుతూ ఉంటాయి. అలాంటి వారితో ఇలా అనబడుతుంది, "హాయిగా తినండి, త్రాగండి, గత దినాలలో మీరు చేసుకున్న కర్మలకు ప్రతిఫలంగా."

4. ఇది నూహ్‌జాతిని నాశనం చేసిన తుఫానును సూచిస్తుంది.
5. నావలోకి ఎక్కించబడిన ప్రజలు వేలాది సంవత్సరాల కిందట గతించినవారే. కాని తరువాత వచ్చిన మానవులందరూ ఆ సమయంలో తుఫాను నుండి రక్షింపబడినవారి సంతానమే. కనుక "మేము మిమ్మల్ని నావలోకి ఎక్కించాము" అని సెలవీయబడింది.
6. ఈ ఆయతు అర్థనిశ్చయానికి లొంగని ఆయతుల (ముతషాబిహాత్) లోనిది. దానికి అర్థ నిర్ణయం చేయటం కష్టంతో కూడుకున్న పని. సింహాసనం (అర్ష్) అంటే ఏమిటో మనం తెలుసుకోలేము. ప్రళయం నాడు ఎనిమిది మంది దైవదూతలు దానిని మోసే స్థితి ఎటువంటిదో కూడ అర్థం చేసుకోలేము. ఏది ఏమైనా అల్లాహ్ సింహాసనంపై కూర్చోవటం, ఆ సింహాసనాన్ని ఎనిమిది మంది దైవదూతలు మోయటం అనే విషయం ఊహకు అందనిది. అల్లాహ్ అప్పుడు సింహాసనం మీద కూర్చుని ఉంటాడు అని అయినా ఈ ఆయతు నిర్ధారించటం లేదు. అల్లాహ్‌ను గురించి దివ్య ఖురాను ఇచ్చే భావన కూడ, ఆయనకు ఒక రూపం ఉన్నదని గానీ, ఆయన ఒక దిక్కున ఉంటాడని గానీ, ఆయన ఒక ప్రదేశంలో నివసిస్తాడనిగానీ, సృష్టి ఆయనను మోస్తున్నదని గానీ ఊహించటానికి అవకాశం ఇవ్వదు. ఇందుచేత పరిశోధించి దాని అర్థాన్ని నిర్ణయించటానికి ప్రయత్నించటం, తమను తాము అపమార్గం వైపునకు పోయే ప్రమాదానికి గురిచేసుకోవటమే.
7. అంటే, తాను ప్రపంచంలో ఉన్నప్పుడు పరలోకాన్ని అశ్రద్ధ చేయలేదనీ, ఒక రోజున తాను దేవుని ముందు హాజరవవలసి ఉన్నదనీ, తన లెక్క ఇవ్వవలసి ఉన్నదనీ భావిస్తూ తాను జీవితం గడిపేవాణ్ణనీ, ఈ విషయాలే తన అదృష్టానికి కారణాలనీ అతను తెలియజేస్తాడు.

وَ اَمَّا مَنْ اُوْتِیَ كِتٰبَهٗ بِشِمَالِهٖ ۙ فَیَقُوْلُ
یٰلَیْتَنِیْ لَمْ اُوْتَ كِتٰبِیَهْ ۚ﴿٢٥﴾ وَلَمْ اَدْرِ مَا
حِسَابِیَهْ ۚ﴿٢٦﴾ یٰلَیْتَهَا كَانَتِ الْقَاضِیَةَ ۚ﴿٢٧﴾ مَاۤ
اَغْنٰی عَنِّیْ مَالِیَهْ ۚ﴿٢٨﴾ هَلَكَ عَنِّیْ سُلْطٰنِیَهْ ۚ﴿٢٩﴾
خُذُوْهُ فَغُلُّوْهُ ۙ﴿٣٠﴾ ثُمَّ الْجَحِیْمَ صَلُّوْهُ ۙ﴿٣١﴾ ثُمَّ فِیْ
سِلْسِلَةٍ ذَرْعُهَا سَبْعُوْنَ ذِرَاعًا فَاسْلُكُوْهُ ؕ﴿٣٢﴾
اِنَّهٗ كَانَ لَا یُؤْمِنُ بِاللّٰهِ الْعَظِیْمِ ۙ﴿٣٣﴾ وَ لَا
یَحُضُّ عَلٰی طَعَامِ الْمِسْكِیْنِ ؕ﴿٣٤﴾ فَلَیْسَ لَهُ الْیَوْمَ
هٰهُنَا حَمِیْمٌ ۙ﴿٣٥﴾ وَّ لَا طَعَامٌ اِلَّا مِنْ غِسْلِیْنٍ ۙ﴿٣٦﴾
لَّا یَاْكُلُهٗۤ اِلَّا الْخَاطِـُٔوْنَ ۠﴿٣٧﴾ فَلَاۤ اُقْسِمُ بِمَا
تُبْصِرُوْنَ ۙ﴿٣٨﴾ وَ مَا لَا تُبْصِرُوْنَ ۙ﴿٣٩﴾ اِنَّهٗ لَقَوْلُ
رَسُوْلٍ كَرِیْمٍ ۚۙ﴿٤٠﴾ وَّ مَا هُوَ بِقَوْلِ شَاعِرٍ ؕ
قَلِیْلًا مَّا تُؤْمِنُوْنَ ۙ﴿٤١﴾ وَ لَا بِقَوْلِ كَاهِنٍ ؕ
قَلِیْلًا مَّا تَذَكَّرُوْنَ ؕ﴿٤٢﴾ تَنْزِیْلٌ مِّنْ رَّبِّ
الْعٰلَمِیْنَ ﴿٤٣﴾

**25 - 37** తన కర్మల పత్రం తన ఎడమ చేతికి ఇవ్వబడిన వ్యక్తి ఇలా వాపోతాడు, "అయ్యో! నా కర్మల పత్రం నాకు అసలు ఇవ్వకుండా ఉంటే, నా లెక్క ఏమిటో నాకు అసలు తెలియకుండా ఉంటే ఎంత బాగుండేది![8] అయ్యో! నాకు (ప్రపంచంలో వచ్చిన) ఆ మరణమే ఏకంగా అంతిమ మరణమై ఉంటే ఎంత బాగుండేది! ఈనాడు నా ఆస్తి నాకు ఏమాత్రం పనికి రాలేదే. నా అధికారమంతా అంతరించి పోయిందే."[9] (అప్పుడు ఇలా ఆజ్ఞాపించబడుతుంది) అతనిని పట్టుకోండి, అతని మెడకు కంఠపాశం తగిలించండి. ఆపై అతనిని నరకంలోకి విసిరివేయండి. తరువాత అతనిని డెబ్బై గజాల పొడుగు గొలుసుతో బంధించండి. మహనీయుడూ, మహోన్నతుడూ అయిన అల్లాహ్‌ను ఇతను విశ్వసించేవాడు కాదు, నిరుపేదలకు అన్నం పెట్టండి అని ప్రోత్సహించేవాడూ[10] కాదు. కనుక ఈనాడు ఇక్కడ ఇతని దుఃఖంలో పాలుపంచు కునే స్నేహితుడెవడూ ఉండడు; గాయాల కడుగు తప్ప అతనికి తినటానికి ఆహారం కూడ ఏదీ ఉండదు. దానిని పాపాత్ములు తప్ప మరెవరూ తినరు.

**38 - 52** కాదు, అది కాదు.[11] మీరు చూస్తూ ఉన్న వస్తువుల మీద, మీరు చూడలేని వస్తువుల మీద ప్రమాణం చేసి చెబు తున్నాను; ఇది గౌరవనీయు డైన ఒక సందేశహరుని వాక్కు, ఏ కవికి చెందిన వాక్కూ కాదు. కాని మీరు విశ్వసించటం అనేది చాల తక్కువ. ఇంకా ఇది ఏ జ్యోతిష్యుని వాక్కు కూడా కాదు. కాని, మీరు ఆలోచించటం అనేది చాల తక్కువ. ఇదసలు సర్వలోకాల ప్రభువు తరఫు నుండి అవతరించింది.

8. ఈ ఆయతు రెండో అర్థం ఇది కూడ కావచ్చు : లెక్క ఇవ్వడం అనే విషయం నాకు తెలియనే తెలియదు. ఒకరోజున నేను నా లెక్కను ఇవ్వవలసి వస్తుందనీ, నేను చేసినదంతా నా ముందు పెట్టబడుతుందనీ నేను ఎంతమాత్రం ఊహించలేదు.
9. అంటే, నేను ప్రపంచంలో ఏ అధికారాన్ని చూసి విర్రవీగేవాణ్ణో, అది కాస్తా ఇక్కడ మటుమాయమైపోయింది. ఇప్పుడు ఇక్కడ నాకు సైన్యమూ లేదు, నా ఆజ్ఞను పాలించేవాడెవడూ లేడు. నేను నిస్సహాయుడనూ, దీనుడనూ అయిన, తన రక్షణకే ఏమీ చేసుకోలేని ఒక దాసుని స్థితిలో నిలబడి ఉన్నాను.
10. అంటే, స్వయంగా ఒక నిరుపేదకు అన్నం పెట్టటం అనేది సుదూర విషయం, ఆకలిగొన్న దైవదాసులకు అన్నం పెట్టండి అని చెప్పటానికైనా ఇష్టపడడు.
11. అంటే, మీరు అనుకున్న రీతిగా ఆ విషయం లేదు.

وَلَوۡ تَقَوَّلَ عَلَيۡنَا بَعۡضَ الۡاَقَاوِيۡلِ ۝٤٤
لَاَخَذۡنَا مِنۡهُ بِالۡيَمِيۡنِ ۝٤٥ ثُمَّ لَقَطَعۡنَا مِنۡهُ
الۡوَتِيۡنَ ۝٤٦ فَمَا مِنۡكُمۡ مِّنۡ اَحَدٍ عَنۡهُ
حٰجِزِيۡنَ ۝٤٧ وَ اِنَّهٗ لَتَذۡكِرَةٌ لِّلۡمُتَّقِيۡنَ ۝٤٨
وَاِنَّا لَنَعۡلَمُ اَنَّ مِنۡكُمۡ مُّكَذِّبِيۡنَ ۝٤٩ وَ اِنَّهٗ
لَحَسۡرَةٌ عَلَى الۡكٰفِرِيۡنَ ۝٥٠ وَ اِنَّهٗ لَحَقُّ
الۡيَقِيۡنِ ۝٥١ فَسَبِّحۡ بِاسۡمِ رَبِّكَ الۡعَظِيۡمِ ۝٥٢ ع ٢ ١٥

ఒకవేళ ఇతను (దైవప్రవక్త) స్వయంగా కల్పించి ఏదైనా విషయాన్ని మాకు ఆపాదించి ఉంటే, మేము ఇతని కుడి చెయ్యిని పట్టుకునేవారము, ఇతని మెడ నరాన్ని కోసివేసేవారము. అప్పుడు మీలో ఎవ్వరూ (మమ్మల్ని) ఈ పని చేయకుండా ఆపగలిగే వారు కారు.[12] అసలు ఇది దైవభీతి కలవారికి ఒక హితోపదేశం. మీలో కొందరు తిరస్కరించే వారున్నారని మాకు తెలుసు. ఇటువంటి తిరస్కారులకు నిస్సందేహంగా ఇది దుఃఖ కారణం అవుతుంది. ఇది పూర్తిగా నమ్మదగిన సత్యం. కనుక ఓ ప్రవక్తా! మహోన్నతుడైన నీ ప్రభువు నామాన్ని స్తుతించు.

12. అసలు విషయం ఏమిటంటే, తనపై అవతరించిన 'వహీ'లో తన తరఫు నుంచి హెచ్చుతగ్గులు చేసే అధికారం ప్రవక్తకు ఏమాత్రం లేదనీ, ఒకవేళ ఆయన అలా చేస్తే, మేము ఆయనను కఠినంగా శిక్షిస్తామనీ తెలియజేయటం. కాని ఈ విషయాన్ని చెప్పిన తీరు మన కళ్ల ముందు ఈ చిత్రాన్ని నిలిపినట్లు ఉన్నది: ఒక రాజు నియమించిన అధికారి ఆయన పేరుతో ఏదైనా ఫోర్జరీకి పాల్పడితే, ఆ రాజు అతని చేతిని పట్టుకుని అతని శిరస్సును ఖండిస్తాడు. కొందరు ఈ ఆయతు నుండి ఒక తప్పుడు వాదనను లేవదీశారు: నేను ప్రవక్తనని ఎవరైనా సవాలు చేస్తే, ఆ వ్యక్తి గుండె నరాన్ని లేదా అతని మెడనరాన్ని తక్షణం అల్లాహ్ కోయకపోయినట్లయితే, అతను ప్రవక్త అని చెప్పటానికి ఇది ప్రమాణం. వాస్తవానికి ఈ ఆయతులో చెప్పబడిన విషయం నిజమైన ప్రవక్తను గురించి గాని బూటకపు ప్రవక్తను గురించి కాదు. బూటకపు దావేదారులు మేము ప్రవక్తలమనే కాదు, దేవుళ్లమని కూడ సవాలు చేస్తారు.

## 70. అల్ మఆరిజ్

ఆయతులు 44 | అవతరణ మక్కాలో

*అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

**1 - 18** అడిగేవాడు శిక్షను గురించి అడిగాడు. అది (ఆ శిక్ష) తప్పకుండా సంభవిస్తుంది. అది అవిశ్వాసుల కొరకే. దానిని తప్పించేవారెవ్వరూ లేరు. అది ఆరోహణ సోపానాలకు స్వామి అయిన అల్లాహ్ తరఫు నుండి సంభవిస్తుంది. యాభై వేల సంవత్సరాల ప్రమాణం[1] గల ఒక రోజున దైవదూతలు, ఆత్మ,[2] ఆయన సాన్నిధ్యానికి అధిరోహిస్తారు.[3] కనుక ఓ ప్రవక్తా! సహనం వహించు, హుందాతనంతో కూడిన సహనం.[4] వారు అది దూరంగా ఉన్నదని అనుకుంటున్నారు. కాని మాకు అది దగ్గరలో కనిపిస్తున్నది. ఏ రోజున ఆకాశం కరిగిన వెండి[5] మాదిరిగా అయిపోతుందో, కొండలు ఏకిన రంగు రంగుల ఉన్ని పింజలు మాదిరిగా అయిపోతాయో, ప్రాణస్నేహితులు ఒకరి కొకరు కనిపించినప్పటికీ, ఎవరూ ఎవరిని గురించీ పట్టించుకోవటం జరగదో. (ఆ రోజున ఆ శిక్ష సంభవిస్తుంది) దోషి ఆనాటి శిక్ష నుండి తప్పించుకోవటానికి తన సంతానాన్నీ, తన భార్యనూ, తన సోదరులనూ, తనకు ఆశ్రయమిచ్చిన దగ్గరి బంధువులనూ భూమండలంలోని వారందరినీ పరిహారంగా ఇచ్చి, ఈ ఉపాయం ద్వారా విముక్తి పొందాలని కోరుకుంటాడు. ఎంతమాత్రం కాదు. (అలా ఎన్నటికీ జరగదు) అది భగ భగ మండే నరకాగ్ని జ్వాల. మాంసాన్ని, చర్మాన్ని సైతం అది తినేస్తుంది. సత్యం పట్ల విముఖుడై, వెన్ను చూపి, ధనాన్ని కూడబెట్టి దానిని మాటి మాటికి పేర్చి పెట్టిన ప్రతివాణ్ణీ అది బిగ్గరగా అరుస్తూ తన వైపునకు పిలుస్తుంది.

٧٠ سُوۡرَةُ الۡمَعَارِجِ مَكِّيَّةٌ ٧٩

اٰياتها ٤٤ | ركوعاتها ٢

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ

سَاَلَ سَآٮِٕلٌۢ بِعَذَابٍ وَّاقِعٍۙ ١ لِّلۡكٰفِرِيۡنَ
لَيۡسَ لَهٗ دَافِعٌۙ ٢ مِّنَ اللّٰهِ ذِى الۡمَعَارِجِؕ ٣
تَعۡرُجُ الۡمَلٰۤٮِٕكَةُ وَالرُّوۡحُ اِلَيۡهِ فِىۡ يَوۡمٍ كَانَ
مِقۡدَارُهٗ خَمۡسِيۡنَ اَلۡفَ سَنَةٍۚ ٤ فَاصۡبِرۡ
صَبۡرًا جَمِيۡلًا ٥ اِنَّهُمۡ يَرَوۡنَهٗ بَعِيۡدًاۙ ٦ وَّ
نَرٰٮهُ قَرِيۡبًاؕ ٧ يَوۡمَ تَكُوۡنُ السَّمَآءُ
كَالۡمُهۡلِۙ ٨ وَتَكُوۡنُ الۡجِبَالُ كَالۡعِهۡنِۙ ٩ وَلَا
يَسۡـَٔلُ حَمِيۡمٌ حَمِيۡمًا ۚ ۖ ١٠ يُّبَصَّرُوۡنَهُمۡ ؕ يَوَدُّ
الۡمُجۡرِمُ لَوۡ يَفۡتَدِىۡ مِنۡ عَذَابِ يَوۡمِٮِٕذٍۢ
بِبَنِيۡهِۙ ١١ وَصَاحِبَتِهٖ وَاَخِيۡهِۙ ١٢ وَفَصِيۡلَتِهِ الَّتِىۡ
تُـْٔوِيۡهِۙ ١٣ وَمَنۡ فِى الۡاَرۡضِ جَمِيۡعًا ۙ ثُمَّ
يُنۡجِيۡهِۙ ١٤ كَلَّا ؕ اِنَّهَا لَظٰىۙ ١٥ نَزَّاعَةً
لِّلشَّوٰىۚ ۖ ١٦ تَدۡعُوۡا مَنۡ اَدۡبَرَ وَتَوَلّٰىۙ ١٧ وَجَمَعَ
فَاَوۡعٰى ١٨

1. హజ్ సూరాలోని 47వ ఆయతులోనూ, సజ్‌దహ్ సూరాలోని 5వ ఆయతులోనూ వేయి సంవత్సరాలు అంటే ఒక రోజు అని పేర్కొనబడింది. ఇక్కడ 'శిక్షను తీసుకు రా' అనే కోరికకు సమాధానంగా, అల్లాహ్‌కు ఒక రోజును 50 వేల సంవత్సరాలుగా చెప్పబడింది. అర్థం ఏమిటంటే, ప్రజలు తమ సంకుచితమైన దృష్టి, ఆలోచన, మనస్సుల కారణంగా దేవుని వ్యవహారాలను తమ కాలపు కొలమానాలలో కొలుస్తారు. అందుచేత వారికి 50 లేక 100 సంవత్సరాల కాలం సుదీర్ఘమైనదిగా కనిపిస్తుంది. కాని అల్లాహ్ వద్ద ఒక్కొక్క ప్రణాళికా పరిమితి వేయి సంవత్సరాలు, 50 వేల సంవత్సరాలుగా ఉంటుంది. ఈ కాల పరిమితి ఒక ఉదాహరణ మాత్రమే.
2. ఆత్మ అంటే, జిబ్రీల్ (అస్సలామ్) అని అర్థం. ఆయన తన ఔన్నత్యం చేత ఇతర దైవదూతల కంటే ప్రత్యేకంగా పేర్కొనబడ్డారు.

اِنَّ الۡاِنۡسَانَ خُلِقَ هَلُوۡعًا ﴿۱۹﴾ اِذَا مَسَّهُ الشَّرُّ
جَزُوۡعًا ﴿۲۰﴾ وَّاِذَا مَسَّهُ الۡخَيۡرُ مَنُوۡعًا ﴿۲۱﴾ اِلَّا
الۡمُصَلِّيۡنَ ﴿۲۲﴾ الَّذِيۡنَ هُمۡ عَلٰى صَلَاتِهِمۡ
دَآئِمُوۡنَ ﴿۲۳﴾ وَ الَّذِيۡنَ فِىۡۤ اَمۡوَالِهِمۡ حَقٌّ
مَّعۡلُوۡمٌ ﴿۲۴﴾ لِّلسَّآئِلِ وَ الۡمَحۡرُوۡمِ ﴿۲۵﴾ وَالَّذِيۡنَ
يُصَدِّقُوۡنَ بِيَوۡمِ الدِّيۡنِ ﴿۲۶﴾ وَ الَّذِيۡنَ هُمۡ
مِّنۡ عَذَابِ رَبِّهِمۡ مُّشۡفِقُوۡنَ ﴿۲۷﴾ اِنَّ عَذَابَ
رَبِّهِمۡ غَيۡرُ مَاۡمُوۡنٍ ﴿۲۸﴾ وَالَّذِيۡنَ هُمۡ لِفُرُوۡجِهِمۡ
حٰفِظُوۡنَ ﴿۲۹﴾ اِلَّا عَلٰٓى اَزۡوَاجِهِمۡ اَوۡ مَا مَلَـكَتۡ
اَيۡمَانُهُمۡ فَاِنَّهُمۡ غَيۡرُ مَلُوۡمِيۡنَ ﴿۳۰﴾ فَمَنِ ابۡتَغٰى
وَرَآءَ ذٰلِكَ فَاُولٰٓئِكَ هُمُ الۡعٰدُوۡنَ ﴿۳۱﴾ وَ
الَّذِيۡنَ هُمۡ لِاَمٰنٰتِهِمۡ وَعَهۡدِهِمۡ رٰعُوۡنَ ﴿۳۲﴾
وَالَّذِيۡنَ هُمۡ بِشَهٰدٰتِهِمۡ قَآئِمُوۡنَ ﴿۳۳﴾ وَالَّذِيۡنَ
هُمۡ عَلٰى صَلَاتِهِمۡ يُحَافِظُوۡنَ ﴿۳۴﴾ اُولٰٓئِكَ فِىۡ جَنّٰتٍ
مُّكۡرَمُوۡنَ ﴿۳۵﴾

**19 - 35** మానవుడు తొందరపడే[6] వాడుగా, సహనం లేని వాడుగా సృష్టించబడ్డాడు. అతనికి కష్టాలు వచ్చినప్పుడు ఆందోళన చెందుతాడు, సుఖాలు కలిగినప్పుడు పిసినారి తనంతో ప్రవర్తిస్తాడు. కాని (ఈ బలహీనతకు ఈ క్రిందివారే దూరంగా ఉంటారు). నమాజు చేసేవారు, తమ నమాజులను ఎల్లప్పుడూ నియమం తప్పకుండా పాటించేవారు, తమ సంపదలలో యాచకులకూ, దిక్కులేని వారికి ఒక నిర్ణీతమైన హక్కును ఇచ్చేవారు, తీర్పుదినం సత్యమని నమ్మేవారు, తమ ప్రభువు శిక్షకు భయపడేవారు; ఎందుకంటే వారి ప్రభువు విధించే శిక్ష ఎవరూ నిర్భయంగా ఉండేటటువంటి శిక్షకాదు, తమ మర్మాంగాలను కాపాడుకునేవారు - తమ భార్యలూ, చట్ట రీత్యా తమ అధీనంలో ఉండే స్త్రీలూ తప్ప, వీరి విషయంలో కాపాడుకోకుండా ఉండేవారు నిందార్హులు కారు; అయితే ఇదిగాక ఇంకా ఎక్కువ కావాలని కోరేవారు హద్దులను అతిక్రమించేవారు - తమ అమానతులను పరిరక్షించే వారు, తమ వాగ్దానాలను నిలబెట్టుకునేవారు, తమ సాక్ష్యాల విషయంలో నిజాయితీగా ఉండేవారు, తమ నమాజును కాపాడుకునేవారు- ఇలాంటి వారు సగౌరవంగా స్వర్గవనాలలో ఉంటారు.

3. ఈ విషయం ముతషాబిహాత్ ఆయత్తులలోనిది (సందిగ్ధ వాక్యాలు). దాని అర్థం రూఢీగా ఇది అని చెప్పటానికి వీలుపడదు. దైవదూతల స్థితిగతులు ఎట్టివో మనకు తెలియవు. వారు పైకి పోయే స్థితి ఎటువంటిదో కూడ మనకు అర్థం కాదు. ఈ దైవదూతలు ఎక్కి పైకి పోయే మెట్లు ఎటువంటివో అనే విషయం కూడ మన మేధకు అందదు. అల్లాహ్ ఒక ప్రత్యేకమైన తావులో ఉంటాడనే విషయం కూడ ఊహించటానికి వీలులేనిది. ఎందుకంటే, ఆయన దేశ కాల పరిమితులకు అతీతుడు.
4. అంటే, ఉన్నతమైన ఉదారబుద్ధిగల వ్యక్తి చూపే సహనం.
5. అంటే, మాటిమాటికీ తన వన్నెలను మార్చునది అని అర్థం.
6. ఏ విషయాన్నయితే మనం మన భాషలో, "ఈ విషయం మానవ స్వభావంలోనే ఉన్నది" లేదా "ఇది మానవుని సహజ దౌర్బల్యం" అని అంటామో, ఆ విషయాన్నే అల్లాహ్, "మానవుడు తొందరపాటుతనంతో పుట్టించబడ్డాడు" అని సెలవిస్తున్నాడు.

فَمَالِ الَّذِيْنَ كَفَرُوْا قِبَلَكَ مُهْطِعِيْنَ ﴿٣٦﴾ عَنِ
الْيَمِيْنِ وَ عَنِ الشِّمَالِ عِزِيْنَ ﴿٣٧﴾ اَيَطْمَعُ كُلُّ
امْرِئٍ مِّنْهُمْ اَنْ يُّدْخَلَ جَنَّةَ نَعِيْمٍ ﴿٣٨﴾ كَلَّا
اِنَّا خَلَقْنٰهُمْ مِّمَّا يَعْلَمُوْنَ ﴿٣٩﴾ فَلَآ اُقْسِمُ بِرَبِّ
الْمَشٰرِقِ وَ الْمَغٰرِبِ اِنَّا لَقٰدِرُوْنَ ﴿٤٠﴾ عَلٰٓى اَنْ
نُّبَدِّلَ خَيْرًا مِّنْهُمْ وَ مَا نَحْنُ بِمَسْبُوْقِيْنَ ﴿٤١﴾
فَذَرْهُمْ يَخُوْضُوْا وَيَلْعَبُوْا حَتّٰى يُلٰقُوْا يَوْمَهُمُ
الَّذِيْ يُوْعَدُوْنَ ﴿٤٢﴾ يَوْمَ يَخْرُجُوْنَ مِنَ
الْاَجْدَاثِ سِرَاعًا كَاَنَّهُمْ اِلٰى نُصُبٍ
يُّوْفِضُوْنَ ﴿٤٣﴾ خَاشِعَةً اَبْصَارُهُمْ تَرْهَقُهُمْ
ذِلَّةٌ ذٰلِكَ الْيَوْمُ الَّذِيْ كَانُوْا يُوْعَدُوْنَ ﴿٤٤﴾ ع ٢ ٨

**36 - 44** కనుక ఓ ప్రవక్తా! ఈ సత్య ధిక్కారులు కుడి ఎడమల నుండి గుంపులు గుంపులుగా నీ వైపునకు ఎందుకు పరుగెత్తుకొస్తున్నారు?[7] వారిలో ప్రతి ఒక్కడూ కానుకలతో నిండిన స్వర్గంలో తనను ప్రవేశపెట్టడం జరుగుతుందనే పేరాశ కలిగిఉన్నాడా? ఎంతమాత్రం కాదు. ఏ వస్తువుతో మేము వారిని పుట్టించామో, ఆ వస్తువేమిటో స్వయంగా వారు ఎరుగుదురు. కనుక అలా కాదు. నేను తూర్పుల, పడమరల[8] స్వామిపై ప్రమాణం చేసి చెబుతున్నాను, మేము వారి స్థానంలో వారికంటె మేలైన వారిని తీసుకురాగల శక్తి కలిగి ఉన్నాము, మమ్మల్ని మించి పోయేవారెవ్వరూ లేరు. కనుక వారిని వారి వ్యర్థ విషయాలలో, ఆటపాటలలో పడి ఉండనివ్వండి. వారికి వాగ్దానం చేయబడుతున్న దినానికి వారు చేరుకునే వరకు వారిని అలా పడి ఉండనివ్వండి. అప్పుడు వారు తమ సమాధుల నుండి బయటికి వచ్చి తమ దేవతల మందిరాల వైపునకు పరుగెత్తుతున్నట్లు పరుగెత్తుతూ ఉంటారు. వారి చూపులు క్రిందికి వ్రాలి ఉంటాయి; అవమానం వారిని కమ్ముకుంటూ ఉంటుంది. ఈ దినం గురించే వారికి వాగ్దానం చేయబడుతోంది.

7. మహాప్రవక్త (సఅసమ్) సందేశాన్నీ, ప్రచారాన్నీ, దివ్య ఖురాను పారాయణాన్నీ విని, ఎగతాళి చేయటానికి, పెద్దగా కేకలు వేయటానికి నలువైపుల నుండి ఒక్క ఉదుటున పరుగెత్తుకువచ్చే అవిశ్వాసుల ప్రస్తావన ఇది.
8. తూర్పులూ, పడమరలూ అనే ప్రయోగం ఎందుకు చేయబడిందంటే, ఒక సంవత్సర కాలంలో ప్రతి రోజూ సూర్యుడు ఒక కొత్త స్థానంలో ఉదయిస్తాడు, ఒక కొత్త స్థానంలో అస్తమిస్తాడు. ఇంకా భూగోళంలోని విభిన్న భాగాలలో సూర్యుడు వేర్వేరు సమయాలలో వరుసగా ఉదయిస్తూ అస్తమిస్తూ ఉంటాడు. ఈ కారణాల వలన తూర్పు పడమరలు ఒకటొకటి కాకుండా, అనేకం ఉన్నాయి.

ఆయతులు 28 | **71. నూహ్** | అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1** మేము ప్రవక్త నూహ్‌ను అతని జాతి వద్దకు పంపాము, అతని జాతి ప్రజలపైకి బాధాకరమైన శిక్ష రాకమునుపే వారిని హెచ్చరించమని (ఉపదేశిస్తూ).

**2 - 4** అతను ఇలా అన్నాడు, "నా జాతి ప్రజలారా! నేను మిమ్మల్ని స్పష్టంగా హెచ్చరించటానికి వచ్చిన (సందేశహరుణ్ణి) వాణ్ణి. కనుక (మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను) అల్లాహ్ దాస్యం చెయ్యండి, ఆయనకు భయపడండి. నాకు విధేయత చూపండి, అల్లాహ్ మీ పాపాలను క్షమిస్తాడు, మిమ్మల్ని ఒక నిర్ణీత కాలం వరకు బ్రతుకనిస్తాడు.[1] వాస్తవం ఏమిటంటే, అల్లాహ్ నిర్ణయించిన కాలం వచ్చినప్పుడు, దానిని తప్పించటం సాధ్యం[2] కాదు. అయ్యో! ఈ విషయం మీకు తెలిస్తే ఎంత బాగుండును."

**5 - 20** అతను ఇలా విన్నవించుకున్నాడు,[3] "ప్రభూ! నేను నా జాతి ప్రజలను రేయింబవళ్లూ పిలిచాను. కాని నా పిలుపు వారి పరుగునే పెంచింది. నేను వారిని నీ క్షమాభిక్ష వైపునకు పిలిచినప్పుడల్లా, వారు చెవులలో వ్రేళ్లు దూర్చుకునేవారు, తమ వస్త్రాలతో ముఖాలను కప్పుకునే[4] వారు; మొండి వైఖరి అవలంబించారు మరియు అహంభావం ప్రదర్శించారు. అయినా నేను వారిని ఎలుగెత్తి పిలిచి సందేశం అందజేశాను. ఇంకా నేను బహిరంగంగా కూడ వారిలో ప్రచారం చేశాను, రహస్యంగా కూడా వారికి నచ్చ జెప్పాను. నేను ఇలా అన్నాను, మీరు మీ ప్రభువును, క్షమించమని వేడుకోండి, నిస్సందేహంగా ఆయన గొప్ప క్షమావంతుడు. ఆయన మీపై ఆకాశం నుండి పుష్కలంగా వర్షం కురిపిస్తాడు, మీకు సిరిసంపదలనూ, సంతానాన్నీ ప్రసాదిస్తాడు, మీ కొరకు తోటలను సృష్టిస్తాడు మరియు మీ కొరకు కాలువలను ప్రవహింపజేస్తాడు. మీకేమయింది, అల్లాహ్‌కై మీరు ఎలాంటి గౌరవాన్నీ ఎందుకు ఆశించరు?[5]

۷۱ سُوْرَةُ نُوْحٍ مَّكِّيَّةٌ ۷۱

اٰیاتها ۲۸ | رکوعاتها ۲

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

اِنَّاۤ اَرْسَلْنَا نُوْحًا اِلٰى قَوْمِهٖۤ اَنْ اَنْذِرْ
قَوْمَكَ مِنْ قَبْلِ اَنْ يَّاْتِيَهُمْ عَذَابٌ اَلِيْمٌ ۱
قَالَ يٰقَوْمِ اِنِّىْ لَكُمْ نَذِيْرٌ مُّبِيْنٌ ۲ اَنِ
اعْبُدُوا اللّٰهَ وَاتَّقُوْهُ وَ اَطِيْعُوْنِ ۳ يَغْفِرْ لَكُمْ
مِّنْ ذُنُوْبِكُمْ وَ يُؤَخِّرْكُمْ اِلٰۤى اَجَلٍ مُّسَمًّى
اِنَّ اَجَلَ اللّٰهِ اِذَا جَآءَ لَا يُؤَخَّرُ لَوْ كُنْتُمْ
تَعْلَمُوْنَ ۴ قَالَ رَبِّ اِنِّىْ دَعَوْتُ قَوْمِىْ لَيْلًا
وَّ نَهَارًا ۵ فَلَمْ يَزِدْهُمْ دُعَآءِىْۤ اِلَّا
فِرَارًا ۶ وَ اِنِّىْ كُلَّمَا دَعَوْتُهُمْ لِتَغْفِرَ لَهُمْ
جَعَلُوْۤا اَصَابِعَهُمْ فِىْۤ اٰذَانِهِمْ وَ اسْتَغْشَوْا ثِيَابَهُمْ
وَ اَصَرُّوْا وَ اسْتَكْبَرُوا اسْتِكْبَارًا ۷ ثُمَّ اِنِّىْ
دَعَوْتُهُمْ جِهَارًا ۸ ثُمَّ اِنِّىْۤ اَعْلَنْتُ لَهُمْ وَ
اَسْرَرْتُ لَهُمْ اِسْرَارًا ۹ فَقُلْتُ اسْتَغْفِرُوْا
رَبَّكُمْ اِنَّهٗ كَانَ غَفَّارًا ۱۰ يُّرْسِلِ السَّمَآءَ
عَلَيْكُمْ مِّدْرَارًا ۱۱ وَّيُمْدِدْكُمْ بِاَمْوَالٍ وَّ
بَنِيْنَ وَ يَجْعَلْ لَّكُمْ جَنّٰتٍ وَّ يَجْعَلْ لَّكُمْ
اَنْهٰرًا ۱۲ مَا لَكُمْ لَا تَرْجُوْنَ لِلّٰهِ وَقَارًا ۱۳

وقف لازم

وَ قَدۡ خَلَقَكُمۡ اَطۡوَارًا ﴿۱۴﴾ اَلَمۡ تَرَوۡا كَيۡفَ
خَلَقَ اللّٰهُ سَبۡعَ سَمٰوٰتٍ طِبَاقًا ﴿۱۵﴾ وَّ جَعَلَ
الۡقَمَرَ فِيۡهِنَّ نُوۡرًا وَّ جَعَلَ الشَّمۡسَ سِرَاجًا ﴿۱۶﴾
وَ اللّٰهُ اَنۡۢبَتَكُمۡ مِّنَ الۡاَرۡضِ نَبَاتًا ﴿۱۷﴾ ثُمَّ
يُعِيۡدُكُمۡ فِيۡهَا وَ يُخۡرِجُكُمۡ اِخۡرَاجًا ﴿۱۸﴾ وَ اللّٰهُ
جَعَلَ لَكُمُ الۡاَرۡضَ بِسَاطًا ﴿۱۹﴾ لِّتَسۡلُكُوۡا مِنۡهَا
سُبُلًا فِجَاجًا ﴿۲۰﴾ ع

వాస్తవానికి ఆయన మిమ్మల్ని విభిన్న రీతులలో సృజించాడు.[6] అల్లాహ్ ఏ విధంగా ఏడు ఆకాశాలను ఒక దానిపై నొకటి సృష్టించాడో, వాటిలో చంద్రుణ్ణి కాంతిగానూ, సూర్యుణ్ణి దీపం గానూ చేశాడో, మీరు చూడటం లేదా? అల్లాహ్ మిమ్మల్ని భూమి నుండి చిత్రవిచిత్రంగా మొలిపించాడు,[7] తరువాత ఆయన మిమ్మల్ని ఈ భూమిలోకే తిరిగి తీసుకుపోతాడు, మళ్లీ దానినుండే యెకాయెకీ మిమ్మల్ని బయటకు తీసి నిలబెడతాడు. అల్లాహ్ మీ కొరకు భూమిని పాన్పు మాదిరిగా పరిచాడు; మీరు దానిపై ఉన్న విశాలమైన మార్గాలలో నడవటానికి వీలు కల్పించాడు."

1. అంటే, మీరు ఈ మూడు విషయాలను ఒప్పుకుంటే, అల్లాహ్ మీ సహజ మరణానికై నిర్ణయించిన వ్యవధి వరకు, మీకు ఈ ప్రపంచంలో జీవించే అవకాశం ఇవ్వబడుతుంది.
2. ఈ రెండో కాలం అంటే, ఒక జాతిపై శిక్షను అవతరింపజేయటానికి అల్లాహ్ నిర్ణయించిన కాలం అని అర్థం. దీనిని గురించి దివ్య ఖురానులో అనేకచోట్ల ఈ విషయం వివరంగా చెప్పబడింది; ఒక జాతిపై శిక్షావతరణకు సంబంధించిన నిర్ణయం చేయబడినప్పుడు, దాని తరువాత ఆ జాతి ప్రజలు ఇస్లామ్‌ను విశ్వసించినప్పటికీ, దానిని క్షమించటం జరగదు.
3. మధ్యలో ఒక సుదీర్ఘకాలపు చరిత్రను వదలిపెట్టి, ఇప్పుడు హజ్రత్ నూహ్ (అస్సలామ్) తన ప్రవక్త పదవి చివరి దశలో అల్లాహ్‌కు చేసిన విన్నపం పేర్కొనబడుతోంది.
4. ముఖాలను వస్త్రాలతో కప్పుకోవడం ఎందుకంటే, వారికి హజ్రత్ నూహ్ (అస్సలామ్) ముఖమంటేనే గిట్టటం లేదు. అలాంటప్పుడు ఆయన మాటను చెవినెందుకు పెడతారు? ఆయన ముందు నుంచి పోయేటప్పుడు తమ ముఖాలను దాచిపెట్టుకుని వెళ్లిపోయేటందుకూ ఇంకా ఆయన వారిని గుర్తించి వారితో మాట్లాడే అవకాశం రాకుండా ఉండేందుకు వారు ముసుగు వేసుకుంటారు.
5. అర్థం ఏమిటంటే, ప్రపంచంలోని ధనవంతుల, ప్రముఖుల మర్యాదకు భంగకరంగా ప్రవర్తించటం ప్రమాదకరమని మీరు భావిస్తారు. కాని సకల లోకాలను సృష్టించిన దేవుని విషయంలో, ఆయన కూడ గౌరవనీయుడే అని మీరు ఎందుకు తలపోయరు? ఆయనకు వ్యతిరేకంగా మీరు తిరుగుబాటు చేస్తారు, ఆయన దైవత్వంలో ఇతరులను కూడ భాగస్వాములుగా చేస్తారు, ఆయన ఆజ్ఞలను ఉల్లంఘిస్తారు, ఇలా చేసినందుకు ఆయన మిమ్మల్ని శిక్షిస్తాడనే భయం మీకు ఏ కోశానా లేదు.
6. అంటే, సృష్టికి సంబంధించిన విభిన్న అవస్థల నుండి, దశల నుండి ప్రయాణింపజేసి మిమ్మల్ని ఈ ప్రస్తుత స్థితికి తీసుకువచ్చాడు అని అర్థం.
7. ఇక్కడ భూమియందలి పదార్థాల కూడికచే రూపొందిన మానవుని పుట్టుకను చెట్టూ చేమల పెరుగుదలతో పోల్చబడింది. ఒకప్పుడు ఈ నేలపై చెట్టూ చేమలు ఉండేవి కావు. దానిపై అల్లాహ్ వాటిని మొలకెత్తజేశాడు. అదేవిధంగా ఒకప్పుడు ఈ భూమండలంపై మానవుడే లేడు. ఇక్కడ అల్లాహ్ అతనిని ఆవిర్భవింపజేశాడు.

قَالَ نُوۡحٌ رَّبِّ اِنَّهُمۡ عَصَوۡنِىۡ وَ اتَّبَعُوۡا مَنۡ
لَّمۡ يَزِدۡهُ مَالُهٗ وَ وَلَدُهٗۤ اِلَّا خَسَارًا ﴿۲۱﴾ وَ
مَكَرُوۡا مَكۡرًا كُبَّارًا ﴿۲۲﴾ وَ قَالُوۡا لَا تَذَرُنَّ
اٰلِهَتَكُمۡ وَ لَا تَذَرُنَّ وَدًّا وَّ لَا سُوَاعًا ۙ وَّ لَا
يَغُوۡثَ وَيَعُوۡقَ وَ نَسۡرًا ﴿۲۳﴾ وَ قَدۡ اَضَلُّوۡا
كَثِيۡرًا ۚ وَ لَا تَزِدِ الظّٰلِمِيۡنَ اِلَّا ضَلٰلًا ﴿۲۴﴾ مِمَّا
خَطِيۡٓــٰٔتِهِمۡ اُغۡرِقُوۡا فَاُدۡخِلُوۡا نَارًا ۙ فَلَمۡ يَجِدُوۡا
لَهُمۡ مِّنۡ دُوۡنِ اللّٰهِ اَنۡصَارًا ﴿۲۵﴾ وَ قَالَ نُوۡحٌ
رَّبِّ لَا تَذَرۡ عَلَى الۡاَرۡضِ مِنَ الۡكٰفِرِيۡنَ
دَيَّارًا ﴿۲۶﴾ اِنَّكَ اِنۡ تَذَرۡهُمۡ يُضِلُّوۡا عِبَادَكَ
وَ لَا يَلِدُوۡۤا اِلَّا فَاجِرًا كَفَّارًا ﴿۲۷﴾ رَبِّ اغۡفِرۡ لِىۡ
وَلِوَالِدَىَّ وَ لِمَنۡ دَخَلَ بَيۡتِىَ مُؤۡمِنًا
وَّلِلۡمُؤۡمِنِيۡنَ وَ الۡمُؤۡمِنٰتِ ؕ وَ لَا تَزِدِ
الظّٰلِمِيۡنَ اِلَّا تَبَارًا ﴿۲۸﴾

**21 - 24** ప్రవక్త నూహ్ ఇలా అన్నాడు, "ప్రభూ! వారు నా మాటను కొట్టిపారేశారు, సంపదనూ, సంతానాన్నీ పొంది మరింత నష్టానికే గురి అయిన వారిని (సంపన్నులను) అనుసరించారు. వారు పెద్ద పెద్ద కుట్రలను పన్నారు. వారు, "మీరు మీ ఆరాధ్య దైవాలను ఎంతమాత్రం విడిచిపెట్టకండి. వద్దా, సువాలను విడిచిపెట్టకండి. యగూస్‌ను, యఊఖ్‌ను, నసర్‌ను కూడ విడనాడకండి"[8] అని అన్నారు. వీరు చాలా మందిని మార్గచ్యుతులుగా చేశారు. నీవు కూడ ఈ దుర్మార్గులకు మార్గచ్యుతిలో తప్ప మరెందులోనూ వృద్ధిని ఈయకు."[9]

**25 - 28** వారు తమ పాపాల మూలంగానే ముంచబడ్డారు, నరకాగ్నిలోకి తోసివేయబడ్డారు. ఆ తరువాత వారు అల్లాహ్ నుండి తమను రక్షించే సహాయకుడెవణ్ణీ పొందలేకపోయారు. ప్రవక్త నూహ్ ఇలా అన్నాడు, "ప్రభూ! భూమిపై ఈ అవిశ్వాసులలో ఏ ఒక్కరినీ వదలిపెట్టకు. ఒకవేళ నీవు వారిని వదలిపెడితే, వారు నీ దాసులను అపమార్గం పట్టిస్తారు. వారి సంతతిలో ఎవడు పుట్టినా పరమ పాపిగా, కరుడుగట్టిన అవిశ్వాసిగా మాత్రమే రూపొందుతాడు. ప్రభూ! నన్నూ నా తల్లిదండ్రులనూ, విశ్వాసిగా నా ఇంట్లోకి ప్రవేశించిన ప్రతి వ్యక్తినీ, విశ్వాసులైన పురుషులూ, స్త్రీలూ అందర్నీ క్షమించు. దుర్మార్గులకు వినాశాన్ని తప్ప మరి దేనినీ అధికం చెయ్యకు."

8. ప్రవక్త నూహ్ జాతివారు పూజించిన దైవాలలో కొందరిని అనంతర కాలంలో అరబ్బులు కూడ పూజించసాగారు. ఇస్లామ్ ప్రారంభదశలో అరేబియాలో అక్కడక్కడా వాటి మందిరాలు ఉండేవి.

9. అసహనం కారణంగా ప్రవక్త నూహ్ శపించలేదు. శతాబ్దాలుగా ఆయన ధర్మప్రచారం చేశారు. కాని ఆయన జాతి ప్రజలు ఆయనను తిరస్కరించారు. అప్పుడు ఆయన వారి పట్ల పూర్తిగా నిరాశకు గురిఅయి ఇలా శపించారు.

# ٧٢ سُوْرَةُ الْجِنِّ مَكِّيَّةٌ ٤٠

ايَاتُهَا ٢٨ | رُكُوْعَاتُهَا ٢

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ۝

قُلۡ اُوۡحِیَ اِلَیَّ اَنَّهُ اسۡتَمَعَ نَفَرٌ مِّنَ الۡجِنِّ
فَقَالُوۡۤا اِنَّا سَمِعۡنَا قُرۡاٰنًا عَجَبًا ۝١ یَّهۡدِیۡۤ اِلَی
الرُّشۡدِ فَاٰمَنَّا بِهٖ ؕ وَلَنۡ نُّشۡرِكَ بِرَبِّنَاۤ
اَحَدًا ۝٢ وَّ اَنَّهُ تَعٰلٰی جَدُّ رَبِّنَا مَا اتَّخَذَ
صَاحِبَةً وَّ لَا وَلَدًا ۝٣ وَّ اَنَّهُ كَانَ یَقُوۡلُ
سَفِیۡهُنَا عَلَی اللّٰهِ شَطَطًا ۝٤ وَّ اَنَّا ظَنَنَّاۤ اَنۡ
لَّنۡ تَقُوۡلَ الۡاِنۡسُ وَالۡجِنُّ عَلَی اللّٰهِ كَذِبًا ۝٥ وَّ
اَنَّهُ كَانَ رِجَالٌ مِّنَ الۡاِنۡسِ یَعُوۡذُوۡنَ بِرِجَالٍ
مِّنَ الۡجِنِّ فَزَادُوۡهُمۡ رَهَقًا ۝٦ وَّ اَنَّهُمۡ ظَنُّوۡا
كَمَا ظَنَنۡتُمۡ اَنۡ لَّنۡ یَّبۡعَثَ اللّٰهُ اَحَدًا ۝٧
وَّ اَنَّا لَمَسۡنَا السَّمَآءَ فَوَجَدۡنٰهَا مُلِئَتۡ حَرَسًا
شَدِیۡدًا وَّ شُهُبًا ۝٨ وَّ اَنَّا كُنَّا نَقۡعُدُ مِنۡهَا
مَقَاعِدَ لِلسَّمۡعِ ؕ فَمَنۡ یَّسۡتَمِعِ الۡاٰنَ یَجِدۡ لَهٗ
شِهَابًا رَّصَدًا ۝٩

# 72. అల్ జిన్న్

ఆయతులు 28 | అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 15** ఓ ప్రవక్తా! జిన్నాతుల సమూహం ఒకటి శ్రద్ధగా[1] విని, ఆ తరువాత (తన జాతి ప్రజల వద్దకు పోయి) ఇలా అన్నట్లు నాకు వహీ ద్వారా తెలియజేయబడిందని చెప్పు; "మేము ఒక అద్భుతమైన ఖురాన్ విన్నాము, అది సన్మార్గం వైపునకు దారి చూపుతుంది, కనుక మేము దానిని విశ్వసించాము. ఇక ఎన్నడూ మేము మా ప్రభువునకు భాగస్వాములుగా మరెవ్వరినీ చేయము." ఇంకా ఇలా అన్నారు, "మా ప్రభువు వైభవం చాలా గొప్పది, ఘనమైనది. ఆయన ఎవరినీ భార్యగాగాని, కుమారునిగా గాని చేసుకోలేదు." ఇంకా ఇలా అన్నారు, "మనలోని అవివేకులు[2] కొందరు అల్లాహ్ విషయంలో ఎన్నో సత్యవిరుద్ధమైన విషయాలు పలుకుతున్నారు." ఇంకా ఇలా అన్నారు, "మానవులు, జిన్నాతులు దేవుని గురించి ఎన్నడూ అబద్ధం పలుకరని మేము భావించాము." ఇంకా ఇలా అన్నారు, "మానవులలో కొందరు జిన్నాతులలోని కొందరిని శరణు వేడుతుండేవారు. ఈ విధంగా వారు జిన్నాతుల గర్వాన్ని మరింత అధికం చేశారు." ఇంకా ఇలా అన్నారు, "అల్లాహ్ ఎవరినీ సందేశహరుడుగా నియమించి పంపడని మీరు భావించినట్లు గానే, మానవులు కూడ భావించారు." ఇంకా ఇలా అన్నారు, "మేము ఆకాశంలో వెతికితే, అది పహరాదారులతో, ఉల్కాపాతంతో నిండిపోయి ఉన్నట్లు కనిపించింది." ఇంకా ఇలా అన్నారు, "మొదట్లో మేము దొంగతనంగా వినటానికి పోయినప్పుడు, ఆకాశంలో మాకు కూర్చోవటానికి స్థలం దొరికేది. కాని ఇప్పుడు ఎవడైనా దొంగతనంగా వినే ప్రయత్నం చేస్తే, అతడి కొరకు ఒక అగ్నిజ్వాల మాటుకాసి ఉంటుంది."

---

1. దీనిద్వారా తెలిసేది ఏమిటంటే, మహాప్రవక్త (సఅసమ్)కు ఆ సమయంలో జిన్నాతులు కనబడటం లేదు; వారు ఖురానును వింటున్నారనే విషయం ఆయనకు తెలియదు. కాని తరువాత అల్లాహ్ 'వహీ' ద్వారా ఈ విషయాన్ని ఆయనకు తెలియజేశాడు. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజిఅన్) కూడ ఈ సంఘటనను ఉటంకిస్తూ, "మహాప్రవక్త (సఅసమ్) జిన్నాతుల ఎదుట ఖురానును పఠించనూలేదు, వారిని చూడనూ లేదు" అని వివరించారు. (ముస్లిమ్, తిర్మిజీ, ముస్నద్ అహ్మద్, ఇబ్నె జరీర్)

2. అసలు 'సఫీహునా' అనే మాట ఉపయోగించబడింది. దీనిని ఒక వ్యక్తిని ఉద్దేశించిగానీ, ఒక వర్గాన్ని ఉద్దేశించిగానీ చెప్పవచ్చు. ఒకవేళ దీనిని తెలివితక్కువ వ్యక్తి అనే అర్థంలో తీసుకుంటే, అప్పుడు, 'ఇబ్లీస్' (షైతాను)

وَّ اَنَّا لَا نَدْرِیْٓ اَشَرٌّ اُرِیْدَ بِمَنْ فِی
الْاَرْضِ اَمْ اَرَادَ بِهِمْ رَبُّهُمْ رَشَدًا ﴿١٠﴾ وَّ
اَنَّا مِنَّا الصّٰلِحُوْنَ وَ مِنَّا دُوْنَ ذٰلِكَ ؕ كُنَّا
طَرَآئِقَ قِدَدًا ﴿١١﴾ وَّ اَنَّا ظَنَنَّآ اَنْ لَّنْ نُّعْجِزَ
اللّٰهَ فِی الْاَرْضِ وَلَنْ نُّعْجِزَهٗ هَرَبًا ﴿١٢﴾ وَّ اَنَّا
لَمَّا سَمِعْنَا الْهُدٰۤی اٰمَنَّا بِهٖ ؕ فَمَنْ یُّؤْمِنْ بِرَبِّهٖ
فَلَا یَخَافُ بَخْسًا وَّلَا رَهَقًا ﴿١٣﴾ وَّ اَنَّا مِنَّا
الْمُسْلِمُوْنَ وَ مِنَّا الْقٰسِطُوْنَ ؕ فَمَنْ اَسْلَمَ
فَاُولٰٓئِكَ تَحَرَّوْا رَشَدًا ﴿١٤﴾ وَ اَمَّا الْقٰسِطُوْنَ
فَكَانُوْا لِجَهَنَّمَ حَطَبًا ﴿١٥﴾

ఇంకా ఇలా అన్నారు, "భూలోకవాసులకేదైనా కీడు చెయ్యాలనే నిర్ణయం జరిగిందా లేక వారి ప్రభువు వారికి సన్మార్గం చూప[3] గోరుతున్నాడా అనే విషయం మాకు అర్థమయ్యేది కాదు." ఇంకా ఇలా అన్నారు, "మనలో కొందరు సజ్జనులు ఉన్నారు, మరికొందరు దీనికి భిన్నంగా ఉన్నారు. మనం విభిన్న పద్ధతులలో విభజింపబడి ఉన్నాము." ఇంకా ఇలా అన్నారు, "అల్లాహ్‌ను మనం భూమిపై కూడ అశక్తునిగా చేయలేము, తప్పించుకుని పారిపోయి ఆయనను ఓడించ[4]లేము అని మేము భావించేవారము." ఇంకా ఇలా అన్నారు, "మేము సన్మార్గ బోధను విని దానిని విశ్వసించాము. ఇప్పుడిక ఎవడైనా సరే, తన ప్రభువును విశ్వసిస్తే అతనికి అన్యాయంగానీ, అతనిపై దౌర్జన్యంగాని జరుగుతుందన్న భయం ఉండదు." ఇంకా ఇలా అన్నారు, "మనలో కొందరు ముస్లిమ్‌లు (దేవుని విధేయులు) ఉన్నారు; మరికొందరు సత్యానికి దూరమై ఉన్నవారు ఉన్నారు. కనుక ఇస్లామ్ (విధేయతా మార్గం)ను అవలంబించినవారు ముక్తిమార్గాన్ని కనుగొన్నారు. ఇక సత్యానికి దూరమయిన వారు నరకానికి ఇంధనమవుతారు."[5]

అని అర్థం. దానిని ఒక వర్గం అనే అర్థంలో గ్రహించినట్లయితే, అప్పుడు జిన్నాతులలోని అవివేకులు, తెలివితక్కువవారు అయిన అనేకుల వర్గం అటువంటి విషయాలు చెప్పేది అని భావం.

3. దీనిద్వారా తెలిసింది ఏమిటంటే, ఈ జిన్నాతులు ఆకాశం యొక్క ఈ స్థితిని చూసి, భూమిపై ఏ విషయం జరిగింది, ఏమి జరగబోతోంది, ఇంత కట్టుదిట్టమైన ఏర్పాట్లు దానికి సంబంధించిన సమాచారాన్ని గోప్యంగా ఉంచటానికి చేయబడుతున్నాయి అని తెలుసుకోవటానికి అన్వేషిస్తూ క్రిందికి దిగ వచ్చారు. ఇక వినువీధిలో ఏ గూఢ సమాచారాన్నీ తెలుసుకునే అవకాశం వారికి లేకపోయింది; ఎటునుండి ప్రవేశించటానికి ప్రయత్నించినా వారు తరిమి తరిమి కొట్టబడుతున్నారు.

4. అర్థం ఏమిటంటే, మా ఈ ఆలోచనయే మాకు ముక్తి మార్గాన్ని చూపింది : మేము అల్లాహ్ అంటే భయం లేకుండాలేము; ఒకవేళ మేము ఆయనకు అవిధేయత చూపితే, ఆయన దండన నుండి మేము ఏ విధంగానూ తప్పించుకోలేము అని నమ్మేవారము. కావున అల్లాహ్ తరఫు నుండి ప్రజలకు రుజుమార్గాన్ని చూపటానికి వచ్చిన ఆ గ్రంథాన్ని మేము విన్నప్పుడు సత్యం ఏమిటో తెలుసుకున్న తరువాత కూడ, అవివేకులైన మా వారు కొందరు మాలో వ్యాపింపజేసిన విశ్వాసాలకు కట్టుబడి ఉండే సాహసాన్ని మేము చేయలేకపోయాము.

5. ఎవరైనా ఇలా ప్రశ్నించవచ్చు: దివ్య ఖురాను ప్రకారం జిన్నాతులు అగ్ని స్వరూపులు. అలాంటప్పుడు నరకాగ్ని వల్ల వారికేంబాధ? దానికి సమాధానం ఇది : దివ్య ఖురాను ప్రకారం మానవుడు మట్టితో పుట్టాడు. అలాంటప్పుడు అతనిని మట్టిపెళ్లతో లాగికొడితే, దెబ్బ ఎందుకు తగులుతుంది?

6. అంటే, అల్లాహ్‌తోపాటు మరెవరినీ ఆరాధించకండి, మరెవరినీ ప్రార్థించకండి, మరెవరి సహాయాన్నీ అర్థించకండి.

وَّ اَنْ لَّوِ اسْتَقَامُوْا عَلَى الطَّرِيْقَةِ لَاَسْقَيْنٰهُمْ
مَّآءً غَدَقًا ﴿١٦﴾ لِّنَفْتِنَهُمْ فِيْهِ ؕ وَمَنْ يُّعْرِضْ
عَنْ ذِكْرِ رَبِّهٖ يَسْلُكْهُ عَذَابًا صَعَدًا ﴿١٧﴾ وَّاَنَّ
الْمَسٰجِدَ لِلّٰهِ فَلَا تَدْعُوْا مَعَ اللّٰهِ اَحَدًا ﴿١٨﴾ وَّ
اَنَّهٗ لَمَّا قَامَ عَبْدُ اللّٰهِ يَدْعُوْهُ كَادُوْا يَكُوْنُوْنَ
عَلَيْهِ لِبَدًا ﴿١٩﴾ قُلْ اِنَّمَاۤ اَدْعُوْا رَبِّيْ وَلَاۤ ع
اُشْرِكُ بِهٖۤ اَحَدًا ﴿٢٠﴾ قُلْ اِنِّيْ لَاۤ اَمْلِكُ لَكُمْ
ضَرًّا وَّلَا رَشَدًا ﴿٢١﴾ قُلْ اِنِّيْ لَنْ يُّجِيْرَنِيْ
مِنَ اللّٰهِ اَحَدٌ ۙ وَّلَنْ اَجِدَ مِنْ دُوْنِهٖ
مُلْتَحَدًا ﴿٢٢﴾ اِلَّا بَلٰغًا مِّنَ اللّٰهِ وَرِسٰلٰتِهٖ ؕ وَ
مَنْ يَّعْصِ اللّٰهَ وَرَسُوْلَهٗ فَاِنَّ لَهٗ نَارَ جَهَنَّمَ
خٰلِدِيْنَ فِيْهَاۤ اَبَدًا ﴿٢٣﴾ حَتّٰۤى اِذَا رَاَوْا مَا
يُوْعَدُوْنَ فَسَيَعْلَمُوْنَ مَنْ اَضْعَفُ نَاصِرًا وَّ
اَقَلُّ عَدَدًا ﴿٢٤﴾ قُلْ اِنْ اَدْرِيْۤ اَقَرِيْبٌ مَّا
تُوْعَدُوْنَ اَمْ يَجْعَلُ لَهٗ رَبِّيْۤ اَمَدًا ﴿٢٥﴾ عٰلِمُ
الْغَيْبِ فَلَا يُظْهِرُ عَلٰى غَيْبِهٖۤ اَحَدًا ﴿٢٦﴾ اِلَّا مَنِ
ارْتَضٰى مِنْ رَّسُوْلٍ فَاِنَّهٗ يَسْلُكُ مِنْۢ بَيْنِ
يَدَيْهِ وَمِنْ خَلْفِهٖ رَصَدًا ﴿٢٧﴾ لِّيَعْلَمَ اَنْ قَدْ
اَبْلَغُوْا رِسٰلٰتِ رَبِّهِمْ وَاَحَاطَ بِمَا لَدَيْهِمْ
وَاَحْصٰى كُلَّ شَيْءٍ عَدَدًا ﴿٢٨﴾ ع

**16 - 23** మరియు (ప్రవక్తా! నాకు ఇలా కూడ సందేశం అందజేయబడిందని చెప్పు) ప్రజలు గనక ఋజుమార్గంలో స్థిరంగా నడుచుకుంటే, మేము వారికి త్రాగటానికి పుష్కలంగా నీటిని ప్రసాదిస్తాము; ఆ వరము ద్వారా వారిని పరీక్షిస్తాము. తన ప్రభువు స్మరణ పట్ల విముఖుడయ్యే అతణ్ణి అతని ప్రభువు కఠిన శిక్షకు గురిచేస్తాడు. ఇంకా ఏమిటంటే, మసీదులు అల్లాహ్ కొరకే ప్రత్యేకించబడ్డాయి. కనుక వాటిలో అల్లాహ్‌తో పాటు ఇతరులెవ్వరినీ ప్రార్థించకండి.[6] అల్లాహ్ దాసుడు ఆయన్ని ప్రార్థించటానికి నిలబడినప్పుడు, ప్రజలు అతనిపై విరుచుకుపడటానికి సిద్ధమయ్యారు. ఓ ప్రవక్తా! ఇలా చెప్పు, "నేనైతే నా ప్రభువునే ప్రార్థిస్తాను, ఆయనకు భాగస్వాములుగా మరెవ్వరినీ నిలబెట్టను." ఇంకా ఇలా నొక్కి చెప్పు, "మీకు నష్టం కలిగించటం లేదా మీకు మేలు చెయ్యటం అనేది నా వశంలోలేదు." ఇలా చెప్పు, "నన్ను అల్లాహ్ పట్టునుండి ఎవ్వరూ కాపాడలేరు. నాకు ఆయన తప్ప మరొక ఆశ్రయం కూడ లేదు. అయితే అల్లాహ్ మాటలను, ఆయన సందేశాలను అందజెయ్యటమే నా పని." ఇక ఎవరైనా సరే, అల్లాహ్, ఆయన ప్రవక్తల మాటలను విశ్వసించక పోతే, వారు నరకాగ్నికి గురిఅవుతారు. అటువంటి వారు అందులోనే శాశ్వతంగా ఉంటారు.

**24 - 28** వారు తమకు వాగ్దానం చేయబడుతున్నదానిని కళ్లారా చూడనంతవరకు (తమ ఈ వైఖరిని విడనాడరు). అప్పుడు వారికి తెలిసిపోతుంది, ఎవరి సహాయకులు బలహీనులో, మరెవరి వర్గం సంఖ్యాపరంగా తక్కువో.[7] ఇలా చెప్పు, "మీకు వాగ్దానం చేయబడుతున్న విషయం సమీపంలోనే ఉందో లేక నా ప్రభువు దానికోసం ఏదైనా దీర్ఘకాలిక వ్యవధి నిర్ణయించాడో, నాకైతే తెలియదు. ఆయన అతీంద్రియ జ్ఞానం కలవాడు, తన అతీంద్రియ విషయాలను తాను ఎంచుకున్న[8] ప్రవక్తకు తప్ప మరెవ్వరికీ తెలియజేయడు. అయితే ఆయన ఆ ప్రవక్తకు ముందూ, వెనుకా రక్షకభటులను నియమిస్తాడు,[9] ఎందుకంటే వారు తమ ప్రభువు సందేశాలను యధాతథంగా అందజేసిన విషయాన్ని ఆయన తెలుసుకోవటానికి.[10] ఆయన వారి పరిసరాలు అన్నింటినీ పరివేష్టించి ఉన్నాడు, ఆయన ఒక్కొక్క విషయాన్ని లెక్కపెట్టి ఉంచాడు."[11]

7. అల్లాహ్ వైపునకు రమ్మని ఆహ్వానించే మహాప్రవక్త (సఅసమ్) సందేశాన్ని విన్నంతనే ఖురైషు తెగలోని కొందరు ప్రజలు ఆయనపై విరుచుకుపడేవారు. వారు తమ వద్ద ఉన్న దండు అత్యంత శక్తిమంతమైనదనీ, మహాప్రవక్త (సఅసమ్) అతి తక్కువ బలం కలవారనీ, ఆయనను అవలీలగా అణచవచ్చుననే అహంభావానికి గురిఅయి ఉన్నారు.

8. అంటే, స్వతహా ప్రవక్త అగోచర విషయ జ్ఞాని కాదు. అయితే, అల్లాహ్ అతనిని ప్రవక్త విధులను నిర్వహించటానికి ఎన్నుకున్నప్పుడు, తాను కోరిన అగోచర విషయ పరిజ్ఞానాన్ని అతనికి ప్రసాదిస్తాడు.

9. రక్షక భటులు అంటే దైవదూతలు అని అర్థం. భావం ఏమిటంటే, అల్లాహ్ వహీ ద్వారా అగోచర విషయ పరిజ్ఞానాన్ని ప్రవక్త వద్దకు పంపేటప్పుడు, దాని పరిరక్షణార్థం, అన్ని వైపులా దైవదూతలను నియమిస్తాడు. ఆ పరిజ్ఞానం సురక్షితమైన తీరులో ప్రవక్త వద్దకు చేరటానికీ, అది కలుషితం కాకుండా ఉండటానికీ ఆయన ఇలా చేస్తాడు.

10. దీనిద్వారా తెలిసింది ఏమిటంటే, ప్రవక్త విధులను నెరవేర్చటానికి అగోచర విషయ పరిజ్ఞానం ఎంత అవసరమో అంతే ప్రవక్తకు ఇవ్వబడుతుంది. ఈ పరిజ్ఞానం తన నిజరూపంలో ప్రవక్తకు చేరేవరకు దైవదూతలు దానిని వేయి కళ్లతో కనిపెట్టి ఉంటారు. ప్రవక్త తన ప్రభువు సందేశాలను ఆయన దాసుల వరకు యథాతథంగా అందజేసే విషయాన్ని కూడ వారు గమనిస్తారు.

11. అంటే, ప్రవక్తనూ, దైవదూతలనూ అల్లాహ్ శక్తి ఆవరించి ఉన్నది. వారు ఆయన అభీష్టానికి ఏమాత్రం విరుద్ధంగా ప్రవర్తించినా, వెంటనే పట్టుబడి పోతారు. అల్లాహ్ పంపే సందేశాలలోని ప్రతి అక్షరం గణింపబడి ఉన్నది. ప్రవక్తలుగానీ, దైవదూతలు గానీ వాటిలో ఒక్క అక్షరాన్ని కూడ మార్చటానికి సాహసించలేరు.

آيَاتُهَا ٢٠ | ٧٣ سُوۡرَةُ الۡمُزَّمِّلِ مَكِّيَّةٌ ٣ | رُكُوۡعَاتُهَا ٢

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○
يٰۤاَيُّهَا الۡمُزَّمِّلُ ۙ ﴿۱﴾ قُمِ الَّيۡلَ اِلَّا قَلِيۡلًا ۙ ﴿۲﴾
نِّصۡفَهٗۤ اَوِ انۡقُصۡ مِنۡهُ قَلِيۡلًا ۙ ﴿۳﴾ اَوۡ زِدۡ عَلَيۡهِ وَ
رَتِّلِ الۡقُرۡاٰنَ تَرۡتِيۡلًا ؕ ﴿۴﴾ اِنَّا سَنُلۡقِىۡ عَلَيۡكَ
قَوۡلًا ثَقِيۡلًا ﴿۵﴾ اِنَّ نَاشِئَةَ الَّيۡلِ هِىَ اَشَدُّ وَطۡاً
وَّ اَقۡوَمُ قِيۡلًا ؕ ﴿۶﴾ اِنَّ لَكَ فِى النَّهَارِ سَبۡحًا
طَوِيۡلًا ؕ ﴿۷﴾ وَاذۡكُرِ اسۡمَ رَبِّكَ وَ تَبَتَّلۡ اِلَيۡهِ
تَبۡتِيۡلًا ؕ ﴿۸﴾ رَبُّ الۡمَشۡرِقِ وَ الۡمَغۡرِبِ لَاۤ اِلٰهَ
اِلَّا هُوَ فَاتَّخِذۡهُ وَكِيۡلًا ﴿۹﴾ وَاصۡبِرۡ عَلٰى مَا
يَقُوۡلُوۡنَ وَاهۡجُرۡهُمۡ هَجۡرًا جَمِيۡلًا ﴿۱۰﴾ وَ ذَرۡنِىۡ
وَالۡمُكَذِّبِيۡنَ اُولِى النَّعۡمَةِ وَمَهِّلۡهُمۡ قَلِيۡلًا ﴿۱۱﴾ اِنَّ
لَدَيۡنَاۤ اَنۡكَالًا وَّجَحِيۡمًا ۙ ﴿۱۲﴾ وَّ طَعَامًا ذَا غُصَّةٍ وَّ
عَذَابًا اَلِيۡمًا ۗ ﴿۱۳﴾ يَوۡمَ تَرۡجُفُ الۡاَرۡضُ
وَالۡجِبَالُ وَ كَانَتِ الۡجِبَالُ كَثِيۡبًا مَّهِيۡلًا ﴿۱۴﴾

ఆయతులు 20 | **73. అల్ ముజ్జమ్మిల్** | అవతరణ మక్కాలో

*అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

**1 - 14** ఓ దుప్పటి కప్పుకుని పడుకునేవాడా! రాత్రివేళ నమాజులో నిలబడుతూ ఉండు, కాని కొంచెం సేపు మాత్రమే; రాత్రిలో సగభాగం లేదా దానిని కొంచెం తగ్గించుకో లేదా దానిని కొంచెం పొడిగించుకో. ఖుర్ఆన్‌ను నెమ్మదిగా ఆగి ఆగి పఠించు. మేము నీపై ఒక గంభీరమైన వాణిని అవతరింప జేయబోతున్నాము. వాస్తవానికి రాత్రివేళ లేవటం మనస్సును అదుపులో ఉంచేందుకు ఎంతో ఉపయుక్తమైనది; ఖుర్ఆన్‌ను శ్రద్ధగా పఠించేందుకు ఎంతో అనువైనది: ఎందుకంటే, పగటి వేళ నీకు చాలా పనులుంటాయి. నీ ప్రభువు నామాన్ని స్మరిస్తూ ఉండు; అన్నిటినీ వదలి పూర్తిగా ఆయనకే అంకితమైపో. ఆయన తూర్పు పడమరలకు స్వామి, ఆయన తప్ప మరొక దేవుడు లేడు. కనుక నీవు ఆయననే వకీలుగా[1] చేసుకో. లోకులు కల్పించే మాటల పట్ల సహనం వహించి, మంచితనంతో వారి నుండి వైదొలగిపో.[2] సత్యతిరస్కారులైన ఈ సంపన్నుల సంగతి నాకు వదలిపెట్టు, నేను చూసుకుంటాను. వీరిని కొంతకాలం ఇదే స్థితిలో ఉండనివ్వు. మా వద్ద (వీరి కొరకు) బరువైన సంకెళ్లు ఉన్నాయి, భగభగ మండే అగ్ని, గొంతులో ఇరుక్కుపోయే ఆహారం, వ్యధాభరితమైన శిక్షా ఉన్నాయి. ఇదంతా భూమీ, పర్వతాలు కంపించే రోజున జరుగుతుంది. ఆ రోజున పర్వతాలు చెల్లాచెదరై పోయే ఇసుక తిప్పలు మాదిరిగా అయిపోతాయి.

1. ఒక వ్యక్తిని ఎవరైనా మనఃపూర్వకంగా నమ్మి అతనికి తమ వ్యవహారాలను అప్పగిస్తే, ఆ వ్యక్తిని వకీలు అని అంటారు. దాదాపు ఇదే అర్థంలో ఉర్దూ భాషలో వకీలు అనే పదం వ్యవహరించబడుతోంది. ఒక వ్యక్తికి ఎవరైనా తమ వ్యాజ్యాన్ని అప్పజెప్పి ఇక తమ ప్రమేయం లేకుండా తమ వ్యాజ్యాన్ని అతను న్యాయస్థానంలో చక్కగా వాదిస్తాడని నిశ్చింతగా ఉంటే, ఆ వ్యక్తిని వకీలు అంటారు.
2. వారి నుండి వైదొలగిపో అంటే, వారితో అన్ని సంబంధాలను తెంచుకొని నీ ప్రబోధ కార్యక్రమాన్ని మానుకో అని అర్థం కాదు. దీని అర్థం ఏమిటంటే, వారితో తర్కానికి దిగకు, వారి అమర్యాదకరమైన ప్రవర్తనను లెక్కలోకి తీసుకోకు, వారి పనికిమాలిన మాటలకు సమాధానం చెప్పకు. దీనిని కోపతాపాలతో, దుఃఖాహంకారాలతో చేయకూడదు ; అలగా జనం తిట్లు విని వాటిని పెడచెవిన పెడుతూ కించిత్తు బాధపడని ఒక ఉత్తమ సంస్కారిగా ప్రవర్తించు.

إِنَّآ أَرْسَلْنَآ إِلَيْكُمْ رَسُولًا ۙ شَاهِدًا عَلَيْكُمْ
كَمَآ أَرْسَلْنَآ إِلَىٰ فِرْعَوْنَ رَسُولًا ﴿١٥﴾ فَعَصَىٰ
فِرْعَوْنُ الرَّسُولَ فَأَخَذْنٰهُ أَخْذًا وَّبِيلًا ﴿١٦﴾
فَكَيْفَ تَتَّقُونَ إِن كَفَرْتُمْ يَوْمًا يَّجْعَلُ
الْوِلْدَانَ شِيبًا ﴿١٧﴾ السَّمَآءُ مُنفَطِرٌۢ بِهٖ ۚ كَانَ
وَعْدُهٗ مَفْعُولًا ﴿١٨﴾ إِنَّ هٰذِهٖ تَذْكِرَةٌ ۚ فَمَن
شَآءَ اتَّخَذَ إِلَىٰ رَبِّهٖ سَبِيلًا ﴿١٩﴾ إِنَّ رَبَّكَ ع ١ ١٩ ١٣
يَعْلَمُ أَنَّكَ تَقُومُ أَدْنَىٰ مِن ثُلُثَيِ الَّيْلِ وَنِصْفَهٗ
وَثُلُثَهٗ وَطَآئِفَةٌ مِّنَ الَّذِينَ مَعَكَ ۚ وَاللّٰهُ
يُقَدِّرُ الَّيْلَ وَالنَّهَارَ ۚ عَلِمَ أَن لَّن
تُحْصُوهُ فَتَابَ عَلَيْكُمْ فَاقْرَءُوا مَا تَيَسَّرَ مِنَ
الْقُرْاٰنِ ۚ عَلِمَ أَن سَيَكُونُ مِنكُم مَّرْضَىٰ ۙ وَ
اٰخَرُونَ يَضْرِبُونَ فِي الْأَرْضِ يَبْتَغُونَ مِن
فَضْلِ اللّٰهِ ۙ وَاٰخَرُونَ يُقَاتِلُونَ فِي سَبِيلِ
اللّٰهِ ۖ فَاقْرَءُوا مَا تَيَسَّرَ مِنْهُ ۙ وَأَقِيمُوا
الصَّلٰوةَ وَاٰتُوا الزَّكٰوةَ وَأَقْرِضُوا اللّٰهَ قَرْضًا
حَسَنًا ۚ وَمَا تُقَدِّمُوا لِأَنفُسِكُم مِّنْ خَيْرٍ
تَجِدُوهُ عِندَ اللّٰهِ هُوَ خَيْرًا وَّأَعْظَمَ أَجْرًا ۚ
وَاسْتَغْفِرُوا اللّٰهَ ۖ إِنَّ اللّٰهَ غَفُورٌ رَّحِيمٌ ﴿٢٠﴾ ع ٢ ١ ١٤

**15 - 19** మేము ఫిరౌను వద్దకు ఒక ప్రవక్తను పంపిన విధంగా ఒక ప్రవక్తను మీకు సాక్షిగా నియమించి మీ వద్దకు[3] పంపాము. (చూడండి) ఫిరౌను ఆ ప్రవక్త మాటను వినకపోవటం వల్ల మేము అతన్ని చాలా తీవ్రంగా పట్టుకున్నాము. ఒకవేళ మీరు కూడ నమ్మటానికి నిరాకరిస్తే, పిల్లలను వృద్ధులుగా చేసే ఆరోజు నుండి ఎలా బయటపడగలరు? ఆనాటి తీవ్రత వల్ల ఆకాశం బ్రద్దలవుతుంది. అల్లాహ్ చేసిన వాగ్దానం నెరవేరి తీరాలి. ఇదొక ఉపదేశం, ఇక ఇష్టమైన వారు తమ ప్రభువు వైపునకు పోయే మార్గాన్ని అవలంబించవచ్చు.

**20** ఓ ప్రవక్తా![4] నీవు ఒక్కొక్కప్పుడు దాదాపు మూడింట రెండు వంతుల రాత్రి, మరొకప్పుడు సగం రాత్రి, ఇంకొకప్పుడు మూడింట ఒకవంతు రాత్రి ఆరాధనలో నిలబడి ఉంటావనీ, నీ సహచరులలో కూడ ఒక వర్గం ఇలాగే చేస్తుందనీ నీ ప్రభువుకు తెలుసు. అల్లాహ్ మాత్రమే రేయింబవళ్ల వేళలను గురించి లెక్క కట్టగలడు. నీవు వేళలను కచ్చితంగా లెక్కించలేవని ఆయనకు తెలుసు; కనుక ఆయన నీపై దయచూపాడు. ఇప్పుడు నీవు ఖుర్ఆన్‌ను సులభంగా పఠించగలిగినంత మేరకే పఠించు.[5] ఆయనకు తెలుసు, మీలో కొందరు వ్యాధిగ్రస్తులు ఉండవచ్చు, మరికొందరు అల్లాహ్ అనుగ్రహాన్ని అన్వేషిస్తూ ప్రయాణాలలో ఉండ వచ్చు, ఇంకా కొందరు అల్లాహ్ మార్గంలో యుద్ధం చేస్తూ ఉండవచ్చు. కనుక మీరు ఖుర్ఆన్‌ను సులభంగా పఠించగలిగినంత పఠించండి. నమాజ్‌ను స్థాపించండి, జకాత్[6] ఇవ్వండి, అల్లాహ్‌కు మంచి అప్పును ఇస్తూ ఉండండి. మీరు ఏ సత్కార్యాన్ని మీ కోసం ముందుగా పంపించుకుంటారో, దానిని మీరు అల్లాహ్ వద్ద చూసుకుంటారు. అదే చాలా శ్రేష్ఠమైనది మరియు దాని ప్రతిఫలం చాలా పెద్దది. అల్లాహ్‌ను క్షమాభిక్ష కోసం అర్థిస్తూ ఉండండి. నిస్సందేహంగా అల్లాహ్ గొప్ప క్షమాశీలుడు, కరుణామయుడూను.

3. ఇక మక్కా అవిశ్వాసులు సంబోధించబడుతున్నారు. వారు మహాప్రవక్తను తిరస్కరించారు, ఆయనను వ్యతిరేకించటంలో ముందంజవేస్తున్నారు.
4. ఈ 'రుకూ' మొదటి 'రుకూ' అవతరించిన 10 సంవత్సరాల తరువాత మదీనా పట్టణంలో అవతరించింది.
5. సాధారణంగా దివ్య ఖురాన్‌ను ఎక్కువగా పారాయణం చేసిన నమాజు సుదీర్ఘమైన నమాజు. కాబట్టి, తహజ్జుద్ నమాజులో ఎంత ఖురాన్‌ను సులభంగా పఠించగలరో అంత ఖురాన్‌ను పఠించండి. దీనివల్ల నమాజు కాలపరిమితి దానంతట అదే తగ్గిపోతుంది.
6. దీని అర్థం విధివిహితమైన ఐదు పూటల నమాజులు చేయటం, జకాతు ఇవ్వటం అనే విషయాలలో ఖురాన్ వ్యాఖ్యాతలందరూ ఏకాభిప్రాయంతో ఉన్నారు.

## ఆయతులు 56 | 74. అల్ ముద్దస్సిర్ | అవతరణ మక్కాలో

## ٧٤ سُوْرَةُ الْمُدَّثِّرِ مَكِّيَّةٌ ٤
اٰياتها ٥٦ | ركوعاتها ٢

*అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

يٰۤاَيُّهَا الْمُدَّثِّرُ ۙ﴿١﴾ قُمْ فَاَنْذِرْ ۪ۙ﴿٢﴾ وَ رَبَّكَ
فَكَبِّرْ ۪ۙ﴿٣﴾ وَثِيَابَكَ فَطَهِّرْ ۪ۙ﴿٤﴾ وَالرُّجْزَ فَاهْجُرْ ۪ۙ﴿٥﴾
وَ لَا تَمْنُنْ تَسْتَكْثِرُ ۪ۙ﴿٦﴾ وَ لِرَبِّكَ فَاصْبِرْ ؕ﴿٧﴾
فَاِذَا نُقِرَ فِى النَّاقُوْرِ ۙ﴿٨﴾ فَذٰلِكَ يَوْمَئِذٍ يَّوْمٌ
عَسِيْرٌ ۙ﴿٩﴾ عَلَى الْكٰفِرِيْنَ غَيْرُ يَسِيْرٍ ﴿١٠﴾ ذَرْنِىْ
وَ مَنْ خَلَقْتُ وَحِيْدًا ۙ﴿١١﴾ وَّجَعَلْتُ لَهٗ مَالًا
مَّمْدُوْدًا ۙ﴿١٢﴾ وَّ بَنِيْنَ شُهُوْدًا ۙ﴿١٣﴾ وَّمَهَّدْتُّ لَهٗ
تَمْهِيْدًا ۙ﴿١٤﴾ ثُمَّ يَطْمَعُ اَنْ اَزِيْدَ ۗ﴿١٥﴾ كَلَّا ؕ اِنَّهٗ
كَانَ لِاٰيٰتِنَا عَنِيْدًا ؕ﴿١٦﴾ سَاُرْهِقُهٗ صَعُوْدًا ؕ﴿١٧﴾
اِنَّهٗ فَكَّرَ وَ قَدَّرَ ۙ﴿١٨﴾ فَقُتِلَ كَيْفَ قَدَّرَ ۙ﴿١٩﴾ ثُمَّ
قُتِلَ كَيْفَ قَدَّرَ ۙ﴿٢٠﴾ ثُمَّ نَظَرَ ۙ﴿٢١﴾ ثُمَّ عَبَسَ وَ
بَسَرَ ۙ﴿٢٢﴾ ثُمَّ اَدْبَرَ وَاسْتَكْبَرَ ۙ﴿٢٣﴾ فَقَالَ اِنْ هٰذَاۤ
اِلَّا سِحْرٌ يُّؤْثَرُ ۙ﴿٢٤﴾ اِنْ هٰذَاۤ اِلَّا قَوْلُ
الْبَشَرِ ؕ﴿٢٥﴾

**1 – 7** వస్త్రం[1] కప్పుకుని పడుకున్న మనిషీ! లే; లేచి హెచ్చరించు. నీ ప్రభువు ఘనతను చాటి చెప్పు. నీ దుస్తులను పరిశుభ్రంగా ఉంచుకో, మాలిన్యానికి దూరంగా ఉండు. ఎక్కువగా పొందాలనే కాంక్షతో ఉపకారం చేయకు. నీ ప్రభువు కొరకు ఓర్పు వహించు.

**8 – 37** సరే; శంఖం[2] పూరించబడే రోజు చాలా కఠినమైన రోజు. సత్య తిరస్కారులకు అది తేలికగా ఉండదు. వదలి పెట్టండి నన్నూ, నేను ఒంటరిగా[3] పుట్టించిన వ్యక్తినీ. నేను అతనికి ఎంతో ధనం ఇచ్చాను, ఎల్లప్పుడూ అతన్ని వెన్నంటి ఉండే కుమారులను ప్రసాదించాను, అతని కొరకు రాజ్యాధికార (సకల సౌకర్యాల) మార్గాన్ని సుగమం చేశాను. అయినప్పటికీ నేను అతనికి ఇంకా ఏదో ఇవ్వాలని ఆకాంక్షిస్తున్నాడు. కాదు, అలా ఎన్నటికీ కాదు, అతను మా వాక్యాల పట్ల విరోధం కలిగి ఉన్నాడు. నేను త్వరలోనే అతనిని దుర్గమమైన స్థానం పైకి ఎక్కిస్తాను. అతడు ఆలోచించి, ఏదో ఎత్తువేయటానికి ప్రయత్నించాడు. కనుక దేవుడు అతనిని నాశనం చేయుగాక! అతడు ఎలాంటి ఎత్తుగడ వేయటానినికి ప్రయత్నించాడు!! అవును, దేవుడు అతనిని నాశనం చేయుగాక! అతడు ఎలాంటి ఎత్తుగడ వేయటానికి ప్రయత్నించాడు! తరువాత (ప్రజల వైపు) చూశాడు. ఆ తరువాత కనుబొమలు ముడిచాడు. ముఖం చిట్లించుకున్నాడు. ఆపై విర్రవీగుతూ తిరిగిపోయాడు, చివరకు, "ఇది పూర్వం నుండి వస్తూ ఉన్న ఒక మంత్రజాలం తప్ప మరేమీ కాదు. ఇది ఒక మానవవాక్కు మాత్రమే" అని అన్నాడు.

---

1. ఈ సూరాలోని మొదటి ఏడు ఆయతులలోనే, మహాప్రవక్త (సఅసమ్)కు, అన్నింటికంటే ముందుగా, ఇస్లామ్ ధర్మప్రచారం చేయమనే ఆదేశం ఇవ్వబడింది. ఇది 'ఇఖ్‌రా బిస్మిరబ్బికల్లజీ ఖలఖ' తరువాత మహాప్రవక్త (సఅసమ్)పై అవతరించిన రెండో వహీ.
2. తొలి ఆయతులు వచ్చిన కొన్ని మాసాల తరువాత ఈ భాగం అవతరించింది. మహాప్రవక్త (సఅసమ్) ఇస్లామ్ ధర్మ ప్రచారం ప్రారంభించిన పిమ్మట వచ్చినటువంటి మొదటి హజ్ సమయంలో ఇది అవతరించింది. బయటి నుంచి రాబోయే హజ్ యాత్రికుల మనస్సులలో దివ్య ఖురానును గురించీ, మహాప్రవక్త (సఅసమ్)ను

سَاُصۡلِيۡهِ سَقَرَ ﴿٢٦﴾ وَمَاۤ اَدۡرٰىكَ مَا سَقَرُ ﴿٢٧﴾
لَا تُبۡقِىۡ وَلَا تَذَرُ ﴿٢٨﴾ لَوَّاحَةٌ لِّلۡبَشَرِ ﴿٢٩﴾ عَلَيۡهَا
تِسۡعَةَ عَشَرَ ﴿٣٠﴾ وَمَا جَعَلۡنَاۤ اَصۡحٰبَ النَّارِ اِلَّا
مَلٰٓئِكَةً ۙ وَّمَا جَعَلۡنَا عِدَّتَهُمۡ اِلَّا فِتۡنَةً لِّلَّذِيۡنَ
كَفَرُوۡا ۙ لِيَسۡتَيۡقِنَ الَّذِيۡنَ اُوۡتُوا الۡكِتٰبَ وَ
يَزۡدَادَ الَّذِيۡنَ اٰمَنُوۡۤا اِيۡمَانًا وَّلَا يَرۡتَابَ
الَّذِيۡنَ اُوۡتُوا الۡكِتٰبَ وَالۡمُؤۡمِنُوۡنَ ۙ وَلِيَقُوۡلَ
الَّذِيۡنَ فِىۡ قُلُوۡبِهِمۡ مَّرَضٌ وَّالۡكٰفِرُوۡنَ مَاذَاۤ
اَرَادَ اللّٰهُ بِهٰذَا مَثَلًا ؕ كَذٰلِكَ يُضِلُّ اللّٰهُ
مَنۡ يَّشَآءُ وَيَهۡدِىۡ مَنۡ يَّشَآءُ ؕ وَمَا يَعۡلَمُ
جُنُوۡدَ رَبِّكَ اِلَّا هُوَ ؕ وَمَا هِىَ اِلَّا ذِكۡرٰى
لِلۡبَشَرِ ﴿٣١﴾ كَلَّا وَالۡقَمَرِ ۙ ﴿٣٢﴾ وَالَّيۡلِ اِذۡ اَدۡبَرَ ۙ ﴿٣٣﴾ ع ١٥
وَالصُّبۡحِ اِذَاۤ اَسۡفَرَ ۙ ﴿٣٤﴾ اِنَّهَا لَاِحۡدَى الۡكُبَرِ ۙ ﴿٣٥﴾
نَذِيۡرًا لِّلۡبَشَرِ ۙ ﴿٣٦﴾ لِمَنۡ شَآءَ مِنۡكُمۡ اَنۡ يَّتَقَدَّمَ
اَوۡ يَتَاَخَّرَ ﴿٣٧﴾

త్వరలోనే నేను అతనిని నరకంలోకి తోసేస్తాను. ఆ నరకం ఏమిటో నీకేమి తెలుసు? అది మిగిలించదు, వదలిపెట్టదు.[4] అది చర్మాన్ని మాడ్చివేసేది. పందొమ్మిది మంది దానిపై నియమితులై ఉన్నారు[5]- మేము దైవదూతలను మాత్రమే నరకానికి కార్యనిర్వాహకులుగా నియమించాము. వారి సంఖ్యను అవిశ్వాసుల కొరకు ఒక పరీక్షగా చేశాము; ఎందుకంటే గ్రంథ ప్రజలకు నమ్మకం కలగాలని, విశ్వసించే వారి విశ్వాసం అధికం కావాలని, గ్రంథ ప్రజలు, విశ్వాసులు ఎలాంటి సందేహంలో పడకుండా ఉండాలని[6] ఇంకా మానసిక వ్యాధిగ్రస్తులు, సత్య విరోధులు "ఈ విచిత్రమైన వాక్కుకు అర్థమేమై ఉంటుంది?" అని అనాలని. ఈ విధంగా అల్లాహ్ తాను కోరిన వారిని మార్గభ్రష్టులుగా చేస్తాడు, తాను కోరిన వారికి మార్గం నిర్దేశిస్తాడు. నీ ప్రభువు సైన్యాలను స్వయంగా ఆయన తప్ప మరెవరూ ఎరుగరు- ఈ నరక ప్రస్తావన ప్రజలకు హితోపదేశం కావాలనే ఉద్దేశ్యంతోనే తప్ప మరి దేని కొరకూ చేయబడలేదు. ఎంతమాత్రం[7] కాదు, చంద్రుడు సాక్షిగా, మరలిపోయే రాత్రి సాక్షిగా, ప్రకాశించే ఉదయం సాక్షిగా ఈ నరకం కూడా గొప్ప విషయాలలోని ఒక[8] గొప్ప విషయం, మానవులకు భీతిగొలిపే విషయం, మీలో ముందడుగు వేసే ప్రతి వ్యక్తికీ, వెనుక ఉండిపోయే ప్రతి వ్యక్తికీ భీతిగొలిపే విషయం.

---

గురించీ, అనుమానాలనూ అపోహలనూ రేకెత్తించటానికి ఒక పెద్ద ప్రచారోద్యమాన్ని చేపట్టాలనే నిర్ణయాన్ని ఖురైషు తెగ సర్దారులు ఒక సభలో తీసుకున్నప్పుడు ఇది అవతరించింది.

3. అంటే, వలీద్ బిన్ ముగైరా అని అర్థం. అతను దివ్య ఖురాను అల్లాహ్ గ్రంథమనే విషయాన్ని మనస్సులోనైతే అంగీకరించాడు. కాని మక్కాలోని తన సర్దారు పదవిని నిలబెట్టుకునేందుకు, అతడు పైన పేర్కొనబడిన సభలో మహాప్రవక్త (సఅసమ్)ను ఒక మాంత్రికుడుగానూ, దివ్య ఖురానును ఒక మాయగానూ ప్రచారం చేయమని అవిశ్వాసులకు సలహా ఇచ్చాడు.

4. అంటే, అది శిక్షా పాత్రులలో ఎవరినీ మిగిలి ఉండనీయదు. తనకు వశమైన ప్రతివాణ్ణీ యాతనకు గురిచేయకుండానూ ఉండదు.

5. ఇక్కడ నుండి "నీ ప్రభువు సైన్యాలను స్వయంగా ఆయన తప్ప మరెవరూ ఎరుగరు" అనేంతవరకు గల పూర్తి విషయం ఒక అవాంతర వాక్యం. ప్రసంగం మధ్యలో గ్రంథక్రమాన్ని వదలిపెట్టి, అవిశ్వాసులు లేవనెత్తిన అభ్యంతరానికి సమాధానంగా అది చెప్పబడింది. నరకంలోని కార్యకర్తల సంఖ్య కేవలం పంథొమ్మిది మాత్రమే అని మహాప్రవక్త (సఅసమ్) చెప్పగా విని వారు దానిని ఎగతాళి చేయసాగారు. ఒకవైపేమో ప్రవక్త ఆదమ్ (అస్సలామ్) కాలం నుండి ప్రళయ కాలం వచ్చేవరకు ప్రపంచంలో ఎంతమంది మానవులు అవిశ్వాసానికి ఒడిగడతారో, మహా పాపాలు చేస్తారో, వారందరూ నరకంలో వేయబడతారు అని చెప్పడం. మరొక వైపేమో, ఇంత పెద్ద నరకంలో, అసంఖ్యాకమైన మానవులను శిక్షించటానికి కేవలం పంథొమ్మిది మంది కార్యకర్తలు

كُلُّ نَفْسٍۭ بِمَا كَسَبَتْ رَهِيْنَةٌ ﴿٣٨﴾ اِلَّآ
اَصْحٰبَ الْيَمِيْنِ ﴿٣٩﴾ فِيْ جَنّٰتٍ ۛ يَتَسَآءَلُوْنَ ﴿٤٠﴾ مع
عَنِ الْمُجْرِمِيْنَ ﴿٤١﴾ مَا سَلَكَكُمْ فِيْ سَقَرَ ﴿٤٢﴾
قَالُوْا لَمْ نَكُ مِنَ الْمُصَلِّيْنَ ﴿٤٣﴾ وَ لَمْ نَكُ
نُطْعِمُ الْمِسْكِيْنَ ﴿٤٤﴾ وَكُنَّا نَخُوْضُ مَعَ
الْخَآئِضِيْنَ ﴿٤٥﴾ وَ كُنَّا نُكَذِّبُ بِيَوْمِ
الدِّيْنِ ﴿٤٦﴾ حَتّٰٓى اَتٰىنَا الْيَقِيْنُ ﴿٤٧﴾ فَمَا
تَنْفَعُهُمْ شَفَاعَةُ الشّٰفِعِيْنَ ﴿٤٨﴾ فَمَا لَهُمْ عَنِ
التَّذْكِرَةِ مُعْرِضِيْنَ ﴿٤٩﴾ كَاَنَّهُمْ حُمُرٌ
مُّسْتَنْفِرَةٌ ﴿٥٠﴾ فَرَّتْ مِنْ قَسْوَرَةٍ ﴿٥١﴾ بَلْ يُرِيْدُ
كُلُّ امْرِئٍ مِّنْهُمْ اَنْ يُّؤْتٰى صُحُفًا مُّنَشَّرَةً ﴿٥٢﴾
كَلَّا ؕ بَلْ لَّا يَخَافُوْنَ الْاٰخِرَةَ ﴿٥٣﴾ كَلَّآ اِنَّهٗ
تَذْكِرَةٌ ﴿٥٤﴾ فَمَنْ شَآءَ ذَكَرَهٗ ﴿٥٥﴾ وَمَا
يَذْكُرُوْنَ اِلَّآ اَنْ يَّشَآءَ اللّٰهُ ؕ هُوَ اَهْلُ
التَّقْوٰى وَاَهْلُ الْمَغْفِرَةِ ﴿٥٦﴾ ع ٢ ٢٥ ١٦

**38 - 48** ప్రతి వ్యక్తీ తాను సంపాదించే దానికి తాకట్టుగా ఉంటాడు, స్వర్గవనాలలో ఉండే కుడిపక్షంవారు తప్ప. వారు అపరాధులను, "మిమ్మల్ని ఏ విషయం నరకంలోకి తీసుకు వెళ్ళింది?" అని అడుగుతారు.[9] దానికి వారు ఇలా అంటారు, "మేము నమాజు చేసేవారిలోని వారం కాము, నిరుపేదలకు అన్నం పెట్టేవాళ్ళం కాము, సత్యానికి వ్యతిరేకంగా మాటలు కల్పించే వారితో కలిసి మేము కూడ మాటలను కల్పించే వారము మరియు తీర్పుదినం అబద్ధమని చెప్పేవారము; చివరకు ఆ అనివార్య విషయం మాకు ఎదురయింది." అప్పుడు సిఫారసు చేసే వారి సిఫారసు, వారికి ఏ మాత్రం ఉపయోగపడదు.

**49 - 56** అసలు వారికేమయింది, ఈ హితబోధ నుండి ముఖం త్రిప్పుకుంటున్నారు, సింహాన్ని చూసి పారిపోయే అడవిగాడిదెల మాదిరిగా.[10] పైగా వారిలో ప్రతి ఒక్కడూ తన పేర బహిరంగ ఉత్తరాలు పంపబడాలని[11] కోరుతున్నాడు, ఎంతమాత్రం కాదు, అసలు విషయం ఏమిటంటే, వారికి పరలోక భయం ఏ మాత్రం లేదు. అలా[12] ఎన్నటికీ కాదు ఇదసలు ఒక హితబోధ. ఇక ఇష్టమైన వారు దీనినుండి గుణ పాఠం నేర్చుకోవచ్చు. అల్లాహ్ కోరితే తప్ప వీరు ఏ గుణ పాఠాన్నీ నేర్చుకోలేరు. ప్రజలు ఆయనకు భయపడాలి, దానికి ఆయన హక్కుదారుడు. (భయభక్తులు కలవారిని) ఆయన మన్నిస్తాడు, దానికి ఆయన అర్హుడు.

---

మాత్రమే నియమించబడ్డారు అనడం. ఈ విషయం వారికి ఎంతో వింతగా తోచింది.

6. దైవదూతలకు గల అసాధారణ శక్తులను గురించి గ్రంథ ప్రజలు, విశ్వాసులు బాగా ఎరుగుదురు. కనుక నరకలోక నిర్వహణకు, కేవలం పంధొమ్మిది మంది దైవదూతలు మాత్రమే సరిపోతారు అనే విషయం గురించి వారికి సందేహమే కలగదు.
7. అంటే, ఈ విధంగా ఎగతాళి చేయటానికి, ఇది గాలి కబురేమీ కాదు.
8. అంటే, చంద్రుడూ, రాత్రీ, పగలూ అల్లాహ్ శక్తిసామర్థ్యాలకు చక్కని ప్రతీకలు అయినట్లుగానే, నరకం కూడ ఆయన శక్తికి ఒక గొప్ప నిదర్శనం.
9. అంటే, స్వర్గంలో కూర్చొని వారు నరకవాసులతో మాట్లాడతారు, ఈ ప్రశ్నను అడుగుతారు.
10. ఇదొక అరబ్బీ జాతీయం. అడవిగాడిదల ప్రత్యేకత ఏమిటంటే, ప్రమాదాన్ని పసిగట్టగానే, అవి ప్రాన్పడి దిక్కుతోచక పారిపోతాయి, ఏ ఇతర జంతువూ ఇలా ప్రవర్తించదు.
11. అంటే, నిజంగానే అల్లాహ్ ముహమ్మద్ (సఅసమ్)ను ప్రవక్తగా నియమించినట్లయితే, ఆయన మక్కాలోని సర్దారుల పేర, షేకుల పేర, "ముహమ్మద్ (సఅసమ్) మా ప్రవక్త కనుక మీరు ఆయనను అనుసరించండి" అని ఉత్తరం వ్రాసి పంపాలి అని వారు కోర్తారు.
12. అంటే, వారి ఈ కోరికను నెరవేర్చటం ఎంతమాత్రం జరగదు.

ఆయతులు 40 | **75. అల్ ఖియామహ్** | అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 – 30** కాదు,[1] నేను ప్రళయదినం[2] సాక్షిగా చెబుతున్నాను; కాదు, నేను ప్రబోధించే అంతరాత్మ[3] సాక్షిగా చెబుతున్నాను; మేము మానవుని ఎముకలను జత చేయలేమని అతడు అనుకుంటున్నాడా? ఎందుకు జతచేయలేము? మేము అతని వ్రేళ్ల కొసలను సైతం సముచితమైన రీతిలో రూపొందించగల సమర్థులం. కాని మానవుడు ఇక ముందు కూడ దుష్కార్యాలు చేయగోరుతున్నాడు.[4] "ఆ ప్రళయదినం అసలు ఎప్పుడు వస్తుంది?" అని ప్రశ్నిస్తున్నాడు. ఆ తరువాత, కనుగుడ్లు తేల వేయటం జరిగినప్పుడు, చంద్రుడు కాంతిహీనుడైపోయినప్పుడు, సూర్యచంద్రులు ఒకటిగా కలిపివేయబడినప్పుడు, ఈ మానవుడే, "ఎక్కడకు పారిపోవాలి?" అని అంటాడు. ఎన్నటికీ జరగదు, అక్కడ ఎలాంటి ఆశ్రయమూ ఉండదు. ఆ రోజున నీ ప్రభువు వద్దకే పోయి ఆగవలసి ఉంటుంది. ఆ రోజున మానవుడికి అతడు ముందూ వెనుకా చేసిందీ, చేయించిందీ అంతా తెలుపబడుతుంది. అదీగాక, మానవుడు ఎన్ని సాకులు చెప్పినా, స్వయంగా అతనికే తనను గురించి బాగా తెలుసు.[5] – ఓ ప్రవక్తా![6] ఈ వహీని (సందేశాన్ని) త్వరత్వరగా జ్ఞాపకం చేసు కోవటానికి నీ నాలుకను ఆడించకు; దీనిని జ్ఞాపకం చేయించటం, చదివించటం మా బాధ్యత. కనుక మేము దీనిని పఠిస్తున్నప్పుడు, నీవు ఆ పారాయణాన్ని శ్రద్ధగా ఆలకించు. ఇంకా దాని భావం అర్థమయ్యేలా చేయటం కూడ మా బాధ్యతే– ఎంతమాత్రం కాదు,[7] అసలు విషయం ఏమిటంటే, మీరు త్వరగా లభ్యమయ్యే వస్తువుల పట్ల (అంటే ఇహలోకం పట్ల) వ్యామోహం పెంచుకుంటున్నారు; పరలోకాన్ని విడిచిపెడుతున్నారు. ఆ రోజున కొందరి ముఖాలు కళ కళలాడుతూ ఉంటాయి, తమ ప్రభువు వైపు చూస్తూ ఉంటారు, కొందరి ముఖాలు చిన్నబోయి ఉంటాయి, తమ పట్ల నడుములు విరిగే విధంగా వ్యవహరించ వచ్చుని వారు అనుకుంటూ ఉంటారు. ఎంతమాత్రం కాదు,[8] ప్రాణం గొంతు లోకి వచ్చినప్పుడు, మంత్రించి ఊదే వారెవరైనా ఉన్నారా అని అనబడినప్పుడు, ఇది ప్రపంచం నుండి వేరైపోయే సమయమని మనిషి తెలుసుకుంటాడు. ఒక కాలుతో మరొకకాలు కలిసి పోయినప్పుడు, అది నీ ప్రభువు వైపునకు తరలిపోయే రోజు అవుతుంది.

٧٥ سُوۡرَةُ الۡقِيٰمَةِ مَكِّيَّةٌ ٣١

اٰياتها ٤٠ | ركوعاتها ٢

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○

لَآ اُقۡسِمُ بِيَوۡمِ الۡقِيٰمَةِ ۙ﴿۱﴾ وَلَآ اُقۡسِمُ
بِالنَّفۡسِ اللَّوَّامَةِ ؕ﴿۲﴾ اَيَحۡسَبُ الۡاِنۡسَانُ اَلَّنۡ
نَّجۡمَعَ عِظَامَهٗ ؕ﴿۳﴾ بَلٰى قٰدِرِيۡنَ عَلٰٓى اَنۡ نُّسَوِّىَ
بَنَانَهٗ ﴿۴﴾ بَلۡ يُرِيۡدُ الۡاِنۡسَانُ لِيَفۡجُرَ
اَمَامَهٗ ۚ﴿۵﴾ يَسۡـَٔلُ اَيَّانَ يَوۡمُ الۡقِيٰمَةِ ؕ﴿۶﴾ فَاِذَا
بَرِقَ الۡبَصَرُ ۙ﴿۷﴾ وَخَسَفَ الۡقَمَرُ ۙ﴿۸﴾ وَجُمِعَ
الشَّمۡسُ وَالۡقَمَرُ ۙ﴿۹﴾ يَقُوۡلُ الۡاِنۡسَانُ يَوۡمَـئِذٍ
اَيۡنَ الۡمَفَرُّ ۚ﴿۱۰﴾ كَلَّا لَا وَزَرَ ؕ﴿۱۱﴾ اِلٰى رَبِّكَ
يَوۡمَـئِذِ اۨلۡمُسۡتَقَرُّ ؕ﴿۱۲﴾ يُنَبَّؤُا الۡاِنۡسَانُ يَوۡمَـئِذٍۢ بِمَا
قَدَّمَ وَاَخَّرَ ؕ﴿۱۳﴾ بَلِ الۡاِنۡسَانُ عَلٰى نَفۡسِهٖ
بَصِيۡرَةٌ ۙ﴿۱۴﴾ وَّلَوۡ اَلۡقٰى مَعَاذِيۡرَهٗ ؕ﴿۱۵﴾ لَا تُحَرِّكۡ
بِهٖ لِسَانَكَ لِتَعۡجَلَ بِهٖ ؕ﴿۱۶﴾ اِنَّ عَلَيۡنَا جَمۡعَهٗ وَ
قُرۡاٰنَهٗ ۚ﴿۱۷﴾ فَاِذَا قَرَاۡنٰهُ فَاتَّبِعۡ قُرۡاٰنَهٗ ۚ﴿۱۸﴾ ثُمَّ
اِنَّ عَلَيۡنَا بَيَانَهٗ ؕ﴿۱۹﴾ كَلَّا بَلۡ تُحِبُّوۡنَ
الۡعَاجِلَةَ ۙ﴿۲۰﴾ وَتَذَرُوۡنَ الۡاٰخِرَةَ ؕ﴿۲۱﴾ وُجُوۡهٌ
يَّوۡمَـئِذٍ نَّاضِرَةٌ ۙ﴿۲۲﴾ اِلٰى رَبِّهَا نَاظِرَةٌ ۚ﴿۲۳﴾ وَ
وُجُوۡهٌ يَّوۡمَـئِذٍۢ بَاسِرَةٌ ۙ﴿۲۴﴾ تَظُنُّ اَنۡ يُّفۡعَلَ بِهَا
فَاقِرَةٌ ؕ﴿۲۵﴾ كَلَّاۤ اِذَا بَلَغَتِ التَّرَاقِىَ ۙ﴿۲۶﴾ وَقِيۡلَ
مَنۡ ٚ رَاقٍ ۙ﴿۲۷﴾ وَّظَنَّ اَنَّهُ الۡفِرَاقُ ۙ﴿۲۸﴾ وَالۡتَفَّتِ
السَّاقُ بِالسَّاقِ ۙ﴿۲۹﴾ اِلٰى رَبِّكَ يَوۡمَـئِذِ اۨلۡمَسَاقُ ؕ﴿۳۰﴾ ع

فَلَا صَدَّقَ وَ لَا صَلّٰى ﴿٣١﴾ وَ لٰكِنۡ كَذَّبَ وَ
تَوَلّٰى ﴿٣٢﴾ ثُمَّ ذَهَبَ اِلٰٓى اَهۡلِهٖ يَتَمَطّٰى ﴿٣٣﴾ اَوۡلٰى
لَكَ فَاَوۡلٰى ﴿٣٤﴾ ثُمَّ اَوۡلٰى لَكَ فَاَوۡلٰى ﴿٣٥﴾ اَيَحۡسَبُ
الۡاِنۡسَانُ اَنۡ يُّتۡرَكَ سُدًى ﴿٣٦﴾ اَلَمۡ يَكُ نُطۡفَةً
مِّنۡ مَّنِىٍّ يُّمۡنٰى ﴿٣٧﴾ ثُمَّ كَانَ عَلَقَةً فَخَلَقَ
فَسَوّٰى ﴿٣٨﴾ فَجَعَلَ مِنۡهُ الزَّوۡجَيۡنِ الذَّكَرَ
وَالۡاُنۡثٰى ﴿٣٩﴾ اَلَيۡسَ ذٰلِكَ بِقٰدِرٍ عَلٰٓى اَنۡ يُّحۡـِۧىَ
الۡمَوۡتٰى ﴿٤٠﴾ ع ٢ ١٨

**31 - 35** కాని అతడు సత్యాన్నీ నమ్మలేదు, నమాజునూ చేయలేదు, అంతేకాదు తిరస్కరించి ముఖం తిప్పుకున్నాడు. ఆ తరువాత నిక్కుతూ, నీల్గుతూ తన ఇంటివారి దగ్గరకు వెళ్లిపోయాడు. ఈ వైఖరి నీకు మాత్రమే చెల్లుతుంది! నీకు మాత్రమే శోభిస్తుంది! అవును, ఈ వైఖరి నీకు మాత్రమే చెల్లుతుంది! నీకు మాత్రమే శోభిస్తుంది!

**36 - 40** మానవుడు తనను విచ్చలవిడిగా వదిలిపెట్టటం జరుగుతుందని భావిస్తున్నాడా?[9] అతడు (తల్లి గర్భంలో) కార్చబడిన నీచమైన ఒక నీటి బిందువుకాడా? తరువాత అతడు ఒక నెత్తుటి ముద్దగా మారాడు; ఆ తరువాత అల్లాహ్ అతని శరీరాన్ని తయారు చేశాడు; ఆపై అతని అవయవాలను రూపొందించాడు. అటుపై దానినుండి స్త్రీ పురుషుల రెండు రకాల (జాతుల)ను సృష్టించాడు. అలాంటప్పుడు ఆయన మరణించిన వారిని మళ్ళీ బ్రతికించలేడా?

1. ప్రసంగాన్ని 'కాదు'తో ప్రారంభించటం అనేది మొదటి నుండే ఒక విషయంపై చర్చ జరుగుతోందనీ, దానిని ఖండించేందుకే ఈ సూరా అవతరించిందనీ, ధ్రువపరుస్తోంది. కనుక ఇక్కడ 'కాదు' అనే దాని భావం మీరు అనుకునేది నిజం కాదు, అసలు విషయం ఇది అని నేను ప్రమాణం చేసి చెబుతున్నాను.
2. ప్రళయం రాకను గురించి స్వయంగా ప్రళయంపై ప్రమాణం చేసి చెప్పడమంటే దాని రాక తథ్యమని తెలుపటమే. ఈ విశ్వ వ్యవస్థ శాశ్వతమైనదీ, నిత్యమైనదీ కాదని స్వయంగా అదే సాక్ష్యమిస్తోంది. ఒకప్పుడు అది శూన్యం నుండి ఉనికి లోకి వచ్చింది. మరొకప్పుడు అది తప్పకుండా అంతమవుతుంది.
3. అంటే, అంతరాత్మ సాక్షిగా! మానవుడు తప్పుచేసినప్పుడు అంతరాత్మ అతనిని నిందిస్తుంది. అది మానవునిలో ఉండటం మానవుడు తన పనులను గురించి తానే సమాధానం చెప్పుకోవలసి ఉన్నది అనే విషయానికి సాక్ష్యం.
4. అంటే, ప్రళయ తిరస్కారానికి అసలు కారణం ఇదేగాని, ప్రళయం ఎంతమాత్రం రాదు, అది రావటం అసంభవం అని చెప్పటానికి తగిన సహేతుకమైన, శాస్త్రబద్ధమైన కారణం కాదు.
5. అంటే, మానవుని కర్మల పత్రాన్ని అతని ముందు ఉంచే ఉద్దేశ్యం, నేరస్తునికి అతని నేరం గురించి తెలియజెప్పటానికి కాదు. కాని అలా చేయటం ఎందుకు అవసరమవుతుందంటే, న్యాయస్థానంలో నేరానికి సంబంధించిన సాక్ష్యం ప్రవేశపెట్టకుండా న్యాయం అవసరాలు తీరవు. స్వయంగా తాను ఏమిటో ప్రతి మానవునికీ తెలుసు.
6. ఇక్కడ నుండి, "ఇంకా దాని భావం అర్థమయ్యేలా చేయటం కూడ మా బాధ్యతే" వరకు ఉన్న విషయం అంతా అవాంతరవాక్యమే. అది ప్రసంగక్రమాన్ని మార్చి మహాప్రవక్త (సఅసమ్)ను ఉద్దేశించి అనబడింది. జిబ్రీల్ (అస్సలామ్) మహాప్రవక్త (సఅసమ్)కు ఈ సూరాను వినిపించేటప్పుడు, ఆయన దానిని తాను మరచిపోతాననే భయంతో, మాటిమాటికీ వల్లించే ప్రయత్నం చేసేవారు.
7. అవాంతర వాక్యం చేత క్రమం తప్పిన ప్రధాన విషయం తిరిగి ప్రారంభించ బడుతోంది. "ఎంతమాత్రం కాదు" అనే దాని అర్థం ఏమిటంటే, మీరు పరలోకాన్ని కాదనటానికి అసలు కారణం మీరు సృష్టికర్తను ప్రళయాన్ని తీసుకువచ్చే విషయంలోనూ, మరణించిన వారిని తిరిగి బ్రతికించటంలోనూ నిస్సహాయుడని తలంచటం కాదు, కాని అసలు కారణం ఇది.
8. "ఎంతమాత్రం కాదు" అనే విషయం పైనుంచి వస్తూ ఉన్న ప్రసంగ క్రమానికి సంబంధించింది. అంటే మీరు మరణించి రూపుమాసిపోతారనే, మీ ప్రభువు కడకు తిరిగిరారనే మీ ఆలోచన తప్పుడు ఆలోచన.
9. అసలు 'సుదా' అనే పదం వాడబడింది. అరబ్బీ భాషలో "ఇబిలున్ సుదా" అని, అచ్చుపోసిన ఆంబోతు మాదిరిగా తిరిగే, ఎక్కడ పడితే అక్కడ మేసే, ఆలనాపాలనా చూసేవారెవరూ లేని ఒంటెను అంటారు.

ఆయతులు 31 | **76. అద్ దహ్ర్** | అవతరణ మదీనాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 3** అనంతమైన కాలంలో మానవుడు చెప్పుకోదగిన వస్తువు కాకుండా ఉండిన సమయం ఏదైనా అతనిపై గడిచిందా?[1] మేము మానవుణ్ణి పరీక్షించటానికి అతనిని ఒక మిశ్రమ వీర్యబిందువుతో సృష్టించాము. ఈ లక్ష్యం కోసం మేము అతనిని వినేవాడుగా, చూసేవాడుగా చేశాము.[2] మేము అతనికి మార్గం చూపాము. ఇక అతను కృతజ్ఞతలు తెలిపే వాడైనా కావచ్చు లేదా సత్యాన్ని తిరస్కరించే వాడైనా కావచ్చు.[3]

**4 - 22** సత్యతిరస్కారుల కొరకు మేము సంకెళ్లను, కంఠపాశాలను, మండే అగ్నిని సిద్ధపరచి ఉంచాము. సజ్జనులు (స్వర్గంలో) కర్పూర జలం కలిపిన మధుపాత్రలను సేవిస్తారు; ఇది ప్రవహించే ఒక సెలయేరు; దైవదాసులు దాని నీటితో పాటు మద్యం సేవిస్తారు. వారు తాము కోరిన చోటికి దాని పాయలను సులభంగా తీసుకుపోతారు. వారు ఎలాంటి వారంటే, (ప్రపంచంలో) మొక్కుబడి[4] చెల్లించేవారు, నలువైపుల నుండి ఆపదలు కమ్ముకొనివచ్చే దినానికి భయపడేవారు మరియు అల్లాహ్ మీది ప్రేమతో పేదలకూ, అనాధులకూ, ఖైదీలకూ అన్నం పెట్టేవారు. (వారు వారితో ఇలా అంటారు), "మేము కేవలం అల్లాహ్ కోసమే మీకు అన్నం పెడుతున్నాము. మేము మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్నిగానీ, కృతజ్ఞతలనుగానీ ఆశించటంలేదు.

٧٦ سُوْرَةُ الدَّهْرِ مَدَنِيَّةٌ ٩٨

اٰيَاتُهَا ٣١ | رُكُوْعَاتُهَا ٢

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

هَلْ اَتٰى عَلَى الْاِنْسَانِ حِيْنٌ مِّنَ الدَّهْرِ لَمْ
يَكُنْ شَيْـًٔا مَّذْكُوْرًا ١ اِنَّا خَلَقْنَا الْاِنْسَانَ
مِنْ نُّطْفَةٍ اَمْشَاجٍ ۖ نَّبْتَلِيْهِ فَجَعَلْنٰهُ سَمِيْعًا
بَصِيْرًا ٢ اِنَّا هَدَيْنٰهُ السَّبِيْلَ اِمَّا شَاكِرًا وَّ
اِمَّا كَفُوْرًا ٣ اِنَّاۤ اَعْتَدْنَا لِلْكٰفِرِيْنَ سَلٰسِلَا۠
وَاَغْلٰلًا وَّسَعِيْرًا ٤ اِنَّ الْاَبْرَارَ يَشْرَبُوْنَ
مِنْ كَاْسٍ كَانَ مِزَاجُهَا كَافُوْرًا ٥ عَيْنًا
يَّشْرَبُ بِهَا عِبَادُ اللّٰهِ يُفَجِّرُوْنَهَا تَفْجِيْرًا ٦
يُوْفُوْنَ بِالنَّذْرِ وَيَخَافُوْنَ يَوْمًا كَانَ شَرُّهٗ
مُسْتَطِيْرًا ٧ وَ يُطْعِمُوْنَ الطَّعَامَ عَلٰى حُبِّهٖ
مِسْكِيْنًا وَّيَتِيْمًا وَّاَسِيْرًا ٨ اِنَّمَا نُطْعِمُكُمْ
لِوَجْهِ اللّٰهِ لَا نُرِيْدُ مِنْكُمْ جَزَآءً وَّلَا
شُكُوْرًا ٩

1. ప్రశ్నించటం దీని ఉద్దేశ్యం కాదు. కాని అతని విషయంలో అటువంటి కాలం ఒకటి గడచింది అనే విషయాన్ని మానవుడు ఒప్పుకునేలా చేయటం; తరువాత, ఒకసారి అతని ఉనికేలేనప్పుడు అతను సృష్టించబడ్డాడు, అలాంటప్పుడు మరణించిన పిమ్మట మళ్లీ అతనిని బ్రతికించటం ఎలా అసంభవం అనే విషయాన్ని గురించి అతను ఆలోచించేలా చేయటం.
2. అంటే, అతనిని ఆలోచనాపరునిగా చేశాము.
3. అంటే, అవిశ్వాస, కృతజ్ఞతలలో తనకు ఇష్టమైన దానిని అవలంబించే స్వేచ్ఛను ఇస్తూ, అవిశ్వాసమార్గం ఏదో, కృతజ్ఞతా మార్గం ఏదో అతనికి తెలియజేశాము.
4. మొక్కుబడి అంటే, మనిషి దేవుని ప్రసన్నతకై నిత్య విధులకు మించి సత్కార్యం చేస్తానని దేవునితో వాగ్దానం చేయటం.

దుర్భరమైన ఆపదలతో కూడుకున్న సుదీర్ఘమైన రోజున మా ప్రభువు విధించే శిక్ష గురించి మేము భయపడుతున్నాము.” కనుక అల్లాహ్ వారిని ఆనాటి కీడు నుండి రక్షిస్తాడు, వారికి తాజాదనాన్నీ, ఆనందాన్నీ ప్రసాదిస్తాడు. వారి సహనానికి[5] ప్రతిఫలంగా వారికి స్వర్గాన్నీ, పట్టు వస్త్రాలనూ ప్రసాదిస్తాడు. అక్కడ వారు ఎత్తైన పీఠాలపై దిండ్లకు ఆనుకుని కూర్చొని ఉంటారు. వారిని ఎండవేడీ బాధించదు. చలి తీవ్రతా వేధించదు. స్వర్గచ్ఛాయలు వారిపైకి వంగి నీడను ఇస్తూ ఉంటాయి, దాని పండ్లు ఎల్లవేళలా వారికి అందుబాటులో ఉంటాయి (వారు తమ ఇష్టానుసారం వాటిని తెంచుకొని తింటారు). వారి మధ్య వెండి పాత్రలు,[6] గాజు గ్లాసులు అటూ ఇటూ త్రిప్పబడుతూ ఉంటాయి; ఆ గాజుగ్లాసులు స్ఫటికం వలె తెల్లనైన వెండితో చేయబడినటువంటివి.[7] వాటిని (స్వర్గ నిర్వాహకులు) కచ్చితమైన అంచనా ప్రకారం నింపి ఉంటారు. అక్కడ వారికి సొంటి[8] కలిపిన మధుపాత్రలు ఇవ్వబడతాయి; ఇది స్వర్గంలోని 'సల్ సబీల్' అనే పేరుగల ఒక సెలయేరు. వారి సేవకొరకు పరుగెత్తుతూ అటూ ఇటూ తిరిగే బాలురు ఉంటారు; వారు ఎల్లప్పుడూ బాలురు గానే ఉంటారు. మీరు వారిని చూస్తే, వెదజల్లబడిన ఆణిముత్యాలా అని అనుకుంటారు. అక్కడ మీరు ఎటు చూచినా దైవానుగ్రహాలే మీకు కనిపిస్తాయి; ఇంకా ఒక మహత్తర సామ్రాజ్య వైభవం కనిపిస్తుంది. వారి ఒంటిపై సన్నని ఆకుపచ్చని పట్టు వస్త్రాలు, ఖరీదైన జలతారు అల్లిన దుస్తులు ఉంటాయి. వారికి వెండి[9] మురుగులు తొడుగుతారు. వారి ప్రభువు వారికి ఎంతో పరిశుద్ధమైన మద్యాన్ని ప్రసాదిస్తాడు. మీకు లభించే ప్రతిఫలం ఇది; మీరు చేసిన పనులు విలువైనవిగా గుర్తించబడ్డాయి.

**23 - 31** ఓ ప్రవక్తా! మేమే ఈ ఖుర్ఆన్‌ను కొంచెం కొంచెంగా నీపైన అవతరింపజేశాము.[10] కనుక నీవు నీ ప్రభువు ఆజ్ఞ విషయంలో సహనం[11] వహించు. వారిలోని ఏ దుర్మార్గుని మాటలుగానీ, ఏ సత్య తిరస్కారి మాటలు గానీ వినకు. నీ ప్రభువు పేరును ఉదయం, సాయంత్రం స్మరించు. రాత్రివేళ కూడ ఆయన సన్నిధిలో సాష్టాంగపడు. రాత్రివేళ సుదీర్ఘ సమయాలు ఆయనను స్తుతించటంలో గడుపుతూ ఉండు.[12] వారైతే తొందరగా లభించే దానిని (ప్రపంచాన్ని) ప్రేమిస్తున్నారు. ముమ్ముందు రానున్న భారమైన దినాన్ని విస్మరిస్తున్నారు.

إِنَّا نَخَافُ مِن رَّبِّنَا يَوْمًا عَبُوسًا قَمْطَرِيرًا ﴿١٠﴾
فَوَقَىٰهُمُ ٱللَّهُ شَرَّ ذَٰلِكَ ٱلْيَوْمِ وَلَقَّىٰهُمْ نَضْرَةً
وَسُرُورًا ﴿١١﴾ وَجَزَىٰهُم بِمَا صَبَرُوا۟ جَنَّةً
وَحَرِيرًا ﴿١٢﴾ مُّتَّكِـِٔينَ فِيهَا عَلَى ٱلْأَرَآئِكِ لَا
يَرَوْنَ فِيهَا شَمْسًا وَلَا زَمْهَرِيرًا ﴿١٣﴾ وَدَانِيَةً
عَلَيْهِمْ ظِلَٰلُهَا وَذُلِّلَتْ قُطُوفُهَا تَذْلِيلًا ﴿١٤﴾
وَيُطَافُ عَلَيْهِم بِـَٔانِيَةٍ مِّن فِضَّةٍ وَأَكْوَابٍ
كَانَتْ قَوَارِيرَا۠ ﴿١٥﴾ قَوَارِيرَا۟ مِن فِضَّةٍ
قَدَّرُوهَا تَقْدِيرًا ﴿١٦﴾ وَيُسْقَوْنَ فِيهَا كَأْسًا
كَانَ مِزَاجُهَا زَنجَبِيلًا ﴿١٧﴾ عَيْنًا فِيهَا تُسَمَّىٰ
سَلْسَبِيلًا ﴿١٨﴾ وَيَطُوفُ عَلَيْهِمْ وِلْدَٰنٌ
مُّخَلَّدُونَ إِذَا رَأَيْتَهُمْ حَسِبْتَهُمْ لُؤْلُؤًا
مَّنثُورًا ﴿١٩﴾ وَإِذَا رَأَيْتَ ثَمَّ رَأَيْتَ نَعِيمًا وَ
مُلْكًا كَبِيرًا ﴿٢٠﴾ عَٰلِيَهُمْ ثِيَابُ سُندُسٍ خُضْرٌ
وَإِسْتَبْرَقٌ وَحُلُّوٓا۟ أَسَاوِرَ مِن فِضَّةٍ
وَسَقَىٰهُمْ رَبُّهُمْ شَرَابًا طَهُورًا ﴿٢١﴾ إِنَّ هَٰذَا
كَانَ لَكُمْ جَزَآءً وَكَانَ سَعْيُكُم مَّشْكُورًا ﴿٢٢﴾
إِنَّا نَحْنُ نَزَّلْنَا عَلَيْكَ ٱلْقُرْءَانَ تَنزِيلًا ﴿٢٣﴾
فَٱصْبِرْ لِحُكْمِ رَبِّكَ وَلَا تُطِعْ مِنْهُمْ ءَاثِمًا أَوْ
كَفُورًا ﴿٢٤﴾ وَٱذْكُرِ ٱسْمَ رَبِّكَ بُكْرَةً وَأَصِيلًا ﴿٢٥﴾
وَمِنَ ٱلَّيْلِ فَٱسْجُدْ لَهُۥ وَسَبِّحْهُ لَيْلًا
طَوِيلًا ﴿٢٦﴾ إِنَّ هَٰٓؤُلَآءِ يُحِبُّونَ ٱلْعَاجِلَةَ وَ
يَذَرُونَ وَرَآءَهُمْ يَوْمًا ثَقِيلًا ﴿٢٧﴾

قرء حفص بغير الالف في الوصل فيهما ووقف على الاول بالالف وعلى الثاني بغير الالف ١٢

نَحۡنُ خَلَقۡنٰهُمۡ وَ شَدَدۡنَاۤ اَسۡرَهُمۡ ۚ وَ اِذَا شِئۡنَا بَدَّلۡنَاۤ اَمۡثَالَهُمۡ تَبۡدِیۡلًا ﴿۲۸﴾ اِنَّ هٰذِهٖ تَذۡکِرَۃٌ ۚ فَمَنۡ شَآءَ اتَّخَذَ اِلٰی رَبِّهٖ سَبِیۡلًا ﴿۲۹﴾ وَ مَا تَشَآءُوۡنَ اِلَّاۤ اَنۡ یَّشَآءَ اللّٰهُ ؕ اِنَّ اللّٰهَ کَانَ عَلِیۡمًا حَکِیۡمًا ﴿۳۰﴾ یُّدۡخِلُ مَنۡ یَّشَآءُ فِیۡ رَحۡمَتِهٖ ؕ وَ الظّٰلِمِیۡنَ اَعَدَّ لَهُمۡ عَذَابًا اَلِیۡمًا ﴿۳۱﴾

మేమే వారిని సృష్టించాము, వారి కీళ్లను పటిష్ఠపరిచాము. మేము ఎప్పుడు కోరితే అప్పుడు వారి రూపాలను మార్చ గలము. ఇదొక హితోపదేశం. ఇప్పుడిక ఇష్టమైన వారు తమ ప్రభువు వైపునకు పోయే మార్గాన్ని అవలంబించవచ్చు. అల్లాహ్ కోరనంత వరకు, మీరు కోరినంత మాత్రాన ఏమీకాదు. నిశ్చయంగా అల్లాహ్ గొప్ప జ్ఞాని, గొప్ప వివేకి; తాను కోరిన వారిని తన కారుణ్యచ్ఛాయలోనికి తీసుకుంటాడు. దుర్మార్గుల కొరకు ఆయన అత్యంత బాధాకరమైన శిక్షను తయారుచేసి ఉంచాడు.

5. విశ్వసించిన తరువాత, ఒక మనిషి తాను మరణించేవరకు దేవుని ఆజ్ఞలను శిరసావహించటం, దేవుని యెడ అవిధేయతకు పాల్పడకుండా ఉండటం – ఈ అర్థంలో సహనం అనే పదం ఇక్కడ ఉపయోగించబడింది.

6. జుఖ్రుఫ్ సూరాలోని 71వ ఆయతులో, వారి ముందు బంగారు పాత్రలు తిరుగుతూ ఉంటాయి అని చెప్పబడింది. అక్కడ ఒకప్పుడు బంగారు పాత్రలు, మరొకప్పుడు వెండిపాత్రలు ఉపయోగించబడతాయి అనే విషయం దీని ద్వారా తెలుస్తోంది.

7. అంటే, అవి వెండితో చేయబడినవైనా, గాజు సీసాలవలె స్వచ్ఛమైనవి.

8. అరబ్బులు సారాయితో పాటు సొంటి కలిపిన నీటిని ఎక్కువ ఇష్టంతో త్రాగేవారు. కనుక స్వర్గంలో కూడ వారికి సొంటి కలిపిన సారాయే త్రాగిస్తారు.

9. హజ్ సూరాలోని 23వ ఆయతులోనూ, ఫాతిర్ సూరాలోని 33వ ఆయతులోనూ వారికి అక్కడ బంగారు కంకణాలు తొడుగుతారు అని చెప్పబడింది. దీనినిబట్టి, తమ అభిరుచి అభిలాషల ననుసరించి, వారు బంగారు కంకణాలను గానీ, వెండి కంకణాలను గానీ, రెంటినీ కలిపి గానీ ధరిస్తారు అని తెలుస్తోంది.

10. ఇక్కడ స్థూలంగా మహాప్రవక్త (సఅసమ్)యే సంబోధితులు. కాని అసలు అవిశ్వాసులు లేవనెత్తిన ఒక అభ్యంతరానికి సమాధానం ఇవ్వబడుతోంది. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) ఈ ఖురాన్‌ను ఆలోచించి స్వయంగా వ్రాస్తున్నారు. ఒకవేళ అల్లాహ్ తరఫు నుండి ఏదైనా ఫర్మానా వస్తే, అది ఒకే మారుగా ఒకే రాశిగా వచ్చి ఉండేది.

11. అంటే, నీ ప్రభువు ఏ మహత్తర కార్యసాధనకై నిన్ను నియోగించాడో, దాని నిర్వహణలో ఎదురయ్యే కష్టనష్టాలను సహించు. నీపైకి ఏది వచ్చినా అదురూ బెదురూ లేకుండా ధైర్యంతో ముందుకు పో.

12. అల్లాహ్‌ను స్మరించమనే ఆదేశం కాల నిర్ణయంతో ఇవ్వబడినప్పుడు, దాని అర్థం నమాజు అవుతుంది. ఈ ఆయతులో ముందుగా ఇలా అనబడింది: "వజ్‌కురిస్మరబ్బిక బుక్‌రతన్ వ్వ అసీలా." అరబ్బీ భాషలో ఉద యాన్ని "బుక్‌రహ్" అంటారు. "అసీలా" అనే పదం పొద్దు వాలిన దగ్గర నుండి సూర్యాస్తమయం వరకు గల కాలాన్ని సూచించటానికి ఉపయోగిస్తారు. ఆ కాలంలో జుహర్, అసర్ నమాజుల సమయాలు ఉన్నాయి. తరువాత ఇలా అనబడింది: "వమినల్లయ్‌లిఫస్ జుద్‌లహూ." రాత్రివేళ సూర్యాస్తమయం తరువాత ప్రారంభ మవుతుంది. ఇందుచేత రాత్రిపూట సజ్దా చేయండి అనే ఆజ్ఞలో, మగ్రిబ్, ఇషా నమాజులు రెండూ చేరి ఉ న్నాయి. దీని తరువాత రాత్రివేళ ఎక్కువ కాలం అల్లాహ్‌ను స్తుతించండి అనేది "తహజ్జుద్" నమాజును స్పష్టంగా సూచిస్తుంది.

آياتها ٥٠ | ٧٧ سُوْرَةُ الْمُرْسَلٰتِ مَكِّيَّةٌ ٣٣ | ركوعاتها ٢

## ఆయతులు 50 | 77. అల్ ముర్సలాత్ | అవతరణ మక్కాలో

బِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

وَالْمُرْسَلٰتِ عُرْفًا ۙ﴿١﴾ فَالْعٰصِفٰتِ عَصْفًا ۙ﴿٢﴾
وَّالنّٰشِرٰتِ نَشْرًا ۙ﴿٣﴾ فَالْفٰرِقٰتِ فَرْقًا ۙ﴿٤﴾
فَالْمُلْقِيٰتِ ذِكْرًا ۙ﴿٥﴾ عُذْرًا اَوْ نُذْرًا ۙ﴿٦﴾ اِنَّمَا
تُوْعَدُوْنَ لَوَاقِعٌ ؕ﴿٧﴾ فَاِذَا النُّجُوْمُ طُمِسَتْ ۙ﴿٨﴾ وَ
اِذَا السَّمَآءُ فُرِجَتْ ۙ﴿٩﴾ وَ اِذَا الْجِبَالُ
نُسِفَتْ ۙ﴿١٠﴾ وَ اِذَا الرُّسُلُ اُقِّتَتْ ؕ﴿١١﴾ لِاَيِّ يَوْمٍ
اُجِّلَتْ ؕ﴿١٢﴾ لِيَوْمِ الْفَصْلِ ۚ﴿١٣﴾ وَمَآ اَدْرٰىكَ مَا
يَوْمُ الْفَصْلِ ؕ﴿١٤﴾ وَيْلٌ يَّوْمَئِذٍ لِّلْمُكَذِّبِيْنَ ﴿١٥﴾
اَلَمْ نُهْلِكِ الْاَوَّلِيْنَ ؕ﴿١٦﴾ ثُمَّ نُتْبِعُهُمُ
الْاٰخِرِيْنَ ﴿١٧﴾ كَذٰلِكَ نَفْعَلُ بِالْمُجْرِمِيْنَ ﴿١٨﴾
وَيْلٌ يَّوْمَئِذٍ لِّلْمُكَذِّبِيْنَ ﴿١٩﴾

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 7** ఒకదాని తరువాత ఒకటి వరుసగా పంపబడే వాటి (గాలులు) సాక్షిగా! అవి తుఫాను వేగంతో వీస్తాయి మరియు (మేఘాలను) లేపి వ్యాపింపజేస్తాయి, తరువాత (వాటిని) చీల్చి వేరుచేస్తాయి, అటుపై (హృదయాలలో దేవుని) జ్ఞాపకాన్ని జనింపజేస్తాయి– సాకుగా కాని లేదా హెచ్చరికగా కాని.[1] ఏ విషయం గురించి మీకు వాగ్దానం చేయబడుతోందో, అది తప్పనిసరిగా జరగవలసి ఉన్నది.[2]

**8 - 15** ఎప్పుడైతే నక్షత్రాల కాంతి మందగిస్తుందో, ఆకాశం చీల్చివేయబడుతుందో, పర్వతాలు తుత్తునియలుగా చేయబడతాయో దైవప్రవక్తలు హాజరయ్యే సమయం వస్తుందో[3] (ఆ రోజున అది సంభవిస్తుంది). ఏ రోజుకై ఈ పనులన్నీ ఆపి ఉంచబడ్డాయి? తీర్పు దినానికై. ఆ తీర్పు దినమంటే ఏమిటో నీకేమి తెలుసు? ఆ రోజున సత్యతిరస్కారులకు వినాశం కలుగుతుంది.

**16 - 19** మేము పూర్వీకులను నాశనం చేయలేదా? తరువాత మేము రాబోవు వారిని కూడ వారి వెనుకనే పంపుతాము. నేరస్థుల పట్ల మేము ఇలానే వ్యవహరిస్తూ ఉంటాము. సత్య తిరస్కారులకు ఆరోజున వినాశం కలుగుతుంది.[4]

1. అంటే, ఎప్పుడైనా గాలుల రాకకు విఘాతం కలిగి, కరువుకాటకాల ప్రమాద పరిస్థితులు ఉత్పన్నమైనప్పుడు, ప్రజలు భయభ్రాంతులై తమ తప్పులకు పశ్చాత్తాపపడుతూ అల్లాహ్ వైపునకు మరలుతారు. మరొకప్పుడు ఆ గాలులే సకాలంలో వర్షపు కారుణ్యాన్ని తీసుకువచ్చినప్పుడు, ప్రజలు అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపుకుంటారు. వేరొకప్పుడు పెనుగాలుల తీవ్రత వల్ల ప్రజలు భయకంపితులవుతారు, వినాశనానికి భయపడి అల్లాహ్ వైపునకు మరలుతారు.
2. అంటే, ప్రళయం రావటం నిశ్చయమనే విషయాన్ని ఈ గాలుల వ్యవస్థ ధ్రువీకరిస్తుంది. గాలి ప్రాణికి జీవనాధారమే, కాని అల్లాహ్ తాను కోరినప్పుడు దానిని వినాశసాధనంగా చేస్తాడు.

**20 - 24** మేము తుచ్ఛమైన నీటితో మిమ్మల్ని పుట్టించలేదా? ఒక నిర్ణీత కాలం వరకు దానిని ఒక సురక్షిత ప్రదేశంలో నిలిపి ఉంచలేదా? చూడండి మేము దీనిని చేయగల సామర్థ్యాన్ని కలిగి ఉన్నాము. కనుక మేము ఎంతో గొప్ప శక్తి సామర్థ్యాలు కలవారము, సత్య తిరస్కారులకు ఆ రోజున వినాశం కలుగుతుంది.[5]

**25 - 28** భూమిని మేము జీవులను, నిర్జీవులను సమీకరించే స్థానంగా చేయలేదా? అందులో ఎత్తైన పర్వతాలను అమర్చలేదా? మీకు త్రాగటానికి మంచి నీరు ప్రసాదించలేదా? ఆ రోజున సత్య తిరస్కారులకు వినాశం కలుగుతుంది.[6]

**29 - 34** ఇక పదండి,[7] మీరు తిరస్కరిస్తూ ఉండిన దాని వైపునకే. నడవండి, మూడు శాఖలుగా చీలిపోయే నీడ వైపునకు[8]– అది చల్లదనాన్ని ఇచ్చేదీకాదు, అగ్ని బారినుండి రక్షించేదీ కాదు, ఆ అగ్ని, మేడల వంటి పెద్ద పెద్ద రవ్వలను విసురుతుంది. ఆ రవ్వలు (ఎగురుతూ) పసుపుపచ్చని ఒంటెలవలె కనిపిస్తాయి. ఆ రోజున సత్య తిరస్కారులకు వినాశం కలుగుతుంది.

اَلَمْ نَخْلُقْكُّمْ مِّنْ مَّآءٍ مَّهِيْنٍ ﴿٢٠﴾ فَجَعَلْنٰهُ فِیْ
قَرَارٍ مَّكِيْنٍ ﴿٢١﴾ اِلٰی قَدَرٍ مَّعْلُوْمٍ ﴿٢٢﴾
فَقَدَرْنَا ۖ فَنِعْمَ الْقٰدِرُوْنَ ﴿٢٣﴾ وَيْلٌ يَّوْمَئِذٍ
لِّلْمُكَذِّبِيْنَ ﴿٢٤﴾ اَلَمْ نَجْعَلِ الْاَرْضَ كِفَاتًا ﴿٢٥﴾
اَحْيَآءً وَّاَمْوَاتًا ﴿٢٦﴾ وَّ جَعَلْنَا فِيْهَا رَوَاسِیَ
شٰمِخٰتٍ وَّ اَسْقَيْنٰكُمْ مَّآءً فُرَاتًا ﴿٢٧﴾ وَيْلٌ
يَّوْمَئِذٍ لِّلْمُكَذِّبِيْنَ ﴿٢٨﴾ اِنْطَلِقُوْٓا اِلٰی مَا كُنْتُمْ
بِهٖ تُكَذِّبُوْنَ ﴿٢٩﴾ اِنْطَلِقُوْٓا اِلٰی ظِلٍّ ذِیْ ثَلٰثِ
شُعَبٍ ﴿٣٠﴾ لَّا ظَلِيْلٍ وَّ لَا يُغْنِیْ مِنَ اللَّهَبِ ﴿٣١﴾
اِنَّهَا تَرْمِیْ بِشَرَرٍ كَالْقَصْرِ ﴿٣٢﴾ كَاَنَّهٗ جِمٰلَتٌ
صُفْرٌ ﴿٣٣﴾ وَيْلٌ يَّوْمَئِذٍ لِّلْمُكَذِّبِيْنَ ﴿٣٤﴾

---

3. తీర్పుదినం నాడు సర్వమానవుల విషయం ప్రస్తావనకు వచ్చినప్పుడు, ప్రవక్తలందరూ వచ్చి తాము అల్లాహ్ సందేశాన్ని తమ ప్రజలకు అందజేశామనే విషయం గురించి సాక్ష్యమిస్తారని దివ్య ఖురాన్‌లో పలుచోట్ల చెప్పబడింది.
4. ఇక్కడ ఈ వాక్యం ఈ అర్థంలో వాడబడింది : ఈ లోకంలో వారికి పట్టినగతి లేక పట్టబోయే గతి వారి అసలు శిక్ష కాదు. కాని తీర్పుదినం నాడు వారు పొందే శిక్షయే వారికి అసలైన శిక్ష.
5. అంటే, మరణానంతర జీవితం సాధ్యమని చెప్పే స్పష్టమైన ఆధారం వారి ముందు ఉన్నా, దానిని తిరస్కరించేవారు ఆనాడు వినాశం పాలవుతారు.
6. అంటే, దేవుని శక్తీ వివేకాల లీలలను చూచి కూడా, పరలోకం ఉన్నదనే విషయం సాధ్యమే, సహేతుకమే అనేదాన్ని తిరస్కరించేవారు, తమ ఈ ఊహాలోకాలలో విహరించదలిస్తే విహరించవచ్చు. ఏ రోజున ఇదంతా వారి ఆశలకు భిన్నంగా జరుగుతుందో, ఆ రోజున తాము ఈ తెలివితక్కువ పని చేసి చేజేతులా తమ వినాశాన్ని తామే కొనితెచ్చుకున్న విషయాన్ని వారు తెలుసుకుంటారు.
7. పరలోకం గురించి ఆధారాలు చూపిన తరువాత, అది నిజంగానే వచ్చినప్పుడు, తిరస్కారుల గతి ఏమవుతుందో చెప్పబడుతోంది.
8. నీడ అంటే, పొగ యొక్క నీడ అని అర్థం. మూడు శాఖల అర్థం ఏమిటంటే, పొగ పెద్ద మొత్తంలో పైకిపోయినప్పుడు, అక్కడ అది ఎన్నో శాఖలుగా విడి పోతుంది.

هٰذَا يَوْمُ لَا يَنْطِقُوْنَ ﴿٣٥﴾ وَ لَا يُؤْذَنُ لَهُمْ
فَيَعْتَذِرُوْنَ ﴿٣٦﴾ وَيْلٌ يَّوْمَئِذٍ لِّلْمُكَذِّبِيْنَ ﴿٣٧﴾
هٰذَا يَوْمُ الْفَصْلِ ۚ جَمَعْنٰكُمْ وَالْاَوَّلِيْنَ ﴿٣٨﴾
فَاِنْ كَانَ لَكُمْ كَيْدٌ فَكِيْدُوْنِ ﴿٣٩﴾ وَيْلٌ يَّوْمَئِذٍ
لِّلْمُكَذِّبِيْنَ ﴿٤٠﴾ اِنَّ الْمُتَّقِيْنَ فِيْ ظِلٰلٍ وَّ ع ١ ٢١
عُيُوْنٍ ﴿٤١﴾ وَّ فَوَاكِهَ مِمَّا يَشْتَهُوْنَ ﴿٤٢﴾ كُلُوْا
وَاشْرَبُوْا هَنِيْٓـًٔا بِمَا كُنْتُمْ تَعْمَلُوْنَ ﴿٤٣﴾ اِنَّا
كَذٰلِكَ نَجْزِي الْمُحْسِنِيْنَ ﴿٤٤﴾ وَيْلٌ يَّوْمَئِذٍ
لِّلْمُكَذِّبِيْنَ ﴿٤٥﴾ كُلُوْا وَتَمَتَّعُوْا قَلِيْلًا اِنَّكُمْ
مُّجْرِمُوْنَ ﴿٤٦﴾ وَيْلٌ يَّوْمَئِذٍ لِّلْمُكَذِّبِيْنَ ﴿٤٧﴾ وَ
اِذَا قِيْلَ لَهُمُ ارْكَعُوْا لَا يَرْكَعُوْنَ ﴿٤٨﴾ وَيْلٌ
يَّوْمَئِذٍ لِّلْمُكَذِّبِيْنَ ﴿٤٩﴾ فَبِاَيِّ حَدِيْثٍۢ بَعْدَهٗ
يُؤْمِنُوْنَ ﴿٥٠﴾ ع ٢ ٢٢

**35 – 37** వారు ఏమీ మాట్లాడలేని రోజు, వారికి సాకులు చెప్పుకునే అవకాశం సైతం ఇవ్వబడని రోజు[9] ఇదే. ఆ రోజున సత్య తిరస్కారులకు వినాశం కలుగుతుంది.

**38 – 40** ఇది తీర్పు దినం. మేము మిమ్మల్నీ, మీకు పూర్వం గతించిన వారినీ సమావేశపరిచాము. ఇప్పుడు మీరు గనుక నాకు వ్యతిరేకంగా ఏదైనా పన్నాగం పన్నగలిగితే, పన్ని చూడండి. ఆ రోజున సత్య తిరస్కారు లకు వినాశం కలుగు తుంది.

**41 – 45** దైవభీతి కలవారు ఈ రోజున నీడల క్రింద సెలయేళ్ల మధ్య ఉన్నారు. వారు ఏ పండ్లు కోరినా (అవి వారి కొరకు సిద్ధంగా ఉన్నాయి). హాయిగా తినండి, త్రాగండి, మీరు చేస్తూ ఉండిన కర్మలకు ప్రతిఫలంగా. మేము సజ్జనులకు ఇటువంటి ప్రతిఫలాన్నే ఇస్తూ ఉంటాము. ఆ రోజున సత్య తిరస్కారులకు వినాశం కలుగుతుంది.

**46 – 50** కొన్నాళ్లపాటు హాయిగా తినండి,[10] సుఖంగా అనుభవించండి. నిజానికి మీరు అపరాధులు. ఆ రోజున సత్యతిరస్కారులకు వినాశం కలుగుతుంది. వారితో "(అల్లాహ్ ముందు) తలవంచండి" అని అన్నప్పుడు, వారు తలవంచరు. ఆ రోజున సత్యతిరస్కారులకు వినాశం కలుగుతుంది. ఇక దీని (ఖుర్ఆన్) తరువాత, మరొక విషయమేముంటుంది వారు విశ్వసించటానికి?

9. అంటే, వారికి వ్యతిరేకంగా వ్యాజ్యం గట్టి సాక్ష్యాలతో నిరూపింపబడినప్పుడు, వారు నిశ్చేష్టులైపోతారు; తమ వాదనను సమర్థించుకోవటానికి వారికి ఏ ఆస్కారమూ ఉండదు.
10. ఇక ప్రసంగాన్ని ముగిస్తూ, మక్కా అవిశ్వాసులను మాత్రమే కాదు, ప్రపంచ మందలి అవిశ్వాసులందరినీ ఉద్దేశిస్తూ ఈ విషయాలు చెప్పబడుతున్నాయి.

ఆయతులు 40 | **78. అన్ నబా** | అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 5** ఏ విషయాన్ని గురించి వీరు అడుగుతున్నారు? ఆ 'మహావార్త'ను గురించేనా? దానిని గురించి వారు రకరకాలుగా చెప్పుకుంటున్నారు. కాదు (వారు అనుకునేది) ఎంతమాత్రం కాదు.[1] త్వరలోనే వారికి తెలిసి పోతుంది. అవును అది ఎంత మాత్రం నిజం కాదు. (అదేమిటో) త్వరలోనే వారికి తెలిసి పోతుంది.

**6 - 16** మేము భూమిని పాన్పుగా చేశాము; అందులో పర్వతాలను మేకులుగా పాతాము; మిమ్మల్ని (స్త్రీ, పురుషుల) జంటలుగా సృష్టించాము; మీకు నిద్ర ద్వారా సుఖం కలుగ జేశాము; రేయిని తెరగా, పగటిని ఉపాధి సమయంగా చేశాము; మీపైన దృఢమైన ఏడు ఆకాశాలను నిర్మించాము; దేదీప్య మానంగా వెలిగే వెచ్చని దీపాన్ని[2] సృష్టించాము; ధాన్యం, కూరగాయలు పండేందుకు, దట్టమైన తోటలు పెరిగేందుకు మేఘాల నుండి ధారాపాతంగా వర్షాన్ని కురిపిస్తు న్నాము- ఇదంతా వాస్తవం కాదా?

**17 - 20** నిస్సందేహంగా తీర్పుదినం ఒక నిర్ణీత సమయం. శంఖం పూరించబడేరోజున మీరంతా గుంపులు గుంపులుగా లేచి వస్తారు. ఆకాశం తెరువబడుతుంది. అది ద్వారాలు ద్వారాలుగా మారిపోతుంది. పర్వతాలు నడిపింపబడతాయి, ఎండ మావులుగా మారిపోతాయి.

٧٨ سُوْرَةُ النَّبَاِ مَكِّيَّةٌ ٨٠

اٰياتها ٤٠ | ركوعاتها ٢

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ

عَمَّ يَتَسَآءَلُوۡنَ ۚ﴿١﴾ عَنِ النَّبَاِ الۡعَظِيۡمِ ۙ﴿٢﴾
الَّذِىۡ هُمۡ فِيۡهِ مُخۡتَلِفُوۡنَ ؕ﴿٣﴾ كَلَّا
سَيَعۡلَمُوۡنَ ۙ﴿٤﴾ ثُمَّ كَلَّا سَيَعۡلَمُوۡنَ ﴿٥﴾ اَلَمۡ
نَجۡعَلِ الۡاَرۡضَ مِهٰدًا ۙ﴿٦﴾ وَّالۡجِبَالَ اَوۡتَادًا ۙ﴿٧﴾
وَّخَلَقۡنٰكُمۡ اَزۡوَاجًا ۙ﴿٨﴾ وَّجَعَلۡنَا نَوۡمَكُمۡ
سُبَاتًا ۙ﴿٩﴾ وَّجَعَلۡنَا الَّيۡلَ لِبَاسًا ۙ﴿١٠﴾ وَّجَعَلۡنَا
النَّهَارَ مَعَاشًا ﴿١١﴾ وَّبَنَيۡنَا فَوۡقَكُمۡ سَبۡعًا
شِدَادًا ۙ﴿١٢﴾ وَّجَعَلۡنَا سِرَاجًا وَّهَّاجًا ۙ﴿١٣﴾ وَّاَنۡزَلۡنَا
مِنَ الۡمُعۡصِرٰتِ مَآءً ثَجَّاجًا ۙ﴿١٤﴾ لِّنُخۡرِجَ بِهٖ
حَبًّا وَّنَبَاتًا ۙ﴿١٥﴾ وَّجَنّٰتٍ اَلۡفَافًا ؕ﴿١٦﴾ اِنَّ يَوۡمَ
الۡفَصۡلِ كَانَ مِيۡقَاتًا ۙ﴿١٧﴾ يَّوۡمَ يُنۡفَخُ فِى الصُّوۡرِ
فَتَاۡتُوۡنَ اَفۡوَاجًا ۙ﴿١٨﴾ وَّفُتِحَتِ السَّمَآءُ فَكَانَتۡ
اَبۡوَابًا ۙ﴿١٩﴾ وَّسُيِّرَتِ الۡجِبَالُ فَكَانَتۡ سَرَابًا ؕ﴿٢٠﴾

الجزء ٣٠

1. అంటే, పరలోకం గురించి వీరు కల్పించుకునే మాటలన్నీ తప్పుడు మాటలు అని అర్థం. వారు అనుకున్నది ఎంతమాత్రం నిజం కాదు.
2. అంటే, సూర్యుడు అని అర్థం. అసలు "వహ్హాజ్" అనే పదం వాడబడింది. దానికి అమితమైన వేడి అని కూడ అర్థం ఉంది. అమితమైన కాంతి అని కూడా అర్థం ఉంది. ఇందువల్ల మేము అనువాదంలో రెండు అర్థాలనూ ఉపయోగించాము.

إِنَّ جَهَنَّمَ كَانَتْ مِرْصَادًا ﴿٢١﴾ لِّلطَّاغِينَ مَآبًا ﴿٢٢﴾
لَّابِثِينَ فِيهَآ أَحْقَابًا ﴿٢٣﴾ لَّا يَذُوقُونَ فِيهَا
بَرْدًا وَلَا شَرَابًا ﴿٢٤﴾ إِلَّا حَمِيمًا وَغَسَّاقًا ﴿٢٥﴾
جَزَآءً وِفَاقًا ﴿٢٦﴾ إِنَّهُمْ كَانُوا۟ لَا يَرْجُونَ
حِسَابًا ﴿٢٧﴾ وَكَذَّبُوا۟ بِـَٔايَٰتِنَا كِذَّابًا ﴿٢٨﴾ وَكُلَّ
شَىْءٍ أَحْصَيْنَٰهُ كِتَٰبًا ﴿٢٩﴾ فَذُوقُوا۟ فَلَن
نَّزِيدَكُمْ إِلَّا عَذَابًا ﴿٣٠﴾ إِنَّ لِلْمُتَّقِينَ مَفَازًا ﴿٣١﴾ ع
حَدَآئِقَ وَأَعْنَٰبًا ﴿٣٢﴾ وَكَوَاعِبَ أَتْرَابًا ﴿٣٣﴾ وَ
كَأْسًا دِهَاقًا ﴿٣٤﴾ لَّا يَسْمَعُونَ فِيهَا لَغْوًا وَلَا
كِذَّٰبًا ﴿٣٥﴾ جَزَآءً مِّن رَّبِّكَ عَطَآءً حِسَابًا ﴿٣٦﴾
رَّبِّ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ وَمَا بَيْنَهُمَا
ٱلرَّحْمَٰنِ لَا يَمْلِكُونَ مِنْهُ خِطَابًا ﴿٣٧﴾

**21 - 30** నిశ్చయంగా నరకం ఒక మాటు.[3] ధిక్కారులకు అది నివాసస్థలం. యుగాల తరబడి వారు అక్కడే పడి వుంటారు.[4] అందులో ఎలాంటి చల్ల దనాన్నీ, పానీయాన్నీ వారు చవిచూడలేరు. ఒకవేళ ఏదైనా దొరికితే, అది సల సల కాగే నీరు, గాయాల కడుగు మాత్రమే. అది (వారి కర్మలకు) పరిపూర్ణ ప్రతిఫలం. లెక్క అడగబడుతుందని వారు ఆశించలేదు. మా వాక్యాలను వారు అసత్యాలుగా చిత్రించి పూర్తిగా తిరస్కరించారు. కాని అసలు పరిస్థితి ఏమిటంటే, మేము ప్రతి విషయాన్నీ పొల్లుపోకుండా లెక్క పెట్టి ఉంచాము. ఇక (మీరు కూడబెట్టిన దాని ఫలితాన్ని) చవిచూడండి. మేము మీ బాధను తప్ప దేన్నీ అధికం చెయ్యం.

**31 - 37** నిశ్చయంగా భయభక్తులు కలవారి కొరకు ఒక సాఫల్యస్థానం ఉంది; ఉద్యానవనాలూ, ద్రాక్షతోటలూ, సమ వయస్సు గల సుకన్యలూ, మద్యంతో నిండిన మధుపాత్రలూ ఉన్నాయి. ఏ విధమైన వ్యర్థ విషయాలనూ, అసత్యాలనూ వారు అక్కడ వినరు. (ఇదంతా) నీ ప్రభువు తరఫు నుండి లభించే ప్రతిఫలం, చాలినంత బహుమానం[5]- దయామయు డైన దేవుని తరఫు నుండి. ఆయన భూమ్యాకాశాలకూ, ఆ రెంటికీ మధ్య ఉన్న ప్రతి వస్తువుకూ యజమాని. ఆయన ముందు మాట్లాడే ధైర్యం ఎవరికీ లేదు.[6]

3. "మాటు" అంటే, వేట జంతువును పట్టుకోవడానికి తయారుచేసిన స్థలం అని అర్థం. తెలియకపోవటం వల్ల అది వచ్చి అకస్మాత్తుగా అందులో పడి చిక్కుకుపోతుంది. నరకాన్ని మాటు అని ఎందుకు అనటం జరిగిందంటే, దైవవిద్రోహులు దానికి భయపడకుండా, దైవ జగత్తును ఒక వేట స్థలంగా భావించి విశృంఖలంగా ప్రవర్తిస్తూ ప్రపంచంలో తమను పట్టుకునే వాడెవడూ లేడని అనుకుంటున్నారు. కాని నరకం వారికి దాగి ఉన్న ఒక మాటు, వారు అందులో అకస్మాత్తుగా చిక్కుకుపోతారు, అంతే, చిక్కుకొని అలాగే ఉండిపోతారు.

4. అసలు "అహ్ఖాబ్" అనే పదం ఉపయోగించబడింది. దాని అర్థం ఏమిటంటే, ఒకదాని తరువాత ఒకటి ఎడతెగకుండా వచ్చే సుదీర్ఘమైన యుగాల పరంపర; ఒక యుగం అంతం కాగానే మరొక యుగం వెంటనే ప్రారంభమవుతుంది.

5. ప్రతిఫలం తరువాత, చాలినంత బహుమానం ఇవ్వటం అంటే, తమ సత్కర్మలు కారణంగా పొందటానికి అర్హులయ్యే ప్రతిఫలం మాత్రమే వారికి ఇవ్వబడదు, ఆపై మరింత బహుమానం, చాలినంత బహుమానం కూడా వారికి ఇవ్వబడుతుంది.

6. అంటే, హషర్ (పునరుత్థాన) మైదానంలో దేవుని దర్బారు ఎంత భయోత్పాతం కలిగించేదిగా ఉంటుందంటే, భూలోకవాసులైనా లేక పైలోక వాసులైనా స్వయంగా తమకు తామై అల్లాహ్ సమక్షంలో నోరు మెదపటంగాని, న్యాయస్థానం వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోవటంగాని ఎంతమాత్రం చెయ్యలేరు.

يَوْمَ يَقُوْمُ الرُّوْحُ وَ الْمَلٰٓئِكَةُ صَفًّا ۖ لَا يَتَكَلَّمُوْنَ اِلَّا مَنْ اَذِنَ لَهُ الرَّحْمٰنُ وَ قَالَ صَوَابًا ﴿٣٨﴾ ذٰلِكَ الْيَوْمُ الْحَقُّ ۚ فَمَنْ شَآءَ اتَّخَذَ اِلٰى رَبِّهٖ مَاٰبًا ﴿٣٩﴾ اِنَّآ اَنْذَرْنٰكُمْ عَذَابًا قَرِيْبًا ۚۖ يَّوْمَ يَنْظُرُ الْمَرْءُ مَا قَدَّمَتْ يَدٰهُ وَ يَقُوْلُ الْكٰفِرُ يٰلَيْتَنِيْ كُنْتُ تُرٰبًا ﴿٤٠﴾ ع ٢

**38 – 39** ఆత్మ,[7] దూతలు బారులు తీరి నిలబడే రోజున, కరుణామయుడు అనుమతించినవారు తప్ప మరెవ్వరూ మాట్లాడలేరు. అదికూడా సవ్యమైన మాట పలికేవారు మాత్రమే మాట్లాడుతారు. ఆ రోజు రావటం తథ్యం. ఇక ఎవరైనాసరే, ఇష్టమైతే, తమ ప్రభువు వైపునకు మరలేమార్గాన్ని అవలంబించవచ్చు.

**40** సమీపంలోనే ఉన్న శిక్షను గురించి మేము మిమ్మల్ని హెచ్చరించాము. ఆ రోజున మనిషి తన చేజేతులా చేసుకుని ముందు పంపుకున్నదంతా ప్రత్యక్షంగా చూస్తాడు. (అప్పుడు) సత్యతిరస్కారి "అయ్యో! నేను మట్టినై ఉంటే ఎంత బాగుండేది" అని గగ్గోలు పెడతాడు.

7. ఆత్మ అంటే జిబ్రీల్ (అస్సలామ్). అల్లాహ్ దగ్గర ఆయనకున్న ఉన్నత స్థానం కారణంగా, దైవదూతలతో పాటు కాకుండా, వేరుగా ఆయనను గురించి ప్రస్తావించడం జరిగింది.

آياتها ٤٦ | ٧٩ سُوْرَةُ النّٰزِعٰتِ مَكِّيَّةٌ ٨١ | ركوعاتها ٢

ఆయతులు 46 | **79. అన్ నాజిఆత్** | అవతరణ మక్కాలో

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○

وَ النّٰزِعٰتِ غَرۡقًا ① وَّالنّٰشِطٰتِ نَشۡطًا ②
وَّالسّٰبِحٰتِ سَبۡحًا ③ فَالسّٰبِقٰتِ سَبۡقًا ④
فَالۡمُدَبِّرٰتِ اَمۡرًا ⑤ يَوۡمَ تَرۡجُفُ الرَّاجِفَةُ ⑥
تَتۡبَعُهَا الرَّادِفَةُ ⑦ قُلُوۡبٌ يَّوۡمَئِذٍ وَّاجِفَةٌ ⑧
اَبۡصَارُهَا خَاشِعَةٌ ⑨ يَقُوۡلُوۡنَ ءَاِنَّا
لَمَرۡدُوۡدُوۡنَ فِى الۡحَافِرَةِ ⑩ ءَاِذَا كُنَّا عِظَامًا
نَّخِرَةً ⑪ قَالُوۡا تِلۡكَ اِذًا كَرَّةٌ خَاسِرَةٌ ⑫
فَاِنَّمَا هِىَ زَجۡرَةٌ وَّاحِدَةٌ ⑬ فَاِذَا هُمۡ
بِالسَّاهِرَةِ ⑭

وقف لازم · وقف لازم · وقف لازم

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 – 9** మునిగి లాగి తీసే, నెమ్మదిగా బయటికి తీసుకుని వెళ్లేవారు[1] (దైవదూతలు) సాక్షిగా, విశ్వంలో వేగంగా తేలియాడే[2] వారు (దైవదూతలు) సాక్షిగా, (వారు ఆజ్ఞాపాలనలో) ఒకరినొకరు మించిపోతారు;[3] (దైవాజ్ఞల ప్రకారం) సృష్టి వ్యవహారాలను నడుపుతారు.[4] భూకంపం కుదిపివేసే రోజున, ఆ కుదుపు తరువాత మరొక కుదుపు; ఆ రోజున కొందరి హృదయాలు భయంతో వణుకుతూ ఉంటాయి, వారి చూపులు క్రిందికి వాలి ఉంటాయి.

**10 – 14** వీరు, "నిజంగానే మేము మరలించబడి మళ్ళీ తీసుకురాబడతామా? ఎముకలు కుళ్ళి శిథిలమయిన తరువాత కూడానా?" అని అంటారు. ఇంకా "ఈ తిరిగి రావటమనేది చాలా నష్టంతో కూడుకున్నదే"[5] అని కూడ అంటారు. వాస్తవానికి ఒకే ఒక తీవ్రమైన గద్దింపు దెబ్బ పడుతుంది, అంతే, వీరు ఒక్కసారిగా బహిరంగ మైదానంలో చేరిఉంటారు.

1. మరణ సమయంలో మానవుడి ప్రాణాన్ని అతని శరీరం లోతులలోకి దిగి అతని నర నరాల నుండి లాగి బయటకు తీసే దైవదూతలు అని భావం.
2. అంటే, దేవుని ఆజ్ఞాపాలనంలో వారు ఎంత చురుకుగా, సర్వసన్నద్ధంగా ఉంటారంటే, విశ్వంలో వారు తేలియాడుతున్నారా అని అనిపిస్తుంది.
3. మించిపోవటం అంటే, దేవుని ఆజ్ఞ యొక్క సూచన అందగానే, వారిలో ప్రతి ఒక్కడూ దాన్ని పాలించటానికి దౌడు తీస్తాడు.
4. వీరు విశ్వసామ్రాజ్యంలోని కార్యకర్తలు. వారి చేతులద్వారా అల్లాహ్ ఆదేశం ప్రకారం విశ్వ వ్యవస్థ నడుపబడుతోంది.
5. అంటే, "అవును, అలాగే అవుతుంది" అని వారికి జవాబు చెప్పినప్పుడు, వారు ఎగతాళిగా ఒకరితో ఒకరు, "మిత్రులారా! మనం గనక మళ్ళీ బ్రతికి లేచి తిరిగి రావటం అనేదే జరిగితే, అప్పుడు మనం సర్వ నాశనమయినట్లే" అని చెప్పుకుంటారు.

وقف لازم

هَلْ اَتٰىكَ حَدِيْثُ مُوْسٰى ﴿١٥﴾ اِذْ نَادٰىهُ
رَبُّهٗ بِالْوَادِ الْمُقَدَّسِ طُوًى ﴿١٦﴾ اِذْهَبْ اِلٰى
فِرْعَوْنَ اِنَّهٗ طَغٰى ﴿١٧﴾ فَقُلْ هَلْ لَّكَ اِلٰۤى اَنْ
تَزَكّٰى ﴿١٨﴾ وَ اَهْدِيَكَ اِلٰى رَبِّكَ فَتَخْشٰى ﴿١٩﴾
فَاَرٰىهُ الْاٰيَةَ الْكُبْرٰى ﴿٢٠﴾ فَكَذَّبَ وَ عَصٰى ﴿٢١﴾
ثُمَّ اَدْبَرَ يَسْعٰى ﴿٢٢﴾ فَحَشَرَ فَنَادٰى ﴿٢٣﴾ فَقَالَ اَنَا
رَبُّكُمُ الْاَعْلٰى ﴿٢٤﴾ فَاَخَذَهُ اللّٰهُ نَكَالَ الْاٰخِرَةِ
وَالْاُوْلٰى ﴿٢٥﴾ اِنَّ فِيْ ذٰلِكَ لَعِبْرَةً لِّمَنْ يَّخْشٰى ﴿٢٦﴾ ع
ءَاَنْتُمْ اَشَدُّ خَلْقًا اَمِ السَّمَآءُ ؕ بَنٰىهَا ﴿٢٧﴾ رَفَعَ
سَمْكَهَا فَسَوّٰىهَا ﴿٢٨﴾ وَ اَغْطَشَ لَيْلَهَا وَاَخْرَجَ
ضُحٰىهَا ﴿٢٩﴾ وَ الْاَرْضَ بَعْدَ ذٰلِكَ دَحٰىهَا ﴿٣٠﴾
اَخْرَجَ مِنْهَا مَآءَهَا وَ مَرْعٰىهَا ﴿٣١﴾ وَالْجِبَالَ
اَرْسٰىهَا ﴿٣٢﴾ مَتَاعًا لَّكُمْ وَ لِاَنْعَامِكُمْ ﴿٣٣﴾

**15 - 26** నీకు మూసా వృత్తాంతం ఏమైనా అందిందా? అతని ప్రభువు పవిత్రమైన "తువా" లోయకు పిలిచి అతనితో ఇలా అన్నాడు, "ఫిరౌన్ వద్దకు వెళ్ళు. అతడు హద్దులుమీరి ప్రవర్తిస్తున్నాడు; అతనికి ఇలా బోధించు, పరిశుద్ధ జీవితం అవలంబించటానికి నీవు సిద్ధంగా ఉన్నావా? నేను నీ ప్రభువు మార్గాన్ని నీకు చూపితే, నీలో ఆయనపట్ల భయభక్తులు కలుగుతాయా?" తరువాత మూసా (ఫిరౌన్ వద్దకు వెళ్ళి) అతనికి గొప్ప సూచనను చూపాడు.[6] కాని అతడు తిరస్కరించాడు, అంగీకరించలేదు. ఆపైన పన్నాగాలు పన్నటానికి వెళ్ళిపోయాడు. ప్రజలను సమావేశపరచి, అతడు, "మీకు నేను అందరికంటే గొప్ప ప్రభువును" అని ఎలుగెత్తిచాటాడు. చివరకు అల్లాహ్ అతడిని ప్రపంచంలోను, పరలోకంలోను శిక్షించటానికి పట్టుకున్నాడు. భయపడే[7] ప్రతి వ్యక్తి కొరకు నిశ్చయంగా ఇందులో గుణపాఠం ఉంది.

**27 - 33** మిమ్మల్ని సృష్టించటం కష్టమయిన పనా లేక ఆకాశాన్ని సృష్టించటమా? అల్లాహ్ దానిని నిర్మించాడు, దాని కప్పును బాగా పైకి లేపాడు, తరువాత దానికి సమతూకాన్ని ఏర్పరచాడు; దాని రాత్రిని చీకటిగా చేశాడు, దాని పగటిని బహిర్గతం చేశాడు. దీని తరువాత ఆయన భూమిని పరిచాడు; అందులో నుంచి దాని నీళ్ళను, గ్రాసాన్ని (మొత్తం వృక్షజాతిని) బయటకు తీశాడు; పర్వతాలను అందులో పాతాడు– మీకూ, మీ పశువులకూ జీవన సామగ్రిగా.

6. గొప్ప సూచన అంటే, చేతికర్ర పెద్ద పాముగా మారిపోవటం అన్నమాట. దీని ప్రస్తావన దివ్య ఖురాన్‌లో పలుచోట్ల వచ్చింది.

فَإِذَا جَآءَتِ الطَّآمَّةُ الْكُبْرٰى ﴿٣٤﴾ يَوْمَ يَتَذَكَّرُ
الْإِنسَانُ مَا سَعٰى ﴿٣٥﴾ وَبُرِّزَتِ الْجَحِيمُ لِمَن
يَرٰى ﴿٣٦﴾ فَأَمَّا مَن طَغٰى ﴿٣٧﴾ وَءَاثَرَ الْحَيٰوةَ
الدُّنْيَا ﴿٣٨﴾ فَإِنَّ الْجَحِيمَ هِيَ الْمَأْوٰى ﴿٣٩﴾ وَأَمَّا
مَنْ خَافَ مَقَامَ رَبِّهِۦ وَنَهَى النَّفْسَ عَنِ
الْهَوٰى ﴿٤٠﴾ فَإِنَّ الْجَنَّةَ هِيَ الْمَأْوٰى ﴿٤١﴾
يَسْـَٔلُونَكَ عَنِ السَّاعَةِ أَيَّانَ مُرْسٰىهَا ﴿٤٢﴾ فِيمَ
أَنتَ مِن ذِكْرٰىهَآ ﴿٤٣﴾ إِلٰى رَبِّكَ مُنتَهٰىهَآ ﴿٤٤﴾
إِنَّمَآ أَنتَ مُنذِرُ مَن يَخْشٰىهَا ﴿٤٥﴾ كَأَنَّهُمْ يَوْمَ
يَرَوْنَهَا لَمْ يَلْبَثُوٓا إِلَّا عَشِيَّةً أَوْ ضُحٰىهَا ﴿٤٦﴾

**34 - 41** ఆ పెద్ద అల్లకల్లోలం[8] చెలరేగి మానవుడు తాను చేసుకున్నదంతా జ్ఞాపకం తెచ్చుకున్న రోజున, చూసే ప్రతివాని ముందు నరకాన్ని తెచ్చి పెట్టినప్పుడు, హద్దులు మీరి ప్రవర్తించి ఐహిక జీవితానికి ప్రాధాన్యమిచ్చిన వాడికి నరకమే నివాస మవుతుంది. తన ప్రభువు ముందు నిలబడవలసి ఉంటుందని భయపడి, తన మనస్సును దుష్టవాంఛలకు దూరంగా ఉంచిన వ్యక్తి యొక్క నివాసం స్వర్గమవుతుంది.

**42 - 46** వీరు నిన్ను, “అసలు ఆ గడియ ఎప్పుడొస్తుంది?” అని అడుగుతున్నారు. దాని సమయమేదో చెప్పటానికి నీకేం పని? ఆ విషయం అల్లాహ్‌కు మాత్రమే తెలుసు. ఆయనకు భయపడే ప్రతి మనిషికీ నీవు హెచ్చరిక చేసేవాడవు మాత్రమే. వీరు దానిని చూసిననాడు (ప్రపంచంలో గాని లేక మరణా వస్థలోగాని) కేవలం ఒక దినంలో ఉదయంగాని సాయంత్రం గాని ఉన్నట్లు వీరికి అనిపిస్తుంది.

7. అంటే, దైవప్రవక్తను తిరస్కరించిన కారణంగా కలిగే పర్యవసానానికి భయపడటం అని అర్థం. ఆ పర్యవసానాన్ని ఫిరౌను చూశాడు, అనుభవించాడు.
8. అంటే, ప్రళయం అని భావం.

ఆయతులు 42 | **80. అబస** | అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 16** విసుగుకొని ముఖం తిప్పుకున్నాడు,[1] ఆ అంధుడు తన వద్దకు వచ్చాడని. నీకేమి తెలుసు, బహుశా అతను దారికి రావచ్చు లేదా హితోపదేశం గురించి ఆలోచించవచ్చు, హితోపదేశం అతనికి లాభదాయకం కూడా కావచ్చు. లక్ష్యపెట్టనివాడి పట్లనైతే నీవు శ్రద్ధ చూపుతావు; వాస్తవానికి, ఒకవేళ అతడు దారికి రాకపోతే, దానికి నీపై బాధ్యత లేదుకదా? ఎవడు తనంతటతాను నీ వద్దకు పరుగెత్తుకుంటూ వస్తాడో మరియు (దేవునికి) భయపడుతూ ఉంటాడో, అతని వైపునుండి నీవు ముఖం తిప్పు కుంటున్నావు. ఎంతమాత్రం కాదు,[2] ఇదసలు ఒక హితబోధ, ఇష్టమైనవారు దీనిని స్వీకరించవచ్చు. ఇది ప్రతిష్ఠాత్మకమైన, మహోన్నతమైన, పరిశుద్ధమైన[3] పత్రాలలో ఉన్నది: ఇవి గౌరవనీయులు, సద్వర్తనులు అయిన లేఖకుల[4] చేతులలో ఉంటాయి.

**17 - 32** మానవుడు నాశనమవుగాక![5] ఎంత కరుడుగట్టిన సత్యతిరస్కారి ఇతడు! ఏ వస్తువుతో అల్లాహ్ ఇతన్ని సృష్టించాడు? ఒక రేతస్సు బిందువుతో అల్లాహ్ ఇతన్ని సృష్టించాడు, తరువాత ఇతని అదృష్టాన్ని నిర్ణయించాడు, ఆ తరువాత ఇతని కొరకు జీవన మార్గాన్ని సులభతరం చేశాడు, ఆపైన ఇతనికి మరణాన్నిచ్చి సమాధికి చేర్చాడు. మళ్ళీ తాను తలచినప్పుడు ఆయన ఇతన్ని రెండోసారి లేపి నిలబెడతాడు. ఎంతమాత్రం కాదు, అల్లాహ్ ఏ విధిని గురించి ఆజ్ఞాపించాడో, ఆ విధిని ఇతను నెరవేర్చలేదు. తరువాత మానవుడు తాను తీసుకునే ఆహారం గురించి కొంచెం ఆలోచించాలి. మేము పుష్కలంగా నీటిని కురిపించాము,[6] తరువాత నేలను అద్భుతమైన రీతిలో చీల్చాము, ఆ తరువాత అందులో ధాన్యం, ద్రాక్ష, కూరగాయలు, ఆలివ్ (జైతూన్), ఖర్జూరాలు, దట్టమైన తోటలు, ఇంకా రకరకాల పండ్లను, మేతను మీ కొరకు, మీ పశువుల కొరకు జీవన సామగ్రిగా పండించాము.

٨٠ سُوْرَةُ عَبَسَ مَكِّيَّةٌ ٢٤

اٰیاتها ٤٢ | رکوعها ١

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○

عَبَسَ وَ تَوَلّٰٓى ۙ(۱) اَنۡ جَآءَهُ الۡاَعۡمٰى ؕ(۲) وَ مَا
يُدۡرِيۡكَ لَعَلَّهٗ يَزَّكّٰٓى ۙ(۳) اَوۡ يَذَّكَّرُ فَتَنۡفَعَهُ
الذِّكۡرٰى ؕ(۴) اَمَّا مَنِ اسۡتَغۡنٰى ۙ(۵) فَاَنۡتَ لَهٗ
تَصَدّٰى ؕ(۶) وَ مَا عَلَيۡكَ اَلَّا يَزَّكّٰى ؕ(۷) وَ اَمَّا
مَنۡ جَآءَكَ يَسۡعٰى ۙ(۸) وَ هُوَ يَخۡشٰى ۙ(۹) فَاَنۡتَ
عَنۡهُ تَلَهّٰى ۚ(۱۰) كَلَّاۤ اِنَّهَا تَذۡكِرَةٌ ۚ(۱۱) فَمَنۡ شَآءَ
ذَكَرَهٗ ۘ(۱۲) فِىۡ صُحُفٍ مُّكَرَّمَةٍ ۙ(۱۳) مَّرۡفُوۡعَةٍ وقف لازم
مُّطَهَّرَةٍ ۙ(۱۴) بِاَيۡدِىۡ سَفَرَةٍ ۙ(۱۵) كِرَامٍ
بَرَرَةٍ ؕ(۱۶) قُتِلَ الۡاِنۡسَانُ مَاۤ اَكۡفَرَهٗ ؕ(۱۷) مِنۡ
اَىِّ شَىۡءٍ خَلَقَهٗ ؕ(۱۸) مِنۡ نُّطۡفَةٍ ؕ خَلَقَهٗ
فَقَدَّرَهٗ ۙ(۱۹) ثُمَّ السَّبِيۡلَ يَسَّرَهٗ ۙ(۲۰) ثُمَّ اَمَاتَهٗ
فَاَقۡبَرَهٗ ۙ(۲۱) ثُمَّ اِذَا شَآءَ اَنۡشَرَهٗ ؕ(۲۲) كَلَّا لَمَّا
يَقۡضِ مَاۤ اَمَرَهٗ ؕ(۲۳) فَلۡيَنۡظُرِ الۡاِنۡسَانُ اِلٰى
طَعَامِهٖۤ ۙ(۲۴) اَنَّا صَبَبۡنَا الۡمَآءَ صَبًّا ۙ(۲۵) ثُمَّ
شَقَقۡنَا الۡاَرۡضَ شَقًّا ۙ(۲۶) فَاَنۡۢبَتۡنَا فِيۡهَا حَبًّا ۙ(۲۷)
وَّ عِنَبًا وَّ قَضۡبًا ۙ(۲۸) وَّ زَيۡتُوۡنًا وَّ نَخۡلًا ۙ(۲۹) وَّ
حَدَآئِقَ غُلۡبًا ۙ(۳۰) وَّ فَاكِهَةً وَّ اَبًّا ۙ(۳۱) مَّتَاعًا
لَّـكُمۡ وَلِاَنۡعَامِكُمۡ ؕ(۳۲)

فَاِذَا جَآءَتِ الصَّآخَّةُ ﴿٣٣﴾ يَوْمَ يَفِرُّ الْمَرْءُ مِنْ
اَخِيْهِ ﴿٣٤﴾ وَاُمِّهٖ وَ اَبِيْهِ ﴿٣٥﴾ وَصَاحِبَتِهٖ وَ
بَنِيْهِ ﴿٣٦﴾ لِكُلِّ امْرِئٍ مِّنْهُمْ يَوْمَئِذٍ شَاْنٌ
يُّغْنِيْهِ ﴿٣٧﴾ وُجُوْهٌ يَّوْمَئِذٍ مُّسْفِرَةٌ ﴿٣٨﴾ ضَاحِكَةٌ
مُّسْتَبْشِرَةٌ ﴿٣٩﴾ وَ وُجُوْهٌ يَّوْمَئِذٍ عَلَيْهَا غَبَرَةٌ ﴿٤٠﴾
تَرْهَقُهَا قَتَرَةٌ ﴿٤١﴾ اُولٰٓئِكَ هُمُ الْكَفَرَةُ الْفَجَرَةُ ﴿٤٢﴾ ع ٤٢ ٥

**33 - 42** చివరకు చెవులను చెవిటివిగా చేసే ధ్వని[7] ఉద్ధృతమైనప్పుడు – ఆ రోజున మనిషి తన సోదరునికీ, తన తల్లికీ, తన తండ్రికీ, తన భార్యకూ, తన సంతానానికీ దూరంగా పరుగెత్తుతాడు. ఆ రోజున వారిలో ప్రతి ఒక్కరికీ తమను గురించి తప్ప ఇతరుల్ని గురించి పట్టించుకోలేని ఆపత్సమయం వస్తుంది. ఆ రోజున కొందరి ముఖాలు దేదీప్యమానంగా వెలుగుతూ ఆనంద పారవశ్యంతో నవ్వులు చిందిస్తూ ఉంటాయి. కొందరి ముఖాలు ఆ రోజున దుమ్మూ ధూళీ కొట్టుకుని ఉంటాయి, వాటిపై నల్లని మసి ఆవరించి మాడిపోయి ఉంటాయి. వీరే సత్య తిరస్కారులు, దుర్మార్గులు.

1. తరువాతి వాక్యాల ద్వారా తెలిసేదేమిటంటే, ఆ విసుగుకున్నవారు, ముఖం త్రిప్పుకున్నవారు మరెవరో కాదు స్వయంగా మహాప్రవక్త (సఅసమ్)యే. ఇక్కడ ప్రస్తావించబడిన అంధుడు హజ్రత్ ఇబ్నె ఉమ్మె మక్తూమ్ (రజిఅన్). ఆయన హజ్రత్ ఖదీజా (రజిఅన్)కు మేనత్త కుమారులవుతారు. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) అప్పుడు, మక్కా అవిశ్వాసులకు చెందిన పెద్ద పెద్ద సర్దారుల ముందు ఇస్లామీ ధర్మ సందేశాన్ని వివరించే పనిలో నిమగ్నులై ఉన్నారు. ఇంతలోనే ఈ అంధవ్యక్తి వచ్చి కొన్ని ప్రశ్నలు అడగదలచి అనుమతి అడిగారు. ఈ సందర్భంలో ఆయన వచ్చి ఇలా జోక్యం చేసుకోవటం మహాప్రవక్త (సఅసమ్)కు నచ్చలేదు.
2. అంటే, అలా ఎంతమాత్రం చెయ్యకు అని భావం. దేవుణ్ణి మరిచిపోయి తమ ప్రాపంచిక వైభవాన్ని చూసుకుని పొంగిపోయే అహంభావులకు అంత ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వకు. ఇస్లామ్ అంటే గిట్టనివారి ముందు దాన్ని గురించి వారిని బ్రతిమాలుతూ ప్రచారం చేసే అంత స్థితికి ఇస్లామ్‌ను దిగజార్చకూడదు. గర్వాంధకారుల్ని ఇస్లామ్ వైపునకు పిలిచేందుకు నీవు అవలంబించే వైఖరిని చూసి నీ స్వప్రయోజనం ఏదైనా వారితో ముడివడి ఉన్నదేమోఅన్న అపోహగానీ, వారు విశ్వసిస్తే నీ సందేశం వ్యాపిస్తుందనీ లేకపోతే లేదనే అపార్థంగానీ వారికి కలగ కూడదు. ఇటువంటి వైఖరిని అవలంబించడం నీ హోదాకు తగినది కాదు. వారికి సత్యం అక్కరలేనట్లే సత్యానికీ వారి అక్కర లేదు.
3. అంటే, ఏ రకమైన కల్తీ ఎంతమాత్రం లేనివి, పరిశుద్ధమైనవి అని అర్థం. వీటిలో కేవలం సత్యానికి చెందిన బోధనలే ఉన్నాయి. ఏ విధమైన అసత్య భావనలకు, మిథ్యా సిద్ధాంతాలకు వీటిలో తావులేదు.
4. అల్లాహ్ ప్రత్యక్ష మార్గదర్శకత్వంలో దివ్య ఖురాన్ పత్రాలను వ్రాసే, వాటిని పరిరక్షించే, వాటిని యథాతథంగా మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్)కు చేరవేసే దైవదూతలు అని అర్థం.
5. ఇక్కడి నుంచి సంబోధన, సత్యం అంటే ఏమాత్రం అవసరం లేనట్లు ప్రవర్తించే సత్య తిరస్కారుల వైపునకు మరలుతుంది. ఇంతకు పూర్వం సూరా ప్రారంభం నుండి 16వ ఆయతు వరకు మహాప్రవక్త (సఅసమ్)ను ఉద్దేశించి సంబోధిం చటం జరిగింది. అయినప్పటికీ అది అవిశ్వాసుల్ని మందలించటానికే ఉద్దేశించబడింది. ఆ సంబోధనా పద్ధతి ఇలా ఉంది: ఓ ప్రవక్తా! సత్యాన్వేషిని వదలిపెట్టి మీరు ఎటువంటి వారి వైపునకు మీ దృష్టిని మరల్చారు? వీరు సత్య సందేశ ప్రచారం దృష్ట్యా దేనికీ పనికిరాని అసమర్థులు, అనామకులు. మీవంటి మహనీయులైన సందేశహరులు దివ్య ఖురాన్ వంటి మహోన్నతమైన విషయాన్ని వారి ముందు పెట్టేందుకు, దానికి వారు ఎంతమాత్రం అర్హత కలవారు కాదు.
6. అంటే, వర్షం అని అర్థం.
7. చివరిసారి శంఖం ఊదటం వల్ల వెలువడే భయంకరమైన ధ్వని. అప్పుడు మృతి చెందిన మానవులందరూ వెంటనే బ్రతికి లేస్తారు.

## 81. అత్ తక్వీర్

ఆయతులు 29 | అవతరణ మక్కాలో

٨١ سُورَةُ التَّكۡوِيرِ مَكِّيَّةٌ ٧

اٰياتها ٢٩ | ركوعها ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○

**1 - 14** సూర్యుడు చుట్టివేయబడినప్పుడు,[1] నక్షత్రాలు చెదరి పోయినప్పుడు, పర్వతాలు నడిపించబడినప్పుడు, పదినెలల చూలి ఒంటెలు వాటి మానాన అవి వదిలివేయబడినప్పుడు,[2] అడవి జంతువులు ఒకచోట సమీకరించబడి నప్పుడు, సముద్రాలు ప్రజ్వలింపజేయబడినప్పుడు, ప్రాణాలు (శరీరాలతో) తిరిగి కలపబడినప్పుడు,[3] సజీవంగా పాతిపెట్టబడిన బాలికను, నీవు ఏ తప్పువల్ల హత్య చేయబడ్డావని అడిగినప్పుడు, కర్మల పత్రాలు తెరువబడినప్పుడు, ఆకాశానికున్న తెర తొలగించబడి నప్పుడు, నరకం మండించబడినప్పుడు, స్వర్గం దగ్గరకు తీసుకురాబడినప్పుడు - అప్పుడు ప్రతి మనిషికీ తెలిసిపోతుంది తానేమి తీసుకువచ్చాడో.

**15 - 29** కనుక (మీరనుకునేది ఎంతమాత్రం నిజం) కాదు.[4] మరలిపోయే, కనుమరుగయ్యే నక్షత్రాలు సాక్షిగా, గడచిపోయి నప్పటి రాత్రి సాక్షిగా, ఊపిరి పీల్చుకున్నప్పటి ఉదయం సాక్షిగా, నేను చెబుతున్నాను, ఇది నిశ్చయంగా అత్యంత గౌరవనీయుడైన ఒక సందేశహరుని వాక్కు,[5] ఆయన ఎంతో శక్తి సంపన్నుడు, సింహాసనాధిపతి వద్ద ఆయనకు గొప్ప స్థానం ఉంది. అక్కడ ఆయన ఆజ్ఞలు పాటించబడతాయి,[6] ఆయన ఎంతో నమ్మకస్తుడు. (ఓ మక్కా ప్రజలారా!) మీ సహచరుడు పిచ్చివాడు కాదు.[7] ఆయన ఆ సందేశహరుణ్ణి ప్రకాశవంత మైన దిజ్మండలంపై చూశాడు. అదీగాక అగోచర విషయాలకు సంబంధించిన (ఈ జ్ఞానాన్ని ప్రజలకు అందించే) విషయంలో ఆయన లోభికాదు. ఇది శాపగ్రస్తుడైన ఏ షైతాను వాక్కూ కాదు. అలాంటప్పుడు మీరు ఎటు వెళ్ళిపోతున్నారు. ఇది సకల లోకాల వారి కొరకు ఒక హితోపదేశం, మీలో ఋజు మార్గాన నడవదలచిన ప్రతి వ్యక్తి కొరకు. సకల లోకాల ప్రభువైన అల్లాహ్ తలచనంతవరకు, మీరు తలచినంత మాత్రాన ఏమీకాదు.

اِذَا الشَّمۡسُ كُوِّرَتۡ ۙ ﴿١﴾ وَ اِذَا النُّجُوۡمُ
انۡكَدَرَتۡ ۙ ﴿٢﴾ وَ اِذَا الۡجِبَالُ سُيِّرَتۡ ۙ ﴿٣﴾ وَ اِذَا
الۡعِشَارُ عُطِّلَتۡ ۙ ﴿٤﴾ وَاِذَا الۡوُحُوۡشُ
حُشِرَتۡ ۙ ﴿٥﴾ وَ اِذَا الۡبِحَارُ سُجِّرَتۡ ۙ ﴿٦﴾ وَاِذَا
النُّفُوۡسُ زُوِّجَتۡ ۙ ﴿٧﴾ وَ اِذَا الۡمَوۡءٗدَةُ سُئِلَتۡ ۙ ﴿٨﴾
بِاَىِّ ذَنۡۢبٍ قُتِلَتۡ ۚ ﴿٩﴾ وَاِذَا الصُّحُفُ نُشِرَتۡ ۙ ﴿١٠﴾
وَاِذَا السَّمَآءُ كُشِطَتۡ ۙ ﴿١١﴾ وَ اِذَا الۡجَحِيۡمُ
سُعِّرَتۡ ۙ ﴿١٢﴾ وَ اِذَا الۡجَنَّةُ اُزۡلِفَتۡ ۙ ﴿١٣﴾ عَلِمَتۡ
نَفۡسٌ مَّاۤ اَحۡضَرَتۡ ؕ ﴿١٤﴾ فَلَاۤ اُقۡسِمُ بِالۡخُنَّسِ ۙ ﴿١٥﴾
الۡجَوَارِ الۡكُنَّسِ ۙ ﴿١٦﴾ وَالَّيۡلِ اِذَا عَسۡعَسَ ۙ ﴿١٧﴾
وَالصُّبۡحِ اِذَا تَنَفَّسَ ۙ ﴿١٨﴾ اِنَّهٗ لَقَوۡلُ رَسُوۡلٍ
كَرِيۡمٍ ۙ ﴿١٩﴾ ذِىۡ قُوَّةٍ عِنۡدَ ذِى الۡعَرۡشِ
مَكِيۡنٍ ۙ ﴿٢٠﴾ مُّطَاعٍ ثَمَّ اَمِيۡنٍ ؕ ﴿٢١﴾ وَمَا صَاحِبُكُمۡ
بِمَجۡنُوۡنٍ ۚ ﴿٢٢﴾ وَ لَقَدۡ رَاٰهُ بِالۡاُفُقِ الۡمُبِيۡنِ ۚ ﴿٢٣﴾ وَ
مَا هُوَ عَلَى الۡغَيۡبِ بِضَنِيۡنٍ ۚ ﴿٢٤﴾ وَ مَا هُوَ بِقَوۡلِ
شَيۡطٰنٍ رَّجِيۡمٍ ۙ ﴿٢٥﴾ فَاَيۡنَ تَذۡهَبُوۡنَ ؕ ﴿٢٦﴾ اِنۡ هُوَ
اِلَّا ذِكۡرٌ لِّلۡعٰلَمِيۡنَ ۙ ﴿٢٧﴾ لِمَنۡ شَآءَ مِنۡكُمۡ اَنۡ
يَّسۡتَقِيۡمَ ؕ ﴿٢٨﴾ وَمَا تَشَآءُوۡنَ اِلَّاۤ اَنۡ يَّشَآءَ
اللّٰهُ رَبُّ الۡعٰلَمِيۡنَ ﴿٢٩﴾ ع

1. అంటే, సూర్యుని నుండి వెలువడి ప్రపంచంలో వ్యాపించే కాంతితోనే సూర్యుడు చుట్టివేయబడతాడనీ, ఆ విధంగా దాని కాంతి ప్రసారం ఆగిపోతుందనీ భావం.

2. అరేబియా ప్రజలకు ఈనటానికి తయారుగా ఉన్న ఒంటెకంటె విలువైన ఆస్తి మరొకటి లేదు. అందుకని వారు దాన్ని ఎంతో జాగ్రత్తగా కాపాడుకుంటూ శ్రద్ధగా మేపుతారు, బాగా సాకుతారు. అటువంటి ఒంటెల్ని కూడ మరచిపోవటం అంటే అర్థం అప్పుడు, ఆ సమయంలో ప్రజలపైకి పెద్ద ఆపద వచ్చిపడుతుందన్నమాట. కనుకనే అమూల్యమైన, అత్యంత ప్రియతమమైన తమ ఆస్తిని కూడ రక్షించుకునే తెలివి వారికి ఉండదు.

3. అంటే, ప్రపంచంలో మానవులు మరణించే ముందు ఏ స్థితిలో జీవించి ఉండేవారో అదే స్థితిలో అదే ఆకారంతో, శరీరం ఆత్మలతో మళ్లీ బ్రతికింపబడి లేపబడతారు అని అర్థం.

4. దివ్య ఖురాన్‌లో చెప్పబడుతున్న విషయాలు పిచ్చివాని ప్రేలాపాలు లేక షైతాన్ ప్రేరణలు అనే మీ అభిప్రాయం నిజం కాదు.

5. ఇక్కడ గౌరవనీయుడైన ఒక సందేశహరుడు (రసూలెకరీమ్) అంటే దివ్య ఖురాన్‌ను తీసుకువచ్చే దైవదూత అని అర్థం. ముందు రాబోయే ఆయతులు కూడ ఇదే విషయాన్ని స్పష్టంగా వివరిస్తున్నాయి. దివ్య ఖురాన్‌ను "సందేశహరుని వాక్కు" అని అంటే ఇది ఆ దైవదూత వాక్కు అని అర్థం ఏమాత్రం కాదు. "సందేశహరుని వాక్కు" లోని పదాలే స్వయంగా ఇది అతన్ని సందేశహరుడుగా నియమించి పంపిన దేవుని వాక్కు అని స్పష్టంగా తెలియజేస్తున్నాయి.

6. అంటే, ఆయన దైవదూతలకు అధికారి అని అర్థం. దైవదూతలందరూ ఆయన ఆజ్ఞల ప్రకారం పనిచేస్తారు.

7. సహచరుడు అంటే మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) అని భావం.

## ٨٢ سُوۡرَۃُ الۡاِنۡفِطَارِ مَکِّیَّۃٌ ٨٢

اٰیاتها ١٩ | رکوعها ١

بِسۡمِ اللّٰہِ الرَّحۡمٰنِ الرَّحِیۡمِ ○

اِذَا السَّمَآءُ انۡفَطَرَتۡ ۙ﴿١﴾ وَ اِذَا الۡکَوَاکِبُ
انۡتَثَرَتۡ ۙ﴿٢﴾ وَ اِذَا الۡبِحَارُ فُجِّرَتۡ ۙ﴿٣﴾ وَ اِذَا
الۡقُبُوۡرُ بُعۡثِرَتۡ ۙ﴿٤﴾ عَلِمَتۡ نَفۡسٌ مَّا قَدَّمَتۡ
وَ اَخَّرَتۡ ؕ﴿٥﴾ یٰۤاَیُّہَا الۡاِنۡسَانُ مَا غَرَّکَ بِرَبِّکَ
الۡکَرِیۡمِ ۙ﴿٦﴾ الَّذِیۡ خَلَقَکَ فَسَوّٰىکَ فَعَدَلَکَ ۙ﴿٧﴾
فِیۡۤ اَیِّ صُوۡرَۃٍ مَّا شَآءَ رَکَّبَکَ ؕ﴿٨﴾ کَلَّا بَلۡ
تُکَذِّبُوۡنَ بِالدِّیۡنِ ۙ﴿٩﴾ وَ اِنَّ عَلَیۡکُمۡ
لَحٰفِظِیۡنَ ۙ﴿١٠﴾ کِرَامًا کَاتِبِیۡنَ ۙ﴿١١﴾ یَعۡلَمُوۡنَ مَا
تَفۡعَلُوۡنَ ﴿١٢﴾ اِنَّ الۡاَبۡرَارَ لَفِیۡ نَعِیۡمٍ ۚ﴿١٣﴾ وَ اِنَّ
الۡفُجَّارَ لَفِیۡ جَحِیۡمٍ ۚۖ﴿١٤﴾ یَّصۡلَوۡنَہَا یَوۡمَ
الدِّیۡنِ ﴿١٥﴾ وَ مَا ہُمۡ عَنۡہَا بِغَآئِبِیۡنَ ؕ﴿١٦﴾ وَ مَاۤ
اَدۡرٰىکَ مَا یَوۡمُ الدِّیۡنِ ۙ﴿١٧﴾ ثُمَّ مَاۤ اَدۡرٰىکَ
مَا یَوۡمُ الدِّیۡنِ ؕ﴿١٨﴾ یَوۡمَ لَا تَمۡلِکُ نَفۡسٌ
لِّنَفۡسٍ شَیۡـًٔا ؕ وَ الۡاَمۡرُ یَوۡمَئِذٍ لِّلّٰہِ ﴿١٩﴾ ع

## 82. అల్ ఇన్‌ఫితార్

ఆయతులు 19 | అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 5** ఆకాశం బ్రద్దలైనప్పుడు, నక్షత్రాలు చెదిరిపోయినప్పుడు, సముద్రాలు చీల్చబడినప్పుడు, సమాధులు తెరువబడినప్పుడు[1] – అప్పుడు ప్రతి మనిషికీ తాను ముందూ వెనుకా చేసుకున్నదంతా ఏమిటో తెలిసిపోతుంది.

**6 - 12** ఓ మానవుడా! పరమదాత అయిన నీ ప్రభువును గురించి ఏ విషయం నిన్ను మోసంలో పడవేసింది? ఆయనే నిన్ను సృష్టించాడు, ఎలాంటి లోపం లేకుండా నిన్ను తీర్చి దిద్దాడు, నిన్ను తగిన రీతిలో పొందికగా రూపొందించాడు, తాను తలచిన ఆకారంలో నిన్ను క్రమబద్ధంగా మలిచాడు. ఎంత మాత్రం కాదు,[2] (అసలు విషయమేమిటంటే) మీరు శిక్షా ప్రతిఫలాలు లేవని తిరస్కరిస్తున్నారు.[3] కాని మీపై కాపలా దారులు నియమించబడి ఉన్నారు, మీ చర్యలను ఒక కంట కనిపెడుతూ ఉండే గౌరవనీయులైన లేఖకులు మీపై నియమించబడ్డారు. మీరు చేసే ప్రతి పనీ వారికి తెలుసు.

**13 - 19** నిశ్చయంగా సజ్జనులు సుఖసంతోషాలలో తేలియాడుతూ ఉంటారు. నిస్సందేహంగా దుర్జనులు నరకానికి పోతారు. తీర్పుదినంనాడు వారు అందులో ప్రవేశిస్తారు. ఇక అందులో నుంచి ఎంతమాత్రం బయటపడలేరు. ఆ తీర్పుదినమేమిటో నీకేమైనా తెలుసా? అవును, ఆ తీర్పు దినమేమిటో నీకేమైనా తెలుసా? ఆ రోజున ఏ మనిషి కొరకూ ఏదైనా చెయ్యటమనేది ఎవరికీ సాధ్యం కాదు. ఆనాడు తీర్పు ఇచ్చే అధికారం పూర్తిగా అల్లాహ్ చేతుల్లోనే ఉంటుంది.

1. సమాధులు తెరువబడినప్పుడు అంటే మృతులను మళ్ళీ కొత్తగా బ్రతికించి లేపటం అని అర్థం.
2. అంటే, ఈ మోసంలో పడిపోవటానికి సరియైన కారణం ఏదీ లేదని అర్థం.
3. అంటే, ఏ కారణం వల్లనైతే మీరు మోసానికి గురిఅయ్యారో అది సమంజసమైన కారణం కానేకాదు. ప్రపంచంలో మానవుడు చేసే కర్మలకు పరలోకంలో శిక్షా ప్రతిఫలాలు అనేవి లేనేలేవు అనే మీ అభిప్రాయం తెలివిమాలిన అభిప్రాయం. నిరాధారమైన ఈ తప్పుడు ఆలోచనే దేవుని విషయంలో మిమ్మల్ని ఏమరుపాటుకు గురిచేసింది, ఆయన చేసే న్యాయం విషయంలో మిమ్మల్ని భయపడకుండా చేసింది. ఇంకా అది నైతిక ప్రవర్తన విషయంలో మిమ్మల్ని బాధ్యతారహితులుగా చేసింది.

ఆయతులు 36 | **83. అల్ ముతఫ్ఫిఫీన్** | అవతరణ మక్కాలో

٨٣ سُوْرَةُ الْمُطَفِّفِيْنَ مَكِّيَّةٌ ٨٦

اٰيَاتُهَا ٣٦ | رُكُوْعُهَا ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

وَيْلٌ لِّلْمُطَفِّفِيْنَ ① الَّذِيْنَ اِذَا اكْتَالُوْا عَلَى
النَّاسِ يَسْتَوْفُوْنَ ② وَاِذَا كَالُوْهُمْ اَوْ
وَّزَنُوْهُمْ يُخْسِرُوْنَ ③ اَلَا يَظُنُّ اُولٰٓئِكَ اَنَّهُمْ
مَّبْعُوْثُوْنَ ④ لِيَوْمٍ عَظِيْمٍ ⑤ يَّوْمَ يَقُوْمُ
النَّاسُ لِرَبِّ الْعٰلَمِيْنَ ⑥ كَلَّآ اِنَّ كِتٰبَ
الْفُجَّارِ لَفِيْ سِجِّيْنٍ ⑦ وَمَآ اَدْرٰىكَ مَا
سِجِّيْنٌ ⑧ كِتٰبٌ مَّرْقُوْمٌ ⑨ وَيْلٌ يَّوْمَئِذٍ
لِّلْمُكَذِّبِيْنَ ⑩ الَّذِيْنَ يُكَذِّبُوْنَ بِيَوْمِ
الدِّيْنِ ⑪ وَمَا يُكَذِّبُ بِهٖٓ اِلَّا كُلُّ مُعْتَدٍ
اَثِيْمٍ ⑫ اِذَا تُتْلٰى عَلَيْهِ اٰيٰتُنَا قَالَ اَسَاطِيْرُ
الْاَوَّلِيْنَ ⑬ كَلَّا بَلْ ٜ رَانَ عَلٰى قُلُوْبِهِمْ مَّا
كَانُوْا يَكْسِبُوْنَ ⑭ كَلَّآ اِنَّهُمْ عَنْ رَّبِّهِمْ
يَوْمَئِذٍ لَّمَحْجُوْبُوْنَ ⑮ ثُمَّ اِنَّهُمْ لَصَالُوا
الْجَحِيْمِ ⑯ ثُمَّ يُقَالُ هٰذَا الَّذِيْ كُنْتُمْ بِهٖ
تُكَذِّبُوْنَ ⑰

**1 - 6** తూనికలలో, కొలతలలో తగ్గించి ఇచ్చేవారికి వినాశం ఉన్నది. వారు ప్రజల నుండి తీసుకునేటప్పుడు పూర్తిగా తీసుకుంటారు; వారికి కొలిచిగాని తూచిగాని ఇచ్చేటప్పుడు తగ్గించి ఇస్తారు. ఒక మహాదినమనాడు[1] వారు బ్రతికించి తీసుకురాబడ నున్నారని వారికి తెలియదా? ఆ రోజున ప్రజలందరూ సకల లోకాల ప్రభువు సమక్షంలో నిలబడతారు.

**7 - 17** ఎంతమాత్రం కాదు[2], నిశ్చయంగా దుర్జనుల కర్మల పత్రం చెరసాల గ్రంథంలో ఉంటుంది. చెరసాల గ్రంథం అంటే ఏమిటో నీకు తెలుసా? అదొక వ్రాయబడిన గ్రంథం. తీర్పుదినాన్ని తిరస్కరించే తిరస్కారులకు ఆ రోజున వినాశం ఉన్నది. హద్దుమీరి ప్రవర్తించే దుర్మార్గుడు తప్ప ఏ ఒక్కడూ దానిని తిరస్కరించలేడు. అతడికి మా వాక్యాలు వినిపించినప్పుడు,[3] "ఇవి పూర్వకాలపు కట్టుకథలే" అని అంటాడు. ఎంతమాత్రం కాదు, అసలు వారి హృదయాలకు వారి దుష్కార్యాల తుప్పు పట్టింది.[4] ఎంతమాత్రం కాదు, నిశ్చయంగా ఆ రోజున వారు తమ ప్రభువు దర్శనం లభించకుండా చేయబడతారు. తరువాత వారు నరకంలోకి పోయిపడతారు. అప్పుడు వారితో "మీరు తిరస్కరిస్తూ ఉండినది ఇదే" అని చెప్పటం జరుగుతుంది.

1. ప్రళయదినాన్ని మహాదినం అని అనటం ఎందుకంటే, ఆ రోజున సర్వ మానవుల, జిన్నాతుల విషయమయి దేవుని న్యాయస్థానంలో ఒకేసారి విచారణ జరుగుతుంది, అప్పుడు శిక్షకూ, ప్రతిఫలానికి సంబంధించిన ప్రధాన నిర్ణయాలు జరుగుతాయి.
2. అంటే, ప్రపంచంలో ఈ నేరాలు చేసిన వారిని ఊరకే వదిలిపెట్టటం జరుగుతుందనే వారి ఆలోచన తప్పుడు ఆలోచన.
3. అంటే, ప్రతిఫలదినం గురించి తెలియజేయబడిన ఆయతులు అని అర్థం.
4. అంటే, శిక్షా ప్రతిఫలాలను కట్టుకథలు అనటానికి వారి దగ్గర సరిఅయిన కారణాలేవీ లేవు. అయితే, వాటిని కట్టుకథలనటానికి కారణమేమిటంటే వారు చేసే పాపాల తుప్పు వారి హృదయాలకు బాగా పట్టింది. అందుకని సహేతుకమూ సమంజసమూ అయిన మాట వారికి కట్టుకథగా కనిపిస్తోంది.

كَلَّآ اِنَّ كِتٰبَ الْاَبْرَارِ لَفِيْ عِلِّيِّيْنَ ﴿١٨﴾ وَ مَآ
اَدْرٰىكَ مَا عِلِّيُّوْنَ ﴿١٩﴾ كِتٰبٌ مَّرْقُوْمٌ ﴿٢٠﴾
يَّشْهَدُهُ الْمُقَرَّبُوْنَ ﴿٢١﴾ اِنَّ الْاَبْرَارَ لَفِيْ
نَعِيْمٍ ﴿٢٢﴾ عَلَى الْاَرَآئِكِ يَنْظُرُوْنَ ﴿٢٣﴾ تَعْرِفُ
فِيْ وُجُوْهِهِمْ نَضْرَةَ النَّعِيْمِ ﴿٢٤﴾ يُسْقَوْنَ مِنْ
رَّحِيْقٍ مَّخْتُوْمٍ ﴿٢٥﴾ خِتٰمُهٗ مِسْكٌ وَ فِيْ ذٰلِكَ
فَلْيَتَنَافَسِ الْمُتَنَافِسُوْنَ ﴿٢٦﴾ وَ مِزَاجُهٗ مِنْ
تَسْنِيْمٍ ﴿٢٧﴾ عَيْنًا يَّشْرَبُ بِهَا الْمُقَرَّبُوْنَ ﴿٢٨﴾ اِنَّ
الَّذِيْنَ اَجْرَمُوْا كَانُوْا مِنَ الَّذِيْنَ اٰمَنُوْا
يَضْحَكُوْنَ ﴿٢٩﴾ وَ اِذَا مَرُّوْا بِهِمْ يَتَغَامَزُوْنَ ﴿٣٠﴾
وَاِذَا انْقَلَبُوْٓا اِلٰٓى اَهْلِهِمُ انْقَلَبُوْا فَكِهِيْنَ ﴿٣١﴾
وَ اِذَا رَاَوْهُمْ قَالُوْٓا اِنَّ هٰٓؤُلَآءِ لَضَآلُّوْنَ ﴿٣٢﴾
وَ مَآ اُرْسِلُوْا عَلَيْهِمْ حٰفِظِيْنَ ﴿٣٣﴾ فَالْيَوْمَ
الَّذِيْنَ اٰمَنُوْا مِنَ الْكُفَّارِ يَضْحَكُوْنَ ﴿٣٤﴾ عَلَى
الْاَرَآئِكِ يَنْظُرُوْنَ ﴿٣٥﴾ هَلْ ثُوِّبَ الْكُفَّارُ مَا
كَانُوْا يَفْعَلُوْنَ ﴿٣٦﴾ ع ٨

**18 - 28** ఎంతమాత్రం కాదు,[5] నిస్సందేహంగా సజ్జనుల కర్మల పత్రం ఉన్నతస్థాయి వ్యక్తులకు సంబంధించిన గ్రంథంలో ఉంటుంది. ఉన్నతస్థాయి వ్యక్తులకు సంబంధించిన గ్రంథం అంటే ఏమిటో నీకు తెలుసా? అదొక వ్రాయబడిన గ్రంథం, దేవునికి సన్నిహితులైన దైవదూతలు దాన్ని కాపలా కాస్తూ ఉంటారు. నిస్సందేహంగా సజ్జనులు సుఖసంతోషాలలో తేలి యాడుతూ ఉంటారు, ఉన్నత పీఠాలపై కూర్చుండి (స్వర్గ దృశ్యాలను) తిలకిస్తూ ఉంటారు. వారి ముఖాలలో నీకు సుఖ సంతోషాల కళాకాంతులు కనిపిస్తాయి. ముద్ర వేయబడిన, సుమధుర మధువు వారికి ఇవ్వబడుతుంది. దానిపై కస్తూరి ముద్ర వేయబడి ఉంటుంది. ఇతరుల్ని మించిపోవాలని కోరుకునే వారు దీన్ని పొందే విషయంలో మించిపోవటానికి కృషిచేయాలి. ఆ మధువులో తస్నీమ్[6] కలిసి ఉంటుంది; ఇదొక సెలయేరు, దీని జలముతో పాటు దైవసాన్నిధ్యం పొందిన వారు మధువు సేవిస్తారు.

**29 - 36** ప్రపంచంలో విశ్వసించినవారిని నేరస్తులు హేళన చేస్తుంటారు. వారిముందు నుండి వెళ్ళేటప్పుడు మాటిమాటికీ కళ్ళు గీటుతూ వారి వైపు సైగలు చేసేవారు. తమ కుటుంబ సభ్యుల దగ్గరకు వెళ్ళేటప్పుడు సంబర పడుతూ వెళ్ళేవారు. వారిని చూసినప్పుడు, “వీరు దారి తప్పారు” అని అనేవారు. వాస్తవానికి వారు వారిపై కాపలాదారులుగా నియ మించి పంప బడలేదు. ఈనాడు విశ్వసించినవారు అవిశ్వా సులను చూసి నవ్వుతున్నారు, ఉన్నత పీఠాలపై కూర్చుండి వారి స్థితిని చూస్తున్నారు. దొరికింది కదా అవిశ్వాసులకు వారు చేస్తూవుండిన చేష్టలకు పుణ్యఫలం.[7]

5. అంటే, శిక్షా పడదు, ప్రతిఫలమూ ఉండదు అనే వారి అభిప్రాయం తప్పుడు అభిప్రాయం.
6. తస్నీమ్ అంటే ఎత్తు అని అర్థం. ఒక సెలయేరును తస్నీమ్ అని అంటే దాని భావం, అది ఎత్తైన ప్రదేశం నుండి ప్రవహిస్తూ క్రిందికి వస్తుంది అన్నమాట.
7. ఈ వాక్యంలో ఒక సున్నితమైన వ్యంగ్యం ఉంది. ప్రపంచంలో విశ్వాసులను బాధించటం పుణ్యకార్యంగా భావించి అవిశ్వాసులు వారిని బాధించేవారు. కనుక పరలోకంలో స్వర్గసౌఖ్యాలు అనుభవిస్తూ ఉండే విశ్వాసులు నరకాగ్నిలో కాలుతూ ఉండే అవిశ్వాసుల దుస్థితిని చూసి వారి కర్మలకు ప్రతిఫలంగా వారికి బాగా పుణ్యం లభించిందని మనస్సుల్లో అనుకుంటారు.

ఆయతులు 25 | ## 84. అల్ ఇన్‌షిఖాఖ్ | అవతరణ మక్కాలో

٨٤ سُوْرَةُ الْاِنْشِقَاقِ مَكِّيَّةٌ ٨٣

اٰيَاتُهَا ٢٥ | رُكُوْعُهَا ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

اِذَا السَّمَآءُ انْشَقَّتْ ۝١ وَ اَذِنَتْ لِرَبِّهَا وَ
حُقَّتْ ۝٢ وَ اِذَا الْاَرْضُ مُدَّتْ ۝٣ وَ اَلْقَتْ مَا
فِيْهَا وَ تَخَلَّتْ ۝٤ وَ اَذِنَتْ لِرَبِّهَا وَ حُقَّتْ ۝٥
يٰۤاَيُّهَا الْاِنْسَانُ اِنَّكَ كَادِحٌ اِلٰى رَبِّكَ كَدْحًا
فَمُلٰقِيْهِ ۝٦ فَاَمَّا مَنْ اُوْتِيَ كِتٰبَهٗ بِيَمِيْنِهٖ ۝٧
فَسَوْفَ يُحَاسَبُ حِسَابًا يَّسِيْرًا ۝٨ وَّ يَنْقَلِبُ
اِلٰۤى اَهْلِهٖ مَسْرُوْرًا ۝٩ وَ اَمَّا مَنْ اُوْتِيَ كِتٰبَهٗ
وَرَآءَ ظَهْرِهٖ ۝١٠ فَسَوْفَ يَدْعُوْا ثُبُوْرًا ۝١١ وَّ
يَصْلٰى سَعِيْرًا ۝١٢ اِنَّهٗ كَانَ فِيْۤ اَهْلِهٖ
مَسْرُوْرًا ۝١٣ اِنَّهٗ ظَنَّ اَنْ لَّنْ يَّحُوْرَ ۝١٤ بَلٰۤى ۛۚ
اِنَّ رَبَّهٗ كَانَ بِهٖ بَصِيْرًا ۝١٥

معانقة ١٧

**1 - 15** ఆకాశం బ్రద్దలైపోయినప్పుడు, అది తన ప్రభువు ఆజ్ఞను శిరసావహించినప్పుడు, అదే (తన ప్రభువు ఆజ్ఞను శిరసావహించటమే) దాని విధ్యుక్త ధర్మం; భూమి విస్తరింప జేయబడినప్పుడు,[1] అది తన లోపల ఉన్నదంతా బయటికి విసరివేసి ఖాళీ అయినప్పుడు,[2] అది తన ప్రభువు ఆజ్ఞను శిరసావహించినప్పుడు, అదే (తన ప్రభువు ఆజ్ఞను శిరసావహించటమే) దాని విధ్యుక్త ధర్మం. ఓ మానవుడా! నీవు భారంగా, బలవంతంగా నీ ప్రభువు వైపునకు వెళుతున్నావు, ఆయనను కలుసుకోబోతున్నావు. ఆ తరువాత, కర్మల పత్రం కుడిచేతికి ఇవ్వబడిన వ్యక్తినుండి తేలికపాటి లెక్క తీసుకోబడు తుంది.[3] అప్పుడు అతను తెగ సంతోషపడుతూ తన వారి వైపునకు మరలిపోతాడు.[4] ఇక కర్మల పత్రం వీపు వెనుకనుండి ఇవ్వబడే వ్యక్తి[5] మాత్రం చావును పిలుస్తూ మండుతున్న అగ్నిలోకి పోయి పడతాడు. అతడు తన కుటుంబ సభ్యుల మధ్య సుఖసంతోషాలలో మునిగి ఉండేవాడు. తాను ఎన్నడూ (తన ప్రభువు వైపునకు) మరలిపోనని అతడు భావించేవాడు. మరలిపోవటం ఎందుకు జరగదు, అతని ప్రభువు అతని చర్య లను గమనిస్తూనే ఉండేవాడు.

1. భూమి విస్తరింపజేయబడినప్పుడు అంటే సముద్రాలూ, నదులూ పూడ్చబడి నప్పుడు, పర్వతాలు తుత్తునియలు చేయబడి చెల్లాచెదురుగా చేయబడినప్పుడు, భూమిలోని ఎత్తూ పల్లాలను చదరం చేసి దాన్ని ఒక మైదానంగా మార్చటం అని భావం.
2. అంటే, మృతిచెందిన మానవులు ఎంతమందైతే అందులో పడి ఉన్నారో వారందర్నీ అది బయటపడేస్తుంది. అదేవిధంగా అందులో ఉన్న వారి కర్మల సాక్ష్యాలన్నీ బయటపడిపోతాయి. ఏ విషయమూ అందులో దాగి ఉండదు, అణగి ఉండదు.
3. అంటే, అతని నుండి కఠినంగా లెక్క తీసుకోవటం జరగదన్నమాట. ఫలానా పనులను నీవు ఎందుకు చేశావు, అవి చెయ్యటానికి కారణాలేమిటో తెలుపు అని అడగటం జరగదు. అతను చేసిన మంచి పనులతో పాటు అతని చెడ్డపనులు కూడా అతని కర్మల పత్రంలో ఉంటాయి. కాని మంచి పనుల త్రాసు పళ్ళెం చెడు పనుల దానికంటె బరువుగా ఉన్న కారణంగా, అతని పాపాలను మన్నించి అతన్ని క్షమించటం జరుగుతుంది.

فَلَآ أُقْسِمُ بِالشَّفَقِ ﴿١٦﴾ وَالَّيْلِ وَمَا وَسَقَ ﴿١٧﴾
وَالْقَمَرِ إِذَا اتَّسَقَ ﴿١٨﴾ لَتَرْكَبُنَّ طَبَقًا عَنْ
طَبَقٍ ﴿١٩﴾ فَمَا لَهُمْ لَا يُؤْمِنُونَ ﴿٢٠﴾ وَإِذَا قُرِئَ
عَلَيْهِمُ الْقُرْاٰنُ لَا يَسْجُدُوْنَ ﴿٢١﴾ بَلِ الَّذِيْنَ السجدة ١٣
كَفَرُوْا يُكَذِّبُوْنَ ﴿٢٢﴾ وَاللّٰهُ اَعْلَمُ بِمَا
يُوْعُوْنَ ﴿٢٣﴾ فَبَشِّرْهُمْ بِعَذَابٍ اَلِيْمٍ ﴿٢٤﴾ اِلَّا
الَّذِيْنَ اٰمَنُوْا وَعَمِلُوا الصّٰلِحٰتِ لَهُمْ اَجْرٌ غَيْرُ
مَمْنُوْنٍ ﴿٢٥﴾ ع ٢٥

**16 - 25** కనుక, కాదు (మీరనుకునేది నిజం కానేకాదు), సంధ్యారుణిమ సాక్షిగా, రాత్రివేళ సాక్షిగా, అది సమీకరించేవి సాక్షిగా, నిండు చంద్రుడు సాక్షిగా, నేను చెబుతున్నాను, మీరు తప్పనిసరిగా ఒక స్థితినుండి మరొక స్థితికి క్రమేణా తరలి పోవలసి ఉంటుంది.[6] అలాంటప్పుడు వీరికేమయింది విశ్వసించరు? వీరి ముందు ఖురాన్ పఠించబడేటప్పుడు సజ్దా (సాష్టాంగ ప్రణామం) ఎందుకు చేయరు? పైగా ఈ అవిశ్వాసులు తిరస్కరిస్తున్నారు. కాని వాస్తవానికి వీరు (తమ కర్మల పత్రాలలో) నమోదు చేసుకుంటున్న వాటిని అల్లాహ్ బాగా ఎరుగు.[7] కాబట్టి వీరికి వ్యధాభరితమైన శిక్ష ఉందన్న శుభ వార్తను వినిపించు. అయితే, విశ్వసించి సత్కార్యాలు చేసిన వారికి అనంత ప్రతిఫలం ఉంది.

4. తన వారు అంటే, అతని లాగానే క్షమాభిక్షకు నోచుకున్న అతని భార్యాపిల్లలు, బంధువులు, సహచరులు అని అర్థం.

5. అల్-హాఖ్ఖా సూరాలో "ఎవరి కర్మల పత్రమైతే అతని ఎడమచేతికి ఇవ్వబడుతుందో" అని చెప్పబడింది. కాని ఇక్కడ "అతని వీపు వెనుకనుండి ఇవ్వబడుతుంది" అని చెప్పబడింది. బహుశా దీని స్థితి ఇలా ఉంటుందేమో; మొత్తం మానవజాతి సమక్షంలో, కర్మల పత్రాన్ని ఎడమ చేతితో తీసుకోవటం అవమానకరంగా భావించి అతడు తన చేతిని వీపు వెనుక పెడతాడు. కాని కర్మల పత్రాన్ని అతడు తప్పనిసరిగా పట్టుకునేలా చేసి తీరటం జరుగుతుంది; అతడు చెయ్యిచాచి దాన్ని తీసుకున్నాసరే లేక వీపు వెనుక దాచుకున్నాసరే.

6. అంటే, మీరు ఒకే స్థితిలో కలకాలం ఉండరు. యౌవనం నుండి వృద్ధాప్యం, వృద్ధాప్యం నుండి మృత్యువు, మృత్యువు నుండి బర్‌జఖ్ (మరణానికీ ప్రళయ దినానికీ మధ్య ఆత్మలు ఉండే వ్యవస్థ), బర్‌జఖ్ నుండి మళ్ళీ బ్రతకటం, మళ్ళీ బ్రతకటం నుండి హషర్ మైదానం, ఆ తరువాత కర్మల విచారణ, శిక్షా ప్రతిఫలాలు, ఇటువంటి ఎన్నో దశల నుండి మీరు సాగిపోవలసి ఉంటుంది. ఈ సందర్భంగా మూడు విషయాలపై ప్రమాణం చెయ్యటం జరిగింది: ఒకటి, సూర్యుడు అస్తమించిన తరువాత కనిపించే సంధ్యారుణిమ. రెండు, పగలు తరువాత వచ్చే రాత్రి చీకటి, పగటిపూట భూమిపై వ్యాపించి ఉండే మానవులూ, జంతువులూ చీకటిపడగానే తమ తమ నివాసాలకు తిరిగి రావటం. మూడు, చంద్రుడు నెలవంక దశ నుంచి క్రమక్రమంగా పెరిగి పూర్ణచంద్రుడు కావటం- మానవుడు నివసించే, ఈ విశాల విశ్వంలో ఎక్కడా స్తబ్ధత లేదని, ఒక నిరంతర పరివర్తన, ఒక క్రమమైన మార్పు నలువైపులా కనిపిస్తుందనే విషయానికి ఇవన్నీ బహిరంగ సాక్ష్యాలు. కనుక తుది శ్వాసతోనే వ్యవహారమంతా సమసిపోతుందనే అవిశ్వాసుల అభిప్రాయం నిజం కాదు.

7. రెండో అర్థం ఇది కూడా కావచ్చు: వారి హృదయాలలో ఉన్న అవిశ్వాసం, సత్యవిరోధం, దురుద్దేశ్యాలు, దుష్ట సంకల్పాలను అల్లాహ్ బాగా ఎరుగును.

# 85. అల్ బురూజ్

ఆయతులు 22 | అవతరణ మక్కాలో

٨٥ سُورَةُ الْبُرُوجِ مَكِّيَّةٌ ٢٧

ايَاتها ٢٢ | ركوعها ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

وَالسَّمَآءِ ذَاتِ الْبُرُوْجِ ① وَالْيَوْمِ الْمَوْعُوْدِ ② وَشَاهِدٍ وَّ مَشْهُوْدٍ ③ قُتِلَ اَصْحٰبُ الْاُخْدُوْدِ ④ النَّارِ ذَاتِ الْوَقُوْدِ ⑤ اِذْ هُمْ عَلَيْهَا قُعُوْدٌ ⑥ وَّهُمْ عَلٰى مَا يَفْعَلُوْنَ بِالْمُؤْمِنِيْنَ شُهُوْدٌ ⑦ وَمَا نَقَمُوْا مِنْهُمْ اِلَّآ اَنْ يُّؤْمِنُوْا بِاللّٰهِ الْعَزِيْزِ الْحَمِيْدِ ⑧ الَّذِيْ لَهٗ مُلْكُ السَّمٰوٰتِ وَ الْاَرْضِ ؕ وَ اللّٰهُ عَلٰى كُلِّ شَيْءٍ شَهِيْدٌ ⑨ اِنَّ الَّذِيْنَ فَتَنُوا الْمُؤْمِنِيْنَ وَ الْمُؤْمِنٰتِ ثُمَّ لَمْ يَتُوْبُوْا فَلَهُمْ عَذَابُ جَهَنَّمَ وَ لَهُمْ عَذَابُ الْحَرِيْقِ ⑩ اِنَّ الَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا الصّٰلِحٰتِ لَهُمْ جَنّٰتٌ تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ ؕ ذٰلِكَ الْفَوْزُ الْكَبِيْرُ ⑪

**1 – 9** దృఢమైన బురుజులు గల ఆకాశం[1] సాక్షిగా! వాగ్దానం చేయబడిన (ప్రళయం) దినం సాక్షిగా! చూసేవాడు సాక్షిగా! చూడబడేది[2] సాక్షిగా! – కందకం వాళ్ళు సర్వనాశనమయ్యారు. అది ఇంధనంతో తీవ్రంగా మండే అగ్ని గల కందకం. అప్పుడు వారు ఆ కందకం చుట్టూ కూర్చుండి విశ్వాసుల పట్ల తాము చేసిన నిర్వాకాన్ని చూస్తూ ఉండేవారు.[3] ఆ విశ్వాసుల పట్ల వారి శత్రుత్వానికి కారణం ఇది తప్ప మరేమీ కాదు – మహా శక్తిమంతుడు, సకల స్తోత్రాలకు తగినవాడు, భూమ్యాకాశాల సామ్రాజ్యానికి యజమాని అయిన అల్లాహ్‌ను వారు విశ్వసించారు. ఆ దేవుడు సమస్త విషయాలను గమనిస్తున్నాడు.

**10 – 11** ఎవరైతే విశ్వాసులైన పురుషులను, స్త్రీలను హింసించారో, ఆ తరువాత దానికి పశ్చాత్తాపపడరో, నిశ్చయంగా వారు నరక యాతనకు గురి అవుతారు. ఆపై వారికి కాల్చివేసే శిక్ష పడుతుంది. విశ్వసించి ఆపై సత్కార్యాలు చేసినవారి కొరకు నిశ్చయంగా స్వర్గవనాలు ఉన్నాయి, వాటి క్రింద సెలయేళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి. ఇదే గొప్ప విజయం.

1. అంటే, ఆకాశంలోని బ్రహ్మాండమైన నక్షత్రాలు, గ్రహాలు అని అర్థం.
2. చూసేవాడు అంటే ప్రళయం నాడు లేచి హాజరయ్యే ప్రతి మనిషీ అని భావం. చూడబడేది అంటే స్వయంగా ప్రళయమే. దాని భయంకర దృశ్యాలను చూసే వాళ్ళందరూ చూస్తారు.
3. కందకాల వాళ్ళు అంటే, పెద్ద పెద్ద కందకాలలో అగ్ని మండించి వాటిలోకి విశ్వాసులను విసరివేసి వారు కాలుతూ కనిపించే హృదయవిదారక దృశ్యాన్ని తమాషాగా చూసినవారు అని అర్థం. సర్వ నాశనమయ్యారు అంటే వారు దైవ శాపగ్రస్తులై శిక్షకు అర్హులయ్యారు అని భావం.

**12 - 22** నిశ్చయంగా నీ ప్రభువు పట్టు బహుగట్టిది. ఆయనే మొదటిసారి పుట్టించాడు, మళ్ళీ ఆయనే రెండోసారి పుట్టిస్తాడు. ఆయన క్షమించేవాడు, ప్రేమించేవాడు, అధికార పీఠాధిపతి, మహిమాన్వితుడు, తాను తలచిన దాన్ని చేయగలవాడు. మీకు సైన్యాల గురించిన సమాచారమేదైనా అందిందా? ఫిరౌన్, సమూద్‌ల (సైన్యాల) సమాచారం? కాని తిరస్కార వైఖరిని అవలంబించిన వారు తిరస్కరించటంలో నిమగ్నులై ఉన్నారు. వాస్తవానికి అల్లాహ్ వారిని చక్రబంధం చేసి ఉంచాడు. (వారు తిరస్క రించినంత మాత్రాన ఈ ఖురాన్‌కు నష్టమేమీ వాటి ల్లదు) ఈ ఖురాన్ మహత్తరమైనది, ఫలకంపై వ్రాయబడి భద్రంగా[4] ఉన్నది.

اِنَّ بَطْشَ رَبِّكَ لَشَدِيْدٌ ﴿١٢﴾ اِنَّهٗ هُوَ يُبْدِئُ
وَيُعِيْدُ ﴿١٣﴾ وَ هُوَ الْغَفُوْرُ الْوَدُوْدُ ﴿١٤﴾
ذُوالْعَرْشِ الْمَجِيْدُ ﴿١٥﴾ فَعَّالٌ لِّمَا يُرِيْدُ ﴿١٦﴾ هَلْ
اَتٰىكَ حَدِيْثُ الْجُنُوْدِ ﴿١٧﴾ فِرْعَوْنَ وَثَمُوْدَ ﴿١٨﴾
بَلِ الَّذِيْنَ كَفَرُوْا فِيْ تَكْذِيْبٍ ﴿١٩﴾ وَّ اللّٰهُ مِنْ
وَّرَآئِهِمْ مُّحِيْطٌ ﴿٢٠﴾ بَلْ هُوَ قُرْاٰنٌ مَّجِيْدٌ ﴿٢١﴾
فِيْ لَوْحٍ مَّحْفُوْظٍ ﴿٢٢﴾ ع

4. అంటే, ఈ ఖురాన్‌లో వ్రాయబడి ఉన్న విషయం మారదు, నశించదు, మార్చశక్యం కాని "సురక్షిత ఫలకం"పై వ్రాయబడి ఉన్నది.

## 86. అత్ తారిఖ్

ఆయతులు 17 | అవతరణ మక్కాలో

٨٦ سُوْرَةُ الطَّارِقِ مَكِّيَّةٌ ٣٦

اٰياتها ١٧ | ركوعها ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 17** ఆకాశం సాక్షిగా! రాత్రివేళ ప్రత్యక్షమయ్యేది సాక్షిగా! రాత్రివేళ ప్రత్యక్షమయ్యేదేమిటో నీకు తెలుసా? అది మెరిసే నక్షత్రం - తనకు ఒక సంరక్షకుడంటూ[1] లేని ప్రాణి ఏదీ లేదు. కనుక మానవుడు తాను ఎలాంటి వస్తువుతో పుట్టించ బడ్డాడో కొంచెం ఆలోచించాలి. వెన్నెముకకు, ప్రక్కటెముకలకు మధ్య నుండి[2] దూకుడుగా వెలువడే ఒక ద్రవపదార్థంతో అతడు పుట్టించబడ్డాడు. నిశ్చయంగా ఆయన (సృష్టికర్త) అతన్ని మళ్ళీ సృష్టించగల శక్తిమంతుడు. దాగివున్న రహస్యాలు బట్టబయలై పరీక్షించబడే రోజున[3] మానవుని వద్ద స్వయంగా తనదంటూ ఏ శక్తీ ఉండదు. అతనికి సహాయం చేసేవాడు కూడ ఎవడూ ఉండడు. వర్షాన్ని కురిపించే ఆకాశం సాక్షిగా, (వృక్షజాతి మొలకెత్తేటప్పుడు) బ్రద్దలయ్యే నేల సాక్షిగా, ఇదొక నిర్ణయాత్మకమైన విషయం, నవ్వులాట కాదు.[4] వీరు (అంటే మక్కా అవిశ్వాసులు) కొన్ని పన్నాగాలు పన్నుతున్నారు, నేను కూడ ఒక పన్నాగం పన్నుతున్నాను. కనుక ఓ ప్రవక్తా! ఈ అవిశ్వాసులను వదిలెయ్యి, కొంతకాలంపాటు వారి మానాన వారిని వదిలెయ్యి.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

وَ السَّمَآءِ وَ الطَّارِقِ ﴿١﴾ وَ مَآ اَدْرٰىكَ مَا
الطَّارِقُ ﴿٢﴾ النَّجْمُ الثَّاقِبُ ﴿٣﴾ اِنْ كُلُّ نَفْسٍ
لَّمَّا عَلَيْهَا حَافِظٌ ﴿٤﴾ فَلْيَنْظُرِ الْاِنْسَانُ مِمَّ
خُلِقَ ﴿٥﴾ خُلِقَ مِنْ مَّآءٍ دَافِقٍ ﴿٦﴾ يَّخْرُجُ مِنْ
بَيْنِ الصُّلْبِ وَ التَّرَآئِبِ ﴿٧﴾ اِنَّهٗ عَلٰى رَجْعِهٖ
لَقَادِرٌ ﴿٨﴾ يَوْمَ تُبْلَى السَّرَآئِرُ ﴿٩﴾ فَمَا لَهٗ مِنْ
قُوَّةٍ وَّلَا نَاصِرٍ ﴿١٠﴾ وَ السَّمَآءِ ذَاتِ الرَّجْعِ ﴿١١﴾ وَ
الْاَرْضِ ذَاتِ الصَّدْعِ ﴿١٢﴾ اِنَّهٗ لَقَوْلٌ فَصْلٌ ﴿١٣﴾
وَّمَا هُوَ بِالْهَزْلِ ﴿١٤﴾ اِنَّهُمْ يَكِيْدُوْنَ كَيْدًا ﴿١٥﴾ وَّ
اَكِيْدُ كَيْدًا ﴿١٦﴾ فَمَهِّلِ الْكٰفِرِيْنَ اَمْهِلْهُمْ
رُوَيْدًا ﴿١٧﴾

ع ١١

1. సంరక్షకుడు అంటే అర్థం స్వయంగా అల్లాహ్‌యే. భూమ్యాకాశాలలో సృష్టింపబడిన వస్తువులలోని చిన్నా పెద్దా అన్నిటినీ ఆయనే పోషిస్తున్నాడు, కాపాడుతున్నాడు. రాత్రి సమయంలో ఆకాశంలో మెరుస్తూ కనిపించే అసంఖ్యాకమైన నక్షత్రాలు, గ్రహాలలోని ప్రతి ఒక్క దాని ఉనికి, మనుగడలు సాక్ష్యమిచ్చేదేమిటంటే, తనను సృష్టించిన వాడొకడున్నాడు, ఆయనే తనను ప్రకాశింపజేస్తున్నాడు, అంతరిక్షంలో వ్రేలాడుతూ ఉండేలా చేశాడు, అది తన కక్ష్యలో తిరిగేటప్పుడు, అసంఖ్యాకమైన నక్షత్రాలు పరిభ్రమించేటప్పుడు, అది వేటితోనూ ఢీ కొనడంగాని, ఇతర నక్షత్రాలు దానితో ఢీ కొనడంగాని జరక్కుండా, అది అంతరిక్షం నుండి క్రిందపడకుండా ఆయన కాపాడుతున్నాడు, సంరక్షిస్తున్నాడు.
2. స్త్రీ పురుషుల సంతానోత్పత్తి ద్రవాలు మానవుని వెన్నెముకకు, ప్రక్కటెముకలకు మధ్య గల శరీర భాగం నుండి ప్రవహిస్తాయి. అందువల్ల మానవుడు వెన్నెముకకు ప్రక్కటెముకలకు మధ్య నుండి వెలువడే ద్రవపదార్థం నుండి పుట్టించబడ్డాడు అని సెలవీయబడింది.
3. దాగి ఉన్న రహస్యాలు అంటే అర్థం ప్రతి వ్యక్తి ప్రపంచంలో చేసిన, రహస్యంగా ఉండిపోయిన కర్మలు మరియు ప్రజల ముందుకు వచ్చి పైకి కనిపించే వ్యవహారాలు అయినప్పటికీ, వాటి వెనుక ఉన్న సంకల్పాలు, లక్ష్యాలు, కోరికలు మాత్రం ప్రజల జ్ఞానపరిధిలోనికి రాకుండా గుప్తంగా ఉన్న రహస్యాలు.
4. ఆకాశం నుండి వర్షం కురవటం, నేలబ్రద్దలై అందులో నుండి వృక్షజాతి మొలకెత్తటం ఏ విధంగా నవ్వులాట కాదో, అదెలా పచ్చి నిజమో అదేవిధంగా మానవుడు మళ్ళీ తన ప్రభువు వైపునకు తప్పకుండా మరలిపోతాడు అని దివ్య ఖురాన్ చెప్పే విషయం కూడ పరిహాసం ఎంతమాత్రం కాదు, అదొక తిరుగులేని సత్యం.

ఆయతులు 19 | **87. అల్ ఆలా** | అవతరణ మక్కాలో

٨٧ سُوْرَةُ الْاَعْلٰى مَكِّيَّةٌ ٨

اٰياتها ١٩ | ركوعها ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

سَبِّحِ اسْمَ رَبِّكَ الْاَعْلَى ① الَّذِيْ خَلَقَ
فَسَوّٰى ② وَالَّذِيْ قَدَّرَ فَهَدٰى ③ وَ الَّذِيْ
اَخْرَجَ الْمَرْعٰى ④ فَجَعَلَهٗ غُثَآءً اَحْوٰى ⑤
سَنُقْرِئُكَ فَلَا تَنْسٰٓى ⑥ اِلَّا مَا شَآءَ اللّٰهُ
اِنَّهٗ يَعْلَمُ الْجَهْرَ وَ مَا يَخْفٰى ⑦ وَ نُيَسِّرُكَ
لِلْيُسْرٰى ⑧ فَذَكِّرْ اِنْ نَّفَعَتِ الذِّكْرٰى ⑨
سَيَذَّكَّرُ مَنْ يَّخْشٰى ⑩ وَ يَتَجَنَّبُهَا الْاَشْقَى ⑪
الَّذِيْ يَصْلَى النَّارَ الْكُبْرٰى ⑫ ثُمَّ لَا يَمُوْتُ
فِيْهَا وَ لَا يَحْيٰى ⑬ قَدْ اَفْلَحَ مَنْ تَزَكّٰى ⑭ وَ
ذَكَرَ اسْمَ رَبِّهٖ فَصَلّٰى ⑮ بَلْ تُؤْثِرُوْنَ الْحَيٰوةَ
الدُّنْيَا ⑯ وَ الْاٰخِرَةُ خَيْرٌ وَّ اَبْقٰى ⑰ اِنَّ هٰذَا
لَفِي الصُّحُفِ الْاُوْلٰى ⑱ صُحُفِ اِبْرٰهِيْمَ وَ
مُوْسٰى ⑲ ع ١٩ ١٢

**1 – 5** (ఓ ప్రవక్తా!) మహోన్నతుడైన నీ ప్రభువు నామాన్ని కొనియాడు; ఆయన(విశ్వాన్ని) సృష్టించాడు, సమమైన తూకాన్ని నెలకొల్పాడు,[1] జాతకం నిర్ణయించాడు,[2] ఆపై, మార్గం చూపిం చాడు,[3] వృక్షజాతులను పుట్టించాడు, తిరిగి వాటిని నల్లని చెత్తా చెదారంగా మార్చాడు.

**6 – 7** మేము నిన్ను చదివిస్తాము, ఆ తరువాత నీవు మరచి పోవు[4] అల్లాహ్ కోరినదాన్ని తప్ప.[5] ఆయనకు బహిరంగమయి నవీ తెలుసు, గోప్యమయినవీ తెలుసు.

**8 – 13** మేము నీకు సులభమైన మార్గంలో ఉండే సౌకర్యాన్ని కలుగజేస్తున్నాము, కనుక నీవు హితబోధ చేస్తూ ఉండు, హితబోధ గనక లాభదాయకమయితే.[6] (దేవునికి) భయపడే వాడు హితబోధను స్వీకరిస్తాడు; దానిని పెడ చెవిని పెట్టేవాడే పరమ దౌర్భాగ్యుడు, అతడు ఘోరమైన అగ్నిలో పడతాడు. ఇక అందులో అతడు చావడూ, బ్రతకడూ.

**14 – 19** పరిశుద్ధతను పాటించి, తన ప్రభువు నామాన్ని స్మరించి, ఆ తరువాత నమాజు చేసినవాడు తప్పక సాఫల్యం పొందుతాడు. కాని మీరు ఐహిక జీవితానికి ప్రాధాన్యం ఇస్తు న్నారు. వాస్తవానికి పరలోక జీవితమే మేలైనది, శాశ్వతమైన దీను. ఈ విషయమే పూర్వం వచ్చిన గ్రంథాల్లోనూ చెప్పబడింది, (అంటే) ఇబ్రాహీమ్, మూసాలపై అవతరించిన గ్రంథాలలో.

---

1. అంటే, నేల నుంచి నింగి వరకు సృష్టిలోని ప్రతి వస్తువునూ సృష్టించాడు, సృష్టించిన ప్రతి వస్తువునూ పూర్తిగా సత్యమైనదిగా, సక్రమమైనదిగా పుట్టించాడు, దానికి సమమైన తూకాన్ని, ప్రమాణాన్ని చక్కగా ఏర్పాటు చేశాడు, దాన్ని ఎటువంటి రూపంలో సృష్టించాడంటే, అటువంటి వస్తువుకు అంతకంటే మంచి రూపాన్ని గురించి ఊహించటం అసంభవం.
2. అంటే, ప్రతి వస్తువునూ సృష్టించేముందు ఈ విషయాలన్నీ నిర్ణయించబడ్డాయి – అది ప్రపంచంలో చేయవలసిన పని ఏమిటి, ఆ పని కోసం దాని పరిమాణం ఎంత ఉండాలి, దాని ఆకారం ఎలా ఉండాలి, దాని గుణగణాలు ఎలా ఉండాలి, అది ఎక్కడ ఏ స్థలంలో ఉండాలి, దాని మనుగడకూ, నివాసానికి, కార్యరంగానికి ఏ

అవకాశాలు, ఏ మార్గాలు సమకూర్చబడాలి, అది ఎప్పుడు ఉనికిలోకి రావాలి, ఎంతకాలం వరకు తన వంతు పనిని చెయ్యాలి, అది ఎప్పుడు, ఎలా అంతం కావాలి. ఈ మొత్తం పథకం పేరే "జాతకం" అంటే.

3. అంటే, ఏ వస్తువును కూడ సృష్టించి దాని మానాన దాన్ని వదలిపెట్టం జరగలేదు. ఏ వస్తువును ఏ పనికోసం సృష్టించటం జరిగిందో, దానికి ఆ పని చేసే విధానం కూడ తెలుపబడింది అని అర్థం.

4. తొలి దశలో, దివ్య ఖురాన్ అవతరణ ప్రారంభమైనప్పుడు, అప్పుడప్పుడూ ఇలా జరిగేది: జిబ్రీల్ (అస్సలామ్) దివ్య ఖురాన్‌ను వినిపించటం ముగించారో లేదో, మహాప్రవక్త (సఅసమ్) దానిని మరచిపోతానేమో అనే భయంతో మొదటి భాగాన్ని మళ్ళీ చదవటం ప్రారంభించేవారు. ఈ కారణంగానే అల్లాహ్ మహనీయుడైన ముహమ్మద్ (సఅసమ్)కు, దివ్య ఖురాన్ అవతరించేటప్పుడు, మీరు దానిని మౌనంగా ఉండి శ్రద్ధగా వినండి, మేము దానిని మీచే చదివిస్తాము. అది మీకు శాశ్వతంగా జ్ఞాపకముండిపోతుంది అని ఉపదేశించి ఆత్మ విశ్వాసం కలిగించాడు.

5. అంటే, ఒకదాని తరువాత ఒకటి ప్రతి పదమూ పూర్తి ఖురాన్ నీ స్మృతిలో సురక్షితంగా ఉండిపోవటానికి కారణం నీ శక్తి సామర్థ్యాలు కావు, ఇది అల్లాహ్ కృప ఫలితమే, ఆయన మహోపకారం, అనుగ్రహాల వల్లనే జరిగింది. అల్లాహ్ కోరితే దాన్ని మరిపింపజేస్తాడు కూడా.

6. అంటే, మేము ధర్మ ప్రచారం విషయంలో, నిన్ను కష్టానికి గురిచేయదలచుకోలేదు. నీవు బధిరులకు వినిపించ నవసరం లేదు. అంధులకు మార్గం చూపనవసరంలేదు. అయితే ఒక సులభమైన పద్ధతిని నీ కొరకు నిర్ణయిం చాము. అదేమిటంటే, ఎక్కడైనా ఎవరైనా ఉపదేశం వినటానికి, దాని ద్వారా ప్రయోజనం పొందటానికి సిద్ధంగా ఉన్నారని నీవు భావిస్తే, అక్కడ తప్పకుండా ఉపదేశం చెయ్యి. ఉపదేశాన్ని స్వీకరించటానికి ప్రజలు సిద్ధంగా లేరని అనుభవపూర్వకంగా తెలిస్తే, నీవు అటువంటి వారి వెంట పడనవసరం లేదు.

# 88. అల్ గాషియహ్

ఆయతులు 26 | అవతరణ మక్కాలో

٨٨ سُوۡرَةُ الۡغَاشِيَةِ مَكِّيَّةٌ ٦٨

اٰياتها ٢٦ | ركوعها ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 16** ముంచుకు వచ్చే ముప్పు (అంటే ప్రళయం)ను గురించిన సమాచారం నీకేమైనా అందిందా? కొందరి ముఖాలలో[1] ఆ రోజున భయాందోళనలు కనిపిస్తాయి, ఎక్కువ శ్రమ పడుతూ, అలసిపోతారు, తీవ్రమైన అగ్నిలో చిక్కుకుపోయి ఉంటారు. త్రాగేందుకు వారికి సలసల కాగే చెలమ నీరు ఇవ్వబడుతుంది. వారి కొరకు ఎండిన ముళ్ల గడ్డి తప్ప మరొక ఆహారం ఉండదు, అది బలమూ నీయదు, ఆకలినీ తీర్చదు. ఆ రోజున కొందరి ముఖాలు కళ కళలాడుతూ ఉంటాయి, తాము చేసుకున్న సత్కార్యాలకు వారు సంతోషపడతారు, అత్యున్నతమైన స్వర్గంలో ఉంటారు. అక్కడ వారు ఎలాంటి వృధా విషయాలను వినరు, అందులో సెలయేళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి, అక్కడ ఎత్తైన పీఠాలు ఉంటాయి, పాత్రలు పెట్టబడి ఉంటాయి, పెద్ద పెద్ద దిండ్లు వరుసలు వరుసలుగా అమర్చబడి ఉంటాయి, అందమైన తివాచీలు పరచబడి ఉంటాయి.

**17 - 20** అయితే వీరు ఒంటెలను చూడరా అవి ఎలా సృష్టించబడ్డాయో? ఆకాశాన్ని చూడరా అది పైకి ఎలా ఎత్తబడిందో? కొండలను చూడరా అవి ఎలా పాతిపెట్టబడ్డాయో? భూమిని చూడరా అది ఎలా పరచబడిందో?[2]

**21 - 26** సరే అయితే, (ప్రవక్తా) హితబోధచేస్తూ ఉండు, నీవు కేవలం హితబోధ చేసేవాడవు మాత్రమే, వారిని ఏ విధంగానూ బలవంతంచేసే వాడవుకావు. కాని ఎవరైతే ముఖాన్ని తిప్పుకుంటారో,(సత్యాన్ని) తిరస్కరిస్తారో, అల్లాహ్ అతనికి భారీ శిక్ష విధిస్తాడు. వీరు (చివరికి) మా వైపునకే మరలిరావలసి ఉంది. ఆపై లెక్క చూడవలసిన బాధ్యత మా మీదనే ఉంది.

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ۝

هَلۡ اَتٰىكَ حَدِيۡثُ الۡغَاشِيَةِ ؕ ١ وُجُوۡهٌ يَّوۡمَىِٕذٍ
خَاشِعَةٌ ۙ ٢ عَامِلَةٌ نَّاصِبَةٌ ۙ ٣ تَصۡلٰى نَارًا
حَامِيَةً ۙ ٤ تُسۡقٰى مِنۡ عَيۡنٍ اٰنِيَةٍ ؕ ٥ لَيۡسَ لَهُمۡ
طَعَامٌ اِلَّا مِنۡ ضَرِيۡعٍ ۙ ٦ لَّا يُسۡمِنُ وَلَا يُغۡنِىۡ
مِنۡ جُوۡعٍ ؕ ٧ وُجُوۡهٌ يَّوۡمَىِٕذٍ نَّاعِمَةٌ ۙ ٨ لِّسَعۡيِهَا
رَاضِيَةٌ ۙ ٩ فِىۡ جَنَّةٍ عَالِيَةٍ ۙ ١٠ لَّا تَسۡمَعُ فِيۡهَا
لَاغِيَةً ؕ ١١ فِيۡهَا عَيۡنٌ جَارِيَةٌ ۘ ١٢ فِيۡهَا سُرُرٌ (وقف لازم)
مَّرۡفُوۡعَةٌ ۙ ١٣ وَّاَكۡوَابٌ مَّوۡضُوۡعَةٌ ۙ ١٤ وَّنَمَارِقُ
مَصۡفُوۡفَةٌ ۙ ١٥ وَّزَرَابِىُّ مَبۡثُوۡثَةٌ ؕ ١٦ اَفَلَا
يَنۡظُرُوۡنَ اِلَى الۡاِبِلِ كَيۡفَ خُلِقَتۡ ۚ ١٧ وَاِلَى
السَّمَآءِ كَيۡفَ رُفِعَتۡ ۚ ١٨ وَاِلَى الۡجِبَالِ كَيۡفَ
نُصِبَتۡ ۚ ١٩ وَاِلَى الۡاَرۡضِ كَيۡفَ سُطِحَتۡ ۚ ٢٠
فَذَكِّرۡ ؕ اِنَّمَاۤ اَنۡتَ مُذَكِّرٌ ؕ ٢١ لَسۡتَ عَلَيۡهِمۡ
بِمُصَيۡطِرٍ ۙ ٢٢ اِلَّا مَنۡ تَوَلّٰى وَكَفَرَ ۙ ٢٣ فَيُعَذِّبُهُ
اللّٰهُ الۡعَذَابَ الۡاَكۡبَرَ ؕ ٢٤ اِنَّ اِلَيۡنَاۤ اِيَابَهُمۡ ۙ ٢٥ (النصف)
ثُمَّ اِنَّ عَلَيۡنَا حِسَابَهُمۡ ٢٦ (ع)

1. ముఖాలు అనే పదం ఇక్కడ వ్యక్తులు అనే అర్థంలో వాడబడింది. మానవుని శరీరంలో ప్రముఖంగా కనిపించే భాగం అతని ముఖం కాబట్టి, "కొందరు వ్యక్తులు" అనటానికి బదులుగా, "కొన్ని ముఖాలు" అనే పదాలు వాడబడ్డాయి.
2. అంటే, ఒకవేళ వీరు పరలోకానికి సంబంధించిన ఈ విషయాలను విని అసలు ఇదంతా ఎలా కాగలుగుతుంది అని అంటే; తమ చుట్టుపక్కల ఉన్న పరిసరాలను వీరు ఎన్నడూ చూడలేదా, ఒంటెలు ఎలా సృష్టించబడ్డాయి? ఈ ఆకాశం ఎలా పైకి లేచింది? ఈ పర్వతాలు ఎలా ఏర్పడ్డాయి? ఈ భూమి ఎలా పరచబడింది? ఈ విషయాలను గురించి వీరు ఎన్నడూ ఆలోచించలేదా? ఇవన్నీ తయారై ఉనికిలోకి రాగలిగి ప్రత్యక్షంగా వీరి కళ్ళముందే ఉన్నప్పుడు, ప్రళయం ఎందుకు రాజాలదు? పరలోకంలో మరొక క్రొత్త ప్రపంచం ఎందుకు ఆవిర్భవించదు? స్వర్గ నరకాలు ఎందుకు ఉండజాలవు?

## 89. అల్ ఫజ్ర్

అవతరణ మక్కాలో | ఆయతులు 30

٨٩ سُوْرَةُ الْفَجْرِ مَكِّيَّةٌ ١٠

اٰياتها ٣٠ | ركوعها ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 5** ఉదయం సాక్షిగా! పది రాత్రులు సాక్షిగా! సరి, బేసి (సంఖ్య)లు సాక్షిగా! నిష్క్రమిస్తున్నప్పటి రాత్రి సాక్షిగా! వీటిలో విజ్ఞత కలవాని కొరకు ఏ ప్రమాణమూ లేదా?[1]

**6 - 14** ఎత్తైన స్తంభాల వారైన ఆదె ఇరమ్ జాతి పట్ల మీ ప్రభువు ఎలా ప్రవర్తించాడో మీరు చూడలేదా? దానిని పోలిన మరొక జాతి ఏదీ యావత్తు ప్రపంచ దేశాల్లోనే సృష్టించబడ లేదు. ఇంకా లోయలో కొండరాళ్లను తొలిచిన సమూద్ జాతిపట్ల, మేకుల వారైన ఫిరౌన్ జాతిపట్ల (మీ ప్రభువు ఎలా ప్రవర్తించాడో మీరు చూడలేదా). ప్రపంచ దేశాల్లో దుర్మార్గానికి ఒడిగట్టి ఘోరమైన ఉపద్రవాలను సృష్టించిన వారు వీరే. చివరకు మీ ప్రభువు వారిపై శిక్ష అనే కొరడాను ఝుళిపించాడు. యథార్థమేమిటంటే మీ ప్రభువు మాటువేసి ఉన్నాడు.[2]

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○

وَالۡفَجۡرِ ۙ﴿۱﴾ وَلَيَالٍ عَشۡرٍ ۙ﴿۲﴾ وَّالشَّفۡعِ وَالۡوَتۡرِ ۙ﴿۳﴾
وَالَّيۡلِ اِذَا يَسۡرِ ۚ﴿۴﴾ هَلۡ فِىۡ ذٰلِكَ قَسَمٌ لِّذِىۡ
حِجۡرٍ ؕ﴿۵﴾ اَلَمۡ تَرَ كَيۡفَ فَعَلَ رَبُّكَ بِعَادٍ ۙ﴿۶﴾
اِرَمَ ذَاتِ الۡعِمَادِ ۙ﴿۷﴾ الَّتِىۡ لَمۡ يُخۡلَقۡ مِثۡلُهَا فِى
الۡبِلَادِ ۙ﴿۸﴾ وَ ثَمُوۡدَ الَّذِيۡنَ جَابُوا الصَّخۡرَ
بِالۡوَادِ ۙ﴿۹﴾ وَفِرۡعَوۡنَ ذِى الۡاَوۡتَادِ ۙ﴿۱۰﴾ الَّذِيۡنَ
طَغَوۡا فِى الۡبِلَادِ ۙ﴿۱۱﴾ فَاَكۡثَرُوۡا فِيۡهَا الۡفَسَادَ ۙ﴿۱۲﴾
فَصَبَّ عَلَيۡهِمۡ رَبُّكَ سَوۡطَ عَذَابٍ ۙ﴿۱۳﴾ اِنَّ
رَبَّكَ لَبِالۡمِرۡصَادِ ؕ﴿۱۴﴾

---

1. ముందు రాబోయే ఆయతులను గురించి ఆలోచిస్తే స్పష్టంగా అర్థమయ్యేదేమిటంటే, మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్)కూ, సత్య తిరస్కారులకూ మధ్య శిక్షా, ప్రతిఫలాల విషయం గురించి వాదాలు జరుగుతున్న సమయంలో ఆయన దాన్ని ఆధారాలతో నిరూపిస్తూ ఉంటే, వారు తిరస్కరిస్తూ ఉండేవారు. ఈ సందర్భంగా నాలుగు విషయాలపై ప్రమాణం చేసి, ఆ తరువాత ఈ సత్యానికి సాక్ష్యంగా మరొక ప్రమాణం చేయవలసిన అవసరం కూడ ఉందా అని సెలవీయబడుతోంది.
2. ఎవరైనా ఒక వ్యక్తి మరొక వ్యక్తి రాగానే అతడిపై దాడి చేద్దామనే ఉద్దేశ్యంతో అతడి కోసం దాగి నిరీక్షిస్తూ కూర్చుండే స్థలాన్ని మాటు అంటారు. జరగబోయే పరిణామం పట్ల అజాగ్రత్తగా ఉండి, నిర్భయంగా ఆ స్థలం మీదుగా పోయినప్పుడు అకస్మాత్తుగా ప్రమాదానికి గురి అవుతాడు. ఇదే పరిస్థితి అల్లాహ్ విషయంలో దుర్మార్గులకు కూడా ఎదురవుతుంది. వారు ప్రపంచంలో కల్లోలపు తుఫానును రేకెత్తిస్తారు, దేవుడనే వాడు ఒకడున్నాడనే, ఆయన వారి చేష్టల్ని గమనిస్తున్నాడనే ఆలోచన కూడా వారికి రాదు. వారు పూర్తిగా నిర్భయంగా రోజు రోజుకు వీలైనన్ని చెడ్డపనులు చేస్తూపోతారు. చివరకు అల్లాహ్ వారిని ఇంకా ముందుకు పోకుండా ఏర్పరచే హద్దు వచ్చినప్పుడు, హఠాత్తుగా ఆయన శిక్ష వారిపై విరుచుకుపడుతుంది.
3. అంటే, ఇది మానవుడి భౌతిక ప్రధానమైన జీవన సిద్ధాంతం. ఈ లోకంలోనే సిరిసంపదలు, హోదా, అధికారాలు దొరకటాన్ని అతడు గౌరవంగానూ, దొరకకపోవటాన్ని అగౌరవంగానూ భావిస్తాడు. కాని అసలు విషయాన్ని అతడు ఎరుగడు. అల్లాహ్ ప్రపంచంలో ఎవరికి ఏది ఇచ్చినా అది పరీక్షించటానికే ఇచ్చాడు. ఐశ్వర్యం అధికారాలలోనూ పరీక్ష ఉంది, పేదరికంలోనూ పరీక్ష ఉంది.

فَأَمَّا الْإِنسَانُ إِذَا مَا ابْتَلَاهُ رَبُّهُ فَأَكْرَمَهُ وَ
نَعَّمَهُ فَيَقُولُ رَبِّي أَكْرَمَنِ ﴿١٥﴾ وَأَمَّا إِذَا مَا
ابْتَلَاهُ فَقَدَرَ عَلَيْهِ رِزْقَهُ فَيَقُولُ رَبِّي
أَهَانَنِ ﴿١٦﴾ كَلَّا بَل لَّا تُكْرِمُونَ الْيَتِيمَ ﴿١٧﴾ وَلَا
تَحَاضُّونَ عَلَىٰ طَعَامِ الْمِسْكِينِ ﴿١٨﴾ وَتَأْكُلُونَ
التُّرَاثَ أَكْلًا لَّمًّا ﴿١٩﴾ وَتُحِبُّونَ الْمَالَ حُبًّا
جَمًّا ﴿٢٠﴾ كَلَّا إِذَا دُكَّتِ الْأَرْضُ دَكًّا دَكًّا ﴿٢١﴾ وَ
جَاءَ رَبُّكَ وَالْمَلَكُ صَفًّا صَفًّا ﴿٢٢﴾ وَجِيءَ
يَوْمَئِذٍ بِجَهَنَّمَ يَوْمَئِذٍ يَتَذَكَّرُ الْإِنسَانُ وَأَنَّىٰ
لَهُ الذِّكْرَىٰ ﴿٢٣﴾ يَقُولُ يَا لَيْتَنِي قَدَّمْتُ
لِحَيَاتِي ﴿٢٤﴾ فَيَوْمَئِذٍ لَّا يُعَذِّبُ عَذَابَهُ
أَحَدٌ ﴿٢٥﴾ وَلَا يُوثِقُ وَثَاقَهُ أَحَدٌ ﴿٢٦﴾ يَا أَيَّتُهَا
النَّفْسُ الْمُطْمَئِنَّةُ ﴿٢٧﴾ ارْجِعِي إِلَىٰ رَبِّكِ
رَاضِيَةً مَّرْضِيَّةً ﴿٢٨﴾ فَادْخُلِي فِي عِبَادِي ﴿٢٩﴾
وَادْخُلِي جَنَّتِي ﴿٣٠﴾

ع

**15 - 26** అయితే మానవుడు ఎలాంటి వాడంటే, అతని ప్రభువు అతనికి గౌరవాన్నీ, వరాలనూ ప్రసాదించి అతన్ని పరీక్షకు గురిచేసినప్పుడు, "నా ప్రభువు నా గౌరవ ప్రతిష్ఠలను ఇనుమడింపజేశాడు" అని అంటాడు. ఆయన అతనికి లభించే ఉపాధిని తగ్గించి అతన్ని పరీక్షించినప్పుడు, "నా ప్రభువు నన్ను అవమానపరచాడు"[3] అని అంటాడు. ఎంతమాత్రం కాదు, కాని అసలు మీరు అనాథులను గౌరవంగా చూడరు, నిరుపేదలకు అన్నం పెట్టే విషయంలో మీరు ఒకరినొకరు ప్రోత్సహించుకోరు, వారసత్వపు ఆస్తి మొత్తాన్ని పోగుచేసి తినేస్తారు, ధనవ్యామోహంలో దారుణంగా చిక్కుకుపోయారు. ఎంతమాత్రం కాదు,[4] భూమిని ఎడాపెడా దంచి తుత్తునియలుగా చేయటం జరిగినప్పుడు, మీ ప్రభువు అవతరిస్తాడు, దైవదూతలు బారులుగా తీరి నిలబడి ఉంటారు. ఆ రోజున నరకం ముందుకు తీసుకురాబడుతుంది, ఆనాడు మానవునికి తెలిసివస్తుంది. అప్పుడు అతనికి తెలిసివచ్చినందువల్ల ప్రయోజనం ఏమిటి? అతను, "అయ్యో! నా ఈ జీవితం కొరకు నేను ముందుగానే కొంత సామగ్రిని ఏర్పాటు చేసుకుని ఉంటే ఎంత బాగుండేది!" అని అంటాడు. ఇక ఆ రోజున అల్లాహ్ ఎలాంటి శిక్ష విధిస్తాడో, అలాంటి శిక్షను మరెవ్వరూ విధించలేరు. ఇంకా అల్లాహ్ ఎలా బిగించి కట్టివేస్తాడో, అలా బిగించి మరెవ్వరూ కట్టలేరు.

**27 - 30** (మరొకవైపు ఈ విధంగా సెలవీయటం జరుగుతుంది) తృప్తిచెందిన మనసా! పద నీ ప్రభువు సన్నిధికి, (నీకు లభించే సత్ఫలానికి) ఆనందిస్తూ. మరియు (నీ ప్రభువునకు) ఇష్టమైన దానివై. చేరిపో (పుణ్యాత్ములైన) నా దాసులలో, ప్రవేశించు నా స్వర్గంలో.

4. అంటే, ప్రపంచంలో మీరు మీ ఇష్టానుసారం ఏదైనా చెయ్యవచ్చు, కాని దీన్ని గురించి అడగటం మాత్రం ఎన్నడూ జరగదు అనే మీ ఆలోచన తప్పుడు ఆలోచన.
5. తృప్తిచెందిన మనస్సు అంటే అర్థం ఏ విధమైన అనుమానం, ఊగిసలాటా లేకుండా, తృప్తితో ప్రశాంత హృదయంతో, భాగస్వాములెవ్వరూ లేని ఏకైక దేవుడైన అల్లాహ్‌ను తన ప్రభువుగానూ, దైవప్రవక్తలు తెచ్చిన సత్యధర్మాన్ని తన జీవన ధర్మంగానూ స్వీకరించిన మానవుడు అని భావం.

ఆయతులు 20 | **90. అల్ బలద్** | అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 20** కాదు,[1] నేను ఈ నగరం (మక్కా)పై ప్రమాణం చేసి చెబుతున్నాను: (ఓ ప్రవక్తా) అసలు విషయం ఏమిటంటే, ఈ నగరంలో నిన్ను హలాల్ చేసుకున్నారు.[2] తండ్రి (అంటే ఆదమ్ అస్సలామ్) సాక్షిగా, ఆయనకు పుట్టిన సంతానం సాక్షిగా! మేము మానవుణ్ణి శ్రమకోసం పుట్టించాము.[3] అతడు తననెవ్వరూ అదుపు చేయలేరని అనుకుంటున్నాడా? నేను అపార ధనరాసుల్ని ఖర్చుపెట్టాను అని అంటాడతను. తనను ఎవరూ గమనించలేదని అతడు భావిస్తున్నాడా?[4] మేము అతనికి రెండు కళ్ళూ, ఒక నాలుకా, రెండు పెదవులూ ప్రసాదించలేదా?[5] ఇంకా స్పష్టమైన రెండు (మంచీ చెడుల) మార్గాలను అతనికి చూపాము. కాని అతడు కష్టతరమైన కనుమ దాటిపోవటానికి సాహసించలేదు. కష్టతరమైన ఆ కనుమ అంటే ఏమిటో మీకు తెలుసా? ఎవరినైనా బానిసపు బంధనాల నుండి విముక్తి గావించటం, లేదా ఆకలిగొన్న రోజున సమీప అనాథుడికి లేదా దిక్కులేని నిరుపేదకు అన్నం పెట్టడం. అంతేకాదు, (వీటితో పాటు) విశ్వసించి, సహనం, సానుభూతుల్ని గురించి ఒకరికొకరు బోధించుకునే వారిలో కూడ మనిషి చేరిపోవాలి. వీరే కుడిపక్షం వారు. మా వాక్యాలను తిరస్కరించిన వారు వామపక్షానికి చెందినవారు.[6] వారిని అగ్ని చుట్టుముట్టి ఉంటుంది.

٩٠ سُوْرَةُ الْبَلَدِ مَكِّيَّةٌ ٣٥

اٰياتها ٢٠ | ركوعها ١

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

لَآ اُقْسِمُ بِهٰذَا الْبَلَدِ ۙ﴿١﴾ وَ اَنْتَ حِلٌّۢ بِهٰذَا
الْبَلَدِ ۙ﴿٢﴾ وَوَالِدٍ وَّمَا وَلَدَ ۙ﴿٣﴾ لَقَدْ خَلَقْنَا
الْاِنْسَانَ فِيْ كَبَدٍ ؕ﴿٤﴾ اَيَحْسَبُ اَنْ لَّنْ يَّقْدِرَ
عَلَيْهِ اَحَدٌ ۘ﴿٥﴾ يَقُوْلُ اَهْلَكْتُ مَالًا لُّبَدًا ؕ﴿٦﴾
اَيَحْسَبُ اَنْ لَّمْ يَرَهٗۤ اَحَدٌ ؕ﴿٧﴾ اَلَمْ نَجْعَلْ لَّهٗ
عَيْنَيْنِ ۙ﴿٨﴾ وَلِسَانًا وَّ شَفَتَيْنِ ۙ﴿٩﴾ وَ هَدَيْنٰهُ
النَّجْدَيْنِ ۚ﴿١٠﴾ فَلَا اقْتَحَمَ الْعَقَبَةَ ۖ﴿١١﴾ وَ مَآ اَدْرٰىكَ
مَا الْعَقَبَةُ ؕ﴿١٢﴾ فَكُّ رَقَبَةٍ ۙ﴿١٣﴾ اَوْ اِطْعٰمٌ فِيْ يَوْمٍ
ذِيْ مَسْغَبَةٍ ۙ﴿١٤﴾ يَّتِيْمًا ذَا مَقْرَبَةٍ ۙ﴿١٥﴾ اَوْ مِسْكِيْنًا
ذَا مَتْرَبَةٍ ؕ﴿١٦﴾ ثُمَّ كَانَ مِنَ الَّذِيْنَ اٰمَنُوْا
وَتَوَاصَوْا بِالصَّبْرِ وَ تَوَاصَوْا بِالْمَرْحَمَةِ ؕ﴿١٧﴾ اُولٰٓئِكَ
اَصْحٰبُ الْمَيْمَنَةِ ؕ﴿١٨﴾ وَ الَّذِيْنَ كَفَرُوْا بِاٰيٰتِنَا هُمْ
اَصْحٰبُ الْمَشْئَمَةِ ؕ﴿١٩﴾ عَلَيْهِمْ نَارٌ مُّؤْصَدَةٌ ﴿٢٠﴾

وقف لازم

ع ٢٠/١٥

1. అంటే, మీరు అనుకున్నట్లు వాస్తవం అది కాదు అని భావం.
2. అంటే, జంతువులక్కూడ రక్షణ, ఆశ్రయం ఉన్నటువంటి నగరంలో మీపై దౌర్జన్యం చెయ్యటాన్ని ధర్మసమ్మతం(హలాల్) చేసుకోవటం జరిగింది అనిఅర్థం.
3. అంటే, ఈ ప్రపంచం, భోగభాగ్యాలు అనుభవిస్తూ హాయిగా జీవించే స్థలం కాదు; కష్టాలు, కాఠిన్యాలు, శ్రమతో నిండిన స్థానం ఇది. ఏ మనిషైనా ఈ స్థితిగతులకు లోనుకాకుండా ఉండలేడు.
4. అంటే, పైన దేవుడు అనే వాడొకడు ఉన్నాడనీ, ఆయన చూస్తున్నాడనీ, ఈ ధనాన్ని తాను ఏ మార్గాల ద్వారా సంపాదించాడో, ఏ పనుల్లో దాన్ని ఖర్చు పెట్టాడో ఆయనకు తెలుసనే విషయం గర్వాన్ని ప్రదర్శించే వాడికి తెలియదా?
5. అర్థం ఏమిటంటే, మేము అతనికి బుద్ధీ జ్ఞానాలు పొందే మార్గాలను ప్రసాదించలేదా? అని.
6. కుడిపక్షం వారిని, ఎడమపక్షం వారిని గురించిన వివరణ కోసం వాఖిఆ సూరాలోని 8, 9, 27, 41 ఆయతులను చూడండి.

## 91. అష్ షమ్స్

అవతరణ మక్కాలో | ఆయతులు 15

٩١ سُوْرَةُ الشَّمْسِ مَكِّيَّةٌ ٢٦

اٰياتها ١٥ | ركوعها ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

وَالشَّمْسِ وَضُحٰىهَا ﴿١﴾ وَالْقَمَرِ اِذَا تَلٰىهَا ﴿٢﴾
وَالنَّهَارِ اِذَا جَلّٰىهَا ﴿٣﴾ وَالَّيْلِ اِذَا
يَغْشٰىهَا ﴿٤﴾ وَالسَّمَآءِ وَمَا بَنٰىهَا ﴿٥﴾ وَالْاَرْضِ وَ
مَا طَحٰىهَا ﴿٦﴾ وَنَفْسٍ وَّمَا سَوّٰىهَا ﴿٧﴾ فَاَلْهَمَهَا
فُجُوْرَهَا وَتَقْوٰىهَا ﴿٨﴾ قَدْ اَفْلَحَ مَنْ
زَكّٰىهَا ﴿٩﴾ وَقَدْ خَابَ مَنْ دَسّٰىهَا ﴿١٠﴾ كَذَّبَتْ
ثَمُوْدُ بِطَغْوٰىهَآ ﴿١١﴾ اِذِ انْۢبَعَثَ اَشْقٰىهَا ﴿١٢﴾ فَقَالَ
لَهُمْ رَسُوْلُ اللّٰهِ نَاقَةَ اللّٰهِ وَسُقْيٰهَا ﴿١٣﴾
فَكَذَّبُوْهُ فَعَقَرُوْهَا فَدَمْدَمَ عَلَيْهِمْ رَبُّهُمْ
بِذَنْۢبِهِمْ فَسَوّٰىهَا ﴿١٤﴾ وَلَا يَخَافُ عُقْبٰهَا ﴿١٥﴾

**1 - 10** సూర్యుడు సాక్షిగా, అతని ఎండ సాక్షిగా, సూర్యుని తరువాత వచ్చేటప్పటి చంద్రుడు సాక్షిగా, (సూర్యుణ్ణి) దేదీప్యమానం చేసేటప్పటి పగలు సాక్షిగా, (సూర్యుణ్ణి) మరుగుపరచేటప్పటి రాత్రి సాక్షిగా, ఆకాశం సాక్షిగా, దాన్ని నెలకొల్పినవాడు సాక్షిగా, నేలసాక్షిగా, దాన్ని పరచినవాడు సాక్షిగా, మానవాత్మ సాక్షిగా, ఆ ఆత్మను తీర్చిదిద్ది[1] ఆపై దానికి సంబంధించిన మంచీ చెడులను దానికి తెలియజేసినవాడు సాక్షిగా,[2] నిశ్చయంగా తన ఆత్మను పరిశుద్ధపరచుకున్న వ్యక్తి సఫలుడయ్యాడు, దానిని అణచివేసినవాడు విఫలుడయ్యాడు.[3]

**11 - 15** సమూద్ జాతి తన దుర్మార్గపు వైఖరి కారణంగా ధిక్కరించింది. ఆ జాతికి చెందిన పరమ దుర్మార్గుడొకడు దిగ్గున లేచాడు, అప్పుడు దైవప్రవక్త ఆ ప్రజల్ని, "జాగ్రత్త! దేవుని ఒంటె జోలికి పోకండి, దాన్ని నీళ్ళు త్రాగకుండా ఆటంకపరచకండి" అని హెచ్చరించాడు. కాని వారు ఆయన మాటను ధిక్కరించి ఒంటెను చంపేశారు. చివరకు వారి పాపాల పర్యవసానంగా వారి ప్రభువు వారందరినీ ఒకేసారి సర్వనాశనం చేసే మహా విపత్తును వారిపైకి పంపాడు.[4] (ఈ చర్యవల్ల) ఏదైనా దుష్పరిణామం సంభవిస్తుందన్న ఎలాంటి భయమూ ఆయనకు లేదు.

---

1. అంటే, అతనికి మేము శరీరాన్నీ, మేధనూ ప్రసాదించాము, ఇంద్రియ శక్తులను అనుగ్రహించాము, శక్తిసామర్థ్యాలను ఇచ్చాము. వీటి కారణంగా అతడు ప్రపంచంలో మానవుడు చెయ్యవలసిన పనులు చెయ్యగల సమర్థుడయ్యాడు.
2. దీనికి రెండు అర్థాలున్నాయి : ఒకటి, సృష్టికర్త అతనిలో మంచిచెడ్డలు రెండింటి వైపునకూ మొగ్గే లక్షణాలను పెట్టాడు. రెండు, అల్లాహ్ ప్రతి మానవుడి నైజంలో మంచిచెడ్డల విచక్షణా జ్ఞానాన్ని ఉంచాడు. నైతికతరీత్యా మంచి చెడ్డలు, సద్గుణాలు-దుర్గుణాలు, సత్కార్యాలు-దుష్కార్యాలు ఒక్కటి కావు. ఫుజూర్ (నీతిబాహ్యత) జుగుప్సాకరమైనది, తఖ్వా (దైవభీతి) అభిలషణీయమైనది. ఈ భావనలు మానవునికి క్రొత్తవికావు. అంతేకాదు ఇవి అతని నైజం ఎరిగిన భావనలే. సృష్టికర్త మంచి చెడ్డల విచక్షణా జ్ఞానాన్ని జన్మతః మానవుడికి ప్రసాదించాడు.
3. ఆత్మను పరిశుద్ధపరచటం అంటే దానిని చెడల నుండి ప్రక్షాళనం చేసి అందులో మంచిని పెంపొందించటం అని భావం. దానిని అణచటం అంటే మనిషి తన మనస్సులోని చెడు ధోరణుల్ని పెంచి ప్రోత్సహించి, మంచి ధోరణుల్ని అణచటం అని అర్థం.
4. దుర్మార్గుడైన ఆ మనిషి తన జాతి ప్రజల ఇష్టంతో వారి కోరిక ప్రకారమే ఒంటెను చంపేశాడు, అల్ ఖమర్ సూరా 29వ ఆయతులో కూడా ఈ విషయం పేర్కొనబడినది. అందుకనే మొత్తం జాతిపైనే దైవశిక్ష వచ్చిపడింది.

ఆయతులు 21 | **92. అల్ లైల్** | అవతరణ మక్కాలో

۹۲ سُوْرَةُ الَّيْلِ مَكِّيَّةٌ ۹

اٰيَاتُهَا ۲۱ | رُكُوْعُهَا ۱

బిస్మిల్లాహ్:

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ○

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

وَالَّيۡلِ اِذَا يَغۡشٰى ۙ‏ ﴿۱﴾ وَالنَّهَارِ اِذَا تَجَلّٰى ۙ‏ ﴿۲﴾ وَمَا خَلَقَ الذَّكَرَ وَالۡاُنۡثٰٓى ۙ‏ ﴿۳﴾ اِنَّ سَعۡيَكُمۡ لَشَتّٰى ؕ‏ ﴿۴﴾ فَاَمَّا مَنۡ اَعۡطٰى وَاتَّقٰى ۙ‏ ﴿۵﴾ وَصَدَّقَ بِالۡحُسۡنٰى ۙ‏ ﴿۶﴾ فَسَنُيَسِّرُهٗ لِلۡيُسۡرٰى ؕ‏ ﴿۷﴾ وَاَمَّا مَنۡۢ بَخِلَ وَاسۡتَغۡنٰى ۙ‏ ﴿۸﴾ وَكَذَّبَ بِالۡحُسۡنٰى ۙ‏ ﴿۹﴾ فَسَنُيَسِّرُهٗ لِلۡعُسۡرٰى ؕ‏ ﴿۱۰﴾ وَمَا يُغۡنِىۡ عَنۡهُ مَالُهٗۤ اِذَا تَرَدّٰى ؕ‏ ﴿۱۱﴾ اِنَّ عَلَيۡنَا لَلۡهُدٰى ۖ‏ ﴿۱۲﴾ وَاِنَّ لَنَا لَلۡاٰخِرَةَ وَالۡاُوۡلٰى‏ ﴿۱۳﴾ فَاَنۡذَرۡتُكُمۡ نَارًا تَلَظّٰى ۚ‏ ﴿۱۴﴾ لَا يَصۡلٰٮهَاۤ اِلَّا الۡاَشۡقَى ۙ‏ ﴿۱۵﴾ الَّذِىۡ كَذَّبَ وَتَوَلّٰى ؕ‏ ﴿۱۶﴾ وَسَيُجَنَّبُهَا الۡاَتۡقَى ۙ‏ ﴿۱۷﴾ الَّذِىۡ يُؤۡتِىۡ مَالَهٗ يَتَزَكّٰى ۚ‏ ﴿۱۸﴾ وَمَا لِاَحَدٍ عِنۡدَهٗ مِنۡ نِّعۡمَةٍ تُجۡزٰٓى ۙ‏ ﴿۱۹﴾ اِلَّا ابۡتِغَآءَ وَجۡهِ رَبِّهِ الۡاَعۡلٰى ۚ‏ ﴿۲۰﴾ وَلَسَوۡفَ يَرۡضٰى ۚ‏ ﴿۲۱﴾

**1 - 11** ఆవరించినప్పటి రాత్రి సాక్షిగా! ప్రకాశించునప్పటి పగలు సాక్షిగా! మగ, ఆడ జాతుల్ని సృష్టించినవాడు సాక్షిగా! వాస్తవంగా మీరు చేసే ప్రయత్నాలు విభిన్న రకాలుగా ఉంటాయి.[1] కనుక ఎవరు (దైవమార్గంలో) ధనాన్ని వినియోగించాడో, (దైవ అవిధేయతకు) భయపడ్డాడో, మంచిని సత్యమని అంగీకరించాడో, అతనికి మేము సన్మార్గంలో నడిచేందుకు సౌకర్యాన్ని కలుగజేస్తాము.[2] ఎవరు పిసినారితనం వహించాడో, (దేవునిపట్ల) నిర్లక్ష్యవైఖరి అవలంబించాడో, పైగా మంచిని తృణీకరించాడో, అతనికి మేము కఠిన మార్గంలో నడిచేందుకు సౌకర్యాన్ని కలుగజేస్తాము.[3] అతను నశించినప్పుడు ఇక అతని ధనం అతనికి ఎలా ఉపయోగపడుతుంది?

**12 - 21** నిస్సందేహంగా సన్మార్గం చూపవలసిన బాధ్యత మాపై ఉంది. వాస్తవానికి పరలోకం, ఇహలోకం రెండిటికీ మేమే యజమానులం. కనుక నేను మిమ్మల్ని ప్రజ్వలించే అగ్ని గురించి హెచ్చరించాను. (సత్యాన్ని) తిరస్క రించి, ముఖం తిప్పుకున్న పరమ దౌర్భాగ్యుడు తప్ప మరెవ్వరూ అందులో కాలిపోరు. పరిశుద్ధుడు కావటానికి తన సంపదను ఖర్చుచేసే పరమ దైవ భీతిపరుడు దానికి దూరంగా ఉంచబడతాడు. అతనికి ఎవ్వరూ ఏ విధమైన ఉపకారం చేయలేదు, దానికి అతను బదులు తీర్చేందుకు. అతను కేవలం మహోన్నతుడైన తన ప్రభువు ప్రసన్నతను పొందటానికి మాత్రమే ఈ పని చేస్తున్నాడు. ఆయన తప్పకుండా (అతడంటే) సంతోషిస్తాడు.

---

1. ఏ విధంగానైతే రాత్రి, పగలు, ఆడ, మగ పరస్పరం విభిన్నమైనవో వాటి చిహ్నాలు, పరిణామాలు కూడా పరస్పరం వ్యతిరేకమైనవో అదేవిధంగా మీరు ఏ మార్గాల్లో ఏ లక్ష్యాల కోసం మీ ప్రయత్నాలు వినియోగిస్తున్నారో, అవి కూడ తమ స్వభావం రీత్యా విభిన్నమైనవి, ఫలితాల దృష్ట్యా వ్యతిరేకమైనవి.
2. అంటే, మానవుని నైజానికి అనుగుణంగా ఉండే మార్గంలో నడవటం అతని కొరకు సులభతరం చేస్తాము అని అర్థం.
3. అంటే, ప్రకృతికి వ్యతిరేకంగా నడవటం అతని కొరకు సులభతరం చేస్తాము అని భావం.

ఆయతులు 11 | అవతరణ మక్కాలో

## 93. అజ్ జుహా

٩٣ سُوۡرَةُ الضُّحٰى مَكِّيَّةٌ ١١

اٰياتها ١١ | ركوعها ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 11** వెలుగు విరజిమ్మే పగలు సాక్షిగా! ప్రశాంతంగా ఆవరించే రాత్రి సాక్షిగా! (ఓ ప్రవక్తా!) నీ ప్రభువు నిన్ను ఏమాత్రం విడనాడలేదు, నీ పట్ల ఆయన అసంతృప్తి చెందనూ లేదు. నిశ్చయంగా రాబోయే కాలం నీ కొరకు గత కాలం కన్నా మేలైనదిగా ఉంటుంది. త్వరలోనే నీకు నీ ప్రభువు నీవు సంతోషపడే అంత అధికంగా ప్రసాదిస్తాడు. నీవు అనాథుడుగా ఉండటం చూసి ఆయన నీకు ఆశ్రయం కల్పించలేదా? నీవు మార్గమేదో తెలియని వాడవుగా ఉన్నప్పుడు ఆయన నీకు సన్మార్గం చూపించాడు. నీవు నిరుపేదగా ఉన్నప్పుడు, ఆయన నిన్ను ధనవంతుడుగా చేశాడు. కావున నీవు అనాథుల పట్ల కఠినంగా ప్రవర్తించకు. యాచకుణ్ణి కసురుకోకు. నీ ప్రభువు వరాలను బహిర్గతం చెయ్యి.

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ۝

وَالضُّحٰى ۙ﴿١﴾ وَ الَّيۡلِ اِذَا سَجٰى ۙ﴿٢﴾ مَا وَدَّعَكَ
رَبُّكَ وَ مَا قَلٰى ؕ﴿٣﴾ وَ لَلۡاٰخِرَةُ خَيۡرٌ لَّكَ مِنَ
الۡاُوۡلٰى ؕ﴿٤﴾ وَ لَسَوۡفَ يُعۡطِيۡكَ رَبُّكَ فَتَرۡضٰى ؕ﴿٥﴾
اَلَمۡ يَجِدۡكَ يَتِيۡمًا فَاٰوٰى ۪﴿٦﴾ وَ وَجَدَكَ ضَآلًّا
فَهَدٰى ۪﴿٧﴾ وَ وَجَدَكَ عَآئِلًا فَاَغۡنٰى ؕ﴿٨﴾ فَاَمَّا
الۡيَتِيۡمَ فَلَا تَقۡهَرۡ ؕ﴿٩﴾ وَ اَمَّا السَّآئِلَ فَلَا
تَنۡهَرۡ ؕ﴿١٠﴾ وَ اَمَّا بِنِعۡمَةِ رَبِّكَ فَحَدِّثۡ ﴿١١﴾ ع

ఆయతులు 8 | అవతరణ మక్కాలో

## 94. అలమ్ నష్రహ్

٩٤ سُوۡرَةُ اَلَمۡ نَشۡرَحۡ مَكِّيَّةٌ ١٢

اٰياتها ٨ | ركوعها ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 8** (ఓ ప్రవక్తా) మేము నీ హృదయాన్ని నీ కొరకు తెరవలేదా?[1] నీ నడుమును విరిచేస్తూవుండిన ఒక పెద్ద భారాన్ని[2] నీపై నుండి దించివేశాము, నీ కొరకు నీ పేరు ప్రఖ్యాతుల్ని ఇనుమడింపజేశాము. కనుక కష్టాలతోపాటు తప్పనిసరిగా సుఖాలు కూడ ఉన్నాయి. ఇందులో ఎలాంటి సందేహంలేదు. కష్టాలతోపాటు తప్పనిసరిగా సుఖాలు కూడా ఉన్నాయి.[3] కాబట్టి నీకు తీరిక లభించినప్పుడు, కఠోరమైన ఆరాధనలో నిమగ్నుడవైపో. నీ ప్రభువు మీదనే నీ మనస్సును లగ్నం చెయ్యి.[4]

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ ۝

اَلَمۡ نَشۡرَحۡ لَكَ صَدۡرَكَ ۙ﴿١﴾ وَ وَضَعۡنَا عَنۡكَ
وِزۡرَكَ ۙ﴿٢﴾ الَّذِيۡۤ اَنۡقَضَ ظَهۡرَكَ ۙ﴿٣﴾ وَ رَفَعۡنَا
لَكَ ذِكۡرَكَ ؕ﴿٤﴾ فَاِنَّ مَعَ الۡعُسۡرِ يُسۡرًا ۙ﴿٥﴾ اِنَّ
مَعَ الۡعُسۡرِ يُسۡرًا ؕ﴿٦﴾ فَاِذَا فَرَغۡتَ فَانۡصَبۡ ۙ﴿٧﴾ وَ
اِلٰى رَبِّكَ فَارۡغَبۡ ﴿٨﴾ ع

1. హృదయం తెరవటం అనే అర్థం కల పదం దివ్య ఖురాన్‌లో ఏయే సందర్భాల్లో వచ్చిందో వాటిని దృష్టిలో ఉంచుకుంటే దానికి రెండు అర్థాలున్నాయని తెలుస్తుంది. ఒకటి, మానసిక సంబంధమైన ఊగిసలాట, అనుమానాలకు దూరమై, ఇస్లామ్ మార్గమే సత్యమార్గమని మనిషి పూర్తిగా సంతృప్తిచెందటం. రెండు, మనిషిలో ఆశలు, అభిలాషలు మహోన్నతమైనవిగా రూపొందడం, పెద్ద పెద్ద ఉద్యమాలు చేపట్టడానికి, అత్యంత కఠినమైన పనుల్ని సైతం చెయ్యటానికి వెనుకాడకపోవటం, మహత్తరమైన దైవదౌత్య బాధ్యతల్ని నిర్వహించే ధైర్యసాహసాలు ఉండటం.
2. తన జాతి ప్రజల అజ్ఞానాన్నీ, అనాగరికతనూ చూసి మహాప్రవక్త (సఅసమ్) సున్నిత మనస్సు శోకం, దుఃఖం, చింత, ఆందోళనలతో బరువెక్కిపోయేది. వారిని చూసి ఆయన ఎంతో బాధపడేవారు, కాని ఈ చెడులను

## 95. అత్ తీన్

ఆయతులు 8 | అవతరణ మక్కాలో

سورة التين ٩٥ مكية ٢٨

اياتها ٨ | ركوعها ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

وَالتِّيْنِ وَ الزَّيْتُوْنِ ① وَ طُوْرِ سِيْنِيْنَ ② وَ هٰذَا الْبَلَدِ الْاَمِيْنِ ③ لَقَدْ خَلَقْنَا الْاِنْسَانَ فِيْۤ اَحْسَنِ تَقْوِيْمٍ ④ ثُمَّ رَدَدْنٰهُ اَسْفَلَ سٰفِلِيْنَ ⑤ اِلَّا الَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا الصّٰلِحٰتِ فَلَهُمْ اَجْرٌ غَيْرُ مَمْنُوْنٍ ⑥ فَمَا يُكَذِّبُكَ بَعْدُ بِالدِّيْنِ ⑦ اَلَيْسَ اللّٰهُ بِاَحْكَمِ الْحٰكِمِيْنَ ⑧

**1 - 8** అత్తి, ఆలివ్‌లు[1] సాక్షిగా! సీనా పర్వతం సాక్షిగా! ఈ శాంతి నగరం (మక్కా) సాక్షిగా, మేము మానవుణ్ణి అద్భుతమైన ఆకృతిలో సృజించాము. తరువాత మేము అతన్ని వెనక్కి త్రిప్పి నీచాతి నీచుడుగా మార్చివేశాము, విశ్వసించి, సత్కార్యాలు చేసేవారు తప్ప. అలాంటి వారికి అనంత ప్రతిఫలం లభిస్తుంది. కాబట్టి (ప్రవక్తా) దీని తరువాత శిక్షా బహుమానాల విషయంలో నిన్ను ఎవరు తిరస్కరించగలరు? అధికారులందరికన్నా అల్లాహ్ గొప్ప అధికారి కాదా?[2]

రూపుమాపే మార్గం ఏదీ ఆయనకు కనిపించేది కాదు. ఈ ఆందోళనే ఆయన నడుమును విరగ్గొడుతూ ఉండేది. అల్లాహ్ సన్మార్గం చూపి ఈ భారాన్ని ఆయనపై నుండి దించాడు, ఆయన మానసిక భారాన్నంతా తీసేసి తేలిక చేశాడు. అప్పుడు ఇస్లామ్ ద్వారా ఒక్క అరేబియాను మాత్రమే కాదు, మొత్తం మానవజాతినే ఈ చెడుల ఊబి నుండి బయటకు తీయవచ్చునే గట్టి నమ్మకం ఆయనకు కలిగింది. ఆనాడు అరేబియా వెలుపలి ప్రపంచం కూడ ఈ చెడులలో కూరుకుపోయి ఉంది.

3. దైవప్రవక్త ఇప్పుడు ఏ విషమ పరిస్థితుల్లో చిక్కుకుని ఉన్నారో అవి ఎంతో కాలం ఉండవనీ, ఆ తరువాత అతి త్వరలోనే మంచి పరిస్థితులు ఏర్పడతాయని ఊరట కలిగించే విషయం రెండుసార్లు చెప్పటం జరిగింది.

4. ఇతర కార్యాలేవీ లేనప్పుడు నీ తీరిక సమయాన్ని శ్రమతో కూడిన కఠోరమైన ఆరాధనకోసం వినియోగించు. నీ దృష్టిని అన్ని వైపుల నుండి మరల్చి, కేవలం నీ ప్రభువు ధ్యానంపై కేంద్రీకరించు.

**95. అత్ తీన్**

1. అంటే, ఈ పండ్లు పండే ప్రాంతాలైన సిరియా, పలస్తీనాలని అర్థం. ఈ ప్రాంతాల్లో ఎంతోమంది దైవప్రవక్తలు జన్మించారు.

2. అంటే, ప్రపంచంలో చిన్న చిన్న అధికారులను కూడ వారు న్యాయం చెయ్యాలని, అపరాధులకు శిక్ష విధించాలని, మంచిపనులు చేసే వారికి బహుమానం ఇవ్వాలని మీరు కోరుతున్నప్పుడు, ఆశిస్తున్నప్పుడు, దేవుణ్ణి గురించి మీ అభిప్రాయం ఏమిటి? అధికారులకే అధికారి, న్యాయాధిపతులకే న్యాయాధిపతి అయిన దేవుడు న్యాయం చెయ్యడని అనుకుంటున్నారా? ఆయన చెడ్డవాణ్ణి, మంచివాణ్ణి ఒకేవిధంగా చూస్తాడని మీరు ఊహిస్తున్నారా? ఆయన ప్రపంచంలో దుష్ట కార్యాలు చేసేవారు, ఉత్తమ కార్యాలు చేసేవారు ఉభయులూ చచ్చి మట్టిలో కలిసిపోవటం తప్ప ఇంకేమీ కాదా? దుష్కార్యాలకు శిక్ష, సత్కార్యాలకు ప్రతిఫలం లభించదా?

# 96. అల్ అలఖ్

ఆయతులు 19 | అవతరణ మక్కాలో

٩٦ سُوْرَةُ الْعَلَقِ مَكِّيَّةٌ ١

اٰيَاتُهَا ١٩ | رُكُوْعُهَا ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

اِقْرَاْ بِاسْمِ رَبِّكَ الَّذِيْ خَلَقَ ۚ ① خَلَقَ
الْاِنْسَانَ مِنْ عَلَقٍ ۚ ② اِقْرَاْ وَ رَبُّكَ
الْاَكْرَمُ ۙ ③ الَّذِيْ عَلَّمَ بِالْقَلَمِ ۙ ④ عَلَّمَ
الْاِنْسَانَ مَا لَمْ يَعْلَمْ ؕ ⑤ كَلَّاۤ اِنَّ الْاِنْسَانَ
لَيَطْغٰۤى ۙ ⑥ اَنْ رَّاٰهُ اسْتَغْنٰى ؕ ⑦ اِنَّ اِلٰى رَبِّكَ
الرُّجْعٰى ؕ ⑧ اَرَءَيْتَ الَّذِيْ يَنْهٰى ۙ ⑨ عَبْدًا اِذَا
صَلّٰى ؕ ⑩ اَرَءَيْتَ اِنْ كَانَ عَلَى الْهُدٰۤى ۙ ⑪ اَوْ
اَمَرَ بِالتَّقْوٰى ؕ ⑫ اَرَءَيْتَ اِنْ كَذَّبَ
وَتَوَلّٰى ؕ ⑬ اَلَمْ يَعْلَمْ بِاَنَّ اللّٰهَ يَرٰى ؕ ⑭ كَلَّا
لَئِنْ لَّمْ يَنْتَهِ ۙ لَنَسْفَعًۢا بِالنَّاصِيَةِ ۙ ⑮ نَاصِيَةٍ
كَاذِبَةٍ خَاطِئَةٍ ۚ ⑯ فَلْيَدْعُ نَادِيَهٗ ۙ ⑰ سَنَدْعُ
الزَّبَانِيَةَ ۙ ⑱ كَلَّا ؕ لَا تُطِعْهُ وَ اسْجُدْ وَ
اقْتَرِبْ ۩ ⑲

السجدة ١٣ ع

**1 - 5** (ఓ ప్రవక్తా) పఠించు సర్వాన్నీ సృష్టించిన నీ ప్రభువు పేరుతో. ఆయన పేరుకుపోయిన నెత్తుటి ముద్దతో మానవుణ్ణి సృజించాడు. పఠించు: నీ ప్రభువు పరమదయాళువు. ఆయన కలం ద్వారా జ్ఞానం నేర్పాడు, మనిషి ఎరుగని జ్ఞానాన్ని అతనికి ప్రసాదించాడు.[1]

**6 - 19** ఎంతమాత్రం కాదు;[2] మానవుడు తనను తాను ఎవరి అక్కరలేని వాడననీ, సర్వస్వతంత్రుడననీ మితిమీరి ప్రవర్తిస్తున్నాడు. (అయితే) చివరికి అందరూ నీ ప్రభువు వైపునకే తప్పనిసరిగా మరలిపోవలసి ఉంటుంది. ఒక దాసుడు నమాజు చేస్తుంటే అతన్ని నిరోధించే వ్యక్తిని నీవు చూశావా? ఒకవేళ (ఆ దాసుడు) ఋజుమార్గంలో ఉంటే లేదా భయభక్తుల్ని బోధిస్తూ ఉంటే, అప్పుడు నీ అభిప్రాయం ఏమిటి? ఒకవేళ (నిరోధిస్తున్న ఈ వ్యక్తి) సత్యాన్ని తిరస్కరిస్తుంటే, (దాన్నుండి) విముఖుడవుతుంటే, అప్పుడు నీ అభిప్రాయం ఏమిటి? అల్లాహ్ చూస్తున్నాడనే విషయం అతనికి తెలియదా? అలా ఎంత మాత్రం జరగదు; అతడు గనక మానకపోతే, మేము అతన్ని, అతని నుదుటి వెండ్రుకలు పట్టుకుని ఈడుస్తాము; అబద్ధానికి, ఘోర పాపానికి పాల్పడిన నుదురు అది. అతడు తన మద్దతు దారుల మూకను పిలుచుకోమను. మేము కూడ మా శిక్షించే దూతల్ని పిలుచుకుంటాము. ఎంతమాత్రం కాదు, అతని మాటలు వినకు, సజ్దా చెయ్యి(నీ ప్రభువు) సాన్నిధ్యాన్ని పొందు.

1. మహాప్రవక్త (సఅసమ్)పై అవతరించిన ఈ ఆయతులు, దివ్య ఖురాన్‌లోని ఇతర అన్ని ఆయతుల కంటే ముందుగా అవతరించాయి.
2. దైవదౌత్య పదవిని అలంకరించిన తరువాత మహాప్రవక్త (సఅసమ్) కాబా గృహంలో నమాజ్ చేయటం ప్రారంభించినప్పుడు అబూ జహల్ ఆయన్ని నిరోధించటానికి ప్రయత్నించాడు. ఆ సందర్భంలో ఈ ఆయతులు అవతరించాయి.

## ٩٧ سُوْرَةُ الْقَدْرِ مَكِّيَّةٌ ٢٥

اٰیاتها ٥ | رکوعها ١

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ۝

اِنَّآ اَنْزَلْنٰهُ فِیْ لَيْلَةِ الْقَدْرِ ۝١ وَ مَآ اَدْرٰىكَ
مَا لَيْلَةُ الْقَدْرِ ۝٢ لَيْلَةُ الْقَدْرِ ۙ خَيْرٌ مِّنْ
اَلْفِ شَهْرٍ ۝٣ تَنَزَّلُ الْمَلٰٓئِكَةُ وَ الرُّوْحُ فِيْهَا
بِاِذْنِ رَبِّهِمْ ۚ مِنْ كُلِّ اَمْرٍ ۝٤ سَلٰمٌ ۛ هِیَ
حَتّٰى مَطْلَعِ الْفَجْرِ ۝٥

## 97. అల్ ఖద్ర్

ఆయతులు 5 | అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 5** మేము దీని (ఖురాన్)ని ఘనమైన రాత్రియందు అవతరింపజేశాము. ఆ ఘనమైన రాత్రి ఏమిటో మీకు తెలుసా? ఆ ఘనమైన రాత్రి వెయ్యి నెలల కంటే కూడా ఎంతో శ్రేష్ఠమైనది. ఆ రాత్రి ఆత్మ, దైవదూతలు తమ ప్రభువు అనుమతితో ప్రతి ఆజ్ఞను తీసుకుని అవతరిస్తారు. ఆ రాత్రి అంతా తెల్లవారే వరకు పూర్తిగా శాంతి శ్రేయాలే అవతరిస్తూ ఉంటాయి.

وقف النبي صلى الله عليه وسلم | معانقة ١٨ | الثلث ٣/٤

## ٩٨ سُوْرَةُ الْبَيِّنَةِ مَدَنِيَّةٌ ١٠٠

اٰیاتها ٨ | رکوعها ١

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ۝

لَمْ يَكُنِ الَّذِيْنَ كَفَرُوْا مِنْ اَهْلِ الْكِتٰبِ وَ
الْمُشْرِكِيْنَ مُنْفَكِّيْنَ حَتّٰى تَاْتِيَهُمُ الْبَيِّنَةُ ۝١
رَسُوْلٌ مِّنَ اللّٰهِ يَتْلُوْا صُحُفًا مُّطَهَّرَةً ۝٢ فِيْهَا
كُتُبٌ قَيِّمَةٌ ۝٣

## 98. అల్ బయ్యినహ్

ఆయతులు 8 | అవతరణ మదీనాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 3** గ్రంథ ప్రజలలోని, బహుదైవారాధకులలోని అవిశ్వాసులు తమ వద్దకు స్పష్టమైన ప్రమాణం వచ్చేవరకు (తమ అవిశ్వాస వైఖరి నుండి) వెనక్కి మరలరు. (స్పష్టమైన ప్రమాణం అంటే) అల్లాహ్ తరపు నుండి ఒక ప్రవక్త[1] వచ్చి సత్యమైన సవ్యమైన రచనలు గల పరిశుద్ధమైన సహీఫాలను[2] చదివి వినిపించటం.

1. ఇక్కడ స్వయంగా మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్)నే ఒక స్పష్టమైన ప్రమాణం అని అనటం జరిగింది.
2. అంటే, ఏ విధమైన అసత్యం, అజ్ఞానం, మార్గభ్రష్టత్వం, నీతిబాహ్యతల కల్తీలేని పరిశుద్ధమైన సహీఫాలు అన్న మాట.

وَ مَا تَفَرَّقَ الَّذِيْنَ اُوْتُوا الْكِتٰبَ اِلَّا مِنْۢ
بَعْدِ مَا جَآءَتْهُمُ الْبَيِّنَةُ ۝٤ وَ مَاۤ اُمِرُوْۤا اِلَّا
لِيَعْبُدُوا اللّٰهَ مُخْلِصِيْنَ لَهُ الدِّيْنَ ۙ۬ حُنَفَآءَ
وَ يُقِيْمُوا الصَّلٰوةَ وَ يُؤْتُوا الزَّكٰوةَ وَ ذٰلِكَ دِيْنُ
الْقَيِّمَةِ ۝٥ اِنَّ الَّذِيْنَ كَفَرُوْا مِنْ اَهْلِ
الْكِتٰبِ وَ الْمُشْرِكِيْنَ فِيْ نَارِ جَهَنَّمَ خٰلِدِيْنَ
فِيْهَا ؕ اُولٰٓئِكَ هُمْ شَرُّ الْبَرِيَّةِ ۝٦ اِنَّ الَّذِيْنَ
اٰمَنُوْا وَ عَمِلُوا الصّٰلِحٰتِ ۙ اُولٰٓئِكَ هُمْ خَيْرُ
الْبَرِيَّةِ ۝٧ جَزَآؤُهُمْ عِنْدَ رَبِّهِمْ جَنّٰتُ عَدْنٍ
تَجْرِيْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ خٰلِدِيْنَ فِيْهَاۤ اَبَدًا ؕ
رَضِيَ اللّٰهُ عَنْهُمْ وَ رَضُوْا عَنْهُ ؕ ذٰلِكَ لِمَنْ
خَشِيَ رَبَّهٗ ۝٨

**4 - 5** పూర్వం గ్రంథం ఇవ్వబడిన ప్రజలలో చీలికలు ఏర్పడింది వారి వద్దకు (ఋజుమార్గానికి సంబంధించిన) స్పష్టమైన బోధవచ్చిన తరువాతనే.[3] వారు అల్లాహ్‌కు దాస్యం చెయ్యాలని, పూర్తి ఏకాగ్రతతో తమ ధర్మాన్ని ఆయన కొరకే ప్రత్యేకించుకోవాలని, నమాజ్‌ను స్థాపించాలని, జకాత్ ఇస్తూ ఉండాలని మాత్రమే ఆదేశించటం జరిగింది. ఇదే ఎంతో సరియైన, సవ్యమైన ధర్మం.

**6 - 8** గ్రంథ ప్రజలలో, బహుదైవారాధకులలో సత్యాన్ని తిరస్కరించినవారు[4] తప్పనిసరిగా నరకాగ్నిలోకే పోతారు, అందులోనే శాశ్వతంగా ఉండిపోతారు. వారు సృష్టిలోకెల్లా పరమ నీచులు. కాని విశ్వసించి సత్కార్యాలు చేసేవారు నిస్సందేహంగా సృష్టిలో అత్యంత శ్రేష్ఠులు. వారికి వారి ప్రభువు వద్ద లభించే ప్రతిఫలం-శాశ్వత నివాస స్థలాలైన స్వర్గ వనాలు, వాటి క్రింద సెలయేళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి; వారు వాటిలో కలకాలం ఉంటారు. అల్లాహ్ వారి పట్ల ప్రసన్నుడయ్యాడు; వారు కూడ అల్లాహ్ పట్ల సంతృప్తి చెందారు. ఇదీ తన ప్రభువు పట్ల భయభక్తులు కలిగి ఉండే వ్యక్తికి లభించే మహాభాగ్యం.

3. అంటే, దీనికి పూర్వం గ్రంథ ప్రజలు ఎన్నో తప్పుడు మార్గాల్లో కొట్టుమిట్టాడుతూ అసంఖ్యాకమైన తెగలుగా విడిపోయారు. దానికి కారణం, అల్లాహ్ తన తరఫు నుండి వారి మార్గదర్శకత్వం కోసం స్పష్టమైన ప్రమాణం ఏదీ పంపకపోవడం ఎంతమాత్రం కాదు. దేవుని తరఫు నుండి మార్గదర్శకత్వం వచ్చిన తరువాతనే వారు ఈ వైఖరిని అవలంబించారు. కావున తన మార్గభ్రష్టత్వానికి స్వయంగా తామే బాధ్యులు.

4. ఇక్కడ తిరస్కరించటం అంటే, మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్)ను నమ్మటానికి తిరస్కరించటం అని అర్థం.

۹۹ سُوْرَةُ الزِّلْزَالِ مَدَنِيَّةٌ ۹۳

اٰياتها ۸ رکوعها ۱

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

اِذَا زُلْزِلَتِ الْاَرْضُ زِلْزَالَهَا ۝١ وَ اَخْرَجَتِ
الْاَرْضُ اَثْقَالَهَا ۝٢ وَ قَالَ الْاِنْسَانُ مَالَهَا ۝٣
يَوْمَئِذٍ تُحَدِّثُ اَخْبَارَهَا ۝٤ بِاَنَّ رَبَّكَ اَوْحٰى
لَهَا ۝٥ يَوْمَئِذٍ يَّصْدُرُ النَّاسُ اَشْتَاتًا ۙ لِّيُرَوْا
اَعْمَالَهُمْ ۝٦ فَمَنْ يَّعْمَلْ مِثْقَالَ ذَرَّةٍ خَيْرًا
يَّرَهٗ ۝٧ وَ مَنْ يَّعْمَلْ مِثْقَالَ ذَرَّةٍ شَرًّا يَّرَهٗ ۝٨ ع

## 99. అజ్ జిల్‌జాల్

ఆయతులు 8 | అవతరణ మదీనాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 8** భూమి తన పూర్తి తీవ్రతతో ఊపి వేయబడినప్పుడు, భూమి తన లోపల ఉన్న మొత్తం భారాన్ని తీసి బయటవేసినప్పుడు, మానవుడు, “దీనికే మయింది (ఇలా ఊగిపోతోంది)” అని అంటాడు. ఆ రోజున అది తన (పైన సంభవించిన) విశేషాలను వివరిస్తుంది. ఎందుకంటే, నీ ప్రభువు దాన్ని (అలా చెయ్యి అని) ఆజ్ఞాపించి ఉంటాడు. (ప్రజలు తమ కర్మలను చూసుకునేందుకుగాను, ఆ రోజున భిన్న పరిస్థితుల్లో దేవుని వైపునకు మరలుతారు. ఆ తరువాత ఎవడైనా రవ్వంత సత్కార్యం చేసి ఉన్నాసరే దాన్ని అతను చూసుకుంటాడు. అలాగే ఎవడైనా రవ్వంత దుష్కార్యం చేసి వున్నాసరే దాన్నీ అతను చూసుకుంటాడు.

آیاتها ۱۱ | ۱۰۰ سُوْرَةُ الْعٰدِیٰتِ مَکِّیَّةٌ ۱۴ | رکوعها ۱

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِیْمِ ○

وَ الْعٰدِیٰتِ ضَبْحًا ۙ﴿۱﴾ فَالْمُوْرِیٰتِ قَدْحًا ۙ﴿۲﴾
فَالْمُغِیْرٰتِ صُبْحًا ۙ﴿۳﴾ فَاَثَرْنَ بِهٖ نَقْعًا ۙ﴿۴﴾
فَوَسَطْنَ بِهٖ جَمْعًا ۙ﴿۵﴾ اِنَّ الْاِنْسَانَ لِرَبِّهٖ
لَکَنُوْدٌ ۚ﴿۶﴾ وَ اِنَّهٗ عَلٰی ذٰلِکَ لَشَهِیْدٌ ۚ﴿۷﴾ وَ اِنَّهٗ
لِحُبِّ الْخَیْرِ لَشَدِیْدٌ ؕ﴿۸﴾ اَفَلَا یَعْلَمُ اِذَا بُعْثِرَ
مَا فِی الْقُبُوْرِ ۙ﴿۹﴾ وَ حُصِّلَ مَا فِی الصُّدُوْرِ ۙ﴿۱۰﴾
اِنَّ رَبَّهُمْ بِهِمْ یَوْمَئِذٍ لَّخَبِیْرٌ ﴿۱۱﴾ ع ۱۱ ۲۵

## 100. అల్ ఆదియాత్

అవతరణ మక్కాలో | ఆయతులు 11

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 11** నురుగులు క్రక్కుతూ, వగర్చుతూ, పరుగెడుతూ తమ డెక్కలతో నిప్పురవ్వలను చెరుగుతూ పోయి తెల్లవారేటప్పటికి మెరుపుదాడి చేసేవి (గుర్రాలు) సాక్షిగా! ఆ సమయంలో అవి దుమ్మూ ధూళి కూడ రేపుతాయి, అదే స్థితిలో అవి ఏదైనా జన సమూహంలోకి జొరబడతాయి కూడ. అసలు విషయం ఏమిటంటే, మానవుడు తన ప్రభువు పట్ల ఎంతో కృతఘ్నుడై ఉన్నాడు.[1] దీనికి స్వయంగా అతడే సాక్షి[2] అతడు సిరిసంపదల వ్యామోహంలో పూర్తిగా మునిగిపోయాడు. సమాధులలో (పాతిపెట్టబడి) ఉన్నది వెలికి తీయబడే సమయాన్ని గురించి అతనికి తెలియదా?[3] ఇంకా హృదయాల్లో (దాగి) ఉన్నవాటిని బయటికి తీసి పరిశీలించే వేళను గురించి అతనికి తెలియదా?[3] నిశ్చయంగా ఆ రోజున వారి ప్రభువు వారిని గురించి పూర్తిగా తెలుసుకుని ఉంటాడు.[4]

1. అంటే, అల్లాహ్ తనకు ప్రసాదించిన శక్తి సామర్థ్యాలను అతడు దౌర్జన్యం చేయటానికీ, అన్యాయం చేయడానికీ వినియోగిస్తాడన్నమాట.
2. అంటే, అతని అంతరాత్మ అతనికి వ్యతిరేకంగా సాక్ష్యం చెబుతుంది; అతను చేసిన పనులు అతనికి వ్యతిరేకంగా సాక్ష్యం చెబుతాయి, చాలా మంది అవిశ్వాసులు స్వయంగా తమ నోటితో కూడా బహిరంగంగా కృతఘ్నుతలు వెలిబుచ్చుతారు.
3. అంటే, మనస్సుల్లో దాగి ఉన్న ఉద్దేశ్యాలు, ధ్యేయాలు, లక్ష్యాలు బహిర్గతం చెయ్యబడి క్షుణ్ణంగా విచారించి మంచి విషయాలు, చెడ్డ విషయాలు వేరుచెయ్యబడతాయి అన్నమాట.
4. అంటే, ఎవరు ఏమిటో, ఏ శిక్షకు లేదా ఏ ప్రతిఫలానికి అర్హుడవుతాడో ఆయనకు బాగా తెలుసు అని భావం.

## 101. అల్ ఖారిఅహ్

అవతరణ మక్కాలో | ఆయతులు 11

١٠١ سُوْرَةُ الْقَارِعَةِ مَكِّيَّةٌ ٣٠

اٰياتها ١١ | ركوعها ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

اَلْقَارِعَةُ ﴿١﴾ مَا الْقَارِعَةُ ﴿٢﴾ وَ مَآ اَدْرٰىكَ

مَا الْقَارِعَةُ ﴿٣﴾ يَوْمَ يَكُوْنُ النَّاسُ كَالْفَرَاشِ

الْمَبْثُوْثِ ﴿٤﴾ وَتَكُوْنُ الْجِبَالُ كَالْعِهْنِ

الْمَنْفُوْشِ ﴿٥﴾ فَاَمَّا مَنْ ثَقُلَتْ مَوَازِيْنُهٗ ﴿٦﴾

فَهُوَ فِيْ عِيْشَةٍ رَّاضِيَةٍ ﴿٧﴾ وَ اَمَّا مَنْ خَفَّتْ

مَوَازِيْنُهٗ ﴿٨﴾ فَاُمُّهٗ هَاوِيَةٌ ﴿٩﴾ وَمَآ اَدْرٰىكَ

مَاهِيَهْ ﴿١٠﴾ نَارٌ حَامِيَةٌ ﴿١١﴾ ع ١ ٢٦

**1 - 11** అదొక మహా ఉపద్రవం! ఏమిటా మహా ఉపద్రవం? ఆ మహా ఉపద్రవమేమిటో నీకేమి తెలుసు? ఆ రోజున మానవులు చెల్లాచెదరైన దీపపు పురుగుల మాదిరిగా అయిపోతారు. పర్వతాలు ఏకిన రంగు రంగుల ఉన్ని వలె మారిపోతాయి. ఆ తరువాత ఎవరి త్రాసు పళ్ళాలైతే బరువుగా ఉంటాయో,[1] వారు తమకు ఇష్టమైన భోగభాగ్యాల్లో ఓలలాడుతారు. మరెవరి త్రాసు పళ్ళాలైతే తేలికగా ఉంటాయో, వారి నివాస స్థలం లోతైన గొయ్యి అవుతుంది. అదేమిటో మీకేమైనా తెలుసా? అది భగ భగ మండే అగ్ని గుండం.

## 102. అత్ తకాసుర్

అవతరణ మక్కాలో | ఆయతులు 8

١٠٢ سُوْرَةُ التَّكَاثُرِ مَكِّيَّةٌ ١٦

اٰياتها ٨ | ركوعها ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

اَلْهٰكُمُ التَّكَاثُرُ ﴿١﴾ حَتّٰى زُرْتُمُ الْمَقَابِرَ ﴿٢﴾

كَلَّا سَوْفَ تَعْلَمُوْنَ ﴿٣﴾ ثُمَّ كَلَّا سَوْفَ

تَعْلَمُوْنَ ﴿٤﴾ كَلَّا لَوْ تَعْلَمُوْنَ عِلْمَ الْيَقِيْنِ ﴿٥﴾

لَتَرَوُنَّ الْجَحِيْمَ ﴿٦﴾ ثُمَّ لَتَرَوُنَّهَا عَيْنَ

الْيَقِيْنِ ﴿٧﴾ ثُمَّ لَتُسْـَٔلُنَّ يَوْمَئِذٍ عَنِ النَّعِيْمِ ﴿٨﴾ ع ٨ ٢٧

**1 - 8** వీలైనంత ఎక్కువగా ఒకరిని మించి ఒకరు ప్రపంచాన్ని పొందాలనే ధ్యాస మిమ్మల్ని ఏమరుపాటులో పడవేసింది. చివరకు మీరు (ఈ వ్యామోహం లోనే) శ్మశానికి చేరుకుంటారు. (మీరనుకునేది) ఎంతమాత్రం కాదు, త్వరలోనే మీకు తెలిసిపోతుంది. మరొకసారి (వినండి, మీరనుకునేది) ఎంత మాత్రం నిజం కాదు, అతి త్వరలోనే[1] మీకు తెలిసిపోతుంది. ఎంతమాత్రం కాదు, మీరు గనక నిశ్చయజ్ఞానంతో (మీ ఈ వైఖరి పర్యవసానాన్ని) తెలుసుకుంటే, (మీ నడవడిక ఇలా ఉండదు). మీరు నరకాన్ని చూసి తీరుతారు. మరొకసారి (వినండి) మీరు పూర్తి నమ్మకంతో దాన్ని చూస్తారు. తరువాత ఆ రోజున మీరు తప్పనిసరిగా ఈ సౌఖ్యాలను గురించి ప్రశ్నించబడతారు.

## 103. అల్ అస్ర్

ఆయతులు 3 | అవతరణ మక్కాలో

١٠٣ سُورَةُ الْعَصْرِ مَكِّيَّةٌ ١٣

اٰياتها ٣ | ركوعها ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

**1 – 3** కాలం సాక్షిగా![1] నిస్సందేహంగా మానవుడు పెద్ద నష్టానికి గురిఅయి ఉన్నాడు. విశ్వసించి సత్కార్యాలు చేస్తూ ఉండేవారూ, ఒకరికొకరు సత్యోపదేశం, సహన బోధ చేసుకునేవారూ తప్ప.

وَ الْعَصْرِ ① اِنَّ الْاِنْسَانَ لَفِيْ خُسْرٍ ② اِلَّا
الَّذِيْنَ اٰمَنُوْا وَ عَمِلُوا الصّٰلِحٰتِ وَ تَوَاصَوْا
بِالْحَقِّ ۙ وَ تَوَاصَوْا بِالصَّبْرِ ③

ع ٢٨

## 104. అల్ హుమజహ్

ఆయతులు 9 | అవతరణ మక్కాలో

١٠٤ سُورَةُ الْهُمَزَةِ مَكِّيَّةٌ ٣٢

اٰياتها ٩ | ركوعها ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

**1 – 9** ప్రజలను దెప్పి పొడవటంలో, పరోక్షంగా వారి లోపాలను ఎంచటంలో ఆసక్తి కనబరచేవాడూ, ధనాన్ని కూడబెట్టి దానిని మాటిమాటికి లెక్కబెట్టి ఉంచేవాడూ అయిన ప్రతి వ్యక్తీ సర్వనాశనమవుతాడు. అతడు తన ధనం తనవద్ద కలకాలం ఉంటుందని అనుకుంటున్నాడు.[1] అలా ఎన్నటికీ జరగదు. అతడు నుజ్జునుజ్జు చేసే స్థలంలో విసరివేయబడతాడు. అలా నుజ్జునుజ్జుగా చేసే స్థలం ఏమిటో నీకు తెలుసా? అది తీవ్రంగా ప్రజ్వరిల్లజేయబడిన దైవాగ్ని. అది గుండెల దాక చొచ్చుకు పోతుంది. అందులో వారు పడిన తరువాత అది మూసివేయ బడుతుంది. ఆ విధంగా వారు పొడుగాటి అగ్ని కీలల మధ్య (చిక్కుకుని ఉంటారు).[2]

وَيْلٌ لِّكُلِّ هُمَزَةٍ لُّمَزَةِ ① الَّذِيْ جَمَعَ مَالًا
وَّ عَدَّدَهٗ ② يَحْسَبُ اَنَّ مَالَهٗٓ اَخْلَدَهٗ ③ كَلَّا
لَيُنْۢبَذَنَّ فِي الْحُطَمَةِ ④ وَمَآ اَدْرٰىكَ مَا
الْحُطَمَةُ ⑤ نَارُ اللّٰهِ الْمُوْقَدَةُ ⑥ الَّتِيْ تَطَّلِعُ
عَلَى الْاَفْـِٕدَةِ ⑦ اِنَّهَا عَلَيْهِمْ مُّؤْصَدَةٌ ⑧ فِيْ
عَمَدٍ مُّمَدَّدَةٍ ⑨

ع ٢٩

---

***101. అల్ ఖారిఅహ్***

1. అంటే, సత్కార్యాలతో నిండిన త్రాసు పళ్ళాలు బరువుగా ఉంటాయన్నమాట.

***102. అత్ తకాసుర్***

1. అతి త్వరలోనే అంటే అది పరలోకం కావచ్చు, మరణమూ కావచ్చు. ఎందుకంటే మానవుడు ఇహలోకంలో ఏయే పనుల్లో తన యావత్ జీవితాన్ని గడిపివచ్చాడో, అవి అతని అదృష్టానికి, సౌభాగ్యానికి సోపానాలా లేక దుష్పరిణామానికి, దురదృష్టానికి సోపానాలా అనే విషయం అతను మరణించిన మరుక్షణమే స్పష్టంగా తెలిసిపోతుంది.

***103. అల్ అస్ర్***

1. కాలం అంటే, భూత కాలం కూడ, వర్తమాన కాలం కూడ. కాలం సాక్షిగా అంటే, గడచిపోయిన చరిత్ర, గడుస్తున్న చరిత్ర రెండూ ముందు చెప్పబోయే విషయం సత్యమని సాక్ష్యమిస్తున్నాయి.

## 105. అల్ ఫీల్

ఆయతులు 5 | అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 5** ఏనుగుల వారిపట్ల నీ ప్రభువు ఎలా వ్యవహరించాడో నీవు చూడలేదా? ఆయన వారి కుట్రను భగ్నం చెయ్యలేదా? ఆయన వారిపైకి పక్షుల్ని గుంపులు గుంపులుగా పంపాడు. అవి మట్టి కాల్చగా తయారయిన కంకర రాళ్ళను వారిపైకి విసరివేస్తూండేవి. చివరికి వారి స్థితిని (పశువులు) తినేసిన పొట్టు[1] మాదిరిగా మార్చివేశాడు.

١٠٥ سُوْرَةُ الْفِيْلِ مَكِّيَّةٌ ١٩

اٰياتها ٥ | ركوعها ١

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ

اَلَمۡ تَرَ كَيۡفَ فَعَلَ رَبُّكَ بِاَصۡحٰبِ الۡفِيۡلِ ①
اَلَمۡ يَجۡعَلۡ كَيۡدَهُمۡ فِىۡ تَضۡلِيۡلٍ ② وَّ اَرۡسَلَ
عَلَيۡهِمۡ طَيۡرًا اَبَابِيۡلَ ③ تَرۡمِيۡهِمۡ بِحِجَارَةٍ مِّنۡ
سِجِّيۡلٍ ④ فَجَعَلَهُمۡ كَعَصۡفٍ مَّاۡكُوۡلٍ ⑤

## 106. ఖురైష్

ఆయతులు 4 | అవతరణ మక్కాలో

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 4** చూడండి, ఖురైష్ ప్రజలు ఎలా అలవాటుపడ్డారో! చలికాలంలోనూ, ఎండాకాలంలోనూ ప్రయాణాలకు ఎలా అలవాటుపడ్డారో![1] కనుక వారు ఈ ఆలయ[2] ప్రభువును ఆరాధించాలి. ఆయన వారికి ఆహారమిచ్చి ఆకలి బాధనుండి కాపాడాడు; శాంతిని ప్రసాదించి భయం నుండి రక్షించాడు.[3]

١٠٦ سُوْرَةُ قُرَيْشٍ مَكِّيَّةٌ ٢٩

اٰياتها ٤ | ركوعها ١

بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ

لِاِيۡلٰفِ قُرَيۡشٍ ① اٖلٰفِهِمۡ رِحۡلَةَ الشِّتَآءِ
وَالصَّيۡفِ ② فَلۡيَعۡبُدُوۡا رَبَّ هٰذَا الۡبَيۡتِ ③
الَّذِىۡۤ اَطۡعَمَهُمۡ مِّنۡ جُوۡعٍ ۙ وَّاٰمَنَهُمۡ مِّنۡ
خَوۡفٍ ④

***104. అల్ హుమజహ్***

1. దీని రెండో అర్థం ఇది కూడా కావచ్చు:అతని ధనం అతనికి శాశ్వత జీవితాన్ని ప్రసాదిస్తుందని అనుకుంటాడు. ఒకప్పుడు తన ఈ సర్వస్వాన్నీ వదలివేసి వట్టి చేతులతో ఈప్రపంచాన్ని విడిచిపెట్టి పోవలసిఉందనే ఆలోచన కూడ అతనికి రాదు.
2. "ఫీ అమదిమ్ ముమద్దదహ్" కు ఎన్నో అర్థాలు ఉన్నాయి. ఒకటి, నరక ద్వారాలను మూసేసి వాటిపై ఎత్తైన స్తంభాలను నిలబెట్టటం జరుగుతుంది. రెండు, ఈ అపరాధులు ఎత్తైన స్తంభాలకు కట్టివేయబడతారు. మూడు, ఆ అగ్నిమంటలు పొడుగైన స్తంభాల రూపంలో పైకి లేస్తూ ఉంటాయి.

***105. అల్ ఫీల్***

1. ఇక్కడ ప్రస్తావించబడిన సంఘటన మహాప్రవక్త ముహమ్మద్(సఅసమ్) పవిత్ర జననానికి 50 రోజుల ముందు జరిగింది. యమన్ దేశాన్ని పాలించే అబీసీనియా రాజ్యం యొక్క క్రైస్తవ రాజు అబ్రహా 60 వేల మంది సైనికుల్ని తీసుకుని, పవిత్ర కాబా మందిరాన్ని ధ్వంసం చేసే దురుద్దేశ్యంతో మక్కాపైకి దండెత్తి వచ్చాడు. ఈ సైన్యంలో ఎన్నో ఏనుగులు కూడ ఉన్నాయి. అతడు ముజ్దలిఫా, మినాల మధ్యకు వచ్చినప్పుడు, అకస్మాత్తుగా

## 107. అల్ మాఊన్

ఆయతులు 7 | అవతరణ మక్కాలో

١٠٧ سُوْرَةُ الْمَاعُوْنِ مَكِّيَّةٌ ١٧

اٰياتها ٧ | ركوعها ١

*అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○
اَرَءَيْتَ الَّذِيْ يُكَذِّبُ بِالدِّيْنِ ① فَذٰلِكَ
الَّذِيْ يَدُعُّ الْيَتِيْمَ ② وَ لَا يَحُضُّ عَلٰى طَعَامِ
الْمِسْكِيْنِ ③ فَوَيْلٌ لِّلْمُصَلِّيْنَ ④ الَّذِيْنَ هُمْ
عَنْ صَلَاتِهِمْ سَاهُوْنَ ⑤ الَّذِيْنَ هُمْ
يُرَآءُوْنَ ⑥ وَ يَمْنَعُوْنَ الْمَاعُوْنَ ⑦

**1 – 7** పరలోక శిక్షను, బహుమానాన్ని తిరస్కరించే వ్యక్తిని నీవు చూశావా? అతడే అనాథులను కసరికొట్టేవాడు, పేద వాళ్ళకు అన్నం పెట్టు అని ప్రోత్సహించనివాడు.[1] పోతే, తమ నమాజుల పట్ల అశ్రద్ధ వహించేవారు,[2] ప్రదర్శనాబుద్ధితో వ్యవహరించేవారు, వాడుకునే మామూలు వస్తువులను (ప్రజలకు) ఇవ్వటానికి వెనుకాడేవారు సర్వనాశనమవుతారు.

## 108. అల్ కౌసర్

ఆయతులు 3 | అవతరణ మక్కాలో

١٠٨ سُوْرَةُ الْكَوْثَرِ مَكِّيَّةٌ ١٥

اٰياتها ٣ | ركوعها ١

*అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○
اِنَّآ اَعْطَيْنٰكَ الْكَوْثَرَ ① فَصَلِّ لِرَبِّكَ
وَانْحَرْ ② اِنَّ شَانِئَكَ هُوَ الْاَبْتَرُ ③

**1 – 3** (ప్రవక్తా) మేము నీకు కౌసర్ ప్రసాదించాము.[1] కనుక నీవు నీ ప్రభువు కొరకే నమాజు చెయ్యి. ఖుర్బానీ కూడా ఇవ్వు. నిస్సందేహంగా నీ శత్రువే నామరూపాలు లేకుండా పోయేవాడు.[2]

---

సముద్రం వైపు నుండి పక్షులు గుంపులు గుంపులుగా తమ ముక్కులతో, పంజాలతో కంకరరాళ్ళను తీసుకుని వచ్చాయి. అవి అబ్రహా సైన్యంపై కంకరరాళ్ళను కురిపించాయి. ఎవరెవరి మీద ఈ కంకర రాళ్ళు పడ్డాయో వారి శరీరాలు తూట్లు పడి మాంసం ముక్కలు ముక్కలుగా క్రిందపడసాగింది. ఈ విధంగా ఈ సైన్యమంతా నాశనమై పోయింది. అరేబియాలో ఈ సంఘటన చాల ప్రసిద్ధిగాంచింది. ఈ సూరా అవతరించేటప్పుడు కూడా దీన్ని కళ్ళారా చూసిన వేలమంది ప్రజలు మక్కాలో ఉన్నారు. అల్లాహ్ మహిమవల్లనే ఏనుగుల వాళ్ళు సర్వనాశన మయ్యారనే విషయాన్ని అరేబియా వాసులందరూ నమ్మేవారు.

**106. ఖురైష్**

1. ఎండాకాలపు, చలికాలపు ప్రయాణాలు అంటే వ్యాపార నిమిత్తం చేసే ప్రయాణాలు అని భావం. ఎండాకాలంలో ఖురైష్ ప్రజలు సిరియా, పలస్తీనాలకు, శీతాకాలంలో దక్షిణ అరేబియాల ప్రాంతానికి వ్యాపారం కోసం వెళ్ళేవారు. ఈ ప్రయాణాలు కారణంగానే వారు ధనవంతులై పోయారు.
2. ఈ ఆలయం అంటే కాబా గృహం అని అర్థం.
3. మక్కా నిషిద్ధ (పవిత్ర) నగరం కావటం వల్ల, అరేబియాలోని ఏ తెగ అయినా ఆ నగరంపై దాడి చేస్తుందనే భయం ఖురైష్‌లకు లేదు. ఖురైష్ తెగవారు కాబా గృహానికి ధర్మకర్తలు కావటం వల్ల వారి వాణిజ్య బృందాలు నిర్భయంగా అరేబియాలోని అన్ని ప్రాంతాలగుండా ప్రయాణం చేసేవి, వాటి జోలికి ఎవరూ పోయేవారు కాదు.

## 109. అల్ కాఫిరూన్

ఆయతులు 6 | అవతరణ మక్కాలో

١٠٩ سُوْرَةُ الْكٰفِرُوْنَ مَكِّيَّةٌ ١٨

اٰيَاتُهَا ٦ | رُكُوْعُهَا ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 6** ఇలా ప్రకటించు, ఓ అవిశ్వాసులారా![1] మీరు ఆరాధించేవాటిని నేను ఆరాధించను.[2] అలాగే నేను ఆరాధించే ఆయన్ని మీరు ఆరాధించరు.[3] మీరు ఆరాధిస్తున్న వాటిని నేను ఆరాధించేవాణ్ణి కాను.[4] అలాగే నేను ఆరాధించే ఆయన్ని మీరు ఆరాధించేవారు కారు. మీ ధర్మం మీదే, నా ధర్మం నాదే.[5]

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

قُلْ يٰۤاَيُّهَا الْكٰفِرُوْنَ ① لَاۤ اَعْبُدُ مَا

تَعْبُدُوْنَ ② وَلَاۤ اَنْتُمْ عٰبِدُوْنَ مَاۤ اَعْبُدُ ③

وَلَاۤ اَنَا عَابِدٌ مَّا عَبَدْتُّمْ ④ وَلَاۤ اَنْتُمْ

عٰبِدُوْنَ مَاۤ اَعْبُدُ ⑤ لَكُمْ دِيْنُكُمْ وَلِيَ دِيْنِ ⑥

## 110. అన్ నస్ర్

ఆయతులు 3 | అవతరణ మదీనాలో

١١٠ سُوْرَةُ النَّصْرِ مَدَنِيَّةٌ ١١٤

اٰيَاتُهَا ٣ | رُكُوْعُهَا ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 3** అల్లాహ్ సహాయం వచ్చినప్పుడు,[1] విజయ భాగ్యం లభించినప్పుడు, ప్రజలు తండోపతండాలుగా అల్లాహ్ ధర్మంలో ప్రవేశించటాన్ని నీవు చూసినప్పుడు (ప్రవక్తా) నీవు నీ ప్రభువు స్తోత్రంతో పాటు ఆయన పవిత్ర నామాన్ని స్మరించు, ఇంకా ఆయన మన్నింపును వేడుకో.[2] నిస్సందేహంగా ఆయన పశ్చాత్తాపాన్ని ఎంతగానో అంగీకరించేవాడు.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

اِذَا جَآءَ نَصْرُ اللّٰهِ وَالْفَتْحُ ① وَرَاَيْتَ

النَّاسَ يَدْخُلُوْنَ فِيْ دِيْنِ اللّٰهِ اَفْوَاجًا ②

فَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ وَاسْتَغْفِرْهُ ۚ اِنَّهٗ كَانَ

تَوَّابًا ③

وقف النبي صلى الله عليه وسلم

---

**107. అల్ మాఊన్**

1. అంటే, అతను తన మనస్సునూ ఈ పనికోసం అంగీకరింపచెయ్యడు, అటు నిరుపేదలకు అన్నం పెట్టండి అని తన ఇంటివారితోనూ అనడు, వేరొకవైపు నిరుపేదలకు సహాయపడండి అని ప్రజలనూ ప్రోత్సహించడు అన్నమాట.
2. దీని భావం నమాజులను మరచిపోవటం కాదు; నమాజుల పట్ల నిర్లక్ష్యంతో వ్యవహరించటం అని అర్థం.

**108. అల్ కౌసర్**

1. కౌసర్ అంటే, ఇహ పరలోకాలకు చెందిన అసంఖ్యాకమైన మేళ్ళు అని భావం. వాటిలో ప్రళయదినం నాటి 'కౌసర్' అనే జలాశయం, స్వర్గలోకంలోని 'కౌసర్' అనే సెలయేరు కూడ ఉన్నాయి.
2. అవిశ్వాసులు మహాప్రవక్త (సఅసమ్)ను 'అబ్తర్' అని ఏ అర్థంలో అంటారంటే, ఆయన తన జాతికి దూరమై పోయారని, ఆయనకు మగ సంతానం కూడ సజీవంగా లేకుండా పోయినదని. కనుక ఆయన నామరూపాలు లేకుండా పోతారని అనుకునేవారు. నిజానికి నామరూపాలు లేకుండా పోయేది దైవప్రవక్త కాదు, ఆయన శత్రువులు మాత్రమే అని వారికి సమాధానం చెప్పడం జరిగింది.

## 111. అల్ లహబ్

ఆయతులు 5 | అవతరణ మక్కాలో

۱۱۱ سُوْرَةُ اللَّهَبِ مَكِّيَّةٌ ٦

اٰيَاتُهَا ٥ | رُكُوْعُهَا ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

1 – 5 అబూ లహబ్[1] చేతులు విరిగిపోయాయి! అతడు సర్వనాశనం అయిపోయాడు![2] అతడి ఆస్తి పాస్తులు, అతడి సంపాదన అంతా దేనికీ పనికి రాకుండా పోయింది. చివరికి అతడు తప్పకుండా భగ భగ మండే అగ్నిలో పడవేయబడ తాడు. అంతేకాదు (అతడితోపాటు) అతడి భార్య కూడ[3] అందులో పడవేయబడుతుంది. ఆమె చాడీలు చెబుతూ కలహాలు రేపే స్త్రీ. ఆమె మెడలో బాగా పేనిన ఒక త్రాడు ఉంటుంది.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

تَبَّتْ يَدَآ اَبِيْ لَهَبٍ وَّ تَبَّ ① مَآ اَغْنٰى
عَنْهُ مَالُهٗ وَ مَا كَسَبَ ② سَيَصْلٰى نَارًا
ذَاتَ لَهَبٍ ③ وَّامْرَاَتُهٗ حَمَّالَةَ
الْحَطَبِ ④ فِيْ جِيْدِهَا حَبْلٌ مِّنْ مَّسَدٍ ⑤

## 112. అల్ ఇఖ్లాస్

ఆయతులు 4 | అవతరణ మక్కాలో

۱۱۲ سُوْرَةُ الْاِخْلَاصِ مَكِّيَّةٌ ٢٢

اٰيَاتُهَا ٤ | رُكُوْعُهَا ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

1 – 4 ఇలా చెప్పెయ్యి,[1] ఆయన అల్లాహ్,[2] అద్వితీయుడు.[3] అల్లాహ్ నిరపేక్షా పరుడు ఎవరి ఆధారమూ, ఎవరి అక్కరా లేనివాడు; అందరూ ఆయనపై ఆధారపడేవారే. ఆయనకు సంతానం ఎవరూ లేరు. ఆయన కూడ ఎవరి సంతానమూ కాదు. ఆయనకు సరిసమానులు ఎవరూ లేరు.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

قُلْ هُوَ اللّٰهُ اَحَدٌ ① اَللّٰهُ الصَّمَدُ ② لَمْ
يَلِدْ ۙ وَ لَمْ يُوْلَدْ ③ وَلَمْ يَكُنْ لَّهٗ كُفُوًا
اَحَدٌ ④

---

*109. అల్ కాఫిరూన్*

1. అంటే, నా దౌత్యాన్ని, నేను తెచ్చిన బోధనలను విశ్వసించకుండా తిరస్కరించిన వారు అని భావం.
2. అవిశ్వాసులు ఇతర ఆరాధ్యులతో పాటు అల్లాహ్‌ను కూడ ఆరాధించేవారు. కాని బహుదైవారాధనతో పాటు చేసే అల్లాహ్ ఆరాధన నిజానికి అల్లాహ్ ఆరాధన కానే కాదు. కాబట్టి బహుదైవారాధకుల యావత్ ఆరాధ్యుల ఆరాధనను తిరస్కరించటం జరిగింది.
3. అంటే, ఏ లక్షణాలు, గుణగణాలు కల దేవుణ్ణయితే నేను ఆరాధిస్తానో, ఆ లక్షణాలు, గుణగణాలు గల దేవుణ్ణీ మీరు ఆరాధించరు అని అర్థం.
4. అంటే, ఇంతకు పూర్వం ఏ ఆరాధ్యులనైతే మీరు మీ తాత ముత్తాతలు ఆరాధించారో, నేను వాటిని ఆరాధించ బోవటం లేదని భావం.
5. అంటే, ధర్మం విషయంలో మీరూ, నేనూ ఏకమవటం అనేది లేనేలేదు. నా దారి వేరు, మీ దారి వేరు.

## 113. అల్ ఫలఖ్

ఆయతులు 5 | అవతరణ మక్కాలో

١١٣ سُوْرَةُ الْفَلَقِ مَكِّيَّةٌ ٢٠

اٰیاتها ٥ | رکوعها ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 5** ఇలా అను: నేను ఉదయం ప్రభువు[1] శరణుకోరుతున్నాను– ఆయన సృష్టించిన ప్రతిదాని కీడు నుండి, కమ్ముకునే చీకటి రాత్రి కీడు నుండి,[2] ముడులపై మంత్రించే వారి కీడు నుండి,[3] అసూయాపరుడు అసూయపడేటప్పటి కీడు నుండి.[4]

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

قُلْ اَعُوْذُ بِرَبِّ الْفَلَقِ ① مِنْ شَرِّ مَا
خَلَقَ ② وَ مِنْ شَرِّ غَاسِقٍ اِذَا وَقَبَ ③ وَ
مِنْ شَرِّ النَّفّٰثٰتِ فِی الْعُقَدِ ④ وَمِنْ شَرِّ
حَاسِدٍ اِذَا حَسَدَ ⑤ ع ٢٨

## 114. అన్ నాస్

ఆయతులు 6 | అవతరణ మక్కాలో

١١٤ سُوْرَةُ النَّاسِ مَكِّيَّةٌ ٢١

اٰیاتها ٦ | رکوعها ١

అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1 - 6** ఇలా అను: నేను మానవుల ప్రభువు, మానవుల చక్రవర్తి, మానవుల ఆరాధ్య దైవం (అయిన అల్లాహ్) శరణు కోరుతున్నాను - దుష్ట భావాలు రేకెత్తించేవాడి కీడు నుండి. వాడు మాటిమాటికీ మరలి వస్తూ ప్రజల మనస్సుల్లో దుష్ట భావాలను రేకెత్తిస్తాడు,[1] వాడు జిన్నాతు జాతికి చెందినవాడైనా కావచ్చు లేదా మానవ జాతికి చెందినవాడైనా కావచ్చు.[2]

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

قُلْ اَعُوْذُ بِرَبِّ النَّاسِ ① مَلِكِ النَّاسِ ②
اِلٰهِ النَّاسِ ③ مِنْ شَرِّ الْوَسْوَاسِ
الْخَنَّاسِ ④ الَّذِیْ یُوَسْوِسُ فِیْ صُدُوْرِ
النَّاسِ ⑤ مِنَ الْجِنَّةِ وَ النَّاسِ ⑥ ع ٢٩

***110. అన్ నస్ర్***

1. విశ్వసనీయమైన కథనాల ప్రకారం ఇది దివ్య ఖురాన్‌లోని చివరి సూరా. ఇది మహాప్రవక్త (సఅసమ్) మరణానికి 3 నెలలకు పూర్వం అవతరించింది. దీని తరువాత కొన్ని ఆయతులైతే అవతరించాయిగాని, పూర్తి సూరా ఏదీ అవతరించలేదు.
2. ఈ సూరా అవతరించిన తరువాత మహాప్రవక్త (సఅసమ్) తమ చివరి దినాల్లో అల్లాహ్‌ను స్తుతించటం, ఆయన పవిత్రతను కొనియాడటం, మన్నింపును వేడుకోవటం ఎక్కువ చేశారని కూడా కొన్ని హదీసుల ద్వారా తెలుస్తోంది.

***111. అల్ లహబ్***

1. ఇతడు మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) గారికి స్వయాన పినతండ్రి అవుతాడు. అబూ లహబ్ అనే పేరుతోనే ప్రఖ్యాతిగాంచాడు.
2. అంటే, ఇస్లామ్ మార్గాన్ని నిరోధించటానికి చాల ప్రయత్నం చేశాడు, కాని విఫలుడయ్యాడు, పరాజయం

పాలయ్యాడు. ఈ వాక్యంలో తరువాత జరుగబోయే విషయం గురించి జోస్యం చెప్పటం జరిగింది; కాని అది జరిగిపోయిన విధంగా చెప్పటం జరిగింది.

3. ఈ స్త్రీ పేరు ఉమ్మె జమీల్. ఈమె అబూ సుఫియాన్ సోదరి. ఇస్లాంను నిరోధించటంలో ఆమె తన భర్తకు ఏమీ తీసిపోలేదు.

**112. అల్ ఇఖ్లాస్**

1. ఆనాటి అవిశ్వాసులు, బహుదైవారాధకులు, "ఆరాధ్యదైవాలందరినీ కాదని, ఏకైక ఆరాధ్య దైవంగా నమ్మించదలచుకున్న మీ ప్రభువు ఎలా ఉంటాడు? ఆయన పుట్టుపూర్వోత్తరాలు ఏమిటి? ఏ వస్తువుతో ఆయన సృజింపబడ్డాడు? ఈ సృష్టియొక్క వారసత్వాన్ని ఆయన ఎవరి నుంచి పొందాడు? ఆయనకు ఎవరు వారసుడవుతాడు?" అని మహాప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) ను అడిగేవారు. ఈ ప్రశ్నలకు సమాధానంగా ఈ సూరా అవతరించింది.

2. అంటే, ఏ శక్తిని మీరే స్వయంగా అల్లాహ్ అనే పేరుతో ఎరుగుదురో, ఎవరిని మీకు, సకల చరాచర సృష్టి రాసులకు సృష్టికర్తగా, పోషకుడుగా, ఉపాధిప్రదాతగా మీరు ఒప్పుకుంటున్నారో, ఆయనే నా ప్రభువు. అల్లాహ్ విషయంలో అరబ్ బహుదైవారాధకుల విశ్వాసం ఎటువంటిదో, దివ్య ఖురాన్‌లో ఎన్నోచోట్ల వివరించటం జరిగింది. ఉదాహరణకు చూడండి, యూనుస్: ఆయతులు 22, 31-33; బనీ ఇస్రాయీల్ : 67వ ఆయతు; అల్ మూమినూన్: ఆయతులు 84-89; అన్ కబూత్: ఆయతులు 61- 63; అల్ జుఖ్రుఫ్: 87వ ఆయతు.

3. "వాహిద్" పదానికి బదులుగా "అహద్" అనే పదం ఉపయోగించబడింది. రెండు పదాల అర్థమూ "ఒక్కడే" అని. కాని అరబీ భాషలో "వాహిద్" అనే పదం అనేక బహుత్వాలను తనలో ఇముడ్చుకోగలిగే అన్ని వస్తువులు, అన్ని విషయాల కోసం వాడబడుతుంది. ఉదాహరణకు, ఒక మనిషి, ఒక జాతి, ఒక దేశం, ఒక విశ్వం. వాస్తవానికి ఇవి బహువచనాలు కానప్పటికీ వీటిని "వాహిద్" అంటారు. కాని "అహద్" అనే పదం, అన్నివిధాలుగా ఒకటే అయి ఉండి అనేక బహుత్వాలను తనలో ఇముడ్చుకోలేని దానికోసం వాడబడుతుంది. అందుకే అరబీ భాషలో ఈ పదం కేవలం అల్లాహ్ కోసమే వాడబడుతుంది.

**113. అల్ ఫలఖ్**

1. అంటే, రాత్రి చీకటిని వేరుచేసి ఉదయాన్ని తీసుకువచ్చే ప్రభువు శరణు అని అర్థం.
2. ఎందుకంటే, నేరాలు, అక్రమాలు, అత్యాచారాలు ఎక్కువగా రాత్రి సమయంలోనే జరుగుతాయి. హానికరమైన జంతువులు కూడా ఎక్కువగా రాత్రి వేళల్లోనే బయటికి వస్తాయి.
3. అంటే చేతబడి చేసే పురుషులు, స్త్రీలు అని భావం.
4. అంటే, అసూయ కారణంగా అతడు ఏదైనా నష్టం కలిగించే ప్రయత్నం చేసినప్పుడు అని అర్థం.

**114. అన్ నాస్**

1. అంటే, ఒకసారి దుష్టభావాలను రేకెత్తించి మార్గం తప్పించటంలో విఫలుడైనప్పుడు, వైదొలగిపోతాడు. తరువాత మళ్లీ వచ్చి దుష్టభావాలను రేకెత్తిస్తాడు. ఇలా మాటిమాటికీ ఈ ప్రయత్నం చేస్తాడు.
2. అంటే, దుష్ట భావాలను రేకెత్తించే వీడు మానవుల్లోని వాడైనా, జిన్నాతు (షైతాను)ల్లోని వాడైనా, వీరిద్దరి బారి నుండి నేను శరణు వేడుకుంటున్నాను అని అర్థం.



# دُعَاءِ خَتْمِ الْقُرْاٰنِ

اَللّٰهُمَّ اٰنِسْ وَحْشَتِيْ فِيْ قَبْرِيْ اَللّٰهُمَّ ارْحَمْنِيْ بِالْقُرْاٰنِ
الْعَظِيْمِ وَاجْعَلْهُ لِيْ اِمَامًا وَّنُوْرًا وَّهُدًى وَّرَحْمَةً
اَللّٰهُمَّ ذَكِّرْنِيْ مِنْهُ مَا نَسِيْتُ وَعَلِّمْنِيْ مِنْهُ مَا جَهِلْتُ
وَارْزُقْنِيْ تِلَاوَتَهٗ اٰنَاءَ الَّيْلِ وَاٰنَاءَ النَّهَارِ وَ
اجْعَلْهُ لِيْ حُجَّةً يَّا رَبَّ الْعٰلَمِيْنَ (اٰمين)

